'విజ్ఞానం బ్రహ్మేతి వ్యజానాత్'

# సంగ్రహ
# ఆంధ్ర విజ్ఞాన కోశము

ఆరవ సంపుటము

## పునరుజ్జీవనము - భాషాశాస్త్ర వికాసము


ఆచార్య మామిడిపూడి వేంకటరంగయ్య, ఎం. ఏ.

*అధ్యక్షులు - సంపాదకీయవర్గము*





ప్రకాశకులు

సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశము

హైదరాబాదు

1969

**మూల్యము రు 20 లు**

ముద్రణము
ఆంధ్ర రచయితల సహకార సంఘ ముద్రణాలయము
ట్రూప్ బజారు, హైదరాబాదు-2

ప్రకాశకులు
కార్యదర్శి,
సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశ సమితి,
విద్యానగరం - హైదరాబాదు-7
టెలిఫోను నెం. 35023

# తొలిపలుకు

ప్రాచీనమును, ఆధునికమునైన విశ్వవిజ్ఞానమును సమన్వయముచేసి సులభశైలిలో అందరకును అందించుటకై కృషిచేయుచున్న సంగ్రహాంధ్ర విజ్ఞానకోశ సమితివారు ప్రకటించిన అంత సంపుటము ను ప్రజలముందు ఉంచుటకు సంతసించుచున్నాను ఈ సంపుటము నందెన్నియో విజ్ఞానప్రదములైన వ్యాసములున్నవి భౌతికశాస్త్రము, జీవశాస్త్రము, వైద్యశాస్త్రము, ఇంజనీరింగు, తత్త్వశాస్త్రము, రాజ్యపరిపాలనశాస్త్రము మొదలగు అనేక మహావిషయములపై ప్రామాణికులగు విద్వాంసులు రచించిన వ్యాసములతో నొప్పు ఈ సంపుటము పాఠకమహాశయులకు పెన్నిధియనుట నిర్వివాదము, ఇటీవలివరకును ఆంగ్లభాషకాని, మరియొక పాశ్చాత్యభాషకాని రానివారికి ఆధునికవిజ్ఞానము అందని మ్రానిపండుగ నుండెడిది విజ్ఞానకోశము తెలుగుభాషలో ప్రకటించుట మొదలైననాటి నుండియు ఎవరును తాము వెనుకబడిపోతిమని చింతింపనవసరము లేదు.

మానవుడు చంద్రమండలముపై దిగి, అచ్చట తనజెండాను పాతుటకు సంసిద్ధుడగుచున్న ఈకాలములో, భౌతికప్రపంచవిజ్ఞానము, టెక్నాలజీ అను ఈ రెండును అపూర్వమైన మార్పులకు గురియగుచున్నవి వీటిరహస్యములతో ప్రత్యక్షపరిచయమును సంపాదింపవలెనన్నచో, మనకు దేశభాషలింకను చాలవు ఆంగ్లముతోగాని, మరియొక సుసంపన్నమైన పాశ్చాత్యభాషతోగాని గాఢపరిచయము అవసరము కావున మనవారు పరభాషలను ఉపేక్షింపరాదు

సంగ్రహాంధ్ర విజ్ఞానకోశమునకు ఆర్థికసహాయమును కల్పించుచున్న ఆంధ్రప్రదేశ ప్రభుత్వమువారిని, కేంద్రప్రభుత్వమువారిని నేను అభినందించుచున్నాను ఈభారము నంతను ప్రభుత్వములపైనుంచి ప్రజాసంస్థలవారు ఊరకుండుట న్యాయముకాదు అమూల్యమైన విజ్ఞానవీథులలో విహరింపజేయు ఈ గ్రంథసంపుటములను అధికసంఖ్యలో కొనుట మూలమున ప్రజలు, భాషాభిమానులు దీనికి ఆర్థికముగా తోడ్పడగలరని ఆశించుచున్నాను.

ఈవిజ్ఞానయాత్రయందు మార్గదర్శకులుగానున్న విద్వాంసులకు నమోవాకము లర్పించుచున్నాను దీర్ఘకాలికమైన ఈపరిశ్రమను రూపొందించుచున్న మాకార్యకర్తలను అభినందించుచున్నాను

హైదరాబాదు
25 - 3 - 1960

మ. చెన్నారెడ్డి,
అధ్యక్షుడు,
సంగ్రహాంధ్ర విజ్ఞానకోశ సమితి.

# నివేదన

సంగ్రహాంధ్ర విజ్ఞానకోశముయొక్క ఆరవసంపుటమును ఆంధ్రుల కరకమలముల
యందుంచుట ముదావహ మగుచున్నది ఉద్యమారంభమునందు ఈ కోశము కుమార
స్వామివలె షడాననమని భావించియుంటిమి టెక్నాలజీ, రాజ్యపాలనము, మున్నగు
కొన్ని క్రొత్తశాఖలను చేర్చుటచే, ఇది అష్టమూర్తి కావలసి వచ్చినది. విజ్ఞానము
అనంతముగా పెరిగిపోవుచున్న ఈ భవ్యయుగమునందు విజ్ఞానకోశములు, షడాననము
లేమి, సహస్రాననములయినను, కొరతగానే యుండిపోవును. మన మాతృభాషయైన
ఆంధ్రభాష ఈ నూతనవిజ్ఞానమును, నిర్దుష్టముగను, సుస్పష్టముగను, ప్రకటింపగల
పదజాలమును కలిగియుండవలెను అట్లు నికరమైన భాషతో సర్వజన సులభముగ,
బహుముఖమైన ఆధునిక విజ్ఞానమును పొదిగి రచింపగల రచయితలుండవలెను వీటి
నన్నిటిని సమకూర్చగల ధనసంపదయు, ఉండవలెను ఈ మూడు విధములైన సాధన
సంపత్తులలో, మొదటి రెండింటిని, సంగ్రహాంధ్ర విజ్ఞానకోశసమితి ఒక్కొక్కమెట్టునకు
అనగా ఒక్కొక్క సంపుటమునకు తత్పూర్వదశయందుకన్న, పెరుగుదల ముఖమున
సమకూర్చుకొన్నది మూడవదగు ఆర్థికబలము కూడ అంచె అంచెకు వృద్ధినొందవలసి
యుండెను అట్లుకాకుండుట కొంచెము నిరుత్సాహ హేతువగుచున్నది. అయినను
కార్యముయొక్క ప్రగతి స్తంభించిపోకున్నచో అదియే పదివేలు

ఆంధ్రదేశము యొక్క ప్రస్తుత విద్యావిధానమునందు, విజ్ఞానకోశమువంటి
గ్రంథముల ప్రచురణము, మునుపటికన్నను అత్యావశ్యక మగుచున్నది. ఇంతవరకును,
మన ప్రభుత్వమువారు, ఉన్నత పాఠశాలల వరకును, తెలుగుభాషను బోధనమాధ్య
మముగా చేయుటతో తృప్తిపడి యుండిరి. ఇప్పుడు ప్రజలును, ప్రభుత్వమువారును
గూడ తెలుగుభాషయొక్క వినియోగపరిధిని విస్తారముగా పెంచుటకు బద్ధకంకణులై
యున్నారు. విశ్వవిద్యాలయ స్థాయిలోకూడ ఆంధ్రభాషద్వారా విద్యాబోధనము
జరుగవలెననియు, ప్రభుత్వ యంత్రాంగమునందలి అన్ని శాఖలలోను తెలుగు రాజ
భాషాస్థానమును ఆక్రమించవలెననియు, స్థిరనిర్ణయము జరిగియున్నది. తెలుగుభాష

ఇంక అంతఃపురములలోను, పర్వతాగ్రములందును మెరుపువలె తోచుచు, గజసుందర గమనముతో నడుచు జమీందారీ స్థితిని కోలుపోక తప్పదు కవుల భావాపగుంఠన ములో ముసిపెనులు చూపు రమ్యకాలము వెళ్ళిపోయినది కవిత్వము, కావ్యములు ఉండవని కాదు అవి అజరామరములు, ఎవరు నలదన్నను, సృజనాత్మకశక్తి నిర్వాసితము కాదు. అయినను తెలుగుభాష ఒక క్రొత్త తీరుతెన్నులు దిద్దుకొనుట తప్పని సరి యైనది ఈ వైజ్ఞానిక యుగమునందు, భావమునకన్న విషయమునకే అధిక ప్రాధాన్యము ఏర్పడుచున్న అతిశయోక్తి, శ్లేష మున్నగు అలంకార డింభకులు స్వేచ్ఛావిహారము కోల్పోవుచున్నారు అసందిగ్ధము, సులభము, సంగ్రహము అగు భాషకే ఇప్పుడు పట్టాభిషేకము విజ్ఞానకోశములే భాషకీ నూతన ప్రయోజనమును సిద్ధింపజేయు కర్మాగారములు. ఇవి యెంత నర్ధిల్లిన తెలగుభాష కంత మేలు

ఎప్పటివలెనే, ఈ యారవసంపుటము నందు విజ్ఞానదాయకములైన వ్యాస రాజములు ఎన్నియో కలవు, చూడగా, రచయితలును మొదటి సంపుటములందువలె శాస్త్రీయపదజాలమును వెదకికొనుటలో భీరువులుకాక, ఆత్మవిశ్వాసముతో వ్యవహరించుచున్నారు అచ్చటచ్చట అనువాదశైలీ పరిమళము సోకుచున్నను, స్వతంత్ర రీతిలో వైజ్ఞానిక భావములను సూక్ష్మాతి సూక్ష్మమైన వానిని ఆంగ్లసదు సహాయము లేకుండగనే, రచయితలు ప్రకటింపగలుగు చున్నారు ఇది తప్పక హర్షింపదగిన పురోగమనము 'పునరుజ్జీవనము' నుండి 'భాషాశాస్త్రము - దాని వికాసము'వరకు గల వ్యాసము లీ సంపుటమునందు ముద్రింపబడినవి ఏడవ సంపుట ముద్రణముకూడ ప్రారంభింపబడినదని తెలుపుటకు సంతసించుచున్నాము

విజ్ఞానకోశపు టార్థిక దౌర్బల్యమును గూర్చి అడుగడుగునను ప్రసంగించుట భావ్యముకాదు ఇంతకన్న ఎక్కువ ఆర్థిక సహాయమున్నచో ఉత్తమ పటములు, త్రివర్ణచిత్రములు అధికసంఖ్యలో సమకూర్పగలిగి యుందుము ఆంధ్రప్రదేశపు ప్రభుత్వమువారు సంపుటమునకు రు 25,000/- విరాళము నిచ్చు విధానమును అవలంబించుచు మా కృతజ్ఞతకు పాత్రులగుచున్నారు, కేంద్రప్రభుత్వ సహాయము ఆరవసంపుటముతో ముగిసినది ముందున్న ఒకటి రెండు సంపుటములకును తమ సహాయమును కేంద్ర ప్రభుత్వమువారు కొనసాగింతురని ఆశపడుచున్నాము ఆంధ్ర మహాజనులును, విద్యాసంస్థలవారును, ఈ యుపయోగి గ్రంథమును కొని దీనిచే తమ గ్రంథాలయముల నలంకరించి మాకు ఆర్థికముగా తోడ్పడ ప్రార్థన

ఆరవసంపుట ప్రకటనకాలమున మా కార్యకర్తృవర్గమునందు కొంత మార్పు జరిగినది. విజ్ఞానసర్వస్వ కార్యకలాపములందు సవ్యసాచులయిన పూజ్యమూర్తులు

శ్రీ ఆదిరాజు వీరభద్రరావు పంతులుగారు విశ్రాంతిగైకొనిరి. శ్రీవారిని తను కార్యము పైకొన్నది భరకార్యము వారి చిరమిత్రము. ప్రజ్ఞాకార్యము మాత్రము వారి దరిదాపులకు రాలేక జంకుచున్నది సంగ్రహ విజ్ఞాన కోశమునకు పదునేను సంవత్సరముల వరకు పెట్టని కోటయైన శ్రీ వీరభద్రరావు పంతులుగారు ఇంకను దీర్ఘకాలము ఆరోగ్యవంతులును, సుఖాన్వితులును కావలెనని ప్రార్థించుచున్నాము విజ్ఞానకోశ నిర్మాణ తంత్రమునందు వారి సహచరులుగా నుండిన ఆచార్య గరికపాటి లక్ష్మీకాంతశాస్త్రిగారును, శ్రీ ప్రతాప రామసుబ్బయ్యగారును ఈ కోశమునకు భరతవాక్యమును పలుకుదురుగాక ! మా కార్యక్రమమునందు అనేకవిధముల తోడ్పడిన పెద్దలందరకును వందనములు ముఖ్యముగా వీరబొబ్బిలి సంస్థానాధీశులు మాన్యశ్రీ శ్వేతాచలపతి రామకృష్ణ రంగారావు బహద్దరు ఎమ్ ఎల్ ఏ, గారి ఔదార్యమును మేము కొనియాడుచున్నాము శ్రీవారు ప్రస్తుత సంపుటమునకు కూడ విరాళము నొసంగి మమ్ము కృతజ్ఞతాబద్ధులను జేసినారు. ఆరవసంపుటము యొక్క ముద్రణ కార్యమును నిర్వహించిన ఆంధ్ర రచయితల సహకార సంఘ ముద్రణాలయమువారిని అభినందించుచున్నాము.

సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశముయొక్క శైశవదశనుండియు దానితో సన్నిహిత సంబంధము కలిగి, ప్రస్తుతము సంఘాధ్యక్షులై మాకన్నివిధముల సలహాను, సహాయమును అందించుచున్న డాక్టరు మర్రి చెన్నారెడ్డిగారికి మేము ఋణపడియున్నాము

'సాప్తపదీనం సఖ్యమ్' అన్న పెద్దలవాక్యము మేరకు రాబోవు ఏడవమజిలీని మేము చేరువరకును ఆంధ్ర మహాజనులు మా కండదండలై నిలువవలయునని విన్నవించుచున్నాము.

సౌమ్య-శ్రీరామనవమి
27–3–1969

ఖండవల్లి లక్ష్మీరంజనం,
కార్యదర్శి

# కార్యనిర్వాహకవర్గము

1 అధ్యక్షులు — డాక్టరు మర్రి చెన్నారెడ్డి
[illegible] హైదరాబాదు-7

2. ఉపాధ్యక్షులు : డాక్టరు డి. సదాశివరెడ్డి, ఎం. ఏ., పి. హెచ్. డి.
ఉపాధ్యక్షులు, ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు-7

3 ,, శ్రీ మామిడిపూడి వేంకటరంగయ్య, ఎం. ఏ.,
మాజీ ప్రొఫెసరు, ఆంధ్ర, బొంబాయి విశ్వవిద్యాలయములు
81 మారేడుపల్లి, సికింద్రాబాదు-26

4 ,, శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజు
తణుకు పశ్చిమ గోదావరిజిల్లా.

5. కార్యదర్శి : ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం, ఎం. ఏ.,
రిటైర్డు ప్రొఫెసరు, ఉ. వి. హైదరాబాదు-7.

6. సంయుక్త కార్యదర్శి : డాక్టరు బి. రామరాజు, ఎం. ఏ., పి. హెచ్. డి.
ప్రొఫెసరు, తెలుగుశాఖాధ్యక్షులు, పోస్టుగ్రాడ్యుయేట్
సెంటరు, వరంగల్లు.

7. కోశాధికారి : డాక్టరు రావాడ సత్యనారాయణ
ఆచార్యులు, భౌతికశాస్త్రశాఖ, ఉ. వి. హైదరాబాదు-7

8. సభ్యులు : గౌ. డాక్టరు బెజవాడ గోపాలరెడ్డి
గవర్నరు, ఉత్తరప్రదేశ్.

9 ,, శ్రీ పి. వి. జి. రాజు, ఎం. ఎల్. ఏ.
పూర్వామాత్యులు, ఆం. ప్ర. ప్రభుత్వము, హైదరాబాదు

10 ,, శ్రీ ఎమ్. ఆర్. అప్పారావు
పూర్వామాత్యులు, ఆం. ప్ర. ప్రభుత్వము, హైదరాబాదు

11 ,, శ్రీ యస్. బి. పి. పట్టాభిరామారావు, ఎమ్. ఎల్. సి.
పూర్వామాత్యులు, ఆం. ప్ర. ప్రభుత్వము, హైదరాబాదు

12 ,, డాక్టరు ఎస్. వేంకటేశ్వరరావు, ఎమ్. డి.
హార్డికరుబాగు, హైదరాబాదు-27

13. ,, శ్రీ జి. వి. సుధాకరరావు, ఎం. ఏ.
బేగంపేట, హైదరాబాదు-16

14. ,, శ్రీ కల్వ సూర్యనారాయణగుప్త
వర్తకులు, సిద్దంబరుబజారు, హైదరాబాదు

15. ,, శ్రీ కె. వి. నరసింహాచార్యులు
సభ్యులు, మ్యునిసిపల్ కార్పొరేషను, హార్డికరుబాగు,
హిమాయత్‌నగర్, హైదరాబాదు-29.

16 ,, శ్రీ టి. హయగ్రీవాచారి
తెలంగాణా ప్రాంతీయసంఘ పూర్వాధ్యక్షులు, వరంగల్లు

17 ,, గౌ. శ్రీ కె. వి. నారాయణరెడ్డి
ప్రణాళికాశాఖ-న్యాయశాఖామాత్యులు, ఆం. ప్ర. ప్రభుత్వము, హైదరాబాదు.

18 ,, శ్రీమతి సంగం లక్ష్మీబాయమ్మ, ఎం. పి.
ఇందిరా సేవాసదనము, సైదాబాదు, హైదరాబాదు-16

19 ,, శ్రీ వి. వి. రాఘవాచారి, ఎమ్. ఎల్. సి.
హైదరాబాదు-22

20 ,, శ్రీ ఖండవల్లి బాలేందుశేఖరము, ఎమ్. ఏ.
ప్రిన్సిపాల్, ఎస్. వి. ఇ. ఎస్. తెలుగుకళాశాల, విద్యానగర్, హైదరాబాదు-7

21 ,, "బ్రహ్మ భూషణ", "శిరోమణి" చెలమచెర్ల రంగాచార్యులు
రీడరు, తెలుగుశాఖ, ఆర్ట్స్ అండ్ సైన్సుకళాశాల, సికిందరాబాదు.

22 ,, డాక్టరు పోణంగి శ్రీరామఅప్పారావు, ఎం. ఏ., పి. హెచ్. డి.
స్పెషల్ ఆఫీసరు, తెలుగు అకాడమీ, హిమాయత్‌నగర్, హైదరాబాదు-29.

23 ,, శ్రీ బి. వి. సుబ్రహ్మణ్యం, బి. ఏ.; బి. ఎల్.
అడ్వకేటు జనరల్, ఆంధ్రప్రదేశము, హైదరాబాదు.

24. ,, డాక్టరు డి. వి. సుబ్బారెడ్డి
సెక్రటరీ, తెలుగుభాషాసమితి, అశోక్‌నగర్, హైదరాబాదు-20

9 సంగ్రామశాస్త్రము — శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనము, ఎం. ఏ.,
విద్యానగరము, హైదరాబాదు-7

10. క్రీడలు — శ్రీ వి. టి. వెంకటాచారి,
భౌతికశాస్త్రశాఖ, ఉ. వి. హైదరాబాదు-7

11. వార్తాశాస్త్రము — శ్రీ యస్. నరోత్తమరెడ్డి, ఎం. ఏ.,
నారాయణగూడ, హైదరాబాదు-29

12 న్యాయశాస్త్రము — శ్రీ వల్లూరి వెంకటేశ్వర్లు, బి. ఏ., బి. ఎల్.,
అడ్వకేట్, సుప్రీమ్‌కోర్టు, క్రొత్తపేట,
హైదరాబాదు

13 వాణిజ్యశాస్త్రము — శ్రీ మొక్కపాటి శివాజీ, ఎమ్. ఏ.,
రీడర్, ఆర్థికశాస్త్రశాఖ, ఆర్ట్స్ &
సైన్సుకళాశాల, వరంగల్లు

14 వినోదములు — శ్రీ కోతుకూచి సాంబశివరావు, బి. ఏ., ఎల్. ఎల్. బి.,
అధ్యక్షులు ఆంధ్రవిశ్వసాహితి,
208, న్యూబోయిగూడ, సికింద్రాబాదు-8.

15. యాత్రలు, అన్వేషణము — శ్రీ దేవులపల్లి రామానుజరావు, బి. ఏ., ఎల్. ఎల్. బి.
కార్యదర్శి, ఆంధ్రప్రదేశ సాహిత్యఅకాడమీ,
హైదరాబాదు

16 కళ — డాక్టరు రాయప్రోలు సుబ్రహ్మణ్యం,
మాజీచరిత్రశాఖాధ్యక్షులు,
ఉ. వి. హైదరాబాదు-7

17 గానశాస్త్రము — శ్రీ పుచ్చా వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి.
విజిటింగ్ ప్రొఫెసర్ & రిసెర్చి ఆఫీసర్,
ప్రభుత్వ నృత్య, గాన కళాశాల,
కింగ్ కోఠిరోడ్డు, హైదరాబాద్-1

18 చిత్రకళ — శ్రీ కె. శేషగిరిరావు
ఉపన్యాసకులు, ప్రభుత్వ లలిత కళాశాల,
హైదరాబాదు

19 నృత్యకళ — శ్రీ నటరాజ రామకృష్ణ, బి. ఏ.,
డైరెక్టర్, నృత్యకళానికేతనము,
హైదరాబాద్.

20 వాస్తువిద్య — డాక్టర్ ఎం. రాధాకృష్ణశర్మ, ఎం. ఏ. పి. హెచ్. డి.,
చరిత్రశాఖ, ఉ. వి. హైదరాబాదు-7

21 గణితశాస్త్రము — శ్రీ రాఘవేంద్రరావు, ఎం. ఏ.,
అధ్యాపకులు, గణితశాస్త్రశాఖ, ఉ. వి.
హైదరాబాదు-7

| | | |
|---|---|---|
| 22 | భౌతికశాస్త్రము | డాక్టరు రావాడ సత్యనారాయణ,<br>ఆచార్యులు, భౌతికశాస్త్రశాఖ<br>హైదరాబాదు-7 |
| 23 | రసాయనశాస్త్రము | డాక్టరు నందూరి వెంకటసుబ్బారావు, డి ఎస్ సి,<br>ప్రిన్సిపాల్, సైన్సుకళాశాల, ఉ వి<br>హైదరాబాదు-7 |
| 24. | వృక్షశాస్త్రము | శ్రీ బి వి. రమణారావు, ఎం ఎస్ సి,<br>రీడరు, వ్యవసాయకళాశాల,<br>రాజేంద్రనగరు, హైదరాబాదు-31 |
| 25 | జంతుశాస్త్రము | శ్రీ వి జగన్నాథరావు, ఎం ఏ,<br>జంతుశాస్త్రోపన్యాసకులు, ఉ వి<br>హైదరాబాదు-7<br>&<br>డాక్టరు పి నారాయణరావు,<br>జంతుశాస్త్రోపన్యాసకులు, ఉ వి<br>హైదరాబాదు-7 |
| 26 | భూగర్భశాస్త్రము | డాక్టరు కె. వి రావు,<br>భారత భూగర్భశాస్త్రశాఖ, హైదరాబాదు<br>&<br>డాక్టరు ఎస్ బాలకృష్ణ,<br>అసిస్టెంటు డైరెక్టరు, నేషనల్ జియోఫిజికల్<br>రిసెర్చి ఇన్‌స్టిట్యూట్, హైదరాబాదు-9 |
| 27 | ఖగోళశాస్త్రము | డాక్టరు చేతనభొట్ల విశ్వనాథం, ఎం ఏ, పి. హెచ్ డి,<br>గణితశాస్త్ర శాఖాధ్యక్షులు, పోస్టు గ్రాడ్యుయేట్<br>సెంటరు, వరంగల్లు<br>&<br>డాక్టరు ఎం బాలకృష్ణశర్మ, ఎం ఏ, పి హెచ్. డి.,<br>రీడరు, ఖగోళశాస్త్రశాఖ, ఉ వి హైదరాబాదు-7 |
| 28 | వైద్యశాస్త్రము | డాక్టరు ఎస్ వెంకటేశ్వరరావు, ఎం డి.,<br>హార్డికర్ బాగ్, హైదరాబాదు-29. |
| 29 | స్థాపత్యము | శ్రీ వల్లూరి సుబ్బరాజు,<br>అగ్రికల్చరల్ ఇంజనీరు, హైదరాబాదు<br>&<br>ప్రొఫెసరు వి వి. ఎల్ రావు,<br>18, సెకండు మెయిన్‌రోడ్డు, గాంధీనగరు,<br>అడయార్, మద్రాసు-20 |

| | | |
|---|---|---|
| 30 | వ్యవసాయశాస్త్రము | శ్రీ కంభంపాటి భాస్కరము, బి. యస్ సి.,<br>వ్యవసాయ కళాశాల, రాజేంద్రనగరు, హైదరాబాదు-31 |
| 31 | సంఖ్యాశాస్త్రము | శ్రీ డి. వి. యస్. ద్వారకి, ఎం. ఎస్. సి.,<br>రీడరు, గణితశాస్త్రశాఖ, ఉ. వి. హైదరాబాదు-7 |
| 32 | మానసికశాస్త్రము | ఆచార్య కె. వేదాంతాచారి, ఎం. ఏ., ఎం. ఇడి.,<br>విద్యాశాస్త్ర కళాశాల, ఉ. వి. హైదరాబాదు-7 |
| 33 | విద్యాశాస్త్రము | శ్రీ సత్తిరాజు కృష్ణారావు, ఎం. ఏ. ఎం. ఇడి.<br>హైదరాబాదు |
| 34 | వాతావరణశాస్త్రము | డాక్టర్ ఎస్. రాజేశ్వరరావు ఎం. ఎస్ సి., పి హెచ్ డి<br>రీడరు, భౌతికశాస్త్రశాఖ, ఉ. వి. హైదరాబాద్-7 |
| 35 | వివిధములు | డాక్టర్ సి. టి. సత్యనారాయణమూర్తి, ఎం. ఎస్ సి., పి హెచ్ డి<br>రీడరు, భౌతికశాస్త్రశాఖ, ఉ. వి. హైదరాబాదు-7 |
| 36 | ఆంధ్రదేశము, విశేష శీర్షికలు | పండిత ఆదిరాజు వీరభద్రరావు,<br>ఆర్క్యాలజి, లక్ష్మణరాయ పరిశోధక మండలి,<br>78, [illegible], హైదరాబాదు-24 |
| 37 | ఆయుర్వేదము | స్వర్గీయ వేదాల తిరువేంగళ వేంకట రామానుజస్వామి,<br>ఆయుర్వేద కళాశాల, [illegible] లింగంపల్లి, హైదరాబాదు-27 |
| 38 | భారతీయ ప్రాచీనవిద్యలు - కళలు | శిరోమణి [illegible] రంగాచార్యులు,<br>రీడరు - తెలుగుశాఖ, ఆర్ట్స్ అండ్ సైన్స్ కళాశాల,<br>సికింద్రాబాదు |
| 39 | పశువైద్యశాస్త్రము | డాక్టరు సి. వెంకటేశ్వరరావు,<br>రీడరు, వెటరినరీ కాలేజి, ఉ. వి. హైదరాబాదు-7 |
| 40. | టెక్నాలజి | డాక్టర్ రామలింగం [illegible],<br>ప్రొఫెసర్, కెమికల్ టెక్నాలజీశాఖ, ఉ. వి.<br>హైదరాబాదు-7 |
| 41 | రాజ్యపాలనము | శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య, ఎం. ఏ. |

# రచయితలు

| పొడిఅక్షరాలు | రచయిత | విషయము | పుట |
|---|---|---|---|
| అ. నే. | శ్రీమతి అన్నాబత్తుల బుల్లి వేంకటరత్నం<br>C/o నటరాజ రామకృష్ణ, నృత్యకళానికేతనము<br>వివేకనగరు, హైదరాబాదు-20 | భాగవత నాట్యకళ | 561 |
| అ. రా. రా. | డాక్టరు అడపా రామకృష్ణారావు, ఎం. ఏ<br>రీడరు, ఆంగ్లభాషాశాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు-7 ఆం ప్ర | ప్రాచ్య, పాశ్చాత్య సిద్ధాంతములు<br>(కావ్యాత్మ) | 232 |
| ఆ. వీ. | వండిత ఆదిరాజు వీరభద్రరావు<br>కార్యదర్శి, లక్ష్మణరాయ పరిశోధకమండలి,<br>78, ఆజంపుర, హైదరాబాదు | 1 ఫణిగిరి<br>2 బడుగరులు<br>3 బయకార రామప్పయ్య<br>4 బౌద్ధదేవతలు | 284<br>334<br>342<br>477 |
| ఆ. పు. | శ్రీ ఆవుల పురుషోత్తము, ఎం. ఏ<br>మల్టిపర్పస్ హైస్కూలు, ఖమ్మం | 1. ఫిలిప్పైనుదీవులు (చ)<br>2 ఫ్రాన్సిస్కోపిజారో | 299<br>314 |
| ఆర్. ఎం. జో. | శ్రీ ఆర్ ఎం జోషి<br>రిటైర్డ్ డైరెక్టర్, సెంట్రల్ రికార్డు ఆఫీసు, హైదరాబాదు ప్రభుత్వము 8-4-199, కాచిగూడ, హైదరాబాదు-27 | 1 పూర్వ చారిత్రకసంస్కృతి<br>2. ప్రాచీనభారత యుద్ధతంత్రము | 80<br>226 |
| ఆర్. రా. | శ్రీ ఆర్ రాజగోపాల్, ఎం. ఏ.<br>ఉపన్యాసకులు, తెలుగుశాఖ, త్యాగరాజ<br>కళాశాల, వాషర్‌మన్‌పేట, మద్రాసు | బాల్కనురాజ్యముల చరిత్ర | 334 |
| ఆర్. వి. రా. | డాక్టరు రాంపల్లి విశ్వేశ్వరరావు, ఎం. ఏ. పి. హెచ్.డి.<br>నారాయణగూడ, హైదరాబాదు | 1 పెట్టుబడి<br>2 ప్రభుత్వము-వాణిజ్యము<br>3 ప్రభుత్వ వాణిజ్య సమారంభములు<br>4 ఫ్రెడరిక్ లిస్టు<br>5 బ్రిటిషగిషివులు<br>6 బొమ్మల పరిశ్రమ | 34<br>187<br>191<br>328<br>404<br>462 |
| ఆర్. స. రె. | శ్రీ ఆర్ సత్యనారాయణరెడ్డి<br>భూగోళశాస్త్రోపన్యాసకులు, డి.ఎన్.ఆర్. కళాశాల<br>భీమవరం, ప. గో. జిల్లా | పోలినీషియా (భూ) | 97 |

| | | | |
|---|---|---|---|
| ఆర్. సు | డాక్టరు రాయప్రోలు సుబ్రహ్మణ్యం, ఎం ఏ, పి హెచ్ డి. మాజీచరిత్ర శాఖాధ్యక్షులు, ఉ వి హైదరాబాదు-7 | 1 పురావస్తు తత్త్వశాస్త్రము | 15 |
| | | 2. ప్రాక్చారిత్రకకళ-పూర్వశిలాయుగము | 211 |
| ఆర్ సు | శ్రీ ఆర్ సూర్యనారాయణమూర్తి, ఎం ఏ ప్రిన్సిపాలు ట్రెయినింగ్ కాలేజి, వరంగల్లు | బాల్టిక్ రాజ్యములు (చ) | 384 |
| ఇం వే | శ్రీ ఇంటూరి వేంకటేశ్వరరావు ఎడిటర్ "సినిమా" ప్లాట్ నెం 12/6, అండవార్ నగరు, మద్రాసు-24 | 1 ప్రఖ్యాత నాటకశాలలు | 130 |
| | | 2 ఫిట్ జెరాల్డ్ ఎడ్వర్డ్ | 291 |
| | | 3 బర్నేజ్ జేమ్స్ | 355 |
| | | 4 బళ్ళారి రాఘవాచార్యులు | 360 |
| | | 5 బాలె | 382 |
| | | 6 బేరెంట్స్ విల్లెం | 458 |
| | | 7. భానుమతి | 569 |
| | | 8. భారతదేశపు సినిమారంగము | 601 |
| ఎం కు | డాక్టర్ ఎం కులశేఖరరావు, ఎం ఏ, పి హెచ్. డి. రీడరు, తెనుగుశాఖ, సాయంకళాశాల, హైదరాబాదు | 1 ప్రతాపరుద్రుడు (కాకతి) | 147 |
| | | 2 బహుజనపల్లి సీతారామాచార్యులు | 366 |
| ఎం సు | శ్రీ ఎం సుధాకరరావు, ఎం ఏ లెక్చరర్ గణితశాస్త్రశాఖ, ఉ వి హైదరాబాదు-7. | 1. పైథాగరస్ | 74 |
| | | 2 బెర్నోలీ సోదరులు | 430 |
| | | 3 బ్రహ్మగుప్తుడు | 489 |
| ఎస్. బి. వి కృ. | శ్రీ ఎస్. బి వి కృష్ణారావు, ఎం. ఎస్. సి ఉపన్యాసకులు, రసాయనశాస్త్రశాఖ, ఎం ఆర్ కాలేజి, విజయనగరము | బేయర్ ఎడాల్ఫ్ ఫాన్ | 453 |
| ఎన్. వేం | శ్రీ ఎన్, వెంకటరావు లార్సన్ అండ్ టోబ్రో, 4-6 క్లబ్ హౌస్ రోడ్ మౌంట్ రోడ్డు, మద్రాసు-2 | బాష్ప ఇంజనులు-టర్బయినులు | 391 |
| ఎస్ సి. | ప్రొఫెసర్ ఎస్ సిద్ధేశ్వర్ రీజియనల్ ఇంజనీరింగ్ కళాశాల, వరంగల్లు | బాయిలర్లు-బాష్పోత్పాదనము | 374 |
| వి. చెం | శ్రీ వి చెంచయ్య, ఎం ఏ ఉపన్యాసకులు, చరిత్రశాఖ, ఎస్. వి. ఆ ఎస్ తెలుగుకళాశాల, విద్యానగర్, హైదరాబాదు-7 | 1 బరంపురము | 345 |
| | | 2 బెల్జియం (చ) | 440 |
| | | 3 బొలివియా (చ) | 467 |
| వి ర | శ్రీ వి రమేష్, ఎం ఏ బి ఇ.డి C/o ఆ పద్మావతి, డి ఇ ఓ ఆఫీసు, ఏలూరు, ప. గో జిల్లా | 1 ఫ్రోబెల్ | 580 |
| | | 2 బర్క్ విల్స్ | 354 |
| | | 3. బాస్ ఫ్లిండర్స్ | 398 |
| | | 4 బెన్ డా | 442 |

| | | | |
|---|---|---|---|
| ఉ. ప్ర. దే. | శ్రీమతి ఉ. ప్రభావతీదేవి,<br>లెక్చరర్, ప్రభుత్వ మహిళా కళాశాల, గుంటూరు | భారతీయ చిత్రకళాచరిత్ర | 640 |
| ఓ. స. | శ్రీ ఓరుగంటి సత్యనారాయణమూర్తి<br>లెక్చరర్, హిందూ కళాశాల, గుంటూరు | 1 భారతదేశచరిత్ర<br>2 భారత రాజ్యాంగశాసనము | 585<br>620 |
| కం. వేం. సు. | 'కవిరాజ', 'వైద్యావధాని' కందుకూరి వెంకటసుబ్బారావు,<br>ధన్వంతరి కళాశ్రమము, గాంధినగరము,<br>ఏలూరు, ప. గో. జిల్లా | ప్రసవతంత్రము-గర్భధారణము,<br>(ఆయుర్వేదము) | 202 |
| క. చి. వెం. | కపిల చినవెంకటరావు అడ్వకేటు విజయవాడ-2 | భారతీయ న్యాయవిధానము | 644 |
| క. వి. | శ్రీ కలవకొలను వివేకానందము, ఎం. ఏ. బి. ఇడి.<br>ఉపన్యాసకులు, ట్రెయినింగు కాలేజి, వరంగల్లు | ప్రోలయ వేమారెడ్డి | 247 |
| కె. ఆర్. స. | శ్రీ కె. ఆర్. సక్సేనా, ఎం. ఎస్. సి.<br>రీడరు, జంతుశాస్త్రశాఖ, ఉ. వి. హైదరాబాదు-7 | ప్రాణిజీవనశాస్త్రము | 287 |
| కుం. ఈ. ద. | స్వర్గీయ శ్రీ కుందూరి ఈశ్వరదత్తు బి. ఏ.<br>రిటైర్డ్ ఎకౌంట్స్ ఆఫీసరు, కాకినాడ,<br>తూ. గో. జిల్లా | 1 పెదకోమటి వేమారెడ్డి<br>2 పెద్దాపురము<br>3 పెనుగొండ | 48<br>51<br>59 |
| కె. ఎస్. పి.<br>&<br>కె. ఎన్. వి. బ. | శ్రీ కె. ఎస్. పిళ్ళై,<br>&<br>శ్రీ కె. ఎన్. వి. బసివిరెడ్డి<br>సివిల్ ఇంజనీరింగ్ డిపార్టుమెంటు, రీజియనల్<br>ఇంజనీరింగ్ కళాశాల వరంగల్లు | ప్రవీక్షణ-ఉదాయన పరికరములు | 198 |
| కె. వి. భూ. | శ్రీ కె. వి. భూపాలరావు,<br>డిప్యూటీ డైరెక్టరు, అర్థశాఖ, హైదరాబాదు-1 | ప్రౌఢ దేవరాయలు | 351 |
| కె. వి. రె. | శ్రీ కె. విఠల్‌రెడ్డి ఎం. ఏ.,<br>ఉపన్యాసకులు, భూగోళశాస్త్రశాఖ,<br>ఆర్ట్స్ & సైన్సు కళాశాల, సికిందరాబాదు | 1 పోలెండుదేశము (భూ)<br>2 బల్గేరియా | 104<br>356 |
| కె. వెం. | డాక్టర్ కె. వెంకటరామయ్య, ఎం. ఎస్. సి. పి. హెచ్. డి.<br>ప్రిన్సిపల్, ఆర్ట్స్ & సైన్సు కళాశాల, వరంగల్లు | ప్రమాణ సిద్ధాంతము | 198 |
| కె. న. శా. | "సాహిత్యశిరోమణి, విద్వాన్" కేశవపంతుల నరసింహశాస్త్రి,<br>ఎ. ఐ. ఆర్. హైదరాబాదు | బిజ్జల తిమ్మభూపాలుడు | 400 |
| కె. సో. | డా. కె. సోమయ్య,<br>అసిస్టెంటు డైరెక్టరు, ఆరోగ్యశాఖ,<br>హైదరాబాదు | ప్రజారోగ్యము (ఆంగ్లవైద్యము ననుసరించి) | 144 |

| | | | |
|---|---|---|---|
| కొ. న. | శ్రీ కొమ్మమూరి నరసింహారావు,<br>విజ్ఞానపురి, హైదరాబాదు-7 | 1 పోలో | 107 |
| | | 2 ఫుట్‌బాల్ | 305 |
| | | 3 బాడ్‌మింటన్ | 366 |
| | | 4 బాలక్రీడలు | 378 |
| | | 5 బాస్కెట్‌బాల్ | 397 |
| | | 6 బేస్‌బాల్ | 454 |
| కొ. నా. | శ్రీ కొల్లిమర్ల నాగేశ్వరరావు, బి. ఏ.<br>కార్యదర్శి, జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీ, ఖమ్మం | బెల్లంకొండ రామారావు | 431 |
| కొ. మ. | పండిత కొ. మధుసూదనరావు,<br>ఖిల్లాగేటు, ఖిల్లాబజారు, ఖమ్మం | బాలచంద్రుడు (పలనాటి) | 378 |
| ఖం. న. శా. | వ్యాకరణ శిరోమణి, ఖండవల్లి నరసింహశాస్త్రి,<br>వైస్‌ప్రిన్సిపల్, సంస్కృతకళాశాల,<br>సీతారాంబాగ్, హైదరాబాదు-1 | భాగవతము (సంస్కృతము) | 564 |
| ఖం. శే. | శ్రీ ఖండవల్లి బాలేందుశేఖరం, ఎం. ఏ.<br>ప్రిన్సిపల్ ఎస్. వి. ఇ. ఎస్. తెలుగుకళాశాల,<br>విద్యానగరము, హైదరాబాదు-7 | 1 ఫోనీషియా (చ) | 309 |
| | | 2 బాబిలోనియా (చ) | 371 |
| | | 3 బ్రిటను దేశము (చ) | 517 |
| | | 4 భారత దేశము (చ)<br>(హిందూ మహాయుగము) | 574 |
| | | 5 భారత దేశము (చ)<br>(మహమ్మదీయ మహాయుగము) | 579 |
| ఖ. శే. అ. | శ్రీమతి ఖమరున్నిసాబేగం అబ్బాసి, ఎం. ఏ.<br>ఉపన్యాసకురాలు, ఉ. వి. మహిళాకళాశాల,<br>హైదరాబాదు | 1 ప్రకృత్యాత్మకత్వవాదము | 165 |
| | | 2 ప్రేయోవాదము | 240 |
| గ. జీ. | శ్రీమతి గద్దిభుక్త జీవరత్నమ్మ<br>C/o శ్రీ నటరాజరామకృష్ణ,<br>నృత్యనికేతనము, హైదరాబాదు | భరతనాట్యము | 548 |
| గ. రా. శ. | పండిత గడియారం రామకృష్ణశర్మ,<br>ఆలంపురము, మహబూబునగరుజిల్లా ఆం. ప్ర. | 1 పురందరదాసు | 6 |
| | | 2 ప్రతాపరెడ్డి సురవరము | 155 |
| | | 3 బ్రాహ్మీలిపి | 510 |
| | | 4 భవభూతి | 556 |
| గ. ల. శా. | శ్రీ గరికపాటి లక్ష్మీకాంతశాస్త్రి, ఎం. ఏ.<br>ఎడిటోరియల్ సూపరింటెండెంటు,<br>సం. ఆం. వి. కోశసమితి, విద్యానగరం,<br>హైదరాబాదు-7 | 1 పోర్చుగల్ దేశము (చ) | 94 |
| | | 2 పోలెండు దేశము (చ) | 102 |
| | | 3 బాణుడు | 366 |

| | | | |
|---|---|---|---|
| గు ద ర | డాక్టర్ గులాం దస్తగిర్ రషీద్, ఎం ఏ పి హెచ్ డి<br>రిటైర్డు రీడరు, పర్షియన్ భాషాశాఖ,<br>ఉ వి, హైదరాబాదు-7 | పారసీభాషా సారస్వతములు | 282 |
| చిం బు వేం అ | శ్రీ చింతలపాటి బుచ్చివేంకట అప్పారావు,<br>రిటైర్డు హెడ్‌మాస్టరు చిక్కడపల్లి,<br>హైదరాబాదు-20 | బ్రహ్మనాయుడు | 491 |
| చ రా శ | చల్లా రాధాకృష్ణశర్మ, ఎం ఏ ఎం లిట్<br>24 A, కాండపరాయ గ్రామణివీధి,<br>తండియార్ పేట, మద్రాసు-21 | ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము, | 285 |
| చె రం | శిరోమణి చెలమచెర్ల రంగాచార్యులు,<br>రీడరు, తెనుగుశాఖ, ఆర్ట్స్ & సైన్సు కళాశాల,<br>సికిందరాబాదు | బమ్మెర పోతనామాత్యుడు | 386 |
| జ. వేం సు శ | పండిత జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మ,<br>కడప, ఆం. ప్ర | పుష్పగిరి | 21 |
| జి రా | శ్రీ జి రామిరెడ్డి, ఎం ఎస్ సి<br>పబ్లిక్ ఎడ్మినిస్ట్రేషను డిపార్టుమెంటు,<br>ఉ వి., హైదరాబాదు-7 | ప్రధాన కార్యనిర్వాహకుడు | 171 |
| జి వి సు | శ్రీ జి. వి సుబ్రహ్మణ్యము, ఎం ఏ.<br>లెక్చరర్, ఎస్ వి ఇ. ఎస్ తెలుగుకళాశాల,<br>విద్యానగరం, హైదరాబాదు-7 | భారత పరిపాలనము-పంచాయతీరాజ్యము | 615 |
| జె ప. | శ్రీ జె పరబ్రహ్మం, ఎం కాం<br>వాణిజ్యశాస్త్రోపన్యాసకులు,<br>హిందూకాలేజి గుంటూరు | భారత వాణిజ్యోపాదములు-<br>దేశాంతర్గతము-అంతర్జాతీయము | 625 |
| జె ల. | డాక్టరు జె లక్ష్మీనారాయణరావు,<br>ప్రకృతి చికిత్సాలయము No 6<br>1 వ మెయిన్ రోడ్డు గాంధీనగరము,<br>అడయార్ మద్రాసు-20 | ప్రకృతిచికిత్స | 125 |
| టి ఎస్ ఎస్. ఆం | శ్రీ టి ఎస్ ఎస్ ఆంజనేయులు, ఎం ఎస్ సి<br>వాతావరణ శాస్త్రశాఖా కార్యాలయము,<br>శివాజీనగరు, పూనా | 1 ప్రపంచ శీతోష్ణస్థితి<br>2 భారతదేశ శీతోష్ణస్థితి | 178<br>599 |
| టి. వి. జి. శా | శ్రీ టి వి జి శాస్త్రి,<br>టెక్నికల్ అసిస్టెంటు ఆర్కియలాజికల్<br>సర్వే ఆఫ్ ఇండియా, సౌత్ ఈస్టరన్ సర్కిల్,<br>ఆబిడ్ మెట్టు; హైదరాబాదు-7 | 1. భారతీయకళ, హైందవకళ-<br>ప్రాచీనరీతి<br>2. భారతీయకళ; హైందవకళ-<br>మధ్యయుగరీతి | 680<br><br><br>685 |

| | | | |
|---|---|---|---|
| డి కె భీ | శ్రీ డి కె భీమసేనరావు, ఎం ఏ,<br>రిటైర్డు ప్రొఫెసరు, కన్నడభాషాశాఖ,<br>ఉ వి లింగంపల్లి, హైదరాబాదు-27 | బసవేశ్వరుడు | 363 |
| డి రా ప | శ్రీ డి రాధాకృష్ణపట్నాయక్, ఎం ఏ<br>ఉపన్యాసకులు, ఆర్థికశాఖ,<br>రాజా ఆర్ ఎస్ ఆర్ కె రంగారావుకళాశాల,<br>బొబ్బిలి, శ్రీకాకుళంజిల్లా | బొబ్బిలి | 459 |
| డి వి రం | డాక్టరు డి వి రంగాచార్యులు,<br>1 వ లైను, ప్రాతపట్టాభిపురము గుంటూరు | ప్రజారోగ్యము (ఆయుర్వేదమును సరించి) | 141 |
| డి శ్రీ. | శ్రీ డి శ్రీధరబాబు, ఎం ఏ<br>తెలుగుభాషా సమితి హైదరాబాదు-7 | ఫ్రెంచిభాషా సారస్వతములు | 825 |
| తం ఆం శా | "భాషాప్రవీణ" తంగిరాల ఆంజనేయశాస్త్రి,<br>ఎం ఏ, బి ఓ ఎల్<br>ఆంధ్రోపన్యాసకులు, ఆంధ్రప్రాచ్యకళాశాల,<br>నల్లకుంట, హైదరాబాదు-20 | భారవి | 647 |
| తూ శి కృ శా | "శిరోమణి" తూములూరి శివరామకృష్ణశాస్త్రి, ఎం ఏ.,<br>తెలుగుశాఖాధ్యక్షులు, ఎస్ వి ఎన్ కళాశాల,<br>నర్సారావుపేట, గుంటూరుజిల్లా | బోధాయనమహర్షి | 475 |
| తె వి శ | "శిరోమణి" తెలకపల్లి విశ్వనాథశర్మ, ఎం ఏ,<br>ప్రిన్సిపల్, వేంకటేశ్వర ప్రాచ్యకళాశాల,<br>పాలెం, మహబూబునగరు జిల్లా | బ్రాహ్మణములు | 506 |
| ది వేం శి | శ్రీ దిగవల్లి వేంకటశివరావు,<br>అడ్వకేటు, గవర్నరుపేట, విజయవాడ-2 | "భారతదేశచరిత్ర" స్వాతంత్ర్యము-<br>అనంతరము | 539 |
| ధ ప్ర | శ్రీ ధర్మేంద్రప్రసాద్, ఎం ఏ,<br>ఉపన్యాసకులు భూగోళశాస్త్రశాఖ,<br>సాయం కళాశాల హైదరాబాదు | "ట్రైబల్" (భూ) | 527 |
| ధూ అ సో | డా॥ ధూళిపాళ అర్కసోమయాజులు,<br>ఎం ఏ పి హెచ్ డి<br>ప్రిన్సిపల్, డి ఎన్ ఆర్ కళాశాల,<br>భీమవరం, ప॥ గో॥ జిల్లా | బీజగణితము | 406 |
| న రా | డా॥ న. రామయ్య, ఎం ఎస్ సి, పి హెచ్ డి<br>రీడరు, వృక్షశాస్త్రశాఖ సైన్సుకళాశాల,<br>ఉ వి, హైదరాబాదు-7 | ఫలదీకరణము | 370 |

| | | | |
|---|---|---|---|
| న రా. | శ్రీ నటరాజ రామకృష్ణ,<br>నృత్యనికేతనము, వివేకనగర్,<br>హైదరాబాదు-20 | ప్రాచీన నృత్యరీతులు | 221 |
| నూ కృ శా | శ్రీ నూతల కృష్ణశాస్త్రి, ఎం ఏ, | 1 భారతదేశ పరిశ్రమలు, భారీ లఘుకుటీర పరిశ్రమలు | 524 |
| | | 2 భారతదూష్యము | 624 |
| పా మా శ | డాక్టరు పాటిబండ మాధవశర్మ,<br>ఎం ఏ పి హెచ్ డి.<br>రీడరు, తెలుగుశాఖ, ఉ వి, హైదరాబాదు-7 | 1 ఫిన్నిష్‌భాషా సారస్వతములు | 206 |
| | | 2 జర్మనీయభాషా సాహిత్యములు | 351 |
| పి ఏ జే | శ్రీ పి ఏ జేమ్స్<br>పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్ డిపార్టుమెంటు,<br>ఉ వి, హైదరాబాదు-7 | పౌరసంబంధములు | 112 |
| పు ప శా | శ్రీ పుచ్చా పరబ్రహ్మశాస్త్రి, ఎం ఏ<br>అసిస్టెంట్ డైరెక్టరు, అర్ష శాఖ, హైదరాబాదు | ప్రోలరాజు (రెండవ) | 249 |
| పు వి | శ్రీ పుచ్చా విశ్వనాథము, బి ఎస్ సి<br>భూగోళశాస్త్ర శాఖ, ఉ వి హైదరాబాదు-7 | పెరగ్వే (భూ) | 68 |
| పు వేం సు. శా. | పుచ్చా వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి,<br>విజిటింగ్ ప్రొఫెసరు & రిసెర్చి ఆఫీసరు,<br>ప్రభుత్వ నృత్య, గాన, కళాశాల,<br>హైదరాబాదు-1 | బయకార రామప్పయ్య-2 | 344 |
| పు వేం | శ్రీ పుల్లాభొట్ల వేంకటేశ్వర్లు, ఎం ఎ బి ఇ డి<br>రిక్కాబజార్, పాత పేట, ఖమ్మం | 1 పొట్టిశ్రీరాములు | 90 |
| | | 2 ప్రాణహిత | 286 |
| | | 3. బుక్కరాయలు | 411 |
| | | 4 బేట్స్‌హెన్రీవాల్టర్ | 446 |
| | | 5. బొజ్జన్నకొండ | 455 |
| | | 6 బ్రహ్మరుద్రయ్య | 495 |
| | | 7. భట్టిప్రోలు | 588 |
| పు శ్రీ. రా | డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు, ఎం ఏ. పి హెచ్ డి<br>ఉపన్యాసకులు, సంస్కృతశాఖ,<br>ఉ వి హైదరాబాదు-7 | భాషాశాస్త్రము-దానివికాసము-<br>భాషాకుటుంబములు | |
| పె లిం శా. | "ఉభయభాషాప్రవీణ" పెరవలి లింగయ్యశాస్త్రి,<br>58/2, పి టి హెచ్ వి కాలనీ, సైదాబాదు,<br>హైదరాబాదు-36 | ప్రతిష్ఠానపురము | 162 |

| | | | |
|---|---|---|---|
| ప్ర. రా. సు | శ్రీ ప్రతాప రామసుబ్బయ్య, ఎడిటోరియల్ స్కాలర్, సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము, విద్యానగరం, హైదరాబాదు-7 | 1 పులిజూదము<br>2 పుష్పములు | 19<br>25 |
| ప్ర. వేం. సు. శ | శ్రీ ప్రతాపగిరి వేంకటసుబ్బశర్మ, పేట, కర్నూలు | భస్మములు | 559 |
| ప్ర సీ. ఆం. | శ్రీ ప్రతాప సీతారామాంజనేయులు, ఎం కాం స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, తెనాలి, గుంటూరుజిల్లా | బ్యాంకింగు విధానము | 601 |
| బి కే | శ్రీ బి కేశవరావు, ఎం ఏ ఉపన్యాసకులు, గణితశాస్త్రశాఖ, ఉ వి. హైదరాబాదు-7 | ఫెర్మా | 307 |
| బి రా. | డాక్టరు బి రాజేశ్వరరావు, ఎం ఎస్ సి. ఉపన్యాసకులు, వృక్షశాస్త్రశాఖ, వ్యవసాయకళాశాల, రాజేంద్రనగర్, హైదరాబాదు-31 | ప్రకాండము | 115 |
| బి. రా | డాక్టరు బి రామరాజు, ఎం ఏ పి హెచ్. డి. ఆంధ్రశాఖాధ్యక్షులు, పోస్ట్‌గ్రాడ్యుయేట్ సెంటర్, వరంగల్లు | 1 బేదరులు<br>2 బ్రౌన్ సి పి. | 447<br>531 |
| బి వి ర | శ్రీ బి వి రమణరావు, ఎం ఎస్. సి రీడరు, వృక్షశాస్త్రశాఖ, వ్యవసాయకళాశాల, రాజేంద్రనగరు, హైదరాబాదు-31 | 1 ప్రఫుల్లచంద్రరాయ్<br>2 ప్లాన్క్-మాక్స్<br>3 ఫారడే మైకేల్ | 179<br>255<br>231 |
| బొ. వేం. కు. | డాక్టర్ బొడ్డుపాటి వెంకటకుటుంబరాయశర్మ, ఎం ఏ పి. హెచ్. డి ఉపన్యాసకులు, తెలుగుశాఖ, ఆర్ట్స్ & సైన్సు కళాశాల, సికిందరాబాదు | ఫాహియాన్ | 237 |
| భం భీ జో. | డాక్టరు భండారం భీమసేనజోస్యులు, ఎం ఏ, పి హెచ్ డి. ఉపన్యాసకులు, హిందీభాషాశాఖ, ఆర్ట్స్ & సైన్సు కళాశాల, సికిందరాబాదు | 1 ప్రాకృతభాషాసాహిత్యములు<br>2 ఫిరదౌసి<br>3 బెంగాలీభాషా సారస్వతములు<br>4 బౌద్ధసాహిత్యము | 203<br>293<br>413<br>484 |
| భో సూ. | శ్రీ భోగరాజు సూర్యారావు, ఎం ఏ, బి ఇడి ప్రిన్సిపల్ ఇన్ చార్జి, ఎం ఆర్ ట్రెయినింగ్ కళాశాల, విజయనగరం-2 | 1 పెస్టాలాజి<br>2 బోధనపద్ధతులు | 72<br>479 |

| | | | |
|---|---|---|---|
| సుం. రా శా | శ్రీ సుంగిపూడి రామలింగశాస్త్రి, | శాత్యాంజే | 567 |
| | కొవ్వూరు, ప గో జిల్లా | | |
| ము ఉ ర | శ్రీ ముజీబ్ ఉర్ రహమాన్, | 1 ప్రవర్తనైక మనస్తత్త్వవాదము | 196 |
| | ఉపన్యాసకులు మనస్తత్త్వశాస్త్రశాఖ, | 2 ఫ్రాయిడ్ | 329 |
| | ఉ వి హైదరాబాదు-7 | | |
| మ ఇ | శ్రీ మహమ్మద్ ఇనాముల్లా, ఎం ఏ బి టి | 1 పెరూదేశము (భూ) | 66 |
| | ఉపన్యాసకులు, భూగోళశాస్త్రశాఖ | 2 బొలీ యా (భూ) | 469 |
| | మహిళాకళాశాల, ఉ వి., హైదరాబాదు-7 | 3 ఫిన్లాండు (భూ) | 292 |
| మ రా స | శ్రీ మహేశ్వరరాజ సక్సేనా, | పురాజీవశాస్త్రము | 10 |
| | ఆంతు, వృక్షశాస్త్రశాఖలు, ఉ వి , హైదరాబాదు | | |
| మా. కో | శ్రీ మాదవపెద్ది కోటేశ్వరరావు, ఎం ఎస్ సి., | 1 ప్రేలుడు పదార్థములు | 245 |
| | రసాయనశాస్త్రశాఖ, | 2 ప్లాటినం | 254 |
| | గుంటూరు మెడికల్ కాలేజి, గుంటూరు | 3 బంగారము | 392 |
| మా వేం రం | శ్రీ మామిడిపూడి వేంకటరంగయ్య, ఎం ఏ , | 1 ప్రజాభిప్రాయము | 138 |
| | మాజీ ప్రొఫెసరు, | 2 ప్రజారాజ్యము | 136 |
| | ఆంధ్ర, బొంబాయి విశ్వవిద్యాలయములు, | 3 ప్లేటో (రాజనీతివేత్తగా) | 264 |
| | 81 మారేడుపల్లి, సికిందరాబాదు-26 | | |
| మి. హ. | డాక్టరు మీర్ హమీదాలీ, | 1. పైరుల చీడలు | 77 |
| | రీడరు, వ్యవసాయశాస్త్ర శాఖాధ్యక్షులు, | 2 పైరుల తెగుళ్ళు | 84 |
| | వ్యవసాయ కళాశాల, రాజేంద్రనగరు, | | |
| | హైదరాబాదు-31 | | |
| ము. బా శ. | డాక్టరు ముక్కామల బాలకృష్ణశర్మ, | ఫాన్ హోఫర్ జోసెఫ్ వాన్ | 312 |
| | ఎం ఎస్ సి , పి హెచ్. డి , | | |
| | రీడరు, ఖగోళశాస్త్రశాఖ, ఉ వి , | | |
| | హైదరాబాదు | | |
| యం ర రా | స్వర్గీయ యం రఘురామరావు, ఎ ఎస్. సి , | 1 ఫలములు | 374 |
| | ఉపన్యాసకులు, వృక్షశాస్త్రశాఖ, | 2 ఫలములు, బీజములు వ్యాప్తిచెందుట | 376 |
| | న్యూ సైన్సు కళాశాల, హైదరాబాదు-29 | 3 బీజములు | 410 |
| రా. క | డాక్టరు రామచలింగ కపర్థి, పి హెచ్ డి , | పెట్రోలియం, బొగ్గు, | 44 |
| | & | వాయు - ఇంధనములు | |
| యం వేం | శ్రీ యం వేంకటేశ్వరరావు, | | |
| | టెక్నాలజీశాఖ, ఉ వి హైదరాబాదు-7 | | |

| | | | |
|---|---|---|---|
| యం. స. వా. | "స్వర్గీయ" యండమూరి సత్యనారాయణ (శ్రీవాత్సవ) ఎం. ఏ., ఆల్ ఇండియా రేడియో, హైదరాబాదు | 1 జాహోయి మతము<br>2 భరతనాట్యశాస్త్రము | 397<br>546 |
| య. యో. | శ్రీ యలమంచిలి యోగేశ్వరరావు. ఎం. ఎస్ సి., ఉపన్యాసకులు, వ్యవసాయ కళాశాల, రాజేంద్రనగర్, హైదరాబాదు-31 | సైరుల పెంపుదల | 37 |
| యన్. సి. యస్. వేం. | "సాహిత్యవిశారద" నల్లాన్ చక్రవర్తులవెంకటాచార్యులు, భరద్వాజుడు సుసర్ల వారివీథి పవర్ పేట, ఏలూరు, ప. గో. జిల్లా | | 551 |
| రా. ప్ర. | శ్రీ రామచంద్రప్రసాదు, ఉపన్యాసకులు, భూగోళశాస్త్రశాఖ, సాయంకళాశాల, హైదరాబాదు-1 | బుష్ మెన్ | 417 |
| రా. భ. | శ్రీ రావూరి భరద్వాజ, పద్మాలయము, 159/3RT, విజయనగర్ కాలనీ, హైదరాబాదు-28 | ప్లాస్టిక్ పదార్థములు (టెక్నాలజీ) | 256 |
| లం. సీ. శా. | శ్రీ లంకా సీతారామశాస్త్రి, ఆంధ్రోపన్యాసకులు, ప్రాచ్యకళాశాల, నల్లకుంట, హైదరాబాదు | భావనారాయణస్వామి ఆలయము (పొన్నూరు) | |
| వ. లిం. | శ్రీ వజ్ఝల లింగమూర్తి, రాజనీతిశాస్త్రశాఖాధ్యక్షులు, యం. ఆర్. కళాశాల, విజయనగరం, విశాఖపట్టణం జిల్లా | ప్రభుత్వ కార్యనిర్వాహకవర్గము | 181 |
| వా. రా. | శ్రీ వారణాసి రామబ్రహ్మం, రిటైర్డ్ లెక్చరర్, అమలాపురం తూ. గో. జిల్లా | భద్రాచలము | 599 |
| వా. వెం. సు. | శ్రీ వారణాసి వెంకటసుబ్బారావు, ఎం. ఏ. చరిత్రోపన్యాసకులు, ఎస్. వి. ఇ. యస్. తెలుగుకళాశాల, విద్యానగరము, హైదరాబాదు-7 | 1. భారతదేశపరిపాలనము- కేంద్రపాలన వ్యవస్థ<br>2. భారతదేశ పరిపాలనము- ప్రణాళికావిధానము<br>3. భారతదేశ పరిపాలనము- రాష్ట్రపరిపాలనవ్యవస్థ | 612<br><br>617<br><br>619 |
| వి. టి. వి. రా. | స్వర్గీయ శ్రీ వేదాల తిరుమలవెంకట రామానుజస్వామి, ఆయుర్వేదశిక్షామందిరము, లింగంపల్లి, హైదరాబాదు | భారతదేశము-ఓషధులు | 610 |

| | | | |
|---|---|---|---|
| వి నా. క రె | శ్రీ వి నారాయణకరన్‌రెడ్డి<br>ఉపన్యాసకులు, నిజాం కళాశాల,<br>హైదరాబాదు -1 | 1 ప్రయోజనైకవాదము<br>2 ఫలానుమేయప్రామాణ్యవాదము. | 195<br>278 |
| వి మ | శ్రీ వి మల్లపరాజు,<br>భూగోళశాస్త్రశాఖ<br>డి యన్ ఆర్ కళాశాల,<br>భీమవరము, పశ్చిమ గోదావరి జిల్లా | 1 పెనామాకాలువ<br>2 బెల్జియన్ కాంగో (భూ) | 57<br>485 |
| వి వి. ఎల్. రా. | ఆచార్య వి వి ఎల్ రావు,<br>18, సెకండు మెయిన్‌రోడ్డు,<br>గాంధినగర్, అడయార్, మద్రాసు-20 | 1 ప్రకాశనము, బల్బులు<br>2 భవనపథకములు | 118<br>552 |
| వి వి | శ్రీ వి విద్యానాథ్,<br>భూగోళశాస్త్రశాఖ,<br>ఉ వి హైదరాబాదు-7 | 1 ఫ్రాన్స్‌దేశము (భూ)<br>2 బెల్జియమ్ (భూ)<br>3 బ్రిటిష్‌దీవులు (భూ)<br>4 భారతదేశము (భూ) | 819<br>488<br>522<br>604 |
| వి వి రా | శ్రీ వి విశ్వేశ్వరరావు, యం యస్ సి,<br>మానవశాస్త్రవేత్త,<br>భారతీయ పురావస్తు - ఉత్ఖననశాఖ,<br>నాగపురము, (మ ప్ర) | ప్రాక్చారిత్రక సంస్కృతులు | 216 |
| వే. సుం | డా॥ వేటూరి సుందరమూర్తి,<br>ఎం ఎస్ సి, పి హెచ్. డి,<br>రసాయనశాఖ, ఉ వి, హైదరాబాదు-7 | పెర్కిన్ సర్ విలియమ్ హెన్రీ | 71 |
| వి సూ. | శ్రీ విష్ణుభొట్ల సూర్యనారాయణ, బి ఏ బి ఎల్,<br>అడ్వకేట్, బ్రాడీపేట, గుంటూరు-2 | బొర్రయ్య, కావలి | 465 |
| వై వి | డాక్టరు వై విఠలరావు, ఎం ఏ<br>ఉపన్యాసకులు, చరిత్రశాఖ,<br>డి యన్ ఆర్ కళాశాల,<br>భీమవరము, ప గో జిల్లా | బర్మా (చ) | 846 |
| వై వి. సు | శ్రీ యర్రమిల్లి వెంకట సుబ్బారావు, ఎం ఎస్ సి,<br>సైన్‌టిస్ట్, రిజియనల్ రిసెర్చి లాబొరేటరీస్,<br>హైదరాబాదు-9 | పూతరంగులు, వార్నిషులు | 28 |
| వై. స | శ్రీమతి వై సరస్వతీరావు,<br>మహిళాకళాశాల, ఉ. వి,<br>హైదరాబాదు-1 | 1 ప్రభుత్వపాలనము<br>2 ప్రభుత్వేతరపాలనము | 185 |

| | | | |
|---|---|---|---|
| శి హ | శ్రీ శిదుగూరి హనుమంతరావు, ఎం ఏ ఎల్ టి, ప్రొఫెసర్, (రిటైర్డ్) "కౌండిన్య" హార్డికర్ బాగ్, హైదరాబాదు-20 | 1. పునరుజ్జీవనము. | 1 |
| | | 2 పౌరధర్మతత్త్వము | 109 |
| | | 3. బౌద్ధమతము | 480 |
| | | 4 బ్రహ్మసమాజము | 498 |
| | | 5. బ్లావట్స్కీ, హెచ్ పి | 514 |
| శ్రీ గో కృ | డాక్టరు శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, 384, లాలగూడ, సికిందరాబాదు-17 | ప్రధానకణములు | 169 |
| శ్రీ శ్రీ | డాక్టర్ శ్రీపాటి శ్రీదేవి, ఎం ఏ, పి హెచ్ డి., రిటైర్డ్ ప్రిన్సిపల్, మహిళాకళాశాల, ఉ వి., 6-3/14, ఖైరతాబాదు, హైదరాబాదు-4 | 1 ప్లేటో (తత్త్వవేత్తగా) | 260 |
| | | 2 ఫ్రాన్సిస్ గాల్టన్ | 313 |
| | | 3. బుద్ధి - బుద్ధిశోధనము | 414 |
| | | 4 బెర్ట్రాండ్ రస్సెల్ | 425 |
| స శ్రీ శ | శ్రీ సన్నిధానం శ్రీధరశర్మ, ఎం ఏ బి ఇడి, ఉపాధ్యాయులు, ప్రభుత్వ ట్రైనింగ్ కళాశాల, బషీరుబాగ్, హైదరాబాదు | ఫ్రాన్సుదేశము (చ) | 316 |
| సి వి. ర | డాక్టర్ సి వి రత్నం, రీడర్, రసాయనశాస్త్రశాఖ, ఉ వి, హైదరాబాదు-7 | ప్లాస్టిక్ పదార్థములు (రసాయనము) | 258 |
| హ ఆ | శ్రీహరి ఆదిశేషువు, ఎం ఎస్ సి, అశోక్‌నగర్, హైదరాబాదు-20 | 1 పెట్రోలియం | 37 |
| | | 2. ఫిషర్ ఎమిల్ | 302 |
| | | 3 బెర్జిలియస్ జోన్స్ జాకబ్ | 428 |
| | | 4 భట్నగర్ శాంతిస్వరూప్ | 535 |
| | | 5 భాభా | 571 |



# వ్యాసానుక్రమణిక

[illegible]

# సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము

## పునరుజ్జీవనము
(Renaissance)

'పునరుజ్జీవనము' లేక "పునర్జన్మ" అను పదము మధ్య యుగావసానమున విద్యా పునరుజ్జీవన పరముగా ఉపయోగింపబడెను. జీవితమునకును, ఆలోచనకును సంబంధించిన ప్రత్యంశమునందు మనస్స్వాతంత్ర్యమును ప్రాచీన విద్యా పునరుజ్జీవనము ప్రోత్సహించెను. కోపర్నికస్ (1473-1543), గెలీలియో (1564-1642) అనువారలు వైజ్ఞానిక శాస్త్ర పునరుజ్జీవన విషయమున అగ్రేసరులైయున్నారు. కోపర్నికస్ అనునాతడు ఆధునిక జ్యోతిశ్శాస్త్ర స్థాపకుడుగా ఖ్యాతి గన్నవాడు. భూమి విశ్వముయొక్క కేంద్రమని చిరకాలము నుండి అంగీకరింపబడుచున్న సిద్ధాంతమును పూర్వపక్షమొనర్చి, భూమి తనఅక్షముపై తానే తిరుగుచు, ఇతర గ్రహములతో సహా సూర్యునిచుట్టు పరిభ్రమించుచున్నదని అతడు ప్రతిపాదించెను. కోపర్నికస్ యొక్క ఈ సిద్ధాంతమునకు గెలీలియో సర్వజనామోదమును సంపాదించెను. గెలీలియో ఇటలీలో పైసా అను నగరమున జన్మించెను. ఇతనితండ్రి ఉన్నతమైన ఫ్లోరెంటైను వంశమున బుట్టినవాడు. అతడు ధనికుడు కాడు. అతడు తనకుమారుని మంచిస్థితియందుంచ గోరి, అతనికి ఉన్ని వ్యాపారము ఉచితమయిన వృత్తియని భావించెను. కాని కొడుకునకు విజ్ఞానశాస్త్రమునందు అభిరుచియున్నట్లు కనిపెట్టి, అతనిని 1581వ సంవత్సరమున వైద్యశాస్త్రాధ్యయన మొనర్చుటకై పైసా విశ్వవిద్యాలయమున కంపెను. గెలీలియో 1582వ సంవత్సరమున లోలకముయొక్క ఆందోళన కాలము (Time of the swing of Pendulam) స్వతంత్రమైన దనియు, దానికిని, అది ఆందోళించు వృత్తాంశముయొక్క వెడల్పునకును, ఎట్టి సంబంధము లేదనియు ప్రప్రథమముగా కనిపెట్టెను. అతడు లోలకముతో కూడిన యొక చిన్నసాధనమును కల్పించెను. దాని నతడు రోగులనాడీకాలమును తెలిసికొనుటకు ఉపయోగించెను.

గెలీలియో తండ్రి తన కుమారునకు విశ్వవిద్యాలయమున చదువు చెప్పింపలేకపోయెను. ఆవిషయ మెరిగిన గెలీలియో, 1585వ సంవత్సరమున తనఇంటికి చేరి, భౌతిక శాస్త్రమును, గణితశాస్త్రమును అధ్యయన మొనర్చెను. అతడు గురుత్వ కేంద్రముపై పరిశోధన మొనర్చెను. సంవత్సరమునకు 18 పౌనుల జీతముపై అతడు పైసా విశ్వవిద్యాలయమునందు గణితశాస్త్రోపన్యాసకుడుగా నియమింపబడెను. అతని కచ్చట అనుకూలమైన పరిస్థితులు లేకపోయెను. అందుచే, స్నేహితుల సాహాయ్యమున సంవత్సరమునకు 32 పౌనుల జీతముపై పాడ్వా నగరములో గణితశాస్త్రాచార్యుడుగా పూర్వముకంటె ఉత్తమతరమయిన ఉద్యోగమును అతడు సంపాదించుకొనెను. 1593వ సంవత్సరములో శతఘ్నులనుగూర్చియు, దుర్గాది నిర్మాణములను గూర్చియు ఒక గ్రంథమును అతడు వ్రాసెను. అది మిలిటరీ ఇంజనీర్లకు విశేషముగా ఉపయోగపడెను.

గెలీలియో సమకాలికులలో కెప్లర్ (1571-1630) అనునాతడొకడు. అతడు కోపర్నికస్ యొక్క సిద్ధాంతమును సవరించి, గ్రహములు సూర్యునిచుట్టు వర్తులకక్ష్యలో గాక, అండాకారమార్గమున పరిభ్రమించునని చూపెను. అతడొకవేళ గెలీలియోకు విశ్వవర్ణనమునుగూర్చి తాను రచించిన పుస్తకమును పంపియుండును. గెలీలియో 1597వ సంవత్సర

ములో కెప్లరున కొకలేఖ వ్రాయుచు, అందులో కోపర్నికస్ యొక్క అభిప్రాయములను పెక్కు వత్సరముల క్రిందటనే తాను అనుసరించినప్పటికిని, వాటిని ప్రచురించుటకు భయపడినట్లు పేర్కొనెను "విశ్వసించి ముందునకు పొమ్ము" అని కెప్లరు గెలీలియోకు ప్రత్యుత్తరము వ్రాయుటయేగాక, తాను కోపర్నికస్ సిద్ధాంతమును సమర్థించిన విధానమును జర్మనీలో ప్రచురింపుమనికూడ సలహా నొసగెను కాని గెలీలియో ఈసలహాను అనుసరించినవాడు కాడు

1599వ సంవత్సరములో అతడు యంత్రశాస్త్రమును గూర్చి ఒక పుస్తకమును రేఖాగణితమున సైనిక వృత్తి లేఖని అనుదానినిగూర్చి మరియొక పుస్తకమును వ్రాసెను ఈవృత్తలేఖినులు కావలయునను వారు పెక్కురుండిరి కావున వాటిని తయారుచేయుటకు అతడొక కర్మాగారమును స్థాపించి అది ఉపయోగపడు విధములపై ఉపన్యాసము లియ్యదొడగెను సుమారు 1604వ సంవత్సర ప్రాంతమున "గతి వృద్ధిచలనము" పై ఒక గ్రంథమును రచించెను అందులో పతనమునొందు పదార్థము ఏకరూపముననే గతివృద్ధిచలనమునకు లోనగునని అతడు ప్రతిపాదించెను గెలీలియో తయారుచేసిన టెలెస్కోపు (దూరదర్శిని యంత్రము) పదిరెట్లకంటె అధికముగా వ్యాసములను వృద్ధిచేయగల శక్తి కలది నౌకా, సైనిక యుద్ధములందు టెలెస్కోపుయొక్క ఉపయోగమునుగూర్చి అతడు వెనిసు నగరపు ద్యూకునకు తెలిపెను అతనికి జీవితావధిగా అధిక వేతనముతో ఆచార్యపదవి లభించెను 1610వ సంవత్సరమున టెలెస్కోపును ఆకసముపైపు గురిపెట్టి, బాహ్యవిశ్వములోనికి కిటికీవంటి యొక ముఖ్యసాధనమును కనిపెట్టితి నని అతడు తెలిసికొనెను అతడు చంద్రునిలో పర్వతములను, అసంఖ్యాక నక్షత్రములతో నిండిన పాలపుంతను, నాలుగు క్రొత్త గ్రహములను కనిపెట్టెను గెలీలియో సిద్ధాంతములు, నూతనావిష్కరణములు క్యాథోలిక్కు మతాధిపతులకు, వేదాంతులకు కోపహేతువులయ్యెను ఇతడు వ్రాసిన "టోలిమెయిక్ కోపర్నికస్" అను ఉత్తమగ్రంథము ఇతనిపతనమునకు కారణమయ్యెను అప్పటికి 68 సంవత్సరముల వయస్సుగలిగిన గెలీలియో అనారోగ్యముచే క్రుంగ నారంభించెను

గెలీలియో పై మోపు తెచ్చిన అభియోగముల ఫలితముగా, అతడు ధర్మవిచారణాధికారుల యెదుట హాజరగునట్లు శాసింపబడెను డెబ్బది సంవత్సరములు పైబడిన ఈవృద్ధమూర్తి రోము నగరమునకు 1633 లో ప్రయాసపడి వెళ్ళవలసివచ్చెను భిన్న మతాభిప్రాయమును త్యజింపవలెనని అతడు శాసింపబడగా, అతడట్లే యొనర్చెను అయినను, సంపూర్ణ స్వాతంత్ర్య మనుభవించుట కాతనికి అనుజ్ఞ యొసగబడలేదు అయినను గెలీలియో తనవ్యాసంగమును కొనసాగించుచు, 1638లో "రెండు విజ్ఞానశాస్త్రములను గూర్చిన సంభాషణలు" అను నొక అత్యుత్తమ గ్రంథమును రచించెను అతడు భౌతికశాస్త్రముపై గావించిన పరిశోధన కృషియంతయు ఈగ్రంథములో సంగ్రహింపబడెను 1637 లో అతడు తుదిసారిగా చంద్రునియొక్క కంపనమును గూర్చి నూతనవిషయమును కనిపెట్టెను 1638 లో అతడు అంధుడయ్యెను 74 సంవత్సరముల వయస్సులో అంధుడైయుండియు, 1656 లో హైగెన్సుచే ఉపయోగింపబడిన లోలక సహితమగు ఘటికాసూత్రమును అతడు కనిపెట్టెను 1641వ సంవత్సరములో స్వల్పకాల మాతడు జబ్బుపడి 1642 సంవత్సరము జనవరి నెలలో మరణించెను

సుదీర్ఘమైన తన జీవితకాలములో సిద్ధాంతముల మూలమున, ఆదర్శవంతమైన నడతమూలమున, విజ్ఞానశాస్త్రముయొక్క సత్యములు తాను కనిపెట్టిన శాస్త్రీయ విధానముచేతనే స్థాపింపబడవలెనని, గెలీలియో దృఢముగా సమర్థించుచు, వాటిని నియమబద్ధముగా అనుష్ఠించుచుండెను ఇదియే భావప్రపంచమున అతడు గడించుకొనిన అఖండ ఖ్యాతి

ప్రాచీన నగర ప్రభుత్వముల యొక్క ఆదర్శము వలె, సర్వతోముఖమైన సంపూర్ణాదర్శమే పునరుజ్జీవనము యొక్క ఆశయమని గుర్తింపబడినది అట్టి సర్వతోముఖ సంపూర్ణ క్రియాశక్తియుతుడైనవాడు లియొనార్డో డావిన్సి (1452-1519) అనువాడు ఇతడు 1452లో ఇటలీదేశమందలి ఫ్లోరెన్సు నగరసమీపమున జన్మించెను ఇతడొక సమర్థుడగు న్యాయవాది కుమారుడు ఆతనికి ఫ్లోరెన్సు పాలకుల ఆశ్రయ ముండియుండెను ఆలేఖ్యము, శిల్పరచనము యందని బాల్యమున అభిమాన విషయములు 1470వ సంవత్సరమున అన్డ్రియా వెర్రోకియో అను నొక సుప్రసిద్ధ చిత్రకారుని శిల్పరచనాగృహమున అతడు అప్రెంటిస్‌గా ప్రవేశించి శిక్షణ ముగించిన పిమ్మట, అతడు చిత్రకారసంఘమునందు సభ్యు

శించి, ప్రతిభాప్రాభవములు గడించి, దృఢసుందరగాత్రుడై సువర్ణమయకేశసమృద్ధితో, గులాబివన్నె దుస్తులు ధరించి, స్నేహితులతో ముచ్చటించుచు, దర్శనీయాకృతితో నొప్పారెను 1477–1482 వరకు అతడు ఫ్లోరెన్సు అధిపతియగు లోరెంజో డెయ్ మెడిసీ అను నాతని పోషకత్వమున నుండి పనిచేసెను 1482వ సంవత్సరమున అతడు చిత్రకారుడుగను, ఇంజనీరుగను మిలాను ప్రభువగు లుడోవిక్ స్ఫోర్జా యొద్దకేగి, ఉద్యోగము నభ్యర్థించెను అతడు 17 వత్సరముల కాలము మిలాన్ నగరములో నివసించుచు శిల్పకర్మను నిర్వహించెను మిలానులో నున్నప్పుడు "లాస్ట్ సప్పర్" అను ప్రసిద్ధచిత్రమును అతడు రచించెను 1500వ సంవత్సరములో అతడు ఫ్లోరెన్సునకు తిరిగి వచ్చెను 1502వ సంవత్సరములో, అతడు సెసెరే బోర్గ్యాకు ముఖ్యస్థపతిగా నియమితుడయ్యెను అతడు సైనిక నిర్మాణములనుగూర్చి సలహాల నిచ్చుచు, ఇటలీలో ప్రయాణించెను 1504–1506 సంవత్సరముల నడుమ అతడు 'మోనాలిసా' అను అత్యంతసుప్రసిద్ధమయిన కళాఖండమును చిత్రించెను ఉజ్జ్వలమయిన నేత్రములతో, గూఢమయిన చిరునవ్వుతో విరాజిల్లు ఈచిత్రము శతాబ్దులవరకు కళారూపమున, శాశ్వత స్త్రీత్వరూప – గూఢసమస్యావిష్కరణముగ భావింపబడుచున్నది 1506వ సంవత్సరమున లియొనార్డో మరల మిలాను నగరమున కేగెను అచట అతడు సాంకేతిక నిర్మాణవిధానములనుగూర్చి రోమన్ క్యాథొలిక్ టంకశాలకు సలహాల నొసగెను అటుతరువాత రెండు సంవత్సరములకు అతడు ఫ్రెంచి ప్రభుత్వ రాజస్థానములో చిత్రకారుడుగను, ఇంజనీయరుగను ఉద్యోగమునుస్వీకరించి, ఫ్రాన్సునందే స్థిరపడెను అచటనే అతడు 1519వ సంవత్సరమున మృతినొందెను లియొనార్డో డావిన్సీ సంపూర్ణమానవుడు నాగరికమైన వ్యక్తిత్వమునకును అంతశ్శుద్ధికిని, ఆరోగ్యకరమైన శరీరనిర్మాణమునకును అతడొక సంపూర్ణోదాహరణము

నికొలోమాకియవెల్లి (1469–1527) అనునతడు మరియొక విచిత్రమైన వ్యక్తి అతడు మధ్యయుగములనుండి ఆధునికయుగమువరకు ఘటిల్లిన పరివర్తనమునకు ప్రతినిధియై యున్నాడు అతని జన్మస్థలము ఫ్లోరెన్సు నగరము అతని తండ్రి ధర్మశాస్త్రపండితుడు కాని అభిజాతుడు కానికారణమున అతడు ఉన్నతోద్యోగి కాజాలడయ్యెను అతడు తన కుమారుడగు నికొలో మాకియవెల్లికి ఉన్నతవిద్యను చెప్పించెను తన్మూలమున అతనికి ఉన్నతమైన ఉద్యోగము లభించెను 1498వ సంవత్సరమునందు కౌన్సిల్ ఆఫ్ టెన్ అను ఫ్లోరెన్సు ప్రజాస్వామిక ప్రభుత్వమునకు చెందిన కార్యనిర్వాహకవర్గమునకు కార్యదర్శి యయ్యెను కార్యదర్శిగ నుండుటచే అతనికి యుద్ధ, రాజనీతి శాఖలయొక్క అంతరంగిక వ్యూహాలాపములను పరిశీలించి, అధ్యయన మొనర్చుటకు అవకాశము లభించెను

పదునారవ శతాబ్ది మొదటి పాదమున ఇటలీ రాజకీయముగా విభక్తమై పరిసరప్రాంతములకు యుద్ధక్షేత్రముగ పరిణమించెను పోపు మున్నగు క్యాథలిక్కు మతాధికారులు ఆధ్యాత్మిక వ్యవహారములందుకంటె లౌకిక వ్యవహారములందే విశేషమయిన అభిరుచి గలవారై యుండిరి ఇటలీ కేంద్ర పరిపాలనముపై తమపట్టును దృఢ మొనర్చుకొనుటకై పోపులు ముఖ్యముగా ఆరవ అలెగ్జాండరు (బోర్గియా), రెండవ జూలియస్ అనువారు ఉద్ధృతమైన సైనిక, రాజకీయ విధానముల ననుసరించిరి ఆరవ అలెగ్జాండరు కుమారుడయిన సీజర్ బోర్గియా అనునతడును, మాకియవెల్లియు పోపుప్రభృతి మతాధికారులే ఇటలీయొక్క అనైక్యమునకు కారకులని విశ్వసించిరి సీజర్ బోర్గియా అనునాతడు క్రైస్తవ దేవాలయములందలి అవాంఛనీయములగువారిని తొలగించుటకై ఆరవ అలెగ్జాండరుపై తన పలుకుబడిని వినియోగించెను కాని 1503వ సంవత్సరమున బోర్గియా, అలెగ్జాండరు అను నిరువురును విషప్రయోగముచే హతులైరి 1503–1513 మధ్యకాలమునందు రెండవ జూలియస్ అనునాతడు యుద్ధ రాజనీతి క్షేత్రములలో శక్తిమంతమైన కార్యవిధానము ననుసరించి, క్రైస్తవ దేవాలయమునకు శత్రువులైనవారిని అణచివేసెను ఇటలీ దౌర్బల్యమునకు సామ్రాజ్యముకూడ హేతువయ్యెను 1507వ సంవత్సరమున మాక్సిమిలియన్ అను సమ్రాట్టు ఇటలీనగర రాజ్యములనుండి ధనసాహాయ్యమును కోరెను ఫ్రాన్సు, స్పెయిన్ దేశములు రెండును బలియములైన రాజరికములుగా అయ్యారై ఇటలీ వ్యవహారములలో జోక్యము కలిగించుకొనుటకు సంసిద్ధము లయ్యెను

మాకియవెల్లి రాజకీయ దౌత్య వ్యవహారములపై ఫ్రెంచి సార్వభౌమునివద్దకును, పోపువద్దకును పంపబడెను జర్మనీకి పోవు మార్గమున అతడు స్విట్జర్లెండును సందర్శించి ఆదేశముయొక్క యుద్ధపద్ధతులను పరిశీలించెను 1510వ

సంవత్సరములో ఆతడు ఫ్రాన్సునందు పండ్రెండవ లూయీ ప్రభువును సందర్శించెను 1512వ సంవత్సరములో స్పానిష్ క్యాథొలిక్కు సైనిక గణములు ఫ్లోరెన్సు నగరము నాక్రమించి, ప్రజాస్వామిక ప్రభుత్వమును కూలద్రోసి, మాకియవెల్లిని కారాగారమున పడవైచెను 1513లో ఆతడు ఏకాంతవాసమునం దుండునట్లు ఆజ్ఞాపితుడయ్యెను ఈ తరుణముననే ఆతడు 'రాజకుమారుడు' అను అత్యంతప్రముఖమైన గ్రంథమును రచించెను అది మెడిసీ వంశపు రాజకుమారుల బోధనార్థము మాత్రమే ఉద్దిష్టమైన రహస్యగ్రంథము ఈ గ్రంథమునందు కపటవృత్తి యెరుగనివాడు రాజ్యతంత్రజ్ఞాన శూన్యుడనియు, ప్రభువైనవాడు వంచకత్వము నెరిగి దానిని యథావసరముగ ఉపయోగింపవలెననియు మాకియవెల్లి స్పష్టమొనర్చెను ఇతడు రాజకీయ ప్రయోజనములను సాధించుటకు నీతిదూరమైన సాధనములను ఉపయోగించుటలో వెనుకాడలేదు కార్యసిద్ధియైన చాలును తత్సాధన మెట్టిదైననేమి! అనునదే మాకియవెల్లి యొక్క తాత్త్విక సిద్ధాంతము రాజకీయ పాతకమును సాఫల్యాప ముగను, ప్రోత్సాహము నను కీర్తించిన కారణముచే, ప్రపంచప్రజాభిప్రాయమును మలినపరచెడి రాజకీయవేదాంతతత్త్వమును ప్రతిపాదించిన బాధ్యతను మాకియవెల్లి వహించవలసివచ్చెను

ఇటలీ దేశమునకు విమోచనము క్రౌర్య-కపట ప్రయోగము మూలమున సిద్ధించలేదు సామ్రాజ్యవాదుల యొక్క, మతాధికారుల యొక్క కాంక్షవలన ఇటలీ ఐక్యసాధనమునకు కాలహరణము ఘటిల్లెను 19వ శతాబ్ది ఆరంభమునందు ఇటలీ ఐక్యము సాధింపబడినపుడు, తత్సిద్ధియందు మాజినీ అను ఇటలీ దేశభక్తునియొక్క ఆదర్శవాదమొక ప్రబలమైన శక్తిగా పరిణమించెను జీవిత మొక ఆదేశమనియు, విధి నిర్వహణము అంతని ఉత్కృష్టసిద్ధాంతమనియు, ఇతడు ఇటలీప్రజలకు బోధించెను కాగా, మాకియవెల్లి నైతికసూత్రములను రాజకీయమునుండి బహిష్కరించెను మాకియవెల్లి 'ప్రిన్స్' అను గ్రంథమునే కాక, 'లివి' అను రచయిత వ్రాసిన 'రోమను చరిత్ర', "ఫ్లోరెన్సు చరిత్ర" అను గ్రంథములపై వ్యాఖ్యలను రచించెను ఈ వ్యాఖ్యలయందలి భావసరణి 'ప్రిన్స్' అను గ్రంథసరణిని పోలియున్నది ఇటలీ ఐక్యసాధనమునందు ఎట్టివిధంపమైనను సమర్థనీయమే ననియు, దేశక్షేమమువిషయమై నిర్ణయము చేయవలసియున్న సందర్భములలో, న్యాయాన్యాయములను గూర్చి, మానవత్వపశుత్వములనుగూర్చి, మానాభిమానములను గూర్చి విచారించుటకు అవకాశమే లేదనియు, శేషించిన ఆలోచనల నన్నిటిని సరకుచేయక దేశస్వాతంత్ర్యమును, ప్రజలజీవితములను రక్షించుటకు ఏది ఏకైకమార్గ మనునదే ప్రశ్నగా పరిణమింపవలెననియు ఆతడు పదేపదే ఉద్ఘాటించెను

1521వ సంవత్సరమున మాకియవెల్లి 'యుద్ధకళ'ను గూర్చి ఒక అగ్రగణ్యమయిన గ్రంథమును రచించెను రాజనీతిశాస్త్రమునందు 'ప్రిన్స్' అను గ్రంథమునకుగల ప్రముఖస్థానమే సైనికశాస్త్రమున ఈ గ్రంథమునకు గలదు "ప్రజలే ఆయుధములు" అనునదే ఆతని అభిప్రాయము పౌరసైన్యప్రాముఖ్యమును ఆతడు ఉద్ఘాటించెను ఆతనికి కిరాయిసైనికదళములనిన ద్వేషము తనజీవితచరమావస్థలో ఆతడు 'మంద్రగోల' 'క్లైటియా' అను రెండు రసవంతములయిన సుఖాంత నాటకములను వ్రాసెను మాకియవెల్లి మరణము 1527వ సంవత్సరమున సంభవించెను

ఫ్రాన్సిస్ బేకన్ (1561–1626) ఫ్రాన్సిస్ బేకన్ అనునాతడు ఆధునికయుగమున అత్యంత శక్తిమంతమయిన ప్రజ్ఞాశాలిగా ప్రశంసింపబడినవాడు ఆతడు లండనునందు తండ్రియగు సర్ నికొలస్ బేకన్ యొక్క వసతిగృహమునందు 1561వ సంవత్సరము 22 జనవరి తేదీన జననమొందెను ఆతని తండ్రి, ఎలిజబెత్తు రాణియొద్ద 'లార్డు కీపర్ ఆఫ్ ది గ్రేట్ సీల్' అను ఉన్నతపదవిని అధిష్ఠించియుండెను పండ్రెండవ సంవత్సరమున కేంబ్రిడ్జి నగరమునకు ఫ్రాన్సిస్ బేకన్ పంపబడెను అచ్చట నాతడు మూడు సంవత్సరములుండి అచ్చట జరుగు కార్యకలాపముల కాతడు రోసి, మూడు సంవత్సరముల అనంతరము ఆతావును వదలిపోయెను పదునారు సంవత్సరముల లేతవయస్సునందు ఆతనికి ఫ్రాన్సునందలి ఇంగ్లీషు దౌత్యకార్యాలయములో ఉద్యోగము లభించెను 1579వ సంవత్సరమున ఆతనితండ్రి హఠాత్తుగ మరణించగా, ఫ్రాన్సిస్ బేకన్ లండనునకు తిరిగి వచ్చెను ఆతనికి పితృవియోగము, ద్రవ్యాభావము ఘటిల్లెను బారిస్టరు విద్యావిశేషములను నేర్చుకొని ఆతడు న్యాయవాదవృత్తి నవలంబించెను ఆతని పినతండ్రియు, ఎలిజబెత్తు రాణిమంత్రియు నగు లార్డు బర్లే, అను నతనిని ఉద్యోగముకొరకాశ్రయించెను కాని బర్లే, రాబర్ట్ సెసిల్ అనుతనకుమారున

కాయుదోగ్యమును నిప్పించడలచెను అందుచే బేకను రాజకీయ రంగములో ప్రవేశింపవలసివచ్చెను 1583వ సంవత్సరములో ఆతడు పార్లమెంటు సభకు ఎన్నుకొనబడెను పార్లమెంటులో వక్తృత్వ కళావిషయమున నాతడు ప్రసిద్ధి నొందెను 1618వ సంవత్సరమున అతడు లార్డు ఛాన్సలర్ గా నియుక్తుడయ్యెను 1621వ సంవత్సరములో అతడు "వై కౌంట్" పదవి నధిరోహించెను ఆతనిపై మోపబడిన లంచపు నేరము ఫలితముగా ఆతనికి పతనము ఘటిల్లెను అతడు తనఅపరాధమును ఒప్పుకొని కరుణింప ప్రభుత్వమును వేడుకొనెను అతనిని నాలుగు రోజులుమాత్రమే చెరసాలయం దుంచిరి ఆతనిపై విధింపబడిన 40,000 పౌనుల జరిమానాను మొదటి జేమ్సు రాజు చెల్లించెను ఆతరువాత అతడు 5 సంవత్సరములుమాత్రమే జీవించెను తనకాలమునెల్ల అతడు వాఙ్మయమును, విజ్ఞానశాస్త్రమును అధ్యయనము చేయుటకై వినియోగించెను అతడొక ప్రయోగమును నడుపుచు జ్వరగతుడై 65 సంవత్సరముల వయఃపరిమితియందుండి, 1626వ సంవత్సరమున మృతుడయ్యెను

బేకను రచించిన వ్యాసములు (1587-1623) ఆతని అత్యుత్తమ సాహిత్య, పాండిత్య ప్రకర్షను వెల్లడించును పఠనమునుగూర్చి ఆత డిట్లు వ్రాసెను "పఠనము ఆనందమును, శోభను కూర్చును అలంకారమును, శక్తిసామర్థ్యములను లభింపజేయును కొన్ని పుస్తకములు రుచిచూడదగినవి, కొన్ని మ్రింగదగినవి, మరికొన్ని నమలి, జీర్ణించుకొనదగినవి అధ్యయనము మానవుని సంపూర్ణునిగను, సమ్మేళనము సంసిద్ధునిగను, రచనము దోషరహితునిగను కావించును మనస్సే మానవుడు, విజ్ఞానమే మనస్సు, విజ్ఞానము వలననే మానవు డగుచున్నాడు "

మానవవిజ్ఞానముయొక్క యథార్థప్రయోజన మేది? అను ప్రశ్నమునకు బేకను ఇట్లు సమాధానము చెప్పెను "విజ్ఞానముయొక్క యథార్థ ప్రయోజనము కౌతుకానందముకాదు, నిశ్చయప్రసన్నత కాదు, ఉత్సాహమును ఉద్దీపింపచేయుటయు కాదు చాతుర్యవిజయము కాదు, భాషణ సామర్థ్యము కాదు, వృత్తిలాభము కాదు, కీర్తి గౌరవ లాలస కాదు, వ్యాపారదక్షతయు కాదు, విజ్ఞాన ప్రయోజనము లాభము కాదు, కీర్తియు కాదు కాగా ఆప్రయోజనము ఆధిపత్యము బేకనుయొక్క అత్యుత్తమ రచనయైన "నూ్యా ఆర్గనన్" అను గ్రంథమందు ఆతడిట్లు నిర్దేశించెను "మనుజుడు, ప్రకృతికి సేవకుడును, వ్యాఖ్యాతయునై యున్నాడు అతడు చేయునది, తెలిసికొనున దెల్ల అతడు ప్రకృతిసంవిధానములో ప్రత్యక్షముగా తిలకించినది, మనమున భావించినదిమాత్రమే ఇంతకుమించి ఆతడేమియు నెరుగడు ఆతడు చేయగలిగే దేదియును లేదు "

ప్రకృతిని వ్యాఖ్యానించువట్ల శాస్త్రీయపద్ధతిని అన్వయింపవలయు ననియు, కేవలము ఇంద్రియానుభవములను, ప్రయోగాత్మక సమాచారమును మాత్రమే విజ్ఞానశాస్త్రమునకు ప్రాతిపదికగా నొనర్పతగదనియు అనుమానపద్ధతిని అనుసరింపవలయు ననియు, శాస్త్రీయ విచారణకు అనురూపమయినది ప్రయోగోపకృతమైన అనుమానపద్ధతియే అనియు బేకన్ వాక్రుచ్చెను

బేకను రచించిన "ది నూ్యా అట్లాంటిస్" అను గ్రంథమునందు ఆతడు ఒక విశిష్టమైన నూతనసమాజమును చిత్రించెను అట్టిసమాజమున విజ్ఞానశాస్త్రమునకు సముచితమగు ఉన్నతస్థానము ఒసగబడినది ఈఆదర్శసంఘమునకు సాలమన్ అనునతడు న్యాయప్రవర్తకుడు విజ్ఞానశాస్త్ర పరిశోధనముకొరకును, దానివిపులప్రచారముకొరకును ఆత డొక నూతనసమాజమును సృజించెను దానికి సాలమన్ కుటుంబము అని పేరు అందలి సభ్యులందరును శాస్త్రజ్ఞులే అందలి ఉపన్యాసశాలలు క్రొత్తవిషయములను, క్రొత్తదేశములను కనుగొన్నప్రముఖుల ప్రతికృతులచే అలంకరింపబడెను ఆ సభ్యులలో కొందరు విదేశీయులలో నివసించి, వారిభాషలను నేర్చుకొని, వారిశాస్త్రముల నధ్యయన మొనర్చి సమాచారమును తెచ్చుటకై విదేశములకు పంపబడిరి ఇట్లు "నూ్యా అట్లాంటిస్" విజ్ఞానమునకును, విజ్ఞానశాస్త్రీయ ప్రగతికిని కేంద్రమగును ఆటవికదశలో నుండిన ఐరోపాఖండమును కళాశాస్త్రనిధిక్షేత్రముగా మార్చి, అల్పపరిమాణముగల ద్వీపకల్పమును ప్రపంచ కేంద్రముగా నొనర్చిన యూరప్ దేశవాసులలోనెల్ల బేకను ప్రధానపురుషుడు

పునరుజ్జీవనమునకు చెందిన మరియొక అంశముసాహస కృత్యము లొనర్చుట, క్రొత్త విషయములను కనిపెట్టుటయందు ఉల్లాసము ప్రకటించుట ఈఉల్లాసము మధ్యయుగములనుండి ఆధునిక యుగమువరకు పరిణామమును చెందినది 1453వ సం॥రమున టర్కీయులు కాన్‌స్టాంటినోపిలు నగర

మును ఆక్రమించుకొనిరి దీనివలన ప్రాక్ పశ్చిమ ఖండముల మధ్యనున్న మధ్యధరావాణిజ్య మార్గము మూసివేయ బడెను నూతనమార్గాన్వేషణమునకై తీవ్రమైన ప్రయత్నములు జరిగెను సముద్రాధిపత్యము ప్రముఖపాత్ర గు వహింపదొడగెను అందుకు పోర్చుగీసువారు మార్గదర్శకులైరి అట్లాంటిక్ మహాసముద్రతీరమున నున్న ఈదేశములో నావికాకళయందు నేర్పరులైన పెక్కురు యోధులు తయారైరి 1415వ సంవత్సరమున నావికుడయిన ప్రిన్స్ హెన్రీ అనునతడు మూరులవద్దనుండి సెంటా అను ప్రదేశమును స్వాధీన మొనర్చుకొనెను లతడు సముద్రీయాన్వేషణముయొక్కయు, నౌకావిషయకచాతుర్యముయొక్కయు ప్రాముఖ్యమును సమగ్రముగా అవగతముచేసికొనెను అప్పటికిని ప్రపంచముయొక్క ఆకృతి ఊహాజనితమైనదిగ నేయుండెను నూతనప్రపంచముయొక్క అస్తిత్వము ఊహింపబడనైన లేదు

ప్రిన్స్‌హెన్రీ ఒక నౌకాశస్త్రశాలను, ఒక వేధశాలను నిర్మించెను అతడు తనజీవితమును నావికాపరికరములను అభివృద్ధి చేయుటయందును, అన్వేషణబృందములను విశాల ప్రపంచములోనికి పంపుటయందును వినియోగించెను

రెండవ జానురాజు (1481–1495) ప్రిన్స్‌హెన్రీ ఆరంభించిన పనిని కొనసాగించెను 1488వ సంవత్సరమున బార్తొలోమియో డయాజ్ అనునాతడు కేప్ ఆఫ్ గుడ్‌హోప్‌ను కనిపెట్టెను 1497వ సంవత్సరములో సహజమైన సాహస లక్షణములుగల నాయకుడగు వాస్కోడిగామా నేతృత్వమున ఒక పరిశోధనబృందము పంపబడెను వాస్కోడిగామా అసాధారణమైన శక్తిసామర్థ్యములు, సాహసప్రవృత్తియు కలవాడు 1498వ సంవత్సరము మే 17వ తేదీన భారతదేశమునందలి కాలికట్ నగరమువద్ద అతడు అడుగిడెను ఈ విధముగ యూరపునుండి ప్రాచ్యదేశమునకొక నూతన మార్గమును కనిపెట్టెను ఇది ఆధునిక చరిత్రమున నొక అత్యంతప్రముఖమైన పరివర్తన చిహ్నము అతడు సుగంధద్రవ్యములను గైకొని 1499వ సంవత్సరము ఆగస్టునెలలో లిస్బన్ (పోర్చుగల్ దేశము) నగరమునకు తిరిగి పోయెను

అమెరికాను కనిపెట్టినవాడు క్రిస్టఫర్ కొలంబస్ అతడు 1446వ సంవత్సరమున జన్మించెను అతడు చాతుర్యము గల నావికుడై, స్పెయిన్‌కు చెందిన ఫెర్డినాండ్, ఇసబెల్లాల యొక్క ఆశ్రయమును సంపాదించుకొని అట్లాంటిక్ మహాసముద్రమును దాటుటకై బయలుదేరెను అతడు 1492వ సంవత్సరమున 'నూతన ప్రపంచము'ను కనిపెట్టెను 1498, 1493, 1502 సంవత్సరములలో అతడు మూడుసార్లు అమెరికాకు మరలిపోయెను క్రొత్తగా కనిపెట్టబడిన జలభాగములను స్పెయిను, పోర్చుగల్లు దేశములమధ్య విభాగ మొనర్చుచు పోప్ ఒక అధికారపత్రమును జారీచేసెను

క్రొత్తగా కనిపెట్టబడిన భూభాగముల మూలముగా వ్యాపార వాణిజ్యములు, క్రయవిక్రయములు పెంపొందెను దీనితో పశ్చిమ యూరపునందలి సముద్రతీరదేశములలో ముఖ్యముగా పోర్చుగల్, స్పెయిన్, ఫ్రాన్సు, హాలెండ్, ఇంగ్లండు దేశములలో మధ్యతరగతి ప్రజావర్గ ముదయించెను ఈమధ్యతరగతిప్రజల ఆవిర్భావమే క్రమముగా జమీందారీ పద్ధతి వినాశనమునకు, జాతీయ రాజరికావతరణమునకును దారితీసినది ఈపరిణామము ఇంగ్లండునందలి 'ట్యూడర్' వంశపరిపాలనకాలమున స్పష్టముగా గోచరించినది భారతదేశమునందలి కాళిదాసువలె 'ట్యూడరు' పరిపాలన కాలములో షేక్స్పియరునకు ప్రపంచవాఙ్మయమున శాశ్వత స్థానము లభించెను

శి హ

## పురందరదాసు

'మన్మనోభీష్టదాతారం, సర్వాభీష్టఫలప్రదం
పురందరగురుం వందే, దాసశ్రేష్ఠం దయానిధిం"

దాసకూటముఖ్యులు, తపస్వులు, అయిన శ్రీ వ్యాసరాయస్వాములు పురందరదాసు నీవిధముగ శ్లాఘించినారు

"దాసరెందరె పురందరదాసరయ్యా
వాసుదేవ కృష్ణన్న సూసి పూజిసువ
నీతియల్లవ నరితు నిగమవేద్యననిత్య
నూతు మాతిగె బిడదె వర్ణిసుతలి
గీతనర్తనది శ్రీకృష్ణన్న పూజిసువ
పూతాత్మ పురందర దాసరివరయ్యా"

మహామహుడగు పురందరదాసు శ్రీ వ్యాసరాయల ప్రియశిష్యుడు లోకమున గురువులను శిష్యులు స్తుతించుట సామాన్యము కాని గురువులే శిష్యుని స్తుతించుట అసాధారణము, అత్యంతమహత్త్వపూర్ణము నగు విషయము

భాగవత ధర్మోపదేశమును, సన్మార్గము నుపదేశించిన మహనీయుడు పురందరదాసు గారి భారత

మంచలి, ఆంధ్ర, కర్ణాటక, తమిళ ప్రాంతములలో పురందరదాసును స్మరింపనివారును, ఆయనకీర్తనలను పాడనివారును లేరని చెప్పవచ్చును నారదమహర్షియే తనభక్తిసూత్రములను ఆచరణలో బెట్టుటకు పురందరదాసుగా జన్మించె నని విజయదాసు కీర్తించెను ఆంధ్రులకు త్యాగిరాజు, మహారాష్ట్రులకు తుకారాం, ఘూర్జరులకు నర్సీభగత్, ఔత్తరాహులకు సూరదాసు ఎట్టిమాననీయులో కర్ణాటులకు పురందరదాసు అట్టిమహానుభావుడు కర్ణాటక సంగీత సృష్టికర్తయై దాసశ్రేష్ఠుడై, కన్నడప్రజా కవియై పురందరదాసు దక్షిణ భారతావనిని భక్తిరసవాహినులలో ముంచియెత్తెను

జననాదికము పూనా పట్టణమునకు ఎదురైదుమైళ్ళ దూరమున పురందరగడ మున్నది అందలి కోటీశ్వరుడును, బ్రాహ్మణప్రముఖుడు నగు వరదప్పనాయకునకు లక్ష్మీబాయి యందు క్రీ శ 1480వ సంవత్సరమున పురందరదాసు జన్మించెను వరదప్పనాయకుడు ఐశ్వర్యమునకు తగినట్లు సదాచార సంపత్తి కలవాడు ఆదంపతు లీశిశువునకు శ్రీనివాసనాయకుడని పేరు పెట్టిరి బాలుడు దినదినాభివృద్ధి గాంచుచు చౌలోపనయనసంస్కారములను పొంది, కన్నడ సంస్కృతముల నభ్యసించెను రత్నపరీక్ష మొదలైన వ్యవహార జ్ఞానము సంపాదించెను గానాభిరుచితో సంగీతము నేర్చెను తండ్రి బలవంతమున ధార్మికవిద్యాపరిచయమునకై కొంత శాస్త్రాభ్యాసము చేసెను

లుబ్ధత్వము నాటి సాంఘికపరిస్థితి ననుసరించి శ్రీనివాసనాయకునకు పదునారు సంవత్సరముల వయస్సు నిండగనే తండ్రి సరస్వతీబాయి అను శ్రీమంతుని పుత్రికతో వివాహముచేసెను రూపవతి, గుణవతియగు సరస్వతీబాయికి భూతదయ, దైవభక్తియు సహజాలంకారములై యుండెను శ్రీనివాసునకు ఔదార్యము లేకున్నను, వినయాదిగుణలోపము లేదు దైవద్వేషము లేనట్లే దైవభక్తియును లేదు ధనలోభము అతనికి పుట్టుగుణమై యుండెను యాచకులను జూచిన నతనికి శత్రువులను జూచినట్లుండును ఎవరైన ధర్మబోధ చేసినచో ఇవన్నియు ధనముకొరకే నని యూహించుచుండెను తలిదండ్రులు మరణించిరి కట్టుకొన్న భార్యకూడ తాను చెప్పినట్లే వండవలెను, తినవలెను రత్నవ్యాపారమున నతనికి సాటిలేరు అతడు బీజాపురము, గుల్బర్గా, విజయనగర రాజాస్థానములందు గణనీయవర్తకుడుగ పేరుగాంచెను

వెండి, బంగారు, రత్నవ్యాపారములలో అపారధన మార్జించి, నవకోటి నారాయణు డయ్యెను అతనికి నలుగురు కుమారులు ఒక కుమార్తె జన్మించిరి చివరి కొడుకునకు తప్ప తక్కినవారందరికిని తనస్థాయికి తగిన శ్రీమంతకుటుంబములలో వివాహములు జరిపెను

సరస్వతీబాయియందు పతిగుణము లన్నిటికి విరుద్ధగుణము లుండెను ఆమె పరమ ఆస్తికశిరోమణి, భర్తస్వభావమునకు చింతించుచు సమయమెరిగి ధర్మములు బోధించుచుండెను ఆమె ప్రయత్నము లన్నియు ఊసరక్షేత్రమున బీజావాపనమువలె వ్యర్థము లయ్యెను అయితే ఆపరిస్థితి చాలకాల ముండలేదు శ్రీనివాసనాయకుని స్వభావములో సంపూర్ణ పరివర్తనము కలిగించు సంఘటన ఒకటి జరగెను

భగవత్పరీక్ష లోకోద్ధారకుడగు పాండురంగస్వామి నాయకు నుద్ధరింపదలచి వృద్ధబ్రాహ్మణ రూపధారియయి బాలు నొకని వెంటబెట్టుకొని యాచింప వచ్చెను నాయకుడు భిక్షుకులను కన్నెత్తి చూడడు వృద్ధవిప్రుడు "స్వామీ! నేను దరిద్రుడను వయసు మీరిన ఈపిల్లవానికి ఉపనయనము చేయలేక మిమ్మాశ్రయించితిని కులమువారు దూషించుచున్నారు జరాభారముచే తిరుగజాలిన శక్తిలేదు ఎట్లయిన ఈధర్మకార్యమునకు తోడ్పడి పుణ్యము కట్టుకొనుడు "అని ప్రాధేయపడెను నాయకుడు కసరుకొనుచున్నను వినక ఆవృద్ధుడు ఆరు నెలల కాలము ప్రతిదినము వచ్చి వేడుకొనుచుండెను కాని అతనికి ధర్మబుద్ధి పుట్టలేదు వృద్ధుని జూడగనే నాయకుని మొగము మాడుచుండెను చివరి కొకనాడు వృద్ధబ్రాహ్మణుడు "స్వామీ! మీకు దయవచ్చిన ఏమైన నిండు లేకున్న లేదని చెప్పుడు ఇంక వ్యర్థముగ తిరుగలేను" అని ఖండితముగ అడిగెను నాయకు డాగ్రహోదగ్రు డయ్యెను సేవకులను పిలచి 'ఇతడు సిగ్గులేక దినమువచ్చి బాధించుచున్నాడు బయటకు త్రోయుడు లోనికి రానీయకుడు'అని ఆజ్ఞాపించెను సేవకులాముసలివాని నవమానించుటకు సంకోచించుచుండిరి బ్రాహ్మణుడు" అయ్యో! నన్ను త్రోయింపకుడు ఉపనయన కార్యము పెద్దమనసు చేయుడు 'అని దీనాతిదీనముగ ప్రార్థించెను నాయకుడీప్రార్థనతో మెత్తపడకపోగా మరింత కోపము నొందెను చివాలున లోనికి బోయి చెల్లని డబ్బుసంచులను దెచ్చి వృద్ధుని ముందు పడవైచి ఇందు నీ కిష్టమైన ఒకడబ్బు యేరుకొమ్మని గద్దించెను వృద్ధబ్రాహ్మణుడు మారుమాటాడక

బాలునితో వెడలిపోయెను శని వదలినదని శ్రీనివాసనాయకుడు సంతోషించెను

ఆవృద్ధు డంతతో వదలలేదు నాయకుని నివాసగృహమునకు వచ్చి సరస్వతీబాయిని చూచెను "తల్లీ! దరిద్రుడను పిల్లవానికుపనయనము చేయలేక ఇచటి ఒక వరమలోభిని ఆరు నెలలాశ్రయించి నిష్ఫలుడనై నీదర్శనము చేసికొంటిని నీవు శ్రీమంతురాలవు దయచేసి పవిత్రమైన ఈబ్రహ్మోపదేశకార్యమునకు సహాయపడుము వృద్ధుడను చిరకాలము బ్రతుకను కొడుకుమెడలో పోగు చూచి ప్రాణము విడచెదను చేయి విడువకు మమ్మా" యని దీనముగ వేడుకొనెను సహజకరుణాశీలయగు ఆయిల్లాలిమనసు కరగిపోయెను ఏమి చేయుటకును స్వాతంత్ర్యములేని తనదుస్థితికి దుఃఖించెను తనభర్తను తలచికొని భయపడెను చివరి కేమైనగానిమ్మని దృఢమనస్కయై తనపుట్టింటివారిచ్చిన రత్నఖచితమగు ముక్కరను తీసి తులసీదళముతో వృద్ధుని చేతికి కృష్ణార్పణ మనెను వృద్ధుడు ముక్కర గైకొని సంతుష్టుడై సరస్వతీబాయిని మనసార పొగడి గొప్ప వ్యాపారిరూపమున నాయకుని అంగడికి పోయెను ముక్కరను నాయకునిచేత బెట్టి 'దీని నమ్మెదను ధరకట్టు'మని కోరెను ఆవస్తువును చూడగనే నాయకుడు సంశయగ్రస్తుడయ్యెను వచ్చినవాని వేషభాషలనుబట్టి యేమనుటకు నోరాడక వస్తువును త్రిప్పిత్రిప్పిచూచి వెల చెప్పక మౌనముద్రాంకితుడయ్యెను వచ్చినవ్యాపారి "నీ కిష్టమైనచో దీనికి నాలుగువందల రూకలిమ్ము, లేనిచో నీవే తీసికొమ్ము" అని ముక్కర నచటవదలి లేచిపోయెను నాయకు డాశ్చర్యముతో నావ్యాపారి యెచటి కేగునో చూడుడని సేవకుల బంపెను వారు తిరిగివచ్చి ఆవ్యాపారి పాండురంగస్వామి దేవాలయమువరకు వెళ్ళెనని, ఆతరువాత కానరాలేదని చెప్పిరి నాయకునిసంశయ మెక్కువై ముక్కరను ఇనుప మందసములో భద్రపరచి వెంటనే ఇంటికి బోయెను

ఆసమయమున సరస్వతీబాయి దేవగృహమునకూర్చుండి ఏమేమో ఆలోచించుచుండెను నాయకుడు భార్యముఖమును జూడగా ముక్కర కానరాలేదు 'ముక్కర యేది?' యని ప్రశ్నించెను ఆమె సత్యము చెప్పుటకు ధైర్యముచాలక మడి గట్టుకొనునప్పుడు తీసిపెట్టితి నని చెప్పెను "నా కిప్పుడు కావలయును తెచ్చియిమ్మ"ని భర్త గట్టిగా అడిగెను మడిముగిసిన తర్వాత యిత్తు నని ఆమె యెంత చెప్పినను వినక ఈక్షణమే కావలయు నని శాసించెను "సరె తులసిపూజ ముగించి తెత్తు" నని దొడ్డిలోనికి పోయి బృందావనముకడ కూర్చుండి రానున్న విపత్తునకై దుఃఖించెను లుబ్ధుడగు పతిచే చిత్రహింసపాలు గాకుండా మరణించుట మేలని నిశ్చయించుకొనెను వెంటనే తనముక్కుపుడకలోని వజ్రమును చాది నీటిపాత్రలో కలిపి త్రాగుటకుముందు తులసీమాత నిట్లు ప్రార్థించెను "తల్లీ! నే నొకధర్మకార్యమునకై దానము చేసితిని దానము గుప్తముగా నుండవలెను ఈవిషయము తెలిసిన లుబ్ధుడగు నాపతి నన్ను హింసించుటేగాక బ్రాహ్మణకార్యమును భంగము చేయును కావున నేను సంతోషములో మరణించుచున్నాను నాపతికి ధర్మబుద్ధి కల్గించుము నాసర్వాపరాధములను క్షమింపుము "అని ప్రార్థించి విషపానము చేయుటకై పాత్ర నెత్తెను ఇంతలో నేదోవస్తువు 'టక్కని' పాత్రలో పడెను అదేమని చూడగా తనముక్కరయే ఆమె హర్షాశ్చర్యసంభరితురా లయ్యెను ఆబ్రాహ్మణుడు శ్రీమన్నారాయణు డని గ్రహించెను భగవంతుడనుగ్రహించె నని పరవశురాలయ్యెను క్షణకాల మట్లుండి మొగము తుడిచికొని ఏమియు జరగనట్లే ఇంటిలోకి వచ్చి భర్తచేతిలో ముక్కర నిడెను

జ్ఞానోదయము నాయకుడు, చేతిలో ముక్కర పడగనే లేచి అంగడికి పోవుచు రెంటిని జత చేసి అమ్మినచో విశేషలాభము రావచ్చు నని ఉత్సాహముతో నిశ్చయించుకొనెను మందసము తెరచిచూడగా అందు భద్రపరచిన ముక్కర లేదు అతనికి భయసందేహములు కలిగెను భద్రపరచిన వస్తువు మాయమైనందుకు సేవకులపై ఆగ్రహించి దూషించెను భయకోపములతో ఇంటికివచ్చి ఏమి జరగెనో చెప్పుమని గద్దించి అడిగెను మడిపని అయినతర్వాత వెదకి ఇత్తునంటివినిగదా తులసిపూజకు వెళ్ళి దొడ్డిలోనుండి తెచ్చితివి ఇట్టిదే అమ్మకమునకు రాగా అంగడిలో భద్రపరచితిని ఇప్పు డది మాయమైనది నా కంతయు చిత్రముగ నున్నది ముక్కర అమ్ముటకు వచ్చిన వ్యాపారి పాండురంగని ఆలయమునకు వెళ్ళి కానరాలేదట! ఆత డెవరో! ఎన్నడు తీయని ముక్కర యీదిన మెందుకు తీసితివో? ఏమి జరిగెనో నిర్భయముగ జెప్పుము! అప్పుడప్పుడు నీవు చేయుచుండిన ధర్మబోధ నాకు వెగటుగా నుండెడిది నేడు నీమాటలు సత్యమని తోచుచున్నవి మనసు అశాంతిలో ఆరాటము చెందుచున్నది.

నా సందేహములుతీర్చి మనశ్శాంతి కల్గింపుము" అని అతడు పశ్చాత్తాపముతో పలికెను భర్తయందు కలుగుచున్న మార్పును, పశ్చాత్తాపమును గుర్తించి సరస్వతీబాయి జరిగిన సంగతి అంతయు నివేదించెను నాయకుని ముఖము వివర్ణ మయ్యెను జరిగిన దంతయు యథార్థముగ నుండెను పూర్వ జన్మ సంస్కారమున నాతనికి జ్ఞానోదయ మయ్యెను దయా మయు డగు భగవంతుడు తన్నుద్ధరించుట కీ పన్నాగము పన్నె నని నమ్మెను అప్పు డతనికి భార్య భాగ్యదేవతగా తోచెను "ఆమెకున్న జ్ఞానము నాకు లేకపోయెను ధర్మబుద్ధి లేని పాపి నైతినే"యని విలపించెను భగవంతుడే వచ్చి యాచింప తిరస్క రించితినే! ధనలోభమే నన్నింత నీచమునకు తెచ్చె నని యేడ్చెను సకలపాపములకు మూలమగు ధనము నీ క్షణమున పరిత్యజింపవలె నను త్యాగబుద్ధి స్పృశ మయ్యెను వెంటనే ఆనందనిర్భరుడై శ్రీనివాసనాయకుడు భగవన్నామమును కీర్తించుచు సతీసుతసహితముగా సర్వాభరణములను తీసివైచి, సామాన్యవస్త్రములు ధరించి, సకలైశ్వర్యములతో నిండిన నివాసభవనము వదలి వీథిలో నిలబడి అందరిని బిలిచెను నాయ కున కేదో విపరీతబుద్ధి పుట్టినదని జనులందరు గుంపులుగా వచ్చి చేరుచుండిరి అందరు చూచుచుండ నొక తులసీదళమును భవనముపై విసరివైచి కృష్ణార్పణ మని నమస్కరించెను

ఈ విధముగ సర్వస్వమును సమర్పించి శ్రీనివాస నాయకుడు నామసంకీర్తనము చేయుచు పురందరగడవీథులలో సంచరించెను పత్నీపుత్రులు ఛాయవలె వెంటనంటిరి వృద్ధ బ్రాహ్మణ రూపధారి యగు శ్రీహరియు అదేరూపమున దర్శన మొసగి అదృశ్యు డయ్యెను నాయకుడు కృతార్థుడ నైతి నని సంతోషించెను ఏ వీథులలో ఆగర్భశ్రీమంతుడై అశేష గౌరవము లందెనో, ఆ పురందరగడవీథులలో హరిభజన చేయుచు శ్రీనివాసనాయకుడు భిక్షావృత్తిని స్వీకరించెను ఆ రాత్రి హనుమదాలయమున పడుకొన్న నాయకుని స్వప్న ములో పాండురంగడు కనపడి పంపాక్షేత్రమునందలి చక్ర తీర్థము కడ నున్న వ్యాసరాయలచే నుపదేశ మంది హరిదాసు డవు కమ్మని ఆదేశించెను మహదాజ్ఞగా భావించి నాయకుడు మరుదినమే సకుటుంబముగా అచటికి ప్రయాణమై పోయెను

వ్యాసరాయల శిష్యత్వము అచిరకాలముననే నాయ కుడు సకుటుంబముగా హంపిని చేరుకొని చక్రతీర్థమఠమునం దున్న వ్యాసరాయలను సందర్శించెను స్వామివారు నాయ కునిజూచి హర్ష పులకాంచితులై దివ్యజ్ఞానముచే సమస్తమెరిగి ఆయన నాదరించి తీర్థప్రసాదము లిచ్చి మరుదినమే సుదర్శన హోమముచేసి నాయకునకు, పత్నీపుత్రులకు చక్రాంకము చేయించిరి తరువాత మంత్రోపదేశము చేసి భాగవతధర్మ దీక్ష నొసగిరి నాయకుడు గురూపదేశము నొంది హరిదాసు డయ్యెను "పురంధరవిఠల" మకుటముతో కీర్తనలు రచింప వలయు నని గురునాజ్ఞ యయ్యెను శ్రీనివాసనాయకుడు పురందరదాసుడై దాసకూటమునకు ముఖ్యు డయ్యెను

దాసకూటము ద్వైతమతప్రవక్త శ్రీ మధ్వాచార్యులు భక్తిమార్గమునకు బీజావాపనము చేసిరి అప్పటినుండి యే అది అంకురించి తర్వాత పుష్పించి ఫలించెను దాని ఫలితమే దాసకూటము మధ్వాచార్యుల తర్వాత పదమూడవ శతా బ్దమున నుండిన నరహరితీర్థులు దాసకూటము నారంభించిరి ఆయన సంస్కృతరచనలచే ద్వైతమతప్రచారమును, కన్నడ కీర్తనలచే భాగవతధర్మ ప్రసారమును చేసెను ఆ తరువాత రెండు శతాబ్దములవరకు ఈ సంప్రదాయమును వెలయించు మహానుభావులు కలుగలేదు 15వ శతాబ్దమున అవతరించిన శ్రీపాదరాయలు దాసకూటము నుద్ధరించి భాగవతధర్మోద్ధర ణకు దీక్ష వహించిరి వారి శిష్యులు వ్యాసరాయలకాలములో భాగవత ధర్మవృక్షము వేరూనెను వ్యాసరాయలు విజయ నగర సార్వభౌము డగు శ్రీకృష్ణరాయలచే మహాగౌరవము నందిన వారు వారిశిష్యులలో గోవిందభిక్షు, పురందరదాస, వాదిరాజ, కనకదాసులు సుప్రసిద్ధులు వీరి కాలమున కన్నడ వాఙ్మయమునందలి భక్తిసాహిత్యమునకు వసంతోదయ మయ్యెను

దాసజీవితము పురందరదాసు విజయనగరము లైట కుటీరము నిర్మించుకొని కాపుర ముండెను ప్రాతరాహ్నికము ముగించుకొని తంబురమీటుచు భగవద్గుణగానముతో వీథులు తిరుగాడెను దొరకినభిక్షతో తృప్తినొంది ఇల్లు చేరుచుండెను ఏది ఎంతలభించినను ఆ దినమే భగవన్నివేదనము తరువాత, అది వినియోగము కావలెను అందరు తినగామిగిలిన పదా ర్థము చక్రతీర్థము నందలి జలచరములపాలగుచుండెను రేప టికి మిగల్ప రాదని దాసునిమతము ఇట్లున్నను పరమాత్మ వారి యోగక్షేమభారము వహించి యున్నందున దాసునకు దారిద్ర్యబాధ తెలియకుండెను

పురందరదాసు మహానుభావుడు , భరతఖండ మందలి

సమస్త తీర్థములను సందర్శించెను ఆయా క్షేత్రస్వాములపై, తీర్థములపై, స్థలపురాణములపై అసంఖ్యాక దేవనామములు రచించెను ఆయన నాలుగులక్షల డెబ్బదియైదు వేల దేవనామములు రచించితి నని ఒకకీర్తనలో తెలుపుకొనెను

"వాసుదేవన నామావళియ క్లిప్తియను
వ్యాసరాయర దయదింద బణ్ణిసెను
ఇంతునాల్కులక్షయ ఎప్పత్తైదు సావిరకృతియు
కంతుజనకన నామ ఘనమహిమె
సంతసది శ్రుతిస్మృతి సమ్మతిదెంద
పురందరవిఠలా వ్యాసమునిగళు పేళిసిదరు"

పై సంఖ్యను నమ్మకుండుటకు వీలులేదు ఏయే విషయములపై ఎన్ని కీర్తనలను రచించెనో ఆ వివరములను ఈ కీర్తనలలో తెలిపినారు

| | | |
|---|---|---|
| 1 | కేదారమునుండి రామేశ్వరపర్యంతము గల తీర్థక్షేత్రమహిమ వర్ణనలు | 1,25,000 |
| 2 | ఆచార్యగురు మహిమ వర్ణనలు | 5,000 |
| 3 | బ్రహ్మాది సర్వలోక వర్ణనలు | 80,000 |
| 4 | పురాణకథాసారములు | 90,000 |
| 5 | దేవతామూర్తి ధ్యానకల్యాణ చరిత్రలు | 60,000 |
| 6 | శ్రుతిస్మృతిసహిత ధర్మప్రతిపాదకములు | 16,000 |
| 7 | సుళాదులు | 64,000 |
| 8 | దేవనామములు, ఉగాభోగములు | 25,000 |
| | | 4,75,000 |

కన్నడమున నేగాక భరతఖండమునందే ఇన్నిరచనలు చేసినవారు లేరని చెప్పవచ్చును పురందరదాసుకీర్తనలకు ఆయనగురువైన వ్యాసరాయస్వామి పురందరోపనిషత్తను నామకరణము చేసి వేదోపనిషత్తులతో సమానముగా వ్యాసపీఠముపై నిడి పూజించిరి

**దాసుని లోకోద్ధరణము** పురందరదాసు అనేకవిధములుగా లోకోపకారములను కావించెను హరికీర్తనరూపమున ధర్మోపదేశము చేయుపద్ధతిని ప్రచారమునకు తెచ్చిన ఖ్యాతి పురందరదాసులకు చెందుచున్నది హరికీర్తన కళకొక సువ్యవస్థిత స్వరూపము నొసగి సంస్కృతము తెలియని సామాన్యులకు గహనతత్త్వములను కీర్తనలరూపమున సులభముగ నుపదేశించెను

ధార్మిక విషయములకు సంస్కృతము తప్ప అన్యభాష అర్హము కాదన్న అభిప్రాయము ఆనాడుండెను శ్రీపాదరాయ వ్యాసరాయస్వాములు కన్నడమునకు ఆ న్యూనత తొలగించి తన్మూలమున ధర్మప్రచారమునకు నాందీవాచకము పలికిరి పురందరదాసు సకలధర్మగ్రంథసారమును కన్నడీకరించి సంస్కృతముతో సమానగౌరవమును కన్నడ భాషకు కలిగించెను

సంగీతవిద్య నట, విట, గాయకుల అసభ్య శృంగారముల పాలై అర్హస్థానము కోల్పోయిన తరుణమున పురందరదాసవతరించి భక్తిభరిత కీర్తనసాహిత్యమును అపారముగ సృష్టించి బ్రహ్మానందసంధాయకమైన సంగీతమునకు పట్టిన దురవస్థను పోద్రోలి భారతీయ సంగీతకళకు మహోపకారము చేసెను కర్ణాటక సంగీతాభ్యాసమునకు ఒక పాఠ్యప్రణాళిక నేర్పరచి తరువాతి త్యాగరాజాదులకు మార్గదర్శకుడయ్యెను

అనేక మతభేదములు వెర్రితలలువేసి దేశమును సంక్షోభపరచుచున్న కాలమున పురందరదాసు శైవవైష్ణవ వైరమును, హిందూముస్లిం కలహములను, ఉచ్చ, నీచ, భావభేదములను తొలగించి చక్కని సమన్వయపూర్వక భక్తిమార్గమును బోధించి సకలజనస్తుతిపాత్రుడయ్యెను చండాలుర దుర్భరస్థితికి సానుభూతి కనబరచి జన్మచండాలురకంటె కర్మచండాలురే నీచు లని నిర్భయముగా చాటెను

పురందరదాసు సంతానములో కడపటికుమారుడు మధ్వపతి అతడు విద్యనభ్యసించక పోయినను పితృసేవాభాగ్యముచే తరించి విజయదాసుడుగా అవతరించి "విజయవిఠల"అను మకుటముతో 25,000 దేవనామములు రచించెను ఈ విధముగా పురందరదాసు నిరంతరము శ్రీమన్నారాయణుని భజించుచు ధన్యతమ జీవితము గడిపి శా శ 1486 రక్తాక్షి సం॥ పుష్యబహుళ అమావాస్య శనివారమున (క్రీ శ 1564) దేహయాత్ర చాలించెను

గ రా శ

## పురాజీవశాస్త్రము

(Palaeontology)

మానవ, జంతు, ఉద్భిజ్జశిథిలముల యొక్క అనుశీలనమే పురాజీవశాస్త్రము ఈ శబ్ద మొక్కొక్కప్పుడు విశేషముగ శిథిలావస్థచెందిన జంతువుల పరముగ ప్రయోగింపబడును శిలారూపములో నున్న మొక్కల యొక్క అనుశీలనము "పాలియోబాటనీ" అన బడుచున్నది దానికి తుల్యమైన "పురా జంతు

శాస్త్రము" అనుపదము ఎన్నడును వాడబడకుండుట విచిత్రమగు విషయము 'ఫాసిల్' అనుపదము. లాటిన్ భాషాపరమగు 'ఫాసిలస్'అను శబ్దమునుండి ఉద్భవించినది ఈ శబ్దమునకు త్రవ్వుట అని యర్థము కావున ఆదియందు ఆ పదము భూమిలో నుండి తొలగింపబడిన యేవస్తువునకైనను వర్తించెను ఫాసిల్ అను పదము నేడు సేంద్రియమూలికమయిన వస్తువునకే పరిమిత మొనర్పబడుచున్నది అనగా అది జీవించియున్న ప్రాణియొక్క లేక మొక్కయొక్క లేక జంతువుయొక్క భాగమునకు గాని, అట్టిప్రాణి సూచన కలిగియున్న మరియొక వస్తువునకు గాని అది పరిమితము చేయబడినది మత్స్యము యొక్క దంతములు లేక ఎముకలు, ప్రవాళము యొక్క అస్థిపంజరము, ఆకు యొక్క ముద్ర, సరీసృపము యొక్క అడుగుజాడలు - ఇవి యన్నియు జంతువృక్ష శిథిలావశేషము లనబడును

ఒక జంతువు గాని, మొక్క గాని శిథిలమగుటకు సాధారణముగ రెండు షరతు లవసరము (1) మెత్తని భాగములు శీఘ్రముగ క్రుళ్ళిపోవుటచే, జంతువుయొక్క ఒకవిధమైన అస్థిపంజరము గాని, మొక్కయొక్క రేఖాకృతి గాని ఉండవలెను కావున కేవల మొక ముద్ర తప్ప, జెల్లీచేపలవంటి జంతువుల జాడలు కాన్పింపవు (2) ఆప్రాణి ఏదియో కొంత మన్నుతో కప్పబడి యుండవలెను అట్లుకానిచో అది ముక్కలై పోవును అరుదుగా మాత్రమే సర్వాంగములతో మరణించిన జంతువుల శరీరములు యథాతథముగ లభ్యమగుచున్నవి సైబీరియా (రష్యా)లోను, అలాస్కా (అమెరికా)లోను శిథిలరూపములో బృహదాకారములైన ఏనుగు జాతికి చెందిన జంతువులు మంచు పేరుకొనిన నేలలయందు కనుగొనబడినవి అవి 25,000 సంవత్సరములనుండి మంచు దిబ్బలయందు పూర్తిగ మరుగుపడి ఘనీభవించి యున్నవి పోలెండుదేశమందలి గెలీషియాలో హిమానీయుగమునకు చెందినట్టియు దట్టముగ వెంట్రుకలతో కప్పబడినట్టియు నొక ఖడ్గమృగము ఒకవిధమగు తారులో సంరక్షిత మొనర్చబడి యున్నది అర్ధశుష్కప్రాంత మగు దక్షిణ అమెరికాలో నేలమీద చరించు మృగముల (Ground sloths) శవభాగములు గుహలయందు రక్షింపబడినవి పైనపేర్కొనిన ప్రతి అంశమందును ఒక అసాధారణపరిస్థితి, శీతలము, రాసాయనికక్రియ, పొడితనము గోచరించును శిథిలముకాని మెత్తనిభాగములు అపురూపముగ నుండును కాని కీటకముల అస్థిపంజరములు అల్పాకారములో నుండు వాటి ఉపాంగములు ప్రాచీనకాలపు వృక్షములయొక్క ఘనీభవించిన గుగ్గిలము సహాయముతో కాపాడబడెను మట్టిలో పాతుకొనిపోయి చిప్ప (Shell) రూపములో గట్టిపడిన ఆకులయొక్క, మృదువైన చిన్నసముద్రపు జంతువులయొక్క అవశేషములు, వాటి బాహ్యాకృతులను తెల్పునట్టి ఒక సన్నని బొగ్గు పొరను మిగుల్చును ఇంతేకాక వాటి నిర్మాణమును గూర్చిన సూక్ష్మవివరములను సంరక్షించును కఠినభాగములు తరచుగ కొలది మార్పులతోనో, లేక మార్పు లేకుండగనో సంరక్షింపబడును సొరచేపలయొక్క, పాలిచ్చు జంతువులయొక్క దంతములు ఇందు కుదాహరణములు మరియు ప్రాచీన సముద్రక్రిముల దవడలు కనుగొనబడినవి ఎముకలు సంరక్షింపబడవచ్చును గాని, అవి తరచుగా మార్పు చెందినవి వాటిస్థానములో విలీనమైన ఖనిజపదార్థము కాన్పించును చిప్పలు తరచుగా శిథిలములు కావు కొన్నితావులలో కొయ్యదుంగలు క్రుళ్ళిన వృక్షములయందో లేక బొగ్గులయందో నిక్షిప్తమై యుండును

శిలారూపములో నిక్షిప్తములై యున్న కఠినభాగములలో సాధారణముగా మార్పు జరుగుచుండును. ప్రవాహజలము చిప్పలయందు, ఎముకలయందుండు రసాయనములను విలీనమొనర్చి, వాటిని తేలికపరచి, వాటిలో సూక్ష్మరంధ్రముల నేర్పరచును తరచుగా రసాయనములు కరగుటచే, ఇతరములు వాటిస్థానము నాక్రమించును ఇసుక, సున్నము, ఇనుము అనువాటియొక్క మిశ్రమద్రవ్యములు సాధారణముగ శిలీభూతములుగ నిక్షిప్తము లగును. ఇందుచే కొన్ని సమయములలో మొక్కయొక్కగాని, జంతువుయొక్కగాని మౌలికనిర్మాణము సంరక్షింపబడును శిలీభూతమైన ఒకానొక అరణ్యములో ఆదిమమైన మ్రాకుల నిర్మాణమును ఇసుకరాయి సంపూర్ణముగా ఆక్రమించియుండినట్లు అందలి రంధ్రములును, అందు ప్రతిసంవత్సరము ఏర్పడు పొరలు వలయములును స్పష్టముగ తెల్పుచున్నవి సమగ్రముగా శిలీభూతమైన అరణ్యములోను, అత్యంతముగ మార్పుచెందిన శిథిలములలోను బదిలీకృత్యము అసంపూర్ణముగ నుండి సాధారణ పథకమునే సూచించును

శిలీభూతము లన్నియు ఎముకలు, చిప్పలు మున్నగు ఇతర అవశేషము లని చెప్పుటకు వీలులేదు కొన్ని శిలీ

భూతములు పూర్వ చారిత్రకయుగము కంటెను ముందున్న జీవితమును నామమాత్రముగనే సూచించునవిగ నుండెను మొదటి మొక్కయొక్క లేక జంతువు యొక్క దైహికపదార్థము శిథిలమై అంతరించి యుండును తత్ఫలితముగ ఒక గుంటమాత్ర మేర్పడి యుండును. దాని గోడలే శిలీభూతముల యొక్క సహజమగు మూసలు విమ్మట విలీనమైన పదార్థములు గుంటలను పూరించవచ్చును అపు డది అసలైనదానికి సహజ మగు మూసగా నేర్పడును అట్టి మూసలే సాధారణమైన శిలీభూతముల రూపములు అడుగుజాడలు లేక జంతువులు నడచు మార్గములు మూసరూపమున గట్టిపడును అట్టి క్రొత్తమట్టిలో నిండిన మూసలు భద్రపరుపబడ వచ్చును

శిలీభూతముల యొక్క అత్యంత విస్పష్టమగు ప్రయోజన మిది అవి స్వయముగ శిలలలో ఇమిడి యున్నవో, అట్టి శిల లేర్పడిన కాలపు వస్తువుల యొక్క పరిస్థితికి ఆ శిలీభూతములు సాక్ష్యమొసగును ఇట్లు నేలచిప్పను మంచినీటి నుండి సులభముగ వేరుచేయ వచ్చును వాటిని మరల సముద్ర సంబంధమైన చిప్పలనుండి వేరుపరచ వచ్చును కొన్ని జంతువులు ఆర్కిటిక్ ప్రాంతములోనో లేక సమశీతోష్ణ ప్రాంతములోనో లేదా ఉష్ణాధిక్య ప్రాంతమునందో నివసించుచుండును వాటి అవశేషము లొకప్పుడు ఆ కాలపు ఉష్ణోగ్రతను, శీతోష్ణస్థితిని గూర్చి మనకు సంపూర్ణజ్ఞాన మొసగవచ్చును

కాలవిషయమున మనము ఎంతఎక్కువగా వెనుకకు పోవుదుమో, అంతవిశేషముగా ఆనాటి సేంద్రియప్రాణులు నేటి సేంద్రియప్రాణుల కంటె భిన్నము లగుచుండును అనగా ఒక యుగము తరువాత మరియొకయుగములో జీవించి అంతరించిపోయిన భిన్నజాతుల కళేబరములు గోచరించుచుండును

శిలీభూతముల ఉపయోగము భూగర్భశాస్త్రజ్ఞులకు మిగుల అభిరుచికర మైనది ఒకయుగమునకు సంబంధించిన ఇతర పరీక్షాసాధనములు క్లేశావహములైనపుడు, శిలీభూతములు భూగర్భపు పొరలయొక్క కాలమును తెలిసికొనుటకు తోడ్పడును పొరలతోనుండు గుట్టలయొక్క, కొండల యొక్క కాలమును నిర్ణయించుటకు పరస్పరము వాటికిగల సంబంధము సహాయకారిగా నుండును ప్రతి శిలాతల్పమునుండి శిలీభూతములను ప్రోగుచేసినచో, కొన్ని శిలాభూతముల తెగలు రెండు లేక అంతకెక్కువ పొరలవరుసలో కూడ కన్పట్టును ఐనను ఇవి స్థిరముగా ప్రత్యేకమైన ఒక పొన్పుల వరుసలో మాత్రముండును కాని, వాటికిపైన గాని, క్రిందగాని ఉండవని కనుగొనబడినది చరిత్ర పరిశీలనమునకు, తేదులుగల బహుమానపు పతకములు లేక నాణెములు ఎంత ఉపయోగకరములో, శిలాపరిశీలనమునకు శిలీభూతములంత ఉపయోగకరములుగ నున్నవి

విదితములైన అన్నిశిలలయొక్క పరంపరాక్రమమును జాగరూకతతో తెలిసికొనిన పిదప, సాధారణరీతిలో, సావయవ ప్రాణుల పరంపరలో క్రమయుతమైన అభివృద్ధి యుండె నని కనుగొన బడినది ప్రప్రథమములో అత్యల్పతరగతికి చెందిన ప్రాణులు, ఆ తరువాత క్రమములో అంతకంటె ఉన్నతమైనట్టియు అటుపిమ్మట అంతకంటె ఉన్నతతరమైనట్టియు ప్రాణులు కన్పించెను ఇంతేకాక పరస్పర సంబంధమును కల్పించు శిలీభూతములు గూడ తరచుగా కన్పట్టుచున్నవి సరీసృపముల వంటి కొన్నిపక్షులును, పక్షులవంటి సరీసృపములును, చేపల పోలికలుకల స్థలజలచరములును, స్థలజలచరములనుపోలు చేపలును, గుర్రముల పోలికలు గల 'టాపిర్స్' అను ఒకరకమైన విచిత్రజంతువులును, ఒంటెలకును లామాస్ మున్నగువాటికిని మధ్యగల కొన్నిరూపములును కలవు

సృష్టి ప్రారంభకాలమునుండి నేటివరకు జరిగిన వేలకొలది కోట్లసంవత్సరముల కాలములో, భూమినిర్మాణాదులు, జీవరాశియొక్క వివిధదశలు ఎట్లెట్లు, ఎప్పుడెప్పుడు పరిణామము చెందినవో కాలనిర్ణయము చేయుటకు ఈ ప్రచండకాలావధిని మహాయుగములుగను, యుగములుగను, ఉపయుగములుగను పండితులు విభజించియున్నారు వారి అభిప్రాయము ననుసరించి అయిదు మహాయుగములు కలవు ఒక్కొక్క మహాయుగములో కొన్ని యుగములు, ఉపయుగములును కలవు ఆయా యుగముల కాలనిర్ణయమును ఈక్రింద వివరించుచున్నాము నేటికాలమునుండి ప్రాచీనములోనికి గణనము చూపుచుండుటచే, యుగప్రారంభసంఖ్య పెద్దదిగను, యుగము ముగిసినసంఖ్య చిన్నదిగను ఉండుట పాఠకులు గమనింపవలెను

I అజోయిక్ మహాయుగము – ఈ మహాయుగము 500 కోట్ల సంవత్సరముల క్రిందట ప్రారంభమై 200 కోట్ల సంవత్సరముల క్రిందట ముగిసినది

II పూర్వకాంబ్రియన్ మహాయుగము – ఈ మహాయుగము 200 కోట్ల సంవత్సరముల క్రిందట ప్రారంభమై 62

కోట్ల సంవత్సరములక్రిందట ముగిసినది

III పాలియోజోయిక్ మహాయుగము - ఈ మహాయుగము 62 కోట్ల సంవత్సరములక్రిందట ప్రారంభమై 22½ కోట్ల సంవత్సరములక్రిందట ముగిసినది ఈ మహాయుగమునందు 6 యుగములు కలవు ఈ క్రిందిపట్టికయందు యుగముల కెదురుగా ప్రస్తుతకాలమునకు పూర్వమున ప్రారంభమైన సంవత్సరము కోట్లసంఖ్యలో తెలుపబడినది -

1 కాంబ్రియన్ — 62 కోట్ల సం॥ నుండి
2 ఆర్డోవిషియన్ — 50 ,, ,, ,,
8 సిలూరియన్ — 45 ,, ,, ,,
4 డివోనియన్ — 40 ,, ,, ,,
5 కార్బోనిఫెరస్ — 85 ,, ,, ,,
6 పెర్మియన్ — 27 ,, ,, ,,
22½ ,, సం॥ వరకు

IV మెసోజోయిక్ మహాయుగము - ఈ మహాయుగము 22½ కోట్లసంవత్సరములక్రిందట ప్రారంభమై 7 కోట్లసంవత్సరములక్రిందట ముగిసినది ఈ మహాయుగములో 8 యుగములు కలవు

1 ట్రియాసిక్ 22½ కోట్లనుండి 18 కోట్ల సం॥ వరకు
2 జురాసిక్ 18 కోట్లనుండి 18½ కోట్ల సం॥ వరకు
8 క్రెటేషియస్ 18½ కోట్లనుండి 7 కోట్ల సం॥ వరకు

V సినోజోయిక్ మహాయుగము - ఈ మహాయుగము 7 కోట్లసంవత్సరములక్రిందట ప్రారంభమై, 25,000 సంవత్సరములక్రిందట ముగిసినది ఈ మహాయుగమున 1 టెర్షియరీ 2 క్వాటర్‌నరీ అను రెండు యుగములు కలవు టెర్షియరీయుగములో 4 ఉపయుగములు, క్వాటర్‌నరీయుగములో 2 ఉపయుగములును కలవు

(1) టెర్షియరీ యుగమందలి ఉపయుగములు -
(ఎ) ఇయోసిని 7 కోట్లనుండి 4 కోట్ల సం॥ వరకు.
(బి) ఒలిగోసిని 4 ,, ,, 2½ ,, ,,
(సి) మియోసిని 2½ ,, ,, 1 కోటినుండి 10 లక్షల సం॥ వరకు
(డి) ప్లియోసిని 1 కోటి 10 లక్షల.. . 10 లక్షల సం॥ వరకు

(2) క్వాటర్‌నరీ యుగమందలి ఉపయుగములు -
(ఎ) ప్లైస్టోసిని 10 లక్షలనుండి 25,000 సం॥ వరకు
(బి) హోలోసిని 25 వేల సం॥ నుండి ప్రస్తుతకాలము వరకు

మొదటి భూగర్భశాస్త్రీయ యుగము (geological era) 'అజోయిక్' మహాయుగ మనబడుచున్నది అది భూమి ఉత్పత్తి నుండి ప్రాణికోటి ఉత్పత్తి యగువరకు జరిగిన మధ్యకాలము తరువాతి దగు పూర్వకాంబ్రియను మహాయుగముతో ప్రాణికోటి యొక్క చరిత్ర ప్రారంభమైనది ఈ పూర్వ కాంబ్రియను మహాయుగమందు ప్రాణ్యుత్పత్తియు, జీవకణోత్పత్తియు మాత్రమే ఘటిల్లుటకాక, వర్తమాన కాలపు ప్రధానమైన నాలుగు అంగ నిర్మాణములలో మూడు నిర్మాణముల ఉత్పత్తి కూడ ఆరంభమైనది మొనెరా (సూక్ష్మజీవులు-ఉదా ఆకుపచ్చని నీటి పాచి), ప్రోటిస్టా, మెటజో అనునవే ఈ అంగనిర్మాణ వర్గములు తొలి ప్రోటిస్టా వర్గములో నీటిపాచి స్వతంత్ర కణపంతములు, పుట్టకొక్కులు అనునవి కన్పించెను

పూర్వ కాంబ్రియన్ మహాయుగాంతమున నుండిన సేంద్రియ జీవులు ఒకవేళ నీటియందలి జీవములై యుండవచ్చును అప్పటి కవి భూమిని ఆక్రమించి యుండవు భూఖండమునకు పరివడిన ప్రోటిస్టా వర్గపు సంతతులలో (విశేషించి పచ్చని నీటిపాచి) ప్రధానమైన మెటాఫైటా అనునొక నూతన వర్గమును స్థాపించిన తెగ లుండియుండెను పాలియోజోయిక్ మహా యుగమునకు చెందిన కాంబ్రియన్ యుగముతో (62—50 కోట్ల మధ్యకాలము) ఆరంభమైన వికాస ప్రవృత్తి కావలసినంతగా శిలీభూతములచే నిర్ధారణ చేయబడుచున్నది వీటివలన ఫైలమ్ (జంతు లేక ఉద్భిజ్జవర్గములలో ప్రధానవిభాగము) స్థాయిలో కాంబ్రియన్ యుగమందున్న ప్రతివర్గము నేటివరకు మని యున్నదనియు, కాగా జాతుల స్థాయిలో ఏవర్గమును మనియుండలేదనియు తేటపడుచున్నది

కాంబ్రియన్, ఆర్డోవిషియన్ యుగములలో భూతలముపై ఎట్టి సావయవ జీవులును లేకుండెను అయితే సూక్ష్మజీవులు ఉండి యుండవచ్చును కాని వేర్వేరువర్గముల నీటి పాచిచే సముద్రము వ్యాపించియుండెను జంతువర్గములలో నీటినిపీల్చు పెక్కురకముల పదార్థములును, అనేక తరగతుల సూక్ష్మ జీవులును సాధారణములై యుండెను విశేష ప్రాధాన్యముచెందిన సంధిపాదములు (arthropods) నేటి ఎండ్రకాయలకును, తేళ్లకును, నశించిన చిదపురుగులకును సంబంధించి యున్నవి

సిలూరియన్, డివోనియన్ యుగములలో పచ్చని నీటి పాచిగల ప్రదేశములనుండి మెటాఫైటులుదయించెను ఇపుడు నశించిపోయిన సైలాప్ సిడ్స్ అనునవి మొదట మొక్కల జాతికి చెందిన ఫైలమ్ ట్రకెయొఫైటా అను వర్గమువందలివి సైలాప్‌సిడ్స్‌వలన మూడుప్రధానమైన ట్రకియొఫైటాల పరంపర ఉదయించెను అవి లికాప్‌సిడ్స్, స్ఫినాప్‌సిడ్స్, టిరాప్‌సిడ్స్ అనునవి ఈ మూడు క్రొత్త సబ్‌ఫైలాలలోని మొదటి రెండును దాదాపు నష్టప్రాయములైనవి

ఉద్భిజ్జములకు పిమ్మట జంతువులు భూమిపైకి చేరెను శిలీభూతములైన వృశ్చికములు సిలూరియను యుగములోని తుదిభాగము నందలివి భూచర జంతువులలో ఇవి మొట్ట మొదటి వని తెలియుచున్నది పిదప సాలీడువంటి ఇతరప్రాణు లుదయించెను పిమ్మట తవుటిపురుగు లుద్భవించెను డివో నియను యుగాంతమున ప్రప్రథమముగా చేపలనుండి వెన్నె ముక గల భూచరములు ఉత్పన్నమయ్యెను మొత్తముమీద డివోనియనుయుగము మత్స్యయుగ మని తరచుగా చెప్పబడు చున్నది మత్స్యములు అనేక వర్గములుగా వ్యాపించెను అవి నేలమీదను, నీటిలోను చేరి చరించు శక్తిగల జంతువులకు గల పూర్వభూతములలో చేర్చబడినవి ఇవి వెన్నెముకగల మొదటి భూచరజంతువులు

ఫైలమ్ బ్రయొఫైటాకు చెందిన తొలిశిలీభూతో ద్భిజ్జములు కార్బోనిఫెరస్ యుగమునకు సంబంధించినవి ఆ కాలములో అనేకములైన అటవీనిర్మాణములకు ఉపకరించు వనస్పతి వర్గములోని పర్ణియసంతానమునకు చెందిన మొక్క లును ఇతరములైన బురద ప్రదేశములలో నుండు ట్రాకో ఫైట్సును పాతుకొనిపోయి శిలీభూతములయ్యెను మొక్కల జాతులలో అత్యంత ప్రముఖమైన సంఘటనము విత్తనము లోనుండి మొక్క ఉద్భవించుటయే ఈ సంఘటనము కార్బోనిఫెరస్ యుగాంతమున జరగినది జంతువర్గములో భూమిమీద చరించు నత్తలు ప్రప్రథమముగా కార్బోనిఫెరస్ యుగములో గోచరములయ్యెను అదేసమయములో జెర్రులు కూడ ఉద్భవించెను ఈలోగా సాలెపురుగులు, తేళ్ళు పూర్వము కంటె విశేషముగా సంఖ్యయందు పెరిగెను వెన్నెముకగల జంతువులలో, ఉభయచరముల ద్వారా వివిధరూపములు ఉదయించెను వాటిస్థానమును అనంతరము సరీసృపము లాక్రమించెను

మెసోజోయిక్ మహాయుగములో సరీసృపోదయ ముతోపాటు పూలమొక్కలు కూడ ఉద్భవించినవి పిదప ఈ మొక్కలు భూగతవృక్షజాతిలో ప్రధానస్థాన మాక్రమించెను వీటితో సమానాంతరముగ క్రిమిజాతులు అపరిమిత ముగా విస్తరించెను అదేసమయములో ఎముకలుగల చేపలు కూడ అనంతముగా వృద్ధి చెందెను వాటినుండి జనించిన ఎముకలుగల మత్స్యములు సముద్రజలములయందే కాక, మంచినీటి జలములయందు కూడ ప్రముఖము లయ్యెను ఈ విధముగా సముద్రము, భూమి సాపేక్షముగా ఆధునిక లక్షణ ములను బడయజొచ్చెను ఎట్లయినను, మెసోజోయిక్ మహా యుగములో సరీసృపముల విస్తరణము దర్శనీయమగు సంఘ టనమని పేర్గాంచినది అవి ఒకవర్గముగా 18 కోట్ల సంవ త్సరములవరకు భూమిపై అత్యున్నత ప్రాభవమును వహిం చెను వాటిప్రాభవము నేటి జంతువుల ప్రాభవము కంటె దీర్ఘతరమైనది ఇప్పు డావర్గమునకు ప్రాతినిధ్యమునువహించు చున్నవి తాబేళ్ళు, మొసళ్లు, బల్లులు, ఊసరవెల్లులు,పాములు వాటి స్థానమును రెండు నూతనవర్గము లాక్రమించినవి వాటివలననే పిట్టలు, సస్తనజాతి జంతువులు ఉదయించెను

జురాసిక్ యుగమునందు సరీసృపవర్గములలో ప్రముఖ మైన ఒకవర్గము పిట్టలుగా బయలు వెడలినది ఈ మార్పునకు సుప్రసిద్ధమైన ఆర్కి-మోపెరిక్స్ అను శిలీభూత జంతువు ప్రధానకారణము ఇది సరీసృపము వంటి పిట్ట సరీసృపము లలో థిరాప్ సిడ్స్ అను మరియొక ప్రధానవర్గము ట్రియా సిక్ యుగములో సరీసృపలక్షణములనుండి దూరమై క్రమ ముగా సస్తనజాతి జంతువులుగా పరిణామము చెందినది ఈ వర్గము వలన నిజమైన సస్తనజంతువులు ఉత్పన్నమయ్యెను మెసోజోయిక్ శకములో అప్రధానములుగా నిలిచిపోయిన యథార్థ సస్తనజంతువులు వీటివలన ఉదయించెను సస్తన జంతువులయొక్కయు, పక్షుల యొక్కయు వ్యాప్తి ముఖ్యముగా సినోజోయిక్ శకమునందు ఘటిల్లెను

భూచరములైన సస్తనజంతువులు డినోసర్స్ అను వాటిస్థానము నాక్రమించెను నీటిలో పెరిగి నీటిలో నివసించెడి సస్తనజంతువులు నీటిలో పుట్టి నీటిలో పెరిగెడి పరీసృపము యొక్క స్థానము నాక్ర మించెను కొంతకాలము వాయుగమన మొనర్చి, విడిచి పోయిన సరీసృపముల యొక్క పూర్వపు సంచారమార్గమును

పశులు అనుసరించెను సినోజోయిక్ మహాయుగారంభము నందు పరంపరాగతమైన సస్తనజాతి జంతువులవలన స్వతంత్రములైన పెక్కు వంశ పరంపరల విస్తారవ్యాప్తి ఘటిల్లెను వీటిలో అత్యంత సమృద్ధమైన వర్గము ప్లేసెంటల్ అను సస్తన జంతువులకు సంబంధించినది దీనిని ఎన్‌థీరియా అని కూడ అనెదరు ఈ వర్గమునకు సస్తనజంతువులుగా మిగుల పరిచితములైన ఈ క్రిందిజాతులు పేర్కొనబడుచున్నవి — పిల్లులు, కుక్కలు, కుక్కజాతికి చెందిన సముద్రపు జంతువులు, నీటి గుర్రములు, ఎలుకలవలె కొరికి తినునట్టి జీవులు, తిమింగలములు, ఒకవిధమైన సముద్రజలచరములు, గబ్బిలములు, అడవిఎలుకలు, పశువులు, గొర్రెలు, పందులు, ఒంటెలు, గుర్రములు, అడవిగాడిదలు, ఏనుగులు, టాపిర్స్ అనునొక రకపు జంతువులు, కోతులు, మనుష్యులు, ఇతరములు

మ రా సా

## పురావస్తు తత్త్వశాస్త్రము (Archaeology)

'ఆర్కియాలజీ' అను ఇంగ్లీషుపదమునకు పురావస్తు తత్త్వశాస్త్ర మని అర్థము అది భూగర్భశాస్త్రమువంటి భూతకాలిక అవశేషములకు సంబంధించిన శాస్త్రము అది ప్రాచీన కాలమునందలి, ఈజిప్టు, మెసపొటేమియా, సింధులోయవంటి తావులలో, భూమియందు పాతుకొనిపోయిన వస్తువులను, ప్రాచీనమనుజులు సాధించిన అద్భుతావహములైన పెక్కు సంస్కృతి నాగరికతలను ఆవిష్కరించెను

ఈ పరిశీలనమునకు ఆధారసాధనములు అనేకములు కలవు ఉదా - ఉపకరణములు, నిర్మాణావశేషములు, మట్టి పాత్రలు, నాణెములు, శాసనములు, ముద్రలు, లోహపు బిళ్లలు మున్నగునవి ఈ విశాలక్షేత్రము, అనుకూల్యము కొరకు, మూడుదశలుగా విభక్తమైనది వీటిలో మొదటిది ప్రాచీనమానవుని వ్రాత గాని, అతని చర్యలనుగూర్చిన లిఖిత వృత్తాంతములుగాని లభింపని భూతకాలిక కృత్యములకు చెందినదశ రెండవది కొన్ని వ్రాతసాక్ష్యములు లభించిన మహాయుగము ఇట్లు పురావస్తుతత్త్వశాస్త్రము అనేకశాఖలుగా విభజింపబడినది అవి ప్రాగితిహాసికము, ఆద్యేతిహాసికము మున్నగునవి ప్రాగితిహాసము అనునది మానవుని ప్రగతి కాలమునకు చెందినది అది విశేషముగ రాళ్లతో, ఎముకలతో, లోహములతో చేయబడిన పనిముట్లు ఆధారముగాగలది పూర్వచారిత్రకమానవుడు పరాన్నభుక్కువలె దాదాపు ప్రకృతిపై ఆధారపడుచు జీవితమును గడిపెను అతడు ఆహారోత్పత్తి చేయక, ఆహారసంచయము మాత్రము చేసికొనుచుండెడివాడు వానికొక స్థిరమయిన వాసస్థానము లేకుండెను అతడు ఆహారాన్వేషియై తమ సమకాలికములయిన జంతువులవలె, ఒకతావునుండి స్థలాంతరమునకు చరించుచుండెను అందుచే శారీరకముగా సస్తనజాతి జంతువులకంటె అతడు దుర్బలుడగుటచేత, ఈ విషయములో సావధానముతో గృహోపకరణములను నిర్మించుకొన సాగెను ఈ ఉపకరణములు మిక్కిలి మోటుగానుండెను పూర్వచరిత్ర సాధారణముగా ప్రాచీనయుగ పాషాణికము, మధ్యయుగ పాషాణికము, నవయుగ పాషాణికము అని మూడుదశలుగా విభక్తమయ్యెను

ప్రాచీనయుగ పాషాణికదశకు చెందిన మనుజుడు దేశద్రిమ్మరియై వేటాడి జీవించెను అతడు సహజమయిన బిలములలోను, పెద్దకొండ గుహలలోను నివసించెను మధ్యయుగ పాషాణికకాలమునందు రాతియుగమునకు చెందిన మనుజుడు తన ఉపకరణములను తయారుచేసికొనుటయందు వాస్తవమయిన ప్రగతి నొందెను దానితోపాటు ముఖ్యముగా వేగముతో పరుగిడు జంతువులను వేటాడుటలో అతడు నేర్పరితనమును ప్రదర్శించెడివాడు ఈ దశలోనే అతడు రాళ్లు రువ్వుట నేర్చికొనెను తుద కాతడు విల్లునమ్ములను కూడ వాడుట అభ్యసించెను

క్రొత్తరాతియుగదశయందు మనుజుడు ఆహారోత్పత్తి కావించెను, జంతువులను పెంచెను, వ్యవసాయముచే తన ఆహారసరఫరాలను అభివృద్ధి యొనర్చుకొనెను, మృతదేహములకు ఉచితమైన ఖననసంస్కారమును కల్పించెను, కుటీరనిర్మాణకళయందును ప్రగతి సాధించెను నూతన శిలాయుగ మానవుడు సాధించిన ఆర్థికస్థైర్యము మహాపాషాణయుగదశ ద్వారా సాముహికకృషి ఫలితముగా తొలిచారిత్రకసంఘముగా రూపొందుటకు వలసిన కాలమును సంక్షిప్తమొనర్చెను ఈ తొలిచారిత్రక సమాజమును పునర్నిర్మించుటకు స్పష్టమయిన మూలసాధనములు లేవు పురావస్తుతత్త్వశాస్త్ర సంబంధమైన పద్ధతులు రెండుకలవు (1) పరిశోధనము (2) ఖననము సంస్కారవంతుడును, చారిత్రకుడునైన పురాతత్త్వశాస్త్రవేత్తకు త్రవ్వుట కనువయిన తావును వరించుటకును,

ఆస్థానమునందు జాగరూకపరిశీలనముచే ఉపయోగకరమైన దత్తాంశములను సమకూర్చుకొనుటకును, భావనీయతలను, సర్వసాంస్కృతికదశలను పరిశీలించుటకును అన్వేషణ మనునది ఉపయోగపడెను

ఖనన మనునది యొక శాస్త్రీయపద్ధతి దాని వలన ఖననప్రాంతము లందలి ప్రాచీనసంస్కృతి ఆవిష్కరణమగును ఈ పద్ధతి తరచుగా అపరాధపరిశోధకవిధానముతో పోల్పబడుచున్నది ఖననము రెండురకములు ఒకటి నిలువుగా త్రవ్వట, రెండవది అడ్డముగా త్రవ్వట మొదటివిధాన మొక చిన్నప్రదేశమును త్రవ్వట కుపయోగపడును అది పురాతత్త్వ శాస్త్రవేత్తకు ఆప్రదేశమునకు సంబంధించిన కార్యనిర్వాహణ క్రమమును తేక ఆ స్థలముయొక్క ఆక్రమణమునందలి పూర్వోత్తరక్రమము నవగతమొనర్చుకొనుటకు తోడ్పడును అడ్డముగ త్రవ్వుపద్ధతి వలన అచ్చటి నాగరికదశల యొక్క సమగ్రవృత్తాంతమును సేకరించుటకు శాస్త్రజ్ఞున కుపకారము జరుగ గలదు

1863వ సంవత్సరములో, చెన్నపురికి దక్షిణమున, పల్లవరమునకు సమీపముగా, నొక గులకరాళ్ళ గుంటలో, పురాణపాషాణికయుగపు వస్తువులను రాబర్ట్ బ్రూస్‌ఫూట్ అను నతడు కనుగొనెను అతడు భారతీయ పూర్వచారిత్రకయుగ పరిశోధనమునకు జనకుడుగను, ప్రపంచ పూర్వచరిత్రవేదిగను విశ్రుతుడు ఇరువదియవశతాబ్ది తొలిదశాబ్దములలో డీటెర్రా, పాటర్‌సన్ అనువారు హిమాలయప్రాంతమందలి హిమయుగ పరిస్థితులను పరిశీలించిరి ఆ పరిశీలనము రకరకములైన శిలాపరికరముల నిర్మాణమును విశేష ప్రకాశమునకు తెచ్చెను ఈప్రారంభకృషిని కృష్ణస్వామి, లాల్, సంకేలియా, సుబ్బారావు, సేన్ తదితరులు కొనసాగించిరి వారు భారతదేశమునందలి దాదాపు అన్నిభాగములందు ప్రాచీన శిలాయుగమునకు చెందిన పెక్కు పరిశోధక క్షేత్రములను ప్రకాశమునకు దెచ్చిరి వివిధ పదార్థములను ఖండములుగా నరకు ఉపకరణములచే విలక్షితమైన ఉత్తరభారత ''సోహన్'' సంస్కృతియు, దక్షిణభారతమునకు చెందిన మదరాసు చేతిగొడ్డళ్ళ పరిశ్రమయు పెక్కుశాస్త్రజ్ఞులను నూతన విషయములను కనుగొనునట్లు ప్రోత్సహించెను తూర్పుపంజాబు లోయలలోను, యమునానదీ లోయలోను, ఉత్తరప్రదేశ నిమ్నప్రాంతములోను, రాంచీలోను, బీహారునందలి సింగభూమిలోను, ఒరిస్సాలోని బర్హబలాంగ్ అను తాళాంబి లోయలోను, భవనాశిలోను, ఆంధ్రప్రదేశమునందలి కృష్ణలోయలోను, ఇతరలోయలలోను, మద్రాసురాష్ట్రమునందలి కొర్తాలయార్ లోయలోను, మహారాష్ట్ర ప్రదేశమునందలి మలప్రభ, ఘటప్రభ లోయలలోను, మధ్యప్రదేశమునందలి నర్మద, చంబల్ లోయలలోను, గుజరాత్‌నందలి సబర్మతీ లోయలోను, రాజస్థానమునందలి నిమ్నప్రాంతములలోను, అనేకములయిన ప్రాచీన శిలావిశేషములు గోచరించెను కేరళ, అస్సాము, నేపాలు, శేషించిన హిందూదేశము మినహా, శేషించిన భారతదేశమంతయు (బర్మాతోసహా) ప్రాచీన శిలాయుగ క్షేత్రముచే ఆవరింపబడినది

"మహారాష్ట్ర, మధ్యప్రదేశ, కర్ణాట, ఆంధ్రదేశము లందును, ఒరిస్సా, ఉత్తరప్రదేశ, బీహారు, రాజస్థాన,సౌరాష్ట్ర, మదరాసురాష్ట్రములందలి ఉపకరణముల ఆవిష్కరణను, పూర్వచారిత్రక మానవుని గురించిన విజ్ఞానమును సంపన్నమొనర్చినది ఈ ఆవిష్కరణములు భారతదేశమందలి మానవుని పరిణామమును సూచించును ఈ ఉపకరణములకును, ఆఫ్రికా ఉపకరణములకును సామ్యము కూడ కన్పట్టును మాధ్యమిక పాషాణయుగ శిలోపకరణములు విస్తృతముగ వ్యాపించియున్నవి మద్రాసురాష్ట్రములో తిరునెల్వేలి జిల్లాకుచెందిన సెక్రిపరిశ్రమ క్రీ పూ 4000 సం॥ల నాటిది లాల్ అను శాస్త్రజ్ఞుని వ్రాతల ననుసరించి కొన్ని కొన్ని పరిశ్రమలు ఇంతకంటె కొంచెము పూర్వకాలికమైనవై యుండవచ్చును కూచయ్, మొరెనాపాటర్, సిభానియా-ఆడ్మగర్ అనునవి వరుసగా ఒరిస్సా, ఉత్తరప్రదేశ, మధ్యప్రదేశ రాష్ట్రములందలి ప్రాంతములు అచ్చటి ఖననముల వలన ఈ సమస్యా పరిష్కారాంశములు ప్రకాశమునకు వచ్చెను ఈ అవశేషముల అతోధిక సమగ్రపరిశీలనమువలన మాధ్యమిక శిలాయుగమునందు వేటాడి జీవించెడు దశనుండి మానవుడు ఆహారోత్పత్తిచే జీవించుదశ కెట్లు ప్రగతినొందెనో బాడ తెలియ గలదు

నవపాషాణయుగ సంస్కృతిక్షేత్రమున ఇటీవల జరిగిన ఆవిష్కరణములు అత్యంతమైన విలువకలవి కృష్ణస్వామి ప్రభృతు లొనర్చిన పరిశీలనములు నవపాషాణ యుగాధ్యయనమును సుసంపన్న మొనర్చినవి కాశ్మీరములో, నవపాషాణ యుగమందు, బిలములలో నివసించిన మానవులు ఎముకల

తోను, రాతితోను చేయబడిన ఉపకరణములను ఉపయోగించిరి వారు మానవులయొక్క, జంతువులయొక్క, కళేబరములను ఖననముచేయు సంప్రదాయము కలిగియుండిరి డార్జిలింగు జిల్లాలో కావింపబడిన అన్వేషణలలో, నవపాషాణయుగపు ఉపకరణములు, సవ్యముగా కాల్చబడని మట్టిపాత్రలు కనుగొనబడినవి వాటిలో తట్టు భాగమున బుట్టలయొక్క, దారములయొక్క చిహ్నములు కానవచ్చెను ఆ అన్వేషణలు అంతు దొరకని ప్రాచ్య–నవపాషాణయుగ గ్రంథికి నూతనసాధనములను చేకూర్చెను మయూరభంజియందలి కూచయ్‌లోని ఖననము ముతకమొరముతో నిర్మితమైన ఎర్రని సామానులతో పాటు, నవపాషాణయుగ శిల్పకళాఖండములను బహిర్గతమొనర్చెను గుంటూరుమండలములో నాగార్జునకొండవద్ద, ఉట్నూరు, పిక్లిహాలు అను తావులవద్ద ఖననములు జరుపబడెను ఈ ఖననములు నవపాషాణయుగ మానవునిగూర్చి ఉపయోగకరమయిన దత్తాంశములను ఆవిష్కరించెను ఆంధ్రప్రదేశ మందలి ఇతర మండలములలో విస్తృత మయిన అన్వేషణలు జరుపుటకు ప్రస్తుతము ఆలోచింపబడుచున్నది బళ్ళారిమండలములో తెక్కలికోటవద్ద జరుపబడిన విస్తృతఖననమువలన ఒక నల్లరాతికొండపై 19 మానవ నివాసస్థానము లుండినట్లు ప్రకటింపబడినది మట్టిపాత్రలాధారముగాగల ఆ సంస్కృతి రెండు వేర్వేరు యుగములకు చెందినదిగా విభక్తమైనది ఆ కాలములో గృహనిర్మాణము గుండ్రముగ నుండి, నేల చక్కగా గచ్చుచేయబడెడిది బుర్జహామ్ నవపాషాణయుగపు క్లిష్టసమస్యచిత్రమైనదిగ నున్నది కారణము, వాటికి ఇతర ప్రాంతములలో సామ్యములు లేకుండుటయే

భారతదేశమున ముఖ్యముగా ఈ శతాబ్ది తొలి రెండు శతాబ్దములలోని అద్య చారిత్రక సంస్కృతి క్షేత్రము పరిశీలింపబడినది పంజాబునందలి హారప్ప, సింధునందలి మొహంజదారో అను ప్రసిద్ధ స్థలములలో ఖననములు గావింపబడినవి తన్మూలమున భారత సంస్కృతియొక్క ప్రాచీనత క్రీ పూ మూడవ లేక, కనీసము నాల్గవసహస్రాబ్దినాటిదని ఊహింపబడినది ఈ ప్రసిద్ధ స్థలములను ఆవిష్కరించుటలో బాధ్యులైన తొలి పురాతత్త్వ శాస్త్రవేత్తలు వీటికిని, మెసపొటేమియా, ఈజిప్టుదేశముల నాగరికతలకును సంబంధానుబంధములను కనుగొనిరి ఈ విషయమున, అకుంఠితమయిన అభిరుచితో అన్వేషణలు జరుపబడినవి గుజరాతునందు, రాజస్థానమందు, పంజాబునందు, గంగానదీ లోయయందు సయితము, హారప్పతో సామ్యములుగల అనేకస్థలములు శోధింపబడి, జాబితాలో చేర్చబడినవి అయితే గత నాల్గుసంవత్సరములలో ఘటిల్లిన అత్యంత ప్రసిద్ధమైన ఆవిష్కరణము పూర్వహారప్ప సంస్కృతికి చెందినది అది రాజస్థానములోని, గంగానగర మండలమందలి కాలిబంగన్ వద్ద జరిగినది అచ్చట లభించిన శిలావశేషములలోని పాత్రలు గరుకై, కాంతివిహీనమయిన ఎర్రని వస్తువులు, అందు, తెలుపు, నలుపు వన్నెలతో మేళవింపబడిన చిత్రముకలదు అందు ఆ కాలమువారు మట్టిఇటుకలతో నిర్మింపబడిన ఇండ్లలో నివసించుచు, లోహమునువాడెడివారు వివిధకార్యములకు బొట్టికత్తుల నుపయోగించిరి రంగులో చిత్రింపబడిన కాళీబంగన్ మట్టిపాత్రలతో కొన్ని హారప్ప మట్టిపాత్రలలో శేషించి యున్నవి వాటినిబట్టి హారప్ప సంస్కృతియొక్క మూలరహస్యము బోధపడగలదు రాజస్థానమునందది ఇతర తావులకును, సింధునందలి పూర్వహారప్ప క్షేత్రములకును, బెలూచిస్థానమునందలి మరికొన్ని తావులకును, సామ్యము కలదు ఈ విషయములవలన రాజస్థాన మందలి హారప్ప సంస్కృతికి మూల మేది యను అత్యంత వివాదగ్రస్తమును, చర్చితమునైన సమస్యకు పరిష్కారమును కనుగొనవలెనని తెలుచున్నది

క్రమబద్ధమయిన పురనిర్మాణ ప్రణాళికతో పాటు మృత్పాత్రల నిర్మాణము, ఇతర పురావస్తు విశేషములు కాళీబంగనులో కనుగొనబడినది అగ్నివేదుల శ్రేణీ ఆవిష్కరణము చిత్తాకర్షకమై హారప్ప కాలమునాటి ప్రజల మతవిషయములపై కొంత వెలుతురును ప్రసరింపజేయును ఒకానొక ఖనకుని కథనమునుబట్టి ఇచట కనుగొనబడిన కొన్ని చిత్రశకలములు లిపియొక్క దిశను-అనగా-లిపికుడినుండి,ఎడమపైపునకు వ్రాయబడియుండుటను నిర్దేశించుచున్నవి ఇటీవలకూడ ఈ ప్రాంతములో, లోథల్, అలమ్‌ఘీర్ పురము, దేసల్ పురములవద్ద కూడ, పురావస్తు తత్త్వశాస్త్రజ్ఞులచే ప్రయోజనకరమయిన పరిశోధన కార్యము కావింపబడినది అయితే నర్మదా లోయలోని నవదతోలీవద్ద డాక్టరు సంకలియా గావించిన ఆవిష్కరణముల ఫలితముగా ప్రముఖమైన తామ్రపాషాణయుగ సంస్కృతి ఆవిష్కృతమైనది

అది దాదాపు క్రీ పూ 17వ శతాబ్దికి చెందినదిగా నిర్ణయింపబడినది హారప్ప సంస్కృతిదశయొక్క తుదిభాగ

మునకును క్రీ పూ 7వ శతాబ్ది తొలిభాగమునందలి ప్రాథమిక చారిత్రక సంస్కృతికిని మధ్యగల విరామవిరతి స్థలమును, కాలమును పూరించుటకును ఆ సంస్కృతియొక్క అస్తిత్వమును ధ్రువపరచ గల అంశములను భారతీయ పురాణగ్రంథములందు గల సంప్రదాయక గాథలనుండి సేకరించుటకును, కృషి సల్ప బడినది లాల్ మహాశయుడు హస్తినాపురము వద్ద కావించిన ఖననము ప్రముఖ ఫలితముల నొసగెను ఇట్టి ఖననములు ఇతరులచే ఉత్తరప్రదేశమందు అత్రాంజిఖేరా అను తావున జరుపబడినవి ఇవి కేవలము హస్తినాపుర మందలి శిలోపకరణ ములకు సంబంధించినవిగా రుజువైనవి

ఇనుపయుగము క్రీ పూ 1000 సంవత్సరముల నాటిదని చరిత్ర పరిశోధనమువలన తెలియవచ్చినది అంతే కాక మహాభారత యుద్ధకాలములో హస్తినాపుర ప్రజలు తమ చిత్రములను బూడిదవర్ణముతో తయారు చేసికొనెడి వారని తెలియుచున్నది

ఇటీవల మహాపాషాణ సంస్కృతి (megalithic) క్షేత్రమున విశేషప్రగతి సాధింపబడినది జమ్ము - కాశ్మీరరాష్ట్రములో అనంతనాగ్ మండలమునందు కొన్ని ఖననస్థలములు కనుగొన బడినవి అవి బుర్ ఝూమ్ అను ప్రాంతమునకు చెందిన మహాపాషాణ పరికరస్వరూపములను పోలియున్నవి డోల్మెండ్ సమాధులు, స్తూపవలయములు అస్థికలశ–ఖననములు, ఆంధ్ర ప్రదేశములోని నాగార్జునకొండ వద్దను, ఏలేశ్వరములోను, అనేక ఇతరప్రదేశములలోను కనుగొన బడినవి వీటిలో ఒక దానిపై మరియొకటిగా ఉంచబడిన రెండు అస్థిపంజరములుకల స్తూపవలయము అసాధారణమైన ఆసక్తిని గొల్పుచున్నది దక్షిణ మహాపాషాణ సంస్కృతి యొక్క ఉత్తరహద్దు, మహారాష్ట్రప్రదేశములో, నాగపూర్ మండలములో జనపతియను తావునందున్నట్లు గుర్తింపబడినది ఉత్తరప్రదేశమందలి మిర్జాపూరు, వారణాసి మండలములలో కొన్ని మహాపాషాణ పరికరములు త్రవ్వ బడినవి అయితే వాటికిని, దక్షిణభారతపు శిలా పరికరములకును నడుమగల నికరమైన సంబంధము ఇంతవరకును నిర్ణయింప బడలేదు

ఇటీవల, చారిత్రక పురావస్తుతత్త్వశాస్త్ర విషయమున విశేషమయిన శ్రద్ధ చూప బడుచున్నది రత్నగిరి (మహారాష్ట్రము)వద్ద జరిగిన ఖననములలో కంచుతోను, రాతితోను నిర్మింప బడిన మహాయాన, వజ్రయాన యుగముల నాటి పెక్కు విగ్రహములు ఆవిష్కృతములైనవి గుజరాతు రాష్ట్రములో దేవ్ని మోరివద్ద స్తూపముల యొక్కయు, బౌద్ధమఠ స్థాపనముల యొక్కయు అవశేషములు ప్రత్యక్షముగా గోచరమగును ఇచ్చటి పురాతన లోహశిలాదులపైగల శాసన పరిశోధన సాక్ష్యముపై అవశేషములు పశ్చిమ క్షాత్రపరాజగు మూడవ రుద్రసేనుని కాలము నాటి వని దృఢముగా చెప్పుటకు తోడ్పడును ఇక్కడ కనిపించు శిల్ప శిలావిగ్రహములకును, గాంధార కళాసంప్రదాయమునకును పోలికలు కలవు కుందనపురము వద్ద అత్యంత ప్రాచీన కాలములో ఆరు సాంస్కృతిక యుగములకు చెందిన నల్లని వర్ణములు గల ఎర్రని శిలాద్రవ్యముతో తయారైన పరికరములు కనుగొన బడినవి

టెర్ అను ప్రాంతమున రమ్యమయిన దంతపు బొమ్మలు, మట్టిబొమ్మలు బయల్పడినవి వాటిపై స్పష్టమయిన రోమక శిల్పప్రభావముగోచరించును మహారాష్ట్రమున ఔరంగాబాదు మండలములో, పిటల్ కోరా గుహల శిథిలావశేషములను తొలగించునపుడు, క్రీ పూ రెండవశతాబ్దికి చెందిన పెక్కు శిల్ప విగ్రహములు కనిపించినవి ఇటీవల అమరావతివద్ద కావింప బడిన ఖననములలో, స్ఫటికపు బరణులు, అనేక శాసనములు శిల్పవిగ్రహములు బయల్పడినవి, వీటితోపాటు ధరణికోట వద్ద బృహదాకారముగా దుర్గప్రాకారములు ఆవిష్కృతములైనవి

నాగార్జున కొండ వద్ద, ఇదివరకే బౌద్ధక్షేత్రముగా గణుతికెక్కిన ప్రాంతములో పెద్దఎత్తున ఖననములు జరిగినవి శాతవాహనుల పతనానంతరము ఇక్ష్వాకు ప్రభువులు అమరావతి కళాసంప్రదాయమునకు చెందిన ఇచ్చటి కళాసంపదను పోషించిరి అచ్చట జరుపబడిన ఖననములు పూర్వైతిహాసికములును, మూలైతిహాసికములు నైన సంస్కృతులను గూర్చి సమృద్ధములైన సాక్ష్యములను సమకూర్చినవి ఆ తావునందలి వస్త్వవశేషములు, నిర్మాణములు,మట్టిపాత్రలు,రాతివస్తువులు, శిలావిగ్రహములు, మట్టి బొమ్మలు, నాణెములు, లోహవస్తువులు–విశేషముగా ఇక్ష్వాకు రాజులకాలము నాటి వని చెప్ప వచ్చును ఆ నిర్మాణావశేషములలో ఇక్ష్వాకు మహారాజుల పోషణమున అభివృద్ధి నొందిన అనేక స్తూపములు, విహారములు చేరియున్నవి లభించిన శాసనములు హీనయాన, మహాయాన శాఖలకు చెందిన వని కనుగొన బడినది ఆ నిర్మాణములలో ఇటుక వాడ బడినది అవి అందమై, ఆకుపచ్చవన్నె గల సున్నపు

రాతితో అతుక బడినవి జాతకకథల మూలముగా బుద్ధుని జీవిత రంగము నుండి నిర్మింప బడిన మనోహరము లగు దృశ్య ప్రతిబింబములును, ఆతని పూర్వజన్మములకు సంబంధించిన సంఘటనములును, శిలాఫలకముల యందు గోచరించును

ఇక్ష్వాకు మహారాజులు బౌద్ధమునకు పోషణ మొసగి యుండినను, వారు బ్రాహ్మణ హిందూమతావలంబకులుగనే ప్రవర్తించిరి వేదవిహితము లయిన అశ్వమేధము, వాజపేయము అగ్నిష్టోమము మున్నగు యాగముల నొనర్చిరి ఖననముల వలన, అశ్వమేధయాగమునకు సంబంధించిన వేదులు బయటపడినవి ఇట్టివి పురాణగాథలను ధ్రువపరచుటకు సహాయపడుచున్నవి

ఇప్పటికిని భారత దేశ చరిత్రలో అనేకములయిన శూన్యఘట్టము లున్నవి విదితము లయిన చరిత్ర ప్రసిద్ధిగల క్షేత్రముల వద్ద క్రమమయిన ఖననములచే ఈ శిలాశిథిలములను బయల్పరుపవలసి యున్నది

ఆర్ సు

## పులి జూదము

ద్యూత విశేషములలో పులి జూద మొకటి ఈ క్రీడా వినోదమును గూర్చి పూర్వ కవులు వర్ణించుటచే, ఇది ప్రాచీన కాలము నుండి ప్రాచుర్యమం దుండి యుండె నని స్పష్టమగు చున్నది

పులిజూదము మూడువిధములుగా నుండు నని తెలియు చున్నది భారత దేశమునం దన్ని ప్రాంతములలోను ఇండ్ల ముందటి అరుగుబండల పైన, కొండరాళ్ళ పైన పులిజూదపు టిండ్లను మలిసించు నాచారము పారంపర్యముగ సాగు చుండెను ఈ జూదము అనాదికాలము నుండియు విరివిగా ఆడబడుచుండె ననుటకు ఇది మరి యొక తార్కాణము గ్రామీణ ప్రాంతములందును, నగరవాసము లందును అన్ని వృత్తులకు చెందిన పేదసాద లీ ఆటను ఆడుచుండుట మన కనుభవసిద్ధము అనుభవజ్ఞులగు క్రీడాకారులు ఈ ఆటను అత్యంత చాకచక్యముతో పణముల నొడ్డి కూడ ఆడుదురు ఇప్పటికిని గ్రామములలో పలువురు వృద్ధులు కూడ ఈ ఆటయం దారి తేరినవారు గలరు కాని ఏ కారణముననో ఇది మేధావి వర్గమున కెక్కియుండ లేదు కాసైనను వ్యయములేని ఈ యాట సహజముగ పేద ప్రజానీకము వరకు మాత్రమే పరిమితమై యున్నది

పాచికలాట సుమారు 40 సంవత్సరముల క్రిందట కర్నూలు జిల్లాలో కొంద రాడుచుండి రట 60 సంవత్సరముల క్రిందట పాలమూరు జిల్లా (ఇప్పటి మహబూబునగరు జిల్లా) యందును, రాయలసీమ యందును, "నక్కముష్టి ఆట" అను నొక క్రీడావిశేషము విరివిగా ఆడబడు చుండెడిది దీనితోపాటు పులిజూదము కూడ విశేషముగా వాడుకయం దుండెను! కాని ఇపుడివన్నియు ఈనాటి నాగరిక క్రీడాకారులకు మోసై, అరుదై పోయినవి నిఘంటుకర్తలు కూడ ఈ యాట ఒక బాలక్రీడా విశేష మనియో ఒక విధమగు జూద మనియో పేర్కొనుటగాని, లేక అంతమాత్రము కూడ వ్రాయక, ఆ శబ్దమునే ఎత్తుకొనక పోవుటయో గూడ సంభవించు చున్నది

మూడువిధములగు పులిజూదములలో ఈనాడు రెండు రకముల ఆటలే తెలియవచ్చు చున్నవి మొదటి రకపు ఆటను గూర్చిన వివరము లివి ఒక పులిని మూడు మేకలచే కట్టి వేయించవలెను! పులిస్థానమున పెద్ద గులకరాతిముక్కను, మేకల స్థానమున చిన్న గులకరాతిముక్కలను చిహ్నములుగా నుంచి ఆట నాడెదరు

పులిని మొదట పై పటమునందలి శిఖర కోణమునం దుంచెదరు మేకను దాని సమీప మందలి ఇంటనుంచగా, పులి దానిపై దాటి, మేక లేకుండిన ఆవలి యింటిపై వ్రాలును అందువలన మేకల నుంచు వాడు ఒక మేకను పులికి మూడవ యింట నుంచి, తరువాత పులియంచున నుండు ఇంట మరియొక మేక నుంచును పులి జరగకుండ కట్టివేయ బడినచో, ఆట ముగిసిన ట్లగును అట్లుకాక, మూడు మేకలను పులి చంపివేసినను ఆట అంతమగును ఇది ఒక రకమగు పులిజూదము

చిత్రము 1



పటము 1

రెండవరకపు పులిజూద మిట్టిది —

నాలుగు పులులతోను, 16 మేకలతోను ఈ యాట ఆడబడును ఈ నాలుగు పులులను పై పటమునందలి నిలువు త్రికోణమునందు మధ్యరేఖపై వరుసగా నుంచెదరు మేకల ప్రతికక్షి పులులకు ప్రక్క నున్న యింటిలో మేక నుంచక, ఒక యిల్లు ఎడముగా దానినుంచును పులుల కక్షిదారుడు ఒక పులిని ఒక యింటికి జరుపును మేకలవాడు రెండవ మేకనుంచును పులి ప్రక్కన అదే వరుసలో మేక

చిత్రము 2



పటము 2

ప్రక్క నున్న ఇల్లు ఖాళీగా నుండినచో, పులివాడు మేకపై తన పులిని దాటించి మేకను చంపును ఈ విధముగా 18 మేకలను పెట్టిన తరువాత మధ్యనున్న పులులచే చంపబడగా మిగిలిన మేకలు, పులులను కట్టివేయు ఎత్తులతో జరపబడును మేకలు విరివిగా చచ్చినప్పుడు, పులులను అరికట్టుట అసంభవ మని మేకలవాడు గ్రహించి, ఓటమిని ఒప్పుకొన్నచో, ఆట ముగిసిన ట్లగును ఆటలుకాక, పులులు కదలకుండ, వాటి ప్రక్క ఇండ్లను మేక లాక్రమించికొనినను, ఆట ఆఖరైన ట్లగును ఈ రెండు రకములైన పులిజూదములందును ఆట నాడు వా రిద్దరు మాత్రమే యుందురు

ఇక మూడవ విధమగు పులిజూదమునకు 'మేకల చద రంగ' మని పేరుపెట్టి, ఈ మూడురకముల ఆటను ప్రజ లాడెదరు

చిత్రము 3



పటము 3

మూడవ పటము సూచించు ఆటను ఒక్కడే ఆడుకొనుచుండును తొమ్మిది కాయలను తొమ్మిది కోణములం దుంచు కొని, వాటిని జరుపుచు చంపుచు పోవును ప్రొద్దుపోని వారు ఈ యాటకు పూనుకొనెదరు

నాల్గవ పటములోని ఆటయు మేకల ఆట అనబడును ఈ నమూనాలో మూడవ పంక్తి తప్ప, తక్కిన పంక్తులలోను, తోకగా కాన్పించు త్రికోణపు టిండ్ల లోను ఇద్ద రాటగాండ్రు పదునారేసి మేకల నుంచెదరు 1, 2 రేఖలు, వాటి త్రికోణ మొకనికిని, 4, 5 రేఖలు, వాటి త్రికోణము ప్రతికక్షికిని కేటాయింప బడి యుండును ఒకరి తర్వాత మరి యొకరు ఒక్కొక్కసారికి ఒక మేకను ఖాళీగా నుండు మూడవ రేఖ మీదికి జరుపును ఒకని మేక ప్రక్కకు మరి యొకని మేకవచ్చి కూర్చొనినను లేక ఆ మేక ప్రక్క యిల్లు ఖాళీగా నున్నను, ప్రతికక్షి యొక్క మేక, అట్లు ప్రవేశించిన మేకను చంపును మొదట చూపిన పులిజూదములు రెండింటిలో పులి ఒక్కొక్కసారి ఒక్కొక్క మేకను చంపివేయును కాని ఈ యాటలో ఎన్ని సందులు దొరకిన, అన్ని మేకలను ఆటకాడు చంపవచ్చును, ఎదుటివాని మేకలను కొన్నిటిని చంపి,

చిత్రము 4

పటము 4

ఆతనిని దుర్బలునిగా నొనర్చి తుద కాతని మేక లన్నిటిని పూర్తిగా చంపివేయ వచ్చును, లేదా ఆట కట్టవచ్చును

పటము (5) సూచించు మరియొక విధమగు పులి జూదముకూడ ఈనాడు ప్రాచుర్యములో నున్నది దీనిని ఇద్ద రాటగాండ్రు ఎదురెదురుగా కూర్చుండి ఆడెదరు ప్రతిఆటగాడు తొమ్మిది మేకలతో ఆటనాడును ఒకడొక కాయను ఒక ఇంటిలో నుంచినచో, రెండవవాడును తనవైపునకే కాక, తన ఇష్టము వచ్చిన మరియొకచోట కూడ తనకాయ నుంచ వచ్చును ఇట్లు కాయల నుంచుటలో, ప్రత్యర్థి కాయలను మూడింటిని ఒకే వరుసలో పెట్టనియ్యక, తన కాయలనే ఆ వరుసలో పెట్టుకొనును ఆ యాటంకములను తప్పించుకుని, ఒకడు ఒకే వరుసలో తన మూడు కాయలను పెట్టి ఎదుటి వాని కాయను దేనినైనను తీసివేయును ఈ యాట 'చర్ పర్' అనబడును తన కాయలను మూడింటిని ఒక వరుసలో పెట్టి 'చర్' అని ఉచ్చ రించి, ఎదుటివాని కాయలను తీసి వేయును మరల తన కాయను వెనుకకు జరపి, దానిని స్వస్థాన మునకు తెచ్చి, మూడింటిని ఒక వరుసచేసి 'పర్' అని యనుచు, ఎదుటివాని కాయను మరొకదానిని తీసివేయును అందుచేతనే ఈ యాట 'చర్ పర్ ఆట' యనబడుచున్నది

చిత్రము 5



పటము 5

కావున ఈ యాటలో నేదియైన మూడవరకపు పులి జూదములో చేరినదేమో! ఈ యాట లన్నియు తెలుగు మండలము లన్నిటిలో ప్రచారమం దున్నవో లేవో గట్టిగా చెప్పజాలము వీటిలో కొన్ని మాత్రమే నగరములందును, గ్రామములందును ఆడబడుచున్నవి కొరవి గోపరాజు వర్ణన మునుబట్టి ప్రాచీనుల ఈ క్రీడా వినోదములు మనకు కొంత వరకు తెలియవచ్చినవి ద్యూతకారుల దృష్టిలో ఇట్టి జూద విశేషములు వినోదకరములైనవని, ఉత్కృష్టమైనవని సమర్థిం చుటకే క్రింద పద్యమొక తార్కాణముగ పేర్కొనబడినది —

"ధన లాభము, పురాణము
వినికియు, వాద్యంబు, యోగవిద్యయు, శాస్త్రం
బును, సంగీతము, కావ్యం
బును, నాటకములును జూదమున కెనయగునే! "

(సింహాసనద్వాత్రింశిక - భా 2 - పు 86)

ప్ర రా సు

## పుష్పగిరి

ఇది కడప తాలూకాలోని ఖాజీపేట ఫిర్కాయందు కడప పట్టణమునకు వాయవ్య దిశగా పదిమైళ్ళలో నున్నది ఈ క్షేత్రమును దక్షిణకాశి యందురు ఉత్తర పినాకినీ నదీ తీరమున గల ఈ క్షేత్రమును వైష్ణవులు మధ్యాహోబిల మందురు కర్నూలు మండలమున నుండు నృసింహ క్షేత్ర మగు అహోబిలమునకును, తిరుపతికిని మధ్యభాగమున నుండుటచే నీ నామమున పిల్తురు వారణాసికిని, చిదంబరమునకును మధ్యభాగమున నీ క్షేత్ర ముండుట వలన మధ్య కైలాసమని పిలుతురు ఉత్తరకైలాసము కాశీపురి యనియు, దక్షిణ కైలాసము చిదంబర మనియు ప్రసిద్ధి కాబట్టి ఈ రెండింటికి నడుమ నుండుటచే మధ్య కైలాస మను నామము వచ్చిన దని కారణమును దెల్పుదురు ఈ గ్రామము పినాకినీ నదికి పడమటను, దక్షిణమునను కొంత భాగమును కలిగి యున్నది పినాకినీ నది ఈ గ్రామము వరకు తూర్పుగ ప్రవహించుచు వచ్చి దీని ఈశాన్యమున దక్షిణమునకు ప్రవహించి తూర్పుననుండు పుష్పగిరి నొరసికొని మరల తూర్పునకు ప్రవహించుచున్నది పినాకినికి నుత్తరమున ఇంద్రనాగేశ్వరాలయము గల చింతలపత్తూరు గలదు తూర్పున శ్రీ చెన్నకేశవాలయము (గదాధరాలయము) మున్నగు ఆలయములు గల కొండయున్నది ఈ గ్రామమునకు దక్షిణమున శ్రీ కాశీ విశ్వనాథాలయముగలదు గ్రామమునందు వైద్యనాథస్వామి యాలయము, భీమేశ్వర త్రికూటేశ్వర శ్రీ కామాక్షీదేవి, ఆ దేవిముందు శ్రీచక్రము (శిలమీద చెక్కబడినది) ధుండి గణపతి, రాఘవేశ్వర సన్నిధి మొదలగు పుణ్య మందిరములు గలవు ఈ శ్రీచక్రము ఆదిశంకర ప్రతిష్ఠితము త్రికూటేశ్వరాలయమున గల రాతిస్తంభములు మనరూపము ప్రతిఫలించునట్లుగ నునుపుగ నుండును ఈ ఆలయము ముందుభాగమున అద్వైత మతస్థాపకులగు శ్రీశంకరాచార్యుల మఠము గలదు నాలుగు దిక్కులయందును జగన్నాథము, శృంగేరి, ద్వారక, బదరికేదారము లను నాలుగు మఠములను భారతదేశమున ప్రతిష్ఠించుటలో వీని శాఖలుగా ప్రకటితములైన వానిలో ఈ పుష్పగిరి పీఠమొకటి యనవలయును శ్రీమదాది శంకరాచార్యులవారు కైలాసమునుండి తెచ్చిన లింగములలో నొక్కటియగు శ్రీ చంద్రమౌళీశ్వర లింగమిందుగలదు పీఠాధిపతులు ఈ లింగమును పూజింతురు ఇక్కడనుండు మఠాధిపతులు అభినవోద్దండ విద్యాశంకర భారతీస్వాము లని యొకరును, వారి యనంతరము విద్యా నృసింహభారతీస్వాముల వారని యొకరును, పర్యాయమున నామధేయములతో ప్రశంసింపబడుచుందురు రాజచిహ్నములు వీరికి గలవు

ఇది మొదట బ్రాహ్మణాగ్రహారము వైష్ణవుల గృహములు, స్మార్తుల గృహములు వరుసలుగ నుండినవి మధ్యభాగమున శ్రీ శంకరాచార్యులవారి మఠము గలదు మఠ సంబంధము గల వారును, దేవాలయ సంబంధము గల వారును, పురోహితులును గలరు కొన్ని దేవాలయములు, లింగములు కాలక్రమమున భూగర్భగతములయినవి గాలివీచు కాలమున పినాకినీ నదీ సైకత స్థలములనుండి సైకతను ఆక్రమించి తిన్నెలుగ నేర్పడి కొన్ని యడగినవి కొన్ని యున్నను పూజాదులు లేక యున్నవి పినాకినీ నదిలోనికి దిగుటకు సోపానము లందందు గట్టబడియున్నవి ఈ క్షేత్ర సమీపమున, పాపఘ్ని, కుముద్వతి, వల్కల, మాండవి నదులు పినాకినీ నదియందు గలియును కాబట్టి ఈ క్షేత్రమును పంచనదీ సంగమ మనియు పిలుతురు

ఈ నదికి తూర్పు భాగమున నొక కొండ కలదు దీనినే పుష్పగిరి యందురు. ప్రవాహకాలమున ఈ గిరియందు గల గుహలలోనికి పినాకినీ జలము వెళ్ళును ఈ గుహల యందు మును లున్నారందురు ఈగుహలలోనికి కొంతవరకు ప్రాకుచు, కొంతవరకు గూర్చుండి జరుగుచు, గొంతవరకు నిలుచుండి నడుచుచు వెళ్ళవలెను పాపవిమోచనేశ్వరుని గుడిక్రింద నుండు గుహలోనికి వెళ్ళి యందుగల వింతలను, నిత్యపూజ జరుగు చిహ్నములను దెలిపినవారు కలరు

కొండపై నుండు దేవాలయము చూచుట కత్యంత రమ్యముగా నుండును "అక్షయ్యతృతీయ" నాడు గరుడోత్సవ వైభవము కన్నులార జూచి యానందింప దగినది పినాకిని తూర్పుభాగమున గల పుష్పగిరి గట్టుపై ప్రాకారమును మహాద్వారమును గల దేవాలయ సముదాయము గలదు మహాద్వారము ఐదు అంతస్థులు గలిగియున్నది దేవాలయము చుట్టును ప్రాకారములోపల శిలాశాసనములుగలవు ప్రాకారములో శ్రీ చెన్నకేశవస్వామి సన్నిధియు, ఆస్వామికి నుత్తర భాగమున నానుకొని పుష్పాచలేశ్వరుడు లింగరూపమున గసబడును శివకేశవమూర్తులొకే స్థలంబుననుండుట యెంతయు జూడదగియున్నది పుష్పాచలేశ్వరుని వామభాగమున ఉమా

మహేశ్వరుడు కలడు ఒక్క సింహాసనముననే యీ విగ్రహములు కలవు దుర్గాదేవ్యాలయము తత్పరిసరమున గలదు ఉమామహేశ్వరునకు నుత్తర ప్రాగ్భాగమున సంతాన మల్లేశ్వరుడు, సాక్షి మల్లికార్జునుడు, శ్రీ యోగాంజనేయ మూర్తి ఆలయములును గలవు సంతాన మల్లేశ్వరుని యాలయద్వారమున పై భాగమున నుండు రాతికిని, క్రింది భాగమున గుమ్మముగా నుండు రాతికిని నడుమ బిలములు గలవు పై రంధ్రమునుండి పుష్పమును విడిచినచో అది క్రింది బిలమున బడినచో, కార్యసిద్ధియు, సంతాన సిద్ధియు కలుగునందురు ఇది యాచారముగ వచ్చుచున్నది గదాధరుని శ్రీ చెన్నకేశవస్వామి దేవుని యాలయమునకు దక్షిణ భాగమున లక్ష్మీదేవి, శ్రీదేవి నామమున వెలయు చున్నది ఆ యమ్మవారికి నెదురుగ యోగాంజనేయమూర్తి గలదు చేతులు జోడించి నిమీలిత నేత్రుడై యోగమున నున్నట్లు కనబడును ఈ మూర్తి దగ్గర భక్తులు సేవచేసి వేదాంతసిద్ధియే గాక, ఇష్టార్థసిద్ధియు పడయుచుందురు పుష్పనాథునకు నుత్తర దిగ్భాగమున చోళరాజులచే ప్రతిష్ఠింపబడిన ద్వాదశ శివాలయములు గలవు ఆ యాలయమున కనేక దానము లొనరించి నట్లు శాసనములు గలవు ఉత్తర దిక్కున పంచలింగములును, భూతాత్మకంబులును గలవు పుష్పాచలేశ్వరునకు దక్షిణ భాగమున గట్టుపైననే పాపవినాశేశ్వరుడు కలడు ఇందే యొక గుహ యున్నది ఇందు తాపసులు గల రని ప్రతీతి సుబ్రహ్మణ్యేశ్వరుడు, పాతాళ మల్లికార్జునుడు బ్రహ్మ ప్రతిష్ఠిత మగు కమల సంభవేశ్వర లింగమును గిరి పడమటి పాదమూలమున ప్రయాగ మాధవదేవుడును గలరు గదాధర దేవునకు పడమట రుద్రపాదము గలదు ఇది కుడిపాదముగ నున్నది వ్రేళ్ళు దక్షిణ దిక్కునకు గలవు పాదము పొడవు ఇరువదినాలు గంగుళములు ఇంచుమించుగ గలదు నడిమి పొలత పది యంగుళములును, వ్రేళ్ళ వెడల్పు ఎనిమిది యంగుళములును, మడమ వెడల్పు ఎనిమిది యంగుళములును కలదు ఇట పితరులకు పిండదానము గావింతురు అస్థినిక్షేపార్థము ఈ రుద్రపాదమునకు క్రింది భాగమునగల పినాకినీనది మడుగునకు ఈ ప్రాంతపు జనులు తప్పక యరుదెంతురు ఇట నుంచిన శల్యములు పుష్పము లగునని యైతిహ్యము గలదు ఈ రుద్రపాదమునకు సుమారు మైలుదూరమున ఈ గట్టు తూర్పుకొన యందు మునిపాక యను పల్లె కలదు అందు విష్ణుపాదముగ గలదు

ఈ గట్టు గల ప్రదేశమున నొక మడుగు 'అమృత సరోవర' మను నది యుండినట్లును, ఇందు మునిగిన, ముదుసలులు యువకు లగుచున్నట్లును తెలుపు కథలు ప్రచారమందున్నవి ఇవి యన్నియు పుష్పగిరి స్థల పురాణమున గలవు వాయు భట్టారకుడు శంకరుని యాజ్ఞచే బర్వతము గొని వచ్చి యా మడుగుపై వైవగ, అది పుష్పమువలె దేలు చుండుట జూచి శివకేశవులు పడమట, తూర్పున దమ పాదములచే త్రొక్కగా ఆ పర్వతము కదలక నిలిచిన దనియు, ఇందు సకల దేవతా గణములతో శివకేశవులు నివసించుచు, భక్తుల కోర్కెలను దీర్చుచుందు రనియు పురాణము తెల్పుచున్నది కొండ పుష్పమువలె తేలుట వలన పుష్పగిరి యని నామము వచ్చినది ఇందలి యమృత సరోవరమహిమను దెల్పు కథలలో నొక్కటి మాత్ర మిందుదహరింప బడుచున్నది

ఒక ముసలికాపు పుత్రులపై అలిగి తానే పొలముదున్ను నుద్దేశముతో ముదుసలి బక్క ఎద్దులను నాగలికి కట్టుకొని వెళ్ళెను మధ్యాహ్నము ఎండ ఎక్కువ కాగా నీటికై వెదకుచు పొదల మధ్యనుండు మడుగుకడకు వచ్చెను నీరు త్రావబోయి ప్రాచిపట్టిన రాయి జారుటచే తాను కొలనులోబడి మునిగెను శరీరము ముడుతలుపోయి పటుత్వము కల్గినది ఈత వచ్చినవాడు కావున లోనుండి లేచి గట్టుజేరెను వార్ధక లక్షణములు పోయినవి నవయౌవనముతో నున్నట్లు కనుగొనెను ఆశ్చర్యపడెను తనముదుసలి యెద్దులను మునుంగచేసెను అవియు కోడెలుగా మారినవి ఇంతలో నతని పెండ్లాము భర్తకు భోజనమునకై సంకటి తెచ్చినది భర్తలక్షణములు కలవుగాని పడుచువాడుగా కనబడుటచే గుర్తుపట్టలేక యిటునటు తిరుగుచుండినది, భర్త రమ్మని పిలిచినాడు ఆమె సంశయించి కోపించి దుర్భాష లాడెను నెత్తిననుండు భోజనసామగ్రి గల గంపను దించి కేకలు వేసెను అతడు వచ్చి బలవంతముగ నెత్తుకొని పోయి కొలనులో ముంచెను వెంటనే ఆ ముసలి యవ్వ జవరాలైనది ఇర్వు రాశ్చర్యపరవశులైరి ఈవార్త పురమున దెలిసినది వెంటనే ముదుసలులు వచ్చుట, సరస్సునమునుగుట, నవయౌవనము నొందుట జరిగినది నారద మునీంద్రు డీ విషయమును దెలిసికొని దివ్యదృష్టితో పూర్వము వినతాదాస్య విమోచనకై గరుడుడు అమృతమును దెచ్చుటలో ఒక బిందు విందుబడినది దాన నీసరస్సున కీ మహిమ కల్గినదని తెలిసి

కొనెను ఈ విషయమును బ్రహ్మదేవున కెరింగించెను బ్రహ్మయు, నారదుడును శ్రీ మహావిష్ణువు కడ కరిగిరి విషయమును దెల్పిరి నారదుడు, బ్రహ్మయు, విష్ణువును శంకరుని కడ కరిగిరి ఆలోచన చేసిరి శంకరుడు వాయుదేవుని పిలిచి యామడుగుపై ఒకపర్వతమును పడవేసి జనులకా ప్రదేశము కనబడకుండునట్లు చేయుమని అజ్ఞాపించెను వాయువట్లు చేయగా, కొండ సరస్సున పుష్పము వలె తేలుచుండెను శంకరు డొకప్రక్కన విష్ణుదేవు డొకప్రక్కన కాలితో ఆ కొండనదిమి రట దాన నది కదలక నిలిచిపోయినదట! ఈ పాదములు తూర్పున, పడమర ఈ కొండయందు గానబడుచున్నయవి ఈ కొండ ప్రాంతమున పినాకినీ నది ప్రవహించు చున్నది

ఈ క్షేత్రమున ప్రతిసంవత్సరము బ్రహ్మోత్సవములు శివకేశవుల కొకేపర్యాయము జరుగును ఈ యుత్సవములకు దాదాపు ఏబదివేల జనము చేరుదురు పినాకినీ నది సైకత ప్రదేశ మంతయు చలిపందిరులు పెట్టి భక్తులు వడపప్పు, నీరు మజ్జిగ, పానకములు యాత్రికులకు నొసగుదురు పుష్పగిరి మఠాధిపతులు విదియనాడు రాత్రి, పంచమి పగలు బ్రాహ్మణ సంతర్పణ చేయుదురు అన్నసత్రపు కమిటీవారు శ్రీ వైద్యనాథాలయమున తదియ, చవితి అన్నదానము చేయుదురు వచ్చిన దైన్యులకు వైశ్యులు అన్నదానము చేయుదురు ఇతరులకు తాము కట్టించిన సత్రములలో అన్నదానము చేయుదురు

ఈ పుష్పగిరియందు పెక్కు శిలాశాసనములు గలవు కాలక్రమమున కొన్ని యల్లరివారిచే నరకబడినవి తెలిసిన యంతవరకు కొన్ని యిందుదహరింపబడు చున్నవి

1 గ్రామమునకు నుత్తరదిశన పినాకినీతీరమున చింతలపత్తూరు అను గ్రామమున ఇంద్రనాథేశ్వరస్వామి గర్భాలయములోని స్తంభముపైన ఈ శాసనము గలదు

''స్వస్తిశ్రీ యతులి శాలివాహన శకంబులు 1152 (క్రీ శ 1230) ఫాల్గుణ బహుళ దశమి శుక్రవారమునాడు ఇంద్రపురవర స్థానాధిపతులు ఈశ్వర శియ్యలునూ॰ఎజస్వామి నాయలును ఈ ముగ్గురు అనుమతిన బడతయనల్లురపాలూను తమ నల్లుర అశ్వత్థాన ఇంగ్రపురద త్తే యుండును పల్లండు బలియండు మడియండు మూరియండు పెండికాశలుచుగండు తను పాలివచ్చిన సహాయము సంబాతముగను,ఒడ్డెశిల జయ్యల పడితుడు మహేశ్వరుని తమనల్లురి అనుమతానల తాడిపాదిలి పెద్దమల్లయ్యలు పెనమల జయ్యల అనుమతానల సంభృతుల ముందట పంచమర స్థానమూర్తిముందర తయారైన .. ణములు 1100 నుండి . '' ఇంతమాత్రము కనబడును ఆవల గనబడని శాసనముగా నున్నది

2 సంతాన మల్లేశ్వరస్వామి గుడియందు ఉత్తర దిక్కున నుండు స్తంభములపై

''శాలివాహన శకగత వర్షంబులు 1216''అని మాత్రము కనబడును మరియొకటి 1220 వత్సరములు మాత్రము కనబడుచున్నది తక్కిన యక్షరములు గోచరములుకావు మాసినవి

3 శ్రీ చెన్నకేశవ స్వామి ఆలయమున గలదు ఇది కన్నడ భాషలో నున్నది

''స్వస్తిశ్రీ శాలివాహన శకవర్షంబులు 1486 (క్రీ శ 1564) భావ సంవత్సర చైత్ర శుద్ధ పాడ్యమిలు శ్రీ మన్మహారాజాధిరాజ రాజవరమేశ్వర వీరప్రతాపశ్రీకృష్ణ రాయ మహారాయలు పుష్పగిరియ చెన్నకేశవ దేవరిగెకొడి విదె ధర్మశాసన చెన్నకేశవ దేవరపూజ అర్చనహార అమృత పడి నైవేద్యక్కెమురికినాటసీమ ఒళగె చెన్నూరసీమెవళిద్య మాచుపల్లి గ్రావను తథాతిథి మన్వాది పుణ్యకాలదళు సహిరణ్యోదక దాన ధారాపూర్వక నామ బంతేవు ఆ చినమాచుపల్లెయ గ్రామడ చతుస్సీమగె వళగాగద తెరళు తుళసినిర్ధేని, సమజల పాపానో అక్షణో ఆగామి సిద్ధ సాధ్యగళం జపా పోగణిమి సౌమ్యప నుడిదనో అగుమాడి కొండు చెన్నకేశ దేవరపూజ పునస్నాన అమృతపడి నైవేద్యవనో చెన్నాహి నడసులు వరు ఎందుకొడుపు దశాసన శ్రీవిరూపాక్ష మంగళ మహే శ్రీశ్రీశ్రీ దానపాలన యోర్మధ్యే . .

ఈ చెన్నూరు పుష్పగిరికి మూడుమైళ్ళలో గలదు ఈ శాసనము నంచలి మాచుపల్లె అయిదు మైళ్ళలో నున్నది చెన్నూరు ఒక సీమకు రాజధానిగ నుండినది ఇదియు పినాకినీ తీరమున గల మహాగ్రామము

4 శ్రీ వైద్యనాథస్వామి గాలిగోపురమునకు ముందున్న శాసనములు శుభమస్తు— స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబు 1462 (క్రీ శ 1540) శార్వరి అశ్వీజ బ॥ ౯॥ గు॥ శ్రీమద్రాజాధిరాజరాజపర మేశ్వర వీరప్రతాప అచ్యుతదేవ మహారాయలు విజయనగర సామ్రాజ్య సింహాసనా రూఢుండయి పృథ్వీరాజ్యము చేయు

చుండగాను వైద్యనాథపదమానిరతులై పుష్పగిరి అగ్రహారక స్థిత విద్వజ్జనాలకు చంద్రగిరి సోమరుసయ్య పుత్రుండు అచ్యుత దేవమహారాయల దళవాయి తిమ్మరుసయ్యకు వ్రాసియిచ్చిన సర్వమాన్యపు ధర్మశాసనక్రమమ దెట్లన్నను అచ్యుతమహాదేవరాయలు మాకు నాయంకరానకు పాలించిన పుండికొడసీమలోని ఈ పుష్పగిరి అగ్రహారమందు పూర్వాన నడిచిన పండితాది దుర్గాధిపతులు . యీ పుష్పగిరిస్థలం, భాస్కరక్షేత్రం, పంచనదీ సంగమం, దక్షిణ వారణాసి విశేషస్థళం ఆ స్వామి అర్చనసేవ మహారాయలకు. ....

5 శ్రీ గణాధిపతయేనమః శుభమస్తు। స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు 1463 అగునేటి ప్లవ సంవత్సర వైశాఖ శు 8 లు, గురువారను శ్రీ మన్మహారాజాధిరాజరాజ పరమేశ్వర శ్రీ వీరప్రతాప అచ్యుత దేవమహారాయలు విజయనగరమందు వజ్ర సింహాసనారూఢుండయి పృధ్వీరాజ్యము నేలుచుండంగాను అచ్యుత దేవమహారాయలువారు చంద్రగిరి సోమరుసయ్య పుత్రుండు తిమ్మరుసయ్యవారు పుష్పగిరి యింద్రనాథ చెన్నకేశ్వర దేవర సేవకులు అయశివాచారుల ఓబయ్య చిన ఓబయ్యగార్కి యిచ్చిన సర్వమాన్యపు శరణాసేవక్రమములు ననువైద్యనాథునికి బేరెడి గ్రామాలు వల్లూరు, మిదుతూరు, గంగవరం - ఈ నాలుగు గ్రామాలను ఆవూరి శివాచార్యులకు చెప్పినట్టి గ్రామం వల్లూరు గ్రామాలు చిన మాచుపల్లి , లోని తృతీయాంశమును గ్రామాలలోని గ్రామస్థులగు మీరు అనుభవించి దేవతా గ్రామాలువుండి కొలువుగా వర్తనయందొకటి కివళ 60 కొలుపెడి మీకు దేవతాసేవ అంగరంగ వైభవాలకు తీర్థ తిరునాళ్ళకు యిచ్చుకొని వూరువారు యీ ధర్మానకు బొందిక యుండెడివారు యెవ్వరుతప్పి రూళ పాతికలు కొన్నాను, తమ తండ్రిని వారణాసిలోను వధించిన పాపానబోయినవారు గంగలోను, గోవుబ్రాహ్మణి వధించిన పాపానబోవువారు అని యిచ్చిన సర్వమాన్యపు ధర్మశాసనము స్వదత్తా గుణం పుణ్యం పరదత్తానుపాలనం। పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్. దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోను పాలనం దానాస్స్వర్గమవాప్నోతిపాలనా దచ్యుతం పదం॥

6. ఇంద్రనాథస్వామి ఆలయపు బయటి ప్రాకారపు రాతిపైన (పశ్చిమ దిక్కుగా) గల శాసనము

స్వస్తిశ్రీ అభ్యుదయ శాలివాహన శకవర్షంబులు 1469 అగునట్టి ప్లవంగ సంవత్సర మార్గశిర బహుళ పంచమిలు శ్రీ మన్మహారాజాధిరాజరాజపరమేశ్వర వీరప్రతాప శ్రీ సదాశివదేవరాయలువారు విద్యానగరమందు రత్నసింహాసనారూఢులై విశ్వసామ్రాజ్యము చేయుచుండగాను శ్రీ మన్మహామండలేశ్వర నంద్యాల తిమ్మయ్యదేవ మహారాజులుగారు వ్రాయించిన శిలాశాసనను సదాశివదేవ మహారాయలువారి ఆనతిని ఆళియ రామయ్య దేవమహారాయలువారి ముదుల కర్ణాటకానకు మహామండలేశ్వర వారు అచ్చునన్ను సర్వమాన్యంగాను కొండోజుకు సర్వమాన్యంగాను చేస్తిమి ఇంద్రనాథదేవుని స్థానం గ్రామాదులు పత్తూరు రావులపల్లి దుంపలగట్టు ఈ గ్రామాదులకు (ప్రక్కనుండు ఊాయి ప్రకారము పడినందున లభింపలేదు )

7 శ్రీ చెన్నకేశవస్వామిగారి గోపురముఖద్వారమున గల శాసనము-ఇటీవలిది

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు 1808 (క్రీ శ 1886) సరియగు పార్థివ నామసంవత్సర శుద్ధ విదియ భార్గవాసరమున పుణ్యక్షేత్రమగుపుష్పగిరినుండు ఆది చెన్నకేశవస్వాములవారికి ప్రీతిగా దేవుని ఆలయమునకు కడపజిల్లా కడపతాలూకా ఖాజీపేట సుంకేసులపుర నివాసియగు దుగ్గిరెడ్డి వంశపయః పారావార రాకాసుధాకరుడును చిన్న వేంకటరెడ్డి పుత్రుడగు నాగిరెడ్డి పత్ని రత్నమా వరదాంబ భక్తియుత ముక్తాఫలుండును స్వధర్మానువర్తనుండును సుగుణాకరుండును అగు వెంకటరెడ్డిగారివలన కట్టించబడి భూదానాది అనేక దాన తాంబూలములతో ప్రతిష్ఠించి అర్పించిన గాలి గోపురము

దేవాలయము గోడమీది శిలలు భారతభాగవతాది కథలను దెలుపు చిత్రములు గలిగియున్నవి

ఇదిగాక మరికొన్ని శాసనము లందందు గనబడుచున్నవి కాని గుర్తింప వీలులేకయున్నవి

ఈ క్షేత్రమునందు 108 దేవాలయములు గలవు సంతానార్థులగు దంపతులు పినాకినీ నదియందు గ్రుంకులిడి, వివిధ దేవతలను దర్శించి, పూజలుచేసి గిరిప్రదక్షిణము చేయవలయును ఈ గిరి ప్రదక్షిణ మిచ్చటి ప్రత్యేకవిశేషము గిరి ప్రదక్షిణఫలమును ఉమామహేశ్వరునకు సమర్పింపవలయును

ఈ కార్యకలాపమును యథావిధిగ నిర్వహించిన దంపతులు సంతానమును బడయుదురు ఇది సత్యమగు విషయము

పుష్పగిరి శైలేశ్వరుని దేవాలయమునందలి ఉత్సవాదులకు ప్రభుత్వమువారు సంవత్సరమునకు పదువందల యేబది రూప్యములు ఒసంగుచుందురు

జ వేం సు శ

## పుష్పములు

ఫలములను, బీజములను ఉత్పత్తి చేసి, సంతానోత్పత్తికి దోహద మొసగుట కేర్పడిన ప్రత్యేకాంగములే పుష్పములు పుష్పసహితములగు ఉద్భిజ్జ జాతులన్నిటికిని స్త్రీ పురుషాంగ విభేదములు గల పుష్పములు సకాలమున బయలుదేరుచుండును అవి పునరుత్పాదకాంగము లనబడును మొక్కపై పుట్టు మొగ్గలలో కొన్ని కొమ్మలుగను, మరి కొన్ని పుష్పములుగను అభివృద్ధి చెందుటచే, పుష్పము గూడ రూపాంతర మొందిన కొమ్మ యని చెప్ప నగును మొగ్గయందుండు పత్రములే పుష్పములో వివిధదళములుగా తయారగును

పుష్పము ఒక్కొక్కటిగ ఆకు వంగలయందు గాని, కొమ్మల చివర గాని కొన్ని మొక్కలయందు ఉత్పత్తియగును మరి కొన్ని మొక్కలలో ఆ స్థలములందే గుత్తులుగా పుట్టును పూగుత్తి యొక్క ప్రధానమగు కాడకు ప్రధాన వృంత మని పేరు సర్వసామాన్యముగా పెద్దదిగ నున్న పుష్పము ఒంటరిగను, చిన్నదిగ నున్నవి గుచ్ఛముగను ఉత్పత్తియగును పుష్పగుచ్ఛములు కీటకములను సులభముగా ఆకర్షించుచుండును పుష్పముల కూర్పును బట్టి గుచ్ఛములను రెండు తరగతులుగ విభజింప వచ్చును కొన్ని మొక్కలలో ప్రధాన వృంతమునకు మొదటనుండు పుష్పములు పెద్దవిగను, పోనుపోను కొనయందున్నవి చిన్నవిగను ఉండును కొన్ని మొక్కల పుష్ప గుచ్ఛములు వర్తులాకారముగ నుండి వాటియందు చుట్టును పెద్ద పుష్పములును, మధ్యలో చిన్న మొగ్గలును ఉండును ఈ రెండు తరగతుల పుష్పగుచ్ఛములు మధ్యాభిసారి (Racemose) గుచ్ఛము లనబడును ఈ తరగతులలో కొన్ని ఉపతరగతులును గలవు కొన్ని మొక్కలలో పుష్పగుచ్ఛములను పరిశీలించుచో ప్రధాన వృంతము చివర నొక పుష్పము కనపట్టును దాని కిరుప్రక్కల ఒక్కొక్క పుష్ప ముద్భవించును గుచ్ఛ మధ్యమున నున్న పుష్పము మొదట వికసించును ఈ తరగతి పుష్ప గుచ్ఛములు మధ్యారంభమంజరు (cymose) లనబడును. పుష్పముల అమరికను బట్టి, ఈ తరగతిలో కూడ కొన్ని ఉపతరగతులు గలవు మరి కొన్ని మొక్కలలో పుష్పగుచ్ఛములు ఈ రెండుతరగతుల సమ్మేళనమును ప్రదర్శించుచుండును ఇంకను కొన్ని మొక్కలలో పుష్పగుచ్ఛములు ప్రత్యేకముగ నుండును తులసి, అత్తి, యూఫోర్బియా గణము లిందు కుదాహరణములు

చిత్రము 6




పటము 1

పుష్ప గుచ్ఛము, గుచ్ఛ స్తంభము

పుష్ప పత్రకము

సామాన్యముగా ప్రతి పుష్పము నందును ఒక కాడ యుండి, దానికొన కొంచెము వెడల్పుగా నుండును ఈ వెడల్పు భాగము పుష్పాసన మనియు, కాడ పుష్ప వృంత మనియు అన బడును పుష్పాసనముపై నాలుగువిధములగు పుష్ప పత్రములు వలయాకారముగ అమరి యుండును అన్నిటికంటె అడుగున నుండునది రక్షక పత్రవలయము, దీనికి పై నుండునది ఆకర్షణ పత్రవలయము ఆకర్షణ పత్రములకు పైన కింజల్క వలయ ముండును దీనిపైగల పుష్పాసన మధ్య భాగమున అండకోశ ముండును ఈ నాల్గు వలయములు గల పుష్పము సంపూర్ణ పుష్ప మనబడును వీటిలోని కింజల్కములు, అండకోశము పునరుత్పాదక భాగములుగా వ్యవహరించును ఈ రెండు భాగములు గల పుష్పము ద్విలింగ పుష్పమన బడును కొన్ని మొక్కల పుష్పములకు పుష్పవృంత ముండదు కొన్ని మొక్కల పుష్పములకు కింజల్కములు గూడ నుండవు అట్టి పుష్పములందు అండకోశ మొక్కటి మాత్ర ముండుటచే, అవి స్త్రీ పుష్పము లగును కొన్ని మొక్కల పుష్పములలో అండకోశము కూడ నుండదు ఇట్టి పుష్పములలో కింజల్కములు మాత్రమే ఉండుటచే, అవి పురుష పుష్పము

లగును కొన్ని మొక్కలలో స్త్రీ, పురుష పుష్పములు రెండును ఒకే మొక్కపై జన్మించును మరి కొన్ని మొక్కల పుష్పములలో రక్షక పత్రవలయము గాని, ఆకర్షణ పత్ర వలయము గాని లోపించి యుండును ఇట్టి పుష్పము లన్నియు అసంపూర్ణ పుష్పము లనబడును ముఖ్యముగా ఏక బీజ దళ వంతము లగు మొక్కలలో రక్షక పత్రములు, ఆకర్షణ పత్రములు కూడ నున్నను, వాటి నడుమ భేద మగపడదు పుష్ప గుచ్ఛములలో సామాన్యముగా పుష్పవృంతమునకు మొదట, చేటిక (bract) అనబడు చిన్న ఆకువంటి నిర్మాణమును, కొన్ని పుష్పములకు చిరుచేటికలు (bracteoles) కూడ నుండును పుష్పము సూక్ష్మమగు మొగ్గదశలో నున్నపుడు, చేటిక దానిని రక్షించు చుండును కొన్ని పుష్పముల చేటికలు మార్పు చెంది ఆకర్షణ పత్రముల వలె నుండును కొన్ని మొక్కలకు భూమిపై నున్న కొమ్మలకేకాక, భూమిలోపలగూడ పుష్పములు పుట్టుచుండును వేరుసెనగ ఇందుకొక ఉదాహరణము ఇట్టి పుష్పములు సంవృత పుష్పము లనబడును

రక్షక పత్రములు, పూమొగ్గ లోని ఇతరభాగములను, బాహ్య పరిస్థితుల వలన కలుగు హానినుండి రక్షించును కొన్ని మొక్కల పుష్పములలో రక్షక పత్రములు విడివిడిగా నుండును, మరి కొన్నిటిలో అవి కలిసియుండును కలిసియున్నపుడు రక్షక పత్రవలయము పలువిధము లగు ఆకారములలో నుండును సామాన్యముగా రక్షక పత్రములు గాని, ఆకర్షణ పత్రములు గాని ఒకే ఆకారము, పరిమాణము కలిగి యుండును అట్లున్నచో ఆ వలయము క్రమవలయ మనబడును కాని కొన్ని మొక్కల పుష్పములలో రక్షక పత్రములలో గాని, ఆకర్షణ పత్రములలో గాని ఒకటి రెండు, ఆకారమునను, పరిమాణమునను, తక్కినవాటి కంటె భిన్నముగ నుండును అట్టి వలయము అక్రమ వలయ మనబడును పుష్పమందలి అండకోశ స్థానమును బట్టి చూచినచో, తక్కిన మూడు వలయముల స్థానము అన్ని రకముల పుష్పములందును ఒకేవిధముగ నుండదు కొన్ని మొక్కల పుష్పములలో అండకోశము ఉచ్చస్థానమున నుండి, తక్కిన భాగములు అండకోశ అధఃస్థితములుగా నుండును మరి కొన్ని మొక్కల పుష్పములలో అండకోశము, అడుగున నుండి దానిపై తక్కిన భాగములు అండకోశ ఉపరిస్థితములుగా నుండును ఇంకను మరి కొన్ని పుష్పములలో అండకోశము అడుగున నున్నను, అండాశయము చుట్టును పుష్పాసనము పెరిగి, తక్కిన పుష్ప భాగములు అండకోశ పరిచక్రములుగా నుండును

ఆకర్షణ పత్రవలయము పుష్పము యొక్క వ్యాపార నిర్వహణమునకు తోడ్పడు ముఖ్య భాగము ఆకర్షణ పత్రములు సువాసన చేతను, రమణీయ మగు రంగుల చేతను పరపరాగ సంపర్కమును కలుగజేయు కీటకముల నాకర్షించును సాధారణముగా పగటివేళ తిరుగాడు సీతాకోక చిలుకలు, భ్రమరములు మున్నగు కీటకములను ఆకర్షించుటకు, వాటి కిష్టమగు వేర్వేరు రంగులను పగటి పూట వికసించు పుష్పముల ఆకర్షణ పత్రములు కలిగి యుండును ఈ సందర్భమున వివిధ పుష్పములు వివిధ వర్ణములను కలిగి యుండును రాత్రు లందు తిరుగు కీటకములను ఆకర్షించు పుష్పములు తెల్లని ఆకర్షణ పత్రములను, పరిమళమును కలిగి యుండును కొన్ని మొక్కల పుష్పములలో ఆకర్షణ పత్రములు విడివిడిగా నుండక కలిసి యుండును ఇట్టి పుష్పములలో ఆకర్షణ పత్రవలయము పలు విధములగు ఆకారములలో నుండి, ఆ యా పుష్పములను సందర్శించు కీటకముల ద్వారా తమ వ్యాపారమును నిర్వర్తించు కొనుటకు తగినట్లుగా నుండును కీటకములకు పుష్పములు ఆశ్రయమును, తేనె, పుప్పొడులు మున్నగు ఆహారముల నొసగి, తమ పనిని చేయించు కొనుటయే ఇందుకు కారణము వివిధ కీటకముల నోటి తొండముల ప్రమాణమునకు తగినట్లుగా, ఆకర్షణ పత్రవలయము యొక్క ఆకారము, పొడవు ఉండును పుష్పములకును, పురుగులకును గల పరస్పర ఆశ్రయ సంబంధమును పరిశీలించినచో, కొన్ని రకముల పుష్పములు కొన్ని రకముల కీటకములకు మాత్రమే తగియున్నట్లగపడును వివిధ పుష్పములలో రక్షక, ఆకర్షణ పత్రముల విన్యాసము (aestivation) వివిధములుగా నుండును కొన్ని పుష్పములలో ఒకటి రెండు ఆకర్షణ పత్రములకు మచ్చలు గాని, చారలు గాని ఉండి, పుష్పములో మధువు దాచబడిన మార్గము కీటకములకు సూచింపబడు చుండును

కింజల్కము లనునవి పుష్పములలోని పురుషాంగములు వీటిని పుంకేసరములని కూడ పిలుతురు సాధారణముగా ప్రతి కింజల్కమునకు కాడవంటి పొడుగు భాగము, దాని చివర నొక పుప్పొడి తిత్తియు నుండును ఆ కాడ భాగము కేసర దండ మనబడును కేసర దండము ముఖ్యముగా

పుప్పొడి తిత్తిని పుష్పము బయటికి ఎత్తి యుంచుట కుప యోగపడును అందువలన పుప్పొడి తిత్తులనుండి పరాగము సులభముగా గాలిలో ఎగుర గలదు పుప్పొడి తిత్తిలో సామాన్యముగా నాలుగు సంచు లుండును ఈ సంచులలో పుప్పొడి ఉత్పత్తి యగును పక్వమైన పుప్పొడి తిత్తి, కొన్ని రకముల పుష్పములలో నిలువుగా చీలి, పుప్పొడిని వెదజల్లును మరికొన్ని పుష్పములలో పుప్పొడి తిత్తి చివర రంధ్ర మేర్పడి, దాని ద్వారా పుప్పొడి బయటికి వచ్చును మరికొన్ని రకముల పుష్పములలో పుప్పొడి తిత్తిపై కొంత భాగము కవాటము వలె పైకి లేచి, పుప్పొడి వెలుపలికి వచ్చును సంయుక్త ఆకర్షణ పత్రములు గల పుష్పములలో కింజల్కములు ఆకర్షణ పత్రములకు అతుకబడి యుండును కొన్ని మొక్కల పుష్పములలోని కింజల్కములను పరిశీలించుచో, పుప్పొడి తిత్తులు విడివిడిగా నుండి, కేసర దండము లన్నియు కలిసి, ఏక-ద్వి-బహు సంలగ్నములుగా నుండును మరికొన్ని రకముల పుష్పములలో కేసర దండములు విడివిడిగా నుండి, పుప్పొడి తిత్తు లన్నియు కలిసి యుండును కొన్ని రకముల పుష్పములలో నుండు కింజల్కము లన్నిటికి పుప్పొడి తిత్తు లుండక, కొన్ని వంధ్యములుగా నుండును మరికొన్ని పుష్పములలో కింజల్కములు కొన్ని పొడవుగను, కొన్ని పొట్టివిగను ఉండును వివిధ పుష్పములలో కేసర దండమునకు పుప్పొడి కలిసియుండు విధానములో కూడ వైవిధ్యము గోచరించును

చిత్రము 7




పటము 2
పుష్పభాగములు

పుష్ప మండలి స్త్రీ విభాగమును అండకోశ మందురు అండకోశ మందు సాధారణముగా అండాశయము, కీలము, కీలాగ్రము అను మూడు భాగము లుండును అండాశయము గుండ్రముగనో, లేక అండాకారముగనో ఉండును అండాశయమునకు దట్టమగు ఫలకవచ ముండును అండాశయము ఒకటి, రెండు, మూడు లేక బహు ఫలదళములచే నేర్పడి యుండును కొన్ని రకముల పుష్పములలో, ఈ ఫల దళములు విడివిడిగా నుండును, మరి కొన్నిటిలో అన్నియు కలిసి యుండును సంయుక్త అండాశయములో కొన్ని పుష్పముల యందు ఒకే ఒక గది యుండును మరి కొన్ని సంయుక్త అండ కోశములలో ఫలదళములకు నడుమ గోడల వంటి నిర్మాణము లేర్పడి, సాధారణముగా అండాశయమున ఎన్ని ఫలదళము లుండునో, అన్ని గదులు గోచర మగు చుండును ప్రతి ఫల దళమునకు దిమ్మెవంటి ఒక జరాయు వేర్పడి, దానిపై బీజాండములు పెరుగును వివిధ పుష్పముల అండాశయములలో జరాయు స్థానము (placentation) వివిధ విన్యాసములలో నుండును బీజాండములను, అండాశయమును విప్పి చూచుచో, తెల్లని గ్రుడ్లవలె నగపడును కొన్ని మొక్కలలో బీజాండముల విన్యాసము ఋజువర్తముగను (orthotropous), కొన్నిటిలో ఉథావర్తముగను (anatropous), కొన్నిటిలో వక్రావర్తముగను (campylotropous), మరి కొన్నిటిలో అనుప్రస్థావర్తముగను (amphitropous) ఉండును ప్రతి బీజాండము జరాయువునకు ఒక కాడవంటి చిన్న భాగముతో కలిసి యుండును వివృత బీజవంతము లగు మొక్కలతో పోల్చి చూచినపుడు, అండకోశము లోని ఫల బీజాండములు సంవృత బీజవంతములగు మొక్కలలో రక్షింపబడి యుండుట ఒక పరిణామ విశేషము బీజాంశములు ఫలదీకరణ మైన తరువాత, అవి బీజములుగను, కాయగను తయారగును కొన్ని మొక్కల పుష్పములలో అండాశయమునందు ఒక బీజము మాత్రమే తయా రగును మరికొన్ని పుష్పములలో రెండు, మూడు, అనేకములుగా, ఆయా మొక్కల బీజ ప్రమాణముల ననుసరించి తయారగును అండాశయపు పై భాగమున సన్నని కీల ముండును కీలము, కీలాగ్రమును పుష్పము పైకెత్తి యుంచి, పరాగ గ్రహణమునకు అనుకూలముగ నుండునట్లు చేయును కొన్ని పుష్పములలో కీలమే ఉండదు కొన్ని పుష్పములలో, అండాశయమున ఎన్ని ఫల దళము లుండునో, అన్ని కీలము లుండును ప్రతి కీలమునకు ఒక అగ్ర ముండును కీలాగ్రము దిమ్మెవలెనో, గుండ్రముగనో, పత్తి రెక్కవలెనో, చిన్నదిగ గాని లేక పెద్దదిగ గాని

యుండును కొన్ని పుష్పముల అండాశయములలో ఒకే కీల మున్నను, కీలాగ్రములు మాత్రము ఫల దళముల సంఖ్యతో సమానముగ నుండును కీలాగ్రము లెన్ని యున్నను, గాలి వలన గాని, కీటకముల వలన గాని, నీటివలన గాని చేరిన పరాగమును గ్రహించి, అది ఎగిరి పోకుండ పట్టియుంచుట కీలముయొక్క ధర్మము కీటకములకు ఆహారమును కూర్చు మధుకోశములు కొన్ని పుష్పములలో అండాశయము క్రింద నున్న గ్రంథుల యందును, మరి కొన్ని పుష్పములలో దాని క్రింద నున్న పళ్లెమువంటి దిమ్మె యందును దాచబడి యుండును

కొన్ని మొక్కల పుష్పములలో కింజల్కములు, అండ కోశము ఒకే సమయమున పక్వమొంది, అతి సన్నిహితముగ నుండును అందుచే ఆ పుష్పములలోను, సంవృత పుష్పముల లోను సాధారణముగా స్వపరాగ సంపర్కము జరుగుచుండును కాని మరికొన్ని మొక్కలలో పుష్పమందలి కింజల్కములో లేక అండాశయమో ముందుగా పక్వమై వాటియందు పర పరాగ సంపర్కమే జరగవలసి యుండును మరి కొన్ని పుష్పములలో కీలాగ్రము పొడవుగనో లేక పొట్టిగనో, కింజల్కములు కూడ పొడవుగనో లేక పొట్టిగనో ఉండి, ఒక దాని కొకటి అందుబాటులో లేని నిర్మాణమునం దుండును ఇంకను కొన్ని రకముల పుష్పములలో పుప్పొడి యందుగానీ, బీజాండమునందు గానీ వంధ్యత్వ మేర్పడుటయు, ఆ పుష్ప మందలి పరాగమే ఆ పుష్పములోని బీజాండములను ఫలదీ కరణ మొనర్ప జాలని స్థితి ఏర్పడుటయు గూడ తరచుగా జరుగు చుండును ఇట్టి పుష్పములలో కూడ పర పరాగ సంపర్కమే ఫలదీకరణ మొనర్చును

పలురకము లగు మొక్కలలో పుష్ప నిర్మాణమునందు గాని, పుష్పభాగముల కూర్పునందు గాని కాన్పించు వైవిధ్యమును గమనిం చుచో, పుష్పములు సహజముగ పరపరాగ సంపర్కమునకే సాధారణముగా తగియుండు నట్లు తెలియగలదు లేనిచో, బీజములు ప్రకృతియం దుండు జీవన సంగ్రామములో జయించి, ప్రాకృతిక వరణమున తమ జాతిని శాశ్వతముగా రక్షించు కొని నిలబెట్టుకొన జాలవు

ప్ర రా సు

## పూతరంగులు - వార్నిషులు

ప్రకృతిలో జీవకోటికి (వృక్ష, జంతు వర్గములకు) సహజ మగు పూతరంగుల చర్మము ద్వారా రక్షణ లభించుచున్నది వాటి పరిణామదశల ననుసరించి ఆ పూతరంగు వృద్ధిచెంది కవచము వలె వాటిని కాపాడును కాని నిర్జీవ పదార్థము లగు లోహములు, ఎండుకట్టె మున్నగు వాటికి, వాతావరణముల మార్పులచే కలుగు పరిణామములనుండి కృత్రిమమైన పూతల వలననే రక్షణము కల్పింప గలము ఇట్టి కృత్రిమ పూతలను రెండు విధములుగా విభజింప వచ్చును (1) పూతరంగులు, (2) వార్నిషులు సహజముగా గృహముల యందును, పరి శ్రమల యందును వాడబడు అనువ సామగ్రి, కలప వస్తువులు, పైన పేర్కొనిన కృత్రిమ పూత రంగులను వాడనిచో త్రుప్పు పట్టి, పైపొర చెడి, క్రమముగా నిర్మూలన మగును కృత్రిమ పూతరంగులను లేక వార్నిషులను వాటిపై పూయుటచే, సూర్యరశ్మికి, వర్షములకు, ఇతర ప్రకృతి పరిణామములగు తట్టుకొని, యథారూపమున నుండగలవు కేవలము రక్షణ మునకే కాక, పదార్థముల సహజమగు అందచందములను కాపాడుటకు కూడ ఈ పై పూతలు ఉపయోగపడును ఈ పూతరంగుల యొక్క, వార్నిషుల యొక్క వాడకము చాలకాలము నుండి సంప్రదాయముగ వచ్చుచున్నది ఉదాహరణమునకు ఈజిప్టు దేశములోని శవపేటిక లపై పూయబడిన రంగులు, మధ్య యుగముల నాటి చిత్రములు మున్నగునవి

పూతరంగులు

పూతరంగు ఘన, ద్రవ

చిత్రము 8




పటము 8 వివిధాకృతుల మకుట దళములు

పదార్థముల మిశ్రమము ఘనపదార్థము రంగు నిచ్చుధాతువు ద్రవపదార్థములో ఈధాతువును మిళిత మొనర్చి, దానిని వస్తువులకు పూసిన తర్వాత, అది ఆరిపోయి కాంతినిరోధక పటల మేర్పడును ఈ ద్రవపదార్థము 'వాహకము' అనబడును సాధారణముగా అవిసెనూనె మున్నగు వృక్ష సంబంధ మయిన తైలములు వాహకములుగా ఉపయోగపడు చున్నవి పూత రంగులను తయారు చేయుటకు ముఖ్యముగా మూడు ద్రవ్యములు వాడబడును (1)రంగు నిచ్చు ధాతువు,(2) వాహకము, (3) విరళీకరణి అనగా పూత రంగును పలుచగాచేసి, వేగముగా ఆరుట కుపయోగపడు (పెట్రోలియమ్ స్పిరిట్) పూత రంగును తయారు చేయుటకు, ముందుగా రంగు నిచ్చు ధాతువును కాటుక వలె మెత్తగా నూరుట నూరిన పొడిని వాహకపు నూనెలో మెదుపుట ముఖ్యము లైన ప్రక్రియలు ధాతువును, వాహకమును చక్కగా ఏకజాతి మిశ్రమము చేయుటకై ఈ పరిశ్రమయందు రోలరు మిల్లులు, చాక్ మిల్లులు మున్నగు యంత్రములు ఉపయోగింప బడును

పూత రంగునందు వాడబడు ధాతువులలో అకర్బన రసాయనములు, ఖనిజములు ముఖ్యము లైనవి కర్బన రసాయన సంబంధము లైన కలంకారి రంగుల వంటి కొన్ని రంగులు కూడ, ఛాయ వచ్చుట కొరకు వాడ బడును తెల్ల రంగులను తయారు చేయుటకు వైట్ లెడ్, జింకాక్సైడ్, టైటానియం ఆక్సైడ్, లితోఫోన్, బేరైటీస్, మున్నగునవి సాధారణముగా ఉపయోగింప బడు ధాతువులు పూత రంగులు ఎరుపుగా నుండవలె నన్నచో, రెడ్ లెడ్ (గంగ సిందూరము), ఫెర్రికాక్సైడు, ఆంటిమనసల్ఫైడ్ అను ఎరుపు రంగు గల ధాతువులు ముఖ్యముగా వాడబడును పసుపు రంగు వచ్చుటకు లెడ్ క్రోమేటును, ఆకుపచ్చ రంగునకు క్రోమియము ఆక్సైడును సాధారణముగా వాడెదరు నీలిరంగు నిచ్చుటకు ఆల్ట్రామెరైన్ బ్లూ, ప్రష్యన్ బ్లూ సాధారణముగా ఉపయోగింపబడు ధాతువులు నల్లరంగు వచ్చుటకు ముఖ్యముగా బొగ్గుమసి, గ్రాఫైట్ అను ధాతువుల నుపయోగింప వచ్చును ఇంకను జేగురు రంగు, బూడిద రంగు మున్నగు వర్ణముల నిచ్చుటకు ఇనుప ఖనిజము గల మట్టినుండి, వేరువేరు విధములయిన యినుప ఆక్సైడ్లు ఉపయోగింపబడు చున్నవి అవసర మైన ఛాయను సాధించుటకును, రంగును బరువుగా తయారు చేయుటకును, ఒదిగి వచ్చుటకును, బేరైటీసు ఖనిజములు, 'చైనామట్టి' అను తెల్లని మట్టి మొదలైనవి పూతరంగులలో కలుపబడును

వాహకములుగా వాడబడు పైని పేర్కొన్న నూనెలు, ఎక్కువగా అయొడిను సంఖ్య కల్గి యుండుటచే, అవి వేగముగా ఆరి, ధాతువుతో రసాయనిక సంయోగము చెంది, గట్టి పొరను విడచుటకు తోడ్పడుచున్నవి పైన పేర్కొనిన గుణములు గల నూనెలు బహు స్వల్పముగ కలవు అవిసె, వలిస, తుంగ్ నూనెలు ఇట్టి జాతికి చెందినవి తక్కువ అయొడిన్ విలువ గల వృక్షజాతి నూనెలు విరివిగా లభ్యము లగుచున్నవి ఇటీవల కొన్ని రసాయనిక మార్పులు వాటియందు కల్గించి, వాటిని పూత రంగులకు వాహకములుగా వాడుచున్నారు భారతదేశములో నిర్జలీకరింప బడిన ఆముదపు నూనె వాహకముగా ఉపయోగింప బడు చున్నది వాహకము, ధాతువు వేగముగా మిళిత మగుటకై, వాటిని నూరుటకు పూర్వము, తక్కువ పాళములలో కొన్ని రాసాయనిక ద్రవ్యములను వాటియందు చేర్చుట అవసరము అట్టి రాసాయనిక ద్రవ్యములు 'వెట్టింగ్ ఏజెంట్స్' అనబడును

పూతరంగుల వాడుక ననుసరించి, అని పెక్కు తరగతులలో తయారు చేయబడు చున్నవి వాటి తయారీలో వివిధము లగు గుణములు కల్గుటకు కొన్ని రసాయన పదార్థములను చేర్చుట అవసరము ఉదాహరణమునకు (1) అగ్నిని ప్రతిఘటించు రంగు, (2) రసాయనములను ప్రతిఘటించు రంగు, (3) ప్రకాశము నిచ్చు రంగు, (4) కృత్రిమ రూపము కలుగజేయు రంగు మొదలగునవి

వార్నీషులు సాధారణముగా వార్నీషులలో అకర్బనపు ధాతువు చేర్చబడదు ప్రకృతిలో దొరకు జిగురులు, లేక, కృత్రిమ జిగురు లగు పెట్రోలియము నూనెలు లేక స్పిరిటులో కలుపబడినపుడు ఏర్పడు పదార్థము వార్నీషు అని పిలువబడును వార్నీషును వస్తువుపై పూయునపుడు, నిగనిగలాడు పై పూత, పారదర్శక లక్షణము గల పటలముగా కన్పట్టును, వార్నీషులు ముఖ్యముగా రెండు తరగతులు మొదటి రకమునకు చెందినవి స్పిరిటు వార్నీషులు ఇందు జిగురు, పెట్రోలియము నూనెలు లేక స్పిరిటు మిళితమగును రెండవ రకమునకు చెందినవి ఓలియోరెసినస్ వార్నీషు లనెదరు ఇందులో హెచ్చు అయొడిను సంఖ్య గల వృక్ష సంబంధమయిన నూనెలతో జిగురును ముందుగా చేర్చి ఉడుకబెట్టుటచే,

అవి కొంతవరకు రాసాయనిక మార్పు చెందును ఈ పదార్థమును పైన పేర్కొనిన పెట్రోలియము నూనెల యందో లేక స్పిరిటునందో కలుపునపుడు ఏర్పడు వార్నిషు 'ఓలియోరెసినస్' వార్నిషు అనబడుచున్నది నూనె వార్నిషులలో ఓలియోరెసినస్ తరగతికి చెందినవి చాలా ముఖ్యములు వీటిని 'హ్రస్వములు' 'మధ్యమములు' 'దీర్ఘములు' అని మూడు తరగతులుగా జిగురు, వృక్ష సంబంధమయిన నూనెల నిష్పత్తిని బట్టి వ్యవహరింపబడును సాధారణముగా 100 పౌ॥ బరువుగల జిగురునకు 8 నుండి 15 గాలన్ల నూనె కలుపబడినచో వాటికి 'హ్రస్వము' లనియు, 20 నుండి 30 గాలన్ల నూనె కలిపిన 'మధ్యమములు', 35 నుండి 60 గాలన్లు కలిపినవి 'దీర్ఘములు' అని పిలుతురు 'హ్రస్వము లయిన వార్నిషులు త్వరగా ఆరి, కాంతిమంత మగు గట్టి పొర నిచ్చును కాని ఈ పొర త్వరగా బీటలు వారును దీర్ఘము లయినవి ఆరుటలో కొంతకాలము తీసికొన్నను, పొర బీటలు వారక వాతావరణముల నుండి వస్తువును కాపాడును అందుచే గృహముల లోనే గచ్చులకు, మేజా సామాను మొదలగువాటికి 'హ్రస్వము'లయిన వార్నిషులను, 'దీర్ఘము' లయిన వార్నిషులను, బండ్లు మొదలగు వాటికిని పూయుదురు బ్లాక్ జపాన్ అను మూడవ రకపు వార్నిషు వస్తువులను నిగనిగ లాడు నల్లటి పూత నిచ్చుటకు వాడుదురు ఇందులో జిగురు బదులు నలుపు రంగు నిచ్చు ఇతర ద్రవ్యమును వాడుదురు ఉదా - తారు, ఆస్ఫాల్టు మొదలగునవి

వార్నిషులు తయారు చేయుటయందు వాడబడు నూనె, జిగురులను బట్టి వివిధ రకము లయిన విధానములు వాడుకలో నున్నవి ఓలియోరెసినస్ వార్నిషుల తయారీలో జిగురును శుద్ధిచేసి యొక పాత్రలో 300 నుండి 350°ం వరకు వేడిచేసి, మరగబెట్టిన నూనెను ఇందులో కలుపుచు తగిన చిక్కదనము వచ్చు వరకు వేడి చేయబడును తరువాత దానిని 200°ం వరకు చల్లార్చి, దానికి విరళీకరణి యగు పెట్రోలియము స్పిరిటు, వేగముగా గాలిలో ఆరుటకు దోహదపడు రసాయనిక ద్రవ్యము లయిన లెడ్, కోబాల్టు, మాంగనీసు లవణములలో ఏదైన యొకటి కలుపుదురు స్పిరిటు వార్నిషుల తయారీలో జిగురును యాంత్రికముగా కలుపుచు ఆల్కహాల్ లేక మెథనాల్ వంటి బాష్పశీల మగు ద్రవములలో కరగింతురు కొన్ని సమయములయందు కొంత వేడి చేయుట కూడ అవసరము స్పిరిటు వార్నిషులు వేగముగా బీటలు వారును అందుచే వాటికి కొన్ని ప్లాస్టిసయిజర్లను కలుపుదురు

ఇంకను వార్నిషు తరగతికి చెందినవి సెల్యులోజ్ లక్కరంగులు, డిస్టెంపర్లు కలవు

సెల్యులోజ్ లక్కరంగులు ఇవి ఇటీవలనే వాడుకలో నున్నవి ఇవి చాలా వేగముగా గాలిలో ఆరి, మంచి కాంతిమంతమయిన పొరలనిచ్చు గుణములు కలవి వీటిలోని ద్రావ్యములు, సెల్యులోజ్ నైట్రేటు, సెల్యులోజ్ ఆసిటేటు వంటి కర్బన రాసాయనిక ద్రవ్యములు, వీటిని ఎథిల్ ఆసిటేటు, బ్యూటైల్ ఆసిటేటు, అమిల్ ఆసిటేటు వంటి ద్రవములలో కరుగచేసి, విరళీకరణి యగు ఆల్కహాలు, బెంజీను వంటి వాటితో కలిపి వాడబడును వీటికి ఉజ్జ్వలమయిన రంగు నిచ్చుటకు, కర్బనద్రవ్య వర్ణములను గాని, అకర్బన ద్రవ్య వర్ణములను గాని చేర్చుదురు ఈ రకపు వార్నిషులు, మోటారు కార్లు, వాయు విమానములు మొదలగు వాటికి పూతలుగా వాడుదురు

డిస్టెంపర్లు ఇవి నీటిలో ధాతువును కలిపి, సరేసు (ఒక రకమైన జిగి)తో కలుపబడునపుడు, ఇంటి గోడలకు రంగులుగా వేయుట కుపయోగింతురు నీరు నూనె కలిపిన కొన్ని ఎమల్షనుతో (అవలేపనములు) కూడ తయారు చేయుదురు నూనె, నీటినుండి విడిపోకుండా ఉండుటకు కేసిన్ అను పదార్థమును సరేసుతో కలిపి మరీ వాడుదురు ముఖ్యముగా వాడు రంగులకు క్షారములవల్ల చెడని ధాతువుల నుపయోగింతురు

వై వి సు

## పూర్వ చారిత్రక సంస్కృతి

భూమండలముపై ప్రప్రథమముగా మానవుని అవతరణమును గురించి అభిప్రాయ భేదములు పొడచూపినవి ఆతని అత్యంత సన్నిహిత పితరు లెవ్వరను విషయముపై గూఢ ఏకాభిప్రాయము పొసగలేదు భూమిత్రవ్వకము ఫలితముగా వెలువడిన శిథిలావశేషముల సహాయమున ఈ విషయ పరిశీలనము జరగవలసి యున్నది జావాద్వీప వాసుని కపాలము మూలముగను, ఆతని తొడ ఎముక యొక్క ఛిద్రభాగము మూలముగను, అట్టి ఇతర అవశేషముల ద్వారమునను, ఆతని ఎత్తు అయిదడుగుల రెండంగుళము లుండెననియు, ఆతని వీపు నందు గూను ఉండెననియు ఊహింప వీలగుచున్నది కొందరి

అభిప్రాయము ననుసరించి ఆధునిక మానవునకు, ప్రాచీనుడైన పెకింగ్ నగరవాసియే యథార్థమైన పూర్వుడుగా పరిగణింపబడినాడు పెకింగ్ నగరము చెంత చౌ - కౌ - టిన్ అను గ్రామములో జరిగిన త్రవ్వకముల సందర్భముగ నలుబది కపాలములు బయల్పడినవి ఇవి మానవుని కపాలములను సన్నిహితముగ పోలి యున్నవి జర్మనీలో శిలాయుగము నాటి శిథిలావశేషములు కనుగొనబడినవి గుణాత్మకముగా అవి పూర్వపువాటి కంటె ఉత్తమతరమైనవి మెదడుకూడ పూర్వపు మెదడుల కంటె పెద్దదియే, గడ్డము ముందుకు పొడుచుకొని వచ్చి ప్రముఖముగా కన్పట్టెడిది, మెడ, భుజములు దృఢముగను, బలిష్ఠముగను ఉండి, నిర్మాణ సౌష్ఠవము కల్గి యుండెను ఆతని ఎత్తు అయిదడుగుల ఆరంగుళము లుండెడిది మిలాంకొవిక్ అనునాతడు సిద్ధపరచిన ఖగోళీయ గణనము ననుసరించి మౌలికముగా మానవునికంటె భిన్నులుగ నుండిన వ్యక్తులు సుమారు ఒక లక్ష 20 వేల సంవత్సరముల క్రింద జీవించియుండిరని తెలియుచున్నది

సాంకేతిక, పారిశ్రామిక ప్రక్రియలకు భిన్నమైన సంస్కృతి ప్రత్యక్షముగా అవతరించి యున్న దినము లవి మానవుడు స్వీయ సౌకర్యార్థమై, తన పరిసరములను స్వశక్తితో బాగొనరించుటకు చేయు కృషి సంస్కృతి యనబడును ఆతని జీవిత పోరాటమును గూర్చిగాని, ఆతని ఆలోచనా పరంపరను గూర్చి గాని, ఆతని భావప్రేరిత సంచలనమును గూర్చి గాని, ఆతడొక క్రమపద్ధతిలో రచనము చేయజాలకుండెను కాని ఆతడు శిలలపైన, భూమ్యుపరితలము పైన - కళాసంబంధమగు చిహ్నములను, లేఖ్యములను సృష్టింప నారంభించినపుడు కేవలము అనాలోచితముగనే తన భావములకును, కార్యకలాపములకును శాశ్వతస్థాన మొసగజాలెను మానవు డెన్నడును స్థాణువు వలె స్థిరరూపములో నుండడు, తన అనుభవములను క్రోడీకరించుకొని, భావితరములవారి కందజేయును శిలాఫలకములకు రూపురేఖలు దిద్దినపుడే ఆతడట్లు చేయగలడు పరిపూర్ణ మానవుడుగా ఆతడు పరిణామము చెందినప్పటి నుండి, శిలాపరికరముల నిర్మాణము ద్వారా తన సంస్కృతిని ప్రదర్శించువరకు గడచిన కాలము నాటి చరిత్ర గతిని గూర్చి పెక్కురు పెక్కురీతులుగా ఊహించిరి మహా భయంకరములైన ఉష్ణ, శీతల వాయువుల తాకిడినుండి తన దేహము నాతడెట్లు సంరక్షించుకొనెనో, రాత్రులందాత డెట్లు విశ్రాంతి గైకొనెనో, మంచినీటి నెట్లు భద్రపరచుకొనెనో, క్రూరమృగముల నుండి ఆత్మరక్షణ మెట్లు గావించుకొనెనో - ఇత్యాది విషయము లన్నియు ఆసక్తిదాయకములైన అంశములు కాని విజ్ఞానశాస్త్రము పిడివాదముగ సిద్ధాంతీకరణ మొనర్పబడజాలదు అందలి సిద్ధాంతములను రుజువు చేయుటకు బలమైన ఆధారములు కావలెను

అత్యంత ఆదిమమానవుడు తన పరిసరములను పరికించునపుడు, తనకు సహకార మిచ్చి నడిపించుటకు తన జ్ఞానేంద్రియములు తప్ప అన్యము లేకుండెను భూమిమీది ధూళియు, బురదయు మృదువుగను, సున్నితముగను ఉండెను వృక్షములు ఆకుపచ్చగ నున్నను, వర్ణవైవిధ్యము నొందుచుండెను జలము ద్రవరూపమున నుండెను - తన కిన్ని పదార్థములు గోచరమైనను, ప్రత్యేకముగా శిల ఆతనికి ఆసక్తిదాయక మగు వస్తువయ్యెను ఈ శిల కర్కశమై, వివిధాకృతులలో నుండుటయే ఇందుకు కారణము ఈ శిలారూపములు సంకీర్ణ లక్షణములు కలిగి అసమానములుగను, క్రమరహితములుగను నుండెడివి అట్టి శిలాఖండములు తన చేతులయం దమరున ట్లొనర్చి, మానవుడు వాటికి తగిన పరిమాణములను సమకూర్చెను ఈ సంస్కృతికి సంబంధించిన అత్యంత ప్రాచీనయుగము "నూతన శిలాయుగ" మనబడుచున్నది

చిత్రము. 8



పటము 1. కాన్పూరువద్ద దొరకిన పంట్రకోల

భూవైజ్ఞానిక యుగమున మోటుగా చేతులతో చెక్కబడిన రాతి పరికరములు ఆతని దైహిక సంస్కృతీ స్థాయికి చిహ్నములుగా నుండెడివి సార్వత్రికముగా మానవుని అస్తిత్వ మానాడు ఋజువయ్యెను ఇది ప్రాచీన శిలాయుగ మనబడుచున్నది ఈ యుగమే, ఇంకను కొలది తరతమ వ్యత్యాసములతో విభక్తమై, ఒక యుగాంతర్భాగములో వేరొక యుగాంతర్భాగము కొలదిగ మిళిత మగుచున్నను, పూర్వ, మధ్యమ, నవీన శిలాయుగము లని పిలువబడుచున్నవి శిలా పరికరములను కనుగొనుట కెచ్చటను క్రమపద్ధతిలో త్రవ్వకములు జరగలేదు లభ్యమైన వాటిలో విశేషభాగము ఉపరితలమున కనుగొనబడినవే శేషించిన పరికరములు అన్యప్రయోజనములకై ఉద్దేశింపబడిన త్రవ్వకములందు

లభించిన ఉపపదార్థములు కాని ఒకటి మాత్రము యథార్థమైన విషయము సకల విధములైన శిలాపరికరములకును ప్రతి రూపములు భారతదేశ మందలి పూర్వ చారిత్రక ఆదిమ యుగమునాటి శిలా పరిశ్రమ వ్యవస్థయందు కాన వచ్చెడివి

ఈ పరికరములు సాధారణముగా శిలాస్ఫటికము నుండి తయారగును ఇవి వివిధ ప్రాంతములలో వివిధ కాలము లందు కనుగొన బడినవి అత్యంత ప్రాచీన శిలాఖండము క్రీ శ 1863వ సం॥ లో బ్రూస్‌ఫూట్ అను భూగర్భ శాస్త్రజ్ఞునిచే కనుగొనబడెను వీటిలో ఎక్కువ భాగము బంగాళా ఖాత తీరమున తెలుగు జిల్లాలలో గులకరాతి మయమగు నదీశయ్యల యందును, కొంతరాతి యందును బయల్పడినది ఇంతేకాక నర్మదా నదీలోయ యందును, బీహారు, ఒరిస్సా, చోటానాగపురము, రాజపుటానాలయందును, ఇటీవల బొంబాయి సమీపమందలి ఖాండవాలీ యందును, పంజాబు, నందలి సోన్ లోయ యందును కనుగొన బడినవి అట్టి శిలా పరికరములు కర్నూలు జిల్లాయందలి "బిల్లాసుర్గమ్" అను తావునను, చెంగల్పట్టు జిల్లాలోని అత్రసపాకమందును, ఉత్తర ఆర్కాటు, కడప జిల్లాలయందును లభింపగలవు 1865లో వ్యాన్ అను నతడు మరాట్వాడాలోని పైథాన్ సమీపమున ముంగి అను తావున ఒక శిలాపరికరమును, హాకెట్ అను నతడు 1873లో నరసింగపేట జిల్లాలోని భూత్రాలో అట్టిదే మరియొక శిలాపరికరమును కనుగొనెను ఈ పరికరములు జంతు శిథిలావశేషములతో కలిసి గులకరాతి నేలయందు కనుగొన బడినవి

చిత్రము 10



పటము 2
సమాధులలో దొరికిన పూర్వ చారిత్రక యుగ మృణ్మయ పాత్రలు

ప్రాచీన శిలా సమూహములు మొరటుగను, విసమనుగను ఉన్న కొలదియు, వాటి వయస్సు కూడ ప్రాచీన తరమైనదై యుండును బ్రూస్ ఫూట్ అను శాస్త్రవేత్త ఈ ప్రాచీన శిలలను పది తరగతుల క్రింద విభజింపగా, కాగిన్ బ్రౌన్ అను నాతడు వాటిని మూడు తరగతులుగనే గుర్తించెను ఈ పరికరముల కొక ఆకారమును సృష్టించుటకై మొరటైన రాతి సుత్తెలు, గొడ్డళ్ళు మున్నగునవి తయారు చేయబడినవి వాటి యందు సున్నితత్వము, సురూపము, లావణ్యము మృగ్యములు

ప్రాచీన, నవశిలా యుగముల నడుమ ఎంతకాలము గడచెనో నిర్ణయించుట చాల కష్టము నవశిలా యుగమందుపయోగింపబడిన రాయి సాధారణముగా నల్లగా నుండెడిది ఈ రాతిని కొన్ని పరికరములతో తొలుత తయారు చేసి, దాని అంచులకు పదును కల్పించుటకై అరగదీసి నునుపుదనమును తెప్పించెడివారు ఆకాలపువారు బాణపు పిడులను, వేత్రపు పిడులను, చక్రములను, కోరములను, ఉలులను తయారు చేసెడివారు

చిత్రము 11



పటము 3
రాయచూరు జిల్లాలో లభించిన ప్రాచీన శిలా పరికరములు

నవశిలా పరికరములు పెక్కురు పాశ్చాత్య శాస్త్రజ్ఞులచే 1861-1862 సంవత్సరముల నడుమ కనుగొన బడెను (సింధు రాష్ట్రములో 1866నందును, బళ్లారిలో 1872 నందును, 1915-16లో అలహాబాదు వద్ద ఖిట్టా గ్రామమందును) నవశిలా యుగమునకు పూర్వమే మానవుడు నిప్పును వెలిగింప నేర్చుకొని యుండవచ్చును సున్నితమగు ఈ శిలా పరికరములను చూచినచో, వాటి నిర్మాణమందు నిప్పు ఉపయోగింపబడి యుండెనని ఊహింప వచ్చును

చిత్రము 12

పటము 4
రాయచూరు జిల్లాలో లభించిన ప్రాచీన శిలాపరికరములు

దక్షిణ భారతమునందు కంటె ఉత్తరభారతమున తామ్ర యుగము మిగుల ప్రముఖమైనదిగ నుండెను వంగరాష్ట్రము నుండి బెలూచిస్థానము వరకు పెక్కు ప్రాంతములలో తామ్ర లోహ పరికరములు కనుగొనబడినవి ఈ పరికరములను పరిశీలింపగా, ఇవి తగరముతో సంపర్కము చెంది, కొన్ని రకముల కంచు లక్షణములు కలవిగా పరిణామము చెందినట్లు తెలియవచ్చినది రాగితో చేయబడిన కత్తులు, ఈటెలు, పాత్రలు మున్నగునవి 1821లో కాన్పూరులోను, ఫతేఘర్ లోను, అలహాబాదు సమీపమున గల కోశమ్ నందును, 1886లో బిజనార్ జిల్లాయందలి రాజపూరులోను, వంగరాష్ట్రమందలి మిధునపురము (మిద్నపూరు) లోను, బీహారు రాష్ట్రమందలి మాంఘీరు, హజారీబాగ్, పాలమవ్ ప్రాంతములలోను కనుగొనబడెను అత్యంత బహుళ పరిమాణములో ఈ పరికరములు మధ్యప్రదేశ్‌లోని గుంజీరియా, బాలఘాట్ పరిసరములలో గూడ లభించెను వీటిలో 424 వరకు రాగి నిర్మాణములును, 102 వెండి పళ్ళెరములునై యుండెను బెలూచిస్థాను, సింధు లోయ ప్రాంతములలో కొన్ని రాగి పరికరములు కాగిన్ బ్రౌనుచే కనుగొనబడెను వీటిలో కత్తులు ఈటెలు, ఉలులు, బల్లెములు కూడ నుండెను ఇవి ఉత్తర భారతమునందే ఎక్కువగా లభించెను రాయచూరు జిల్లాలో 1889లో కల్లూరు గ్రామమున ఒక కొండరాతిని పగులగొట్టగా, దాని క్రింద మూడు రాగి కత్తులు కాన్పించెను 1797 నుండి 1800వ సం॥ వరకు నెల్లూరు, కాళహస్తి ప్రాంతములలోను వెంకటగిరి సమీపముననుఅనేక రాగి గనులను తాను స్వయముగా చూచితి నని హేయన్ అను నాతడు తెలిపి యున్నాడు ఇట్టి పరికరములే కృష్ణా, పెన్నా నదుల నడుమను కర్నూలు, బళ్లారి జిల్లాలలోను కనుగొనబడినవి అయితే, రాగిగనులు కచ్చితముగా ఎప్పు డావిర్భవ మయ్యెనో నిర్ణయించుట దుర్లభము ఇతర దేశములలో కూడ శిలాయుగము తామ్ర యుగముగా పరిణామము చెందుటకంటె, ఇనుప యుగముగనే విశేషముగా పరిణామ మొందినది అట్లే దక్షిణభారత దేశమందును తామ్ర యుగమునకు పూర్వమే ఇనుప యుగము ఆరంభమైనది ప్రాచీన మానవుడు ప్రప్రథమమున స్వీయరక్షణకు ప్రకృతి సిద్ధమగు గుహాలయందు నివసించినప్పుడు, అతడు కొన్ని కుడ్య చిత్రములను రచించెను అట్లే కొండ శిలల నుండి కొన్ని పరికరములను ఆతడు తయారొనర్చెను 1878లో స్పెయిను దేశములో కొన్ని చిత్రములు కనుగొనబడెను వాటిలో మను బోతు చిత్ర మొకటి నాగపూరు సమీపమున మహాదేవ పర్వతములలో ఇట్టి శిలా చిత్రములు కనుగొనబడెను కాని వాటిపై కొన్ని పొర లేర్పడుటచే, వాటి నిర్మాణ కాలమును కనుగొనుట కష్టము ఇట్టి చిత్రములు విశేష సంఖ్యలో భారతదేశమునందు కనుగొనబడినవి ఈ ప్రాంతములలోని చిత్తరువుల యందు నలుపు, ఎరుపు వర్ణములు కలిసిన జేగురు రంగు మాత్రమే ఉపయోగింపబడుట ఆశ్చర్యకరమైన విషయము ఈ రంగు విశేషమైన మన్నిక కలది అధిక సంఖ్య గల ఈ చిత్రములకు కళాప్రాముఖ్యము లేకున్నను, కొన్నిటి యందు అత్యంత తేజోవంత మగు జీవకళ ప్రతిబింబించు చుండెను వాటిలో పూర్వ చారిత్రక ఆటవిక జీవితమును గూర్చిన భావములు స్పష్టముగ గోచర మగుచుండెను ఈ చిత్రములలో వేట దృశ్యములు సమృద్ధిగా నుండెను మధువును సేకరించుట ఆ నాటి ప్రజల ప్రధాన వృత్తి అది వారి మధురాహారము ప్రాచీన కాలమందే వారు విల్లు నమ్ములను తయారు చేయుటకు వెదురు ముక్కలను పదును చేసికొనెడివారు ఈ చిత్రములందు మత ప్రాముఖ్య మిసుమంతయు లేదు ఐంద్రజాలిక, మాంత్రిక విద్యలకు సంబంధించిన చిత్రములు కూడ అందు కొలదిగ నుండెను

చిత్రము 13



పటము 6

సమాధులలో కనిపెట్టబడిన కొన్ని మృణ్మయ పాత్రలు

పూర్వచారిత్రక మానవునకు ప్రాతినిధ్యము వహించిన పెక్కు ప్రముఖాంశములలో ఆతని సమాధి యొకటి మృత కళేబరమును గూర్చి మానవు డెప్పుడును విచారించుచు, ఆసక్తిని ప్రదర్శించు చుండెడివాడు ఆత్మ ఎట్లు అదృశ్య మగునో, మరల కళేబరములో ప్రవేశించుటకై అది వచ్చునో, రాదో తెలిసికొనుట కాతడు మిగుల కుతూహల పడుచుండెడి వాడు ఆనాటి సమాధులు గాని, ఈజిప్టులోని సూచ్యగ్ర స్తూపములు గాని, తాజమహలు గాని, ఒకదానితో మరి

యొకటి కొన్ని అంశములలో భేదించినను, అవి ఒకే తరగతికి చెందియున్నవి

చరిత్ర కందని అత్యంత ప్రాచీన కాలములో మృత దేహములు శిలానిర్మిత శవపేటికల యందును, మొరకైన ఇతర సాధనముల యందును సమాధి చేయబడెను కొన్ని సందర్భములలో ఈ పేటికల యందు రెండు మానవ కళేబరములు మరి కొన్ని సమయములలో గొర్రెపిల్లల యొక్క, గొర్రెల యొక్క ఎముకలు సహితము ఉంచబడి సమాధి చేయబడెడివి ఇట్టి పేటికలు హైదరాబాదు నగరము చెంతనున్న మౌలాలి యొద్దను, రాయగిరి సమీపమునను కనుగొన బడినవి ఇట్టి పేటిక యొకటి సికింద్రాబాదున కుత్తరముగా నున్న హష్మత్ పేట యందు ప్రదర్శింపబడి యున్నది పెక్కు ఇతర రకముల సమాధులు తెలంగాణ మండలి జానంపేట యందును, మౌలాలి చెంతను కలవు ఫెర్గుసన్ వ్రాసిన ఒక గ్రంథమందు ఉత్తర ఆఫ్రికా, పశ్చిమ యిరోపా దేశము లందలి ప్రాచీన శవపేటికల ఛాయా చిత్రములను ప్రకటించెను ఇవి ప్రాచీన భారత దేశమందలి శవపేటికలను సన్నిహితముగా పోలియున్నవి

చిత్రము 14



పటము 6

ప్రాచీన కాలమునాటి రాగి ఖడ్గము

ఈ శవపేటికలు స్వల్ప భేదములతో పెక్కు విధములుగా నిర్మింపబడి యుండెను ఇవి నిజామాబాదు, మహబూబునగరు, గుల్బర్గా, రాయచూరు జిల్లాలలోను, జడచర్ల యందును కన్పట్టు చున్నవి ఆ ప్రాంతముల హరిజనులు ఈ నాటికిని మృత దేహములను సంస్కరించుట యందు పూర్వపద్ధతులనే అవలంబించు చున్నారు

ఖనన మొనర్పబడిన కొన్ని సమాధులలో మెరుగు పెట్టబడిన కుండ పెంకులు కాన్పించెను, కొన్నిటిలో పూసలు బయల్పడెను, మరి కొన్నిటిలో ఇనుప గొడ్డళ్ళు, కొడవళ్లు, ఇనుప చక్రములు కనుగొన బడినవి వీటిలో ఒక్క నాణెము కూడ లభింపలేదు ప్రాచీన నాణెములు క్రీ పూ 6వ శతాబ్ది నుండి ఖనన ప్రాంతము లందు లభించెను కుండ పెంకులపై లిఖింప బడిన కొన్ని చిహ్నములను విద్వాంసులు వర్గీకరించి, వాటిని ఇతర ప్రాంతము లందు దొరకిన పెంకులతో పోల్చిరి భారత దేశపు చిహ్నములను పరిశీలింపగా, అవి అతి ప్రాచీన మగు బ్రాహ్మీ లిపిలోని కొన్ని అక్షరములను పోలియుండెను

క్రమబద్ధ మగు రాజ్యమును గాని, రాజ్యపాలనా విధానమును గాని, వంశపరంపరా గత మగు చరిత్రను గాని,

చిత్రము 15



పటము 7

స్పెయినులో ని పూర్వ చారిత్రక యుగమునాటి మనుబోతు వర్ణ చిత్రము

లిపిని గాని, నాణె ముద్రణమును గాని, మానవుడు నిర్మింపని కాలము పూర్వ చారిత్రక యుగ మనబడు చున్నది ఆర్యులు భారత దేశమునకు రాక పూర్వము మహోజ్జ్వల నాగరికతతో విలసిల్లిన మొహెంజొ దారో, హరప్ప క్షేత్రములు పూర్వ చారిత్రక యుగమునకు సంబంధించినవి చరిత్ర నిర్మాణమున కవసరమగు సమాచారము అచ్చట లేకుండుటయే ఇందుకు కారణము అయినను అచ్చటి నాగరికత మహోదాత్తమును, అత్యున్నతము నైనది ఇచ్చటి పూర్వ చారిత్రక సంస్కృతి వలన, మానవుడు మహోన్నతు డైన మేధావిగా జీవించి, తన అభ్యుదయ పథమున ఎదురైన ప్రతిబంధకములను అధిగమించి విజయమును చేపట్టగల్గెనని నిరూపిత మగుచున్నది

ఆర్ ఎం జో

## పెట్టుబడి
## (Capital)

"పెట్టుబడి" శబ్ద నిర్వచనము ఆధునిక ఉత్పాదక వ్యవస్థలో పెట్టుబడి బలీయ మగు పాత్ర నిర్వహించు చున్నది పెట్టుబడి లేనిచో, భూమి బీడు వారి నిస్సారమై పోవును, కార్మికులు పనిలేక సోమరు లయ్యెదరు, సంఘ నిర్మాణము నేటివలె సంశ్లిష్టముగను, వక్ర స్వభావము గలదిగను ఉండదు

అయితే, పెట్టుబడి అనునది ఆదాయమా ? అవును ఒక విధముగా అది ఆదాయమే పెట్టుబడికిని, సంపదాభి

వృద్ధికిని పరస్పర సంబంధ మున్నది మానవుని సంపదలో కొంత భాగము, ఆతని రాబడియమును కూర్చి పెట్టుటకో, లేక ఉత్పాదక విధానమం దాతనికి సహాయపడుటకో, దాచి యుంచబడుట గాని, లేక వినియోగపడుట గాని సంభవించు చున్నది పెట్టుబడి అను పదమునకు ప్రఖ్యాత అర్థశాస్త్రజ్ఞుడగు మార్షల్ నిర్వచన మిచ్చుచు, మానవుని సంపదలో అది ఒక భాగమే నని వచించెను ధన రూపములో ఆదాయ మార్జించుట కాతడు సంపదలో కొంత భాగమును వినియోగించు నని కూడ ఆతడు వ్యాఖ్యానించెను చాప్‌మన్ అను మరి యొక అర్థ శాస్త్రవేత్త కూడ పెట్టుబడి సంపదయే ననియు, అది ఆదాయమును గాని, తత్తుల్య మగు ఉత్పాదక పదార్థమును గాని సంపాదించుటకు సహాయపడు ననియు చెప్పినాడు పెట్టుబడి అను శబ్దమునకు కేవలము ధనమే కాక, యంత్రములు మున్నగు సరకులని గూడ అర్థము చెప్పవచ్చును అందుచే వివిధ రూపములలో నుండు పెట్టుబడులకు నడుమ గల భేదమును వివరించుట అవసరము.

స్థిరరూప మగు పెట్టుబడికిని, నిర్వహణ కొర కుపయుక్త మగు పెట్టుబడికిని నడుమ గల భేదమును వివరించుట ప్రయోజనకరము మన్నిక గల వస్తువులు స్థిరరూప మగు పెట్టుబడు లనబడును పెట్టుబడి రూపమున వ్యవహరించు యంత్రములు మున్నగు వస్తువుల నుండి యజమానికి ఆదాయము సంక్రమించుటకు దీర్ఘ కాలము పట్టును ఇక నిర్వహణ కొర కుపయోగించు పెట్టుబడి అనగా ధనమని అర్థము పారిశ్రామి కాధికారి ఈ ధనమును తన వద్ద నుంచుకొని, వేతనముల చెల్లింపు మున్నగు ఉత్పాదక వ్యయముల కొర కుపయోగించు చుండును

పెట్టుబడి యొక్క విధులు స్వేచ్ఛా వాణిజ్య, వ్యాపార ఉత్పాదన విధానము ఆచరణయం దున్న సమాజములో పెట్టుబడి, కీలక మగు పాత్ర నిర్వహించును ఆ పద్ధతి కన్వయమగు "పెట్టుబడిదారీ విధానము" అను శబ్ద ప్రయోగము నుండియే పెట్టుబడి యొక్క పాత్ర విదిత మగును సోషలిస్టు సమాజము కూడ పెట్టుబడి లేకయే అభివృద్ధి చెందజాలదు ధనిక సమాజములో పెట్టుబడి, ప్రభుత్వమునకును, ప్రైవేటు వ్యక్తులకును చెంది యుండగా, సోషలిస్టు సమాజములో అది సంఘపరముగ నుండును నాగరికత ఉదయించి నప్పటినుండి—ముఖ్యముగా పారిశ్రామిక విప్లవానంతరము—పెట్టుబడిదారీ, సోషలిస్టు సమాజములు రెండింటి యందును పెట్టుబడి గణనీయ మగు పాత్ర నిర్వహించు చున్నది పెట్టుబడి లేనిదే, ఈ రెండు వ్యవస్థలలో ఏదియు నేటివలె నిర్మాణాత్మక రూపములో అంత సంశ్లిష్టముగ నుండెడిది కాదు

అందుచే, పెట్టుబడి యొక్క ధర్మములను తెలిసికొనుట ఉపయోగకరము (1) ఉత్పాదనములో పెట్టుబడి కార్మికులకు సహాయపడును, యంత్రములను, ఇతర పరికరములను వారికి సమకూర్చును (2) పెట్టుబడి వినియోగము వలన, యంత్రము ద్వారా ఉత్పాదనము అధికమై, దాని కగు వ్యయము తగ్గును (3) పెట్టుబడి వలన కార్మికులకు జీవనోపాధి ఏర్పడును పారిశ్రామిక విప్లవమునకు పూర్వపు సమాజములో చెప్పులు కుట్టు గ్రామీణ శ్రామికుడు, ఒక చెప్పుల జత పూర్తియైన తరువాతనే రెండవ దానిని తయారు చేయుట కుపక్రమించును మొదటి జతను అమ్మినసే గాని, ఆతని చేతిలో పైకము పడదు కాని ఆధునిక మైన కర్మాగారములో పాదరక్షల కవసర మగు ముడిసరకు ఒక ప్రక్క నుండి వచ్చు చుండగా, తయారైన పాదరక్షలు రెండవ ప్రక్క నుండి అమ్మకమునకు బయటికి పోవుచుండును, కర్మాగారమునందు తయారగు పాదరక్షలు విపణి వీథిలో అమ్ముడు పోకపూర్వమే కార్మికులకు వేతనములు చెల్లింపబడు చుండును పైన చెప్పినట్లు నిర్వహణార్థ ముపయోగపడు పెట్టుబడి నుండియే కార్మికులకు వేతనములు చెల్లింపబడును (4) పెట్టుబడిని పెట్టనిచో, ఆధునిక మైన భారీ ఉత్పాదనమును సాగించుట అసంభవము తత్ఫలితముగా, ఆధునిక పారిశ్రామిక సంస్థ యందు పెట్టుబడి ఉపయోగింపబడుట వలననే, నేటిసమాజములో మానవుడు వివిధములైన పారిశ్రామిక వస్తువులను విరివిగా వినియోగించ గల్గుచున్నాడు నిజముగా, పెట్టుబడియే లేనిచో, ఆధునిక పారిశ్రామిక నిర్మాణమును గూర్చి ఊహించుట కూడ అశక్యము

పెట్టుబడి వృద్ధికి కారణములు కూడబెట్టిన ధనము నుండియే పెట్టుబడి వృద్ధి చెందును ఉత్పాదక సాధనముల సమీకరణము దిగువ పేర్కొనిన మూడు మార్గములలో ఏదేని ఒక దానివలన సాధ్య మగును (1) నిత్య జీవితావసర వస్తువులను మాత్రమే తయారుచేయు శ్రామికులు కొలది రోజులపాటు ఎక్కువ గంటల వంతున విశేషముగా శ్రమించి, పూర్వము కంటె అత్యధికముగా అట్టి వస్తువులను తయారు

చేయుదురు ఈ వస్తువులలో కొంతభాగము నిలువచేయబడి, ఆ తరువాత ఉత్పాదక సాధనములను తయారుచేయు సంవత్సరములో నిలువయందుండిన వస్తువులను వా రుపయోగింప వచ్చును (2) శ్రామికులు, తాము పనిచేయు కాలములో కొంత భాగమును నిత్యజీవితావసర వస్తువులను, శేషించిన భాగమును ఉత్పాదక సాధనములను తయా రొనర్చుటకు వినియోగింప నిశ్చయించ వచ్చును ఇట్టి సందర్భములో వారు మామూలుగా తయారుచేయు నిత్య జీవితావసర వస్తువులలో కొంత భాగమును నష్టపడవలసి వచ్చును పూర్వము కంటె ఇప్పుడు తయా రగు జీవితావసర పదార్థముల పరిమాణము తగ్గుటయే ఇందుకు కారణము (3) రెండు రకము లగు వస్తువులను ఉత్పత్తి చేయు కార్యక్రమమును శ్రామికులు తమలో తాము పంచుకొని, కొందరు జీవితావసర పదార్థములను, మరికొందరు ఉత్పాదక సాధనములను తయారు చేయవచ్చును జీవి తావసర వస్తువులను ఉత్పత్తి చేయువారు, వాటి నన్నిటిని ఉపయోగింప జాలరు ఉత్పాదక సాధనములను చేయు శ్రామికుల సహాయార్థమై, వారు చేసిన జీవి తావసర వస్తువులలో కొన్నిటిని మాత్రమే ఉపయోగింప వలెను పై మూ డంశము లను పరిశీలించినచో, జీవితావసర వస్తువుల నన్నిటిని కాక, వాటిలో కొన్నిటిని మాత్రమే వాటిని ఉత్పత్తి చేయువారు వాడుకొనుట వలన, ఉత్పాదక సాధనములు తయా రగుచున్నవి అనగా, నిత్యజీవితావసర పదార్థములను తయారు చేయువారు, పైన చెప్పిన విధముగా, పొదుపుదనమును అవలంబింప వలెను రేపటి అవసరముల నిమిత్తమై నేడు మన కోరికలను వాయిదా వేసికొన వలెను మదుపు చేయు వస్తు పరిమాణము మీదనే పెట్టుబడి యొక్క వృద్ధి ఆధారపడి యుండును

**పొదుపు ధనమందలి ఉద్దేశము** ఈ అంశమును గూర్చి అర్థశాస్త్ర గ్రంథములలో పెక్కు రీతులుగా వివరింపబడి యున్నది ఈ క్రింద పేర్కొనిన ఆరు ఉద్దేశములు ముఖ్యములైనవి (1) ముందు జాగ్రత్తను గూర్చి వివేకము ప్రదర్శించుట, మానవుడు తన అవసరముల నిమిత్తమై ముందు రానున్న గడ్డు దినములను గడచుటకు కొంత మూల ధనమును నిలువ చేసికొన వచ్చును (2) దూరదృష్టి – కుటుంబికు డైన వ్యక్తి, కేవలము తన వృద్ధాప్యము కొరకే కాక, బిడ్డల విద్య కొరకును, కుమార్తెల వివాహము కొరకు కూడ చాలి నంతగా మూల ధనమును సమకూర్చుకొన వలసి యుండును (3) జీవితాభివృద్ధి–జీవన ప్రమాణమును పెంపొందించుకొనవలె నని ప్రతి మానవుడు కోరుకొనును అందుకొర కాతడు తన ఆదాయములో కొంత పొదుపు చేసికొని, ఆ పొదు పైన ధనమును, ఎక్కువ ఆదాయము తీయుటకై ఉపయోగించు కొనును (4) కుటుంబము పెడల ప్రేమ – కుటుంబ యజమాని, తన భార్యాబిడ్డల యెడ గల ప్రేమచే, వారి సుఖ జీవనము కొరకు పెద్ద మొత్తమును సంపాదించి ఇయ్యవలె నని వాంఛించును (5) అహంభావము – ధనవంతుడు సంఘములో గొప్ప అధికారమును, పరువు ప్రతిష్ఠలను అనుభవించుచుండును ఎంతో ధనమును పొదుపుచేసి, కూడబెట్టజాలితి నన్న అహంభావము నాతడు వహించి యుండును, సమాజములో తా నొక విశిష్ట స్థానము నాక్రమించిన అదృష్ట జాతకుడ నని మురియుచుండును (6) లోభము – కేవలము లోభదృష్టితో, ఏ పని కైనను డబ్బు వ్యయపెట్టుటకు అకారణముగా వెరచు వ్యక్తు లీనాడు కూడ లేక పోలేదు

**ఆధునిక పారిశ్రామిక సంస్థలలో పొదుపుధనము** పారిశ్రామిక సంస్థలు అవమూల్యన నిధులను విధిగా నిర్మించుచుండును ఈ విధానము సర్వసామాన్యమైనదే అంతే కాక, అవి ద్రవ్యతులో వ్యవపత్తులను గూడ సేకరించుచుండును గడ్డు దినములను గడచుటకు ఇట్టి ఉపపత్తు లుపయోగ పడగలవు ఇవి అగోచర మూలద్రవ్య మని కూడ అనబడును ఈ అగోచర మూలద్రవ్యము ద్వారా లాభములో నుండి కొంత భాగము వెనుక వేయబడి, ఇతోధిక మగు పెట్టుబడి కొరకుపయోగింప బడును ఈ విధాన మంతయు దూర దృష్టితో కూడిన వివేకము, పురోగతి యందలి ఆసక్తి, సాహస లక్షణము పెడల గల అభిమానము మున్నగు వాటిచే ప్రేరితు డైన పారిశ్రామిక వేత్త అనుసరించును ప్రభుత్వముచే ధన ప్రాణములకు చేకూరు రక్షణము వలన పొదుపు చేసికొనుటకు వలసిన శక్తికి, సంకల్పమునకు బలము సిద్ధించును అట్లే, బ్యాంకులు, ఇన్సూరెన్సు కంపెనీలు, పారిశ్రామిక, వ్యాపార సంస్థలు, ప్రభుత్వ సెక్యూరిటీలు మున్నగునవి, పెట్టుబడికి అనుకూలము లైన సంస్థలు కాకతాళీయముగా ఈ సందర్భములో రెండంశములు పేర్కొన దగును

(1) ఆధునిక సమాజములో పొదుపు చేయబడిన ధనమును పెట్టుబడి క్రింద నుపయోగించుటకు పెక్కు సంస్థలు

కలవు వీటిలో కొన్ని పైన పేర్కొనబడినవి (2) మానవునకు పొదుపు చేసికొను నుద్దేశమున్నను, ఆతని కనీసపు జీవితావసరములకే చాలీ చాలని సంపాదనము కారణముగా, ఆతడు పొదుపు చేయలేని స్థితియం దుండును

బడుగు దేశములలో పెట్టుబడి సమస్య రాగ్నర్ నుర్క్సె, మారిస్ డాబ్, హిష్మన్ మున్నగు అర్థశాస్త్రవేత్తలు బడుగు దేశముల యొక్క ఆర్థిక సమస్యలను గూర్చి ఇటీవల లోతైన పరిశీలనములను జరిపిరి బడుగు దేశముల యందలి పెట్టుబడి సమస్య నీ క్రింది విధముగా వివరింప వచ్చును

(1) బడుగు దేశము లందలి జనాభాకును, సహజోపవత్తులకును అనుగుణ్య మగు పెట్టుబడి ధనము లోపించి యుండును

(2) ప్రతి బడుగు దేశము నందును నిరుద్యోగుల యొక్కయు, పాక్షికోద్యోగుల యొక్కయు సంఖ్య అధికముగ నుండును

(3) గ్రామీణు లగు ఇట్టి వారు ప్రజా హితము లగు ఉత్పాదక కర్మాగారములలో నియోగింప బడెదరు బడుగు దేశములలో ఈ ఉత్పాదక కర్మాగారములే ప్రధాన మైన సంస్థలుగా పరిగణింప బడును మొత్తము మీద బడుగు దేశములలో వస్తు వినియోగ మంతగా వృద్ధి నొందలేదు అసమగ్ర మగు ఉద్యోగావకాశముల చేతను, తత్ఫలితముగా కలుగు అల్పాదాయము చేతను, వస్తువుల వాడకము వృద్ధి కాంచ జాలదు, ఒక వేళ వృద్ధి చెందినను, అది స్వల్ప మాత్రమే ఇది రెండు కారణముల వలన జరగును (అ) పూర్వము నిరుద్యోగులుగను, పాక్షికోద్యోగులుగను ఉండిన వారు ఇప్పుడు స్థానభ్రష్టు లగుటచే, వంటశాలలు ఎక్కువగా పెరిగినవి, అనగా ఆహార వినియోగము పరిమాణాత్మకముగా కొంత వరకు అధికమైనది (ఆ) ఈ శ్రామికులు పూర్వము కంటె ఇప్పుడు ఎక్కువగా ఆహార పదార్థములను వినియోగించెదరు వీరు శ్రమించి పని చేయుటయే ఇందుకు కారణము అయితే జాతీయోత్పాదనము ఇనుమడించినది అధికోత్పత్తి జరిగినను, ఆహార పదార్థముల వినియోగములో స్వల్పమగు అధికృత మాత్రమే ఘటిల్లుటచే, పూర్వము కంటె ఇప్పుడు పొదుపుధనము హెచ్చుస్థాయిలో నుండును ఇట్లు పొదుపయిన ఆహార ద్రవ్యములే పెట్టుబడి యగును

(4) పైన జెప్పబడిన ఉత్పాదక కర్మాగారములను ప్రభుత్వమే నెలకొల్పవలసి యుండును గ్రామీణ సమష్టి వ్యవసాయ క్షేత్రము లందలి అదనపు పంటను పారిశ్రామిక విస్తరణమునకై సమీకరించు విధానమును సోవియట్ ప్రభుత్వము తమ దేశములో ఆచరణ యందు పెట్టి, ఇతర దేశము లందు కూడ దానిని పరిచయ మొనర్చెను భారత దేశములో కూడ ఈ సమస్య యెడల శ్రద్ధ గైకొన బడుచున్నది

(5) ఈ సమస్యను గూర్చి ఆలోచన సల్పుటచే, జనాభా పెరుగుదలను అరికట్ట వలసిన అవసరము కలదు

(6) బడుగు దేశము లన్నిటిలోను విచిత్ర మగు ఒక మనస్తత్వము గోచర మగును ఆ దేశముల ప్రజలు అభ్యుదయ దేశములను అనుకరించుచు ట్రాన్సిస్టరులు, కెర్లినులు మున్నగు విలాస వస్తువులను వాడుటయం దెక్కువ మక్కువను ప్రదర్శించు చున్నారు తగు విధముగా వారిపై పన్నులను విధించి, ఈ విలాస వస్తువులపై వారికి గల మోజును అరికట్టనిచో, పొదుపుధనము అసంభవమై పెట్టుబడి ధనము సమకూడుట దుర్ఘట మగును బడుగుధనమునుండి బయటపడి, అభ్యుదయమును సాధింపవలె నన్నచో, ప్రతి పేద దేశ మందును పెట్టుబడి ధనమును చాలి నంతగా సమకూర్చ వలెను

పెట్టుబడి అను పదమునకు పిగౌ అను అర్థ శాస్త్రజ్ఞు డిచ్చిన నిర్వచనముతో ఈ వ్యాసమును సమాప్తి చేయ వచ్చును 'పెట్టుబడి ఒక సరస్సు వంటిది పొదుపు చేయబడు వివిధములగు ధన, కనక, వస్తు, వాహనములు ఈ సరస్సులోనికి నిరంతరముగా వచ్చి చేరుచునే యుండును ఇట్లు వచ్చి చేరు సంపద అంతయు తుదకు ఈ సరస్సు నుండి పలు ముఖములుగా బయటికి వెడలిపోవును ' ఈ సరస్సు సమాజముచే పోషింప బడుచు, మరల సమాజమును పోషించు చుండును

ఆర్ వి రా

## పెట్రోలియము

ఈనాటి నాగరికత పెట్రోలు మీదను, ముడి పెట్రోలియము నూనె నుండి లభించు ఇతర పదార్థముల మీదను ఆధారపడి ఉన్నది "రెక్కాడితే గాని డొక్కాడదు" అన్నట్లు పెట్రోలియము నుండి లభించు పదార్థములు వాడుకొననిదే, యంత్రములు కదలవు అనగా పెట్రోలియమునకున్న ప్రాముఖ్యము అధిక మైనది

పెట్రోలియము నూనె మనకు భూగర్భము నుండి లభించు చున్నది. దానిని కొందరు మట్టినూనె అనియు, రాతి నూనె అనియు, ఖనిజ తైల మనియు వ్యవహరించు చుందురు. యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికాలోను, కాస్పియన్ సముద్ర ప్రాంతములలోను, పెట్రోలియము నూనె విరివిగా లభించును. బోర్నియో, రుమేనియా, జపాన్, కెనడా, బర్మా, ఇరాన్, ఇరాక్ లలో కూడా తగినంత ప్రమాణములో పెట్రోలు దొరకు చున్నది. మన దేశములో, అస్సాము, అంక్లేశ్వర్ మొదలైన కొన్ని ప్రాంతములలో పెట్రోలు కొంత లభించును. అది మన అవసరములకు సరిపోవునంత విరివిగా లేదు. అందుచేత పెట్రోలియము లభించు తావులను భూగర్భ శాస్త్రవేత్తలు పరిశోధించు చున్నారు.

పెట్రోలియముతో పాటు జ్వలనశీలము గల వాయు పదార్థములు కూడ ఉవ్వెత్తుగా పైకి బయటికి వచ్చును. అవి మండినచో, అద్భుత తేలిక అయిన పని కాదు. "బాకూ" లోని నూనె గనుల ప్రాంతములో క్రీ. పూ. 600 ప్రాంతమున ఆకసములోనికి ఎత్తుగా విజృంభించిన అగ్ని జ్వాలలు అట్టివి.

ముడి పెట్రోలియము నూనెతో పాటు దానికి సంబంధించిన ఇతర పదార్థములు ఎన్నియో లభించుచున్నవి. వాటి నన్నిటిని ప్రాచీన కాలములో ఏదో రీతిగా ప్రజలు వాడుకొనెడివారనుటకు ఋజువు లున్నవి. జల ప్రళయము సంభవించి జీవజాతి అంతయు నాశనము అగుటకు సిద్ధము కాగా ఒక ఓడను నిర్మించుకొని, అందు రకమున కొక జంట చొప్పున జీవజాతుల నన్నిటిని చేర్చుకొని రక్షించుట కుద్యమించిన నోవా అను నతడు తన ఓడకు కీలు పూత పూసెనని తెలియుచున్నది. పిదప యూదుల న్యాయశాస్త్ర ప్రవర్తకుడైన మోజెస్ శిశువుగా ఉన్నపుడు, ఈజిప్టు దేశపు రాజైన ఫరోవారి నుండియు, అకాల మరణము నుండియు, అతనిని తప్పించి రక్షించుటకై అతని తల్లి పసికందును తారు పూసిన తట్టలో పరుండబెట్టి నైలునదీ ప్రవాహములో వదలిన దని కూడా చెప్పబడినది. ఓడ కీలును తాము వాడుకొనుటయే కాక, యూఫ్రటీస్, టైగ్రిస్ నదీతీర వాసులు విదేశీయులకు కూడ దానిని సరఫరా చేసెడివారు. ఆ ఓడ కీలును ప్రాచీన కాలములోని ప్రజలు గృహ నిర్మాణమునకు ఉపయోగించు బెందడి పదార్థముగా సున్నము, అడుసులకు బదులుగా వాడెడివారు. బహుశః భారత తేతిహాసములో ప్రఖ్యాతినందిన లాక్షగృహ నిర్మాణములో కూడ దానిని వాడి ఉందురని ఊహించుట సత్యదూరము కాజాలదు. ఆ కాలములో నౌకాయానమునకు ప్రసిద్ధి వహించిన చీనావారు, రోమనులు, భారతీయులు తమ కొయ్య ఓడలు సముద్ర జలములో చివికిపోకుండ తారు పూత పూసెడి వారట! తారు దహన శీలముకలది. అందుచేత వారు దానిని వంట చెరకుగను, సముద్ర జలమును ఇగిర్చి ఉప్పు తయారు చేసికొనుటకును ఉపయోగించెడి వారు. తారును తైల పదార్థములతో కలిపి, గాయములను మాన్పుటకును, కీళ్ళనొప్పుల నివారణకును మలామా మందుగా కూడా వాడెడి వారు. ఐతే, ఈ చెదురు మదురు ఉపయోగము లన్నియు అధునిక పెట్రోలియము పరిశ్రమకు ఎంతో పూర్వకాలికములు.

చిత్రము 16



భూగర్భతత్త్వాన్వేషణ విధానము

పటము 1

1859లో డ్రేక్ అను అమెరికాదేశీయుడు, పెట్రోలియము నూనె కొరకై సుమారు 18 82 మీటర్ల (69 అడుగుల) లోతుగల నూతిని త్రవ్వెను. దానినుండి రోజునకు 15 బారెల్ల నూనె లభించెడిది. అదే పెట్రోలియము పరిశ్రమకు ఆది. ఆ సంవత్సరము ఇరువది ఐదు లక్షల కిలోగ్రాముల (2500 టన్నుల) నూనె తయారైనది. 1914 నాటికి ఐదువేల ఐదు వందల కోట్ల కిలోగ్రాములు (ఐదున్నర కోట్ల టన్నులును), 1920 నాటికి ఆరు వేల కోట్ల కిలోగ్రాములును, (ఆరుకోట్ల టన్నులు), 1940 నాటికి పదునెనిమిది వేల కోట్ల కిలోగ్రాములును, 1960 నాటికి లక్ష ఇరువది నాలుగువేల కోట్ల కిలోగ్రాముల ముడి పెట్రోలియము ఒక్క అమెరికాలోనే లభించినది. ఈ పరిశ్రమ బ్రహ్మాండముగా అభివృద్ధి అయినదని స్పష్టమగుచున్నది. మొదటి పెట్రోలు నూయి 18 82

మీటర్ల లోతు కలదిగా త్రవ్విరి కాని ఈ నాడు 300 8 కిలో మీటర్ల లోతు గల నూతులు, సముద్ర గర్భములో దాగియున్న పెట్రోలియమును సాధించు నూతులు, త్రవ్వి ఎక్కడెక్కడి పెట్రోలియమును త్రవ్వి వెళ్ళగించి, సేకరించి, వాడుక చేసికొనునట్లు సాంకేతిక విజ్ఞానాభివృద్ధిని సాధించియున్నారు

ముడి పెట్రోలియమును ఒక పాత్రలో గ్రహించి, క్రమముగా వేడి చేయుచు, వేర్వేరు ఉష్ణోగ్రతలలో లభించు వాయు రూపద్రవ్యములను చల్లార్చి, వేర్వేరు పాత్రలలో సేకరించు విధానమును అవలంబించి, వివిధ ద్రవ్యములను తయారు చేయుచున్నారు ఈ విధానమును ఆంశిక స్వేదన క్రియ అని అందురు

చిత్రము 17.



గురుత్వాకర్షణ నిర్ణయ విధానము

పటము 2.

ఈ రీతిగా సిద్ధమగు ద్రవ్యములను, వాటి ఉపయోగములను సంగ్రహముగా ఈ క్రింది పట్టిక నుండి గ్రహించ వచ్చును

| వరుస సంఖ్య | ఆంశిక స్వేదనలోని ఉష్ణోగ్రత | ఆ ఉష్ణోగ్రతలలో లభించు ద్రవ్యములోని రసాయనిక ద్రవ్యములు | తారతమ్య సాంద్రత | ఆ ద్రవ్యము యొక్క ఉపయోగములు |
|---|---|---|---|---|
| 1 | 30° డిగ్రీల వరకు | సైమోజెన్ | 0.64 | — |
| 2 | 30° నుండి 70° వరకు | పలుచని పెట్రోలియము | 0.65 | సులువుగా ఆవిరి అయ్యెడి ద్రావణిగా రసాయన పరిశ్రమలలో వాడుచున్నారు |
| 3 | 70° నుండి 120° వరకు | — | | — |
| | | లైగ్రాయిన్, పెట్రోలు, లేక, గాసోలిన్ | 0.72 | నీటితో కడుపుటకు వీలుకాని ఉన్ని మొదలైన బట్టలనుండి మురికిని తొలగించుటకై వాడుక చేయుచున్నారు మోటారు కార్లలో వాడుక చేయు ఇంధనము |
| 4 | 120° నుండి 150° వరకు | పెట్రోలియము, బెంజోలీను | 0.76 | రసాయనిక పరిశ్రమలలో ఉపయోగకరమైన ద్రావణి |
| 5 | 150° నుండి 300° వరకు | కిరోసిను నూనె | 0.80 | దీపములలో కాంతి నిచ్చెడి ఇంధన ద్రవ్యము |
| 6 | 300° పైగా | కందెన తైలము వేసలీను | — | యంత్రములలో గరగరమను రాపిడి తొలగించుటకు వాడు కందెనగా తైలమును మలమూ మందుల తయారీలో సహద్రవ్యముగా వేసలీనును ఉపయోగించుచున్నారు |
| 7 | 48° నుండి 62° వరకు ద్రవీభావము పొందెడి మెత్తని ఘనపదార్థము | — పారఫిన్ మైనము | — | కొవ్వు వత్తులను తయారు చేయుటలోను, విజ్ఞాన పరిశోధనాలయములలో పరిశోధించెడి ద్రవ్యములను పలుచని రేకులుగా కత్తిరించునపుడు పొదిగెడి పదార్థముగాను ఉపయోగించుచున్నది |

ముడి పెట్రోలియము నుండి లభించు పదార్థములలో, అది లభించిన నూనె గనుల ప్రాంతము ననుసరించి కొద్ది తేడా లుండును ముడి పెట్రోలియము చిక్కగాగాని, ధూమవర్ణము కలదిగాగాని, ఆకుపచ్చని వన్నెకలదిగా గాని, మిశ్రమ వర్ణము కలదిగాగాని ఉండును అదిలభించు ప్రాంతమునుబట్టి, దానితో కలిసియుండు మలిన పదార్థములను బట్టి ముడి పెట్రోలియము యొక్క గుణములలో తేడా లుండును ఆర్గానిక్ సల్ఫరు (సేంద్రియ గంధకపు) పదార్థము లున్నప్పుడు దుర్వాసన ఉండును రష్యను పెట్రోలియములో కార్బను పరమాణువులు వలయాకారములో ఉన్న రసాయన ద్రవ్యము లుండును వేర్వేరు దేశములలోని ముడి పెట్రోలియము నుండి అంశిక స్వేదనము వలన లభించు వివిధ పదార్థములు రసాయనదృష్ట్యా మిశ్రమ స్వభావము గలవి అయినను వాటి భౌతిక లక్షణ ములలో సామ్యము, ఉపయోగములలో ఐక్యము ఉండును అందుచేత మనకు వాటిలోగల తేడాలను గురించి నిశితమైన విమర్శ అవసరము కాదు ముడి పెట్రోలియము నుండి సహజముగా లభించు ఉపయోగ కరమైన పదార్థములకు తోడుగా రసాయన శాస్త్రవేత్తలు పెక్కు క్రొత్త పదార్థము లను తయారుచేసి, వాటి ఉపయోగములను, మరింత ఎక్కువ చేసినారు అట్టి క్రొత్త పదార్థములు కనీసము ఒక వెయ్యి వరకు ఉన్న వని, అవి నానాటికి ఎక్కువ అగుచున్న వని, పెట్రో - రసాయన శాస్త్ర మను ఒక క్రొత్త శాఖ రూపొందు చున్న దని, తెలిసికొనినచో వాటి ప్రాధాన్యము స్పష్టమగును

చిత్రము 18



మాగ్నెటోమీటరు విధానము

పటము 8

కందెన తైలమును శుద్ధిచేయుట మూలముగా రంగు, వాసన లేని రకరకముల తెల్లని నూనెలు లభించు చున్నవి వాటిని పరిమళ ద్రవ్యములతో మేళవించి కొబ్బరి నూనెతో కలిపి చవుక రకపు తలనూనెలు తయారు చేయుదురు ఎండకు వడదెబ్బ తగులకుండ కాపాడుకొనుటకు పూసుకొనెడి మైపూతలను, రకరకపు మందు మలాములను తయారు చేసి కొనుటలో కూడ వాటిని ఉపయోగించు చున్నారు

నారింజపండ్లు మొదలగు రసభరితము లైన పండ్లను రవాణ చేయునపుడు, అవి గాలికి ఆరి, వడలిపోయి రసహీన ములు కాకుండ తెల్లని నూనెను అతి పలుచని పూతగా పూయుదురు కోడిగ్రుడ్లు నిలువ చేయుటకై అట్టి నూనెలో ముంచి తీసి రవాణా చేయుదురు మాంసము, ద్రాక్షపండ్లు మొదలైన ఆహార పదార్థములను నిలవ చేయుటకు నిగనిగ లాడుచు తాజా సరకులవలె కన్పించునట్లు చేయుటకు కూడ ఈ నూనెలను వాడుక చేయుచున్నారు

రకరకముల రంగుల సిరాలను తయారుచేయుటలో శీఘ్రముగ ఇగిరిపోవు నూనెలు ద్రావణములుగా ఉపయోగ పడుచున్నవి బూట్ పాలిష్‌ల తయారీలో కూడా అవి వాడు కలో నున్నవి గులాబీ, మల్లె మొదలైన పూలనుంచి సువాసన సారములను పీల్చి గ్రహించి తమలో లీనము చేసికొనుటకు నూనెగింజల నుండి తైల పదార్థములను, పచ్చిగానున్న ఎముకల నుండి సర్వీసును గ్రహించుటకు కూడ ఈ తెల్లని నూనెలు శక్తివంత మైన ద్రావణములుగా ఉపకరించు చున్నవి

నల్లని కాటుకపొడిని పోల్చాయిడు కణముల రూపములో నున్న బొగ్గుపొడిని నల్లని రంగు పదార్థముగా వాడుక చేయుచున్నారు రబ్బరు టైర్లు, టైప్ రైటరు రిబ్బనులు, కార్బను పేపర్లు, ఇండియన్ ఇంక్, అచ్చు సిరాలు మొదలైన వాటిని తయారు చేయుటలో నల్లని ఈ కాటుక పొడిని, త్వరగా అవిరిగా మారిపోవు పెట్రోలియము నూనెలను విరివిగా వాడుచున్నారు

కాగితముతో చిన్న చిన్న పాత్రలను తయారుచేసి, వాటిలో కేకులు, రొట్టెలు, చాకొలెట్లు, తీయని బిళ్ళలు కంటికి నదరుగా కన్పించునట్లు ప్రదర్శించుచు నిలవ ఉంచి అమ్ముటకు వాడుక చేయుదురు ఉల్లిపొర కాగితములను కూడ అందు కొరకు ఉపయోగించు చున్నారు వీటి తయారీలో పారఫిన్ మైనము ఉపయోగపడును పారఫిన్ మైనమునకు రంగు, రుచి ఉండవు అందుచేత దానిని వాడి తయారుచేసిన కాగితపు పాన పాత్రలను ఉపయోగించుటకును, దాని సంపర్కములో

నిలవ ఉంచిన ఆహార పానీయములను సేవించుటకును ఎవరికిని ఎట్టి అభ్యంతర ముండదు పైగా ఆ పదార్థములు అప్పుడే తయారైనట్లు ఆకర్షకములుగా నుండును

రసాయన స్వభావ దృష్ట్యా ముడి పెట్రోలియము వివిధము లయిన హైడ్రో కార్బనుల మిశ్రమము దానితో పాటు లభించు వాయురూప ఇంధన ద్రవ్యాలు కూడా హైడ్రో కార్బనులే ఆ వాయు మిశ్రమములో ఎక్కువగా మీథేను, కొంతమట్టుకు ఈథేను, మిక్కిలి తక్కువగా ప్రొపేను, బ్యూటేను అనునవి ఉండును ప్రొపేను, బ్యూటేనులు మిక్కిలి తక్కువ ఉష్ణోగ్రతలో సలసల మరగునట్టి హైడ్రో కార్బనులు అందుచేత వాటిని అదిమి పట్టినప్పుడు ద్రవరూపములో ఉండును వాటినే ఈనాడు బుర్ షేను, కోల్ గాస్ అను వ్యాపార నామములతో ఇంటింటా వంటకు ఉపయోగించు ఇంధన ద్రవ్యముగా సరఫరా చేయుచున్నారు

చిత్రము 19



పటము 4

అణువిచ్ఛేదన క్రియ వల్ల బ్యుటిలీను ప్రొపిలీనులను తయారుచేయు సాధనము

ప్రపంచములో సిద్ధ మగుచున్న పెట్రోలియములో సూడవవంతు మోటారు కార్లను నడపుటకు వాడుచున్నారు రోజురోజుకు లడులాదిగా కొత్తకార్లు తయారగుచున్నవి విమానములను నడపుటకు కూడ పెట్రోలు అవసరమే అందుచేత ముడి పెట్రోలియము నుండి యథాతథముగా లభించు పెట్రోలు మన అవసరములకు సరిపోవుట లేదు లభించిన కందెన తైల మంతయు వినియోగవు కాకుండ మిగిలిపోవు చున్నది అందుచేత రసాయన శాస్త్రవేత్తలు కందెన తైలము నుండి అణు విచ్ఛేదన విధానము వల్ల పెట్రోలియమును తయారు చేయు చున్నారు ఎక్కువ ఉష్ణోగ్రతలో సలసల మరగు ద్రవరూపము గల హైడ్రోకార్బను అణువులలో 10 మొదలు 20 కార్బను పరమాణువుల వరకు ఉండును ఆ ద్రవపదార్థములను బిందు రూపములో ధారావాహికముగా కనకనలాడు అల్యూమినామీద పడునట్లు చేసినప్పుడు, అణువులపై గొడ్డలి పెట్టు తగిలినట్లయి, అవి విచ్ఛేదము నొందును తత్ఫలితముగా 4 నుండి 8 వరకు కార్బను పరమాణువు లుండు పెట్రోలియముగను, తెల్లని నూనెలుగను, బ్యూటేనుగను మార్పుచెందును ఈ విధానము ననుసరించి ముడి పెట్రోలియము నుండి విరివిగ ఎథిలీను, బ్యుటిలీను, ప్రొపిలీను అను వాయురూప అసంతృప్త హైడ్రోకార్బనులను కూడ తయారుచేసి రాసాయనిక కల్పనకు ఉపయోగించు చున్నారు బ్యుటిలీను, ప్రొపిలీనుల యొక్క అణు సంయోగ క్రియ వలన మేలిరకపు పెట్రోలుగా మార్పు కొనగలుగు చున్నాము

ఎథిలీనును వాడి, రాసాయనికులు పోలిథీను అను ప్లాస్టిక్ పదార్థమును కల్పన చేసిరి రకరకముల ప్లాస్టికు పదార్థములు గృహ కృత్యములలో ఉపయోగపడు పాత్రలు, ఆఫీసులలో వాడుకకు పనికివచ్చు రకరకముల ఉపకరణములు ఫ్యాక్టరీలలో విమానముల నిర్మాణమునకు పనికివచ్చు పనిముట్లు తయారు చేసికొనుటకు సహాయకారు లగుచున్నవి మరియు నీటితో కలిసి నురుగు నిచ్చు పదార్థములను కూడ పెట్రోలియము నుండి లభించిన పదార్థముల నుపయోగించి రాసాయనికముగా కల్పించినారు వాటివలన బట్టల నుతుకుటలో విప్లవాత్మకమైన మార్పులు వచ్చినవి దారము వలె పోగు తీయుటకు వీలైన టెరిలీను, నైలాను మొదలైన రకరకముల పదార్థముల రసాయనిక కల్పనలో ముడి పెట్రోలియము నాధారముగా గ్రహించి, శాస్త్రవేత్తలు కృషిచేసి సఫలీకృత మనోరథులైరి

ఇన్ని విధములుగా ఉపయుక్తమైన ముడి పెట్రోలియము సృష్టిలో ఏరీతిగా ఏర్పడినది? అను విషయమును గురించి విజ్ఞానవేత్తలు శోధించి రెండు రకముల సూచనలను

చేసిరి మెండెలీఫ్ అను రష్యాసు శాస్త్రవేత్త భూగర్భములో ఉండెడు విపరీత ఉష్ణోగ్రతా పరిస్థితులలో లోహములు కార్బనుతో రాసాయనికముగ యోగించి, కార్బైడుల రూపములో ఉండు ననియు, ఆ కార్బైడులు పై నీటియొక్క చర్యవలన హైడ్రో కార్బనులుగా తయారవుచున్న వనియు, అక్కడి విపరీత ఉష్ణోగ్రతా పీడనశక్తి కారణముగా అత్యంత క్లిష్టమైన హైడ్రోకార్బనులు, సరళమైన హైడ్రోకార్బనులు తయారయినందున మిశ్రమ రూపముగా ముడి పెట్రోలియము ఏర్పడి ఉండవచ్చు ననియు సూచించెను ఇక ఎంగ్లర్ అను మరియొక శాస్త్రవేత్త చేప నూనెలను గాలి చొరకుండ వేడిచేసి, ముడి పెట్రోలియము వంటి పదార్థమును తయారు చేసెను ఈ విజ్ఞాన ప్రయోగ ఫలితమును ఆధారముగా గైకొని ముడి పెట్రోలియము భూగర్భములో ఏర్పడుటకు సముద్ర జల జంతువులు అక్కడి వేడికి మార్పులు చెందుటయే కారణమని ఆయననిర్వచించినాడు పెట్రోలియములో ప్రసారమయిన సమతల కాంతి కిరణ ప్రసారము వక్రీభవన మొందుట కూడ ఈ అభిప్రాయమునకు ప్రోత్సాహముగా నున్నది

చిత్రము 20



పటము 5

అణు సంశ్లేషణ క్రియవల్ల మేలిరకపు పెట్రోలును తయారు చేయు సాధనము

పెట్రోలియము యొక్క ఆవశ్యకతను గుర్తించి రసాయన శాస్త్రవేత్తలు దానిని రాసాయనిక క్రియల వలన సృష్టించుటకు యత్నములు సాగించు చున్నారు అట్టి కృషిలో ఫిషర్-ట్రాప్ష్ విధానము ఎన్నతగినది కార్బన్ మోనాక్సైడును హైడ్రోజని వాయువును 1 : 2 పరిమాణ నిష్పత్తిలో గ్రహించి ఆ మిశ్రమమును కోబాల్టు మొదలయిన లోహధాతువులను ఉత్తేజకరణులుగా వాడుచు రసాయన క్రియకు అనుకూలమైన ఉష్ణోగ్రతలో నిర్వర్తించి హైడ్రో కార్బనుల మిశ్రమమును తయారు చేయుటయే ఈ విధానము



$$n\,(C + 2\,x\,H \rightarrow)\ (CH_x)n + nH_2$$

బొగ్గుపొడిని నూనెలో రంగరించి 470°c ఉష్ణోగ్రత నందు వరకు వేడిచేసి, వాతావరణమునకు 250 నుండి 700 రెట్లు పీడన శక్తి ఉండునట్లుగా హైడ్రోజనిని అదిమి ప్రసరింప జేసినపుడు, కార్బను హైడ్రోజనీ రసాయనముగా సంయోగింపగా హైడ్రోకార్బను తేర్పడును ఈ విధానమును ఉపయోగించి కూడా పెట్రోలును సృష్టించుకొనవచ్చునని బెర్జియస్ శాస్త్రవేత్త రుజవు చేసినాడు

ఒక వంక సృష్టిలో సహజముగా లభించు ముడి పెట్రోలియమును తీర్చి దిద్దుకొనుట, మరొక వంక రాసాయనిక క్రియోపలబ్ధముగా దానిని పారిశ్రామికముగా తయారు చేసికొనుచు పెట్రోలియము అవసరాలను గడపుకొను చున్నాము మన దేశము యొక్క అవసరములను వాటితో ఎంత వరకు మన దేశములోనే లభించు సరకుతో తీర్చుకొనుచున్నామో ఈ క్రింది పట్టిక వలన తెలిసికొన వచ్చును

| మన దేశములో కందెన తైలము | 1962 | 1963 | 1964 | 1965 | 1966 | 1967 |
|---|---|---|---|---|---|---|
| అవసరాలు (టన్నులలో) | 2,97,000 | 2,67,000 | 3,91,000 | 4,54,000 | 5,00,000 | 8,00,000 |
| అస్సామ్ ఆయిల్ కంపెనీ | 25,000 | 20,000 | 41,000 | 42,000 | 40,000 | 36,000 |
| బరౌనీ | — | — | — | — | — | 45,000 |
| మద్రాస్ రిఫైనరీ | — | — | — | — | — | 2,00,000 |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| లూబె ఇండియా | — | — | — | — | — | 1,45,000 |
| హాల్ దియా రిఫైనరీ | — | — | — | — | — | 2,00,000 |
| దిగుమతులు | 2,12,000 | 2,81,000 | 3,50,000 | 4,12,000 | 4,60,000 | 1,74,000 |
| దిగుమతుల ఖరీదు లక్షల రూపాయలలో | 1,640 | 1,586 | 1,076 | 1,904 | 2,000 | 1,019 |

మన దేశములో వాడక మగుచున్న పెట్రోలియము పదార్థాల పరిమితిని, మనము దిగుమతి, చేసికొనుచున్న వాటి విలువ ఈ క్రింది పట్టిక వివరించు చున్నది

| | వినియోగ మవుచున్న మొత్తము పెట్రోలియము పదార్థములు | మనము దిగుమతి చేసికొన్న వాటిఖరీదు |
|---|---|---|
| 1961 | 8297 మిలియనుల టన్నులు | 83 52 కోట్ల రూపాయలు |
| 1962 | 9079 ,, | 87 50 ,, |
| 1963 | 10,715 ,, | 98 47 ,, |
| 1964 | 11,303 , | 91 93 ,, |
| 1965 | 12,075 ,, | 82,64 ,, |

ఈ రెండు పట్టికలలోని వివరములను బట్టి మనకు అత్యంతావశ్యక మయిన పెట్రోలియము సేకరణకు ఎంత తీవ్రమైన కృషి చేయవలసి ఉన్నదో స్పష్ట మగును అందువలననే భారత ప్రభుత్వము ఆయిల్ అండ్ నాచురల్ గాస్ కమిషనును ఏర్పాటు చేసి భూగర్భ శాస్త్రవేత్తలచే, ఎక్కడెక్కడ పెట్రోలియము గనులున్నవో కూలంకషముగా శోధించుటకు ఏర్పాటు చేయుచున్నారు అట్టి విజ్ఞానశాస్త్ర పరిశోధక బృందమునకు రోజుకటికి కనీసము పదకొండు వేల రూపాయలు ఖర్చు కాగలదనియు, వారి పరిశోధనల వలన పెట్రోలియము నూనె ఊట ఉన్నదని తెలిన చోట, నూనె కొరకు త్రవ్వ నూతికి డెబ్బది లక్షల రూపాయల వరకు వ్యయము కాగలదనియు తెలియు చున్నది అందువలన పెట్రోలియము నూనె పరిశోధన లెంత వ్యయ ప్రయాసలతో కూడినవో ఊహింప నగును

భూగర్భములో పెట్రోలియము దాగియున్నదో లేదో శోధించుటకు విజ్ఞాన శాస్త్రవేత్తలు మూడు రకములుగా పరిశోధించు చున్నారు వాటిలో మాగ్నటో మీటరుతో చేయు శోధన మొదటిది విజ్ఞాన వేత్తలు విమానములో భూతలమునకు పైన ఒక నిర్ణీతమైన ఎత్తున ప్రయాణము చేయుచు నిశితమైన విజ్ఞాన సాధనోపకరణముల సహాయముతో భూమి యొక్క అయస్కాంతిక గుణ ప్రమాణములను నిర్ణయించుదురు ఆ గుణ ప్రమాణములను వా రుపయోగించు సాధనముతే రేఖా చిత్రముగా గీయును వాటిలో వ్యక్తమగు ఎగుడు దిగుడులను బట్టి భూమి యొక్క అయస్కాంతిక లక్షణములలోని అత్యల్పమైన మార్పులు సువ్యక్తమగును అందు వలన విమానము ఎగురుచు పయనించిన దూరములో భూమి తన గర్భములో నిక్షిప్తము చేసికొన్న ధాతు సంపద, జల ప్రవాహము, నూనె చెరువులు మొదలగు వాటి ఉనికి, లేమి, ఊహించు కొనుటకు వీలగును దుర్గమమైన అడవులు, కొండలు ఉన్న ప్రాంతములో ఈ రకపు పరిశోధన సహాయకారిగా ఉండి పరిచయాత్మక జ్ఞానమును ప్రసాదించును పెట్రోలియము యొక్క అన్వేషణకై వాడు విధానములలో గురుత్వాకర్షణ నిర్ణయ విధానము రెండవది దీనిలో ప్రజ్ఞావంతులైన పరిశోధకులు ప్రోత్సాహ జనకముగా నున్న ప్రదేశములలో, కొన్ని వారములపాటు మకాము చేసి, సునిశితమైన సాధనముల నుపయోగించి అచ్చట భూమి యొక్క గురుత్వాకర్షణను నిర్ణయించుదురు వారు వాడెడు వైజ్ఞానిక సాధనములు గురుత్వాకర్షణలో కలుగు అత్యల్పమైన తేడాలను కూడ సూచించు సమర్థత కలవియు, అత్యంత సున్నితమైనవియు నైనందున, ఈ పరిశోధన మూలముగ భూగర్భములో దాగి ఉన్న రాళ్ళ స్వభావమును భూమి పొరల స్వభావమును అవగతము చేసికొనుటకు వీలగును

మొదటి రెండు విధానముల కంటె మూడవ విధాన మయిన భూగర్భ తత్త్వాన్వేషణము ఉత్తమ మైనది ఈ విధానములో భూగర్భ, భౌతిక శాస్త్రవేత్తలు, ఇంజనీర్లు, ఇతర ఆనుషంగిక శాస్త్రవేత్తలు ప్రత్యేకముగా కృషి చేసినవారు పాల్గొందురు వారు తమతో కొనిపోవు ఉపకరణములు కూడ బరువైనవి గను, శ్రమదాయక మైనవిగను ఉండును ఒక్కొక్కప్పుడు వారు అడవిని నిర్మూలించి తమ పరిశోధనలకు కావలసిన స్థలమును తెరపి చేసికొని అనుకూలముగా తీర్చి దిద్దుకొన

వలసి వచ్చును వారు తమ పరిశోధనల కొరకై 12 19 మీటర్ల (40 అడుగులు) లోతుగా ఫిరంగి గుండును ప్రేల్చుట కనువైన గోయి త్రవ్వుదురు ఆ గోతికి ఒక క్రమము ననుసరించి వేర్వేరు దూరములలో శబ్ద తరంగములను సేకరించుకొని వివర్ధన మొనర్చి ఆ శబ్ద తరంగముల వేగమును, అవి అనుసరించిన మార్గమును సూచించు భూగర్భ శబ్దగ్రాహకములను అమర్చి ఉంచుదురు లోతైన గోతిలో ఫిరంగి గుండు ప్రేల్చినపు డుత్పన్నమైన శబ్ద తరంగములు భూమిలో ప్రయాణము చేసి మధ్యే మార్గములో నున్న రాయి రవ్వల వలన పరావర్తన మొంది శబ్దగ్రాహకముల దగ్గరకు చేరుకొనును వాటి వేగమును, మార్గమును అక్కడి ఛాయాచిత్రగ్రాహక యంత్రములమూలముగా నిర్ణయించుటకు వీలగును ఈరీతిగా ఒక ప్రదేశము నుండి మరియొక ప్రదేశమునకు పరిశోధనల కొరకు మకాములు మార్చి, శోధించి నూనె గనుల ఉనికి వ్యక్తమైన ప్రాంతమును, మరల మట్టముగా శోధించి, తమ పరిశోధనలను క్రోడీకరించి, సమీక్షించి, "ఇదిగో, ఇక్కడ ఇంత... లోతున నూనె ఊట తగులు అవకాశము కలదు" అని నిర్వివాదముగ తేల్చుదురు, అప్పుడు అక్కడ నూనె బావిని త్రవ్వి అక్కడ లభించు ముడి నూనె ప్రమాణము ననుసరించి దానిని అక్కడ శుద్ధి చేయుటయో లేక మరియొక చోటునకు రవాణా చేయుటయో సాగించుదురు మన దేశములో చాలినంత ముడి పెట్రోలియము లభించ నందున ఇతర దేశములనుండి దానిని రవాణా చేసికొని శుద్ధిచేయు కర్మాగారములను కూడ ప్రోత్సహించుట జరుగును అట్టివే విశాఖ, మదరాసు పట్టణములలో నున్న నూనె శుద్ధి కర్మాగారములు

హ అ

## పెట్రోలియం, బొగ్గు, వాయ్వింధనములు

ఇంధనములు మూడు రకములు 1 ఘనేంధనములు, 2 ద్రవేంధనములు, 3 వాయ్వింధనములు, ఘనేంధనములకు బొగ్గు, ద్రవేంధనములకు పెట్రోలియము, తత్సంబంధములు, వాయ్వింధనములకు నైసర్గిక వాయువు, బొగ్గు కొలిమి వాయువు మున్నగునవి ఉదాహరణములుగా చెప్పఁబడుచున్నవి

బొగ్గు గృహోపయోగములకును, పారిశ్రామిక ప్రయోజనములకును విరివిగా ఉపయోగించు ప్రధాన ఇంధనములలో బొగ్గు ఒకటి మెత్తని గని బొగ్గు విద్యుదుత్పత్తి కుపయోగింప బడును అనేకములైన ఆధునిక పారిశ్రామిక సంస్థలు విద్యు దుత్పత్తికి క్లిష్టములైన యంత్రముల నుపయోగించి బొగ్గును వాడుచున్నవి చూర్ణ మొనర్పబడిన బొగ్గు గూడ ఉష్ణోత్పత్తికి పెక్కు సిమెంటు, తదితర పరిశ్రమలం దుపయోగ పడుచున్నది ఆధునిక యంత్రములందు శాస్త్రీయముగా అమర్పబడు ప్రక్రియల వలన, ఉత్పత్తి యగు ఉష్ణము వృధ కాక, అంతయు సవ్యముగా పారిశ్రామికోత్పత్తి కొర కుపయోగ పడును బొగ్గును ఇంకను సద్వినియోగ మొనర్చి, పొదుపు చేసికొనుటకై, దానిని కర్బన వాయువుగా మార్చ వచ్చును అనగా బొగ్గు లక్షణముల ననుసరించి, దానిని 480 డిగ్రీల నుండి 1000 డిగ్రీల సెంటిగ్రేడు వరకు ఉష్ణీకరణ మొనర్ప వలెను

అల్పోష్ణ కర్బనీ కరణము కోకింగు కాని మెత్తని గని బొగ్గును గాలితో సంపర్కము కాకుండ 600 సెంటిగ్రేడు ప్రమాణము వరకు వేడి చేసినచో, ఆవిరి లక్షణముగల పదార్థములు బొగ్గు నుండి తారు–వాయువుల రూపములో వెడలిపోవును మిగిలిన 'కోక్' అను పొగలేని బొగ్గు గృహములలో వంట పనులకును, ఇతర కార్యక్రమములకును ఉపయోగ పడును మామూలు గని బొగ్గుకంటె ఈ బొగ్గు యొక్క ఉష్ణోగ్రత తీవ్రముగ నుండును కార్బనైజర్లనుండి వాయు రూపములో పైకెగసి పోవు పదార్థములో కొంత భాగము తారు రూపములో ప్రత్యేకముగా ఏర్పడును ఘనీభవింపని వాయువులు కార్బనైజరు నందలి బర్నరుకు పంపబడుట గాని, లేక అదనపు వాయువులు నిలువ చేయబడి, వాయ్వింధనములుగా ఉపయోగింప బడుట గాని సంభవించును

తారు నుండి స్రవక్రియ జరిగిన ఫలితముగా రోడ్డు నిర్మాణమున కుపయోగపడు తారు, తారు తైలములు, తారు ఆమ్లములు మున్నగునవి బయల్వెడలును. 250 డిగ్రీల నుండి 350 డిగ్రీల సెంటిగ్రేడు ప్రమాణము గల ఉష్ణములో కాగిన అల్పోష్ణ తైలములు జల శుద్ధీకరణ మొనర్పబడి, అందుండి డీసెలు నూనె, కిరోసిను నూనె యొక్క ప్రత్యామ్నాయ ద్రవ్యములు, మోటారు స్పిరిటు ఇత్యాదు లుత్పన్న మగును

అధికోష్ణ కర్బనీకరణము కోకింగు బొగ్గును బ్యాటరీలలో అధికోష్ణముచే కర్బనీకరణ మొనర్చినచో (1000 డిగ్రీల సెంటిగ్రేడు ఉష్ణోగ్రత ప్రమాణముచే), లోహ పరిశ్రమల కుపయోగించు శ్రేష్ఠమగు అంగారక్షార లక్షణము గల కార్బోనియన్ కోకు ఘనరూపములో తయారగును పొయ్యిమీది నుండి బయల్వెడలు వాయు మిశ్రమము అమోనియా జలముతో సంపర్క మొందగా నేర్పడు కోకింగు వాయువు, తుదిసారిగా శుద్ధీకరణము నొంది, దానితో పాటు నీటి ఆవిరి, తారు, తేలికపాటి తైలములు, బరువైన జలకర్బన ద్రవ్యములు, సంశ్లిష్ట కర్బన మిశ్రమములు మిళితములై యుండును అందుండి యంత్ర పరికరములచే తారు వేరు చేయబడును 5 నుండి 10 శాతము వరకు గల సల్ఫ్యూరిక్ కామ్లము ద్వారా వాయువు సరఫరా యగును ఆ సమయములో అమోనియా విలీనమై, అమోనియమ్ సల్ఫేటుగా పరివర్తనము చెందును ఇట్టి పెక్కు ప్రక్రియల ఫలితముగా బెంజీన్, టొలుయీన్, క్సైలీన్ అను ద్రవ తైలము లుత్పత్తి యగును

తక్కువ జాతి బొగ్గును సంపూర్ణముగా వాయువులోనికి మార్చి, కార్బన్ మొనాక్సైడు గాను, ఉదజని విశేషముగా నుండు కృత్రిమ వాయువు గాను ఉత్పత్తి చేయవచ్చును

ద్రవేంధనములు ముఖ్యముగా పెట్రోలియము నుండి ఉత్పత్తి యగును ఉష్ణోత్పత్తి విషయమున, బొగ్గు తరువాత, ద్రవేంధనములు రెండవ స్థాన మాక్రమించును విద్యుదుత్పత్తి కొరకు కుపయోగింప బడు ప్రధాన వాణిజ్య సంబంధమైన ద్రవేంధనము ఇంధన తైల మొక్కటే ఈ తైలము శుద్ధికరణ యంత్రముద్వారా గ్యాసొలీను వంటి విలువ గల పదార్థముగా చౌక పద్ధతిలో మార్చ బడుటకు అవకాశ ముండదు బొగ్గుతారు, తారుతైలము, కిరోసిను, బెన్జాల్, ఆల్కహాల్ మున్నగు ఇతర ద్రవేంధనములు ఇంధన తైలము కంటె తక్కువ స్థాయిలో ఉపయోగింప బడుచున్నవి అంతర్జ్వలన యంత్రములందే ప్రధానముగా గ్యాసొలీను ఉపయోగింప బడును

కర్బనీ కరణము వలన, మెత్తని గని బొగ్గు విశేషము లను గ్యాస్ ప్రొడ్యూసర్లలో గాని, లేక జలవాయు పేటికలలో గాని సంపూర్ణముగా వాయువీకరణ మొనర్చుట వలన, జల వాయువును రాసాయనిక ప్రభావముచే ఉదజనీకరణ మొనర్చుట వలన, బొగ్గును, బొగ్గు తైలమును ప్రత్యక్షముగా రాసాయనిక ప్రభావముచే ఉదజనీకరణ మొనర్చుట వలన, బొగ్గు నుండి ద్రవేంధనములను ఉత్పత్తి చేయవచ్చును

**పెట్రోలియమ్** పెట్రోలియమ్ అను పదమునకు 'పెట్రా' (శిల), 'ఓలియమ్' (తైలము) అను శబ్దములు వ్యుత్పత్తులు అనగా శిలాతైల మని యర్థము గ్యాసొలీను, కిరోసిను, వాయు తైలము, ఇంధన తైలము మున్నగు పెక్కు ఇతర తైలములు ప్రకృతి నుండి లభ్యమగు ముడి నూనె నుండి గాని, లేక శుద్ధికరణ మొనర్ప బడిన పెట్రోలియము నుండి గాని ఉత్పత్తి యగును రాసాయనికముగా కర్బనము, ఉదజని మున్నగు మిశ్రమ ద్రవ్యముల సమ్మేళనమే పెట్రోలియము కర్బనము 84 నుండి 87 శాతము వరకును, ఉదజని 11 నుండి 13 శాతము వరకును, ఆమ్లజని, నత్రజని, గంధకము మొత్తముగా 1 నుండి 4 శాతము వరకును ఛేదించు చుండును

సాధారణముగా తైలములు, పేరాఫిన్ (తారు నుండి తయారగు మైనము వంటి ముద్ద) ప్రాతిపదిక, మిశ్రమ ప్రాతిపదిక అను రెండింటి క్రింద వర్గీకరింప బడును ఆవిరి కాగా, శేషించిన పదార్థము పేరాఫిన్ మైనమా లేక ఒక రకమైన బంక పదార్థమా లేక ఈ రెండింటి యొక్క సమ్మేళనమా అను సంశము ననుసరించి ఈ వర్గీకరణము నిర్ణయింపబడును

నైసర్గిక తైలము యొక్క గాని, దాని నుండి తయారగు ఇతర తైలముల యొక్క గాని స్వరూప స్వభావములు, వాటియందు సంయోగమగు రసాయన ద్రవ్యములపై ఆధారపడును

పెట్రోలియపు ప్రవక్రియ భూమినుండి తీయబడు ముడి నూనె నుండి మలినమును, నీటిని వేరుచేసిన తరువాత, అది ప్రవక్రియ జరుపు వేరువేరు విభాగములకు అప్పగించబడును తైలము ఏయే రంగములలో ఏయే ప్రయోజనముల కుపయోగపడునో, దానిని బట్టియు, ముడి నూనె స్వభావమును బట్టియు విపణి వీధియందలి వ్యాపార స్థితిగతులను బట్టియు, పెట్రోలియము యొక్క ప్రవక్రియ నిర్ణయింపబడును ఈ ప్రవక్రియ అధునిక శాస్త్రీయ పద్ధతుల ననుసరించి మిగుల అభివృద్ధి పరుపబడినది వేర్వేరు ప్రక్రియలను బట్టి, వేర్వేరు ప్రయోజనముల కనుకూలించు వేర్వేరు తైలములు తయారు చేయబడును

స్రవక్రియా విధానములో ఏ సాంకేతిక ప్రక్రియను అనుసరించినను, ప్రారంభ దశలో పెట్రోలియము నుండి ఒకే తరగతి గ్యాసొలీను గాని, పెట్రోలు గాని, కిరోసిను గాని, వాయు తైలము గాని (దీనికి డీసెలు తైలమని గూడ పేరు) తయారగును అటు తరువాతి శుద్ధీకరణ ప్రక్రియలు భిన్నములుగ నుండును పైన పేర్కొన బడిన వివిధ ప్రక్రియలు సాంకేతికముగను, రాసాయనికము గను సంక్లిష్టములై యుండును

ముడి పెట్రోలియము నుండి ఉత్పత్తియగు వేర్వేరు శుద్ధీకరణ పెట్రోలు తైలములలో, గ్యాసొలీను తర్వాత కిరోసిను రెండవ స్థాన మాక్రమించు చున్నది పెట్రోలు, గ్యాసొలీనులు-రెండును అంతర్జ్వలన యంత్రము లందును, పరిశ్రమ లందును, వ్యవసాయ క్షేత్రము లందును ఉపయోగింప బడుచున్నవి ముడి పెట్రోలియము నుండి ఉత్పత్తి యగు పెక్కు రసాయనముల సంయోగము, విస్తృత రాసాయనిక, పరస్పర సంబంధిత పరిశ్రమల యొక్క విశిష్ట లక్షణముగా వివరింప బడుచున్నది

**నైసర్గిక గ్యాసొలిన్** నైసర్గిక వాయువు నుండి తీయ బడు గ్యాసొలిను, శుద్ధీకరణ మగు గ్యాసొలిను కంటె భిన్నముగ నుండును నైసర్గిక వాయువు నుండి ఉత్పత్తి యగు నైసర్గిక గ్యాసొలినుకు శీఘ్రముగా ఆవిరి యయ్యెడి స్వభావ ముండును అందుచే ముఖ్యముగా మోటారు శకటములు చలి గాలిలో సులభముగా కదలుట కుపయోగపడు మోటారు ఇంధనముగా గ్యాసొలీనును మేళవింప వచ్చును నైసర్గిక గ్యాసొలీనును ఆధునిక యంత్రముల మీద సశాస్త్రీయముగా నూతన ప్రక్రియలచే తయారు చేయుట కీనాడు అవకాశములు కొల్లలుగా నున్నవి ఈ గ్యాసొలిను ఇతర శుద్ధీకరణ ద్రవ్యములతో మిశ్రిత మొనర్పబడి ప్రధానముగా మోటారు చమురును తయారు చేయుట కుపయోగ పడు చున్నది అంతే కాక, దాని నుండి విమానముల కుపయోగ పడు సున్నిత మగు గ్యాసొలిను కూడ పెక్కు శాస్త్రీయ ప్రక్రియల మూలముగా తయారగుచున్నది

**ద్రవీకరణ పెట్రోలియమ్ వాయువులు** నైసర్గిక గ్యాసొలిను నుండి ఉపోత్పత్తులుగా (by-products) తయారగు ప్రొపేన్, బుటేన్ వంటి తేలికపాటి హైడ్రో-కర్బన ద్రవ్యములు నేడు ద్రవీకరణ పెట్రోలియమ్ వాయువు పేర, వంట మున్నగు గృహ కృత్యములు నిర్వహించుటకును, నగరములలో దీపములను వెలిగించుటకును, మోటారులారీలు, బస్సులు, ట్రాక్టరులకును విరివిగా వాడబడు చున్నది

**వాయ్వింధనములు** గృహముల యందును, పరిశ్రమల యందును ఉష్ణోత్పత్తి కొరకు యంత్ర పరికరముల మూలముగా వాయువు దహింపబడు చున్నది ముఖ్యముగా ఇనుమును కరగు లోహ పరిశ్రమ లిందు కుదాహరణములు ఇదికాక, విద్యుదుత్పత్తికొరకు నైసర్గిక వాయువు, ద్రవీకరణ పెట్రోలియమ్ వాయువు, కోక్ ఓవెన్ వాయువు, బొగ్గు కొలిమి వాయువు, జలవాయువు ఇత్యాదులు కూడ ఉపయోగింపబడవచ్చును

నైసర్గిక వాయువును మినహాయించగా, వాయ్వింధనములలో ప్రధానములైన రెండు తరగతులు మాత్రమే గుర్తింపబడినవి (1) గనిబొగ్గు నుండి సంపూర్ణముగను, తైలము నుండి కొలదిగను స్రవక్రియ జరపగా ఉత్పత్తి యగు వాయ్వింధనములు, (2) కర్బన ద్రవ్యముల మీద, ముఖ్యముగా ఆవిరి వలన, గాలి వలన లేక రెండింటి సంపర్కము వలన కలుగు ప్రభావముచే నేర్పడు వాయ్వింధనములు రెండవ తరగతి ఇంధనములకంటె, మొదటి తరగతి ఇంధనములకు ఉష్ణోత్పత్తిశక్తి అత్యధికముగా నుండును

నైసర్గిక వాయువు భూగర్భములో కొన్ని ప్రాంతము లందు పెట్రోలియము ఉన్నను, లేకున్నను, నైసర్గిక వాయువు నిలువదేరి యుండును ఈ వాయువును గూర్చిన పరిజ్ఞానము శతాబ్దుల నుండి శాస్త్రవేత్తలకు తెలిసియుండినను, అది క్రీ శ 1800 సం॥ ప్రాంతమున గాని ప్రథమముగా అమెరికా ఖండములో కనుగొనబడి యుండలేదు

నైసర్గిక వాయువునందు ప్రధానముగా పేరాఫిన్ ద్రవ్యములకు సంబంధించిన హైడ్రోకర్బనములు, కార్బన్ డయాక్సైడు, నత్రజని, హీలియమ్ మున్నగునవి మిశ్రితములై యుండును ఈ నైసర్గిక వాయువునుండి ఇంధనము, నైసర్గిక గ్యాసొలీను, ద్రవీకరణ పెట్రోలియమ్ వాయువు, నల్ల కర్బనము, హీలియము, ఉదజని, పెట్రో - రసాయనములు మున్నగు ముఖ్యద్రవ్యము లుత్పత్తి యగును

శుద్ధీకరణ యంత్రాగారము లందలి వాయువులలో అపరిపూర్ణము లైన హైడ్రో కర్బనములు, ఉదజని, వాటి మిశ్రమములు చేరియుండును వాయువులలో అపరిపూర్ణము

లును, రాసాయనికముగా ప్రతిక్రియా శీలమును గల మిశ్రమములు బహుళముగా నుండుటచే, ఆధునిక తైలపరిశ్రమలో పెట్రో-రసాయనములు, మిశ్రమ క్షారజనిత గ్యాసొలీను, ప్రేలుడు పదార్థములు, విలీనీకరణ ద్రవ్యములు, ఓషధులు, కృత్రిమ రబ్బరు, ధూమికలు, రాళములు (resins) మున్నగు పదార్థములు ఉత్పత్తి యగుచున్నవి

బొగ్గు వాయువు  బొగ్గును కోకు భ్యాటరీలయందు కర్బనీకరణ మొనర్చుటవలన, బొగ్గు వాయువు ఉత్పత్తి యగును ఈ వాయువు నుండి సల్ఫ్యూరి కామ్లము సహాయమున అమోనియా ద్రావణము తారు పదార్థములు వేరు చేయబడును ఇట్లు శుద్ధీకరణ మొనర్పబడిన బొగ్గువాయువు (లేక కోక్ వాయువు) వివిధ ప్రయోజనముల కొరకు సరఫరా చేయబడును ఈ వాయువుయొక్క ఉష్ణశక్తి 500 B T U/cu అడుగులకు పైగా నుండును

బొగ్గు కొలిమి వాయువు (Producer gas)  కొలిమి యందుండు బొగ్గుగాని లేక కోకు గాని ఆవిరి రూపములో నున్న పెనుగాలిచే ప్రతిక్రియ నొందుచో, కర్బనము అధిక భాగము కార్బను మొనాక్సైడుగా మారి, ఆవిరిలో విశేష భాగము ప్రజ్వలిత కర్బనముచే వియోగము చెందిన ఫలితముగా, కర్బన-మొనాక్సైడును, ఉదజనియు ఉత్పత్తి యగును  ఇట్లు సేంద్రియ పదార్థమంతయు అల్పశ్రేణి వాయువుగా మారును ఇదియే బొగ్గుకొలిమి వాయు వనబడుచున్నది దీని ఉష్ణోగ్రత విలువ 130 నుండి 170 B T U/cu అడుగు లుండును ఈ వాయువు పరిశ్రమలయందు కొలుములలో ఇంధనముగా ఉపయోగింపబడును అంతేకాక, అంతర్జ్వలన యంత్రములలో విద్యుదుత్పత్తికి కూడ ఇది ఉపయోగపడును బొగ్గు లేక కోకు వంటి ముడిపదార్థముల ననుసరించియు, పారిశ్రామిక పరిస్థితిని బట్టియు, ఈ వాయువు యొక్క సంయోగమును, ఉష్ణశక్తియు మారుచుండును

జలవాయువు  ప్రజ్వలన శీలము గల కోకును ప్రేలుడు కొలిమిలో (blast furnace) 1000 డిగ్రీల సెంటిగ్రేడు ప్రమాణముగల అత్యధికోష్ణములో వాయుపీకరణ మొనర్చుటవలన, జలవాయువు ఉత్పత్తి యగును మాధ్యమిక స్థాయికి చెందిన ఈ వాయువుయొక్క ఉష్ణప్రమాణశక్తి దాదాపు 300 B T U/cu అడుగు లుండును దీనియందు దాదాపు సమాన అనుపాతములుగల కర్బన-మొనాక్సైడు కొంతవరకు కర్బన-డయాక్సైడు, నత్రజనితో కలిసిన ఉదజనియు మిళితమై యుండును ఈ వాయువు నుండి ప్రకాశ విహీనమైన నీలవర్ణ జ్వాల బయల్వెడలి మహాశక్తివంత మగు ఉష్ణోగ్రత నిచ్చును

ప్రేలుడు కొలిమి వాయువు – ఈ వాయువు అల్పశ్రేణికి చెందినది దీని ఉష్ణోగ్రత ప్రమాణము 95 B T U/cu అడుగులు–ఇనుమును కరగునప్పుడు ఈ వాయువొక ఉపోత్పత్తిగా భారీ పరిమాణములో తప్పక తయా రగుచుండును శుద్ధి చేయబడిన ఈ వాయువు, ఆవిరిని ఉత్పత్తి చేయుటకును, అంతర్జ్వలన యంత్రములలో విద్యుత్తును సృష్టించుటకును, కొలుములను రగుల్చుటకు ఉపయోగపడు కోకువాయువుతో సమ్మేళన మొనర్చుటకును, వినియోగింపబడును

సంపూర్ణ వాయుపీకరణము  ఈ ప్రక్రియ ననుసరించి, బూడిద తప్ప, మరే ఇతర ఘన పదార్థముకూడ మిగులనంత వరకు బొగ్గు, వాయుపీకరణ మొనర్పబడును బొగ్గుకొలిమి వాయువును ఉత్పత్తి యొనర్చు విధానముకంటె, వాయుపీకరణ విధానము భిన్నముగ నుండును  నగరవాయువునకును, బొగ్గుకొలిమి వాయువునకును మధ్యమముగా నుండు ఒక రకమైన వాయువును తయారుచేయుటయే ఈ ప్రక్రియ యొక్క భావము  ఈ విధానములలో ఎక్కువ భాగము కర్బనీకరణ జలవాయూత్పత్తుల సంయోగముపై ఆధారపడి యుండును

వివిధ వాయ్వింధనముల, ఉష్ణశక్తుల సంయోగ శాతము

| | బొగ్గు వాయువు (కోక్ ఓవేన్ వాయువు) | జల వాయువు | కర్బన జల వాయువు | బొగ్గు కొలిమి వాయువు |
|---|---|---|---|---|
| Co — | 6 8 | 43 5 | 34 0 | 30 0 |
| $Co_2$ | 1 8 | 3 5 | 3 0 | 3 5 |
| $H_2$ | 53 0 | 47 4 | 40 5 | 10 0 |
| $N_2$ | 3 4 | 4 4 | 2 9 | 54 5 |
| $O_2$ | 0 2 | 0 6 | 0 5 | 0 5 |
| ప్రోదీన్యము (Methane) | 31 6 | 0 7 | 10 2 | 1 5 |
| ప్రకాశకములు | 3 7 | — | 8 9 | — |
| మొత్తము B T U ఘ అడుగు 1 కి | 586 0 | 302 0 | 550 0 | 135 0 |

యం వేం
రా క

## పెద కోమటి వేమారెడ్డి (క్రీ శ 1402-1420)

పెద కోమటి వేమ భూపాలుడు కొండవీటి రాజ్యమేలిన ప్రభువరేణ్యుడు పరాక్రమమునకు, ప్రతిభకు, పాండిత్యమునకు ప్రఖ్యాతిని గాంచిన ఆంధ్ర నరేంద్రులలో నొకడు రెడ్డిరాజ్య స్థాపకు డగు ప్రోలయ వేముని జ్యేష్ఠ సోదరు డైన మాచ మహీపాలునికి పౌత్రుడు పెద కోమటి భూపతికిని అనంతాంబికను జన్మించిన ప్రథను పుత్ర రత్నము వేమ నామాంకితుడు ఇతని సోదరుడు మాచ నరపతి రెడ్డి ధరణీశులు తమ తండ్రి పేరులు తమ నామములకు ముందిడుకొను నాచార ముండుటచేతను, తన తండ్రి పేరు పెద కోమటి యనుట చేతను ఇతనికి పెద కోమటి వేమారెడ్డి యను పేరు వచ్చెను

ఈ పెద కోమటి భూపాలునకు వీరనారాయణ, రూపనారాయణ, జగనొబ్బగండ, సర్వజ్ఞ చక్రవర్తి, ఇత్యాది బిరుదులు గలవు ఇతడు పండిత ప్రభువై సాహిత్య చింతామణి మొదలగు గ్రంథములను సంస్కృతమున రచియించి, తన వైదుష్యమును వెల్లడి గావించెను శృంగార నైషధ కృతి భర్తయగు మామిడి సింగన మంత్రి ఈతని సచివాగ్రణి, శృంగార నైషధ కృతి కర్త యగు శ్రీనాథ మహాకవి ఇతని విద్యాధికారి అభినవభట్ట బాణబిరుదాంకితు డగు వామనభట్టు ఇతని యాస్థాన పండితుడు ఇట్టి సంస్కృతాంధ్ర సాహిత్య సౌహిత్య మింతకు నూరేండ్లకు పూర్వము కాకతీయ రెండవ ప్రతాపరుద్రుని యాస్థానమున వెలసెను తరువాత నూరేండ్లకు కృష్ణరాయల యాస్థానమున గాని ఇట్టి సన్నివేశము సంభవింప లేదు ఇదియే పెద కోమటి వేమ భూపాలుని కొండవీటి సంస్థాన కీర్తి ధ్వజము

కోమటి వేముడు కొండవీటి రాజ్య మధిష్ఠించుటకు పూర్వము ప్రోలయ వేమారెడ్డి మనుమ డగు కుమారగిరిరెడ్డి రాజ్య పాలకుడుగా నుండెను కొండవీడు రాజ్యము శ్రీనాథుడు వర్ణించినటుల "ముగురు రాజులకును మోహంబు పుట్టించు గురుతైన యురితాడు (కొండవీడు)"గా నుండెను ముగురు రాజు లెవరనగా నరపతులైన విజయ నగరాధీశులు, హయపతులైన బహమనీ సులతానులు, గజపతులైన కళింగావనీ పతులు ఈ రాజ్యమునకు పడమటను, దక్షిణమునను విజయ నగర రాజ్యము ఉత్తరమున బహమనీ రాజ్యము, దేవరకొండ రాజకొండ పద్మనాయక సంస్థానములు, తూర్పున కళింగ రాజ్యము ఉండెను ఈ రాజ్యాధిపతులు కొండవీటి రాజ్యము నాక్రమించుటకు ప్రయత్నించుచుండిరి కాని రెడ్డిరాజన్య విజృంభణము వారిని విఫల మనోరథుల గావించు చుండెను కుమారగిరి నృపాలునకు తన భగినీ భర్తయైన కాటయ వేమారెడ్డి సైన్యాధిపతియు, సచివుడును నైయుండి కొండవీటి రాజ్యము శత్రువుల పాల బడకుండ కాపాడు చుండెను కాని కుమార గిరి రెడ్డి కొండవీటి రాజ్యము నధిష్ఠించిన దాదిగ దాయాదుల వైర మెదుర్కొన వలసిన వాడై యుండెను రెడ్డిరాజ్య స్థాపకు డగు ప్రోలయ వేముని కాలము నుండి, కుమార గిరి పాలనారంభము వరకు కొండవీటి రాజ్యము దినదినాభి వృద్ధిని గాంచి, తూర్పు తీరమున సింహాచలము వరకు వ్యాపించి యుండెను ఆ రాజ్యము ప్రోలయ వేముని సంతతి వారే పరిపాలించు చుండిరి రాజ్య మెప్పుడును వీరకోజ్యము ప్రోలయ వేముని జ్యేష్ఠ సోదరుడగు మాచారెడ్డి సంతతి వారు, ప్రోలయ వేముని సంతతి వారికి సామంతులుగనో, సహచరులుగనో యుండిరి వీరిలో పెద కోమటి వేముడు బహు పరాక్రమ వంతుడు తన పౌరుష, పాండిత్య ప్రభావములచే కుమార గిరి, కాటయ వేములకు సాటివాడు రాజ్యము జ్యేష్ఠ సోదర కుటుంబమునకు చెందక, కనిష్ఠ సోదర వంశ పరంపరా ప్రాప్త మగుటచే, సహజమగు వైరము వొడమె, ఈ రెండు కుటుంబములకు దాయ విరోధము సంభవించెను ఈ పంటకుల వంశజులు రెండు పక్షములుగా చేరిరి కొందరు కుమారగిరి ప్రాపును, మరి కొందరు పెద కోమటి వేముని ప్రాపును అనుభవించు చుండిరి దీనికి తోడుగా కాటయ వేముడు కుమార గిరి రెడ్డి కాలమున, అతని యాజ్ఞానుసారముగా, పూర్వ దిగ్విజయ యాత్ర వెడలి, సింహాచల ప్రాంతము వరకు గల భూభాగమును కొండవీటి రాజ్యములో చేర్చి, రాజమహేంద్రవర దుర్గ ప్రాంతమున ప్రముఖులై యున్న దువ్వూరి రెంటివ అల్లాడ రెడ్డిని అతని కుమారులు వేమ, వీరభద్ర, దొడ్డారెడ్లను కొండవీటి ప్రభువులకు సామంత యాండలికులనుగా నొనర్చి, కొండవీటి రాజ్య భార భరణ దక్షు డయ్యెను వీరు కుమార గిరి రెడ్డి పక్షము వారైరి వీరే కాటయ వేముని పూర్వ దిగ్విజయ యాత్రలో పాల్గొని యాతనికి విజయమును చేకూర్చిన వారు దీనికి ప్రతిఫలము వీరికి రాజమహేంద్రవర రాజ్యము లభించుటయే

కాటయ వేమారెడ్డి తన కుమార్తె యగు అనితల్లిని అల్లాడ వేమారెడ్డి రెండవ కుమారుడగు వీరభద్రారెడ్డి కిచ్చి వివాహ మొనర్చెను కుమారగిరిరెడ్డి తనయు డగు రెండవ అనపోతారెడ్డి మరణించిన తర్వాతను, కాటయ వేమారెడ్డి కుమారు డగు రెండవ కుమారగిరిరెడ్డి స్వర్గస్థుడైన పిమ్మటను, రాజమహేంద్రవర రాజ్యమును అల్లాడ రెడ్డియే స్వతంత్రుడై పరిపాలనము గావించెను

కుమారగిరిరెడ్డి, తాను బ్రతికి యుండగనే తన కుమారు డగు అనపోతారెడ్డిని, రాజమహేంద్రవర రాజ్యమునకు ప్రతినిధిగ నియమించెను కాని దురదృష్ట వశమున నతడు తండ్రి బ్రతికి యుండగనే మరణించెను అంత కుమారగిరి రెడ్డి తన సచివుడును, సైన్యాధిపతియు, తన సామ్రాజ్య సంభరణ దక్షుడును నైన కాటయవేముని రాజమహేంద్రవర రాజ్యాధి నేతనుగా నియమించెను ఈ నియమముచేత కొండవీటి రాజ్యము రెండు ఖండము లయ్యెను కుమారగిరి రాజ్యావసాన కాలమున రాజ్యమునందు క్షామము సంభవించెను ఒక ప్రక్క విజయ నగరాధీశులు, వేరొక దిక్కు గజపతులు మరియొక వైపు బహమనీ సుల్తానులు కొండవీటి రాజ్యముపై దండెత్తి వచ్చిరి రాజ్యమునందు శాంతి భద్రతలు పూజ్యము లయ్యెను అంత, కుమారగిరి రెడ్డియు, కాటయ వేముడును కొండవీడు విడనాడి రాజమహేంద్రవర దుర్గమునకు జేరుకొనిరి ఇట్టి తరుణమున పెదకోమటి వేమారెడ్డి కొండవీటి రాజ్య ప్రభు వయ్యెను కుమారగిరి రెడ్డి భూపాలునితో ప్రోలయ వేముని రాజవంశ మంతరించెను

పెదకోమటి వేమారెడ్డి క్రీ శ 1402 సం॥ లో కొండవీటి రాజ్య మధిష్ఠించెను ఆతనికి కులక్రమాగతమై సామ్రాజ్య సింహాసనము నేటికి లభించె నవచ్చును

పెదకోమటి వేముడు కొండవీటి సింహాసన మధిష్ఠించుటకు పూర్వము విజయ నగరాధీశులు కొండవీటి రాజ్యములోని పశ్చిమ భాగము నాక్రమించు కొనిరి ఆ కాలముననే విజయనగరములో రాజ్యాంతఃకలహములు సంభవించెను ఇది యదనుగా గొని వేముడు వెంటనే యా పరరాజాక్రాంతమైన భూభాగమును వశపరచు కొనెను తర్వాత అతడు కాటయ వేముని అధికారమున నున్న రాజమహేంద్రవర రాజ్యమును కైవసము గావించు కొనుటకు భగీరథ ప్రయత్నము గావించెను ఈ యుద్ధములలో కాటయ వేమునకు అల్లాడ రెడ్డి సహాయ భూతుడై పెదకోమటి వేముని ప్రయత్నములకు విఘ్నము కలిగించు చుండెను ఈ అల్లాడ రెడ్డి ప్రోలయ అనవేమ భూపాలుని మనుమరాలి మగడు కాటయ వేముని మేనమామ యగు అనపోత భూపాలుడే అల్లాడ రెడ్డి భార్య వేమాంబకు పెద తండ్రి కావున కాటయ వేముడును అల్లాడ రెడ్డి భార్య వేమాంబ తల్లియును మేనత్త మేనమామ బిడ్డలు ఈ సంబంధ బాంధవ్యముచే అల్లాడ రెడ్డి పెదకోమటి వేమునకు ప్రత్యర్థియై నిలచెను ఎట్టకేలకు పెదకోమటి వేముడు భక్తిరాజకుమారుడైన అన్నదేవ చోడునితో సహకరించి, కాటయ వేమునిపై దండెత్తి పోయి వెలమ వీరుల సహాయముతో ఆతనిని సంహరించెను ఈ యుద్ధములో కాటయ వేముడు కర్ణాటాధీశుడగు మొదటి దేవరాయల సహాయము నర్థించినను ఫలము లేకపోయెను దెబ్బది యేడు పద్మనాయక గోత్రములలో కొప్పునూళ్ళ వంశజు డగు గజరావు తిప్పనాయుడు కోమటి వేముని పక్షమున ఈ యుద్ధములో పాల్గొని కాటయ వేముని వధించి 'కాటయ వేముని తలగొండుగండ' యను బిరుదమును వహించెను

కాటయ వేముడు మరణించినను రాజమహేంద్రవర దుర్గము కోమటి వేముని వశము కాలేదు కాని యతడు యత్నము విడనాడ లేదు అల్లాడ రెడ్డికి కర్ణాటాధీశులు మిత్రులు వీరు కొండవీటి రాజ్యమునకు ప్రక్కలో బల్లెమై యుండిరి కర్ణాటాధీశులకు బహమనీ సుల్తానులు వైరులు అంత పెదకోమటి వేముడు కర్ణాటాధీశ్వరుల వైరియును బహమనీ సుల్తానును నగు ఫిరోజిషా స్నేహ మర్థించి, మరల రాజమహేంద్రవర దుర్గముపై దండెత్తి పోయెను కర్ణాటాధీశుడగు ప్రథమ దేవరాయలు అల్లాడ రెడ్డికి తోడ్పడ వలెనను తలంపుతో విపులమగు సైన్యమును గూర్చి, కొంత భాగమును తెలంగాణా దుర్గములపైకిని, కొంత భాగమును కొండవీటి రాజ్యమునకు తూర్పు తీరమున నున్న మోటుపల్లి రేవు పట్టణముపైకిని దాడికై పంపెను ఇది గమనించి ఫిరోజిషా తన రాజ్య సంరక్షణార్థము, రాజమహేంద్రవర దుర్గము ముట్టడి మాని, స్వదేశమునకు పలాయనమై పోయెను పెదకోమటి వేముడును అల్లాడ రెడ్డి సైన్యములను నేటి పశ్చిమ గోదావరీ మండలమున నున్న రామేశ్వరము దగ్గర ఎదుర్కొని, యుద్ధమునం దోడిపోయి నిజ రాజధానికి మరలి పోయెను

పెదకోమటి వేముడు ఫిరోజిషాతో నెరపిన మైత్రి తుదకు ప్రాణాంతక మయ్యెను బహమనీ సుల్తానులకును, వారి సామంతులుగ నుండిన పద్మనాయక వెలమ వీరులకును అభిప్రాయ భేదములు పొడసూపి, తురుష్కులతోడి కోమటి వేముని మైత్రిని విరసించు చుండిరి వీరు విజయనగర సామ్రాజ్యాధీశులకును, బహమనీ సుల్తానులకును జరగిన యుద్ధములలో విజయనగర సామ్రాజ్యాధీశుల పక్షము వహించిరి అంత వేమునకును, వెలమ నాయకులకును విరోధములు ప్రజ్వరిల్లెను ఒక ప్రక్క పెదకోమటివేమునకును అతని సోదరు డగు మాచారెడ్డికిని, వేరొక ప్రక్క కుమార మాదానాయకుని కుమారుడైన వేదగిరి లింగమనేడులకును యుద్ధములు సంభవించెను వేదగిరి మాచారెడ్డిని సంహరించి యాతనికి బొమ్మ పెట్టెను ఈ పగ సాధించుటకు పెద కోమటి వేముడు వేదగిరిపై దండెత్తి పోయి, యతని నోడించి యాతని బొమ్మను తన తమ్ము పడిగమున బెట్టించెను ఈ పగను సాధించుటకై వెలమ వీరుడైన లింగమనేడు ముమ్మడి సింగభూపతితో గలసి, పెదకోమటివేముని నోడించి, విజయాంకములుగ వేముని సింహలాంఛనమును, 'నందికంత పోతురాజ'ను ఖడ్గమును గొని పోయెను ఈ యుద్ధములో వెలమ వీరులు వేముని వధించి రనియు దెలియు చున్నది పెదకోమటివేము డెట్టి పరాక్రమవంతు డైనను, ఆనాటి రాజకీయ రంగములో ప్రజ్వరిల్లుచున్న పరస్పర వైర పవానల కీలల కాహుతి యయ్యెను ఈ దుర్ఘటన క్రీ శ 1420లో సంభవించెను

**వేముని కుటుంబము** కోమటి వేమునకు మాచారెడ్డి యను సోదరు డుండెను ఈవేముడును, మాచయయు రామలక్ష్మణులవలె నుండిరి వేముడు తాను కొండవీటి రాజ్యము నేలుచున్నపుడే, కొండపల్లి సీమను మాచారెడ్డి కిచ్చివేసెను వేముని భార్య సూరాంబ వీరి కుమారుడు రాచవేమారెడ్డి ధాన్యవాటీ పురాధీశ్వరుడైన గన్నభూపాలుని దౌహిత్రుడు తనతల్లి సూరాంబ కట్టించిన సంతానవారిధి యను తటాకమునకు జగనొబ్బగండ కాలువను త్రవ్వించిన విషయము దెల్పు శాసనము తప్ప ఇతనిని గూర్చి ఇతర సంగతులు తెలియవు ఇతడు నాలుగేండ్లు పరిపాలనము గావించెను కొండవీటి రాజ్యము కళింగ నృపతులకును, తరువాత కర్ణాటకులకును వశమయ్యెను ఈతనితో మాచారెడ్డి వంశ మంతరించెను

**కోమటి వేముని వైదుష్యము** కోమటివేముడు అలంకార శాస్త్ర గ్రంథములలో నుత్కృష్టమైనదని చెప్పబడిన 'సాహిత్య చింతామణి' యను గ్రంథమును రచించెను ఆ గ్రంథములో తాను రచించిన 'యథామమైవ తాణే'యనియు, 'యథామమేవ కావ్యే వీరనారాయణ చరితే' యనియు ఇతర గ్రంథముల నుదాహరించెను అమరు శతకమునకు శృంగార దీపిక యను వ్యాఖ్యానము రచించెను హాల విరచితమైన సారతరమైన నూరు ప్రాకృతగాథలకు సప్తశతీసారటీకయను గ్రంథమును వ్రాసెను పైని పేర్కొనబడిన సాహిత్య గ్రంథములుగాక, సంగీత చింతామణియను గ్రంథమునుగూడ రచించెను కావుననే ఆతని యాస్థానకవులగు వామనభట్ట బాణుడును, శ్రీనాథకవియు ఇతనిని సర్వజ్ఞ చక్రవర్తి యని పేర్కొనినారు

"శ్లో చూడామణిర్నృపాణాం,దుర్మద పరిపంథి శిఖరి దంభోళిః
సర్వజ్ఞ చక్రవర్తీ పెదకోమటి వేమభూపతిర్జయతి"

ఈ సర్వజ్ఞ చక్రవర్తి అను బిరుదము తన పాండిత్యమును బట్టి వహించి యుండెను ఇతని కాలముననే రాచకొండ రాజధానిగా తెలంగాణా ప్రాంతమును పాలించు చుండిన పద్మనాయక కులతిలకుడగు రావుసింగభూపాలుడు సాహిత్య చింతామణి, సంగీత చింతామణి యను గ్రంథములకు ప్రతిగా రసార్ణవ సుధాకర మను అలంకార శాస్త్ర గ్రంథమును, సంగీత సుధాకర మను సంగీత శాస్త్రగ్రంథమును రచించి, 'సర్వజ్ఞ' బిరుదమును వహించి వాసి కెక్కెను సంగ్రామ రంగమునందే గాక సాహిత్యరంగము నందును వెలమలు, రెడ్లు ప్రతిస్పర్థులు

**వేమ భూపాలుని ఆస్థానము** వేమభూపాలుని యాస్థానమున పేరెన్నికను గన్న గొప్ప సంస్కృత కవి వామనభట్ట బాణుడు వీరనారాయణ చరిత్ర మను నామాంతరము గల వేమభూపాల చరిత్రమను నాఖ్యాయికను, నలాభ్యుదయము, రఘునాథ చరిత్రము, బాణాసుర విజయము అను కావ్యములను, పార్వతీ పరిణయము, కనకలేఖ అను నాటకములను, శృంగార భూషణ మను భాణమును, శబ్దచంద్రిక, శబ్ద రత్నాకర మను నిఘంటువులను, హంసదూత మను దూత ఖండ కావ్యమును ఇతడు రచియించెను ఇతడు వత్సగోత్రుడు, కోమటి యజ్వకుమారుడు, మాధవ విద్యారణ్యుని శిష్యుడు

వేమభూపాల చరిత్రము గద్యకావ్యము ఇందు బాణ భట్టుని హర్ష చరిత్రమునకు ప్రతిబింబమై, పెదకోమటి వేముని చరిత్ర వర్ణింపబడినది చారిత్రక విషయము స్వల్పము ఇందు అద్దంకిపుర వర్ణనము, ప్రోలయ వేముని వంశ వర్ణనము, పెదకోమటి వంశవర్ణనము కలవు ఈతనికి అనంతాంబయందు వేమ, మాచతనయుల జననము, పెదకోమటి పట్టాభిషేకము కళింగాధీశునిపై ఆతని పూర్వ దిగ్విజయ యాత్ర, గంగాతీర యాత్ర, ఆతడు అచ్చట చేసిన దానధర్మములు, స్వదేశాగమనము, దక్షిణదేశ దిగ్విజయ యాత్ర, తర్వాత పశ్చిమ, ఉత్తర దేశములపై అతడొనర్చిన దండయాత్ర, ఆత్మపురీగమనోన్ముఖుడై వచ్చునపుడు వింధ్యగిరి యరణ్యమునందు ఆతనికి లభించిన చండికాలయ దర్శనము, మార్గమునందలి దక్షారామ "భీమేశు" దర్శనము స్వదేశమునకు పునరాగమనము మొగలైన వర్ణనములతో గ్రంథము సమాప్తి నొందెను

**శ్రీనాథుడు – విద్యాధికారి :** శ్రీనాథ మహాకవి పెదకోమటి మంత్రి శిఖామణియైన మామిడిసింగనకు ఆంధ్ర నైషధకావ్య మంకితము గావించెను పెదకోమటి యాస్థానమున నుండి వేమభూపాలునకు అష్టాదశ పురాణములు వినిపించి, పండితవరేణ్యుల విద్యాపరీక్షలు నిర్వహించి, తన కీర్తిని ఆంధ్ర మండలమునం దంతటను వ్యాపింపజేసికొనెను పెదకోమటి వేము దొసగిన దాన శాసనములను పెక్కింటిని శ్రీనాథకవియే రచించినాడు వెలువడిన వాటిలో

శ్లో॥ విద్యాధికారీ శ్రీనాథో వీరశ్రీ వేమభూపతేః।
ఆకరోదాకరో వాచాం నిర్మలం ధర్మశాసనమ్॥

అను శ్లోకము శాసనములందు గలదు

**పెదకోమటి వేముని సచివాగ్రణి సింగనామాత్యుడు :** మామిడి సింగనామాత్యుడు వేమభూపతి మహాసామ్రాజ్యరక్షామణియై వరలెను ఇతడు రాజకీయవేత్త యగుటయేగాక సాహిత్యవేత్తయునై యుండెను జ్యోతిష సిద్ధాంత భాగమున అసమాన ప్రజ్ఞావంతుడై సోమసిద్ధాంతమునకు గూఢార్థ దీపిక యను వ్యాఖ్యానము రచించెను ఈ సచివాగ్రణికే శ్రీనాథుడు నైషధకావ్య మంకితమిచ్చెను సింగనామాత్యుని కొల్వుకూట మిట్లు వర్ణింపబడినది

"మృదు మధుర చిత్ర విస్తర కవితావిలాస వాగీశ్వరు లగు కవీశ్వరులచేతను, పతంజలి కణాదాక్షచరణ పక్షిలాది శాస్త్రసిద్ధాంత కమలవన హంసులగు విద్వాంసులచేతను, భరతమతంగ దత్తిలకోహ లాంజనేయ ప్రణీత సంగీత విద్యా రహస్య విజ్ఞాన వైజ్ఞానిక స్వాంతులగు కళావంతులచేతను, శక్తిత్రయ, చతురుపాయ-షాడ్గుణ్య ప్రయోగ యోగ్య విచారులగు రాయశారులచేతను, నిఖిల పురాణేతిహాస సంహితా తాత్పర్యాలోచనా ధురంధర ధిషణాసముత్సాహులగు పౌరాణిక వర్యులచేతను పరివేష్టింపబడిన గొల్వుకూటంబున సరస సాహిత్యగోష్ఠివినోదప్రసంగం బులు జరుపుచుండు"

ఇట్టి సచివ చింతామణి ఈతనికి ముందు జన్మించి యుండలేదు ఇతని తర్వాత ఈతనికి ఉద్దియైనవాడొక శతాబ్దము తర్వాత సాళువ తిమ్మరుసు మంత్రి యొకడే

**పండిత పోషణము** పెదకోమటి వేముడు భూలోక ధన్వంతరి యని పేరొందిన భాస్కరాచార్యుడు బ్రహ్మసూర్యాది సిద్ధాంతవేత్త యగు పెద్దియజ్వ, తర్కమీమాంసా వ్యాకరణాది శాస్త్ర పండితు డగు సింగనార్యుడు మొదలగు పండితులకు అనేక అగ్రహారముల నిచ్చి సత్కరించెను

**గృహ రాజ సౌధ నిర్మాణము** పెదకోమటి వేముడు కొండవీటిలో అత్యద్భుతమగు రాజసౌధమును నిర్మించినట్లు శ్రీనాథుని ఫిరంగిపుర శాసనమువలన ద్యోతక మగుచున్నది

**పెదకోమటి వేముని ప్రశస్తి**

(1) శ్లో॥ జ్ఞాతాయది నహిదాతా, దాతాచేత్కోఽపి
భువి నచ జ్ఞాతా, ।
జ్ఞాతా దాతా చాభూః, పెదకోమటి వేమ
భూపతే చిత్రమ్॥

(2) శ్లో॥ శ్రితజన పోషణ–రిపుశోషణ–బుధతోషణ–
సత్యభాషణాదిగుణాన్,
దధతే దశరథరామః ప్రాగద్యతు కోమటి వేమ
విభు వేమః॥

కుం ఈ ద

## పెద్దాపురము

**పూర్వ చరిత్ర** పూర్వకాలమున క్రీ శ పదునారవ శతాబ్ది మధ్యమునుండి పందొమ్మిదవ శతాబ్ది మధ్యభాగము వరకు తూర్పుగోదావరి మండలమున ప్రఖ్యాతివహించిన పెద్ద సంస్థానము పెద్దాపుర సంస్థానము వత్సవాయివంశ్య, జగపతి బిరుద క్షత్రియ శిఖామణులకు కాణాచియై వారి సంస్థానమునకు ప్రధానమగు పట్టుగొమ్మయై పెద్దాపురము మూడువందల సంవత్సరములు భోగభాగ్యములకు నిలయమై

విలసిల్లెను ఈ సంస్థాన మాకాలమున కిమ్మూరు సీమలోని యంతర్భాగము కాకతీయ సామ్రాజ్య మంతరించిన పిదప కిమ్మూరు సీమ, రెడ్ల, గజపతుల హస్తగత మయ్యెను గజపతుల సామంతులలో నొక డగు పెద్దాపాత్రు డనువాడు కిమ్మూరు సీమకు సరదారుడై తమిరె యను గ్రామమున నొక కోట నిర్మించి, బురుజులు తీర్పించి, కోటకు దక్షిణమున తన పేరిట పెద్దాపుర మను పేటను గట్టించి, యచ్చట ప్రభుత్వము నెరపెను అప్పటికే యా ప్రాంతమున వత్సవాయి కుల క్షత్రియ యోధులు ప్రబలులై యుండిరి ఈ పెద్దా పాత్రుని పరిపాలన కాలముననే, వత్సవాయివంశ రాజులకు పూర్వుడైన శ్రీ తిమ్మ జగపతిరాజు తన బాహు పరాక్రమముచే, కిమ్మూరు సీమను వశపరచుకొని, పెద్దాపుర దుర్గమును సాధించి, నాటి గోల్కొండ నవాబుల మహమ్మదీయ సరదారుల నక్కడంచి, స్వతంత్రుడై, సంస్థానమును పాలింప నారంభించెను ఇయ్యది క్రీ శ 1555, సం॥న జరిగిన వృత్తాంతము

ఈ వత్సవాయి వంశపువారి మూల పురుషుడు సూర్య వంశజుడై కృష్ణామండలములోని గుడిమెట్ట రాజధానిగాగల చాగిపోతరాజైనట్లును, ఈతని వంశమువాడైన రామ నృపాలుడు తన నివాసమును వత్సవాయి నగరమునకు మార్చినందున, నాటినుండియు సాగివా రనుట మారి, వత్సవాయివారైనటులును రామవిలాస కృతికర్త యగు ఏనుగు లక్ష్మణ కవి

" . .

తగవత్సవాయాఖ్య నగరంబు నిజ నివా
సముచేసె నది కారణముగ సాగి
వంశమునకు వత్సవాయ నామము లోక
సుప్రసిద్ధమగుచు నొంపుగాంచె
"

అని వ్రాసియున్నాడు

మార్కండేయ పురాణోత్తర భాగములో వత్సవాయ సంజ్ఞ గల పురుషునిచే, వీరి వంశమునకు వత్సవాయివారని పేరు వచ్చినట్లును, వీరు సూర్యవంశోద్భవులయినట్లును తెలుపబడినది

"గోదావరీ తట ప్రాంతపుళింద విషయాధిపం
మహానందేశ్చ పౌత్రంచ మార్తాండకుల సంభవం
వత్సయూవస్య తనయం వత్సవాయం మహీపతిం
కీర్త్యాకరం సమాదాయ సొంగదేశం గమిష్యతి"

వత్సవాయి యను గ్రామము జగ్గయ్యపేటకు ఆరు మైళ్ళ దూరమున నున్నదట అదియును గాక పూసపాటి రాచి రాజు, వసిష్ఠ గోత్రోద్భవు లగు రాచవారి కుటుంబములను గూర్చి తాను వ్రాసిన సీసమాలికలో వత్సవాయి వారికి వత్సవాయి సంజ్ఞ యెట్లు కలిగెనో ఇట్లు తెలిపినాడు

సీ॥ మామకవంశ భీమనృపాలు ౘచివుండు
ఉండ నాగాగ్రణిదానరాజు,
వేములవాడ భీమమునీషిచే రామ
గోపాల చరితంబు గొనిన మేటి,
వత్సవాయిని చంద్రవర్మచేగిరిౘధి
గగనార్కశకముల కాస్కనొంది,
పజ్జాపురి ముకట్టి సకలారి ముంౘల
భయద ప్రతాపంబు పొదుకొలిపి,
వెలసె తక్వంశ్యులిల వత్సవాయి వార
లైరి

1 తిమ్మరాజు (క్రీ శ 1555-1607) వత్సవాయి వంశమునకు మూలపురుషుడు రామురాజైనను, ధానరాజైనను సంస్థాన సంపాదకుడు ఈ తిమ్మరాజే ఇతడు కృతి నందిన శేషధర్మ కావ్యమునందు, వెలుతురుపల్లి విశ్వనాథకవి, వీరి మూలపురుషుడు తిరుమలరాజు, ఆతని కుమారుడు నాగిరాజు, అతని పుత్రుడు తిప్పరాజు, అతని పుత్రుడు జగ్గరాజు (జగన్నాథ రాజు), ఆతని కుమారుడు పేరరాజు, ఆతని కుమారుడు తిమ్మరాజు అనియు చెప్పియున్నాడు ఈ తిమ్మరాజే కృతికర్త ఇతనికి చతుర్భుజ డనియు, పేషణీహనుమంతు డనియు, నేలగోలుగండ డనియు, హనుమత్కేతన ద్వితీయార్జును డనియు బిరుదులు గలవు ఏనుగు గుర్వమంత్రియు, ఇతని సోదరుడు గురురాజును, పోలప్రెగ్గడ సూరమంత్రియు, ఇతని ప్రధానులు ఈతడు పాలించిన ప్రదేశము, నేటి పెద్దాపురము తాలూకా, తుని, పిఠాపురము డివిజనులు, రామచంద్రపురము తాలూకాలో నెక్కువ భాగము జడ్డంగి, తోటపల్లి మొదలగునవి కల మన్యప్రాంతమునకు విస్తరించియుండెను ఈ తిమ్మరాజు పరాక్రమము రామవిలాసములో ఏనుగు లక్ష్మణకవి ఇట్లు వర్ణించియున్నాడు

(1) రణమున గుఱ్ఱంపు రౌతుల బరిమార్చె
హాసిగా నెఱజెర్ల వారి లోన
పెద్దాపురంబున బిరుదాంక పురిలోన

యవన వీరులఁ బరాభూతులఁ జేసె
ప్రతిఘటించు నరేంద్ర సుతుని దర్పమడంచెఁ
దిరుపతి చెంత భూవరులు మెచ్చ
దూరుపునాట శత్రుకుత్ర నక్షత్ర
రుచి రూపుమాపె సూర్యుండనంగ
అంగ వంగ కళింగ చోళాది దేశ
వసుమతీ నాథ సభలలో వార్త కెక్కె
వత్సవయ పేర ధారుణీశ్వరుని సుతుడు
రమ్య గుణశాలి శ్రీ తిమ్మరాజ మౌళి

(2) తుల్యా మాహాత్మ్యములో, షేరు మహమ్మదుఖాను, ఇతనికి పైడి యొరవాలు ఇచ్చినట్లు ఈ కవి వర్ణించియున్నాడు

గీ॥ అందరికి తన చేయిమీదనిన బిరుదు
డిక్కతిమ్మనృపతి పతిపైడి యొరవాలు
షేరు మహమదుఖానుని చేతనందు
నపుడు తనచేయి మీదుగా నందుకొనియె ॥

2 రాయ జగపతిరాజు (క్రీ శ 1607–1649) తిమ్మరాజు జ్యేష్ఠసుతుడు రాయజగపతిరాజు ఈ రాయజగపతిరాజు తండ్రి వలెనే బహుపరాక్రమవంతుడై, రాజ్యమును వృద్ధిపొందించినట్లు ఏనుగు లక్ష్మణ కవి తుల్యా మాహాత్మ్యములో నిట్లు వర్ణించి యున్నాడు

సీ॥ సుల్తనబుల్ హసన్ క్షోణీశ్వరునిచేత
మాటిమాటికి బహుమాన మొందె
మరియును బింగళిమాదన్న ఖానుజీ
మంత్రజ్ఞులవలన సమ్మాన మొందె
అక్కన్న మొదలైన యట్టి పెద్దలచేత
మేలు భూషణములు మెప్పు లందె
పరులక్కరులకు దుష్కరము లౌగడిదుర్గ
ముల గొట్టి వారిచేఁ బూజలందె
గీ॥ పీఠికాపురి కిమ్మూరు బిక్కవోలు
తునియుఁ గొత్తా మొల్లేరు ఘనత నేలె
వత్సవయతిమ్మ నృపాల వరుని సుతుడు
రాజమాత్రుడె రాయపరాజ శౌరి

ఈతని కాలముననే ఈ సంస్థానాధీశులకు జగపతి బిరుదము సుల్తాన్ శహా బహద్దరు అబుల్ హసన్ చే లభించినట్లు తెలియుచున్నది రాయవేశ్యా భుజంగుడనియు, గండరగండడనియు నితనికి ఇతర బిరుదులును గలవు.

3 సార్వభౌమ తిమ్మజగపతిరాజు (1649–1688) రాయపరాజు కుమారుని ప్రశస్తిని గూర్చియు, విజయములను గూర్చియు, ఏనుగు లక్ష్మణకవి రామవిలాసమున నిట్లు వర్ణించియున్నాడు

సీ॥ రాజులు మెచ్చఁ బల్లాకోట సాధించె
నరహరదేవు దుర్నయ మడంచె
గుదురైన రావిణీ కోటలగ్గలు వట్టె
యోదు కోటంతయు నుర్విగలపె
దుగరాజు మొదలైన వొరలను భంగించి
విశ్వంభరుని యుద్ధ నిరతుఁ జేసె
దగిఁ భూసపాటి సీతారామ భూపాలు
డభినుతింపంగ జయంబు గాంచె
గీ॥ పరిసవతు యవనాధీశుఁ దురగపతిని
గయ్యమున గెల్చి లోక విఖ్యాతిఁ జెందె
వత్సవాయా న్వయమునకు వన్నె తెచ్చె
రాయప నృపాలు శ్రీ తిమ్మరాజమౌళి
ఉ॥ రాజులలోన వత్సవయిరాజులు ధన్యులు, వారిలోపలన్
దేజముగాంచెఁ బేరనృపు తిమ్మమహీశ్వరుఁ డంతకన్న రా
రాజయి మించె రాయప ధరావిభుఁ డాయనకంటె వైభవ
భ్రాజితుఁ డయ్యెఁ దిమ్మనృపరత్నము రాజకిరీట శోభియై

ఏనుగు లక్ష్మణకవి తాతయైన లక్ష్మణకవి ద్రౌపదీ పరిణయ మను కావ్యమును సార్వభౌమ తిమ్మరాజున కంకిత మిచ్చెను

4 ఉద్దండరాయ జగపతిరాజు (1688–1714) ఇతడు సార్వభౌమ తిమ్మరాజు తమ్ముడైన బలభద్రరాజు కుమారుడు ఇతని ప్రాభవౌన్నత్యములనుబట్టి ఉద్దండబిరుదము చేకూరెను ఈతని కాలముననే పిఠాపుర సంస్థానాధీశ్వరు డగు రావు మాధవరాయడు తన్నెదిరింపగా, నాతని నోడించి పద్మనాయక వీరుల నుక్కడంచినట్లు ఏనుగు లక్ష్మణకవి ఈ క్రింది పద్యములో శ్లేషించి, చమత్కరించి యున్నాడు.

గీ॥ రూపునసెకాదు విక్రమాటోపమునను
మాధవుని గెల్చి విఖ్యాత మహిమగాంచెఁ
బద్మనాయక విజయంబుఁ బదిలపఱిచెఁ
దేజమున రాయపక్షమాధీశ్వరుండు ॥

5 కళాతిమ్మ జగపతిరాజు – తల్లి రాఘవాంబ : (1714–1749) తండ్రి స్వర్గస్థు డగునప్పటికి ఈ తిమ్మరాజు బాలుడు,

ఆ కారణమున తల్లి రాఘువాంబ కుమారునికి పట్టము గట్టి యాతని పక్షమున రాజ్యపాలనము గావించెను వీరి కాలము ననే పెద్దాపుర సంస్థానమునకు కష్టములు ప్రాప్తించెను రాజమహేంద్రవరమున నెలకొన్న తురుష్క సరదారుడు రుస్తుంఖానుడు హిందూ సంస్థానాధీశుల లోబరచుకొను తలంపుతో పెద్దాపురముపై దండెత్తి, కోటను స్వాధీనము చేసికొనుటకు జంకి, మిత్రద్రోహము చేసి, రాజకుమారు లగు తిమ్మ జగపతి రాజును, అతని సోదరుని తన దగ్గరకు రావించు కొని, ఆ బాలురపై వేడి నూనెను బోయించి చంపించెను అంత రాఘువమ్మ, తదితర రాణివాసము వారు, తురుష్కుల పాలబడుదు మన్న భయము తోచి, చిచ్చునం దురికి ప్రాణ త్యాగము గావించు కొనిరి ఈ భయంకర వృత్తాంతము జరుగు నప్పటికి తిమ్మ జగపతి రాజునకు ఏడు మాసములు ఈడు గల జగపతి యను శిశువు జీవించి యుండెను రాణులు చితిలో ప్రవేశింపక పూర్వము రాఘువాంబ ఆ శిశువును రాజ పురోహితుని భార్య యగు కొంపెల్ల లక్ష్మి సోమిదేవమ్మ (లక్ష్మిసోదెమ్మ) యను సాధ్వి కప్పగించి, ఎట్లయినను, ఆ శిశువును కళా జగపతి తిమ్మరాజు బిడ్డకుడును, విజయనగర ప్రభువు నగు పూసపాటి సీతారామచంద్ర రాజున కప్పజెప్పుమని కోరెను

కొంపెల్లవారు ఎన్నో పురుషాంతరముల నుండి రాజ పురోహితులుగా నుండి సుఖముగా కాలక్షేపము చేయు చున్నవారు ఈ లక్ష్మిసోమిదేవమ్మగారును, ఈమె భర్తయు శిష్టాచార సంపన్నులు, ఛాందసులు అయినను, ఈ రాజ కుమారుని రక్షించుట ప్రాణాపాయకరమగు కార్యమని తెలిసియు, లక్ష్మి సోదెమ్మగారు ఆ బాలుని రక్షణ భారము తనపై వైచుకొనెను రాఘువాంబ గారికి మాట యిచ్చెను

తన కప్పగింప బడిన బాలుని ఒడిలో పెట్టుకొని పోవు చుండగా తురుష్క భటు లడ్డగించిరి ఆమె వారలకు తన కుమారుడే అని చెప్పి, వారు విశ్వసించుటకై బాలుని ముద్దు పెట్టుకొని, వాని నోటిలో తన నోరు పెట్టుకొని ఎంగిలి చేసికొని బయట పడెను

ఇంటికి రాగనే భర్తకు సంగతంతయు చెప్పి భర్తను, కొందరు భటులను దీసికొని పిల్లవానితో విజయ నగరమునకు బయలుదేరెను ఈసంగతి గ్రహించి రుస్తుంఖానుడు తన సైనికు లను పంపెను వారు పిల్లవానిని పట్టుకొని నచ్చి బంది ఖానాలో పడవేసిరి లక్ష్మి సోమిదేవమ్మ ఆ పిల్లవాడు తన కొమరుడే యని ఎంత మొత్తుకొన్నను రుస్తుంఖానుడు చెవిని పెట్టెను ఆమె రుస్తుంఖాను భార్య యొద్దకు పెక్కు సారులు వెళ్ళి వలవల యేడ్చుచు తనకు పుత్రభిక్ష పెట్టుమని బేగంసాహెబాను మరిమరి ప్రార్థింప సాగెను చివరకు రుస్తుం ఖానుడు ఆ పిల్లవానితో లక్ష్మి సోమిదేవమ్మ కూడ చెర సాలలో నుండుట కనుమతించెను రుస్తుంఖాను భార్యకు మనసు కరగి పిల్లవానిని చంపకుండ నుండుటకు శ్రద్ధ నైకొనెను కారాగార విశేషములు ఆమె తన భర్తద్వారా విజయ నగరమునకు తెలుపు చుండెను

అప్పటికి విజయ నగరమునందు విపరీత పరిస్థితు లేర్పడెను సీతారామచంద్రరాజు తన పెన తండ్రి కుమారు డగు విజయరామరాజుచే పెట్టింపబడిన విషాన్నముచే మర ణించెను ఆయన భార్యయు, శిశువు పినతల్లియు నగు సాధ్వి సహగమనము చేసెను కాని విజయరామరాజు చెరయం దున్న బాలుని విడిపింప నిశ్చయించు కొనెను

ఇంతలో రుస్తుంఖానుని కుమారుడు నూరుద్దీను ఖానుడు తండ్రిని జంపి పెద్దాపురము కోట నేలుచుండెను

పిల్లవానిని రక్షించుటకు లక్ష్మి సోమిదేవమ్మ ఉపాయ ములు ఆలోచించ దొడగెను ఆమె ముప్పది మూరల చీర కట్టుకొన సాగెను ఆ చీర తన నడుము చుట్టును చుట్టలు చుట్టలుగా పెక్కు తడవలు త్రిప్పి త్రిప్పి కట్టుకొన సాగెను కోటలోనికి వచ్చుటకును, పోవుటకును ఆమె కొక్కదానికే అనుమతి యుండెను ఆమె వచ్చినప్పుడును, పోవునప్పుడును ఆ చీరచుట్టలు విప్పించి పరీక్షింప సాగిరి అట్లు కట్టుకొనుట తమ కులాచార మని ఆమె భటులకు నచ్చచెప్పెను ఈ పరీక్ష కొన్నినాళ్ళు జరిగిన తరువాత భటులకు విసుగు వేసి పరీక్ష మానిరి

నూరుద్దీనుఖాను కళింగ దేశమువైపు దండయాత్ర చేయు గడబిడతో నుండగా, ఒక నిశీథమున ఆమె యా బాలుని తన యొడిలో దాచికొని, వానిపైన తన చీరను చుట్ట చుట్టి, కావలావారికి అనుమానము కలుగకుండ కోట దాటి, ఒక సంకేతస్థలమున తగిన సిబ్బందితో సిద్ధముగానున్న పల్లకిలో బాలునితో సురక్షితముగా విజయనగరము చేరి విజయరామ గజపతిగారికి బాలుని ఒప్పజెప్పెను నూరుద్దీన్

ఖానుడు విజయ రామరాజు బాలుని అంచెల మీద తీసికొని పోవుచున్నా డని తెలిసికొని, కుపితుడై యాతనిపై దండెత్తి చేబ్రోలు కడ విజయనగర సేనలను మార్కొని, యుద్ధములో హతుడయ్యెను పెద్దాపురము కోట మరల సంస్థానాధీశుల వశమయ్యెను

లక్ష్మి సోమిదేవమ్మగారు ఎన్నో కష్టాలు పడి రాజ వంశపు కూనను కాపాడి నందులకును, ఆమె చేసిన అఖండ త్యాగమునకును కృతజ్ఞతా పూర్వకముగా విజయరామ గజపతి మహారాజుగారు ఒక అగ్రహార మిచ్చి, దానికి లక్ష్మీ పురాగ్రహారమని ఆమె పేరు పెట్టెను రాయ గజపతి రాజు గారిని రక్షించినందుల కియ్యబడిన అగ్రహారము కనుక ఆ అగ్రహారమునకు రాయభూపాల పురాగ్రహార మనియు పేరు గలదు

6 రాయ గజపతిరాజు (1749 - 1758) ఇతడు బాల్య దశలో విజయనగరమున పెరిగి పెద్దవాడై, పెద్దాపురము కోట, చేబ్రోలు యుద్ధమున సంస్థానము వశమైన పిమ్మట, విజయనగరము వీడి, పెద్దాపురము చేరి రాజ్య మేలెను ఇతడు అశ్వారోహణ కుశలుడు నల్లపరాజు వెంకటపతి రాజు రచించిన అశ్వశాస్త్రమునకు కృతిపతి ఈయన పరిపాలన కాలముననే బొబ్బిలి యుద్ధము జరిగెను ఆ యుద్ధమునందు రాయ గజపతిరాజు విజయరామరాజు పక్షమున యుద్ధమునకు వెడలెను యుద్ధములో విజయరామరాజు హతుడయ్యెను విజయరామరాజు హతుడైన పిమ్మట విజయ నగర సంస్థానమును సీతారామచంద్రరాజు కుమారుడైన ఆనంద గజపతి పాలించెను ఇతడును, రాయ జగపతి రాజును విజయ నగరమునందే పెరిగి పెద్దవారైరి బొబ్బిలి యుద్ధమైన పిమ్మట గజపతి, జగపతిపై నీసుజెంది యెట్లయినను పెద్దాపుర సంస్థానమును స్వాధీనము చేసికొన నెంచెను చెందుర్తి కడ విజయనగరరాజగు గజపతి, ఆంగ్ల సేనలు కలసి, పరాసువారి నోడించిన యుద్ధములో జగపతి పాల్గొనినట్లు తెలియదు గజపతి, జగపతిపై మైత్రి నటించి, జగపతి కుమారుని ఎత్తుకొని పోయి తన స్వాధీనమునం దుంచుకొనెను తర్వాత జగపతిని దండింప నెంచి, యుద్ధమునకు వెడలెను ఉండూరు వద్ద క్రీ శ 1759 సం॥ జరిగిన యుద్ధములో జగపతి గుండు దెబ్బతిని, హతుడయ్యెను జగపతి రాజు రాణులు పెద్దాపురము కోటలో సహగమనము చేసిరి

7 విద్వత్తిమ్మ జగపతిరాజు (1760 - 1797) తండ్రి రాయ జగపతి చనిపోవునప్పటికి ఇతడు ఏడేండ్ల బాలుడు ఈ ఏడేండ్ల ప్రాయముననే పెద్దాపురములో క్రీ శ 1760 సం॥లో పట్టాభిషిక్తుడై, దాయాది యగు వత్సవాయి రాఘవరాజుచే పెంచబడి సంరక్షింపబడు చుండెను ఇతని కాలములో విజయ నగిర రాజగు ఆనంద గజపతి ప్రాభవము హెచ్చుచుండుటచే, హైదరాబాదు నవాబగు మీర్ నిజామల్లీఖానుడు భయపడి ఆనంద గజపతిపై దండు వెడలి, రాజమహేంద్రవరమున కీవలిగట్టున నున్న కొవ్వూరు దగ్గర దండు విడిసెను ఇంతలో ఆనంద గజపతి రాజమహేంద్రవరము కడ మశూచి సోకి మరణించెను విజయరామ గజపతి భార్య చంద్రాయమ్మదేవి, బాలుడగు విద్వత్తిమ్మ జగపతిని వెంటబెట్టుకుని నవాబును కొవ్వూరు కడ కలిసికొని, నవాబుతో రాజీపడి, ఆతనికి సంవత్సరమునకు, పెద్దాపురము సంస్థానము, సాలుకు కొన్ని వరహాలు జుమ్మా కట్టునట్లు ఒడంబడిక చేసికొని, సంస్థానము తిమ్మజగపతిరాజు పాలనమున నుండునట్లు ఏర్పాటు గావించెను నాటినుండియు పెద్దాపుర సంస్థానము మహమ్మదీయుల సామంత సంస్థాన మయ్యెను

తర్వాత క్రీ శ 1766 సం॥ లో నవాబు ఉత్తరసర్కారులను ఆంగ్లేయుల వశము గావించెను అప్పటికి తిమ్మరాజునకు పదునాల్గేండ్ల ప్రాయము పెద్దాపుర సంస్థానము బ్రిటిష్ వారికి సామంత సంస్థాన మయ్యెను

ఈ విద్వత్తిమ్మ జగపతి సార్థక నాముడు ఇతని సంస్థానమునం దష్టదిగ్గజము లను పేరుతో ఎనమండ్రు కవులుండెడి వారట వీరిలో ముఖ్యులు ఏనుగు లక్ష్మణ కవి, చల్లా కామకవి, వక్కలంక వీరభద్ర కవి అనువారు ఈతడు కవివరేణ్యులకు కామధేనువై బీదల పాలిటి కల్పవృక్షమై, దానధర్మము లనేకములు గావించి, కీర్తిశేషు డాయెను ఈతని మరణా నంతరము కవులు చెప్పిన యొక చాటుపద్య ముదాహరింతుము

ఉ॥ పాతకులైన భూరణపంక్తిని బంపక సర్వయాచక
వ్రాతము పాలి కర్ణుడయి రాజిలు తిమ్మ జగత్పతీంద్రున
య్యాతెగటార్చి వైచితివి, యోరువజాలక యోరి వర్మజా!
నీ తలకొట్ట, యింత నృపునిన్ మఱి నీకు సృజింపశక్యమే॥

8 రాయ జగపతి మహారాజు (1797 - 1804) ఇతడు విద్వత్తిమ్మ జగపతి కుమారుడు ఈతని కాలముననే బ్రిటిష్

ప్రభుత్వము సంస్థానమునకు "శాశ్వతకర నిర్ణయము" గావించెను ఈతని కాలమున సంస్థానము, దాదాపు 700 గ్రామములు గలిగి యుండెను ఇప్పటి తూర్పు గోదావరి మండలములోని చాల భాగమును, పడమటి గోదావరి మండల, కృష్ణామండలములలోని కొంత భాగమును ఇతని సంస్థానమున వ్యాపించి యుండెను ఇతడు బహు సమర్థతతో సంస్థానమును పాలించి, నాటి ఆంగ్లేయ మండల కరగ్రాహులచే మెప్పు వడసెను

౭ తిమ్మ జగపతి (1804 - 1807) రాయ జగపతి తనకు సంతానము లేనందున, తన పట్టపుదేవి యగు లక్ష్మీ నరసాయమ్మ దేవికి దత్తత చేసికొనుటకు అధికార మిచ్చుచు మరణ శాసనము వ్రాసి యుండుటచే, నీమె జ్ఞాతి కుటుంబము లోని కనిష్ఠ శాఖలోని బాలునొకని పెంచుకొని యాతనికి తిమ్మజగపతి యని పేరిడి, తాను పుత్రుని పక్షమున సంస్థానమును పాలించెను కాని దురదృష్ట వశమున ఈ దత్త పుత్రుడు క్రీ శ 1807లో మరణించెను

కడపటి దశ (1807 - 1847) తిమ్మ జగపతి బ్రతికి యుండగనే ఆంగ్ల ప్రభుత్వము వారు రక్ష్యరక్షక శాసనమును అమలులోనికి తెచ్చిరి అతని మరణానంతరము సంస్థానము, తనకు చెందవలయు నని జ్యేష్ఠ సన్నిహిత జ్ఞాతి యగు జగన్నాథరాజు వ్యాజ్యమును దెచ్చి, గెల్చి, సంస్థానము నొక సంవత్సరము పాలించెను ఇంతలో లక్ష్మీ నరసాయమ్మ సంస్థానము తనకే చెందవలె నని ఇంకొక యభియోగమును దెచ్చెను వ్యాజ్యము తన పక్షము కాగా, ఆమె సంస్థానమును క్రీ శ 1814 వరకు పాలించి కీర్తిశేషురాలయ్యెను

బ్రతికి యుండిన రాణులు, సవతులు, ఒకరిపై నొకరు సంస్థానమునకై పెనగులాడి, విశేష ధన వ్యయములు గావించి, క్రమముగా ప్రభుత్వమున కీయవలసిన పేష్కష్ బకాయిని పెంచి వేసిరి కరవు, గాలివానలు, దేశమునందు తాండవ మాడెను కొంత కాలము, సంస్థానము మండల కరగ్రాహి పాలనమున నుండినను లాభము లేకపోయెను కట్టకడపట బుచ్చిబంగారమ్మ యను రాణి వశమున సంస్థానము రెండేండ్లు (1836-1838) గడచిన తర్వాత రాణుల పాలనము, సంస్థాన సంపాదకుల మూలవంశము అంతరించినవి ఈమె కాలమున సంస్థానము, ప్రభుత్వము వారికి ఈయవలసిన బాకి రు 1,52,387 లు

బుచ్చిబంగారమ్మ క్రీ శ 1838 లో మరణింపగా, సంస్థానము మరల సంస్థాన ప్రభువుల సన్నిహిత జ్ఞాతి యగు భీమవరపుకోట శాఖకు చెందిన సూర్యనారాయణ జగపతి రాజున కప్పగింపబడెను అప్పటికి రాణుల పరిపాలన కాలమున అమ్మివేయబడిన మురాలుగాక, ఇతర మురాలతోడను, పేష్కష్ రు 1,36 811-0-0 బాకీ తోడను, సంస్థానము వీరికి చెందెను వీరి కాలమున సంస్థానము చేసిన అప్పులు రు 8,16,328-0-0 వరకును పెరిగి యుండెను ప్రభుత్వము వారికి రావలసిన అప్పు రాబట్టుకొను మార్గము లేకపోయెను సంస్థానము వేలము వేయబడెను కాని పాడుకొనుటకు చుట్టు ప్రక్కల సంస్థానాధీశులు సిద్ధపడలేదు కావున ప్రభుత్వము వారే సంస్థానమును బాడుకొని, వారివశము గావించుకొనిరి ఇయ్యది క్రీ శ 1847 సం॥ లో జరిగెను సంస్థానము ఆంగ్లేయుల రాజ్యములో లీన మయ్యెను

నేటి చరిత్ర పెద్దాపురము తాలూకాకు పెద్దాపురము కేంద్రస్థానము పెద్దాపురము రివిన్యూ డివిజనుకు ప్రధాననగరము ఉపమండల కరగ్రాహి కార్యాలయము కలదు జిల్లా మునసబు కోర్టు కలదు ప్రభుత్వమువారు నిర్వహించుచున్న వైద్యశాలయు, బాలికోన్నత పాఠశాలయు కలవు అనధికారుల పర్యవేక్షణముగల రెండు బాలకోన్నత పాఠశాలలును, ఒక ట్రెయినింగుస్కూలును కలవు

పెద్దాపురము తాలూకాలోనిది మెట్టభూమి దీనిలో కొంతభాగము ఏలేరు కాల్వనీటిచే మరియు, చెరువులను సాగు చేయబడుచున్నవి పెద్దాపురము బెల్లమునకు, పట్టువస్త్రములకు ప్రసిద్ధి

ఈ పట్టణమున క్రీ శ 1915 సం॥ లో పురపాలక సంఘము నెలకొల్పబడినది ఈ పట్టణమున మంచినీటి యెద్దడి యుండుటచే, సామర్లకోట కాలువ నుండి గొట్టములద్వారా, రావింపబడి, కుళాయిల మూలమున ప్రజలకు మంచినీళ్ళు సమకూర్చబడు చున్నవి

పట్టణవైశాల్యము పదునైదు చతురపుమైళ్ళు జనసంఖ్య 24,807 పురపాలక సంఘపు ఆదాయము రు 4,22,88 — 00, వ్యయము రు 4,21,108 — 00 (19658 60)

కుం శే డి

## పెనామా కాలువ

### పెనామా కాలువ యొక్క చారిత్రక పూర్వరంగము

పెనామావద్ద కాలువను నిర్మించుటకై రెండు ప్రయత్నములు చేయబడినవి ప్రథమ ప్రయత్నము 1882వ సం॥లో ఫ్రెంచి సిండికేటుచే చేయబడినది దానికి నాయకుడు ఫెర్డినాండ్ - డి - లెస్సెప్స్ అను నాతడు ఆ యత్నము ఘోరముగా విఫలమొందినది రెండవ యత్నము అమెరికా సంయుక్త రాష్ట్రములచే కావింపబడినది ఆధునిక కాలమందలి వాస్తు శాస్త్రీయ మహోన్నత విజయములలో పెనామా కాలువ నిర్మాణ మొకటిగా పరిగణింపబడినది

క్రీ శ 1878వ సం॥లో, ఫ్రెంచి సిండికేటు ఈ కాలువను త్రవ్వుటకు కొలంబియా రిపబ్లికు ప్రభుత్వము నుండి ఒక ప్రత్యేక అనుమతి పత్రమును పొందెను అప్పటిలో పెనామా భూసంధి కొలంబియా యాజమాన్యమున నుండెను నాలుగు సంవత్సరముల తరువాత ఆ సిండికేటు సముద్ర మట్టమునకు సమానముగ కాలువను త్రవ్వ నారంభించెను ఈ కాలువ నిర్మాణమునకు వాటాల నమ్ముటద్వారా వసూలు చేసిన కోట్లకొలది ధనమును ఫ్రెంచి సిండికేటు యజమానులు తమ అసమర్థతచేతను, అవినీతి కార్యములచేతను,దుర్వ్యయము చేయుటచే 1889వ సం॥లో దివాలా తీసెను

ఫ్రెంచి సిండికేటు కాలువ నిర్మాణములో ఓటమి చెందిన పిదప, 'డి-లెస్సెప్స్' కంపెనీని కొనివేయుటకు అమెరికా సంయుక్తరాష్ట్ర ప్రభుత్వాధ్యక్షుడగు థియొడోర్ రూజ్ వెల్టు అమెరికా కాంగ్రెసునుండి అధికారము పొందెను 1903 జనవరిలో కొలంబియాతో కావించుకొనిన ఒక తాత్కాలిక ఒడంబడిక పత్రముపై సంతకములు జరగెను ఆ ఒడంబడిక ప్రకారము ఒకకోటి డాలర్ల ధనమును కాలువ నిర్మాణ స్థలము కొరకును, సాలాసా బాడుగక్రింద 2 లక్షల 50 వేల డాలర్ల ధనమును కొలంబియాకు చెల్లించు ఏర్పాటు గావింపబడెను కాని కొలంబియా కాంగ్రెసు నాయకులు ఎక్కువ ద్రవ్యమును కోరి, పై ఒడంబడికను ధ్రువపరుపక, వాయిదా వేసెను దానిపై పెనామా రాష్ట్రీయులు మిక్కిలి ఆశాభంగము చెంది 1903 నవంబరు 3 వ తేదీన శాంతియుతమైన విప్లవమును లేవదీసిరి ఆ మరునాడే, పెనామా రిపబ్లిక్ (ప్రజాసత్తాక రాజ్యము) ప్రభుత్వ మేర్పరుపబడెను రెండు దినముల పిమ్మట పెనామా రిపబ్లిక్కు అమెరికా సంయుక్త రాష్ట్రములచే గుర్తింప బడెను

1903 సం॥ నవంబరు 18వ తేదీన అమెరికా సంయుక్త రాష్ట్రములకును, పెనామా రిపబ్లిక్ ప్రభుత్వమునకును మధ్య, కాలువ నిర్మాణమును గూర్చి ఒడంబడికపై సంతకములు చేయబడెను ఈ ఒడంబడిక ననుసరించి పసిఫిక్ సముద్రమును, అట్లాంటిక్ సముద్రమును కలుపు నౌక కాలువను త్రవ్వి, దాని సకల వ్యవహారములను నిర్వహించుటకు అమెరికా సంయుక్త రాష్ట్రములకు అవకాశము కల్గెను ఈ ఒడంబడిక మూలముగా పెనామా కాలువపై సంపూర్ణ సార్వభౌమాధికారములు అమెరికా కియ్యబడెను పెనామా కాలువపై పెనామా ప్రభుత్వమున కెట్టి అధికారములును సంక్రమించుటకు వీలు లేదు ఈ కాలువను ఉపయోగించు కొనుటకు, ఆక్రమణలో నుంచుకొనుటకు, దానిపై సర్వాధిపత్యమును వహించుటకును ఒక్క అమెరికా సంయుక్త రాష్ట్రములకే హక్కు కలదు ఇందుకు ప్రతిఫలముగా అమెరికా సంయుక్త రాష్ట్రములు పెనామా స్వాతంత్ర్య రక్షణమునకు పూచీనొసగుటే కాక, ఆ ప్రభుత్వమునకు ఒకేసారి కోటి డాలర్ల మొత్తమును, ఏటేటా 2 లక్షల 50 వేల డాలర్ల ధనమును ప్రత్యేకముగ చెల్లించుటకు అమెరికా అంగీకరించెను

అమెరికా సంయుక్త రాష్ట్రముల సైనిక వాస్తు శాస్త్రజ్ఞుల దళము సముద్రమట్టపు కాలువకు బదులుగా లాక్ కాలువను నిర్మించుటకు నిశ్చయించి 1904 మే నెలలో పనిని చురుకుగా ప్రారంభించెను యంత్రముల యొక్కయు, ఐలీయములగు ప్రేలుడు మందుల యొక్కయు, జమైకా నీగ్రో కార్మికుల యొక్కయు సహాయముచే, భూగర్భము నుండి అపారమగు మన్ను, కంకర, గులకరాయి, పెనుబండలు త్రవ్వబడి, కొండరాసులవలె ప్రోగులు పోయబడెను ఈ బృహత్పథకము నందు మూడు శ్రేణులుగల జంటలాకులు, బ్రహ్మాండమైన ఒక కృత్రిమ సరోవరము, ఒక సహజ సరోవరము మున్నగు సాంకేతికావసరములను తీర్చుటకై నిర్మింపవలసి వచ్చెను కర్నల్ జి డబ్లియు గోథల్స్ అను నాతడు నిర్మాణ కార్యక్రమమును పర్యవేక్షణ మొనర్చెను కర్నల్ డబ్లియు సి గార్గస్ అను నాతడు కాలువ నిర్మాణ ప్రాంతమున వ్యాపించియున్న పెక్కు ఉష్ణమండల వ్యాధులను నిర్మూల మొనర్చెను

పెనామా ప్రభుత్వము వారి కోరిక ననుసరించి, 1936వ

సం॥లో జరిగిన నూతన ఒడంబడిక మూలముగా సాంవత్సరిక రుసుమును అమెరికా ప్రభుత్వము 4,30,000 డాలర్ల వరకు పెంచెను కాని పెనామా స్వాతంత్ర్య రక్షణమునకై పూర్వము వహించిన పూచీని అమెరికా ప్రభుత్వము ఉపసంహరించుకొనెను 1955 లో మరల ఈ రుసుము 19,30,000 డాలర్ల వరకు పెంచబడెను పెనామా కాలువ కంపెనీ యజమానులు పెనామా ప్రభుత్వమునకు పెనామా సిటీ రైలు రోడ్డు మండలములను, 2 కోట్ల 50 లక్షల డాలర్ల విలువగల ఇతర ఆస్తులను ఇచ్చివేసెను 1962వ సంవత్సరాంతమున, పెనామా ప్రభుత్వము యొక్కయు, సంయుక్త రాష్ట్రముల యొక్కయు పతాకములు కాలువ మండల ప్రాంతములలో సివిలియన్ అధికారము క్రింద ఉమ్మడిగా ఎగురవేయ బడెను

**వర్ణనము** ఇరుకైన పెనామా భూసంధి గుండా ప్రవహించు ఈ కాలువయొక్క రెండు తీరముల నడిమి (వెడల్పు) దూరము 40 మైళ్లు కారిబియన్ సముద్రపు లోతు నీటినుండి పసిఫిక్ మహాసముద్రపు లోతు నీటివరకు గల నిడివి 50 మైళ్లు సాధారణముగా భావించునట్లు, ఈ కాలువ తూర్పునుండి పశ్చిమమునకు భూసంధిని దాటుటలేదు లిమెన్ అఖాతములో ప్రవేశించి నప్పటినుండి ఈ కాలువ 'గాటన్' లాకులగుండా, గాటన్ సరస్సు నందలి అత్యంత విశాలమైన ఒక బిందువునకు సూటిగా దక్షిణమునకు 11½ మైళ్ల దూరము పోయి, అచ్చటి నుండి తూర్పుదిశకు మరలి, పసిఫిక్ సముద్రము వైపున పెనామా అఖాతమును చేరువరకు సాధారణముగా ఆగ్నేయ దిశకు ప్రవహించును

అట్లాంటిక్ మహా సముద్రమునుండి పసిఫిక్ మహా సముద్రమునకు ప్రయాణించు ఓడ లిమన్ అఖాతమునకు చేర్చు కాలువలో ప్రవేశించును ఈ కాలువ అడుగు భాగపు వెడల్పు 500 అడుగులు అది 6¾ మైళ్ల దూరమున నున్న గాటన్ లాకుల వరకు విస్తరించి యున్నది గాటన్ వద్ద ఓడ మూడు లాకులలో ప్రవేశించును ఆ లాకులు ఓడను 85 అడుగులు పైకి లేపును పిదప ఓడ గాటన్ సరస్సులో ప్రవేశించును ఆ సరస్సు విస్తీర్ణము 164 చ మైళ్లు అందలి కాలువ లోతు 45 నుండి 87 అడుగుల వరకున్నది సరస్సు నందు గాన్‌బో వరకు గల 24 మైళ్ల పొడవు కాలువ యొక్క వెడల్పు 500 నుండి 1000 అడుగుల వరకుండును గాన్‌బో చెంత 'గెయ్‌లార్డ్' అనుకొక గండి ఆరంభమగును ఈ గండి ద్వారా పోవు కాలువ 8 మైళ్ల పొడవుకలది దాని అడుగు భాగపు వెడల్పు 300 అడుగులు దాని లోతు 45 అడుగులు ఆ కాలువ పీడర్ మైగెల్ వద్దనున్న లాకులవరకు విస్తరించి నది ఈ లాకులలో 31 అడుగుల లోతుగల ఒక లాకునందు, సముద్ర మట్టముపై 54 అడుగుల ఎత్తుననున్న ఒక చిన్నసరస్సు లోనికి ఓడ దింపబడును దానిగుండా ఓడ ఒక మైలుదూరము మిరాఫ్లోర్స్ వద్దనున్న రెండు లాకులలోనికి ప్రయాణించును ఈ లాకులు ఓడను సముద్ర మట్టమునకు దింపును అప్పుడది 500 అడుగుల వెడల్పు, 8 మైళ్ల దూరము గల ఒక ఎమీప మార్గము గుండా పసిఫిక్ మహాసముద్రములోనికి చేరును లాకులు డూప్లికేటు, లేక డబల్ బారెల్స్‌గా నుండుటవలన ఓడలు ఒకేకాలమున ఎదురెదురుగా ప్రయాణము చేయ వచ్చును కాలువ మొత్తములో 22 కోణాలు లున్నవి మొత్తము వంపు 600° 54′ అత్యంత సునిశితమైన వంపు 67° 11′ విద్యుద్దీపముల వరంపర వలన, కౌశల్యమున నిర్మితమైన లంగరు గుర్తుల వలన, రాత్రింబవళ్లు కాలువపై ఓడల ప్రయాణమునకు భద్రత చేకూరు చున్నది

పెనామా కాలువ సముద్ర మట్టముపై 85 అడుగుల ఎత్తున నున్నది అడుగు మట్టపు వెడల్పు 300 నుండి 1000 అడుగుల వరకుండును దాని వెడల్పు ఇంకను పెంచబడు చున్నది కాలువ నీటియందు ఓడలు ప్రయాణించు సగటు కాలము 15 గంటలు, అందులో 8 గంటలు కాలువలో నరి... మూర్పిడికే సరిపోవును

**పరిపాలనము** అమెరికా కాంగ్రెసు చట్టము ననుసరించి పెనామా కాలువ పాలనము నిర్వహింప బడుచున్నది గవర్నరు పరిపాలనా నిర్వాహకుడుగా వ్యవహరించు చున్నాడు ఆతడు నాల్గు సంవత్సరముల కొకసారి రాజ్యాధ్యక్షునిచే నియుక్తుడగును పెనామా కాలువ మండలము నందు అమెరికా సంయుక్త రాష్ట్రములకు సంబంధించిన జిల్లా కోర్టు కలదు అందు, సంయుక్త రాష్ట్రములందలి న్యాయ స్థానములలోని న్యాయాధీశులవలె, దేశాధ్యక్షుని చేతనే న్యాయమూర్తి నియుక్తుడగుచున్నాడు

పెనామా కాలువ వ్యవహారములను నిర్వహించు ప్రధాన కార్యస్థానమందు, వేర్వేరు పనులను చేయు ఈ క్రింది విభాగములు కలవు (1) క్రియాకలాప నిర్వహణ, పోషక శాఖ, (2) సముద్ర వ్యవహారశాఖ, (3) యంత్ర శాఖ,

(4) విద్యుత్ శాఖ, (5) మునిసిపల్ ఇంజనీరింగుశాఖ, (6) సరఫరాశాఖ, (7) గడాంకశాఖ, (8) ఆరోగ్యశాఖ మున్నగునవి పెనామా కాలువకు సంబంధించిన ప్రధాన కార్యాలయము వాషింగ్టన్ నగరమం దున్నవి

1960వ సం॥ జనాభా లెక్కలను బట్టి ఈ కాలువ మండల మంతటి జనాభా సంఖ్య 42,122 మంది - 1950వ సం॥ లెక్కలను బట్టి 52,822 మంది పెనామా కాలువ కంపెనీ చేతను, పెనామా కాలువ మండల ప్రభుత్వము చేతను 1963వ సం॥ జూనునెలలో నియమితులైన సంపూర్ణ ఔద్యోగిక బృంద ములో 3,766 మంది అమెరికా సంయుక్త రాష్ట్రముల పౌరులు, తక్కిన 10,370 మందిలో పెనామా పౌరులు అత్యధిక సంఖ్యాకులు

**పెనామా కాలువపై రవాణా** 1963 సం॥ జూను 30 వ తేదీతో ముగియు ఆర్థిక సంవత్సరములో పెనామా కాలువ గుండా ప్రయాణించి రవాణా సుంకములు చెల్లించిన 11,017 ఓడలలో 1593 ఓడలు అమెరికా సంయుక్తరాష్ట్రము లకును, 1441 ఓడలు నార్వే దేశమునకును, 1309 ఓడలు బ్రిటను, కెనడా దేశములకును, 1095 ఓడలు జర్మనీదేశమున కును, 846 ఓడలు జపాను దేశమునకును, 833 ఓడలు లైబీరియా దేశమునకును, 693 ఓడలు హాలెండు దేశమున కును, 603 ఓడలు గ్రీసు దేశమునకును, 464 ఓడలు పెనామా దేశమునకును, 364 ఓడలు స్వీడను దేశమునకును, 314 ఓడలు డెన్మార్కు దేశమునకును, శేషించిన ఓడలు 27 ఇతర దేశములకును చెందియుండెను ఆ సంవత్సరములో ఈ ఓడలపై విధింపబడిన రవాణా సుంకముల మొత్తము 5,63,63,078 డాలర్లు

**ప్రాముఖ్యము** పెనామా కాలువ నిర్మాణముచే కొన్ని సముద్ర వ్యాపార మార్గముల దూరము లు తక్కువయినవి కొన్ని సముద్రపు ఓడరేవుల ప్రాధాన్యము సాపేక్షముగా మార్పుచెందినది పెనామా కాలువ నిర్మాణము పూర్తియైన పిమ్మట ఈ క్రింది మార్గములు సన్నిహితములైనవి

(1) దక్షిణ అమెరికా పసిఫిక్ తీరమునకును, ఉత్తర అమెరికా అట్లాంటిక్ తీరమునకును నడుమగల దూరము విశేషముగా తగ్గిపోయినది

న్యూయార్కు నుండి వాల్పరైజోకు

(మాగిలన్ గుండా) 8,400 మైళ్ళు

న్యూయార్కు నుండి వాల్పరైజోకు

(పెనామా కాలువ గుండా) 4,600 మైళ్ళు

(2) ఈ కాలువ మార్గము వలన ఆస్ట్రేలియా, న్యూజీలెండు దేశములు అమెరికా సంయుక్త రాష్ట్రములకు పూర్వము కంటె సమీపము లైనవి

న్యూయార్కు నుండి వెల్లింగ్టనుకు (న్యూజీలెండు)

పెనామా కాలువగుండా 8,500 మైళ్ళు

,, ,, మాగిలన్ గుండా 11,300 ,,

న్యూయార్కు నుండి సిడ్నీకి (ఆస్ట్రేలియా)

పెనామా కాలువ గుండా 9,700 ,,

,, ,, మాగిలన్ గుండా 13,400 ,,

(3) ఐరోపాఖండము నుండి ఆస్ట్రేలియా, న్యూజీలెండు దేశములకు ప్రయాణించుటకై పెనామా కాలువ వలన నూతన మార్గ మేర్పడినది

లివర్ పూల్ నుండి సిడ్నీకి (ఆస్ట్రేలియా)

పెనామా కాలువ గుండా 12,400 మైళ్ళు

,, ,, సూయజ్ ,, ,, 12,000 ,,

లివర్ పూల్ నుండి వెల్లింగ్టనుకు(న్యూజీలెండు)

పెనామా కాలువ గుండా 11,100 ,,

,, ,, సూయజ్ కాలువ గుండా 12,600 ,,

(4) పెనామా కాలువ నిర్మాణముచే జపాను ఓడరేవులు ఉత్తర అమెరికా యొక్క అట్లాంటిక్ ఓడరేవుల నుండి సమీపము లైనవి

న్యూయార్కు నుండి యోకహామాకు (జపాను)

పెనామా కాలువ గుండా 9,700 మైళ్ళు

,, ,, సూయజ్ కాలువ గుండా 13,100 ,,

(5) పెనామా కాలువ నిర్మాణము వలన, ఉత్తర అమెరికా యొక్క తూర్పు, పశ్చిమ తీరముల నడుమ గల సముద్ర మార్గపు దూరములు తగ్గినవి ఇందువలన, 7000 మైళ్ళకంటె ఎక్కువ దూరము కలిసి వచ్చినది

(6) ఉత్తర అమెరికా యొక్క పశ్చిమ సముద్ర తీరము ఐరోపాఖండమునకు 5000 మైళ్ళకంటె అధికముగా సమీప మైనది వి మ

## పెనుగొండ

పెనుగొండ పశ్చిమ గోదావరీ మండలములోని తణుకు తాలూకా యందలి యొక ప్రసిద్ధ గ్రామము ఆంధ్ర దేశము

లోని ప్రాచీన గ్రామములలో నొకటి పౌరాణికము గాను, చారిత్రికము గాను, వాణిజ్య విషయికము గాను పేరు గాంచిన గ్రామరాజము ఆంధ్ర దేశములోని వైశ్య సంఘమునకు కాణాచి వారి కులదేవత యైన వాసవి కన్యకు జన్మభూమి

**పౌరాణిక గాథలు** వాసవి కన్యకా పురాణ మను పేర, స్కాంద పురాణమున ఉత్తర ఖండమునందు, సమత్సుజాత సంహితలో సాలంకాయన వైశ్యముని సంవాద రూపమున నొక మహా గ్రంథము కలదు దానిలో కలియుగమున వైశ్యుల జన్మము, వాసవీ కన్యకాజననము, పెనుగొండ నగర ప్రాముఖ్యము, వైశ్య కులగోత్రములు, ఆనాటి వైశ్యుల సాంఘిక పరిస్థితులు, ఆంధ్ర దేశములో వైశ్య నకరనిలయము లగు పదునెనిమిది పట్టణముల వివరణము మొదలగు విషయములు తెలుప బడినవి పూర్వ మొకప్పుడు బ్రహ్మ సత్య లోకమున నొక మహాసభను దీర్చి, విప్ర ఋషులను, భూలోకమున నుండి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యుల నాహ్వానించి, వారందరిని జూచి యా సృష్టికర్త "ఓ పుత్రులారా! భూలోకమునందు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యుల సృష్టి జరుగుచున్నదా ? వేరు వేరుగా వంశములు,గోత్రములు నిర్ణయింప బడినవా ? అని ప్రశ్నించెను అప్పుడు బ్రాహ్మణుల పక్షమున దూర్వాసుడను మహర్షి బ్రాహ్మణులకు నూట తొమ్మిది గోత్రములు, పదునెనిమిది గణములు గలవని చెప్పెను క్షత్రియుల పక్షమున ధనంజయుడను రాజశ్రేష్ఠుడు క్షత్రియులకు గోత్రము లేదును, గణ మొకటియు అని చెప్పెను అనంతరము సమాధి యను వైశ్యుడు, వైశ్యులకు ఏడువందల పదునాల్గు (714) గోత్రములును, నూట రెండు గణములును గలవని చెప్పెను అంత గోత్రాధిక్యముచే గర్వితులైన 612 గోత్రములవారు బ్రాహ్మణులను పరిహసించిరి మిగిలిన 102 గోత్రములవారు, పై 612 గోత్రముల వారి మూఢత్వమునకు నవ్వుకొనిరి తర్వాత విప్రులు వైశ్య తిరస్కారమునకు కోపోద్దీపితులై వైశ్యులకు "కులాధములై జాతిభ్రష్టులై పోవుదురుగాక"యని శాపమిచ్చిరి వైశ్యులలో కొందరు ఆ శాపభీతికి పరితపించిన వారై, బ్రహ్మను శాప పరిహారమునకు వేడుకొనగా, బ్రాహ్మణశాప మప్రతిహతమనియు, కలియుగమునందు వైశ్యుల గోత్రములు ప్రాకృత గోత్రములై నప్పటికిని అవి పవిత్రములే యగుననియు, బ్రాహ్మణుల నవమానించుటచే వారు మున్ముందు అగ్నిప్రవేశము గావించి శాపవిముక్తులై సమస్త లోకమందు పూజింప బడుదు రనియు, వారి వంశమునందు జగదీశ్వరి యగు పార్వతి "కన్య"యను నామముచే జన్మించగల దనియు, ఆ కన్య కారణమువలన ఏ వైశ్యులు అగ్నిహోత్రమునందు ప్రవేశింతురో వారు బ్రాహ్మణుల ననుసరించు చుందురనియు, ఏ వైశ్యులు భయముచే పలాయన మగుదురో వారు వైశ్య జాతినుండి వెలివేయబడుదు రనియు బ్రహ్మ ప్రత్యుత్తర మిచ్చెను

వైశ్యు లందరు భూలోకమునకు వచ్చి, అపరార్కముని యాదేశముచే శివునిగూర్చి ఘోర తపస్సు చేసి శివుని వలన వరములను బడసి, కైలాసమునే తమ నివాసముగా గావించు కొనిరి అచట పులస్త్య గోత్రుడగు సోమదత్తు డను వైశ్య మునియొక్క కూతురు "కీర్తి"యను కన్యక కైలాస శిఖరమునందు విహరించుచుండగా, చిత్రకంఠు డను గంధర్వుడామెను జూచి, మోహించి, యామె నివాసమునకు పోయి, తనకా కన్యనిచ్చి పెండ్లి గావింపు మని సోమదత్తుని వేడుకొనెను కాని వైశ్య ఋషిసంఘ మా కోర్కెను తిరస్కరింపగా, గంధర్వుడు కోపోద్దీపితుడై వారిని "కైలాసము నుండి భూలోకమునకు పోయి అచట అగ్నిప్రవేశము గావించి, బంధు సహితముగ నశింతురు గాక" అని శపించెను అది విని వైశ్యఋషి సంఘమువానిని భూలోకమున, మనుష్య రూపముతో జన్మించి, భయంకరమైన పిడుగువంటి ధ్వనిని విని ఘోర మరణము పొందుదువుగాక యని ప్రతిశాప మిచ్చిరి వైశ్యులు భూలోకమునకు వచ్చినవారై, తమ స్థితికి దిగులు నొంది అపరార్క మహర్షిచే సంచాగరీ మంత్రోపదేశమును పొంది, శివుని కొరకై ఘోర తపస్సును గావించిరి శివుడు ప్రత్యక్షమై మరల వారికి కైలాసవాసమును సిద్ధింప చేసెను కొంత కాలము గడచిన తర్వాత శంకర-గౌరీ వివాహమునకు సకల లోకవాసులు కట్నములు తెచ్చుటయు, భూలోకము నుండి కానుకలు రాకుండుటకు గల కారణములు నారదుని వలన నెరిగి, మరల వైశ్యులను భూలోకమునకు చనుడని సాంబశివు డాజ్ఞాపించెను అంత విశ్వకర్మ వైశ్యుల నివాసము కొరకు పదునెనిమిది పట్టణములను నిర్మించెను

"ఇత్యుక్తో విశ్వకర్మాచ చకార నగరాణిచ

శ్రేష్ఠశైల పురాఖ్యాంచ పురంధ్రీ గుణనామకమ్

ఘంటసాలాంచ పాలాఖ్యాం వీరనారాయణాహ్వయమ్
ఏలాపురంచ నగరం విశాలాక్షీం శివంపురమ్
ధనదాఖ్యం ధర్మవరం జగన్నాథం కళింగకమ్
పాంచాలాఖ్యాం పాలకుంరం త్రిగుణం భీమనామకమ్
కల్యాణదం కామపురం ఆనంద జనదాహ్వయమ్
ఇందురాఖ్యం పురవరమిత్యష్టాదశ భూతలే "

పై వివరింపబడిన పట్టణము లీవిధముగ గుర్తింప నగును

జ్యేష్ఠశైలము = పెనుగొండ–పురంద్రీగుణము = ఆచంట (ప గోదావరి మండలము)–ఘంటసాల = ఘంటసాల (కృష్ణా మండలము)–ఏలాపురము = ఏలూరు (ప గోదావరి మండలము) ధనదపురము = చందవోలు (గుంటూరు మండలము)–ధర్మవరము = ధర్మవరము (అనంతపురము మండలములోని ధర్మవరము లేక ప గోదావరి మండలములోని ధర్మవరము లేక విశాఖ పట్టణ మండలములోని ధర్మపురి కావచ్చును)–జగన్నాథము = జగన్నాథము (ఉత్కళ రాష్ట్రములోని ప్రసిద్ధ పుణ్యక్షేత్రము కావచ్చును)–కళింగకము = కళింగ పట్టణము (శ్రీకాకుళము మండలము)–పాంచాలము = పాంచాల పురి = (ఎచ్చటిదో తెలియదు)–పాలకుంరము = పాలకొండ (విశాఖ పట్టణ మండలము)–త్రిగుణంభియనామకం = (1) ద్రాక్షారామము, (2) క్షీరారామము, (3) గుణపూడి భీమవరం (ఈ మూడు గ్రామములు పంచారామములలో ప్రసిద్ధమైన మూడు శైవక్షేత్రములు)–కామపురము (ఎచటనో తెలియదు) కామపురపు కోట కావచ్చును (ప గోదావరి మండలము)

**వైశ్య పురాణములోని పదునేడు గ్రామములు** కన్యకా పురాణమును భాషాంతరీకరించిన భాస్కరాచార్యుడు ఈ క్రింది గ్రామములను పెనుగొండకు గ్రాస గ్రామములుగా పేర్కొనెను వ ధర్మ, ధనద, పాంచాల, నిరవద్య, జగన్నాథ, క్షీరకాసార, దెందులూరు, ఏలా, ఘంటసాల, త్రిగుణిత, ఘనభీమ, విశాల, కళింగ, నృసింహ, వీరనారాయణ, ఆచంట నగరంబులగు నీ సప్తదశ గ్రామంబులు పెనుగొండకు గ్రాస గ్రామములుగా నత్యంత శోభితంబై తనర్చె (5-38) లెక్కకు పదునారు వచ్చుచున్నవి కాని పదునేడు కాలేదు పదునేడవ గ్రామమేదో చెప్పలేదు సంస్కృత కన్యకా పురాణమునకును, దాని తెలుగుసేత యగు వైశ్యపురాణమునకును గ్రామనామములలోను, సంఖ్యలోను వ్యత్యాస మగుపడుచున్నది

**వైశ్య పురాణములోని పెనుగొండ వర్ణనము**

సీ॥ ఏ పురంబుననుండి నెలమి మూలస్థాన
మల్లికార్జునుడు శ్రీనుండితుండు
ఏ పట్టణంబున గోపికా పతిదైత్య
మర్దనుండుండు జనార్దనుండు
ప్రవహించునే వీట ప్రాగ్భాగమునకెట్టు
కడలిరాయని కొమ్మ గౌతమమ్మ
ఏ వీటఁ జెలువొందు నేప్రొద్దు గరుణతో
విశ్వనాథుని దేవి వింధ్యనిలయ
తే॥ విప్రజాహుజ విటూద్ర విమలహర్మ్య
కూట సంస్థాపిత స్వర్ణ కుంభదీప
జాలభాసిత బ్రహ్మాండ గోళకంబు
ధరణి స్వర్గంబు పెనుగొండ పురవరంబు

(పీఠిక ప 48)

పెనుగొండ వైశ్యాగ్రహారము

ఉ॥ ఈవణిగగ్రహార మిల
నే నృపుడైనను సర్వమాన్య సం
భావననొంది రక్షణము
భక్తి నొనర్చినయేని కోలువే
ల్గోవులనిచ్చు పుణ్యమగు
లోలత నీపురమీకత్రోచినన్
గోవధ చేసినట్టి యతి
ఘోరపుఁ బాపము నొందువానినిన్

(5-42)

పెనుగొండ పట్టణమందు కుసుమశ్రేష్ఠి యను వైశ్య కులోత్తము డొకడుండెను అతని భార్య కౌసుంభి చిర కాలము సంతానము లేక పరితపించి, తన కులగురువగు భాస్కరాచార్యుని యాజ్ఞచే పుత్రకామేష్టి కొనర్చి, భగవంతుని యనుగ్రహమున స్త్రీపురుష రూపములుగల కవలలను గాంచెను ఈశ్వరానుగ్రహము వలన గలిగిన కుమారునకు నతడు విరూపాక్షుడను నామమును, పరమేశ్వరి యనుగ్రహమున గలిగిన కుమార్తెకు పూర్వము ఆమె విష్ణుసోదరియై, కన్యకయై యుండుటచే 'వాసవి' యను నామకరణమును 'కన్యక' యను నానుకరణమును గావించెను కొన్ని యేండ్లు

గడచిన తర్వాత చాళుక్య రాజగు విష్ణువర్ధను డనువాడు దిగ్విజయ యాత్రకు వెడలి పెనుగొండ పట్టణమును ప్రవేశించి, వాసవిని జూచి మోహితుడై, యామెను తనకిచ్చి వివాహము చేయుమని కుసుమ సెట్టిని వేడుకొనగా పట్టణ వాసులైన వైశ్య కులమువారు సమ్మతింపక పోయినందున, రాజు కోపోద్దీపితుడై, కొందరు సైనికులను బంపి, వారిని జయించి వాసవి కన్యను బలాత్కారముగ కొనితెండని యాజ్ఞాపించెను అంత 612 గోత్రములవారు భయభ్రాంతులై పలాయనులుకాగా, మిగిలిన 102 గోత్రములవారు రాజునకు వైశ్యకన్య నిచ్చుట కొడబడక, వాసవికన్యతో నగ్నిప్రవేశ మును జెందిరి వాసవికన్య శాపముచే విష్ణువర్ధనుడు మృతు డయ్యెను కాని విష్ణువర్ధనుని కుమారుడగు రాజనరేంద్రుడు పరితపించి, కుసుమసెట్టి కుమారుడైన విరూపాక్ష సెట్టికి పెనుగొండ పట్టణమునందు యువరాజ పట్టాభిషేకమును గావించెను వాసవికన్య ప్రత్యక్షమై 102 గోత్రములను, పది లక్షణములను, వారివారి వివాహ విధానాలను దెలిపి అంతర్ధాన మయ్యెనట!

**వర్తక శ్రేణులు** పురాణ గాథల వలన వైశ్యుల సాంఘిక పరిస్థితులను సులభముగా తెలిసికొన వచ్చును వీరు పదునెనిమిది పట్టణవాసులై, ఆంధ్రదేశమునందు వాణిజ్యము నభివృద్ధి గావించి, ఆయా పట్టణములందు వర్తక శ్రేణులను నెలకొల్పి ప్రతి నగరమునకు గల పట్టణస్వామి యను నగరాధ్యక్షుని పాలనమున కులాచార విధుల దిద్దుకొను చుండిరి ఈ పదునెనిమిది పట్టణములకు పెనుగొండయే కేంద్రస్థానము

**పెనుగొండలోని ప్రసిద్ధ దేవాలయములు** పెనుగొండలో కన్యకాపరమేశ్వరి దేవాలయము ప్రధానమైనది నగరేశ్వర దేవాలయమను నొక శివాలయము, జనార్దనస్వామి దేవాలయమును, ఒక విష్ణ్వాలయమును గలవు

**పెనుగొండ వైశ్యశ్రేష్ఠులు – చరిత్రాత్మక విషయములు** పెనుగొండ వైశ్యకులోత్తములు క్రీ శ పండ్రెండవ శతాబ్ది నుండియు, శాసనములలో పేర్కొనబడి ప్రశంసింపబడినారు వీరు పరమ ధార్మికులు ఖండన భీములు, మహారాజుల భండారులు సుజనులు

నాదిండ్ల (శ 1046) (S I Vol X No 82) శాసన పద్యములు సంస్కరింపబడి క్రోడీకరింపబడినవి

శా॥ శ్రీమద్ధర్మ పరాయణుల్ బుధజనా
  శీర్వాద వంతుల్ దయా
ధాముల్సర్వజనానురక్తుల భువి
ధ్వస్తాత్ములుద్యద్య శో
రామారాముఁలు వైశ్యవంశులు గుబే
  ర ప్రాభవుల్ గోమినీ
భామాధీశ పదాబ్జ భక్తులు జగ
  త్ప్రఖ్యాత తేజోనిధుల్॥

ఉ॥ లాలిత విత్తదాన్వయల
  లాముడు పుణ్యయశోధనుండు పెను
కోమల కులోత్తముండు పెను
  గొండ విభుండు ప్రభుండు సత్యవా
క్శీలుడు ధారుణిం గొడవి
  సెట్టికి గోలమకున్ సుతుండు ల
క్ష్మీలలనేశ్వరస్మరణ
  శీముపి గోమనయున్ ముదంబుతోన్

(పై శాసనములో నాదిండ్లయందు దేవాలయ నిర్మాణము సూచింపబడినది )

(2) ఘంటశాల (శ 1060), (S I Vol X No 115)
పెనుగొండ శాసనువెంగిన వైశ్యుండు సాజెల
గోత్రుండు గోటకొమ్మిసెట్టి తమ తల్లిచంద్రుంబ
  దనకును ధర్ముపుగా ఘంటశాల
యైన చోడపాండ్య పురమున శ్రీజలధీశ్వర
మహాదేవర దక్షిణోత్తరములం బెట్టిన
యఖండ దీపములు—

(3) ద్రాక్షారామశాసనము (శ, 1070) (S I Vol IV No 1131-1134)

అస్తిశ్రీ పెనుగొండ నామనగరం
  యస్యోపకల్యావని
శ్యాకైర్యైరభితో విభాతిరుచిరైః
శ్చేత్రైస్తథా చైడపైః
తత్రాభవ త్సకలవైశ్య శిరోవతంస
  సౌజన్యరత్న ఖనిరాశ్రిత పద్మహంసః
శ్రీమోత్తిసాన్వ సురభిః, ...
క్షమావాన్ ధర్మాత్మా పరహితరతోయం బుధ
  జనస్తుతో భీమః

నాగాంబికావదన వారిజ చంచరీకా
 ద్భీమాద్వణిజ శిఖండమదేర్యశస్వీ ।
పోతస్సశామఖిమతో ద్విజపారిజాతో
 క్షోణీనాథ శిఖండమండన మణేః ।
 కోదండ గాండీవినా

(4) బెజవాడ (శ 1163) S I Vol X No 293
పెనుగొండ శాసనుండు సెంటికుల గోత్రుండు
గొంటూరి పరువల మల్లి సెట్టి మల్లీశ్వర మహా
దేవరకు అఖండ దీపాన కిచ్చిన మోదాలు

(5) గుంటూరు (శ 1310) (S I IV No 660)
నగరేశ్వర దేవదివ్య శ్రీపాద పద్మారాధకుండును
పెనుంగొండ పురవరాధీశ్వరుండును పునగో సిలగోత్ర
పవిత్రుండును వైశ్య కులోత్తముండు
న్ను గింగి శెట్టి

పెనుగొండ ప్రాశస్త్యము పెనుగొండ వైశ్యకులా స్థానము వైశ్యులు విత్తమునకు, వితరణమునకు, వివణి విహారమునకు, పేరెక్కినవారు చతుర్థ జాతులలో వైశ్యులొక్కరే ప్రత్యేక పీఠగణము నొక్కదానిని స్థాపించి వాసిగాంచిరి

కం ఈ ద

## పెరగ్వే

**ఉనికి, విస్తీర్ణము** పెరగ్వే దక్షిణ అమెరికా ఖండములో ఒక చిన్న దేశము ఇది ఇంచుమించుగా దక్షిణ అమెరికా యొక్క మధ్య భాగమున నున్నదని చెప్పవచ్చును ఇది $19\frac{1}{2}°-27\frac{3}{5}°$ దక్షిణ అక్షాంశముల మధ్యను $54\frac{1}{4}°-62\frac{3}{4}°$ పశ్చిమ (గ్రీనిచ్‌కి) రేఖాంశ వృత్తముల మధ్యను కలదు మకరరేఖ ఈ దేశము యొక్క మధ్య నుండి పోవును దీని యొక్క వైశాల్యము 1,57,047 చదరపు మైళ్ళు ఇది "పెరగ్వే" అనెడు నదికి ఇరువైపుల వ్యాపించి యున్నది దీనికి తూర్పున బ్రెజిల్, దక్షిణమున అర్జెంటైనా, పశ్చిమ ఉత్తర వైపులలో బొలీవియా దేశములు కలవు పెరగ్వే దేశము చుట్టును పూర్తిగా భూభాగము చేత ఆవరింపబడి యున్నది దీనికి సముద్రతీరము 500 మైళ్ళ దూరమునకు పైగా నున్నది

**భౌతిక స్వరూపములు_నదులు ।** పెరగ్వే దేశమందు మూడు ముఖ్యమైన నదులు కలవు అవి 1 పెరగ్వే, 2 పెరానా, 3 పిల్కొమాయో పెరగ్వే అనునది ఈ దేశమును రెండు ముఖ్యమైన భాగములుగా విభజించుచు ఉత్తరము నుండి దక్షిణమునకు ప్రవహించు చుండును ఈ నదికి తూర్పు భాగమును పెరగ్వే ప్రాపర్ అనియు, పశ్చిమ భాగమును చాకోమండలము అనియు పిలుతురు వీటి యొక్క విస్తీర్ణములు క్రమముగా 61,698 చ మైళ్ళు, 95,815 చ మైళ్ళు అయి ఉన్నవి పిల్కొమాయోనది చాకోమండలమునకు దక్షిణ సరిహద్దుగా నుండి వాయవ్యము నుండి ఆగ్నేయముగా ప్రవహించుచు అసన్‌షియాన్ పట్టణ ప్రాంతమున పెరగ్వే నదిలో కలియును పెరానా నది పెరగ్వే దేశమునకు ఆగ్నేయ సరిహద్దులో నున్నది దీని ప్రవాహము దాదాపు వందమైళ్ళు పెక్కు జలపాతములతో కూడియుండి లోయల గుండ పోవుచు ఇది పైలార్ అను పట్టణమునకు చాల దిగువ భాగమున పెరగ్వే నదితో కలియును

సరస్సులు ఈ దేశమందు రెండు ముఖ్యమైన సరస్సులు కలవు అవి 1 ఇపోయా, 2 యిపాకరై ఈ రెంటిలోను ఇపోయా పెద్దది ఇది పెరగ్వేకు ముఖ్య పట్టణమైన అసన్‌షియాన్‌కు దక్షిణ దిక్కున దాదాపు 60 మైళ్ళ దూరములో నుండును దీని పరిసర ప్రాంతములలో భూమి చిత్తడిగా నుండి, దట్టమైన అడవులతో కూడియుండి కొంత మంది ఆటవిక జనులకు నివాస స్థానమై యున్నది రెండవదైన యిపాకరై సరస్సు అసన్‌షియాన్‌కు తూర్పువైపున దాదాపు 15 మైళ్ళ దూరములో నున్నది ఇది ఇపోయా కంటె చాల చిన్నది దీని ప్రాంతము కొంచెము సుందరముగా నుండి అసన్‌షియాన్ ప్రజలకు విహారస్థలముగ ఉపయోగపడుచున్నది

భూమి ఉపరితల స్వరూపములు ఈ దేశము ఎక్కువ భాగము పచ్చిక మైదానములతోను, మిక్కిలి దట్టమైన సతత హరితారణ్యములతోను నిండియున్నది పెరగ్వే ప్రాపరు యొక్క దక్షిణ భాగమున భూమి మిక్కిలి చిత్తడిగా నుండి దట్టమైన అరణ్యములతో నిండియున్నది ఆగ్నేయ పెరగ్వే భాగమందు మాత్రము ఒక శ్రేణిలో ఎత్తైన గుట్టలు కలవు ఈ గుట్టలు దాదాపు 1600 అడుగుల ఎత్తుకంటె మించిలేవు ఈ దేశములోని ఏ భాగమైనను 2,200 అడుగులకు మించిన ఎత్తులో లేదు ఎక్కువ భాగము సముద్ర మట్టము నుండి కొన్ని వందల అడుగుల యెత్తున మాత్రమే యున్నది.

చిత్రము 21




పెరగ్వే నది యొక్క తూర్పు ప్రాంతమంతయు చిన్న చిన్న పల్లపు మైదానములతో కూడి యుండి చాల మంది పెరగ్వే దేశస్థులకు నివాస స్థానమైనది మొత్తము జనసంఖ్యలో 65 లేక 70 శాతము వరకు ప్రజలు ఇచ్చటనే నివసింతురు ఇచ్చట తాటి మొదలైన వాటివలె కొమ్మలు లేని చెట్లు విరివిగా పెరుగును చాకో మండలము మిక్కిలి విస్తారమైన పచ్చిక మైదానములతోను, విలువైన అడవులతోను కూడి యున్నది కొన్ని కొన్ని చోట్ల ముళ్ళపొదలతో నిండియున్న భూములు కూడ కలవు

శీతోష్ణస్థితి ఇది ఎక్కువ భాగము సమశీతోష్ణస్థితి కలిగియున్నది. వాతావరణము మిక్కిలి సుఖదాయకము గాను, ఆరోగ్య దాయకముగాను ఉండును ఉష్ణోగ్రత వేసవిలో 100°F వరకును, శీతకాలములో 70°F వరకును ఉండును ఇచ్చటి వారికి జనవరి వేసవికాలము లోను, జూలై శీతకాలములోను వచ్చును అసన్ షియాన్ వద్ద వేసవిలో 82°F మరియు శీతకాల ములో 66°F ఉష్ణోగ్రత ఉండును వర్షపాతము చాకో మండలమున 32"లకు మించి యుండదు సాధారణముగ చాకో మండలము కంటె పెరగ్వే నదికి తూర్పు భాగమున వర్షపాత మధికముగ నుండును తరచుగ ఆ వర్షపాతము 52" లకు మించుచుండును ఈ విధముగ తూర్పుకు పోయిన కొలది వర్షపాతము పెరుగుచు బ్రెజిల్ సరిహద్దు ప్రాంతమున దాదాపు 80"లకు ఉండును

స్వాభావిక ఉపపత్తులు వృక్షవర్గము, జంతువర్గము చాకో మండలమున నున్న అడవులు ప్రసిద్ధి చెందిన 'క్విబ్రాకో' అనబడు ఒక రకమైన చెట్లతో కూడి యున్నవి వీటి కొయ్యలను, చర్మములను శుభ్రము చేసి పదును పట్టుటకు వినియో గింతురు

ఈ ప్రయోజనముచేత ఈ అడవులు ప్రపంచములో మిక్కిలి విలువైన సంపదగా పరిగణింప బడుచున్నవి ఇచ్చట అడవులు ఇంకను చాల భాగము అన్వేషింపబడని స్థితిలో నున్నవి కొన్ని చోట్ల ఈ క్విబ్రాకో చెట్లను నరకి అమెరికా సంయుక్త రాష్ట్రములు, ఇంగ్లండులకు ఎగుమతి చేయుదురు దీనితో మందులు గూడ తయారు చేయుదురు పెరగ్వే నదికి తూర్పు భాగమైన పెరగ్వే ప్రాంతము లోని అడవుల యందలి చెట్లు గట్టి కొయ్యలతో కూడి యున్నవి ఇచ్చట నివసించు ఆటవిక ప్రజలు ఈ గట్టికొయ్య మొద్దులను అర్జెంటైనాకు ఎగుమతి చేయుదురు వారు ఈ కొయ్యలను రైలు పట్టాల క్రింద విరివిగా వినియోగించుదురు ఇచ్చటి ప్రజలకు సామాన్య ప్రయోజనములకై మెత్తటి కొయ్యలు కావలసి యున్నను దొరకవు వారికి ఇది ఒక అనివార్యము ఇచ్చటి మైదాన భూములలో మాటే లేక పెరగ్వే టీ అనబడు ఒక రకమైన టీ చెట్లను విస్తారముగ పెంచుదురు ఇది ప్రపంచములో కెల్ల ప్రసిద్ధి చెందిన ఒక రకమైన టీ ఈ దేశపు ఎగుమతులలో ఇది ముఖ్యమైనది ఈ అడవులలో పెద్దపులులు, అడవి పందులు, అనేక రకములైన తేళ్ళు కలవు

నిప్పు కోళ్ళు నల్లని బాతులు, పావురములు, చిలుకలు మొదలైన పక్షిజాతులు కలవు అనేక రకములైన క్రిమికీటకములు కూడ కలవు

**భూములు** ఇచ్చటి భూములు చాల సారవంతమైనవి అయినను ఆ భూములలో కొంత భాగము మాత్రమే సాగు చేయబడు చున్నవి ప్రజలనేకులు అనాగరికులు అగుటవలనను, భాగ్యవంతులు కానందువలనను, జనసాంద్రత మిక్కిలి తక్కువగుట వలనను చాలభూములను సాగుచేయక వదలివేయుదురు పెరగ్వే యొక్క ఎత్తు మైదానములలో పలురకములైన పండ్లను పండించుచున్నారు

**ఖనిజములు** అచ్చట గనులలో ఇనుము, మాంగనీసు, తామ్రము గ్రఫైటు, సల్ఫరు, పాదరసము దొరకును కొన్ని చోట్ల నాపరాయి, చలువరాయి కూడ దొరకు చున్నది ఈ దేశమున బొగ్గుగనులు లేనందువలన అచ్చటి ప్రజలకు ఇనుము, మాంగనీసు, తామ్రము మొదలైన ఖనిజ సంపదలను వినియోగించుకొనుట దుర్లభ మగుచున్నది కాని కొన్ని చోట్ల పెట్రోలియము దొరకు చున్నది

ఈ దేశమున జల విద్యుత్పాటవము చాల అధికము కాని దేశము వెనుకబడి యుండుట వలనను, ప్రజలు అజ్ఞానులగుట వలనను, దీనిని వినియోగించుకొనలేక పోవు చున్నారు (500 H P మాత్రమే వినియోగములోనికి వచ్చుచున్నది)

**ప్రజలు-వృత్తులు** ఈ రాజ్యము యొక్క జనసంఖ్య 1950వ జనాభా లెక్కల ప్రకారము 14,08,400 కలదు జనసాంద్రత చాల తక్కువ సరాసరి చూచిన చదరపు మైలునకు 9 మంది నివసింతురు ఇది ముఖ్యముగ గమనింప దగిన విషయము జనాభాలో 65 శాతము గ్రామములలో నివసించుచు, వ్యవసాయ వృత్తియో లేక అడవులను నరకుటయో అవలంబించి యున్నారు మిగిలిన 35 శాతము పట్టణములందు నివసించు చున్నారు ఇచ్చటి ప్రజలు మిక్కిలి సాధారణమైన దుస్తులను ధరించుదురు ఆడవారు పెక్కు మంది పైనుండి మోకాలి క్రింది వరకు గౌనువలె నుండు ఒకేఒక వస్త్రమును ధరించుదురు మొత్తముసంఖ్యలో 80 శాతము ప్రజలు అజ్ఞానులు-చదువను, వ్రాయను, తెలియనివారు ఈ దేశ మందలి ప్రజల యొక్క ద్రవ్యమానమునకు గ్వ్యరాని అని పేరు ఒక గ్వ్యరాని 0 17 డాలర్లకు సమానము అనగా భారత దేశపు ద్రవ్యమానము ప్రకారము గ్వ్యరాని ఒకటి అయిన షుమారు 0=82 పైసలకు సమానము అగును

ఇచ్చటి పంటలలో ప్రత్తి ముఖ్యమైనది ప్రజలు ప్రత్తిని విరివిగా పండించి దానిని శుభ్రపరచి, గింజల నుండి వేరుచేసి ఆ ప్రత్తిని ఇతర దేశములకు ఎగుమతి చేయుదురు చెరకు, వరి, పొగాకు కూడ పండించుదురు ప్రజలు అనాగరికులగుట వలన వ్యవసాయము చాల పురాతన పద్ధతులలో జరగును అంతగా ప్రయత్నము లేకున్నను పండ్లు విస్తారముగ పండును ఇచ్చట నుండి ప్రత్తి, టీ, పండ్లు క్విబ్రాకో, గట్టి కొయ్యలు ఎగుమతి చేయచున్నారు ఈ వస్తువులలో ఎగుమతి మొత్తము క్రమముగా ఎక్కువగుచు నున్నది ఇచ్చట కొంతమంది ప్రజలు పశువుల పెంపకము వలన జీవించుచు మాంసమును, పశువులను అధికముగ ఎగుమతి చేయుదురు అడవుల నుండి వనస్పతి నూనెలు కూడ తయారుచేసి విదేశములకు పంపుదురు ఇచ్చటివారు విదేశముల నుండి ఆహార పదార్థములు, బట్టలు, యంత్రములు, లోహపు సామానులు, వ్యవసాయపు పనిముట్లు, రసాయనములు మొదలైనవి దిగుమతి చేసికొందురు లాటిన్ అమెరికా చేయు మొత్తము విదేశ వ్యాపారములో పెరగ్వే ఒక శాతము మాత్రమే చేయును

**రవాణా**, ఇచ్చటి రవాణా చాల భాగము నదుల ద్వారా జరుగుచుండును ఎగువ భూభాగములందు పెద్ద నదులు లేనందువలన ఎద్దుబండ్ల ద్వారా రవాణా విరివిగా జరగును ఈ దేశమందు రైలు సౌకర్యము మొత్తము 750 మైళ్లకు మించి లేదు మొత్తము మీద రవాణా ఇప్పటికిని చాల వ్యయదాయకముగను, దుర్భరముగను ఉండునని చెప్పవచ్చును పెరగ్వే మరియు అర్జెంటైనాల పరస్పర ఒప్పందముల మీద కొన్ని రైలు మార్గములు ఈ రెండు దేశములను కలుపు చున్నవి ఈ మార్గముల ద్వారా ఈ రెండు దేశముల మధ్య ఎగుమతి దిగుమతుల వ్యాపారము విరివిగా సాగు చున్నదని చెప్పవచ్చును అన్ని రకములైన రోడ్ల యొక్క పొడవు కలిపిన, మొత్తము 4,000 మైళ్ళు మాత్రమే యున్నది దీనికి రాజధాని అయిన అసన్ సియాన్ నుండి ఒక వాయు మార్గము బ్యూనస్ ఐర్సు వరకును, రెండవది అసన్ సియాన్ నుండి రియోడి జనీరో వరకును కలవు ఇంతకు మించి వేరు వాయు మార్గములు లేవు

పట్టణములు  పెరగ్వే యందు పట్టణములు, గ్రామములు కలసి 1950 జనాభా లెక్కల ప్రకారము 180 మాత్రమే యున్నవి వాటిలో 5000 జనాభాకు మించినవి ఏడు కలవు వాటిలో అసన్‌షియాన్ (2, 01, 340 జనాభా), విల్లారికా (14,680 జనాభా), కన్‌సెప్షియన్ (14,640 జనాభా), మరియు ఎన్‌కార్నేషియన్ (18,821 జనాభా) ముఖ్యమైనవి వీటిలో అన్నిటికన్న పెద్దదైన అసన్‌షియాన్ ఈ రాజ్యమునకు రాజధాని

ప్రభుత్వము  ఈ దేశమందు ప్రజాస్వామిక ప్రభుత్వము కలదు ఈ ప్రభుత్వమును ఒక అధ్యక్షుడు, ప్రజలచే ఎన్నుకొనబడిన అయిదుగురు మంత్రులు కలిసి నడపుచుందురు ప్రభుత్వ చట్టముల ననుసరించి యిచ్చటి ప్రజలకు మత స్వాతంత్ర్యము కలదు పెక్కు మంది ప్రజలు రోమన్ కేథలిక్ చర్చికి సంబంధించిన మతస్థులు దేశము యొక్క ఆర్థికపరిస్థితిని పెంపొందించుటకుగాను ప్రభుత్వము అనేక విధములుగ కృషిచేయు చున్నది అమెరికా సంయుక్త రాష్ట్రములు, ఇంగ్లండు, స్పెయిను, ఇటలీ మొదలైన దేశములు దీనికి ఈ కృషిలో తోడ్పడుచున్నది ఈ విధముగ తోడ్పడుటయే గాక పెక్కు మంది ఆయా దేశములవారు పెరగ్వేకు వచ్చి యిచ్చట వలస లేర్పరచుకొన్నారు పెరగ్వే ప్రభుత్వమువారు ఈ విధముగ వచ్చిన యితర దేశస్థులకు ఉచితముగ భూముల నిచ్చుట, పన్నులను తగ్గించుట మొదలైన అధిక సౌకర్యములు కలిగించి వారిని చాల ప్రోత్సహించుచున్నారు దేశము యొక్క ఉపపత్తులను పెంపొందింప చేయుటకు ప్రభుత్వము ఈ ఐరోపా దేశస్థుల సహాయము తీసికొనుచున్నది

పు వి

## పెరూ దేశము (భూ)

స్థానము  పెరూ అను చిన్న దేశము దక్షిణ అమెరికా పశ్చిమ తీరమున వాయవ్య దిశనుండి ఆగ్నేయ దిశవరకు దక్షిణ సమాంతర రేఖయందు 3–18 డిగ్రీల నడుమ నున్నది ఈ దేశమునకు పశ్చిమమున పసిఫిక్ సముద్రము, ఉత్తరమున ఈక్వెడార్, కొలంబియా దేశములు, తూర్పున బ్రెజిల్, బొలీవియా దేశములు, దక్షిణమున చిలీదేశము ఎల్లలుగానున్నవి

పూర్వ చరిత్ర  స్పెయిన్ ప్రభుత్వముచే జయింప బడుటకు పూర్వము ఈ దేశము 'ఇన్కా' ప్రభుత్వముచే సుమారు 400 సంవత్సరములు పాలింపబడెను ఈ దేశమం దుండిన బంగారు, వెండి గనులు స్పెయినువారి నాకర్షించెను మొదట ఇన్కా ప్రభువులు స్పెయినువారి నాహ్వానించి, వారితో స్నేహసంబంధములను నెరప ప్రయత్నించిరి కాని ఈ నూతన నాగంతకుల ముఖ్యోద్దేశము, తమ దేశమందలి ఖనిజ సంపదను కొల్లగొట్టుటయే అని ఇన్కా ప్రభుత్వము త్వరలో గ్రహించెను పవిత్రమైన మతసంస్థలనుండి గూడ బంగారమును అపహరించి, దురాశాపరులైన స్పెయినువారు, తమ దేశమునకు ఎగుమతి చేయసాగిరి తత్ఫలితముగా ఇన్కా ప్రభుత్వమునకును, స్పెయిను వారికిని నడుమ పోరాటము ఘటిల్లి, అందు స్పెయినువారు విజయులైరి దీనితో 16వ శతాబ్దినుండి పెరూ దేశములో స్పెయిను పరిపాలన ప్రారంభమైనది

జనసంఖ్య  ఈ దేశపు జనసంఖ్య 1 కోటి 10 లక్షలకు మించి యున్నది వారిలో ఎర్ర ఇండియనులు, మెస్టిజోలు అను తెగలవారు 80 శాతములో నున్నారు

నైసర్గిక స్థితి  భౌతిక లక్షణముల ననుసరించి పెరూ దేశము మూడు మండలములుగా విభజింపబడ నగును

1 పశ్చిమ తీరప్రాంతము
2 ఆండీస్ పర్వత ప్రాంతము
3 తూర్పు పల్లపు ప్రాంతము

పశ్చిమ తీరప్రాంతము  పసిఫిక్ తీరమును అంటి యున్న ఈ యిరుకైన పల్లపుప్రాంతము, ఉత్తరపు కొనయందలి భాగమున తప్ప, అంతయు మిశ్రమమైన బూడిగ గోధుమ వర్ణము గల ఎడారిగా నున్నది అం దచ్చటచ్చట ఆండీస్ పర్వతములు ఉబికియున్నవి ఇట్టివే, దక్షిణమున పసిఫిక్ తీరపు టంచులను అంటియున్నవి ఇన్కా ప్రభువుల కాలములో ఈ శుష్కభూమి నిరుపయోగముగ నుండి పోయెను 16వ శతాబ్ది నుండి స్పెయినువా రీదేశమునందలి వివిధ ప్రధాన ఉపపత్తులను వినియోగమునకు తెచ్చుచుండిరి అట్టి వాటిలో జల వినియోగము విశేష ప్రాముఖ్యము గలది ఆండీస్ పర్వతములపై నుండి ఏబదికి పైగా నదులీశుష్క ప్రాంతములోనికి ప్రవహించి, పసిఫిక్ సముద్రమున కలియుచున్నవి నీటి కాలువల పొడవునను, జలాధారముచే సస్యశ్యామలము కాగల సుక్షేత్రము లీనాడు కర్షకులచే సద్వినియోగ మొనర్పబడు చున్నవి

తీరప్రాంతమం దెచ్చటను సహజము. రేవు స్థలములు లేవు మొల్లెండో, కాల్లో, టలారా అను రేవులు అడ్డు కట్టలచే అభివృద్ధి పరుపబడినవి పెద్దపెద్ద ఓడలు తీరమునకు దూరముగా లంగరు వేయబడును అందలి సరకులు చిన్న పడవలద్వారా దరికి చేర్చబడును

**శీతోష్ణస్థితి** టలారాకు ఉత్తరాన్య మందున్న అల్ప భూఖండము తప్ప, తీరప్రాంతములో విశేషభాగమున శీతోష్ణస్థితి పొడిగా నుండును మొల్లెండో, పిస్కొ, లిమా, ట్రుజిల్లో ప్రాంతములందు సంవత్సరమునకు సగటున 2 అంగుళముల వర్షము మాత్రమే కురియును ఈ స్వల్ప వర్షమైనను నమ్మకముగా కురియదు సముద్రతీరము వెంబడి గల చల్లని 'హంబోల్టు' జలప్రవాహములును, పైకుబికి వచ్చు శీతలమగు నీటిబుగ్గలును, అచ్చటి వాతావరణ పతనమునకు, భూనిస్సారమునకు కారణము లగుచున్నవి దక్షిణమునుండి వీచు వాయువు సముద్ర జలముచే చల్లబడును ఆ వాయువు దేశాంతర్భాగము లోనికి వచ్చినపుడు, దాని శీతోష్ణస్థితి అధికమగును అందుచే ఘనీభవనము సాధ్యము కాక, పొడిగాలి ప్రవర్తిల్లును ఆండీస్‌పర్వత పశ్చిమ పార్శ్వములందు పైపైకి వీచు వాయుతరంగములు 5000 అడుగుల ఎత్తున చల్లబడి, కొంత పరిమాణములో వర్షపతనమునకు కారణ మగును తీరము వెంట శీతల వాతావరణముచే, తరచుగా పొగమం చేర్పడును హంబోల్టు జలప్రవాహము వలన, పశ్చిమతీర వాతావరణము, ఒకే సమాంతరరేఖపై నున్న బ్రెజిలుదేశము యొక్క తూర్పుతీర వాతావరణము కంటె 6 డిగ్రీలు తక్కువగా నుండును

**ఉత్పత్తులు, మానవ జీవితము** నిస్సార మగు ఈ ఎడారిలో వర్షపతనము తక్కువగా నుండును ఆండీస్ పర్వతములపై నుండి ప్రవహించు పెక్కు కాలువల నీటి ఆధారముచే పంటలు పండు ఈ ప్రాంతము పెరూ దేశమందలి ప్రధాన వ్యవసాయ క్షేత్రము కొలదిగా నున్న లోయల యందలి పంటభూములు దేశాంతర్భాగములో నున్నవి అట్టి పంటభూములకు నడుమనడుమ నిస్సారము లగు కొండభూము లున్నవి ఈ దేశములో ప్రస్తుతము రోడ్డు రహదారీలు, రైలు మార్గములు చాలినంతగా అభివృద్ధి నొందినవి పశ్చిమ తీరమందున్న రేవులు ప్రధానములైన వాణిజ్య కేంద్రములుగా ఉపయోగ పడుచున్నవి

మొత్తముమీద వాతావరణము ఉష్ణప్రధానముగ నుండుటచే, ప్రత్తి, చెరకు మొక్కలను ఏటేటా నాటనక్కర లేదు నీటి పారుదల సౌకర్యము లుండుటచే, ప్రతి సంవత్సరము రెండు మూడు పంటలు పండుచున్నవి ఇటీవల కొంత కాలము నుండి తోటల పెంపకము, శాస్త్రీయ పద్ధతులపై అభివృద్ధి పరుపబడినది తోటల యజమానులు ఆధునిక వ్యవసాయ పరికరముల నుపయోగించు చున్నారు కాని భారీ ఎత్తున సహకార వ్యవసాయము స్పెయిను వారికి స్వప్నవృత్తాంతముగనే పరిణమించినది

స్థానికులైన కార్మికులు, ఆండీస్ పర్వత పశ్చిమ భాగము నుండి అప్పుడప్పు డీదేశమునకు వచ్చు శ్రామికులు, ఆ ప్రాంతపు పొడి వాతావరణమునకు అనుకూల మగు సాధారణ కుటీరములందు నివసింతురు వరి, మొక్కజొన్న, కాఫీ, పండ్లు, కాయగూరలు, పశుగ్రాసము మున్నగు వాటిని వారే స్వయముగ పండించు కొనెదరు ఆల్ఫాఫా అను నొక విధమైన పశుగ్రాసము ఉన్నతభూముల యొక్క పటవాలు ప్రాంతపు చెమ్మ నేలలయందు పెంచబడు చున్నవి

తీరప్రాంతపు మధ్యభూములందున్న లోయ లన్నిటి యందు ప్రత్తి పండుచున్నది కాని లిమా, పిస్కొ ప్రాంతముల పరిసరములందు కూడ ప్రత్తిపంట విశేషముగా అభివృద్ధి చెందినది సంవత్సరమునకు పండు మొత్తము ప్రత్తి పంటలో 90 శాతము విదేశములకు ఎగుమతి కాగా, శేషించిన భాగము లిమా మండలములో నెలకొల్పబడిన దూది మిల్లులకు వినియోగింప బడును దక్షిణ అమెరికాలో పంచదార ఉత్పత్తియందు బ్రెజిల్ తర్వాత పెరూ రెండవస్థాన మాక్రమించియున్నది చెరకు పంట విశేషముగా తీరమైదానమందలి ఉత్తరపు లోయలకు పరిమితమైనది 18 నెలలలో చెరకు పంట మొదటి కోతకు సిద్ధమగును ప్రతి ఏటా మరల మరల మొక్కలను నాటకయే, పెక్కు సంవత్సరముల వరకు చెరకు గడలు కోతకు తయారగు చుండును

చిన్నచిన్న సముద్రపు మొక్కల ఉనికి కారణముగా, చల్లని హంబోల్టు జలప్రవాహములందు చిన్న చేపలు పుష్కలముగా పెరుగుచున్నవి పెక్కు రకముల పక్షు లీచేపలపై ఆధారపడి జీవించు చున్నవి ఈ పక్షులు, తీరప్రాంతమందును, సమీపమందున్న చిన్న దీవుల యందును చెట్లపైనను నివసించు చుండును చచ్చి, కుప్పలుగా ప్రాలి పడియున్న

ఈ పక్షులు జలప్రవాహముచే కొట్టుకొని పోవుట కచట వర్షముతే కురియవు ఇట్టి పక్షుల మృత శరీరముల కుప్పలను మొట్టమొదటిసారిగా హంబోల్టు అను పరిశోధకుడు క్రీ శ 19వ శతాబ్దిలో చూచెను ఆ శతాబ్దియందే ఆ పక్షుల మృత దేహములందు శాస్త్రజ్ఞులచే నత్రజని కనిపెట్టబడెను ఆ మృత దేహములు సారవంతమైన ఎరువుగా ఉపయోగ పడునని నిర్ణయింప బడెను అప్పటి నుండి ఈ సముద్రపు పక్షులు పెరూ దేశమునకు ప్రధానమైన ద్రవ్యోపపత్తిగా ఉపకరింప సాగెను భూగర్భమున నున్న ఈ పక్షుల మృతదేహముల త్రవ్వకము ప్రభుత్వముచే అదుపు చేయబడి, వాటి ఎగుమతి నిషేధింప బడెను ఈ దేశమునం దుత్పత్తి యగు ఈ పక్షుల ఎరువంతయు స్థానికావసరములకు వినియోగ పడుచున్నది

మత్స్య సంపద మత్స్యపరిశ్రమ పశ్చిమ తీరమం దంతట అభివృద్ధికి తేబడినది అచ్చట నున్న చల్లని జల ప్రవాహమునందు రకరకములైన చిన్న చేపలు సమృద్ధిగా నున్నవి వీటిలో అధికభాగము శాస్త్రీయపద్ధతిపై డబ్బా లలో నిలవ చేయబడి పశ్చిమ దేశములకు ఎగుమతి చేయబడు చున్నది కొంత భాగము పశువుల ఆహారమునకు యోగ్య మగునట్లు తయారు చేయబడుచున్నది

ఖనిజ సంపద సముద్రతీరము పొడవున, మార్కోనా పరిసరములందును, పిస్కోకు సమీపముననను ఇనుప గనులు కలవు శాంటా నదీతీరముపై గల చింబోటి అనునది ప్రధాన మైన ఇనుము - ఉక్కు పారిశ్రామిక కేంద్రము అమెరికాకు ముడి ఇనుమును సరఫరా చేయు దక్షిణ అమెరికా దేశము లలో వెనిజులా తర్వాత ఈ దేశము రెండవస్థాన మాక్ర మించును

తీరమైదానమం దుత్తరభాగమున లాబిటాస్ వద్ద పెట్రోలియము లభించును పెట్రోలు గను లచ్చట దాదాపు సముద్రపు ఒడ్డుననే ఉండుట వలన, అవి ఎక్కువ ప్రయోజన కరములుగా నున్నవి ఏటేటా 20 లక్షల టన్నుల పెట్రో లియము ఈ దేశమం దుత్పత్తి యగుచున్నది ఈ ముడి నూనె ఓడల ద్వారా తైలశుద్ధి కర్మాగారములకు నేరుగా, చౌకగా చేర్పబడు చున్నది ఉత్తర మందున్న టలారా రేవు వద్ద సుప్రసిద్ధమగు నూనెశుద్ధికర్మాగారము కలదు అచ్చటి నుండియే వివిధ దేశములకు నూనె ఎగుమతి చేయబడును తీరప్రాంతమందు ఖనిజ సంబంధమైన ఇంధనములు లేకుండు టచే, పెట్రోలు ద్వారా ఉత్పత్తి యగు విద్యుత్తునకు రవాణా, పరిశ్రమ రంగములందు అధిక ప్రాముఖ్యము చేకూరినది తీరప్రాంతమందు నెలకొనిన పరిశ్రమల అవసర ములకు జలవిద్యుత్కేంద్రముల నుండి ఉత్పత్తి యగు విద్యుత్తు మాత్రమే చాలదు సెర్రోడి పాస్కోకు దక్షిణమున రాగి గనులున్నవి

నగరములు, పరిశ్రమలు ఈ దేశమునకు రాజధాని యైన లిమా అన్ని నగరములలో మిగుల పెద్దది దాని జన సంఖ్య సుమారు 13 లక్షలు ఈ నగరము రిమాక్ అను సారవంతమైన లోయయం దున్నది తీరమున కది సమీప ముగా, రిమాక్ నది కిరుప్రక్కల నుండుటచే, దాని ప్రాము ఖ్యమును స్పెయినువారు గమనించి దానిని రాజధానిగా ఎన్నుకొనిరి ఆ నగరము ప్రముఖ పారిశ్రామిక, ఆర్థిక, సాంస్కృతిక కేంద్రమనదగి యున్నది తూర్పున నున్న ఒరోయా నగరమునకును, రాజధానికిని నడుమ రైలు మార్గము కలదు ఆండీస్ పీఠభూమికి ఒరోయా నగరమొక ప్రధాన వ్యాపార కేంద్రము ఉత్తరముననున్న కాల్లో రేవు నకును రాజధానికిని రైలు, రోడ్డు మార్గములు కలవు రాజధానీ నగరమందలి ముఖ్య ప్రాంతము కళాత్మకముగా నిర్మితమై, నేత్రానందకరముగ నుండును కాని నగరపు పొలిమేరలయందు కాన్పించు పూరిగుడిసెలు మనస్సునకు సహజముగ జాలి కల్గించును రాజధాని యగు లిమా నగరమునకు కాల్లో అనునది రేవుకేంద్రము ఇచ్చట వ్యాపా రపు సందడి అధికముగ నుండుటచే, ఇది 'వాణిజ్య నగర' మనబడుచున్నది ఇచ్చటి రేవునందు సుదీర్ఘములైన అడ్డు కట్టలు నిర్మింపబడి, ఓడలు లంగరు దించుటకు సౌకర్యములు కల్పింప బడినవి ఈ రేవునుండి రాజధానికిని, సెర్రోడి పాస్కో, ఒరోయా నగరములకును రైలు మార్గములు గలవు ఈ రేవు సమీపమందలి జన సంఖ్య 1 లక్ష 86 వేలు దానిలో అధికసంఖ్యాకులు వణిజులు కొందరు ఓడలలో పంచదార బస్తాలను, దూది బేళ్ళను ముడి రాగిని ఎక్కించి తన్మూలముగా లభించు వేతనములతో జీవనము సాగించు చున్నారు మరికొందరు విదేశముల నుండి ఓడలద్వారా దిగుమతియగు యంత్ర పరికరములను, వస్త్రములను, కలప మున్నగు సామానులను రేవునకు చేరవేసి, దాని మూలమున లభించు వేతనములతో జీవించెదరు

కాల్లోకు ఆగ్నేయమున పిస్కో అను మరియొక రేవు కలదు ఇచ్చట ఆండీస్ పర్వత పశ్చిమ పార్శ్వముపై నుండి ఒక నది క్రిందికి ప్రవహించి పసిఫిక్ సముద్రములో కలియుచున్నది ఈ రేవునుండి బయలుదేరు ఒక ప్రధానమైన శైలుమార్గము, మైదానము గుండా ఆగ్నేయ దిశకు సాగిపోవును దక్షిణపెరూ దేశములో మొలెండో అను నది ముఖ్యమగు ఒక రేవు కుజ్కో, ప్యూనో, అరిక్విపా అను నగరముల నుండి అధిక పరిమాణములో ఇచ్చటికి ఉన్ని కొనిరాబడి, విదేశములకు ఎగుమతి చేయబడును

ఆండీస్ పీఠభూమి తీర మైదానమునకు తూర్పుగానున్న ఈ పీఠభూమి, తూర్పు పశ్చిమ ఆండీస్ పర్వత కనుమల నడుమ వాయవ్య దిశనుండి, ఆగ్నేయ దిశవరకు విస్తరించియున్నది ఈ పీఠభూమిపై లెక్క నీటి మడుగులు గలవు నీరు నిలుచు కొన్ని పల్లపుభూములు కొంత కాలము తర్వాత, జలసమృద్ధి గల పెద్ద సరస్సులుగా ఏర్పడినవి ప్రపంచ మందలి పీఠభూములపై నున్న ఇట్టి మంచినీటి సరస్సులలోకెల్ల టిటికాకా అనునది గరిష్ఠ ప్రమాణము కలది ఈ సరస్సు ప్యూనోకు తూర్పున నున్నది పశ్చిమమున ఈ పీఠభూమి నుండి వడివడిగా క్రిందికి ప్రవహించు చిన్న కాలువలు, సముద్ర తీరమందలి శుష్కభూములకు నీటిని సరఫరా చేయును తూర్పు ప్రాంతమందలి లోతైన నదులు వల్లపు ప్రాంతమందున్న పార్శ్వభూముల గుండా ప్రవహించి బ్రెజిల్ దేశములో ప్రవేశించు చున్నవి

శీతోష్ణస్థితి ఆండీస్ పీఠభూమి యందలి ఎగువ ప్రాంతము అతి శీతలముగ నుండును అచ్చట సంవత్సరము పొడవున పెనుగాలి వీచుచుండును ఎత్తు పల్లములను బట్టి అందలి వాతావరణము మారుచుండును సముద్రమునకు దూరముగా నుండుటచే, ఇచ్చట హంబోల్టు యొక్క శీతల ప్రభావ మెంతమాత్రము కాన్పింపదు సాంవత్సరిక వాతావరణ ప్రమాణము 8° ఫా కంటె అధికముగ నుండదు 12,500 అడుగుల ఎత్తున నున్న ప్యూనోయందు సాంవత్సరిక సగటు వాతావరణము 48° ఫా వరకుండును సంవత్సరము పొడవున దైనిక వాతావరణ ప్రమాణములు అత్యంత తీవ్రముగ నుండును అల్ప వాతావరణ పీడనము వలన ఉన్నత భూమిపై వీచు గాలియందు ప్రాణవాయువు తకువ శాతములో నుండుటవలన, అచ్చటి ప్రజలు శారీరకముగా చాకచక్యము లేక మందముగ నుందురు దక్షిణమునుండి ఉత్తరమునకు పోనుపోను వర్షపాత మధిక మగును ఇదియు విశేషముగా వేసవిలోనే ఘటిల్లును ఎత్తునుబట్టి మార్పు చెందు వర్షపాతము సంవత్సరమునకు 18 నుండి 40 అంగుళముల వరకు ఘటిల్లు చుండును

సహజోద్భిజ్జ సంపద ఎత్తులో గల మార్పును బట్టియు, శీతోష్ణస్థితియందు ఘటిల్లు హెచ్చుతగ్గుల ననుసరించియు, ఉద్భిజ్జముల పెరుగుదలయందు వ్యత్యాసము గోచరించును 11,000 అడుగుల ఎత్తునకు తక్కువగా నుండు కొండ లోయలయందు అరణ్యములు పెరుగును 11,000 నుండి 14,000 అడుగుల ఎత్తుగల ప్రాంతమందు పెరుగు గడ్డి మున్నగు పలు రకముల పశుగ్రాసము గొర్రెలు మున్నగు జంతువులకు యోగ్యముగ నుండదు సముద్ర మట్టమునకు 14,000 నుండి 17,000 అడుగుల ఎత్తున నున్న ప్రాంతమందు చలి మిక్కుటముగా నుండుటచే, ఉద్భిజ్జము అచ్చట ఏపుగా పెరుగదు అంతకు పైన అసలు మొక్కలు మొలచుటయే అసాధ్యము

వ్యవసాయము చిన్న చిన్న వ్యవసాయ క్షేత్రములందు దేశీయులు మొక్కజొన్న, బార్లీ, గోధుమ, బంగాళాదుంపలు, పండ్లు మున్నగు వాటిని పండించెదరు పంట ఋతువులందు కొందరు వ్యవసాయదారులు తీరప్రాంత మందలి వ్యవసాయ క్షేత్రములకు తరలి పోయెదరు దక్షిణమందున్న కుజ్కో పర్వత ప్రాంతమందలి ప్రధాన వ్యవసాయ కేంద్రము ఉన్నత భూములందు వ్యవసాయ కలాపము కర్షకుల స్వీయ ఆహార నిమిత్తమే గాని, వ్యాపారార్థము కాదు ఆండీస్ పర్వత ప్రాంత మందున్న వ్యవసాయ క్షేత్రమునకు సమీపముననే గల ప్రతి గ్రామమందు వందల కొలది పశువులు పెంచబడును నూర్పిడియైన ధాన్యమును, కొండ ప్రాంత మందలి వంటచెరకును గ్రామమునకు చేర్చుటకు గాడిద లుపయోగింప బడును ఎద్దులు మున్నగు ఇతర జంతువులు కూడ ఈ పని కుపయోగి పడుచున్నవి రైతుల పేదరికము, స్వల్ప ఖండములుగా భూవిభజనము, సహకార వ్యవసాయ విధానములేమి, అయోగ్య మగు భూలక్షణము, శీతోష్ణ వాతావరణ పరిస్థితులు - ఇవన్నియు పెరూలో వ్యవసాయాభివృద్ధికి ఆటంకములుగా పరిణమించినవి కొండ లోయలందలి వ్యవసాయ కలాపములో విశేష భాగము కేవలము మానవ శ్రమవలననే జరగుచున్నది అచ్చటచ్చట

ప్రవహించు కాలువల ద్వారానే ఇచ్చటి వ్యవసాయ భూము లకు నీటి వసతి కలుగుచున్నది

**ఖనిజములు** పీఠభూమియందు ముఖ్యముగా లభించు బంగారము జాతీయ సంపదకు విశేషముగా దోహద మొసగు చున్నది ఈ ఖనిజమే ఈ దేశమునకు స్పెయినువారిని ఆక ర్షించి, ఇన్కా రాజ్యపతనమునకు హేతువయ్యెను పెరూలో లభ్యమగు ఇతర ప్రధాన లోహములలో వెండి, రాగి కూడ కలవు మిశ్రమ ఉక్కు లోహమును తయారుచేయుట కుప యోగపడు వనాటమను ఖనిజముకూడ అచ్చట దొరకును ఈ దేశములో ఖనిజములను త్రవ్వితీయు గుత్తాధికారము తెల్లజాతివారే అనుభవించు చున్నారు భారతీయులు, మెస్టిజోలు ఈ గనులలో కార్మికులుగా మాత్రమే పనిచేయు చున్నారు రవాణా ఇబ్బందులు, ఇంధనముల లేమి, స్థానిక కార్మికుల సాంకేతిక అసమర్థత – ఇవన్నియు గనుల పరిశ్ర మాభివృద్ధికి అంతరాయములుగ నున్నవి పీఠభూమి నుండి రేవులకు పోవు రైలుమార్గములు కొలదిగ మాత్రమే కలవు ఖనిజములలో 90 శాతము ఒరోయా, సెర్రోడి పాస్కోల సమీపమున గలవు గనులు కేంద్రీకృతమై ఉన్న ఈ మండల మునకును, రాజధానియగు లిమా నగరమునకును నడుమ, రైలు మార్గము కలదు కంచర గాడిదలు, బరువులు మోయు ఇతర జంతువులు నడచు కాలిబాటలు చిన్న చిన్న ఇతర గనుల నడుమ కాన్పించును ఈ దేశమందు లభించు కొలది నేల బొగ్గు, సెర్రోడి పాస్కో యందలి రాగిగనుల కార్యకలా పములకు మాత్రమే సరిపోవును తీరమందలి టలారా మండ లములో దొరకు నూనె దేశావసరములను తీర్చ జాలదు అందుచే ఏటేటా ఇతర దేశముల నుండి పెద్ద మొత్తములలో పెట్రోలును దిగుమతి చేసికొనవలసి యున్నది ఉన్నత తలమందు వీచు అపూర్వమైన గాలి తెల్లవారి ఆరోగ్యమునకు భంగము కల్గించు చుండును అందుచే గనుల యజమానులగు వారు, అసమర్థులును, అపనమ్మకస్థులునైన స్థానిక భార తీయులను, మెస్టిజోలను మాత్రమే విధిలేక పనులలో నియో గించవలసి వచ్చుచున్నది

**ప్రజలు, ఇతర వాణిజ్యములు** పెరూ దేశీయులలో భారతీయులు, మెస్టిజోలు అత్యధికులు వీరు దారిద్ర్య మనుభ వించుచు, నికృష్టదశలో జీవించుచున్నారు కొకెయిన్ అను పదార్థము కలిగిన కోకాపత్రములను నమలుట అచ్చటి ప్రజల కొక సామాన్యమగు అలవాటు వారు చిన్న చిన్న పూరిం డ్లలో నివసించుచు, గొర్రెలను, ఇలామా, విక్యునా, అల్పాకా అను జంతువులను పెంచుచు జీవింతురు వారు దీర్ఘముగను, వదులుగను ఉండు ఉడుపులను ధరింతురు, వాటికంతగా కుట్టుపని ఉండదు ప్రతి సంవత్సరము చాలినంత ఉన్ని ఆ దేశములో లభ్యమగును అల్పాకా జంతువుల నుండి తీయు ఉన్ని అత్యుత్తమ మైనది దక్షిణదేశ మందున్న అరిక్విపా నగరము ఉన్నిని శుభ్రపరచు ప్రధాన కేంద్రముగా వాసి కెక్కినది అచ్చటినుండి ఉన్ని బృహత్పరిమాణములో మొలెండో నగరమునకు పంపబడి, అచ్చటినుండి ప్రపంచ విపణుల కెగుమతి చేయబడును

**నగరములు** దక్షిణ ప్రాంతమందున్న కుజ్కోనగరము ఆండీస్ పర్వతముల తూర్పు పార్శ్వమున నున్నది ఒకప్పుడీ నగరము ఇన్కా సామ్రాజ్యమునకు రాజధానిగ నుండెను ఇప్పుడది ఒక వ్యవసాయ కేంద్రముగ మాత్రమే ఉన్నది ఇటీవల ఈ నగరము ఉన్ని పరిశ్రమ కేంద్రముగ ప్రసిద్ధి గనినది ఇచ్చటినుండి దక్షిణమున నున్న అరిక్విపా నగరమున కొక జంట రైలుమార్గము కలదు మరియొక రైలు మార్గము వాయవ్య దిశగా లిమా నగరము వరకు పోవును

తూర్పు పల్లపు ప్రాంతము ఉష్ణాధిక్యమును, తేమ గాలియును కల్గి, ఎల్లప్పుడు పచ్చగనుండు నిరతహరిత ప్రాంత ఉద్భిజ్జములతో కళకళలాడు మాంటానా అను ఈ పల్లపు ప్రాంతము, పైన పేర్కొనబడిన పీఠభూమికి తూర్పుగా, పెడమార్గమున నున్నది స్వల్ప జనసంఖ్యవలన, రవాణా సౌకర్యములు తక్కువగా నుండుటవలన, ఈ ప్రాంతపు ఆర్థి కాభివృద్ధి వెనుకబడినది రబ్బరు, బలాటా, అను జిగురు పదార్థము ఇచ్చట ఉత్పత్తియగు ప్రధాన ద్రవ్యములు క్వైనైనును తయారు చేయుటకు సింకోనా చెట్టు బెరడును ఉపయోగించెదరు కొంతకాలము క్రిందట, ప్రపంచమునకంతటికి పెరూదేశము నుండియే సింకోనా సరఫరా అగుచుండెడిది కాని తరువాత ఈస్ట్ ఇండీస్ దీవులతో పోటీచేయలేక, ఈ దేశము సింకోనా వ్యాపారములో నష్టపడినది

మాంటానా ప్రాంతమందలి కోకా గుబ్బలకు విశేష ప్రాముఖ్యము కలదు ఈ పంట ప్రధానముగా లోయల దిగువ ప్రాంతమునకు పరిమితమై యున్నది ఈ పల్లపు ప్రాంతములందలి ఉత్తరభాగము పెట్రోలునకు ప్రసిద్ధి

చెందినది ఉత్తరమున నున్న ఇక్విటాస్ అనురేవు ఆమెజాన్ నదిపై నున్నది దీనికి పశ్చిమమున నున్న ప్రాంతము ఓడ ప్రయాణమునకు అననుకూలముగ నుండును ఇక్విటాస్‌నకు చుట్టుప్రక్కల దట్టమైన అడవులును, శాఖోపశాఖలుగ నుండు కాలువలును గలవు ఉష్ణప్రధానములైన అడవులయందు పండు పంటయు, పరిసరములం దుత్పత్తి యగు వ్యవసాయసంపదయు కాలువలపై ఇచ్చటికి చేరవేయ బడును ఇక్విటాస్ నగరము ఉత్తర నిమ్న ప్రాంతమందలి మధ్య భాగమున నున్నది ఇచ్చటనుండియే ప్రధానముగా రబ్బరు, బలాటాలు ఎగుమతి యగును రబ్బరువ్యాపారము క్షీణించుటచే, పూర్వము ఇక్విటాస్ నగరము అప్రధాన మయ్యెను కాని ఇటీవల అచ్చట నూనెగనుల త్రవ్వకము వలన, ఈ నగరమునకు మరల ప్రాముఖ్యము చేకూరినది

వాణిజ్యము రవాణా చిక్కులు, ప్రతికూలశీతోష్ణస్థితి, ప్రజల నికృష్ట జీవితము-ఇవన్నియు ఆర్థిక, పారిశ్రామిక, వాణిజ్యాభివృద్ధికి అంతరాయము కల్గించినవి ప్రత్తి, మత్స్య పదార్థములు, పంచదార, కాఫీ, ఉన్ని, రాగి, తుత్తునాగము, సీసము, పెట్రోలియము మున్నగునవి అమెరికా, బ్రిటను, చిలీ దేశముల కెగుమతియగు ముఖ్య పదార్థములు ఆహార ధాన్యములు, రసాయనములు, యంత్రములు పశ్చిమ జర్మనీ, బ్రిటను, అమెరికా దేశములనుండి దిగుమతి యగును పెనామా కాలువ నిర్మాణము వలన, యూరపు, తూర్పు అమెరికా ఖండములతో పెరూదేశమునకు గల వ్యాపారము చాలవరకు అభివృద్ధి చెందినది ఇటీవల ఆండీస్ పర్వతముల పైగా, ఆమజాన్ నదియొక్క ఉపనది వరకు ఒక రహదారీ మార్గము నిర్మింపబడినది ప్రస్తుతము క్రమపద్ధతి ననుసరించి అన్ని ప్రాంతములకు విమానములు ప్రయాణించు చున్నవి పెరూదేశములో దూరమందున్న మారుమూల ప్రాంతముల నన్నిటిని కలుపుచు క్రొత్త రహదారులు, విమాన యానములు క్రమముగా నిర్మింపబడు చున్నవి

మ ఇ

## పెర్కిన్, సర్ విలియం హెన్రీ (1838-1907)

తన జీవితమంతయు రసాయనశాస్త్ర పురోభివృద్ధి కొరకే ధారపోసిన మహనీయుడును, "అనిలీన్" అను ద్రవ్య నిర్మాతయు నైన విలియం హెన్రీ పెర్కిన్ 1838వ సంవత్సరము మార్చి 12వ తేదీన లండన్‌నగరమున జన్మించెను ఇతడు ప్రాథమిక విద్యను లండను సిటీ స్కూలులో అభ్యసించుచు తన విరామ సమయమంతయు రసాయన శాస్త్ర అధ్యయనమునకే వినియోగించెడివాడు పెర్కిన్, తన ప్రాథమిక విద్య పూర్తిచేసికొని, సుప్రసిద్ధ రసాయన శాస్త్రాచార్యుడైన ఏ డబ్ల్యు వాన్‌హాఫ్‌మన్‌వద్ద తన అభిమాన శాస్త్రము నభ్యసించుటకు "రాయల్ కాలేజ్ అఫ్ కెమిస్ట్రి"లో విద్యార్థిగా చేరెను

చదువు ముగించుకొని పెర్కిన్ ఆ కాలేజీ లోనే హాఫ్‌మన్ యొక్క సహాయ అధ్యాపకుడుగా చేరెను హాఫ్‌మన్ ఉపన్యాసములు విని ఉత్సాహపూరితుడై, అతని ప్రోత్సాహము వలన పెర్కిన్ తన ఇంటిదగ్గర ఒక చిన్న ప్రయోగశాల నేర్పరచుకొని సాయంకాలమందు అనేక ప్రయోగములు స్వయముగా చేయుచుండెడి వాడు అట్టి ప్రయత్నములలో కృత్రిమముగా 'క్వినైన్' అను వృక్షసంతతి నుండి లభ్యమగు ఔషధమును తయారుచేయుటకు అతడు చేసిన ప్రయత్నములు అతి ముఖ్యమయినవి ఈ ప్రయోగ పరంపరల పర్యవసానమే "మావే" అను అనిలీన్ వర్ణద్రవ్య నిర్మాణమునకు దారి తీసినది అనిలీన్‌ను పొటాసియం డైక్రొమేట్‌తో ఆక్సీకరణము చేయగా, అతడాశించిన క్వినైన్‌కు బదులుగా ఒక నల్ల నిపదార్థ మేర్పడెను దీనినుండి ఒక ఊదారంగు ద్రవ్యమును పెర్కిన్ విడదీయ గలిగెను ఈ కృత్రిమ వర్ణద్రవ్యము బట్టల అద్దకమునకు అతి ప్రశస్తమైనదిగా నిరూపించబడినది ఇది 'మావే' అను సంకేతనామముతో, అద్దకమునకు తక్కువ ఖరీదులో లభ్యమగుట వలన త్వరలో విరివిగా వాడుకలోనికి వచ్చినది కృత్రిమవర్ణద్రవ్య నిర్మాణమునకు ఇది నాంది అని చెప్పవచ్చును

1856లో మావే అను ఈ అద్దకపు రంగును భారీ ఎత్తున ఉత్పత్తి చేయుటకు ప్రత్యేకాధికారమును పెర్కిన్ పొందెను పిదప పెర్కిన్ తన తండ్రిని, తమ్ముని సహాయులుగ గొని "హారో" దగ్గర గ్రీన్‌ఫర్డ్ గ్రీన్ అను ప్రదేశమున ఒక కృత్రిమ వర్ణద్రవ్య కర్మాగారమును స్థాపించెను 'అలిజరిన్' అను ఎర్రని సహజవర్ణ ద్రవ్యమును గూడ కృత్రిమముగా పెద్ద ఎత్తున తయారు చేయుటకు అతి ముఖ్యమైన పారిశ్రామిక పద్ధతిని గూడ ఈతడే కనిపెట్టెను అంతకుముందు ఈ రంగు పదార్థమును 'మాడర్' వ్రేళ్ళనుండి తయారు చేసెడివారు కృత్రిమముగా దీనిని తయారు చేయుట ప్రారం

ఖించుటతో, ప్రాత పద్ధతి పూర్తిగా మూలపడినది త్వరలో పెర్కిన్ అలిజరిను తయారు చేయుటకు కూడ ఒక 'పేటెంటు'ను సంపాదించెను తదాదిగా చాలకాలము వరకు కృత్రిమ వర్ణద్రవ్యముల తయారీ గ్రీన్ ఫర్ గ్రీన్ పరిశ్రమల యొక్క గుత్తాధికార మయ్యెను బి ఎఫ్ డుప్పా అను శాస్త్రజ్ఞునితో కలిసి పెర్కిన్ 'గ్లైకొకాల్, టార్టారిక్ ఆసిడ్' అను కర్బన రసాయన పదార్థములను గూడ కృత్రిమముగా తయారు చేయగలిగెను

పెర్కిన్ అనేక ఇతర వర్ణ ద్రవ్యముల యొక్కయు, సుగంధ ద్రవ్యముల యొక్కయు అణునిర్మాణ విషయమై విస్తృతమయిన పరిశోధనములు కావించెను తన ప్రయోగ పరిశోధనముల ఫలితముగా, 1868లో టోంకాబీన్, ఉడ్ రఫ్ లందు సువాసనకు కారణభూత మయిన "కుమరిన్" అను కర్బన రసాయనద్రవ్యమును కృత్రిమముగా తయారుచేసి దాని అణు నిర్మాణమును ఇతడు నిర్ణయించ గలిగెను 'సాలికెనిన్' అను మరియొక సహజ కర్బన రసాయన పదార్థము యొక్క అణు నిర్మాణమును గురించి గూడ ఇతడు ప్రయోగములను జరిపెను

1874 సంవత్సరమునుండి, పెర్కిన్ పారిశ్రామిక విభాగమునుండి విడిపడి, తన కాలము నంతయు రసాయన శాస్త్ర పరిశోధనమునకే వినియోగించెను 1878వ సం॥ న కర్బన అసంతృప్త ఆమ్లముల కృత్రిమనిర్మాణ ప్రక్రియను ఇతడు పరిశోధించి కనుగొనెను ఈ ప్రక్రియ "పెర్కిన్ రియాక్షన్" అను పేరుతో నేటికిని వాడుకలో నున్నది దీనియందు అరోమాటిక్ ఆల్డిహైడులను, మజ్జామ్లక్షారలవణములతోను, దాని ఎన్‌హైడ్రైడ్‌లతోను సంయోగించి α B-అసంతృప్త ఆమ్లములను తయారు చేయవచ్చును ఉదా "కుమరిక్ ఆసిడ్", సిన్నామిక్ ఆసిడ్లు ఈ విధానము ననుసరించి చేయబడుచున్నవి ఇవి గాక అయస్కాంత క్షేత్రమున కాంతి ధ్రువతలమును గురించి గూడా పెర్కిన్ విపులముగా పరిశోధనములు సలిపెను ఇతడు అయస్కాంత భ్రమణశక్తిని గురించి లెక్కకట్టెను

పెర్కిన్ చేసిన అమూల్యపరిశోధనముల ఫలితములను గుర్తించి రాయల్ సొసైటీవారు 1878లో ఇతనికి 'రాయల్ పతక' ప్రదానము చేసిరి 1887లో పెర్కిన్‌కు 'డేవీపతకము' బహూకరించబడినది వివిధములైన బ్రిటిష్ వైజ్ఞానిక సంస్థలు, తదితర విదేశ వైజ్ఞానిక సంస్థలు పెర్కిన్ శాస్త్రజ్ఞుని పలువిధముల సన్మానించి, సంభావించెను బ్రిటిష్ ప్రభుత్వము 1906లో 'సర్' అను బిరుదము నిచ్చి ఈ మహాశయుని సత్కరించెను

1907వ సం॥న తన 69వ ఏట 'హారో' యందలి తన స్వగృహమున పెర్కిన్ కన్నుమూసెను

వి సుం

## పెస్టాలాజీ (1746-1827)

విద్యా చరిత్రలో ప్రఖ్యాతి నొందిన మహాపురుషులలో పెస్టాలాజీ యొకడు విద్య వలననే మానవకోటి నుద్ధరించుట సాధ్యమను సంపూర్ణ విశ్వాసముతో పేదలకు, అనాథులకు విద్య గరపి, వారి నుద్ధరింప నితడు సమకట్టెను అందు కాతడు జీవితాంతము వరకు అధ్యాపక వృత్తి నవలంబించెను విశాల హృదయముతో, నమ్రతతో, నిస్స్వార్థముతో విద్యా బోధనమునకు, సంఘ సంస్కారమునకు అతడు తన జీవితమును ధారపోసెను అతని భావములు, బోధనా సూత్రములు, ప్రయోగముల ఫలితములు ఆధునిక పాఠశాలలం దనుసరింప బడుచున్నవి

జోహాన్ హీన్రిచ్ పెస్టాలాజీ అను నాతడు స్విట్జర్లెండు నందలి జూరిక్ పట్టణమున 1746వ సంవత్సరములో జన్మించెను అతని యైదేండ్ల ప్రాయమున తండ్రి మరణించెను తానును, తన సోదరియు, తల్లి సంరక్షణముతో నుండిరి సెలవు దినములను క్రైస్తవ మతబోధకుడగు తన తాతగారి వద్ద గడపు చుండెను దయా, ప్రేమభావములను తన తల్లి నుండియు, దైవభక్తి, మతాభిమానములు మున్నగు సుగుణములను తాతనుండియు గ్రహించెను

బాల్యము నుండియు అతడు మత గ్రంథములను చదివి మత బోధకుడు కాదలచెను కాని తన వాక్పటుత్వము తక్కువ నుండనందున, ఆ నిర్ణయము నుండి వైదొలగెను అంతట న్యాయవాదిగ పేదల హక్కులను కాపాడి, వారి నుద్ధరింప దలచెను, కాని ఆ సంకల్పమును గూడ విడిచిపుచ్చెను స్వంత భూమిలో కర్షకుడుగ కృషి చేయుచు నూతన వ్యవసాయ పద్ధతులను ప్రజలకు నేర్పి, సంఘము నుద్ధరింప దలచెను ఆ సందర్భమున రూసో అను ప్రఖ్యాత పురుషుడు రచించిన 'ఎమిల్', 'సోషల్ కాంట్రాక్టు' అను రెండు గ్రంథములాతని నాకర్షించినవి అందలి సిద్ధాంతముల నాచరణములో

నుంచి మానవసేవ చేయదలచెను ఆతని జీవితమం దెన్ని కష్టనష్టముల నైన నోర్చి, దుర్భర దారిద్ర్యములో ఆతనికి అండగా నుండిన ధర్మపత్ని 'ఏనాషుల్త్జస్' అనునామె ఆతనికి కెంతయో సేవ జేసెను

'న్యూహోఫ్' అను తన స్వంత కృషిభూమిలో పెస్టాలాజీ కొందరు పేద బాలురకు, అనాథుల బిడ్డలకు శిక్షణ నిచ్చుచు, తన అధ్యాపక వృత్తిని ప్రారంభించెను పేదల నుద్ధరించుటకు బదులు తానే దరిద్రమున మునుగుటచే, 1779లో ఆ సంస్థను మూసివేయవలసి వచ్చెను పిదప నాతడు 18 సంవత్సరములు కొంత గ్రంథరచనమున కాలము గడిపెను "ది ఈవెనింగ్ అవర్ ఆఫ్ ఎ హెర్మిట్", "లియొనార్డ్ అండ్ గెర్ట్రూడ్", "క్రిస్టఫర్ అండ్ ఎలిజా" అను గ్రంథములను రచించి, వాటి ద్వారా తన భావములను ప్రకటించెను 1798వ సంవత్సరములో స్విట్జర్లెండు దేశ మాక్రమించిన ఫ్రెంచి విప్లవ ప్రభుత్వ సహాయమున స్టాన్జ్ అను గ్రామములో కేథలిక్కు బాలలు, అనాథలు నగు నలుబదిమందికి తడు ఉపాధ్యాయుడుగ నియమింపబడెను కాని అయిదు మాసములకే అత డా గ్రామమును విడిచి బర్‌డార్ఫ్ అను నొక పట్టణములో నొక పాఠశాలయందు అధ్యాపకుడుగ ప్రవేశించెను అచట నుండిన మూడు సంవత్సరములలో తన నూతన బోధన పద్ధతులను, ప్రయోగములను సాధించెను పిదప మున్షెన్ బుష్ కాన్వెంట్ పాఠశాలకు తరలెను ఒక సంవత్సరము లోపుననే ఆతడు అక్కడనుండి వెర్డన్ అను పట్టణమున కేగెను అచ్చట ప్రఖ్యాతి నొందిన ఒక విద్యాసంస్థను అతి జయప్రదముగ నడిపెను ఉపాధ్యాయులకు శిక్షణ మొసగు శాఖను స్థాపించెను ఐరోపా దేశములలోని ప్రముఖు లాసంస్థను చాల ప్రస్తుతించి, పెస్టాలాజీని విశేషముగా కొనియాడిరి కాలక్రమేణ ఆ సంస్థయం దంతఃకలహములు బయలుదేరి అది యంతరించెను అంత పెస్టాలాజీ క్లిండీ అను గ్రామమునకు పోయి, అచ్చట 12 మంది అనాథ బిడ్డలతో నొక పాఠశాలను ప్రారంభించెను అప్పటి కాయనకు వార్ధక్యము పైబడెను శక్తిహీనుడై



చిత్రము 22

పెస్టాలాజీ

అంత్యదశలో తిరిగి ఆతడు 'న్యూహోఫ్'న కేగెను మూడు సంవత్సరముల పిదప అతడు 1827 ఫిబ్రవరి 17న స్వర్గస్థుడాయెను ఆతని సమాధిపై "ఒక మంచి పౌరుడు, నిజమగు క్రైస్తవుడు, సకలము ఇతరులకే కాని, తానేమియు నపేక్షింపలేదు" అను వాక్యములు వ్రాయబడినవి

పెస్టాలాజీ విద్యాతత్త్వము క్రైస్తవ మత సిద్ధాంతముల ననుసరించి యుండును మానవుడు దైవాంశసంభూతుడు భగవంతుడు ప్రసాదించు శక్తిసామర్థ్యములు ప్రతి వ్యక్తి యందును నిబిడీకృతమై యుండును మానవకోటి యొక్క సర్వశక్తులను ప్రకృతి వికసింపజేయును అధ్యాపకుడైనవాడు ప్రతి బాలుని వ్యక్తిత్వమును చాల పవిత్రమైనదని గ్రహింపవలెను పాఠశాల లక్ష్యము బాలబాలికలకు విజ్ఞానము నందజేయుట గాని, బోధనము గాదు ప్రతి వ్యక్తి యందును గల శక్తి సామర్థ్యములను వికసింపజేసి మానవునికి ఔన్నత్యము నందజేయుటయే విద్యయొక్క లక్ష్యము అందుకు బాల్యము చాల ప్రధానమైన దశ గావున, ప్రారంభ విద్య లేక ప్రాథమిక విద్యయే ముఖ్యమైనదని పెస్టాలాజీ భావించి, దానికై తన జీవితమును, తన సర్వస్వమును ధారపోసెను

ప్రారంభ విద్యను తల్లి ప్రేమతో మొదలు పెట్టును బిడ్డ తల్లిని ప్రేమించుచు సృష్టికర్తను ప్రేమించుటను తెలిసికొనును గృహమే తొలి పాఠశాల తల్లి బోధనమే విద్యకు మూలము మత విచారమునకు, నైతిక జీవితమునకు అదియే సాధనము బాలు డభ్యసింపవలసిన సకల జ్ఞానమును సూక్ష్మీకరించి, తల్లుల కందుబాటులో నుండునట్లొనర్చి, గృహములను సంస్కరించినచో, పాఠశాలల యవసరమును తగ్గింపవచ్చునని పెస్టాలాజీ భావము

పెస్టాలాజీ బోధన పద్ధతికి మూలము సహజజ్ఞానము లేక అంతర్జ్ఞానము భౌతిక నైతిక ప్రపంచములు అంతర బాహ్యేంద్రియములపై కల్గించు ప్రత్యక్ష ప్రభావమును లేక సంస్కారమును సహజజ్ఞాన మందురు అనగా బోధనము విద్యార్థి యొక్క ప్రత్యక్షానుభవము పైన లేక సహజజ్ఞానము పైన ఆధారపడి యుండవలెను ప్రకృతికి, బాలునికి నడుమ మధ్యవర్తిత్వ మవసరము లేదు ఉపాధ్యాయుడు, పాఠ్యగ్రంథముల కంటె, విద్యార్థికి స్వానుభవము, పరిశీలనము ముఖ్యములైనవి వాటిని భాషతో చేర్పవచ్చును

సహజ జ్ఞానమును పొందుటకు పూర్వము మనసును పద జాలముతో నింపరాదు ఆరంభమున అస్పష్టమగు సహజ జ్ఞానము, అటుపిమ్మట స్పష్టమగు పరిశీలనము, అనంతరము నిర్దుష్టమగు భావోదయము – ఇవియే సకల బోధనమునకు సాధనములని పెస్టాలాజీ విశ్వాసము

బోధనము సూత్మములగు మూలాంశములతో ప్రారంభమై, ఒక మెట్టునుండి మరియొక మెట్టునకు అవిచ్ఛిన్నమగు క్రమములో బాలబాలికల మనోవికాసము ననుసరించి సాగవలెను ఒక భాగమున పరిపూర్ణత నొందిన తరువాతనే మరియొక భాగమునకు పోవలెను బోధన విషయములు, చేరువ వాటినుండి దూరపువాటికి క్రమముగా విస్తరింపవలెను బాలునికి కడు చేరువైనది తన దేహము కనుక తన దేహమును గూర్చిన విషయముల నుండి పరిసరములకు, పిదప దూరపు సీమలకు జ్ఞానము విస్తరింపవలెను

సకల జ్ఞానమును సూత్మీకరింప దలచిన పెస్టాలాజీ, విజ్ఞానమంతయు సంఖ్య, రూపము, మాట అను మూడు తరగతులుగ నుండునని చెప్పెను సకల జడపదార్థములకు రూపము లుండును, వాటిని లెక్కింపవచ్చును, భాషద్వారా వర్ణింపవచ్చును ఉపయోగమువలన భాష అభివృద్ధి నొందును ఉచ్చారణమును సంభాషణమును నేర్పిన పిమ్మటనే బాలురకు చదువుట నేర్పవలెను అట్లే గణితమున మనోగణితమును ముందు నేర్పవలెను చిత్రలేఖనమున గూడ, రేఖలు, కోణములు, వక్రరేఖలతో ప్రారంభింపవలెను సకల బోధనమును క్రియాత్మకముగ నుండవలెనని అతడు చెప్పెను

విద్యకు పరిశ్రమ ప్రధానము పాఠశాల, కర్మాగారము కలిసి యుండవలెను ప్రతి విద్యార్థియు కృషి చేయుటద్వారా ఏదియో ఒక వృత్తిని పరిశ్రమను అలవరచుకొన వలెనని పెస్టాలాజీ వక్కాణించెను

సాధకత, అనుభవము, అభ్యాసము – ఈ మూడును మానసిక నైతిక వికాసమునకు సాధనములు వ్యక్తికి జ్ఞానముకంటె నైతిక ప్రవర్తనము ముఖ్యము, అధ్యాపకునికి, విద్యార్థికి నడుమ ప్రేమ ముఖ్యము అట్టి ప్రేమ మూలముననే, సుగుణములను బోధింపకుండ, విద్యార్థులు వాటిని అలవరచుకొనుట సాధ్యమగును పాఠశాలలందు క్రమశిక్షణమును శిక్ష మూలమున కాక, అన్యోన్య ప్రేమ వలననే సాధింపవలెనని ఆతని సూత్రము

పెస్టాలాజీ ఉన్నతాశయములతో, ఉత్కృష్ట భావములతో, బోధన విధానమును గురించి, విద్యాభ్యాస లక్ష్యములను గురించి సంఘ సంస్కారమును గురించి పెక్కు కలలు కనెను కాని ఆతడు పూనుకొనిన దానికి కావలసిన శక్తిసామర్థ్యము లాతని వద్ద లేవు ఆచరణము అప్పుడపుడు ఆతడు బోధించిన దానికి విరుద్ధముగను, హాస్యాస్పదముగ గూడ నుండెను అయితే, ఆయన కేమి తెలిసినను, ఏమి తెలియకున్నను, ఒక్క విషయము మాత్ర మాతనికి నిశ్చయముగ తెలియును మానవుని పవిత్రత, ఔన్నత్యము, దయార్ద్రహృదయత – వీటియం దతనికి సంపూర్ణ విశ్వాస ముండెను బాలల మనోవికాసమును గూర్చిన సంపూర్ణ జ్ఞాన మతనికి గలదు

భో సు

## పైథాగరస్

అనంతర కాలికుల భావనా ఫలకముపై అమోఘమయిన ముద్రను వైచిన గణిత శాస్త్రవేత్తలలో "పైథాగరసు" గణనీయుడైన మహామహుడు అట్టి మహనీయుల జీవితముల నావరించిన కల్పనా గాథావల్లరిని ఛేదించి కల్పనా యథార్థమును వివరించుట కష్టసాధ్యమయిన పని ఈ క్రింది విషయ వర్ణనము నందు వివాదాస్పదములగు అంశములు విడిచివేయ బడినవి

గ్రీసు దేశమందలి సామోసు పట్టణము, పైథాగరసు జన్మస్థానము పైథాగరసు క్రీ పూ 580 లో జన్మించి, 500లో మరణించినాడు గ్రీకులలో మహా గణిత శాస్త్రజ్ఞుడును, జ్యోతిశ్శాస్త్రజ్ఞుడును అయిన థేల్సు పండితునకు పైథాగరసు సమకాలికుడు థేల్సు పండితుడే మొట్టమొదట జ్యామితి శాస్త్రమువైపు పండితుల దృష్టిని మరల్చినవాడు మొదట సైరెను పట్టణ నివాసుడయిన ఫెరిసిడేజు వద్దను, తరువాత అనాగ్జిమొండరు వద్దను పైథాగరసు అధ్యయనమొనర్చెను అనాగ్జిమొండరు పైథాగరసును థీబ్జు పట్టణమునకు పోవలసినదిగా హితబోధ చేసెను అనాగ్జిమొండరు మాట ననుసరించి పైథాగరసు, ఈజిప్టు దేశమునందలి థీబ్జు పట్టణమునకు వెడలి, అచ్చట కొన్ని సంవత్సరములు నివసించెను తరువాత నతడు ఈజిప్టును వీడి సామోసు నగరమున నివాస మేర్పరచుకొనెను అప్పుడాపురము పోలిక్రేటసు అను రాజుయొక్క క్రూర పరిపాలనము క్రింద

నుండుట అతడు గమనించెను పైథాగరసు మరల తన గృహమును వీడి, దక్షిణ ఇటలీ యందున్న మాగ్నాగ్రేసియా ప్రాంతమునకు పోయి, క్రోటన్ పట్టణమున స్థిరపడిపోయెను అచ్చటనే అతడు "పైథాగరీయ సంప్రదాయమును నెలకొల్పెను

ఈ పైథాగరసు తత్త్వ సంస్థకు చెందిన సభ్యులు ఒక ప్రత్యేక తెగగా నేర్పడిరి ఈ పంథావారు తాము ఆవిష్కరించిన విషయములను, రూపొందించిన సిద్ధాంతములను బయలుపరచ కూడదని యొక కట్టడి చేసికొనిరి తాము కనిపెట్టిన విషయములను తమ గురువర్యుడగు పైథాగరసునకే వివరింపవలసి యుండుట ఆచారముగ నుండెను పైథాగరసు వ్రాసిపెట్టిన గ్రంథము లెవ్వియు లేకున్నను, ఆ మహాసంస్థ యందు గణిత శాస్త్రము ప్రధాన అధ్యయన విషయమై యుండెననుట నిశ్చయము పైథాగరసు గణితమును ఒక శాస్త్రముగా ఉన్నత పథములోనికి తెచ్చెను "జ్యామితి శాస్త్ర పరనమునొక ధారాళ విద్యగా మార్చినవాడు పైథాగరసే ఏలననగా, అతడు దాని సూత్రముల లోతుపాతులను గాలించి, దాని సిద్ధాంతములను కుశాగ్ర బుద్ధితో పరిశోధించి యున్నాడు " అని ప్రోక్లూసు పండితుడు వచించియున్నాడు అతని జ్యామితికిని, అతని అంక గణితమునకును సన్నిహిత సంబంధము కలదు అంక గణితోక్తులను ఆమోదించు జ్యామితి శాస్త్ర సంబంధములు అతనికి అత్యంత ఆదరణీయములుగా నుండెనని తెలియుచున్నది

పైథాగరసు ప్రధానముగా కొక నైతిక సంస్కర్తయు తాత్త్వికుడునునై యుండెను అయితే, అతని నైతిక, తాత్త్వికవిచారము లన్నియు గణిత శాస్త్రాంశముల ఆధారము పైననే నిలిచియుండెను పైథాగరసు తాను నిర్వచించిన గణితశాస్త్రీయ విషయములను నాల్గుశాఖలుగా విభజించెను అంకగణితము, అనువర్తిత గణితము, జ్యామితి శాస్త్రము, ఖగోళశాస్త్రము అనునవి ఆ నాల్గుశాఖలు ఆ నాల్గింటి సమ్మేళనమే పరిపూర్ణ విద్యా, విజ్ఞానములకు మూలకందమని పైథాగరసు భావించెను పైన పేర్కొన్న నాలుగు విషయముల సంబంధమున పైథాగరసు కావించిన ప్రబోధములు, ఆవిష్కరణములు, ఈ క్రింద పొందుపరచబడినవి అయితే ఈ విషయములను గూర్చి పైథాగరసు ఎట్టి గ్రంథమును రచించి యుండలేదనియు, ఆయా గ్రంథకర్తలు వెల్లడించిన అభిప్రాయముల మీద అవి ఆధారపడియున్నవనియు గ్రహించవలయును

**జ్యామితి** ఈజిప్షియను జ్యామితి ఎట్లో, అట్లే పైథాగరసు జ్యామితికూడ విస్తీర్ణములతో సంబంధము కలదయి యున్నది సమాంతరములను, త్రికోణములను, సమాంతర చతుర్భుజములను అధికరించి యూక్లిడ్ అను శాస్త్రజ్ఞుడు రచించిన మొదటి రెండు పుస్తకములలోగల విషయము యొక్క సారాంశమునే పైథాగగసు తెలిసికొని, బోధించెనని విశ్వసింపబడు చున్నది జ్యామితి యందలి ఈ క్రింది ముఖ్య సిద్ధాంతముల కర్తృత్వము పైథాగరసు పండితునకు అంటగట్టబడుచున్నది అయితే అతడు వాటికొసగిన సరియగు ప్రమాణములు కానరావు (పిదప యూక్లిడ్ రుజువుపరచియున్నాడు)

1 సమకోణ త్రిభుజము యొక్క కర్ణముపైగల చతురస్రము శేషించిన రెండు భుజములందలి చతురస్రముల మొత్తమునకు సమానము

2 త్రిభుజము యొక్క కోణముల మొత్తము రెండు సమకోణములకు సమానము

8 ఒక బిందువు చుట్టుప్రక్కల నున్న సమతలము, సమ త్రిభుజముల చేతను, సమ చతురస్రముల చేతను, లేక సక్రమ షడ్భుజముల చేతను పూర్తిగా నింపబడవచ్చును

పైథాగరస్ యొక్క అనుయాయులు వృత్తము యొక్క చదరమును గూర్చి తెలిసికొన యత్నించి యున్నట్లు చెప్పబడినది వృత్తము సమతల చిత్రములలో నెల్ల పూర్ణాకృతికల చిత్రమనియు, ఘనములలో నెల్ల గోళము పూర్ణాకృతి కలదనియు వారు వచించిరి గోళములో ఇముడ్చదగిన అయిదు క్రమఘనములు కలవని వారెరిగినట్లు విశ్వసింపబడుచున్నది సమ చతురస్రము యొక్క భుజము, రజ్జువు, అసమపరిమాణములని పైథాగరసు రుజువు చేసినట్లు గూడ విశ్వసింపబడు చున్నది

**అంకగణితము** అన్ని సంఖ్యలను సరి సంఖ్యలుగాను, బేసి సంఖ్యలుగాను విభజించుటతో పైథాగరసు అంకగణిత శాస్త్ర సిద్ధాంతమును ఆరంభించెను బేసి సంఖ్యలను అతడు శంకువు లనెను $2n+1$ వంటి బేసి సంఖ్యను అతడు $(n+1)^2$ మరియు $n^2$ అను సమచతురస్ర సంఖ్యల యొక్క భేదముగా భావించెను 1మొ, $2n+1$ వరకు గల శంకువుల మొత్తము

సమచతురస్ర సంఖ్యగాను, దాని వర్గమూలము భుజముగాను పేర్కొనబడినవి రెండు సంఖ్యలయొక్క గుణకార లబ్ధములు సమతలములని చెప్పబడినవి ఒక గుణకార లబ్ధమునకు కచ్చిత మయిన వర్గమూలము లేనిచో, అది దీర్ఘ చతురస్రము అన బడెను మూడు సంఖ్యలయొక్క గుణకార లబ్ధము 'ఘన సంఖ్య' అని పేర్కొనబడినది మూడు సంఖ్యలు, తుల్యము లైన వాటికి ఘన చతురస్రము అని పేరు పెట్టబడినది ఈ నిర్వచనములకన్నింటికిని ఈ క్రింది జ్యామితి చిత్రముతో ప్రత్యక్ష నిర్దేశము కలదు




పదునొకండు చిన్న సమచతురస్రములు కల H K L అను శంకువు, A C అను నొక ($5^2$) సమచతురస్రము చుట్టి పెట్టినచో, ఆ చిత్రమొక H L అను సమచతురస్రముగా ఏర్పడిపోవును అయితే అది పరిమాణమున అధికమగు చున్నది అందు ముప్పదియారు ($6^2$) చిన్న సమచతురస్రము లుండుట ఈ ఆధిక్యమునకు హేతువు అంకిక - సిద్ధాంతము లలో పెక్కులు గ్రీకు గణిత శాస్త్రజ్ఞులు కనిపెట్టినవి తుల్యపద్ధతులచే కనిపెట్టబడి రుజువు చేయబడిన వనుట సంభావ్యము

$(2n^2+2n+1)$, $(2n^2+2n)$, $(2n+1)$ అను సంఖ్యలు ప్రత్యేక సార్థక్యము కలవై యున్నవి ఎందుచేతనన- అవి క్రమముగా సమకోణ త్రిభుజముయొక్క కర్ణమునకును, రెండు భుజములకును నిర్దేశకములు ఈ సత్యమును పైథా గరసు, తాను జ్యామితీయ సాధ్యములను కనిపెట్టుటకు ముందే, ఎరిగి యుండెనని కాంటర్ పండితుని అభిప్రాయము అయితే పైథాగరసు సమకోణ త్రిభుజముయొక్క కర్ణమున కును, రెండు భుజములకును ప్రతియైన సమానములను ఎరిగి యుండె ననుట సందేహాస్పదము

పైథాగరస్‌నకు త్రిభుజము యొక్క సంఖ్యలు పరిచితమై యుండెను ఎమతలముపైన శ్రేణులుగా నుంచబడిన కౌంటర్ల మొత్తమును త్రిభుజము యొక్క సంఖ్య నిర్దేశించును అడుగున నున్న శ్రేణిలో 'n' అను కౌంటర్లు, దానిపైనున్న శ్రేణులలో ఒక్కొక్క శ్రేణియందును, దాని క్రింది శ్రేణి కంటె ఒక్కొక్క కౌంటరు తగ్గుచుండినచో,

$$\text{ఆ త్రిభుజ సంఖ్య} = n+(n-1)+ \quad +2+1$$
$$= \tfrac{1}{2}\, n\,(n+1)$$

లూసియన్ అను గ్రంథములో ఒక భాగమందు పైథా గరసు వాడిన భావముయొక్క వివరణ సందర్భమున ఒక వర్తకుడు "నీవు నాకేమి బోధింతు" వని పైథాగరసును ప్రశ్నించెనట! అంతట పైథాగరసు "నేను నీకు లెక్కపెట్టు విధానమును నేర్పెద" ననెనట! వర్తకుడు - "ఆ విధానము నా కిదివరకే తెలిసి యున్నదికదా !" అని యనెను

పైథాగరసు - "నీవు లెక్కించు విధానమేది "

వర్తకుడు - "ఒకటి, రెండు, మూడు, నాలుగు"అనునది

పైథాగరసు - "ఆగుము - నీవు నాలుగు అనుకొన్నది పది
సంఖ్య - అదియొక పూర్ణమైన త్రిభుజము
అది మా చిహ్నము "

అంకిక, జ్యామితిక, సమస్వర, శ్రావ్య సంబంధి, శ్రేణులలోని అనేక సంఖ్యలతో పైథాగరీయనులకు పరిచయ ముండెనని విశ్వసింపబడినది మొదటి మూడు శ్రేణులు నేడును విదితములు చివరిశ్రేణి నిర్వచన మిట్లున్నది - నాలుగు పూర్ణాంకములు—

$$a \quad \frac{2ab}{(a+b)} \quad \tfrac{1}{2}(a+b) \quad b$$ అను నిష్పత్తి యం దున్న శ్రావ్య సంబంధి శ్రేణి యందున్నవిగా చెప్పబడినవి ఉదా 6, 8, 9 మరియు 12 అను సంఖ్యలు శ్రావ్య సంబంధి శ్రేణియం దున్నవి

అనువర్తిత విషయములు భుగోళశాస్త్రము వంటి అనువర్తిత విషయములను గూర్చి పైథాగరసు కావించిన 'ఉ'పదేశమును గూర్చి స్వల్పముగనే విదిత మగుచున్నది,

ఐనప్పటికి పైథాగరసు అను పండితుడు గ్రహచలన విధుల నెరిగి యుండెనని కొందరు గ్రంథకర్తలు అభిప్రాయ పడుచున్నారు అతనికి స్ఫాటిక విజ్ఞానముయొక్క ప్రాథమిక సిద్ధాంతములు తెలిసియుండె ననియు విశ్వసింప బడుచున్నది

ఆరంభము నుండి పైథాగరియనులు ప్రజలతో కలసి మెలసి యుండెడివారు కారు పైథాగరసు అనుయాయుల కగిన శిక్షణము, వారి రహస్య పద్ధతి, వారు సంఘమునుండి విడివడి యుండుట వారియందు ఇతర జనులకు క్రమముగా ద్వేష మేర్పరచెను తుదకు క్రీ పూ 500 సం న పైథాగరసును, అతని అనుయాయులలో పెక్కురను, అతని రాజకీయ విరోధులు అల్లరిమూకచే హత్య చేయించిరి

పైథాగరసు మరణానంతరము ఆతని సంప్రదాయము నూరు సంవత్సరములకు పైగా ఎపిచార్మస్, హిప్పాసస్, ఫిలోలస్, అర్కిటస్ అనువారి నేతృత్వమున అభివృద్ధి నందినట్లు విశ్వసింప బడినది

యం సు

## పైరుల చీడలు

ప్రతి సంవత్సరము మనదేశములో పైరు పంటలకు చీడల వలన, తెగుళ్ళ వలన అపారమైన నష్టము వాటిల్లు చున్నది వీటిని సక్రమమైన నివారణోపాయములచే ప్రతిఘటించినచో సస్యోత్పత్తి విశేషముగా అభివృద్ధి యగును సస్యములు అనేకములగు చీడలకును, తెగుళ్ళకును గురియై పాడై పోవుచుండును పైరులను నిర్మూలించు కీటకముల వలన చీడ లేర్పడు చుండును శిలీంధ్రములు, సూక్ష్మజీవులు, వైరసులు, శైవలములు, పాములవంటి క్రిములు ఉద్భిజ్జములలో కొన్ని స్థూల పరాన్నభుక్కులు, ఆహార, పరిసర, శరీరధర్మములు సరిగా లేకుండుట-మున్నగు వాటి వలన తెగుళ్ళు కలుగు చుండును పైరులకు చీడలు, తెగుళ్ళ వలన సగటున నూటికి ఇరవై వంతులు నష్టము కలుగు చున్నదని అంచనా వేయబడినది పైరుల కెట్టి హాని సంభవించునో, దీనికి కారణభూతము లగు చీడలను, తెగుళ్ళను అరికట్టుటకు వీలైన పద్ధతు లెవ్వియో ఈ దిగువ సంగ్రహముగా చర్చించ బడినది

**తృణధాన్యములకు సంభవించు చీడలు**

వరి (1) తెల్లకంకి -- ఇది 'స్కోనోబియస్ ఇన్‌సెర్టులస్' అను నొక విధమగు కాండమును తొలుచు పురుగు వలన కలుగును వరిమొక్క మొవ్వ చచ్చి యుండుటచే గాని, వరినారు మొవ్వ వాడుటచే గాని, పరిణత దశలో కంకుల

చిత్రము 28




పటము 1

వరిమొక్క కాండమును తొలుచు పురుగు - వివిధ దశలలో

యందు తెల్లని చాలు ఏర్పడుటచే గాని ఈ చీడను గుర్తింప వచ్చును ఈ కీటకము యొక్క జీవిత పరిమితి, గ్రుడ్డు దశ మొదలు వయోవస్థ వరకు మొత్తము 6 నుండి 8 వారము లుండును ఇది ప్రాకుడుపురుగు దశలో కాండమునకు రంధ్రము చేసి, లోపల ప్రవేశించి, అందుండు మధ్యభాగమును తినివేయును 0 03 శాతము ఎన్డ్రిన్‌గాని, 0 05 శాతము పారథియన్ గాని మూడు పర్యాయములు మొక్కపై జల్లు వలె కొట్టి, ఈ చీడను నివారించవచ్చును దీపపు బోను లను పొలములో నుంచుట వలన, కోసిన మోళ్ళను తీసి వేయుట వలన గూడ ప్రయోజనము కలుగును

చిత్రము 24

పటము 2
వరిపైరుకు ఎట్టు గొంగళి పురుగుల దండు

2 గొంగళిపురుగుల దండు ఈ పురుగులు గుంపులు గుంపులుగా కనిపించు చుండును ఇవి నారు మళ్ళ లోని నారు మొక్కల ఆకు లను, మడిలోని లేత మొక్కల ఆకులను పూర్తిగా తినివే యును ఇవి పగలు చల్లని వేళలందును, రాత్రులందును బయటికి వచ్చుచు, తక్కిన సమయములలో మట్టియందు దాగుకొను చుండును ఈ పురుగుల జీవితకాలము 40-50 దినము లుండును దీని ముందరి రెక్కలు ముదురు గోధుమ వర్ణములో నల్లని మచ్చ కలిగి యుండును రెక్కల చివర అలవంటి రేఖ యుండును వెనుక రెక్కలు బూడిద - గోధుమ రంగుతో నుండును 10వ శాతము బి హెచ్ సి నిగాని, డి డి టి పొడిని గాని ఎకరమునకు 20 పౌనుల చొప్పున చల్లి ఈ చీడను అరికట్ట వచ్చును

3 తాటాకు తెగులు ఇది రైస్ హిస్పా అను నొక కీటకము వలన వరి పైరునకు సంభవించును ఈ కీటకము డింభ దశయందు ఆకులకు రంధ్రములు చేయును పరిణత దశలో తెల్లని చార లేర్పడునట్లు ఆకులలో నుండు పత్ర హరితమును గీరివేయును దీని జీవిత కాలము 4-5 వారము లుండును ఎకరమునకు 5 శాతము డి డి టి ని 15-20 పౌన్లు వేసి ఈ చీడను అరికట్ట వచ్చును లేదా, 5 శాతము బి హెచ్ సి పొడిని ఎకరమునకు 12-15 పౌనుల చొప్పున చల్లవలెను

4 కోడు ఈ చీడ వరికోడు ఈగ అను కీటకము వలన కలుగుచున్నది ఇది దోమవలె పొడవైన కాళ్ళు కలిగి యుండును దీని డింభము కాండములోనికి తొలుచుకొని పోయి కంకులు వేయనీయక గొట్టముల మాదిరి చీడను కల్గించును దీని జీవిత చక్రము 18 నుండి 20 రోజు లుండును 10 శాతము బి హెచ్ సి ని గాని, పరాథి యనునుగాని 4 ఔన్సులు యకరమునకు చల్లి ఈ చీడను అదుపులోనికి తేవచ్చును కాంతిమంతములగు దీపపు బోనులను కూడ ఇందు కుపయోగింప వచ్చును

చిత్రము 25

పటము 8
వరిమొక్క కాండమును తొలచి పైన కణితిని కల్పించు పురుగు-వివిధదశలలో

5 వరి మిడుత వరి మిడుతలు ఆకులను తినివేసి, కంకులను కొరికి వేయును వీటి వలన సెప్టెంబరు, నవంబరు నెలల మధ్య నష్టము కలుగుచుండును ఎకరమునకు 20 పౌనుల చొప్పున 10 శాతము బి హెచ్ సి పొడిని చల్లి ఈ మిడుతలను అదుపులో నుంచవచ్చును మిడుత జీవిత కాలము ఒక సంవత్సర ముండును కోతలైన తరువాత భూమిని లోతుగా దున్నవలెను

1 జొన్న చిన్న తొలుపు పురుగు ఈ కీటకము యొక్క డింభము కాండము లోనికి తొలిచి, ప్రవేశించి లేత మొక్క లలో నుండు దవ్వను తిని వేయును అందుచే మొక్క యొక్క మొవ్వ నిర్మూల మగును ఎదిగిన మొక్కల కాండపు కణుపు లను తొలచును ఈ కీటకము యొక్క జీవిత వలయము 5, 6 వారము లుండును దీని రెక్కపురుగులు గడ్డి రంగులో నుండును ఈ చీడ కనిపించిన వెంటనే చచ్చిన

మొక్కను పీకి తగులబెట్టి, 0 03 శాతము ఎన్డ్రినును చల్లుట మూలముగా చీడను అరికట్ట వచ్చును అధిక ప్రమాణములో విత్తనములు చల్లుట మంచిది కోసిన మోళ్ళను తీసివేయవలెను దీపపు బోనులను గూడ పొలములో నుంచవలెను

2 **అగ్గి పురుగు** ఇది ఆకుపచ్చ రంగులో నుండును లేత కంకులనుండి సారమును చురుకుగా పీల్చుకొనును అందుచే కంకులలో గింజ పట్టదు ఈ చీడ మొక్కజొన్న, సజ్జ పైరులమీద కూడ కనపడును 10 శాతము బి హెచ్ సి పొడిని చల్లి, దీనిని అరికట్ట వచ్చును

3 **రెక్కలు లేని దక్కను మిడుత** ఈ మిడుత, దాని డింభములు కూడ జొన్న మొక్కలను పూర్తిగా తినివేయును పైరు, కంకితో నున్నప్పుడు అత్యధికముగా నష్టము కలుగుచుండును ఇది ఇతర చిరుధాన్యముల మీదను, కాయధాన్యముల మీదను కూడ కనబడును దీని జీవితావధి ఒక సంవత్సరము 10 శాతము బి హెచ్ సి ని చల్లుటచేతను, ప్రత్యేకము వ్యవసాయ పద్ధతులచేతను ఈ మిడుతను అరికట్ట వచ్చును

మొక్కజొన్న (గులాబి రంగు తొలుపుడు పురుగు) దీని డింభములు కాండము లోనికి తొలుచుకొని పోయి, కాండపు బోదెను చంపివేయును చచ్చిన మొవ్వలను బట్టి ఈ చీడను గుర్తింప వచ్చును దీని జీవిత వలయము 6, 7 వారము లుండును అల్పాకారము గల దీని రెక్క పురుగు గడ్డి రంగులో నుండును 0 03 శాతము ఎన్డ్రిన్ జల్లుతో దీనిని అరికట్ట వచ్చును ఇది రాగి, ఎఱ్ఱ, కొఱ్ఱ పైరులలో కూడ కనపడును

**కాయధాన్యములకు సంభవించు చీడలు**

1 **పచ్చపురుగు** ఈ చీడ కందిపైరు మీద తరచుగా కనబడును ప్రత్తి, వేరుసెనగ, టొమాటో, పొగాకు పైరుల మీదకూడ ఇది కాన్పించును ఈ కీటకము తన ప్రాకుడు దశలో ఆకులను తిని వేయును కాయలలో రంధ్రములుచేసి, గింజలను తినివేయును దీని జీవిత కాలము నాలుగు నుండి ఆరు వారము లుండును 10 శాతము బి హెచ్ సి పొడి గాని, డి డి టి పొడిగాని ఎకరమునకు 20 పౌనుల చొప్పున చల్లి ఈ చీడను అరికట్టవచ్చును ఖటిక పాషాణమును కూడ చల్లవచ్చును

2 **కంది తురాయి చిమ్మట** ఇది కంది పైరునకు ప్రత్యేకమగు చీడను కలుగజేయును దీని శిశువు ప్రాకుడు దశలో ఆకుపచ్చని కాయలలో ప్రవేశించి గింజలను తినివేయును దీని జీవిత కాలము 6, 7 వారము లుండును ఇది ఆకుపచ్చ-గోధుమ కలిసిన రంగులో, సన్నగా, పొట్టిగా నుండును తురాయి వంటి రెక్కలు కలిగి యుండును 5 శాతము బి హెచ్ సి పొడి గాని, డి డి టి పొడిగాని ఎకరమునకు 20 పౌనుల చొప్పునగాని, 50 శాతము నీటిలో కలిసిన డి డి టి ని 4 పౌన్లు గాని చల్లినచో ఈ చీడ నిర్మూలమగును

3 **పెసర, మినుము, ఉలవ పైరులు** కొమ్ములుగల ఒక విధమగు ప్రాకుడు పురుగులచే సాధారణముగా నాశన మొనర్పబడుచుండును ఈ పురుగుల పొడవు 2 నుండి 3 అంగుళము లుండును, శరీరముపై చివరభాగమున మొనదేలిన కొమ్ముకలిగి లావుగా నుండును ఇవి మొక్కపై నున్న ఆకులను నాశనమొనర్చి పంటను క్షీణింప జేయును ఈ చీడను 10 శాతము బి హెచ్ సి ని ఉపయోగించి అరికట్ట వచ్చును

**చెరకునకు పట్టు చీడలు**

1 **చెరకుగడ తొలుపు పురుగు** ఈ చీడవలన చెరకు మొవ్వ చచ్చిపోవును ఇది ముఖ్యముగా లేత మొక్కలకు సంభవించును ఈ కీటకము యొక్క శిశువులు ప్రాకుడు దశలో నేలమట్టముగ ఒక వైపునుండి కాండములో ప్రవేశించి మొక్కను నిర్మూలించును దీని జీవితావధి 6, 7 వారములు దీని రెక్క బూడిద-గోధుమ లేక గడ్డి రంగులో నుండును 0 03 ఎన్డ్రిన్ చల్లి ఈ చీడను నిర్మూలింప వచ్చును 'ట్రైకోగ్రామా' అను పరాన్న భుక్కులను ఎకరమునకు ఒక లక్ష చొప్పున 15 రోజుల కొకసారి మూడు పర్యాయములు పైరుపై వదలి కూడ ఈ చీడను అదుపులో నుంచవచ్చును

2 **వెర్రితల చీడలు** ఈ కీటకము యొక్క ప్రాకుడు పురుగు చెరకు ఆకు మధ్యనుండు ఈనె ద్వారా కాండములోనికి తొలుచుకొని పోవును దీని ఫలితముగా మొక్క వెర్రితల వేయును ఈ పురుగు జీవితకాలము 6-8 వారములు తక్కువ ఉష్ణోగ్రత వలన, వాయువులో నుండు సామాన్యముగు ఆర్ద్రత వలన, ఈ కీటకము అభివృద్ధి చెందును దీని రెక్క

వెండివలె తెల్లగా నుండును ఆడపురుగునకు చివర కాషాయరంగు గల కుచ్చు ఒకటి ఉండును భూమిని చక్కగా

చిత్రము 23




పటము 4
చెరకు గడను తొలుచు పురుగు-వివిధ దశలలో

దున్నుట చేతను, 0 16 శాతము డి డి టి ని గాని, బి. హెచ్ సి. పొడిని గాని, 0 1 శాతము ఎన్డ్రిన్ నుగాని చల్లి ఈ చీడను నిర్మూలింప వచ్చును పొలములో దీపపు బోనులను గూడ ఉంచినచో, అవి క్రిమి నిర్మూలనమునకు సహాయ పడును

3 దూదేకుల పురుగు ఇది గడ్డి రంగుగల ఒక విధమగు చురుకైన నల్లివంటిది దీనితల పక్షి ముక్కు వలె నుండును ఇవి గుంపులు గుంపులుగా చెరకు మొక్క అన్ని దశలందును ఆకులలోని సారమును పీల్చుచు, మొక్కను ఏపుగా ఎదుగ నీయవు ఈ కీటకము యొక్క జీవితము 8–10 వారములలో పూర్తి యగును 10 శాతము బి హెచ్ సి పొడిని ఎకరమునకు 30–40 గ్యాలనులు ఋతు పవనమునకు పూర్వమును, 40–60 గ్యాలనులు ఋతుపవనమునకు తరువాతను చల్లి ఈ చీడను నిర్మూలింప వచ్చును

నూనె గింజల పైరులకు పట్టు చీడలు

1 నువ్వు పంతి ఈగ ఈ ఈగ యొక్క డింభములు లేత పూ మొగ్గలలో నుండును వాటివలన కంతులేర్పడి, కాయ లేర్పడుటలో నిరోధము కలుగు చుండును ఈ చీడను నిర్మూలించు పెక్కు మార్గములు ఆచరణములో నున్నవి క్రింద రాలిన మొగ్గలను ఏరి తగుల బెట్టుట కూడ ఈ నిర్మూలన పద్ధతులలో ఒకటి

2 నువ్వు మెలి పురుగు ఈ రెక్క పురుగు ఆకులను విస్తారముగా తినును దీని జీవిత కాలము 3–4 నెలలు 0 5 శాతము బి హెచ్ సి పొడిని చల్లి ఈ చీడను నిర్మూలింప వచ్చును

1 ఆముదములు నామాల పురుగు ఈ కీటకము ప్రాకుడు దశలో పొడవుగా, నునుపుగా, బూడిద–గోధుమ రంగులో, పల్లకీ బొంగు ఆకారములో ప్రాకుచు ఆకులను తినివేయు చుండును ఈ కీటకము యొక్క జీవిత వలయము 30–35 రోజులుండును 0 5 శాతము బి హెచ్ సి పొడిని ఎకరమునకు 15–20 పౌనుల చొప్పున చల్లినచో, ఈ చీడ నిర్మూల మగును

గింజను, కాండమును తొలుచు పురుగు ఈ కీటకము ప్రాకుడు దశలో ముదురు గోధుమ రంగును కలిగి యుండును ఇవి కాండములోను, కాయలోను ప్రవేశించి నాశనమును కల్పించును కాయలు అంటుకొని యుండి, వాటిపై విసర్జక పదార్థము లుండుటను బట్టి, ఈ చీడను గుర్తింపవచ్చును ఈ కీటకము యొక్క జీవిత కాలము 4–5 వారములు 5 శాతము బి హెచ్ సి పొడిని ఉపయోగించి ఈ చీడను నిర్మూలింప వలెను

వేరుసెనగ 1 ఎఱ్ఱ గొంగళి పురుగు ఈ చీడ ఎఱ్ఱ నేలలలో పెరుగు సస్యములకు చాల నష్టము కల్గించును ఇది ముఖ్యముగా వేరుసెనగకే కాక, జొన్న, మొక్కజొన్న, సజ్జ మొదలగు పైరులకు కూడ సంభవించును ఈ చీడ తీవ్రముగ నున్నప్పుడు లక్షల కొలది గొంగళి పురుగులు ఒక పొలము నుండి మరియొక పొలమునకు చేరుచు, మొక్కలను తినివేయు చుండును ఇది ముఖ్యముగా జులై, సెప్టెంబరు నెలల నడుమ సంభవించును ఈ కీటకము యొక్క జీవిత వలయము ఒక సంవత్సరము 10 శాతము బి హెచ్ సి పొడిని ఉపయోగించి చిన్న గొంగళి పురుగులను 0 08 శాతము ఎండ్రినును కాని 0 05 శాతము పారథియనును కాని ఉపయోగించి పెద్ద గొంగళి పురుగులను నిర్మూలింప వచ్చును

2 వేరుసెనగ వెర్‌పూచి ఈ కీటకము యొక్క డింభము కాండమును తొలిచి మొక్కను చంపును ఇది పేడ పురుగు జాతిలోనిది, గోధుమ రంగులో స్వల్పాకారమున నుండును 5 శాతము డి డి టి పొడితో దీనిని అరికట్ట వచ్చును చీడపట్టిన మొక్కలను ఏరి తగులబెట్ట వలెను

నార పైరులకు సంభవించు చీడలు

ప్రత్తి 1 కాండపు తొలుపుడు పురుగు ఈ కీటకము యొక్క డింభములు మొదట లేత మొక్కల పైభాగపు కాండములోనికి తొలుచుకొని పోయి తరువాత కాయలలో ప్రవేశించును అందుచే కొమ్మలు ఎండిపోయి, మొగ్గలు, కాయలు, రాలిపోవును ఈ కీటకము యొక్క జీవిత కాలము 4, 5 వారము లుండును ఈ చీడ కనపడిన తరువాత 0 025 శాతము పారథియనును 15 రోజుల కొకసారి రెండు మూడు పర్యాయములు చల్లిన, చీడను అరికట్ట వచ్చును

పింక్‌బోల్ వరమ్ ఈ కీటకము యొక్క డింభము పువ్వులలోనికి, కాయలలోనికి ప్రవేశించుటచే, అవి రాలి పోవును డిసెంబరు, జనవరి నెలలలో 75, 100 శాతము కాయలు పాడై, రాలిపోవును దీని జీవితవలయము సుమారు 5 నుండి 7 వారములు పరిశుద్ధమైన సేద్యము వలన, 0 03 శాతము ఎన్‌డ్రినును చల్లుట వలన ఈ చీడ నిర్మూల మగును విత్తనములను చక్కగా ఎండబెట్ట వలెను రాలిన మొగ్గలను, కాయలను తగులబెట్ట వలెను

3 కాటన్‌లీఫ్ హాపర్ ఇది ముఖ్యముగా అమెరికా ప్రత్తి రకములకు సంభవించు చీడ ఈ పురుగులు జూన్,

చిత్రము 27.










పటము 5
ప్రత్తి కాయను తిని వేయు పురుగు
వివిధ దశలలో

చిత్రము 28







పటము 6
మిరప మొక్కలను పీడించు
పురుగు.

నవంబరు నెలల నడుమ ఆకులలోని సారమును పీల్చివేయును ఆకులు క్రిందికి వ్రాలి, పత్రహరితములేక రాలిపోవును మొక్క ఎదుగుదు ఈ కీటకము యొక్క జీవిత వలయము సుమారు 3 వారము లుండును ఈ రెక్కపురుగు లేత ఆకుపచ్చ రంగులో నుండును దీని ముందరి రెక్కపై నల్లని మచ్చ యుండును 5 శాతము డి డి టి పొడిని ఎకరమునకు 20-25 పౌనులు చల్లి ఈ చీడను తుదముట్టింప వచ్చును

పొగాకు ఆకు ప్రాకుడు పురుగు ఈ పురుగు చిన్నదిగా నున్నప్పుడు పొగ మొక్క యొక్క లేత ఆకులను, కాడలను రాత్రు లందు అమితముగా తినును తరువాతి దశలో ఇది వేరుచోట నుండును ఈ చీడ బటానీ, వంగ, టొమాటో, ఆముదము, అరటి మొదలగు వాటిపై గూడ అగపడును ఈ కీటకము యొక్క జీవితము 30-40 దినములలో అంతమగును ఎకరమునకు 10-15 పౌనుల చొప్పున క్రిమి పాషాణమును చల్లి ఈ చీడను నిర్మూలింప వచ్చును

మిరప కామర పురుగులు

ఈ పురుగులు ముడత తెగులును కలుగజేయును ఈ చిన్న కీటకములు కొమ్మలలోని సారమును పీల్చుకొనుచు, లేత ఆకులు ముడుతలు పడునట్లును, వాడునట్లును చేయును. ఈ చీడ ముదిరినచో, ఆకులన్నియు రాలి, మొక్క చచ్చుటకు సిద్ధమగును. చివరలు

నల్లబడును దీనిని 'కొరివి తెగులు' అని కూడ అందురు ఈ కీటకముల జీవిత కాలము 6–9 దినములు 5 శాతము బి హెచ్ సి ని కాని, డి డి టి ని కాని, 40 శాతము నికొటిన్ గంధకితమును గాని ఉపయోగించి చీడను నిర్మూలింప వచ్చును

కూరకాయల మొక్కలకు పట్టు చీడలు

వంగ 1 అక్షింతల పురుగు—ఈ లద్దిపురుగులు, వాటి డింభములు ఆకులలోని పత్రహరితమును తినివేసి, ఆకులను రాల్చివేయును ఇవి ఆలుగడ్డ, కాకర, అడవి గుమ్మడిజాతి మొక్కలమీద అగపడును ఈ కీటకముల జీవిత వలయము 15–25 దినములు ఈ లద్దిపురుగులు గుండ్రముగా, లేత గోధుమ రంగులో, నల్లని మచ్చలు కలిగి యుండును వీటి డింభములు పసుపు పచ్చగా, శరీర మంతట ముండ్లతో నుండును 5 శాతము బి హెచ్ సి పొడిని చల్లి ఈ చీడను నిర్మూలింప వచ్చును

2 వంగతొలుపుడు పురుగులు ఈ కీటకపు గ్రుడ్డునుండి పుట్టిన చిన్న ప్రాకుడు పురుగులు లేత రెమ్మలను తొలిచి అవి వాడునట్లు చేయును కాయలు తయారైన వెంటనే ఈ పురుగులు వాటిని నిర్మూలించును వీటి జీవిత కాలము 4–5 వారములు వీటి రెక్కపురుగు బూడిద–గోధుమ రంగులలో నుండును గులాబి–గోధుమవర్ణపు చుక్కలుగల తెల్లని రెక్కలను కలిగి యుండును. 0 08 శాతము ఎన్డ్రిన్ చల్లి ఈ చీడను అరికట్ట వచ్చును

చిత్రము 28.













పటము 7
వంగచెట్టును తొలుచు పురుగు వివిధ దశలలో

టొమాటో ! అక్షింతల పురుగులు, పొగాకు ప్రాకుడు పురుగులు టొమాటో మొక్కలకు హాని చేయును

బెండ బెండ తొలుపుడు పురుగు తరచుగా బెండ మొక్కలకు నష్టము కల్గించును

గుమ్మడి ఈ మొక్కలకు ఒక రకపు లద్దెపురుగు హాని చేయుచుండును ఆకులలోని పత్ర హరితమును తినివేసి, వాటికి చిల్లులు కల్గించును దీని డింభములు మట్టిలోనే ఉండి, వేళ్ళను, కాండమును, కాయలను తొలిచి పాడుచేయును ఈ కీటకముల జీవిత చక్రము 4–7 వారము లుండును ఖటిక పాషాణమునుగాని, 0 1 శాతము లిండేనును గాని చల్లి ఈ చీడను అరికట్ట వచ్చును

చిత్రము 29







పటము 8
మంచి గుమ్మడికి పట్టెడు పురుగు వివిధ దశలలో

ఆవ కుటుంబపు కూరగాయలు

ఈ జాతి మొక్కలకు నష్టము కల్గించు కీటకములలో పొగాకు ఆకు ప్రాకుడు పురుగు, క్యాబేజి నల్లులు, డైమండ్ బ్లాక్ మాత్ (విళ్ళ పురుగు), ఆవ రంపపు ఈగ అనునవి ముఖ్యము లైనవి 100 గ్యాలన్ల నీటిలో 4–8 పౌనుల ఖటిక పాషాణమును గాని, పత్తు పాషాణమును గాని కలిపి చల్లినచో, ఈ చీడలు అదుపులోనికి వచ్చును

పండ్లమొక్కలకు సంభవించు చీడలు

మామిడి (1) మామిడిపై నుండు హొపర్ ఈ కీటకములు బూడిద–గోధుమ రంగు కలిగి అల్పాకారములో వేలకొలదిగా నుండును ఇవి లేతకొమ్మలను, మొగ్గలను, పువ్వులను పట్టుకొని వాటి సారమును పీల్చుచుండును అందుచే పూలగుత్తులు, చిన్నకాయలు ఎండిపోవును ఈ కీటకములు జిగురువంటి తియ్యని పదార్థమును క్రక్కుచుండుటచే నల్లని శిలీంధ్రజాతి దానిపై బయలుదేరి, కొమ్మలు పొగ చూరినట్లుండును ఈ కీటకముల జీవిత వలయము 3–4 వారము లుండును మామిడి తోట భూమిపై తేమ లేకుండ చేయవలెను 5 శాతము డి డి టి ని, గంధకపు పొడిని 1 1 లేక 1 2 వంతులలో కలిపి రెండుసార్లు చల్లి ఈ చీడను నిర్మూలింప వచ్చును

(2) మామిడి కాండపు తొలుపు పురుగు, ఇది ఒక జాతి లద్దిపురుగు దీని డింభములు కాండములోనికి తొలుచుకొని పోయి చెట్టును చంపివేయును అది తొలిచిన కన్నములనుండి విసర్జన పదార్థము విశేషముగా బయటికి వచ్చును దీని

జీవితకాలము ఒక సంవత్సరము తొలిచిన కన్నములలో పెట్రోలు కొట్టి, మట్టితో దానిని పూడ్చినచో చీడ అదుపు లోనికి వచ్చును

**నారింజ** 1 **నారింజ సీతాకోక చిలుక** ఈ సీతాకోక చిలుకయొక్క డింభము లేత మొక్కల ఆకులను తినివేసి నష్టము కల్గించును దీని జీవితవలయము 3-4 వారములు బాగుగా ఎదిగిన ప్రాకుడు పురుగు ముదురు ఆకుపచ్చ రంగులో 1½ అంగుళముల పొడవుండును 0 025 శాతము డి డి టి ని గాని, 5 శాతము బి హెచ్ సి ని గాని చల్లి ఈ చీడను నిర్మూలింప వచ్చును

2 **దోమపోటు** ఈ చిమ్మటలు పండ్లను పొడిచి, రసమును పీల్చివేయును పండ్లు క్రుళ్ళి రాలిపోవును వీటి రెక్కలు 3 అంగుళముల పొడవుండును వీటి జీవిత కాలము 4-5 వారములు ఈ కీటకములను అదుపులో నుంచుట కష్టము పండ్లకు సంచులు కట్టుట యొక్కచే వీటిని అదుపులో నుంచుటకు సరియైన మార్గము 15 రోజుల కొకసారి 0 25 శాతము డి డి టి ని రెండు మూడు సార్లు చల్లుట వలన కూడ కొంత ఉపయోగము కల్గును

**ద్రాక్ష ఫ్లీబీటిల్** ఇది రాగివర్ణము గల చిన్న లద్దిపురుగు ఇది లేత మొగ్గలను తొలిచివేయును దీని డింభములు క్రిందికి వ్రాలి వ్రేళ్ళను తిని నేలలో గూడు కట్టుకొనును దీని జీవితవలయము 6-7 వారము లుండును 0 2 శాతము డి డి టి ని గాని 0 1 శాతము లిండెన్ గాని చల్లి ఈ చీడను అరికట్ట వచ్చును

నిలవ చేసిన ధాన్యమునకు పట్టు చీడలు

1 **వడ్ల మసిపురుగు** ' ఇది ఎరుపు – గోధుమ రంగులలో గాని, నల్లగా గాని ఉండు ముక్కుపురుగు ఈ కీటకములు, వాటి డింభములు తృణధాన్యపు గింజలను, చిరుధాన్యపు గింజలను తినుచు వాటిలో గ్రుడ్లను పెట్టుచుండును సంవత్సరమునకు ఈ కీటకముల జీవిత వలయము నాలుగైదు పరకుండును

2 **ఖప్రా లద్దిపురుగు** ఇది గోధుమ రంగులో అండాకారముగ నుండు లద్దిపురుగు దీని డింభములు తృణధాన్యపు గింజలను, చిరుధాన్యపు గింజలను, కాయ ధాన్యములను పాడుచేయును వాటికి శరీరమంతటను గోధుమ రంగు గల రోమము లుండును.

3 **వడ్ల చిలుకలు** ఈ రెక్కపురుగులు పసుపు-గోధుమ రంగులలో నుండును వీటి ప్రాకుడు పురుగులు తృణధాన్యపు గింజలను, కొన్ని చిరుధాన్యములను పాడు చేయును

4 **వడ్లరెక్క పురుగు** ఈ రెక్కపురుగు బూడిద రంగులో నుండును దీని ప్రాకుడు పురుగులు మీగడ రంగు కలిసిన తెలుపు వర్ణములో నుండును ఇవి తృణధాన్యపు గింజలను తినుచు వాటితో తుట్టెలు పెట్టుచుండును ఇవి డింభదశలో సుమారు ఒక నెలరోజు లుండును ఇవి నూనె గింజలను, ఎండిన పండ్లను కూడ పాడుచేయు చుండును

5 **త్రుప్పురంగు పిండిపురుగు** ఈ చిన్న లద్దిపురుగు యొక్క డింభములు లేతపసుపు రంగులో నుండును ధాన్యపు గింజలను, పిండిని, కాయధాన్యములను, ప్రత్తి, వేరుసెనగ, నువ్వు, ఎర్రచక్కెర, ఎండిన పండ్లు మొదలైన వాటిని ఇవి తినుచు, పైరును పాడుచేయును

6 **పప్పుగింజల లద్దిపురుగు** ఈ కీటకము చాకొలెటు రంగులో నుండును ఇది డింభములతో కలిసి పప్పు గింజల నెన్నిటినో తొలిచి, తిని, పాడుచేయు చుండును గింజలో డింభము రెండు మూడు వారను లుండును ఈ జాతి కొన్ని నిలువ గింజలను, కాయలను గూడ పాడు చేయు చుండును

నిలువచేసిన ధాన్యమును నిర్మూలించు కీటకముల అలవాట్లు ఒకేమాదిరిగ నుండుటచే, వాటిని అదుపులో నుంచు పద్ధతులు కూడ ఒకే మాదిరిగ నుండును ఈ కీటకాభివృద్ధిని నిరోధించు మార్గములలో (1) గింజలను బాగుగా ఎండబెట్టుట, (2) నిలువచేయు సంచులు, డబ్బాలు మున్నగు వాటిలో 4 శాతము గామెక్సెన్ పొడిని చల్లుట, (3) గోదాముల గోడలలో నుండు పగుళ్ళను, కన్నములను మూసివేయుట మున్నగునవి ముఖ్య మార్గములు చీడపట్టిన తరువాత చేయవలసిన నివారణోపాయములలో ఈ క్రింది విధముగా విషవాయు ప్రసారము విస్తారముగా ధాన్యము నిలువయుంచిన గోదానులలో చేయవలెను (1) 100 ఘ అడుగులకు 3 పౌను చొప్పున కర్బన ద్విగంధకిద ద్రవమును 24 గంటలు ఉపయోగించుట లేదా (2) ఎథిలీన్ డైక్లోరైడ్ – కార్బన్ టెట్రాక్లోరైడ్ (ED/CT) ద్రవమును 100 ఘ అడుగులకు 2½ పౌనుల చొప్పున 24 గంటలు చల్లుట , లేదా (3) మిథైల్ బ్రోమైడ్ వాయువును 100 ఘ అడుగులకు 1 పౌను

చొప్పున 48 గంటలు ప్రసారము చేయుట చాలకాలము నిలువచేయు ధాన్యమునకు మూడుసార్లు పై విధముగా చేయవలెను ఈ విధముగా పొగపెట్టబడిన ధాన్యము గాలిలో ఒకటి రెండురోజులు బాగుగా ఆరబోసిన తరువాత భోజనార్హముగ నుండును

మీ హ ఆ

## పైరుల తెగుళ్లు

వరి అగ్గితెగులు ఈ తెగులు 'పైరిక్యులేరియా ఒరైజె' అను శిలీంధ్రముచే సంభవించును ఆకులపై కదురు ఆకారము గల గోధుమరంగు మచ్చ లేర్పడును తెగులు తీవ్రముగ నున్నచో, పైరు మాడిపోవును కంకుల మొదళ్ళు, కణుపులు నల్లబడును ఈ తెగులు ముందుగనే సోకినచో, కంకులలో తాలుగింజ లేర్పడి, 5–100 శాతము వరకు నష్టము కలుగవచ్చును ఈ తెగులు ముఖ్యముగా గాలి ద్వారా వ్యాప్తిచెందుచు, తెగులు పట్టిన గింజల ద్వారా కూడ వ్యాపించు చుండును తరచుగా వర్షము తగులుట, మబ్బువేసిన దినము లెక్కువగా నుండుట, గాలిలో తడి హెచ్చుగా నుండుట తటస్థించినచో ఈ తెగులు అమితముగా నుండును ఎకరమునకు 200 గ్యాలన్ల చొప్పున 1 శాతము బోర్డో మిశ్రణము గాని, రాగి సంబంధమగు శిలీంధ్రనాశకమైన మందుగాని నారుమడిలో చల్లినచో, ఈ తెగులు అదుపులోనికి వచ్చును ఈ తెగులు నిరోధకశక్తి గల వంగడపు విత్తనములను ఉపయోగించు చుండవలెను తెగులు పట్టిన గడ్డిని, మోళ్ళను తగులబెట్ట వలెను

2 మచ్చ తెగులు ఈ తెగులు 'హెల్మింథోస్పోరియం శైజె' అను శిలీంధ్రముచే గలుగు చున్నది ఆకులపైనను, తొడుగులవలె నుండు ఆకుల మొదళ్ళపైనను, గింజలపైనను ముదురు గోధుమరంగు గల మచ్చ లేర్పడును తరచుగా కంకి పైకి రాజాలకుండును కొంతవరకు ఈ తెగులు విత్తనము ద్వారా సంభవించు చుండును, అందుచే విత్తనములలో పౌనుకు 1 గ్రాము చొప్పున సెరిసాన్ గాని, అగ్రోసాన్ జి యన్ గాని, కలిపి యుపయోగించినచో లాభము కలుగును.

3. అడుగు కుళ్ళు తెగులు : ఈ తెగులునకు 'ఫ్యూజేరియం మొఫార్మి' అనునది కారణము నారుమడి దశలో ఈ తెగులు చాల హానికరముగా నుండును తెగులుపట్టిన మొక్కలు తక్కిన వాటికంటె తెల్లబడి, పొడవుగా నెదిగి తరువాత చచ్చిపోవును ఈ తెగులు కూడ విత్తనములద్వారా వ్యాప్తి చెందుటచే, విత్తనములను పౌనుకు 1 గ్రాము అగ్రోసాన్ జి యన్‌తో గాని, సెరిసాన్‌తో గాని కలిపి ఉపయోగించినచో ఈ తెగులు అదుపులోనికి వచ్చును 'జి ఇ బి 24' అను వరి వంగడమునకు ఈ తెగులును నిరోధించు శక్తి గలదు

జొన్న 1 కాటుక తెగులు (పొట్టి) ఇది 'స్ఫిలోథీకిసోర్గై' అను శిలీంధ్రముచే జొన్నకు కలుగుచున్న బహుప్రమాదకర మైన తెగులు ఈ తెగులు పట్టిన మొక్కల కంకులలో సాధారణమైన గింజలకు బదులు కాటుకవంటి పొడి పర్పడును ఈ తెగులు బయటనుండి విత్తనముల ద్వారా వ్యాపించును కాబట్టి, విత్తనములను ముందుగా 16 పౌన్లకు 1 ఔన్సు చొప్పున గంధకముతో గాని, పౌనుకు 1 గ్రాము చొప్పున సెరిసాన్‌తో గాని, అగ్రోసాన్ జి యస్‌తో గాని బాగుగా కలిపి వాడినచో ఈ తెగులు పూర్తిగా అదుపులోనికి వచ్చును

2 జొన్నబోడు, 'స్ట్రైగాలూటియా' యనునది పుష్పయుత బీజవంతములగు పరాన్న భుక్కులలో నొకటి ఇది అసంపూర్ణ పరాన్నభుక్కు సూక్ష్మములగు దీని గింజలు నేలలో జొన్నవేళ్ళను పట్టుకొని, మొక్కలుగా పెరుగును ఈ తెగులు పట్టిన జొన్నమొక్కలు గిడసబారి, తక్కువ గింజలతో చిన్న కంకులు వేయు చుండును పుష్పించుటకు పూర్వమే ఈ పరాన్నభుక్కులను పీకివేయుట ఉత్తమమైన నిరోధక మార్గము దీనికి లొంగని జొన్న వంగడపు విత్తనములను ఉపయోగించ వలెను

గోధుమ, 1 కాండపు నల్లమచ్చ తెగులు (పక్సీనియా గ్రామినిస్) ఈ తెగులు వలన విస్తారమగు నష్టములు కలుగుచుండును. ఇది గోధుమకే గాక బార్లీకిని, కొన్ని గడ్డిజాతులకును గూడ సంభవించు చుండును కాండముపైనను, ఆకుల మీదను ముదురురంగు బొక్కలు మొదట బయలుదేరి అవి తరువాత నల్లబడును ఈ తెగులు క్రమముగా మొక్కకంతకును వ్యాపించును గింజలు తప్పలుగా తయారగును గంధకపు పొడిని చల్లుటచే ఈ తెగులు అదుపులోనికి వచ్చును కాని అది ఆర్థికముగా అంత లాభకారి కాదు ఈ వ్యాధిని నిరోధించు శక్తిగల వంగడపు విత్తనములే ఉపయోగించుట మంచిది

2 కాటుక తెగులు ఈ తెగులు సోకిన మొక్కలు నల్లని పొడివలె నుండు సిద్ధబీజ సముదాయముతో కాటుక వలె నుండు కంకులను కలిగి యుండును ఈ తెగులు విత్తనముల ద్వారా వ్యాప్తి చెందుటచే, విత్తనములను కొంతసేపు వేడి నీటిలో నుంచుట వలన గాని, బాగుగా ఎండలో నుంచుటవలన గాని ఇది అదుపులోనికి వచ్చును

మొక్కజొన్న మొక్కజొన్నకు సంభవించు తెగుళ్లు అంత ప్రమాదకరమైనవి కావు

సజ్జ, కొఱ్ఱ, రాగి పైరిక్యులేరియా గణమునకు చెందిన శిలీంధ్రముల వలన ఈ మూడు పైరులకును మూడు తెగుళ్ళు కలుగుచుండును బోర్డో మిశ్రణముగాని, డ్యూప్రవిట్, ఫంజిమార్ మొదలగు రాగి సంబంధమగు శిలీంధ్రనాశకములు గాని 20 గ్యాలన్ల నీటిలో 1 పౌను చొప్పున కలిపి చల్లినచో ఈ తెగులు అదుపులోనికి వచ్చును

చెరకు ఎఱ్ఱకుళ్ళు తెగులు ఇది ప్రమాదకరమైన తెగులు ఈ తెగులు సోకిన మొక్కల ఆకులు వ్రేలాడబడి వాటి అంచులు ఎండిపోవుచుండును తరచుగా గడ కుళ్ళుచు తగ్గిపోవు చుండును తెగులు లేని విత్తనపు ఖండములను ఎన్నుకొని, వాటిని 1 శాతము బోర్డో మిశ్రణములో ముంచి ఉపయోగించినచో తెగులు ప్రథమముగా సోకదు ఈ తెగులును నిరోధించు శక్తికల వంగడముల నుపయోగించుట ఉత్తమమైన పద్ధతి

2 కాటుక తెగులు (ఉస్టిలాగో సైటామిని) ఈ తెగులు సోకిన మొక్కలు గిడసబారును నల్లకాటుక తెగులు సోకిన పొడవైన జూకలవంటి కాండములను కలిగి యుండును అట్టి జూకలను సకాలములో ఊడబెరుకుట, తెగులు సోకని విత్తనములను ఎన్నుకొనుట, తెగులును నిరోధించగల వంగడములను ఉపయోగించుట ఉత్తమమైన పద్ధతులు

కాయధాన్యములు ఈ జాతి మొక్కలలో కంది పైరునకు 'ఫ్యుజేరియమ్ ఉడమ్' అను శిలీంధ్రము వలన వాడు రోగము కలుగును ఈ తెగులు సోకిన మొక్కలు పచ్చబడి, వాడి చచ్చిపోవును వేళ్ళు కుళ్ళుచుండును దీర్ఘకాల సస్య పరివర్తనము వలనను, ఈ తెగులును నిరోధించు శక్తికల విత్తనములను నాటుట వలనను, దానిని అదుపులో నుంచవచ్చును మినుములు, పెసలు పైరులకు అయిడియమ్ జాతి శిలీంధ్రము వలన బూడి బూజురోగము కలుగు చుండును ఎకరమునకు 50 పౌనుల చొప్పున గంధకపు పొడిని చల్లి ఈ తెగులును అరికట్టవచ్చును

నూనెగింజల పైరులు వేరుసెనగ పైరునకు 'సర్కోస్పొరా పెర్సనేటా,' 'స. అరాఛిడికోలా' అను శిలీంధ్రములచే ప్రమాదకరమైన 'టిక్కా' అను ఆకుమచ్చ తెగులు సంభవించుచుండును చుట్టును పసుపు పచ్చగా నుండు గుండ్రని మచ్చలు ఆకులపై ఏర్పడి, ఆకులు రాలిపోవు చుండును తీవ్రమగు పరిస్థితులలో కాయలు ఏర్పడవు 1 శాతము బోర్డో మిశ్రణము గాని, గంధకపు పొడిని గాని చల్లి ఈ తెగులును అదుపులో నుంచవచ్చును

ప్రత్తి 'నల్లచేయి' లేక కోణాకారమగు ఆకు మచ్చ తెగులు 'జాన్థోమోనాస్ మాల్వేసియారమ్' అను సూక్ష్మజీవి వలన ఈ తెగులు సంభవించును ఇది విదేశపు ప్రత్తిరకముల పైన ఎక్కువగా కనబడుచుండును ఆసియా ప్రత్తిరకములపై అరుదుగా కనబడును మొదట ఆకులపై గోధుమవర్ణపు కోణాకారము గల మచ్చలు ఏర్పడును తరువాత పత్రవృంతములకు, కొమ్మలకు, కాయలకు కూడ అది వ్యాపించి, అవి నల్లబడి రాలిపోవును ఈ తెగులు విత్తనముల ద్వారా వ్యాపించును కాబట్టి విత్తనములను అగ్రోసాన్ జి యన్ లో కలిపి వాడుట, ఈ తెగులును నిరోధించు రకములను పెంచుట లాభకరముగ నుండును

పొగాకు, చెమ్మగొట్టు తెగులు ఈ తెగులు పొగాకు నారునకును, టొమాటో, మిర్చి, వంగ, కొన్ని అవకుటుంబపు మొక్కలకును సంభవించును ఈ తెగులు నారుమడిలోని మొక్కలను వివిధ ప్రదేశములలో చంపివేయుచు, నారుమడిలో కొన్ని ఖాళీస్థలములను కలుగజేయును నేలలో నీరు చక్కగా వడసిపోవని స్థలములందును, ఒత్తుగా చల్లిన నారుమళ్ళ యందును, ఈ తెగులు తీవ్రముగా నుండును. కాబట్టి, అట్టి పరిస్థితు లేర్పడకుండ చూడవలెను 1 శాతము బోర్డో మిశ్రణమును గాని, డ్యూప్రవిట్ ను గాని, ఫ్యూమిగర్ మొదలైన మందులను గాని ఎకరమునకు 200 గ్యాలన్ల చొప్పున విత్తనములు చల్లిన 32వ రోజు మొదలు 10 రోజుల కొకసారి చల్లినచో ఈ తెగులు అదుపు లోనికి వచ్చును

2 పౌడరీమిల్డ్యూ ఇది నారునాటిన తరువాత వచ్చు ప్రమాదకరమైన తెగులు ఆకుల క్రిందిభాగమున తెల్లని పొడివంటి తెగులు కనపడుట ప్రారంభించును తరువాత ఆకు వాడిపోయి, గోధుమ రంగుగా మారును

ఈ తెగులు బెండ, దొండ, గుమ్మడిజాతి మొక్కలు మొదలగు ఇతర పైరులకు కూడ సంభవించును నాట్లువేసిన $1\frac{1}{2}$ నెలలకు, మొక్కల చాళ్ళమధ్య 40 పౌన్ల గంధకపు పొడిని నేలపై చల్లినచో ఈ తెగులు చక్కగా అరికట్ట బడును

3 ఫ్రొగేయి ఆకుమచ్చ: ఈ తెగులు పొగాకు పైరుకు సంభవించును కాని, సకాలములో 1 శాతము బోర్డో మిశ్రణమును చల్లినచో ఈ తెగులు అదుపులోనికి వచ్చును ఇది గాక ఈ పైరుకు 'ఆకుచుట్ట' 'వెర్రితల' అను వైరసు తెగుళ్ళు, 'పొగాకు మల్లె' అను వేరు బదనిక ఒక్కొక్కప్పుడు చాల నష్టము కలిగించు చుండును

పసుపు కొలిటో్రైకమ్ కాప్సిసై, టాఫ్రినామాక్యులెన్స అను శిలీంధ్రములు కలుగజేయు 'ఆకుమచ్చ' తెగులు వలన ఈ పైరునకు తీవ్రమైన నష్టము కలుగును 1 శాతము బోర్డో మిశ్రణమును గాని, రాగి సంబంధమగు మరి యితర శిలీంధ్రములను నిర్మూలించు మందు గాని రెండు మూడు సార్లు చల్లినచో ఈ తెగులు అదుపులోనికి వచ్చును

మిరప 1 చెమ్మగొట్టు తెగులు ఇది నారుమళ్లలో సాధారణముగా సంభవించు ప్రమాదకరమైన తెగులు 1 శాతము బోర్డో మిశ్రణము గాని, మరి యితర రాగి సంబంధమైన మందులుగాని ఎకరమునకు 200 గ్యాలన్ల చొప్పున విత్తనములు చల్లిన 10వ రోజు నుండి రెండుసార్లు చల్లినచో, ఈ తెగులు అదుపు లోనికి వచ్చును నీరు నిలువ యుండుట, ఒత్తుగా విత్తనములు చల్లుట పనికిరావు ఈ తెగులు క్యాబేజి, గోబిపువ్వు మొక్కలు మొదలైన ఆవ కుటుంబపు పైరులకు కూడ సంభవించు చుండును

2 పండ్లు కుళ్లుట, పుల్లవిరుగుడు తెగుళ్లు ఇది కూడ ఒక ప్రమాదకరమైన తెగులు ఇది ఆకులకు, కొమ్మలకు, కాయలకు సంభవించి ఆకులు రాలిపోవుట, కొమ్మలు పుల్ల విరుగుట, పండ్లు కుళ్లుట జరుగును 1 శాతము బోర్డో మిశ్రణము కాని, ఇతర రాగి సంబంధమగు మందు గాని రెండు సార్లు చల్లినచో ఈ తెగులు అరికట్టబడును

3 పౌడరీ మిల్ డ్యూ ఈ తెగులు వలన ఆకులు రాలిపోవును 1 శాతము బోర్డోమిశ్రణమును గాని, గంధకపు పొడిని గాని చల్లి దీనిని అదుపులో నుంచ వచ్చును

కూరగాయలు టొమాటో, ఆలుగడ్డ, క్యాబేజి, గోబిపువ్వు మొక్కల ఆకులకు బ్లైట్ అను తెగులు "ఆల్టర్నేరియా స్పి" అను శిలీంధ్రమువలన కలుగును 1 శాతము బోర్డో మిశ్రణమును గాని, ఇతర రాగి సంబంధమగు మందును గాని సకాలములో చల్లి ఈ తెగులును అరికట్ట వచ్చును

పండ్ల మొక్కలు, నారింజ జాతి 1 ఆకులపై రంగు రంగుల తెగులు నేలలో తుత్తునాగము లోపించుటచే ఈ తెగులు కలుగును ఇది బత్తాయి మొక్కలకు సాధారణముగా సంభవించు ప్రమాదకరమైన తెగులు దీనివలన ఆకులు చిన్నవై, వాటి ఈనెల మధ్య పసుపురంగు ఏర్పడును సాధారణముగా కాయలు వృద్ధిచెందక పోవుటచే ఫలసాయము తగ్గిపోవును 5 పౌన్ల తుత్తునాగ గంధకితము, $2\frac{1}{2}$ పౌన్ల సున్నము, 100 గ్యాలన్ల నీటితో కలిపి వసంతకాలమున సంవత్సరమునకు రెండుసార్లు చల్లినచో ఈ తెగులు అరికట్ట బడును

2 పొంతు తెగులు ఈ తెగులు ఒకవిధమగు సూక్ష్మజీవుల వలన కలుగును ఆకులమీదను, కొమ్మలమీదను, కాయల మీదను ఎత్తుగా, గోధుమరంగుగల సెండువలె పుండ్లు ఏర్పడును తెగులు సోకిన కొమ్మలను, రెమ్మలను కత్తిరించి 1 శాతము బోర్డో మిశ్రణమునుగాని, నీటిలో కరియు గంధకమును గాని మేనెల మొదలు సెప్టెంబరు నెలవరకు ప్రతి నెల చల్లుచుండినచో ఈ తెగులు తగ్గిపోవును

3 జిగురు తెగులు ఈ తెగులు కాండపు మొదలును సంభవించును దానివలన విస్తారము జిగురు బయటకు వచ్చును బెరడు కుళ్లుచు, చివరకు చెట్టు చచ్చిపోవును నీరు పెట్టునప్పుడు కాండము తడియకుండ చూచుచు, బోర్డో పేస్టును కాండమునకు రాయుచున్నచో, ఈ తెగులు అదుపు లోనికి వచ్చును

మామిడి 'పౌడరీమిల్ డ్యూ' ఈ తెగులు వలన ఆకులు, పువ్వులు వాడి రాలిపోవును గంధకపు పొడిని చల్లుటచే, ఈ తెగులు అదుపులోనికి వచ్చును

అరటి 'పెనామా తెగులు' అను వాడు రోగము ఈ తెగులు వలన బయటి ఆకులు పచ్చబడి, అకస్మాత్తుగా వాడి, క్రిందికి వ్రాలి, ఎండిపోవును తరువాత లోపలి ఆకులకు కూడ ఈ తెగులు తగిలి, చివరకు మొక్క పూర్తిగా వాడిపోవును తెగులు సోకిన ముక్కలు గెలలు వేయవు నేలలో నీరు నిలవకుండ చేసి, తెగులు సోకిన మొక్కలను పీకివేసి, మొక్కకు 60 పౌనుల చొప్పున నేల సున్నమును వేసినచో, ఈ తెగులు

నివారితమగును రోగము లేని పిలకలను, ఈ తెగులును నివారించు శక్తిగల ఇతర జాతులను నాటవలెను

ద్రాక్ష 1 **డౌనీమిల్ డ్యూ** ఈ తెగులు ద్రాక్షతీగె యొక్క లేత భాగములకు సంభవించును ఆకులపై లేత ఆకుపచ్చ - పసుపురంగు గల మచ్చలు ఏర్పడి, ఆకుల క్రింద తెల్లని పదార్థము పెరుగును అది తరువాత ఎండిపోవును. పండ్లు ముడుతలు పడి కుళ్ళిపోవును 1 శాతము బోర్డో మిశ్రణమును కొమ్మలు కత్తిరించిన వెంటనే ఒకసారియు, తరువాత కాయలు కాసి, పండ్లు కోయువరకు 15 రోజుల కొకసారియు చల్లిన ఈ తెగులు చక్కగా నివారించ వచ్చును

2 **పౌడరీ మిల్ డ్యూ** ఈ తెగులు లేత కొమ్మలకును, ఆకులకును, కాయలకును సోకును కాయలు మామూలుగా వృద్ధికావు గంధకపు పొడిని క్రమపద్ధతిని అప్పుడప్పుడు చల్లుచుండినచో ఈ తెగులు అదుపులోనికి వచ్చును

3 **ఆంత్రాక్నోస్** ఈ తెగులు కూడ లేత కొమ్మలకు, ఆకులకు, కాయలకు సంభవించును దీనివలన నల్లని పుండ్ల వంటి మచ్చలు ఏర్పడును తెగులు తీవ్రముగ నున్నచో కాయలు నాశనమగును ఎండిన పండ్లు రాలగా, తొడిమలు మాత్రమే మిగులును ముదిరి బొట్టపడిన పండ్లమీద పిట్ట కన్నులవంటి గోధుమరంగు మచ్చ లేర్పడి, పండ్లు కుళ్లుట ప్రారంభించును 1 శాతము బోర్డో మిశ్రణము కొమ్మలు కత్తిరించినది మొదలు కాయలు కాయువరకు 15 రోజుల కొకసారి చల్లినచో ఈ తెగులు నివృత్తమగును

మీ హ ఆ

## పైరుల పెంపుదల .

సస్యములను విత్తనముల వలన గాని, చెట్టుయొక్క వివిధ భాగముల ద్వారా గాని పెంపొందించ వచ్చును సస్యములను వ్యాప్తి చేయుటకు ఉపయోగపడు పద్ధతులను ప్రవర్ధన పద్ధతు లందురు ప్రవర్ధన పద్ధతులు రెండు విధములు

1 బీజ ప్రవర్ధనము

2 శాఖీయ ప్రవర్ధనము

ప్రవర్ధన పద్ధతులు సస్యజాతులను బట్టి మారుచుండును. వాటి వివరనులు ఈ క్రింద పొందుపరచ బడినవి

బీజ ప్రవర్ధనము,

ఏకవార్షికములగు వరి, గోధుమ, మొక్కజొన్న, జొన్న మొదలగు కాయధాన్యములు , వంగ, బెండ, బీర, చిక్కుడు, రామములగ మొదలగు కూరగాయలు, బొప్పాయి, ఫాల్సా మరియు *బహ్వాంకుర జాతులగు నారింజ - నిమ్మ రకములు గింజల ద్వారా పెంపొందించ వచ్చును కాని జీడిమామిడి, జామ, సపోటా వంటి ఫలజాతులలో బీజ ప్రవర్ధనము పనికిరాదు ఏలనన ఈ జాతులలో గింజల నుండి వచ్చు మొలకలు తల్లి లక్షణముల నన్నింటిని కలిగి యుండవు

బీజ ప్రవర్ధనము చేయునపుడు ఈ క్రింది అంశములను గమనింపవలయును

(1) ప్రవర్ధనమునకు ఉపయోగించు గింజలను ఎంచిన చెట్లనుండి మాత్రమే తీసికొనవలయును

(2) సస్యజాతులను బట్టి పండ్లనుండి గింజలు తీసిన వెంటనే గాని (ద్రాక్ష, నారింజ, మామిడి) లేక కొలది నెలల తరువాత గాని (బొప్పాయి, దానిమ్మ, సీతాఫలము, సపోటా) గింజలు నాటవచ్చును

(3) గింజలు చైతన్యము కోల్పోకుండ నుండి, ఉపయుక్తములుగా నుండుటకొరకు, వాటిని గాలి చొరని గాజు సీసాలలో భద్రపరచ వలయును అట్లు కానిచో అల్కాథీన సంచులలో నింపి ఈ సంచులను డబ్బాలలో పెట్టి మూత పెట్టవలయును గింజలను కర్రబూడిదతో కలిపి భద్రపరచినచో, త్వరలో చైతన్యమును కోల్పోవు గింజలను ఉపయోగించుటకు ముందు జాగ్రత్తగా భద్రపరచుట ఎంతైన అవసరము

(4) నారుమడులలో గింజలు నాటు దూరము, విత్తుల సైజునుబట్టి మారుచుండును సామాన్యముగా 15"—18" దూరముగల వరుసలో 6"—8" దూరములో విత్తులు నాటుదురు

(5) మామిడివంటి ఫలజాతులలో గింజలను బీజాంకురముపైకి ఉండునటుల నిలువుగా పాతుట మంచిది గింజలను

---

*బహ్వాంకుర జాతులు ఈ జాతులలో ఒక గింజనుండి ఒకటి కంటె ఎక్కువ మొలకలు వచ్చును అందువలన వీటిని బహ్వాంకుర జాతులందురు ఈ మొలకలలో నాసిగానున్నవి (సుమారు 10 శాతము) సంపర్క జనిదములు మిగతా మొక్కలు బీజాంకురముచుట్టు నున్న పొరలనుండి జనించును. ఈ సంపర్క జనిదములు కాని మొక్కలు పూర్తిగా తల్లి చెట్లను పోలియుండును అందువలన ఈ జాతులను బీజముల ద్వారా పెంపొందించ వచ్చును మాంగోస్టీన్ అవకాడో, నేరేడు, కొన్ని మామిడి రకములు కూడ బహ్వాంకురయుతములు.

పాదులలో నాటవచ్చును, లేదా మొదట నారుమడులలో నాటి, సుమారు రెండు నెలలలోపు వయస్సు కలిగిన మొక్కలను నారుమడినుండి తీసి పొలములో నాటవచ్చును

(6) ఏకవార్షికములగు తృణధాన్యములను, కూరగాయ జాతులను, వాటి జీవిత కాలమునుబట్టి, సుమారు 3–5 వారములు నారుమడిలో ఉంచవలయును ఉదా ఒక రకపు వరి 5 మాసములలో పంటకు వచ్చుచో, ఆ నారును నారుమడిలో అయిదు వారము లుంచవలయును

(7) జీడిమామిడి, టేకు, ఎర్ర చందనము మొదలగు జాతులలో 5–6 నెలల వయస్సుగల మొలకలు తోటలలో నాటినప్పుడు, బాగుగా నాటుకొనక, పెక్కు మొక్కలు చనిపోవును అటువంటి జాతులలో మొక్కలను ఆరు నెలల వరకు నారు మడిలో పెంచి, తరువాత వాటిని నారు మడి నుండి తీసి 2" కాండభాగము మరియు 4" వేరు భాగము కలిగిన మొండెములుగా చేసి నాటినచో అవి నూటికి నూరుపాళ్ళు బ్రతుకును.

(8) జిబ్బరిలిక్ యాసిడ్, థయోయూరియా వంటి కృతకవీర్యదములు, బొప్పాయి, నారింజ, నిమ్మ, అనాస, పోక, జాతులలో గింజలు త్వరలో మొలకెత్తుటకును, బాగుగా పెరుగుటకును, అనుకూలము లని కనుగొన బడినది

**శాఖీయ ప్రవర్ధనము**

అరటి, అనాస మొదలగు ఫలజాతులు, ఆలుగడ్డ, గెనుసుగడ్డ మొదలగు దుంపకూరలు, గులాబి, క్రోటను మొదలగు ఉద్యాన సస్యములలో మామూలుగా బీజోత్పత్తి జరుగదు కావున ఈ జాతులను శాఖీయ ప్రవర్ధనము ద్వారా పెంపొందించ వలయును ఈ పద్ధతి ద్వారా వ్యాప్తి చేయుట వలన, ఒక చెట్టునుండి వచ్చు సంతతి అంతయు ఆ చెట్టు యొక్క లక్షణముల నన్నింటిని కలిగి యుండును. శాఖీయ ప్రవర్ధనములో ఈ క్రింది పద్ధతులు కలవు

(1) పిలకల, దుంపల ద్వారా ప్రవర్ధనము

అరటి, అనాస జాతులను పిలకల ద్వారా ప్రవర్ధనము చేయవలయును బంగాళాదుంపలు, పసుపు, కంద, అల్లము, పెండలము వంటి దుంపజాతులను దుంపల భాగములతో వ్యాప్తి చేయవలయును ఇవి కాండపు రూపాంతరములు ఈ దుంపల మీద కణుపులు మరియు కణుపుల దగ్గర మొగ్గలు ఉండును రెండు లేక మూడు మొగ్గలు కలిగినటువంటి దుంప భాగములు ప్రవర్ధనమునకు పనికివచ్చును

(2) కాండ ప్రవర్ధనము –

దానిమ్మ, ద్రాక్ష, దబ్బ మొదలగు ఫల జాతులలో క్రితపు ఋతువులో పెరిగినటువంటి ముదురు కాండ భాగములను ప్రవర్ధనమునకు ఉపయోగింతురు ఈ కాండ భాగములు 3–4 కణుపులు (8"–10" పొడవు) మరియు పెన్సిలు మందము కలిగి యుండును క్రోటను, కోలియస్, చామంతి వంటి అలంకరణములలో అదే ఋతువులలో పెరిగినటువంటి లేత కాండ భాగములను ఉపయోగింతురు ఈ కాండములు 4"–5" పొడవుండును ఈ కాండ భాగములను, భూమిలో

చిత్రము 30


పటము 1 నాటుటకు సిద్ధముచేసిన కాండపుభాగములు

గాని లేక కుండీలలో గాని నాటినచో, వేరు నాటుకొని మొక్కలుగా వృద్ధి చెందును

ఇటీవలి పరిశోధనము వలన 'ఐ బి ఎ 'వంటి రసాయన పదార్థములు ఈ కాండ భాగములపై వేళ్లను జనింపజేయుటకును, వాటిని వృద్ధిచేయుటకును ఉపయుక్తము అని తేలినది

(3) **కాండ భాగములతో అంట్లు కట్టుట :**

కాండ భాగములతో ప్రవర్ధనము చేయుటకు వీలుగాని జాతులలో అంట్ల ద్వారా ప్రవర్ధనము చేయవచ్చును వాటిలో ఈ క్రింది పద్ధతులు ముఖ్యమైనవి.

(ఎ) నేల అంట్లు

ఈ పద్ధతిలో ఎంచిన చెట్ల కాండములను (భూమికి దగ్గరగా నున్న కొమ్మలను) నేలకు చేరువగా వంచి, కాండము మీద అంగుళము మేరకు బెరడు తీసివేయ వలయును తరువాత ఈ బెరడు తీసిన భాగము భూమిలో 3"-4" లోతున ఉంచి దానిపై మన్నుకప్పి బరువు పెట్టవలెను తరువాత నీరు పోయు చుండవలెను ఇట్లు చేసినచో 45-60 రోజులలో ఈ కొమ్మల మీద వేరులు జనించును తరువాత వీటిని దఫాల వారీగా కత్తిరించి కుండీలలో గాని, తోటలలో గాని నాట వలయును కిడిమామిడి, గులాబి, జామ, దానిమ్మ జాతులను ఈ పద్ధతిలో అంట్లు కట్టవచ్చును

(బి) గాలి అంట్లు

కొన్ని జాతులలో కొమ్మలు నేలకు దగ్గరలో నుండవు ఇలాంటి జాతులలో నేలంట్లు కట్టుట సాధ్యము గాదు చెట్ల పైభాగములో నున్న కొమ్మలతో అంట్లు కట్టుటకు ఈ పద్ధతిని ఉపయోగింతురు ఎంచిన కొమ్మలలో 1" పొడవున బెరడు తీసి, దానిచుట్టు తడి రంపపు పొట్టు గాని, లేక నాచు గాని ఉంచి, దానిపై ఆల్కథీను పేపరు (150 గేజి) చుట్టవలయును ఆల్కథీను పేపరు చివరలను దారముతో గట్టిగా కట్టి, దానిపై జిగురు కలిగిన చేపును చుట్టుదురు ఇట్లు చేయుట వలన, అంట్లలోనికి గాలి చొరదు అంటు కట్టిన 2 నెలలలో వేర్లు జనించును తరు

చిత్రము 28




వాత కాండములను దఫాలవారిగా వేరుచేసి, ప్రవర్ధనమునకు ఉపయోగించ వచ్చును ఈ పద్ధతివలన, సపోటా, మామిడి మొదలగు ఫలజాతులలో మంచి ఫలితము కల్గును

(సి) చేర్పంటు

సీతాఫలము, మామిడి, సపోటా, వంటి ఫలజాతులకు ఈ పద్ధతి చాలా అనుకూలము ఈ పద్ధతిలో ఎంచిన చెట్టు యొక్క కాండభాగములను అదే జాతిలోని వేరొక మొక్కపై అతికించి అంటు కట్టుదురు అంట్లు కట్టుటకు మొదట వేరు భాగమునకు పనికివచ్చు మొక్కలను నారుమడులలో 6 నెలలు పెంచి, తరువాత కుండీలలోనికి మార్చుదురు కుండీలలోని మొక్కలు బాగుగా పెరిగి, కాండభాగము పెన్సిలు మందము

చిత్రము 29




కలిగియున్నపుడు, వాటిని అంటు కట్టవలసిన చెట్టువద్దకు కొని పోయి, అదేమంగము గల కాండము వద్ద స్టాండుపై అమర్చుదురు ఎంచిన కొమ్మలమీద 2" పొడవున ¼" మందమున బెరడు తీయవలయును బెరడు తీసిన తరువాత, రెండు కొమ్మలను దగ్గరగా చేర్చి, వాటి విభాజ్య కణములు కలిసికొను నట్లుగా చేయవలయును తరువాత ఈ భాగముపై మైనపు గుడ్డపీలికలను చుట్టి, దాని పురికొసతో బిగించవలెను ఇట్లు కట్టిన తరువాత సుమారు 3 నెలలలో అంట్లు తయారగును అప్పుడు అతుకు క్రింది భాగములోని ఎంచిన కొమ్మపై గాట్లుపెట్టి దానిని తల్లి చెట్టు నుండి వేరు చేయవలయును ఈ విధముగా అతుకు పైభాగములోని

మొక్క యొక్క తలభాగమును తీసివేయ వలెను ఈ పనిని దఫాలవారిగా చేయుట మంచిది

(డి) మొగ్గంటు

నారింజ, రేగువంటి ఫలజాతులకు, గులాబి వంటి పుష్ప జాతులకు ఈ పద్ధతి చాల అనుకూలము ఈ పద్ధతిలో కుండీలలో పెంచిన మొక్కల మీద, ఎంచిన చెట్లనుండి తెచ్చిన మొగ్గలను అమర్చి కట్టుదురు మొక్క కాండభాగముపై "T" ఆకారములో గాని తలక్రిందులగా నున్న "T" (⊥) ఆకా

చిత్రము 80




రములో గాని (పటము 4 లో చూపిన మాదిరి) గంట్లు పెట్టి బెరడు వదులు చేయవలయును అదే సైజుగల మొగ్గలను ఎంచిన చెట్లనుండి తెచ్చి, ఈ గాడిలో అమర్చి మైనపు పీలికలతో గాని, లేక రబ్బరు ముక్కలతో గాని, లేక ప్లాస్టిక్ టేపుతో గాని కట్టుదురు అంటు కట్టిన తరువాత సుమారు రెండు నెలలకు అతికిన మొగ్గలు ఎదుగ నారంభించును అప్పుడు అతుకునకు పైనున్న మొక్క యొక్క తలభాగమును తీసి వేయవలయును

ప్రక్కంటు పద్ధతిలో వానగాలులకు దెబ్బతిన్నటువంటి మామిడి చెట్లను బాగుచేసి కొనవచ్చును ఇతర ఫలజాతులకు కూడ ఈ పద్ధతి ఉపయోగపడును

వేరు భాగముల ద్వారా ప్రవర్ధనము -

ఈ పద్ధతిలో పెన్సిలు మందము కలిగిన ముదురు వేళ్లను (2-8 కణుపులు 4"-6" పొడవు) భూమిలో అడ్డముగా నాటినచో మొలకలుగా తయారగును ఈ పద్ధతిలో సీమదబ్బ, జామ, రాస్ప్‌బెర్రి, బ్లాక్‌బెర్రి వంటి ఫలజాతులను అభివృద్ధి చేయవచ్చును

పలువిధములగు కాండభాగముల మరియు వేరు భాగముల ప్రవర్ధనమునకు కృతక వీర్యాదిములను కలిగినటు వంటి "సిరడిక్స్-ఎ", "సిరడిక్స్-బి", "హార్ట్ మోన్", "రూటోన్" వంటి రాసాయనిక ద్రవ్యములను ఉపయోగించుట వలన మంచి ఫలితములు పొందవచ్చును

య. యో.

## పొట్టి శ్రీరాములు

ఎన్నెన్ని మహోద్యమములో, ఎన్నెన్ని మహాసంస్థలో ఎందరెందరు మహామహులో, దాదాపు నాలుగు దశాబ్దములపాటు సాధింపలేక, కేవలము 'గగన కుసుమముగా' నుండిపోయిన ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర నిర్మాణమును, నిస్స్వార్థ దేశభక్తుడు, నిరాడంబర జీవి, నిష్కామ కర్మయోగి యగు గాంధీజీపథగామియైన శ్రీ పొట్టి శ్రీరాములు ఏకాంగిగా నిలచి, ఆమరణ నిరశన వ్రతమును బూని, తన సంపూర్ణాత్మాహుతి మూలమున తన సోదరాంధ్ర ప్రజలకు ప్రత్యేక రాష్ట్రమును సాధించి యిచ్చి అమరుడయ్యెను

పొట్టి శ్రీరాములు గారి మహాలక్ష్మమ్మ, గురవయ్య మాతాపితలు శ్రీరాములు మద్రాసునందలి జార్జిటౌనులోని అణ్ణాపిళ్లై వీథిలో గల 163వ నెంబరు గృహమునందు 16-3-1901వ సంవత్సరములో జన్మించెను పొట్టివారిది మంచి పేరువడసిన వైశ్య కుటుంబము ఈ కుటుంబము వారును, వారి బంధువులును మద్రాసునందు చాలమంది కలరు

శ్రీరాముల యొక్క పూర్వులు నెల్లూరు జిల్లాకు చెందినవారు ఆ జిల్లాయందలి జువ్వలదిన్నె పాలెము వారి స్వగ్రామము ఆయన బాల్యజీవితము జువ్వలదిన్నె పాలెమునందు ప్రశాంతముగా గడచినది చదువు నిమిత్తము మద్రాసునకు వచ్చెను ఇంటర్‌మీడియేట్ వరకు అక్కడ చదివి అందు కృతార్థుడయ్యెను

'శానిటరీ ఇంజనీరింగు'ను చదువుటకు బొంబాయి పట్టణము వెళ్ళి అచ్చట మిక్కిలి శ్రద్ధాసక్తులతో విద్య నభ్యసించి ఆ పరీక్షయందు డిప్లమాను అతడు పొందెను

'పూవు పుట్టగనే పరిమళించు' నన్నట్లు శ్రీరాములకు విద్యార్థి దశనుండియే దేశసేవ చేయవలయు నను అభిలాష

మెండుగా నుండెను. ఆయన తన కళాశాలను బహిష్కరించి స్వాతంత్ర్య సమరమున దూకుట కుద్యమించెను. కాని కుటుంబములోని పెద్దల అభిప్రాయము ననుసరించి అట్లు చేయుటకు వలను పడక ఇంజనీరింగు కోర్సును పూర్తి చేసెను.

శ్రీరాములు, తన విద్య ముగిసిన పిమ్మట, బొంబాయి యందే జి. ఐ. పి. రైల్వేలో నెలకు 250 రూప్యముల వేతనముతో ఉద్యోగమున ప్రవేశించి నాలుగు సంవత్సరములు పనిచేసెను. ఆ రోజులలోనే ఆయనకు వివాహము జరిగినది. తరువాత కొద్దిరోజులకు భార్యావియోగము సంభవించినది. ఆ దుస్సంఘటనతో ఆయన హృదయము పూర్తిగా మారిపోయినది. ఒక విధమైన వైరాగ్యము కలిగినది. అదే సమయమున 'జలియన్ వాలా బాగ్' దురంతములు జరిగినవి. అతి క్రూరమైన రౌలట్ చట్టము ప్రవేశపెట్ట బడినది. దేశమందంతటను అశాంతి జ్వాలలు బయలుదేరినవి. శ్రీరాముల హృదయకుహరమునందు సైతము ఆ జ్వాలలు ప్రవేశించి ఆయనను కదలించి వైచినవి. ఒక విధమైన విరక్తత ఆయనను ఆవహించినది. దానితో తాను చేయుచున్న ఉద్యోగమునకు రాజీనామా నిచ్చి భవిష్యత్కార్యక్రమమును అన్వేషింప సాగెను. మానసిక శాంతిని, చిత్తస్థైర్యమును పొందుటకుగాను తన తల్లిదండ్రులను, బంధువర్గమును, తనకుగల యావదాస్తిని విడిచిపెట్టి కట్టుగుడ్డలతో గుజరాతునందు గాంధీజీ స్థాపించిన సబర్మతి ఆశ్రమమునకు వెళ్లి అందు ప్రవేశించెను. అతి త్వరలోనే శ్రీరాములు, తన సత్ప్రవర్తన, సత్సాంగత్య ఆదర్శ శీలములతో ఆశ్రమవాసుల హృదయములను చూరగొని, తలలో నాలుకయై ప్రవర్తించుటచేత 'రాములు భాయి' యని అందరును ఆయనను ఆప్యాయతతో పిలువ మొదలిడిరి.

ఈ సబర్మతీ ఆశ్రమ జీవితమే శ్రీరాముల జీవితమునందు ఒక గొప్ప పరివర్తనముగా పరిణమించి ఆయనను ఒక ప్రత్యేక వ్యక్తిగా తీర్చిదిద్దినది.

ఆత్మార్పణము, నిస్వార్థ ప్రజాసేవ, త్యాగనిరతి యను ఈ త్రిగుణములు నిండుగా నున్న శ్రీరాములు 11 సంవత్సరముల సుదీర్ఘకాలము గాంధీజీ చరణసన్నిధియందు అంతేవాసిగా నుండి వారి హృదయమును చూరగొని, అంతరంగిక శిష్యు డయ్యెను. మితవ్యయము, పొదుపరితనము అనునవి ఆయనకు వెన్నతోబెట్టిన విద్యలు. ఆయన తనకు గావలసిన భోజనాది సౌకర్యములను మిక్కిలి తక్కువ ఖర్చుతో కూర్చుకొనుచుండెడివాడు. ఆయన నియమ మెుక్క నిబద్ధమైన ఆదర్శ జీవితవిధానమునకు ముగ్ధుడైన గాంధీజీ "శ్రీరాములవంటి నిష్కామ కార్యధురంధరులును, సేవాతత్పరులును, పదుగురున్న యెడల స్వరాజ్యమును నొక్క దినములో సాధింపవచ్చు" నని చెప్పి యుండెను.

చిత్రము 81



శ్రీరాములు తాను తలపెట్టిన కార్యక్రమములను ఎట్టి ప్రచారముగాని, ప్రకటనలుగాని చేయక, నిరాడంబరముగను, నిస్వార్థబుద్ధితోను చేయుచుండెడి వాడు. ఆయనకు వ్యర్థమైన శుష్కోపన్యాసము లనిన మిక్కిలి యేవగింపు. గాంధీజీ తలపెట్టిన నిర్మాణ కార్యక్రమమును ఆయన పరమావధిగా భావించి తదభివృద్ధికై పనిచేసెను.

భారత స్వాతంత్ర్య సమరమున శ్రీరాములు మూడు పర్యాయములు పాల్గొని సత్యాగ్రహము చేసి, శ్రీకృష్ణ జన్మస్థానము నలంకరించెను.

ప్రప్రథమమున 1927వ సంవత్సరమున జరిగిన సహాయ నిరాకరణోద్యమమున పాల్గొని ఆ ఉద్యమ వ్యాప్తికి తీవ్రమైన కృషి సలిపి యుండెను.

1930వ సంవత్సరమున గాంధి మహాత్ముడు తలపెట్టిన ఉప్పు సత్యాగ్రహోద్యమము నందు పాల్గొని జైలుశిక్ష ననుభవించెను. ఆ తరువాత 1940వ సంవత్సరమున జరిగిన

వ్యక్తి సత్యాగ్రహము నందు సైతము పాల్గొని కారాగారము నందు బంధింపబడెను 1942వ సంవత్సరము ఆగష్టునందు జరగిన 'క్విట్ ఇండియా' ఉద్యమమునందు గూడ పాల్గొని తిరిగి ఆయన కారాగారమునందు బంధింపబడెను

ఈ మూడు పర్యాయములు ఆయన దుర్భర కారాగృహ శిక్షలకు గురియై ఎన్నియో కష్టములను, ఎంతో ఓర్పుతో సహించెను శ్రీరాములకు సాంఘిక సేవ యనిన మిక్కిలి ప్రీతి వ్యక్తి సత్యాగ్రహము ముగిసిన పిమ్మట ఆతడు సుమారు 1½ సంవత్సరములు రాజకోట సంస్థానమునందు సాంఘిక సేవ చేసెను ఆ తరువాత గుజరాతు రాష్ట్రమందలి "తరవాడా" గ్రామ సేవాశ్రమజీవి సంఘమునందు మిక్కిలి పట్టుదలతో 2½ సంవత్సరములు సాంఘిక సేవా కార్యక్రమములను నెరవేర్చి, తన ఆదర్శ జీవిత విధానము వలన ప్రజా హృదయములను చూరగొన్నవాడాయెను అటుపిమ్మట తన మాతృభూమియైన ఆంధ్రదేశమునకు వచ్చి "కొమరవోలు" గాంధీ ఆశ్రమమున నాలుగు సంవత్సరములు సాంఘిక కార్యకలాపముల యందు నిమగ్నుడై ప్రతిఫలాపేక్ష లేని తన సేవా ధర్మమును నిర్వర్తించి, తన సోదరప్రజల హృదయములను చూరగొన గలిగెను

హరిజనోద్ధరణ మనినను, పతితజనోద్ధరణ మనినను, శ్రీరాములకు ప్రాణప్రదములుగా నుండెడిది నెల్లూరునందు పై కార్యక్రమముల నిమిత్తము ఆయన చేసిన సేవ అనన్యసామాన్యమైనది ఆయన కాళ్లకు చెప్పులు గాని, తలపై గొడుగు గాని, లేకయే, 'పూజ్య బాపూజీ'వలె చిన్న ఖద్దరు కొల్లాయి గుడ్డను ధరించి, పైన చిన్న తుండుగుడ్డ నైచుకొని తిరుగుచుండెడి వాడు అట్టులపైన "హరిజనులకు దేవాలయ ప్రవేశ మియ్యండి" - "హరిజనోద్ధరణము చేయండి" - "మానవ సేవయే మాధవ సేవ" అనునట్టి వాక్యములను వ్రాసి తన మెడకు తగిలించుకొని వాడవాడల యందును ప్రచారము చేయుచు తిరుగుచుండెడి వాడు దానిని చూచిన కొందరు ఆయన 'ఉన్మాది' యని పరిహసింప సాగిరి ఆ రోజులలో హరిజనులు సైతము ఆయన పవిత్ర భావములను గ్రహించజాలక హేళనము చేయుచుండిరి ఐనను స్థితప్రజ్ఞుడైన ఆ మహాపురుషుడు వీటిని సరకు చేయక, అచంచలమైన ఆత్మవిశ్వాసముతో తాను నమ్మిన పవిత్ర సిద్ధాంతముల కనుగుణముగా పనిచేసెను

ప్రభుత్వమువారు రాజకీయ బాధితులకు భూముల నిచ్చుచున్న సమయమున కొందరు మిత్రులు దరఖాస్తు పెట్టుకొన వలసినదని, ఆయనను కోరియుండిరి సంసార బంధముల నుండి విముక్తి పొంది కర్మయోగిగా జీవయాత్ర సాగించుచున్న ఆ మహామహుడు అందుల కంగీకరించక తిరస్కరించెను

శ్రీరాములు, గాంధీజీ ప్రవేశపెట్టిన ఖద్దరు ధారణము ప్రభుత్వ న్యాయస్థానముల బహిష్కరణము, పన్నుల నిరాకరణము, మద్యపాన నిషేధము, హరిజనోద్ధరణను, హిందూ ముస్లిముల ఐక్యత మొదలగు నిర్మాణ కార్యక్రమములను మిక్కిలి పట్టుదలతో ప్రచారము చేసి విజయమును సాధింప జీవితాంతము వరకు ఆయన గట్టి ప్రయత్నములను చేసియుండెను

భారత దేశమునకు స్వాతంత్ర్యము సిద్ధించిన పిమ్మట ఆయన, రాజకీయ రంగము నుండి పూర్తిగా నిష్క్రమించి, దేశాభివృద్ధి కనుగుణమగు ఇతర సాంఘిక కార్యక్రమములను నెరవేర్చుటకు నడుము గట్టెను ఆయన ఆంధ్రదేశమున గాంధీ స్మారక నిధికి సంచాలకుడుగా నుండి మిక్కిలి మితవ్యయముతో తన జీవితమును గడుపుకొని ఆ నిధులు నిర్మాణాత్మకమైన కార్యక్రమముల యందు సద్వినియోగ పడునట్లు ప్రయత్నించెను

శ్రీరాములు 1944వ సంవత్సరము నుండి తన జన్మస్థలమైన నెల్లూరును కేంద్రముగా చేసికొని ఖద్దరు ఉద్యమ వ్యాప్తికి, హరిజనోద్ధరణమునకు తన జీవితమును అంకితము చేసి పనిచేయ సాగెను

1946వ సంవత్సరమున నెల్లూరు పట్టణమున మూలపేటలోని శ్రీ వేణుగోపాల స్వామివారి దేవాలయమునందు హరిజనులకు ప్రవేశము లేనందులకు మిక్కిలి కినిసి, ఆలయ ధర్మకర్తలతోను, పూజారులతోను సంప్రదింపులు జరిపి, అందు విఫలుడై, నిరశనవ్రతమును బూని 29 దినముల యనంతరము వారికి దేవాలయ ప్రవేశము కలుగునట్లు చేసియుండెను

ఇండియాకు స్వాతంత్ర్యము సిద్ధించిన తరువాత సైతము హరిజనోద్ధరణమునకు సరియైన దోహదము జరగనందుకు మిక్కిలి ఖేదపడి శ్రీరాములు 1948వ సంవత్సరమున తిరిగి మరియొకమారు కఠోరమైన ఉపవాస దీక్ష పూనెను 29 దినముల కఠోరమైన ఉపవాస దీక్షానంతరము 'ఆంధ్రకేసరి'

టంగుటూరి ప్రకాశము ప్రభుత్వము, మద్రాసు రాష్ట్రమందంతటను ప్రతినెలలో చివరి రోజును హరిజనోద్ధరణమునకు ఉపయోగించుటకు గాను జిల్లా కలెక్టర్లకు ఆదేశము పంపినది ఆ యాదేశము ననుసరించి, నేటికిని ప్రతినెల చివర రోజున గ్రామ పంచాయితీల యందును, సమితి కేంద్రముల యందును, హరిజన సంక్షేమము నిమిత్తము కృషి జరగుచున్నది

ఆంధ్రులకు ఆంధ్రరాష్ట్ర నిర్మాణము అతి చిరకాల వాంఛ దానిని సాధించుటకు ఎన్నియో ఉద్యమములు నడచినవి ఎందరెందరో మహామహులు కృషిసలిపి యుండిరి అయినను అది సాధ్యముకాక కేవలము ఎండమావుల వలె అయిపోయినది

1950వ సంవత్సరమున స్వాతంత్ర్య దినోత్సవమునాడు స్వామి సీతారాం (గొల్లపూడి సీతారామశాస్త్రి) వంటి ప్రముఖ కాంగ్రెసు నాయకుడు ఆమరణ నిరశన వ్రతమును పూనెను 35 దినముల యనంతరము ఆచార్య వినోబాభావే, రాష్ట్రపతి రాజేంద్రప్రసాదు, భారత ప్రధాని జవహర్లాలు నెహ్రూ మున్నగు ప్రముఖులు ఇచ్చిన హామీల ననుసరించి ఆయన నిరశనవ్రతము నుండి విరమించెను స్వామి సీతారాం సలిపిన నిరశన వ్రతమువలన ఆంధ్రరాష్ట్రము సిద్ధించక పోయినను, ప్రజా హృదయముల యందు రాష్ట్రవాంఛ గాఢముగా బలపడి, ఉద్యమ స్వభావము తీవ్రరూపము దాల్చినది కాని అసలు సమస్య అస్తవ్యస్తమై పోయినది

ఆ తరువాత రెండు సంవత్సరములు ఆంధ్రరాష్ట్రమునకు సంబంధించిన యే విషయము పరిష్కారము జరుగక, అసలు విషయము తెరమరుగున పడిపోయినది ఆంధ్ర నాయకులలో ఏకాభిప్రాయము కుదరలేదు దానితో ఢిల్లీ పెద్దలు మౌనముద్ర వహించిరి

ఇట్టి అనిశ్చిత స్థితిలో సున్నితమైన శ్రీరాముల మనస్సు మిక్కిలి వ్యాకులత జెందినది ఆంధ్రప్రజల చిరకాల వాంఛితమైన ఆంధ్రరాష్ట్రము నెట్లైన సాధించి తీరవలయునను పట్టుదల అధికమైనది అసలు సమస్యను అటో ఇటో తేల్చివేయ వలయు నను కాంక్ష గాఢమై ఆయన హృదయమును తొందరపెట్ట సాగినది అందు వలన ఆయన 1952 సెప్టెంబరు మాసములో తన బాల్యస్నేహితుడు, మద్రాసు న్యాయవాద సంఘ సభ్యుడు అయిన శ్రీ బి లక్ష్మినారాయణ గారికి నెల్లూరినుండి యొక లేఖ నిట్లు వ్రాసియుండెను

"ఆంధ్రరాష్ట్రమును గురించి నేను తీవ్రముగా ఆలోచిస్తున్నాను మన నాయకులు యీ సమస్య పరిష్కారము చేస్తారని ఆశించాను అది జరుగలేదు ఏ రాజకీయ పార్టీ చేతులలోను కీలుబొమ్మగా ఉండడము నా స్వభావానికి వ్యతిరేకమైనది నాకు పార్టీ అంటూ ఏదియు లేదు నాకు సహచరులను వారు కూడా లేరు ఎక్కడికిపోయినను, ఏం చేసినను నాకు నేనుగానే వ్యవహరిస్తాను నేను అనేక పర్యాయాలు నిరాహార దీక్ష వహించి విజయంకూడా పొందాను ఈ నా కోరికను సాధించుటకు నా జీవితాన్ని అర్పిస్తాను''

''ఈ ఆంధ్రరాష్ట్ర సమస్య యెన్నో అభిప్రాయ భేదాలను రేకెత్తించినది ప్రతిఒక్కరు తమ ధోరణిలోనే ఆలోచిస్తారు ప్రజలందరూ ఒకేవిధముగా ఆలోచించ నంత వరకు అందరకు ఆమోదకరం అయిన పని కాదు ఈ విధంగా చేయటానికి నాక ఒక్కటే మార్గము కనిపిస్తున్నది సంశయభావం లేకుండా దృఢనిశ్చయంతో నా ప్రాణాలను అర్పించడమే ఆ మార్గం ఇంకా ఆలస్యం చేస్తే అపరాధం చేసినవాణ్ణి అవుతానేమో నని నిన్నటినుంచి భావిస్తున్నాను ఈ విషమ పరిస్థితిని యెదుర్కోవడానికి సిద్ధంగా ఉన్నాననే ఆశిస్తున్నాను దేనికైనా నా ప్రాణాలను అర్పిస్తాను ''

ఇట్టి తీవ్ర ఆలోచనలతో మనస్సంక్షోభము నొందిన శ్రీరాములు మద్రాసునకు వచ్చి మహర్షి బులుసు సాంబమూర్తిగారి యింటియందు 19 అక్టోబరు 1952వ సంవత్సరమున ఆదివారమునాడు ఆమరణ ప్రాయోపవేశమునకు పూనుకొనెను ఆ వజ్రసంకల్పుడు ఉపవాసదీక్ష జరుపుచున్న సమయమున ఎట్టి ఆహారమును ఈయ వలదనియు, తన కోరిక నెరవేరు నంతవరకు, తాను ఎట్టి ఆహారమును ఏరూపమునను స్వీకరింప జాలననియు తన మనోనిశ్చయమును వెలిబుచ్చి యుండెను

శ్రీరాములు నిరశన వ్రతమును ప్రారంభించుచు మరి రెండు షరతులను వెలిబుచ్చి యుండెను ''(1) మద్రాసు నగర విషయములో అందరికి ఆమోదకరమైన అంగీకారము కుదరడము, (2) నిర్వివాదాంశమైన ఆంధ్ర ప్రాంతములతో వెను వెంటనే ఆంధ్రరాష్ట్ర నిర్మాణమును గూర్చి భారత ప్రభుత్వము విస్పష్టముగా ప్రకటన గావించడము''

ఇట్టి మహాశయములతో శ్రీరాములు ప్రారంభించిన నిరశన వ్రతము నిర్విఘ్నముగా సాగుచుండెను కాని

నాయకులకు హృదయపరివర్తనము కలుగలేదు రోజులు వారములుగా, వారములు నెలలుగా మారజొచ్చినవి కాని పరిస్థితిలో మార్పు కనిపించలేదు

ఈ కఠోర నిరాహార వ్రతము వలన కలుగనున్న విపరీత పరిస్థితులను ప్రజల దృష్టికి తీసికొని వచ్చుటకు డిసెంబరు 7వ తేదీన ఆంధ్రకేసరి నాయకత్వమున అఖిలపక్షసమావేశము జరగినది కాని ఫలితము శూన్యమైనది ఎటు జూచిన నిరాశా, నిస్పృహాలే గోచరమైనవి

1952 డిసెంబరు 15వ తేదీ వచ్చినది 58 రోజులు నిరవధికముగా ఉపవాస వ్రతము సాగించిన శ్రీరాములు 84 పౌనులు బరువు తగ్గిపోయెను సత్యాగ్రహికి తరచు అపస్మారము సంభవించుచు, పరిస్థితి అత్యంత ఆందోళనతో నిండిపోయినది నిమిషమొక యుగముగ గడవసాగినది రాత్రి 9 గంటల 45 నిమిషములకు పూర్తిగా స్మారకము తప్పిపోయినది 1952 డిసెంబరు 15వ తేదీ రాత్రి 11 గంటల 23 నిమిషములకు ఆ పూర్ణపురుషుని పంచప్రాణములు అనంతవాయువులలో లీనమై పోయినవి ఆయన అమరుడై పోయెను ఆ మహామహుని సంపూర్ణాత్మార్పణమున యావద్భారత జాతి శోకసముద్రమున మునిగి పోయినది

ఆనాటి భారత ప్రధానమంత్రి స్వర్గీయ శ్రీ జవాహర్లాలు నెహ్రూ 1952 డిసెంబరు 19వ తేదీన పార్లమెంటు నందు ప్రత్యేక ఆంధ్రరాష్ట్రమునకు సంబంధించిన చరిత్రాత్మకమైన ఒక ప్రకటనమును చేసియుండెను తత్ఫలితముగా రాజస్థాన్ ప్రధాన న్యాయమూర్తియైన శ్రీ కైలాసనాథ వాంఛూను ప్రత్యేకాధికారిగా నియమించి ఆంధ్రరాష్ట్ర స్థాపనకు ఒక సమగ్ర నివేదికను అందజేయు వలసినదని ప్రభుత్వము కోరియుండెను శ్రీ వాంఛూగారు యావదాంధ్రమును పర్యటించి తన నివేదికను ప్రభుత్వమునకు సమర్పించి యుండెను

ఆ నివేదిక ననుసరించి, 1953వ సంవత్సరము అక్టోబరు 1వ తేదీన ఆంధ్రకేసరి ప్రకాశము నాయకత్వమున కర్నూలు రాజధానిగా మద్రాసు రాష్ట్రములోని శ్రీకాకుళము, విశాఖపట్టణము, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, కడప, కర్నూలు, అనంతపూరు అను జిల్లాలతో ప్రత్యేక ఆంధ్రరాష్ట్రము ఏర్పడినది ఆంధ్రుల ఈ అభీష్టరాష్ట్రావతరణ మహోత్సవమును మన ప్రియతమ నాయకుడు జవాహర్‌లాలు నెహ్రూ పండితుడు అత్యుత్సాహముతో జరపియుండెను

అమరజీవి పొట్టి శ్రీరాములు కనిన కలలు 1956 నవంబరు 1వ తేదీన సాఫల్యము చెందినవి అదియొక శుభదినము ఆనాడు ఆంధ్రరాష్ట్రములోని 11 జిల్లాలును, తెలంగాణములోని వరంగల్లు, ఖమ్మం, నల్గొండ, మహబూబునగరు, మెదకు, నిజామాబాదు, అదిలాబాదు, కరీంనగరు, హైదరాబాదు అను తొమ్మిది జిల్లాలును కలసి 20 జిల్లాలతో ఆంధ్రప్రదేశ్ అను నామముతో విశాలాంధ్రము నిర్మాణ మయినది ఆంధ్రప్రదేశ్‌కు హైద్రాబాదు రాజధానిగా ఎరింప బడినది

ఆంధ్రరాష్ట్ర సిద్ధికొరకు ఆత్మార్పణము చేసిన అమరజీవి పొట్టి శ్రీరాములు అమరత్వము నొందిన సందర్భమున ఎందరెందరో మహామహులు తమ తమ శ్రద్ధాంజలుల నర్పించియుండిరి అట్టివారిలో గణనీయుడు "మద్రాసు మెయిల్" పత్రికా సంపాదకుడు నగు శ్రీ ఎ ఎ హేల్స్ తన పత్రికా సంపాదకీయమునందు ఆతడిట్లు వ్రాసెను "క్రీస్తు శిలువకు అనంతరము, ఇది మరొక మహత్తర ఆత్మ పరిత్యాగము"

పుం వేం

## పోర్చుగల్ దేశ చరిత్ర

పోర్చుగల్లు ప్రజాసత్తాక రాజ్యము ఇది యూరపు ఖండములో ఐబీరియా ద్వీపకల్పమునందు నైరృతి దిశాగ్రమున నున్నది దీని విస్తీర్ణము 35,413 చ మైళ్లు 1950వ సం॥ లెక్కలను బట్టి ఇందలి జనాభా 84,90,000 లిస్బన్ నగరము ఈ దేశమునకు రాజధాని ఇందలి ప్రజలు పోర్చుగీసు భాష మాట్లాడుదురు రోమను కాథలిక్ మతమును వారనుసరింతురు

పోర్చుగల్లు నిమ్నోన్నత ప్రాంతములు గల దేశము అత్యంత సాహసికులగు నావికుల యొక్కయు, అన్వేషకుల యొక్కయు ఉద్యమ ఫలితముగా మాతృదేశము కంటె విస్తీర్ణమున 23 రెట్లెక్కువగా గల వలస సామ్రాజ్యముపై ఈ దేశమున కాధిపత్యమబ్బినది ఫొనీషియనులు, కార్తజీనియనులు ఈ దేశమునందలి అతి ప్రాచీనవాసులు అనంతరము గ్రీకులు కూడ వచ్చి ఇచ్చట నివాస మేర్పరచుకొనిరి విజిగాత్తు లను అనాగరికులు క్రీ శ 400 సం॥ ప్రాంతములో ఈ దేశమును ముట్టడించిరి 700వ సం॥ ప్రాంతములో ఉత్తర ఆఫ్రికా యందలి మూర్స్ అను ముస్లిము తెగ వారు పోర్చుగల్లును జయించిరి క్రీ. శ 900వ ప్రాంతములో

వీరేకారణముననో బలహీనులు కాగా, క్రైస్తవులకును, వీరికిని యుద్ధములు ఘటిల్లెను ఈ యుద్ధములో క్రైస్తవులు విజేతలై పోర్చుగల్లులో ప్రభుత్వమును స్థాపించుకొనిరి వీరి పాలన క్రింద పోర్చుగల్లు ప్రాముఖ్యమును వహించి, సుభిక్షముగా వర్ధిల్లుచుండె నని చరిత్ర తెలుపుచున్నది

క్రీ శ 1867వ సం॥ అనంతరము రాజ్యమునకు వచ్చిన 'హెన్రీ ది నావిగేటర్' పోర్చుగల్లును బహుముఖముగా అభివృద్ధి పరచి, నావికులకు ప్రోత్సాహము నిచ్చుచు, నూతన దేశములను, నూతన మార్గములను పరిశోధించిన వారికి బహుమానము లీయసాగెను ఈ కాలముననే పోర్చుగీసు నావికులు భారత దేశమునకు సముద్ర మార్గమును కనిపెట్టుటకు సాహసోపేతమైన కృషి సల్పిరి ఈ కృషి ఫలితముగా 1489వ సం॥ లో వాస్కోడగామా అను సాహసిక నావికుడు భారత దేశమునకు సముద్ర మార్గమును కనిపెట్టెను

సాంప్రదాయికముగా ఈ దేశము బ్రిటనుకు మిత్రదేశము రాజకీయముగా, పోర్చుగల్లు వాస్తవమైన నియంతృత్వమును నెరపు దేశము ప్రతికూల శక్తులను ప్రభుత్వము నిర్దాక్షిణ్యముగ అణచివేయుచు వచ్చెను జాతీయ జీవనమునందలి పెక్కు వర్గములవారు కఠినమైన సైనిక శాసనముచే పరిపాలింప బడిరి దేశమందు నిరంకుశత్వము తాండవించు చుండెను

క్రీ శ 1143వ సం॥ లో ఒకటవ అల్ఫాన్సో ప్రభువు క్రింద స్వాతంత్ర్యమును సాధించు వరకు పోర్చుగల్లు స్పెయిను దేశములో అంతర్భాగముగా నుండెను క్రీ శ 1580 వరకు స్వతంత్రముగా నుండిన పోర్చుగల్లు, 1581లో స్పెయిను రాజగు రెండవ ఫిలిప్పు ఆధిపత్యమున స్పెయిను రాజ్యములో విలీనమయ్యెను కాని 1640లో పోర్చుగల్లు తిరుగుబాటొనర్చి నాల్గవ జాన్ ఆధిపత్యమున నొక నూతన రాజవంశమును స్థాపించెను కాని, ఐరోపాలో నొక ప్రముఖ రాజ్యముగా పోర్చుగల్లు ప్రకాశింప జాలకుండెను అయితే 1806లో యూరపు ఖండ మందలి సముద్రపు రేవులలోనికి బ్రిటిషు నౌకలను రానియ్యవల దని నెపోలియను శాసించిన ఆజ్ఞను పోర్చుగల్లు ఉల్లంఘించెను అందుచే ఫ్రెంచి సేనలు పోర్చుగల్లును ముట్టడించగా, 1811లో బ్రిటిష్, పోర్చుగీసు సైన్యములు కలిసి ఫ్రెంచి ముట్టడి సైన్యములను తరిమివైచెను.

వాస్కోడగామా భారత దేశమునకు సముద్ర మార్గమును కనిపెట్టుటయు, 1500వ సం॥ లో బ్రెజిల్ దేశము పోర్చుగీసువారి అధీనములోనికి వచ్చుటయు, అనంతరము పెక్కు వలస ప్రాంతములు ఆఫ్రికాయందు పోర్చుగీసువారి స్వాధీనమగుటయు కారణములుగా, పోర్చుగీసువారి వర్తక ప్రాబల్యము పెరిగినది కాని మూడవ జాన్ కాలమున ఈ వైభవము తగ్గనారంభించెను పోర్చుగల్లు నుండి పెక్కురు యూదులు తరిమివేయ బడగా, వారితోపాటు విశేషముగు వాణిజ్యముకూడ తరలి పోయినది అందుచే పోర్చుగీసువారనేకులు తమ ప్రభుత్వము నెలకొల్పిన విదేశ వలస ప్రాంతములలో నివసించుటకై వెడలిపోయిరి 1500వ సంవత్సరము తరువాత పోర్చుగీసు నావికులు కనుగొన్న పెక్కు ప్రదేశములను పోర్చుగీసు ప్రభుత్వము కోల్పోయినది క్రమముగా భారత దేశమున కూడ దాని ప్రాబల్యము సన్నగిల్లినది

1911వ సం॥ జూను 19వ తేదీన పోర్చుగల్లులో రాజరిక విధానము అంతమొందింప బడెను దాని స్థానములో ప్రజాసత్తాక రాజ్య సంవిధానము ప్రవేశపెట్ట బడెను ప్రథమ ప్రపంచ సంగ్రామము ప్రారంభ మగుటతోడనే, బ్రిటిష్ మైత్రి విషయమున పోర్చుగల్లు తన భక్తివిశ్వాసములను ప్రకటించెను పోర్చుగీసు సైన్యములు ఆఫ్రికా యందును, పశ్చిమ యుద్ధరంగ మందును బ్రిటను పక్షమున పోరు సల్పినది యుద్ధకాల మందును, యుద్ధానంతర మందును అంతరంగికముగా ఈ దేశమున రాజకీయ అస్థిరత్వము విశేషముగా ప్రబలుచుండెను

1926 మే 30వ తేదీన సైనిక నాయకత్వము క్రింద తలయెత్తిన తిరుగుబాటు ఫలితముగా, అధ్యక్షుడు ఫ్రోసి రాపై సైనిక నియంతృత్వము స్థాపింపబడెను అనంతరము 1928లో అర్థిక మంత్రిగా నియుక్తుడైన డాక్టరు ఆంటోనియో సాలజారు అనునాతడు 1932 నుండి ప్రధాన మంత్రిగాను, నియంతగాను వ్యవహరించుచు ప్రజాహిత సంస్థలకు ప్రతికూలు డయ్యెను పోర్చుగీసు వలస రాజ్యములలో అనులనందున్న తమ ప్రభుత్వ నిరంకుశ విధానము వెడల పోర్చుగల్లులో ప్రజాహిత సంస్థలు, మితవాద వర్గములు చేసిన తీవ్రాందోళనము ఫలితముగా నియంతయగు సాలజారు ఇటీవల పదవిచ్యుతుడు కావలసి వచ్చెను

పోర్చుగీసు సామ్రాజ్యాధికారులు జయించి తమ

అధీనమం దుంచుకొని యుండిన విదేశ వలస ప్రాంతముల వివరములు ఈ దిగువ పట్టికలో పేర్కొన బడినవి.

| | వైశాల్యము చ మైళ్లు | జనాభా (1950) |
|---|---|---|
| ఆఫ్రికా ఖండములో | | |
| 1 అంగోలా (పశ్చిమాఫ్రికా) | 4 87,788 | 41,45,184 |
| 2 కేప్ వెర్డీ దీవులు (పశ్చిమాఫ్రికా తీరమునకు సమీపమున) | 1 589 | 1 47 097 |
| 3 మొజాంబిక్ (తూర్పు ఆఫ్రికా) | 2,97 654 | 57,82,317 |
| 4 గినియాలో కొంత భాగము (పశ్చిమాఫ్రికా తీరప్రాంతము) | 13,944 | 5,08 970 |
| 5 సాటోమీ & ప్రిన్ సైప్ దీవులు (గినియా జలసంధివద్ద) | 372 | 62,159 |
| ఆసియా ఖండములో | | |
| 6 మకావో (దక్షిణ చైనా సముద్ర తీరమందలి దీవులు) | 5 | 1,87 772 |
| 7 గోవా, డయ్యు, డామన్ (భారత దేశములోనివి) | 1,588 | 6 37 846 |
| 8 టైమూర్ (మలే ఆర్చి పెలగో) | 7,330 | 4,42,378 |

ఈ వలస ప్రాంతములలో భారతదేశ మందలి గోవా, డయ్యు, డామన్ ప్రాంతము లందు పోర్చుగీసు ప్రభుత్వము విషమ పరిస్థితులను గల్పించుటచే, 1961 డిసెంబరులో స్వతంత్ర భారత ప్రభుత్వము పోలీసుచర్య జరిపి పోర్చుగీసు ప్రభుత్వమును కూలద్రోసి గోవా, డయ్యు, డామనులను వశము చేసికొన్నది ఇవి యిప్పుడు భారత దేశాంతర్భాగములై యున్నవి

ప్రభుత్వము, దేశరక్షణము 1933వ సంవత్సరపు రాజ్యాంగ విధానము ననుసరించి పోర్చుగల్లు 'కార్పొరేటు' ప్రజాసత్తాక రాజ్యమయ్యెను ప్రజామోదముచే 7 సంవత్సరముల గడువు వరకు దేశాధ్యక్షుడు పదవియం దుండునట్లి రాజ్యాంగ చట్టమునం దవకాశ మొసగబడెను 150 మంది సభ్యులు గల జాతీయ సమితి యొకటి 4 సంవత్సరముల గడువుతో ఎన్నుకొన బడును చట్టబద్ధమైన 'కార్పొరేట్ ఛేంబర్' అను సంస్థ ఆర్థిక, సాంఘిక వ్యవహారములను, శాసన సంబంధ విషయములను నిర్వహించును దాని సభ్యులు స్థానికసంస్థలకును, ప్రభుత్వ విషయక, నైతిక, సాంస్కృతిక, ఆర్థిక సంబంధములైన సంస్థలకును ప్రాతినిధ్యము వహించెదరు జాతీయ సమితియందలి మూడింట రెండు వంతుల మంది సభ్యులచే దేశాధ్యక్షుని 'వీటో' నిర్ణయములను త్రోసివేయుటకు సిద్ధాంతరీత్యా అవకాశ మేర్పరుప బడినది అధ్యక్షులు ప్రధానమంత్రిని నియోగించును, ప్రధాన మంత్రి తన మంత్రివర్గమును ఎన్నుకొనును కాని మంత్రి వర్గము జాతీయ సమితికి బాధ్యత వహింపదు

పోర్చుగల్లులో సైనిక శిక్షణము నిర్బంధముగు విషయము ప్రారంభ సైనిక శిక్షణ కాలపరిమితి 6 సంవత్సరములు కర్తవ్య నిర్వహణమున బాధ్యతగల వారినందరిని ప్రభుత్వము యుద్ధకలాపములకు పిలుపుదు 1951వ సం॥ లో పోర్చుగీసు సైనికుల మొత్తము సంఖ్య దాదాపు 64,000 వర కుండెను 1949 నాటికి విమానబల సంఖ్య 575 1952వ సం॥ లో నౌకాబలమునందు 5 డిస్ట్రాయరులు, 3 జలాంతర్గాములు, 8 స్లూపులు, అనేకములగు చిన్న నౌకలు చేరియున్నవి, మొత్తము నౌకాసిబ్బంది 7000 వరకుండెను

సాంఘిక, ఆర్థిక పరిస్థితులు పోర్చుగల్లులో నిర్బంధవిద్య 1911వ సం॥ లో ప్రవేశపెట్ట బడినది 1949-50 లో పనిచేయు చుండిన 10,364 ప్రాథమిక పాఠశాలలలో 6,21,069 బాలబాలికలు విద్య నభ్యసించు చుండిరి. 43 ఉన్నత పాఠశాలలలోని విద్యార్థుల సంఖ్య 20,085 పీరు కాక ప్రైవేటు ప్రాథమిక పాఠశాలలలో 58,602 విద్యార్థులును, ప్రైవేటు ఉన్నత పాఠశాలలలో 26,405 విద్యార్థులును చదువుకొను చుండిరి కాయింబ్రా, లిస్బన్, ఒపార్టో విశ్వవిద్యాలయములలో 9,614 మంది ఉన్నతవిద్య నభ్యసించుచున్నారు

పోర్చుగల్ కార్పొరేటు ప్రభుత్వ విధానమందు ప్రణాళికాబద్ధమైన ఆర్థిక వ్యవస్థ వ్యవహారములో కలదు అందులో ఉత్పత్తిచేయు ప్రతి సంస్థయు దేశసేమమును దృష్టియందుంచుకొని క్రమబద్ధముగా వ్యవహరించును వ్యవసాయ, పారిశ్రామిక, ఆర్థిక రంగములందు కార్పొరేటు సంస్థలు స్థాపింప బడినవి

పోర్చుగీసు ప్రజలలో 60 శాతము వ్యవసాయమే వృత్తిగా గలవా రున్నారు గోధుమ ప్రధానమైన పంట ఐనను, స్థానికావసరములకు కూడ అది చాలదు అందుచే ధాన్యమును దిగుమతి చేసికొనవలసి వచ్చు చున్నది ప్రపంచములో విశేషముగా ద్రాక్ష సారాయమును ఉత్పత్తి చేయు దేశములలో ఈ దేశ మొకటి ఆలివు నూనెను తయారుచేయు

దేశములలో ప్రపంచము నందు పోర్చుగల్ దేశము మూడవ స్థాన మాక్రమించు చున్నది

1948వ సంవత్సరములో ఆ దేశమునందు 10 లక్షల పశువులు, 40 లక్షల గొర్రెలు, 12 లక్షల పందులు ఉండి యుండెను 1949 లో ఆ దేశమందు 8,000 మెట్రిక్ టన్నుల ఉన్ని ఉత్పత్తి యయ్యెను పోర్చుగీసు పరిశ్రమలలో విశేష ముగా ఆ దేశీయుల ఉపయోగమునకు మాత్రమే వస్త్రోత్పత్తి జరగు చున్నది మొత్తము మీద ఎగుమతుల కంటె దిగుమ తుల మీదనే ఈ దేశము యొక్క ఆర్థిక జీవన మాధారపడి యున్నది ముఖ్యమైన ఎగుమతులలో బిరడాలు, నూలు వస్త్రములు, మద్యము, చేపలు పేర్కొన దగినవి ప్రధాన మగు దిగుమతులలో గోధుమలు, గోధుమపిండి, నౌకలు, పారిశ్రామిక యంత్రములు, ముడిప్రత్తి, ఇనుము, ఉక్కు చెప్పదగినవి

ఖనిజ సంపద పోర్చుగల్లులో ఖనిజ సంపద ఇంకను సంపూర్ణ వికాసము నొందలేదు కాని కొంతవరకు ఉల్ఫ్రామ్, బొగ్గు, ముడి ఇనుము, రాగి, మాంగనము, సీసము, తగరము, మరికొన్ని యితర లోహములు లభ్యము లగు చున్నవి

జాతీయ ఆర్థిక వ్యవస్థకు మత్స్యపరిశ్రమ కొంత మేరకు ఆధారభూతముగా నున్నది ఈ పరిశ్రమ యందు 1950వ సం॥ లో 40,060 మంది మనుష్యు లుండిరి 16,496 పడవలు పనిచేయు చుండెను

నైసర్గిక స్వరూపము, శీతోష్ణస్థితి 360 మైళ్ళ పొడవు, 140 మైళ్ళ వెడల్పు గల పోర్చుగల్ దేశమునందు పెక్కు చిన్న నదులు, మూడు పెద్ద నదులు ప్రవహించు చున్నవి ఈ పెద్ద నదులు స్పెయిను దేశములో పుట్టి అట్లాంటిక్ మహాసముద్రమున కలియుచున్నవి ఈ మూడు పెద్దనదులు పోర్చుగల్ దేశమును మూడు భౌగోళిక మండల ముల క్రింద విభజించి యున్నవి 400 మైళ్ళ వరకు అట్లాంటిక్ మహాసముద్రములో విస్తరించిన అజోర్స్ అను తొమ్మిది ద్వీపములు మూడు వర్గములుగా విభజింప బడినవి వీటి వైశాల్యము 888 చ మైళ్ళు అట్లాంటిక్ వైమానిక మార్గములలో అజోర్స్ ఒక ప్రముఖమైన స్థానము ద్వితీయ మహా సంగ్రామ సమయములో బ్రిటన్, అమెరికాలు రెండును ఇచ్చట విమాన స్థావరములు నిర్మించుకొని యుండెను

ఈ దేశపు శీతోష్ణస్థితి సమ ప్రకృతికముగను, సమ శీతోష్ణముగను ఉండును కాని అట్లాంటిక్ మహాసముద్రము నుండి వీచు చల్లని వాయువులను చొరనీయని పర్వతము లందలి లోతైన లోయలలో వేసవి కాలమునందు అత్యుష్ణ ముగ నుండును లిస్బన్, కాయింబ్రా, ఒపార్టో నగరములలో శీతోష్ణస్థితి 60 నుండి 61 5 డిగ్రీల నడుమ నుండును తీర ప్రాంతము పొడవున మిక్కుటముగా మంచు పట్టును సంవ త్సరమునకు వర్షపాతము 16 అడుగుల పరిమాణమున నుండును ఉత్తర ప్రాంతమందును, సెర్రాడా - ఎస్ట్రెల్లా అను తావునను వర్షపాతము గరిష్ఠ ప్రమాణములో నుండును

గ ల శా

## పోలినీషియా (భూ) •

వివరణ సౌలభ్యము కొరకు పసిఫిక్ దీవులు, వాటి పరిసర సముద్ర జలములు మేలనీషియా, మైక్రొనీషియా, పోలినీషియా అను మండలములుగా విభజింపబడి యున్నవి పెక్కు దీవులు గల పోలినీషియా మండలము ఒక బ్రహ్మాండ మయిన త్రిభుజాకారము వంటిది ఈ విశాల మండలము ఉత్తర దక్షిణములుగా 5000 మైళ్ళు, తూర్పు పడమరలుగా 4000 మైళ్ళు గలది ఈ మండలము ఉత్తరమున నున్న హావాయి ద్వీపములనుండి నైరృతియందున్న న్యూజీలెండు వరకు విస్తరించి యున్నది ఈ మండలమున మార్క్వెసస్, ట్యుమోటు, సొసైటి, సామో, టోంగా, కుక్ మున్నగు ద్వీపములు, ద్వీపసముదాయములు చేరియున్నవి పోలి నీషియా మున్నగు దీవులు (1) హావాయి, (2) తూర్పు పోలి నీషియా, (3) కేంద్ర, పశ్చిమ పోలినీషియా, (4) న్యూజీ లెండు పరిసర ద్వీపములు అను నాలుగు ప్రధాన ద్వీప సము దాయములుగా విభక్తమై యున్నవి

హావాయి ద్వీపసముదాయము సుదీర్ఘమయిన జలాంత ర్భాగ వేదికకు పైగా ఒక ఉన్నత స్థలము నాక్రమించి యున్నది ఈ ద్వీపములు నైరృతి - వాయవ్య దిశగా ఉత్తర మున 18°-40′ నుండి 28°-40′ వరకును, పశ్చిమ రేఖాంశ మున 154°-80′ నుండి 178°-40′ వరకును గల సమాంతర రేఖల నడుమ సుమారు 2000 మైళ్ళ వరకు వ్యాపించి యున్నవి

తూర్పు పోలినీషియా ద్వీపములు పోలినీషియా యొక్క ప్రాగ్దిశాంత కోణమునం దున్నవి ఇవి దక్షిణ

మున 7°-50′ నుండి 28° దక్షిణ అక్షాంశము వరకును, పశ్చిమ రేఖాంశమున 109°-20° నుండి 155° వరకు విస్తరించి యున్నవి

కేంద్ర, పశ్చిమ, పోలినీషియాలో వెరసి 224 దీవులున్నవి ఇవన్నియు పసిఫిక్ మహాసముద్ర మధ్యప్రాంతములో 2,000 చతురపు మైళ్ళ విస్తీర్ణము నాక్రమించి యున్నవి ఈ దీవులలో అధిక భాగము భూమధ్య రేఖకు దక్షిణముగను, 180వ మధ్యాహ్న రేఖకు తూర్పుగను ఉన్నవి

ఈ క్రింది మూడు పట్టికలలో పైన పేర్కొన బడిన (1) హవాయి, (2) తూర్పు పోలినీషియా, (3) కేంద్ర, పశ్చిమ పోలినీషియా ద్వీపములు, ద్వీప సముదాయముల పై శాల్యములు, జనసంఖ్య, వివరింప బడినవి

పట్టిక — 1

| | దీవులు | విస్తీర్ణము చ మైళ్ళలో | | జనసంఖ్య 1961-62 |
|---|---|---|---|---|
| 1 | హవాయి | 4021 | | 61,332 |
| 2 | మాయి | 728 | | 35,717 |
| 3 | మొలకాయ్ | 259 | | 5,023 |
| 4 | కహూలావి | 45 | | — |
| 5 | లానాయ్ | 141 | | 2,115 |
| 6 | ఓహు | 598 | | 500,409 |
| 7 | కాయే | 551 | | 27,922 |
| 8 | నైహో | 72 | | 254 |
| 9 | కౌలా | 120 | ఎకరములు | — |
| 10 | నిహో | 155 | ,, | — |
| 11 | నెకర్ | 40 | ,, | — |
| 12 | ఫ్రెంచిఫ్రైగేట్ (2) | 60 | ,, | — |
| 13 | గార్డెన్ పిన్నకిల్స (2) | 3 | ,, | — |
| 14 | లేసన్ | 1,000 | ,, | — |
| 15 | లిసియాన్స్కి | 450 | ,, | — |
| 16 | పెరల్ & హెర్మెస్‌రీఫ్ | 800 | ,, | — |
| 17 | మిడ్వే | 2,000 | ,, | 80 |
| 18 | క్యూరే | 300 | ,, | — |
| | మొత్తము | 6,348 చ మైళ్లు | | 63,2802 |

పట్టిక — 2

| | ద్వీపసముదాయము | దీవుల సంఖ్య | విస్తీర్ణము చ మైళ్ళలో | జన సంఖ్య 1961-62 |
|---|---|---|---|---|
| 1 | మార్క్వెసస్ | 10 | 492 | 4,837 |
| 2 | సొసైటీ | 14 | 636 | 68,245 |
| 3 | టూమోటు | 76 | 353 | 6,847 |
| 4 | ఆస్ట్రల్ | 5 | 58 | 4,091 |
| 5 | మాంగరేవా | 4 | 11 | 7,097 |
| 6 | రాపా | 1 | 15 | 380 |
| 7 | పిట్‌కెయిర్న్ | 4 | 18 25 | 128 |
| | మొత్తము | 114 | 3885 | 91,525 |

పట్టిక — 3

| | ద్వీపసముదాయము | దీవుల సంఖ్య | విస్తీర్ణము చ మైళ్ళలో | జన సంఖ్య 1961-62 |
|---|---|---|---|---|
| 1 | కుక్ | 15 | 98 7 | 18,378 |
| 2 | న్యూయి | 1 | 100 3 | 4,939 |
| 3 | టోకిలా | 3 | 4 0 | 1,960 |
| 4 | పశ్చిమసామో | 4 | 1,133 0 | 114,427 |
| 5 | నౌరూ | 1 | 8 2 | 4,849 |
| 6 | ఓషియన్‌దీవి | 1 | 2 3 | 2,504 |
| 7 | ఎల్లిస్ | 9 | 9 6 | 5,120 |
| 8 | ఈక్వెటోరియల్ | 13 | 277 0 | 1,455 |
| 9 | ఫోనిక్స్ | 8 | 11 1 | 1,133 |
| 10 | అమెరికన్‌సామో | 6 | 76 1 | 20,051 |
| 11 | టోంగా | 150 | 268 9 | 67,495 |
| 12 | వాలిస్ & ఫుటూనా | 3 | 106 0 | 8,380 |
| | మొత్తము | 224 | 2,100 2 | 250,811 |

పోలినీషియా లోని దక్షిణాగ్రభాగము, న్యూజిలెండుకు సంబంధించిన దీవులు (ఉత్తర, దక్షిణ, స్టీవర్ట్ & చాదమ్ దీవులు)—ఇవన్నియు దక్షిణ అక్షాంశమున 34°-30′ నుండి 47°-30′ వరకును, తూర్పురేఖాంశమున 166°-10′ నుండి 178°-20′ (దూరప్రాచ్యమున నున్న చాదమ్స్) వరకును విస్తరించి యున్నవి ఈ దీవులు ఆస్ట్రేలియాకు ఆగ్నేయ దిశనుండి తూర్పుగా 1200 మైళ్ళ దూరమునను, అంటార్క్-

టికాకు ఉత్తరముగా 1600 మైళ్ళ దూరమునను, చిలీ దేశమునకు పడమరగా 6000 మైళ్ళ దూరమునను, హవాయి దీవులకు వాయవ్యముగా 4000 మైళ్ళ దూరమునను కలవు ఈ ద్వీపముల భూవైశాల్యపు మొత్తము సుమారు 1,08,786 చదరపు మైళ్ళు 1961వ సం॥ నాటి జనసంఖ్య 24,14,954

హవాయి దీవులు కెప్టెన్ జేమ్స్ కుక్ అను వానిచే 1778వ సం॥ లో కనుగొనబడెను కాని 1800 సం॥ వరకు ఈ దీవులు ఉత్తర పసిఫిక్ మహాసముద్రములో వ్యాపారపు టోడలకు ప్రధానముగా స్థావరములుగ మాత్రమే ఉపయోగించినవి 19వ శతాబ్దిలో ఈ దీవులనుండి మంచి గంధపు చెక్క విదేశములకు ఎగుమతి చేయబడు చుండెను ఇచ్చట తిమింగిలముల వేట కూడ ఆ కాలములో జరిగెను 1898వ సం॥ లో హవాయి దీవులను అమెరికా సంయుక్త రాష్ట్రముల ప్రభుత్వము తన రాజ్యములో విలీన మొనర్చుకొనెను

ఫ్రెంచి ఓషియానియా దీవులు వేర్వేరు అన్వేషకులచే కనుగొన బడినవి 'సొసైటీ' దీవులు 1767వ సం॥ లో వాలిస్ అను వానిచేతను, మార్క్వెసస్ ద్వీప సముదాయము మెండనా అను వాని చేతను, టూమోటు ద్వీపసమూహము 1606 లో క్విరోస్ మున్నగు వారిచేతను కనుగొనబడినవి అల్లే, మాంగరేవా ద్వీపసముదాయము 1797 లో కెప్టెన్ జేమ్స్ విల్సన్ చేతను, ఆస్ట్రల్ ద్వీపములు 1777 లో కుక్ అను వానిచేతను కనిపెట్ట బడినవి ఈ ద్వీప సమూహము లన్నిటిని ఫ్రెంచి ప్రభుత్వము వరుసగా 1880, 1842, 1880, 1881, 1880వ సంవత్సరములలో తన రాజ్యమున కలుపుకొనెను

బ్రిటిష్ వలస ప్రాంత మగు పిట్ కెయిర్న్ దీవిని ప్రప్రథమమున "బౌంటీ" అను ఓడమీది తిరుగుబాటు దారులు 1790 లో ఆక్రమించు కొనిరి అప్పుడా దీవి నిర్మానుష్యముగ నుండెను 1722వ సం॥ లో 'ఈస్టర్' పండుగనాడు రాగ్‌వీన్ అను నాతడు ఈస్టర్ దీవిని కనుగొనెను 1888 నుండి ఈ దీవి చిలీ ప్రభుత్వపు ఏలుబడిలో నుండెను

పసిఫిక్ మహాసముద్ర మధ్యమందున్న దీవులకు అన్వేషణ మూలమున, నూతనావిష్కరణ మూలమున, వ్యాపారస్థులు, క్రైస్తవ మతబోధకులు, తిమింగిలపు వేటగాండ్రు-వీరి మూలమున, అంతర్జాతీయము లయిన పోటీల మూలమున, పాశ్చాత్యులతో సంబంధ మేర్పడినది ఈ సందర్భములో మాండనా, క్విరాస్, టాస్మన్, లెమెయిర్ మున్నగు వారు పేర్కొనదగుదురు

ఐక్యరాజ్యసమితి ప్రణాళిక ననుసరించి 'నౌరూ' అను ద్వీపముపై ఆస్ట్రేలియా, న్యూజిలెండ్, గ్రేట్ బ్రిటను రాజ్యములు ఉమ్మడి ధర్మకర్తృత్వమును నిర్వహించు చుండెను వాలిస్ ఫుటూనా దీవులు ఫ్రెంచి న్యూకాలిడోనియా రక్షణ క్రింద నుండెను ఎల్లిస్ ద్వీపములు, ఓషియన్ ద్వీపము, ఫోనిక్స్ ద్వీపములు (కాంటన్, ఎండర్‌బరీ దీవులు, బ్రిటన్, అమెరికాలు సంయుక్తముగ పాలించినవి) గ్రేట్ బ్రిటను యొక్క పశ్చిమ పసిఫిక్ హైకమీషనుచే పాలింప బడుచున్నవి వీటితోపాటు వాషింగ్టన్, ఫానింగ్ క్రిస్ట్‌మస్, మాల్డెన్, స్టార్‌బక్, వాస్టాక్, ఫ్లింట్, కారొలైన్ అను ద్వీపములు గూడ హైకమీషనరు పరిపాలనమందున్నవి న్యూయీ, టోకిలా దీవులు న్యూజిలెండు ప్రభుత్వము క్రింద సామంత రాజ్యములుగ నున్నవి 1961వ సంవత్సరము వరకు న్యూజిలెండు ప్రభుత్వము పశ్చిమ సామోవా ద్వీపముపై ధర్మకర్తృత్వాధికారము చలాయించు చుండెను ఆ తరువాత ఆ ద్వీపము సర్వస్వతంత్ర రాజ్య మయ్యెను అమెరికన్ సామోవాద్వీపము పైన, అమెరికన్ ఈక్వెటోరియల్ ద్వీపముల పైన అమెరికా ప్రభుత్వము ఆధిపత్యము వహించు చున్నది టోంగా ద్వీపము బ్రిటిష్ రక్షణ వ్యవస్థ క్రింద నున్న ఒక స్వతంత్ర రాజ్యము 1947వ సంవత్సరములో ఆరు పాలక ప్రభుత్వములచే స్థాపింప బడిన దక్షిణ పసిఫిక్ కమీషను ఈ ద్వీపములకు సంబంధించిన ఉమ్మడి సమస్యల నన్నిటిని పరిష్కరించుచు వ్యవహారము నెరపు చుండెను

1642వ సంవత్సరములో కెప్టెన్ టాస్మన్ అను డచ్చి జాతీయుడు న్యూజిలెండు దేశమందలి 'గోల్డెన్ అఖాతము' నొద్ద నున్న మహోన్నత మగు 'దక్షిణ ఆల్ప్స్'పై చూచాయగా దృష్టి సారించెను 127 సంవత్సరములు గడచిన పిదప జేమ్సుకుక్ అను అన్వేషకుడు 1769వ సం॥ లో ఆ దీవులను స్వయముగా దర్శించి, ఇతోధికమైన పరిశోధనముకు మార్గము నుగమ మొనర్చెను 1840వ సం॥ నుండి అచ్చట క్రమపద్ధతి ననుసరించి నిర్మాణాత్మకముగా వలసలు ప్రారంభింప బడినవి ఈ దీవులు బ్రిటిష్ వలస ప్రాంత మగుటతో, ప్లేసర్ గోల్డ్ అను నూతన ద్వీపము కనుగొన బడిన ఫలితముగా, వలసల నిర్మాణము 1860వ సం॥ నుండి అధికమైనది న్యూజిలెండు ప్రస్తుతము కామన్‌వెల్తు రాజ్యకూటమిలో ఒక సభ్యదేశమై, స్వతంత్ర ప్రతిపత్తి ననుభవించు చున్నది

న్యూజిలెండు దేశము తప్ప, తక్కిన పసిఫిక్ ద్వీపము లన్నియు భూగర్భ శాస్త్రజ్ఞులచే 'ఓషియానిక్' ద్వీపములుగా వర్గీకరింప బడినవి ఆ ప్రాంతమంతయు పగడపు సంపదకు నిలయమైన అగ్ని పర్వతమయ భూమిగా పేరు బడసినది అగ్ని పర్వత ప్రాంతస్థములగు ఈ ద్వీపముల నుండి పలు రకము లైన నిక్షేపములు త్రవ్వి తీయ బడినవి అందుచే అవి ఈనాడు క్రమముగా హీనస్థితికి దిగజారు చున్నవి భూగర్భములో జంతు కళేబరములను మరుగు పరచుచు, అవశేషములై యున్న సున్నపు రాయి, ద్రావణము నుండి స్రవించు రాసాయనిక అవక్షేపణము చేతను, అంగ నిర్మాణముల చేతను శిలారూపమున ఘనీభవించెను పొలినీషియాలో పగడ నిక్షేపములు పలు తావులలో అసంఖ్యాకములుగ కన్పట్టును అగ్ని పర్వత మయములైన చిన్నచిన్న దీవులలో భూగర్భమునందు ఒక విధమైన శిలాద్రవము ఘనరూపమున పొరలుగా ఏర్పడి, నడుమ నడుమ ప్రేలుడు లక్షణములు గల పెక్కు రసాయన ద్రవ్యములు గోచరించును ప్రాచీన స్ఫటిక శిలాఖండములు, రూపపరిణామము పొందిన పురాకల్ప ద్రవ్య విశేషములు న్యూజిలెండులో పెక్కు ప్రాంతములందు భూమిపై ఉద్భవించినవి అగ్నిపర్వత సంబంధములైన రాసాయనిక పదార్థములు అసంఖ్యాకములుగా తార్తీయయుగ మధ్యమున భూగర్భమునుండి వెలుపలికి పొంగి పొరలెను ప్రాచీన యుగములనాటి హిమానీ నదీజలముల యొక్కయు, తార్తీయ యుగసంబంధి నదీద్రవముల యొక్కయు నిక్షేపములు లోయల యందును, మైదానముల యందును గోచరించును

ఈనాటి పొలినీషియా దీవుల నైసర్గిక లక్షణములు ప్రధానముగా అగ్ని పర్వతములు రాపిడి చెందుట వలన ఏర్పడినవి ప్రవాహ జలమునకు తరంగములు తోడగుట వలన ఈ రాపిడి కలుగు చున్నది దీని ఫలితముగా సముద్ర మట్టముతో పోల్చి చూడగా, దీవుల యొక్క ఎత్తు పల్లము లలో మార్పులు సంభవించు చుండును

అగ్నిపర్వత మయములైన పెక్కు ద్వీపముల ఎత్తు 1000 అడుగులవర కున్నది హవాయి ద్వీప సముదాయములోనున్న మౌనాకీ అను దీవి 13,784 అడుగుల ఎత్తున నున్నది స్వల్ప విస్తీర్ణము కల పగడపు దీవులు తక్కువ ఎత్తులో నుండును న్యూజిలెండు నందలి దక్షిణ ఆల్ప్స పర్వతములపై 10,000 అడుగుల ఎత్తుగల శిఖరములు 17 కలవు ఈ పర్వతములు ఉత్తర ద్వీపములోనికి విస్తరించినవి కేంద్ర పర్వత శ్రేణులనుండి నదులు అర్ధ వ్యాసాకారములో ప్రవహించు చుండును వైకాటో అను మండలము, ఉత్తర భాగము నందలి థేమ్సు నిమ్నప్రాంతము, దక్షిణ ప్రాంత మందలి కాంటర్బరీ, వైమియా మైదానములు – ఇవి ప్రముఖములైన నిమ్నప్రాంతములు

న్యూజిలెండుకు పరిసర మందున్న దీవులు తప్ప, తక్కిన దీవుల యొక్క శీతోష్ణస్థితి ముఖ్యముగా ఉష్ణప్రధానముగా నుండును హవాయిలో సగటు శీతోష్ణస్థితి 72 డిగ్రీలు సంవత్సరములో అది 5 నుండి 8 డిగ్రీల వరకు హెచ్చుచు తగ్గుచుండును కాని ఎత్తునకు పోయిన కొలది శీతోష్ణ గతులలో తగ్గుదల కన్పట్టును 4000 పైళ్ళ ఎత్తునకు పైన సర్వసాధారణముగా గడ్డకట్టిన మంచు కన్పట్టును ఈ దీవుల కభిముఖముగా గాలివీచు దిశయందు వర్షములు సమృద్ధిగా కురియును ఈ దిశయందు గల పర్వత పార్శ్వములపై ఇంకను అధికముగా వర్ష పాతము ఘటిల్లును 'వయపిలికాయై' అను అగ్రముపై (5075 అడుగుల ఎత్తు) సంవత్సరమునకు సుమారు 460 అంగుళముల వర్షము కురియుగా, దానికి మరుగున నున్న ప్రాంతముపై 20 అంగుళముల వర్షము మాత్రమే కురియును

ఫ్రెంచి ఓషియానియాలో ఉష్ణోగ్రతను అదుపులో నుంచుట యందు శీతోష్ణ స్థితియందలి వ్యాపార పవనములు ప్రముఖ పాత్రను వహించు చున్నవి ఈ ఉష్ణోగ్రత 75-80 డిగ్రీల నడుమ సమాన స్థాయిలో నుండును కొన్ని దీవులపై వర్షపాతము ఏటేటా గొప్ప మార్పులకు లోనగుచుండును ఉష్ణ ప్రధాన లక్షణము గల తుపానులు ఇండ్లను, ద్వారములను, చెట్లు చేమలను పెల్లగించును ఈస్టర్ అను క్రైస్తవ పర్వదిన సందర్భములో వాతావరణము చల్లగను శీతోష్ణస్థితి 60-70 డిగ్రీల మధ్యను ఉండును వర్షపాతము సగటున 54 అంగుళము లుండును పసిఫిక్ సముద్ర మధ్యభాగములో శీతోష్ణస్థితి అల్పోష్ణముగను, ఒకే తీరుగను ఉండును కాని వర్ష పాతము ఎత్తు ననుసరించి అల్పస్థాయి నుండి మధ్యమ, ఉన్నత స్థాయిల వరకు భేదించు చుండును న్యూజిలెండు శీతోష్ణస్థితి సముద్ర జలప్రభావముచే చల్లగ నుండును సంవత్సరము పొడవున తుపానుతో కూడిన వర్షపాతము సమముగ నుండును శీతాకాలములో అది అల్పగరిష్ఠ స్థాయిలో

నుండును మరగుపడి యున్న దక్షిణ ఆల్ప్స్ యొక్క తూర్పు భాగములో కొన్ని తావులందు సంవత్సరమునకు 15 అంగుళముల వర్షము మాత్రమే కురియుచున్నది శీతోష్ణ ప్రమాణములు 40, 65 డిగ్రీల నడుమ సగటు స్థితిలో నుండును ఉత్తరద్వీపము అల్పోష్ణముగ నుండగా, దక్షిణ ద్వీపములో పెక్కు దినములు హిమము ఘనీభవించును మంచు కూడ కురియు చుండును

పాలినీషియా దీవులు తుదిసారిగా మానవునిచే ఆక్ర మించబడిన, వాసయోగ్యములగు భూములు ఈ తూర్పు పసిఫిక్ ద్వీపవాసుల యొక్క ప్రాచీన పంక్త్యులు మలేజాతిని పోలినవారితో కలిసి జీవించి యుండిరని ఊహింప బడు చున్నది మలేజాతిని పోలిన వీరు బోర్నియో నుండి కాని లేక సెలిబిస్ నుండిగాని పశ్చిమ పాలినీషియాలోనికి తరలి పోయిరట మొట్టమొదటి పాలినీషియా బృందము దక్షిణ అమెరికా ఖండము వైపు పోవుచుండగా, అచ్చట వలస లేర్పరచుకొనిన వారితో ఈ బృందమునకు సంపర్కము కలిగి యుండవచ్చును ఆ కారణమున, వారి శరీర నిర్మాణము నందు ప్రముఖములైన లక్షణము లేర్పడెను కాని వారి పుట్టు పూర్వోత్తరములు, వారి ప్రయాణకాలము, వారి ప్రాచీ నులను గురించిన విషయములపై శాస్త్రవేత్తల నడుమ అభి ప్రాయభేదములు గలవు పాలినీషియనులు ఆసియానుండి వెడలిరనియు, అస్సాముననందలి నాగులకును, పాలినీషియను లకును నడుమ ఆచార వ్యవహారములలో పోలికలు కలవనియు, శాస్త్రజ్ఞులలో అత్యధికులు ఏకాభిప్రాయమును ప్రకటించిరి ఈనాడు వీరు హవాయి నుండి న్యూజీలెండు వరకు గల విశాల సముద్రప్రాంతము లోను, ఎల్లిస్ నుండి ఈస్టరు వరకు గల వందలాది దీవులయందును విస్తరించి యున్నారు పాలి నీషియనులు గోధుమ వర్ణము కలిగి ఉందురు దీర్ఘకాయు లగు వారి శిరోజములు నల్లగ నుండును వీరు వంశ పారం పర్యముగ తాత, తండ్రుల వరుసలో తమ తెగ నాయకుల పాలనము క్రింద జీవింతురు వీరు పరాక్రమోపేతులై, యుద్ధ శూరులై, చరిత్రయందు సాహస కార్యములను ఆచరించిన వారు వీరు పరదేశ సంపర్కముచే ప్రభావితులగుటకు ఇచ్ఛ గించువారు

పాలినీషియనుల మతము సామాన్యమైన సర్వసజీవత్వ వాదము ఈ మతము పౌరాణిక గాథామయమై, జానపద వాఙ్మయ ప్రధానముగ నుండును వారి భాష మలయానియా వాగ్భాషా కుటుంబమునకు చెందినది వారి భాషయందు వైయక్తికమైన వివిధ మాండలికములు చేరియున్నవి

పాలినీషియా వర్గములో (1) సామో (2) మయోరీ (3) టాహిటియన్ (4) హవాయిన్ (5) టోంగన్ (6) మాంగ రేవన్ (7) మార్క్వెసన్ ద్వీపవాసులగు నూకుహివనులు అను ఉపవర్గములు గలవు



పాలినీషియనులు ఉన్నతమైన సాంస్కృతిక స్థాయి గల్గినవారు శిలాయుగము నందలి మరి ఏ ఇతర జాతియు, ఆ స్థాయి నందుకొని యుండలేదు టోంగనుల కాలమునాటి సోపాన శిలావేదికలు, టాహిటునుల నాటి దేవాలయములు, ప్రపంచ నాగరక ప్రజల ప్రశంసల నందికొనినవి పాలినీషి యనులు ఒక్కగది మాత్రమే గల నిరాడంబరమైన పూరి గృహమందు కాపురము చేయుచు, ప్రధానమైన మత్స్యా హారముతో పాటు, చిలగడము, నారికేళములు, మున్నగు ఉపాహారములను భుజించు చుండెడివారు కుక్కలు, పందులు, కోళ్లు మున్నగు పెంపుడు జంతువులు వారిచే పోషింప బడు చుండెడివి వారి వస్త్రములు చెట్ల బెరడు నుండియు ఆకుల నుండియు తయారగు నార పోగులతో నేయ బడెడివి వారు లోహ, మృణ్మయ పాత్రల నెరుగరు కాని చేపలను పట్టుకొను లోహ సంబంధములగు కొక్కెములను విరివిగా వాడినట్లు తెలియుచున్నది మృణ్మయ పాత్రలకు బదులుగా వారు కొబ్బరి కాయ చిప్పలను, గుమ్మడికాయ డిప్పలను ఉపయోగించెడి వారు వారు సముద్రముపై విహారము సల్పుటలో నేర్పరులు పసిఫిక్ మహాసముద్రముపై ప్రయాణము సల్పుచు దక్షిణముగా న్యూజీలెండు వరకు అచ్చటచ్చట గల దీవులలో వారు వలసలు స్థాపించుకొని స్థిరనివాసముల నేర్పరచు కొనిరి

యూరపియనుల సంపర్కముతో, పాలినీషియనుల స్వీయ సంస్కృతికి అంతరాయ మేర్పడినది ఆ తరువాతి సంధికాలములో వారు పెక్కు చిక్కుల ననుభవించి ఇప్పు డిప్పుడే హవాయి, న్యూజీలెండు, రారొటోంగా ప్రాంతము లలో పాశ్చాత్య సంప్రదాయానుకూలురుగా పరిణామము చెందుచున్నారు

పాలినీషియా దీవులలో అధిక భాగము ఉష్ణప్రధానమైన వాతావరణము కలిగియున్నది ఇందు ప్రధానముగా అల్ప అక్షాంశ సంబంధములైన ఆహారపు పంటలు పండు చుండును,

హవాయి దీవులలో వ్యవసాయము విశేషముగా యాంత్రిక మొనర్చబడి, వ్యాపారమునకు ఉపయోగపడు పదార్థములు కూడ పండింపబడు చున్నవి 1960వ సంవత్సరములో 24, 61, 454 ఎకరముల భూమియందు 6242 వ్యవసాయ క్షేత్రములు పని చేయుచుండెను ఈ దీవులలో చెరకు, అనాస ప్రధానము లగు పంటలు కాఫీ, అరటి, పుష్ప వృక్షములు గూడ పెంచబడు చున్నవి మొత్తము వ్యవసాయోత్పత్తిలో 86 శాతము చెరకు, అనాస ఫలముల వ్యాపారము జరగు చున్నది అటవీ సంపద వలన, చేపలు పట్టుట వలన, వ్యవసాయోత్పత్తుల నుండి పెక్కు రూపములలో నిలవ పదార్థములను తయారు చేసికొనుటవలన ఈ దీవుల యందలి ప్రజలు జీవించు చున్నారు రవాణా సౌకర్యములు చాలినన్ని కలవు అమెరికా, కెనడా, ఆస్ట్రేలియా, ఫిలిప్పైనులు, చైనా, జపాను దేశములకును ఈ దీవులకును నడుమ పెక్కు నౌకా రవాణా సంబంధములు గలవు దీవికిని, దీవికిని నడుమ చిన్న చిన్న నావలు, నాటుపడవలు ప్రయాణము చేయుచుండును 1962 లెక్కల ప్రకారము 2975 మైళ్ల నిడివిగల రహదారులు, 2,61,874 రవాణా మోటారు బండ్లును కలవు రాజధాని యగు హానొలులు (294194) నుండి అమెరికా ఖండము వరకు, ముఖ్యమైన పెక్కు విమాన మార్గము లున్నవి

ఫ్రెంచి ఓషియానియాలో ఫాస్ఫేటులు, కొబ్బరి, కాఫీ ఉత్పత్తియై ఎగుమతి చేయ బడు చున్నవి లోహ వస్తువులు, వస్త్రములు, పెట్రోలు, పంచదార, పిండి దినుసులు దిగుమతి చేసికొన బడుచున్నవి ఎగుమతు లన్నిటి వలన లభించు ఆదాయము ఒక్క విదేశ యాత్రికుల వలననే సంక్రమించు చున్నది తూర్పు దిక్కున నున్న ద్వీపములో అరటి, చిలగడము, చెరకు మున్నగు పంట భూములతో పాటుగా పశువులు, గొర్రెలు, గుఱ్ఱములు మేయు పచ్చిక మైదానములు గలవు కేంద్ర పశ్చిమ పొలినీషియా దీవులలో కొబ్బరి వృక్షములు ప్రధానములైనవి నౌరూ, ఓషియన్ దీవులనుండి ఫాస్ఫేటులు, లోంగా దీవినుండి కొలది ప్రమాణములో అరటికాయలు ఎగుమతి చేయబడు చున్నవి కుక్ దీవులలో దబ్బపండ్లు, పశ్చిమ సోమో ద్వీపములలో కోకో, అరటికాయలు, విశేషముగా పండింపబడు చున్నవి ఈ ప్రాంతములో రవాణా సమస్య క్లిష్టమైనది సంవత్సర మంతటిలో ఓడ ప్రయాణములు నిర్ణిత కాలములలో అరుదుగ మాత్రమే జరగు చుండును ఒక విమాన మార్గము న్యూజిలెండు నందలి ఆక్లెండును, కుక్ ద్వీపముతో కలుపు చున్నది టాహిటీ ద్వీపముపై పాపటీ అను నొక రేవుస్థలము కలదు 1941 నుండి అచ్చటనుండి సముద్రముపై క్రమబద్ధమైన రవాణా మార్గములు ఏర్పడి యున్నవి దీవులకు, ద్వీప సముదాయములకు మధ్య రకములైన పడవలు ప్రజలను, సరకులను మోసికొని పోవుచుండును

ఆర్ వ రె

## పోలెండు దేశము (చ)

యుగముల పర్యంతము దండయాత్రలకును, విభజనమునకును గురియైన పోలెండు విషయమై, ద్వితీయ ప్రపంచ సంగ్రామ రూపమున చరిత్ర పునరావృత్త మగుచుండు నను అంశము అన్వర్థ మయ్యెను పై కారణముచే, పోలెండు విస్తీర్ణము కాలిఫోర్నియా న్యూమెక్సికో నగరముల నడుమ నున్న వైశాల్యమునకు సమానముగా కుంచింపబడెను ఈ దేశపు జనాభా కూడ 1,10,000 వరకు కోతపడెను జర్మనుల క్రూర దురాక్రమణము, భయంకరమగు కరవు కాటకములు, యుద్ధానంతర అస్థిరత్వము — ఈ సమష్టి ఫలితములు కారణములుగా పోలెండు ప్రజల నైతిక, మనఃస్థైర్యములు సడలెను ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరము పోలెండు, కమ్యూనిస్టు పరిపాలనము క్రిందికి వచ్చెను ఆర్థిక, సాంఘిక పునర్నిర్మాణ కార్యక్రమము నిబ్బరముగా కొనసాగ నారంభించెను పోలెండు నూతన నాయకత్వము సోవియట్ రష్యా ప్రభుత్వ విధానములను దాదాపుగా అనుసరించుచు వ్యవహరించు చుండెను

పదవ శతాబ్ద్యంతమునకు పూర్వము ఈ దేశ చరిత్రను గూర్చి ఇదమిత్థమని తెలిసిన విషయము తక్కువ పదునొకండవ శతాబ్ది తొలుదొల్త మొదటి బొలిస్‌లాస్ అను పోలెండు రాజు బొహీమియా, సాక్సనీ, మొరేవియాలపై ప్రభుత్వము నెరపెను క్రీ శ 1241 లోను, 1259 లోను ఘటిల్లిన మంగోలు దండయాత్రలు తరిమికొట్ట బడినను, శత్రువులు జరపిన విధ్వంసకాండకు దేశము గురియయ్యెను ఇంతలో 'ట్యూటానిక్ నైట్స్' అను నొక తెగవారు ప్రష్యాలో నొక రాజ్యమును నిర్మింప దొడగిరి అందులో పోలెండు నందలి కొంత భాగము కూడ చేరియుండెను పోలెండువారు బాల్టిక్ సముద్రమును చేరు మార్గమునకి నూతనరాజ్య మొక ఆటంకముగ పరిణమించెను 1410వ సం॥లో టానెన్

బర్గ్ వద్ద ట్యూటానిక్ నైట్స్ ఓడింపబడిన ఫలితముగా ఘటిల్లిన 'పీస్ ఆఫ్ థారన్' అనుసంధి (1466) ననుసరించి, పోలెండునకు బాల్టిక్ తీరప్రాంతము మరల లభ్యమయ్యెను

15, 16వ శతాబ్దుల నడుమ పోలెండు ప్రాభవము అత్యున్నత దశయం దుండెను 17వ శతాబ్దిలో హీనస్థితి యందుండిన కులీనుల ప్రాభవములో నిరంతరాభివృద్ధి సంలక్షిత మయ్యెను దాని కనుగుణముగ ప్రభుత్వ బలము క్షీణింప దొడగెను కాని పోలెండు ప్రభుత్వము 1572లో ఎన్నికల మూలమున రాజ్యమునకు వచ్చెను అనంతరము రష్యనుల పైన, టర్కుల పైన పోలెండు ప్రభుత్వము పెక్కు విజయములను సాధించెను పోలెండులో బలమైన కేంద్ర ప్రభుత్వము నెలకొన కుండుటచే, క్రమముగా నేర్పడిన క్షీణదశను ఈ విజయములు సహితము అరికట్ట జాల కుండెను అందుచే రష్యా, ప్రష్యా, ఆస్ట్రియా ప్రభుత్వములు ఈ దేశమును మూడు పర్యాయములు (1772, 1793, 1795-96 సంవత్సరములలో) తమలో తాము పంచుకొన గల్గిరి అటు పిమ్మట ఒక శతాబ్ది వరకు పోలెండు రాజ్యపు అస్తిత్వమునకే భంగము వాటిల్లెను కాని పోలెండు ప్రజలు తమ స్వాతంత్ర్యమును మరల సంపాదించుకొను యత్నమును మాత్రము విరమింప లేదు ప్రథమ ప్రపంచ యుద్ధములో, దురదృష్ట వశమున, వారు ఉభయుల పక్షముననూ పోరాడ వలసి వచ్చెను

పోలెండు స్వాతంత్ర్యము లాంఛన ప్రాయముగా 1918 సం॥ లో ప్రకటింప బడగా, మార్షల్ పిల్‌సుడ్స్కి అను నాతడు అధ్యక్షుడుగా నియమితు డయ్యెను 1920లో పోలెండుపై రష్యా దాడి సల్పగా, ఫ్రెంచివారి సాయముతో పోలెండు దేశీయులు 1926లో ఆ దండయాత్రను తుదముట్టించిరి వెంటనే పిల్సుడ్స్కి, ప్రభుత్వమును సంపూర్ణముగా స్వాధీన పరచుకొని, 1935 మే నెలలో ఘటిల్లిన తన మరణము వరకు దేశమును నిరంకుశముగా పరిపాలించెను

1934లో పోలెండుతో చేసికొనిన నిరాక్రమణ సంధిని ఉల్లంఘించి, 1939 సెప్టెంబరులో జర్మను నియంత హిట్లరు పోలెండుపై దండయాత్రకు వెడలెను ఇంతలో తూర్పు నుండి రష్యను సేనలు పోలెండును ముట్టడించెను అదే సంవత్సరము సెప్టెంబరు 28వ తేదీన జర్మను, రష్యా ప్రభుత్వము లొక ఒడంబడికను చేసికొని, దాని ననుసరించి పోలెండులో కొంత భాగమును ఇరువురు తాత్కాలికముగ ఆక్రమించిరి యుద్ధములో ఫ్రెంచివారి ఓటమి అనంతరము పోలెండు ప్రభుత్వము, ఇంగ్లండులో ప్రవాసమం దుండెను

ఇట్లుండగా, 1941 జూను నెలలో జర్మను నాజీ ప్రభుత్వము సోవియట్ రష్యాపై ఆకస్మికముగా దాడిసల్పిన పిదప, పోలెండంతయు జర్మనీచే ఆక్రమింపబడెను 1941 జులై నెలలో పోలెండు రష్యాలో ఒక ఒప్పందమును కుదుర్చుకొనెను దాని ననుసరించి, 1939వ సం॥ నకు పూర్వము జర్మను సోవియట్ ప్రభుత్వముల మధ్య చేసికొనబడిన ఒడంబడిక లన్నియు రద్దయి పోయెను కాని చట్టబద్ధమైన పోలెండు ప్రభుత్వమునకు రష్యనులలో శీఘ్రముగనే వివాదము ఘటిల్లెను 1944 జులై నెలలో కమ్యూనిస్టు ప్రాబల్యము గల పోలెండు జాతీయవిముక్తి సంఘటనా సంస్థను రష్యా ప్రభుత్వము గుర్తించెను పోలెండు నందలి లుబ్లిన్ పట్టణము విముక్తమైన పిదప ఈ విముక్తి సంఘటనా సంస్థ ఆ పట్టణమునకు తరలి, 1944 డిసెంబరులో తాత్కాలిక పోలెండు ప్రభుత్వముగా తాను ప్రకటించు కొనెను దాదాపు ఆరుమాసములుగా జరగిన రాయబారముల అనంతరము 1945 జూను నెలలో జాతీయ సమైక్య పోలెండు ప్రభుత్వమును ఏర్పరచు తలంపుతో లండను నగరము నందలి పోలెండు ప్రవాస ప్రభుత్వ సభ్యులు కొందరు లుబ్లిన్ ప్రభుత్వములో భాగస్వాములైరి 1945 జులై నెలలో బ్రిటన్, అమెరికాలు రెండును ఈ ప్రభుత్వమును గుర్తించి, పూర్వపు ప్రవాస పోలిష్ ప్రభుత్వపు గుర్తింపును రద్దు గావించుకొనెను

1945 ఆగస్టు నెలలో బ్రిటిష్ ప్రధాని, రష్యా ప్రధాని, అమెరికా అధ్యక్షుడు బెర్లిన్ నగరమున సమావేశమై, ఓడర్, నిస్సినదుల పొడవున తాత్కాలికమైన పోలెండు పశ్చిమ సరిహద్దును నిర్ణయించిరి ఆ నెలయందే సోవియట్ పోలెండు సరిహద్దును నిర్ణయించుచు ఇరు దేశములు ఒడంబడిక పత్రముపై సంతకములు కావించు కొనెను ఈ ఒడంబడికను బట్టి పోలెండు తూర్పు సరిహద్దు పశ్చిమదిశకు జరుపబడవలసి వచ్చెను ఈ విధముగా తూర్పున పోలెండు 1,07,72,000 మంది ప్రజలు నివసించు 69,860 చ మైళ్ల ప్రదేశమును కోల్పోయెను పశ్చిమమున పోలెండునకు, యుద్ధాత్పూర్వమందుండిన 86,21,000 మంది జనసంఖ్య గల 38,986 చ మైళ్ల ప్రాంతము సంక్రమించెను

1947 జనవరిలో జరగిన ఎన్నికలలో కమ్యూనిస్టు రిపబ్లికు ప్రభుత్వమునకు సమగ్రమైన విజయము చేకూరెను ఈ విజయము వలన, ప్రతికూల వర్గమునకు ప్రజాతంత్ర రాజకీయ కలాపములను స్వేచ్ఛగా కొనసాగించుటకు అవకాశములు సన్నగిల్లెను నూతన ప్రభుత్వమునకు సుస్థిరత చేకూరెను

ప్రభుత్వము - రక్షణము 1952వ సంవత్సరపు రాజ్యాంగ సంవిధానమునకు రష్యా రాజ్యాంగ చట్టము మూలకందము "సీమ్" అను పార్లమెంటుసభ రాజ్యాధికారమునకు సర్వోన్నతాంగముగ వ్యవహరించును అందు 425 మంది సభ్యులుందురు వీరు 18 సంవత్సరముల వయస్సునకు పైబడిన పౌరు లందరిచే నాల్గు సంవత్సరముల కొకసారి ఎన్నుకొనబడెదరు ఈ పార్లమెంటు ("సీమ్") రాజ్యాంగ పరిషత్తును ఎన్నుకొనును పార్లమెంటు సమావేశము కాని సమయమున, దాని స్థానములో ఈ పరిషత్తు వ్యవహరించును ఈ పార్లమెంటు మంత్రి మండలిని కూడ ఎన్నుకొనును మంత్రి మండలికి నాయకుడు ప్రధాని రాజ్యాంగ పరిషత్తు సర్వోన్నత కార్య నిర్వహణ పరిపాలనాంగముగా వ్యవహరించును

1952లో పోలెండు సైనికసంఖ్య దాదాపు 6 లక్షలు అందులో దేశభద్రతకును, సరిహద్దుల రక్షణమునకును చెందిన సేనలు చేరియున్నవి నౌకాబలములో 2 డిస్ట్రాయర్లు, 4 జలాంతర్గాములు, మందుగని నిర్మూలన యంత్రములు, తీర ప్రయాణము చేయు నావికాదళములును గలవు

గ. ల. శా.

## పోలెండు దేశము - (భూ)

పోలెండు ఐరోపా యందలి ప్రాచీనమయిన ఒక రాజ్యము ప్రథమ ప్రపంచ సంగ్రామానంతరము ఈ రాజ్యమొక ప్రజాస్వామికముగా అవతరించెను నూతనముగా ఆవిర్భవించిన పోలెండు దేశము జర్మనీకిని, రష్యాకును నడుమ నున్నది ఈ దేశమున పెక్కు జాతులు గల 3 కోట్ల 50 లక్షల మంది ప్రజలు నివసించు చున్నారు దీని విస్తీర్ణము 1 లక్ష 50 వేల చ మైళ్లు రెండవ ప్రపంచ యుద్ధములో జర్మనీ, రష్యాల నడుమ విభక్తమయిన పిదప పోలెండు, కమ్యూనిస్టు రిపబ్లికుగా పరివర్తన మొందెను ఈ దేశము ఉత్తర ఐరోపా మైదానములో ఆల్ప్సు పర్వత శ్రేణులకును, బాల్టిక్ సముద్రమునకును మధ్య నున్నది ఈ దేశమునకు తూర్పున సోవియట్ రష్యా, పడమట జర్మనీ దేశమును గలవు పోలెండు దేశము చదునుగా నుండును నదులు, సరస్సులు, అరణ్యములు తప్ప, ఎట్టి భౌతికావరోధములును అందు కానరావు. అందుచే కొందరు జర్మనులు పూర్వము స్వేచ్ఛగా తూర్పునకు జరిగి, పోలెండులో స్థిరపడిపోయిరి అట్లే పోలుజాతి వారును తూర్పునకు పయనించి రష్యాలో స్థిరముగా నిలిచి పోయిరి అవరోధ రహితమై, మైదానమయమైన పోలెండు దేశము దండయాత్రలకు గురియయ్యెను ఆధునిక యుగములో దాని ఉనికికి ప్రమాదమేర్పడినది ప్రాక్పశ్చిమములయందు బలీయ రాజ్యములైన రష్యా, జర్మనీల దయాదాక్షిణ్యములపై ఈ దేశ మాధారపడవలసి వచ్చినది

పోలెండు పాక్షికముగనే అభివృద్ధి చెందిన దేశము అయినను ఆర్థికముగ ఆ దేశము మంచి స్థితియందే యున్నది నష్టపడిన ప్రాంతమును, నశించిన ప్రజలును పోగా, ఇప్పుడా దేశపు వైశాల్యము 1,21,131 చ మైళ్ళు, అందలి జనసంఖ్య 2 కోట్ల 40 లక్షలు అచ్చటి సగటు జనసాంద్రత చ మైలునకు 206 మంది చ మైలునకు 250 మందికి పైగా జనసాంద్రత గల భూఖండము, సైలీషియా బొగ్గుగని ప్రాంతమందును, ఎగువ విస్తులా, 'సా' నదీ లోయలకు చెందిన కార్పేథియన్ అగ్రభాగమునందును విస్తరించి యున్నది రోక్లా నగర పరిసరగు లందును, బొగ్గుగనులు, పారిశ్రామిక కర్మాగారములు విస్తరించిన మండలము లందును, జనసమ్మర్దము విశేషముగ నున్నది జనసమ్మర్దము అధికముగ నున్న ఇతర ప్రాంతములు జెస్టోకోవా, లుబ్లిన్, వార్సా, పోజ్నన్, బిడ్గాజ్, జీషియా, డాన్స్క అను నగర పరిసరములందు కలవు వార్సా, లాడ్జ్ నగరములలో ఒక్కొక్కదానియందు 6 లక్షలకు మించిన జనసంఖ్య కలదు మొత్తము 12 నగరములలో ఒక్కొక్కదాని జనాభా ఒక లక్ష వరకు కలదు

పోలెండులో ఇప్పుడు నివసించుచున్న జనులందరు దాదాపు పోలెండు జాతీయులే. కొలది సంఖ్యలో బాల్టిక్ జాతులు, శ్వేత రష్యనులు, ఉక్రేనియనులు, చెక్ జాతీయులు మైనారిటీ వర్గములుగా అక్కడక్కడ జీవించు చున్నారు వృద్ధులు, పిన్న వయస్కులు అధిక సంఖ్యలో

నుండుట ఈ దేశ మండలి ప్రత్యేక లక్షణము 25-45 సంవత్సరముల నడి వయస్సువారు తక్కిన వారికంటె తక్కువ సంఖ్యలో నున్నారు. రెండవ ప్రపంచ యుద్ధకాలమునను, అనంతరమును ఘటిల్లిన విషయము వలన ఈ స్థితి సంభవించెను పాఠశాలలయందు, విశ్వవిద్యాలయములయందు రష్యా భాష నేర్పబడుచున్నను, మొత్తము మీద దేశములో ఒక్క పోలిష్ భాషయే మాటలాడ బడు చున్నది

1940వ సంవత్సరమునకు పూర్వము ఈ దేశము ప్రధానముగా వ్యవసాయముపై ఆధారపడి యుండెడిది కాని 1960లో జనాభాయందు 38 2 శాతము మాత్రమే వ్యవసాయము వలన జీవించు చుండిరి పోలెండు ఆర్థిక వ్యవస్థ ఇప్పుడు సంపూర్ణముగా మారినది భారీ పరిశ్రమలు జాతీయము చేయబడుటయో, లేక ప్రభుత్వ స్వాధీనమున నుండుటయో సంభవించినది అన్ని పారిశ్రామిక శాఖలందు ప్రణాళికాబద్ధమగు ఆర్థిక విధానము ప్రవేశ పెట్టబడినది ఈనాటి పోలెండు భూభాగములో, సగమునకు పైగా వ్యవసాయోపయుక్తముగ నున్నది మైదానములు, పచ్చిక బయళ్ళ వైశాల్యము పదవ వంతును, అరణ్యముల వైశాల్యము నాల్గవ వంతును కలదు దేశ మధ్య భాగమున మంచుతో కప్పబడి యుండు లోయమైదానములందును, దక్షిణ భాగమందలి నదీలోయ లందును పంటలు సమృద్ధిగా పండును ఈ మంచు మైదానము లందును, సైలీషియా ప్రాంత మందును వ్యవసాయోపయుక్తమగు భూమి గరిష్ఠ శాతములో కలదు తూర్పు దక్షిణ ప్రాంతములందు ఉత్తమమగు మైదానములు, పచ్చిక బయళ్లును కలవు వ్యవసాయము క్రింద నున్న మొత్తము 85 లక్షల ఎకరముల భూమిలో 50 లక్షల ఎకరములందు రై అను కాయధాన్యమును, పదిలక్షల ఎకరములలో గోధుమలును, 25 లక్షల ఎకరములలో ఉరలగడ్డలును పండు చున్నవి అన్ని పంటలలో రై ధాన్యము ముఖ్యమైనది వాయవ్య ప్రాంతమందును, కార్పేథియను పర్వత ప్రాంతమందును గల వ్యవసాయ భూములలో విశేష భాగమునందు పండిన రై ధాన్యము యుద్ధమునకు పూర్వము విదేశములకు ఎగుమతి అయ్యెడిది సైలీషియా మైదానము నందును, లుబ్లిన్, క్రాకో నగరముల పరిసరము లందును, బిడ్గాజ్ నుండి బాల్టిక్ సముద్రపు కయ్యవరకును విస్తరించియున్న నిమ్నతమ మగు విస్తులా లోయయందును గరిష్ఠమగు గోధుమ ధాన్యము పండుచున్నది ఈ దేశములో ప్రముఖముగా గోధుమలు పండెడి ప్రాంతము లివియె

పోలెండులో ఉర్లగడ్డలు ముఖ్యమైన భోజనపదార్థము ఇవి అన్ని ప్రాంతములలో సాధారణముగా పండుచుండును 50 నుండి 60 లక్షల మెట్రిక్ టన్నుల రై ధాన్యము, 2 కోట్ల 50 లక్షలనుండి 3 కోట్ల మెట్రిక్ టన్నుల ఉర్లగడ్డలు ఏటేటా ఈ దేశములో పండును ఇదియే ఇచ్చటి ప్రధానమగు వ్యవసాయ సంపద దాదాపు 20 లక్షల ఎకరములలో పండు ఓట్లు, సుమారు 10 లక్షల ఎకరములలో పండు బార్లీ అంతగా ముఖ్యమైన పంటలు కావు ఈ ధాన్యములు అన్ని ప్రాంతములలోను పండును బార్లీలో అత్యధిక భాగము సైలీషియాలోను, ఉన్నత భూము లందును పండుచున్నవి క్రాకో నగరమునకు తూర్పు ప్రాంతమందు ఓట్లు విశేషముగ పండు చున్నవి

సుగర్ బీటు, 2 లక్షల ఎకరముల భూమిలో ఏటేటా 30 నుండి 40 లక్షల టన్నుల వరకు పండుచున్నది సైలీషియా మైదానములో పండు సుగర్ బీటు అత్యుత్తమమైనది పరిశ్రమల కుపయోగపడు అవిసె పంట ఈ దేశములో ముఖ్యమైనది ఇది ముఖ్యముగా బాల్టిక్ తీరములో పండును ప్రధానముగా దక్షిణ మండలములో జనుము, చికోరీ, హాప్ అను పంటలు విరివిగా పండు చున్నవి

శీతోష్ణస్థితి అననుకూల మగుటచే, ఆ దేశములో వరి పంట పండుట అసాధ్యము ద్రాక్షతోటలు, ఇతర ధాన్యములు అరుదుగా నున్నవి పొగాకు ఉత్పత్తికి అచ్చటి శీతోష్ణస్థితి ప్రతికూలమైనను, పొగాకు సాగయ్యెడి భూవైశాల్యము యుద్ధమునకు పూర్వముకంటె ఈనాడు 400 శాతము అధికము చేయబడినది అవిసె, జనుము మున్నగునవి ముఖ్యములగు ఇతర ఉత్పత్తులు పూర్వము జర్మనీ ఆక్రమించియున్న ప్రాంతములో పండ్ల తోటలు విశేషముగా గలవు

యుద్ధములో హంగరీ దేశమునందు జరిగినంతగా పశునష్టము పోలెండులో జరిగెను అనగా పశువులలో సగము వరకును, పందులలోను, గుర్రములలోను సగము వరకును నష్టము ఘటిల్లెను పందుల సంఖ్య ఈనాడు 60 లక్షల వరకు పెరిగినది గుర్రముల యొక్క, పశువుల యొక్క సంఖ్య కొంత వరకు మాత్రమే ఎక్కువైనది దాదాపు 60 లక్షల వరకు గొర్రెలు కూడ కలవు

సుగ్రములు సంఖ్య అన్ని ప్రాంతముల యందును దాదాపు సమానముగ నున్నది లుబ్లిన్, లాడ్జ్ నగరముల పరిసరముల యందు అవి గరిష్ఠ సంఖ్యలో నున్నవి పోలెండు మధ్యప్రాంతమందు పశుసంపద అధికముగా కలదు మంచు మయనుగు లోయలో పందుల పెంపకము విశేషముగా జరుగు చుండును బియలిస్టాక్, బిడ్గాజ్ నగర పరిసరములందు గొర్రెల పెంపకము జరుగు చున్నది అక్కడనే పశుగ్రాసము కూడ లభించు చున్నది కేంద్ర ప్రాంత మందును, దక్షిణ భాగమందును, కోళ్ళ పెంపకము విశేషముగా జరుగును పోలెండునందు చేపలుపట్టు వృత్తి ప్రముఖమైనది పెక్కు రకములైన చేపలు అచ్చట లభించు చున్నవి

యుద్ధకాలములో పెక్కు అరణ్యములు నిర్మూలమైనవి పోలెండు మొత్తము విస్తీర్ణములో నాల్గవ వంతు అరణ్యములచే ఆక్రమింపబడి యున్నది సున్నపురాతి నేలయందు ఆకురాలుదువృక్షములతో కూడిన వివిధ వృక్షజాతులు పెరుగుచున్నవి ఉత్తర ప్రాంతములో త్వరితముగా పెరుగు చున్న దేవదారు వృక్షము లిప్పుడు ఉచ్చస్థితియం దున్నవి 'ఫిర్' అను అత్యంత నాణ్యమయిన కలప, కార్పేథియన్ మండలమునందు ఉత్పత్తి యగుచున్నది పూర్వము జర్మనీ పాలనములో నుండిన ప్రాంతములలో క్రమబద్ధము గాను, దట్టము గాను అడవులు తిరిగి పెంచబడు చున్నవి

సైలీషియా బొగ్గుగని ప్రాంతమందు అమూల్యమైన ఖనిజ సంపద కలదు మేలైన 'కోకింగ్' జాతికి చెందిన నేల బొగ్గు మొత్తము ఉత్పత్తిలో 30 శాతముకంటె ఎక్కువగా లభింపదు ఇట్టి బొగ్గు జాక్లర్ మండలమున కూడ దొరకును ఈ మండలము క్రాకో నగరమునకు నైరృతి దిశగా జెకొస్లోవేకియా సరిహద్దునకు సమీపముగ నున్నది జర్మను సరిహద్దు మీద నున్న నీస్సెనది కుడిగట్టు పొడవు లిగ్నైట్ అను మెత్తని నేలబొగ్గు త్రవ్వి తీయబడు చున్నది వార్టా, విడ్రానదుల నడుమను, లుబ్లిన్ నగరమునకు దక్షిణమునను నిక్షిప్తమై యున్న లిగ్నైటు విస్టవస్త ప్రణాళిక ననుసరించి త్రవ్వి తీయబడు చున్నది

కార్పేథియను పురోభాగమం దున్న టార్నోకు తూర్పుగా జాస్లో గనులయందు మాత్రమే ప్రస్తుతము పెట్రోలు లభ్యమగు చున్నది ఈ ప్రాంతము నుండి న్యాచురల్ గ్యాసు, గొట్టముల గుండా కీల్సి, కటోవిస్ అను గనుల ప్రాంతమునకును, క్రాకో నగరమునకును సరఫరా యగు చున్నది సమృద్ధమగు కార్పేథియను ఎదీజలముల నుండి ఇంత వరకు విద్యుదుత్పత్తి ప్రారంభము కాలేదు పోలెండులో లభ్యమగు ముడి ఇనుము తక్కువ రకమునకు చెందినను, కీల్సి మున్నగు ప్రాంతముల చుట్టును గల పీఠభూములలోని గనులనుండి మేలైన ఇనుము ప్రస్తుతము తీయబడు చున్నది సైలీషియా ఎగువ భాగము నందలి ముడిఇనుము దాదాపు పూర్తిగా త్రవ్వి తీయబడినది అందుచే పోలెండు పరిశ్రమలు, విదేశముల నుండి దిగుమతి యగు ఇనుము మున్నగు ఖనిజములపై ఆధారపడు చున్నవి అల్ప పరిమాణములో సీసము, తుత్తునాగము, వెండి, కాడ్మియమ్ అను తగర విశేషము, సైలీషియాలో లభించు ముఖ్య లోహములు విస్తులా, డునాఫెక్ నదుల సంగమ స్థాన మందు ముఖ్యముగా బొక్నియా సమీపమున శిలాలవణము సమృద్ధిగా దొరకును

1920 నుండి పోలెండు పారిశ్రామికాభివృద్ధి త్వరితముగా జరుగు చున్నది రెండు ప్రపంచ సంగ్రామములు కారణముగా జర్మనీనుండి పోలెండునకు సంక్రమించిన పారిశ్రామిక ప్రాంతములే ఇందుకు ముఖ్య కారణము బట్టల మిల్లులు, లోహ కర్మాగారములు ఈ దేశమున విశేషముగ నున్నవి విదేశములనుండి దిగుమతియైన ప్రత్తి, జనుపనార, ఉన్ని మున్నగు పదార్థములచే వస్త్రోత్పత్తి చురుకుగా సాగు చున్నది లాడ్జ్ నగరములో వస్త్ర కర్మాగారములు కేంద్రీకరింప బడినవి అవి దేశమధ్యమం దున్నవి అందుచే ఆ నగరము ముఖ్యమైన వ్యాపార కేంద్రమైనది అందు లోహ, రసాయన, ముద్రణ పరిశ్రమలు, ఆహారము నిలువచేయు పరిశ్రమలు, ఎలక్ట్రో - టెక్నికల్ పరిశ్రమలు నెలకొల్పబడి యున్నవి

ఉన్నివస్త్ర పరిశ్రమ ప్రధానముగా బియలిస్టాక్, బిడ్గాజ్ నగరములందు మాత్రమే ప్రముఖముగా నుండగా, నూలువస్త్ర పరిశ్రమలు పోలెండు మధ్యభాగము నందును సైలీషియాలోను స్థాపింప బడినవి సైలీషియా ప్రాంతములో భారీ పరిశ్రమలు కేంద్రీకరింపబడి యున్నవి ముఖ్యముగా జెకొస్లోవేకియా, రష్యా దేశములనుండి దిగుమతియైన ముడి లోహముల సహాయముతో ఇనుమును కరగించు కొలిమిలు ఉక్కు రోలింగ్ మిల్లులు పనిచేయు చున్నవి కాని యంత్రములు, యంత్ర పరికరములు, కొరముట్లు పెక్కు ఇతర స్థలములలో తయారగు చున్నవి.

నౌకానిర్మాణ పరిశ్రమ డాన్‌స్క్, గిడ్నియా, జీసిన్ నగరములందు నెలకొనెను గాజు, పింగాణీ పరిశ్రమలు వార్సా నగరము చుట్టును గల సైలీషియాలో విరివిగా స్థాపింప బడినవి పిండిమరలు, పానీయములు సారాయి తయారుచేయు బట్టీలు, పంచదార శుద్ధిచేయు కర్మాగారములు, ఆహారమును డబ్బాలలో నిలువచేయు పరిశ్రమలు బిడ్గాజ్, లాడ్జ్, వార్సా నగరములలో విరివిగను, సైలీషియా మధ్యప్రాంతములో కొంతవరకును కేంద్రీకరింప బడినవి

కార్జోవ్ నగర మొక ముఖ్యమగు కలప పరిశ్రమ కేంద్రము పోలెండు దక్షిణ, మధ్యమ ప్రాంతములందలి పెక్కు నగరములందు కొంతవరకు కలప పరిశ్రమ కొనసాగు చున్నది కాగితపు మిల్లులు పశ్చిమ సైలీషియాలోను, సైలీషియాలోని బొగ్గుగని ప్రాంతమందును నెలకొల్ప బడినవి

యుద్ధకాలములో నిర్మూలమైన పెక్కు రవాణా మార్గము లన్నియు దాదాపుగా మరల స్థాపింప బడినవి

విభిన్నములగు చరిత్రలను, సంప్రదాయములను కలిగి యున్న వేర్వేరు భూభాగములను ఒక రాజకీయ కూటమిగా సంఘటింప వలసిన సమస్యను పోలెండు ప్రభుత్వము ఎదుర్కొన వలసి వచ్చినది యుద్ధమునకు పూర్వము తూర్పు జర్మనీ యందలి రాష్ట్రములును పోలెండు నందలి కేంద్ర, పశ్చిమ ప్రాంతములును అట్టి భూభాగములోనివే పోలెండు ఉపపత్తు లీనాడు కొంతవరకు పెరిగినను, ఆర్థికముగను, ఇతర విధములుగను దానిని సౌష్ఠవమొనర్చుట 1919వ సంవత్సరముకంటె కఠినమైన కార్యము రెండవ ప్రపంచ యుద్ధములో మొదటి మహాసంగ్రామముకంటె, ఆ దేశమునకు అపారమగు నష్టము సంభవించుటయే ఇందుకు కారణము రాజధాని యగు వార్సా నగరముతో పాటు మరి కొన్ని నగరములు అధికముగా నిర్మూలములై, కొన్ని విశాల ప్రాంతములు గాఢ దాదాపు నిర్మానుష్యమైనవి అంతేకాక, పోలెండు ఈనాడు రష్యనుల సైనిక ప్రాబల్యము క్రింద నున్నది ఈ రష్యాయే 1919లో అంతర్యుద్ధ ఫలితముగా బలహీన స్థితియందుండెను రష్యామీద ఆధారపడి యుండుటచే, పోలెండు అమెరికా సంయుక్త రాష్ట్రములనుండి గాని, పశ్చిమ దేశములనుండి గాని ఋణములు తెచ్చుకొన లేకున్నది పోలెండు పునర్వ్యవస్థీకరణమునకును, ఆర్థికాభివృద్ధికిని అవసరమగు సహాయము పెక్కు రూపములలో పాశ్చాత్య రాజ్యములు, అమెరికా సంయుక్త రాష్ట్రములు మాత్రమే చేయగ్గలినవి 'మార్షల్ ప్రోగ్రాము'ను అనుసరించి అమెరికా వాగ్దాన మొనర్చిన సహాయమును అంగీకరింప కుండగా పోలెండు నిరోధింపబడినది ఈనాటి పరిస్థితులలో వాణిజ్య రంగమున పోలెండుతో భాగస్వామ్యము వహించుటకు పాశ్చాత్య దేశములు సహజ లక్షణములు కలిగి యున్నవి అట్టి పశ్చిమ రాజ్యములతో వ్యాపార సంబంధములు నెరపుటకు రాజకీయ మగు ప్రతిబంధకములు కల్పింప బడినవి

పోలెండులో డాన్‌స్క్, గిడ్నియా, జీసిన్ ప్రధానములైన రేవు కేంద్రములు మొదటి రెండు రేవుల ద్వారా 1 కోటి 20 లక్షల మెట్రిక్ టన్నుల సరకులు ఎగుమతి యగుచున్నవి మూడవ రేవు ద్వారా 20 లక్షల నుండి 30 లక్షల మెట్రిక్ టన్నుల వరకు ఎగుమతులు జరుగు చున్నవి యుద్ధమునకు పూర్వము ముఖ్యముగా గ్రేట్ బ్రిటన్, జర్మనీ, అమెరికా దేశములలోను, అటుతర్వాత జెకస్లొవేకియా, ఆస్ట్రియాలతోను పోలెండు వాణిజ్యము నెరపుచు వచ్చెను ఈనాడు పోలెండు వ్యాపారము జరపు దేశముల జాబితాలో రష్యా అగ్రస్థానమున నున్నది గ్రేట్ బ్రిటన్, డెన్మార్కు, రష్యాను అనుసరించు చున్నవి పోలెండునుండి ప్రధానముగా ఎగుమతియగు సరకులు, బొగ్గు, లోహములు, (తుత్తునాగము, తుత్తునాగపు రేకులు), యంత్రములు, వస్త్రములు, కలప, బార్లీ, పంచదార, మాంసము, వెన్న, గ్రుడ్లు, పందులు, ముడి ఖనిజములు, ఒకమాదిరి ముతక లోహములు, యంత్ర పరికరములు, మోటారు కారులు, ట్రక్కులు, ప్రత్తి, నూలు వస్త్రములు, రబ్బరు, ధాన్యములు, బియ్యము, పొగాకు, తోళ్ళు, రసాయన పదార్థములు ముఖ్యముగా దిగుమతియగు వస్తువులు

కె. వి. రె

## పోలో

ఈ ఆట చాల ప్రాచీనమైనది పర్షియాదేశము దీని జన్మస్థానము తరువాత ఇది జపాను, చైనా టిబెట్టు దేశములకు వ్యాపించి, అచ్చటనుండి భారతదేశమునకు వచ్చినట్లు తెలియుచున్నది 16వ శతాబ్దియందీ ఆట భారతదేశమున బాగుగా వ్యాప్తి యందుండెనట అనంతరము రెండు శతాబ్దముల వరకు ఈ ఆట వ్యాప్తిలో లేదు తిరిగి 1850వ సంవత్సరములో మణిపుర సంస్థానమందలి శిల్‌ఛారులో

"యూరపియన్ పోలో క్లబ్" అను పేరుతోను, 1860వ సంవత్సరములో కలకత్తాయందు 'కలకత్తా పోలో క్లబ్' అను పేరుతోను పోలో ఆట తలయెత్తినట్లు కనిపించుచున్నది ఆ సమయమందే ఈ ఆటకు సంబంధించిన నియమావళి కూడ ఏర్పడినట్లు తెలియుచున్నది 1869వ సంవత్సరములో ఈ ఆట ఇంగ్లండులో ప్రారంభమై వృద్ధి చెందినది

పోలో క్రీడయందు జట్టునకు నలుగురు ఆటగాండ్ర చొప్పున నుందురు వారు చిన్న గుర్రముల (పోనీల) పై కూర్చొని చిన్న బ్లేడు అమర్పబడిన దళసరి పేముకర్రతో తేలికగ నుండు కొయ్యబంతిని కొట్టుచు ఆడెదరు ఆట ఆడు స్థల విస్తీర్ణము 300 గజముల పొడవు, 200 గజముల వెడల్పు కలిగియుండును ఇరుప్రక్కల గల 'గోల్' యొక్క ఆవరణ విస్తీర్ణము 8 గజము లుండును పై జెప్పిన పేముకర్ర పొడవు 48 అంగుళము లుండును ఆటగాడి చేతినుండి కర్ర జారి పడిపోకుండునట్లు ఒక బెట్టు మూలమున దానికి చేతి మణికట్టుతో సంబంధ మేర్పరుప బడును, పైజెప్పిన బంతి కొయ్యతో చేయబడును అది 8¾ అంగుళముల వ్యాసముతో 4½ లేక 4¾ ఔన్సుల బరువు కలిగి తేలికగ నుండును జట్టునం దుండు నలుగురు ఆటగాండ్రలో ఒకడు ఎల్లకాపరిగా వ్యవహరించును శేషించిన ముప్వురు ఫుట్‌బాల్ ఆటయందువలె 'ఫార్వర్డు' ఆటగాండ్రై బంతిని వెంబడించుచు, నేర్పుగా పరుగిడునట్లు తర్ఫీదైన పోనీలపై స్వారి చేయుచు, అటకాయించుటకు ప్రయత్నించు ప్రత్యర్థి ఆటగాండ్రను తప్పించుకొనుచు వారి ఎల్లను అతిక్రమింప ప్రయత్నించెదరు ఎక్కువ పర్యాయములు ఎల్లను అతిక్రమించిన జట్టు ఆటయందు గెలిచిన జట్టుగా నిర్ణయింప బడును ఫుట్‌బాలు నందువలె, ఆట యాడు కాలపరిమితి ఒక గంట మాత్రమే ఈ గంట కాలములో అలసిపోయిన పోనీలను మార్పిడి చేయుటకు రెండు మూడు పర్యాయములు ఆట ఆపివేయ బడును ఆట ప్రారంభింప బడిన పిమ్మట అరగంటలో జరగు పోనీల మార్పునకు విరామ కాలము మూడు నిమిషములు మాత్రమే అరగంట అయిన తరువాత గుర్రముల మార్పిడి కొసగబడు విరామ సమయము అయిదు నిమిషములు ఒక జట్టు మరొక జట్టు యొక్క ఎల్లను అతిక్రమించి, 'గోలు' చేయగానే, రెండు జట్టులవారు తమ తమ పార్శ్వములను మార్చుకొనెదరు

1909వ సంవత్సరము వరకు ఉత్తమ శ్రేణికి చెందిన పోనీలు ఇంగ్లండు, ఐర్లెండు, ఆస్ట్రేలియా దేశములలో పెంపొందింప బడినవి భారత దేశమం దుపయోగింపబడు పోనీలను ఎక్కువగా ఆస్ట్రేలియా దేశమునుండి దిగుమతి చేసికొనెడి వారు ఆ పోనీలకు తగిన శిక్షణ నొసగి, వాటిని ఆటయం దుపయోగించెడి వారు

బ్రిటిష్ పరిపాలనములో భారతదేశము నందలి కొన్ని సంస్థానముల యందు ఈ ఆట ఆడబడు చుండెడిది ఆంధ్ర దేశమందు వెంకటగిరి, బొబ్బిలి, విజయనగర సంస్థానములలో పోలో ఆట ప్రచారములో నుండెడిది వెంకటగిరి మహారాజ కుమారుడైన శ్రీ వెలుగోడి వెంకట రాజగోపాలకృష్ణ యాచేంద్ర ఈ యాటలో ఆరితేరిన వాడుగా పేర్గాంచెను

కాని ఈ ఆట టెన్నిస్, ఫుట్‌బాల్, హాకీ, క్రికెట్ మున్నగు ఆటలవలె దేశము నలుమూలల వ్యాపించలేదు దీనికి ప్రధాన కారణ మొక్కటియే ఈ ఆట నాడుటకు పోనీలు అవసరము వాటిని ఎక్కువ సంఖ్యలో కొనగలిగిన ఆర్థిక స్తోమతు ఆటగాండ్ర కుండవలెను పోనీల కట్టి అంగవైకల్య మేర్పడినను, ఆట కుపయోగ పడవు కనుక ప్రచారములో నున్న కొంత కాలమైనను, ఈ ఆట ధనికులైన సంస్థానాధీశులే ఆడుచుండెడి వారు ఇదియు కాక, క్రీడారంగమునం దిటీవల భారతదేశము నందు నలుమూలలలో యువకులను మిక్కుటముగా ఆకర్షించుచున్న ఆటలు క్రికెట్, ఫుట్‌బాల్, హాకీ, బ్యాస్కెట్‌బాల్, వాలీబాల్, బ్యాడ్మింటన్ మున్నగునవైనందున, తిరిగి ఈ ఆట అభివృద్ధి చెందలేదు

పింగళి సూరనార్యుడను ప్రఖ్యాత తెలుగు కవి "ప్రభావతీ ప్రద్యుమ్నము" అను మహాప్రబంధమును రచించి యున్నాడు ఆ కావ్యమునందు కథానాయకుడగు ప్రద్యుమ్నుడు "ద్వారకానగర బాహ్య ప్రదేశంబునందు వాహ్యాళి విహార సారస్యంబునం దగిలి యుండె"నట ఈ సందర్భమున కవి చేసిన వర్ణనమును బట్టి ప్రద్యుమ్నుడాడుచుండినది "పోలో" క్రీడవలెనే కన్పట్టుచున్నది ఆ విషయ మిట్లు వర్ణితమయినది

చ॥ తన హృదయంబు వెంబడిన తప్పక ఘోటక మంతనంతనే
సమపదనిల్పి ముంజకుబారి కెలంకులకుం దొలంగిడా
వెనుకకునేగు దెంచి కడువేడ్క యొనర్పగ బంతియాడె నె

మ్మని గన కింపుగోల నడిమింటనె భ్రిమ్మరదారికొట్టుచున్
(II ఆ)

వ॥ మఱియును (II ఆ)

చ॥ ఎగురవైచి కొట్టు టవియెంత భరంబని బంతియగ్రగా
మిగ వడిబాఱవైచి పుడమింబడనీయక దానిమీఁదఁ జి
త్రగతి వాయుండఁదోలుచును గ్రమ్మరమీదికి
గొట్టి యాడెవిం
తఁ దనచేతి రత్నమయదండము కాంతులుగాడి పాఱఁగన్
(II ఆ 1)

వ॥ వెండియునతండు మండలగతుల నెతులంబుగా గురంగంబు
దోలియాడు నప్పుడు (II ఆ 2)

ఇంకను అయిదారు పద్యములలో ప్రద్యుమ్నుడు తురగమును నడపు విధానము వర్ణితమయినది

"వల్గితముఖగతిపంచక
వల్గు విహారముల సైంధవము నలయించెన్—
" (II ఆ)

అని కవి వర్ణించినాడు పింగళి సూరనార్యుడు క్రీ శ 1580 ప్రాంతమువాడు కావున, ఆ కాలములో రాకుమారులు పోలో (గుఱ్ఱపు బంతి యాట) ఆడుచుండిరి కాబోలు సూరనార్యుడా ఖేలనమును చూచినాడేమో !

కొ న

## పౌరధర్మ తత్త్వము

పౌరధర్మ తత్త్వమును చక్కగా గ్రహించి దేశమును ఔన్నత్యమునకు తెచ్చిన వారిలో ప్రాచీనకాలపు గ్రీకు దేశీయులు అగ్రస్థానమును అలంకరించి యుండిరి వారి రాజ్యాంగ విధానములకును మన రాజ్యాంగ విధానములకును కొన్ని భేదము లుండి యున్నను, ఈకాలపు రాజకీయ భావము లైన, ధర్మము, స్వాతంత్ర్యము, రాజనీతి, నిబంధనలకు లోబడిన సంపూర్ణ బాధ్యతాయుత పరిపాలనము – అనునవి రాజకీయ తత్త్వవేత్తలైన ప్లేటో, అరిస్టాటిల్ అను వారు గ్రీకు పౌర ప్రభుత్వములను పరిశీలించి, విమర్శించిన భావములే గ్రీకు దేశీయులు పౌరధర్మ తత్త్వములో, ప్రథమస్థానము శాంతత్వము, సాధుత్వము, నియమము మున్నగు గుణముల కొసగిరి "నిన్ను నీవు తెలిసికొనుము నియమయుతుడవు కమ్ము," "మితిమించి ఏదియు కూడదు" అను సూత్రములు గ్రీకు రాజ్యాంగ విషయములో నేమి తదితర విషయములలో నేమి, వారి స్వాభావిక గుణములుగ నుండెను భారత దేశమందును, వేదకాలమునుండి, ఉపనిషత్కాలమునుండి, బుద్ధునినాటినుండి, ఇప్పటి వరకును, శమదమాది గుణముల కును, శాంతి సౌహార్దములకును ప్రాముఖ్య మొసగ బడినది జయప్రదముగా వృద్ధి పొందవలె నన్నచో, ఈ గుణముల యొక్క ఆవశ్యకతను ప్రజలు తరచుగా జ్ఞప్తియం దుంచు కొన వలయును

గ్రీకు దేశీయుల పౌరధర్మ తత్త్వమందలి రెండవ లక్షణము వారి దేశ స్వాతంత్ర్యాభిలాష పారసీకులతో యుద్ధముచేసి, క్రీ పూ 5వ శతాబ్దమందు గ్రీకు స్వాతంత్ర్య మును నిలబెట్టి, ప్రజా ప్రభుత్వమును ఘనతకు తెచ్చిన వీరుడు పెరిక్లీసు మహాశయుడు ఇతడు సుమారు 35 సం॥ లు గ్రీకు పట్టణములలో శ్రేష్ఠతమమైన ఏథెన్సు అను పురమునకు ప్రథమ పౌరుడుగా నుండెను ఈ పారసీక యుద్ధములలో ఆశ్చిలస్ అను గ్రీకు కవి పాల్గొనెను అతడు తాను రచించిన పెర్షియన్స్ అను నాటకమందు, గ్రీకుల దేశ స్వాతంత్ర్యాభి లాషను వర్ణించి యున్నాడు ఆ నాటకములో పాత్రమైన పెర్షియా రాణియగు ఎటోస్సా 'ఈ గ్రీకుల గుంపునకు నాయకు డెవడ'ని యడిగెనట దానికి వెంటనే గ్రీకులు, బానిసలవలె ఏ యజమానునకును తలవంచరు అని జవాబు వచ్చెనట

ఇట్లు దేశ స్వాతంత్ర్యము నభిలషించుటయే కాక, ప్రజా ప్రభుత్వమే ప్రభుత్వ విధానము లన్నిటిలోను శ్రేష్ఠతమ మయినదను భావముచే ప్రజా ప్రభుత్వము కొరకు పాటుపడి, అట్టి ప్రభుత్వము వలన దేశమునకు శాశ్వతమైన కీర్తి తెచ్చిన వారు, గ్రీకు దేశములో యేథెన్సు పట్టణమందు నివసించిన, పెరిక్లీసు కాలము నాటి పౌరులు

గ్రీకు పౌరధర్మ తత్త్వమునందలి మూడవ లక్షణము ప్రజా ప్రభుత్వ మని చెప్పవచ్చును ఈ ప్రజా ప్రభుత్వము సంపూర్ణముగా సాధించుటకు సుమారు రెండువందల సంవత్సరములు పట్టెను కొలది కాలము రాజులు రాజ్యము చేసిరి తరువాత గొప్ప వంశ్యులైన ప్రభువులు రాజ్యము చేసిరి ఈ ప్రభువులు ప్రజారంజనాసక్తులు కాక స్వార్థపరా యణులును, మదాంధులును నైయుండుట వలన, కలహము లేర్పడినవి కొన్ని పురములందు క్రూర నాయకులు అధి కారమునకు వచ్చిరి మరి కొన్ని పట్టణములందు జనులందరు

కూడి ఒక ప్రతినిధిని ఎన్నుకొని అధికార పదవిని ఆ ప్రతినిధి కిచ్చిరి

ఏథెన్సు పట్టణమునకు క్రీ పూ 6వ శతాబ్దమందు సోలను అను నాయకుడు ప్రతినిధియై అట్టి పదవి నలంకరించెను – ఈ ప్రజాప్రభుత్వమునకు పునాది వేసినవాడు సోలను ప్రజలకు ఆర్థిక స్వాతంత్ర్యము లేని ప్రజా ప్రభుత్వము వ్యర్థమని సూచించిన ఘనుడు సోలనే సాంఘిక భేదము లున్నంతకాలము రాజకీయ సమత్వము సంపూర్ణముగా సాధింపజాల మని బోధించిన వాడు సోలనే ఈతడు గ్రీకు రాజనీతి కళయందు సంపూర్ణమైన కౌశల్యము కల వాడు నూతన ప్రజా ప్రభుత్వమందు రాజకీయ, ఆర్థిక, సాంఘిక స్థితులన్నిటియందును కొంత సమత్వము ఏర్పరచుట అవసర మని, నాయకులు ఒప్పుకొను చున్నారు రాజ్యాంగము నందలి అంతఃకలహములు కోపముచే పరిష్కరింపబడజాలవు ఉత్తమమైనట్టియు, నియమబద్ధమైనట్టియు, మార్గము నవలంబించి, పౌరుల యోగక్షేమములను పెంపొందించుటయే ప్రజా ప్రభుత్వమునకు ముఖ్య సూత్రముగ నుండవలెనని సూచించినట్టి సోలెనుయొక్క ఉపదేశము, గ్రీకు దేశీయులకే గాక, రాజ్యాంగ విషయములలో శ్రద్ధ కలవా రందరికిని అత్యంతము గ్రాహ్యమగు చున్నది

క్రీస్తునకు పూర్వము 461 ప్రాంతమందు, పెరిక్లీసు నాయకత్వమున, ఏథెన్సు పురమందు ప్రజాప్రభుత్వము అత్యుచ్ఛస్థితి నొందెను ఆ కాలమున 20 సం॥ ల వయస్సుగల పురుషు లందరును ఒకచోట చేరి వారి రాజకీయ వ్యవహారముల నన్నింటిని చర్చించు చుండెడివారు ఏథెన్సు నందలి జనసంఖ్య సుమారు 50 వేలు కాని సాధారణముగా 5, 6 వేలకు మించిన జనసంఖ్యతో ఎప్పుడును సమావేశములు జరుగలేదు ఇట్టి సమావేశమునకు ఎక్లీజియా అని పేరు పౌరులు సంవత్సరమునకు 10 సారులు సమావేశ మగుచుండిరి ఆ గోష్ఠులయందు సభ్యులు ముఖ్య విషయములను చర్చించి పరిష్కరించు చుండిరి ప్రతి దినము జరుగవలసిన రాజ్యాంగ కార్యములను నిర్వహించుటకు ఏడాది కొకపర్యాయము చీట్లువేసి 500 మంది సభ్యులను ఎన్నుకొను చుండిరి ఈ విధముగా మధ్యస్థుడు (ప్రతినిధి) అనువాడు లేకుండ జను లందరు ప్రభుత్వాధికారమును నిర్వహించుట సులభమైన పనికాదు గృహకృత్యములను నిర్వహించుకొను స్త్రీలును, బానిసలును, తమ సేవాకృత్యములను నిర్వహించుకొనుచు, ప్రజా ప్రభుత్వ నిర్వహణము నందును తోడ్పడు చుండిరి కాని ఈకాలపు ప్రజాప్రభుత్వము దీనిని హర్షించదు నేటి పౌరుల ఆదర్శములను బట్టి ప్రజాప్రభుత్వ తంత్రమున స్త్రీ పురుష భేదము లుండగూడదు దాస్యము నుపేక్షించిన సంఘము నిజమైన ప్రజాప్రభుత్వయుత సంఘముగాదు ఏథెన్సులో స్త్రీలకును బానిసలకును వినాగా శేషించిన వారందరికి రాజ్యాంగి విషయములందు సమాన హక్కు లున్నవి కార్యనిర్వాహక సభ్యులను ఓట్లచే ఎన్నుకొను హక్కుమాత్రమే గాక, కార్యనిర్వహణము స్వయముగా చేసికొనుటకును, అధికార పదవులందు కొన్ని సైనికోద్యోగములు మినహా అన్ని పదవులను అంగీకరించుటకు గ్రీకు పౌరులందరకును హక్కులుండెను 30 సం॥ ల వయస్సు కలిగిన వారందరికిని న్యాయాధికారులుగా నుండుట హక్కుండెను

ప్రజా ప్రభుత్వము వలన కలిగిన స్వేచ్ఛా స్వాతంత్ర్యములను ఏథెన్సుపౌరులు దుర్వినియోగము చేయక, ధర్మబద్ధులై దేశముయొక్క శ్రేయస్సుకొరకు పాటుపడుటయే వారి పౌరధర్మ తత్త్వముయొక్క నాల్గవ లక్షణము – యుద్ధములో మరణించిన వీరులకు జరుపవలసిన ఉత్తర క్రియలను గూర్చి ప్రసంగించుచు, పెరిక్లీసు మహాశయుడు గ్రీకు పౌరుల గుణముల నీవిధముగ వర్ణించి యున్నాడు "మా రాజ్య పరిపాలనము స్వాతంత్ర్యమునకు మార్గదర్శకము మా రాజకీయ వ్యవహారములు బహిరంగములు – ఎవరికిని బహిష్కారము లేదు దైనందిన వ్యవహారములలో పరస్పరానుమానములు మాకు లేవు పొరుగువారు తమ ఇష్టానుసారము ప్రవర్తించినను, అట్టివారికి మేము హాని కలిగింపకుండుటయే గాక, మా అసమ్మతిని కూడ ప్రకటింపము ఇంపుగా నుండదని మేము వారి దైనందిన వ్యవహారములలోను, వారిని ఎట్టి నిర్బంధమునకును గురి చేయకున్నను, రాజకీయ వ్యవహారములలో మాత్రము ధర్మమును, చట్టములను భయభక్తులతో గౌరవించెదము అధికార పురుషుల ఆజ్ఞలను, మారు పలుకకుండ శిరసావహించెదము మేము ధర్మానుచరులము ముఖ్యముగ అన్యాయము నుండి కలుగు నష్ట విమోచనమునకై పాటుపడెదము చట్టములనేగాక, ఏ యాచార ధర్మములు అతిక్రమించుట వలన అపకీర్తి కలుగునో, ఆ ఆచార ధర్మములను ముఖ్యముగా గౌరవిం

చెదము "ఈ వాక్యములలో అతిశయోక్తి లేదు"

గ్రీకుపౌరుల స్వేచ్ఛా స్వాతంత్ర్యములకును, ధర్మశాసన బద్ధతకును పరస్పర వైరుధ్యము లేనంతవరకు, వారి ప్రజా ప్రభుత్వము, అప్రతిహతమును, తేజోవంతమునునై భాసిల్లెను ప్రజా ప్రభుత్వమునకు ప్రతికూలురైనవారు ప్రజా ప్రభుత్వ రాజ్యాంగమందుండ అనర్హులనియు, వారు దేశము యొక్క క్షీణదశకు కారకు లగుదురు అనియు వారు చెప్పిరి "ప్రజలయందు వివేకము, జ్ఞానము ఉన్నంతవరకు ఇట్టి అభియోగమునకు అవకాశ ముండదు పౌరతత్త్వ ధర్మమును హక్కులను గుర్తించి ఉత్కృష్ట కార్యముల నిర్వహించిన పౌరులకు తగినట్టి ఉన్నతోద్యోగముల నిచ్చెదము బీద తనమును ఒప్పుకొనుట సిగ్గుకాదు బీదతనమును తొలగించు కొనుటకు ప్రయత్నము చేయకుండుట నిజముగా నింద్యము లోకహితైక కార్యములందు సంబంధము కలుగజేసికొనని వానిని పనికిరాని వాడని తలచెదము" ఇత్యాది వాక్యములలో పెరిక్లీసు పౌరధర్మ తత్త్వసారమును సంగ్రహించియున్నాడు

ఏథెన్సు ప్రజాప్రభుత్వ రాజ్యాంగమందు, అధికారులు తమ అధికార బలమును దుర్వినియోగము చేయకుండ కొన్ని నిబంధన లుండెను చీట్లు వేసికాని, వోట్లచేకాని, ఎన్నుకొనబడిన అధికారులు వారి ఉద్యోగములో ప్రవేశించుటకు ముందుగ, వారి యోగ్యతా ప్రవర్తనములను గురించి ఒక పరీక్షకు లోబడి యుండవలసిన వారైరి ఉద్యోగమందు ప్రవేశించిన తరువాత నెల కొకసారి వారి ప్రవర్తనము పునర్విమర్శింప బడుచుండెను వారి ఉద్యోగకాలము సాధారణముగ ఒక సంవత్సరపు పరిమితి కలదై యుండి అటు తరువాత వారు తమ ఉద్యోగ కాలమందు గడించి చేసిన ఆదాయ వ్యయములు జాగరూకతతో పరిశీలింప బడెను అధికారులు ధర్మకర్తలవంటివారు వారి అధికార బలము నిబంధనములకు లోబడి యున్నది వారు నిబంధనములను మీరి ప్రవర్తించిన యెడల ప్రజలు వారిని తొలగింప వచ్చును అను సూత్ర సముదాయము ఏథెన్సు పౌరధర్మ తత్త్వమునందలి ఐదవ లక్షణము

ఎప్పుడు జనులు సాంఘిక-ఆర్థిక-రాజకీయ విషయములలో సమర్థులై, స్వేచ్ఛ, సమత్వము, సౌహార్దము కలిగి యుందురో అప్పుడే వారి హృదయములందు ఒక విధమైన నూతన కాంతి ఉదయించును వారు తమ భావములను శాశ్వతమైన, సుందరమైన, కవిత్వమందును, శిల్పనిర్మిత యందును, ఉపన్యాసకరణ మందును, చరిత్ర నిర్మాణమందును ఆవిష్కరించుచు, పౌరధర్మ తత్త్వమునకు లలిత కళాభిరుచి ఆనందము, నీతి, ప్రేమ ముఖ్య లక్షణములని చాటుదురు

ఏథెన్సు గ్రీసు దేశమునకు ఒక విద్యాలయము వంటిది "అతివ్యయము చేయము సుందరమైన వస్తువులను మేము ప్రేమించెదము పౌరుష వంతులమై పాండిత్యమును, జ్ఞానమును ఆర్జించి ఆదరింతుము" అని పెరిక్లీసు చెప్పిన వాక్యములు సంస్మరణీయములు పెరిక్లీసు కాలమునాటి పౌరులలో మానసిక వికాసము పరవళ్ళు త్రొక్కసాగెను కవులు, శిల్పులు, చరిత్రకారులు ఉత్తేజితులయిరి కవులలో ఆశ్చిలస్, సోఫాక్లీస్, యూరిపిడిస్ అనువారు కష్టాంత నాటకములు వ్రాయుటలో అగ్రగణ్యులై వరలిరి అరిష్టోఫేన్స్-అను నాతడు సుఖాంత నాటకములు వ్రాయుటలో అందెవేసిన చేయి మన అజంతా, ఎల్లోరా శిల్పములనుబోలు పెక్కు శిల్పములను ఏథెన్సు పట్టణమున కలంకార ప్రాయములై యున్నవి ఫిడియసు అను శిల్పి ఏథెన్సు పౌరుల సహాయముతో విచిత్రమైన విగ్రహములను సృష్టించెను బంగారముతోను, దంతములతోను చేసిన దేవతావి విగ్రహములు అత్యద్భుతములై యున్నవి అచటి ఎథీనాదేవి ఆలయము ఆగ్రా పట్టణ మందుండు మోతీ మశీదుతో పోల్చబడి యున్నది పాశ్చాత్య చరిత్రకారులలో ప్రథమగణ్యులైనవారు హెరాడొటస్, థ్యూసిడైడ్స్ అనువారలు మన దేశమందు గుప్త కాలమున ఏవిధముగ వైజ్ఞానికముగ పునః సృష్టికలిగినదో, అట్లే పెరిక్లీసు కాలమునాటి గ్రీసు దేశమందున్న మానవుని మూర్తిమత్త్వము సంపూర్ణముగ వికసించె నని చెప్పుట అతిశయోక్తి కాదు

క్రీస్తునకు పూర్వము నాల్గవ శతాబ్దమందు, గ్రీకు దేశమందు అంతఃకలహములు ప్రబలమాయెను వాటి ఫలముగా ప్రజా ప్రభుత్వము క్షీణించుటయే గాక, మేసిడన్ రాజులైన ఫిలిప్, ఎలెక్సాండరులు గ్రీసు దేశమును ఆక్రమించుట తటస్థించెను అట్టి సందర్భమున, రాజనీతిని, ధర్మమును బోధించి పౌరధర్మ తత్త్వమును జ్ఞప్తికి తెచ్చిన గురువులు ముగ్గురు వీరు సోక్రటీస్-ప్లేటో-అరిస్టాటిల్ అనువారు నీతిలేని ప్రభుత్వము పునాదిలేని గృహము వంటిది అని సోక్రటీసు బోధించెను అతని ముఖ్య శిష్యుడైన ప్లేటో, తన గురువైన

సోక్రటీసు యొక్క మరణమునకు అవివేకులైన ప్రజలే కారకులై యుండిరనియు అధికార పదవులలో నుండువారు తత్త్వజ్ఞానులుగ నుండవలె ననియు పౌరు లందరకును స్వస్వధర్మ నిర్వహణ విషయమున పరిపూర్ణ ప్రజ్ఞాలబ్ధికి వలసిన విద్యలను నేర్పుటయే ప్రభుత్వముయొక్క ముఖ్య ధర్మ మనియు, 'రిపబ్లిక్' అను గ్రంథమందు వ్రాసి యున్నాడు ప్లేటో శిష్యుడైన అరిస్టాటిల్ పాశ్చాత్య రాజనీతి శాస్త్ర మును స్థాపించినవాడు అతడు 158 గ్రీకుపురముల రాజ్యాంగ విధానములను పరిశీలించి, రాజ్యాంగ తత్త్వమును శిష్యులకు బోధచేసి, మానవుని యుక్తమైన జీవితమునకు పౌరత్వము ముఖ్యావసర మనియు, రాజ్యాంగ విధానము లన్నిటి యందును చట్టములకు లోబడినట్టియు, ధనాధిక్యముగాని బొత్తిగా బీదతనముగాని లేక మధ్యస్థితిలో నుండువారి ప్రభుత్వము యుక్తమైనదనియు, మధ్యస్థితిలో నుండువారి సంఖ్య వృద్ధి చేయవలెననియు, 'పాలిటిక్సు' అను గ్రంథము నందు వ్రాసి యున్నాడు

ఈ గ్రీకు గురువులు ముగ్గురును బోధించిన సూత్ర ములు ప్రాచీన గ్రీకు కాలమునందే గాక సర్వకాలములందును సర్వదేశములందును ఎల్లవారలకును గ్రాహ్యములు అగుచున్నవి 18 సం॥ ల వయస్సు దాటిన తరువాత, గ్రీసు దేశీయుడగు ప్రతి పురుషుడు, "నా దేశమును నేను చూచినప్పటికంటె హీనస్థితిలో గాక హెచ్చైన స్థితిలో నుంచెదనని ప్రమాణము చేసెనట మన దేశమందును ప్రతి యువకుడును ఈ ప్రకా రము ప్రమాణముచేసి, గ్రీకు యువకులవలె బుద్ధి వికాసము నకు కావలసిన విద్యల నభ్యసించి, సాంఘిక, ఆర్థిక, రాజ్యాంగ లోపములను దిద్దుచు, సంఘమును తలక్రిందు చేయు పద్ధతుల నవలంబింపక, గ్రీకు పౌరధర్మ తత్త్వమును శాశ్వత స్థానము నకు తెచ్చిన అరిస్టాటిల్ మహాశయుని ఈ క్రింది వాక్యము లను జ్ఞప్తియం దుంచుకొన వలయును. "Man when perfected is the best of animals but when sepa rated from Law and Justice, he is the worst of all " పరిపూర్ణతను పొందిన మానవుడు జీవకోటిలో శ్రేష్ఠ తముడు, కాని న్యాయమును ధర్మమును త్యజించు నెడల అతడే జీవకోటిలో అధమాధముడు కాగలడు

కె హ

# పౌర సంబంధములు
## (Public Relations)

వివిధములైన పరిపాలనా శాఖలు స్వీయ దైనందిన కృత్యములను నిర్వహించు చున్నవి అందుచే పౌర పరిపా లనమునకు సామాన్య పౌరులతో విశేష సంబంధము కలదు ముఖ్యముగా ప్రజాస్వామిక సూత్రములకు కట్టుబడిన ప్రభుత్వాధికారులు ప్రభుత్వ సేవకులై యున్నందున, వారు ప్రజలకు గూడ సేవకులుగ నున్నారు వారు ప్రభుత్వమును నియంత్రించి నడుపునట్టివారు పరిపాలనా నిర్వహణ సాధ నముగా నేర్పడిన సిబ్బంది, ప్రభుత్వము యొక్కయు, పౌరుల యొక్కయు అవసరములను తెలిసికొన వలెను ప్రభుత్వాధికారులు ప్రత్యేక విజ్ఞానమును, కౌశలమును వృద్ధి చేసికొని దానిని ఉపయోగింతురు అందుచేత వారు పరిపాలన కలాపము యొక్క స్వరూప స్వభావములను గూర్చి ప్రజలకు సలహా నొసగవలెను ప్రభుత్వపు సిబ్బందితో పౌరులకు గల సంబంధము సాధారణముగా శాశ్వతాభిప్రాయ మును కల్గించును కావున అట్టి సంబంధములు సుహృద్భావో పేతములుగను, సాహాయ్యకములుగను పరిణమించు రీతిగా చూచు ప్రత్యేక బాధ్యత అధికారులపై నుండును ప్రభుత్వ-ప్రజా సంబంధములు ఇరుపక్షముల మనుగడకు విశేషముగా దోహదము చేకూర్చును ప్రజా సహాయము లేనిదే ఏ ప్రభుత్వము గూడ దీర్ఘకాలము మనజాల కుండుటయే ఇందుకు కారణము

పౌర సంబంధములను కచ్చితముగా నిర్వచించుట కష్టము రెక్స్‌వర్లో అను పండితుడు పౌరసంబంధముల నిట్లు నిర్వచించెను "అది యొక శాస్త్రము, దాని ద్వారమున ఒక సంస్థ సాంఘిక బాధ్యతలను నెరవేర్చుటకును, ప్రజల గుర్తింపును సాధించుటకును, జయ సంపాదనమునకు వలయు ప్రజామోదమును బడయుటకును బుద్ధిపూర్వకముగ ప్రయ త్నింప గలదు " జె హెచ్ రైట్, బి హెచ్ క్రిస్టియన్ అనువారు పౌర సంబంధములనుగూర్చి "సత్ప్రవర్తనమువలన గణ్యతను సంపాదించుట, 90 శాతము ధర్మము నాచరించుట, 10 శాతము దానినిగూర్చి చెప్పుట " అని నిర్వచించిరి

ప్రజల కోరికలను గూర్చి తెలిసికొనుట, కోరవలసిన విషయములను ప్రజలకు తెలియజెప్పుట, అధికారులకును అనధికారులకును నడుమ తృప్తికరములైన సంబంధముల

విషయమై నమ్మకము పుట్టించుట, ప్రభుత్వ నిర్వాహకులు కావించు విషయములను ప్రజల కెరిగించుట – ఇత్యాదులు పౌర సంబంధములలో ముఖ్యములైనవి

'ప్రజా' శబ్ద నిర్వచన వైవిధ్యము 'పౌరసంబంధములు' అను సమాస భాగమందలి 'పౌర' శబ్దమునకు సామాన్యముగ చెప్పబడు అర్థముకంటె విస్తృతమగు అర్థమును గ్రహింపవలసి యుండును 'పౌర' శబ్దము సర్వ ప్రజాభేద పరముగ ప్రయుక్తమైనది ఈ సందర్భమున 'పౌర' శబ్దప్రయోగమందు వివిధములైన ఒత్తిడి వర్గములు, సువ్యవస్థిత సంఘములు, వృత్తి సంఘములు, ముక్త్యారుల ఆశ్రితులు, సామాన్య పౌరులును చేరి యున్నారు

అట్లే, 'సంబంధములు' అను పదము నందు పెక్కు అర్థచ్ఛాయ లిమిడి యున్నవి దీని అర్థము, ప్రభుత్వమునకును, ప్రజలకును చెందిన ప్రాకృతికము, నరశమునైన సంబంధమునకు మాత్రమే పరిమితమై యుండదు ప్రభుత్వ మనుసరించు ప్రధాన రాజనీతి విధానమందు పాల్గొనుటకై పౌరులు అభిరుచి కల్గియుందురు వారు ప్రభుత్వపు కార్యనిర్వహణ దక్షతనుగూర్చి విశ్వాసమును బడయ నెంచుదురు పరిపాలన లక్ష్యములను, తమకు లభింపనున్న ప్రయోజనములను గూర్చి తెలిసికొన వారు ఉవ్విళ్ళూరు చుందురు ప్రజలకును, అధికారులకును నడుమ సంబంధములు స్నేహభావార్ద్రములై యుండవలెనని పౌరు లపేక్షించు చుందురు

ఉత్తమ ప్రభుత్వ మెప్పుడును జాగరూకతతో మెలగవలెను ప్రభుత్వము నిరంతరము దైనందిన పరిణామములను గమనించుచు, విప్లవములు కాని, తిరుగుబాటులు కాని ఘటిల్లుటకు గల సర్వావకాశములను తొలగింపవలెను పౌరసంబంధము లెప్పుడును ఏకాధిష్ఠాన నిర్దేశాత్మకముగా నుండగూడదు ప్రభుత్వము ముఖ్యముగా ప్రజా క్షేమముతో సంబంధము కల్గి, ప్రజలను సేవించున దగుటచేత, అది ప్రజల అవసరములను తుల్యవిశ్వాసముతో తెలిసికొనవలెను హేతుపురస్సరముగా తృప్తినొందిన ప్రజా సామాన్యముకంటె, ప్రభుత్వమను సౌధమునకు ప్రబలతరమైన పునాది మరియొకటి ఉండనేరదు ప్రగతి శీలములైన పెక్కు దేశములలో, పర్యాలోచన మూలముననను, ప్రశ్నావళి మూలముననను ప్రజాభిప్రాయమును తెలుపు ఓట్ల ద్వారముననను ప్రజాభిప్రాయము మదింపు చేయబడును ఈ విషయములో భారత దేశమందు ఇట్టి ప్రధానవగు చర్యలను తీసికొనవలసి యున్నది

పౌరులతో సంబంధము సక్రమాభివృద్ధి లేని దేశములలో ముఖ్యముగా ప్రభుత్వ సిబ్బందివారు అసమర్థులుగను, అనుభవ రహితులుగను, అనుచిత శిక్షితులుగను ఉన్న తావులలో అధికారులకును, అనధికారులకును మధ్య అభిప్రాయ భేదములు పొసగి, తన్మూలమున వారి నడుమ సంబంధములు క్లిష్టములగను, శోషకారులుగను, ఉపద్రవ కారులుగను పరిణమించవచ్చును కాని బాధ్యతాయుతమైన సివిల్ సర్వీసు బృందము సమర్థవంతములును, వాంఛనీయములునైన సంబంధములను నెలకొల్పుటలో జయము నొందవచ్చును ఇట్లు ఎక్కువ కనికరముతోను, మర్యాదతోను విచార శీలముతోను పౌరుల యెడ ప్రవర్తింప వలసిన బాధ్యత అధికార వర్గముపై నుంచబడినది అధికారులు లోకజ్ఞులుగను, ఉత్తమ విద్యావంతులుగను, పరిపాలనముతో ముఖ్య సంబంధము గల కార్య విధానములను, నిబంధనలను తెలిసిన వారుగను ఉండుట ఆవశ్యకము

సాధారణ ప్రజలు విద్యావంతులై యుండుట అరుదు అంతే కాదు ప్రభుత్వము సర్వదా ప్రజల సమస్యలను పరిష్కరింపజాలక నిస్సహాయ స్థితియం దుండుటచేతను, ప్రజల అభ్యర్థనలలో పెక్కులు విఫలీకృతము లగుటచేతను, తిరస్కరింప బడుటచేతను, ప్రజలు ఆశాభంగమును, అసంతృప్తిని చెందుదురు అధికారులు సాధారణ మానవుని యెడ కనికరముంచవలెను ప్రజలు ప్రభుత్వ కార్యాలయముల కేగినపుడు వారియందు కాననగు లోపములను అధికారులు సానుభూతితో మన్నింపవలెను పౌరులు కూడ ప్రభుత్వాధికారుల లోపములను సద్భావముతో వివేచింపవలెను అధికారులకును, అనధికారులకును మధ్య సముచితమైన పౌరసంబంధ సాధన ద్వారమున ఉచితమగు సంబంధములు పరిరక్షితవములైనచో, పెక్కు పరిపాలనా సమస్యలు పరిష్కృతములు కాగలవు అన్ని రాష్ట్ర ప్రభుత్వము లందును పౌరసంబంధ మూలములు యుక్తముగా పరిరక్షితము అయినచో, భారత దేశమున పంచాయతీ రాజ్యపాలనములో గల అనేక సమస్యలు అచిరకాలములో అదృశ్యము కాగల వనుటలో అతిశయోక్తి యుండదు

పౌరులకు సమాచార మందించుట ఏ ప్రభుత్వ సంస్థయందైనను ప్రభుత్వ కార్యనిర్వహణ విధానములను, రాజనీతి

విధానములను గూర్చి సర్వదా ప్రజలకు తెల్పుచుండుట వాంఛనీయము ఇట్లు చేయుట వలన (1) ప్రభుత్వ విషయమున పౌరులకు విపరీత భావములు కల్గుటకు గల అవకాశములు సన్నగిల్లును ఏ ప్రత్యేక విషయమును గూర్చియైనను ప్రభుత్వము చేయు నిర్ణయములయొక్క గుణావగుణ విశేషములను ప్రజలు గ్రహింప గల్గుదురు

భిన్న సాధనముల ద్వారమున పటుతరమైన పౌరసంబంధములను కొనసాగింప వచ్చును మంత్రులు తమ ప్రసంగములలో ప్రభుత్వ మవలంబించు స్థూల రాజ్యాంగ విధానములను గూర్చి ప్రజలకు వెల్లడించ వచ్చును మంత్రుల ప్రసంగములు మామూలు కార్యక్రమములకు సంబంధించునవిగా నుండక, ప్రజాభి రుచికరములుగ నుండవలెను

భారత దేశమున ఆకాశవాణి మిగుల ఫలోత్పాదకముగ నుండగలదు ఆకాశవాణి కార్యక్రమములు తప్పక గ్రామీణులకు అందికలో నుండునట్లు సరియైన ఏర్పాటులు కావింప వలెను ఈ కార్యక్రమములు అభిరుచికరములుగను, కాలికములుగను, వరణాత్మకములుగను ఉండవలెను

వార్తాపత్రికలు నిర్వహింపవలసిన పాత్రయు కలదు ప్రజాసత్తాక రాజ్యమున వాటికి గల ప్రాముఖ్యమును తక్కువగా అంచనా వేయుటకు వీలులేదు పౌరులను విద్యావంతులుగ నొనర్చుటకై ప్రభుత్వము కరపత్రములను, పుస్తకములను, గోడల కంటింపబడు ప్రకటనములను ప్రచురించి పంచిపెట్ట వలెను ప్రభుత్వ ప్రచురణములు ఆకర్షకముగ నుండుటయే కాక, సులభ సాధ్యముగను, తక్కువ ధరలకు లభించునవిగను ఉండవలెను

ఈ విషయములో సినిమా విశేషముగా తోడ్పడగలదు ప్రజలలో విశేష సంఖ్యాకులు నిరక్షరాస్యులుగను, మూఢ విశ్వాసము కలవారుగను ఉన్న దేశములలో లోపరహితమైన పౌరసంబంధ స్థాపనమునకు సినిమా విశేషోపకారము కాగలదు ప్రసార-సమాచార మంత్రిత్వ విభాగమునకు చెందినవారు తమ అధ్వర్యవమున ఉత్పత్తి చేయబడు ఉచితములును, శిక్షణ పూర్ణములైన ఫిల్ములను ప్రదర్శింపజేయుచు తమ కృత్యములను బాగుగా నిర్వహించుచున్నారు

ప్రదర్శనము లనునవి ఆధునిక సమాజములో శాశ్వత స్థానము నేర్పరచు కొనినవి పౌరసంబంధ కార్యక్రమములో వాటికి న్యాయముగా సముచిత స్థానము కలదు అవి భారత దేశమున గల పౌరసంబంధ కార్యక్రమములలో కెల్ల మిక్కిలి అమోఘములైన సాధనములు హైదరాబాదు నందలి అఖిల భారత ప్రదర్శనము, ప్రజలకు దానివలన చేకూరు పరమ ప్రయోజనము, పేర్కొన దగినవి

ఈ సాధనములతో ప్రతి దానియందును లాభనష్టము లున్నవి పరిస్థితులను, సామాన్య మానవులకు లభించు అనుకూల్యమును, పరిసర సందర్భములను పురస్కరించుకొని, సముచితమైన సాధనమును చేపట్టి ఉపయోగింప వలెను

జాతీయ స్థాయిలో అనేక దేశములయందలి మంత్రిత్వ శాఖలలో ఒక ప్రత్యేక మంత్రిత్వశాఖ లేక పక్షము పౌరసంబంధ రక్షణమునకై ఏర్పడి యున్నది భారత దేశమున సమాచార-ప్రసార మంత్రిత్వశాఖయే పౌరసంబంధ రక్షణ బాధ్యతను వహించు చున్నది అది ఈ క్రింది ఏజెన్సీల ద్వారమున పనిచేయు చున్నది

1 అఖిలభారత ఆకాశవాణి
2 ఫిల్ము విభాగము
3 ఫిల్ములదోష వివేచన కేంద్రమండలి
4 ప్రకటనశాఖ
5 పత్రికా సమాచారశాఖ
6 ప్రచురణ విభాగము
7 రిఫరెన్స్ - పరిశోధన విభాగము

రాష్ట్రములలో సమాచార - పౌరసంబంధ సంచాలక కార్యాలయములు కలవు అవి ఉపయోగకరములైన కార్యములను నెరవేర్చు చున్నవి ఉదా ఆంధ్రప్రదేశ మందలి సంచాలక కార్యాలయము వార్తాపత్రికలందు పౌరులు కావించు విమర్శనములను గమనించి, అందు సమరు సంబంధముగల భాగములను కత్తిరించి, వాటిని, వాటితో సంబంధముగల వివిధ శాఖలకు అభిప్రాయము కొరకును, అవసర చర్యకొరకును పంపబడును భారత దేశమున కొన్ని రాష్ట్రము లందు జిల్లా స్థాయిలో ఇంతకు మున్నే పౌరసంబంధాధికారుల పదవు లేర్పడి యున్నవి ఉత్తర కాలమున ప్రతి ప్రభుత్వ కార్యాలయ మందును జాతీయ స్థాయిలోను, రాష్ట్రీ స్థాయిలోను ఒక పౌరసంబంధాధికారిని నియోగించుట వాంఛనీయము

ప్రణాళిక అనునది భారత దేశమున ఒక నూతన విషయము సాధారణముగా పౌరునకు ప్రణాళికతో గాని,

ప్రణాళికా కార్యక్రమముతో గాని పరిచయ ముండదు ప్రణాళికా భంగమునకు గల కారణములలో లోపభూయిష్ఠ మగు పౌరసంబంధ కార్యక్రమ మొకటి కానవచ్చును బాగుగా ఆలోచింపబడి, సక్రమముగా నిర్వహింపబడి భారత దేశమందలి గ్రామీణులకు వాస్తవముగా అందుబాటులో నున్న పౌరసంబంధ కార్యక్రమము యొక్క ఉత్తమ ప్రమాణమును బట్టి ప్రణాళిక జయమును నొందగలదని అంతగా నొక్కి వక్కాణింప నవసరము లేదు

పౌరసంబంధములను ప్రభుత్వ కార్యక్రమము యొక్క మదింపుగా అపార్థము చేసికొనగూడదు మదింపు యొక్క ఉద్దేశమే పూర్తిగా వేరు ఏదేని యొక ప్రత్యేక ప్రభుత్వ కార్యక్రమము యొక్క సామర్థ్యముతో దానికి సన్నిహిత సంబంధము కలదు అయితే పౌరసంబంధ శాఖకు ప్రభుత్వము తోను, పౌరులతోను ఎక్కువ సంబంధ ముండును సాధారణ మైన ప్రభుత్వ చర్యలను గూర్చి అపుడపుడు పౌరులకు తెలుపు చుండుటయే పౌరసంబంధ శాఖయొక్క ప్రధాన కర్తవ్యము జాన్ డి మిల్లెట్ అను ప్రాజ్ఞుడు పౌరసంబంధ విషయము నిట్లు సంగ్రహించెను "పౌరులు వాంఛించున దేదియో తెలిసి కొనుటయు, పరిపాలనాధికారులు వారి వాంఛలను ఎట్లు నెరవేర్చు చున్నారో వివరించుటయు, గత కాలమందలి దోషములు మరల జరుగబోవను నమ్మకము పుట్టించుటయు పౌరసంబంధము లనబడు చున్నవి భవిష్యత్సమస్యలను గూర్చి సలహా నొసగుటయే పౌరసంబంధ మనబడును అయితే ఉత్తమ కృత్యములను నిర్వహించని పౌరసంబంధము లెన్నటికిని ఉత్తమ కృత్య నిర్వహణమునకు ప్రత్యామ్నాయము కాజాలవు "

ఏ ఎ జే

## ప్రకాండము :

బీజ మంకురింపగనే, నిద్రావస్థయందున్న మొలక భూమ్యుపరి తలముపై సూర్యరశ్మిలో ప్రవేశించి, ఆకులను, కొమ్మలను ఇచ్చుచు పెరుగుచుండు భాగము ప్రకాండ మనబడును దీనిపై నిర్ణీత స్థానములైన కణుపులయొద్ద పత్రము లుద్భవించును రెండు కణుపుల నడుమ నుండు దూరము పొట్టిగ నుండవచ్చును లేదా పొడవుగ నుండ వచ్చును కాండముపై ఆకుల అమరికలు ఎన్నో విధములుగ నుండును ప్రతి పత్రము, కాండము యొక్క కణుపువద్ద పుట్టి, పటవాలుగా వ్యాపించి సూర్యరశ్మిని పొందుట కను వుగా నుండును ప్రతి పత్రము కాండముతో చేయు కోణము యొక్క భాగమును కక్ష యనెదరు ప్రతి పత్రము యొక్క కక్షయందును మొగ్గలు పుట్టును ఇవి కొమ్మలుగా పెరుగు చుండును ప్రధానశాఖ చివర చిన్న చిన్న పత్రము లతో ఒత్తుగా నున్న ప్రకాండపు తుదిభాగమున మొగ్గ యుండును వృక్షము యొక్క పెరుగుదలకు తోడ్పడు స్థావరములు ఈ రెండువిధములగు మొగ్గలయం దుండును వాటి యందలి జీవకణములు అతి త్వరితముగా విభజనము చెందును చెట్టుయందలి కణసముదాయమును ఎక్కువ చేయుచుండును మొగ్గ యనునది విస్తరింప జాలని ఒక సంక్షిప్త ప్రకాండము కాని అసాధారణములు మొగ్గలు, జామ, కానుగ చెట్లయందు వేరులనుండియు పనసచెట్టునందు ప్రకాండమంతటి నుండియు జనించి, శాఖలుగా పైకి లేచును రణపాలచెట్టునందీ కణ విభజనము చెందు చిరికాండ భాగము పత్రము యొక్క చివరి నక్కులలోనికి కొనిపోబడి, అచ్చట మొగ్గలు పుట్టును ఇవి క్రింద రాలి మొక్కలుగా లేచును

ప్రకాండపు ఎత్తునుబట్టి, వృక్షములు మొక్కలుగా, గుల్మములుగా, మ్రానులుగా విభజింప వచ్చును మొక్కలు కోమలమైన చిన్న ప్రకాండమును గలిగి, ఒక ఋతువులో నైనను, లేక ఒక సంవత్సరములో నైనను జీవితమును పూర్తి చేసికొన్నచో, ఏకవార్షికము లనబడును రెండు, అంతకంటె ఎక్కువ సంవత్సరములు జీవించినచో అవి ద్వివార్షికములు లేక బహువార్షికములని పిలువబడును గుల్మముల (పొదల) యొక్క కాండములు గట్టిగా నుండి కండ కలిగియుండును వాటి మొదళ్లనుండియే పలు శాఖలు బయలుదేరును అవి పరిమితమైన ఎత్తువరకు పెరుగును పెద్దపెద్ద వృక్షములు బోదెలను కలిగి మ్రానులను కట్టును వాటి కొమ్మలు నలు దిశలకును, ఊర్ధ్వముగ బాగుగా విస్తరించు చుండును

స్వభావసిద్ధముగా, వృక్షములకు దార్ఢ్యము గల ప్రకాండము లనియు, బలహీన ప్రకాండము లనియు రెండు తరగతులుగా పేర్కొన వచ్చును దార్ఢ్యము గలవి నిటారుగను, దృఢముగను పెరుగును బలహీనమగు కాండములు కొమ్మల భారమును వహింపలేక, ఏదేని యొక ఆధారము పైననో లేక నేలపైననో ప్రాకుచుండును నేలపై ప్రాకు

పాటిలో, పుష్పించునప్పుడు కొన పైకిలేచునట్టివి, ప్రతి కణుపువద్ద క్రిందికి వేళ్ళనిచ్చుచు పైకి కొమ్మల నిచ్చుచు పోవునట్టివి, ప్రధానశాఖ భూమిలో నుండగా పిటవాలుగా పిల్లశాఖలు పైకి లేచునట్టివి—ఇట్లు ఎన్నో రకములుగ నుండును ఆధారముపై ప్రాకుచు పెనవైచుకొనునవి కొన్ని యును, ప్రత్యేకాంగములు కల్గినవి కొన్నియును వీటియం దుండును ఇందుకు వేళ్లనైనను, నులితీగలనైనను, ముళ్ల నైనను, కొక్కిలనైనను ఉపయోగించుకొనుచు పైకి ఎగ ప్రాకు చుండును

కాండములు గుండ్రముగను, త్రిమూలముగను, చక్రీయ ముగను, బహుముఖములుగను, ఎత్తు పల్లములుగల రూపము లలోను కన్పించు చుండును కొన్ని కాండములు మెత్తగ బెండువలెను, కొన్ని బోలుగను, కొన్ని గట్టిగను, మరికొన్ని అంటులతోను, మచ్చలతోను పలు విధములుగా కన్పట్టును

సూర్యరశ్మి చక్కగా సోకుటకును, ఆహార సంపాదనము, దేహాభివృద్ధి సక్రమముగా జరుగుటకును కొమ్మల విభజన క్రమము అవసరము ప్రకాండపు మొగ్గ విభజనము చెంది రెండు కొమ్మలుగా పెరుగుట, పుష్పహీన వృక్షములలో అగ్రపు మొగ్గ పెరుగుచు కక్షమొగ్గలభివృద్ధి చెందుట పుష్పసస్యము లలో చూడగలము ఏక దళములలో శాఖలు అరుదుగా కాన్పించును కక్షమొగ్గల పెరుగుదల వ్యవస్థితము, అవ్యవ స్థితము అని రెండు విధములు వ్యవస్థ స్థితియందు కాండము కొంతవరకు పెరిగి, పూమొగ్గగనో, లేక ముల్లుగనో, లేక తీగగనో అంతమొంది, ప్రక్క కక్షనుండి కొమ్మలు బయలు

చిత్రము 86



దేరును అవ్యవస్థిత విధమందు ప్రకాండము పెరుగుచు, కక్ష మొగ్గలు శాఖలుగా అవరోహణ క్రమములో పెరుగు చుండును ఇట్టి కొమ్మలు ఆ తీగను గాని పువ్వును గాని ప్రక్కకు నెట్టి, ప్రధానస్థాన మాక్రమించి, కపట కాండమైనను, అది నిజకాండముగా ప్రవర్తించుట ద్రాక్ష, నల్లేరు మొక్కలలో చూడగలము ఇట్టి విషయము ఏకాంత పత్ర అమరిక కాండములలోనే సంభవించును అభిముఖ పత్రము లున్నపుడు రెండు కక్ష మొగ్గలు ఒక్కుమ్మడిగా పెరుగు చుండును బహుపత్ర వర్తులాకారమున నున్నపుడు ఎన్నియో శాఖలు ఒక్కుమ్మడిగా పెరుగు చుండును

ప్రకాండపు విధులన్నియు అంతర్భాగస్థ కణసంహతి యొక్క అమరికపై ఆధారపడి యుండును కావున దానిని అడ్డకోతయందు పరిశీలించినచో, వెలుపలి పొరయగు (బాహ్యచర్మము) దాని లోపట్టున నుండు వల్కలమును, మధ్యములో నుండు కేంద్ర వృత్తమును (దవ్వ) చూడగలము బాహ్యచర్మము ఏకకణ మందములో ఒకే వరుసయందు క్రిక్కిరిసి యుండును పైన నుండు 'క్యూటిన్' పూత అంతర్భాగమును రక్షించు చుండును ఇందలి కొన్నికొన్ని కణములు పత్రరంధ్రములుగను, రోమములుగను మారు చుండును ఏకదళ బీజములలో రోమములు అరుదుగను, క్యూటిను మందముగను ఉండును రోమములలో హరిత కణికలు తక్కువగ నుండును కాని చర్మము నందలి కణము లన్నిటి యందును హరిత కణిక లుండును ఈ చర్మము నందలి కొన్ని కణములలో విసర్జక పదార్థములగు నిరేంద్రియ స్ఫటికములు కూర్చబడును వల్కలము ఎన్నియో వరుసలుగ నుండును బాహ్యచర్మము క్రింది మూడు నాలుగు వరుస లలో హరిత కణికలు హెచ్చుగ నుండును గోడలు మందమైన కణములతో నున్న భాగమును 'కాలెంకైమా' అనియు లేక క్రింది చర్మమనియు పిలుతురు ఇది కాండమునకు దార్ఢ్యమును కల్గించును తరువాతి వరుసలు పలుచని గోడలతో వదులుగా నుండి, మధ్యభాగములో ఖాళీ స్థలము లేర్పడును ఇందు గ్లూకోసెన్, రాఫిడెస్ అను నిరేంద్రియ పదార్థములను, బిగురును, పాలకణముల పెంపును కూడ అచ్చటచ్చట కొన్ని ద్విదళ ములలో చూడగలము వల్కలము యొక్క చివర వరుస దవ్వభాగమును చుట్టి దళసరి గోడలతో దట్టముగ నుండును ఇందు పిండికణము లుండుటచే, ఈ వరుస పిండి తొడుగని పిలువబడుచున్నది ఏకదళములలో ఈ పిండి తొడుగు ఉండదు. దవ్వభాగము వృత్తాకారములో గాక, నాళికా పుంజములన్నియు వల్కలమునందే వెదజల్లబడి యుండును ద్విదళములలో కేంద్రమందలి దవ్వభాగము వృత్తాకార మందుండి, పైనుండు "పెరిసైకిల్" అను కొన్నిపొరలు హార్డ్ బాస్ట్‌గా మారి దార్ఢ్యమును కలుగ చేయును ఏకదళములలో పెరిసైకిల్ ఉండదు కాని హార్డ్ బాస్టు వెదజల్లబడిన ప్రతిపుంజమును చుట్టియుండును వృత్తాకారమున అమర్చబడిన పుంజములకు ముందు కేంద్రమునందు బెండువంటి భాగమును ద్విదళములలో చూడగలము కాని అట్టిదానిని ఏకదళములలో గుర్తింపలేము నాళికా పుంజములు శోషక, పోషక నాళములను కలిగియుండును శోషక నాళములలోని కణములు పలువిధములైన గట్టి గోడ లను కలిగి, లిరిగి అవిభాజ్యములుగా మారి, ఒక కణము ఇంకొక కణముతో కలిసి గొట్టముగా, క్రిందినుండి పైవరకు ఒకే నాళముగా మారి, నీటిని నిరాటంకముగా సరఫరా చేయుచుండును ఇందు నాళపు వెడల్పును బట్టి, తొలి నాళము, తుదినాళము అని ప్రతి పుంజమునం దుండును ఏకదళ వృక్షములలో ప్రతి పుంజమునందును శోషక, పోషక నాళములను చుట్టి దార్ఢ్యకణ సముదాయముండును కాని ద్విదళములలో ఇట్టి కవచముండక, శోషక, పోషక నాళ ముల మధ్యగా 'కేంబియమ్' అను జీవకణ సముదాయ ముండును ఇది విభజనము చెందుచు, క్రొత్త శోషక, పోషక నాళముల నిచ్చుటవలన, మొక్కలోని పుంజములెల్ల కలిసి వృత్తముగా మారును ఈ విధమైన క్రొత్త కణముల కూర్పు వలననే ప్రకాండము యొక్క పరిధియు, మందమును పెరుగుచుండును ఇట్టి కూర్పు సంవత్సరమునకు రెండు మారులు జరుగుటవలన, వర్తులాకారములో అంత్య, ఆది, అనుశోషక, నాళ సమ్మిళిత వృత్తములు వృక్షమునం దెన్నియో ఏర్పడును వాటినిబట్టి చెట్టు వయస్సును లెక్కింప వచ్చును మొక్కనుండి క్రమానులోనికి మార్పు చెందిన దవ్వభాగమే మన మనుగడకు ఉపయుక్తమైన కలప యగుచున్నది కణ విభజనమునకు ఉత్తేజనము కల్గించు 'కేంబి యమ్' కణములు ఏక దళములందలి నాళికా పుంజము లందుండవు కావున, అందు కాండపు కైవారము పెరుగ నేరదు కలప భాగపు వృత్తములలోని శోషక నాళములు విసర్జక

పదార్థములైన సూబరిన్ లిగ్రినులతో నిండి చివరకు గట్టి కలపభాగము నేర్పాటు చేయుచుండును దీనిని 'చేవకర్ర' అని పిలిచెదరు ప్రకాండము యొక్క మందము అభివృద్ధి చెందునప్పుడు బాహ్యచర్మ కణములు విచ్ఛిన్న మగుటయో, లేక చచ్చి అతిపోవుటయో సహజము అట్టి సమయ మున వల్కలమునందు నూతన 'కెంబియం' జనించి, లోపలి కణసముదాయ రక్షణార్థమై క్రొత్త కణములను బాహ్య చర్మమునకు అందించుచు పోవును ఈ విధముగా కొన్ని సంవత్సరముల అనంతరము మందమగు బెరడువంటి బాహ్య చర్మ మేర్పడును ఓకు వృక్షమందలి ఈ భాగమే సీసా బిరడాలుగా ఉపయోగ పడుచున్నది ఇతర వృక్షములలోని వేళ్ళు పొలుసులుగా మారుట చూచు చున్నాము ఇందచ్చ టచ్చట పైభాగమున పగుళ్ళుండుటచే, క్రింది వల్కలము వదులుగా నుండి శ్వాసక్రియకు అనుకూల మగుచున్నది ఇందు మానవాళి కుపయుక్తములగు వృక్ష విసర్జకను లెన్నియో కూర్చబడు చున్నవి (రంగులు, జిగుర్లు, మత్తు పదార్థములు, మందు పదార్థములు మున్నగునవి)

ప్రకాండము కొమ్మలుగా చీలి, పత్రములతోను, పుష్ప ములతోను వాతావరణము సోకునట్లుగా విస్తరించి యుండును వేరులనుండి గ్రహింపబడు లవణ ద్రవములు ఆకులకు పోషక నాళముల ద్వారా సరఫరా యగునట్లును, ఆకులం దుత్పత్తియగు ఆహారము పోషక నాళములద్వారా ఇతర భాగముల పోషణమునకు చేరునట్లును ఏర్పరుపబడును ఆకులయొక్క, కొమ్మలయొక్క, ఫలములయొక్క భార మును వహించునట్లును, వాయుపీడనమును తట్టుకొనునట్లును ప్రకాండము ధార్ఢ్యకణములను కలిగియుండును ఆకులకు తోడుగా హరితకణికలు కల్గి కిరణ జన్య సంయోగ క్రియ వలన ఆహారమును సిద్ధమొనర్చి కూర్చు చుండుటచే, ఇందలి వల్కలమును ఆహార గిడ్డంగి అనియెదరు ఇది శాఖయోత్పత్తికి అనువుగ నున్నందున త్వరితముగా ఫలమును పొందవచ్చును

లవణ ద్రవముల యొక్క, ఆహారము యొక్క సరఫ రాలతో పాటు సంతానోత్పత్తి కవసరమైన అంగములను ధరించుటే కాక, పరిసర ప్రభావముల ననుసరించి ప్రకాం డము రూపాంతరము చెందుచుండును అందులో తన అంగ భాగములైన కణుపు, కణుపు నిడివి, కక్షమొగ్గ, పత్రములను కొంచెముగనో, గొప్పగనో ఇతర రూపములయందు చూపు చుండును అందుచే వాటిని సులభముగా గుర్తించి, అవి కాండపు రూపాంతరములని చెప్పవచ్చును కాండము భూ గర్భము నందును, మధ్యగతముగను, వాయుగతముగను రూపాంతరము చెందును కాండము భూమ్యుపరితలముపై నున్నపుడు కొన్ని మొగ్గలు అగ్రముపైనను, కక్షపైనను ముల్లులుగా మారును అట్టివాటిపై కణుపులు, ఆకులు కాంచ కన్పట్టును కొన్ని అగ్రపుమొగ్గలు పార్శ్వమున ప్రకాండముల నిడి, కొక్కెలుగా మారును బలహీన వృక్షములలో అగ్రము పైనను, కక్షపైన నులి తీగెలుగా మారి చెట్టును పైకి ఎగ బ్రాకించును ఎడారి మొక్కలలో బాష్పోత్సేకము తగ్గిం చుటకై, పత్రములు క్షీణించుట వలన ప్రకాండము బల్ల పరుపుగా మారి, హరితకణికలు గల్గి, కిరణజన్య క్రియ గల్గి చున్నందున, ఆ కాండము పత్రాభాస మనబడుచున్నది బహువార్షిక వృక్షములలో కొన్ని పర్యాయములు కాండము గిడ్డంగిగా మారి, భూగర్భమున ఉండి, మరుసటి సంవత్సర మునకై ఆహారమును కూర్చుచుండును ఇందువలన ప్రకాం డము నందలి కణుపుల నిడివి చిన్నదిగను, ఆకులు పొరల రూపముననను ఉండుట అల్లము, కందగడ్డలలో గమనింప వచ్చును ఇవి భూమియందు నిలబడిగాని లేక పరుండిగాని ఉండవచ్చును కొన్ని పర్యాయములు గుండ్రని కొనలు (అగ్రము లేక కక్షమొగ్గలు) అంతర్భాగమం దుండి, వాటి కొన తొక్కుమన్నదిగా ఉబికి, దుంపలుగా మారును వీటియందు మనము 'కన్నులు' అను భాగములలో చిరుమొగ్గలను గిరిగి చూడవచ్చును పొరల దుంపలగు ఉల్లియందు, వెల్లుల్లియందు కాండము దిమ్మెవలె మారి, (బహుసరి) ఆకులు గిడ్డంగులై దట్టముగా పొరలవలె గుండ్రముగా చుట్టుకొని భూగర్భములో నుండును ఇవన్నియు ఆహారమును కూర్చి మానవాళిని పోషించు చున్నవి మధ్యగత ప్రకాండము అనునవి భూమిపై పొరయొద్దనే పోవుచు, పైకి శాఖల నిచ్చుచుండు టచే, ఇవి శాఖయోత్పత్తికి ఉపకరించుచున్నవి

పలువిధములుగా ప్రకాండములు మార్పులు చెంది ప్రజానీకమునకు ప్రాణాధారము లగుచున్నవి

బి. రా

## ప్రకాశనము - బల్బులు

కాంతి యనునది శక్తియొక్క ఒక రూపము ఈ కాంతియే నేత్రమునకు దృష్టి అను ఇంద్రియ జ్ఞానమును

కలుగజేయును సూర్యుడు, నక్షత్రములు, విద్యుద్దీపములు మున్నగు ప్రకాశవంతమైన వస్తువులు కాంతికి మూలాధారములు సూర్యునినుండి కాంతియే కాక, ఉష్ణముకూడ లభించు చున్నది ఉష్ణము, కాంతియు శక్తియొక్క తరంగములు ఆ తరంగములు విద్యుదయస్కాంత తరంగము లన బడును వీటి తరంగ దైర్ఘ్యము చాల తక్కువ, అందుచే వీటి సాతత్యము చాల ఎక్కువగా నుండును

చెరువునందు నిశ్చలముగ నున్న నీటిలో రాయి విసరినచో కలుగు నీటి తరంగములు మనకు అనుభవమే రాయి నీటి మీద పడిన బిందువునుండి ఈ తరంగములు అన్ని దిక్కులకు పయనించును పరిశీలించినచో, నీరుమాత్రము కదలదు, కాని తరంగము మాత్రము దరికి చేరును ఈ తరంగములు దిగువ 1వ పటములో చూపబడినవి

M, N ల మధ్యదూరము తరంగ దైర్ఘ్య మనబడును అటులనే వరుసగానున్న రెండు శిఖల మధ్యదూరము కూడ తరంగ దైర్ఘ్య మనబడును తరంగము ఒక ఆవృత్తిలో పోవు దూరముకూడ తరంగ దైర్ఘ్యమే ఒక సెకనులో తరంగము '$f$' ఆవృత్తులు చేసినచో, అది $f \times \lambda$ దూరము ప్రయాణము చేసినట్లగును దీనినే 'వేగము' ($v$) అని యనెదరు కావున $v = f\lambda$ అగును, ఇందు $v$ సెకనుకు పోవు దూరము, $f$ ఆవృత్తుల సాతత్యము, $\lambda$ తరంగ దైర్ఘ్యము

చిత్రము 87



పటము 1

ప్రకాశత్వము విద్యుద్దీపములు

శాస్త్రవేత్తలు తరంగములను కాంతికిరణములు, గామా కిరణములు, X - కిరణములు, రేడియో తరంగములు, ఉష్ణ తరంగములుగా విభజించి, ఇవన్నియు విద్యుదయస్కాంత తరంగముల కుటుంబమునకు చెందినవని కని పెట్టిరి వీటి వేగమును C' అనెదరు రోదసిలో వీటి వేగము సెకనుకు $3 \times 10^{8}$ మీటర్లు కాంతి కిరణముల తరంగ దైర్ఘ్యము చాల తక్కువ అందుచే దీనిని 'ఆంగ్ స్ట్రామ్' యూనిట్లలో కొలిచెదరు ఒక 'ఆంగ్ స్ట్రామ్' యూనిటు $10^{-10}$ మీటరుకు సమానము పసుపు పచ్చని కిరణమునకు తరంగ దైర్ఘ్యము 6000 ఆంగ్ స్ట్రామ్ అయినచో, దాని సాతత్యము

$$= \frac{3 \times 10^{8}}{6000 \times 10^{-10}} = 5 \times 10^{14} \text{ ఆవృత్తులు}$$

సూర్యునినుండి వచ్చు వెలుతురు తెల్లగ నుండును కాని నిజమునకు ఈ తెల్లని కాంతియందు వర్ణమాలలోని తరంగ దైర్ఘ్యము లన్నియు గోచర మగును ఈ తరంగ దైర్ఘ్యముల మిశ్రమము తెల్లని రంగుగా కనిపించును ఈ తరంగముల నన్నిటిని పరావర్తనము చేయు తలము ఏదైనను తెల్లగ కనిపించును కొన్ని తలములు కొన్ని తరంగములను మాత్రమే పరావర్తన మొనర్చి మిగిలిన వాటిని ఇముడ్చు కొనును ఎరుపు మినహా మిగిలిన కిరణములను ఇముడ్చు కొను తలము ఎర్రగ కనిపించును అది ఎర్రని కిరణములను మాత్రమే పరావర్తన మొనర్చుట ఇందుకు కారణము

కాంతిజనకములు ప్రకాశవంతములైన వస్తువు లన్నియు వెలుతురును కలుగ జేయును సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు సహజములైన కాంతిజనకములు కంటికి బాధలేక వస్తువులను చూడవలె నన్నచో, కొంత ప్రకాశత్వ ముండవలెను, ఒక ప్రమాణపు వైశాల్యముమీద ఒక సెకనులో పడెడి మొత్తపు కాంతి ప్రకాశత్వ మనబడును చంద్రుడు పూర్తిగా ఆకాశములో నున్నను, పౌర్ణమి నాటి రాత్రి స్పష్టముగ కాన్పింపదు తగినంత ప్రకాశత్వము లేకుండుటే దానికి కారణము పగలు కూడ మబ్బులు క్రమ్మి నపుడు అటులనే యుండును

రాత్రిగాని, పగలుగాని తగినంత వెలుతురు కావలె నన్నచో, సహజమగు కాంతిజనకములపై ఆధారపడుటకు వీలులేదు యంత్రాగారములు, కచేరీలు, పాఠశాలలు బాగుగా పని చేయవలె ననినచో, తగిన వెలుతు రుండవలెను ఇందుకు కృత్రిమ కాంతి జనకముల నుపయోగింప వలెను వీటిలో విద్యుచ్ఛక్తిచే పనిచేయు కాంతిజనకము ఉత్తమమైనది నిజమునకు పూర్వము వ్యాపార రంగమునకే విద్యుచ్ఛక్తిని ఉపయోగించెడివారు ఇప్పుడు కూడ విశేష భాగము విద్యుచ్ఛక్తి అందుకే ఉపయోగ పడుచున్నది తక్కిన పద్ధతులకంటె, విద్యుద్దీపముల విధానము వలన విశేష ప్రయోజనములు కలవు విద్యుత్తు చౌకగను, సౌకర్యముగను ఉండును పైగా విద్యుత్తును అదుపునం దుంచవచ్చును సినిమాలు, నాటకములు విద్యుచ్ఛక్తి లేనిదే పని చేయజాలవు విద్యుచ్ఛక్తి వలన గృహములు శుభ్రముగను, ప్రకాశవంతముగను ఉండగలవు

వివిధ రకముల దీపములు విద్యుద్దీపమును మూడు రకములుగ విభజింప వచ్చును 1 తాప ప్రదీపములు,

2 చాప దీపములు, 3 ఉత్సర్గ దీపములు 1860 నుండి 1948వ సం॥ వరకు జరగిన విద్యుద్దీపముల అభివృద్ధి, వాటి కాంతి నైపుణ్యము ఈ దిగువ చూపిన రెండు పటముల (2, 3) నుండి తెలియగలదు

తాప ప్రదీపములు ఈ దీపమొక గాజుగోళము (బల్బు) (5వ పటమును చూడుము) ఇందులో టంగ్స్టన్ లోహముతో చేయబడిన 'ఫిలమెంటు' అనబడు సన్నని తీగ చుట్ట ఉండును దీనిలో విద్యుత్తు ప్రవహించునపుడు, అది వేడెక్కి నిప్పువలె ఎర్రబడును దీని ఉష్ణము ఎక్కువైనకొలది అది పసుపు రంగును పొంది క్రమముగా తెల్లబడును ఫిలమెంటు యొక్క ఉష్ణమును ఎక్కువ చేయుటచే వ్యక్తమగు వర్ణమాలలోని కిరణము లన్నియు ప్రసరింపబడును గాజు గోళమును జడవాయువులైన నత్రజనితో గాని, ఆర్గాన్‌తో గాని నింపెదరు టంగ్స్టన్ ఫిలమెంటును 2950°C పరమోష్ణమునకు (2950 = 2677° + 273° సెంటిగ్రేడు) వేడి చేసినపుడు దీపము యొక్క వెలుతురు ఎక్కువగును ఈ దీపముల నుండి వచ్చు వెలుతురు పసుపు వర్ణముతో కూడిన తెలుపు రంగుగ నుండును

చిత్రము 38




పటము 2
ప్రకాశత్వము - విద్యుద్దీపములు

చిత్రము 39.

| Date | Type | Filament | Quantity of light per watt |
|---|---|---|---|
| 1880 | Arc | | |
| 1880 | Carbon | | |
| 1909 | Tungsten vacuum | | |
| 1913 | Tungsten gas filled | | |
| 1934 | Tungsten coiled coil | | |
| 1944 | Fluorescent tube | | |

పటము 3
ప్రకాశత్వము - విద్యుద్దీపములు.

చాపదీపములు ఈ దీపములలో కొంచెము ఎడముగనున్న రెండు ఎలక్ట్రోడుల మధ్య విద్యుచ్చాప మేర్పడును కార్బను కడ్డీలను ఎలక్ట్రోడులుగ ఉపయోగించునప్పుడు, దానిని కర్బనచాప దీపమందురు గట్టి కర్బనమును ఎలక్ట్రోడుల కుపయోగింతురు చాప మేర్పడినపుడు ధనకర్బనము చివర గొయ్యి ఏర్పడును ఇది తెల్లగ నుండి చాల భాగము కాంతి నిచ్చును (4వ పటమును చూడుడు) చాపమును స్థిరముగ నుంచుటకు శ్రేణిలో ఒక నిరోధమును ఉపయోగించెదరు కార్బను చాపము కేంద్రీకరింపబడినచో, అత్యధికమైన కాంతి నిచ్చును అందుచే దీనిని 35 మి మీ సినిమా ప్రొజెక్టరు లన్నిటిలో ఉపయోగించెదరు

చిత్రము 40

పటము 4
ప్రకాశత్వము- విద్యుద్దీపములు

ఉత్సర్గ దీపములు వీనికిని తాపప్రదీపములకును ప్రాథమికమైన తేడా కలదు తాప ప్రదీపములలో ఫిలమెంటు ప్రకాశించును కాని ఉత్సర్గ దీపములలో ఒక వాయువు నుండి గాని, ఆవిరినుండి గాని విద్యుత్తు ప్రవహించును అపుడా వాయువు గాని, ఆవిరి గాని ప్రకాశవంతమై వెలుతురు నిచ్చును

సామాన్య పరిస్థితులలో వాయువులువిద్యుద్వాహకములు గావు కాని కొన్ని ప్రత్యేకమైన పరిస్థితులలో అవి వాహకము లగును అప్పుడు మాత్రము అవి వెలుగు నియ్యగలవు ఆ సంఘటనమును అర్థము చేసికొనవలెనన్నచో, ద్రవ్యము యొక్క నిర్మాణమును గూర్చి తెలిసికొనవలెను (6వ పటము చూడుడు) పరమాణు కేంద్రమునుండి వివిధ దూరములలో వివిధ వలయములలో క్రమానుసారముగ ఎలక్ట్రానులు పరిభ్రమించుచుండును కేంద్రకమునకు దగ్గరగా నుండువాని వేగము చాల హెచ్చుగ నుండును అందుచే వాటి వలయములు అభేద్యమైన పొరలుగ నుండును ఒక్కొక్క వలయములో గరిష్ఠ సంఖ్యగల కొన్ని ఎలక్ట్రానులు మాత్రమే తిరుగు

చిత్రము 41




పటము 5
నేటి ఎలక్ట్రిక్ బల్బు
1 బేయొనెట్ క్యాప్ 2 ఫిలమెంట్ లీడ్స 3 కాయిల్డ్ ఫిలమెంట్ 4 ఫిలమెంటు ఆధారములు

చిత్రము 42.

పటము 6
ప్రకాశత్వము-విద్యుద్దీపములు.

చుండును మొకటి పొరను K పొర లేక వలయము అని యందురు ఇందులో 2 కంటె ఎక్కువ ఎలక్ట్రానులుండవు తరువాతి పొరను L పొరయని అందురు దీనిలో ఎలక్ట్రానులు 8 వరకుండును తరువాతిది M పొర దీనిలో ఎలక్ట్రానులు 18 వరకు మాత్రమే ఉండును

ఒక్కొక్కప్పుడు బాహ్యశక్తి యొక్క ఉపయోగము వలన పరమాణుశక్తి ఎక్కువై లోపలి పొరలోని ఎలక్ట్రాను బయటి పొరలోనికి స్థానచలనము పొందును అప్పుడు పరమాణువు ఉద్రిక్త స్థితిలో ఉన్నదందురు ఈ బయటి పొరలోనికి వెళ్ళిన ఎలక్ట్రానులు తిరిగి లోపలి పొరలోనికి వెళ్ళినప్పుడు పరమాణువునుండి శక్తి విద్యుదయస్కాంత కిరణముల రూపములో బయల్వెడలును ఈ తరంగ దైర్ఘ్యములు కనిపించునట్లున్నచో, అది కాంతి తరంగముగా ఉద్భవించును విద్యుదుత్సర్గ దీపములలో జరుగు పని ఇదియే

ప్రాథమికముగ ప్రతి ఉత్సర్గ దీపములో నైనను తక్కువ పీడనములో నున్న ఏదైన వాయువు గాని, ఆవిరి గాని కలిగిన గొట్ట ముండును దానికి 6వ పటములో చూపినట్లు A (Anode), K (Cathode) అను రెండు ధ్రువము లుండును ఈ రెండు ఎలక్ట్రోడులమధ్య ఎక్కువ ఓల్టేజిని కలుగ జేయుదురు తక్కువ పీడనములో నున్న గొట్టము లోపలి వాయువులో నుండి విద్యుత్తు ప్రసార మగును అప్పుడా వాయువు ప్రకాశవంతముగు వెలుగు నిచ్చును ఈ గొట్టములను డి సి మీద గాని, ఎ సి మీద గాని పని చేయించ వచ్చును ఒక్కొక్కప్పుడు ప్రమాదకరమైన ఎక్కువ విద్యుత్ప్రవాహము గొట్టములో కలుగ వచ్చును అట్లు జరుగకుండ శ్రేణిలో ఒక నిరోధకమును ఉపయోగించెదరు డి సి మీద పని చేయించునపుడు నిరోధకమును, ఎ సి మీద పనిచేయించునపుడు చోక్‌ను వాడెదరు

కొన్ని రకముల ఉత్సర్గ దీపములను గురించి దిగువన వివరింప బడినది

అధిక పీడనము గల పాదరసపు ఆవిరి దీపము వెలుతురును కలుగజేయుటకు ఈ దీపములో పాదరసపు ఆవిరిని ఉపయోగించెదరు (7వ పటము చూడుడు) పాదరసపు ఆవిరిలో నుండి విద్యుదుత్సర్గము కలిగినపుడు వర్ణమాలలోని కొన్ని కాంతి కిరణములు బహిర్గత మగును దీపమునుండి కాంతి యొక్క రంగు పాదరసపు ఆవిరి యొక్క పీడనము మీద ఆధారపడి యుండును పరిశ్రమలలో సాధారణముగా ఎక్కువ పీడనము గల పాదరసపు ఆవిరి దీపము నుపయోగింతురు దీని పీడనము 2 నుండి 6 వాతావరణముల వరకు ఉండును (1 వాతావరణ పీడన మనగా 1 చ అంగుళమునకు 14 7 పౌనుల బలము లేక ఒక చతురపు మీటరునకు 9 678 కిలోగ్రాముల బలము) తక్కువ పీడనపు దీపముల కంటె ఈ దీపములు ఎక్కువ నీలము - తెలుపురంగు నిచ్చును ఈ దీపములు కనిపించు కాంతి కిరణములతో పాటు కనిపించని అతి నీలలోహిత కిరణములను కూడ నిచ్చును (7వ పటము చూడుడు)

చిత్రము 13



MERCURY DISCHARGE LAMP

పటము 7

ప్రకాశత్వము - విద్యుద్దీపములు

7వ పటము (అ) లో ఎక్కువ పీడనములో పనిచేయు పాదరసపు ఆవిరి దీపమును చూడవచ్చును దీనిలో ఒక దానిలో నొకటి రెండు గాజుగొట్టము లుండును లోపలి గొట్టమే ఉత్సర్గ దీపము ఇందులో ఒక పాదరసపు బిందువు, కొంచెము ఆర్గానువాయువు, మెలికలు తిరిగి తీగచుట్టలుగ నున్న రెండు ఎలక్ట్రోడులు, ఆరంభముచేయు మరియొక ఎలక్ట్రోడును ఉండును, ఈ దీపమునకు తీగలను అమర్చు పద్ధతి 7వ పటములో (ఆ) చూపబడినది

ముందుగా ఆరంభము చేయు ఎలక్ట్రోడు, ప్రధానమైన ఎలక్ట్రోడు A ల నడుమ ఉత్సర్గము కలుగును ఇందుకు ఆర్గాను వాయువు ఉపకరించును తరువాత ప్రధానమైన ఎలక్ట్రోడులమధ్య నిరోధము తగ్గి, వాటిమధ్య ఉత్సర్గ మేర్పడును ఇందువలన కలుగు వేడికి పాదరసము ఆవిరి

యగును పాదరస మంతయు ఆవిరియైన పిదప, అది ఉత్సర్గ దీపముగ పనిచేయును అప్పుడు కనిపించు వర్ణములలోని కొన్ని కాంతికిరణములు ప్రసరించును ఈ ఉత్సర్గపు గొట్టము యొక్క ఉష్ణత వాతావరణము ఉష్ణతను బట్టి మారకయుండవలెను అందుచే దానిని మరొక బయటి గొట్టములో పెట్టి, రెండింటిమధ్య నున్న గాలిని తీసివేయుదురు గొట్టము యొక్క ఉష్ణము గరిష్ఠ విలువను పొందినపుడు, అత్యంత ప్రకాశవంతమైన నీలము, తెలుపురంగు గల కాంతి వెలువడును ఫిలమెంటు దీపములో ఉష్ణముతో నిరోధము ఎక్కువగును కాని ఉత్సర్గ దీపములో ఉష్ణతతో నిరోధము తక్కువగును అందుచే దీనిలో ఉష్ణము ఎక్కువైన కొలది విద్యుత్ ప్రవాహము కూడ ఎక్కువ కాకుండునట్లు దీపమునకు శ్రేణిలో 'చోక్' అను తీగచుట్టను అమర్చెదరు ప్రధానమైన విద్యుత్ప్రవాహపు సరఫరానుండి ఈ దీపము ఎక్కువ విద్యుత్తును తీసికొన కుండునట్లు దీపమునకు సమాంతరముగ ఒక కండెన్సరును బిగించెదరు

ఇంతే వాటేజి గల ఫిలమెంటు దీపముకంటె, దీనిలో ఎక్కువ వెలుతురు వచ్చును (8వ పటము చూడుడు) ఈ దీపములను 20 నుండి 30 వాతావరణముల పీడనము వరకు పని చేయించ వచ్చును

నీలము - తెలుపు కలిసిన రంగు వెలుతురు నిచ్చుట వలన, ఈ దీపములను గృహములలో నుపయోగింపరు వీటిని ఎక్కువగా వీథులలోను, బహిరంగ ప్రదేశము లందును అమర్చెదరు ఈ దీపములు వేడెక్కి పూర్తిగ ప్రకాశవంత మగుటకు 10 నిమిషములు పట్టును ఓల్టేజి మార్పుల కిది అతి సున్నితముగ నుండును

**సోడియం ఆవిరి దీపము** ఇది వర్ణమాలలోని పసుపు పచ్చని భాగమునందలి ఒకే రంగును ఇచ్చును ఇది U ఆకారముగ నుండు గాజుగొట్టము దీనిలో 'నియాన్' వాయువు, కొంచెము సోడియము ఉండును రెండు చివరల యందు రెండు ఎలక్ట్రోడు లుండును దీనిలో ఉత్సర్గమును ఆరంభించుటకు చాల ఎక్కువ ఓల్టేజి కావలెను అందు కొరకు ఆటో ట్రాన్స్‌ఫార్మరును అమర్చెదరు మొట్టమొదట నియాన్ వాయువులో ఉత్సర్గము ఆరంభింప బడును దీనినుండి ఎర్రని వెలుతురు వచ్చును దీపము యొక్క ఉష్ణత క్రమముగ పెరిగి సోడియము ఆవిరి యగును అపుడు సోడియము ఆవిరినుండి ఉత్సర్గము కలిగి, ప్రకాశవంతమగు పసుపు పచ్చ-నారింజ రంగు కలిసిన వెలుతురు జనించును U గొట్టము చుట్టును జంట గోడలు గల గాజుగొట్ట ముండును ఈ రెండు గోడల నడుమ గాలి తీసి వేయబడును అందుచేత లోపల ఉన్న ఉత్సర్గపు గొట్టము యొక్క ఉష్ణము తగ్గక ఉండును పసుపు పచ్చని వెలుతురు నిచ్చుటచే, ఇది గృహములలో ఉపయోగమునకు సరిపడక, వీథులలో ఎక్కువగా వాడబడును

**స్ఫోరక దీపము** ఇది 1 అంగుళము నుండి $1\frac{1}{2}$ అంగుళముల వరకు వ్యాసార్ధము కలిగి, $1\frac{1}{2}$ అడుగుల నుండి 5 అడుగుల వరకు పొడవుగల గాజుగొట్టములో చేయబడిన దీపము ఇది తక్కువ పీడనముతో పనిచేయు పాదరసపు ఆవిరి దీపము దీనినుండి పగటివేళ కన్పట్టు వెలుతురు లభించును పాదరసము ఆవిరిలో కలుగు ఉత్సర్గము వలన, కంటికి కాన్పింపని అతి నీలలోహిత కిరణములే ఎక్కువగా వచ్చును అందుచే అవి వెలుతురు నిచ్చుటకు ఉపయోగ పడవు

అతి నీలలోహిత కిరణములు కొన్ని స్ఫోరక పదార్థములపై పడినపుడు, అవి ఉత్తేజితమై కంటికి కనబడు వివిధ వర్ణముల వెలుతురును ఇచ్చును మనకు ఏరంగు వెలుతురు కావలెనో, ఆ రంగు నిచ్చు స్ఫోరక పదార్థమును కాని, పదార్థముల మిశ్రమమును గాని దీపపు గొట్టములోపలి భాగము మీద పూతగా పూయుదురు పగటి వెలుతురువంటి కాంతి కావలెనన్నచో, కొన్ని స్ఫోరకపదార్థముల మిశ్రమమును వాడెదరు

చిత్రము 44




పటము 8

ప్రకాశత్వము - విద్యుద్దీపములు

పై రెండు పటములలో స్ఫోరక దీపమును చూడవచ్చును ఈ గొట్టములో రెండు చివరలపై రెండు ఎలక్ట్రోడు లుండును ఇవి తీగల చుట్టలు వీటిమీద ఎలక్ట్రానులను విడుదలచేయు పదార్థములను పూత పూయుదురు ఈ దీపము యొక్క ఉష్ణము 50 సెం డిగ్రీల లోపుగా నుండును అందుచే దీని పైన ఇంకొక గొట్ట ముండదు కొన్ని మిల్లిగ్రాముల బరువుగల పాదరసము, కొంచెము ఆర్గాను వాయువు ఈ గొట్టములో నుండును

గొట్టము మిగుల పొడవుగ నుండుటవలన ఎలక్ట్రోడు లను ముందుగా వేడి చేయవలెను అందుచే అవి ప్రథమముననే ఎలక్ట్రానులను ఎక్కువగా విడుదల చేయును తత్ఫలితముగా ఎలక్ట్రోడులమధ్య ఎక్కువగా ఓల్టేజి కలుగును ఈ పై ప్రక్రియ జరుగుట కొరకు శ్రేణిలో ఒక చోక్‌ను, ద్విలోహపు స్విచ్ గల స్టార్టరు అను దానిని వలయములో కలుపుదురు ఈ విధముగ ఎలక్ట్రోడుల మధ్య ఎక్కువ ఓల్టేజిని కలుగజేయుట వలన, వాటి రెండింటి నడుమ విద్యుత్ చాపము కలుగును ఇదివరలో చెప్పినట్లు ఎలక్ట్రోడులనుండి విడుదల చేయబడు ఎలక్ట్రానులు గొట్టములోనుండి ప్రవహించుచు పాదరసపు పరమాణువులను ఢీకొనును అప్పుడా పరమాణువులు ఉద్రిక్త స్థితిని పొంది కిరణములను ప్రసారము చేయును ఈ కిరణ ములు ఎక్కువ భాగము అతి నీలలోహిత భాగములోనివై ఉండును గొట్టము లోపలి భాగముపైన కావలసిన స్ఫోరక పదార్థములను పూయుట వలన, ఇవి కంటికి కనిపించని కిరణములను శోషింపచేసి, వాటికి బదులుగా ప్రకాశవంతమైన వెలుతురును గొట్టము పొడవున ప్రసరింప జేయును

చోక్ గూడ గొట్టము స్థిరముగ పనిచేయుటకు ఉపయోగపడును ప్రధానమగు ఓల్టేజికి సమానాంతరముగా ఒక కండెన్సరును అమర్చుదురు ఇది దీపములో నుండి తక్కువ విద్యుత్తును ప్రవహింప జేయును ద్విలోహపు స్విచ్‌కి సమా నాంతరముగ ఒక చిన్న కండెన్సరును కూడ అమర్చుదురు ఇది అనవసరమైన విద్యుత్ స్ఫులింగములను కలుగనీయదు

తక్కిన ఉత్సర్గ దీపములవలె స్ఫోరక దీపము కూడ స్విచ్ వేయుటతోడనే మిగుల ప్రకాశవంతముగ వెలుగును ఈ దీపములు కన్నులు చెదరక యుండు చల్లని వెలుతురును ప్రసారము చేయును అందుచే కార్యాలయములలోను, పరిశ్రమలలోను, గృహములలోను ఉపయోగించు కొనుట కీదీపములు సౌకర్యముగ నుండును

ప్రత్యేక రకపు దీపములు అతి నీలలోహిత కిరణము లను, పరారుణ కిరణములను (infra-red) కలుగజేయు ప్రత్యేక రకమైన దీపములు కలవు ఈ కిరణములను వైద్యములలోను, పరిశ్రమలలోను ఉపయోగించుచున్నారు వీటి వలన ఎక్కు ఉపయోగము కలదని సూర్యుని నుండి వచ్చు వెలుతురులో కనిపించు కిరణములే కాక, ఈ కిరణ ములు కూడ ఉండును మనకు తెలియకయే ప్రతిదినము ఆ కిరణములు కొంత వరకు మన శరీరముపై పడుచుండును ఈ రెండు రకముల కిరణములు మన కంటికి కానిపింపవు వర్ణమాలలో 1000° నుండి 136° A వరకు అతినీలలోహిత కిరణము లుండును 7500 A° నుండి 4,00,000 A° వరకు పరారుణ కిరణము లుండును, పరారుణ కిరణములను ఉష్ణ తరంగము లనెదరు

అతి నీలలోహిత కిరణముల వలన మానవాళికి బహుళ ప్రయోజనములు కల్గును మనకు హానిచేయు కొన్ని రకముల సూక్ష్మజీవులను ఇవి సంహరించును పడిసెము, ఎముకల రోగ ములు, క్షయరోగము ఈ కిరణముల వలన మాన్పవచ్చును పరిశ్రమలలో రంగులను పరీక్షించుట కుపయోగపడును 'డి' విటమినులను తయారు చేయుట కుపకరించును భోజన పదార్థములను చాలకాలము నిలువ చేయుటకు కూడ ఈ కిరణము లుపయోగపడును

పరారుణ కిరణములు కూడ అనేక విధములుగ ఉపయోగపడును ఈ కిరణముల ప్రసారమువలన కలుగు ఉష్ణము చే కీళ్ళనొప్పులు, వెన్నుకు నొప్పులు, దంతపు నొప్పులు వ్రణములు తగ్గును భూమిమీద ప్రాణులు నివసించుటకు కావలసిన వేడిమికూడ ఈ కిరణముల వలననే కలుగుచున్నది

అగోచరమైన ఈ కిరణముల వలన అనేక ప్రయో జనము లుండుటచే వీటిని కృత్రిమ సాధనముల వలన ఉత్పత్తి చేయుటకు పెక్కు పరిశోధనలు జరగినవి ఇందువలన ప్రత్యే కోపయోగమున కవసరమగు ప్రత్యేక తరగతి కిరణములను ఉత్పత్తి చేయుట ఇప్పుడు సాధ్యమైనది ఇప్పుడు అతి నీలలో హిత పరారుణ కిరణముల నుత్పత్తి చేయుటకు అవసరమైన అనేక ప్రత్యేక రకముల విద్యుద్దీపము లున్నవి ఇట్టి దీపములు కొన్ని ఈ క్రింద వివరింపబడినవి

సూక్ష్మజీవులను, క్రిములను సంహరించు దీపములు సూక్ష్మజీవులను, క్రిములను సంహరించుట కుపయోగపడునది

అతి నీలలోహిత కిరణ ప్రసారణ దీపము ఈ దీపములు సుమారు 2537 A° తరంగ దైర్ఘ్యముగల కిరణములను ప్రసారము చేయును ఈ కిరణములు క్రిములను, గాలిచేత వ్యాప్తమగు సూక్ష్మజీవులను చంపుటకు అతి తీవ్రమైన శక్తిగలవి ఈ క్రిమినాశక దీపములు తక్కువ పీడనముగల ప్రత్యేక రకపు పాదరసపు ఆవిరి దీపములు వీటిని స్ఫోరక దీపముల వలె తయారు చేయుదురు గొట్టము లోపలి భాగము మీద స్ఫోరక పదార్థపు పూత ఏమియు నుండదు అతినీలలోహిత కిరణములను తనద్వారా పోనిచ్చు ప్రత్యేకమైన గాజుతో ఈ దీపముల గొట్టములను చేయుదురు మామూలు గాజు అయినచో ఈ కిరణములను ఇముడ్చుకొనును

గృహములయందలి కొన్ని గదులలోనికి వెలుతురు ఎక్కువగా రాకపోవచ్చును ఇట్టి గదులలో హానికరమైన సూక్ష్మ జీవులు తొందరగ పెరుగును రోగులు మాట్లాడునపుడు ఇట్టి సూక్ష్మజీవులు వారు విడుచు గాలి నుండి బయటికి వచ్చును ఇతరు లాగాలిని పీల్చినచో ఈ జీవులు వారి శరీరములలో ప్రవేశించి వారికి కూడ పడిసెము, గవదబిళ్ళలు, క్షయ, పొంగువంటి అంటువ్యాధులు సోకును అందుచేత గాలిలో నుండు ఇట్టి సూక్ష్మజీవులను నాశనమొనర్పవలెను

పాఠశాలలలోను, వరుసగ కొట్లవలెనుండు నిర్మాణములలోను, భవనముల లోపలి భాగములలోను ఈ క్రిమినాశక దీపముల నుపయోగింతురు ఈ కిరణములు ప్రాణులకు హానికరమైన వగుటచే వీటినుండి తగిన జాగ్రత్త తీసికొనవలెను మామూలు గాజు వీటిని శోషింపజేయును అందుచే కన్నులను రక్షించుటకు స్వచ్ఛమైన గాజు కంటిపోళ్ళ నుపయోగింపవలెను

గదులలో పరావర్తకములను పెట్టి క్రిమినాశక దీపముల కిరణములు గదిలోని మనుష్యులపై ప్రసరింపకుండునట్లు వాటిని అమర్పవలెను

త్రాగెడు మంచినీటిలోని క్రిములను, సూక్ష్మ జీవులను చంపుటకు కూడ క్రిమినాశక దీపముల నుపయోగించెదరు కలరా, టైఫాయిడ్, గ్రహణి మున్నగు రోగములు నీటిలో నుండు సూక్ష్మజీవులవలన కలుగును ఇట్టి సూక్ష్మజీవులను చంపి త్రాగెడి నీటిని శుభ్రము చేయుటకు అతినీలలోహిత కిరణముల నుపయోగించెదరు పాల కేంద్రములలో పాలయందలి సూక్ష్మజీవులను నిర్మూలించుటకు అతినీలలోహిత కిరణముల నుపయోగించెదరు

మానవులకు అనేక విధములుగా అతి నీలలోహిత కిరణము లుపయోగపడును కొద్ది మోతాదులో చర్మముపై అతి నీలలోహిత కిరణములు పడినచో దానికి రంగు వచ్చును ఈ రంగువలన చర్మమునకు రక్షణ మేర్పడును ఒకరకపు అతి నీలలోహిత కిరణములను చర్మముపై ప్రసరింపజేసినపుడు, క్రొవ్వు 'డి' విటమినుగ మారును ఈ విటమిను వలన పిల్లలను పెలుగనియ్యకుండ చేయు ఎముకల జబ్బు తగ్గును

ఇన్‌ఫ్రారెడ్ దీపము ఇన్‌ఫ్రారెడ్ దీపము హాలెండు దేశములోని ఫిలిప్స్ కంపెనీ తయారు చేసినట్టిది ఇది కొన్ని తరంగ దైర్ఘ్యములుగల పరారుణ కిరణములను ప్రసారము చేయును వీటి ఉష్ణమును కొన్ని రోగముల కుపయోగించెదరు ఈ కిరణముల వలన నొప్పులు తగ్గును అందుచే ఈ దీపములు "పరారుణ వైద్యదీపములు" అనబడు చున్నవి

మనకు శరీరములో ఎక్కడైనను కీళ్ళనొప్పి గాని, ఇరుకునొప్పి గాని కలిగినపుడు వేడి తువ్వాలుతో గాని, వేడి నీళ్ళ సంచితో గాని నొప్పియున్న భాగమును కాచెదము ఇట్లు కాచుట వలన నొప్పి తగ్గును చర్మమునకు బాగుగా అడుగున నున్న భాగములకు ఇట్లు కాచుట వలన ఉపయోగము కలుగదు వేడి తువ్వాలునుండి వేడిని ముందుగా చర్మము తీసికొనును తరువాత అది క్రమముగ చర్మము లోనికి ప్రసరించి, చివరకు శరీరములోని ధాతువులకు ఎరుసు కొద్ది వేడి మాత్రమే ధాతువుల వద్దకు చేరును అందుచే ఇది వ్యర్థమైన పని చర్మము కూడ వేడెక్కుటచే, బాధ కలుగును

7,000 A° నుండి 14,000 A° వరకు తరంగ దైర్ఘ్యము గల పరారుణ తరంగములు (ఉష్ణతరంగములు) శరీర మందలి మాంసము లోనికి బాగుగ చొచ్చుకొని పోవును సుమారు 11,000 A° తరంగ దైర్ఘ్యము గల కిరణములకు చొచ్చుకొని పోవు శక్తి చాల ఎక్కువ ఇది శరీరముపై పడినప్పుడు లోపలికి చొచ్చుకొనిపోయి, రోగ భూయిష్ఠమైన ధాతువులను వేడి చేయును ఈ ధాతువుల యొక్క సిరలు ఉబ్బి, వాటినుండి రక్త మెక్కువగా ప్రసరించును నెత్తురు వేగముగా ప్రసరించుట వలన నొప్పి తగ్గిపోవును ఉష్ణ వైద్యములోని సూత్ర మిదియే ఉష్ణమును శరీరములోని భాగములకు అందజేయుట పరారుణ కిరణముల వలన ఏమియు బాధ లేకుండ జరుగును

ముఖ్యముగ 7,000 A° నుండి 14,000 A° మధ్య

తరంగ దైర్ఘ్యము గల ఉష్ణ తరంగములను కలుగజేయునట్లుగ "ఇన్‌ఫ్రారెడ్" దీపమును తయారు చేయుదురు ఇది మామూలు టంగ్‌స్టన్ ఫిలమెంటు దీపమే దీని ఉష్ణము 2600° సెం వరకుండును ఇంత అధికోష్ణము గొల్గు టంగ్‌స్టన్ ఫిలమెంటు కంటికి కనిపించు కిరణములతో పాటు పరారుణ కిరణములను కూడ విడుదల చేయును కనిపించు కిరణములను శోషింపచేయుటకు ఎర్రని గాజుగలకవచను దీపముతో పాటు ఉపయోగించెదరు

ఈ దీపములను ఒక పెట్టెలో అమర్చి, దీనినుండి వచ్చు పరారుణ కిరణములను శరీరముపై ప్రసరింప చేసినచో రక్తప్రసరణము చురుకుగా జరుగును ఇది సామాన్య మానవులకు కూడ మంచిదే

ఆరబెట్టుట కుపయోగించు పరారుణ ఉష్ణదీపము ఇది కూడ పరారుణ కిరణములను ప్రసారము చేయు దీపమే. ఇది తొందరగా వేడిని కలుగజేసి వస్తువులను ఆరబెట్టుటకు పనికివచ్చును కాని ఉష్ణవైద్యమునకు పనికిరాదు ఇది కూడ వాయువుతో నింపిన టంగ్‌స్టన్ ఫిలమెంటు దీపమువంటిదే దీనిని వెలుతురు కొరకు కాక, ఉష్ణమును కలుగచేయుటకు మాత్రమే తయారు చేసెదరు ఫిలమెంటు ఉష్ణము 1900° సెం వరకుండును ఉష్ణము తక్కువగ ఉండుట వలన ఈ దీపము చాలకాలము మనును దీని కిరణములు వస్తువులపై బడినపుడు అవి పట్టుకొనగలిగిన వేడిమి కలుగును

ఈ దీపములను నిరోధక శక్తిగల ప్రత్యేకపు గాజులో చేయుదురు దీనిలోపలి కిరణములను బాగుగా పరావర్తనము చేయు 'పరావర్తకము' సీలుచేసి యుండును అందుచే ఎక్కువ శక్తి కావలసిన పనికి ఉపయోగించుటకు వీలుపడును ఆరబెట్టు దీపములలోనుండి కిరణములు 1800 $A^0$ తరంగ దైర్ఘ్యము వద్ద ప్రసారమగును ఈ కిరణములు ఇన్‌ఫ్రారెడ్ దీప కిరణములంత లోతునకు చొచ్చుకొని పోజాలవు

సూర్యకాంతిలో నుండు పరారుణ తరంగములు భూమి మీదకు వచ్చునరికి వాటి తీవ్రత తగ్గిపోవును ఒక వస్తువుకు 50 సెం మీ దూరములో పరారుణ దీపము నుంచినచో, ఆ వస్తువుమీద పడు కిరణములకు మిట్టమధ్యాహ్నము వచ్చు సూర్యకాంతిలోని పరారుణ కిరణముల కుండునంత తీవ్రత యుండును కాని దీపమును 10 సెం మీ దూరములో పెట్టినచో దానినుండి ప్రసారమగు కిరణములు సూర్యకాంతి కంటె పదిరెట్లు ఎక్కువ తీవ్రముగ నుండును

పరారుణప్రసార దీపము పరిశ్రమలలోను, వాణిజ్యములోను, గృహములలోను ఎక్కువగా ఉపయోగపడుచున్నది పెక్కు పరిశ్రమలలో వివిధ పదార్థములను ఆరబెట్టుట అవసరము ఇందుకు పరారుణ దీపము బాగుగా పనిచేయును ఈ దీపము వస్తువులను తొందరగా ఆరబెట్టును అందువలన ఉత్పత్తి పెరుగుటకు అవకాశము కల్గును దీనికి మరమ్మతు లెక్కువగా నుండవు

ఆరబెట్టుట కుపయోగపడు పరారుణ దీపము అనేక విధములుగా ఉపయోగింపబడుచున్నది తోళ్ల పరిశ్రమలో తోళ్ళను, జిగుళ్ళను, రంగువేసిన తోళ్ళను ఆరబెట్టుటకు ఈ దీపము ఉపయోగపడును బట్టల పరిశ్రమలో బట్టలను ఆరబెట్టుటకు, లోహపు పరిశ్రమలో ఎనామిల్ పూతపూసిన రేకులను, మోటారు కారుపై రంగులను ఆరబెట్టుటకు ఈ దీపము ఉపయోగపడును. రసాయన పరిశ్రమలలోను, మందుల పరిశ్రమలలోను, బిళ్ళలను, మాత్రలను తయారుచేయుటలోను, ద్రవపదార్థములను ఘనీభవింప చేయుటలోను ఈ దీపము ఉపయోగపడును ఇవి కాక పెక్కు ఇతర పరిశ్రమల యందు కూడ ఈ దీపము ఉపయోగింపబడుచున్నది

గృహములలో కూడ స్నానానంతరము తడి జుట్టును, తడి బట్టలను ఆరబెట్టుటకు ఈ దీపము కొందరిచే ఉపయోగింపబడుచున్నది ఈ విధముగ ఆధునిక జీవితములో పరారుణ ఉష్ణదీపము పెక్కు రంగములందు ప్రముఖమైన పాత్రను వహించు చున్నది

వి వి ఎల్

## ప్రకృతి చికిత్స

ప్రకృతి చికిత్స అనగా మందుల యొక్కయు, ఇంజెక్షనుల యొక్కయు, ఇతర కృత్రిమ వస్తువుల యొక్కయు సహాయము లేకుండ పంచమహాభూతముల యొక్క సహాయముతోనే (ఆకాశము, సూర్యరశ్మి, గాలి, నీరు, మట్టి) ఒక వ్యక్తి శరీరములో నున్న రోగమును, రోగలక్షణములను తెలిసికొని, కుదిర్చి, తిరిగి ఆ వ్యక్తిని ఆరోగ్యవంతునిగా చేయుట పంచమహాభూతములను, అవసరము కొలది శాస్త్రీయ పద్ధతిలో వినియోగించుకొని, ఆరోగ్యమును పొందుటయే ప్రకృతి చికిత్స అనబడు చున్నది

పూర్వకాలమున ఏదియో ఒక పంచమహాభూతము

ద్వారమున ముఖ్యముగ జలము ద్వారమున జరుపబడిన చికిత్సయే ప్రకృతి చికిత్స అనబడెను కాని క్రమముగ పలు రకములైన చికిత్సలు దీనిలో చేర్చబడినవి ముఖ్యముగ జల చికిత్స, సూర్యకిరణచికిత్స, మృత్తికాచికిత్స, వాయు స్నానము, ఉపవాసము, వ్యాయామము, కశేరుకా చికిత్స, ఆహార నియమములు, ప్రార్థన, ఇవి అన్నియు కూడ ప్రకృతి చికిత్సా విభాగములే నేటి ప్రకృతిచికిత్సా విధానములో ఇవి అన్నియు ఉపయోగింపబడు చున్నవి ప్రకృతి చికిత్సకుడు రోగియొక్క రోగమూలకారణములను తెలిసికొనుటకు కూడ, వేరు పద్ధతిని అవలంబించును దీనిలో, ఆకృతి నిదానము (రోగి శరీరమును చూచి రోగనిదానము చేయుట) కనీనికా నిదానము(కంటిలోని పాపను భూతఅద్దము ద్వారా పరీక్షించి శరీరములోనున్న రోగమును కనుగొనుట) అనునవి ముఖ్యమయిన రోగనిదాన పద్ధతులు

ప్రకృతి చికిత్సా సిద్ధాంతము

1 ప్రకృతిలోని అన్ని జీవరాసులును పంచ మహాభూతముల కలయికచే సృష్టింప బడినవే మానవ శరీరము కూడ ఈ పంచ మహాభూతముల సంయోగముచే ఏర్పడినదే కనుక శరీరమును బాగుచేసికొనుటకు కూడ పంచ మహాభూతముల సహాయము తప్ప ఇతర సహాయము అవసరము లేదు మానవుడే మందులను, ఇంజెక్షనులను వాడుకొనును కట్టెతో చేయబడిన ఒక వస్తువును బాగుచేయుటకు మరల కట్టెయే ఉపయోగింప బడినట్లు, మట్టితో చేయబడిన వస్తువు మరల మట్టితోనే బాగుచేయ బడినట్లు, శరీరము కూడ ఏ వస్తువుల చేత పోషింప బడుచున్నదో, మరల ఆ వస్తువుల చేతనే అది బాగుచేయ బడవలయును అనునదే ప్రకృతి చికిత్స యొక్క మూల సిద్ధాంతము

2 ప్రకృతి చికిత్స యొక్క రెండవ సిద్ధాంతము "రోగాద్వైతము, (చికిత్సాద్వైతము)" అనునది సాధారణముగా మానవుడు ఆహార, విహార నియమములను, ప్రకృతి నియమములను ఉల్లంఘించుచు, అనాత్మవంతుడై, ఇంద్రియ లోలుడై, జీవించుచుండును ఇట్టి పరిస్థితిలో శరీరము యొక్క కార్యక్రమములో కొంత అంతరాయము కలిగి, శరీరము బలహీన మగును అప్పుడు శరీరములో కొన్ని అన్య పదార్థములు అనగా వికార విషపదార్థములు, వాయు, ద్రవ, ఘనరూపములలో నిలువ యుండిపోవును, ఈ అన్య పదార్థములు శరీరము యొక్క సప్త ధాతువులలో (రసము, రక్తము, మాంసము, మేదస్సు, అస్థి, మజ్జ, శుక్రము) ప్రవేశించి, వాటికి బలహీనతను చేకూర్చి, ఆయా ధాతువునకు సంబంధించిన రోగములను పుట్టించును కనుక నేడు వేరు వేరు పేర్లతో పిలువబడు అనేక రోగములకును, రోగలక్షణములకును, అన్నింటికిని మూలకారణము ఒకటే అది శరీరములో అన్య పదార్థము నిలువ యుండుటయే

"సర్వేరోగా మలవశాః"

'ప్రాణస్య సమలే దేహే స్థితే రోగినామకం,
ప్రాణస్య నిర్మలే దేహే స్థితే స్వాస్థ్యనామకం"

ఎప్పుడు అన్ని రోగముల మూల కారణము ఒకటే అని తెలిసికొంటిమో, అప్పుడే అన్ని రోగములకు చికిత్స కూడా ఒకటియేయై ఉండవలెను శరీరములో ఉన్నటువంటి అన్యపదార్థమును శరీరమునుండి వెడలగొట్టి, శరీరమును నిర్మలము చేయుటయే ప్రకృతి చికిత్స

కనుక రోగాద్వైతము, (చికిత్సాద్వైతము) అనునది ప్రకృతి చికిత్సయొక్క మూల సిద్ధాంతములలో ఒకటియై యున్నది

3 శరీరము ఒక స్వయం చాలిత యంత్రము ప్రతి శరీరములోను ప్రాణశక్తి లేక జీవశక్తి ఉండును అది ఎల్లప్పుడును ఆ శరీరము యొక్క రక్షణ కొరకై, ఆరోగ్యము కొరకై పోరాడు చుండును ఈ పోరాటము యొక్క బాహ్య చిహ్నములే రోగలక్షణములు రోగమనునది ఒక నిర్జీవ పదార్థము ఈ పదార్థమును శరీరమునుండి వెడలగొట్టి, శరీరమును కాపాడుటయే శరీర ధర్మము, ప్రకృతి ధర్మము కనుక శరీరము చేయు ఈ స్వీయ రక్షణాప్రక్రియకు, మనము ఏవిధమైన ఆటంకము కలుగ జేయకుండ దానికి సహాయ పడుటయే ప్రకృతి చికిత్స రోగలక్షణములను రోగములనుగా, శత్రువులనుగా భావించి, వాటిని అణచుటకు,కృత్రిమ పద్ధతులను, కృత్రిమ పదార్థములను వాడి శరీరము చేయు స్వీయ రక్షణ ప్రక్రియకు భంగము కలిగించి నందుచేత, శరీరములో ప్రాణశక్తి నశించి, మృత్యువు సంభవించు చున్నది కనుక రోగ లక్షణములను శరీరము యొక్క మిత్రములనుగా భావించి, ఆహార విహార నియమములను పాటించి, మందులు, ఇంజెక్షనులు మున్నగు వాటిని తీసికొనకుండ, శరీరమునకు సహాయము చేసినచో, శరీరము తన రోగమును తనే బాగుచేసి

కొనగలదు ఈ సిద్ధాంతము ప్రకృతి చికిత్సా సిద్ధాంతములలో ముఖ్యమైనది

4 ప్రకృతి చికిత్సయొక్క ముఖ్య ఉద్దేశము ప్రతి వ్యక్తికిని అతని శరీరధర్మమును తెలియజేసి, అతని శరీరములో ఇమిడియున్న మహత్తర శక్తులను వినియోగించుకొని, ఆత్మవిశ్వాసముతో, ఆత్మబలముతో ఆరోగ్య విషయములో సంపూర్ణ స్వాతంత్ర్యము పొందుటకు అతనికి అవకాశము కలిగించుటయే రోగనివారణముకంటె రోగనిరోధము ముఖ్యము ఈ సిద్ధాంతమును ఒక ప్రకృతి చికిత్సా సిద్ధాంతము మాత్రమే ఆచరణలో పెట్టుచున్న దనవచ్చును ఎల్లప్పుడును మనుజుడు ప్రకృతి నియమములను, ఆహార విహార నియమములను పాటించి సంతులిత జీవనమును గడపిన యెడల, శరీరముయొక్క ప్రాణశక్తులును, రోగనిరోధక శక్తియును పెరిగి, రోగము రాకుండ శరీర స్వాస్థ్యము సురక్షితము కాగలదు

**ప్రకృతి చికిత్సా విధానములు**

1 వాయుచికిత్స అనగా ఉదయమునందు, సాయంకాలమునందు నడక ద్వారమునగాని, వ్యాయామము ద్వారమునగాని, శరీరమునకు పరిశుభ్రమైన గాలి తగులునట్లు చేయుట ఇదికాక, అవసరమును బట్టి, వివిధ ఉష్ణోగ్రతలను మరియు వివిధ వత్తిడులును గల వాయువును, రోగి శరీరముపై ప్రసరింపచేయుట

2 సూర్యకిరణ చికిత్స సాధారణముగా ఉదయమున, సాయంకాలమున శరీరమును సూర్యరశ్మికి గురిచేయుట ఇదికాక, ఆదిత్యపేటిక ద్వారమున రోగికి సూర్యస్నానము చేయించుట

కేంద్రీకరించిన సూర్యరశ్మిని రోగియొక్క ప్రత్యేక శరీర భాగముమీద ప్రసరింపజేయుట సూర్యరశ్మి ప్రసారము కల నీరు, నూనెలు, పంచదారగోళీలు వాడుట సూర్యకిరణములోని సప్తవర్ణములను రోగియొక్క శరీరముపై ప్రసరింపజేయుట అరటి, వేప, రావి అను చెట్ల ఆకులను రోగి శరీరమున కంటించి దానిపై సూర్యరశ్మిని ప్రసరింపజేయుట ఈ చికిత్సలోని ముఖ్యవిషయము

3 జలచికిత్స ఎనీమా, జలపానము, స్నానము, తొట్టి స్నానము, లింగస్నానము, ఆవిరిస్నానము, వేడినీటి పాదు స్నానము, తడికట్లు మొదలగు చికిత్సలు ముఖ్యమైనవి ఈ చికిత్సలు పూర్తి శరీరమునకుగాని, శరీరముయొక్క ప్రత్యేక అంగములకు గాని చేయవచ్చును

4 మృత్తికాచికిత్స దీనిలో మట్టిపట్టీలు, మట్టి పూతలు, భూగర్భ శయనము మొదలగు చికిత్సలు ముఖ్యములు శరీరములో నున్న అత్యుష్ణమును, విషములను బయటి లాగివేయగల అద్భుత శక్తులు మట్టికి కలవు

5 మర్దన చికిత్స రోగియొక్క శరీరమును, లేక ప్రత్యేక అంగమును, నూనెతో గాని, తడిబట్టతో గాని, పొడిబట్టతో గాని, పౌడరుతో గాని, మంచు గడ్డతో గాని, మర్దన చేయుట మర్దనచికిత్స యనబడుచున్నది

6 కశేరుకా చికిత్స వెన్నెముకను మర్దనముచేసి, కొన్ని రోగములను నివారించుట

7 ఉపవాస చికిత్స ప్రకృతి చికిత్సా విధానములో ఉపవాస చికిత్స ప్రప్రథమమైనది ఇది మిక్కిలి ముఖ్యమైనది శరీరమును రోగ పదార్థముల నుండి విముక్తము చేయు విషయమున దీనికి మించిన ఆయుధము వేరొకటి లేదు

''లంఘనం పరమౌషధం''

రోగిని బట్టియు, రోగావస్థను బట్టియు, స్వల్పకాలముగ గాని, దీర్ఘకాలికముగ గాని, ఉపవాసము చేయించిన యెడల, సప్తధాతువులు శోధింపబడి, వాటిలో నుండు అన్య పదార్థ మంతయు బహిష్కరింపబడి, అతని శరీరము రోగరహితమై, తేజోవంతమై మనుటకు ఉపవాసము బ్రహ్మాస్త్రము వంటిది ఉపవాసమునునది నిర్జలోపవాస మనియు, జలోపవాస మనియు, రసోపవాస మనియు త్రివిధముగ నున్నది

8, వ్యాయామము మానవుడు ఒకే ప్రమాణములో తిని, శ్రమించి, విశ్రాంతి కైకొనినచో అతని శరీరమున కేరోగము రాదు దేహపరిశ్రమ చేయని వారికే పెక్కు రోగములు వచ్చును కనుకనే, దేహము సర్వదా తేలికగను, చైతన్యవంతముగను ఉండవలె ననినచో, సూర్యనమస్కారములు, ప్రాణాయామము, యోగాభ్యాసము, మొదలగు సౌమ్య వ్యాయామములు అత్యంత ముఖ్యములు ప్రకృతి చికిత్సా విధానములో వీటికి చాల ప్రాముఖ్య మొసగబడినది ఎందు చేతననగా, వీటివలన, దేహమేకాక మనస్సుకూడ నిర్మలమై ఆరోగ్యదాయకము కాగలదు

9 ఆహార చికిత్స అజీర్ణము లేనిదే రోగము లేదు అజీర్ణముగ నున్నపుడు భోజనము విషమగును మన ఆరోగ్యము గాని, రోగము గాని మనము ఏ ఆహారమును ఏ కాలమునకు ఏ ప్రమాణమున తిందుమో దానిపై ఆధారపడి ఉండును కనుక ప్రకృతి చికిత్సలో ఆహారమునకు ఎక్కువ ప్రాముఖ్యము కలదు

పథ్యమును పాటించినచో మందులు అనావశ్యకములు పథ్యమును పాటించనిచో మందులు సేవించినను లాభము లేదు కనుక ఆరోగ్యముతో నుండవలయు నన్నచో, ఆహార విషయములో నియమ మావశ్యకము ప్రకృతి చికిత్సలో సాత్విక ఆహారమునకు ఎక్కువ ప్రాముఖ్యము కలదు తామస, రాజస, ఆహారములే శరీరములో అనేక వికారములను కల్పించి రోగములకు మూలకారణములు కాగలవు పండ్లు, కూరగాయలు, ధాన్యములు, మజ్జిగ, తేనె, మొదలగునవి సాత్వికాహారములు

10 ప్రార్థన మానవునకు శరీరారోగ్యమువలె మానసిక ఆరోగ్యము కూడ అవసరము ప్రకృతి చికిత్సా సిద్ధాంతము ప్రకారము ఆహార పదార్థములు ఏవిధముగ శరీర పోషణమునకు ఉపకరించునో అదే విధముగ ప్రార్థనయు మనస్సునకు స్థైర్యము నొసగును మనశ్శరీరములకు అవినాభావ సంబంధము కలదు కనుక, సాత్వికాహారము, సత్సంగము, సద్గ్రంథ పఠనము, ప్రార్థన, దైవచింతనము-ఇవన్నియు శరీరమును, మనస్సును, శుద్ధపరచి సంపూర్ణ ఆరోగ్యమును ప్రసాదించును కనుక ప్రకృతి చికిత్సా ప్రణాళికలో ప్రార్థనకు సముచితస్థానమొసగ బడినది

ప్రకృతి చికిత్సా విధానములో ఉపయోగించు పనిముట్లు

పంచ మహాభూతములను శాస్త్రీయముగా, మితముగా, అనుకూలముగా, అవసరమును బట్టి ఉపయోగించుకొనుటకై ఈ క్రింది ఎనిముట్లు, ప్రకృతి చికిత్సాలయములలో విరివిగా వాడ బడును

1 ఎనిమాడబ్బా, 2 నీళ్ళతొట్టి, 3 వేడినీళ్ళసంచి, 4 మంచుగడ్డసంచి, 5 ఆదిత్యపేటిక, 6 ఆవిరిపెట్టె, 7 రంగు అద్దములు, 8 రంగుసీసాలు, 9 ముతకగుడ్డపట్టీలు, 10 ముతక దుప్పట్లు, 11 కంబళ్ళు

ప్రకృతి చికిత్సయొక్క ఇతిహాసము ఆదికాలము నుండి మన దేశములో ఋషులు, మునులు, యోగులు, అరణ్యములలో నుండి కంద మూలములను, ఫలములను తినుచు, స్వచ్ఛమైన గాలిని, నిర్మలమైన నీటిని సేవించుచు, ఆహారవిహార నియమములను పాటించుచు, సూర్యనమస్కారములను, యోగాభ్యాసమును చేయుచు, అకృత్రిమమయిన జీవనము గడుపు చుండెడివారు వారు అట్టి వాతావరణములో ఎట్టి రోగములులేక ఆరోగ్యముగ,దీర్ఘ కాలము జీవింపగల్గిరి వీరిది ప్రకృతి జీవనమే అయినప్పటికి, ఆ కాలములో "ప్రకృతి చికిత్స" అను పేర ఎట్టి నిర్దిష్టమైన చికిత్సా పద్ధతియు అమలులో నున్నట్లు ఎక్కడను ఆధారములు లేవు అయినప్పటికిని రోగమును నయము చేసికొనుటకు పంచమహాభూతముల సహాయము అనాదినుండి అనుశ్రుతమై ఉన్నట్లు వేరు ఆధారములు కలవు

ఋతస్య పథాప్రేతః (శుక్లయజుర్వేద సంహిత 7/45)
అనగా ప్రకృతి నియమములను అనుసరించి జీవితమును గడపవలయును

"అప్స్వన్తరమృత మప్సు భేషజమ్
అపస్య విశ్వ భేషజమ్ (ఋగ్వేద సంహిత 1/23/19)
1/23/20)
అనగా జలములో అమృతమున్నది జలము ఔషధ స్వరూపము జలములో అన్ని ఔషధములున్నవి

సూర్య ఆత్మా జగత స్తస్థుషశ్చ, (సామవేదసంహిత 6/14/3)

'ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్,'

సూర్యుడే అన్నిరకములైన క్రిములకు నియంత్రత్వము వహించును సూర్య కిరణములు నిశ్చయముగ మలినకులను నాశనముచేసి శరీరమును నిర్మలము చేయును సూర్యుని వలననే సమస్త ప్రాణికోటి ఆరోగ్యము లభించుచున్నది క్రీస్తునకు పూర్వము 2000 సం॥ నుండి నేటివరకు ప్రకృతి చికిత్స పద్ధతిలో పెక్కు మార్పులు కలిగినవి ఒక్కొక్క కాలమందు ఒక్కొక్క క్రొత్త అంశము కనిపెట్టబడి, క్రమముగా అభివృద్ధిచెంది, శాస్త్రీయ పద్ధతిలో రూపొందిన అన్ని పద్ధతులయొక్క సమగ్ర రూపమే నేటి ఆధునిక ప్రకృతిచికిత్స నిపుణ వైద్యులచేత సేకరించబడిన ఆధారములను బట్టి చూడగా ప్రకృతి చికిత్స మొదటిసారిగా గలచి [illegible] రూపములో, ఐరోపా ఖండములో ముఖ్యముగా ఆటలీ, జర్మనీదేశములలో ఆరంభింప బడి క్రమముగా, రష్యా, అమెరికా,ఇంగ్లండు అను దేశములకు ప్రాకినది నేడు కూడ మనదేశముకంటె ఇంగ్లండు, అమెరికా దేశములలో ప్రకృతిచికిత్స ఎక్కువ ప్రచారములో నున్నది

ప్రకృతి చికిత్సా ప్రగతిలో కొన్ని ముఖ్య ఘట్టములు ఈ క్రింద వివరింప బడినవి

క్రీ పూ 2500: సం॥లో థాట్ అను వ్యక్తి ఒక పద్ధతి తన

ముక్కుతో నీళ్ళను గుడిస్థానములో ప్రవేశపెట్టి మలవిసర్జనమును చేయుటను చూచి ఎనిమా పద్ధతిని కనిపెట్టెను.

హిప్పోక్రెటీస్ (క్రీ పూ 460-357) ఇతడు రోగము వచ్చుటకూడ శరీరధర్మమే అని చెప్పెను. శరీరమునకు అవకాశము ఒసగినచో శరీరము స్వయముగనే స్వాస్థ్యమును పొందగలదు అని వచించెను. రోగులని చన్నీళ్ళలో స్నానము చేయించి, జ్వరమును తగ్గించవచ్చును అని ఇతడు మొట్టమొదటి సారిగ నిరూపించెను.

క్రీ శ ఒకటవ శతాబ్దిలోని చరకుడు చరకసంహిత అను ఉద్గ్రంథమును రచించి, దానిలో రోగములను నివారించుటకు 13 రకముల నీటి ఆవిరి స్నానములను పేర్కొనెను.

గాలెన్ (క్రీ శ 131-201) ఇతడు రోమన్ రాజులకు రాజవైద్యుడుగ నుండెను. ఇతడు రోగము మన మిత్రమే గాని శత్రువు కాదు, శరీరములో ఏమార్పు జరిగినను అది శరీర రక్షణకొరకే జరుగును అని నిరూపించెను.

క్రీ శ 900లో యూరోప్ దేశములో గొప్ప వైద్యశాలలు వెలసెను. అందు గొప్ప గొప్ప వైద్యులు నిపుణులైన వారు, అనేక వైద్యవిధానములను అమలులో పెట్టిరి. అందులో పథ్యపాలనము లేకుండ, ఆహార నియమములు లేకుండ, ఎన్ని మందులు వాడినను ప్రయోజనములేదు అను సిద్ధాంతము ప్రకృతి చికిత్సకు మిక్కిలి తోడ్పడినది.

లియోనార్డో డావిన్సి (క్రీ శ 1452-1519) అనునతడు వైద్యశాస్త్రములో శరీరశాస్త్రము ముఖ్యభాగమనియు, వైద్యుడు శరీరశాస్త్రము తప్పక ఎరిగి యుండవలెననియు చెప్పెను.

విన్‌సెన్ట్ ప్రీస్‌నిట్జ్ (1799-1851) అనునతడు జలచికిత్సను శాస్త్రీయముగ ప్రవేశపెట్టిన గొప్పవ్యక్తి. ఇతడు జలచికిత్సను గురించి విపులముగ గొప్ప పుస్తకములు వ్రాసెను.

సెబాస్టియన్ నెయిప్ (1821-1894) అనునతడు జలచికిత్సను బాగుగ ప్రచారములోనికి తీసికొని వచ్చెను. ఇతడు జలచికిత్సతోనే అన్ని రోగములు కుదురునని నిరూపించెను.

ఆర్నోల్డు రిక్లీ (క్రీ శ 1823-1926) ఇతడు వాయుస్నానము, సూర్యకిరణ చికిత్స, శాకాహారము అను వాటిని ప్రకృతిచికిత్సా పద్ధతిలో కొన్ని అంశములుగా ప్రవేశపెట్టెను.

ఆంద్రూ టెయిలర్ స్టిల్ (క్రీ శ 1828-1917) అనునతడు కశేరుకా చికిత్సను, మర్దనచికిత్సను, ప్రకృతిచికిత్సలో చేర్చెను.

లూయీ కూనే (క్రీ శ 1844-1907) అను వైద్యుడు జలచికిత్సలో పొట్టివైద్యము అను చికిత్సావిధానమును కనుగొనిన గొప్ప ప్రకృతి చికిత్సకుడు. అన్యపదార్థము, ఏకరోగ నిదానము, రోగాద్వైతచింత, ద్వైతసిద్ధాంతము, ఉపవాస చికిత్స మొదలగు ముఖ్య చికిత్సావిధానములను ఇతడు కనిపెట్టి ప్రకృతిచికిత్సావిధానముతో వాటిని జోడించెను. ఇతని కాలమునుండియే ప్రకృతిచికిత్స బాగుగ ప్రచారములోనికి వచ్చినది.

అడోల్ఫ్‌జస్ట్ (క్రీ శ 1838-1930) ఇతని కాలములో వాయుస్నానము, సూర్యకిరణ చికిత్స, మర్దన చికిత్స, ప్రకృతి చికిత్సలో ప్రముఖ స్థానమును వహించినవి.

జె హెచ్ టిల్‌డెన్ (క్రీ శ 1851-1940) ఇతడు శరీరములో అన్యపదార్థము నిలవయుండుటయే అన్ని రోగములకు మూలకారణము అని నిరూపించెను.

ఆర్నాల్డ్ ఎహ్‌రెట్ (క్రీ శ 1866-1922) శరీరములో రోగమునకు మూలకారణము ఎక్కువగ శ్లేష్మముండుటయే. అందువలన మనము తీసికొను ఆహారము శ్లేష్మరహితముగ ఉండవలెను అని ఇతడు నిరూపించెను.

జాన్ హార్వేకెల్లాగ్ (క్రీ శ 1852-1944) ప్రకృతి చికిత్సా జగత్తులో లూయీకూనే తరువాత గొప్పవ్యక్తి ఇతడే. ఇతని కాలములో వ్యాయామము, వాయుస్నానము, సూర్యస్నానము, జలచికిత్స, మర్దనచికిత్స చాల శాస్త్రీయముగ పరిశోధింపబడి అనేక పుస్తకములు వెలువడినవి. ఇతడు స్వయముగ అమెరికాలో గొప్ప వైద్యశాలలను నడిపి వేలకొలది రోగులకు స్వాస్థ్యమును చేకూర్చెను.

బెర్నర్ మాక్‌ఫాడెన్ (క్రీ శ 1868-1955) శరీరమును ఆరోగ్యముతో, సౌందర్యముతో కాపాడుకొనుటకు స్త్రీలు, పురుషులు, పిల్లలు, వృద్ధులు వ్యాయామము చేయవలయును. వ్యాయామము వలననే అనేక రోగములు నివారింపబడును అని ఇతడు నిరూపించెను.

బెనెడిక్ట్ లస్టు (క్రీ శ. 1872-1945) మందులు లేకుండగనే రోగములను నిర్మూలింపవచ్చును, అను సిద్ధాంతమును బాగుగ తెలపరచి రుజువు చేసిన వ్యక్తులలో ఇతడు గొప్పవాడు. అమెరికా దేశములో ప్రకృతివైద్యము ప్రచారము గావింపబడుటకు ఇతడు ముఖ్యకారకుడు. అన్ని చికిత్సా పద్ధతులను సమన్వయ పరచి, ఇదివరలో జలచికిత్స అను పేరుతో వ్యవహరింపబడుచున్న చికిత్సాపద్ధతికి, "ప్రకృతిచికిత్స" అను

పేరుపెట్టి, ఆ పేరును ప్రపంచమందంతటను చాటి, ప్రచారము చేసిన గొప్ప వ్యక్తి ఇతడు ఇతడు ఆధునిక ప్రకృతి చికిత్సావిధానమునకు నాంద్రీప్రవర్తకుడు, పితామహుడు, అని చెప్ప బడుచున్నాడు

ఇ డి బాబిట్ (క్రీ శ 1883) ఇతడు అమెరికా దేశీయుడు సూర్యకిరణ చికిత్సను గురించి ఇతడు బహుళముగ ప్రచారము చేసినవ్యక్తి

డాక్టరు బేట్సు (క్రీ శ 1880) కండ్లకు అద్దములు వాడకుండ కంటిరోగములను ప్రకృతి చికిత్సతో బాగుచేయ వచ్చు నని ఇతడు సిద్ధాంతీకరించెను

హెర్‌వార్డ్ కారింగ్టన్ (క్రీ శ 1908) ఇతడు ఉపవాస చికిత్సను ప్రకృతి చికిత్సా విధానములో ముఖ్య చికిత్సగా ప్రవేశపెట్టిన అమెరికా దేశీయుడు

మహాత్మాగాంధి (క్రీ శ. 1869-1948) భారత దేశములో ప్రకృతి చికిత్సా విధానమునకు జీవము పోసి, ప్రజలలో దీనియందు అభిరుచిని కలిగించి ఆరోగ్యముయొక్క స్వయంపోషణ విధానమును స్వయముగా ఆచరించి, ప్రచారము చేసిన గొప్ప యుగపురుషుడు ఇతడు ప్రార్థన, ఉపవాసము, అను నీ రెండింటిని ప్రకృతి చికిత్సలో చేర్చి ఈ రెండింటి మాహాత్మ్యమును నిరూపించిన గొప్పవ్యక్తి ఇతడు ప్రార్థనవలన మనస్సు, ఉపవాసమువలన శరీరము-రెండును పరిశుద్ధత నొందును సంపూర్ణ ఆరోగ్యము లభించును అని చెప్పుటయే గాక స్వయముగ ఆచరణములో పెట్టి, పుస్తకములు వ్రాసి ప్రకృతి చికిత్సను ఉన్నత స్థాయిలోనికి తీసికొని వచ్చిన ముఖ్య వ్యక్తి ఇతడు

భారతదేశములో ఆధునిక ప్రకృతి చికిత్స మొట్టమొదటి సారిగా భారత దేశములో ప్రకృతి చికిత్సను ప్రవేశపెట్టుట, భారతీయ భాషలో ప్రకృతి చికిత్సా విషయక గ్రంథమును అచ్చు వేయుట అను ఈ రెండు గౌరవములు ఆంధ్రునికే దక్కినవి 1894లో, తూర్పు గోదావరికి చెందిన ధవళేశ్వరములో సూపరింటెండెంటుగా నున్న ద్రోణంరాజు వెంకటాచలపతిశర్మ మొదటిసారిగా జర్మనుభాషా గ్రంథము 'న్యూసైన్స్ ఆఫ్ హీలింగ్' అను దానిని తెలుగు భాషలోనికి అనువదించెను ఇతడు స్వయముగ జర్మనీకి వెళ్ళి ప్రముఖ ప్రకృతి చికిత్సకుడగు లూయీకూనే అను నతనిని కలిసికొని ఆతని అనుమతితో ఈ గ్రంథమును అనువదించెను

ఇతడు స్వయముగ ప్రకృతి చికిత్సను అమలు జరుపు విషయమున చాల ప్రచార మొనర్చెను ఇట్లే దేశములో ఇతర ప్రాంతములలో కూడా ఈ చికిత్సా పద్ధతి ప్రవేశ పెట్టబడినది ఐనను బ్రిటిష్ ప్రభుత్వ పరిపాలన క్రింద ఇది విశేషముగ అభివృద్ధి నొందజాల దయ్యెను

మహాత్మా గాంధి మరల దీనికి జీవము పోసినవాడయ్యెను ఆయన తన గ్రామీణ నిర్మాణ కార్యక్రమములో ప్రకృతి చికిత్సను ఒక అంశముగా ప్రవేశపెట్టి, ఇది ప్రజాదరణమును పొందుటకు పునాది వేసెను తత్ఫలితముగ నేడు దేశములో సుమారు 50 ప్రకృతి చికిత్సాలయాలు వెలసినవి వందల కొలది ప్రకృతి చికిత్సకులు నేడు పనిచేయు చున్నారు దీని విశిష్టత క్రమముగ అందరికిని తెలియవచ్చుచున్నది ఇప్పుడు కేంద్ర, రాష్ట్రప్రభుత్వములు కూడ ఈ వైద్యశాఖకు మాన్యత నిచ్చి, ఆర్థికముగ సహాయము చేయు చున్నవి 1956లో అఖిలభారత ప్రకృతి చికిత్సాపరిషత్తు ఏర్పడినది తరాదిగ అది చాల కృషిచేయు చున్నది 1966లో కేంద్ర ప్రభుత్వ సహాయముతో 4 సం॥ ల డిగ్రీకోర్సును, 2 సం॥ ల డిప్లొమా కోర్సును, ఒక సం॥ రము నర్సింగ్ కోర్సును నెలకొల్పబడినవి భారత దేశములో వివిధ ప్రాంతములలో ఈ కోర్సు నడుపబడు చున్నది అనేక ప్రకృతి చికిత్సకులును తయారగుచున్నారు

జె ల

## ప్రఖ్యాత నాటకశాలలు

'కావ్యేషునాటకం రమ్యం' అని పెద్దలవాక్కు మానవుని ఆత్మోద్దీపనమునకు ఉపకరించు కళలన్నిటి యందును నాటకమునకు మనము ప్రథమస్థాన మొసగెదము సృజనాత్మక శక్తిని ఉపాసించు కవియొక్క ఊహాపోహాలకు రూపకల్పన చేయువారు నటీనటులు వీరి హావ, భావ, ప్రదర్శనకు రంగభూమిని సమకూర్చునదియే నాటకశాల శాస్త్రీయమైన నాటకశాలలు లేనిచో కవులు గాని, నటీనటులు గాని, శిల్పులు గాని వెలుగులోనికి వచ్చుటకవకాశ ముండదు నాటక సంస్థల కీర్తిప్రతిష్ఠలు ఎక్కువగా నాటకశాలలమీదనే ఆధారపడి యుండుననుటలో అతిశయోక్తి యుండజాలదు

ఏ దేశపు చరిత్ర పుటలను తిరుగ వేసినను, నాటక సంస్థల యొక్క, నాటకశాలల యొక్క ప్రాముఖ్యము గోచరింపక మానదు ప్రపంచ విఖ్యాతినందిన నాటక కర్తలందరు వీటి

మూలముననే ప్రఖ్యాతులైరి 'మాస్కో ఆర్ట్ థియేటర్' లేనిచో, చెకోవ్, గోర్కీ ప్రభృతులు కేవలము కథా రచయిత లుగనే ఉండి యుండెడి వారు బెర్గిన్ థియేటరు ద్వారా ఇబ్సెన్ గొప్ప నాటకకర్తగా రూపొందగలిగెను అట్టిక్ థియేటరు, వెషిలిస్, సోఫెకిల్స్, యూరిపైడ్స్, అరిస్టోఫెన్స్ మొదలైన నాటక రచయితలను బాహ్య ప్రపంచమునకు చూపగలిగెను షేక్స్పియరు, మోలియరు మున్నగు నాటక కర్తలు తమకాలమునందు ఉండియున్న థియేటరుల ద్వారానే పేరు ప్రతిష్ఠలను గాంచిరి జార్జి బెర్నార్డ్ షా 'ఇండిపెండెంట్ థియేటరు' మూలముననే ప్రపంచ ఖ్యాతి నార్జింపగలిగెను ఐర్లెండులోని అబ్బే థియేటరు మూలముననే సింజ్, గ్రిగోరి, లెనాక్స్, రాబిన్‌సన్ మొదలైన నాటక రచయితలు బహుళ ప్రచారములోనికి వచ్చిరి కోర్టు థియేటరు గాల్స్‌వర్దీని సుప్రసిద్ధ నాటకకర్తగా రూపొందించెను యూజెనీ-ఓ-నీల్‌కు 'ది ప్రావిన్స్ టౌన్ ప్లేహవుస్' చక్కని శిక్షణ కేంద్రముగా పరిణమించెను ఏదో ఒక థియేటరుతో సంపర్కము లేకయే, ఏ నాటకకర్త యైనను, ఏకాలమునందు కూడ ప్రాముఖ్యము లోనికి రాజాలడన్న సత్యమును అంగీకరింపక తప్పదు

నాటకమును ఎట్లు వ్రాయవలయునో తెలిసికొనుటకు, ప్రతి వ్యక్తి, తనచే వ్రాయ బడిన నాటకము రంగస్థలముపై ప్రదర్శింప బడుచున్నప్పుడు దానిని దర్శింపవలసి యుండును సంభాషణలను వల్లించుటలో నటీనటులు ఎట్టి బాధకు గురి యగుదురో, ఆతడు ప్రత్యక్షముగా పరికింప వలసి యుండును ఏ దృశ్యములు ప్రేక్షకుల హృదయములకు హత్తుకొనునో ఆతడు స్వయముగా చూడవలసి యుండును ఇట్లు చేయుట వలన నాటకరచనకు సంబంధించిన సిద్ధాంత పరిజ్ఞానముతో పాటు, ఆతనికి ప్రత్యక్షానుభవము కూడ కలుగును నాటక రచయిత లెప్పుడును విద్యార్థులుగా మెలగి, తమ రచనలలోని లోటుపాటులను ఎప్పటికప్పుడు సవరించు కొనవలసి యుండు నని విఖ్యాత రచయిత సోమర్ సెట్ యొక్క అభిప్రాయము

సరియైన నాటకశాలలు లేకుండుట వలననే, ఎందరో నాటక కర్తలకు నాటక రచనా విధానమందలి మర్మములు, కిటుకులు తెలిసికొనుట కవకాశము లేకపోవుచున్నది పుస్తక రూపములో ప్రచురింపబడిన నాటకములలో నాల్గవ వంతు నాటకములు మాత్రమే రంగభూమిపై కెక్కుచున్నవి తక్కి నవి వెలుగులోనికి రాజాలకున్నవి శాస్త్రీయ పద్ధతుల ననుస రించి నిర్మితమైన నాటక శాలలు లేకుండుటయే ఇందుకు కారణము

ఈనాడు మనము చూచుచున్న నాటకశాలలు నిజమైన నాటక శాలలు కావు ఒక ప్రక్క రంగభూమి, మరియొక ప్రక్క ప్రేక్షకులు కూర్చొను ప్రదేశము ఉన్నంత మాత్రము ననే, ఏ పాకయైనను నాటకశాల యని వ్యవహరింపబడుట తగదు నాటకశాల యనిన, దేవాలయ మని భావింపవలసి యుండును నటరాజమూర్తికి మానసపూజ జరుగు ప్రదేశమే నాటక శాల చాక్షుష క్రతువును జరిపించు యజ్ఞశాలయే నాటకశాల నాటకశాల ఒక వేది మంటపము నాటకశాల యొక్క నాలుగు కోణములు నాలుగు వేది చిహ్నములని భరతముని చెప్పియున్నాడు

నాటకము సర్వ జనరంజకముగా నుండవలెనన్నచో నాటకశాల యొక్క రూపురేఖలు ఆకర్షణీయముగ నుండ వలెను నాటకశాలకు రూపురేఖలను ఆకర్షణీయముగా దిద్దిన దేశములలో గ్రీసు మొదటిది గ్రీకునాటక రంగస్థలిచాల పురా తనమైనది ప్రారంభదశలో గ్రీకు నాటక రంగస్థలిమీద నటీనటులు కేవలము సంభాషణల తోడనే నాటకమును నడపు చుండెడివారు, తెరలు, విద్యుద్దీపములు, ఇతర పరికరములు ఆనాటి రంగస్థలి యందు ఉపయోగింప బడెడివి కావు

1787 వ సం॥ వరకు వివిధ దేశములలో నాటకశాలలు చక్కని ఆకృతిని పొందినట్లు కన్పింపదు మానవ నాగరికత అభివృద్ధి యైనకొలది, నాటక రంగము కూడ కాలానుగుణ ముగా మార్పులకు లోనవు చుండెను షెరిడన్, గోల్డ్‌స్మిత్ మొదలయిన కవి పుంగవులు రంగమందు అడుగుపెట్టిన తరు వాతనే, ఇంగ్లండులోని నాటకరంగస్థలి విప్లవాత్మకమైన మార్పునకు గురియైనది థియేటర్ రాయల్ అను నొక నాటకశాల రూపుదాల్చి ఇంగ్లండులోని నాటకోద్యమమునకు గొప్ప ఊతనిచ్చెను ప్రేక్షకుల హృదయములలో రసాను భూతి స్పందించుటకు, రంగస్థలి మీద వివిధ దృశ్యము లగపడు టకు 'సెట్స్' నిర్మింప బడెను విద్యుద్దీపముల ద్వారా కాంతి ప్రసరణము కూడ కల్పింపబడెను దానిచే నాటకమునకు వింత శోభ చేకూరెను సంగీతవాద్యములు కూడ నాటక ప్రదర్శనలో ఒక భాగమయ్యెను నటనములో కూడ మోటు దనము సున్నితత్వమునకు తావిచ్చెను

నాటకము కూడ విశిష్టమైన కళయగుట వలన,

ప్రపంచమందలి వివిధ దేశములు దాని అభ్యున్నతికి ఈనాడెంతయో కృషి కావించుచున్నవి ప్రతి దేశములోను ఒక జాతీయ నాటకశాల వెలసి, ఆ దేశము యొక్క సంస్కృతిని నాగరికతను ప్రతిబింబించుచున్నది చిన్న దేశమైన ఐర్లెండులో కూడ 1904 వ సం॥ లో రూపొందిన అబ్బీ థియేటరు ఈనాటి వరకు నాటక కళామతల్లికి నీరాజనము అర్పించుచున్నది హంగరీలో నెంజట్టి స్లిన్ హాజ్, చెకోస్లోవేకియాలో నరొడ్ని డివాలో, ఆస్ట్రియాలో బర్గ్ థియేటరు ఆయా జాతుల సంప్రదాయముల కనుగుణమైన నాటకములను ప్రదర్శించుచు నాటక కళను ప్రోత్సహించు చున్నవి నార్వే, డెన్మార్కు, స్వీడన్ మున్నగు దేశములలో రాజుల ప్రాపు నందుకొనిన నాటక శాలలు అభివృద్ధి నందుచున్నవి యుగోస్లేవియా, రుమేనియా, బల్గేరియా, ఫిన్‌లెండు మున్నగు దేశములలో జాతీయ నాటకశాల లీనాడు ప్రశంసార్హముగా పనిచేయు చున్నవి ఫ్రాన్సులో ప్రభుత్వముచే నాలుగు నాటకశాలలు నిర్వహింప బడు చున్నవి కామెడీ ఫ్రాంకయిజ్, ఓడియన్, ఒపేరా, ఒపెరా కామిక్ అనునవి వీటి పేర్లు జర్మను ప్రభుత్వము బెర్లిన్ నగరములో స్టాట్స్ థియేటర్ అనునొక నాటక శాలను నిర్మించినది సోవియట్ రష్యాలోని 'మాస్కో ఆర్ట్ థియేటర్', 'బోల్షాయ్ థియేటర్' అను ప్రఖ్యాత జాతీయ నాటకశాలలు ఈనాడు ప్రపంచ దృష్టిని ఆకర్షించు చున్నవి

ఇంగ్లండులో కూడ నాటకోద్యమ మీనాడు ప్రాధాన్యము వహించు చున్నది షేక్‌స్పియరు మెమోరియల్ నేషనల్ థియేటరు కమిటీ, ప్రభుత్వముచే నియమింపబడిన ఆర్ట్స్ కౌన్సిల్ – ఈ రెండు సంస్థలు కలిసి ఒక జాతీయ నాటక శాలను థేమ్స్ నదీ తీరమున నిర్మించినవి ఈ నాటక శాలాభివృద్ధికి ఏటేట ప్రభుత్వము వద్దనుండి పదిలక్షల పౌనులు సబ్సిడీ రూపనులో లభ్యమగు చున్నవి

జాతీయ నాటకశాల యొక్క ఆవశ్యకతను అమెరికా కూడ గుర్తించినది 1935 లో ప్రభుత్వ శాసనము ననుసరించి "అమెరికన్ నేషనల్ థియేటర్ అండ్ అకాడమీ" స్థాపింపబడినది కాలానుగుణమగు మార్పులకు లోనయిన ఈ సంస్థ 1946 లో చక్కని నాటకశాలలను అమెరికాలోని ప్రధాన నగరములలో నిర్మించినది

జాతీయ నాటకశాలను పోషించుట కీనాడు వివిధ దేశములలో గట్టి ప్రయత్నములు జరుగు చున్నవి కమ్యూనిస్టు ప్రభుత్వములు గల దేశములలో ఈ నాటకశాలలు వ్యక్తిగత ప్రాముఖ్యము గల వ్యాపారుల అధీనమందు లేవు అయినా ప్రభుత్వములే ఈ నాటకశాలలను పోషించు చున్నవి కొన్ని దేశములలో ఇవి రాజుల ఆదరణము పొందెను, మరి కొన్ని దేశములలో ప్రభుత్వముల 'సబ్సిడీ' గ్రహించియు వ్యవహరించు చున్నవి

ఈనాడు సినిమా, టెలివిజనుల దాడికి నాటక కళ తట్టుకొన జాలకున్నది. అయినను, మానవుని ఆత్మశక్తి మీద ఆధారపడిన నాటకకళ యంత్రశక్తి మీద ఆధారపడిన సినిమా సమక్షమునందు ముందుకు లంఘించుచునే యున్నది సోవియట్ రష్యాలో ఈ సత్యమును మనము ప్రత్యక్షముగా చూడగల్గుదుము కమ్యూనిస్టు ప్రభుత్వములు ఆ దేశము లందలి సినిమా కళకు ఎంత ప్రాధాన్య మొసగుచున్నవో, అంత ప్రాధాన్యమును నాటక కళకు గూడ ఇచ్చు చున్నవి

నాటకశాల నిర్మాణములో రష్యా క్రొత్తపుంతలు త్రొక్కుచున్నది మాస్కో ఆర్ట్ థియేటరులోని గుండ్రముగా తిరిగెడి రంగభూమి ప్రేక్షకులకు అచ్చెరువు కలిగించును ఈ నాటకశాలను అనుకొనియున్న అయిదంతస్తుల భవనములో నాటక ప్రదర్శనమునకు అవసరమగు ఆధునిక పరికరము లన్నియు నున్నవి ఈ ఆర్ట్ థియేటరులోని రంగస్థలము మనోజ్ఞముగ నుండును రంగభూమి విశాలముగా నుండుటచే, ఏనుగులు, గుర్రములు మున్నగు జంతువులుకూడ దానిపై సంచరించుట కవకాశమున్నది దృశ్యముల మార్పు ఒక క్షణములో జరుగుటకు ఈ థియేటరులో అవకాశ మున్నది శబ్దప్రసారక యంత్రములు, విద్యుద్దీపములు నాటక ప్రదర్శనముల రక్తికి విశేషముగా దోహద మొసగును

నాటకశాలకు తోడుగా నాటక శిక్షణశాలను కూడ సోవియట్ ప్రభుత్వము నడుపు చుండుట గమనింపదగినది మాస్కో ఆర్టుథియేటరుకు అనుబంధ సంస్థగా ఒక విద్యాలయము కూడ ఈనాడు వ్యవహరించు చున్నది ప్రపంచములో నలుమూలలనుండి విద్యార్థులిచటికి వచ్చి ఈ పాఠశాలలో నాటక శిక్షణమును బడయు చున్నారు

ప్రతి దేశమందును జాతీయ నాటకశాలలతోపాటు ప్రాంతీయ నాటకశాలలు కూడ వెలయు చున్నవి ప్రజాస్వామిక దేశములలో ప్రభుత్వములు, ప్రజలు వీటిని నిర్వ

హించుచున్నారు కమ్యూనిస్టు దేశములలో అవి ప్రభుత్వాల చేతనే నడుపబడుచున్నవి, వ్యక్తిగత వ్యాపారులు నాటకకళను దుర్వినియోగపరచి, అమాయక ప్రజలను ఒకవిధమైన భ్రమకు లోనుచేసెదరని ఆ ప్రభుత్వముల అభిప్రాయము అందుచే, శక్తిమంతములైన కళను అవి జాతిపరము చేసియున్నవి

కట్టడముల రూపములో నున్న నాటకశాలలే కాక, సంచార నాటకశాలలు కూడ ప్రజాస్వామిక, కమ్యూనిస్టు దేశములలో సున్నవి. వయోజన విద్యావ్యాప్తికిని, వైజ్ఞానికబీజములను ప్రజాహృదయములలో నాటుటకును ఈ సంచార నాటకశాలలు ఎక్కువగా తోడ్పడుచున్నవి, అమెరికాలోని వివిధ రాష్ట్రములలో ఈ సంచార నాటకశాలలు విశేషముగా విజ్ఞానవ్యాప్తికై కృషిచేయుచున్నవి

భారత దేశములో కూడ నాటకోద్యమము క్రమముగా పటిష్ఠతను చేకూర్చుకొనుచున్నది మహాకవి రవీంద్రుని పేరిట భారత దేశమందలి ప్రధాన నగరములలో, ప్రభుత్వ ప్రాపులో, గొప్ప నాటకశాలలు వెలయుచున్నవి హైదరాబాదులోని 'రవీంద్రభారతి' వీటిలో నొకటి అఖిలభారత సంగీతనాటక అకాడమీ, భారతదేశ మందలి నాటకోద్యమమునకు సల్పుచున్న సేవ గణనీయము

కళలు భౌగోళిక సరిహద్దులను దాటి మానవకోటి సంతతిని ఏకోన్ముఖముగా నడపింప శక్తిగలవి ఈ కళలలో నాటకకళ శక్తిమంతమైనది విజ్ఞాన వినోదములకు ఆలవాలమైన నాటకకళను చిత్తశుద్ధితో ఉపాసించినప్పుడే వివిధ దేశములు "వసుధైక కుటుంబము" అనెడి అమృత వాక్కునకు చరితార్థతను చేకూర్పగలుగును

ఇం. వేం.

## ప్రజాభిప్రాయము

ఇప్పటి యుగమునకు మార్పు ప్రధాన లక్షణము సంప్రదాయ సిద్ధములగు మతవిశ్వాసములను, సాంఘికాచారములను, కట్టుబాట్లను, ఆర్థికపద్ధతులను, పరిపాలన కార్యక్రమములను మార్చి, క్రొత్తవాటిని ప్రవేశపెట్టుటకు గొప్ప ప్రయత్నము జరుగుచున్నది ఆయా రంగములకు చెందిన సంస్కర్తలు ప్రజాభిప్రాయమును తమవైపునకు త్రిప్పుకొనగలిగిన గాని తమ ఉద్యమములకు విజయము లభించదన్న కారణమున సమస్త ప్రయత్నములు గావించుట సర్వసాధారణమైనది మార్పులు ప్రమాదకరము లనియు, సనాతనముగ వచ్చుచున్న సంప్రదాయములే అనుసరణ యోగ్యము లనియు, భావించువారు ప్రజాభిప్రాయమును సంప్రదాయము పట్ల సుముఖముగ నుండునట్లు చేయుటకు గట్టి ప్రయత్నము చేయుచున్నారు క్రొత్తవస్తువులను ఉత్పత్తి చేయువారు, విదేశములనుండి వాటిని దిగుమతి చేయువారు, ప్రజల అభిప్రాయమును వాటికి సుముఖముగ చేసి, వారి రుచులను మార్చుటకు ప్రయత్నములను చేయుచున్నారు అన్ని మార్పులకు ప్రజాభిప్రాయము సాధనమను విషయము సర్వసమ్మతము గాంచినది మార్పులను కోరు వారితో పాటు వాటిని నిరసించువారు కూడ తమ యుద్దేశము నెరవేరుటకు ప్రజాభిప్రాయమే సాధనమని అంగీకరించుచున్నారు

రాజకీయ రంగములో ప్రస్తుతము ప్రజాభిప్రాయమునకు ప్రత్యేక ప్రాధాన్యము లభించియున్నది ప్రజాభిప్రాయము ననుసరించి పరిపాలనము జరుగవలయు ననుట ప్రజాస్వామిక విధానమునకు మూలసూత్రము ప్రజాభిప్రాయమును బట్టియే ప్రజాస్వామికములందు పరిపాలకులు ఎన్నుకొనబడుచున్నారు ప్రజాభిప్రాయము సూచించిన కార్యక్రమములను కొనసాగించుటయు, అది నిరసించిన కార్యక్రమములను వదలుకొనుటయు, ప్రజాస్వామికములలోని ప్రభుత్వములకు లక్షణము కమ్యూనిస్టు, ఫాసిస్టు, సైనిక నియంతృత్వాది ప్రజాస్వామికములు కాని రాజ్యములలో కూడ ప్రజాభిప్రాయమునకు ప్రాధాన్యము కలదు ప్రజలు అజ్ఞానులనియు, వారి అభిప్రాయములను బట్టి పరిపాలనము సాగించుట ప్రమాదకరమనియు ఈ విధానముల ననుసరించువారి విశ్వాసము అయినప్పటికిని ప్రజాభిప్రాయమును తమవైపునకు త్రిప్పుకొనుటకు ప్రచారసాధనముల నన్నిటిని వారు వినియోగించెదరు తాము ఎంత నియంతలైనను, ప్రజల సహకారము లేక తాము తలపెట్టిన కార్యక్రమములు విజయవంతములు కావను సాంకేతికమైన భావమే దీనికి కారణము

ప్రజలలో అందరియొక్క గాని, కొందరియొక్క గాని సమష్టి ప్రయోజనములకు సంబంధించిన అభిప్రాయమే ప్రజాభిప్రాయమని చెప్పదగియున్నది. వ్యక్తుల సొంతవ్యవహారములతో గాని, గుణదోషములతో గాని దానికి సంబంధము లేదు ఇందులో కూడ ప్రభుత్వ సాధనమున సమకూర్పదగిన ప్రయోజనముల

విషయమున సూత్రమే రాజకీయ రంగమునకు సంబంధించిన ప్రజాభిప్రాయము ప్రసక్తమగుచున్నది ఇంతేగాక ప్రభుత్వము పైనను, దాని కార్యకలాపముల పైనను ప్రభావము వహించగల శక్తి ఉన్నప్పుడే ప్రజాభిప్రాయమునకు సార్థక్యము లభించుచున్నది ఒక అభిప్రాయము ప్రజలలో అత్యధికుల అభిప్రాయ మైనప్పుడును, ఆ అభిప్రాయము పట్ల వారికి గాఢమైన విశ్వాసము, పట్టుదల ఉన్నప్పుడును, అందునిమిత్తమై ప్రభుత్వముపై ఒత్తిడి చేయుటకు సభలు, సమావేశములు, ఊరేగింపులు, కరపత్రములు, మొదలైన ప్రచార సాధనము లను వారు ఉపయోగించుటకు సంసిద్ధులైనప్పుడును, దానికి ప్రభుత్వముపై ప్రభావము వహించగల శక్తి సమకూరినట్లు చెప్ప వచ్చును ప్రభుత్వవు వైఖరిని మార్చగల ప్రజాభిప్రాయమే రాజకీయ రంగమున గుర్తింపదగిన ప్రజాభిప్రాయము

అభిప్రాయమునకును, సత్యమునకును గొప్ప భేదము కలదు సత్యమును గురించి ఎవరికిని ఏలాటి సందేహము ఉండదు ఉన్నను అందరును నమ్మదగిన సాక్ష్యము ఆధారము చేసికొని దానిని నివారించ వచ్చును "రెండు రెండ్లు నాలుగు", "భూమి సూర్యుని చుట్టు తిరుగుచున్నది", "ఆవిరి మూలమున మేఘము లేర్పడుచున్నవి"-అను నివి సత్యములు అభిప్రాయ మిట్టిది కాదు ప్రతి అభిప్రాయమును గురించి, "ఇదియా, అదియా," "అనుసరణీయమా, కాదా," అను అనుమానమునకు అవకాశము కలదు మద్యపానమును ప్రభుత్వము నిషేధించ వచ్చునా? అనుదానిలో చర్చనీయాంశములు సత్యాసత్యములు కావు రెండు భిన్న మార్గములలో ఒకదానిని ఎన్నుకొనుటయే చర్చనీయాంశము ఒక్కొక మార్గమందును కొన్ని సాధకములతో పాటు కొన్ని బాధకములు గూడ ఉన్నవి కొందరి దృష్టిలో బాధకములు ఎక్కువగ నుండుటచేత వారు నిషేధము కూడదనే అభిప్రాయమునకు వచ్చుచున్నారు మరికొందరి దృష్టిలో సాధకములతే ఎక్కువ అందుచేత వారి అభిప్రాయము నిషేధమును సమర్థించు చున్నది "భూమి కమతములకు హద్దును కల్పించ వచ్చునా?", "ఆహార పదార్థములను రైతులనుండి నిర్బంధముగ సేకరించు అధికారము ప్రభుత్వమునకు ఉండతగునా?", "బ్యాంకులను జాతీయము చేయవచ్చునా?", "కాశ్మీరు విభజనకు అంగీకరింపవచ్చునా?", "అణ్వస్త్రములను మనమేల తయారు చేయరాదు", అను ఇవి అన్నియు ప్రజలు ప్రభుత్వమునకు సూచించు కార్యక్రమములు వీటి ఫలితములు ఎట్లుండునో భవిష్యత్తున గాని మనకు తెలియజాలదు, అప్పటికి కూడ పూర్తిగ తెలియగలదో లేదో చెప్పజాలము కాని వీటిని గురించి ఏదో ఒక నిర్ణయమునకు రావలసి యున్నది ఏ నిర్ణయమునకు రాకుండుట కూడ ఒక విధమైన నిర్ణయమే వీటిని గురించి మనకు గలగి ఒక అభిప్రాయమే గాని, నిస్సందేహముగ రుజువుపరచదగిన ప్రమాణవాక్యము కాదు అభిప్రాయము మన కోరికలకు సంబంధించిన విషయము అందుచేత ప్రజలలో ప్రభుత్వ సాధనమున జరుగ వలగిన కార్యక్రమముల గురించి అభిప్రాయ భేదములు తప్పవు ప్రజలందరిలో ఏకాభిప్రాయము గల విషయములు చాల తక్కువ అందుచేత ప్రజాస్వామిక రాజ్యములలో ఏకాభిప్రాయము కుదరనప్పుడు అధిక సంఖ్యాకుల అభిప్రాయమును బట్టి కార్యకలాపములు జరుపబడును ఇట్లు కానిపక్షమున ప్రభుత్వ మంతయు స్తంభించిపోవును

అభిప్రాయ భేదములు ఉన్నంతమాత్రమున ఏదియో ఒక అభిప్రాయము ననుసరించుట న్యాయము కాదను వాదము సమర్థనీయము కాజాలదు కావలసినది విషయమునకు సంబంధించిన సంగతి సందర్భముల నన్నిటని చక్కగను, పూర్తిగను పరిశీలించి అభిప్రాయమునకు వచ్చుట తొందరపడి గాని, ఉద్రిక్తతతో గాని ఏదియో ఒక అభిప్రాయమునకు రాకూడదు మనము సూచించు కార్యక్రమములోని గుణదోషములను పరీక్షించి, ఎదుటి పక్షమువారి ఆక్షేపణములను గూడ లెక్కలోనికి తీసికొని మన మొక అభిప్రాయమునకు రావలెను అప్పుడుకూడ మనము సమర్థించు కార్యక్రమము మూలమున మనము ఊహించని ప్రమాదములు కొన్ని సంభవించవచ్చును కాని జీవితమున కిది ఒక లక్షణము దానికి ప్రతిక్రియ ఎట్టిదియు లేదు

ప్రజాభిప్రాయము పూర్తిగ హేతుబద్ధముగ ఉండదు దీనికి కారణము మానవప్రకృతి పూర్తిగ హేతుబద్ధము కాకుండుటయే మానవునిలో అనేక విశ్వాసములు లీనమై ఉన్నవి సంప్రదాయములందును, సమాజములో నాయకత్వము వహించినవారి మాటలందును అతనికి గౌరవము కలదు ప్రజల అభిప్రాయమునకు హేతువాదములో పాటు ఇవికూడ ఆధారము లగుచున్నవి ఒక విధమైన విశ్వాసములు, సంప్రదాయ

ములు, ఒక నాయకుని మాటలు వాటి బలమును కోల్పోవచ్చును కాని వెంటనే మరియొక విధమైన విశ్వాసములు, సంప్రదాయములు మరియొక నాయకుని మాటలు వాటి స్థానమును ఆక్రమించుకొనును ఏ విశ్వాసములు, సంప్రదాయములు, నాయకులు లేకుండ మానవ జీవితము ఇప్పటివరకు సాగలేదు ఇకమీదట సాగజాలదు వీటి అన్నిటిలో హేతువాదమునకు నిలబడలేని అంశములు ఎన్నో కలవు హేతువాదమే తమ తత్త్వమునకు ఆధారమనిచెప్పు కమ్యూనిస్టుల తత్త్వమందు కూడ ఇట్టి అంశములే కనుపించుచున్నవి వారుకూడ సోవియట్ సంప్రదాయమునకో, చైనా సంప్రదాయమునకో దాసులు మార్క్సు, లెనిన్, మావో అను నాయకుల వాక్యములు వారికి పరమప్రమాణములు వారి అభిప్రాయములపై వీటికి గల ప్రభావము అంతంత కాదు

ప్రజాభిప్రాయమును సృష్టించువారు ప్రజలు కారు క్రొత్త అభిప్రాయమును ఏ ఒక్క ప్రతిభాశాలియో సృష్టించుచున్నాడు అతని శిష్యులు దానిని ప్రచారము చేయుటయు, వారి మూలమున అది స్వల్పసంఖ్యాకులలో వ్యాప్తిగాంచి క్రమక్రమముగ ప్రజలలో వ్యాపించుటయు జరుగుచున్నది ఇది జరుగుచున్నప్పుడు దీనిని ప్రతిఘటించువారు కూడ కొందరు బయలుదేరుటయు, వారు దీనికి విరుద్ధముగ ప్రచారము చేయుటయు, దాని మూలమున ప్రజలలో వివిధములగు అభిప్రాయములు బయలుదేరుటయు సంభవించుచున్నది సామాన్య ప్రజలు, అభిప్రాయములను స్వీకరించువారే గాని సృష్టించువారు కారు కాని వారు వాటిని స్వీకరించినప్పుడే వాటికి సంఘమును మార్చగల శక్తి లభ్యమగుచున్నది సంఖ్యాబలము లేక ఏ అభిప్రాయము ప్రభుత్వముపై ప్రభావము వహింప శక్తి కలది కాజాలదు

ప్రస్తుత కాలమున క్రొత్త అభిప్రాయములను ప్రజలలో వ్యాపింపజేయుటకు అనేక సాధనములు కలవు దేశమందు ప్రయాణ సౌకర్యములు వృద్ధిగాంచుటచేత ప్రజల మధ్య సంబంధములు పెరిగి ఒక ప్రాంతమున బయలుదేరిన అభిప్రాయములు దేశమంతట వ్యాప్తి గాంచుచున్నవి పూర్వకాలమునకంటె ఇప్పటి కాలమున విద్యాలయముల సంఖ్యయు, విద్య నేర్చుకొన్నవారి సంఖ్యయు వృద్ధిగాంచుచున్నవి విద్య, అభిప్రాయముల వ్యాప్తికి గొప్ప సాధనము ఒక విద్యావంతుడు అనేక విద్యావిహీనుల అభిప్రాయములను మార్పగలిగి యున్నాడు వార్తాపత్రికలు, గ్రంథములు, అభిప్రాయప్రచారమునకు పటిష్ఠములైన సాధనములు అక్షరాస్యత పెరుగుచుండు దేశములలో వీటిని స్వయముగ చదువగలవారి సంఖ్య పెరుగుటయు, ప్రజాభిప్రాయము దాని మూలమున మరింత సులభముగ రూపొందుటయు జరుగుచున్నది అన్ని దేశములలో రేడియో, సినిమా మొదలైన సమాచార సాధనములు అభిప్రాయ వ్యాప్తిలో ఎంతయు తోడ్పడుచున్నవి సినిమాలను చూచి, అందులోని సంభాషణలను, పాటలను, పద్యములను వారివారి అభిమాన తారల ముఖములందుండి విని ప్రజలు క్రొత్త అభిప్రాయములు కలవారగుచున్నారు సభలు, సమావేశములు ప్రచారమునకై ఏర్పరచబడిన ఊరేగింపులు, వాటిలో ఉపయోగింపబడు నినాదములు ఈ సందర్భమున ప్రాధాన్యమును వహించుచున్నవి

వీటి అన్నిటితోపాటు ప్రజాస్వామిక దేశములలో రాజకీయ పక్షము లనేకములు ఏర్పడుటయు, తమ అభిప్రాయములను అనేక సాధనముల సహాయమున ప్రచారము గావించుటయు జరుగుచున్నది స్వయముగా రాజకీయ విషయములందు శ్రద్ధాసక్తులు గలవారి సంఖ్య చాల తక్కువ తమ తమ వృత్తుల ననుసరించుటయందును, కుటుంబముల పోషించుకొనుటయందును, సామాన్య ప్రజలు తమ కాలమును వినియోగించుకొనుచుందురు విశ్రాంతికాలము ఏదైన ఉన్న, దానిని వినోదములకై ఉపయోగించుకొనెదరు గాని, సాంఘిక, రాజకీయాది సమస్యలను గురించి చర్చించుటకు గాని, చర్చలను వినుటకు గాని అనేకులు సిద్ధముగా ఉండరు ప్రజల వోట్లను సంపాదించి, తద్వారా అధికారమునకు వచ్చుటయే రాజకీయ పక్షముల ప్రధానోద్దేశ మగుటచేత, అది కొనసాగుటకై వివిధ పక్షములవారు ప్రజల మధ్య తిరుగుచు, సమయము చూచుకొని తమ అభిప్రాయములను వారిలో వ్యాపింపజేయుటలో శ్రద్ధ వహించుట సహజము ఇందుచేత ప్రజాభిప్రాయమును రూపొందించుటలో రాజకీయ పక్షములు వహించు పాత్రకు గొప్ప ప్రాధాన్యము కలదు

ప్రజాభిప్రాయమును రూపొందించుటకై సాధనము లనేకము లున్నట్లు, అది ఏవైపునకు మొగ్గుచున్నదో తెలిసికొనుటకు కూడ ఈ కాలమున అనేక సాధనములను ఉపయోగించుచున్నారు సాధారణ మయిన ఎన్నికలలో ఏయే పక్ష

ములకు ఎన్నివోట్లు రాగలవో, ఏ పక్షమునకు విజయము రాగలదో ఎన్నికలకు పూర్వమే అంచనా వేయుట సాధ్యమగుచున్నది ఇదేవిధముగ ప్రభుత్వము తలపెట్టిన కార్యక్రమముల పట్ల ప్రజలలో ఎందరు సుముఖులో, ఎందరు విముఖులో ఉరామరికగా తెలిసికొనుటకై ఈసాధనములను వాడుచున్నారు అందుచేత ప్రజాభిప్రాయానుసారము ప్రభుత్వమును నడుపుట మరింత సులభసాధ్యమగుచున్నది

ప్రజాభిప్రాయమును మార్చి రూపొందించుటలో మన స్తత్వ శాస్త్రము ఎంతో సహకారిగ నున్నది ఎలాటి ప్రచారకులు ప్రజల మనస్సులను ఎక్కువగ ఆకర్షించగలరో, ప్రచారకుల సౌందర్యము, వారి దుస్తులు, వారి పాటలు, వారి లాస్యము, ప్రజలపై ఎట్టి ప్రభావముకలదో తెలుపగల నిపుణులనేకులు ఈ కాలమున ఉన్నారు వార్తాపత్రికలలోను, గోడలపైనను చిత్ర విచిత్రములగు స్త్రీ పురుషుల బొమ్మలను ప్రకటించి, ఆ ప్రకటనల సహాయమున తాము తయారుచేసి అమ్మదలచిన వస్తువులపై ప్రజలకు మోజు కలుగుపట్లు చేయుటకై లక్షలాది ద్రవ్యమును వ్యాపారస్థులు ఖర్చుపెట్టుట సర్వ సాధారణము వస్తువులపట్ల ప్రజల రుచులను మార్పుటకు ఇట్టి ప్రయత్నములు అపరిమితముగ జరుగుచున్నవి వస్తువుల గుణావగుణముల బట్టి కాక ప్రకటనలలోని బొమ్మలచేత ఆకర్షింపబడి ప్రజలు వస్తువులను కొనుగోలు చేయుట ఈ యుగమునకు ఒక ప్రధాన లక్షణము ఒక రాజకీయ రంగమందే గాక ఆర్థికాది సమస్త రంగములందును ప్రజాభిప్రాయమునకు అత్యంతమైన విలువ ఉండుటచేత దానిని ప్రచార సాధనముగను, ప్రకటనల సాధనముగను, తమకు అనుకూలముగ రూపొందించుకొనుట అనేక వర్గములవారు, ఉత్పత్తిదార్లు, వర్తకులు, నటులు, నర్తకులు, గాయకులు, తుదకు కవులు కూడ ప్రయత్నము చేయుట యుగ ధర్మమయ్యెను

మా వేం ౧౦

## ప్రజారాజ్యము

ప్రజలచే స్వేచ్ఛగను, సవ్యముగను ఎన్నుకొనబడు ప్రతినిధులు పరిపాలించు రాజ్యమునకు ప్రజారాజ్యము అని పేరు ప్రజలు స్వయముగను, ప్రత్యక్షముగను పరిపాలించు రాజ్యమునకు కూడ ఈ పేరు చెల్లుచున్నది కాని అట్టి రాజ్యములు ప్రాచీన కాలమునందు కొన్ని దేశములం దుండినను, ప్రస్తుతకాలమున అట్టివి ఎచ్చటను లేవు ఆ కాలమున రాజ్యములు కొన్ని ఒక పట్టణమునకు మాత్రము పరిమితములై, విస్తీర్ణ మందును, జనసంఖ్య యందును మిక్కిలి చిన్నవిగ నుండినందున, ప్రజలందరు ఒక సభలో సమావేశమై పరిపాలనకు సంబంధించిన వ్యవహారములను చర్చించి పరిష్కరించుట ఆచరణ సాధ్యముగ నుండెను ఇదిగాక అప్పటి వారికి ప్రాతినిధ్య విధానము తెలిసియుండలేదు ప్రస్తుత కాలపు రాజ్యములు దేశవ్యాప్తములై లక్షలకొలది, కోట్లకొలది జనసంఖ్య కలిగినట్టివి ఇంతటి జనము ఒక సభలో సమావేశ మగుటయు, సావధానముగా వ్యవహారములను పరిశీలించుటయు సాధ్యము కాదు ఇట్టి రాజ్యములు ప్రజారాజ్యము లగుటకు ప్రజలు పరిపాలకులను ఎన్నుకొనుట తప్ప సాధనాంతరము లేదు అందుచేత ప్రజలు స్వేచ్ఛగను, సవ్యముగను ఎన్నుకొను ప్రతినిధులు పరిపాలించు రాజ్యము ప్రజారాజ్యము అను నిర్వచనము ఈ కాలపు పరిస్థితులకు అనుగుణముగ నున్నది

ప్రస్తుతము ప్రపంచములో సుమారు నూట ఇరువది స్వతంత్ర రాజ్యము లున్నవి వీటిలో సుమారు సుప్పదియైదు రాజ్యములు ప్రజారాజ్యములు భారతదేశము ఈ వర్గములో చేరినట్టిది తక్కిన రాజ్యములు నియంతృత్వ పరిపాలన విధానమును అనుసరించు నట్టివి వీటిలో కొన్నిటియందు పరిపాలనాధికార మంతయు ఒక నియంతవశ మందున్నది మరి కొన్నిటియందు కమ్యూనిష్టు పక్షమువంటి ఏకైక రాజకీయ పక్షము యొక్క వశమందున్నది నియంతృత్వ విధానము ననుసరించు దేశములలో కొన్నిటియందు ఎన్నికలు జరిగినను అవి స్వేచ్ఛతో కూడిన ఎన్నికలు కావు అధికార పక్షము తప్ప తక్కిన రాజకీయ పక్షము లేర్పడుట గాని, పనిచేయుట గాని, ఆ దేశములలో చట్ట విరుద్ధము ప్రజారాజ్యములలో వివిధ పక్షములకు చెందిన అభ్యర్థులు ఎన్నికలలో నిలబడుటచేత వారిలో నొకరిని ఎన్నుకొనుటకు ప్రజలకు అవకాశము, స్వేచ్ఛ కలదు ఒక్కొక్క నియోజక వర్గమున ఒకరికంటె ఎక్కువ అభ్యర్థులు నిలబడినప్పుడే ఎన్నిక అనుమాట సార్థకమగుచున్నది నియంతృత్వ దేశములలో ఒక్కొక్క నియోజక వర్గమున అధికార పక్షమునకు చెందిన అభ్యర్థి ఒక్కడే నిలబడుటచేత ఓటర్లు విధిలేక అతనినే ఎన్నిక చేయవలసినవారగుచున్నారు అందుచేత దేశములో ఎవరు పరిపాలన

అధికారమునువహించవలెనో నిర్ణయించుటయందు ఎన్నికలకు ఎట్టి ప్రాధాన్యము లేదు అవి ఒక తంతు మాత్రమే అచ్చటి పరిపాలకుల అధికారమునకు సైన్యములు, రహస్యముగ పనిచేయు పోలీసు దళములు ప్రధానాధారములు ప్రజారాజ్యములలో ఈ అధికారమునకు ప్రజల ఆమోదము ఆధారము ఎన్నికలు ఈ ఆమోదమును వ్యక్తపరచు సాధనము

ప్రజారాజ్య విధానము ప్రపంచములోని కొన్ని దేశములయం దు మాత్రమే పరిమితమై ఉండుటయే గాక, ప్రపంచ చరిత్రలో గత రెండు మూడు వందల సంవత్సరముల మధ్యనే దానికి వ్యాప్తియు, ప్రాధాన్యమును లభించినవని గుర్తించుట అవసరము ప్రాచీన కాలములో గ్రీసుదేశములోని ఏథెన్సు నగర రాజ్యములు కొన్నిటి యందు ప్రజాప్రభుత్వము వర్ధిల్లెను, అది క్రీ పూ 400 సంవత్సరముల నాటి మాట అటు తర్వాత రెండువేల సంవత్సరముల కాలము ప్రపంచ మందంతటను ప్రజల ఎన్నికలతో నిమిత్తము లేని పరిపాలన విధానము లుండెను అత్యధిక సంఖ్యాక రాజ్యములలో వంశ పారంపర్యముగ అధికారమునకు వచ్చిన రాజులు పరిపాలనము సాగించుచుండిరి ఆయారాజ్యములలో కొన్ని ప్రముఖ వర్గములు-భూస్వాములు, మతాధికారులు మొదలైనవారు-వారికి అండగా నిలబడి, వారి అధికారములో భాగస్వాములుగ నుండిరి అందుచేత ఇటీవలి కాలమువరకు ప్రభుత్వము లన్నియు అల్పసంఖ్యాక వర్గముల వశమందున్నట్లు చెప్పవచ్చును వారిని అధికారములో ప్రవేశపెట్టుటయందు గాని, అధికారమునుండి తొలగించుట యందు గాని, ప్రజలకు ఎలాటి పాత్రయు ఉండినది లేదు వారి ఆజ్ఞలను శిరసా వహించుటయే ప్రజల కర్తవ్యముగ భావించబడుచుండెను

ఈ విధానమున ప్రప్రథమముగ ఇంగ్లండులో మార్పు ప్రారంభమయ్యెను 17వ శతాబ్దమున ఇంగ్లండు ప్రజలు ఒక విప్లవమును లేవదీసి, నిరంకుశులగు రాజులపై తిరుగుబాటు గావించి, ప్రజలు ఎన్నుకొన్న పార్లమెంటు సభ దేశమును పాలించు విధానమును స్థాపించిరి అది మొదలు "ప్రభుత్వములకు ప్రజల ఆమోదమే ఆధారము" అను సిద్ధాంతము పాశ్చాత్య ప్రపంచమున ప్రాబల్యము వహించి 1776 లో అమెరికాయందును, 1789 లో ఫ్రాన్సునందును గొప్ప విప్లవములకు దారితీసెను అమెరికా విప్లవ ఫలితముగ ఇప్పటి యునైటెడ్ స్టేట్సు ప్రజలు బ్రిటీషు రాజుల యొక్క నిరంకుశ పరిపాలనమును తొలగ ద్రోసి స్వతంత్ర రాజ్యమును స్థాపించుకొని, దానిని ప్రజలు ఎన్నుకొనిన ప్రతినిధులు పరిపాలించవలెనను విధానమును ప్రవేశపెట్టిరి 1788 నాటికి అమెరికా విప్లవమునకు ఆధారమైన ప్రజాస్వామిక సిద్ధాంతములు ఫ్రాన్సు దేశమునను వ్యాపించి, [illegible] ప్రాబల్యగాంచి ఫ్రెంచి విప్లవమును లేవదీసెను అంతవరకు తమ నిరంకుశ ప్రభువులు పెట్టుచుండిన బాధలను సహింపలేని వారై ఫ్రెంచి ప్రజలు అప్పటి ప్రభువుపై తిరుగుబాటు గావించి ప్రజా రాజ్యమును స్థాపించి, విప్లవ తత్త్వములను, ప్రజాస్వామిక విధానమునకు ప్రధానాంశములైన మానవ సమత్వ, స్వాతంత్ర్య, సౌభ్రాత్ర సిద్ధాంతములను యూరపు ఖండమందంతట ప్రచారము గావించి, అంతకుపూర్వము అధికారమందుండిన నిరంకుశ ప్రభుత్వము లనేకములను తొలగద్రోసిరి ఈవిధముగ ఇంగ్లండు, అమెరికా, ఫ్రాన్సు దేశములలో 17, 18 శతాబ్దములలో జరిగిన విప్లవములు, వాటికి ఆధారములైన తత్త్వములు బహుళ వ్యాప్తిని గాంచి, ప్రజారాజ్య విధానమే ఉత్తమ పరిపాలనా విధానమను భావమును, అట్టి రాజ్యముల సంఖ్యను పెంపొందించెను 19 వ శతాబ్దపు చివరి భాగమునాటికి పశ్చిమ యూరపు ఖండములోని దేశము లనేకములు, ఖండాంతరములలో బ్రిటిషు వలస రాష్ట్రములుగ నుండిన కెనడా, ఆస్ట్రేలియా, న్యూజిలెండులు, దక్షిణ అమెరికాలోని కొన్ని దేశములు ప్రజారాజ్యములుగ రూపొందెను 1914-18 సం॥లో జరిగిన మొదటి ప్రపంచ యుద్ధమందు ప్రజాస్వామికములగు దేశములు విజయమును సాధించుటయు, నిరంకుశములగు సామ్రాజ్యములు విచ్ఛిత్తి గాంచుటయు సంభవించెను తత్ఫలితముగ మరి కొన్ని దేశములందు ప్రజాస్వామిక విధానము నెలకొల్పబడెను 1930 నాటికి ప్రజారాజ్య విధానము, ఆ విధానమునకు ఆధారమైన తత్త్వము ఉచ్చస్థితియం దుండెను అది ప్రపంచ వ్యాప్తము కాగలదన్న విశ్వాసము కూడ ప్రాబల్యము గాంచెను

విప్లవ యుగపు ప్రథమ దశలో 'ప్రజలు' అను శబ్దమునకు భూస్వామ్యాది ఉన్నత వర్గములకును మధ్యతరగతులకును చెందిన వారను పరిమితార్థము కల్పింపబడెను విప్లవములను లేవదీయుటలో మధ్య తరగతులకు చెందినవారు ప్రధాన పాత్ర వహించుటయే దీనికి కారణము అందుచేత ఈ వర్గములవారే పరిపాలకులను ఎన్నుకొనుటయందు పాల్గొను

చుండిరి క్రమక్రమముగ పారిశ్రామిక విప్లవము సంభవించుటయు, కార్మికుల సంఖ్యయు, వారి సంఘములు ప్రాబల్యము గాంచుటయు, రాజకీయ ఉద్యమములలో వారు కూడ ప్రవేశించుటయు జరిగెను తత్ఫలితముగ వారు కూడ ''ప్రజలుగ'' గుర్తింపబడి, ఎన్నికలలో పాల్గొను వారైరి కాని అప్పటికి కూడ పురుషులకేగాని, స్త్రీలకు ఎన్నికల హక్కు లేకుండెను 1916 తర్వాత, మొదటి ప్రపంచ యుద్ధము మూలమున సంభవించిన పరిణామముల ఫలితముగ స్త్రీలు కూడ పురుషులతో సమానమైన పౌరులుగ గుర్తింపబడిరి అప్పటినుండి ఏవియో కొన్ని రాజ్యములందు తప్ప తక్కినవాటిలో పురుషులతో పాటు స్త్రీలు కూడ ఎన్నికలలో పాల్గొన గల వారైరి

మొదటి నుండియు సంప్రదాయ సిద్ధముగ అధికారములో నుండిన వర్గముల వారును, విజ్ఞాన వేత్తలలో కొందరును ప్రజా ప్రభుత్వ విధానమునకు ప్రతికూలురుగ నుండిరి కాని, వారి ప్రతిఘటన ఈ విధానము యొక్క వ్యాప్తికి ఆటంకము కలిగించలేదు 1917 లో సోవియట్ రష్యాయందు కమ్యూనిస్టు పక్షమువారు గొప్ప విప్లవమును తేవదీసి, ఏక పక్ష నియంతృత్వమును స్థాపించి, తమ నిరంకుశ పరిపాలన సాధనమున దేశమును బాహ్య శత్రువుల ప్రమాదము నుండి రక్షించుటయే గాక, ఆర్థిక సాంఘిక పరిస్థితుల యందు విప్లవాత్మకములైన మార్పులను గావించి, వెనుకబడిన దేశమును పురోగమింప జేయుటలో నియంతృత్వము పటిష్ఠ సాధనమని నిరూపింప గలిగిరి ఇంతేగాక, వారి కమ్యూనిస్టు విధానమును, తత్త్వమును ప్రపంచమందంతట ప్రచారము చేయ సాగిరి అప్పటి అంతర్జాతీయ పరిస్థితులు వారి ప్రచారమునకు ఎంతో అనుకూలించెను ఏషియా ఖండపు దేశములలోను, వెనుకబడిన ఇతర ప్రాంతము లందును కమ్యూనిస్టు పక్షములు నిర్మాణము గావింపబడెను ఆర్థికముగను, సాంఘికముగను తరతరములుగ వెనుకబడియుండు దేశముల పురోభివృద్ధికి కమ్యూనిస్టు నియంతృత్వ విధానము, ప్రజా ప్రభుత్వ విధానముకంటె పటిష్ఠమైన సాధనమను ప్రచారము తీవ్రముగ జరుగ సాగెను 1917 కు పూర్వము ప్రజా ప్రభుత్వ విధాన మొక్కటే విప్లవాత్మకమైన విధానమనియు, అది ఒక్కటే ఆదర్శ రాజకీయ విధాన మనియు ప్రజలు భావించి యుండిరి దానితో పోటీ చేయగల విధాన మింకొకటి ప్రచారములో లేకుండెను 1917 తర్వాత కమ్యూనిస్టు నియంతృత్వ విధానము దానితో పోటీ చేయగలది అయ్యెను రెండవ ప్రపంచ యుద్ధ ఫలితముగ కమ్యూనిస్టు దేశమైన సోవియట్ రష్యా బలపడుటయు, ప్రపంచములో దాని పలుకుబడి పెరుగుటయు, మధ్య యూరపు, తూర్పుయూరపు దేశములు దాని ఆధీనములోనికి వచ్చి, కమ్యూనిస్టు విధానమును అనుసరించుటయు, అత్యధిక జనసంఖ్యగల చైనా దేశము కమ్యూనిస్టు దేశమగుటయు, కమ్యూనిస్టు సిద్ధాంతములకును, ఉద్యమమునకును మరింత బలమును చేకూర్చెను ఒకప్పుడు ప్రపంచములోని దేశములన్నియు ప్రజారాజ్యములు రూపొందగలవను విశ్వాసము ప్రబలి యుండెను కాని 1917 తర్వాత జరిగిన పరిణామముల మూలమున ఆ విశ్వాసము బలహీనత గాంచెను

ఏషియా, ఆఫ్రికా ఖండములలోని దేశము లనేకములు 1945 కు పూర్వము పాశ్చాత్యుల వలస రాష్ట్రములుగ నుండి 1945 కు తర్వాత స్వతంత్ర రాజ్యములు కాగలిగెను వీటిపై యాజమాన్యము వహించిన ఇంగ్లండు, ఫ్రాన్సు, నెదర్లాండ్సు, యునైటెడ్ స్టేట్సు మొదలైనవి ప్రజారాజ్యము లగుటచేత, వాటి పరిపాలన విధాన ప్రభావ కారణమున ఈ స్వతంత్ర రాజ్యములు ప్రప్రథమమున ప్రజాస్వామిక విధానమును అనుసరించెను కాని కొన్ని సంవత్సరములు కడచుటకు పూర్వమే ఈ దేశములలో అనేకములందు ప్రభుత్వములు స్థిరత్వము లేక పదే పదే మారుటయు, అధికారములో లేని ప్రతిపక్షములు దేశైక్యమునకు భంగకరములైన అతివాద ఉద్యమములు లేవదీసి శాంతి భద్రతలకు ప్రమాదము కలిగించుటయు, తరతరములుగ నిరంకుశత్వమునకు అలవాటు పడిన ప్రజలు ప్రజాస్వామిక విధానమందు గాఢ విశ్వాసము చూపక పోవుట చేతను, ఈ విధానముపట్ల అభిమానములేని నాయకులు సైనిక వర్గముల సహాయమున ప్రజాస్వామికమును రద్దుచేసి, నియంతృత్వమును నెలకొల్పిరి ఇట్టి మార్పు జరిగిన దేశములలో ఇండోనేషియా, బర్మా, పాకిస్తాన్, ఈజిప్టు, ఘనా దేశములు ప్రధానముగ గుర్తింపదగినవి ఏషియా, ఆఫ్రికా ఖండములలోని మరికొన్ని దేశములు కూడ ఈ మార్గమునే అనుసరించి, ఏకపక్ష నియంతృత్వ రాజ్యములుగ రూపొందుచున్నవి భారత దేశము సింహళము, మలేషియా, ఫిలిప్పైన్సు, జపాన్ దేశములలో మాత్రము రెండవ ప్రపంచ యుద్ధా

నంతరము స్థాపింపబడిన ప్రజారాజ్య విధానము ఇప్పటివరకు ఏలాటి అంతరాయము లేక అమలులో ఉన్నది

యూరపు ఖండము నందు కూడ ఫ్రాన్సు, జర్మనీ, ఇటలీ దేశములందు ప్రజాప్రభుత్వము పూర్తి సుస్థిరత్వమును సంపాదించ లేదు ప్రపంచములో ప్రస్తుతము ఇంగ్లండు, ఐర్లాండు, లక్సెంబర్గు, నెదర్లాండ్సు, బెల్జియం, డెన్‌మార్కు, నార్వే, స్వీడన్, స్విట్జర్‌లాండు, యునైటెడ్ స్టేట్సు, ఆస్ట్రేలియా, న్యూజిలెండు దేశములు మాత్రమే సుస్థిరత్వము గాంచిన ప్రజారాజ్యము లని విజ్ఞుల అభిప్రాయము

1920 తర్వాత అనేక దేశములలో ప్రజాస్వామికమునకు బదులు కమ్యూనిస్టు విధానము వ్యాపించుటయు, 1945 తర్వాత ప్రజాస్వామికమును వరించిన పాకిస్తాన్ వంటి ఏషియా, ఆఫ్రికా ఖండపు దేశములలో అది రద్దగుటయు, రద్దుకాని దేశములలో కూడ దాని స్థిరత్వమును గురించి సంశయములు బయలుదేరుటయు ప్రజాస్వామిక సిద్ధాంతములోని గుణదోషముల పునఃపరిశీలనమునకు దారితీసెను కొన్ని ఆర్థిక సాంఘిక పరిస్థితులు ప్రజాస్వామికము సుస్థిరమగుటకు తోడ్పడు ననియు, అట్టి పరిస్థితులు లేని దేశములలో ఈ విధానము విజయవంత మగుట సందేహాస్పద మనియు పరిశీలకు లనేకులు అభిప్రాయపడి యున్నారు సుస్థిరత్వమునకు అనుకూలములగు పరిస్థితులలో కొన్ని ప్రధానముగ గుర్తించవలసి ఉన్నది (1) వీటిలో మొదటిది ప్రజల మనోవైఖరి ప్రజలకు ప్రజారాజ్యమందు పూర్తి విశ్వాసముండుట అవసరము ఇంగ్లండు మొదలైన దేశములలో అట్టి విశ్వాసము ఏర్పడి యున్నది ఈ దేశములలో ప్రజాస్వామిక విధానము కాలక్రమమున రూపొందినట్టిది అనుభవము ద్వారా ప్రజలు అందులోని సుగుణములను గ్రహించ గలిగిరి తరతరములుగ నిరంకుశత్వమునకును అల్పసంఖ్యాక వర్గముల అధికారమునకును లోబడిన ఏషియా, ఆఫ్రికా ఖండప్రజలకు అకస్మాత్తుగ ఇట్టి విశ్వాసము కుదురుట సాధ్యము కాదు దీనికి కొంత వ్యవధి కావలసి యున్నది (2) ఆర్థికాభివృద్ధి - ప్రజాస్వామికము సుస్థిరత్వము గాంచిన దేశములన్నియు ఆర్థికముగ వృద్ధిగాంచినట్టివి వీటిలోని ప్రజల సగటు ఆదాయము ఎక్కువగ నున్నది కనీస అవసరములను కూడ తీర్చుకొనలేని దరిద్రుల సంఖ్య చాల తక్కువ ఆర్థికములగు తరతమ భేదములు కూడ తక్కువ ప్రజలలో మధ్యతరగతికి చెందినవారి సంఖ్య ఎక్కువ వర్గవిభేదములు విపరీతములుగ నుండని కారణమున ప్రజలమధ్య అసూయ, ద్వేషము మొదలగు సంఘర్షణములకు దారితీయు లక్షణములకు ఎక్కువ అవకాశము లేదు అందరును ఎంతో కొంత ఆస్తిపరులగుటచేత విప్లవోద్యమములు, అతివాద ఉద్యమములు వారిని ఆకర్షించవు వర్గ పోరాట సిద్ధాంతమును ప్రచారముచేయు కమ్యూనిస్టు పార్టి, ఆర్థికాభివృద్ధి గాంచిన దేశములలో పలుకుబడి సంపాదించలేక పోవుటకు ఇదియే కారణము (3) విద్యాభివృద్ధి - ఇంగ్లండువంటి దేశములలో అందరును అక్షరాస్యులు ప్రజలలో అధికభాగము మాధ్యమిక విద్యను అభ్యసించినట్టివారు స్వయముగ వార్తాపత్రికలను, పుస్తకములను చదివి, రాజకీయ విషయములను గురించి చెప్పెడు మాటలను విశ్వసించక, స్వయముగ ఆలోచించి మంచి చెడ్డలను గ్రహించగలవారు ప్రజాప్రభుత్వము స్థిరత్వము సంపాదించుటకు ప్రజలలో సామాన్య విద్య వ్యాపించుట అవసరము (4) ప్రజాస్వామికము మూలమున ప్రజలు వాంఛించు సత్ఫలితములు ఈ దేశములందు లభించుచున్నవి అందరి అవసరములు చాలవరకు తీరుట, అందరును విద్యావంతులగుట, ప్రభుత్వము అందరి సౌభాగ్యము వృద్ధిగాంచుటకు కావలసిన కార్యకలాపములు సాగించుట మున్నగు ఫలితములు ప్రజాస్వామికము మూలమున ప్రజలకు లభించినవి ఈ కారణముచేత ప్రజలకు ఈ విధానమందు పూర్తి విశ్వాసము కలిగినది, దీనిని తొలగద్రోయుటకు ప్రయత్నించువారి ప్రచారమునకు ఎట్టి అవకాశము గాని లేకపోయినది

పై వివరణమును బట్టి ఒక సత్యము స్పష్టమగుచున్నది ప్రపంచములో ప్రస్తుతము స్థిరత్వములేని ప్రజారాజ్యములు కొన్ని ఉన్నవి భారతదేశములో ప్రజాస్వామికము కూడ అట్టిదనియే అనేకుల అభిప్రాయము ఇంగ్లండు మొదలైన రాజ్యముల వలె ఈ రాజ్యములందు కూడ ప్రజాస్వామికము సుస్థిరత్వమును సంపాదించ వలయుననిన, ఆర్థికాభివృద్ధి సత్వరముగ జరుగుట అవసరము ప్రజల కనీస అవసరములను తీర్చుటకు కావలసిన ఆహారాది పదార్థముల ఉత్పత్తి వెంటనే పెరుగ వలసి యున్నది ప్రజలలో విద్యావ్యాప్తి జరుగవలెను ఆర్థికముగను, సాంఘికముగను ఉండు తరతమ భేదములు తగ్గవలెను ఆర్థిక సాంఘిక పరిస్థితులకును, పరిపాలన విధాన సుస్థిరత్వమునకును అవినాభావ సంబంధ మున్నది

ఈ సత్యమును గ్రహించి ఏషియా, ఆఫ్రికా ఖండములలోని వెనుకబడిన దేశముల ప్రజాప్రభుత్వములు ఆయా దేశముల ఆర్థిక, సాంఘిక పరిస్థితులను సత్వరముగ మార్చుటకు అనుగుణములైన కార్యక్రమములను సాగించుటయందు శ్రద్ధ వహించుచున్నవి.

ప్రతి రాజకీయ ఉద్యమమునకు ఏదియో ఒక సిద్ధాంతము, ఒక తత్త్వము ఆధారముగ నున్నది. ఆ తత్త్వములోని బలమును బట్టియే ఉద్యమమునకు బలము, ప్రచార సౌలభ్యము వ్యాప్తి లభించుచున్నవి. ఈ కారణముచేత ప్రజారాజ్య విధానమును సమర్థించు తత్త్వముయొక్క స్వరూపమును, అందులోని ప్రధానాంశములను తెలిసికొనుట అవసరము.

మానవ సమాజమును గురించి చాలాకాలము నుండి రెండు ప్రధాన తత్త్వములు ప్రతిపాదింపబడి యున్నవి. ఒక తత్త్వము మానవులందరిలో ఉండు సామాన్య లక్షణములకు ప్రాధాన్యము కల్పించి మానవ సమానత్వమును సమర్థించుచున్నది. మానవులందరియందు తెలివి, మంచి చెడుగుల మధ్య విచక్షణ చేయగల శక్తి, ప్రతిభ, ప్రజ్ఞ బీజరూపమున నున్నవనియు, అందరికీ సమానావకాశములు లభించినపుడు ఇవి వికసించగలవనియు, సమానావకాశములు లేని కారణమున కొందరు పైకి వచ్చుటయు, తక్కినవారు వెనుకబడి యుండుటయు సంభవించుచున్నదని ఈ తత్త్వము సిద్ధాంతీకరించుచున్నది. సమాజ నిర్మాణమున కంతకు మానవ సమత్వము ప్రధానాధారముగ నుండదగిన సూత్రమని ఇది సమర్థించుచున్నది. ప్రజాస్వామిక విధానమునకు ఈ సమత్వ సిద్ధాంతము మూలాధారము. రెండవ తత్త్వము మానవుల మధ్యనుండు విభేదములను, అసమత్వమును ఆధారముగ చేసికొని, పుట్టుకచేతనే కొందరు ఎక్కువ తెలివితేటలను, ప్రజ్ఞను కలవారనియు, సమానావకాశములు కల్పించినను కొందరు పైకి వచ్చుటయు, తక్కినవారు వెనుకబడిపోవుటయు తప్పదను సిద్ధాంతమును ప్రతిపాదించుచున్నది. ప్రజలలో దేశమును పాలించు సామర్థ్యము గలవారు కొందరు మాత్రమే. ఏ పనికి ఎవడు అర్హుడో వాడు ఆ పనిని చేయుట అతనికే గాక, సంఘమున కంతకును లాభకరము. ప్రజారాజ్య విధానమును ఖండించువారి వాదము ఇదియే.

కాని వీరి వాదములోని లోపములను గుర్తించవలెను. ఈ వాదమును సమర్థించువారు సంఘములో పరిపాలించుటకు ఎవరు అర్హులో, ఎవరు కారో నిర్ణయించ లేకున్నారు. మానవ చరిత్రలో జాతి (ఆర్యజాతి, శ్వేతజాతి), కులము (క్షత్రియ కులము), వంశము (సూర్యవంశము, చంద్రవంశము), వయస్సు (వృద్ధులు–భీష్మునివంటి వారు), లింగము (పురుషులే అర్హులు, స్త్రీలు అర్హులు కారు), సైనికబలము, మతము (మధ్యయుగపు భారతదేశములో మహమ్మదీయులే పాలకులగుటకు అర్హులనియు, ఆధునిక యూరపు ఖండములో కొన్ని దేశములందు కాథలిక్కులు, కొన్నిటియందు ప్రొటెస్టాంటులు అర్హులనియు పరిగణింపబడిరి), ధనము (భూస్వాములు, పెట్టుబడిదారులు, ఫ్యాక్టరీ యజమానులు), విద్య–వీటిలో ఏదియో ఒకదానిని బట్టిగాని, కొన్నిటిని బట్టిగాని పాలకుల అర్హతల నిర్ణయింపబడినది. కాని ఈ నిర్ణయము లోపభూయిష్టమని శాస్త్రవేత్తల అభిప్రాయము. అర్హతలుగల వారు అన్ని జాతులలోను, అన్ని కులములలోను, వృద్ధులతోపాటు యువకులలోను, పురుషులతోపాటు స్త్రీలలోను, యుద్ధనైపుణ్యము లేని సామాన్యులలోను, అన్నిమతముల వారిలోను, ధనికులతోపాటు ధనహీనులలోను, పండితులతోపాటు సామాన్య పామర జనములోను కనిపించుచున్నారు. కనుక ఈ భేదములననుసరించక అన్ని జాతులవారికి, అన్ని కులములవారికి, ప్రజలందరికి పరిపాలనరంగములో పాల్గొనుటకు సమానావకాశములు కల్పించుటయే సమర్థనీయము.

ఇదిగాక జాతి, కులము, మతము మొదలైన వానిని బట్టి అర్హులను నిర్ణయించి ఎవరు పాలనాధికారమందునో ప్రజలలో ఏదో ఒక వర్గము వారికి మాత్రమైనను, వారు దానిని స్వప్రయోజనమునకే వినియోగించుకొనుట తప్పదు. ప్రజలందరి సౌభాగ్యమునకై వినియోగపడవలసిన పరిపాలనము ఒక వర్గమువారి ప్రయోజనమునకే వినియోగింపబడుట రాజనీతికి విరుద్ధము. పరిపాలనలో ప్రజలందరు భాగస్వాములైనప్పుడే అది ప్రజలందరి సౌభాగ్యమును వృద్ధిచేయునట్టిది నుండును. మానవ అసమత్వవాదమును సమర్థించువారు ఈ విషయమును విస్మరించుచున్నారు.

రాజ్య పరిపాలనము ప్రజల అవసరములను తీర్చి వారికి సంతృప్తి కలిగించుటకై ఉద్దేశింపబడిన పని. అధికారుల అల్పసంతృప్తికై ఉద్దేశింపబడినట్టిది కాదు. ప్రజల అవసరములను, అభిరుచులను తెలిసినవారే ఈ పనిని చక్కగ చేయగలవారగుదురు. వీటిని తెలిసికొనుటకు ప్రజలు ఎన్నుకొనువారు, అధికారులగుట

లేర్పరచుకొని, అందనేక కుటుంబములు చేరి నివసించెను వనము లన్నియు ఛేదింపబడిన పిమ్మట, రాజదుర్గ రక్షితులై వేనవేలు సంఖ్య గల సంఘములో నగర నివాసములకు జనపదవాసియే తరలివచ్చి స్థిరనివాస మేర్పరచు కొనెను పురవాసి యగు మనుజుడు పౌరుడనియు, నగరవాసి నాగరికుడనియు ప్రసిద్ధి చెందెను ప్రతి వ్యక్తియు స్వవిషయమున స్వాస్థ్యరక్షణ క్రమము పాటించుచున్నను, సామాజికముగ కొంత త్యాగ మొనర్చనగాని, తాను వసించు గ్రామమో, నగరమో పరిశుద్ధముగ నుండజాలదు సాముదాయికము అందరారోగ్యవంతులై మనుగడ సాగింపవలె ననిన, ప్రతి వ్యక్తియు, స్వశక్తి ననుసరించి అందరకొరకై చేయవలసిన విధులు పెక్కు గలవు అట్లు జరగనినాడు సాంక్రామిక, జనపద విధ్వంసక వ్యాధులు, పొడచూపి సాముదాయిక మరణములు దేశమం దెల్లెడల తలయెత్తగలవు

సాంక్రామిక వ్యాధులకు ఋతు విపర్యయము మరియొక కారణము శీతాకాలములో ఎండలు ప్రబలుట, వానకాలములో వరపు గల్గుట ఋతువిపర్యయ మనబడును ఋతుచక్ర మిట్లు విషమముగ సంచరించుటచే, ఒక పద్ధతికి అలవడి తిరుగు దేహగతి తారుమారై తట్టుకొనజాలక, రోగములు జనించి, విసర్జింప బడు మలము లేర్పడి, నలుదెసల నిండుటచే సహితము సాంక్రామిక వ్యాధులు పొడచూప గలవు ఇంతేకాక, వరపుచే నీటి వసతులు చెడి మురికి నీరు వ్యాపించి పరిసరములు దుర్గంధ పూరితము లగును ఇందుచే సాంక్రామిక, జనపద విధ్వంసక వ్యాధులు సహితము వ్యాపింప గలవు నేటి అణుబాంబుల ప్రయోగముచే ఋతువిపర్యయావస్థయు, జనపద విధ్వంసక వ్యాధులును, క్రిమిసంకలమును కలుగుట కనరాక యుండవచ్చును

గ్రామమున ఉత్తర దిక్కుననే మలవిసర్జన, దహన క్రియలు గావింప వలయును ఉత్తరదిక్కు వాయువు తిరిగి నగరముపై ప్రసరింపక పైకి పోవునుగాని, ప్రాణవాయువును నశింప జేయదు అందుచే మలవిసర్జనమునకు, శవదహనమునకును ఉత్తరదిశ నిర్దేశింప బడెను క్రిమి సంహారమునకు, గ్రామ పారిశుద్ధ్యమునకు కలయంపి (నీటిలో గలుపబడిన పేడ) చల్లించుట యొక్క సంప్రదాయమై యున్నది ఆట్టి కలయంపి నేటి డెటాల్, ఫినైల్ మున్నగు వాటికంటె మిన్నయని తెలిసికొన వలయును ఆవు పేడలో రేడియము గలదు దానిచే సర్వ క్రిములు నశింపగలవు అట్టి గోమయము కలిపిన కలయంపి చల్లినచో, క్రిములు భస్మము కాగలవు ఇల్లును అలికించిన యెడల సాంక్రామిక వ్యాధులు చొరనేరవు మిక్కిలి గాటుగల సున్నముతో ముగ్గులు పెట్టుటచే గాలి యందలి సూక్ష్మ క్రిములు నశించుటయే కాక, దుష్టవాయువు నంగలి పులును దినము నశించి పరిశుద్ధి పొందుటకు సాయ పడును మరియు సాంబ్రాణి, గుగ్గిలము మున్నగు ధూపములు వేయించినచో క్రిమిసంహారమునకు తోడ్పడును సున్నము, పసుపు కలిపిన వసంతము దిష్టి దృశ్యములను (దృష్టిదోషములను) వారించి, వాయు సంస్కారమునకు తోడ్పడును అట్లే ప్రాణవాయువు నొసంగుచు, దుష్టవాయువుల నాకర్షించు వేపాకుల తోరణములు ప్రయోజనకారులు పచ్చని రంగు నేత్ర వ్యాధులను, చర్మవ్యాధులను పోగొట్టును. గ్రామములలో అమ్మబడు ఫలములు, కాయగూరలు, తినుబండారములు దూషితములు కాకుండ తగు చట్టములను అమలునం దుంచుట యుక్తము అట్లే చాకిరేవులు, జలాశయములు కలుషితములు గాకుండునట్లు రక్షించుకొనుట పాడి దుష్ట జలపానము చేసిన పశువులిచ్చు క్షీరములు రోగకారణము లగును దూషిత జలముచే నుడకబెట్టబడిన వస్త్రములనుండి రోగములు సంక్రమించు అవకాశము గలదు

జనపద విధ్వంసక-సాంక్రామిక వ్యాధులు దేశమున చెలరేగినప్పుడు దేశమును నిర్వ్యాధి మొనర్చుటకై తొల్లి నిర్వచింపబడిన "దుందుభికల్పము" ఒకటి కలదు మంత్రోచ్చాటన సంగీతాది శబ్దములచే నొక విధముగు సంచలనశక్తి శరీరములో కల్గును మానసిక, శారీరక పరిణామములు సహితము మిట్టి శబ్దముల వలననే కల్గును జనపద విధ్వంసక వ్యాధులు చెలరేగిన ప్రదేశములందు నేడు సహితము పిరంగి వాద్యములతో గ్రామసంచారము చేయు నలవాటు కలదు ఇట్టి శబ్దములచే సూక్ష్మక్రిముల యుత్పత్తియు, వ్యాప్తియు కలుగదు కాని ఆయుర్వేద ప్రోక్తములగు దుందుభి స్వనాదులచే క్రిమి, కీటక, విషోత్పత్తి కాకుండుటయు, ఆరోగ్యము కల్గిన దేశము పీడారహితమై, నిరామయ మగుటయు జరగగలదు కొన్ని శక్తిమంతములగు మూలికల క్షారము లొనర్చి, వానిని ద్రవ పదార్థములలో కలిపి, వాటిలో రోగకారకములను ముంచి, గ్రామమెల్లెడల గట్టించినను, పతాకముల నందు తడిపి యెగురవేసినను, దుందుభి స్వనము వ్యాపించునంతవరకును,

ధ్వజాదులనుండి చేరు వాయువు సోకునంతవరకును, తోరణా దులు స్పృశించు మేరకును, క్రిమికీటకాదులేకాక, ప్రచండము లగు సర్పాదులు సహిత మా ప్రదేశమును వదలి పారిపోగలవు

చెవితమ్మెలకును, బుద్ధిస్థానమునకును సంబంధము కలదు అందుకే కాలోలు పండితులు కుండలధారులై మెలగుదురు ఆడువారు మెట్టెలు ధరించుటచే, సిద్ధాంతానుసారము బొటన వ్రేలి శావలి వ్రేలునకును, స్త్రీల యండములకును సంబంధ ముండుటచే ఋతుప్రవర్తనము చక్కబడును అందులకే పురుషులకు అంత్రవృద్ధి వచ్చునప్పుడు బొటనవ్రేలు ప్రక్క వ్రేలునకు మెట్టెను ధరింపజేయుదురు అంత్రవృద్ధి అంతట నదృశ్య మగును ఆడువారు చీరలు ధరించునప్పుడు పోకముడి వేసి కొన్నచో, గర్భాశయ భ్రంశము రానోవదు ఒడ్డాణము ధరించుట వలనగూడ గర్భాశయ భ్రంశము రాదు ఉత్తు ముడి వేసికొనుటచే శరీరములోని విద్యుత్కణములు పరిహరింప బడవు పంచకచ్ఛములతో పంచ కట్టుటవలన, మానవ శరీరమందలి విద్యుచ్ఛక్తి నిలుపుదల కాగలదు అమావాస్య, పూర్ణిమ మొదలగు పర్వదినములలో కొన్ని రోగములు - ముఖ్యముగా మానసిక వ్యాధులు - ప్రకోపించుట చూచు చున్నాము ఆనాడు భూమికి చంద్రునినుండి రాదగిన కొంత శక్తి లోపించుటచే, అట్టి వ్యాపారము జరుగుచున్నది అందుచే మన పూర్వులీపర్వదినములను అనధ్యయన దిన ములుగా ప్రకటించిరి ఏకాదశినా డుపవసించుట యొక ఆచారమై యున్నది ఇట్లు పదునైదు రోజులలో నొక్కరో జుపవసించుటచే రోగములు ప్రబలవు

అదర్శప్రాయ మగునట్టి, ప్రాచ్యదేశ సాంప్రదాయిక మైనట్టి గ్రామ మెట్లుండ వలయునో ఇచ్చట తెలిసికొందము గ్రామములు చతురస్ర మండలముగ గాని, దీర్ఘ చతురస్ర మండలముగ గాని నిర్మింప బడవలయును పైన పేర్కొని నట్లు, ఉత్తరదిశను మలవిసర్జనాదులకై బాహ్యప్రదేశముగా విడువ వలయును అట్లే ఉదీచీదిశయందే శ్మశానవాటికకొరకు కొంతమేర వదల వలయును ఏలయన దక్షిణానిలము పురములోనికి ప్రవేశింపగలదు కాని ఉత్తరపు గాలి నగరము లోనికి ప్రవేశించి మలయానిలమును కలుషితము చేయక దుర్గంధమును దవ్వులకు గొంపోవును. గ్రామములకు దక్షిణ దిక్కున సకల సుమనోభరితము లగు, రుచ్యఫలపూరితములగు తరులతలతోను, ప్రాణవాయు సంచలితములగు నింబామల కాది వృక్షములతోను, శ్రేష్ఠములగు తదితర వృక్షములతోను గ్రామారోగ్యమునకై ఒక వనవాటికను ప్రతి గ్రామమున నిర్మించుటయు, అయ్యది గ్రామాధికారుల యదుపులో నుంచుటయు యుక్తము ఆ వనవాటికలందు గ్రామీణుల విహారవేళములకును, వనభోజనాదులకును తగు సౌకర్యము లతో కొంత స్థలము నేర్పాటు చేయుట యుచితము అవ కాశ మున్నచో, పురజనుల వ్యాయామాదులకు తగిన వసతు లేర్పాటు చేయవలెను

వీథులు దక్షిణమునుండి ఉత్తరమునకును, తూర్పునుండి పడమరకును బారులుతీరి యుండవలెను. నాల్గు వీథులు, లేక నాల్గుదిక్కులు గలియుచోట మండపములు నిర్మించి, వాటి చుట్టును చెట్లు నాటి, అచ్చట పెద్దలు చేరి ప్రసంగించు టకై తగు చావడు లేర్పాటుచేయుట మంచిది వీథులకు నటునిటు కానుగ, వేప, అశోక మున్నగు చెట్లు నాటుట యును యుక్తము ప్రతివారి ఇంటిముందు కొంత మేర వదలి, ఆరోగ్యదాయకములగు సౌరభ పుష్పలతా గుల్మాదులను నాటుట శుభప్రదము అందు అనుదినము కలయంపి జల్లి, ముగ్గులతో సింగారించుటచే క్రిమికీటకములు నశింపగలవు వీథులకు నిరుప్రక్కల భవనము లుండి, ప్రవాహజలమును, వర్ష జలమును కొనిపోవు కాలువలు లుండవలెను అవి ఉత్తర దిక్కునకో, తూర్పుదిక్కునకో తరలింప బడవలయును గ్రామములో మంచినీటి వసతి లభ్యముగానిచో, ఎంట కాలు వలు మున్నగువాటి నీటితో గాని, సమీపమున గల వాగుల నీటితో గాని, కేవలము వర్షజలములో గాని, నింపి ఒక మంచినీటి చెరువును నిర్మింపవలెను అట్టి చెరువు గ్రామము నకు పడమర దిక్కున నుండుట మంచిది ఏలయన, మన సిద్ధాంతము ప్రకారము ప్రాగ్వాయువు అనారోగ్యకరము సూర్యుడన్ని యెడల తూర్పుదిక్కున నుదయించును గదా! ఉదయమునుండి సూర్యకిరణములచే స్పృశింపబడు జల బాష్పములు తూర్పు దిశనుండి వీచు వాయువులతో మిళితములగుటచే, శ్లేష్మతత్వము గలవారికి జలుబు, దగ్గు మున్నగు శ్లేష్మవ్యాధులను ప్రోదిచేయును అందుచేతనే ప్రాగ్వాయువును శ్వాసాశయాది వ్యాధులు గలవారు విసర్జింప వలయును ప్రతి ఇంట వెనుక పెరడొక టుండవలెను పెరటిలో కొన్ని ఫలవృక్షములు, సుమభరితము లగు లతాగుల్మా దులు సహిత ముంచుకొన వలెను దొడ్డియం దొక మూలని

తప్పక నిర్మింప వలయును బావినుండి తోడిన నీరు వృథ కాకుండ చెట్ల కుపయోగపడునట్లు చేయవలెను. ఇంకను నీరు నిలువ యున్నచో, ఆ నీటిని పీల్చుకొన వగిన యనటి వృక్షాదులను, నారికేళ వృక్షములను, కూరగాయలను పెంచ వలెను చెట్లనుండి రాలిన ఆకులను దొడ్డియందు గుంటను త్రవ్వియో, కాల్చియో, మొక్కలకు ఎరువగునట్లు ఏదుపా యము కల్పింపవలెను

పెరటిలో ప్రతి కుటుంబమునకును ఒక సెప్టిక్ పాయి ఖానా దొడ్డిని నిర్మించుకొనుట అవసరము అట్లు కానిచో, మరుగు దొడ్డి యుండుట ప్రయోజనకరము అనుదినము దానిని శుభ్రపరచుట మిక్కిలి అవసరము మనుష్య మల మును, పెంటకుప్పలను పొలములకు ప్రోలి, కూరగాయలకు, పంటలకు ఎరువుగా నుపయోగించుట యుక్తము

గ్రామమునకు పడమర దిక్కున గల చెరువు సమీపములో తూర్పున కభిముఖముగా దేవాలయములు, సత్రములు నిర్మింపబడ వలెను దక్షిణదిక్కున ఉత్తరాభిముఖముగా రచ్చ కొట్టములు, గ్రామకచేరీలు, విద్యాలయములు, ఆట స్థలములు ఏర్పాటు గావలయును గ్రామ జనులు సమష్టిగా రాత్రు లందు వెలుగొసగు విద్యుద్దీపములు లేక కాచదీపికలను, వీధుల పొడ వనుసరించి అచ్చటచ్చట పాదుకొలుప వలెను గ్రామ మధ్యమున గ్రంథాలయము, సమావేశ మందిరము నిర్మించు కొనిన, గ్రామపురోభివృద్ధికి దోహద మొసగును గ్రామమునకు తూర్పున వర్తకుల యంగడులు, కూరగాయల దుకాణములు మున్నగునవి యుండవలెను పడమట పండిత గృహములు, విద్యార్థుల భవనములు ఉండుట మంచిది ఉత్తర దిక్కున చేనేతకారుల గృహములు, కుంభకారుల, చర్మకారుల గృహ ములు, ఇటుకల నేర్పాటు చేయువారి గృహములు నిర్మింప బడవలయును దుర్గంధము, ధూమము ఉత్తరమునకు తరలిం చుటయే ఇందలి భావము అందుచే ఆరోగ్యమునకు దోహ దము చేకూరును

సంజ వేళల, ముఖ్యముగా సాయంకాలమున అన్ని గృహములయందు సాంబ్రాణి పొగలు, గుగ్గిలపు ధూమములు వేయవలయును ఇట్లు చేయుటచే దోమలు మున్నగు సూక్ష్మ జీవులవలన, మిడుతలు మున్నగు కీటకముల వలన బాధ నివారణ యగును ముఖ్యముగా సంక్రాంతి మొదలగు పండుగలయందు ప్రతి గృహమునకు సంవత్సరమున కొకసారి యైనను సున్నము కొట్టించ వలయును ఇందువలన సాంక్రా మిక వ్యాధులు దవ్వులకు తొలగును అట్లే, పండుగ దినము లందు ప్రతి గృహమునకు తోరణములు కట్టినచో, దుర్వాయు వులు తొలగి, గృహములు ప్రాణవాయు పూరితము లగును

ప్రాతఃకాలమున గ్రామసంకీర్తనములు, వేదాధ్యయన ములు, భజనసంకీర్తనములు వెలసినచో, ప్రజల మానసిక పరిస్థితి వివ్వారి, ఉత్సాహము యేర్పడును అట్టి గీతములు విన్నవారికి ఆనందము కల్గుటయే కాక, ఆను బద్ధజాల ఎంచల నముచే రక్తచంక్రమణము వృద్ధియై, సర్వగిరి, ఆరోగ్యము చేకూర గలవు

వి పం

## ప్రజారోగ్యము · (ఆంగ్ల వైద్యము ననుసరించి)

ప్రజారోగ్య రక్షణము నాల్గు రీతులుగా విభజింపబడ ఎచ్చును (1) జీవనప్రమాణవృద్ధి (2) వ్యాధినిరోధము (3) నిదానము - చికిత్స (4) వికలాంగులకు, దీర్ఘవ్యాధి పీడితులకు పునరావాసము ప్రపంచ ఆరోగ్యసంస్థ, ఆరో గ్యము, ప్రతి ఒక్కరి హక్కుగా గుర్తించినది ప్రభుత్వములు, సమాజములు సంఘటిత చర్యల ద్వారా ప్రజారోగ్యమును సాధించుట, దీనికై ఆరోగ్య విజ్ఞాన ప్రచారము గావించుట, ప్రజారోగ్య రక్షణ పథకమునందలి అంతర్భాగములు

దేహదార్ఢ్యములేని జీవి బ్రతుకుటయే అసంభవము భూస్వామ్య యుగము అంతమై, నగరములు పెరిగినకొలది, సామాజిక జీవనమునకు కావలసిన మంచినీటి శుభ్రత, మురుగు నీటి పారుదల మరుగుదొడ్ల వసతి మున్నగునవి వైద్యశాస్త్ర ములో ప్రజారోగ్యశాఖ యొకటి ఏర్పడుటకు కారణము లైనవి. పైగా అంటువ్యాధులు సమూహముగా గ్రామము లను, పురములను పలుమారు నాశనము చేయుచుండెను కంటికి కాన్పింపని క్రిములను, సూక్ష్మదర్శిని అను సాధనము నీటి యందును, వాతావరణము నందును చూపగల్గినది లూయీ పాశ్చరు, రాబర్టుకాక్ మొదలగు సుప్రసిద్ధ శాస్త్రవేత్తలు రోగములకు క్రిములు కారణభూతములని నిరూపించినారు దయ్యము, అమ్మవారు, గాలి మున్నగు మూఢనమ్మకము లకు గొడ్డలిపెట్టుగా మహమ్మారి విజ్ఞానము రూపొందించి, జాడ్య ములను అదుపులో నుంచుటకై సాయపడినది (ఉదా : భారత దేశములో కలరా, ప్లేగు, మశూచి ప్రముఖములైన అంటువ్యాధులు).

గత శతాబ్దిలో వైద్యమునుండి ప్రత్యేకింపబడిన ప్రజారోగ్యశాఖ బలపడి, ఈ రెండు శతాబ్దులలో ఘనవిజయము గాంచినది క్రమముగా మాతా శిశురక్షణము, పోషణము, పాఠశాలలలోని ఆరోగ్య ప్రణాళికలు, పరిసరముల పారిశుద్ధ్యము, ఆరోగ్యవిద్య మున్నగు పెక్కు శాఖోపశాఖలు వెలసినవి ఇట్లు పెరిగిన ఉపశాఖలు వైద్య రూపమునే మార్చివేసినవి ఈ కాలములోనే వైద్యము సంస్థాన పోషణము నుండి విముక్తి చెంది స్వతంత్ర భారతవు తోడ్పాటున బొందుటతో వైద్యవృత్తి ఇతోధికముగా వ్యాప్తి చెందినది

వ్యాధి సహజ చరిత్ర వైద్య పరిశోధనములు వ్యాధిగ్రస్తునిలో వ్యాధి సోకుటకు ముందును, అనంతరమును కల్గిన మార్పులను పరిశీలించి, వ్యాధి సహజ చరిత్రను నిరూపించినవి వ్యాధి ఆకస్మికముగా సంక్రమించదు అట్లే అది ఆకస్మికముగా అదృశ్యము కాదు వ్యాధి సోకినదశలో కొందరు వ్యాధిని లోలోపలనే అణచివేయ శక్తి కల్గి యుందురు వ్యాధి కుదిరిన తరువాత గూడ, మలమూత్రములలో క్రిములను కొందరు వదలుదురు అట్టి దశయందు రోగులు క్రిమివాహకు లగుదురు ఈ క్రిముల ద్వారానే సాంక్రామిక వ్యాధులు సమాజములో వ్యాప్తి చెందును

నివారణ స్థాయి వ్యాధిగ్రస్తునికి చేయవలసిన సేవలోని చికిత్సా నివారణ భాగములు ఈ దిగువ చూపబడినవి -

| | వ్యాధి స్థాయి | చికిత్స | నివారణము |
|---|---|---|---|
| 1 | ఆరోగ్యము చెడక పూర్వము, వ్యాధి ముందు దశ | | ఆరోగ్యాభివృద్ధికై సలహా |
| 2 | వ్యాధి అంకురించిన పిదప | | టీకాలు మొదలగు సాధనములు |
| 3 | రోగ లక్షణముల ప్రారంభము | సకాలములో రోగ నిదానము, సమాజములో రోగులకై వెదకుట, సత్వర చికిత్స | |
| 4 | రోగము ముదిరిన పిదప | చికిత్స లేక మరణము | |
| 5 | రోగ పీడితుడై, అసహాయుడైన దశలో - వ్యాధి చిహ్నములు శాశ్వతముగా ఏర్పడినపుడు | | వేరుస్థలమున నుంచుట |

ఒకటి, రెండు దశలు ప్రాథమిక నివారణము క్రిందికి రాగలవు, మూడు నాలుగు స్థాయులు ద్వితీయ నివారణ మనిలనియు, అయిదవ స్థాయి తృతీయ నివారణ మనియనియు చెప్పబడు చున్నవి

ప్రజారోగ్యము, అష్టాంగములు ప్రాథమిక ఆరోగ్య కేంద్రములు, ఇతర ఆరోగ్య సంస్థలు ఎనిమిది విధముల సేవా ధర్మములను నిర్వహింపవలసి యున్నది అప్పుడే వ్యాధి సహజ చరిత్ర ననుసరించి ఆరోగ్య ప్రణాళికలు నిర్వహింప బడును

(1) జనన, మరణ తదితర ఆరోగ్య వివరముల సేకరణ
(2) ఆరోగ్య ప్రచారము, బోధ
(3) పరిసరముల పారిశుద్ధ్యము
(4) అంటురోగముల, సాంక్రామిక వ్యాధుల నిరోధము
(5) మాతా శిశు రక్షణము, పోషణము
(6) కుటుంబ నియంత్రణము
(7) పాఠశాలలలో ఆరోగ్య ప్రణాళికలు
(8) వైద్య చికిత్స

మరణములను మాత్రమే అదుపునం దుంచుటచే పెరిగిన అదనపు జననములు కూడ అదుపులోనికిపచ్చి జనన మరణము లందు వ్యత్యాసము తగ్గువరకు జనాభా పెరుగుదల తీవ్ర రూపము దాల్చును

వ్యాధులకు గల ప్రధాన కారణములు

(1) తాత ముత్తాతల నుండి తల్లిదండ్రుల ద్వారా గుణముల సంక్రమణము
(2) గాయములు, దెబ్బలు
(3) పోషణములోని లోపములు, విటమినులు మొ॥
(4) అంటువ్యాధులు, సాంక్రామిక వ్యాధులు
(5) క్షీణదశను కల్పించు అంశములు - క్యాన్సరు గుండెజబ్బు వగైరా
(6) పిచ్చి, మానసిక వ్యాధులు

మొదటి రెండు కారణములను నివారించుట సులభము

కాదు మూడవ కారణములో పుష్టికరమైన ఆహార మొకటి వ్యాధికి పుష్టికరమగు ఆహారలోప మొక కారణముగా ఆరోగ్యశాస్త్రజ్ఞులు పేర్కొను చున్నారు జనాభా పెరుగుదల భారత దేశములో ఆహారాభివృద్ధిని మించుటచే, నేడు పుష్టికరమగు ఆహార మటుండనిచ్చి, కనీసపు ఆహారము సహితము జనసామాన్యమునకు తగిన ప్రమాణములో లభించుట కష్ట సాధ్య మైనది అదృష్టవశమున ఒకేరకమైన శాకాహారమును భుజించినప్పటికిని, మాంసకృత్తులు క్రొవ్వు పదార్థములుగా మార్చుకొనగల్గిన శక్తి మన దేహమునకున్నదని నేటి పరిశోధనలు తెల్పుచున్నవి విద్యార్థుల విషయమై జరిగిన పరిశీలనల ఫలితముగా సుమారు 80 శాతము వ్యాధులు ఆహార లోపము వలన కల్గినవని తెలియుచున్నది పెరిగెడి వయస్సులో ఇట్టి లోపము ఆరోగ్యపు పునాదులపై దెబ్బ కొట్టును ఇక శక్తి ఆహారమువలన కల్గు హానిని నిర్ణయింపలేము వ్యాపారములోని లోభము, ప్రజల ఆహారముపై దాడి, మందులకల్తీ - ఇవన్నియు రాక్షస కృత్యములు వీటితోపాటు ధూమపానము, టీ, కాఫీ, నాటు సారాయము లను సేవించుట మున్నగు చెడు అలవాట్లు పరిస్థితులను మరింతగా విషమింపజేయును కొందరు తమ ఆకలిని చంపుకొనుటకే అలవాటులను చేసికొను చున్నారు ఇది విషాదకరమైన విషయము

వ్యాధికిగల సహాయ కారణములలో సాంఘిక, ఆర్థిక వాతావరణ ప్రభావము ఇటీవల ప్రాధాన్యము వహించుచున్నది మానసిక వ్యాధులను ఉద్రేకింప జేయుటలోను, దీర్ఘ కాలిక వ్యాధులగు క్షయ మొదలగు వాటిని ఇనుమడింప జేయుటలోను వీటికి ప్రాముఖ్యము కలదు తత్ఫలితముగా, ప్రజారోగ్య శాస్త్రమునకు నేడు సాంఘిక నివారణ వైద్యమని పునః నామకరణ మొనర్పబడినది వ్యక్తి, సంఘము నుండి విడివడి యుండలేడు వ్యక్తిఆరోగ్యమునకు సమాజములోని సంఘర్షణములు హానికరము లగుచున్నవి

కొన్ని వివరములు భారతదేశమందలి 43 9 కోట్ల జనాభాలో (1961) సుమారు చెరిసగముగ స్త్రీ పురుషులున్నారు ఏటేటా 2 2 శాతము ప్రజలలో పెరుగుదల కన్పించు చున్నది జననములు ; 1000 కి 40 7; మరణములు 1000 కి 21 6, గ్రామీణులు 81 శాతము , నగరవాసులు 19 శాతము 10,000 కు మించని జనాభాగల గ్రామములు 5,64,718 వీటిలో 10 లక్షల మందికి మించిన నగరములు 7 లక్షకు పైబడిన నగరములు 100 ఏబదివేలకు పైబడిన పట్టణములు 141 ఇరువదివేల జనాభాకు మించినవి 516 పదివేల జనాభాకు మించినవి 817 కార్మికుల సంఖ్య 18 8 కోట్లు కార్మికులలో రైతులు, రైతుకూలీలు కలిసి 12 1కోట్లు కార్మికేతరుల సంఖ్య 25 1 కోట్లు

వయస్సు వారిగా 0 మొ॥ 14 సం॥ మధ్య వయస్సులో 40 2 శాతము జనులు కలరు

15 మొ॥ 49 సం॥ మధ్య వయస్సులో 47 9 శాతము జనులు కలరు

50 సం॥ పైబడిన వయస్సులో 11 9 శాతము జనులు కలరు

మరణములకుగల కారణములు

వెయ్యి జనాభాలో (1958)

(1) జ్వరములవలన 5 16 , విరేచనములు వగయిరాల వలన 0 56 (2)శ్వాసకోశ వ్యాధులవలన 1 05, (3)మశూచి, కలరా, ప్లేగు వ్యాధుల వలన 0 57, (4) ఇతర కారణముల వలన 8 89 మంది పీడింపబడిరి మలేరియా పీడితులు-ప్రపంచమంతటను 25 కోట్లు

(విశేషముగా భారతదేశములో) జనులు

కలరా పీడితులు 20 లక్షల 48 వేల మంది (1958)

మశూచి పీడితులు 1 లక్షమంది (1954)

క్షయ పీడితులు - భారత దేశములో 60 లక్షలరోగులు, 5 లక్షల మరణములు

ఫైలేరియా (బోదవ్యాధి) 12 2 కోట్ల మంది వ్యాధి పీడిత ప్రాంతములో నివసించుచున్నారు

''ట్రకోమా'' అను కంటి వ్యాధి గ్రస్తులు 2 లక్షలు (ఆసియా ఆఫ్రికా ఖండములలో)

కుష్ఠ వ్యాధి గ్రస్తులు 25 లక్షల మంది (భారత దేశములో)

సంపూర్ణ వైద్య సౌకర్యములు మొత్తము జనసంఖ్యలో 2 శాతము (94 లక్షల మంది ప్రజలు) ప్రతినిత్యము వ్యాధిగ్రస్తులయ్యెదరనియు, వారిలో అయిదవ భాగము వైద్యుల సలహా కోరెదరనియు, అంచనా వేయబడినది దాదాపు 70 లక్షల 50 వేల మంది రోగులు వెలుపల నుండి వచ్చి ఆస్పత్రులలో చికిత్స పొందు చున్నారనియు, ఆస్పత్రు



ఓరుగల్లు కోటయందలి ప్రతాపరుద్రుని శిరస్సు - కిరీట విలసితము

పెట్టెను ఈతని సైన్యము చాల శక్తిమంతమైనది. ఇందు తొమ్మిది లక్షల ధానుష్కు లుండిరి అసంఖ్యాకులైన అశ్వికులు, గజారోహిణులు వీరికి సహాయులుగా నుండిరి

ప్రతాపరుద్రదేవుని రాజ్యారంభ కాలమున అల్లావుద్దీను ఖిల్జీ ఢిల్లీ సుల్తానుగా నుండెను (1296-1316) ఈ సుల్తాను తెలంగాణముపై ఎనిమిది సారులు దండయాత్రలు చేసినట్లు తెలియుచున్నది మొదటి ఏడు దండయాత్రలును నిష్ఫలము లైనవి ఎనిమిదవసారి ఆంధ్రదేశాధీశుడగు ప్రతాపరుద్రదేవ మహారాజు ఓడిపోవుటయు, తురుష్కులకు బందీ యగుటయు, సంభవించినది ఈ యుద్ధము లన్నిటిని ఇంతటి ధైర్యముతో నెదుర్కొనుటయు, దండయాత్రలను త్రిప్పికొట్టుటయు చూడగా, ప్రతాపరుద్రు డెంతటి పటుతరమైన సైన్యమును కూర్చి వ్యవస్థీకరించెనో స్పష్టమగును

ప్రప్రథమముగా అల్లావుద్దీన్ ఖిల్జీ తెలంగాణముపై క్రీ శ 1303 సం న దండయాత్ర చేసెను దీనికి రెండు ముఖ్యకారణములు కానవగును సుసంపన్నమైన ఆంధ్రదేశమును కొల్లగొట్టుట యొకటి, రాజ్య విస్తరణకాంక్ష రెండవది ఇది కాక అల్లావుద్దీనుకు ధనమావశ్యకముగా నుండెను ఉత్తర ప్రాంతముల నుండి వచ్చి పడుచున్న మంగోలులను రాజపుత్ర సేనావాహినులను ఎదుర్కొనుటకు ఆతనికి కావలసినంత ధనసంపద లేకుండెను అందుచే మలిక్ ఫఖురుద్దీన్ జూనా నాయకత్వమున ఓరుగంటిపై దండయాత్ర చేయుటకు సైన్యమును పంపించెను ఈ సైన్యము తెలంగాణమున కాకతీయ వాహినితో నెదుర్కొనెను ప్రతాపరుద్రుని యాస్థానమున ఉన్నతోద్యోగమున నుండినవాడగు పోతుగంటి మైలి యనునాతడు కరీంనగర ప్రాంతమునందలి ఉప్పరపల్లి సమీపమున యవనుల సైన్యముతో నెదుర్కొని దానిని పటాపంచలు గావించెను ఇట్లు శృంగభంగమైన సుల్తాను సైన్యము తిరిగి ఢిల్లీ ముఖముగా పారిపోయెను

తురుష్కులకు కలిగిన ఈ పరాజయమువలన అల్లావుద్దీను ఖిల్జీ నిరుత్సాహమును పొందలేదు మంగోలులను జయించి, రాజపుత్ర స్థానమునను, దేవగిరియందును తన యధికారముద్రలను సుప్రతిష్ఠితము చేసిన తరువాత దక్షిణదిశయందున్న తెలంగాణముపై సుల్తాను దృష్టి సారించెను ఈ సమయముననే అసంఖ్యాక సైన్యమునకు మలిక్ నాయబ్ కాపుర్ అను వానిని అధిపతినిచేసి తెలంగాణముపై దండయాత్ర చేయించెను ఈ దండయాత్రకు రెండు ముఖ్యకారణములు కనిపించుచున్నవి తనకింతకుముందు కలిగిన పరాభవమునకు ప్రతీకారమును చేయుట యొకటి తన శత్రువైన గుజరాతు సంస్థానాధీశుడు రాయకర్ణునికి ప్రతాపరుద్రుడు ఆశ్రయమిచ్చుటచే ఆతనిపై సుల్తానుకు కలిగిన ఆగ్రహము రెండవది

తురుష్క సైన్యముతో మలిక్ నాయబ్ కాపుర్ 20 వ జనవరి 1310 నాడు కాకతీయ రాజధాని సమీపముగల అనుమకొండ చేరెను అనుమకొండ దుర్గము నాక్రమించి ఆతడు కిల్లెలకలతో దానికి రక్షణ కల్పించుకొనెను ప్రతాపరుద్రునికిగల సైన్యము (9,00,000 ధానుష్కులు, 20,000 ఆశ్వికులు, 100 గజారోహకులు) ఓరుగంటి దుర్గమున సమాయత్తమై యుండగా నాదుర్గమును తురుష్క సైన్యము ముట్టడించెను అనన్య పరాక్రమముతో తెలుగు వీరులు తురుష్క సైన్యము నెదిరించిరి ఇరువదియైదు దినములవరకు కోట ముసల్మానుల వశము కాలేదు కాని మట్టికోటను తురుష్కులకు వదలి కాకతీయ సైన్యములు రాతికోటలోనికి వెడలెను ఐనను ప్రతాపరుద్రుడు తురుష్కుల యాధిపత్యమును స్వీకరించలేదు మలిక్ కాపురు రాతికోటను ముట్టడించియుండెను కోటబయట గ్రామప్రాంతముల నున్న ఆంధ్రయోధుల వలన ఆతడు కొన్ని బాధలకు గురికావలసివచ్చెను ఢిల్లీతో ఓరుగంటికి నడుచుచున్న తపాలా సంబంధమును తెలుగువారు పూర్తిగా ధ్వంసము గావించిరి

అధైర్యమును చెందని గ్రామప్రజలను పీడించుటపై మలిక్ తురుష్క యోధులను పంపించుచుండెను ఇది ఇట్లుండగా, రాతికోటలోని పరిస్థితి విషమించుచుండెను స్థలము చాలమిచే అనేక బాధలకు గురికావలసి వచ్చుచుండెను ప్రతాపరుద్రుడు కోటను రక్షించుట యసాధ్యమని భావించెను మలిక్ కాపుర్ తో సంధి రాయబారము నడపెను ఎంతికి మలిక్ అంగీకరించెను కాని పరివారముగా ప్రతాపరుద్రుని యధీనమునందున్న ధనము నంతయు ఆతడు కోరుటయేకాక ప్రతి సంవత్సరము కప్పమును చెల్లించవలయుననియు, గజయూధమును సుల్తానుకు కానుకగా పంపించవలయుననియు, ప్రతాపరుద్రునిచే నొప్పించుకొనెను తురుష్కుల ముట్టడి ఈ విధముగా ముగిసినది

తాననంగీకరించిన విధముగా ప్రతాపరుద్రుడు ఢిల్లీ

సుల్తానునకు కప్పము చెల్లించుటయు, గజయూథమును పంపించుటయు సక్రమముగా జరిపించుచుండెను. ఒకసారి పోటుగంటిమైలి, తెలింగబిజ్జ యను కాకతీయ వీరులు ఢిల్లీ సుల్తాను కొలువులో ఖడ్గవిద్యా ప్రదర్శనముచేసి యాతని యభినందనలను బొందిరి. సుల్తాను తెలుగు వీరుల శక్తిని ప్రశంసించుటయే కాక ప్రతాపరుద్రునిపై గౌరవ భావమును వహించెను.

తురుష్కుల దాడి ఫలితముగా కాకతీయ సామ్రాజ్యములో కొన్ని విషమ పరిస్థితు లేర్పడెను. సామంతులుగా నున్న కాయస్థులు తిరుగుబాటు చేసిరి. తెలుగుచోళ సాంబుడైన రంగనాథుడు నెల్లూరునందు స్వాతంత్ర్యము ప్రకటించుకొనెను. తురుష్కులనుండి కొద్ది యవకాశము లభించిన వెంటనే ప్రతాపరుద్రుడు వారి నణచుటకై ప్రయత్నించెను. కాయస్థ వంశమునకు చెందిన మల్లిదేవుని సంహరించెను. గండికోటను స్వాధీనము గావించుకొనెను. గొంకయరెడ్డి యను వానిని గండికోట కధిపతిగా నియమించి, నెల్లూరు చోళుల నణచు ప్రయత్నమున నుండెను. ఈ సమయమున అనగా క్రీ. శ. 1311న సం॥ మలిక్ నాయబ్ కాఫర్ పాండ్య దేశముపై దండెత్తి, దేశమును కొల్లగొట్టి, హస్తగతమైన ధనముతో ఢిల్లీకి వెడలిపోయెను. అల్లావుద్దీను దక్షిణదేశమున తన యాధిపత్యమును స్థాపించుట కిది మంచి యదనని గ్రహించెను. కాని మహారాష్ట్రమున పరిస్థితులు విషమించుటచే మలిక్ నాయబ్‌తో సేన నచటికి పంపించవలసి వచ్చెను. అందుచే కొద్ది సైన్యమును పాండ్యదేశమునకు పంపించుచు ప్రతాపరుద్రుని సైన్యమును కూడ నర్థించెను. ప్రతాపరుద్రుడు సుల్తానుతో సహకరించుటకు అంగీకరించెను. దీనివలన ఆతనికి రెండు ప్రయోజనములు సమకూరనుండెను. నెల్లూరును సులభముగా జయించుట యొకటి, తమపూర్వులు కోల్పోయిన కాంచీపురమును గ్రహించి పాండ్యులకు ప్రతీకారము చేయుట రెండవది. అందుచే ముప్పిడి నాయకుని నాయకత్వమున సేనను సమాయత్తముచేసి నెల్లూరును జయించుటకును, సుందర పాండ్యునికి రాజ్యమిప్పించుటకును, పంపించెను. ఈ దండయాత్రలో సుల్తాను సైన్యములున్నను, భారమంతయు కాకతీయ సైన్యమే వహించవలసి వచ్చెను. దీనితో నెల్లూరు వశమయ్యెను. ముప్పిడి నాయకుడధికారిగా నియమితు డయ్యెను. ఈ సందర్భముననే ముప్పిడి నాయకుని కుమారుడగు పెద్దరుద్రుడు సహాయపడ బల్లాలుని జయించుటయు, కాంచీ నగరమును గ్రహించుటయు లభించెను.

కాకతీయులు కాంచీ పట్టణమును గ్రహించుటచే పాండ్యులు తిరిగి సంచలనము లేవదీసిరి. పడుగురు పాండ్యులు ఏకమై, సైన్యములను సమకూర్చుకొని కాకతీయులపై ప్రతీకారమునకై కాంచిపై విజృంభించిరి. అపుడు యవనసైన్య ప్రసిద్ధముగా ప్రతాపరుద్రుడు స్వయముగా ఎదుర్కొని పాండ్యులతో యుద్ధము చేసెను. భీకర సంగ్రామము జరిగెను. ఆ దేశపు శాసనములను పాండ్య రాజులు వీరాభిమానము సరచుచుండెను. దేచెర్ల ఎఱ్ఱదాచెడు, రెడ్డి వీరులు పాపడు అను ధైర్యసాహసములతో ఎదుర్కొని ప్రతాపరుద్రుని ప్రశంసలను పొందిరి. పాండ్యులు పలాయనము చిత్తగించిరి. ప్రతాపరుద్రుడు మానవీరు డనువానిని కాంచీ మండలాధికారిగా నియమించి తన రాజధానికి తిరిగి పోయెను.

కాంచీ యుద్ధమున ప్రతాపరుద్రుడు నిమగ్నుడై యున్నప్పుడు భారత రాజధాని ఢిల్లీలో రాజకీయముగా చాల మార్పులు జరిగెను. క్రీ. శ. 1316 సం॥న అల్లావుద్దీన్ ఖిల్జీ మరణించెను. మలిక్ నాయబ్ కాఫర్ రాజ్యాధికారమును స్వీకరించెను. కాని మలిక్ కాఫర్ హత్య కావింపబడి, అల్లావుద్దీన్ కుమారుడైన కుతుబుద్దీన్ ముబారక్ షా అనువాడు సింహాసన మధిష్ఠించెను. ముబారక్ షా తన రాజ్యమును సుస్థిరము గావించుకొన్న వెంటనే, మహారాష్ట్రమున బయల్వెడలిన తిరుగుబాటు నణచుటకును, ప్రతాపరుద్రుని యొద్ద తిరిగి కప్పము రాబట్టుటకును తురుష్క సైన్యమును దక్షిణాపథమునకు పంపించెను. ఖుస్రూఖాను అను నాతడీ సైన్యమునకు నాయకత్వము వహించెను. ఓరుగంటికి వచ్చిన ఖుస్రూఖాన్ ప్రతాపరుద్రుని దర్శించి, నియమిత సంఖ్యలో అశ్వములు, గజములు, ధనము, కప్పముగా గ్రహించి తిరిగి ఢిల్లీకి వెడలిపోయెను. ఈ సందర్భమున ప్రతాపరుద్రుడు కప్పమును చెల్లించుట కంగీకరించకపోగా, భీకర సమరము జరిగినదనియు, ప్రతాపరుద్రుడు చాల సైన్యమును కోల్పోయి చివరకు సుల్తాను అధికారము నంగీకరించెననియు ఇంకొక చారిత్రకుడు వ్రాసియున్నాడు. యుద్ధమువాట ఎట్లున్నను ఢిల్లీ సుల్తాను తెలంగాణముపై తిరిగి తన యధికారమును ప్రకటించెననుట ఇందలి సారము.

ఖుస్రూఖాను ఢిల్లీకి వెడలిపోయిన తరువాత ప్రతాప

రుద్రుడు కంపిలి రాజ్యముపై దండెత్తినట్లు తెలియుచున్నది. కంపిలిరాయని కుమారుడగు కుమారరాముడు ప్రతాపరుద్రుని సహాయ మర్థించి మూడవ ఖిల్జీలునిపై దండు వెడలుటకు వేడుకొనెను కాని, ప్రతాపరుద్రుడు దాని కంగీకరించకపోగా, కుమారరాముడు ఆగ్రహించి కంపిలికి వెడలి ప్రతాపరుద్రునిపై వైరమును వహించెను. హాని నణచుటకై కాకతీయ సైన్యము కంపిలిపై దాడివెడలెను. ఇచట జరిగిన సమరమున కంపిలివారు జయించినట్లు కొన్ని చోట్ల, కాకతీయులు జయించినట్లు మరికొన్ని చోట్ల, కాన్పించుచున్నది.

ఢిల్లీలో రాజకీయ పరిస్థితులు మారెను. గయాసుద్దీన్ తుగ్లకు (1320-1325) ఢిల్లీరాజ్యాధిపతి యయ్యెను. అతడు రాజ్యమున తన యధికారము సుస్థిరమయిన వెంటనే దక్షిణాపథముపై దృష్టి సారించెను. క్రీ. శ. 1323 లో సుల్తాను కుమారుడగు ఉలుఘ్‌ఖాను నాయకత్వమున తురుష్క సైన్యము తెలంగాణముపై దాడివెడలెను. ఢిల్లీ సుల్తాను ఇట్లు దాడి చేయుటకు ప్రతాపరుద్రుడు పన్ను చెల్లించక పోవుటయు, సుల్తాను అధిపత్యము నంగీకరింపక పోవుటయు కారణములుగా చారిత్రకులు వర్ణించిరి. ఉలుఘ్‌ఖాన్ ఓరుగంటి కోటను ముట్టడించెను కాని, ప్రతాపరుద్రుని సైన్యములు చాల ధైర్యసాహసములతో ఎదుర్కొనినవి. ఆరుమాసములు ముట్టడి కొనసాగినను తురుష్కులకు కోటస్వాధీనము కాలేదు. కాకతీయ సైన్యముల బలపరాక్రమములతో తురుష్కభటుల ధైర్యము సడలుచుండెను. ఇట్టి సమయమున సైన్యములో కలకలము బయలుదేరెను. ఢిల్లీలో సుల్తాను మరణించెననియు, రాజ్యమితరులకు హస్తగత మయ్యెననియు కలిగిన వదంతియే యీ కలకలమునకు కారణము. ఎట్లో ధైర్యమును వహించి యున్న ఢిల్లీ సైనికులకీ వార్త యశనిపాతమై వారి ధైర్యమును హరించివేసెను. వెంటనే ముట్టడిని వదలి తురుష్క సైన్యములు ఢిల్లీ వైపునకు తరలుటకు ప్రారంభించినవి. కాకతీయ భటులు వారిని కోటగిరివరకు తరిమి, విశేషనష్టము కలిగించిరి. ఈ సైనిక వైఫల్యము తురుష్కుల బలహీనతను, కాకతీయుల పరాక్రమ విశేషమును విశదము చేసెను.

గయాసుద్దీను సైనికముగా కలిగిన వైఫల్యములను లెక్క చేయలేదు. ఉలుఘ్‌ఖాను ఇంకను దేవగిరియందే యుండెను. ఆతనికి సహాయముగా మరికొంత సైన్యమును గయాసుద్దీను పంపించెను. తెలంగాణముపై సాధ్యమైనంత త్వరగా దండెత్తి ఆ రాజ్యమును వశము చేసికొమ్మని యాదేశించెను. సైన్యము ఢిల్లీనుండి రాగానే ఉలుఘ్‌ఖాను దేవగిరి నుండి బయలుదేరి హుటాహుటిగా సైన్యమును తెలంగాణమువైపు నడిపించుచు సరిహద్దుపైనున్న బదరికోట (బీదరు కావచ్చును) చేరెను. అచటి దుర్గమును, దాని పరిసర ప్రాంతములనున్న కోటలను ఆక్రమించి, తన సర్దార్ల నచట నియమించెను. చివర కాతడు బోధను నగరము చేరెను. అచటినుండి ఓరుగల్లు కేవలము పదిదినముల ప్రయాణము మాత్రమే. పిదప ఓరుగంటి వైపు వెడలి, ఆ పట్టణమును ముట్టడించెను. ఈ ముట్టడికి సంబంధించిన వివరములధికముగా తెలియవు. తెలిసిన సమాచారమునుబట్టి, ఖాను, నగరబాహ్య ప్రాంతమున ముట్టడి సాగించి మట్టికోటను వశము చేసికొనెను. తరువాత కోటలోపలి భాగమునాతని వశమయ్యెను. కోటయందాతని యధికారము ముద్రితమయ్యెను. ప్రతాపరుద్రుడు ఉలుఘ్‌ఖానుకు బందీయయ్యెను. ఆతనిని ఢిల్లీకి పంపించిరి (1323).

ప్రతాపరుద్రుడు తురుష్కులకింత సులభముగా పట్టువడుట యాశ్చర్యకరమే. అయినను దీనికి కారణములు లేకపోలేదు. ఉలుఘ్‌ఖాను మొదటి ముట్టడిలో తురుష్కులను పరాజితుల చేసిన ప్రతాపరుద్రుడు విజయోత్సవములు ప్రకటించెను. తురుష్కులు మరువెంటనే దండయాత్ర చేయుదురని భావించకపోవుటచే, కాకతీయ చక్రవర్తి ధాన్యము మొదలైన ఆహార పదార్థములను విచ్చలవిడిగా వ్యయించెను. యుద్ధ సన్నాహములను మానవలసినదనియు, శాంతముగా జీవించి, వ్యవసాయాది వృత్తుల నవలంబించ వలసినదనియు ప్రజల నాదేశించెను. కాని, మొదటి దండయాత్ర జరిగిన నాలుగు మాసములకే ఉలుఘ్‌ఖాను అన సైన్యములతో తిరిగి వచ్చి కోటను చుట్టుముట్టుట ప్రతాపరుద్రుని చకితుని గావించెను. కోటలో తగిన వస్తుసామగ్రి కాని, సైన్యసన్నాహము కాని లేకుండెను. కోటను రక్షించుకొనుటయు దుస్తరమయ్యెను. అయినను ధైర్యముతో ప్రతాపుని సైన్యములు తురుష్కుల నెదిరించెను. కాని తగిన ఆహారపదార్థములు లేకపోవుటచే భటులు, నగరవాసులు, కరువునకు లోనుకావలసి వచ్చెను. ఇట్టి విషమ పరిస్థితులలో తురుష్కులు కోటను సులభముగా స్వాధీనము చేసికొనిరన్నను ఆశ్చర్యము లేదు. ప్రతాపరుద్రుడు కోట ద్వారములను తెరిపించి, తన పరివారముతో

శత్రువులకు వశమయ్యెను తురుష్కులు నగరమును సర్వనాశనము గావించిరి

ప్రతాపరుద్రుడు వశమైన తరువాత ఉలుఘ్‌ఖాను ఆతనిని చాలకాలము ఈ ప్రాంతమున నుండనీయలేదు ఆతడు ఓరుగంటిలో నుండుట ప్రజా విప్లవమునకు కారణమగునను ప్రమాదమును శంకించి యాతనిని సకుటుంబముగా ఢిల్లీ నగరమునకు పంపించెను విశ్వాస పాత్రులైన ఇద్దరు సర్దారులు ఖాదర్ ఖాన్, ఖ్వాజాహాజీ అనువార లాతనికి రక్షణగా నుండిరి కాని, వారు ఢిల్లీనగరమునకు చేరు లోపలనే ప్రతాపరుద్రుడు మరణించెను ఢిల్లీ ప్రయాణ సందర్భమున కలిగిన ప్రతాపరుద్రుని మరణమునకు సంబంధించిన వివరము లంతగా తెలియరావు కాని నర్మదా నదీతీరమున ప్రతాపరుద్రుడు ఇష్టపూర్వకముగ దేహము చాలించెనని అనితల్లి శాసనము చెప్పుచున్నది ప్రతాపరుద్రదేవుడు స్వాభిమానము గల చక్రవర్తి బందీగా జీవించి తురుష్కుల యధీనమున నుండుట కాతని కంగీకారముగ నుండదు అందుచే నాతడు బలవన్మరణమునకు పాల్పడెనన్నను సంశయింప బనిలేదు, ప్రతాపరుద్రుని మరణముతో విశాలసామ్రాజ్యమును స్థాపించి పాలించిన కాకతీయ వంశ మంతరించెను ఆంధ్రదేశము హిందూ రాజుల యధీనము బాసి తురుష్కుల హస్తగత మయ్యెను

**రాజ్య వ్యవస్థ** తనకు పూర్వులైన కాకతీయ చక్రవర్తుల వలెనే ప్రతాపరుద్రుడు రాజ్యమున రక్షణ వ్యవస్థకు చాల ప్రాధాన్యము నిచ్చెను ముఖ్యముగా తురుష్కుల దండయాత్రలవలన ఈయవసరము మరింతయధికమయ్యెను దుర్గముల కీలకాలపు రక్షణ వ్యవస్థయందు ప్రాముఖ్యము చాల కలదు ఈ దుర్గములు నాలుగువిధములుగా నుండెడివి (1) జల దుర్గములు, (2) స్థలదుర్గములు, (3) వనదుర్గములు, (4) గిరిదుర్గములు ప్రతాపరుద్రుడు ఇట్టి దుర్గము లన్నిటియందును రక్షణ నియమములు కట్టుదిట్టముచేసెను దుర్గములలో అట్టాలకములు, గోపురములు నిర్మింపబడెను ధానుష్కులు, యోధులు నిరంతర మీ దుర్గములను రక్షించుటయందు నిమగ్నులై యుండిరి ధాన్యము, ఆయుధములు, వస్తుసామగ్రి నిలువ చేయుట నాటి రాజనీతి దుర్గములు విశాల మైదానములను కలిగి సైన్యముల రాకపోకల కనువుగా నుండెడివి ఈవ్యవస్థ కలిగిన దుర్గములలో నాడు ప్రాధాన్యము వహించినవి ఓరుగల్లు, అనుమకొండ, దివి, కొలను, గండికోట మొదలగు దుర్గములు

రాజ్యవ్యవస్థ సామాన్యముగా నాటి కాలమున సైనిక పరముగా నుండెడిది ప్రతాపరుద్రుడు తన రాజ్యమును పరిపాలనా సౌకర్యమునకై విభాగములు చేసి ఆ విభాగముల కధిపతులుగా 'నాయకులను' నియమించెను ఈ నాయకులు సైన్యమునకు సంబంధించిన యధికారులే పరిపాలనకై కావలసిన వ్యయములకై ఈ నాయకులకు నాయక స్థలములు, నాయక స్థల వృత్తులు అను భూసంతులను రాజు బహూకరించుచుండెను ఈ నాయంకర వ్యవస్థను తరువాతి వారగు విజయనగర పాలకులును అనుసరించిరి ప్రతాపరుద్రుడు రచించిన నీతిసారమను గ్రంథము పరిపాలనకు సంబంధించిన విశేషములను కొన్నిటిని సూచించుచున్నది సామంతులకు, రాజాధికారులకు గ్రామముల యధికారముల నప్పగించవలెననియు, వారు పరిపాలనను చక్కగా కొనసాగించుటయే కాక, రాజుగారికి అవసర పరిస్థితులయందు సహాయము చేయుటకై కొంత సైన్యమును సమకూర్చి యుంచవలయుననియు ఇందు చెప్పబడియున్నది ఇదిగాక గ్రామముల రాబడి నుండి కొంత భాగము చక్రవర్తి ధనాగారమునకు పంపించవలసి యుండెను సామంతుల సైన్యమే కాక రాజు స్వయముగా శక్తిమంతమైన సైన్యమును కలిగియుండవలెననుట నాటి రాజనీతిలో ముఖ్య విశేషము సామంతులు బలవంతులై కేంద్రప్రభుత్వమును తిరస్కరింతురని కాబోలు వీరిలో పెక్కుమందికి స్థలముల మార్పు చేయుచుండిరి ప్రతాపచరిత్ర ననుసరించి, ప్రతాపరుద్రుడు తన రాజ్యమున నాల్గవ భాగమును నాయకుల కప్పగించి, డెబ్బదియేడుగురు నాయకులను నియమించెనని తెలియుచున్నది

సైనిక వ్యవస్థలో రథ, గజ, తురగ, పదాతు లను చతురంగ బలములకు ప్రాముఖ్యమున్నను, కాకతీయ రాజులితర రాజులవలెనే రథములను తమ సైన్యమున చేర్చినట్లు కాన్పించదు సమకాలిక వర్గముల ననుసరించి, ప్రతాపరుద్రుని సైన్యమున నూరు ఏనుగులు, ఇరువదివేల అశ్వికులు, నవలక్ష ధనుర్ధరులున్నట్లు తెలియవచ్చును గజములను బర్మా, సింహళముల నుండియు, కళింగ దేశము నుండియు సంపాదించుచుండిరి అశ్వములు సింధు పారసీక దేశముల నుండియు దిగుమతి యగుచుండెను గజసాహిణులు, అశ్వసాహిణులు,

సామాన్యముగా అయుధాదళముల కధిపతులుగా నుండిరి ప్రతాపరుద్రుని సైన్యము రెండు విభాగములుగా నుండెను రాజు సైన్యము మొదటిది నాయకుల సైన్యము రెండవది దండాధిపతి, సైన్యాధిపతి యను సైన్యాధికారులీ సైన్యముల నడిపించు చుండిరి రాజు సర్వసైన్యాధ్యక్షుడుగా నుండెడివాడు రాజు స్వయముగా సేనను నడిపించుటయు, యుద్ధము చేయుటయు కలదు రాజునకు అంగరక్షక దళ ముండెడిది యుద్ధమున శౌర్య ధైర్యములను ప్రదర్శించిన వీరులకు రాజు వస్తురూపములో బహుమానములు భూదానములు, గ్రామదానములు చేయు చుండెడివాడు

ఇతర హిందూ చక్రవర్తులవలెనే కాకతీయ ప్రతాపరుద్రుడును నిరంకుశ ప్రభువే రాజ్యమున నాతనికి సర్వాధికారములు కలవు వర్ణాశ్రమ ధర్మపాలనము రాజునకు ముఖ్య ధర్మముగా నుండెడిది ఈ ధర్మము నతిక్రమించెడి వారిని ప్రతాపరుద్రుడు శిక్షించెడివాడు 'రాజనీతి' యను గ్రంథమునందు రాజునకు కావలసిన యోగ్యతలను గురించి చెప్పబడి యున్నది రాజు వేదశాస్త్ర పారంగతుడు కావలయును రాజనీతి, కళాసాహిత్యములందు నిపుణత కలిగి యుండవలెను ప్రజలకు తండ్రివంటివాడు రాజు సేవకులను, అధికారులను దయా గౌరవములతో చూడవలయును ప్రతాపరుద్రు డీయోగ్యతల నన్నియు కలిగియుండె ననుటలో సందేహము లేదు రాజు తన ప్రజల కష్టనిష్ఠురములను కనుగొనుటకై వారి కష్టపడప్పుడు దర్శన మొసంగెడివాడు ఒకచోట ఆతని సభా విశేషములు చెప్పబడి యున్నవి రాజు సభతీర్చినప్పుడు అంగనాజన మాతని వెనుక నిలబడియుండెడిది కవి గాయకులు దక్షిణ పార్శ్వమున నుండువారు వందిలాతని గుణగణముల కీర్తించుచు వామపక్షమున చేరియుండువారు అమాత్యులు, రాజబంధువులు, సచివులు, అధికారులు సముచిత స్థానములలో సభ నలంకరించి యుండువారు రాజునకు పరిపాలనా విధానమున అనేకమంత్రులు సహాయము చేయుచుండెడివారు వీరు నాటి శాసనములందును, సమకాలిక సాహిత్యమునందును, మహాప్రధానులు, ప్రధానులు, ప్రెగ్గడలు, అమాత్యులు, మంత్రులు అని వ్యవహరింపబడిరి కాని వీరు ఆచరించు ప్రత్యేక విధులెట్టివో వివరములు తెలియరావు సామాన్యముగా వీరు వేదశాస్త్ర పారంగతులగు బ్రాహ్మణులే యని తెలియవచ్చుచున్నది

**సాహిత్య పోషణము** కాకతీయ వంశమునందలి ఇతర రాజులవలెనే, ప్రతాపరుద్రుడును, సాహిత్య పోషణమున వెనుకాడినవాడు కాడు నిజమునకితని రాజ్యకాలమున శాంతి లేక తురుష్కుల దండయాత్రలు జరుగుచునే యుండినను, సాహిత్యవికాసమున కాపరిస్థితి యాటంకమును కలిగించినట్లు కాన్పించదు కాకతీయుల సాహిత్య పోషణమున రెండు భాషలభివృద్ధి చెందినవి ఒకటి సంస్కృతము, రెండవది తెలుగు మొదట సంస్కృతమును గురించి పరిశీలింతము ప్రతాపరుద్రుడు మొదలగు కాకతీయ చక్రవర్తులును, వారి సామంతులును, అనేక దానశాసనములను, వ్రాయించి యున్నారు ఇందనేకములు సంస్కృతమున నున్నవి ఈ శాసనములను కావ్యపరముగా చూచిన, ఇవి ప్రశస్తి కావ్యములనిపించును కాని వీటిరచయితలను గురించి మనకంతగా తెలియదు కాని, ఈ శాసనములను చూచినప్పుడు అందలి సుందరమైన శైలి, విషయ వైశద్యము మనలను ముగ్ధులను గావించును శాసనములు నిజమునకు రాజప్రశస్తులవంటివి కదా ఇవి సంస్కృతమున నున్న నన్నచో, సంస్కృత భాష యెంత ప్రచురముగా నాడు వాడుకలో నుండెనో స్పష్టమగును అనగా, సంస్కృత భాషా ప్రచారమునకు కాకతీయ చక్రవర్తులు చాల ప్రోత్సాహము ఇచ్చియుండిరనుటలో సందేహము లేదు

ప్రతాపరుద్రుని అస్థానము నలంకరించిన సంస్కృత కావ్యకర్తలలో సాకల్య మల్లుభట్టు అను నాతడు ప్రఖ్యాతిని గాంచి యున్నాడు ఇతడు రెండు కావ్యములను రచించెను (1) ఉదాత్త రాఘవ కావ్యము (2) నిరోష్ఠ్య రామాయణము ఇందు ఉదాత్త రాఘవము చాల ప్రఖ్యాతి చెందినది దీనికి తరువాత రెండు వ్యాఖ్యానములు రచితములైనవి ఈ రాజు ఆస్థానముననే నివసించిన జైనకవి అప్పయార్యుడను నాతడు జైనేంద్ర కల్యాణాభ్యుదయమను కావ్యము క్రీ శ 1320 సం॥ న రచించెను ఆంధ్రమున క్రీడాభిరామమను వీధినాటకమునకు మూలమైన ప్రేమాభిరామము సంస్కృతముననే రచితమైనది దీని రచయిత రావిపాటి త్రిపురాంతకుడు ఇతడు ప్రతాపరుద్రుని సమకాలికుడేయై యుండును ప్రతాపరుద్రుని కాలమున ఓరుగంటి సాంఘిక జీవితమును గురించియు, ఇతర విశేషములను గురించియు, ఈ గ్రంథకర్త తన గ్రంథమున ఉల్లేఖించి యున్నాడు సంస్కృతము నందలి అలంకార



ఓరుగల్లు కోటలోని శిథిల విగ్రహములు - షితాబుఖాన్ దర్బారు హాలుముందు సమకూర్చబడినవి



స్వయంభూదేవాలయ శిథిలఫలకము - ఓరుగల్లుకోట

## కాకతి ప్రతాపరుద్రుని నాణెము

(a) 

1

 (a)

2

(b) 

1

ముందు భాగము

 (b)

2

వెనుక భాగము

(a) మొదటివరుస నాణెముయొక్క అసలు రూపము

(b) రెండవవరుస నాణెవిషయముకు స్పష్టముగా తెలుపుటకు వ్రాయబడిన వ్రాయింగు

(a) 

పై నాణెముయొక్క ముందు భాగము

(విస్తృతరూపము)

(b) 

పై నాణెముయొక్క వెనుక భాగము

(విస్తృతరూపము)

By the courtesy of the Journal of the Numismatic Society of India Vol XXI, Part II

# కాకతీయ ప్రతాప రుద్రదేవుని నాణెము

కాకతీయ చక్రవర్తులకాలములో మాడలు, మాడువులు, బడిమాడువులు, చిరుపీడ, గద్యాణము, పెగోడా, మాడబడిపాతిక మున్నగు పేర్లుగల నాణెములున్నట్లు తెలియుచున్నది కాని కాకతీయ నాణెములు ఒక్కటియు దొరకలేదు ఒకటి రెండు నాణెములు దొరకినట్లు ప్రకటింపబడినదిగాని, అవి అవునని, కావని వివాదము బయలుదేరినది అందుచే వాటివిషయము సందిగ్ధముగానే నిలిచిపోయినది

ఇప్పుడు శ్రీ యస్ రామయ్య అనువారు ఒక నాణెమును కనుగొని ఆ విషయమును "ది న్యూమిస్మాటిక్ సొసయిటి ఆఫ్ ఇండియా" వారి సంపుటము 21, భాగము 2 లో వ్యాఖ్యానించి ప్రకటించినారు (1959) శ్రీ యస్ రామయ్యగారు ప్రకటించిన కాకతీయనాణెపు ప్రతిబింబమును ఈ ప్రక్కపుటలో ముద్రించినాము

ఈ నాణెముమీద—

| | |
|---|---|
| ముందుభాగమున | శ్రీమద్విక్ర |
| | మకాకతీయ |
| | ప్రతాపరు |
| వెనుకభాగమున | ద్రదేవవి |
| | జయకటక |
| | (౧౩ . ) శక |

అని లేఖనము కలదు ఇందు "కాకతీయ ప్రతాపరుద్రదేవ" అనునక్షరములు స్పష్టముగా కనిపించుచున్నందున, ఇది కాకతీయనాణెమే సందేహములేదు ఇది రాగినాణెము నాణెముయొక్క బరువు 125 5 వడ్లగింజలు పరిమాణము 82 అంగుళములు వలయాకారము ప్రాచీననాగరలిపి నాణెముపేరు తెలియదు

కాకతీయుల నాణెములలో ఒకవైపున తెలుగులిపి, ఒకవైపున నందివిగ్రహము ఉండుచుండెను ఈ నాణెములో తెలుగులిపిలేదు నందివిగ్రహము లేదు ఇట్టిమార్పునకు కారణము ఏమైయుండును? కాకతీయులకు పవిత్రభాష సంస్కృతము వారిశాసనములు, సమకాలికుల శాసనములు సంస్కృతభాషలో నున్నవి ఒకవిధముగా సంస్కృతము వారి రాజభాషయని చెప్పవచ్చును మరియు కాకతీయ ప్రతాపరుద్రదేవచక్రవర్తి స్వాతంత్ర్యము గోల్పోయి, ఢిల్లీ చక్రవర్తికి సామంతుడుగా నున్నకాలములో వేసిన నాణెమని ఊహింపబడుచున్నది మహమ్మదీయులు విగ్రహములను సహింపరు. అఖిలభారతములో చెలామణి యగుటకు నాణెములను ఈ విధముగా సంస్కృతభాషలో నాగరలిపిలో ముద్రించియుందురు ఈ నాణెములు ఢిల్లీవరకు ప్రచారములో నుండియుండును

ఈ నాణెమునందు శకసంవత్సరము పేర్కొనబడినది శకమనగా శాలివాహనశకమే శకసంవత్సర సందర్భమున ౧౩ సంఖ్య స్పష్టముగా కనిపించుచున్నది దానితరువాత నుండవలసిన రెండు అంకెలు తెలియుటలేదు

ప్రతాపరుద్రదేవచక్రవర్తి శా శ 12 17 నుండి 1248 వరకు రాజ్యముచేసి యుండెను శా శ 1231 లో ఆతడు ఢిల్లీచక్రవర్తికి కప్పముగట్టుటకు సమ్మతించియుండెను. కావున ఈనాణెము శా శ 1240 ప్రాంతములో ముద్రితమైయుండును అది క్రీ శ 1318 అగును

యథార్థమయిన కాకతీయనాణెమును ప్రకటింపగలిగినందులకు మేము సంతోషించుచున్నాము

ఈవిషయమునంతయు సేకరించి మాకు సహాయముచేసిన శ్రీమాన్ కొమాండూరి వేంకటాచార్యు, ఎం ఏ గారికి మేమెంతయు కృతజ్ఞులమై యున్నాము వారికి మాధన్యవాదములు

—సంపాదకుడు

శాస్త్రమునకు క్రీ శ పదునాల్గవ శతాబ్ది అనగా ప్రతాప రుద్రుని పరిపాలనాకాలము స్వర్ణయుగ మని చెప్పవొప్పును. అలంకారికులలో తలమానికమువంటివాడైన విద్యానాథుడీ చక్రవర్తి యాస్థానపండితుడే. ఈతడు వ్రాసిన 'ప్రతాప రుద్రయశోభూషణము' నాటికి, నేటికి, అలంకారశాస్త్రమున ప్రామాణిక గ్రంథముగా ఉన్నది. విద్యానాథుడు నాటికాలమున పండితాగ్రగణ్యుడుగా భావింప బడినాడు. తన ఆలంకారికగ్రంథమును ఈతడు ప్రతాపరుద్రునికే అంకితము గావించినాడు. ఇతర ఆలంకారికులైన సాయణుడు, విశ్వేశ్వరుడు, సింగభూపాలుడు విద్యానాథు ననుసరించియే రచనలు చేసిరి. ఈ కాలముననే వెలువడిన ప్రముఖసంస్కృత గ్రంథములలో పాల్కురికి సోమనాథుడు రచించిన అనుభవసారము, చతుర్వేదసారము, అక్షరాంకగద్యము, సోమనాథ భాష్యము, రుద్రభాష్యము మున్నగునవి కలవు. కొలని రుద్రదేవుడు రచించిన శ్లోకవార్త్తికము, గుండయ భట్టు రచించిన ఖండనఖండన మను అద్వైత గ్రంథమునకు వ్యాఖ్యానము కూడ నీకాలముననే వెలువడినవి.

చిత్రము 45



పటము 1

శ్రీ వేంకటేశ్వరాలయము ప్రాంగణములో భద్రపరుపబడిన రాతి స్తంభము – ఓరుగల్లు కోట

ఆంధ్రకావ్యముల రచనాకాలము చేతను, ప్రాశస్త్యముచేతను మొదటిదియైన ఆంధ్ర భారతము ప్రతాపరుద్రుని కాలమునాటికే అధికాంశము రచితమై యుండెను. అందుచేతనే కాబోలు, ప్రతాపరుద్రుని కాలమునందలి యాంధ్రరచయితలు తమ దృష్టిని రామాయణముపై ప్రసరింపజేసిరి. తెలుగుభాషలో మొదటి రామాయణ మీతని కాలముననే రచింపబడినది. హుళక్కి-భాస్కరుడు, మల్లికార్జున భట్టు, అయ్యలార్యుడు, కుమారరుద్రదేవుడు అను నలుగురు రచయితలీకావ్యరచనమున పాల్గొనిరి. ఒక కావ్యమును పలువురు చేపట్టి పూరించుట ఆంధ్రమున క్రొత్తకాదు. ప్రతాపరుద్రుని అశ్వసైన్యాధ్యక్షుడగు సాహిణిమారడు ఈ కృతిని స్వీకరించెను. ఇందు కుమారరుద్రదేవుడు సాహిణి మారని కుమారుడే. ఈ విధముగా ప్రతాపరుద్రుని యధికారులే ఈ కావ్యరచనకు దోహదము కావించిరి. భాస్కర రామాయణ మును వాల్మీకి రామాయణమును అనుసరించి ఆంధ్రీకరింప రచింపబడిన ఉత్తమ గ్రంథము

తిక్కనసోమయాజి శిష్యుడైన కేతన రచించిన దశకుమార చరిత్రముకూడ దాదాపుగా ఇదేకాలమున వెలువడినది ఇది సంస్కృతమున దండికృతికి ఆంధ్రానువాదము మారన వ్రాసిన మార్కండేయపురాణ మీకాలమునందలి మరియొక కావ్యము సంస్కృతమునందలి ఇదే పేరుగల పురాణమునకు ఇది సంక్షిప్తమైన అనువాదము ఆంధ్రభాషాభూషణము, త్రిపురాంతకోదాహరణము అను గ్రంథములుకూడ ఇదేకాలమున వెలువడినవి కాకతీయుల పాలనములో రచితమై బహుళ జనాదరణమును పొందిన కావ్యము రంగనాథ రామాయణము గోనబుద్ధారెడ్డి కాకతీయుల సామంతులలో నొకడుగా నున్నట్లు చెప్పబడుచున్నది ఇతడే దీనిని రచించె నందురు రంగనాథు డనువాడు దీనిని రచించెనను వాదమును కలదు

చిత్రము 46



పటము 2
ఒక రాతి స్తంభముమీది చెక్కడపు పనితనము - ఓరుగల్లుకోట

రచయిత యెవరైనను ఈ ప్రశస్తమైన ద్విపద కావ్యము కాకతీయుల కాలమున వెలువడినట్టి దనుటలో సందేహము లేదు

ఈ సందర్భమున పాల్కురికి సోమనాథుని రచనములను గురించి విశేషముగా చెప్పవలసి యున్నది సోమనాథుడు శివకవి కాకతీయులు, అందును ప్రతాపరుద్రుడు శైవమతాభిమాని సోమనాథుడు స్వయముగా ప్రతాపరుద్రుని దర్శించె ననియు, ఓరుగంటి నగరమున కొంతకాల ముండె ననియు చారిత్రకాధారములవలన తెలియు చున్నది ఈతడు రచించిన రెండు ద్విపదకావ్యములు 1 బసవపురాణము, 2 పండితారాధ్యచరిత్ర మనునవి బహుళ ప్రశస్తి నందుకొన్నవి వీరశైవమతమును దక్షిణభారతదేశమున ప్రచారము చేసిన బసవేశ్వరుని చరిత్రను బసవపురాణమున సోమనాథుడు వర్ణించెను పండితత్రయమున నొకడుగా ప్రఖ్యాతి వహించి, శైవమతమును ప్రచారముచేసిన మల్లికార్జున పండితారాధ్యుని చరిత్ర రెండవ గ్రంథమున వివరింపబడినది తన గ్రంథము బహుళప్రచారమును పొందవలయు నని కాబోలు సోమనాథుడు ద్విపదచ్ఛందమును గ్రహించుటయు, జాను తెనుగును అభిమానించుటయు జరిగెను వృషాధిపశతకము, చెన్నమల్లు సీసములు ఈతని ఇతర రచనలు ఇవియు శైవమత ప్రాశస్త్యము నుగ్గడించునవియే

ప్రతాపరుద్రుని కాలమున విలసిల్లిన ఇంకొక ప్రముఖాంధ్ర పండితుడు కృష్ణమాచార్యులు ఇతడు సింహగిరిన జన్మించినవాడు

గొప్ప వైష్ణవ భక్తుడు చతుర్లక్ష ఆంధ్ర వచనములను రచించి సింహగిరీశుడగు నృసింహస్వామి కంకితము చేసెను ఈ వచనము లన్నియు లభింపవు కాని, లభించినవానిలో ఉత్తమ వచనములు కలవు ఆంధ్రమున వచనైకరచనలు చేసిన వారిలో కృష్ణమాచార్యులే అద్యుడు ప్రతాపరుద్రుడు ఈతని పాండిత్యమును, వైష్ణవభక్తిని, మహిమలను మెచ్చుకొని ఈతనిని గ్రామాధికారిగా నియమించెను తాను రచించిన వచనములను రాగిరేకులపై చెక్కించుటకు కృష్ణమా

చిత్రము 47



పటము 8.

గ,క స్తంభముమీది చెక్కడపు పనితనము-ఓరుగల్లుకోట

చార్యులు ప్రభుత్వధనమును వెచ్చించినను, ప్రతాపరుద్రు డాతని మహిమ నెరిగినవా డగుటచే, ఆతని దండింపలేదట! మొత్తముమీద ప్రథమాంధ్రవచన కావ్యము ప్రతాపరుద్రుని కాలముననే వెలువడినది ఇట్లు కాకతీయ వీరప్రతాప రుద్రదేవసార్వభౌముని పరిపాలనాకాల మాంధ్రదేశమున అన్నివిధముల ఖ్యాతి నందినది

యం కు

## ప్రతాపరెడ్డి - సురవరము

వంశము సురవరము ప్రతాపరెడ్డిగారు 'మోటాటి' రెడ్డి శాఖకు చెందినవారు పూర్వము వీరింటిపేరు 'ఏమిరెడ్డి వారు' గోత్రము 'పెరినూళ్ళ గోత్రము' వీరి పూర్వులు గుల్బర్గా జిల్లాలోని సురపురం సంస్థానము నుండి వచ్చినారు అచటినుండి ఈ వంశములోని ఒక శాఖ నాగరకర్నూలు తాలూకాలోని 'ఎత్మెము' గ్రామమునకు పోయెను మరొక శాఖవారు కొల్లాపురం తాలూకాలో కొన్నాళ్ళు ఉండి సుమారు 250 సంవత్సరముల క్రిందట ఆలంపూరు తాలూకా ఇటిక్యాలపాడు గ్రామమున స్థిరపడినారు అందువలన వీరికి సురాపురము వారని, సురవరము వారని ఇంటిపేరు వచ్చెను ఈ సురవరము వారికి మూలపురుషుడు అచ్చన్న అతడే పెద్దమరూరునుండి ఇటిక్యాలపాడు చేరుకొనెను అచ్చన్న కుమారుడు పక్కిరిరెడ్డి - మనుమడు పాపిరెడ్డి పూర్వము ఈ వంశము వారు శైవులు పాపిరెడ్డిగారి కాలమున వైష్ణవమును స్వీకరించిరి ఈయన నుండి ఈ వంశమువారి వివరములు తెలియుచున్నవి

సురవరము పాపిరెడ్డికి నలుగురు కుమాళ్లు, ముగ్గురు బిడ్డలు కలిగిరి కొడుకులు వెంకటరెడ్డి, నారాయణరెడ్డి, వెంగళరెడ్డి, రామకృష్ణారెడ్డి అనువారు ఈ నలుగురి వంశా

నమువారు ప్రస్తుత మున్నారు రెండవ వారైన నారాయణ రెడ్డిగారి ముగ్గురు కుమారులలో జ్యేష్ఠులు మన ప్రతాపరెడ్డి గారు తాతయైన పాపిరెడ్డి మరణించిన ఒక మాసమునకు వీరు పుట్టిరి అందువలన మొదట వీరికి పాపిరెడ్డి అని తాత పేరు పెట్టిరి విద్యాభ్యాస కాలములో ప్రతాపరెడ్డి అని పేరు మారెను

ప్రతాపరెడ్డిగారు దుర్ముఖి జ్యేష్ఠ బ॥ ౧ గురువారము నాడు (28-5-1896) జన్మించిరి తండ్రి నారాయణరెడ్డి తల్లి రంగమ్మ బోరవెల్లి గ్రామములోని మూరము వారింటి ఆడుబిడ్డ. నారాయణరెడ్డిగారు పట్టుదల గలవారు కుటుంబములో మాట పట్టింపులు వచ్చి ఇల్లు వదలిపోయి బోరవెల్లిలో కాపురము పెట్టిరి స్వతంత్రముగా వ్యాపారము చేయుచు గడపిరి ఆయన మంచి వ్యవహర్త, వ్యాపారదక్షుడు వ్యాపారముచేయు కాలములోనే వివాహము చేసికొని తమ వ్యక్తిత్వమును చాటుకొనిరి ప్రతాపరెడ్డిగారు తాతగారింట బోరవెల్లిలో జన్మించి 7 సంవత్సరముల వయస్సు వచ్చువరకు అచటనే పెరిగిరి

తండ్రి నారాయణరెడ్డిగారి దగ్గరనే ప్రతాపరెడ్డిగారు 2వ వాచకమువరకు చదివిరి తరువాత స్వగ్రామము చేరిన కొన్నాళ్ళకు వీరి పెద్దలు తమ కుటుంబములోని బాలుర విద్యాభ్యాసమునకై కర్నూలులో కాపురమును పెట్టించిరి అంతవరకు వీథిబళ్ళలో ఒక సంవత్సరకాలము చదువులు జరిగెను 1904వ సంవత్సరమున కర్నూలులోని A B M (మిషనరీ) ప్రైమరీ స్కూలులో నాలుగవ తరగతిలో చేరి విద్యాభ్యాసము సాగించిరి అప్పుడు ఆ స్కూలుపెద్ద రఘురామయ్యగారు ఆయన ఘోరమైన బడిపంతులు విద్యార్థులపై అపార వాత్సల్యము కలవారై నిత్యము యథాశక్తిగ శిష్యులకు కాయశుద్ధి చేసి అనుగ్రహించు చుండిరట ! వారి దెబ్బలకు తాళలేక ప్రతాపరెడ్డిగారు బడికే ఎగనామముపెట్టి కూర్చుండవలసి వచ్చెను వీరి విద్యాభ్యాసమునకై శ్రద్ధ వహించినవారు వీరి పినతండ్రి సురవరము రామకృష్ణారెడ్డిగారు

ప్రతాపరెడ్డిగారి బాల్యదశయందే పెదతండ్రి వెంకటరెడ్డి, తండ్రి నారాయణరెడ్డి, (1912) పినతండ్రి వెంగళరెడ్డిగారలు మరణింపగా కడపటి పినతండ్రిగారగు రామకృష్ణారెడ్డిగారిపై ఆ సంసారభార మంతయు పడినది వారే ఇంటి వ్యవసాయములు, వ్యవహారములు, కర్నూలు వ్యాపారములు కొనసాగించుచు కుటుంబములోని తమయొక్క, సోదరుల యొక్క సంతానములకు విద్యాభ్యాసము చేయించుచు సుగుణశాలురు, సచ్ఛీలురు అని ప్రసిద్ధి పొందిరి తమ పిల్లలతో పాటు ఆయన ఎందరో నిస్సహాయులైన బంధువుల పిల్లలకు భోజన వస్త్ర పుస్తకాదులు ఫీజులతోసహా ఇచ్చి కర్నూలులో విద్యాదానము చేసినారు వీరినిగూర్చి ప్రతాపరెడ్డిగారే తమ వాక్యములలో "మా వంశములోని అందరిలో మా చిన్నాయనగారు పవిత్రులు తమ సంతానముకంటె మించిన ప్రేమతో తమ అన్నల సంతానమును చూచుకొనుచు వచ్చినారు వారికి సమష్టి ఆస్తిపై 15 ఏండ్ల కాలము సర్వాధికారము ఉండినను ఒక్క దమ్మిడి దాచి యెరుగరు వారిలోని గుణవిశేషము వారు మహాదాతలు మహారాజ కుటుంబమున పుట్టవలసినవారు ఎట్లో మూవంటి బీదకాపుల ఇంటిలో పుట్టిరి వారి జీవిత కాలములో 2 లక్షల రూపాయలకుపైగా దానము చేసియుందురు రామకృష్ణారెడ్డిగారికి బ్రాహ్మణులన్న - అందులో పండితులన్న చాల భక్తి సదా వారిచుట్టు బ్రాహ్మణ బృందము ఉండేది సత్సాంగత్యమన్నా, పండితుల గోష్ఠి అన్నా వారికి చాల ప్రీతి సంస్కృతాంధ్రములలో కొలదిగా పాండిత్యము ఉండెను వారు తమ 60వ ఏట పుణ్యమరణమును పొందిరి" అని ఒక చో వ్రాసినారు

1905 సంవత్సరమున కర్నూలులోని కోల్సు మమోరియల్ హైస్కూలులో 1వ ఫారమున ప్రతాపరెడ్డిగారు చేరిరి 4వ ఫారము వరకు సంస్కృతమును కూడ చదివిరి అచటి సంస్కృత పండితులు గద్వాల కృష్ణమాచార్యులుగారు వారి బలవంతము వలననే సంస్కృతమును గ్రహించిరి ఇంటిదగ్గర సుప్రసిద్ధ విద్వాంసులు బ్రహ్మశ్రీ వెల్లాల శంకరశాస్త్రిగారికడ పంచకావ్యములు, భారతచంపువు, లఘుకౌముది చదివిరి మొగటినుండి వీరికి లెక్కలు వచ్చెడివికావు 5వ ఫారములో లెక్కల టీచరు వీరిని క్లాసులో కొట్టి అవమానించినందున తమ చదువును మున్సిపల్ హైస్కూలునకు మార్చుకొనిరి 1912వ సంవత్సరము మొదటిసారి స్కూల్ ఫైనల్ పరీక్షయందు లెక్కలలో తప్పి 1913లో ఉత్తీర్ణులైరి ప్రతాపరెడిగారికి చిన్నతనమున కసరత్తులు, కుస్తీలు అనిన చాల

ఇష్టముండెడిది అందుకై అల్లరి పిల్లలతో తిరుగుచుండిరట!

1914లో హైదరాబాదులోని నిజాముకాలేజీలో చేరి 1916లో ఎఫ్ ఏ పరీక్షలో 'లాజిక్' సబ్జెక్టులో తప్పిరి 1917లో ప్రయివేటుగా పరీక్షలో కృతార్థులైరి ఆ కాలమున వీరిని హైదరాబాదు నగరమున పింగిళి వెంకటరామరెడ్డిగారు చాల ఆదరించిరి కొత్వాలు వెంకట్రామరెడ్డిగారికి వీరిపై విశేషప్రీతి అప్పుడు హైదరాబాదులో సరియైన హోటలు లేనందున విద్యార్థులు చాల అవస్థలు పడుచుండిరి పింగిళివారు ఉచితముగ నిచ్చినగదిలో వసించుచుండిరి

చిత్రము 48



సురవరము ప్రతాపరెడ్డి

వివాహము 1916 లో ఇటిక్యాల గ్రామనివాసి గౌని రెడ్డన్న కుమార్తె పద్మావతమ్మను తమ తల్లికి ఇష్టము లేకున్నను పట్టుబట్టి పెండ్లి చేసికొనిరి బాల్యమునుండి వీరుభయులును పరస్పరము ప్రేమించుకొని యుండిరి కావున ఇది ఆదర్శ దాంపత్యముగా నుండినది సురవరము ప్రతాపరెడ్డి గారికి నలుగురు కుమారులు, నలుగురు పుత్రికలు ఉన్నారు

ప్రతాపరెడ్డిగారికి ఉన్నత పాఠశాలా విద్యార్థి దశ నుండియే సంస్కృతము అభిమాన పాత్రమై యుండెను మెట్రిక్ వరకు ద్వితీయ భాషగా సంస్కృతమును చదివిరి ఎఫ్ ఏ లో 'చరిత్ర - లాజిక్' మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజిలో బి ఏ తరగతిలో చేరినపుడు మరల సంస్కృతమును చదువదలచిరి కాని ఎఫ్ ఏ లో తీసికొననందున వారికి బి ఏ లో సంస్కృతము తీసికొనుట కష్టమయ్యెను అప్పుడు తమ గురువులు వెల్లాల శంకరశాస్త్రిగారి ద్వారా ప్రయత్నించి కీ శే వేదము వేంకటరాయశాస్త్రిగారిచే ప్రెసిడెన్సీ కళాశాలలో సంస్కృతభాషా ప్రధానాచార్యులైన ఎస్ కుప్పుస్వామి శాస్త్రిగారికి సిఫారసు ఉత్తరమును సంపాదించి వారికి అందజేసిరి శాస్త్రిగారు రెడ్డిగారి సంస్కృత జ్ఞానమును పరీక్షించి సంతోషముతో బి ఏ తరగతిలో వారిని చేర్చుకొనిరి 1919 లో బి ఏ పరీక్షయందు సంస్కృతమున కృతార్థులై ఇంగ్లీషులో తప్పిరి 1920 లో మరల తప్పి సప్లిమెంటరీ పరీక్షలో నెగ్గిరి దీనితో చదువు చాలించుకొనివచ్చి 1921వ సంవత్సరము ఊరక ఇంటిదగ్గర గడిపిరి ఇకమీద వీరికి చదువవలెనను ఇష్టము లేకున్నను పినతండ్రిగారి నిర్బంధము వలన లాకాలేజీలో చేరవలసి వచ్చెను ఇష్టములేని చదువగుటవలన ఎఫ్ ఎల్ పరీక్షలో తప్పిరి కాని తిరువాన్కూరుకు పోయి చదివి ఎఫ్ ఎల్ పరీక్షలో, బి ఎల్ పరీక్షలో ప్యాసై పట్టప్రధానోత్సవములో డిగ్రీ పొంది వచ్చిరి

విద్యాభ్యాసము పూర్తి అయిన తరువాత చేతనైన ప్రజాసేవ చేయుచు ఇంటిదగ్గర ఉండిపోదలచిరి కాని తమ దగ్గరి బంధువగు పేరూరి బసిరెడ్డికి ఒక వ్యవహారములో సహాయము చేయవలెనని తమ పినతండ్రి రామకృష్ణారెడ్డి గారు బలవంతము చేయగా హైదరాబాదుకు వెళ్ళవలసి వచ్చెను హైదరాబాదులో ప్రముఖులయిన కొత్వాలు వేంకట్రామరెడ్డిగారు తాము ౬-౭ ఏండ్లక్రిందట స్థాపించిన రెడ్డిహాస్టలుకు వార్డెన్‌గా ఉండి పనిచేయుమని నిర్బంధించిరి, బంధుకార్య సాఫల్యమునకై అచ్చట నుండుటచే కొత్వాలు గారి యాజ్ఞను అంగీకరింపవలసి వచ్చెను

1924వ సంవత్సరము ప్రతాపరెడ్డిగారు రెడ్డి హాస్టలులో వార్డెనుగా చేరునాటికి హాస్టలు వ్యవహారములు అవకతవకలుగా నుండెను క్రమశిక్షణ లేకుండెను మోసములు జరుగుచుండెను విద్యార్థులు విచ్చలవిడిగా తిరుగుచుండిరి రెడ్డిగారు ఈ అవకతవకలను మొదలే విచారించి తెలిసికొని యున్నందున క్రింది షరతులతో వార్డెనుగా ప్రవేశించిరి

(1) వార్డెన్ వేతనము తీసికొనక పనిచేయుట

(2) హాస్టలుకు నియమావళి సిద్ధము చేయబడుట

(3) నియమావళిని ఆచరణలో పెట్టుటకు వార్డెనుకు సర్వాధికారములు ఇవ్వబడుట హాస్టలు కమిటీవారు అందులో జోక్యము పెట్టుకొనకుండుట

ఈ షరతులను కొత్వాలు వెంకటరామారెడ్డిగారు అంగీకరించిరి ప్రతాపరెడ్డిగారు 2 నెలలలో హాస్టలు విద్యార్థులలో క్రమశిక్షణను నెలకొల్పిరి విద్యార్థులలో విద్యావ్యాసంగమును పెంచుటకు రెడ్డి గ్రంథాలయము నభివృద్ధి

వరచిరి అప్పుడప్పుడు సమావేశములు పెట్టి వక్తృత్వపు పోటీలు నడపి విజ్ఞానాభివృద్ధి కలిగించిరి హాస్టలు అన్ని విధముల బాగుపడెను హాస్టలు విద్యార్థులు మెట్రిక్-బి ఏ పరీక్షలలో రాష్ట్రములో ఉత్తములుగా ఉత్తీర్ణు లగుచుండిరి ఈవిధముగా 7-8 సంవత్సరములు రెడ్డిగారు ప్రతిఫలము లేకుండా వార్డెనుగా నుండి, రెడ్డిహాస్టలు నభివృద్ధిచేసి గొప్ప సేవచేసిరి వారు చేరునాటికి 1000 గ్రంథములుండిన గ్రంథాలయము విడుచునాటికి 12,000 గ్రంథములతో నొప్పెను 80కి లోపుగా ఉండిన విద్యార్థుల సంఖ్య 180కి పెరిగెను 8 సం॥లు ప్రతిఫలరహితముగా ప్రతాపరెడ్డిగారు రెడ్డిహాస్టలు కార్యకలాపములను చక్కదిద్దిరి

గోలకొండ పత్రిక ప్రతాపరెడ్డిగారు హైదరాబాదుకు వచ్చిన మరుసంవత్సరమే గోలకొండ పత్రిక స్థాపింపబడెను ఈ పత్రిక రెడ్డిగారికొరకే స్థాపించబడెను తనకు రెడ్డి హాస్టలు పని చాలదని, ఇతోధికముగా ప్రజాసేవ చేయుటకు పత్రిక యొకటే సాధనమని, అట్లయిననే హైదరాబాదులో ఉందునని రెడ్డిగారు పట్టుబట్టుటచే కొత్వాలు వెంకట్రామ రెడ్డిగారు కొందరు పెద్దమనుష్యులచే 7000 రూపాయల విరాళ మిప్పించిరి మద్రాసునుండి టైపు - ప్రింటింగు మిషనులు తెప్పించిరి

ఈ సమయమున ఒక సంఘటనము జరిగెను కీ॥ శే॥ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు కర్నూలుజిల్లా నుండి మదరాసు శాసనసభకు 'స్వరాజ్యపార్టీ' అభ్యర్థిగా నిలిపెదమని రెడ్డిగారి నాహ్వానించిరి కాని వారు కొత్వాలుగారికి మాట ఇచ్చినందున దాని నంగీకరింపక హైదరాబాదులో పత్రికాసేవకే పూనుకొనిరి లేనిచో పైస ఖర్చులేకుండ రెడ్డిగారు మదరాసు శాసనసభా సభ్యులై యుండెడివారు

గోలకొండ పత్రిక అర్ధవారపత్రికగా 1926లో వెలువడినది పత్రికా నిర్వహణము పూర్తిగా అపరిచిత మయ్యును రెడ్డిగారు తమ ప్రతిభా విశేషముచే సమర్థవంతముగా నిర్వహించిరి మొదట వారే సంపాదకులుగ, మేనేజరుగ, ప్రూఫ్ రీడరుగ, అనువాదకులుగ, పత్రవ్యవహారము జరుపు గుమాస్తాగా, స్టాంపులు అతికించి టపాలో వేయు జవానుగా, ఏకైక వ్యక్తియై అన్ని కార్యములను నిర్వహించిరి సాధారణముగా తెలంగాణములో సారస్వతసేవకై పత్రికలను నడపిన వారందరికిని ఇది అనుభవైకవేద్యము

అదివరకే రాష్ట్రములో రెండు వారపత్రికలు "నీలగిరి" "తెనుగు పత్రిక" అనునవి వెలువడుచుండి నందున గోలకొండ పత్రికను అర్ధవారపత్రికగా నడుపవలసి వచ్చెను ఆరంభమున ఈ పత్రిక పెక్కు ఇబ్బందుల నెదుర్కొనవలసి వచ్చెను అప్పుడు తెలంగాణా జనులలో మాతృభాషపై అభిమానము లేదు చందాదారులు చాల తక్కువ, ఉర్దూపత్రికల మీద విశేష వ్యామోహము తెలుగుభాషా సేవపట్ల సహాయము లేదయ్యె పైగా నైజాం ప్రభుత్వము సంవత్సరమునకు 3-4 సారులైన బెదరించు చుండెను ఈలాటి ఈతిబాధలతో పత్రిక ఎట్లో నిలువగలిగెను 4-5 ఏండ్ల అనుభవముతో రెడ్డిగారు విసుగుచెంది పత్రికను ఆపివేయ దలచిరి కాని కొత్వాలుగారు ఆమోదింపక పట్టుబట్టి నిలిపిరి ఎట్లయిననేమి క్రమముగా పత్రిక నిలువద్రొక్కుకొని ఆర్థికముగ కొంత బాగుపడెను

పత్రికను ప్రారంభించిన 2-3 ఏండ్ల తరువాత రెడ్డిగారికిని, వారి పినతండ్రి గారికిని రెడ్డిగారి భావిజీవితవృత్తినిగూర్చి వివాదమేర్పడెను రామకృష్ణారెడ్డిగారు వీరిని హైదరాబాదులో వకీలువృత్తి నారంభింప ఆదేశించిరి కాని ప్రతాపరెడ్డిగారి కిది ఇష్టములేదు ఈ వివాదము ఒక సంవత్సరము నడచెను ఈ సందర్భములో ఆరుమాసములు రెడ్డిగారు తమ స్వగ్రామమైన ఇటిక్యాలపాడులో గడపిరి ఈ నిర్బంధపు అజ్ఞాతవాసములో కాలక్షేపమునకై అనేక గ్రంథములు చదివి "హిందువుల పండుగలు" అను గ్రంథము రచించిరి తరువాత పినతండ్రి గారితో రాజీపడి కొత్వాలు గారి సహకారము వలన హైదరాబాదులో వకాలతు మొదలుపెట్టిరి ప్రభుత్వ నిబంధనల ననుసరించి వకీలు సనదు తీసికొన్నవారు పత్రికా సంపాదకులుగా నుండ వీలులేదు అందువలన నామమాత్రపు సంపాదకులుగా శ్రీ కొండా వెంకట రంగారెడ్డిగారి బంధువులైన బాలకృష్ణారెడ్డిగారిని నియమించి సర్వబాధ్యతలను తామే నిర్వహించు చుండిరి.

వకీలు జీవితము బలవంతపు బ్రాహ్మణార్థముగా వీరు వకాలతు ప్రారంభించిరి ఆనాటి వకీలు వృత్తికి క్రింది లక్షణములు అవసరమై యుండెను "అధికారుల పరిచయము, అం[illegible]రము పొందియుండుట, ప్రజాహిత కార్యములలో జోక్యము లేకుండుట, కుచ్చుటోపి షేర్వాణీలు ధరించుట, గడుసుగా ఉండుట, అబద్ధములు చక్కగా ఆడగలిగి యుండుట, వకీలుకు

ముఖ్యలక్షణములు " వీటిలో ఏ యొకటియు వీరికడ లేనందున వకీలుగా రాణింపలేక పోయిరి పైగా ఆ వృత్తియందు వీరికి మొదటినుండియు అభిమానము లేదు కొత్వాలు గారు కామిచ్చిన మాట ప్రకారము శివరాజ బహద్దరు ఎస్టేటులో అధికారిగా ఉన్న బన్సీలాల్ మోతీలాల్ గారిచే వీరికి 100 రూపాయల వేతనము నేర్పాటు చేయించిరి కాని బన్సీలాల్ గారు కొన్నాళ్ళకు ఆ పదవిని వదలిపోయిరి తరువాత ఉర్దూరానందున వీరికి కేసులు ఆగిపోయెను జీతము నిలిచి పోయెను క్రమముగా వీరి న్యాయవాద వృత్తికి నూరేండ్లు నిండెను

**రాజకీయ జీవితము** ప్రతాపరెడ్డిగారు హైదరాబాదు చేరిన క్రొత్తలో ప్రజాసేవకై పాటుపడుచుండిన వారు శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులుగా రొక్కరే ఉండిరి తగిన సహకారులకై అన్వేషించుచున్న పంతులుగారు గుట్టుగా పనిచేయు అలవాటుగల రెడ్డిగారిని బయటికి లాగిరి ప్రచారము పేరుతో కరీంనగరము జిల్లా అంతట త్రిప్పి రెడ్డిగారిచే ఉపన్యాసము లిప్పించిరి వీరి వక్తృత్వమును గూర్చి కొంత చెప్పవలసి యున్నది

విద్యార్థి దశలో రెడ్డిగారికి చాలా సభాకంపము ఉండినది రెడ్డిహాస్టలులో పనిచేసినపుడు విద్యార్థుల యెదుట ఉపన్యాసము లిచ్చు అలవాటు చేసికొనిరి కృష్ణదేవరాయాంధ్రభాషా నిలయమున వీరు "నిజాం రాష్ట్రాంధ్రులు" అను విషయమును గూర్చి గంభీరోపన్యాస మొసగి శ్రోతలచే మెప్పు నొందిరి ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావు పంతులుగారి ప్రోత్సాహము విశేషముగా ఉన్నందున వారివెంట అనేక సభలలో ఉపన్యసించి రాటుదేలిరి మొదలు మొదలు రెడ్డిగారు సలక్షణమైన గ్రాంథికభాషలోనే ఎంతసేపైనను ప్రసంగించు చుండెడివారు రానురాను ప్రజలలో సన్నిహితత్వ మేర్పడిన తరువాత ఉపన్యాసములకు గ్రాంథిక శైలి పనికిరాదని గ్రహించిరి తరువాత వారు వ్యావహారిక భాషలోనే ఉపన్యసించుచు పండిత పామరులను రంజింపజేయు చుండిరి ఎంతగొప్ప సభయైనను, ఏ విషయమును గూర్చియైనను జంకుగొంకులు లేక అనర్గళముగా ప్రసంగించి శ్రోతల మెప్పునొందుచు మహావక్తలై ప్రసిద్ధిగాంచిరి వారికి గల విషయ పరిజ్ఞాన మపారము ఎంతటివారినైన ఆశ్చర్యచకితులను చేయజాలిన పాండిత్యము వారి ప్రసంగములలో వ్యక్తమగుచుండెడిది మొదలే సిద్ధమై సభలకు వెళ్ళు అలవాటు వీరికి లేకుండెను నిరంతర గ్రంథ పరిశీలనము, వీరికి అలవుగా ఉదాత్త ప్రసంగము చేయు శక్తిని ప్రసాదించినది తెలంగాణమునసే కాక అఖిలాంధ్రము నందలి ప్రసిద్ధవక్తలలో ప్రతాపరెడ్డిగా రొక్కరని చెప్పుట అతిశయోక్తి కాదు

ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావుగారు "నిజాం రాష్ట్రాంధ్ర మహాసభ"ను మొట్టమొదట జోగిపేటలో ప్రారంభించినపుడు (1927) ఆ ప్రథమ మహాసభకు ప్రతాపరెడ్డిగారే అధ్యక్షులుగా వరింపబడిరి తరువాత ఆ ఆంధ్ర మహాసభకు 3 ఏండ్లు కార్యదర్శిగా పనిచేసిరి మరల శ్రీ మందుముల రామచంద్రరావుగారితో కలిసి 2-3 ఏండ్లు కార్యదర్శి బాధ్యతలు నిర్వహించిరి నిజాంరాష్ట్రమున జరిగిన ఆంధ్ర మహాసభలలోను, జిల్లా రాజకీయ సభలలోను, గ్రంథాలయ సభలలోను రెడ్డిగారు పాల్గొని ఉర్దూ వ్యామోహములో మునిగి తేలుచున్న దేశీయులను మాతృభాషాభిమానమువైపు మరల్చుటకు తీవ్ర కృషిచేసిరి ఆంధ్ర మహాసభా వేదికలపై తెలుగు సరిగా రాని నాయకులు ఉర్దూలో ప్రసంగించుట సహింపలేక రెడ్డిగారు అభివృద్ధి పక్షమును లేవదీసిరి అభిప్రాయ భేదములతో చివరకు వీరు ఆంధ్ర మహాసభను వదలుకొనిరి

రెండేళ్ళు ఆంధ్ర జనసంఘాధ్యక్షులుగ, రెండేండ్లు పింగిలి జనార్దనరెడ్డి స్మారకనిధి కార్యదర్శిగ పనిచేసిరి జాతీయ భావపూరితులైన రెడ్డిగారు తమ పత్రికలో ప్రభుత్వ విధానములను నిర్భయముగ విమర్శించుచు తెలంగాణా ప్రజలకు రాజకీయ చైతన్యము కలిగించు చుండిరి వారి నిరాడంబర జాతీయ వస్త్రధారణము, నిర్భయ భాషణము ప్రజలపై చక్కని ప్రభావ ముద్రను వేసెను

1938లో హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ పక్షమున సత్యాగ్రహము ప్రారంభమయ్యెను వారి మిత్రు లెంత ప్రయత్నించనను రెడ్డిగారు ఉద్రేకము నొందక రాజకీయములకు దూరముగ నుండిరి వారి ఇంటిలో అనారోగ్యమువలన, వారికి సత్యాగ్రహముపై సదభిప్రాయము లేనందువలన ఆ ఉద్యమముతో సంబంధము పెట్టుకొనలేదు

1947వ సంవత్సరమున గోలకొండ పత్రిక యాజమాన్యము మారెను అది దినపత్రికగా వెలువడసాగెను

పోలీసుచర్య తరువాత హైదరాబాదు రాజకీయములలో

మార్పు వచ్చెను. వీరి సహచరులగు కొందరు పెద్దమనుష్యుల ప్రోత్సాహముచే రెడ్డిగారు స్టేట్ కాంగ్రెస్ సభ్యులుగా చేరిరి 1951లో 'ప్రజావాణి' అను పత్రికను ప్రారంభించిరి కాని వీరి స్వతంత్రాభిప్రాయములను సహింపని సాహుకారులు సహాయ నిరాకరణము చేసినందున ఆ పత్రికకు పురిటిలోనే సంధి కొట్టెను వనపర్తి నియోజక వర్గము నుండి కాంగ్రెసు అభ్యర్థిగా శాసనసభకు పోటీచేసి గెలుపొందిరి వీరికి మొదటినుండియు ముఠాలు కట్టుట, కుట్రలు చేయుట, కల్లబొల్లి మాటలాడుట చేతకానందున ఎంత ప్రతిభావంతులై యుండినను, ఎంత ప్రజాసేవ చేసియుండినను కాంగ్రెసులో రాణింపలేక పోయిరి ఆప్తమిత్రులు ఉన్నత స్థానముల నాక్రమించి యుండినప్పటికిని అన్నివిధముల అర్హులైన రెడ్డిగారు ఏ పదవిని పొందలేక పోయిరి

భాషాసేవ రెడ్డిగారికి ఉన్నత పాఠశాలా విద్యార్థి దశనుండియే సంస్కృతము అభిమాన భాషయై యుండెను వారికి 6వ ఫారము చదువునప్పటినుండియే "నేను తెలుగులో కవి కావలెను శాశ్వతకీర్తి సంపాదింపవలెను" అను కోరిక దైవికముగ ఉదయించెను ఆ వెంటనే చిలకమర్తి వారి నవలలు, వీరేశలింగముగారి కవుల చరిత్ర, చేమకూర వాని సారంగధర కావ్యమును తెప్పించి ఘట్టముగా చదివిరి తెలుగు ప్రబంధములు, వ్యాకరణము, ఛందస్సు స్వయముగ చదువుకొని తమకు తోచినట్లు కవిత్వము వ్రాయ మొదలు పెట్టిరి ఈవిధముగా స్వయంకృషితో వీరు తెలుగు పాండిత్యము సంపాదించి సుప్రసిద్ధ రచయితగా పేరు గాంచిరి

ప్రతాపరెడ్డిగారు మూడేండ్లు ఏ సభలలో సార్వజనిక తమ కార్యక్రమము లన్నిటిని సంక్షేపించికొని కూర్మవృత్తి నవలంబించి అజ్ఞాతముగా ఉండిరి 1942 లో పెదపాలెము నందు ఆంధ్రదేశ గ్రంథాలయ సభను జరుపువారు ఆ సభకు బలవంతపెట్టి అధ్యక్షులుగా గొనిపోయిరి నిజామాంధ్రుడు బ్రిటిష్ ఆంధ్ర ప్రాంతములలో అధ్యక్షత వహించుట రెడ్డిగారితోనే మొదలయ్యెను 1948 లో ఖమ్మం గ్రంథాలయ మహాసభలకు అధ్యక్షత వహించిరి 25వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభను అలంపూరు తాలూకాలోని క్యాతూరులో జరుపుటకు చాల కృషిచేసిరి ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకు చాలకాలము ఉపాధ్యక్షులుగా నుండిరి 1944లో వరంగల్లులో జరిగిన ఆంధ్ర సారస్వత పరిషత్తు మహాసభలకు అధ్యక్షత వహించిరి ఈ పరిషత్తు ప్రారంభకులలో నొకరై పరిషత్తు అభివృద్ధికి యథాశక్తి సేవచేసిరి

హైదరాబాదులో చక్కని రచయితలు లేని కొరతను తీర్చవలెనని వీరు 1941లో పలువురు విద్యావంతులతో "విజ్ఞానవర్ధనీ పరిషత్తు"ను స్థాపించిరి మొదటి రెండు సంవత్సరాలు ఆసంస్థకు కార్యదర్శిగాను, తరువాత అధ్యక్షుడుగాను ఈ పరిషత్తుకు సేవ చేసిరి ప్రతివారము పరిషత్తు సభ్యులొకచోట సమావేశమై తమ అభిరుచి ననుసరించి వ్యాసములు వ్రాసి చదువు చుండిరి ఆసంస్థ కొన్ని ఉత్తమ గ్రంథములను ప్రకటించెను

హైదరాబాదు నగరములో ఆంధ్ర బాలురకు ఉన్నత పాఠశాల ప్రత్యేకముగా లేని లోపము రెడ్డిగారికి బాధ కలిగించు చుండెను నగరములోని కర్నాటకులు, మహారాష్ట్రులు ప్రత్యేకముగ తమ బాలురకు పాఠశాలలను నిర్వహించు చుండిరి కాని తెలుగువారికే తెలుగు పాఠశాల లేకుండెను రెడ్డిగారి కృషి ఫలితముగా శ్రీ ఆర్ దామోదర రెడ్డిగారి సహకారముతో 1944వ సంవత్సరము జూన్ నెలలో "ఆంధ్ర విద్యాలయము" మాధ్యమిక పాఠశాలగా ప్రారంభింపబడెను ఆ పాఠశాలా సంఘమునకు వీరు చాల కాలము కార్యదర్శిగా సేవచేసిరి

రచనలు ప్రతాపరెడ్డిగారు సంస్కృతాంధ్ర ఆంగ్ల భాషలతోపాటు ఉర్దూ, ఫారసీ భాషలను గూడ అభ్యసించిరి గోలకొండ పత్రిక ద్వారా అనేక సాహిత్య ప్రక్రియలను సాధించి ఆయా రచనలలో సిద్ధహస్తులైరి గోలకొండ పత్రికలో సుమారు 900 వ్యాసములు, వ్యాఖ్యలు వివిధ నామములతో తమాషా ముచ్చట్లు విమర్శనలు రచించినారు ఇతర పత్రికలలో విశేషముగా వాఙ్మయమునకు సంబంధించిన 100 వ్యాసములు వ్రాసియున్నారు వివిధ విషయములపై వారనేక గ్రంథములను రచించిరి

(1) రెడ్డిగారి మొట్టమొదటి రచన 1915లో ప్రారంభమైనది 'బూత్బీ' (Boothby) "In Freedom's cause" అను ఆంగ్ల నవలకు అనువాదము దీని వ్రాతప్రతిని కర్నూలులోని వీరి ఇంటి అల్మెరాలో ఉంచి హైదరాబాదుకు వీరు చదువునకు పోయినపుడు ఇంటిలోని విద్యార్థులు ఆ వ్రాతపుస్తకమును మిఠాయి అంగడివాని కిచ్చి ఒక లడ్డు తెచ్చికొని తినిరట !

(2) రెండవ రచన "శుద్ధాంత కాంత", (1917)

"Romance of a Zenana" అను ఆంగ్ల గ్రంథము ఆధారము చేసికొని రచించిన నవల ఇప్పటికిని అముద్రితము

తరువాత 'కృష్ణాపత్రిక'లో 1918-1919 సంవత్సరములలో వీరి పద్యములు కొన్ని ప్రకటింపబడినవి

మద్రాసులో వీరు విద్యాభ్యాసము చేయు కాలమున కర్నూలులో వీరు వ్రాసిఉంచిన "చంపకీభ్రమరము", "హరిశర్మోపాఖ్యానము" అను రెండు లఘుకావ్యముల వ్రాతప్రతుల నెవరో హరించిరి

(3) మద్రాసులోని ఒక నాటకసభవారి బహుమతి పోటీకై 1921లో "ఉచ్ఛల విషాదము" అను నాటకము వ్రాసిరి బహుమతి రాలేదు గోలకొండ ప్రెస్సులో ముద్రింపబడెను

(4) 1924లో 'తుకారాం' నాటకమును 3 అంకములుగా రచించిరి దానిని సికిందరాబాదులోని 'జగదీశ నాట్యమండలి' వారి కోరికపై అయిదు అంకములుగా పెంచిరి అనేక ప్రదర్శనలు పొంది ఆ నాటకము ప్రకటింపబడెను

( 5) గ్రామజనదర్పణము (ముద్రితము)
( 6) పూనా వ్యవసాయ ప్రదర్శనము ,,
( 7) కర్నూలురాజుల వంశావళి ,,
( 8) హిందువుల పండుగలు ,,
( 9) నిజాం రాష్ట్రపరిపాలనము ,,
(10) గ్రంథాలయములు ,,
(11) మద్యపానము ,,
(12) సంఘోద్ధరణము ,,
(13) హైందవ ధర్మవీరులు ,,
(14) ప్రతాపరెడ్డి కథలు ,,
(15) ప్రాథమిక స్వత్వములు ,,
(16) రాజాబహద్దర్ వెంకటరామారెడ్డి చరిత్ర ,,
(17) మొగలాయి కథలు ,,
(18) రామాయణ విశేషములు ,,
(19) జాగీర్లు
(20) యువజన విజ్ఞానము
(21) ఆంధ్రుల సాంఘిక చరిత్ర

సెంట్రల్ సాహిత్య అకాడమీవారు ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రకటించిన వీరి "ఆంధ్రుల సాంఘిక చరిత్ర" కు 5000 రూపాయలు బహుమతి నిచ్చిరి

ఆంధ్రుల సాంఘిక చరిత్రము 454 పుటలుగల ఉద్గ్రంథము ఇందు ఆంధ్రుల 850 సంవత్సరముల సాంఘిక చరిత్ర సంగ్రహముగానే తెలిపినారు ఏతద్గ్రంథాంతమున పొందుపరచిన ఈక్రింది పద్యముచే శ్రీ ప్రతాపరెడ్డిగారి **కవితా** పాటవమును దిఙ్మాత్రదర్శనముగా జూపుచున్నాము

సంపూర్ణ భావనాంభ స్తరంగోద్వేగ
గౌతమీగంభీరగమనమునకు
ఆలంపురీనంద నారామవిభ్రాజి
మల్లోలఫలరాజిమధురరుచికి
ఆంధ్రీకుమారీసమాయు క్తపరిపూత
తుంగాపయస్సుమాధుర్యమునకు
ఖండశర్కర, జాజి, ఖర్జూర, గోక్షీర
ద్రాక్షాదియుతరామరసమునకును
అమృతనిష్యందివల్లకీహ్లాదమునకు
రాగిణీదివ్యసమ్మోహరాగమునకు
తేనెతేటల నవకంపు సోనలకును
సాటి యగును మా తెనుగుభాషామతల్లి

**చివరికాలము** ప్రతాపరెడ్డిగారికి ప్రజాహిత జీవితముపై రానురాను విసుగు కలుగ నారంభించెను అన్ని కార్యక్రమములు విరమించికొని శేషజీవితమును హాయిగా తమ వ్యవసాయ గ్రామమైన కంచుపాడులో గడుపదలచి అక్కడ తమ నివాసమునకు, పశువులకు, విడివిడిగా రెండు చక్కని ఇండ్లు కట్టించుకొనిరి ఈ కంచుపాడు అలంపూరు తాలూకాలోని మారామునగాల బస్సురోడ్డుమీద ఉన్న చిన్న పల్లె ఇది వారికి అన్నివిధముల తగియుండెను కాని ప్రతాపరెడ్డిగారు తమ ఇద్దరు తమ్ములతో భాగపరిష్కారము చేసికొన్నప్పుడు ఇటిక్యాలపాడు గ్రామము ఆస్తిని పెద్దతమ్ముడు, కంచుపాడు ఆస్తిని చిన్నతమ్ముడు కోరుకొనగా జ్యేష్ఠుడైన దోషమునకు 4 కొంపల 'చండూరు' గ్రామము ఆస్తి వీరి పాలబడెను కోరి కట్టించుకొన్న ఇంటిలో నివసించుటకు వీరు నోచుకొనలేదు

1946లో రెడ్డిగారు చాల జబ్బుపడిరి కలరాకు గురియైరి 'ఆంధ్ర విద్యాలయము' చందాలకై తిరుగుచు గోపాలపేట సంస్థానము రాణీ లలితాదేవిగారి గౌరవమునకు పాత్రులైరి ఆమె నిర్బంధముచేసి రెడ్డిగారిని గోపాలపేట సంస్థానమునకు "మోతెమద్" పదవిలో ఉండి సంస్థానాభివృద్ధి

చేయగోరిరి గత్యంతరము లేక 15 దినములు ఆ పదవిలో ఉండి సంస్థాన గ్రామములను పర్యటించి సంస్థానాభివృద్ధికి ఒక ప్రణాళికను వ్రాసి యిచ్చిరి ఈ పర్యటనచే మరల దీర్ఘ వ్యాధిపాలైరి

చివరి కాలమున కుటుంబ పరిస్థితుల వలనను, తరచుగా వచ్చు అనారోగ్యము వలనను వీరికి మనశ్శాంతి కరవయ్యెను సరళ స్వభావులైన రెడ్డిగారు 25-8-1953 తేదీన దివంగతులైరి

సురవరము ప్రతాపరెడ్డిగారు సుప్రసిద్ధులు నిద్రాణమై యుండిన తెలంగాణమును మేల్కొల్పిన వైతాళికులు చిరస్మరణీయులు దేశభక్తుడుగా, పత్రికా సంపాదకుడుగా, సంఘసేవకుడుగా, కవిగా, ఉత్తమ విమర్శకుడుగా పరిశోధకుడుగా, వక్తగా, బహుముఖ ప్రజ్ఞాశాలిగా విశిష్ట వ్యక్తిత్వముతో ఆయన అఖిలాంధ్ర లోకమునకు సుపరిచితుడు హైదరాబాదు నగరమునందు ఆయనకు సంబంధము లేని సంస్థగానీ, ఉద్యమముగాని లేదన్నచో అతిశయోక్తి అవంతయు లేదు జీవితమంతయు ప్రజాహిత కార్యములకే వినియోగించిన ధన్యజీవి సురవరము ప్రతాపరెడ్డి పండితుడు

గ రా శ

## ప్రతిష్ఠానపురము

దాదాపు రెండువేల సంవత్సరముల క్రిందట ఆంధ్రులగు శాతవాహన (శాలివాహన) రాజులకు రెండు రాజధానులుండెను కృష్ణాతీర మందలి ధాన్యకటకము రాజు నివసించెడి రాజధాని రెండవది గోదావరీ తీరస్థమగు ప్రతిష్ఠానపురము ఆంధ్రదేశము నేలిన రాజవంశములలో సాతవాహన వంశము మిక్కిలి పురాతనమైనది ప్రతిష్ఠాన పురమున యువరాజు నివసించు చుండెను ఆ ప్రతిష్ఠాన పురము 'పైఠన్' అను పేరుతో నేడు పిలువబడు చున్నది ఇది ఔరంగాబాదు (మహారాష్ట్ర) జిల్లాలో నున్నది ఈ పట్టణము యొక్క పుట్టుపూర్వము అంతగా తెలియవచ్చుట లేదు

స్థలపురాణమున ఈ విధముగా నున్నది సృష్టికర్త యగు బ్రహ్మ, తాను నివసించుటకు తగిన స్థలము కొరకు దేశమంతయు వెదకెనట చివరకు పవిత్ర గోదావరీ తీరస్థమగు నీ పవిత్ర ప్రదేశమును వాసయోగ్యముగా నిశ్చయించి నగర నిర్మాణము చేయించి దానికి 'పట్టణ'మని పేరు పెట్టెనట తరువాత వెలసిన నగరములు అంతకంటె పవిత్రములు, జనావాస యోగ్యములు నగుటచే బ్రహ్మ యది సహింపక తన 'పట్టణ'మునకు 'ప్రతిష్ఠాన'మని నూతన నామకరణమొనర్చెను నాటినుండి ఈ పట్టణము దేవేంద్రుని రాజధాని యగు 'అమరావతి'ని బోలి మిగిలిన పట్టణములను తిరస్కరించెడిదట ఇట్టి కథాంశములతో 'ప్రతిష్ఠాన మాహాత్మ్య' మను స్థలపురాణ మొకటి కలదు

ప్రాచీనపాలీ గ్రంథములలో ప్రతిష్ఠాన ప్రశంస గలదు నాటి బౌద్ధమతోపదేష్టల కిది స్థావరముగా నుండెను

ప్రతిష్ఠానపురము శాతవాహన చక్రవర్తులకు ఉపరాజధాని యైనప్పటినుండి చారిత్రకముగా కీర్తిప్రతిష్ఠలను, పెంపుసొంపులను సంతరించుకొన్నది సాతవాహనాంధ్ర చక్రవర్తులలో హాల శాతవాహనుడు మిక్కిలి ప్రసిద్ధుడు, పరాక్రమవంతుడు అతడు శక, యవన, పహ్లవుల దురాక్రమణలను, విజృంభణములను అణచి వారిని స్వపాదాక్రాంతులనుగా నొనర్చుకొనెను ప్రాకృత భాషలో హాలుడు మహా విద్వాంసుడు మహాకవి ప్రాకృత భాషయందతడనేక గాథలను రచించెను తనకు ప్రాకృత భాషయందు గల యభిమానాదరముల వలన ఆతడు ప్రాకృతమును రాజభాషగా నొనర్చెను ఆతని యాస్థాన మండపమున ప్రాకృత భాషాయోష అపూర్వ హావభావ రసాలంకార ధ్వనిరీతు లుట్టిపడ మధుర మంజుల లాస్యమొనర్చెడిది మహారాజు తన యాస్థానమున కరుదెంచిన ప్రాకృత పండితులతో సాహిత్యగోష్ఠి నెరపి వారిని నిరతము సత్కరించుటచే జను లతనిని విక్రమార్కుని యవతారముగా భావించు చుండిరి మరియు నతనిని 'కవివత్సలు'డనియు కీర్తించు చుండిరి హాలుని పట్టమహిషి వేదవల్లి ఈయమ సంస్కృతమున గొప్ప విదుషీమణి

హాలుని యాస్థానమున గుణాఢ్య, శర్వవర్మ, అమరార్య, బోదేశ, చులిబీచ, కుమారభట్ట, ముకుందసేన, శ్రీరాజ ప్రభృతులగు పెక్కురు విద్వత్కవులు నివసించు చుండిరి శర్వవర్మకడ సంస్కృతాభ్యాస మొనర్చి గుణాఢ్యునియెడ హాలు డనాదర మొనర్చెనని యొక యైతిహ్యము గలదు అప్పుడు గుణాఢ్యు డరణ్యమున పిశాచ జనులతో వసించు చుండెను పైశాచీ ప్రాకృతమున సప్త విద్యాధరుల చరిత్రమును బృహత్కథ యనుపేర ఏడు లక్షల గ్రంథమును రచించెను రాజాదరము లేకపోవుటచే దానిని అగ్నికాహుతి గావించెను అందు నరవాహనదత్తు డను

విద్యాధరుని కథ మాత్రము రాజు ప్రార్థనపై మిగిలి యున్నది అది కథాసరిత్సాగరముగా నిప్పటికి అన్ని భాషలలో అనువదింపబడి యున్నది బృహత్కథ శ్లేషార్థబంధముగా హారలీలతో ఈ క్రింది శ్లోకమున బోల్చబడినది

"సముద్దీపిత కందర్పా కృతగౌరీ సనాధనా
హారలీలేవ నో కస్య విస్మయాయ బృహత్కథా"

ప్రతిష్ఠానపురము గొప్ప వర్తక స్థానముగా నుండినట్లు ప్రాచీన చరిత్రకారు డగు టాలెమీ వ్రాతలవలన దెలియు చున్నది వస్త్రములు, పూసల పరిశ్రమ కీపట్టణము పెట్టినది పేరు నేటికిని పైఠన్, పట్టువస్త్రములకు, జరీ, జరివస్త్రములకు, కర్ర చెక్కడపు పరిశ్రమకును పెట్టినది పేరు

విద్యా, వాణిజ్య విషయములందే కాక ప్రతిష్ఠానము, నాగరకతలో, సభ్యతలో ఆదర్శప్రాయముగా నుండి వేరు పట్టణాలలోని జనులకు రూపురేఖలను దిద్దజాలి యుండెను ఆ కాలమున ఆంధ్ర ద్రవిడ కర్ణాట మళయాల స్త్రీలు రవికెలు ధరింప నెరుంగకుండిరట ఆంధ్ర కర్ణాటాంగనలు ప్రతిష్ఠానమునకు వచ్చిన తరువాత నిగూఢ పయోధరలగు ఘూర్జర మహారాష్ట్రి స్త్రీలను జూచి నాగరికత కలవడి, రవికెలను, పైటలను ఉంచుకొనసాగిరి 'ప్రతిష్ఠానము' 'పైఠన్' అయినది పయిట, పైటలు అను పదములు పైఠన్ నుండి పుట్టినవే ప్రతిష్ఠానమున అలవడినట్టిది గావున కుచాచ్ఛాదనమునకు తన్నగర నామమే పైటగా వ్యవహారమునకు వచ్చినది రవికెలకును పైఠిణీ రవికెలనియే పేరు ప్రతిష్ఠానపురపు గాలిసోకని మళయాళ స్త్రీలు ఇప్పటికిని పైటలు, రవికెలు లేకుండనే యున్నారు వస్త్రాలంకార విషయమున స్త్రీలకే కాక పురుషులకును ప్రతిష్ఠాన మొజ్జబంతిగా నుండెడిది సాతవాహనాంధ్ర సామ్రాజ్య పతనానంతరము ప్రతిష్ఠానపురముతో ఆంధ్రదేశమునకు సంబంధము విచ్ఛిన్నమై పోయినది కాని పైటలు, పైఠిణీ రవికెలు, పైఠిణీ పాగాలును మాత్ర మాంధ్రదేశమున నిలిచి పోయినవి ప్రతిష్ఠానముతో రాచరిక సంబంధ మున్నప్పుడే ఆంధ్ర స్త్రీలకు పైటల యలవాటు, నాగరికత యేర్పడి యుండెనని యూహింప వచ్చును

ఆంధ్ర సాతకర్ణుల యనంతరము క్రీస్తుశకము నాల్గవ శతాబ్దినుండి ఈ పుర మెవ్వరి యాధిపత్యమున నుండెనో తెలియవచ్చుట లేదు దక్షిణాపథమున అప్పుడు కదంబుల, గాంగుల, పల్లవుల పరిపాలన యున్నట్లు తెలియు చున్నది తరువాత ఇది చాళుక్య రాజన్యుల వశమయ్యెను పంద్రెండవ శతాబ్ది మధ్యభాగమున కాలచుర్యులును, తరువాత హోయిసలులును, పిమ్మట యాదవులును దీనిని పరిపాలించిరి యాదవ వంశమున చివరివాడగు హరపాలుని యనంతరము మహమ్మదీయులు క్రీ శ 1318 లో దీనికి రాజ్యాధికారులైరి మహమ్మదీయ సైన్యమప్పుడు ప్రతిష్ఠానమున నుండెను పదునాల్గవ శతాబ్దిలో ఈ పట్టణము అహ్మద్‌నగర్ నిజాంషాహీల వశమైనది దీని కప్పటి పేరు 'మంగీపైఠన్' తరువాత నిది బీజాపురు సులతానుల స్వాధీనమయ్యెను 1594లో అక్బరు కుమారుడగు దానియాల్ రాజకుమారునకు బీజాపుర రాజపుత్రికిని పైఠన్ పట్టణముననే వివాహము జరిగెను తరువాత కొంతకాలము వరకు దీని చరిత్ర తెలియ వచ్చుటలేదు 1720లో హైదరాబాద్ నిజాంనవాబు పాలనలోకి వచ్చెను పదునెన్మిదవ శతాబ్ది అంతమున మహదాజీ సింధియాకును, రాజపుత్ర సైన్యములకును 'పైఠ'నునందే ఘోర యుద్ధము జరిగెను ఆ యుద్ధమున మహారాష్ట్రులు గెలిచిరి

### ప్రతిష్ఠానము—మహానుభావ మతము

నాడు ప్రతిష్ఠానమున అన్ని వర్ణాలవారును నివసించు చుండిరి శాలివాహనుడను రాజు బ్రాహ్మణునికి కుంభకార స్త్రీయందు జనించినవాడని ఐతిహ్యము గలదు ఇందెంతవరకు సత్యమున్నదో లేదో కాని యా కాలమున శక్తిమంతమగు సత్సంతానము కొరకు అనులోమ వివాహములు జరుగుచుండవచ్చును తరువాత చాల కాలమునకు బయలుదేరిన మహానుభావ సంప్రదాయి మీ భావమునకు దోహదకారి యగు చున్నది

ఈ సంప్రదాయ మతకర్త కృష్ణభట్టను బ్రాహ్మణుడు ఇతడు ప్రతిష్ఠానపుర నివాసి రాజునకు పరమ గురువు ఇతడు బహుదేవతల ఆరాధనను ఖండించి వేదచోదితమగు ఏకేశ్వరోపాసనను పునఃస్థాపించెను శ్రీకృష్ణ పరతత్త్వ మొక్కటే యుపాస్య మని సిద్ధాంతీకరించెను కులమత సంబంధమైన కట్టుబాట్లను త్రెంచివేసి సర్వసంగ పరిత్యాగులై భిక్షావృత్తితో జీవించునట్లు శిష్యవర్గముల నేర్పరిచెను

కృష్ణభట్టు మాతంగకన్యను వివాహ మాడెను ఆతడామెయం దైదుగురు కుమారులను కనెను ఈ విపరీత ఆచరణమునకు నాటి బ్రాహ్మణ బృందము కినిసి, యాతనిని

నగరము వెడల నడచిరి కృష్ణభట్టు జంకుగొంకులు లేని వాడును, ధైర్యస్థైర్యములు కలవా డగుటచేతను పత్నీ పుత్రులను వీడక పై మహానుభావ సంప్రదాయమును స్థాపించి, తన యైదుగురు కుమారులను ఆ మతప్రవర్తకులనుగా జేసెను ఆ కుమారులు దేశాటనము చేసి నూతన సంప్రదాయమును బోధించి, యెందరినో జనుల నా మతమున చేర్చిరి ఈ సంప్రదాయమున గురుస్థానమున నున్నవారు ముండిత శిరస్కులై దండ కమండలములను బూని, నల్లని వస్త్రములను ధరింపవలెను శాకమే వారి యాహారము ఉదకమే వారి పానీయము ఈ మతానుయాయులు దక్కనునందును, బీరారునందును ఎక్కువగా నున్నారు వీరి జాతరలు పెక్కుచోట్ల జరుగుచుండెను ఈ జాతరలతో ఈ మతానుయాయులు పెక్కురు గుమిగూడుచుండిరి అందుచే ప్రతిష్ఠానము, మహానుభావ మతమునకు జన్మస్థానమని చెప్పవచ్చును

ప్రతిష్ఠానము — చారిత్రక వస్తుసామగ్రి

పురాతత్త్వ శాఖవారు 1937 లో ప్రతిష్ఠానపురమున గోదావరి కుత్తరతీరమున నాలుగుచోట్ల త్రవ్వ పనిని ప్రారంభించిరి ప్రాయోగికముగా నొకచోట త్రవ్వి, ఆదే గోతిని విశాలపరచిరి ఇట్లు త్రవ్వగా నొక్కొక్క పొరలో లభించిన వస్తువులు వివిధ యుగములకు చెందినవిగా గోచరించెను

నాలుగు స్థలములలోను రెండు స్థలములను త్రవ్వి తీసిన వస్తువులు మిక్కిలి సంతృప్తికరముగా నున్నవి 18 అడుగుల లోతువరకు ఇచట త్రవ్విరి కొన్నిచోట్ల నొకదాని క్రింద నొకటిగా నున్న 6 పొరలు 6 యుగములనాటి నాగరికతను సూచించుచున్నవి పై పొరలో గల భవనములు, రాయి, సున్నములోను, ఇటుక, అడుసుతోను కట్టినవి ఇవి భూమి మట్టమునకు 4 అడుగుల లోతులో కన్పించినవి ఇందులో బ్రిటిషు వారి వెండి నాణెములు, బంగారు నగలు, రాగి పాత్రలు, మట్టి పాత్రలు లభించినవి ఇవి యన్నియు ఇటీవలివి దాని క్రిందిపొర 18, 19 శతాబ్దులకు చెందినది దీనిలో మొదటి ఆసఫ్జాహీ నాణెములు లభించినవి మూడవ పొరలో మొగల్ పాదుషాల కాలమునాటి వెండి, రాగి నాణెములు దొరకినవి నాలుగవ పొరలోని గోడలు, పునాదులు, ఐదవ పొరయందలి గోడలతోను, పునాదులతోను కలిసిపోయి యున్నవి అంతేకాక దొరికిన వస్తువులు, ఏటవాలుగను కదలిపోయినవిగను ఉన్నవి ఒకప్పుడు వరదచే ఇండ్లన్నియు పడిపోయి పట్టణము ధ్వంసమై యుండవచ్చునని చెప్పవచ్చును ఈ పట్టణములో బహమనీ నాణెములు, తుగ్లకు నాణెములు గూడ లభించినవి అందుచే ఈ వరద 14వ శతాబ్దిలో కాని, 15వ శతాబ్ది ప్రారంభమునగాని సంభవించి యుండవచ్చునని యూహింప వచ్చును

5 వ పొరలో ప్రాచీనాంధ్ర నాణెములు లభించినవి 6 వ పొరలో ఇటుకలతో గట్టబడిన రెండు భవనముల వరుస కనిపించెను ఇందు సున్నమేమాత్రము వాడబడలేదు అడుసు మాత్రమే ఉపయోగింపబడినది భవననిర్మాణములు, సున్నము వాడుకలోనికి రాకపూర్వము కట్టబడినవని చెప్పవచ్చును ఇందలి వాస్తుశిల్ప మద్భుతమైనది

ఇతరవస్తువులు ఆవవేసిన మట్టి, ముత్యపు చిప్పలు, ఏనుగు దంతపు వస్తువులు, రాతివస్తువులు, ఇనుప వస్తువులు, రాగి, ఇత్తడి, కంచువస్తువులు, వెండి, బంగారము, గాజు మున్నగు పెక్కు వస్తువు లిందు లభించినవి ప్రాచీనతను బట్టి మట్టిబొమ్మలను పేర్కొనవచ్చును ఇవి మిక్కిలి ప్రాచీనమైనవనుటకు సాక్ష్యము, మట్టిబొమ్మల మెడలలో హారములుగా మస్కియందును, మొహంజదారో యందును గానబడు చున్నవి బంగారము కరిగించు మట్టిమూసలును, రంగు కుండలుగూడ లభించినవి ప్రాచీన ప్రతిష్ఠానమున ముత్యపు చిప్పలు, పగడాలు కూడ లభించినవి ఈపట్టణమున ఈపరిశ్రమ మిక్కిలి ప్రసిద్ధికెక్కినది గాజులు, ఉంగరములు, పూసలు, ఇతరములగు అలంకార వస్తువులు దొరకినవి ఏనుగు దంతపు వస్తువులు వీటితరువాత పేర్కొనదగినవి అవి యనేక రకములవి గలవు ఇందు మంచిపనితనము కన్పించుచున్నది దంతపుగాజులు, చదరంగపు పాళీలు, పాచికలు, కర్ణాలంకారములు, సూదులు, కదుళ్ళు మున్నగు వస్తువులు

రాతి వస్తువులు రాతి యుగమునకు సంబంధించిన వస్తువు లిచట లభింపక పోయినను వివిధములగు రాళ్ళతో చేయబడిన పూస లిచటి సంస్కృతి సభ్యతల ప్రాచీనతను చాటుచున్నవి నల్లరాయి, రక్తమణి, వైదూర్యము, స్ఫటికశిల, శ్వేత రక్తశిల, మున్నగు ననేకవిధములగు రాళ్ళ పూసల పరిశ్రమలో వాడబడినట్లు స్పష్టమగుచున్నది

ఈ పూసలు కొన్ని గుండ్రముగను, కొన్ని బల్లపరపుగను, కొన్ని వర్తుల స్తంభాకారముగను ఉన్నవి కొన్ని

పలకలు పలకలుగా ఉన్నవి మొంటివి దక్కను నాగరికత కును, సింధులోయ నాగరికతకును సంబంధించినవిగా నున్నవి రెండవవి ప్రాచీన గ్రీకు, రోమను, ఈజిప్టియను గ్రంథకర్తలచే ప్రశంసింపబడిన పైరాను పూస పరిశ్రమను గూర్చిన వ్రాతలను ధ్రువపరచు చున్నవి

ఆంధ్ర నాణెములు ఇక్కడ లభించిన రాగివస్తువులలో ముఖ్యమైనవి ఆరవపొరలోని ఆంధ్రనాణెములు పది చదరపు రాగినాణెము లొకచోట లభించినవి వీటిపై నొకవైపున బోధివృక్ష మచ్చొత్తింప బడినది కొన్ని నాణెములపై స్వస్తిక చిహ్నము గలదు దాని యాకారము దాదాపు శాసనము పోలి యున్నది తక్షశిలలోని యాంధ్ర నాణెముల నివి పోలి యున్నవి ఇట్టి వింకను వేరువేరు చోట్ల పెక్కులు దొరకినవి ఇవి యాంధ్రులనాణెములేయని పరిశోధకుల యభిప్రాయము ఇవి కాక కొన్ని చిన్నచిన్న గుండ్రని రంధ్రము గల నాణెములు లభించినవి ఈ నాణెము లీస్థలము యొక్క ప్రాచీనతను మరి మూడు నాలుగు శతాబ్దులు వెనుకకు నెట్టినవి ఇవి కాక తుగ్లక్, బహమనీ, మొగల్, ఆదిల్‌షాహీ, నిజాంషాహీ, బరీద్‌షాహీ రాజుల నాణెములును లభించినవి

దీనిని బట్టి ప్రతిష్ఠానపురము వివిధ చక్రవర్తుల, రాజన్యుల పరిపాలనలో పెంపు సొంపుల నందియు, వైభవ ప్రాభవములను పోగొట్టుకొని నేడు నామమాత్రావశిష్టమై చరిత్రకారులకును, పరిశోధకులకును పనిని కల్పించు చున్నది

పె లిం శా

## ప్రత్యయాత్మకత్వవాదము (Idealism)

ప్రత్యయాత్మకత్వ వాదము వేద్యత్వ విశిష్ట మనోనిరపేక్షముగా, బాహ్య విషయములు సత్తకలవను విషయమును నిరాకరించును బాహ్యవిషయములు లేనివే. లేక, అవి మనమున కధీనములై యున్నవి మనస్సే ప్రధానముగ వాస్తవికత కలది ప్రపంచమును గూర్చిన ఇట్టి మతము, భౌతిక వాదమునకు విరుద్ధమైనది దానికి అధ్యాత్మవాద మని పేరు అనగా ఆత్మ లేక మనస్సు ఈ ప్రపంచమున కధిష్ఠానము అని అర్థము భౌతిక ప్రపంచము మనస్సుయొక్క ఆభాసము లేక దానియొక్క బహిర్వ్యక్తీకరణము అది ప్రపంచమునకు ఆధ్యాత్మిక ప్రతీతి నొసగును భౌతికవాదము ప్రపంచమునకు కృత్రిమ వివరణ మొసగి, దానిని ద్రవ్యముగాను, గతిగాను, శక్తిగాను వ్యాఖ్యానించును భౌతిక ద్రవ్యము సత్య మనియు, మనస్సు యాదృచ్ఛికము లేక పరిణామక్రమమునం దొక సహగామి అనియు, భౌతిక వాదము వచించును ఆ వాదము ననుసరించి మనస్సు అత్యంత విధానాత్మక మయిన బుద్ధియొక్క గౌణఫల మగుచున్నది

ఆ వాదవిషయమున గల ప్రాతికూల్యము ఇటీవల కొంత సడలినది ఇటీవల కావింప బడిన భౌతిక శాస్త్రాధ్యయనములు కారణముగా మన కిదివరకు భౌతిక ద్రవ్యము విషయమున గల భావములు మారినవి నేడు మనము భౌతిక ద్రవ్యమును విద్యుద్భరితముగాను, భౌతికపదార్థ పూర్వభావియగు శుద్ధశక్తిగాను గ్రహించు చున్నాము నేడు మనస్సు కేవలము ఆలోచనాత్మకముగా పరిగణింపబడుట లేదు అది నేడు అత్యంత సంశ్లిష్టమయిన విషయముగా పరిణమించినది సంభవమును, ఆవేగవిషయకమును నగు ఈహాయు, అనుకూలమైన ఆచరణయు వరణాత్మకమైన గ్రహణమును, చైతన్యమును, వ్యక్తిత్వమును, ఆ మనస్సు నందు చేరియున్నవి ప్రపంచమున బహుమంది తత్త్వజ్ఞులు ప్రత్యయాత్మక వాదులై యున్నారు అయితే, వారు నానావిధములయిన ప్రత్యయాత్మక వాదములకు ప్రతినిధులుగా నున్నారు ఆ వాదములలో కొన్నింటికి జ్ఞానమీమాంసయు, మరి కొన్నింటికి ఆధ్యాత్మిక మీమాంసలును ఆధారభిత్తికలుగా నున్నవి

యూరపియను తత్త్వశాస్త్ర విషయమున అత్యంత ప్రాచీన మయిన ప్రత్యయాత్మకత్వ వాదియైనవాడు ప్లేటో పండితుడు ప్రపంచములో గల సార్వకాలిక తత్త్వజ్ఞులలో ప్లేటో మహాశయు డొకడు విశ్వమున మనస్సు తప్ప మరియొకటి లేదు అనునట్టి అతివాదుల కక్ష్యకు చెందిన సర్వాత్మకత్వవాది ప్లేటో పండితుడు కాడు "దృగ్గోచరమగు వైయక్తిక విషయ ప్రపంచము విశ్వాతీత మనః కల్పనా ప్రపంచము యొక్క ఆభాసమును, "బహిస్స్పందనమును నై యున్నది" భావనలు శాశ్వత సారములును, రూపములును, ప్రకారములును, ప్రతిబింబములు నై యున్నవి అవి ప్రతిరూపకములుగా, లక్ష్యములుగా, ఇంద్రియార్థ ప్రమాణములుగా ఉపయోగించును అవి హేతువిదితములు 'భావనలు' కేవలము మానసిక దశలు అనుట ప్లేటో పండితుని

ఆశయము కాదు ఇంద్రియ గోచర మయిన విషయ ప్రపంచము అనుభవ వేద్యము ఆ ప్రపంచము అపరిణత మయిన భౌతిక ద్రవ్యముచే నిర్మితము దానిని ప్లేటో 'అసత్త' అని వ్యవహరించెను అట్లు వ్యవహరించుటచే అది (ప్రపంచము) లేనిదని అతని ఆశయము కాదు అయితే, అది అవ్యవస్థకును, అనర్థమునకును, అసంపూర్ణతకును మూలము వ్యక్తులు పుట్టుదురు, గిట్టుదురు భావనలు నిత్యములు అవి యథార్థ వస్తువులు. అవి మారునవి కావు అవి సార్వకాలికములు ప్లేటో పండితునికి భౌతిక విషయములపై ప్రీతి తక్కువ న్యాయ్యము, సౌందర్యము, సాంఘికాదర్శములు ఇత్యాది ఆధ్యాత్మిక విషయము లందు అతడు ఏకాగ్రబుద్ధి గలవాడు మనస్సు మాత్రమే 'సత్యము' అను నియమనిష్ఠ మయిన దాగ్నసిక ప్రత్యయాత్మకత్వ వాదముతో ప్లేటోకు సంబంధము లేదు అతని ప్రత్యయాత్మకత్వవాదము ఆదర్శములకొరకు, లేక, ఉదాత్తతర మూల్యముల (పురుషార్థముల) కొరకై కావింపబడిన యొక విధమగు నైతిక యత్నమై యుండెను

బర్క్లే ప్రతిపాదించిన ప్రత్యయాత్మకత్వ వాదము లేక విషయనిష్ఠమయిన ప్రత్యయాత్మకత్వ వాదము 18వ శతాబ్దికి చెందిన బర్క్లే అను ఐరిషు ధర్మాధ్యక్షుడు నవీనమయిన యొక ప్రత్యయాత్మకత్వ వాదమును స్థాపించెను భౌతిక వాదముయొక్క ఖండనము ఫలముగా ఆ వాదము తల యెత్తినది భౌతికమైన జడపదార్థ మొకటి కలదు దానికి స్వతంత్రసత్త కలదు అనువాదమును బర్క్లే నిరాకరించెను మనము, భౌతిక ద్రవ్యములని వ్యవహరించు పదార్థములు అనుభవైక విషయములు అనుభవ మనగా ప్రత్యక్షోపలబ్ధి భౌతిక పదార్థము గుణముల సముదాయమే భౌతిక ద్రవ్య గుణము లన్నియు విషయినిష్ఠదశలు లేక, మనఃకల్పనలు ఇందులకు కారణమిది మనము చూచు ప్రతి వస్తువు మనఃకల్పితమే ఏ వస్తు వయినను సత్తాక మను నపుడు, అది ప్రత్యక్షోలబ్ధి కలదనియే మన ఆశయము అది సత్తకలదే-అయితే, దానిని దర్శించు మనస్సున కధీనముగాని (స్వతంత్ర) సత్త దానికి లేదు కావున ఈ ప్రపంచము మనఃకల్పితము ఏకాధికరణకములైన వర్ణము, రుచి వాసన, వేడిమి, శైత్యము (అనుగుణములు) భిన్నకాలములలో, భిన్నభిన్న వ్యక్తిగతములుగాను, ఒకప్పుడు ఏక వ్యక్తిగతములుగాను మారు చుండును ఒక వస్తువు ఒకనికి తియ్యగాను, మరియొకనికి చేదుగాను గోచరించును ఏది ఒకనికి రుచికరముగ నున్నదో, అదే మరియొకనికి అరుచికరముగ నుండుట కలదు కావున, పదార్థగుణములు యథార్థములు కావు అవి ఇంద్రియ గ్రాహ్యతాసంబంధులును, విషయినిష్ఠములును నైన వికారములై యున్నవి కన్ను లేనిచో వర్ణము నిరర్థకము, వినుటకు శ్రోత్రము లేనిచో, శబ్దమచింత్యము, రుచి చూచుటకు జిహ్వ లేనిచో, రుచి అనూహ్యము, ఈ గుణ సంబంధి సంవేదనలను తొలగింపుము కన్నులు వెల్తురును గాని, వర్ణములనుగాని చూడనిచో, శ్రోత్రము ధ్వనిని విననిచో, ఘ్రాణము గంధమును ఆఘ్రాణించనిచో, అన్ని వర్ణములు, అన్ని శబ్దములు, అన్ని రుచులు, అన్ని గంధములు అదృశ్యములై వాటి అస్తిత్వమును కోల్పోవును కావున ఈ గుణములు (భౌతిక) శరీరమునకు చెందినవి కావు కాని అవి, వాటిని చూచునట్టి లేక అనుభవించునట్టి మనస్సునకు సంబంధించినవై యున్నవి కావున అవి విషయియగు మనస్సునకు చెందిన దశావిశేషములు బర్క్లే ఇట్లు ఒక పదార్థముయొక్క సత్త అది బహిరింద్రియ గ్రహణ విషయ మగుటలోనే కలదు అనెను ఇట్లతడు సంగ్రహముగా ప్రత్యయాత్మకత్వ వాదమును లేక ప్రాతీతిక భావవాదమును సూత్రించెను

లైబ్‌నిట్‌యొక్క ప్రత్యయాత్మకత్వ వాదము లైబ్‌నిజ్ 17వ శతాబ్దియందు అగ్రేసరులయిన జర్మను తాత్త్వికులలో నొకడు అతడు మరియొక విధమయిన ప్రత్యయాత్మకత్వ వాదమును ప్రతిపాదించెను అది ప్లేటోచేతగాని, బర్క్లే చేతగాని ప్రతిపాదింపబడిన ప్రత్యయాత్మకత్వ వాదముకంటె పూర్ణముగా భిన్నమైనది అది ఇట్లున్నది

విశ్వమంతయు వ్యష్టుల శక్తిచే నిర్మితమైనది అని లైబ్‌నిజ్ వాదించెను వాటిని (వ్యష్టులను) భౌతిక విషయము లనుటకంటె శక్తికేంద్రము లనుటయే మేలు అవి భౌతిక వ్యష్టులును, అల్పజీవులునై యున్నవి వాటికి దర్శనశక్తి, అభివృద్ధి నొందుశక్తి కలవు శక్తిమత్తులయిన ఈ వ్యష్టులను అతడు జీవులు లేక అణుశక్తు లని వ్యవహరించెను ప్రతి జీవియు నిత్యమైనది అది అనశ్యమును అవికార్యమునై యున్నది

అయితే ఈ జీవులకు భిన్నదశాత్మక మయిన స్పష్టత కలదు మొక్కలలోని జీవులు ప్రస్ఫుటమైన అవ్యక్తత కలవి

జంతువులలోని జీవులు అంతకంటె తక్కువ అస్పష్టత కలవి మనుజుని యందలి జీవుడు విశేషస్పష్టతా యుక్తుడు అన్నిటి యందుకంటె అత్యంత స్పష్టతాయుత చైతన్యము దేవుని యందు కలదు ఈ శ్రేణిలో విచ్ఛిత్తిలేదు ఒక చివరన అచేతన భౌతిక ద్రవ్యము, పాషాణములు తత్సదృశములు కలవు మరియొక తుదయందు దేవు డున్నాడు అయితే ప్రపంచము అభౌతిక - అప్రపంచిత, అణువులచే, లేక జీవులచే నిర్మితమై యున్నచో, ఆ ప్రపంచ మెందుచేత ప్రపంచిత ముగను, భౌతికముగను కనుపించు చున్నది అను ప్రశ్న ఉదయించు చున్నది దీని నవగతము చేసికొనుటలో మనకు క్లేశము విశేషముగ నుండదు ఎందుచేతననగా ఆధునిక కాలమున ఇటీవలి విద్యుత్కణవాదము ననుసరించి, అణువులు శక్తిమండలముగా కనిపెట్ట బడినవి వ్యాప్తి లేక దేశము అనునది జీవుల సహాస్తిత్వము యొక్క దృశ్యప్రతిభాసమే యథార్థమునకు వ్యాప్తియు లేదు, భౌతిక ద్రవ్యమును లేదు 'మనస్సు' అను పదార్థమును వివరించుట మిక్కిలి సుకరము లైబ్నిజ్ నిర్దేశించినట్లు - మనస్సు ఒక నిత్యమగు ఆధ్యాత్మిక సత్త ఆ సత్త ఉన్నతతర వికాస దశయందు, భౌతిక శరీరస్థు లయిన జీవులకంటె భిన్నమైనదిగ నున్నది జీవులు స్వయంక్రియావంతులు దేవుడు లేక, జీవ - జీవుడు, జీవులను సృజించి, సృష్టికాలముననే, ఒకరిచే నొకరు ప్రభావితులు కాకుండు నట్లును ఒకరికొకరు అనురూపులై యుండు నట్లును, మున్ముందే వారి సంబంధానుబంధములను వ్యవస్థాపన మొనర్చెను ఆ విధానము గడియారమును చేయువాడు, వాటిని తయారుచేసి అన్నియు ఒకే కాలమును చూపునట్లు, అన్నిటియందును ఒకే గంటపై ముల్లును నిక్షేపించుటవంటిది ఈవివరమునకు పూర్వనిర్ణీతసంవాద వాదము అని పేరు కావున లైబ్నిజ్ వాదము ననుసరించి విశ్వము కృత్రిమమైనది కాదు అది బలశక్తి సమన్వితమును, సచేతనమును నై యున్నది

ప్రాతిభాసిక ప్రత్యయాత్మకత్వ వాదము (విమర్శనాత్మక అతీంద్రియ భావవాదము) ఇమ్మాన్యుయల్ కెంట్ అను పండితుడు రచించిన గ్రంథముతో జర్మను తత్త్వశాస్త్రము అత్యుదాత్తస్థితినొందినది కెంటువాద మిట్లున్నది ఈ పరిదృశ్యమాన జగత్తునకు లేక ప్రాతిభాసిక జగత్తునకు, పూర్వరంగమున కొన్ని ప్రత్యక్ష - అననుభూత-విషయము లున్నవి అవి అవిదితములును, అవేద్యములునై యున్నవి అవి జీవిపై లేక మనస్సుపై ప్రభావమును కల్పించి పరస్పర అసంబద్ధము లయిన భావములను ఉత్పాదన మొనర్చును మనస్సు వాటిని యథాకాలముగా యథాదేశముగా, క్రమబద్ధ మొనర్చును దేశకాలములు, వేదనాశక్తి ప్రసాదించు ప్రత్యక్షానుభవ రూపములు అది (మనస్సు) దేశకాలానుసారముగా, అవగతి ద్రవ్యము వేదనాశక్తి, సంఖ్య, యాథార్థ్యము, అనుప్రకారములక్రింద సంధానింపబడిన సంవేదనలను ఉపనయించి, వాటికి ఏకత్వమును సంపాదించును ఇట్లు మనస్సు స్వతస్సిద్ధ వస్తువును తెలిసికొనజాలదు అది స్వీయరూపముల సాయమునను, ప్రకారముల సాయమునను, స్వతస్సిద్ధ వస్తువుల యొక్క సంఘటనలను లేక ఆభాసములను మాత్రమే తెలిసికొనగలదు కావున కెంట్ ప్రతిపాదించిన ప్రత్యయాత్మకత్వ వాదము సంఘటనవాద మనబడినది ఇంద్రియగ్రాహ్య మయిన ప్రపంచ మొక దృశ్యము లేక ప్రతిభాసము అది ఒక రీతిగా, మనఃకల్పితమైన 'జగత్తు' అని అతడు భావించెను ఈ అర్థమున కెంట్ పండితుని యొక్క తత్త్వశాస్త్రము సర్వాత్మకత్వ వాదమును అగుచున్నది మనస్సు మాత్రమే వాస్తవికమైనది అను నర్థమున మాత్రము అతని వాదము సర్వాత్మకత్వ వాదము కాజాలదు

**నిరపేక్షమయిన ప్రత్యయాత్మకత్వ వాదము** ఇది మరి యొక ప్రాచీనరూప మయిన సర్వాత్మకత్వ వాదము నిజమైన సత్త తత్త్వతః అద్వితీయమైన ఆత్మ అను ప్రతీతి కలదు అనుభవసిద్ధమైన సత్త యొక్క నానాత్వము ఇందిమిడియున్నది అదియే ఆ నానాత్వమును వ్యాఖ్యానించునుగూడ ఈ ఆశయము ప్రాచీన కాలమున వేదములందలి ఉపనిషత్తు లను భాగములందు ప్రతిపాదింప బడినది ఇట్టి భారతీయ అద్వైత వేదాంతమును ప్రతిపాదించిన వారు శ్రీ శంకరాచార్యులవారు (788-820) అంశద్వైతవాదము నందు తాత్త్విక ప్రత్యయాత్మకత్వ వాదము, సాక్షాత్కార దర్శనముతో మిశ్రితమై యున్నది గ్రీసులో పారమెనిడీస్ అను పండితుని వాదము ఏకత్వవాదము అత దద్వైత వేదాంత తత్త్వమును - ముందే పసిపట్టెను అయితే అత్యంత ఆద్యుడును, ఆదర్శభూతుడును నైన అద్వైతవాది, హెగెల్ అను తత్త్వజ్ఞుడై యున్నాడు అతడిట్లు వచించెను అత్యంత నిరుపాధిక చైతన్యము హేతుపూర్వక మైన మనస్సే

తదంతర్గతములైనవే సర్వహేతువు, సర్వప్రకృతి, సర్వశాస్త్రములు, చరిత్రము, కళ, మతము, తత్త్వశాస్త్రము అనునవి ప్రపంచమననేమి? సత్త అననేమి? అని ప్రశ్నించి హెగెల్ ఇట్లు సమాధాన మొసగెను సత్తయన చింతన లేక వివేకము ప్రపంచ మొక చింతనక్రమము అది నిరుపాధికుని యొక్క లేక దేవుని యొక్క బహిర్వ్యాపకత్వము దేవుడు అనంతమైన మనస్సు లేక ఆత్మ సావధికములయిన మనస్సులు, దేవుని యొక్క సావధికము లయిన ప్రతిబింబములు కావున అవి దేవునికి సజాతీయములు ప్రపంచము దేవుని యొక్క ప్రతిరూపము అందుచే అది వాటికి (సావధిక మనస్సులకు) వేద్యమగుచున్నది ఏ పదార్థముల (మనస్సు, ఆత్మ) ద్వారమున మానవుని మనస్సు ప్రపంచమును తెలిసికొనుచున్నదో ఆ పదార్థముల ననుసరించియే దేవుడు ఆ ప్రపంచమును తనలోనుండియే వెలువరించెను కాబట్టి మన చింతన యొక్క అధిష్ఠానము సత్తాధిష్ఠానమునకంటె అభిన్నము జ్ఞానపదార్థములు విషయినిష్ఠములును, విషయనిష్ఠములును నైయున్నవి చింతనధర్మములు సత్తాధర్మములై యున్నవి

ప్రపంచము దివ్యసంకల్పము యొక్క పరిణామము ప్రకృతి యనునది బహిర్వ్యాపకమయిన (దివ్య) చింతనయే అది బాహ్యరూపమున ఆవిష్కృత మయిన నిరపేక్షాబుద్ధియే అది అత్యంత సంపూర్ణముగా మానుష ఆత్మ చైతన్యమున ప్రకటీకృత మగుచున్నది వైయక్తిక మయిన మనస్సు విషయినిష్ఠము. భగవంతుడు వ్యక్తులందు ఆవిష్కృత మయిన కేవలాత్మ (చైతన్యము)యే

వ్యక్తిప్రధాన సర్వాత్మకత్వ వాదము ఈ వాదము కేవల సర్వాత్మకత్వ వాదము యొక్క అనంగీకార రూపమున బయలు వెడలినది ఎందుచేతననగా కేవల సర్వాత్మకత్వ వాదమునందు నిరుపాధికునకు అత్యంత ప్రాధాన్యమును, మానుష స్వేచ్ఛకు అత్యల్ప ప్రాధాన్యమును ఒసగబడినది అందుచేత ఈ వ్యక్తి ప్రధాన సర్వాత్మకత్వ వాదము, మానుష వ్యక్తిత్వమును, మానుష స్వేచ్ఛను, నూతన మూల్యములను సృష్టించుటయందు మనుష్యునకు గల ప్రాముఖ్యమును నొక్కి వక్కాణించినది ఈ మతము దేవుని సావధికునిగా భావించినది ఇది దేవుని నిరవధికునిగా గుర్తించదు నిరుపాధిక చైతన్యము దేవుని యొక్కయు, సావధికులయిన జీవుల యొక్కయు, ప్రపంచము యొక్కయు అజ్ఞాత అద్వైతము అనబడుచున్నది మనము స్వతంత్రులము మనము నూతన మూల్యములను సృజింతుము భగవంతుడు మన స్వాతంత్ర్యమును నిర్ణయించువాడు కాడు భౌతిక ప్రపంచము ప్రాతిభాసికము అని వాదించు ఈ దర్శనము ఆదర్శాత్మకము లేక ఆధ్యాత్మికవు

సంకల్పపూర్వక సర్వాత్మకత్వ వాదము శాస్త్రీయకులు, సంకల్పమును లేక ఏకాంతిక సంకల్పమును మనస్సుయొక్క ఆవశ్యకరూపముగా నొక్కి వక్కాణించిరి అందుచేత ఈ వాదము సంకల్పపూర్వక ప్రత్యయాత్మక వాద మనబడినది కెంట్ అను పండితుడు సంకల్ప ప్రాధాన్యమును దృఢపరచినాడు షోపన్ హార్ అను విద్వాంసుడు కెంటు యొక్క అనుయాయి అగుటచే ఈ వాదమునకు ప్రోద్బల మొసగెను అతడు తాను రచించిన 'ది వరల్డ్ ఆజ్ విల్ అండ్ ఐడియా' అను గ్రంథమును "ప్రపంచము నా యొక్క సంకల్పము" అను సుప్రసిద్ధమయిన ప్రతిపాదనముతో ఆరంభించెను "నేను నా మనస్సును పరిశీలించుకొన్న మీదట అందు బుద్ధికంటె సంకల్పమే ప్రధానమైనదని గ్రహించితిని నా శరీరము నా సంకల్పము యొక్క బాహ్యరూపము అట్లే ఈ ప్రపంచము నిరుపాధిక సంకల్పము యొక్క బాహ్యాభివ్యక్తియై యున్నది ప్రపంచము కేవలము నా యొక్క భావమై యుండుటయే గాదు, దాని కొక విషయాత్మకమైన మూలము కూడ కలదు దాని యొక్క పునాది ఏకాంతిక సంకల్పమందు కలదు "

కాగా తుద కిట్లు చెప్పవచ్చును: ప్రత్యయాత్మకత్వ వాదులందరికి విశేషమైన సాధారణత కలదు ద్రవ్యము, యంత్రవ్యాపారము, శక్తిరక్షణము, అనువాటితోనే ప్రపంచమున్నదను వాదమును వారు నిరాకరింతురు ప్రపంచమునకు అర్థము, ఉద్దేశము, లక్ష్యము కలవు విశ్వము యొక్క హృదయమునకును, మనుజుని ఆత్మకును, మధ్య ఒక విధమైన సామరస్యము కలదని వారు విశ్వసింతురు తేలిన విషయ మిది ఈ ప్రపంచము చతురమును, అర్థపరితమును నైయున్నది అందలి పడుగుపేకలు భావమునకును, సంకల్పమునకును అనురూపములై యుండవలయును

ఖ బే అ

## ప్రధాన కణములు
## (Fundamental Particles)

ద్రవ్యమునకు సరళరూపములును, స్వతంత్రముగ మన గలిగినవియును అయిన కణములు ప్రధానకణములు. డాల్టను అను శాస్త్రజ్ఞుడు పరమాణువులే ద్రవ్యమునకు ప్రధానకణము లన్నాడు. చాలా చాలా పల్చనచేసిన వాయువులలోనుండి 20,000 వోల్టుల పీడనముతో, విద్యుత్తు ప్రసరించినప్పుడు ఋణాగ్రమునుండి ద్రవ్యము వెలెనే, తమ తాకిడివల్ల తేలికైన చక్రమును త్రిప్పగల 'కిరణములు' వెలువడునని క్రూక్సు అనునతడు కనుగొన్నాడు. అవి జింకుసల్ఫైడు తెరలకు తాకి చుణుకులు మెరిపించగల కణములే అని లెనార్డు అను శాస్త్రజ్ఞుడు కనిపెట్టెను. వీటికి ఋణవిద్యుదావేశ ముండునని తరువాత తెలిసినది. ఇవి, అన్ని వాయువులలో నున్నవని తెలిసినది. ద్రవ్యములో ఈ ఎలక్ట్రానులు మొట్టమొదట బయటపడ్డ ప్రధానకణము లన్నమాట. ద్రవ్యప్రవేశక శక్తిగలిగిన X—కిరణాలను ఉత్పాదించుటకు వేగవంతములైన ఎలక్ట్రానులను ఉపయోగింతురు. ఎలక్ట్రానుకంటె కనిష్ఠకణము మరిలేదు. కనుక దాని ద్రవ్యరాశి 1 అనీ, దాని విద్యుదావేశము (ఋణముకనుక) −1 అని అనుకొందము.

అన్ని మూలపదార్థములలోను తేలికైన ప్రతిహైడ్రోజను పరమాణువులోను ఒక ఎలక్ట్రాను ఉండును. దీనికి తుల్యమైన ధనవిద్యుదావేశము గలిగి ఎలక్ట్రానుకు ప్రతిగా హైడ్రోజను పరమాణువులోనున్న కణము ప్రోటాను. దీని విద్యుదావేశము +1, ద్రవ్యము 1836.

వెల్తురు అన్నది కణములవర్షమా? తరంగముల తాకిడియా? అని వైజ్ఞానికులు చిరకాలము మథనపడి, వెల్తురు తరంగశీలానికి ఎక్కువ సాత్మ్యము చేరుటతో అది (విద్యుదయస్కాంత) తరంగములతాకిడియే అని నమ్మిరి. అయితే, వస్తుతత్త్వముమీద కాకుండ, ఆవస్తువు ఉష్ణోగ్రతమీద ఆధారపడునట్టి దీప్తిలో శక్తి ఏరీతిగా విస్తరించియున్నదో పరిశీలించి సూత్రీకరించిన ప్లాంకూ, కాంతి తాకిడికి ఎలక్ట్రానులను చిమ్మునట్టి లోహతత్త్వాన్ని విశదీకరించబోయిన అయిన్‌స్టీను, X− కిరణాలు చెదిర్చే ఎలక్ట్రానుల దిశను, గతిభారమును పరిశీలించిన కాంప్టను అనువారు కాంతి శక్తికణములుగా వ్యవహరించునని చూపించిరి. ఈశక్తి కణముయొక్క శక్తి ఆ కాంతి తరంగాంకతిని బట్టి యుండును. గామాకిరణములు, X−కిరణములు, అతినీలలోహితకిరణములు, కంటికి కనబడెడు రంగులకాంతి, ఉష్ణము, రేడియోప్రసారతరంగములు అన్నియు దీప్తిసంబంధించినవే. వీటన్నిటి శక్తికణములు వీటి తరంగాయతినిబట్టిన శక్తితోడనే ఉండును. ఈ కణములన్నిటికి ఫోటానులు అని పేరు. వాడుకలో గామా ఫోటానులు అతిశక్తిమంతములు. దృశ్యమానకాంతి ఫోటానులు తక్కువశక్తిమంతములు. కనుక ఫోటానులను పరము అటు 'గామా'లనుండి, ఇటుదృక్కాంతిఫోటానుల వరకే పరిమితము అయి యుండును.

1930లో బోథే, బెక్కర్ అనువారును, 1932లో జోలియట్ క్యూరీలును చేసిన ప్రయోగమును శుద్ధిచేసి, ఛాడ్విక్కు అనునతడు 1932 లో న్యూట్రానును కనిపెట్టినాడు. బెరీలియమ్ ధాతువును ఆల్ఫాకణాలతో తాడించినప్పుడు కర్బనము పర్పడి, న్యూట్రానులు వెలువడును. ఈ న్యూట్రానలకు విద్యుదావేశము లేదు. వీటిద్రవ్యరాశి 1839 (ప్రోటానుది 1836) కనుక హైడ్రోజను ఎక్కువగా ఉండెడు మైనమును వీటితో తాడించినచో, ఆ మైనమునుండి ప్రోటానులు విడివడి ఇంచుమించు న్యూట్రానులంత వేగముతోనే బయటికి ప్రసరించును. ఏ విద్యుదావేశము లేని కారణముచేత, ఇవి పరమాణువుల పొలిమేరలలోని ఎలక్ట్రానులవలన గాని, పరమాణువుల నడుమనుండు కేంద్రకములవల్ల (ఇవి ధనావేశితములు) గాని వికర్షించబడక నిరాటంకముగా, పరమాణు గర్భములోనుంచి దూరిపోవును. ఒకవేళ న్యూట్రాను ఒకటి పరమాణు కేంద్రకమునకు తగులుటయే సంభవించిన యెడల ఆ కేంద్రకమునకు పట్టుకొని ఆ పరమాణువునకు కృత్రిమ రేడియో తీవ్రతను కలిగించ వచ్చును. కేంద్రకనిర్మాణ పరిశీలనలో న్యూట్రాను తాడనము అతిసాధారణమై పోయినది. న్యూట్రానులను పట్టిన పరమాణు కేంద్రకములు, కొన్ని రేడియోతీవ్రతనుపొందుటతో కృత్రిమముగ రేడియో తీవ్రమూలకమును తయారు చేయుటకు న్యూట్రాను తాడనమును ఉపయోగించు చున్నారు.

డిరాక్కు, అను భౌతికశాస్త్రవాద విజ్ఞాని, ఎలక్ట్రానుయొక్క శక్తివిలువను సాపేక్షతాసిద్ధాంత రీత్యా లెక్కగట్టి ఆ ఫలితమునుబట్టి ఎలక్ట్రానుతో సమానమై ధనవిద్యుదావేశము గలిగిన కణము ఉండునని తెల్పినాడు. ఈ ఊహను

పోలాచూచుటకు కాదుగాని, విశ్వమయూఖములవలన విడి వడిన కణములను ఫొటోటీయు యత్నములో ఆండర్సను పోజిట్రాను అను ఎలక్ట్రానుయొక్క ప్రతి కణమును కనిపెట్టి నాడు ఈ కణము ద్రవ్యరాశి 1, విద్యుదావేశము +౧ ఆ తరువాత ఆండర్సను ప్రయోగశాలలో, గామాకిరణమును సీసపు పలకలో నుండి పంపగా ఎలక్ట్రాను పోజిట్రానులు దిగువవైపు జంటగా బయల్పడి విడిపోవుట కనుగొనెను ప్రయోగశాలలో పోజిట్రానును చూపించు మాటను అటుంచి, ఈ ప్రయోగము, గామా (కిరణపు) ఫొటాను-శక్తుశక్తి కణము - రెండు ఎలక్ట్రానులుగా మారి, ఇక మిగిలి పోయినశక్తిని ఆ రెండుకణములకును ఇచ్చివేయునని నిరూపించినది ఋణవిద్యుదావేశిత ఎలక్ట్రానుకు ప్రతికణము, ధన విద్యుదావేశిత ఎలక్ట్రాను (ఇదియే ప్రొటాను) ఉండు నని నిరూపించినది శక్తి అనునది కొన్ని పరిస్థితులలో - గామాశక్తికణము సీసపు పరమాణుకేంద్రక రంగములోనే కదా మారినది? కణ, ప్రతికణములుగా ఏర్పడునని నిరూపించినది పోజిట్రాను ఎలక్ట్రానును చేరినచో రెండుకణములు మాయమై రెండుఫొటానులు ఏర్పడును ఒకదానిని ఒకటి తన్నినట్లు వ్యతిరేకదిశలలో కాంతి వేగముతోనే దూసికొని పోవును పోజిట్రాను స్వతంత్రముగా ఉండగల కణమేగాని స్థిరత్వముగలది కాదు

రేడియోతీవ్రపదార్థములు, ఆల్ఫాకణమును, బీటా కణమును, గామాకిరణమును తమలోనుండి బయటికిచిమ్మును ఆల్ఫాకణములు హీలియము పరమాణువుల కేంద్రకములు ఇవి రెండేసి ఎలక్ట్రానులను పట్టుకొని హీలియము పరమాణువులై పోవును బీటాకణములు వేగాతిశయముగల ఎలక్ట్రానులే. ఇవి వెలువడుటలో అన్నికణములు ఒకశక్తితో వెలువడ లేదు ఏదోకారణమువలన కొంతశక్తిని నష్టపోయి వెలువడు చున్నట్లు కనబడినవి ఎందువలన? అన్నది చిక్కు ప్రశ్న ఈ చిక్కుప్రశ్నకుతోడు గణితము కుదురని ఇంకొక చిక్కు వచ్చినది బీటా (రేడియో) తీవ్రతలో ఎలక్ట్రానులే కాకుండ పోజిట్రానులు వెలువడుటయు కద్దు ఈ తీవ్రతను కేంద్రకము లోని న్యూట్రానులు ఒక్కొక్కటి ప్రోటాను ఎలక్ట్రాను గానో, కేంద్రకములలోని ప్రొటానులు న్యూట్రానూ పోజిట్రాను గానో, విడిపోయి ఆ ఎలక్ట్రాను పోజిట్రానుమాత్రమే బహిష్కరింపబడుటగా అన్వయించినారు వైజ్ఞానికులు ఈ క్రియలో పూర్వ-, పశ్చాత్-, కణముల తిరుగుడు తత్త్వముల లెక్క సమముకాలేదు పూర్వకణములు న్యూట్రాను, ప్రొటానుల (ఆత్మప్రదక్షిణపు) తిరుగుడులు $\frac{1}{2}h$ ఒక్కొక్కటి, పశ్చాత్కణాలు రెండును ఒక్కొక్కటి $\frac{1}{2}h$ తిరుగుడు తత్త్వాలుగలవి ఈ రెండును ఒకవైపే తిరుగు చుండినచో మొత్తము ప్రదక్షిణపు తిరుగుడు 1h అన్నది పూర్వకణపు $\frac{1}{2}h$ కన్న $\frac{1}{2}h$ ఎక్కువై పోవుచున్నది అవి రెండు ఒకదాని కొకటి వ్యతిరేకముగా తిరుగుచున్నవి అను కొనినచో, ఈ మొత్తము సున్నాఅయి ''పూర్వకణపు తిరుగుడు మిగిలియుండవలెనే? ఏదీ?'' అనిపించును ఈ రెండు చిక్కులను తీర్చు ఊహ 1927లో పౌలీ అనునతడు చేసినాడు బీటా తీవ్రపదార్థములు ఎలక్ట్రానుతోపాటు న్యూట్రినో అను సూక్ష్మాతిసూక్ష్మకణమును చిమ్ము చుండునని యన్నాడు పౌలీ దీనికి ద్రవ్యము లేనేలేదట, శక్తియున్నదట తిరుగుడు తత్త్వము $\frac{1}{2}h$ట! లెక్కలు సరిపోయినవి బీటాకణములలో కానరాని మిగతా శక్తి వీటిలో ఉండవలె నన్నారు అయితే వీటిని పట్టి చూపుట జరుగవలెనుగదా? 1942 లో ఏలెన్ అను నతడు, 1949 లో ఆల్బర్ట్సు, వూ అనువారు, 1940 లో సెర్విను అనునతడు న్యూట్రినో, గుణములను నిరూపించిరి పోజిట్రానుతో వచ్చునది న్యూట్రినో ఎలక్ట్రానుతో వచ్చునది ప్రతిన్యూట్రినో, (ఈ రెండును పోజిట్రాను ఎలక్ట్రానులవలె పరస్పర విధ్వంసకములు )

పరమాణువుల కేంద్రకములు ప్రోటానులును, న్యూట్రానులును చేరి ఏర్పడినవన్నారు వీటిని చేర్చి ఉంచ గల ఆకర్షక శక్తులు గురుత్వాకర్షణశక్తుల కంటె కోటాను కోట్ల రెట్లు ఎక్కువ ఆ కణముల విద్యుదాకర్షణశక్తులు వాటిని ఛిన్నాభిన్నము చేయవలెనే! అట్లుచేయుటలేదు కేంద్రకముల చేరిక శక్తులు ఏవి? అను జిజ్ఞాసచేయుచు, యుకావా అను జపానీయ వైజ్ఞానికుడు - కేంద్రకకణములు మీసానులు అను కణములను మార్చుకొనుచు నుండుటవలననే చేరికగలిగి ఉన్న వని లెక్కలు కట్టినాడు ఆ కణముల ద్రవ్యము ఎలక్ట్రానుకు 273 రెట్లయినను ఉండు నన్నాడు విశ్వకిరణాల పరిశోధనలో ఎలక్ట్రానుకు 200 రెట్లు ద్రవ్యముగల కణములు కనబడినవి పవెల్ అనునతడు 1947లో 300 రెట్లు ద్రవ్యము కల మీసానులను కనుగొనినాడు మీసానులు అనేక రకములుగా- పరమాణువిచ్ఛేదక ప్రయోగ సాఫల్యమువలన తెలినవి K మీసాను ద్రవ్యము 966 సీటిలో ధనావేశితములు,

ఋణావేశితములు, తటస్థములుకూడ ఉన్నవి మీసానులు మారి ఎలక్ట్రానులును, న్యూట్రినోలును, ఫోటానులును, ఇతర మీసానులును, ఏర్పడ్డ క్రియలను వైజ్ఞానికులు గుర్తించిరి ఈ కణములవలన జరుగు క్రియలను గమనించు దశ దాటి వీటిని ఉపయోగించు దశ రాలేదు ఇంకను

ప్రోటాను, న్యూట్రాను, చేరిన కణము డ్యూటెరాను ఈ కణముతే బరువైన హైడ్రోజను కేంద్రకాలు ఇవి సుమారు రెండు ప్రోటానుల ద్రవ్యముగలిగి $e^{+}$ విద్యుదావేశముతో ఉండును న్యూట్రాను (1839) కును, డ్యూటెరానుకును నడిమి ద్రవ్యము (2182), తటస్థశీలము గలిగిన హైపెరాను లను విశ్వకిరణ పరిశోధనలో రోచెస్టరు, బట్లరు, ఆమూరు, అనువారు కనుగొనినారు ప్రోటానులతో పరమాణువిచ్ఛే దనము జరపు సింక్రోట్రానుతో హైపెరానులను ప్రయోగ శాలలో కనుగొనినారు ఈ 'హైపెరాను' ప్రోటాను ఋణా వేశితమై మీసానుగా విడిపోవును సగటున $3 \times 10^{-10}$ సెకనులలో

గామాఫోటానులు సీసపు పలకలోనుండి పోవుచు ఎలక్ట్రాను ప్రతిఎలక్ట్రాను (అదే పోజిట్రాను) ల జంటగా మారినట్టుగా, ప్రోటాను ప్రతిప్రోటానులకు కావలసినశక్తిని ప్రోటానుకో కలిగించి లోహమును వాటిచేత తాడించి నట్లయితే ఆ రెండును ఇంకా, న్యూట్రాను, ప్రతిన్యూట్రా నును ఏర్పడవని అని బెర్క్లి బెవేట్రాను రాక్షసయంత్ర ముతో సోదామాడగా రాగితో అవి ఏర్పడినవి ప్రతి ప్రోటానులను వాటి వేగమునుబట్టియు, వాటి విద్యుదా వేశము (ఋణము!) ద్రవ్యరాశినిష్పత్తినిబట్టియు, గుర్తించి నారు ప్రోటాను ప్రతిప్రోటాను చేరి శక్తిగామారిపోయి ద్రవ్యము ధ్వంసమగుటకూడ గమనించినారు మొత్తముమీద ప్రధానకణములన్నవి శక్తినుండి జంటలుగా ఏర్పడుచు సమానద్రవ్యము గలిగి, అన్నివిధములను విద్యు దావేశము, తిరుగుడుతత్త్వములలో-బింబ ప్రతిబింబ వ్యత్యస్త ధర్మాలు చూపించుచున్నవి సాపేక్షతావాదమును, శక్తి కణ గణాంక వాదమునకు ఆరోపించి డిరాక్కు తీసిన కణ - ప్రతి కణ వాదమునకును ఫలితములు అనుకూలము అనునది విశేషము

శ్రీ గో కృ.

# ప్రధాన కార్యనిర్వాహకుడు
## (Chief Executive)

రాజ్యపరిపాలనా వ్యవస్థలో ప్రధాన కార్యనిర్వాహకుడు ప్రత్యేకమైన విశిష్టాధికారమును వహించి యుండును దేశపరిపాలనా యంత్రాంగ మంతటిలో అతడు ఏకైక ఉన్నతాధికారిగా పరిగణింపబడును

ప్రభుత్వములో రెండు తరగతుల ప్రధాన కార్య నిర్వాహకులను మనము చూచుచున్నాము (1) నామ మాత్రపు ప్రధాన కార్యనిర్వాహకుడు, (2) వాస్తవ ప్రధాన కార్యనిర్వాహకుడు ఇండియా, బ్రిటను, కెనడావంటి శాసన బద్ధమగు ప్రజాస్వామిక రాజ్యములందు, రాజ్యాధినేత (అతడు నామమాత్రపు ప్రధాన కార్యనిర్వాహకుడుగ మాత్రమే వ్యవ హరించును) న్యాయశాస్త్రానుసారముగ విశేషపరిపాలనా ధికారములను కలిగియున్నను, ఇట్టి దేశములందు, ఆచరణలో నిజమైన నిర్వహణాధికార మంతయు మంత్రివర్గమందే ప్రతి ష్ఠితమై యుండును ఇట్టి ప్రజాస్వామిక రాజ్యములందు, పార్లమెంటుకు నివేదింపబడు రాజకీయ విధాన మంతటిని మంత్రివర్గమే నిర్ణయించును కార్యనిర్వాహక వర్గముపై సర్వాధిపత్యమును చలాయించుచు, పరిపాలనా యంత్రము నందలి వివిధ శాఖల కార్యకలాపములను అది సమన్వయ పరచు చుండును పై చెప్పబడిన ప్రజాస్వామిక రాజ్యములలో మంత్రి వర్గము చలాయించు ఇట్టి సర్వాధికారము 'మంత్రిత్వ నియం తృత్వ' మనిపించుకొనగలదని కొందరు వ్యాఖ్యానించు చున్నారు కాని అది అంతటితో ముగియదు పార్లమెంటుకు సంబంధించునంత వరకు, మంత్రివర్గ మొక నియంతృత్వమే యైనచో, మంత్రివర్గ నాయకుడగు ప్రధాని కూడ మంత్రి వర్గమునకు సంబంధించునంతవరకు అట్టి స్థానమునే ఆక్రమింప గల డన్నమాట అందుచే శాసనబద్ధమైన ప్రజాస్వామిక రాజ్యవ్యవస్థయందు సిసలైన ప్రధాన కార్యనిర్వాహకుడు ప్రధాన మంత్రియే కాగలడనుటలో అత్యుక్తి ఉండబోదు పాలకవర్గ పక్షమునందును, ప్రభుత్వమందును అతడాక్రమించు స్థానము, అతనిని అట్టివానినిగా నొనర్చును

అధ్యక్షుడే ఏకైకాధిపత్యము వహించు అమెరికా వంటి ప్రభుత్వ యంత్రాంగమందు, అధ్యక్షుడే ప్రధాన కార్య నిర్వాహకుడుగా వ్యవహరించును రాజ్యమునకును, ప్రభుత్వ మునకును అతడే సర్వాధికారి యగును

ప్రభుత్వేతరములైన ప్రైవేటు సంస్థలయందు కూడ ప్రధాన కార్యనిర్వాహకు లుండెదరు ఎట్టి బృహత్ సంస్థయందైనను కీలకమైన కేంద్రస్థాన మొకటుండుటచే, ప్రధాన కార్యనిర్వాహకుల నియామకము ఆవశ్యక మగుచున్నది అట్టివార లాసంస్థలకు చిహ్నములుగను, లేదా ప్రతినిధులుగను వ్యవహరింతురు

కావున ప్రధాన కార్యనిర్వాహకుడు పరిపాలనా యంత్రాంగమునకు సర్వాధికారిగా పరిగణింపబడి, ఆ యంత్రాంగముయొక్క పటుతర ప్రవర్తనమునకు బాధ్యత వహింపవలసి యుండును ప్రభుత్వమను నౌక కాతడు చోదకునివంటివాడు పరిపాలనా విధానము సక్రమముగా సాగుటకు ప్రధాన కార్యనిర్వాహకునకు పెక్కు అధికారములు, విధ్యుక్త కార్యకలాపములు అప్పగింప బడును అతడు పరిపాలనా విధానమందలి ముఖ్యాంశములను నిర్ణయించి దానిని క్రమబద్ధ మొనరించును సవ్యమైన పరిపాలనా విధానమునకు క్రమబద్ధమగు సూత్రీకరణ మావశ్యకము క్రింది ఉద్యోగవర్గమునకీ సూత్రీకరణము మార్గదర్శి వలె ఉపకరించును ఈ పరిపాలనా విధాన నిర్ణయమునందే ప్రధాన కార్యనిర్వాహకుడు తన కాలమునం దధిక భాగమును వినియోగించును ప్రధానాంశము లన్నిటిపైన క్రింది అధికారులు ప్రధాన కార్యనిర్వాహకునితో సంప్రదింపులు జరిపి, ఉచితములైన సలహాల నొసగెదరు

ప్రధాన కార్యనిర్వాహకుడు ప్రభుత్వ నిర్వహణశాఖా నిర్మాణ స్వరూపమును స్థిరీకరించి, అవసరమైన సంస్కరణములు చేయును శాసనబద్ధమగు ప్రజాస్వామిక రాజ్యములలో పరిపాలనావసరములకు అనుగుణముగా కార్యనిర్వాహణ శాఖను నిర్మించుటకును, పునర్నిర్మించుటకును ఆత డధికారము కల్గియుండును భారతదేశమందలి కేంద్ర, రాష్ట్రీయ ప్రభుత్వములలోని వివిధ శాఖలు, అవసరములను పురస్కరించుకొని సునాయాసముగా అప్పుడప్పుడు పునర్నిర్మింప బడుచుండును అధ్యక్షుడే సర్వాధికారిగా నుండు ప్రభుత్వములో ప్రధాన కార్యనిర్వాహకుడు, కార్యనిర్వహణ శాఖయందు తీవ్రమగు మార్పులు చేయదలచినచో, శాసన సభ్యులతో ముందుగా సంప్రదింపవలసి యుండును కాని వివిధ శాఖలయొక్క అంతర్నిర్మాణ వివరణాంశములు ప్రధాన కార్యనిర్వాహకుని చేతనే నిర్ణయింప బడును

ప్రధాన కార్యనిర్వాహకునకు వివిధ శాఖల నిర్మాణ విషయమున అధికార మున్నంతమాత్రమున చాలదు ప్రధానాధికారులను నియోగించి, ఉత్సాహ పరచుటకు కూడ ఆతనికి అధికార ముండవలెను మంత్రులవంటి ఇతర ప్రభుత్వ, రాజకీయాధికారు లాతనిచే నియమింప బడెదరు అంతే కాదు ప్రభుత్వ యంత్రాంగము నందలి ఉన్నత పదవులకు అర్హత గల దక్షులను నియమించు అధికార మాతనికి కలదు ఉదాహరణమునకు కొన్ని సంప్రదాయములకు, నియమములకు బద్ధుడై విదేశములలో రాయబారులను, సుప్రీం కోర్టు న్యాయమూర్తులను, అటార్నీ - జనరలును, పబ్లికు సర్వీసు కమిషను అధ్యక్షుని, సభ్యులను ఆతడు నియమించును తక్కిన ఉద్యోగులు పబ్లిక్ సర్వీసు కమిషనుద్వారా ఎన్నికయగుదురు అయితే వారి ఔద్యోగిక స్థితిగతులు, ముఖ్యాధికారుల నియామకాదులు ప్రధాన కార్యనిర్వాహకుని చేతనే నిర్ణయింప బడును, లేదా ఆతని సమ్మతితో నిర్ణయింప బడును

ప్రభుత్వ విధానములను అమలు జరపుటకై ప్రధాన కార్యనిర్వాహకుడు తన క్రింది ఉద్యోగులకు ఉత్తరువులను జారీచేయును ఆతని క్రింద వ్యవహరించు వివిధ శాఖలకు పంపబడు ఉత్తర్వులు సాధారణ స్వభావము కలిగియుండును, లేక నిర్ణీత స్వభావము కూడ కల్గియుండును ఈ ఉత్తరువులు లేఖల ద్వారాను, సర్క్యులర్ల ద్వారాను, ఇతర సాధనముల ద్వారాను పంపబడు చుండును సంక్షిప్తముగా చెప్పవలెనన్నచో, ప్రభుత్వ నిర్వహణశాఖ యంతటికిని పరిపాలనా నేతృత్వమును ఆతడు సృష్టించి, దానికి రూపురేఖలు దిద్దును

కార్యనిర్వహణ శాఖయందలి కలాపములను సమన్వయ పరచుట ప్రధాన కార్యనిర్వాహకుని మరియొక విధ్యుక్తధర్మము వివిధ శాఖలు, ఏజెన్సీలు ప్రభుత్వ వ్యవహారములను జరుపుచుండుటచేత, విధాన నిర్వహణములో చర్వితచర్వణము ఘటిల్లకుండ, ప్రధాన కార్యనిర్వాహకుడు ఎప్పటికప్పుడు జాగరూకత వహింపవలెను

ప్రధాన సమన్వయ కర్తగా, వేర్వేరు శాఖల నడుమ ఎవ్విధమైన ఘర్షణములు ఉత్పన్నమగుండ, పరిపాలనా యంత్రము సవ్యముగా సాగిపోవునట్లు జాగ్రత్తపడుట కూడ ఆతని బాధ్యతలలో నొకటి

కార్యనిర్వహణ శాఖలను అదుపునందుంచి, వాటిపై

పర్యవేక్షణ జరపుట కూడ అతని మరియొక ధర్మము ఈ శాఖల ఆచరణ విధానమునకు సంబంధించిన సమాచారమును ఎప్పటికప్పుడు సేకరించుట కాతనికి అధికారము కలదు ఏదేని యొక శాఖ సంతృప్తికరముగా పనిచేయుట లేదని ఆతనికి తోచినచో, దాని కార్యకలాపములను అతడు పరిశీలించి, దర్యాప్తు జరుపవచ్చును

ప్రధాన కార్యనిర్వాహకుడు ప్రభుత్వాధిపతిగూడ యగుటచే, కార్యనిర్వాహక శాఖయొక్క కలాపము లన్నిటికిని ఆతడే సంపూర్ణముగా బాధ్యత వహింపవలసి యుండును ఈ విధినిర్వహణమును సామర్థ్యముతో నెరపుటకు వివిధ శాఖలపై అతడు పెత్తనము వహించి, పర్యవేక్షణము జరుపవలసి యున్నది

అమెరికావంటి దేశములలో బడ్జెటు అంచనాలను తయారొనర్చుట, వాటిని శాసనసభ ఎదుట నివేదించుట, శాసనసభ వాటిని ఆమోదించిన పిదప, వాటిని అమలు జరపుట, ప్రధాన కార్యనిర్వాహకుని విధికృత్యములై యున్నవి ముఖ్యములైన ఆర్థిక ప్రణాళికలు, ఆర్థిక విధానము లన్నిటిని ఆతడే సిద్ధము చేయును

పరిపాలనా వ్యవస్థయందు ప్రధాన కార్యనిర్వాహకుడు కీలకమైన పాత్ర నిర్వహించును ఈ వ్యవస్థ కాతడు నాయకుడై దాని ధోరణిని, దాని స్థాయిని రూపొందించును పరిపాలనా యంత్రమందలి కార్యనిర్వహణ శాఖయొక్క రూపురేఖలను అతడు సమగ్రముగను, సంపూర్ణముగను సరిదిద్దును ప్రభుత్వ ప్రధాన ప్రతినిధిగా, శాసన సభముందును, ప్రజలముందును ప్రభుత్వ విధానములను సమర్థించుట ఆతనివిధి

మొత్తముమీద ప్రధాన కార్యనిర్వాహకుడు నిర్వర్తింప వలసిన విధులు అత్యంత గురుతరమైనవి ఏకైక వ్యక్తిగా ఈ విధుల నన్నిటిని ఒక్కచేతి మీదుగా అతడు నిర్వహింపజాలడు ఆతనికి సహకార మవసరము చిల్లర మల్లర పనులనుండి ఆతనిని విముక్తి పరచుటకును, ఆతని విధి నిర్వహణమునకు సంబంధించిన ప్రణాళికను సిద్ధమొనర్చుకొనుటయం దాతనికి సహాయ పడుటకును, ఉద్యోగివర్గ సహకార మాతని కొసగ బడును అమెరికా సంయుక్త రాష్ట్రములలో కార్యనిర్వాహక బృందసహాయము దేశాధ్యక్షునకు లభించును ఈ కార్యాలయములో అంతశ్శాఖలు పెక్కులు గలవు బ్రిటను, భారత దేశములలో వేర్వేరు మంత్రిత్వ కార్యదర్శులు మున్నగువారు మంత్రివర్గమునకును, ప్రధాన మంత్రికిని సహకార మొసగెదరు ఇటీవల కొలది సంవత్సరములనుండి భారత దేశములో ప్రధానమంత్రి సహకారము కొరకు ప్రత్యేకముగా ఒక సచివాలయ సిబ్బందివర్గ మేర్పరుపబడినది ఈ వర్గముతోసహా సకల శాఖలపై పర్యవేక్షణము నెరపుచు, వాటిని అదుపులో నుంచుకొని, యావత్పరిపాలనా విధానము సాఫీగా సాగిపోవునట్లు చూచు బాధ్యత ముఖ్యముగా ప్రధాన కార్యనిర్వాహకుడే స్వీకరింప వలెను

బి రా

## ప్రపంచ శీతోష్ణస్థితి

ఒక ప్రదేశముయొక్క వాతావరణ స్థితిని – అనగా అచ్చటి ఉష్ణోగ్రత, వాయుప్రసారము, మేఘములు, వర్షము మొదలగువాటి సాముదాయకస్థితిని శీతోష్ణస్థితి అందురు స్థూలముగా ప్రపంచమునందు వాతావరణము ఏ యే పరిస్థితులమీద ఆధారపడియుండునో చూతము

వాతావరణమునకు ముఖ్యకారణములు రెండు 1 సూర్యునివలన కలుగు ఉష్ణము, 2 భూమిమీదిగాలి సూర్యరశ్మియే భూమిమీద ప్రాణికోటికి మూలాధారము సూర్యుని ఉపరితలము 6000° C తో మండుచుండును అచ్చటనుండి కాంతి ప్రసరించి భూమిపై పడును ఇట్లు సగటున ఒక చదరపు సెంటిమీటరుమీద ఒక నిమిషమునకు 1 94 కేలరీల ఉష్ణమును కలిగించుకాంతిని భూమి స్వీకరించుచున్నది దీనిని సౌరస్థిర

చిత్రము 49



పటము - 1

పరిమాణమందురు ఈ కాంతిలో కొంతభాగము భూమిమీద ప్రతిబింబించి తిరిగి పైకిపోవుచున్నది ఇట్టి ప్రతిబింబనశక్తి అప్పటి వాతావరణస్థితి మీదను, ఇతర విషయముల మీదను ఆధారపడి యుండును ఇట్లు పైకిపోవు కిరణములను, గాలిలోని కర్బన ద్విఆమ్లజనిదము, ధూళి, నీటి ఆవిరి మొదలగునవి పీల్చుకొని తిరిగి భూతలము మీదికి పంపివేయు చున్నవి మొత్తముమీద భూమధ్యరేఖకు ఇరువైపుల 35 అక్షాంశములలో ఉన్న ప్రదేశము ఎక్కువ సూర్యరశ్మిని పొందుచున్నది ఆ పై ప్రదేశము లలో సూర్యరశ్మి చాల తక్కువగా నుండును భూగోళము మీద జనవరి, జులై నెలలలో ఉష్ణోగ్రత వ్యాప్తి చెందు విధానమును, 1, 2వ పటములలో చూడవచ్చును

చిత్రము 50



పటము 2

భూమిపై వాయు ప్రసారము సూర్యకిరణములు ధ్రువ ప్రాంతములలో ఏటవాలుగను, భూమధ్యరేఖా ప్రాంతములలో సూటిగను పడుటవలన, భూమధ్యరేఖా ప్రాంతము వేడిగను, ధ్రువప్రాంతము శీతలముగను ఉండునని స్థూలముగ చెప్ప వచ్చును అందువలన భూమధ్యరేఖా ప్రాంతమునం దున్న గాలి తేలికయగుటచే పైకిపోవును ధ్రువప్రాంతమునందలి చలిగాలి ఆస్థానము నాక్రమింప వచ్చును పైకిపోయిన గాలి ధ్రువప్రాంతములకు పోవును ఇట్లు ధ్రువప్రాంతమందలి గాలి భూమధ్య రేఖకును, భూమధ్య రేఖయందలి గాలి ధ్రువప్రాంతమునకును పోవ ప్రయత్నించును

భూమి తన ఇరుసుపై తాను తిరుగుటచే ఇట్టి ప్రయత్నమునకు విఘ్నము కలుగును భూమధ్యరేఖ నుండి గాలి ధ్రువప్రాంతమునకు పోవునప్పుడు, అది పశ్చిమదిశకు నెట్టి

చిత్రము 51.




పటము 3

వేయబడును అదేవిధముగా ధ్రువప్రాంతమునుండి వచ్చు గాలి తూర్పునకు తిరుగును ఇట్లు ధ్రువ ప్రాంతపు గాలులు 50-60 అక్షాంశ ప్రాంతమునందు తూర్పుగాలులుగా మారును భూమధ్యరేఖ నుండి బయలుదేరిన గాలులు చల్లబడి 30° అక్షాంశ ప్రాంతమందు క్రిందికి దిగుటవలన అక్కడ ఉన్నత పీడన ఘటములు (High pressure cells) ఏర్పడును కాని ఊర్ధ్వ వాతావరణములో మాత్రము, ధ్రువప్రాంతమందు తక్కువ పీడన శక్తిని, భూమధ్యరేఖా ప్రాంతమం దెక్కువ పీడనశక్తిని కలిగియుండెడి గాలులు భూమధ్య రేఖ నుండి ధ్రువములకు పోవుచుండును ఉత్తరార్ధ గోళములోని వాయు ప్రసారము 3వ పటమునందు చూపబడినది దక్షిణార్ధగోళమందలి వాయు ప్రసారము దీనికి ప్రతిబింబముగా ఊహింపవచ్చును

చిత్రము 52



పటము 4

ఉన్నత పీడన ఘటములు 30° అక్షాంశ ప్రాంతము నందు మూడుగా విభజింపబడి, మూడు ఘటములుగా కాన్పించును దక్షిణార్ధ గోళములో చాలభాగము సముద్ర ప్రాంతమగుటచే, ఈ ఘటములు సంవత్సరము పొడవున ఒకేచోట ఉండును ఉత్తరార్ధ గోళములో శీత కాలమున ఈ ఘటములు భూమిమీదను, వేసవిలో సముద్రముమీదను కన్పించును భూమి సూర్యరశ్మి వలన త్వరగా వేడెక్కుటయే ఇందుకు కారణము అదేవిధముగా, సూర్యరశ్మి లేని సమయమున

చిత్రము 53



పటము 5

చిత్రము 54



పటము 6

చిత్రము 55



పటము 7.

భూమి త్వరగాచల్లబడును అందుచే, భూఖండములు వేసవిలో అతివేడిగను, శీతకాలములో మిక్కిలి చల్లగను ఉండును కాని సముద్రము అన్నికాలములలోను దాదాపు ఒకే ఉష్ణోగ్రతను కల్గి యుండును 4, 5వ పటములలో ఈ ఘటముల ఉనికిని చూడవచ్చును ఈ ఉన్నతపీడన ఘటముల మధ్య అల్పపీడన ఘటములను చూడవచ్చును

"బైస్ బాలట్" సూత్రప్రకారము ఈ ఘటముల చుట్టును గాలి తిరుగుచుండును ఈ గాలుల ప్రభావము 6,7 పటములలో చూపబడినది భూమధ్యరేఖాప్రాంతమునందు గాలులు మందముగా వీచును వీటికి ఉత్తర దక్షిణములలో ఋతుపవనములు (వ్యాపార పవనములు) 30° అక్షాంశము వరకు వ్యాపించి యుండును ఇవి ఉత్తరార్ధగోళములో ఈశాన్యము నుండియు, దక్షిణార్ధ గోళములో ఆగ్నేయమునుండియు వీచును 30° అక్షాంశ ప్రాంతమునందు అధికపీడన ఘటము లుండునని చూచితిమి అచటినుండి ధ్రువప్రాంతమునకు పోయిన కొలది 60° అక్షాంశము వరకు గాలులు పశ్చిమమునకు వీచుచుండును భూమధ్యరేఖనుండి 30 అక్షాంశము వరకును, ఆపైన అధికపీడన ఘటములనుండి 60 వ అక్షాంశము వరకును అల్పపీడన ఘటములు, సుడిగాలులు అధికముగా నుండును

భూగోళము మీది గాలుల నడవడిని ఇంత స్థూలమగు సూత్రములతో వివరించుట కష్టము వివిధ ప్రదేశములలోని భూఖండము లందును, సముద్రము లందును వివిధములుగా గాలులు వీచున అంతే కాక, ఋతువులను బట్టి కూడ ఈ వాయు స్వరూపము మారుచుండును ఋతువులను బట్టి ఈ వాయు మండలములు పైకిని, క్రిందికిని కదలుచుండును ఉదాహరణమునకు వేసవిలో దక్షిణార్ధగోళమంగలి ఆగ్నేయ పవనములు భూమధ్యరేఖను దాటి, నైరృతి పవనములుగా మారి భారత దేశమంతయు వ్యాపించి వర్షము నిచ్చును సెప్టెంబరు తరువాత ఇవి మరల దక్షిణమునకు మరలును

శీతోష్ణస్థితి – సముద్రప్రభావము . భూగోళము మీది వాయు ప్రసారము ననుసరించి సముద్రము మీద ప్రవాహములు పుట్టుచున్నవి ఇందుచే శీతల ప్రాంతమందలి సముద్ర జలము భూమధ్యరేఖ వైపునకును,

భూమధ్య రేఖ ప్రాంతమందలి ఉష్ణజలము ధ్రువములవైపునకును ప్రవహించుచున్నవి గల్ఫ్ ప్రవాహము, ఉత్తర అట్లాంటిక్ ప్రవాహము, కురోషియో, ఉత్తర పసిఫిక్ ప్రవాహములు ఉష్ణ జల ప్రవాహము లనబడు చున్నవి ఇవి సాధారణముగా తీర ప్రాంతములందు ప్రవహించుటచే, ఈశాన్య అమెరికా, వాయవ్య ఐరోపాల తీరములు ఆ అక్షాంశములందు కలుగు ఉష్ణము కంటె ఎక్కువ ఉష్ణోగ్రతను పొందుచున్నవి ఇదేవిధముగా లాబ్రడార్, ఒయోషియో, శీతలజల ప్రవాహములు ఆయాదేశముల తీరములకు శీతల వాయువుల నుద్భవింపజేయును

సముద్రమునుండి వీచు గాలులవలన తీరములయొక్క ఉష్ణోగ్రత వేసవికాలములో తక్కువగను, శీతకాలములో ఉండవలసిన దానికంటె ఎక్కువగను ఉండి, సమశీతోష్ణస్థితిని కలుగజేయు చున్నది ఇందువలన భూఖండముల మీద ఉత్తరార్ధ గోళములో జూలై నెలయందు ఎక్కువ ఉష్ణోగ్రతయు, జనవరి నెలయందు తక్కువ ఉష్ణోగ్రతయు ఉండును సముద్రముమీద ఆగస్టునెలలో ఉష్ణోగ్రత అధికముగను, ఫిబ్రవరిలో అల్పముగను ఉండును సముద్ర మధ్యములోని పగటి ఉష్ణోగ్రతకు, రాత్రి ఉష్ణోగ్రతకు, వ్యత్యాసము చాల తక్కువగ నుండును అది 1, 2 డిగ్రీలు మాత్రమే తీరములలో 4, 5 డిగ్రీలవరకుండును ఇట్టి సముద్రప్రభావము 1, 2 పటములలో చూపబడినది సముద్రమట్టపు సమోష్ణరేఖలు వేసవిలో భూమధ్యరేఖ వైపునకును, చలికాలములో ధ్రువముల వైపునకును ప్రసరించును ఆర్కిటిక్ మండలములును, పరిసర ప్రాంతములును కనిష్ఠ శీతలప్రదేశములుగ చూపబడినవి

సముద్రముపై ఘటిల్లు బాష్పీకరణము ఎక్కువగా భూమిపై ఉష్ణతా పరిస్థితులను మార్చుటలో ముఖ్యపాత్రను వహించును సముద్రము నుండియు, భూభాగమందలి తదితర జలాశయముల నుండియు ఆవిరియగు నీటిలో ఎక్కువభాగము భూమిపై వర్షరూపమున పడును భూమిమీద నీరు అధికము కాకుండ కొంతభాగము ప్రవాహముల రూపములో సముద్రమునకు చేరుచుండును ఇట్లు జలవలయము యథారీతిగ పూర్తియగు చుండును

చలికాలములో భూమి చల్లగనుండి, పీడనము హెచ్చుగ నుండును గాలి సముద్రము వైపునకు ప్రసరించును వేసవికాలములో భూమి వెచ్చగ నుండగా, పీడనము తగ్గిపోవును దీనివలన సముద్రమునుండి గాలి భూమిపైకి ప్రసరించును గాలియందు కలుగు ఈ మార్పును ఋతుపవనమందురు ఇది ముఖ్యముగా ఆసియాఖండములో కన్పడును

నైసర్గిక లక్షణము, శీతోష్ణస్థితి సముద్రము యొక్క శీతోష్ణ స్థితి రమారమి ఒకే విధముగ నుండును భూమిచే గ్రహింపబడు ఉష్ణము, ఉష్ణసంవహనము వలన, గాలిలో కల్లోలము కలుగజేయును

శీతోష్ణస్థితిపై పర్వతముల ప్రభావము ఎక్కువగ నుండును ఎత్తయిన పర్వతములు శీతోష్ణస్థితిని విభజించుటకు ఉపయోగపడును ఇవి ఒకవైపునుండి మరొకవైపునకు ప్రసరించు సుడిగాలులను, క్రిందుగా ప్రసరించు వాయు ప్రవాహములను అడ్డగించును తూర్పునుండి పశ్చిమమునకు విస్తరించిన హిమాలయ పర్వతములు, ఆల్ప్స పర్వతములు ధ్రువములనుండి వచ్చు చలిగాలులను దక్షిణ ప్రాంతమునకు పోకుండ అడ్డగించును కావున ఇటలీ, ఉత్తరభారతము ఉష్ణముగ నుండును అట్లే ఆండీస్, రాకీ పర్వతములు, భారతదేశపు పశ్చిమ కనుమల నుండియు, సముద్రము నుండియు వచ్చు గాలులను అడ్డగించి గాలి మరుగు ప్రాంతములకు వర్షాభావము కలిగించును సముద్రపుగాలి నీటిగాలివలె పగలు నేలమీదినుండి పర్వతములపైకిని, రాత్రి పర్వతములనుండి నేలమీదికిని వీచుచుండును

చిత్రము 10




పటము 8

వర్షపురీతులు ఎన్ని మార్పులున్నను, ప్రతిసముద్రము, వాయువునకు నీటిని సరఫరా చేయుచుండును ఈ సముద్రపు గాలుల పరంపరచే తేమ భూమికి కొనిపోబడును ఈ తేమ వర్షముగ, మంచుగ, వడగండ్లుగ, మంచుబిందువులుగ భూమి

మీద పడుచుండును పెక్కు ప్రవాహముల రూపమున ఈ నీరు మరల సముద్రమున కలియుచుండును విశ్వవ్యాపకమైన ఈ ప్రవాహచక్రము 8 వ పటములో చూపబడినది 9 వ పటములో భూమిమీద పడు సగటువర్షపాతము చూపబడినది చెమ్మగాలి వీచునపుడే వర్షపాతము సంభవించును ఈగాలి ముఖ్యముగా తుపానుల మూలమున, పర్వతారోహణ మొనర్చి పైకిపోయి మేఘములను పుట్టించి వర్షములను కలుగజేయును ఉన్నత, మధ్యమ అక్షాంశ రేఖలయందలి మండలములయొక్క పశ్చిమ

చిత్రము 57




పటము 9

ప్రభావముకలిగి యుండునని గిల్‌బర్ట్ వారును, ఆతని అనుచరులును నిరూపించిరి ఇప్పటికిని శీతోష్ణస్థితి శాస్త్రమునం దిది యొక సమస్యగా నున్నది ప్రపంచమున ఘటిల్లు వర్షపాతము 10 వ పటములో చూపబడినది

**శీతోష్ణస్థితి—మానవసౌఖ్యము** మానవశరీరమునకు కొంత పరిమాణముగల వేడిమి అవసరము అది ఎక్కువైనను తక్కువైనను అనారోగ్యము కల్గును మానవుని సౌఖ్యము ఉష్ణోగ్రతమీద, వాయువేగముమీద ఆధారపడి యుండును

చిత్రము 58




పటము 10

తీరమునందు ఋతుపవనము ప్రధానమైనది భూమధ్యరేఖా మండలమున వర్షమధికముగ పడును ఈవర్షపాతము విశేషముగా శీతకాలమునందు ఘటిల్లు తుపానులవలన సంభవించుచున్నది కాని ఋతుపవనప్రాంతములలో వేసవియందు ఎక్కువ వర్షము కురియును సహారావంటి పశ్చిమ తీరపు ఎడారులపైపునకు తేమలేనిగాలి వీచుటచే, అచ్చట వర్షము లుండవు

**శీతోష్ణస్థితి పరివర్తనము** శీతోష్ణస్థితికి కొన్ని నియమ లక్షణము లుండును పెక్కుచోట్ల ప్రతిసంవత్సరము పవనస్థితి సాధారణముగా ఒకే పరిధిలో నుండును ఒకమానవుని జీవిత కాలమునందు శీతోష్ణస్థితి ఒక స్థిరమార్గమును సూచించును ప్రాచీనలిఖిత చరిత్రయందు శీతోష్ణస్థితిలో మార్పులు జరిగినట్లు సూచింపబడెను ప్రతిసంవత్సరము జరుగుమార్పు వ్యవసాయమునకు ఉపయోగపడుచున్నది హిందూ, పసిఫిక్ మహాసముద్రములమీది వాయువులకు గల పరస్పరసంబంధము హిందూదేశపు పశ్చిమభాగముమీది ఋతుపవనముల మీద

**వర్షపాతమండలములు** (ఎ) భూమధ్యరేఖామండలము— ఇది రెండుగోళార్ధముల వ్యాపారపవనములుగల ప్రాంతము ఇది భూమధ్యరేఖకు ఇరువైపులనున్న, 10 డిగ్రీలు అట్లాంటిక్, పసిఫిక్, ఉత్తరహిందూమహాసముద్రముల ప్రభావమునకు లోనైన తూర్పు, పడమరదీవుల భూమండలము వాయుపీడనము ఈ మండలముపై తక్కువగ నుండును తరచుగా సంభవించు తుపానులవలన, గాలులు, వర్షపాతము అధికముగ నుండుచు ఇది 'అధికవర్ష మండలము'లో చేర్చబడినది ఇచ్చట ఉరుములతో వర్షము కుండపోతగ కురియును అప్పటికప్పుడే, వెంటనే ఆకాశము నిర్మలమై నక్షత్రములు కాన్పించును

(బి) వ్యాపార పవనమండలములు ఇవి ఉత్తరగోళార్ధమునందు ఈశాన్య, ప్రాగ్దిశలనుండియు, దక్షిణగోళార్ధమునందు ఆగ్నేయప్రాగ్దిశలనుండియు వీచును ఇవి 25° ఉ నుండి బయలుదేరి భూమధ్యరేఖను దాటి వ్యాపారపవనము

లగును లేదా, ఇవి భూమధ్యరేఖా సమీపప్రాంతమునకువచ్చు సరికి పశ్చిమవాయువులుగా మారును పసిఫిక్ మహాసముద్రములో 40° ఉ – 5° ఉ సమాంతరములమధ్య ఈ పవనములు వీచును అట్లే, దక్షిణగోళార్ధమందు సుమారు ఈసమాంతర ప్రదేశములలో వాయుపీడనము ఎక్కువై, గాలులు బయలు దేరును ఆగ్నేయవ్యాపారపవనములు ఎడతెగక వీచును ఆగ్నేయ ఆసియాయొక్క ఆగ్నేయ ఋతుపవనము ఉత్తరమునుండి వీచును అట్లే దక్షిణ అట్లాంటిక్ వ్యాపారపవనములు భూమధ్యరేఖనుదాటి నైరృతి ఋతుపవనములుగా మారును దక్షిణాఫ్రికా, చిలి పెరూఎడారులు, ఈ ఆగ్నేయ వ్యాపారపవనములు పొడిగానుండుటవలన, ఏర్పడినవని చెప్పవచ్చును

(సి) ఋతుపవన శీతోష్ణమండలము భూమిపై ఉష్ణోగ్రతయందు కలుగు మార్పుల ఫలితముగా, ఆసియాపై వాయుపీడనము ఎక్కువగును చలికాలములో చైనాయందు ఈ వాయువులు వాయవ్య పవనము లనబడును అట్లే మధ్య చైనాలో ఇవి ఉత్తరపవనములనియు, భూమధ్యరేఖా సమీప మండలమందలి పవనములు ఈశాన్యపవనములనియు అనబడును ఇవియే కాక, వాయుగుండములు మధ్యధరాసముద్రమునుండి బయలుదేరి తూర్పుగా భారతదేశమునకు వచ్చి అచ్చట వర్షములను కలుగజేయును ఉత్తరభారతములో ఈ వర్షములు మిక్కిలి ఆవశ్యకములు ఈ శీతఋతుపవనములు అక్టోబరునుండి మార్చివరకు వీచును బంగాళాఖాతములో ఏర్పడు వాయుగుండములు పశ్చిమ, వాయవ్యదిశలకు జరుగును హిమాలయపర్వతములు ఈ ఋతుపవనములను పరిమిత మొనర్చును భారతీయ నైరృతి ఋతుపవనములు సెప్టెంబరు నెలవరకు వీచును చైనాలో ముఖ్యముగా హిందూమహాసముద్రమునుండి వీచు పవనములవలననే వర్షములు కలుగుచున్నవి ఈ ఋతుపవనములమార్పు, ముఖ్యముగా వృక్ష, జంతుజాలములపై ఎక్కువప్రభావముకలిగియుండును ఋతుపవనమండలమందలి ప్రాణికోటియొక్క జీవనము చాలవరకు ఋతుపవనధర్మములపై ఆధారపడియుండును దక్షిణ ఆగ్నేయ ఆసియాయందు పర్వతముల ప్రభావము మెండుగనుండును అస్సాములోని ఖాసీకొండల ప్రభావముకూడ అధికమే ఈవిధముగనే చైనా నైసర్గిక ప్రభావముకూడ ఎక్కువగనుండును ఈ తీరుగనే, ఉత్తర ఆస్ట్రేలియాలోని ఉత్తరక్వీన్స్‌లెండుకొండలపై వర్షము హెచ్చుగా కురియును

(డి) పశ్చిమ వాయవ్యమండలము : దక్షిణగోళార్ధమునందు 35°–60° మధ్యగల మండలముపై పశ్చిమవాయువులు వీచును ఇచ్చట ప్రచండవాయువులు నిర్విరామముగా వీచుటచే, ఇది 'రోరింగ్ ఫోర్టీస్' అని నావికులచే నామకరణము చేయబడినది పసిఫిక్ మహాసముద్రమును దాటిన తర్వాత ఈ పశ్చిమవాయువులు అమెరికాతీరమును చేరుచుండును పర్వతపంక్తులమూలమున ఈ గాలులనుండి, కొంతవరకు, అచ్చటి ప్రజలకు రక్షణము కల్గును అప్పుడప్పుడు ఘటిల్లు వాయుగుండములవలన ఈ గాలులు మెక్సికో సింధుశాఖవరకు విస్తరించును ధ్రువమార్గమందలి అక్షాంశమండలములలో తేమగాలి, మితవర్షము కల్గించును పశ్చిమ పవనములు సముద్రములపై పయనించుటచే ఎడతెగని వర్షపుజల్లులు పడును వేసవియందు అధికవర్షము కురియును భూతలముపై అక్టోబరు నెలలో అత్యధికవర్షము పడును జులై నెలలోకూడ వర్షపాతము ఒకమాదిరిగా ఎక్కువగనే పడును

(ఇ) మధ్యధరాసముద్రశీతోష్ణస్థితి మధ్యధరాసముద్రతీరప్రాంతములు, క్యాలిఫోర్నియా, చిలీసముద్రమండలము, దక్షిణఆఫ్రికాలోని నైరృతికేప్ రాష్ట్రము పశ్చిమ ఆస్ట్రేలియా ప్రాంతపు వాతావరణము, ఆసక్తి దాయకముగానుండును మధ్యధరాసముద్రములోను, దానితీరప్రాంతములలోను గాలి నిలుకడగ వీచును ఈ పవనములు హెచ్చుస్థాయిలో అప్పుడప్పుడు అతితీవ్రముగా వీచుచుండును చలికాలమందు వీచుగాలులను పశ్చిమపవన శ్రేణిలో చేర్చవచ్చును ఇచ్చటవర్షపాతము వాయవ్యయూరపునందలి తుపానుగాలులవలెనుండును ఇచ్చట ముఖ్యముగా శీతకాలము వర్షఋతువు ఇచ్చట వర్షము అధికముగా కురిసినవెంటనే ఆకాశము నిర్మలమగుచుండును అందుచే ఈ మండలమునకును, పశ్చిమవాయు మండలమునకును, భేదము కలదు వేసవి వర్తకమునకు అనుకూలముగ నుండును గాలివాలు ప్రాంతమునందు వర్షము తక్కువగా నుండును

(ఎఫ్) ధ్రువమండలములు అంటార్కిటికా అనునది సముద్ర మట్టముపై 8000 అడుగుల ఎత్తుగ నుండి దట్టముగ మంచుతో కప్పబడిన ప్రాంతము అచ్చట వేసవికాలమందు కూడ ఈ మంచువలన ఘనీభవనమును మించి ఉష్ణోగ్రత

పెరుగదు ఇచ్చటి శీతలముచే సాధారణ వాతావరణ ప్రసారణము నధిగమించి భూమిపై ప్రతి చక్రవాతపు వాయువులు సృష్టింపబడును ధ్రువమండల మనగా ఒక అగాధమగు సముద్రము ఈ ప్రాంతము శీతకాలము మంచుతో కప్పబడి యుండును ఎండకాలమున మాత్రము కొలదిగ జలము కన్పించును ఉత్తర ధ్రువప్రాంతమందు గ్రీన్‌లెండు, స్కాండినేవియాల మధ్యగల సముద్రము తప్ప, తక్కిన ప్రాంతమంతయు భూమియే చలికాలమున వాయవ్య సైబీరియా, గ్రీన్‌లెండు భాగము ప్రపంచ మంతటిలో అతి శీతలముగ నుండును శీతకాలమందు ఆర్కిటిక్, పసిఫిక్ ప్రాంతము లందు ఆకాశము నిర్మలముగను, ప్రశాంతముగను ఉండును వేసవిలో కెనడా, సైబీరియాలలో పీడనము తగ్గును అంటార్కిటిక్ ప్రాంతమునందు వర్షపాతము తక్కువగ నుండును అప్పుడప్పుడు మంచు తునకలు కురియును అమెరికా, యూరేషియాలతో చుట్టబడిన ప్రాంతము ధ్రువప్రాంతముగను, తుపాను స్వభావము కలదిగను ఉండును ఇచ్చటి శీతకాలము మంచుమయమై యుండును వేసవియందు తీరమునందును కొండచరియల యందును వర్ష మధికముగా కురియును

వాతావరణ విభజనము ప్రపంచమందలి వివిధ ప్రాంతములలో వాతావరణము వివిధ రకముల శీతోష్ణస్థితితో నుండును అందుచే ఒక తరగతి శీతోష్ణస్థితిని విభజించుటకు, ఆ మండలముల నడుమ సరిహద్దుల నేర్పరుపవలెను కాని సంవత్సరము పొడవున కొన్ని ప్రాంతములలో ఒకే రకమైన శీతోష్ణస్థితి ఉండవచ్చును లేక మారవచ్చును కావున ఒక్క ప్రాంతపు శీతోష్ణస్థితి ఒకే ఒక వాతావరణ లక్షణముచే నిర్ణయింప బడదు

"కొప్పెన్" అనువాతని వర్గీకరణ విధానము సాంవత్సరిక, మాసీయ ఉష్ణోగ్రతా, వర్షపాతనులపై ఆధారపడును భౌగోళిక శాస్త్రజ్ఞు లీవర్గీకరణమును విమర్శించినారు వాతావరణ పరిశీలనము సమగ్రముగా జరగుటకవకాశము లేకుండుటచే ఈ వర్గీకరణ విధానము పరిమితమొనర్పబడినది పై విధముగా కాక, థ్లోర్ అనువాతడు వర్ణనాత్మకమగు శీతోష్ణ శాస్త్రమునకు వ్యతిరేకమైన విధానమును సూచించెను దానితోపాటు ఆశాజనకమగు కొన్ని సూచనలను కూడ అతడు ప్రతిపాదించెను ఋతువుల హెచ్చు స్థాయిననుసరించి వాయుపీడన మండలమును, వర్తమాన వాయుప్రమాణముల ననుసరించి పడు శీతోష్ణ మండలములను అతడు వర్గీకరించెను

టి యస్ యస్ ఆం

## ప్రఫుల్ల చంద్రరాయ్, సర్

సర్ ప్రఫుల్లచంద్రరాయ్ సుప్రసిద్ధుడైన భారతీయ రసాయన శాస్త్రవేత్త ఈతడు వంగరాష్ట్రమున జెస్సూరు జిల్లాలో రారువి అను గ్రామమున 1861వ సం॥ ఆగస్టు 2వ తేదీని జన్మించెను ఈతని తండ్రి హరిశ్చంద్రరాయ్ ప్రఫుల్లచంద్రుడు తొమ్మిదేండ్ల ప్రాయమువరకు రారువి గ్రామమునసే చదివెను 1870లో హరిశ్చంద్రరాయ్ కుటుంబము కలకత్తా పట్టణ నివాసమునకు వచ్చి చేరెను అతడు బ్రహ్మసమాజమునం దభిమానము కలవాడు ప్రఫుల్లచంద్రుని హృదయము కూడ చిన్నతనము నుండియు బ్రహ్మసమాజమందే లగ్నమైనది 1879లో అతడు ప్రవేశపరీక్షయం దుత్తీర్ణుడయ్యెను ఈశ్వరచంద్ర విద్యాసాగర పండితుడు స్థాపించిన మెట్రొపాలిటన్ ఇన్‌స్టిట్యూషనులో అతడు ఎఫ్ ఏ తరగతిలో చదువుచుండగా అచట రసాయన శాస్త్రాధ్యాపకుడగు సర్ అలెగ్జాండర్ పెడ్లర్ వలన అతనికి రసాయన శాస్త్రమునందు గొప్ప అభిరుచి కల్గినది ఆ సమయముననే ప్రఫుల్లచంద్రునికి "గిల్‌క్రిస్ట్" విద్యార్థి వేతనము లభించి, తన్మూలమున యూరపు ఖండమున ఉన్నత విద్య నభ్యసించు అవకాశము లభించెను

1882లో ప్రఫుల్లచంద్రుడు ఎడింబరో విశ్వవిద్యాలయమున బి ఎస్ సి పరీక్షకొరకు చదువనారంభించెను రసాయన, భౌతిక, జంతు, వృక్షశాస్త్రము లాతడు కోరుకొనిన అభిమాన విజ్ఞానశాస్త్రములు 1888లో అతడు ఎడింబరో విశ్వవిద్యాలయమున "డాక్టర్ ఆఫ్ సైన్సు" అను పట్టమును పొందెను తరువాత అతనికి గిల్‌క్రిస్ట్ ఫౌండేషను వారి ప్రత్యేక విద్యార్థి వేతనము, హోప్ బహుమతి విద్యార్థి వేతనము లభించినవి ఎడింబరో విశ్వవిద్యాలయ రసాయన శాస్త్రసంఘమున కతడు ఉపాధ్యక్షుడుగ ఎన్నుకొనబడెను సర్ మ్యూర్, సర్ చార్లెస్‌బెర్నార్డ్ మొదలగువారు ఇండియా రాజ్యాంగ కార్యదర్శికి ప్రఫుల్లచంద్రుని గూర్చి సిఫారసు చేసిరి 1888 లోనే అతడు కలకత్తా నగరమునకు తిరిగి వచ్చెను

1889వ సంవత్సరమున ప్రఫుల్లచంద్రరాయ్ కలకత్తా

 

రాష్ట్రీయ కళాశాలలో సహాయ రసాయన శాస్త్రాచార్యుడుగ నియమింపబడెను నూనె, నెయ్యి మొదలగు ఆహార పదార్థములలో కలగలుపు ఎక్కువై అమ్మబడుచుండుట చూచి, ఆతడు సుమారు మూడేండ్లు పరిశోధనాలయములో ఆయా పదార్థములను విశ్లేషణము చేయుచు కృషిచేసి, తత్ఫలితము లను ప్రచురించెను ప్రకృతి పరిశీలనమం దతడు చాల శ్రద్ధ తీసికొనుచు వంగభాషయందు "జంతుశాస్త్ర" మను గ్రంథ మును రచించెను తీరిక సమయ ములయం దాతడు బ్రహ్మసమాజ కార్యక్రమములలో పాల్గొను చుండెడివాడు

వంగదేశమున ప్రకృతిసంపద విశేషముగ నున్నది పరిశ్రమల కవసరమైన ముడిసరకులు చవుకగా, విస్తారముగా దొరకును రాష్ట్ర కళాశాలలో ఉద్యోగము దొరకిన తరువాత తన నెల జీత ములో కొంత భాగము వెనుక వేయుచు స్వల్పమగు పెట్టుబడితో ప్రఫుల్లచంద్రుడు తన గృహమందే ఔషధములను తయారు చేయుట మొదలుపెట్టెను తా నొక పారిశ్రామికుడై, విజయము పొంద వలెనను గట్టి పట్టుదల ఆతనికి కల్గెను కొలది సంవత్సరములలో కలకత్తాలో అప్పర్ సర్క్యులర్ రోడ్డునందున్న ఆతని గృహము ఒక కర్మాగారముగా మారినది అదియే "బెంగాల్ కెమికల్ అండ్ ఫార్మస్యూటికల్ వర్క్స" అను సుప్రసిద్ధమైన పరిశ్రమాగారము 1902లో అది రెండులక్షలరూప్యములమూలధనముతో "లిమిటెడ్" వ్యాపారసంస్థ యైనది ఆ కర్మాగారములో ఆసియా ఖండమున గంధకికామ్లము తయారుచేయు యంత్రములలోనెల్ల పెద్దయంత్రము నెలకొల్పబడినది ప్రఫుల్లచంద్రుడనేక పారిశ్రామికోద్యమములకు కారకుడయ్యెను అధ్యక్షుడుగనో, ప్రోత్సాహకుడుగనో, పోషకుడుగనో, ఆతడనేక పరిశ్రమలతో సంబంధము పెట్టుకొనెను ఆతడు స్థాపించిన

చిత్రము 59



ప్రఫుల్లచంద్రరాయ్

బెంగాల్ కెమికల్ అండ్ ఫార్మస్యూటికల్ వర్క్స ఇప్పటికిని భారతీయుల కొక గొప్ప మరణశాసన పూర్వక దానముగా నిలిచి యున్నది

రాష్ట్ర కళాశాలా పరిశోధనాలయమున ప్రఫుల్లచంద్రుడు కృషిచేయుచు, మెర్క్యురస్ నైట్రైట్ అను పాదరస లవణమును కనిపెట్టెను ఆతడు గంధకము, ప్లాటినము మొదలగువాటి సంయుక్త ద్రవ్యములనుగూర్చి కూడ కొన్ని పరిశోధనములనుచేసెను సుమారు పదునైదు సంవత్సరములు శ్రమపడి, పరిశోధనముజరపి, "హైందవ రసాయనశాస్త్ర చరిత్ర" అను గొప్ప గ్రంథమును రెండు సంపుటములు కలదానిని వ్రాసెను 1902 వ సం॥ లో మొదటి సంపుటము, 1908 వ సం॥ లో రెండవ సంపుటము ప్రచురింపబడినవి ఆ గ్రంథము అత్యుత్తమమగు ప్రశంసల నందినది

1904 లో వంగ రాష్ట్రప్రభుత్వము ప్రఫుల్ల చంద్రుని ఐరోపా ఖండ పర్యటనమునకు పంపెను 1912లో లండను నగరమునజరిగిన సామ్రాజ్యవిశ్వవిద్యాలయాధినేతల సమావేశమునకు ఆతడు ప్రతినిధిగా వెళ్ళెను డర్హామ్‌విశ్వవిద్యాలయమువారతనికి గౌరవ డి యస్‌సి పట్టము సమర్పించిరి

ప్రఫుల్ల చంద్ర రాయ్ రసాయనశాస్త్రసంబంధమగు రెండు గొప్పసంస్థలను స్థాపించెను మొదటిది భారతీయ రసాయనశాస్త్రసంప్రదాయము, రెండవది 1924 వ సంవత్సరమున ఆతడు అధ్యక్షుడుగనున్న భారతీయ రసాయనవేత్తల సంఘము ఆ సంఘభవన నిర్మాణమున కాతడు పండ్రెండు వేల రూప్యముల భూరివిరాళ మొసగెను ఈ రెండుసంస్థల వలన ఆతనికి శాశ్వతమగు పేరుప్రతిష్ఠలు కల్గినవి 1936 లో ఆతడు కలకత్తా విశ్వవిద్యాలయోద్యోగమునుండి విరమించు

కొనెను అతడు చివరివరకును ఆ విశ్వవిద్యాలయ రసాయన శాస్త్రశాఖకు ఎమరిటస్ ప్రొఫెసరుగ నుండెను

ప్రఫుల్ల చంద్రుని షష్టిపూర్తియైన తర్వాత అతడు ప్రభుత్వోద్యోగమునుండి విరమించుకొనువరకు మొత్తము ఒక లక్షముప్పదివేల ఏడువందల రూప్యములను ఆ విశ్వవిద్యాలయమునకు విరాళ మిచ్చెను తరువాత సుమారు పదునైదేండ్లు సర్ అషుతోష్ ముఖర్జీ స్థాపించిన రసాయనశాస్త్ర పరిశోధనాలయమునకు తన వేతనమును ముట్టజెప్పుచు, దాని కధిష్ఠాతగా పనిచేసెను 1911 వ సంవత్సరమున ప్రఫుల్లచంద్రునికి 'కంపానియన్ ఆఫ్ ది ఆర్డర్ ఆఫ్ ది ఇండియన్ ఎంపైర్' (C I E)అను గౌరవబిరుద మీయబడెను మొదటి ప్రపంచ యుద్ధమైన తరువాత ఆతనికి 'సర్' బిరుద మిచ్చిరి 1934 లో లండను నగరము నందలి 'రసాయనశాస్త్రజ్ఞుల సంఘము' నకు ఆతడు గౌరవసభ్యుడుగ ఎన్నుకొనబడెను 1932, 1935 సంవత్సరములలో ఆతడు స్వీయచరిత్రయొక్క ప్రథమ, ద్వితీయ సంపుటములను ప్రచురించెను

ప్రఫుల్లచంద్రునికి 1901 నుండియే గోపాలకృష్ణగోఖలే, రైటానరబుల్ శ్రీనివాసశాస్త్రి, మహాత్మ గాంధి మున్నగువారితో పరిచయము కల్గినది ఆతని మాతృదేశాభిమానము అపారమైనది "పరిశోధనము లాగగలవు, పరిశ్రమ లాగగలవు. కాని స్వరాజ్య మాగుటకు వీలులేదు" అని ఆత డెన్నియో సభావేదికలనుండి చెప్పుచుండెడివాడు ప్రజాసేవాపూరితములగు ఉద్యమముల నాత డెన్నియో నడపెను వంగరాష్ట్ర రాజకీయ, విద్యావిషయములలో ఆతనిస్థానము అద్వితీయమైనది 1921 నుండి ప్రఫుల్ల చంద్రరాయ్ ఖద్దరువస్త్రధారణము, దేశీయవిద్యావ్యాప్తి, అస్పృశ్యతానివారణ మున్నగు ఉద్యమములలో ప్రధానపాత్రవహించుటకు మొదలుపెట్టెను హిందూ - ముస్లిము సమైక్యము, సర్వమత - జాతీయతా సమన్వయము ఆతనికి ప్రియమైన ఆశయములు

1921లో ఖెస్నూరు క్షామనివారణోద్యమమున కాతడు నాయకత్వము వహించెను 1922 లో ఉత్తర వంగరాష్ట్రమున వరదలవలన కల్గిన ఉపద్రవములో ఆత డొనర్చిన మానవసేవ అపారమైనది ఆచార్య ప్రఫుల్ల చంద్రునిపై రవీంద్రునకు అత్యున్నత గౌరవభావ ముండెడిది

ప్రఫుల్ల చంద్రుని డెబ్బదవ జన్మదిన సందర్భమున భారతీయ రసాయనశాస్త్రవేత్తల సంఘ మాతని కొక అభినందన గ్రంథమును బహూకరించెను వంగరాష్ట్రప్రజల పక్షమునగూడ అట్టిగ్రంథ మొకటి ఆతనికి సమర్పింపబడినది ఆతని ఎనుబదవ జన్మదినోత్సవమునుగూడ ప్రజలు అట్టి ఉత్సాహముతోడను, అభినందనములతోడను జరపిరి

ప్రఫుల్ల చంద్రుడు విజ్ఞానయోగి. దేశభక్తుడు, మహాదాత, జాత్యుద్ధారకుడు, మహోదారమనస్కుడు, దయాదాక్షిణ్యమూర్తి 1944 జూన్ పదునారవ తేదీ సాయంకాలము ఆరున్నర గంటలకు కలకత్తా విశ్వవిద్యాలయ విజ్ఞానశాస్త్ర, సాంకేతిక కళాశాలలోని తన గదియందు ఆతడు తన భౌతిక కాయమును విడిచెను

బి వి ర

## ప్రభుత్వ కార్యనిర్వాహకవర్గము

నియంతృత్వరాజ్యములలో కార్యనిర్వాహకవర్గము సర్వాధికారము దాల్చియుండుట సహజము అయితే నేడు ప్రజాస్వామ్య రాజ్యములలోగూడ కార్యనిర్వాహకవర్గము యొక్క ఆధిపత్యము పెంపొందించుట గమనింపవలసియున్నది కొన్ని అవాంతర పరిస్థితులలో శాసనసభను తాత్కాలికముగ రద్దుపరచుట నేటి ప్రజాస్వామ్య దేశములలో జరుగుచున్నది కాని కార్యనిర్వాహక వర్గమును అట్లు రద్దొనర్చుట ఎచ్చటను కనివిని ఎరుగము కార్యనిర్వాహకవర్గమును విప్లవసమయములలో మాత్రము తొలగించుట కవకాశ మున్నది అది రద్దు చేయబడిన నాడు దేశము అరాజకముపాలై, రాజ్యాంగయంత్రము స్తంభించును ప్రభుత్వాంగము లన్నిటియందు కార్యనిర్వాహకవర్గము ప్రధానస్థానము వహించియున్నది అందుచే ప్రభుత్వమునకు ప్రత్యామ్నాయంగా 'కార్యనిర్వాహకవర్గము' అనుశబ్దమును వాడుట నేడు పరిపాటియైనది

కార్యనిర్వాహకశాఖ, ప్రభుత్వ పరిపాలనా శాఖలలో నొకటి, ఈ పదమునకు వివిధనిర్వచనము లీయబడినవి స్థూలముగ చెప్పవలెనన్న, ప్రభుత్వవిధానములను నిర్ణయించుచు, శాసనసభగావించు చట్టములను, తీర్మానములను ఆచరణలో పెట్టునది కార్యనిర్వాహకశాఖ ఈ శబ్దమును సంకుచితదృష్టితో కొందరును, విశాలదృష్టితో కొందరును నిర్వచించుటచే, దీనికి వివిధ అర్థములు, వివరణములు ఈయబడినవి సంకుచితదృష్టితో చూచినచో, కార్యవర్గము యొక్క ముఖ్యాధికారి యగు మంత్రిమండలి మాత్రమే కార్యనిర్వాహకవర్గముగా పరిగణింపబడును విశాలదృష్టితో నిర్వచించి

నచో, పరిపాలనాయంత్రాంగమును నడపు అన్నివర్గములకు చెందినవారు కలిసి సమష్టిగా కార్యనిర్వాహకవర్గ మనబడును అనగా, రాజకీయవర్గమునకు చెందిన కార్యవర్గముఖ్యాధికారియు, మంత్రులును, రాజకీయ వ్యవహారములతో ప్రమేయములేని వివిధస్థాయీలకు చెందిన ఉద్యోగులును (గుమాస్తా మొదలు ప్రభుత్వకార్యదర్శివరకు) కలిసి కార్యనిర్వాహకవర్గ మనబడును సాధారణముగ నిత్యమును వాడుకయందు ఈ పదమును సంకుచితార్థములోనే ప్రయోగించుట అలవాటైనది

కార్యనిర్వాహక వర్గనిర్మాణము అంతస్తులవారీగా నుండును అన్నిటికంటె పై అంతస్తులో నున్నవానిని కార్యవర్గ ముఖ్యాధికారియని అందురు కెనడా, ఆస్ట్రేలియా, సింహళములలో గవర్నరు - జనరల్ అనియు, ఇండియా, ఫ్రాన్సు అమెరికా సంయుక్తరాష్ట్రములలో అధ్యక్షుడనియు పేర్లు గలవు ఇండియా, అమెరికా సంయుక్తరాష్ట్రములు మున్నగు దేశములలో కార్యవర్గ ముఖ్యాధికారి పరోక్షపు టెన్నికపద్ధతివలనను, కెనడా, ఆస్ట్రేలియా, న్యూజీలెండు మొదలగు దేశములలోనామినేషన్ పద్ధతివలనను,పదవిలోనికివచ్చును పరిమితాధికారియగు రాజుగల రాజ్యములో రాజు, కార్యవర్గముఖ్యాధికారియై వ్యవహరించును ఉదా బ్రిటన్ రాజులేని ప్రజారాజ్యములో ఈ అధికారియొక్క పదవీకాల పరిమితి సాధారణముగా 5 లేక 4 సంవత్సరము లుండును ఈ నిర్ణీతకాలములో శాసనసభగాని, మరి ఏ ఇతరసంస్థగాని కార్యవర్గముఖ్యాధికారిని తొలగింపజాలదు అయితే శాసనసభకు ఆతనిపై మహాభియోగమును తెచ్చుటద్వారా ఆతనిని తొలగించు అధికారముండును ఇది చాల అరుదుగ మాత్రమేజరుగును కార్యవర్గ ముఖ్యాధికారి తిరిగి ఎన్నికయగు విషయమై పెక్కుపద్ధతులు ఆచరణమునందున్నవి అమెరికాసంయుక్తరాష్ట్రములలో ఒకేవ్యక్తి రెండుపర్యాయములకంటె ఎక్కువగా అధ్యక్షుడుగా ఎన్నికయగుటకు వీలుపడదు ఇట్టి నిబంధనలవలన, ఎన్నికయగువ్యక్తి తన పదవిని నిలబెట్టుకొనుటకు ప్రాకులాడక, స్వతంత్రముగ ప్రవర్తింపవీలగును భారతదేశమువంటి కొన్నిరాజ్యములలో ఒకేవ్యక్తి మరల మరల ఎన్నికయగు విషయమై ఎట్టినిబంధనలులేవు ఎన్నిపర్యాయములైనను, ఆతడు ఎన్నికకావచ్చును బ్రెజిల్, చిలీ మున్నగు కొన్ని లాటిన్ అమెరికా దేశములలో కొంతకాలవ్యవధితో తిరిగి ఎన్నికకు వీలగు విధానము ఆచరణములో నున్నది కార్యవర్గముఖ్యాధికారిపదవి, పరిపాలనారంగములో అత్యున్నతమైనదగుటచే, అది గౌరవముతో, హోదాలతోకూడుకొని యుండును ఆతని అధికారములు కడ విస్తృతముగ నుండును కాని పార్లమెంటరీ ప్రజాస్వామ్యములో ఈతని అధికారము లన్నియు నామమాత్రములే పలన, ప్రధానమంత్రిసలహాపై కార్యవర్గముఖ్యాధికారి వ్యవహరించవలెను ఉదా భారతదేశాధ్యక్షునకు, పార్లమెంటును సమావేశపరచుట, రద్దుచేయుట, తనవద్దకు పంపబడిన చట్టుచట్టములను ఆమోదించుట లేక తిరస్కరించుట, మంత్రిమండలిని నియమించుట, న్యాయాధిపతులను నియమించుట, సర్వసేనానిగా సైనిక గౌరవములను పొందుట, రాయబారులను నియమించుట, దేశమున శాంతిభద్రతలకు వలయు చర్యలు తీసుకొనుట మొదలగు అధికారము లీయబడినవి కాని పార్లమెంటరీప్రభుత్వసంప్రదాయానుసారము అధ్యక్షుడు ప్రధానమంత్రిసలహా ననుసరించి ప్రవర్తింపవలెను

కార్యనిర్వాహక వర్గమును రెండువిభాగములుగా విభజింపవచ్చును (1) రాజకీయ విభాగము (2) రాజకీయములతో ప్రసక్తి లేని విభాగము రెండవతరగతివిభాగము అన్ని దేశములలోను చాలవరకు ఒకేసిద్ధాంతముమీద ఆధారపడియుండును కాని మొదటిరకపు విభాగములో వివిధరకములున్నవి వాటిని ముఖ్యముగా మూడువర్గములక్రింద విభజింపవచ్చును (1) మంత్రిమండలిపద్ధతి (2) అధ్యక్షప్రభుత్వ పద్ధతి (3) డైరెక్టరేట్ పద్ధతి

మంత్రిమండలి పద్ధతి బ్రిటనులో 18వ శతాబ్దినుండి క్రమముగా అభివృద్ధిగాంచి నేడు చాల జయప్రదముగా సాగుచున్నది ఇండియా, కెనడా, ఆస్ట్రేలియా, న్యూజీలెండు మున్నగు కామన్‌వెల్తు రాజ్యములు కూడ ఈ పద్ధతినే అనుసరించినవి ఈ మంత్రిమండలి ప్రభుత్వ విధానమును బాధ్యతాయుత ప్రభుత్వమనికూడ పిలుతురు మంత్రివర్గము శాసనసభకు బాధ్యత కలిగి వ్యవహరించుట ఈ పద్ధతియందలి ముఖ్య లక్షణము (1) సాధారణముగా మంత్రులు శాసనసభలో సభ్యులై ఉండవలెను సభ్యుడు కానివాడు మంత్రిగా నియమింప బడినచో, ఆరు మాసములలో ఆతడు శాసనసభ్యుడు కావలెను (2) మంత్రులు సమష్టిగను, వ్యక్తిగతముగను శాసనసభకు బాధ్యులై ఉండవలెను (3) మంత్రి

వర్గము యొక్క కాలపరిమితి నిర్ణయింప బడదు శాసన సభలో అధికసంఖ్యాకులైన సభ్యులు ఎప్పుడు మంత్రివర్గముపై, అవిశ్వాస తీర్మానమును ఆమోదింతురో, అప్పుడు మంత్రులు తమ పదవులకు రాజీనామాల నియ్యవలెను (4) మంత్రిమండలి అధ్యక్షుడే నాయకుడు, ప్రధాన మంత్రియుగూడ నగును ఈతడు కార్యనిర్వాహక వర్గములో కీలక స్థానమును వహించి యుండును మంత్రుల నియామకము, తొలగింపు ప్రధానమంత్రి సలహాపైననే జరుగును మంత్రుల నందరిని ఒక త్రాటిపైన నడపించుట, ప్రభుత్వ ప్రణాళికలకు, సిద్ధాంతములకు, రూపురేఖలు దిద్దుట ప్రధానమంత్రిమీదనే చాలవరకు ఆధారపడి యుండును (5) కార్యవర్గ ముఖ్యాధికారి (భారత దేశములో అధ్యక్షుడు) మంత్రివర్గ సమావేశములలో పాల్గొనుటకు వీలులేనందున, ప్రధానమంత్రి ప్రభుత్వ నిర్ణయములను అధ్యక్షునకు తెలియపరచవలెను పార్లమెంటును, మంత్రివర్గమును, దేశాధ్యక్షుని కలియగట్టువాడు ప్రధానమంత్రి (6) మంత్రిమండలి, పరిపాలనా బాధ్యతను వహించుటయే కాక, చిత్తుచట్టములను తయారుచేసి, శాసనసభలో ప్రవేశపెట్టు బాధ్యత కూడ కలిగి యుండును ఈ మండలి శాసనసభపై నాయకత్వమును గూడ వహించు అధికారము కలది

కాబినెట్ పద్ధతికంటె విభిన్న లక్షణములు కలది అధ్యక్ష ప్రభుత్వ పద్ధతి ఉదా అమెరికా సంయుక్త రాష్ట్రములు, లాటిన్ అమెరికా దేశములు ఈ పద్ధతి ప్రభుత్వ శాఖల అధికార విభజన సిద్ధాంతముపై ఆధారపడి యున్నది శాసన నిర్వహణశాఖ శాసన నిర్మాణశాఖనుండి వేరు చేయబడును (1) కార్యనిర్వాహకశాఖపై సర్వాధికారి అధ్యక్షుడు కార్యవర్గమునందలి ఇతర సభ్యులు అధ్యక్షునికి పూర్తిగా లోబడి యుందురు వారిని నియమించుటకు, తొలగించుటకు అధ్యక్షునికే పూర్తి అధికారము లుండును (2) ఈతడు ప్రత్యక్షపు ఎన్నికపద్ధతి వలనగాని, పరోక్షపు ఎన్నికపద్ధతివలనగాని అధికారమును చేపట్టును (3) అధ్యక్షుడు శాసన సభ్యుడుగా నుండ వీలులేదు ఒకవేళ శాసనసభ్యుడు అధ్యక్ష స్థానమునకు ఎన్నుకొనబడినచో, శాసన సభ్యత్వమును విరమించుకొనవలెను (4) అధ్యక్షునకుగాని, అతని కార్యవర్గమునందలి సభ్యులకుగాని (వీరిని కార్యదర్శు లందురు) చిత్తుచట్టములను శాసనసభలో ప్రవేశపెట్టు అధికారము లేదు అసలు వారికి శాసనసభా సమావేశములలో పాల్గొను హక్కుగూడ ఉండదు (5) అధ్యక్షుడుగాని, అతని కార్యదర్శులుగాని శాసనసభకు బాధ్యులు కాజాలరు (6) అధ్యక్షుని తొలగించు అధికారము శాసనసభకు ఉండదు అతని పదవీ కాలపరిమితి రాజ్యాంగ చట్టముచే నిర్ణయింపబడి యుండును

డైరెక్టరేటు పద్ధతిపై ఆధారపడు కార్యనిర్వాహక వర్గ విధానము స్విట్జర్లెండు, రష్యా మున్నగు కొన్ని దేశములలో కలదు మంత్రివర్గ ప్రభుత్వ లక్షణములు కొన్నియు, అధ్యక్ష ప్రభుత్వ లక్షణములు కొన్నియు కల్గియుండుట డైరెక్టరేటు విధానమందలి విశిష్టత డైరెక్టరేటు పద్ధతి యందు (1) మంత్రిమండలి యుండును (2) మంత్రులను శాసనసభ నియమించును (3) మంత్రులు, శాసనసభా కార్యకలాపములలో పాల్గొనుటకు, చిత్తుచట్టములను ప్రవేశపెట్టుటకు అవకాశ ముండును (4) కార్యనిర్వాహకవర్గ పదవీకాలము రాజ్యాంగ చట్టబద్ధమై యుండునేకాని, శాసనసభపై ఆధారపడి యుండదు మంత్రిమండలి శాసనసభకు బాధ్యత వహింపదు (5) ఇంతేకాక, మంత్రులు సమష్టి బాధ్యతతో వ్యవహరింప నవసరముండదు, ఎవరికి వారే బాధ్యులు (6) మంత్రిమండలి అధ్యక్షుడు నామమాత్రమునకే అధ్యక్షుడుగాని, అతనికి ప్రత్యేకాధికారములు లేవు

నేడు ప్రభుత్వ నిర్వహణములో ప్రధాన పాత్రను నిర్వహించువారు సివిల్ సర్వీసు ఉద్యోగులు కార్యనిర్వాహక వర్గములో రాజకీయములతో ప్రమేయము లేకుండ వీరు వ్యవహరింతురు పరిపాలనా విషయములలో విశేషమగు శిక్షణము, పరిజ్ఞానము, నైపుణ్యము కలిగి, ప్రభుత్వ నిర్వహణమే వృత్తిగాగలవారు సివిల్ సర్వీసు ఉద్యోగు లనబడెదరు వారి నియామకము, తీసివేత, వేతనములు మున్నగు విషయములు చట్టబద్ధములై యుండును నిత్య పరిపాలనా విషయములలో మంత్రిమండలికి అండగా నిలిచి, వారికి తగురీతిని సహాయమొనర్చుట ఈ ఉద్యోగుల ముఖ్య ధర్మము వీరు మంత్రులకు చేదోడు వాదోడుగా నుండి, సలహాల నిచ్చుచు, అవసర విషయములను అందజేయుచు సహకార మొసగవలెను మంత్రిమండలికి సలహా, సహకారముల నొసగుట మాత్రమే ఈ ఉద్యోగుల విధి తన సలహాలకు విరుద్ధముగా మంత్రిమండలి నిర్ణయము తీసికొనినను, ప్రశ్నింపక, ఆట్టి నిర్ణయములను ఆచరణయందు పెట్టుటకు ఈ ఉద్యోగి

సర్వదా కృషి చేయవలెను మంత్రిమండలి సభ్యులు కూడ కొన్ని నియమములను పాటింపవలెను ఉద్యోగులతో సంప్రదించుటగాని, వారి సలహాలను స్వీకరించుటగాని తమ హోదాకు తక్కువైనదను, అహంభావముతో మంత్రులు ప్రవర్తింపరాదు ఉద్యోగులను రచ్చకెక్కింపక, వారి గౌరవ ప్రతిష్ఠలను కాపాడు బాధ్యత మంత్రులపై నుండును పరిపాలనమునకు సంబంధించిన నిర్ణయములను తీసికొనుట మంత్రుల బాధ్యత, వారి నిర్ణయములను జయప్రదముగ నిర్వహించుట ఉద్యోగుల బాధ్యత

కార్యనిర్వాహక శాఖలో రాజకీయ వర్గమునకు చెందిన అధ్యక్షుడును, మంత్రిమండలియు నిర్వర్తింప వలసిన విధులు పెక్కులున్నవి (1) ప్రభుత్వ చర్యలపై ముఖ్య నిర్ణయములను వీరు తీసికొందురు జాతీయ, అంతర్జాతీయ విషయములపై ప్రభుత్వ వైఖరిని నిర్ణయించుట వీరి విధులలో ప్రధానమైనది (2) శాసనములు గావించుటలో గూడ కార్యనిర్వాహకవర్గము ప్రముఖపాత్ర వహించు చున్నది శాసనములకు కావలసిన విషయములను సేకరించుటయందును చిత్తుచట్టములను తయారు చేయుటయందును, కార్యనిర్వాహకవర్గము శాసనసభకు అత్యంతము సహాయపడును పార్లమెంటరీ ప్రభుత్వములో చిత్తుచట్టము శాసనమగుటకు కార్యవర్గ ముఖ్యాధికారి సమ్మతి అవసరము. (3) ఆర్థిక రంగములో కూడ కార్యనిర్వాహకశాఖ కావింపవలసిన విధులు చాల ముఖ్యమైనవి ఏయే మార్గముల వలన ధనము సేకరింప వలెనో, ఎంతెంత సొమ్ము ఏయే రంగములపై వెచ్చింపవలెనో మున్నగు విషయములలో కార్యనిర్వాహక వర్గము శాసనసభకు సలహాల నిచ్చుచుండును (4) సైనిక విషయములపై నిర్ణయములు గావించుట కూడ కార్యనిర్వాహక వర్గముయొక్క విధియే రక్షణశాఖ ఒక మంత్రిచే నిర్వహింపబడును సివిల్ ఉద్యోగులవలెనే, సైనికోద్యోగులు కూడ మంత్రివర్గనిర్ణయముల ననుసరించి నడచుకొనవలెను

నేడు అన్ని దేశములలోను కార్యనిర్వాహక వర్గము యొక్క ఆధిక్యము పెరుగుచున్నది దీనికి అనేక కారణము లున్నవి (1) క్యాబినెట్ ప్రభుత్వ పద్ధతి ప్రకారము చిత్తు చట్టములను ప్రతిపాదించుట, శాసనసభను రద్దుపరచుట మొదలగు అధికారములు మంత్రివర్గము కలిగియుండుటచే, మంత్రివర్గ నిరంకుశత్వమునకు అవకాశ మేర్పడినది (2) పరిపాలనలో జాప్యమును అరికట్టుటకును, పరిపాలనాసౌలభ్యమునకును ఆర్డినెన్సులు, శాఖీదులు, ప్రకటనలు జారీచేయు అధికారము కార్యనిర్వాహకవర్గమునకు లభించెను (3) ప్రభుత్వవిధులను నిర్వహించుటలో వివిధరకములైన తగవులు సంభవించును అట్టితగవులను తీర్చుటకు సాధారణన్యాయాధిపతులకంటె ప్రభుత్వశాఖాధికారులే సమర్థతతో న్యాయ మొసగగలరను భావముతో కార్యనిర్వాహకవర్గమునకు న్యాయాధికారము లొసగబడినవి (4) నాగరకత పెరుగు చున్నకొలది, పరిపాలనాపద్ధతులు, సమస్యలు క్లిష్టరూపము పొందుటచే, కార్యనిర్వహణలో అనుభవము తక్కువగల శాసనసభ్యులు, కార్యనిర్వాహకవర్గముపై ఆధారపడుట ఎక్కువైనది (5) నేటిప్రజాస్వామ్యములలో సామ్యవాద సిద్ధాంతములకు ప్రాధాన్యమిచ్చుటచే, ఆర్థిక, సాంఘిక, రంగములలో ప్రభుత్వ మనేకబాధ్యతలను నిర్వహించుచున్నది దీనిఫలితముగా అధికారుల ప్రాబల్యము హెచ్చినది (6) అంతరంగిక పరిస్థితులలో వచ్చిన మార్పులకుతోడు, అంతర్జాతీయసమస్యలవలనకూడ కార్యనిర్వాహకవర్గ ప్రాబల్యము అధికమైనది రెండుప్రపంచయుద్ధముల ఫలితముగను, అనంతరము అగ్రరాజ్యములనడుమ ఉత్పన్నమైన ప్రచ్ఛన్నయుద్ధ ఫలితముగను, కార్యనిర్వాహకవర్గపు అధికారములు అన్ని దేశములలో పెంపొందుచున్నవి

పై కారణముల ఫలితముగా కార్యనిర్వాహకవర్గము నియంతృత్వరూపమును దాల్చవచ్చు నను భీతి నేడు కలుగు చున్నది అందువలన ప్రభుత్వ ఆధిక్యమును అరికట్టుటకు వివిధ చర్యలు తీసికొనవలెను ఉద్యోగుల ప్రాబల్యమును అదుపులోనికి తెచ్చుటకు (1) అనధికారసంఘములను స్థాపించి, వాటికి ప్రాధాన్య మియ్యవలెను (2) నేటి ప్రజాస్వామ్యమును కార్యనిర్వాహకవర్గ నియంతృత్వమునుండి కాపాడుటకు బలీయమైన ప్రతిపక్షము అత్యావసరము దేశములో ఒకే రాజకీయపక్షము, అత్యధికబలముతో నున్న యెడల,పరిపాలనా రంగములో అవినీతి, నిరంకుశత్వము పెరుగును ఈ ప్రమాదములను అరికట్టుటకే బలీయమైన ప్రతిపక్షమును నెలకొల్పవలెను (3) అధికారవికేంద్రీకరణమువలనకూడ కార్యనిర్వాహకవర్గప్రాబల్యమును తగ్గింపవీలగును ఈ ఉద్దేశముతోడనే భారతదేశమునందలి రాష్ట్రప్రభుత్వములు పంచాయతీరాజ్యమునకు ప్రాధాన్యము నిచ్చినవి ఇట్టిచర్యలుతీసికొనుటవలన, ప్రజాస్వామ్యమునకు కార్యనిర్వాహకశాఖవలన ఎట్టి ప్రమాదమును వాటిల్లదు

వ లిం

## ప్రభుత్వపాలనము - ప్రభుత్వేతరపాలనము (Public & Private Administration)

మానవశక్తి సంపదలను ఒకానొక లక్ష్యసిద్ధి కొరకు క్రమపద్ధతులలో వినియోగించుట పరిపాలన మనబడును సాధారణముగా, పరిపాలనములో ప్రజాసౌభాగ్య సంపాదనమే ముఖ్య లక్ష్యముగా నుండును పరిపాలనములో ప్రణాళికా రచన, సంస్థాపన, ఉద్యోగస్థుల నియంత్రణము, దర్శకత్వము, విభిన్నాచార సంయోగము, సమాచార సేకరణ నివేదనము, ఆదాయవ్యయ వివరసూచికారచన అను విధానములు గలవు ఈ భిన్నవిధానము లన్నిటి యొక్క అంత్యలక్ష్యము ప్రజాసేవయే ఉదా ప్రజారోగ్యము, విద్య అనునవి

పరిపాలనమును పలువురు పలురీతులలో నిర్వచించిరి శారీరక, మానసిక, సాంకేతిక, కార్యనిర్వాహకాది విభిన్న కార్యక్రమములచే సమ్మిశ్రితమై, ఏ ఒక్క లక్ష్యసిద్ధికొరకైనను ఉపయోగపడునట్టి కార్యక్రమమే పరిపాలన మని కొందరును, నీటి అన్నిటియొక్క సమ్మేళనము కాక, కార్యనిర్వహణము కొరకు వినియోగించెడు ఏ ఒక్క విధానమైనను పరిపాలనమే అని మరి కొందరును చెప్పెదరు ఉదా ఒక సంస్థాధికారి పరిపాలకు డనబడును కాని, ఆ సంస్థయందలి బంట్రోతు పరిపాలకు డనబడడు

అభిన్న విధానమనియు, కార్యనిర్వాహక విధాన మనియు, విధానము ద్వివిధము అభిన్నవిధానము ననుసరించి కార్యాలయము నందలి చిన్న పదవినుండి పైపదవి వరకు ప్రతి యుద్యోగియు పరిపాలకు డగుచున్నాడు కార్యనిర్వాహక విధానము ననుసరించి పరిపాలనము కార్యనిర్వాహకులచేతనే నడుప బడుచున్నది కాని అదే సంస్థకు చెందిన ప్రజారోగ్య యంత్రశాస్త్రములు మొదలైన ప్రత్యేక కర్తవ్యములపై ముఖ్య కార్యనిర్వహణము ఆధారపడి లేదు

మనఃపూర్వక సంకల్పసిద్ధి కొరకు దృఢనిశ్చయముతో ఆచరించు కార్యక్రమమే పరిపాలనమని 'వైగ్' అను నాతడును, ఏకాభిప్రాయముతో కార్యసాధనము సలుపుటయే పరిపాలనమని సైమన్, స్మిత్‌బర్గ్, థామ్సన్ అను పండితులును, నిర్వచించిన ఉద్దేశములను సాధించుటకై సలుపు కార్యకలాపమే పరిపాలనమని లూథర్‌గల్లిక్ అనునాతడును, పరిపాలనమును నిర్వచించి యున్నారు

సామాన్యముగా పరిపాలనా నిర్వహణము, పరిపాలింపబడు అనేక రూపములను, క్షేత్రములను బట్టి యుండును మరియు పరిపాలనా దక్షత ఒక కళగా గాని, శాస్త్రముగా గాని గమనించినయెడల, అది కార్యనిర్వాహక కౌశల్యముగా గోచరించును

పై విధముగా నిర్వచింపబడిన పరిపాలనము ఐక్యరాజ్యసమితి మొదలు సామాన్య కుటుంబము వరకును వాటి వాటి ప్రత్యేక సుఖసంపదల సిద్ధికొరకు స్వల్పముగనో, హెచ్చుగనో వాడుకలో నున్నది శక్తిసంపదలను తగురీతిని వినియోగించి కార్యసాధన మొనర్చు ఈ పరిపాలనములో సాంఘిక లక్ష్యములు వేరుగా నుండును సాధారణముగా ఈ పరిపాలనము రెండు విభాగములుగా నున్నది 1 ప్రభుత్వ పరిపాలనము ప్రజల సుఖసంపదలకొరకు పాటుపడుచు అనేక రీతుల ప్రజాసమ్మతితో ప్రదేశమందైనను మహోన్నతముగా వెలయు పాలనమే ప్రభుత్వపరిపాలన మనబడుచున్నది స్వార్థ పరార్థసిద్ధికొరకైనను కొంతవరకు ప్రజాసేవ చేయుటకై నెలకొల్పబడు పెద్ద వ్యాపారసంస్థలు రెండవతరగతికి చెందిన ప్రభుత్వేతర పరిపాలనమునకు ఉదాహరణములు అందుచేత ఈ రెండు విభాగములలో ఏ సంస్థ దేనికొరకు ఉద్దేశింపబడినదో, ఆయా ఉద్దేశానుసారముగా పరిపాలన విధాన మేర్పడును ఈ ద్వివిధ పరిపాలనములోని ఉద్దేశములు సాంఘికదృష్ట్యా వేరువేరైనను వాటికి కొన్ని విషయములలో పోలికలు కలవు పెద్ద వ్యాపారసంస్థలను, స్వలాభరహిత ప్రభుత్వ సంస్థలతో పోల్చిచూచినచో, ఈ పోలికలు కనబడును ముఖ్యముగా పరిపాలన విధానములు, ప్రధాన కార్యనిర్వాహక అధికార వర్గములు – ఈ రెండింటిలోను ఇంచుమించుగా ఒకేవిధమగు అర్థము స్ఫురించును వైద్యుడు వ్యాధిగ్రస్తులైన మానవులను రక్షించుటకొరకు తన చికిత్సానిపుణత నెట్లు ఉపయోగించునో, లేక యంత్రకారుడు తన సాంకేతిక విద్యాకౌశలముతో వివిధ నిర్మాణముల నెట్లుచేయునో, అటులనే పరిపాలకుడు తన పరిపాలన దక్షతతో మానవశక్తి సంపదలను సమకూర్చి, వాటిని క్రమరీతిని వినియోగించునని కార్యనిర్వాహక సిద్ధాంతము చెప్పును ఇది ప్రభుత్వసంస్థలకును ప్రభుత్వేతర వ్యాపారాది ఇతర సంస్థలకును ఒకేరీతిగా ఉపకరించును

వ్యాపార సంస్థలకు స్వలాభమే ముఖ్యలక్షణము ప్రభుత్వశాఖలకు ప్రజాసేవయే ముఖ్యోద్దేశము. తమపరకు

లను కొనెడి ప్రజలను అర్థముచేసికొనెడి యావశ్యకత వ్యాపార సంస్థలకు ఎట్లు కలదో, అటులనే ప్రభుత్వ సంస్థలకు ప్రజల ఆనుకూల్యమును, ఇష్టానిష్టములను తెలిసికొనుట అత్యావశ్యకము గణనా కౌశలము, కార్యనిర్వాహకదక్షత మొదలగు గుణములన్నియు ప్రభుత్వ సంస్థలలోను, ప్రభుత్వేతర సంస్థలలోను ఒకేవిధముగా ఉపయోగపడుచున్నవి అంతే కాక ఉద్యోగుల క్షేమసౌకర్యములకొరకు నెలకొల్పబడు ప్రత్యేక కార్యక్రమములు ఈ ద్వివిధ తరగతుల సంస్థలలోను కలవు ఆయా సామర్థ్యములను వినియోగించుకొను విధము, పరిమాణము, సమర్థత అనునవి ఆసంస్థ లెదుర్కొను ప్రత్యేక పరిస్థితులను బట్టి యుండును ఇట్లు శీఘ్రనిర్ణయము, అధికార వికేంద్రీకరణము అనునవి ప్రభుత్వేతర సంస్థలయొక్క ముఖ్య లక్షణములు, వీటివలన ఆ సంస్థలు అనేకములగు పనులను, సమర్థతతో, తక్కువకాలములో ముగించుకొని, మొత్తము మీద లాభములను పొందు చున్నవి మఱియు ఉద్యోగస్థుల అంతస్తులలో కేవలము నిబంధనల ప్రకారము పనిసాగించుట, శీఘ్రగతిని నిర్ణయములు తీసికొనజాలకుండుట, ఉత్సాహకరముగా పనులు చేయకుండుట, మున్నగునవి మొత్తముమీద ప్రభుత్వోద్యోగస్థులయొక్క లక్షణములుగాఎన్నబడుచున్నవి

ఉద్యోగస్థులను ప్రభుత్వ సంస్థలలోనుండి ప్రభుత్వేతర సంస్థలలోనికిగాని, ప్రభుత్వేతర సంస్థలనుండి ప్రభుత్వ సంస్థల లోనికిగాని మార్చుటవలన, ఈరెండు తరగతుల సంస్థలయొక్క సమర్థత,నిష్పక్షపాతబుద్ధి,ప్రజాసౌఖ్యమును పాటించు ఔదార్యము, సమయోచిత నిబంధనముల వర్తింపజేయు శక్తి ఇత్యాది గుణములు తేటపడగలవు ప్రభుత్వసంస్థలలో ఉన్నతోద్యోగములలోనికి సూటిగా ప్రభుత్వేతర సంస్థలలో పనిచేయు వారిని నియమించు పద్ధతిప్రకారము, భారతప్రభుత్వకర్మాగారములలోని ముఖ్యపదవులలోనికి ప్రభుత్వేతర బృహత్కర్మాగార సంస్థలలోని వారిని, భారతీయ కార్యనిర్వాహక సంపుటి ద్వారమున నియోగించు ప్రయత్నములు జరగుచున్నవి ఇటీవల ప్రభుత్వముచే నెలకొల్పబడిన ప్రణాళికా జనితములగు ఇంచుమించు అన్ని యంత్రాగార వ్యాపార సంస్థలు ఈ పద్ధతికి తార్కాణములుగ నున్నవి ఈ బృహద్వ్యాపార సంస్థలు కేవలము స్వలాభములకొరకే కాక, ప్రజాక్షేమము కొరకు గూడ పాటుబడుచున్నవి అవి సరఫరాచేయు సామగ్రి యొక్క నాణ్యము తగ్గకుండ సామగ్రి ధరల తగ్గింపుకొరకు నిర్విరామముగా కృషిచేయుచున్నవి అట్టి సామగ్రి యొక్క శ్రేష్ఠతను పెంపొందించుటకొరకు, పెద్ద పెట్టుబడితో పరిశోధనములు నిత్యమును కొనసాగింపబడుచునే యున్నవి ఇవన్నియు ప్రజాక్షేమముకొరకే గదా! అందుచేతనే, ప్రభుత్వేతర సంస్థలైనప్పటికిని, పెద్దపెద్ద వ్యాపారసంస్థలు ప్రభుత్వ శాఖలవలెనే ప్రజాభ్యుదయ, మానవకల్యాణముల కొరకే వాటి పరిపాలనమును సాగించు చున్న వనవచ్చును. ప్రభుత్వ, ప్రభుత్వేతర సంస్థలనడుమ, పరిపాలన విషయమునగల తారతమ్యముల కంటె సాదృశ్యములే హెచ్చుగా కనబడుచున్నవి ప్రభుత్వ సంస్థలలో ఒకదాని నింకొకదానితో గాని, అటులే ప్రభుత్వేతర సంస్థలలో ఒకదానిని ఇంకొకదానితో గాని పోల్చిన యెడల, వాటిలో గోచరించు తారతమ్యములు వాటి పరస్పర పరిణతులను బట్టి యుండును అంతేకాక ప్రభుత్వేతర విభాగములో నెలకొల్ప బడిన భారీసంస్థ లన్నిటిలోను పరిపాలనా రూపము రాజకీయాధికార జనిత అహంభావ భూయిష్ఠమైన ప్రభుత్వ పరిపాలనము వలెనే యుండును ఇట్టి సామరస్యము ముఖ్యముగా పై పదవులలో గోచరించును రెండు తెగల సంస్థలు భారీపరిమాణము కలిగి, ఇంచుమించు ఒకేరీతిగా సాధకబాధకములకు లోనగుచున్నవి

అనుచిత పరిమాణములో రూపొందినందు వలన అధికార నిబంధనాత్మక రాజకీయపాలనములోని అసమర్థత, ఉపేక్ష, ప్రభుత్వేతర విభాగ సంస్థలలోగూడ కానవచ్చును ప్రభుత్వేతర సంస్థలన్నియు ఏదోవిధముగా పదేపదే వాటి పరిమాణమును పెంచుటకొరకు తలపెట్టుచునే యుండును కాని, అట్టి పెరుగుదల ఒక ఉచితస్థాయిని దాటిన వెంటనే ప్రభుత్వ సంస్థలలోని జాడ్యము లన్నియు వీటియందు తల లెత్తును పరిమాణము పెరుగుచున్న కొలది, పరిపాలనా సమర్థత, కార్యశూరత్వము, మున్నగుసులక్షణము లన్నియుకార్యనిర్వాహక ప్రతిఫలక్షీణ న్యాయముప్రకారము క్షీణించును ఏదోవిధముగా ప్రతి సంస్థయందును కొంతవరకు సరిదిద్దు కట్టుబాటు లుండుట నిజమే ఈ సంస్థల పరిపాలనమును ఏదోవిధముగా విమర్శన చేసి, సరిచేయుటకు సూచనలు తయారుచేయు శాఖలు వేరుగా నియమింపబడినవి వీటినే ప్రభుత్వపాలనములో 'సంస్థాపన–పద్ధతుల' శాఖ అని యందురు

ప్రభుత్వ, ప్రభుత్వేతరసంస్థల పరిపాలనములో కొన్ని

పోలికలు కలవు అయినను వాటినడుమ మూలాధారములైన భేదములును కలవు ప్రభుత్వోద్యమములు సాధారణముగా అధికార నిబంధనాత్మక ఆచారములకు లోబడి యున్నట్టియు, పరిపాలనాధికారమును పొందియున్నట్టియు, రాజకీయ పక్షముయొక్క ఇష్టానిష్టములను గణించుచుండును కచ్చేరీల రివాజుపట్టి ముఖ్యముగా ప్రభుత్వసంస్థలలోనే కనపడును స్వతంత్రోద్యమమే ప్రభుత్వేతరసంస్థల యొక్క ముఖ్యబలము సర్ జోసియా స్టాంప్ అనునతడు చెప్పిన ఈభేదములు పరిపాలనానుగుణ్యము, ఆర్థిక కట్టుబాటులు, ప్రతిఫలసూత్రము, ప్రశ్నోత్తరవాదము అను నాలుగు ముఖ్యవిషయములపై ఆధారపడియుండును ఈ రీతిగా ప్రభుత్వశాఖల పరిపాలనము స్వల్పమైన తేడాలతో ఒకేమాదిరిగా కనిపించుచు చట్టనిబంధనావళిబద్ధమై యుండును పరిపాలకలు నిజముగాచట్టములను క్రియారూపముగా అక్షరాల అమలుపరచువారే గాని స్వేచ్ఛాచారులు కారు ఆదాయమును రాబట్టుటలోగాని, శాంతి భద్రతలను కాపాడుటలో గాని వారికి స్వేచ్ఛ చాల తక్కువ ప్రభుత్వేతర సంస్థల పాలకులు అట్లుప్రవర్తింపనవసరములేదు వారి ప్రవర్తనము అందరితోను ఒకేరీతిగా నుండ నవసరము లేదు పరిస్థితులనుబట్టి వారియుద్దేశములు, ఆచారములు మారుచునే యుండును వారిపరిపాలన నీతిలో స్వలాభ సిద్ధియే ముఖ్యోద్దేశము కావున, ప్రతిదినము పరిపాలనములో మార్పులు చేయుట వారికి పరిపాటియై యున్నది

శాసనసభలకును, ఖజానాధికారులకును ప్రభుత్వసంస్థల యొక్క ఆదాయవ్యయములపై కఠినమైన అధికారము కలదు కాని, అట్టి బాహ్యజనితమైన కట్టుబాటులు ప్రభుత్వేతరసంస్థల ఆర్థికవిషయములలో నుండవు వీటి ఆర్థికపాలనము సాధారణముగా అంత్యఫలసిద్ధాంతము ప్రకారము నడచును ప్రభుత్వశాఖల ఆర్థికవ్యయము ఎల్లప్పుడును ప్రజోపయోగము కొరకే వినియోగింపబడును సక్రమముగా సమర్థతతో ప్రభుత్వసంస్థలను నడపు బాధ్యత తుదకు మంత్రుల మీదనే నిలుపబడియున్నది ఇట్టివేవియు ప్రత్యేకసంస్థలలో కానరావు ప్రొఫెసర్ ఆపిల్బీ చెప్పినట్లు, రెండురకముల సంస్థలనడుమ ముఖ్యమైన భేదములు కనబరచు విషయము అనుమానపూరితపరీక్షయేయై యున్నది ప్రభుత్వసంస్థల వ్యవహారములు కుణ్ణముగా ప్రజలచే పరీక్షింపబడుటకు అవకాశము లున్నవి ఏచిన్న అపచారము జరిగినను, ప్రజలు మన్నించక దానిని అతికఠినముగా శాసనసభలలో తీవ్రచర్చలకు గురి చేయవచ్చును వ్యాపార సంస్థల వ్యవహారములు ఏ స్వల్ప సంఖ్యాకులకో తప్ప, శేషించిన ప్రజానీకమున కెరుకపడవు ప్రభుత్వ పరిపాలనావ్యవహారములు సర్వసాధారణముగా వారి ఏకస్వతంత్రవ్యాపారములేగాని, పోటీకి వీలుపడునవి కావు కాని ప్రభుత్వేతరపాలనము ఎల్లప్పుడును అభివృద్ధికొరకేగాక దాని మనుగడకొరకును పాటుపడుచు, వ్యాపారపు లాభనష్టములలో పోటీకి నిలువవలెను ఈసంస్థల లోటుపాటులు, గుణగణములు నిజముగా వీటిపరిమాణభేదములనుబట్టియే యుండును గాని, స్వకీయ ప్రత్యేకసంస్థలక్రింద విభజనము వలన ఘటిల్లవు ఈరీతిగా ఒక పెద్దవ్యాపారసంస్థకును — అది ఏ తరగతికి చెందినదైనప్పటికిని — ప్రభుత్వశాఖకును నడుమ పరిపాలనా సాదృశ్యములే హెచ్చుగా కలవు కాని, తేడాలు హెచ్చుగా లేవు మరియు ప్రభుత్వేతర విభాగము లోనే నెలకొల్పబడిన సంస్థలలో, పెద్ద, చిన్నపరిమాణము ననుబట్టియే పరిపాలనాకృతి మార్పుచెందును భారీవ్యాపార సంస్థలలోకూడ అధికార వికేంద్రీకరణము, సమర్థత, పొందిక అను పోటీ సమస్యలు ఎల్లప్పుడును ఉండును నిత్యము ప్రభుత్వశాఖలవలె, ఈ ప్రభుత్వేతరవ్యాపారసంస్థలు గూడ ఈ సమస్యాపరిష్కారము చేయుటకు ప్రయత్నించుచునే యున్నవి

వై న

## ప్రభుత్వము - వాణిజ్యము

"స్వేచ్ఛావాణిజ్య" ఆర్థికవ్యవస్థలో ప్రభుత్వము వర్తకవాణిజ్యములను గిరాకీ–సరఫరాల పరస్పర క్రియా క్రియాప్రతిక్రియలకు విడిచివేయును పూర్వము ప్రభుత్వ కార్యకలాపములు పరిమితముగ నుండెడివి అనగా ప్రభుత్వము ప్రధానముగా రక్షణవిధులను మాత్రమే నిర్వహించెడిది కాని వర్తమాన శతాబ్దియందు 'సంక్షేమసమాజము', 'సోషలిస్టు సమాజము' అను నూతనభావములు ఉద్భవించుటతో, ప్రభుత్వము ఆర్థికరంగమునకు సంబంధించిన వర్తక, వాణిజ్య వ్యవహారము లందు జోక్యము కల్పించుకొని వ్యవహరింప వలసివచ్చినది వర్తకవాణిజ్యములు రెండును దేశమునకు ప్రాణము వంటివి ఈ అంశములను గిరాకీ సరఫరాలకు స్వేచ్ఛగా వదలివేసినచో, ప్రజాభ్యుదయముకొరకు పాటు పడుట మిగుల దుర్లభమగును అట్టిస్థితిలో వెనుకబడిన ఏ దేశ

మైనను ముడివస్తువులను విదేశములకు ఎగుమతి చేయుచు, తయారైన సరకులను వాటినుండి దిగుమతి చేసికొనుచు, స్వదేశములో నిరుద్యోగమును పెంపొందించుకొన వలసిన దుస్థితి ఏర్పడును. అట్టి దుస్థితిని తొలగించుటకే, ఆధునిక యుగములో దేశక్షేమము దృష్ట్యా ప్రతి సంక్షేమరాజ్యము వర్తక వాణిజ్యములను క్రమబద్ధ మొనర్పవలసి యున్నది.

**దిగుమతులపై సుంకములు** ఈ సందర్భములో దిగుమతులపై విధింపబడు సుంకముల సమస్య చర్చనీయాంశమగును. స్వదేశీ పరిశ్రమలను అభివృద్ధి చేసికొనుటకై వెనుకబడిన దేశము విదేశీసరకుల దిగుమతులపై సుంకములు విధించి, వాటి రాకను అరికట్టుచు, స్వీయపరిశ్రమలను నిర్మించుకొనుచుండును. ఇదియే స్వీయరక్షణవిధాన మనబడును.

**స్వేచ్ఛావాణిజ్యము – రక్షణము** ఎట్టి ఆటంకములను కల్పించక, విదేశీసరకులను దేశములోనికి రానిచ్చుట స్వేచ్ఛావాణిజ్య మనబడును. పారిశ్రామికముగా అభివృద్ధిచెందిన దేశములనడుమ స్వేచ్ఛావాణిజ్యము కొనసాగుట ఒక విధముగా మంచిదే కావచ్చును. కాని పారిశ్రామికముగా అసమానస్థితి యందున్న దేశముల నడుమ స్వేచ్ఛావాణిజ్యము బలహీన దేశమునకు ప్రమాద హేతువగును. అట్టిసందర్భములో బడుగు దేశములకు రక్షణవిధానము శరణ్యమగును. ఈ రక్షణవిధానమునుసరించి దిగుమతులపై సుంకముల విధింపు ప్రపంచమందంతట సర్వజనాంగీకారమైనట్టిదే. ఆయాదేశముల పరిస్థితుల దృష్ట్యా, వేర్వేరురాజ్యములు భిన్నములైన సుంకవిధానముల ననుసరించుచుండును.

**స్వేచ్ఛావాణిజ్యము** పూర్వసంప్రదాయకులైన అర్థశాస్త్రవేత్తలు స్వేచ్ఛావాణిజ్యమును సమర్థించెదరు. వారి వాదమున ఈ క్రిందివిధముగా నుండును.

(1) అంతర్జాతీయ వాణిజ్యములో కృత్రిమావరోధములు లేకున్నచో, ప్రపంచ వ్యాపారము సాపేక్షప్రయోజన, మూల్యసిద్ధాంతముల ననుసరించి కొన్నిదేశములు ఇతర దేశములలో కంటె కొన్నివస్తువులను చౌకగను, దృఢముగను, నాణ్యముగను తయారుచేయగల్గును. ఒకదేశమునకు వలసిన సకలపదార్థములను ఆ దేశమే స్వయముగ ఉత్పత్తిచేయుట అసాధ్యము. ఏ దేశము ఏ సరకులను గరిష్ఠసౌలభ్యముతో చేయగలుగునో, ఆ దేశము తయారుచేయువస్తువులు పటిష్ఠముగను చౌకగను ఉండుట సంభవము. ఏ దేశము కూడ స్వయంపోషకముగా నుండజాలదు. శ్రామిక విభజన మనునది అంతర్జాతీయ స్థాయిలో కొనసాగవలెను గదా! పై విషయములను పరిశీలించినచో, స్వేచ్ఛావాణిజ్యము అధికోత్పత్తికి దోహద మొసగగలదని గ్రహింపగలము.

(2) ఉత్పత్తి సాధనముల నన్నిటిని గరిష్ఠ పరిమాణములో ఉపయోగించుటచే, ప్రజల ఆదాయము గరిష్ఠ స్థాయి నందుకొనగలదు.

(3) స్వేచ్ఛావ్యాపారమునందు వినియోగదారులకు సర్వస్వాతంత్ర్యముండును. స్వేచ్ఛావాణిజ్య, పోటీవిధానము అందు వినియోగదారులు కనిష్ఠ ధరలకు వస్తువైవిధ్యమును పొందగలరు. ఈవిధముగా వినియోగదారులకు గరిష్ఠమగు సంతృప్తి సిద్ధించును.

పై అంశములతోపాటు స్వేచ్ఛా వాణిజ్యవిధానమును సమర్థించువారు రక్షణవిధానమువలన కలుగు చెడుగులను ఈ క్రిందివిధముగా పేర్కొనుచున్నారు. స్వేచ్ఛావ్యాపారము లేకున్నచో, ఉద్యోగివర్గమును కేటాయించుటయందు లోపములు ఘటిల్లును. గరిష్ఠోత్పత్తి, గరిష్ఠాదాయము, గరిష్ఠ సంతృప్తి కుంటుపడును. సంరక్షిత పరిశ్రమలందు 'ట్రస్టు' లేర్పడి, వాటికిగల బలీయమైన వనరులచే, రాజకీయజీవితము కలుషితమగును. 19వ శతాబ్ది ఉత్తరార్ధమందు స్వేచ్ఛావ్యాపారమువలన బ్రిటిష్ వాణిజ్యమునకు ప్రయోజనము చేకూరెను. ఇందువలన అభివృద్ధి చెందిన బ్రిటిష్ పరిశ్రమలతో మరే దేశమును పోటీ చేయ జాలకుండెను. కాని ఈ విధానమునే భారత దేశములో కూడ అమలుజరపుటవలన, జాతీయపరిశ్రమలకు తీవ్రమైన అంతరాయము కలిగి దాదాభాయి నౌరోజీవంటి మేధావుల ఆగ్రహమునకు కారణమయ్యెను. తత్ఫలితముగా అతడు "పేదరికము భారత దేశములో అనాంగ్లసంప్రదాయపాలనము" అను గ్రంథమును రచించెను. అంతటితో అర్థశాస్త్రప్రవీణులు స్వేచ్ఛావాణిజ్యము నందలి దోసగులను గ్రహించి, విదేశ దిగుమతులపై నిర్బంధప్రయోగమును సమర్థింప సాగిరి.

**రక్షణవిధానము** రక్షణవిధానమును సమర్థించుచు పెక్కు వాదములు బయలుదేరెను. బాల్యావస్థలోనుండిన భారతపరిశ్రమలను రక్షింపవలెననుటయే ఈవాదములోనెల్ల బలీయమైనది, ముఖ్యతమమైనది. కొన్నిసరకులను తయారుచేయుటలో కొన్నిదేశములు ప్రదర్శించు విశేషసాంకేతిక

నైపుణ్యమునకు ఆ దేశపు సహజప్రయోజనములు కారణములు కావు దీర్ఘకాలికానుభవము, సాధనము అందుకు కారణములు ఇందు కుదాహరణముగా బ్రిటనులోని వస్త్ర పరిశ్రమను పేర్కొన వచ్చును

ఇతరదేశములందు శైశవదశయందున్న పరిశ్రమలకు రక్షణ కల్పించి పోషించినచో, ఆ పరిశ్రమలను బ్రిటిషుదేశపు స్థాయికి తీసికొనివచ్చుట కష్టమైనపని కాదు ఈ వాదమును ప్రతిపాదించిన ఫ్రెడరిక్ లిస్ట్ ప్రశంసాపాత్రుడు వ్యవసాయము అభివృద్ధిదశయందున్న దేశములో నూతనముగా పరిశ్రమలను నెలకొల్పుట దుర్ఘటమని ఆతడు వ్రాసెను ఇది సుసాధ్య మొనర్పవలెనన్నచో, విదేశసరకులపోటీకి వ్యతిరేకముగా స్వదేశపరిశ్రమలకు రక్షణ కల్పింపవలెను అట్టిరక్షణము తాత్కాలిక స్వభావముకలదిగా నుండును బాలారిష్టదోషములను గడచి, అభివృద్ధిదశనందుకొనిన పిదప అంతర్జాతీయ వాణిజ్యరంగములో అట్టిపరిశ్రమలుపోటీచేయగలస్థితియందుండును పరిశ్రమలకొకసారి రక్షణ కల్పింపబడినపుడు, దాని ఉపసంహారణము దుస్తరమని అనుభవమువలన తెలియవచ్చినది రక్షణ పొందిన పరిశ్రమలయం దొక దశలో మాంద్యమేర్పడి, ఉత్పత్తియు, సామర్థ్యమును, నైపుణ్యమును పెంచుటకు కృషి జరగదు అందుచే బాల్యదశ బాల్యదశగానే కొనసాగుచు సమాజమునకు భార మేర్పడును

దేశరక్షణమునకు సంబంధించిన పరిశ్రమ లెన్నటికిని విదేశముల పోటీకి గురికాకూడదు ఏదేశమందైనను, ఆర్థికవ్యవస్థయందు నానాత్వము, వైవిధ్యము అవసరము కావున కేవలమొక వ్యవసాయముపై గాని, కొలదిపరిశ్రమలపై మాత్రమే గాని ఏ దేశము ఆధారపడకూడదు

ఆహారమువంటి అత్యావసరపదార్థ మునకు సంబంధించిన సాధనసంపత్తివిషయములో స్వయంసమృద్ధత అవసరము అంతర్జాతీయ వ్యాపార, వాణిజ్యముల కింకను భారతదేశమునకు యుద్ధప్రమాదమునుండి భయము తీరలేదు

పై వాదములే కాక, పారిశ్రామిక రక్షణమును బలపరచు ఇతరవాదములు కూడ కొన్ని గలవు హెన్రీక్లే అను నతడు రక్షణవిధానమును అమలు జరుపుటవలన, నూతన పరిశ్రమలను నిర్మింపవచ్చుననియు, నూతనపరిశ్రమలలో నియుక్తులైన కార్మికులు సాధించు అధికోత్పత్తికి విపణి వీథిలో గిరాకీ ఏర్పడగలదనియు చెప్పియుండెను కొన్ని పరిశ్రమలయందు భారీయంత్రసామగ్రి స్థాపింపబడుటచే తలకు మించిన వ్యయము అవసరమగుచున్నది అట్టిపరిశ్రమలకు విదేశముల నుండి పోటీలేకుండ చేయవలెను అందుచే పరిశ్రమలకు లభించు రక్షణమువలన ఉత్పత్తిక్రమమునకు నిలుకడ ఏర్పడును

ఎగుమతి దిగుమతులలో సమానీకరణమును సాధింపవలెనన్నచో, దేశీయపరిశ్రమలకు రక్షణముకల్పించుట అత్యావశ్యకమను వాదముకూడకలదు ఇట్లు చేయుటచే 16–18 శతాబ్దుల నడుమ పెక్కుదేశములు బంగారు, వెండి నిలువలను నిర్మించుకొన కలిగినవి ఈ విధానము 'వర్తకసరళి' అనబడుచున్నది దీనిని పురస్కరించుకొని ''వేతనములు – ఉద్యోగము'' అను నంశముకూడ చర్చించబడు చున్నది ప్రొఫెసరు కీన్స్ అను సుప్రసిద్ధ పండితుని అభిప్రాయమునుసరించి, అరనపు ఎగుమతులు నూతనదేశీయ పెట్టుబడులకు సమానమగును అయితే దీనిని నిరవధికముగా కొనసాగింపకూడదు

ఏ దెట్లయినను రక్షణవిధానమువలన లాభనష్టములు రెండును సంభవించును అందుచే ఈ విధానమునందు పిడివాదమును ఎన్నడును అనుసరింపకూడదు దేశములో ఘటిల్లు ఆర్థిక ప్రగతినిబట్టియు, ప్రపంచస్థితిగతుల ననుసరించియు పరిశ్రమలకు రక్షణముకల్పించుటలో యుక్తాయుక్తవివేకము, సమయోచితజ్ఞానము, ప్రదర్శింపవలెను దేశీయుల సర్వతోముఖశ్రేయస్సునకు అనుగుణముగ విశాలప్రాతిపదికపై ప్రభుత్వము తనవ్యాపార, వాణిజ్యవిధానమును రూపొందించవలెను

**రక్షణరీతులు–దిగుమతిసుంకములు** సుంకముల విధింపు ద్వారా కొన్ని విదేశసరకులపై నిర్బంధములను ప్రయోగించుటే కాక, వాటిని పూర్తిగా నివారింపవచ్చును బరువునుబట్టి గాని, పరిమాణమునుబట్టి గాని, ఇతరఅంశములనుబట్టి గాని, సుంకములను లెక్కకట్టవచ్చును కొన్నిసందర్భములయందు సరకుల విలువనుబట్టిగూడ సుంకములు విధింపబడును

**ముడివస్తువులపై ఎగుమతి సుంకములు**, ఇతరదేశములకు ఎగుమతియగు ముడివస్తువులపై గూడ సుంకములు విధింపబడును ముడిప్రత్తి ఇందుకొక ఉదాహరణము ఈ విధముగా దేశీయపరిశ్రమల పోటీపాటవమును అధిక మొనర్పవచ్చును

**పరిమాణాత్మక నిర్బంధములు** ఒక కాలపరిమితిలో

దిగుమతి చేసికొనవలసిన సరకుల గరిష్ఠపరిమాణము ముందుగనే నిర్ణయింపబడును ఈసందర్భమున దిగుమతులు మిగుల స్వల్పముగ నున్నచో, గుత్తదారులు అట్టి అవకాశమును ఉపయోగించుకొని విచ్చలవిడిగా వినియోగదారులను కొల్లగొట్టెదరు వ్యాపార నియంత్రణముక్రింద లైసెన్సువిధానము ధారాళముగా ఉపయోగింపబడును

సముద్రసుంకములచట్టము, స్టోర్సు కొనుగోలు విధానము, రైల్వే షిప్పింగు రేట్లవిధానము మున్నగు శాసనముల క్రింద ప్రోత్సాహ ద్రవ్యములు ఆర్థికసహాయములు 'పూలింగ్-మిక్సింగ్' ఒడంబడికలు, టారిఫ్ కోటాలు మున్నగు పరిపాలనా ప్రక్రియలు ప్రయోగింపబడును

వ్యాపారపు టొడంబడికలు వివిధదేశముల నడుమ ఈ కాలములో వ్యాపారపు టొడంబడికలు విరివిగా చేసికొనబడు చున్నవి ఏ రెండుదేశములమధ్యనైనను, అట్టిఒడంబడికలకు పూర్వమే, ఏవ రెంతసరకును, ఎట్టిసరకును దిగుమతి లేక ఎగుమతిగావించుకొనవలెనను విషయము నిర్ణయించబడును ఇట్టి ఉభయపక్ష ఒప్పందముల యొక్క ప్రధానోద్దేశము గుత్తాధికారమే అని ఎల్లిస్ వంటి కొందరు ఆర్థికవేత్తలు అభిప్రాయపడిరి ఇట్టి ఒప్పందములే, కొన్నిసందర్భములలో, వ్యాపారవాణిజ్యములను ఆకర్షించుటకు మార్గములుగా కాన్పించును యుద్ధానంతరదశయం దిట్టి వ్యాపారపు టొడంబడికలు సర్వసామాన్యములైనవి ప్రస్తుత అంతర్జాతీయపరిస్థితియం దిట్టి పరస్పర వ్యాపారవిధానము అనివార్యమైనది

ప్రభుత్వముచే వ్యాపారనిర్వహణము ఇటీవల కొంత కాలమునుండి కొన్ని దేశముల ప్రభుత్వములు దేశీయవిదేశీయ వ్యాపారకలాపములయందు పాల్గొనుచున్నవి రెండవ ప్రపంచ సంగ్రామమునకు పూర్వము రష్యా జర్మనీప్రభుత్వములు భారీయెత్తున వ్యాపారమును సాగించినవి అప్పటి నుండి ఈ విధానము ఇతరదేశములకు ప్రాకినది ప్రభుత్వమే వ్యాపారమును నిర్వహించు విధానమును రష్యా, చైనాదేశములు మిగుల విస్తృతముగా అమలుజరపినవి సుసంఘటితమైన సోషలిస్టు ఆర్థికవ్యవస్థయం దీప్రభుత్వవ్యాపార మొక భాగమైనది జాతీయప్రణాళికతో వ్యాపార, వాణిజ్యములను సమన్వయించుటకును, విదేశములతో లాభకరమైన బేరములు సాగించుటకును ప్రభుత్వము లిట్టి వ్యాపారమును స్వయముగా సాగించుచుండును

ఇటీవల పెట్టుబడిదారీ విధానమును, సంకీర్ణ ఆర్థిక విధానమును అనుసరించు కొన్ని ఇతర రాజ్యములు గూడ ప్రభుత్వవ్యాపారమును చేయు చున్నవి అర్జెంటీనా, కెనడా, ఆస్ట్రేలియా, ఇంగ్లండు, అమెరికా మున్నగు ప్రభుత్వము లిందు కుదాహరణములు భారతదేశములో కూడ స్టేట్ ట్రేడింగు కార్పొరేషన్ అనునొక ప్రభుత్వవాణిజ్యసంస్థ కలదు జపానున కెగుమతియగు ముడి ఇనుమంతయు ఈసంస్థ ద్వారా సరఫరాయగును దేశ ప్రయోజనకరములైన ఇతరవిధులు కూడ ఈ సంస్థచే నిర్వహింపబడుచున్నవి

వ్యష్టిపరమైన గుత్తాధికారము కంటె ప్రభుత్వమే ఇట్టి వ్యాపారాధికారమును చేపట్టి నిర్వహించుట శ్రేయస్కరము అంతర్జాతీయవ్యాపార క్షేత్రములో ఇటీవల గుత్తపద్ధతిపై కొనుగోలు, అమ్మకములు జరగుచున్నవి పెట్టుబడిదారీవిధానమందు ఎగుమతులుచేయు వ్యాపారు లొకవంక అత్యధిక లాభము లార్జించుచునే, తమ వ్యాపారపుసరకుల నాణ్యమునైనను ఒకేవిధముగనుంచక, చెడగొట్టు చుందురు ప్రభుత్వ వాణిజ్యవిధానమువలన ఈ చెడుగులను చాలవరకు అరికట్ట వచ్చును ఈవిధానముద్వారానేఆర్థికప్రణాళికలనువిజయవంతముగా అమలు జరపవచ్చును శీఘ్రనిర్ణయములుకూడ ప్రభుత్వ వాణిజ్యవిధానమునందే సాధ్యమగును ఉభయపక్షముల ఒడంబడికలుకూడ ఈ విధమువలననే జయప్రదముగా ఆచరింపబడగలవు

**లోపములు** ప్రభుత్వవాణిజ్యవిధానము లోపరహితమనుటకు వీలులేదు ఇట్టివ్యవహారమును నిర్వహించు ప్రభుత్వోద్యోగములకు వ్యాపారమునకు సంబంధించిన విషయ పరిజ్ఞానము అల్పముగ నుండును వివిధపదార్థముల గిరాకీ, సరఫరాల స్థితి ఏ తరుణములో, ఎట్లుండునో ఊహించు అనుభవము వారికి చాలినంతగా ఉండదు. ఇందువలన ప్రభుత్వమునకును, ప్రజలకును, నష్టము ఘటిల్లుచుండును ప్రభుత్వ వ్యాపారసంస్థలకు చొరవ, సాహసము లోపించియుండునని కొందరనెదరు ప్రభుత్వోద్యోగులు ఒక శాఖనుండి మరియొక శాఖకు, వారికొకర్యమునననుసరించి బదిలీయయ్యెదరు అట్లు బదిలీయగునపుడు నూతనబాధ్యతలను స్వీకరించి నిర్వహించుటకు వారు అర్హులా కారా యను విషయమును విచారింపరు ప్రభుత్వవాణిజ్యసంస్థలుసహితము ఒకవిధమైన గుత్తసంస్థలుగా మారి వాటిపై వినియోగదారులకు అధీనములేకుండ పోవుట

మరియొక లోపము ప్రైవేటుసంస్థయందున్నట్లు, ప్రభుత్వ సంస్థయందు కూడ పోటీతత్త్వము మృగ్యమగును

ప్రభుత్వవాణిజ్యవిధానమం దెన్నిలోపము లున్నను సోషలిస్టుసమాజమును నిర్మింప నుత్సహించుచున్న భారత దేశములో అది అనివార్యమగు పరిణామము కాగలదు

ఆర్ వి

## ప్రభుత్వ వాణిజ్య సమారంభములు

దేశీయార్థిక విధానము వ్యక్తిపరములైన సంస్థలచే నడపబడుచున్నంతవరకు, కార్మికవర్గమును, పొదుపుధనమును ప్రోత్సహించుటకు స్వకీయమైన ఆస్తిపాస్తు లవసరము సోషలిస్టు ఆర్థికవ్యవస్థలో, ప్రజాక్షేమము దృష్ట్యా ఉత్పాదన కలాపమంతయు ప్రభుత్వముచే నడపబడును పెట్టుబడిదారీ ఆర్థికవ్యవస్థయందైనను లేక సంకీర్ణ ఆర్థికవ్యవస్థ యందైనను ఆస్తిపైగల స్వత్వమును ప్రజలశ్రేయస్సుకు అనుగుణముగా అదుపునందుంచుట గాని, క్రమబద్ధ మొనరించుట గాని, అసాధ్యమనుటకు వీలులేదు దేశసంపదయంతయు అల్పసంఖ్యాకవర్గమునందు కేంద్రీభూతమైనచో, దేశప్రజలయొక్క ఆదాయములలో అసమానత్వ మేర్పడి, రాజకీయ, ఆర్థిక విధానములకు ప్రమాదము వాటిల్లును అందుచే జాతీయాదాయము యొక్క పంపకపు పద్ధతియందు అసమానత్వ మేర్పడకుండ ప్రభుత్వము దానిని అరికట్టవలెను అట్టి అసమానత్వమును నివారించుటకు ప్రభుత్వము ఉన్నత ప్రమాణములో క్రమాభివృద్ధిలో పన్నుల విధానమును, మరణసుంకముల విధానమును అమలుజరపుట గాని లేక ప్రభుత్వమే తన యాజమాన్యమున పరిశ్రమలను నిర్వహించుట గాని వాంఛనీయము

పెట్టుబడిదారీ వ్యవస్థలో లాభాపేక్ష యే ఉత్పాదనమును నిర్ణయింపగల అంశమని కొందరు వాదించెదరు "వినియోగదారుల సర్వస్వాతంత్ర్య" మనునొక నినాదను ప్రచారమునగలదనుట నిర్వివాదాంశము పెట్టుబడిదారీ రాజ్యములలో గుత్తస్వత్వములు, ఆదాయములలో తీవ్రములైన అసమానత్వములు మున్నగునవి మనము చూచుచునేయున్నాము అమెరికాసంయుక్తరాష్ట్రములందును, ఇంగ్లండునందును, పెట్టుబడిదారీ విధానమును సంస్కరించి సంకీర్ణ ఆర్థికవ్యవస్థను రూపొందించుటకు ప్రయత్నములు జరుగుచున్నవి ఈసంకీర్ణ వ్యవస్థ ననుసరించి స్వంతఆస్తి, స్వేచ్ఛావ్యాపారమనునవి, ప్రభుత్వము అమలుజరుపు ప్లానింగువిధానమునకును, చెలాయించు నియంత్రణ విధానమునకును లోబడి వ్యవహరించును

సోషలిస్టు నమూనా సమాజములో ప్రధానమైన వాణిజ్యసమారంభములు ప్రభుత్వముచే నడుపబడును అనుభవమును బట్టిచూచినచో, యథేష్టవర్తక సిద్ధాంతము ప్రాతిపదికగాగల ఆర్థికవ్యవస్థయందుకూడ నష్టము లున్నవని తేలినది సంకీర్ణ ఆర్థికవిధానము ఆచరణ మందున్న దేశములలో కూడ కొన్ని పరిశ్రమలయందు ప్రభుత్వము ప్రత్యక్షముగా పాల్గొనుటయు, నిర్వహించుటయు, వాంఛనీయమని కొందరు వాదించుచున్నారు దీనినే "జాతీయీకరణ" మని మరియొక మాటలో వ్యవహరించెదరు ఒకవంక సోషలిస్టులు సమస్తమైన ఉత్పాదనసాధనములను జాతీయ మొనర్పవలెనని కోరుచుండగా, మరియొకవంక సంకీర్ణ ఆర్థికవ్యవస్థను వాంఛించువారు మధ్యేమార్గము ననుసరించుచు, కొన్నిసందర్భములలో మాత్రమే జాతీయీకరణ సూత్రమును అంగీకరించెదరు

వాణిజ్యసమారంభములు ప్రభుత్వపర మొనర్పవలెనను వారు పెక్కువిధములుగా వాదములుసల్పుచున్నారు జాతీయీకరణ మొనర్చుటచే పోటీ అంతరింపగలదనియు, జాతీయ వాణిజ్యసమారంభముల ద్వారా మౌలికపరిశ్రమలను అదుపులోనుంచుటకు శక్తిగల్గు ననియు, తద్ద్వారా దేశము యొక్క ఆర్థికవ్యవస్థను పటిష్ఠ మొనర్చుట సాధ్యమగుననియు వారి వాదము ఆర్థిక ప్రణాళికా విజయమునకు మౌలిక పరిశ్రమలను అదుపునందుంచుట అత్యవసరము ప్రభుత్వవాణిజ్య సమారంభములకు లాభార్జనాసక్తి ప్రధానవిషయము కాదు లాభము లేవైన వచ్చుచో, అవి ప్రభుత్వమునకే చెందును ప్రభుత్వ పరిశ్రమలయందు అంతర్గత ప్రజాస్వామిక సిద్ధాంతము కూడ ఇమిడియున్నది, అంతేకాక కార్మికులకుకూడ న్యాయ్యమైన భాగస్వామ్యము లభింపగలదు

పరిశ్రమలు ప్రభుత్వపరము కాగూడదను వారి వాదము కూడ కలదు ప్రభుత్వ సమారంభములందు 'సామర్థ్యము' లోపించుననియు, పొదుపు మృగ్యమగుననియు, శీఘ్రనిర్ణయములను తీసికొనవలసిన సందర్భములో జాగు సంభవించుననియు, పరిపాలనా కలాపములలో కాలహరణము ఘటిల్లుననియు, కార్మిక వేతనము లధికమగుననియు వారు ప్రధానముగా వాదింతురు ప్రభుత్వవాణిజ్య సమారంభములు తప్పనిసరిగా

మితిమీరిన కేంద్రీకరణ స్వభావము కల్గియుండుటచే, అట్టి సంస్థలను నడపుటకు విశేషధన వ్యయమగుటయే గాక, కార్య విధాననిర్ణయమునందును, కార్యాచరణమునందును, జాప్యము సంభవించుచుండునని వారి వాదము అంతేకాక బాధ్యతను స్వీకరించుటయందును, వ్యక్తిగతమైన చొరవను ప్రదర్శించుట యందును ఉత్సాహము లేక, ఒక్కొక్కప్పుడు, అట్టిసంస్థల ఆంతరంగిక వ్యవహారములందు పరస్పర సంఘర్షణము కూడ ఘటిల్లును అంతగా చొరవ అవసరములేని కొన్ని వాణిజ్య సంస్థలు (అవి పెట్టుబడిదారీ చట్రములోనున్నప్పటికిని) జాతీయ మొనర్పదగునని సామాన్యముగా అంగీకరింప బడుచున్నది ఇట్టి సంస్థలలో వ్యక్తిగత యాజమాన్యమువలన, పోటీవలన నష్టమేసంభవించుచున్నది జాతీయజీవనములో అత్యవసర ప్రాముఖ్యముగల సంస్థలయందును, మౌలికములగు కీలకపరి శ్రమలయందును జాతీయాకరణ సూత్రము అన్వయింపదగును

ప్రభుత్వ వాణిజ్య సమారంభ నిర్మాణము - ఇట్టిసంస్థలు వివిధరూపములలో నుండవచ్చును

(1) భారతీయ తంతి తపాలాశాఖ కూడ ఒకఉదాహరణ ముగా పేర్కొనబడ వచ్చును ఈశాఖ యొక్క కార్యకలాప ముపై శాసనసభకు సంపూర్ణాధికారము కలదు ఇట్టిసంస్థలు ప్రభుత్వము నిర్ణయించిన పెక్కు నిబంధనలకు కట్టుబడియుండు టచే, కేవలము వాణిజ్యపద్ధతిపై వీటిని నిర్వహించుట సాధ్యము కాదు ఇట్టిక్షేత్రములందు వ్యక్తిగత ప్రయోజనమునకు అవకాశము, ఆసక్తియు నుండజాలవు

(2) ప్రత్యేకమైన చట్టముచే శాసనబద్ధమైన కొన్ని వాణిజ్యసంస్థలు సృష్టించబడును అమెరికాలో ఆసక్తిదాయకముగా నిర్మింపబడిన ఇట్టిసంస్థలవంటివి భారతదేశములో కూడ ఇపుడు తలఎత్తినవి కొన్ని ప్రత్యేకవసులైన విధులు ఇట్టిసంస్థలకు కేటాయింపబడినవి ప్రారంభదశలో ఇట్టివాటికి ప్రభుత్వమే పెట్టుబడులను సమకూర్చును ఒకొక్కొక్కప్పుడు వాటాలమూలముగా గూడ పెట్టుబడిధనము చేకూరును ప్రభుత్వముచే నిర్ణయింపబడిన నిబంధనలతో ఈ కార్పొరేష నులు స్వయముగా వ్యవహారములు జరపుకొనును చట్టబద్ధ ముగా నిర్మితమైన ఇట్టి వాణిజ్య సంస్థలు వ్యాపారసంఘము లుగా నిర్వహింపబడగలవు ఇట్టిసంస్థలపై సాధారణముగా రాజకీయమైన ఒత్తిడిఉండదు ఇంగ్లండులోకూడ ఇట్టికార్పొ రేషనులు గలవు కేంద్ర, రాష్ట్రీయస్థాయీలలో పబ్లిక్ వాణిజ్య కార్పొరేషనులు ఈనాడు దేశములో వ్యవహరించుచు, దేశీ యార్థిక జీవితమునందు ప్రముఖమైన పాత్రను నిర్వహించు చున్నవి

(3) ప్రభుత్వవాణిజ్య సమారంభములు జాయింటుస్టాక్ కంపెనీలవలె రిజిస్టరు చేయబడవచ్చును అందులో ప్రభుత్వమే వాటాలనన్నిటిని గాని, అధిక భాగమును గాని కొనివేయ వచ్చును 'సింద్రీ' ఎరువులకర్మాగార మిందుకొక ఉదాహరణము

(4) ఉత్పత్తి, వినిమయదారుల సహకారసంఘములు, సామూహిక యాజమాన్యసంఘములు మున్నగు ఇట్టివి పెక్కు లీనాడుకలవు

ప్రభుత్వ సమారంభములో ధర నిర్ణాయక విధానము - స్వేచ్ఛా వ్యాపారములో వాణిజ్యసంస్థయొక్క యజమా నుడే, గరిష్ఠ లాభములు పొందుటకు, విపణివీథియొక్క స్థితి గతుల ననుసరించి తానుత్పత్తి చేయదలచిన వస్తువులయొక్క పరిమాణమును వాటిధరలను స్వయముగా నిర్ణయించును ప్రభుత్వ వాణిజ్య సమారంభము, లాభము నాశించిగాక, జాతి యొక్క అభ్యుదయమును కాంక్షించి నిర్వహింపబడును ఇందు ధరనిర్ణాయక విధానమున లాభార్జనప్రసక్తి రానేరాదు

ప్రథమప్రపంచ సంగ్రామమునకు పూర్వముకూడ, పెక్కు ఐరోపాదేశములందు ప్రభుత్వాధీనమున పెక్కు పరిశ్రమలు నిర్వహింప బడుచుండెడివి కొన్నిసందర్భములలో, కొన్ని వర్గ ముల ప్రజాక్షేమమును దృష్టియందుంచుకొని, ఇట్టిపరిశ్రమలు లాభదాయకములుకాని ధరలనుకూడ కొన్నివస్తువులకు నిర్ణ యించెను 19వ శతాబ్ది తుదిభాగమున వాయూత్పత్తి, నీటి సరఫరా, విద్యుదుత్పత్తి, కర్మాగారములను నిర్వహించు చుండిన మునిసిపల్ సంస్థలచే నిర్ణయించబడిన ధరనిర్ణాయక విధానము, ప్రజలదృష్టిని ఆకర్షించెను పైనపేర్కొనబడిన వస్తువుల ధరలు, వాటి ఉత్పత్తికగు వ్యయముకంటె మించి యుండరాదని అంగీకరింపబడినది ఈ పద్ధతిప్రకారము లాభము గాని, నష్టము గాని ఘటిల్లదు ఈసిద్ధాంతము చాలాకాలము క్రిందనే బారోనీ, పారిటో అనువారలచేతను, ఆధునిక అర్థ శాస్త్రవేత్తలైన లెయిలర్, ఆస్కార్ లాంగ్, మీడీ మున్నగు వారలచేతను ప్రతిపాదింప బడినది

కాని కొన్ని ప్రత్యేక పరిస్థితులలో వస్తువులయొక్క ఉత్పత్తివ్యయమునకును, వాటిమూల్యమునకును వ్యత్యాసము కల్పింపబడును ద్రవ్యోల్బణమును అరికట్టుటకును, హానికర

మైన నల్లమందువంటి పదార్థముల వాడకమును తగ్గించుటకును లాభార్జనము సమర్థనీయమగును మొత్తముమీద ఉత్పత్తి వ్యయముకంటె తక్కువధరలకు వస్తువుల అమ్మకము సమాజ సంక్షేమ దృష్టి ననుసరించి సమర్థనీయమగు చున్నది

**భారతదేశములో ప్రభుత్వ వాణిజ్య సమారంభములు** స్వతంత్ర భారతదేశములో ప్రప్రథమముగా 1948 లో భారత ప్రభుత్వము రూపొందించిన పారిశ్రామిక విధానముననుసరించి పారిశ్రామిక సంస్థలు నాలుగు తరగతులుగా విభజింపబడినవి (1) సంపూర్ణముగా ప్రభుత్వముయొక్క గుత్త అధికారము క్రింద నున్నవి (2) ప్రభుత్వము యొక్క అదుపులో నున్నవి (3) ప్రభుత్వ పర్యవేక్షణకు గురిచేయబడినవి, (4) ప్రభుత్వము యొక్క సాధారణ పర్యవేక్షణక్రింద వ్యవహరించు ప్రైవేటు సంస్థలు

1956 లో ప్రభుత్వముచే రూపొందింపబడిన నూతన పారిశ్రామిక విధానము ననుసరించి ఒకటవ షెడ్యూలునందు పేర్కొనబడిన నూతన పారిశ్రామిక విధానము ననుసరించి ఒకటవ షెడ్యూలునందు పేర్కొనబడిన 17 పారిశ్రామిక సంస్థలు సంపూర్ణముగా ప్రభుత్వ బాధ్యతక్రిందికి తీసికొని రాబడెను సోషలిస్టు ప్రాతిపదికపై నూతన సమాజమును నిర్మించుటకై, ప్రణాళికాబద్ధమగు ఆర్థికాభివృద్ధి అతిశీఘ్రముగా జరుగవలసి యున్నది తత్సాధనకై, మౌలికమైనట్టి, కీలకమైనట్టి, ప్రజోపయోగకర మైనట్టి అన్ని పరిశ్రమలును ప్రభుత్వరంగమునందే వ్యవహరించవలెను పెద్ద పెట్టుబడి అవసరమగు పరిశ్రమలు కూడ ఈ ప్రభుత్వరంగములో ప్రవేశపెట్టబడినవి

యుక్తకాలమునందు క్రమముగా జాతీయమొనర్పదగు 12 పారిశ్రామిక సమారంభములు రెండవతరగతియం దుంచబడినవి

ప్రైవేటురంగమునందు వ్యక్తుల యాజమాన్యమున వ్యవహరింపగలపరిశ్రమలుమూడవ శ్రేణియందు చేర్చబడినవి

పైన చెప్పబడిన విధానము ననుసరించి ప్రభుత్వ పారిశ్రామిక, వాణిజ్యసంస్థలు భారతదేశములో బహుళసంఖ్యలో ప్రారంభింపబడినవి అనుభవమునుబట్టి చూడగా, ఈ ప్రభుత్వ సమారంభములు విశేషమైన నష్టముమీద నడచుచున్నవి అందుచే సాధ్యమైనంత వరకు అట్టి నష్టము వాటిల్లని పద్ధతులపై స్వయంపోషకములుగ నుండునట్లు, ఈ సంస్థలు నిర్వహింపబడుట వాంఛనీయము గతించిన 5 సంవత్సరములలో పెక్కు ప్రభుత్వ సమారంభముల నిర్వహణ వ్యవహారములను పరిశీలించినచో, ఊహించినదానికంటె ఏటేటా అత్యధికమైన నష్టము కల్గుచుండెనని విదితమగును అనుకొన్న దానికంటె పెట్టుబడి మొత్తము అత్యధికముగ కావలసి వచ్చినది కొన్ని సంస్థలలో కార్మికుల అశాంతి తీవ్రస్థాయికి వచ్చినది నిర్వహణ సామర్థ్యము లోపభూయిష్ఠముగ నుండెను ప్రభుత్వ వాణిజ్య సమారంభములు ప్రస్తుతము శైశవావస్థయందుండి పెక్కు క్లిష్ట సమస్యల నెదుర్కొను చున్నవి కాని ఈ క్లిష్టతను సాధ్యమైనంత మేరకు తగ్గింపవలెను ఈ సమారంభములందు ప్రజల కష్టార్జితమైన ధనము పెట్టుబడిగా నుండుట చేతను విదేశములకు మనము ఋణపడి యుండుటచేతను, వీరందరకు భారత ప్రభుత్వము జవాబుదారీ వహింపవలసి యున్నది సాధ్యమైనంత త్వరలో ఋణదాతలకు ధనముచెల్లించి, దేశము యొక్క ఆర్థిక వ్యవస్థను పటిష్ఠమగు పునాదులపై నిర్మించుకొనవలెను వైయక్తిక వాణిజ్యరంగ మందలి సంస్థలును, ప్రభుత్వరంగ మందలి సంస్థలును పై అంశములను విచారించి, దేశీయుల సంక్షేమము నాశించి వాటివాటి కార్యకలాపము లను నిర్వహించుకొన వలసి యున్నది

ఆర్ వి

## ప్రమాణ సిద్ధాంతము

ప్రాచీన భౌతికశాస్త్రము ముఖ్యముగ స్థూల సంఘటనములను మాత్రమే తేట తెల్లము చేయును దానిచే నిరూపితములైన ఫలితములు సాధారణముగ కంటికి కనిపించునవిగను, లేక సాధారణ యంత్రముల సహాయమున కనుగొనదగినవిగను ఉండును ఖగోళపదార్థముల కదలికలు మొదలు, భూమ్యాకర్షణ ప్రభావితములై స్వేచ్ఛాపతనము నందుచున్నట్టియు, లేక నిశ్చలతా స్థానమునుండి స్థితిస్థాపక డోలనము నందుచున్నట్టియు పదార్థముల కదలికల వరకు గల వివిధగతిరీతులను ప్రాచీన యంత్రగతి శాస్త్రము ఇంచుమించు నిర్దుష్టముగనే విశదీకరింప గలిగినది విద్యుదయస్కాంత క్షేత్రములయందు కదలుచుండు ఒక విద్యుద్భరిత పదార్థముయొక్క గమనము, ద్రవ, వాయు పదార్థముల ప్రవాహము, ఉష్ణప్రసారము, వాయుగతి సిద్ధాంతము - ఇవన్నియు సాంప్రదాయిక సిద్ధాంతములచే జయప్రదముగా అన్వయింపబడగల సంఘటనములలో కొన్ని ఉదాహరణములు ఈ శాఖా

రంభములో భౌతిక శాస్త్రజ్ఞులు తమ దృష్టిని పరమాణు వ్యూహారచనా పరిశీలనము పై పునకు మరల్చిరి అనతికాలము లోనే సాంప్రదాయిక సిద్ధాంతములు, సంఘటనములు అణు సంబంధమైన సంఘటనలకు అన్వయించవని విశదమైనది

పూర్వ సిద్ధాంతములలో మార్పును ప్రవేశ పెట్టవలసిన అవసరము మొట్టమొదట కాంతి వర్ణమాలలను గూర్చియు, నల్లని వస్తువులయొక్క వికిరణశక్తిని గూర్చియు, జరిగిన పరిశీలనములలో వ్యక్తమయ్యెను, అత్యధికోష్ణోగ్రతలకుగాని, విద్యుత్ స్ఖలనములకుగాని గురియైన పదార్థములనుండి వెలువడిన ఉద్గార వర్ణమాలలయందు కొన్ని ప్రత్యేక రేఖలు ద్యోతకమగును ఇవి యొక వరుస క్రమములో నుండును ఈ రేఖలలో కనిపించు క్రమశీలత్వమును రిడ్బ్ మేళన సూత్రము ద్వారా తెలుపవచ్చును ఈ సిద్ధాంత రీత్యా, ఒక పదార్థము యొక్క పరమాణువులకు వర్ణవిశ్లేషణ సంబంధమైన పదములను గాని. కొన్ని సంఖ్యల సముదాయములను గాని ప్రత్యేకింపవచ్చును అట్లన్వయించినపుడు ఆపదముల యొక్క అంతరము బహుళమైన ఆవర్ణ రేఖల తరంగ సంఖ్యలతో సమానముగ నుండును ప్రాచీనశాస్త్రము ఈ పదముల ఆవిర్భావమును గూర్చిగాని, ఈ మేళన సూత్రమును గూర్చి గాని విశదీకరింపలేదు

ఒక నల్లని వస్తువు నుండి వెలువడు ఉష్ణవికిరణము నందలి వర్ణవిశేషణ క్రమమును, ఏకప్రమాణ ఘనపరిమాణము గల ఒక శూన్యవికిరణి యొక్క విద్యుదయస్కాంత శక్తిని కనుగొనుటద్వారా విశదీకరించుటకు ర్యాలీ, జీన్స్ అను శాస్త్రజ్ఞులు ప్రయత్నించిరి శూన్య వికిరణియందుండుట కవకాశముగల స్థిర తరంగముల సంఖ్యను కనుగొని ప్రతి ఒక్క డోలనమునకు $KT$ విలువ గల శక్తి ఉండునని యూహించుటయే వారి విశదీకరణ విధానము ఇందలి రెండవ ఫలితము సంప్రదాయ సిద్ధమైన సమాన విభాగ సిద్ధాంతము ననుసరించి యుండును ఆ విధముగ సూత్రీకరింపబడిన వికిరణ సిద్ధాంతము, స్వల్ప డోలన వేగములవద్ద జరుపబడిన ప్రయోగ ఫలితములనే ధ్రువపరచును కాని, అధిక డోలన వేగములవద్ద తీవ్ర వ్యత్యాసములను కనబరచుచున్నది

1901 లో నల్లని వస్తువు యొక్క వికిరణమును గూర్చి వివరింప కోరి, మాక్స్‌ప్లాంక్ అను శాస్త్రజ్ఞుడు, వికిరణ ప్రకంపనికిని, చుట్టునున్న పరిసరములకును మధ్య శక్తి మార్పిడులు ప్రత్యేక పరిమాణములలో లేక క్వాంటాలో జరుగునని ఒక సాహసిక ప్రతిపాదనమును చేసెను పరమాణు తతులు పరస్పరము వికిరణ శక్తి నిచ్చిపుచ్చుకొనెడి ప్రక్రియ, నిశ్చిత ప్రమాణములు లేక క్వాంటాలోనే జరుగునుగాని, పూర్వసిద్ధాంతముల నుండి ఊహింపబడినట్లు అవిచ్ఛిన్నముగా నుండదని ఇతనివాదము ఈవాదము ఒక ప్రకంపని యొక్క సగటు శక్తిని సూచించు సమీకరణములో మార్పును తెచ్చినది నల్లని వస్తువు యొక్క వర్ణవిశ్లేషణ విభజనమును గూర్చి కూడ ఇది వివరింప గలిగెను 1914 లో హెర్ట్జ్, ఫ్రాంక్,అను శాస్త్రజ్ఞులు పాదరస పరమాణువులతో ఋణవిద్యుత్కణ ఘర్షణములకు సంబంధించిన ప్రయోగములు చేసి, పరమాణువుల మధ్య విద్యుదయస్కాంత శక్తి వలెనే యాంత్రిక శక్తి కూడ క్వాంటాలోనే గ్రహింపబడునని నిరూపించిరి

ఈ విధముగనే, తేజో విద్యుత్పరిణామము కాంప్టన్ పరిణామము అను మరిరెండు ప్రయోగ ఫలితములను గూడ ప్రాచీన సిద్ధాంతము విశదీకరింప లేకుండెను తేజో విద్యుత్పరిణామ సిద్ధాంతప్రకారము, ఘనపదార్థములమీద వికిరణ ప్రసరణము జరిగినపుడు, ఋణవిద్యుత్కణములు వెలువడును ఈ తేజో విద్యుత్కణముల గరిష్ఠవేగము వికిరణము యొక్క తరంగదైర్ఘ్యముపై ఆధారపడును గాని, దాని తీవ్రతపై ఆధారపడదని కనుగొనబడెను కాంప్టన్ పరిణామము ప్రకారము, ఒక ఘనపదార్థముపై పతనమంది అందుండి చెదరిన ఎక్స్‌కిరణములు(రాంట్జన్ కిరణములు)పతన వికిరణము యొక్క కంపన వేగమునే కాక, చెదరిన కోణముపై ఆధారపడిన అధికతర తరంగ దైర్ఘ్యముగల యొక నూతన కంపన వేగమును కూడ కలిగియుండును వికిరణమునందు అవిచ్ఛిన్న ప్రసారము జరగదనియు, ఒక వికిరణ కిరణము $h\nu$ అను నిశ్చిత ప్రమాణముగల తేజః కణముల (క్వాంటా) ప్రవాహము వలె నుండుననియు తెల్పెడివాదము యొక్క ప్రాతిపదికపైననే పై రెండు సిద్ధాంతములను వివరింప వలనుపడెను

ఇట్లు కణరూపమైన శక్తి మార్పిడిని గుర్తించిన పిమ్మట శాస్త్రజ్ఞులకు వర్ణవిశ్లేషణ ప్రయోగఫలితముల కనుగుణముగ ఈ కణముల విమోచనముగాని, విలీనముగాని జరిగెడి విధానమును గూర్చి వివరించుట ఒకసమస్య యైనది 1911లో రూథర్‌ఫర్డ్ అనుశాస్త్రజ్ఞుడు కేంద్రకము పరమాణు మధ్యస్థమై

ఉండుననియు, దానిచుట్టును ఋణ విద్యుత్కణములు వివిధ వృత్తపరిధులలో పరిభ్రమించుచుండుననియు ప్రతిపాదించెను. ప్రాచీన సిద్ధాంతముల ప్రకారము అట్టి అణువు సుస్థిరముగ నుండజాలదు. 1914 లో నీల్స్‌బోర్ అను శాస్త్రజ్ఞుడు పరమాణు నిర్మాణమును గూర్చిన యొక వాదమును రూపొందించెను. అందలి విషయములకును సంప్రదాయిక శాస్త్రపద్ధతికిని మౌలిక వ్యత్యాసము గలదు. అతడు, పరమాణువు కొన్ని ప్రత్యేక నిశ్చల స్థితులను కలిగియుండుననియు, అట్టి యొకస్థిరస్థితిలోగల మొత్తముశక్తి స్థిరముగా నుండుననియు, ఊహించెను. మరియొక ప్రతిపాదన మేమన పరమాణువు నందలి యొక ఋణ విద్యుత్కణ మొక స్థిర పరిధి నుండి మరియొక దానికి మారుననుట. అట్లు మారుటలో పరమాణువు $h\nu = E_1 - E_2$ అను క్వాంటమ్ సమీకరణములో నున్న $h\nu$ విలువగల తేజఃకణములశక్తిని విముక్త మొనర్చును, లేదా, విలీన మొనర్చుకొనును. మరియు, ఈస్థిర స్థితులలో, కేంద్రముచుట్టును తిరుగుచున్న ఋణకణము $P = \frac{nh}{2\pi}$ అను సమీకరణము ననుసరించిన కొన్ని నిర్ణీతమైన విలువలు కలిగిన పరిభ్రమణవేగమును కలిగియుండునని ఊహించుట మూలమున ఉదజని వర్ణమాలలోని రేఖలకంపన వేగములను వివరింప సాధ్యమగునని నిరూపించెను.

ఉదజని వర్ణమాలను సార్థకముగ వివరింగపలుగుటలో తేజఃకణసిద్ధాంతము అత్యుత్తమ విజయమును సాధించినది. వికిరణములేని స్థిరస్థితులను ప్రవేశపెట్టుటయును, భ్రమణోద్వేగపు విలువలు నిర్ణీతప్రమాణములలో నుండునని తెలుపుటయును, ప్రయోగముల ద్వారా విశదమైన సత్యములను వివరింపగలిగిన మేరకే సమర్థనీయములు. నీల్స్‌బోర్ యొక్క ప్రతిపాదనల సమగ్ర అవగాహనము తరంగయంత్రశాస్త్రము ప్రచురమైన తరువాతనే సాధ్యమైనది.

కే. వెం.

## ప్రయోజనైక వాదము
## (Utilitarianism)

సుఖమే జీవితపరమార్థమను సిద్ధాంతములలో 'ప్రయోజనైకవాద' మొకటి. ఇది ఒక దార్శనిక సిద్ధాంతముగా, సకల క్రియాకలాపములకు, ప్రయోజన మొక్కటే నైతిక సామాజిక లక్ష్యమని ప్రతిపాదించుచున్నది. వైయక్తిక, సామాజిక కార్యజాలమునకు ప్రయోజనమైన సుఖమును జీవిత లక్ష్యముగా ఈ సిద్ధాంతము పేర్కొనును. వ్యక్తిగతముగ మానవునకు అత్యధిక స్థాయిలో ఆనందమును ప్రసాదింపగల కార్యమే నైతికముగా అభిలషణీయమైన దనియు, అత్యధికమైన ఆనందమును అధికసంఖ్యాకులైన మానవులకు ప్రసాదింపగల కార్యమే సామాజికముగా మంచిదనియు ఈ సిద్ధాంతము భావించుచున్నది. ఈ సిద్ధాంతమును ప్రతిపాదించినవారిలో జెరిమీబెన్థమ్ (1748-1832), జేమ్స్‌మిల్ (1773-1836), జాన్ స్టువర్ట్ మిల్ (1806-1873) ముఖ్యులు. ఆదిలో గే (1669-1745), పాలే (1743-1805) అను శాస్త్రవేత్తల ప్రతిపాదనముల ననుసరించి, ఈ ప్రయోజనైకసిద్ధాంతము ఈశ్వర వాదముతో ముడివడి యున్నది. అనంతరము స్పెన్సరు (1820-1903) దృష్టిలో ఈ సిద్ధాంతము పరిణామవాద స్వరూపమును స్వీకరించినది. అటుపిమ్మట సిడ్జ్‌విక్ (1838-1900) అనునాతని భావనలో అది అంతరజ్ఞాన రూపము ధాల్చినది. అమెరికాలో జి ఇ మూర్, హెచ్ రాష్‌డల్, జె లైర్డ్ వంటి తత్త్వవేత్తలు, సుఖేతరములైన ప్రయోజనములను సైతము మంచివని భావించు భావప్రధానాత్మక ప్రయోజనైక వాదమును ప్రతిపాదించు ఉద్యమమునకు కారకులైరి. అమెరికాలో ప్రయోజనైక వాదమునకు ప్రధానముగా సంకల్పవాదముల విలువలతో సంబంధ మేర్పడెను. మూల్యప్రయోజన వాదమును లక్షించు జేమ్స్, డ్యూయీ, పెర్రీలయొక్క లౌకిక నీతిశాస్త్ర సిద్ధాంతములు భావప్రధాన ప్రయోజనైకవాద సిద్ధాంతమునకు ఉత్తమోత్తమమగు రూపములుగా అమెరికా దేశమునందు పరిగణింప బడుచున్నవి.

సాంప్రదాయికముగా, ప్రయోజనైక వాదము ప్రయోజనమునే జీవితముయొక్క పరమసూత్రముగా ప్రోత్సహించు నొక దృక్పథముగా అవగాహనము చేసికొనబడినది. తత్ఫలితముగా, ఈ సిద్ధాంతము అంతరజ్ఞాన వాదమునకు వ్యతిరేక మయినది.

ఎపిక్యురస్ అనునాతడు ప్రతిపాదించిన సుఖవాదమునకును, ప్రయోజనైక వాదమునకును నడుమ ముఖ్యమగు రెండంశములలో భేద మున్నది. (1) ఎపిక్యూరియనుల సుఖవాదమువలె, ప్రయోజనైకవాదము స్వీయసుఖ సంతోషములను మాత్రమే ఆకాంక్షించు స్వార్థపూరితమగు సిద్ధాంతము కాదు. (2) వివిధ రకముల సుఖముల నడుమ ప్రయోజనైక

వాదము గుణాత్మక విభేదములను ప్రవేశపెట్టును.

లోకప్రసిద్ధుడగు సోక్రటీసుయొక్క శిష్యుడగు అరిస్టిప్పస్ (క్రీ పూ 435-366) ప్రప్రథమముగా వైయక్తిక సుఖమే సర్వవిధములైన సుఖములలో మిన్నయైన దనినాడు. ఎపిక్యూరస్ (క్రీ పూ 341-270) ఈ సిద్ధాంతమునకు కొన్ని మెరుగులు దిద్ది, భౌతిక సుఖములకంటె మానసికానందమే సర్వదా ఎక్కువ వాంఛనీయమని చెప్పినాడు. ఆధునిక యుగమున థామస్ హాబ్స్ (1588-1679) సుఖానుభవమును ఆధార మొనర్చుకొని ఒక నైతిక దర్శనమును నిర్మింప వలెనని తీవ్రమైన యత్నమును గావించినాడు.

ప్రయోజనైక సిద్ధాంత చరిత్ర ఎట్టిదైనను, ఈ వాదముయొక్క పరమ లక్ష్యమును పరామర్శించినచో, అది ప్రజాస్వామిక ప్రభుత్వ విధానములకు నైతికమైన ప్రాతిపదికగా ఉగ్గడింపబడినట్లు తెలియుచున్నది. అంతేకాక, ప్రాచీన రాజరికములలో, దైవాంశసంభూతులగు ప్రభువుల పవిత్ర స్వత్వములు అప్రతిహతములైనవను వాదమును వ్యతిరేకించు ఒక తీవ్ర సిద్ధాంతముగా, ప్రయోజనైక వాదము పరిగణింపబడినది. ప్రజాస్వామిక ప్రభుత్వము అత్యధిక సంఖ్యాకులగు ప్రజల ప్రయోజనములను సిద్ధింపజేసి, వారికి అత్యుత్తమ ఫలితములను లభింపజేయునను నమ్మకము వలన, అది సక్రమమైనదిగ భావింపబడుచున్నది.

కొందరు దార్శనికులు సుఖములయొక్క గుణాత్మక, పరిమాణాత్మక భేదములను స్పష్టముగా వివరించి యుండగా, కొలది మందియొక్క సుఖానుభూతుల మూలముగా, ఎందరు వ్యక్తులు ఎంత నష్టమునకు గురియగుదురను విషయమునకు బెన్థమ్ అధికమగు ప్రాధాన్యము నొసగినాడు. తక్కిన అంశములు సమానములైనపుడు గుణాత్మక విషయములలో ఆతడు భేదమును పాటింపలేదు.

మిల్ అను పండితు డట్లుకాక, బుద్ధిబలముతో మిళితములగు సుఖములే భౌతిక, శారీరక సుఖములకంటె ఎల్లపుడును, ఉత్తమములు, ఉన్నతములు నైనవని ప్రబోధించినాడు. ఈ దృష్టి ననుసరించి "సంతృప్తమైన సూకరమువలె జీవించుటకంటె, అసంతృప్తుడైన మానవుడుగా జీవించుటయే ఎక్కువమేలు, సంతృప్తుడైన బుద్ధిహీనునికంటె, అసంతృప్తుడగు సోక్రటీసువలె జీవించుటయే గొప్ప."

వైయక్తిక, సామాజిక సిద్ధాంతములవలె, ప్రయోజనైకవాదము కూడ పరస్పర విరుద్ధములగు రెండు భావముల నడుమ ఊగులాడుచుండును. ఒక ప్రక్క ఈ వాదమునకు సుఖవాదముతోను, అహంకార వాదముతోను, నియతివాదముతోను సన్నిహితమగు చుట్టరిక మున్నది, మరొక ప్రక్క, దీనికి అంతరజ్ఞాన వాదముతోను, పరిపూర్ణ వాదముతోను, సర్వభూత హితవాదముతోను, స్వేచ్ఛా సంకల్ప వాదముతోను బాంధవ్య మున్నది. అందుచే, మిల్లు ప్రతిపాదించిన ప్రయోజనైక వాదమునకును నిర్వివాదమగు నైతిక సిద్ధాంతమునకు సంబంధించు సాంప్రదాయిక ధర్మచింతనమునకును విమర్శనాత్మకమగు అనురూప్యము కలదు.

వి నా కి రె

## ప్రవర్తనైక మనస్తత్వవాదము
## (Behaviouristic School of Psychology)

జాన్ బి వాట్సన్ అను అమెరికా మనస్తత్వ శాస్త్రజ్ఞునిచే (క్రీ శ 1878-1958) ప్రవర్తనైక మనస్తత్వ వాదమను నొక నూతన సిద్ధాంత మావిష్కరింపబడెను. 1913 వ సంవత్సరములో 'సైకలాజికల్ రెవ్యూ' ('మనస్తత్వ సమీక్ష') అను పత్రికయందు 'ప్రవర్తకుని దృష్టిలో మనస్తత్వవాదము' అను శీర్షిక క్రింద ఒక వ్యాసము ప్రచురింపబడెను. ఆ వ్యాసములో సమకాలిక మనస్తత్వవాదమును వాట్సన్ విమర్శించుచు, అది వివాదరహితమైన ఒక ప్రకృతి శాస్త్రముగా ప్రపంచములో విశిష్ట స్థానమును సంపాదించుకొన లేనందుకు విచారము, ఆశాభంగము ప్రకటించెను.

విషయాత్మక మనస్తత్వ వాదమున కొక పథకమును వాట్సన్ ప్రతిపాదించెను. ఈ విషయాత్మక మనస్తత్వవాదము చైతన్యమునకు సంబంధించి యుండక, మానవుని ప్రవర్తన పరిశీలనమునకు సంబంధించినదై యుండెను. తన విమర్శనమందు వాట్సన్ 'మనస్సు', 'చైతన్యము', 'ఇంద్రియ వికారము', 'ప్రత్యక్షానుభవము', 'ప్రతిరూపము' అను శబ్ద ప్రయోగముల ప్రయోజనమును ప్రశ్నించుచు, ఈ ప్రయోగములు మనస్తత్వవాదులందరిచే అనుగుణముగ ఉపయోగింపబడకపోవుటచే, అవి గందరగోళమునకు మాత్రమే త్రోవతీసెనని వ్యాఖ్యానించెను. మనస్సంబంధమైన ఇట్టి శబ్ద ప్రయోగములకు శాస్త్రీయమైన విషయాత్మక మనస్తత్వవాదములో స్థాన ముండరాదని వాట్సన్ ఉద్ఘాటించెను.

మనస్తత్త్వవాదముమానవప్రవర్తనమునకుసంబంధించిన శాస్త్రమనియు అట్టిప్రవర్తనము 'ఉత్తేజము' 'అనుక్రియ'అను క్రియా విధానములద్వారా విషయాత్మకముగ వర్ణింపబడవలెననియు ఆతడు వక్కాణించెను ఆకాలమున పెక్కురు మనస్తత్త్వవాదులు అనుష్ఠించుచుండిన 'అంతశ్చింతనవిధానము'నుగూడ వాట్సన్ విమర్శించెను ఈ విధానము అవిశ్వసనీయమైనదని ఆతని అభిప్రాయము సుశిక్షితులైన మనస్తత్త్వవాదుల నడుమ కూడ ఈ అంతశ్చింతన విధానము కారణముగా భేదాభిప్రాయము లుప్పతిల్లినవి జంతువులు, బాలురు, అసాధారణ వ్యక్తులు-వీరి విషయములోగూడ ఈవిధానమును అనుసరించ కూడదని వాట్సన్ వక్కాణించెను

మనస్తత్త్వవాదము ప్రకృతిశాస్త్రములలో కేవల మొక విషయాత్మకవిధానమనియు, భౌతికరసాయనశాస్త్రములకు వలెనే, దానికికూడ అల్పప్రమాణమగు 'అంతశ్చింతనము' మాత్రమే చాలుననియు ఆతడు సూచించెను

వాట్సన్ నిర్వచించిన ప్రవర్తనైకమనస్తత్త్వవాదలక్ష్యమిట్లుండెను 'అనుక్రియను ఊహింపగల ఉత్తేజమును పొందుచు, ఉత్తేజమును వివరింపగల అనుక్రియను స్వీకరింపవలెను' ఈ లక్ష్యనిర్వచనము ననుసరించి ప్రవర్తనైక మనస్తత్త్వవాదము నిస్సంశయముగ నొకశాస్త్రమనదగియున్నది ఇట్టి శాస్త్రములలో అంతశ్చింతనమునంటి విషయిగతవిధానములకును, చైతన్యమువంటి మనోగతవ్యాపారములకును ఎట్టి స్థానము కూడ నుండజాలదు విషయాత్మకములైన ఉత్తేజమును, అనుక్రియలనుమాత్రమే దృష్టియందుంచుకొని ప్రవర్తనైక మనస్తత్త్వవాదమును గూర్చి రచన సల్పుటగాని అధ్యయన మొనర్చుటగాని జరుగవలయునని వాట్సన్ ప్రకటించెను

ప్రవర్తనైకమనస్తత్త్వవాదుల భావనప్రకారము, మానవమూర్తిత్వ మనునది పరిసరవాతావరణ ప్రభావము ద్వారా సంక్రమించు అలవాటులచే రూపొంది, పరిణామము పొందును ప్రముఖరష్యను మానవశాస్త్రవేత్తయైన 'పావ లోవ్' ప్రప్రథమముగా ఈవిధానమును ప్రయోగించి, దానిని అభ్యసనసిద్ధాంతముగా రూపొందించెను మూర్తిత్వనిర్మాణ విషయమున అభ్యసన విధానమునకు వాట్సన్ అత్యంత ప్రాముఖ్యము నిచ్చెను. 'వంశపారంపర్య సంక్రమణ సిద్ధాంతము' ఈవిషయములో దాదాపు ఎట్టిపాత్రయు వహింపదు ఆరోగ్యవంతులైన పన్నెండుగురు బిడ్డలను తనకప్పగించినచో, వారిశక్తి యెంతటిదైనను, వారి పూర్వులు ఏజాతికి చెందిన వారైనను – ఆ బిడ్డలు ఏవృత్తియందు ప్రవీణు లగుటకు వాంఛించెదరో – వైద్యవృత్తియందుగాని, న్యాయవాదిత్వ వృత్తియందుగాని, కళావృత్తియందుగాని, లేక చోరవృత్తియందైనగాని ఈ పన్నెండుగురిలో ఎవ్వరినైనను ప్రత్యేకమైన ప్రవీణునిగా తయారుచేయగలనని వాట్సన్ ప్రబలమైన ఆత్మవిశ్వాసముతో ప్రకటించెను ఈ విషయమున దాతనికిగల తీవ్రభావములు పై ప్రకటనమునందు ద్యోతకముకాగలవు కాని ఇట్టి తీవ్రభావములతో ప్రవర్తనైక మనస్తత్త్వవాదులందరు ఏకీభవింపకున్నను, మూర్తిత్వనిర్మాణమునందు అభ్యాసపద్ధతికిగల పాత్రమునకు మాత్రము వారు అత్యంతప్రముఖ స్థానమునిచ్చెదరు

వాట్సన్, మనస్తత్త్వవాదము నొక ప్రయోగశాస్త్రముగా పరిగణించును ఈ ప్రయోగశాస్త్రము మానవుని అభ్యున్నతికి వినియోగింపవలయునని ఆతని అభిప్రాయము మానవుని ఉత్తమవ్యక్తిగా రూపొందించుటకు విద్యావిధాన మొక సాధనమై, పసిబాలురలో శాస్త్రీయమైన హేతువాద దృష్టిని కల్గించుటకు తోడ్పడవలయునని ఆతని విశ్వాసము విద్యారంగమునందే కాక, పారిశ్రామిక, వైద్యరంగములందు కూడ ప్రవర్తనైక మనస్తత్త్వవాదను ప్రముఖముగా సహాయకారి కాగలదు

ప్రవర్తనైక మనస్తత్త్వవాదులు, అనుకూలిత అనుక్రియలపైనను, తత్ఫలితముగా అభ్యసనమనస్తత్త్వవాదమునుండి జనించు విజ్ఞానముపైనను అత్యంతవిశేషముగా కృషిసల్పిరి వాట్సన్ మరణానంతరము, ఆతనిచే ప్రతిపాదింపబడిన ప్రవర్తనైక మనస్తత్త్వసిద్ధాంతములలోని పెక్కు అంశములు విమర్శకు గురియైనను, క్రమవిరుద్ధమైన ఆతని విషయాత్మక పరిశీలన విధానము పలువురి ఆమోదమును పొంది ముందుకు కొనిపోబడెను సమకాలికులగు హల్, టెల్మన్, గుత్రీ, స్కిన్నర్ మున్నగువారు తమ రచనలయందు వాట్సన్ సిద్ధాంతమునే అనుసరించుట వలన వారు ఆధునిక ప్రవర్తక వాదులుగా గణుతికెక్కిరి. శాస్త్రీయవిషయ విచారణముపై ప్రవర్తనైక మనస్తత్త్వవాదులు తమదృష్టిని విశేషముగా కేంద్రీకరించుటచే, ఈనాటికిని వారిసిద్ధాంతముచే మనస్తత్త్వ పరిశోధన పద్ధతులు ప్రభావితములగుచున్నవి

మ. ఉ. ర.

## ప్రవీక్షణ, ఉదాయన పరికరములు
## (Surveying and Levelling Instruments)

భూముల యొక్క సరిహద్దులకొలత సర్వేయింగు లేక ప్రవీక్షణ మనబడును భూమిపైనున్న వివిధస్థానముల యొక్క ఎత్తు పల్లముల కొలత లెవెలింగు లేక ఉదాయన మనబడును భూమిపై నుండు మిట్టపల్లములను కొలిచి భవిష్యత్కాలములో ఉపయుక్తములైన పటములను తయారుచేయు సివిల్ ఇంజనీరింగు శాఖయందలి ఒక విభాగము లెవెలింగ్ అని సాధారణముగా వ్యవహరింపబడుచున్నది

ప్రవీక్షణము రెండువిధములుగా నుండును (అ) సాధారణ ప్రవీక్షణము, (ఆ) కచ్చితమైన ప్రవీక్షణము

సాధారణ ప్రవీక్షణము భూమివంపులకు, వక్రీభవమునకు సవరణలు చేయకయే కొలదివిస్తీర్ణముగల ప్రదేశములను సర్వేచేయుట సాధారణప్రవీక్షణమనబడును ఇందుకుపయోగపడునవి సాధారణ పరికరము లనబడును

కచ్చితమైన ప్రవీక్షణము (జియొడెటిక్) పెద్ద వైశాల్యముగల ప్రదేశములకు, భూమివంపులకు, వక్రీభావమునకు సవరణలుచేసి సర్వేచేయుట కచ్చితమైన ప్రవీక్షణ మనబడుచున్నది ఇందుపయోగించు పరికరములు విలువగలవి, ప్రత్యేకములైనవి

సాధారణముగా ప్రాజెక్టుల కవసరమైనది సాధారణ సర్వేయనబడును ఏవస్తువునైనను మరియొక వస్తువుతో సూచించుటకు మూడు నిరూపకములచే నిరూపింపవలెను వీటిలో రెండు నిరూపకములు అడ్డముగను, ఒకనిరూపకము నిలువుగను ఉండును ఇట్టికొలతలను కొలచుటకు రెండు రకముల సాధనము లుండును

(అ) సమతలపు కొలతకు సాధనములు (1) గొలుసు (2) చేపు (3) దిక్సూచి (4) సమతలమేజా, (5) థియొడొలైట్

(ఆ) నిలువు కొలతకు సాధనములు (1) లెవెల్, (2) థియొడొలైట్

వివిధరకముల ప్రవీక్షణములు భూములను కొలచుటకు ఈక్రింది విధానము లవలంబింపబడును (1) గొలుసుసర్వే (2) దిక్సూచిసర్వే (3) సమతలమేజాసర్వే (4) థియొడొలైట్ సర్వే (5) లెవెలింగుసర్వే

గొలుసు సర్వే గొలుసువెంబడి దూరములను, గొలుసునుండి నేలపై లంబము వెంబడి గల దూరములను కొలిచి, పటములను తయారుచేయుట గొలుసుసర్వే అనబడును దీనికవసరములగు పరికరములు (1) గొలుసు (2) చేపు (3) లంబములను కొలచుబెత్తము (4) శిలువ తలకర్ర లేక దృష్టి చతురము (5) రేంజింగ్ బెత్తములు (6) బాణములు

గొలుసు 30, 20, 15 మీటర్లపొడవుగల గొలుసులు ప్రవీక్షణమున కుపయోగింపబడును పొలముల విస్తీర్ణములను ఎకరములలో కొలచుటకు గ్రామకరణము లుపయోగించు గొలుసుల పొడవు 66 అడుగు లుండును 66 అడుగులను దశాంశపద్ధతిలోనికి మార్చినచో, 20 మీటర్లగును కావున ప్రస్తుతము తయారగుచున్న 20 మీటర్ల గొలుసులను గ్రామకరణము లుపయోగింపవచ్చును

చిత్రము 60

ONE FOOT OR LINK

50

10 OR 90  20 OR 80  30 OR 70  40 OR 60

FIG. 1. CHAIN

ప్రతిముప్పదిమీటర్ల గొలుసునందు 100 లింకులుండును ప్రతిలింకు ఒక చిన్నచక్రిముతో అతుకబడి యుండును ఈ చక్రముల వలన, మొత్తము గొలుసునంతను ఒకలింకు పొడవుగల కట్టగా ముడిచి కట్టవచ్చును ప్రతి పది లింకులకు ఒక సూచిక బిళ్ళ యుండును ఈసూచికబిళ్ళ కొక సూది మొన యున్నచో, అది 10 లేక 90 లింకులనియు, రెండు మొనలున్నచో అది 20 లేక 80 లింకులనియు, 4 మొనలున్నచో, 40 లేక 60 లింకులనియు, 5 మొనలున్నచో 50 లింకులనియు సులభముగా తెలిసికొనవచ్చును

చేపు ఇది గుడ్డతో కాని, ఉక్కుతో కాని 30, 20, 15

మీటర్ల పొడవుకలిగి, గుండ్రని చిన్నతోలుపెట్టెలో రిబ్బను వలె చుట్టబడియుండును గొలుసురేఖ నుండి స్థానమువరకు లంబములను కొలచుటకు దీని నుపయోగింతురు

లంబములను కొలచుబెత్తము ఈబెత్తములు కొయ్యతో గాని,ఉక్కుతోగాని, 3 మీటర్ల పొడవున తయారుచేయబడును వీటితో గొలుసురేఖనుండి స్థానములవరకు లంబములను కొల చెదరు వీటిపై ప్రతి 20 సెంటిమీటర్లకు ఒకరంగు విడిచి మరి యొక రంగును - ఎరుపు - తెలుపు లేక ఎరుపు - నలుపు లేక నలుపు - తెలుపు పూసెదరు

శిలువ తలకఱ్ఱ కఱ్ఱతోకాని, ఇనుముతోకాని తయారుచేయబడు శిలువవంటి చిన్నతల ఈ కఱ్ఱపైనుండును ఈ తలపై నిలువుకోతల జతలు ఒకదానికొకటి సమకోణము లలో నుండును ఈకఱ్ఱతో గొలుసురేఖలకు లంబరేఖలను నిర్ణయింపవచ్చును ఒకనిలువు కోతల జతను గొలుసురేఖతో సరిగా నుంచి, ఈనిలువుకోతలకు సమకోణములలో నున్న మరి యొక నిలువుకోతల జతతో ఒకలంబరేఖను నిర్ణయించెదరు

చిత్రము 61



CROSS STAFF HEAD

పటము 2

దృష్టిచతురము ఈ పరికరములో 45 డిగ్రీల కోణ మేర్పడునట్లు అద్దములు ఒకదాని కొకటి అమర్పబడును అందుచే ఏ కాంతికిరణమైనను ఈ అద్దముల ద్వారా వక్రీకరణ మొందునపుడు అద్దముల నడుమనున్న కోణమునకు రెండింతల కోణములో వక్రీకరణమొందును ఈదృక్శాస్త్రసూత్రము ననుసరించి గొలుసురేఖకు లంబములను నిర్ణయించ వచ్చును

రేంజింగు బెత్తములు, రెండు లేక మూడు సెంటి మీటర్ల వ్యాసము కలిగి, రెండు లేక మూడు మీటర్ల నిడివి గల కఱ్ఱతోకాని, ఉక్కుగొట్టముతోకాని రేంజింగుబెత్తములు చేయబడును ఈ బెత్తముపై ప్రతి 20 సెంటిమీటర్లకు, ఒక విభాగము విడిచి మరియొకవిభాగముపై రంగులు వేయ బడును రంగులు వేయబడిన ఈబెత్తములు స్థానములను నిర్ణయించుటకును, గొలుసురేఖను పొడిగించుటకును, లేక ఒకగొలుసు పొడవుకంటె ఎక్కువ దూరములోనున్న రెండు స్థానముల నడిమి దూరమును కొలుచునపుడు, అదే రేఖలో ఒక గొలుసు దూరములోనున్న స్థానములను నిర్ణయించుట కును ఉపయోగపడును

బాణములు వీటిని నాల్గవవంతు సెంటిమీటరువ్యాస ముతో, 45 సెంటిమీటరుల పొడవున ఇనుప తీగతో చేయు దురు ఇవి ఒక కొనయందు సూదిమొన వలెను, మరియొక మొనయందు వలయా కారముగను చేయబడును వీటిని ప్రతి గొలుసు పొడవుచివర, గొలుసును ముందుకు లాగుటకుపూర్వము నేలలో గ్రుచ్చెదరు సర్వే అయిన తరువాత గ్రుచ్చిన బాణముల నన్ని టిని లెక్కించెదరు ఇందువలన మొత్తము కొలువబడిన గొలుసులసంఖ్య తెలియగలదు గొలుసు సర్వే విధానములో మొత్తము విస్తీర్ణములను చిన్న త్రిభుజములుగా విభ జించి సర్వే చేయుదురు

చిత్రము 62



ARROWS

పటము 8

దిక్సూచిసర్వే దిక్సూచిలో ముఖ్యముగా ఉత్తర,

చిత్రము 63




Fig.4. PRISMATIC COMPASS

దక్షిణ దిక్కులనుసూచించు అయస్కాంతశక్తి కలిగిన సూది యుండును మొత్తము మున్నూట అరువది డిగ్రీలు (ప్రతి డిగ్రీ అర్ధడిగ్రీ వరకు విభజింపబడినది) గల వృత్తాకార మందున్నచక్రముకూడనుండును భూమిపై ప్రతిరేఖ యొక్క దిక్కును సూచించుటకు, ఆ రేఖకు, ఉత్తరమునకు మధ్యనుండు కోణమును కొలిచి సూచించెదరు ఈ కోణమును, ఆ రేఖ వెంబడి దూరమును కొలుచుటవలన పటము వేయుట సులభ మగును

గొలుసు సర్వే సర్వే విధానమందును, దిక్సూచివిధాన మందును కొలతలు కొలుచునపుడు, పుస్తకములో కొలతలను, కోణములను వ్రాసి, పిమ్మట కార్యాలయములలో పటములను తయారుచేయుదురు

సమతలమేజాసర్వే ఈ విధానమున కవసరమగు పరి కరము లివి (1) 80 సెంటిమీటర్లపొడవు, 60 సెంటిమీటర్ల వెడల్పుగల్గిన చదునైన నున్నటి మేజాబల్ల (డ్రాయింగు బోర్డు), (2) దానికాధారము, (8) దృష్టిసూచకము, (4) తొట్టె దిక్సూచి, (5) స్పిరిట్ లెవెల్, (6) డ్రాయింగుపరికర ములు

చిత్రము 84



Fig 5 Plane Table

చిత్రము 65



Fig 6 Trough Compass

చిత్రము 66



Fig 7 Alidade or Sight vane

దృష్టిసూచికసహాయముతో దృష్టిరేఖలను వ్రాయ వచ్చును తొట్టె దిక్సూచితో ఉత్తరదిశను తెలిసికొనెదరు స్పిరిట్ లెవెలుతో డ్రాయింగుబోర్డును సమతలముగా నుంచ వచ్చును డ్రాయింగు పరికరములతో పటములను వ్రాసెదరు

సమతలమేజా సర్వేవిధానములో వివరముగా అన్ని అంశములను పటములలోను, పుస్తకములలోను పేర్కొన కుండగను, కొలతలను, కోణములను ఉదాహరింపకుండగను సర్వేచేయుటయు, పటమును గీయుటయు మొత్తముగా పూర్తియగును

థియొడొలైట్‌సర్వే ఈ పద్ధతిననుసరించి సమతలము నందును, నిలువునందును కొలతలను తీయవచ్చును దీనిలో ఒక లెవెలింగుతల, పై సమతలవృత్తము, క్రింది సమతల వృత్తము, నిలువువృత్తము, దూరదర్శిని, ఆధారమును ఉండును క్రిందిసమతలవృత్తము 820 డిగ్రీలుగా విభజింపబడి, ప్రతిడిగ్రీ మరల 8 లేక 6 విభాగములుగా విభజింపబడి యుండును పై వృత్తములోనున్న వెర్నియరు వలన, కోణ ములను, డిగ్రీలను మరింత కచ్చితముగా కొలవవచ్చును

దూరదర్శినిని సమతలములో త్రిప్పినచో భూమిపై నున్న వివిధ స్థానముల నడుమనున్న కోణములను సమతల ములో కొలవవచ్చును

ఈ పరికరమును దిక్సూచి వలెనే పటములను తయారు చేయుటకు వాడవచ్చును థియొడొలైట్ సర్వే చాల కచ్చిత మైనదగుటచే అతి ముఖ్యస్థానములను కలుపుటకు దానిని, వాడెదరు థియొడొలైట్‌లలో పలురకము లున్నవి వెర్ని యర్ థియొడొలైట్, మైక్రోస్కోపిక్ థియొడొలైట్, మైక్రో ఆప్టిక్ థియొడొలైట్ అనునవి సమతలవృత్తములు, నిలువు వృత్తములుకూడ తిరుగు మరల వశమునందుండును వీటిలో ఒకటి సాధారణముగా వాడుటకును, మరియొకటి కచ్చితముగా స్థానములను దృష్టిరేఖయందుండునట్లు దూర

దర్శినిని త్రిప్పుటకును ఉపయోగపడును.

చిత్రము 67

పటము 8

| | | | |
|---|---|---|---|
| 1 | Lower plate | 14 | A frame |
| 2 | Foot screw | 15 | Vertical circle tangent screw |
| 3 | Upper parallel plate | 16 | Vertical circle clamp screw |
| 4 | Lower tangent screw | 17 | Vertical circle |
| 5 | Lower clamp | 18 | Reading glass |
| 6 | Outer axis | 19 | Telescope |
| 7 | Scale plate | 20 | Object glass |
| 8 | Upper clamp screw | 21 | Sun shade |
| 9 | Upper tangent screw | 22 | Focussing screw |
| 10 | Vernier plate | 23 | Eye piece |
| 11 | Plate bubble | 24 | Telescope level |
| 12 | Compass box | 25 | Capstan headed nuts |
| 13 | Clip screw | | |

లెవెలింగ్ వివిధస్థానములమధ్యనున్న అంతరమును లేక నిలువుదూరమును లేక ఎత్తుపల్లములను కొలుచుట లెవెలింగ్ అనబడును. లెవెలింగ్ పరికరములో ఒక దూరదర్శిని, ఒక స్పిరిట్ బుడగ గొట్టము, ఒక ఆధారము, లెవెలింగ్ కొలత, లెవెల్‌లు ఉండును. స్పిరిట్ బుడగను గొట్టమునకు కచ్చితముగా మధ్యనుండునట్లు చేయుట వలన, దూరదర్శిని దృష్టిరేఖను సమతలములో నుంచెదరు. లెవెలింగ్ పొద్దునకు ఉన్న మూడు మరపాదముల సహాయముతో స్పిరిట్ బుడగను గొట్టముమధ్య నుండునట్లు చేయవచ్చును. లెవెలింగ్ కొలత మీటర్లలోను, సెంటిమీటర్లలోను విభజింపబడి, ఒకదానిలో మరియొకటి ఇముడునట్లు మూడు ముక్కలుగా మొత్తము నాలుగు మీటర్ల పొడవుండును. వీటితో అర్ధసెంటిమీటరు వరకు ఎత్తుపల్లములను కొలవవచ్చును.

చిత్రము 68

పటము 9

| | | | |
|---|---|---|---|
| 1 | Levelling screws | 6 | Clamp screw |
| 2 | Micrometer screw | 7 | Prism |
| 3 | Cross levels | 8 | Reflector |
| 4 | Scale | 9 | Telescope |
| 5 | Milled head | 10 | Ray-shade |

దూరదర్శిని ద్వారా సమతలములోనున్న దృష్టిరేఖతో ఏదైన స్థానముపై నుంచిన లెవెలింగ్ కొలతను చూచినచో, ఆ కొలతపై మనము చూచు విలువ ఆ స్థానమునకును, దృష్టిరేఖకును నడుమనున్న ఎత్తుతో సమానమగును కావున ఒక

స్థానములో లెవెలింగ్ పరికరమునుంచి, మనకు కావలసిన రెండు స్థానములయొద్ద లెవెలింగు కొలతనుంచి, వాటిపై మనము దూరదర్శిని ద్వారా చూచినపుడు కాన్పించు ఎత్తు విలువల భేదము, ఆ రెండు స్థానముల నడుమనున్న ఎత్తు లేక పల్లము-రహదారులు, కాలువలు మున్నగు నిర్మాణము లలో లెవెలింగ్ పరికర ముపయోగపడును

చిత్రము 69




పటము 10

1 Levelling head
2 Telescope
3 Eye-piece
4 Diaphragm screws
5 Focussing screw
6 Ray shade
7 Level tube
8 Level tube nuts
9 Cross bubble tube

వివిధములగు లెవెలింగుపరికరములు (1) డంపీలెవెల్ (2) రివర్సిబుల్ లెవెల్, (3) వై (Y) లెవెల్, (4) టిల్టింగ్ లెవెల్

కె ఎస్ పి, కె ఎస్ వి బి

## ప్రసవతంత్రము-గర్భధారణము (ఆయుర్వేదము)

ఉపోద్ఘాతము ప్రపంచమునందలి చేతనములు, అచేతనములు, తా మెట్లు జన్మించినదియు తెలిసిగాని, తెలియక గాని తనంతటి జీవులను ప్రసవించుచునే యున్నవి ఇది ప్రకృతి ధర్మముగా కన్పట్టుచున్నది

సంతానములేని వ్యక్తి గడ్డిబొమ్మవలె, చిత్రించిన దీపమువలె, వ్యర్థజీవియగుచున్నట్లు కనిపించుచున్నాడు

బ్రహ్మాండ, అండాండ, పిండాండములయందలి సృష్టి పరిణామమును ప్రవచించినది వేదము వేదవిజ్ఞులైన మహర్షులు వైద్యశాస్త్రరచయితలైరి వైద్యశాస్త్రములయందు శారీరక విజ్ఞానము అత్యవసరము ఈ శరీరము ఎట్లు నిర్మింపబడు చున్నదో తెలిసికొనుటకై స్వభావము, ఈశ్వరుడు, కాలము, యదృచ్ఛ, నియతి, పరిణామము అను షట్కోణములనుండి వారు చూచినారు తర్కపద్ధతిలో వాదోపవాదములు కల్పించుకొని నిశ్చయజ్ఞానమును పొందినారు గర్భధారణ సమస్యలను సంపూర్ణముగా పరిష్కరించినారు

మనుష్యప్రభవుడు భూతజాతులు – జరాయుజములు, అండజములు, స్వేదజములు, ఉద్భిదములు అని నాలుగు విధములు జరాయుజములు మావియందు పుట్టునవి యోనులు అనంతవిధములు అచ్చుదిమ్మలో ఒత్తబడిన పోత బొమ్మవలె ఏ యోనియందు గర్భధారణసామగ్రి సమకూడునో ఆ యోనినిబట్టి ఆ భూతరూపమే కలుగును మనుష్యుడు మనుష్యప్రభవు డగుటచే మానవశరీరాకృతి కలిగియుండును

గర్భోత్పత్తి సామగ్రి వర్షాదిఋతువులు, భూమి, ఉదకము, బీజములు అనునవి నాల్గును ఒకటిగా సమకూరుటచే, అంకురములు జనించునట్లుగా ఋతుకాలము, గర్భాశయము, జఠరాగ్నిచే పక్వమైన అన్నరసము శుక్రార్తవములు అనునవి నాలుగును ఒకటిగా ఎమకూరి గర్భ ముత్పత్తియగును

వంశశుద్ధి సత్సంతానము కలుగవలెనన్న, సహజమైన కోర్కెతో దంపతులు పెక్కునియమములను పాటించవలెను రెండువైపులయందును దంపతులు వంశశుద్ధిగలవారుగా నుండవలెను (అనగా పెండ్లికుమార్తెవంశమునందును, పెండ్లి కుమారుని వంశమునందును మూర్ఛ, కుష్ఠము, అపస్మారము మొదలగు మొండివ్యాధులు లేనివారుగా నుండవలెను) తాము రసరక్తాది సప్తధాతుపుష్టిగలవారుగా, సుస్థిరులుగా నుండవలెను

శరీరశుద్ధి దంపతులు వంశశుద్ధితోపాటు శుద్ధశరీరులై ఆరోగ్యవంతులై యుండవలెను పురుషుడు దుష్టమైన ఆహారములు, అతివ్యాయామము, అధిక సంభోగము, అకాల సంభోగము, భయము, వీనిని అనుభవించుటచేతను, యోనికాని యోని

వంటి ప్రదేశములలో (చంకలు, సంధులు మొదలగు ప్రదేశములలో) రమించుట, మూర్ఖస్త్రీలతో భోగించుట, శుక్రవేగమును ఆపుట మొదలగు కారణములచే వాత పిత్త శ్లేష్మాదులు దూషింపబడి శుక్రవహాసిరలను దూషింపజేయును శుక్రమును నశింపజేసియో, పురుషాంగమును శక్తివిహీనముగా జేసియో నపుంసకునిగా జేయును ఆసైక్య, సౌగంధిక, కుంభిక, ఈర్ష్యక, షండ మొదలగు నామములతో నపుంసకరోగమునుపొందును మరియు వాతదూషితశుక్ర, పిత్తదూషిత శుక్ర, రక్తదూషిత శుక్ర, గ్రంథిశుక్ర, పూతిపూయశుక్ర, క్షీణశుక్ర, మూత్రపురీషగంధిశుక్ర, మొదలగు శుక్రదోషములును సంప్రాప్తించును కావున పురుషుడు శుద్ధశరీరుడుగా నుండవలెను

స్త్రీ పాసిన దుష్టాన్నాదులను తినుట, విశేషముగా రమింపబడుట, మైథునసమయమున చిత్రరతమునకై వివిధములగు వికటమైన అంగవిన్యాసములను, విషమ శయనమును, పురుషాంగసదృశముగా ఏనుగుదంతము, బర్రెకొమ్ము మొదలగు ఆటవస్తువులతో మైథునకర్మ చేసికొనుట (ఈ ఉపలింగ సురతము కోసలరాజ్యమునందలి స్త్రీలలో నుండెడిదట, పాశ్చాత్యదేశములలో అక్కడక్కడ రబ్బరుతోచేయబడిన ఉపకరణముల సురతము కలదట) మొదలగు దోషకర్మలచే వాతాదులు ప్రకోపించును ప్రకోపించిన త్రిదోషములు – వాతల, అతిచరణ ప్రాక్చరణ, ఉదావృత్త, జాతఘ్ని, అంతర్ముఖ, సూచీముఖ, శుష్కయోని, వామిని షండీ, మహాయోని, పిత్తలయోని, రక్తయోని, కఫదుష్టయోని,అరజస్క, పరిప్లుత, ఆచరణకర్ణిని, సన్నిపాతయోని అను ఇరువది విధములైన యోనిదోషములను కలిగించును మరియు నాలుగు విధములైన ప్రదర రోగములు, ఎనిమిది విధములైన వంధ్యా రోగములు, సోమరోగ, యోనికందములును, జన్మవంధ్యా, కాకవంధ్యా, మృతవంధ్యా, త్రిపతీవంధ్యా, శుక్రఘ్నీవంధ్యా, సజ్యవంధ్యా, త్రిముఖీవంధ్యా, వ్యాఘ్రిణీవంధ్యా, బకీవంధ్యా, కమలినీవంధ్యా, వ్యక్తినీవంధ్యా, మొదలగువంధ్యా రోగములును, వాతవ్యాధులును కలుగగలవు ఇట్టిరోగినులైన స్త్రీలకు గర్భోత్పత్తి కలుగనేరదు ఒకానొకచో కలిగినను విరుద్ధరూప శరీరాదులు, విరుద్ధ గుణములు కలవారుగా నుందురు

మనశ్శుద్ధి సంభోగసుఖమునందు వర్తించు స్త్రీ పురుషులు ఎట్టి యాహార, ఆచార మనశ్చింతనములు కలవారుగా నుండెదరో, అట్టివారలకు ఆయా చేష్టలుగల సంతానమే కలుగును కావున ఏ స్త్రీ ఎట్టి సత్త్వముగల పురుషుడు పుత్రుడుగా గలుగవలెనని కోరుకొనునో ఆ స్త్రీ తినెడి యాహారములు ప్రవర్తించు విహారములు, చూడబడు దృశ్యములు, వినెడి కథలు, భావింపబడు గుణములు, ధ్యానింపబడు మూర్తులును అట్టిసత్త్వముకలవిగానుండవలెను తల్లిదండ్రుల సత్త్వము, తనచే పూర్వజన్మయందు చేయబడిన కర్మలు, అభ్యసించిన జ్ఞాన విజ్ఞానవిశేషములు వీటి ననుసరించి జీవులకు ఆ యా సత్త్వవిశేషములు కలుగుచుండును

పూర్వజన్మవిషయము పూర్వజన్మ రెండువిధములుగా నుండును మొదటిది క్రితజన్మలో పరిణతినందిన జీవాత్మ గర్భధారణానంతరము ప్రవేశించును ఆత్మచే జ్ఞానేంద్రియములు కలుగును దృష్టి, శ్రవణము మొదలగునవి ఆత్మకుగల పూర్వజన్మకృతకర్మయే కారణముగా శక్తిమంతములుగనో, అశక్తములుగనో జనించును రెండవది, తన శరీరమునకు కారకులైన తల్లిదండ్రులే పూర్వజన్మముగా నుందురు పూర్వజన్మమైన తల్లిదండ్రులనుండి (సర్వాంగములనుండియు ద్రవించి, స్రవించు బీజభాగమునందు) ఏ భాగము దూషింపబడునో ఆ భాగమున లోపము కాన్పించును

పూర్వదేహసంబంధ గుణాదులప్రాప్తి (పూర్వవాసనలు) – గర్భస్థశిశువు పూర్వదేహమునందు చక్కగా నభ్యసించినవియు, అంతఃకరణమునందు దృఢముగా నాటుకొనినవియునగు శాస్త్రజ్ఞానగుణాదులు గర్భస్థశిశువునకు స్వభావముగనే సిద్ధించును గర్భము సత్త్వగుణాధిక్యము కలదియైనచో పూర్వజన్మయందలి జాతిగుణకర్మలనుగూడ స్మరించును పూర్వజన్మజ్ఞానముగల బాలబాలికల చరిత్రలను, చేష్టలను అప్పుడప్పుడు పత్రికాముఖమున జదువుచునేయున్నాము ఇదియే పూర్వజన్మములో జీవుని కర్మాచరణమునందలి గుణవిశేషము

గర్భమునకు – ఆత్మజనిత గుణములుగా జ్ఞానము, విజ్ఞానము, ఇంద్రియములు, ఆయువు, దుఃఖము మొదలగునవి సంప్రాప్తించును సత్త్వజనితగుణములుగా – ఆరోగ్యము, పరాక్రమము, బలము, వర్ణము, మేధ మొదలగునవి సంప్రాప్తించును మాతృజనితములుగా–శరీరవృద్ధి, బలము, కాంతి, స్థితి, హాని మొదలగునవి సంప్రాప్తించును పైతృకగుణములుగా – ఎముకలు, దంతములు, గోళ్ళు, సిరలు, స్నాయు

వులు, ధమనులు శుక్రము, శిరోజములు, శరీరరోమములు, మీసములు మొదలగు కఠినభాగములు సంప్రాప్తించును

**దంపతుల వయోధర్మము** చిన్న మొక్కకును, ముదిరి మొద్దువారిన మొక్కకును పూవులుగాని, పండ్లుగాని యుండవు లేత మొగ్గలకు, లేతకాయలకును, వడలిపోయిన పుష్పములకును, ఫలములకును సుగంధ ముండదుకదా! అట్లే పురుషులకు పదునారు సంవత్సరములకు పూర్వమును, డెబ్బది సంవత్సరములకు పిమ్మటను ప్రాయికముగా శుక్రదర్శన ముండదు స్త్రీలకు పండ్రెండు సంవత్సరములకుపూర్వమును, ఏబది సంవత్సరములకు పిమ్మటను సామాన్యముగా రజస్సు, స్తన్యము కనిపించజాలవు

**రజస్వలా నియమములు (ముట్టుమనిషి ఆచారములు)** ఋతుమతియైన ఆమె దర్భగడ్డిపైనను, చాపలపైనను శయనింపవలయును దోసిలిలోగాని, మూకుడులోగాని, ఆకులలోగాని శాల్యన్నమునో, యవాన్నమునో, యుంచుకొని ఘృతక్షీరాదులతో భుజింపవలెను ఋతువైన మూడుదినములును భర్తను దర్శింపగూడదు బ్రహ్మచర్యముతో నుండవలెను

**ఋతుకాలవర్జనీయములు** ఋతుమతి పగలు నిద్రించుట, స్నానము చేయుట, కాటుక పెట్టుకొనుట మొదలగువాటిని ఆచరింపరాదు ఆచరించినచో, ఆ నెలలో గర్భవతియగుటయే తటస్థించినచో, కలుగబోవు శిశువునకు కొన్ని వికారలక్షణములు సాధారణముగా సంభవించును పగటినిద్రచే నెల్లప్పుడును నిద్రించు స్వభావముగలవారును, కాటుకచే మందదృష్టి గలవారును, స్నానానులేపనములవలన ఎల్లప్పుడు దుఃఖించువారును, అభ్యంజనముచే చర్మవ్యాధులు గలవారును, గోళ్ళు తీసికొనుటచే పుప్పిగోళ్ళుగలవారును, రోదనమువలన వికారదృష్టిగలవారును, పరుగెత్తుటచే, దుముకుటచే చంచల స్వభావులును, బిగ్గరగా నవ్వుటచే నోటిలోభాగములయందు నలుపు వర్ణముగలవారును, అధికసంభాషణమువలన ప్రలాపులును, భీకరశబ్దములు వినుటచే చెవుడుకలవారును, తల దువ్వుకొనుటచే బట్టతలగలవారును, ఈదురుగాలి తగులుటచేతను, ఆయాసకరమైనపనులు చేయుటచేతను ఉన్మాదులును పుట్టుదురు

**పుత్రపుత్రికాపేక్ష-నియమములు** ఋతుస్నానము చేసిన రోజున (నాలుగవనాడు) స్త్రీ తొలుదొల్త ఏ పురుషుని చూచునో అట్టిపురుషునివంటి పుత్రుని బడయును కావున మొట్టమొదట భర్తనే చూడవలయును భర్తృదర్శనానంతరము పూజ్యులైన ఆచార్యులవారిచే పుత్రజననప్రదములైన ఆజ్యహోమాదికములను చేయించి పిదప కొన్ని నియమములను పాటింపవలయును, ఒకమాసమువరకు బ్రహ్మచర్యము నాచరించిన పురుషుడు సాయంకాలమునందు శరీరమునకు నేతిని మర్దింపచేసికొని స్నానముచేసి, ఘృతక్షీరములతోగలిసిన శాల్యన్నమును (ధాన్యవిశేషము) భుజింపవలెను

ఒక మాసమువరకును బ్రహ్మచర్యనియమము కలదైన స్త్రీ సాయంకాలము తైలాభ్యంజనము చేసికొని నూనె, మినుములుకలిసిన ఆహారమును భుజింపవలెను పిమ్మట ఈ దంపతులు భోగింపదగును ఋతుమతియైన నాలవనాడు భోగించినచో ఆయుష్యముకలవాడును, ఆరవదినము దైనచో ఆరోగ్యముకలవాడును, ఎనిమిగవదినము దైనచో సంతతి కలవాడును, పదియవదినము దైనచో సౌభాగ్యము కలవాడును, పండ్రెండవ దినము దైనచో ఐశ్వర్యము కలవాడును నైన సుపుత్రుడు కలుగగలడు ఈ దినములలో ఆర్తవము అల్పముగా నుండియుండును పుత్రికాపేక్ష కలవాడు ఐదు, ఏడు, తొమ్మిది, పదునొకండు రోజులలో భోగింపదగును ఈరోజులలో ఆర్తవము అధికముగానుండును

**సద్యోగర్భధారణలక్షణములు** ఆయాసము, బడలిక, దప్పిక, తొడలయందు బలములేకుండుట, శుక్రశోణితములు బయలువెడలకుండుట, అను లక్షణములను సంభోగానంతరము కనిపెట్టగలిగినచో ఆ సమయమునందే గర్భము ధరింపబడెనని తెలిసికొనవలెను తెలిసికొనిన దంపతులుగాని, తెలిసికొనిలేని దంపతులుగాని ఒక మాసమువరకును తిరిగి సంభోగింపరాదు సంభోగించినచో గర్భము ఛిన్నాభిన్నమగుటకు అవకాశము కలదు

**వసంతాది ఋతువులు - సంభోగము** సంభోగమును గ్రీష్మ వర్షర్తువులలో విసర్జింపవలెను వసంత శరదృతువులలో మూడు దినముల కొకసారి యనుభవింపవచ్చును హేమంత శిశిరములలో యథాశక్తిని యథేచ్ఛముగా భోగింపవచ్చును ఇట్టి నియమములచే ధాతుక్షీణము కలుగనేరదు

**గర్భము - పరిపూర్ణ మానవాకృతికై** శుద్ధశుక్రము, శుద్ధార్తవము, పరిశుద్ధగర్భాశయము, ఋతుకాలము, జీవాత్మ వీనియొక్కసంపత్తు సమకూడవలసి యుండును సంపత్తుతో పాటు హితములైన ఉపచారములును అవసరములే గర్భము కలుగుటకును సంపూర్ణావయవములతో సౌందర్యముగల అంగ

ప్రత్యంగములతో పరిపూర్ణమానవాకృతి పోషింపబడుటకును, సుఖముగా ఉద్భవించుటకును పైనచెప్పిన సంపత్తులును ఉపచారములును ఉపకరించును

శరీరము - పంచమహాభూతములు పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము అను ద్రవ్యపంచకముతో గూడుకొనినది ప్రపంచము ఏది కఠినముగా నుండునో అది పృథ్వీభూతసంబంధముకలది ఏది ద్రవస్వరూపముగా నుండునో అది అబ్ధాతుసంబంధముకలది ఏది ఉష్ణగుణము కలదిగా నుండునో అది తేజోధాతు సంబంధముకలది ఏది చలనస్వభావముకలదిగా నుండునో అది వాయుభూతసంబంధముకలది ఏది అవకాశముకలదిగా నుండునో అది ఆకాశభూత సంబంధముకలది ఆహారద్రవ్యములుకూడ పంచభూతాత్మికములే యగుటచే పంచభూతాత్మక శరీరమును పోషించుచున్నవి శరీరమునందు జీవాత్మ అధిష్ఠించియుండి చైతన్యమును కలిగించును

శుక్రము జఠరాగ్నిచే పక్వమైన ఆహారసారము రసాది సప్తధాతురూపముగా మారును రసముచే రక్తము, రక్తముచే మాంసము, మాంసముచే మేదస్సు, మేదస్సుచే అస్థి, అస్థిచే మజ్జ (మూలుగు). మజ్జచే శుక్రమును ఉత్పన్నమగుచున్నవి శుక్రము పూర్వోక్తమగు ఆహార రసధాతు పరిణామమునందినదగుటచే రసరక్తాది ఆరుధాతువుల సూక్ష్మాంశములుకలదిగా నుండును చెరకుగడయందంతటను శర్కరయున్నట్లును, పాలయందంతటను నేయి యున్నట్లును శరీరమునందంతటను శుక్రము వ్యాపించియుండును మైథునాపేక్షతో పురుషుడు స్త్రీదర్శన స్పర్శనములచే సర్వశరీరమునుండియును బీజరూపమైన శుక్రము స్త్రీ పురుష సంయోగ సమయమున జారి, గర్భాశయమునందు జేరి, ఆర్తవముతో కలియును అందు కర్మప్రేరితుడైన జీవాత్మయు గర్భాశయమున జేరును అప్పుడది ఆత్మవికారములగు వృద్ధిక్షయ పరిణామాదులతోడను గూడినదగును ఈ స్థితియందు పిండము గర్భమనబడును

శోణితము స్త్రీ శరీర సంబంధమైన ఉపధాతువు, స్త్రీలకు ఆహార సారమైన రసధాతువునుండి సంయోగ సమయమున గర్భాశయమునుజేరి, శుక్రముతో మిశ్రమమై అది శరీరముగా రూపెత్తుటకును, పోషకముగా నుండుటకును ఉపయోగపడును

రజస్సు స్త్రీ మాసమున కొకసారి రజస్వల (ముట్టు) యగుచుండును రజస్వల నాలవనాడు శుద్ధస్నానము చేసిన పిమ్మట తిరిగి యొక మాసము వరకును రసధాతువునుండి యేర్పడిన శోణిత మను ద్రవము గర్భాశయమునకు వచ్చి చేరుచుండును గర్భాశయమున గర్భ పోషణమునకు ఉపయోగపడుచుండును గర్భము లేనప్పుడు నిష్ప్రయోజనమైన శోణితము మరల మరల ప్రతిమాసమునను మూడుదినములు విసర్జింపబడుచుండును

ఆర్తవము రజస్వలకు మూడుదినములకు పిమ్మట రజస్స్రావము ఆగిపోవును నాలుగవనాటినుండి క్రొత్త శోణితము గర్భాశయమునకు వచ్చి చేరుచునేయుండును గర్భాశయముఖము శుక్రగ్రహణమునకు అనుకూలముగా విప్పారియుండును గర్భధారణమునకు అనువుగానుండు కాలము పండ్రెండురోజులును స్త్రీని ఋతుమతి యందురు ఋతుకాలమున గర్భాశయమున జేరుచుండు క్రొత్త శోణితమును ఆర్తవమందురు

గర్భావయవోత్పత్తి మామిడిపిందెయందు పీచు, రసము, విత్తనము, జీడి మొదలగునవి కనుపింపక పరిపక్వమైన పిమ్మట విస్పష్టముగా గాన్పించును ఇట్లే గర్భస్థ పిండమునందును తల, చేతులు, కాళ్ళు, ఎదురురొమ్ము, పొట్ట మొదలగు అంగములును, కండ్లు, చెవులు మొదలగు ప్రత్యంగములును ఆదియందే, ఏకకాలమందే గర్భస్థ పిండమునందు అతి సూక్ష్మాతి సూక్ష్మములుగా దాగియుండుటవలన దృశ్యములుకాక కాలాంతరమున క్రమముగా దృశ్యమగును

స్త్రీయొక్క పురుష ప్రసూతి చిహ్నములు గర్భస్థపిండము పురుషాకృతినందు నపుడు కుడిపార్శ్వమంతయు ఉరవగా తోచును దక్షిణ స్తనమున మొట్టమొదట క్షీర మగుపడును. ఏనుగు, గుఱ్ఱము, మామిడి మొదలగువానియందు ఇచ్ఛ కలుగును స్వప్నమున మామిడిపండ్లు, కమలములు, కలువపూవులు కనిపించుచుండును ముఖముప్రసన్నముగానుండును పిండము స్త్రీ రూపము నెత్తుచున్నచో పై లక్షణములకు విపరీత లక్షణము లగుపించును పిండము నపుంసకునిగా మారునపుడు ఉభయ పార్శ్వములును ఉన్నతములై కడుపు ముందునకు పొడిచికొని వచ్చినట్లుండును పిండము కవలలుగా తయారగునప్పుడు నూగారు పల్లముగా గాన్పించును గర్భవతికి దైవదర్శనమునందును, పెద్దల వాక్యములు వినుటయం

దును, శౌచమునందును ఆసక్తి యధికముగుచున్నచో శుభ గుణములుగల పుత్ర పుత్రికలను ప్రసవించును శిశువుయొక్క అంగ ప్రత్యంగ సౌందర్యాది గుణములు జీవుని పూర్వ జన్మార్జితములు

**గర్భధారణము కాని కారణములు** మిక్కిలి బాల్యము మిక్కిలి వృద్ధాప్యము, దీర్ఘవ్యాధులుగల స్త్రీ పురుషులు మైధునము నాచరించుటకు తగరు ఏకాంత మందిరము, అలంకరింపబడిన సుఖశయ్య, మైధునాపేక్ష సమకూడవలెను

**సంభోగసమయమున** స్త్రీ వక్రముగా పరుండిన బల వత్తరమైన వాతము మర్మస్థానములను పీడించును కుడి పార్శ్వమున పరున్న, శ్లేష్మము స్రవించి గర్భాశయము నావరించును ఎడమవైపుగా పరున్నచో పిత్తము ప్రకోపించి శుక్రశోణితములు దహింపబడును అందువలన స్త్రీ వెల్లకిల పరుండియే శుక్రమును గ్రహించవలెను మైధునానంతరము చన్నీటితో స్నానము చేయవలెను మైధునాపేక్ష గలవారు అధికముగా భుజింపరాదు ఆకలితో నుండరాదు దప్పిక భయము, దుఃఖము, కోపము, ఇతర ధ్యానము, అధిక మైధునవాంఛ గల స్త్రీ గర్భమును ధరింపనేరదు గర్భమును ధరించినను వికృత గుణకర్మలుగల సంతానమును గాంచును

**గర్భిణీలక్షణములు** గర్భవతి చనుమొనలు మిక్కిలి నల్లగానుండుట, నూగారు విస్పష్టమగుట, కనురెప్పలు తరుచుగా వాలుచుండుట, అకారణముగా వమనమగుట, సుగంధ సేవనముచే భయముచెందుట మున్నగు లక్షణములు కన్పించును

**గర్భిణీవర్జనీయ కృత్యములు** గర్భము ధరించినది మొదలు శ్రమకరములైన పనులు, మైధునము, లంకణము అధికభోజనము, పగటి నిదుర, రాత్రి జాగరణము, ఒంటె, గుర్రము, మొదలగు వాహనముల నెక్కుట, దుఃఖించుట, జడియుట, దీర్ఘకాలము గొంతు కూర్చుండుట, హెచ్చుతగ్గులుగా కూర్చుండుట, తైలాదులతో అనువాసనవస్తిని చేయించుకొనుట, జలగలు,కొమ్ములు మొదలగు సాధనములచే రక్తమును దీయించుకొనుట, మలమూత్రాది వేగములను నిరోధించుట విడువవలయును

**గర్భస్వరూపము, మాసములు** గర్భధారణానంతరము ప్రథమ మాసమునందు శుక్రార్తవములు కలలావస్థను చెందును అనగా పెరుగుబిళ్ళవలె పేరుకొనును రెండవమాసమునందు ఆకలలమే కఫముతడుపుచుండగా, పిత్తము పక్వము చేయుచుండగా, వాతము విభజన చేయుచుండగా పరిపాకము నందినదియు, పంచభూతాత్మకమైనదియు అశుక్రార్తవ కలలమే గర్భాశయమునందు మృదువుగా గట్టిపడును అట్టి గర్భము పిండాకారముగా (గుండ్రముగా) కఠినముగానున్నచో పురుషగర్భమగును పేశ్యాకారముగా (చచ్చౌకముగా ఇటికరాయివలె) నున్నచో స్త్రీగర్భమగును అర్బుదమువలె (బూరుగు మొగ్గవలె లేక బంతియొక్క అర్ధభాగమువలె) ఉన్నచో నపుంసక గర్భమగును ఈ విషయమును అనుభవజ్ఞులు స్పర్శచే తెలిసికొందురు మూడవమాసమునందు గర్భమునందలి పిండమునకు షడంగనిర్మాణమునకై (తల, మొండెము, చేతులు, కాళ్లు) ఆయాస్థానములయందు కంద పిలకలవలె ఏర్పడును మూడవ మాసమునందే శిరస్సు, హస్త పాదములు మొదలగు అంగములును, చెంపలు, ముక్కు, పెదవులు, నేత్రములు, చెవులు, వ్రేళ్లు మున్నగు ప్రత్యంగములును రూపించును నాల్గవ మాసమునందు సర్వాంగ భాగములును విస్పష్టమగును ఈ నాల్గవ మాసమునందే గర్భమున కేర్పడిన హృదయము ఆత్మకు స్థానమగుటవలన దానియందు జీవాత్మ ప్రవేశించుచున్నది కావున ఈ నాల్గవ మాసమునందే గర్భము శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ స్వరూపమైన ఇంద్రియార్థములను గర్భిణీద్వారా కోరుచుండును ఈ కోరికలనే వేవిళ్లు అని యందురు గర్భవతి దౌహృదిని యనబడును

గర్భవతి కోరెడి కోర్కెలను తీర్పవలెను తీర్పకున్నచో శిశువు అసంపూర్ణాంగములు, ఇంద్రియములు కలవిగానగును కోరెడి కోర్కెలలోని మంచి చెడ్డలను బట్టి ఉన్నతోన్నత నీ చా తి నీచ స్వభావములుగల సంతాన ముద్భవించును దౌహృదకాలమునందు గర్భమునందుండు జీవునియొక్క ప్రారబ్ధ కర్మలకు అనుగుణమైన వాంఛలు దైవవశమున గర్భిణికి కలుగుచుండును

ఐదవ మాసమునందు మనస్సు, ఆరవ మాసమునందు బుద్ధి, ఏడవ మాసమునందు అంగప్రత్యంగములును విశేషవృద్ధి నంది, విస్పష్టముగా రూపించుచుండును ఎనిమిదవ మాసమునందు తేజోరూపమైన ఓజస్సు అస్థిరముగా చంచలముగా నుండును కాన ఈ ఎనిమిదవ మాసమునందు జనియించు శిశువు జీవించుట దుర్లభము

**గర్భపోషణ విధము** గర్భము ప్రారంభమైనది

మొదలుకొని నాలుగవ మాసము వరకును గర్భిణి యొక్క సర్వశరీరావయవములయందును వ్యాపించియుండు ధమనుల యందలి అన్నాదిరసముల యొక్క చెమ్మయే గర్భస్థపిండమును పోషించుచుండును గర్భగోళము గర్భిణియొక్క రస రక్తవహములైన శిరల నడ్డగించుటవలన ఆ రక్తనాడి జరాయు (మావి) రూపముగను, అన్న రసనాడి గర్భస్థ శిశు నాభి బద్ధముగను నై గర్భము నిటునటు చలింపనీయక దృఢముగా చుట్టుకొని పట్టుకొని యుండును

గర్భిణి భుజించు ఆహార రసము మూడు విభాగములుగానగును అందొక విభాగము తల్లియొక్క శరీరపోషణమునకును, రెండవ భాగము స్తన్యవృద్ధికిని, మూడవభాగము నాభి నాడీ మార్గమున గర్భమును జెంది క్రమముగా వృద్ధి పొందించుటకును ఉపకరించును

**శిశురోదనాద్యభావము** ముఖము, వాత మార్గములును జరాయువుచే కప్పబడి మూయబడియుండుటచేతను, కంఠము కఫముతో గూడియుండుటచేతను గర్భస్థశిశువు రోదనాదులను చేయలేకుండును వాయువు అల్పము, మలము అల్పము నగుటచే గర్భమునందలి శిశువు మలమూత్ర వాతములను విడువజాలకుండును

**స్వాభావికములు** గర్భిణి ఉచ్ఛ్వాస నిశ్వాసచలన నిద్రల ననుసరించియే గర్భమునందున్న శిశువునకును ఉచ్ఛ్వాసాదులు కలుగుచుండును కరచరణాద్యవయవముల రూప విశేషములు-అరచేతులయందును, అరకాళ్లయందును రోమములు మొలవకుండుట, దంతములు మొలచుట, ఊడుట మున్నగు లక్షణములు-పెక్కులు స్వభావ సిద్ధములుగనే కలుగుచుండును

**గర్భచిత్రములు-చిరకాల గర్భధారణము** గర్భమును ధరించుటలో చిరకాల మాలస్యమగుటకు స్త్రీ, వంధ్య కాక పోయినను గర్భాశయ దోషమో, ఋతుదోషమో, పురుషుని శుక్రదోషమో, కారణము కాగలదు ఎప్పటి కాయుభయుల దోషములును తొలగునో అప్పటినుండి గర్భధారణమున కవకాశ మేర్పడును

**గర్భముకాని గర్భము** గర్భాశయమున రజస్సు వాయువుచే అడ్డగింపబడినప్పుడు పైకి గర్భ లక్షణములు గర్భిణీలక్షణములు గాన్పించును మాసమాసమునను రజస్సు స్రవింపక గర్భాశయము వృద్ధిపొందును దీనిని తెలియనివారు గర్భమనియే నిర్ణయించెదరు అగ్నితాపము, ఎండవేడిమి, ఉష్ణకరాన్నపానములు, అధికశ్రమ, దుఃఖము, వ్యాధిబాధలు-వీటిచే రజోరక్తగము బయలువెడలును అట్టి రజోరక్తమును చూచి తెలియనివారు గర్భమును పిశాచములే హరించినవని తలపోసెదరు పిశాచములకు శరీరము ఆహారముగా నుపయోగింపబడదు

**అస్థివిహీన గర్భకారణము** కామపీడితలగు ఇరువురు స్త్రీలు భోగాపేక్షకలవారలై పరస్పర యోని సంఘర్షణముచే కామద్రవమును (శోణితమును) స్రవింపజేసికొనిన యెడల వారలకు ఎముకలులేని మాంసపిండము జనించును

**స్వప్నగర్భము** ఋతుస్నానానంతరము సంభోగించినట్లు స్వప్నముగాంచెడి స్త్రీయొక్క శోణితమును, వాతము గ్రహించి గర్భాశయమున చేర్చినచో సహజ గర్భమువలెనే కుక్షి క్రమముగా వృద్ధిపొందును సకాలమునందు ప్రసవించును పితృసంబంధమైన గుణములగు ఎముకలు, కేశములు, గోళ్లు, మొదలగునవి లేని మాంస పిండమును ప్రసవించును దీనినే కలల మని యనుటయును కలదు

**యమళ గర్భములు (పలురకముల కవలలు)** శుక్రముకన్న శోణితము అధికముగా కలిసినచో కన్యక జనించును శుక్రమధికముగా గలిసినచో పుత్రుడు జనించును గర్భాశయమున ఒక భాగమునందు శోణితమును, మరియొక భాగమునందు శుక్రమును అధికముగా నుండునట్లు శుక్రార్తవ సంయోగము వాయువుచే రెండు భాగములుగా విభజింపబడినచో, పుత్రికయు, పుత్రుడును, కవలలుగా జనించెదరు, శుక్ర మధికముగాగల శుక్రశోణితములు సమాన భాగములు రెండుగా విభజింపబడినచో, ఇద్దరు పుత్రులు కవలలుగా జనించెదరు ఆర్తవ మధికముగాగల శుక్రార్తవములు రెండు సమాన భాగములుగా విడివడినచో కవలలు ఇద్దరును కన్యకలుగనే జనించెదరు కర్మవశముచే యమళగర్భమునందు శుక్రార్తవములు హెచ్చుతగ్గులుగ జేరుటచే యొక భాగమధికముగను రెండవ భాగమల్పముగను వృద్ధిపొందును అట్టి యెడ పుట్టిన పిల్లలలో ఒకరు పీలగను, మరియొకరు పుష్టిగను ఉండుట తటస్థించును శుక్రార్తవ సంయోగము వాతాధిక్యముచే చిందరవందరయై అనేక భాగములుగ విభజింపబడినచో పెక్కురు పిల్లలు ఒకేసారి జనించెదరు

**గర్భకార్శ్యము** గర్భవతి భుజించిన ఆహారసారము

గర్భాశయమునకు అందనిచో గర్భస్రావమో, గర్భపాతమో జరుగును లేక గర్భము కృశించును ఆ కృశించిన గర్భమే క్రమముగా పుష్టినందుకొనుటలో ఆలస్యము కాగా, అనేక సంవత్సరములకు ప్రసవించుటకూడ కలదు దీనినే మూడు తొమ్మిదులు మోయుట, నాలుగైదు తొమ్మిదులుమోయుట యను లోకాచారము కలదు

**సర్పాద్యాకార గర్భములు** స్త్రీ యొక్క పాపకర్మల విశేషములచే పాము, తేలు, తాబేలు, గుమ్మడిపండు మొదలగు వికారరూపములుగల గర్భము లుత్పత్తికాగలవు

**కుబ్జత్వాది గర్భవికార కారణములు** గర్భవతికి గర్భదోహద కాలమున కలుగు కోరికలను యుక్తియుక్తముగా తీర్పవలెను అట్లు తీర్పనిచో, ఆమె వాతాదిదోష ప్రకోపము గలదై కుంటినో, గ్రుడ్డినో, కృశించిన వానినో, ముక్కిడినో, మూగినో ప్రసవించును గర్భాధానకాలమునందు చాంచల్యము, మౌనము, నిద్ర మొదలగు వికారములను పొందినను, ఆయా జీవుల పూర్వజన్మ పాపములు వెంటబడించినను, నానా వికారములుగల సంతతిని పొందును

**నేత్రవర్ణాది కారణములు** గర్భమునకు ఇంద్రియ విభాగకాలమైన నాల్గవ మాసమునందు తేజోధాతువు దృగ్భాగమునందు వ్యాపింపకున్నచో గర్భమునకు జాత్యంధత్వము కలుగును ఆ తేజోధాతువే రక్తగతమై దృష్టిభాగమునందు వ్యాపించినచో, గర్భమునకు రక్తాక్షత్వము కలుగును పిత్తమునందు చేరినచో పింగాక్షత్వము, కఫముతో చేరినచో శ్వేతాక్షత్వము, వాయువుతో చేరినచో, వికృతాక్షత్వము కలుగును.

**శరీరవర్ణ కారణము** గర్భము యొక్క తెలుపు మొదలగు ఛాయలకు తేజోధాతువు కారణము గర్భాధాన సమయమున ఉదకధాతువు అధికమైనచో, గర్భమునకు గౌరవర్ణము, పృథ్వీధాతువు అధికమైనచో కృష్ణవర్ణము, ఆకాశ పృథ్వీధాతువులు అధికమైనచో, కృష్ణశ్యామ వర్ణము, ఉదక ఆకాశధాతువులు అధికములైనచో గౌరశ్యామ వర్ణమును గల చాయలతో సంతాన ముద్భవించును గర్భిణీ స్త్రీ ఏ రంగునుగల ఆహారమును ప్రీతితో దినునో, ఆ యాహార వర్ణముగల శరీరి పుట్టును

**షడ్రససేవనాధిక్య ఫలితములు** గర్భవతి యొక్కువగా తినెడి రుచులలో తీపిచే ప్రమేహరోగులు, మూగవారు, స్థూలురును, పులుపుచే రక్తపిత్త రోగులు, చర్మరోగులును, నేత్రరోగులును, ఉప్పుచే ముడుతలుగలవారును వెండ్రుకలు నెరియువారు, బట్టతలకలవారును. చేదుచే క్షయరోగులు, బలహీనులు అర్భకులును, కారముచే దుర్బలులు, నపుంసకులు, గొడ్రాండ్రును, వగరుచే నల్లనివారు, ఆనాహులు, ఉదావర్తులును పుట్టెదరు

**ముగింపు** ఇట్లు పూర్వాయుర్వేదశాస్త్రకారులు గర్భధారణ సమస్యలుగా రేకెత్తు నానావిధ ప్రశ్నలను సకారణముగా, సుకరముగా పరిష్కరించి గ్రంథస్థముచేసినారు మరియు, సుఖ ప్రసవోపాయములను సూతికోపచారములను, వివరించినారు పుంసవనక్రియలుగా–గర్భవతి ఇష్టము ననుసరించి స్త్రీ పురుష సంతాన ఫలితము నిచ్చు సత్క్రియలను, మూలికాక్రియలను చెప్పినారు గర్భనిరోధక యోగములుగా–లోపలికిని, పైకిని పనికి వచ్చు సుఖోపాయములను పెక్కింటిని నిర్వచించినారు అత్యవసర సమయములలో–నిరపాయములగు గర్భస్రావ చికిత్సలనుగూడ లిఖించినారు

కం వేం సు

## ప్రాకృతభాషా సాహిత్యములు

భారతీయ ఆర్యభాషా వికాసక్రమమును ప్రాచీన, మధ్య, ఆధునికకాలము అనుపేర విభజించిరి అందు మధ్యయుగమునకు చెందినవి ప్రాకృత భాషలు. ప్రాకృతము నుండియే సంస్కృతము జనించిన దనియు, సంస్కృతము నుండియే ప్రాకృతము ఉద్భవించినదనియు ఇట్లు భిన్న వాదములు కలవు ప్రాకృతభాషా మహాకావ్యమగు 'గఉడవహో' కర్త ప్రాకృతము నుండియే అన్ని భాషలు పుట్టెననియు, మరల ప్రాకృతమునందే అవి విలీనమగుననియు సగర్వముగా చెప్పియున్నాడు క్రీ పూ 500 నుండి క్రీ శ 1000వరకు వ్యవహారములోనున్న మధ్యయుగ భాషల ప్రారంభరూపము 'పాళి'యనియు, మధ్యకాలిక రూపము 'ప్రాకృతము' అనియు, ఉత్తరకాలిక రూపము 'అపభ్రంశ'మనియు పేర్కొనబడినది 'లలియే' (లలితమై), 'మహురక్షరయే' (మధురాక్షరయుక్తమై), 'జువఈజణవల్లహే' (యువతీజనవల్లభమై). 'ససింగారే' (సశృంగారమై) విలసిల్లినది ప్రాకృత సాహిత్యము రాజశేఖరుడు ప్రాకృతభాష స్త్రీసదృశ సుకుమారమని నుడివి యున్నాడు

శౌరసేని, మాగధి, అర్ధమాగధి, మహారాష్ట్రి, పైశాచి, అను ముఖ్య భేదములు కాక, హెర్మన్ జాకోబీ పండి

తుడు జైన మహారాష్ట్రిని జైన శౌరసేనిని కూడ పేర్కొని యున్నాడు వీటిలో మహారాష్ట్రికి, అర్ధమాగధికి జైన సౌరసేనికి చెందిన రచనలు మాత్రమే దొరకుచున్నవి శిలాశాసనముల లోను పాత్రోచితభాషను ఉపయోగించు సంప్రదాయము ననుసరించి పెక్కు సంస్కృత నాటకముల లోను, సంస్కృత అలంకారిక గ్రంథముల లోను, ప్రాకృత భాషారూపములు కన్పట్టుచున్నవి

వైదికధర్మప్రభావము లోపించుటతో సంస్కృతభాష కూడ తన మహత్త్వమును కోల్పోయినది తదాది జన భాషలకు ఆశ్రయము లభించినది వర్ధమాన మహావీరుడు, గౌతమబుద్ధుడు తమతమ మతప్రచారము కొరకు ప్రాకృత భాషల నుపయోగించుటతో ఆ భాషలకు విద్వత్ సమాజము లో కూడ మన్నన లభించినది మధ్యయుగములోని సాంఘిక, రాజకీయ, నైతిక, ధార్మిక పరిస్థితులను అవగాహనము చేసి కొనుటకు ప్రాకృతవాఙ్మయ పరిచయము అత్యావశ్యకము

ప్రాకృత భాషలో ఋ, ౠ, ఌ, ఐ, ఔ, విసర్గలు లోపించినవి మాగధి తప్ప మిగిలిన ప్రాకృతములలో య, శ లు వ్యవహారము నుండి తొలగిపోయినవి మాగధిలో శ, ష, స లకు బదులు "శ"యే వ్యవహరింపబడినది శౌర సేనిలో న, య లు, ణ, జ లుగా మారినవి ద్వివచన ప్రయోగము లేదు అన్ని శబ్దరూపములు అకారాంత పదములవలెనే నిష్పన్నము కాజొచ్చినవి కారకముల సంఖ్య తగ్గినది లఙ్ లిట్, లుఙ్ యొక్క వివిధ రూపములు వాడుకలో నుండి తొలగి పోయినవి కారకము, క్రియ-వీటి సంబంధము తెలి యపరచుటకు నామవాచకములతో కారకావ్యయకృదంత రూపముల నుపయోగించు పరిపాటి ఏర్పడినది

ప్రాకృత భాషా సాహిత్యము లౌకికమనియు, ధార్మిక (మత సంబంధి) మనియు రెండు విధములు

ప్రాకృత భాషలలో మహారాష్ట్రి ప్రధానమైనది విపులమైన సాహిత్య సంపద కలది "రావణవహో" "లీలావఈ" 'సిరంచిధ కవ్వ' 'ఉసాణిరుద్ధ' 'కంసవహో' మొదలగు కావ్యములు, "గాహాసత్తసఈ", "వజ్జాలగ్గం" మున్నగు ముక్తక రచనలు ప్రపంచ ప్రసిద్ధములు

మహారాష్ట్రి ప్రాకృత రచనలలో తలమానికమువంటిది 'రావణవహో' లేక 'దహముహవహో' (దశముఖవధ) అనునది ఈ కావ్యమునకు సేతుబంధము అను పేరు కూడ కలదు 15 ఆశ్వాసములుగల ఈ కావ్యములో పూర్వార్ధ భాగములో సేతుబంధన కథ, ద్వితీయార్ధ భాగములో రావణ వధ, రామపట్టాభిషేకము వర్ణితములు మొదటి భాగములో ప్రాకృతిక దృశ్యములు మనోహరముగ చిత్రించబడినవి రెండవ భాగములో మానవ ప్రకృతి సూక్ష్మముగా వర్ణించ బడినది సమాస ప్రధాన శైలిగల ఈ కావ్యమున ఆర్యా ఛందము ఎక్కువగా వాడబడినది దీని రచయిత కాశ్మీర రాజగు రెండవ ప్రవరసేనుడు అని కొందరి అభిప్రాయము అతని ఆ స్థానములోని ఒకానొక కవి దీనిని రచించి యుండ వచ్చునని కొందరి యభిప్రాయము

'గఉడవహో' (గౌడవధ) రచించిన 'బప్పఈరాఅ' (వాక్పతి రాజు) 8వ శతాబ్దిలో కన్నౌజీని (కాన్యకుబ్జమును) పరి పాలించిన యశోవర్మ ఆస్థానములో నుండెడివాడు 'గఉడ వహో' 1209 ఆర్యాఛందములలో వ్రాయబడిన ఉత్కృష్ట చారిత్రిక గ్రంథము యశోవర్మ యొక్క గౌడదేశ దండ యాత్ర, మార్గమధ్యమున అనేక ప్రదేశములను అతడు జయించిన వృత్తాంతములు రమ్యముగా వర్ణించబడినవి వాక్పతిరాజు రచించిన 'మహుమహవిఅఅ' (మధుమథవిజయ) కావ్యము నామమాత్రావశిష్టము

మహారాష్ట్ర నివాసియగు కుతూహలభట్టు యొక్క 'లీలావఈ' (లీలావతి) రచనా కాలము క్రీ శ 1000 ప్రాంతము ఇందు ప్రతిష్ఠాన పురాధీశ్వరుడగు సాతవాహనుని యొక్కయు, సింహళ రాజకుమారి అగు లీలావతి యొక్కయు ప్రేమ కథ వర్ణించబడినది గంధర్వ లోకములోని కొంత మంది ప్రేమికుల కథలుకూడ ప్రాసంగికముగా వర్ణింపబడి నవి సర్గబద్ధముకాని ఈ రచనలో కవి చూపిన ప్రబంధ పటుత్వము ప్రశంసనీయము

ప్రాకృత వ్యాకరణ నియమములను వివరించు 'సిరంచిధ', (శ్రీ చిహ్న) అను ప్రబంధ కావ్యము, కేరళ నివాసియగు కృష్ణలీలా శుకుడు (13వ శతాబ్ది), అతని శిష్యుడగు దుర్గాప్రసాదు, రచించినది ఇందు శ్రీకృష్ణలీలలు వ్యాఖ్యానించబడినవి ఇదే ఇతివృత్తముగల 'సోరి (శౌరి) చరిఅ'మను కావ్యము (18వ శతాబ్ది) కృత్రిమభాషాయుక్తమై, అర్థక్లిష్ట ముగా నున్నది

ఖండ కావ్యములలో 'ఉసాణిరుద్ధ' (ఉషా-అనిరుద్ధ), 'కంసవహో' (కంసవధ) ముఖ్యములు వీటి రచయిత కేరళ

నివాసియగు రామపాణిపాదుడు ఇవి క్రీ శ 1750 ప్రాంతమున వ్రాయబడినవి. 'ఉసాణిరుద్ధ'లో ఉషా-అనిరుద్ధుల అనురాగము, వివాహము 230 పద్యములలోను, 'కంసవహో' లో శ్రీకృష్ణుని బాల్యక్రీడలు 233 పద్యములలోను సుమ్మృదుమనోహరముగా వర్ణించబడినవి

ఇవిగాక 'హరివిలఅ' (హరివిజయ), 'రావణవిలఅ', 'భృంగసందేశ', 'కుమారవాలచరియ' (కుమారపాలచరిత్ర) అను కావ్యములు పేర్కొన తగినవి

ముక్తక కావ్యములలో 'గాహాసత్తసఈ', 'వజ్జాలగ్గం' సుప్రసిద్ధములు ఈ రెండు గ్రంథములలో పెక్కురు కవుల రచనలు సంకలితములయినవి గాథాసప్తశతిని హాలుడను మహారాజు క్రీ శ మొదటి శతాబ్ది ప్రాంతములో పర్చి కూర్చెనని చెప్పుదురు ఇందు శృంగార రసప్రధానములగు ఘట్టములు అత్యంత రమణీయముగాను, స్వాభావికముగాను వర్ణించ బడినవి

'వజ్జాలగ్గం' (వ్రిజ్యాలగ్న) అను గ్రంథము జైన శ్వేతాంబరముని యగు జయవల్లభునిచే కూర్చబడినది వజ్జా అనగా పద్ధతి ఇందుగల 795 గాథలు, కావ్య, సజ్జన, దుర్జన, దైవ, దారిద్ర్య, సురత, ప్రేమ, సతి, అసతి లేఖక, వైద్య, వేశ్య, జర మున్నగు 48 పరిచ్ఛేదములుగా విభజింపబడినవి చక్కని శైలిలో మానవస్వభావము అతిసరళముగా విశదీకరించ బడినది

గోపాలమిశ్రుడు రచించిన 'మకుటము'లోని 81 పద్యములు మాత్రమే దొరకుచున్నవి ఆనంద వర్ధనాచార్య విరచితమగు 'విషమవా(బా)ణలీల'అను గ్రంథము నామమాత్రావశిష్టము ఇవిగాక ప్రాకృతభాషలో రచింపబడిన శృంగార, నీతిప్రధానములగు ముక్తకములు అనేకములు సంస్కృత అలంకార గ్రంథములలో ఉట్టంకించ బడినవి భరతుని నాట్య శాస్త్రమున గూడ వేలకొలది ప్రాకృత పద్యములు కలవు ఇవి అన్నియు ఆనాటికి ప్రాకృత భాషలపట్ల జనులకుగల గౌరవమునకు తార్కాణములు

ప్రాకృతమునగల ధార్మిక సాహిత్యము జైనమతాచార్యులచే రచింప బడినది ఈ గ్రంథములు అర్ధమాగధిలో వ్రాయబడినవి వీటిలో సిద్ధాంత గ్రంథములు, ఇతర వాఙ్మయమును కలవు ఆగమ గ్రంథములు అంగ, ఉపాంగ, సూత్రములు అను భాగములుగా విభజింపబడినవి గద్యపద్యమిశ్రితములగు అంగగ్రంథములు పంద్రెండు వీటిలో దృష్టాంతములద్వారా జైనమతమునకు సంబంధించిన సిద్ధాంతములు బ్రాహ్మణాది-అన్యమతముల ఖండనము, నిర్వాణ మోక్షాదుల చర్చలు, తీర్థంకరుల జీవితకథలు మున్నగు విషయములు వివరింపబడినవి ఈ 12 అంగములకు ఉపాంగగ్రంథములు కలవు వీటిలో మృత్యువు, పూర్వజన్మము, పునర్జన్మము, ఆత్మ, నక్షత్రలోకము, భూగోళము, స్వర్గనరకాదులు దృష్టాంతసహితముగా చర్చించబడినవి సూత్రగ్రంథములలో ఛేయసుత్త, మూలసుత్తములు ప్రధానములు ఛేయసుత్తములు సంఖ్యలో ఆరు వీటిలో జైన ఆచార వ్యవహారములు, జపతపనియమాదులు వివరించబడినవి మూలసుత్తములు నాలుగు వీటిలో వ్రతనియమములు, జీవన విధానము మున్నగు విషయములు విశదముగా చెప్పబడినవి 'పఇణ్ణ' (ప్రకీర్ణ) గ్రంథములసంఖ్య పది వీటిలో మనుష్యుని జననము, రోగచికిత్సలు, త్యాగము, మరణము, జీవనవిధానము మున్నగు విషయముల వివరణము గలదు చూలికాసుత్తములు రెండు వీటిని జైనమత సంబంధములగు విజ్ఞాన సర్వస్వములుగా పేర్కొనవచ్చును జైన పేర్కొనబడిన గ్రంథములన్నియు అలంకారికము, సమాసబహుళమునగు శైలితో కూడినవై, సాహిత్య దృష్టిచేకూడ మహత్త్వ పూర్ణములైనవి నంది, అనుయోగదా(ద్వా)ర అనునవి ఉత్తరకాలమునకు చెందిన ఆగమగ్రంథములు

ఆగమ సాహిత్యము అత్యంత గంభీరమును, పారిభాషిక పదయుక్తమును అగుటచే నిరుక్తి, భాష్యము, చూర్ణి, టీక, వివరణము, వివృత్తి, వృత్తి, దీపిక, అవచూరి, అవచూర్ణి, వివేచన, వ్యాఖ్య, ఛాయ, అక్షరార్థ, పంజిక, టబ్బ, భాషాటీక, వచనిక అనుపేర్లతో పెక్కు వ్యాఖ్యానములు రచింపబడినవి

జైనమతములో, శ్వేతాంబర, దిగంబర, భేదములు ఏర్పడిన పిదప శ్వేతాంబరులు మహారాష్ట్రి ప్రాకృతములోను, దిగంబరులు శౌరసేనీ ప్రాకృతములోను రచనలు సాగించిరి వీటినే జైనమహారాష్ట్రియనియు, జైన శౌరసేనియనియు పాశ్చాత్య విద్వాంసులు పేర్కొనినారు జైనులు గద్యపద్యములలో మతవిషయక గ్రంథములే కాక నిబంధ, ఆఖ్యాయికా, నవలా, కథానికలు అను ప్రక్రియలనుకూడ రచించినట్లు కనబడుచున్నది

జైనమహారాష్ట్రిలో రచింపబడిన 'సమరాఇచ్చకహా' 'కథాకోశప్రకరణము' 'ధూర్తాఖ్యానము' 'కథామహోదధి'

'విజయచంద్రకేవలిన్' మున్నగునవి ప్రసిద్ధ ఆఖ్యాయికా గ్రంథములు వీటిలో బాణుని రచనాశైలిని అనుకరించిన ఘట్టములు పెక్కులుగలవు 'తరంగవతి', 'సురసుందరీచరిత', 'కాలకాచార్య కథానక', 'సిరిసిరిబాలకహా', 'రయనసేహర కహా' మున్నగు కథాగ్రంథములు ప్రఖ్యాతములు వీటిలో అచటనచట పద్యాత్మకశైలికూడ అవలంబింపబడినది 'పఉమ చరిఅ', 'వసుదేవహిండీ', 'కుమ్మాపుత్తచరిఅ', 'హరివంశ చరిఅ', 'జంబూచరిఅ' మున్నగునవి చరిత్రకావ్యములు 'పఉమచరిఅ' (పద్మచరిత్ర)లో విమలసూరి 118 పర్వములలో రామాయణగాథను వర్ణించియున్నాడు జైన రామాయణ మని ప్రసిద్ధిగాంచిన ఈ కావ్యములో అవాల్మీకీయములు పెక్కులు కలవు జైన శౌరసేనిలోకూడ ప్రసిద్ధములగు గ్రంథ ములు పెక్కులు కలవు 'పవణాయసార', 'సమయసార', 'నియమసార', భపాహుడ్', 'కత్తిగేయాణుపేక్ఖా','మూలా ధార', 'మూలారాధన', 'శ్రావకాచార', 'దర్శనసార' మున్నగునవి పద్యాత్మకరచనలు 'షట్ఖండాగమ', 'కాషాయ', మున్నగునవి ప్రసిద్ధ సూత్రగ్రంథములు జీవట్ఠాణ, ఖుద్దా బంధ్, బంధస్వామిత్వవిచయ, వేదనా, వర్గణ, మహాబంధ్ అను ఆరుభాగములు కలిగిన షట్ఖండాగమమును ధరసేన ఆచార్యుడు చెప్పగా ఆంధ్రదేశమునకు చెందిన పుష్పదంతుడు, భూతబలి అనువారు వ్రాసిరట షట్ఖండాగమముపై కూడ వ్యాఖ్యానములు రచింపబడినవి ఈ గ్రంథములలో జైనమత సిద్ధాంతములు వివరించబడినవి మహావీరస్వామి, ఇతర తీర్థం కరులు ఆచార్యులను ప్రశంసించు స్తుతి (స్తోత్ర) గ్రంథములు కూడ వ్రాయబడినవి వీనిలో 'ఋషభపంచాసిక', 'మహావీర స్తవన', 'శాంతినాథ స్తవన' అనునవి ప్రఖ్యాతములు ఇవికాక సిద్ధాంత, కర్మసిద్ధాంత, శ్రావకాచార, ప్రకరణగ్రంథములు పెక్కులు కలవు జైన ఆచార్యుల, గురువుల శిష్యపరంపరను వర్ణించు పట్టములు, చారిత్రిక ప్రబంధములు చరిత్రదృష్ట్యా ఉల్లేఖ్యములు

ఆ కాలమున వ్రాయబడిన సంస్కృత నాటకములలో నీచపాత్రలకు మాగధి, స్త్రీ విదూషక గుప్తచరులకు శౌర సేని వాడబడినది

ప్రాకృతములలో సట్టకములు పెక్కులు రచింపబడినవి 'కర్పూరమంజరీ', 'విలాసవతీ', 'చందలేహా' (చంద్రరేఖా), 'శృంగారమంజరీ', 'ఆనందసుందరీ' ప్రభృతిగ్రంథములు ప్రఖ్యాతములు

చండుని 'ప్రాకృతలక్షణము' వరరుచి 'ప్రాకృత ప్రకాశము', హేమచంద్రుని 'సిద్ధహేమ శబ్దానుశాసనము' ఇవి ప్రసిద్ధ వ్యాకరణగ్రంథములు ఇవి గాక 'ప్రాకృతకామ ధేను', 'సంక్షిప్తసార', 'ప్రాకృతానుశాసన', 'ప్రాకృతకల్ప తరు', 'ప్రాకృతసర్వస్వ' ప్రభృతి వ్యాకరణగ్రంథములు ఉప లబ్ధములు,

'వృత్తజాతి సముచ్చయ', 'కవిదర్పణ', 'గాహాలక్ఖణ', 'ప్రాకృతపైంగల', 'స్వయంభూఛందములు' – ఇవి ఛందో గ్రంథములు

ధనపాలరచిత 'పాఇఅలచ్ఛీనామమాల'కాక మరికొన్ని నిఘంటువులు కలవు

ప్రాకృతభాషలలో అనేకములగు శాస్త్రీయగ్రంథ ములుకూడ వ్రాయబడినవి వాటిలో 'అత్థసత్థ (అర్థశాస్త్ర)' 'రాజనీతి', 'నిమిత్తశాస్త్ర', 'చూడామణిసార', 'అంగవిజ్జ' (విద్య), 'జోణిపాహుడ్' (యోనిప్రాభృత), 'వద్ధమాణవిజ్జ కప్ప' (వర్ధమానవిద్యాకల్ప), 'జోయిససార', వివాహపడల' (పటల), లగ్గసుద్ధి, దినసుద్ధి, 'జోఇసహీర' (జ్యోతిషసార), 'కరలక్ఖణ' (కరలక్షణ), 'రత్నపరీక్షా', 'ద్రవ్యపరీక్షా','ధాతూ త్పత్తి' 'వస్తుసార' ప్రభృతులు పేర్కొనతగినవి ఈగ్రంథములు పాండిత్యపూర్ణములై, ప్రామాణిక గ్రంథములుగా నేటికిని వెలుగొందుచున్నవి

క్రీ పూ 6-8 శతాబ్దములలో రాజకీయ, నైతిక, ధార్మిక విప్లవములు ప్రాకృతభాషల ఉద్భవమునకు కారణ మైనవి మరల క్రీ శ 10–11 శతాబ్దుల సాంఘిక పరిస్థితులు ఆధునిక ఆర్యభాషల పుట్టుకకు కారణభూతములైనవి ఈ మధ్యకాలము ప్రాకృతభాషల ఉచ్ఛదశకును, సాహిత్యగౌరవ మునకును ఆలవాలమైనది ప్రాకృత కథాసాహిత్యము, సత్త సఈలు మొదలగునవి భారతీయ భాషలన్నింటిని ప్రభావిత మొనర్చినవని నిస్సంశయముగా చెప్పవచ్చును ప్రాకృతభాష లలో ఉపలబ్ధములగు రచనలు భారతీయ భాషాసారస్వత తులనాత్మకపరిశీలనమునకు అత్యధికముగా తోడ్పడుచున్నవి

ఠం ఠీ ఠో

## ప్రాక్చారిత్రక కళ – పూర్వశిలాయుగము .

కళానిర్వహణ మనునది మానవునకు సంక్రమించిన అత్యున్నత ప్రజ్ఞా లక్షణములలో నొకటి పురాపాషాణిక

కాలమున వేటాడి జీవించు ప్రజలతో దృశ్యకళా వ్యాసంగము ఆరంభమైనది. అనంతరము గడచిన పదిలక్షల సంవత్సరముల కాలములో ఈ దృశ్య కళాభివృద్ధి తాబేటి నడకనడచెను. తరతరముల మానవులు పుట్టుచు, గిట్టుచుండగాని, కళా సంస్కృతులలో వారిసుమంతయు పరివర్తనము తేజాలకుండిరి పిమ్మట, ఇటీవల సృజింపబడిన కళా ఖండములతో తులతూగ గల కళావిజ్ఞానమును మానవుడు కల్పింప జాలెను.

పూర్వ శిలాయుగములో వేటకాండ్రు కొనసాగించిన కళా సంస్కృతి వ్యాసంగము ఆశ్చర్యమును గొల్పును. వారు గావించిన స్త్రీచిత్రముల ఉత్పత్తి విశిష్టమైనది.

పూర్వ చారిత్రక కళ నాల్గు విభాగములుగా చేయబడవచ్చును. (1) ఉత్కరణము (Engraving), (2) చిత్రలేఖనము, వర్ణచిత్రణము, (3) శిల్పము, (4) ప్రతిరూప చిత్రణము. ఈకళారూపము మరల ద్వివిధము, గుహాకళ అనియు, గృహకళ అనియు.

గుహా కళ: గుహాకుడ్యముల పైనను, గుహాశ్రయముల పైనను గోచరమగు పురాపాషాణయుగ కళా ఖండములు, వర్ణచిత్రములు, ఉత్కరణములు పశ్చిమ, నైరృతి-ఐరోపా ఖండములకును, తూర్పు ఆఫ్రికా యందలి సహారా ఎడారి ప్రాంతమునకును, దక్షిణ రొడీసియాకును, దక్షిణాఫ్రికాకును పరిమితమై యున్నవి. ఆఫ్రికా ఖండపు గుహాకళ ఐరోపా దేశమందు ప్రశంసింపబడిన అత్యంత ప్రాథమిక కళయంత ప్రాచీనమైనది కాదు. పశ్చిమ, నైరృతి ఐరోపా ఖండములలో మూడు కళా కేంద్రములు విశిష్టములైనవి. మొదటిది నైరృతి ఫ్రాన్సు దేశమునందున్నది. అచ్చటి కళా ఖండములు 'విజీర్' పర్వతకనుమలలో మెండుగా కేంద్రీభూతములై యున్నవి. రెండవ కేంద్రము పైన పేర్కొనిన కనుమలకు దక్షిణముననున్న పిరనీస్ పర్వతశ్రేణులలో ఉత్తరపు వీటవాలు ప్రదేశములందు కలదు. మూడవ కళా కేంద్రము, ఉత్తర స్పెయిను దేశమునందు 'బిల్బా' నగరమునకు పశ్చిమముగానున్న కాంటాబ్రియన్ పర్వతములం దున్నది. ఇచ్చటి పెక్కు గుహాలు ఉత్తర జలవిభాజక క్షేత్రమునకును, బిస్కే సముద్రపు రేవునకును నడుమనున్నవి. పైన పేర్కొనినవియే కాక వర్ణ, ఉత్కరణ చిత్రములతో అలంకృతములైన గుహాలు స్పెయిను దేశమందలి గ్వాడలజర, మాడ్రిడ్ రాష్ట్రములందును, తూర్పు తీరమునగల వల్సెల్లో వద్దను, వలెన్షియాకు దక్షిణమునను, మలయా చుట్టు దక్షిణ దిశాగ్రమందును, కాన్పించును. స్పెయినులో చెదురుమదురుగా నున్న ఈ కళా కేంద్రములు ఫ్రాంకో-కాంటాబ్రియన్ కళా సంప్రదాయమునకు చెందియున్నవి. వల్సెల్లోకును, దక్షిణ మండలములకును సంబంధించిన కళా ఖండములు మధ్యధరా సముద్ర ప్రాంతీయ పూర్వ శిలాయుగ కళా సంప్రదాయములతో కొన్ని పోలికలను కల్గియున్నవి. ఇటలీ సముద్రపు రేవయిన లైగూరియనునకు సమీపముననున్న రైన్ నదీలోయ యొక్క దిగువ భాగమునందును మధ్య ఇటలీలోను, అపూలియా, పశ్చిమ సిసిలీల యందును ఉన్న గుహాలు ఈ పూర్వ శిలాయుగ కళా సంప్రదాయమునకు చెందినవి. మనోహరమైన ఉత్కరణ కళాఖండ మొకటి హాలెండు దేశములో కనుగొనబడినది. అచ్చటి కళా ఖండములలో రేఖా చిత్ర రూపములును, ఏ తరగతికిని ప్రతినిధులుకాని ఇతర కళా రూపములును, విశేషానుపాతములో నున్నవి.

ఫ్రాంకో-కాంటాబ్రియన్ మండల మందలి కళా సంవిధానము ఈ దిగువ తరగతుల క్రింద విభజింపబడినది. (1) వర్ణచిత్ర రచనము (2) ఉత్కరణము (3) గుహాకుడ్యముల పైన, శిలాఖండముల పైన చెక్కబడిన ఉత్సేధ చిత్రములు సాధారణముగా ఈ చిత్రములన్నియు ఇతర వృత్త్యవశేషములతో పాటు, గుహాముఖముచెంతనే చెక్కబడియున్నవి.

చోరనలవికాని గుహాలయము లందలి పెక్కు అపురూప కళా ఖండములు నేటికిని స్పెయిను దేశమునందు కలవు. సింహముయొక్క చెక్కడపు చిత్రము, ఖడ్గమృగము యొక్క వర్ణచిత్రము, వివిధ వర్ణాలంకృతమైన విశాల వృషభవన చిత్రము నేలకొరగిన కపాలముతోపాటు బల్లెపుపోట్లు తినిన ఎలుగుబంటి ప్రతిమ, పైన పేర్కొనిన తావులలో కాన్పించును. శిలాకుడ్యముపై అనుకొని యున్న గోవు, వృషభము, కారెనుము-వీటియొక్క ఆదర్శ మృత్ప్రతిమలు టక్ట్, ఆడోబర్టులవద్ద కనుగొనబడినవి.

గృహ కళా సంప్రదాయమంతయు ప్లాస్టిక్, ఉత్కరణ రూపములకు పరిమితమై యున్నది. అయితే శిలా ఖండములపై రచింపబడిన అల్పపరిమాణ వర్ణచిత్రముల నమూనాలు ఈ నాటివరకు చెక్కుచెదరక నిలచి యున్నవి. ఇట్టి చిత్రములచ్చట పూర్వ మెన్నియో నశించియుండును. జంతు, రేఖా శాస్త్రముల సిద్ధాంతముల ననుసరించి రంగులతో

చిత్రింపబడిన శిల లెన్నియో పర్పెల్లో నగరము చెంతనున్న గుహానివాసములందు కనుగొనబడెను

ప్రాచీన కాలమందు ఉపయోగింపబడిన పెక్కు వేట పరికరములమీద-ముఖ్యముగా విసురుడు బల్లెముల మీద-మాగ్దలీనియను సంప్రదాయమునకు చెందిన అద్భుత కళా నైపుణ్యముట్టిపడు చిత్రములు రచింపబడెను అట్టి చిత్రములలో బల్లెముల ప్రయోగమునకు అనువై ఉబికి యుండునట్లు పోగరలతో అత్యంత కౌశలముతో చెక్కబడిన జంతు చిత్రములుకూడ నున్నవి బంగరు రేకుతో గంభీరముగా స్థగితములైన రాజదండములవలె కన్పట్టు వర్తులాకార శల్యదండములు ఆ నాటి కళా వైభవ సూచకములుగా భాసించుచున్నవి గృహ కళకు చెందిన మరియొక తరగతి ఆభరణములు, రంధ్రములతో చెక్కబడిన జంతు శిరములు, శాయొత్తు పతకములుగా ధరింపబడి యుండనోపును. అలంకృతములైన దీపపు బుడ్లు, రంగుపాత్రలు, చిత్రకారుని వర్ణనిక్షేపముల నుపకరించు చేపదంతపు బరిణెలు. ప్రసిద్ధమగు వేరొక చిన్న తరగతికి చెందిన కళా నిక్షేపములు-గృహ కళా ఖండములలో పెక్కులు, గృహోపకరణములపై కాక, ఎముక ముక్కల మీద, దంతపుశకలములమీద, శిలాఖండముల మీద, దుప్పి కొమ్ములమీద రచింపబడెను

ప్రాచీన శిలాయుగ మానవుడు, శిలలపైన, లోహపు రేకులపైన, చెక్కుటకు తనకు విశేషముగా ఉపయోగపడు గంటమును తయారొనర్చుకొనెను ఆయా కాలములయం దుపయోగమునకు తగినరీతిగా అతడు రేఖాకృతిలో కావించిన పెక్కు చెక్కడములు కలవు వాటిలో విస్తృతవైవిధ్యము గోచరించును మొత్తముమీద ప్రారంభ దశలో తయారైన చెక్కడములు లోతుగను, వెడల్పుగను ఉండెడివి అనంతరీయమయిన పూర్వపాషాణిక కళా సంప్రదాయములో సుకుమారములై, సన్నని రేఖలను బోలిన చెక్కడములు ప్రాచుర్యములోనికి వచ్చెను

ఈ చెక్కడములు గుహా కుడ్యములపైనను, గండశిలావాసముల పైనను మాత్రమే కాక, చిన్న చిన్న శిలాఫలకముల మీదను, ఎముకల మీదను, దంతముల మీదను, దుప్పికొమ్ముల మీదను తరచుగ నిర్వహింపబడెడివి మాగ్దలీనియన్ యుగములో ఇట్టి రేఖా-ఉత్కరణములు ముఖ్యముగా శల్యములతోను, దంతములతోను నిర్మింపబడిన ఉపకరణముల పైనను, ఈటెల పైనను అతి లలితముగ కావింపబడెను ఈ ఉత్కరణములు ముఖ్యముగా దక్షిణాఫ్రికాలో సర్వసాధారణముగా కన్పట్టుచుండును

ఉత్కరణ చిత్ర రచనా విధానము పశ్చిమ ఐరోపాలో కంటె తూర్పు మధ్య-ఐరోపా ప్రాంతములలో మిక్కిలి అరుదుగ నుండెను స్త్రీ పురుషులు ధరించు భూషణములమీదను ఎముకలతోను, దంతములతోను నిర్మింపబడు రకరకముల పరికరములమీదను, అంచుల వెంట అల్లిబిల్లిగ నుండు రేఖలతో జాలరుకట్టు అతిరమణీయముగ చెక్కబడినది పలుతెగల అడవి జాతులవారు శిలలపైన, ఎముకలపైన, గుహాకుడ్యములపైన, శిలావాసములపైన, వన్యమృగ రేఖా చిత్రములను జీవకళ ఉట్టిపడునట్లు చెక్కెడివారు. ప్రెడ్‌మాస్ట్ అను తావున పోగరతో చెక్కబడిన స్త్రీల చిత్తరువులును, సహజములైన ఇతర చెక్కడపు చిత్రములును కనుగొనబడినవి

వర్ణ చిత్ర రచనము, వాస్తవిక వర్ణచిత్ర రచనము, ధూళీ వర్ణచిత్ర రచనము అను మూడు తరగతులుగా, చిత్ర రచనమును విభజింపవచ్చును వాస్తవిక వర్ణ చిత్ర రచనము కంటె భిన్నమగు వర్ణచిత్ర రచనము ప్రాచీన శిలాయుగ మానవులచే అనుష్ఠింపబడినది ఈవిషయము ఖనిజ వర్ణ పరికరములలో తయారైన సుద్దబలపములు కనిపించుటచే ధ్రువపడినది.

ప్రాచీన శిలాయుగ శిల్పకళ (1) ఉబ్బెత్తు చిత్రములు (2) గోళాకార శిల్పములు అను రెండుతరగతులుగా వర్గీకరింపబడినది ప్రాచీన శిలాయుగపు మానవుడు ఫ్రాన్సుదేశములో సృష్టించిన కొన్ని ఉబ్బెత్తు శిల్పములు అత్యంత సౌందర్య కౌశల్యములకు తార్కాణములు ఈ శిల్పముల యొక్క స్థూలరూపములను తయారుచేయుటకు మొరటు ఉలు లుపయోగింపబడినవి సూక్ష్మవివరములను తీర్చి, తుది రూపము దిద్దుటకు నిశితమైన గంటములు, రంగులు వాడబడెడివి గోళాకార శిల్ప ప్రక్రియ చిన్నవస్తువులను మలచుటకే ముఖ్యముగా పరిమితమైయుండెను ప్రాచీన శిలాయుగ సంస్కృతికి చెందిన ఊహాకల్పిత కళాప్రక్రియలు రేఖా కళా విధానములు మధ్యశిలా యుగములో నశించినవి, ఆనాటి ప్రజలు తమ కళాప్రతిభను కోల్పోయిరి పరికరములపై, ఆయుధములపై కావింపబడిన అలంకార సంస్కరణము క్రమముగా అతిహీనస్థాయికి దిగజారెను దైనందిన జీవితములో

జను ఉపయోగించిన వస్తు సముదాయముపై గోచరించిన కళాసంస్కారము కూడ అట్టిదే బట్ లెండులో కనుగొనబడిన వస్తుజాతమును బట్టి, సహజత్వము దాదాపు మృగ్యమయ్యె ననవచ్చును అయితే స్పేడనుదేశములో కనుగొనబడిన కొన్ని చెక్కడములు, జీవకళ ఉట్టిపడు ప్రాచీన శిలాయుగ సంప్రదాయమును స్ఫురణమునకు తెచ్చుచున్నవి

పెక్కు శిలోత్కరణ చిత్రములు, వర్ణచిత్రములుగల శిలాఫలకములు, స్కాండినేవియాలో కనుగొనబడినవి వీటి వలన ప్రాచీన శిలాయుగ కళావిశిష్టత ఆర్కిటిక్ ప్రాంతీయ కళయందు శేషించియున్నదని తేటపడుచున్నది ఆర్కిటిక్ మండలములో జంతువుల ఎముకలతో మలచబడిన కత్తులు, గొడ్డళ్లుకూడ ఇట్టివే ఆర్కిటిక్ కళాసంప్రదాయము నవశిలా యుగమునందుకూడ వ్యవహారమునందుండెను

దక్షిణ–యూరపులో ప్రాలినిథ్యాత్మక కళ అదృశ్య మయ్యెను అజిలియనులనెడి తెగవారు స్ఫటిక శిలలపై వర్ణ చిత్రములను రచించియుండిరి ఇవి ఎర్రని తేగురుమన్నుతో చుక్కలు, కడ్డీలు, తరంగరేఖలు మున్నగు రూపములలో తయారైనవి ఈ నమూనాలన్నియు సాంకేతికములే కాని, కళాప్రాశస్త్యయుతములు కావు

పాలెస్టయిను దేశపు ఒక తెగవారు మాధ్యమిక శిలా యుగ కళాఖండములను సృష్టించిరి వాటిలో అత్యుత్తమ మైన కంఠహారమునుబట్టి, వారు కళాకల్పనా నిష్ణాతులని స్పష్టమైనది అయితే వారు ఎముకతో నిర్మించిన కొడవలి పిడిపైగల వనదేవతాది విగ్రహములు తలమానికములవంటివి ఈ స్వల్ప ఉత్కరణమునందు భావస్ఫోరకమగు ప్రాచీన శిలా యుగకళాప్రాభవము సువ్యక్తమగుచున్నది

ప్రక్కప్రక్కగా నున్న స్త్రీ, పురుషుల చెక్కడపు చిత్రములను దర్శించినపుడు, వాటి భావావేశముల వ్యక్తీ కరణము భిన్నముగ నుండును స్త్రీ చిత్రములు నగ్నరూప మునందుండు సౌందర్యదేవతామూర్తులకు సన్నిహిత సాదృశ్యము కల్గియుండును అయితే స్థూలకాయలుగను, గర్భవతులుగను కన్పడు ఈ దేవతల చిత్రరచనయందు ముఖ్యాంగ మగు శిరస్సుయొక్క ప్రాధాన్యమును చిత్రకారుడు గమనింప లేదు జంతుచిత్రములను, స్త్రీచిత్రములను ఈ కళాకారుడే చెక్కినను, కొన్నిసందర్భములలో, వాటి సృష్టికి మూలహేతు వగు భావావేశము మాత్రము అత్యంతభిన్నమై కన్పట్టును జంతుచిత్ర రచన విషయమున ఈ చిత్రకారుడు ప్రతిజాతి జంతువుయొక్క స్వభావాకృతుల ఉజ్జ్వల వాస్తవికతచే ప్రభావితుడైయున్నట్లు కన్పట్టును కాగా స్త్రీరూపచిత్రణమందు చిత్రకారుడు స్త్రీరూపమును తానూహించిన వాస్తవికతా దృష్టితో కాక, స్త్రీత్వమున కంతకును స్త్రీయే మూలభూత యను భావముతో కల్పనచేసెను అనగా ఆతడు కేవలము స్త్రీయొక్క బాహ్యాకృతిని కాక, ఆమెయందు నిగూఢమై యున్న అవంధ్యతను భావగర్భితముగా మూర్తీభవింపచేసెను

మాధ్యమిక శిలాయుగ కళావస్తువులు, ఆనాటి దృశ్యములు, ఆ కాలపు సంఘటనలు ప్రాచీన శిలాయుగపు వాటి కంటె, ప్రజ్ఞావిషయమున, ఉన్నతతరస్థాయికలవై యున్నవి కాని, నిర్మాణ నిర్వహణమునందును, భావప్రకటనమునందును మాత్రము అవి తక్కువస్థాయికే చెందియున్నవని చెప్పవలెను

గుహాకళకును, ఇంద్రజాలిక–మత కలాపమునకును సన్నిహితసంబంధ మున్నదనుటకు పెక్కు నిదర్శనములలో జంతురూప ప్రచ్ఛన్నులైన మానవులయొక్కయు, మనుష్య–దేవతాకృతి–విశిష్టులైన మాంత్రికులయొక్కయు చిత్రచయము పేర్కొనదగినది

గుహావాస్తువునందు గోచరించు ఈ ఐంద్రజాలిక లక్షణము గృహవాస్తుకళయందు అంతగా బలీయమై కన్పట్టదు కొండగొర్రెయొక్కయు, దుప్పియొక్కయు, స్థూలాకృతి కల వన్యమృగముల యొక్కయు చిత్రములు బల్లెములపై చెక్కబడెడివి ఈ చిత్రములు ఆనాడు ఆ మృగములను వెంబడించి వేటాడువారికిగల కౌశల్యమునకు చిహ్నములుగా విశ్వసించబడినవి

గుహావాస్తువు విశేషముగను, గృహవాస్తువు కొలదిగను జంతు చిత్రకళా విజ్ఞానమునకు తోడ్పడినవి కొంతవరకు ఐంద్రజాలికమును, విశేషముగా మతసంబంధ విశిష్టమునైన ఆ సంప్రదాయము మానవుని వేటజీవితమున కాధారమైనది.

శిలాయుగవాస్తు కళాకారుడు జంతుతత్త్వ మెరిగి, జంతుజీవితములో లీనమై, వాటి చిత్రములను సృష్టించెడి వాడు ఆతడు ఐంద్రజాలిక కలాపముల ననుష్ఠించుచు, బహుళప్రయోజనములను సాధించెడివాడు ప్రకృతి సంపదలో నొకభాగమగు జంతువిషయములో ఆనాటి కళాకారుడు లీను డగుటతో అతని చర్యలకును, మతజీవితమునకును అవినాభావ సంబంధ మేర్పడెను

కళాసృష్టియందు లీనమై, మానవుడు సాధింపగల్గినంత విజయము మరి యేయితర రంగమునందును ఆతడు సాధింపజాలకుండెను అనుసంధాన చిత్రరచనము, రేఖాచిత్రలేఖనము — ఈరెండు విధానములును ఐరోపాలో ప్రాచీన శిలాయుగాంతమునందు బహిర్గతము కానారంభించెను ఈ కళాసంవిధానము అవ్యక్తమును, అస్పష్టమునునగు మాధ్యమిక శిలాయుగపు అలంకరణములలో గోచరించెను వేటకాండ్రు వాస్తవికచిత్రములను కల్పించియుండిరి అర్వాచీన శిలాయుగ మానవుడు రేఖాచిత్రముల నమూనాలతోనో, కేవలము సహజరూపములయొక్క సాంప్రదాయిక సంధాన చిత్రములతోనో, భూమ్యుపరితలములను అలంకరించెడివారు వీటిలో మొదటి కళారూపము భావవ్యక్తీకరణముతోను, చిత్తోద్వేగముతోను సంకలితమైయుండగా, రెండవది గుణాలంకార ప్రధానముగ నుండెడిది రూపదర్శనములో, అనగా మాతృదేవతామూర్తుల మతసాంప్రదాయిక శిల్పములందును, కొన్ని నమూనాలయందును, ఈరెండు కళారూపముల అవిచ్ఛిన్నత గోచరించును ఈ మూర్తులయందుకూడ నిస్పష్టమైన భేదము కన్పట్టును ప్రాచీన శిలాయుగపు అత్యుత్తమ చిత్రములు సాంప్రదాయికతకు చెందియుండియు స్త్రీ శరీర చిత్రణ విషయమున, ఇంద్రియ వికారపరతను ప్రకటించుచుండును ఆధునిక శిలాయుగపు చిత్రములలో ఇంద్రియ వికారపరత లోపించినది అవి స్త్రీమూర్తిలబ్ధములును, సాంప్రదాయికములునైన ప్లాస్టిక్ రూపములనుగాని, కేవలము వింత స్వరూపములనుగాని ప్రదర్శించును స్వాభావిక కళావైభవ నిర్మూలనమువలనగాని, నిగూఢమగు చరిత్రగతివలనగాని, లేక, కళాసంప్రదాయతైణ్య వినాశనమువలనగాని ఇది ఘటిల్లియుండవచ్చును ఈ నూతన సాంకేతిక కళాప్రాదుర్భావమునకు కారణము కొంతవరకు లయాన్విత స్థిరజీవిత సంఘటనమని స్పష్టమగుచున్నది

ఆధునిక శిలాయుగమునందు సాధింపబడిన ముఖ్యశిల్ప కార్యము అత్యుత్తమమయిన మృణ్మయ శిల్ప కళాఖండము ఆసియాలోను, ఈజిప్టులోను ఆకాలములో సిద్ధమైన ఉత్తమ మృణ్మయ వస్తుసముదాయము రూప-అలంకార విషయమున ఆనాటినుండి ఈనాటివరకు చేయబడిన మృణ్మయ వస్తువులతో తులతూగగల్గుచున్నది మృణ్మయ పదార్థములను విడచిపుచ్చినచో, గుణవిశిష్టమైన వాస్తుశిల్పము, శిలోత్కరణ మొక్కటే అని చెప్పవచ్చును ఈ ఉత్కరణ శిల్పములో దుప్పెలయొక్కయు, కొయ్య గరిటెలయొక్కయు పై భాగములనుండు పక్షి విగ్రహములు, జంతు విగ్రహములు దర్శనీయములుగ నుండును

జరికో అను ప్రదేశమున కన్గొనబడిన మృణ్మయ కపాలచిత్రముయొక్క దృశ్యము ఆనాటి కళావైశిష్ట్యమును తెలుపుచున్నది వాటిని సృష్టించిన కళాకారుల ఐంద్రజాలిక తాముతానురక్తి వారి కళాచాతుర్యముకంటె అధికతరమైనది తొలి నవీన శిలాయుగ మానవులు కల్పించిన కళాఖండములలో మృణ్మయపాత్రలు ప్రథమశ్రేణికి చెందినవి ప్రాచీన శిలాయుగపు మృణ్మయ కళాఖండములకును, పైన పేర్కొనిన మృణ్మయ వస్తువులకును స్పష్టమైన వ్యత్యాసము కలదు నైలునదీ మండలమందలి మృణ్మయవస్తు కళాకారులు రూపకల్పనయందేకాని, అలంకార రచనయందు ప్రవీణులు కారు వర్ణాలంకృతమయిన మృణ్మయ వస్తూత్పత్తియందు ఆసియా, ట్రిపోలీ, ఆల్టినియన్, ఆలూబాయిడ్, యాంగ్షా, హాలీఫియన్ మున్నగు సంప్రదాయములకు చెందిన పాత్రలు అత్యున్నత కళాశిఖరము నందుకొనెను

నవీన శిలాయుగాలంకరణ కళలో స్తూపికల వినియోగము మృణ్మయవస్తు నిర్మాణములోను, శిలోత్కరణములోను విశేషముగా పేర్కొనదగినది

మృణయ కళాకారులు స్తూపికల వినియోగ విధానమును స్పష్టమైన కళాసాహిత్య పరిజ్ఞానముతో గ్రహింపకుండిరి ఐనను, దేవాలయములమీద, సమాధులమీద, గోరీలమీద విరివిగా చెక్కబడిన నైతిక-ఆధ్యాత్మిక సూత్రములవలన, ఈ మృణ్మయకళ సంకేతప్రధానమై ఉండియుండెనని తెలియుచున్నది

నవీన శిలాయుగపు మృణ్మయ కళాకారుడు సృష్టించిన లౌకిక కళాఖండములకును, దేవాలయ విగ్రహములకు, సమాధులకు చెందిన పవిత్ర కళాఖండములకును నడుమ స్పష్టమైన వ్యత్యాసము గుర్తింపబడుచున్నది

వ్యవసాయమువలన జీవించు వ్యక్తి ఒకానొక ప్రదేశమున స్థిరపడినతరువాత, గృహనిర్మాణమును కాంక్షించుచుండెను ధన, ధాన్యములు వృద్ధినొందినపిదప ప్రథమమున పూరిగుడిసెలతోనున్న యొక కుగ్రామము పట్టణముగా పరిణామము చెందెను ఆపట్టణమే పిదప మహానగరముగా విక

సించెను గృహనిర్మాణ విధానమునకు ధనాఢ్యులిచ్చిన ప్రోత్సాహపోషణములు, శిల్పశాస్త్రకళకు లభించిన ప్రేరణము ఆయా దేశములందు గృహనిర్మాతలకు లభ్యమైన పరికరములపైననే విశేషముగా ఆధారపడియుండెను

నవీనశిలాయుగములో జరికోవద్ద నిమ్నప్రదేశములలో నిర్మింపబడిన గృహములు వలయాకృతిలో నుండెను ఉన్నత ప్రాంతములందు సమకోణములతో నొప్పు రాతిగోడలతో పూరిపాకలు నిర్మింపబడెను వాటిప్రక్కనే కాలిన ఇటుకలతోను, పచ్చిఇటుకలతోను నిర్మింపబడి, రెల్లుగడ్డితో కప్పబడిన గృహములుండెను ఈజిప్టుదేశములో రాజవంశావళియొక్క ప్రాదుర్భావమునకు పూర్వము ఇటుకనిర్మాణము ప్రవేశపెట్టబడెను మొహంజోదారో, హరప్పల శిథిలములను పరిశీలింపగా, గృహవాస్తువునందు కాలిన ఇటుకలు, శిలాజితు తైలముతో తయారైన సున్నము, చప్పరములకు, పునాదులకు, గోడలపై భాగములకు ఏకరీతిగా ఉపయోగింపబడినట్లు తెలియుచున్నది హరప్పయుగపు ప్రజలు ఇటుకలను నిర్మించుటలో మిక్కిలి నిపుణులై యుండిరి ఫలాత్మకమైన హరప్ప వాస్తుకళాసంప్రదాయము అనంతరయుగములం దవతరించిన మహోన్నత ద్రవిడకళావైభవమునకు మార్గదర్శకమయ్యెను

హరప్ప శిథిలములలో నిలబడియున్నట్టియు నాట్య భంగిమలో నున్నట్టియు ఇద్దరు యువకుల విగ్రహములు ఆశ్చర్యకరములు అచటి అరుణశిలానిర్మితమగు నొక మొండి విగ్రహము ప్రకృతియొక్క ప్రత్యక్ష ప్రతిరూపమనవచ్చును అయితే అందలి ఆదర్శీకరణము దానివాస్తవికతకు భంజకమయ్యెను బూడిదవర్ణములోనున్న యొకశిలావిగ్రహపునాట్య భంగిమము అఖిలా లక్షణ ప్రధానమై యున్నది సంశ్లిష్టమైన ఆనాట్యవిన్యాసమును, వివిధాంగముల చలనశీలమును శిల్పకారుడు విశేషమగు సాంకేతికనైపుణ్యముతో కల్పించినాడు మొహంజోదారో విగ్రహములలో టపిరెగడ్డముకల ఒక విగ్రహము యొక్క ఉత్తరీయముచే ఆచ్ఛాదితమైన ఊర్ధ్వకాయ మొక అత్యుత్తమ శిల్పకళాఖండమై భాసిల్లుచున్నది నాసికాగ్రమును లక్షించుచు అర్ధనిమీలితనేత్రముతో నొప్పు ఆవిగ్రహము ఒక భారతీయ యోగిపుంగవునిదని తేటపడుచున్నది నిమీలితనేత్రుడై కూర్చొనియున్న మరియొకవ్యక్తియొక్క విగ్రహనిర్మాణము నిరాడంబరముగను, మనోరంజకమునై, శిల్పియొక్క విస్తృతకళాదృష్టిని సూచించుచున్నది ఒకనగ్నకళావతియొక్క కంచువిగ్రహము దీర్ఘబాహులతలతో నేత్రానందకరమై, సహజమగు జీవకళతో ప్రకాశించుచున్నది

అంగుళీయకములపై చెక్కబడిన దృశ్యములలో పార్శ్వముఖచ్ఛాయలుకల జంతువుల చిత్తరువులు నిశితమైన సాధనములచే తీర్చిదిద్దబడినవి వీటియందు కొన్నిచిత్తరువులు పౌరాణికకల్పనా ప్రాధాన్యము కలవైయున్నవి వీటిలో నొసట ఒంటికొమ్ముగల ఒక ఖడ్గమృగము, క్రొవ్విన మూపురముతో నొప్పు వృషభము ఇందులకు తార్కాణములు

రా సు

## ప్రాక్చారిత్రక సంస్కృతులు

మానవుడు భూమిపై నివసించి విశ్వమునకు చరిత్రను అందజేసినాడు ఆదిమ మానవుడు మిక్కిలి పురాతనకాలములో జనించి, కాలమాన పరిస్థితులవలన పెరిగి, కొంతకాలము జీవించి, నశించి ప్రాక్చరిత్రను అందజేసినాడు ఆతడెట్లు, ఎక్కడ, ప్రప్రథమమున జన్మించెనన్న విషయమును అటులుంచి, ఎన్నివేల సంవత్సరముల క్రిందట ఆతడు ఉదయించెను? ఎట్లునివసించెను? ఆతడు తన దైనందిన సమస్యలను ఎట్లు పరిష్కరించుకొనెను? ఆతని జీవితము, నాటి కాలికప్రభావములో ఎట్లుండెను? అను ప్రశ్నలు చర్చింపదగినవి ఆదిమ సంస్కృతుల విషయమై పురాతత్త్వ పరిశోధకులు పెక్కు పరిశోధనములను జరపిరి, వీరింకను పరిశోధనములను జరపుచునే యున్నారు ఈ పరిశోధనపు ఫలితములే ప్రాక్చారిత్ర సంస్కృతు లనబడుచున్నవి

యుగములు ప్రప్రథమ మానవుల సంస్కృతులు పెక్కు దేశములందు పరిశోధనానంతరము బయల్పడినవి ఉదాహరణమునకు ఇచ్చట పేర్కొనదగినవి ఆసియా, ఆఫ్రికా, ఐరోపాఖండములు ఈ ఖండముల సంస్కృతులు వికసించిన కాలము మూడు యుగములుగా విభజింపబడినది (1) ప్రాతరాతి యుగము, (2) మధ్యమరాతి యుగము, (3) నూతనరాతి యుగము మానవుడు పనిముట్లను తయారుచేయుటలో రాతికి విశేషముగా ప్రాముఖ్యము నిచ్చెను కనుకనే ఇవి రాతి యుగములని పిలువబడుచున్నవి

ప్రాక్చరిత్ర, ప్రాక్చారిత్రక సంస్కృతి అనగానేమి? మానవునకు అక్షరజ్ఞానము అలవడక పూర్వము జరిగిన చరిత్ర ప్రాక్చరిత్ర అనబడుచున్నది అనగా, అది మానవుని

ఆదిచరిత్ర అని యర్థము వ్రాతకోతల జ్ఞానము మానవులకు అన్ని దేశములందును ఒకే సమయమున అలవడలేదు మెసపటోమియా, ఈజిప్టు దేశములలో మూడువేల సంవత్సరముల క్రిందట మానవులకు అక్షరజ్ఞాన మబ్బినది అటులే, వ్రాతజ్ఞానము మానవుని జ్ఞానతృష్ణపై ఆధారపడి, పలు దేశములలో, పలుకాలములందు వెలువడినది భారత దేశములో లిఖిత - పఠన జ్ఞానము క్రీ పూ సుమారు 6వ శతాబ్దమున ఉదయించినట్లు చరిత్రకారులు చెప్పుచున్నారు అందుచే, ఆదిమ మానవులకు అక్షరజ్ఞానము శూన్యమని చెప్పవచ్చును వా రుపయోగించిన పరికరములు, మానవ, జంతు శల్యములు, వారి నివాసములు మొదలగు మానవ కృతములైన వస్తు సముదాయములు ప్రాక్చరిత్రకు ముఖ్యములైన ఆధారములు ఈ ఆధారములను పలువురు శాస్త్రకారులు పరిశీలించిరి మరికొందరు శాస్త్రవేత్తలు ఆ పరిశీలనా ఫలితములను ఆమోదించిరి పిమ్మట, ప్రాక్చరిత్ర అవతరించెను

**సంస్కృతిశబ్ద నిర్వచనము** ప్రాక్చరిత్రలో 'సంస్కృతి' అను పదమునకు, ఆదిమ మానవులయొక్క ప్రత్యేక సాముదాయిక అభ్యసనము, ఉత్పత్తి, ఆలోచనావిధానము లని నిర్వచన మియ్యవలయును వారు ఉత్పత్తి చేసినవి 1 నివాసములు, 2 పలురకములైన పరికరములు లేక పనిముట్లు, 3 ఆభరణములు, 4 మట్టిపాత్రలు వా రట్లు నిత్యజీవితములో పలురకములగు వస్తువులను వినియోగించుకొనిరి ఇట్టి అవశేషములేకాక, శిలాయుగ మానవుని ఎముకలు, భుజించి విసర్జించిన వృక్ష, ధాన్యచిహ్నములు, జంతువుల ఎముకలు, కర్రబొగ్గుతో మిశ్రితములైన పురాతనపు దాలిగుంటలు కూడ వారి సంస్కృతి పునర్నిర్మాణమునకు తోడ్పడును

**మానవుని ప్రాచీనత** మానవుడు సుమారు ఐదులక్షల సంవత్సరముల క్రిందటనుండి పృథ్విపై నివసించుచు వచ్చెను జావాలో (ఇండొనేషియా) శిలారూప 'పిథికేంత్రోపసుల' యొక్క ఎముకలును, వాని పరిసరములలో నివసించి నశించిన జంతువుల ఎముకలు - అనగా, స్టిగోడన్ అను ప్రాచీనపు ఏనుగుయొక్కయు, విచ్చలవిడిగా తిరుగుపనుగుయొక్కయు, నీటి ఏనుగుయొక్కయు, గిబ్బన్ అను జంతువుయొక్కయు, ఒరాంగ్-ఉటాంగ్ యొక్కయు ఎముకలు బయల్పడినవి ఇవియేకాక, మానవు డుపయోగించిన రాతిపనిముట్లుకూడ లభించినవి అట్లే, చైనాదేశములో 'పీకింగ్ మానవుని' (పటము 3) అస్థిపంజరములు, ఖడ్గమృగములయొక్క, ఎలుగుబంట్లయొక్క, మచ్చలుగల్గిన సివంగులయొక్క, వెంట్రుకలుగల ఖడ్గమృగములయొక్క, ఏనుగులయొక్క ఎముకలు బయల్పడినవి వీటితోపాటు మానవుని శిలాపరికరములు నిక్షిప్తములై యుండుటచే, పై జంతువులతో మానవునకు గల సంబంధము వ్యక్తమగుచున్నది కాని భారత దేశమునందు ఆదిమ మానవులు 1,50,000 సంవత్సరముల క్రిందట ఉండినట్లు 'నెవాస'లోని త్రవ్వకముల మూలమున తెలియుచున్నది వీటినిబట్టి ఈ సంస్కృతులు వివిధ దేశములలో వివిధ దశలయందు కాలమాన పరిస్థితులనుబట్టి వృద్ధిచెందినవని తెలియనగును ఎట్లనగా, ఈనాటికిని ప్రాక్చారిత్రక యుగమునకు చెందిన మానవజాతుల సంతానములను చెంచులు, కాదరులు, అంగామీలు మొదలుగాగల చెక్కు ఆటవిక జాతులవారిని చూచుచున్నాము దీనినిబట్టి, మానవ సంస్కృతియొక్క పురోగమనము కొన్ని ప్రదేశములలో ఉరవడిగ నుండినను, మరికొన్ని ప్రాంతములలో తగుమాత్రముగనో లేక వెనుకబడినదిగనో ఉన్నట్లు తెలియుచున్నది

భారతదేశమున ప్రాచీన సంస్కృతుల చరిత్ర పరిశీలనమునుబట్టి పైన వివరింపబడినట్లు వాటి కాలక్రమములు వరుసగా ఈ క్రిందివిధమున నున్నవి

1 ప్రాతరాతియుగము క్రీ పూ సుమారు 1,50,000 సంవత్సరములు

2 మధ్యమ (చిన్న) రాతియుగము క్రీ పూ సుమారు 10,000–4000 సంవత్సరములు

3 నూతన రాతియుగము క్రీ పూ సుమారు 8,500–2,000 సంవత్సరములు

**ప్రాతరాతియుగము** ఈయుగమునకు సంబంధించిన రాతిపరికరములు ముఖ్యముగా చేతిగొడ్డళ్ళు (పటము–1), కోరులు, తునకలు, చెక్కుళ్ళు (పటము–2), తొచర్లు–నిత్యజీవితములో ఆనాటి మానవుడు ఉపయోగించెను ఈ పనిముట్లను చేయుటలో క్వార్ట్‌జైట్ అని పిలువబడు రాతికి అతడు ఎక్కువ ప్రాధాన్య మిచ్చెను. ఈపనిముట్లు క్రింది ప్రదేశములలో లభించెను పశ్చిమపంజాబులోని సోహన్‌లోయ, తూర్పు పంజాబులోని సిర్సానదీలోయ, బియాస్‌నదీలోయ, వనగంగానదీలోయ, ఉత్తరప్రదేశములోని సింగ్రౌలిలోయ ప్రాంత

ములు, యమునానదీ ప్రాంతము, బీహారులోని 'రోరో' లోయ, పశ్చిమబెంగాలులోని కంగ్సాబతలోయ, ఒరిస్సాలోని భూర్జబలాంగ్‌లోయ, మయూర్‌భంజ్, మద్రాసు రాష్ట్రమందలి కోర్టలయారు లోయ, పల్లవరము, అత్తిరమపాకము, వడమదురై, మైసూరులోని మలప్రభ ఘటప్రభ, గుజరాతులోని సబర్మతి, మాహిలోయ, నరసింగపూరు, హోషంగపూరు ప్రాంతములు, కృష్ణానదీలోయ, నెల్లూరు, కర్నూలు (బిల్లసురగంగుహాలు), గుంటూరు, కృష్ణాజిల్లాలు

ఈరాతి పనిముట్లు జంతువులను చంపుటకును, వాటి చర్మములను ఒలుచుటకును, ఆహార పదార్థములగు దుంప, వేరుజాతులను భూమినుండి త్రవ్వి తీయుటకును, ఇంకను ఇతర అవసరములకును ఉపయోగింపబడినవి ప్రాక్చారిత్రక యుగములో ఈక్రింది జంతువులు జీవించి యుండెను –

అడవి ఏనుగులు, అడవి గుర్రములు, ఖడ్గమృగములు, నీటిఏనుగులు మొదలగునవి అడవిపశువులు ఇవిబృహదాకృతిలో భయంకరముగ నుండెడివి స్వతస్సిద్ధముగా ఏర్పడిన అగ్నిని వారు ఆశ్రయించి, దాని అండను చేరు చుండిరి వారికిభాషాజ్ఞానము లేకున్నను, పలురకముల సంకేత శబ్దములమూలమున వారి అభిప్రాయములు సహచరులకు తెలియజేయు చుండిరి వారిలో కొందరు దిగంబరులుగ నుండియు, కొందరు ఆకులు, చర్మములు ధరించియు జీవించు చుండిరి. వారు పలుప్రదేశములలో సంచరించుచుండెడివారు కొండగుహాలలోను, రాళ్ళ నీడలయందును, జలసమీపము నందును నివసించుచుండెడివారు వారిజనసంఖ్య స్వల్పము వారు తీరికసమయములలో వర్ణచిత్రములను గీయు చుండెడివారు స్పెయిన్ దేశములోని 'ఆల్టమేరియా', ఫ్రాన్సుదేశములోని లాకౌసు ఇట్టిచిత్రములకు ప్రసిద్ధికెక్కినవి (పటములు 8, 4, 5) రాను రాను, వారి సముదాయములు పెరిగి, పరస్పరము స్నేహ, వైరభావములు వారినడుమ తల యెత్తుచుండెను

మధ్యమ (చిన్న) రాతియుగము ఈ యుగము నాటి ప్రజలు చిన్న చిన్న రాతి పరికరములను వాడి యుండిరి ఈ పరికరములను చేయుటలో వారు జస్పర్, జేడ్, అగేట్, కార్నీలియన్, ఫ్లింట్, చెర్ట్, చల్‌సిడని, క్వార్ట్జ అను పలు రకముల శిలలను ఉపయోగించెడివారు అనాటి మానవులు చిన్నచిన్న పనిముట్లను కలిపి ఒక పెద్దపరికరమును చేయుటలో ప్రసిద్ధులైరని తెలియవచ్చుచున్నది (పటము 11) ఆహార సేకరణముకొరకును, జంతువుల వేటకును, స్వరక్షణము కొరకును, జంతువులను ప్రతిఘటించుటకొరకును ఈపరికరములను వారు వినియోగించుకొనుచుండిరి ఈ పరికరములలో ఈక్రిందివి పేర్కొనదగినవి బ్లేడులు, అర్ధచంద్రాకృతిలోనున్న పనిముట్లు, త్రికోణములు (పటములు 7, 8), చూపుళ్ళు, విషమచతుర్భుజములు (పటము-8), స్క్రేపర్లు ఈ పరికరములు బీర్భన్‌పూరు, సింగ్రౌలీ బేసినులలోను (మీర్జపూరు), మైసూరులోని సంగనకల్లులోను, ఆంధ్రప్రాంతమందలి నాగార్జునకొండవద్దను. కర్నూలులోను, గుజరాతులోని లంగనాజ్ మున్నగు ప్రాంతములలోనులభ్యములైనవి లంగనాజ్‌లో పనిముట్లతో పాటు మానవుని ఎముకలు, జంతువుల (నక్క, ముంగిస, జింక, ఖడ్గమృగము, పశువు, ఎలుక, ఉడుత, చేప, తాబేలు) ఎముకలు లభ్యములైనవి మెదడు అభివృద్ధి చెందుటవలన, నిత్యజీవితములో అనాటి మానవునకు కొంత అభ్యుదయము కన్పట్టెను ఆహారసేకరణములోను, వేటాడుటలోను, చేపలు పట్టుటయందును అతడు పలురకములైన పద్ధతుల ననుసరించెను

నూతన రాతియుగము ఈయుగములో మానవుడు శిలాపరికరములకు మెరుగుదిద్ది, సానపట్టి వాడెను అతడు ఆకుపచ్చరంగుగల ట్రాప్ అనుశిలను ఎక్కువగా రాతిపనిముట్లను చేయుటకై వాడెను అకాలములో ఈదిగువ పరికరములు తయారుకాబడెను సెల్టులు, (పటము 15), రాతిగొడ్డళ్ళు (పటము 16), పారలు (పటము 12), సుత్తిరాళ్ళు, మెరుగుదిద్దెడిరాళ్ళు, పనిముట్లను చేసెడిరాళ్ళు, చిత్రితకపట్టుటకుపయోగపడురాళ్ళు, సన్నికల్లు–పొత్రమురాళ్ళు(పటము12), భుజములుకల్గినపారలు (పటము 14)

క్రొత్తరాతియుగపరికరములు ఈక్రింది ప్రదేశములలో లబ్ధములైనవి చంబల్‌లోయ, దక్షిణరాజస్థానములోని నాగ్దా, అహార్ ప్రాంతములు, నర్మదాలోయలోని మహేశ్వర్, నవదాటోలి, మెహగమ్, త్రిపురి ప్రాంతములు, తపతీలోయలోని బహాల్‌టెక్‌వాడా, ప్రకాశ్ ప్రాంతములు, గోదావరిలోయలోని నాసిక్, జోర్వే, నివాసాప్రాంతములు, కృష్ణాలోయయందలి మస్కి, నాగార్జునకొండప్రాంతములు, తుంగభద్రలోయలోని బ్రహ్మగిరి, సంగనకల్లు, కస్మీరుప్రాంతములు కస్మీరునందలి భూగృహములో రాతిపనిముట్లు, ఎముకసూదులు, ప్రాచీనకాలపు నాగళ్ళు, రోకళ్ళు, దాలిగుంటలు, అస్థిపంజరములు లభించినవి

ఈ యుగములో మానవసంస్కృతి విశేషముగా అభివృద్ధి చెందినది మానవునకు ఆలోచనాజ్ఞానము, మంచి చెడుగుల విచక్షణ అలవడినవి అతడు జీవితావసర వస్తుసామగ్రిని చేకూర్చుకొనగలిగెను సామాన్యముగా క్రొత్త రాతియుగ సంస్కృతిలో ఈ దిగువ పేర్కొనబడిన పలురకముల అభివృద్ధులు సాధింపబడినవి మెరుగుదిద్దిన రాతిపరికరములు, తాత్కాలికముగా తలదాచుకొనుటకు వసతులు, హస్తముతోను, కుమ్మరి చక్రముపైనను తయారుచేయబడిన మట్టిపాత్రలుండెను జంతువులను మచ్చికచేసి పెంపకమొనర్చుట (పశువులు, మేకలు పందులు, కుక్కలు మొ॥), వ్యవసాయము చేయుట (గోధుమ, వరి, జొన్న, బార్లీ), బుట్టలు నేయుట, చాపలు వగైరాలు, అల్లుట, బట్టలనేత, ఆహారమును వండి భుజించుట, ఆభరణ ధారణము, తీరికసమయములలో లలితకళల నుపాసించుట, మానవ కళేబరముల ఖననము, వస్తుసామగ్రిని తరలించి వ్యాపారము చేయుట, స్థిరనివాసముల నిర్మాణము, కుటుంబ, సంఘ, గ్రామజీవిత విధానములను అలవరచుకొనుటపై మాయ, మతములపై అభిప్రాయములు మొలకలిడుట ఘటిల్లెను

మానవుని యొక్క క్రమబద్ధమగు విజ్ఞానవికాసమును, వాతావరణముపై (కాలమానపరిస్థితులు)అతని విజయమును, సృష్టిలో ఆతని తదేకకృషిని, ప్రాక్చారిత్రక సంస్కృతులు చిత్రించు చున్నవి వారు నిత్యజీవితములో అనేకసమస్యలను ధైర్య, సాహస, సహనములతో ఎదుర్కొనిరి వారు పుట్టి, పెరిగి,మరణించినప్పటికిని, వారి అనాదిసంస్కృతులు అనంతర మానవతరములకు చిరస్మరణీయములుగా నిలిచి యున్నవి

వి వి రా

## ప్రాచీన నృత్యరీతులు

మనుష్యుడు మొదటి సారిగా తన ఆనందము కొరకు ఏర్పాటు చేసికొని ప్రదర్శించిన నృత్యములు—అనుకరణ నృత్యము లనబడినవి ఇవియే అతి ప్రాచీనము లైనట్టివి ఈ 'అనుకరణ' నృత్యములు ప్రకృతిలోని వివిధ జంతువులను, పశులను జూచి వాటియొక్క విన్యాసముల నభ్యసించి తన సాటివారి వినోదము కొరకు మనుజుడు ప్రదర్శించెడి వాడు

ఉదా ఆహార సముపార్జనముకొరకు అతడు అరణ్యములో సంచారము చేసినవేళలో—

ఆకాశము మేఘావృతమైనందున—మగ నెమిలి తన రంగురంగుల పురిని విప్పి తనప్రియురాలిని ఆకర్షించుటకు చేయు సుందర విన్యాసములను దర్శించి, మానవుడు ఆదృశ్యమును తాను అనుకరించ మొదలిడినాడు అతడు ఆనెమిలి వలె పురిని ధరించి నాట్యమొనర్చెను అదియే మయూర నాట్యమైనది దానినే కాలక్రమమున అనేకులు అభ్యసించి అనేక శాస్త్రీయ అంశములతో చేర్చి, ఒకరమణీయ నర్తనముగా రూపొందించినారు ఇట్లే బెబ్బులి, కోతులు మున్నగు వాటి అనుకరణములు ప్రవర్తిల్లినవి

ఈ అనుకరణ రీతులు మనకు 'కథకళి'—నర్తనములో ఎక్కువగా గోచరించును

ఉదా 'సౌగంధికపుష్ప'—కథలో గాని, లవకుశ నాటకములో గాని హనుమంతుని పాత్రను ప్రదర్శింప గోరువానికి వానరముయొక్క చేష్టలన్నియు ప్రదర్శించిన పిదపనే, హనుమంతుని పాత్రాభినయ మాతని కప్పగింతురు ఈ దృశ్య మంతయు హాస్యరసపోషకముగా నుండును

ఈ అనుకరణము తరువాత అభివృద్ధి చెందినట్టి నృత్యము లయ, ఆట అనునవి ఈలయ ఆట,రసభావములు లేని శుద్ధనృత్త పద్ధతికి చెందినది వాద్యముల సంగీతము ననుసరించి కాళ్ళు చేతులను కదలించుచు వలయములుగా తిరుగుచు ఆడు నర్తనపద్ధతి బృంద నర్తనరీతి. ఇందులో అనేకులు పాల్గొందురు, వాద్య సంగీతధ్వని ననుసరించి ఈ నర్తకులు, కూర్చుండుట, లేచుట, ఇతర ప్రక్కలకు వంగుట, ముందునకు వెనుకకు వంగుట, ఎగురుట, దూకుట ఇత్యాది విన్యాసములను పెక్కురు కలిసి ప్రదర్శించు నృత్తమిది దీనికొక కథ కాని, దాని అనుసరణము గాని, అనుకరణముగాని ఉండదు కేవలము లయవిన్యాసము మాత్రమే ఇది రెండవ దశయని చెప్పవచ్చును

మూడవదశలో లయతోపాటు, తాళము, తాళగతి కూడా చేర్చబడినవి ఈదశ ఏర్పడునాటికి నాట్యములో కొంత క్రమశిక్షణము ఏర్పడినది అది జానపద నర్తనశైలి, లేక ఆటవికశైలి అనను దానిని ఒక పద్ధతిలో కొంత పరిశ్రమతో అభ్యసించి ప్రదర్శించెడివారు అది కూడ శుద్ధ నృత్త పద్ధతియే ఆ పద్ధతినుండియే అనేక ప్రాచీన శాస్త్రీయ నర్తనరీతులు పుట్టినవి

ప్రాచీన నర్తనములో "నృత్తము" ముఖ్యమైనట్టిది, మొదటిది—ఈ నృత్తములో తాళలయల ననుసరించి ధ్వని

యొక్క స్వరూపమును అంగ ప్రత్యంగ ఉపాంగములద్వారా ప్రదర్శించుట

ఉదాహరణము తళాంగుతక
తకిట దికిట
తరికిట తోం
తరికిటతక, దిరికిటతక
ధిర్గుడు తైయ్యా

ఈ విధముగా ఒకచర్మవాద్యము మ్రోగు చున్నప్పుడు ఆ ధ్వనియొక్క స్వరూపమును శరీరముయొక్క అవయవముల ద్వారా ప్రదర్శించుట—మరియు

తకిటత, తకిటత, అని 4 అక్షరముల గతి నడిచినప్పుడు, తకిట, తకిట, చికిట, తకిట—అను మూడు అక్షరముల గతి నడచినప్పుడు, ఆ ధ్వని ననుసరించి పాదవిన్యాసము ప్రదర్శించుట నృత్తముయొక్క ముఖ్యోద్దేశము ఆదిలో ఈనృత్తము వాద్యసంగీతము ననుసరించియే ప్రదర్శింపబడినది అటుపై బృంద గానముతో (అనగా గాయకులు కలిసి ఏదైనా ఒకపాటను పాడుటతో) నర్తకులు కలిసి నర్తించుట ఆరంభించిరి అయినను ఆ పాటలయొక్క అర్థముతో వారికి నిమిత్తము లేదు ఆ అర్థమును వారు ప్రదర్శించుటకై ఆనర్తనము చేయక, ఆ గానమును లయతాళముల విన్యాసముకొరకు ఆధారముగా చేసికొని ఆడెడివారు అట్టివే స్త్రీలు ప్రదర్శించెడి అనేక జానపద నృత్యములు—గొబ్బి, కుమ్మి, కోలాటము మున్నగునవి వీటిలో పాటలు పాడుచు ఆడబడినను, అపాటయొక్క అర్థమునకును, ఆటకును సంబంధ ముండదు ఆపాట లయ, తాళవు నడక వాటికి ముఖ్యము

తరువాత ఏర్పడినట్టిదే నృత్యము ఇందులో తాళలయలతోపాటు, పాడబడు పాటలకు, అందలి అర్థమునకు కొంత ప్రాముఖ్య మొసగబడినది ఆ గీతాలలోని అర్థమును ప్రదర్శించుటకు కొంత ప్రయత్నము జరగెడిది. ఆ సమయములోనే హస్తాభినయము (హస్తముద్రలద్వారా అర్థమును ప్రదర్శించురీతి) వృద్ధిచెందినది దీనివలన నృత్యకళలో పెక్కులు మార్పులు ఘటిల్లెను శుద్ధనర్తనము వేరుగాను, నృత్యము వేరుగాను అభివృద్ధి చెందుటయే గాక ఈ రెండింటిని చేర్చి ప్రదర్శించు శైలి ఒకటి కూడా రూపొందినది—దీనిని ప్రాచీన యక్షగాన రీతిగా చెప్పవచ్చును ఇందు నర్తకులు తాము పాడు పాటయొక్క అర్థమును అభినయించుచు మధ్యమధ్య నృత్త మాడుదురు

అటుపై వచ్చినట్టిది అభినయవిద్య ఇది ప్రత్యేకముగా భావమును ప్రదర్శించుటకై వృద్ధిపరచబడినట్టిది ఇది అన్ని రీతులకంటె తరువాత వృద్ధిపొందిన కళావిశేషము

ఈవిధముగా అనుకరణ విద్యగా ప్రారంభమై, నర్తనము సంపూర్ణమైన అభినయములో—నృత్త, నృత్య, నాట్య విభాగములతో భారతదేశములోని నాట్యకళ అభివృద్ధిచెంది ప్రచారములోనికి వచ్చినది కాని ప్రపంచములోని కొన్ని ప్రాంతములలోనాట్యకళ నృత్తరూపము లోనే నిల్చిపోయినది మరికొన్ని ప్రాంతములలో నృత్యము కూడా కొంతవరకు వృద్ధిచెందినది కొన్ని దేశాలవారు నాట్యమును (నృత్యనాటకరీతి) వృద్ధిపరచుటలో తృప్తిచెందినారు భారత దేశస్థులే సర్వాంగ సుందరమైనట్టియు, అన్నిరీతులకు ప్రాధాన్యమిచ్చునట్టియు కళను రూపొందించు కొనినారు అందు విశేషించి అభినయమును భారతీయులు మాత్రమే అభివృద్ధి పరచిరి ఇది నృత్యకళయొక్క ప్రాచీన రూపము ఇక ప్రాచీన విన్యాసరీతులు వివరింపబడును

మానవుడు తన వినోదముకొరకు కొన్ని అనుకరణ నృత్యములను ప్రదర్శించుటకు మొదలిడిన పిదప

తాను కొలుచు దేవతల సముఖమున ప్రదర్శింపదగిన కొన్ని నృత్యములు రూపొందించుకొనెను అవే ఆరాధన నృత్యములు ఇందు ప్రాచీనమైనట్టివి పంచభూతముల ఆరాధన నృత్యములు

జలదేవతను, భూమాతను, అగ్నిదేవతను-ఈవిధముగా మనుజుడు తనయొక్క మనుగడకు ఆధారభూతులైన వేల్పుల నెందరినో తృప్తిపరచుటకు నర్తనము లాడెడివాడు—ఇవన్నియు శుద్ధనృత్తములే ప్రారంభములో ఇవి సులభ పద్ధతికి చెందిన లయనృత్తములుగా నుండినవి కాలక్రమమున శాస్త్రీయ దృక్పథము పెరిగిన కొలది ఈ నాట్యములందు గూడ అనేక శాస్త్రసంబంధి అంశములు చేర్చబడి, ఒక విశిష్ట సంప్రదాయము ఏర్పడినది అయినను ఇవన్నియు శుద్ధనర్తనములే ఈ నాట్యములను యజ్ఞయాగాదుల సమయము లందును, భూమిని దున్ను సమయములందును, వర్షదేవతను (వరుణుని) సంతృప్తిపరచుటకును, ప్రత్యేకముగా ప్రదర్శించుచుండెడివారు

భరతార్ణవ శాస్త్రకారుడు నందికేశుడు, నాట్యశాస్త్ర రచయిత భరతుడు-వీరికి ముందున్న ఈ నాట్యములు 'దేశి' సంప్రదాయానుసారముగా ప్రదర్శింపబడి యుండును, ఈ మహాపురుషులు వెలసి నాట్యశాస్త్రములు కల్పించినపిదప ఈ ఆట క్రమము పూర్తిగా శాస్త్రీయ పద్ధతిలోనికి మారి యుండును

తరువాత కొంత కాలమునకు దేశములో రుద్రుని ఆరాధనము ప్రముఖస్థానము వహించినది ప్రజలు దేవతలకు ఆలయములను కట్టింప నారంభించిరి ఆరాధన విధానములో గూడా కొన్ని మార్పులు జరిగినవి ఆలయములలో పూజా విధానము ఒక క్రమ పద్ధతిలో జరుపబడుచు వచ్చినది దాని ననుసరించి ఆరాధన విద్యలో నూతనాంశములు చేర్చబడినవి షోడశోపచారములు ఆరాధనములో ఒక భాగ మయ్యెను అందు కనుకూలముగా నృత్తవిద్య గూడ వృద్ధిచెందెను ఈ విధముగా ఉదయమున మేల్కొనుట మొదలుకొని రాత్రి పవ్వళింపు సేవవరకు నృత్తము ఆలయపూజలో ఒకభాగ మైనది వినాయకునకు, శివునకు, విష్ణువునకు, మహాసేనునకు, అయా దేవేరులకు ఆలయ నిర్మాణములలో స్థానము లభించెను-ఆయా దేవతల ప్రీతికొరకు ప్రత్యేక నృత్యములు కూర్చబడినవి ఈ నృత్యరీతులతోపాటు అతి ప్రాచీనమైన నృత్తములు చేర్చబడి ఆడుట ఆరంభింప బడినవి

ఉదా శివాలయములో హారతి ముగిసినపిదప నృత్య పూజలో గణపతికవుతము నాడిన తరువాత-పంచభూత ఆరాధన నర్తనమనుపేర ఐదు జతులను ముఖ్యముగా ఆడుదురు ఈ ఐదు జతులు అతి ప్రాచీనములైనవి పృథ్విని, అప్పును, తేజస్సును, వాయువును, ఆకాశమును పూజించుచు ప్రదర్శించిన నృత్తవిశేషములే ఆ జతులు ఆ జతులయందలి శబ్దోచ్చారణముల తీరు, ఛందస్సు, ప్రాచీనములు, విశిష్టములు మాత్రాఛందస్సులో గతి యతి విన్యాసాలతో కూర్చబడిన జతి విశేషాలే ఈ ఐదు ప్రత్యేక నర్తనములు ఇట్టివే అష్టదిక్పాలుర ఆరాధనమున ప్రదర్శింపబడు నర్తనములు ఈ అన్ని జతులకును నృత్తప్రదర్శనము మాత్రమే ఈ నృత్తములు అపూర్వ తాళములందు కూర్చబడినవి ఇవి సామాన్యముగా ప్రదర్శించు వినోద నర్తనరీతికి చెందినట్టివిగావు కవుతము అను ప్రత్యేక రచనలు దేవళములందు అధిష్ఠాన దేవతల సాన్నిధ్యములో ప్రదర్శింపబడును. ఈ నర్తనములు ఆయాదేవతలకు చెందిన తాళములలో నుండును

ఉదా వినాయక కవుతము-72 అక్షరములు 'వినాయక తాళము'లో కూర్చబడి యుండును అట్లే శివకవుతము 11 అక్షరముల రుద్రతాళములో కూర్చబడి యుండును

దేవికవుతము ౮ అక్షరముల శక్తితాళముతో కూర్చబడి యుండును ఆ తాళసంజ్ఞల (గురువు, లఘువు, ప్లుతము, ఇత్యాది విభాగములు) ననుసరించి నృత్తము ప్రదర్శితమగును కవుతములో మృదంగ జతులును ఆయా దేవతలపై స్తోత్రగీతములును మిళితమై యుండును అయినను స్తోత్రమునకు నృత్యము గాక శుద్ధనృత్యము ప్రదర్శింపబడును

ఉదా తక్కిట కిటతక-ధిక్కిటకిటతక

తాండవ వినోద—

ధిక్కిట కిటతక-దరికిటకిటతక

త్రిశూల డమరు

ధిమి ధిమి తదిమిత

త్రినేత్రశంకర త్రిపురసంహార

ధిగ్గుడు ధిగ్గుడు ధిగ్గుడు తాం

నందివాహన నాగభూషణ

ఈరచన ఆలయములో కవుతముగా ప్రదర్శింపబడినప్పుడు పూర్తిగా మృదంగ శబ్దములకు, సాహిత్యమునకు నృత్తవిన్యాస ముండును ఇతరవేళల కేళికగా ప్రదర్శించినప్పుడు జతులకు నృత్తమును, "తాండవవినోద" అను సాహిత్యము వచ్చినప్పుడు తాండవ భంగిమలును ప్రదర్శింపబడును

ఆలయములో ప్రదర్శింపబడు మరియొక ప్రాచీన నృత్తము "అడ్డిత" దారేవిన్యాసము, నర్తకి, చూర్ణికను పఠించి పుష్పాంజలి సమర్పించిన తరువాత ప్రదర్శింపబడు నర్తనమిది ౫ అక్షరముల రెండు విభాగములు (౨+౩) సమ విషమగతులతో కూడిన తాళగతిలో కూర్చబడి ప్రదర్శితమగును సృష్టిలో సమగతి విషమగతి అను ఈ రెండు గతులను మించి వేరులేవు ఈ రెండింటి చేరికవలన వివిధగతులు, జాతులు, ఏర్పడుచున్నవి అందువలన ఈ రెండుగతులను ఏర్పరచిన ౫ అక్షరముల గతిలో ఈ అడ్డిత నృత్తము ప్రదర్శింపబడును ఈ నర్తనము సమస్థానకములో నిల్చిన నర్తకి యొక్క "సూలూ" విన్యాసముతో ప్రారంభింపబడును ఇటుపై ఇరుప్రక్కలకు భూచారి, ఆకాశచారి, పాదవిన్యా

సములు, హస్తరేచకములు, వివిధదృష్టి భేదములు ప్రదర్శింప బడినపిదప నర్తనము ముగించబడును ఈ ముగింపు 'మొహర'—అనబడును

ఈ నర్తనము 'తాం తాతై తాతై జగదత్తాం
తోదిగిదాం - తోదిగిదందందాం
దాం దం దం - దందందాం'—ఈ విధమైన

మృదంగ శబ్దములతో కూర్చబడి యుండును పంచభూత జతులు, అష్టదిక్పాలుర ప్రీతికొరకై ఆడబడు జతులు ఆయా శబ్దముల విశిష్టత తెల్పుటకుగాను క్రింద కొన్ని ఉదాహరణ ములు : ఇట్టి శబ్దజాలము మరియే నృత్యరీతిలోను ఉండదు ఇది స్వరపద్ధతిలో పఠించిన, వేదములు పల్లించినరీతిగా నుండును

ఉ పంచభూత జతులనుండి

(1) దోఒహం - దొద్దోహం
ధోంగిట కిటతక - దొద్దోంత కిటతక
. .
. .

(2) ఆఒహోంఒఒ - ఆఒహోంఒఒ
ధ్యేయం ధ్యేయం - దేఒఒహం

(3) ఝం - కిణకణ కణ కణ
రింఖణ రింఖణ రింఖణ

అష్టదిక్పాలురు

అగ్నిజతి — జం జం జం జం
రింఖణ రింఖణ ఖణ ఖణ ఖణ ఖణ
. . . .

వాయుజతి — రింఝు రింఝు రిర్రింఝు రిరి
రిరింఝు రింఝురి రిరిరిం
రింఖణ . ...... ..

వరుణజతి — రేహు రేహురే హురే రేహురే
రేహురె హురె రేహురే
హురే రేహురే . . .

ఈశానజతి — శివపంచముఖ శబ్దాలనుండి
ధళాంగ్ ధళ ధళధళ త్లాంగ్
నగి నగి ననగి - ననగి ననగి నగి
ఖరితు ఖరితు సరి - ధోంగిన ధోంగిన
నఝోం ఝోంత ఝం

ఇత్యాది జతులకు ఆటక్రమ ముండును—ఈవిధమైన శబ్దజాలము వినోద నర్తనములం దుండదు ఈ శబ్దములను పలికించుటకూడ ఒక ప్రత్యేక సాధనము మరియు ఈ జతు లన్నియు తాళఛందస్సు ననుసరించి కూర్చబడును ఆయా దేవతలకు సంబంధించిన బీజాక్షరముల స్వరూపము ఈ జతు లందు ఇమిడ్చి జతి కూర్చబడి యుండును ఇది ఒకవిధముగా ఆగమశాస్త్ర, మంత్రశాస్త్రములకు సంబంధించిన విద్యా రీతిగా పేర్కొనవచ్చును ఈ నర్తనముల యొక్క ప్రాచీ నతను తెల్పుట కష్టమైనను, భారతీయ శిల్పులు, దేవతలకు ఆలయములు కట్టునాటికే ఇవి విశిష్టనర్తనములుగా అభివృద్ధి చెందినట్లు చెప్పవచ్చును ఈ నాట్యరీతి ఉత్తర హిందూ స్థానములో ప్రస్తుత కాలములో కనిపించదు ఆంధ్ర, తమిళ, కర్ణాట, ఓఢ్ర దేశములలో కొందరు మాత్రము ఇది తెలిసినవా రున్నారు

ఈ నర్తనములుగాక ప్రాచీన కాలములో విరివిగా ప్రచారమందుండి ప్రస్తుత కాలములో మరుగుపడు చున్న నాట్యములు కొన్ని యున్నవి అవియే సప్తతాండవములు అవి శివుడు ప్రదర్శించిన 'ఆనంద తాండవము, సంధ్యా తాండవము, కలికతాండవము ఇత్యాదులు కావు ఈ సప్త తాండవములలో "తాండవ"మను శబ్దము నృత్తమునకు పర్యాయ పదముగా వాడబడినది శుద్ధ, దేశి, పేరిణి, ప్రేంఖణ, దండిక, కలశ, కుండలి అను ఈ ఏడు నర్తనములు శివుడు ప్రదర్శించిన ప్రత్యేక నర్తనములు ఇవన్నియు అపూర్వ తాళములందు ప్రదర్శింపబడిన స్థానిక, కరణ, చారి, గతి విన్యాసములు ఇవియును శుద్ధనర్తనపద్ధతికి చెందినట్టివే ఈ నృత్తములను గూర్చిన వివరములు భరతార్ణవములో పూర్తిగా చర్చింపబడినవి అట్లే పార్వతి కొన్ని లాస్యములు ప్రదర్శించినది వాటిని "దేశినీ" లాస్యము లందురు అవి యును కోమలమైన కరణజతి విన్యాసములు గల్గిన నర్తన ములుమాత్రమే

కౌరంగి నర్తనము దీనిని వసంతోత్సవమునందలి వేడుక నర్తనరీతిగా పేర్కొనవచ్చును వసంత పంచమినాడు అనంగునిపూజించి నృత్యము, గానము అను వేడుకలు చేసెడి వారు ఈనర్తనములో అన్నియును ౯ విధములుగానుడుంను మామిడి తోటలో విరియబూచిన మామిడి మ్రానువద్ద గోమ యముతో శుభ్రపరచి ౯ రకముల (రంగులు) మ్రుగ్గులు

పెట్టుదురు 5 రకముల ఫలములు, 5 రకముల సువాసన ద్రవ్యములు అర్పించి 5 రాగములతో, 5 తాళములతో 5 గతులలో, 5 జతులతో 5 గురు యువతులు, 5 గురు యువకులు నర్తనమాడుదురు ఇందు ముఖ్యముగా రతితాళము, రతిలీల, మదనతాళములు - వాడబడును రతీమన్మథులుగా అలంకరించుకొనిన కళాకారులతో పాటు ఆనాడు ఉత్సవములో పాల్గొనువా రందరు పసుపుపచ్చని వస్త్రములు ధరింతురు ఈ నర్తనము ప్రాచీన కాలములో రాజవంశముల వారు జరుపుకొను వసంతపు వేడుకలకు సంబంధించినట్టిది

కర్మనృత్యము ధర్తిమాతను పూజించునపుడు చేయబడు అతి ప్రాచీనమైన నర్తనము "కర్మ" ఇది ఆటవికులచే నేటికిని చేయబడుచున్నది పంటలకాలములో ముందుగా భూదేవతను పూజించి పిదప భూమిని దున్నుదురు పూచిన "ఇప్ప"చెట్టు కొమ్మనొకదానిని అరణ్యమునుండి నృత్యగానములతో గొనివచ్చి ఊరనున్న మందిరమువద్ద నాటి దానిని పూజించి నృత్యపు వేడుకలు చేయుదురు అప్పుడే పొలముల వద్దకు పోయి భూమాతను పూజింతురు ఈ పూజలందు ప్రదర్శించు నర్తనమునకు ప్రత్యేక తాళగతులు, రాగములు ఉన్నవి

మత్తలి నర్తనము ఇది ముస్లిం సంప్రదాయమునకు చెందిన వినోద నర్తనము ఇది మొగలు చక్రవర్తుల, నవాబుల ఆస్థానములందు ప్రదర్శింపబడెడిది ఈ నర్తనమును గురించిన కొన్ని వివరములు ప్రాచీనగ్రంథములం దున్నను ఇది పూర్తిగా మరుగుపడిన నర్తనరీతి అని పేర్కొన వచ్చును ప్రస్తుత కాలములో "కథక్" అను పేరుతో ఉత్తర హిందూస్థానములో ప్రచారములో నున్న శాస్త్రీయ నృత్యములో కొన్ని విన్యాసములు ఆరీతికి చెందినట్టివి ఉన్నను పూర్తిగా అది మత్తలి నర్తనము కాదు

ధ్రువపద నర్తనము దీనినే ప్రస్తుతకాలములో 'దరువు' అను పేరుతో భాగవతనాట్యమేళములవారు ఆడుచున్నారు ధ్రువములు కల్గి అనేకరీతుల ఒక భావమునుగాని, తాళమును గాని విన్యాసముచేయుటకు అనుకూలముగా ఉండునట్టి రచనయే ధ్రువపదము ధ్రువములనగా అనేకరీతుల విన్యాసము చేయుటకు అనువైన పదజాలముల కూర్పు ఈ ధ్రువపద వాద్యరీతి, పాటబాణి ప్రస్తుతకాలములో ఆంధ్రలో తూర్పు తీరమున భాగవతులవద్ద నిల్చియున్నది

మేళ ప్రాప్తి శివుని పంచముఖ తాళములని 5 తాళము లున్నవి అవి చాచాత్పుట, చచ్చత్పుట, సంపక్వేష్టక, ఉద్ఘట్టిత పుత్రిక, ఉద్ఘట్ట అనునవి ఈ ఐదు తాళములందు ఆటనిధానము మేళప్రాప్తి ఇది ప్రదర్శన ప్రారంభములో చేయు పూజానర్తనములో ఒకభాగముగా నుండెడిది ఇందే "అయిత్త"మను మరొక నర్తనము కూడా ప్రదర్శింపబడును మాటలు స్వరములు, జతులు లేకుండ ఒకరాగమును ఆలాపపద్ధతిలో ఒకతాళములో పాడుచు, దానికి ఆట ప్రదర్శించుట 'అయిత్తము'

యతి నర్తనము డమరుక యతి, మృదంగయతి, గోపుచ్ఛయతి త్రిశూలయతి - అని ఇట్లు యతు లెన్నియో రకములుగా నున్నవి ఆయాస్వరూపములో, జతులు కూర్చి, నర్తనమాడబడును ఇది శుద్ధనృత్తమునకు చెందినట్టిది ఇందు కరణ, రేచక, చారి, - ఇత్యాది విన్యాసములుండును ప్రస్తుత కాలములో 'భరతనాట్య' మను పేరుతో ప్రచారములోనున్న నాట్యములోని "జతిస్వరము" కొంతవరకు యతి నర్తనమును పోలియుండును యతివిన్యాసము - ఉదాహరణము "డమరుకయతి"

ఝంతరి కిటతక - ఝగణగ దికితక
జేకణ ణక ణక ణక దికి
తరికిట తక ఝణు
తదిమిత దిమి
తదిమీ
ధీకిట
ధిమికిట తక
ధికి తక తకణక
తకజణు దికితక తహతది
ధిమికిట ధిమికిట ధీంకు నాంగు తక తోం

ఈవిధముగా జతులు ఆయాస్వరూపాలలో కూర్చబడి నర్తనమాడబడును అది చూడ ముచ్చటగా నుండును కాని, ఈ ఆటతీరు అరుదైనది శివతాండవకేళికయందు అచ్చటచ్చట ఇది గాంచనగును

ప్రాచీన "పేరణి" విన్యాసము - ప్రస్తుతకాలములో ప్రచారములోనున్న (భరతనాట్యమను పేరుతో) కేళికా నర్తనము 'పేరణి' నర్తనము ఇందు 5 భాగములు (1)ఘర్షరము (2) విషమము (3) భావాశ్రయము (4) కవిచారకము

(5) గీతము

ఈఐదు విభాగములయొక్క ఆటక్రమమును జతుల విన్యాసరీతిని విపులముగా పరిశోధించినచో - దీనికిని నేటి కాలములో ఆడబడు భరత నాట్యప్రదర్శన పద్ధతికిని చాలా దగ్గర సంబంధ మున్నదని తెలియును ప్రాచీన పేరణిక్రమము నుండియే ఈ శైలిక్రమము రూపొందినట్లు చెప్పవచ్చును పేరణి క్రమము నృత్తముతో ప్రారంభమై నృత్యముతో, అభినయముతో ముగియు చున్నది

ఘర్ఘరము, విషమము అను ఈరెండు భాగములందు నర్తకి నృత్తము ప్రదర్శించును

భావాశ్రయము, విహారము-వీటియందునృత్యము ప్రదర్శితమగును

గీతములో అభినయ ముండును ఈరీతినే అలరింపు, జతిస్వరము, శబ్దము, వర్ణము, అభినయము అను ఐదు విభాగములు భరతనాట్యశైలిలో నున్నవి అలరింపులో, జతిస్వరములో నృత్తము ప్రదర్శితమగును శబ్దములో వర్ణములో నృత్యము ముఖ్యము అభినయములో వివిధ రసముల సంచారుల, నాయికల, ప్రదర్శనములు కలవు దానికనువైనట్టి రచనలు శ్లోకములు, పదములు, జావళీలు ఉపయోగించబడును

* * * *

కాలానుగుణముగా ఆటక్రమములో (జతులు, గతులు, గీతములు మొదలైనవి) కొద్ది మార్పులున్నను ప్రాచీన పద్ధతిలో (పేరణి క్రమములో) భరతనాట్యశైలి నూతన మెరుగులతో రూపొందినట్లు చెప్పవచ్చును

[ప్రస్తుత కాలములో మిగిలిన ప్రాచీన నర్తనరీతి, ఆలయ సంప్రదాయ మొక్కటియే]

అగ్న్యారాధన నృత్తము వీరుల కొలుపులో ముఖ్యముగా ఈ నర్తనము చేయబడును భారతదేశమంతటను ఈ నర్తన మున్నది ముఖ్యముగా ఆటవికజాతులందు విశేషించి ఈ నృత్యము విరివిగా వ్యాపించియున్నది మండుచున్న నిప్పు అను మూకుళ్లలో వేసికొని వాటిని రెండుచేతులతో పట్టుకొని నర్తనమాడుదురు కొందరు దేవతాస్తోత్రగీతములను పాడుచుందురు ఈ నాట్యము ముఖ్యముగా దేవుళ్ళనములలోను, వీరుల పూజయందును నేటికిని చేయబడుచున్నది

మణిపురము, బలిద్వీపము, మొదలైన ప్రాంతములలో ఒకప్రత్యేక నర్తనరీతి యున్నది ఆలయములకు చెందిన పూజకులు దేవదాసీలు ఒక క్రమపద్ధతిలో నాట్యమాడి, భగవదావేశమును పొందుదురు అటుపై వారు రాబోవు విషయముల భవిష్యత్తును గూర్చి గూడ తెల్పుదురు, వీరినే మణిపురప్రాంతములో "మైబీ" లనియు, బలిద్వీపములో 'సాంగ్ యాంగ్' నర్తకినులనియు అందురు ప్రాచీనగ్రీసుదేశములోని 'ఒరకిల్స్' ఈ తరగతికి చెందినట్టివారై యుండవచ్చును మైబీనర్తనము అతిప్రాచీనమైనట్టిది దాని తరువాత వ్యాప్తిలోనికివచ్చినట్టివే "లయహరోబా" (శైవనర్తనరీతి) మహారాస, రాసలీల (వైష్ణవరీతి) నృత్యములు జపానుదేశపు మారుమూల ప్రదేశములలోని బౌద్ధ ఆరామములలో నేటికిని కొన్ని నృత్యములు చేయబడుచున్నవి బుద్ధదేవునికి ఆరగింపువేళలో నర్తకినులు నృత్యగానోత్సవము చేయుదురు ఈరీతిని పరిశోధించినచో ప్రాచీనకాలములో (బౌద్ధులకాలములో) భారతావనిలో ప్రచారములోనున్న నాట్యకళారీతినిగూర్చి విశదమగును ఆ ప్రాంతములో నేటికిని నర్తకులు ఆ ప్రాచీన నాట్యములను ప్రదర్శించు చున్నారు ఈ నాట్యములుగూడ నృత్తరీతికి చెందినట్టివే

న రా

## ప్రాచీన భారతయుద్ధతంత్రము

ప్రాచీన భారతయుద్ధతంత్ర వృత్తాంతము వేదకాలము నుండి ఆరంభమై, రాజకీయరంగమున మహామ్మదీయులు

చిత్రము 72



ప్రాచీన భారతయుద్ధతంత్రము

ప్రవేశించు వరకును. పిదప విజయనగర సామ్రాజ్య స్వర్ణ యుగము వరకును విస్తరించియున్నది మానవుని మనస్సునందు యుద్ధవాంఛ సహజమైనది మానవనాగరికత ఉదయించిననాటినుండి, విద్యాసంస్కృతులు యుద్ధవాంఛను జయింప యత్నించి విఫలములైనవి సత్య న్యాయములు మానవప్రోక్తములని మనుజుడు బహుకాలముగా వచించుచు వచ్చుచున్నాడు శాంతికాముకుడైన వ్యక్తి ఎల్లప్పుడు యుద్ధసన్నద్ధుడై గూడ ఉండవలెనని ఆత డెరిగిన విషయమే విజ్ఞాన శాస్త్ర ప్రగతిగల ఆధునికయుగమందు జ్ఞానము విస్తృతమును గంభీరమును అగుటతో యుద్ధసాధనములు యుద్ధాయుధములు, అత్యంత శీఘ్రపరివర్తనమునొందెను విశేష హానికరములును, లక్ష్యసిద్ధియందమోఘములునై పరిణమించినవి

ప్రాచీనభారతమున యుద్ధశాస్త్రమును గూర్చిన పరిజ్ఞానము సంపూర్ణముగ నుండియుండెను ప్రాచీనభారతీయులు, తమ కుశాగ్రబుద్ధి గ్రహింపగల్గునంతవరకు, శక్తిమంతమైన తమ భావనాపటిమ ప్రసరింపగల్గునంతవరకు, అక్షయ్యమైన తమ చాతుర్యమును అనుసంధింపగల్గునంతవరకు, యుద్ధతత్త్వమును విజ్ఞాత మొనర్చుకొనిరి శత్రువును అశక్తు నొనర్చుట, అతనిని సాధనరహితునిగను, సహకారవిరహితునిగను చేయుట, అతనిని, అతనికి ప్రియమైన దెల్లను నాశ మొనర్చుట — యుద్ధమువలని ముఖ్యప్రయోజనములు కాని నేటికాలమున యుద్ధయంత్రములు, అతిమాత్రముగా నాశనకారులయినవి నైతిక శాస్త్రీయ ప్రాముఖ్యముగల కొన్ని నియమము లీకాలమున ఏర్పరచబడినవి విషవాయువులు, జీవాణువులు ప్రయోగింపబడు యుద్ధపద్ధతులు నిషేధింపబడినవి హిందూ, క్రైస్తవ దేవాలయములు, వైద్యశాలలు, పాఠశాలలు, పుస్తకభాండాగారములు, చారిత్రక స్మారకచిహ్నములు శత్రుదాడులకు గురికాకుండ నిషిద్ధములైనవి వేదకాలమునుండి ప్రాచీన భారతీయులు అపర్యాప్తముగ నాగరకులై యుండుటచే, అట్టినిషేధవిధుల ప్రాముఖ్యమును గ్రహింపగల్గిరి ధర్మశాస్త్రములందు, మహాభారతమందలి శాంతిపర్వమునందు ఈ నిషిద్ధవిధుల ప్రసక్తి గలదు

వర్ణవ్యవస్థలో క్షత్రియులకు సాంగ్రామిక శాస్త్రాభ్యాస మొక కర్తవ్యముగా విధింపబడినది అయితే ఒకప్పుడు ద్రోణాచార్యుడు, కృపాచార్యుడు, అశ్వత్థామవంటి బ్రాహ్మణులు మహాయోధులై వరలుటయేకాక బ్రహ్మాండమైన సేనానివహకులకు సర్వసేనాపతులుగ గూడ ప్రకాశించిరి క్షత్రియులు 22 సంవత్సరముల వయస్సునకే ఉత్తమయోధులుగ భాసిల్లిరి షోడశాబ్దముల వయఃపరిమితికే వారు యుద్ధకళయందు అత్యంత నిష్ణాతులైరి విశ్వామిత్రమహర్షి, తానొనర్చు యాగసంరక్షణార్థమై, దశరథునినుండి రామలక్ష్మణుల సాయ మర్థించెను రామలక్ష్మణు లిరువురు, ఆ సమయమున, పదునారు వత్సరముల ప్రాయముగలవారు మహాభారతసంగ్రామమున పాల్గొనిన అభిమన్యుడు కూడ పదునారు వత్సరముల వయస్సును మించినవాడు కాడు

యుద్ధములు పలుతెరగులుగా వర్గీకరింపబడినవి న్యాయమైన కారణములను పురస్కరించుకొని భావింపబడినది ఒక 'ధర్మయుద్ధము' మాత్రమే కూటయుద్ధము, మంత్రయుద్ధము, అసురయుద్ధమువంటి యుద్ధభేదములలో స్వార్థపరతయు, లోభమును, కారణములై యుండెను ముఖ్యముగా, ధర్మయుద్ధము, లేక, ప్రకాశయుద్ధమునందుమాత్రమే నైతికవిధులు పాటింపబడినవి ఇతరయుద్ధభేదములలో అట్టి ఉత్తమవిధులు ఉల్లంఘింపబడెను శత్రువును వంచించి, యుద్ధతంత్రమున అతనిని కలవరపెట్టుటకై ఇంద్రజాలమును, అభిచారమును, వశీకరణక్రియలును దానవులచే ప్రయోగింపబడినవి

శత్రువులను పరాజితుల నొనర్చి, మర్దింపదగిన యుద్ధమునందుకూడ ప్రాచీన భారతీయులు వివేకమును, అనుకంపను, ఆదరమును చూపగల్గియుండుట ప్రశంసాపాత్రమైన విషయము రాజదూతద్వారా రాయబారమును నడిపి, యుద్ధచర్య ఆరంభమగుటకు గల కారణ సామంజస్యమును గూర్చి శత్రువర్గమునకు ప్రత్యయమును పుట్టించునరకు, సాధారణముగా, ధర్మయుద్ధము ఆరంభము చేయబడెడిది కాదు రాజదూత పవిత్రుడుగ భావింపబడెను, అతని కెట్టి హానియు జరుపబడకుండెడిది దూతకు జరిగిన అవమానము, అపకృతి, వాటిని భావించినపక్షమునే ద్విగుణీకృతముగా బెడిసికొట్టునని భావింపబడెను రామాయణమునందు హనుమంతుడు సీతావృత్తాంతమును ఎరుకపరచిన పిదప, అంగదుడు రావణునిచెంతకు దూతగా పంపబడెను అంగదునకు ప్రహితుడనియు, ఆంజనేయునకు దూత యనియు వ్యవహారము, మహాభారత యుద్ధమందును శ్రీకృష్ణుడు రాయబారిగా వర్తించెను

ధర్మయుద్ధ మొకయాగముగా భావింపబడెను యుద్ధారంభమునకై శుభదినము నిర్ణయింపబడెను విస్తృతమైన మతానుష్ఠానములు కావింపబడెను కావుననే యుద్ధరంగమున ఎకవచుడై, సాయుధుడై, ధానుష్కుడై, సశరుడై, శిరస్త్రాణయుతుడై, యథాశక్తి యుద్ధమొనర్చుచు మరణించిన యోధునకు వీరస్వర్గమునందు సముచితస్థానము నిశ్చితమైనది

యోధులు సంగ్రామమందు, మనముకనిడుకొనదగిన కొన్ని నైతిక నియమములు దిగువ విస్తరింపబడినవి కయ్యమునకు కడగిన ఇరువురు యోధులు సర్వదా సములై ఉండవలయును అశ్వికునకు అశ్వికునితోను రథికి రథితోను పోరు పొసగును విరోధి ధరించిన శస్త్రకవచములను పరిశీలించి, ఇరుపక్షముల పోటియందు తుల్యత్వము గోచరించినపుడే యుద్ధమునారంభింపవలెను విషప్రయుక్తములైన శస్త్రాశరములను ఉపయోగింపరాదు యుద్ధమొనర్చునపుడు యోధుడు అతిక్రుద్ధుడై యుండగూడదు వృద్ధులతో, బాలురతో, స్త్రీలతో పోరాడగూడదు గడ్డిపరకను నోట కరచుకొనివచ్చు శరణాగతుని, శిబిర పరిజనమును, శాంతికాముకులగు పౌరులను, బ్రాహ్మణులను, గోవులను చంపుట తగదు నిద్రాగతుడైన వ్యక్తిపైనను, దాహముగొనినవానిపైనను యోధుడు పడకూడదు

యుద్ధాచరణ సందర్భమున తుల్య సంఖ్యాబలములు చేకూరుటకు అవకాశము లేనపుడు, ప్రత్యామ్నాయ సాధనములను సమకూర్చుకొనుటకు ఒకపట్టిక సిద్ధపరుపబడియుండెను ఒక ఏనుగును అయిదుగురు అశ్వికులుకాని, పదునేనుగురు పదాతులుగాని, నాలుగు గుఱ్ఱములుగాని మాత్రమే ప్రతిఘటింపవలెను ఒకఅశ్వికుని ముగ్గురు పదాతులు, ముగ్గురు అశ్వికులను ఒకఏనుగు ఎదుర్కొనవలెను వ్యవసాయవృత్తి నాశ్రయించిన శ్రామికుల శాంతియుత జీవనమునకు భంగము కల్పింపగూడదు సస్యసంపూర్ణములైన క్షేత్రములను, పుష్పఫలోద్యానములను, దేవాలయములను, పూజాస్థానములను స్పృశింపకూడదు ఇట్టి సాంగ్రామిక నియమానుష్ఠానమును కాంచిన మెగస్తనీసు (క్రీ. పూ 4 వ శతాబ్ది) అను వైదేశికుడు విస్మిత చకితుడయ్యెనట!

యుద్ధములో బందీలుగా పట్టుబడినవారందరు ఔదార్యముతో ఉపచరింపబడిరి స్త్రీలు యుద్ధమున పట్టుబడినచో, వారిలో అవివాహితలు తదర్థమై వరింపబడిన పురుషులను వివాహమాడునట్లు అనుజ్ఞాతలయిరి లేదా, వారు బహుమానములతో వారి తలిదండ్రుల యొద్దకు పంపబడిరి కృష్ణదేవరాయలు (16 వ శతాబ్ది) గజపతిదేవుని భార్యను సగౌరవముగా ఆమెభర్తవద్దకు రక్షకవర్గముతో పంపియుండెనని చెప్పబడినది, ఒకశతాబ్ది పిదప, లావణ్యవతియగు కల్యాణపురపు సుబేదారుని కోడలి విషయమునగూడ, శివాజీ మహారాజుకూడ అట్టి ఔదార్యమునే ప్రదర్శించెనట!

ఒకరాజ్యమును జయించినపిదప పరాజితుడైన రాజు కాని, ఆతని కుమారుడు కాని ఆరాజ్యముననే పునర్నియుక్తుడయ్యెనట! జయింపబడిన దేశములో ప్రవృత్తియందున్న ఆచారములకును, సంప్రదాయములకును, కర్మకాండకును, ఎట్టి భంగము కావింపబడలేదు బందీలుగా గ్రహింపబడిన రాజులయెడ అనుష్ఠింపబడిన విధానము, అలహాబాదు వద్దగల సముద్రగుప్తుని స్తంభశాసనమున వివరింపబడినది బందీలైన దక్షిణాపథాధీశులు విముక్తులై, స్వస్థానములందు పునర్నియుక్తులైనట్లును, ఆటవికులకు ఉద్యోగప్రాప్తి కల్గినట్లును ఉదాహరణములు గలవు

క్షతగాత్రులై బందీలుగా గ్రహింపబడిన యోధులు మిక్కిలి జాగరూకతతో ఉపచరింపబడి, సంరక్షింపబడిరి ప్రత్యేక పరిస్థితులలో వారు గృహముల కేగుటకుగూడ అనుజ్ఞాతులైరి నక్కీరార్ అను ద్రవిడదేశపు సంగమ మహాకవి, రెండవ నెడూన్ జెలియమ్ అను ప్రభువు యొక్క సానుకంప స్వభావమును వర్ణించెను అననుకూలమైన వాతావరణ పారుష్యమును సరకుసేయక అర్ధరాత్రమున ఆతడు, క్షతగాత్రులై తనపక్షము వారిచే చికిత్స చేయబడుచున్న పరపక్ష సైనికులవద్దకుపోయి, వారి యోగక్షేమములను విచారించెడివాడు న్యాయసంగ్రామములలో శత్రువులను పగటివేళ శత్రువులుగను, రాత్రివేళ మిత్రులుగను భావించుట సాధారణమైన నీతియైయుండెను మహాభారతయుద్ధమున సూర్యాస్తమయమగుసరికి యుద్ధవిరమణము జరగెడిది పగశిబిరములోనివారిని కలిసికొని వారితో యోధులు స్నేహముతో మెలగుచుండిరి భగవంతుని ఆశీర్వచనమును పొందుటకై ఆయోత్సవములు జరుపబడెడివి బ్రాహ్మణులకును, బీదలకును సంతర్పణములు జరిపి, వారికి దక్షిణ లొసగబడెడివి యుద్ధమందు పట్టుబడిన ఆస్తిని రాజు అపహరింపక, అట్టిచరాస్తిలో ఆరవవంతుమాత్రము ఉంచుకొని, శేషించినదానిని సిపాయీ

లకు పంచిపెట్టించుచుండెడివాడు

జైనులు బౌద్ధులుకూడ అట్టి ఉత్తమవిధులను సమర్థించిరి హేమచంద్రుడు రచించిన లఘ్వర్హనీతిసారమందును, సోమదేవుని నీతివాక్యామృతమందును, ఈనైతిక సంహిత తుల్యభావసరణిలో నిరూపింపబడినది ధర్మయుద్ధమున శత్రువు ఉత్తమ నీత్యాదర్శములు కలవాడైనచో, అట్టినియమాచరణము ప్రశంసింపదగినదే కాని, శత్రువు అవినీతిపరుడును, లోభియు, స్వార్థపరుడును అయినచో, సద్వర్తనము గల విరోధి కూడ మాతని అవినీతికి గురికాగలదు వైదేశికాగమన కాలమున భారతదేశము అట్టివిషాదాంత విపర్యయముల ననుభవించినది

భారతసేన సాధారణముగా చతురంగసేనయని వ్యవహరింపబడినది అనగా, అది ఏనుగులు, రథములు అశ్వములు పదాతులను చతుర్విధములైన అంగములతో సంకలితమైనది నౌకాదళ వ్యవస్థ, వస్తుసంభారవ్యవస్థ అను రెండు శాఖ లుండెను

ప్రాచీన భారతీయులు పెక్కు శస్త్రములను, యుద్ధయంత్రములనుగూడ కల్పించిరి ముక్తములు, అముక్తములు యంత్రముక్తములు అని అవి వర్ణింపబడినవి 1 ముక్తములు చేతితో విసిరివేయబడునవి 2 అముక్తములు చేతిని వదలిపెట్టనివి, అనగా చేతిలో నుంచుకొనబడునవి 3 యంత్రసహాయమునగాని మరియొక ఉపాయముచేగాని ముక్తము లగునవి యంత్రముక్తములు ధనుర్వేదమనునది మానవుడు కనిపెట్టిన ప్రథమ యుద్ధ శస్త్రవిద్య భారతదేశమున దాని వికాసమంతయు ధనుర్వేద మనబడును శాస్త్రీయముగా అనుష్ఠింపబడినపుడు అది అత్యద్భుతకృత్యముల నొనర్చెను ఆధునికములైన బాంబులకును, అగ్నిబాణములకును, ముక్తములకును అది పితృస్థానీయము ధనుస్సులు ఉక్కుతోగాని, కొమ్ముతోగాని, కొయ్యతోగాని చేయబడుచుండెను బాణములు ఉక్కుతోగాని, వెదురుతోగాని నిర్మింపబడుచుండెను వాటికి ఒకప్రక్కన అగ్రములు, రెండవప్రక్కన ఈకలు అమర్పబడియుండును ధనుస్సు త్రాడు స్నాయువుతోగాని, ముంజగడ్డి తంతువులతోగాని, పేనబడెడిది ఆకాలపు తుపాకులు నేటితుపాకులను పోలియుండుననుట సందేహాస్పదము ఋగ్వేదమందు, శత్రువులను జయించుటకు అగ్ని సమర్థమై యుండినట్లు ప్రశంసింపబడినది అథర్వవేదములో సీసపు గుండ్లతో ప్రయుక్తములైన తుపాకులనుగూర్చి పేర్కొనబడినది

శుక్రనీతి సారమందును వసిష్ఠ ధనుర్వేదమందును శతఘ్ని పేర్కొనబడినది దానిని తుపాకి అనునర్థమున గ్రహింపవచ్చుననుట సందేహాస్పదమైన విషయము కాని గుణవిషయమున అది విధ్వంసకశక్తి కలదియై యుండియుండవలెను ముక్తాయుధములు పెక్కు లున్నవి. భిందిపాలము, ద్రుఘణము తోమరము, నాళికము, లగుడము, పాశము, చక్రము దంతకంట, ముసుండి అనునవి చేతపట్టుకొనదగిన అముక్తాయుధములలో గూడ గొప్ప వైవిధ్యము కలదు ఋష్టిసము, కాళాస్యము, పరశువు, గోశీర్షము, అసిధేనువు, లవిత్రము, స్థూణావు, ప్రాసము, పినాకము, గద, ముద్గరము, ముసలము, పరిఘ, మయూఖి అనునవి పేర్కొనదగినవి

అసి లేక కత్తికూడ అనేకరకములు కలది ఉదాహరణ- నిస్త్రింశము విశసనము. ఖడ్గము, తీక్ష్ణధార, దురాసదము, శ్రీగర్భము, విజయము, ధర్మమూలము కత్తుల నిర్మాణ విషయములో వేరువేరు తావులు ప్రసిద్ధములై యున్నవి ఖత్తిలో లేక ఖట్టార్‌లో నిర్మింపబడిన కత్తులు కాంతికిని, శైశికలో తయారుకాబడినవి శత్రువున్మూలన సామర్థ్యమునకును, శూర్పారకలో చేయబడినవి మనుగడకును, అంగవంగదేశములందు చేయబడినవి తైక్ష్ణ్యమునకును ప్రసిద్ధి నొందినవి ఆయుధముల రంగులును భిన్నములై యుండెను కొన్ని ఖడ్గధారలపై గరుడాకారము లేక లింగాకారము ఉత్కీర్ణముగా చెక్కబడి, శుభప్రదములుగా భావింపబడెను అనూపదేశ ప్రాంతములలో నల్లనికత్తులు, శతహరణమున తెల్లని ఇనుపకత్తులు, కళింగదేశమున బంగారువన్నె కత్తులు, కాంభోజదేశమున నిగనిగలాడు ఇనుపకత్తులు, గుజరాతుదేశమున నీలివన్నె కత్తులు, మహారాష్ట్రదేశమున బూదివన్నె కత్తులు, కర్ణాటకదేశమున కొంచెము పాటలవర్ణముగల కత్తులు నిర్మింపబడుచుండెను సంఖ్యాతీతములైన ముక్తకములు ఇంద్రజాలముచేతను, తపస్సుచేతను, విశిష్టములైన ప్రార్థనలచేతను పొందబడుచుండెను అవి ఒండొంటిశక్తిని కుంఠిత మొనర్చునవిగ నుండెను

కవచము, దాని వైవిధ్యము ప్రాచీనవాఙ్మయమున ఉదాహృతములైనవి అవి కొన్ని శిల్పవిన్యాసములందును ప్రతిమాచిత్రణములందును కనబడినవి యోధులు తనుత్రాణ

మును, శిరస్త్రాణమును, భుజత్రాణమును ధరించిరని తెలుపు నిదర్శనములు ఋగ్వేదమున కలవు అవి చర్మముతోను, ఎముకలతోను, లోహములతోను నిర్మితములయ్యెను నాగరికత అభివృద్ధినొందినకొలదియు, కవచములందు అధికతరమైన కాఠిన్యము, అభేద్యతయు పొడసూపెను

**సేనావిభాగములు** పత్తి, సేనాముఖము గుల్మము, గణము, వాహిని పృతన, చమువు, అనీకిని, అక్షౌహిణి అను నవి సేనావిభాగములు అవి నేటి బెటాలియనులు, రెజిమెంటులు, కంపెనీలు మున్నగు వాటికి సమానములై యుండెను అందు పత్తిఅను విభాగము అత్యల్పమైనది పత్తి యను విభాగమునందు ఒక రథము, ఒక ఏనుగు మూడు అశ్వములు ముగ్గురుపదాతులు కలరు పత్తియను విభాగము కంటె మూడురెట్లధికమైనది సేనాముఖమను విభాగము మూడు సేనాముఖములు కలిసినచో ఒక గుల్మ మగును మూడు గుల్మములు చేరినచో ఒక గణ మగును మూడుగణములు కలిసినపుడు ఒక వాహినియగును మూడువాహినుల చేరిక యొక్క పృతనయను సేనావిభాగ మగును మూడు పృతనములుకలిసి ఒక చమువు అగు చున్నది పది అనీకములు ఒక అక్షౌహిణియగును

21,670 రథములు, 21,870 ఏనుగులు, 65,610 అశ్వములు, 1,09,350 పదాతులు కలది ఒక అక్షౌహిణి యన బడినది ఇతర ప్రామాణికుల మతమున అక్షౌహిణియందలి సంఖ్య భిన్నముగ నున్నది ప్రాచీన భారతీయసేనావ్యవస్థ యందు ఒక క్రమము, ఒకపద్ధతి, ఒక ఉద్దేశము ఉండెను

ఒక్కొక్క విభాగమునకు చెందిన ప్రధానపురుషునకు 'పతి' అను వ్యవహార ముండెను ఉదా—చమూపతి, వాహినీపతి మొ॥ తన రథసారథిని, గుర్రములను సేనను రక్షించుకొనుచు శత్రుసేనలను నాశన మొనర్పగల యోధుడు రథి యనబడెను అతడు సాంగ్రామిక శాస్త్రమందు నిపుణుడై యుండవలెను పూర్వోక్తలక్షణములచే లక్షితుడై, ఏకాంగియై, పదివేల సంఖ్యగల ధానుష్కులతో యుద్ధ మొనర్పు శక్తిగల యోధుడు మహారథు డనబడెను ఆతడు రాజును గూడ సంరక్షించు శక్తికలవాడు

అతిరథుడు వీరుడు, అద్వితీయుడు, అసహాయుడై అతడు యోధుల యొక్కయు, అశ్వముల యొక్కయు రథసారథుల యొక్కయు, ఏనుగుల యొక్కయు ఎంత గొప్ప సంఖ్యలోనైనను పోరగల యోధుడు

**వ్యూహములు** చతుర్విధసేనాంగములను, యుద్ధమునందు తంత్రదృష్ట్యా వివిధాకారములలో విన్యాస మొనర్చుటయే వ్యూహము ఉదాహరణమునకు ఒకరాజు ప్రప్రథమమున ఒకనిపై దాడిచేయుట, అట్టితరి, రెండవవాడు ఆత్మరక్షణ మొనర్చుకొనుట—ఈవిధముగా సంఘర్షమునుబట్టి వ్యూహములు భిన్నరీతులుగ నుండును ప్రథమాభిఘాతరూపము నిగ్రహమనియు, ఆత్మరక్షణరూపము ఆసనమనియు, వ్యవహరింపబడినవి రామాయణ యుద్ధమున రాముడు ప్రథమముగ శత్రువుపై పడినవాడు రావణు డట్టితరి ఆత్మరక్షణము కావించుకొనినవాడు వ్యూహరచనలు అనేక అంశములపై ఆధారపడియుండెను యుద్ధము చదునైన మైదానములపై జరుగనున్నదా? లేక కొండప్రదేశమున జరుగనున్నదా? యుద్ధమైదానములు నీటినయములై యున్నవా లేక ఎడారులుగా నున్నవా? యుద్ధభూమి ఎగుడుగా నున్నదా? లేక దిగుడుగా నున్నదా? అనునవి ఈ అంశములు ఉభయపక్షములవారికి అస్త్రములు, ఆయుధములు లభ్యములా, అలభ్యములా అను రెండు విషయములు కూడ ఈ సందర్భమున గమనింపదగియున్నవి

సమతలముగల మైదానమందు దండవ్యూహము రచింపబడును అట్టితావున మండలవ్యూహముకూడ పనికి వచ్చునని చెప్పబడినది భూమి నిమ్నోన్నతముగ నున్నపుడు భోగవ్యూహము రచింపబడును ఇట్టితావులో అసంహత వ్యూహముకూడ పన్నబడును భూతలము విషమముగ నున్నచో, విషమవ్యూహము ఉపదిష్టమైనది కౌటిల్యునివంటి ప్రామాణికులు సమవ్యూహమును, విషమవ్యూహమును, హస్తివ్యూహమును, పత్తివ్యూహమును ప్రశంసించిరి రోమనులు, గ్రీకులు సమచతురరూపముగల దృఢవ్యూహ నిర్మాణములకై పదాతిబలమునే ఉపయోగించిరి భారతీయవ్యూహములలో అశ్వబలము, రథములు, ఏనుగులుకూడ ఉపయోగింపబడినవి

సమవ్యూహములో ప్రతియోధుకు ఎట్టి ఆటంకము లేకుండ సంచరించుటకు వలసిన స్థలముండునట్లు ఆయుధము అన్నియు ఒకేప్రమాణముగల దూరములో ఉంచబడును ముగ్గురు సాయుధభటులు ఒకయుద్ధాశ్వమును ఎదుర్కొనవచ్చును పదునేనుమంది యోధులు లేక అయిదుగుర్రములు ఒకరథమును లేక ఒకఏనుగును ఎదుర్కొనవచ్చును రథ

వ్యూహమునందు 9 రథములు పురోభాగమునందును, 9 రథములు పార్శ్వములందును, పక్షములందును ఉంచబడును హస్తివ్యూహమందును, అశ్వవ్యూహమందును పార్శ్వములందు, పక్షములందు తొమ్మిది తొమ్మిది ఏనుగులు ఏర్పాటు చేయబడును హస్తివ్యూహములలో పురోభాగమునందు యుద్ధగజములును, పక్షములందు ఎక్కుటకు ఉపయోగించు ఏనుగులును ఉంచబడును పత్తి వ్యూహములలో పురోభాగమున సకవచులైన యోధులును, పక్షములందు కవచధారులు కాని యోధులును వెనుకభాగమున ధనుర్ధరులును ఉంచబడుదురు

మండల వ్యూహరచనలో స్వల్పవైవిధ్యము కలదు అందు సర్వతోముఖము, సర్వతోభద్రము, అష్టానీకము, విజయము, కాకపది, అర్ధచంద్రిక అనునవి కొన్నివ్యూహములు

అరిష్టము మున్నగు మరికొన్ని వ్యూహములుకూడ చెప్పబడినవి ఇందు పురోభాగమును రథములు, పక్షములను ఏనుగులు, వెనుకభాగమును అశ్వములు, ఆక్రమించును అచలవ్యూహమునందు పదాతిబలము, అశ్వబలము, రథములు ఒండొంటివెనుక నిలబడును అప్రతిహతమను మరియొక వ్యూహభేదమందు ఏనుగులు, అశ్వములు, రథములు, పదాతులు ఒండొంటివెనుక నిలిచియుండును

ముందునకు పార్శ్వములు త్రోసికొనిపోయినపుడు దండవ్యూహమే ప్రదారవ్యూహమనబడును ఉభయ పార్శ్వములు, పక్షములు ముందునకు పొడిగింపబడినపుడు ఏర్పడు వ్యూహము ద్రోణమనబడును దీనిప్రతిరూపము అసహ్యవ్యూహమనబడును దానిపక్షములు మిక్కిలి దీర్ఘములై యుండును

దండవ్యూహముయొక్క విపరిణామములే సంయోగములే శ్యేనవ్యూహము, చాపవ్యూహము చాపకుక్షి వ్యూహము, ప్రతిష్ఠావ్యూహము, సుప్రతిష్ఠావ్యూహము వైరవ్యూహము, సంజయవ్యూహము, స్థూలకర్ణవ్యూహము, విశాలవ్యూహము, విజయవ్యూహము, చమూముఖ వ్యూహము, ఝషాస్యవ్యూహము అను నామములచే వ్యవహరింపబడుచున్నవి

సర్పసారి గోమూత్రికము అనువ్యూహములు భోగ వ్యూహముయొక్క భేదములు అందు పురఃపార్శ్వములు పక్షములు అసమమైన లోతులుకలవి శకటమను వ్యూహభేదమొకటి కలదు ఇందు పురోభాగమున రెండుపంక్తులుండును దీని పక్షములు దండవ్యూహ పక్షములను పోలియుండును దీనివిపర్యయక్రమమే మకరవ్యూహము దీనికి విరుద్ధమైన పారిపతంతక వ్యూహము, దీనికి విరుద్ధమైన సర్వతోభద్ర వ్యూహము అనునవి భోగవ్యూహము భేదములు

భీష్ముడు, కౌరవుల సర్వసేనాధిపతియై యుండగా, ప్రతిదినము ఒకనూతన వ్యూహమును రచించుచుండెను వాటిలో గరుడవ్యూహము, మకరవ్యూహము, సర్వతోభద్ర వ్యూహము అనునవి కొన్నిమాత్రమే

పాండవులసైన్యము ఏడుఅక్షౌహిణులు కలిగి కౌరవుల సైన్యముకంటె చిన్నదిగా నుండెను కావున వారు తమ తంత్రములను మార్చుకొని సూచీవ్యూహమును, క్రౌంచారుణ వ్యూహమును, శకటవ్యూహమును పన్నుకొనిరి ప్రతివ్యూహ పద్ధతియు, తదుత్పాదక యుగమునకు అనుకూలముగ నున్నట్లు అగ్నిపురాణమందు చెప్పబడిన ఉక్తి కుశలముగనున్నది ఏవ్యక్తియు జాపోహ్యవచార నిష్ఠుడును, స్వార్థపరుడును అయియుండ గూడదు పురోభాగమునుండి ప్రమాదముప్పతిల్లు నున్నపుడు, మకరవ్యూహము, సూచీవ్యూహము ఉపయోగించును వెనుకభాగమునుండి ప్రమాదము ఘటిల్లనున్నపుడు శకటవ్యూహము శ్రేయస్కరము పక్షములనుండి ప్రమాదము శంకింపబడెనేని, వజ్రవ్యూహము ఉపకరించును, అన్ని దిశలనుండి ప్రమాదము వాటిల్లనున్న సమయమున చక్రవ్యూహము ఉపకారకము

సైన్యమందలి ప్రథమ విభాగము రథులకు చెందినది యథార్థమునకు రథములయొక్క శీఘ్రగమనమునకు ఉత్తమమైన రహదారులు ఆవశ్యకములు శ్రీహర్షచక్రవర్తికాలము నాటికే (౭వ శతాబ్ది) రథముల వాడుక పాతబడెను వాటి ప్రసక్తి వేదములందు కలదు ప్రప్రథమమున యోధుడే రథచోదకుడుగ నుండెను అనంతరము ఈ కృత్యములు ప్రత్యేకింపబడినవి రథసారథికి అశ్వములు పూర్తిగా వశమై ఉండవలెను రథ మే దిశకు గమించునో విరోధి కెన్నడును ఎరుకపడకూడదు

వేదకాలమునుండియు గజబలము వాడుకయందుండెను కొండప్రదేశములలో బరువుగల సామానులను మోసికొనిపోవుటయందు ఏనుగు అత్యంతప్రాముఖ్యము వహించినది బలిష్ఠమైన ఏనుగు యుద్ధమున అశ్వికులను, పదాతులను

విరోధింపగలిగెడిది యుద్ధమందు సంపూర్ణముగ గజబలమును ఉపయోగించుకొనవలసి యున్నచో, వాటికి శిక్షణము నొసగవలసి యుండెను ఆశిక్షణము సప్తవిధము

(1) ఉపస్థానము—ఏనుగు ఆవరణములపైగా, ఎత్తయిన ప్రదేశములపైగా ఎగిరి దుముకుట

(2) సంవర్తనము—ఏనుగు ఎగారొప్పి, గుంటలపైగా దుముకుట

(3) సంయానము — సూటిగను, వంకరటింకరగను ప్రయాణించుట

(4) వధావధము—గుర్రములను, పదాతులను కాళ్ళ క్రింది పడవైచి నుగ్గుచేయుట

(5) హస్తియుద్ధము—ఏనుగులు ఒండొంటితో పోరాడుట

(6) నాగరాయణము—కోటపై, భవనములపై ఎగబడి ధ్వంస మొనర్చుట

(7) సాంగ్రామికము—ప్రత్యక్షయుద్ధములలో ఏనుగులు పాల్గొనుట—ఇత్యాదులలో ఏనుగునకు శిక్షణ మావశ్యకము

గజాధ్యక్షు లనెడు ప్రత్యేకాధికారులు వ్యవహరించుచుండిరి వారు గజరోగనిదానచతురులు, గజాహార పరిజ్ఞాతలు అశ్వబలము, పదాతిబలము ముఖ్యమైన సేనాంగములు ఆధునికయుద్ధమునగూడ వాటిప్రాముఖ్య మిట్టిదే గజాశ్వ శిక్షకులు గజాశ్వముల శుభాశుభలక్షణములను తెలిసినవారై యుండిరి ఆశ్వికులు తేలికరై, సునిశితమైన శస్త్రములను ధరించెడివారు పదాతిబలములలో అన్నివర్గముల వారికిని ప్రవేశ ముండెడిది కాని అందులో పారంపర్యముగ విశ్వసనీయులై యుద్ధమొనర్చు 'మౌలికు'లను జాతివారు విశేషసంఖ్యాకులుగనుండిరి వేతనమునుగ్రహించు 'భృతు'లను సైనికులుండిరి 'శ్రేణు'లను సైనికులు మిత్రరాజ్యాధిపతులచే పంపబడినవారు అహోరాత్రములు ఎత్తుప్రదేశముల నుండియు, పరిఖలనుండియు, సమతలములనుండియు పోరాడుటయేకాక, సైన్యనివాసములను నిర్మించుట, సాంగ్రామిక సేవయందు నియుక్తులైన కార్మికులపనులను పర్యవేక్షించుట, కోశాగారమును, ఆయుధాగారమును ఇతర సామగ్రిని పరిరక్షించుట — ఇవి పదాతుల కర్తవ్యములై యుండెను

సైన్యభోజనాదికమును పరికల్పించు గణము వారు చతుర్విధ సేనాంగములకు ఆవశ్యకమైన భోజనసామగ్రిని మోసికొనిపోయెడివారు వారితోపాటు సమృద్ధమైన ఔషధ సామగ్రులతో వైద్యబృందముకూడ పోవుచుండెను ఈ వైద్య గణమందు అనుభవము గడించిన వైద్యశాస్త్రనిపుణులుండిరి ప్రాచీన భారతీయ నౌకాసేనాధిపతిత్వము ఏకరీతిగా పొగడ్తను కాంచియుండెను నౌకానిర్మాతలు, 700 మందికి సరిపోవు నౌకలను నిర్మింపగల్గిరి పగిలిన మరమ్మతులను సరళపద్ధతిలో చేయగల్గిరి వారు సంగ్రామనిర్వహణంపు ప్రాముఖ్యమును, అందుకు వలసిన ధనసేకరణవిధమును బాగుగా ఎరిగినవారు

పై వివరములవలన ప్రాచీనభారతీయుల యుద్ధతంత్రములు అన్యదేశీయులగు సమకాలికుల యుద్ధతంత్రములకంటె మిన్న కాకున్నను, వాటికి ఏవిధమునను తీసిపోవునవి కావుండెనని తెలియుచున్నది

ఆర్ ఎం జో

## ప్రాచ్య, పాశ్చాత్య సిద్ధాంతములు (కావ్యాత్మ)

కవితాస్వరూపమును, కావ్యభేదములను, వాటి లక్షణములను, ప్రయోజనములను కావ్యసౌందర్యపోషకములైన రసభావ శబ్దార్థాలంకారములను వివరించు సాహిత్యతత్త్వమును ప్రాచ్య, పాశ్చాత్య లాక్షణికులు తమ గ్రంథములలో విపులముగా చర్చించియున్నారు అందును ముఖ్యముగా సంస్కృతాలంకారికులు కావ్యమునకు కాంతతో సాదృశ్యమును కల్పించి, కావ్యమునకుగూడ కాంతకువలెనే దేహమును, ఆత్మయు, గుణములును, అలంకారములును కలవని భావించిరి శరీరమును, గుణాలంకారములును కాంతకు సౌందర్యాధాయకములైనను, ఆత్మ ఆమెకు ప్రధానము అట్లే కావ్యమునందలి రసాలంకారాది వివిధాంగములలో ఆత్మ ప్రధానమైనదని వారు నిశితముగ చర్చించిరి

పాశ్చాత్యలాక్షణికులు కవిత్వమును బహువిధముల నిర్వచించి కావ్యభేదములను, లక్షణములను, వివిధాలంకారములను, అందును ముఖ్యముగా రూపకాలంకార స్వరూపమును స్పష్టముగా నిరూపించిరి గాని, ప్రత్యేకముగా వారు కావ్యమునకుగల దేహాత్మలనుగూర్చి చర్చించలేదు ఐనను వారు కావించిన వివిధకవితా నిర్వచనములనుబట్టి కావ్యమునకాత్మభూతమైనది అలంకారసముదాయమని కొందరును, రసమని మరికొందరును భావించినట్లు చెప్పవచ్చును

సంస్కృతమునందలి సాహిత్యశాస్త్ర గ్రంథములలో మొట్టమొదటిది భరతుని నాట్యశాస్త్రము అందు ప్రధానముగా రూపకలక్షణము కలదు భరతుడు రూపకమునే కావ్యముగా నెంచెను ఇతివృత్తము కావ్యమునకు శరీరమనియు, రసము దాని సౌందర్య హేతువనియు అతడు భావించెను ఇట్లు రసప్రాధాన్యమును నెలకొల్పుటలో అతడు నందికేశ్వరుని మార్గమును అనుసరించెను కావ్యమునకు రస మాత్మ యని భరతుడు ప్రత్యేకించి పేర్కొనకున్నను, రూపకమునకు రసమువలననే సౌందర్యము చేకూరునని చెప్పుటచే అతని మతమున కావ్యమునకు ఆత్మభూతమైనది రసమని తోచుచున్నది

భరతుడు నాట్యశాస్త్రమునందు దృశ్యకావ్య లక్షణములను చర్చించగా, క్రీ శ 6వ శతాబ్దమునకు చెందిన భామహుడను లాక్షణికుడు భామహాలంకారమను గ్రంథమున శ్రవ్యకావ్య లక్షణములను వివరించెను అందతడు శబ్దార్థములు కావ్యమునకు శరీరమువంటివనియు, కావ్య సౌందర్యమును ఇనుమడింపజేయజాలినవి వక్రోక్తివంటి అలంకారములనియు నిర్ణయించెను భామహుడలంకార ప్రాధాన్యవాది అతడు రసవంతముగూడ రసవదలంకారమను పేర నొక యలంకారముగనే పరిగణించెను స్వభావోక్తిలో విశేషమేమియు లేదనియు, వక్రోక్తియే కావ్య సౌందర్యపోషకమనియు, శబ్దార్థరూపమున నొప్పు కావ్యశరీరమునకు అలంకారములే ముఖ్యమనియు అతని యభిప్రాయము

తరువాత క్రీ శ 7వ శతాబ్దమున దండి కావ్యాదర్శమను గ్రంథమున, రమణీయార్థశోభితమైన పదావళియే కావ్యమునకు శరీరమనియు, గుణములే తత్సౌందర్యహేతువులనియు చెప్పెను అలంకారములు శరీరమునకు వలెనే కావ్యమునకును బాహ్య సౌందర్యమును గూర్చును అంత స్సౌందర్యము నొసగజాలినవి గుణములని అతని అభిప్రాయము దండి రసప్రాధాన్యవాదము నామోదించలేదు అతడును భామహునివలెనే రసమును ఒక యలంకారముగనే గణించెను

ఇంతవరకు పేర్కొన్న ఆలంకారికులు తమ దృష్టిలో కావ్యసౌందర్యమునకేది ప్రధానమో తెలిపిరిగాని, సూటిగా కావ్యమునకు శరీర మిది, ఆత్మ ఇది యని చెప్పలేదు కావ్యాత్మనుగూర్చిన చర్చను మొట్టమొదట చేసిన సంస్కృతాలంకారికుడు క్రీ శ 8-9 శతాబ్దముల మధ్యభాగమునకు చెందిన వామనుడు కావ్యాలంకార సంగ్రహమను లక్షణ గ్రంథమునందు అతడు గుణాలంకారయుత శబ్దార్థములు కావ్యశరీరమనియు, రీతి కావ్యాత్మ యనియు తనసిద్ధాంతమును ప్రతిపాదించెను ఆత్మ లేనినాడు శరీరమునకలంకారములు వ్యర్థములు. గుణములచే నేర్పడు రీతియే కావ్యమునకు ఆత్మయై తత్సౌందర్యహేతు వగుచున్నదని వామనుని మతము

వామనుని తరువాత కావ్యాత్మనుగూర్చి విపులముగ చర్చించి నూతన సిద్ధాంతమును ప్రతిపాదించిన లాక్షణికుడు ఆనందవర్ధనుడు అతడు ధ్వన్యాలోకము అను ప్రసిద్ధసాహిత్య శాస్త్ర గ్రంథమును రచించెను అందతడు కావ్యశరీరమునకాత్మ ధ్వనియనియు అది వస్తుధ్వని, అలంకారధ్వని రసధ్వని యని మూడు విధములనియు, ఈ మూడింట రసధ్వని సర్వ శ్రేష్ఠమనియు చెప్పెను

అలంకారములును, గుణములును అతనిదృష్టిలో కావ్యమునకు ముఖ్యాంగములుకావు గుణసంకలనమున నేర్పడు రీతియు కావ్యాత్మకాజాలదు గుణాలంకారములు కావ్యాత్మయగు ధ్వనికి అంగములని అతని అభిప్రాయము భరతుని రసమార్గమునే పెంచి ఆనందవర్ధనుడు ధ్వనిసంప్రదాయమును నెలకొల్పెను అతడు కావ్యమునకు ధ్వని ఆత్మయని తెలిపెను గాని కావ్యశరీర మేదియో నిర్దేశింపలేదు వ్యాఖ్యాతలు కొందరు అతడు శబ్దార్థయుగళమునే కావ్యశరీరముగా భావించెనని వ్రాసిరి మరికొందరతడు చారుత్వాతిశయ విశిష్టార్థ ప్రకాశకమైన శబ్దవిశేషమునే కావ్యశరీరముగా నూహించి, 'రమణీయార్థ ప్రతిపాదకమైన శబ్దమే కావ్య' మని నిర్వచించిన జగన్నాథ పండితునకు మార్గదర్శకుడయ్యెనని వాదింతురు ధ్వన్యాలోకమున, కావ్యశరీర ప్రస్తావన మాత్రము లేదు

ఆనందవర్ధనుని ధ్వన్యాలోకమునకు అభినవగుప్తుడు 'లోచన' మను వ్యాఖ్యానమును రచించెను అతడుకూడ ధ్వని సిద్ధాంతము నామోదించుచు, రసమే కావ్యమునకు జీవమనియు, రసధ్వని యొక్కటియే కావ్యాత్మ యనియు, వస్త్వలంకార ధ్వనులుకూడ సర్వవిధముల రసపర్యవసాయులు కావలెననియు చెప్పెను కావ్యశరీరము శబ్దమని అభినవగుప్తుని అభిప్రాయము

అభినవగుప్తునకు సమకాలికుడైన కుంతకుడను ఆలంకారికుడు ధ్వనిమతమును నిరాకరించి, వక్రోక్తియే కావ్య

జీవితమని అభిప్రాయపడెను భామహుడు పూర్వమే అలంకార ప్రాధాన్యమును చాటుచు, స్వభావోక్తిలో సొగసు లేదనియు, దానికి విరుద్ధమైన వక్రోక్తియే కావ్య సౌందర్య హేతువనియు చెప్పెను అతనివాదమునే పెంచి కుంతకుడు వక్రోక్తియే కావ్యజీవితమని ప్రకటించెను అతడు కూడ శబ్దార్థయుగళమునే కావ్యశరీరముగా నెంచెను

వ్యక్తి వివేకమను గ్రంథమునందు మహిమభట్టు (క్రీ శ 1020—1060) ధ్వనిసిద్ధాంతమును ఖండించెను ఆనందవర్ధనుడు పేర్కొన్న ధ్వనులన్నియు అనుమానములోనే ఇమిడియున్నవని మహిమభట్టు వాదించెను ఇట్లతడు అనుమాన ప్రాధాన్యవాదియైనను, కావ్యమునకు రసాదిరూప మాత్మయనుటలో విప్రతిపత్తి లేదని ఒప్పుకొనెను అతనిదృష్టిలో శబ్దార్థముల జంటయే కావ్యశరీరము తరువాత ఆలంకారికులు మహిమభట్టు వాదము నంగీకరింపక, ఆనందవర్ధనుని ధ్వనిసిద్ధాంతమునే సమర్థించిరి

కుంతకుని తరువాత క్షేమేంద్రుడను పండితుడు అలంకారముల ప్రాధాన్యము నంగీకరింపక, కావ్యములో ఔచిత్యము లేనిచో గుణాలంకారములు నిరర్థకములనియు, ఔచిత్యమే కావ్యమునకు జీవితభూతమనియు తెలిపెను క్షేమేంద్రుడు ధ్వనిమతమును ఖండింపలేదుగాని, కావ్యాత్మ ఔచిత్యమని నిర్వచించెను

కావ్యాలంకారమను గ్రంథమున రుద్రటుడను లాక్షణికుడు తిరిగి అలంకార ప్రాధాన్యమును స్థాపింపయత్నించినను, అతని ఆశయము సిద్ధింపలేదు ఆనందవర్ధనుని ధ్వనిసిద్ధాంతమునే మమ్మటాచార్యాది లాక్షణికులు గ్రహించుటచే కావ్యాత్మ ధ్వనియే అను సిద్ధాంతమే బహుళముగా అంగీకృతమైనది

కావ్యమునకు శరీరాత్మలను పాశ్చాత్య విమర్శకు లిదమిత్థమని నిరూపించలేదుగాని, కవిత్వమునకు వారొనర్చిన నిర్వచనముల నాధారముగా చేసికొని, వారిలో కొందరలంకార ప్రాధాన్యమును, మరికొందరు రసప్రాధాన్యమును గుర్తించినట్లుమాత్రము నిర్ణయించవచ్చును

సంగీతయుక్తమైన భావమే కవిత్వమని థామస్‌కార్లైల్ నిర్వచించెను భావనా వ్యక్తీకరణమే కవిత్వమని చెప్పవచ్చునని షెల్లీ వ్రాసెను సత్యమువట్ల, సౌందర్యమువట్ల, శక్తివట్ల గల గాఢానురక్తిని సుందరభావనతో, సముచితశబ్దములలో ప్రకటించుటయే కవిత్వమని లెయ్‌హంట్ భావించెను లయాన్వితమైన సౌందర్యసృష్టియే కవిత్వమని అమెరికన్ విమర్శకుడు ఎడ్గార్ ఎలెన్ పో నిర్వచించెను భావములను అత్యంత రమణీయముగను, హృద్యముగను వెల్లడించు విధమే కవిత్వమని మాథ్యూ ఆర్నాల్డ్ అభిప్రాయపడెను ఈ విమర్శకులందరును స్థూలముగా కావ్యసౌందర్యము శబ్దగతమనియు, అలంకారాశ్రితమనియు నెంచినట్లు తోచును కనుక వీరు అలంకారమతమునకు చెందినవారని చెప్పవచ్చును

ఇక కావ్యభేదములను చర్చించుచు జాన్ స్టూవర్ట్ మిల్, భావోద్వేగము అప్రయత్నముగా శబ్దార్థములలో నిమిడిపోవుటయేగాని, కవిత్వ మనగా ఇతరమేదియు కాదని చెప్పెను మహోత్కృష్ట భావోద్వేగమును సముచితభావనచే ధ్వనింపజేయుటయే కవిత్వమని జాన్‌రస్కిన్ భావించెను క్రీ శ 19వ శతాబ్దమున ఇంగ్లీష్ సాహిత్యక్షేత్రమున కాల్పనికోద్యమ పునర్వికాసమునకు కారకులైన కవికుమారులలో అగ్రగణ్యుడు విలియమ్ వర్డ్స్‌వర్త్, నాటి పఠితలకు విలక్షణముగా తోచిన తనఖండ కావ్యముల స్వరూపమును వివరించుచు తీవ్రావేశములు అప్రయత్నముగ పొంగి ప్రవహించుటయే కవిత్వమని నిర్వచించెను ఆబ్లే కీబుల్ అను విమర్శకుడుకూడ ఉప్పొంగివచ్చు ఆవేశమునకు వాహికయే కవిత్వమని యనెను ఈ నిర్వచనములలో ఆవేశము, భావోద్వేగము అనుమాటలు భారతీయాలంకారికులు వర్ణించిన శృంగారాది నవరసములనే సూచించెను కనుక విమర్శకులు రసప్రాధాన్య వాదమును బలపరచిరని అనవచ్చును రసమును గూర్చి ప్రాచ్యాలంకారికులు కూలంకషముగా చర్చించి, దాని సమగ్రస్వరూపమును తమలక్షణగ్రంథములలో నిరూపించిరి పాశ్చాత్య విమర్శకులు 'ఇమోషన్' 'ఫీలింగ్' 'సెంటిమెంట్' మొదలైన పదములతో వివిధరసములనే సూచించినను, వారిచర్చ రససిద్ధాంతపు తొలిదశకు చెందినదేయని చెప్పవలెను కావ్యసౌందర్యమునకు రసమే ప్రధాన హేతువని వారిలో కొందరు భావించిరని మాత్రము నిస్సంకోచముగ నిర్ణయింపవచ్చును

ఈ నిర్వచనములం దెక్కడను కావ్య శరీరాత్మలను గూర్చిన ప్రసక్తి లేదు టి యస్ ఓమండ్ అను విమర్శకుడు మాత్రము ఛందస్సునుగూర్చి వ్రాయుచు, పద్యమునకు గణబద్ధమైన వృత్తము శరీరమనియు, రసాన్వితభావము ఆత్మయనియు తన యభిప్రాయమును ప్రకటించెను, ఈ నిర్వచ

నములో శరీరము, ఆత్మ అను పదములు ప్రయుక్తములైనవి గణబద్ధమైన శబ్దసముదాయము పద్యమునకు శరీరమనియు, రసభరిత భావమే ఆత్మయనియు కనుక రసమే కావ్యాత్మ యనియు సూచితమైనది ప్రాచ్యాలంకారికులలో రస ప్రాధాన్యవాదుల సిద్ధాంతమునకిది సన్నిహితముగా నున్నది

ఆ రా రా

## ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము (మదరాసు)

ముద్రణకళ రోజురోజునకు క్రొత్తపుంతలు సంతరించు కొనుచున్న ఈనాళ్లలో, వ్రాతప్రతులకు ప్రాముఖ్యము గలదా? వాటిని భద్రపరచుట అవసరమా? అను ఈ మొదలగు ప్రశ్నలు కొందరికి తోచవచ్చును మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తకభాండాగారమును ఒక్కసారి దర్శించుచో ఈ ప్రశ్నలకు సదుత్తరములు లభింపగలవు వ్రాతప్రతులకు కాణాచి అనదగు నీ భాండాగారములో లిఖిత పుస్తకము లెన్నియో గలవనుట చర్వితచర్వణమే అగును వీటిలో కొన్ని తాళపత్ర గ్రంథములు, మరికొన్ని కాగితముమీద వ్రాయబడినవి ఇవి ఒక్క భాషకు చెందినవికావు, ఒక్క విషయమునకు సంబంధించినవియు కావు సంస్కృతము, తెలుగు, తమిళము, కన్నడము, మలయాళము, మహారాష్ట్రీము, అరబ్బీ, పారశీకము, ఉర్దు మొదలైన పెక్కు భాషలలో వ్రాతప్రతులు గలవు వీటిలో కొన్ని అత్యంత ప్రాచీనములు అంతే కాదు, చారిత్రకముగాను, సాహిత్యవిషయకముగాను వీటికి ఎంతో విలువ గలదు భాషావైవిధ్యముతోపాటు, ఈ వ్రాతప్రతులలో విషయవైవిధ్యముకూడ కననగును వీటిలో కొన్ని ఛందోలంకారాదిశాస్త్రములు, ఇంకను కొన్ని పురాణేతిహాసములు, మరికొన్ని కావ్యములు, కొన్ని వైద్య గ్రంథములు వీటిలో కొన్నిటికి మాత్రమే ముద్రణభాగ్యము కలిగినది మిగిలినవి యన్నియు నేటికిని వ్రాతప్రతులుగానే ఉన్నవి ఆధునిక పద్ధతుల సాహాయ్యముతో, వ్యయప్రయాసలకోర్చి, వీటిని భద్రపరచుచున్న మదరాసు ప్రభుత్వము వా రెంతయు అభినందనీయులు

ఈ భాండాగారము ఈనాటిది కాదు దీనికి రమారమి నూరేండ్ల చరిత్ర గలదు 1850 ప్రాంతమున కుంఫిణీ వైద్యులు తక్కిన వారు వ్రాతప్రతులుకొని, వాటిని తమమదరాసు ఏజంటునకు పంపుచుండెడివారు వాటిలో కర్నల్ కాలిన్ మెకంజీ, సి పి బ్రౌను ప్రభృతులు సేకరించిన వ్రాతప్రతులుకూడ గలవు. దక్షిణ భారతదేశచరిత్ర రచనకు శ్రీకారముచుట్టిన కారణ జన్ముడు కాలిన్ మెకంజీ అయన ఎంతో శ్రమపడి దక్షిణ భారతములోని గ్రామచరిత్రలు, శాసనములు, దేశపటములు మున్నగు వాటిని సేకరించెను ఆతడు వ్రాయించిన గ్రామ చరిత్రలు స్థానిక సంపుటము లనుపేరున వ్యవహృతములగు చున్నవి అటులనే బ్రౌను దొరవారును అమూల్యములైన చారిత్రక, సారస్వతవిషయ ప్రధానములగు సంపుటములను తయారుచేయించిరి 1855లో ఇంగ్లాండునకు వెళ్లునంతవరకును, తాను సేకరించిన వ్రాతప్రతులను ఆయన కుంఫిణీ వారికి అందజేయుచునే యుండెను తన సొంత గ్రంథాలయమునుకూడ వారికే ఇచ్చెను బ్రౌను సంపుటములన్నియు తెలుగు లిపియందే గలవు ఇది గమనింపదగిన విషయము

పై వారిరువురే కాక, ఈస్టిండియాహౌస్ వారుకూడ కొన్ని వ్రాతప్రతులు సేకరించిరి ఈ వివిధ సంపుటములే ప్రస్తుత భాండాగారమునకు రూపురేఖలు తీర్చిదిద్దెనవచ్చును

1869లో ఈ వ్రాతప్రతుల సంపుటముల కొకపట్టికను తయారు చేయించుటకు ప్రభుత్వము నిశ్చయించెను ఆ పనిని టేలర్ అను దొరకు ఒప్పగించిరి అప్పు డాయన మదరాసు రాజధానీ కళాశాలలో సంస్కృతాచార్యుడుగా నుండెను 1875లో ఆయనను క్యూరేటరుగా నియమించిరి ఆయన తయారుచేసిన కేటలాగును అచ్చువేయుటకు ప్రభుత్వము సమ్మతించెను 1876 నుండి క్రొత్త వ్రాతప్రతుల కోసము అన్వేషణ ప్రారంభమయ్యెను ఆ విధముగా ఈ భాండాగారము పెరిగి, పెద్దదై నేడు మన దేశములోని ప్రసిద్ధ భాండాగారములలో ఒకటిగా పరిగణింపబడుచున్నది

1968లో భాండాగారమువారు ప్రకటించిన వివరము లను పురస్కరించుకొని చూడగా, ఈ క్రింద పేర్కొనినట్లుగా పుస్తకములున్నట్లు తెలియుచున్నది

| భాష పేరు | వ్రాతప్రతులు | అచ్చు పుస్తకములు |
|---|---|---|
| సంస్కృతము | 44,407 | 5,064 |
| తమిళము | 18,789 | 8,175 |
| తెలుగు | 1 986 | 1,302 |
| (3 775 వ్రాతప్రతులు ఆంధ్రప్రదేశ ప్రభుత్వమువారికి ఒసగబడినవి) | | |
| ఇంగ్లీషు | — | 4,621 |
| నిఘంటువులు | 102 | |

పిక్‌ఫోర్డ్ 1869 జూలై నుండి 1870 వరకు క్యూరేటరుగ నుండెను ఆ పిమ్మట శ్రీయుతులు వేంకట సుబ్బాశాస్త్రి, శేషగిరిశాస్త్రి, యం రంగాచార్య, యస్ కుప్పుస్వామిశాస్త్రి (1914–1936), పి సి సుబ్రహ్మణ్యశాస్త్రి, ఎ. శంకరన్, సయ్యద్ మహమ్మద్ ఫజ్లుల్లాసాహెబ్, టి చంద్రశేఖరన్ (1949–1962) ప్రభృతులు క్యూరేటర్లుగా వ్యవహరించి, ఈ భాండాగారమును అభివృద్ధికి తెచ్చిరి ప్రస్తుతము శ్రీ ఆర్ కె పార్థసారథి క్యూరేటరుగా నున్నారు

నేడు ఈ భాండాగారము మదరాసు విశ్వవిద్యాలయ గ్రంథాలయమునకు వెనుకనున్న మేడమీద గలదు ఇది మొదటినుండియు ఇక్కడ లేదు తొలుత విద్యాశాఖ డైరెక్టరుగారి కార్యాలయమునందు (నుంగంబాకం) ఒక గదిలో కుప్పగా పడియుండెనట! వ్రాతప్రతులు కొన్ని శిథిలావస్థకు పాల్పడియుండుటను చూచి, ఒక సహృదయుడీవిషయమును ప్రభుత్వ దృష్టికి తీసికొనిరాగా, అప్పుడు వాటిని రాజధానీ కళాశాలకు చేరవేసిరి అటుపిమ్మట వీటిని సెయింటు జార్జికోటలో ఒక గదిలో ఉంచిరి తుట్టతుదకు భాండాగారము ప్రస్తుతమున్నచోట ఏర్పాటు చేయబడెను

వ్రాతప్రతులను భద్రపరచుటలోపాటు భాండాగారము వారు సుప్రసిద్ధులైన పండితుల సాహాయ్యముతో కొన్ని వ్రాతప్రతులను సంస్కరించి ప్రకటించినారు తెలుగులో కూడ పెక్కు గ్రంథములు ముద్రింపబడినవి వాటిలోకొన్ని:- చొక్కనాథ చరిత్ర, కులశేఖర మహీపాల చరిత్ర, హైదరు చరిత్ర, బొబ్బిలియుద్ధకథ, భారతసార సంగ్రహము, ఆర్యభటీయవ్యాఖ్య, యామున విజయ విలాసము, పతివ్రతా చరిత్రము మొదలగునవి

ప్రతిరోజు వచ్చిపోవు పండితులు, పరిశోధకులు, విద్యార్థులు మొదలగువారితో కలకలలాడుచు కనిపించు నీసరస్వతీ నికేతనము దర్శనీయము

చ రా శ.

## ప్రాణహిత .

ప్రాణహితానది దక్షిణ భారతమున విచిత్రముగా ఏర్పడిన ఒక విశిష్టమైన నది. ఇది అన్నినదులవలె ఏకొండలలోను పుట్టలేదు వార్ధా, వేణుగంగ అను రెండునదులు రెండు వైపులనుండి వచ్చి కలిసి ఏకప్రవాహముగా మారును ఈ కలయిక అదిలాబాదుజిల్లా 'ధర్మసాగరము' అనుప్రాంతములో జరుగును ఇట్టి ఏకప్రవాహమే "ప్రాణహిత" అని పేర్కొనబడినది దీనికి ప్రాణి, ప్రణీత, అని నామాంతరములు కలవు ప్రాణహితానది గోదావరి కొక ఉపనది

వార్ధా లేక వరదానది ఈనది, మధ్యప్రదేశమునందలి బెటల్ జిల్లాలో 2550 అడుగుల ఎత్తునగల విదర్భ పీఠభూములయందలి పర్వతపంక్తులనుండి పుట్టి, 20 మైళ్ళు ఆరాష్ట్రములో ప్రవహించి ఆపిమ్మట మహారాష్ట్ర ప్రాంతములో ప్రవేశించుచున్నది ఈనది ఆగ్నేయదిశగా షుమారు 300 మైళ్ళు ప్రవహించి సముద్రమట్టమునకు 480 అడుగుల ఎత్తుగల ప్రదేశములో ధర్మసాగరమువద్ద వేణు గంగానదితో కలియుచున్నది ఈ నదీప్రవాహాపు చివరి 26 మైళ్ళనిడివి, ఆంధ్రప్రదేశ, మహారాష్ట్ర ప్రాంతములకు పరిహద్దుగా నేర్పడుచున్నది

వార్ధానది వేణుగంగతో కలియకముందే పెనగంగానది కుడివైపునుండి వచ్చి వార్ధాలో చేరుచున్నది

వేణుగంగ లేక పైన్‌గంగానది ఈనది మధ్యప్రదేశమందలి మహాదేవపర్వతములో జన్మించి, ఆతర్వాత తూర్పుగా మరలి ఆవెనుక దక్షిణాభిముఖముగా గొప్ప వలయాకారముగా నేర్పడుచున్నది ఈనది 170 మైళ్ళు మధ్యప్రదేశరాష్ట్రమందు ప్రవహించి, ఆ తరువాత మధ్యప్రదేశమునకును, మహారాష్ట్రమునకును 20 మైళ్ళపొడవున సరిహద్దుగా ఏర్పడుచున్నది ఆవెనుక దక్షిణాభిముఖముగా తిరిగి 188 మైళ్లు ప్రవహించి, అదిలాబాదుజిల్లా ధర్మసాగరమను ప్రదేశమువద్ద వార్ధానదితో కలియుచున్నది

ఈ వేణుగంగానది 28,583 చదరపుమైళ్ల ఆరగాణిని మధ్యప్రదేశమునందును మహారాష్ట్రమునందును ఆక్రమించి యున్నది ఈనది మధ్యప్రదేశ్ రాష్ట్రమునందలి కారడవుల గుండా ప్రవహించుచున్నది

ఇట్లు వార్ధ, పెనుగంగ, వేణుగంగ అను మూడు పెద్ద నదుల నీటిబరువుతో ప్రాణహిత ప్రవహించి గోదావరిలో సంగమించి గోదావరిని జలప్రపూర్ణము గావించుచున్నది

మంజీర, మానేరు, ప్రాణహిత, ఇంద్రావతి, శబరి, కిన్నెరసాని యనునవి గోదావరీ మహానదికి గల ముఖ్యమైన ఉపనదులు గోదావరికి ఈ ఉపనదులన్నింటివలన సంక్రమించు నీటిలో మూడవవంతు నీరు ప్రాణహితా నదివలననే లభించుచున్నదని తెలియుచున్నది

గోదావరీనది షుమారు 650 మైళ్లు తూర్పుగా ప్రవహించినపిమ్మట, ఆగ్నేయ దిశగా మరలుచున్నది ఇచ్చటనే త్రిలింగములలో నొకటియైన కాళేశ్వర మహాక్షేత్ర మున్నది స్కాందపురాణాంతర్గతమైన సనత్కుమార సంహితయందు గల 'కాళేశ్వరఖండము' నందలి జాహ్నవీ గౌతమీ సంవాదమునందు ప్రయాగక్షేత్రమున త్రివేణీ సంగమము మాత్రమే జరగియున్నది, కాళేశ్వర మహాక్షేత్రమున ప్రణీత వరద, వైన్య, గౌతమి, సరస్వతి అను పంచగంగల సంగమము జరగినది అందుచే ఈ కాళేశ్వరక్షేత్రము ప్రయాగకంటె మిక్కిలి మిన్నయైనదని చెప్పబడినది దీని కాధారము ఈ క్రిందిశ్లోకము

శ్లో॥ ప్రణీతా, వరదా, వైన్యా, గౌతమీ చ సరస్వతీ,
నద్యః పంచ వహం త్యత్ర ప్రయాగాత్కోటిశోఽధికమ్

వరదా, వేణు గంగల సంయుక్త ప్రవాహము ధర్మసాగరము నుండి ప్రాణహితానది అనుపేరుతో షుమారు 80 మైళ్ళ వరకు ఆంధ్రప్రదేశమునందు ప్రవహించుచున్నది. పెద్దవాగు అను ఉపనది ఇందులో చేరుచున్నది ప్రాణహితానది అదిలాబాదుజిల్లాకు తూర్పు దిగ్భాగముల పరిహద్దులవెంబడి ఈశాన్య దిక్కుగా ప్రవహించి, మహారాష్ట్ర దేశమునకును, ఆంధ్ర ప్రదేశమునకును సహజమయిన పరిహద్దుగా నేర్పడి సముద్ర మట్టమునకు 850 అడుగులఎత్తున, మంథెన గ్రామమునకు తూర్పుదిక్కుగా 28 మైళ్ళ దూరమునగల, కాళేశ్వర మహాక్షేత్రమువద్ద గోదావరినదిలో సంగమించుచున్నది సంగమ విషయము బ్రహ్మపురాణమున 161వ అధ్యాయమున వర్ణింపబడినది ఈ ప్రాణహితానదినిగూర్చి ప్రశంసలు అగ్నిపురాణమునందును, పద్మపురాణ-ఉత్తరఖండమందును కలవు

ప్రాణహితయు దాని ఉపనదులును కలిసి వివిధరాష్ట్రములలో 42,165 చదరపుమైళ్ళ ఆరగాణి లేక జలగ్రహణ వైశాల్యము నాక్రమించుచున్నవి ఈ ఆరగాణి పూర్ణగోదావరీ నదియొక్క ఆరగాణిలో ½ వంతు కంటె కొంచెము అధికముగా నుండును ఈ ప్రాణహితానదియొక్క ఆరగాణియం దధిక భాగము మధ్యప్రదేశ, మహారాష్ట్ర ప్రాంతముల యందున్నది ఈనదియందలి నీటి గరిష్ఠప్రమాణము 9,60,000 క్యూసెక్కులు ఈనది ప్రవహించు ప్రదేశములందు సంవత్సరమునకు సగటున 35" నుండి 60" వర్షపాతము ఘటిల్లును

సిరిపూరు తాలూకాలోని సిరిపూరు పట్టణమునకు 15 మైళ్ళ దూరమున బెజ్జూరు అను గ్రామము కలదు ఆ గ్రామమునకు సమీపమున ఈనదిపై విద్యుత్ప్రాజెక్టును నిర్మించుటకు ప్రభుత్వము ఒక పథకమును సిద్ధముచేసి యున్నదని తెలియుచున్నది

ప్రభుత్వము ప్రాణహితానదిపై పెక్కుచోట్ల రోడ్డు వంతెనలు నిర్మించి ఆంధ్ర, మహారాష్ట్ర ప్రాంతముల మధ్య రాకపోకలకు సౌకర్యములు నేర్పాటుచేసి యున్నది

ప్రాణహితానదికి ఇరువైపులయందును గొప్ప లోగ్గగను లున్నవి ఈ పరిసర ప్రాంతారణ్యములలో వెదురు విస్తారముగా లభించుచున్నది ఈ వెదురు సిరిపూరునందలి కాగితపు ఉత్పత్తి కేంద్రమునకు మిక్కిలి ఉపయోగపడుచున్నది

పు వేం

## ప్రాణి జీవనశాస్త్రము
## (Ecology)

ప్రపంచ వైశాల్యములో సగముకంటె పైబడిన ప్రాంతములందు జంతువులు, మొక్కలు, సూక్ష్మప్రాణులు నివసించుచున్నవి (సూక్ష్మజీవులు కంటికి గోచరింపక కేవలము సూక్ష్మదర్శిని సహాయముననే చూడబడునవి) ఇట్లు ప్రాణివర్గమంతయు - సూక్ష్మజీవులు మొదలు అత్యంత వికాసము నొందిన మానవులవరకు - ప్రపంచ వైశాల్యములో సగముకంటె ఎక్కువ భాగములో నివసించుచున్నారు ప్రపంచమున ఏదేని యొక భాగములో నివసించు ఉద్భిజ్జ, జంతుజాలమంతయు కలిసి ఒకవిధమైన సంపూర్ణీకృతవర్గముగా ఏర్పడినది పరిశీలన సౌలభ్యముకొరకు, ఈ వర్గము తరచుగా ఉద్భిజ్జవర్గమనియు, జంతువర్గమనియు రెండు ఉపవర్గములుగా విభక్తమొనర్పబడినవి

ఏ సూక్ష్మజీవియు శూన్యములో నివసింపజాలదు దాని పరిసరములచే అది ఆవృతమగుచుండును జంతువులకును, ఉద్భిజ్జములకును లేక వాటికి సంబంధించిన వర్గములకును, వాటి పరిసరములతోగల పరస్పరక్రియలను, సంబంధములను, అధికరించి చేయబడు అధ్యయనశాఖకు 'ప్రాణిజీవనశాస్త్రము' అని పేరు భూ, సముద్ర, నదీ, తటాక జలములలో భిన్న విభిన్నములైన జీవితములను గడుపు వేర్వేరు జీవులతో సంబంధముగల శాస్త్రమునకు ప్రాణి జీవనశాస్త్రమని విస్తృతముగా చెప్పబడినది ప్రకృతియొక్క నిర్మాణ,కర్తవ్యముల పరిశీలనమే ప్రాణి జీవనశాస్త్ర నిర్వచనమనినచో ఎక్కువ

నిశ్చితముగ నుండును మానవుడుకూడ ఈ ప్రకృతిలో నొక భాగమే ప్రకృతి యనుపదము సజీవప్రపంచమను శబ్దమునం దిమిడియున్నది నదికి నదీశయ్యతోను, రొట్టెముక్కకు పెనముతోను సంబంధమున్నట్లు, ప్రాణులకు వాటిపరిసరము లతో అత్యంత సన్నిహిత సంబంధము కలదు

జంతు, ఉద్భిజ్జవర్గములకు, వాటిని ఆవరించుకొనియున్న నిర్జీవ పరిసరములతో ప్రత్యేకముగు పరస్పర క్రియానుబంధ ములు కలవు ఈ సజీవ ప్రపంచము, నిర్జీవపరిసరములును కలిసి ప్రాణిజీవనశాస్త్ర విధానముగ వ్యవహృతమగుచున్నవి ప్రాణిజీవన శాస్త్రవిధానములో, ప్రాణులును, నిర్జీవమైన పరిసరములును ఇమిడియుండి, ఒకదాని ప్రభావము రెండవ దానిపై ప్రసరించుచున్నది రెండును పరస్పరాశ్రయములే ఇందుచే ఒకసంశ్లిష్టవిధాన మేర్పడుచున్నది ఈ విధానము భూమండలముపై ప్రాణిపోషణమునకు ఆవశ్యకము

ప్రాణిజీవన శాస్త్రవిధానములో చెట్టు లేక జంతువు వంటి జీవులు సహజముగా నివసించుతావు "ఉనికిపట్టుగా" పేర్కొనబడుచున్నది అట్టితావులలో నివసించు జీవులు ఒక ప్రత్యేకమైన జీవితవిధానమునకు అలవాటుపడియుండును అట్టితావు ఒకగూడుగా వర్ణింపబడినది జీవి సహజముగా వృద్ధిచెందెడుతావు మానవుని ఇంటిచిరునామాతో పోల్చబడి నది దానిగూడు మానవుని వృత్తివంటిది అట్టి ఉనికిపట్టులో ఒక్కొక్క గూడుకంటె ఎక్కువ ఉండుననుట స్పష్టము ఉదాహరణమునకు అడవిగాడిద, ఆఫ్రికా సింహము ఉష్ణ ప్రాదేశిక పచ్చికమైదానములలో సంచరించును అనగా వాటి ఉనికిపట్టు ఒక్కటే అయితే ఆ రెండింటి గూళ్ళు మాత్ర మొకటి కావు అడవిగాడిద గడ్డిమేయును సింహము అడవిగాడిదలతోసహా ఇతర జంతువులను ఆహారముగా తిని వేయును

ప్రాణి జీవనశాస్త్ర విధానమును నాలుగు భాగము లుగా విభజింపవచ్చును (1) ఆల్బియాటిక్ ద్రవ్యములు (2) ఉత్పత్తి కారకములు, (3) వినియోగ కారకములు, (4) క్షయకారకములు ఆల్బియాటిక్ పదార్థము అనునవి పరిసరముల యొక్క మౌలిక, మిశ్రమ ద్రవ్యము లనబడు చున్నవి వాటియందు నిర్జీవపదార్థములగు జలము, కర్బన ద్విఆమ్లజనిదము, ప్రాణవాయువు, సున్నపుకస్థము, నత్రజని, భాస్వరము, దానిమిశ్రద్రవ్యములు మున్నగునవి కలిసి యుండును ఇంకను వాటిలో కొన్ని సజీవపదార్థములు కూడ నున్నవి ఉదా: అమినో ఆమ్లములు క్షయమగు జీవరాసుల అవశేషములు

ప్రాణి జీవనశాస్త్ర విధానములోని సచేతనములే సజీవ ఉత్పత్తికారకములని చెప్పబడుచున్నవి ఈ చేతనములు సామాన్యములయిన అచేతన మిశ్రద్రవ్యములనుండి ఆహా రోత్పత్తిని చేసికొనగలుగుచున్నవి అవి కిరణజన్య సంయోగ క్రియాత్మకమువంటిది దీనిచే సూర్యరశ్మి, జలము, క్లోరో ఫిల్, కర్బనద్వ్యామ్ల జనిదముల సన్నిధిలో పచ్చని మొక్కలు సంశ్లిష్ట ఆహారపదార్థముగా సంశ్లేషణ మొనర్చబడుచున్నది సాంద్రారణ్యములలో వృక్షములును, పచ్చికబయళ్ళలో పచ్చికయు మిక్కిలి ప్రముఖమైన ఉత్పత్తి కారకములు సరస్సులలో పాతుకొనియున్నట్టియు, నీటిపై తేలియున్న ట్టియు నీటిమొక్కలుకూడ ఉత్పత్తి కారకములే కాగా, సముద్రతీరములవెంట నాటుకొనియున్నట్టియు, సముద్ర ములో తేలుచున్నట్టియు కొన్నిపాచిపదార్థములును ఉత్పత్తి కారకములుగనే యున్నవి జంతువులు ముఖ్యముగా విని వినియోగకారకములు అవి ఇతరజీవులకు హాని చేయును, ఉద్భిజ్జములను తినివేయును ఇతర జంతువులను తినివేయు రెండవశ్రేణికి చెందిన సింహమువంటివి వినియోగ కారక ములు గలవు

పుట్టకొక్కులవంటి సూక్ష్మవిషజీవులు, ప్రధానమైన క్షయకారులుగా చెప్పబడుచున్నవి ఇవి మృతజీవ పదార్థము యొక్క లేక జీవనాధార పదార్థముల యొక్క సంశ్లిష్ట మిశ్రద్రవ్యములను విచ్ఛిత్తి యొనర్చుచు విచ్ఛిత్తి చెందిన పదార్థములలో కొన్నింటిని స్వీకరించి, జీర్ణించుకొనుచు, విని యోగ కారకములచే ఉపయోగింపబడిన సాధారణ ద్రవ్యము లను విడుదల చేయుచుండును

ప్రాణి జీవన శాస్త్రీయవిధానములోని నాలుగు అంగ ములలో తుది మూడును సజీవ సూక్ష్మప్రాణులు విశేషించి మొక్కలు ఉత్పత్తికారకములుగను, జంతువులు వినియోగ కారకములుగను, కొన్ని సూక్ష్మజీవులు క్షయకారకములుగను ఉన్నవి

ప్రాణి జీవనశాస్త్ర విధానముయొక్క పరిసరములు భౌతిక జీవశాస్త్రీయాంశముల ఫలితములే ఇవి సూక్ష్మజీవి వర్గములపై తమ దుష్ప్రభావమును ప్రసరింపజేయును వెలు

తురు, వాతావరణము, శీతోష్ణస్థితి, రసాయనములు, నీరు, భూమ్యుపరితలమునకు అడుగున నుండు పొర- ఇవియే ప్రధానమైన భౌతికాంశములు

జీవరాసులపై వెలుగున కుండు ప్రభావము అల్పము వెలుగు సూక్ష్మజీవులను, ఉద్భిజ్జ జంతువర్గముల యొక్క ఉన్నత తరరూపములను బాధించును సూర్యరశ్మియందు ఉద్భిజ్జములు, ఆహారమును సంశ్లేషణ మొనర్పగలవు

ఉష్ణోగ్రతయందు కలుగు మార్పులచే ప్రాణులు ప్రతిక్రియకు గురియగును వేర్వేరు శీతోష్ణస్థితులుగల ప్రదేశములందు సూక్ష్మజీవు లుండుటగాని, లేకుండుటగాని, అట్టి శీతోష్ణస్థితులకు అలవాటుపడగల శక్తిపై ఆధారపడి యుండును ప్రపంచములో కొన్ని జీవులు ఉష్ణమండలములందును, మరి కొన్ని జీవులు శీతలమండలములందును సుఖముగా నివసింపగలవు మరికొన్ని జీవులు బ్రతుకుటకు మితోష్ణప్రాంతము అవసరము

వినిమయ సాధనము యొక్క రాసాయనిక లక్షణము కూడ ప్రాణిజాతముపై తన ప్రభావమును ప్రసరింపజేయును నీటిలో నివసించు జీవులు నీటియందలి రాసాయనిక ద్రవ్యములచే విశేషముగ ప్రభావితము లగును చిప్పలను నిర్మించు కొను జీవులు, ఆ చిప్పల నిర్మాణమునకు చాలినంత సున్నము నీటియందున్నప్పుడే అందు బ్రతుకగలవు

జలచరములగు జంతువులు, మొక్కలు, వాటి ఉనికికి అనుకూలములగు కొన్ని మార్పులకు లోనైనవి ఈ విధముగా జీవులు అవి నివసించు మంచినీటినిబట్టియు, సముద్రపు నీటినిబట్టియు, నిర్మాణాత్మకముగను పరిపుచ్చుకొనుటకు అనుకూలముగా పరివర్తనము చెందినవి

భూమ్యుపరితలమునకు అడుగున నుండు పొరకూడ ప్రాణి జీవనశాస్త్రవిధానములో నొక ముఖ్యాంశము ఉద్భిజ్జి భూమ్యుపరితలముల స్వరూప స్వభావములు మున్నగునవి మొక్కలలోను, కీటకములలోను అసంఖ్యాకములైన పరివర్తనములను, అనుకూల్యములను ప్రవేశపెట్టినవి

జీవశాస్త్రీయాంశములుకూడ జంతువుల యొక్క, మొక్కలయొక్క జీవితములలో మార్పును కల్పించుచు ప్రముఖపాత్ర వహించుచున్నవి ఏ జంతువుగాని, మొక్కగాని ఒంటరిగా జీవింపజాలదు స్వీయ వర్గమునకును, ఇతర వర్గమునకును చెందిన జంతువులయొక్క, మొక్కలయొక్క ఉనికివలన జంతువు, మొక్క ప్రభావితము లగుచున్నవి ఇట్లు సూక్ష్మజీవి వర్గములమధ్య ఆహార, ఆశ్రయములకొరకు, సహచర స్వయంరక్షణములకొరకు తీవ్రమైన పోటీ జరుగుచున్నది భిన్నవర్గములమధ్య ఒక విధమైన అన్యోన్యాశ్రయము కలదు దాని ఫలితముగ ఒకేజాతి నడుమను భిన్నజాతుల నడుమను స్పర్ధ ఏర్పడును, ఇందుకొరకై మొక్కలకును జంతువులకును మధ్య జీవశాస్త్రీయావసరములనుగూర్చి విచిత్రములైన పలురకముల సంబంధములు నెలకొనుచున్నవి ఇది సహవాసమునకు, సహాయమునకు, ముఠా జీవితమునకు, పోటీకి, సంఘజీవితాభివృద్ధికి దారితీసినది తేనెటీగలు నివసించు మండలములలో ఆట్టిస్థితి కన్పట్టును. ఇది యొక ప్రత్యేకరకపు అంతస్సంబంధములకు, అనుకూల్యములకు దారితీసెను

పరాన్న భుక్కులగు జీవులు పరాధీన జీవితమునకు అలవాటుపడినవి ఇవి జంతువుల, ఉద్భిజ్జముల శరీరములలో (బయటగాని, లోపలగాని) నివసించుచు, వాటికి హాని కల్పించుచు అనేక రకముల వ్యాధులను కల్పించుచుండును అయితే ఒకప్పు డవి హానికరములు కాకపోవచ్చునుకూడ

ఎంద్రకాయలవంటి కొన్ని అల్పప్రాణులు మృదులములైన చిప్పల లోగ్రలలో నివసించి ఆత్మరక్షణ మొనర్చుకొనును పరస్పర సహకార జీవనము, సన్నిహిత సంబంధము అనునవి సూక్ష్మజీవులలోని వేర్వేరు ఉపవర్గములమధ్యనుండు సహజలక్షణము

కొన్ని పరిసరముల నడుమ విజయవంతముగా బ్రతుకుటకై సూక్ష్మజీవులుకొన్ని రక్షణోపాయములను ఆవలంబించును రక్షణకు అనుకూలమైన రంగును దాల్చుట అట్టి ఉపాయములలో నొకటి అట్టిరంగు పరిసరములనుగాని, పరిసరములలో ఏదేని యొక పదార్థమునుగాని పోలియుండును శత్రువుల కంటబడకుండ ఆత్మరక్షణమునకై ఈ ఉపాయము నవలంబింపబడును భారతదేశమందలి సీతాకోక చిలుక రెక్కలపై భాగము ఉజ్జ్వలమైన రంగుతో శోభిల్లుచుండును అయితే ఆ రెక్కల క్రిందిభాగము ఎండిన ఆకువలె వివర్ణమై శ్వేతకళ దాల్చి యుండును సీతాకోకచిలుక విశ్రమించునపుడు ముడుచుకొనిన రెక్కలచే దాని వీపు కప్పబడి యుండును ఇట్టి స్థితిలోనుండు సీతాకోక చిలుక ఎండిన ఆకువలె కన్పట్టును

పైన పేర్కొనబడిన ప్రత్యేకరకముల అలవాట్లను,

సద్దుబాట్లను, చేసికొనుటయేకాక, ప్రాణిజీవనశాస్త్రీయవిధానమందలి సూక్ష్మజీవులు వాటి అభివృద్ధికి అనుకూలములగు విభిన్నములైన మారుమూల స్థానములనుగూడ ఎన్నుకొని అచ్చట నివాసము చేయును (ఉదా నీరు, భూమి, వాయువు) దానినిబట్టి అవి జలచరములనియు, (మంచి నీరు, సముద్రపు నీరు), భూచరములనియు ఖేచరములనియు పేర్కొనబడుచున్నవి. దీనివలన వాటికి నిర్మాణాత్మకములును, క్రియాత్మకములును అయిన పెక్కు మార్పులేర్పడినవి ఉదాహరణమునకు సముద్రచరములగు తిమింగిలములు మున్నగు కొన్ని స్తన జలచరముల శరీరాకృతులలో మార్పులు ఘటిల్లెను వాటి శరీరములు చేపల శరీరములను పోలియుండును ప్రపంచజ్ఞానము లేనివారు వాటిని చేపలనియే భ్రమించెదరు అవి స్తన జంతువులగుటచే, చేపల కంటె భిన్నములైనను వాటి శరీరాకృతి చేపల శరీరాకృతిని పోలియుండుటచేతనే అట్లు భ్రమించుటకు కారణమగుచున్నది

కె ఆర్ ఎ

## ప్రేయోవాదము
## (Hedonism)

శారీరకమైన లేక మానసికమైన ఆనందమే అత్యున్నతమగు సంపదయనియు, అదియే మానవుని విశిష్టతమమైన ఆదర్శమనియు, జీవిత పరమావధియగు అట్టి మహానందము మానవునకొక నైతిక లక్ష్యముగా రూపొందవలెననియు ప్రేయోవాదము (పాశ్చాత్యచార్వాకవాదము) నిర్వచించుచున్నది అరిస్టిపస్ అను నొక గ్రీకు తత్త్వవేత్త ప్రప్రథమముగా ఇట్టి భావమును ప్రతిపాదించెను సాంఘిక సంక్షేమమునందాసక్తి చూపని ఇతడు కేవలము వ్యష్టి సుఖమునందే తన విశ్వాసమును ప్రకటించెను ఆనందములోకూడ, కేవలము ఐహికమగు దైహికానందమునే అరిస్టిపస్ అత్యున్నతమైన ఆనందముగా పరిగణించెడివాడు

ఎపిక్యూరస్ అను మరియొక గ్రీకు తత్త్వవేత్త "ఎపిక్యూరియన్ తత్త్వసిద్ధాంత" మనుదానిని ఆవిష్కరించెను అరిస్టిపస్ ప్రతిపాదించిన సిద్ధాంతమును ఎపిక్యూరస్ సంస్కరించి మెరుగుపరచెను ఆనందమును, మహోన్నతమైన మానవాదర్శముగా పరిగణించిన ఇతడు శారీరకానందము కంటె, మానసికానందమునకే ప్రాధాన్యము నిచ్చెను భయభ్రాంతులనుండి, మనస్తాపమునుండి విముక్తులగుటవలన వేదనమునుండి, వ్యాకులత్వమునుండి, మానవుడు తుట్టతుదకు అత్యున్నతమయిన ఆనందమును అనుభవింపగలడని ఎపిక్యూరస్ భావించెను

ఆధునిక యుగములో, హాబ్స్, బెన్‌థామ్ మిల్ అను సుప్రసిద్ధ బ్రిటిష్ భావుకులు ఆనందమును ప్రాతిపదికగా చేసికొని సమగ్రమైన నొక నైతిక తత్త్వసిద్ధాంతమును రచించుటకు తీవ్రప్రయత్నము లొనర్చిరి బెన్‌థామ్ ప్రతిపాదించిన సిద్ధాంతములో (1747-1832), ఆనందమే సర్వోత్తమమైన ఆశయమయినను, అట్టి ఆనందము క్షణభంగురమగునదిగా నుండక, జన్మాంతమువరకు అనుభవయోగ్యమైనదిగ నుండవలెననియు, వ్యక్తిగతమైన ఆనందముగాక, అత్యధిక సంఖ్యాకులగు ప్రజల ఆనందమే సర్వవిధముల వాంఛనీయమనియు అతడు పేర్కొనెను

బెంథామ్ మరియు నిట్లనెను "ఆనందము, వేదనము అనెడి సామ్రాజ్యమునకు ప్రకృతి మానవుని అధీనమొనర్చెను ఆనందమును ఆపేక్షించి, వేదనమును తప్పించుకొనుటయే మానవుని ఏకైకాశయమై యుండవలెను" బెంథామ్ అంగీకరించిన సిద్ధాంతము ననుసరించి, మానవచర్యలన్నిటికి ఆనందము, వేదనము- ఈ రెండే సంభవనీయములగు ప్రేరణములు ఈ రెండింటిలో ఒకదానినే మానవుడు ఆశించును మానవ జీవితములో ఏ కార్యము నాచరించినను, ఏ ఆశయమును సాధింప దలచినను, అది తనకు ఆనందమును సిద్ధింపచేయునను విశ్వాసము సహజముగ ప్రతివ్యక్తియు కలిగియుండును

మానవుడొక విషయమును వాంఛించి, అది ఆనందదాయకమని గ్రహించుటయు, వేరొకప్పుడు అదియే బాధామయమైనదని గుర్తించుటయు- ఈ రెండు అవస్థలును అవిభాజ్యములైనవని జె యస్ మిల్ అనునతడు వక్కాణించెను ఒక పదార్థము వాంఛనీయమైనదనియు, అది ఆనందభరితమైనదనియు భావించుటయందెట్టి వ్యత్యాసము ఉండబోదు ఈ రెండు భావనలు సమానార్థకములే ఈ సిద్ధాంతమునుండి మిల్లు ఒక తుదినిర్ణయము చేసికొనెను "మన మెల్లప్పుడు సుఖమునే వాంఛించెదము, అనగా మన కోరికలకు సుఖమే పరమలక్ష్యము" ఈ తరగతికి చెందిన ప్రేయోవాదమునకు ప్రొఫెసరు సిజ్‌విక్ అనునాతడు మనస్తత్త్వ

ప్రేయోవాదమని పేరిడెను ఈ వాదములో పస లేదు ఇది మిగుల లోపభూయిష్ఠముగ నుండెనని రాష్‌డల్ అను పండితుడు సవ్యముగనే వ్యాఖ్యానించెను సకల వాంఛలను ఈడేర్చుకొనుటయందు నిస్సంశయమైన ఆనందము కలదు కాని ఇట్లు భావించుటకును, ఒకానొక విషయము ఆనందమును కలుగజేయునదిగా ఊహింపబడుటవలననే అది వాంఛింపబడినదని స్థిరముగా చెప్పుటకును చాల వ్యత్యాసము కలదు నిజమునకు, ఊహాజనితమైన ఆనందము కోరిక వలననే కల్గును కాని, కోరికమాత్ర మెన్నటికిని ఊహాజనితమైన ఆనందము వలన ఉత్పన్నము కాజాలదు ఈ దిగువ విషయము వలన ఈ సిద్ధాంతము మరింత స్పష్టముగా బోధపడ గలదు కోరిక లెప్పుడును అనుభూతికి పూర్వమే ఘటిల్లును ఆనందలబ్ధి కొరకై ముందుగనే కోర్కెలు జనింపనిచో, పెక్కు విధములైన ఆనందానుభూతులకు అసలు స్థానమే ఏర్పడదు అన్యుల సుఖ సంక్షేమములను వాంఛించిననే గాని, మానవు డెవడును వారి కరుణకు పాత్రుడై ఆనంద మనుభవించుట సాధ్యపడదు ఎట్టి పదార్థములను పొందుట వలన మనకు సుఖము కలుగునో, అట్టి పదార్థములనే వాంఛించెదము మనము కొన్ని పదార్థములను కోరుదుమనుట యథార్థమే కాని అంత మాత్రమున మనము ఆనందమును అభిలషింతుమను మాట మాత్రము వాస్తవము కాదు మనము విషయ వాంఛలను కలిగి యున్నంతమాత్రమున, ఆనందానుభూతులను వాంఛించు చున్నామనుట కది నిదర్శనము కాజాలదు

మిల్లు, బెంథాము లిరువురును మనస్తత్త్వప్రేయోవాదమును సమర్థించిరి మానవు డెపుడును సుఖమును వాంఛించి, దుఃఖమును బాపుకొనుటకు యత్నించుటచే, వా రావాదమును సమర్థించిరి కాని ఆనందలబ్ధి కొరకు మన మెంత ఎక్కువగా పాటుపడుదుమో, అది మన కంత అల్పముగా సిద్ధించునని సిజ్‌విక్ సూచించెను తాత్కాలికముగా ఆనందమను భావమును విస్మరించుట మూలముననే యథార్థమగు సుఖానుభూతిని బడయగలము అట్టి సమయములోనే మనము వాంఛిత ఫలముపై దృష్టిని మరల్చెదము ఫలసిద్ధి కలిగినప్పుడు ఆనందము స్వయముగ మనలను వరించును అట్లుకాక, మన దృష్టిని ఆనందముపైననే కేంద్రీకరించుచో, అది మనకు దాదాపు అలభ్యమే యగును మన మొక నాటక ప్రదర్శనమును చూచునపుడు, మన దృష్టి నంతను నాటకముపై లగ్నము చేయవలెను గాని, దాని నుండి మనము పొందు ఆనందముపై కాదు మనము ఉద్దేశపూర్వకముగా సుఖమునే వాంఛించితిమేని, మన కాశాభంగము కలుగక మానదు "మానవునిలో గాఢసుఖైక వాంఛ ప్రబలమగుచో, అది స్వీయ వ్యాఘాతమునకే దారితీయును" అందుచే ఈ సిద్ధాంతములో ప్రేయోవాదమునందలి వైపరీత్యము గోచరించును అందుచే సిజ్‌విక్ మనస్తత్త్వ ప్రేయోవాదమును త్రోసివైచి, నైతికప్రేయోవాదమును సమర్థించెను నైతికప్రేయోవాదము ప్రకారము, ఆనంద మనునది మానవునియొక్క సర్వసామాన్యమగు వాంఛాఫలితము కాదనియు, అది ఉత్తమమును, విశిష్టమునగు ఆశయమే అనియు ఆతడు వాదించెను ఆనందము మానవు డాశించు ఉత్తమమైన చరమ లక్ష్యమనిగూడ ఆత డుద్ఘాటించెను అట్టి ఆనందమునందే యథార్థమైన విలువగలదు ప్రపంచమునందలి ఇతర సద్విషయము లన్నియు ఈ ఆనందమునకు లోబడియే యుండును అందుచే ప్రతివ్యక్తియు ఆనందమును బడయుటకు యత్నింప వలయును కాని మన మెల్లపుడును తప్పక ఆనందమునే అనుభవింప ఉద్యమింతుమేని, మన మానందమును పొందవలయు ననుట అర్థహీనము. నుండును ఆనందము రెండు రూపములను గైకొనును 1 అహంకారపూరితమైనది, 2 పదార్థవాద సంభరితమైనది

అహంకారపూరిత ప్రేయోవాదము, ప్రతివ్యక్తియు అత్యున్నతమైన ఆనందమును అనుభవింప వలెనని చెప్పును ఎపిక్యూరస్ సిద్ధాంతము ప్రకారము యథార్థ సుఖ మనుభవించు ప్రతి జీవియు, న్యాయమగు హేతుబుద్ధి కలిగి, యుక్తాయుక్త విచక్షణజ్ఞానముతో వ్యవహరింపవలెను మనస్సంబంధమగు ఆనందమునకే ఎపిక్యూరస్ ప్రథమస్థాన మొసగెను వైవిధ్యమగు అట్టి ఆనందము తరతమ భేదములచే వేదనమునుండి, వ్యాకులత్వమునుండి విముక్తమై, చిరకాలము అనుభవనీయమగుటయే అందుకు కారణము కాని రెండవదానికంటె మొదటిది గుణాత్మకముగా ఉత్తమతర మైనదని ఆతడు గుర్తింపడు.

భారత దేశమునందలి చార్వాక మతానుయాయులు గూడ ఈ భావమునే సమర్థించెదరు వ్యక్తిపరమైన ఇంద్రియానందమును మానవుడు ఉత్తమమైన ఆనందముగా పరిగణింపవలెననియు, స్వర్గనరకములు లేవనియు, శాశ్వతమైన

జీవాత్మ అనునది శూన్యమనియు, అందుచే పునర్జన్మము అనునది లేదనియు చార్వాకుల మతము "కడుపునిండ భుజించి, కమ్మగ త్రాగి, ఆనంద మనుభవింపుము, అప్పుచేసి పప్పుకూడు భుజింపుము" అనునదే చార్వాకుని (క్రీ పూ ) సిద్ధాంతము వేదనముకంటె ఆనందమును అధికముగా చేకూర్చు కార్యమే సమంజసమైనది అనగా ఆనందముకంటె వేదనమును అధికముగా కలుగచేయు కార్యము నింద్యమును, వర్జనీయమునైనదని అర్థము

కాని అహంకారపూరిత శ్రేయోవాదము సమాన ప్రమాణముగల నైతిక విలువలను సృష్టింప జాలదు ఒకనికి ఆనందము చేకూర్చునది మరియొకనికి దుఃఖహేతువు కావచ్చును ఆనంద మనుభవించుట న్యాయమై, బాధల నాహ్వానించుట దోషమగుచో, అట్టి సందర్భమున నైతిక ప్రమాణము సమపాళములో నుండజాలదు, అనగా సర్వజనులచే సమానముగా పరిగణింపబడు నైతిక సిద్ధాంతమును త్రోసివేసినట్లే యగును

శ్రేయోవాదమునకు మెరుగులుదిద్ది, దానిని ఇంకను సంస్కరించిన వాడు జాన్‌స్టూవర్ట్ మిల్ (1806-73) అను పండితుడు వివిధములైన ఆనందానుభూతులలో గుణభేదములను గుర్తించి ఈత డట్టిసంస్కరణమునకు కడంగెను కొన్ని విధములైన ఆనందానుభూతులు ఇతరములైన వాటికంటె శ్రేష్ఠములైనవని ఆతని అభిప్రాయము కేవలము ఆనందదాయకము లగుటచేతనే వాటికి శ్రేష్ఠత్వము సంక్రమింపలేదు వాటియందు విశిష్టత కలదు కనుకనే, అట్టి ఉత్తమ స్థానము వాటికబ్బినది బెంథామ్ అనునాతడు ఆనందమునందు ఎట్టి గుణభేదము లున్నట్లు అంగీకరింపక, దానిని పరిమాణాత్మకముగనే లెక్కకట్టెను కళా, కవన, దాతృత్వ వ్యాసంగముల వలన కలుగు ఆనందముయొక్కయు, ఇంద్రియ సంబంధమైన ఆనందము యొక్కయు పరిమాణము సమానముగా నున్నప్పుడు, మొదటిరకపు ఆనందము రెండవ రకపు ఆనందముకంటె ఉత్తమమైనది కాజాలదు ఈ వాదమును జాన్‌స్టూవర్టు మిల్లు త్రోసిపుచ్చెను "సంతృప్తజీవియగు సూకరముకంటె, అసంతృప్తుడగు మానవుని జీవితమే ఉత్తమతరమైనది, తృప్తుడగు బుద్ధిహీనునికంటె, అసంతృప్తుడగు సోక్రటీసును అనుసరించినవాడే ధన్యుడు" అని మిల్లు వ్యాఖ్యానించెను అందుచే, వివిధములైన ఆనందములలో గల పరిమాణముతోపాటు అంతలి గుణవిశేషములలో గూడ మిల్లు వ్యత్యాసమును కనిపెట్టెను మానవునియందు విశిష్టమైన బుద్ధి నైతికత్వము సహజముగ నుండుటచే, అందుండి ఆనందముయొక్క గుణము ఉత్పన్నమగును కాని ఇట్టి ఆనంద గుణవిశేషము ప్రచ్ఛన్నరూపములో నున్న నైతిక గుణముకంటె అన్యము కాజాలదు ఇట్లు వాదించుట శ్రేయోవాదమును విసర్జించుటే యగును గుణనిర్ణయమునకు పరిమాణ మొక్కటే ఏకైక శ్రేయోవాద ప్రమాణము అనగా అదియే గాఢమగు ఆనందము. అది మనస్తత్వ శ్రేయోవాదమునుగూడ క్షీణింపజేయును వలన, ఆనందములో ఉత్తమ లక్షణమును మన మపేక్షించినచో, మనము ఆనందమునే వాంఛింపమని యర్థము "ఉత్తమ స్థాయికి చెందిన ఆనందము నెడల కలుగు వాంఛ యథార్థముగా ఆనంద లబ్ధికై జనించు కోరిక కాజాలదు"

మిల్లు, బెంథాము లిరువురు పరార్థ శ్రేయోవాదమును సమర్థించెదరు ఒకవ్యక్తి అనుభవించు ఆనందముకంటె, బహుజనులచే అనుభవింపబడు ఆనందమే వాంఛనీయమైనది అదియే ప్రపంచములో తుదివరకు మనగలుగు ప్రామాణికమైన నైతికసూత్రము ఆనందానుభూతులయందుండు వైవిధ్యమునుగూడ మిల్లు అంగీకరించెను బెంథాము పరార్థచింతన గలవాడయ్యును, పునః పునః అతడు మానవునియందు గల అహంకారమును గుర్తించెను ప్రతి మానవునియందు పరార్థచింతనకంటె స్వార్థచింతనయే బలీయముగా నుండును "స్వార్థప్రయోజనము ఈడేరునను దృఢనమ్మకము కలుగనిదే, మానవుడు అన్యులకు సాయముచేయగల్గునని కలలోగూడ నమ్మవద్దు" అని బెంథాము వాదము అట్టిచో, అహంకార, స్వార్థములనుండి పరార్థచింతనమునకు బెంథాము ఎట్లు ముందునకు సాగిపోగలడు ? మానవుడు సహజముగ అహంకారపూరితుడైనచో, అతడు అన్యులసుఖమును ఎట్లు అపేక్షించి, వారి సంక్షేమముకొరకై స్వీయసుఖమును త్యాగమొనర్పగలడు ? ఈ ప్రశ్నకు బెంథామ్ సమాధానమియ్యనే లేదు కాగా, మిల్లు సమాధాన మిచ్చుచు, సర్వజనక్షేమమెట్లు వాంఛనీయమో కారణము మాత్రము వివరించుట సాధ్యముకాదని చెప్పెను, కాని పరస్పర సహవాసమువలన ప్రతిమానవునకు తోడిమానవుని యెడల దయాదాక్షిణ్యములు కలుగునని మాత్రము వెల్లడించెను ప్రథమమున మనము అహంకార పూరితుల మగుచునే, మన బాధలనుండి విముక్తి

చెందుటకై ఇతరుల బాధలను నివారించియుంటిమి అనంతరము, ఈ స్వార్థచింతనతో కూడుకొనిన సానుభూతియే, సర్వజన శ్రేయోభిలాషగా మారినది తోడి మానవుల యొక్క బాధలను, కోరికలను సానుభూతితో పరిశీలింపగల లక్షణము ప్రతి మానవునియందు ఉత్పన్నమై, అది సాంఘిక చైతన్యముగా పరిణామము చెందినది ఈ సిద్ధాంతము ప్రయోజనవాదము అని పిలువబడెను వలన, మానవుని ప్రతిచర్యయు, దాని ప్రయోజనమునుబట్టి, ఈ సిద్ధాంతముచే నిర్ణయింపబడును ప్రయోజనకరమగు ప్రతిచర్యయు జనసామాన్యము యొక్క బాధలను నివారించి, వారి సుఖజీవనమునకు దోహద మియ్యవలెను

పరిణామ ప్రేయోవాదము (హెర్బర్ట్ స్పెన్సరుచే ప్రతిపాదితము)

మిల్లు, బెంథాములు ప్రతిపాదించిన ప్రేయోవాదము ప్రత్యక్షప్రేయోవాద మనబడుచున్నది హెర్బర్ట్ స్పెన్సర్, లెస్లీ స్టీఫెన్, అలెగ్జాండరులచే ప్రతిపాదింపబడిన వాదము పరిణామ ప్రేయోవాద మని పిలువబడు చున్నది స్పెన్సరు ప్రప్రథమముగా పరిణామ సిద్ధాంతమును నైతికప్రవర్తనమునకు అన్వయించెను నీతిబాహ్యమగు జంతు ప్రవర్తనమునుండి నైతికజీవనము పరిణామము చెందినది నైతిక ప్రవర్తనము, అభివృద్ధి వికాసములకు లోబడియుండును పరిణామ ఫలితమే నీతియనునది పరిణామదశ ద్వారా తప్ప, వేరొక మార్గమున నీతిసూత్రము గ్రాహ్యము కాజాలదు మానవుని ఆచరణము ఆతని ఆశయమునకు సరిపడునట్లు చేయుటయే మానవప్రవర్తనమని స్పెన్సరు నిర్వచించెను ఆంతరంగిక సంబంధములను బాహ్యసంబంధములకు నిరంతరముగా సరిపుచ్చుచుండుటయందే జీవితసారము ఇమిడియున్నది అనగా మానవశరీరము నిరంతరము పరిసర వాతావరణమును అనుసరించునని యర్థము మానవ ప్రవర్తనము ఇట్టి అనుసరణమునకు దోహద మొనర్చుటయో, కాక, ఆటంకపరచుటయో సంభవించును దోహదకారియగు ప్రవర్తనము సద్విషయమనియు, నిరోధకారియగు ప్రవర్తనము దుర్విషయమనియు అందుము ఎట్టిచర్యలు విధిగా మానవసౌఖ్యమునకు హేతుభూతములగునో, ఎట్టిచర్యలు మానవదుఃఖమునకు కారణభూతములగునో, మానవ జీవిత ధర్మములనుండి అనుమితి యొనర్చుట నీతిశాస్త్రముయొక్క విధ్యుక్తధర్మమని స్పెన్సరు నుడివెను ఈవిధముగా సత్ప్రవర్తనము మానవశ్రేయస్సుకు దోహదకారి కాగా, దుష్ప్రవర్తనము మానవశ్రేయస్సుకు భంగకారి యగును

జంతువులు సహజసిద్ధముగా సుఖమునపేక్షించి, బాధను తప్పించుకొనప్రయత్నించును ఆయాజాతుల జంతువులు వాటి ఆత్మరక్షణమునకై కొను వేర్వేరు చర్యలనుబట్టి వాటి బాగోగులు నిర్ణయింపబడును స్పెన్సరు ప్రేయోవాది ఆనందమే జీవితచరమ లక్ష్యమని ఆతని నమ్మకము రాజకీయ సాంఘిక, నైతిక, మతవిషయక నియంత్రణము మూలముననే నైతిక చైతన్యము చాలవరకు రూపొందును నైతికమర్యాద తాత్కాలికమైనది వ్యక్తిగతముగా మానవుడు సంఘమునకు సమగ్రముగను, సంపూర్ణముగను సంధానము కాకుండుటచే ఇట్టిస్థితి ఏర్పడును సంధానము సంపూర్ణమైనచో, నైతిక బాధ్యత గాని, విధినిర్వహణ జ్ఞానము గాని సంభవింపదు అది పూర్తిగా అదృశ్యమగును శీలమనునది అయత్నకృతమైనది పరిణామ ప్రేయోవాదమునకు "నైతిక ప్రకృతిశాస్త్ర" మని గ్రీన్‌పండితుడు మారుపేరిడెను

పైన పేర్కొనిన వాదముయొక్క అభివృద్ధి వికాసములు మాత్రమే వివరింపబడి, దాని ప్రారంభదశ వదలివేయబడుటచే, అది విమర్శమునకు గురియయ్యెను పూర్వము గుప్తముగను గూఢముగ నుండు దానిని పరిణామదశ బహిర్గతము మాత్ర మొనర్చును వాస్తవ పరిస్థితులనుండి ఆదర్శమును పరిణామము నొందించుటకు స్పెన్సరు యత్నించెను జీవశాస్త్రీయ విషయములనుండి నైతికవిలువలు పరిణామము చెందనేరవు నైతికభావ వికాసముయొక్క వెక్కుదశలను బహిర్గత మొనర్చుటచే కాక, ఆ భావమును ఇదమిత్థమని నిర్ణయించుటచే, విధాయకశాస్త్ర మనదగు నీతిశాస్త్రముయొక్క ముఖ్యకర్తవ్యము

మానవశరీరము పరిసర వాతావరణమునకు సరిపడుట యనగా, అది సాధింపవలసియున్న లక్ష్యము పూర్వమే ఊహింపబడుచున్నదని మెకంజీ పండితుడు నిరూపించెను నైతికజీవితములో మానవుడు తాను విశ్వసించిన నైతికభావమునకు పరిసర భౌతిక, సాంఘిక వాతావరణమును సరిపెట్టుకొనును నైతికజీవనమున, బాహ్యవాతావరణమును స్వీయ ప్రవర్తనమునకు సరిపెట్టుకొనవలెను గాని, తద్వ్యతిరేకముగ గాదు అనగా, ప్రకృతికి అనుకూలముగా తనను తాను

మలచుకొనుటగాక, తన నైతిక, రసజ్ఞాన చైతన్యమునకు ఇతోధికముగా అనుకూలపడునట్లు ప్రకృతినే తాను మలచవలె ననుట ఇదివరలో పేర్కొనినట్లు, ఈ సందర్భములో జీవశాస్త్రీయ పరిణామ సిద్ధాంతమును గాని, ప్రకృతివర్ణ సిద్ధాంతమును గాని, "బలాఢ్యునిదే భవిష్యత్తు" అను నానుడిని గాని నైతిక జీవితమునకు అన్వయింపరాదు నైతిక విషయము నందు పశుబలమునకు గాక, ధార్మికబలమునకే జయము సిద్ధించును అనగా ధార్మికబలమే యథార్థమైన బలమని భావము జంతుసామ్రాజ్యములో బలాఢ్యుడే శాసనకర్త కాగలడను సిద్ధాంతము చెల్లుబడి యగును నైతిక సామ్రాజ్యమునందట్లు గాక ధర్మవర్తనుడగు బలహీనుడే రక్షణమునకు పాత్రుడగును

నైతికపరిణామము జీవశాస్త్రీయ పరిణామములో ఏకభాగము కాజాలదు ఏలన, జీవశాస్త్రీయ పరిణామము నందు భౌతికవిషయములు అనివార్యములగును మానవశరీరము వంశపారంపర్యమును బట్టియు, బాహ్యావాతావరణమును బట్టియు నిర్మాణము పొందును జీవశాస్త్రీయ పరిణామదశలో మన స్వాతంత్ర్యమునకు అవకాశముండదు కాని నైతిక పరిణామమునందట్లుగాక మనస్వాతంత్ర్యమునకు అవకాశముండును ఆనందమునుగూర్చి, ఆవేదనమునుగూర్చి స్పెన్సరు గావించిన జీవశాస్త్రీయ వివరణము సమర్థనీయమైనదికాదు భోగలాలసత మానవుని ఆయుష్షును పెంపొందింపక, శక్తిసామర్థ్యములను క్షీణింపజేయును సుఖకారకమగు పదార్థము విధిగా ఆరోగ్యమునకు దోహదకారి కాజాలదు ఉదాహరణమునకు జీర్ణశక్తి, ఉచ్ఛ్వాసనిశ్వాసముల వంటి పెక్కు ప్రయోజనకరములగు శారీరకధర్మములు సుఖమును మరగిన వ్యక్తులయందు సాధారణముగా మృగ్యములగును

స్పెన్సరు పేర్కొనిన రాజకీయ, సాంఘిక, మతవిషయక నియంత్రణము నైతిక చైతన్యమును కల్గింపజాలదు అది 'తప్పదు'! అను నిర్బంధభావమును కల్గించునేగాని, 'యుక్తము, సమంజసము' అను సౌమ్యభావమును కల్గింపజాలదు ఆశక్తులు భౌతికనిర్బంధమునకు అవకాశమొసగునే కాని, నైతికాశయమునకు బద్ధునిజేయవు వ్యక్తికిని, సమాజమునకును నడుమ సమైక్యభావము సర్వదా వాంఛనీయము అట్టి ఐక్యము ద్వారా సంఘములోనుండు సంఘర్షణములు, క్లేశములు దూరమగుచు సంపూర్ణమగు ఇట్టి ఐక్యభావమును స్పెన్సరు మృత్యువుతో పోల్చెను జీవితములోని సంఘర్షణవు పోరాటము, పరివర్తనము అనివార్యములు పారమార్థికసిద్ధి లభింపక అసంతృప్తిచెందు పవిత్రహృదయుడు వాస్తవ ప్రపంచమునందలి సాంఘికవ్యవస్థతో ఎన్నటికిని తృప్తిచెందజాలడు

లెస్లీ స్టీవెన్సన్ అనువాతడు మానవ సమాజమును మానవశరీరముగా భావించెను మానవసమాజములో వ్యక్తులు అన్యోన్యాశ్రితులుగా జీవించెదరు సమాజమునుండి విడివిడి మానవుడు ఏకాకిగా జీవింపజాలడు శరీరవయవములవోలు సమాజము పరిసర వాతావరణ ప్రభావముచే అభివృద్ధిచెంది వికసించును ప్రతివ్యక్తియు సమాజమును నిరంతరముగా ఆశ్రయించుకొని అనుసరించవలెను వ్యక్తికి, సమాజమునకు నడుమగల సంబంధము బాహ్యపరమైనది, యాంత్రికపరమైనది కాదు అది అంతర్గతమైనది, ఇంద్రియ సంబంధమైనది స్టీవెన్సన్ సిద్ధాంతము ప్రకారము, జీవితపరమావధి మిల్లు, బెంథాము లూహించినట్లు, బహుజనముయొక్క గరిష్ఠ సౌఖ్యముకాక, సమాజముయొక్క సదారోగ్య సామర్థ్యములు మాత్రమే శాస్త్రీయమైన ఈ గీటురాయి సుఖమనిగాక, ఆరోగ్యసౌభాగ్యమని చెప్పవలెను సమాజముయొక్క సమష్టి క్షేమమునకై ఆచరించు ప్రతిచర్యయు మంచిదనవలెను, తద్వ్యతిరేకమైన ప్రతిచర్యయు చెడుదనవలెను మానవసమాజము ఏచరమ గమ్యమునకై ప్రయాణము సాగించుచున్నదో, అగమ్యమును స్టీవెన్ గుర్తింపడు కేవల బాహ్యరూపమును బట్టి మాత్రమే అతడు సమాజమునుగూర్చి భావించి, దాని ఆరోగ్య స్థిరత్వ సామర్థ్యములు మాత్రమే సాధింపవలసియున్న ఆశయములని తలచును సాంఘిక స్థైర్యమును పరిరక్షించుటకై వ్యక్తిపరమైన శీల మొక సామర్థ్యముగా అతడు పరిగణించును కాని సమాజముయొక్క ఆరోగ్యమును అపేక్షించుట, లోపరాహిత్యవాదముపై ఆధారపడుటయే యగును ఈ లోపరాహిత్యవాద సిద్ధాంతము ప్రకారము, సమాజము ద్వారా మాత్రమే మానవుని ఆత్మసాక్షాత్కారము సాధ్యమగును ఆత్మ సాక్షాత్కారమనగా స్వకీయమైన ఆశయ సిద్ధియని అర్థము ఆత్మాశయమే సమాజముయొక్క ఆశయమనియు, లేదా పాశ్చాత్మసిద్ధి లేక వివేకాత్మసిద్ధి అనియు చెప్పబడుచున్నది ఇది సమాజము ద్వారానే సిద్ధింపగలదు

ఆర్థిక శ్రేయోవాదము ఆర్థిక శ్రేయోవాద మనునది శ్రేయోవాదముయొక్క సాధారణ సూత్రముల ననుసరించి

ప్రతిపాదింప బడినది సుఖలాలసతను అపేక్షించు స్పష్టమైన భావప్రకటనమే అది సుఖలాలసత ప్రేయోవాదముయొక్క సహజ లక్షణము ఈ సందర్భములో సుఖమను శబ్దమును సాధారణమైన విలువదృష్ట్యా పరిశీలింపక, నిర్ణీతమైన ఒకానొక ప్రత్యక్ష స్వరూపము ద్వారా విచారింపవలెను సుఖము పెక్కు విధములుగ నుండును ఇంద్రియ సుఖము అందులో చేరినదే, సౌందర్యోపాసనము వలన, మానసిక సంబంధమైన వ్యాసంగములవలన, ఉదాత్తమైన ఆనందమును అనుభవింపగలము ఆర్థిక ప్రేయోవాదము ఇట్టి ఆనందమునకు ప్రాధాన్య మియ్యక త్రోసివుచ్చును ఆర్థిక ప్రయోజనములకు, ఆర్థిక సంక్షేమమునకు, సుఖవాంఛలను ఈడేర్చుకొనుటకై స్వేచ్ఛగా చేయు ధనవ్యయమునకు మాత్రమే అది ప్రాముఖ్యము నిచ్చును సూక్ష్మముగ చెప్పవలెనన్న, ఆర్థిక స్వాతంత్ర్యమే దాని ధ్యేయము ఆర్థిక సంక్షేమముద్వారా తప్ప, వేరువిధముగా ఆనంద మనుభవింప సాధ్యమగు నను దృష్టి ప్రేయోవాదమునందు మృగ్యము. మరొక విధముగా చెప్పవలెనన్న, ఆర్థిక సౌభాగ్యమునకు ఆనందము, భోగలాలసత ప్రాతిపదికలు కాగలవు ఈ రెండును జీవితమునకు అత్యావశ్యకములైనవి అందుచే, ఆర్థిక ప్రేయోవాదమునకు ఆర్థిక సౌభాగ్యము, ఆర్థిక సంక్షేమములుతప్ప, అన్య విషయములు కేవలము అప్రధానములుగా పరిగణింప బడును

ప్రేయోవాదము పెక్కు విమర్శనములకు గురియైనది ఈవాదము సమగ్రమైన మానవ ప్రకృతిమీద కాక పాక్షిక దృష్టిమీద ఆధారపడి యుండుటయే ఇందుకు కారణము మానవుడు సుఖమును కాంక్షించు మృదుత్వముగల వ్యక్తిగా ప్రేయోవాదము భావించును అందుచే భోగలాలసతను అనుభవించుటయే మానవ జీవితధర్మ మని దాని సిద్ధాంతము కాని, ఆత్మ సాక్షాత్కారముతోపాటు ఆనందమును, సుఖమును గూడ అనుభవించుటయే యథార్థమైన జీవితాదర్శము కావలెను

అదియును గాక ఆనందము, సుఖలాలసత-ఈ రెండును ఒకే ఒక విషయము కాదు అవి వేరువేరు విషయములు డ్యూయీ అను పండితు డిట్లు చెప్పెను, "సుఖలాలసత క్షణభంగురమైనది, తరతమ భేదము కలది ఆనంద మట్లుకాక, శాశ్వతమైనది, సార్వకాలికమైనది, సర్వవ్యాపకమైనది ఆనందము ఆత్మజ్ఞానముచే కలుగు సంపూర్ణానుభూతి పాక్షికమగు సుఖలాలస భావమునకు ఆనందము ప్రతికూలమైనది సర్వవిధములైన సుఖానుభూతుల సమ్మేళనము నుండి నిజమగు ఆనందము జనించును కేవలము పాక్షికమగు సుఖమును పొందుటవలన కలుగు ఆనందము దానికి వ్యతిరేకమైనదగును భోగలాలసత అశాశ్వతమైనది, ఆనందము శాశ్వతమైనది ఈ రెండింటినడుమ గల స్పష్టమైన తారతమ్యమును మిల్లు, బెంథాము లిరువురు గుర్తింపజాలక పోయిరి

మానవుని మనోభావములను హేతుబద్ధముగా సమీక్షించి సమైక్య మొనర్పవలసిన పవిత్ర బాధ్యతను అలక్ష్యము చేయుటయే ప్రేయోవాదముయొక్క ప్రధాన దోషము నైతికాదర్శమును అనుసరించి హేతుబద్ధముగా మానవుని ఇంద్రియ జ్ఞానమును క్రమబద్ధ మొనర్చుటయే నీతి యనబడును

ఖ బే ఆ

## ప్రేలుడు పదార్థములు :

ఏ వస్తువులు వాయురూపము పొంది, పరిమాణము పెరుగుటవలన అత్యధిక పీడనశక్తిని పొందగలవో, అవి ప్రేలుడుపదార్థము లనబడును అవి ఘన, ద్రవ, వాయురూపములలో నుండవచ్చును అట్టి స్థితి విపరీతమైనచో, అందుండి ఉష్ణముకూడ ఉత్పత్తి కావచ్చును ఈ గుణములను ఆధారముగ చేసికొని ఈ ప్రేలుడు వస్తువులను అనేక రీతులుగా ఉపయోగించుకొను చున్నాము

చాలకాలము క్రిందట రోగర్ బేకన్ అను శాస్త్రజ్ఞుడు పొటాసియమ్ నైట్రేట్ ను శుద్ధిచేయ ప్రయత్నించెను అప్పుడది ప్రేలి చుట్టుప్రక్కలకు చిందగా, అది ప్రమాదకరమైన శక్తికలదియని అతడు కనిపెట్టెను ఈ గుణము నాధారముగ చేసికొని అతడు తుపాకిమందును తయారుచేసెను అది పొటాసియమ్ నైట్రేట్, బొగ్గు, గంధకముల కలయికచే నేర్పడును ఆ బేకన్ శాస్త్రజ్ఞుడే ఈవిషయమును కనిపెట్టుటలో పితామహుడుగా పేర్కొనబడుచున్నాడు తరువాత చాలకాలము వరకు ఈతుపాకిమందు మిశ్రమములో కొలది మార్పులుతప్ప, ప్రత్యేకములైన పరిశోధనములు జరుగలేదు ఇటీవల 75 సంవత్సరములనుండియు పెక్కురకముల ప్రేలుడు వస్తువులు సిద్ధము చేయబడు చున్నవి

ఈ ప్రేలుడువస్తువులలో కూడ అనేకరకములు కలవు వాటిలో కొన్ని కేవలము స్థానికముగా ప్రేలి, గనులను పగుల

గొట్టుటకును, ఖనిజములను భస్మము చేయుటకును పనికి వచ్చునవి ఇవి ఒక తరగతికి చెందినవి వీటినే యుద్ధములలో ఉపయోగించునపుడు అందు గంధకము ఎక్కువ పాళ్ళలో కలుపబడును గంధకముకంటె తీవ్రతరమైన ప్రేలుడు శక్తి గల్గిన రాక్షెట్లుగా చేయబడు కొయ్యనారను కూడ వాడ వచ్చును అధికమైన ప్రేలుడు శక్తికలిగి, చాల దూరము వరకు ప్రమాదము కలుగ జేయువాటిని విస్ఫోటకము లందురు ఎజైడ్స్, హైడ్రజైడ్స్, ఫల్మినేట్స్ అను ప్రేలుడుపదార్థములను వీటినిర్మాణమునందు వాడుదురు

వస్తువులు సాధారణముగా రెండురకములుగనున్నవి స్వీయనిర్మాణములో అధికముగా వేడిమిని తీర్ణించుకొను వాటిని ఉష్ణగ్రాహకము లందురు తయారగునపుడు వేడిమిని బయల్పరచువాటిని ఎక్సోథర్మిక్ అందురు వీటిలో మొదటి రకపు వస్తువులు ప్రేలుడు పదార్థములకు బాగుగా ఉపయోగ పడును ఉత్తమమైన ప్రేలుడువస్తువుల కుండవలసిన లక్షణము లివి

1 కొద్దికాలములో గాలి వాయు రూపమును పొందుట
2 అధికముగా ఉష్ణమునుగూడ ఉత్పత్తి చేయగల్గుట
3 ఒకేసమయములో పై రెండు పనులను చేయగల్గుట

గాలి, ప్రేలుటలో అవసరమైన ప్రాణవాయువును ఈ పదార్థములు కొన్ని సమయములలో పరిసరములనుండి గ్రహించును అప్పుడప్పుడు ఆవాయువును అంతర్భాగముల నుండి కూడ కలుపుకొన వచ్చును

ప్రేలుడు పదార్థములను పెక్కువిధములుగా విభజింప వచ్చును

1 మెల్లగాగాలి వాయువుగా మారునవి (ఉదా తుపాకిమందు, తోటాలు మొదలగునవి) వీటిని చోదక పదార్థములుగా వాడుదురు
2 అధికశక్తిగలవి (ఉదా ఆమటాల్, తుపాకిదూది
3 ఆరంభకములు, మెర్క్యురి, ఫల్మినేట్.
4 (అ) విపరీతమైన పొగను పుట్టించునవి
(ఆ) రంగురంగుల మంటలను కల్పించునవి
(ఇ) అగ్నిజ్వాలలను లేపగల్గినవి
5 రాసాయనిక స్వభావముకలవి (పైరోటెక్నిక్ మిక్స్చర్స్)

ధ్వంసకారకములు వీటిలో ప్రధానమైనవి (1) డైనమైట్ (2) కార్డైట్ (3) గన్‌కాటన్ వీటిని స్వీడిష్ రసాయనశాస్త్రజ్ఞుడైన ఆల్‌ఫ్రెడ్ నోబెల్ కని పెట్టెను వీటితో బాంబులు, షెల్సు, యుద్ధసహాయకమైన పెక్కు ప్రేలుడువస్తువులు చేయుదురు నోబెల్ తనజీవితమునంతయు ఈ వ్యాపారములోనేగడపి, విశేషముగా ధనమును ఆర్జించెను చరమకాలములో అతడు పశ్చాత్తప్తుడై ఆధనము నంతయు నొకనిధిగా ఏర్పరచి, దానిమీద వచ్చువడ్డీతో ఎల్ల ప్రపంచములో అయిదురంగములందు అత్యంత మేధావంతులయినవారికి అయిదు నోబెల్ బహుమానములను ఏర్పరచెను వాటిని ఏటేటా (1) సాహిత్యము (2) వైద్యము (3) శాంతి (4) భౌతికశాస్త్రము (5) రసాయనశాస్త్రము అనువాటిలో అత్యంత ప్రముఖులైన వారి కొసగనేర్పాటు కావించెను

అమెరికాలో ఎక్కువగా వాడబడు ప్రేలుడు పదార్థములైన బ్లాస్టింగ్ పౌడర్, డైనమైట్, కార్డైట్ మున్నగు వాటిని చేతిబాంబులలోను, తుపాకులలోను, టార్పెడో నిర్మాణమునందును వాడుదురు ఎక్కువగా నత్ర మిశ్రద్రవ్యముల నుపయోగించుదురు ఈప్రేలుడు పదార్థములను సిద్ధము చేయుటలోగాని, వాడుటలోగాని వివిధదేశములలో భిన్న భిన్నములైన నిబంధనము లున్నవి ఈ ప్రేలుడు పదార్థముల వ్యాపారమును లైసెన్సు లేనిది చేయుటకు వీలులేదు వీటిని తయారు చేయుటలో వాడబడు కొన్నివస్తువు లీక్రింద ఉదాహరింపబడినవి

(1) టి ఎన్ టి గెలటిన్ (2) నత్రక్రొవ్వుతైలము (3) నైట్రోసెల్యులోజ్ (4) గంధకము (5) పిండిపదార్థము (6) బొగ్గు (7) సురేకారము (8) సోడియ నత్రితము

ఆధునిక కాలములోని అణుబాంబులతోను, హైడ్రోజను క్లియర్ బాంబులవంటి వాటితోను పోల్చినయెడల, విధ్వంసక శక్తిలో, ప్రాతకాలపు ప్రేలుడువస్తువు లెంతమాత్రమును దీటైనవి కావని స్పష్టమగుచున్నది

మా కో

## ప్రోలయ వేమారెడ్డి

వేమారెడ్డి తండ్రి ప్రోలయ కాల వేమయ ఈ వేమయదే వీరి వంశకర్త వీరిది వెల్లచేరి గోత్రము వేమని తల్లి నిక్రమ సింహపురపు దొడ్డారెడ్డి పుత్రిక అన్నమాంబ ఇతని కాల వేమయ కాకతీయ రుద్రమదేవి కొలువున సైన్యాధిపతిగ నుండి కుటుంబమునకు పేరుప్రతిష్ఠలు తెచ్చెను ఇతడు ప్రతాపరుద్రుని సేనానాయకులలో నొకడు ప్రోలయయు, వేమయయు ప్రతాపరుద్రుని కాంచీ దండయాత్రలో పాల్గొని యుండిరి ప్రోలయవేముని మాతామహుడు దొడ్డయయు, మేనమామ నాగసేనాధిపతియును 1323 లో ప్రతాపరుద్రునికిని, ఢిల్లీసుల్తాను మహమ్మదు బిన్ తుగ్లకునకును జరిగిన యుద్ధములో పాల్గొనియుండిరి

ప్రోలయ వేమారెడ్డి పంటదేసటికులమున జనించి, కాకతీయ సామ్రాజ్యమున సేనానాయకుడై తురుష్కుల దండయాత్రలచే సామ్రాజ్య మంతరించెడు తరిని అద్దంకి రాజధానిగ కందుకూరు మొదలు గోదావరి తీరమువరకును, తన భుజబలముచే జయించి రెడ్డిరాజ్యమును స్థాపించి 1325 నుండి 1353 వరకు రాజ్యమేలెను

ప్రోలయరెడ్డికి గల ఏవురు కుమారులలో ఇతడు అగ్రజుడు కాకున్నను యుద్ధనైపుణ్యము ఇతని రాజకీయ దూరదృష్టివలన అభివృద్ధిగాంచెను ముసునూరి ప్రోలయనాయకుని దాయాదుడును, పినతండ్రి కుమారుడును అయిన కాపయనాయకుని డెబ్బదిఅయిదు సామంతనాయకులలో ప్రోలయవేమారెడ్డి యొకడై వారలతో బాటు మహమ్మదీయుల నెదుర్కొనుటలో ముఖ్యపాత్ర వహించి యుండెను

ప్రోలయవేమారెడ్డి ప్రోలయనాయకునితో కలసి ఆంధ్రదేశమునుండి మహమ్మదు బిన్ తుగ్లకు సైన్యములను పారద్రోలిన తదుపరి స్వతంత్ర రెడ్డి రాజ్యమును స్థాపించెను మహమ్మదీయ సైన్యములను తరిమివేయుట 1328 ప్రాంతమున జరిగియుండవచ్చును తదుపరి రెండేండ్లతరువాత ఇతడు స్వతంత్రరాజ్యమును స్థాపించెను ఇతడు స్వతంత్రరాజ్యమును స్థాపించుటలో ప్రోత్సాహ మొసగినది గంగదేవుడు ఈతడే ఘోడేరాయ గంగదేవుడని వ్యవహరింపబడుచుండెను ఇతడు శ్రీశైలప్రాంతపు త్రిపురాంతక దేవుని భక్తుడు, మహాపాశుపత యోగి, అంటదేవునిమంత్రి, గురువు, రాజనీతివేత్త

ప్రోలయ వేమారెడ్డి రణమొనర్చిన ప్రాంతములకు గుండ్లకమ్మ, గౌతమీనదు లెల్లలుగా నుండినట్లు మల్లవరపు శాసనములో చెప్పబడినది మహమ్మదీయుల దాడులకు పూర్వము బ్రాహ్మణులు ఈ నదుల ప్రాంతములలో అగ్రహారము లనుభవించి, మధ్యలో కోల్పోయి, తిరిగి ప్రోలయ వేమారెడ్డివలన పొందినట్లు తెలియుచున్నది ప్రోలయ వేమారెడ్డికి యుద్ధములలో సోదరులేగాక మేనమామలుగూడ సాయపడిరి ప్రోలయ వేమారెడ్డి రాజయిన కొద్దికాలము లోనే అతని కనిష్ఠసోదరుడు మల్లారెడ్డి తెలంగాణముపైనేగాక కోస్తా జిల్లాలపై దాడిచేసిన అల్లావుద్దీను నోడించినటుల హరివంశకారుడు చెప్పినాడు ఈ యుద్ధములో ప్రోలయవేమారెడ్డి పుత్రుడగు అనపోతారెడ్డి పాల్గొనెనని తెలియుచున్నది హరివంశము ప్రకారము ప్రోలయ వేమారెడ్డి తమ్ముడును, సేనానాయకుడును అగు మల్లారెడ్డి తురుష్కులనుండి మోటుపల్లి రేవును జయించెను కేవలము తూర్పురేవగు మోటుపల్లిని స్వాధీనపరచుకొనుటతో తూర్పు ప్రాంతమంతయు స్వాధీనము కాలేదు ఇతనికాలపు శాసనములవలన ఇతని రాజ్యమును గురించిగాని, ఇతని యుద్ధములను గురించిగాని, ఎక్కువ చారిత్రకాంశములు తెలియరావు ఇతడు క్రమక్రమముగ బలమును చేకూర్చుకొనుచు, చుట్టుప్రక్కల తిరుగుబాటొనర్చు నాయకుల నణచుచు, రాజ్యవిస్తీర్ణము గావించెను ఇతడు 84 దుర్గములు కట్టించెనని చెప్పబడినది వీటిలో ధరణికోట, ధనదుప్రోలు, వినుకొండ కొండవీడు, బెల్లంకొండ ముఖ్యమైనవి ఇతడు చుట్టుప్రక్కలనున్న పూర్వము కాకతీయ చక్రవర్తుల సామంతరాజులైన బోయవిషయ దేశనాయకులను జయించెను ఆరోజులలో త్రిపురాంతకము వ్యాపారమునకు కీలకస్థానముగ నుండెను దీనిని గ్రహించి ప్రోలయ వేమారెడ్డి ఆప్రాంతపు రాజగు భక్తిరాజు నెదుర్కొని, యతనినోడించి శ్రీశైలపు పరిసరప్రాంతములను స్వాధీనపరచుకొనెను అతని జీవితావసానకాలమునకు రాజ్యపు టెల్లలు ఉత్తరమున కృష్ణానది, దక్షిణమున నెల్లూరుజిల్లాలోని కందుకూరు, పడమట కర్నూలుజిల్లాలోని శ్రీశైలములుగా నుండెను

ప్రోలయ మహామండలేశ్వర బిరుదమును వహించలేదు. రెడ్డిరాజు లెవ్వరును అట్టిబిరుదములను దాల్చియుండలేదు విజయనగర రాజులగు హరిహర బుక్కరాయలు రాజ్యప్రారంభములోనే యట్టిబిరుదములు దాల్చియుండిరి దీనికి కారణము కలదు మునునూరు నాయకులగు ప్రోలయకాపయ

నాయకులును అట్టిబిరుదములను దాల్చియుండలేదు ప్రోలయ వేమారెడ్డికి వారిపట్ల కడు శ్రద్ధాభక్తు లుండుటవలన, వారి వలెనే ఇతడు ధరించకపోవుటయు. తదుపరి రెడ్డిరాజు లెవరును దాల్చకుండుటయు తటస్థించెను

ఇతడు ప్రోలయ నాయకునికి విశ్వాసపాత్రుడుగను సామంతుడుగను నుండెను ప్రోలయ, కాపయ నాయకులు కాకతీయరాజ్య సముద్ధరణకు బద్ధకంకణులై యుండిరి ప్రోలయ వేమారెడ్డి ప్రోలయ నాయకుని పిదప కాపయ నాయకునికిగూడ విశ్వాసపాత్రుడుగను, సామంతుడుగను నుండి, వారలతో పాటు పెక్కుయుద్ధములందు పాల్గొనెను ఆంధ్రదేశమును మహమ్మదీయులనుండి రక్షించుటకు తాను, తన అన్నదమ్ములతోపాటు, సర్వసేనలను వినియోగించెను

ముందు ప్రోలయ నాయకునికి, తదుపరి కాపయనాయకునికి నామమాత్రముగ సామంతుడుగ వ్యవహరించినను ఇతడు స్వతంత్రముగ వ్యవహరించుచునే వచ్చెను ఆయాధిపత్యమును ఎక్కువకాలము పాటించలేదు తెలంగాణముపై బహమనీ సుల్తానగు అల్లాఉద్దీన్ హసన్‌షా తొలిసారిగా దాడిచేయుటచే, కాపయ నాయకుని బలము క్షీణింపసాగెను అతడు పూర్వతీరపు దేశముపై యాజమాన్యము వహించలేకుండెను ఆ ప్రాంతములో కాపయ నాయకుని ప్రతినిధి యగు అనపోత నాయకుడు మహమ్మదీయులనుండి గాని, ఇతర హిందూరాజుల దాడులనుండి గాని దేశమును రక్షింప గల శక్తిశాలిగ లేకుండెను ఈ బలహీనతను పురస్కరించుకొని ప్రోలయవేమారెడ్డి తన భవిష్యత్తును చక్కదిద్దుకొనుటకు, స్వతంత్రముగా రాజ్యము పాలించుటకు నిశ్చయించుకొనెను ఈవిధముగ మునునూరి కాపుల ఆధిపత్యమును ఇతడు ధిక్కరించెను

రెడ్డిరాజ్యముతోపాటు స్థాపించబడి అభివృద్ధి యగుచున్న విజయనగర సామ్రాజ్యపు రాజులతో వేమారెడ్డి పోరి నెల్లూరిజిల్లాలోని ఉదయగిరిని దాటిరాకుండ వారిని అడ్డగించుచు వచ్చెను

ఇతనికి ముగ్గురు పుత్రులు, ఇద్దరు పుత్రిక లుండిరి అనపోత, అనమాచ, అనవేమ యను ముగ్గురు పుత్రులలో అనమాచ బాల్యముననే మరణించెను. ప్రోలయ వేమారెడ్డి తన జీవిత కాలములోనే అనపోతారెడ్డిని యువరాజుగా చేసెను అతనికి రాజ్యమేలు శిక్షణము నిచ్చెను తాను ఉబ్బసవ్యాధిపీడితుడగుటచే 1350 నాటికి సంపూర్ణ రాజ్యభారము అనపోతారెడ్డికి అప్పజెప్పి విశ్రాంతి తీసికొనుచు మూడు సంవత్సరముల తదుపరి (1353) పరలోక గతుడాయెను

ఇతని మొదటిపుత్రిక దొడ్డాంబ, మొదటి కాటయరెడ్డి పౌత్రుడును, మారయ పుత్రుడును అగు రెండవ కాటయ రెడ్డిని పెండ్లాడెను రెండవ పుత్రిక భక్తిరాజు పుత్రుడగు భీమచోడుని పరిణయ మయ్యెను

**వేముని శీలము** ఇత దన్నదమ్ములలో గుణజ్యేష్ఠుడు చిన్నతనమునుండి కాకతీయ సేనానియైయుండి షాడ్గుణ్య ప్రయోగముల నెరిగినవాడు. విశేషించి విలువిద్య నేర్చిన వాడు ఆనాటికి ప్రయోగములోనున్న సమస్త శస్త్రక్రియల యందును పరిచితిగలవాడు, మహావీరుడు త్రిపురాంతక విశ్వనాథదేవపాదారవింద సక్తమానసుడు ఇతని శీలమునకు వైదికధర్మ స్థాపనము బీజము ఆగమశైవము కీలకము సామ్రాజ్య స్థాపనమునకు శ్రీ పర్వతేశభక్తి వ్యాపృత ఘోడేరాయగంగ గురువర్యుని ఆశీర్వచన ప్రాద్బలము కారణము

ఇతడు రాజ్యస్థాపనము చేయుటకు ముందు విశేష కోశసంగ్రహణము చేసెను ఇతని కోశాధికారి అవచిసెట్టి. వేముడు రాజ్యప్రారంభములోనే శ్రీశైల, అహోబిలము లలో సోపాన నిర్మాణము గావించి తన ఈశ్వరభక్తిని ప్రకటించుకొనెను ఈ సోపాన నిర్మాణమునకు సేనను సేకరించుటకు అవచిసెట్టి ధనసహాయము చేసెను. ప్రోలయ వేమారెడ్డి పాతాళగంగకుగూడ మెట్లు కట్టించెనని తెలియుచున్నది వేముడు అనేక అగ్రహారములను విద్యా లపోవృద్ధుల కిచ్చెను వీటిలో బ్రహ్మభట్టు అను బ్రాహ్మణునకు 1330 లో ఇచ్చిన హశ్వేరు గ్రామము 1335 లో చిట్టిమంచి తిమ్మభట్టు శాస్త్రిలవారికిచ్చిన రామతీర్థము, 1344 లో ఎలకూచి వల్లభశిష్టుకు ఇచ్చిన మంచాళ్ళ గ్రామము ముఖ్యమైనవి మ్లేచ్ఛు లపహరించిన విప్రాగ్రహారములను తిరుగ ఉద్ధరించి మరల దానము లొనర్చెను,

ప్రోలయ వేముడు చెరువులు, గుళ్ళు ప్రతిష్ఠించెను సత్రములు, చలివందిళ్ళు, తోటలు, నిధులు నిలిపెను హేమాద్రి దానఖండములో చెప్పిన దానములన్నియు నిర్వర్తించెను ఇతడు మహాశైవుడైనను విష్ణుగాథలయందుకూడ అభిమానము కలవాడు. తత్కథా ప్రసంగమతియై వరలెను వేముడు చుట్టాలమేరువు సోదరులు, మాతులుడు, మాతుల

పుత్రులు - వీరందరిని సామ్రాజ్యమునందు ముఖ్య పదవులం దుంచి, వారలను తన సౌహార్దముచే వశపరచుకొని, వారల సాయమున సామ్రాజ్యకార్యము నిర్వర్తించుచుండెను ప్రజలయం దీతడు మిక్కిలి యనురాగము గలిగి వారి కేయపాయము రాకుండ వారిని కంటికి రెప్పవలె గాచు చుండెను

**వేముని రాజ్యాంగము** వేముడు గిరిదుర్గముల నాక్రమించి, వాటియందు తన బంధువులను సైన్యములతో నుంచి పాలించు చుండెను తన రాజ్యపు దుర్గములలో అశ్వ, గజ, భటసైన్యముల నుంచెను కాకతీయ సామ్రాజ్యమందలి ఇతర కట్టుబాట్లన్నియును స్థిరముగనే యుండెను మోటుపల్లిరేవును మల్లారెడ్డి గెలిచిన తదుపరి నౌకావ్యాపారమును ప్రోలయ వేముడు తిరిగి ఉద్ధరించెను

**సాహిత్యపోషణము** రెడ్డిరాజులకాలము సంస్కృతాంధ్ర సాహిత్యములకు వసంత మని చెప్పవచ్చును రెడ్డిరాజులు కవి పండితులను పోషించుచు వారలచే కృతులనందిరి ఇతర శ్రీమంతులు రాజుల ననుసరించు చుండిరి రెడ్డిరాజులు కేవలము భాషాపోషకు లగుటయేగాక, స్వయముగ పండితులై కృతులను రచించిరి ప్రోలయ వేమారెడ్డి రచనలు గావించినట్లు తెలియరాదు అతడు గొప్ప పండితుడని కవులు కృతులలో వర్ణించినారు వేమారెడ్డి పండితులను, ఆస్థానమును సందర్శింప వచ్చిన కవులను బాగుగ ఆదరించి సమ్మానించుచుండెను శివవంశజుడును, గొప్ప సంస్కృతకవియు నగు మహాదేవుని కీత డాశ్రయ మిచ్చెను ఈమహాదేవుని వంశజుడు లొల్ల లక్ష్మీధరుడు ఇతడు తొలుత విజయనగర రాజుల ఆస్థానకవిగా నుండెను తదుపరి ప్రోలయ వేమారెడ్డి అతనిని విద్యాధికారిగా నియమించెను తెనుగు సాహిత్యమునుగూడ రెడ్డిరాజులు పోషించిరి రెడ్డిరాజుల ఆస్థానము నలంకరించిన ప్రథమ ఆంధ్రకవి ఎఱ్ఱాప్రెగ్గడ యని చెప్పవచ్చును ప్రోలయ వేమారెడ్డికి ఎఱ్ఱనార్యుని గుణగణమునగల పక్షపాతము స్పష్టము ఎఱ్ఱాప్రెగ్గడను మహాకవిగా గ్రహించి చేరదీసినది మొదట మల్లారెడ్డియే యని చెప్పవచ్చును

ఎఱ్ఱాప్రెగ్గడకు గుడ్లూరు గ్రామమున మల్లారెడ్డితో పరిచయ మేర్పడెను ఈకవి అరణ్య పర్వశేషము, లక్ష్మీనృసింహపురాణము, రామాయణము, హరివంశము రచించెను అరణ్య పర్వశేషమును రచించుటవలన అతని కీర్తి నలుదిశల వ్యాపించెను నృసింహపురాణము అహోబిల నృసింహస్వామికి అంకిత మీయబడినది ఎఱ్ఱన, రామాయణమును ప్రోలయవేముని కోరిక ప్రకారము రచించినట్లు తెలియవచ్చుచున్నది కాని అది నామమాత్రముగనే యున్నది ప్రోలయ వేమారెడ్డి కోరికపై రచింపబడిన తుదికృతి 'హరివంశము' ఇందు కవి, కృతిపతిని పొగడుటలో అతిశయోక్తులు లేవు ఇది యొక అపూర్వ విషయము కృతిపతి కృతికర్తల ఆడంబరరహిత జీవితముల కిది చక్కని నిదర్శనము

ఎఱ్ఱాప్రెగ్గడ తన హరివంశములో వేమారెడ్డి యొక్క వర్ణనము చేసినాడు వేమారెడ్డి ధనుర్విద్యాప్రవీణుడు, గొప్ప యోధుడు, పరస్త్రీ విముఖుడు, వినమ్రుడు, శైవభక్తి గలవాడు, సప్తసంతానములను స్థాపించినవాడు, తపోధనులును, విద్వత్కవులును అగు బ్రాహ్మణుల కగ్రహారములు విరివిగా నిచ్చినవాడు

క వి

## ప్రోలరాజు (రెండవ)

(క్రీ శ 1110–1158)

ఆంధ్రదేశము నేలిన రాజవంశములలో కాకతీయవంశ మొకటి ఈ వంశపు రాజులు క్రీ శ సుమారు 1000 నుండి 1323 వరకు మొదట అనుమకొండను తరువాత ఓరుగల్లును రాజధానులుగ చేసికొని స్వతంత్రముగ పాలించిరి వీరిపుట్టు పూర్వోత్తరములను గూర్చిగాని, "కాకతీయ" అను వంశ నామమునుగూర్చిగాని చరిత్రకారులు నిశ్చితాభిప్రాయమునకు రాజాల కున్నారు వీరిప్రాచీనులు రాష్ట్రకూట రాజులయొద్ద సామంతులుగను, దండనాయకులుగను ఉండి, తెలంగాణమున కొరవి ప్రాంతమునకును, తరువాత అనుమకొండకును వచ్చి చేరిరి అటుపిమ్మట వీరు కల్యాణిచాళుక్యుల సామంతులుగ మారినట్లు తెలియుచున్నది కాకతీయ వంశనామము వారి మొదట నివాస స్థలమగు కాకతి యను నగరమును బట్టి ఏర్పడెనని కొన్ని శాసనములు తెలుపుచున్నవి కాకతియను దేవత వారికి కులదేవత యగుటనుబట్టి ఆ వంశనామ మేర్పడెనని ప్రతాపరుద్రీయ వ్యాఖ్యాతయగు కుమారస్వామిసోమ పీథియు, క్రీడాభిరామకర్తయు తెలిపిరి క్రీ. శ 1504 నాటి దగు సితాబుఖాను (సీతాపతిరాజు) శిలాశాసనము కూడ ఈ విషయమునే సూచించుచున్నది అట్లే వీరు క్షత్రియులా లేక చతుర్థకులజులా అనెడి సమస్య యొకటి చిరకాలమునుండి

చరిత్రకారులలో అనిశ్చితమై యున్నది రాజ్యరక్షణమందు ప్రతాపాది గుణములనుబట్టి వీరికి వృత్తిధర్మము ద్వారా క్షత్రియత్వము లభించినదని కొందరు తలచుచున్నారు

క్రీ శ 1000 సం॥ పూర్వము కాకతివంశమునకు చెందిన మొదటి బేతరాజు, అనుముడు, కొండడు అను యోధులను నిర్జించి, అనుమకొండను తన రాజధానిగ జేసికొనెను ఇతడు పశ్చిమ చాళుక్య చక్రవర్తి యగు ఆహవమల్ల మొదటి సోమేశ్వరుని అనుయాయిగ నుండెను మొదటి బేతరాజు కుమారుడు మొదటి ప్రోలరాజు సుమారు 1052 నుండి 1076 వరకును, మొదటి ప్రోలరాజు కుమారుడు రెండవ బేతరాజు సుమారు 1088 వరకును, చాళుక్య చక్రవర్తియగు ఆరవ విక్రమాదిత్యునకు (క్రీ శ 1076–1126) సామంతులై యుండిరి రెండవబేతరాజు గతించిన పిమ్మట అతని పెద్దకుమారుడు త్రిభువనమల్ల దుర్గరాజు సుమారు క్రీ 1098 నుండి రాజ్య మేలినట్లు ఖాజీపేట దర్గాయందున్న అతని శాసనమునుబట్టి తెలియుచున్నది. తర్వాత అతని సోదరుడగు రెండవ ప్రోలరాజు రాజయ్యెను ఈ రెండవ ప్రోలరాజును పేర్కొను మొట్టమొదటి శాసనము అనుమకొండయందలి పద్మాక్షి గుట్టపై ఉన్నది అది క్రీ శ 1117 వ సంవత్సరము నాటిది అందితడు కళ్యాణి చాళుక్య చక్రవర్తియు, త్రిభువనమల్ల బిరుదాంకితుడును అగు ఆరవ విక్రమాదిత్యుని (1076–1126) సామంతుడుగ పేర్కొనబడెను రెండవ ప్రోలరాజును గూర్చిన విశేషములను తెలుపు మరిరెండు శాసనములు కాజీపేటలో కలవు ఇవి క్రీ శ 1117 తరువాతికాలమునాటివి క్రీ శ 1149 వ సంవత్సరమునకు చెందిన మరియొక శాసనము కరీంనగరంజిల్లా శనగవరం గ్రామములో లభించినది ఇందుకూడ రెండవ ప్రోలరాజును గూర్చి ప్రశంసచేయబడినది ఈ శాసనాధారములవలన కాకతీయ వంశజుడగు రెండవ ప్రోలరాజు కళ్యాణి చాళుక్య ప్రభువులగు మూడవ సోమేశ్వరునకును, రెండవ జగదేకమల్లునకును సామంతుడుగ నున్నట్లు స్పష్టపడుచున్నది వారి క్రింద ఈ కాకతి రాజులు మహామండలేశ్వరులలో మిన్నలై యుండిరి అప్పటికి అనుమకొండ విషయముతో గూడిన సబ్బిమండలము రెండవ ప్రోలుని యధీనములో నుండెను ఈతని ఉద్యోగులు పై మండలములో పన్నులు వసూలు చేయుచుండిరి క్రి శ 1151 వ సం॥ లో కళ్యాణి చాళుక్య చక్రవర్తియగు రెండవ జగదేకమల్లుడు గతించెను అంతట ఈతని తమ్ముడు మూడవ తైలపుడు చాళుక్య సింహాసనమధిష్ఠించెను గూడూరు, మాటేడు శాసనములు కాకతీయుల గూర్చియు, వారిసామంతుల గూర్చియు, ప్రశంస చేయుచున్నవి క్రీ శ 1158 వ సం॥ నాటి దాక్షారామశాసనములో కూడ కాకతీయ రాజులను గూర్చి కొన్ని అంశములు తెలియవచ్చుచున్నవి ఇందు కాకతీయ సామంతుడగు బ్రమ్మిరెడ్డి దాక్షారామ భీమేశ్వరదేవరకు అఖండ దీపారాధన కొరకై కావించిన దానము సూచింపబడినది క్రీ శ 1156–57 ప్రాంతములో అసమర్థుడైన మూడవతైలపుడు కాలచుర్య బిజ్జలుని వలన పదభ్రష్టతనొంది, వనవాసి ప్రాంతమునకు ప్రవాసమున కేగెను బిజ్జలుడు కళ్యాణి సింహాసనమునాక్రమించెను ఈయదను చూచుకొని కాకతీయులు పశ్చిమ చాళుక్యులను పూర్తిగ ధిక్కరించి, స్వతంత్రు లగుటకు యత్నములు చేయజొచ్చిరి దాక్షారామ శాసన మీ యంశమును సూచించుచున్నది ఈ స్వాతంత్ర్య స్థాపన యత్నము రెండవ ప్రోలరాజు కాలములో ప్రారంభమై అతని కుమారుడు రుద్రదేవుని కాలమున ఫలవంత మయ్యెను

కాకతీయ రాజ్యమునకు స్వతంత్ర ప్రతిపత్తి ఏర్పడిన పిమ్మట, తచ్చిహ్నముగ అనుమకొండలోని వేయిస్తంభముల దేవాలయమున ఒక శిలాశాసనము వేయింపబడెను (క్రీ శ 1162) దీనిని వేయించిన ప్రభువు రెండవ ప్రోలురాజు కుమారుడు రుద్రదేవుడు ఈ శాసనమున కాకతిరుద్రుడు తనపేర రుద్రేశ్వరదేవుని, శ్రీ వాసుదేవుని, శ్రీ సూర్యదేవుని ప్రతిష్ఠించి, ఆ దేవతల అర్చనాదుల కొరకై మద్దిచెరువుల గ్రామమును దానము చేసినట్లు వ్రాయబడినది. వేయిస్తంభములగుడిలోని శాసనము వేయించుటలో రుద్రదేవుని ముఖ్యోద్దేశము కాకతీయరాజుల స్వతంత్రప్రతిపత్తిని ప్రకటించుటయు, వారు సాధించిన ఘనవిజయములను వర్ణించుటయు అని తోచుచున్నది ఈ శాసనములో రెండవ ప్రోలరాజు విజయములు నాలుగు తెలుపబడినవి చాళుక్య చూడామణియగు తైలపుని రెండవ ప్రోలరాజు ఒక పర్యాయము బందీగగొని, భక్త్యనురాగములచే అతనిని విడచిపుచ్చుట ప్రోలుని మొదటి విజయము ఈ తైలపుడు కళ్యాణి ప్రభువగు మూడవ తైలపదేవుడు కావచ్చును ఈ విజయమును రెండవ ప్రోలరాజును, అతని కుమారుడగు రుద్రదేవుడును కలిసి 1149–1157 సంవ

త్సరముల నడుమ సాధించిరి రెండవ ప్రోలరాజు గోవింద రాజును దండనాయకుని, మంత్రకూట నగరాధీశుడగు గుండ రాజును, జగద్దేవుడను మరియొక ప్రభువును జయించినట్లు కూడ వేయి స్తంభములగుడి శాసనము తెల్పుచున్నది అంతే కాదు పానగల్లు ప్రాంతమున గోకర్ణరాజు కుమారుడగు ఉదయాదిత్యుడను తెలుగుచోడునికి ప్రోలరాజు తిరిగి రాజ్యమిప్పించెనట పైన తెలుపబడిన మాండలిక ప్రభువులందరు పశ్చిమ చాళుక్యరాజుల పక్షము వహించి, రెండవ ప్రోలరాజుతో పోరాడి పరాభవింపబడి యుండవచ్చును ఈ విజయములను సాధించినపిమ్మట ప్రోలరాజు తూర్పుతీరమున తన రాజ్యమును విస్తరింపజేయుటకై యత్నించుచు, కోట చోడయ రాజుచే సంహరింపబడెను 1169 నాటిదగు దక్షారామశాసనమువలన, ఈయంశము వ్యక్తమగుచున్నది

కాని రెండవ ప్రోలుని ఈ విజయములు తన స్వాతంత్ర్యోద్యమమునకు చెందినవి కావేమోనను సంశయము గలదు వేయి స్తంభముల గుడిలోని శాసనమందు చెప్పబడిన తైలపుడు క్రీ శ 1151 లో రాజైన మూడవ తైలపుడు గాక విక్రమాదిత్యుని కుమారులలో నొకడును, కందూరు నాడును యువరాజ వృత్తిగ నేలుచు వచ్చిన కుమార తైలపుడు గావచ్చును అతడు తండ్రి మరణానంతరము పై చెప్పబడిన మాండలికులతో గలిసియో, కలయకయో రాజగు మూడవ సోమేశ్వరునిపై కుట్రపన్ని యుండుననియు ప్రోలరాజు స్వామిభక్తిపరుడై వారి తిరుగుబాటు నణచిన విశేషములే ఈ శాసనమందు చెప్పబడిన వనియు, క్రీ శ 1162 ప్రాంతమున రుద్రునిచే పొందబడిన స్వాతంత్ర్యముతో ప్రోలుని విజయముల కెట్టి సంబంధము లేదనియు కొందరి యభిప్రాయము

రెండవ ప్రోలరాజును గూర్చి చెప్పదగిన మరియొక గొప్పవిషయమున్నది ఈతడు ప్రజోపయుక్తములగు సత్కార్యములందు గూడ మిక్కిలి శ్రద్ధవహించెనట తటాకముల త్రవ్వించి, జలసమృద్ధికై వరుణదేవుని ప్రతిష్ఠించి పాటుపడినట్లు కాజీపేట శాసనమందు ఈతడు స్వయముగ వ్రాయించుకొనెను ఇతని తటాక ప్రతిష్ఠలనుగూర్చి ఇతనిమనుమడగు గణపతిదేవ చక్రవర్తి శాసనములు మిక్కిలి పొగడెను

ప్రోలుని భార్యపేరు ముప్పమాంబ ఈమె నతవాటి దుర్గరాజునకు సహోదరి యని తెలియుచున్నది ఇతని కనేక పుత్రులు గలరనియు, వారిలో రుద్రుడు పెద్దవాడనియు, మహాదేవుడు రెండవవాడనియు, శాసనములందు చెప్పబడెను మహాదేవుని కుమార్తెయగు మైలమాంబ వేయించిన త్రిపురాంతక శాసనమందు ప్రోలునికి హరిహరుడను మరియొక కుమారు డుండినట్లు వ్రాయబడినది

మాదిరెడ్డికుంట శాసనమందు ప్రోలరాజొక కీర్తిస్తంభమును స్థాపించెనని తెలుపబడెను అందు సద్గుణముల నిధియు, మాహేశ్వరులలో నగ్రగణ్యుడునైన రామేశ్వర దీక్షితుడు అచటి ఆలయమును కట్టించినట్లు కలదు ఆతని ముఖ్యశిష్యుడగు చలమర్తిగండ ప్రోలరాజు శాశ్వతమగు కీర్తిస్తంభమును స్థాపించెనని అందు చెప్పబడెను కనుక ప్రోలుడు రామేశ్వర దీక్షితుని శిష్యుడై అతనియొద్ద (కాలాముఖ) శైవమత దీక్షనొందెనని స్పష్టమగుచున్నది స్వయముగ శైవమతాభిమానియయ్యు, జైనమతమునకు కూడ ఆతడు తగు ప్రోత్సాహమిచ్చినట్లు అనుమకొండ పద్మాక్షీదేవాలయ శాసనముద్వారా కడలాలయ బసదినిగూర్చిన యంశమును బట్టి తెలియుచున్నది సిద్ధేశ్వర చరిత్రమందీతనిగూర్చి యొక కథ చెప్పబడెను ఒకనాడీతని బండిచక్రముపైనున్న ఇనుప పట్టా ఒకచోట బంగారుగా మారెననియు, అచట పరుసవేది కలదని నిశ్చయించుకొని, తన ఇష్టదైవమగు స్వయంభు శివదేవుని ప్రతిష్ఠించి, ఆలయమును నిర్మించెననియు చెప్పుదురు

పు ప శ

## ప్రౌఢదేవరాయలు :

(క్రీ శ 1422 నుండి 1446 వరకు)

మొదటి దేవరాయలకు ముగ్గురు పుత్రులు అందొకడు బహమనీలతో జరిగిన యుద్ధమందు మోసముచే వధింపబడెను మిగిలినవారు రామచంద్రుడును, విజయుడు నను నిరువురు మొదట రామచంద్రుడు రాజై కొన్ని మాసములు పాలించెను ఆపై విజయుడు మొదటి విజయ బుక్క భూపతిగ సింహాసన మధిష్ఠించెను అతనిని విజయ బుక్కరాయ లనియు నందురు మొదటి దేవరాయల కితడు హేమాంబిక యందు జన్మించెను విజయభూపతి రమారమి ఆరు నెలలు పాలించి యుండ వచ్చును ఇతడు సమర్థుడు కాకుండుటచే ఇతని కుమారుడగు (రెండవ) దేవరాయలే తండ్రి జీవితకాలములో పరిపాలనాచక్రమును నడుపుచుండెను తండ్రి మరణానంతర మీతడు సామ్రాట్టయ్యెను ఇతడు విజయ బుక్కభూపతికి నారాయణాంబిక వలన కలిగెను ఈ ప్రభువునకు ప్రౌఢదేవ

రాయ అను నామాంతరమును, గజబేంట (ఏనుగువేట) దేవరాయ అను బిరుదును కలవు

క్రీ శ 1422 సెప్టెంబరులో, ఫెరోజుషా చనిపోయెను ఆతని తమ్ముడగు ఖానెఖానాన్, 'అహమ్మదుషా' యను బిరుదుతో బహమనీ సింహాసన మధిష్ఠించెను వెంటనే కప్పము చెల్లించలేదను సాకు కల్పించి ప్రబల సైన్యముతో అతడు విజయనగర రాజ్యముపై దాడి వల్పెను ప్రౌఢదేవరాయల కాంధ్ర ఘూర్జర గజపతులు బాసటగ నిల్చిరి కాని కళింగ ఆంధ్రులు అనూహ్యములగు కారణములచే ససైన్యముగ తొలగిపోయిరి అందువలన రెండవ దేవరాయలు కొంత ఇరుకున పడినను, ఫిరిస్తా మున్నగు చరిత్రకారులు వ్రాసినట్లుగ, ఇతడు పరాజితుడు కాలేదు ముద్గల్లువద్ద జరిగిన యుద్ధములో అపారమగు సైనిక నష్టము కలిగిన పిదప క్రీ శ 1423 ప్రారంభములో, విజయనగర, బహమనీ రాజ్యములవారు సంధి చేసికొని, వారివారి రాజధానులకు తిరిగిపోయిరి గుల్బర్గా విజయనగరమునకు సమీపమునందుండుటయును, విజయనగరము దినదినప్రవర్ధమాన మగుచు ప్రబలమగుచుండుటయును, తరతరముల బృహత్ప్రయత్నము దానిని రూపడంపజాల కుండుటయును సమగ్రముగ సమీక్షించి, బహమనీ సుల్తానగు అహమ్మదుషా, తన రాజధానిని విజయనగరమునకు దూరముననున్న 'బీదరు'నకు మార్చెను 'మనిగిరికెరె' శాసనము ప్రౌఢదేవరాయలు తురకల నోడించినట్లు స్పష్టముగ నుద్ఘాటించు చున్నది ఈయుద్ధము తర్వాత అహమ్మదుషా జీవితములో మరల విజయనగరమువారికి బహమనీలతో పోరాటము జరుగలేదు

రెండవ దేవరాయలు గజపతుల గజసేనను కేసరివలె విదళించెనని వర్ణింపబడినది ఇతని సేనానాయకులలో నొకడగు లక్ష్మణదండనాయకుడు సింహళమును జయించి, అచ్చట తన ప్రభువుయొక్క విజయపతాకను ప్రతిష్ఠించెను సింహళ రాజకుమారి యగు సింహళదేవితో రెండవ దేవరాయల వివాహము జరిగినది ఈ రగడ సముద్రవ్యాపారమును గురించి వచ్చిన ట్లున్నది ఈ విజయమువలన రెండవ దేవరాయలకు సముద్రాధిపత్యముకూడ లభించినది ఇతడు శాసనములలో "చతుస్సముద్రాధిపతి"యని పేర్కొనబడినాడు

కాటయవేముడు చనిపోయిన పిదప ఆతని యేకైక పుత్రిక యగు అనితల్లి భర్తయును, కాటయవేముని సైన్యాధ్యక్షుడగు అల్లాడరెడ్డియొక్క రెండవ కుమారుడును నగు వీరభద్రారెడ్డి రాజమహేంద్రవరమునకు రాజయ్యెను ఇతని యన్న యగు వేమారెడ్డి తమ్మునికి బాసటగ నుండి కళింగ రాజ్యపు పొల్లలపై తరచు దాడులు జరుపు చుండెను తూర్పు గాంగ వంశ్యుడును, కళింగాధిపతియు నగు నాలుగవ భానుదేవునికి వేమారెడ్డియొక్కయాగడము దుస్సహముగనుండెను ఇతడు రాచకొండ రాజగు లింగానాయని తనవానిగ జేసికొని వేమారెడ్డి, వీరభద్రారెడ్ల నోడించెను అంతట ఆగక ఇతడు కొండవీటిపై దాడి సలిపెను పెద్దకోమటిరెడ్డి మరణానంతర మాతనికుమారుడగు రాచవేమారెడ్డి కొండవీటికి క్రీస్తుశకము 1420 లో రాజయ్యెను కాని క్రీ శ 1424 లో నితడు హత్య చేయబడుటచే అచట అరాజకము ప్రబలినది దానిని పురస్కరించుకొని విజయనగరపు దండనాయకులు కొందరు కొండవీటి రాజ్యములో నధికభాగమును తమ సామ్రాజ్యాధీనము లోనికి తెచ్చిరి అయితే ప్రౌఢదేవరాయలు బహమనీ సుల్తానుతో యుద్ధమునందు నిమగ్నుడై యుండుటవలన నిటు శ్రద్ధ వూనలేదు ఈ తరుణమును వినియోగించుకొని భానుదేవుడు విజయనగర సర్దారులను తోద్రోలి కొండవీటి రాజ్యమునంతయు స్వాధీన పరచుకొనెను రెండవ దేవరాయలకీ సంగతి తెలియగనే దాడివెడలి, భానుదేవుని దేశపు పొల్లలు దాట తరిమి, కొండవీటిరాజ్యమును సంపూర్ణముగ లీనమొనర్చుకొనెను క్రీ శ 1424 లో సింహాచలమందు సింహాద్రినాథునికి సాళువ తెలుంగు రాయలు వ్రాయించి యిచ్చిన దానశాసనమువలన ఈ సంగతి తెలియవచ్చు చున్నది రెండవ దేవరాయల కీత డీ యుద్ధమునందు బాసటగ నున్న ట్లున్నది ఈ యుద్ధము తదుపరి రాజమహేంద్రవర రాజ్యము వీరభద్రారెడ్డికి మరల స్థిరపరచ బడినది

భానుదేవునితో జరిగిన యుద్ధము తర్వాత, రమారమి ఎనిమిది సంవత్సరములు విజయనగర సామ్రాజ్యములో శాంతి వర్ధిల్లినది భానుదేవుని మరణానంతర మాతని కుమారుడగు కపిలేశ్వర గజపతి రాజమహేంద్రవరముపై దాడి సలిపెను వేమారెడ్డి, వీరభద్రారెడ్ల అభ్యర్థనముపై రెండవ దేవరాయలు మల్లప్ప ఒడయార్ ఆధిపత్యమున నొక ప్రచండ వాహినిని బంపి కపిలేశ్వరుని దేశమునుండి పారద్రోలెను తన ప్రభువు నానతిచే మల్లప్ప రాజమహేంద్రవరములో కొంత కాలముండి, శాంతిని నెలకొల్పి, విజయనగరమునకు

తిరిగి పోయెను క్రీ శ 1435 ఫిబ్రవరి ఇరువది ఏడవ తేది ఆదివారమునాడు అహమ్మదుషా చనిపోయెను ఆతని కుమారుడగు రెండవ అలాయుద్దీను సింహాసన మధిష్ఠించెను కప్పము నెగవేసె నన్న నెపముతో దేవరాయలను దండింప నొక ప్రబలమగు సైన్యము నిచ్చి అతడు తనతమ్ముడగు మహమ్మదును విజయనగరముపై బంపెను ఈ దాడి వివరములు తెలియవచ్చుటలేదు కాని ఇరువది ఏనుగులను నృత్యగానములందారితేరిన 200 దాసీలను, కొంత ద్రవ్యమును ఇచ్చి దేవరాయలు సంధిచేసికొన్నట్లు ఫిరిష్తావంటి కొందరు చారిత్రకులు వ్రాయుచున్నారు

ఈ యుద్ధము తరువాత మరల క్రీ శ 1443 ఉత్తరార్ధము వరకు దేవరాయలు తన సామ్రాజ్యమును సుఖశాంతుల కాలవాలముగ నేలెను ఇతని శాసనము లనేకము లీవిషయమును ధ్రువపరచు చున్నవి

దేవరాయలు విశాల సామ్రాజ్యమున కధిపతియయ్యెను ధనవస్తురాసు లపారములుగ నుండెను సైన్యసంపద అపరిమిత మయ్యెను ఐనను అన్నింటను తనకన్న తక్కువవారగు బహమనీలు తరుచుగ తనను తన రాజ్యమును వేధించుచున్నారు తాను వారి నదుపులో నుంచలేకున్నాడు దీనికి కారణమును కనుగొనవలెనని మంత్రి సామంతహిత పురోహితులతో క్రీ శ 1442 లో సుదీర్ఘ చర్చలు జరిపి మేటి విలుకాండ్రును ఉత్తమాశ్వములును తనకు లేమియే దీని కొక ముఖ్య కారణమని రాయలు నిర్ణయించు కొనెను

రెండవ దేవరాయలు తురకలను తన సైన్యములో చేర్చుకొనెను అచిరకాలముననే రెండు వేల తురక విలుకాండ్రను, పదివేల తురక అశ్విక దళమును సుశిక్షితమగు దానిని సిద్ధపరచుకొనెను. తురకలకు విజయనగరములో మసీదు కట్టించి జాగీరులిచ్చి పరిపూర్ణమగు మత స్వాతంత్ర్యమును వ్యక్తి రక్షణమును కల్పించెను తన సింహాసనమున కెదురుగ నొక దివ్యాసనముమీద తురకల మత గ్రంథమగు పవిత్ర ఖురాను నుంచెను రెండవ దేవరాయ అచిరకాలముననే సుశిక్షితమగు ఎనుబది వేల అశ్వికబలమును, అరువదివేల ధనుర్ధరులను, రెండు లక్షల పదాతి బలమును సమకూర్చు కొనెను అతి నూతనమగు రణరీతుల నాకళింపు చేసికొని వాటిని ప్రవేశపెట్టెను

1443వ సంవత్సరమున విజయనగర, బహమనీరాజ్యములకు యుద్ధము సంభవించెను ఇం దేపక్షము వారికిని నిశ్చితమైన విజయము చేకూరలేదు

రెండవ దేవరాయలు క్రీ శ 1446 మే నెల 24 నకు సరియగు శా శ 1368 క్షయనామ సంవత్సర వైశాఖ బహుళ చతుర్దశి మంగళవారమునాడు దివంగతు డైనట్లు శ్రావణ బెళ్గొళాయందలి శాసనము తెల్పు చున్నది

ఇతడు దాదాపు ఇరువదియైదు సంవత్సరములు సామ్రాజ్య మేలెను అబ్దుల్ రజాక్ వర్ణనలనుబట్టి ఇతడు పొడగరి పలుచని దేహము కలవాడు సుందర దరహసితముచే అందమైన ముఖము కలవాడు ఇతనిది ఆలివునూనె వర్ణము గడ్డము లేదు కృష్ణనుండి కన్యాకుమారి వరకును తూర్పు పడమర సముద్రములకును మధ్యగల మొత్తము దక్షిణాపథమును ఏకచ్ఛత్రాధిపతిగ నేలెను దక్కనుపీఠభూమిలోని కొన్ని ప్రాంతములుకూడ ఇతని వశమునం దుండెను సింహళముసైత మీతనికి సామంతదేశమే ఇతనికి సుమారు మూడువందల రేవుపట్టణములు ఉన్నట్లు తెలియుచున్నది రేవులనుండియు, గనులనుండియు, భూముల నుండియు ఇతనికి అపారమయిన రాబడి యుండెను బహమనీలతోను, గజపతులతోను, ఇతరులతోను ఇతనికి నిరంతరము పోరు జరుగు చున్నను ఇతని సుపరిపాలనము ప్రజలకు సుఖమును, శాంతిని, సిరిసంపదలను సమకూర్చినది ఇతనియెడ ప్రజ లనురక్తులుగను, సంతృప్తులుగను నుండిరి దేశపు సంపదను, రాజధాని వైభవమును, రాజుల ఆడంబరమును విభ్రాంతి కలిగించు సైన్యవ్యవస్థను, పరిపాలనాచక్రపటిమను, ఆచారవ్యవహారములను సమకాలికుడగు అబ్దుల్ రజాక్ కనులకు కట్టునట్లు వర్ణించినాడు ఇతడు సారస్వతోపాసకుడు కవిపండితుల ననేకులను చేరదీసి సత్కరించెను గీర్వాణాంధ్ర కన్నడభాషలు ముఖ్యముగ ప్రోత్సహింపబడినవి ఇతను శైవుడైనను పరమత సహనము కలవాడు తురకలకు మసీదులు కట్టించి ఇచ్చెను అంతఃపురపు ఆవరణములోనే 'పానుసుపారి' వీథియందు జైనులకు మందిరము గట్టించెను న్యాయ మొకరిసొత్తు గాక యావత్ప్రజానీకమునకు తంగేటిజు న్నయ్యెను. ఇతని న్యాయపరిపాలనము, ధర్మదీక్ష ప్రశంస్యములు అన్నివిధముల నీతడు సంగమ వంశపు రాజులలో నద్వితీయుడు

కుళ్ళాయి పెట్టి, కోకబుట్టి, మహా కూర్పాసమును

దొడిగి, రాజదర్శనము సాధించి, చంద్రభూప క్రియాశక్తి రాయల సమక్షమున, నుద్భటవివాద ప్రౌఢిచే గౌడడిండిమ భట్టు నోడించి, ముత్యాలశాలయందు కనకాభిషేకము చేయించుకొని, శ్రీనాథుడు కవిసార్వభౌముడను బిరుదమును పొందిన దీప్రౌఢదేవరాయ చక్రవర్తివలననే విజయనగర మీ ప్రభువు కాలములో విజయనగరముగ మాత్రమేకాక విద్యానగరముగ కూడ దక్షిణ భారతమందంతటను విఖ్యాతి చెందెను ఈతని సభాంగణము సరస్వతీదేవి నృత్యశాలగ మారినదన్నచో అతిశయోక్తి కాజాలదు

కె వి. భూ

## ప్లాటినము

భూగోళములో దొరకు లోహములలో నెల్ల ప్లాటినము మిక్కిలి విలువకలది దీనికి గల ప్రత్యేకగుణముల వలన ఇది అనేక ముఖ్యవిషయములలో ఉపయోగపడుచున్నది ఈ లోహమునకున్నంత సాంద్రత మరేధాతువునకును లేదు ఇది బంగారముకంటెను బరువైనది ఈ లోహము ప్రపంచములో చాల పరిమితముగా లభించును ఈ లోహము పెక్కు రసాయన పరిశ్రమలలోను, శాస్త్రీయ పరికరముల కొరకును, కొలది పరిమాణములో ఆభరణముల నిమిత్తమును వినియోగింప బడుచున్నది

**ముఖ్యగుణములు**

1 ఈ లోహము, ఇతర లోహములవలె, సాధారణ లక్షణము లన్నిటిని కల్గియుండును, దీనియందు ఉష్ణ, విద్యుద్వాహక శక్తులు గలవు,

2 వెండివలె తళతళ లాడుచుండును, చాల గట్టిగా నుండును

3 అత్యుగ్రమగు ఉష్ణమునందు గాని ఈలోహము కరగదు

4 మామూలు పరిస్థితులలోగాని, వేడిచేసినను, ఈ లోహము ప్రాణవాయువుతో సంయోగము పొందదు

5 దీనిని వెండి, బంగారముల వలె సన్నని తీగగా సాగదీయవచ్చును, అట్లే పలుచని రేకుగాకూడ సాగగొట్టుటకు వీలగును

6 ఈ లోహము మీద సాధారణ ద్రావకము లెవ్వియును ఎట్టి ప్రభావమును కల్గింప జాలవు కాని ఆక్వా రెజియా (Hcl+$HNO_3$) లోను, ($KClO_3$+Hcl) లోను మాత్రమే ఇది కరగును

7 క్షారములు, $Na_2O_2$ వేడిచేసినయెడల రాసాయనికముగా కలియును

8 $CS_2$ ద్రవరూపమునగాని, ఆవిరిగాగాని ప్లాటినముతో కలియుటవలన, ఆలోహపు పాత్రలను కోల్ గ్యాసుతో వేడిచేయగూడదు

9 ప్లాటినముయొక్క ఉష్ణవ్యాకోచశక్తి గ్లాసుతో సమానముగనుండును అందుచే తీగెలను గ్లాసులో నమర్చుట సులభము

10 ప్లాటినము క్లోరినుతోను, అమ్మోనియాతోను కలిసి అనేక రాసాయనిక పదార్థముల నిచ్చును ప్రత్యేకముగా గంధకము, పాషాణము, భాస్వరములు ఈ లోహమును నిరుపయోగకరమైనదానినిగ చేయును వాటిని విషములని యందురు

**ఉపయోగములు** 1 సాధారణ ద్రావకములకు ప్లాటినముపై ఎట్టి ప్రభావమును లేకుండుటచే శాస్త్రీయ పరిశోధనములందు ఈ లోహమును "క్రైనాడిష్"గను, లోహములను కరగించు మూసలుగను తయారుచేయుటకు ఉపయోగింపవచ్చును

2 ఈ లోహమునుండి తీయబడు సన్నని తీగె విద్యుత్పరికరములందు ఉపయోగింపబడును వాటిని గాజులో నిముడ్చుట సులభము

3 నలుపు ప్లాటినమును, ద్రవద్రవ్యములను పీల్చు గుణము గల ప్లాటినమును, జీరురుగను, బంకగను ఉండు రూపములలో పెక్కురసాయన పరిశ్రమలందు ఉత్ప్రేరకముగా వాడెదరు

4 దంతవైద్యములో ప్లాటినముతో చేయబడు రేకులు ఉపయోగపడును

5 ఇది చాల విలువైన లోహమగుటచే, కొందరచే ఆభరణముగా గూడ వాడబడును

6 రాసాయనిక పరీక్షలలో ప్లాటినము తీగెలను వాడవచ్చును వివిధములైన లోహములను Hcl తో కలిపి, ప్లాటినము తీగెను అందులో ముంచి మంటలోనుంచినయెడల, ఆ లోహమునకు ప్రత్యేక లక్షణముగల రంగును మంటకు కలుగజేయును ఆ రంగునుబట్టి ఆ లోహమును గుర్తింపవచ్చును

ఉదాహరణములు

| | | | మంటకు ఇచ్చు రంగు |
|---|---|---|---|
| 1 | రాగి | — | ఆకుపచ్చ + నీలి |
| 2 | కాల్షియమ్ | — | ఇటుకరంగు |
| 3 | స్ట్రాంషియమ్ | — | కాషాయరంగు |

మున్నగునవి

ప్లాటినము లభించు స్థానములు భూమండల మంతటిలో ఈ లోహము అత్యధికముగా రష్యాదేశ మందలి యూరల్ పర్వతములందు లభించును బ్రిటిష్ కొలంబియాలో, దక్షిణ అమెరికాలో గూడ కొలదిగా దొరకును దీనిలో చాల స్వల్ప భాగములో 'స్పెర్రిలైట్ పి టి-As₂' (Sperrylite pt As₂) అను ఖనిజము కలిసియుండును సాధారణముగా ఈలోహము స్వచ్ఛరూపములో, ఇసుక, కంకరలతో కలిసి, రాళ్ళవలె కాన్పించును వర్షపాతమువలన, వాతావరణ భేదముల ననుసరించి, ఈ రాళ్ళన్నియు క్రమముగా శిథిలములై, నదీ ప్రవాహములలో కొట్టుకొనిపోయి సమతల మైదానములలో, ప్లాటినము కణములు ఇసుకతోకూడి నిలచును అట్టిచోట్ల నదీగర్భములనుండి ఇసుకను సేకరించి, వాటి సాంద్రతలయం దుండు భేదములవలన, విడదీయుదురు ఈ విధానమునే మరల మరల అనుసరించుట వలన, ఇతర లోహములతో మిశ్రమైన ప్లాటినము ఏర్పడును

సాధారణముగా ప్లాటినములో ఇనుము, రాగి, ఆస్మియము, ఇరిడియము, బంగారము మున్నగు అవాంఛనీయములగు ఖనిజములు కలిసియుండును వీటిని రాసాయనిక పద్ధతులలో గాని, ఆక్వారెజియా (Hcl+Hno₃) లో కరగించుటవలన గాని తీసివేయవచ్చును అవసరమగు స్వచ్ఛత ననుసరించి వివిధములైన పద్ధతులను వాడెదరు తుదకు శుద్ధి కర్మాగారములో ప్లాటినము శుద్ధిచేయ బడును

మా కో

## ప్లాన్క్, మాక్స్ (1858-1947)

మాక్స్‌ప్లాన్క్ జర్మనీదేశపు సుప్రసిద్ధ భౌతికశాస్త్రవేత్త ఆతడు కీల్ అనుచోట క్రీ శ 1858 ఏప్రిల్ 23 వ తేదీన జన్మించెను ఇతడు మ్యూనిక్, బెర్లిన్ విశ్వవిద్యాలయములలో విద్య నభ్యసించి, మొదట మ్యూనిక్ విశ్వవిద్యాలయములో నొకసహాయుడుగా చేరెను తరువాత ఇతడు 1885 లో కీల్‌లోను, 1889 లో బెర్లిన్‌లోను శాస్త్రాచార్యుడుగా నియమింప బడెను ఇతడు సైద్ధాంతిక భౌతికశాస్త్రమును, ముఖ్యముగా తోష్ప్రవైగికీ శాఖ నభ్యసించుచు, దానినిగూర్చి కృషిచేయుట యందు తన జీవితమును వినియోగించెను అత డావిషయమును గూర్చి ఇచ్చిన ఉపన్యాసములు గ్రంథరూపమున బ్రచురింపబడి, ఇంగ్లీషు, ఫ్రెంచి, రష్యా భాషలలోనికి భాషాంతరీకరింపబడినవి

1901 లో ప్లాన్క్ వెల్లడిచేసిన "ఊర్జావికిరణ నియమము" వలన ఆతడు అంతర్జాతీయ యశస్సును పొందెను విద్యుదణువులయొక్క ప్రదోలన తరచుదనముపై ఆధారపడి అవిభాజ్యములైన ఊర్జాణువుల యొక్క పూర్ణాంక అవర్త్యములలో నిర్దుష్టముగా వికిరణను నొందుచున్న శక్త్యుత్సారణము, ప్రచూషణము జరగుచుండునని ఈ నియమము స్థిరపరచును. 1912 లో ప్లాన్క్ ఈ ఊర్జాణువాదమును అన్ని రకములగు శక్తికిని వర్తింపజేయుచు, ఊర్జాణువుల ద్వారా ఉత్సరణక్రియ విచ్ఛిన్నముగ జరగుననియు, ప్రచూషణక్రియ అవిచ్ఛిన్నముగ జరగుననియు కూడ ఆత డూహించెను ఈ ఊహ నాధారముగా జేసికొనినల్లని పదార్థముల వికిరణ పటములో శక్తి ఎట్లు పంపిణి చేయబడినదో ప్లాన్క్ లెక్కవేయ గలిగెను ఈ సిద్ధాంతము ప్రకారము, శక్తిప్రమాణమైన ఒక ఊర్జాణువు = hν. దీనిలో h, ప్లాన్క్ యొక్క స్థిరాంకమును (క్రియా ఊర్జాణు స్థిరాంకము), ν ప్రదోలనపు తరచుదనమును తెలియజేయును ఈ విధముగా ప్లాన్క్ తన సిద్ధాంతము ప్రకారము ఉష్ణకిరణమును గూర్చి సరియైన సూత్రమును నిర్ధారింపగలిగెను ప్లాన్క్ యొక్క ఊర్జాణువాదములో పెక్కురు భౌతిక శాస్త్రజ్ఞులు తరువాత మార్పులు కల్గించిరి గాని, నల్లని పదార్థముల వికిరణమును గూర్చి ఆతడు చేసిన కృషి పునాదిగా నిల్చినది 1918లో మాక్స్‌ప్లాన్క్‌కు భౌతికశాస్త్రమున నోబెల్ బహుమాన మీయబడెను ఆతడు "భౌతికశాస్త్ర చరిత్ర" అను పత్రికకు అధిపతియయ్యెను 1916 వ సంవత్సరముననే ఆతనిని రాయల్ సంస్థలో విదేశీయ సభ్యునిగా ఎన్నుకొనిరి ఆతడు జర్మనుభాషలో ఆయిదు గ్రంథములను వ్రాసెను వాటిలో రెండు గ్రంథములు ఇంగ్లీషుభాషలో అనువదింపబడెను మాక్స్‌ప్లాన్క్ 1947 వ సంవత్సరములో చనిపోయెను

బి వి ర

## ప్లాస్టిక్ పదార్థములు (టెక్నాలజి)

అనాది మానవులు, నిత్యజీవితోపయోగమునకు శిలలు, కొయ్యలు, లోహములు, రకరకముల మృత్తికలు ఉపయోగించుకొను చుండెడువారు మట్టిపనిముట్ల కంటెను కొయ్యతో చేసిన పనిముట్లు, వాటికంటెను శిలాసాధనములు, వాటిని మించి లోహసాధనములు ఎక్కువ ఉపయోగకరమైన వని, మానవుడు అనుభవములో గ్రహించెను శాస్త్ర విజ్ఞానము అభివృద్ధిచెందుచున్నకొలదియు, రకరకముల లోహములను, ఇతరపదార్థములను, మానవుడు ఉపయోగించుట నేర్చుకొనినాడు ఇంకను క్రొత్తవాటి కొరకు అన్వేషణలు ప్రారంభించెను ఈ మహాకృషిలో, విజ్ఞాన వేత్తయైన మానవుడు ఆవిష్కరించిన సరిక్రొత్త పదార్థము ప్లాస్టిక్

ఇప్పటికి రమారమిగా నూరేండ్లక్రిందట, జాన్ వెస్లీ హ్యాట్ అను ప్రెస్ కార్మికుడు, తొలిసారిగా ప్లాస్టిక్‌ను కనిపెట్టెను ఈ నూతన పదార్థము వలన, మునుముందు సహోద్భుతమైన వస్తువులు తయారు కాగలవనిగాని, పారిశ్రామికముగ అత్యంతకీలకమైన స్థానములో ప్లాస్టిక్ పదార్థములు ఉండునని గాని హ్యాట్ భావించి యుండడు కేవలము బిలియర్డ్స్ బంతుల తయారికొరకని, ఆయన దీనిని రూపొందించెను నైట్రోసెల్యులోస్‌ను ఆల్కహాల్, కర్పూరము కలిసిన మిశ్రమద్రవ్యముతో చేర్చి వేడిచేసెను ఆల్కహాల్ ఆవిరయిపోగా, మిగిలిన పదార్థము, దంతమువలె గట్టిగ తయారయినది కృత్రిమముగా తయారయిన తొలి ప్లాస్టిక్ పదార్థ మిదియే!

ప్లాస్టిక్ లనగా, వేడికి మెత్తబడి, మన ఇష్టమువచ్చిన ఆకారములోనికి మలుచుకొనుటకు వీలయిన పదార్థములని అర్థము బంకమన్ను, గాజు, వివిధ లోహములుకూడ ఒకానొక దశలో ప్లాస్టిక్ గుణములను ప్రదర్శించును అయితే వీటిని మనము ప్లాస్టిక్ లని వ్యవహరింపము

ఇతరపదార్థములకును, ప్లాస్టిక్కులకును, ఏ విషయములోను పోలికలు లేవు మిగతావాటిలో లేని సల్లక్షణములు, ప్లాస్టిక్కులలో కోకొల్లలుగ ఉన్నవి, ప్లాస్టిక్కులతో తయారైన వస్తువులు పుచ్చిపోవు, తుప్పు, చిలుము, వీటిని అంటవు చెదలు, పురుగులు వీటిని తినివేయజాలవు రకరకముల నూనెలవలన కూడ, ప్లాస్టిక్కులకు మరకలుకావు ఆమ్లములు, క్షారపదార్థములు, ప్లాస్టిక్కులను చలింప చేయలేవు, ఇన్ని సుగుణములు వీటిలో ఉన్నవి కనుకనే, లోహాలను కలపను, ప్రత్తిని, త్రోసివేసి వాటి స్థానములలో ప్లాస్టిక్కులు వచ్చి యున్నవి

ప్లాస్టిక్కులలో ప్రధానమైన రకములు రెండున్నవి ఒక రకము ప్లాస్టిక్కులను థెర్మోప్లాస్టిక్కు లందురు రెండవరకము వాటిని థెర్మోసెటింగ్ లందురు పారిశ్రామికముగా వేటి ప్రాముఖ్యము వాటికున్నది థెర్మోప్లాస్టిక్కులు వేడికి కరుగును, లేదా మెత్తబడును చల్లార్చినచో తిరిగి గట్టిపడును ఈరకము వాటిని, కరగించి, పోతపోయుటకు ఎక్కువగా ఉపయోగించెదరు థెర్మోసెటింగ్ ప్లాస్టిక్కులు ఇందుకు భిన్నముగ నుండును జిగురువలె ఉన్నదశలో వీటినికూడ పోతపోయుటకు ఉపయోగించెదరు కాని వేడెక్కినకొలది ఈరకము ప్లాస్టిక్కులు ఘనీభవించిపోవును తిరిగి ఇవి మెత్తబడుట యనునది జరుగదు అత్యుష్ణమువలనగాని, అతిశీతలము వలనగాని, ఇవి ద్రవీభూతములు కావు థెర్మోప్లాస్టిక్కులకన్న, థెర్మోసెటింగ్ ప్లాస్టిక్కులు దృఢముగా నుండును, మన్నిక ఎక్కువ

లోహములుకూడ పనికిరాని చోటులందు, ప్లాస్టిక్ పదార్థములు పనికివచ్చు నన్నచో వాటిలో లేని ఎన్నియో సుగుణములు, ప్లాస్టిక్కులలో ఉన్నవని అర్థము లోహవస్తువులకు చిలుము పట్టకుండుటకును, తుప్పు అంటకుండుటకును, మెరుగుకొరకును, రంగులను పూయవలసిఉండును ప్లాస్టిక్కులకు అట్టి అవసరములేదు మరియు లోహము లున్నంత బరువుగా ఇవి ఉండవు

ప్లాస్టిక్ పదార్థము లన్నియు ఈనాడు కృత్రిమముగా తయారగుచున్నవి ఒకప్పుడు చెట్ల జిగురులనుండి మాత్రమే వీటిని రూపొందించుట జరుగుచుండెను రసాయన శాస్త్ర మహిమచేత, ఎందులకును పనికిరా వనుకొనెడు పదార్థముల నుండి, అన్నిటికిని పనికివచ్చెడు ప్లాస్టిక్కులు అవతరించినవి

స్వల్ప పరిమాణములో ఉండెడు సరళ రచన గల ద్రవ్య కణములను వేడికిని, ఒత్తిడికిని గురిచేసిన కారణముగా అవి బృహదనురూపములను ధరించును ఈ విధానమును గుణకావయవత అందురు

థెర్మోప్లాస్టిక్, థెర్మోసెటింగ్ ప్లాస్టిక్ కుటుంబాలలో కొన్ని వందల రకములున్నవి ఒక రకపు ప్లాస్టిక్ చేయలేని పనిని, మరొక రకపు ప్లాస్టిక్ సులువుగా చేయును ఇదే

కారణముగా శాస్త్రజ్ఞులు వివిధోపయోగములకు అనువైన పందలాది ప్లాస్టిక్ పదార్థములను ఆవిష్కరించిరి

'సెల్యులాయిడ్' అనెడు ప్లాస్టిక్కును జాన్ వెస్లీ హ్యాట్ కనిపెట్టినాడు దీనితో గుండీలు, ఆటబొమ్మలు, గాజులు, రింగులు, పళ్ళుపెట్టెలు తయారు చేయుదురు సంపూర్ణముగా నత్రీకరించబడిన ప్రత్తిని కర్పూరములో మిశ్రమము చేయుటవలన ఈ ప్లాస్టిక్ సిద్ధించును ఇది కొద్ది వేడికే మండిపోవును

ఇంతకన్న మంచి సెల్యులోస్ అసిటేట్ ప్లాస్టిక్కులు ప్రత్తిని అసిటికామ్లములో సంయోగించగా, సెల్యులోస్ అసిటేట్ తయారగును దీనికి డైయూథైల్ థాలేట్, అసిటోన్ ద్రావణములతో సంయోగము కలిగించెదరు అసిటోన్ ఇగిరిపోగా, మిగిలిన దానిని సెల్యులోస్ అసిటేట్ ప్లాస్టిక్ అందురు దీనిని చలనచిత్రాలకు, కృత్రిమ పట్టు తయారు చేయుటకు విరివిగా వాడుదురు 'విస్కోస్ ప్లాస్టిక్'తో రేయన్ పట్టువస్త్రాలు, సెలిఫోన్ కాగితాలు తయారగును

గలాలైట్ ప్లాస్టిక్కును 1897 వ సంవత్సరములో 'స్పిట్లర్' అను విజ్ఞాని ఆవిష్కరించినాడు పాల విరుగుడును శుభ్రముచేసి, పొడిగా మార్చి, ఆ చూర్ణమును గ్లిసరిన్‌తో చేర్చి, వస్తువులుగా మార్చిన తరువాత, ఫార్మలీన్‌తో సంయోగించి గట్టిపరచెదరు గలాలైట్ ప్లాస్టిక్‌తో గుండీలు, దువ్వెనలు, బకిల్సు మొదలైన వెన్నో తయారు చేయుదురు

'బేక్‌లాండ్' అను బెల్జియము దేశ రసాయన శాస్త్రవేత్త, కార్బాలిక్ ఆసిడ్‌ను, ఫార్మల్‌డిహైడ్‌తో చేర్చి వేడెక్కించినప్పుడు 'బేకలైట్' అను ప్లాస్టిక్ తయారయినది ఇది థెర్మోసెటింగ్ ప్లాస్టిక్ దీనిలో పూరక ద్రవ్యములను చేర్చి పోతపనులకు ఉపయోగించెదరు

'పోన్స్' అను మరొక శాస్త్రవేత్త యూరియాను, ఫార్మల్ డిహైడ్‌ను కలిపి, అమ్మోనియాను ప్రేరక ద్రవ్యముగా ఉపయోగించుటవలన క్రొత్తరకము ప్లాస్టిక్ తయారయినది దీనితో, రకరకముల విద్యుత్పరికరములు, రేడియో పెట్టెలు, గడియారము లుంచుకొను పెట్టెలు తయారు చేయుదురు

1927 వ సంవత్సరములో కృత్రిమమైన గాజు ఆవిష్కరించ బడినది దీనిని పెర్స్‌పెక్స్ అందురు ఇదికూడ కృత్రిమ ప్లాస్టిక్కే మిథైల్ మెథాక్రిలేట్ ద్రవ్యానికి బెంజాయిన్ పెరాక్సయిడ్‌ను ప్రేరక ద్రవ్యము చేసి, వేడెక్కించుటవలన, ఈ ప్లాస్టిక్ తయారగును ఇది స్వచ్ఛమైన పారదర్శక స్థితిని కలిగి యుండును దీనిని కిటికీలకు, లాంపుషేడ్లకు ఎక్కువగా వాడుదురు కార్లు, విమానములు, రాకెట్లవంటి వాటికి పెర్స్‌పెక్స్ ప్లాస్టిక్కులను విరివిగా ఉపయోగించుచున్నారు

1930 లో నైలాన్ ప్లాస్టిక్కులు రూపొందించ బడినవి వీటిలో రంగురంగుల వస్త్రములు తయారు చేయుదురు 1940 లో ఆవిష్కరించ బడిన టెరిలీన్ ప్లాస్టిక్కులను కూడా దుస్తులకు ఎక్కువగా వాడుచున్నారు

నైలాన్, థెర్మోప్లాస్టిక్ కుటుంబమునకు చెందినట్టిది దీనిని అడిపిక్ ఆమ్లమునుండియు, హెక్సామెథిలీన్ డయామిన్ నుండియు తయారు చేయుదురు ఈ రెండు పదార్థములను, ఫినాల్, ఉదజని, ప్రాణవాయువు, నత్రజని నుండి రాసాయనికముగా తయారు చేయుదురు డబ్ల్యు హెచ్ కెరోథర్స్ దీనిని ఆవిష్కరించినాడు

జె. ఆర్ హ్విన్‌ఫీల్డ్, జె. టి డిక్సన్ అను శాస్త్రజ్ఞులు టెరిలీన్ ప్లాస్టిక్కును రూపొందించిరి దీనిని తయారు చేయుటకు, ఎథిలీన్ గ్లైకాల్, టెరిఫ్తాలిక్ ఆసిడ్‌లు కావలయును, టెరిలీన్ ప్లాస్టిక్ కూడ థెర్మో ప్లాస్టిక్కు కుటుంబమునకు చెందినదే దీనితో వలలు, బెల్టులు చేయుచున్నారు విద్యుత్తంత్రులకు రక్షాకవచముగా ఈ ప్లాస్టిక్ పనికి వచ్చును

పోలివినైల్ ప్లాస్టిక్కులు పోలిస్టైరీన్ ప్లాస్టిక్కులు, పోలిథిన్ ప్లాస్టిక్కులు, ఆక్రిలిక్ ప్లాస్టిక్కులు, ఎమినో ప్లాస్టిక్కులు మొదలైన రకము లెన్నియో యున్నవి ప్లాస్టిక్ పదార్థములతో ఈనాడు తయారుకాని వస్తు వనునది లేదేమో అనిపించును చిన్నచిన్న గుండీలు మొదలుకొని, విమానాల రెక్కల వరకు ప్లాస్టిక్కులతో తయారగుచున్నవి ఉక్కును సహితము తినివేయగల ఆమ్లములను, క్షీరములను, ప్లాస్టిక్ జాడీలు నిస్సంకోచముగా నిలువ చేయుచున్నవి ప్లాస్టిక్కులతో వస్త్రములు తయారగుచున్నవి గేర్ చక్రాలు తయారగుచున్నవి మరియొక పదార్థ మేమియు లేకుండ, అచ్చముగా ప్లాస్టిక్‌తో తయారైన మహా భవనము కూడ ఉన్నది కారుల బాడీలను, మోటారు సైకిళ్ళ బాడీలను ప్లాస్టిక్కులతో తయారుచేయు పద్ధతిని శాస్త్రజ్ఞులు సాధించినారు ఇందు వలన వాహనముల బరువు తగ్గుటయే

కాకుండ, ఇంధన తైలముల వాడకము సగమునకు సగము పడిపోవును ప్లాస్టిక్కుల రాకతో పారిశ్రామిక రంగములో సరిక్రొత్త మార్పు లెన్నియో తలచూపుచున్నవి ఒకప్పుడు ఉక్కు, ఇనుము, రాగి, ఇత్తడి లోహములతో తయారగు వస్తువులు ఈనాడు ప్లాస్టిక్కులతో తయా రగుచున్నవి ఆమేరకు ఈ లోహముల వాడకమును మనము తగ్గించుకొని ఇతరత్రా వాటిని ఉపయోగపరచుకొనవచ్చును ప్లాస్టిక్కుల వాడకము రోజురోజునకు పెరుగుటతో ఈ పరిశ్రమలుకూడ విస్తృత మగుచున్నవి

మన దేశమునకు సంబంధించినంత వరకు ప్లాస్టిక్ పరిశ్రమ ఎంతో క్రొత్తది మొన్న మొన్నటి వరకును భారత దేశము ప్లాస్టిక్ వస్తువులను, ముడి ప్లాస్టిక్కును దిగుమతి చేసికొను చుండెను మన దేశములో కూడ ప్రయివేటు వ్యాపార సంస్థలు ప్లాస్టిక్ పరిశ్రమలను స్థాపించినవి ఈ యంత్రాగారములకు అవసరమైన ముడిపదార్థములను ఇతర దేశములనుండి తెప్పించుకొనుట జరుగు చున్నది. విదేశీమారక ద్రవ్యము కొరత కారణముగా, దిగుమతులను తగ్గించినప్పటికిని, అవసరమయిన ముడిపదార్థములను దేశములో నే తయారుచేయుటకు ప్రయత్నములు జరుగుచున్నవి

ఈనాడు ప్రపంచమునందలి దేశములన్నియు కలిసి ఒక కోటి టన్నుల ప్లాస్టిక్కులను తయారు చేయుచున్నవి వీటి ఉత్పత్తి సంవత్సరమునకు సంవత్సరమునకు పెరుగుచున్నది ప్రపంచ మంతటను ప్లాస్టిక్కుల ఉత్పత్తి ఇట్లున్నది

| | |
|---|---|
| 1950 వ సంవత్సరములో | 15,00,000 టన్నులు |
| 1955 వ సంవత్సరములో | 32,00,000 టన్నులు |
| 1962 వ సంవత్సరములో | 80,00,000 టన్నులు |

మన దేశములో ప్రస్తుతము 45 వేల టన్నుల ప్లాస్టిక్కులుమాత్రమే ఉపయోగించుకొన బడుచున్నవి ఇందులోను 20 వేల టన్నులు మన దేశములో ఉత్పత్తి కాగా, మిగిలినదానిని దిగుమతి చేసికొనుచున్నాము

నాలుగవ పంచవర్ష ప్రణాళికలో ప్లాస్టిక్కుల ఉత్పత్తి బాగుగా పెరుగగల సూచన లున్నవి 1970-71 వ సంవత్సరాంతమునకు 8 లక్షల టన్నుల ప్లాస్టిక్కులను దేశములోనే తయారు చేయుటకు ప్రయత్నములు జరుగుచున్నవి ఈ పరిశ్రమయొక్క భవిష్యత్తు పెట్రో రసాయనముల పరిశ్రమ అభివృద్ధిమీద ఆధారపడి యున్నది ప్లాస్టిక్కుల తయారీకి అవసరమైన ముడి పదార్థములు, పెట్రో రసాయన కర్మాగారములలో ఉప ఉత్పత్తులుగా లభించును

విజ్ఞానశాస్త్రము మానవ జాతికి సమర్పించిన ప్లాస్టిక్ పదార్థములు, భవిష్యత్తులో మరెన్ని ప్రయోజనములను సాధింపగలవో ఊహించలేము శిలాయుగము, దారు యుగము, లోహయుగములను గడచి వచ్చిన మానవుడు ఇపుడే ప్లాస్టిక్ యుగములో ప్రవేశించినాడు ప్లాస్టిక్కుల వలన భవిష్యత్తులో సాధింపగల ఫలితములు అనంతములు

రా భ

## ప్లాస్టిక్ పదార్థములు · (రసాయనము)

లోహములు, పింగాణి, గాజు, కర్ర అనువాటితో చేయబడు అనేకరకములయిన వస్తువుల స్థానమున ఈనాడు ప్లాస్టిక్ వస్తువులు వాడుకలో నున్నవి 1930 నుండి ప్రతి 5 సంవత్సరములకు ఈ ప్లాస్టిక్ పరిశ్రమ ద్విగుణీకృతమగుచు, పురోభివృద్ధి గాంచు చున్నది కనీసము ఇరువది ప్రముఖమైన తరగతులకు చెందిన ప్లాస్టిక్ పదార్థములు సుమారు 150 పేరులతో ప్రస్తుతము చెలామణిలో నున్నవి మానవుని దైనందిన జీవితములో ఈ పదార్థముల ప్రాముఖ్యము, వాటి వివిధ ఉపయోగములను బట్టి సుస్పష్టమగు చున్నది

ప్లాస్టిక్ అనగా నేమి ? తగినంత గట్టితనము గలిగి, వేడిమి సహాయముచే ఏ ఆకృతినైనను పొందగల ఘన పదార్థమును "ప్లాస్టిక్" అని వ్యవహరింతుము

వేడిమి యొక్క పీడనము సహాయముతో మెత్తపరచబడిన ప్లాస్టిక్‌ను, పోతపోయుట ద్వారా, ఎట్టి ఆకారములోనైనను మలచుకొనవచ్చును ద్రవరూపముననున్న ప్లాస్టిక్‌ను, గుండ్రని సెరద ద్వారా, ఒత్తిడివలన జొన్పినచో, అది తీగ, లేక, గొట్టము రూపములో వెలువడును ప్లాస్టిక్ ద్రావణములో అట్టలను, పలుచని కొయ్యపలకలను ముంచి అరబెట్టినచో, వాటిపై పరి సమానమగు ప్లాస్టిక్ పూత వచ్చును వీటిని లామినేటెడ్ ప్లాస్టికు లందురు

ప్లాస్టిక్ పదార్థములను ఈ క్రింది తరగతులుగా విభజింపవచ్చును

1 అధిక అణు భారముగల కొన్ని సహజ కర్బన ద్రవ్యములనుండి లభ్యమగునవి

2 తక్కువ అణు భారముకల కొన్ని కర్బనద్రవ్యముల నుండి, కృత్రిమముగా, పాలిమెరైజేషన్ అను రసాయన

ప్రక్రియద్వారా లభ్యమగునవి వీటిలో తిరిగి రెండురకములు కలవు

1 ఎడిషన్ పాలిమెరైజేషన్ ద్వారా ఏర్పడు థెర్మోప్లాస్టిక్స్

2 కండెన్సేషన్ పాలిమెరైజేషన్ద్వారా ఏర్పడు థెర్మోసెట్టింగ్ ప్లాస్టిక్స్

పై తరగతులకు చెందిన ముఖ్యమగు కొన్ని ప్లాస్టిక్ పదార్థములను గురించి క్లుప్తముగా ఈక్రింద తెలుపబడినది

(1) సహజకర్బన ద్రవ్యముల నుండి లభ్యమగు ప్లాస్టిక్ పదార్థములు సెల్యులోజ్ (ఉదా పరిశుద్ధమగు ప్రత్తి) నుండి సెల్యులాయిడ్ అను ప్లాస్టిక్‌ను తయారు చేయు చున్నారు కంటి అద్దముల చట్రములు, ఫిల్ములు, సంగీతవాయిద్య పరికరములు చేయుటకు సెల్యులాయిడ్ ఉపయోగపడును కాని, అగ్నిస్పర్శ తగులగనే మండిపోయెడి స్వభావము దీనికి కలదు సెల్యులోజ్ నుండి తయారగు మరొక ప్లాస్టిక్ పదార్థము సెల్యులోజ్ అసిటేట్ అనబడును ఇది సెల్యులాయిడ్ అంత సులువుగా మండదు ఫిల్ములలోను, విమానములందలి గాజుభాగముల స్థానములోను ఇది ఉపయోగపడును

కేసీన్‌నుండి చేయబడు కేసీన్ ప్లాస్టిక్ పదార్థము బొత్తములను, బకిల్సును చేయుటకు పనికివచ్చును కేసీన్ అనునది ఆవుపాలలోని ప్రముఖ మాంసకృత్పదార్థము దీనిని ఆవు కడుపులోని కొన్ని పొరలనుండి తీయుదురు

(2) పాలిమెరైజేషన్ ద్వారా లభ్యమగు ప్లాస్టిక్ పదార్థములు నేటి నవనాగరికతకు అత్యావశ్యకములగు అనేక ప్లాస్టిక్ పదార్థములు పాలిమెరైజేషన్ అను ప్రత్యేక రసాయన ప్రక్రియ మూలముగా లభ్యమగు చున్నవి తక్కువ అణుభారముకు, ఎక్కువ చురుకుతనమును కల కొన్ని కర్బన ద్రవ్యములు, ఉత్ప్రేరకముల సహాయముతో, అనువగు ఉష్ణముల పీడనములవద్ద రాసాయనికముగా ఐక్యమై అత్యధిక అణుభారముకల పదార్థముగా మారును దీనినే పాలిమెరైజేషన్ అనియందురు ఇందులో తిరిగి రెండువిధములుకలవు

కొన్ని కర్బన ద్రవ్యములు ఈ చర్యలో పాల్గొనినపుడు, పరస్పరముగ, అనేకవేల, లక్షల అణువుల స్థాయిలో, కలిసిపోవును దీనికి ఎడిషన్ పాలిమెరైజేషన్ అని పేరు

రెండు వేరు వేరు కర్బన ద్రవ్యములు ఒకదానితో నొకటి అనంతముగా కలియునపుడు, నీటి లేదా మద్యసారవు అణువు లేర్పడి, వేరుచేయబడుచు అత్యధిక అణుభారముకల పదార్థము ఏర్పడినయెడల, దానికి కండెన్సేషన్ పాలిమెరైజేషన్ అని వ్యవహారము

పాలిమెరైజేషన్ చర్యలో తయారగు పదార్థమును రెసిన్ (జిగురు) అని యందురు ఈజిగురుకు తగు గట్టితనమును చేకూర్చుటకై, పూరక పదార్థములు ప్లాస్టిసైజర్స్ మొదలగువాటిని కలిపినతరువాత, వచ్చు పదార్థమును 'ప్లాస్టిక్' అని వ్యవహరింతురు

ఎడిషన్ పాలిమెరైజేషన్‌వలన థెర్మోప్లాస్టిక్ పదార్థమేర్పడును ఇది వేడిమికి సులువుగా మెత్తబడును దీనికి అంటుకొని మండిపోవుగుణము కలదు సాధారణముగా ఇది గాజువలె పారదర్శకముగా నుండును

కండెన్సేషన్ పాలిమెరైజేషన్ ద్వారా థెర్మోసెట్టింగ్ ప్లాస్టిక్ పదార్థములు లభించును ఇవి అధిక ఉష్ణోగ్రత వలన గాని, రసాయన పదార్థముల ప్రభావముచే గాని ఎట్టి మార్పును చెందవు ఇవి సులభముగా పగులవు

థెర్మో ప్లాస్టిక్ పదార్థములు అక్రిలికామ్లము నుండి తత్సంబంధమగు కర్బన ద్రవ్యముల నుండి గాజును పోలిన ప్లాస్టిక్ పదార్థములను చేయు చున్నారు ఇవి సులువుగా పగులకపోవుటచే, గాజుకంటె విశిష్టమైయున్నవి విమాన భాగములు, వైద్యపరికరములు చేయుటకు వీటిని ఉపయోగించు చున్నారు

వినిల్ క్లోరైడ్, సైనైడ్‌అసిటేటులనుండి వివిధ రకములగు వినిల్ ప్లాస్టిక్కులు ఏర్పడు చున్నవి వీటినుండి గొట్టములను, పలకలను, గ్రామఫోను రికార్డులను చేయుచున్నారు. పెయింట్లు, వార్నిషులు, అతుకుటకు పనికివచ్చు జిగురులను తయారుచేయుటలో కూడ ఇవి పనికివచ్చును ఈ ప్లాస్టిక్ పూతపూసిన వస్త్రము నుండి వర్షమునకు తడువని దుస్తులు తయారగుచున్నవి

స్టైరీను నుండి ఏర్పడు పాలీస్టైరీను అను పదార్థమును రెఫ్రిజిరేటరు తొడుగులు, సీసాల మూతలు, మొదలగునవి చేయుటకు వాడు చున్నారు

ఎథిలీను నుండి పాలిఎథిలీనును, వివిధరకములుగా మైనమువలె మెత్తగాను, రబ్బరువలె సాగునట్లును, లేదా గట్టిగాను తయారుచేయవచ్చును బంగీలు కట్టుటకు పనికి

వచ్చు మిక్కిలి పలుచని ప్లాస్టిక్ కాగితము, విద్యుత్ తంత్రులకు తొడుగు ప్లాస్టిక్ గొట్టములు, ప్లాస్టిక్ పైపులు, ప్లాస్టిక్ సీసాలు, మొదలగున వెన్నియో పాలిఎథిలీననుండి చేయబడుచున్నవి టెఫ్లన్ అను ప్లాస్టిక్ పదార్థము, ఉదజనికి బదులు ఫ్లోరిన్‌ను కలిగియున్న ఎథిలీన్‌నుండి తయారగు చున్నది ఎట్టి రసాయన పదార్థముల ప్రభావమునకును లోను గాకుండుట టెఫ్లన్ యొక్క విశిష్టత గాఢగంధకామ్లము సైతము టెఫ్లన్ సీసాలలోపోసి భద్రపరచవచ్చును విద్యుత్ తంత్రులకు ప్రశస్తమగు తొడుగుగా కూడ ఇది పని చేయును టెఫ్లన్ పూతపూయబడిన స్టెయిన్‌లెస్ స్టీలు పెనములు మన్నికకు, శుభ్రతకు పేరెన్నిక గన్నవి

థెర్మోసెట్టింగ్‌ప్లాస్టిక్ పదార్థములు ఫెనల్ ఫార్మల్డిహైడ్‌లనుండి చవుకగా లభించు బేక్‌లైట్ ప్లాస్టిక్‌లు ముఖ్యముగా విద్యుత్‌మీటల తయారీలో వాడబడు చున్నవి

మెలమైన్ - ఫార్మల్‌డిహైడ్‌ల నుండి తయారగు మెల్‌మక్ ప్లాస్టిక్ వస్తువులు నీటికి, వేడిమికి ఏమాత్రము చెక్కుచెదరక, యూర్యా ఫార్మల్‌డిహైడ్ ప్లాస్టిక్‌లకంటె శ్రేష్ఠమై ఉన్నవి మెల్‌మక్‌తో తయారగు కప్పులు, సాసర్లు, కంచములు మొదలగునవి అత్యుత్తమమైనవై శుభ్రతకు, చూపులకు పింగాణీ సామగ్రిని మించి యున్నవి తేలికగా నుండుటయు, సులువుగా పగులకుండుటయు వీటి ప్రత్యేకత

థాలిక్ ఆమ్లము, గ్లిసరీన్‌లనుండి ఏర్పడు ఆల్‌కిడ్ రెసిన్‌లకు రంగుపదార్థములను జతకూర్చి, ద్రవరూపములో పెయింట్లుగా ఉపయోగించు చున్నారు.

గ్లైకాల్స్ - డైఐసోసైయనేట్స్‌లనుండి పాలీయురిథేన్ ప్లాస్టిక్‌లను చేయుచున్నారు వీటిని స్పాంజీ రూపములో, దిండ్లు, పరుపులు వంటివి చేయుటకు వాడుచున్నారు

ఇసుకరాతిని కల్గియున్న సిలికాన్ ప్లాస్టిక్ పదార్థములు అత్యధికమైనట్టియు, అత్యల్పమైనట్టియు, ఉష్ణోగ్రతలకు, ఎట్టిమార్పును చెందక, తట్టుకొనగల్గి యుండును అధిక ఉష్ణోగ్రతలవద్ద వాడబడు పరికరములకు పూతగా ఇది ఉపయోగ పడును

సి వి ర

## ప్లేటో (తత్త్వవేత్తగా):

ప్లేటో పండితుడు క్రీ పూ 427 లో గ్రీసునకు ముఖ్య పట్టణమైన ఏథెన్సులో జన్మించెను అతని తల్లిదండ్రులు ఎరిష్టన్, పెరిక్టియోనె అనువారు వారు సంపన్నులును, పలుకుబడి కలవారునై యుండిరి సోక్రటీసు మహాశయుని శిష్యులలో ప్లేటో అగ్రేసరుడు అనేకములయిన కట్టుకథలు ప్లేటోనుగూర్చి వ్యాప్తిలో నుండెను వాటిలో నొకదానిని బట్టి అపోలో అను దేవుడే ప్లేటో జనకుడని తలంపబడెను భగవంతునిచే విశేషముగా అనుగ్రహింప బడిన బాలకులలో ప్లేటో ఒకడని భావింప బడెను ఆభిజాత్యము, సంపన్న పితరులు, దివ్యమయిన ఆకృతి, దైహిక, మానసిక సౌష్ఠవములు—ఇత్యాది గుణములలో ప్రతి గుణమును ప్రకృతిమాత ప్లేటోకు ప్రసాదించి అతనిని ఆశీర్వదించినది ప్లేటో అను నామ మతనికి ఒక ఎగతాళి నామమని తెలియుచున్నది 'ప్లేటో' అను పదమునకు విశాలస్కంధుడని అర్థము

ప్లేటోకు సంగీత సాహిత్యములతోపాటు ప్రశస్తమయిన విద్య లభించెను ప్లేటో తన యౌవన దశయందు జార్జియస్ ప్రొటాగోరస్ అను కుతర్కవాదులను గూర్చి వినియుండెను

ప్లేటో ప్రప్రథమముగ క్రేటిలస్ అను గురువువద్ద అధ్యయన మొనర్చెను అతడు పిదప సోక్రటీసును శుశ్రూషించెను ఆ కాలమునందు సోక్రటీసు యొక్క పాశ్చాత్యవ్యక్త పద్ధతి ప్రకారము అతని తత్త్వశాస్త్రమును ప్లేటో నేర్చెను జ్ఞానమే ధర్మము, ధర్మమే ఆనందము అనునది ఆ తత్త్వము

ప్లేటో, సోక్రటీసునందు అత్యంత భక్తికలవాడై అతనిని ఆరంభమునుండి పూజింప దొడగెను ఆ కారణముచే సోక్రటీసును విషమ మరణమునుండి తప్పించుటకై యథాశక్తి ప్రయత్నించు భాగ్యము శిష్యులలో నెల్ల ప్లేటోకు మాత్రమే దక్కినది ఆ విషయము ఎథీనియను పట్టణము నందలి జనులకు తెలిసెను వారు ప్లేటోను ద్వేషించిరి అందుచే ప్లేటో ఎథీనియన్ పట్టణమును వదలి పోవుటయే తనకు శ్రేయస్కరమని భావించెను అతడు ప్రపంచ సంచారము గావింప కడంగెను. ప్రపంచ మనగా ఆనాడు తెలిసిన

భూభాగము మాత్రమే అతడు దర్శించిన ప్రదేశములను

చిత్రము 78



ప్లేటో

గూర్చిన వివరములు తెలియవు కాని, ఆతడు సిసిలీ, ఇటలీ, సైరెనీ, ఇండియా, ఈజిప్టు దేశములనేగాక గంగా తీరమును కూడ దర్శించి యుండెననుట సంభావ్యమగుచున్నది పండ్రెండు సంవత్సరముల కాతడు తిరిగివచ్చెను యాత్రానంతర మత డొక జంగమ సర్వదేశీయ విజ్ఞాన సర్వస్వ మనదగి యుండెను

ప్లేటో, అంతట తన కాలమునెల్ల తన గురువగు సోక్రటీసు యొక్క తాత్త్విక ఉపదేశములను వ్యాప్తికి దెచ్చుటకై వ్యయింప కృతనిశ్చయు డయ్యెను నగరోద్యానమునందు అతడు ఒక పాఠశాలను తెరచి దానికి "అకాడమీ" అను నామకరణ మొనర్చి అందు సోక్రటీసు తత్త్వములను ప్రవచింప దొడగెను

ప్లేటో యొక్క గ్రంథము లన్నియు ఆతని గురు వగు సోక్రటీసు యొక్క ముఖమునుండి బయలువెడలిన వాద తార్కిక భాషలో రచించ బడినవి అందుచేత వాటిలో ఏవి ఆతని గురువు యొక్క విచారణములో, ఏవి ప్లేటో యొక్క స్వీయవిచారణములో వివేచించుట కష్టసాధ్యము అయితే ఉత్తమ విచారణము లెవ్వియో కొంతవరకు గుర్తింప బడినవి ప్లేటో ప్రాచీన ప్రపంచమునకు చెందిన అత్యంత దేదీప్యమాన మేధావులలో ఒకడుగా వరలెను

ప్లేటో రచించిన గ్రంథములు బహుళములు అతని ముఖ్య గ్రంథములు ఇరువది నాలుగు గ్రంథములకంటె మించి యున్నవి అందు 'రిపబ్లిక్' సింపోజియమ్, క్రిటో, ఫెయిడో అను గ్రంథములలో దాదాపు ఆధునిక భావము లన్నియు గలవు ఆ గ్రంథములు మత, రాజకీయ, తాత్త్విక, విజ్ఞాన సర్వస్వములుగా కనిపించుచున్నవి ప్లేటోయొక్క దార్శనిక విజ్ఞానము మహత్తర మైనది కావుననే అతని గ్రంథములు యూరపు పైనను, సర్వ ప్రపంచముపైనను తమ ప్రచండ మగు ముద్రను వైచినవి ఆతని పెక్కు భావములు పాశ్చాత్య ప్రపంచ భాగమును ఉర్రూత లూగించినవి ఈనాటికిని అతని భావములు నవనవములుగా భాసించు చున్నవి ఆదర్శ ప్రాయమైన ప్రజాస్వామిక ప్రభుత్వమును స్థాపించుటయే ప్లేటోయొక్క తాత్త్విక స్వప్నరహస్యము అట్టి ప్రజాస్వామ్యములో పరిపూర్ణమగు ఉత్తను మానవ సమాజము ఆవిర్భవింప గలదను ఉపజ్ఞాలోభితమగు భావ మాతనికి ప్రథమముగా జనించుట ఒక అసాధారణమైన విషయము ఆదర్శ భూతమగు అట్టి ప్రజారాజ్యమును నిర్మించుటకై రూపొందింపబడిన విపుల కార్యక్రమమే ప్లేటోయొక్క మహత్త్వమునకు ప్రబల నిదర్శన మనదగియున్నది

ప్లేటో పండితుని కీర్తి గ్రీసుదేశమునందే గాక ఆనాటి ప్రపంచమునం దెల్లయెడలను వ్యాపించెను. డయోనిసియస్ అను సిరక్యూస్ రాజు ఆనాడు ప్రసిద్ధుడై యుండెను ఆతడు ప్లేటోను తన రాజ్యమున కాహ్వానించెను "నీ గ్రంథములలో నీవు ప్రవచించిన రీతిగా నారాజ్య మొక ఆదర్శ ప్రజాస్వామ్య మగునట్లు తోడ్పడు"మని ఆ రాజు తన ఆహ్వానములో ప్లేటోను అర్థించెను ఆ రాజు కావించిన ఆహ్వానము నంగీకరించి వివేకవంతముగ ఎట్లు పరిపాలనము చేయవలెనో రాజునకు తెలుపుటకు ప్లేటో సిసిలీకి ముఖ్య పట్టణమైన సిరక్యూస్‌నకు వెళ్ళెను డయోనిసియస్ రాజమాత్రుడే కాని తాత్త్వికుడు కాడు అందుచేత తాత్త్వికుడగు ప్లేటో కావించిన ఉపజ్ఞతాయుత తాత్త్వికోప దేశములకు బెదరి ఆతనిని (ప్లేటోను) చంపించెదనని బెదరించినట్లు ఒక కథ గలదు కాని ప్లేటో స్నేహితులలో కొందరు ఆతని పక్షమున మధ్యవర్తిత్వమును పూనిరి అందుచేత ఆ రాజు ప్లేటోను ఒక బానిసనుగా విక్రయించి అతనిని ప్రాణములతో వదలివైచెనట! అదృష్టవశమున ప్లేటోకు గల శిష్యులలో ఆతని యందు ప్రేమగౌరవములు కలవా డొకడు తన బిడ్డలకు విద్య గరపుటకై ప్లేటోను కొనెను అయితే ఆతడు తన గురువర్యుని విముక్తు నొనర్చి ఏథెన్స్ పట్టణమునకు పంపివైచెను

ప్లేటో పండితుడు తనఇంటికి మరలిపోయిన తరువాత డయోనిసియస్ రాజు తా నొనర్చిన ఘోరాపచారమునకై పశ్చాత్తాపమును వెలిబుచ్చుచు క్షమాపణము నర్థించుచు ప్లేటో కొకలేఖను వ్రాసెను కాని "నేను తత్త్వచింతావ్యగ్రుడనై యున్నాను నిన్నుగూర్చి ఆలోచించుటకు నాకు తీరిక లేదు" అనుచు ప్లేటో, డయోనిసియసుకు ఒక తిరస్కార పూర్వకమయిన లేఖ నంపెనని యొక ఉపకథవలన తెలియు చున్నది

పిదప ప్లేటో తన విద్యా పరిపత్తునందు, తత్త్వ ప్రవచనములను కొనసాగింప దొడగెను కాలక్రమమున ఆతని ప్రసిద్ధి అధికతరము కాజొచ్చెను తత్ఫలితముగ "జ్యూయస్" అను ప్రాచీన గ్రీకుల ప్రధాన దేవత సాక్షాత్తుగా ఈ ఋషి నవతరించినను, ప్లేటో పండితునికంటె గురుతరమగు శక్తితో ఆమె ప్రవచింప జాలదని జనులు పలుక దొడగిరి ప్లేటో మిక్కిలి వృద్ధుడగువరకు జీవించెను

ప్లేటో పండితుని గ్రంథములలో రిపబ్లిక్ సింపోజియమ్, ఫాడ్రుస్, ఫిలెబస్, థియాక్టెటస్, లిసిస్, లాచెస్, చార్మిడెస్, జార్జియస్, పార్మనిడెస్, యూథిడెమస్, లాస్ అనునవి ప్రసిద్ధములు

ప్లేటో యొక్క 81 వ సంవత్సరమందు పిన్న వయస్కు లగు అతని స్నేహితులలో ఒకని వివాహము ఒకనాడు జరుగుచుండెను ప్లేటో ఆహూతుడై ఆ వివాహమున కేగెను అందు యువకులు క్రీడోత్సవా సక్తులై కోలాహల ధ్వని గావించుచుండిరి ఆ ధ్వని ప్లేటోకు ప్రచండమును, దుస్సహము నగుటచే, అతడు ఆ వివాహ గృహమందు ఒక పనికి రాని గదికి పోయి అందు కొంచెము నిదురపోయి విశ్రాంతి నొంద యత్నించెను కాని మరునాటి ఉదయమున పెండిలి కడనే క్రీడలను ముగించుకొని, అతని స్నేహితు లాగదికి వచ్చి చూచిరి ప్లేటో అందు దీర్ఘ నిద్రాగతుడై యుండెను ఆ దృశ్య మాతని స్నేహితుల నందరిని దుఃఖాశ్చర్యమగ్న మనస్కుల గావించెను

**ప్లేటో తత్త్వశాస్త్రము** ప్లేటో పండితుని వేదాంతము సోక్రటీసుయొక్క వాద తర్క పద్ధతి ఆధారముగా గలది ప్లేటో యొక్క ప్రధానమయిన తత్త్వోపదేశ మిది ఆలోచనా విషయములు శాశ్వతముగా యథార్థములు ప్రత్యక్షోపలబ్ధి గల ఇంద్రియ విషయములు (ఇంద్రియ అర్థములు) అనిత్యములు మనుజుడు భావజ్ఞానము కలవాడు అతనికి సంఘటనమును గూర్చిన అభిప్రాయములుమాత్రమే కలవు శాశ్వత పురుషార్థములు, న్యాయము, సుందరత్వము, సాధుత్వము అనునవి నిత్యములును, అత్యుత్తమములునైన యాథార్థ్యములు మనుజులకును, దేవతలకును గూడ స్వీయ అస్తిత్వమును, స్వీయ లక్ష్యమును తెలిసికొనుటకు అవి తోడ్పడును జీవితము యొక్క పర్యవసానము, లక్ష్యము, సత్యావగతియై యున్నది కావున సత్యము యొక్క జ్ఞానము మనుజున కావశ్యకము

మనుజుడు 'సర్వవస్తుమానము' అని ప్రాచీన గ్రీకులు భావించిరి కాని ఈ భావమును మార్చి, ప్లేటో మహాశయుడు "విశ్వాత్మయే అనగా దేవుడే సర్వవస్తు మానము కాని ఏ ఒక్క వ్యక్తియు కాజాలడు" అని ఉద్ఘాటించెను

అందుచే ప్లేటోకు విశ్వాత్మయందు గల విశ్వాసము ఘనమైనది వ్యక్తిగతములయిన సత్యములు లేక విశేష సత్యములు నిరపేక్షజ్ఞానము నొసగజాలవని ప్లేటో అభిప్రాయము

ప్లేటో యొక్క ఆలోచన నైతికభావములతో పరివ్యాప్తమై యున్నది నీతిశాస్త్రమును గూర్చి ఆతడు విశేషముగా నొక్కి వక్కాణించెను భగవద్విషయక జ్ఞానమే మానవుని ముఖ్యవ్యాపారమై యుండవలెనని ఆతడు వచించెను జ్ఞానమే ధర్మము, ధర్మమే ఆనందము కొత్తముమీద మనుజుని జీవిత పర్యవసానము, లక్ష్యము, ఆనందమే అనుచు ఇట్లు నైతికచింతనమునే ప్లేటోనొక్కివక్కాణించెను ఐనను ఆధ్యాత్మిక విద్యావిషయమున ఆతనికి అభినివేశము లేదనరాదు ఎందుచేతనన దైవిక మార్గదర్శకత్వమందును, ప్రార్థన యందును అతడు విశ్వాసము కలవాడు పై చెప్పబడిన విషయము లన్నియు సోక్రటీసు యొక్క తత్త్వోపదేశములే వాటియందు ఆతనికి విశ్వాస ముండెను

నైతికోపదేశ విషయమున తనగురువర్యుని కంటె ప్లేటో ఒక అడుగు ముందునకు వైచెను ఎట్లనిన, ఆతడు జీవితమునుగూర్చి యొక సమగ్రమయిన సమాలోచన మొనర్చి అందలి నానాప్రకారములైన అభిరుచులను, అనుభవములను పరామర్శించి ప్రకటించెను

**ప్లేటో పండితుని మనస్తత్త్వ శాస్త్రము** ఆత్మయందు తర్కమును, రెండు అహేతు పూర్వకములైన భాగములును కలవు (1) ఆత్మ–ఇది మానవుని యొక్క సక్రియమును అర్థవంతమునునైన స్వభావమై యున్నది (2) వాంఛ–అనగా విషయక వాంఛ తర్కము మనుజుని యందలి అత్యుత్తమ భాగము అది ప్రవృద్ధమైనచో జ్ఞానముగా రూపొందును అజ్ఞానము అహేతు పూర్వక భాగమును నిగ్రహించినచో, ఆత్మ ధైర్యము నావిష్కరించును అప్పుడు మనుజుడు ఉత్తమ కక్ష్య నధిరోహించును మనుజుని వాంఛలు నిగ్రహముచే నియంత్రితము అగును ఆత్మయొక్క ఉనికి జ్ఞానవశమున నుండి ప్రవర్తించు చున్నదను నైతికాదర్శము సిద్ధించును

సాంఘిక తత్త్వశాస్త్రము ప్లేటో యొక్క సాంఘిక తత్త్వశాస్త్రము అతని యొక్క అనువర్తిత నీతిశాస్త్రమే అని చెప్పబడినది. ఒక్కొక్క ధర్మమునకు లేక ఆత్మభాగమునకు, ప్రతిగా ఒక్కొక్క సాంఘిక కక్ష్య కలదు 'రిపబ్లికన్' అను ఉత్తమ గ్రంథములో ప్లేటో ఇట్లు వివరించెను. జ్ఞానమనునది తాత్త్విక ధర్మనిష్ఠగల ప్రభువును, ధైర్యము క్షాత్ర వర్గమును, నిగ్రహము కార్మిక - శిల్పి - కర్షక - కక్ష్యలను బోలియున్నది. తాత్త్విక - సత్యనేతృత్వమున, ఈ కక్ష్య లన్నియు, ఏ రాజ్యమునందు పనిచేయుచుండునో ఆ రాజ్యమే న్యాయ్యమును, ఆదర్శమునునగు రాజ్యమగుచున్నది. ఇట్టి న్యాయ్యరాజ్యము శ్రీమంత ప్రభుత్వమే ప్రజాసత్తాకము, అల్పసంఖ్యాకులగు ధనికుల రాజ్యము మున్నగు శేషించిన ప్రభుత్వరూపము లన్నియును అధమ కక్ష్యకు చెందిన రాజ్యములు.

జ్ఞానవాదము ప్లేటో హేతువాది. అతడు కేవలము ఇంద్రియ ప్రత్యక్ష జ్ఞానముపై ఆధారపడువాడు కాడు. స్వీయ - అనుభవ పూర్వకజ్ఞాన విషయమున సామాన్యములు యథార్థ జ్ఞానమునకు ఉపదేశకము లనువిషయము వాసనా సిద్ధాంతముచే సలక్షణముగ నిరూపింపబడినది. అనగా జీవుని పూర్వజన్మానుభూతములైన సామాన్యములు ఈ జన్మమున సముచితములయిన క్రియలచే సముద్బుద్ధములగును.

మతము ప్లేటో హేతువాదియు, గూఢతత్త్వజ్ఞుడును నైయుండెను. అతని భావనలో - దేవతలు, ఏకేశ్వరోపాసనా విషయములు అయితే అతడు తరచుగా అనేకేశ్వరోపాసనా విషయమును గూడ ప్రశంసించుచుండును. ప్లేటో యొక్క ఆదర్శము సౌజన్యము. అందుచే కొందరు అట్టి సౌజన్యము దేవునికంటె అభిన్నమని తలచిరి. ఐనను ఫీయడ్రస్, టైమాయస్ అను ప్లేటో గ్రంథములు-దేవుని ఒక వ్యక్తి సంబంధిగను, సౌజన్యము ఆ దేవునికి వెలుపలనున్నదానిగను ప్రతిపాదించుచున్నవి. దేవుడు, విశ్వము యొక్క తండ్రియును, నిర్మాతయును, కారకుడును, ఆకార నిరూపకుడునునై యున్నాడు. క్రైస్తవ మతస్థులును, ఇతర ఈశ్వరవాది మతస్థులును విశ్వసించు విధమున, దేవుడు లోక సృష్టికర్త కాడు. కాని ప్లేటో తత్త్వము ననుసరించి, దేవుడు విశ్వము యొక్కయు, వ్యవస్థారాహిత్యము యొక్కయు విధాత (అనగా విశ్వము యొక్క సృష్టి సంహార కర్త) యై యున్నాడు. ప్లేటో పండితుడు సావధిక - ఈశ్వర భావమును ప్రవచించెను. అతని దృష్టి ఆధ్యాత్మిక - ద్వైత దృష్టియై యున్నది. అది అనుభవ విషయకమును, అననుభవవిషయకమునునైన అతని శాస్త్రీయ ద్వైతమునకు తుల్యము. అది సుప్రసిద్ధ మయిన గుహోదాహరణముచే దృష్టాంతీకరింపబడినది.

ప్లేటో తత్త్వజ్ఞుని మరణానంతరము అతని తత్త్వముపై అనేక వివరణములును, అందు అభివృద్ధి వికాసములును జనించినవి. ప్లేటో తాత్త్వికుని ప్రాచీన విద్వత్పరిషత్తు అతని అనంతరము (క్రీ పూ 427-347) అరిస్టాటిల్ మహాశయునిచే కొనసాగింపబడినది. అరిస్టాటిల్ ప్లేటో శిష్యులలో అగ్రగణ్యుడు. అరిస్టాటిల్ పండితుడు ప్లేటో యొక్క నైతిక సిద్ధాంతములకు ప్రాధాన్య మొసగెను.

మధ్యమ పరిషత్తు (క్రీ. పూ 247-129) సంశయవాద సంప్రదాయముగా రూపొందెను. ఆర్ సెస్టాస్ (క్రీ పూ 315-241) అనునతడు నిర్ణయత్యాగ పక్షమును సమర్థించెను. కార్నియేడ్స్ అను పండితుడు (క్రీ పూ 213 - 129) యదృచ్ఛ, సంభావ్యత అనునవి జీవితము యొక్క ప్రధాన నిర్దేశకములని బోధించెను. వీరిలో ఏ యొక్కరును గ్రంథములను రచించినవారు కారు.

నూతన ప్లేటో తత్త్వము (క్రీ పూ 250 నుండి క్రీ శ 529) అనునది ఎమ్మోనియస్‌సాకాస్ అనువానిచే (175-242) స్థాపింపబడెను. అది ప్లాటినస్ (203-279) అను పండితునిచే అభివృద్ధికి తేబడినది. అతడు ప్లేటో తత్త్వము నందలి పౌరాణికములును, ద్వైత విషయకములును, ఈశ్వరుని సర్వగతత్వ విషయకములునునగు అంశములను వ్యాఖ్యానించెను.

ప్లేటో తత్త్వముపై మరియొక వివరణము కలదు. దానికి అలెగ్జాండ్రియన్ ప్లేటోనిజమ్ అని పేరు. (క్రీ పూ 20- క్రీ శ 50) యూదీయ ద్వైతిక ఈశ్వర - మీమాంసకుడు ప్లేటో పండితుని యొక్కయు, మోసెస్ పండితుని యొక్కయు సిద్ధాంతములు అనేకవిషయములలో తుల్యములని వ్యాఖ్యానించెను.

పాశ్చాత్యదేశమున అనంతర తరములకు చెందిన తత్త్వజ్ఞులు, నిరంతరము ప్లేటో తత్త్వముచే ప్రభావితులయిరి. అనేకులు తమ మతతత్త్వములలో ప్లేటో సిద్ధాంతములను ఆవిష్కరించిరి. నేటికిని ప్రబలతత్త్వ వికాసమునకు ప్లేటో

తత్త్వమే మూలమై యున్నది. ఆధునిక కాలమున ప్లేటో తత్త్వమునకు చేకూరు గణన, పాఠకుల మనముపై అతని వేదాంతమునకుగల అధికార ప్రాభవములకు నిదర్శనమై యున్నది. ప్లేటో తత్త్వము యొక్క సక్రమావగతి, తత్త్వశాస్త్ర సవ్యావగతియే, ప్లేటో తత్త్వము యొక్క అపక్రమావగతి తత్త్వశాస్త్ర అయథార్థావగతియే (భ్రమ) అని చెప్పబడినది. ప్లేటో తత్త్వమును సక్రమముగ అవగతి చేసికొనిన వారికి తత్త్వశాస్త్రము బోధపడును. అతని తత్త్వము సరిగ అవగతి కానివారికి తత్త్వశాస్త్ర అవగతి భ్రమయే.

శ్రీ శ్రీ

## ప్లేటో [క్రీ పూ 428-347] (రాజనీతివేత్తగా)

గ్రీసుదేశమందు విద్యలకు, కళలకు, వర్తక వ్యాపారములకు, ప్రజాస్వామ్యమునకు ప్రధాన కేంద్రముగ ప్రసిద్ధి గాంచిన ఏథెన్సు నగరములోని ఒక ప్రముఖ సామంత కుటుంబమున క్రీ పూ 428 లో ప్లేటో జన్మించెను. అతడు బాల్యములో విద్యలతోపాటు శరీరవ్యాయామమందు కూడ శ్రద్ధవహించి కండపుష్టికలవాడయ్యెను. తన ఇరువదవ సంవత్సరమున అతడు విఖ్యాతిగాంచిన తత్త్వవేత్తయగు సాక్రటీసుకు శిష్యుడై ఎనిమిది సంవత్సరము లతనికి శుశ్రూష చేసి, అతని నుండి అనేక సత్యములను గ్రహించెను. కాని ఆకాలపు ఏథెన్సు పౌరులు సాక్రటీసు ప్రతిభను గుర్తించలేనివారై, అతని బోధలు యువకులను చెడమార్గమున పెట్టు చున్నట్లు దురభిప్రాయపడి, అతనిపై నేరము మోపి, న్యాయస్థానములో విచారణ జరిపించి, తుదకతనికి మరణ శిక్షకు గురియొనర్చిరి. ఈ విషాదఘట్టము ప్లేటోయొక్క మనోభావములలో గొప్ప పరివర్తనమునకు కారణమయ్యెను. మహాత్ముల సందేశములలోని ఘనతను గ్రహించుటకు సామర్థ్యము లేని సామాన్య పౌరుల ప్రజాస్వామ్యము లోని లోపములను స్పష్టపరచుటకు ఇంతకంటె బలవత్తరమగు సాక్ష్యము అవసరము లేదను అభిప్రాయము ప్లేటోలో జనించెను. తన్మూలమున ప్రజాస్వామ్యము పట్ల అతనికి ద్వేషము కలిగెను. ఇది జరిగిన తర్వాత నాలుగు సంవత్సరములకు ఏథెన్సు రాజ్యము యుద్ధములో పూర్తిగ అపజయము గాంచుటయు, తత్ఫలితముగ సామ్రాజ్యమును కోల్పోవుటయు, శిష్టప్రభుత్వమునకు కేంద్రమైన స్పార్టానగరము విజయభేరి మ్రోగించుటయు జరిగెను. దీనికికూడ ఏథెన్సులోని ప్రజాస్వామ్యమే కారణమన్న భావము ప్లేటోలో బలపడెను. గురువగు సాక్రటీసు మరణించిన తర్వాత ప్లేటో అనేకదేశములలో సంచారము గావించి, వాటిలోని పరిపాలనా విధానములను గమనించి, క్రీ పూ 388 లో ఏథెన్సుకు మరలివచ్చి, అకాడెమీ అను పేరిట నొక విద్యాపీఠమును స్థాపించి, తత్త్వవిచారము చేయుచు, శిష్యులకు తత్త్వము నుపదేశించుచు ఇరువది సంవత్సరముల కాలము గడపెను. తదుపరి 60 వ ఏట తన రాజకీయ సిద్ధాంతములను ఆచరణలో పెట్టుటకు సిసిలీద్వీపములోని సైరక్యూస్ నగరములో అవకాశము లభించినట్లు తోచగా, అతడక్కడికి వెళ్ళి కొంతకాలము గడపి అవకాశము వ్యర్థముకాగా, ఏథెన్సుకు మరలివచ్చి విద్యావ్యాసంగములో కాలము గడుపుచు క్రీ పూ 348 లో దివంగతు డయ్యెను.

ప్లేటో దీర్ఘకాలపు విద్యావ్యాసంగ ఫలితముగ రిపబ్లిక్, స్టేట్స్‌మన్, లాస్ మొదలైన గ్రంథరాజము లనేకములు వెలువడెను. వీటిలో అతడు సమస్త శాస్త్రములను గురించి అనేక సిద్ధాంతములను ప్రతిపాదించెను. అతడు విచారణచేయని శాస్త్రము ఒక్కటికూడ లేదని చెప్పుటలో ఏలాటి అతిశయోక్తి లేదు. పాశ్చాత్యుల తత్త్వశాస్త్రము లన్నిటికిని అతని రచనలే మూలాధారము లయ్యెను. అతడు కాలముచేసి ఇప్పటికి సుమారు 2400 సంవత్సరములైనను అతని సిద్ధాంతములు సజీవములై వాటి ప్రతిభను, ప్రభావమును ఏమాత్రము కోల్పోక ప్రకాశించు చున్నవి.

ప్లేటో రచించిన గ్రంథములన్నిటిలో "రిపబ్లిక్" అగ్రస్థానమును వహించినట్టిది. రాజ్యాంగతత్త్వమును గురించిన ఇంతటి యుద్గ్రంథము పాశ్చాత్యప్రపంచములో మరి యొకటి లేదు. అందులో అతడు ప్రతిపాదించిన సిద్ధాంతములను ఇచట సంక్షిప్తముగ వివరించుచున్నాము.

(1) నిర్దుష్టమైనట్టియు, ఆదర్శప్రాయమైనట్టియు రాజ్యముయొక్క స్వరూపమును చిత్రించు ఉద్దేశముతో ప్లేటో ఈ గ్రంథమును రచించెను. ఇందులోని సిద్ధాంతములలో ప్రప్రథమమున గుర్తింపవలసినది సాక్రటీసునుండి అతడు నేర్చుకొనిన, "జ్ఞానమే పరమార్థము" అనునది. ఋజుప్రవర్తనము, యోగ్యత మొదలగు సుగుణములకు జ్ఞానమే ఆధారమని దీనిభావము. జ్ఞానియే చరితార్థుడను సత్యమును ఇది చాటుచున్నది.

(2) పదార్థముల నిజస్వరూపమును తెలిసికొనుటయే

వాటినిగురించిన జ్ఞానము కాని పదార్థములు, అందులోను సజీవముగ నుండునవి, సర్వకాల సర్వావస్థలందు ఒకేరూపమును ధరించక నిమిషనిమిషమునకు మారుచుండును గర్భములో పిండరూపమున నున్న పురుషుడు శిశువుగను, బాలుడుగను, యువకుడుగను, వృద్ధుడుగను మారుచున్నాడు అందుచేత పురుషుని స్వరూపము ఇట్టిదని నిరూపించుట సాధ్యముకానట్లు తోచును కాని ఇందులో అసాధ్యమేదియు లేదు పరిపక్వము గాంచిన అవస్థలో పదార్థస్వరూప మెట్టిదో, అదియే దాని నిజస్వరూపము అట్టి అవస్థను పొందిన తర్వాత దానిలో ఎంచదగిన మార్పు ఏలాటిది ఉండదు కనుక ప్రతి పదార్థము పరిపక్వదశయందు ఎట్టిరూపమును ధరించునో దానిని గుర్తించుటయే, దానిని గురించిన నిజమైన జ్ఞానము

(3) ఈ సూత్రము రాజ్యముల విషయమున గూడ వర్తించుచున్నది అందుచేత పరిపక్వము గాంచిన రాజ్యము ఎట్టిదిగ నుండునో నిర్ణయించుటయే రాజ్యాంగ తత్త్వము అట్టి రాజ్య మొక్కటే స్థిరత్వము కలది యగును కంటికి కనుపించు వాస్తవ ప్రపంచము నందుండు రాజ్యము లేవియు పరిపక్వములు కావు అవి శుద్ధములు కావు తత్త్వవేత్త విచారించ వలసినది వాటిని గురించి కాదు పరిపక్వ రాజ్య స్వభావ స్వరూపములను అతడు విచారించి వివరించ తగ్గది

(4) పరిపక్వ రాజ్యమును వివరించుటలో పరిపక్వము గాంచిన పురుషు డెట్లుండునో తెలిసికొనుట అవసరము ప్రతి పురుషునిలో మూడు గుణము లున్నవి శారీరకావసరములను తీర్చు ఆహారాది పదార్థము లందును, ఇతర ఇంద్రియ సుఖము లందును, గల వాంఛ మొదటి గుణము ఇతరుల మూలమున ప్రమాదములు సంభవించకుండ, తన్ను రక్షించుకొనగోరుట రెండవ గుణము ధైర్య సాహసములు దీనికి సాధనములు మంచి చెడ్డల మధ్య వివక్ష చేయగలుగుట మూడవ గుణము ఇదియే వివేకము కాని ఏ పురుషునిలో కూడ ఈ మూడు గుణములు సమాన ప్రమాణములో ఉండవు అనేకులలో ఇంద్రియ సుఖాపేక్ష ఒక్కటే అత్యధికముగ నుండును కొందరిలో ధైర్య సాహసములు మెండు మరికొందరిలో వివేకము అగ్రస్థానము వహించును జీవితము శాంతముగను, సుఖముగను నడుచుటకు వివేకమే ప్రధాన సాధనము తక్కిన రెండు గుణములను నియమ బద్ధములుగ చేసి, వాటి వలన ప్రమాదము సంభవించకుండ చేయగలది వివేకము అందుచేత గుణము లన్నిటిలో వివేకము ఉత్కృష్టము వివేకియే జ్ఞానవంతుడు

(5) మానవునియందుండు గుణములే మానవ సంఘమందు కూడ ఉన్నవి అందుచేత మానవ సంఘము కూడ త్రిగుణాత్మక మైనట్టిది పరస్పరాశ్రయులగు మానవుల సముదాయమే సంఘము ఏ మానవుడు గాని ఇతరుల సహకార సహాయములు లేక సుఖముగ జీవించ లేడు ప్రతి పురుషునకు ఆహారాది పదార్థము లనేకములు అవసరము కాని వాట నన్నింటిని అత డొక్కడే ఉత్పత్తి చేసికొనలేడు ఒక్కొక్కడు ఒక్కొక పని చేయుటయందు సమర్థుడుగ నుండును దీని ఫలితముగ ప్రతి సంఘము, వృత్తి విభాగము కలదిగ నున్నది

వ్యవసాయమందు నేర్పు గలవారు పంటల నెక్కువగ పండించి, అందులో కొంత భాగమును నేతగాండ్రు, వడ్రంగులు మొదలగు వారి కిచ్చి, వారు తయారు చేసిన వస్త్రములు, కర్ర సామానులు మొదలగు వాటిని సంపాదించుచున్నారు ఈ విధానముననే పరస్పరాశ్రయ మనిపేరు కాని సంఘము స్థిరముగ నిలబడుటకు వస్తు సామగ్రిని తయారు చేయుటయందు నేర్పు గలవారు మాత్రము చాలరు ఈ వృత్తులు వృద్ధిగాంచిన సంఘములో ధనధాన్యము లధికముగ నుండును అందుచేత ఇతర సంఘములవారు దురాశాపరులై యుద్ధము చేసి వాటిని అపహరింప ప్రయత్నింతురు ఇది గాక సంఘమందు దరిద్రులుగ నుండువారు ధనికులపై దౌర్జన్యము గావించి వారి ధనము నపహరింప జూచెదరు ఇట్టి ప్రమాదముల నుండి సంఘమును రక్షించుటకు యోధులు అవసరము కాయకష్టము చేయువారిని, యోధులను వారి వారి వృత్తులు సౌష్ఠవముగ అనుసరించునట్లు చేయుటకును, సంఘము యొక్క సమష్టి సౌఖ్యమును పెంపొందించుటకును పరిపాలకులు అవసరము కనుక ప్రతి సంఘమందు కాయకష్టము చేయువారు, యోధులు, పరిపాలకులు అను మూడు ప్రత్యేక వర్గము లుండవలెను మొదటి రెండు వర్గముల వారు పరిపాలక వర్గమునకు, వారి శాసనములకు లోబడి వారి వారి పనులను చేయవలెను కాయకష్టము చేయువారిలో ఇంద్రియ సుఖాపేక్ష మెండు యోధులలో ధైర్యసాహసము లధికము పరిపాలకులలో వివేకము ప్రధాన గుణము మనస్సు విధించు నియమములకు లోబడు ఇంద్రియములు

శరీర సౌఖ్యసాధనము అగునట్లును, వివేకమునకు లోబడిన ఇంద్రియ సుఖావేశయు, ధైర్య సాహసములును పురుమనికి శాంతిని సమకూర్చునట్లును పరిపాలకులకు లోబడి వర్తించు కాయకష్ట వర్గమువారు (శ్రామికులు) యోధవర్గమువారు సంఘ శ్రేయస్సును సమకూర్చు వారగుదురు

(6) ఎవడు దేనికి అర్హులో వారు ఆయా పనులను చేయుట ఉత్తమము వైద్యశాస్త్రమందు జ్ఞానము కలవాడే గదా వైద్యము చేయవలసినది అదేవిధముగా అధికారార్హత గలవాడే పరిపాలకుడు కావలెను ఇట్టి అర్హత అందరికి ఉండదు వివేకము దానికి మూలము మానవ జన్మము యొక్క పరమార్థ మెరుగుటయే వివేకము తత్త్వవేత్త లొక్కరికే అట్టి వివేక ముండును సంఘమును ధర్మమార్గమున నడుపగలవారు వారొక్కరే అట్టివారు పరిపాలకులుగ నుండు రాజ్యమే ఆదర్శ రాజ్యము తత్త్వవేత్త లొక్కరే రాజులగుటకు యోగ్యులు అట్లుగాక, దానికి విరుద్ధముగ పౌరులందరు, శ్రామికులు యోధులతోసహా పరిపాలనాధి కారమునకు అర్హులు అను సూత్రమును ఆధారముగా జేసికొన్న ప్రజాస్వామ్యము ఆదర్శ రాజ్యము కాజాలదు అది అధమమని చెప్పదగి యున్నది ఏథెన్సు పతనమునకు ఇదియే కారణము

పరిపాలనాధి కార్యమును వహించిన తత్త్వవేత్తలు నిర్వసంగ పరిత్యాగులుగ నుండవలెను వారికి సొంత ఆస్తులు ఉండరాదు ప్రత్యేకముగ ఆలుబిడ్డలు ఉండరాదు కాని వారికి స్త్రీసంగమము గాని, సంతానము గాని ఉండరాదని కాదు దీని అర్థము, సంతాన మొక్కదానికే వారు స్త్రీలతో కలియ వలెను ఎవరిని గాని వివాహ మాడరాదు వారికి ఏ స్త్రీతోకూడ శాశ్వత సంబంధము ఉండకూడదు ఏ స్త్రీకి ఏ అధికారి మూలమున గర్భము కలిగెనో, ఏ శిశువునకు ఏ అధికారి తండ్రియో తెలియకూడదు సొంత ఆస్తియు, సొంత కుటుంబములు అధికారుల స్వలాభ పరత్వమునకు దారితీయునట్టివి అందుచేత అట్టివి ఆదర్శ రాజ్యమం దుండరాదు ప్లేటో రూపొందించిన ఆదర్శ రాజ్యములోని పరిపాలకులకు ఇవి లేనందున వారు వారి అధికారమును దుర్వినియోగము చేయజాలరని అతని అభిప్రాయము అందుచేత వారెని అధికార మందుండి తొలగించుటకై ఏలాటి కుట్రలు జరుగవు అట్టి అధికారము స్థిరత్వము నొందగలదు అట్టి రాజ్యములో విప్లవభయ ముండదు

తత్త్వవేత్తలు పరిపాలకులగునప్పుడు వారి అధికారమునకు రాజ్యాంగము ద్వారా గాని ఇతర చట్టములద్వారా గాని హద్దులు కల్పించుట అనుచితము అవివేకము, అనవసరము సర్వజ్ఞులపై ఇతరులు విధించు చట్టములు అనవసరములు వారి అధికారము నిరంకుశముగ నుండవలెను

తక్కిన రెండుమార్గములవారిని వేరుపరచి, వారిని నియమములో ఉంచుటయే పరిపాలకుల ప్రథమకర్తవ్యము ఎవడు శ్రామికవర్గములో చేర్చదగినవాడో ఎవడు యోధవర్గములో చేర్చదగినవాడో, ఎవడు అధికారవర్గములో చేరుటకు అర్హుడో నిర్ణయించుట వారి పని కొంతవరకు పుట్టుకను బట్టి ఈ అర్హతానర్హతలు ఏర్పడును కాని వీటిని కనుగొనుటకు, కనుగొనినతర్వాత ఆయా వర్గములలో చేరిన వారిని ఆయా వృత్తులలో నుండునట్లు అంగీకరింపజేయుటకు, విద్య ప్రధానసాధనము ఇరువది ఏండ్లవయస్సు వచ్చువరకు పౌరులందరికి ప్రాథమిక విద్యను నేర్పవలెను దానికి శరీర వ్యాయామము, సంగీతము, కావ్యపఠనము ప్రధానాంగములు ఇరువదవ సంవత్సరమున విద్యమూలమున వారు గడించిన శక్తిసామర్థ్యములనుబట్టి శ్రామికవర్గములో చేరదగినవారిని తక్కినవారినుండి వేరుపరచవలెను వారది మొదలు జీవితాంతము వరకు కాయకష్టము చేయువారుగనే ఉండవలెను తక్కినవారికి మరి పదిసంవత్సరములు గణిత శాస్త్రము, జ్యోతిషము, తర్కము నేర్పవలెను ముప్పదవ ఏట వారిలో యోధులగుటకు మాత్రమే అర్హులగు సాహసికులను కేటాయించవలెను మిగిలినవారికి మరి అయిదు సంవత్సరములు ఉన్నత విద్యలను నేర్పి, అధికారవర్గములో చేర్చవలెను విద్యాపారంగతులును, ముప్పదియైదు సంవత్సరములకు పైబడ్డవారు మాత్రమే పరిపాలకులగుట శ్రేష్ఠమని దీనిని బట్టి స్పష్టమగు చున్నది

విద్య, గుణకర్మ విభాగ మొక్కదానికి మాత్రమే సాధనము కాదు శ్రామికవర్గమువారు వారి స్థితిగతులతో తృప్తిపడి, పై వర్గములవారిపై తిరుగుబాటు చేయకుండుటకు కూడ ఇదియే సాధనము, పై అంతస్తులకు వెళ్ళుటకు తమకు అర్హత లేదన్నభావము దీనిమూలమున వారిలో ఏర్పడుచున్నది, వర్గసంకరములేక, ఎవరి వృత్తిధర్మమును వారు అనుసరించుటకు ఇది ఆధారము సంఘము యొక్క స్థిరత్వమునకు అన్నివర్గములవారిలో ఇట్టి పరిజ్ఞానముండుట అవసరము

ఈ అవసరమును తీర్చుటయే విద్యయొక్క ప్రయోజనము

ప్లేటో చిత్రించిన ఆదర్శరాజ్యమందు ఏథెన్సులోని పరిపాలన విధానమందుండిన లోపములు లేవు ఆ లోపము లన్నిటికి అజ్ఞానులగు ప్రజలు పరిపాలకులగుట కారణమనియు, జ్ఞానులగు తత్త్వవేత్తలే రాజ్యమును పాలించవలెననియు అతనిసిద్ధాంతము. ప్రజాస్వామ్యమును నిరసించి, నియంతృత్వ మును సమర్థించిన తత్త్వవేత్తలలో ప్లేటో ఒకడు

ప్లేటో సిద్ధాంతమును అతనిశిష్యుడై, అతనివలెనే తత్త్వవేత్తగా జగత్ప్రఖ్యాతి గాంచిన అరిస్టాటిల్ కొంత వరకు ఖండించెను ఆ ఖండనములోని ప్రధానాంశములను ఈ ఎంగర్భములో గుర్తించవలసి ఉన్నది (1) తత్త్వవేత్తలు చిత్రించు ఆదర్శ రాజ్యములు నిర్మాణ సాధ్యములుగ నుండ వలెను గాని, ఆకాశ భవనములవలె అసాధ్యములుగ నుండ రాదు ప్లేటో చిత్రించిన ఆదర్శ రాజ్యము నిర్మాణ సాధ్యము కానట్టిది అది భావనా ప్రపంచములో మాత్రమే ఊహింప తగినది మానవ మాత్రులకు సర్వజ్ఞత్వము అందుబాటులో ఉండదు సర్వజ్ఞులగు తత్త్వవేత్తలే రాజ్యపాలనమునకు అర్హు లని నిర్వచించుట అట్టి రాజ్యములు ఎన్నటికి కూడ నిర్మాణ సాధ్యములు కావని చెప్పుటయే జ్ఞానులు రాజ్యపరిపాలన మును వహింప నిచ్చగింతురా? ప్లేటో సిద్ధాంతములో ఇదియే గొప్ప లోపము (2) అధికారులకు సొంత ఆస్తులుగాని భార్యలుగాని, సంతానముగాని ఉండరాదన్న ప్లేటో సూత్ర మును కూడ అరిస్టాటిల్ ఖండించెను శరీర సౌఖ్యము లేక ఆత్మ వికాసము సిద్ధించదు శరీర సౌఖ్యమునకు ఎంతో కొంత ఆస్తి ఉండవలెను ఇది గాక నియమబద్ధ జీవితమునకు కుటుం బము మూలము దారపుత్రాదులు లేని జీవితము కళ్ళెము లేని గుఱ్ఱమువలె చపల స్వభావము కలది యగును ఆస్తి విషయమున గాని, కుటుంబ విషయమున గాని ఉమ్మడి సామాజిక (కమ్యూనిస్టు) పద్ధతి ననుసరించుట ప్రకృతి విరు ద్ధము ఇంతే గాక అది అభివృద్ధి నిరోధకము (3) తత్త్వ వేత్తలగు అధికారులు సర్వజ్ఞు లగుటచేత వారిని నియమ మార్గములో నుంచుటకు సంప్రదాయ సిద్ధములగు ఆచార ములు గాని, శాసనములు గాని అనవసరమన్న ప్లేటో వాద మును కూడ అరిస్టాటిల్ ఖండించెను అధికార మందుండు వారుకూడ సామాన్యులవలె చట్టబద్ధులుగ నుండుట అవసర మని అతడు ప్రతిపాదించెను దీని కతడు రెండు కారణము లను చూపెను

చట్టము యొక్క ప్రభావము మొకటి కారణము చట్టమునకు గాని, శాసనమునకు గాని, సంప్రదాయములకు గాని తరతరములనుండి సంఘములోని వారు గడించిన అను భవము మూలాధారము ఒకని ఇచ్ఛామూలమున ఏర్పడిన సూత్రములలో లోపము లుండవచ్చును కాని, తరతరముల నుండి లభించిన సంప్రదాయములలో లోపము లుండవు లోపము లున్నప్పుడు పౌరులందరు కలసి వాటిని సవరించి క్రొత్త శాసనముల నేర్పరచు కొనవలెనే గాని అధికార మందుండు ఎంతటి జ్ఞానులైనను సంప్రదాయములను మార్చి ఇష్టము వచ్చినట్లు చరింపరాదు పాలకులు పాలితులు కూడ చట్టములకు బద్ధులై ప్రవర్తించుటయే ధర్మము ఇది గాక చట్టబద్ధమైన పరిపాలనముఉన్నప్పుడేపౌరులకునిజమైన స్వేచ్ఛ లభించుట జరుగును స్వేచ్ఛయొక్క లక్షణమే అతడు సూచిం చిన రెండవ కారణము స్వేచ్ఛ అనగా ఇతర మానవుల ఆజ్ఞలకు లోబడవలసిన అవసరము లేకుండుట ఇతరుల ఆజ్ఞ లకు లోబడవలసినవాడే బానిస చట్టమునకు లోబడుట స్వేచ్ఛను పోగొట్టుకొనుట కాదు పరిపాలకులు కూడ చట్ట బద్ధులై ఉన్నప్పుడును, వారు అమలులో ఉంచు చట్టములు వారి ఇచ్ఛాఫలితములు గాక సంప్రదాయ ఫలితములో, ప్రజాభిప్రాయ ఫలితములో అగునపుడును, అట్టి శాసన ములకు లోబడుట స్వేచ్ఛకు భంగము కలిగించదు. ఈ రెండు కారణములచేత అధికారులు నిరంకుశులు గాక, చట్టబద్ధులుగ నుండవలసి యున్నది సర్వస్వామ్యము చట్టమునకే గాని వ్యక్తు లెవ్వరికిని ఎంతటి మహానుభావుల కైనను ఉండరాదు చట్టబద్ధమైన రాజ్యమే ఆదర్శ రాజ్యము

కొంతవరకు నియంతృత్వమును, కమ్యూనిస్టు విధాన మును ప్రతిపాదించిన ప్లేటో యొక్క రాజ్యాంగ తత్త్వము నకును, చట్టబద్ధమైన స్వామ్యమును ప్రతిపాదించిన అరిస్టా టిల్ తత్త్వమునకును, అప్పటినుంచి ఇప్పటి వరకును పోరా టము జరుగుచునే ఉన్నది నిరంకుశ తత్త్వము ననుసరించు ఫాసిస్టులు, కమ్యూనిస్టులు, సైనిక నియంతలు, ఏకపక్ష పరిపాలనమును సమర్థించువారు ప్లేటో యొక్క శిష్యవర్గ మునకు చెందినవారు ప్రజాస్వామ్యాది నియమబద్ధ పరిపాలన విధానమును సమర్థించువారు చాలవరకు అరిస్టాటిల్ శిష్య వర్గమునకు చెందినవారు ఈ తత్త్వవేత్తలు లేవదీసిన తత్త్వ

విశాదములు ఇప్పటివరకు పఠీవములై ఉండుటయే వారు ప్రతిపాదించిన సిద్ధాంతముల ప్రాధాన్యమునకు గొప్ప తార్కాణము

మా వే రం

# ఫ

## ఫణిగిరి

ఫణిగిరి అను గ్రామము నల్లగొండ జిల్లాలో నున్నది ఇదియొక బౌద్ధమత కేంద్రముగా నుండెను కాని ఆ బౌద్ధారామము భూగర్భములో మునిగిపోయినది హైద్రాబాదు పురాతత్త్వశాఖవారి ప్రయత్న ఫలితముగ అదిబయటపడినది

ఈ బౌద్ధవిహారము ఒక గుట్టమీద నున్నది పురాతత్త్వ శాఖవారు ఈ ప్రాంతమును త్రవ్వగా, ముప్పదిస్తూపముల శిథిలములు కనిపించినవి ఇవన్నియు గుండ్రని కట్టడములు

చిత్రము 74



(ముందు దృశ్యము

పటము 1.

పశ్చిమభాగమునసే కొండవాలున వివిధ అంతస్తులుగ నిర్మింపబడియున్నవి ఆరామ మధ్యముగ నలుచదరపు వ్యూహముగ ఇటుక కట్టడముల పునాదులున్నవి ఈ పునాదులమీద గదులు కట్టబడినట్లు తోచుచున్నది ఈగదులు, బౌద్ధభిక్షువుల నివాసమునకు ఉద్దేశింపబడిన కొట్లు కాబోలును!

బౌద్ధుల ఆరాధన మందిరములను చైత్యములందురు ఇచ్చటి చైత్యముయొక్క నిర్మాణ విధానము దాక్షిణాత్య శిల్పములో గాని, తదితర స్థానములందలి శిల్పములో గాని కనబడని ప్రత్యేకతను కలిగి యున్నది

ఈ కట్టడములకు వాడిన ఇటిక రెండడుగుల పొడవును, ఒక అడుగు వెడల్పును, మూడున్నర అంగుళముల మందమును కలిగియున్నది ఈ ఇటికల నిర్మాణ విధానము వాటి అత్యంత ప్రాచీనతను చాటుచుండును ఇక్కడ దొరకిన తెల్లనున్నపు రాతిచెక్కడములు చాల అందమైనవి

చిత్రము 75



(వెనుక దృశ్యము)

పటము 2.

ఫణిగిరిలో దొరికిన విగ్రహ శకలము

వీటిలో పెక్కులు రాతితో కట్టబడినవే

ఈ స్తూపములలో పెక్కులు ముఖ్య ఆరామమునకు

ఇచ్చటి శిల్పకళ అత్యున్నత శిల్ప సంప్రదాయమును ప్రకటించుచున్నది. శిల్పములలో జీవశక్తి, భావుకత్వము, రూప

సంపద విస్తృతముగ కొట్టవచ్చినట్లు కనబడును ఇచ్చట ఆంధ్ర రాజుల నాణెములుకూడ దొరకినవి ఈ నాణెములు ఆంధ్ర సామ్రాజ్య వైభవమును వేనోళ్ళ చాటుచున్నవి

శిల్పకళా వైభవమును బట్టియు, నాణెములమీది సాంకేతిక చిహ్నములను బట్టియు, ఫణిగిరి బౌద్ధవిహారము క్రీ శ మొదటి శతాబ్దములో ప్రకాశమానముగ నుండి యుండెనని చరిత్రకారులు నిర్ణయించినారు ఆంధ్రుల పూర్వ చరిత్ర సమీకరణములో ఫణిగిరి శిల్పశకలములు, శిల్పసంపద అపారముగ ఉపయోగింప గలవు

ఇచ్చట దొరకిన ఒక విగ్రహముయొక్క ఊర్ధ్వభాగము ముఖవిలాసమును, చిత్తవృత్తులను, శరీరపుష్టిని ప్రకటించు చుండును చెవులకు బరువైన తాటంకములున్నవి ఆ తాటంకములు బరువైనవని తోచునట్లుగ చెవులు క్రిందికి సాగి యున్నవి శిరోభాగమున విజయలాంఛనముగ ఒక ఆకు కొమ్మ చుట్టబడి యున్నది ఈ పద్ధతి ప్రాచీన గ్రీకు సంప్రదాయమునకు చెందినది ప్రాచీన గ్రీకు దేశీయులతోను, వారి సంప్రదాయములతోను - ఇచ్చటి తెలంగాణము వారికి మంచి పరిచయముండి యుండెనేమో !

ఇచ్చట కుడ్యభాగమైన ఒక పలకరిమ్మో దొరికినది ఆ చిన్న ముక్కమీద మూడు ప్రక్కలయందు శిల్పచిత్రములు చెక్కబడియున్నవి ముఖభాగమున సంపూర్ణముగా రేకులు విచ్చిన సుందరపద్మ చిత్రము కలదు పద్మమునకు దిగువభాగమున ఒక వృషభము, మానవుడు, గజము- ఈ విగ్రహములు శిల్పింపబడి యున్నవి వృషభపు మూపురము ఎత్తుగా, సొంపుగా నున్నది ఈ వృషభమును గజము తరుముచున్నది ఏనుగుయొక్క కాయము స్థూలమైనది, దంతములు నిడుపైనవి తరుముచున్న ఈ గజమునుండి వృషభమును గాపాడుటకు కాబోలు వృషభమునకును, గజమునకును మధ్యనొక మనుష్యుడు నిలుచుండి యున్నాడు ఇతడు అంత దృఢకాయుడుగా కనబడడు అయిననేమి, మహాధైర్యవంతుడుగా నుండియుండును అతని రూపములో విజయసిద్ధి చిహ్నములు ప్రకాశమాన మగుచుండును. (3, 4, 5 పటములను చూడుడు)

వామన రూపుడైన ఒక బొజ్జయ్య శిల్పచిత్ర మొకటి కలదు ఇదియొక వ్యంగ్య చిత్రముగ కన్పించును ఈ

చిత్రము 76



పటము 3

చిత్రము 77



పటము 4.

చిత్రము 78



పటము 5.

కుడ్యశిల్పములు (ఫణిగిరి)

శిల్పము ఉత్తమ శిల్పలక్షణములను ప్రకటించు చున్నది (8వ పటము చూడుడు)

చిత్రము 79



పటము 8

వామనరూపుడైన శ్రీజయ్య

జనగామనుండి సూర్యాపేటకు పోవు రోడ్డుమీదుగా 30 మైళ్ళు పయనించినచో, ఫణిగిరి శిథిల బౌద్ధవిహారమును చేరుదుము

అచ్చట కొండమీద ఒక గుహలో వెలసిన దేవునకు ఒక గుడి కట్టబడినది. ఈ దేవునకు 'ఫణిగిరి రామప్ప' అని ప్రసిద్ధి ఈ ఆలయములోగల శ్రీరాముడు స్వయంవ్యక్త ప్రత్యక్ష దైవమని ప్రశస్తి చెందియున్నాడు

ఆ పి

## ఫలదీకరణము :

లింగభేదము గల యుగ్మక ఐక్యమును ఫలదీకరణ మందురు ఇందులో ఒక యుగ్మకపు కణరసము, నాభికము, వేరొకదాని కణరసము నాభికముతో సమైక్యము చెందును ఇట్లేర్పడు కణమును సంజనిక మందురు సంజనికము. పిదప అభివృద్ధి చెంది పిండముగా మారి సంతానాభివృద్ధి చేయును లింగోత్పత్తి ద్వారా జీవవ్యాప్తి జరుగుట సర్వవిదితమే. అట్టి లింగోత్పత్తికి ఫలదీకరణము మూలాధారము

పురుషయుగ్మక పాదపము ఇది పరాగ రేణువునుండి యుత్పత్తి చెందును పరాగరేణువులు చాల చిన్నవి సామాన్యముగ 15-50μ కొలతగలవి వీటి యాకారము వివిధ రకములు – గుండ్రటివి అండాకారము, త్రిభుజాకారము, పరాగమునకు ఒక కవచ ముండును కవచమున రెండు పొర లుండును మొదటిది పై పొర, రెండవది లోపొర పై పొర సామాన్యముగ దళసరిగా నుండి పైతలమున అలంకృతమై యుండును దీనిలో సూక్ష్మమైన వివరములు గలవు వీటినే పరాగ వివరము లందురు ద్విబీజ దళములలో పరాగ వివరములు మామూలుగ మూడు ను, ఏకబీజ దళములో ఒకటియు నుండును పరాగములో రెండు కణము లుండును పెద్దదానిని శాఖీయ కణమనియు, చిన్నదానిని ఉత్పత్తి కణమనియు అందురు పరాగ సంపర్కము జరుగునపుడు పరాగము ఈ ద్వికణ దశలో నుండును ఇది ఆవృత బీజముల యొక్క ఒక ముఖ్య లక్షణము కీలాగ్రముపై పడిన పిదప పరాగములు అచట అంకురించును కొన్ని మొక్కజాతులలో అంకురారంభము వెంటనే జరుగవచ్చును ఉదా జొన్నలు, చెరకు కాని కొన్నిటిలో కొన్ని గంటల పిదప కానవచ్చును ఉదా బీట్‌రూట్ పరాగములను అంకురింప జేయుటకు కారణము కీలాగ్రమున జనించు ద్రవమని తెలియు చున్నది అంకురించునపుడు పరాగము యొక్క లోపొర నాళికగా బీజరంధ్రము నుండి బయటకు పెరుగును దీనిని పరాగనాళిక అందురు పరాగనాళిక వెలువడు నపుడు దాని శాఖీయ నాళికకూడ వెంబడించును ఇదే సమయమున ఉత్పత్తి కణము లోపొరనుండి విడిపోయి, విభజింపబడి, పరాగములో రెండు పురుషయుగ్మకములుగా మారును. కాని కొన్ని వృక్షములలో ఉత్పత్తి కణము లోపొరనుండి వేరై పరాగ నాళికలోనికి వచ్చి పురుషయుగ్మకముల నుత్పత్తి చేయును పురుషయుగ్మకములు కణస్వరూపము కలిగి యుండును. అవి చాల చిన్నవి మరియు పలు రూపములు కలవి–దీర్ఘ వర్తులాకారము, అండాకారము, పరాగనాళిక క్రమక్రమముగా కణములను వేరు చేయుచు కీలాగ్రమునుండి కీలము యొక్క అడుగు భాగము వరకు చొచ్చుకొని వచ్చును పిదప అది అండాశయమునుండి బీజాండమును చేరును పరాగనాళిక కీలాగ్రమునుండి అండమును చేరుటకు సామాన్యముగ రెండు

లేక మూడు దినములు తీసికొనును

పైని వివరించిన పరాగ నాళికయే బీజవృక్షములలో పురుషయుగ్మ పాదపమును సూచించు చున్నది ఇట్లు జీవ వృక్షములలో పురుషయుగ్మ పాదపము మిక్కిలి క్షీణరూపము గలిగి యుండును మరియు అది తన పోషణమునకు బీజ పాదపముపైన ఆధారపడి యుండును పురుషయుగ్మ పాద పము ఇట్టి క్షీణావస్థ జెంది యుండుట బీజవృక్షముల యొక్క ఒక ముఖ్య లక్షణము

స్త్రీయుగ్మ పాదపము . ఇది గురుబీజాణువు నుండి జనిం చును దీనినే పూలవృక్షములలో పిండకోశ మందురు బీజ వృక్షములలో దీర్ఘ బీజాణువు పరాగముల వలె కాక మాతృ దేహము నుండి విడిపోకుండా యుండును అది బీజాండమందు ప్రదేశ కణములమధ్య నుండును దీర్ఘబీజాణువు ఏకకణీయము దాని పెరుగుదల నాభిక విభజనముచే సూచింపబడును ప్రథమ విభజనము ఫలితముగా రెండు నాభికలు ఏర్పడును వీటిలో ఒకటి బీజరంధ్రమువైపు, రెండవది బీజాధారము వైపు చేరును ఇచట ప్రతి యొకటి మరల రెండు పర్యాయములు క్రమవిభజనము చెందుట వలన నాలుగు నూతన నాభిక లుత్పన్న మగును బీజరంధ్రము వైపున నున్న నాలుగు నాభికలలో మూడు వెంటనే కణరూపము దాల్చును ఈ మూడింటిని కలిపి అండ పరికర మని యందురు ఈ కణ ములు సాధారణముగా పొడవుగా నుండును వీటిలో రెండిం టిని సహాయికలనియు, మూడవ దానిని అండము అనియు నందురు జీవవివరపు వైపున నున్న సహాయకణముల చివ రలు కొద్దిగా కొక్కెపు ఆకారము కలిగి యుండును సహా యక కణములందును, అండకణమందును సాధారణముగ ఒక పెద్ద రసధమని యుండును అండపరికరపు మూడు కణములు పిండకోశము యొక్క బీజరంధ్రపు చివరనుండి వ్రేలాడుచు అగపడును బీజాధారము వైపున నున్న నాలుగు నాభికలలో మూడు వెంటనే కణములుగ మారిపోవును వీటిని అపా దకము లందురు పిండకోశపు ఇరు ధ్రువములయందు మిగిలి యున్న నాలుగవ నాభిక, మధ్యస్థలమునకు జరిగి అచట ఒక దానితో మరియొకటి కలిసి పోవును దీనిని ద్వితీయనాభిక అని యందురు ఇట్లు ఈ మార్పులు జరుగు సమయమున పిండ కోశపు పరిమాణము అభివృద్ధి చెందును పైన వివరించిన పిండకోశము ఆవృత బీజములలో సర్వసాధారణ మైనది పిండకోశము రెండు రక్షక కవచములచే రక్షింపబడుచుండును ఈ కవచముల కొనలు కలియక చిన్న ద్వారము వంటి భాగముండును, ఈ ద్వారమే బీజరంధ్రము అని యనబడును

ఆవృత బీజముల స్త్రీయుగ్మ పాదపము, పురుషయుగ్మ పాదపమువలె చాలా క్షీణదశను కలిగియుండుట గమనించ వచ్చును ఇదియు పరాన్నజీవియే కాని, ఇది పురుషయుగ్మ పాదపమువలె కాక అంతదశ నుండియు మాతృదేహభాగమై పెరుగును

ఫలదీకరణము పరాగనాళము సాధారణముగ బీజ రంధ్రముద్వారా బీజాండములోనికి ప్రవేశించును తరువాత అది ప్రదేశకణములను దాటి తుదకు పిండకోశమును జొచ్చి ఫలదీకరణము గావించును బీజరంధ్రముద్వారా ఈవిధముగ జరుగు ఫలదీకరణమును బీజవివరసంయోగము అని యందురు కొన్ని వృక్షములయందు పరాగనాళము బీజాధారముద్వారా బీజాండముచొచ్చి పిండకోశము ప్రక్కన పెరుగుచు తుదకు మరల బీజరంధ్రము ద్వారా అండకోశమునుప్రవేశించును ఈ ఫలదీకరణ విధానమును బీజాధార సంయోగమందురు ఇవ్వి ధముగా పరాగనాళము యెటనుండి అండబీజమును జొచ్చి నను, ఫలదీకరణము బీజరంధ్రము నుండియే జరుగుట ముఖ్య మైన విషయము పురుషయుగ్మకములు పరాగనాళిక చివర పగులుటచే, అండకోశమున విడుదలయగును పరాగనాళిక ప్రవేశించినపుడు ఒకటి లేక రెండు సహాయికలు నశించి పోవును కొన్నిజాతులలో ఒక సహాయిక వెంటనే నశించి, మరియొకటి తదుపరి జీర్ణమగును సహాయికలు ఫలదీకరణ మందు యేదైన ప్రత్యేకపాత్ర వహించుచున్నటుల తోచ రాదు పురుషయుగ్మకములలో, ఒకటి అండకణములో కలి యును ఈవిధముగా జనించుకణమునుసంజనిక మందురు ఇది ఫలదీకరణమున జరుగు ముఖ్యమైన విషయము ఇదేసమయ మున లేక ఒకింతపూర్వము రెండవ పురుషయుగ్మకము ద్వితీయనాభికతో కలసిపోవును ఈచర్యను త్రైక్యము అందురు మరియు ఇట్లేర్పడు నాభికను అంకురచ్ఛద నాభిక అందురు ఇది ఫలదీకరణమున జరగు రెండవ ముఖ్యాంశము పైన వివరించిన రెండు సంయోగక్రియలను ద్విఫలదీకరణ మందురు ఇది కేవలము ఆవృతబీజములలోనే గాని మరియే ఇతర వృక్ష

ములలో గానరాదు దీనిని ప్రప్రథమమున హాపిన్ (1898) అను జీవశాస్త్రజ్ఞుడు కనుగొనెను ఫలదీకరణము జరిగిన తరువాత మకుటము, కేసరావళి వాడిపోయి తుదకు రాలి పోవును ఫలదీకరణమున పురుషయుగ్మకము యొక్క కణ ద్రవ్యము పాల్గొనునని ఇంతవరకు రూఢిగా తెలియదు శాఖీయనాళిక పరాగనాళికయందు చాలా పూర్వమే నశించి పోవును

ఫలదీకరణము జరిగిన పిదప సంజనికము స్థితదశయం దుండును కొన్ని జాతులయందు ఈపరిస్థితి కొన్ని గంటలవర కుండును ఉదా వరి కాని కొన్నిటియందు ఇది నాలుగు లేదా అయిదు మాసములవరకు విస్తరించ వచ్చును

స్థితదశ గడచిన పిదప సంజనికము క్రమవిభజనము నొంది పిండముగా సిద్ధమగును బీజరంధ్రము వైపునుండు పిండపు చివర, యెల్లప్పుడు తల్లి వేరుగా మారును. మరియు బీజాధారము వైపు చివర, బీజదళ విభాగము బీజోపరముగా వృద్ధినొందును

పిండము పెరుగునపుడు అంకురచ్ఛద వాళిక కూడ పలు మార్లు విభజనము చెంది, ఒకకణపుంజమును ఉత్పత్తిచేయును దీనిని అంకురచ్ఛద మందురు కొన్ని ఫలవృక్షజాతులలో పిండము పెరుగునపుడు అది అంకురచ్ఛదమును ఆహారముగా వినియోగించుకొనును ఉదా సెనగ, చిక్కుడు, ఈవిధముగ తయారగు బీజములను అంకురచ్ఛద రహిత బీజము లందురు మరికొన్ని వృక్షజాతులలో, అంకురచ్ఛదము అభివృద్ధిచెంది యథాస్థితిలో నుండిపోవును ఉదా ఆముదము, గోధుమ ఇట్లేర్పడు బీజములను అంకురచ్ఛద సహిత బీజము లందురు ఈలోపల అండచ్ఛదము కూడ మార్పులుచెంది బీజకవచముగ తయారగును ఇట్లు ప్రతి అండమునుండి ఒక బీజము ఉత్పత్తి చెందును ఇదేసమయమున అండాశయము కూడ అభివృద్ధి చెంది ఫలముగా రూపొందును

కణశాస్త్రరీత్యా ఫలదీకరణము వృక్షజీవ చక్రమున అతి ముఖ్యమైన అంశము దీనివలన సంజనికములో వర్ణి కముల సంఖ్య రెండింతలగును లింగోత్పత్తిలో ప్రతి సారి ఈవిధముగనే జరగును కనుక కొన్నితరముల పిదప వర్ణి కములు అసంఖ్యాకములగును దీనివలన జీవక్రియలు కల్లో లితమై వృక్షజాతిని నశింపచేయును కాని ఈపరిస్థితి ప్రకృతిలో ఏర్పడదు పరాగము, గురుబీజాణువులు అర్ధభాజ కము ద్వారా జనించును, కనుక వాటి వర్ణికముల సంఖ్య n దశలో నుండును పరాగనాళిక, పిండకోశము మరియు వాటిచే ఉత్పత్తియగు యుగ్మకములు గూడ n దశలోనుండును ఇట్లు ఫలదీకరణము వలన వర్ణికముల సంఖ్య యెప్పుడును 2 n కన్న మించదు ఇందువలననే ప్రతిజాతి వర్ణికములు యెల్లప్పుడును నిర్ణీత సంఖ్యలో నుండును

అంకురచ్ఛదము, త్రైక్యము చెందిన వాళికనుండి యుత్పత్తి యగుటచే దీని నిర్మాణముకూడ గమనింపదగినది ఇందులో ప్రతికణము 8 n దశలోనుండును కొన్నిజాతులలో కణకవచములు వెనువెంటనే యేర్పడకపోవుట వలన, అంకు రచ్ఛదములో వర్ణికముల సంఖ్య 8 n వరకు కూడా పెరుగు చుండును అంకురచ్ఛదము ముఖ్యముగా, ఆహారమును నిలువచేయు కణపుంజము కాని అంకురచ్ఛదపు ఈకార్య నిర్వహణలో దాని విపరీతమైన కణనిర్మాణ ప్రాముఖ్య మేదియో ఇంతవరకు తెలియదు

ఫలదీకరణము, వృక్షముయొక్క జనిత లక్షణదృష్ట్యా (జనితశాస్త్రము) కూడ, ఒక విశేషమైన అంశము పరాగ ములు లేక గురుబీజాణువులు జనించునపుడు, వాటి వర్ణికముల మధ్య జన్యమార్పిడి జరుగును ఇందువలన యుగ్మకములు కూడా నూతనగుణములు కలవియై యుత్పత్తి యగును పురుషయుగ్మకములలో కాని స్త్రీయుగ్మకములలో కాని ఒకటి మరొకదానికి జన్యగుణములలో తత్సమానముగ ఉండనేరదు ఫలదీకరణము వలన, ఇట్టివిభిన్నగుణములుగల యుగ్మకములు సమైక్యము చెందుచున్నవి

అందుచే, లింగోత్పత్తి ద్వారా జనించుసంతానము సరి క్రొత్త గుణములు గలిగియుండును ఇట్లు అర్ధభాజకము, ఫలదీకరణ క్రియలు జీవజాతిని ప్రతితరమున నూతనగుణములు గల వాటినిగా చేయుచున్నవి ఇలయే జీవజాతి అభివృద్ధికి మూలకారణము

పటములు 1-8 పురుషయుగ్మ పాదపోత్పత్తిని సూచించు ముఖ్యమైన దశలు (పటములు డయగ్రామటిక్‌గా వ్రాయబడినవి)

1 పరాగము
2 పరాగనాళిక వికజన చెందుట
3 శాఖీయ, ఉత్పత్తి కణముల నిర్మాణము
4-5 ఉత్పత్తికణము పరాగ పొరనుండి విడిపోవుట
6 ఉత్పత్తికణము పరాగమునందే విభజింపబడి పురుష యుగ్మకములను ఇచ్చుట
7-8 పురుష యుగ్మకములు పైవలెగాక, పరాగనాళికలో జనించుట

పటములు 9-18 వివిధ రూపములు, అలంకారములు గల పరాగములు

9 ఉత్తరేణి
10 శృంగామలకము పరాగము కోయబడిన దృశ్యములో
11 పొన్నగంటి కూర
12-18 ఆమ్లికా, పులిచింత
12 పరాగపు మధ్యరేఖ దృశ్యము
13 పరాగపు ధ్రువదృశ్యము
14 పిండికూర బీజాండము అండాశయపు నిలువుకోత యందు

పటములు 15-20కర్బూజాజాతిలో పిండకోశపు ఉత్పత్తి

15 బీజాండపు నిలువుకోత, పరాగనాళిక ప్రదేశకణ పుంజమును జొచ్చుకొని పిండకోశమును చేరుట
16 బీజాధారపువైపు దీర్ఘబీజాణువు అభివృద్ధిచెందుట మరియు నశించిన మిగతా మూడు దీర్ఘ బీజాణువులు

పటములు 17-20 రెండు, నాలుగు, ఎనిమిది నాభికలు గలిగిన దశలలో ఉన్న పిండకోశము

21 శృంగామలకము పిండకోశపు నాభికలు కణరూపము చెందుట
22-25 బంతిచెట్టు
22 పిండకోశములో అండపరికరము, అపాదికములు, ద్వైనాభిక నిర్మాణము
23 సంజనికము, అంకురచ్ఛదనాభిక విభజనము చెందుట
24-25 పెరిగిన పిండను, అంకురచ్ఛదము
26 తండులీయ బీజము యొక్క కోతముఖము వలయాకారపు పిండము, దానిని చుట్టియున్న ఒకవరుస అంకురచ్ఛదము

శా = శాఖీయ నాభిక
ఉ = ఉత్పత్తి కణము
పు = పురుష యుగ్మకములు
ప = పరాగనాళిక
పి కో = పిండ కోశము
బీ = బీజాండము
ప్ర = ప్రదేశకణ పుంజము
దీ = దీర్ఘ బీజాణువు
స = సహాయికలు
అం = అండము
అపా = అపాదికములు
ద్వై = ద్వైనాభిక
సం = సంజనికము
అ నా = అంకురచ్ఛద నాభిక
అ క = అంకురచ్ఛద కణములు
అంకు = అంకుర చ్ఛదము
పి = పిండము

(1-8 adapted from Maheswari, P 1950
9 & 11-13 adapted from Erdtman G-1952
10 & 21 adapted from Bhargava H R 1935
14 & 21 adapted from Kajale L B 1940
15-20 adapted from Singh, D 1955
22-25 adapted from Venkateswarlu J and Maheswari Devi M 1956)

న రా

## ఫలములు

ఫలములు ఆవృత బీజవృక్షముల యందుండును ఫలదీకరణమునకు పూర్వము పుష్పము యొక్క మధ్యభాగములో అండాశయము అండములతో కలిసి యుండును ఫలదీకరణము తరువాతనే అండాశయము ఫలముగాను, అండములు బీజములుగాను మారును ప్రత్యేకముగా అండాశయముతోనే పెరుగు ఫలములు స్వభావసిద్ధ ఫలములని లేక వాస్తవిక ఫలములని అనబడును ఉదా మామిడి, చిక్కుడు,

నారింజ కొన్నిటిలో అండాశయముతో పాటు పుష్పము యొక్క ఇతర భాగములు కూడ (అనగా పుష్పాసనము మొదలగునవి) ఫలములుగా మారును ఉదా సీమరేగుపండు, అత్తిపండు, జీడి జీడిమామిడి, ఇట్టి ఫలములు అస్వభావసిద్ధ ఫలములు లేక ఫలాభాసము లనబడును ఆపిల్, జీడిమామిడి వృక్షములలో ఫలము కాక, పుష్పాసనము గుజ్జుగా మారి తినెడు పదార్థముగా ఉపయోగ పడును

కొన్ని ఫలములు ఎండిన తర్వాత విప్పకొని బీజములను వెదజల్లును ఉదా చిక్కుడు, జిల్లేడు, మొదలగు ఇట్టి ఫలములు బిదుర ఫలము లనబడును బీజములను వెదజల్లకుండ ఫలములు శాశ్వతముగా మూసికొని యున్నచో, వాటిని అబిదుర ఫలము లందురు

ఉదా మామిడి, జామ మొదలగునవి

ఫలములు మూడు వర్గములుగా విభజింప బడినవి

1 **సామాన్య ఫలములు** ఇవి సాధారణముగా అండకోశము నుండి తయారగును తొడిమ లేక వృంతము ఒకేఒక ఫలమును కలిగియుండును ఇట్టి పరిస్థితులలో ప్రతి పుష్పము నుండి ఒకే ఫలము తయారగును ఉదా మామిడి, కొబ్బరి, చిక్కుడు, చింత

2 సంకలిత ఫలములు వీటిలో ఒక పుష్పమునుండి రెండు లేక పెక్కు ఫలములు తయారగును ఇవి ఒకే పుష్పములో వేరుగా నుండు అండాశయముతో తయారగును ఇట్టి పరిస్థితిలో ఫలదీకరణము తర్వాత ఒకే కాడ లేక తొడిమ రెండు లేక పెక్కు ఫలములను కలిగి యుండును

ఉదా జిల్లేడు, సీతాఫలము, అశోకఫలము నిద్రగన్నేరు

3 సంయుక్త ఫలములు పుష్పగుచ్ఛము నుండి తయారగు ఒకే ఫలము సంయుక్తఫల మనబడును ఉదా మఱ్ఱి, రావి, పనస, అనాస మొదలగునవి

పైని ఉపహరింప బడిన మూడు భాగముల ఫలముల యొక్క ముఖ్య వర్గములలో ఒక్కొక్క దానియందు అనేక విధములైన ఫలము లుండుట వలన, అవి వర్గములుగాను ఉపవర్గములుగాను విభజింప బడినవి

సామాన్య ఫలములు ముఖ్యముగా రెండు ఉపవర్గములుగా విభజింప బడినవి (1) శుష్కఫలములు (2) కండ ఫలములు

I శుష్కఫలములు ఈ ఫలములలో గుజ్జుకాని కండ కాని ఉండదు ఫలములు ఎండి గట్టిగా నుండును ఈ ఉప వర్గములో దిగువ ఉదాహరింప బడిన రకములు సామాన్యముగా కానవగును

1 కాదఫలములు ఉదా చిక్కుడు, బీన్సు, శెనగ, మొదలగునవి

2 ఫలకోశములు ఉదా ప్రత్తి, ఉమ్మెత్త, బెండ మొదలగునవి

3 అవిభిన్నచర్మ ఫలములు ఉదా గోధుమ, వరి, మొక్కజొన్న మొదలగునవి

II కండఫలములు ఈ ఫలములు కండ కాని లేక గుజ్జు కాని కలిగి యుండును ఈ ఫలములలో ఫలకవచము మూడు భాగములుగా కనబడును ఉపరి భాగమునకు (1) బాహ్య ఫలకవచమనియు మధ్యభాగమునకు (2) మధ్యఫలకవచమనియు, లోపలి భాగమునకు (3) అంతఃఫలకవచమనియు పేర్లు కొన్ని ఫలములలో ఫలకవచము యొక్క ఈ మూడు భాగములు చక్కగా కనబడును

ఉదా కొబ్బరి, మామిడి, మరికొన్ని ఫలకవచములలో ఈ మూడు భాగములు రెండు భాగములుగా కనబడును

ఉదా టొమాటో, వంకాయ

కండ ఫలముల యొక్క ముఖ్య విభాగములు ఈ క్రిందనుదాహరింపబడినవి

1 బెర్రీ ఫలములలో సామాన్యముగా మధ్యస్థములగు అంతఫల కవచములు గుజ్జుగా లేక కండగా మారును

ఉదా ద్రాక్ష, వంకాయ, అరటి మొదలగునవి

2 అస్థిఫలము ఈ ఫలములలో ఫలకవచము యొక్క మూడు భాగములు వేరువేరుగా స్పష్టముగా నుండును అస్థిఫలము లన్నింటిలో అంతఃఫల కవచము గట్టిగా పెంకువలె మారి యుండును. మధ్యఫల కవచము లేక బీజముయొక్క ఏదేని భాగము గుజ్జుగా మారును ఉదా కొబ్బరి, మామిడి, ఈ రెండు ఫలములలో గట్టిగా పెంకువలె నుండు భాగము అంతఃఫల కవచము కొబ్బరిలో గుజ్జుగా నుండును బీజము యొక్క ఎండోస్పెరమ్ తినబడును మామిడి పండులో మధ్య ఫలకవచము గుజ్జుగా మారును

3 పెపో కీరజాతికి చెందిన వృక్షముల ఫలము

లన్నియు పెపో లనబడును ఉదా గుమ్మడి, పుచ్చకాయ, దోసకాయ మొదలగునవి వీటిలో మధ్యఫలకవచము, అంతః ఫలకవచము గుజ్జుగా లేక కండగా మారును బీజములు కండలో మూడు వేరు వేరు భాగములుగా అమర్చబడి యుండును

4 హెస్పిరిడియమ్ ఉదా నిమ్మ, నారింజ ఈ ఫల ములలో బాహ్యఫల కవచము, మధ్యఫల కవచము కలిసి యుండును అంతఃఫలకవచము సన్నని పొరవలె నుండి పెక్కు భాగములుగా విభజింప బడును వీటిని తొనలందుము ఈ ఫలములలో తినుటకు యోగ్యమగు గుజ్జు, బీజములను ఆశ్రయించుకొని యుండును

5 పోమ్ ఉదా సీమరేగువండు (ఆపిల్) వీటిలో నిజమైన ఫలము ఎండియుండి మధ్యభాగమున నుండును ఇది తినవీలుండదు గుజ్జుగా నుండు భాగము ఫలముచుట్టు ఆక్రమించుకొనునది పుష్పాసనము ఇదే తినబడును అందు వలననే ఇది ఫలాభాసము అనబడును

సంకలిత ఫలములు ఉదా సీతాఫలము, అశోక ఫలము ఈ ఫలములు ఒక పుష్పములోనే వేరువేరుగా నుండు అండాశయముల నుండి తయారగును అందులకే ఒక తొడిమ లేక కాడ అనేక ఫలములను కలిగి యుండును సీతాఫల ములో ప్రతిబీజము దానిని ఆశ్రయించుకొని యున్న గుజ్జు కలిసి ఒక ఫలమగును ఈ అన్ని ఫలముల బాహ్య కవచములు కలిసి పైనున్న కన్నులవంటి భాగములుగా ఏర్పడును బీజముచుట్టు నుండు గుజ్జు అంతఃఫల కవచమనబడును

సంయుక్త ఫలములు . ఉదా మఱ్ఱి, రావి, పనస మొదలగునవి ఒక పుష్పసమూహము నుండి ఒకే ఫలము తయా రగును వీటిలో పుష్పముల యొక్క అన్ని భాగములు గుజ్జుగా మారును

యం ర రా

## ఫలములు బీజములు వ్యాప్తిచెందుట .

మొక్కలయొక్క ఫలబీజములు వ్యాప్తి చెందుట సహజ లక్షణము ఇట్లు సంభవించుటకు ప్రబల కారణములు కలవు ఒక చెట్టుయొక్క కాయల బీజములు ఫలముల బీజ ములు ఆ చెట్టుక్రిందనే పడినచో, ఆ స్థలము, అచటి ద్రవ పదార్థములు పరిమితము లగుటచే, ఆ బీజములు మొలకలెత్తి బాగుగా వృద్ధి చెందనేరవు కావుననే ఈ బీజములు ఇతరత్ర వ్యాప్తి చెందు చుండును అవి వ్యాప్తిచెందు విధము వివిధ పరిస్థితుల ననుసరించి మారుచుండును కొన్ని పరిస్థితులలో ఫలముల యొక్క, బీజముల యొక్క భాగములు రూపాంతర ములు చెందుట కూడ కానవగును

చిత్రము 81



పటము 1

బీజములు వ్యాప్తి చెందుటకు కొన్ని పరిస్థితులు సహాయకారులుగ పనిచేయు చుండును బీజవ్యాప్తికి ముఖ్య ముగ గాలి, నీరు, పశువులు, పక్షులు, మానవులు కూడ సహాయకారు లగుట తటస్థించును. బీజాదులు వ్యాప్తి చెందు టకు సహాయపడు వాటిలో గాలి ముఖ్య పాత్ర వహించును గాలిచే వ్యాప్తిచెందు ఫలబీజములలోయుక్త మగు మార్పులు కాన్పించును కొన్ని చెట్లయొక్క కాయలు, అష్ఠిఫలము (డ్రూప్) ఉదా మామిడిపండు ఫలములు రెక్కలవంటి ఆకారములు కలిగి గాలిమూలమున ఎగిరిపోయి వ్యాప్తి చెందు చుండును అట్టి వాటిలో మునగ చెట్టు కాయలు, భూచక్రగడ్డ చెట్టుకాయలు ఉదాహరణములు

చిత్రము 82



పటము 2

చిత్రము 83




పటము 3
ఆపిల్ ఫలము

వీటిలోని బీజముల పైపొరయొక్క రెండువైపులందును రెక్కలవంటి సన్నని పొరలు పెరుగును ఇట్లే తీరుతీరుగా కాయల చుట్టును, ఫలముల చుట్టును రెక్కలు పెరుగును ఈ రెక్కల సహాయముచే కాయలు, ఫలములు వాటి బీజములు గాలిలో నెగురుచు దూరదేశములకు కూడ పోయి వ్యాప్తి చెందుచుండును.

కొన్ని చెట్లలోని ఫలములకు, కాయలకు పారషూట్ వంటి ఛత్రము ఉండును ఇది సూర్యముఖిలోను, బంతిజాతికి చెందిన మొక్కలలోను చాలవరకు కానవచ్చును బంతివంటి మొక్కలలో పుష్పము యొక్క రక్షక

చిత్రము 84




పటము 4

పత్రములు సరిగా ఫలముపైనుండి సన్నని వెంట్రుకలుగా విభజింప బడును కాయలు గాని ఫలములు గాని ఎండిన తరువాత విభజింపబడు ఈ రక్షక పత్రములు 'పారషూట్' ఛత్రముగా మారి, అవి వ్యాప్తి చెందుటలో సహాయ పడును ఇదే విధముగా జిల్లేడుచెట్టు ప్రత్తిచెట్టుల బీజముల చుట్టును సన్నని కేసరము లుండును ఈ కేసరములు బీజముయొక్క పైపొరనుండి తయారగును ఈ కేసరముల మూలముననే బీజములు గాలిలో ఎగిరివ్యాప్తిచెందును

చిత్రము 86



పటము 6

చిత్రము 87




పటము 7.

కొన్ని వృక్షముల ఫలములు, బీజములు చాల తేలికగా నుండును కావున ఎండిన వెంటనే అవి గాలిలో ఎగిరి వివిధ ప్రాంతములలో వ్యాప్తిచెందును వీటిలో సింకోనా (క్వినైన్ మందునిచ్చు చెట్టు) లోని బీజములు చాల చిన్నవిగా, తేలికగా నుండును ఒక ఔన్సు పరిమాణము గల సింకోనా కాయలో 70,000 బీజము లుండును తేలికదైన వగుటచే, అవి స్వయముగా గాలిలో ఎగురుచు పోయి

మొక్కజొన్న బీజము అంకురోత్పత్తి చిత్రము 85




పటము 5



వ్యాప్తి చెందును

నీటి సహాయముచే వ్యాప్తిచెందు ఫల బీజములలో కొబ్బరికాయ ముఖ్యోదాహరణము ఈ కాయలకు నీటి ప్రవాహము వైపు కొట్టుకొని పోవుట కుపయుక్తమగు సాధనము ఉండును కొబ్బరికాయపై నున్న మధ్యకవచము (పొర) తంతువులుగా మారును ఈ తంతువులనే జుట్టు అని

ఆముదపు బీజము

చిత్రము 88




పటము 8

బీజపు నిలువుకోత

కూడ అనెదరు ఈ తంతువు లుండుటచే, కొబ్బరికాయ నీటిపై కొట్టుకొని పోయి దూర దేశముల వరకు వ్యాప్తి చెందు చుండును

జంతువులు, మానవులు కూడ ఫలబీజ వ్యాప్తిలో ముఖ్యపాత్రమును వహించు చుందురు జంతువులు గడ్డికొరకు తిరుగునప్పుడు పెక్కు గడ్డికాయలు వాటి

చిత్రము 89



పటము 9

కృత్రిమ ఫలము

దేహమునకు గ్రుచ్చుకొనును. ఈ కాయలకు ముళ్ళవంటి సాధనము లుండుటచే, జంతువులు పలు ప్రాంతములందు తిరుగునపుడు, గడ్డిబీజములు అచ్చట రాలి వ్యాప్తి చెందును ముళ్ళవంటి సాధనములు గలవాటికి ఉత్తరేణి కాయలు, పల్లేరుకాయలు ముఖ్యమైన ఉదాహరణములు ఇదేవిధముగా

బీన్ బీజము నిర్మాణము

చిత్రము 90




పటము 10

'క్సైగర్స్లా' అను తెలుకొండి చెట్టుకాయ యందలి బాహ్య కవచము ఎండి పులిగోళ్ళుగా మారును ఈ కాయలు కూడ జంతువుల శరీరములకు గ్రుచ్చుకొనును. ఇట్టి ముళ్ళు కలిగిన కాయలే మానవుల బట్టలకు తగుల్కొని, వారు ప్రయాణము చేయు ప్రాంతములందెల్ల వ్యాప్తి చెందును మన మెపుడైన ఒక తోటలో నడచి బయటికి వచ్చినచో, మన బట్టలకు అనేక రకములైన గడ్డి కాయలు, గడ్డిముండ్లు, ఇతర గింజలు గ్రుచ్చుకొని యుండును

ఫలబీజ వ్యాప్తిలో పక్షులు కూడ ప్రముఖ పాత్రను వహించును చాలవరకు పక్షులచే భుజింపబడు కాయలలోని, ఫలములలోని బీజములయొక్క పైపొర చాల గట్టిగ నుండును ఈ పొర పక్షుల జఠరములో జీర్ణము కాదు బీజములు చెడకుండగనే, మలముతోపాటు బయటకు వచ్చి వ్యాప్తి చెందు చుండును జామపండు మేడిపండు మొదలగు నవి ఇందు కుదాహరణములు

యం ర రా

## ఫలానుమేయ ప్రామాణ్యవాదము

ఫలానుమేయ ప్రామాణ్యవాదము ఒక దార్శనిక సిద్ధాంతము. దీనిని ఇంగ్లీషులో "ప్రాగ్మాటిజం" అందురు ఈ సిద్ధాంతమున ఒక వాక్యముయొక్క సత్యము అది అందించు సత్ఫలితములపై ఆధారపడి నిర్ణయింప బడు చున్నది సాంప్రదాయిక ఫలానుమేయ ప్రామాణ్య వాదము ఒక దార్శనిక శాఖగా సి ఎస్ పియర్స్ (1839-1914). విలియమ్ జేమ్సు (1842-1910) అను వారితో ఆరంభమైనది ఫలానుమేయ ప్రామాణ్యవాదము సర్వవిధములైన అనుభవ నిరపేక్ష భావనలను తిరస్కరించుచు ప్రయోగాత్మక దృష్టికి ప్రాధాన్య మిచ్చు చున్నది ఇది జీవితమును అధ్యయనము చేయు ఒక దర్శనము మానవావసరములను పరిశీలించు శాస్త్రముగా ఇది దర్శన శాస్త్రమును నిర్వచించును ఈ వాదమును క్రమ బద్ధముగా నిర్మింప బడిన ఒక సమగ్ర దర్శన మనుటకంటె, దర్శనశాస్త్ర ప్రపంచములో ప్రభవించిన ఒక శాఖయనియు ఒక ఉద్యమ మనియు అనుట లెస్స గత సంఘటనలలోనికి తొంగి చూచుచు మూలసూత్రములకై అన్వేషించు ప్రయత్నము కంటె, వర్తమాన సంఘటనలు, వాటి ఫలితములు-వీటిపైన దృష్టి సారించు ఒక అభ్యాసము ఈ శాఖకు సామాన్యముగా కన్పించుచున్నది

ఫలానుమేయ ప్రామాణ్య పద్ధతిచే ప్రతి భావమును దాని ఫలితములతో కలిపి సమీక్షించుకొని వ్యాఖ్యానించు కొనవలెనని జేమ్సు వచించెను ఒక రకముగా సోక్రటీసు, అరిస్టాటిల్ బెర్కలీ హ్యూమ్ వంటి తాత్త్వికులు ఈ

ఫలానుమేయ ప్రామాణ్య పద్ధతిని అవలంబించినట్లు కనబడును ఇటీవలి తార్కికులు, దార్శనికులు, విజ్ఞాన శాస్త్రవేత్తలలో సిగ్వర్టు, మాచ్ ఆస్టవాల్డ్, పియర్సన్, మల్ హద్, పైన్ కేర్, డ్యూహెమ్, రుస్సెన్ అనువారు ఈ పద్ధతి ననుసరించి నట్లు జేమ్సు ఉదాహరించెను యూరపు ఖండమునందలి పాపినీ, (ఇటలీ) సిమ్మెల్, (జర్మనీ) బ్లాండెల్ (ఫ్రాన్సు) మొదలగువారు కూడ ఈ మార్గానుగాములుగా ఉదాహరింప బడదగినవారు సమకాలిక అమెరికను వాస్తవికతా వాదమునకు, అనుభవ వాదమునకు చెందిన పెర్రీ, మాంటేంగ్, లవ్ జాయ్, హెర్బర్ట్ మీడ్, మాక్స్ ఆటో, సి ఐ లెవిస్, స్టీఫెన్ సి పెప్పర్, చార్లస్ డబ్లియు మారిస్ వంటివారు విలియం జేమ్సునకు సిద్ధాంత విషయమున చాల ఋణపడి యున్నామని చెప్పుకొను చున్నారు అదియే కాక పెక్కుమంది ఇతర అమెరికను రచయితలు ఫలానుమేయ ప్రామాణ్య వాద ఉద్యమములో తమకు గల శక్తిరక్తులను వ్యక్తపరచు చున్నారు ఈ పద్ధతి సామాజిక, రాజకీయ రంగములలో కూడా అవలంబింప బడుచు వచ్చినది హాకింగ్ దృష్ట్యా టాల్‌స్టాయ్ దార్శనిక భావనలలో కూడ ఈ విధానచ్ఛాయ లున్నవి ఇటీవలి రాజకీయవేత్త ముస్సోలినీ, తాను తన రాజకీయ విశ్వాసములను ఏర్పరచుకొను సందర్భమున విలియమ్ జేమ్స్, నీషేల భావములు తనకు తోడుపడినవని వారికి తాను చాలా ఋణపడి యున్నానని అంగీకరించినాడు

ఫలానుమేయ ప్రామాణ్య జ్ఞానసిద్ధాంతము బుద్ధి వ్యతిరేక సిద్ధాంత భావధారల ద్వారా విస్పష్టముగా ప్రకటిత మగుచున్నది జ్ఞానమీమాంసకు చెందిన బుద్ధివాద వ్యతిరేకోద్యమములో బుద్ధి కొన్ని ప్రయోజనములను సిద్ధింప జేసికొనెడి ఉపకరణము అట్లే మనస్సు, భావములు, తెలివి ఇవి కూడ జ్ఞానసాధనోపకరణములు మాత్రమే జ్ఞానము క్రియోన్ముఖముగా చేయునట్టిదే గాని సత్యప్రకటన దాని పరమార్థము కాదని జాన్‌డ్యూయీ వాకొనెను అందు వలన అమెరికాలో ఫలానుమేయ ప్రామాణ్యవాదము "భావసాధన వాద"మని, "ప్రయోగాత్మ వాద"మని బహుళ వ్యాప్తి పొందినది బుద్ధియొక్క సత్తాను కాదను బుద్ధి వ్యతిరేక అతిభౌతికవాదము తర్కమునకు కాక సంకల్పమునకు ప్రాధాన్యమిచ్చును ఎఫ్ సి ఎస్ ఛిల్లర్ తన మానవతా వాదముతో సాంప్రదాయిక అతి భౌతికశాస్త్రజ్ఞుల "శూన్యవిశ్వము"ను వ్యతిరేకించెను ఫలానుమేయ ప్రామాణ్యవాదము ఆచరణ స్థాయిలో ఫలితములను దృష్టిలో ఉంచుకొని భావములను వ్యాఖ్యానించు ఒక పద్ధతి మాత్రమే కాదు ఇది యొక "అర్థ"మునకు సంబంధించిన సిద్ధాంతముగా, ఒక సత్య నిర్వచనముగా చెప్పబడు చున్నది ఛిల్లర్ దృక్పథమున సత్యమనునది అవ్యక్తమైనది, అతీతమైనది మాత్రము కాదు సత్యము మానవ నిర్మితము, వైయక్తికము, విశేషము, సాపేక్షము సత్యము దాని ఉపయోగము ద్వారానే ప్రకటీకృత మగుచున్నది ఏ భావమైనను సరియే అది ఒక సిద్ధాంతముగా గాని లేదా మరియొక శాస్త్రీయ కల్పనగా గాని సంతృప్తికరమైన, ఆచరణాత్మకమైన ఫలితములకు దారి తీయుచున్నచో, అది సత్యమన బడును కాన సత్యమనునది విశ్వాసము ద్వారా కాక ఉపయోగము ద్వారా ద్యోతక మగును ఫలానుమేయ ప్రామాణ్యవాదుల సత్యసిద్ధాంతము సత్యాచరణములో గర్భితమై యున్న వినియోగాంశమునకు ప్రాధాన్య మిచ్చును కాని సత్యస్వభావమున గర్భితమై యున్న అంతర్నిహిత సారమునకు మాత్రము ఇది ప్రాధాన్య మియ్యదు ఈ వాదము ఒక జ్ఞానసిద్ధాంతముగా సాంప్రదాయికముగా వచ్చుచున్న అనురూప సిద్ధాంతము, సుసంగత్వ సిద్ధాంతము, అంతరజ్ఞాన సిద్ధాంతము అనెడి విభిన్న జ్ఞానసిద్ధాంతములను వ్యతిరేకించు చున్నది సత్యమువలెనే అసత్యము ప్రత్యయ జ్ఞానముద్వారా సాధింప కలుగు విలువ కాని ఏదో వ్యతిరేకమైన విలువ కాదు

ఈ వాదములో సత్య మనునది ఇంద్రియ జ్ఞానము తోడను, సంబంధ బాంధవ్యముల తోడను, అనుభవముల తోడను కూడిన ప్రవాహము నైతిక సూత్రములు కూడా ఈ సిద్ధాంతము దృష్ట్యా ఎన్నియో మార్పులు చెందుచుండును ఏదియు స్థిరము కాదు స్థాణువు కాదు ప్రతి వస్తువు పరిణమించును, రూపాంతరము పొందును పరిణామము సత్యము, పరిణామశూన్యమగు స్థిరత అసత్యము

నీతిశాస్త్రము ఈ వాదములో ఒక ఆచరణాత్మక శాస్త్రముగా నిర్వచింప బడినది ఫలానుమేయ ప్రామాణ్య వాదమున నైతిక సమస్య లన్నియు ఆచరణమును అనుసరించియే యుండును ఏది ఉపయోగకరమో, ఏది ప్రయోజనకారియో అదియే సత్యము, అదియే నీతి.

"ప్రాగ్మా" అను పదమునకు క్రియాత్మకమని, కౌశలమని అర్థము దానినుండి జనించినదే "ప్రాగ్మాటిజం" అను పదము కాన "ప్రాగ్మాటిజం" అను ఈ వాదము సర్వదా నైపుణ్య యుతము, ఆచరణసాధ్యము, ఉపయోగకరము అయిన క్రియకే అధిక ప్రాధాన్య మిచ్చును ఈ సిద్ధాంతపు నీతి, ఫలానుమేయపు నీతి అన్నమాట

ఇక ఫలానుమేయ ప్రామాణ్యవాదపు తార్కిక సిద్ధాంతములు ప్రవచింప బడును అనుభవ నిరపేక్షమైన బుద్ధివాదమువంటి సాంప్రదాయిక తార్కిక సిద్ధాంతములను ఈ వాదము ఖండించును ఈ సిద్ధాంతము అనుభవ నిరపేక్షమైన జ్ఞానమును ప్రతిపాదించు అన్నివాదములను తిరస్కరించు ఒక అనుభవపూర్వక శాస్త్రముగా తర్కశాస్త్రమును నిర్వచించును మనకు సత్యముగా కన్పించునదియే, ఫలానుమేయ ప్రామాణ్య వాదముమట్టి కూడ సత్యమే అయినను ఆ సత్యముకూడ క్షణికమైనది నిరంతరము పరిణమించుచు సర్వదా రూపాంతరములు చెందుచు ఉండునది ఆ సత్యము అదియేకాక, ఇది అనుభవాంతర్నిహితము తర్కములో 'నిర్ణయము' అనగా మనగవేషణా పర్యవసానమైన ఒక స్థిరమైన ఫలము ఇక 'ప్రతిపాదన' మనినచో అది వైయక్తికము, జీవగతము

ఇక ఫలానుమేయ ప్రామాణ్యవాదము యొక్క మన స్తత్త్వశాస్త్ర విభాగమును గురించిన చర్చ తెలుపబడును ఈ చర్చ ధారావాహినిగా ప్రవహించు చైతన్యస్రవంతియగు మానవానుభవముతో అంటిపెట్టుకొని ఉండును జేమ్సు దృష్ట్యా అనుభవము అనునది అన్నిటిని తనలో నిముడ్చుకొను ఒక సత్త జ్ఞాన మంతయు అనుభవజన్యము ఆలోచన అంతయు ప్రయోజన సహితము మన చైతన్యమయ జీవిత మంతయు సంఘర్షణములకు ఫలము ఇదియే జేమ్సు మహాశయుడు ప్రతిపాదించిన మౌలిక అనుభవవాదమునకు ఆధార శిల ఇక జాన్‌డ్యూయీ అన్నచో అతడు భవిష్యత్తులో సంభవింపబోవువాటికంటె గతములో సంభవించినవాటికంటె మించిన వర్తమాన ఫలములకు, పరిణామములకు, ప్రాధాన్య మిచ్చెను ఇట్టి ఆలోచనా ధోరణి అతడు ప్రతిపాదించిన 'అపరోక్షానుభవము'నకు సంబంధించిన సిద్ధాంతములలో ప్రదర్శింప బడుచున్నది

ఈ ఫలానుమేయప్రామాణ్యవాదము సర్వతారకమైన ఒక మతశాస్త్రమును సూచించుచున్నది "విభిన్న మతానుభవములు" అనెడి తన గ్రంథమున విలియం జేమ్సు విస్పష్టముగా మతము, వైవిధ్యములతో కూడుకొనిన దనియు, వ్యక్తి సంకల్పానుగుణమైన దనియు, స్వభావసిద్ధమైన దనియు, ప్రకటించెను కన్నులు కన్పింపనివానికి సులోచనములవలె మతశాస్త్రము అజ్ఞానికి అంధత్వమును పోగొట్టు ఒక సాధనము మతము అనునది రాటుతేరిన మానసికశక్తిగలఅనుభవవాదుల కొరకు ఉద్దేశింప బడినదిగాని, సున్నితమైన మనస్సులు కల బుద్ధివాదులకు మాత్రము కాదు ఈ వాద ప్రతిపాదకులక సాహసకృత్యములతో కూడిన జీవిత మనినచో మక్కువ ఎక్కువ విశ్వసించవలెను అను సంకల్పము సర్వవిధమైన పురోభివృద్ధి సాధనకు మూలాధారము

ఈ సిద్ధాంతమును అన్నివైపులనుండి విమర్శన జ్వాలలు ముట్టడించినవి ఆలోచనా ప్రపంచములో ప్రామాణిక సంప్రదాయమునకు చెందిన తత్త్వవేత్తలు ఈ సిద్ధాంతమును సాధనసాధ్యములకు మధ్యగల ఒక వింతపదార్థముగా భావించినారు ఈ సిద్ధాంతవాదులు తరచుగా ప్రయోగించుచున్న సమాసములు, నినాదములు – వీటి నన్నిటిని ఆధునిక మేధావులు తీవ్రముగా అధిక్షేపించిరి ఈ "ఆకాంతులు", "ధనపు విలువలు" "సంతృప్తి" "కర్మఫలములు" "ఆచరణాత్మక ఫలితములు"–ఇట్టిపదములు బుధ్యాత్మకసంస్కృతి యొక్క క్షీణదశకు చిహ్నములు తరువాత వచ్చిన ఫలానుమేయ ప్రామాణ్యవాద అనుయాయుల చేతిలో అసలైన ఈ పరిణామాత్మక జీవిత తత్త్వపు స్థాయి దిగజారిపోయినది ఈ వాదము ఒక దార్శనికశాఖగా, అనేక ఆలోచనావాహినులను తనలో కలుపుకొన్నది ప్రయోజనైక వాదము, అనుభవవాదము, అనియతివాదము, ప్రత్యక్షజ్ఞాన ప్రాధాన్యవాదము, నామవాదము మొదలైన వాదములు ఈ ఫలానుమేయ ప్రామాణ్యసిద్ధాంతముతో దగ్గర చుట్టరికముగల సిద్ధాంతములుగ నున్నవి

విమర్శనముల గొడవను వదిలిపెట్టినచో ఈ వాదము తాత్త్విక రంగానికి శాశ్వతమైన కొన్ని సేవలు చేసినది ఈ సిద్ధాంతము ఎక్కడనో తాత్త్విక కల్పనాజాలములో చిక్కుకొని, ఎక్కడనో దివిలో విహరించునట్టి తత్త్వచింతనను భువికి తెచ్చినది నిత్యజీవితములో మానవుడు సువ్యక్తమగుచున్న సంఘటనలతో వ్యవహరించవలసి యున్నాడు ఈ సన్ని

వేశములను వాటివాటి యోగ్యతలనుబట్టి చర్చింపవలసి యున్నది గాని, ఏవియో సందర్భశుద్ధిలేని సూత్రములను సమాచారములను ఆధారము చేసికొని చర్చించుటలో ఇసుమంతయు లాభములేదు గత సంఘటనలలో సమస్యలను పరిష్కరించిన సమాధానములే భవిష్యత్తున రాబోవు సమస్యలకు కూడ పరిష్కారములు అందించలేవు అని వారు చెప్పు దానిలో చాలవరకు సత్య మున్నది ఇట్టి విషయములను ఫలానుమేయ ప్రామాణ్యవాది బాగుగ అర్థము చేసికొన గలడు అందుచేతనే జీవితములో ఎదురుపడుచున్న కష్టపరంపరలను అతడు అవలీలగా దాటగలడు ఈ వాదాను యాయుల కృషి ఫలితముగా దర్శనశాస్త్రములో నూతనాభిరుచి చిగురించినది

ఇంతకు పూర్వము కొలదిమందికి మాత్రమే కాణాచిగా ఉన్న శాస్త్రీయశాస్త్రీయ భావధారను సామాన్యమానవులకు అందుబాటులోనికి తెచ్చి వారిలో వినుత్న ఆలోచనాస్రవంతి పెల్లుబుకునట్లు చేసిన గౌరవము ఈ సిద్ధాంత ప్రతిపాదకులకే దక్కుచున్నది మానవ మనోగర్భములో నిహితములై యున్న నవనవోన్మేషయుత సృజనాత్మక శక్తులను గుర్తించి ఒక క్రొత్త విశ్వాసమును ప్రజలలో కల్పించినారు వీరు ఫలానుమేయ ప్రామాణ్యవాదము తప్పనిసరిగా ఒక జీవిత దర్శనమే కాని అనుయాయులు కొందరు మూలతత్త్వమును అపార్థము చేసికొని తప్పుగా అనువర్తించుకొనిరి

వి. వా. క. రె.

## ఫారడే మైకేల్ (1791-1867)

మైకేల్ ఫారడే ఇంగ్లండులోని సుప్రసిద్ధ వైజ్ఞానికులలో నొకడు ఈతడు రసాయన శాస్త్రవేత్తయు, భౌతిక శాస్త్రవేత్తయునై యున్నాడు మైకేల్ ఇంగ్లండులో 'సర్రే' యందు న్యూ యింగ్టన్ అను తావున 1791 సెప్టెంబరు 22వ తేదీన జన్మించెను ఈతని తండ్రిపేరు జేమ్సుఫారడే ఆతడు కమ్మరిపని చేసెడివాడు తల్లి ఒక వ్యవసాయదారుని కుమార్తె మైకేల్ వారి మూడవ కుమారుడు వారు శాండిమేనియన్ అను చిన్న క్రైస్తవమత శాఖకు చెందినవారు

ఫారడే, తన పదమూడవయేటనే విద్యాభ్యాసమును విరమించుకొని 1813 మార్చినెలవరకు వార్తాపత్రికలను లండను నగరములో అమ్ముచు, పుస్తకములను బైండు చేయుచు జీవితమును గడుపుచుండెను తరువాత సుప్రసిద్ధ శాస్త్రవేత్తయగు సర్ హంఫ్రీడేవీ సిఫారసుతో "గ్రేట్ బ్రిటన్ రాయల్ ఇన్‌స్టిట్యూషను"కు సంబంధించిన పరిశోధనాలయములో సహాయుడుగా ఆతడు నియమింపబడెను

ఫారడే అక్టోబరు 1813 మొదలు ఏప్రిల్ 1815 వరకు సర్ హంఫ్రీవెంట ఫ్రాన్సు, ఇటలీ, స్విట్జర్లెండు దేశములలో పర్యటించెను 1821 లో ఫారడే, సారాబెర్నార్డు అను నామెను వివాహమాడెను 1825లో రాయల్ ఇన్‌స్టిట్యూషనకు చెందిన పరిశోధనాలయమునకు సంచాలకుడుగా నియమింపబడెను 1833 లో ఆతడు రసాయన శాస్త్రమున ఉపన్యాసము లియ నవసరము లేని "ఫుల్లేరియన్" ప్రొఫెసరుగా జీవితాంతము వరకు రాయల్ ఇన్‌స్టిట్యూషనులో నియమింపబడెను

సర్ హంఫ్రీ డేవీకి పైన పేర్కొనిన పరిశోధనశాలయమున ఫారడే సహాయుడుగా పనిచేయుచు, ఆతడు చూపిన మార్గములలో ప్రప్రథమమున రసాయనశాస్త్రములను గూర్చి కృషిచేసెను క్లోరిన్‌వాయువును గూర్చి ప్రత్యేకముగా పరిశీలించుచు, ఆతడు కర్బనముయొక్క రెండు క్రొత్తరకముల క్లోరైడులను కనిపెట్టెను జాన్ డాల్టన్ చూపిన "వాయు ప్రసృతి" అను విషయముపై అతడు కొన్ని ప్రాథమిక ప్రయోగములు చేసెను వివిధ వాయువులను ద్రవీకరించుటలో ఆతడు కృతకృత్యు డయ్యెను ఉక్కుయొక్క మిశ్రమ లోహములను గూర్చి ఆతడు చక్కగా విచారణ సల్పెను తేజస్సంబంధ మగు అద్దములలో కొన్ని క్రొత్తరకములను తయారుచేసెను ప్రయోగశాలలో ప్రయోగపద్ధతులనుకూడ ఫారడే మెరుగుపరచెను,

ఫారడే చేసిన విద్యుత్సంబంధమగు ఆవిష్కరణములు ఆతని రసాయనశాస్త్రకృషిని స్వల్పకాలమునకే ప్రసిద్ధికి తెచ్చెను ఆతడు మొదట ఏడు అర్ధపెన్నీలు, ఏడు యశదచక్రములు, ఉప్పునీటితో తడిపిన ఆరు కాగితపుముక్కలు – వీటితో నొక వాల్టైక్ పైలును నిర్మించి, దానితో మాగ్నీషగంధకితమును విశ్లేషించెను అయస్కాంతములును, విద్యుత్ప్రసారముచేయు తీగెలును, ఒకదానిచుట్టు మరియొకటి అవిచ్ఛిన్నముగ తిరుగునట్లు చేసిన నిర్మాణము ఫారడే మొదట చేసిన ఆవిష్కరణములలో ముఖ్యమైనది విద్యుత్ప్రవాహముల ప్రరోచనము ఆతడు గావించిన అత్యుత్తమ ఆవిష్కరణము ఆతడు అయస్కాంతము నుపయోగించి

విద్యుత్ప్రవాహమును ఉత్పత్తిచేయుటయందును, ఒక తీగెలో ప్రవహించుచున్న విద్యుత్తునుండి మరియొక తీగెలో విద్యుత్తు నుత్పత్తి చేయుటయందును, ఒక విద్యుత్ ప్రవాహమునుండి వేరొక పరిపథములో వేరొక ప్రవాహమును ప్రవేశపించుట యందును ఆతడు విజయము గాంచెను

1841 నవంబరు 24వ తేదీన రాయల్ సొసైటీలో ఫారడే తాను "ప్రయోగాత్మక పరిశోధనములను గూర్చి వ్రాసిన మొదటి వ్యాసావళిని చదివెను ఫారడేచేసిన ఆవిష్కరణముల ప్రథమ దశలో వివిధమార్గములయం దుత్పత్తియగు విద్యుత్తు అభేదముగ నుండుననియు, ఒక విద్యుత్ప్రవాహమునకు నిశ్చిత మగు విద్యుదంశిక చర్య ఉండుననియు, ధన విద్యుత్తు యొక్క ప్రతి యూనిటు ఒక నిశ్చితమగు పద్ధతిలో ఋణవిద్యుత్తు యొక్క యూనిటుతో సంబంధము కల్గి యుండుననియు, "పరిశుద్ధ విద్యుత్ప్రభారము" ఉత్పత్తి యగుట అసంభవ మనియు అతడు స్థిరపరచెను విద్యుత్ప్రరోచనము చేయుటలో వివిధ పదార్థములకు గల సామర్థ్యము వేరు వేరుగా నుండునని ఆతడు కనిపెట్టెను హెన్రీకేవెండిష్ అను శాస్త్రజ్ఞుడీవిషయములను ఇదివరకే కనిపెట్టెను కాని 1879 వరకు ప్రచురింప బడకుండుటచే, అవి ఎవరికిని తెలియ లేదు

1841 నుండి 1845 వరకు ఫారడే విశ్రాంతి గైకొనెను. తరువాత అతడు మరల పరిశోధనములు చేయ నారంభించెను తత్ఫలితముగ ఆతడు కొన్ని విద్యుద్విషయకమైన గొప్ప ఆవిష్కరణములు కావించెను అభిస్పందిత ప్రకాశముపై చుంబకత్వమునకు గల ప్రభావము ఏకోనచుంబకత్వము యొక్క వివిధ ఘటనలు అత డీసారి చేసిన ముఖ్యమగు ఆవిష్కరణములు 1822వ సంవత్సరమున ఈ విషయమై పరిశోధనములు మొదలుపెట్టి 1845వ సంవత్సరమున ఆతడు సఫలత నొందెను ఆ సంవత్సరముననే నవంబరు 6వ తేదీన, రాయల్ సంస్థకు "ప్రయోగాత్మక పరిశోధనములు" అను శీర్షికయొక్క 19వ భాగమును ఆతడు పంపెను డిసెంబరు 6వ తేదీన 20వ భాగమును, 24వ తేదీన 21వ భాగమును ఏకోనచుంబకస్వభావముగల పదార్థముల ధర్మములను వర్ణించు వివరములను ఆతడా సంస్థకు పంపెను అభిస్పందిత ప్రకాశతలము, చుంబకీయ పరిభ్రమణము చెందునను విషయమును ఆవిష్కరణము చేయుటచే ఫారడే, శాస్త్రవిజ్ఞానమునకు గొప్ప సేవ చేసెను దాని వలన అయస్కాంత (చుంబక) శక్తి కానున్న కావున పరిసరములందలి పదార్థ భాగములో ఆ శక్తియొక్క దిశకు సమాంతరమగు అక్షముల చుట్టును పరిభ్రమించు చుండునను విషయము ధ్రువపడినది

అయస్కాంత శక్తిచే ప్రేరేపించి, మైకేల్ ఫారడే ఉత్పత్తి చేసిన విద్యుత్ప్రవాహముతే టెలిఫోను, టెలిగ్రాఫి, విద్యుద్దీపములను కనిపెట్టుటకును, విద్యుచ్ఛక్తి సహస్ర ముఖముల ఉపయోగ పడుటకును మార్గదర్శకము లైనవి విద్యుద్రసాయనము, విద్యుద్రాసాయనిక వియోగము అను విషయములపై ఫారడే పరిశోధనములు చేసి ఎన్నియో క్రొత్త విషయములను కనిపెట్టి, విద్యుత్కిరణ ప్రక్రియలను చాల అభివృద్ధి చేసెను విద్యుత్ప్రవాహము వలన కలుగు రాసాయనిక ఫలితములను గూర్చి సుప్రసిద్ధములైన సూత్రముల నాతడు పర్పరచెను

1835వ సంవత్సరములో ఫారడే, రాయల్ సంస్థలో రసాయన శాస్త్రాచార్యుడుగ నియమితుడై, తుద వరకు ఆపదవిని నిర్వహించు చుండెను ఇంగ్లండు ప్రభుత్వము, ఫారడేకు అతని ఏబదవపేట సంవత్సరమునకు 300 పౌనుల చొప్పున ఉపకార వేతన మిచ్చెను. మైకేల్ ఫారడే 40 ఏండ్లు రాయల్ సంస్థాభవనమున నివసించి 1858లో లండను నగరము వెలుపల హాంప్టన్ కోర్టువద్ద విక్టోరియా రాణి తన కొసగిన భవనమునకు మారెను అచటనే క్రీ శ 1867 ఆగస్టు 25వ తేదీన ఫారడే కాలధర్మము నొందెను

"రసాయన ప్రబంధన విద్యుచ్ఛక్తిని గూర్చి ప్రాయోగిక పరిశోధనములు" అను నాలుగు సంపుటములు, రసాయన భౌతిక శాస్త్ర ప్రాయోగిక పరిశోధనములు, క్రొవ్వువత్తిదీపము యొక్క రాసాయనిక చరిత్రపై ఉపన్యాసములు, ప్రకృతి లోని వివిధ శక్తులు అనునవి ఫారడే ప్రచురించిన గ్రంథములు టిండల్, జోన్సు, గ్లాడ్‌స్టన్, థాంప్సన్ మున్నగు వా రాతనిని గూర్చి గ్రంథములు రచించిరి

బి వి ర

## ఫారసీ భాషా సారస్వతములు

ఫారసీ కేవలము పర్షియా దేశమునకు చెందిన భాషయే కాదు అది ఇరానియా పీఠభూమి యంతటికిని సంబంధించిన భాష ఆ పీఠభూమిలో పర్షియా ఒక భాగము పర్షియను భాష ఇండో-యూరపియను భాష యనబడు చున్నది దానికి

సుదీర్ఘమైన పూర్వచరిత్ర కలదు.

**జొరాస్టరు-అవెస్తా:** జొరాస్టరు మహాశయుడు అవెస్తా అను నొక పవిత్ర గ్రంథము ద్వారా తన మతమును బోధించెను. ఈ గ్రంథము దాదాపు క్రీ. పూ. 1000 వ సంవత్సర ప్రాంతమున సంకలితమైనది. ఈ గ్రంథములో గాథలు, దైవస్తుతి గీతములు, ప్రార్థనములు, నైతికోపదేశములు పొందుపరచబడినవి. వాటి భాష సంస్కృతమునకు మిక్కిలి సన్నిహితముగ నుండును.

**ప్రాచీన పర్షియా భాష:** శిలలపైనను, స్మృతిచిహ్నముల పైనను పర్షియా దేశమున, కీలాకారపు లిపితోనున్న శాసనములు, ఆర్కిమేనియనుల ప్రభుత్వ శకమునకు చెంది యున్నవి. ప్రాచ్యభాషా పండితులచే "ప్రాచీన పర్షియను" అని వ్యవహరింపబడు భాషను గూర్చి ఆ శాసనములు విజ్ఞానమును ప్రసాదించు చున్నవి.

పహల్వీ లేక మధ్యకాలిక పర్షియను భాష: ఆ కాలమున ఆర్కిమేనియనుల స్థానమున పార్థియనులు తమ ప్రాభవమును స్థాపించుకొని రోమను సామ్రాజ్యమునకు ప్రతిస్పర్ధులైరి. వారు పహల్వీ అను తమ భాషను వ్యాపింప జేసిరి. ఈ భాష సస్సేనియన్ సామ్రాజ్య పాలనములో ఔజ్జ్వల్యమునందును, సారస్వత వైభవము నందును విశేషముగ పురోగమించినది. ఈ భాష ప్రాచ్యభాషా పండితులచే "మధ్యకాలిక పర్షియను" అని వ్యవహరింపబడెడిది. పహల్వీ భాషా లిపి ఆర్మెయిక్ లిపియొక్క అనుకరణమే. పహల్వీ వాఙ్మయమున, పహల్వీ భాషానువాదములైన అవెస్తా, కీర్తనలు, గుణశాతర కవిత, పురాణ కథలు, వచన చరిత్రలు కలవు. సస్సేనియా రాజుల కాలమున ముఖ్యముగా 6వ శతాబ్దిలో గ్రీకు, సిరియా, సంస్కృత భాషలనుండి కావింపబడిన శాస్త్రీయ, సారస్వత గ్రంథముల అనువాదములచే పహల్వీ వాఙ్మయము సుసంపన్న మయ్యెను.

ఏడవ శతాబ్దియందు అరబ్బుల విజయము, అనంతరము ఇరానియా పీఠభూమియొక్క ప్రధాన భాగములం దణచివేయబడిన స్వాతంత్ర్యకాముక పామర ప్రజలను ఇస్లామీయులుగా మార్చుట—ఈ కారణముల మూలమున అరబ్బీ భాష రాజ్యపాలనమునకును, విద్యా సంస్కృతి కలాపములకును అనుకూలమైన భాషగా పరిణతి చెందెను. మస్నవీ (అంత్యానుప్రాసగల ద్విపద) అనునది వీరకావ్యములను, అద్భుత రసాన్విత కథాకావ్యములను, నీతికావ్యములను రచించుట కుపయోగపడెను. సనాయ్, నిజామీ, రూమీ, సాదీ, జామీ అను కవులు తద్భాషా కవుల కోవలో పేర్కొన దగినవారు. లయాన్వితము, సహజము, సానుప్రాసమునైన పర్షియను వచన రచనమున విశారదుడుగా అంగీకృతుడైనవాడు సాదీ అను కవిశేఖరుడు. గులిస్తాన్ అనునది అతని కృతి. నాటక రచన పర్షియను భాషలో ఇంకను స్థిరపడలేదు. భారత దేశపు కట్టుకథలు, "అరేబియన్ నైట్స్" లోని సాహస గాథలు, నిర్మాణాత్మకము, ఊహావిలసితమునైన కావ్య రచనమునకు అవకాశమును కల్పించెను.

నవలా రచనము పాఠకులలో అభిరుచిని రేకెత్తింప జాలదయ్యెను. కాని ప్రధానముగా ఆలోచనా ప్రేరకములును, విద్వత్ స్ఫోరకములునునైన ఉత్తమ పర్షియను వచన రచనమందు రచయిత వినోదముకంటె సంఘోద్ధరణ సంఘ చైతన్యములనే లక్ష్యములుగ గ్రహించెను. చరిత్రమునందును, సూఫీ వేదాంతమునందును విశేష కృషి జరిగెను. నిజామీ యను ఛందశ్శాస్త్రజ్ఞుని కావ్యనిర్వచనమును కళాత్మకమైన వచన రచనమునకు కూడ అన్వయింప వచ్చును.

బుఖారా, సమర్ కండ్ అను రెండు రాజధానులలో విరాజిల్లిన ససానిద్ ఆస్థానము పర్షియను జాతీయ చైతన్యమును ఉద్దీపింప జేసెను. విజ్ఞాన నిధులైన ఈ ఆస్థానాధీశుల ఉదార పోషణము క్రింద పర్షియను వాఙ్మయము శైశవమును వీడి పరిపూర్ణ ప్రౌఢదశ నందుకొనెను.

వేదాంతాభిజ్ఞుడును విజ్ఞానశాస్త్ర ప్రపూర్ణుడునైన ఇబిన్ సినా అనునతడు ప్రభుత్వ గ్రంథ భాండాగార వర్ణనము నొనర్చెను. నాసరు యొక్క పండి పాఠకుడును, ప్రముఖ ప్రథమ కవియునైన రూదకీ అనువానినికి సమనిద్స్ అనువారితో సంబంధాను బంధములు కలవు. పర్షియను కవిత కితడు చాసరు మహాకవి వంటివాడు. అబూ ఆలీ అను మంత్రివర్యుడు తాబరీ అను కృతిని పర్షియను భాషలోనికి అనువదించుట ద్వారా ఉదాత్తమగు పర్షియను వచనశైలిని సృజించినాడు. ఫిర్ దౌసీ ఈ రాజవంశ పోషణమున 'షానామా'లోని విశేష భాగమును రచించెను. కాయ్ కన్స్ అను వేరొక కవి కాబూస్ నామా అను రచనమును చేసెను. మహమ్మద్ అనునతడు పర్షియను సారస్వతమును రాజోచిత విధానమున

పోషించెను ఆతని ఆస్థానకవి ఉన్సురీ అనునతడును ఫరూకీ మినుచిహ్రీ అను వారలును ఆతని శిష్యగణము లోనివారే ఆనంతరీయులగు ఘజ్నవిదులను వారు పర్షియను సారస్వత సంప్రదాయమును సమగ్రముగ పోషించి, భారత దేశమందలి ముస్లిముల కప్పగించిరి

పర్షియన్ ప్రభువుల జీవిత చరిత్రను తెలుపు "షాహనామా" అను తన మహాకావ్యమును ఫిరదౌసి మహమ్మదునకు అంకిత మొనర్చెను

సూఫీ తత్త్వవాది యగు హుజ్వీ పండితుడు ఆ కాలమున లాహోరు నగరములో నివసించు చుండెను మసూద్ సాద్ సాల్మన్, అబుల్ ఫరాజ్ రూనీలుకూడ ఆ పట్టణవాస్తవ్యులే సనాయ్ తాను రచించిన ఒక అత్యుత్తమ కావ్యమును బహరాన్‌షాకు అంకిత మొనర్చెను

సెల్జుక్ టర్కుల ఆగమనముతో ఇస్లాము చరిత్రయందొక ముఖ్యమైన శకమేర్పడెను అరాజకము నణచుటకొక కఠిన పరిహారమార్గమీ టర్కుల ఏకీకరణ శక్తియందభివ్యక్త మయ్యెను క్రూసేడర్స్ అను క్రైస్తవ దండయాత్రికులు పొందిన అపజయ పరంపరలకు వీరే కారకులు ఈ సెల్జుక్ టర్కుల పాలనములో ఆస్థాన కవిత అత్యున్నత శిఖరము నందుకొనెను స్తోత్రకరణము లాభకరమైన కవితా వృత్తి యయ్యెను ఆ కాలపు అత్యుత్తమ కవులలో అన్వరీ మ్యుయజ్జీ, ఖకానీ, జహీర్ అనువారు సుప్రసిద్ధులు

నిజామీ కవి శృంగారగీతికా ప్రణేతలలో శ్రేష్ఠతముడు పంచాంగ సంస్కరణమునకై ఉమర్ ఖయ్యామ్ మాలిక్షాచే ఆహూతుడై, స్వీయ వినోదము కొరకు అజరామరములైన చతుష్పాద గీతములను రచించెను నాసిరీ ఖుస్రూ కవి గద్యపద్యములను రచించెను నిజాముల్ ముల్క్ అను మంత్రిసత్తముడు స్వయముగ మత వాఙ్మయమునకును, ధర్మోపదేశమునకును పోషకుడుగ ఖ్యాతి గాంచెను అతడు ప్రయోగాత్మక రాజనీతి నధికరించి, సుప్రసిద్ధ గ్రంథము నొకదానిని వ్రాసెను

ఆ కాలమున చరిత్ర రచన కూడ ప్రోత్సహింపబడెను నసరుల్లా అనునతడు 'కలిలవ-డిమ్నా' (అరబ్బీ భాషలోని కనువదింపబడిన పంచతంత్రము)ను సొగసైన పర్షియను భాషలోని కనువదించెను మహమ్మద్ ఘూరీ తన అనుచరులను కూడదీసికొని ఘజ్నవిదులలో తుదివానిని లాహోరునుండి వెడలగొట్టి, గ్వాలియరును, బెంగాలును, బుందెల్ ఖండును, బీహారును స్వాధీన మొనర్చుకొనెను ఆతని సామ్రాజ్యము అచిరకాలముననే సింధు, బెంగాలు, ఢిల్లీ రాజ్యములుగా విచ్ఛిన్నమై మంగోలు దండయాత్రల నుండి తప్పించుకొనెను ఈ రాజ్యముల ప్రభువు లందరు పర్షియను వాఙ్మయమును ప్రోత్సహించినవారే

13వ శతాబ్దిలో పర్షియా దేశము మంగోలు దండయాత్రలకు గురి యయ్యెను విజ్ఞానశాస్త్రములను, వాఙ్మయమును ప్రోత్సహించుటలో మంగోలీయులగు ఇల్‌ఖానులు గాఢమైన అభిలాషను వ్యక్త మొనర్చిరి

సెల్జుకి టర్కుల పోషణమున ఈ శతాబ్ది కవులలో అత్యుత్తముడగు నొకడు పర్షియను ఘజలులను, పర్షియను ఖురానును సూఫీ మస్నవీని రచించెను భయచోదితుడైన సాదీ యనునాతడు పలాయితుడై ప్రపంచమున సంచరించి, కొంత కాలమైన తరువాత స్వస్థలమైన షిరాజ్‌నకు మరలి వచ్చి, పర్షియను వాఙ్మయములో అత్యుత్తములైన గులిస్తాన్, బూస్తాన్ అను గ్రంథములను వ్రాసెను రమ్ అను కవిశేఖరుని కీర్తి పాశ్చాత్యాగ్ర శిఖరము నధిరోహించెను సాదీ కవి కవితాసుమము పర్షియా సారస్వత వాతావరణములో వికసించెను ఖుస్రూ కవి, తన గేయములను ప్రవాహ రూపమున వెలువరించెను

తైమూరు పాలనమందును, తరువాతివారి పోషణము క్రిందను పర్షియను సారస్వతములో పునరుద్ధరణము ఘటిల్లెను హాఫిజ్ అను కవి ఘజలు రచయితలలోనెల్ల సర్వజనాదరణీయుడై, ఈ యుగమున అత్యంత ప్రజ్ఞాశాలిగా పరిఢవిల్లెను ఇది పర్షియను కవితా సుమోదయమునకు నూతన వసంత కాలము దీనిని రెండవ ప్రామాణిక కవితా యుగమని చెప్పవచ్చును అధిక్షేప కావ్యము ఈ యుగమున ఘటిల్లిన యొక ఆకర్షక సారస్వత ప్రక్రియ ఉబైదీ, జకానీ, బుషక్ అనువారిట్టి కవితను వ్రాసిరి దినదినప్రవర్ధమాన మగుచుండిన సూఫీ తత్త్వప్రభావమునకు అహుదీ, మగ్రబీ, నిమాతుల్లా అల్లీ అను కవుల రచనలు నిదర్శనములు జామీ కవి ప్రామాణిక కవితా మహత్త్వ ప్రక్రియా వైవిధ్యమునకు ప్రతినిధి ఈ కవితాధ్యాయమున ఇతడు తుదివాడు

ఇట్టి స్థితిలో సఫైదులను తెగబారు పర్షియా సింహాసనమునకై పెనగి కృతకృత్యులైరి వారి కాలమున వణిజులును

రాజనీతి విశారదులును ఐరోపానుండి వచ్చి చేరిరి వీరి రాకతో పర్షియాదేశమున ఆధునిక యుగ మారంభమైనది అబ్దుల్ హాసన్ అనునతడు ఈకాలపు కవులలో అగ్రగణ్యుడు అతడు సాధారణముగా 'నిజాముల్ ముల్క్' అను బిరుదముతో వ్యవహరింప బడుచుండెడివాడు అతడు పరిపాలనా నిర్వహణ కళను అధికరించి యొక గ్రంథమును రచించెను

సూఫీతత్త్వ మానాడు గొప్ప అధ్యాత్మిక ప్రభావమును, సారస్వత ప్రాముఖ్యమును కల్గియుండెను వాస్తవమున కాతత్త్వము పర్షియను కావ్యజాలమునెల్ల స్వీయ ప్రభావముచే ముద్రిత మొనర్చెను ఈ విషయమును బట్టియే సూఫీతత్త్వమునకు పర్షియను సారస్వతమందు ప్రాముఖ్య మేర్పడెను సూఫీతత్త్వ ప్రవచనోద్యమమున అబూసయద్ అబుల్ ఖయర్ అనునాతడు సుప్రసిద్ధ కవి అతడు "చతుష్పది" అను పద్యమును పునరుజ్జీవింపజేసి దానికి సార్వజనికతను చేకూర్చెను మరియొక సూఫీతత్త్వజ్ఞప్రముఖుడు సనాయ్ అనునతడు సూఫీతత్త్వప్రతిపాదనమునకై 'మస్నవీ' రూపమును ప్రప్రథమముగా ప్రయోగించిన కవియాతడు హాదీకత్-ఉల్-హాకీకా అనునది ఆతని అత్యంత సుపరిచితమైన మస్నవీ సూఫీతత్త్వజ్ఞుల పారవశ్యోపేతమైన వేదాంతముతో పాటు, ఉమర్ ఖయ్యామ్ ప్రతిపాదించిన నాస్తికత కూడ ప్రవర్తిల్లెను ఈ నాస్తికత నిరుత్సాహకరముగను, నిరాశాజనకముగ గూడ నుండెను ఉమర్ ఖయామునకు కవిగా కంటె సిద్ధాంతిగాను, గణితశాస్త్ర విశారదుడుగాను, స్వతంత్ర చింతకుడుగాను విశేషతర ఖ్యాతి గలదు ఆతని రుబాయత్తులు దాదాపు ప్రతిభాషా సారస్వతమందును పరిదృశ్యమానములు భాషావిష్కరణ సాధనముగా వచన రచనము పర్షియన్ భాషయందు సాపేక్షముగా మిక్కిలి అరుదైయున్నది

సుప్రసిద్ధ గూఢతత్త్వవాదియు, పవిత్రవర్తనుడును, నీతి శాస్త్రవేత్తయునైన అల్ గజలీ అనునతడు ఇస్లామీయ సూఫీ భక్తి తత్త్వవికాసమున నొక శకమును స్థాపించిన మహనీయుడు. అతని రచనలు విశేషముగ అరబ్బీభాషలో జరిగినను, అతడు కిమియాయ్-సా-అదత్ అను శీర్షికతో పర్షియను భాషయందు "ఇహ్యా ఉలుముద్దీన్" అను ప్రముఖ గ్రంథమును సంగ్రహించెను అరుజీ సమర్కండీ అను కవి రచించిన చహర్-మకలా అను కృతి అసంపూర్ణ వేదాంతపరమగు నొక జీవితచరిత్రము అన్వరీ, షాకనీ కవులు తమ జీవిత విశేషములను స్తోత్రకావ్య రచనకై వినియోగించినవారు ఇతిహాసములనుండి సేకరింపబడిన సుప్రసిద్ధ ప్రేమగాథల నధికరించి అద్భుత రసాత్మక కావ్యరచనకు మార్గదర్శకుడై వరలినవాడు గంజా నిజామీ అను మహాకవి ఆతడు రచించిన శృంగార కావ్యపంచకము 'ఖామ్‌సా' అను నామముచే వ్యవహరింపబడినది తరువాతి కవులు పెక్కురు అహమహమికతో దాని ననుకరించిరి

అత్యంత సామర్థ్య విలసితుడును, రూపకాద్యలంకార రచనా తత్పరుడునైన ఫరీదుద్దీన్ అట్టార్ అనుకవి, సనాయ్ కవీశ్వరునకు పిదప, సూఫీతత్త్వ సంప్రదాయమును కొనసాగించెను మాన్ టి-కట్-తైల్ అనునది ఆతని ప్రసిద్ధరచన తధ్‌కిరాత్-అల్-ఔలియా అను వచన రచనయందు ముస్లిము సిద్ధులయొక్కయు, గూఢ తాత్త్వికులయొక్కయు జీవిత చరిత్రలను, సూక్తులను ఆతడు సంకలన మొనర్చెను

మౌలానా-ఇ-రమ్ అను నామాంతరముగల జలుద్దీన్ అనునతడు విజ్ఞానశాస్త్ర వాల్లభ్యమును సంపాదించుకొనిన పిమ్మట, కవితావృత్తియం దడుగిడెను మంగోలు దండయాత్ర వలని భీతిచే కలతనొందక ఆతడు తన రచనలను కొనసాగించినట్లు తెలియుచున్నది సూఫీ తాత్త్విక ప్రపంచమున ఆతడు రచించిన గ్రంథములలో మస్నవీ కృతి పహ్లవీభాషా రచితమైన 'ఖురాను'గా విశేషతర ఖ్యాతితో విరాజితమైనది సాదీకవివర్యుడు బహుళగ్రంథ ప్రణేత అతడు పద్యరూప ప్రక్రియలనన్నిటిని రచించినవాడు బుస్తాన్, గులిస్తాన్ అను కృతులతో ఆతనికి అవినాభావ సంబంధ మేర్పడియున్నది ఈ రెండు గ్రంథములు అధునిక వాఙ్మయము లన్నిటిలోనికి అనువదింపబడినవి

మంగోలులుకూడ చారిత్రక, విజ్ఞానశాస్త్రముల ఆర్థిక, ప్రాయోగిక మూల్యమును గుర్తించిరి వారి రాకకుమున్నే, పర్షియాయందు ప్రసిద్ధినొందిన వారలలో నసిరుద్దీన్ టస్ అనునత డొకడు అతడు వేదాంత, గణిత, జ్యోతిశ్శాస్త్రములలో ఆరితేరినవాడు స్వీయభాషయగు పర్షియనులో అఖ్‌లక్-ఇ-నాసిరి అను సుప్రసిద్ధ గ్రంథము నాతడు రచించెను ఇస్లాము వాఙ్మయ మంతటిలో, నీతిశాస్త్రవిషయమున అది అత్యుత్తమ రచనగా పరిగణింపబడు చున్నది ఆలామాలిక్ అనునతడు సవిస్తరమైన మంగోలు చరిత్రమును రచించెను. దాని పేరు తారిఖ్-ఇ-జహన్ గుషా అనునది

ఇల్ఖానీ రాజ్యకాలమున పద్యరచనయందెట్టి కృషియు జరుగలేదనియే చెప్పవచ్చును ఖాజూకిర్మన్ అనువాతడు నిజామీకవిని అనుకరించుటలో కృతకృత్యుడయ్యెను ఆతడా కాలపు కవులలో శ్రేష్ఠుడుగా భాసించెను రాజ్వత్-ఉల్-అన్వర్ అను నీత్యాత్మక కావ్య మాతని రచనయే

ఇల్ఖాను ప్రభువుల తుది దినములలోను, తైమూరు సాధించిన పర్షియా విజయమునకు పూర్వము అర్ధశతాబ్దపు కల్లోలిత కాలమందును, సూఫీ తత్త్వ వాఙ్మయమునకు చక్కని ప్రచారము లభించెను ఈ కాలమున లామా-అట్-ఇరాఖీ, గుల్‌షన్-ఇ-రజ్ అను రెండు కావ్యములును విశేష వ్యాప్తిచెందిన గూఢతత్త్వ గ్రంథములు ఇవి మహమ్మద్ షబిస్తరీ అనుకవి ప్రణీతములు

హాఫిజ్‌కవి సూఫీ తత్త్వ కవులలో కడపటివాడు దృష్టి గభీరత, భాషాచాతురి, భావసౌందర్యము మున్నగు విషయములను పురస్కరించుకొని, ఆతడు పర్షియను కవులలో పెల్లి అగ్రగణ్యుడైనవాడు ఆతడు కసిదమ్, రుబాయతులను, నీతికావ్యములను రచించెను 'నైటింగేల్ ఆఫ్ షిరాజ్' అని ఆతనికి బిరుదముండెను ఇల్‌ఖానుల కాలమునందువలె, తైమూరు కాలమందును విద్యావేత్తలు ప్రధానముగ చరిత్ర రచనా వ్యాసంగమున కాలము బుచ్చుచుండిరి అయితే అనంతరము పెక్కురు సంగ్రాహకుల గ్రంథములు లబ్ధమైనను ఆకాలమున ఉత్తమ చారిత్రికులుగా గణతికెక్కినవా రెవ్వరును లేకుండిరి

తైమూరు రాజ్యకాలమున గూడ కవులును, గూఢ తత్త్వజ్ఞులును జీవించియుండిరి గద్యకవిగా జామిస్ గొప్ప ఖ్యాతిగాంచెను 'బహారిస్తాన్' ఆతని అత్యుత్తమ వచన రచనము సాదీకవిచే గ్రథితమైన 'గులిస్తాను' నాదర్శముగా గొని దానినతడు రచించెను నిజామీ వాడిన ఛందస్సునే వాడుచు ఆతడు మస్నవీ పంచకమును రచించెను ఆతడు తరచుగ దౌలత్‌షా రచించిన తజ్‌కిరత్-అల్-షు ఆరా అను జీవిత చరిత్రమునుండి ఉదాహరణముల నొసగెడివాడు

నేటి పర్షియా భారతదేశములోను ఐరోపాఖండ దేశములలోను ప్రవృద్ధమగు మతచైతన్యముతో పరస్పరసంబంధములను వృద్ధిచేసుకొనుట నేటి పర్షియాదేశములో "సఫవిద్" రాజ్యపాలకుల విధానముగా నుండెను ఆదేశ చరిత్రలో సఫవిద్ కాలమొక పునరుజ్జీవన యుగముగ గణనకెక్కెను 19వ శతాబ్ది ఆరంభముననే వాఙ్మయమందు మతలక్షణములు ప్రతిఫలింప జొచ్చెను సఫవీషాహ్ అబ్బాస్ అనునతడు ఆనాటి మేధావి బృందమును తనచుట్టును చేర్చుకొని వారితో గోష్ఠులు జరపుచుండెడివాడు మహాతషమ్, శాపీ, హాతిఫీ, సహాయ్, పిఘానీ, అనువారికాలపు సుప్రసిద్ధకవులు హాతిఫీ రచితమైన తైమూర్‌నామా (తైమూరు విజయములు), పద్యరచనమునకు నూతన చైతన్యమును ప్రసాదించెను

భారతదేశములో అక్బరు ఆస్థానమున పర్షియను వాఙ్మయములో గొప్ప పాత్రవహించి గణుతి కెక్కినవాడు తెయిర్లన్ మహాకవి బాబర్ చక్రవర్తిచే భారతభూమికి ఆహూతుడైన ఖ్వాండ్‌మీర్ అను చారిత్రకుడు 'హాబిబు సియార్' అను అత్యంత విపులగ్రంథమును రచించెను అక్బరు చక్రవర్తి అనుగ్రహమునకు పెక్కురు పర్షియను కవులు పాత్రులైరి బుఖారా వాస్తవ్యుడైన ముష్ఫికీ అను గేయ కవియు మషాద్ నివాసియు, మస్నవీ రచయితయు నగు హుసేన్ సనాయ్ అనుకవియు అక్బరునకు విశేషముగ ఋణపడి యున్నారు కాని అక్బరు కాలమునాటి ప్రధానకవి షిరాజ్ నివాసియగు ఉర్ఫీ అనునాతడు ఫైజీ అనునతడు బృహద్గ్రంథకర్త ఆతడు నల్‌దమున్ అనునొక భారతీయ అద్భుత రసాత్మక గాథను పర్షియను భాషలోని కనువదించెను

కుహారానువాసియగు జహూరి మస్నవీసకీనామా అను గ్రంథము మూలమున స్మరణీయుడైనాడు ఇది హాఫిజ్ వ్రాసిన గ్రంథమునకు అనుకరణమే టాబ్రిజీ వంశీయుడైన ఇస్ఫహాన్‌సైబ్ అనునాతడు జామీకవికి పిమ్మట పేర్కొనదగిన గొప్ప పర్షియనుకవి ఇతడు భారతదేశములో షహజహాను ఆస్థానమున కొంతకాలము గడపెను ఇతడు రచించిన దివాన్ అను గ్రంథములో గేయప్రమాణ రూపములతో వెలసిన పెక్కు పద్యములు, చతుష్పాదులు పోషకుల నధికరించి వ్రాయబడిన స్తోత్రములు, ఇందు అనేకములైన టర్కీ గేయములుకూడ చేరియున్నవి

సఫవిద్ కాలానంతరము ప్రాచీన సారస్వత ప్రక్రియలు ఉపయోగమందుండినను, పాశ్చాత్య సంపర్కము, నూతన ప్రభావోదయము ఫలవంతములైనట్లు కన్పించును ప్రాచీన శైలులకు చెందిన పర్షియను కవులలో అత్యంత ప్రతిభావంతుడైనవాడు 18వ శతాబ్దికి చెందిన షేక్ ఆలీహాజిన్ అనువాడు ఆతడు తన సమకాలికులగు విద్వాంసులను, కవులను గూర్చి

'తజ్కిరతుల్ ము అ సిరియు' అను గ్రంథమును వ్రాసెను హాబిబుల్లాకానీ అనునాతడు 19 వ శతాబ్దిలో ఇరాను నందు జన్మించిన అత్యంత ప్రతిభావంతుడైన కవి సమర్థుడును, నీతి, వీరకావ్యముల ప్రణేతయునైన రజాకులీఖాన్ లాలా బఖీ అనునాతడు మజ్మా ఉల్ ముషాజా, రియాజుల్ ఆరిఫిన్ అను మహాకావ్యములను రచించి సారస్వత చరిత్రకు అమూల్యమైన సేవ యొనర్చెను తజియాస్ అను కవితాప్రక్రియ అత్యంత ఆధునిక మైనది ఇది ప్రవృద్ధమైన, దీర్ఘప్రలాప కావ్యరూపమై యుండవచ్చును బాబిజమ్ యొక్క ఉత్పత్తి కూడ 19 వ శతాబ్దిలో ఘటిల్లిన నూతన విషయము దీనికి సారస్వతమయిన విలువ కంటె చారిత్రికమయిన విలువయే అధికము బాబ్ అనునతడు వ్రాసిన పెక్కు గ్రంథములలో బాయన్ అనునది అత్యంత ప్రముఖ మైనది

రాజ్యాంగ సంవిధాన ప్రతిష్ఠాపనము వలన, పాశ్చాత్య కళా, విజ్ఞాన శాస్త్రముల ప్రభావము వలన, పర్షియా ఆధునిక కవిత యందు మార్పులు ఘటిల్లినవి ఆధునికోద్యమ ప్రవక్తలు పద్య కవితయందు నూతనాంశములను ప్రవేశపెట్టి కావ్య పరిధిని విస్తృత మొనర్చిరి ఈ నూతనోద్యమము సాంప్రదాయికత, కృత్రిమత అను నిగళముల నుండి పర్షియను కవితను విముక్త మొనర్చెను నేటి పర్షియను కావ్య ప్రధాన లక్షణము లీదిగువ సంగ్రహింప బడినవి

1 సాలంకృతమును, కృత్రిమమునైన శైలి త్యజింప బడినది.
2 నేటి కవితా వస్తువునందు విశేషమైన మౌలికత కలదు
3 ప్రేమ కవితా ప్రాచుర్యము సన్నగిల్లినది
4 కవితా విషయములు మానవాళి రుచికరక్షేత్రములపై పరివ్యాప్తము లైనవి

ఆధునిక కవితయందు ఈ క్రింది లోపములు కూడ నున్నవి ఆధునిక పద్య కావ్యములలో పెక్కులు కావ్యాభాసములు, అనగా అవి ఛందోబద్ధ వచన రూపములు వాటిలో కవిత్వాంశము లేదు ఉదా "అండర్జ్ అఫ్ షురిదా "

అనేక కావ్యములు జనసామాన్యము కొరకు ఉద్దిష్టములైన ఉగ్రగంభీరోపన్యాస రూపములవలె భాసించును నియమ సహితమైన పద్యము కనిపించదు. ఆధునిక కవులు రాజకీయ, దేశభక్త్యాత్మక కావ్యములలో శృంగార-వీర-కరుణ రసములను పోషించుట కలదు

ఇరాజ్ మిర్జా అను కవి ఈ శైలక్షణములు ప్రతిధ్వనించు 'మడిరాండ్', 'కల్-ఇ-మడిర్' అను రెండు పద్య కావ్యములను రచించెను వీటిలో కొన్ని తావులలో చతురోక్తి సమృద్ధిగ కన్పించును ప్యూరట్ కవి రచించిన మహా-బి-మెహార్ అను కావ్య మిందుకు ఉత్తమోదాహరణము

గు ద ర

## ఫాహియాన్ :

చంద్రగుప్త విక్రమాదిత్యుడు (క్రీ శ 375–413) ఉత్తర హిందూస్థానమును పాలించు కాలమున ఫాహియాన్ అను చైనా యాత్రికుడు క్రీ శ 405 వ సంవత్సరములో భారత దేశమునకు విచ్చేసి ప్రామాణికములగు కొన్ని అపూర్వ బౌద్ధ గ్రంథములను సేకరించుటకు తక్షశిల, రాజగృహము, గయ, వారణాసి, అయోధ్య, పాటలీపుత్రము, కపిలవస్తు, తామ్రలిప్తి ప్రభృతి ప్రధాన బౌద్ధ క్షేత్రములను సందర్శించెను ఇతడు తన యాత్రా సందర్భమున ఆరు దీర్ఘ వర్షములు భారత భూమిలో పర్యటించి, గుప్తరాజుల కాలమునాటి దేశ పరిస్థితులను, ప్రజల సాంఘికాచారములను గూర్చి కూడ వ్రాసి యుండెను ఈతని రచన లాకాలపు చరిత్ర నిర్మాణమునకు ముఖ్యాధారములుగ నెన్నబడు చున్నవి

'ఫాహియాన్' అనునది మతసంబంధమగు నొక బిరుద నామము "ప్రసిద్ధ బౌద్ధ ధర్మాధికారి" అని ఈ బిరుదమున కర్థము

ఆ కాలమున నిఖిల బౌద్ధ ప్రపంచమునకును భారత భూమి యొక పవిత్ర క్షేత్రముగ పరిగణింపబడెడిది బౌద్ధ మతస్థాపనా చార్యుడైన బుద్ధ భగవానుడు భారత భూమి యందే జన్మించెను ఆ ప్రాచీన యుగములో వేలాది బౌద్ధ యాత్రికులు ఆసియా ఖండమున పెక్కు ప్రాంతముల నుండి భారతభూమి కరుదెంచి, బౌద్ధక్షేత్రములను దర్శించి పోవు చుండెడివారు అట్టి యాత్రికులలో ఫాహియాను ప్రముఖుడు ఈతడు ప్రధానముగ సూత్ర పీఠికలని చెప్పబడు వినయసూత్ర గ్రంథముల (వినయపిటకముల) యొక్క సంపూర్ణ ప్రతులకొరకన్వేషించి మాతృదేశమునకు కొని పోవుటకై భరత వర్షమున కరుదెంచెను

ఫాహియాను చైనా దేశమందలి షాంఘై మహానగరమున నివసించు చుండిన యొక బౌద్ధ భిక్షువు ఇతడు క్రీ॥ శ 370 వ సంవత్సర ప్రాంతమున కంగ్ వంశమున జననమందెను. ఈతని జననీ జనకుల కితడు నాల్గవ తనయుడు, ఈతనికి మూడేండ్లయిన నిండకముస్నె, ఈతని సోదరులు ముప్వురును మృత్యువు వాతబడి జననీ జనకులను దుఃఖసాగరమున ముంచిపోయిరి ఈతని తండ్రి పుత్ర వియోగముచే మిగుల బొగిలి, కృశించి, విరక్తుడై తనబిడ్డ డెచ్చటనైన బ్రతికి యుండిన చాలునని తలచి, ఫాహియాను నొక బౌద్ధ మతమున విడిచి వచ్చెను కాని పాప మాతడు తన ప్రేమ పాశముల త్రెంచుకొనజాలక, కొలది దినములైన గడువక పూర్వమే, మరల మఠమునకేగి తన చిన్న తనయుని గొని వచ్చి, ఇంట నుంచుకొని అతి గారాబమున బెంచుకొన దొడఁగెను. కాని ఇంట నడుగు బెట్టిన నాటినుండియు నా బాలుడు వ్యాధిగ్రస్తు డయ్యెను నానాటికి రోగము ముదిరి ఎన్ని యౌషధముల సేవించినను ప్రయోజనము లేకుండెను మరల బౌద్ధ మఠమున విడిచిన, అతడు జీవించునేమో యను నాశతో తండ్రి కన్నీరు గార్చుచు, ప్రాణావశిష్టుడై యున్న కుమారుని భుజములపై నిడికొని, మఠమున దించి వచ్చెను తోడనే శాపము దీరినట్లు ఫాహియానునకు వ్యాధి తిరుగుముఖము పట్టి క్రమముగ అతడు స్వస్థుడయ్యెను తిరిగి కొనిపోవచ్చిన తండ్రి వాంఛను తిరస్కరించి, నాటినుండి ఆ పసిపాపడా మఠమునందే కాలమును బుచ్చుచు క్రమముగా పదియేండ్ల ప్రాయము గలవా డయ్యెను అప్పటి నుండియు అతనికి కష్ట పరంపరలు ప్రారంభ మయ్యెను జనను మాతాపితరుల యొక్కయు రక్తబంధువుల యొక్కయు మరణము లాతని మనమును చలింపజేయ జాలవయ్యెను భిక్షుకవృత్తిని, సన్యాసాశ్రమమును అతడు త్యజింప నిరాకరించెను అతని సంకల్పము వజ్రతుల్యమయ్యెను చిన్ననాటి నుండియు ఫాహియాను త్యాగనిరతికి కాక, అనన్య ధైర్యసాహసములకు గూడ ప్రసిద్ధి చెంది యుండినట్లు నిరూపించు పెక్కు ఉదంతములు కలవు

నిర్ణీతమగు శిక్షణకాలము ముగియగనే, ఫాహియాను బౌద్ధగ్రంథరాజమగు వినయపిటికను సంపాదించి తెచ్చుటకై భారతభూమికి బయలుదేరెను అతని యాత్రావృత్తాంతము, చైనాకు మరలునపుడు మార్గమధ్యమున అతని కొదవిన క్లేశ పరంపరలు అతని రచనలయందు సాకల్యముగ వర్ణింపబడినవి తన రచనల నన్నిటిని అతడు పట్టువలువలపై వ్రాసికొని పోయెనట ఆకాలపు భారతీయుల సౌశీల్యము, ఆచారవ్యవహారములు, సంపత్సౌభాగ్యములు, మతవిశ్వాసములు, అతని యాత్రావృత్తాంతము అందు వర్ణితములైనవి గుప్తరాజుల నాటి ప్రజలు భోగభాగ్యాదులతో తులతూగుచుండిరనియు, పాటలిపుత్రమున ప్రజలచే నిర్మింపబడిన ఉచితవైద్యశాలలుండెడివనియు, యాత్రికుల సౌకర్యార్థమై ముఖ్యనగరములలో విశ్రాంతిగృహములు వెలసెననియు ఫాహియాను వ్రాసెను గుప్తరాజులు సమర్థులగు న్యాయపాలకులనియు నేరములు, శిక్షలుగూడ స్వల్పమాత్రముగ నుండెడివనియు. ప్రజలు తిరుగుబాటు సల్పినపుడుమాత్రమే హస్తచ్ఛేదము వంటి కఠినదండనము విధింపబడెడిదనియు అతడు తెలిపియుండెను చోరభయ మిసుమంతయు లేకుండెననియు, విదేశీయు లెట్టి ఆటంకములును లేకయే దేశములో కాలక్షేపము చేయగలిగిరనియు, గుప్తరాజులు మతసహనమూర్తులనియు ప్రజలహితమునే అభిలషించుచు. వారి ఆదర విశ్వాస, సహకారములను చూరగొనుచు, జనరంజకముగ పాలించెడివారనియు, ఫాహియాను వ్రాసెను

ఫాహియాను అత్యుత్తబౌద్ధధర్మమున సాధనదశ నతిక్రమించి, సిద్ధినధిగమించినపిమ్మట అతని ధర్మదీక్షయు, గాఢమతనిరతియు, బుద్ధివైశారద్యమును, కఠోరదీక్షాసక్తియు ప్రకాశము నొందినవి అనంతరమే అతడు భారత దేశ యాత్రకు పూనుకొనెను

క్రీ॥ శ 399 వ సం॥ న ఫాహియాను షాంఘై నగరము వీడి పాదచారియై, ఆరుదీర్ఘ వర్షము లహోరాత్రములు ప్రయాణ మొనర్చెను ఆకాలమున అంతటి దూరప్రయాణము సల్పుట మిగుల దుస్సాధ్యమగుటచే. అతడు మార్గమధ్యమున నెన్నియో శ్రమలుపడెను నిర్మనుష్యమై, భీషణవాయువులకును, దుమారములకును ఆకరమై, దుర్గమమగు గోబీయెడారిని దాటెను, వడవడవణకించు శీతలవాయువులకు నిలయములగు ఉన్నతపర్వతావళుల సంచరించెను పర్వతశిఖరములనుండి జారి, అతివేగమునపారు సెలయేటి ప్రవాహములను దాటెను, నిర్జలములై శిలావృతములై క్రూర మృగజాలము కావాసభూములగు పర్వతప్రాంతములబడి ప్రయాణించెను, మార్గమున షెన్ షెన్, కుస్తాన, కీచా, కన్యాకుబ్జ,

కోసల, గాంధార, మగధ ప్రభృతి రాజ్యముల నెన్నిటినో అవలోకించెను కుస్తాన, ఉదయన, గాంధారరాజ్యముల గూర్చి ఫాహియాను గావించిన ప్రశంసలు చరిత్రపరిశోధకుల కత్యంతోపయుక్తము లైనవి ఆనాటి చైనా సామ్రాజ్యము నుండి భరతవర్షము దనుక అతడు గాంచిన దేశము లన్నియు భారతసామ్రాజ్యౌన్నత్యమునకు దోసిలొగ్గినవి ఆదేశము లన్నిటియందును ఆర్యావర్త దిగ్విజయపతాక ఎగురు చుండెను ప్రాచ్యప్రపంచమున భారతదేశీయ ఆధ్యాత్మిక సామ్రాజ్యము సుస్థాపిత మయ్యెను ఈరాజ్యము లన్నిటి లోను ఆచారములను వేషభాషా మర్యాదలను, విజ్ఞాన, సాంస్కృతిక వ్యవహారములను, శిల్ప చిత్ర కళా సాహిత్య ములను భారతవర్షము శాసించునదియై విరాజిల్లినది ఇటీవల పూర్వ తురుష్క స్థానమున భూగర్భమునుండి బయల్వెడలిన శిల్పశిథిలములు ప్రాచీన భారత జాతీయ విభవమునకు సాక్షు లనియు, ఆర్యావర్తమునకు పశ్చిమోత్తరముగ నున్న ఆఫ్ఘనిస్థానము (లోయీూ), బెలూచిస్థానము (ఖోహాన) మున్నగు రాజ్యములందు గూడ ఈ కాలమున బౌద్ధము వ్యాపించి యుండెననిగుఉ ఫాహియాను తెల్పి యున్నాడు

ఎట్టకేలకు ఫాహియాను ఆర్యావర్తమును చేరుకొనెను పాుగ్లీ, సింధునదుల నడుమనుండు యావద్భారతభూమిని వీక్షించెను ఇతిహాస ప్రసిద్ధములగు పట్టణములను, పుణ్యతీర్థ ములను పెక్కింటిని దర్శించెను వైద్యశాస్త్రమునకు, శస్త్ర చికిత్సకు భూవలయమున ప్రసిద్ధిగాంచి, సకలశాస్త్ర పారం గతులగు పండితులకు నివాసభూమియై పదు శతాబ్దములు మహోన్నత పదవి ననుభవించి, ప్రపంచమున నన్నిప్రాంత ముల నుండియు విద్యార్థులను నాకర్షించిన తక్షశిలానగర మును గాంచెను పావన క్షేత్రమగు వారణాసి కేగెను శాక్యసింహుని జన్మస్థానమగు కపిలవస్తుపట్టణమును సేవించెను గౌతముడు బుద్ధత్వము నొందిన గయా క్షేత్రమును దిలకిం చెను బుద్ధుడు నిర్వాణము నొందిన కుశనగరమును వీక్షించెను అన్నిటికంటె, బుద్ధ భగవానుని జన్మభూమిని దర్శించి ఫాహి యాను అత్యంత పులకాంకితు డయ్యెను

అత్యున్నతమైన బుద్ధభక్తులకు మహాపవిత్రమైన బోధిద్రుమమును గాంచి ఫాహియాను భక్తిపరవశుడయ్యెను అశోకసార్వభౌముని మనోహారిణియు. లావణ్యరాశియునగు తిష్యరక్షిత, తన విభునకొక్కతరువునెడ అంతప్రేమ యేలొకో యని అసూయాగ్రస్తయై, ఆ వృక్షమును తెగనరకించిన యుదంతమును, అశోకభూపాలుని భక్తిప్రభావమున నా వృక్షరాజము మరల జిగిర్చి, శాఖలు దొడిగి విస్తరించుట మున్నగు చిత్రకథలను. ఫాహియాను మనోహరముగవర్ణించి నాడు ప్రాచీన భారతేతిహాసక్షేత్రమున ప్రసిద్ధిగాంచిన రాజ గృహపట్టణపరిసరములనుండు గృధ్రకూటపర్వతము నధి రోహించి, యందలి చిత్రముల నారసెను

ఇట్లు ఫాహియాను ఉత్తరభారతమున పెక్కుక్షేత్రము లను దర్శించి, అనియాపర్వతశ్రేణుల ద్వారమున టొలై రాజ్యమునచేరి, సింధునదిని దాటి, ఊచన్ (ఉద్యానప్రదే శము) ప్రవేశించి, అందలి సంఘారామములను వాటియందలి అనుష్ఠాన విధానములను గమనించి, అందు బుద్ధుని పాద చిహ్న మొకదానిని గుర్తించెను తరువాత అతడు దక్షిణము నకు దిగి సు-హు-టో దేశమును చేరెను శాక్యముని దాన వీరత్వమును ఇంద్రు డిచ్చటనే పరీక్షించివాడట! పిమ్మట నాతడు తూర్పుగా మరలి గాంధారమును జేరెను బుద్ధుని నేత్రదాన గాథాచిహ్నమగు స్తూపమును అత డిచ్చటనే చూచెను పిదప తక్షశిలలో బుద్ధుని శిరోదాన, శరీరదాన స్మృతిచిహ్నములగు స్తూపములనుగూడ అతడు సందర్శించి, పెషావరు (పురుషపురి) చేరి, కనిష్కుని ప్రసిద్ధ స్తూపమును, బుద్ధుని భిక్షాపాత్రమును దర్శించెను

అనంతరము ఫాహియాను బుద్ధుని పుర్రెయెముకగల నాగరదేశమునకు ఏకాకిగా ముందునకు సాగెను. అచ్చట హెలూనగరమున "పుసుక ఎముక తిరునాళ్లు" సందర్శించి, బుద్ధుని అస్థిసంచయమును వీక్షించెను ఆ తరువాత అతడు తూర్పున సింధునదిని గడచి 'భిద' అనబడు నేటి పంజాబు రాష్ట్రమును చేరెను అందలి భిక్షుకు లాతనియెడ మిగుల సానుభూతిని చూపి ఆదరించిరి పిమ్మట ఫాహియాను మథురానగరమునకు చని, బౌద్ధ మభివృద్ధియందున్న సంఘా రామములను సందర్శించి, అటనుండి "మధ్యమదేశము"నుచేరి, అచ్చటి ప్రజల ప్రశాంత నిర్మల జీవితమును గొనియాడెను అచ్చట చండాలురు మినహా మరెవ్వరును జీవహింసచేయుట గాని, మధువును సేవించుటగాని, మాంసభక్షణ మొనరించుట గాని, వెల్లుల్లి నీరుల్లులను ముట్టుటగాని జరుపరైరి

ఫాహియాను పిదప సంకాశ్యరాజ్యము చేరెను అచటినుండి కాన్యకుబ్జమునకు వెడలి అందలి స్తూపములను

దర్శించెను. సాంచి యందు బుద్ధుని దంతకాష్ఠ గాథకు నిలయమైన స్తూపమును వీక్షించి, కోసలము, శ్రావస్తి మున్నగు విహారాదులలోని స్మారక చిహ్నములను దిలకించుచు అచటి గాథాపరంపరలను వినుచు, బౌద్ధసన్యాసుల సానుభూతుల నందుకొనుచు, పురోగమనము గావించెను. అటు చని చని కపిలవస్తు–కుశనగరములనడుమ గల రామగ్రామమందలి ఇతిహాస ప్రసిద్ధములగు స్తూపారామములను సందర్శించెను. ఆ గ్రామసమీపములో బుద్ధుడును, అతని శిష్యుడగు సుభద్రుడును పరినిర్వాణము నొందిన తావులందలి స్తూప, సంఘారామములను చూచెను.

వైశాలీప్రాంతారణ్యమున ఆమ్రపాలి అను సుందరాంగి బుద్ధుని స్మారకచిహ్నముగ నిల్పిన ఉద్యాన, విహార, స్తూపములను ఫాహియాను దర్శించెను. ఆసమీపముననే "అస్త్రసన్యాస స్తూపమును, 'వైశాలీమహాసభా' (బౌద్ధధర్మ ద్వితీయ మహాసభా) చిహ్నమగు స్తూపమునుగూడ శ్రద్ధాసక్తులతో విలోకించెను. పిమ్మట వాతడు అశోకుని పాటలీపుత్ర నగరమును చేరుకొని, ఆతడు నిర్మింపించిన దివ్యసౌధములను, స్తూపాదికమును కనుగొనెను. క్రొత్త, ప్రాత రాజగృహములను అందలి స్తూపసంఘారామాదికములను దర్శించెను. పిశుదను మారుని బుద్ధుడు దండించి, "శూరాంగమసూత్రము"ను వెలువరించిన గృధ్రకూటపర్వతమును ఫాహియాను అధిరోహించి, ఆ సూత్రమును పఠించుచు ఒకరాత్రి అందుగడపెను. ఆ పిమ్మట "శతపర్ణగుహ" అనబడు ప్రథమ సభాగుహను చూచి, సర్వసంగ పరిత్యాగియై, అచ్చటనే ఆత్మహత్య గావించుకొని నిర్వాణము నొందిన ఒక భిక్షువుగాథ వినుచు, శాక్యముని బుద్ధుడైన గయలో నిర్మింపబడిన సంఘారామాదికమును సందర్శించెను. అంతట "అశోకనరకగాథ"ను విని, పత్రవృక్షమును పూజించి, శాక్యపబుద్ధుని అస్థిపంజరముగల గురుపదమునుగాంచి, దాని మహిమలు విని, పాటలీపుత్రమునకు తిరోగమించి, "ఋషి మృగోద్యాన పుష్పవాటి విహారము"ను, అందలి హీనయాన విద్యార్థులను, స్తూపారామములను దర్శించెను.

ఫాహియాను దక్షిణాపథమున అడుగిడకపోయినను, దక్కనులోని "పారావతవిహారము"ను గూర్చి వినినదంతయు వర్ణించినాడు. పాటలీపుత్రములో బౌద్ధమతగ్రంథ మాతృకల నుండి ఎత్తివ్రాసికొనుట కెంతయో శ్రమపడెను. తుద కాతనికి మహాయాన సంఘారామమునందు మహాసాంఘిక సూత్రములు పొందుపరుపబడిన "వినయపిటకము" యొక్క ప్రతి లభించినది. తరువాత ఫాహియాను దానిని చైనాభాషలోనికి అనువదించెను. "సర్వాస్తివాద సిద్ధాంతము"లకు ముందుగా ఆరేడువందల గాథలలో ఫాహియాను వ్రాతపతిని నిర్మింపించినాడు. "సంయుక్తాభిధర్మహృదయము"ను అతడు సంపాదించెనని కొందరి మతము. అతడు "సంయుక్త పిటకసూత్రము"ను మాత్రమే అనువదించెనని మరికొందరనిరి. ఆతడు ఇరువదియైదు వందల గాథలతో ఒక సుత్తమును, "పరినిర్వాణ వైపుల్య సూత్రము"న ఐదు వేలగాథలతో ఒక ప్రకరణమును, "మహాసాంఘికాభిధర్మము"ను సంపాదింపగల్గెను.

తన అన్వేషణాకృషిలో లభించిన విజయముచే ఫాహియాను ప్రోత్సాహమొంది, భారతదేశములో సంస్కృత భాషను అభ్యసించుచు, తద్భాషాగ్రంథములను పఠించుచు, 'వినయాసూత్రము'లను వ్రాసికొనుచు, మూడేండ్లు గడపెను. ఫాహియానుతో కలిసి భారతదేశమున కరుదెంచిన ఆతని అనుయాయులలో టి-ఆవో-చిన్ అను నాతడు ఆర్యావర్త వైభవముచేతను, బౌద్ధధర్మానుపానముచేతను సమ్మోహితుడై పాటలీపుత్రమందే స్థిరనివాసి యయ్యెను. కాని వినయసూత్రములను తనమాతృదేశమునకు సంతరించిపెట్టుటయే ఫాహియాను ఆశయమగుటవలన, ఆత డేకాకిగనే భారతదేశమును వీడి మాతృభూమికి మరలి చనెను. ఆతని మతాభిమాన మెంతగాఢమైనదో, ఆతని దేశాభిమాన మంత ప్రబలమైనది. బౌద్ధశిక్షణ గ్రంథములు లేని తన దేశమునకు వాటిల్లిన కొరతను దీర్చుటకై ఫాహియాను ఆర్యావర్తమును చేరి, కృతకృత్యుడై, తత్కార్యసాఫల్యమున నాతడు మాతృభూమికి మరలిపోయెను. తిరుగుప్రయాణమున ఆతడు హుగ్లీ నదీముఖద్వారముకడ ఓడనెక్కి, సింహళమునకు పోయి, అచ్చట రెండేండ్లుగడపి, మరల నావనెక్కి చైనాకు వెడలిపోయెను. మార్గమధ్యమున సముద్రప్రయాణముచే ఆతనికి ప్రమాదము వాటిల్లగా పెక్కు శ్రమలకోర్చికొని పోవుచున్న అమూల్యగ్రంథములు సముద్రగర్భమున మునిగిపోవునేమో యని ఆతడు భీతిల్లెను. కాని బౌద్ధశ్రమణకుల యనుగ్రహము వలన నాగండము గడచి, ఆతడు మాతృదేశమును సురక్షితముగ చేరుకొనెను. ఒకానొక రచనయం దాతడు ప్రాచీన హైందవుల నౌకానిర్మాణ చాతుర్యమును, నౌకాయాన

నిర్వహణ కౌశలమును వేనోళ్ళ చాటినాడు

ఫాహియాను చైనాదేశమును జేరినపిమ్మట బుద్ధభద్రుడను ప్రఖ్యాత భారతీయ బౌద్ధపండితునితో కలిసి, తానార్యావర్తమునుండి గొనివచ్చిన సంస్కృతగ్రంథములను తన మాతృభాషలోనికనువదింప దొడగెను బుద్ధభద్రు డా కాలమున రాజ్యమేలిన చైనా సామ్రాజ్య విభునిచే నాహ్వానింపబడి యా దేశమునకు బోయినాడు ఫాహియాను తన యాత్రను ముగించుకొని చైనాదేశమును జేరునప్పటికి పండితవర్యుడు చైనా సార్వభౌముని యాస్థానమున నుండెను పూర్వ మిట్లు చైనా చక్రవర్తులచే నాహుతులై పెక్కండ్రు హైందవవిద్వాంసు లా దేశమును దర్శించుచుండిరి

ఫాహియాను భారతదేశమునుండి గొనివచ్చిన సంస్కృతగ్రంథముల అనువాదము ముగియకమునుపే, ఆతని యాయువు చెల్లిపోయినది తన ఎనుబదిరెండవయేట కింగ్ చౌ పట్టణమున సిన్ను అను నొక బౌద్ధసంఘారామమున ఫాహియాను అస్తమించెను

ఎనిమిది దీర్ఘవర్షము లుత్తర భారత, సింహళద్వీపము లందు గ్రుమ్మరి అచ్చటగాంచిన విశేషములను, ఆనాటి ఆర్యావర్తమందలి సాంఘిక, రాజకీయ, పారిశ్రామికవ్యవస్థలను సమగ్రముగ ఫాహియాను వర్ణించినాడు చరిత్రాధారము లంతగాలేని యా కాలపు భరతవర్ష చరిత్రనిర్మాణమున కీతని గ్రంథ మొక అమూల్య సాధనమైనది నాల్గవ శతాబ్దినాటి భారత నాగరికతా వైభవముల నితడు వేనోళ్ళ ప్రస్తుతించినాడు కాలవాహినిలోబడి మ్రగ్గిపోకుండ, ప్రాచీన భారత సభ్యతా చిహ్నములు భూలోకమున విస్మృతములై పోకుండ కాపాడి, ప్రాచ్య పాశ్చాత్య ప్రపంచములందు భరతఖండ మెట్టి యగ్రపీఠ మలంకరించినదో విశ్వమున కెరింగించి, ఒక్క భరతభూమికేగాక, నాగరిక ప్రపంచమునకెల్ల ఫాహియాను మహాశయుడు చిరస్మరణీయుడైనాడు

బొ వేం కు శ

## ఫిట్ జెరాల్డ్ ఎడ్వర్డ్.

పందొమ్మిదవ శతాబ్దియందు భావ విప్లవమును కొనివచ్చిన ఆంగ్ల మహాకవులలో ఫిట్ జెరాల్డ్ ఎడ్వర్డు ఒకడు ఈయన ఇంగ్లండు దేశము నందలి బ్రెడ్‌ఫీల్డ్ సఫక్ అను చావునందు క్రీ శ 1809 మార్చి 31 వ తేదీన జన్మించెను ఈతని తండ్రిపేరు జాన్ పర్ సెల్. ఫిట్ జెరాల్డ్ అను యువతిని పరిణయ మాడుటచే, తల్లియొక్క కుటుంబపు పేరిట కుమారుడు 'ఫిట్ జెరాల్డ్ ఎడ్వర్డు' అను నామముతో వ్యవహరింప బడుచుండెను

1816 నుండి 1821 సం॥ వరకు తన తల్లిదండ్రులు పారిస్ నగరములో ఉండవలసి వచ్చినప్పుడు, ఎడ్వర్డు ఇంగ్లండులోనే ఉండిపోయి, కేంబ్రిడ్జి యందలి ట్రినిటీ కళాశాలలో ఉన్నత విద్య నభ్యసించెను ఇచ్చట ఆతనికి థాకరే, డబ్ల్యు హెచ్ థాంప్సన్ మున్నగు ప్రసిద్ధ రచయితలతో స్నేహ మేర్పడెను విద్యార్థి దశలోనే ఫిట్జ్ రాల్డ్ ఎడ్వర్డు భావప్రధానమైన కవితను ఉపాసింప దొడగెను యూరపు ఖండమునందు ఆ కాలములో ఘటిల్లుచుండిన సాహిత్య విప్లవము కూడ ఆతని దృష్టిని ఆకర్షింపక పోలేదు

విద్యను పూర్తి చేసికొని, ఎడ్వర్డు 1830 లో పారిస్ నగరమునకు వెళ్ళి అచ్చట కొంతకాలము ప్రశాంతమైన జీవితమును గడపెను ప్రకృతి రామణీయకమును ప్రతిబింబించెడి పుష్పములు, రసాస్వాదనమునకు ఉపకరించెడి సంగీతము, హృదయాహ్లాదకరమైన సాహిత్యము ఆతనిని విశేషముగా ఆకర్షించు చుండెను

1835 లో ఎడ్వర్డునకు మహాకవి టెన్నిసన్‌తో పరిచయ మేర్పడెను ఆ పరిచయ భాగ్యమును పురస్కరించుకొని, ఎడ్వర్డు కవితా లోకమునందు క్రొత్త పుంతలను త్రొక్క నిశ్చయించు కొనెను 1842 లో ఆతనికి ఫ్రెంచి విప్లవ రచయిత యగు కార్లయిల్ తో స్నేహ మేర్పడెను సుప్రసిద్ధ కవులతో, పండితులతో సంబంధ మేర్పరచుకొన్న ఎడ్వర్డు లేఖినినుండి పుష్టికరమగు రచనలు వెలువడ సాగెను 'యుఫ్రెనార్' అను కావ్య మాతని ప్రథమ రచన దానిలో ఆతడు కేంబ్రిడ్జిలోని తన విద్యార్థి జీవితమును హృదయంగమముగా వర్ణించెను. ఆ రచన సంభాషణల రూపములో నడచెను

ఎడ్వర్డు రెండవ రచన 1852లో వెలువడెను దీని పేరు 'పొలోనియస్' ఇది యొక నైతిక సూక్తుల సంపుటి ఇందలి కొన్ని సూక్తులు ప్రాచీన ఆంగ్ల గ్రంథములనుండి గైకొన బడెను కొన్ని సూక్తులను ఎడ్వర్డు తనకు తానై సృష్టించెను ఈ గ్రంథము విశేషముగా జనాదరణము నొందెను తరువాత నాతడు తన దృష్టిని నాటకానువాదముల మీదికి సారించెను స్పెయిను భాషలో రచింప బడిన

'కాల్డెరాన్' అను ఆరు నాటకముల సంపుటిని ఎడ్వర్డు ఆంగ్ల భాషలోనికి స్వేచ్ఛగా అనువదించెను.

కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయమునందు సంస్కృతాధ్యాపకుడుగా పేరుగాంచిన ఇ బి కావెల్ అనునాతని ఉపదేశమును పురస్కరించుకొని ఎడ్వర్డు ప్రాచీన గ్రంథపఠనమునకు గడంగెను గుప్తనామముతో ఆతడు 1856 లో 'సాలమన్ అండ్ అబ్సల్' అను గేయ కావ్యమును రచించెను ఈ కావ్యము మిల్టన్ యొక్క కవితా ధోరణిలో నడచెనని పాఠకులు కొనియాడిరి

బ్రహ్మచర్య జీవితములో ఎడ్వర్డునకు సంపూర్ణత్వము గోచరింపక పోవుటచే, ఆతడు బెర్నార్డు బార్టన్ అను నొక కవికుమారిని పరిణయమాడి గృహస్థు డయ్యెను కాని దాంపత్య జీవితములో ఆత డాశించిన సుఖశాంతులు లభింపలేదు ఆతని భావములు ఆతని భార్యకు ఏమాత్రము నచ్చకుండెను దానితో భార్యాభర్త లిరువురు దాంపత్య జీవితమునకు విడాకులియ్యక తప్పలేదు

బహుభాషా కోవిదుడైన ఎడ్వర్డు పారసీక భాషను నేర్చుకొని, ఆ భాషయందు మహాకవియు, శాస్త్రజ్ఞుడునైన ఉమర్ ఖయాముచే రచింపబడిన 'రుబాయత్'ను గేయ రూపములో ఆంగ్లములోనికి అనువదించెను ఈ రచన మొదట ఎవ్వరిని ఎక్కువగా ఆకర్షింప లేదు అదియు కాక ఆతడు ఆ కావ్యకర్తగా తన పేరును ప్రకటించు కొనలేదు ఒక సంవత్సరము గడచిన పిమ్మట రూసెటి, స్విన్ బర్న్, లార్డుహాటన్ మున్నగు మహా రచయితలు ఎడ్వర్డు రచనయందలి గొప్పతనమును గుర్తించి, ఆతని రచనా ప్రాశస్త్యమును బాహ్య ప్రపంచమునకు ఎరుకపరచిరి దానితో ఎడ్వర్డు పేరు మహాకవి ప్రపంచములో ప్రతిధ్వనించెను

'రుబాయత్' గ్రంథములో ఉమర్ ఖయ్యాము ఆధ్యాత్మిక తత్త్వమునకు కాక, భౌతిక పరమైన సుఖములకు విశేష ప్రాధాన్య మిచ్చెను మానిని, మద్యము, కవిత - ఈ మూడును మానవునకు భూలోక స్వర్గమును ప్రసాదించుననియు, నిరాశకు, నిస్పృహకు లోనుగాక, మానవుడు పై మూడింటిని ఉపాసించి ఐహిక సుఖములను బడయవలయుననియు, ఉమర్ ఖయాము 'రుబాయత్'లో ప్రబోధించెను ఈ ప్రబోధము నందలి అంతరార్థము తనకు నచ్చుట వలననే కాని గ్రంథానువాదమునకు పూనుకొంట నని ఎడ్వర్డు తన ఉపోద్ఘాతములో తెలియ జేసెను ఎడ్వర్డు రచనలో మొదట డెబ్బదియైదు చతుష్పాద పద్యములు కలవు తరువాత అవి సంస్కరింపబడి విపులీకరణము నందినవి ఈ రచనలోని భాష, ప్రాస, మధురిమ పాకమున పడి ఎడ్వర్డునకు అంతర్జాతీయ ప్రశస్తిని ఆర్జించి పెట్టినవి ఇతనిచే విరచితమైన 'రుబాయత్' ఎన్నియో పర్యాయములు పునర్ముద్రణము నందినది

పిమ్మట ఎడ్వర్డు, జార్జిక్రాబ్ రచించిన గ్రంథములను అన్వయన మొనర్చి, వాటిని 'క్రాబ్ సూక్తులు' అను పేరుతో ఆంగ్లములోనికనువదించెను మానవుని నైతిక పునరుజ్జీవనమునకు ఈ సూక్తులెంతయు తోడ్పడునని పెద్దల అభిప్రాయము

సాహిత్య కార్యకలాపములలో అహర్నిశలు మునిగి తేలిన ఎడ్వర్డునకు సముద్రయాన మనిన కడు మక్కువ రచనలకు ఒక సంవత్సరముపాటు స్వస్తిచెప్పి, ఇతడు సముద్రయానము సలిపి, ప్రకృతి గర్భమందున్న వైచిత్ర్యములను తిలకించెను తన మనోరథ మీడేరినపిమ్మట ఎడ్వర్డు స్వస్థలము చేరి 1883 జూన్ పదునాల్గవ తేదీన నిద్రయందే ఎట్టి బాధయు నెరుగక శాశ్వతముగ కన్నుమూసెను బహుభాషా కోవిదుడై భాషావిప్లవమునకు వైతాళిక ప్రబోధము సల్పిన ఈ మహాకవికి శ్రద్ధాంజలు లర్పించుచు మహాకవి టెన్నిసన్ తన గ్రంథము నొకదానిని ఈతని దివ్యస్మృతికి అంకిత మిచ్చెను

మిత్రులకు ఎడ్వర్డు వ్రాసిన లేఖల లన్నిటిని కొన్ని సంపుటములుగా ఆల్డిస్ వైట్, ఎఫ్ ఆర్ బార్టన్ మొదలైనవారు ప్రచురించిరి. ఈ లేఖలు ఫిట్ జెరాల్డ్ ఎడ్వర్డు యొక్క ఆదర్శములను, ఆశయములను ప్రస్ఫుటము చేయుచున్నవి

ఇం. వే

## ఫిన్లాండు (భూగో)

ఫిన్లాండు ఒక స్వతంత్ర ప్రజాసత్తాక రాజ్యము ఇది $59^\circ - 48'$ నుండి $70^\circ - 7'$ ఉత్తర అక్షాంశమువరకును, $19^\circ - 2$ నుండి $31^\circ - 35$ ప్రాచ్యరేఖాంశమువరకును విస్తరించి యున్నది దీని ఉత్తర – దక్షిణముల నిడివి దాదాపు 700 మైళ్ళు నార్వేకును, ఫిన్లెండు సింధుశాఖకును నడుమ, యూరపు ఉత్తరభాగమం దీదేశము కలదు. స్వీడను, బాల్టిక్ సముద్రము, బోత్నిక్ సింధుశాఖయు పశ్చిమమున కలవు తూర్పున సోవియట్ రష్యా ఉత్తర దక్షిణములుగా విస్తరించి యున్నది

నైసర్గికస్థితి ఈ దేశము సమగ్రముగా దాదాపు పూర్వ కేంబ్రియను లేక బాల్టిక్ రక్షక ఫలకముమీద నున్నది, ఇది దాదాపు సమభూమి యని చెప్పదగినను. నడుమ నడుమ నున్న గుట్టలు చట్టులు, పొరలు పొరలుగా మడత పడినట్లగపడును అందు విశేషముగా మెతక రాళ్ళును, రూపాంతరము చెందిన సాధారణపు శిలలును, స్ఫటిక శిలలును, అగ్నిశిలలును కూడ కన్పట్టును నల్లరాయి సహిత మచ్చటచ్చట గోచరించును పైన పేర్కొనబడిన అస్తవ్యస్త ములగు ఈ ప్రాచీన పర్వతముల పొరలయొక్క ప్రభావ మచటి నైసర్గిక లక్షణములపై ప్రసరింపదు ప్రాచీన కాలమందేర్పడిన ఈ పొరలలో విశేష భాగము మంచుదిబ్బల రాపిడిచే ఒరసికొని పోయినవి అచ్చటచ్చట ప్రతిఘటింప జాలు విక్రాంతములును, కర్కశములునైన ఉన్నతోత్తు రాళ్ళు కాన్పించు చుండును పెక్కు ప్రాంతములలో గుండ్రము, నునుపునైన కొండల చుట్టును నదులు, సెలయేళ్ళు జాలు వారుచుండును నీటిచే నిండిన పల్లపు ప్రాంతములు మంచు నీటి సరస్సులవలె భాసిల్లును

మొత్తముమీద ఈ దేశ మంతగా ఎత్తుకాని పీఠభూమి యని చెప్పవచ్చును దీని సగటు ఎత్తు 400 నుండి 600 అడుగుల వరకుండును అచ్చటచ్చట కొన్ని మిట్టప్రదేశములు సముద్ర మట్టముపై 2000 అడుగుల ఎత్తున నుండును పల్లముగానున్న సముద్రతీరము శతాబ్దమునకు 3 అడుగుల చొప్పున ఎత్తు చేయబడు చున్నది ఉత్తర ప్రాంతపు నైసర్గిక స్థితులు దక్షిణమందలి నైసర్గిక స్థితులకంటె విశేషముగ భిన్నములై యున్నవి ఉత్తరమందలి నదీమండల నిర్మాణము సుస్పష్టముగ తీర్చి దిద్దబడినది మువోనియో, కెమీ, ఔలు జోకీ అనునవి ఇందలి ముఖ్య నదులు బోత్నియా సింధు శాఖకు తూర్పుగా మాన్‌సెల్కా పర్వతముల వరకు నేల ఎత్తుగా నుండును ఇచ్చట అనేక తావులలో భూమి సముద్ర మట్టముపై 1000 అడుగుల ఎత్తున నున్నది దక్షిణ దిశయందలి తలోపరి దృశ్యమున పెక్కు సరస్సులును అల్లిబిల్లిగ నుండు నదులును కలవు దేశములో దాదాపు 30 శాతము బురద నేలలలోను, చవిటి భూములలోను నిండి యున్నది నిట్టమై, చాపాకృతిగల హిమానీ ప్రవాహముల గట్టుల యందు కుడ్యములను బోలు శిలాశ్రేణులు దేశాంతర్భాగములో దాదాపు 400 మైళ్ళ దూరము వరకు సముద్ర తీరమునకు సమానాంతరముగా వ్యాపించి యున్నవి ఈ కుడ్యములకు లోతట్టున అనేక సరస్సులతో విరాజమానమైన భూమి కలదు ఈ దేశమునందు 60 వేల సరస్సులు గలవు అవి మొత్తము విస్తీర్ణములో 12 6 శాతము నాక్రమించినవి వాటిలో పెక్కు సరస్సులు మంచు నీటిచే ఏర్పడినవి పెక్కు తావులలోని సరస్సులను చిత్తడినేలలుగ మార్చి, వాటిని పచ్చిక బయళ్ళుగా అభివృద్ధి పరచి జనులు ఉపయోగించు కొనుచున్నారు ఇచ్చట తలోపరి దృశ్యమందు దిబ్బలు, సరస్సులు, అటవీ పరివృతమైన ఉపరితలము, నగ్నశిలా ప్రదేశములు, ఖాళీ స్థలములు కనిపించును సరోవర మండల జలము ఝరుల మూలముననను, పెద్ద నదుల మూలముననను బహిర్గత మగుచున్నది

ముఖ్యముగా దక్షిణమందలి తీరప్రాంతము హిమానీ నద కాలానంతరీయమును, సముద్ర సంబంధమునైన మట్టితో కప్పబడి యున్నది అచ్చటి నేల సారవంతమై వ్యవసాయ ప్రయోజనముల కొరకు బాగుగా ఉపయోగింప బడుచున్నది అందు పశుగ్రాసమే కాక, పంట పైరులును అభివృద్ధి దశలో నున్నవి పాడి పరిశ్రమ కూడా వికాసము చెందినది

చిత్రము 91

ఫిన్లాండు

**శీతోష్ణస్థితి** ఫిన్లాండు శీతోష్ణస్థితి సముద్రశీతోష్ణస్థితికి భూమండల శీతోష్ణస్థితికి మధ్యస్థమై యున్నది ఈదేశమందలి విశేషభాగము ఉత్తరధ్రువప్రాంతములో నున్నది ఆ ప్రాంతముపై అట్లాంటిక్ సముద్రపు ఉపశమన ప్రభావము ప్రసరింపదు అందుచే అచ్చటి శీతోష్ణస్థితులు ఇంగ్లండులోని ఆగ్నేయదిశ యందలి శీతోష్ణస్థితిని పోలియుండును జూను నెల మధ్యభాగమున ఆదేశమునందు శీతకాల లక్షణము లేర్పడును గ్రీష్మఋతువు జూను నెలలో ఆరంభమగుటతో, వర్షము లాగిపోవును జులై నెల మధ్యభాగమున ప్రకృతి సంపూర్ణ వికాసముచెంది మధుర సుగంధయుత పుష్పములతో నిండియుండును సెప్టెంబరు తొలిదశయందే వేసవి అంతమగును అంతట వర్షము లారంభించి నవంబరువరకు కురియును మంచుపడ నారంభించును మరల నొకసారి మనోహరమైన పరిస్థితు లేర్పడును తీవ్రముగనుండు చలికాలములో ఉష్ణోగ్రత దక్షిణమున 20 ఫా నుండి ఈశాన్యమున 10 ఫా వరకు తగ్గును సాలానా సగటువర్షపాతము 20 అంగుళములు చలికాలమున మంచు సాంద్రముగ కురియును నైఋతి దిక్కున ఓడరేవులు మంచుతో పేరుకొని పోవును కాని మంచుదిబ్బలను ఛేదించు యంత్రములసాయమున ఓడరేవులు తెరచియుంచబడుటచే ఓడప్రయాణము సుకరమగును యాత్రికులు దర్శించి ఆనందించుట కా ప్రాంతము శీతకాలములలో అనుకూలముగ నుండును ఈ ఋతువులో కలప నరకబడును ఇది వసంతకాలములో మంచు దిబ్బలు కరగినపుడు నీటిపై ఇతర ప్రాంతములకు తరలింపబడును

**అడవులు** సమశీతోష్ణ లక్షణముగల అడవులు ఈ దేశపు విస్తీర్ణములో 72.5 శాతము నాక్రమించి యున్నవి ఇంత విస్తీర్ణముగల అరణ్యములు యూరపుఖండమం దెచ్చటను లేవు ఈ అడవులలో ఆర్థిక, వాణిజ్యప్రాముఖ్యముగల పెక్కురకముల కలప కలదు కలపఎగుమతియందు ఈదేశము కెనడా తరువాతి స్థానము నాక్రమించుచున్నది కలప పుష్కలముగను, చౌకగను ఉత్పత్తియగు రష్యావలన ఈ దేశమునకు పోటీ ఏర్పడుచున్నది అయినను విశాలమైన అరణ్యము లుండుటచేతను, నరకబడిన అటవీప్రాంతములలో మరల అడవులు పెంచబడుటచేతను, చలికాలమున విశేషముగా మంచు కురియుటచేతను, చౌకపారుగా నీటి రవాణా మార్గములు లభించుటచేతను, విద్యుదుత్పత్తి చౌకగా ఘటిల్లుటచేతను, ఈ దేశములో అరణ్యముల పెంపుదలకు అవకాశము కల్గెను

**వ్యవసాయము** ఈదేశపు విస్తీర్ణములో 6 6 శాతము భూమియందుమాత్రమే వ్యవసాయము చేయబడుచున్నది దున్నినభూమిలో సగభాగమునందు ఎండుగడ్డియు మూడవవంతు భాగములో ఆహారధాన్యములును పండింపబడుచున్నవి చలికాలములో చిల్లర పనులయందు నిమగ్నులైన ప్రజలు వేసవిలో వ్యవసాయమునందు ప్రవేశించెదరు నైఋతి తీరమందలి పల్లపునేలలు, సరోవరతీరములందలి లోయలు, ప్రధానమైన వ్యవసాయభూములుగా నున్నవి ఇచ్చట ఉష్ణోగ్రత తక్కువగా నుండును, భూమికూడ సారవంతమైనది రై, యవలు, ఓట్లు, ఆలుగడ్డలు, ఎండుగడ్డి, ఫిన్లాండునందలి ప్రధానమైన పంటలు అల్పశీతోష్ణస్థితివలన గోధుమ ఉత్పత్తి కుంఠిత మగుచున్నది అయితే కొన్నితావులలో త్వరగా పండు గోధుమపంటలో అభివృద్ధి చేకూరుచున్నది ఉత్తరమున దీర్ఘతర గ్రీష్మఋతువు కారణముగా గోధుమ తక్కువకాలములో పండిపోవును దక్షిణమందు పైరు పెరుగుదలకాలము సాపేక్షముగా దీర్ఘతరమై యుండును ఇటీవల పాడికేంద్రములకు అధికప్రాధాన్య మేర్పడినది ఈ పరిశ్రమకు డెన్మార్కు పరిశ్రమకువలె ఉజ్జ్వలభవిష్యత్తు కలదు ఐరోపాయందలి పశ్చిమదేశములకు వెన్న విరివిగా ఎగుమతి చేయబడుచున్నది ఇచ్చటనుండి వెన్నను విశేషముగా దిగుమతి చేసికొను దేశములలో బ్రిటను ప్రధానమైనది

**ఖనిజములు** ఫిన్లాండులో ఖనిజసంపత్తు తక్కువ బొగ్గుగాని, నూనెగాని అచ్చట లభింపదు ముడిగంధకిత ఖనిజములు 4 శాతము రాగి, 28 శాతము గంధకము, 27 శాతము ఇనుము (యశదము, మణిశిల, వెండి, బంగారముతో కూడినది) మాత్రము ఒకటి రెండు తావులలో లభించును సున్నపురాయి, సబ్బురాయి, ఎర్రరాయి విస్తారముగా దొరకును కాని జలవిద్యుచ్ఛక్తి, అడవులు ప్రధానములైన ద్రవ్యాధారములుగా నున్నవి

**వస్తూత్పత్తులు** ఈదేశపు పారిశ్రామిక ప్రగతి ప్రధానముగా అటవీసంపదతోను, జలవిద్యుచ్ఛక్తితోను ముడిపడి యున్నది జనాభాలో 20 శాతము అటవీసంబంధ పరిశ్రమలలో నిమగ్నులై యున్నారు జల విద్యుదభివృద్ధి వలన ఫ్యాక్టరీ పరిశ్రమలకు ప్రోత్సాహము కలిగెను.

ఫిన్లాండు అంతర్భాగములో నున్న టాంపిర్ యొద్ద వస్త్రపరిశ్రమ అభివృద్ధి చెందినది

ప్రముఖస్థలములు హెల్‌సింకీ నగరము రాజధానిగను, ముఖ్యమైన రేవుస్థలముగను అభివృద్ధిచెందినది హెల్సింకీ తరువాత టుర్కో అనునది ప్రధాన పారిశ్రామిక మయిన రేవుప్రాంతముగా గణుతికెక్కినది సంవత్సరములో కొలది మాసములు హాంకో, టుర్కో అను నౌకాశ్రయస్థానములు మంచుతో పేరుకొనిపోవును కాని మంచుదిబ్బలను బ్రద్దలు చేయు యంత్రముల సాయముతో ఓడల రాకపోకలకు అవకాశము కల్పింప బడును

రహదారులు 1958 వ సంవత్సరములో 7,476 కిలో మీటర్ల రైల్వేమార్గము నిర్మింపబడియుండెను దానిద్వారా 16,848,000 టన్నుల సామానులు రవాణా చేయబడెను సరస్సులు రవాణాకొరకు ధారాళముగా ఉపయోగింప బడుచున్నవి అవి కొలది పొడవుగల కాలువలతో కలుపబడుచు, శాశ్వతమైన నీటి రహదారులుగా ఉపయోగపడుచున్నవి ఈ రహదారుల పొడవు దాదాపు 2700 మైళ్ళు ఉత్తర ఫిన్లాండులో రవాణామార్గములు విశేషముగా అభివృద్ధి చెందియుండలేదు మొత్తము దేశమంతటిలో 1958 వ సంవత్సరమునాటికి 68,460 కిలోమీటర్ల రోడ్డు నిర్మింపబడియుండెను విమాన మార్గములు హెల్సింకీ నుండి స్టాక్‌హోమ్ (స్వీడను రాజధాని), కోపెన్ హెగన్ (డెన్మార్కు రాజధాని), హామ్‌బర్గు (జర్మనీ), ఆమ్‌స్టర్డమ్ (బెల్జియము రాజధాని), పారిస్ (ఫ్రాన్సురాజధాని), లండను నగరములతోను, ఇతర ముఖ్య రాష్ట్రీయ పట్టణములతోను సంబంధములు కల్గియున్నవి

జనాభా 1951 వ సం లెక్కల ననుసరించి ఫిన్లాండు జనాభా 16,61,000 మంది జాత్యుద్భవమునుబట్టి ఈ జనాభా 1000 సంవత్సరములుగా ఫిన్నో-ఉగ్రియన్, ట్యుటానిక్ వంశీయుల సమ్మేళన పరిణామమే అని తెలియుచున్నది, జనాభాలో 91 25 శాతము వారు ఫిన్నిష్‌భాషను, 8 6 శాతము వారు స్వీడిష్‌భాషను మాట్లాడెదరు. లాప్స్ అను వారు అల్పసంఖ్యాకులుగా నున్నారు

ఒక చదరపు మైలుకు సగటు జనాభాసాంద్రత 31 మాత్రమే అయితే జనాభా వంపకము హెచ్చుతగ్గులుగా నున్నది. విశేషముగా తీరమందును, ప్రత్యేకముగా ఫిన్నిష్ సింధుశాఖ వెంబడియు జనసాంద్రత కేంద్రీకృతమై యున్నది. ఉత్తర భాగమందును, దక్షిణమున అంతర్భాగమందును జనసాంద్రత చాల స్వల్పము

జాతీయ క్రైస్తవ మతశాఖయైన ఎవాంజెలికల్ విభాగము, లూథరన్ మతవర్గమునకు చెందినది ప్రజలలో 96 శాతము వారు ఈ మతశాఖను అవలంబించిరి బాప్టిస్టులు రోమన్ క్యాథొలిక్కులు, యూదులు అను విభిన్న మతావలంబకులును కొలది సంఖ్యలో నున్నారు ఏ మతమునకును చెందనివారు 2 శాతమువా రున్నారు

విదేశవర్తకము ఫిన్లాండుకు స్వాతంత్ర్యము సిద్ధింపక పూర్వము ప్రధానముగా ఫిన్లాండుసరకులు రష్యాకు ఎగుమతి యగు చుండెడివి 1945 వ సం॥ పిమ్మట ఫిన్లాండు వాణిజ్యము పశ్చిమాభిముఖమైనది బ్రిటను, జర్మనీ దేశముల వారు ఫిన్లాండుతో శీఘ్రముగా వర్తకసంబంధములను పెంపొందించు కొనిరి కాని ఇపుడు ప్రధానముగా బ్రిటను, రష్యా దేశముల వారు ఫిన్లాండుతో ఎగుమతి దిగుమతి వ్యాపారములు చేసి కొనుచున్నారు దిగుమతిచేసికొనబడు ప్రధానమగు సరకులలో ముడిలోహములు, లోహపుసరకులు, యంత్రములు, ప్రయోగసాధనములు, నేతసరకులు, బొగ్గు, నూనె, ఆహారధాన్యములు పేర్కొనదగినవి కలప, కలపసామానులు, వెన్న, జున్ను, చర్మములు ఎగుమతులలో ముఖ్యములైనవి

చరిత్ర ఫిన్నిష్ సింధుశాఖయొక్క దక్షిణతీరము నుండి తరలి వెళ్ళి దేశాంతర్భాగములో ప్రప్రథమముగ కొన్ని తెగలవారు క్రీ శ 100 వ సం లో స్థిరనివాసముల నేర్పరచుకొనిరి క్రీ శ 700 నాటికి క్రమముగా నైఋతి దిశనుండి మరియొక ముఠావారు లడోగా సరస్సునకు తరలి పోయిరి అనంతరము, అచ్చట స్థిరపడిన జాతులవారు పరస్పరము యుద్ధమొనర్చుకొని, విశేషముగా నష్టపడిరి పిదప వారు క్రమముగా స్వీడను, రష్యాను రాజన్యులచే జయింపబడిరి అధిక సంఖ్యలో స్వీడను ప్రజలు అనంతరము ఫిన్లాండులో నివాసము లేర్పరచుకొనిరి క్రీ శ 1155 నుండి 1805 వరకు ఫిన్లాండులో సాగిన తమ రాజ్యపాలనములో 'అబో' నగరమును స్వీడన్ ప్రభువులు తమ రాజధానిగా చేసికొనిరి వారి కాలములలో క్రైస్తవ నాగరికత వ్యాప్తి చెందెను స్వీడను ఏలుబడిక్రింద ఫిన్లాండు 650 సంవత్సరములు దానిసత్వ మనుభవించెను 17 వ శతాబ్దిలో ఈదేశము చాలవరకు స్వాతంత్ర్యమును, శాసన సభాధికారమును సంపా

దించుకొనెను రాజకీయమైన ఒత్తిడికారణముగా స్వీడను ప్రభువులు ఫిన్లాండును రష్యాకప్పగించిరి 1917లో రష్యాలో జరిగిన బోల్షివిక్ విప్లవఫలితముగా 1920 లో నూతన సోవియట్ రష్యా ప్రభుత్వము ఫిన్లాండుపై తన రాజకీయాధికారమును సంపూర్ణముగా త్యజించి, దానికి స్వాతంత్ర్యము నిచ్చివైచెను 1920 లో ప్రవేశపెట్టబడిన రాజ్యాంగచట్టము ననుసరించి ఫిన్లాండుదేశ మొక ప్రజాసత్తాక రాజ్యముగా రూపొందెను ఈ దేశ మిపుడు ఐక్యరాజ్య సమితిలో సభ్యత్వము కలదై యున్నది

మ ఠ

## ఫిన్నిష్‌భాషా సారస్వతములు

దేశము ఫిన్లెండు దేశము యూరప్ ఖండముయొక్క ఉత్తరాగ్రమునం దున్నది ఉత్తరమున ఆర్కిటిక్ మహాసముద్రము, నార్వే దేశము, తూర్పున సోవియట్ రష్యా దేశము, దక్షిణమున ఫిన్లెండు గుడము, పడమట బోత్నియన్ గుడము, స్వీడన్ దేశము ఎల్లలుగా గలిగి, ఉత్తర దక్షిణములు మిక్కిలి పొడవుగల పీలికవలె ఫిన్లెండు వ్యాపించి యున్నది ఫిన్లెండు కాసారమయమైన దేశము అందు మొత్తము 16 329 చదరపు మైళ్ళ వైశాల్యము గల చిన్న, పెద్ద కాసారములు అరువదివేల వరకు గలవు మిగిలిన 1,34,812 చదరపు మైళ్ళ భూమిలో కొంత భాగము అడవులు, పర్వతములు పోగా తక్కిన భూమి ఇంచుమించుగా చిత్తడి నేలగా నుండును ఫిన్లెండు ప్రధాన నగరము హెల్‌సింకి అనునది

ఫిన్లెండు జనాభా సుమారు నలుబది లక్షలు వీరిలో లాప్పులు, స్వీడులు, రష్యనులు కూడ కలరు వ్యవసాయము వీరిప్రధానవృత్తియైనను, పేదరికము తాండవించుచుండును

భాష ఫిన్నిష్ భాష ఉరల్-ఆల్టేయిక్ భాషా కుటుంబము నందలి ఫినో-ఉగ్రియన్ తెగకు చెందినది ఫిన్నిష్ భాష పెక్కు యూరపియన్ భాషలకంటె భిన్నమైనది నామవాచకములకు 16 విభక్తి రూపము లుండుట ఇందలి విశేషము నామవాచకములముందు ఎట్టి ఆర్టికల్ కూడ ఉండదు. 'పోయ్‌కా' అనగా 'a boy' లేక 'the boy' అని యర్థము నామవాచకములందు. సర్వనామములందు లింగభేదము లేదు 'హాన్' అను పదమే వాడు, ఆమె అను నర్థముల నిచ్చును సాధారణముగా పదమునందలి తొలి యక్షరముమీద ఊనిక యుండును సంస్కృతాంధ్రములందు వలె వర్ణమాల యందలి యక్షరము లన్నియు ఎట్లు పలుకబడునో అట్లే వ్రాయబడును పదమునందలి వర్ణము లన్నియు ఉచ్చరింప బడును శుద్ధ స్వరములు ఎనిమిది కాక, మిశ్రమ స్వరములు పెక్కు కలవు రెండు స్వరములు అవ్యవహితముగా వ్రాయబడినచో, ఆ స్వరముయొక్క దీర్ఘతను ఏర్పడును ఫిన్నిష్ భాషయందు స్వీడిష్, రష్యన్ భాషల నుండి గ్రహింపబడిన పదములు పెక్కులు గలవు

సారస్వతము క్రీ శ 1835 వరకు ఫిన్నిష్ భాషలో సారస్వతము పుట్టలేదు ఏవో జానపద గీతములు, గాథలు ప్రచారమునందు ఉండినట్లు కనబడును మైకేల్ అగ్రికోలా (1510-57) అను క్రైస్తవమతగురువు 1542 లో ఫిన్నిష్ భాషా ప్రథమ వాచకమును తయారు చేసెను 1548 లో ఆయన 'న్యూటెస్టమెంటు'ను ఫిన్నిష్ భాషలోనికి అనువదించెను అతడు 1552 లో ఓల్డ్ టెస్టమెంటునందలి కొన్ని భాగములను కూడ అనువదించెను ఈ దేశము మొదటి నుండియు స్వీడిష్ జాత్యధికారమునకు లొంగి యుండుట వలన, ఫిన్నిష్ భాషా సారస్వతములు వర్ధిల్లుటకు అవకాశము లేకపోయెను విద్యావంతులు మాత్రమే స్వీడిష్ భాషా సారస్వతమును నేర్చిరి

1642 నాటికి ఫిన్నిష్ భాషలో బైబిల్ గ్రంథము సంపూర్ణముగా అనువదింపబడినది ఆ పిమ్మట షుమారు రెండువందల సంవత్సరముల కాలము ఫిన్నిష్ భాషలో వచ్చిన గ్రంథము లన్నియు మతమునకు సంబంధించినవే కావ్యములు పుట్టినను అవి స్వీడిష్ భాషయందే రచితములు

హెన్రిక్ గేబ్రియల్ పోర్థన్ (1739-1804) అనునాతడు ఫిన్నిష్ భాషా సాహిత్యముల అధ్యయనమున శ్రద్ధ వహించి పలువురకు ఆ విషయమునందు ఆసక్తి కలిగించెను అట్లు ఆసక్తి పొంది కృషి చేసినవారిలో మత్తియ్యాస్ అలెగ్జాండర్ కాస్ట్రెన్ అను నాతడు ముఖ్యుడు

1835 లో ఇలియస్ ల్యూన్రాట్ అను భాషాతత్త్వవేత్త 'కాలెవాలా' అను పేర ఒక ప్రాచీన గద్యపద్య సంకలనమును ప్రకటించెను ఇది ఫిన్నిష్ భాషా సాహిత్యములకు మహోదయము ఇది ఫిన్నిష్ జాతికి ఆదికావ్యముగా వెలసినది ఇందలి జానపద ఖండకావ్యములు, కావ్య ఖండములు ప్రజలను ఉత్తేజ పరచినవి, రచనాశక్తి గలవారికి మార్గము చూపినవి

1840 లో ల్యాన్రాట్ మరియొక పద్యసంకలనమును గూడ ప్రకటించెను 'కాంటెలెటార్' అను పేరుగల ఈగ్రంథము వ పెక్కు సుందరజానపద గేయములు కూర్పబడినవి జాక్రిస్ టోపెలియస్ అను నాతడుకూడ కొన్ని జానపదగీతములను, గాథలను సేకరించి ప్రకటించెను ఈసంకలన గ్రంథముల ప్రకటనము ప్రజలయందు జాతీయ భాషాసాహిత్య ప్రీతిని రేకెత్తించెను 1881 లో స్థాపింపబడిన ఫిన్నిష్ సాహిత్య సమితి, జాతీయ సాహిత్య నిర్మాణమునకు మిక్కిలి దోహదకారి యయ్యెను ఈవిధముగా ప్రారంభమైన ఫిన్నిష్ భాషాసాహిత్యముల అభ్యుదయము, ఫిన్ లెండుపై అధికారము నెరపుచుండిన స్వీడిష్ వారికి కన్నెర్ర యయ్యెను మత, ఆర్థిక విషయములకు దక్క అన్యవిషయములకు ముఖ్యముగా కావ్య, కథాసాహిత్యనిర్మాణమునకు ఫిన్నిష్ భాషను ఉపయోగింపరాదని నిషేధము చేయబడెను అయినను జాతీయభావావిష్టులయిన రచయితలు ఈ నిషేధమును తిరస్కరించి ఫిన్నిష్ భాషలో రచనలు చేయుచునే వచ్చిరి

జె వి స్నెల్మన్ అను తాత్త్వికుడు, రాజకీయవేత్త అయిన విద్వాంసుడు, జార్జి జకేరియస్ యూర్యో-కోస్కినెన్ అను చరిత్రకారుడు ఏ ఐ ఆహ్లక్విస్టు అను భాషాశాస్త్రవేత్త, జూలియస్ క్రోహన్ అను జానపద సాహిత్య ప్రియుడు—వీరందరు ఫిన్నిష్ భాషలో జాతీయసాహిత్య నిర్మాణము చేయుచునే యుండిరి చివరి ఇరువురు నూతన ఛందస్సులలో ఫిన్నిష్ భాషలో కవితా రచన కూడ చేసిరి

ఫిన్నిష్ భాషలో ప్రప్రథమ మహాకవియైన ఎలెక్సిస్ కివి ఈకాలమునందే అవతరించినాడు (1834-72) 'కాలెవాలా' అను సంకలనమునందలి యొక గాథను స్వీకరించి, ఈతడు 1864 లో 'కుల్లెర్వో' అను నాటకమును రచించెను అదే సంవత్సరమున 'ది హీత్ షూ-మేకర్సు' అను హాస్యరస రూపకమును వ్రాసెను 1870 లో 'ఏడుగురు సోదరులు' అను నవలను కూడ రచించినాడు ఇది కర్షక జీవితమును ఎంతో చక్కగా చిత్రించినది ఈ నవల పెక్కు ప్రపంచ భాషలలోనికి అనువదింపబడినది. సుకుమారమైన హాస్యము, ప్రగాఢమైన మానవత్వము, మధురాతిమధురమైన శైలి, నైతికమైన దృక్పథము కివి మహాకవి రచనయందలి ప్రధాన లక్షణములు వీటికితోడు మహత్తరమైన కల్పనాశక్తి ఆయన సొమ్ము ఆయన రచనలు ఫిన్నిష్ ప్రజల హృదయములను చూరగొన్నవన్నచో, ఆశ్చర్యమేమున్నది!

19 వ శతాబ్ది ఉత్తరభాగమున ఫిన్నిష్ సారస్వతము మీద ఫ్రాన్సు, నార్వే, స్వీడన్ సాహిత్యముల ప్రభావము పడినది రష్యన్ సాహిత్యప్రభావముకూడ కొంత కనబడినది యథార్థజీవితచిత్రణము ఆరంభమైనది ఈ మార్గమున రచనలు చేసినవారిలో మున్మొదట పేర్కొనదగినది మిన్నా కాంత్ అను మహిళ (1844-97) ఆమె సంఘసంస్కారప్రియ, గొప్ప నవలా రచయిత్రి, నాటక కర్త్రి పేదల జీవితముమీద ఆమెకు అభిమానముకలదు స్త్రీలకు జరగు అన్యాయములను ఆమె తీవ్రముగా ఖండించినది. ఆమె తన నాటకములలో చిత్రించిన పేదస్త్రీల జీవితములు ఈనాటికి గూడ యథార్థములుగా కనబడు చున్నవి

'కార్మికునిభార్య' అను నాటకములో (1885) దాంపత్యములో దారిద్ర్యములో మ్రగ్గిపోవుచున్న పేదలకు అన్యాయము చేయు నియమములను, ఆచారములను, వాటిని సమర్థించు ధనికవర్గములను ఆమె దుయ్యబట్టినది 'మతగురువు కుటుంబము' అను నాటకములో (1891) ఒక కుటుంబమునందలి కొన్ని తరములను చిత్రించి, భిన్నతరములవారి మధ్య జరగు సంఘర్షణములను, ఆచారదాసులైన వృద్ధులు ప్రగతిశీలురైన యువకుల స్వాతంత్ర్యములను అరికట్టిన విధమును ఆమె చక్కగా నిరూపించినది

ఈకాలమునందే కార్లో బెర్గ్బామ్ అను నతడు ఫిన్నిష్ జాతీయనాటకసమితిని స్థాపించెను పి ఇ కాయండర్ అను నాతడు షేక్స్పియర్ నాటకములను ఫిన్నిష్ భాషలోనికి అనువదించెను దీనితో ఫిన్నిష్ జాతీయ సంస్కృతికి, కళలకు చక్కని వికాసము కలిగినది

జుహానీ ఆహో (1861-1921) అను నాతడు సమకాలిక జీవితమును యథార్థముగా చిత్రించిన రచయితలలో పేర్కొనదగినవాడు చక్కని హాస్యము ఆయన రచనలకు ప్రాణము "మతగురువుకూతురు" "మతగురువు భార్య" అనునవి ఆయన ప్రఖ్యాత నవలలు చదువుకొనిన మధ్యతరగతి కుటుంబములందలి జీవితమును, ఈ నవలలు కన్నులకు గట్టినట్లు ప్రదర్శించినవి ఈయన రచించిన కథలు, యాత్రా విశేషములు, స్మృతులు, నాటకములు ఎనిమిది సంపుటములుగా ప్రకటించబడినవి

ఆర్విడ్ యార్నిఫెల్టు అను నవలా, నాటకరచయిత

మీద టాల్‌స్టాయ్ ప్రభావము అతిశయముగా కనబడు చున్నది ఈయన రచించిన 'మానవుల అదృష్టములు' 'జీవిత సాగరము', అను రెండు కథానికా సంపుటములు ఫిన్నిష్ సాహిత్యమున ఉత్తమస్థానముల నలంకరించినవి

జోహన్నెస్ విన్నసోక్కిస్కి అను నిగూఢ నామముతో గ్రంథరచనచేసిన రచయితయొక్క "రక్తారుణ కుసుమ గానము", "అజ్ఞాతవాసి" అను నవలలు శైలీసౌందర్యము నకు పేరుపొందినవి

ఫిన్నిష్ కర్షకజీవితమును చిత్రించు ఉత్తమరచనలు చేసిన వారిలో జోయెల్ లెహ్తోనెన్, ఇల్మారికియాంటో ప్రఖ్యాతులు

ఏ ఇ. యల్ ల్యూన్ భాం అను నాతడు ఫిన్నిష్ జాతిలో ఉత్తమ భావకవి తనయొక్కయు, తనజాతి యొక్కయు, సుఖదుఃఖాద్యావేశములను ఆయన చక్కగా వ్యాఖ్యానించినాడు "కాలతరంగాలు" (1899), "హెల్గా హిమ్ను" (1908) అను భావకవితాసంపుటములు ప్రకటించి నాడు

ఫిన్నిష్ సాహిత్యప్రపంచములో కివి, ఆహోల తరు వాత పేర్కొనదగిన మహారచయిత యఫ్ ఇ సిల్లన్‌పా 1939 లో ఆయనకు నోబెల్ బహుమతి లభించినది ఫిన్నిష్ ప్రజల జీవితమే ఆయన రచనలకు వస్తువు సమకాలిక జీవిత మును యథార్థముగా చిత్రించినప్పటికిని, ఆ జీవితమునందలి కళాసౌందర్యమును ప్రస్ఫుటీకరించుట ఆయన రచనలయందలి విలక్షణత. ఆయన రచనలలో "నిరాడంబర సంస్కృతి" (1919) "బాల్యంలోనే నిద్రపోయినది" (1931), "వేసవి రాత్రిలో ప్రజలు" (1935) అనునవి ఉత్తమమైనవి చివరి గ్రంథము భావసౌందర్యభరితమైనది

మహిళా రచయితలు పలువురు బయలుదేరుట ఫిన్నిష్ సారస్వతముయొక్క విశేషము చక్కని కథానికలు రచించిన ఐనో కల్లాస్ (1878-1956), నవలా రచయిత్రి మైలాటాల్విహెూ (1871-1951), హాస్యపూరితములైన కథా నికలు, నాటికలు రచించిన మేరియాజోటుని (1880-1948), ముఖ్యముగా పేర్కొనదగినవారు. జోటుని రచించిన 'క్లాస్' అను నాటకమునకు 1941 లో బహుమతి లభించినది యువ తరములో ఉత్తమ రచయిత్రిగా పేర్కొన దగినది ఈవా హూన్ పెట్టో.

ఫిన్నిష్ జాతీయోద్యమమునకు మిక్కిలి తోడ్పడిన రచయితలలో ఈనోలినోను (1870-1926) అను నాతనిని ముందుగా పేర్కొనవచ్చును ఫిన్నిష్ భాషా మహాకవులలో ఈయన స్థానము చాలా గొప్పది హెల్కావిర్సియా (1916) అనునాతని చారిత్రక కావ్యము వీరరసభరితమై, తీవ్రమైన జాతీయావేశముతో నిండియున్నది. అది బాలడ్ రూపములో ఉండి జాతీయతా ప్రచారమునకు ఎంతో ఉపకరించినది ఈయన డాంటేమహాకవియొక్క 'డివైన్ కామెడీ'ని ఫిన్నిష్ పద్యకావ్యముగా అనువదించినాడు 'ఒట్టోమాన్నినెన్' అను కవి హోమర్, మోలియర్, గెథే, ఇబ్సెన్ అను మహాకవుల గ్రంథాలను ఫిన్నిష్ భాషలోనికి అనువదించినాడు.

కార్లూ క్రాంసు, జుహానీసుల్లో, ఊనోకైలాస్ అను భావకవులుకూడా ఫిన్నిష్ జాతీయోద్యమమునకు చాల బలము చేకూర్చినారు

ఫిన్నిష్‌జాతియందు జన్మించియు స్వీడిష్ భాషయందే రచన సాగించిన మహాకవి జోహాన్ లడ్విగ్ రూనెబర్గ్ (1804-77) జాతీయభావ బంధురములయిన ఆయన గేయ ములు జగద్విఖ్యాతములు

పా మూ క

ఫిరదౌసి.

ఇరాను దేశమునకును, ఫారసీ సాహిత్యమునకును అపార గౌరవ ప్రతిష్ఠలు గడించిపెట్టిన మహాకవి ఫిరదౌసి అతని అసలుపేరు అబుల్ ఖాసిమ్ మన్సూర్ లేక అబుల్ ఖాసిమ్ హసన్ ఫిరదౌసి అనునది అతని ఛద్మనామము అతడు ఇరాను దేశమునందలి తుస్ ప్రాంతములోని షాదాబ్ అను గ్రామమున క్రీ శ 941 లో జన్మించెను గజనీ సుల్తా నులలో రెండవవాడగు ముహమ్మద్ ఇబ్నను బక్తగిన్ కాలములో, ఆ సుల్తాను ప్రేరణచే 60,000 పద్యములు గల 'షాహనామా' అను కావ్యమును అతడు రచించెను 'షాహనామా' సంస్కృత సాహిత్యములోని 'రాజతరంగిణి'తో సరిపోల్పదగిన కావ్యము

ఇరానులో ఆ దేశమును పరిపాలించిన రాజుల యొక్కయు, రాజవంశముల యొక్కయు, చరిత్రలను సేక రించి పెట్టుట పరిపాటిగా నుండెను క్రీ శ రెండవ శతా బ్దిలో అబ్దుల్లా ఇబ్నెముఖప్ఫా అను నాతడు ఆ చరిత్రలకు అరబ్బీ భాషలో నొక వరుసక్రమ మేర్పరచెను. సస్సైదువంశ

సంస్థాపకుడగు యాకూబ్ ఇబ్న్ లైత్ అనునాతడు దానిని పెంచి వ్రాసెను ముహమ్మదు ప్రవక్తకు సమకాలికుడగు నౌషేర్వాను అను రాజు కాలమున దహాఖాన్ దానీశ్వర్ అను కవీశ్వరుడు 'ఖోదైనామా' అను పేరిట ఆ సాహనామా కథలకు కావ్యరూప మొసగెను. క్రీ శ 976లో నూహ రాజ కుమారుని ఆస్థానకవీశ్వరుడగు దఖీకి మరియొక కావ్యమును రచించెను కాని వీటి అన్నింటి కన్నను మిన్నయైనది 'సాహనామా'

సుబుక్తగిన్ క్రీ శ 993 నుండి 1030 వరకు గజనీ నగరమును పరిపాలించెను అతను తన కోశాధ్యక్షుడగు ఖ్వాజా హసన్ మైమందీ ద్వారా ప్రతి వేయి పద్యములకు వేయి బంగారు మొహారీ లిచ్చు షరతుపై 'సాహనామా'ను వ్రాయుమని ఫిరదౌసీని ప్రేరేపించెను తన జన్మస్థానమగు తుస్ ప్రాంతమున గల నదికి ఆనకట్ట కట్టించి, ఆ ప్రాంతమును సస్యశ్యామలము చేయవలెనను తన చిన్ననాటి కోరిక ఫలింపగలదను ఆశతో ఫిరదౌసి 35 సంవత్సరములు కష్టించి క్రీ శ 1011 లో 60,000 పద్యములు గల 'సాహనామా'ను పూర్తిచేసి ఆ కావ్యమును అయాజ్ అనువాని ద్వారా సుల్తాను వద్దకు పంపెను.

ఈర్ష్యాపూరితుడైన కోశాధ్యక్షుడగు మైమందీ అనునాతడు 60,000 బంగారు నాణెములకు బదులు 60 వేల వెండి నాణెము లిచ్చిన చాలునని సుల్తానునకు నచ్చచెప్పెను చక్రవర్తి ఆదేశము ప్రకారము అయాజు 60,000 వెండి నాణెములను తీసికొని ఫిరదౌసి వద్దకు వెళ్ళెను తన ఆశా సౌధము నేలపై కూలగా, హృదయము వ్రయ్యలు కాగా, ఫిరదౌసి ఆ మొత్తమును ఇచ్చవచ్చినట్లు పంచిపెట్టి దేశమును వదలి వెళ్ళెను. వెళ్ళునపుడు సీలువేసిన కవరులో వ్యంగ్యాత్మకమగు నొక పద్యమును వ్రాసి, 20 దినముల తరువాత దానిని రాజున కిమ్మని అయాజుతో చెప్పెను. కానిన పుత్రుడును, నీచరక్త సంజాతుడును అగుటచే మహమ్మదు తన విలువను గుర్తించలేక పోయెనని దాని తాత్పర్యము ఆ వ్యంగ్యాత్మక పద్యమును చదివి సుల్తాను ఆగ్రహావేశమున ఫిరదౌసిని పట్టితెచ్చుటకై సైనికులను పంపెను కాని అప్పటికే ఫిరదౌసి దేశమును దాటి వెడలి పోయెను

ఫిరదౌసి తన దేశాటన సందర్భమున బగ్దాదులో, ఖలీఫా ఆస్థానములో నుండి ఖురానులోని కథ ఆధారముగా, 9 వేల పద్యములు గల 'యూసుఫ్ జులేఖా' అను కావ్యమును రచించెను కాని ఆ కావ్యమునకు 'సాహనామా'కు లభించిన ప్రసిద్ధి చేకూరలేదు

చివరకు క్రీ శ 1020 లో, 80 సంవత్సరముల వార్ధకమున నిస్పృహ, నిరాశాహతుడై ఫిరదౌసి స్వగ్రామములో జీవితమును చాలించెను విశ్వసాహిత్యములో తలమానికమగు 'సాహనామా' వంటి మహాకావ్య రచయిత యగు ఫిరదౌసి అతి దయనీయమగు పరిస్థితులలో మరణించెను అతని సమాధి వద్ద నమాజు చేయుటకు మొదట నిరాకరించిన రాజభక్తుడగు మౌల్వీ నాటిరాత్రి రాజలాంఛన చిహ్నితుడైన ఫిరదౌసిని స్వర్గమున గాంచి ఆశ్చర్యచకితుడై మరునాడు యథావిధిగా అతని సమాధివద్ద నమాజు చేసెనట

'సాహనామా' శైలి అలంకార సమంచితమై, ప్రసాదగుణభూషితమై, ఉత్కృష్ట కావ్యలక్షణ శోభితమై కన్పట్టును ఆ కావ్యములోని భావసౌందర్యము, వర్ణనసౌష్ఠవము, రచనా చాతుర్యము అపూర్వములు పాఠకుల హృదయములను కరగించుటలో 'సాహనామా' అసమానమైనది అనంతరీయ కవులపై 'సాహనామా' యొక్క ప్రభావమనంతము, ఫారసీ భాషలో 'సాహనామా' తరువాత, ఆ కావ్యము ఆధారముగా 'ఘర్ షాస్పనామా', 'సామానామా', 'జహంగీర్‌నామా', 'ఫరాముర్జ్‌నామా' మున్నగు కావ్యములు రచింపబడినవి. ఫారసీ సాహిత్యములో 'సాహనామా' స్థానము అద్వితీయము

సాహనామా మొట్టమొదట ఫ్రెంచి భాషలో 1866లో ప్రచురింపబడెను అటు పిమ్మట అది ప్రపంచములోని అన్ని భాషలలోను అనువదింప బడినది

రం శ్రీ శా

## ఫిలిప్పైను దీవులు (చ) :

పసిఫిక్ మహాసముద్రమున నెలకొనియున్న ద్వీపసమూహములు ఫిలిప్పైను దీవు లనబడుచున్నవి ఆసియా ఖండపు దక్షిణ తీరమును ఆనియున్న సముద్రము, స్పెయిను పాలకుడగు రెండవ ఫిలిప్ పేరిట 'ఫిలిప్పైన్' సముద్రమని పిలువ బడుచున్నది.

ఇందు గల సుమారు 7100 దీవులు దాదాపు 600 మైళ్ళ విస్తీర్ణము నాక్రమించి యున్నవి ఇవియే ఫిలిప్పైను దీవులు. ఇవి ఉత్తరమున $4^{\circ} 23'$ - $21^{\circ} 25'$ అక్షాంశమునకును,

తూర్పున 116-126° 30' రేఖాంశములకును నడుమ నున్నవి ఈ దీవులకు పశ్చిమ, ఉత్తర దిశలందు చైనా సముద్రమును, తూర్పున పసిఫిక్ మహాసముద్రమును ఉన్నవి, దక్షిణపు దిశ సెలిబిస్ సముద్రము చేతను, బోర్నియో తీర జలముల చేతను ఆవరింపబడి యున్నవి

ఇచ్చటి కాతికొట్టు భూమిని, ఉన్నత పర్వతములును, సాంద్రారణ్యములును ఆక్రమించి యున్నవి ఈ ద్వీప సముదాయము తొలుదొల్త స్పెయిన్ ప్రభుత్వాధీన మందును, పిమ్మట అమెరికా సంయుక్త రాష్ట్రప్రభుత్వము క్రిందను చాల కాలముండి 1946 వ సంవత్సరములో స్వతంత్ర రిపబ్లిక్కుగా అవతరించెను ఈ దీవు లన్నిటికిని మనిలా నగరము ప్రధాన రేవు కేంద్రముగను, రాజధానిగ గూడ వ్యవహరింప బడుచున్నది ఈ దీవులలో నెల్ల 'లూజన్' అనునది పెద్ద దీవి

ఫిలిప్పైను సముద్రమును గూర్చి ఫెర్డినాండ్ మాగిలన్ అను సాహసిక యాత్రికుడు తొలిసారిగా 1521 మార్చి నెలలో ఐరోపా వాసులకు తెలియజేసెను కాని ఈ దీవులకు చైనా వారితో వ్యాపారము క్రీ శ 10-13 శతాబ్దుల నడుమ నుండినట్లును సాధారణ సంబంధములు అంతకు పూర్వమునుండియే సాగుచుండినట్లును తెలియ వచ్చినది స్పెయిను వారిచే ఫిలిప్పైను భాషలో సృష్టింప బడిన అక్షరముల ఆకృతి వలన, ప్రజలు మాటాడు భాషల ఉచ్చారణములోను పదజాలములోను ఎక్కువ భాగము సంస్కృతభాషా లక్షణము లుండుటవలన, గీర్వాణభాషా కోవిదులగు హిందువుల ప్రభావము ఫిలిప్పైను ప్రజా సాంస్కృతిక విజ్ఞాన జీవితములపై విశేషముగా ప్రసరించినట్లు చెప్పకయే చెప్పుచున్నది క్రీస్తుశకపు తొలిశతాబ్దులలోనే హైందవ ప్రభావము మలయా, జావా, సుమత్రా మున్నగు ద్వీపముల ద్వారా ఫిలిప్పైనులపై పడినట్లు స్పష్టముగా కన్పట్టు చున్నది

ఇప్పటికిని ఈ దీవులలో ఆరని అగ్నిపర్వతము లనేకములు నిరంతరము నుండుచు, లావా అను లోహ ద్రవపదార్థమును వెలిగ్రక్కు చున్నవి ఈ లావానుండి ఏర్పడిన భూవైశాల్యము తక్కువ దైనను, దానిని గూడ వ్యవసాయ యోగ్యమైన దానినిగ మార్చి ప్రజలు తమ కవసరమగు వస్తుజాలమును ఉత్పత్తి చేసికొను చున్నారు కృషీవలులు పర్వత ప్రాంతమును సమతలముగా మార్చి, వరిని, జొన్నను, చెరకును, పొగాకును, అడవి అరటిని, హెంప్ అను నారను ఉత్పత్తి చేయుచున్నారు అరణ్యమయ పర్వత ప్రాంతములలో అనాగరికులైన ఆదిమవాసులు నివసించు చున్నారు

ఈ దీవులపై స్పెయిను ప్రభుత్వము పూర్వము నుండియు జరపుచు వచ్చిన పెక్కు దండయాత్రలలో 1564-72 సంవత్సరముల నడుమ చేసిన దండయాత్ర మిగుల ముఖ్యమైనదియు, యుక్తియుక్తమైనదిగ గూడ నున్నది "లగాజ్‌పి" అను వ్యక్తి క్రీ శ 1564 నవంబరులో స్పెయిను దేశమునుండి బయలుదేరి 1565 వ సంవత్సరం నాటికి 'సెబు' అను తావును చేరుకొని, ఆ సంవత్సరమే మే నెల ఆరంభములో అచ్చట ప్రప్రథమముగా స్థిరనివాస మేర్పరచుకొనెను కాని దీర్ఘకాలిక శత్రువులైన పోర్చుగీసువారు (బుడతకీచులు) అచ్చటనే యుండుట చేతను, తన చెంత వలసినన్ని సైన్యములు, ద్రవ్యసాధనములు లేనందునను, పానే అను ద్వీపమును అతడు సురక్షిత స్థలముగా నెంచి తన ప్రధాన సైనిక దళములను 1569 వ సంవత్సరములో అచ్చటికి తరలించెను అతడు మనిలా నగరమును తన వ్యవస్థా కేంద్రముగా నేర్పరచుకొనెను అప్పటినుండి విజయలక్ష్మి అతనిని వరించెను అతని మనుమడగు జుయాన్-డి-సాల్సిడో అనువాతడు అతని ప్రథమ విజయమునకు కారకుడైనాడు "మొరా" దీవులు తప్ప తక్కిన ద్వీపసముదాయ మంతయు స్పెయినునకు స్వాధీన మయ్యెను క్రీ శ 1572 లో స్పెయిన్ ఆధిపత్యమున మనిలా నగరము క్రమపద్ధతి ననుసరించి నిర్మాణము గావింప బడెను పిమ్మట 1574 లో మనిలాపై లిమా-హాంగ్ అను చైనీయుడు దాడి సల్పెను కాని సత్వరమే అతడు తన సేనలను ఉపసంహరించు కొనవలసిన వాడయ్యెను ఈ దీవుల నేలుచుండిన తాత్కాలిక గవర్నరు లనేకులు పాదరీ లగుటచే, స్పెయిను దేశీయులైన క్రైస్తవ మత గురువులు అత్యధిక సంఖ్యాకులైన సామాన్య ప్రజలను తమ మతానుయాయులనుగా నొనర్చుకొన గల్గిరి స్పెయిను జాతీయుల ప్రశాంత ప్రవర్తనముచే, ఫిలిప్పైను దేశీయులు వారిని నిరాటంకముగా తమలో లీనమొనర్చుకొనిరి తత్ఫలితముగా ఐరోపియనుల సాంస్కృతిక ముద్ర చెరగని రీతిగా వారిపై శాశ్వతముగా పడెను

తీరప్రాంతములలోను, లోతట్టు భాగములందును దాదాపు స్పెయినుపాలకు లడుగిడిన తావులన్నియు,

సునాయాసముగా వారికి హస్తగతము లైనవి కాని క్రీ. శ 1570 లో మనిలాపై ముస్లిముల తిరుగుబాటు తప్పని దయ్యెను లూజన్ యందలి ఇస్లాము మతప్రాబల్యము లొంగుబాటునకు రాదయ్యెను, మిండానా పరిస్థితులు వేరు విధముగ నుండెను, దక్షిణాది వాతావరణ మింకొక రీతిగా నుండెను స్పెయినువారు మహమ్మదీయులకు అగర్భ శత్రువులై యుండిరి ఫిలిప్పైను ముస్లిములకు వారు 'మోరో'లను నామమిడిరి ఇప్పటికిని వా రదేపేరుతో పిలువబడు చున్నారు ఇట్లుండగా 1574 లో రియోగ్రాండి-డి-మిండానా అను నాతనికి మోరోలు లొంగిపోయిరి అప్పటి గవర్నరు ఫ్రాన్సిస్కో-డి-సాండి అను నాతడు 1578-79 వరకు మోరోలకు వ్యతిరేకముగా పోరాటము సాగించుచునే యుండెను కాని స్పెయినువారి కెట్టి ప్రయోజనము సిద్ధింపలేదు ఈ విధముగా 1887 వరకు మోరోలు తమ దీర్ఘకాలిక దండయాత్రలను సాగించుచునే యుండిరి వారు తీరప్రదేశముల నన్నిటిని ధ్వంసమొనర్చి, మనిలా నగరమును గూడ రూపుమాపెదమని బెదరించిరి దచ్చివారు, మోరోలు ఐక్యము నొంది ప్రాచ్య సముద్రతీర ప్రాంతము నాక్రమించి, ప్రాబల్యము సంపాదించిరి ఇంతలో నార్సికో క్లవీరియా జెల్డువా అనునాతని ప్రభుత్వము అప్రతిహతమైన బలిమిని చేకూర్చుకొని బలాన్‌గ్వెన్‌గ్వి అను ద్వీపమును ప్రప్రథమముగా స్వాధీన మొనర్చుకొని, మోరోలపై తిరుగు లేని అపూర్వవిజయమును సాధించెను తదనంతరము 1850 లో అంటోనియో-డి-ఉర్‌బిజ్‌టాండో ఇగ్విియా ప్రభుత్వము టాకిల్ ద్వీపముపై మోరోల ఆధిపత్యమును నిర్మూలించి మరుసటి సంవత్సరమే జోలో నగరమును ముట్టడించి దానిని స్వాధీనపరచు కొనెను దీనితో మోరోల ప్రాబల్యము కూకటి వేళ్ళతో ధ్వంసమైనది

మాగిలన్, ఫిలిప్పైను దీవులను కనుగొనినప్పటినుండి మనిలానగరస్థాపనపర్యంతము పోర్చుగీసువారు, స్పెయినువా రాక్రమించుకొనిన దీవులపై తమకును హక్కు కలదని పోటీ పడిరి, తుదకు (1580-1840) స్పెయిను-పోర్చుగీసు సమాఖ్య మూలముననే వారి వైరుధ్యము అంతమొందినది

సర్ ఫ్రాన్సిస్ డ్రేక్ అను సాహసికుడు సముద్రయాన మొనర్చి ఫిలిప్పైనులలోని మిండానా అను స్థలమును చేరుకొనెను, 1587 లో థామస్ కావెండిష్ అనునాతడు మొలుక్కాస్ వరకు సముద్ర ప్రయాణము సాగించి, అక్కడినుండి "సాంటాఆనా" అను గొప్ప నౌకయొక్క రాక నడ్డగించుటకై కాలిఫోర్నియాకు తిరిగి వచ్చెను అప్పుడాతడు ఫిలిప్పైను దీవులకు వెళ్ళి ఇలాయిలో అను ఓడరేవు నాక్రమించుకొనుటకు వ్యర్థప్రయత్న మొనర్చెను ఈ సంఘటనానంతరము డచ్చివారు ప్రవేశించిరి ఇది యంతయు ఫిలిప్పైను ప్రాచీన చరిత్రకు సంబంధించిన గాథ

ఆధునిక యుగమున 1941 లో ఫిలిప్పైను దీవులు జపాను సైనిక దురాక్రమణమునకు గురి యయ్యెను. తన్మూలమున 10 లక్షల ఫిలిప్పైను ప్రజలు, 95% నౌకలు, 70% రవాణా పదార్థములు, 80% గనులు, 85% పంచదార ఉత్పత్తి, 65% కొబ్బరి నూనె, 25% ఇతర ఉత్పత్తులే కాక, బియ్యము, హెంపునార, పొగాకు, చేపల పరిశ్రమ (మొత్తము విలువ 11,70,00,000 డాలర్లు) నష్టమునకు గురియైనట్లు అంచనా వేయబడినది నివాస గృహములకు, రేవు సౌకర్యములకు, రాకపోకలకు అపార నష్టము కలిగినది. రాజకీయ కల్లోలముతో, ఆర్థిక సంక్షోభముతోపాటు, ప్రభుత్వము కమ్యూనిస్టు కుట్రలను తిరుగుబాటులను సహితము ఎదుర్కొనవలసి వచ్చెను తుదకు ఫిలిప్పైను అధ్యక్షుడగు క్విజాన్, తన మంత్రివర్గమును వెంట నిడికొని అమెరికాకు పలాయన మొనర్పవలసినవా డయ్యెను, 1944 లో అమెరికా సైన్యములు జనరల్ మెకార్థర్ నాయకత్వమున ఫిలిప్పైను దీవులలో ప్రవేశించి 1945 లో మనిలా నగరమునకును, అటు పిమ్మట దేశమంతటికిని జపాను దురాక్రమణనుండి విముక్తి కల్పించెను అధ్యక్షుడగు క్విజాను మరణింపగా, ఆస్మినా అనునాతడు నూతనాధ్యక్షు డయ్యెను 1946 ఏప్రిలు నెలలో జరిగిన ఎన్నికలయందు ఆస్మినా అపజయము పొందగా, రోహ్సాస్ అనునాతడు అదే సంవత్సరములో సర్వ స్వతంత్రమైన ఫిలిప్పైను రిపబ్లిక్కునకు ప్రథమాధ్యక్షు డయ్యెను

ఫిలిప్పైను దేశరక్షణ నిమిత్తమై సైనిక స్థావరము లను నెలకొల్పుటకు అధికార మొసగెడి ఒడంబడిక పత్రముపై అమెరికా, ఫిలిప్పైను ప్రభుత్వముల ప్రతినిధులు 1947 మార్చి నెలలో సంతకము చేసికొనిరి. 1948 లో జరిగిన రోహ్సాస్ మరణానంతరము క్విరినో నూతనాధ్యక్షు డయ్యెను ఫిలిప్పైను రాజ్యాంగ చట్టము భాషోఛ్ఛు అన్ని

అంశములలోను అమెరికా రాజ్యాంగ చట్టమును పోలి యున్నది రాజ్య నిర్వహణాధికారమంతయు దేశాధ్యక్షుడే వహించుచు, తనచే నియమింపబడు మంత్రివర్గముయొక్క సహకారమును పొందుచుండును దేశాధ్యక్షుడు నాల్గు సంవత్సరముల కొకసారి ప్రజలచే ఎన్నిక యగును శాసనాధికారమును చలాయించు పార్లమెంటు సభలో 124 మంది ప్రజా ప్రతినిధులు వ్యవహరించు చుందురు

ఆ పు

## ఫిషర్ ఎమిల్

ఎమిల్ ఫిషర్ అను శాస్త్రవేత్త 'కొలోన్' నగరమునకు సమీపముననున్న యూస్కిర్ షెన్ అను గ్రామములో 1852 అక్టోబరు 9వ తేదీన జన్మించెను ఐదుగురు అప్పచెల్లెంద్రకు కడగొట్టు తమ్ముడై నందున, ఇతడు గారాబముతో పెరిగెను ఇతని తండ్రియగు లారెంజ్ ఫిషర్ అనునతడు వ్యాపారదృష్టి కల వాడుగా నుండెను అతడొకవంక వ్యవసాయ పరికరములను స్వయముగా విక్రయించుచు, మరియొకవంక తన అన్న దమ్ములు నిర్వహించుచున్న బట్టలమిల్లులోను, ఇటిక ఆవము లోను, సారాబట్టీలలోను, వాటాలుగైకొని, ధనార్జనమే ప్రధాన లక్ష్యముగా వర్తించెడివాడు అందుచే ఫిషర్ చిన్న వయస్సుననే కలప వ్యాపారము చేయుచుండిన తన బావ మరదివద్ద శిక్షణమునకై కుదురుకొనవలసి వచ్చెను కాని అతని కా కలప వ్యాసంగము రుచింపలేదు ఫిషర్ దృష్టివిజ్ఞాన సముపార్జనముపై లగ్నమైనది.

అందుచే అతడు పరిశోధనాలయమును తన ఇంటివద్దనే ఏర్పరచుకొని, భౌతిక విజ్ఞాన శాస్త్రవిషయక ప్రయోగములను నిర్వహించు చుండెడివాడు ఆదినములలో రాసాయనిక పరిశ్రమలు ఎక్కువ లాభకరములుగా నుండెడివి. అందువలన, ఫిషర్ యొక్క వైజ్ఞానిక శాస్త్రాభిరుచిని అతని తండ్రి గమనించి, దానిని తన వ్యాపారదృక్పథముతో సమన్వయింప నిశ్చయించి, రసాయన శాస్త్రమును అభ్యసింపుమని కుమారుని ప్రోత్సహించెను తండ్రిసలహా ననుసరించి ఫిషర్, కెకులే, బేయర్ అను శాస్త్రవేత్తలవద్ద రసాయనశాస్త్రము నధ్యయన మొనర్చి, 1874లో పట్టభద్రుడాయెను అతరువాత బేయర్ వద్దనే ఫిషర్ కొంతకాలము పరిశోధనములను కొనసాగించుచు, అతనితోపాటు జర్మనీదేశమందలి మ్యూనిక్ నగరములో విశేషాధ్యయన మొనర్చి 1882లో ఎర్లాంగెన్ విశ్వవిద్యాలయమందును, 1885లో వుర్జ్‌బర్గ్ విశ్వవిద్యాలయమందును ఆచార్యపదవిని అలంకరించెను పదిసంవత్సరముల కాలములో ఫిషర్ రసాయన శాస్త్రములో పెక్కురు శిష్యులకు శిక్షణము నొసగి, వారిని తీర్చిదిద్ది, 1892లో బెర్లిన్ విశ్వవిద్యాలయమున రసాయన శాస్త్రాచార్యపదవిని, ఆ శాస్త్రవిషయక పరిశోధనా సంస్థకు ఆధిపత్యమును వహించి, అనితరసాధ్యమైన ప్రజ్ఞను ప్రదర్శించెను మొత్తము ముప్పదియైదు సంవత్సరములపాటు అతడు కష్టనిష్ఠురముల కోర్చి, తన ఆరోగ్యమును పణముగా నొడ్డుచు, స్వీయదేశ క్షేమమును కాంక్షించుచు శ్రమించి తుదకు 1919 జులై 14వ తేదీన 'వాన్సీ' అను గ్రామములోని స్వగృహమునందు స్వర్గస్థుడయ్యెను

బెంజీన్ అను శాస్త్రవేత్తయొక్క అణురచనా విన్యాసమును కెకులే శాస్త్రజ్ఞుడు 1865లో వివరించి యుండెను నాటినుండి అణురచనకు సంబంధించిన రాసాయనిక పదార్థముల విజ్ఞాన సేకరణమునకు కాలమనుకూలించెను. ఈ విజ్ఞాన సేకరణము చురుకుగా కొనసాగుచుండెను ఈ సేకరణ కృషిలో 1871లో, స్ట్రెకర్, రోమర్ అను శాస్త్రవేత్తలు, బెంజీన్ డయజోనియమ్ నైట్రేటును పొటాసియమ్ హైడ్రోజన్ సల్ఫైటుతో కలిపి, ఒకరసాయన యౌగికమును సిద్ధముచేసిరి అది జరిగిన నాలుగు సంవత్సరములకు, ఫిషర్ ఆయౌగికము మిశ్రమమని ఋజువుచేసి, దానినుండి ఫినైల్ హైడ్రోజనును వేరుచేసి, దాని రాసాయనిక స్వభావమును వివరించెను ఆ దినములలోనే తాను తయారుచేసిన ఫినైల్ హైడ్రోజిన్ ఆల్డిహైడ్ కీటు, గణాత్మక పదార్థములతో ఏరీతిగా సంశ్లేషణాత్మక రాసాయనిక చర్యలలో పాల్గొనునో అతడు వివరించెను కాని కార్యాంతర నిమగ్నుడగుటచే, 1888వ సంవత్సరము వరకు అతడు తన పరిశోధనముల ప్రాముఖ్యమును గుర్తింపనేలేదు తాను నిర్వహించిన రాసాయనిక క్రియలలో లభించిన పదార్థములకు హైడ్రోజనులను పేరును గూర్చియు, వాటి అణు రచనారీతుల వివరణమును గూర్చియు, ఫిషర్ 1888వ వరకు తలంపనేలేదు అతడు కూలంకషముగా చర్చించి, నిర్ణయించిన హైడ్రోజనుల అణురచనా విన్యాసమును శాస్త్రవేత్తలు యథాతథముగా ఆమోదించినారు ఫిషర్, ఫినైల్ హైడ్రోజనును ఉపయోగించి, కార్బొహైడ్రేటు పదార్థముయొక్క చక్కెరలయొక్క, అణురచనలను వెల్లడించెను. ఆపరిశోధనముల యొక్క వివరములుగాని, వాటియొక్క ఫలితములుగాని, జన

సామాన్యమును ఆకర్షించెడివికావు, అవి వారికి సులువుగా అవగత మయ్యెడివి కావు గ్లూకోజు, గాలక్టోజులను చక్కెర పదార్థములలో ఆరేసి కార్బను పరమాణువులున్న వనియు, అవి ఆల్డిహైడ్ గణాత్మకములనియు, అరాబినోజ్ అను పదార్థములో ఐదు కార్బను పరమాణువులుండుననియు, అదికూడ ఆల్డిహైడు గణాత్మకమేననియు, చెరకు, పంచదార, పాలచక్కెర, మాల్ట్ చక్కెర అనుపదార్థములలో రెండేసి హెక్సోజు చక్కెరలు సంయోగాత్మకములుగా నున్నవనియు, ఆరు కార్బను పరమాణువులున్న హెక్సోజు చక్కెరపదార్థముల అణువులలో 16 వేర్వేరు రకముల అణురచనలుండుననియు, ఫిషర్ జరపిన శాస్త్ర పరిశోధనమువలన రుజువైనది మొత్తముమీద చక్కెర పదార్థముల అణువిన్యాసమును వెల్లడించిన కీర్తియు, వాటిలో కొన్నిపదార్థములను శాలల్యములో రాసాయనికముగా సృష్టించిన కీర్తియు, ఫిషరునకే చెందగలవు ముఖ్యమైన ఆహారపదార్థముల రాసాయనిక అణువిన్యాసవిజ్ఞానము జీవరసాయనశాస్త్ర విజ్ఞానాభివృద్ధికి దోహదమయ్యెను. జీర్ణక్రియలలో ఏయే ఎంజైములు ఏయే కార్బొహైడ్రేటు పదార్థములను ఏయే రీతుల, మార్చుచున్నవో, అవగత మొనర్చుకొనుటకు ఈ శాస్త్రవేత్తయొక్క కృషి మూలకందమైనది

ఫిషర్ ప్రోటీనులను గురించియు, వాటినుండి లభించు ఎమినో ఆసిడులను గురించియు, 1899 నుండి కృషిచేయ మొదలిడెను ఎమినో ఆసిడు అణువులలో క్షారస్వభావమును వ్యక్తమొనర్చు ఎమినోగణమును ఆమ్లస్వభావమును వ్యక్తమొనర్చు కార్బాక్సిలిక్ గణమును కాంచగలము క్షారస్వభావమును మాటుపెట్టి, ఆల్కలాయిడులతో లవణీకరణము చేసి, ఫిషరును, అతని శిష్యులును ఎమినో ఆసిడులను కొంతవరకు వేరుచేయగల్గిరి వారు తమ పరిశోధనములలో మొదట పారా-నైట్రో బెంజోయిల్ క్లోరైడును, తరువాత నఫ్తలీన్ సల్ఫొనైల్ క్లోరైడును వినియోగించి, అత్యల్పద్రావణీయతా స్ఫటికాకృతిగల జన్యపదార్థములను తయారుచేయుట వలన కచ్చితముగా ఎమినో ఆసిడుల మిశ్రమమును వేరుచేయుట సాధ్యమైనది కార్బొహైడ్రేటు స్వభావ నిరూపణములో ఫినైల్ హైడ్రజీను తోడ్పడినంత విరివిగా కాకపోయినను, కొంతవరకు ప్రోటీనుల స్వభావనిరూపణములో బీటా నాఫ్తలిన్ సల్ఫొనైల్ క్లోరైడు, ఫిషరుకు చేదోడైనది. ప్రోటీనులతో జలాణువిశ్లేషణాత్మకలయక్రియను నిర్వర్తించినప్పుడు ఎమినో ఆసిడుల మిశ్రమము లభించును ఆమిశ్రమమును ఎస్టరీకరణమొనర్చి లభించిన ఎస్టరుల మిశ్రమమును ఆంశిక స్వేదన విధానము ననుసరించి, వేరుచేయు విధానమును ఈ శాస్త్రవేత్త రూపొందించెను అందువలన ఎడెస్టిన్, ఎలాస్టిన్, ఫైబ్రిన్, గ్లోబిన్, గ్లూటెన్, కెరటిన్, గ్రుడ్ల సొన, రక్తసారము, పాలు మొదలైన వాటినుండి లభించెడి ఆల్బుమినులు మున్నగు ప్రోటీనుల నిర్మాణమునకు ఉపయోగపడిన ఎమినో ఆసిడులను కూలంకషముగా పరిశోధించుట జరిగెను పట్టుపురుగు, సాలీడుల నిర్యాసరూపముగా లభించిన ఫైబ్రాయిన్, ప్రోటీనులను రెండింటిని ఫిషర్ శోధించి, ఆ రెండు జీవజాతులలో ఒకదానితో మరియొకదానికి ఆహారవిహారములలో ఎట్టిసంబంధము లేకున్నను, వాటి అణునిర్మాణములో వినియుక్తమైన ఎమినో ఆసిడులలో వ్యత్యాసము అంతగా లేదని విస్పష్టమొనర్చెను మడగాస్కర్ (ఆఫ్రికా) సాలీడులో గ్లూటమిక్ ఆసిడు తక్కువగాను, స్వచ్ఛమగు పట్టుదారములో అది ఎక్కువగాను ఉండుననియు, సెరిన్ అను ఎమినో ఆసిడు, సాలీడుదారమునుండిగాక పట్టుదారమునుండి మాత్రమే లభించుననియు, ఫిషర్ తెలిపియుండెను

ప్రోటీను అణువులయొక్క కల్పనపట్లకూడ ఫిషర్ శ్రద్ధవహించెను ఎమినో ఆసిడు అణువులు ఏ తీరున అంచెలు అంచెలుగా పరస్పర సంయోగము చెంది క్రమముగా పోలిపెప్టైడులుగాను, ప్రోటీనులుగాను మారునో అతడు వివరించెను 4 అలనీన్, 8 లూసీన్, 8 లైసీన్, 2 టైరోసీన్, 2 ఫినైల్ అలనీన్, 18 ఇతర ఎమినో ఆసిడు అణువులను—అనగా మొత్తము 32 అణువులను సంయోగించునట్లు అమర్చినప్పుడు $1.28 \times 10^{27}$ రకముల ప్రోటీను అణువులను తయారు చేసికొనవచ్చునని స్పష్టమగును ప్రోటీనులలోని వైవిధ్యమును, ప్రత్యేకతను స్పష్టముచేయుటకు ఈ వివరము సరిపోగలదు ఫిషర్ 1907 లో విశేషమగు ఓర్పుతో కృషిచేసి ఆక్టాడికా పెప్టైడును రసాయనికముగా కల్పన చేసి దానిలో 816 సమరూపములు ఉన్నవని వివరించి, ప్రోటీనుల రాసాయనిక కల్పనలోగల క్లేశములను స్పష్టమొనర్చెను

క్లిష్టమగు అణురచనా విన్యాసముగల పదార్థములలో ఎంజైములు ఎన్నదగినవి ఎంజైములకు, వాటి ఉపలబ్ధికై తోడ్పడు పదార్థములకు నడుమగల సంబంధమును గురించి కూడ ఫిషర్ శోధించెను ప్రోటీనులపై ఎంజైముచర్యలను

నిర్వహించి, పెప్టోనులకును, ఎమినో ఆసిడులకును మధ్యాంత
రముగా పోలి పెప్టైడులు లభించునని అతడు రుజువుచేసెను
జీవజాతులలో – అనగా మొక్కలలోను, జంతువులలోను
జీవకణరసములు, ధాతువులు, వేలాదిగా రాసాయనిక క్రియ
లలో పాల్గొనుచున్నవనియు, వాటిలో ప్రతిదానిని ఏదో ఒక
పదార్థము ఉత్తేజకరముగా నిర్వహించుననియు, 1837 లో
బెర్జిలియస్ అను శాస్త్రవేత్త సూచించెను ఆ సూచన ఫిషర్
పరిశోధించిన ఎంజైము క్రియలమూలమున ప్రయోగాత్మక
ముగా సత్యమని రుజువయ్యెను

ఫిషర్ పరిశోధించిన పదార్థములలో టానిన్‌లు కూడ
పరిగణింపబడవలసి యున్నవి కరక్కాయ, మాచికాయ
మున్నగు కసటు పదార్థములయందలి టానిన్‌లను గురించి
రసాయన శాస్త్రవేత్తలు 1852 వ సంవత్సరంనుండి శ్రద్ధ
వహించ సాగిరి స్ట్రెక్కర్ అనునాతడు మాచికాయలనుండి
లభించిన టానిన్ యొక్క అణుస్వరూపమును నిర్ణయించెను
దానిని జలాంశ విశ్లేషణాత్మక క్రియకు పాల్పరచి నప్పుడు
విరివిగా గాలిక్ ఆసిడు, అత్యల్పముగా గ్లూకోజు లభించు
చున్నవనియు, అందువలన ఆటానిన్ గ్లూకొసైడు కావచ్చు
ననియు ఆ శాస్త్రవేత్త సూచించెను మరికొందరు శాస్త్ర
వేత్తలు కాము ఆ ప్రయోగములనే నిర్వహించినప్పుడు
గ్లూకోజు ఈషన్మాత్రము కూడ లభింప లేదనియు, లభించినను
అది అత్యల్ప పదార్థము మాత్రమే ననియు, టానిన్‌లు
గ్లూకోసైడులను భావము సమర్థనీయము కాజాలదనియు,
వాదింప సాగిరి అర్ధశతాబ్దము కాలము గాలోటానిన్‌ల
రాసాయనిక స్వభావము అనిశ్చితముగనే యుండెను
1908 లో ఫిషర్ డైగాలిక్ ఆసిడును రాసాయనికముగా
సృష్టించెను అది స్ఫటికాకృతి కలదైనను, వగరుగానుండును
అందుచే అది కసటు పదార్థములైన టానిన్‌లలో మూల
పదార్థమై యుండవచ్చునని ఫిషర్ ఊహించెను 1912 లో
చైనాటానిన్‌ను అతడు స్వచ్ఛముగా తయారు చేసెను
అతడు తయారు చేసిన పదార్థము పోలరైజ్ అయిన కాంతి
తలమును ఎంత వంపు తిరుగునట్లు చేయునో పరిశీలించెను
ఆ లక్షణము నికరమైనదని తెలినపిమ్మట, అది నిర్యుక్త
మైనదని అతడు ధ్రువపరచు కొనెను తర్వాత దానిని
జలాంశ విశ్లేషణాత్మకలయక్రియకు పాల్పరచి, 8 శాతము
మాత్రమే గ్లూకోజు లభించెనని గుర్తించెను ఈ పరిశోధన

ములను ఆధారముగా గైకొని ఫిషర్, చైనాటానిన్ రాసా
యనికముగా గ్లూకోసైడు కాదనియు, డైగాలిక్ ఆసిడ్
లోని కార్బాక్సిల్ గణములు గ్లూకోజులోని హైడ్రాక్సి
గణములతో సంయోగించినప్పు డేర్పడు ఎస్టరు పదార్థ
మనియు తెలిపెను దాని అణురచనా విన్యాసమును వివరించి
దాని అణుభారము 1700 ఉండుననియు, దానినుండి జలాంశ
విశ్లేషణాత్మక రసాయన క్రియవలన లెక్కప్రకారము 10 6
శాతము గ్లూకోజు, విరివిగా గాలిక్ ఆసిడ్ లభించుననియు
అతడు సిద్ధాంతీకరించెను అంతేకాక, అతడు పెంటాగాలో
యిల్ గ్లూకోజును రాసాయనికముగా కల్పించి, దానిలో
గాలోటానిన్ యొక్క రుచి, ద్రావణీయత మొదలైన లక్షణ
ములు, పోలికలు వ్యక్తమగుచున్నవని అతడు రుజువుపరచెను
ఈ రీతిగా ఒక తరగతి టానిన్‌లయొక్క రాసాయనిక
స్వభావమును వెల్లడించి, అట్టి పదార్థములను మొదటిసారిగా
సృష్టించిన కీర్తి ఫిషరునకు దక్కెను

"ప్యూరిన్ జన్యపదార్థములు" అనునది ఫిషర్ తన
పరిశోధనములు సాగించిన మరొక ప్రఖ్యాతమైన శాఖ
యూరిక్ ఆసిడును గురించియు, దానితో జన్యజనక సంబం
ధముగల రసాయన పదార్థములను గురించియు, 1776 నుండి
ఎందరో శాస్త్రవేత్తలు పరిశోధనకృషి జరిపిరి వారందరి
కృషిని ఫిషర్ ఒక కొలికికి తెచ్చి చిరకీర్తిని సంపాదించు
కొనెను అతడు 1881 లో కెఫీనును విశ్లేషించి మెథిల్
కార్బామైడును, డైమెథిల్ అలోగ్జానును తయారు చేసెను
1914 లో థియోఫిల్లిన్ డి-గ్లుకొసైడ్ ఫాస్ఫారిక్ ఆసిడ్
అను న్యూక్లియొటైడును రాసాయనికముగా కల్పన చేసెను
ఈ 28 సంవత్సరముల మధ్యకాలములో ఫిషర్ చేసిన కృషి
మకుటాయమానమైనది 1900 నాటికే 130 వేర్వేరు పదార్థ
ముల రసాయన కల్పనమునకు, వాటినిగూర్చిన విజ్ఞానము
నకు ఈతని కృషి దారితీసెను యూరిక్ ఆసిడును పోలిన
పదార్థములకు ఆ అర్థము స్ఫూర్తి అగురీతిగా 'ప్యూరినులు'
అను పేరుపెట్టి ఫిషర్ తన కృషివలన క్రొత్త అధ్యాయ
మును తీర్చిదిద్దెను థియోఫిల్లిన్, కెఫీన్, డైఎథిల్ బార్బి
ట్యూరిక్ ఆసిడ్ (వెరొనాల్) మున్నగువాటి రసాయన
కల్పనా విధానములు ఎంతయు ప్రాముఖ్యము వహించు
చున్నవి ఈ మూడు పదార్థములు ఔషధములుగా వాసి
కెక్కినవి ఈ ఔషధద్రవ్యములను బోరింగర్, బేయర్ అను

శాస్త్రజ్ఞులు ఫ్యాక్టరీలలో ఫిషర్ యొక్క సూచనల ననుసరించి విరివిగా తయారు చేసిరి ఈ అంశమునకు సంబంధించి ఫిషర్ చేసిన కృషి, నూతన ఔషధముల కల్పనకే కాక, జీవకణములలో ఇమిడియున్న న్యూక్లియోటైడులు అను పదార్థములను గురించిన విజ్ఞాన వివరణమునకు కూడ తోడ్పడెను

ఫిషర్ కావించిన కృషి కేవలము శాస్త్రవిషయకమైన అంశములకే పరిమితము కాలేదు అది పారిశ్రామికాభివృద్ధికి కూడ తోడ్పడెను 1888 లోనే ఈతని బుద్ధిశైశిత్యమును గుర్తించి, బాడిషె కంపెనీవారు ఇతనిని తమ ఫ్యాక్టరీలో పరిశోధనములవిభాగమునకు 500 పౌనుల వేతనముపై డైరెక్టరుగా నుండవలసినదని ఆహ్వానించిరి ఆ ప్రలోభమును గ్రహించిన ఫిషర్, శాస్త్రవిషయక పరిశోధనలలో నిమగ్నుడై పారిశ్రామికాభివృద్ధికి ఉపాంగముగా విశేష సంఖ్యలో శాస్త్రవేత్తలను తర్ఫీదు చేసెను అంతేకాక తాను డాక్టరేటుడిగ్రీ కొరకు చేసిన కృషిలో ఫ్లోరెసిన్, ఆర్సినోల్ నుంచి లభించెడి థాలీనులపై తన దృష్టిని కేంద్రీకరించెను తర్వాత మ్యూనిక్ లోనున్నప్పుడు రోజానిలీను రంగులనుగురించియు, ట్రైఫినైల్ మిథీను రంగులకు మూలమైన పదార్థములను గురించియు ఇతడుకృషి యొనర్చి రంగుపదార్థముల పరిశ్రమకు కొంత చేయూత నొసగెను

మొదటి ప్రపంచయుద్ధము కారణముగా జర్మనీకి ఏర్పడిన సమస్యలు ఫిషరును పారిశ్రామిక పరిశోధనలవైపు ఆకర్షించినవి దేశభక్తి, ఇతర బాధ్యతలు అతని అవిరామకృషిని ప్రోత్సహించెను 1914 సెప్టెంబరులో తన దేశమందలి సురేకారపు నిల్వలు మరొక సంవత్సరమువరకుకంటె సరిపోవనియు, యుద్ధ కార్యకలాపములకు అత్యంతావశ్యకమైన నైట్రిక్ ఆసిడ్ తయారీకి మార్గాంతరము న్వేషింపవలసిన అగత్యమున్నదనియు, అతడు ప్రభుత్వమునకు సూచించెను ఆ సూచన ననుసరించి కోక్ దావెన్ల నుండి లభించిన అమ్మోనియాను నైట్రిక్ ఆసిడుగా మార్చెడి పారిశ్రామిక విధానములు రూపుదాల్చెను రెండు నెలల పిదప ప్రేలుడుపదార్థముల తయారీకి కావలసిన పొరతీరర్పారపు నిల్వలుకూడ హరించుచున్నవని అతడు గ్రహించి, దానికి ప్రత్యామ్నాయముగా డై మెథిల్, డై ఎథిల్ డైఫినైల్, కార్బామైడులను ఉపయోగించెడి అవకాశములుండెనని సూచించెను, కోల్ గ్యాసులో వాయురూపములినములుగా కలిసియుండు బెంజీను, టొలీనులను సేకరించెడి విధానములను, కోక్ ఓవెనులతీరునుండి ఫినోల్ క్రెసోలులను వేరుపరచెడి రీతిని, నాఫ్తలీనునుండి ఆంథ్రసీను తైలమును తయారుచేయు పద్ధతిని, ఇతడు సాధించి, ఆచరణలో పెట్టించెను సామాన్యముగా తైలపదార్థములనుండి సబ్బులను, గ్లిసరినును తయారుచేయుదురు గ్లిసరిను, విధ్వంసక్రియలకుపయోగపడు ప్రేలుడుపదార్థములను తయారుచేయుటకు అత్యంతావశ్యకమగు వస్తువు ఆహారపదార్థములుగా ఉపయోగపడు తైలములను ఆదాచేయుటకై గ్లిసరినుకు బదులుగా, రాసాయనికముగా కల్పించుటకు వీలైన గ్లైకాల్ అను పదార్థమును వాడుట యుక్తమని ఫిషర్ సూచించెను తత్ఫలితముగా ఒక క్రొత్తపరిశ్రమ ఏర్పాటుచేయబడినది అందులో గ్లైకాలునకు తోడుగా లభించిన ఆల్డిహైడ్-ఆల్కహాల్ ను వినియోగములోనికి తెచ్చి తైలపదార్థములకు సంబంధించిన ఆసిడులను, ఎస్టర్ మార్గరిన్ అను ఆహారపదార్థమును ఆతడు సృష్టించి, ఆహార సమస్యాపరిష్కారమునకు కొంతవరకు తోడ్పడెను ఎండుగడ్డిని, కలపను, గుర్రములు మొదలైన పశువులు జీర్ణించుకొనగలిగిన ఆహారపదార్థములుగా మార్చెడి విధానములను, కాయగూరలు కుళ్ళకుండ నిలువచేయు పద్ధతులను, కాఫీకి ప్రత్యామ్నాయముగా వాడుట కనువగు పదార్థముల కల్పనలను ఆహారయోగ్యమైన ఆల్బుమిన్ సహితపదార్థములను లూపిన్స్ యొక్క ఆహారయోగ్యతలనుగురించి ఫిషర్ పరిశోధన మొనర్చి యుద్ధజ్వాలలతో పరివేష్టింపబడిన జర్మనుదేశప్రజల ఆకలిమంటలను చల్లార్చుటకు ప్రయత్నించెను

బహుముఖ ప్రజ్ఞాశాలియైన ఈ జర్మనుశాస్త్రవేత్తకు రాయల్ సొసైటీవారు 1890 లో 'డేవీ' పతకమును బహూకరించిరి 1892 లో బ్రిటిష్ కెమికల్ సొసైటీయొక్క గౌరవసభ్యుడుగా ఎన్నుకొనబడెను 1902 లో రసాయనశాస్త్రపరిశోధనములకు నిర్దేశింపబడిన దత్తమయిన 'నోబెల్' బహుమానము ఈ శాస్త్రజ్ఞుని కీర్తికి చిరస్థాయిగా నొసగెను ఈతడు కావించిన కృషిప్రయోజనము నానాటికి వృద్ధిచెందుచున్నది

హూ ఆ

## ఫుట్ బాల్

ప్రాచీన గ్రీసుదేశీయులు, రోమనులు కాళ్ళతో తన్నెడి ఒక విధమైన బంతి ఆటను ఆడుచుండెడివారని చరిత్ర వలన

తెలియు చున్నది పదునాల్గవ శతాబ్దియందు ఈనాటి 'ఫుట్ బాల్' ఆటవంటి ఒక క్రీడావిశేషము వ్యవహారమం దున్నట్లును, 'గోలు'నకు, 'గోలు'నకు నడుమ మూడుమైళ్ళ దూర ముండెడిదనియు తెలియవచ్చు చున్నది అప్పటివారు నాలుగంగుళముల వ్యాసముగల కొయ్య బంతిని ఉపయోగించెడివారట ఇంగ్లండులో ఎలిజబెత్తురాణి పాలనమున తోలు బంతిని ఉపయోగించినట్లును, ఆనాటినుండి అదియే ప్రచారములోనికి వచ్చినట్లును తెలియుచున్నది 19వ శతాబ్ది ద్వితీయ భాగములో ఈ ఆటకు నియమ, నిబంధనము లేర్పడినవి అప్పటినుండి, అంతర్జాతీయ స్థాయిలో టెన్నిస్, క్రికెట్ ఆటలతోపాటు ఫుట్ బాలునకు గూడ గౌరవ స్థాన మేర్పడినది తొలుత ఇంగ్లండు ఈ ఆటయందు ప్రథమస్థాన మాక్రమించి యుండెను అటుపిమ్మట రష్యా, దక్షిణ అమెరికా, యుగోస్లేవియా, హంగరి, బల్గేరియా, పోలెండు దేశములు ప్రాముఖ్యము నొందినవి భారత దేశమును బ్రిటిష్ ప్రభుత్వము పాలించినపుడు ఈ ఆట ఇచ్చట ప్రచారమును బడసినది 1924 వ సంవత్సరములో భారతీయుల జట్టు తొలిసారిగా, విదేశ పర్యటనము గావించినది 1948 లో ప్రప్రథమముగా ఆజట్టు ప్రపంచ ఒలింపిక్ పందెములందు పాల్గొనినది విదేశీయులీ ఆటయందు బూట్లు ధరించి పాల్గొనెడివారు అయితే మన దేశమందు పెక్కురు ఆటగాండ్రకు బూట్లు ధరించి ఆడుట అలవాటుగా నుండెడిది కాదు కాని అది నుండి హైదరాబాదు జట్టు, ఆంగ్లో-ఇండియన్ జట్టు, విశాఖపట్టణమందలి పోర్టుట్రస్టు జట్టు బూట్లు ధరించియే ఈ ఆటను ఆడెడివి హైదరాబాదు జట్టు మొదటినుండి ఇప్పటి వరకు భారత దేశమందు ప్రథమశ్రేణికి చెందిన జట్టుగా పరిగణన పొందినది ఆసియా, అంతర్జాతీయ ఆటల పోటీలయందు పాల్గొన్న భారత జట్లలో, హైదరాబాదు ప్రతినిధులు విధిగా పాల్గొనుచు వచ్చిరి

ప్రక్కన గీయబడిన చిత్రములో ఫుట్ బాల్ క్రీడాస్థల విస్తీర్ణమును, అందలి పదకొండు ఆటగాండ్ర నిర్ణీత స్థలములను చూపబడినవి సామాన్యముగా ఈ ఆటను 110 గజముల పొడవు 70 గజముల వెడల్పుగల మైదానమునందుగాని,పచ్చికనేలపైగాని, జట్టు ఒకటికి పదునొకండు మంది చొప్పున ఆడుదురు. క్రీడారంగ మధ్యమున, చిత్రములో చూపినట్లు ప్రత్యర్థులైన రెండు జట్లవారు నిర్ణీత స్థలములో నిలచి




యుందురు చిత్తు గెలిచిన జట్టు ఆట ప్రారంభించును ఆట జరుగు మొత్తము కాలము ఒక గంట మొదటి అరగంట పూర్తి అయిన తరువాత 5 నిమిషముల విరామము ఆటగాండ్ర కియ్యబడును. రెండవ అరగంటలో పోటీచేయు జట్లు పార్శ్వములు మార్చుకొనెదరు నిర్ణయమైన ఒక గంట కాలములో ప్రతిపక్షముపై ఎవరు ఎక్కువ సంఖ్యగల గోలులు చేయగలరో, వారు పందెములో గెలిచినట్లు ప్రకటింపబడుదురు ఇరు పక్షములలో ఎవరును ఒక్క గోలుకూడ చేయజాలనిచో, అట్టి ఆట 'డ్రా' (అనగా సమానమైనట్లు) అని అనబడును అట్టి సందర్భములో ఉభయ పక్షముల అంగీకారముపై, క్రీడాకాలమును పొడిగించి, మరల ఆటను ఆడనిత్తురు

ఈ ఆటయందు బంతిని కాళ్ళతో కాని, తలతో కాని కొట్టవచ్చును, కాని గోల్ కీపరు తప్ప తక్కిన ఆటగాండ్రు దానిని చేతితో తాకరాదు మనిషిని మనిషి నెట్టుటగాని, కొట్టుటగాని చేయరాదు పందెపు ఆటలందు న్యాయము జరుగునట్లు చూచుటకు మధ్యవర్తులు నిర్ణయింప బడుదురు. ఆతడు ఫుట్ బాల్ ఆటయందలి మెలకువలు బాగుగా తెలిసి యుండి, నైపుణ్యము కలవాడై, న్యాయ పక్షపాతిగా నుండవలెను అంతియే కాక ఆట నియమము లాతనికి సాకల్యముగా తెలిసి యుండవలెను ఆ నియమముల ననుసరించి ఆట చివర ఆతడు విజేతలను నిర్ణయించు అధికారము కల్గి యుండును ఒక ఆటకాడు ప్రత్యర్థిని కొట్టినను, తన్నినను, త్రోసినను, అట్టి ఆట అక్రమమగు ఆటగా పరిగణించ బడును అట్లు అక్రమముగా ఆడువానిని మధ్యవర్తి హెచ్చరించు చుండును దానిని అలక్ష్యమొనర్చి, అక్రమమగు ఆటనే అతడు కొనసాగించిన యెడల, మధ్యవర్తికి ఆతనిని ఆటనుండి తొలగించు నధికారము కలదు

ఇరువదినాల్గు అడుగుల వెడల్పు, ఎనిమిది అడుగుల ఎత్తునుగల 'గోల్' అను పందెపు గుర్తుగల గమ్యస్థానము లోనికి ప్రత్యర్థి బంతిని తన్నిన యెడల, ఆతడొక 'గోలు'ను సాధించినట్లగును, గోలును సంరక్షించువాడు గోల్ కీపరు అనబడును ఆతనికి అండగా ఇరువురు ఫుల్ బ్యాక్స్, బంతిని గోలువరకు రానియ్యక ప్రత్యర్థిని ప్రతిఘటించు చుందురు వారికి అండగా, వారిముందు ముగ్గురు హాఫ్ బ్యాక్స్ వారి వారి స్థానములలో ప్రత్యర్థులను ఢీకొను చుందురు పైచెప్పిన ఆరుగురు ఒక రక్షణశ్రేణిగా వ్యవహరింతురు వీరికి ముందుండు అయిదుగురు ఆటగాండ్రను 'ఫార్వర్డ్ లైన్' అని యందురు ఈ అయిదుగురు ప్రత్యర్థుల గోలుపై దాడి చేయుచు, గోలును సాధించుటకు యత్నించు చుందురు

ప్రతి జట్టునందు వారి వారి అభిమతానుసారముగా ఆటలయందు ప్రత్యేకములైన దుస్తులు ధరించెదరు ఇవి భిన్నభిన్నములై ఆకర్షణీయములుగ నుండును

ఆటగాండ్రలో పరస్పర సహకారము, ఐక్యము అవసరము. ప్రత్యర్థుల గోలు వరకు బంతిని అంచెలవారిగా తన్నుకొనుచు, ప్రత్యర్థుల ప్రతిఘటనను వమ్ముచేయుచు, వారికి బంతిని చిక్కనీయక, వేరువేరు స్థానములలో నిలిచి యున్న స్వపక్షీయులకు బంతిని చాకచక్యముతో (తలతో కొట్టికూడ) అందించుచు, తుదకు గోలులోనికి బంతిని సూటిగా పాచెరిగి తుపాకి గుండువలె కొట్టుటయందు విశేషమగు నేర్పుండవలెను పరస్పర సహకారము తోడను, చాకచక్యము తోడను బంతిని ప్రతిపక్షమునకు చెందు ఫుల్ బ్యాకులను గూడ తప్పించుకొని గోలును సమీపించినను, తుది క్షణములో గాభరాపడి బంతిని గోలులోనికి కొట్టలేని స్థితికూడ సంభవించు చుండును అందుచే గాభరా చెందక బంతిని గోలులోనికి స్థైర్య, ప్రశాంతులతో కొట్టు నేర్పు కొందరు అలవరచు కొనెదరు అట్టి కీలక సమయములో, కీలక స్థానమందు అట్టి ఆటగాండ్రు సిద్ధముగ వేచి యుందురు

స్టాన్లీ మాథ్యూస్ అను బ్రిటిష్ దేశీయుడు తన 15వ ఏటనుండి ఫుట్ బాల్ ఆటయందు విశేష కృషిసల్పి, అసమానమైన ఆటకాడుగా ప్రపంచ మంతటిలో పేరుపొంది ప్రప్రథమముగా తన దేశమునకు గౌరవము తెచ్చెను ఇట్టివారు పెక్కు దేశములలో అనంతరము ఉద్భవించి ఈ ఆటను ప్రజారంజక మొనర్చిరి ఇట్టివారిలో భారత దేశమునకు చెందిన సైలన్ మన్నా, సమీర్ బెనర్జీ, తంగరాజ్, శంకరనారాయణ్, అబ్దుల్ రహమాన్, కెంపయ్య, నిఖిల్ కుమార్ నంది, ప్రదీప్ కుమార్ బెనర్జీ, కృష్ణచంద్రపాల్, వల్లభజోస్యుల కృష్ణమూర్తి, కృష్ణరావునాయుడు మున్నగువారు ప్రసిద్ధులు ఆంధ్ర రాష్ట్రములో ఒకప్పుడీ ఆట ఉచ్ఛస్థాయిలో నుండెడిది క్రమముగా క్షీణదశకు వచ్చిన ఈ ఆటను పునరుద్ధరించుటకు, ఆంధ్ర ప్రదేశముతోపాటు, అన్ని రాష్ట్రములలో విశేష కృషి జరుగుచున్నది. క్రీడారంగమును ఇతోధికముగా విశిష్ట పింప జేయుటకు వేరువేరు శాఖలయందు క్రీడా సంస్థలు స్థాపింప బడినవి

కొ వ

ఫెర్మా.

ఫెర్మా పండితుడు ఫ్రాన్సుదేశమందలి మోంటన్ బెన్ అను నగరములో క్రీ శ 1601 వ సంవత్సరమున జన్మించి 1665 వ సం॥ జనవరి 12 వ తేదీన కాస్ట్రెస్ నగరములో మృతి చెందెను

ఫెర్మా ఒక తోళ్ళవర్తకుని కుమారుడు అతడు ప్రాథమిక విద్యను ఇంటివద్దనే నేర్చుకొనెను 1631 వ సం॥ లో న్యాయశాస్త్రమున పట్టభద్రుడయ్యెను. అనంతర మాతనికి టూలోన్ నగరములో కౌన్సిలరు పదవి లభ్యమయ్యెను.

న్యాయబుద్ధితో తన కర్తవ్యమును నెరవేర్చువాడను ప్రసిద్ధి అతడు బడసెను

తన అభిమాన విషయముగా ఫెర్మా తీరికసమయము లందు గణితశాస్త్రాధ్యయన మొనర్ప నుద్యమించెను ఈ గణితశాస్త్రాధ్యయన వ్యగ్రత, అతడు ఇతరులతో కలిసి మెలిసి యుండక ఏకాకిగా నుండుటకు గల కారణములలో ఒకటి గణిత మాతని అభిమాన విషయము దాని నతడు మిగుల శ్రద్ధాభక్తులతో అధ్యయన మొనర్చుచుండువాడు ఆ కాల మున లోకమునకు విదితమై యుండిన సకల గణితశాస్త్రీయ శాఖలపై ఫెర్మా తన ప్రతిభాముద్రను వైచెను

ఫెర్మా జీవితకాలములో అతని ప్రధానరచన లేవ్వి యును ముద్రింపబడి యుండలేదు అతడు కనిపెట్టిన విష యము లన్నియు ఆత డధ్యయన మొనర్చిన పుస్తకముల పుటల అంచులయందు వ్రాసికొనినవే, అంతేకాక, ఆత డప్పు డప్పుడు కాగితపుముక్కలు మున్నగు వాటిపైగూడ వ్రాసి కొనిన పరిశీలనములును గలవు ఇవన్నియు అతని మరణా నంతరమే సేకరింపబడి పండితులచే అధికారికముగా నమోదు చేయబడినవి అతడు రచించిన సిద్ధాంతములు తరచుగా వాటికి సరియగు ఉపపత్తులు చూపబడకయే విడిచివేయబడినవి అయితే వాటిలో కొన్నిటికి క్రమమైన వివరణములను ఆయిలర్, లగ్రాంజ్ అను విద్వాంసులు సమకూర్చియుంచిరి

సంఖ్యాశాస్త్ర సిద్ధాంతము, జ్యామితిశాస్త్రము, సంభా వ్యతా సిద్ధాంతము అను వాటిని అధికరించి ఫెర్మాకావించిన పరిశీలనములకు శాశ్వత ప్రయోజనము కలదు పై మూడు విషయములలోను సంఖ్యాశాస్త్ర సిద్ధాంత మాతనికి అత్యం తాభిమానవిషయమై యున్నట్లు కనిపించును

ఈ పండితుడు సాధించిన సుప్రసిద్ధ ఫలితములలో కొన్ని ఈ దిగువ సంగ్రహింపబడినవి.

(1) $a^{\phi(n)}-1 \equiv 0$ (mod $n$) ఇందు $a$ అనునది $n$ అనుదానికి ప్రైమ్ అనగా $n$ చే అవిభాజ్యమై యున్నది మరియు $n$ అనునది $n$ కంటె తక్కువైనట్టియు, దానిచే అవిభాజ్యమైనట్టియు నొక పూర్ణాంకముల సంఖ్యయై యున్నది

(2) డియోఫాంటస్ ప్రతిపాదించిన ప్రమేయోప సిద్ధాంతము యొక్క వివరణమును, ఉపపత్తిని ఫెర్మా ఇట్లు వివరించెను —

రెండు పూర్ణాంకముల యొక్క సమచతురస్రముల మొత్తము $4n-1$ అనురూపములో నుండజాలదు సమచతు రస్రము యొక్క గుణకార లబ్ధమును $4n-1$ అను రూపము యొక్క అవిభాజ్యమును ఒక సమచతురస్రముగగాని, రెండు సమచతురస్రముల యొక్క మొత్తముగాగాని ఉండుట సంభ వము కాదు $a$ అనునది $b$ అనుదానికి అవిభాజ్య మగు చుండగా $a^2+b^2$ అను రూపము యొక్క సంఖ్య $(4n-1)$ అను రూపము యొక్క ప్రైమ్‌చే విభాగింపబడజాలదని అతడు చెప్పెను

(3) $a^2+b^2=c^2$ అగునట్లుగా $a, b, c$ లు పూర్ణాం కములైనచో, అట్టిస్థితియందు $ab$ సమచతురస్రము కాజాల దని ఫెర్మా వచించెను దీనిని లగ్రాంజ్ పండితుడు వివరించి యుండెను

(4) $n$ అనునది అసమచతురస్ర పూర్ణాంక మగు చుండగా $nx^2+1=y^2$ అను సమీకరణమునకు పూర్ణాంక ములలో అపరిమిత సంఖ్యాకములైన వివరణములు కలవని ఫెర్మా సూచించెను వీటికికూడ వివరణములను లగ్రాంజ్ పండితుడే సమకూర్చెను. దీనిని ప్రప్రథమమున పేర్కొనిన వాడు ఫెర్మాకాదు ప్రాచీన హైందవ గణితశాస్త్రవేత్తలు పూర్ణవివరములు అసంఖ్యాకములుగ నున్నదని వివరించి యుండిరి

(5) $n$ అనునది 2 కంటె పెద్దదై యుండగా, $x^n+y^n=z^n$ అను సమీకరణమునకు $x, y, z$ యొక్క పూర్ణమూల్యములు తుల్యములు కావని అతడు కనుగొనెను ఈ ప్రమేయోపపాద్య సిద్ధాంతము ఫెర్మా రచించిన తుది సిద్ధాంతముగా సర్వత్ర విదితమైనది

విశ్లేషణ ప్రక్రియను, అత్యల్పాణుసిద్ధాంతమును విని యోగించుటద్వారా ఫెర్మాపండితుడు జ్యామితిశాస్త్రమునకు మహోపకార మొనర్చినవాడాయెను డికార్టే పండితుడు రచించిన 'జ్యామెట్రిక్' అను గ్రంథమును చదువుటకుమున్నే ఫెర్మా వైశ్లేషిక జ్యామితి మూలసూత్రముల సమాలోచన మును స్వతంత్రముగనే కావించెను మరియు వక్రరేఖయొక్క ధర్మములన్నియు, వాటి సమీకరణములనుండి ఊహింపబడ గలవని ఫెర్మా కనుగొనెను వాటి నాతడు విశిష్టధర్మములని వచించెను వక్రరేఖలకును, క్షేత్రకలనములకును గరిష్ఠత్వ—అల్ప

ష్ఠత్వములకును స్పర్శరేఖలను నిర్ణయించుటయందు, అతడు అత్యల్పాణుశాస్త్రసిద్ధాంతములను అనువర్తింపజేసెను ఎట్టి వక్రరేఖయొక్క గరిష్ఠత్వ-అల్పిష్ఠత్వములను కనుగొనుట యందైనను అత డొక విస్పష్టమగు పద్ధతి నవలంబించెను $X$ మరియు $X_e$ అను కోటిభుజములు కల రెండు బిందువులకు వక్రకోటులను ఫెర్మాపండితుడు సమరేఖలను తుల్యములుగా జేసి అండవృత్తమునకును, మరికొన్ని వక్రరేఖలకును ఉపస్పర్శరేఖను కనుగొనెను అయితే యథార్థమును విచారించగా, ఉపస్పర్శరేఖలను కనుగొను సామాన్యపద్ధతి ఇదియేనని ఫెర్మా తెలిసికొనియుండలేదు ఏ క్రమమునకు చెందిన పరవలయములయొక్కగాని, లేక అతిపరవలయములయొక్కగాని వైశాల్యములను కనుగొని, సామాన్య వక్రరేఖల రాశికేంద్రములనుగూడ అతడు నిర్ణయింపగలిగెడివాడు

పాస్కల్ యొక్క సహకారములతో ఫెర్మాపండితుడు సంభావ్యతా సిద్ధాంతమును అధికరించి కావించిన పరిశీలనమే అత్యంత సుప్రసిద్ధమయిన రచనగా ఎన్నదగినది ఫెర్మా ఈ సిద్ధాంతమును అంకయోగ సిద్ధాంతమును ఉపయోగించి అభివృద్ధి పరచెను ఆత డీసమస్యలనుగూర్చి పాస్కలుతో చర్చించియుండెను ఫెర్మాపండితుడు సంభావ్యతా సిద్ధాంత తత్త్వములను గూర్చి విస్పష్టమైన అభిప్రాయములు కలిగియుండెను అవి, పిదప శాస్త్రజ్ఞులచే క్రమమైనవిగా గ్రహింపబడినవి పాస్కల్ ప్రతిభాశాలియైనను ఆతడు గావించిన పరిశీలనము లన్నియు క్రమమైనవి కావను అభిప్రాయము గూడ కొందరిలో నుండెను

సంఖ్యాశాస్త్రి సిద్ధాంతములను,గణితశాస్త్రోపశాఖలను అధికరించి ఫెర్మారచించిన గ్రంథములు అత్యుత్తమశ్రేణికి చెందియున్నవి

వి కే

## ఫొనీషియా (చ)

ప్రపంచమునందలి ప్రసిద్ధ ప్రాచీన జాతులలో ఫొనీషియా జాతి ఒకటి ఈ జాతివారి దేశము మిక్కిలి చిన్నది జనసంఖ్య అల్పము అయినను వీరనేక రంగములలో గొప్ప విఖ్యాతిని సాధించిరి వీరు గొప్ప నావికులుగను, వ్యాపారస్థులుగను, ప్రఖ్యాతి వడసిరి. ఆధునిక యుగమునందు బ్రిటిషు జాతివారు సముద్రాధిపత్యమును సాధించినట్లే, ఆ ప్రాచీన యుగమున ఫొనీషియనులు నౌకాయానమునందు ద్వితీయమగు స్థానము నాక్రమించి యుండిరి వీరు శిల్పకళయందును చేతి పనులందును కూడ ప్రసిద్ధి గాంచిరి వర్తక వ్యాపారము అందు నిమగ్నులగు జాతులవారం-రును కూడ శాంతి ప్రియులుగ నుందురు అట్లే ఫొనీషియా జాతివారు కూడ శాంతికాములు కాని శత్రువు తమపై అకారణముగ దౌర్జన్యము సాగించిన పక్షమున, వారు దేవతలు కూడ హర్షించ దగిన ధైర్య పరాక్రమములతో యుద్ధము సాగించెడివారు వారి చరిత్రము విజ్ఞానప్రియుల కెల్లరకును హృద్యముగ నుండ గలదు

మధ్యధరా సముద్రముయొక్క తూర్పు కొనయందు ప్రాచీనమగు ఫొనీషియా దేశము నెలకొని యుండెను ఇచ్చట ఖర్జూర వృక్షములు విస్తారముగ పెరిగెడివి అందువలన గ్రీకులును, రోమకజాతివారును, ఈ దేశమును ఫొనీషియా లేక ఖర్జూర వృక్షముల దేశమని వ్యవహరించెడివారు ఈ రాష్ట్రముయొక్క పొడవు రెండు నూర్ల మైళ్లు అతి విశాలముగ నున్న ఉత్తర ప్రాంతమున నీ భూభాగము వెడల్పు ముప్పదియైదు మైళ్ళు దక్షిణ భాగమున ఫొనీషియా దేశము రెండుమైళ్ళ వెడల్పుగ నుండును ఈ దేశపు వైశాల్యము 4000 చతురపు మైళ్ళు ఈ దేశపు భూసారములో పెక్కు భేదములు కలవు ఇచ్చట పశ్చిమ భాగమున ఖర్జూర వృక్షములు బాగుగా పెరుగును మధ్యభాగమున వేరువేరు ధాన్యాదులు పండును ఇచ్చట పండ్లతోటలు, పూతోటలుకూడ ఏపుగ పెరుగును మరికొంత తూర్పుగ పయనించినచో, అచ్చట పర్వత పాదములవద్ద ద్రాక్ష, ఆలివు, మల్బరీ తోటలు కానవగును ఫొనీషియా దేశపు తూర్పు కొనయందు పర్వత పంక్తులు కలవు ఇవి ఉత్తరమునందు అయిదువేల అడుగుల ఎత్తుగను, దక్షిణమున తొమ్మిదివేల అడుగుల ఎత్తుగను ఉన్నవి వీటిపై మహోన్నత వృక్షపంక్తులు కానవగును వీటిలో ఓక్, చెస్నట్, సికమూర్, సీడర్ మున్నగు వృక్షములు మిక్కిలి ప్రశస్తమైనవి వీటి కట్టె గృహ నిర్మాణమునకును, నౌకా నిర్మాణమునకును మిక్కిలి ఉపయోగ పడును ఈ దేశపు పశ్చిమ దిక్కున మధ్యధరా సముద్రము వ్యాపించి ఉన్నది ఫొనీషియా తీరమున కత్యంత సమీపమున చిన్నచిన్న ద్వీపములు కలవు వీటిలో ముఖ్యముగా పేర్కొనదగినవి టైర్, సిడన్, అరాడస్ అనునవి. ఈ ద్వీపములు మనుష్య యత్నముచే చక్కని

రేవుపట్టణములుగ మార్పు చెందెను. ఇవి కాక సముద్రములోనికి చొచ్చుకొని పోయిన శిలా సమూహములు గోడలుగా నేర్పడగా, ఆ గోడల నడుమ కొన్ని రేవుస్థానములను నిర్మించుటకు అవకాశము కలదు. నైసర్గికమగు అనుకూల్యము లేర్పడి యుండిన కారణమున, ఫోనీషియా జాతివారు తమ దేశపు విస్తృతిని, జనసంఖ్యకును మించిన ఖ్యాతిని సంపాదించిరి.

అతి ప్రాచీనకాలమున ఫోనీషియా దేశమున నివసించిన ప్రజలు 'హామైటు' జాతివారు క్రీ పూ 2000 సంవత్సరములకు పూర్వము ఇచ్చటికి సెమెటిక్ తెగకు చెందిన మరియొక జాతివారు వచ్చి స్థిరనివాసముల నేర్పరచుకొనిరి యూదులు, బాబిలోనియనులు, వీరికి సన్నిహిత జ్ఞాతులు. వీరిలో సమయోచిత వర్తనము, పట్టుదల, కష్టసహిష్ణుత, దైవభక్తి మున్నగు సద్గుణము లెన్నియో యుండెడివి అందులకు తోడు వీరు గొప్ప ధైర్యసాహసములు గల శూరులు. కావుననే వీరు పశ్చిమమున ఇంగ్లాండునుండి, తూర్పున భారతదేశము వరకును వ్యాపారము నిమిత్తము పెక్కు దేశముల సందర్శించినప్పు డాదేశముల వారెల్లరును ఫోనీషియా వారిని మిక్కిలి గౌరవముతో సన్మానించుట సంభవించుచుండెను.

రాజ్యాంగ విషయములందు ఫోనీషియా వారెన్నడును ఒక్క రాజు పరిపాలనకు లోబడి యుండలేదు. ప్రాచీన గ్రీకు ప్రపంచమునందు వలెనే, ఈ దేశమున పట్టణ రాజ్యములు నెలకొని యుండెడివి. ఇచ్చటి నగరములలో టైరు, సిడన్, బైబ్లస్, అరాడస్, అక్రా అనునవి విఖ్యాతి గాంచెను. వాటిలో టైరు నగరము తలమానికము వంటిది టైరు పట్టణము మొట్టమొదట సముద్ర తీరమున నెలకొని యుండెను. ఇది యొక ప్రాత పట్టణము దీని వైశాల్యము 15 చదరపుమైళ్ళు. చుట్టును గల బలమైన ప్రాకారముతో, ఈ మహానగరము శత్రుదుర్భేద్యముగ నుండెడిది. టైరు నగరవాసులు తీరమునకు అరమైలు దూరముననున్న రెండు చిన్నద్వీపములను కలిపి మరియొక జనావాసము నేర్పాటు చేసికొనిరి. ఇది నూతనమగు టైరునగరము. ఇచ్చట మహోన్నత భవనరాజములు నిర్మింపబడెను పట్టణమునకు ఉత్తర దక్షిణపు కొనలలో ఉత్తమమగు రేవుస్థానము లేర్పాటయ్యెను. ఈ దేశమందలి ఇతర పట్టణములుకూడ ఇంచుమించుగ నిట్లే యుండెడివని మనము భావించవచ్చును ఫోనీషియా దేశమందలి పట్టణరాజ్యములవారు శాంతిసమయమునం దెవరికి వారు రాజ్య పరిపాలనాదికములను సాగించుచు వచ్చినను, యుద్ధకాలమునందు మాత్రము వారొండొరులకు సహాయపడు చుండెడివారు.

ఫోనీషియాదేశమందలి వేరువేరు పట్టణముల చరిత్రలు మనకు లభ్యపడుటలేదు కాని ఈ దేశమందలి సర్వశ్రేష్ఠమగు టైరు నగరపు రాజులనుగూర్చిన కొన్ని యంశములుమాత్రము మనకు తెలియవచ్చినవి క్రీస్తునకు పూర్వమును, అనంతరమును గడచిన శతాబ్దులలో ఫోనీషియాదేశమునం దెట్టి రాజకీయసంఘటనలు జరిగినవో మనకు తెలియుచున్నవి ఈ దేశమునందలి సిడన్ నగరము క్రీ పూ 18 వ శతాబ్దికి పూర్వమే మిక్కిలి ఉన్నతదశయం దుండెను. ఇచ్చటి ప్రజలు గొప్ప నావికులుగను, పారిశ్రామికులుగను విఖ్యాతి గాంచిరి కాని 18 వ శతాబ్ది యందు ఈ సిడన్ ప్రజలు ఫిలిస్టయిను జాతివారిచే పీడింపబడి క్షీణతకు గురి అయిరి క్రీ పూ పదునొకండవ శతాబ్దినుండి టైరునగరము ప్రాధాన్యము వహింప సాగెను ఈ నగరరాజ్యమును పాలించిన మొదటి గొప్ప రాజు హిరమ్ ఈతడు టైరునగరమును విస్తృతపరచి నూతన మందిరములను, దేవాలయములను, రేవు ప్రదేశములను నిర్మాణము చేయించెను. హిరమ్ ప్రభువు పాలస్తీనా రాజ్యమును పాలించిన డేవిడ్, సాలమను రాజులతో స్నేహభావమును పాటించెను, జెరూసలెమ్ నగరమందు బ్రహ్మాండమైన యెహోవా దేవాలయమును కట్టించుటలో, హిరమ్, సాలమన్ రాజున కపారమగు సహాయము కావించెను ఈవిధముగ ఈ రెండు రాజ్యములకును స్నేహసంబంధము లేర్పడెను హిరమ్‌రాజ వంశ్యుల కాలములో పాలస్తీనా రాజులు టైరురాజు కుటుంబములోని కన్యకలను వివాహమాడిరి తత్ఫలితముగ ఫోనీషియావారి మతవిశ్వాసములు యూదులలో వ్యాపించెను. క్రీ పూ. 9 వ శతాబ్దమునుండి అస్సీరియా సామ్రాజ్యపు ప్రభువులు బలవంతులు కాసాగిరి అస్సిరియారాజ్యము యొక్క ప్రాబల్యమును గుర్తించి. టైరు మొదలైన ఫోనీషియా నగరరాజ్యములవారు ఆ చక్రవర్తులకు కప్పము కట్టుట కంగీకరించిరి. అస్సీరియా రాజులు ప్రథమదశయందు ఫోనీషియాప్రజల స్థానిక స్వాతంత్ర్యమును గుర్తించిరి. కాని

కాలము గడిచినకొలదియు అస్సీరియావారి యహంకారము పెరిగిపోయెను వారు ఫొనీషియారాజ్యములలో పరిపాలన సాగించుటకు, తమ యధికారులను పంపసాగిరి అందుల కంగీకరింపక ఫొనీషియా ప్రజలు అస్సీరియారాజ్యముపై తిరుగుపాటు కావించిరి అషుర్ బనిపాలు అను అస్సీరియారాజు ఫొనీషియాపై దండెత్తిపోయి, టైరు మొదలైన పట్టణములను నాశనము కావించెను అస్సీరియావారి పాలనలో ఫొనీషియాజాతివారు చాలబాధలకు గురియైరి క్రీ పూ ఏడవశతాబ్దియందు ఫొనీషియాజాతివారు అస్సీరియావారి ఇనుపకౌగిలినుండి విడివడి అపారముగ అభివృద్ధిచెందిరి అనంతరకాలమున ఫొనీషియాజాతివారు కొంతకాలము ఈజిప్టుదేశమునకు, బాబిలోనియారాజ్యమునకును సామంతులుగ నుండుచు వచ్చిరి కాని కొన్నికారణముల వలన క్రీ పూ ఆరవశతాబ్దియందు ఫొనీషియావారు బాబిలోనియా ప్రభువులపై తిరుగుబాటు కావించిరి, బాబిలోను ప్రభువగు నెబుచడ్నెజారు అను నాతడు బ్రహ్మాండమగు సేనతో ఫొనీషియాపై దండెత్తిపోయి టైరు మున్నగు నగరములను ధ్వంసముచేసెను. పదమూడు సంవత్సరములకాలము హోరాహోరి పోరాడిన పిదప సముద్రమునందు నెలకొని యున్న నూతన టైరునగరముకూడ శత్రువునకు లొంగిపోయెను కాని కాలక్రమమున బాబిలోనియావారి ఆధిక్యముకూడ క్షీణించెను క్రీ పూ ఆరవశతాబ్దినుండి పారసీక రాజులు ఆసియాఖండమునందు గొప్ప సామ్రాజ్యమును స్థాపించుకొనజొచ్చిరి ఫొనీషియావారు నూతన పరిణామముల గుర్తించి పారసీకసామ్రాజ్యమునకు సామంతులైరి నౌకానిర్వహణమునందు ఫొనీషియారాజ్యములవారికి గల అసామాన్య ప్రావీణ్యమునుగుర్తించి పారసీకప్రభువులు వీరిచే తమ యుద్ధనౌకలను నిర్మింపించెడివారు. పారసీకరాజుల యుగమందు ఫొనీషియాజాతివారు తమ వాణిజ్యమును నిరాఘాటముగ సాగించుకొని చాల అభివృద్ధిని సాధించిరి. పారసీక సామ్రాజ్యమును యవనవీరుడైన అలెగ్జాండరు క్రీ. పూ నాల్గవ శతాబ్దిలో కూలద్రోసెను. ఫొనీషియా జాతివారును, ముఖ్యముగ టైరుపట్టణమువారును అలెగ్జాండరు నెదిరించి ఘోరముగ పోరిరి. అలెగ్జాండరు తరువాతి కాలములో ఫొనీషియా జాతివారు తమ వ్యక్తిత్వమును కోల్పోయి గ్రీకు ప్రజలలో లీనమయిరి

ఫొనీషియా జాతివారిని గూర్చి చింతించి నప్పుడు మనకు ముఖ్యముగ జ్ఞప్తివచ్చు నంశము వారి నౌకాయాన ప్రావీణ్యము. మూడువేల సంవత్సరములకు పూర్వము, నౌకాయానమున కీనాటి సౌకర్యములు లేని యుగమున, ఈ జాతివారు మహాసముద్రములందు నిర్భయముగ ప్రయాణము చేయగల్గుట వారి సామర్థ్యమునకు మంచి తార్కాణము ఫొనీషియా జాతివారు వాడెడి పడవలు పరిమాణమున చాల చిన్నవి. వీటిని నడపుటకై వారు తెడ్లను, తెరచాపలను వాడెడివారు. వీరి పడవలను నిర్మించుట కావశ్యకమైన కఱ్ఱ లెబనాన్ కొండలపై దొరకెడిది. ఈజాతి నావికులు తమ నౌకలయందు సుదూర ప్రయాణములు కావించుచుండిన మాట వాస్తవమే కాని, వారు వీలైనంత వరకు సముద్ర మధ్యమునకు పోక, తీరమున కనతిదూరమున తమ పడవలను నడపుచు, ముందునకు పోవుచుండెడివారు ఫొనీషియా నావికులు మధ్యధరా సముద్రమునంతను సంపూర్ణముగ శోధించిరి నీకో అను ఈజిప్టు రాజు కోరికపై వీరు ఎఱ్ఱసముద్రపు రేవు పట్టణములలో నొకదానినుండి బయలు వెడలి, బేబల్ మాండబ్ జలసంధిని దాటి, హిందూ మహాసముద్రమున ప్రవేశించి, దక్షిణముగ పయనించి గుడ్ హోప్ అగ్రమును చేరి, అచ్చటనుండి ఉత్తరముగ ఆఫ్రికా ఖండపు పశ్చిమ తీరప్రాంతము ననుసరించి సాగిపోయి, జిబ్రాల్టరు జలసంధిగుండ మరల మధ్యధరా సముద్రమును చేరిరట. ఈ ప్రయాణమును వారు మూడు సంవత్సరములలో ముగించిరి ఫొనీషియావారు బ్రిటను దేశమును కూడ సందర్శించిరి ఆ ద్వీపమును వారు తగరపు దీవులని వర్ణించెడివారు ఈ జాతి ప్రజలు భారత భూమికి కూడ వ్యాపారము నిమిత్తము పోయెడివారు వీరికి భారత ప్రజలు ఫణిజాతి యను నామము నిచ్చిరి

ఫొనీషియా ప్రజలు వ్యాపారమునందు చాల ప్రసిద్ధి గాంచిరి. వీరు తమ దేశమున సిద్ధమగు సుందరమగు వెండి, బంగారు పాత్రలను విదేశములకు గొనిపోయి అమ్మెడివారు అంతేకాక దంతపు సామానులు, నల్లసీసపుకఱ్ఱ, తోళ్ళు, నిప్పుకోళ్ళ యీకలు, జిగుళ్ళు, రత్నములు, ధాన్యములు, వస్త్రములు, సారాయములు, ఉన్ని, పాదరసము, తగరము, అలంకార ద్రవ్యములు మట్టి సామానులు, గాజు సామానులు మున్నగు వాటిని ఈ దేశపు వ్యాపారు లితరుల కమ్మి

ధనము సంపాదించెడివారు ఫొనీషియా జాతి వర్తకులు తమ వర్తక కార్యకలాపములందు చాల న్యాయముతో వర్తించెడివారు ఇతరులను మోసగించుట యనునది వీరెరుగరు కాని కొన్ని కొన్ని సందర్భములలో ఈ జాతి వర్తకులు పరదేశీయులను చెరపట్టి, వారిని బానిసలుగ అమ్ముట కూడ కలదు వీరి వ్యాపారము ఓడలలోను, నాటుమార్గమునను కూడ సాగెడిది

విదేశములతో వ్యాపారము సాగించు జాతులవారా యాదేశములలో తమ వర్తక స్థానములను, వలస ప్రదేశములను, నెలకొల్పుకొనుట సర్వసామాన్యము ఫొనీషియా జాతి వారికి కూడ ఈ సత్యము వర్తించు చున్నది వీరు ఈజిప్టు దేశమున మెంఫిస్ అను వర్తక స్థానము నేర్పాటు కావించుకొనిరి. ఇచ్చట ఈ జాతివారొక దేవాలయమును నిర్మించుకొనినట్లు హెరోడోటస్ అనుచరిత్రకారుడు తెల్పుచున్నాడు. సిలీసియా ద్వీపమునకు ముఖ్య పట్టణమగు టార్సస్ నగరమును వీరే స్థాపించిరి మధ్యధరా సముద్రమునందలి సైప్రస్ రోడ్స్, క్రీటు, సిసిలీ ద్వీపములలో ఫొనీషియా జాతివారి వర్తక స్థానము లేర్పడెను ఆఫ్రికా ఖండములో ఫొనీషియా జాతివారు స్థాపించిన వలసప్రదేశములలో కార్థేజ్ నగరము జగత్ప్రసిద్ధిని గాంచినది

ఫొనీషియా జాతివారికి విశిష్టములును, నిశ్చితములునగు మతాభిప్రాయము లుండెడివి వారు బాల్ అను దైవతమును, ఎష్టొరెట్ అను దేవిని పూజించెడివారు బాల్ దేవుడు సూర్యునికిని, అగ్నికిని అధిష్ఠాన దైవమని ఫొనీషియావారు భావించిరి సృష్టికంతకును ఈ దేవుడే మూలకారణమని వీరి తలంపు ఎఫీకా అను ప్రదేశమున, ఈ దేవతామూర్తుల గౌరవార్థముగ ఫొనీషియావారొక గొప్ప దేవళమును నిర్మించిరి ఇందలి ధనకనక వస్తువాహనము లపారములు. కాలక్రమమున ఈ జాతివారి మతమునం దనేక దురాచారములు ప్రవేశించెను జంతుబలులు, నరబలులు, శిశుబలులు, వ్యభిచారము మున్నగునవి మతమునకు అంగములుగ భావింపబడ సాగెను ఫొనీషియావారి మతవిశ్వాసములు యూదు జాతివారిని, మధ్యధరా సముద్రములోని ద్వీపముల వారిని గాఢముగ ప్రభావితులను కావించెను

ఫొనీషియా జాతివారియందు వైజ్ఞానికాభివృద్ధి కూడ చక్కగ సాగెను వీరి జాతియందు బోయిథస్, డియోడోటస్, అంటిపాటర్ అపోలోనియస్ అను తత్త్వజ్ఞులును, ఫిలో అను చారిత్రికుడును, హెర్మిప్పస్ అను వైయాకరణియు, మారినస్ అను భూగోళ శాస్త్రవేత్తయు, పాలస్ అను ఆలంకారికుడును. ఇతర వైజ్ఞానికులును ఉద్భవించి, ఈ జాతికి ప్రఖ్యాతిని కల్పించిరి ఈ దేశమువారు న్యాయశాస్త్రమును కూడ శ్రద్ధగ నభ్యసించిరి కాని ఫొనీషియా జాతి పండితులు తమ గ్రంథరచనమును స్వభాషలో కాక పరభాష యగు గ్రీకువాణియందు కావించుట ప్రత్యేకముగ గమనింప తగినది

ఫొనీషియావారు తమ యవసరముల కొరకై ఒక ప్రత్యేకమగు లిపిని నిర్మించు కొనిరి. యూదుల హీబ్రూ భాషకును, ఫొనీషియా భాషకును చాల సామ్యము కలదు ఈ రెండును సెమెటిక్ భాషా కుటుంబమునకు చెందినవి ఈ రెండు భాషలందును కూడ ఇరువది రెండు అక్షరములు మాత్రము కలవు. సెమెటిక్ భాషలన్నిటివలెనే ఫొనీషియా భాషకూడ కుడినుండి ఎడమవైపునకు వ్రాయుదురు తమ వ్యాపారపు లెక్కలు మున్నగు వాటిని వ్రాసికొనుటకై ఫొనీషియావారు ఈ భాషను వాడియుండ వచ్చును కాని ఈ భాషయందు వ్రాయబడిన గ్రంథములు నేడు కానరావు లిపిసౌలభ్యముండుటచే ఫొనీషియావారి లిపి గ్రీకు, లాటిను భాషల లిపిని ప్రభావితము కావించి యుండునని కొందరు పండితుల మతము

ఖం. బా.

## ఫ్రాన్‌హోఫర్, జోసెఫ్ వాన్ (1787-1826).

జోసెఫ్ వాన్ ఫ్రాన్‌హోఫర్ (1787-1826) క్రీ శ 1787 సంవత్సరము మార్చి 6 తేదీన జర్మనీలోని స్ట్రాబింగ్ అను నగరమున జన్మించెను అతడు మ్యూనిక్ నగర సమీపమున గల "ఉట్సెష్‌నైడెర్" అను గాజు పరిశ్రమల సంస్థయందు కంటియద్దముల నిపుణుడుగా అనుభవమును గడించి, చివరకా సంస్థకు తానే యధిపతి యయ్యెను ఈ యనుభవమే యతనిని సరియైన రంగులేని అద్దములు నిర్మించుట యందును, వివిధములైన దృగ్యంత్రములను సిద్ధపరచుట యందును సిద్ధహస్తుని గావించెను

ఫ్రాన్‌హోఫర్ శాస్త్రజ్ఞునికి శాస్త్రప్రపంచమునందు చిరకీర్తి నార్జించి, యతని స్థానమును విజ్ఞానశాస్త్ర చరిత్రలో స్థిరముగా నిల్పినవి,యత డొనరించిన సౌరవర్ణ మాలా పరిశోధనలే.

వర్తులాకార రంధ్రమునుండి సూర్యకాంతి నొక గాజు పట్టకముపై బడనిచ్చెను. అది తెల్లని కాంతి విశ్లేషణమొంది నిర్దుష్టమైన యేడు వర్ణములలోనికి విభజింపబడు నని మహా మేధావియైన న్యూటను ప్రప్రథమమున గుర్తించెను పిమ్మట క్రీ. శ. 1802వ సంవత్సరమున డబ్ల్యు హెచ్ వొల్లాస్టన్ అను వాతడు వర్తులాకార రంధ్రమునుండి గాక, రేఖాకారరంధ్రము నుండి సూర్యకాంతిని పంపి, యేర్పడిన వర్ణమాలలో నల్లని రేఖలుండుట గమనించెను కాని, వీటిని గురించిన విజ్ఞానముపై ఫ్రాన్‌హోఫర్ శాస్త్రజ్ఞుడు విపులమైన పరిశోధనము లొనర్చి, అట్టి 576 రేఖలను గుర్తించి, వర్ణమాలలో వాటి స్థానము, సూటిగ వచ్చిన సౌరకాంతి యందును, చంద్రుని నుండి, తదితర గ్రహములనుండి పరావర్తనము చెంది పట్టకమును జేరిన సూర్యకాంతి యందును, ఒక టేయని నిర్ణయించు వరకును తద్విజ్ఞానము మరుగునబడి యుండెను ఫ్రాన్‌హోఫరు ఇట్టి నల్లని రేఖలను విభూషిత వర్ణమాలా రేఖలను A నుండి G వరకు గల అక్షరములచే గుర్తించెను ఇట్టి ముఖ్యమైన పరిశోధనముల నాతడొనరించుట వలననే నేటికిని అవి యతని పేర "ఫ్రాన్‌హోఫర్ రేఖలు" అనబడుచున్నవి.

అంతేగాక, ఖగోళపదార్థజన్యమైన వర్ణమాలను, అన్యకృత్రిమ భౌగోళిక నీస్సోదిత వర్ణమాలతో పోల్చి (ఉదా సోడియం లాంపు) తరంగదైర్ఘ్యమును కనుగొను పద్ధతి ప్రవేశపెట్టినదీతడే నేడు విరివిగా నుపయోగింపబడుచున్న వర్ణమాలాలేఖినికిని, వర్ణమాలాదర్శినికిని మూలకారకు డీతడే యని చెప్పవచ్చును ఇతడు సమాంతరముగా సన్నని తీవల నొకదాని ప్రక్కనొకటి తేర్చియు, గాజుపై వజ్రముతో మిక్కిలి దగ్గర దగ్గరగా అనేకములైన సమాంతర రేఖలను గీచియు, అవి వర్ణమాలా దర్శినియందు పట్టకమునకు బదులుగా వాడబడ వచ్చునని చూపెను ఇవియే నేడు గ్రేటింగ్సు అనుపేర బహుళముగా వాడబడు చున్నవి

ఫ్రాన్ హోఫర్ శాస్త్రజ్ఞుడు దూరదర్శిని వస్తుకటకమునకు ముందొక పట్టకముంచి నక్షత్ర కాంతిని విశ్లేషణ మొందించి వాటి వర్ణమాలలను పరీక్షించెను. ఈతని వైదుష్యమును గుర్తించి 1823వ సంవత్సరములో ఇతనిని మ్యూనిక్‌లో గల శాస్త్రసదస్సునకు పరిపాలకునిగా నియమించి, సత్కరించిరి ఇత డచ్చటనే 1826 సం జూన్ 7 వ తేదీన కీర్తిశేషు డయ్యెను

ము. బా. శ

# ఫ్రాన్సిస్ గాల్టన్ (1822-1911)

సర్ ఫ్రాన్సిస్‌గాల్టన్ అనునాతడు ఇంగ్లండు దేశీయుడగు ప్రసిద్ధమానవ వర్ణనశాస్త్రజ్ఞుడు మనుష్యవర్ణన శాస్త్రమునందు, మానసిక శాస్త్రమునందు, వాతావరణ శాస్త్రము (అంతరిక్ష శాస్త్రము)నందు, విదేశ పర్యటనమునందు, ఈతడు సాధించిన విజయములు ఘనమైనవి. ఈతడు సర్వతోముఖ ప్రజ్ఞాశాలిగా పేర్గాంచినవాడు.

1822 ఫిబ్రవరి 16వ తేదీన గాల్టన్ బర్మింగ్‌హామ్ నగరమందు జన్మించెను అతని తాతయగు ఎరాస్‌మస్ డార్విన్ ప్రకృత్యారాధకుడగు కవిపుంగవుడుగ గణుతికెక్కెను జగత్ప్రసిద్ధి చెందిన చార్లెస్ డార్విన్ ఈతని దాయాది ఫ్రాన్సిస్ కొంతకాలము కింగ్ ఎడ్వర్డు పాఠశాల యందు విద్యాభ్యాస మొనర్చెను. బర్మింగ్‌హామ్ వైద్యశాల యందు, లండను నగరమందలి కింగ్స్ కళాశాలయందు కేంబ్రిడ్జి నగరమున గల ట్రినిటీ కళాశాలయందు ఇతడు కొంతకాలము వైద్యవిద్య నభ్యసించి, తుదకు 1844 లో వైద్యశాస్త్రమందు పట్టభద్రు డయ్యెను కాని అనంతర మాతడు తన నిర్ణయమును మార్చుకొని, వైద్యవృత్తినుండి మరియొక వ్యాసంగమునకు మరలెను

ఫ్రాన్సిస్ గాల్టన్ 1845-46 వ సంవత్సరములో సుడాను ప్రాంతమందు విస్తృతముగా పర్యటించెను 1850లో నైరృతి ఆఫ్రికాయందు దతడు నూతన పరిశోధనములు జరిపెను అంతకుపూర్వ మాతడు ఆ ప్రాంతమునందు అడుగిడనే లేదు ఈ పరిశోధన యాత్రను ముగించుకొని తిరిగి వచ్చిన తరువాత తన యాత్రానుభవములను గూర్చి "ఉష్ణప్రధానమైన దక్షిణాఫ్రికాయందలి ఉష్ణమండల పరిశోధకుని కథనము" అను గ్రంథము నాతడు 1853 లో ప్రచురించెను ఈ ఉద్గ్రంథ రచనమునకు రాయల్ జియాగ్రాఫికల్ సొసైటీ వారాతనికి బంగారు పతకమును పారితోషికముగా నొసగి సత్కరించిరి ఈ పర్యటనములను గూర్చి ఇట్టివే మరికొన్ని గ్రంథముల నాతడు 1855లో ప్రచురించెను 1860 లో ఆతడు స్పెయిను ఉత్తరప్రాంతమును దర్శించి తన పర్యటనానుభవములను, అచ్చటి ప్రజాజీవిత విశేషములను వర్ణించుచు, "వెకేషన్ టూరిస్ట్స్" అను గ్రంథసంపుటములను ప్రకటించెను.

అంత నాతడు తన శ్రద్ధాసక్తులను నూతన విషయాధ్యయనము వైపు - వాతావరణశాస్త్రము వైపు మరల్చెను ఈ శాస్త్రమునకు సంబంధించిన సిద్ధాంతములను "మెటిరియోగ్రాఫికా" అను గ్రంథములో 1863 లో ప్రకటించెను భారీ యెత్తున వాయుప్రేరణ మొనర్చుట కిదియే యథార్థమైన ప్రథమ ప్రయత్నము ప్రతి చక్రవాతముయొక్క ఉనికిని గూర్చియు, తత్సంబంధమగు సిద్ధాంతమును గూర్చియు నిర్ధరించిన ప్రథమ రచయిత కూడ ఈతడే అటుపిమ్మట ముప్పది సంవత్సరముల వరకు గాల్టన్ "వాతావరణశాస్త్ర సంస్థ"లో సభ్యుడుగ నుండి ఆ సంస్థకు ఎనలేని సేవ యొనర్చెను

పైన పేర్కొనిన విషయము లన్నిటికంటె, మనుష్య వర్ణనశాస్త్రమును గూర్చియు, మానసిక శాస్త్రమును గూర్చియు, అందును విశేషముగా మానవవంశావళిని గూర్చియు, గాల్టన్ అధ్యయన మొనర్చెను ఈ విషయాధ్యయనముతో ఈతని పేరు సన్నిహితముగా పెనవేసికొని యున్నది 1869 లో ఇతడు, "వంశానుగతమైన ప్రజ్ఞ, తత్ సిద్ధాంతములు, ఫలితములు" అనునొక ప్రసిద్ధ గ్రంథమును రచించెను ఈ గ్రంథము విజ్ఞానశాస్త్ర, వైద్యశాస్త్ర క్షేత్రములందు సంచలనము కల్గించెను వీటి తరువాత గాల్టన్ వివిధ శాఖలకు సంబంధించిన పెక్కు ప్రముఖ విజ్ఞాన శాస్త్ర గ్రంథములను 1874, 1883, 1884, 1889 సంవత్సరములలో రచించెను. ఈ అమూల్య గ్రంథముల రచనము ద్వారా, పూర్వము కేవలము అజ్ఞాతముగా నుండియున్న ఒక నూతనవిజ్ఞానశాస్త్రము ఆవిష్కృత మైనది. ఈ శాస్త్రము నతడు "యూజినిక్సు" అనెను ఈ శబ్దము విజ్ఞానశాస్త్ర పరిభాషలో ప్రథమ పర్యాయముగా ఈతడే ప్రయోగించెను మానవ జాతిని పటిష్ఠ మొనర్చుటకు క్రమబద్ధమైన కృషి యొనర్పవలెనని గాల్టన్ వాదించెడివాడు అసమర్థుల జననమును అరికట్టి, సమర్థులైనవారి జననమును పెంపొందించుట వలననే ఈ ఆశయము సిద్ధింప గలదని అతని విశ్వాసము ఈ యూజినిక్సు శాస్త్రమునకు (నరవంశశుద్ధి శాస్త్రమునకు) సంబంధించిన సిద్ధాంతము నాతడు 1865 లో ప్రతిపాదించెను, కాని 1884 లో మాత్రమే ఇది చర్చింపబడినది. "శారీరకముగను, మానసికముగను భావితరముల వారి గుణగణములను వికసింప జేయుటకుగాని, బలహీనపరచుటకుగాని, సాంఘిక నియంత్రణమునకు సంబంధించిన సాధనముల పరిశీలనము" అనునదియే గాల్టను గావించిన నరవంశశాస్త్రవిషయకనిర్వచనము. ఈ శాస్త్ర విషయమునుగూర్చిన పరిజ్ఞానమును అభివృద్ధి పరచుటకై గాల్టన్ లండను విశ్వవిద్యాలయమందు పరిశోధన సంస్థను స్థాపించెను

గాల్టను ప్రజ్ఞాప్రాభవములు, శ్రద్ధాశక్తులు మరియొకసారి ఈ క్షేత్రమును గూడ అధిగమించి, ఇతర విషయములపై ప్రసరించెను సంఘటన చిత్రరచనా విధానమును ప్రథమముగా కనిపెట్టిన దీతడే. వ్రేలిముద్రలను తీయు విధానమునెడల, నేరస్థులను గుర్తించుటలో వ్రేలిముద్రల ప్రయోజనము నెడల, ఇతడు విశేషమైన ఆసక్తిని ప్రకటించెను ఈ అంశముపై పెక్కు గ్రంథప్రకటనములు వెలువడెను (1892, 1893, 1895)

మానవుని గూర్చియు, అతని ప్రకృతి తత్త్వమును గూర్చియు, దాని వికాసమునుగూర్చియు, అమూల్యములైన సిద్ధాంతములను ఆవిష్కరించుచు గాల్టన్ ప్రముఖమును, ఫలవంతము నైన జీవితమును గడపెను. శక్తిమంతము లైన అతని రచనములు అతని జీవితకాలమునందే ప్రజలలో ఆలోచనా శక్తిని, ఆలజడిని పురిగొల్పెను. విజ్ఞాన శాస్త్రము నెడల, ప్రజాసామాన్యము నెడల అతని సేవాపరాయణత్వము గుర్తింప బడుటయే కాక, విజయ పరంపరను చేపట్టిన అతడు ఘనముగ సన్మానితుడై, గౌరవపాత్రు డయ్యెను 1860 లో రాయల్ సొసైటీవారు అతనిని కేవల మొక "ఫెలో"గా మాత్రమే ఎన్నుకొనక, "డార్విన్" పతకమును గూడ అతనికి బహుమానముగా నొసగిరి (1902). ఇంతేకాక ఆక్స్‌ఫర్డు, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయములు అతనిని 1894, 1895 సంవత్సరములలో గౌరవబిరుదములచే సత్కరించినది "1908లో" నా జీవిత స్మృతులు" అను గ్రంథము నాతడు ప్రచురించెను. అతని "విద్యావీరత్వ"మును పురస్కరించుకొని "సర్" బిరుదప్రదాన మాతనికి చేయబడినది విజ్ఞానశాస్త్రములలో ఉన్నతశిఖర మందుకొనిన మహా మేధావియగు సర్ ఫ్రాన్సిస్ గాల్టన్ జీవితము 1911లో సమాప్తమయ్యెను.

డా. శ్రీ శ్రీ

## ఫ్రాన్సిస్కో పిజారో :

ఫ్రాన్సిస్కోపిజారో స్పెయినుదేశీయుడు నూతన ప్రాంతముల అన్వేషణార్థము స్పెయిననుండి బయలుదేరిన జట్టు

నాయకులలో ఇతడొక ప్రఖ్యాత పురుషుడు

క్రీ శ 1471-1475 సంవత్సరముల నడుమ స్పెయినులో ఎస్ట్రామదుర మండలమందు, ట్రూజిల్లో అను తావున పిజారో జన్మించెను ఇతడు గంజాలో పిజారో అను పేద సైనికోద్యోగి వలన ఉంపుడుకత్తెయందు కలిగిన కుమారుడు. విద్యాబుద్ధులు కరపుటకు శ్రద్ధ వహించెడి పోషకులు లేనందున, ఇతడు నిరక్షరకుక్షి యయ్యెనని తెలియు చున్నది

ఇతడు పిన్నవయస్సుననే సైన్యములో చేరి, అమెరికాకు వెళ్ళి, అచ్చట ఎల్ గ్రాన్ కాపిటన్ అనునాతని నాయకత్వమున, నెపోలియను నాయకత్వమున జరిగిన యుద్ధములలో పాల్గొనెను ఇంతకు మించి ఇతని బాల్య విశేషములు తెలియవు.

నూతన ప్రపంచము కనిపెట్టబడిన కాలమున స్పెయినులోని సెవిల్లా అను ప్రదేశమున, పిజారో నివసించు చుండెను అదృష్ట దేవతచే ప్రేరితుడై ఇతడు పసిఫిక్ మహాసముద్రమును కనుగొనుటకు నూనెజ్-డి-బల్బో అనునాతని జట్టులో చేరెను ఆ జట్టు పెనామా భూసంధి నధిగమించి, తొలిసారిగా, 1518 వ సంవత్సరములో పసిఫిక్ మహాసముద్ర ప్రవేశ మొనర్చెను

బల్బో జట్టు పసిఫిక్ సముద్ర ప్రవేశ మొనర్చినప్పటి నుండి సవనిధులకు, నాగరికతకు ఆలవాలమైన దేశమొకటి దక్షిణమున సుదూరములో నున్నదను కింవదంతులు జట్టువారి చెవి సోకెను అందువలన పిజారో, ఆల్మాగ్రో అను పేద సైనికులు దక్షిణ అమెరికా యొక్క పశ్చిమ తీరమును కనుగొనుటకు బద్ధకంకణులైరి అపజయములకు, ఆపదలకు గురియగుచు వీ రెట్టకేలకు పెరు అను దేశములో నున్న ఇన్కా సామ్రాజ్యపు పొలిమేరను చేరుకొన గల్గిరి ఇది ప్రశంసనీయమైన ఘనవిజయము. ఇతఃపూర్వము పెనామావారి ద్రవ్య సహాయమును పొందిన రెండు జట్టులవారు కూడ ఇందు ప్రవేశించుటలో విఫలులైరి.

అనంతరము పిజారో, హెర్నాండో-డి-లూగ్ అను మతబోధకునకును, ఆల్మాగ్రో అను సైనికునకును అండగాను, భాగస్వామిగాను నిల్చి, నూతన దేశములను కనుగొనుటకు సాధించిన దక్షిణఅమెరికా యాత్రలో పాల్గొనెను. ఆ సందర్భమున అన్నవస్త్ర సామగ్రి ఏదియు లేకున్నను గాలో ద్వీపములో పిజారో, పదుముగ్గురు అనుచరులు, నెలల తరబడి నిస్సహాయులై నిలిచిపోయిరి ఇట్లు చేయుటలో గొప్ప ధైర్యస్థైర్యములను ప్రదర్శించిన పిజారో యొక్క ప్రఖ్యాతి స్పెయిను దేశమం దంతట వ్యాపించెను. ఆతడు దక్షిణమున 9° పయనించుటయే గాక, పెరూ సామ్రాజ్య విశేషములను విశదముగ పొడగాంచు వరకు పురోగమింప కృతనిశ్చయుడయ్యెను

పెనామా గవర్నరు వలన తనకెట్టి సాయము లభింపదని గ్రహించి, 1528 వ సంవత్సరము వసంత ఋతువులో అతడు "పెడ్రో-డి-కాండియా" అను మిత్రుని, వెంటనిడుకొని స్పెయిను రాజును సహాయ మర్థించుట కేగెను వేళావిశేషమేమియోగాని, రాజీతని ఉత్సాహమునకు అచ్చెరువంది, ధన, అనుచర వర్గముతో సాయమొనరించి, గౌరవ పురస్సరముగ "కోట్ ఆఫ్ ఆరమ్స్" అను బిరుదప్రదానము చేసెను. అంతేకాక, మున్ముందు కనిపెట్టబోవు దేశమంతటికి సర్వాధికారములతో అతనిని గవర్నరుగా నియోగించి, ఇతోధిక ప్రోత్సాహ సహాయములతో సాగనంపెను.

1529 లో పిజారో తన నలుగురు సోదరులతో అమెరికాకు బయలుదేరెను. ఇన్కా సామ్రాజ్యము ఆండీస్‌పీఠభూమి ప్రక్కన ఉత్తర దక్షిణములుగా సముద్ర మట్టమునకు 9,000-13,000 అడుగుల ఎత్తున "కార్డిల్లర్" పర్వత పంక్తులలో పరివ్యాప్తమై యుండెను. ఈ సామ్రాజ్యము ఆ సమయమున వారసత్వపు తగాదాల వలన బలహీన మయ్యెను దురాక్రమణ బుద్ధిచే గద్దెనెక్కిన అటాహుల్పా అనునాతడు తన రాజధానిని కుజ్కోనుండి కాజమార్కాకు మార్చెను పిజారో తన బృందముతో పెనామానుండి బయలుదేరి పెరూకు వచ్చుసమయమున 8,000 మంది స్థానిక సైనికులు అటాహుల్పాను రక్షించు చుండిరి స్పెయినీయు లతనిని తమ జట్టున కధిపతిగ నుండుటకై నిర్బంధించిరి అంతట నాతడు వారి చేతిలో కీలుబొమ్మ యయ్యెను దోపిడి కెగబడిన పిజారో పక్షీయులు అటాహుల్పాను చెర విడిపించెదమను మిషతో కావలసినంత ధన మతనినుండి గైకొని చివరకతనిని నిర్దాక్షిణ్యముగ చంపివేసిరి.

పిజారో, 'లిమా' నగరమును తన రాజధానిగ జేసికొని గవర్నరు హోదాలో, పరిపాలనమును నిష్కంటకముగ సాగించు చుండెను టోలాడో అను ప్రదేశము 1529 జులై నెలలో శత్రువశ మయ్యెను పిజారో, తాను నూతనముగ

కనిపెట్టిన న్యూకేస్టైల్ రాష్ట్రములో 600 మైళ్ళ ప్రాంతమునకు కొన్ని షరతులపైన సర్వసేనాధిపతిగను, గవర్నరుగను నియమింపబడి, పిదప సర్వ హక్కులతో పెరూ దేశపు వైస్రాయి పదవియందు ప్రతిష్ఠితుడయ్యెను. పదవీ నిర్వహణమునకు విధించిన షరతుల ప్రకారము పిజారో ఆరు మాసములలో సంపూర్ణ సాయుధ సిబ్బందిని చాలినంతగా పెంచుటను మూర్గురు యోధులను వలస ప్రాంతములనుండి పరిగ్రహింప వలసినవాడై యుండెను. కాని ఈ విధిని నిర్వహింపనందున అతడు 1530 జనవరిలో శాన్‌లుకార్ నుండి సముద్రమార్గమున రహస్యముగా వెడలిపోవలసి వచ్చెను. తక్కిన ఓడలతో తన సోదరుడగు హెర్నాండోను కలిసికొని అతడు జనవరిలో పెనామాను వదలిపెట్టెను. 1536-37 లో కుజ్కోను తిరిగి సాధింపవలెనను జాతీయోద్యమములో ఇన్కాకు, అల్మాగ్రో వలన పరాజయము సంభవించెను. పిదప అల్మాగ్రో-పిజారోలకు సరిహద్దులను గురించియు, విజయము లభించిన ప్రాంతము యొక్క పంపిణీ విషయమునను తొలుత చిన్న తగాదా పర్పడి, అంతకంతకు ప్రజ్వరిల్లెను. మిత్రులమధ్య చివరకు అంతర్యుద్ధము ఘటిల్లెను. పిజారో పక్షమువారిచే అల్మాగ్రో హత్యగావింప బడెను. తత్ప్రతీకార చర్యగ అల్మాగ్రో కుమారుడు ద్వేషముతో ఒక ఇట్టును లేవదీసి, 1541 సంవత్సరములో పిజారోను అంతమొందించెను.

ఆ. వ

## ఫ్రాన్సుదేశము (చ) :

దాదాపు ఆరవ శతాబ్దము వరకును ఫ్రాన్సునకు చెప్పదగిన చరిత్ర లేదు. అంతకుపూర్వము దీనికి గాల్ అని పేరుండెను. గాల్ చాలకాలము రోమక సామ్రాజ్యముయొక్క అంతర్భాగమై యుండెను. నాలుగవ శతాబ్దమున అనాగరిక జాతులవారు రోమక సామ్రాజ్యముపై బడినప్పుడు, వారిలో విధ్వంసకారులు క్రీ శ 416 లో గాల్ యొక్క దక్షిణ భాగమైన ఆక్విటైన్‌లో నివాస మేర్పరచుకొనిరి. కాని అనంతరము విసిగాత్ అను జాతీయులు వారిని పారద్రోలి అచ్చట స్థిరముగా నుండిపోయిరి.

రైనునదీ ప్రాంతమునందు ఫ్రాంకులు అను వేరొక జాతివా రుండిరి. వీరు ట్యూటానిక్ అను ఆదిమజాతికి చెందినవారు. హూణులు రోమక సామ్రాజ్యముపై దాడిచేసినప్పుడు, వీరు ఇతర జాతులతో కలిసి, వారిని పారద్రోలిరి. వీరు చాలకాలము ఐకమత్యము లేక తిరుగుచుండిరి. ఆరవ శతాబ్దమున క్లోవిస్ అనునొక అనాగరక జాతీయుడు వీరిని జయించి వీరికి రాజాయెను. ఫ్రాంకులను బట్టియే ఆదేశమునకు ఫ్రాన్సు అను పేరు వచ్చెను.

క్లోవిస్, మొట్టమొదట ఫ్రాన్సుకు రాజు. ఇతడు త్వరలో ఫ్రాన్సునందలి తూర్పుభాగమును జయించుటయే కాక దక్షిణముననున్న విసిగాత్ జాతీయులనుగూడ జయించి ఫ్రాన్సుదేశ మంతటికి రాజాయెను. ఇతనిపిదప రాజ్యమును ఇతని కుమారులు పంచుకొనిరి. వీరి వంశీయుల కాలమున అంతర్యుద్ధములు జరిగెను. క్రీ శ 638 లో మేరోవింగియన్ వంశీయులు ఫ్రాన్సును పరిపాలించిరి. వీరందరును దుర్నీతిపరులగుటచే, రాజ్యమునందు శాంతిభద్రతలు లోపించెను. భూస్వాములు స్వతంత్రులై స్వేచ్ఛగా పరిపాలించుచు, ప్రజలను పీడించుచుండిరి. ఇట్టి సమయమున ఫ్రాన్సుయొక్క ఐక్యమును కాపాడినవారు రాజనగరాధికారులు. రాజులు నిర్వీర్యులు, దుర్నీతి పరులగుటచే, వీరు బలవంతులై ప్రధాన మంత్రుల వలెనే వ్యవహరించిరి. కాలక్రమమున వీరిపదవులుకూడ వంశపరంపరాగతములైనవి. వీరిలో చార్లెస్‌మార్టెల్ పేర్కొనదగినవాడు. ఇతడు మేరోవింగియనుల కాలమున విచ్ఛిన్నమయిన ఫ్రాన్సును మరల ఏకముచేసెను. క్రీ. శ 732 లో అరబ్బులు స్పెయినును జయించి ఫ్రాన్సు దేశమునందుగూడ ప్రవేశించి, జయించుచుండగా, ఇతడు వారి నడ్డగించి టూర్సు యుద్ధమున వారి నోడించెను. దీనితో వారు వెనుదిరిగి వెడలిపోయిరి. నాడు మార్టెల్ అడ్డగింపకుండినచో, యూరపు దేశచరిత్రయే మారియుండెడిది. ఇతని పిదప ఇతని కుమారుడైన పెపిన్ 751 లో చివరి 'మెరోవింగియన్' అను రాజును త్రోసివేసి తానే సింహాసన మధిష్ఠించెను. ఇతడు ఇటలీని జయించి, దానియందలి తూర్పుభాగమును పోపున కిచ్చెను. పెపిన్ మరణించగా, అతని రాజ్యమును కుమారులైన కార్లొమానె, చార్లెస్ అనువారు పంచుకొనిరి. కాని కార్లొమానె మరణించుటచే రాజ్యమంతయు 771 సం లో, చార్లెస్ నకే సంక్రమించెను. ఇతడే చార్లమేన్ అనుపేరుతో ప్రసిద్ధుడాయెను.

చార్లమేన్, చరిత్రలో చాల ప్రసిద్ధికెక్కినవాడు. అతడు నలుబది సంవత్సరములు పరిపాలించెను. ఫ్రాన్సునందు భూస్వాముల యొక్కయు, రాజుల యొక్కయు, తిరుగు

కోటులను అతడు అణచివేసెను ఇటలీ పై భాగముననున్న లంబార్డే జాతీయులు పోపుయొక్క రాజ్యము పైబడగా, పోపు చార్లమేన్ సహాయము నర్థించెను ఇతడుపోయి వారి నోడించి, వారిపై తానే రాజాయెను ఇతడు జర్మనీలో సాగ్జనీ అను రాష్ట్రముపై పదునెనిమిదిమారులు దాడిచేసి తుదకు పూర్తిగా అణచివేసెను, బవేరియాను జయించెను ఫ్రాన్స్ దక్షిణ భాగముననున్న ఆక్విటైను ప్రాంతీయులను అణచివేసెను క్రీ శ 800 లో చార్లమేన్ "చక్రవర్తి" అను బిరుదమును వహించెను. పోపు ఇతనిని పట్టాభిషిక్తుని జేసెను నాటి చార్లమేన్ రాజ్యము, స్పెయిను, ఇటలీ, రష్యాలు తప్ప మిగిలిన యూరపురాజ్యమంత పెద్దదై యుండెను ఇతడు తన రాజ్యమును చక్కని రాజ్యాంగ విధానముచే కట్టుదిట్టము చేసెను ప్రజోపయోగకరములగు పెక్కు సంస్కరణములు చేసెను విద్యాభివృద్ధికై పాఠశాలలు నిర్మించెను

చార్లమేన్ అనంతరము రాజ్యమంతయు రెండు భాగములుగా విభక్తమాయెను ఒకభాగము పశ్చిమభాగము ఇందు ఫ్రాంకులు అధికులు. రెండవది తూర్పుభాగము ఇందు జర్మను జాతీయులు అధికులు ఈ కాలమునాటి రాజులు అంతగా చెప్పదగినవారు కారు 987 లో హ్యూకాపెట్ అను నాతడు ఫ్రాంకులకు రాజుగా నెన్నుకొనబడెను ఇతని వంశీయుల కాలమున ఫ్రాంకుల రాజ్యము ఫ్రాన్సు రాజ్యముగా మారెను కాపెట్ వంశీయులు మూడుశతాబ్దులు పరిపాలించిరి వీరిలో ఆరవ లూయీ (1108-1137) భూస్వాముల నణచివేసెను ఏడవ లూయీ కుమారుడైన ఫిలిప్ అగస్టస్ (1180-1223) నాటి రాజులలో పేరెన్నికగన్నవాడు ఇతడు పారిస్ నగరమును గొప్ప రాజకీయ వైజ్ఞానిక కేంద్రముగా జేసెను, అందొక విశ్వవిద్యాలయమును స్థాపించెను రాజధానీ నగరమును అనేక విధములుగా అభివృద్ధి చేసెను తొమ్మిదవ లూయీ (1226-1276) తురుష్కుల నెదిరించుటకు మత యుద్ధములలో పాల్గొని ఓడిపోయెను

ఆ కాలము నుండియే ఫ్రాన్సునకు, ఇంగ్లండునకు వైరము హెచ్చెను. ఫ్రాన్సులో ఇంగ్లండు రాజునకు చెందిన కొన్ని భాగములు కలవు వీటి ఆధిపత్య మెవరి కుండవలె ననునది సమస్య అయ్యెను అగస్టస్, ఇంగ్లండునకు చెందిన భాగములన్నింటిని గెలిచెను కాని అతని పిదప మరల అనేక కారణములవలన యుద్ధములు నూరు సంవత్సరముల వరకు జరిగెను వీటియందు గెలుపు ఎక్కువగా ఇంగ్లండునకే కలుగుచుండెను 15వ శతాబ్ది ప్రారంభమునకు ఫ్రాన్సునందలి అధిక భాగము ఇంగ్లండురాజు వశములో నుండెను రాజధానియైన పారిస్‌కూడ అతని వశములోనే యుండెను ఫ్రాన్స్ రాజైన ఏడవ చార్లెస్ నిలువనీడలేక తిరుగుచుండెను అతని పరిస్థితి మిక్కిలి హీనమై యుండెను ఇట్టి సమయమున జోన్ అను రైతుబాలిక చార్లెస్‌వద్దకు వచ్చి, దైవప్రేరితనై వచ్చితిననియు అతనిని మరల రాజుగా చేసెదననియు చెప్పెను ప్రజ లందరును ఆమెపక్షము చేరిరి ఈప్రజాసైన్యసహాయముతో ఆమె ఇంగ్లీషువారితో అద్భుతముగా పోరాడి వారినోడించి చార్లెసును మరల పట్టాభిషిక్తుని చేసెను కాని ఫ్రాన్సునందు కొందరు ద్రోహులు ఆమెను చెరపట్టి ఇంగ్లీషువారికి అప్పగించిరి వారామెను మాంత్రికురాలినిగా నిర్ణయించి 1431 లో సజీవముగా కాల్చివేసిరి జోన్ ఆఫ్ ఆర్క్ అని ఈమె పేరు గాంచెను. కాని ఫ్రాన్సువారు ఊరుకొనక తాము కోల్పోయిన స్థానములు జయించుకొను చుండిరి 1453వరకు ఇంగ్లీషు వారికి ఫ్రాన్సులో ఒక్క కలే మాత్రము మిగిలెను చార్లెస్ అనంతరము కొందరు పాలించిరి కాని, 16వ శతాబ్దారంభము వరకు చెప్పదగిన విశేషములు జరగలేదు

మొదటి ఫ్రాన్సిస్ (1516 - 1547) కాలమునుండి ఫ్రాన్స్ క్రమక్రమముగా బలవత్తరము కాజొచ్చెను. నాడు హాప్స్‌బర్గ్ వంశీయులు జర్మనీరాజ్యమును పాలించుచుండిరి వారు చాల బలవంతులగుటచే వారి బలము నణచివేయుటకు ఫ్రాన్సిస్ యత్నించెను. ఇతడు రోమన్ క్యాథలిక్ మతమునకు చెందినవాడు ఇతని వారసులకాలమున ప్రొటెస్టెంట్, క్యాథలిక్ మతముల సంఘర్షణము మిక్కుటముగా నుండెను

పదమూడవ లూయీ (1616-1643) కాలమునుండి ఫ్రాన్సు, యూరపునందు ఉన్నతస్థానము నందుకొనెను ఇతనికి రిష్లూ అనుమంత్రి యుండెను ఇతడు మిక్కిలి సమర్థుడు. ఇతడు ఫ్రాన్సుయొక్క ఆధిపత్యమును ఇనుమడింప జేయుట కనేకవిధముల యత్నించెను బలవంతులైన హ్యూజినాట్లు అను వారిని అణచివేసెను హాప్స్ బర్గుల బలమును తగ్గించుటకు యత్నించెను 1642లో రిష్లూ మరణించగా, అతనివద్ద చక్కగా శిక్షణము పొందిన మజారిన్ అనునాతడు ప్రధాన మంత్రి యయ్యెను 1643లో పదమూడవ లూయీ మరణింపగా, అతని కుమారుడు పదునాలుగవ లూయీ చక్రవర్తి

ఆయ్యెను కాని ఇతడు బాలుడగుటచే, మజారిన్ ఇతనికి సంరక్షకుడుగా నుండెను 1661 వరకు మజారిన్ రాజ్యచక్రమును త్రిప్పెను 1661 లో ఇతడు మరణింపగా పదునాల్గవ లూయీ పెద్దవాడగుటచే, ఆతడే సర్వాధికారములు పూనెను

పదునాలుగవ లూయీ కాలము, ఫ్రాన్స్ చరిత్రలోనే కాక, ప్రపంచ చరిత్రలో కూడ చాల పేరు పొందినది లూయీ 64 సంవత్సరములు పరిపాలించెను ఇతడు ముఖ్యముగా రాజ్యాధికారమును నిరంకుశముగా చేయుటకు యత్నించెను ఇతనికి "గ్రాండ్ మొనార్క్" అను బిరుదము కలదు ఇతడు ఫ్రాన్సును అనేక యుద్ధములందు ముంచివైచెను స్పెయిన్ వారసత్వ యుద్ధములు ఇంగ్లండుతో అనేక తావులందు జరిగెను ఒకవైపు యుద్ధములు చేయుచునే పరిపాలనా విధానమును కట్టుదిట్టము చేసెను ఇతని కాలముననే ఫ్రెంచివారు ఉత్తర అమెరికా యందును, భారతదేశము నందును వ్యాపారము చేయుట ప్రారంభించి, వలసరాజ్యముల స్థాపించుకొను చుండిరి శాస్త్ర విజ్ఞానము బాగుగా అభివృద్ధి చెందినది. రసీన్, మోలీర్, కార్నెల్ వంటి రచయితలు వెలసిరి. లూయీకి ఆడంబరములన్న చాల యిష్టము. ఇతడు ఎనలేని భోగభాగ్యములతో తులదూగుచుండెడి వాడు ఇతని అనంతరము 1715 లో ఇతని కుమారుడు పదునైదవ లూయీ చక్రవర్తియై 1774 వరకు పాలించెను ఇతడు తండ్రివలెనే నిరంకుశ రాజ్యాధికారమును గురుతరము చేయుటకు యత్నించెను.

1774 వ సం॥లో పదునారవ లూయీ చక్రవర్తి ఆయెను. శతాబ్దముల నుండి పెరిగిపోవుచున్న ఇతని నిరంకుశాధికారము యొక్క ఫలితములు విస్పష్టమై తీవ్ర రూపమును దాల్చెను పదునాలుగవ, పదునైదవ లూయీల కాలములందలి యుద్ధములకును, చక్రవర్తుల భోగములకును, ఆడంబరములకు ధన మనంతముగా వ్యయమగు చుండెను కాని ఈ ధనమును చేకూర్పవలసిన బాధ్యత ఎట్టి హక్కులు లేని సామాన్య ప్రజల దాయెను. ధనికులు ఎట్టి పన్నులు ఇయ్యవలసిన అవసరము లేకయే మినహాయింపబడు చుండిరి. ఈ పరిస్థితి 1789 ప్రాంతమున మిక్కిలి విషమించెను.

1789 లో లూయీ చక్రవర్తికి ధన మవసరమై స్టేట్ జనరల్ అను శాసన సభను సమావేశపరచెను. శతాబ్దము నుండియు ఈ సభ ఏనాడును సమావేశము కాలేదు. చక్రవర్తి ధనమడుగగా, ప్రజలు నిరాకరించిరి. లూయీ శాసనసభను రద్దుచేసి వెడలిపోయెను కాని సభ్యులు కొందరు సమావేశమై హక్కుల చట్టమును సిద్ధముచేసి పంపిరి ఈలోగా ఫ్రాన్సునందు ఉద్రిక్త పరిస్థితి ఏర్పడెను ప్రజలు బాస్టిల్ అను చెరసాలను ముట్టడించి అచ్చటి ఖైదీలను విడుదల చేసిరి లూయీ పారిపోవుటకు యత్నించెను. కాని ప్రజలు అతనిని పట్టుకొనివచ్చి వారి హక్కుల పత్రమును నివేదించిరి ఆతడు అంగీకరించినట్లు నటించెను. కాని విప్లవమును అణచివేయుటకు రహస్యముగా ఆస్ట్రియాతో, సంప్రతింపులు చేయుచుండెను

ప్రజలు మొదటి రిపబ్లిక్కును ప్రకటించిరి. రిపబ్లిక్ కొన్ని ఉపయోగకరములైన సంస్కరణలు చేసెను కాని, అనంతరము తీవ్రవాదులు పరిస్థితిని చేజిక్కించు కొనిరి డాంటనే, రాబెస్ పేరే అనువారు ఒక భయంకర రాజకీయ విధానమును ప్రవేశపెట్టిరి. ధనికవర్గీయుల శిరములను ఛేదించిరి ఈ స్థితిని చూచి రెండవమారు లూయీ మరల భార్యతో పారిపోయెను. మరల ప్రజ లాతనిని పట్టుకొనివచ్చి శిరమును ఖండించిరి. కొంతకాలమైన పిదప లూయీ భార్యయైన మేరీ అంటాయినేట్ యొక్క శిరస్సును కూడ ఛేదించిరి ఈ భయంకర పరిపాలనము 1794 లో అంతరించెను 1795 లో క్రొత్త ప్రభుత్వము అయిదుగురు సభ్యులతో నేర్పడెను ఫ్రాన్సుపై ఇతర దేశములు యుద్ధమును ప్రకటించుటచే, ఫ్రెంచి సైన్యములకు నెపోలియన్ బోనపార్టీ సేనానిగా నియమింపబడెను

నెపోలియన్ విజయములు చేకొని క్రమముగా బలవంతుడయ్యెను ప్రజాస్వామ్య ప్రభుత్వము యొక్క అవకతవకలచే విసిగిన ప్రజలు తుదకు 1800లో ఇతనినే "కాన్సలు"గా ఎన్నుకొనిరి. తుదకు 1804 లో ఇతనినే చక్రవర్తిగా నొనర్చిరి నెపోలియన్ త్వరలో యూరపు నంతటిని జయించెను. ఆస్ట్రియా, ఇటలీలను జయించెను, ప్రష్యా అతనికి స్వాధీనమయ్యెను, ఈజిప్టుపై ఆతడు దాడిచేసెను. రష్యా చక్రవర్తి స్పర్థ కలుగుటచే, రష్యాపై ఆతడు దాడిచేసెను. కాని ఆతడు అపార నష్టముతో తిరిగి వచ్చెను నెపోలియన్ బలమునకు భయము చెందిన యూరపులోని దేశములు అతనిని ఓడింప తలపడిరి. ఇంగ్లండు నెపోలియనుపై కక్ష కట్టెను 1813 లో ఆస్ట్రియా, రష్యాలు నెపోలియనుతో యుద్ధము చేసెను.

దీనిలో నెపోలియన్ ఓడిపోయి రాజ్యమును విడిచెను ఈ లోపల పదునెనిమిదవ లూయీ (పదునేడవ లూయీ ఫ్రెంచి విప్లవములో మరణించుటచే) రాజుగా చేయబడెను. కాని వెడలిపోయిన నెపోలియన్ కొంతకాలమైన పిదప తిరిగివచ్చి లూయీని ఫ్రోసిరాజని తానే పాలింప మొదలిడెను ఇంగ్లడును, ఇతర దేశములును అతనితో యుద్ధమునకు దిగెను తుదకు 1815 లో వాటర్లూ యుద్ధమున అతడు ఓడిపోయెను నెపోలియన్ పది సంవత్సరములు ఫ్రాన్సుకు శాంతిభద్రతల నొసగెను అనేక సాంఘిక సంస్కరణములు చేసెను ఫ్రెంచి విశ్వవిద్యాలయమును స్థాపించెను న్యాయశాస్త్రమును క్రోడీకరింపించెను దీనిని "నెపోలియనిక్ కోడ్" అందురు

నెపోలియను పిదప, లూయీ మరల (1817-1824) ప్రజల ఇచ్ఛానుసారమే పరిపాలించెను 1830 లో యూరప్ లో విప్లవములు చెలరేగెను తత్ఫలితముగా ఫ్రాన్సునందును ప్రభుత్వము కొన్ని కట్టుదిట్టములు చేసెను లూయీ పిదప, ఛార్లెస్ మరల ప్రజలకు వ్యతిరేకముగా పాలించెను వారికి కల పెక్కు హక్కులను తీసివేసెను దీనిచే 1830 లో ప్రజలు మరల తిరుగుబాటు చేసిరి ఛార్లెస్ భయముచే సింహాసనము విడిచిపోయెను ఇతని పిదప పూర్వపు ఫ్రాన్సురాజగు నాలుగవ హెన్రీ యొక్క వంశ్యుడైన లూయీ ఫిలిప్ అనువాడు చక్రవర్తిగా చేయబడెను ఇతడు 1830-48 వరకు ప్రశాంతముగా పరిపాలించెను

యూరపునందు రాజకీయ సిద్ధాంతము లనేకములు ప్రతిపాదింపబడు చుండెను ఫ్రాన్సునందును ప్రజలకు ప్రాతినిధ్య మధికము కావలెనని ప్రజలు అలజడిచేసిరి. లూయీ ఇట్టిమార్పులను ఎదిరించెను మరల ప్రజలు 1848లో తిరుగుబాటు చేసిరి. లూయీ ఫిలిప్ భయముచెంది రాజ్యము విడిచిపోయెను. ప్రజలు తాత్కాలిక ప్రభుత్వము నేర్పరచిరి. దీనికి రెండవ రిపబ్లిక్ అనిపేరు. నెపోలియన్ బంధువైన లూయీ ఈ రిపబ్లిక్కునకు అధ్యక్షుడుగా నెన్నుకొనబడెను. అధ్యక్షుడైనపిదప లూయీ బలవంతుడై అధికారము లన్నిటిని చేజిక్కించుకొనెను 1852లో అతడొక రాజ్యాంగ చట్టమును ప్రసాదించెను. ప్రజలు దీని నంగీకరించిరి రెండవ రిపబ్లిక్ అంతరించి మరల రెండవ సామ్రాజ్యము స్థాపింపబడెను లూయీ, మూడవ నెపోలియన్ అను బిరుదముతో చక్రవర్తియాయెను

లూయీ, ప్రజల ఆదరాభిమానములు పొందుటకై ప్రజోపయోగకరములగు కొన్నిపనులను చేసెను పారిస్‌ను అనేక విధములుగా అభివృద్ధిపరచెను వ్యవసాయాభివృద్ధి కావించెను సౌశాశ్రయములు నిర్మించెను. రాజ్యవిస్తరణము కూడ చేయదలచి ఇతర రాజ్యములతో లూయీ యుద్ధములు చేసెను క్రిమియా యుద్ధమున చేరి టర్కీనుండి వ్యాపార సౌకర్యములు పొందెను 1859లో ఆస్ట్రియా-ఇటలీ యుద్ధములో ఇటలీతో కొన్నిభాగములు జయించెను 1870లో అకారణముగా ఫ్రాన్సు ప్రష్యాతో యుద్ధమునకు దిగెను దీనియందు ఫ్రాన్సు ఓడిపోయెను ఈ అపజయము లూయీ వలన, అతని సామ్రాజ్యవాదము వలన, ఘటిల్లెనని ప్రజలు భావించి నూతన ప్రభుత్వమును స్థాపించుకొనిరి 1871లో మరల మూడవ రిపబ్లిక్ అవతరించెను 1875లో నూతన రాజ్యాంగము ప్రతిపాదింపబడెను దీనిచే ఒక అధ్యక్షుడు, రెండు శాసనసభలు సృష్టింపబడెను. అధ్యక్షుడు మంత్రిమండలి సహాయముచే పరిపాలించెను

ఫ్రాన్సునందు, నాటినుండియు ప్రజాస్వామ్య ప్రభుత్వమే నడచుచున్నది. 1914-18 నాటి యుద్ధములో ఫ్రాన్సు మిత్రమండలితో చేరి జర్మనీ నెదిరించెను రెండవ ప్రపంచ యుద్ధములో 1940-1944 వరకు ఫ్రాన్సు రాజధానియగు పారిస్ జర్మనీకి వశమాయెను 1944లో అమెరికా సైన్యములు ఫ్రాన్సునందు ప్రవేశించి జర్మనీవారిని ఓడించి పారద్రోలెను ఫ్రాన్సు మరల స్వతంత్ర దేశమాయెను ఓడిపోయిన జర్మనీలో కొంతభాగము ఫ్రాన్సునకు లభించెను

స. శ్రీ. శ

## ఫ్రాన్సుదేశము (భూ).

ఐరోపా ఖండములో ఫ్రాన్సు ఒక ప్రముఖ దేశము దాని వైశాల్యము 2,12,919 చ. మైళ్ళు, జనసంఖ్య 4,65,20,271 (1962 సం.). ఐరోపా పశ్చిమ తీరమున మధ్యధరా సముద్రమునుండి "ఇంగ్లీషు ఛానల్" వరకు ఈ దేశము విస్తరించి యున్నది. ఉత్తర, పశ్చిమసముద్రతీరములద్వారా, ఉత్తర సముద్రము నంటియున్న దేశములకును అట్లాంటిక్ సముద్రమునకును, అమెరికా ఖండమునకును, దక్షిణతీర రాష్ట్రములద్వారా ప్రాగ్దేశములకును మార్గమైన సూయజ్ కాలువకును ఈ దేశమునుండి సులువైన రవాణా

మార్గములు సమకూడుటచే, భౌగోళికముగా ఫ్రాన్సు అను కూలమైన స్థానమునం దున్నది.

ఈ దేశముని విశేష భాగమునకు సముద్రము సరి హద్దుగా నున్నది తూర్పు, దక్షిణ దిశలందు మాత్రము కొంత భాగమునకు భూమి ఎల్లగా నున్నది దక్షిణమున ఉన్నతమైన "సియిర్రా" పర్వత పంక్తులు స్పెయినునుండి ఫ్రాన్సును విడగొట్టు చున్నవి ఫ్రాన్సుకు తూర్పు సరిహద్దున ఇటలీ, స్విట్జర్లెండు, జర్మనీ, బెల్జియము దేశము లున్నవి

నైసర్గిక లక్షణములు ఫ్రాన్సుయొక్క మొత్తము వైశాల్యములో అరవవంతు గల పీఠభూమి దేశమధ్యమున దక్షిణభాగమం దున్నది ఈ పీఠభూమియొక్క శీతోష్ణ, వాతావరణ లక్షణములచే ఈదేశము ప్రభావిత మగుచున్నది ఈ పీఠభూమియందు సీన్, లాయిర్, డార్డాన్, గెరోన్ అను మహానదు లుద్భవించినవి ఈ నదులకు సంబంధించిన పల్లపు మైదానములు, ఉత్తర, పశ్చిమ దిశలందు బెల్జియమ్ సరిహద్దునుండి పిరెన్నీస్ పర్వతపంక్తుల వరకు ఈ పీఠభూమిని పరివేష్టించి యున్నవి ఈ మైదానములకు ఆవలిప్రక్క పశ్చిమ దిశాగ్రమున పర్వతమయమగు బ్రిటన్నీ అను మండలము కలదు. దక్షిణమున, పైన పేర్కొనిన పీఠభూమి, మధ్యధరా సముద్రతీర మైదానమును తాకియున్నది, తూర్పున అదిరైన్-సన్ లోయను అంటి యున్నది ఈ విధముగా దేశమధ్యమందున్న పీఠభూమి ఈశాన్యమందు తప్ప, తక్కిన అన్ని దిశలయందు పల్లపు ప్రాంతమును అంటి యున్నది. పల్లపు ప్రాంతమగు రైనులోయకు తూర్పున, ఆల్ప్సు పర్వతముయొక్క పశ్చిమ భాగము కలదు ఈ ప్రాంతమునుండి జలమంతయు రైనునదికి ఉపనదులగు ఇస్కర్, థ్రాన్స్ అను వాటిలోనికి ప్రవహించును ఆల్ప్సు పర్వతముల వలెనే పిరెన్నీస్ కనుమలు ఫ్రాన్సు దక్షిణాగ్రమున ఫ్రెంచి-స్పానిష్ సరిహద్దుమీద నున్నవి

శీతోష్ణస్థితి ఫ్రాన్సులో కొంత భాగము ఉష్ణమండలమందును, కొంత భాగము శీతల మండలమందును కలదు. ముఖ్యముగా పశ్చిమ ప్రాంతమున దాని శీతోష్ణస్థితి సాధారణముగా సముద్రముచే ప్రభావితమై యున్నది తూర్పు సరిహద్దునను, ఉన్నత భూభాగములందును గల శీతోష్ణస్థితి భూఖండ లక్షణములచే ప్రభావిత మగుచున్నది. అందుచే అచ్చటి వాతావరణము కొలదిగ ఉష్ణతరముగను, మిగుల శీతలముగను ఉండును పర్వతములపై తప్ప, తక్కిన ప్రాంతములందు, పశ్చిమమునకంటె వర్షపాతము అల్పముగ నుండును

శీతోష్ణ స్థితిగతినిబట్టి ఫ్రాన్సు మూడుమండలములుగా విభజింపబడి యున్నది అందలి ముఖ్యలక్షణము లీ దిగువ పట్టికలోని అంకెల వలన తెలియగలవు

| మండలము | శీతోష్ణస్థితి | | | | వర్షపాతము (అంగుళములలో) | | |
|---|---|---|---|---|---|---|---|
| | జూలై | జనవరి | రేంజి | సం సగటు | చలికాలము | వేసవికాలము | మొత్తము |
| 1 వాయవ్యమండలము : | | | | | | | |
| (అ) బ్రెస్ట్ | 66F | 40F | 25F | 52F | 15 | 10 | 25 |
| (ఆ) పారిస్ | 65F | 36F | 29F | 50F | 9 | 11 | 20 |
| (ఇ) బోర్డియాక్స్ | 68F | 41F | 27F | 54F | 13 | 15 | 33 |
| 2. మధ్యధరా సముద్ర మైదానము- మార్సెయిల్స్ | 72F | 48F | 29F | 57F | 13 | 8 | 21 |
| 3 పీఠభూమి మండలము | | | | | | | |
| క్లెమాంట్ ఫెర్రాండ్ | 66F | 35F | 31F | 50F | 8 | 13 | 21 |

ఫ్రాన్సుయొక్క వాయవ్య భాగమందలి శీతోష్ణస్థితి తక్కిన అన్ని ప్రాంతములకంటె విశిష్టతరమైనది. అది సిద్ధమైన పశ్చిమ ఐరోపా శీతోష్ణమును పోలియుండి పెక్కు వైవిధ్యములతో కూడియున్నది. అన్ని ఋతువులలో ఘటిల్లు వర్షపాతము శీతకాలమున గరిష్ఠముగ నుండును. బ్రిటన్నీ మండలమందు గరిష్ఠ వర్షపతనము సంభవించును అచ్చటనుండి తూర్పుగా పారిస్, బెల్జియముల వైపువకు పోనుపోను శీతోష్ణస్థితి అధికమగును పశ్చిమమునుండి తూర్పునకు పోనుపోను,

దేశముయొక్క శీతోష్ణస్థితి యంతయు భూఖండ స్వభావము కల్గియుండును ఈ దేశమందలి ఉన్నత ప్రాంతములు సముద్ర తీరమునకు దూరముగ నుండుటచే, వాటిస్వభావ మింకను భూఖండ లక్షణ సమన్వితమై యుండును ఆప్రాంతము ఎత్తుగ మన్నను, వేసవిలో మిగుల వేడిగనుండును, చలికాలములో చలి తీవ్రముగ నుండును మంచు సాధారణముగా కురియు చునే యుండును గరిష్ఠ వర్షపాతము ఎండాకాలమున ఘటి ల్లును మధ్యధరా సముద్రతీర మైదానమునందును రైను నదీ లోయయందును గల శీతోష్ణ వాతావరణములు మధ్య ధరా సముద్ర వాతావరణ లక్షణము కలవై యుండును (పైపట్టికచూడుడు) వేసవి మిగుల వేడిగను, శీతాకాలము మిగుల చల్లగను ఉండును మొత్తము వర్షపాతములో విశేష భాగము శీతకాలములో ఘటిల్లును ఇతర ప్రాంతములకంటె ఈ మండలములో సగటు శీతోష్ణస్థితి అధికతరముగ నుండును

ఫ్రాన్సుయొక్క సహజ మండలములు నైసర్గిక, శీతోష్ణస్థితుల వైవిధ్యము కారణముగా, ఈ దేశము దిగువ పేర్కొనబడిన సహజమండలముల క్రింద విభజింప బడ వచ్చును.

1 వాయవ్య ద్వీపకల్పము ఇందు ప్రాచీనకాలపు పల్లి రాతి గుట్టలు కలవు తీరరేఖ శిలామయమై ఎగుడు దిగుడుగ నుండును ఇందు జలమయమైన పెక్కు లోయలు కలవు అన్ని ప్రాంతములందు వర్షములు కురియుటచే, పచ్చిక పపుగా పెరుగును అందుచే పశువుల పెంపకమునకు, పాడి పరిశ్రమకు ఈ మండలము మిగుల ప్రఖ్యాతి వహించినది ఇచ్చట వేసవి మిగుల చల్లగ నుండుటచే, ద్రాక్షతోటలు మెండుగా ఫలించు చున్నవి ఇచ్చటనుండి స్ట్రాబెర్రీ ఫలములు భారీ యెత్తున ఇంగ్లండున కెగుమతి యగును చారిత్రిక ముగా ప్రఖ్యాతి వహించుట చేతను, ప్రకృతి దృశ్యములతో రమణీయముగ నుండుటచేతను, వినోదార్థ మరుదెంచు పెక్కు యాత్రికులను ఈ ప్రాంతము ఆకర్షించు చున్నది

అక్విటెయిన్ ఇది నైరృతి ఫ్రాన్సునందలి యొక పల్లపు ప్రాంతము ఇది చారెంటీ, గారోన్, ఆడర్ నదుల పరీవాహక ప్రాంతములచే వ్యాక్రమింపబడి, ఇంచుమించు త్రిభుజాకార మైదానముగా నుండును ఇందధికభాగము బంక మన్నుతో కూడిన బండునేల కలదు చారెంటీ పరీవాహక మండల మంతయు విశేషముగా సున్నపు రాతితో నిండి యున్నది అక్విటెయిన్ సముద్ర తీరము సరళరేఖవలె సూటిగా నుండును అం దిసుకరాయి కలదు దాని వెనుక లోతులేని సముద్రపు కయ్యలున్నవి ఈ ప్రాంతములో గొర్రెలు మేయు పచ్చిక బయళ్ళు తప్ప, సారవంతమైన భూములు లేవు ఈ ప్రాంతమును ఫలప్రద మొనర్చుటకై, ఇచ్చట నిలువయున్న నీటిని తోడివైచి 'కోనిఫెరస్' అను వృక్షములను నాటుచున్నారు పడమటి గాలుల ప్రభావముచే దేశములోనికి త్రోసికొనివచ్చు ఇసుకను అరికట్టుటయే కాక, దేశాదాయమును కూర్చు సాధనములుగా గూడ ఈ వృక్షములు ఉపయోగ పడుచున్నవి ఇది వ్యవసాయమునకు అను కూలమగు సుక్షేత్రముగా పరిణమించు చున్నది చారెంటి నదీలోయ గోధుమ, ద్రాక్షపంటలకును, బ్రాందీ మున్నగు సారాయములకును ప్రసిద్ధమైనది గారోన్ లోయలో మొక్కజొన్న, పొగాకు, గోధుమ పండును దేశములో నెల్ల ద్రాక్ష ఫలములు, ద్రాక్ష సారాయము ఉత్పత్తియగు ప్రధాన కేంద్రములలో నిది యొకటి

బోర్డియాక్స్ ముఖ్యమగు ఈ రేవుపట్టణము కొన్ని అంశములలో ఇంగ్లండు నందలి బ్రిస్టల్ రేవును పోలి యున్నది ఇందు పంచదార శుద్ధి కర్మాగారములు, చాకొలెట్, కోకో పరిశ్రమలు కలవు ఆగ్నేయ దిశాగ్రమున నున్న టౌలన్ నగరము, మధ్యధరా సముద్రమునకు పోవు కార్కసొన్నీ అను ద్వారమార్గమును తన అదుపునం దుంచు కొనును

పారిస్ మండలము ఈ మండలమును సీన్, రివా పొమ్మీ నదుల యొక్కయు, లాయిర్ నదీ మధ్యభాగము యొక్కయు పరీవాహక ప్రాంతము లాక్రమించి యున్నవి ఇచ్చట సున్నపురాయి, సిమెంటున్నవు గనులున్నవి ఇది కూడ అక్విటెయిన్ వలె సారవంతమగు ప్రాంతము గోధుమ, ద్రాక్ష పంటలకు, గొర్రెల పెంపకమునకు, గుర్రముల పెంపకమునకు, పాడి పరిశ్రమకు ఇది ప్రసిద్ధి కెక్కినది సీన్ నదీ ముఖద్వారము చెంతనున్న హావిర్ అనునది ఫ్రాన్సు నందు ముఖ్యమగు రెండవ సముద్రపు రేవు నీస్సి, టౌలోన్, కెలే అనునవి ముఖ్యములైన ఇతర రేవు పట్టణములు ఈ పట్టణములనుండి ఇంగ్లండునకు పొగ యోడలు ప్రయాణించు చుండును మహానగరమగు పారిస్ ఈ దేశమునకు రాజధాని యూరపునందలి వివిధ దేశములకు పోవు మార్గములకు

నగరము కూడలి యగుటచే, దీని ప్రాధాన్యము విశేష మైనది

**ఈశాన్య పారిశ్రామిక మండలము** ఈ మండలము వ్యవసాయ దృష్టిచే సారవంతమైన దగుటయేకాక, పారిశ్రామికముగ గూడ అతిప్రధానమగు ప్రాంతము ఇందు బొగ్గు గనులు విశేషముగా కలవు నూలు, ఉన్ని వస్త్ర పరిశ్రమలు లిల్లీ, రౌబెక్స్, టూర్‌కోయింగ్, ఆర్మెంటీర్స్ నగరములందు నెలకొని యున్నవి. ఇందు ఇంజనీరింగు పరిశ్రమలు, పంచదారశుద్ధి కర్మాగారములు, గాజు పరిశ్రమలు కూడ నుండుటచే ఈ మండలము మిగుల ప్రఖ్యాతిగాంచి యున్నది

కేంద్ర పీఠభూమి : పైన పేర్కొనిన దేశమధ్యమందలి పీఠభూమియొక్క సగటు ఎత్తు 3000 అడుగులు ఇది దేశమందలి ప్రధానమైన జలవిభాజక క్షేత్రములలో నొకటి ఈ పీఠభూమియందు వేర్వేరు శాఖల ఎత్తు ననుసరించియు, అతి శీతలమైన చలికాలపు స్వభావమును బట్టియు, నిస్సారమగు భూలక్షణముల ననుసరించియు, ఇచ్చటి వ్యవసాయ పద్ధతులు వేరువేరుగా నుండును మేకలు, గొర్రెలు ఇందు విశేషముగా నుండుటచే, ఉన్ని వస్త్రపరిశ్రమయు, జున్ను పరిశ్రమయు అభివృద్ధి చెందినవి 'ఎలిమెంట్ ఫెర్రాండ్' అనునది ఇందలి ప్రధాన విపణికేంద్రము ఇచ్చట రబ్బరు పరిశ్రమాలయము కూడ కలదు తూర్పు, ఆగ్నేయ దిశలందున్న రైన్, మధ్యధరా సముద్రతీర మైదానములు అత్యంత సారవంతమైనవి ఇచ్చట ఇనుము, ఉక్కు, పట్టుపరిశ్రమలు ప్రముఖమైనవి ఉద్ధృతముగా ప్రవహించు ఇచ్చటి నదుల జలముల నుండి విద్యుచ్ఛక్తి ఉత్పత్తి యగుచున్నది ఈ విద్యుచ్ఛక్తి నైరృతి భాగమందున్న బోర్డియాక్స్, టూలన్, పిరెన్నీస్ మండలములకు సరఫరా యగుచున్నది తక్కిన ప్రాంతముల కంటె ఈ మండలమందు జనసంఖ్య పలుచగ నుండును అననుకూల పరిస్థితులు కారణముగా, ఇందలి జనులు పారిస్ మున్నగు నగరములకు వలసపోవు చున్నారు

**తూర్పు సరిహద్దు ప్రాంతము** మ్యూస్, రైన్ నదుల నడుమనున్న ఈ ప్రాంతము ఖనిజసంపదకు పేరు బడసినది నిమ్నముగ నుండు ఈ మండలమున నడుమ నడుమ పీఠభూములు కన్పట్టును దీనికి ఆగ్నేయముగా మధ్య యూరపులో నెల్ల అతి ప్రాచీనములగు పర్వతపంక్తులలో నొకటి యగు వాస్జెస్ కనుమభాగము కలదు లగ్జెంబర్గును అనుకొని దక్షిణముననున్న లారెయిన్ మండలములో యూరపులో నెల్ల పెద్దవియగు ఇనుపగనులు కలవు మోసెల్లీ నదికి తూర్పున గొప్ప ఉప్పుగనులు లున్నవి వాస్జెస్ పర్వతములకు దక్షిణమునను, తూర్పునను మల్‌హౌస్, కోల్మర్, బెల్‌ఫర్ట్ అను ముఖ్య కేంద్రములలో ప్రముఖములైన వస్త్ర పరిశ్రమలు కలవు స్ట్రాస్‌బర్గ్ నగరము, పశ్చిమముగా పారిస్ నగరమునకు పోవు మార్గమును, ఫ్రాంక్‌ఫర్ట్ ద్వారా ఉత్తరమున నున్న జర్మనీకి పోవు మార్గమును, తూర్పుదిశగా తూర్పు యూరపునకు పోవు మార్గమును, దక్షిణముగా స్విట్జర్లెండునకు పోవు మార్గమును అదుపులో నుంచుకొనును రైన్ నదిపై పోగ యోడలు స్ట్రాస్‌బర్గు వరకు ప్రయాణింప గల్గుటచే, ఈ రేవుపట్టణము మిగుల ఉపయోగకారిగా నున్నది

**రైన్–సోన్ పరీవాహక మండలము** రైన్ నది గోతార్డ్ పర్వత శిఖరమునొద్ద పుట్టి, ఫ్రెంచి సరిహద్దు కావలనున్న జినీవా సరస్సునకు తూర్పుగా ప్రవహించి, అచ్చటనుండి పశ్చిమమునకు మరలి, పర్వత మయమైన ప్రాంతమున ప్రవహించి, లయన్స్ నగరమును చేరి, అచ్చట ఆకస్మికముగా దక్షిణమునకు తిరిగి, సోన్ నదితో కలియు చున్నది ఉత్తర-దక్షిణములుగా సంయుక్తముగా నేర్పడిన రైన్-సోన్ లోయ, చారిత్రక యుగములో మధ్యధరా సముద్రమునుండి ఉత్తర యూరపునకు ప్రధానమగు రహదారిగా ఉపయోగించినది సహజముగ నేర్పడిన ఈ ప్రముఖ మార్గము పారిస్, బ్రిటను, ఉత్తర జర్మనీలకు రవాణా సౌకర్యమును సమకూర్చినది. ఈ లోయ వ్యవసాయ దృష్టి చేతను, పారిశ్రామికముగను గూడ ముఖ్యమైనది లయన్సుకు ఉత్తరముననున్న సోన్ లోయ భూసంబంధ శీతోష్ణస్థితి కలిగి, అత్యుష్ణముగను, అతి శీతలముగను గూడ ఉండును అచ్చట వేసవియందు వర్షములు కురియును శీతోష్ణస్థితి మధ్యధరా సముద్ర లక్షణము కలదిగ నుండును అందలి ముఖ్యములగు పంటలు గోధుమ, ద్రాక్ష ఫ్రాన్సులో మూడవదియైన లయన్స్ నగరము ముఖ్యమైన రైల్వే కూడలి

సోన్ లోయకు తూర్పున సమాంతరములుగా నేర్పడి యున్న సున్నపురాతి గుట్టలు తూర్పు-పశ్చిమ రహదారులకు అంతరాయములుగ నున్నవి లయన్స్ నగరమునొద్ద మల్బెర్రీ వృక్షములను పెంచుటవలన, రైన్ లోయలో పట్టుపురుగుల

పరిశ్రమ అభివృద్ధి చెందుటవలన, అది ప్రధానమగు పట్టు పరిశ్రమ కేంద్రముగా ప్రసిద్ధి కెక్కినది

**మధ్యధరా సముద్ర తీరమండలము** ఈ ప్రాంతమందు త్రిభుజాకృతిగల దిగువ రైనుమండలమును, తీరమునంటి తూర్పు-పడమరలకు విస్తరించిన ఇరుకు మైదానములును, చేరి యున్నవి మార్సెయిల్సుకు పడమరగానున్న మైదానము పండలి మట్టితో కూడిన రేగడభూమి ఇందు సువిశాలమైన రైన్ నది డెల్టాకూడ కలదు అడవులను ఛేదించుట వలన, అచ్చటి నదులు పొట్టివగుటవలన, మంచుగడ్డలు కరుగగా ఏర్పడు జలము, విపరీతమైన వర్ష జలముతో ఏకమై పొంగి పొరలి ఆ ప్రాంతమంతటిని భీభత్సముగా వరదలలో ముంచెత్తును మధ్యధరా సముద్ర శీతోష్ణ స్వభావముగల ఈ ప్రాంతములో వేసవి ఉష్ణముగ నుండును శీతకాలము ప్రశాంతముగ నుండును ఈ ఋతువులయందే వర్షములు అత్యధికముగా కురియును, వేసవులు అత్యుష్ణముగ నుండుటచే పచ్చిక బయళ్ళు ఏపుగా పెరుగవు ఈ మండలమున నీటి పారుదల సౌకర్యములు ఆవశ్యకములు మధ్యధరా సముద్ర ప్రాంతమున ఆలివు, ద్రాక్ష, మల్బెర్రీ పైరులు మాత్రమే పెరుగును, ఉత్తర రైనునదికి ముప్పది మైళ్ళలో నున్న మార్సెయిల్స్, ఫ్రాన్సులోనెల్ల మొట్టమొదటి సముద్రపు రేవుగను, రెండవ గొప్ప నగరముగను ప్రసిద్ధి చెందినది ఈ నగరమున పిండి మరలు, సబ్బు పరిశ్రమలు, చర్మ పరిశ్రమలు, పంచదార మిల్లులు నెలకొని యున్నవి

**ప్రధానమగు వ్యవసాయక దేశము** ఈ దేశములో కొన్ని పరిశ్రమలు వృద్ధిచెంది యున్నను, ఈ దిగువ కారణములచే అది వ్యవసాయ ప్రాధాన్యముకల దేశ మనదగి యున్నది (1) సారవంతములైన భూములు అధిక శాతములో నుండుట (2) వ్యవసాయమునకు అనుకూలమగు చెమ్మ, శీతోష్ణ పరిమాణము (3) పారిశ్రామిక వికాసమునకు దోహదమిచ్చు బొగ్గుగనులు విస్తారముగా లేకుండుట (4) వివిధములగు పంటలను పండించు అవకాశములు మెండుగా నుండుట (5) ఫ్రెంచి ప్రజలకు భూమియందుండెడి ఆదరము, తరములనుండి పారంపర్యముగ వచ్చెడి వ్యవసాయ సంప్రదాయమును కొనసాగించుటయందు ఫ్రెంచి రైతాంగమునకు గల శ్రద్ధాసక్తులు

**వాణిజ్యము** ఫ్రాన్సునందు ఘటిల్లు వ్యవసాయాభివృద్ధి వలన, వివిధ తరగతుల వ్యవసాయపు పంటలు పండుట వలన, ఆ దేశము ఆహార పదార్థములకొరకు విదేశములపై ఆధారపడుటలేదు పారిశ్రామికాభివృద్ధి ఘనముగ లేకుండుటచే, కొలదిగ మాత్రమే ముడిసరకులను విదేశములనుండి దిగుమతి చేసికొని, తయారైన పారిశ్రామిక వస్తువులను గూడ కొలదిగ మాత్రమే ఇది ఎగుమతి చేయును ఆహారపదార్థములతో పాటుగా, బొగ్గు, ముడిలోహములు, ఉద్భిజ్జ తైలములు, ఉన్ని, ప్రత్తి, పట్టు, యంత్రములు, కాఫీ మున్నగు సరకులను ముఖ్యముగా ఈ దేశము దిగుమతి చేసికొను చున్నది ఈ దేశమునుండి ప్రధానముగా పట్టు, నారవస్త్రములు, యంత్ర పరికరములు, మోటారు శకటములు, పెక్కు విలాస వస్తువులు ఎగుమతి యగుచుండును

వి. వి.

## ఫ్రాయిడ్ (1856-1939).

సిగ్మండ్ ఫ్రాయిడ్ అనునతడు సుప్రసిద్ధుడైన మనోవిశ్లేషణ సిద్ధాంత స్థాపనాచార్యుడు ఆతడు క్రీ శ 1856వ సంవత్సరములో మొరేవియా రాష్ట్రములోని ఫ్రీబెర్గు నగరమున నొక యూదు కుటుంబములో జన్మించెను ఆతడు మూడు సంవత్సరముల ప్రాయములో నున్నప్పుడు అతని తలిదండ్రులు ఆస్ట్రియా రాజధానియగు వియన్నా నగరమునకు తరలిపోయిరి వియన్నానగరములో ఫ్రాయిడ్ దాదాపు ఎనిమిది సంవత్సరములు గడిపెను ఆ తరుణముననే డార్విన్ మహాశయుడు "జాతుల ఉత్పత్తి" అను మహాగ్రంథమును రచించెను మానవుని గూర్చిన భావమునందీ గ్రంథము విప్లవపూరితమగు సంచలనము కల్గించెను పరిణామవాద సిద్ధాంతము ననుసరించి, మానవుడు ప్రకృతిలో నొక భాగముగను, జంతు వర్గములో నొక జంతువుగను భావింపబడెను వయఃపరిపాకము నొందుచుండిన ఫ్రాయిడ్ మనఃఫలకముపై ఈ భావము గొప్ప ప్రభావమును ప్రసరింపజేసెను

క్రీ శ 1881వ సంవత్సరములో ఫ్రాయిడ్ వియన్నా విశ్వవిద్యాలయములో వైద్యశాస్త్రమున పరీక్షితుడై, పట్టభద్రుడయ్యెను వైద్య విద్యార్థిగా నున్నదశలో, ఇతడు వియన్నా విశ్వవిద్యాలయమున శరీరశాస్త్ర ప్రయోగశాలా నిర్వహణాధికారియు, సమకాలిక శారీరకశాస్త్ర ప్రవీణులలో అత్యంత సమర్థుడునైన ఎర్నెస్ట్‌బ్రూక్ అనువానని ప్రభావము క్రిందికి వచ్చెను ఫ్రాయిడ్ తంత్రికా విజ్ఞానమును గూర్చి

విశేషముగు శ్రద్ధానక్తులతో అధ్యయన మొనర్చెను కాని పరిస్థితుల ప్రాబల్యముచే దీర్ఘకాల మాతనికి పరిశోధనలను ఒరపు అవకాశము లభింపకుండెను అందుచే అతడు వైద్య వృత్తిని చేపట్టవలసి వచ్చెను

పూర్వ మనఃప్రవృత్తి ననుసరించి, ఫ్రాయిడ్ సహజ సిద్ధముగ నాడీభంగముచే బాధితులైన రోగులకు చికిత్స నొసగుటయందు ప్రత్యేక శ్రద్ధవహించెను. ఆ దశయందు నాడీ వైద్యపరిజ్ఞాన మంతగా అభివృద్ధిపొంది యుండలేదు మనో జాడ్యములచే పీడింపబడుచున్న ట్లగపడు రోగులతో ఫ్రాయి డుకు పరిచయ మేర్పడెను అవగత చైతన్యములో శక్తి మంతములగు విశేషాంశము లున్నవనియు, అవి అసాధారణ లక్షణములను కలుగజేయు చుండుననియు, అతడు అనుమా నించెను

క్రీ శ 1885 వ సంవత్సరములో జీన్ మార్టిన్ చార్కాట్ అను శాస్త్రజ్ఞుని యొద్ద ఒక సంవత్సరకాలము శాస్త్రాధ్యయన మొనర్చుటకై ఫ్రాయిడ్ పారిస్ నగరమున కేగెను యోగనిద్ర మూలమున మూర్ఛలకు జయప్రదముగా చికిత్స యొసగుటయందు మార్టిన్ ప్రసిద్ధి గడించియుండెను ఫ్రాయిడ్ అతనియొద్ద శిక్షితుడై స్వస్థలమునకు మరలివచ్చి, స్వయముగా నై ప్రక్రియ ననుసరించి మూర్ఛవ్యాధులకు చికిత్సచేయ నారంభించెను కాని ఈ చికిత్సావిధానము వలన పెక్కు సందర్భములలో తాత్కాలిక ప్రయోజనము మాత్రమే కల్గుటవలన, దానియెడల ఫ్రాయిడ్ క్రమముగా అసంతృప్తి చెందెను

కొలది సంవత్సరముల అనంతరము వియన్నా నగరము నందు సుప్రసిద్ధ వైద్యుడగు జోసెఫ్ బ్రూయరుతో గావించు కొనిన పరిచయభాగ్యము వలన, ఫ్రాయిడునకు రేచక విధా నము నందలి విలువ బోధపడెను అటుపిమ్మట ఫ్రాయిడ్ ఈ విధానమును స్వేచ్ఛాసహవాస ప్రక్రియగా అభివృద్ధి పరచెను ఈ ప్రక్రియ ననుసరించి, రోగి, తనమనములో జనించు భావ ములనెల్ల వెల్లడి చేయవలసి యుండెను ఫ్రాయిడు, బ్రూయరు లిరువురు సంయుక్తముగా నొనరించిన కృషిఫలితముగా, సుప్ర సిద్ధమగు "మూర్ఛావ్యాధి విచారణము, అను గ్రంథము క్రీ శ 1895లో అవతరించెను. కాని అధివ్యాధులం దుత్పన్న మగు లైంగికాంశములకు ఫ్రాయిడ్ అధికప్రాధాన్య మొస గుటచే, అతనికి బ్రూయరుతో అభిప్రాయభేద మేర్పడి, తుదకు బ్రూయరునకు అతనితో సంబంధము త్రెంచుకొనవలసి వచ్చెను

1900వ సం॥లో ఫ్రాయిడుచే రచింపబడిన "స్వప్న వివరణము" అను చిరస్మరణీయ గ్రంథము ప్రచురింపబడెను ప్రథమమున ఈ గ్రంథము అంతగా ప్రజాదరణము బడయ కున్నను, క్రమముగా ఆధునిక మహాగ్రంథములలో నొకటిగా గణుతికెక్కెను ఈగ్రంథము కేవల మొక స్వప్నవృత్తాంతము మాత్రము కాదు, ఫ్రాయిడు సంవత్సరములుగా శ్రమించి ఏకాగ్రతతో స్వయం విశ్లేషణము గావించుకొనిన ఫలముగా ఆవిష్కరణమైన ఉద్గ్రంథమిది ఈ గ్రంథములో మానవ మనో గత శాస్త్రమునుగూర్చి ఫ్రాయిడ్ ప్రతిపాదించిన నూతన సిద్ధాంతము వివరింపబడి యున్నది అవగతచైతన్యసిద్ధికి స్వప్నములు రాజమార్గముల వంటి వనియు, స్వప్నము లన్నియు సుఖస్వప్నముల నుండి అత్యంత భయంకరములైన దుస్స్వప్నముల వరకు కోర్కెలను తీర్చుకొనుటకు చేరా ప్రయత్నించుట కుద్దేశింపబడినవనియు, ఫ్రాయిడు విశ్వసించెను స్వప్నములయందు, మానవునిలో అణగియుండు వాంఛలు ప్రచ్ఛన్న రూపములో సంకేతములుగా గోచరమగునని అతని నమ్మకము

ఈ దిగువ ఉదాహరింపబడిన రీతిగా, ఫ్రాయిడ్ ఒక దానివెంట నొకటి తన ఉత్తమ గ్రంథములను, వ్యాసములను రచించి ప్రకటింపించెను 1904వ సంవత్సరములో 'దైనందిన మనస్తత్వ రోగ నిదానము' అను గ్రంథము ప్రచురింపబడెను ఈ గ్రంథము వాగ్దోషములకు, లిఖిత దోషములకు, మరపు దనమునకు గల కారణములను వివరించును ఇవన్నియు అజ్ఞాత హేతువులచే జనించునని ఫ్రాయిడ్ విశ్వసించెను 1905వ సంవత్సరములో 'లైంగిక శాస్త్రముపై 'మూడు వ్యాసములు' అను మరియొక గ్రంథము వెలువడెను లైంగిక జ్ఞాన వికాసమును గూర్చి ఫ్రాయిడ్ తన అభిప్రాయముల నీ గ్రంథమున వివరించెను బాల్యదశయందు కూడ లైంగికజ్ఞాన ముండుననియు, అట్టి జ్ఞానము పుట్టుకతోడనే ప్రారంభమగు ననియు ఈ గ్రంథమున పేర్కొనబడెను మానవుని సకల కార్యములను ప్రేరణము చేయునది బలీయమగు లైంగిక వాంఛయేనని ఫ్రాయిడ్ అభిప్రాయము లైంగిక వాంఛా జనితమైన ఆధునిక నాగరికత మహోన్నత స్థితిగా పరిణామ మొందగలదనియు ఫ్రాయిడ్ విశ్వసించెను 1905వ సంవత్స రములోనే "ఛలోక్తులు – అవగత చైతన్యము" అను మరి

యొక గ్రంథమాతడు రచించెను ప్రజలు పలుకు ఛలోక్తులు అవగత చైతన్యాజన్యములనియు, మానవుడు నవ్వేది నవ్వు ఆతని మనములో అణగియుండు కోరికలకు చిహ్నమైన సంతుష్టి మాత్రమే అనియు ఫ్రాయిడ్ విశ్వసించెను

ఫ్రాయిడ్ పెక్కు సంవత్సరముల కాలము ఏకాకిగనే కృషిసల్పెను ఆతని రచనలు, అతడు ప్రయోగించిన మనోవిశ్లేషణ విధానమువలన సిద్ధించిన విజయములు, పెక్కుమంది అనుచరులను ఆతని పక్షమునకు ఆకర్షింపగల్గెను అట్టివారిలో ఆడ్లర్, జంగ్ ప్రభృతులు ముఖ్యులు వీరు క్రమముగా లైంగిక సిద్ధాంతముపై ఫ్రాయిడుతో భేదించిరి తంత్రికా విజ్ఞానములో లైంగికాంశమునకు ప్రాధాన్యము లేదని వాదించిన వీరు ఫ్రాయిడునుండి వేరై, స్వతంత్రములైన సిద్ధాంత మార్గములను త్రొక్కిరి

ఫ్రాయిడ్ తన జీవితాంతము వరకు గ్రంథములను వ్రాయుచు, తన పూర్వ సిద్ధాంతములను పరిష్కరించుచునే యుండెను అనంతర మాతడు రచించిన గ్రంథములలో "బియాండ్ ది ప్లెజర్ ప్రిన్సిపుల్", "గ్రూప్ సైకాలజీ-ఎనాలిసిస్ ఆఫ్ ఈగో", "ఫ్యూచర్ ఆఫ్ ఇల్యూజన్", "సివిలిజేషన్-ఇట్స్ డిస్కంటెంట్స్", "మోసెస్ అండ్ మోనోథీయిజమ్" అనునవి ముఖ్యములైనవి

1938వ సంవత్సరములో ఫ్రాయిడ్ రచించిన గ్రంథములను, పత్రముల నన్నిటిని జర్మను నాజీ అధికారులు కాల్చివైచి, ఆతనికి ప్రాణభయమును కల్పించిరి అందుచే మిత్రుల సహాయముతో ఆతడు ఇంగ్లండునకు వెడలిపోయెను ఆతడు లండను నగరములో ఒక సంవత్సరము పైగానుండిన సమయములో, నోటియందు పుట్టకురుపు లేచి అనేక సంవత్సరములు బాధపడెను శస్త్రచికిత్స లెన్నిజరపినను, ప్రయోజనము కలుగక, తుదకాతడు 1939 సెప్టెంబరు 23వ తేదీన మృతినొందెను

మ మ. ర

## ఫ్రెంచిభాషా సారస్వతములు.

ఇండో-యూరపియన్ భాషాకుటుంబమునకు చెందిన లాటిన్ నుండి రోమక భాషలు జనించినవి ఈ రోమక భాషలలో ప్రసిద్ధమైన భాష ఫ్రెంచిభాష పూర్వపు రోము మహాసామ్రాజ్యమునందలి 'గాల్' అను పేరుగల ఫ్రెంచి సీమయందు ఒక రకమైన అపభ్రంశపు లాటిన్ భాషలో వాడుక వ్యాప్తి చెందినది. కాలక్రమమున అపభ్రంశపు లాటిన్ అనేక రూపాంతరములు చెందినది చిట్టచివరకు క్రీ శ 9వ శతాబ్దమున అతిప్రాచీన ఫ్రెంచి భాషగా రూపుదాల్చినది ఈ ప్రాచీన ఫ్రెంచిభాష క్రీ శ 16 వ శతాబ్దమునకు మధ్యయుగపు ఫ్రెంచిగా మారినది 17వ శతాబ్దమునకు ఈ భాషలలోని విభిన్న మాండలికములకు సాన్నిహిత్యము చేకూరి, ఆధునిక ఫ్రెంచి భాషగా ఇది మారినది ఇది ఫ్రాన్సు దేశపు జాతీయ భాష అంతేకాక బెల్జియం, స్విట్జర్లెండు, కెనడా, ఇటలీ దేశములందు ఫ్రెంచి భాషలో వ్యవహరించు ప్రజలు లక్షల మంది గలరు ఆఫ్రికాయందలి ఫ్రెంచి వలస రాజ్యములోను, మరికొన్ని ఆఫ్రికను ప్రాంతము లందును ఫ్రెంచిభాష వ్యవహారములో నున్నది

ఈ భాషలోని అనేక పదములు లాటిన్ భాషా జన్యములే అయినను గ్రీకు, అరబిక్, ఇంగ్లీషు, స్కాండినేవియన్, ఇటాలియన్ భాషా పదములు ఫ్రెంచి భాషయందు చొరబడి సముచిత స్థానమును సాధించుకొన్నవి ఈభాష వ్రాయబడు లిపి రోమను లిపి ఫ్రెంచిలో పదాంతపు హల్లు ఉచ్చరించుట జరగదు

ఫ్రెంచిప్రజల సౌందర్యపిపాస, సౌందర్యారాధన, సౌందర్యసృష్టి, వారిసృజనాత్మక ప్రక్రియలన్నిటిలో ప్రతిఫలించినవి అరీతిగనే వారి సారస్వత సృష్టికూడ సౌందర్య పరిపూర్ణమై ప్రపంచమున ప్రముఖ స్థానము నాక్రమించినది

ఫ్రెంచి భాష సమైక్యమై ఏకైకమగు ఫ్రెంచి భాషగా రూపొందక పూర్వము అందు అనేకములగు మాండలికము లుండెడివి ఆ మాండలికములలో కూడ సారస్వతసృష్టి కొంత వరకుసాగి, తర్వాత సారస్వత వికాసమునకు అది నాంది యైనది ఈ మాండలికములలో "ఫ్రాంసియన్" మాండలికమునకు ప్రజల ఆదరణము అధికముగా లభించినది అందువలన తక్కిన మాండలికము లన్నియు ఇందులో ఇమిడిపోయినవి క్రీ శ 12 వ శతాబ్దమునాటికి ఈభాషలో కొన్ని గ్రంథముల రచన సాగినది ఈ రచనలలో "షేన్‌సన్ ది రోలాండ్" "(రోలాండుగీతము)" అనునది సర్వోత్తమమైన రచనగా పేరొందినది క్రైస్తవ మతరక్షణ నిమిత్తమై ముస్లిములతో పోరాడి స్వర్గ మలంకరించిన ఒక వీరుని గాథ ఈగీతమునకు కథావస్తువు తర్వాత కూడ వీర గాథాచిత్రణము చేసిన ఇటువంటి రచనలు కొందరు కవుల లేఖినుల నుండి వెలువడినవి

తర్వాత వెలువడిన కావ్యములలో ప్రేమారాధనము ప్రాముఖ్యము వహించినది. ఇట్టి కావ్యరచనా రీతిలో గొప్ప స్థానము నాక్రమించిన కవి క్రిటిన్ డిట్రాయీ అనువతడు. ఆ తర్వాత ప్రేమారాధనమే ప్రధానముగా గల గద్య రచనలు కూడ వెలువడినవి. ఈ శతాబ్దములలో ఇతిహాసప్రధాన ప్రేమారాధన ప్రపూరిత కావ్యరచనలే కాక, కొన్ని స్వతంత్ర రచనలు కూడా సాగినవి. వాటిలో పన్నెకెక్కిన సంకలన గ్రంథరాజము "రోమాన్ డి రేనా" అనునది. వివిధకవుల రచనలను సంపుటీకరించిన సంకలన గ్రంథ మిది.

13 వ శతాబ్దమున గేయరచనకు మరికొంత పుష్టి చేకూరినది. 15 వ శతాబ్దమున "విల్లోన్" రచనలతో ఫ్రెంచి గేయరచనల ప్రతిష్ఠ పెరిగి పోయినది. 15 వ శతాబ్దములో అర్నూల్ గ్రిబాన్ కవివరేణ్యుని వంటివారు మత బోధకు తమ రచనావ్యాసంగమును సాధన భూతముగా నొనరించుకొనినారు. మరికొందరు కవులు తమహృదయములలో స్పందించిన భావనలకే కవితారూపమునిచ్చి ఆత్మాశ్రయ కవిత వెలయించినారు. స్వీయానుభవ ప్రకటనయే లక్ష్యముగాగల కవితను సృష్టించి, 13 వ శతాబ్దము నాటికే ఆత్మాశ్రయ కవితోద్యమమును ప్రారంభించి ప్రసిద్ధి బడసిన కవి ఆడమ్ డిలా హేలి. 13, 15 వ శతాబ్దముల నడుమ జరిగిన కృషిలో రూపకములు విరివిగా రచింప బడినవి. అవియేకాక నీతి ప్రబోధకరములగు రచనలు, ప్రహసనములు కూడా కొందరు రచించిరి. ఈ దశలోని రచనలలో కడు ప్రసిద్ధిగాంచినది "రోమాన్ డి రోజా" అను ప్రేమరస ప్రధాన రచనా ప్రసూనము. ఈ గ్రంథమున రెండు భాగములు గలవు. ఈ రెంటిని "గిలోమీ డి లారీ", "జరజీన్ డి మోన్" అను జంటకవులు రచించిరి. ఇదంతయు ఫ్రెంచి సారస్వత ప్రపంచమున యూరపులోని పునరుజ్జీవన కాలమునకు పూర్వదశలో జరిగిన సాహిత్య కృషి.

పునరుజ్జీవన యుగమున, అన్ని రంగములతో పాటు ఫ్రెంచి సారస్వత సృష్టికి కూడ నూతనోత్తేజము కల్గినది. పునరుజ్జీవన యుగపు ఆది ఫ్రెంచి మహాకవి క్లెమెంట్ మరోత శైలీవిన్యాసములో, భావప్రకటన వైలక్షణ్యములో ఫ్రెంచి భాషా భారతికి ఒక ప్రత్యేక అలంకారమును, ఒయ్యారమును సాధించి పెట్టినాడు. ఇదంతయు 16వ శతాబ్దపు సారస్వత సృష్టి వ్యాసంగము. ఈ శతాబ్దముననే పియరీ డిరోన్‌సార్డు అను మహాకవి ఫ్రెంచి రచనారీతిలో ఇంకొక సంప్రదాయమును నెలకొల్పినాడు. ఇతడు, మరికొందరు ప్రసిద్ధ రచయితల సహాయముతో "ప్లేడి" అను సంకలన గ్రంథమును వెలువరించినాడు. భాషావిషయకముగా కూడా, ఈ రచనా సంకలనము క్రొత్త రచనా శైలిని, ప్రయోగ వైచిత్రిని సాధించుకొనినది. గ్రీకు, లాటిన్ పదములు కూడా వీరి రచనలలో చోటు చేసికొన్నవి. ఈ కృషిలో సార్డుకు తోడ్పడిన రచయితలలో ప్రముఖుడు డూబెల్లే అనునతడు. ఇతని ప్రసిద్ధ రచనలు "యాంటిక్విటీస్ డి రోమ్", "డిఫెన్సు ఎట్ ఇలస్ట్రేషన్ డిలాలాంగ్వే ఫ్రాంకేయిస్" అనునవి. కవితా లోకమున ఇతని అభిమాన ఛందస్సు సానెట్, ఓడ్ అనునవి. ఈ శతాబ్ది రచయిత లనేకులు ఈ కవితోద్యమమునకు సహకరించి, ఈ రచనా సంప్రదాయమును గౌరవించి, అనుసరించి, ఈ శైలిలో తమతమ రచనలను ఆవిష్కరించినారు. ఈ శతాబ్దపు ముగింపులో వర్ధిల్లిన మల్‌హెర్బీ ఈ కోవలో పరిగణనీయుడు.

16 వ శతాబ్దమున కొందరు రచయితలు తత్త్వ రచనలను కూడా కావించినారు. తత్త్వమును, కవిత్వమును రెండింటిని మేళవించి వాటిని తమ రచనలందు ప్రతిఫలింపజేసినవారు రబెలే, కేల్విన్, మాంటియన్ మొదలగువారు. రబెలే రచించిన "గర్గాంటువా ఎంపంటాగురియెల్" అనునది నవలా రూపమున రచింప బడినది. మాంటియన్ రచన స్వీయానుభవ ప్రతిబింబము. క్రైస్తవ మతములోని ప్రొటెస్టెంటు కోవకు చెందిన భావములను మత తత్పరులకేకాక, సాహితీ ప్రియులకు కూడా రసరంజకముగా నుండు శైలీ విన్యాసముతో కేల్విన్ తన రచనలు సాగించినాడు. ఈ కాలములో ఫ్రెంచి గద్యమునకు రూపురేఖలు ఏర్పడ ప్రారంభించినవి. కేల్విన్, రబెలే తమ రచనలచే పాఠకులకు తుష్టి కూర్చుటయేగాక, ఫ్రెంచి గద్యరచనా రీతికి కూడ పుష్టి చేకూర్చినారు. ఈ గద్యరచనా విధానమునకు మరింత గౌరవము తెచ్చిపెట్టినవాడు గ్రీసు భాషయందలి ప్లూటార్క్ రచనలను ఫ్రెంచి భాషలోనికి అనువదించిన అమియోట్ అనునతడు.

17 వ శతాబ్దమున పూర్వశతాబ్దపు రీతులే ఎక్కువగా అనుసరింప బడినవి. గత శతాబ్దపు రీతులకు పరిపుష్టి చేకూర్చుటయే ఈ శతాబ్దమున రచయితలు తమ ధ్యేయముగా

భావించుకొనిరి ఈ లక్ష్యసాధనకు ఈ శతాబ్దమున ఫ్రెంచి సాహిత్య చరిత్రలో గొప్ప సంఘటనలు జరిగినవి. అందులో మొదట ఉదాహరింపదగిన సంఘటన 1634 సంవత్సరములో ఫ్రెంచి అకాడమీ స్థాపన తర్వాతిది సారస్వత కృషికి ఏర్పడిన రాజాదరణము ఫ్రెంచి అకాడమీ స్థాపనవలన పునరుజ్జీవనోద్యమమునకు అధికారిక బలము చేకూరినది అకాడమీలో నలుబది మంది సభ్యులుండిరి కావ్యలక్షణములను నిర్ణయించుటకు. కావ్యములను పరిశీలించి ఉత్తమ కావ్యములను నిర్ధరించుటకు వారి కధికారము కలదు ఆనాడు ఫ్రెంచి దేశమును పరిపాలించిన పదునాల్గవ లూయీ జాతీయ జీవనమున ఐక్యము కూర్చుటకు సాహిత్య పోషణమును ఒక మార్గముగా అవలంబించెను ఆనాటి రాజాదరణములో వెలువరింపబడిన ముఖ్య గ్రంథములు రూపకములు ఆ రూపక రచయితలలో పియరీకార్నియర్, జీన్ రేసిన్, మాలియర్ అనువారు ముఖ్యముగా పేర్కొనదగినవారు నవ్యరీతిలో రూపక రచనా విధానమునకు దారి చూపినవాడు కార్నియల్ విషాదాంత నాటకములను విశిష్ట స్థాయికి గొనిపోయి, గ్రీకు విషాదాంత నాటకములతో దీటగు స్థానమును ఫ్రెంచి రూపకములకు కల్పించినవాడు రేసిన్ మాలియర్ రచించిన హాస్యరస ప్రధాన రూపకములు జగత్ప్రసిద్ధములు ఈ శతాబ్దములో గద్యరచనా విధానముకూడ పరిపుష్టి నొందినది గద్య రచయితలలో జీన్‌డిలా ఫ్రాంకొయిన్ పండ్రెండు సంపుటములలో తన కల్పనా కథలను ప్రకటించెను ఇందలి కథాకథన పద్ధతి, రసస్ఫూర్తి, శైలీవిన్యాసము ఆశ్చర్యకరములు డెకార్తె, పేస్కల్ తమ తత్త్వబోధనములను గ్రంథస్థముచేసి అద్భుత వచన గ్రంథములను వెలయించిరి. తర్వాత బోయిలో అనెడి లాక్షణికుడును, కావ్యస్రష్టయు ఈశతాబ్దపువాడే ఇతడు వెలువరించిన కావ్య లక్షణములు 18 వ శతాబ్దాంతమువరకు ప్రామాణికము లైనవి 17 వ శతాబ్దమున ఫ్రెంచి భాషలోని వాక్యరచనా రీతియే మారిపోసాగినది వాక్యములలో నిర్దుష్టత పెరిగినది అలతి అలతి పదముల కూడికతో సంక్షిప్త వాక్యరచన అభివృద్ధి గాంచినది ఈ క్రొత్త మార్పునకు మార్గదర్శకులయిన లోలాబ్రుయియారీ, లారాకీఫోకాల్, సెయింట్ సైమన్ అనువారు ప్రసిద్ధులు

ఫ్రెంచి సాహిత్య చరిత్రలో 18 వ శతాబ్దమునకు హేతువాద యుగమని కొందరు పేరిడిరి ఇది అన్వర్థనామమే. జీవితమందలి విలువలను హేతుదృష్టితో పరికించి, విమర్శించి, పరికాదని తోచినవాటి నన్నిటిని తలక్రిందులు గావించుటయే తమ లక్ష్యముగా భావించిన విప్లవవాదులయొక్క యుగమిది వివిధ దేశములనుండి, అందులో ముఖ్యముగా ఇంగ్లండు నుండి, వైజ్ఞానిక భావములు, రాజకీయ భావములు ఫ్రెంచి దేశమునకు దిగుమతి కాసాగినవి ఇది యొక భావవిప్లవ దశ ఇది సారస్వత రంగమున కూడ ప్రవేశించినది రచయితలకును సంక్రమించినది రచనల యందును ప్రతిఫలించినది ఇట్టి నూతన సారస్వత సృష్టికి ఉత్సాహ, ప్రేరణములు రేకెత్తించినవాడు పెయిరీ బెయిలీ అనునాతడు విప్లవాగ్ని విరులను పదములుగా మార్చి ప్రజానీకపు దృష్టిని ఆకట్టుకొన్న సుప్రసిద్ధ రచయిత వాల్టెయిర్ ఈ విప్లవోద్యమములో వాల్టెయిరుకు జతచేరినవారు రూసో, మాంటెస్క్యు, డెనిస్ డిడెరో, వెసాగీ, మేరివా అనువారు పేర్కొనదగినవారు వాల్టెయిర్ తన ఎనుబది సంవత్సరముల నిండు జీవితములో అనేక సాహిత్య ప్రక్రియలలో ప్రయోగములు సల్పినాడు మానవులలో సమానతా భావమును రేకెత్తించుటకు కృషి చేసినవా డితడు లేఖలు, కావ్యములు, కథానికలు, వ్యంగ్య రచనలు, రూపకములు ఈ సర్వతోముఖ ప్రజ్ఞావంతుని కలమునుండి వెలువడిన సాహితీ రూపములు రాజకీయ వేత్తయగు మాంటెస్క్యు వచన రచన సరళ గంభీరము వెసాగీ, మెరివా అనువారు ప్రసిద్ధ నవలా రచయితలు ఈ కాలమున నవలా రచనకొక ఉదాత్తస్థాయి కూర్చినవాడు యాబీప్రవోస్ట్ డేనిస్ డిడరోట్ సృష్టిపరిణామ క్రమమును విశదీకరించు వైజ్ఞానిక రహస్యములకు సాహితీ రూపము నిచ్చినాడు ఈతడు జీన్ పీరాండ్ డలెంబర్ట్‌తో కలిసి ప్రప్రథమముగా ఫ్రెంచిభాషా విజ్ఞాన సర్వస్వమును వెలువరించినవాడు ఆనాటి విప్లవ భావములను సిద్ధాంతబద్ధము చేసినవాడు మహా రచయితయగు రూసో వీరందరి కృషి ఫలితముగా ఆ శతాబ్దాంతమున జాజ్వల్యమానముగా వెల్లివిరిసిన ఫ్రెంచి మహావిప్లవమునకు నాందీగీతము పాడబడినది

19 వ శతాబ్దము మొదలుగా ఫ్రెంచి సాహిత్యమున ఆధునిక యుగము స్టేల్ సతి, షెటోబ్రియాలు ఈ ఆధునిక సాహిత్య యుగపు వైతాళికులు స్టేల్ సతి నవలకు నూతనమైన వన్నెలు దిద్దినది షెటోబ్రియా కాల్పనిక వాద వికాసమునకు తోడ్పడి, ఆ కోవలో తర్వాత జరిగిన కృషికి త్రోవ వేసినాడు.

ఈ శతాబ్దమున గేయము పునరుజ్జీవనము పొందినది లామార్టిను ఉత్తమ ప్రేమోద్వేగ భరిత కావ్యరచన చేసిన వాడు. ఆల్‌ఫ్రెడ్ మస్సెట్ వ్యంగ్యరచన కడుపుబ్బ నవ్వించును. మానవ భావనాశీలితలోని లోతులను వెదకి, అంతర్గత రహస్యములను వెలికితీసి వెలుగున కందించుటకు సాహిత్యమును సాధనముగా స్వీకరించినవాడు ఆల్‌ఫ్రెడ్ డివినీ పై అందరికన్నను మిన్నయైనవాడు ప్రపంచ సాహితీ రంగములోనే విఖ్యాతి గడించిన సుప్రసిద్ధ రచయిత విక్టర్‌హ్యూగో థియోఫైల్ గౌతియర్, చార్లెస్ బౌడలైర్ అను పద్య కావ్య రచయితలుకూడా తర్వాత పరిగణనీయములు. ఈ శతాబ్దములో బయల్వెడలిన సాంకేతిక వాదమునకు వైర్లన్ మల్లార్మి, రింబా అనువారు ప్రముఖ ప్రతినిధులు సాంకేతిక వాద మనగా కొన్ని సంకేతముల మూలకముగా మూలార్థమునకు అరచాటు కల్పించి చిత్రించు రచనారీతి ఈకాలపు నవలారచయితలలో విక్టర్ హ్యూగో, హెన్రీబెయిల్, అనరీడిబల్జాక్, ఫ్లాబర్ట్, అలెగ్జాండర్ డ్యూమాస్, గైడిమపాసా పేరెన్నికగన్నవారు మపాసాకథలు, మానవ మనోభావ చిత్రణములోను, కామానుభవచిద్విలాసరూపకల్పనలోను జగత్ప్రసిద్ధములైనవి ఈ శతాబ్దమున ఉదయించిన ప్రముఖ నవలారచయిత ఎమిలీజోలా విక్టర్‌హ్యూగో, అలెగ్జాండర్ డ్యూమాస్ రచించిన నాటకములుకూడా సుప్రసిద్ధములు

ఇరువదవ శతాబ్దమున ఫ్రెంచినవలకు నూతనరూపము వచ్చినది కథనరీతిలో నూతనత్వమును సృష్టించిన ఈ శతాబ్దపు ఆది రచయిత అనటోల్‌ఫ్రాన్సు. ఇతని రచనలు కొన్ని 19వ శతాబ్దాంతిమ సంవత్సరములలోకూడా వెల్వడినవి ఆత్మపరిశీలనమును ఆధారముగాగొని కావ్యరచన సాగించుటకు కొందరు రచయితలు శ్రద్ధవహించిరి అట్టివారు మార్సెల్ ఫ్రౌస్టు, యాండిగైడ్ అక్రమ లైంగిక కార్యకలాపములు కథావస్తువులుగా స్వీకార యోగ్యములు కావా అను మీమాంస, వాదోపవాదములు వీరి రచనలతో చెలరేగినవి నవలా రచనావిధానములో మరొక క్రొత్తమార్గమును త్రొక్కినవాడు రోమన్‌రోలా ఇతడు రచించిన జాన్ క్రిస్టఫర్ అనునది సుప్రసిద్ధము ఒక వ్యక్తి జీవితకథను ఆధారముగా తీసికొని, అందలి ప్రత్యేకప్రతిపత్తిగల సంఘటనలను మణులను సూత్రమునకుచేర్చి మాలగాకూర్చిన రీతిగా-ఐక్యము చెడకుండ రచించుటయే ఇతని నవలారచనా సంవిధానములోని ప్రత్యేకత జూలిస్‌రోమేన్‌కూడ రోమన్‌రోలా విధానమును అనుసరించి రచనలు గావించెను ఈపద్ధతిని అనుసరించి వ్రాసిన రోజర్‌మార్టిన్‌డూగార్డునకు 1937 లో నోబెల్ బహుమానము లభించినది

ఇరువదియవ శతాబ్దమున పద్యకవితలో సాంకేతిక వాదము, అతి వాస్తవికతావాదము మొదలుగాగల అన్ని వాదముల ప్రతిధ్వనులును గలవు పద్య కావ్యరచయితలలో "పాల్ వెలిరీ"ని విస్మరింప వీలుపడదు అనేక క్రొత్తపోకడలలో రూపకములు వెల్వడినవి మేటర్‌లింక్ వ్రాసిన నాటకములకు కూడ బాగుగ వ్యాప్తి కలదు

నవీన విజ్ఞానపరిశోధనములు, రాజకీయసంచలనములు, ప్రపంచయుద్ధములు, ఫ్రెంచి సారస్వతముపై ప్రభావము కనపరచినవి ముఖ్యముగా ప్రపంచమహాయుద్ధములు ఫ్రెంచిదేశమును సంక్షుభిత మొనర్చినవి రచనమీదకూడ ఈ బాహ్య పరిస్థితులు ప్రభావమును కలిగించినమాట వాస్తవము నోబెల్ బహుమానముకూడ సాధించుకొన్న కవితావేశము గల తత్త్వవేత్త హెన్రీబెర్గ్సన్, ప్రాచీనాధునాతన భావములను సమన్వయించి రచనద్వారమున తత్త్వసందేశము నొసగినవాడు ఇంకను సాహిత్య వ్యవసాయమును సాగించుచున్న నవలా రచయిత, కథకుడు, తత్త్వవేత్త జీన్‌పాల్‌సార్త్ర అను కవి

డి శ్రీ

## ఫ్రెడరిక్ లిస్ట్

ఫ్రెడరిక్ లిస్ట్ జర్మనీయందలి రూటిలింగన్ అను నగరములో 1789 వ సం న జన్మించెను ఇతడు తన విద్యాసముపార్జనానంతరము పిన్న వయసునందే (1818) ఒక ప్రముఖమైన కళాశాలలో రాజనీతిశాస్త్రాధ్యాపకుడుగా నియమితు డాయెను ఈ ఉద్యోగమును నెరపుచునే, మరియొక వంక ప్రభుత్వాధికారులు తమ విధినిర్వహణములో ఏవిషయమును గురించియు నిర్ణయములను సత్వరముగా గైకొనక చేయుచుండు జాప్యమునుగూర్చి ఇతడు పత్రికావ్యాసముల ద్వారా విమర్శించుచుండెడివాడు రాజుల అధికారములు చట్టబద్ధములై యుండవలెనని ఇతని అభిప్రాయము 1819లో ఇతడు తన ఉద్యోగమునకు రాజీనామా నొసగెను

పిదప జర్మనీయందు వాణిజ్య, పారిశ్రామిక సంఘస్థాపనలో ఫ్రెడరిక్ విశేషముగా సాయపడెను జర్మనీలో

ఆ కాలమున ఒక రాష్ట్రమందలి సరకులు మరియొక రాష్ట్రమునకు రవాణా యగునపుడు సుంకములు విధింపబడుచుండెడివి ఇట్టి సుంకములను రద్దుచేసి, ఇతర దేశములకు ఎగుమతి యగు సరకులపై జర్మనీ సరిహద్దులయందే సుంకము లను విధింపవలెనను ఫ్రెడరిక్ లిస్టు సలహాను అనుసరించి అచటి వాణిజ్య పారిశ్రామిక సంస్థ వాదించుచుండెను

ఫ్రెడరిక్ తన జన్మస్థానమునుండి 1820 లో పార్లమెంటు సభ్యుడుగా ఎన్నిక అయ్యెను రోడ్లమీద సుంకములు, ఎక్సైజు పన్నులు తొలగింపబడవలెననియు, రాబడిపన్ను ఒకటి మాత్రమే విధింపబడవలెననియు, ప్రభుత్వోద్యోగుల సంఖ్య తగ్గవలెననియు ఇతడు పార్లమెంటులో వాదించెడివాడు ప్రభుత్వాధికారుల కీవాదము కంటకముగా తోచెను తత్ఫలితముగా ఇతడు తన పార్లమెంటు సభ్యత్వమును కోల్పోవుటయేకాక, పది నెలల కారాగార శిక్షకు కూడ గురియయ్యెను దేశమును విడిచి వెళ్ళినచో, ఇతనిని కారాగారమునుండి విడిచి పుచ్చుటకు జర్మను ప్రభుత్వ మంగీకరించెను ఫ్రెడరిక్ ఈ అవకాశమును పురస్కరించుకొని కారాగారమునుండి విముక్తుడై అమెరికాకు వలస పోయెను

ఫ్రెడరిక్ అమెరికాయందలి పెన్సిల్వేనియా రాష్ట్రమునకు పోయి స్థిరపడి, స్వేచ్ఛావ్యాపారమును గురించి పత్రికలలో వ్యాసములు వ్రాసెను ఈ సందర్భములో ఇతడు "అవుట్‌లైన్స్ ఆఫ్ అమెరికన్ పొలిటికల్ ఎకానమీ" అను గ్రంథమును ప్రచురించెను పదునాల్గు సంవత్సరముల తరువాత ఇతడు రచించిన "నేషనల్ సిస్టమ్ ఆఫ్ పొలిటికల్ ఎకానమీ" అను గ్రంథమునకు పై గ్రంథము నాంది అయ్యెను అమెరికాలో వ్యావసాయిక, పారిశ్రామిక పరివర్తన లక్షణములను, ప్రబల ఆర్థిక సంప్రదాయములను ఇతడు గుర్తించెను అందుచే ఈతని ఆర్థిక తత్త్వములు కూడ వాటిపై ఆధారపడ దొడ్చెను

ఫ్రెడరిక్ లిస్ట్ కారణాంతరముల వలన 1832 లో తిరిగి జర్మనీ దేశమునకు వచ్చి జీవితాంతము వరకు అచ్చటనే ఉండిపోయెను "స్వేచ్ఛావ్యాపారము నపేక్షించు దేశములు అనుభోక్తలు, ఉత్పత్తిదారుల యొక్క న్యాయమైన కోరికలను పరిష్కరించు టెట్లు ?" అను సమస్యపై ఇతడొక వ్యాసమును వ్రాసెను అటు పిమ్మట 1841 లో తాను వ్రాసిన 'నేషనల్ సిస్టమ్ ఆఫ్ పొలిటికల్ ఎకానమీ' అను గ్రంథమందు అంతర్జాతీయ వాణిజ్యమునుగూర్చి ఇతడు ముఖ్యముగా పేర్కొనెను ఆడమ్ స్మిత్ మున్నగువారు ఆవిష్కరించిన 'స్వేచ్ఛా వ్యాపార సిద్ధాంతము'ను త్రోసిరా జనుటయే ఫ్రెడరిక్ ముఖ్యోద్దేశము ఆడమ్ స్మిత్ ప్రభృతులు తమ కాలపు పరిస్థితుల ననుసరించి కొన్ని సిద్ధాంతములను ప్రవేశపెట్టిరే కాని, నిజమైన ప్రపంచ పరిస్థితులను గాని, రానున్న స్థితిగతులను గాని, వారు తమ దృష్టియందుంచుకొనలేదని ఫ్రెడరిక్ వాదించెను ప్రపంచ రాజ్యము నడుమ శాంతి వాతావరణము నెలకొనగలదని వారాశించినను, అట్టిది ఘటిల్లుట కష్టతరమని ఫ్రెడరిక్ వక్కాణించెను స్వేచ్ఛావ్యాపారము, సంరక్షిత వ్యాపారము వివిధ దేశములలో నడచు విధమును గమనించి, తదనుగుణముగ ఆర్థిక, రాజకీయ సిద్ధాంతములను ప్రవేశపెట్టవలయు నని ఫ్రెడరిక్ వాదించెడివాడు

మానవుని కోరికలు తక్కువగా నున్నపుడు స్వేచ్ఛావ్యాపారము వాంఛనీయమనియు, వ్యవసాయమును వృద్ధి చేసికొని విదేశములలో తయారగు సరకులను దిగుమతి చేసికొని, అచ్చటికి తమ ముడిసరకులను ఎగుమతిచేయు అవకాశము కల్పింపవలెననియు, కాలక్రమమున స్వీయ పారిశ్రామికాభివృద్ధి ఘటిల్లిన పిదప విదేశీయ సరకులను దిగుమతి యొనర్చుకొను స్థితి అంతమగుననియు ఫ్రెడరిక్ తన అభిప్రాయములను సూచించెను వెనుకబడిన దేశములు ఆర్థికముగా బలపడు వరకు ప్రభుత్వము, స్వీయ పరిశ్రమలను సంరక్షించి ప్రోత్సహింపవలెననియు, బలపడిన తరువాత స్వేచ్ఛావ్యాపారమును ప్రవేశపెట్ట వచ్చుననియు, అట్టి పరిస్థితులలో అంతర్జాతీయమైన పోటీ ఉన్నను, అభివృద్ధి నొందుచున్న దేశములకు అంతగా నష్టము కలుగదనియు ఫ్రెడరిక్ వాదించెను

ఆధునిక యుగములో పారిశ్రామికాభివృద్ధి లేనిదే, ఒక్క వ్యవసాయము వలననే దేశాభివృద్ధి కలుగదనియు, ఈ రెండు వ్యవస్థలు ఏకకాలమున అభివృద్ధి నొందిననేగాని సమగ్రమైన దేశాభ్యుదయము సాధ్యము కాదనియు, ఈ రెండు వ్యవస్థలును ప్రభుత్వ పరమైనపుడు యుద్ధములకు, అశాంతికి అవకాశ ముండదనియు ఫ్రెడరిక్ ఉద్ఘాటించెను

పని విభజనమును గురించి కూడ ఫ్రెడరిక్ తన అభిప్రాయములను ప్రపంచమునకు వెల్లడి చేసెను మానవు

విలువ వృద్ధియైనంత మాత్రముననే ప్రయోజనము లేదనియు, ఉత్పత్తి హెచ్చినదేగాని కుటుంబమునకును, దేశమునకును రక్షణము కలుగదనియు, ఫ్రెడరిక్ వాక్రుచ్చెను మంచి సంప్రదాయములు, మంచి మతము మొదలైనవి ఉత్పత్తిని సాధించుటకు ఉత్తమ సాధనములని ఆతని విశ్వాసము

శ్రమకు మాత్రమే సహజమైన విలువ కలదనియు, దానిని బట్టియే వస్తువులకు విలువ ఏర్పడుననియు, అనగా శ్రమకులేని విలువ దానివలన ఉత్పత్తియగు వస్తువునకు స్వత స్సిద్ధముగా ఉండనేరదనియు ఫ్రెడరిక్ వాదించెడివాడు ఆయా దేశములలోని పరిస్థితులనుబట్టి, విజ్ఞాన శాస్త్రముల అభివృద్ధినిబట్టి, వ్యవసాయ, పరిశ్రమాభివృద్ధినిబట్టి, వస్తువుల ధరలు నిర్ణయింపబడునని ఆతని అభిప్రాయము ఒకానొక దేశములో పెక్కురు కార్మికులున్నను, వారు ఉత్పత్తి కార్యక్రమములో నిమగ్నులైననేకాని, దేశము సుసంపన్నము కాదని ఫ్రెడరిక్ యొక్క నిశ్చితాభిప్రాయము ఇతడు వ్రాసిన అంశము లన్నియు 'సంరక్షిత సిద్ధాంతము'నం దిమిడి యున్నవి

మాల్థస్ సిద్ధాంతములను ఫ్రెడరిక్ ఖండించెను వివిధ దేశములయొక్క శీతోష్ణస్థితుల నాధారము చేసికొని ఫ్రెడరిక్‌లిస్టు కొన్ని సూత్రములను ప్రవేశ పెట్టెను సుప్రసిద్ధ అర్థశాస్త్రవేత్తయగు స్మైస్ ఈ సూత్రములను విమర్శించి యుండెను జర్మను రైల్వే విధానము, నౌకాదళాభివృద్ధి ఫ్రెడరిక్ సిద్ధాంతములపై ఆధారపడి యుండెను అమెరికాలో సహితము పెక్కురు ఇతని ఆర్థిక సిద్ధాంతములను అనుష్ఠించు చుండిరి

ఆర్ వి రా

## ఫ్రోబెల్ (1782-1852)

ఫ్రోబెల్ అను నవతరాక విద్యావేత్త అరిస్టాటిల్, ప్లేటో, పెస్టలాజీ, రూసో, మాంటిసోరి, బేకన్, హెర్బర్ట్, కొమినియస్ మొదలగు విఖ్యాత విద్యావేత్తల శ్రేణికి చెందిన వాడు ఫ్రోబెల్

మనశ్శాస్త్ర సూత్రములను విద్యా విధానమునకు సమన్వయపరచి కీర్తి గడించినవాడు ఫ్రోబెల్ పాఠశాలను ఒక ఉద్యానవనముతోను, ఉపాధ్యాయుని ఒక తోటమాలితోను, బాలబాలికలను వికసించు మొక్కలతోను పోల్చి "కిండర్ గార్టన్" తత్త్వమును ప్రబోధించినవాడు ఫ్రోబెల్ మహాశయుడు

**జననము-విద్యాభ్యాసము** ఫ్రోబెల్ పూర్తి పేరు 'ఫ్రెడరిక్ విల్‌హెమ్ అగస్ట్ ఫ్రోబెల్' అనునది ఈయన హెర్బర్ట్ పెస్టలాజీ శిష్యుడు హెర్‌బార్ట్ ఉపాధ్యాయుని గురించి ఆలోచించుచు ఫ్రోబెల్ బాలబాలికలను గురించి యోచింప సాగెను ఫ్రోబెల్ 1782 న 'ఒబర్ వీస్ బాక్' అను గ్రామమున (జర్మనీ దేశము) జన్మించెను పరిసరములు మతప్రసక్తితో కూడియుండెను సవతి తల్లి సంరక్షణమున పెరిగినందున ఇతని బాల్యము కష్టముగనే గడచెను ఇతడు ఒంటరిగ, అడవులలో సంచరించుచు పశులను, జంతువులను నిశితముగా పరిశీలించుట వలన గొప్ప శాస్త్రజ్ఞుడయ్యెను ఇతడు ప్రకృతి శాస్త్రమును, వృక్షశాస్త్రమును బాగుగ అభ్యసించెను సృష్టిలో కనబడుచున్న భిన్నత్వములో ఒక సంధానశక్తి కలదని విశ్వసించెను ఇతడు కొంత కాలము అటవీ శాఖలోను, మతప్రచారములోను కాలము గడిపి 'జినా' విశ్వవిద్యాలయమున ఉన్నతవిద్య నభ్యసించుటకు ప్రవేశించెను జర్మనీ దేశములో గొప్ప మేధావులు 'జినా' విద్యాలయమున ప్రవేశించుట ఒక ఆచారమై యుండెను అచ్చట ఇతడు 'తత్త్వమును' 'విజ్ఞానశాస్త్రమును' అభ్యసించెను ఇతనికి ఫిక్‌టీ, షెల్లింగ్ అను విద్యావేత్తలతో పరిచయభాగ్య మేర్పడెను ఆర్థిక దుఃస్థితి వలన విద్యకు ఇతడు స్వస్తి చెప్పెను

ఫ్రోబెల్ వ్యవసాయము చేయుట, భూములను కొలుచుట, మతప్రచారము చేయుట మొదలగు వృత్తులను నిర్వహించెను 1806 న ఫ్రాంక్‌ఫర్ట్‌లో శిల్పకళ నభ్యసించెను ఆ సమయముననే పెస్టలాజీ ఆదర్శపాఠశాలను నిర్వహించుచున్న డాక్టర్ అన్‌టన్ గ్రూనర్, ఫ్రోబెల్‌ను ఉపాధ్యాయ వృత్తి స్వీకరింపుమని ప్రాధేయ పడెను ఎవర్డిన్‌లో నివసించుచున్న పెస్టలాజీని ఇతడు సందర్శించెను కాగితము, చెక్క, పేస్టు, బోర్డులతో తయారుచేసిన సాధనములను,ఉపకరణములను ఆతని నేతృత్వమున బాలబాలికలు ఉపయోగింప ప్రారంభించిరి వారు చైతన్యముతోను, ఉత్సాహముతోను ప్రవర్తించుటను చూచి ఫ్రోబెల్ ఆశ్చర్య పడెను వారియందలి సృజనాత్మక శక్తిని బహిర్గతముచేసివిద్యావిధానమును ఉదాత్త పరచవలెననిఇతడు సంకల్పించెను అట్టి శక్తి దివ్యమైనదని ఉత్తమసాధనమని ఇతడు విశ్వసించెను విద్యారంగములో సంగీతమునకు, ఆటలకు,

ఆటవస్తువులకు విశేష ప్రాధాన్యము గలదని ఇతడు నిర్వచించెను

ఇతడు కొన్నాళ్ళు పరిశోధనములు జరిపి నెపోలియను యొక్క సైన్యములను ఎదిరించుటకు ఏర్పరచబడుచున్న సైన్యములో చేరెను 1814 న ప్రొఫెసర్ 'వీస్'నకు శిష్యుడై ఇతడు బెర్లిన్ విశ్వవిద్యాలయమున ప్రవేశించి, అచ్చట స్ఫటికశాస్త్రము నభ్యసించెను పిదప ఫ్లామన్ అను తావునకు చేరి శిశుస్వభావమును గురించి పరిశోధనములు సాగించెను మిడన్‌డార్ఫ, లాంగీతల్ అను విద్యావేత్తలతో కలిసి 'జర్మన్ విద్యాసంస్థ'ను స్థాపించెను

ఫ్రోబెల్ తత్త్వము స్వీయ ప్రకటన, స్వేచ్ఛ, శిశువిద్యయొక్క మూలసూత్రములని ఫ్రోబెల్ వక్కాణించెను క్రీడామార్గము విద్యార్జనమునకు ఉత్తమ సాధనమని ఇతడు విశ్వసించెను తన తత్త్వమునకు 'కిండర్‌గార్టన్' అని నామకరణ మిడెను ఆనకట్టలు, కోటలు, యంత్రములు, భవనములు మొదలగు మాడల్స్ నిర్మించుటకు విద్యార్థులకు అనుకూల వాతావరణము కల్పింపబడెను విద్యార్థుల సృజనాత్మక శక్తిని, కౌతుకమును జిజ్ఞాసను, ఉపజ్ఞనులకు ఊహాశక్తిని, స్వావలంబన శక్తిని అత్యుత్తమ స్థాయికి తెచ్చుటకు కిండరుగార్టన్ తత్త్వము బాగుగ ఉపయోగ పడునని ఫ్రోబెల్ నుడివెను

ఫ్రోబెల్ 'ఎడ్యుకేషన్ ఆఫ్ మాన్' అను గ్రంథమును వ్రాసి తన తత్త్వమును ప్రచారము చేసెను ఆదర్శ తత్త్వము', 'పరిణామవాదము' తన విద్యాతత్త్వమునకు ప్రాతిపదికలని ఇతడు నిర్వచించెను స్విట్జర్‌లాండ్ దేశములోని వార్టన్‌సీ భవనమున తన తత్త్వమును ప్రయోగాత్మకముగచూపెను తర్వాత భర్గ్‌డార్ఫ్‌లో తన తత్త్వమునకుటక రూపకల్పనము చేయ మొదలిడెను నర్సరీ పాఠశాలలను ఆదర్శవంతములనుగా సంస్కరించని యెడల ఉన్నత విద్యను సాధించలేమని విశ్వసించి ఇతడు చాటెను గ్రాస్, కొమినియస్ అనువారుకూడ ఫ్రోబెల్‌ను అనుసరించిరి ఆదర్శమైన 'మదర్స్' నర్సరీ పాఠశాలల స్థాపన అత్యవసరమనియు, క్రీడామార్గమే ఉత్తమ సాధనమనియు, వారు నమ్మసాగిరి అందులకుగాను బాలుర మానసిక స్థాయికి తగిన ఆటపాటలను అభినయ గీతములను సృష్టించిరి

జర్మనీ దేశములో 3-7 సంవత్సరములలోపు వారికి నర్సరీ పాఠశాలను నిర్మింపించి ఫ్రోబెల్ తన తత్త్వమును ఆచరణలో పెట్టెను ఇతడు ఆ పాఠశాలలకు 'కిండరు గార్టన్స్' అని నామకరణ మొనర్చెను కిండర్‌గార్డన్ అనగా పిల్లల తోట అని అర్థము

ఆర్థిక దుఃస్థితి వలన ఫ్రోబెల్ తన పాఠశాలను మూయవలసిన వాడయ్యెను సమకాలికులు తన తత్త్వమును తీవ్రముగా విమర్శించుట వలన ఇతడు నిస్పృహను, నిరుత్సాహమును చెందెను క్రీడా మార్గపద్ధతి ఉత్తమ సాధనము కాదని కొందరు విమర్శించిరి 1844 లో ఇతడు పరిశోధనములకు స్వస్తి చెప్పెను మరొక అయిదేండ్ల కాలము జర్మనీ దేశమందంతటను పర్యటించి తన తత్త్వమును ప్రచారము చేసెను 1849 లో లిబిన్‌స్టీన్‌యొద్ద మరేన్‌హోల్ట్జ్‌బ్యూలో అను మరొక విద్యావేత్తతో చేరి ఒక ఆదర్శ పాఠశాలను ఇతడు స్థాపించెను కాని 1852 లో ప్రష్యా విద్యామంత్రి ఆగ్రహించి కిండర్ గార్టన్ పాఠశాలను మూయవలెనని శాసించెను ఫ్రోబెల్ అవమానమును, అనాదరమును భరించలేక ఆ సంవత్సరముననే మరణించెను

ఐక్యము, శాశ్వతాభివృద్ధి విద్యార్జనముయొక్క ఉత్తమ ఆదర్శములని ఫ్రోబెల్ నిర్వచించెను స్వీయ ప్రకటనము, సృజనాత్మకశక్తి, స్వేచ్ఛ, విద్యార్జనమునకు ఉత్తమ సాధనములని ప్రబోధించెను స్వయంచోదితమైన ప్రతిక్రియ కూడ సత్ఫలితములను సాధించుననియు, వ్యక్తిత్వము సంపూర్ణముగ, సమగ్రముగ, సర్వతోముఖముగ వికసించుటకు ఆది ఎక్కువగా తోడ్పడుననియు, ఫ్రోబెల్ వాదించెను పాట, అభినయ గీతములు, నిర్మాణాత్మకకృషి అను మూడు సూత్రములను విద్యార్థులకు నేర్పిన, 'కిండర్‌గార్టన్' తత్త్వము సిద్ధించునని ఇతని భావము (1) అభినయ గీతములు (2) ఆటలు, ఆటవస్తువులు (3) నిర్మాణ పరికరములు ఇవి బాలబాలికలయొక్క సృజనాత్మక శక్తిని అభివృద్ధి పరచునని ఫ్రోబెల్ సిద్ధాంతీకరించెను పిల్లలు కథలు చెప్పునప్పుడు పాటలు పాడుదురు అభినయము చేయుదురు, తర్వాత అట్ట ముక్కలతోను, ఇటికలతోను, చెక్కముక్కలతోను కొన్ని మోడల్సును నిర్మింతురు ఇందు వలన వారి శారీరక, మానసిక నైతిక శక్తులు సంపూర్ణముగా వికసించును 'మదర్స్' అభినయ గీతములు ఫ్రోబెల్ తత్త్వమునకు ప్రాణప్రదములు పంచేంద్రియ శిక్షణము, సంవేదనాత్మక జ్ఞానము శాశ్వతమైనవని ఇతడు విశ్వసించెను

'కిండర్ గార్టన్ తత్త్వము'లో 'గిఫ్ట్స్' ఆటవస్తువులు ప్రముఖ పాత్రను నిర్వహించును ఈ వస్తువులు పిల్లల విషయమున ప్రేరకములుగా పని చేయును వస్తువులచే ఆకర్షింపబడి, ఏదేని ఒక క్రియకు వారు ప్రేరేపింప బడుదురు అట్టి క్రియ నిర్మాణాత్మకముగాను, సృజనాత్మకముగాను ఉండును ప్రథమవర్గపు 'గిఫ్ట్స్' ఆరు ఊలు బంతులు ఇవి వివిధ రంగులలో నుండును చలనము, మార్గము, రూపము, ద్రవ్య గుణము మొదలగు ఎంపేములు వారియందు కలుగును రెండవ వర్గములో చెక్కతో చేసిన గోళము, క్యూబ్, సిలండర్ ఉండును తృతీయ వర్గములో కొంచెము పెద్దక్యూబ్ ఉండును ఈ క్యూబ్‌ను ఎనిమిది సమభాగములుగ ఖండించి పెట్టుదురు ఇందువలన ఏకత్వము, భిన్నత్వము, సంధాన తత్త్వము పిల్లలకు బోధ పడును ఇవిగాక మరిమూడు 'గిఫ్ట్స్'గా ఉపయోగించు చెక్కముక్కలు బాలురు కలిగి యుందురు వీటి సహాయమున పిల్లలు అనేక రూపములను సృష్టింతురు వారిలో అవధానము, కౌతుకము, జిజ్ఞాస నిర్మాణాత్మక సహజత్వము మొదలగు శక్తులు వికసించును విద్యార్జనమునకు ఈ శక్తులు గొప్ప పునాదులుగా పని చేయును

ఈ 'గిఫ్ట్స్' కాక ప్రకృతి పరిశీలనము ఫ్రోబెల్ తత్త్వములో అంతర్లీనమై యుండును ఉపవాస దీక్షవలన బాల బాలికలయందలి 'చెడుగు'ను తొలగించి మంచిని ఉదాత్తము చేయవచ్చునని ఆయన విశ్వసించెను కొందరు విద్యావేత్తలు ఈ తత్త్వమును తీవ్రముగా విమర్శించిరి పెస్టలాజీ తత్త్వమును ఫ్రోబెల్ అభివృద్ధి పరచెను ప్రకృతిసిద్ధమైన అభివృద్ధియే ఉత్తమ మైనదనియు, శాశ్వతమైనదనియు మానవ కల్పిత కృత్రిమ మార్గములు బాలురను వక్రమార్గమున ప్రవర్తింప జేయుననియు, ఫ్రోబెల్ ప్రచారము చేసెను. ఇట్లు ఒక క్రొత్త తత్త్వమును సృష్టించి, 19వ శతాబ్దపు శాస్త్రీయ అభిప్రాయములను, మానసిక శాస్త్ర సూత్రములను విద్యారంగములో ప్రవేశపెట్టిన విద్యావేత్తగా ఫ్రోబెల్‌ను మనము స్మరించు చున్నాము సృజనాత్మకశక్తి, స్వీయ చైతన్యము, క్రియాత్మక జ్ఞానము, బాలబాలికలకు అత్యవసరములని ఇతడు నుడివెను ఫ్రోబెల్ యొక్క క్రియాత్మక తత్త్వము క్రమముగ కృతియుక్తాభ్యాసనముగా మారి పోయెను ఇదియే క్రమముగ వృత్తికేంద్ర విద్యగా రూపొందెను విద్య చైతన్యవంతమైన కార్యక్రమమని నేటి విద్యావేత్తలు కూడ అంగీకరించిరి. శారీరక, మానసిక, నైతిక, ఆధ్యాత్మికవికాసము, సర్వతోముఖమును, సమగ్రము నైన వ్యక్తివికాసము, స్వావలంబనము, స్వయంచోదిత క్రియాత్మకజ్ఞానము విద్యయని ఫ్రోబెల్ విశ్వసించెను ఫ్రోబెల్ 'కిండర్ గార్టన్' సంస్థలు ఉన్నత విద్యకు గట్టి పునాదులు వేయుననుట నిర్వివాదాంశము ఇదియే అత్యుత్తమ మార్గము

ఏ ర

# బ

బంగారము :

బంగారము సృష్టిలోనున్న లోహములలో ముఖ్యమైనది ప్రపంచమంతటిలో సంవత్సరమునకు 2 కోట్లఔన్సుల బంగారము ఉత్పత్తియగుచున్నది అందులో సగమునకుపైగా దక్షిణాఫ్రికాయందే ఉత్పత్తియగుచున్నది తక్కినది అమెరికా, కెనడా, రష్యా, ఇండియాలలో ఖనిజములనుండి తీయబడుచున్నది మొత్తము పరిమాణములో నూటికి రెండు శాతము భారతదేశములో ఉత్పత్తియగును ఇదియంతయు దాదాపుగా మైసూరు రాష్ట్రములోని కోలారుజిల్లాయందే దొరకును

సువర్ణము సాధారణముగా కఠిన శిలలతో మిళితమై యుండును స్ఫటికములతో కూడ బంగారము కలిసి యుండును స్వర్ణమిళిత ఖనిజముల నుండి ప్రవహించు నదీ జలములలో బంగారము ఇసుకరూపమున లభించును. ఈ యిసుక నుండి లోహమును వేరుచేసి ఆలోహమును అమ్ముటద్వారా, అసంఖ్యాకులైన జనులు ఉత్తరప్రదేశము, అస్సాము మధ్య ప్రదేశములందు జీవితమును గడపుచున్నారు దేశపరిస్థితులను బట్టియు, ఖనిజస్వభావమును బట్టియు ముడిలోహములనుండి బంగారమును ఉత్పత్తిచేయు ప్రక్రియలు వివిధరీతులుగా నున్నవి

(1) నదీ సైకతములు బంగారు కణములుండు ఇసుక నదీగర్భము నుండి డ్రెడ్జర్లతో త్రవ్వబడి కుప్పలు పోయబడును ఆ యిసుకను యంత్రములలో మెత్తగా పొడిచేసి, పెద్ద పెద్ద జల్లెడలలో జల్లించి గడ్డలను వేరుచేయుదురు మెత్తని చూర్ణమును నీటితో కలిపి మిక్కిలి వేగముతో గిరగిర త్రిప్పిన

యెడల బరువైన అణువులు క్రిందికి చేరి, తేలికపాటు వస్తువులు, ఇతర లోహములు నీటిలో కొట్టుకొనిపోవును ఇట్లు పెక్కు పర్యాయములు చేసినచో, తుదకు బంగారపు కణములే మిగిలి పోవును

ఒక్కొక్కప్పుడు స్వర్ణపుపొరలు పర్వతపార్శ్వముల యందును, నదీతీరములలో కొన్ని తావులయందును లభించును అప్పుడా పొరలను అమిత వేగముగల నీటిధారలతో కడిగిన యెడల, కశ్మలమంతయుపోయి బంగారము మాత్రము మిగులును

స్వర్ణకణ మిశ్రిత ఖనిజములు ఈ ఖనిజపు శిలలను యంత్రములచే బాగుగా చూర్ణమొనర్చి, పెక్కు పర్యాయములు నీటియందుముంచి కడిగెదరు. తేలిక పదార్థము లన్నియు పోయి, బంగారు కణముల శాతము పెరుగును ఆ చూర్ణము నుండి లోహమును రెండు పద్ధతులతో విడదీయుదురు

సైనైడు పద్ధతి ఈపద్ధతి ననుసరించి పైని చెప్పబడిన చూర్ణముతో 0.15% సోడియము సైనైడు ద్రావణమును కలిపి బాగుగా కలియబెట్టుదురు కొంత సేపయిన తరువాత బంగారు కణములు దానితో కలిసి ఒక సంయోగ ద్రవ్యముగా నేర్పడును దీనికి నీటిలో కరగియుండు స్వభావముండును ఆ ద్రావణమును వడియగట్టి దానిలో తుత్తునాగపు పలుకులను పడవేసినచో, ఆ పలుకుల పైన బంగారము అతుకుకొనును ఆ పలుకులను తీసివైచి, కడిగి, శంఖద్రావకములో వేసిన యెడల, తుత్తునాగపు ముక్కలు కరగి, బంగారము మిగులును

ఈ ద్రావణములోనికి విద్యుచ్ఛక్తిని పంపి, కూడ బంగారమును విడదీయవచ్చును

పాదరసపు పద్ధతి : ఈ పద్ధతిని ముఖ్యముగా కోలారు గనులలో అనుసరించుచున్నారు రాగిరేకుల మీద పాదరసపు పూత పూయుదురు స్వర్ణమిశ్రిత చూర్ణమును ఆ రేకుల ప్రక్కగా నడపిన యెడల, అందులోని బంగారపు కణములు పాదరసముచే ఆకర్షింపబడి కలిసిపోవును కొంతకాలమునకు పిమ్మట ఆ పాదరసమును గీకి వేడిచేసిన యెడల, పాదరసము ఆవిరియై, సువర్ణము మిగులును

శుద్ధి చేయుట . ఈ పద్ధతిని తయారైన బంగారములో రాగి, వెండి, సీసము మొదలైన ఇతరలోహము లుండును వాటిని ఈ క్రింది రెండు మార్గములలో తొలగింపవచ్చును

(ఎ) లోహమును శంఖద్రావకములలో నుంచిన యెడల, ఇతర లోహములన్నియు కరగిపోయి, బంగారము మిగులును

(బి) బంగారమును గాఢముగా వేడిచేసిన యెడల, నీచ లోహములన్నియు ఆవిరియై, సువర్ణము మాత్రమే మిగులును ఇట్లెన్ని పర్యాయములు చేసిన, వన్నె అంత ఎక్కువగా వృద్ధిచెందును

బంగారపు లక్షణములు , ఉపయోగములు (1) బంగారమును సాధారణముగా రాజలోహమని యందురు సాధారణమైన ఆమ్లములవలన, క్షారములవలన, బంగారమున కెట్టి ప్రతిక్రియయు జరగదు ఈ లోహము ఆక్వారీజియా అను పదార్థమునందు మాత్రమే కరగును

(2) ఈ లోహము పచ్చని తళుకు కాంతి కలిగి యుండును

(3) ఈ లోహమునుండి పలుచని రేకును,సన్నని తీగెను, తీయవచ్చును

(4) దీనియందు సాంద్రత అధికము

దీనిని ఆభరణములుగను, ఇతర విలాస వస్తువులుగను నిర్మించి వాడుదురు

(5) వెండి, ఇత్తడి, రాగి పాత్రలకు బంగారు పూత పూయుదురు

(7) మేలిమిబంగారము చాల మెత్తగానుండును

(8) నాణెములను తయారుచేయుటకు రాగిని దీనిలో కలుపుదురు సాధారణముగా ఒక నవరసులో 22 భాగములకు 2 పాళ్ళు రాగిని కలుపుదురు దానినే 22 కారెట్ బంగారమందురు ఆభరణములలో ఇంకను ఎక్కువగా రాగిని కలుపవచ్చును

(9) ఆయుర్వేద ఔషధములలో బంగారమును కలుపవచ్చును (ఉదా : సిద్ధమకరధ్వజము పూర్ణచంద్రోదయము)

(10) బంగారములో సంయోగము నొందుద్రవ్యములు రంగులుగా నుపయోగింపబడును ముఖ్యముగా గోల్డ్ క్లోరైడ్ + స్టానస్ క్లోరైడ్‌ను వేడిచేసినచో, పర్పుల్ ఆఫ్ కాస్సియస్ అను రంగు వచ్చును దానిని గాజు, పింగాణీ పరిశ్రమలలో నుపయోగింతురు

(11) సాధారణముగా ఏదేశమం దయినను, సంపదను

బంగారు ప్రమాణముతో విలువ కట్టెదరు ప్రతిదేశము యొక్క కేంద్ర బ్యాంకునందును, ఆదేశపు కరెన్సీ నోట్లకు సరిపడు విలువగల బంగారము, వెండి నిధులుండవలెను అందు వలన అంతర్జాతీయ వ్యాపార, వాణిజ్యరంగములలో బంగారము ప్రధానమగు పాత్ర వహించుచున్నది

మూ కో

## బడుగరులు

నీలగిరి కొండలలో బడుగరులు ఉరాళులు, తోడువరులు, కొత్తరులు, ముళ్ళుకుడుంబరులు అను అయిదు తరగతుల ఆటవిక జాతులవా రున్నారు ఈ తెగలవారిలో పరస్పర సంబంధములు కలవు ఈ పార్వతీయులు, ఆంధ్రులు, ద్రవిడులు మొదలగు వారుండు గ్రామములను చేరక, ఆ యూరులకు దూరదూరముగా నుండు పర్వత ప్రాంతములలో కుటీరములు నిర్మించుకొని నివసించు చుందురు

బడుగరులు వీరి భాష ఒక విధమగు కర్ణాటక భాషగా నుండును ఇది ప్రాచీన కర్ణాట భాషయని తెలియుచున్నది వీరు నుదుటిపై విభూతి ధారణము చేయుదురు ఇతర తెగలవారును ఇట్లే చేయుచుందురు బడుగరులు వ్యవసాయమే వృత్తిగాగలవారు వ్యవసాయము వలన వచ్చు ఫలసాయమును తమ బిడ్డల ఆస్తిగా భావించెదరు వారు అరణ్యములలోని చెట్లను నరకి, వంటచెరకును అమ్మి, ఆ రాబడితో జీవించెదరు ఎన్ని కష్టములు దాపురించినను, బిడ్డల యాస్తిని వారెంతమాత్రము ముట్టుకొనరు ఇప్పుడిప్పుడు బడుగరులు కొంత ఇంగ్లీషు భాషను నేర్చుకొని తెల్లవారివద్ద వంటవారుగనో, మరి వేరు విధముగనో ఉద్యోగములు చేయుచున్నారు

బడుగరులలో బ్రాహ్మణులు కలరు వీరు జంగము లను వేసికొందురు శాకాహారులుగ నుందురు అయినను, బడుగరులలోని ఇతర శాఖలవారితో వియ్యమందు చుందురు బడుగరులకు 'ఎదుందేవరు' అను పేరుగల దైవము ముఖ్యమైన కులదైవము 'ఎదుందేవరు' అనగా ఉద్ధరించు దైవమని అర్థము

ఈ బడుగరుల తెగలో వివాహక్రమము విడ్డూరముగా నుండును ఏ కన్యనైనను వివాహ మాడగోరు యువకుడు ఆ కన్యయొక్క పితృగృహమునకు వెడలి, ఆ పితకు తను వచ్చిన కార్యమును తెలుపును అతడు ఆ కన్యను పిలిచి, ఆ యువకుని చూపించి, "ఇతడు నిన్ను పెండ్లియాడగోరి వచ్చినాడు, నీ అభిప్రాయమేమి ?" అని ఆమె నడుగును తనకు అసమ్మత మగునేని ఆమె వెంటనే ఆ విషయమును తెలుపును అప్పుడా యువకుడు గొప్ప ఆశాభంగము నొంది, విచారముతో వెడలిపోవును ఆ స్త్రీకి ఆ పురుషుడు నచ్చినవాడయ్యేనేని, శయనానంతరము తెలిపెదనని యామె ప్రాక్రుచ్చును అంతట ఆ యింటిపెద్ద ఆ యిరువురకు విందు భోజనము పెట్టి, ఆ రాత్రి వారిద్దరను 'శయనగృహము'నకు పంపును శయన గృహము లనునవి ప్రత్యేకముగా పల్లెల యందు విడిగానుండు గృహములు ఈ గృహములందు రాత్రులలో వధువులు వరులను పరీక్ష చేయుచుందురు ఆ యిరువురు ఆ రాత్రి ఆలు మగలవలె ఏకాంత క్రియాకలాపములతో గడపెదరు ఉదయమున లేచి వారు తమతమ గృహముల కేగెదరు ఆ వనిత తన అభిరుచినిబట్టి అతనిని వరించుటో లేక వరింపకుండుటో సంభవించును వరించినచో వారిద్దరికి పెద్దలు వివాహ కార్యము వైభవ పూర్వకముగా జరపెదరు ఆ వనితకా యువకుడు ఆమోద యోగ్యుడుగా నుండనిచో, అతడు తిరస్కరింప బడును తత్ఫలితముగా తనకు గల్గిన అవమానముచే అతడు దుఃఖించును ఈ విధముగా ఈ తెగ మగువలు సంతుష్టికరుడగు వాడు దొరకువరకు రుచిచూచి విడుచు చుందురు చివరకు వనిత యొక్క పరిణయము నిశ్చయమగునాటికి ఆ స్త్రీ గర్భవతిగనో, సంతానవతిగనో యుండును బడుగరు స్త్రీ తాను పరీక్షింపకుండ ఎవ్వరిని పెండ్లి చేసికొనుటకు వీలులేదు

ఇట్లు దంపతులైనప్పటికిని, తరువాత ఆ భర్త తన కనుకూలుడు గాడేని, ఆమె వానిని విడిచి మరియొకనిని వివాహ మాడవచ్చును ఇది వారి ఆచారము వారి పరిణయమునకయిన ద్రవ్యమును నూతన భర్త పాతభర్త కిచ్చుకొనవలయును అట్లే భర్తయు,తన కిష్టములేని భార్యను త్యజించి మరియొక తరుణిని పెండ్లియాడ వచ్చును ఆ ఇరువురిలో ఎవరు విడాకు లిచ్చుటకు ముందుకు వచ్చెదరో, వారికి తమ సంతానమునందు హక్కుండదు దంపతులలో భర్తకాని, భార్యకాని మరణించినచో, బ్రతికి యున్నవారు మరల వివాహ మాడవచ్చును

బడుగరులలో పురుషుడుగాని, స్త్రీగాని చనిపోయి నప్పుడు వారివారి వస్త్రాభరణములను, మృత్పాత్రలను

చితిపై నుంచి దహన మొనర్చెదరు లోకాంతరమున వారికా వస్తువులు అవసరమని వారి భావము

బడుగరులలో కొందరు మణియగాండ్రుగా నియుక్తులగుదురు. వీరు తమ జాతులవారినుండి శిస్తుదస్తులు వసూలు చేసి, దివాణమునకు కట్టుచుందురు. వీరికి దివాణమువారు మిరాసీల నొసగుదురు. ముళ్ళకుదుంబురు తెగ మినహా, శేషించిన తెగలపై బడుగరులు పెత్తనము వహించి యుందురు. కులవివాదములను వీరు తీర్చుచుందురు. బడుగరులకు ఆయాజాతులవారు భయపడుచు, వినయ విధేయులై వర్తించుచుందురు.

**ఉరాళిలు** ఈ తెగవారు బడుగరులకు భృత్యులై యుందురు. వ్యవసాయ కార్యములు నెరవేర్చుచు, కూలీలుగా పనిచేయుచుందురు. ఈ తెగవారి భాషయు, బడుగరుల భాషయు దాదాపు ఒకేవిధముగా నున్నట్లు తోచుచుండును.

**తొడువరులు** వీరిభాష ఇట్టిదని చెప్పుటకు వీలులేదు. అది యొకవిధమయిన ఉచ్చారణము కలది. అది ఇంగ్లీషు భాషను పోలియుండును. వీరు నీలగిరి పర్వతములలోని అధిత్యకల (కొండమీదినేలలు) కన్నింటికి అధీశ్వరులై యుందురు. నేలకావలసిన వారెల్లరు వీరి నాశ్రయింపవలసి యుందురు. కృషీవలులగు బడుగరులు తొడువరులకు 'మేలు హారము'ను చెల్లింతురు. తొడువరుల ముఖ్యవృత్తి బర్రెల పెంపకము. ఈ బర్రెలకు దూడలు కలిగినచో, వాటిని తమ కాహారముగ ఉపయోగించుకొందురు. చచ్చినవాటిని భుజింపరు. ఈ బర్రెలు అడవిదున్నలవలె భయంకర రూపములు కలవిగా నుండును.

తొడువరులలో ఎవ్వరయిన మృతులైనచో, బంధువు లందరు రావింపబడి వారికి షడ్రసోపేతమయిన భోజనము పెట్టబడును. వచ్చిన బంధువులందరు ఇంటి కొకగేదె వంతున తీసికొనివచ్చి ఇంటివారికిచ్చెదరు. ఇట్లు వచ్చిన బర్రెలను తమ ముందుంచుకొని తమ యింటిబర్రెలను ఒక్కొక్క దానిని వధించి, వాటిచుట్టు కూర్చుండి ఏడ్చెదరు.

బర్రెలను వారు ఇంటివద్ద కట్టివేయరు. మేతపొలముల లోనికి తోలుదురు. ఆ మహిషములను చంపుయత్నము ప్రాణాపాయకరము. కొందరు ప్రాణములను కోల్పోవుటయు కలదు. బలిష్ఠులు, ధీరులు, సాహసికులు అయిన వారు బర్రెలను విచ్చలవిడిగా వదిలిపెట్టి, తరుముచు, వాటిచుట్టు మూగి తలవగులగొట్టి చంపుదురు. బంధించి చంపుట పౌరుష లోపము. ఈ మహిషవధా సంరంభమున, అవి విజృంభించి చేయు బీభత్సము అపారము. మనుష్యులొకరిద్దరు మరణించుట కూడ తటస్థించును. మహిష వధానంతరము తత్సంప్రదాయ కృత్యములను నెరవేర్చెదరు. తరువాత ఆ చోటు విడిచి మరియొక చోట గుడిసెలను నిర్మించుకొని, బంధువులు తెచ్చియిచ్చిన బర్రెలతో జీవనము సాగించెదరు. ఇట్లుచేసినచో, మృతులకు పుణ్యలోకములు కలుగునని వారి విశ్వాసము. ఊర్ధ్వదైహిక క్రియాకలాపములు మూడుదినములు గొప్ప ఉత్సవముగా జరుపబడును. ఈ ఉత్సవమును జూచుటకు ఆటవికులుకానివారును వచ్చి వినోదించుచుందురు.

తొడువరుల కులములోని స్త్రీలు రజస్వలలుగాక మున్నె మగలను కూడెదరు. ఒక కుటుంబము నందలి అన్న భార్యయే ఆతని తమ్ములకును భార్యగా నుండును. అగ్రజుడు ముసలివాడైనను, ఆతని భార్య మరణించినను, మరియొక తరుణిని అన్నకిచ్చి పెండ్లిచేసి, తమ్ములు ఆమెతో కూడుదురు. జ్యేష్ఠుడు జీవించి యుండగా, కనిష్ఠుడు పెండ్లి యాడగూడదు. భార్య జీవించి యున్నచో, ఆతడు మరియొక భార్యను చేకొనగూడదు. అగ్రజుడు మృతుడైనను, కాకున్నను, ఆతని భార్య మిక్కిలి ముదుసలిదైనను, రెండవ వాడు వివాహ మాడుటకు వీలులేదు. వారిద్దరు మరణించిన తరువాతనే రెండవవాడు, వివాహ మాడవలెను. వీని తమ్ములు పూర్వము వివరించిన తీరుగానే అగ్రజుని భార్య యొడ నడచుకొనవలెను. వివాహాపేక్షగలవాడును, సమష్టి కుటుంబమున నుండనిష్టములేనివాడును వేరుపడిపోయి వివాహము చేసికొనవచ్చును. ఇట్లు విభక్తులైపోయిన సోదరులు ఒక కుటుంబముగా నేర్పడినచో, పూర్వోక్త ప్రకారము వర్తించెదరు.

వడతులు గృహములయందు నివసించునపుడు విగత వస్త్రలై లజ్జావిహీనలై గ్రుమ్మరుచుందురు. ఇంటివారుకాక, పెరవారు కనబడినపుడు స్త్రీలు వస్త్రములను ధరించెదరు. ఈ స్త్రీలు కటిప్రదేశము, ఊరువులు, ఉరోజములు మూయునట్లుగా పోకముడి యిడక యే వస్త్రమును ఒంటిచుట్టు చుట్టుకొని యుందురు. ఉరోజములపై భాగమున ఒక మూపునుండి రెండవ మూపువరకు ధనురాకారమున పచ్చ పొడిపించుకొనెదరు. వెండ్రుకలను పెరుగనీయక కత్తిరించుచు, వాటిని

దువ్వి కపోలముల మీదుగా జారవిడిచెదరు కొప్పులుగా, జడలుగా కేశవిన్యాస మొనర్చు పద్ధతులు వారికి లేవు తోడువరు స్త్రీలలో సుందరాంగినులు, ఒయ్యారులు కలరు పూర్వోక్తులైన బడుగరుజాతి అధికారులు, ఒక్కొక్కసారి ఒంటరిగా నుండు ఈ పడతులను బలిమిబట్టికొని కూడెదరు ఆ పురుషుల నెవ్వరు ఏమియు జేయజాలరు అందుచే పురుషులు తమ స్త్రీలను ఒంటరిగా నుంచి పోవు సందర్భము వచ్చినయెడల, వారిని మోసికొని పోయెదరు గృహబాహ్య ప్రదేశములందు జరుపవలసిన కృత్యము లన్నియు పురుషులే చేసెదరు

**కోత్తరులు** ఈ జాతివారు పైన పేర్కొనిన జాతుల వారికంటె తక్కువవారు వీరు వడ్రంగి, కమసాల, కమ్మర, కుమ్మర, ఉప్పర, చాకలి, మంగలి పనులు చేయువారు వీరు చర్మవాద్యములను కూడ వాయించు చుందురు

**ముళ్ళుకుదుంబరులు** ' వీరికి కుదుంబరులనియు నామాంతరము కలదు వీరికొక ప్రత్యేకభాష లేదు ఆయా పరిసర ప్రాంతముల భాషలను భ్రష్టరూపమున వాడుచుండెదరు వీరు పక్కన పార్వతీయులతో చేరక, పర్వతముయొక్క అత్యంత శిఖరాగ్రమునందుండు నితంబములయందు నివసించు చుందురు ఆ ప్రదేశ మంతయు క్రూరమృగ సంచారభూమిగ నుండును అయినను వారి కావంతయు భయము లేదు వారు ఇతరులతో కలియుట తరచుగా సంభవింపదు స్త్రీలు, పురుషులు మంత్రశక్తి గలవారట! పురుషు లింటలేని సమయమున కుదుంబరు స్త్రీలు నిర్భయముగ కేకలు వేసియు, రాళ్ళు రువ్వియు, బడితెలతో కొదియు పులులను, ఏనుగులను, ఇతర క్రూరమృగములను పారద్రోలెదరు ఈ ముళ్ళుకుదుంబరులు తమకు గల మంత్రౌషధ శక్తిచే పెక్కు రూపములను దాల్పగలరట! వీరు ఇచ్ఛానుసారముగ భీకర మృగరూపములను ధరించి తమ శత్రుజనమును పరిహరించెదరట! అందుచే అచ్చటి పార్వతీయులందరు వీరిని జూచి భయపడెదరు; వీరియెడ వినయముతో వర్తించెదరు మరియు తామార్జించు ధనములో సగభాగమును సంవత్సర కప్పముగా వీరి కిచ్చుకొనెదరు. మానవులు చేరరాని అఘోర పర్వత కాంతారములలో ఏ శైలాగ్రముననో, ఏ వృక్షాగ్రముననో ఉండు తేనెపెరనులనుండి ముళ్ళుకుదుంబరులు అనాయాసముగా తేనెను డించెదరు ఈ కార్యము ఇతర గిరిచరుల కలవికానిది

ఆ వీ.

## బమ్మెర పోతనామాత్యుడు :

'మృదుమయఫణితీనాం మార్గదర్శీమహర్షిః' అని పలుకుం గమ్మదనమునకు వాసిగాంచిన వాల్మీకి కవిచంద్రుని మధుర వాగ్గుంఫములను తన సొత్తు చేసికొన్నాడు పోతనామాత్యుడు కావుననే 'విద్యావతాంభాగవతే పరీక్షా' అని కొమ్ములుదిరిగిన కోవిదులకే పరీక్షాస్థానముగా ప్రథ వహించిన శ్రీమద్భాగవతము ఆసిద్ధహస్తునిచేతిలో 'బాలరసాలసాలనవ పల్లవకోమలమై' ఎసలారినది అబాలగోపాలమునకు ఆస్వాద్యమైనది అనువాదయుగమారంభమైన యేనూరేండ్లకుగాని 'భాగవతదివ్యఫలరసాస్వాదయోగము' తెలుగుజాతికి కలుగలేదు ఆంధ్రులకీ యమృతభాండమునందించి అజరామరకీర్తి నందిన అమలచరితుడు బమ్మెరపోతన మహోదయుడు

**పోతన - అభిజనాదులు** ప్రామాణికులైన పలువురు చారిత్రికులు అంతరంగబహిరంగ సాక్ష్యములు పరిశీలించి తెలంగాణమందలి ఓరుగంటికి సమీపమున నేటి జనగామతాలూకాలోని బమ్మెర అనునదియే పోతనార్యుని అభిజనమని నిరూపించినారు

**వంశము** చిరకాలవాసమువలన బమ్మెర అనుగ్రామనామమే పోతనామాత్యుని వంశమువారికి గృహనామమైనది బమ్మెరవారిది కౌండిన్యసగోత్రము ఆపస్తంబసూత్రము యజుశ్శాఖ వీరునియోగిబ్రాహ్మణులు శైవమతావలంబులు పోతన తాత ఎల్లన తండ్రి కేసన తల్లి లక్ష్మమ్మ అన్న తిప్పన పోతనార్యునకు కేసన యను బకకుమారుడున్నట్లును, అతడు తండ్రివలెనే కవియు, పండితుడునై వెలయుటయేగాక, 'ప్రౌఢసరస్వతి' అను బిరుదమునుకూడ వహించియుండినట్లును తెలియుచున్నది పోతన పౌత్రులైన కేసనమల్లనలను వారు, తామును తాతతండ్రులవోలిక కావ్యరచనాధురీణులై రాజాయణీపరిణయమనెడి ప్రబంధమును రచించి వంగడపు వాసి నిల్పినారు ప్రౌఢసరస్వతి కూతురు ఎల్లమ్మ పోతనగారి పౌత్రియైన ఈ ఎల్లమ్మను పెండ్లాడిన అజ్జరపు పేరయ లింగకవి ఒడయనంబివిలాసమును రచించి పేరుగాంచెను వీరి వంశగురువులు ఇవటూరివారు ఆదిశైవాచార్యులు ఆరాధ్యులనబడువారు. పోతన్న క్రీ శ పదునైదవ శతాబ్ది ఉత్తరార్థమువాడై యుండునని నిశ్చయింప బడెను అనగా

(క్రీ శ 1400-1470) వరకును గల కాలములో ఈ మహాకవి వెలసియుండెనని విశ్వసింపదగి యున్నది

**గుణశీలాదులు**

వినయము చందనమునకు పరిమళమువలె పోతనార్యునకు వినయము ప్రకృతిసిద్ధమైయున్నట్లు తోచును ఆంధ్రభాగవతపీఠికాగ్రంథభాగములో ఈకవితల్లజుడు వాడిన మాటలు ఆతని వినయసంపత్తిని చాటును తన అఖండ పాండిత్యమునకును, అసాధారణకావ్యకళానైపుణ్యమునకును భాగవత గ్రంథమెల్ల దర్పణాయమానమై మెరయుచున్నను—

'భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు
శూలికైన దమ్మిచూలికైన
విబుధవరులవలన విన్నంత కన్నంత
తెలియవచ్చినంత తేటపఱుతు'

అన్నాడు పేరుపేరున పూర్వులగు మహాకవులను పూజ్యభావముతో స్మరించి ప్రణుతి సేయుటయేగాక, 'వర్తమాన కవులకుం బ్రియంబునలికి భావికవులబహూకరించి' నాడీ సౌజన్యమూర్తి ఇంకొకచో 'పోతయనామవ్యక్తుండ సాధునయయుక్తుండన్' అని తాను తనను పరిచయము చేసికొన్నాడు వినయ మొసగునదిగదా విద్య విద్యావినయము లీయుత్తమసంస్కారునకు మణికుండలములై కైసేసినవి.

నిరీహ ఈ మహాకవిలో కొట్టవచ్చినట్లు కనపడు మరియొక గుణము నిరీహ అలోలుపత్వము అతడు యథాలాభసంతుష్టుడు ఉన్న కొద్దిపాటి పొలమును దున్నుకొని బ్రతుకుచుండెనని ప్రతీతి విషయాసక్తితో అవసరాలు పెంచుకొని దైన్యమును నించుకొని ఒకవంక ఆనాటి కవులు పండితులు అందరు గాకున్నను, పెక్కుమంది ప్రభువుల ప్రాంగణాలలో ప్రాకులాడుచుండగా ఈ అన్నదే చాలు తాను బంగారు పిచ్చుక కాగల అర్హతలును అవకాశములును ఎన్నో కలిగినవాడయ్యు, అవంక చూడనైన చూడక లేమికౌగిళ్ళలోనే ఆనందించిన పోతన నిరీహానిష్ఠ ఎంతగరిష్ఠమో! ఈయైహికసంపదాశ తన స్వేచ్ఛకు శృంఖలమై శివభక్తి సాధనకు బాధకమై కడకు తన జన్మధ్యేయమగు కైవల్య ప్రాప్తికే భంజకము కాగలదని ఆ విజ్ఞాని ముందే గుర్తించెను అపరిగ్రహదీక్షను పట్టెను అతి కఠోరవ్రతము ఆ సజ్జనుని ఈ నియమపాలనము, తోడికవి పండితులకు అహంకారముగా, ప్రభువులకు అవినయముగా తోచియుండును సత్యమునకు రాజసమునకు ఘర్షణము దానిఫలితమై యుండును చాటువులుగా వినవచ్చుచున్న

'కాటుక కంటినీరు చనుకట్టుపయింబడ నేల యేడ్చెదో
కైటభదైత్యమర్దనుని గాదిలి కోడల! యో మదంబ! యో
హాటకగర్భురాణి నిను నాకటికిం గొనిపోయి యల్లక
ర్ణాటకిరాటకీచకులకమ్మ 'త్రిశుద్ధిగ నమ్ము భారతీ'
'బాలరసాలసాలనవపల్లవ కోమలకావ్యకన్యకన్
గూళలకిచ్చి యప్పడుపుఁగూడుభుజించుటకంటె సత్కవుల్
హాలికులైననేమి గహనాంతరసీమల కందమూలకౌ
ద్దాలికులైననేమి నిజదారసుతోదరపోషణార్థమై'
'—ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనమ్ములున్
సొమ్ములు గొన్ని పుచ్చుకొని చొక్కి శరీరము వాసి కాలుచే
సమ్మెటపోటులం బడక సమ్మతి శ్రీహరి కిచ్చి చెప్పె నీ
బమ్మెరపోతరాజొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్—'

అను నిట్టి పద్యాల రాతున ఆనాటి ఆ ఘర్షణచ్ఛాయలు గోచరించుచున్నవి కట్టుకథలన్నియు చరిత్ర కావలసిన నిర్బంధము లేదు కాని నిప్పులేనిదే పొగరాజదు కాబట్టి యివి యన్నియు పోతన్న కాలప్రవాహమునకు ఎదురీదినవాడు - ఆశాపాశము త్రెంచినవాడు - అను తాత్పర్యార్థరూపమైన సత్యమును సూచించు ననవచ్చును

భక్తి పోతన మాతాపితృభక్తియు మెచ్చదగినదై యున్నది తనతండ్రి కేసనమంత్రికిని, తల్లి లక్కసానమ్మకును గ్రంథారంభమున పుష్పాంజలి సమర్పించినాడు 'ఈశ్వర సేవాకాముడు' నా అన్న అని తిప్పయను సంభావించినాడు ఈతని గుణహారములో భగవద్భక్తి నాయకమణియనదగినది శివపారమ్య బోధకమగు శైవమతమునకు చెందినవంశములో పుట్టుపొందియు ఈతడు తిక్కనవలె హరిహరాద్వైతమును పాటించినవాడు అందుచే శివకేశవులయెడ సమభక్తి నెరపి జీవితము గడపెను ఈతని భక్తియోగము పరాకాష్ఠకుచెందినది భక్తిశూన్యుని పుట్టువు వ్యర్థమని యతడిట్లు తెగడినాడు

'చేతులారంగ శివుని పూజింపడేని
నోరునొవ్వంగ హరికీర్తి నుడువడేని
దయయు సత్యంబు లోనుగాఁదలఁపడేని
కలుగనేటికిఁ దల్లుల కడుపుచేటు'

దయాసత్యములను పూన్చి భక్తిపుష్పరథయాత్ర సాగింపు డని యుపదేశించినాడు మహాభక్తకవి 'సర్వమున్నతని దివ్య కళామయమంచు విష్ణునందుల్లమునిల్పి' జీవితముగడపిన సచ్చరిత్రుడతడు చేతనుని సర్వవ్యాపారము భగవదిచ్ఛా పరతంత్రమే యనెడి దృఢాధ్యవసాయము ఆతా త్త్వికునిది పృథక్ప్రయత్న సాధ్యమని యొరులు తలంచు కావ్యనిర్మా ణమువంటి బుద్ధి వ్యవసాయమున నైతము తాను నిమిత్త మాత్రుడే లేఖకుని చేతిలోని లేఖినివంటి ఉపకరణమే, బొమ్మ లాట వానిచేతి కీలుబొమ్మయే, తాను కావుననే

'పలికెడిది భాగవతమట

పలికించిన వాడు రామభద్రుండట నే

పలికిన భవహరమగునట,

పలికెద వేఱొక్క గాథ పలుకగనేలా ?'

అని ముక్తకంఠముగా చెప్పగలిగినాడు

పోతన రచనలు వీరభద్ర విజయము, భోగినీదండ కము, ఆంధ్ర మహాభాగవతము అనునవి పోతనకృతులు

వీరభద్రవిజయము ఇది నాలుగాశ్వాసముల ప్రబం ధము ఇందలి ఇతివృత్తము వాయు బ్రహ్మపురాణములనుండి గ్రహింపబడినది తన గురువగు ఇవటూరి సోమనాథుని ప్రేరణచే పోతన ఈ గ్రంథమును రచించెను ఇది ఈ కవి ప్రథమరచన కావ్యమార్గములో జంకుచు జంకుచు అడుగిడు చున్నట్లున్నది ఇంటబుట్టిన శైవము వంట బట్టియున్న తొలి దినములవి గురువు వీపుతట్టి, నామహిమయున్నదిలే, వద! అనుచు

'వింత పండువు బోలెను వీరభద్ర

విజయమెల్లను వినఁగను వేడ్కయయ్యె

నది తెలుంగున రచియింపు మభిమతముగ—'అని

ఉద్బోధించి—నాకింత అధికారమా అనునేమో! యని

'పిన్నవాఁడ ననియుఁ బెక్కు సంస్కృతులను

విననివాఁడ ననియు వెఱవుమాను

మత్ప్రసాద దివ్య మహిమచే నెంతైన

కవిత చెప్ప లావు గలదు నీకు—'

అని ఉత్సాహపరచినాడు

కొందరు ఈవీరభద్ర విజయమును, పోతన, భాగవతము వ్రాసినపిమ్మట వ్రాసిన ట్లందురు భాగవతమున దక్షాధ్వర సందర్భమున శివదూషణము చేసినందున పోతన కన్నులు పోయినందున తద్దోష పరిహారార్థముగా వీరభద్రేశ్వరునిపై ఒక ప్రత్యేక ప్రబంధమునే పోతన రచించెననియు వా రందురు అందుకు ప్రమాణముగా

'భాగవత ప్రబంధ మతి భాసురతన్ రచియించి దక్షదు

ర్యాగకథా ప్రసంగమున నల్పవచస్కుఁడనై లి తిన్నిమి

త్తాగత వక్త్రదోషపరిహారముకై యజనైకశైవశా

స్త్రాగమ వీరభద్ర విజయంబు రచించెద వేడ్కనామదిన్—'

అను పద్యమును చూపుదురు ఎవరో కల్పించినది, అప్రమాణ మైనది అని పరిశోధకులు దీనిని త్రోసివేసిరి పరిణతమైన భాగవతశైలియేడ? వీరభద్ర విజయమందలి పూవకైతయేడ? పిన్నవాఁడను, పెక్కు సంస్కృతులను విననివాడను అని తానే చెప్పుకొనుచున్నాడుగదా!

భోగినీదండకము పోతన రెండవ కృతి భోగినీదండ కము రాచకొండ రాజగు రెండవ (సర్వజ్ఞ)సింగ భూపాలుని ప్రీతిగా అతని యుంపుడుకత్తెపేర రచింపబడినది ఈశృంగార కృతి దీనిలో పోతన్న హస్తముద్రలు మెండుగా కనబడు చున్నవి కొన్ని దంతకథలును ఇందులకు సాక్ష్యము పలుకు చున్నవి భాగవతమున దశమస్కంధములో అక్రూరుడు శ్రీకృష్ణుని స్తుతించు సందర్భములో పోతనయే రచించిన దండకముతో ఇది సరితూగుచుండుటయు ఇది ప తన్మహాకవి రచనమే యనుటకు మరియొక నిదర్శనము ఈ దండకమున కడపటనున్నట్టి—

'పండిత కీర్తనీయుఁడగు బమ్మెరపోతనయాసుధాంశుమా

ర్తాండ కులాచలాంబునిధి తారకమై విలసిల్ల భోగినీ

దండకమున్ రచించె బహుదానవిహర్తకు రావుసింగభూ

మండల భర్తకున్ విమత మానవనాథమదాపహర్తకున్'

అను పద్యము ఈ దండకమును పోతన రచితమునుగా పేర్కొనుచున్నది ఇది పచ్చిసింగారపు కబ్బము కనుక దీనిని పోతనవంటి నైష్ఠికుడు రచించియుండడని కొందరందురు కాని అది సరికాదు మానవమాత్రుడేయైన పోతన ప్రథమ వయస్సులో ఇట్టిరచన సాగించియుండిన వింతపడవలసిన దేమున్నది! ఈడుపెరిగి జ్ఞానము వర్ధిల్లి ఈశ్వరానుగ్రహ మున ఆ బుద్ధియోగము బలపడిన దశ వచ్చినపుడు వ్యక్తుల స్థితిగతులు మారుట లోకదృష్టమే అట్టి సహజపరిణతియే పోతన జీవితవృత్తములోను సంభవించియుండునేమో!

శ్రీ మదాంధ్రమహాభాగవతము పోతనామాత్యుని కీర్తిమూర్తి

కెత్తిన విజయధ్వజము భాగవతము ఇది ఆ మహనీయుని కృతి భాగవత రచయిత పోతన్న పాతపోతన్నకాడు ఈత డొక సరిక్రొత్తవ్యక్తి సంస్కారమేవేరు శైలియేవేరు లక్ష్యమేవేరు తన చిత్తవృత్తికి తూగిన యితివృత్తము ! ఇతి వృత్తమునకు దీటైన తన చిత్తపరిణతి ! మిన్నెత్తు తన శబ్ద రాశి ! విశ్వమంత తన భావము ! ఓహో ! ఎంత భాగ్యముతనది ! ఉప్పొంగిపోవుచు—

'ఒనరన్ నన్నయ తిక్కనాదికవు లీయుర్విన్ బురాణా
వళుల్
దెనుఁగుం జేయుచు మత్పురాకృత శుభాధిక్యంబు
దా నెట్టిదో
తెనుఁగుం జేయరు మున్ను భాగవతమున్ దీనిం
దెనింగించి మ
జ్జననంబున్ సఫలంబుచేసెదఁ బునర్జన్మంబు లేకుండగన్—'

అని ఎలుగెత్తి చాటినాడు తనయెడ వాత్సల్య పూర్ణులగుట చేతనే తాము సర్వసమర్థులయ్యు ఈ భాగవతాంధ్రీకరణపుణ్య కార్యమును తనపాలుగా విడిచి యుంచినారని ఆ నన్నయ తిక్కనాదులగు పూర్వకవులను భక్త్యాదరములతో సంభావించినాడు

**భాగవతపురాణము – అనుబంధచతుష్టయము** పోతన భాగవతమునకు వ్యాసప్రోక్తమైన భాగవత పురాణము మూలము, ఇది పదునెనిమిది పురాణములలో ఒకటి దేవీ భాగవతము ఈ అష్టాదశ పురాణములలో లెక్కింపబడదు దీనికొక సంకేతమున్నది మత్స్యపురాణములో ఈభాగవత సంకేతము విశదీకరింపబడినది పోతన్నగారును ఇట్లు వివరించినారు —

'సత్యం పరం ధీమహి'యను గాయత్రీ ప్రారంభంబున గాయత్రీనామబ్రహ్మరూపంబై మత్స్య పురాణంబులోన గాయత్రి నధికరించి ధర్మవిస్తరంబును, వృత్రాసురవధంబును నెందుఁ జెప్పంబడు నదియ భాగవతంబని పలుకుటంజేసి యీ పురాణంబు శ్రీభాగవతంబన నొప్పుచుండు '

మూలభాగవతములోని మొదటి శ్లోకమిది :

'జన్మాద్యస్య యతోన్వయాదితరతశ్చార్థేష్వభిజ్ఞః స్వరాట్
తేనే బ్రహ్మహృదా య ఆదికవయే, ముహ్యంతి యత్సూరయః
తేజోవారిమృదాంయథా వినిమయోయత్ర త్రిసర్గోఽమృషా
ధామ్నా స్వేన సదా నిరస్తకుహకం సత్యం పరం ధీమహి.'

ఇందు గాయత్రీ మంత్రము స్మరింపబడినది గ్రంథమందంతటను పరమధర్మ ముపదేశింపబడినది వృత్రాసురకథయు దీనిలో చెప్పబడినది కావున భాగవతపురాణమిదియే మహాపురాణములలో లెక్కింపబడినది

విషయము, అధికారి, సంబంధము, ప్రయోజనము అనునవి అనుబంధ చతుష్టయము ప్రతిగ్రంథమునను ఈయంశములు సమన్వయము కావలెను భాగవతములో దీని సమన్వయము, 'ధర్మః ప్రోజ్ఘిత కైతవోఽత్ర పరమో నిర్మత్సరాణాంసతాం' అను శ్లోకమున గావింపబడినది

దీని భావమును పోతనామాత్యుడిట్లు విశదీకరించెను—

'శ్రీమంతమై మునిశ్రేష్ఠ కృతంబైన
భాగవతంబు సద్భక్తితోడ
వినఁగోరువారల విమలచిత్తంబులఁ
జెచ్చెర యీశుండ చిక్కుఁగాక
ఇతర శాస్త్రంబుల నీశుండు చిక్కునె!
మంచివారలకు నిర్మత్సరులకుఁ
గపట నిర్ముక్తులై కాంక్ష సేయక యుండుఁ
దగిలియుండుట మహాతత్త్వబుద్ధి
పరఁగ నాధ్యాత్మికాది తాపత్రయంబునడఁచి
పరమార్థభూతమై యఖిలసుఖద
మైసమస్తంబు గాకయు నయ్యెనుండు
వస్తువెఱుఁగంగఁదగు భాగవతమునందు '

విషయము ఇందు అవశ్యానుష్ఠేయములగు భాగవత ధర్మాలు, పరవ్యూహ విభవాంతర్యామ్యర్చారూపుడగు భగవంతుని స్వరూపము విస్తరముగా నిరూపితములైనవి పురాణలక్షణమున కనుగుణముగా ఇందు కావించిన సర్గ ప్రతిసర్గాది వర్ణనము స్థూలరూపుడగు సర్వేశ్వరుని స్వరూప నిరూపణపరముగానే స్వీకరింపబడుటచే ఈ గ్రంథమున సాధనమైన పరమధర్మము, సాధ్యమైన సర్వేశ్వరుడు వర్ణింపబడినట్లు తేలును 'అత్రానువర్ణ్యతేఽభీక్ష్ణం విశ్వాత్మా భగవాన్ హరిః' 'కీర్తితోయచ్చ మే సాక్షాదనాదినిధనోహరిః–' అను భాగవతోపసంహార భాగమునందలి వాక్యములును ఈ ప్రతిపాదితార్థమునే సూచించునవి

సంబంధము బోధ్యబోధకరూపమైనది సంబంధము

అధికారి భాగవత పురాణ పఠనమునకు ముఖ్యాధికారులు ముముక్షువులు సంసారార్ణవఖేదితచిత్తులై విషయభోగములను రోసి ధర్మజిజ్ఞాసువులై, నిర్మలధర్మకర్మదీక్షాపరతంత్రులు నైన సజ్జనులు ఈ భాగవతగ్రంథసుధానుభవమునకు అర్హులు

ప్రయోజనము తత్త్వజ్ఞాన సంపాదనము, తాపత్రయోన్మూలనము, తద్ద్వారమున భగవదనుగ్రహ ప్రాప్తి కడకు మోక్షప్రాప్తి మానవుడైనవాడెల్ల అవశ్యముగా అభిలషింపవలసినది చరమపురుషార్థము, మోక్షము అట్టి మోక్షప్రాప్తికి భాగవత పఠనము సులభతరోపాయము

'నిగమములు వేయుఁజదివిన

సుగమంబులుగావు భక్తి సుభగత్వంబున్

సుగమంబు భాగవతము

నిగమంబుఁ జఠింపముక్తినివ సనము బుధా'

అను సూతమహర్షి సూక్తి యీ యర్థమునే తెలుపుచున్నది మహాభక్తుడగు పోతనయు - దీనిన్ (భాగవతమును) దెనిగించి 'మజ్జననంబున్ సఫలంబుఁ జేసెదఁ బునర్జన్మంబు లేకుండఁగన్' అని పునర్జన్మరాహిత్య రూపమైన మోక్షమునే యభిలషించినాడు

ఆంధ్ర భాగవతము - అవతరణ సన్నివేశము శాంతరసప్రధానమైన భాగవతము, అతిప్రసన్నమైన వాతావరణములో అవతరించినది ఈ సన్నివేశమునకును సంస్కృత భాగవతావరణ సన్నివేశమునకును చక్కని పోలిక కన్పట్టుచున్నది అచట పావనమైన సరస్వతీ నదీతీరము వేదములు విభాగించి, భారత సంహిత చెప్పి, యెన్నెన్ని విధములుగానో ధర్మములు ప్రపంచించియు హృదయములో ఏదో ఒక కొరతతో, ఏదోఒక తపనతో వ్యాకులపడుచు, విజ్ఞానికావున వెంటనే గ్రహించి

హరికిఁ యోగివరుల కభిలషితంబైన

భాగవత విధంబుఁ బలుకనైతి

మోసమయ్యెఁ దెలివి మొనయదుమఱచితి

ననుచు వగచుచున్న యవసరమున

అనుతాపనుచు నిలచిన వ్యాసమహర్షి

ఇచట పవిత్రమైన గోదావరీ పులినతలము వీరభద్ర విజయము, భోగినీదండకము రచించి ఏ విన్నకైతగాడుగానో పేరొందెనేమోగాని అది తృప్తినొసగక కొంతకాలము కింకర్తవ్యతా మూఢుడై యుండి కాలము చెల్లిపోవుచున్నదేయని వెంత మొకవంక దందడింప కుందికుంది యింతలో పుణ్యవశమున లోధావిర్భావమునొంది శ్రీమన్నారాయణ కథాప్రపంచ విరచనాలోచనా పరుడగుచున్న పోతనకవి అచట దేవర్షి నారదుడు దివినుండి దిగివచ్చి నీవు నిఖిలబంధమోచనంబుకొరకు వాసుదేవుని లీలా విశేషంబులు భక్తితోడ వర్ణింపుము -' అని భాగవత రచనకు ప్రేరేపించుట ఇచ్చట శ్రీరామభద్రుడే ప్రత్యక్షమై 'మన్నామాంకితముగా శ్రీ మహాభాగవతంబుఁ దెనుగుసేయుము నీకు భవబంధంబులు దెగున"ని అనతిచ్చుట ఉభయత్ర భాగవత గ్రంథావతారము'

పోతన ప్రతిభావ్యుత్పత్త్యాదులు

ప్రతిభ పోతన్న ప్రతిభాసంపన్నుడైన మహాకవి కావ్యవస్తువును ఏరుకొనుటలోనే కవి ప్రతిభ తెలియవచ్చును పిష్టపేషణముగా ఒకరుచేసినపనినే తానుచేయుట ప్రతిభగలవాని పనికాదు తనకాలమువరకును తెలుగులోనికి రాని మూలగ్రంథముకొరకు వెదకినాడు ఏ అల్పపురాణమో కావ్యమో చేపట్టి చేతులు కడిగికొని యుండవచ్చును ఆ విశేషప్రతిభావంతుని దృష్టి పంద్రెండు స్కంధముల మహాగ్రంథము భాగవతముమీదనే పడినది ఒక్కపూనికతో ఇహపరములను సాధించినాడు పురాణించుట అనాటిప్రజ్ఞావంతులకుచిన్నె పురాణింపదొరకొన్నాడు ప్రతిభాహీనుడు సాహసము చేసినను మాటచెల్లించుకొనలేడు ఈతడో చెల్లించుకొన్నాడు నన్నయతిక్కనాది మహాకవుల శ్రేణిలో నిలువగలిగినాడు సమానులలో ఉత్తమశ్లోకుడగుటకు మించిన యిహమేమున్నది? అటు కావ్యకళను దివ్యకళగాదిద్ది సర్వేశ్వరారాధనములో పూజాసామగ్రిచేసి ముక్తినందుకొన్నాడు

మూలగ్రంథమునందలి అంశములను పెంచుటలో, త్రుంచుటలో, మార్చుటలో, తీర్చుటలో ఆతని ప్రతిభ వేయిరూపుల వెలుగొందినది రసపోషణము, పాత్రోన్మీలనము, ఔచిత్యపాలనము వంటివి కవికి కేవలము వ్యుత్పత్త్యభ్యాసముల వలన లభించునవి కావు అట్టివెల్ల ప్రతిభోద్యోగమే

వ్యుత్పత్తి సంచి మొదలులేని సెట్టి బేహారము వంటిది చదువుకంఢలేని కూర్పరి జతనము బహుగ్రంథావలోకనము, వైదుష్యము వలసినంతగా పోతనార్యునకు కలవు విద్వాంసులకే పరీక్షాస్థానముగా ప్రథవహించిన భాగవతమును మూలకారుని హృదయము అందివచ్చునట్లు తెలిగింపగల్గిన ఈతనిది

నిండైన పాండిత్యమని వేరుగా చెప్పనక్కరలేదు కొన్ని కొన్ని ఘట్టములలో శ్రీధరీయచంద్రికాదివ్యాఖ్యాతల భావములను కూడ క్రోడీకరించి చూపగలిగినాడనగా అది అంతంతన పొసగు పనియా ? అందందు నిక్షేపించిన యజ్ఞ గంతాదిపదరత్నాలు, ప్రౌఢప్రయోగాలు, సమస్తవాక్యాలు, ఛందోలంకారశిల్పాలు ధ్వనివిన్యాసాలు - అతని వివిధశాస్త్ర పరిజ్ఞానమునకు తార్కాణము నైమిశారణ్య వర్ణనము మొదలైన కొన్నితావులలో మూలములోలేని శ్లేష సౌభాగ్యాలు కాదంబరీసుధారసాస్వాదసిద్ధుడు కానివాడు కూర్పగలవి యేనా ! అతడు తెలుగులోను అట్టి గట్టిదిట్టయే యనుటకు భాగవతమునందలి నూర్లకొలది అచ్చతెలుగు పద్దెములే సాక్ష్యమిచ్చును సంస్కృతాంధ్రములు రెండింటను కవ్వడియైన వాడు కావుననే

'కొందఱకు తెలుఁగు గుణమగు,
కొందఱకున్ సంస్కృతంబు గుణమగు రెండున్
కొందఱకు గుణములగునే
నందఱ మెప్పింతు గృతులనయ్యైయెడలన్ –'

అని చెప్పి చెప్పినట్లుచేసి మెప్పుగొన్నాడు

**అభ్యాసము** పోతన కవితాభ్యాసము దొడ్డది పద్య విద్యలో ఆరితేరిన కొద్దిమంది కవులలో ఈతడొకడు ఈతని ధారాశుద్ధి అనల్పము

'పురాణింపందొరం కొంటి మీఁ దెట్టేవెంటఁ జరింతుఁ
దత్సరణి నాకీవమ్మ ! –'

అని బ్రాహ్మీదేవిని ప్రార్థించిన యీవాక్య వాక్కు కావ్య రచనా శిల్పములోని పట్టులు గుట్టులు, తెలిసికొని ప్రయోగ రంగములో ప్రదర్శించి మేల్ భళీ ! అనిపించుకొన్నాడనిన అది అతనియసకృదభ్యాస శిక్షా ఫలమే

పోతన డొక్కశుద్ధిలేని పట్టి భక్తకవి అని కొందరను కొనుట తెలియమి అట్టివారు ఆసుజనుని వినయమును అపార్థము చేసికొన్నవారు గద్యములలో అతడు తనకు విశేషణములుగా 'శ్రీపరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర, 'సహజ పాండిత్య'—అను విశేషణాలు వాడుకొన్నాడు ఇందువలన అతడు గురుముఖమున ఏమియు విద్యాశిక్షను బడయలేదని చెప్పినట్లా ? అతడు తనతండ్రియైన కేసనకడనే తెన్నగం చదువుకొన్నాడు. ఆతనితండ్రి విద్వాంసుడే అచట భాగవతములోనే 'లలితమూర్తి బహుకళానిధి కేసన' అని తానే చెప్పినాడు వీరభద్ర విజయములో తాను తనతండ్రి యొద్ద విద్యాభ్యాసము చేసినట్లు స్పష్టముగా చెప్పికొనియే యున్నాడు శాస్త్రాదులను, విశేషించి వేదాంతశాస్త్రమును, ఆతడాయా గురువుల సన్నిధిలో అధ్యయనము చేసియుండెననుట విశ్వసనీయము

**పోతన కవితాగుణములు** ఈతని రచనలో వైశద్యము చెప్పుకొనతగిన గుణములలో ఒకటి అన్వయ కాఠిన్యములేని సరళ రచన యతనిది అక్షర రమ్యతయం దతని కెక్కువ ఆదరము పద్యపాదములు తూచినట్లు పదములు సమానాక్షరారంభములు కలిగియుండి వీనులవిందులై సాగును యతి ప్రాసములను కవిత్రయమువారు వేరు పదములతో గాక సంధిగతాక్షరములతో గాని, పదమధ్యాక్షరములతో గాని నిర్వహింతురు ఈ సరణి పరితలకు అంత సుకరమనిపించదు పద్యపు తూగును కొంత కొరవడును పోతన యతిప్రాసముల పట్టున క్రొత్త శిల్పమును ప్రవేశపెట్టినాడు తరచుగా పాదాంతముల యందు పదముల ముగింపు, విశ్రమ స్థానము లందు పదాంతరముల వాడుక అతని పద్ధతి దీనివలన పద్యము సమవిభక్తముగా, పరిష్కృతముగా, వీనులకు సోకి ముద్దులొలుకును అనుప్రాసలతో ఈతని పద్యాలు హృద్యతమము లైనవి ఇది పోతన పద్యమనుటకు అనుప్రాసమొక భద్రముద్ర అంత్యానుప్రాసములు విశేష సంఖ్యలో కనబడినను, వృత్త్యనుప్రాస లాటానుప్రాసాదులను కూడ ఆపలుకుచక్కదన మెరిగినవాడు వాడకుండలేడు అర్థాలంకారములలో ఉపమోత్ప్రేక్షల నధికముగా ఉపయోగించి తక్కిన కొన్ని యలంకారములను అక్కడక్కడ పొందు పరచినాడు వ్యంగ్య చమత్కారమునందును అతడు సిద్ధహస్తు డనిపించును శ్రీకృష్ణుని చెయిదముల వర్ణనములో అవి ఎంతో ప్రాకృతములుగా తోచుచున్నను, వాటినుండియే అవి అప్రాకృతము లనియు దివ్యములనియు భక్తభోగ్యము లనియు ధ్వనింపజేయు ఘట్టాలు హృదయంగమాలు

'జనకర్మచమేదివ్య మేవం యోవేత్తి తత్త్వతః' అన్నట్లుగా సర్వేశ్వరుని వివిధావతారములందు సంభవించు జన్మ జాతము, ఆచరించు కర్మకలాపము, సర్వమును దివ్యములే అజ్ఞులును, అహంకారులును గుర్తింపని ఈ దివ్యతత్త్వమును పోతన పెక్కుతావుల వాచ్యముగాను, కొన్ని యెడల వ్యంగ్య మర్యాదతోను తెలుపగలిగినాడు

**రసపోషణము** అనుగుణమైన శైలిని పొందుపరచి పోతన రసపోషణము చేయుటలోను మేటియని వాసిగాంచినాడు మోహినీఅవతారవర్ణనమునను, గోపీకృష్ణులలీలలలోను, శృంగార రసమును చక్కగా పోషించెను ఒక్కొక్కచో శృంగారమును భక్తికి అంగముగా తీర్చి దానికి పావనత్వమును సంపాదించును ఒకచో శృంగారవీరములకు సంసృష్టి ప్రదర్శించును శ్రీకృష్ణ నరకాసురుల యుద్ధఘట్టములో ఇది గన్పట్టును కంసవధము, శ్రీనృసింహావతారాదుల ప్రస్తావనములలో వీరరౌద్రాద్భుత రసములు పోషింపబడిన రీతి అసాధారణము రుక్మిని శ్రీకృష్ణుడు పరాభవించిన పట్టున హాస్యము, భీభత్సము కానికినలాడినవి పుణ్యాశ్రమాదుల వర్ణన శాంతమును వెలయించును భక్తినిరసముగా అంగీకరించినచో—అభక్తిరసమే ఇందు ఆమూలాగ్రము విస్తరిల్లి రాజ్యమేలుచున్న దనవచ్చును శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవనము, అర్చనము, వందనము దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనము అను నవవిధభక్తియు ఆయా కథాసూత్రములో నిబద్ధమై నవ్యనవ్య రూపములతో ఇందు భాసిల్లినది

**ఆంధ్రభాగవతము-శిథిలగ్రంథపూరణము** ఆంధ్ర భాగవతమున కొంత భాగము అక్కడక్కడ శిథిలమైపోగా వెలిగందల నారయ మున్నయినవారిచే ఆయా భాగములు పూరింపబడిన వనియు, రాచకొండరాజు సింగభూపాలుడు పోతన తనకంకితము చేయలేదన్న కినుకతో అతని భాగవతమును భూమిలో పాతిపెట్టించినందున అటనట శిథిలమైన గ్రంథభాగములను నారయాదులు పూరించిరనియు, పోతన్న తానే కొన్ని స్కంధములు తెనిగించి నారయాదులచే కొన్ని ఆంధ్రీకరింప చేసెననియు, వినవచ్చు గాథలు నిరాధారములు ఆనాటి తెలంగాణమునందలి రాజకీయ కల్లోలములచే ఆంధ్ర భాగవతము కొంతకొంత భాగము శిథిలమైపోగా పిమ్మట ఆ గ్రంథమందలి అదరముతో నారయాదులు యథాశక్తి ఆయా భాగములు తెనిగించి మూలగ్రంథములో చేర్చినారని చరిత్రకారులు నిశ్చయించిరి

**ఆంధ్రభాగవతము - ఆంధ్రుల కల్పతరువు** శ్లేషానుప్రాణితమైన చక్కని రూపకాలంకారముతో సర్వావయవ సుందరముగా పోతన కవీంద్రుడు చిత్రించి చూపిన శ్రీమద్భాగవత మిదిగో!

'లలితస్కంధము, కృష్ణమూలము, శుకాలాపాభి
రామంబు, మం
జులతాశోభితమున్, సువర్ణసుమనస్సుజ్ఞేయమున్,
సుందరో
జ్జ్వలవృత్తంబు, మహాఫలంబు, విమలవ్యాసాల
వాలంబునై
వెలయున్ భాగవతాఖ్య కల్పతరువుర్విన్
సద్ద్విజశ్రేయమై—'

'పిబత భాగవతం రస మాలయం'—అన్నారు తనకు లభించిన ఈ సుధారసమును సోదరుల కెల్లరికిని పంచిపెట్టినాడు పోతన కవివదాన్యుడు గజేంద్రమోక్షము, వామనావతారము, ప్రహ్లాదచరిత్రము, రుక్మిణీకల్యాణము మొదలైన మధుర మధురఘట్టాలు ఆంధ్రుల జిహ్వాగ్రాలను అలంకరించినవి మొన్న మొన్నటివరకును తెలుగునాట మన ఆంధ్ర వాఙ్మయమునకే భూషణములన వెలసిన వెయ్యార్లు పోతన పద్యరత్నాలలో ఒండురెండైన రాని అక్షరాన్యుడైనవాడుండెడివాడు కాడు ఇప్పటికిని ఆంధ్ర జనసందోహములో పావన భాగవత కథాశ్రవణాసక్తి మిక్కిలిగానే గోచరించుచున్నది లోకకల్యాణాకాంక్షతో—

'నిగమకల్పతరోర్గళితంఫలం
శుకముఖాదమృతద్రవసంయుతమ్
పిబత భాగవతం రసమాలయం
ముహురహో! రసికా భువి భావుకాః'

అను వేదవ్యాసమహర్షి దివ్యవాణితో శ్రుతికలిపి

'వేదకల్పవృక్ష విగళితమై శుక
ముఖసుధాద్రవమున మొనసియున్న
భాగవతపురాణ ఫలరసాస్వాదన
పదవిఁగనుఁడు రసికభావవిదులు—

అని అదరముతో ఆహ్వానించుచున్నాడు మహాకవి పోతనార్యుడు పుణ్యమూర్తి

'జయంతి తే సుకృతినో రసిద్ధాః కవీశ్వరాః'

చె రం

## బయకార రామప్పయ్య-౧

"బయకార" అనునది ఇంటిపేరు గాదు బయకారుడనగా సంగీత విద్వాంసుడని యర్థము రామప్పయ్య అను పేరు ప్రియనామము రామప్పయ్యకు రామమంత్రి,

రామయామాత్యుడు అనునవి వ్యవహార నామములు

రామప్పయ్య ఉత్తర ఆర్కాటు జిల్లా వందవాశి తాలూకా పాదిరికుప్పం అనెడు గ్రామము నివాసము గాగల వాడు ఈతని తండ్రి పెదతిమ్మయ తల్లి పెదలక్క వీరమ్మ ఈతని పితామహుడు రామమంత్రి పితామహి తెలుగమ్మ ఈతని పినతండ్రులు తిమ్మమంత్రి, మారయ, రామయ భాస్కరుడు, భావయ అనువారు నలుగురు ఈతని మేనత్త చిన్నమాంబ వీరు నియోగి బ్రాహ్మణులు నందవరీకులని కొందరనుచున్నారు పరాశర గోత్రులు, అపస్తంబ సూత్రులు, యజుశ్శాఖీయులు

వీరిది పేరుప్రతిష్ఠలుకల వంశము రామప్పయ్య తండ్రియైన పెదతిమ్మయ విజయనగర చక్రవర్తి అచ్యుత దేవరాయల (1529-1542) వద్ద "రాయసం" అనెడు మంత్రి పదవి వహించి యుండెను అందుచే ఈతడు రాయసం తిమ్మరుసయ్య అని ప్రసిద్ధి చెందెను ఈ పెదతిమ్మయ (రాయసం తిమ్మరుసయ్య) రాజనీతిజ్ఞుడేగాక ధార్మిక చింతన గలవాడును నై యుండెను ఈ తిమ్మరుసయ్య తిరుపతిలో గోవిందరాజ స్వామివారికి చీరాల, పేరాల, అందుపల్లి, కొటోప్పలు అను గ్రామములు దానము చేసినాడు (1539)

రామప్పయ్య పినతండ్రి యయిన రామయ భాస్కరుడు (బాచమరుసు 1529-1542) అచ్యుత దేవరాయలవారి పరిపాలనా కాలములో కొండవీటి దుర్గాధిపతిగా ఆ ప్రాంతము నేలు అధికారి యయ్యెను ఈతడు గోపీనాథ పురమును నిర్మించినాడు యవనుల బలముల నోడించినాడు గోపీనాథ స్వామిని ప్రతిష్ఠించినాడు ధర్మఖ్యాతి మహిమ మీరగ ఆంధ్ర మండలము నేలినాడు ధీవిశారదుడు, శౌర్య మహితయశుడు, భానుతేజుండు, రామయభాస్కరుడు అని ప్రసిద్ధి చెందిన మహాపురుషుడు

రామప్పయ్య అచ్యుతదేవరాయల, అళియ రామ రాయలకాలములో నుండినవాడు ఇతడు మొదట చిన్న చిన్న యుద్యోగములు చేసి స్వశక్తిచే గొప్పగొప్ప పదవులను పొందినాడు ఇతడు 1535 లో కన్నడ ప్రాంతములోని హడినాడు సీమకు అధిపతిగా నియమితు డయినాడు రామయ భాస్కరుడు కొండవీటి దుర్గాధిపత్యమునుండి విరమించుకొనిన తరువాత, ఆ గొప్పపదవికి రాయలవారు రామప్పయ్యను నియమించెను కొండవీటిలో (1539) రాజ ప్రతినిధిగా రామప్పయ్య ఇరువది సంవత్సరములు దక్షతతో రాచకార్యములను నిర్వహించెను

రామప్పయ్య రాజనీతిచతురమతియై పరిపాలన చేయుచు పెక్కు ధర్మకార్యము లొనర్చెను ఈ వంశము వారు తిరుమల-తిరుపతి శ్రీ వెంకటేశ్వరస్వామివారి భక్తులు రామప్పయ్య తన తండ్రి లోగడ శ్రీ గోవిందరాజ స్వామి వారికి చేసిన గ్రామదానముల విషయములో కొన్ని మార్పులు చేసి అద్దంకి సీమలోని నర్యూరు గ్రామమును, బెల్లంకొండ సీమలోని కార్యూరు గ్రామమును కూడ గోవిందరాజస్వామి వారికి సమర్పించినాడు (1544) చీరాల, పేరాల, అందుపల్లి గ్రామములకు బదులుగా వాటిమీద వచ్చెడు ఆదాయము 150 రేఖావణములకు (బంగారు నాణెములు) సమానముగా ఆదాయము వచ్చునట్లు నేడునాడులోని కుళత్తూరు గ్రామములో ఒక అగ్రహార మేర్పాటుచేసి సగము గ్రామమును ఇచ్చినాడు ఈ గ్రామముల మీద ఆ దేవాలయమునకు పాలుకు వచ్చు సుమారు 950 రేఖావణముల ఆదాయము నుండి గోవిందరాజస్వామివారికిని, ఇతర మూర్తులకును, తన పినతండ్రి బాచమరుసయ్యగారి కుమారుడు క్రిష్టప్పయ్య గారి పుణ్యముకొరకు వినియోగించునట్లు ఏర్పాట్లు చేసినాడు స్వామివారి ప్రసాదములో తనకువచ్చు భాగమును బాచమరుసయ్యగారి పుణ్యము నిమిత్తము ఉదయగిరి శ్రీనివాస భట్టరుగారికి ధారపోసినాడు పినతండ్రి బాచమరుసయ్య, ఈతని భార్య అమ్మాజమ్మ, వీరి కుమారుడు కిష్టప్పయ్యగార్ల పుణ్యము నిమిత్తము బాచేశ్వర, అమ్మేశ్వర, కృష్ణేశ్వర దేవాలయములను నిర్మించినాడు (1539) ఇంకను బళ్ళారి జిల్లాలో దేవాలయములను, తటాకములను నిర్మించినాడు ఇట్లు దానధర్మములు చేయుచు శాసనములు వేయించినాడు ఈ శాసనములు వివిధ ప్రాంతములలో నున్నవి క్రీ శ 1558 తరువాత అయన శాసనములు కనబడుటలేదు

రామప్పయ్య మేనత్త చిన్నమాంబయు గొప్ప ధార్మికురాలు ఈమె భర్త ఆత్రేయస గోత్రుడును, ఆశ్వలాయన సూత్రుడును, ఋక్శాఖీయుడును అయిన ప్రతాప ఎల్లనార్యుడు (ఎల్లమరసు) చిన్నమాంబ, కొండవీటి సీమలోని వంకాయలపాడు అనెడు గ్రామమునకు రామచంద్రపురమను నామాంతరముపెట్టి, తిరుపతి గోవిందరాజస్వామి వారికి దానము చేసినది (1547) సంతబూరులో పర్వతనాథ

 

స్వామిని ప్రతిష్ఠించినది గోపీనాథ తటాకమును త్రవ్వించినది ఇట్లు పెక్కు ధర్మకార్యము లొనర్చిన ధన్యాత్ముఁరాలు చిన్నమాంబ

రామయామాత్యుడు (రామప్పయ్య) గొప్ప రాజ్యతంత్రజ్ఞుడు సమర్థుడయిన పరిపాలకుడు అంతేగాదు సంగీత సాహిత్యములయందును ఘనమైన పాండిత్యము కలవాడు ఈతని సంగీత సాహిత్య విశారదతకు ఈతడు రచించిన "స్వరమేళ కళానిధి" అను సంగీతశాస్త్ర గ్రంథము సాక్షీభూతముగా నున్నది ఈ గ్రంథము సంస్కృతములో రచింపబడినది ఈ స్వరమేళకళానిధిని రామయామాత్యుడు అళియరామరాయల వారికి అంకితమిచ్చినాడు

స్వరమేళకళానిధిలో "పూర్వాధిక కొండవీటి ప్రధాన దుర్గ ప్రతిపాదనేన తెలూరి సింహాసన పట్ట నేనయుక్తాం" అని చెప్పుకొన్నాడు ఇతి శ్రీమదఖినవభరతాచార్య, వాగ్గేయకార తోడరమల్ల తిమ్మామాత్యనందన రామయామాత్య నిర్మితే స్వరమేళకళానిధౌ" అని గద్యలో వివరించినాడు ఇందలి "తోడరమల్ల" అనునది ఒక బిరుదము ఈ బిరుదము ఈతని మాతామహుడగు కల్లినాథునకును ఉండెను కల్లినాథుడు శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరమను సంగీత గ్రంథమునకు వ్యాఖ్యానము వ్రాసినవాడు "చతురకల్లినాథ తోడరమల్ల" అని ప్రసిద్ధిచెందినవాడు తోడరమల్లబిరుదము మాతామహుని నుండి బయకార రామప్పయ్యకు సంక్రమించినటులున్నది కల్లినాథుడు రామప్పయ్యకు సంగీతమును శాస్త్రమును గరపిన గురువు

రామప్పయ్య అచ్యుత దేవరాయల యొద్దను అళియ రామరాయల యొద్దను తన సంగీతవిద్యను ప్రదర్శించి మెప్పు పొందినాడు అచ్యుత దేవరాయలవారి రాణివాస స్త్రీలకును, అళియరామరాయల కమార్తెలకును సంగీతము నేర్పిన విద్యాగురువు అందువలననే ఆయనకు బయకార రామప్పయ్య అను పేరువచ్చినది

రామయామాత్యుడు రాజతంత్రమునందును, పరిపాలనా కార్యమునందును, సంగీత సాహిత్యములందును ప్రావీణ్యము కలిగియుండుటయేగాక, శిల్ప శాస్త్రమునందును ప్రవీణుడయినట్లు తెలియుచున్నది అళియరామరాయలవారి కోరికపై ఇతడు "చిత్రకూటము" అను రాచనగరును నిర్మించినాడు ఇందు రమ్యహర్మ్యములు, సుందరోద్యానములు, చిత్రశిల్పములు, నిర్మించి మనోహరముగా తీర్చిదిద్దినాడు ఇది వైజయంత మనెడు దివ్యభవనమును మించి ప్రకాశించు చుండెనట !

ఆ పీ

## బయకార రామప్పయ్య ౨

బయకార రామప్పయ్య (రామయామాత్యుడు) సంగీత శాస్త్రమునందును, లక్ష్యలక్షణములలోను, సాహిత్యమునందును, అసదృశ పండితుడై వరలెను మాతామహుడైన కల్లపదేశికుని యొద్ద సంగీతము నభ్యసించి పండితుడనైతినని ఇతడు చెప్పెను కల్లపదేశికుడనగా, చతుర కల్లినాథుడే 'చతుర' అనునది కల్లినాథునకు ప్రభువు లొసగిన బిరుదము (చూడు సం ౨ పుట ౫౭౪)

రామయామాత్యుడు విజయనగర సామ్రాజ్యపాలకుడగు అళియ రామరాజునకు మంత్రిగాను, ఆస్థాన విద్వాంసుడుగాను ఉండెను

తనచే రచింపబడిన ఏలా, రాగకదంబాదులను, ముప్పది రెండు సూథలను ప్రసిద్ధములైన పంచ తాళేశ్వరములను శ్రీరంగ, ద్విపద-స్వరాంక-స్వరవిలాసాది ముప్పది ప్రబంధములను, పదునారు ధ్రువములను, నలుబదియారు సాలగ సూథలను, ఇరువదిరెండు రాగములతో కూడిన పంచరత్నములను, గీత, అలంకార, ఆలాపనాదులను అమోఘముగా రామయామాత్యుడు గానముచేసెను ప్రభువగు రామరాజు మెచ్చినవాడై, రామయామాత్యునకు అనేకములయిన ఆభరణములను, జాగీరులను బహూకరించెను

పిమ్మట ప్రభువు ప్రోత్సహించి నందున రామామాత్యుడు 'స్వరమేళ కళానిధి' అను నొకలక్షణ గ్రంథమును రచించెను ఇందు ఉపోద్ఘాత–స్వర – వీణా – మేళ – రాగములు అను అయిదు ప్రకరణములు కలవు

(1) ఉపోద్ఘాత ప్రకరణమునందు కవి, తనవంశమును, రాజవంశమును, తనపాండిత్యమును తనకును, రాజునకును గల సంబంధమును, తనకు లభించిన రాజసన్మానములను, తాను 'స్వరమేళకళానిధి' యను లక్షణగ్రంథమును వ్రాయబూనుట కేర్పడిన పరిస్థితులు మున్నగు సంశములను వివరించెను

(2) స్వరప్రకరణమునందు గీతప్రశంస గీతభేదములు, స్థానములు, శ్రుతులు శుద్ధ–వికృత స్వరములు, గాంధర్వము గానము మొదలయిన విషయములు వివరింపబడినవి

(3) వీణాప్రకరణమునందు వీణయొక్క ప్రాముఖ్యము, శ్రుతిచేయు విధానము, శుద్ధమేళ, మధ్యమేళ, అచ్యుత రాజేంద్రమేళ, వీణాలక్షణములు, వీటియందలి శుద్ధ వికృత స్వరములు మొదలయినవి చెప్పబడినవి

(4) మేళప్రకరణమునందు-మేళవిభాగము. ముఖారి, మాళవగౌళ, శ్రీరాగము, సారంగనాట, హిందోల, శుద్ధ రామక్రియ, దేశాక్షి, కన్నడగౌళ, శుద్ధనాట, ఆహరి, నాదరామక్రియ, శుద్ధవరాళి, రీతిగౌళ, వసంతభైరవి కేదారగౌళ, హెజ్జుజ్జి, సామవరాళి, రేవగుప్తి, సామంత, కాంభోజి అను ఇరువది మేళములకు లక్షణములు నిర్ణయించి చెప్పబడినవి

(5) రాగప్రకరణమున - ఉత్తమ, మధ్యమ, అధమ రాగములకు లక్షణములు వివరింప బడినవి ఇందు—

(అ) ఉత్తమ రాగములలో

నాటి, వరాళి, సారంగనాట, శుద్ధరామక్రియ, ముఖారి, భైరవి, ఆహరి, సామంత, కన్నడగౌళ, దేశాక్షి అను పది సంపూర్ణ రాగములకును, శౌళి, శుద్ధవసంత, మాళవశ్రీ, ఘూర్జరి, లలిత, అను అయిదు షాడవ రాగములకును, హిందోల, మల్హారి, ధన్యాసి, మాళవగౌళ, శ్రీరాగము అను అయిదు ఔడవ రాగములకును లక్షణములు చెప్పబడినవి

(ఆ) మధ్యమ రాగములలో

కేదారగౌల, నాదరామక్రియ, కాంభోజి,సామవరాళి, రీతిగౌల, హెజ్జుజ్జి, నారాయణి, వేలావలి అను ఎనిమిది సంపూర్ణ రాగములకును, కన్నడ, బంగాల, పాడి, వసంత భైరవి, గుండక్రియ అను నాలుగు షాడవరాగములకును మధ్యమాది, భూపాల, రేవగుప్తి అను మూడు ఔడవరాగములకును లక్షణములు చెప్పబడినవి

(ఇ) అధమ రాగములలో

సౌరాష్ట్ర, నాగధ్వని, సోమ, శంకరాభరణము అను నాలుగు సంపూర్ణ రాగములకును, ఘంటారవము, భిన్నషడ్జ అను రెండు షాడవరాగములకును, సావేరి, ఆందోళి అను రెండు ఔడవరాగములకును లక్షణములు చెప్పబడినవి

ఈ ప్రకారము మొత్తము 48 రాగములకు లక్షణములు కలవు

తాళములు మొదలగు వాటినిగూర్చి సంగీత రత్నాకరమున శార్ఙ్గదేవుడు విపులముగా చెప్పియున్నాడు కావున వాటిని తాను చెప్పుట లేదని రామయామాత్యుడు వ్రాసియున్నాడు

గ్రంథాంతమున 'స్వరమేళకళానిధి' అను గ్రంథలేఖనమును శా శ 1472 నకు సరియగు సాధారణనామ సంవత్సర శ్రావణ శుద్ధ దశమినాడు రామామాత్యుడు ముగించినట్లు కలదు ఈ కాలము సరిగా క్రీ శ 1550 వ సంవత్సరము, ఆగస్టు 21 న తేది కాగలదు

షం వే సు శా

## బరంపురము

బరంపురమును "బ్రహ్మపుర"మని కూడ వ్యవహరించుట కలదు ఈ పట్టణము ప్రస్తుతపు ఒరిస్సా రాష్ట్రీము నందలి గంజాము జిల్లా యందు 19° 20′ ఉ అ, 84° 50′ తూ రే ల మీద నున్నది మద్రాసు-హౌరా రైలుమార్గము నందు ఇది యొక స్టేషను సముద్ర మట్టమునకు 78 అ ఎత్తున గల రాతిప్రదేశమందు నిర్మింపబడిన పట్టణమిది సముద్రపు ఒడ్డునకు ఈ పట్టణమునకు మధ్యగల దూరము 7 మైళ్ళు మాత్రమే

బరంపురమునకు తూర్పునను దక్షిణమునను విశాలమైన మైదాన ప్రాంతములు గలవు ఈ పట్టణమునకు పదెనిమిది మైళ్ళ దూరమున పశ్చిమోత్తర భాగమున "కేరండి", "మొహిరి" అను పర్వతశ్రేణులు కలవు పశ్చిమ భాగమందున్న కొండలు దట్టమైన అడవులతో కూడియున్నవి ఈ పట్టణపు వాతావరణము సర్వసామాన్యముగ ఆరోగ్య ప్రదమైనదనియే చెప్పవచ్చును ప్రతి సంవత్సరము నవంబరునుండి ఫిబ్రవరి వరకు ఇచ్చటి వాతావరణము మిక్కిలి ఆహ్లాదకరముగ నుండును ఈ నాల్గు నెలలు ఆకాశము నిర్మలముగ నుండి రాత్రులందు పొగమంచు పడుట వలన గాలి చల్లగ నుండును ఈ కాలమునందు ఉష్ణోగ్రత 50°—80°F మధ్య ఉండును కాని ఇచ్చట ఏప్రిల్, మే, నెలలందు ఎండలు మిక్కుటముగ కాయును

బరంపురము బ్రిటిషువారి కాలమునుండి ఈనాటి వరకు తాలూకా ముఖ్యపట్టణముగ నున్నది బ్రిటిషువారి పాలనములో కొంతకాలము ఈ పట్టణము గంజాము జిల్లాకు ముఖ్య పట్టణముగ గూడ నుండెను నాడు, ఇచ్చట జిల్లా న్యాయాధిపతి, సీనియరు అసిస్టెంటు కలెక్టరు, తహశీలుదారు మొదలుగాగల ప్రభుత్వోద్యోగులు నివసించెడివారు ఈ పట్టణ

మునకు అంతి దూరమున క్రీ శ 1908 సంవత్సరము వరకు బ్రిటిషువారి సైనిక స్థావరములు గూడ నుండెను

క్రీ శ 1844 సంవత్సరమున "మొహిరీ" జమీందారు బ్రిటిషువారికి పన్నులు బకాయి పడుటచేత ఈ సంస్థానమును ప్రభుత్వమువారు బహిరంగ వేలములో కొనిరి తదనంతరము బ్రిటిషువారు బరంపురమును ముఖ్యపట్టణ మొనర్చి ఈ మొహిరీ జమీందారీ ప్రాంతమును తాలూకా క్రింద మార్చి వేసిరి క్రీ శ 1936 వ సంవత్సరము వరకు బరంపురము తాలూకా మద్రాసు రాష్ట్రములో నొక భాగముగ నుండెను క్రీ శ 1936 వ సంవత్సరములో ఒరిస్సా రాష్ట్రము ఏర్పడి నపుడు ఇది మద్రాసునుండి ఒరిస్సాకు బదిలీ చేయబడెను

బరంపురమునందు నివసించు వారిలో పెక్కు మంది తెలుగు మాట్లాడువారు గలరు ఈ తాలూకాను ఆంధ్ర రాష్ట్రములో చేర్చవలసిన ఆవశ్యకమును గూర్చి క్రీ శ 1953-55 సంవత్సరముల మధ్య ఫజల్ అలీ కమీషను వారికి ఆంధ్ర ప్రభుత్వము, ప్రజాసంస్థలు కూడ వివరించెను కాని క్రీ శ 1956 సంవత్సరము నవంబరు నెలలో భాషాప్రయుక్త రాష్ట్ర విభజనము జరిగినపుడు బరంపురము ఆంధ్రులకు లభించలేదు.

బరంపురము 20 వ శతాబ్దపు పూర్వార్ధమందు గొప్పగ అభివృద్ధి పొందినది క్రీ శ 1901 వ సంవత్సరములో దీని జనాభా 25,729 ఈనాడు 70,000 కు మించి యున్నది. ఇంతటి వేగముతో అభివృద్ధి చెందిన పట్టణము ఒరిస్సా రాష్ట్రములో మరియొకటి లేదు ఇది ఈనాడు ఫుల్బనికి, గంజాము నందలి ఏజెన్సీ ప్రాంతములకు, రహదారి కూడలిగ నున్నది ఇచటి కలప, తోళ్ళ పరిశ్రమలు ఈ పట్టణాభివృద్ధికి ఎక్కువగ తోడ్పడినవి

బరంపురము తాలూకా యందలి ప్రజల వృత్తులలో వ్యవసాయము ముఖ్యమైనది వర్షమే ఇచటి పంటలకు ప్రధానమైన ఆధారము కాని కొలదిగ నీటి పారుదల వసతులు గూడ ఇచట కలవు వరి, రాగి, నూనెగింజలు, చెరకు, అపరములు ముఖ్యముగ పేర్కొనదగిన ఇచ్చటి పంటలు ఈ ప్రాంతపు భూమి సారవంతమైన దగుటచేత స్థానికావసరములకు మించి పంటలు పండును మిగులు ఆహార పదార్థములు కలప, తోళ్ళు ఇచ్చటినుండి ఎగుమతి చేయబడును

బరంపురము పట్టు పరిశ్రమకు పేరెన్నిక కన్నది ఇచట జరీ నేతపనికూడ గలదు నేత పరిశ్రమ భారీ యెత్తున జరుగును

బరంపురము పెక్కు సంస్కృతులచే మిశ్రమమైనది ఇచట తెలుగు, ఒరియా, సంస్కృతుల మేళికలయిక కానవగును నాగరికములయిన హిందూ, ముస్లిం, క్రైస్తవ వర్గములకు తోడుగ, అనాగరికులైన సంతాలులు, గోండులు, సవరులు, కోలులు మొదలగువారు ఈ ప్రాంతములందు నివసించు చున్నారు వీరందరి సహకార కృషిపైననే ఇచ్చటి ఆర్థిక వ్యవస్థ ఆధారపడి యున్నది బరంపురము అన్ని రంగములందు పాటి పట్టణములతో సమముగ అభివృద్ధి చెందు చున్నది

ఏ చెం

## బర్మా (చ).

**దేశనిర్ణయము** ఆగ్నేయాసియాలో భారతదేశమునకు తూర్పుగానున్న అనేక రాష్ట్రములు ఒకటిగా కలిసిన యూనియనే ప్రస్తుత బర్మాదేశము షాన్, కరెన్, కచిన్, కాయా, అను రాష్ట్రములును, చిన్, అరకాన్ పర్వతములు చేరిన చినీ జిల్లాయును, బర్మాలోనివే బర్మా నేడు స్వతంత్ర రాజ్యముగా వర్ధిల్లుచున్నది రాజ్యాంగమును బట్టి, ఈ దేశమునకు అధ్యక్షుడు రాజ్యాధిపతిగా నుండును రెండు విభాగములుగల శాసనసభ యొకటి కలదు దీని కాలపరిమితి నాలుగు సంవత్సరములు బ్రిటిష్ సామ్రాజ్యములో, నొక భాగముగా నుండిన బర్మా స్వతంత్రమగుటకు చాలకాలము పట్టినది

**బర్మా ప్రజలు** బర్మా దేశమునకు ప్రాచీనకాలమున శర్ణ (సువర్ణ) భూమియని పేరు అచటనుండు ఆదిమనివాసులు నీగ్రిటోలకు చెందినవారు ప్రస్తుతపు నివాసులు మంగోలియా జాతికి చెందినవారు వీరు పశ్చిమచైనా, టిబెటు ప్రాంతముల నుండి తరలివచ్చి బర్మా దేశములో నున్న ఐరావతి, సాల్వీన్ నదులగుండా అరకాన్ ప్రాంతములోనికివచ్చిన వారు తదుపరి 'తాయ్‌లు' లేక 'షాన్లు' అను జాతివారు, షాన్ రాష్ట్ర, సయాము దేశములలో విస్తరించుకొని, చైనా సరిహద్దు ఇరువైపుల నుండి, బర్మాలోనికి చొచ్చుకొనివచ్చిరి ఇంకను క్రాన్సు అనువారు, అరకాన్ లోనికి పోయిరి పయన్ అనువారు, 'ప్రోమ్' అనుచోట రాజ్యము స్థాపించిరి మాన్సు లేక టయిలంగులు 'పెగు'లో రాజ్యము స్థాపించిరి

ప్రస్తుతము 'తూర్పుపాకిస్తాన్'లో నుండి అపుడు ఇండియాలో నున్న చిట్టగాంగ్, అనుదాని నుండి కూడ ఆరకానులోనికి జనులు ప్రవేశించుటకలదు మణిపూరు, ఎగువబర్మా,మద్రాసు, మలేయాల నుండి జనులు 'పెగు' 'టెనాసరిమ్' ప్రాంతము లోనికి ప్రవేశించుట కలదు రానురాను హిందూమత సంప్రదాయములు మంగోలియన్ సంప్రదాయముల నతిక్రమించుట, బౌద్ధమతము, బ్రాహ్మణమతము నతిక్రమించుట, బర్మాలో జరిగినందున, బర్మాయంతయు బౌద్ధమత ప్రభావమునకు లోనైనది

ప్రాచీన చరిత్ర కీ శ మొదటి శతాబ్దమునాటికి, టగాంగు, ప్రోమ్, తేటన్ అను బర్మాలోని వివిధప్రాంతములలో భారతీయ వలస లేర్పడినవి ఐదవ శతాబ్దమునాటికి శైవ మతము, వైష్ణవమతము, బౌద్ధమతము, హీనాయన, మహాయనములు ఆచరణములోనికి వచ్చినవి ఈకాలములో బుద్ధఘోషుడు తేటనును సందర్శించి హీనయానమును వ్యాప్తిలోనికి తెచ్చెను 8 వ శతాబ్దములో విక్రమ వంశపు రాజులు 'ప్రోమ్'ను పాలించిరి వారి పతనకాలమున పాగన్ వంశము వారుద్భవించి, ఐరావతి, చింద్విన్ నదులసంగమ ప్రాంతమున రాజ్యమును స్థాపించిరి

మధ్యయుగపు చరిత్ర - పాగన్‌వంశము 11 వ శతాబ్దమున అధికారములోనికి వచ్చిన 'అనవరతుడు' అను రాజు పాగన్ వంశమును స్థాపించెను అతడు బౌద్ధమతాభిమాని యగుటచే, అంతకు పూర్వమున్న 'అరి' పురోహితులను తొలగించెను, బౌద్ధ సన్యాసులను, బౌద్ధగ్రంథములను తేటన్ నుండి రప్పించి ప్రవేశపెట్టెను ఈ వంశములో పదిమంది రాజులు పాలించిరి తుదివాడగు నరతీహపతి అనువాని కాలమున, చైనా చక్రవర్తియైన కుబ్లాఖానుతో విరోధమేర్పడెను రాజ్యము క్షీణించెను

పాగన్ వంశరాజులకాలము శిల్పకళకు ప్రసిద్ధిచెందెను క్యాంజిట్టా కాలమున 'ఆనందం' అను గొప్ప బౌద్ధదేవాలయము కట్టబడెను వారికాలమున బర్మాయంతయు వీక రాజ్యముగ వర్తిల్లెను మొత్తముమీద 5,000 దేవళములు వారు నిర్మించినట్లు తెలియుచున్నది వాటిశిథిలములు నేటికిని కానవచ్చును ఆ కట్టడములు, శిల్పకళకు, చిత్రలేఖనమునకు పేర్గాంచినవి బుద్ధుని జీవితవిశేషములు చిత్రింపబడెను 18వ శతాబ్దమునుండి రాజ్యము యొక్క ప్రసిద్ధిపోయినది

షాన్ రాజ్యము షాన్ చరిత్రలో (1287-1531) రెండున్నర శతాబ్దములు అరాజకము కనిపించును రాజకుమారులు, ఇతర నాయకులు రాజ్యాధికారము కొరకు పెనగులాడ జొచ్చిరి తైలంగులు, షాన్లు, బర్మీయులు అధికారముకొరకు తగవులాడ జొచ్చిరి పెగు, టూంగూ, ఆరకానులు అను చిన్న చిన్న రాజ్యములు వృద్ధినొందెను. పెగు రాజులలో ముఖ్యుడు రజాదరిట్ (1385-1423) అనువాడు అతడు నిరంకుశుడు, రక్తపాతమన్న వెరచువాడు కాడు మోసగాడు అతని రాజధానీ నగరము 'అవా' ఆతనికుమార్తె షిన్‌సాబు (1453-72) దమ్మచెడి అను బౌద్ధ సంన్యాసిని పెండ్లాడెను ఆకాలము శాంతియుతముగనుండెను పెగు చరిత్రలో అది స్వర్ణయుగము ఆ కాలముననే డేగన్ (రంగూన్) లో నుండు ష్వెడగాన్ దేవళము ఉన్నతము చేయబడి, ఇంకను అలంకరింపబడినది తుదకు 1531 నాటికి ఈ వంశము టూంగూవంశముచే తొలగింపబడెను

ఆధునిక చరిత్ర, టూంగూవంశము వీరు షాన్‌లను, టలైంగ్‌లను ప్రతిఘటించిరి 23 మంది రాజులీవంశములో నుండిరి 15 మంది హతులైరి వారిలో తుదివాడగు టబిన్‌ష్వెటి అనురాజు (1531-50) అతని బావమరదియైన బయిన్నాంగ్ అను సేనాని సహాయముతో ప్రోమ్,నూర్త బాన్ లను స్వాధీనపరచుకొని, అరకాన్‌పై దండెత్తి, పెగును పట్టుకొని, సయామునపై బడి, తుదకు 'అవా' నగరమున రాజ్యాభిషిక్తుడయ్యెను అతడు షాన్‌రాజులను ఎగువ బర్మా నుండి తరిమెను. ఆతనితరువాత బయిన్నాంగ్ ను(1551-1581) పాలించెను అతడు సయామునుఖ్యపట్టణముగా గల అయూధియాను పట్టుకొని, షాన్‌రాష్ట్రములను లోబరచుకొని సయామును అర్ధభాగముకూడ తన యధీనములో నుంచుకొని పాలించెను అతడు అరకాన్ ప్రాంతముదక్క బర్మాదేశమునకంతకును రాజయ్యెను బంగాళము, కొలంబో ప్రాంతములకు రాయబారముల నంపెను కొలంబోనుండి పవిత్రదంతమును సంపాదించెను కొలంబో కన్య నొకామెను అతడు వివాహమాడెను కాని, అతని నిర్బంధసైనిక విధానము వలనను,సతతము యుద్ధముచేయుటవలనను, అతని రాజ్యము అభివృద్ధి చెందలేక పోయెను అతని కుమారుడు నందబయిన్ తండ్రి విధానమునే అనుసరించినవాడై రాజ్యపతనమునకే కారకుడయ్యెను సయామీయులు బర్మాపై దండెత్తుట,

అరకానీయులు పెగుపై దాడిచేసి ధ్వంసముగావించుట, రాజు పదభ్రష్టుడై నిహతుడగుట జరిగెను. 16 సంవత్సరముల కాలములో రాజ్యమంతయు ముక్కలై పోయెను 'ఆవా'తో కూడ కొన్ని రాష్ట్రములు మాత్రము బయిన్నాంగు సంతతి వారికి మిగిలెను. అతని మనుమడు అనంకుపెట్లున్ (1605-1628) పోయిన దక్షిణరాష్ట్రములను తిరిగి జయించి, సిరియం (రంగూనుకు దగ్గిరగానుండిన) రేవును ముట్టడిచేసి, అచటి పోర్చుగీసు గవర్నరయిన డిబ్రిటోను చిత్రవధ చేసెను. ఈ రాజు సంతతివారు ఆవాకు తరలి వెళ్ళిపోయిరి. ఈ వంశము ప్రాధాన్యము పోయినది. అయితే ఈ రాజులలో థాలున్ (1629-48) అనువాడు పండితులను పోషించెను. తరువాత నొక శతాబ్దమువరకు ఆవాను పాలించినవారు బలహీనులు. ఈ కాలమున ఎగువ బర్మాపై, మింగ్, మంచూ చైనీయులు రెండుసారులు, మణిపురీయులు అయిదుసార్లు దండెత్తిరి. పెగూలో ఆవా ప్రాముఖ్యము తగ్గనారంభించెను. 1740 నాటికి తైలంగులు తమ రాజును నియమించుకొని 10 సంవత్సరములలో ఆవా పరిసరము నంతను ఆక్రమింపగలిగిరి. ఈ తైలంగుల ఆధిపత్యమును ప్రతిఘటించినవాడు ష్వెబొకు నాయకుడు, 'అలంగుపాయా' ఇతడే బర్మా రాజవంశములో కడపటి వంశమునకు స్థాపకుడయ్యెను.

**అలంగుపాయా వంశము** అలంగుపాయాను బహొంప్రా అనికూడ అందురు. ఇతడు కడు సమర్థుడై (1752-1760) దేశమునంతను జయించి సిరియమును స్వాధీనపరచుకొని, పెగూపై దాడిచేసి, మణిపురీయుల నోడించి, టలైంగులను లోబరచుకొని, రంగూన్‌లో తాను స్థిరపడి, సయాముపై దండెత్తిన రాజు. టలైంగులు కొందరు సయామునకు పారిపోయిరి. సయాము ముఖ్యపట్టణముగాగల అయూథియాను ముట్టడించినపుడు, అతడు రోగమునకు గురియై, తిరిగివచ్చునపుడు త్రోవలో మరణించెను.

**యూరోపియనుల రాక** అలంగుపాయా పాలించు కాలమునాటికే యూరోపియనులు బర్మాతో సంపర్కమేర్పరచుకొనుట మరియొక విశేషము. పోర్చుగీసువారు ప్రథములు. వారు బర్మాలో స్థావరము లేర్పరచుకొని, బర్మా యువతులను పరిణయమాడ జొచ్చిరి. 'సిరియమ్ రేవు'కు పోర్చుగీసు గవర్నరు డిబ్రిటో అనువాడు. ఇతని కాలముననే అనంకు పెట్లున్ సియంరేవును ముట్టడించెను. బ్రిటిష్‌వారు, డచ్చివారు కూడ 1627 ప్రాంతమున స్థావరము లేర్పరచుకొనిరి. కాని 50 సంవత్సరముల తరువాత వాటిని వదలుకొనిరి. మరల 1709 లో బ్రిటిషువారు సిరియమ్‌లో నొక నౌకాశ్రయమును స్థాపించి, 1743 వరకు దానిని తమ స్వాధీనమున నుంచుకొనిరి. అపుడు టలైంగులు దానిని కాల్చివైచిరి. ఇంగ్లీషువారు నెగ్రేస్ అను ప్రాంతమునకు స్థావరముకొరకు పోవలసివచ్చెను. బెస్సేన్ వద్ద కూడ ఇంగ్లీషువారు స్థావరమును స్థాపించుకొనిరి. కాని, అలంగుపాయా కాలములో నెగ్రేస్‌లో నున్న ఇంగ్లీషువా రోడింపబడిరి. వారి సైన్యము హతము కావింపబడెను. ఇంగ్లీషు కంపెనీవారు బెస్సీనులోనుండి అలంగుపాయాకు కెప్టెన్ ఆల్వ్స్ అను వానిని రాయబారమంపి నష్టపరిహార మిమ్మని కోరిరి. కాని ఫలితము లేకపోయెను. తరువాత ఫ్రెంచి గవర్నరు డూప్లే సిరియమ్ రక్షణార్థము రెండు నౌకలను పంపగా, వాటిని అలంగుపాయా వశపరచుకొని ఫ్రెంచి ఉద్యోగుల నందరను ఉరితీయించెను. బెస్సీన్ నుండి 1762లో ఇంగ్లీషువారు విరమించుకొనవలసిన వారైరి.

అలంగుపాయా సంతతివారు ఆవాను రాజధానీ నగరముగా చేసికొనిరి. వారు మణిపూరుపై దాడిచేసి, అనేకులను బంధించి, సయాముపై దండెత్తి, అయూథియాను పట్టుకొనిరి. చైనీయులు దేశముపై పడగా, నాలుగు సంవత్సరముల తరువాత వారిని తరిమికొట్టగలిగిరి. సయామీయులు తిరుగుబాటు గావించిరి. బర్మీయులు సరిహద్దు దాటిపోవలసి వచ్చెను. అలంగుపాయా కుమారుడొకడు బొడపాయా (1782-1819) అమరపురమునకు రాజధానిని మార్చి, అరకానును జయించి, 20,000 అరకానీయులను చెరబట్టెను. అపుడే మహాముని బుద్ధుని ప్రతిమను ఎత్తుకొనిపోయెను. తిరుగుబాటు నాయకులు చిట్టగాంగ్‌లో తలదాచుకొని, యుద్ధమునకు కడంగిరి. బొడపాయ విజయముచే మదాంధుడై "నేనే భవిష్యద్బుద్ధుడ" నని ప్రకటించుకొనెను. భేదాభిప్రాయ పడినవారిని శిక్షించెను. డజనులకొలది దేవాలయములను కట్టించెను. అందులో నొకటి పూర్తియయి యుండినచో 500 అ. ఎత్తు కలిగియుండెడిది. అతడు బంధితులచే పనిచేయించెను. నిర్బంధ సైనిక విధానమును ప్రవేశపెట్టెను. ఆతని నిరంకుశత్వము వలన వ్యవసాయమును అనేకులు వదలుకొనవలసి వచ్చెను. అడవులకు ప్రజలు పారిపోయిరి. నిర్బంధపు కూలిపని నుండి తప్పించుకొనిరి. తప్పించుకొనిన వారు బ్రిటిష్ ఇండియాలోని ప్రాంత

మునకు పారిపోయిరి వారిని పట్టియిమ్మని బర్మారాజు కోరెను ఇదియే బ్రిటిష్ ఇండియా ప్రభుత్వమువారు బర్మాతో చేసిన మొదటి యుద్ధమునకు కారణమయ్యెను బర్మాసేనాని 'మహాబందులా' చిట్టగాంగునుండి దాడిచేయుటకు సిద్ధపడెను

బౌడపాయా తరువాత అతని మనుమడు బగియిడా (1819-37) పాలించెను బ్రిటిషువారితో యుద్ధము 1824 లో జరిగెను దాని ఫలితము యాండబూసంధి ప్రకారము 'ఆవా' దర్బారునకు మేజర్ బర్నీ అనునతనిని రాయబారిగా పంపుటకు నిశ్చయింపబడెను 1837లో 'థరవాడి' అనునాతడు (బగియిడా సోదరుడు) రాజయ్యెను బర్నీగాక అతనితరువాత ఇంగ్లీషు రాయబారులను గూడ సరిగా రాజులు సత్కరింపక పోవుటచే, ఇంగ్లీషు రాయబారము విరమింపబడెను (1840) అనేక తిరుగుబాటులు జరిగెను అంతట, అతిక్రూరముగా వారి నణచి, రాజు నిరంకుశముగా పాలింపదొడగెను తుదకు రాజు పిచ్చివాడయి పోయెను అతని సోదరుడు పాగన్ మిన్ అనునతడు (1846-53) చాల దురాశాపరుడు, అవినీతిపరుడు అతని నిరంకుశత్వము భరింపరానిదయ్యెను రంగూన్ గవర్నరైన మాంగ్ ఓక్ అనునతడు భరింపరాని అర్థికవిధులను విధించుచు, బ్రిటిష్ నౌకలకు నష్టము కలిగించుచుండెను అంతట బ్రిటిష్ వారు రంగూనునకు ఓడలనంపి, గవర్నరునుతొలగించి, తమకు పరిహారము నిమ్మని కోరినను, పాగన్ లక్ష్యపెట్టలేదు క్రొత్తగవర్నరును నియమించెను అంతట బ్రిటిష్ వారు రంగూనుకు, బెస్సీనుకు, మార్టబానుకు తమసేనల నంపి, యుద్ధముచేసి పెగూనంతను ఆక్రమించిరి (1852) ఇదియే రెండవ బర్మా యుద్ధము

ఇంతలో విప్లవము సంభవించెను పాగన్ సోదరుడు మిండాన్ మిన్ (1853-78) పాగన్ ను తొలగించి రాజయ్యెను మిండాన్, రాజధాని నగరమును మాండలేకు మార్చెను పెగు ప్రాంతము మొదటి కమిషనరు సర్ ఆర్థర్ ఫెయిరీ అమరపురమునకు, మిండాన్ కడకు, వాణిజ్య సంధికొరకు వెళ్ళగా, మిండాన్ అతనిని మర్యాదతో సత్కరించెను కాని సంధి కుదరలేదు మిండాన్ రాజు విశేషము దయాదాక్షిణ్యములు గల రాజు దుస్థితియందున్నపుడు ఎవరిని బాధింపరాదు అను భావముకలవాడు మిండాన్ కొన్ని సంస్కరణములను ప్రవేశపెట్టెను ఉద్యోగులకు జీతముల పద్ధతిని నిర్ణయించెను బ్రిటిష్ వారు బర్మారాష్ట్రముతో వాణిజ్యపు సంధి చేసికొనిరి (1862) కాని, మిండాన్ రాజునకు ప్రత్యేకహక్కులు కొన్ని యుండుటవలన సంధిషరతులు సరిగా పనిచేయక పోయెను తరువాత కలనల్ ఫిచ్చె మరియొకసంధి చేసికొనెను కాని ఫలితము లేకపోయెను తిరుగుబాట్లను మిండాన్ అణచవలసి వచ్చెను మిండాన్ తన ప్రశాంతకాలమును వృథాపుచ్చక మంచిపనులు చేసెను రోము, పారిస్, లండన్ నగరములకు రాయబారము పంపి ఇటలీ ఫ్రాన్సులతో సంధి గావించెను యంత్రసామగ్రిని దిగుమతి చేయించి, చేకు కలపతో, డాక్టరు మార్క్సు అను యస్ పి జి మిషనరీ కొరకు, చర్చి నొకదానిని కట్టించెను మిండాన్ మర్యాదస్థుడయినను, బ్రిటిష్ వారి తీరు అతనికి కష్టము కలిగించెను అతని హోదాను సరిగ పరిగణింపక, ఒక సామంతునివలె బ్రిటిషువారతనిని చూడదొడగిరి రాజును దర్బారులో కాలిచెప్పులతో దర్శనము గావించుట బర్మా ఆచారముగాదు అయినను బ్రిటిషు రాయబారులు మాండలేలో అట్లే కాలిచెప్పులతో సందర్శించుట జరుగగా రాజు రాయబారితో సంప్రతించుట కొప్పుకొనలేదు మిండాన్ రాజు 1878లో రక్తగ్రహణివలన మరణించెను ప్రజ లందరు దుఃఖపడిరి

మిండాన్ చనిపోయినంతనే, రాజకుమారులు సింహాసనమునకు పెనగులాడిరి అలేనంటా అను రాణియొక్క కుతంత్రము వలన, ఆమె కుమార్తె సుప్యాలత్ అనునామె థిబా అనువానిని వివాహ మాడినందున, అతని రాజ్యము లభించుటకై వివిధ రాజకుమారులు బంధింపబడి హతమొనర్పబడిరి థిబా 1878-85 వరకు పాలించెను అప్పటి కప్పుడే మాండలేలో ప్రజలు, బ్రిటిషువారియెడ హేయభావము నూపుచు, వారిని అమర్యాద పరచుట వలన, బ్రిటిషు రాయబారి మాండలే నుండి విరమించు కొనవలసి వచ్చెను థిబా రాజు ఫ్యట్మయోకు, సిమ్లాకు రాయబారములు పంపెను కాని, వెనుకకు పిలచెను ఫ్రెంచి రాయబారియైన హాస్ తో సంప్రతింపులు సాగింప దొడగెను మాండలేకు రైలుమార్గము చేయించుటకును ఐరావతీ నదిలో నౌక సౌకాదళ మేర్పరచుటకును ఉద్దేశించెను ఎగువ బర్మాలో అల్లరులు చెలరేగెను జైలునుండి తప్పించుకొని పోయిరను మిషచే, అనేక రాజకీయ ఖైదీలను థిబా చంప నాదేశించెను బొంబాయి-బర్మా ట్రేడింగు కార్పరేషన్నును ఈ సందర్భములో రు 2,30,000 దండుగ ధనమును చెల్లించ వలసినదిగా థిబా ఆజ్ఞాపించెను

కార్పొరేషన్నువారు అక్టోబరు 1885 లో ఈ విషయమై తీవ్రమైన అధిక్షేపణ తెలుపగా, దానికి తీబా రాజు సరియైన సమాధాన మియ్యక, ఆంగ్లేయులను సర్వనాశనము చేయుటకు తన ప్రజలను ప్రోత్సహించెను అంతట బ్రిటిషువారు సర్ హెన్రీ ప్రెండర్‌గాస్టు సైన్యాధిపత్యమున ఇరావతి ఎగువ ప్రాంతమునకు సైన్యమును పంపిరి యుద్ధమున బ్రిటిషువారు విజయమంది, తీబాను కుటుంబమును భారత దేశమునకు పంపిరి ఇదియే మూడవ బర్మా యుద్ధము దీని పర్యవసానము బర్మా యంతయు బ్రిటిషు రాజ్యమయ్యెను

బ్రిటిషుపాలన–బర్మా బ్రిటిషురాజ్య మైనప్పటినుండి 1897 వరకు, బర్మా, ఛీఫ్ కమీషనరు అనునతని పరిపాలనయందుండెను. 1897 నుండి లెఫ్టినెంటు గవర్నరు అనునతడు నియమింప బడెను బ్రిటిష్ పాలనలో బర్మా అభివృద్ధి చెందుటకు ఆర్థిక దుస్థితి కొంత అడ్డగించినను క్రమముగా నిష్పాక్షికమైన పరిపాలనము ఏర్పడుటచేతను, రాకపోకల అభివృద్ధి, రైలు, నది, రోడ్డు మున్నగు సాధనములు ఏర్పడుటచేతను, వర్తక మభివృద్ధి చెందుటచేతను, విద్యా, వైద్య వసతులు మున్నగునవి లభించుటచేతను క్రైస్తవ మిషనరీల (ప్రొటెస్టెంటు, కేథలిక్) కృషివలనను, బర్మాప్రజలలో మార్పు ఏర్పడెను బర్మా అభివృద్ధి పొందసాగెను 1937 వరకు బర్మా ఇండియాతో కలిసియుండి, లెఫ్టినెంటు గవర్నరు పరిపాలనములో నుండెను 1937 లో బర్మా, భారతదేశము నుండి వేరయిపోయి బ్రిటిషు సొంతపరిపాలనలో నుండెను గవర్నరు నియుక్తుడయ్యెను శాసనసభ ఏర్పరచ బడెను రంగూన్‌లో విశ్వవిద్యాలయము, పాఠశాలలు నెలకొల్ప బడినవి భారత దేశములోని జాతీయోద్యమ ప్రభావము బర్మాలో కూడ కన్పడి, బ్రిటిష్ వస్తువుల బహిష్కరణము సహాయనిరాకరణము మొదలగు పరిస్థితులు ఏర్పడెను కాని బ్రిటిషు చర్యవలన అవి ఎక్కువగా వ్యాప్తి గాలేదు

వెనుకబడిన షాన్‌కాంగ్‌లోయ, కచిన్ ప్రాంతములను కూడ అభివృద్ధి చేయుటకు కృషి జరిగినది

బర్మాలో స్వాతంత్ర్యోద్యమము బర్మాను భారత దేశమునుండి వేరుచేయవలసినదని 1928 లో ఏర్పడిన సైమను కమిషను సిఫారసు చేసినపుడు అది బర్మా శాశ్వతముగ వెనుకబడి యుండుటకు బ్రిటిషువారు చేసిన పన్నాగ మను భావముచే డాక్టరు 'బామా' నాయకత్వమున బర్మా వేరుగా నుండకుండ చేయు సంఘమొకటి ఏర్పడెను ఈ సంఘము భారతదేశపు ఫెడరేషనులో బర్మా ఒక భాగముగా నుండుటకు కోరినది 1932 ఎన్నికలలో ఈ సంఘమువారు అధిక సంఖ్యలో వచ్చిరి అయితే ఫెడరేషనులో చేరునపుడు ఎప్పుడైనా ఇష్టము వచ్చినపుడు విడిపోవుటకు హక్కు బర్మీయులు కోరిరి అది బ్రిటిషువారు ఒప్పుకొనరైరి బర్మాను వేరు రాజ్యముగ చేయుటకు ఉద్యమము ప్రారంభ మైనది 1935 చట్టము ప్రకారము భారత దేశమునుండి, బర్మా వేరు చేయబడెను క్రొత్త రాజ్యాంగము ప్రకారము డాక్టరు 'బామా' పదవిలోనికి వచ్చెను 1939 లోనే రెండవ ప్రపంచ సంగ్రామము ప్రారంభ మగుటచే, అనుకున్న సంస్కరణములను బామా ప్రవేశ పెట్టలేక పోయెను అసంతృప్తి, వ్యవసాయదారుల ఋణగ్రస్తత భారత సాహుకార్ల వడ్డీవ్యాపారములు, భారత కూలీలు అధిక సంఖ్యాకులు బర్మాలో నుండుట, యూరపియను వర్తక కంపెనీ లుండుట–ఇవి యన్నియు చేరి, జాతీయ భావాగ్నిలో ఆజ్యము పోసినవి రాజకీయ పక్షములు బయలుదేరెను నిజముగా ఇవి పక్షములు గావు, ఆయా వ్యక్తులచుట్టు నున్నకక్షలు డాక్టర్ బామా పక్షమునకు 'సిన్ యెతా' అనియు యూసా పక్షమునకు 'మ్యోచిత్' అనియు పేర్లు ఇవిగాక విద్యార్థులు, కార్మికులు కలసిన "డిఓ బామా ఆశియోనె" లేక 'థాకిన్' పక్షముకూడ లేచెను పాశ్చాత్య విద్యావ్యాప్తిలో జాప్యమేర్పడెను 1937 నాటికి దేశమంతటికిని వైద్య పట్టభద్రులు 25 గురు మాత్రము తయారైరి

స్వతంత్ర బర్మా సిద్ధి 1939 లో 'యూసా' యనునాతడు ప్రధానమంత్రి అయ్యెను ఆతడు జపాను పక్షపాతి బ్రిటిషువారికి ప్రతికూలుడు 1941 లో ఇతడు లండనునకు వెళ్ళి, అధినివేశ ప్రతిపత్తి బర్మాకు కావలెనని అర్థించి తిరిగి వచ్చునపుడు బ్రిటిషు గవర్నమెంటువారు, ఆతనిని బంధించి ఆఫ్రికాలో ఉంచిరి డాక్టరుబామా 1939 లోనే థాకిన్ పక్షము సహాయములో 'స్వాతంత్ర్యపక్షము' అను దానిని స్థాపించి, స్వాతంత్ర్యము కావలెనని ఆందోళనము సాగించెను అంతట బ్రిటిషువారతనిని బంధించిరి బామా జపాను దండయాత్రా సమయములో, కారాగారము నుండి తప్పించుకొని జపానువారితో చేరెను. థాకిన్ పక్షమువారు కూడ కొందరక్లే

'ఫారోన్మసా'కు పారిపోయి జపానీయులతోచేరి సైనికశిక్షణను పొందిరి వీరిలో ఆంగ్‌సాంగ్ ముఖ్యుడు జపానువారి ఆక్రమణ మూలకముగా వారి అధ్వర్యవమున ఏర్పడిన బర్మా ప్రభుత్వములో పైవారు పాల్గొనిరి 1942లో బామా ప్రధాన మంత్రి యయ్యెను ఆగస్టు 1, 1942 లో ఏర్పడిన బామా ప్రభుత్వమున, మే 1943 లో బర్మా స్వాతంత్ర్యసిద్ధికి ఒక కమిటీ బామా నాయకత్వముననే నెలకొల్పబడెను బర్మాకును, జపానుకును సంధి కుదురుట కొరకు సంధి ముసాయిదా తయారు చేయబడెను 1, అగస్టు 1943 న బర్మాస్వాతంత్ర్యము ప్రకటింపబడెను బామాను 'రాజ్యాధిపతి' అనిరి క్రొత్తప్రభుత్వము అమలులోనికి వచ్చినది జపాను సహకారముకొరకు సంధి కూడ జరిగినది కాని జపాను తన స్వలాభముతేక యింత చేయునా? జపాను దేశములోని సంపదయంతయు వినియోగించుకొని దేశమును దుర్భిక్షమునకు గురిగావించినది 1945 లో, ఆంగ్‌సాంగ్ బ్రిటిష్‌వారి పక్షమునకు తిరిగి పోయెను 'బామా' జపానువారితోనే యుండిపోయెను బర్మా తిరిగి బ్రిటిషువారి యధీనమైనపుడు క్రొత్తప్రభుత్వము ఆరంభమయ్యెను కాని ఆంటిఫాసిస్టుపీపుల్సు ఫ్రీడమ్‌లీగ్, కమ్యూనిస్టులు స్వాతంత్ర్యముకొరకు ఉద్యమము లేవనెత్తిరి అంతఃకలహ పరిస్థితులు ఏర్పడనుండెను 1946 లో బ్రిటనుతో ఏర్పడిన లేబరుపక్ష ప్రభుత్వము, బర్మాకు, భారతదేశమునకిచ్చు ప్రతిపత్తియే ఇచ్చుటకు సంప్రతింపులను బర్మా నాయకులతో ప్రారంభించెను. ఈ సంప్రతింపులలో భేదాభిప్రాయములవలన ఆంటి ఫాసిస్టు పీపుల్సు ఫ్రీడమ్‌లీగ్‌తో చీలిక లేర్పడెను ఎర్రజెండాపక్షము, తెల్లజెండా పక్షమునుండి విడిపోయినది ఆంగ్‌సాంగ్ (తెల్లజెండాపక్షము) చేయు సంప్రతింపులు ఎర్రజెండాపక్షము వారికి సమ్మతము కానందున, ఆం ఫా. పీ ఫ్రీ లీగ్ నుండి ఆ పక్షమువారు తొలగింపబడిరి జనవరి 1947 లో బ్రిటనుతో ఒడంబడిక గావించుకొని ఆంగ్‌సాంగ్ బర్మాకు తిరిగివచ్చెను కాని రాజ్యాంగము పూర్తిగా తయారు కాకమునుపే ఆంగ్‌సాంగ్‌ను 'యూసా' అనుచరులు వధించిరి తదుపరి 'థాకిన్‌ను' లేక 'యును' అనునతడు అక్టోబరు 1947 లో అంతిమ ఒడంబడిక బ్రిటనుతో గావించిన విధమున, జౌద్ధజాతకుల సలహా ప్రకారము, శుభదినమున జనవరి 4, 1948 సం॥ బర్మా స్వతంత్రరాజ్యముగా ప్రకటింపబడెను కాని అది బ్రిటిషుకామనువెల్తులో చేరలేదు

స్వతంత్ర బర్మా ప్రభుత్వము - థిరు 'థాకిన్'ను లేక 'యును' అనునతడు ప్రధానియయ్యెను కాని అతడు కొన్ని పరిస్థితుల నెదుర్కొనవలసి వచ్చెను (1) ఆం ఫా పీ ఫ్రీ లీగ్ లో నుండి విడిపోయిన వారి ప్రతిపక్షము (2) ప్రభుత్వము యొక్క సోషలిస్టు విధానమును వ్యతిరేకించు కడిపక్షము (3) 'కరేన్లు' అనువారి ప్రతిఘటన - అనగా వారు బర్మాతో చేరియుండుట కిష్టపడకపోవుట 1950 అంతమువరకు కరేనులు, ప్రతిపక్ష కమ్యూనిస్టులు, అల్లరులు చేయుచునే యుండిరి 1952 నాటికి, ఎట్లయిననేమి, పరిస్థితులు అదుపులోనికి వచ్చినవి రాజ్యాంగము తయారీ పూర్తియై 1956 లో ఎలక్షనులు జరుగునప్పటికి ఆం ఫా పీ ఫ్రీ లీగ్‌నకే అధిక సంఖ్యలో వోట్లువచ్చినవి 'యూను' ప్రధానమంత్రిగా నుండి 1956 లో, రాజీనామానిచ్చి, తనతరువాత మంత్రివర్గమును పేర్కొనెను మరల 1957 లో ప్రధానమంత్రిత్వము స్వీకరించి 1958 సెప్టెంబరువరకు ఉండి, తరువాత జనరల్ నెవిన్‌ను ప్రధానిగా పేర్కొనెను ప్రస్తుతముకూడ జనరల్ నెవిన్ బర్మాదేశమున ఆధిపత్యము కలిగియున్నాడు స్వతంత్రబర్మా దేశము అంతరంగికముగా మధ్యరకపు సోషలిస్టు విధానము ననుసరించి అభివృద్ధి నందుటకు కృషిచేయుచున్నది బర్మా ఐక్యరాజ్యసమితివలనను, అమెరికా సంయుక్త రాష్ట్రముల వలనను, సహాయము పొందినది అది విదేశ రాజ్యాంగములో ఏరాజ్యకూటమితో చేరక, భారతదేశమువలె తటస్థవిధానము ననుసరించు చున్నది

వై. వి

## బర్మీయ భాషాసాహిత్యములు

సుమారు కోటిన్నర జనాభాగల బర్మా దేశములో వందకు పైగా భాషలుండుట వింతవిషయమే ఈ భాషలు కేవలము ఒక భాషయొక్క మాండలిక భేదములు కావు వీటిలో చాలభాగము స్వతంత్ర భాషలే ఈ భాషలలో పెక్కులు కొండజాతిప్రజలు మాటాడునవి వీటికి లిపి, సాహిత్యము, లేవు

చీనో-టిబెటన్, ఆస్ట్రిక్, కరేన్, మాన్ మొదలైన కుటుంబములకు చెందిన వేరువేరు తెగలుగా ఈ భాషలను విభజింప వచ్చును ఈ దేశములో రమారమి ఒకకోటి ప్రజలు మాటాడునది బర్మీయ భాష దీనికి పెక్కు మాండలిక భేదములుకొన్ని అన్యభాషలు కూడ ఉన్నవి

బర్మీయ భాష చీనో-టిబెటన్ కుటుంబమునకు చెందినది పదములన్నియు ఏకాక్షరములు స్వరభేదము వలన, ఉచ్చారణ భేదము వలన, ఊనిక భేదము వలన, ఒకే పదము అనేకములైన అర్థములను ఇయ్యగలుగుచున్నది సామాన్యముగా ఇతర భాషలలో భయాశ్చర్యాదిభావములను వ్యక్తము చేయుటకొరకే స్వరభేదమును ఉపయోగించుట కలదు కాని బర్మీయభాషకు ప్రాణమే స్వరభేదము భిన్న స్వరములతో వాక్యములు ఉచ్చరింపబడుచుండుటవలన ఒక విధమైన సంగీతము ఉత్పన్నమై వినుటకు ఇంపుగా ఉండును

బర్మీయ భాషలో అక్షరములు 42 వీటిలో 10 స్వరములు, 32 వ్యంజనములు కలవు 10 స్వరములలో 5 హ్రస్వములు, 5 అహ్రస్వ స్వరములకేదీర్ఘములు కంఠ్య, తాలవ్య, మూర్ధన్య, దంత్య, ఓష్ఠ్యవర్గములలో వర్గమునకు ఐదు చొప్పున ఇందు ఇరువదియైదు వ్యంజనము లుండును ఐదు అంతస్థములు, రెండు ఊష్మములు వర్గములందలి అక్షరములు తెలుగునందువలెనే ఉండును క, ఖ, గ, ఘ, ఙ - ఇవి కవర్గాక్షరములు తక్కిన వర్గములును ఇట్లే

బర్మాదేశమున నాల్గు విధములైన లిపులుకలవు అవి ప్యూ, తలైంగ్, బర్మీజ్, షాన్ అనునవి వీటిలో ప్యూ, తలైంగ్ లిపులు ప్రత్యక్షముగా ప్రాచీన తెలుగు - కన్నడ లిపినుండి పుట్టినవి కదంబరాజులనాటి లిపినుండి ప్యూలిపియు, పల్లవులనాటి లిపినుండి తలైంగ్ లిపియు పుట్టినవి తలైంగ్ లిపినుండి బర్మీయ, షాన్ లిపులు పుట్టినవి

బర్మాదేశమునకు మతము, విజ్ఞానము, నాగరికత, భారతదేశము నుండియే సంక్రమించినవి. బర్మీయభాషలో పెక్కు భారతీయ భాషా పదములు కలవు బర్మీయ లిపి పాళీ (నాగరి) లిపి నుండి పుట్టినదని కొందరందురు కాని అది ప్రాచీన తెలుగు - కన్నడ లిపి నుండి పుట్టినదనుటయే సత్యము తలైంగులు అనబడువారు తెలంగాణమునుండి వలస పోయిన తెలుగువారే అని పరిశోధకులు నిర్ణయించిరి

బర్మీయ భాషకు వ్యాకరణము పొత్తిగా లేదని చెప్పవచ్చును ప్రత్యయములు, ఉపసర్గములు లేవు వాక్యములో పదమునకుగల స్థానమును బట్టి, ఒకేపదము నామవాచకము, క్రియ, విశేషణము మున్నగు భాషా భాగములలో ఏదియైనను కావచ్చును వాక్యమునందలి పదములు కర్త, కర్మ, క్రియ అను క్రమములో ఉండును నామవాచకములు, విశేషణములు వివిధకాలములందలి క్రియా రూపములు, ధాతువుల చివర స్వల్పములయిన మార్పులవలన ఏర్పడును, కర్మణి రూపములు, తరచుగా మొదటి వ్యంజనమును మహాప్రాణముగా మార్చుటవలన, కర్తరి రూపములుగా మారును ఇట్లే అకర్మకములు, సకర్మకము లగును ఉదా క్యా - థి అనగా పడుట ఖ్యా - థి అనగా పడగొట్టుట లుట్ - థి అనగా స్వతంత్రముగా నుండుట ల్హుట్ - థి అనగా స్వతంత్రము చేయుట

బర్మీయ భాషను ఎడమనుండి కుడికి వ్రాయుదురు పదములనడుమ ఖాళీలు ఉండవు వాక్యావసానమున గూడ విరామచిహ్నము సాధారణముగా ఉండదు పరిచ్ఛేదాంతమున నాల్గు నిలువుగీత లుండును

పదములన్నియు ఏకాక్షరము లగుటవలనను, ఒకే పదము స్వరభేదముచే అర్థభేదమును ఇచ్చుచుండుటవలనను, ఆభాషలో పుట్టిపెరిగిన వారికి తప్ప, బర్మీయభాషను మాట్లాడుట, అర్థము చేసికొనుట మిక్కిలి కష్టము

ఉదా 'పె' అనగా కాటియాకు, చెవులు రిక్కించుట, దృష్టిమాంద్యము, మలినముగనుండుట మున్నగునవి 'పే' అనగా ఇచ్చుట, 'పే-సా' అనగా పిల్లనిచ్చుట 'ఫే' అనగా చెడును తొలగించుకొనుట, బలహీనమగుట 'మ్యిన్' అనగా చూచుట, ఎత్తయిన, గుఱ్ఱము అనియర్థములు

'ఒక ఎత్తయిన గుఱ్ఱమును చూచితిని' అని చెప్పవలసి వచ్చినచో, స్వరభేదముతో 'మ్యిన్' అను శబ్దమును ముమ్మారు ఉచ్చరింపవలసి యుండును అట్లు ఉచ్చరించుట, ఆయర్థమును గ్రహించుట బర్మీయులకే చేతనగును

బర్మీయ భాషలో మరియొక విచిత్రమైన లక్షణమున్నది. వస్తువుల సంఖ్యను చెప్పునప్పుడు, వస్తునామమును, సంఖ్యను, జాతివాచకమును ప్రయోగించుటయే ఈ విచిత్ర లక్షణము - ఉదా రెండు కుక్కలు అనుటకు క్వే. హ్ని - గాంగ్ అనగా కుక్కలు, రెండు జంతువులు అందురు

బర్మాదేశమందలి అతిప్రాచీన సాహిత్యము శిలాశాసనముల రూపమున లభించుచున్నది ఇట్టిశాసనములు 5 వ శతాబ్ది నాటివి కూడ కలవు ఐరావతినదీ ప్రాంతము లందు లభించు ప్రాచీన శిలా శాసనము లందలి భాష స్థానిక

మైన ప్యూ భాష 8 వ శతాబ్ది నాటికి తలైంగులు ప్యూ జాతివారిని ఓడించి ఉత్తరమునకు తరిమివైచిరి అప్పటి నుండియు శిలాశాసనములు తలైంగుభాషలో విరివిగా లభించుచున్నవి ఈ శాసనము లన్నియు వ్యక్తుల గుణ గణములను స్తుతించునవి ప్యూ శాసనములు కదంబ లిపి యందును, తలైంగ్ శాసనములు పల్లవ లిపియందును లిఖింప బడియున్నవి

బర్మీయభాషలో లిఖింపబడిన శాసనములు అతి ప్రాచీనము లైనవి ఉదా క్రీ శ 1118 నాటి మ్యాజెడి శాసనము

భావనాత్మక మైన స్వతంత్ర సాహిత్యము 15 వ శతాబ్ది నుండి లభించుచున్నది ఇది తాళపత్రములమీద గంటముతో చెక్కబడి యున్నది బౌద్ధచక్రవర్తుల పోషణముక్రింద ఈ సాహిత్యము 19 వ శతాబ్ది వరకు సాగినది రచయితలు బౌద్ధ సన్యాసులు లేదా, సంఘారామములందు శిక్షణము పొందిన రాజోద్యోగులు ఈ సాహిత్యమున కొంత వైవి ధ్యముకూడ కలదు

(1) పద్యరూపమున నిబంధింపబడిన బుద్ధుని జాతక కథలు (పోై)
(2) బౌద్ధమత గ్రంథము లాధారముగా రచింపబడిన నీతి పద్యములు, స్తుతిపద్యములు (మాగన్)
(3) ఐతిహాసిక వీరగాథలు (ఎగ్యిన్)
(4) ప్రకృతినిగూర్చి, ప్రేమనుగూర్చి రచింపబడిన గీత ములు (యాడూ)
(5) చర్యారూపములయిన ఐతిహ్యములు (యాగన్)
(6) నీతిలేఖారూపములు (మ్యిట్-టాజా)
(7) జానపదగీతములు (ట్యా)
(8) ఆత్మాశ్రయ లఘుగేయములు (లె-దాలి, థాన్-చో, లె-ఛో, ద్వె-చో, జా-లె మొదలైనవి)
(9) ఆస్థానములందు ప్రదర్శించుటకు యోగ్యములైన నాటకములు, పురాతన వీథి నాటకములు (ప్యా)

నాటకములు సాధారణముగా బుద్ధుని జాతకకథలకు సంబంధించినవి వీటిని 'జ్యాత్' అందురు ఇవియే నిజమైన వృత్తాంతములు గనుక, వీటిని 'వుట్టు' అనియు అందురు కల్పిత వృత్తాంతములు గల నాటకములను ప్యాజాత్ అందురు

ఇటీవలి నాటకకర్తలలో పేర్కొనదగినవాడు ఊ-పో-న్యా అనునతడు ఆతని నాటకములందలి పాటలు మాధుర్యమునకు పేరుమోసినవి విజయజాత్ అను నాటకము ఆతని రచనలలో ఉత్తమోత్తమ మైనది మాంగ్ ఫే అను రచయిత పెక్కు నాటకములను రచించెను వాటిలో రామ జాత్ (రామాయణము) మిక్కిలి ప్రఖ్యాతి వహించినది

బర్మీయ సాహిత్యమున పబదిపైగా ఛందోభేదములు కలవు వీటిలో చాలభాగము నియతమైన ఆరోహణ గతి గలవి కొన్ని అనియత మిశ్రగతి గలవి ప్రాచీన సాహిత్య మంతయు ఇంచుమించుగా బౌద్ధమత సంబంధములైన పవిత్ర భావములతో నిండియుండును భాష ఆస్థానయోగ్యమై, మధురమును, సుకుమారమునై యుండును

చిత్రము 92



15-19 శతాబ్దులందలి రచన సాధారణముగా పద్య రూపమే ఐనను, గద్యరచన ఏమియు లేకపోలేదు గద్య గ్రంథములు విశేషముగా పాళీ భాషలోని జాతక కథలకు అనువాదములో, అనుసరణములో అయియున్నవి బర్మీయ చరిత్రాంశములు, న్యాయశాస్త్రవిషయములు కూడ గద్యములో రచింపబడి యున్నవి గద్యశైలి దీర్ఘవాక్యములతో, శిథిలవాక్యబంధములతో, యథేష్టవిరామములతో కూడి యుండును

ఈ గ్రంథములన్నియు తాళపత్రములమీద వ్రాయబడి యున్నవి ధనికుల ఇండ్లలో పలుచని దంతపు పత్రములమీద వ్రాయబడిన గ్రంథములుకూడ లభించును 1870 వ సంవత్సర ప్రాంతమున దిగువ బర్మాలో ముద్రణయంత్రములు వెలసినవి దానితో సాహిత్యమున పెద్ద మార్పులు వచ్చినవి 1875 నుండి ప్యో-జాత్ వంటి ప్రచారంతక నాటకములు, నవలలు, నవలికలు, కథానికలు ప్రచురముగా వెలువడ సాగినవి ప్రాచీన పద్య, గద్యరచనాప్రక్రియలు వెనుక బట్టినవి

1920వ సంవత్సరములో రంగూన్ విశ్వవిద్యాలయము స్థాపింపబడినది అప్పటినుండి బర్మీయ సాహిత్యమున క్రొత్త యుగము ప్రారంభమైనది యువతరము రచయితలు పాశ్చాత్య సాహిత్య ప్రభావము వలన నవ్యసాహిత్య నిర్మాణమునకు పూనుకొనిరి వారు పద్యములను, కథానికలను, వ్యాసములను వెలయించిరి, అన్యభాషా సాహిత్యములందలి ఉత్తమ రచనలను అనువాదరూపమునను అనుసరణ రూపమునను బర్మీయులకు వారు అందజేసిరి

1947 లో బర్మా యూనియను ఏర్పడినది ప్రజలలో జాతీయ భావము రేకెత్తినది జాతీయ సాహిత్యసృష్టి ఆరంభమైనది బర్మా సంస్కృతికి సాహిత్యము దర్పణప్రాయమైనది ప్రభుత్వ ప్రోత్సాహము కూడ దానికి లభించినది ప్రతి సంవత్సరము ఉత్తమ నవలలకు ప్రభుత్వము బహుమతు లిచ్చుచున్నది

బర్మా దేశములో బర్మీయభాష ప్రభుత్వభాషగా వ్యవహరింపబడుచున్నది న్యాయస్థానములందు ఆంగ్లము కూడ ఉపయుక్త మగుచున్నది మాధుర్యమునకు పేరందిన బర్మీయ భాష 'ఇటాలియన్ ఆఫ్ ది ఫార్ ఈస్ట్' అను ప్రఖ్యాతిని గడించినది

హి. మా. శ

## బర్కు - విల్సు

రాబర్టు ఓహారా బర్కు, విలియమ్ జాన్ విల్సు-అను నిరువురును ఆస్ట్రేలియా ఖండముయొక్క అంతర్భాగమును పరిశోధించిన వారిలో అగ్రగణ్యులు

బర్కు (1820-61) అనునతడు ఐర్లండు దేశస్థుడు అతడు 1848 సంవత్సరము వరకు ఐర్లండు దేశపు సైన్యములోను, ఐదేండ్లు ఆదేశపు మహారాజుయొక్క ప్రత్యేక దళములోను పనిచేసి టాస్మానియాకు వలసపోయెను అచటినుండి మెల్‌బర్న్ చేరి, అచట పోలీసు అధికారిగా నియుక్తుడయ్యెను విల్సు అనునతడు మెల్‌బర్న్ నివాసి అతడు మెల్‌బర్న్‌లోని నక్షత్ర పరిశోధనశాలలో పరిశోధకుడుగ నున్నవాడు

1857 వ సంవత్సరములో విక్టోరియాలోని వేదాంత సంస్థవారు ఆస్ట్రేలియాఖండ-అంతర్భాగమును పరిశోధనాత్మకముగ పర్యటించి ఒక నివేదికను సమర్పించుటకై ఒక సంఘమును నియమించిరి ఆ సంఘమునందు బర్కు నాయకుడుగను, విల్సు శాస్త్రీయ పరిశోధకుడుగను పనిచేసిరి

ఆ పరిశోధన సంఘమువారు 1860 వ సంవత్సరమున ఆగస్టు 21 వ తేదీన మెల్‌బర్న్‌నుండి బయలుదేరిరి కాని కొలది కాలమునకే ఆ సంఘములోని సభ్యులలో అంతఃకలహములు చెలరేగెను అందుచే అందున్న ఇరువురు సభ్యులు 'మియాండి' అను ప్రదేశమునుండి వెనుకకు మరలిరి తుదకు బర్కు, విల్సు, ఇద్దరును మరి ఐదుగురి సహాయముతోను, 15 గుర్రములతోను, 16 ఒంటెలతోను, క్వీన్స్‌లాండులోని "కూపర్స్‌క్రీక్" చేరి అచట ఒక స్థావరమును నెలకొల్పిరి

బర్కు మియాండిలో 'రైట్' అను ఒక ఉద్యోగికి తమకు కావలసిన ఆహారపదార్థములను, ఒంటెలను తీసికొని 'కూపర్స్ క్రీక్' స్థావరమునకు చేరునట్లు ఆదేశ మిచ్చి యుండెను కాని రైట్ ఎందుచేతనో 1861 వ సంవత్సరము జనవరి 26 వ తేదీ వరకు ఆ స్థావరమునకు చేరియుండలేదు ఆ ఆలస్యమునకు చికాకుపడి బర్కు తన సహచరులతో ప్రయాణమును కొనసాగింప నిశ్చయించెను ఆ స్థావరములో 'బ్రాహె' అను వానిని రైట్ రాకకై ఎదురు చూడవలసినదిగా బర్కు నియమించెను

తుట్టతుదకు 1861 వ సంవత్సరము ఫిబ్రవరి 4 వ తేదీన బర్కు, విల్సు అనువారును, సహచరులును ఫ్లిండర్స్ అను నది.

యొక్క సరిహద్దుకు చేరిరి. అనగా తమకు అప్పగింపబడిన కార్యమును, ఖండాంతర్భాగ పరిశోధనమును, వారు దాదాపు పూర్తిగ నెరవేర్చిరి. అచటినుండి వారు ఫిబ్రవరి 26 వ తేదీన తిరుగు ప్రయాణమును మొదలుపెట్టిరి. ఆహార ధాన్యములు చాలినన్ని లేకుండుటచేతను, వాతావరణము అనుకూలముగ లేకపోవుటచేతను, ఆ ప్రయాణమున వారు పెక్కు కష్టములకు లోనుకావలసిన వారైరి.

గ్రైట్ అనునతడు తీసికొని రాగలడని ఆశింపబడిన ఆహార పదార్థములు చేరనేలేదు. గ్రే అనునతడు ఆహారాభావాదికారణములచే ఏప్రిల్ 16 వ తేదీన మరణించెను. మిగిలినవారు అతని మృతదేహమును భూస్థాపితము చేయుటకై, ఒక్కదిన మాగిపోయిరి. ఆ ఒక్కదినము జరిగిన ఆలస్యము విషాదాంత ఫలితములకు దారితీసెను.

వారు 'కూపర్స్ క్రీక్' వద్దనున్న తమ స్థావరమునకు వచ్చి చూచిరి. అది నిర్జనమై యుండెను. వారి రాకకు కొన్ని గంటలకు పూర్వమే అచటి స్థావరమున నిరీక్షించు చుండుటకై నియమింపబడిన 'బ్రాహె' అను ఉద్యోగి, బర్కు ఎంతకాలము వరకు అచటికి రాకుండుటచే, ఆ స్థావరమునుండి వెనుకకు మరలిపోయెను. బర్కు, విల్సు అనువారును, మిగిలినవారును అచటి స్థానికులిచ్చిన ఆహార పదార్థములతో ఎట్లో కొన్ని దినములు మాత్రము జీవింప గల్గిరి. కాని తుదకు జూను నెల చివరి రోజులలో శేషించిన వారితోపాటు వారిరువురుగూడ మరణించిరి.

ఇట్లు ఆస్ట్రేలియాఖండ అంతర్భాగ పరిశోధనము విజయవంతమయ్యు విషాదాంతముగ పరిణమించెను.

ఏ. ర.

## బర్బేజ్ జేమ్స్

షేక్స్పియరు నాటకములకు విశ్వవిఖ్యాతిని కల్గించుటకు కృషిసలిపిన వారిలో జేమ్స్ బర్బేజ్ అనునతడు ప్రముఖుడు. ఇంగ్లండులోని స్ట్రాట్ ఫర్డ్-అన్-ఆవన్‌లో ఈతడు జన్మించెను. చదువులో అంతగా మనస్సు ప్రవేశించని కారణముచే, బర్బేజ్ తన దృష్టిని నాటక రంగముమీద ప్రసరింప జేసెను. చిన్నపిల్లలతో కలిసి పెక్కు నాటకములను ప్రదర్శించి ఇతడు రాజవంశ్యుల మన్ననల నందెను.

నాటకము రక్తికట్టవలె నన్నచో, చక్కని నాటకశాల యుండవలె ననెడి అభిప్రాయముతో, జేమ్స్ బర్బేజ్ లండను నగరమునకు అనతిదూరమందున్న షూరెడిచ్‌లో ఒక నాటకశాలను నిర్మించెను. అంతకుముందు నాటక ప్రదర్శనము లన్నియు తాత్కాలికముగా నిర్మింపబడిన డేరా హాలులలో నడచుచుండుటచేత, ప్రేక్షకులు క్రొత్తగా నిర్మింపబడిన ఈ నాటకశాలకు తండోపతండములుగా రాసాగిరి. ఈ నాటకశాల 'థియేటర్' అనెడి పేరుతో వ్యవహరింప బడుచుండెడిది.

లండనులో అడుగుపెట్టిన షేక్స్పియరునకు ప్రప్రథమముగా స్వాగత మిచ్చినవాడు జేమ్స్ బర్బేజ్ అనునతడే. ఈతనిచే నిర్మింపబడిన 'థియేటరు'లోనే షేక్స్పియరు నాటకములన్నియు వెలుగును చూచెను. ప్రథమ జేమ్స్‌రాజు, ఎలిజబెత్‌రాణి, ఈ 'థియేటరు'లో ప్రదర్శింపబడిన షేక్స్పియరు నాటకములను చూచి ముగ్ధులయిరి. నాటక కళాభిమానియైన లైసెస్టర్ ప్రభువు సహాయ సంపదతో, జేమ్స్ బర్బేజ్ ఈ థియేటరును ఇరువది సంవత్సరములపాటు జయప్రదముగా నడిపెను.

జేమ్స్ బర్బేజ్ నిర్వహించిన నాటకసంస్థ 'బ్లాక్ ఫ్రయర్స్' అనునది 1596 లో బాహ్యప్రపంచమును చూచిన ఈసంస్థ నార్వే, స్వీడన్ మొదలైన దేశములను కూడ సందర్శించి షేక్స్పియరు నాటకములను విరివిగా ప్రదర్శించి, పేరు ప్రతిష్ఠలతో పాటు ధనమును గూడ పుష్కలముగా నార్జించెను. జేమ్స్ బర్బేజ్ కేవలము నాటక సంస్థానిర్వాహకుడుగానే కాక, గొప్ప నటుడుగా కూడ వాసికెక్కెను. పాత్రల నమలుచుట షేక్స్పియరు వంతు, ఆ పాత్రలకు పరిపూర్ణమైన న్యాయము సలుపుట బర్బేజ్ వంతు.

ఎలిజబెత్ రాణి కాలమున రాజవంశములు నాటకముం పట్ల ఆదరాభిమానములను కనబరచుచుండెడివి. కొందరు సనాతనవాదులు - ముఖ్యముగా మతగురువులు - నాటక రంగమును చిన్నచూపుచూచిరి. నటనకు సంఘములో స్థానము లేకుండ చేయుటకు వారెంతో ప్రయత్నించిరి. జేమ్స్ బర్బేజ్ మతగురువుల యొక్కయు, సనాతన వాదుల యొక్కయు ఆగ్రహమునకు గురియయ్యెను. నాటకకళ ద్వారా, వారుడు కట్టిన సనాతన సంప్రదాయముల మీద కత్తి ఝళిపించుటకు జేమ్స్ బర్బేజ్ ఎన్నడును వెనుకాడినవాడు కాదు. గుణవగు మహాకవి షేక్స్పియరుమీద నీక ఈగయైనను వాలకుండ బర్బేజ్ జాగ్రత్తవహించి ఆతనిపట్ల భక్తిశ్రద్ధలను ప్రత్యక్షముగా అగపరచెను.

మహాకవి షేక్స్పియరు బర్బేజ్‌ను శిష్యునిగా భావించి ఎరుగడు జేమ్స్ బర్బేజ్ తన ఆప్తమిత్రుడనియే షేక్స్పియరు తన రచనలలో తెలియపరచి యున్నాడు బర్బేజ్, కెంప్, పోప్, ఫిలిప్స్, హెమింజ్, కాన్డెల్, లోవిన్, స్లయ్, ఆర్మిన్ అనువారందరు నాటకరంగస్థలి మీద షేక్స్పియరునకు బాసటగా నిలిచినవారు వీరందరిలోను జేమ్స్ బర్బేజ్ కే షేక్స్పియరు ప్రథమస్థానము నొసగెను

కాని లండనుకు దగ్గరగా నిర్మించిన 'థియేటరు' చట్ట సంబంధమైన కొన్ని ఆవాంతరములకు గురియయ్యెను ఆ నాటకశాల నిర్మింపబడిన స్థలమును తనకు కౌలునకు ఇచ్చిన వారే, తన అభ్యున్నతిని చూచి సహింపక, తనను న్యాయ స్థానమునకు ఏదియో మిషమీద లాగినను, జేమ్స్ బర్బేజ్ ఎంత మాత్రమును భయపడలేదు ఆ 'థియేటరు' కవాటములు ఎట్టి పరిస్థితులలోను బంధింపబడుటకు అతడవకాశ మియ్యలేదు మిత్రుల అభిమాన సహకారములతో, బర్బేజ్, లండనులో మరియొక థియేటరును నిర్మింపించెను దానిపేరు "గ్లోబ్ థియేటరు" ఇది చరిత్ర ప్రసిద్ధిగాంచిన నాటకశాల షేక్స్పియరు నాటకములన్నియు ఈనాటకశాలలో ప్రదర్శింపబడినవై విదేశీయుల మన్ననలను పొందెను

షేక్స్పియరునకు కుడిభుజముగా నుండిన జేమ్స్ బర్బేజ్ 1597 లో మరణించెను కాని అతని పుత్రుడు రిచర్డ్ బర్బేజ్ 'తండ్రికి తగిన తనయుడై, వరలెను తండ్రి గతించు నప్పటికి రిచర్డునకు ముప్పది సంవత్సరముల వయస్సుండెను

పుట్టుకతోడనే నటుడైన రిచర్డు బర్బేజ్, నాటక రంగముమీద ప్రవేశించుట కెంతో కాలము పట్టలేదు షేక్స్పియరు నాటకములలోని ముఖ్య పాత్రలనన్నిటిని అతడు ధరించి సామర్థ్యముతో నటించి అఖండఖ్యాతిని గాంచెను మూడవ రిచర్డు, ఒథెలో, కింగ్ లియర్, మాక్‌బెత్, హేమ్‌లెట్ అను పాత్రలను నటించుటలో రిచర్డు విశ్వవిఖ్యాతి కెక్కెను

తండ్రిచే నిర్మింపబడిన 'గ్లోబ్ థియేటరు'ను ఆధునిక పద్ధతుల ననుసరించి పునర్నిర్మించి, రిచర్డు, బ్రిటిష్ నాటక చరిత్రలో నొక నూతనాధ్యాయమును ప్రారంభించెను. రంగాలంకరణములో, ఆహార్యములో, సంగీతములో, క్రొత్త పుంతలు త్రొక్కిన నాటక ప్రయోక్తలలో రిచర్డు అగ్ర తాంబూలమునకు అర్హతను సంపాదించుకొనెను

బర్బేజ్, ఆతనికొడుకు రిచర్డు, షేక్స్పియరు నాటకములకు అజరత్వ, అమరత్వములను చేకూర్చిరనుటలో అతిశయోక్తి లేదు ఈ సత్యమును మహాకవి షేక్స్పియరు తన రచనలలో తెలిపియున్నాడు అంతకు పూర్వము నాటకములు లాటిన్ భాషలో ప్రదర్శింపబడుచుండెను బర్బేజ్ తనయుడగు రిచర్డు నాటిలో రంగప్రవేశానంతరము స్వచ్ఛమైన ఆంగ్ల భాషకు ప్రచారము నిచ్చిరి నాటకకళ యొక్క స్వరూప వీక్షణానందమును ధనాఢ్యులకేకాక, సామాన్య ప్రజలకు కూడ అందుబాటులోకి తెచ్చిన వారిలో జేమ్స్ బర్బేజ్, రిచర్డు బర్బేజ్ చిరస్మరణీయులు

ఇం వేం

## బల్గేరియా (భూ)

పరస్పర విరుద్ధములైన రెండు గుణములు–క్షత్రియ గుణము, శైవగుణము–బల్గేరియా చరిత్రలో ప్రాముఖ్యము వహించినవి 1878లో టర్కులు పరాజయమునొంది రాజ్యము నుండి ఉపసంహరించుకొనిన పిదపనే బల్గేరియా రాష్ట్రము ఉత్పన్నమైనది ప్రస్తుత రాజ్యమునందలి ఉత్తరార్ధభాగము మాత్రమే మొట్టమొదట బల్గేరియాగా నుండెను శేషించిన భాగము 1885 వ సంవత్సరములో దానిలో చేర్చబడినది అందు మిక్కిలి దక్షిణమున నున్న భాగము 1912 సం॥ లో లబ్ధమయ్యెను

1946 వ సంవత్సరమునకు పిమ్మట, రష్యా ప్రోత్సాహము వలన, బల్గేరియా, సామ్యవాద ప్రభుత్వ విధానము నంగీకరించి, "బల్గేరియను ప్రజాప్రభుత్వము"గా రూపొందెను టర్కులను పారద్రోలి, స్వతంత్ర బల్గేరియా ప్రభుత్వమును స్థాపించుకొనుటలో, బల్గేరియాకు రష్యా సహాయ మొనర్చెను అందుచేత రష్యాను తన ప్రధాన మిత్రముగా బల్గేరియా భావించుచు వచ్చెను బల్గేరియాపై తన ప్రభావమును ప్రసరింప జేయుట, మధ్యధరా సముద్రములో ప్రవేశమును సంపాదించుకొనుటకై రష్యా అవలంబించిన రాజనీతిలో నొక భాగమై యుండెను ద్వితీయ ప్రపంచ సంగ్రామానంతరము టర్కీకిని, గ్రీసునకును ప్రతికూలముగాను, 1948 సంవత్సరము పిమ్మట యుగోస్లేవియాకు ప్రతికూలముగాను సోవియట్ యొక్క సరిహద్దు కాపలి చౌకీగా బల్గేరియా ఏర్పడెను

భౌతికముగా, బల్గేరియాను ఇట్లు విభజింపవచ్చును (1) డాన్యూబ్ పీఠభూమి, (2) బాల్కన్ పర్వతములు,

(3) మారికాలోయ, (4) రొడోప్ పర్వతములు

డాన్యూబ్ పీఠభూమి ఇది ఎక్కువ ఎత్తులేని పీఠభూమి, పీమ సున్నపురాయిచే నేర్పడినది పర్వతములపైనుండి అడ్డముగా ప్రవహించు నదులు ఈ ప్రాంతమును కోసి, లోతైన లోయల నేర్పరచినవి ఈ పీఠభూమి పైభాగము పొడిగా నుండును ఇందలి విశేషభాగము లాస్ అను మట్టిచే కప్పబడియున్నది ఈ పీఠభూమి నిమ్నోన్నతమై చెట్లు చేమలులేనిదిగా నున్నది కొన్ని భాగములలో ఇది క్రమమైన వ్యవసాయమునకు పనికిరానంత శుష్కముగా నుండును ఇచట గోధుమ, జొన్నపంటలు పండును రష్యా మైదానములపై

చిత్రము 98

బల్గేరియా

రాష్ట్రసరిహద్దు

రైలుమార్గములు

రొమేనియా

నుండి చలికాలమున వీచు కఠోర పవనములకు గురికాని తావులలో ద్రాక్షపంట పండును చలికాలమున చలి తీవ్రముగ నుండును వేసవులు వేడిగనుండును ఆ వేడిమి జొన్నపంటకును, సన్‌ఫ్లవర్ పంటకును అనుకూలముగ నుండును సన్‌ఫ్లవర్, శాకతైలమునకు మూలాధారము ఈపీఠభూమియందును, లోయలయందును, జనాభా సాంద్రముగనుండును ఇందు జనుల వాడుకకు మించిన ధాన్యము పండును మిగులు ధాన్యము డాన్యూబ్ నది యొక్క ఓడరేవుల ద్వారమున ఎగుమతి చేయబడును ఈప్రాంతమునందలి పట్టణములలో పలసాయము అమ్మబడును ఈ పట్టణములలో వెల్లి, రసక్ (జనాభా 63,000)అను డాన్యూబు నదిపైగల ఓడరేవు మిక్కిలి పెద్దది

డాన్యూబ్ పీఠభూమి బల్గేరియా జనుల యొక్క ప్రాచీన కేంద్రము అచ్చట వారు హంగేరియను దండయాత్ర కాలమున మొదట ప్రవేశించి స్థిరనివాస మేర్పరచుకొనిరి అచ్చట నుండి వారు దక్షిణదిశకు పురోగమించిరి టుర్నోవో వద్ద ప్రాచీన రాజధాని యొక్క శిథిలములు కనిపించుచున్నవి అవి చక్కగా భద్రపరుపబడుచున్నవి 19 వ శతాబ్దిలో వారి స్వాతంత్ర్యోద్యమ మిచ్చటనే ప్రభవించినది

బాల్కను పర్వతములు డాన్యూబు పీఠభూమికి దక్షిణమున గల బాల్కను పర్వతములు ఎత్తైనవికావు అందుచే వాటిని దాటుట కష్టమైన పని కాదు ఆ పర్వతములు ప్రధానముగా సున్నపు రాళ్ళతోను, ఇసుకరాళ్ళతోను ఏర్పడి యున్నవి పర్వతముల శీతోష్ణస్థితి తీక్ష్ణమైనది అచట గాఢమయిన ఖండవృష్టి కలదు ఆచటి జనాభా పలుచగ నుండును డాన్యూబ్ నదీ శాఖలలో నొకటైయైన ఇస్కర్ అను నది, బాల్కను పర్వతశ్రేణిని భేదించుకొని ప్రవహించి, ముఖ్య పట్టణమయిన సోఫియాకు పోవుట కొక మార్గమును కల్పించినది సోఫియా పట్టణములో అనేకములైన ఉత్పత్తి పరిశ్రమలు అభివృద్ధి నొందినవి వాటిలో పెక్కు పరిశ్రమలు వ్యవసాయోత్పత్తులను ప్రయోజనాత్మకముగా చేయునవి కాజన్‌లక్ అను పట్టణము వ్యవసాయ వస్తూత్పత్తి విషయిగా అభివృద్ధి చెందినది గులాబి అత్తరును తయారు చేయుటకై గులాబిపూలను సేకరించుట ఆ పట్టణముయొక్క ప్రత్యేకత అంతకంటె పెక్కువగా కాలోఫర్, కార్లోవో అను పట్టణములలో అత్తరు పరిశ్రమ చురుకుగా సాగుచున్నది ఆ ప్రాంతములలో వేలకొలది ఎకరములందు గులాబివనములు కలవు జనులు గులాబిపూల పరిశ్రమయందు ఎక్కువగా వ్యాపృతులై యున్నారు కొంచెము నేలబొగ్గు, రాగి, సీసము,

తుత్తునాగము గల గనులు, ఓకు, బీచ్ వృక్షములుగల విశిష్టారణ్యములు, జలవిద్యుత్తు సౌకర్యములు, పర్వతములలోగల గొర్రెలనుండి లభించు సమృద్ధమైన ఉన్ని - ఇవన్నియు లఘు పరిశ్రమానుకూలము లయిన పరిస్థితులు

**మారిత్సాలోయ** ఈ లోయ త్రికోణాకృతితో నొప్పు నిమ్న ప్రదేశము లేతనై, మృదువైన రాళ్ళపై అది సర్పడినది అలోయ, ఉత్తరమున అంటిబాల్కను పర్వతములకును దక్షిణమున రోడోప్ కును మధ్యగతమై యున్నది అందు బల్గేరియా కంతటికి ప్రధానమయిన నిమ్న ప్రదేశము కలదు

**శీతోష్ణస్థితి దృష్ట్యా** ఈలోయ సురక్షితమైన స్థానమై యున్నది చలికాలములో చలి తక్కువగ నుండును అచ్చటి దృగ్గోచరమగు ప్రదేశమందలి వృక్షసంతతి మధ్యధరా సముద్ర ప్రాంతమునకు చెందిన వృక్షసమూహమును కొంత వరకు పోలియుండును చలికాలమున తూర్పునుండి వీచు చలిగాడ్పులు నారింజపండ్ల పెంపకమును నిరోధించును అయితే, పెక్కు విధములయిన పండ్లు కూరలు, ద్రాక్ష తోటలు, పొగాకు తోటలు అత్తరు కొరకు పెంచబడు గులాబీ తోటలు, విస్తృతములయిన గోధుమ, వరి, ప్రత్తిక్షేత్రములు, మల్ బరి వృక్షములు, వాటి పట్టుపురుగులు—ఈ అన్నింటి మూలమున ఈ లోయ మహత్తరమయిన ఆర్థిక మూల్యము కలదిగా పరిణమించినది ఈ భూభాగము "బల్గేరియన్—కాలిఫోర్నియా" అను గౌరవ నామమును పొందినది ఈ ప్రదేశమందలి కర్షకులు యూరపు దేశమునందలి అత్యంత ప్రతిభావంతులయిన ఉద్యాన పాలక శ్రేణిలోని వారని ప్రసిద్ధి వడసిరి పశ్చిమమున ఫ్లోవ్ డివ్ అను నొక ప్రముఖ పట్టణమున్నది అందలి జనాభా 1 25,500 అది బల్గేరియాలో గల మిక్కిలి పెద్ద పట్టణములలో రెండవది అది రైల్వే మార్గమున నదీతీరమున నున్న ప్రాచీనమైన వర్తక కేంద్రముగ నున్నది ఈ ఫలవంతమైన ప్రాంతపు ఉత్పత్తులను బయటికి రవాణా చేయు ముఖ్య ద్వారమిదియే వర్తక పరిమాణమున అది స్టాలిన్ (వర్నా) పట్టణమును మించుచున్నది మైదానపు పరిహద్దుపై గల ఇతర పట్టణములు విశేషముగా విపణి కేంద్రములై యున్నవి

**రోడోప్ పర్వతములు** రోడోప్ అనునది నిమ్నోన్నతమై ఎత్తుగానుండు ఒక పెద్దచట్టు అది రాకపోకలకు గొప్ప ఆటంకముగా నున్నది అది ఇప్పటికిని కొంతవరకు అడవులచే ఆక్రమింపబడి యున్నది అందలి జనాభా పలుచగా నున్నది నైసర్గికముగా నిమ్నోన్నతమైన దగుటచే, రోడోప్ అనేక జాతుల జనుల కాశ్రయమై యున్నది ఆ జనులు తరచుగా బాధాకరులు వీరిలో నొకరు పోమక్సు లేక, మోస్ లెరన్ బల్గేరియన్స్ అనువారు వీరు క్రైస్తవులను హింసించుటలో టర్కులకు తోడ్పాటు కావించిరి వీరు ముఖ్యముగా కట్టెలను కొట్టి కాల్చిన బొగ్గులచే జీవింతురు వ్లాక్స్ అనువారు మరి యొక తెగకు చెందినవారు వారు పసుల కాపరులు వారు రుమేనియనులను పోలియుందురు ఆ ఉభయసంఘముల వారి కంటె ఎక్కువ పిడాకారులు మాసిడోనియన్సు అనువారు వారు రోడోప్ ప్రదేశముయొక్క దక్షిణ, పశ్చిమ భాగము లందు నివసించువారు పోమక్సు, వ్లాక్స్, మాసిడోనియన్సు అనువారు అత్యున్నతమైన బాల్కన్ పర్వతములలో ఆశ్రయమును పొందుచుందురు ఈ దేశములో చాలకాలము ప్రవర్తిల్లిన కలతకంతటికి కారకులు వీరే

దక్షిణదిశకు ప్రవహించు స్ట్రుమ, మెస్టా అను నదులు రోడోప్ పర్వతములపై బడిన వానసీటిని నిశ్శేషముగ గ్రహించు చున్నవి రోడోప్ పశ్చిమ భాగమున సారవంతమయిన చిన్న పరీవాహక ప్రదేశములు పెక్కులున్నవి అందు వ్యవసాయ కార్యకలాపములు అమలు చేయబడు చున్నవి మొత్తముమీద ఈ పర్వతశ్రేణి ఫలవంతమైనదియు కాదు, ఆశ్రమ యోగ్యము కూడ కాదు ఉన్నతతర ప్రదేశములందు సంవత్సరములో విశేషకాలము మంచు కురియును క్రింది పలవాలు ప్రదేశములు అరణ్యమయములు

**ఆర్థికాభివృద్ధి** కృషి ప్రధాన దేశముగా బల్గేరియా పునాదులు సుస్థిరములైనవి ఇచట శీతోష్ణ స్థితియందలి మార్పులచే పంటల ఉత్పత్తిలో వైవిధ్య మేర్పడుచున్నది ఫలములు, పొగాకువంటి ప్రత్యేక ఫలసాయము ఎగుమతి యగుటచే, వాటిని క్రయము చేయుటకు సిద్ధముగానున్న విపణి కేంద్రములు బల్గేరియాకు లభించినవి అట్టివి ముఖ్యముగా మధ్యయూరపులో నున్నవి బల్గేరియాలో అత్యధికులు వ్యవసాయమందు వ్యగ్రులై యున్నారు పూర్వకాలమందుండిన పెద్ద కమతము లిప్పుడు చిన్నచిన్న క్షేత్రములుగా విభజింప బడినవి అచ్చటి వ్యవసాయ పరిస్థితులు బీదగతి యున్నవి ప్రమాణాధికముగా ఆహారపు పంటలపై దృష్టి కేంద్రీకరింప బడుటచే, పంటనేల బలపడుటకు అవకాశము

తక్కువగా నున్నది పశువుల పెంపకము పైరు పంటలంతటి ప్రాధాన్యము కలదియే ముఖ్యముగా అచటి గొర్రెల మందలు అసంఖ్యాకములు వస్త్రపరిశ్రమలలో ఉన్నిని ఉపయోగించు చుందురు పాడిపశువులు, కాడిపశువులు అని పశువులను సమముగా విడదీసి యుంచెదరు ముఖ్యమయిన కాడి జంతువులలో గుర్రములు పది లక్షలవరకు ఉన్నవి దక్షిణ మండలములలో గాడిదలు, కంచర గాడిదలు, అనేకములు రవాణాకొరకు ఉపయోగించ బడుచున్నవి కోళ్ళు ప్రధానముగా, కోడిపిల్లలు సాధారణముగా, లభించు చుండును చేపలుపట్టుట అప్రధానమయిన వృత్తి తేనె ఉత్పత్తి లెస్సగా వృద్ధి చెందినది బల్గేరియన్ పట్టుపురుగు గూడులు సుప్రశస్తములు ప్రత్తి, జనపనార వంటి పారిశ్రామిక సస్యములు అచ్చట పెంచబడు చుండును కాని అవి అంత ముఖ్యమయినవి కావు ఏవిధముగను అవి ప్రముఖమయిన పరిశ్రమోత్పత్తులకు దారితీయలేదు

ఖనిజ సంపదల అన్వేషణము స్వల్పముగా జరిగినది ఖనిజసంపద ఇచట విశేషముగా కలదను సూచన లెవ్వియు కనబడవు 1947 వ సంవత్సరమున దేశమునందలి గనులు, పరిశ్రమలు జాతీయ స్వత్వస్వాధీనములలోనికి తీసికొనబడెను గోధుమవన్నెకల నేలబొగ్గు గనులు పెక్కులున్నవి సోఫియా పట్టణమువద్ద బిట్యూమినస్ నేలబొగ్గు గనులు త్రవ్వబడినవి ముడి ఇనుము చాల స్వల్పముగా దొరకును. ఇతర ఖనిజము లచ్చట అప్రధానమైనవి అయితే సోఫియా పట్టణమునకు ఉత్తరమునను,స్టాలిన్ పట్టణమునకు సమీపమునను,అధికముగా మాంగనపు గనులు త్రవ్వబడు చున్నవి స్వల్పప్రాధాన్యము గల ఇతర ఖనిజములలో రాగి, సీసము, తుత్తునాగము, కాక్రైస్నట్, పారశోతము పేర్కొన దగినది జలశక్తి ఆధారములలో దాదాపు 6 వ శాతము మాత్రమే అభివృద్ధి చేయబడినది బల్గేరియా తనకు వలసిన విద్యుచ్ఛక్తిలో సగము మాత్రమే సమీకరింప గల్గుచున్నది దేశమునందలి జనాభాలో పదిశాతము జనులు పరిశ్రమలలో వ్యాపృతులై యున్నారు అయితే ప్రధానమైన పరిశ్రమలలో మూడవవంతు జనులైనను చేరియుండలేదు పారిశ్రామిక కార్మికులలో పెక్కుమంది ప్రధానముగా చేతిపనులలోను, గృహపరిశ్రమలలోను, లఘుపరిశ్రమలలోను వ్యవసాయ జీవితములోను ఉండియున్నారు దేశమంతట విభక్తములై యున్న గృహపరిశ్రమలలో చిన్న పిండిమరలను, తోళ్ళను పదునుచేయు కార్ఖానాలను, ద్రవక్రియాగారములను, పాదరక్షలను బట్టలను కంబళ్ళను గృహోపకరణములను ఉత్పత్తిచేయు కర్మాగారములు పేర్కొనదగినవి

ప్లోవ్‌డివ్, సోఫియా, స్టాలిన్ అను పట్టణములలో ఇనుము ఉక్కు, లోహములకు సంబంధించిన భారీ పరిశ్రమలు కలవు స్టాలిన్, బర్గస్, అను పట్టణములు నౌకానిర్మాణ కేంద్రములు ప్లోవ్‌డివ్‌లోను, స్టాలిన్‌లోను రాసాయనిక పరిశ్రమలు కలవు సోఫియా పట్టణము చర్మపరిశ్రమ కేంద్రము కార్లోవాలో, సోఫియా నగరములో పలురకముల నేతబట్టలు తయారగును టార్నోవో, ఉన్నిపరిశ్రమకు కేంద్రము స్టాలిన్ ప్రత్తిమిల్లు కేంద్రము ప్లోవ్‌డివ్‌లో పట్టు ఫ్యాక్టరీకూడ నున్నది ద్రవక్రియాగారములతోపాటు ఫలరసాదులను డబ్బాలలో నిలువచేయు యంత్రాగారములు ఇచ్చట కలవు వీటితోపాటు, జాతీయమొనర్చిన కారణముచే, శర్కర శుద్ధీకరణాగారములు, పెద్ద పిండియంత్రములు, పొగాకు ఫ్యాక్టరీలు చురుకుగా అభివృద్ధి చెందుచున్నవి స్థానికములైన చిన్న రంపపుమిల్లులు కలప పరిశ్రమకు మూలాధారములయి యున్నవి సోఫియా, ప్లోవ్‌డివ్, బర్గస్‌ల మధ్యనున్న ప్రాక్పశ్చిమ అక్షమునకు చెందిన బల్గేరియా ప్రాంతము ప్రధానముగా పరిశ్రమలకు నిలయము ఆది ఆ దేశపు ముఖ్యమైన వాణిజ్య కేంద్రముగా కూడ నున్నది

రాకపోకలకు సాధనములు తగుమాత్రముగా కలవు 1968 వ సంవత్సరములో బల్గేరియాయందు 5760 కిలోమీటరుల రైల్వే నిర్మింపబడి యుండెను అందులో 484 కిలోమీటరుల నారోగేజి రైల్వేలైను చేరియున్నది. బల్గేరియాలోని ప్రధానమైన రోడ్లు సాధారణముగా రైల్వే ననుసరించి యుండును

అంతర్దేశీయ వాణిజ్యము, రాజధాని యయిన సోఫియాలోను ప్లోవ్‌డివ్‌లోను కేంద్రీకరింపబడి యున్నది స్టాలిన్ బర్గస్ అను రెండు సముద్రపు ఓడరేవులును డాన్యూబ్ నదికి చెందినవి దిన్, లోవ్, రూస్ అను ఓడరేవులును ప్రస్తుతము వైదేశిక వర్తకవిషయమున ఎగుమతి దిగుమతులకు ముఖ్యస్థానములుగా నున్నవి ఇటీవల కాలమున ఎగుమతులు వ్యవసాయోత్పత్తి మూలకములైన పదార్థములై యున్నవి పొగాకు వాటిలో ప్రధానమైనది సజీవ జంతువులు, చర్మములు, ఉన్నివంటి జంతూత్పత్తులు, ఆహారధాన్యములు, ఫల

ములు శేషించిన వస్తువులుగా చెప్పనగును నేతబట్టలు, లోహపు సామానులు, యంత్రములు విశేషముగా దిగుమతి యగుచుండును

కే వి రే

## బళ్లారి రాఘవాచార్యులు

విప్లవభావ ప్రపూరితములయిన పోకడలు పోయి, పినూత్నములయిన ప్రయోగములను సలిపి, ఆంధ్ర నాటక రంగ చరిత్రమీద తన ప్రభావముద్రను కొట్టిన మహానటుడు 'బళ్లారి' రాఘవాచార్యులు ఆతని అసలు ఇంటిపేరు తాడిపత్రివారు బళ్లారిని నాలుగు దశాబ్దములపాటు తన కార్యకలాపములకు కేంద్రముగా చేసికొనుటచే అతనికి 'బళ్లారి రాఘవాచార్యులు' అని పేరువచ్చినది పూర్తి పేరుతో కాక అతడు అశేష ఆంధ్రనాటక కళాభిజ్ఞుడగుటచే 'రాఘవ' అను సంక్షిప్తనామముతో వ్యవహరింపబడెడి వాడు తన నామధేయమునకు చివరనున్న 'ఆచార్యులు' అను పదమునకు తాను తగనని అతడే స్వయముగ దానిని వదలివేసెను

రాఘవాచార్యుల తండ్రిపేరు 'అష్టావధానము' నరసింహాచారి నరసింహాచారి బళ్లారిలో స్థానిక ఉన్నత విద్యాలయములో తెలుగు పండితులుగా పనిచేయుచుండెడివారు రాఘవాచారి మాతృమూర్తి పేరు శేషమ్మ ఈమె ఆంధ్ర నాటక పితామహుడగు ధర్మవరము కృష్ణమాచార్యులకు సోదరి

అనంతపురము మండలములోని తాడిపత్రియందు రాఘవాచారి 1880 ఆగస్టు 2వ తేదీన జన్మించెను మెట్రిక్యులేషన్ పరీక్షలో ప్రతిభతో ఉత్తీర్ణుడయిన పిమ్మట రాఘవాచారి మద్రాసులోని క్రిస్టియన్ కళాశాలలో ఉన్నతవిద్యను అభ్యసించి పట్టభద్రుడయ్యెను తరువాత అతడు న్యాయశాస్త్రమును చదివి, బి యల్ పట్టమును స్వీకరించి, బళ్లారిలో నున్న తన మేనమామ ధర్మవరం కృష్ణమాచార్యుల వారితో కలిసి న్యాయవాద వృత్తిని సాగించెను

కళాశాలలో చదువు సాగించుచున్నప్పుడే రాఘవాచారి నాటక రంగస్థలముమీద పాదముపెట్టి, రసికులయిన ప్రేక్షకుల హర్షధ్వనులను స్వీకరించెను షేక్స్పియర్ నాటకములలో వివిధపాత్రలను పోషించుచు, ఆయన ఉన్నత విద్యాధికారుల మన్ననలను బడసెను విద్యార్థి దశయందే ఆయనకు 'షేక్స్పియరియన్ నటుడు' అన్న బిరుదు లభించెను కళాశాలలోని పాశ్చాత్య అధ్యాపకులుకూడ ఆంగ్లభాషలో ఆయన కనబరచిన వాచికాభినయమునకు అచ్చెరువందిరి

బళ్లారిలో న్యాయవాద వృత్తిని చేపట్టిన రాఘవాచారి అనతికాలములో 'గొప్ప క్రిమినల్ లాయరు'గా పేరు పొందెను ధనముతోపాటు, అయన, కీర్తిప్రతిష్ఠలను కూడ విశేషముగ గడింపసాగెను న్యాయస్థానములలో వృత్తి విద్యననుసరించి అతడు సాగించెడి వాదములను విని అతని వక్తృత్వమును చవిచూచుటకు జనులు విశేషముగ వచ్చెడివారు

ఒకవెంప న్యాయవాద వృత్తిని సాగించుచునే, రాఘవాచారి తన దృష్టిని తెలుగు నాటకరంగము మీదికి సారించెను కేవలము సంగీతమునకే ప్రాధాన్యమొసగి, భావగర్భితమయిన వాచికాభినయమునకు, పుష్టితోకూడిన నటనమునకు, విముఖతను కనపరచుచున్న తెలుగు నాటక రంగస్థలిని సంస్కరించుటకు అతడు నడుముకట్టెను దుష్టభూమికలను పోషించుటలో కూడ నటులు జుగుప్సాకరమయిన మోటుతనమునకు కాక

చిత్రము 94



మృదుత్వమునకు ప్రాముఖ్యము నీయవలెనన్న వాదనమునకు రాఘవాచారి ప్రాణప్రతిష్ఠ సలిపెను స్త్రీ భూమికలను స్త్రీలే నిర్వహించవలెననియు ప్రకృతిసిద్ధమయిన లాలిత్యము, మనోజ్ఞత, మార్దవము స్త్రీల సొత్తనియు, స్త్రీపాత్రలను పోషించుటకు పురుషులు, ఏకోణములోనుంచి చూచినప్పటికిని తగరనియు, అతని వాదము ఈ వాదమున కనుగుణముగా రాఘవాచారి, సంప్రదాయమను సంకెలలను పగులగొట్టుటకు సంసిద్ధుడయ్యెను సంస్కారముగల కులస్త్రీలను అతడు నాటక రంగస్థలికి ఆహ్వానించెను

ఉద్యమములు లేవదీసినపుడు అతడు ప్రతిఘటనమునకు లోనగుటలో ఆశ్చర్యములేదు నూతన ఉద్యమ ఆరంభకుడయిన రాఘవాచారి కూడ పూర్వాచారపరాయణులయిన కొందరి ప్రతిఘటనమునకు, శాపములకు లోనుగాక తప్పలేదు మొక్కవోని ఆత్మవిశ్వాసముతో, అంకుఠిత కార్యదీక్షతో ఆయన తన ఉద్యమమును కొనసాగించి అచిరకాలములో కృతకృత్యుడు కాగలిగెను

రాఘవాచారి యొక్క విప్లవాత్మకమైన పోకడకు మొట్టమొదటగా గురియైనది పౌరాణిక నాటకమైన 'ప్రహ్లాద' లోని హిరణ్యకశిపునిపాత్ర హిరణ్యకశిపుడు రాక్షసుడయినను, సర్వాంతర్యామిని కనుగొనవలెనని తహతహలాడుచున్న ఒక సత్యాన్వేషకుడని రాఘవాచారి భావన భయానక,భీభత్స రస ప్రధానిమయిన అరుపులు పెడబొబ్బలు, లేకుండ ఆయన హిరణ్యకశిపుని పాత్రను ఎంతయో హుందాతనముతో పోషించెను

సీ॥ అస్మదీయంబగు నాదేశముననగాని
మిక్కిలి రవి మింట మెరయవెరచు
అన్ని కాలములందు అనుకూలుడై కాని
విద్వేషియై గాలి వీవవెరచు
మత్ప్రతాపానలమందీశ్వరార్చియై,
విచ్చలవిడి నగ్ని వెలుగవెరచు
అతితీక్ష్ణమయిన నాయాజ్ఞనుల్లంఘించి,
శమనుండు ప్రాణుల జంపవెరచు
ఇంద్రుడాదిగ నాస్త్రముల చెత్తవెరచు,
అమర, కిన్నర గంధర్వ యక్ష, విహాగ,
నాగ విద్యాధరావలి నాకు వెరచు

'నేల నెరువవు వలువ నీకేది దిక్కు' అనిన పద్యమును పాడుచున్నపుడు రాఘవాచారి కనపరచిన హావభావములు అసామాన్యములు అహంకారముకాక అన్వేషణాతత్పరత ఆ హావభావములలో ప్రస్ఫుటమగుచుండెడిది

'లోకములన్నియున్ గడియలోన జయించినవాడవింద్రియా
నీకము చిత్తవృత్తిన్ గెలువనేరవు'

అని ప్రహ్లాదుడు హిరణ్యకశిపునకు ప్రత్యుత్తర మిచ్చునపుడు రాఘవాచారి ప్రదర్శించినముఖలక్షణములను ఆనాడు చూచినవారెవ్వరు ఈనాటికిని మరచిపోజాలరు అవి ప్రేక్షకహృదయ ఫలకములమీద గాఢముగా కొట్టబడినవై చెరిగిపోని ముద్రలు

'విజయనగర సామ్రాజ్య పతనము' అను నాటకములో రాఘవాచారి గ్రహించినది పఠాన్ పాత్ర ఆపాత్రను అభినయించుటలో ఆయన గౌరీశంకర శిఖరమును అధిరోహించుచుండెడివాడు పద్యమును పాడుటలోగాని, గద్యము పల్లించుటలోగాని, భావమునకు, రాఘవాచారి అత్యధిక ప్రాధాన్యము నిచ్చెడివాడు పఠానుపాత్ర నిర్వహణములో ఆయన వాచికాభినయము పరాకాష్ఠనందినది

తన మేనమామగారయిన ధర్మవరము కృష్ణమాచార్యులవారి కలమునుండి వెలువడిన నాటకములను రాఘవ తెలుగుదేశములో బహుళ ప్రచారములోనికి తీసికొనివచ్చెను 'చిత్రనళీయము'లో బాహుకుడు, 'సారంగధర'లో రాజరాజనరేంద్రుడు, 'రామదాసు'లో రామదాసు అను భూమికలకు తన జీవరేఖలను పోసెను బహుముఖ ప్రజ్ఞాన్వితుడయిన రాఘవాచారి బెంగుళూరు అమెచూర్ డ్రమెటిక్ అసోసియేషనులో సభ్యుడుగాచేరి, దాని పతాకచ్ఛాయలలో ఎన్నియో రసవత్తరములైన నాటకప్రదర్శనముల నిచ్చెను ఆ ప్రదర్శనములను తిలకించి గొప్ప రసానుభూతినందిన గురుదేవులు రవీంద్రనాథ ఠాకూరు, మహాత్మగాంధి, రాఘవాచారి నటనాప్రతిభను, కళాపిపాసను వేనోళ్ళ కొనియాడి యుండిరి

మదరాసు సుగుణవిలాస సభవారు, చెన్నపురి ఆంధ్ర మహాసభవారు ప్రదర్శించిన సాంఘిక నాటకములలో కూడ పాల్గొని రాఘవాచారి ఆధునిక నాటక కళోపాసకుల ప్రశంసలను కూడ అందుకొనెను డాక్టరు ఎ వి రామన్నారు వ్రాసిన 'తప్పెవరిది?' పిఠాపురం రాజా లేఖినినుండి వెలువడ్డ 'ఆలోకమునుండి ఆహ్వానము' మొదలయిన నాటకములలోని పాత్రలను ధరించి వ్యావహారిక భాషోచ్చారణముతో కూడ ఆయన తన ప్రతిభను వెల్లడించెను 'సరిపడని సంగతులు' అన్న ఒక సాంఘిక నాటకమును అతడు స్వయముగా వ్రాసెను

బహుభాషాకోవిదుడయిన రాఘవాచారి కన్నడ నాటకములయందును విభిన్నపాత్రలను ధరించెడివాడు ముఖ్యముగా కన్నడనాటకము 'మందోదరి'లో అతని రావణ పాత్రాభినయము కళాభిజ్ఞుల ప్రశంసల నందుకొన్నది కబీరు పాత్రపోషణములో రాఘవాచారికి రాఘవాచారియే సాటి దానిని చూచిన మహాత్మాగాంధీ మంత్రముగ్ధుడయినాడనుటలో ఆశ్చర్యములేదు

విద్యార్థిక అందరిని చేరదీసి 'రాఘవాచారి ఆర్ట్ లవర్స

లీగ్' అను నొక నాటకసంస్థను స్థాపించెను దీని యాజమాన్యమున ఆయన ఆంధ్రదేశము నందలి పలుకేంద్రములలో 'చంద్రగుప్త', 'హరిశ్చంద్ర' మొదలయిన నాటకములను ప్రదర్శించెను నాటక రంగస్థలముమీద ఆయన సమయస్ఫూర్తి అసమానము ఒకసారి 'చంద్రగుప్త' నాటకములో చాణక్యుని పాత్రను ధరించి అతడు నల్లకాటి దృశ్యములో అటునిటు తిరుగుచుండగా ఎక్కడనుండియో ఒక శునకము రంగస్థలము మీదికి వచ్చెను. శునకమా - వచ్చితివా రమ్ము ఈ శ్మశాన వాటిక నాదేకాదు నీయదికూడాను' అనుచు ఆయన ఆ శునకమును దగ్గరకుతీసికొని ప్రదర్శనమునకు ఏమాత్రము అంతరాయము కలుగకుండ, సమయస్ఫూర్తి కనపరచుచు ప్రేక్షకుల కరతాళధ్వనులను స్వీకరించెను

1927లో రాఘవాచారి పాశ్చాత్య దేశములయందు పర్యటించెను 'ఒథెల్లో', 'షైలాక్ ది జ్యూ' మొదలయిన పాత్రలను అభినయించి ఆరోజులలో విఖ్యాత రంగస్థల నట, నటీమణులయిన సర్ జాన్ ఫోర్బ్స్, లేడీఫోర్బ్స్, రాబర్ట్ సన్ మొదలయినవారి ప్రశంసలను అందుకొనెను జార్జి బెర్నార్డుషా అతని 'ఒథెల్లో' పాత్రాభినయమును చూచి "ఇంతటి మహానటుని కనిన భారతదేశము ధన్యమైనది" అనెను

పాశ్చాత్యదేశ పర్యటనానంతరము రాఘవాచారి తన న్యాయవాదవృత్తికి క్రమక్రమముగా తిలోదకములిచ్చి తెలుగునాటక రంగాభ్యుదయమునకే తన జీవితమును అంకితమొనర్చెను వ్యాపార దృక్పథముతోగాక రాఘవాచారి కళాపిపాసతో ఎన్నియో నాటకములను ప్రదర్శించి, వాటి మూలమున వచ్చిన ఆదాయముతో బీదవిద్యార్థులకు, ప్రజాహిత సంస్థలకు తోడ్పడెను నాటకరంగస్థల నటనలో అత్యున్నతమైన ప్రమాణములను నెలకొల్పి, నటులకు రాఘవాచారి ఆదర్శప్రాయు డయ్యెను

నటనలో నిష్ణాతుడయిన రాఘవాచారిని తెలుగు చలన చిత్రరంగము కూడ ఆహ్వానించెను ఆయన 'ద్రౌపదీ మానసంరక్షణము,' 'రైతుబిడ్డ', 'చండిక' మొదలయిన చిత్రములలో రంగమున కనపడి అశేష సినిమాప్రేక్షకప్రజల హారకు లందుకొనెను. 'రైతుబిడ్డ'లో నరిసిరెడ్డిపాత్రను ఆయన అభినయించిన విధానము అద్వితీయమైనది

యంత్రమునకు దాసుడుకాలేక ఆ మహానటుడు సినిమారంగమును వదలి, విశృంఖల విహారము చేయుటకు అనువైన నాటకరంగస్థలమును తిరిగి ఆశ్రయించెను నాటక కళాలక్ష్మికి ఆయన చేసిన మహోన్నతసేవను గుర్తించి ఆంధ్ర నాటకకళాపరిషత్తు ఆయనకు 'నాటక కళాప్రపూర్ణ' అను బిరుదము నొసగెను ఆంధ్రవిశ్వవిద్యాలయముకూడ ఆయనను నిండుసభలో సముచితరీతిని సన్మానించెను

రాఘవాచారి గొప్ప సంఘసంస్కర్త కుల, మత విచక్షణలమీద అతడు తన చిన్నతనమునందే సమరమును ప్రకటించెను స్త్రీస్వాతంత్ర్యోద్యమమునకు రాఘవాచారి పట్టుకొమ్మ ఆతని నాటకబృందములో బ్రాహ్మణులతోపాటు హరిజనులు, పురుషులతోపాటు స్త్రీలు ఎటువంటి విచక్షణ లేక పాల్గొనుచుండిరి

రాఘవాచారి గొప్ప వేదాంతి సంగీతమునందు, సాహిత్యమునందు ప్రతిభావంతులయిన పండిత తారానాథ్ అనువారు రాఘవాచారికి ప్రత్యక్షగురుదేవులు రాజకీయ ఉద్యమములో పాల్గొని, నైజాం ప్రభుత్వముచే హైదరాబాద్ సంస్థానమునుండి వెడలగొట్టబడ్డ పండిత తారానాథ్, తుంగభద్రానదీతీరమందు కట్టుకొనిన 'ప్రేమాయతన' మను ఆశ్రమమునకు తరచు వెళ్ళుచు, గురువుగారి బోధామృతమును రాఘవాచారి మనసార గ్రోలుచుండెడివాడు తాను ప్రదర్శించిన నాటకములకు వచ్చిన డబ్బులో చాలభాగము రాఘవాచారి తమ గురువరేణ్యుల ఆశ్రమమునకే ఇచ్చివేసెను

ఆంతరంగికజీవితములో రాఘవాచారి నిరాడంబరుడు తనయింట భజనసమాజము నొకదాని నేర్పాటుచేసి, అతడు దానిలో హైందవ మహమ్మదీయ, క్రైస్తవులను సభ్యులనుగా తీసికొనెను వైష్ణవులందరు తనను వెలివేసినను సంఘమునకు ఎదురుతిరిగి, తన అంతరాత్మ ప్రబోధానుగుణముగ రాఘవాచారి హరిజనులను తనయింటిలో పనివారలుగ నియమించెను

జాతీయోద్యమమునందు తాను స్వయముగ పాల్గొనక పోయినను రాఘవాచారి అవసరముకల్గినప్పుడు దేశభక్తిని వెల్లడించుచుండెడివాడు 'రావుబహదూరు' బిరుదమును తనకిచ్చుచున్నటుల బ్రిటిష్‌ప్రభుత్వము ప్రకటించినప్పుడు రాఘవాచారిలోని జాతీయాభిమానము పెల్లుబికి, దానిని ఆయన నిరాకరించునటుల చేసినది

రాఘవాచారి స్ఫురద్రూపి అజానుబాహువు ఆయన

కన్నులలో తేజస్సు ఉట్టిపడుచుండెడిది పూర్ణపురుషుడయిన రాఘవాచారి అరువదియేండ్లకాలము జీవించి 1946 ఏప్రెల్ నెల 17 వ తేదీ చైత్రశుద్ధ పున్నమినాడు శివమంత్రమును ఏకాగ్రచిత్తతతో జపించుచు పరమేశ్వర సాన్నిధ్యమును జెందెను

ఇం వెం

## బసవేశ్వరుడు .

బసవేశ్వరుడు వీరశైవ మతోద్ధారకుడుగను, వీరశైవ కవిగను సుప్రసిద్ధుడు కర్ణాటకమునందు బాగేవాడియను నొక గ్రామమున మాదిరాజు అను నొక సద్విప్రు డుండెను అతడు సత్కర్మానుష్ఠానపరుడు అతని ధర్మపత్ని మాదాంబ మాదాంబ గర్భశుక్తి ముక్తాఫలమై బసవేశ్వరుడు క్రీ శ 12వ శతాబ్ది మధ్యభాగమున జన్మించెను అతడు విద్యాభ్యాస మొనర్చి 8 సంవత్సరముల ప్రాయముననే శైవపురాణ కథలన్నియు గ్రహించెను

ఆ కాలములో సమాజమునందుండిన వ్యవహారములు, అంధశ్రద్ధ మిథ్యాడంబరములు, అర్థహీనమైన కర్మానుష్ఠానములు మొదలగు దోషములను వీక్షించిన బసవనికి కర్మకాండపై జుగుప్స జనించెను అందుచేత నతడు ఉపనయనము నొల్లక తిరస్కరించి, జన్మస్థలము ను విడిచి, సద్గుర్వన్వేషణపరుడై బయలుదేరెను మలప్రభా కృష్ణానదుల సంగమ స్థానమునందున్న సంగమేశ్వరునిచే బసవేశ్వరుడు ఆకర్షింపబడెను బసవుడు సంగమేశ్వరుని శరణుజొచ్చెను

సంగమేశ్వరుని దర్శనమాత్రమున ఆ దేవునియందు బసవేశ్వరునకు అనన్యసాధారణమైన భక్తి ప్రాదుర్భవించెను అట్టి భక్తిచే పరవశుడై బసవేశ్వరుడు సంగమేశ్వరుని నానావిధముల స్తోత్రము చేయుచు నర్తించెడివాడు అన్నాహారాదులను వర్జించి కేవల తదేక ధ్యానపరుడై అహోరాత్రములు అఖండమైన తపస్సు నొనర్చెను

బసవుని తపస్సు పక్వమైనది అన్ని స్థలములందు, సకల చరాచర పదార్థములందు అతనికి పరమేశ్వరుని ఉపస్థితియే గోచరించెను అతడు భూతదయ నిరాడంబరత, నిష్కల్మషత మొదలైన సద్గుణముల కునికిపట్టై పరమ వినీతుడయ్యెను బసవేశ్వరుని నిశ్చలభక్తి సంగమేశ్వరు నాకర్షించెను సంగమేశ్వరుడు ప్రసన్నచిత్తుడై బసవేశ్వరుని ధ్యానసమాధ్యవస్థయందు గోచరించి "బసవా ! నీయొక్క భక్తిచే నేను నీవశవర్తినైతిని నీవు తపస్సును మానుకొని మంగళవాడ (కళ్యాణ) పట్టణమునకు వెడలుము బిజ్జల సామ్రాట్టు సభయందు నీ కీర్తిప్రతిష్ఠలు నా మహిమచే వెల్లడి కాగలవు" అని సానుగ్రహముగ పలికెను సంగమేశ్వరుని సానుగ్రహ వాక్యముల నాకర్ణించిన బసవేశ్వరునికి మనశ్శాంతి కలుగలేదు బసవనికి సంగమేశ్వరుని సాన్నిధ్యత్యాగమనిష్టమయ్యెను అచటనే ప్రసన్నుడై కాలక్షేప మొనర్చెను సంప్రీతుడైన సంగమేశ్వరుడు కలలో దర్శన మొసగి సర్వకాల సర్వావస్థలయందును నేను నీవెంట చరింతును నమ్ముము నా అనుగ్రహ కారణమున రేపు నీకు నందీశ్వరుడొక లింగ మొసగునని వచించెను

సంగమేశ్వరుని ఆ వాక్యములను విని బసవేశ్వరుడు ఆనందపూరితుడయ్యెను మరునాడు స్నానాదులను నిర్వర్తించుకొని, పరమేశ్వరుని దర్శనము చేసికొని నందికేశ్వరుని ముందు ధ్యానపరుడై కూర్చుండెను అట్టితరి నందికేశ్వరుడు ఒక లింగమును బసవేశ్వరుని హస్తమునందు న్యస్తముచేసి, పంచాక్షరీ మంత్రము నుపదేశించి, మస్తకముపై తన ముఖము పెట్టి దీవించి, అంతర్ధానము చెందెను బసవేశ్వరుడు భగవద్ధ్యానపరుడై సంగమేశ్వరుని ఆజ్ఞను శిరసావహించి, మంగళవాడ (కళ్యాణ) అను పత్తమున కేగెను

బిజ్జల చక్రవర్తి ఆస్థానమునందు బసవేశ్వరునికి ఆశ్రయము లభించెను ఆ సందర్భమునందొక విశేషము ఘటిల్లెను రాజాస్థానమునందు గణికులు రాజ్యసంబంధమైన ఆదాయ వ్యయ వివరములను అప్పగించు చుండిరి తీక్ష్ణదృష్టిగల బసవేశ్వరుడు ఆ లెక్కలలోనున్న పొరపాటును కనుగొని, భండారి సిద్ధదండాధీశునకు చెప్పెను బసవేశ్వరుని యొక్క గణితశాస్త్ర ప్రావీణ్యమునకు సిద్ధదండాధీశు డచ్చెరువొందెను అతడు బిజ్జల రాజునకు బసవేశ్వరుని విద్యాకౌశలమును, బుద్ధివైశద్యమును గూర్చి చెప్పెను బిజ్జలుడు బసవేశ్వరునకు తన ఆస్థానమునందు ఆశ్రయమిచ్చెను బిజ్జలుడు తన చెల్లెలగు నీలలోచనను బసవనికిచ్చి పెండ్లి చేసెను కాలక్రమమున బసవేశ్వరుడే భండారమునకు ముఖ్యాధికారియై 'భండారి బసవ' అను ఖ్యాతినొందెను బసవుడు కోశమునకు భండారి అగుటయేకాక 'భక్తిభండారియై'కూడ వరలెను బసవేశ్వరుడు గంగాదేవి మాయిదేవి యను నిద్దరు భార్యలతో నిరీహుడై సంసారయాత్రను కొనసాగించెను

బిజ్జలుని రాజధానియందు బసవేశ్వరుడు గడపిన కాలము అతని జీవిత కాలమునందు 'స్వర్ణయుగము' ఆ కాలమునందు బసవేశ్వరుడు స్పృశించినదెల్ల స్వర్ణమయ్యెను పలికినదెల్ల సిద్ధవచన మయ్యెను

బసవేశ్వరుడు గొప్ప భక్తుడు మహిమాన్వితుడు బసవేశ్వరుని జీవన నైర్మల్యము, అకుటిలానుష్ఠానము, నిష్కల్మష భక్తి, హృదయ వైశాల్యము, సమదృష్టి, శివభక్త కైంకర్యము, ఆత్మపరీక్ష, అహంకారాభావము మొదలగు సద్గుణములు పలు తావులనుండి శివభక్తులను, కళ్యాణ పట్టణమునకు ఆకర్షించెను

కర్ణాటక సీమనుదాటి వీరశైవ మతము ఆంధ్రదేశమునందు వ్యాపించెను శివభక్తులు జాతి, వర్ణ, వివక్ష లేక తండోపతండముగ ఏతెంచి బసవేశ్వరుని వలన సత్కారములను, భక్తిగౌరవ పురస్సరముగ పొందుచుండిరి ఎంత నిమ్న వర్గమునకు చెందిన వారైనను శివభక్తులు బసవేశ్వరునికి వంద్యులును, అనుకరణీయులునైరి ఎంత ఉన్నత వర్గమునకు చెందినవారైనను నికృష్టాచారు లాతనికి త్యాజ్యులైరి కులముగాని, వృత్తిగాని శివభక్తికి అడ్డము రాకూడదని బసవేశ్వరుడు చాటించెను

ఇతరుల సమున్నతిని సహింపకుండుట మానవులకు సహజము బసవేశ్వరుడు తన మతప్రచారమునకు రాజ్యకోశాగారమునుండి ద్రవ్యమును అత్యధికముగ వ్యయించుచున్నాడు అది స్వార్థప్రతిష్ఠాపనము కొరకు చేయబడుచున్న ఉపాయము అతనిది కేవలము వ్యాజభక్తియని అతని ఉత్కర్షమును సహింపని స్వార్థపరులు—కొందరు బిజ్జలునకు అతనిపై కొండెములు చెప్పదొడగిరి ఒకప్పుడు రాజు, భాండాగారమును పరీక్షించెను కాని ధనములో వెలితి లేకుండెను చాడీకోరులకు ముఖభంగమయ్యెను

ఒకనాడు బసవేశ్వరుని మహిమవలన అతనిని వంచింప వచ్చిన దొంగజంగముల మెడలోని వంగకాయ లన్నియు లింగకాయ లయ్యెను ఒకానొక సమయమున కొందరు దొంగలు శివభక్తుల వేషమును ధరించి ఏతెంచి గోవుల నపహరించి వెళ్ళిరి ఈ సమాచారము నెరిగి బసవేశ్వరుడు ఎట్టి చింతపడక "సంగమేశ్వరుడు ఇచ్చును అతడే పుచ్చుకొనును దుఃఖమేల?" అని దూడలను కొనిపోయి గోవులదగ్గర విడిచి రాదగునని సేవకుల నాజ్ఞాపించెను దీనిచే బసవనికి జంగమ దేవరల యందలి అవ్యాజభక్తియు, నిరీహయు గోచరించును

బసవేశ్వరుని జీవనము యొక్క అంత్యఘట్టము వివాదాస్పదము కల్యాణ పట్టణమునందు జాతి సాంకర్యావాదము వలన ప్రజలలో కోలాహలము తాండవమాడెను బిజ్జల రాజునకు ప్రాణాపాయము కలిగెను అందు బసవేశ్వరుని హస్తము కలదని తెలియుచున్నది బసవేశ్వరుడు కళ్యాణమును వదలి కూడలి సంగమేశ్వరునియందు ఐక్యమునొందెను బసవుడు వృషభదేవుని అవతారమని ప్రతీతి

కన్నడమునందు బసవేశ్వరుని జీవిత చరిత్రమును చిత్రించిన గ్రంథము లనేకములు కలవు హరిహరదేవ విరచితమగు "బసవరాజ దేవరగళె" వాటిలో అత్యంత ప్రాచీనము ఇది అసమగ్ర గ్రంథము తెలుగు భాషయందు పాల్కురికి సోమనాథుడు రచించిన బసవపురాణము ఆధారముగ కన్నడమున భీమకవి బసవపురాణము వ్రాసెను సింగరాజుమల బసవరాజ చారిత్రము, షడక్షరి బసవరాజవిజయము—బసవని చరిత్రమును వివరించు ఇతర గ్రంథములు

బసవేశ్వరుడు కన్నడ సారస్వతమునకు శాశ్వత సేవ నొనర్చెను అతని షట్స్థలవచనములు, కాలజ్ఞాన వచనములు మంత్రగోప్య వచనములు, వీరశైవ సిద్ధాంతమును ప్రతిపాదించు ప్రసిద్ధగ్రంథములు ఇవి కూడలిసంగమ దేవనామాంకితములు కన్నడ వచనము బసవేశ్వరుని చేతులలో పరిణతి నొందెను వీరశైవ మత సిద్ధాంతములను ఆ కాలమున జనులకు సులభముగ దెలియు భాషలో బోధించిన ఖ్యాతి బసవేశ్వరునకు దక్కినది

బసవేశ్వరుడు గొప్ప సమాజ సంస్కర్తగా పేరొందినవాడు లింగవంతులందరు ఒక కుటుంబమని బసవేశ్వరు డుద్ఘోషించెను సమాజమునందు స్త్రీలకు సమానమైన స్థానము గలదని చాటించెను లింగవంతులు నిత్యశుద్ధులు కావున ఏవిధమైన అశౌచము వారిని అంటజాలదు లింగధారులైన శివభక్తులయందు భేదభావము ఉండకూడదు జంగముడు సాక్షాచ్ఛివస్వరూపి, కాయకష్ట మత్యావశ్యకము అని అతడు విశ్వసించెను

ఈవిధముగా బసవేశ్వరుడు ధర్మప్రవర్తకుడుగా, సమాజ సంస్కర్తగా, కన్నడ సాహిత్యమున నవీనమార్గ ప్రవర్తకుడుగా విఖ్యాతుడైన మహాపురుషుడు

డి కె భీ రా

## బహుజనపల్లి సీతారామాచార్యులు

బహుజనపల్లి సీతారామాచార్యులు ఉద్దండపండితుడు ఆంధ్రవైయాకరణి, నిఘంటురచయిత ఈతని జన్మస్థలము తమిళప్రాంతమందలి నాగపట్టణము ఇతడు 1827 వ సం॥ర ములో జనన మందెను చిన్నతనమున తండ్రివద్దనే ఇతడు విద్యాభ్యాస మొనర్చెను బాల్యముననే ఇతనికి కొంత కవితాధోరణి అలవడెను నాగపట్టణమునగల క్షేత్రస్వామి నధికరించి ఈయన సుందరరాజస్వామి శతకమును చాతుర్య మేర్పడ రచించెను 1849 లో ఇతడు చెన్నపురిని చేరెను చెన్నపురియే ఇతని సాహిత్యవ్యాసంగమునకు ప్రధానరంగ మయ్యెను అచటి రాజధానీ కళాశాలలో పండిత పదవుల నలంకరించిన చిన్నయసూరివద్దను, పురాణము హయగ్రీవ శాస్త్రియొద్దను శుశ్రూషించి ఇతడు గొప్పపండితు డయ్యెను

సీతారామాచార్యులు చెన్నపట్టణమునందలి బోధనాభ్యసన పాఠశాలయందు ఆంధ్రపండితుడుగ పనిచేసెను ఈ పండితుడు శబ్దరత్నాకరము, ప్రౌఢవ్యాకరణము అను రెండు గ్రంథములను రచించెను ఇవి వీరి దీర్ఘకాలిక కృషిఫలిత ములు, వీరిప్రతిష్ఠకు ప్రధానావలంబనములు, ఆంధ్రభాషా యోషకు అమూల్యాలంకరణములు ఈ రెండుగ్రంథము లలో కాలక్రమముచేతను ప్రామాణ్యముచేతను, పరిమాణము చేతను, శబ్దరత్నాకరము మొదటిదిగా చెన్నదగియున్నది ఆంధ్రభాషాపండితుల మన్ననలను పొందిన నిఘంటువులలో శబ్దరత్నాకరము మొదటిది సీతారామాచార్యులు ఇరువది యైదు సంవత్సరములు పరిశ్రమించి ఈ గ్రంథమును సమ కూర్చెనట ఇంతకుముందు పరవస్తు చిన్నయసూరి అకారా దిగా ఒక నిఘంటు నిర్మాణమునకు పూనుకొనియుండెను కాని అది బృహద్గ్రంథమై సామాన్యుల కందుబాటులో నుండ దనుభావముచే, సీతారామాచార్యులీ శబ్దరత్నాకరమును కూర్చుటకు ప్రారంభించెను కాని ఇతనికి ఆంధ్రసాహిత్య ముపై గల అధికారముచేనేమి, స్వభావసిద్ధమయిన సాహిత్య పరిశోధనశక్తిచేనేమి, ఈ గ్రంథముకూడ చాల విస్తృత మయ్యెను

తెలుగునందలి తత్సమ, తద్భవ, దేశ్య, గ్రామ్యపదము లను అకారాదిగా కూర్చి వాటి యర్థవివరణముచేసిన మొదటి నిఘంటు విది ఈ శబ్దరత్నాకరమందలి ఈ పద్ధతిని తరువాతి నైఘంటికులు తరచుగా అనుసరించుచు వచ్చిరి ఒక పదమును గ్రహించి దాని యర్థమును వ్రాయుటతో తృప్తిచెందక, ఆ పదమునకు వ్యుత్పత్తులను, ప్రకృతి వికృతు లను చెప్పుట ఈతని పద్ధతి ఇదియేకాక, బహుగ్రంథములను పరిశీలించి ఆపదమునకు గల ప్రామాణిక కవిప్రయోగరూప మున చాలవరకు పద్యపాదములను, కొన్ని సందర్భములందు వచనభాగములను ఈ నిఘంటుకారుడు ఇందు పొందుపరచి యున్నాడు ఇది ఈ పండితుని బహుగ్రంథపరిశీలన ఫలము

ఈ శబ్దరత్నాకరరచనసందర్భమున, లేఖకులుగా రామానుజులునాయుడు, అనంతాచార్యులు అను ఇద్దరు పండితులు సీతారామాచార్యులకు సాయము చేసినట్లు తెలియ వచ్చుచున్నది ఈ గ్రంథమును చెన్నపట్టణమునందలి దేశ భాషాగ్రంథకరణసభ అను క్రైస్తవమిషనరీ సంఘము క్రీ శ 1885 వ సం లో ప్రప్రథమముగా ముద్రింపించెను గ్రంథ కర్త యగు సీతారామాచార్యులను ఈ సభవారు ఐదువేల రూప్యములతో సన్మానించిరి తరువాత ఈ గ్రంథము 1912, 1922, 1929, 1937 సంవత్సరములలో మరల మరల ముద్రిత మైనది 1958 లో దీనిని 'విద్యారత్న' బిరుదాంకితులు నిడుదవోలు వెంకట్రావుగారు పరిశీలించి, ఇందు అనుబంధము లను చేర్చిరి వీరు ముద్రణాదిదోషములను సవరించుటయే కాక, కొన్నిటికి సవరణలను, వివరణములను చేర్చిరి

ఆంధ్రభాషయందు పరవస్తు చిన్నయసూరి బాల వ్యాకరణమును రచించెను ఈ గ్రంథము గొప్ప ప్రచార మును పొందినది విద్యార్థులును, పండితులును దీనిని సమాన ముగా ఆదరించిరి చిన్నయసూరి బాలవ్యాకరణమును సమగ్రముచేయదలచి సీతారామాచార్యులు 'త్రిలింగ లక్షణ విశేష'మను ప్రౌఢవ్యాకరణమును రచించి దానినిగూర్చి ఇట్లు వ్రాసిరి భారతాది గ్రంథపరిశోధనంబుచే దొరకిన విశేషలక్షణ ప్రయోగముల నేర్చి కూర్చి 'త్రిలిఙ్గ లక్షణ శేషం' బను నొక యపూర్వ వ్యాకరణమును వ్రాసి తిని " ఈ ప్రౌఢవ్యాకరణము విజయనగర ప్రభువు 'మీర్జా శ్రీ విజయానంద గజపతి మహారాజునకు అంకితమై వారి ధనసహాయ్యముచేతనే 1885 వ సంవత్సరమున ముద్రిత మైనదని తెలియుచున్నది.

వైకృతదీపిక, పదార్థనామకోశము, బాలచంద్రోద యము, లఘుకౌముది, నీతిమాల, పతీధర్మసంగ్రహము, ప్రసన్నపారిజాతము, ఆంధ్రశబ్దమంజరి, ఉపాధ్యాయబోధిని,

విభాషాయశశతకము అను గ్రంథములనుకూడ ఆచార్యులు రచించెను ఈ గ్రంథరచనా వ్యాసంగమంతయు ఈ పండితుడు 1864 నుండి ప్రభుత్వ బోధనాభ్యసన పాఠశాలలో పండితపదవియం దుండిన కాలములోనే జరిగినది ప్రతిగ్రంథమును ఇతడు చక్కని ప్రయోజన దృష్టితో రచించెను ఆచార్యులు బహుభాషావేత్త ద్రవిడ, సంస్కృత, హూణ భాష లితనికి కరతలామలకములై యుండెను భాషాశాస్త్రమునకూడ ఈయన కృషిచేసి యుండెను ఆంధ్రభాషాసాహిత్యమునం దితడు ప్రముఖస్థాన మాక్రమించెను ఇతడు క్రీ శ 1891 వ సం.లో స్వర్గస్థు డయ్యెను

ఎమ్ కు రా.

## బాడ్మింటన్ :

బాడ్మింటన్ అను ఆటయొక్క పుట్టుక స్థలము దక్షిణ భారత దేశములోని తంజావూరు నగరమని తెలియుచున్నది విదేశములలో విశేషముగా 'షటిల్ బాడ్మింటన్' అను ఆట మాత్రమే ప్రచారమునం దున్నది కాని భారత దేశములో ఇదియు బాడ్మింటను అను ఈ రెండు ఆటలును బహుళ ప్రచారమునం దున్నవి బాడ్మింటన్ ఆటలో ఉలు బంతియు, షటిల్ బాడ్మింటను ఆటలో తురాయి (ఈకెల) బంతియు ఉపయోగింప బడును ఆంధ్రదేశమందలి బాడ్మింటన్ ఆటగాండ్రలో కొందరు దక్షిణ భారతమంతటిలోను, ఛాంపియనులుగా పేరుబడసిన దినములు గలవు

ఈ ఆటను ఒక్కొక్క పక్షమున ఒక్కొక్కరుగా, ఇద్దరిద్దరుగా, ఐయిదుగురుగా – అనగా సింగిల్స్, డబుల్స్, ఫైవ్స్‌గా గూడ ఆడెదరు ఈ యాటయందు ఆటగాండ్రు ఉలుబంతిని కొయ్యతోను, సన్నని నరములతోను తయారు చేయబడిన 'బ్యాట్'తో ప్రతిపక్షమున పాల్గొను ఆటగాండ్రమీద పరస్పరముగా ప్రయోగింతురు ఉలుబంతి బరువు 1½ తులము లుండును గేములో 29 పాయింట్లు కోర్టు (ఆట స్థలము)నకు నడుమ పార్శ్వపు హద్దు గీతలకు వెలుపల మూడడుగుల దూరములో రెండు స్తంభములు పాతబడును రెండింటిని కలుపుచు అడ్డముగా నొక వల కట్టబడును ఆ వల పై భాగపు ఎత్తు భూమిమీదినుండి ఆరడుగు లుండును టెన్నిస్ ఆటయందువలె కాక, ఈ క్రీడలో బంతిని నేలపై పడనీయకుండ ఆడవలెను సమఉజ్జీలు ఆడునపుడు ఈ ఆట చాల ఆకర్షకముగ నుండును, ఇది ఎక్కువ వ్యయముతో కూడిన ఆట కాకుండుటవలనను, ఒకే పర్యాయము పదిమంది ఆడుటకు వీలుకలది అగుటవలనను దక్షిణభారత దేశమునందు గ్రామములలో సహితము ఈ ఆట విరివిగా ఆడబడు చున్నది

కొ న రా

## బాణుడు :

బాణుడు సంస్కృత వాఙ్మయాగ్రమున నొక ప్రభాతరలజ్యోతియై వెల్గిన కవి అతనికి బాణభట్టు, భట్టబాణుడు అను నామములును కలవు భట్టశబ్ద మాతని గొప్ప పాండిత్య స్ఫోరకమై యుండును

హర్షచరితము, కాదంబరి, బాణకవి ప్రణీత గద్య గ్రంథములు ఇవి బాణుని కీర్తిసౌధమునకు మూలస్తంభములు చండీశతకము, శివశతకము ఈ కవికృత పద్య కావ్యములని తెలియుచున్నది సంస్కృత కవులకు స్వీయ కావ్యములలో ఆత్మకథాంశములను నిక్షేపించు అలవాటు లేదు బాణుడీ యాచారమున కపవాదము, హర్షచరితమునందలి ప్రథమ, ద్వితీయోచ్ఛ్వాసములందును కొలదిగ తృతీయోచ్ఛ్వాసమునందును కాదంబరిలో ఆద్యమంగళ శ్లోకములలోను, కవి తన వృత్తాంతమును వివరించి యున్నాడు

బాణభట్టు వాత్స్యాయనవంశమున జన్మించిన బ్రాహ్మణ ప్రవరుడు తండ్రి చిత్రభానుడు వేదశాస్త్ర నిష్ణాతుడు తల్లి రాజదేవి అత్యంత పవిత్రచరితాలంకృత. తాత కుబేరాఖ్యుడు జగద్విదిత విద్వాంసుడు ఆ మహాపండితుని ఆస్యము నిరంతర వేదపఠన – సోమరసపాన – పురోడాశభక్షణములచే ప్రపూతమైనదని చెప్పబడినది

ప్రీతికూటము బాణుని నివాసస్థానము శోణానదీతీరస్థము తల్లి అతని బాల్యమందే పరలోకగత యయ్యెను తండ్రి అతని నల్లారుముద్దుగ పెంచెను యథాకాలమున తండ్రి అతని కుపనయనాది సంస్కారముల నిర్వర్తించెను బాణుడు సాంగవేదమును వ్యాకరణాది శాస్త్రములను అధ్యయన మొనర్చెను జనకుడు స్వర్గలోక మలంకరించిన పిదప బాణకవి కొంతకాలము ప్రీతికూటముననే నివసించెను కాని పెద్ద లెవ్వరు లేమి స్వేచ్ఛాధీనుడై వివిధ వృత్తుల నాశ్రయించిన స్నేహితులతో దేశాటన మొనర్చెను లోకజ్ఞానము నార్జించుకొనెను తన జన్మస్థలమున కేగెను కాన్యకుబ్జరాజయిన హర్షవర్ధనుని ఆస్థానపండితులలో నగ్రగణ్యుడై అతనిచే బహువిధముల సత్కృతు డయ్యెను హర్షవర్ధనుడు ఉత్తర

దేశమున కాన్యకుబ్జమును రాజధానిగ జేసికొని క్రీ శ 606-645 సంవత్సరముల మధ్యకాలమున రాజ్యమొనర్చెను ఆ చక్రవర్తి సమకాలికుడైన బాణభట్టును ఆ కాలమున నున్నవాడని తెలియుచున్నది

**హర్షచరితకథాసంగ్రహము** శ్రీకంఠ దేశమున, స్థాణ్వీశ్వర పురమున, పుష్యభూతియను రాజుండెను ఆతని వంశ్యుడు ప్రభాకర వర్ధనుడు ప్రభాకర వర్ధనునకు రాజ్యవర్ధనుడు, హర్షవర్ధనుడను నిరువురు పుత్రులును, రాజ్యశ్రీయను నొక పుత్రికయు జన్మించిరి రాజ్యశ్రీ మౌఖరి రాజగు గ్రహవర్మను వివాహమాడెను

ప్రభాకరవర్ధనుడు మరణించెను ఆతని జ్యేష్ఠపుత్రుడు రాజ్యవర్ధనుడు తండ్రి సింహాసనము నధిరోహింప నిరాకరించెను అతడు తన తమ్ముడగు హర్షవర్ధనుని రాజ్యాభిషిక్తు నొనర్ప యత్నించుటకుమున్నే, మాళవరాజు గ్రహవర్మను జంపి రాజ్యశ్రీని తన ముఖ్యపట్టణమున చెరసాలయం దుంచెను ఈవార్త చెవిసోకినంతనే రాజ్యవర్ధనుడు తన సేనలను మాళవరాజుపై నడపెను కాని గౌడరాజుచట నొనర్చిన కుట్రమూలమున రాజ్యవర్ధనుడు నిహతుడయ్యెను

అట్టి విపత్తుదే కలిగిన హర్షవర్ధనుడు సేనతో మాళవాధీశునిపై పగదీర్చుకొన సత్వరమేగెను ఇంతలో రాజ్యశ్రీ చెరసాలనుండి విముక్తయై, చితాగ్ని నధిరోహింప యత్నించెను కాని యొక బౌద్ధభిక్షు వామెను ఆ యుద్యమము నుండి వారించి సురక్షిత నొనర్చెను మార్గములో ఈ వార్త హర్షవర్ధనునకు దెలిసెను అంత అతడు సోదరి రాజ్యశ్రీ నన్వేషింప నేగెను హర్షుని యొక్కయు రాజ్యశ్రీ యొక్కయు సమావేశము ఘటిల్లిన సందర్భమున కథ ముగిసెను కారణమనూహ్యము

హర్షచరితము సంస్కృత సాహిత్యమునందలి సుప్రసిద్ధ చరిత్రాత్మకగద్యకావ్యములలో నొకటి ఇది ఎనిమిది ఉచ్ఛ్వాసములతో నలరారుచున్నది మంగళశ్లోకములలో, బాణుడు పార్వతీపరమేశ్వరులను స్తుతించెను వ్యాసుని, భట్టార హరిచంద్రుని, సాతవాహనుని, ప్రవరసేనుని, భాస కాళిదాసులను పేర్కొనెను

**వర్ణనములు** హర్షచరితమునందలి ముఖ్య వర్ణనములలో రాజద్వారమును, హర్షుని జన్మమును తద్వైభవమును, రాజ్యశ్రీ వివాహవైభవమును, సరస్వతీదధీచుల సమావేశమును, భైరవాచార్యుని శైవగురుత్వమును, తదితరములను బాణమహాకవి సరసముగ వర్ణించెను

**చారిత్రకాంశములు** హర్షచరిత్రము 7వ శతాబ్ది యందలి చారిత్రకాంశములకు మణిదర్పణము మాలవ, కాన్యకుబ్జ సింధు, కళింగ, ప్రాగ్జ్యోతిష ప్రభృతి, ఆనాటి రాజ్యనామములు పేర్కొనబడినవి సైనిక సంఘటనలు, సేనానివేశములు, విజయవృత్తాంతములు, ప్రత్యక్షముగ వర్ణింప బడినవి హర్షుడు మహావిజేతగా ప్రశంసింప బడెను అతడు సింధురాజును జయించెను, దుర్గమమైన హిమశైల ప్రాంతమున నున్న పలికవలన కప్పమును గైకొనెను మాల్వరాజ కుమారులలో జ్యేష్ఠుడగు కుమారగుప్తు నభిషిక్తు నొనర్చెను మాధవగుప్తునిపై హర్షచక్రవర్తి చూపిన అనుగ్రహ మపారము జైత్రయాత్రా సన్నద్ధుడైన హర్షునితో ప్రాగ్జ్యోతిషాధీశుడగు భాస్కరవర్మ మైత్రి నొనర్చుకొనెను ఇట్లు పెక్కులు చారిత్రకాంశములు ఇందు పొందుపరచ బడినవి హర్షచక్రవర్తి మహత్త్వమును సమగ్రముగ వర్ణింప, తన కలవియైనపని కాదని కవీశుడు సవినయముగ జెప్పకొనెను

**సాంఘికాది పరిస్థితులు** హర్షచరితమునం దానాటి సాంఘికాది పరిస్థితులు ప్రతిబింబించుచున్నవి పౌరాణిక ప్రవరులుండిరి వారియెడ జనులాదరాభిమానములను జూపుచుండిరి మహాభారతము సర్వజనప్రీతిపాత్రమై వరలెను సుదృష్టి బాణునకు వాయుపురాణమును శ్రుతపరచెను బాణుడు రాజదర్శనమున కేగునపుడును, హర్షుడు జైత్రయాత్ర కేగునపుడును, విఘ్నపరిహారకములును, జయసంపాదకములు నగు మంగళక్రియాకలాపముల ననుష్ఠించిరి

తమ స్థితికి భంగము వాటిల్లని విధమున బ్రాహ్మణులితరవర్ణస్థులతో కలిసిమెలిసి అత్యంత స్నేహ సౌమనస్యములతో మెలగుచుండిరి బాణుని స్నేహితులలో పెక్కు వర్ణములవా రుండిరి

ఆనాటి రాజకుమారులు సకలవిద్యా ప్రవీణులై యుండిరి వారు పద-వాక్య-ప్రమాణ-ధర్మ-ఇతిహాసాదుల యందు నిష్ణాతులై యుండిరి వారు రాజనీతియందును వ్యాయామమందును - చాప - చక్ర - కృపాణ ప్రభృతి సర్వాయుధ విద్యావిశేషములయందును ఆరితేరినవారుగ నుండిరి రథ - గజ - తురంగారోహణమునందును, వీణా వేణుముఖ

వాద్యములందును, నృత్తశాస్త్ర - గాంధర్వవేద - చిత్రకర్మ-రత్నపరీక్షా - వాస్తువిద్యా - ఆయుర్వేద - కావ్య నాటకాదుల యందును, వారు పండితులుగా నుండిరి

ఆనాడు వైదిక-బౌద్ధ-జైనమతములకు ప్రాధాన్య ముండెను ఉత్తర భారతమున జైనుల కాదరము తక్కువగ లభించు చుండెను నగ్నజైనుడు ఎదురగుట అపశకునముగ భావింప బడుచుండెను వైదికబౌద్ధమతములు పరస్పర సంఘర్షణము లేక ప్రవర్ధమానము లగుచుండెను దివాకర మిత్రుడు బౌద్ధుడుగ మారెను ఆతనిని పెక్కురు భిన్నమత స్థులు శుశ్రూషించిరి శైవులు, భాగవతులు, జైనులు పౌరాణికులు, మీమాంసకులు ఆతని శిష్యులలో నుండిరి తన సోదరి రాజ్యశ్రీ తనతోపాటు బౌద్ధుల కాషాయవస్త్రముల ధరింపగలదని హర్షుడనెను భైరవాచార్యుడు శైవగురువుగ ప్రసిద్ధుడు హర్షుని పూర్వులు పరమ శివభక్తులై వరలిరి పుష్పభూతి మహా శివభక్తుడు ప్రభాకరవర్ధనుడు ప్రత్యహము సూర్యుని పుష్పములతో నారాధించు చుండెను హర్షుడు స్వయముగ గొప్ప శివభక్తుడు అతడు శివునారాధించి జైత్రయాత్రా సన్నద్ధుడయ్యెను ఆతని ముద్రపై నంది విగ్రహముండెను ప్రభాకరవర్ధనుడు పెక్కు యాగము లొనర్చెను

హర్షచరితముపై రంగనాథుడు రుచకుడు మున్నగు వారు వ్యాఖ్యానములను వెలయించిరి

కాదంబరి ఇది సారస్వత కళాఖండముగ హర్షచరిత్రముకంటె మిన్నయైనది ఇందలి కథ బృహత్కథాగతము దీనికి బాణుడు మెరుగుపెట్టెను ఇందు పూర్వభాగమనియు, ఉత్తరభాగమనియు రెండు భాగములు కలవు పూర్వభాగము బాణకవి విరచితము ఉత్తరభాగము బాణుని కుమారుడు భూషణభట్టు రచించినది అతడును తండ్రివలె తద్రచనమున భావ, భాషావాల్లభ్యమును ప్రదర్శించెను

కాదంబరి సంశ్లిష్ట రచనా విరాజితమయిన యొక దీర్ఘ కథ ఇది వైశంపాయనుడను శుకముచే శూద్రకుడను రాజునకు చెప్పబడెను ప్రస్తావనా శ్లోకములలో బాణభట్టు త్రయీమయుడును త్రిగుణాత్మకుడునునగు త్ర్యంబకుని స్తుతించెను దుర్జన నిందయు, సుజనస్తుతియు గావింపబడినవి కథాప్రశంసను కొలదిగ తన వాత్స్యాయనవంశప్రశంసను బాణు డొనర్చెను

కథాసంగ్రహము : గంధర్వరాజసుతయగు కాదంబరికిని, ఉజ్జయిన్యధిపుడగు చంద్రాపీడునకును, మధ్య ప్రవర్తిల్లిన ప్రేమప్రవృత్తితో, కాదంబరీ స్నేహితురాలగు మహాశ్వేతకును పుండరీకుడను నొక ఋషికుమారునకును మధ్య ఘటిల్లిన ప్రేమకథను జోడించి, కాదంబరియందు బాణుడు వర్ణించెను ఈ నాయికల వివాహములు నాయకుల హఠాన్మరణములచే ఆగిపోయెను ఆకాశవాణియొక్క అభయ వచనమును విశ్వసించి, నాయికలు కాలయాపన మొనర్చిరి శుకము కథను ముగించి ఎగిరిపోయెను

శుకమును గొనివచ్చిన స్త్రీ శుకవృత్తాంతమును శూద్రకుని పూర్వజన్మ వృత్తాంతమును ఆతనికి దెల్పెను నాయికా నాయకుల వివాహ విషయమున గల శాపములు తీరుటతో, చంద్రాపీడ పుండరీకులు పునర్జీవితులైరి ఉజ్జయినిలో నాయికలు తమ నాయకులతో గలిసి సుఖస్థితిలో జీవింప దొడగిరి

విరహపీడితయగు కాదంబరి మాటలు, పత్రలేఖ వచ్చి, చంద్రాపీడునకు ప్రకటపరచుట కుద్యమించుటతో, ఉత్తర భాగ మారబ్ధమైనది

ఈ కావ్యమందు కాదంబరీ చంద్రాపీడులకథ ప్రధానమైనది అయినను పెక్కు అవాంతరకథ లిందు చేర్చబడినవి బాణుని కథాకథనవిధానము మిక్కిలి ఆకర్షకము అందుచేతనే "కాదంబరీరసజ్ఞానామాహారోఽపి న రోచతే" (మద్యాసక్తులకు ఆహారము కనరానట్లు, కాదంబరీ కథావర్ణన శ్రవణాసక్తులకు ఆహారముగూడ రుచింపదు )

ఇందు చంద్రచందనాదు లుద్దీపనవిభావములు నాయికానాయకుల చతురాదిక్రియలు అనుభావములు నిర్వేదాదులు వ్యభిచారిభావములు రతి స్థాయిభావము ఇందు శృంగారము ప్రధానరసము తక్కినరసములప్రధానములుగ వర్ణితములు

ప్రధాన వర్ణనాంశములు మాతంగకుమారిని, వింధ్యాటవిని శబరసైన్యకోలాహలమును, ఉజ్జయినీపట్టణమును అచ్ఛోదసరోవరమును, సిద్ధాయతనమును సూతికాగృహమును కాదంబరీమహాశ్వేతలను, శాల్మలీ తరువును, ప్రభాతచంద్రోదయములను బాణుడు అద్భుతముగ వర్ణించెను శుకవైశంపాయనుని కథాప్రారంభము, శుకనాసుడు చంద్రాపీడున కొనర్చిన ఉపదేశము గంధర్వ ముఖ్యపట్టణమున ప్రవర్తిల్లిన కాదంబరీ చంద్రాపీడుల ప్రేమకలాపము మహా

శ్వేతాపుండరీకుల ప్రేమవృత్తాంతము, తద్వియోగము, తద్విరహము, తత్పునస్సమాగమము, ఇత్యాది వర్ణనము లత్యంత మనోహరములును, చిరస్మరణీయములునై యున్నవి వాణిని బాణరూపమున నవతరించెనని గోవర్ధను డనెను

బాణుని విషయవర్ణనము సమగ్రము "బాచిత్కవీనాం న వా దృష్టిః" అనునట్లు బాణుడు తన నిశితదృష్టి నేకపర్యాయము ప్రసరింపజేసి ద్యావాభూముల మధ్యగతమయిన సమస్త వస్తువులను దర్శించి, తత్తత్త్వమెరిగి, తద్రహస్యములను సమర్థపదములచే, సముచితాలంకారములచే, ఉదాత్తభావములచే, శైలీవైవిధ్యముచే, సరసముగ వర్ణింపగల దిట్ట ఇంద్రాయుధమను అశ్వమును వర్ణించుసందర్భమున బాణుడు ప్రదర్శించిన కౌశలమునుబట్టి ఆతనికి 'తురంగబాణుడ'ను ప్రతీతి లబ్ధమయ్యెనందురు జాబాల్యాశ్రమపావిత్ర్యమును హింసారహితత్వమును మహాత్వమును మహాకవి సరసముగ వర్ణించెను నూతనశాద్వలమువలెనున్న శిఖికలాపముక్రింద సర్పము నివసించుచున్నది కురంగశిశువు, తల్లిని విడిచి, కేసరములు మొలిచిన సింగపుకొదమల పరిచయమును పొంది, స్రవించుచున్న ఆడుసింహపు పొదుగునుండి పాలను త్రావుచున్నది ఏనుగులు మదించియున్నను, గండస్థలములందలి మదజలములు క్రోలుచు నిశ్చలములైయున్న తుమ్మెదల యందు దయకలిగి వాటిని తమ చేటచెవులతో నివారింపకున్నవి అనరీతిగా విరోధిసత్వములయొక్క పూర్వమత్సర త్యాగము, స్నేహము వర్ణింపబడినవి

బాణుని సూక్తులు మధురసార్ద్రమంజరులవగిది ఈ మహాకవిసూక్తిమంజరులు, సర్వపాఠక ప్రకరమునకు ప్రీతిపాత్రములు

ఉదా "కిమివహి దుష్కరమకరుణానాం" (కా పూ భా) (కరుణావిహీనులకు దుష్కర మేదికలదు)

"నాస్తిజీవితాదన్యదభిమతమిహ జగతి హి సర్వజంతూనాం" (కా పూ భా) (సర్వప్రాణులకును జీవితముకంటె అభిమతతరమైన వస్తువు లేదు) "ప్రాయేణ అకారణమిత్రాణి అతికరుణార్ద్రాణిచ సదా ఖలు భవంతి సతాం చేతాం సి (కా పూ భా) (సత్పురుషుల చిత్తములు అకారణమిత్రములును దయార్ద్రములు నగుచున్నవి) "జగతి జన్మనో వయస ఆకృతేర్వా సదృశ మాచర న్న వచనీయతామేతి" (కా ఉ భా) (జన్మమునకు, వయస్సునకు, ఆకృతికి తగినట్లు వర్తించువా డెవ్వడును నింద్యుడు కాడు "అహో విపద్దీపదం, సంపత్సంపద మనుభ్నాతి" (విపత్తువెంట విపత్తును, సంపత్తు ననుసరించి సంపత్తును కల్గును)

బాణుడు తన కావ్యములలో నిక్షేపింపని భావములుగాని, వాడని అర్థములుకాని, శబ్దములుగాని, అలంకారములుగాని, భావింపని కల్పనలుగాని, ప్రదర్శింపని ఊహసమృద్ధిగాని, చూపని వాక్యరచనావైవిధ్యముగాని, సంస్కృత వాఙ్మయమున అరుదుగ కనిపించును బాణుని భావాదులననుకరింపనివారును లేరు కావుననే, "బాణోచ్ఛిష్టం జగత్సర్వ"మ్మను అభిజ్ఞోక్తి పర్పడినది బాణుడు వాడిన అర్థములనే శబ్దములనే, కల్పనలనే, వాక్యవిన్యాసములనే, వర్ణనములనే అనంతరీయకవులు వాడిరి

బాణుడు ప్రథమాది విభక్త్యంతపదములను, అవ్యయములను, క్రియలను, పౌనఃపున్యముగ ఉపయోగించును ఉదా కృపాజినీ, వల్కలీ, అక్షవలయీ, మేఖలీ, (హ చ ప్ర ఆ) ఇచట పుంలింగశబ్ద ప్రథమైకవచనములు ఆవృత్తములైనవి కపోలే కలయ, కువలయంకలావతి! చందనచర్చాం రచయ భానుమతి! పిడయ, పాదౌ పద్మావతి!, ఇట్లిచట సంబోధన ప్రథమావిభక్తుల ప్రత్యావృత్తికలదు -ఇట్లే ద్వితీయాది విభక్త్యంతపదముల పునరుక్తియు కలదు

"యత్రరాగః స్ఫురతి తరులతాసిసలయేషు" యత్ర చ పీతోద్గీర్ణం జలనిధి జలమివ మునినా"

"ఇతో వనగజకులం, ఇతో వరాహయూథం, ఇతో వనమహిషబృందం, ఇతశ్శిఖండిమండలవిరుతం"—ఇట్లు యత్ర ఇతః, అను అవ్యయముల ఆమ్రేడితము కలదు "గృహ్యతాం దిశక్చామరాణి వా, నమంతు ధనూంషి శిరాంసి వా శేఖరీభవంతు పాదరజాంసి, శిరస్త్రాణి వా, భుజ్యతాం భూమయః, ఇషవోపి వా" (హ చ 8 ఉ)—ఇచట క్రియారూపముల పునరావృత్తి కలదు విషయ సాక్షాత్కారమున కుపకారకములును, శ్రవణసుభగములునైన ఇట్టి పునరుక్తులు అసంఖ్యాకములు

అలంకారములలో బాణుని ఉపమలు పెక్కుచోట్ల శ్లేషసనాథములు ఉదా "రాహురివ, అసకృదాస్వాదితసోమరసః," నదీ తట తరురివ సరజలకాశనవిరలజటః, క్రౌంచిరివ కృపానుగతః"

"సంసరణసేతుః సంసారసింధోః," వరకు త్రైష్ణలతా

గహనస్య, మహామంత్రః క్రోధభుజంగమస్య, దివకరో మోహాంధకారస్య (జాబాలిః)-ఇచటి రూపకములు మనోహరములు, "రసాయనమివ యౌవనస్య, ఏకరాజ్యమివ రామణీయకస్య, మూలకోశమివ లావణ్యస్య (హ చ )-ఈ ఉత్ప్రేక్షలు రమ్యములు

"మాతంగకులాధ్యాసితమపి పవిత్రం", పరిపూర్ణ ద్విజపతి మండలసనాథమపి తరుగహనాంధకారం (ఆశ్రమమహత్త్వం) సామప్రయోగపరోపి సతతావలంబితదండః, సన్నిహితనేత్రద్వయోపి పరిత్యక్తవామలోచనః" – ఇవి చక్కని విరోధాభాసోదాహరణములు

బాణుని వక్రోక్తిప్రయోగ కౌశలము సుప్రసిద్ధము శ్లేషకాకువులచే అన్యార్థకల్పన మొనర్చుట వక్రోక్తి

రాజ్యవర్ధనుని శౌర్యమును, ధైర్యమును, శాంతవృత్తిని, హర్షవర్ధనుని పరాక్రమాదిగుణములను, తత్సోదరీ ప్రీతిని, రాజ్యశ్రీ కష్టములను కన్నులగట్టినట్లు వర్ణించినాడు కవిపుంగవుడు కాదంబరియందలి నాయికల ప్రేమప్రవృత్తుల యొక్కయు, తత్తత్పాత్రల తితిక్ష, చిత్తక్షోభము, మున్నగు మనోవృత్తుల యొక్కయు, ఆవిష్కరణము తెల్లగ గావింపబడినది

అనంతరీయకవులపై బాణకవిప్రభావము స్పష్టము వామనభట్టబాణుని బృహత్కథామంజరిలో కాదంబరీకథకలదు అభినందుని కాదంబరీ కథాసారము భోజరాజదేవుని కొడుకగు విక్రమదేవుని కాదంబరీకథాసారము, అనునవి బాణుని కాదంబరీకథాసంగ్రహములు, కాశ్మీరీయుడగు కాశీనాథకవి సంక్షిప్తకాదంబరిని రచించెను మణిరామకవి, కాదంబర్యర్థసారమను నొక పద్యకావ్యమును వ్రాసెను. నవీనులు పెక్కురు బాణుని కాదంబరిని సంగ్రహించుచున్నారు కవులొనర్చిన బాణుని భావభాషానుకృతులు అనంతములు

వ్యాఖ్యలు శివరాముడు, వైద్యనాథుడు, బాలకృష్ణుడు సూరచంద్రుడు, మహాదేవుడు, సుధాకరుడు, ఘనశ్యాముడు మున్నగు పండితులు బాణకవి కాదంబరిపై వ్యాఖ్యలు రచించిరి

ప్రశంసలు జయంతభట్టు, గంగాదేవి, ధర్మదాససూరి, చంద్రదేవకవి, సోడ్ఢలుడు, మున్నగువండితులు, సముచితవిధమున, బాణభట్టు కవితాగుణములను ప్రశంసించిరి జయంతభట్టు "ప్రకటరసానుగుణవికటాక్షరచమత్కారిత సకలకవి కులా, బాణస్య వాచః" అనియు, గంగాదేవి, "వాణీ పాణిపరామృష్ట వీణానిక్వాణహారిణీ, అనియు, ధర్మదాససూరి

"రుచిరస్వరవర్ణపదా, రసభావవతీ, జగన్మనోహరతి
తత్కిం తరుణీ? నహి నహి వాణీ బాణస్య మధురశీలస్య"

అనియు, బాణుని వాణిని ప్రశంసించిరి

ఇతర కవులలో ఒక్కొక్క రొక్కొక్క కావ్యగుణమున లబ్ధవర్ణులగుచుండిరి బాణుడు శ్లేషశబ్దగుంఫ రసాలంకార సదర్థకథావర్ణన సమర్థుడగు కవీంద్ర పంచాననుడని చంద్రదేవకవి ఈ కవిని పొగడెను అభినందుడు వాగీశ్వరుడనియు, వాక్పతిరాజు అర్థేశ్వరుడనియు, కాళిదాసు రసేశ్వరుడనియు, బాణుడు వాగర్థరసాది సర్వేశ్వరుడనియు నుడివి సోడ్ఢలుడు బాణుని పొగడెను

పాశ్చాత్య విమర్శకులు బాణుని వచనరచనము నిట్లు విమర్శించిరి "బాణుని వచన మొక మహారణ్యము అందు దీర్ఘవర్ణన సమృద్ధులను వృక్షములును, పొదలును క్రిక్కిరిసియున్నవి అందుచే పాఠకుడను బాటసారి, వాటిని స్వయముగ ఖండించి, బాటనుకల్పించుకొనువరకు అతని ప్రగతి అసంభవము బాటను కల్పించుకొనిన పిమ్మటకూడ, ఆబాటసారి, అజ్ఞాతపదరూపముననున్న భయంకర మృగముల నెదుర్కొనవలసినవా డగును" ప్రాచ్యపండితులీ విమర్శనమును పూర్వపక్షమొనర్చి బాణునివచనరచన నిట్లు సమర్థించిరి అపరిణతబుద్ధులకు బాణుని వచన మట్టిదిగ తోచగలదు కాని సంస్కృతపండితులకు మాత్రము బాణుని గద్యకవితారీతులు ప్రమోదావహములు కాగలవు బాణుడు ఆకాలమందలి మహాకవుల రుచిప్రమాణములకును, ఆలంకారికుల నియమావళికనిలోనై రచించెననుట సత్యదూరము కానేరదు "

మొత్తముమీద బాణుని గద్యకావ్యములు సార్వజనికములు "అతని హర్షచరితము చరిత్రకారులకు మార్గదర్శకము కాదంబరి భాషాతత్త్వజిజ్ఞాసువులకు సద్గురూపదేశము "

బాణుడు, ఈ క్రిందిశ్లోకములలో, తనవచనకావ్యమునందలి కథాస్వరూప స్వభావములను తెలిపియున్నాడు

"స్ఫురత్కలాలాపవిలాసకోమలా
కరోతి రాగం హృది కౌతుకాధికమ్
రసేన శయ్యాం స్వయమభ్యుపాగతా
కథాజనస్యాభినవా, వధూరివ"
"హరంతి కం నోజ్జ్వలదీపకోపమైః

నవై : పదార్థై రుపపాదితా: కథా:
నిరంతర శ్లేషఘనాస్సుజాత యో
మహాస్రజశ్చంపకకుట్మలై రివ."

గ ల.

## బాబిలోనియా (చ)

అతిప్రాచీనకాలమున విలసిల్లి, ఎన్నదగిన నాగరికతను పెంపొందించుకొనిన దేశములలో బాబిలోనియా, అస్సీరియాలను తప్పక పేర్కొనవలయును. బాబిలోనియాదేశమునకు ప్రథమమున కాల్డియాయను నామము వ్యవహారములో నుండెను. ప్రాచీనకాలపు బాబిలోనియా, అస్సీరియారాజ్యములను రెంటిని చేర్చి ఇప్పుడు 'ఇరాక్' అని వర్ణించుచున్నారు. ఇరాకునకు మెసొపొటేమియా యను నామాంతరము కలదు. మెసొపొటేమియారాజ్యము భారతదేశమునకు పశ్చిమోత్తరమున నున్నది. దీనికి తూర్పున పర్షియా, ఆఫ్ఘనిస్థానములును, పశ్చిమమున అరేబియాదేశమును, దక్షిణమున సముద్రమును, ఉత్తరమున పర్వతపంక్తులును గలవు. ఇరాకురాష్ట్రమందు టైగ్రీసు, యూఫ్రటీసు నదులు ప్రవహించుచున్నవి. జగత్ప్రసిద్ధిచెందిన బాబిలోను నగరము యూఫ్రటీసు నదీతీరమున నెలకొని యుండెడిది.

బాబిలోనియా చరిత్రయందు మిక్కిలి విఖ్యాతిచెందిన హమ్మురాబీ అను రాజు టింటిర్కి అను పట్టణమును తన రాజ్యమునకు ముఖ్యస్థానముగ భావించుకొనెను. ఈ నగరమున కాతడు 'బాడిమిర్రా' యను నూతన నామము నొసంగెను. ఈ పదమునకు భగవంతుని ద్వారమని యర్థము. సెమిటిక్ భాషలో "బాబ్ ఇల్ లేక బాబిల్" అను పదముల యర్థమునే సూచించును. 'బాబిలు' పదము ఆంగ్లములో బాబిలోనుగా మార్పుచెందినది. బాబిలోను నగరము రాజధానిగా కల్గిన దేశమునకు బాబిలోనియా యను నామము వర్తింపబడెను.

అతిపురాతనయుగములో బాబిలోనియా దేశమందు రెండుతెగల ప్రజలు నివసించుచుండెడివారు. వారిలో 'అక్కాడులు' దేశపు టుత్తరభాగమందును, 'సుమేరులు' దక్షిణప్రాంతమందును, తమ నివాసముల నేర్పాటు చేసికొనిరి. బాబిలోనియాదేశములోనికి వివిధయుగములలో, భిన్నభిన్న జాతులవారు వలసవచ్చి ఇచ్చట స్థిరనివాసములను కల్పించుకొని, స్థానికప్రజలలో లీనమైపోయెడివారు. వీరందరికినికూడ వ్యవసాయమే ముఖ్యవృత్తిగ నుండెడిది. ఈ దేశమందలి నదులు వర్షాకాలమున మిక్కిలి విజృంభించి కట్టలపైనుండి పొంగి పొరలుచు, పారెడివి. ఈ జలమునంతను కాలువల ద్వారా ప్రవహింపజేసి, తమ పొలములలోనికి రప్పించుకొని, బాబిలోనియాప్రజలు వివిధములగు సస్యములను పండించుకొనెడివారు. ఈ పంటలే ఇచటి ప్రజలకు ముఖ్యజీవనాధారము. ఇతర ప్రాచీనదేశపు నాగరికతలవలెనే బాబిలోనియా నాగరికతకూడ వ్యవసాయవృత్తి యనెడి పునాదిపై ఆధారపడి యుండెను.

వ్యవసాయదారులందరును కూడ చిన్నచిన్న గ్రామములందు నివసించుట సహజవిషయము. అట్లే సుమేరుప్రజలుగూడ గ్రామములందే నివాసము లేర్పరచుకొనెడివారు. ఈ ఇండ్లు పచ్చిఇటుకలతో నిర్మించెడివారు. గ్రామమధ్యమున గ్రామదేవత ఆలయము వెలసెడిది. ఈ దేవతయే గ్రామప్రజకు రక్షకురాలని ఆకాలపు ప్రజలు భావించుచుండిరి. గ్రామదేవతకు ప్రతినిధులుగా రాజు లేర్పడిరి. గ్రామమునకు చెందిన వ్యవసాయపు భూములు, పొలిమేరలలోని భూములు, చెరువులు, కాలువలు, మున్నగునవి గ్రామదేవతయొక్కయు రాజుయొక్కయు, రక్షణలో నుండెడివి. ఒకగ్రామమునకు చెందిన భూములను, పంటకాలువలు మున్నగువాటిని, ఇతర గ్రామస్థు లాక్రమించుకొనిన పక్షమున, రెండుగ్రామముల ప్రభువులకును యుద్ధము సంభవించెడిది. బాబిలోనియాదేశపు ప్రాచీనచరిత్రలో ఇట్టి యుద్ధములు తరచు సంభవించుచుండినట్లును, వాటివలన చాల జననష్టము సంభవించుచుండినట్లును నిదర్శనపూర్వకముగ తెలుపవచ్చును.

మానవజాతి ఆరంభదశయందు నివసించిన ఈ సుమేరుజాతివారు పరమేశ్వరునిగూర్చి విచిత్రభావనలు కల్గియుండిరి. భగవంతుడుకూడ ఈలోకమందలి రాజులవలెనే జీవించును. ఆయనకుకూడ దారపుత్రాదులుందురు. ఆయనకూడ శత్రువులతో యుద్ధములు సాగించును. యుద్ధములులేని కాలమున ఆయనకూడ విశ్రాంతి గైకొనుచు, భోగవిలాసములలో కాలముపుచ్చును. భగవంతుని నివాసస్థానమగు దేవాయతనముకూడ రాజుగారి దర్బారువలెనే సకలైశ్వర్యములకును ఆటపట్టయి యుండును. ఈ భావముల కనుగుణముగ సుమేరులు తమ దేవస్థానముకొరకై అత్యుత్తమ భవనములను సకల సంపదలను చేకూర్చెడివారు. ఆనాటి గ్రామములలో

నేచాలయమే సర్వవిధముల ఉన్నతస్థానము నాక్రమించి యుండెడిది

బాబిలోనియా దేశమందు పరిపాలన శాసించిన సుమేరు రాజులలో "ఉరుకాగినా"యను ప్రసిద్ధ ప్రభువు తుట్టతుదివాడని చెప్పవచ్చును ఈతనిముఖ్యపట్టణము లాగాష్ అనునది ఈతడు న్యాయబుద్ధితో పరిపాలనము సాగించుటయే గాక ఆనాడు తనదేశమున ప్రబలియున్న లంచగొండితనము, పక్షపాతమై ఖరి మున్నగు దోషములను నిర్మూలించి, దోషులైన అధికారులను కఠినముగశిక్షించెను ప్రజాపీడనము తొలగించెను ఈరాజు మరణించిన తరువాత సుమేరు రాజవంశమువారి ప్రాభవము క్రమముగా క్షీణించెను సుమేరు ప్రాంతమునకు ఉత్తరమున నెలకొనియున్న అక్కాడు రాష్ట్రమును పాలించుచున్న మొదటిసారగాణ అనురాజు దక్షిణదేశముపై దండెత్తివచ్చి, అచ్చటిరాజులను సంపూర్ణముగ పరాభవించెను దీనితో సుమేరు ఉన్నతి క్షీణించెను కాని కొంతకాలము గడచినతరువాత "ఉర్" పట్టణాధీశ్వరులును, సుమేరుజాతీయులును అగు "ఉర్ ఇంగూరు" ను, అతని కుమారుడు "దుంగి"యును, సుమేరుల ప్రాచీనవైభవమును పునరుద్ధరించిరి వీరిలో దుంగి యనునాతడు గొప్ప వీరుడు ఈ ప్రభువు సుమేరురాష్ట్రముపై దండెత్తివచ్చిన సెమిటిక్ జాతులవారి నోడించి, పారద్రోలుటయేగాక తన రాష్ట్రమునకు సమీపమున నున్న ఎలామ్ ప్రాంతమునుకూడ జయించెను ఈదుంగిరాజు సిరియా, కానాన్ రాజ్యముల నుండి తన రాష్ట్రముపై దాడిసల్పుచుండిన, సెమిటిక్ జాతులవారి విజృంభణము నరికట్టుటకై, తనదేశపు పశ్చిమభాగమున, టైగ్రిసు, యూఫ్రటీసు నదుల నడుమ ముప్పది మైళ్ళ నిడివికల ప్రాకారమును నిర్మించెను కాని దుంగిరాజు మరణించినతరువాత ఈ ప్రాకారము సుమేరులకు రక్షణమొసగజాలదయ్యెను సెమిటిక్ జాతులవారు ధారాళముగ సుమేరు దేశమున ప్రవేశించి, ఆరాజ్యము నాక్రమించిరి ఈవిధముగ నీప్రాంతములోనికి చొచ్చుకొనివచ్చిన సెమిటిక్ ప్రజలు మొట్టమొదట అక్కాడు రాష్ట్రములోనివారు కావున వారికి "అక్కాడులు" అనుపేరు సాధారణముగ వాడబడుచున్నది వారు అక్కాడు సుమేరు రాష్ట్రములను కలిపివైచి ఒకేరాష్ట్రముగ కావించి, పరిపాలనము చేయనారంభించిరి సుమేరు ప్రజలు అక్కాడు రాష్ట్రీయులచే సంపూర్ణముగ పరాభవింపబడుటకు కారణము వారి యుద్ధవిధానమునందలి లోపములేయని పండితులు భావించుచున్నారు అక్కాడులు ధనుర్బాణములనుధరించి,దూరమునుండియే శత్రుమారణము కావించెడివారు అందులకు ప్రత్యామ్నాయముగ సుమేరులు తమప్రాచీనమైన ఖడ్గములు, బాలులు మున్నగువాటిని బూని రణరంగమున కేగెడివారు కావున వారు శీఘ్రముగ ముందునకు సాగిపోజాలక, శత్రుబాణముల తాకిడికి తట్టుకోలేక, పదులకొలది మరణించెడివారు

చరిత్రరంగమునుండి అదృశ్యులైన ఈ సుమేరు జాతివారు వ్యవసాయమునందు చాలనేర్పును సంపాదించి వేరువేరువిధములగు పంటలను పండించెడివారు వీరు ఖర్జూరపు చెట్ల పెంపకమును బాగుగ ఎరిగియుండిరి - ఈజాతివారు పంచెల గుంపుల నేర్పాటు కావించుకొని, పరిసర దేశములతో వ్యాపారము సాగించుచుండిరి వీరికి రాగి మున్నగు లోహములు అరేబియానుండిదిగుమతియగుచుండెను. సుమేరు జాతివారు నిర్మించుకొనిన కట్టడములకై వలసిన రాళ్ళు ఎలామ్ప్రాంతము నుండి లభించుచుండెను-సుమేరులు శిల్పకళను వృద్ధిచేసికొనిరి ఈజాతివారు తమవ్రాతకోతలకొరకై మట్టి ఇటుకలను వాడుచుండిరి - సుమేరు దేశమును పరిపాలించిన ఉరుకాగినాయను ప్రసిద్ధపాలకుడు ప్రజోపయోగకరములైన పెక్కు శాసనములను కావించి, వాటిని మట్టి ఇటుకలపై వ్రాయించెను - అక్కాడుల యుగమందు బాబిలోనియారాజ్యమును పాలించిన హమ్మురాబీ అను గొప్పరాజు పై శాసనములను తనకు వరవడిగ గైకొనెను సుమేరు దేశము నాక్రమించిన అక్కాడు ప్రజలు సెమిటిక్ జాతికి చెందినవారని స్థలాంతరమున చూచినారము ఈ ప్రజలు క్రీ పూ 3000 - 2000 సంవత్సరములనడుమ అరేబియా దేశమునుండి, అక్కాడు రాష్ట్రమునకు వలసవచ్చినట్లు తెలియుచున్నది - స్వదేశమునందు జీవనోపాధికి తగిన సదుపాయములు లేనప్పుడిట్టి వలసలు సాగునని వేరుగా తెలుపనక్కరలేదు అక్కాడులు సుమేరు అక్కాడు రాష్ట్రములను రెండింటిని కలిపివైచి, బాబిలోనుదేశమును సృష్టించిరి వీరికి బాబిలోను నగరము రాజధాని అక్కాడులు నెలకొల్పిన రాజవంశము "సుమూఅబూ" వంశము వీరిపరిపాలనము ప్రారంభమైనపిమ్మట కొంతకాలమువరకును దేశమందు అల్లకల్లోలములు వ్యాపించి యుండెను ఇందులకు "ఎలామ్"

రాష్ట్రము

సుమూ అబూ వంశములోని హమ్మురాబీ రాజు ఈ ఎలామ్ దండయాత్రలను అరికట్టి, దేశమున శాంతిని నెలకొల్పెను ఈప్రభువు ప్రాచీన బాబిలోనియా చరిత్రలో మిక్కిలి విఖ్యాతిని గాంచెను ఈతడు దేశమునందెల్లెడల ధర్మబద్ధమైన ప్రభుత్వమును నెలకొల్పెను ఈతడు తన అధికారులందరును న్యాయముగను, నిష్పక్షపాతముగను, క్రమబద్ధముగను, పరిపాలనము సాగించునట్లు కట్టుదిట్టములను చేసెను ఈ రాజు తన ప్రజలకెల్లరకును న్యాయము లభించునట్లు ఏర్పాట్లు కావించెను హమ్మురాబీరాజు ఆనాడు దేశమందు వ్యాప్తిలోనున్న శాసనములను స్థిరపరచెను ధర్మబద్ధముగ నూతన శాసనములను కావించెను స్త్రీల హక్కులను, బానిసల హక్కులను సంరక్షించుచు, ఈప్రభువు కావించిన శాసనములు అతని న్యాయపక్షపాతమును వేనోళ్ళ చాటుచున్నవి – వ్యవసాయాభివృద్ధికై ఈ రాజు తటాకముల నేర్పాటుచేసెను కాలువలు త్రవ్వించెను ప్రపంచమందలి ఉత్తమరాజన్యులలో నొక్కడని వర్ణింపదగిన ఈ హమ్మురాబీ ప్రభువు క్రీ పూ 2000 ప్రాంతమున జీవించినట్లు చారిత్రకులు నిర్ణయించినారు

హమ్మురాబీ మరణించినతరువాత సుమూ అబూ వంశమునందు ప్రసిద్ధులైన రాజులెవ్వరును కానరారు ఈ వంశపురాజులు సుమేరు రాష్ట్రమునకు దక్షిణతమ భాగమందున్న చిన్న స్వతంత్రరాజ్యముతోడను, ఎలామ్‌దేశీయులతోడను, పశ్చిమప్రాంతములనుండి దండెత్తివచ్చిన హిట్టైటులను అనాగరక జాతులతోడను తరచు యుద్ధములు కావించుచు వచ్చిరి తత్ఫలితముగ వీరిబలము నానాటికి క్షీణించెను హిట్టైటులు సుప్రసిద్ధమగు బాబిలోను నగరముపై దండెత్తివచ్చి, పట్టణమును కొల్లగొట్టి, అచటి దేవతావిగ్రహములను పెకలించుకొని వెడలిపోయిరి అపిమ్మట "కాసైటు"లను మరియొక జాతివారు బాబిలోను నగరమును వశపరచుకొని, వేరొక రాజవంశమునకు పునాదివేసిరి

సుమూఅబూ వంశమువారి కాలమున బాబిలోనియా నాగరికత చక్కగ వికసించెను ఈ కాలమున బాబిలోను పౌరులు పూర్వము తాము పూజించుచుండిన "ఎన్లిల్" అను దైవతమును విడనాడి, "మార్డూక్" అను మరియొక దేవుని కొలువసాగిరి యార్డూకు బాబిలోను నగరమునకు పురదైవము ఈయన గౌరవార్థము పెక్కు ప్రార్థనాగీతములు రచింపబడెను పండితులగు వారి ధార్మిక గీతములను జాగ్రత్తగ కాపాడి ప్రజానీకమునందు ప్రచారములోనికి తెచ్చిరి

అక్కాడుల యుగములోకూడ సుమేరు జాతీయుల భాషయే యెక్కువ వ్యాప్తిలోనుండెను ఈభాషయందుగల పదములను సమకూర్చి, వాటికి అక్కాడుభాషలో అర్థము తెలుపునట్టి నిఘంటువులను విద్వాంసులు సిద్ధముచేసిరి–గ్రంథరచనమునందును, వ్యాపార సరళియందును, సుమేరు భాషయే విరివిగ వాడబడజొచ్చెను వైద్యగ్రంథములు మంత్రతంత్రకారులు, శకుననిర్ణయము మున్నగువాటికి సంబంధించిన వీరిగ్రంథము లాధునికులకు లభ్యపడినవి ఆనాటి వ్యాపారులకు నాణెముల వాడకము తెలియకపోలేదు కాని వారు వర్తకమునందు వస్తువుల మార్పిడి విధానమునే హెచ్చుగ ఉపయోగించుచుండిరి

బాబిలోనియారాజ్యమున నూతనముగ నెలకొల్పబడిన కాసైటువంశము ఒక నూతనజాతికిచెందినది కాసైటులు ప్రథమమున మీడియాదేశములో నివసించుచుండిరి ఈ దేశము నేటి ఇరాకురాజ్యమునకు ఈశాన్యభాగమున నెలకొనియుండెను కాసైటులు మొట్టమొదట అక్కాడుప్రాంతములపై దాడులు కావించి, కాలక్రమమున బాబిలోనియాదేశములోకూడ ప్రవేశించిరి కాసైటులు రాజ్యపరిపాలనయందు మిక్కిలి నేర్పరితనమును చూపిరి వీరు కొంతకాలమువరకును ఎలామ్‌రాష్ట్రమును, అస్సీరియారాజ్యమునుకూడ జయించి, పరిపాలించిరి కాసైటులు ఈజిప్టుదేశమువారితో మైత్రిని పాటించిరి క్రీ పూ 1180 వ ప్రాంతమున ఎలామ్‌రాష్ట్రము వారు బాబిలోనియాపై దండెత్తివచ్చి, కాసైటువంశము నంతమొందించిరి

ఎలామ్ రాష్ట్రీయులును, ఇతరజాతులవారును మూడు శతాబ్దులకాలము బాబిలోనియాదేశమున రాజ్యపాలనము సాగించినపిమ్మట క్రీ పూ 852 వ సంవత్సరమున అస్సీరియా ప్రభువులు ఈ దేశముపై దండెత్తివచ్చి, ఇచ్చటిరాజును తమకు సామంతునిగ చేసికొనిరి కాని బాబిలోనియా వారు తరచుగ అస్సీరియా సార్వభౌములపై తిరుగుబాటులు సాగించి, అనేకకష్టములకు గురియైరి క్రీ. పూ 606 వ సంవత్సరమున అస్సీరియారాజ్యము కూలిపోయెను బాబిలోనియా రాజులు మరల స్వతంత్రులైరి. కాని నూతనముగ

తలయెత్తిన పారసీకసామ్రాజ్యమువారు క్రీ పూ 539 వ సంవత్సరమున బాబిలోనియారాజ్యము నాక్రమించిరి స్వాతంత్ర్యప్రియులగు బాబిలోను ప్రజలు పారశీక ప్రభువులపై తరచు తిరుగుబాట్లు చేయుచు వచ్చిరి అందులకు కినిసి జెర్క్సెస్ అను పారసీక ప్రభువు బాబిలోనుపై దండెత్తివచ్చి నగర ప్రాకారములను పూర్తిగ ధ్వంసము చేసెను పారసీకుల పతనము తరువాత బాబిలోనియారాజ్యము గ్రీకులకు వశపడెను జగదేక వీరుడైన అలెగ్జాండరు అను గ్రీకురాజు, నేనే ఆసియా ఖండమున కంతటికిని ప్రభువునని ప్రకటించి, బాబిలోనునగరమును తనరాజధానిగ చేసికొనెను ఈ నగరముయొక్క ఔన్నత్యమును గుర్తించి, అద్భుతపడి, అలెగ్జాండరువీరు డిందలి మార్డూకుదేవాలయమును పునరుద్ధరింపవలెనని ప్రయత్నించెను కాని అంచాతడు కృతకృత్యుడు కాలేదు

బాబిలోనియాజాతివారు నేటికి సుమారు నాల్గువేల సంవత్సరములకు పూర్వము విలసిల్లియుండిరి అయినను అట్టి ప్రాచీనకాలములోకూడ వారు ప్రశంసనీయమైన అభివృద్ధిని సాధించగల్గుట గమనింపదగిన యంశము ఆ యుగమునాటి బాబిలోనియాప్రజలు విస్పష్టమగు లిపిని, భాషను నిర్మాణము కావించుకొని, పెక్కుశాస్త్రములలో గ్రంథములను వ్రాయుచుండిరి నేడు వ్రాతకొరకై మనము కాగితములను వాడుచున్నట్లే, ఆ యుగపు బాబిలోనియాప్రజలు ఇటుకలను వాడెడివారు ఆ ఇటుకలను వారు తమ దేవాలయములలో భద్రపరచెడివారు. ఆ దేవళములు వారి పుస్తకభాండాగారము లని మనము గుర్తింపవలెను ఈ ప్రజలకు జ్యోతిశ్శాస్త్రము నందు చాల అభిమానముండెడిది వీరు గ్రహసంచారమును చక్కగ పరిశీలించిరి సూర్యచంద్రుల గ్రహణములను వీరు బాగుగ నిర్ణయించెడివారు అనంతమగు కాలమును వీరు సంవత్సరములుగను, సంవత్సరములను పండ్రెండు నెలలుగను, వారమును ఏడుదినములుగను, దినమును ఇరువదినాలుగు గంటలుగను విభజించి కాలనిర్ణయమందు సౌకర్యము కలిగించిరి వీరు గణితశాస్త్రమునుకూడ వృద్ధిగావించిరి వివిధ వస్తువుల కొలతలు, తూకము, ఘనపరిమాణము, మున్నగు వాటిని నిర్ణయించుటకై బాబిలోనియాప్రజలు చక్కని యేర్పాట్లు కావించిరి ఈ దేశపురాజులు శిల్పకళనెంతయు పెంపుకావించిరి "నెబుచడ్నిజారు" అను బాబిలోనియారాజు అత్యద్భుతమైన ఫణితిలో 'ఆకాశోద్యానవనము'లను ఏర్పాటు చేయించెను బాబిలోనినగరమం దాకాలమున సుందరములును, మహోన్నతములును, అగు భవనములును, దేవాలయములు ఎన్నియో వెలసెను

బిం బా

## బాయిలర్లు - బాష్పఉత్పాదనము

చరిత్ర బాయిలరు అను పదము, ఆంగ్లభాషలోని 'బాయిల్' అను పదమునుండి యుద్భవించినది బాయిల్ అనగా మరుగబెట్టుట లేక కాచుట దేనియందు మరుగబెట్టబడునో అది బాయిలర్ అనబడును కావున బాయిలర్లు నీటిని కాచి ఆవిరిని తయారుచేయుట కుపయోగపడును ఈ ఆవిరిని శక్తినొసగు సాధనములం దుపయోగింతురు

క్రీ పూ 180 వ సంవత్సరములో తయారు కావింపబడిన 'హీరోఇంజను' మొట్టమొదటి బాయిలరని అనుకొనవచ్చును ఇది అర్ధగోళాకారము కలిగియుండి క్రిందనుండి మంటతో కాచబడినది 18 వ శతాబ్దమునకు మునుపే బాయిలర్లనుగూర్చి ఈజిప్టుదేశస్థులకు తెలిసియుండెనని, పాంపై శిథిలములద్వారా తెలియుచున్నది

బాయిలర్లు కనిపెట్టబడిన మొదటిరోజులలో, వాటిని ఇనుము, సీసము, కర్ర, ఇటుకలతో తయారుచేయుచుండిరి ఆ రోజులలో ఆవిరిభారము లేక ఒత్తిడి ప్రతిచతురపు అంగుళమునకు 5 మొదలు 25 పౌనులవర కుండెను కాని రాను రాను కాంపౌండు ఆవిరియంత్రములు, టర్బైనులు, హెచ్చుభారపు ఆవిరిని ఉపయోగించుటచే, బాయిలర్లుకూడ హెచ్చుభారపు ఆవిరిని తయారుచేయవలసివచ్చినది ఈ హెచ్చుభారమును సహించుటకై, బాయిలర్లు ఉక్కు, ఉక్కుతోకూడిన మిశ్రమలోహములతో తయారుచేయబడినవి 19వ శతాబ్దము వచ్చునప్పటికి ఆవిరిభారము ప్రతి చతురపు అంగుళమునకు 100 వరకు పెరిగినది

నిర్మాణము దేనినిర్మాణమైనను, దాని పనిపై ఆధారపడియుండును బాయిలరు ఆవిరిని ఉత్పత్తిచేయును. ఆ ఆవిరికి కావలసిన భారము, ఉష్ణోగ్రత యుండవలయును ఆవిరిని తయారుచేయుటకు నీటిని కాచవలయును అందులకుగాను ప్రతిబాయిలరునందును నీటినికాచుటకు ఒక పాత్రయు వేడినొసగు ఇంధనము నుంచుటకు కావలసిన ఏర్పాటును ఉండవలయును ఆవిరియొక్క భారము హెచ్చుగా నుండును గనుక బాయిలరుపాత్ర ఆ భారమును వహించు

శక్తికలిగి, ఆవిరి బయటికిపోకుండునట్లుండవలయును ఇంధనము మండుటచే కలుగు వేడి బాయిలరులోనుండు నీటికి చేరవలయును ఈ వేడిపోవు త్రోవ యొక్క వైశాల్యము ఎంత హెచ్చుగానుండిన బాయిలరు అంతచక్కగా పనిచేయును కనుకనే ఇంజనీర్లు ఇందులకు కావలసినమార్పులుచేయ ప్రయత్నించిరి

**విభజనము** బాయిలర్లనన్నిటిని రెండు తరగతులుగ విభజించవచ్చును (1) ఇంధనపు వాయువులు గొట్టములందు కల బాయిలర్లు (2) నీరు గొట్టములందుకల బాయిలర్లు

(1) ఇంధనపు వాయువులు గొట్టములలోకల బాయిలరులందు ఇంధనమును దహించగా కలుగు వాయువులను బాయిలరునందలి గొట్టములద్వారా పంపి, నీరు ఆ గొట్టముల చుట్టు ప్రవహింపజేసెదరు ఇట్టిబాయిలర్లకు ఉదాహరణములు

- i నిలువు బాయిలరు
- ii కార్నాను బాయిలరు
- iii లాంకషైరుబాయిలరు
- iv స్కాచ్ మెరైన్ బాయిలరు
- v పొగబండి బాయిలరు

(2) నీరు గొట్టములందుకల బాయిలర్లలో నీరు గొట్టములద్వారా ప్రవహించి, ఇంధనపు వాయువులు ఆ గొట్టముల చుట్టును ప్రవహించుచుండును ఇది పై వాటికంటె హెచ్చు భారముతో ఆవిరిని ఉత్పత్తిచేయగలవు వీటికి ఉదాహరణములు

- i బ్యాబ్ కాక్సు మరియు విల్ కాక్సుబాయిలరు
- ii స్టెర్లింగు బాయిలరు
- iii యారోబాయిలరు

**వర్ణనము—పనిచేయువిధానము** పనిచేయు విధానమును పరిశీలించుటకు సామాన్యపు నిలువుబాయిలరును ఉదాహరణముగ తీసికొందము సాధారణముగా అన్ని బాయిలర్ల విధానము ఒకటిగనే యుండును

1 వ పటమునందు ఈ బాయిలరు యొక్క పరిచ్ఛేదన దృశ్యము చూపబడినది ఇందు నీటిని ఆవిరిని ఉంచుటకై ఒక వర్తుల స్తంభాకారపాత్ర A A అనునది కలదు దీనిలో మరియొక వర్తుల స్తంభాకారపు పెట్టె B B అనునది కలదు ఇందు అగ్నియుండును గాన, దీనిని అగ్నిపేటిక అనియందురు దీనిలో ఇంధనమునుంచి దహించుటకై గ్రేట్ అను స్థలమున్నది ఇంధనపు వాయువులు గొట్టము 'C' ద్వార పైకిపోవును అగ్నిపేటికయందు ఒకటి లేక రెండు అడుగొట్టములు 'F F' అనునవి కొంచెము వాలుగా అమర్చబడి యున్నవి వీటివలన నీరు బాగుగ ప్రవహించి త్వరితగతిని ఆవిరి యగును ఈ ప్రతి అడ్డుగొట్టమున కెదురుగ, బయటి వర్తులపాత్రయందు కన్నములున్నవి వీటియందు చేయిదూర్చుట కవకాశమగును గాన, వీటిని 'చేతిరంధ్రములు' అనియందురు లోని అడ్డుగొట్టములను శుభ్రపరచుట కివి యుపయోగపడును

చిత్రము 95



FIG. I

SIMPLE VERTICAL BOILER

**బాయిలరుపైని పరికరములు** బాయిలరునకుకాని, దానిపై పనిచేయు మనుజులకుకాని, ఎటువంటి ప్రమాదములు సంభవించకుండ చూచుటకును, బాయిలర్లు ఎట్టితొందరయు నిలుపుదలయు లేకుండ హెచ్చు సమర్థతతో పనిచేయుటకును, కొన్ని పరికరములేర్పరుపబడినవి వీటిని బాయిలరుపై అమర్చియుంచుదురు కాబట్టి వీటికి ఉపరిస్థములు అను పేరు కలిగినది

(1) **నీటిమట్టమును తెలుపు పరికరము** బాయిలరునందు ఎల్లప్పుడు నీరు ఒకనిర్ణీతమగు మట్టముకంటె క్రిందికి రాకూడదు కావున నీటిమట్టమును ఈ పరికరముద్వారా తరచుగ చూచుచుండవలెను

(2) **భారమును సూచించు పరికరము** బాయిలరు ఉత్పత్తిచేయు ఆవిరి యొక్క భారమును ఇందులో కనుగొనవచ్చును

(3) **భద్రకవాటకము** బాయిలరు, ఉపయోగమును బట్టి, కొంత భారమును సహించునట్లు అది నిర్మింపబడియుండును సాధారణముగా లోనిఆవిరి ఇంతకంటె హెచ్చు భారమునకు పోకుండునట్లు చూతురు, కాని ఎవరి అశ్రద్ధవల్లనైనను, భారమధికమైనచో, ఇతర ప్రమాదములు సంభవించుటకుముందే, ఈద్వారము (వాల్వు) తెరచుకొని కొంత ఆవిరిని బయటికివదలి, భారమును తగ్గించును తగ్గినతోడనే ఈ ద్వారము (వాల్వు) తనకుతానే మూసికొనును

(4) కరగుప్లగ్గు  అజాగ్రత్తవలన ఎప్పుడైనను బాయిలరులోని నీటిమట్టమును చూడని ఫలితముగా అది క్రిందికి దిగినచో, వేడివలన ఉష్ణోగ్రత అధికమై, ఈ ప్లగ్గుకరిగి, లోని నీరు క్రిందికిజారి అగ్నిని ఆర్పి వేడిని తగ్గునట్లుచేయును ఇందువలన బాయిలరునకు కలుగు హాని నివారింపబడును

(5) నిలుపుదు ద్వారము  బాయిలరులోని ఆవిరిని బయటి గొట్టములకు పంపుటకుకాని, బాయిలరులోనే ఉంచుటకుకాని, ఇది ఉపయోగపడును

(6) బయటికి పారద్రోలు ద్వారము  బాయిలరులోగల నీటియందు కూడిన మురికిని, మన్నును తగ్గించుటకుకాని, లేక అవసరమయినపుడు బాయిలరును ఖాళీచేయుటకుగాని, ఇది ఉపయోగపడును దీనిని బాయిలరుయొక్క క్రింది భాగమునందమర్తురు

బాయిలరుయొక్క భద్రతకు ఈ పరికరములన్నియు ఆశ్యావశ్యకములు వాటి అవశ్యకత తప్పనిదగుటచే, అందు మిగుల ముఖ్యమైన వాటిని ఒకటొకటిగ కాక, జంటగా వాడెదరు అందువలన పొరపాటున ఒకటి పనిచేయక పోయినను, ఇంకొకటి పనిచేసి బాయిలరును, జనులను ప్రమాదములనుండి తప్పించును. ఉదా భద్రకవాటము, నీటిమట్టపు సూచని

పొగదండి బాయిలరు  ఇది "ఇంధనపువాయువులు గొట్టములందుకల బాయిలరుల" తెగకు చేరినది

ఇందు అడ్డముగానుంచిన ఒక వృత్తాకారపుపాత్ర A A అనునది కలదు దీనికి ఒక చివర B B అను అగ్ని

చిత్రము 96



FIG 2

LOCOMOTIVE BOILER

పేటికయున్ను, మరొక చివర C C అను పొగపెట్టెయును ఉన్నవి ఇంధనపువాయువులను అగ్ని పేటికనుండి పొగపెట్టెకు తీసికొనిపోవుటకై కొన్ని P P అను చిన్నగొట్టములపై A A అను పాత్రయందు అడ్డముగా అమర్చబడినవి ఇవ్విధమున వాయువులు గొట్టములందు ప్రవహించునపుడు, అవి తమ వేడిని, గొట్టములబయట నీటికొసగి, ఆవిరిని కలుగజేయును తరువాత ఈ వాయువులు E అను పొగగొట్టముద్వారా బయటికి పంపబడును తయారైన ఆవిరి. నిరోధకకవాటము ద్వారా బయల్వెడలి, క్రిందనుండు ఇంజనుకు పోయి అక్కడ పొగబండి కదలుటకై వలసినశక్తిని ఉద్భవింపజేయును

ఈ తెగకుచేరిన మరిరెండు చిత్రములు ఈక్రింద పొందుపరచబడినవి

చిత్రము 97                    చిత్రము 98




FIG.3

COCHRAN BOILER



FIG 4

LANCASHIRE BOILER

నీటిగొట్టపుబాయిలర్లు  ఇందు ఉదాహరణముగ బాబ్ కాక్ - విల్ కాక్సు బాయిలరును తీసికొందము ఇందుకూడ నీటిని ఆవిరిని నిలుపుదలచేయుటకై E అను ఒక వర్తులాకారపు పాత్ర అదనముగా అమర్చబడినది దీని ముందుభాగమున నుండు 'B' లు (మెల్లగా తీసికొనిపోవునవి) వెనుకటిభాగముననుండు 'C' లతో (మెల్లగ క్రిందికి తీసి కొనిపోవునవి) పొడుగైన వాలుగు గొట్టములు A ద్వారా కలుపబడినవి మెల్లగ క్రిందికి తీసికొనిపోవు ప్రతిదానియొక్క క్రింది చివరభాగమున ఒక చిన్న మట్టిపెట్టె అమర్చబడినది, నీటియందలి మురికి మన్ను వగైరాలు అక్కడ చేరుకొని యుండి, L అను విరజిమ్ము కవాటమును తెరచినపుడు అది బయటికి త్రోయబడును

సహకారోపకరణములు  బాయిలరు పనిచేయుటకును

హెచ్చుగా ప్రయోజనకరముగ నుండుటకును, అవసరమైన అదనపు పరికరములను ఈ పేరుతో పిలిచెదరు

1 నీటిని సరఫరాచేయుయంత్రము బాయిలరు ఎంత భారముతో ఆవిరిని తయారు చేయవలెనో, అంతకంటె హెచ్చుభారములో నీటిని బాయిలరునకు సరఫరాచేయవలసి యుండును ఇందుల కుపయోగించునవి (i) ముందువెనుకల కాడు యంత్రము, (ii) తిరుగుడు యంత్రము, (iii) లోనికి చిమ్ము యంత్రము

**2-కి ఎకనమైజరు మరియు ఎయిర్ ప్రీ హీటరు** ఇంధనపు వాయువులు బాయిలరులోని నీటికి వేడి నొసగిన పిదప కూడ, ఇంకను వాటియందు కొంత వేడి మిగిలియుండును. ఆవాయువులను అప్పుడే బయటకు పంపినచో వాటియందు మిగిలి యుండు ఆవేడి వృథాయగును కనుక హెచ్చుప్రయోజనము నకై ఆవాయువులను (i) బాయిలరుకు సరఫరాచేయు నీటిని కాచు ఎకనమైజరునందును, (ii) బాయిలరునందు కాల్చు ఇంధనమునకు కావలసిన గాలిని వేడిచేయుటకై ఎయిర్ ప్రీ హీటరునందును ఉపయోగించి, తరువాత బయటికి వదలుదురు ఈ రెండు పరికరములవలన ఇంధనపు ఖర్చుతగ్గి పాటవము అధికమగును

సూపర్ హీటరు ఆవిరి హెచ్చుగా ఉపయోగకరముగ నుండుటకు, అందు నీటిబిందువు లేమాత్రము ఉండ కూడదు ఇంతేకాక ఆవిరి హెచ్చు ఉష్ణోగ్రత కలిగి యుండ వలెను అట్టి పరిస్థితులందు, అది ఎక్కువ శక్తికలిగియుండును మరియు ఇంజనులందే కాని, టర్బైనులందే కాని కొందర తక్కువగా నుండును ఇందులకు ఈ పరికరము ఉపయోగపడును బాయిలరునందలి ఆవిరిని బయటికి తీసి, వేడి గొట్టములద్వారా పంపి, వాటిచుట్టూ వేడి వాయువులను ప్రవహింప చేయుదురు

చిత్రము 99



FIG 5

BABCOCK AND WILCOX BOILER (WATER TUBE)

నవీన పద్ధతుల పైన కనబరచినట్లు, ఆవిరి ఎంత శక్తిమంతముగ నుండిన, అది అంత హెచ్చు ఉపయోగకారిగా నుండును ఇందులకు ఉష్ణోగ్రత హెచ్చించుట ఒక విధమైన పద్ధతి, భారమును హెచ్చించుట మరియొక పద్ధతి శక్తిదాయక యంత్రముల శక్తిని హెచ్చించినట్లు ఆవిరి యొక్క భారమును కూడ హెచ్చించవలసి వచ్చినది ఉన్నత పీడనముగల బాయిలర్ల కుదాహరణములు (i) బెన్సన్ (ii) వెలోక్స్, (iii) లియోఫ్లర్, (iv) లామోంట్సు వగయిరా

ఇంతవరకు సాధారణముగా బాయిలర్లలో వాడు బొగ్గు లేక నూనెవంటి ఇంధనములు మొత్తము ప్రపంచమందు పరిమితముగ నుండుట చేతను, వాటిని ఉపయోగించు యంత్రముల పరిమాణములు పెరుగుచుండుట చేతను ఇంజనీర్లు, శాస్త్రజ్ఞులు ఇవికాక వేరు ఇంధనము లేవైనను ఉపయోగించ వీలగువాయని యోచించుచుండిరి ఇంతలో రెండవ ప్రపంచ సమరమునందు అణుశక్తి యొక్క ప్రభావము తెలియ వచ్చినది సమరము ముగిసిన తరువాత ఈ అణుశక్తిని ఆవిరి తయారు చేయుటకై ఉపయోగించు ప్రయత్నములు జరిగినవి భారతదేశమున సహితము, ఇట్టి అణుశక్తివలన ఆవిరిని తయారుచేసి దాని ద్వారా విద్యుచ్ఛక్తిని ఉద్భవింపజేయు యంత్రములు ట్రాంబేలో నొకటియు, తారాపూరులో నొకటియు తయారైనవి ఇవికాక, ఇంకను మద్రాసులో నొకటి, రాజస్థానములో నొకటి స్థాపింప ప్రయత్నములు జరుగుచున్నవి

చిత్రము 100




FIG 6

BENSON BOILER

క్రీస్తుపూర్వము హీరో ఇంజను బాయిలరునుండి, ఆధునిక కాలపు అణుశక్తి బాయిలరు వరకు జరిగిన అభివృద్ధి యందు వివిధ శాస్త్రములును, టెక్నాలజీయును ముఖ్య పాత్రలు తీసికొన్నవి కాని అప్పటినుండి ఇప్పటివరకు సిద్ధాంతములు మాత్రము హెచ్చుగా మారలేదు వేడిని ఉపయో

గించి ఆవిరిని ఉద్భవింపజేయుట, ఆ ఆవిరిని శక్తిదాయక సాధనములందు ఉపయోగించుట, ఏపరిశ్రమలకైనను అత్యవసరమైనది కనుక ఏ పరిశ్రమలకైనను బాయిలర్ల ముఖ్యావశ్యకత వేరుగ చెప్పనవసరము లేదు

యన్. పి.

## బాలక్రీడలు

పెద్దల ఆటలలో లేని క్రొత్తదనము, ప్రత్యేకత పిల్లల ఆటలలో కాన్పించును వీరి ఆటలలో సంగీత, సాహిత్య వినోదములు రసాత్మకముగా మేళవించును. భారత దేశములో సంప్రదాయానుసారముగా వచ్చు ఆటలన్నియు పాటలతో కలిసి ఆడబడుచున్నవి ఉదాహరణమునకు

"ఒత్తెం బిత్తెం - వగడా బిత్తెం
ఏకూచక్రా - ఎలకాపండు
మామిడిముట్టె - మల్లెరేకూ
ఆవులుబొయ్యే - రేవుల్లోనా
గెజ్జాఘల్ - మొగ్గాదూక్ "

బాలబాలిక లీ పాట పాడుచు వర్తులాకారముగా పద్మాసనాసీనులై ఆడుదురు చెమ్మచెక్క అను మరియొక ఆట కలదు ఈ ఆటను అచ్చముగా బాలికలే ఆడుదురు ఈ ఆట ఆడునపుడు గూడ బాలిక లీ క్రింది పాటను పాడెదరు

చెమ్మ-చెక్క - చారడేసి మొగ్గ
అట్లుపోయంగ - ఆరగించంగా
రత్నాలపల్లకిలో రంగులేయంగా
ముత్యాలపల్లకిలో ముగ్గులేయంగా
పగడాలపల్లకిలో పందిళ్ళేయంగా
పందిట్లో మాబావ పెండ్లియాడంగా

ఈ పాటను ఇద్దరేసి బాలికలు ఎగురుచు, చేతులు పైకెత్తి, అరచేతులపై అరచేతులతో కొట్టుచు ఆడెదరు

బాలురు ప్రత్యేకించి ఆడెడి ఆటలు చెడుగుడు, బొంగరములు, గోటిబిళ్ళలు మొదలైనవి పల్నాటి వీరచరిత్రలో బొంగరములు త్రిప్పుట వ్యాయామ క్రీడగా పేర్కొనబడినది కొబ్బరి బొండములను మించిన బొంగరములను పలనాటి వీరులు విసరివిసరి త్రిప్పికొట్టగా, పెద్దరాళ్ళు సహితము డొల్లలు పడెడివని ప్రతీతి. ఇప్పుడుకూడ ఈ యాట ఆడబడుచునే యున్నది

విశేషప్రచారములోనున్న మరియొక క్రీడా విశేషము పేరు గాలిపడగ ఆట గాలిపడగలను ఎగురవేయు ఈయాట ఆంధ్రదేశ మంతటిలో హైదరాబాదు నగరమునందు విశేషముగా ఆచరణమునందున్నది ఈ యాటల తరువాత బాలురు ఉత్సాహముతో ఆడెడి యాటపేరు చెడుగుడు ఈ యాట కబాడీ అనికూడ అనబడును ఈ యాటను ఆడునప్పుడు కూడ ఆటకాండ్రు పాడుచుండుట గమనింపగలము

అంచి-బాంచి-చందనకటాంచి
ఆత్తాకు-అరాకు-సన్నబిరాకు
ఒరోరి వెంకన్నా-పరిగెత్తరోరి వెంకన్నా

పైని పేర్కొనిన ఆటలలో ఒక్కొక్క ప్రాంతము వారు ఒక్కొక్క చరణమును పాడుచు ఆడెదరు

అదేవిధముగా రుమాలు ఆట, కోతి గుమ్మంచి ఆట, నాలుగు స్తంభముల ఆట కాళ్ళ-గజ్జె ఆట అను రకరకముల పాటలతోకూడిన కొన్ని ఆటలు ఆడబడుచున్నవి

వీటిలో నాలుగు స్తంభముల ఆటయే ప్రస్తుతము 'మ్యూజికల్ చైర్స్' అను ఆటగా పరిణమించినది కాని ఇప్పుడు ప్రాత పాటలకు బదులుగా గ్రామఫోను రికార్డులు ఉపయోగింప బడుచున్నవి అదేవిధముగా బాలురు విరివిగా ఆడెడి ఆట గోలికాయలాట యనబడును

బాల, బాలికల ఆటలు డబ్బు ఖర్చుతో నిమిత్తము లేనట్టివి. ఈ యాటలకు ప్రత్యేకమైన సాధనముల ఆవశ్యకత యుండదు కాని వీటిలో కలిగెడి వ్యాయామము, ఉత్సాహము, సంఘీభావము, ఆనందము పెద్దలు ఆడెడి ఆటలలోని వ్యాయామాదుల విషయములో ఏమాత్రము తీసిపోవు

పూర్ణపురుషుడుగా, ఒకవ్యక్తిగా మానవుడు పెంపొందుటకు ఈ యాటలు బాలికలకు, బాలురకు మిగుల దోహదకారులు కాగలవు

కొ. న. రా.

## బాలచంద్రుడు - పలనాటి.

మహావీరధర్మమును నెరవేర్చి సమరరంగమున అవక్రపరాక్రమముతో శత్రువులను దునుమాడి ఆంధ్రులపరాక్రమాతిశయమును దిగంత విఖ్యాతమొనర్చిన మేటి వీరుడు పలనాటి బాలచంద్రుడు, అభినవ అభిమన్యుడు

బాలచంద్రుని తండ్రి రేచెర్ల బ్రహ్మనాయుడు తల్లి పేరు ఐతమ్మ ఈమెకు ఈతమ్మయను నామాంతరము కూడ కలదు. భార్య మాంచాల. క్రీ. శ. 1098 నుండి 1104 సం. మధ్య

కాలమున గురజాల ముఖ్యపట్టణముగ పలనాటిరాజ్యసీమను పరిపాలించిన నలగామరాజునకు మంత్రిగను, రాజకుటుంబము నకు గౌరవనీయుడైన ఆప్తుడుగను బ్రహ్మనాయుడు వర్తించు చుండెను బ్రహ్మనాయనిభార్యయైన ఐతమ్మకు చాలకాలము వరకు సంతానము లేకుండెను ఆమె యెన్నో వ్రతములు చేసెను ఎన్నో నోములునోచెను ఎన్నో తీర్థములందు గ్రుంకెను దేవుళ్ళను పూజించెను ప్రార్థనలు చేసెను ముఖ్యముగా మాచెర్ల క్షేత్రస్వామియైన చెన్నకేశవస్వామిని ఎన్నో విధముల ఆరాధించెను పెక్కు దానములుచేసెను చివరకు "గజనిమ్మపండు" వ్రతము ఒక సంవత్సరము సలిపెను ఆమె భక్తిపూర్వకముగా నాటి, పెంచిన గజనిమ్మచెట్టు పుష్పించి కాయలుకాచెను సంవత్సరానంతరము గజనిమ్మపండ్లనుకోసి పళ్ళెరములలో నింపి భక్తిపూర్వకముగా చెన్నకేశవస్వామికి సమర్పించి సంతానార్థినియై ఆ దేవుని ప్రార్థించెను అప్పుడు పళ్లెరములలోని ఒకపండు ఎగిరివచ్చి ఆమెదోసిలిలోపడెను భగవంతు డనుగ్రహించినందుకు ఆమె చాల సంతోషించి, ఆ పండును ఒక బ్రాహ్మణ వనితకు నిచ్చి తనకును ఆచ్చటనున్న స్త్రీలకును దానిని పంచియిమ్మని ఐతమ్మ కోరెను బ్రాహ్మణస్త్రీ ఆ పండును ఎనిమిది భాగములు చేసి, తా నొక భాగమును తీసికొని, ఆరు భాగములు ఇతరస్త్రీ లారుగురుకి నిచ్చి ఒక భాగమును ఐతమ్మకొసగెను తత్ఫలభక్షణప్రభావమున ఆ ఎనిమిది మంది స్త్రీలు గర్భములు ధరించి కుమారులను గనిరి వీరందరు బాలచంద్రునికి సోదరులవలె మైత్రీబంధము కలవారై మెలగిరి

**బాలచంద్రుని జననము** బాలచంద్రుడు దుష్టనక్షత్రమున జన్మించుటచే తండ్రి బ్రహ్మనాయుడు, బిడ్డడు తన ఇంట పెరుగుట అరిష్టముగా భావించి, పుత్రవ్యామోహమును సైతము త్రెంచుకొని, తనకు సేవకుడును, పుత్రసమానుడును నైన కన్నమదాసుడను మాలవాని కా బాలు నప్పగించి, అరణ్యమున నెవరికి తెలియకుండ నతని జంపిరమ్మని యాజ్ఞాపించెనట! అంత బ్రహ్మనాయని యాజ్ఞ ననుసరించి, కన్నమదాసుడు ఆ బాలుని యర్ధరాత్రమున అరణ్యమునకు గొని పోవుచుండగా, ఆ విషయము బ్రహ్మనాయని తమ్ముడైన పేర్నీడనువానికి తెలిసి కన్నమదాసుని కలిసికొని, యాతనిని ఒప్పించి, యా బాలుని తనయింటికి దీసికొనిపోయి పెంచు చుండెను

**వివాహము** ఇది ఇట్లుండ బ్రహ్మనాయని బావమరది గండుకన్నమనీడు తనకుమార్తె మాంచాల యుక్తవయస్కురాలగుటవలన వివాహ మొనర్పనెంచి, సభలో బ్రహ్మనాయనికి ఒకనాడు ఆ విషయ మెరింగించెను ఆ మాటలు ప్రక్కన కూర్చుండియున్న బ్రహ్మనాయని సహోదరుడు పేర్నీడువిని తాను పెంచుచున్న బాలచంద్రునికి మాంచాలి నొసగి వివాహము గావింపుమనికోరి వెంటనే బాలచంద్రుని పిలువనంపెను బాలచంద్రుడు సభకు వచ్చెను ఆ బాలుడు తన కుమారుడేయని బ్రహ్మనాయడు గుర్తించి, అరిష్టజాతకుడైన ఆతడు జీవించియుండరాదనియు, వెంటనే వధ్యశిలకు గొనిపోయి తలనరకమని, యా బాలచంద్రుని కన్నమదాసున కప్పగించెను కన్నమదాసు అట్లే బాలుని వధ్యశిలకుగొనిపోయి భైరవఖడ్గముచే వధింపబోయెను తిరిగి పేర్నీడు అడ్డమువచ్చి బాలుని తీసికొనిపోయి బ్రహ్మన్నతో వాదులాడెను సభాసదులందరు పేర్నీడుపక్షమున వాదించి బాలుని కరుణింపుమని బ్రహ్మన్ననుకోరిరి తమ అన్నదమ్ములలో బాలచంద్రు డొక్కడే కొడుకనియు, వంశాంకురమును త్రుంచివేయవలదనియు, పేర్నీడు, సభాసదులు పట్టుబట్టిరి తుదకు దైవనిర్ణయమెట్లో అట్లే జరుగుగాకయని బ్రహ్మన్న తనపట్టువదలెను తదనంతరము, బ్రహ్మనాయడు బాలచంద్రుని పుత్రవాత్సల్యమున స్వీకరించి, గండుకన్నమనాయని సుతయగు మాంచాలను బాలచంద్రునకిచ్చి పెండ్లిచేయుటకు సమ్మతించెను బాలచంద్రునకును, మాంచాలకును వైభవోపేతముగా వివాహకార్యము జరిగెను వివాహమునాటికి బాలచంద్రుడు, మాంచాల బాల్యదశలోనుండిరి

**అన్నమ్మతూలనాడుట** బాలచంద్రుడు, ఇంట తన కేమియు ప్రొద్దుపోవుటలేదనియు, కాలక్షేపము నిమిత్తము తోడిహితులతో బొంగరాలాడుట కేగెదననియు చెప్పి తన తల్లి అనుజ్ఞకై ప్రార్థించెను తల్లి యైతమ్మ కుమారుని మొదట వారించియు, ఆటుపిమ్మట అనుమతించెను తల్లియాజ్ఞను గొని బాలచంద్రుడు సంగడికాండ్రతో పుర బాహ్యప్రదేశమునకు వెళ్ళి అచట బొంగరము లాడుచుండెను దైవవశమున ఆతనిబొంగరము ఆ దారిలో నెత్తిమీద సీటికడవ మోయుచువచ్చుచున్న 'అన్నమ్మ' యను నొక వైశ్యాంగన పాదమునకుతగిలి గాయపరచెను అంత ఆవనిత క్రోధముతో బాలచంద్రుని జూచి "వీరశిఖామణి యగు బ్రహ్మనాయని

కుమారుడవై, యాతనివంశమున కపకీర్తి దెచ్చుచుంటివి వీరులైన నీతండ్రి మున్నగువారు, యుద్ధరంగమున వారి వారి శౌర్యసాహసములను ప్రదర్శించుచుండగా, నీవిచ్చట బొంగరము లాడుచుంటివి వీరపుత్రుడవేని నీ శీరములు శౌర్యమవూడి యుద్ధరంగమున ప్రదర్శింపుము" అని తీవ్రముగ బలికెను

ములుకులవంటి యామాటలువిని బాలచంద్రుడు తల్లి యగు ఐతాంబకడకేగి, యుద్ధోదంతమును సవిస్తరముగనెరిగి, తానును యుద్ధరంగమునకు వెడలి తండ్రికి సహాకరింతునని యనుజ్ఞ వేడెను ఐతాంబ తనకుమారుని ఆ యుద్యమము నుండి మరల్చుటకు యెన్నియోవిధముల ప్రయత్నించెను బాలుని హృదయము రణోత్సాహపూరితమై యుండెను తల్లితో వీరధర్మమును నెరవేర్పనిమ్మని బాలుడు ధర్మసూక్ష్మము లెన్నియో యెరుకపరచెను ఐతాంబ యెట్టకేలకు సమ్మతించెను "సకలదేవతలు నిన్ను రక్షించెదరుగాక" యని కుమారుని దీవించి, యుద్ధమునకు వెడలుటకుముందు నీభార్య యగు మాంచాలనుజూచి, యామెకుగూడ చెప్పి పొమ్మని పలికెను

మాంచాల దీవెన బాలచంద్రుడు తన వివాహానంతరము అత్తవారింటికి వచ్చుటకును, తనభార్య మాంచాలను చూచుటకును ఇదియే మొదటిసారి మాంచాలయొక్క రూపయౌవనసౌందర్యములను జూచి అత్యంత ముగ్ధుడయి, అట్టి సుందరాంగిని తాను ఇంతకాలము విస్మరించినందులకు ఎంతయో నొచ్చుకొనెను అచ్చట మాంచాలయొనర్చిన అనేకమర్యాదలనంది యుద్ధముమాట మరచి, భార్యతో సరససల్లాపములమునిగియుండెను అనపోతాదిసోదరులు మాంచాల నగరునకేతెంచి, వీరాలాపము లాడుచు యుద్ధప్రయాణమునకాహ్వానించిరి మాంచాల భర్తతో "సమరమున నద్వితీయ శౌర్యమునుజూపి, పగరకు వెన్నుజూపక పరాక్రమించి శత్రుసంహారమొనర్చి వీరధర్మమును నెరవేర్పుడు మీతల్లిని వీరమాతగను, నన్ను వీరపత్నిగను జేయుడని" వేడుకొని, ఈ వీరకృత్యముచే "కలియుగంబున మీకు ఘనపూజలమరు" నని ప్రోత్సహించి, భర్తచేతికి ఆయుధమిచ్చి సమరోన్ముఖుని గావించెను భర్తపరివారమువెంట బ్రాహ్మణబాలు డగు అనపోతు కత్తిపట్టుకొనియుండుటజూచి, "బ్రాహ్మణుడు మీ వెంటవచ్చి యుద్ధమున మడసిన బ్రహ్మహత్యాపాతకము ఘటిల్లుననియు, ఎట్లేని యుపాయాంతరముచే ఆతనిమరల్పుడనియు మాంచాల భర్తకు చెప్పి పంపెను

పలనాటికలహకారణము పలనాటిప్రభువైన అనుగురాజు పూర్వమొకపర్యాయము వేటనిమిత్తము అరణ్యమునకు పోయి, చాలసేపు వేటాడి డస్సి తిరిగి వచ్చుసమయమున, మార్గమధ్యమున 'నాగమ్మ' యను రెడ్డివనిత యొకతె, రాజును ఉచితోపచారములచే మెప్పించెను రాజు ఆమె యాదరమునకు సంతసమంది, యొకవరమేదేని కోరుకొమ్మనెను అంతట ఆమె "పలనాడు నంతటిని నాయిచ్చవచ్చినపుడు ఏడు గడియలకాలము మంత్రిణినై పాలించునట్లనుగ్రహింపుడని రాజును వేడెను రాజు ఆకోరికను మన్నించి శాసనము వ్రాసియిచ్చెను అనుగురాజు మరణానంతరము ఆతని కుమారుడు నలగామరాజు రాజయ్యెను ఆసమయమున రాజునకు, నాగమ్మపొందిన పూర్వపు శాసనపత్రమునుజూపించి మంత్రిణీ పదవి సంపాదించి, ఎట్లో మాయచే అధికారచక్రమంతయు స్వాధీనపరచుకొనెను అప్పటినుండి రాజ్యమునకు మంత్రియైన బ్రహ్మనాయని, రాజసహోదరులు మలిదేవాదులను కడతేర్చుటకు నాగమ్మ యెన్నియోకుట్రలు పన్నుచుండెను నలగాముడు నాగమ్మచేయు కుట్రలనెరుగక యామె చేతికీలుబొమ్మయయి, తమ్ములను చెరబెట్టించెను బ్రహ్మన మలిదేవాదులను చెరనుండి విడిపించి, పలనాటి రాజ్యమును విభజించి, 'గురజాల' రాజ్యమును నలగామునికి, 'చంద్రవంక' సమీపమున, 'మాచర్ల' యను నొకపట్టణమును గట్టించి యచటిప్రాంతమును మలిదేవాదులకును బంచెను ఈ పంపకము నాగమ్మకు ఇష్టములేదు శత్రురాజ్యమును, శత్రుశేషమును ప్రబలుచుండుట క్షేమముగాదను తలంపుతో ఆమె నలగామునియెటులో యొడబరచి, బ్రహ్మనాయని కోడిపందెములకు పురిగొలిపి మోసముచే పందెముగెలిచెను ఫలితము బ్రహ్మనాయనికి, మలిదేవాదులకు ఏడుసంవత్సరము అరణ్యవాసము ప్రవాసకాలము ముగిసినవెనుక, తిరిగి దాయభాగమిమ్మని బ్రహ్మనాయడు నయవాక్యముల నలగామునియర్థించెను నాగమ్మచేతి యంత్రపుబొమ్మయైన నలగాముడు అందులకు తిరస్కరించగా పరిస్థితి విషమించెను యుద్ధమే శరణ్యమని బ్రహ్మనపక్షము నిర్ణయించెను అయినను సామోపాయమునూహించి బ్రహ్మనాయడు 'రాచమల్లు'అను నామాంతరముగల అలరాజును నలగామునికడకు రాయబారిగపంపెను.

ఈ యలరాజు నలగాముని యల్లుడు పెదమలిదేవుని బావమరదియైన కొమ్మరాజు కుమారుడు. నాగమ్మ దుస్తంత్రముచే సంధి విఫలముకాగా అలరాజు తిరిగివచ్చుచు నాయకురాలిచే ప్రేరితుడైన యొకనిచే విషప్రయోగమువలన చచ్చెను అలరాజును రాయబారిగానంపునపుడు అతనితండ్రి కొమ్మరాజు తనపుత్రుని కచ్చట యేమి యాపదవచ్చునోయని విచారించుచుండెను బ్రహ్మనాయడది జూచి యలరాజున కెట్టియాపదయు వాటిల్లదనియు, అతడు తిరిగివచ్చుదనుక, అతనికి మారుగ బాలచంద్రు నాతనికడ ఇల్లడ పెట్టుదుననియు చెప్పి కొమ్మరాజు భయమునుతీర్చెను బాలచంద్రుడు అలరాజు మరణమునువిని, నాయకురాలియొక్కయు, నలగామరాజు యొక్కయు దుర్నయముల కంతము సాధింపనెంచి వీరరసమూర్తియై యుద్ధరంగమునకు బయలుదేరెను తనతోవచ్చుచున్న అనపోతుని యింటికిబంపు నుపాయమాలోచించి, బాలచంద్రుడు మార్గమధ్యమున ఆగి నేను నా ముత్యాలహారమును, ఉంగరమును మాంచాలగృహముకడ మరచివచ్చితిని నీవు వేగమేవెళ్ళి వాటిని కొనితెమ్ము అని అనపోతును వెనకకు బంపెను బాలచంద్రు డంత త్రిపురాంతకముచేరి యనపోతును కార్యమపూడికి రావలదని యాంక్షలుపెట్టి, లేఖ వ్రాసి దానిని ఒకచెట్టుకొమ్మకుకట్టి పరివారముతో నల్లగొండ జేరెను

కార్యమపూడిలో నాయకురాలు, మలిదేవాదులతో సంధిచేసుకొనవలెనను తలంపుతో కొందరు రాయబారులను మలిదేవునికొలువునకు బంపెను అచట మలిదేవాదులు ఆసంధి కంగీకరించి విందు గుడుచుచున్నతరి బాలచంద్రుడు పరభసమున అచటికేగి, యచటి పెద్దలను పలువిధముల నిందించి, యుద్ధసన్నద్ధులుకండని వీరులను హెచ్చరించెను అంతట కొమ్మరాజు మున్నగువారు బాలచంద్రుని యప్పటి యుద్ధప్రయత్నమును మాన్పిరి

బాలచంద్రునిపనుపున మాంచాలనగరికేగిన యనపోతు అచట బాలచంద్రుని ముత్యాలహారము, ఉంగరము లభింపమి, నిరాశుడై కార్యమపూడి కేతెంచుచు త్రిపురాంతకముచేరి యచట చెట్టుకొమ్మకు తనమిత్రుడుకట్టినలేఖను చదువుకొని, భగ్నాశుడై తన బిరుదమును, జండెమును బాలచంద్రుని కందచేయుమని 'మాడచి'యను మగువకిచ్చి కత్తితోపొడుచుకొని చచ్చెను మాడచి వెంటనే కార్యమపూడికేగి యనపోతువంపిన బిరుదమును, జండెమును బాలచంద్రునకిచ్చి యనపోతు మరణవార్త నెరింగించెను

**బాలచంద్రుని యుద్ధము** బాలచంద్రుడంత పట్టరాని పౌరుషోద్రేకముతో కత్తిని ఝుళిపించుచు లేచి, తా నొక్కడే శత్రువులను పరిమార్చి నరసింగుని తలద్రుంచి కొమ్మరాజు సముఖముననుంచి, కులపగదీర్తునని ప్రతినబూని సమరోన్ముఖుడుకాసాగెను తక్కిన వీరులును తాము భుజించు ఆహారమును పటిలోగలిపి సంధివ్యవహారములను తృణీకరించి యాయుధపాణులై యుద్ధమునకాయత్తులైరి సభలోనున్న నలగాముని రాయబారులును, తమ రాజుకడకేగి సంగతివిన్నవింపగా నలగాముడును సమరసన్నాహమున కుద్యమించెను

బాలచంద్రుడంత తన తండ్రికి నమస్కరించి యతనిచే ననేక యుద్ధతంత్రముల నెరిగి, సైన్యసమేతుడై యుద్ధభూమికి నడచెను యుద్ధరంగమున నరసింగరాజు అపారమైన సేనానివహమును తరలించుకొనివచ్చి బాలచంద్రు నెదుర్కొనెను బాలచంద్రుని కత్తివాదరకు నరసింగుని సైన్యముకాకలేక చెల్లాచెదరగుచుండగా, శత్రుసైనికులలో నొకని నరసింగుడని భ్రమించి బాలచంద్రుడు అతనితలద్రుంచి చేతబట్టుకొని తండ్రికడకేగెను బ్రహ్మన్న యదిజూచి యది నరసింగుని శిరముకాదని చెప్పగా ద్విగుణీకృతోత్సాహముతో బాలచంద్రుడు యుద్ధరంగమున కురికెను బాలచంద్రుడీ పర్యాయము శత్రుమూకను అవక్రవిక్రమముతో చెండాడుచు నరసింగునిపై దూకెను ఉభయులును కొంతసేపు అతిఘోరమగు యుద్ధమునుచేసిరి తుదకు బాలచంద్రుడు తన 'సామంతరాగోల'చే నరసింగుని తలనరకి చేతబట్టుకొని తండ్రికడకేగెను బ్రహ్మనాయడు కుమారునిచేతిలో నరసింగుడు ఘోరమరణమందుటజూచి మిక్కిలి దుఃఖించెను అనుగురాజుసంతానము యొక్క యోగక్షేమముల బాధ్యత తనయందుండుటచేతను, చిరకాలము ఆ రాజవంశమువారికి నిర్వ్యాజముగ సేవచేసియుండుటచేతను, శత్రుత్వము సంభవించినను నరసింగునిచావు బ్రహ్మనాయనికి హృదయవిదారకమయ్యెను ఈ యకృత్యము జరిపినందులకు కుమారుని నిరసించెను బాలచంద్రుడా పరుషోక్తులను భరించలేక అచట నిలువలేక రెట్టించిన రోషముతో మరల కృపాణపాణియై కదనరంగమునకురికెను అట్లు కొంతకాలము ఘోరసంగ్రామమొనర్చి యుద్ధరంగమున గూలెను

మహాభారతయుద్ధమున వీరాభిమన్యునివలె బాల చంద్రుడు నూనూగుమీసాల నూత్నప్రాయముననే యకుంఠిత పౌరుషప్రతాపములను ప్రదర్శించెను ఆంధ్రుల దేశభక్తికి, ధర్మానురక్తికి వన్నెగూర్చెను ఆంధ్రవీరుల కీర్తిచంద్రికల నాచంద్రార్కము దిగంతముల వెలయించెను అతడు నేటికిని నిఖిలాంధ్రులచే వీరపూజ లందుచున్నాడు

కొ. ప.

## బాలె :
(Ballet)

సృజనాత్మకమయిన కళ ప్రతిబింబించు రూపకములు పాశ్చాత్య దేశములలో సుమారు పదివరకు ఈనాడు ప్రచారములో నున్నవి వీటిలో బాలె ఒకటి తెలుగులో దీనిని నృత్యరూపకమని నిర్వచింపవచ్చును దీనిలో ఉద్వేగముతో కూడుకొన్న ఆంగికాభినయముతప్ప, వాచికాభినయము ఏమాత్రము ఉండదు నేపథ్యమున వివిధ వాయిద్యముల కలయికతో పాడబడెడు గాత్రపు పాటననుసరించి ఈ నృత్యరూపకము నడచును ఇటాలియన్ భాషలో "బాలెర్" అనిన 'నృత్యము చేయుట'యని అర్థము దీనినుంచియే బాలె వ్యాప్తిలోనికి వచ్చినది

సంప్రదాయ సిద్ధమయిన, లక్ష్య, లక్షణ సమన్వితమైన శాస్త్రీయ నృత్యములు బాలెకు ప్రాణాధారములని చెప్పవచ్చును ఇటలీని పాలించిన రాజులు దీనిని మొదటినుంచియు అభిమానించుచుండిరి వచ్చిన అతిథులకు విందునొసగినపిమ్మట వారి వినోదార్థము, గౌరవార్థము బాలే ప్రదర్శింపబడుచుండెను దీనిలో ఇతరులెవ్వరు కాక రాజకుటుంబములోని మగవారలే పాల్గొనుచుండిరి 1489లో ఇటలీలోని టార్టొనాలో ఇది సర్వాంగ సుందరముగా, ప్రప్రథమముగా ప్రదర్శింపబడినట్లు దీనికి సంబంధించిన చరిత్ర చెప్పుచున్నది

గ్రీకు పురాణములోని కథావస్తువులు ఆకాలమునాటి బాలెలో ఉపయోగింపబడుచుండెను దైవాంశ సంభూతులు దీనిలోని పాత్రలు బాలె ప్రదర్శింపబడుటకు రాజప్రాసాదములో ప్రత్యేక రంగస్థల మొకటి యుండెడిది కథాకాలము నాటి రామణీయకతను ప్రస్ఫుటపరచు అద్భుతమైన సెట్టింగులతో ఈ రంగస్థలము అలరారుచుండెడిది ఆక బాలెలో ఉపయోగింపబడెడి దుస్తుల, ఆభరణముల విలువలు చెప్పనలవిగాకుండెను పాత్రధారులు ఒకరకమైన శిరోవేష్టములను, బుట్టబొమ్మలను వాడుచుండిరి

ఇటలీరాజుల ఆదరాభిమానములను అందుకొనిన బాలె "కాథరయిన్ డిమెడిస్" అను రాణి ఈ కాలములో ఫ్రాన్సులో నుండెను తన కుమారుడయిన మూడవ హెన్రీ దృష్టిని రాజకీయ వ్యవహారములమీదినుండి మరల్చుటకొరకు ఆమె తన అంతఃపురములో బాలె ప్రదర్శనములను తరచు ఏర్పాటు చేయుచుండెను

పౌరాణిక కథావస్తువులతో కూడిన బాలె ఇతర యితివృత్తముల మీదకూడ తన దృష్టిని సారించెను కాలానుగుణమయిన సంస్కరణములకు దీనిని లోనుచేసినవాడు ఫ్రెంచి దేశమును ఏలిన పదునాలుగవ లూయీ చిన్నప్పటినుండి ఆయనకు బాలెమీద అభిమానము మెండు తన పదునైదవ యేట ఆయన "బాలెడెలానూయ్ట్" అను రూపకములో సూర్యుని పాత్రను ధరించెను అప్పటినుండి ఆయనకు "మార్తాండమహీపతి" అను పేరు వచ్చెను

బాలెలో మోటుతనమును ఆగపరచు కుప్పిగంతులను చాలవరకు తగ్గించి, దానికి మార్దవమును చేకూర్చినవాడు లూయీ ప్రభువు మోలియర్, జాన్ బాప్టిస్ట్ లల్లీ మొదలయిన నాటక రచయితలను, సాహితీవేత్తలను తన ఆస్థానమునకు రప్పించి లూయీ బాలెకు సంబంధించిన సాహిత్యములోను, ఆహార్య, వేషధారణములలోను వారి రుచుల ననుసరించి మార్పులను ప్రవేశపెట్టెను

అంతవరకు రాజకుటుంబములోని వారలు బాలెలో పాత్రలు దాల్చుచుండిరని మనము తెలిసికొంటిమి లూయీ రాజు ఈ సంప్రదాయమునకు స్వస్తిచెప్పి ప్రజాసామాన్యమునకు చెందిన కళోపాసకులకుకూడా దీనిలో పాల్గొనుటకు అవకాశమును కల్పించెను సంప్రదాయ సిద్ధమయిన నృత్యము తెలిసిన అధ్యాపకులను రప్పించి, వారిచేత ఉత్సాహముకలవారికి సరియైన శిక్షణమును ఆయన ఇప్పించెను అంతవరకు ధనాఢ్యులకే అందుబాటులో ఉన్న బాలె, ప్రజాస్వామ్యమునకు లూయీ కాలములో చేరువకు వచ్చెను బాలెకు సంబంధించిన రంగాలంకరణము సాంకేతిక శాస్త్రరీత్యా కళాకాంతులతో తేజరిల్లవలెనను మహాశయములతో లూయీప్రభువు నృత్యశాస్త్రమును బోధించు రాయల్ 'అకాడమీ'ని స్థాపించెను, అకాడమీకి ప్రారంభోత్సవమును సలుపుచు ఆయన ఇట్లు చెప్పెను " నృత్యము విశిష్టతతోకూడిన గొప్ప కళ అని మీరు గుర్తించవలెనని నేను కోరుచున్నాను ఇంత

వరకు ఇది రాజప్రాసాదములలో నాలుగు గోడలమధ్య బంధింపబడి యున్నది దీని శృంఖలములను ఈనాడు నేను త్రెంచుచున్నాను పురుషులతోపాటు స్త్రీలుకూడ విరివిగా నృత్యకళను అభ్యసించవలెనని నా కోరిక ఈ అకాడమీ పతాకచ్ఛాయలలో శిక్షణము పొందిన స్త్రీపురుషులు దేశ దేశములకు వెళ్ళి నృత్యకళకు గొప్ప గౌరవమును, ఖ్యాతిని తెచ్చిపెట్టెదరని నేను ఆశించుచున్నాను "

లూయీ ప్రభువు కనిన కలలన్నియు నిజములాయెను ఈ అకాడమీలో శిక్షణము పొందినవారు ఇంగ్లండు, అమెరికా, రష్యా మొదలయిన దేశములకువెళ్ళి అచ్చట బాలె ప్రదర్శనములిచ్చి కళాభిజ్ఞుల అభినందనములను స్వీకరించిరి రాయల్ అకాడమీ అచిరకాలములో "పారిస్ ఆపెరా"గా రూపొంది విశ్వఖ్యాతి నార్జించెను

అంతకుముందు బాలె ప్రదర్శనములలో స్త్రీపాత్రలను కూడ పురుషులు ధరించెడివారు హావభావ ప్రకటనములో స్త్రీపాత్రలను స్త్రీలే ధరించినచో చక్కని రసానుభూతి స్ఫురించుటకు అవకాశముండునని తెలిసికొన్న నృత్య అధ్యాపకుడు లల్లీ, నృత్యమే వృత్తి విద్యగా చేపట్టుట కభిలషించెడు స్త్రీమూర్తులను రంగస్థలమున కాహ్వానించెను ఆ ఆహ్వానము నందుకొని రంగస్థలముమీదికి ప్రప్రథమముగా పాదమును పెట్టిన ఆమె "లెఫాన్టయిన్ "

పారిస్ ఆపెరాలో చక్కని నృత్య అధ్యాపకులు తయారయిరి వీరిలో బ్యూషాంప్ గొప్ప పేరు సంపాదించెను శాస్త్రీయ నాట్యములో పదసంచలనము పంచభంగిమలలో ఉండవలయుననెడి సిద్ధాంతమునకు బ్యూషాంప్ ప్రాణప్రతిష్ఠ చేసెను నృత్యమునకు ప్రప్రథమముగా "నొటేషను" ఇచ్చిన ఆచార్యవర్యుడు బ్యూషాంప్

బాలే చరిత్రలో మరొక నూతనాధ్యాయమునకు ప్రారంభోత్సవము సలిపినవాడు జార్జెస్‌నావెర్ బాలేలో అలంకరణమునకు, ఆడంబరమునకు ప్రాధాన్యము ఇయ్యక భావప్రకటనమునకు, సున్నితమైన సౌందర్యోపాసనకు ప్రాముఖ్యము నీయవలెనని ఈయన ఆశయము ముఖలక్షణములను మరుగుపరుచు బుట్టబొమ్మలను,శిరోవేష్టములను తీసివేయవలెనని నావెర్ పట్టుదల నాట్యశాస్త్రమునకు నావెర్ ఈవిధముగా క్రొత్తవ్యాఖ్యాన మొసగెను

పెక్కుమంది కళాకారులు, సాహితీవేత్తలు, నావెర్ వాదమును బలపరచిరి కాని పారిస్ ఆపెరావారు మాత్రము దానిని వ్యతిరేకించిరి అభ్యుదయవాది యయిన నావెర్ తన ఊహాపోహల కనుగుణముగా ఒక శిష్యురాలిని తయారు చేసెను ఆమెపేరు మేరీమెడలయిన్ గుర్‌మార్డ్ ఆమె తన బృందసభ్యులతోకూడ ఇటలీ, ఇంగ్లండు, ఫ్రాన్సు, రష్యా దేశములలో సుమారు వంద బాలే ప్రదర్శనముల నిచ్చెను పౌరాణికములేకాక సాంఘికములుకూడ దీని కథావస్తువులయ్యెను పొగాకునకు సంబంధించిన ఇతివృత్తము బాలేలోకెక్కి వివిధ దేశములలో దానిని ఎట్లుపయోగించెదరో ప్రహసన రూపములో తెలియజేయబడెను లక్షలాది ప్రేక్షకులు ఈ బాలే ప్రదర్శనమును చూచి ఆనందించిరి

ఒకచెంప తేలిక ఇతివృత్తములు, మరొకచెంప బరువయిన కథావస్తువులు బాలే ప్రదర్శనములకు ఉపయోగింపబడుచుండెను నావెర్ వాదము ననుసరించి నాట్యధర్మమునకు కాక లోకధర్మమునకు అనువయిన పోకడలు బాలే ప్రదర్శనములో ప్రవేశపెట్టబడెను సర్ వాల్టర్ స్కాట్, విక్టర్ హ్యూగో నవలలలోని కథావస్తువులు ఫ్రెడరిక్ ఛాపిన్ లూయీ మొదలయిన సంగీత విద్వాంసుల కర్ణపేయమయిన గానములతో జతచేరి, బాలేకు నిండుశోభను సమకూర్చెను

నావెర్ వాదమున కనుగుణముగా మరొక ఆమె రంగస్థలముమీదికి పాదముపెట్టెను ఆమెపేరు టగ్లియానీ తనది బహుతేలికయైన శరీరమగుటచేత ఈమె రంగస్థలముమీద ఆంగికవిన్యాసమును ఎంతో మృదువుగాను, మనోహరముగాను అగపరిచెడిది గాలిలో ఎగురు పక్షివలె ఈమె రంగస్థలిమీద సంచలనము అగపరచుటచేత కళాభిజ్ఞులు ఈమెకు "వాయుపుత్రిక" అను బిరుదు నొసగిరి భయానక, భీభత్స, రసప్రధానమయిన నృత్యములను వదలివేసి ఈమె శృంగార, కరుణారసప్రపూరితములయిన నాట్యములను చేపట్టెను కరుణారసప్రపూరితమయిన ఈమె భంగిమలను కాంచి కంటతడిపెట్టని ప్రేక్షకుడు ఉండెడివాడు కాడు

బాలేను బహుళప్రచారమునకు తీసికొని వచ్చుటలో ఇటలీ, ఫ్రాన్సు దేశములతో రష్యా పోటీకి కడంగెను కాథెరిన్ ది గ్రేట్ కాలములో బాలేను సెంట్ పీటర్స్ బర్గులో లక్షలాది ప్రజలు అభిమానింప దొడగిరి మొజర్ట్, బిథోవెన్ మొదలయిన సంగీత శాస్త్రజ్ఞులు బాలేయొక్క

స్థాయిని ప్రజాదృష్టిలో పైకి లేపిరి

బాలేలో కృత్రిమత్వమునకు కాక సహజత్వమునకు చోటు చూపెట్టిన ఘనత అన్నాపవ్‌లోవాకు దక్కెను ఈమె రష్యన్ ఇంపీరియల్ పాఠశాలలో నాట్యశాస్త్రము నభ్యసించెను 1907 లో తన బృందముతో ఈమె ప్రపంచ మంతటా పర్యటించెను కేవలము నగరములనేకాక పట్టణములను, పల్లెలను దర్శించి పవ్‌లోవా తన పర్యటనములలో భారతదేశమునకు కూడ వచ్చి బాలే ప్రదర్శనముల నిచ్చెను ఈమె ముఖకవళికలు, అంగవిన్యాసము, హావభావ ప్రకటనము అత్యంతాకర్షణీయముగా నుండుటచేత రవీంద్రనాథఠాకూరంతటి కళాభిజ్ఞునిచే ఈమె "హావభావముల అధిదేవత" అని పేర్కొనబడెను నాట్యకళా ప్రచారమునకే తన జీవితమును అంకితము చేసికొన్న ధన్యజీవిని పవ్‌లోవా

పవ్‌లోవా బృందము తరువాత చెప్పుకోదగ్గది డయిగిలేవ్ బృందము ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికా, ఇరాన్, దక్షిణ అమెరికా, జపాను, ఫిలిప్పయిన్ మొదలయిన దేశములలో ఈ బృందము పర్యటించి బాలే ప్రదర్శనములకు బహుళ వ్యాప్తిని చేకూర్చెను

బాలే శోభను ఇనుమడింపజేసినది న్యూయార్క్స సిటీ బాలే కంపెనీ వివిధ రసములకు అనుగుణమయిన వెలుతురును ప్రసరించుటకు ఈ కంపెనీ డిమ్మర్లను, ఫుట్‌లైట్లను, స్పాట్‌లైట్లను ఉపయోగించెను మేఘములు, నక్షత్రములు, చంద్రబింబము మొదలయినవాటిని రంగస్థలముమీద ప్రదర్శించుటలో ఈకంపెనీ సరిక్రొత్త ప్రయోగములను చేసెను

తన ఆదర్శములను సిద్ధాంతములను ప్రచారము చేయుటకు బాలే ఒక విశిష్టమయిన సాధనముగా రష్యాకు ఉపయోగపడుచున్నది సోవియట్ బాలేలో నృత్యమునకు సంబంధించిన సాంకేతిక శాస్త్రవిజ్ఞానము పరాకాష్ఠ నందినది సంఘములో పెట్టుబడిదారుడు కార్మికుని ఎట్లు పీకుకొని తినునో ప్రదర్శించుటయందు సోవియట్ బాలే పోకడ అద్వితీయము ముఖ్యముగా ప్రపంచశాంతి ఉద్యమమునకు సోవియట్ బాలేచేసిన సేవ చరిత్రలో పేర్కొనదగ్గది. బోల్షాయ్ థియేటరులో ఈనాడు వందలాది యువతీ యువకులు బాలే నృత్యములో తగిన శిక్షణము నందుచున్నారు

అమెరికా దేశములోని కొన్ని విశ్వవిద్యాలయములు కూడ నృత్యశిక్షణమునకు డిగ్రీకోర్సులు ప్రవేశపెట్టినవి బాలే ప్రదర్శనముల పోటీలనుకూడ ఇవి ప్రతి సంవత్సరము జరుపుచు ఉత్తమమయినవిగా ప్రకటింపబడినవాటికి ఇవి పారితోషికముల నిచ్చుచున్నవి

ఫిల్ములలోను, టెలివిజనులలోను బాలే ప్రదర్శనములు ప్రవేశపెట్టబడినవి ఇవి ఈనాడు కోట్లకొలది ప్రజలను రంజింపచేయుచున్నవి

జ. వేం

## బాల్కన్ రాజ్యములు (చ)

'బాల్కన్' అను తురుష్కపదమునకు 'పర్వతశ్రేణులని' అర్థము ఈ ద్వీపకల్పమునందు ఆల్పయిన్ శ్రేణులలోని కార్పేథియన్ శాఖకు చెందిన పర్వతములు (బాల్కన్) వ్యాపించి యుండుటచే ఈ పేరు సిద్ధించినది కాని భారతదేశమునకు హిమాలయములవలె యూరప్ ఖండమునుండియొక నిర్ధారణక్రమమున వేరుచేయు సరిహద్దు బాల్కన్ ద్వీపకల్పమునకు లేదనియే చెప్పవలసి యున్నది ఈ కారణమువలననే బాల్కన్ రాజ్యములలో అనాదినుండియు సరిహద్దువిషయమున పెక్కు భేదాభిప్రాయములు, సమస్యలు చెలరేగినవి పైగా ఈ పర్వతశ్రేణులు బాల్కన్ భూభాగమునందంతటను వ్యాపించి యుండుటచే ఈ ద్వీపకల్పమునందలి వివిధ రాజ్యములమధ్య రాకపోకలు మున్నగు సంబంధములు మిక్కిలి అరుదు బాల్కన్ చరిత్రలో సరిహద్దులకు సంబంధించిన సమస్యలే ప్రధానముగ కనిపించుచున్నవి

బాల్కన్ ద్వీపకల్పముయొక్క వైశాల్యము సుమారు 17,500 చ మైళ్ళు ఈ భూభాగమునకు డాన్యూబ్, సావె నదులు ఉత్తర సరిహద్దునందును, నల్లసముద్రము, తూర్పు దిక్కునందును, మార్మరా, ఈజియన్ సముద్రములు దక్షిణమందును, అడ్రియాటిక్, అయోనియన్ సముద్రములు పశ్చిమదిక్కునందును ఎల్లలుగానున్నవి బాల్కన్ పర్వతశ్రేణులలో ఇనుము, రాగి మున్నగు ఖనిజములు లభించుచున్నవి. కాని ఈ ఖనిజములను త్రవ్వితీయు ప్రయత్నములు ద్వితీయ ప్రపంచ సంగ్రామానంతరమే తీవ్రముగా ప్రారంభమయినవి బాల్కన్ ద్వీపకల్పమునందు ఆల్బేనియా, గ్రీసు, బల్గేరియా, రుమేనియా, యుగోస్లావియా అను రాజ్యము లున్నవి కొందరు చరిత్రకారులు రుమేనియాను ఎంతవరకు బాల్కన్ రాజ్యకూటమియందు చేర్పదగునను ప్రశ్నను

లేవదీసిరి కాని బాల్కన్ చరిత్రయందును రాజకీయము లందును రుమేనియా దేశముకూడ ప్రముఖపాత్రను వహించి యుండినది. పూర్వము బాల్కన్ రాజ్యములుగా నుండిన మాంటినీగ్రో, డాల్మేషియా, బోస్నియా, సెర్బియా, హెర్జిగోవినా అను రాజ్యములు 1919 లో ఒకటిగా చేర్చబడి యుగోస్లేవియా యను పేరిట స్థాపింపబడినవి. ఈ వ్యాసమున బాల్కన్ రాజ్యముల సమష్టి చరిత్ర మాత్రము పరిశీలింప బడును.

డాన్యూబ్ నదికి ఉత్తరముగానున్న భూభాగము (ఇప్పటి రుమేనియా) ప్రాచీనకాలమున డాసియాయని పిలువ బడుచుండినది. డాన్యూబ్ నదికిని ఈజియన్ సముద్రమునకును మధ్య భూభాగము అనగా ద్వీపకల్పమునందలి తూర్పు భూభాగమునకు థ్రాస్ అనియు, పశ్చిమభూభాగమునకు ఇలీరియా యనియు పేర్లుండెను. దక్షిణమున మాసిడోనియా, గ్రీస్ రాజ్యములుండినవి. అప్పటి రోమక రాజ్యపాలనముక్రింద ఈ ద్వీపకల్పమునందలి రాజ్యములన్నియు ఐక్యముతో నుండినవి. కాని, క్రమక్రమముగ ఈశాన్యదిక్కునుండి గాథ్ జాతివారు ప్రవేశించుటచేతను, అదేసమయమున రోమకసామ్రాజ్యము పతనమునందుటచేతను, ఈ ద్వీపకల్పము పెక్కుదండయాత్రలకును, వలసరాజ్యములకును గురియైనది. ఈ వలసరాజ్య స్థాపకులు బాల్కన్ ద్వీపకల్పమునందు సుస్థిరమగు రాజ్య పాలనము నెలకొల్ప ప్రయత్నింపనందువలన వారి పరిపాలనమునకు సంబంధించిన చిహ్నసముదాయము కాని, సంస్కృతి గాని నేటికిని బాల్కన్ రాజ్యములందంతగా కానరాదు. గాథిక్ జాతి తరువాత స్లావ్ జాతివారు క్రీ. శ. మూడవ శతాబ్దము నుండి వలస ప్రారంభించినను, ఆరవ శతాబ్దమునుండియే డాన్యూబ్‌కు దక్షిణముగా వ్యాపింపదొడగిరి. ఈ సందర్భమున గ్రీకుజాతివారు దక్షిణముగా సముద్రతీరమునకు తరుమబడిరి. స్లావ్ జాతివారు నేటి బల్గేరియా, యుగోస్లావియాలున్న భూభాగములందు ప్రధానముగా తమ స్థిరనివాసము లేర్పరచుకొనదొడగిరి. ఈ స్లావ్ జాతివారు బైజాన్టీన్ పరిపాలనము నెట్లో ఎదుర్కొన గలిగిరి గాని తర్వాత వచ్చిన ఆటోమన్ తురుష్కుల ధాటి తాగజాలకపోయిరి. క్రీ. శ. 1186 లో గ్రీకు జాతివారిపై విప్లవమును జరిపించిన పీటర్, ఐవన్ సోదరులచే నూతన బల్గేరియా సామ్రాజ్యము స్థాపింపబడెను.

క్రీ. శ. 1203–04 లో వాల్గిన క్రూసేడు బైజాన్టిన్ సామ్రాజ్యముపై దండెత్తి కాన్‌స్టాంటినోపిల్‌ను ఆక్రమించుకొనినది. బైజాన్టిన్ పరిపాలకులు 1261 లో మరల కాన్‌స్టాంటినోపిల్‌ను ఆక్రమించుకొనిరి. కాని క్రైస్తవపరిపాలకులలో ఐకమత్యము లేకపోయినది. వారిమధ్య అంతఃకలహములు చెలరేగుటచే లాటిన్ సామ్రాజ్యపాలకులు 14, 15 శతాబ్దములలో వచ్చిన ఆటోమన్ తురుష్కుల నెదుర్కొనలేకపోయిరి. 1366 లో తురుష్కులు గలిపోలిని ఆక్రమించుకొనిరి. మొదటి మురాద్ అనునతడు ఆడ్రియానోపిల్‌ను ఆక్రమించుకొని దానిని తన ముఖ్యనగరము గావించుకొనెను. 1389 లో సెర్బియనులు వారి మిత్రులందరును, కొసావోలో జరిగిన యుద్ధమునందు పూర్తిగా ఓడింపబడిరి. 1393 లో బల్గేరియాకూడ తురుష్కుల పాలనములోనికి వచ్చినది. ఇట్లు తురుష్కపాలకులు 14 వ శతాబ్దములో పొందిన విజయముల ఫలితముగా బాల్కన్ ద్వీపకల్పము యావత్తు మాంటినీగ్రో తప్ప, వారి యధీనమున నుండినది. ఆల్బేనియా బోస్నియా పరిపాలకులు ఇస్లాం మతమునుకూడ స్వీకరించిరి. టర్కీపాలకులలో బలాఢ్యుడయిన రెండవ మురాద్ పాలనమున 1453 లో కాన్‌స్టాంటినోపిల్ తురుష్కుల వశమయినది. ఇట్లు టర్కీపాలనము ఈ ద్వీపకల్పమున సుమారు నాలుగు శతాబ్దములపాటు జరగినదే కాని ఆ సమయమున ఈ బాల్కన్ రాజ్యములలో ఎట్టి అభివృద్ధియు కానరాకుండెను.

19 వ శతాబ్ది ప్రారంభమునుండి తురుష్కులరాజ్యము పెక్కు ఇబ్బందులకు లోనగుటచే, ఈ ద్వీపకల్పమునగూడ వారి పాలనము క్రమక్రమముగ సడలిపోజొచ్చినది. అదే సమయమున ఐరోపాఖండమునందు కొన్ని రాజ్యములు అన్ని రంగములలో అభివృద్ధిని గాంచి తమ యాధిపత్యమును బాల్కన్ రాజ్యములపై తీసికొనిరాదలచి వారికి తురుష్కపాలనమునుండి విముక్తిని ప్రసాదింప సిద్ధపడినవి. అప్పటినుండి ఐరోపారాజ్యముల యొక్క జోక్యము ఈ బాల్కన్ దేశములపై కనబడుచున్నది. తొలుత ఈ యూరపురాజ్యములు బాల్కన్ ప్రజలు తురుష్కదాస్యశృంఖలములనుండి విముక్తి పొందుటకు వారితో సహకరించినను, 20 వ శతాబ్దములో చెలరేగనున్న బాల్కన్ యుద్ధములకు ప్రపంచసంగ్రామములందు బాల్కన్ రాజ్యములు పాల్గొనుటకుకూడ ఈ పశ్చిమరాజ్యములే కారకములని చెప్పవలసియున్నది. బాల్కన్ ద్వీపములో చెప్పుకొనదగినంత వ్యావసాయిక, పారిశ్రామిక సంపద లేనప్పు

టికిని, ఈ భూభాగము పెక్కు కలహములకు, యుద్ధములకు కేంద్రమయినది అందుకు మరొక కారణము ఈ రాజ్యభాగము ఆసియా, ఐరోపాఖండముల మధ్యనుండి వాటి రాకపోకలకు కీలకమయి యుండుటయే

ఆటోమను రాజ్యస్థితి క్షీణదశకు రాగానే బాల్కన్ రాజ్యములు యూరపుఖండముతో సంప్రదింపులు ప్రారంభించి స్వాతంత్ర్యోద్యమమునకు గడంగెను రష్యాప్రభుత్వముగూడ బాల్కన్ రాజ్యములను తురుష్కులపట్టునుండి విడిపింప ప్రయత్నింపగా, ఇంగ్లండు, రష్యనుల ఆధిపత్యమునరికట్టుటకుగాను కాన్‌స్టాంటినోపిల్ రష్యనుల వశము కాగూడదని టర్కీపాలకులను బలపరచినది రష్యా గ్రీసు స్వాతంత్ర్యమునకు కారకమయినదని గ్రేట్ బ్రిటన్, ఫ్రాన్సుదేశములు టర్కీకి సహాయపడి రష్యాతో క్రిమియన్ యుద్ధమును (1854-56) ప్రారంభించి రష్యానోడించినవి కాని టర్కీపాలనమునుండి గ్రీసు 1829 కే స్వాతంత్ర్యము పొందినది గ్రీసు చూపిన మార్గమును తక్కిన బాల్కన్ రాజ్యములన్నియు పాటించినవి బల్గేరియా 1908 లో స్వాతంత్ర్యము నందుటతో బాల్కన్ రాజ్యములన్నియు స్వేచ్ఛనుపొందినవి

బాల్కన్ రాజ్యములిట్లు స్వాతంత్ర్యమును పొందినప్పటికిని, వారి యభిమతము పూర్తిగా నెరవేరలేదు. అనగా ప్రతిరాజ్య మొక ప్రత్యేకదేశముగా, ప్రభుత్వముగా, పరిగణింపబడవలెననెడి కోరిక నెరవేరలేదు ప్రతిరాజ్యమునందును సరిహద్దుసమస్యలు ముమ్మరముగా చెలరేగినవి మాసిడోనియా, ఆల్బేనియా రాజ్యములపై టర్కీ ఇంకను ఆధిపత్యమును వహించుట తక్కిన బాల్కన్ రాజ్యములకు నచ్చలేదు ఈ యంతఃకలహములను అరికట్టుటకుగాను బెర్లిన్ నగరములో జరిగిన సమావేశమున సామరస్యమును బాల్కన్ రాజ్యము లేర్పాటుచేసికొనినవి కాని, ఈ సామరస్యము తాత్కాలికమే అయినది 1908 లో బల్గేరియా స్వాతంత్ర్యమును ప్రకటించినది 1908-09 లో టర్కీలో ఏర్పడిన మార్పులు కలహములుగా చెలరేగెను ఆస్ట్రియా ప్రభుత్వము బోస్నియా, హెర్జిగోవినా సంస్థానముల నాక్రమించెను 1910 లో ఉత్తర ఆల్బేనియా వాస్తవ్యులొక తిరుగుబాటును లేవదీసిరి మరునటి సంవత్సరమే టర్కీ, ఇటలీతో సాగించిన యుద్ధమువలన టర్కీ యొక్కబలము సన్నగిల్లెను. 1912 లో మాసిడోనియాలోని క్రైస్తవులను పెక్కురిని తురుష్కులు హత్యగావించిరి ఈ కారణముల ఫలితముగా 8-10-1912 న మొదటి బాల్కన్ యుద్ధము ప్రారంభమైనది

టర్కీతో జరుగనున్న ఈ యుద్ధమున బాల్కన్ రాజ్యము లెట్లైక్యమయినవో పరిశీలింపదగును మాసిడోనియాలో తిరుగుబాటు ఉద్యమమునకు ఒక సంస్థ స్థాపింపబడినది (The Internal Macedonian Revolutionary Organisation—I M R O) బల్గేరియన్ ప్రధాని సెర్బియా ప్రభుత్వముయొక్క సాయము నపేక్షించి యుద్ధప్రయత్నములను ప్రారంభించెను తొలుత గ్రీసురాజ్యము ఉదాసీనముగ నుండినప్పటికిని తర్వాత తక్కిన బాల్కన్ కూటమితో చేతులు గలిపినది మాంటినిగ్రోకూడ చేరుటతో ఈ కూటమి సమగ్రమయినది సరియైన వేళకు రష్యా సహాయముగూడ ఈ కూటమికి సిద్ధించినది ఈ బలముతో వీరు టర్కీ ఆధిపత్యమును తలక్రిందులుచేయ నుద్యమించిరి బాల్కన్ కూటమిట్లు బలము చేకూరుచుండగా, టర్కీలో కూడ యుద్ధప్రయత్నములు తీవ్రముగ జరుగుచుండినవి తురుష్క సేనానాయకులు తయారుచేసిన రక్షణ ప్రణాళికను తురుష్కప్రభుత్వము విసర్జించి బల్గేరియాపై ముట్టడిని ఆజ్ఞాపించెను తామే దండయాత్రను ప్రారంభించినచో కాన్‌స్టాంటినోపిల్ తమచేతులనుండి జారిపోజాలదని తురుష్కులు తలచిరి

**మొదటి బాల్కన్ యుద్ధము** ఈ యుద్ధము బాల్కన్ రాజ్యముల (బల్గేరియా, సెర్బియా, గ్రీస్, మాంటినిగ్రో) కూటమికిని, టర్కీకిని మధ్య జరిగినది యుద్ధప్రణాళిక ననుసరించి మాంటినిగ్రినులు స్కూటారిని వశపరచుకొనుట సెర్బియనులు మాసిడోనియానుండి తురుష్కులను పారద్రోలుట, బల్గేరియనులు థ్రాసులోని తురుష్కుల నోడించి కాన్‌స్టాంటినోపిల్ వైపు సేనలు నడిపించుట, గ్రీకులు సాలోనికాను వశపరచుకొనుట అనువిధులను బాల్కన్ రాజ్యములు తమలో తాము కేటాయించుకొనెను. ఈ నాలుగు బాల్కన్ సేనాదళము లొకేసమయమున తమ ముట్టడిని ప్రారంభించినవి తురుష్కులీ సేనాదళముల ధాటికేమాత్రము ఆగజాలకపోయిరి కిర్క్‌కిలిస్సా, లూలీబర్గాస్ మున్నగు ప్రాంతములలో చెలరేగిన సమరములందు తురుష్కులు బల్గేరియన్ల చేతులలో ఓడిపోయిరి ఒక నెలలోపుగనే తురుష్కులు పెక్కు సైనిక సావరములను కోల్పోయిరి, తమ నష్టములను తగ్గించుకొను

టకుగాను తురుష్కసేనలు చటాల్జాప్రాంతమున రక్షణ సౌకర్యముల నేర్పాటు చేసికొనినవి. పిమ్మట గ్రీకులు సాలోనికాను ఆక్రమించుకొనిరి. సెర్బియనులు తురుష్క సేనలను సముద్ర తీరమువరకు పారద్రోలి దురాజోవద్ద తమ స్థావరముల నేర్పరచుకొనిరి.

ఇట్లు ప్రణాళికాక్రమమును చక్కగా పాటించి బాల్కన్ రాజ్యసంస్థవారు టర్కీపై అఖండ విజయమును సాధించిరి. యుద్ధమునందు టర్కీ గెలువగలదని ఎవ్వరును తలచలేదు. కాని బాల్కన్ రాజ్యములకు అంత త్వరగాను సులభముగాను విజయము సిద్ధించుట అందరికి ఆశ్చర్యమును కలిగించినది. బాల్కన్ సంస్థకు వేగముగా విజయము సంక్రమించుటచే టర్కీ తాత్కాలికముగా యుద్ధవిరమణను జరుగవలెనని 1912 డిసెంబరులో కోరెను. తత్ఫలితముగా వెంటనే లండన్ నగరమున రెండు పక్షములలోని నాయకులు సమావేశముల నేర్పాటుచేసిరి. ఈ సమావేశములలో పాశ్చాత్య దేశనాయకులుగూడ పాల్గొనిరి. టర్కీ తన బాల్కన్ భూభాగమునంతయు (కాన్‌స్టాంటినోపిల్ తప్ప) కోల్పోవుటయేకాక యుద్ధమువలని నష్టపరిహారమునుగూడ బాల్కన్ సంస్థకు చెల్లింపవలెనని సమావేశసభ్యులు తెలియజేసిరి. ఈ షరతులను టర్కీ ప్రతినిధు లంగీకరింపనందువలన సంధి కుదరలేదు. మరల 1913 ఫిబ్రవరి నెలనుండి మే నెలవరకు యుద్ధము జరిగినది. ఈ యుద్ధఫలితముగా గ్రీకులు జనీనా భూభాగమును, బల్గేరియన్లు అడ్రియానోపిల్‌ను ఆక్రమించుకొనిరి. స్కూటారి యంతయు మాంటినిగ్రినుల వశమాయెను. మే నెలలో లండనునందు మరొక సమావేశ మేర్పాటు గావింపబడినది. దీని ఫలితముగా టర్కీ బాల్కన్ భూభాగమునందలి తన యాధిపత్యమును సంపూర్ణముగా కోల్పోయినదని చెప్పవచ్చును. ఈ యొప్పందమువలన అల్బేనియా యొక ప్రత్యేక సంస్థానముగా అంగీకరింపబడినది. మాసిడోనియాలో చాల భూభాగము సెర్బియా వశమైనది. బల్గేరియా, అడ్రియానోపిల్ పట్టణముసేగాక ఈజియన్ సముద్రతీర భూములను కూడ పొందగలిగినది. గ్రీసురాజ్యమునకు క్రీట్, సాలోనికా రాష్ట్రములు సిద్ధించినవి.

ఇట్లు మొదటి బాల్కన్ యుద్ధమువలన టర్కీనుండి ప్రతి బాల్కన్ రాజ్యము కొంత భూభాగమును పొందగలిగినను, అసూయాద్వేషములు వారిమధ్య వెంటనే చెలరేగినవి. గ్రీకు సేనలుమాత్రమే సాలోనికా భూభాగము నాక్రమించుటకు బల్గేరియా, సెర్బియాప్రభుత్వము లంగీకరింపక తమ సేనలకు కూడ అచ్చట స్థావరము లేర్పాటు చేయవలయునని పట్టుబట్టినవి. అల్బేనియానుగూర్చి మరొక తీవ్రమయిన సమస్య పొటమరించినది. మార్చి 1912 నాటికే టర్కీనుండి తా మాక్రమించుకొనబోవు భాగమునుగూర్చి బల్గేరియా, సెర్బియా రాజ్యములొక రహస్యమైన ఒప్పందమును కుదుర్చుకొనినవి. ఈ యొప్పందముప్రకారము అల్బేనియాయందలి చాలభాగము సెర్బియాకు చెందవలసియున్నది. అట్టిలాభము సెర్బియాకు సిద్ధించినచో అడ్రియాటిక్ సముద్రతీరమున దానికొక రేవు లభింపగలదు. కాని అల్బేనియా నొక ప్రత్యేకసంస్థానముగ స్థాపించుటచే సెర్బియాకోరిక నెరవేరలేదు. పైగా, సెర్బియాకొక రేవుపట్టణము లభించుట ఆస్ట్రియాప్రభుత్వమున కేమాత్రము ఇష్టములేదు. అందువలన సెర్బియాలో జరుగుచుండిన ఆస్ట్రియావ్యాపార ఒప్పందములన్నియు కుంటుపడగలవని తలచి, ఆస్ట్రియా, హంగేరి దేశములు సెర్బియాపై కక్షగట్టియుండెను. ఇట్లు సెర్బియాకుమాత్రము రహస్య ఒప్పందములోని లాభములేవియు సిద్ధింపలేదు. కాని, బల్గేరియాకు మాత్రము ఒప్పందములోని భూభాగములన్నియు లభించుటయేకాక, అడ్రియానోపిల్ మున్నగు భూభాగములుకూడ అదనముగ లభించినవి. వెంటనే సెర్బియా తాను బల్గేరియాతో చేసికొనిన ఒప్పందము చెల్లదనియు, నూతన ఒడంబడిక నొకదానిని సృష్టింపవలయుననియు పట్టుబట్టినది. ఈ వైషమ్యము వలన ఏప్రిలు 1913 నుండి సెర్బియా తక్కిన బాల్కన్ రాజ్యములపై యుద్ధప్రకటనమును కావించినది.

రెండవబాల్కన్‌యుద్ధము: మొదటి బాల్కన్‌యుద్ధమునందు బాల్కన్‌రాజ్యములు సమష్టిగా టర్కీతో పోరాడి ఓడింపగా, టర్కీనుండిలభించిన రాజ్యభాగమును పంచుకొనెడి విషయమున భేదాభిప్రాయములు కలిగి, మరుసటి సంవత్సరమే బాల్కన్‌కూటమియందు అంతర్యుద్ధము చెలరేగినది. ఈ అంతర్యుద్ధమునే చరిత్రకారులు రెండవబాల్కన్‌యుద్ధమని వ్యవహరింతురు. ఈ రెండవబాల్కన్‌యుద్ధప్రారంభమునకు సెర్బియాయొక్క దండయాత్ర నాంది యయినను, తక్కిన బాల్కన్‌రాజ్యములుకూడ అట్టి దండయాత్రకొరకు ఎదురుచూచుచుండినవనియే చెప్పవలయును. సాలోనికాసంస్థానము, ఈజియన్ సముద్రతీరభూముల విషయమై గ్రీకులు,

బల్గేరియనులు భేదాభిప్రాయములకు లోనయిరి అందువలన బల్గేరియాకూడ జూన్ నెలలో యుద్ధప్రకటనమును గావించినది ఇదేసమయమున రుమేనియా ఈ రంగమున ప్రవేశించి తనకుగూడ కొంత రాజ్యభాగము రావలసియున్నదని బల్గేరియాను హెచ్చరించినది ఇట్లు సెర్బియా, గ్రీసు, రుమేనియా లొకపక్షముగాను, బల్గేరియా మరియొక పక్షముగాను యుద్ధ సన్నాహములు గావించెను మాంటినిగ్రో, సెర్బియాపక్షమును చేరినది ఈ రెండవ బాల్కన్ యుద్ధము 1913 సం జూన్ 30 న ప్రారంభమయి జులై ఆఖరుకు అంతమయినది రుమేనియాగూడ సెర్బియా యొక్క మిత్రమండలిని చేరుటవలన బల్గేరియాకు ఓటమి తథ్యమయ్యెను జులై 21వ తేదీన బల్గేరియా రాజధాని యగు సోఫియాను సెర్బియా మిత్రమండలి ఆక్రమించుకొనునని భయపడి బల్గేరియా అస్త్ర ఉపసంహారమును కోరెను ఆగస్టు 10 న బుకారెస్టులో జరిగిన ఒప్పందము ననుసరించినది ఈ యదను బల్గేరియా టర్కీనుండి పొందిన చాలభూభాగమును కోల్పోయి చూచి టర్కీ, బల్గేరియా నుండి ఆడ్రియానోపిల్‌ను తన వశము గావించుకొనినది

బుకారెస్టులో జరిగిన ఒప్పందముప్రకారము (1) టర్కీ ఆధిపత్యము కాన్‌స్టాంటినోపిల్, ఆడ్రియానోపిల్ సంస్థానములపై మాత్రము ప్రవర్తిల్లవలయు ననియును, (2) సెర్బియా, మాంటినిగ్రోలు, బల్గేరియా రాజ్యభాగమును కొంత గ్రహించవలయుననియును, (3) సాలోనికాను గ్రీస్‌లో చేర్చవలయు ననియును (4) ఆల్బేనియా ప్రత్యేక సంస్థానముగా అంగీకరింపబడవలయుననియు తీర్మానింపబడినది కాని ఈ శాంతి ఒప్పందమువలన యూరపుఖండములో మరికొన్ని నూతన సమస్యలు తలయెత్తినవి

రెండవ బాల్కన్ యుద్ధమున తనకు లభించిన అఖండ విజయము కారణముగా సెర్బియాకు కలిగిన కీర్తిని ఆస్ట్రియా హంగరీరాజ్యములు సహింపలేదు. యూరప్‌లో చెలరేగిన మరికొన్ని విషమసమస్యల ఫలితముగా 1914 లో ప్రథమ ప్రపంచసంగ్రామము ప్రారంభమయినది

ప్రథమ ప్రపంచసంగ్రామము ఫలితముగా సెర్బియా రాజ్యము యుగోస్లేవియా యను నూతన నామమున విస్తరణము గావింపబడినది బల్గేరియా, ఈజియన్ సముద్ర తీరమును గ్రీసు రాజ్యమునకును, మరికొంత భాగమును యుగోస్లావియాకును కోల్పోయినది ఆల్బేనియా ప్రభుత్వము స్థిరపరుపబడినది రుమేనియాకూడ కొంత రాజ్యభాగమును పొందగలిగినది ప్రపంచ సంగ్రామానంతరము ఈ బాల్కన్ రాజ్యములు ప్రజాస్వామ్య పరిపాలనమును పాటించినను మరల జాతిభేదములు చెలరేగుటచేతను, 1929-30 లో బయలుదేరిన ఆర్థిక, వ్యవసాయరంగముల యందలి క్షీణదశ చేతను ఈ ప్రభుత్వములన్నియు నియంత్రిత పరిపాలనా సంస్థలుగా మార్పబడినవి

ఈ బాల్కన్ రాజ్యములలో జనాభాసమస్య క్రమక్రమముగా హెచ్చయినదే కాని, అదేక్రమమున పంటలు అభివృద్ధి కానందున ఆహార సమస్య కూడ తలచూపినది ఈ సమస్యను పరిష్కరించుటకుగాను బాల్కన్ ప్రభుత్వములు పారిశ్రామికాభ్యుదయమును హెచ్చించినవి బాల్కన్ రాజ్యములనుండి వ్యవసాయ పదార్థములను జర్మన్, ఇటలీ దేశములవారు కొనుగోలు చేసికొనుచు బాల్కన్ ఆర్థిక పరిస్థితి పైనను, రాజకీయ రంగమునను తమ ఆధిపత్యమును నిలబెట్టుకొనిరి బాల్కన్ రాజ్యముల మధ్యనుండిన ఎల్లల సమస్య ద్వితీయ ప్రపంచసంగ్రామమునకు పూర్వము మరల చెలరేగినది ఈ పరిస్థితినిచూచి తక్కిన దేశములవారు గూడ బాల్కన్ రాజకీయములలో తల చూపిరి 1939 లో ఇటలీ ఆల్బేనియాను ఆక్రమించుకొనినది రుమేనియాలోని కొంత భూభాగమును రష్యా, హంగేరి బల్గేరియాలు ఆక్రమించుకొనినవి ఆల్బేనియాలోని తన సైనిక స్థావరములనుండి ఇటలీ, గ్రీసుదేశములు 1940 అక్టోబరు 28 న దండెత్తగా జర్మనీ సేనలు యుగోస్లావియా, గ్రీసుదేశములను 1941 ఏప్రిల్ 6 న ముట్టడించినవి ఇట్లు ద్వితీయ ప్రపంచ సంగ్రామకాలమున, ఇటలీ జర్మన్ సేనలు బాల్కన్ భూభాగమునంతను ఆక్రమించుకొని యుండినవి సంగ్రామము ముగియునప్పుడు ఇంగ్లండు 1944 లో చేసికొనిన షరతుల ననుసరించి గ్రీసు రాజ్యముపై అన్నిరంగములలోను ఆధిపత్యమును చలామణి చేసికొనినది ఇట్టి ఆధిపత్యమును రష్యాకూడ రుమేనియా, బల్గేరియా, ఆల్బేనియా, యుగోస్లావియా అను రాష్ట్రీయులపై ప్రవర్తింపజేసినది 1947 నాటికి గ్రీసు తప్ప తక్కిన బాల్కన్ రాజ్యములవారు తమతమ దేశములందలి సార్వభౌమ పరిపాలనావిధానములను పూర్తిగా రద్దుచేసికొని కమ్యూనిస్టు పరిపాలనా పద్ధతిని స్థాపించుకొనిరి యుగోస్లావియామాత్రము కమ్యూనిస్టు పారిపాలనా విధానము ననుస

రించినను తన ఆంతరంగిక వ్యవహారములందు స్వాతంత్ర్యమును నెలకొల్పుకొని పాశ్చాత్య రాజ్యములతోకూడ పొత్తు కలిపియున్నది

ద్వితీయ సంగ్రామానంతరము బాల్కన్ రాజ్యములు పారిశ్రామిక సంపదను పెద్దపెట్టున విస్తీర్ణము గావింప కంకణము గట్టియున్నవి

ఆర్ రా

## బాల్టిక్ రాజ్యములు - (చ)

ఎస్తోనియా లట్వియా లిథుయానియా అను మూడు రాజ్యములు బాల్టిక్ సముద్రతీరమునం దుండుటచే, వీటికి బాల్టిక్ రాజ్యములను పేరు కల్గినది క్రీ శ 1939 వ సంవత్సరమువరకు స్వతంత్రముగనున్న ఈ దేశములు 1940 వ సంవత్సరములో సోవియట్ రష్యారాజ్యములో సోషలిస్టు రిపబ్లికులుగా అంతర్భాగములక్రింద విలీనములైనవి ఈ దిగువ మూడు బాల్టిక్ రాజ్యముల చరిత్ర సంక్షిప్తముగ పేర్కొనబడినది

ఎస్తోనియా ఈ దేశము బాల్టిక్ రాజ్యములందు ఉత్తర దిశాగ్రమున నున్నది భౌగోళికముగా ఇది తక్కినబాల్టిక్ రాజ్యముల లక్షణములనే పోలియున్నది దీని వైశాల్యము 18,000 చ మైళ్ళు 1,60,000 మంది ప్రజలుగల టాలిన్ నగరము ఈ దేశమునకు రాజధాని ఇచ్చట నొక విశ్వవిద్యాలయము కలదు ఈ దేశపు జనాభా 12 లక్షలు ఇచ్చటి ప్రజలు ఫిన్నో-యుగ్రియన్ మిశ్రమైన ఎస్తోనియను భాషను మాట్లాడుదురు వీరు క్రైస్తవమతమునందలి వేర్వేరుశాఖలను అనుసరింతురు డ్వినా అనునది ఈదేశమందలి నదులలో నెల్ల మిక్కిలి పొడవైనది

ఎస్తోనియాజాతీయులు క్రీ పూ ఈ దేశమునకు తరలి వచ్చి తమ నివాసముల నేర్పరచుకొనినట్లు చరిత్రవలన తెలియుచున్నది

ప్రథమ ప్రపంచ యుద్ధానంతరము స్వతంత్రరాజ్యముగా అవతరించిన ఈ చిన్నదేశము, రెండుశాబ్దములు సర్వతంత్రప్రతిపత్తిననుభవించి 1940 వ సం లో సోషలిస్టు రిపబ్లికుగా ఐచ్ఛికముగా సోవియట్ రష్యారాజ్యములో విలీనమయ్యెను

13 వ శతాబ్దిలో ఎస్తోనియనులను జాతివారిని జర్మను దేశమునకుచెందిన "ట్యుటానిక్‌నైట్స్" అను యుద్ధవీరులు జయించి, వారిని తమ బానిసలనుగా నొనర్చుకొనిరి ఆ తరువాత 1621 లో ఈ రాజ్యము స్వీడను ప్రభువుల అధీనమయ్యెను దానితో జర్మను ధనికభూస్వాముల ప్రాబల్యము కొంత మేరకు సన్నగిల్లెను కాని 1721 వ సంవత్సరానంతరము ఎస్తోనియాలో స్వీడను అధికారము అంతమొందె దాని స్థానములో రష్యాయొక్క సామ్రాజ్యాధిపత్యము నెలకొనెను తత్ఫలితముగా ఎస్తోనియనుప్రజలు ఒకవంక జర్మను ధనికభూస్వాములైన 'బాల్ట్స్' అను వర్గము వారికిని, మరియొకవంక రష్యా సామ్రాజ్యాధికారులకును దాస్య మొనర్ప వలసినవారైరి వీరి నిరంకుశాధికారము దాదాపు ప్రథమ ప్రపంచ సంగ్రామాంతము వరకు కొనసాగెను యుద్ధానంతరము ఎస్తోనియా స్వతంత్రరాజ్యముగ ప్రకటింపబడెను

ద్వితీయ ప్రపంచయుద్ధము ప్రారంభమైన తొలిమాసములలో, ఈ దేశము ప్రజాభిప్రాయము ననుసరించి, సోవియట్ రష్యా మహారాజ్యములో అంతర్భాగమైన 16 వ సోషలిస్టు రిపబ్లికుగా విలీనమయ్యెను ఈ రిపబ్లికు రాజ్యాంగ విధానము సోవియట్ రాజ్యాంగ విధానమును పోలియుండును

ఈ రిపబ్లికునందలి ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు విద్యావంతులై యున్నారు 1949 లో కమ్యూనిస్టు ప్రభుత్వముయొక్క ఆధిపత్యమున సమష్టి వ్యవసాయ విధానము ప్రవేశపెట్టబడినది సామ్యవాద పాలనముక్రింద ఈ రిపబ్లికు ప్రజలు విశేషముగ నాగరికులై, సుఖజీవనమును గడుపుచున్నారు ఇచ్చట సోషలిస్టు రాజ్యమును స్థాపించుటకు పూర్వము అధికసంఖ్యాకులైన ప్రజలు క్రైస్తవమతమందలి లూథరన్ శాఖకు చెందియుండిరి

**లట్వియా** . ఈ రిపబ్లిక్ రాజ్యము బాల్టిక్ దేశముల నడుమ నున్నది ఇదికూడ తక్కిన బాల్టిక్ దేశముల లక్షణములనే కలిగియున్నది దీని వైశాల్యము 25,395 చ మైళ్ళు జనసంఖ్య సుమారు 22 లక్షలు 4 లక్షలు జనాభాగల 'రిగా' నగరము ఈ రిపబ్లికునకు రాజధాని ఇచ్చటి ప్రజలు లట్వియన్ భాషను మాట్లాడుదురు క్రైస్తవమతమందలి వేర్వేరు శాఖలను వీరు అవలంబించుచున్నారు

లట్వియా జాతీయులు ప్రాచీన ఆర్యజాతికి చెందినవారు వీరు ప్రప్రథమమున బాల్టిక్ సముద్రతీరమునకు తరలి వచ్చి, అరాజక జీవితమును గడపుచు, కేంద్ర ప్రభుత్వ మనునది లేకుండుటచే, శక్తిమంతులైన పరరాజ్యముల ప్రభువు

లకు సులభముగా లొంగిపోవలసినవారైరి మొట్టమొదట 1158 వ సంవత్సరములో జర్మను ట్యుటానిక్ యుద్ధవీరులు వీరిని జయించి, ఆ ప్రాంతమును లివోనియా, కోర్లెండ్ అను రెండు రాజ్యములుగ విభజించి పరిపాలనమును నెరపిరి 1562 లో ఈ రాజ్యములను పోలెండు ప్రభుత్వము జయించి, 1795 వరకు కోర్లెండులో పరిపాలనమును కొనసాగించెను కాని లివోనియాపై ఆధిపత్యము విషయములో స్వీడనుకు, పోలెండునకు 1562 నుండి 1629 వరకు వివాదము కొనసాగుచునే యుండెను లివోనియా ప్రాంతమును 1629 వ సం॥ నుండి 1721 వరకు స్వీడిష్ ప్రభుత్వము తన ఆధీనమునందుంచుకొని ఏలుచుండెను 1721 వ సంవత్సరమునందే లివోనియాను రష్యా తన స్వాధీనములోనికి తీసికొని, అనంతరము 1795 లో కోర్లెండునుగూడ జయించెను ఆనాటినుండి 1918 వ సంవత్సరము వరకు లట్వియనులు రష్యా పాలనము క్రింద దాస్యమనుభవించుచు నుండిరి కాని ఈ పరదాస్యమందుకూడ వారు తమ భాషాసంప్రదాయములను, జానపద సాహిత్యమును భద్రపరచుకొని పోషించుకొనుచు వచ్చిరి 1917 లో రష్యాలో ఘటిల్లిన సోషలిస్టు విప్లవము లట్వియా స్వాతంత్ర్యసంపాదనమునకు చక్కని అవకాశము కల్పించిన ఫలితముగా 1918 నవంబరులో లట్వియా దేశమొక రిపబ్లికు ప్రభుత్వముగా ప్రకటింపబడెను ఈ స్వతంత్ర రిపబ్లికు పరిపాలనము రెండు దశాబ్దములుపైగా కొనసాగిన అనంతరము ఎస్తోనియా దేశమువలెనే, లట్వియా 1940 వ సంవత్సరంలో సోషలిస్టు రిపబ్లికుగా సోవియట్ రష్యాలో అంతర్భాగముగా విలీనమయ్యెను 1941 నుండి 1944 వరకు ఈ ప్రాంతమునాక్రమించియుండిన జర్మను సైన్యములు రష్యనులచే తరుమబడిన అనంతరము అచ్చట సోషలిస్టు పరిపాలనావ్యవస్థ సుస్థిర మొనర్పబడెను

ఈ దేశప్రజలలో అత్యధికులు అక్షరాస్యులేకాక, విద్యావంతులుకూడనై యున్నారు రాజధానియగు రిగా నగరమునందొక విశ్వవిద్యాలయము కలదు 1947 లో కమ్యూనిస్టు రాజ్యాంగ ప్రణాళిక ననుసరించి దేశములో సమష్టి వ్యవసాయ విధానము ప్రవేశపెట్టబడెను వారి ప్రాచీనవాఙ్మయము విశేషముగా జానపద గేయరూపములో నుండెను 19 వ శతాబ్దిలో ఘటిల్లిన జాతీయచైతన్యము ఫలితముగా ఈ దేశములో సాహిత్యాభివృద్ధి అధికముగా జరిగెను సోషలిస్టు పరిపాలనముక్రింద ఈదేశప్రజలు సుఖజీవనము చేయుచున్నారు

విథుయానియా ఈ రిపబ్లికురాజ్యము బాల్టిక్ రాజ్యములన్నిటిలో దక్షిణదిశాగ్రమందున్నది ఇది యొక పల్లపు ప్రాంతము, ఉత్తర ఐరోపా మైదానములో ఇది చేరియున్నది ఇందు వేలకొలది చిన్న సరస్సులు కలవు ఇచట అడవు లధికముగ నుండును భూమి చిత్తడిగ నుండును నీమెన్ అను నది యొకటి కలదు ఇది దేశమునందలి ప్రధానమగు నది లట్వియనులు, ప్రాచీన ప్రష్యనులు మేళనమునొంది విథుయానియా జాతీయులుగా పరిణామ మొందిన ఈ దేశీయులు 'స్లవ్' జాతిని పోలు బాల్టిక్ ప్రజాసముదాయముగా రూపొందిరి వీరు క్రీస్తుశకమునకు పూర్వమే ఇచ్చటకువచ్చి నివాస మేర్పరచుకొనిరి

ఈ దేశముయొక్క విస్తీర్ణము సుమారు 22,958 చ మైళ్ళు, జనాభా 30 లక్షలు వీరందరు విథుయానియన్ అను భాషను మాట్లాడెదరు 1,82,000 జనసంఖ్య గల విల్నా అనునది ఈ దేశమునకు రాజధాని

మధ్యయుగములో ఈ దేశము రాజకుటుంబమునకు చెందిన వైవాహిక బాంధవ్యముల మూలముగా పోలెండు రాజ్యమునకు చేర్చబడినది క్రీ శ 1410 లో పోలెండువారు, విథుయానియావారు తమ సైన్యములను సమీకరించి, టానెన్ బర్గువద్ద జర్మను ట్యుటానిక్ యుద్ధవీరులను ఓడించిరి తదుపరి తమ పాలనాధికారమును రష్యాదేశములో సహితము చాలవరకు విస్తృతము గావించుకొనిరి 1795 వ సంవత్సరములో మూడవసారి పోలెండుదేశము విభజింపబడిన తరువాత విథుయానియా దేశము రష్యా పాలనాధికారముక్రిందికి పోవలసి వచ్చెను 1918 వ సంవత్సరమువరకు, అనగా మొదటి ప్రపంచ సంగ్రామానంతరమువరకు విథుయానియను ప్రజలు తమ స్వాతంత్ర్యమును బడయలేదు

1940 లో విథుయానియా ఇచ్ఛికముగా సోవియట్ సోషలిస్టు రాజ్యములో రిపబ్లికుగా విలీనమయ్యెను కాని జర్మను ఫాసిస్టుసైన్యములు, సోవియట్ యూనియనుపై దండెత్తిన సందర్భములో, 1940 వ సంవత్సరములో ఈ చిన్న రాజ్యమును ఆక్రమించి 1944 వరకు అచ్చటనే తిష్ఠవేసి ఉండెను 1944 లో రష్యా ఎర్రసైన్యములు జర్మనులను పారద్రోలి విథుయానియాను నిష్కంటక మొనర్చెను

ఈ రిపబ్లికుయొక్క రాజ్యాంగ విధానము సోవియట్ సోషలిస్టు రాజ్యాంగ విధానమునే అనుసరించి యుండును ఆర్థిక, రాజకీయ, సాంఘిక, విద్యా, సాంస్కృతిక, సాహిత్య రంగములలో ఈ దేశప్రజలు అభివృద్ధిని సాధించి సుఖజీవనమును గడపుచున్నారు

ఆర్. సూ

## బాష్ప ఇంజనులు - టర్బయినులు

నీటిచక్రములు 2 వేల సంవత్సరములక్రితమే ఉపయోగములోనుండెను ఈజిప్టుయందలి ప్రాచీనులు ధాన్యమును, గోధుమలను విసరుటకు నీటిని ఉపయోగించినట్లు శిలాలిఖితములనుబట్టి తెలియవచ్చినది 19 వ శతాబ్దివరకు నీటిచక్రములను గోధుమలను విసరుటకును, వస్త్రములను నేయుటకును వినియోగించుచుండిరి ప్రాచీనకాలములో నీటిచక్రము కలపతో తయారయ్యెడిది అంచునకు తెడ్డు లమర్పబడినవి నీటి ప్రవాహమువలన తెడ్డులు కదిలెడివి ఇనుము, ఉక్కు కనుగొనబడిన తరువాత, వాటిచే నీటిచక్రములు తయారగుట ప్రారంభమయ్యెను

జలశక్తిని వినియోగించుట ప్రాచీనకాలమునుండియు ముఖ్యమైన విషయముగా పరిగణింపబడినది విద్యుద్యంత్రములను కనుగొనినపిమ్మట, వాటిద్వారా దూరప్రాంతములకు విద్యుచ్ఛక్తిని సరఫరాచేయుటకు ప్రారంభించిన తర్వాత, నీటిచక్రముల (నీటి టర్బయినులు) ప్రాముఖ్యము అధికమయినది ప్రస్తుతము నీటిటర్బయినులు జలవిద్యుత్కేంద్రములలో విద్యుద్యంత్రములను నడుపుటకే ప్రధానముగా ఉపయోగింపబడుచున్నది ఒక పౌనుబరువుకల నీరు H అడుగులనుండి పడినచో H అ పౌ శక్తిజనించును ఒకక్షణమునకు ఒక ఘనపుటడుగునీరు ప్రవహించుచో, అనగా 62 4 పౌనులనీరు - అందులోనిశక్తి 62 4 H అ పౌనులుండును Q ఘనపుటడుగులనీరు క్షణమునకు H అడుగుల ఎత్తునుండి పడుచో, ఈ దిగువ పేర్కొనబడిన అశ్వశక్తి జనించును

$$\frac{62\ 4}{550 \times n}\ Q\,H \qquad (1)$$

నీరు గొట్టములద్వారా, టర్బయినులద్వారా ప్రవహించుటచే, కొంతశక్తి నష్టమగును అందుచే పై సూత్రములో n ఉపయోగింపబడినది సాధారణముగా దీని విలువ 0 80 అయి యుండును పైసూత్రమునుబట్టి ఒక అశ్వశక్తి జనించుటకు, ఎత్తు ఎక్కువగనున్నచో, తక్కువనీరును, తక్కువగ నున్నచో, ఎక్కువనీరును అవసరమని స్పష్టమగుచున్నది

టర్బయినులు విద్యుద్యంత్రములను నడపుటకుమాత్రమే ఉపయోగింపబడుటచే వాటివేగము (N=R P M) ఈక్రింది సూత్రమునకు అనుగుణముగ నుండవలెను

$$PN = 120\ F \qquad (2)$$

P= జనరేటరుయందుండు ధృవములసంఖ్య (సమసంఖ్య)

N= నిమిషమునకు తిరుగుచుట్లు

F= క్షణమునకు చేయు ఆవృత్తులు

భారతదేశములో F విలువ 50, మైసూరులో కొంత ప్రాంతమున 25, ఐరోపాలో పెక్కుభాగములందు 50, ఇటలీలో కొన్నిప్రాంతములందు 42, అమెరికాలో పలుతావులందు 60, కొన్నిస్థలములలో 25, 50 కూడ ఉపయోగమున నున్నది

కొన్ని సందర్భములందు విద్యుత్కేంద్రము రెండు ఆవృత్తుల వరకు పనిచేయవలసి యుండును ఇది ఒకేసారిగాక, వేరువేరు సమయములందు సంభవించును అట్టిసమయములలో రెండు ఆవృత్తులకు అనుకూలపడునట్లు టర్బయినును, జనరేటరును తయారుచేయవలెను

ప్రస్తుతము ఒక మైలు ఎత్తునుండికాని, కొన్ని అడుగుల ఎత్తునుండికాని పడు నీటిని టర్బయినులను నడుపుట కుపయోగింపవచ్చును 6 50 000 అశ్వశక్తిని ఉత్పత్తిచేయు టర్బయినులు ఇటీవల నిర్మింపబడినవి ఇంకను ఎక్కువశక్తిగల టర్బయినులను నిర్మింపవచ్చును, కాని రైలు రోడ్లు మోయు బరువులకు పరిమితి కలదు సాధారణముగా టర్బయినులు రెండు తరగతులుగా నిర్మింపబడుచున్నవి ఈ రెండు తరగతులలో మరల విభాగములు కలవు




ప్రస్తుతము ఎక్కువ ఉపయోగములో నున్నది ఒక ఇంపల్స్ టర్బయిను మాత్రమే దీనిని పెల్టన్ అనికూడ పిలుతురు ఫ్రాన్సిస్‌టర్బయినులో నీరు వర్తులమధ్యముగా ప్రవ

హించును ప్రొపెల్లరులో నీరు అజాకారములో ప్రవహించును ఈ రెండిటికి నడుమ డెరియజ్ అనువది కలదు ఏరకపు టర్బయినును ఎట్టిపరిస్థితులలో ఉపయోగింపవలెనను విషయము ఈ క్రింది అంశములపై ఆధారపడును

నీరెంత ఉన్నది?

ఎంతశక్తిగల టర్బయిను కావలెను?

నీరెంత ఎత్తున నున్నది?

దానిమట్టము ఎట్లుమారును?

విద్యుత్కేంద్ర మెచ్చట నిర్మింపబడినది?

నీటిస్వభావము (ఇసుక ఉన్నదా? ఎంత?)

భూమి రాతిప్రాంతమా లేక సులభముగ త్రవ్వుటకు సాధ్యమగునదియా?

పై పరిస్థితులనుబట్టి చూచినచో పందలాది టర్బయినులను నిర్మించుటకు అవకాశమున్నది టర్బయినుల నిర్మాణమును వర్గీకరణ మొనర్చుటకు ఈ క్రిందిసూత్ర ముపయోగములో నున్నది

$$Ns = N\sqrt{HP}/H^{\frac{5}{4}} \qquad (3)$$

N = (R P M) భ్రమణవేగము (నిమిషమునకు)

H + P = అశ్వశక్తి

H = ఎత్తు (అడుగులలో)

Ns = విస్పష్టవేగము దీని విలువ తెలిసినచో, టర్బయినుయొక్క ఆకారమును, కొలతను తెలిసికొనవచ్చును

$$Ns(\text{మెట్రిక్}) = 4.45 \times Ns(F\,P\,S)$$

పారిశ్రామికులు Nsను నిర్ణయించుటకు ప్రయోగాత్మక సిద్ధాంతములను తయారుచేసినారు (4)

$$\text{పెల్టన్} - Ns = \sqrt[2\frac{8}{4}]{4}$$

$$= \frac{175M/^{\frac{3}{4}}}{\sqrt{M\ P}}$$

$$Ns = \frac{5050}{19+32} + 19 (1915 - 1930)$$

$$\text{ప్రొపెల్లర్} \quad = \frac{650}{\sqrt{4}}$$

$$Ns = \frac{7000}{H+32} + 35$$

$$Ns = \frac{316}{\sqrt[4]{H}}$$

$$\text{కప్లాన్} \quad Ns = \frac{500}{\sqrt[4]{H}}$$

ఎక్కువ వేగముగల టర్బయినుల యొక్క ఉత్పత్తి వ్యయము తక్కువగుటచే, సాధారణముగా ఐరోపా ఖండ పారిశ్రామికులు అట్టి టర్బయినులను నిర్మింతురు అమెరికాలో కార్మిక వేతనములు హెచ్చగుటచే హెచ్చు సామగ్రితో తక్కువ వేగముగల టర్బయినులను నిర్మించుట వారికి లాభకరము పై సూత్రములవలన, టర్బయిను యొక్క Ns తెలిసినచో, ఎత్తు, అశ్వశక్తి, మొదటనే నిర్ణయించబడిన దాని రూపము, ఆక్రమించు స్థలము, వివిధ భాగముల పరిమాణము ప్రవర్తనము మున్నగు విషయములను నిర్ణయింప వచ్చును

పెల్టను టర్బయిను 1000 అడుగులపై ఎత్తున ఉపయోగింప బడుటచే, ఒక అశ్వశక్తిని ఉత్పత్తి చేయుటకు తక్కువనీరు చాలును కప్లానును తక్కువ ఎత్తులకు ఉపయోగించుటచే, హెచ్చునీరు అవసరము

1000 అడుగుల ఎత్తునుండి నీరు వచ్చునపుడు, 1000 అశ్వశక్తి జనించుటకు క్షణమునకు 7.5 ఘనపుటడుగుల నీరు కావలెను, 100 అడుగుల ఎత్తునుండి వచ్చునపుడు 75 ఘనపుటడుగుల నీరు ఒక్కొక్క క్షణమున కవసరము హెచ్చునీరు ప్రవహించవలసి వచ్చునపుడు, టర్బయిను పరిమాణము కూడ హెచ్చుగా నుండవలెను

ఇంపల్స్ టర్బయినులకు నీరువచ్చు గొట్టముల చివర ఒకతూము (Nozzle) ఉండును ఆ తూములో ఒక సూది ముందుకు, వెనుకకు కదలుటచే, నీటి పారుదల అదుపులో నుండును తూమునుండి వచ్చునీరు ఒకదళసరి పళ్లెములంచున అమర్చబడిన బొక్కెనలమీద పడునట్లు ఏర్పరుపబడును ఎత్తునుండి వచ్చు నీటియందలి చలనశక్తి బొక్కెనలకు బదిలీయై చక్రము తిరుగును

ఈ బొక్కెనలు సాధారణముగా ఉక్కుతో చేయబడును రెండు బొక్కెనలు – ఒక దాని ప్రక్కన మరొకటి – అమర్పబడుచో, వాటిమీదికి వచ్చు నీరు చిందకుండ విసర్జనమగును

అడ్డముగా అమర్చబడిన (ఇంపల్స్) టర్బయినులో రెండు నీటి ధారలు (Jets) ఉపయోగింప బడును జనరేటరు – టర్బయిను ఎల్లపుడును ఒకే వేగములో కదలవలెను ఈ విలువ 4,3,2 సూత్రముల మీద ఆధారపడియుండును. జనరేటరుమీద పడు భారము మారు

వపుడు టర్బయినునుండిపోవు నీటిపరిమాణము కూడ మార్చవలెను బరువు హెచ్చిన కొలది వేగము తగ్గుచుండును తూములోని సూదిని ముందునకు వెనుకకు కదలించుటచే నీటి పరిమాణమును మార్చవచ్చును ఇది 'గవర్నరు' చేయుపని

జనరేటరుమీది భారము తీసివేయబడినపుడు, వీలయినంత త్వరలో నీటి ప్రవాహమును కట్టివేసి, జనరేటరును ఆపవలెను నీరు అతి దీర్ఘములయిన గొట్టములనుండి వచ్చుటచే, నీటి ప్రవాహమును త్వరగా ఆపుట కష్టము అందుచే జనరేటరుమీద భారము తగ్గగనే, ధారలు బొక్కెనల మీద పడకుండ గవర్నరు తప్పించును ఇంకను చక్రము తిరుగుచునే యుండును అందుచే బొక్కెనల వెనుకభాగముమీద వేరొకధార పడును.

చక్రమునుండిపడు నీరు విద్యుత్కేంద్రము వెలుపలికి పోవలెను చక్రముయొక్క క్రిందిభాగమునకును, పైకిపోవు నీటిమట్టమునకును మధ్యగల దూరము కనీసము 6 అడుగులుండవలెను ఈ ఎత్తు ఒకే విధముగ నున్నపుడు, వరదల కాలములో ఘటిల్లు నీటి ప్రవాహపుటెత్తును గూర్చి కూడ విచారింపవలెను

నిలువుగా ఏర్పరుపబడిన టర్బయినులకు 2 నుండి 6 వరకు ధారలుపయోగింపవచ్చును ఎక్కువ ధారలున్నచో హెచ్చువేగముండును హెచ్చు వేగముగల టర్బయిను-జనరేటరు యొక్క ఖరీదు తక్కువగ నుండును పరిమాణములు తగ్గుటచే, స్థావర నిర్మాణ వ్యయము కూడ తక్కువగా నుండును అడ్డముగ అమర్చబడు టర్బయినుల స్థావరముల యందు

(a) ఒకధారకల ఒక టర్బయిను

(b) రెండుధారలుగల ఒక టర్బయిను

(c) రెండు టర్బయినుల మధ్య ఒక జనరేటరును ఒక్కొక్క టర్బయిను యందు ఒకటి లేక రెండు ధారలను అమర్చెదరు

టర్బయినును నిలువుగా అమర్చవలెనా, లేక అడ్డముగా అమర్చవలెనా అను విషయము విద్యుత్కేంద్రాధికారుల నిర్ణయముమీద ఆధారపడును ప్రస్తుతకాలములో నిలువుగా అమర్చుటయే సాధారణమైన విధానమైనది అడ్డపు నిర్మాణములు 2000 అ ఎత్తున నున్నపుడు, ఒక రన్నరుకు ఒకధార ఉండును రెండు ధారలను ఉపయోగింపవలసినప్పుడు, రెండు గవర్నరులను ఏర్పరచెదరు

రియాక్షను టర్బయినులకు సరఫరాయగు నీటికి కొంత చలనశక్తియు, కొంత ఒత్తిడి శక్తియునుండును ఈ రెండు శక్తులు చక్రముమీద పనిచేయును సాధారణముగా రియాక్షన్ టర్బయినును నాలుగు భాగములక్రింద విభజింపవచ్చును– 1 కేసింగ్, 2 నీటి పరిమాణమును మార్చుటకు కదలెడి తలుపులు 3 చక్రము, 4 డ్రాఫ్ట్ ట్యూబు

నీటిగొట్టము స్క్రాల్ కేసులకు అతుకబడును రన్నరులోనికి, చుట్టునుగల తలుపులనుండి వచ్చునీరు ఒకేపరిమాణములో నుండవలెను అందుచే కేసింగువ్యాసము మొదట హెచ్చుగనుండి రానురాను తగ్గవలెను కేసింగునుండి నీరు ద్వారములద్వారా చక్రమునకు పోవును చక్రమునకు ద్వారములు అమర్చబడియుండును చక్రమునకు ఈ ద్వారముల ద్వారాపోవు ప్రవాహమును ఎక్కువకాని, తక్కువకాని చేయవచ్చును, పూర్తిగా అరికట్టవచ్చునుకూడా అట్టి మార్పులను గవర్నరుచేయును

ఫ్రాన్సిస్ టర్బయినుతో నీరు ద్వారములనుండి రన్నరులోనికి పోవును వర్తులమధ్యముగా అచ్చటనుండి డ్రాఫ్ట్ ట్యూబునకు పోవును. పూర్వము ఫ్రాన్సిస్ టర్బయినును 800 అడుగులకంటె తక్కువ ఎత్తుగానున్న తావుల కుపయోగించెడివారు ప్రస్తుతము 1600 అడుగులవరకు ఉపయోగించుచున్నారు 1000–1600 అడుగుల ఎత్తులలో ఫ్రాన్సిస్ టర్బయినునుకాని లేక ఇంపల్స్ టర్బయినునుకాని ఉపయోగింపవచ్చును

ఎక్కువ ఎత్తు (తక్కువ $N_s$) నుండి తక్కువ ఎత్తు (హెచ్చు $N_s$) నకు మారునప్పుడు రన్నరుయొక్క రూపము మారును ఫ్రాన్సిస్ టర్బయినుయొక్క ద్వారములనుండి బయలుదేరు మధ్యరేఖ రన్నరుద్వారా పోవును $N_s$ హెచ్చినకొలది, ఈ రేఖనుండి రన్నరు క్రిందిభాగమువరకు నడుమగల దూర మెక్కువగును, పై భాగము తగ్గును ప్రొపెల్లరు టర్బయినులో రెక్కలు స్థిరమైన స్థానములోనుండును ఈ రేఖనుండి రెక్కలు చాల దూరములో నుండును ద్వారమునుండి నీరు వేగముతోవచ్చి, అచ్చటనుండి అక్షాకారములో తిరిగి రెక్కలద్వారా పైకి వెలువడును ఫ్రాన్సిస్టర్బయినుమీద పడు భారమునుబట్టి

నీటిపారుదలను మార్చవలెను ఈ మార్పు తలుపులను మూయుటవలన, తెరచుటవలన జరుగును ఈ పనియంతయు గవర్నరువలన జరుగును ప్రవాహాజలపరిమాణము ద్వారము లచే క్రమబద్ధమొనర్పబడును సాధారణముగా నీటిఎత్తు మారక 100 అడుగుల వరకుమాత్రమే ఉన్నప్పుడు ప్రొపెల్లరు-టర్బయిను లుపయోగింపబడును

కప్లాను టర్బయినులో రెక్కలయొక్క కోణమును మార్చవచ్చును ఇందు ద్వారములు, రెక్కలుకూడ కదలును బరువులయొక్క అవసరములను బట్టి ద్వారములు మారు చుండును సామర్థ్యమును పెంచుటకు రెక్కలయొక్క కోణమును మార్చవలెను ఇట్టి మార్పులు గవర్నరువలన జరుగును ఎత్తులో ఎక్కువగమార్పు లున్నప్పుడు ఈ టర్బయి నులు వాడబడను ప్రస్తుతము 280 అడుగుల ఎత్తువరకు ఈ టర్బయినులు ఉపయోగపడుచున్నవి

రియాక్షను టర్బయిను నుండి వెలువడు నీటిలో చలన శక్తి ఇంకను అధికముగ ఉండును దీనిని వినియోగించుటకు L ఆకారముగల డ్రాఫ్ట్‌ట్యూబును ఉపయోగింపవలెను మొదటిభాగములో చక్రము యొక్క వ్యాసమును, ట్యూబు యొక్క వ్యాసమును సమానముగా నుండును రానురాను వ్యాసము హెచ్చుచేయబడును అడుగుభాగములో ఈఆకృతి వర్తులాకారమునుండికూడ మారును ప్రవాహాజలమునందు సుడులుండ కూడదు

కప్లాను టర్బయినులనుండిపోవు నీరు చాలహెచ్చుగ నుండుటచే ఒక నమూనాను తయారుచేసి దానినుండివచ్చు ప్రయోగఫలితములమీద ఆధారపడి డ్రాఫ్ట్‌ట్యూబును తయారు చేయుదురు రన్నరునుండి నీరు అధిక వేగముతో వచ్చుటచే డ్రాఫ్ట్‌ట్యూబుయొక్క ముందుభాగము రాపిడివలన అరిగి పోవును దీనిని తగ్గించుటకు ఉక్కు రేకులు ముందుభాగములో బిగింపబడను కొన్ని పరిస్థితులందు తలుపులు చక్రముమీద కొంత నీటిఒత్తిడిని కల్గించవలసిన అవసరమేర్పడును డ్రాఫ్ట్‌ట్యూబులన్నిటినుండి వెలువడు నీటిమట్టము రన్నరుమట్టము కంటె హెచ్చుగా నుండును ఇట్టిపరిస్థితి సాధారణముగా రియాక్షను టర్బయినును ఎక్కువ ఎత్తున కుపయోగించు నప్పుడే ఏర్పడును ఎంత ఎత్తున ఉంచవలసినదియు, Ns రెక్కలరూపము, విద్యుత్కేంద్రము సముద్రమట్టమున కెంత ఎత్తున నున్నదియు, బాహ్య ఉష్ణోగ్రతమీద ఆధారపడును రియాక్షనుటర్బయినులు సాధారణముగా నిలువుగా ఏర్పాటు చేయబడును కొన్ని సందర్భములలో ఫ్రాన్సిస్ టర్బయినులు అడ్డముగా అమర్చబడును

ప్రస్తుతము కప్లాన్‌టర్బయిను 280 అడుగుల ఎత్తునకు ఉపయోగపడుచున్నదని ఇదివరకే తెలిసికొంటిమి హెచ్చు పరిమాణము ఎక్కువగను, రెక్కలు కురుచగను చేయబడ వలెను రెక్కలపై కాల్యము తగ్గుటచే అది విశేషభారమును మోయవలసియుండును ఇంకను ఎక్కువ ఎత్తుగల ప్రదేశము లకు నీటి నుపయోగించుట కష్టసాధ్యము ఈ ఆటంకములను తప్పించుకొనుటకు రెక్కలను హబ్బుకు ఒక కోణమునందు అమర్చవచ్చును ఇదియే డెరియజ్ చక్రము రెక్కలు ముడుచు కొన్నప్పు డది అర్ధగోళమువలె కన్పట్టును ఇట్టి డెరియజ్ చక్రమును 800 అడుగుల ఎత్తువరకు ఉపయోగింపవచ్చును ఇట్టిచక్రములను టర్బయినులుగా గాని, పంపులుగా గాని ఉపయోగింపవచ్చును ప్రస్తుతము 1600 అడుగుల ఎత్తు వరకు ఫ్రాన్సిస్ టర్బయినులనుపయోగింపవచ్చును దీనివలన కలుగు లాభము లివి

(ఎ) టర్బయిను, జనరేటరు హెచ్చువేగములో తిరు గును అందుచే ఖరీదు తక్కువయగును విద్యుత్కేంద్రము యొక్క వైశాల్యము తక్కువగుటచే, దాని నిర్మాణపు వ్యయము తక్కువగును

(బి) విద్యుత్కేంద్రముయొక్క వెడల్పు తక్కువగుటచే బరువులనెత్తు కప్పి అను యంత్రముయొక్క వెల తగ్గును. ఎత్తవలసినభారముకూడ తగ్గును

(సి) ఇంపల్స్ టర్బయినులో చక్రముయొక్క అడుగు భాగము నీటిమట్టమునకు కనీసము 8 అడుగులపైగా నుండ వలెను ఈ ఎత్తు నష్టము రియాక్షను టర్బయినులో ఉండదు

(డి) ఫ్రాన్సిస్ టర్బయిను విషయములో 65 నుండి 125 శాతమువరకు ఎత్తునందు మార్పు ఉన్నచో నీరు సద్విని యోగము చేయవచ్చును ఇంపల్సు విషయములో ఎత్తునందు వ్యత్యాసము 90 నుండి 110 శాతమువర కుండవలెను.

(ఇ) ప్రస్తుతము టర్బయినులను పూర్తిభారము వేసి నడపుటచే ఫ్రాన్సిస్‌తోనే ఎక్కువ నీటిని సద్వినియోగము చేయవచ్చును

(ఎఫ్) ఇంపల్స్ టర్బయినుయొక్క నూదిమీద గతుకు లేమాత్ర మున్నను శక్తి నష్టమగును ప్రయోగాత్మకముగా 1 MM పరిమాణపు గతుకులున్నచో శక్తియందు 8 శాతము నష్టమగునని తేలినది

నీటియందు ఇసుకయున్నచో ఫ్రాన్సిస్ టర్బయినును ఉపయోగించుట మంచిదికాదు అందువలన ఎక్కువభాగములు త్వరగా అరిగిపోవును భాగములను మార్చుటకు ఎక్కువ కాలమగును విద్యుత్కేంద్రము రాతిమయమగుచోట మన్నచో నిర్మాణవ్యయ మెక్కువగును ముఖ్యముగా రన్నరు విసర్జించు నీటిమట్టముకంటె తక్కువమట్టములో ఉండవలసిన అవసర మేర్పడునపుడు, తక్కువఎత్తున ఉన్న నీటిని-(కాలువలు, చిన్ననదులు)-విద్యుదుత్పాదనకు వినియోగింపవలెనన్నచో వ్యయమెక్కు వగును

అంతేకాక నీరుగోనేరునువదలి కేంద్రములలో వెలుపలికి పోవునపుడు కనీసము మూడు నాలుగు పర్యాయములు మలుపులు తిరుగవలెను దానిలోని శక్తి నష్టమగును ఈ నష్టమును తగ్గించి తక్కువజలమున్నపుడు సద్వినియోగము సల్పుటకై గొట్టపుఖడగ టర్బయిను లుపయోగములోనికి వచ్చినవి వీటియందు టర్బయినును, జనరేటరును ఒకే గొట్టములో నుంచెదరు ఆగొట్టమునుండియే నీరుకూడ ప్రవహించును జనరేటరుకు ముందుకాని, వెనుకకాని టర్బయినును ఏర్పాటు చేయుదురు

భూమి తనచుట్టును తిరుగుటచే బ్రహ్మాండమైన చలన శక్తిని (K E) కల్గియున్నది ఆశక్తివలన, సూర్యచంద్రుల ఆకర్షణశక్తివలన, సముద్రము కొన్నిప్రదేశములలో దినమునకు రెండుసార్లు పొంగును పొంగుగావచ్చిన నీటిని విద్యుదుత్పత్తికొరకు వినియోగించుటకై కొన్ని సంవత్సరములనుండి చర్చలు జరుగుచున్నవి కాని పెక్కుకారణములవలన కేంద్రములు నిర్మింపబడలేదు ఇట్లు స్థావరములలో సరియైన స్థలములయందు ఆనకట్టనిర్మించి నీరుపొంగినపుడు అన్నిద్వారములను తెరచి రిజర్వాయరులోనికి నీరుపట్టవలెను తరువాత ద్వారములను మూసి ఆ నీటిని టర్బయినులద్వార పంపి నడుపవచ్చును

నమూనా పరిశీలన జలచలన శాస్త్రములో నమూనా పరిశీలన ముఖ్యతరమైనది టర్బయినుయొక్క ప్రతిభాగమును ఉపయోగింపకపూర్వముకాని, మార్చుటకుపూర్వముకాని ఆ భాగముతో పరిశోధనాగారమునందు ప్రయోగములు చేయవలెను పెద్దపెద్ద టర్బయినులను నిర్మించుటకుపూర్వము వాటి నమూనాలు తయారుచేయబడును నమూనా పరిశీలనఫలితముగనే డెరియజ్ టర్బయిను ఉత్పత్తియైనది

రియాక్షను టర్బయినులలో డ్రాఫ్ట్‌ట్యూబునిండా నీరు ఉంచవలెను టర్బయిను పనిచేయు సమయములలో దానిని తయారుచేయువారు వెలువడిన నీరు ఎంతమట్టములో ఉంచవలసినదియు తెలియ జేయుదురు ఆమట్టము పెరుగవచ్చును కాని తరుగకూడదు మట్టము తగ్గినచో 'కావిటేషన్' అను బాధ్యము టర్బయినుకు సంక్రమించును అట్టిస్థితిలో రన్నరు శీఘ్రకాలములో తినివేయబడును

పెద్దపెద్ద టర్బయినులను తయారుచేయుటకు ముందు ముఖ్యముగా ఎక్కువ ఎత్తున కుపయోగించు చిన్న నమూనాలను తయారుచేసి ప్రయోగములు జరిపెదరు ప్రయోగ సమయమందు గాజుకవాటములను డ్రాఫ్ట్‌ట్యూబునందు ఏర్పరచి చూచెదరు నీరుప్రవహించు మట్టమునుమార్చి ఏమట్టమునందు నీటిబుడగ లేర్పడునో ఆ మట్టమును తీసికొనవలెను అదియుకాక, ప్రయోగము జరుపునప్పుడు టర్బయినుయొక్క సామర్థ్యముకూడ కొలువబడును

పొడవైన గొట్టములద్వారా టర్బయినులకు నీరు వచ్చును. సాధారణముగా గొట్టముల పొడవు టర్బయినులపైన వచ్చు ఎత్తుకంటె ఎక్కువగానుండును నీటిగొట్టము ఒకప్రక్క కట్టివేయబడినపుడు క్రిందినుండి పైభాగమునకు ఒక కెరటము పోవును దీని వేగము గొట్టముయొక్క వ్యాసముమీద, దళసరితనము మున్నగువాటిమీద, ఆధారపడును

ఉపమానము - ఎత్తు 800 అడుగులు
గొట్టము పొడవు 6000 అడుగులు
నీటివేగము 1 సెకనుకు 15 అడుగులు
నీటికెరటపువేగము సెకనుకు
8600 అడుగులు

నీటని కట్టివేసినచో క్రిందిభాగమునుండి పైభాగమునకు కెరటము 28 సెకనులలో పోవును దీనివలన 210

శాతము ఒత్తిడి ఏర్పడును అందుచే గొట్టము పగిలిపోవును ఈ ఒత్తిడిని తట్టుకొనగల గొట్టములను చేయుటకు వ్యయ మెక్కువగును సాధారణముగా 20 నుండి 30 శాతము ఒత్తిడిని తట్టుకొనగల గొట్టములు నిర్మింపబడును 20 శాతము ఒత్తిడిని మాత్రమే తట్టుకొనగల గొట్టములను నిర్మింపవలె నన్నచో 30 సెకనుల కాలములో నీటిని నెమ్మదిగా పారు దల చేయవలెను నీరు నెమ్మదిగాపారుచో, టర్బయిను వేగము విచ్చిన్న వేగమునకు వచ్చును

బరువుయొక్క మార్పుదలనుబట్టి టర్బయినుయొక్క వేగము మారుచుండును ఒకేస్థిరవేగమును కొనసాగించుటకై నీటిని సరఫరా చేయుటకు ఈ మార్పు ఉపయోగపడును

జనరేటరునుండి గవర్నరు, బెల్టుద్వారాగాని, ప్రత్యేక మైన పెండ్యులమ్ జనరేటరు ద్వారాగాని నడుపబడును గవర్నరులో ముందుభాగమున రెండు శైలంతులు అమర్ప బడి యుండును వేగమును మార్పుటకు ఈ బంతులు క్రిందికిని పైకిని కదలుచుండును ఈ కదలిక విస్తృతమొనర్పబడి గేటని అదుపులోనుంచుట కుపయోగింపబడును

యస్ వేం

## బాస్ - ఫ్లిండర్స్ :

జార్జిబాస్, మాథ్యూఫ్లిండర్స్ అనుఇరువురును నౌకా యాత్రికులు. వీరు ఆస్ట్రేలియా తీర పరిశోధకులునై ఉండిరి

జార్జిబాస్ అనునతడు ఆంగ్లేయ వైద్యుడు అతడు ఫ్లిండర్స్‌తోకలిసి ఆస్ట్రేలియా తీరమును పరిశోధించినవాడు ఆ పరిశోధనములలో అతడు పెక్కుమార్లు నౌకాయానము చేసి అంతకుపూర్వము ఎవ్వరును కనిపెట్టియుండని భూ భాగ ములను కనుగొనెను

జార్జిబాస్ 1795 వ సంవత్సరములో ఫ్లిండర్స్‌తో కలిసి 'వాన్ డీమన్స్‌లాండ్' అని ఆనాడు వ్యవహారములో నున్న నేటి టాస్మానియాకును, ఆస్ట్రేలియా భూ భాగమున కును మధ్య భాగమున ఒక జలసంధి యున్నట్లు కనుగొనెను

ఆ జలసంధి బాస్ పేర 'బాస్ జలసంధి' అని వ్యవహ రింపబడ దొడగెను. ఆ ప్రయాణములోనే బాస్, ఫ్లిండర్స్- ఇరువురును 1798 లో టాస్మానియాను చుట్టివచ్చిరి

ఆ ప్రయాణముల నుండి వారు 1800 వ సంవత్సర ములో తిరిగి ఇంగ్లండు చేరిరి

మాథ్యూఫ్లిండర్స్ - (1774-1814) అను నతడొక ఆంగ్లేయ నౌకా యాత్రికుడు అతడు జార్జిబాస్‌తో కలిసి కొన్నిసార్లును, తాను స్వయముగా మరికొన్ని సార్లును ఆస్ట్రే లియా తీరప్రాంతములను పర్యటించి క్రొత్త భూములను, నదు లను, పర్వత పంక్తులను కనుగొనినవాడు

ఫ్లిండర్స్ 1774 వ సంవత్సరము మార్చి 16 వ తేదీన లింకన్‌షైర్‌లోని డానింగ్‌టన్‌లో జన్మించెను. అతడు 1789 లో నౌకాశాఖలోచేరి 1791 లో 'బ్లైయ్' అనునతనిని పసిఫిక్ సముద్ర యాత్రలో అనుసరించి, ఆతనివలన నౌకా యానమునకు చెందిన ఎన్నియోవిషయములను గ్రహించెను

1795—99 సంవత్సరముల మధ్య జార్జిబాస్‌తో కలిసి ఫ్లిండర్స్ ఆస్ట్రేలియా తీరమును పరిశోధించెను ఆ పర్యటన ములో వారు 'బాస్ జలసంధి' ని కనుగొనుటయే కాక, టాస్మా నియాను నౌకాయానమున చుట్టివచ్చిరి 1801 వ సంవత్సర ములో ప్రభుత్వమువారిచే ఆస్ట్రేలియాతీర శాస్త్రీయ పరిశో ధన బృందమునకు ఫ్లిండర్స్ నాయకుడుగా నియుక్తుడ య్యెను ఆ పరిశోధనా కాలములో పూర్వము ఎవ్వరును కనుగొనని అనేక ప్రాంతములను అతడు కనుగొనెను

'పార్‌పోయిస్' అను నౌకలో అతడు తిరుగు ప్రయా ణము చేయుచుండగా ఆ నౌక ప్రమాదమునకులోనై సము ద్రమున మునిగిపోయినది ఫ్లిండర్స్ తాను గుర్తెరుగని పర్వత పంక్తుల మధ్య చిక్కుకొనెను అక్కడి నుండి అతడు 750 మైళ్ళ దూరముననున్న జాన్‌సన్ ఓడరేవునకు ఒకచిన్న పడవలో చేరెను

ఆ దుర్ఘటములైన యాత్రానుభవముల నన్నింటిని ఫ్లిండర్స్ "ఎ వాయేజ్ టు టెర్రా ఆస్ట్రేలియా" (ఆస్ట్రే లియా తీర భూముల పర్యటనము) అను గ్రంథమున విశదీక రించుచు, ఎన్నియో శాస్త్రీయ విషయములను గూర్చి గూడ అందు చర్చించెను

అంతేకాక, నౌకలపై ఆనాడు ఉపయోగింపబడు చుండిన దిక్సూచి యంత్రములలోగల లోపములను అతడు గ్రహించి ఆ లోపములు నౌకలయందలి ఇనుప సామగ్రి వలననే కలుగు చున్నవని తెలిసుకొని, ఆయంత్రములను ఫ్లిండర్స్ సరిచేసెను

ఫ్లిండర్స్ 'వాన్ డేమన్స్ లాండ్ తీరమును గూర్చిన పరిశీలనములు' అను గ్రంథమును గూడ రచించెను అతడు 1814వ సంవత్సరము జులై 19వ తేదీన మరణించెను సరిగా ఆనాడే అతని "ఎ వాయేజ్"అను గ్రంథము ప్రచురింపబడినది.

ఫ్లిండర్స్ పేర దక్షిణ ఆస్ట్రేలియా తీరమునకు నేటికిని "ఫ్లిండర్స్‌లాండ్" అను వ్యవహారము కలదు దక్షిణ ఆస్ట్రేలియాలోని ఐర్ ద్వీపకల్పము, ఆ తీరమునకు కొంచెము దూరములో నున్న ఫ్లిండర్స్ ద్వీపము, దక్షిణ ఆస్ట్రేలియా లోని ఫ్లిండర్స్ పర్వతపంక్తి, నేటికిని అతని పేరనే వ్యవహరింప బడుటచే,అతని నామము చిరస్థాయిగా నిలిచిపోయినది

ఎ ర

## బాస్కెట్ బాల్

ఈ ఆట క్రీ శ 1891 వ సంవత్సరమున అమెరికా దేశములో ప్రప్రథమముగా ప్రారంభింపబడినది దీనిని కనిపెట్టిన వాడు డాక్టర్ జేమ్స్ నైస్మిత్ ఈ ఆటను ఎంగ్ మెన్స్ క్రిస్టియన్ అసోసియేషన్ వారు వ్యాప్తినొందించిరి ఈ ఆట విస్తృతము పాశ్చాత్య దేశములందే కాక ప్రాచ్యదేశములందు కూడ యువతుల చేతను, యువకుల చేతను, బాలకుల చేతను, బాలికలచేతను విరివిగా ఆడబడుచున్నది బాస్కెట్ బాల్ ఆట ఆరుబయలునందు ఆడబడుఆట సాధారణముగా ప్రతి ఉన్నత పాఠశాలయందును, కళాశాలయందునుగల ఆవరణముల యందేర్పరుపబడిన కోర్టునందు ( క్రీడారంగము ) ఈ ఆట ఆడబడును ఇది 'టచ్ మినాట్' అను ఆటగా క్రీడా ప్రపంచమందు ప్రసిద్ధిగాంచినది అనగా ఒకరినొకరు తాకకుండగనే ఆడబడు నిరపాయకరమైన ఆటయని అర్థము

అమెరికన్ క్రైస్తవ మిషనరీలు 46 సంవత్సరముల క్రిందట ఈ యాటను భారతదేశమున ప్రవేశపెట్టినప్పటినుండి ఇది క్రమముగా ఇచ్చట ప్రచారము గాంచుచు 1950వ సంవత్సరము నుండి అభివృద్ధిచెందినది 1950 లో బొంబాయిలో నెలకొల్పబడిన ఇండియా బాస్కెట్‌బాల్ ఫెడరేషన్ ఈఆట యొక్క అభివృద్ధికై చాల పాటుపడినది అధునిక పద్ధతులలో ఈ ఆటను ఆంధ్రదేశములో ప్రవేశపెట్టిన వ్యక్తి శ్రీ విత్తనాల వేంకటేశ్వరరావు 1954 వ సంవత్సరములో ఆంధ్రరాష్ట్ర బాస్కెట్‌బాల్ సంఘము విజయవాడలో అవతరించినది తదాదిగా పెక్కురు క్రీడాకారులు ఈ యాటయందు ఉత్తీర్ణులై వివిధ ప్రాంతములలో జరుగు పోటీలలో పాల్గొనుచు పేరుగాంచియున్నారు ఆంధ్రదేశమందు వివిధప్రాంతములలో ఆంధ్రప్రదేశ స్పోర్ట్సు కౌన్సిల్ ఆధ్వర్యవమున శిక్షణ కేంద్రములు స్థాపింపబడినవి ఈ ఆటయందు యువతీ యువకులకు శిక్షణము గరపబడుచున్నది ఈ ఆటయందు హైద్రాబాదు నగరమునకు చెందిన క్రీడాకారులు ప్రముఖస్థానమును సంపాదించుకొని యున్నారు 1955 వ సం లో ఈ క్రీడలో స్త్రీలు జాతీయ పోటీల సందర్భమున హైద్రాబాదు నందలి స్త్రీల 'ఛాంపియన్ షిప్' ను సాధించుకొనిరి

ఆటస్థలము పొడవు 26 మీటర్లు, వెడల్పు 14 మీటర్లు క్రీడారంగమునకు రెండు చివరల యందును, వెడల్పు నందలి మధ్యభాగములో రెండుపోస్టులు, వాటికి అమర్చబడినబోర్డులు కన్పించును ఆ బోర్డులకు 45 సెంటిమీటర్ల రింగులుండును వాటికి వలలు అమర్చబడియుండును ఈ ఆటలో టీమునకు ఐదుగురు ఆటగాండ్ర చొప్పున రెండుజట్లవారు పాల్గొనెదరు పోటీలలో 20 నిమిషములు ఆట ఆడిన తరువాత ఆటగాండ్రు పది నిమిషముల కాలము విశ్రాంతి తీసికొందురు తిరిగి ప్రతిపక్షపు జట్టువారు పార్శ్వములు మార్చుకొని మరొక 20 నిమిషముల కాలము ఆటనాడుదురు ఏ పక్షపు జట్టువారు వలలో బంతిని వేసి, ఎక్కువ పాయింట్లను సంపాదింతురో, ఆపక్షమువారు ఆటను గెలిచినట్లు నిర్ణయింపబడును ఆటస్థలపు ఆవరణములో ఎచ్చటనుండియైనను వలలో బంతి పడునట్లు వేయవచ్చును కాని పోస్టువద్దనున్న నిర్ణీతమగు ఆవరణములో ప్రత్యర్థులయిన ఆటగాండ్రు మూడు సెకనులకంటె ఎక్కువ కాలము నిలిచియుండరాదు ముప్పది సెకనులను మించి ఆటస్థలములో ఆటగాండ్రు బంతిని తమ స్వాధీనములో నుంచుకొనరాదు

బాస్కెట్‌బాల్ వ్యాసము 80 సెంటిమీటర్లుండును దాని బరువు 600 మొదలుకొని 650 గ్రాములవరకుండును

కో. వ రా

## బాహాయి మతము

బాహాఉల్లా అను ప్రవక్త కనుగొనిన మతము బాహామతమనబడుచున్నది 'బాహా ఉల్లా' అనగా భగవంతుని వైభవము అని అర్థము ఈ మతము 'బాబీ' అను ఇస్లాముశాఖా మతస్థుని బోధనలను పోలియున్నది ఈ మతప్రవక్త 1817 లో పర్షియాదేశము లో జన్మించెను బాహా ఉల్లాకు పూర్వము 'బాబీ' అను నాతడు ఈ క్రొత్తమతమును ప్రచారముచేసినందుకు హత్యగావింపబడెను బాబీ అసలుపేరు అలీ మహమ్మదు షిరాజ్ 1844 మేనెల 23 వ తేదీన బాహా ఉల్లా క్రొత్త బాహాయిమతమును ప్రచారము చేయునని బాబీ ముందుగనే ప్రకటించి యుండెనట! ఈ ప్రకటనమును ప్రజలు

ముందుగనే తెలిసికొని బాహా ఉల్లాను భగవంతుని అవతార పురుషునిగా నమ్మినారు. ఇది చూచిన ఇస్లాముమత ప్రముఖులకు కన్నెఱ్ఱనైనది. వారిలో చాల అలజడి కలిగినది. తుదకా ప్రవక్తను 1850 జులై 9 వ తేదీన తబ్రీజ్ నగరములో బహిరంగముగా ఉరితీయించిరి. అతని అస్థికలు పాలస్తీనాలోని కొండగట్టుమీద భద్రపరుపబడినవి. అతని సమాధి బాబీభక్తులకు పుణ్యక్షేత్రమైనది.

ఈ నూతన మతము నశింపలేదు. 1817 లో పర్షియా యందలి అక్కానగరమున హుసేన్ ఆలీ యను మహాపురుషుడు జన్మించెను. అతడు బాహా ఉల్లా అను పేరుతో ఈ నూతన మతమునకు ప్రవక్తయై బోధించెను. ఇస్లాము మతాచార్యులు హుసేన్ ఆలీనికూడ వదలిపెట్టక టెహరాన్ నగరములోని భూగర్భకారాగారములో బంధించిరి. పూర్వము బాబ్ మహాప్రవక్త ఆదేశించిన విశ్వమానవ ముక్తిసాధనమగు మతమును బోధించవలసిన బాధ్యత తనపైననే ఉన్నట్లు హుసేన్ ఆలీ గ్రహించెను. ఈ ప్రవక్తను టెహరాన్ నుండి ముందుగా బాగ్దాదునకును, తరువాత ఇస్తాంబుల్ నగరమునకును మతాధికారులు తరలించిరి. అక్కడ 1863-1868 వరకు ఇతడు తన మతమును ప్రచారము చేసి అధికసంఖ్యాకులైన తదనుయాయులను ఆకర్షించెను. 1866-67 లో తొలిసారి హుసేన్ ఆలీ తనను బాబ్ వారసునిగాను, అతని అవతార పురుషునిగాను ప్రకటించుకొనెను. అప్పటినుండి ఇతడు బాహా ఉల్లా అను పేరుతో ప్రసిద్ధికెక్కెను. బాహా ఉల్లాను, అతని అనుచరులను ఇస్లాము మతాధికారులు సహింపలేక అడ్రియానోపిల్ నగరమునకుమార్చి తరువాత పాలస్తీనాలోని 'అక్కా (ఆకర్) యందు కారాగారములో నుంచిరి. ఈ అక్కానగరమే బాహాయి మతస్థుల మక్కా అయినది. 1892 లో బాహా ఉల్లా తన భౌతిక శరీరమును విడిచి తన కుమారుడైన అబ్దుల్ బాహాను తనవారసునిగాను బాహాయి మతప్రవక్తగాను నియమించెను. ఆతడుకూడ తన తండ్రివలెనే ఇస్లాము మతాధికారులమూలముననను సుల్తానుమూలముననను చెరలపాలై నిర్బంధములోనే యుండెను. 1908 లో యువజన ఇస్లాం విప్లవకారులు టర్కీలో తిరుగుబాటుచేసి సుల్తాన్‌గిరిని పూర్తిగా రూపుమాపువరకు ఈ మతప్రవక్తకు నిర్బంధ విముక్తి కలుగలేదు. 1911 లోను, 1918 లోను అబ్దుల్ బాహా ఐరోపాలో పర్యటనముచేసి తన మతసిద్ధాంతములనుగూర్చి ప్రచారముచేసెను. 1912లో తొమ్మిదిమాసములపాటు ఆతడు అమెరికాలో సంచరించి అచ్చట జనసముదాయముగల గొప్ప సభలలోను, సమావేశములలోను ప్రసంగించెను. ఈ మత ప్రబోధమును విని ఐరోపాలోను, అమెరికాలోను అనేక భక్తులీమతమునెడల విశ్వాసమును ప్రకటించిరి. ఇతడు తన మనుమలలో జ్యేష్ఠుడగు షోగీ ఎఫెండీని తన అనంతరము బాహాయి మతమునకు ముఖ్య ప్రవక్తగా నియమించెను. అబ్దుల్ బాహా 1921 నుండి 1957 వరకు బాహాయిమతమును తొలి సంస్థాపకుడైన బాహాఉల్లా సూత్రముల ప్రకారము నడిపి దానికి అంతర్జాతీయ విఖ్యాతిని కల్పించెను. ఈ మతముకూడ క్రైస్తవమత శాఖలవలె ఒక ప్రధానస్థానమును, జాతీయ శాఖలను, ఉపశాఖలను కలిగి, వివిధదేశములలో విస్తరిల్లి ఒక క్రమముతో విరాజిల్లుచున్నది. దీనికి ఏడుగురు మంత్రులు, ఇరువదిమంది సభ్యులుగల కార్యవర్గమున్నది.

షోగీ ఎఫెండీ అక్కానగరమునకు సమీపముగా బహిజీ అనుచోట బాహా ఉల్లాకు ఒక మందిరమును కట్టించెను. అక్కడ ఆ మతమునకు చెందిన పత్రములు, లేఖలు, ప్రబోధ గ్రంథములు, కవితలు, కావ్యములు, అవి యివి యననేల-సమస్త సాహిత్యమును భద్రపరుపబడినది. షోగీ ఎఫెండీ బాహాయి మతమునకును, విశ్వమానవ కల్యాణమునకునుగల సంబంధమును ప్రవచించి, బాహాయిరహస్యములను సర్వజనులకు వెల్లడించెను. బాహాయిమతము ఏ ఇతర మతమును ద్వేషింపక సర్వమత సామరస్యమును సాధించు నొక లోక కల్యాణ మతముగా పేర్కొనబడినది.

అమెరికాలో బాహాయి మతస్థులు ఇల్లినాయి (స్) రాష్ట్రములో విల్మెట్ అనుచోట ఒక ప్రార్థనామందిరమును నిర్మించుకొనిరి. అమెరికాలోనే రిజిష్టరైన 80 సంఘములున్నవి. సుమారు 40 శాఖలు ఇతర దేశములలోకూడ నున్నవి.

బాహాయి మతస్థుల గ్రంథములలో ముఖ్యమైనవి- బాహా ఉల్లా రచించిన కితాబీ అకాదానీ, కితాబీ ఇకానీ మున్నగునవి. ఇవి పెక్కు భాషలలోనికి అనువాదము పొందినవి. బాహాఉల్లా జీవితచరిత్ర, ఆయన సందేశము, ప్రార్థనలు, ధ్యానవిధానము మొదలైనవి అత్యంత బహుళప్రచారములో నున్న మతప్రబోధక గ్రంథములు. "బాహాయి ప్రపంచము" అను ద్వైమాసపత్రిక ఇంగ్లీషుభాషలో వెలువడుచున్నది.

బాహాయి మతమునకు అరబ్బీ పారసీక, ఇస్లాంమతముల తోను, జోరాస్ట్రియన్ మతముతోను ఎట్టి సంబంధము లేదు ఈ నూతన బాహాయి మతధర్మములో భగవంతుడు అవాఙ్మానస గోచరుడని పేర్కొనబడినది ఆయనను తెలిసికొనుట ఆతని అవతార పురుషుడైన ప్రవక్తమూలముననే సాధ్యము భగవంతుడు యుగయుగములందు సంభవించుచునే యుండును. కాలచక్రములో వేయేసి సంవత్సరముల కొకతూరి భగవంతుడు ప్రత్యక్ష మగుచునే యుండును పైకి చూచుటకు భిన్నముగా కనిపించినను, ఈ భగవంతుని సాక్షాత్కారము, ప్రసన్నత, ఒకే సత్యమును, ఒకే దివ్యరూపమును సూచించును నేటి కాలమునకు ఒకే ధర్మములో, ఒకే మతవిశ్వాసముతో, ఒకేసూత్రముతో విశ్వమానవకోటిని ఏకీకరించవలె ననునది భగవంతుని ఆదేశము మతము, భక్తి, విశ్వాసము అనునవి వ్యక్తిగతముగా శాంతిసుఖములను కల్పించి, ముక్తిని కలిగించు సాధనములు విశ్వమానవ సమాజములో, హింసోన్మత్త పృథ్వీచక్రములో శాంతిని, స్నేహమును, సామరస్యమును, పరస్పర సదవగాహనమును కల్పించు ఉత్తమోత్తమ శక్తియే మతము మానవులందరు ఒకటే స్త్రీపురుషులు సమానులు మతము, విజ్ఞానశాస్త్రము ఒకే సత్యమును నిరూపించును కావున నవి పరస్పర విరుద్ధములు కావు మానవుని ఆత్మ అనశ్వరమైనది, అనంతమైనది, అమృతమైనది అంతర్జాతీయమైత్రి భావన, ప్రేమ, స్నేహసంబంధ బాంధవ్యములు మానవునిలోని దివ్యాంశమును ప్రత్యక్షీకరించి, ప్రేమతో, శాంతితో మానవులను బంధించుచున్నవి ఇవియే బాహాయి మతములోని ప్రధాన సూత్రములు

ఇస్లాముమతములోకాని, జోరాస్ట్రియను మతములో కాని కనిపించునమ్మకములకు ఇది విరుద్ధము సూఫీ తత్త్వమునకుకూడ బాహాయిమతము పూర్తిగా విరుద్ధము ఖురాను గ్రంథమును, మహమ్మదు ప్రవక్తను ఈ మతము విశ్వసింపదు విశ్వమానవతాధర్మసూత్రములమీద ఆధారపడిన ఈ బాహాయి మతము ఇంతగా వర్ధిల్లుటకు ప్రధానకారకుడు ఇబ్రహీమ్ జార్జి ఖైరుల్లా ఇతడు 1900 లో బాహా ఉల్లా అను పేరుతో రెండు సంపుటముల ఉద్గ్రంథమును ప్రచురించిన తరువాత అమెరికా మొదలైనదేశములలో ఈ మతానుయాయులు పెక్కురు బయలువెడలినారు బాహాయి మతమునుగూర్చి అనేక విషయములను తెలుపు గ్రంథములు ఇంగ్లీషు, ఫ్రెంచి భాషలలో ప్రచురింపబడినవి ఈ ఖైరుల్లా లెబనాన్ దేశములో పుట్టి, కెయిరోలో విద్యాభ్యాసముచేసి, అమెరికాలో 1897–1898 సంవత్సరములలో ఈ మతమునుగూర్చి ప్రచారము చేసెను ఈతని వాగ్ధోరణికి, విజ్ఞానమునకు, మతప్రబోధ గరశక్తికి వశ్యులై వేలకొలది అమెరికా దేశీయులు బాహాయి మతములో చేరిరి నాటి బీజాంకురములే నేడు విశాల వృక్షములై, శాఖోపశాఖలుగా విస్తరించినవి

బాహాయిమతము ఇంత విశేష ప్రచారము పొందుటకు ఈ కాలమునకిది అన్నివిధముల అనుకూలమైన దగుటయే ముఖ్యకారణము. ఇందలి అనుభవపూర్వకమైన, ఆచరణయోగ్యమైన జీవనపద్ధతి, నీతి, నియమబద్ధమైన సూత్రములు సర్వసుగమములు ఇది నిగూఢమైన రహస్యములతో, మంత్రతంత్రములతో, మాయబోధలతో నిండియుండలేదు ఈ మత ప్రవక్త చేసిన ఉపదేశములు మహమ్మదీయులలోని ఒక్క షియా జాతీయులకు మాత్రమే ఉద్దేశింపబడినవికాక, సమస్త మానవులకు ఉపయోగించునవిగ నున్నవి బాహాఉల్లా, నాటి సుల్తానులకు ఎదురుతిరుగక, వారికి వినయపూర్వకముగ లేఖలు వ్రాసెను ఇట్లే ఆతడు రచించిన లేఖలు అల్‌వాహి–సలాతిన్ (సుల్తానులకు ఆదేశములు) అను పేరుతో వెలువడెను వాటితోపాటు బాహాఉల్లా తన విశ్వమానవ మతమునుగూర్చి విక్టోరియా మహారాణికి, రష్యా చక్రవర్తి జార్ ప్రభువునకు నెపోలియన్ చక్రవర్తికి, క్రైస్తవ జగద్గురువు పోప్‌నకు లేఖలు పంపెను ఈ లేఖలు చూచి సుల్తాన్ సామంతులు, దండనాధికారులు ఈతనిని, ఈతని అనుచరులను ఘోర నిర్బంధములో పెట్టిరట! కొందరిని చిత్రవధ చేయించిరట! అట్టి సందర్భములలో బాహాఉల్లా తన భక్తులకు చెప్పిన నీతి ఇది "నీవు ఇతరులను చంపవద్దు, నిన్ను ఇతరులు చంప యత్నించినయెడల మారుమాటాడక ఊరక పడియుండుము " ఆతని ఆదేశానుసారము, ఆతని అనుచరులు అధికార దుర్మాంధుల బాధలకు, హింసలకు గురియై మరణించిరి సత్యము, అహింస, శాంతి, ధర్మము, స్నేహము అను సూత్రములపై బాహాయిమత మాధారపడినది కావుననే ఇది అన్ని దేశములలో వర్ధిల్లుచున్నది అంతర్జాతీయ స్నేహలేఖా పరిచయములవలన వర్ధిల్లు సంస్థలలో బాహాయి మతప్రబోధక సంస్థయొకటి ఇది మానవ స్నేహబంధములలో మతమును, భగవంతుని కట్టివేసి, భగవన్మహిమను ప్రేమభావములలో

ప్రతిబింబింప జేయుచున్నది ఇది నేటికాలపు నవీన మతము బహుజన సుగమమైనది

యం స నా

## బిజ్జుల తిమ్మభూపాలుడు.

శ్రీ కృష్ణదేవరాయలు, సురభిమాధవరాయలు, మల్లారెడ్డి, వనపర్తి అష్ట భాషా గోపాలరాయడు మొదలయిన రాజకవుల కోవకు జెందిన వాడు తిమ్మ భూపాలుడు ఇతని ఇంటిపేరు బిజ్జులవారు క్రీ శ 1700 ప్రాంతమున ఈ రాజకవి ఆలంపూరు సీమను పాలించెను ఈయనకు పూర్వులయిన రాజన్యులు బిజాపుర నవాబులకు అండదండలుగా నుండిన మహావీరులు బిజాపుర రాజ్యము క్రీ శ 1686 లో మొగలాయి చక్రవర్తుల శౌర్య ప్రవాహమున గలిసిన నంతవరకును, మొగలాయి చక్రవర్తి పంపిన గయాసుద్దీను కర్నూలు పట్టణమును ఆక్రమించిన తరువాతను, ఈ వంశీయులకు కర్నూలు, ఆలంపూరు పరగణాలపై "సర్ నాడ గౌడు, సర్ దేశాయి" మొదలయిన బిరుదములతో పరిపాలనాధికార ముండెను

వీరి ఇంటిపేరయిన "బిజ్జుల" అను పదమును గురించి ఇట్లూహించుటకు వీలున్నది కాలచుర్యుడైన బిజ్జలరాయడు పశ్చిమ చాళుక్య రాజయిన శైలపదేవుని జయించి, కల్యాణీ నగరమున తన విజయధ్వజమును ప్రతిష్ఠించెను బసవేశ్వరుడు మంత్రిగా లభించిన పిమ్మట, జైన మతమును వదలి, శైవమును స్వీకరించుటయే గాక, దేశము నందంతటను వీరశైవ మతమును వ్యాపింప జేయుటకు ప్రయత్నించెను బసవేశ్వరుని నాయకత్వమున విజృంభించిన శైవమత విప్లవ ప్రభావము వలన దేశీయ పరిస్థితులు తారుమారగుటచేత బిజ్జలరాయడు తన రాజధానియందు నిలువలేక పోయెను అది కారణముగా కాలచుర్యులు పెక్కు స్థలములు తిరుగుచు, ఆయా ప్రాంతములందు వీరశైవమును వ్యాపింప జేయుచు, తమ పలుబడిని నెరపుచుండిరి అట్టి సందర్భమున ఆలంపూరు సీమ కూడ వారికి స్వాధీనపడినట్లు అచ్చటి శాసనములు తెలుపుచున్నవి కనుక బిజ్జల రాయని వంశీయులే కాలక్రమమున బిజ్జులవారై యుందురు లేదా బిజ్జలుడు వీరశైవ మత ప్రాప్తికి దోహదము కలిగించిన ప్రముఖుడగుటచేత, కొందరు రెడ్లు భక్తిచేత అతని పేరును తమ సంతానములో నొకనికి బెట్టియుందురు అతని పేరు కాలక్రమమున వంశనామముగా మారియుండును కాగా ఆలంపూరు ప్రాంతపు వారయిన కొందరు రెడ్డికులజులు 'బిజ్జల' పదమును గ్రహింపగా, అది తరువాతి కాలమున "బిజ్జుల" గా మారియుండును కనుక ఈ వంశము వారికి కాలచుర్య బిజ్జలరాయని సంబంధము దైహికముగనో, భక్తి విశ్వాస రూపముననో, కలిగియుండెనని ఊహించుట సత్యదూరముకాదు కాలచుర్య చక్రవర్తి భుజబలమల్లుని కాలపు శాసనములు ఆలంపూరు ప్రాంతమున లభించుటయు, బిజ్జుల వంశపు రెడ్డిరాజులు గత శతాబ్దము వరకును శివభక్తులగుటయు, ఆలంపూరు నందుండిన జంగమ మఠాధిపతులు, బిజ్జలరాయని చిహ్నములుగల ఘంటా శంఖములను ధరించుచు, వాటికి సంస్కారము చేయవలసి వచ్చినప్పుడు 'పల్లెపాడు' అను గ్రామముననున్న బిజ్జుల వంశపు దేశముఖులచేతనే నూతన ఘంటా శంఖములకు సంస్కారము చేయించి స్వీకరించు చుండుటయు, కారణములుగా "బిజ్జుల" పదమును గురించి ఇంతగా ఊహింపవలసి వచ్చినది

ఈ బిజ్జుల వంశమునకు వన్నెలుదిద్ది, తద్వంశీయుల కీర్తికి పౌఢమయిన సారస్వత ప్రక్రియ ద్వారా స్థైర్యమును జేకూర్చిన వాడు తిమ్మభూపాలుడు ఇతడు మురారికవి సంస్కృతమున రచించిన అనర్ఘ రాఘవ నాటకమును ప్రౌఢమైన పద్యకావ్యముగా ఆంధ్రీకరించెను ఈ కావ్యమునందలి పీఠికా భాగమున తిమ్మభూపాలునికి పూర్వులును, తరువాతివారునునైన రాజన్యులు వర్ణింపబడిరి ఈ వంశావతార చరిత్రను గ్రంథకర్త స్వయముగా రచింపలేదనియు, అతని ఆస్థాన కవులు విరచించిరనియు అనర్ఘ రాఘవము చెప్పుచున్నది తిమ్మభూపాలుడు తనవంశమునకు మూల పురుషుడుగా తెల్పినవాడు దాదభూపాలుడు దాదభూపాలునికి కుప్పవిభుడు, అతనికి కొండనృపాల, చెన్ననరపతులు ఉదయించిరి చెన్ననరపతి కుమారుడు చినతిమ్మరాజు చినతిమ్మరాజు కొడుకులలో మూడవ వాడైన కొండభూపాలుడు మిక్కిలి పరాక్రమశాలి 'గాయ గోవాళ గేయాధిరాయ' బిరుద మండనుండు, భయంకర భండనుండు, భవ్యగుణపాళి కొండభూపాలమౌళి" అని అనర్ఘ రాఘవమతనిని వర్ణించినది నేటికిని చెక్కు చెదరక కర్నూలు పట్టణముననున్న 'కొండారెడ్డి బురుజు' ఇతని పేరున వెలసినదేయని యూహించుటకు వీలున్నది ఇతని తరువాత వరుసగా రామన్నపాలుడు, యాగనరపతి మొదలయిన వారు వర్ణింపబడిరి ఈ వంశపరంపరలో

వచ్చిన వారిలో పెదతిమ్మనృపాలుడు చారిత్రిక పురుషుడుగా పేర్కొనదగినవాడు. ఆయనకు బిజాపురనవాబు మన్నన అధికముగా నుండినట్లును, ఆతడు ఆలంపూరును రాజధానిగా జేసికొని, అలంపూరు, కర్నూలు పరగణాలను పాలించినట్లును అనర్ఘ రాఘవములోని ఈ పద్యము తెలుపుచున్నది.

సీ॥ కమనీయ దక్షిణ కాశికా క్షేత్రంబు
రహిమించ నెవ్వని రాజధాని,
తుంగాఖ్యగంగా తరంగ రంగన్మోళి
బ్రహ్మేశు డెవ్వని పాలివేల్పు,
పాదుషా దత్త కుంభద్దంతి హయముఖ్య
వస్తువెవ్వనియింట విస్తరిల్లు,
ధరవంతు కెక్కు కందనవోలి దేశంబు
గణుతింప నెవ్వని కాణయాచి,
గీ॥ సిరులనొప్పు నలంపూరి సీమకెల్ల
'నాడగౌడును, దేశాయి నాడకరణ'
మనెడు విఖ్యాతి యెవ్వాని కలరె నతడు
వొల్చె, బిజ్జుల పెదతిమ్మ భూవిభుండు

ఇతనికి 'గండభేరుండ, రాయవేశ్యాభుజంగ' అను బిరుదములు కూడ నుండెను. విజయనగర సామ్రాజ్య పతనానంతరము బిజాపుర నవాబు కర్నూలు బళ్లారి మండలములలోని కొన్ని ముఖ్యప్రాంతములు ఆక్రమించి పరిపాలించు చుండెను. ఆ దండయాత్రలలో మొదట లొంగిపోయి, తరువాత నవాబు అభిమానమును సంపాదించుటచేత బిజ్జుల పెద తిమ్మ భూపాలుడు అలంపూరు, కర్నూలు సీమలకు సర్ నాడగౌడు సర్ దేశాయి హోదాలతో పాలకుడుగా నుండెను. ఈయన తరువాత నైదుతరముల వరకును ఈ బిరుదము లుండినవి. ఈ విధముగా ఈ వంశమున కసమాన కీర్తిని జేకూర్చిన వారిలో పెద తిమ్మభూపాలు డగ్రగణ్యుడు.

ఆయన, కామాంబ యను ధర్మపత్నియందు కృష్ణభూపాలుని గనెను. అవక్రపరాక్రముడై నిరంతర దానధురీణుడై వెలసిన యాకృష్ణభూపాలునికిని, వనపర్తి వెంకటరాజు కూతురు బచ్చమాంబకును అనర్ఘ రాఘవ కర్తయైన తిమ్మభూపాలు డుదయించెను. (ఈ వనపర్తి వెంకటరాజు అష్టభాషా గోపాలరాయని తండ్రి. బచ్చమాంబ ఆతనిచెల్లెలు కాగా తిమ్మభూపాలుడు అష్ట భాషా గోపాలరాయనికి మేనల్లుడు. ఆకాలమున వనపర్తి రాజులు సూగూరును రాజధానినిగా చేసికొని రాజ్యమును పరిపాలించుచుండిరి)

పూర్వుల వలెనే ఇతడును (తిమ్మభూపాలుడు) ఖడ్గమును బట్టి యుద్ధరంగమున రాణించెను. ఫికిలి చెన్న భూపాలుని జయించినట్లు అనర్ఘ రాఘవము పేర్కొన్నది. ఖడ్గమును బట్టుటతోపాటు తిమ్మభూపాలు డాంధ్రవాఙ్మయమున కపారమైన సేవ జేసెను. అనేక కవిపండితుల కగ్రహారాది దానము లొసగెను. ఒక సంవత్సరమున భూదాన వ్రతదీక్షనుబట్టి ప్రతిరోజును ఒక భూదానము ప్రకారము వత్సరాంతమువరకును జేసెనని వంశీయులు పరంపరగా చెప్పుకొనుచుందురు. తిమ్మభూపాలునికి అక్కమాంబ, పౌరమాంబ యనునిద్దరు భార్యలయందును ధర్మభూపాలుడు, కొండనృపాలుడు, నరసింహనరపతి, కృష్ణభూవిభుడు, బచ్చభూపతి యనువారుదయించిరి. వారిలో ధర్మభూపాలుడును, నరసింహ నరపతియు మిక్కిలి పరాక్రమవంతులైనట్లు ఈ క్రింది రెండుపద్యములు వెల్లడించుచున్నవి.

సీ॥ సింధుదేశమునకే శ్రీఘనుడానాంబు
పతి బహుజీవన స్థితి యొనర్చు,
కాశ్మీరమునకే జగత్పతి భాషాళి
ముఖ్యంబు మేదురా మోద మొసగు,
సౌరాష్ట్రమునకునే సవరసూత శ్రోత్రి
యరయ శోభాస్పద స్ఫురణం గూర్చు,
కరహాటమునకునే వరరుచి తేజంబు
మేలిమిదులకించు డాలునిల్పు,
గీ॥ మత్స్యమునకే రసాధీకు మహితధామ
మమలకమలాప్తి ఘటియించి యలరంజేయు
నతడు సామాన్యుడే బిజ్జులాన్వయాబ్ధి
పూర్ణిమాశ్వారి శ్రీధర్మభూపశౌరి
సీ॥ గడగడ వడకి నల్గడలం గాలు తురుష్క
వాహినీచ్ఛట డాగ వనధియయ్యె,
పోంగాల్లులేక బల్ బుసకొట్టి పడుపార
సీకాహితతికి వల్మీకమయ్యె,
వెఱ నిజపకుంబు లిఱఁలోవు పాశ్చాత్య
కోశికాళికి నంధకారమయ్యె,
భువి దిగంబరులైన యవన యోగుల కాయ
ములు నిండగా భూతిపూతయయ్యె,

గీ॥ ననుచు నానావనీరుశెవ్వని మహోగ్ర
చటులధాటీ నిరాఘాట పటుతురంగ
ఖురసముద్ధూతధూళిఁ జేర్కొనుచునుండు
రతదుసామాన్యుఁడే నృసింహ ప్రభుండు "

అనర్ఘరాఘవమును రచించునాటికి తిమ్మభూపాలుడు వృద్ధుడై, పుత్రపౌత్ర విభవముతోగూడి, భాషాసేవయందును, పండితాదరణమునందును, కావ్యగోష్ఠులందును, కవితారచనయందును కాలము గడువుచుండెను ఎర్ నాడగౌడు, నర్దేశాయి బిరుదములతోకూడిన పాలనాధికారము తిమ్మభూపాలుని కుమారుడైన నరసింహ నరపతి వరకు నుండెను తరువాత చండశాసనుడైన ఆలంగీరుపాదుషా మరణించిన యవకాశమును పురస్కరించుకొని, దక్కన్ ప్రాంతమునకు సుబేదారుగానున్న 'నిజాముల్ ముల్క్ ఆసఫ్జా' క్రీ॥ 1724 లో స్వాతంత్ర్యమును ప్రకటించి తానే ప్రభువయ్యెను అప్పటి నుండి బిజ్జలవారి దశ తగ్గెను నిజాము అలంపూరును 'పాయాగుల్ ముల్క్' అనువానికి క్రీ॥ 1821 లో జాగీరుగా నిచ్చెను బిజ్జలవారికి కొన్ని గ్రామముల జాగీర్దారీ' దేశముఖిరుసుము, కొన్ని శేరీలు (స్వంత వ్యవసాయముగల భూములు) మాత్రము మిగిలెను

ఈ వంశీయులు క్రీ॥ 1855 వ సంవత్సరమునకు సరియైన నళసంవత్సర చైత్రశుక్ల సప్తమినాడు వ్రాయించిన కైఫీయతువలన నరసింహారెడ్డి మొదలుకొని, అనర్ఘరాఘవమును అచ్చువేయించిన కీ శే బిజ్జల చంద్రశేఖరరెడ్డి జాగిర్దార్ గారి తాతయైన ధర్మారెడ్డిగారి వరకునుగల చరిత్ర విశదమగుచున్నది ఆ చరిత్రలోని యంశములు వీరికిని వనపర్తి, ఆత్మకూరు, గోపాలుపేట, గద్వాల మొదలగు సంస్థానముల వారికిని ఉండిన స్నేహమును, జ్ఞాతికలహములను, స్త్రీలయిన లక్ష్మీదేవమ్మ, చిన్నమ్మ అనువారు చూపిన సాహసమును, రాజ్యనిర్వహణ దక్షతను వెల్లడించుచున్నవి ఇప్పటికిని ఈ వంశీయులు అలంపూరు తాలూకాకు చెందిన పల్లెపాడు అను గ్రామమునందున్నారు వీరి సంబంధ బాంధవ్యములు బాబాసాహెబ్ పేట దేశముఖులలోను, హుస్నాబాద్, బొమ్మరకుంట్ల మొదలయిన దేశముఖులలోను సాగుచున్నవి

అనర్ఘరాఘవకావ్యమందలి పీఠికా పద్యరచన మిక్కిలి ప్రౌఢతరమైనది యనుట కీ క్రింది పద్యమొక్కటి చాలును

మ॥ ఇనదత్తంబు ధనంజయచ్ఛరము వాణీశద్గిరీశంబులో
కనదత్కైరవ మజ్జరాగదుదురాట్కాంతంబు శాశ్వీరతి
ధ్వనసారంబు సురాలయుద్రజత గోత్రంబు యెల్లబ్రహ్మాండమా
చినతిమ్మక్షితిపాలకొండవిభున కీర్తిప్రకాశంబునన్ "

వ్యాకరణశాస్త్ర వైశారద్యమును వెల్లడించునిట్టి పద్యములు తెలుగు ప్రబంధములలో చాల తక్కువగా నున్నవి తిమ్మభూపాలుడు తన ఏలుబడిలోనున్న ప్రాకటూరుగ్రామము నందలి రామేశ్వరస్వామికి అనర్ఘరాఘవమును అంకితము చేసెను గ్రంథారంభకథనమున పూర్వాంధ్ర ప్రబంధ రచయితల పద్ధతియే అనుసరింపబడినది తిమ్మభూపాలుని స్వప్నమున రామేశ్వరస్వామి సాక్షాత్కరించి "భవత్కృతాంధ్రకృతి నావృతి మాకిపుడంకితంబుగానొనరించి ధన్యతం బొరయుముర్వర" యని యాదేశించెను దాని ననుసరించి,

కం॥ రాజీవజాండదీపక తేజోమయదివ్యకాయ దివసేశునకున్
రాజతగిరిరాజపరి, భ్రాజచ్ఛ్రీప్రాకటూరి రామేశునకున్"

ఇత్యాది షష్ఠ్యంతములతో నంకితముచేసెను ఆ స్వప్నవృత్తాంతమును వెల్లడించు సందర్భమున వ్రాసిన పద్యములవలన తిమ్మభూపాలుని ప్రాభవమును, సాహిత్యకళాభిరుచియు తేటతెల్లమగుచున్నవి

కం॥ అని శివుడంతర్హితుడై,
చనియెను నేమేలుకాంచి సమ్మదమాత్మన్
తెనగొనగగాల్యకృత్యము,
లొనరిచి యాస్థానసీమనధ్యోలగమై।

కం॥ హితబాంధవమంత్రిపురో,
హితబుధకవి కోటి గలయ వీక్షించి మహో
ద్భుతమంది, యమందానం,
దితనాడెందమున నిట్లుదలచితి గడకన్ ।

సీ॥ చారుకృష్ణానదీతీరసీమారామ
కమనీయకల్పకకందకంబు
మహితలోకత్రయీమౌళిభాగాభోగ
మండనాయితహారమణివరంబు
హిమశైలకన్యకాస్తృత్తవక్షోజాత
చిత్రితచందనపత్రకంబు
ప్రాకటూరీధరావరకమధ్యస్ఫుర
న్నవ్యముక్తాఫలనాయకంబు

గీ॥ జైనరామేశ్వరస్వామి యనువమోత్స
వైకసంరంభమునకు నేడి దెసమస్త
దేశవిద్వత్కవిప్రభృతిప్రశస్త
ఘనసభాజనమిచ్చోట దవరె చౌర!

ఇష్టరసభవ్యమైన యనర్ఘరాఘవ కావ్యమును రచించుట యందు దనకు సహాయమొనర్చిన కృష్ణకవియను విద్వాంసుని యెడల గృతజ్ఞతను వెల్లడించుచు నీ పద్యమును రచించెను

చం॥ అతనికి పౌత్రుడై యసదృశాఖిల విద్యలప్రౌఢిగన్నయా
యతమతి కృష్ణసత్కవి సహాయకవిత్వమునన్ సమాజసం
తత భజనాదరుండనగు నాకు నశేషవిశేషవైదుషీ
ప్రతిభ కరస్థలామలకభాస్వరమై తగరారు టబ్బమే

ఈసందర్భమున,

శ్లో॥ యాంతి న్యాయప్రవృత్తస్య తిర్యంచోపి సహాయతామ్
అపంథానం తు గచ్ఛంతం సోదరోపి విముంచతి"

అని మురారికవి అనర్ఘరాఘవ నాటకమున రచించిన శ్లోకమును,

గీ॥ ఎట్టులన్నను న్యాయమార్గైకవృత్తి
కవనిఁదిర్యక్కులైన సహాయమగును,
కాని తెరువున నడచినవాని విడుచు
ననుగులోఁబుట్టువైన సత్యంబు సుమ్ము॥

అని యనువదించి, నాటక ప్రస్తావనలోని శ్లోకమును తన పద్య కావ్య పీఠికయందు చమత్కారముగా నుపయోగించుకొనుట ప్రశంసనీయముగా నున్నది

గ్రంథారంభమున చేసిన పూర్వకవిస్తుతిలో వ్యాస వాల్మీకి కాళిదాసమయూరాది సంస్కృతకవులను, నన్నయాది కవిత్రయమును మాత్రము ప్రశంసించెను శ్రీమద్రామాయణ ప్రశస్తినిగావించి తానాంధ్రీకరింపదలచిన అనర్ఘరాఘవ నాటకకర్తయైన మురారికవిని ఇట్లు ప్రశంసించెను

సీ॥ నిఖిలతపోధన నివహసంస్తుత్య చా
రిత్రైకమౌద్గల్యగోత్రభవుడు
నానావిధకళాభినవపితామహవర్ధ
మానభట్టార్య కుమారకుండు,
తతపటీవృత్తాంతకంతు మశ్యావ్యాయ
మానవతీసూక్తి మౌక్తికంబు,
గురుభట్టదేశికోత్తర పూరమధ్యస
రన్నిరామాట సారస్వతుండు,

గీ॥ బాలవాల్మీకి బిరుదకుంభన్మురారి
నాటక మనర్ఘరాఘవనామకంబు,
దాని నాంధ్రప్రబంధంబుగానొనర్చి
యుదితసామగ్రి నమ్ముదమూను పథకు

శ్రీరామచంద్రుని చరితమును వాల్మీకి రచించెనుగదా! ఇక నితరులేల రచింపవలెనన్న ప్రశ్నకు సమాధానముగా నీ క్రింది పద్యమును రచించెను

మ॥ గొనకౌరాము చరిత్ర యాదిమకవిశుణ్ణంబుగానెంచిమా
నిన నీరీతి గుణాఢ్యుడై తనరువానిన్ నాయకుంగాంచ తే
మిని దత్తద్గుణగౌరవస్ఫురిత గాంభీర్యాతిమాధుర్యవా
క్యనవప్రబ్రహ్మలు పండితుల్ తమరయో సార్థక్యముల్
గాంతురే

పీఠికయందలి వంశావతారవర్ణనము తిమ్మభూపాలుని యాస్థానకవులు రచించినది కనుక వారా రాజకవి శౌర్య ప్రతాపాదుల నభివర్ణించిరి ఆ వర్ణనలోని యొకటి రెండు పద్యములు

సీ॥ "పటుమహోనవపూరభరితు కౌతుకకల
స్ఫుటమహోనవసార భోక్తలుగను,
వరసుధర్మా భోగవారణులౌ భానుల
నురుసు ధర్మాభోగయుక్తులుగను,
చారకసన్మార్గహారులౌ నలినీల
సంతత సన్మార్గచారులుగను,
తతసుమనోభివర్ధన మూన్చు యవనుల
సమధీః సుమనోభి సంగులుగను,

గీ॥ జేసెనఘటనఘటనా విశేషభాస
మానచాతుర్యధుర్యతానూనకలన"
ననుచు నీధాటి వినుతించు సహితకోటి
ధీరసల్లాప బిజ్జల తిమ్మభూప!

ఉ॥ ఈదృశ పుత్రపౌత్ర విభవైకమహోమహిమాభిరామతన్
మేదిని సుప్రసిద్ధిఁగను మీఁరుచే యిటువంటి కావ్యముల్
సాదులు మెచ్చఁగా బహురసప్రతిపాదన లీల పొచ్చఁగా
నాదృతిమీఁగ దేవతల కంకితమూన్పుట తిమ్మభూవరా!

ఏడంకములుగల మురారినాటకమును అయిదాశ్వాసముల ప్రబంధముగా ననువదించెను మురారి సంస్కృతకవిత యెంత ప్రౌఢమైనదో అంతటి ప్రౌఢి గలదిగా నాంధ్రకవితను రచించిన తిమ్మభూపాలుని వైదుష్యము అనితర సాధారణ

మైనట్టిది శ్రీ కృష్ణదేవరాయల ఆముక్తమాల్యదను, సురభి మాధవరాయల చంద్రికాపరిణయమును దృష్టియందుంచుకొని యీ ప్రౌఢప్రబంధమును తిమ్మభూపాలుడు రచించెనా యని పించును అనువాదము మిక్కిలి శ్రమైకసాధ్యమైనపని అయినను స్వతంత్రకావ్యమువలె నిరర్గళ ధారావిలసితముగా దీనిని రచింపగలిగిన ఈ కవి కవితాచమత్కృతి కావ్యజ్ఞశిఖరలో నారికేరినట్టిదని గ్రంథమంతయు సాక్ష్య మిచ్చుచున్నది ఈయన భాషాంతరీకరణ చాతుర్యమును వెల్లడించుట కొకటి రెండు మచ్చుతునకలు విశ్వామిత్రుడు చేసిన దశరథ ప్రశంసలో నొకటి,

శ్లో॥ త్రైలోక్యాభయలగ్నకేన భవతా వీరేణవిస్ఫారిత
స్తజ్జీమూతముహూర్తమండనధనుఃపాండిత్యమాఖండలః
కించాజప్రముఖార్పితేన హవిషా సంపుల్లమానోల్లస
త్సర్వాంగీణవలీవిలుప్తనయన వ్యూఢఃకథంవర్తతే

అను మురారి శ్లోకమును,

ఉ॥ ఎన్నగ ముజ్జగంబులకు నీవభయంబిడు పూటకావనౌ
టన్నిటచావనై పుడమియెడన్ మరపాందుటచానునిచ్చలున్
అన్నపు కూటిచే బలిసి సాంద్రతరంగవళీ సమున్నతిన్
కన్నులుపూడ నేడు బలఘస్మరుడేగతి నున్నవాడొకో

ఇట్లు మూలార్థమును చెడనీయక, తెలుగుజాతీయముల తీయదనమునకు లోపము కలుగనీయక కావ్యమునంతటిని విరచించెను శివధనుర్భంగ సందర్భము నందలి యీ పద్యములను గనుడు,

సీ॥ ఏకార్ముకంబున కిందుకోటీరుండు
దక్షాధ్వర ధ్వంసి ధన్వియయ్యె,
ఏ శరాసనమున కిందిరారమణుండు
కుంభినీధరుడంప కోలయయ్యె,
పథనుర్గణకు నంభోధరా ధ్వచరంబు
రథ్యపు రౌఘంబు లక్ష్యమయ్యె,
ఏచాపమున కబ్జలోచనోన్నతశయ్య
దర్వీకరస్వామి మౌర్వియయ్యె,
గీ॥ అట్టిమహనీయ కోదండ మఖలవిబుధ
నికరకేళి ప్రచండమున్నిద్రభువన
జయగుమద్దండ మద్భుతోచ్చయ కరండ
మహహ శక్యంబె తన్మహామహిమ పొగడ.

మ॥ నగవిధ్వంసనువిల్ జగత్త్రితయ సంత్రాణప్రవీణోద్యాపనం
బగుటన్ రోహితమయ్యెనే నృపులచాపారూఢి, నమ్మేటిరా
మగలూహింతురు దీనిఁగన్గొని మదిన్ మౌర్వీకిణశ్యామికా
మృగనాభిస్ఫుట గంధగంధిల భుజశ్రేణుల్ నిరర్థంబుగన్

ఇంచుమించుగా గ్రంథమంతయు నిట్లే నడచినది ఈ క్రింది యాశ్వాసాంత గద్యము తిమ్మభూపాలుని ఘనతను చక్కగా చాటుచున్నది

"ఇది శ్రీమద్రామేశ్వర శాశ్వత కృపాకటాక్ష వీక్షణ సమాసాదిత సకల సామ్రాజ్యధౌరేయ, అశ్రాంత విశ్రాణనావధీరిత రాధేయ, బిజ్జల కులకలశనిధానశారత్తికినిశాకర త్రివెన్నెల్కన్ని గోత్రపవిత్ర, కృష్ణరాయమహీధవకుమార, సంగరాంగణకుమార, దయాగుణగోపాల తిమ్మభూపాల ప్రణీతంబైన యనర్ఘరాఘవంబను మహాప్రబంధంబునందు సర్వంబును పంచమాశ్వాసము సంపూర్ణము

ప్రాచీనకవులలో సంస్కృత నాటకములను యథాతథముగా ననువదించిన వారిలో ప్రబోధచంద్రోదయ నాటకము ననువదించిన మలయమారుత కవులతరువాత పేర్కొనదగినవాడు తిమ్మభూపాలుడు సుమారు 80 సంవత్సరములకు పూర్వమున ఈ కావ్యమును ముద్రింపించి ఆంధ్ర సాహిత్య ప్రియుల కందించినవాడు శ్రీ శే బిజ్జుల చంద్రశేఖరరెడ్డి. ప్రౌఢకవితా ప్రియులందరును జదువదగిన ప్రబంధము అనర్ఘరాఘవము ఆంధ్ర కవులందరును ప్రశంసింప దగినవాడు తిమ్మభూపాలుడు

కే. స శా

## బిద్రీ నగిషీపనులు

హైదరాబాదు నగరమునకు సుమారు 80 మైళ్ళ దూరములో బిదర్ అను పట్టణము గలదు పూర్వపు హైదరాబాదు రాజ్యములో ఈ నగరము బిదరుజిల్లాకు ముఖ్య పట్టణముగా ఉండెడిది 1956వ సంవత్సరము తరువాత ఇది మైసూరు రాష్ట్రములో చేర్పబడినది బహమనీరాజుల పరిపాలనకాలములో ఆరాజుల ప్రోత్సాహము వలన, బిద్రీ పరిశ్రమ దినదినాభివృద్ధి గాంచెను ప్రజలు కూడ ఈ పరిశ్రమను విశేషముగ ప్రోత్సహించుచు వచ్చిరి

బిద్రీ పరిశ్రమలో ఉక్కు లేక రాగికి బదులుగా 16 : 1 నిష్పత్తిలో తుత్తునాగము, రాగి తదితర ధాతువులు కలిపిన ఒక నల్లని సీసపురంగుగల మిశ్రమధాతువు ఉపయోగింప

బడుచున్నది ఈ మిశ్రమ లోహమునకు తుప్పుపట్టదు, చెడిపోదు ఇచ్చటి కళాకారులు పెక్కు మిశ్రమధాతువుల పరిశోధనముచేసి చివరకు నల్లరంగునై ధగధగ మెరయునట్లు వెండిరంగును పూతవేయుటలో విజయము గాంచిరి తుత్తునాగమును, రాగిని 16 1 నిష్పత్తిలో కలుపుదురు రాగిని కలుపుటవలన వస్తువునకు మంచి మెరుగు వచ్చును

బిద్రీ వస్తువులను ఉత్పత్తిచేయుటలో ఐదుదశలు కలవు ఈ దశలు ఒకదానితరువాత మరియొకటి ఘటిల్లును మొదటిది దిమ్మదించు దశ(అనగా పోతపోయుట) రెండవది మెరుగుదిద్దు దశ మూడవది చెక్కుడుదశ నాలుగవది వెండి దారముతో తాపటపుదశ ఐదవది నలుపుచేయు దశ మైలతుత్తమును నీటిలోకలిపి నలుపుచేసిన నమూనాలను ఒకసారి ఆ నీటియందుంచెదరు పోతపోసిన వెండి నమూనా అట్లే యుండగా, మిగతా భాగము కారునలుపుగా తయారగును బిదర్ కోటలో దొరకు మట్టియందు సురేకారము హెచ్చుగా నుండుటచే ఈ మార్పు వచ్చునని కొందరు చెప్పుదురు మొదట ఇట్లే జరిగియుండవచ్చును గాని, తరువాత ఈ పరిశ్రమ పటన్‌చెరువు, హైదరాబాదులలో విస్తరించినప్పుడు ఏ పాతకోటలోని మట్టిని ఉపయోగించినను, వస్తువులు బిదరులో వలెనే తయారగునని పరిశోధనమువలన నిరూపితమయ్యెను

తుత్తునాగము హెచ్చుగానున్నచో, బిద్రీ సామానుల బరువు హెచ్చుగా నుండును నానాటికి ఈ వస్తువుల బరువును తగ్గించుచున్నారు దానివలన వస్తువుల ధర తగ్గుటయే గాక, సులభముగా ఒకచోటినుండి మరియొక చోటికి వాటిని తీసికొనిపోవుటకును, విదేశ వ్యాపారమునకును,వీలగుచున్నది అంతే గాక ఇట్లు తక్కువ విలువగల వస్తువులు తయారగుటచే, సామాన్య వ్యక్తులు వీటిని కొనగలుగుచున్నారు

మొదట హుక్కాలు, పాన్‌సుపారి పెట్టెలు, ట్రేలు, కూజాలు, కప్పులు, సుందరమగు చిన్న పెట్టెలు, గ్లాసులు తయారు చేసెడివారు వాటి రూపములు పలువిధములుగా నుండెను నగిషీచేతాళములు, ముచ్చటైన అనేక రకముల ఇతరవస్తువులు తయారయ్యెడివి భారత జాతీయ వస్తు ప్రదర్శన శాలయందు బిద్రీపరిశ్రమకు సంబంధించిన సొగసయిన కుర్చీలు కూడ కాంచగలము దీనినిబట్టి ఈ పరిశ్రమకు అఖిల భారత ఖ్యాతి అబ్బినట్లు తెలియగలదు

బిద్రీ కళాకారులు ప్రయోగించెడి సాంకేతిక కళా విధానములలో "టర్కాషి" "జైనిషాన్" అను లోహ తాపట ప్రక్రియలు ముఖ్యములైనవి విభిన్నములైన ఈ ప్రక్రియలను అవసరము ననుసరించి ఒకే సమయమున ఒక్కొక్కప్పుడు మేళవింపవచ్చును ఏ కళాకారుడైనను తన ఇష్టము వచ్చిన పద్ధతిని అవలంబింపవచ్చును సాధారణముగా ఈ రెండు ప్రక్రియలను కళాకారులు జోడించెదరు అందమగు ఆభరణములకొరకు వెండిని వాడెదరు బంగారమును మిక్కిలి తక్కువగా ఉపయోగించెదరు పూర్వము బిదరు జిల్లాలోని కల్యాణ్ నగరమందలి కళాకారులు బంగారమును ఉపయోగించెడి వారు నల్లరంగుమీద, వెండినగిషీకి మంచి వన్నె వచ్చును అది చూచుటకు చాల అందముగా నుండును

దక్కను ప్రభువులు కొంతవరకు స్వతంత్రులు కనుక పర్షియా, అరేబియాలనుండి వచ్చిన నమూనాలకే కాక స్థానిక నమూనాలకు కూడ గొప్పవిలువ నిచ్చెడివారు

మొట్టమొదటి కళాకారులు ఇరాన్ దేశము (పర్షియా) నుండి వచ్చియుండవచ్చును పర్షియన్ కళాకారులను దక్కన్ ప్రభువులు పోషించెడివారు స్థానిక మహమ్మదీయులు, లింగాయతులు కూడ ఈ పరిశ్రమయందు క్రమముగా శ్రద్ధ చూపసాగిరి ఎన్ని సంవత్సరములక్రిందనో మరణించిన రామన్న మాస్టరు అను హిందూ బిద్రికళాకారుని ఇప్పటికిని ముస్లిము బిద్రీ కళాకారులు గౌరవించెదరు పూర్వము బిద్రీ పరిశ్రమయందు ఈజిప్టు నందలి "మమ్మీ"లను పోలు కళా రచనా రీతులు కూడ వాడబడుచుండెను ఐరోపా కళాకారులు, ముఖ్యముగా ఫ్రెంచి కళాకారులు కూడ కొంతవరకు నగిషీ పనితనమునకు తోడ్పడిరి రేఖా సంబంధమైన కళాప్రక్రియ ప్రథమములో ఈజిప్టునుండి పర్షియా దేశముగుండా భారత దేశమునకు వచ్చెను ఆనాడు చేపల ఆకృతులుగల పెట్టెలు కూడ వాడబడుచుండెను వీటిలో నొకటి బొంబాయి వస్తు ప్రదర్శనశాలలో భద్రపరుపబడినది జంతువుల నమూనాలు చాల తక్కువగా నుండెడివి. 18 వ శతాబ్దానంతరము వంశపారంపర్యముగా వచ్చిన కళలకు అంతరాయము కలిగెను అప్పటివరకు భారతీయ కళలను పోషించిన భూస్వాములు, తమ ఆర్థిక పరిస్థితి బాగుగాలేక, చేతిపరిశ్రమలను పోషింపలేక పోయిరి మొన్న మొన్నటివరకు హైదరాబాదులోని, నవాబుల గృహములలో బిద్రీసామానులు కొల్లలుగానుండెను

పూర్వము హైద్రాబాదు నవాబు, సాలార్‌జంగ్ మున్నగు వారు బిద్రీ పరిశ్రమలకు విశేష ప్రోత్సాహమిచ్చి యుండిరి హైద్రాబాదులో ప్రస్తుతము బిద్రీ పారిశ్రామిక కేంద్రమొకటి స్థాపింపబడి యున్నది

ఇప్పుడు పారసీక నమూనాలే కాక, అజంతా నమూనాలు కూడ వాడబడుచున్నవి ఆంధ్రప్రదేశ ప్రభుత్వము ఈ పరిశ్రమకై సహకార కర్మాగారములను, యంత్రసామగ్రిని చేకూర్చియున్నది తయారయిన సరకులకు విపణి సౌకర్యములు కూడ ప్రభుత్వము కల్పించుచున్నది ప్రాచీనమగు బిద్రీ వస్తువులకు విదేశీ మార్కెట్లు కూడ లభించుచున్నవి ప్రస్తుతము భారతదేశములో ప్రజలు వీటిని విరివిగా కొనచే కున్నారు

అందమైన బిద్రీకళాఖండములు సాలార్ జంగ్ వస్తు ప్రదర్శనశాలలోను, నేషనల్ వస్తు ప్రదర్శనశాల (న్యూఢిల్లీ) లోను, హైద్రాబాదు వస్తు ప్రదర్శనశాలలోను, బొంబాయి వస్తు ప్రదర్శనశాలలోను, కొందరు హైద్రాబాదు నవాబుల ఇండ్లలోను కానవగును

బిద్రీ వస్తువులపై వేయబడు చిత్రములు సాధారణముగా బిదరులోని చరిత్రాత్మక దుర్గమునుండియు, ప్రఖ్యాతిగన్న అజంతా చిత్తరువుల నుండియు గ్రహింపబడినవే

ఆధునికములైన చెక్కు ఇతర నమూనాలు కూడ ఇప్పుడిప్పుడు వచ్చుచున్నవి ఇవియన్నియు బిద్రీ కళావిధానమునకు వన్నెతెచ్చుచున్నవి, చేతి పరిశ్రమలలో ప్రముఖ స్థానము సంపాదించిన బిద్రీసరకులను మైసూరు, మహారాష్ట్రి ప్రభుత్వములు కూడ అనుకరించుచు, వాటికి సర్వవిధముల ప్రోత్సాహమును, పోషణమును కలుగజేయుచున్నవి.

ఆర్. వి రా

## బీజ గణితము .

కొన్ని దత్తాంశములను ఉపయోగించి కనుగొనవలసిన ఒక అవ్యక్తరాశికి 'యావత్తావత్' కల్పనచేసి, అనగా ఆ అవ్యక్తరాశిని 'య' అని కల్పించి, దాని విలువను సాధించుటతో బీజగణిత మారంభమైనది ఉదా " ఒక రాశి కందు-దానిని 3 చేత గుణించి, 4 కలుపగా 25 వచ్చినది. ఆ రాశి యేమి?" అను ప్రశ్నకు సమాధానము- ఆరాశి 'య' అనుకొనుము అప్పుడు 3య + 4 = 25 అనగా 3య = 25—4 = 21 య = $\frac{21}{3}$ = 7 కావున ఆరాశి 7 అగును, ఇచ్చట దత్తాంశములను ఉపయోగించి 3 య + 4 = 25 అను సమీకరణమును నిర్మించితిమి తదుపరి సమీకరణ సూత్రముల ననుసరించి, అవ్యక్త రాశిని కనుగొంటిమి సమీకరణ సూత్రము తెలియనగా, సమీకరణము అనగా రెండు సమాన రాసుల యొక్క సమానత్వమును సూచించు విధానము- పై సమీకరణములో 3య + 4 ఒకరాశి, 25 ఒకరాశి, ఆ రెండు సమానములని = అనుగుర్తు తెలియజేయుచున్నది

(2) సమీకరణము యొక్క రెండు సమాన రాసులకు ఒకే సంఖ్యను కలిపినను, వాటినుండి ఒకే సంఖ్యను తీసివేసినను, వాటిని ఒకేసంఖ్యచేత గుణించినను, లేదా ఒకే సంఖ్యచేత భాగించినను ఆ సమీకరణము యొక్క సమీకరణత్వము చెడదు అందుచేత 3 య + 4 = 25 అను సమీకరణమందు రెండువైపుల 4 అను సంఖ్యను తీసివేయుము అప్పుడు

3 య + 4—4 = 25—4 అనగా 3య = 21 అని వచ్చినది తిరిగి రెండువైపుల 3 అను సంఖ్యచేత భాగించుము—భాగించగా $\frac{3య}{3} = \frac{21}{3}$ అనగా య = 7 అని వచ్చినది

ఈ పై విధానములో ఒకవిషయము కన్పట్టును అది యేదన, ఒక సమీకరణములో ఒకప్రక్కనున్న ధన రాశివి రెండవప్రక్కకు తీసికొనిపోగా ఋణరాశిగా పరిణమించును ఉదా 3య + 4 = 25 అనుసమీకరణమందు 3య = 25—4 అగును అట్లే ఒకప్రక్కనున్న ఋణరాశిని, రెండవప్రక్కకు తీసికొని పోయినచో, ధనరాశిగా పరిణమించును ఒకప్రక్కనున్న గుణకరాశి, రెండవప్రక్క భాజక రాశిగా పరిణమించును ఒకప్రక్కనున్న భాజకరాశి రెండవప్రక్క గుణకరాశిగా పరిణమించును ఈప్రకారము బీజప్రాయముగ ఆల్పారంభము చేయబడిన బీజగణితము, నేడు ఒకమహావృక్షముగా వ్యాపించినది ఇచ్చట పై సమీకరణములో 'య' అనునది బీజవర్ణము బీజవర్ణప్రయోగముతో సాధింపబడు గణితము బీజగణితము ఈ బీజ గణితము ప్రాచీన భారతదేశమున శతపథబ్రాహ్మణ ప్రవచనకాలమందే యున్నట్లును, తదుపరి శుల్బ సూత్రకాలమందు బాగుగా విస్తృతిచెందినట్లును, మనకు "దత్త, సింగ్" అను భారతీయ గణితజ్ఞుల 'భారతీయ గణిత చరిత్ర' అను గ్రంథమున వ్యాఖ్యాతమైయున్నది అనగా క్రీస్తుపూర్వము రమారమి 2000 సంవత్సరములకు పూర్వమే మనదేశములో బీజగణితము బీజప్రాయముగ నారంభమైనది తదుపరి ఆర్యభటాచార్యుడు (క్రీ శ 499) ఈ బీజ గణితమునకు ఒక

యాపమును గ్రంథస్థము చేసినాడు అటుపిమ్మట బ్రహ్మగుప్తా చార్యుడు, మహావీరాచార్యుడు, భాస్కరాచార్యుడు, జ్ఞాన రాజు, నారాయణాచార్యుడు మొదలగువారు రచించిన గ్రంథములు నేటికిని ఉపలబ్ధము లగుచున్నవి భాస్కరాచార్యుడు తన 'బీజగణిత' గ్రంథమందు 'బ్రహ్మాహ్వాయ శ్రీధర పద్మనాభ బీజాని యస్మాదతి విస్తృతాని' అని వ్రాయుటచేత అతనికంటె పూర్వమందు బ్రహ్మ, శ్రీధరుడు, పద్మనాభుడు మొదలగువారు బీజ గణితమును గురించి పెద్ద గ్రంథములను వ్రాసినారని తెలియుచున్నది కాని ఆగ్రంథములు కాలగర్భములో మ్రగ్గిపోయినవి ఉపలబ్ధగ్రంథములలో భాస్కరాచార్య విరచిత బీజగణితము గొప్ప గ్రంథమని చెప్పవచ్చును ఇందీనాడు ఉన్నత పాఠశాలా విద్యార్థులకు ఉపయోగించు విషయములు మొదలు, ఎం ఏ విద్యార్థులకు ఉపయోగించు విషయముల వరకు వ్రాయబడియున్నవి ఈ గ్రంథమునకు జహంగీర్ సంస్థాన దైవజ్ఞుడగు కృష్ణదైవజ్ఞుడు నిర్మించిన నవాంకుర వ్యాఖ్య చాల ముఖ్యమైనది భారతీయ బీజ గణితములోని కొన్ని ప్రారంభవిషయములు (1) సామాన్య సమీకరణములు (2) వర్గ సమీకరణములు (3) శ్రేఢీ గణితము మొదలగునవి కొన్ని పెద్ద విషయములు (1) కుట్టకగణితము (2) వర్గప్రకృతి మొదలగునవి, నవీన బీజ గణితములో కొన్ని విషయములు (1) ఘాతసిద్ధాంతము, (2) లఘురిక్థ సిద్ధాంతము (3) సమీకరణ ప్రకృతి (4) వల్లీభిన్నాంత ప్రకృతి (5) సంఖ్యాతత్త్వము మొదలగునవి ఇప్పుడీవ్యాసమున ఈ పై విషయములలో కొన్ని స్థాలీపులాకముగ పరిశీలింపబడును

ఏకవర్ణ సమీకరణములు

ఉదా . "ఏకస్య రూపత్రిశతీ షడశ్వాః,
అశ్వా దశాఽన్యస్య తు తుల్యమౌల్యాః,
ఋణం తథా రూపశతం చ యస్య
తౌ తుల్యవిత్తౌ చ కిమశ్వమౌల్యం" (భాస్కర బీజగణితం, శ్లో 90 )

అనగా ఒకనికి 6 గుర్రములు, 300 రూప్యములు కలవు మరియొకనికి 10 గుర్రములు, 100 రూప్యములు ఋణము కలవు వారిద్దరు సమానధనము కలవారైనచో అశ్వమూల్యమెంత?

సమాధానము— అశ్వమూల్యము య అనుకొనుము 6 అశ్వముల మూల్యము 6 య; కావున మొదటివాని ఆస్తి 6య + 300, రెండవవాని ఆస్తి 10య — 100,

ప్రశ్న ప్రకారము 6య + 300 = 10య — 100

. 4య = 400, య = 100 రూప్యములు—అనగా అశ్వ మూల్యము 100 రూప్యములు

ఉదా ॥ 2 ॥ బహువర్ణ సమీకరణములు,

"మాణిక్యాష్టక మింద్రనీల దశకం ముక్తాఫలానాం శతం యత్తే కర్ణవిభూషణే సమధనం క్రీతం త్వదర్థే మయా। తద్రత్నత్రయ మౌల్యసంయుతిమితిః త్ర్యూనం శతార్ధం ప్రియే మౌల్యం బ్రూహి పృథగ్యదీహ గణితే కల్పాసి కల్యాణిని!

( శ్లో 98 )

అనగా "ఓ కల్యాణిని! నీకొరకు ఎనిమిది మాణిక్యములు, పది ఇంద్రనీలములు, నూరు ముత్యములు సమాన ధనములతో కొంటిని—ఒక మాణిక్యము, ఒక ఇంద్రనీలము, ఒకముత్యము కలిసి 47 రూప్యముల విలువగలవి ఒక్కొక్కదాని విలువ ఎంత? "

ఇచ్చట గణితప్రస్తారము- మాణిక్యముయొక్క విలువ మ అనుకొనుము ఇంద్రనీలము యొక్క విలువ 'ఇ' అనుకొనుము ముత్యము యొక్క విలువ ము అనుకొనుము ప్రశ్న ప్రకారము

8మ = 10ఇ = 100 ము (1)

మ + ఇ + ము = 47 (2)

ప్రథమ సమీకరణమునుండి, ఒక్కొక్క రాశి విలువ క అనుకొనిన

అనగా 8 మ = 10 ఇ = 100 ము = క

$మ = \frac{క}{8},\ ఇ = \frac{క}{10},\ ము = \frac{క}{100}$

ద్వితీయ సమీకరణమునుండి

మ + ఇ + ము = 47

అనగా $\frac{క}{8} + \frac{క}{10} + \frac{క}{100} = 47$

కావున $\frac{25క + 20క + 2క}{200} = 47$

47 క = 47 × 200

. క = 200

$\therefore ము = \frac{200}{8} = 25$ రూప్యకములు; $ఇ = \frac{200}{10}$ = 20 రూప్యకములు, $ము = \frac{200}{100} = 2$ రూప్యకములు

ఉదా "త్రయోదశ తథా పంచ కరణ్యౌ భుజయోర్మితీ।
భూరజ్ఞాతాత్ర చిత్వారః ఫలం భూమిం వదాశు మే॥
(శ్లో 104)

అనగా ఒక త్రిభుజములో రెండు భుజములు వరుసగా $\sqrt{13}$, $\sqrt{5}$, దాని వైశాల్యము 4, దాని భూమి ఎంత?




సమాధానము. కచట త్రిభుజ మనుకొనుము చట భూమిమానము తెలియదు

$\text{కచ} = \sqrt{13}$, $\text{కట} = \sqrt{5}$, $\text{చట} = ?$

చ బిందువునుండి కట భుజముమీదికి చత లంబమును గీయుము-దత్తాంశప్రకారము.

$$\text{త్రిభుజ వైశాల్యము} = \frac{\text{కట} \times \text{చత}}{2} = \frac{\sqrt{5} \times \text{చత}}{2} = 4$$

$$\text{చత} = \frac{8}{\sqrt{5}}$$

$\text{కచత}$ త్రిభుజములో $\text{కచ}^2 = \text{చత}^2 + \text{కత}^2$

$13 = \frac{64}{5} + \text{కత}^2 \quad \therefore \text{కత} = \sqrt{13 - \frac{64}{5}} = \frac{1}{\sqrt{5}}$

అట్లే $\text{చటత}$ త్రిభుజములో $\text{చట}^2 = \text{చత}^2 + \text{తట}^2$

$\text{య}^2 = \frac{64}{5} + \text{తట}^2$

$\text{తట} = \sqrt{\text{య}^2 - \frac{64}{5}}$, కాని దత్తాంశప్రకారము

$\text{కట} = \sqrt{5}$

$\text{కత} + \text{తట} = \sqrt{5}$

$\frac{1}{\sqrt{5}} + \sqrt{\text{య}^2 - \frac{64}{5}} = \sqrt{5}$

$1 + \sqrt{5\text{య}^2 - 64} = 5$

$\sqrt{5\text{య}^2 - 64} = 4$

$5\text{య}^2 - 64 = 16$

$5\text{య}^2 = 80$, $\text{య}^2 = 16$, $\text{య} = 4$

ఉదా 4 వర్గసమీకరణములు

"యూథాత్ పంచాంశకస్త్ర్యూనః వర్గితో గహ్వరం గతః।
దృష్టశ్శాఖామృగః శాఖా మారూఢో వద తేకతి?"

అనగా ఒక వానరయూథములో ఐదవవంతులో 3 తగ్గించి, వర్గించగా ఎంతవచ్చునో అన్నికోతులు గుహలోనికేగినవి, ఒకకోతి మాత్రము చెట్టెక్కినది మొత్తము కోతులెన్ని?

కోతులసంఖ్య య అనుకొనుము దత్తాంశప్రకారము

$\left(\frac{\text{య}}{5} - 3\right)^2 + 1 = \text{య}$

$\therefore \frac{(\text{య} - 15)^2}{25} + 1 = \text{య}$

$\therefore (\text{య} - 15)^2 + 25 = 25\text{య}$

$\text{య}^2 - 30\text{య} + 225 + 25 = 25\text{య}$

$\therefore \text{య}^2 - 55\text{య} + 250 = 0$

$\therefore (\text{య} - 50)(\text{య} - 5) = 0 \qquad \text{య} = 50$ లేక $5$

కాని 5 ఇచ్చట వర్తించదు-ఎందుచేతననగా ఐదువ వంతులో 3 తగ్గించుట యనగా ఒకటిలో మూడు తగ్గించుట ఇది అర్థరహితము-కావున సమాధానము 50

50లో ఐదవవంతు 10, 10 లో 3 తీసివేయగా 7, 7 వర్గించగా 49, 49 కోతులు గుహాంతరమునకేగగా ఒకకోతి చెట్టెక్కినది

కుట్టక గణితము

ఉదా "ఏకవింశతియుతం శతద్వయం,
యద్గుణం గణక పంచ షష్ఠియుక్।
పంచవర్జిత శతద్వయోద్ధృతం
శుద్ధిమేతి గుణకం వదాశు తం"

అనగా 221 ని దేనిచేత గుణించి, 65 ను కలిపి, 195 చేత భాగింపగా నిశ్శేషముగా భాగింపబడును?" అని ప్రశ్న ఇచ్చట 221 కి భాజ్యమని పేరు. 65 కి క్షేపకమని పేరు, 195 హారమన బడును ఇచ్చట ఏ సంఖ్యచేత గుణింతుమో దానికి కుట్టక మని పేరు కుట్టకమనగా గుణకమని యర్థము, 195 చేత భాగించగా వచ్చు లబ్ధమునకు లబ్ధియని పేరు కావున ఇచ్చట కుట్టకమును, అనగా గుణకమును, లబ్ధిని కనుగొనవలయును కుట్టకము 'య' అనుకొనుము, లబ్ధిని 'ల' అనుకొనుము దత్తాంశ ప్రకారము $221\text{య} + 65 = 195\text{ల}$ అనివచ్చును

ఇచ్చట య, ల అను గుణ లబ్ధులకు అనేక విలువలు వచ్చును వాటిని కనుగొనవలయును ఈజాతి సమీకరణము లకు 'Indeterminate Equations of the first degree' అని పేరు

ఈ సమీకరణమును సాధించుటకు భాస్కరాచార్యుడు చెప్పిన సూత్రములు

(1) ఇచ్చిన సమీకరణములో భాజ్య, క్షేపక హారము లను సాధ్యమైనచో అపవర్తనము చేయవలయును అనగా

పై సమీకరణములో 13 చేత అపవర్తనము చేయవచ్చును అపవర్తనమనగా 'Reducing to the lowest terms' అని యర్థము అపవర్తనము చేయగా పై సమీకరణము

17య + 5 = 15 ల అగును

(2) భాజ్య హారములు ఒక సంఖ్యచేత భాగించబడి, శేషము దానిచేత భాగింపబడకపోయిన, ఇచ్చిన సమీకరణము దుష్టమగును అనగా పై సమీకరణములో 65 బదులుగా 60 ఉన్నదనుకొనుము అప్పుడు 13 చేత భాగించగా

17 య + $\frac{60}{13}$ = 15 ల యగును

ఇందు య, ల యొక్క విలువలు పూర్ణాంకములు అగుటకు వీలులేదు ఎందుచేత ననగా, య, ల విలువలు పూర్ణాంకములగుచో 15 ల — 17 య పూర్ణాంకము కావలసి యుండును అది $\frac{60}{13}$ అగుటకు వీలులేదు కావున పూర్ణాంకములు రావలెనన్న, సమీకరణములో శేషము భిన్నాంకమగుటకు వీలులేదు

(3) అపవర్తనమును కనుగొనుట ఎట్లనిన భాజ్యమును, హారముచేత పారస్పరికముగ భాగించవలయును - పై ఉదాహరణమున 221, 195 సంఖ్యలను పరస్పరము భాగింపగా

195) 221 (1
      195
      26) 195 (7
          182
          13) 26 (2
              26
              0

ఇచ్చట 13 అపవర్తన సంఖ్య యగును దీనికి H C F అని పేరు

(4) 2 వ సూత్రముచేత భాజ్యహారములు అపవర్తన రహితములుగా నుండవలెను అప్పుడు వాటిని దృఢములు అనియందుము

(5) అట్టి దృఢభాజ్యహారములను పారస్పరికముగా శేషరూపము అనగా ఒకటి వచ్చువరకు భాగింపవలయును పై ఉదాహరణములో 13 చేత అపవర్తనము చేసినతరువాత వచ్చిన సమీకరణము 17 య + 5 = 15 ల అగును దీని యందు భాజ్యమగు 17 ను, హారమగు 15 ను పారస్పరికముగా భాగించిన

15) 17 (1
    15
    2) 15 (7
       14
       1 శేషము

ఇచ్చట ఫలములగు 1,7 వల్లీరూపము అనగా $\frac{1}{7}$ అని వ్రాసి చివరిదానిక్రింద శేషమగు 5 ను వ్రాసి, దానిక్రింద శూన్యము నుంచవలయును అనగా 1 అగును ఇచ్చట ఉపాంతిమమగు

7
5
0

5 చేత ఊర్ధ్వరాశియగు 7 ను గుణించి, అంతిమ శూన్యమును కలుపగా 35 వచ్చును ఆ 35 ను ఈ క్రిందివిధముగ వ్రాసి, అంతిమ శూన్యమును కొట్టివేయవలయును అనగా

1  1
7  35
5  5
0

అని వచ్చును తిరిగి అదేవిధముగా ఉపాంతిమమగు 35 ను, పై రాశియగు 1 చేత గుణించి అంతిమరాశిని కలిపి, అంతిమ రాశియగు 5 ను కొట్టివేయగా

1  40
35  35
5

అని వచ్చును

ఇందు ఊర్ధ్వరాశియగు 40 ను, విభాజ్యమగు 17 చేత తష్టము చేయగా 6 శేషించును దీనికి లబ్ధియని పేరు ద్వితీయ రాశియగు 35 ను హారమగు 15 చేత తష్టము చేయగా 5 వచ్చును దీనికి గుణమని పేరు దీనికే కుట్టకమనియు పేరు కావున సారాంశమేమనగా 17 ను గుణమగు 5 చేత గుణించి, శేషమగు 5 ను కలుపగా 90 వచ్చును అది 15 చేత నిశ్శేషముగా భాగింపగా 6 వచ్చును అదియే లబ్ధి ఈ లెక్కను నవీన పద్ధతిగా చేయు విధానమేమనగా

17 య + 5 = 15 ల

15) 17 (1
    15
    2) 15 (7
       14
       1) 2 (2
          2
          0

$$\frac{15}{17} = \frac{1}{1+}\ \frac{1}{7+}\ \frac{1}{2}$$

ఇందు $\frac{1}{1+\frac{1}{7}}$ గ్రహించగా $\frac{7}{8}$ వచ్చును

అప్పుడు $17 \times 7 + 1 = 15 \times 8$ అగును

శేషమగు 5 చేత గుణించగా

$$17 \times 35 + 5 = 15 \times 40$$

$$17 \times \text{య} + 5 = 15\ \text{ల}$$

తీసివేయగా $17\ (\text{య} - 35) = 15\ (\text{ల} - 40)$

$$\therefore \frac{\text{య} - 35}{15} = \frac{\text{ల} - 40}{17}$$

సుష్టము చేయగా

$$\frac{\text{య} - 5}{15} = \frac{\text{ల} - 6}{17} = \text{క} \quad \text{అనుకొనుము}$$

$\text{య} = 15\text{క} + 5, \quad \text{ల} = 17\text{క} + 6$

క అను రాశికి 0, 1, 2 మొదలగు విలువలనిచ్చిన, లబ్ధి గుణములు వరుసగా 5, 6 లేక 20, 23 లేక 35, 40 ఇట్లు వచ్చును

అనగా 17 ను 5 చేతగాని, 20 చేతగాని, 35 చేతగాని గుణించి 5 కలుపగా 15 చేత భాగింపబడి, వరుసగా 6, 23, 40 లబ్ధులు వచ్చునన్నమాట

ధూ. అ సో.

## బీజములు

వృక్షములు రెండు విధములు అవి బీజ రహితములు, బీజయుక్తములు అండములు ఫలదీకరణము తరువాత బీజములుగా మారును బీజ వృక్షములు రెండు వర్గములుగా విభాగించబడినవి (1) అనావృత బీజ వృక్షములు, (2) ఆవృత బీజ వృక్షములు, అనావృత బీజవృక్షములలో ఫలములుండవు ఉదా: దేవదారు (పైనస్) వృక్షము ఇందు బీజములు బహిర్గతములు ఈవృక్షముల సంఖ్య చాలతక్కువ ఆవృత బీజ వృక్షములు ఫలములు కలిగియుండును ఫలదీకరణము తర్వాత అండాశయము ఫలముగా అండము బీజముగా మారును ఆవృత బీజ వృక్షాళిలో బీజములు ఫలములోపల నుండును

ఆవృత బీజవృక్షములు రెండు విధములు (1) ద్విదళ బీజ వృక్షములు ఉదా చిక్కుడు, మామిడి, చింత, (2) ఏకదళ బీజ వృక్షములు ఉదా ఉల్లి, మెట్టతామర, అరటి

ఫలదీకరణము తర్వాత అండము, బీజముగా మారునపుడు చాల మార్పు చెందును, ఈ మార్పు వలననే బీజము వృక్షముగా పెరుగ గలుగును ప్రతి బీజము బీజకవచమును కలిగి యుండును ఈ బీజ కవచములో రెండు పొరలుండును కొన్ని బీజములలో ఈ రెండు పొరలు పూర్తిగా కలిసిపోవును మరికొన్నింటియందు ఈ రెండు పొరలు వేరుగా కాన్పించును ఉదా ఆముదము రెండు పొరలు వేరుగా నున్నప్పుడు పైపొర టెస్టా, లోపలిపొర టెగ్‌మెన్ అనబడును. బీజకవచముపై ఒక చిన్న రంధ్రముండును దీనిని బీజ వివరము అందురు బీజములోనుండు పిండము ఈ బీజవివరము ద్వారముగ గాలిని పీల్చును అంకురోత్పత్తి కలిగినపుడు నీరు బీజ వివరము ద్వారముననే బీజములోనికి పోవును బీజ వివరము సమీపములో తెల్లని గీలవలె ఒక పొర యుండును దీనిని బీజనాభి అందురు ఈ బీజనాభి ఫలముతో బీజమునకు గల సంబంధమును చూపును బీజకవచములో పిండము ఉండును ఈ పిండమే క్రొత్త వృక్షముగా మొలకరించును పిండము నాలుగు భాగములు కలిగియుండును (1) అక్షము, (2) బీజ దళములు, (3) ప్రథమశాఖ, (4) ప్రథమమూలము బీజ కవచము లోపలి భాగములకు రక్షణము కలిగించును బీజదళములు పిండిపదార్థములవంటి ఆహారపునిల్వలు కలిగియుండును నిలువచేయబడిన ఆహారము, అంకురోత్పత్తి కలిగి, మొలక ఎదిగి పత్రములు పెరుగువరకు ఉపయోగపడును ఆహారము నిల్వ ఉండుటవలననే బీజ దళములు గుజ్జుగలిగి లావుగా పప్పు బద్దలవలె ఉండును కొన్నిబీజములలో ఆహారపు నిల్వలు బీజ దళములలో కాక, వేరే ప్రత్యేక పదార్థముగా ఉండును దీనిని పిండిపదార్థమందురు ఈ ఆహారపు నిల్వలు పిండి పదార్థములుగా, లేక క్రొవ్వుపదార్థములుగా, లేక ప్రోటీనులుగా ఉండును ఆహారపు నిల్వలు బీజ దళములలో కాక ప్రత్యేక పదార్థములో నుండునపుడు బీజదళములు సన్నగా పొరలవలె నుండును ఉదా ఆముదపు బీజము సాధారణముగా ఏకదళ బీజ వృక్షములలో ఆహారపు నిల్వలు ఎండోస్పెరమ్‌లోనే ఉండును

ద్విబీజదళ వృక్ష బీజములలో ఎల్లప్పుడు రెండు బీజ దళములు అక్షమునకు అంటియుండును ఈ అక్షపు ఒక వైపున అనగా పై భాగమున ప్రథమశాఖ యుండును అక్షమునకు మరియొక వైపున అనగా క్రింది భాగమున ప్రథమ మూలముండును ప్రథమమూలము సామాన్యముగా సన్నని కోణాకారము కలిగియుండును అంకురోత్పత్తి కలిగినపుడు

ప్రథమమూలము వేళ్ళుగా, ప్రథమశాఖ కాండముగా, పత్రములుగా పెరుగును

ఏకబీజదళ వృక్షములలో ఎల్లప్పుడు ఒకే ఒక బీజదళ ముండును ఉదా మొక్కజొన్న, గోధుమ, వరి ఈ బీజదళము చాల చిన్నదిగా బీజమునకు పక్కని వైపున ఉండును బీజము మిగతా భాగములలో ఆహారపు నిల్వలు ఎండోస్పెరమ్ రూపములో నుండును బీజదళముపై పిండము ప్రథమశాఖ, ప్రథమమూలము కలిగియుండును

ఏకబీజదళములో ఒక ప్రత్యేకత గుర్తించవలెను బీజపు ఉపరి భాగములో బీజకవచములో ఫలకవచముకూడ కలిసియుండును ఎందుకనగా ఏకబీజదళ వృక్షఫలము ఒకేబీజము కలిగియుండును ఉదా వరి, గోధుమ ద్విబీజదళ ఫలములో సాధారణముగా ఎక్కువ బీజములుండును

ఉదా చిక్కుడు, జామ, నారింజ, చింత

అనుకూలమైన పరిస్థితులలో బీజము అంకురించును ఈఅంకురోత్పత్తి వలననే మొక్కలు పెరుగును ముఖ్యముగా అంకురోత్పత్తి కొరకు మూడు పరిస్థితు లవసరము (1) తేమ (2) ప్రాణవాయువు లేక గాలి (3) ఉష్ణము ఈ మూడు అనుకూల పరిస్థితులలో బీజము అంకురించి మొక్కగా పెరుగును అంకురోత్పత్తి కలుగునపుడు నిలువయున్న ఆహారము ద్రవపదార్థముగా మారును ఈ ఆహారము ప్రథమ మూలముచే, ప్రథమశాఖచే ఉపయోగింపబడును ఈ ఆహారము వలననే ప్రథమశాఖ కాండముగా, ప్రథమ మూలము వేళ్ళుగా, సరిక్రొత్త పత్రములు పుట్టువరకు పెరుగును

ఉం. ర. రా.

## బుక్కరాయలు :
## (క్రీ శ 1356_1377)

యదువంశమునందు సంగమరాజు జన్మించెను అతని భార్య మాంబిక ఈదంపతుల కుమారుడు బుక్కరాయలు. ఇతనికి హరిహరరాయ, కంపరాయలను వారు అన్నలు మారప, ముద్దప యనువారు తమ్ములు హరిహరరాయలు విజయనగర సామ్రాజ్య సంస్థాపకుడు, ప్రథమ చక్రవర్తి (1336-1356) హరిహరరాయల యనంతరము బుక్కరాయలు విజయనగరసామ్రాజ్య చక్రవర్తి యయ్యెను (క్రీ శ 1356) వీరితండ్రి సంగముడగుటచే, ఈవంశమునకు సంగమ వంశమని పేరువచ్చినది

మొట్టమొదట కాకతీయ ప్రతాపరుద్ర చక్రవర్తికడ హరిహర, బుక్కరాయ లిరువురు కోశాధ్యక్ష పదవులలో నుండిరి కాకతీయ సామ్రాజ్య పతనానంతరము ఈ సోదరులు ఆనెగొంది రాజునొద్ద మంత్రులుగా పనిచేసిరి మహమ్మద్ బిన్ తుగ్లక్ ఆనెగొందిరాజు నోడించుటయు (1323), ఈ సోదరులను బందీలుగా ఢిల్లీ గొంపోవుటయు అచ్చటవీరలను మహమ్మదీయ మతప్రవిష్టులను గావించుటయు, ఢిల్లీనుండి వీరుతిరిగి వచ్చిన పిదప విద్యారణ్య స్వామివారి యనుగ్రహమున వీరు హిందువు లగుటయు హరిహరరాయలు ఆనెగొందిరాజయి, విజయనగర సామ్రాజ్య స్థాపకుడై వరలుటయు — ఇవన్నియు ఒడుదొడుకులతో కూడిన చరిత్రాంశములు

హరిహర రాయలు ఆనెగొంది నేలుచుండినపుడు, బుక్కరాయలు యువరాజుగను, మంత్రిగను ఉండి రాజ్యనిర్వహణమున సర్వవిధముల తోడ్పడెను విజయనగర నిర్మాణ విషయమున శ్రీ శ్రీ విద్యారణ్యస్వాములవారి పలుపొకటి, రాజయిన హరిహరరాయల ఆదేశమొకటి కారణములుగా బుక్కరాయలు నగరనిర్మాణ భారమును తన తలపై వైచికొని, జయప్రదముగ నెరవేర్చెను

బుక్కరాయలు యువరాజుగానుండిన సమయముననే, హరిహరరాయలు ఇతనిని గుత్తిదుర్గమున అధిపతిగా నియమించెను మూడవ బల్లాలుని కార్యకరణములను, కనిపెట్టుచుండుటకును, పశ్చిమ ప్రాంతసీమలను రక్షించుటకును హరిహరరాయ లిట్టి నియమము చేసెను మూడవ బల్లాలుని ప్రధాన సేనాపతియైన బల్లప దండనాయకునకును, బుక్కరాయలకును సరిహద్దులనుగూర్చి యుద్ధము జరిగెను హొయిసలులు ఓడిపోయిరి బల్లాలునినుండి అనంతపురము జిల్లాలోని పెనుగొండను బుక్కరాయలు జయించెను అప్పుడు బుక్కరాయలు తనరాజధానిని గుత్తినుండి పెనుగొండకు మార్చెను ఈ మార్పు హొయిసల రాజ్యపు దుర్గాలను త్రుంచివేయుట కనువుగా నుండెను

బుక్కరాయలు హొయిసల సేనానులను చిత్తుగా నోడించి, హొయిసల రాజ్యమును వశముచేసికొనియెను ఈ మహా విజయము హరిహరరాయల కాలములో జరిగిన మహా ఘనమైన యుద్ధప్రస్థానము (1346) నకు చెందినది.

బుక్కరాయలు తనకర్ణాటక సామ్రాజ్యమును మిక్కిలి విస్తరింపచేయుటకును, తురుష్కుల దండయాత్రల నుండి

దక్షిణాపథమును రక్షించుటకును, హిందూ మతపునరుద్ధరణ మునకును, వీరకంకణము ధరించి అన్న హరిహరరాయల అడుగుజాడలలో నడచి కృషిచేసి, సఫలీకృత మనోరథు డయ్యెను

బుక్కరాయలు తనకుమారుడైన కుమారకంపరాయల వెంట సాళువ మంగరాజును, గోపన్న మంత్రిని తోడుగానిచ్చి 1860-61 సంవత్సరములలో తుండీర మండలమును జయించు టకు పంపెను ఆ మండలమును రాజ నారాయణ సాంబువు రాయలనునాతడు పాలించుచుండెను ఈ సాంబువురాయలు, విజయనగరాధీశ్వరులకు సామంతుడయి యుండియు, మధుర సుల్తానులతో చేతులు గలిపి, విజయనగర సామ్రాజ్యమును కూలద్రోయుటకు కుట్రలు పన్నెను

విరించిపురము నొద్ద ఉభయ సైన్యములకును, ఘోర సంగ్రామము జరిగినది ఈ యుద్ధమున రాజనారాయణ పరాజితుడై స్వల్పసైన్యముతో రాజగంభీర పర్వతములకు పారిపోయి తల దాచుకొనెను కాని విజయనగర సైన్యములు వెంటాడి ఆతనిని డీకొనినవి

ఈ యుద్ధమున, కుమారకంపభూపతిచే సాంపరాయలు వధింపబడినట్లు కుమార కంపరాయల ధర్మపత్నియైన గంగా దేవి తన 'మధురా విజయ' మను కావ్యమునందు వర్ణించి యున్నది కాని వరాహ పురాణము, జైమినీ భారతము మొదలగు ఇతర గ్రంథముల వలన సాంపరాయలు యుద్ధమున వోడిపోయి శరణు వేడుకొనెననియు, సైన్యాధ్యక్షుడయిన సాళువమంగరాజు దయతలచి, తన ప్రభువైన కంపరాయనిచే ఆతనిని రాజ్యమున పునః ప్రతిష్ఠితుని చేయించి 'సాంపరాయ స్థాపనాచార్య' యను బిరుదమును పొందినట్లును చెప్ప బడుచున్నది.

కంపరాయలు సాంపరాయని జయించిన పిదప కాంచీ పురమును స్వాధీనపరచుకొని, మరకత పురమును తనకు రాజధానిగా నేర్పాటు చేసికొని ఆ ప్రాంతమును కొంతకాలము పాలించెను మధుర ప్రాంతమును పాలించుచున్న సుల్తాను, ఢిల్లీ చక్రవర్తికి సామంతుడుగానుండ ఆతర్వాత, తన స్వతంత్రతను ప్రకటించుకొని 'సుల్తాన్' అను బిరుదమును వహించెను ఈ సుల్తాను హిందూప్రజలపైన ఘోరమైన అత్యాచారములు చేయదొడగెను ఈ మధుర నవాబు రాజ్యము హిందూమత విధ్వంసమునకు కారణభూతమగున ట్లుండుటయే కాక, విజయనగర సామ్రాజ్యమునకును ప్రక్కలో బల్లెమై ప్రవర్తింపసాగెను

ఈ క్లిష్ట పరిస్థితులను బుక్కరాయలు గ్రహించి తన కుమారుడయిన కంపభూపతిని మధుర సుల్తానును దండించు టకు పంపెను (1870) అశేష సైన్యముతో కంపభూపతి దండువెడలి మధుర సుల్తానును పరాజితుని జేసి, ఆ రాజ్యమును స్వాధీనపరచుకొనెను ఈ భయంకర సంగ్రామమున సాళువ మంగరాజు కుమార కంపభూపతికి అండయై నిలచి సైన్యము లకు నాయకుడుగా నుండి, అమిత శౌర్య సాహస ములను ప్రదర్శించి సుల్తానును చంపి పూర్ణ విజయమునకు తోడ్పడెను

మధురా విజయముతో విజయనగర సామ్రాజ్యము ఉత్తర దిశను తుంగభద్రా నది నుండి దక్షిణమున సేతుబంధ రామేశ్వరము వరకు వ్యాపించినది

కుమార కంపభూపతి భార్య మధురా విజయమను కావ్యమునందు, ఆనాటి తురుష్కుల దుర్నీతిని గురించియు, తన భర్త యొక్క మధురావిజయమును గురించియు ఈక్రింది కథను తెలుపుచున్నది—

తుండీర దేశమును జయించిన కుమార కంపరాయలు కాంచీపురమున నున్న సమయమున పాండ్యదేశాధి దేవత ఒకనాడు స్వప్నమున గన్పించి సుల్తాను దౌష్ట్యములను అభివర్ణించి పాండ్యరాజు ఖడ్గమును ఆతనికి ప్రసాదించి, మధురా విజయమునకు పురికొల్పెనట! అంతట ఆతడు వీరావేశపరుడై యుద్ధమునకు తలపడి మధుర సుల్తానును ఓడించెనట!

మలిక్ కాపూర్ దక్షిణదేశ దండయాత్రల సందర్భమున శ్రీరంగక్షేత్రము నుండి, తిరుమల తిరుపతి దేవస్థానమునకు తీసికొని పోబడిన శ్రీరంగనాథుని విగ్రహమును మరల శ్రీరంగక్షేత్రమునకు దెప్పించి, దానికి పునఃప్రతిష్ఠ జేయించి ప్రజల మన్ననలకు కుమార కంపరాయలు పాత్రుడైనట్లు కూడ తెలియుచున్నది

కుమార కంపభూపతి తన అవక్ర పరాక్రమముతో ద్రవిడదేశమునంతటిని జయించి 'రాజగంభీర రాజ్య' మను పేరుగల ఆభూభాగము నంతటిని 1875 వ సంవత్సరమువరకు పరిపాలించి, బుక్కరాయలకన్న ముందే స్వర్గస్థుడయ్యెను.

బహమనీ సుల్తాన్ అల్లాఉద్దీన్ హసన్ షా కాలము నుండియు, కాకతీయ ప్రభువుల పాలనక్రిందనున్న 'కొలను సీమ' యు, విజయనగర ప్రభువుల ఆధీనములోనున్న కృష్ణా

తుంగభద్రల నడుమగల 'అంతర్వేది' ప్రాంతమును, వివాదగ్రస్తమైనదిగా నుండి అనేక యుద్ధములకు దారితీసినది ఈ యుద్ధములందు హిందూరాజులకును, బహమనీ నవాబులకును 'పర్యాయము' న జయాపజయములు కలుగుచుండెను

ఈ యుద్ధముల ఫలితముగా విజయనగర బహమనీ రాజ్యములకు ఎడమవైపు కృష్ణానది సరిహద్దగునట్లును, కృష్ణ కావలనున్న మహాళ్లు కొన్ని ఉభయరాజుల సమష్టి పరిపాలన క్రింద నుండునట్లును సంధి నిర్ణయమైనది (1365)

ఈపద్ధతికొడంబడి మొదటి బహమనీసుల్తాన్ మహమ్మదుషా (1358–1377) బుక్కరాయలతో సంధి చేసికొనుటను గమనించినచో, బుక్కరాయలు యుద్ధములందు ఘోర పరాజయముల పాలయ్యెనను మహమ్మదీయ చరిత్రకారుల వ్రాతలు అసత్యములనియు, పక్షపాత భూయిష్ఠములనియు స్పష్టమగును

బుక్కరాయలు కృష్ణానదికి దక్షిణముననున్న ప్రాగ్దేశమును జయించుటకు జైత్రయాత్ర వెడలెను కర్నూలు జిల్లాలో కొంతభాగమును, నెల్లూరు జిల్లాలో దర్శి పొదిలి డివిజనులను, కొండవీడు రెడ్డిరాజుల రాజ్యమందలి కొంత భాగమును ఇతడు జయించి, తనరాజ్యములో కలుపుకొనెను (1363–1364)

బుక్కరాయల పాలనములో విజయనగరసామ్రాజ్యము ఉత్తరమున కృష్ణానదినుండి దక్షిణమున సేతుబంధ రామేశ్వరము వరకును, పూర్వ సముద్రమునుండి పశ్చిమసముద్రము వరకునుగల సువిశాల భూభాగమునందు వ్యాపించియుండెను

ఈ విశాల భూ భాగమును రాయలు (1) ఉదయగిరి రాజ్యము (2) పెనుగొండ రాజ్యము (3) అరగ మలెహ రాజ్యము (4) ములువాయి రాజ్యము (5) తుళు రాజ్యము (6) రాజగంభీర రాజ్యము అను ఆరు ఖండములుగా విభజించి, తన కుమారులను పాలకులనుగా నియమించెను ఈ రాకుమారులు పరిపాలనాదక్షులు రాజనీతివిశారదులు మహాపరాక్రమ సంపన్నులునై రాజ్యకార్య నిర్వహణమునందు బుక్కరాయలకు తోడ్పడుచుండిరి

బుక్కరాయలు తన రాజ్యమున వ్యవసాయాభివృద్ధికి మిక్కిలి తోడ్పడెను చెరువులను, బావులను, కాలువలను త్రవ్వించి చక్కని నీటి వసతులను కల్పించెను దేశమును సస్యశ్యామలము గావించెను భూమిశిస్తు విధానము ప్రజలకు అనుకూలముగా నుండెడిది. దేశమున కరవు కాటకములు సంభవించినపుడు ప్రజలకు ఉచితముగా ధాన్యమును పంచి పెట్టుటకుగాను పెద్ద పెద్ద గిడ్డంగులను నిర్మించి వాటియందు ధాన్యమును నిలువయుంచెడివారు

వర్తక వాణిజ్యముల యభివృద్ధికై రాయలు దూర ప్రాంతముల నుండి ధనవంతులయిన వర్తకులను రావించి, విద్యానగరమున వారికి మంచి వసతులు రక్షణ ఏర్పాట్లు చేసి నిర్భయముగా వర్తక వ్యాపారము చేసికొనుటకు అనుకూల పరిస్థితులను కల్పించెను

బుక్కరాయలు విజయనగరమును రమ్య హర్మ్యములతో కళకళలాడునట్లు వృద్ధిపరచెను ఇది వీరులకు, విద్వాంసులకు, కళా కారులకు నిలయమై విలసిల్లినది దీనిచుట్టును ఏడు ప్రాకారములుండెను శత్రు దుర్భేద్యమైన ఈమహానగరము పదు నాలుగు మైళ్ళ పొడవును, పదిమైళ్ళ వెడల్పును కలిగి మంచి కట్టుదిట్టములతో నుండెడిది ఇది తీర్చిదిద్దిన బజారులతో, వర్తక వాణిజ్యములతో మహావైభవోపేతముగా నుండెను

బుక్కరాయలు పెక్కుమంది కవిపండితులను పోషించి, వారికి అనేక అగ్రహారములను దానముచేసి విద్యాభివృద్ధికి అమితమైన దోహదము చేసెను. ఇతడు వైదికమతాభిమాని ఈ రాజు ప్రోత్సాహముతో మాధవసాయణుడు వేద భాష్యమును, పెక్కు ఇతర గ్రంథములను రచియించెను 'శ్రీమత్సకల భాషా భూషణ రసపోషణ సంవిధాన చక్రవర్తియైన' నాచన సోమనాథకవి ఈ రాజు కాలమున వర్ధిల్లి 'ఉత్తర హరివంశము' ను మహాకావ్యమును వ్రాసెను రాయలు నాచనసోమునికి భూరి సన్మానము చేసి, పినాకినీ తీరమందలి పెంచుకలదిన్నె యను గ్రామమునకు "బుక్కరాయపుర" మను నామాంతరము కల్పించి, దానిని అతనికి అగ్రహారముగా నిచ్చెను

రాయలకాలమున ప్రఖ్యాతి వహించిన మహామంత్రి, మహావిద్వాంసుడైన మాధవమంత్రి ఇతడు వేద వేదాంగములను కూలంకషముగ పఠించి, నాస్తికమతమును ఖండించి, ఉపనిషన్మార్గమును పునః ప్రతిష్ఠించి, పెక్కుమందికి గురువై మోక్షమార్గము నుపదేశించెను. సూతసంహితకు వ్యాఖ్యానమును, శైవామ్నాయ సారము మొదలగు గ్రంథములను రచియించెను ఇతడారాజ్యమున పశ్చిమ ప్రాంతమునకు పాల

కుడుగా నుండెను ఇతనికి 'పిరవసంతమాధవుడు' అను నామాంతర ముండెను

ఆనాడు విజయనగరసామ్రాజ్యమునకు గోవా ముఖ్యమగు రేవు పట్టణముగా నుండెను దేశ, విదేశ వాణిజ్యము లీరేవునుండి బహుళముగా సాగుచుండెను

విజయనగర సామ్రాజ్య స్థాపనకు తోడ్పడిన శృంగేరీ మఠమును బుక్కరాయలు 1856 వ సంవత్సరమున దర్శించి, గొప్పభూములను ధనకనక వస్తువాహనములను సమర్పించి, ఆ మఠాభివృద్ధికి తోడ్పడి, తన కృతజ్ఞతను తెలుపుకొనెను

బుక్కరాయలు శైవమతావలంబి అయినను సర్వమతముల వారిని సమానముగా ఆదరించెను ఒకానొక సందర్భమున శ్రావణ బెళ్గోళాయందు జైనులకును, వైష్ణవులకును మతకలహములు చెలరేగినవి మతావేశపరవశులైన వైష్ణవులు జైనమందిరమైన 'గోమటేశ్వరాలయము' ను పాడుచేసిరి ఆ విషయము తెలిసిన రాయలు ఉభయ మతముల వారిని సమావేశపరచి, తప్పుచేసిన వైష్ణవులను మందలించి మరల జైన దేవాలయమును వైష్ణవులు తమ సొంత ఖర్చులతో బాగుచేయించునట్లు తీర్పుచెప్పి, వారిరువురికిని సఖ్యత చేకూర్చెను

బుక్కరాయలు న్యాయశీలుడు, పరిపాలనా దక్షుడు, సమర కోవిదుడు, యోధాగ్రేసరుడు, రాజనీతి విశారదుడు ఈతని స్నేహమును కోరుచు, సింహళము, జావా, మలయాళ దేశపు రాజులు తమ రాయబారులను ఆతని దర్బారునకు బంపి, విలువగల కానుకలను ప్రతి సంవత్సరము సమర్పించు చుండెడివారని, ఫెరిస్తావంటి చరిత్రకారుడు గూడ శ్లాఘించి యుండెను

బుక్కరాయలు తన రాయబారులను చైనా, జపాన్ మొదలయిన వివిధ దేశములకును బంపి, తన విశాల దృక్పథమును, శాంతికాముకతను ప్రదర్శించుకొనెను

హరిహర రాయలకు వలెనే బుక్కరాయలకు గూడ విద్యారణ్యమహర్షి మంత్రిగను, హితబోధకుడుగను ఉండి, విజయనగర సామ్రాజ్యాభివృద్ధికి హిందూమతసంరక్షణమునకు మిక్కిలి తోడ్పడెను

'మహామండలేశ్వర, పూర్వ పశ్చిమ సముద్రాధీశ్వర' మున్నగు బిరుదములను బుక్కరాయలు వహించెను తన రాజ్యవిస్తరణముతోపాటు కోశాగారమును ధనసమృద్ధము చేసెను రాయలు మిక్కిలి ప్రజారంజకుడు అతని మహత్తర పరిపాలనమున ప్రజలు భోగభాగ్యములతో, సుఖశాంతులతో తులతూగిరి ప్రజలు తమ ప్రభువునెడల భక్తిప్రపత్తులు గలిగియుండిరి

ఈ బుక్కరాయలనే చరిత్రకారులు, వీర బుక్కరాయలనియు మొదటి బుక్కరాయలనియు వ్యవహరించిరి

విజయనగర సామ్రాజ్య ప్రముఖ నిర్మాతలలో నొకడైన బుక్కరాయ సార్వభౌముడు 22 సంవత్సరములు ప్రతిభా, ప్రభావ, విభవ సంపన్నుడై మహోన్నతముగ రాజ్యమేలి 1377 వ సంవత్సరములో పరలోకగతుడయ్యెను

పు వేం

## బుద్ధి-బుద్ధి శోధనము

బుద్ధి లేక జ్ఞానము అను పదమును నిర్వచించుట ఇంచుక కష్టమైన కార్యము మనస్తత్త్వ శాస్త్రజ్ఞుల కింకను ఈ శబ్ద నిర్వచనములో ఏకీభావ మేర్పడ కుండుటే ఇందుకు కారణము ఒక నూతన సన్నివేశమును సమర్థతతో నిర్వహించుటకును, నూతన విషయములను గ్రహించుటకును వేర్వేరు వ్యక్తుల శక్తియందుండు వ్యత్యాసములను తెలుపుటకును, ఉపయోగించు శక్తిపరముగా బుద్ధి యను శబ్దము సాధారణముగా ప్రయోగింపబడును ప్రతి ఉపాధ్యాయుడు తన విద్యార్థులలో కొందరిని ఇతరులకంటె ఎక్కువ మేధావంతులుగ పేర్కొనుచుండును అందువలన అట్టి విద్యార్థులు ఇతరులకంటె ఎక్కువ తెలివిగలవారని కాని, విద్యాభ్యాసములో ఉత్తములని కాని అర్థముకాదు మేధావియైన పసిబిడ్డ సోమరియై కూడ నుండవచ్చును కదా! మేధావియగు బాలుడు సోమరికానిచో, తక్కిన పిల్లలకంటె ఎక్కువ శీఘ్రముగా పాఠములను నేర్చుకొనగలడని దీని అర్థము కావున బుద్ధియను శబ్దమునకు బుద్ధి కౌశల్యమును సంపాదించు శక్తి యని అర్థమేకాని, సంపాదింపబడు కౌశల్య పరిమాణమును అర్థము మాత్రము కాదు అది ప్రత్యేకమగు నొకశక్తి కాక మేధస్సునకు సంబంధించు సాధారణ సామర్థ్యమని మాత్రమే చెప్పవలసి యున్నది బుద్ధి కౌశల్యమును తెలిసికొని, దాని శక్తిని అంచనాకట్టుటకేదైన మార్గముకలదా యను ప్రశ్న ఈ సందర్భమున ఉదయించును.

ఆల్‌ఫ్రెడ్ బినెట్ అనునతడు సమకాలిక మానసిక శాస్త్రజ్ఞులలో అగ్రగణ్యుడు బుద్ధిశోధనములను ప్రవర్తిల్ల

చేసిన వారిలో ఆతడు ప్రథముడు 1900 వ సంవత్సర ప్రాంతమున పారిస్ నగరమందలి పాఠశాలాధికారులు, విద్యాభ్యాసములో వెనకబడిన బాలబాలికల స్థితిని గూర్చి కలవరపడిరి వారూహించినట్లు బిడ్డలు వెనుకబడియుండుటకు వారి సోంబెతనము, సావధానత లేమి కారణములా? లేక బుద్ధి కౌశల్యములో మాంద్యము కారణమా? అను సమస్యలు తలయెత్తెను పాఠశాలాధికారు లీ సమస్యలను పరిష్కరింపుమని బినెట్‌ను కోరియుండిరి

విశ్వసనీయమగు నొక బుద్ధిశోధన విధానమును గూర్చి బినెట్ యోచింప మొదలిడెను వ్యక్తుల బుద్ధి పాటవమును శోధించి, దాని పరిమాణమును తెలిసికొనుటకు యత్నించిన వారిలో బినెట్ ప్రథముడు కాడు అదివరకే గాల్టన్ అను శాస్త్రజ్ఞుడు మానవుని మేథాశక్తిని, అతని పారంపర్యమును, అతని పరిసరములను పరిశీలించు శోధనశాలను లండను నగరములో స్థాపించెను కావున బినెట్ ఈ కార్యరంగములో ప్రవేశింపక పూర్వమే, కొన్ని తరగతుల పరిశోధనములు ఆచరణమునం దుండెను అయితే మానవుని మేధస్సును పరిశీలించుటకై పరీక్షావిధానమును ప్రవేశపెట్టిన వారిలో బినెట్ ప్రథముడు

బాలుర నోటివెంట ప్రశ్నలకు జవాబులను రాబట్టి వారిచే కొన్ని పనులను చేయించి, వయోనుగుణముగా కఠిన మొనర్పబడిన ప్రశ్నావళిలో వారు పొందిన విజయమునుబట్టి వారిధీశక్తిని నిర్ణయించుటయే బినెట్ నిర్వహించిన పరిశోధన విధానము ఆరు సంవత్సరముల మూడు మాసముల వయస్సుగల బాలుడు నాలుగు సంవత్సరముల రెండు మాసముల వయస్సుగల సాధారణ బాలుడు ప్రియపదముగా చేయగల పనులను మాత్రమే ఆచరింప సామర్థ్యము కలిగియుండవచ్చును

ఒకానొక శిశువుయొక్క గ్రహణశక్తి ఆతడు పెద్దవాడగుటతోపాటు క్రమముగా హెచ్చుచుండును కాని ఆ శిశువు యుక్తవయస్సునకు చేరువగుకొలది ఆతని గ్రహణశక్తియొక్క పెరుగుదల తగ్గుచున్నట్లు పరిశీలింపబడినది. గ్రహణశక్తియొక్క పెంపుదల 14–16 సంవత్సరముల మధ్య నిలిచిపోవునని తెలియుచున్నది ఆ వ్యక్తి పిదప, అధికతరమైన జ్ఞానమును, కౌశల్యమును, వివేకమును సంపాదించుకొనవలసినవాడగును కాని వాటిని సంపాదించుకొనుటకు అతని శక్తి పై హద్దును చేరగలదు శిశువులు పాఠశాలను వదలి, వృత్తిలో ప్రవేశించు వయస్సు దాటిన పిమ్మట, బుద్ధిశోధన విషయమై, అట్టి విద్యార్థులనుండి సరియైన ఉదాహరణములు లభించుట దాదాపు అసంభవమగును అనగా ఆ వయస్సు రాకపూర్వమే బడిపిల్లలు చక్కని ఉదాహరణములుగ ఉపకరింతురు తత్ఫలితముగా పదునాలుగు సంవత్సరముల వయస్సు దాటిన తర్వాత బాలుని బుద్ధి వికసించునో, వికసించదో ఇంతవరకు కచ్చితముగా తెలియకున్నది గత ప్రపంచ యుద్ధ సందర్భమున అమెరికా యుద్ధసైనికులను పరీక్షింపగా, సగటున 18 సంవత్సరముల వయస్సు వచ్చువరకు వారి బుద్ధినైశిత్యము వికసించునని స్పష్టమైనది ఇతరోదాహరణముల వలన కూడ 15–16 సంవత్సరముల వయస్సు వరకు మానవుని బుద్ధివికసించునని తేలినది ఆ వ్యక్తులనే మరల మరల పరీక్షించి 18 నుండి 19 సంవత్సరముల వయస్సువరకు బుద్ధి వికాసమును పరిశీలించుటకు యత్నములు చేయబడినవి ఇట్లు జరిపిన కొన్ని పరిశీలనములలో 14 సంవత్సరములకు పైబడిన విద్యార్థుల బుద్ధివికాసములో ఎట్టి అభివృద్ధియు కన్పింపలేదు కొన్ని పరిశీలనములలో 18, 20 సంవత్సరముల వయస్సు వరకు, మందముగనైనను బుద్ధివికాసమున సంతతాభివృద్ధి ఘటిల్లినది వయస్సు ముదిరిన కొలది మధ్యమ వయస్కుల సాధారణ గ్రహణశక్తి మొదట మెల్లగను, ముదుసలితనము పైబడిన కొలది, త్వరితముగను క్షీణించునను విషయము పరిశోధనల వలన స్పష్టమైనది

దాదాపు 16 సంవత్సరముల వయస్సుగలవారి బుద్ధిశోధనపు వక్రరేఖ వయస్సునుబట్టి వృద్ధిచెందునను కథనము కేవలము అబద్ధమని కొందరు విమర్శకుల అభిప్రాయము ఈ చిక్కును నివారించుటకై కొందరు మానసిక శాస్త్రజ్ఞు లిట్లు సూచించిరి "బుద్ధి" అనుశబ్దము తప్పుడు అర్థమిచ్చుచున్నదని కొందరు మనస్తత్వ శాస్త్రజ్ఞులు సూచించి ఈ చిక్కును పరిష్కరించిరి ఈ శబ్ద స్థానములో "సాధారణ బుద్ధిశక్తి" అను పదమును చేర్చినచో భావము సుబోధక మగునని వారి అభిప్రాయము కారణ మేమనగా నూతన సమస్యలను తెలిసికొని పరిష్కరించుట వయస్సు పైబడినవారికి అంతకంతకు తక్కువ ప్రాముఖ్యమైన విషయముగా పరిణమించును కలన, ఈ సమస్యలను పరిష్కరించుటకు వలసిన జ్ఞానమును ఆతడు అంతకుపూర్వమే సంపాదించుకొని యుండును

బుద్ధిశోధన విషయములో బాలుని శరీరాభివృద్ధి ఘటిల్లు తరుణముననే అతని బౌద్ధిక వయస్సు పెంపొందును అతని బౌద్ధిక వయస్సునకును, కాలిక వయస్సునకును నడుమనుండు నిష్పత్తి ఇంచుమించు స్థిరముగనే యుండును శిశువు ఉన్నత స్థాయిలో విద్యాభ్యాసము వలన ప్రయోజనము పొందగలడో లేక బుద్ధిపాటవమున కవసరమగు వృత్తి వలన ఉన్నత స్థాయిలో విజయము సాధింపగలడో సాపేక్షక బాల్యావస్థ యందే ఊహించుటకు సాధ్యమగుట ఇందుకు కారణము

అయితే బౌద్ధిక భాగహార లబ్ధము సందలి స్థిరత్వము సంపూర్ణమైనదికాదు శిశువుయొక్క బౌద్ధిక భాగహార లబ్ధ ప్రమాణములో హెచ్చు తగ్గులు కాన్పించును ఈ బౌద్ధిక భాగహార లబ్ధము మెదడునకును, వెన్నెముకకును సంబంధించిన అంటువ్యాధులు కారణముగా క్షీణింపవచ్చును లేదా పరిసరముల ప్రభావము వలన ఈ భాగహార లబ్ధములో వృద్ధి యేర్పడవచ్చును ఎట్లయినను, బౌద్ధిక భాగహార లబ్ధము తగినంత స్థిరముగా నుండుటచే, ఉత్తరకాలమందలి బౌద్ధికకలాప ప్రదర్శనమున కిది విలువైన ప్రాతిపదికగా ఉపకరింపగలదు

బినెట్ శోధనములపై ఘటిల్లిన అభివృద్ధి బినెట్‌కు అకాలమరణము ఘటిల్లెను అందుచే అతడు ప్రారంభించిన బుద్ధిశోధనములందు అభివృద్ధిని సాధింపజాలకపోయెను అమెరికాలో టెర్మన్ అను శాస్త్రజ్ఞుడు బినెట్ కావించిన బుద్ధిశోధన విధానమును సవరించి, విస్తృతపరచెను అతడీ విషయమును గూర్చి 1916, 1937 సంవత్సరములలో ప్రముఖ గ్రంథములను ప్రచురించెను. ఈ గ్రంథములద్వారా ప్రామాణికమైన వైయక్తిక బుద్ధిశోధన విధానము పరిణామము చెందినది ఈ కారణముగా పూర్వపు బినెట్ బుద్ధి శోధన విధానము ప్రాతబడినది ఈ నూతన శోధనపద్ధతులు పెక్కు విషయములలో పూర్వపు విధానముకంటె భిన్నముగ నున్నవి ఈ నూతన శోధన విధానములలో 18 మాసముల నుండి 22 సంవత్సరముల బౌద్ధిక ప్రాయమువరకు మానవుల బుద్ధిశోధనములు ఇమిడియున్నవి ఈ శోధనముల వలన బౌద్ధికవయస్సు దాటిన శిశువులనుగూర్చి కావలసినంత సమాచారము లభ్యమైనది. అయితే ఏకకాలమునందు పెక్కురకు సుశిక్షితుడు కాని శోధకునివలన బుద్ధిశోధనములను చేయించవలసిన ఆవశ్యకము కలదు, ఈ ఆవశ్యకత సాముదాయిక శోధనములవలన తీరినది ప్రథమమున జరుపబడిన అమెరికా సైనిక శోధనములును, నార్తంబర్‌ల్యాండు మానసిక శోధనములును ఇందు కుదాహరణములు ఇందువలన ఏకకాలమున బాలబాలికలయొక్క సాధారణ సాముదాయిక సామర్థ్యమునుగూర్చి పుష్కలమైన సమాచారము శీఘ్రముగా లభింపగలదు

ప్రాయోగిక బుద్ధిపరిశీలనము ఏ ప్రయోగమునకైనను కార్యాచరణమునకు సంబంధించు ముఖ్య పరిస్థితులను అదుపునందుంచుకొని పృథక్కరించవలెను వివేకవంతమైన కార్యమునకు సంబంధించు అవసర పరిస్థితులను వశమందుంచుకొనుట సులభముకాదు 72 గంటలు నిద్రకాచిన విద్యార్థులపై ప్రయోగములు చేసినతర్వాత, భిన్నమైనను, తత్తుల్యమైన బుద్ధిశోధనము జరుపబడెను వారు నెరవేర్చిన కార్యముయొక్క విలువ మామూలు విలువకంటె 25 శాతము తగ్గెను ఈ ప్రయోగము వలన నిశితమైన బుద్ధిబలమునకు విశేషముగ మేలుకొనియుండుట అవసరమని తెలియుచున్నది అనగా మేధాసంపత్తునకు జాగరూకత అవసరమని యర్థము అట్లే ఆకలిలోనున్న జనులు ఎక్కువ జాగరూకతకల్గి కార్యనిర్వహణమును చక్కగా చేయగల్గుదురేమో యను విషయమును తెలిసికొనుటకై ప్రయోగములు జరుపబడెను

పరస్పర సంబంధిబుద్ధి పరిశీలనము పైనపేర్కొనిన స్థిర పరిస్థితులలో పెక్కురను పరీక్షించుటకు మరికొన్ని ప్రయోగములు చేయబడినవి వ్యక్తిగతముగా మానవుని బుద్ధితో ఏ యితర లక్షణములు కలిసి పనిచేయుచుండునో కనుగొనుటయే ఈ ప్రయోగముల ఉద్దేశము ఒకవ్యక్తి చురుకైనవాడుగను, మేధావిగను, మరియొకడు మందుడుగను ఉన్నాడనుకొనుడు నిర్హేతుకముగా త్వరపడి ఒక నిర్ణయమునకు వచ్చుటకు బదులుగా ఈ దృష్టితో అనేకులు పరీక్షింపబడిరి జాగరూకతతో తీర్మానములు గావింపబడెను కొందరు గణితశాస్త్రజ్ఞులు అన్యోన్య సంబంధములను మానము చేయుటకై సూత్రములను కల్పించిరి. అవి దోషరహితములును, సాన్వయములునైన పరస్పర సంబంధములకొరకు +1 అను విలువను, దోషరహితములైన పరస్పర వ్యతిరేక సంబంధములకొరకు -1 అను విలువను ఒసగెను అన్యోన్య సంబంధముయొక్క ప్రతి అంతస్సునకును భిన్నధనాత్మక, ఋణాత్మక వ్యతిరేకములగు విలువలు లభించెను ఈ సూత్రములు, వీటికి గల అపవాదముల సంఖ్యను, తీవ్రతను క్రమ

మైనవిగా పరిగణించును. చలరాసులైన ఈ రెండును సమాన ప్రతిపత్తికలవి. మొదటిది కారణమనియు, రెండవది కార్యమనియు చెప్పుటకు వలనుపడదు. అయితే అవి రెండును కలిసియుండుటచే వాటికి పరస్పర సంబంధము కొంత కలదు.

సాధారణ బుద్ధిశోధనములేకాక, ప్రత్యేక సామర్థ్యములు కనుగొనుటకు కూడ పెక్కుశోధన విధానములు కలవు. కచ్చితమైన వేగనిర్ధారణము మొదలుకొని కలవరపరచు సమస్యా పరిష్కారముల వరకు ఈ విధానములు వ్యాప్తి కలిగియున్నవి. స్పియర్ మన్, థారన్ డైక్ అను ప్రముఖ మానస శాస్త్రజ్ఞులు శ్రమపడి, వివరముగా పరిశీలించి, ఈ సమస్యపై వేరువేరుగా నిర్ణయములను చేసిరి. తెలివితేటలుగల ప్రవర్తనము నందెల్ల ఒకే ఒక సాధారణాంశము కలదని స్పియర్ మన్ నుడివెను. ఈ సాధారణాంశము కచ్చితముగా వర్ణింపబడదగు విధమును తెలుపు సాక్ష్యాధారములేదు. అతడీ సాధారణాంశమును సాధారణ సామర్థ్యమని మాత్రమనెను. దానికతడు 'జీ' (జనరల్) అని పేరిడెను. 'జీ' యొక్క అస్తిత్వము వలననే, సంగీత, సంఖ్యా, కళా శాస్త్రముల వ్యాసంగములలో విజయము ఘటిల్లుచుండును.

ఇది యిట్లుండగా, థారన్ డైక్ బౌద్ధికరంగములో 'జీ' యొక్క సత్తనే శంకించినాడు. కాని 'సాధారణ మేధా శోధనము' అని మనమభిప్రాయపడునది పెక్కు ప్రత్యేకశక్తి సామర్థ్యముల సమాహారమని అతడనెను.

వారసత్వరీత్యా సంక్రమించు మేధస్సు. మేధస్సు యొక్క భాగహార లబ్ధము వారసత్వ రీత్యా సంక్రమించు లక్షణముగా నిశ్చితమగునా, లేక మేధాసంబంధమైన శిక్షణము యొక్కయు జీవితమందలి పరిసర ప్రభావముల యొక్కయు ఫలితములవలన నిశ్చితమగునా అను సంశయము వివాదగ్రస్తమైనది. బుద్ధిసూక్ష్మతగల్గిన మానవ ప్రవర్తనమునకు వారసత్వము, పరిసరములు కూడ ఆవశ్యకములని స్పష్టమగుచున్నది.

స్పియర్ మన్, థారన్ డైకులవంటి మానవశాస్త్రజ్ఞులు బుద్ధిశోధన విధానములను కల్పించి మానవాళికి కావించిన సేవ అమూల్యమైనది. ఈ శోధనములు మానవజీవితములో పెక్కు రంగములకు సంబంధించిన వ్యాసంగములందు ప్రయోజనకారులుగ నున్నవి.

శ్రీ శ్రీ. దే.

## బుష్ మెన్

ప్రాచీనకాలమున బుష్ మెన్ అనువారు ఉష్ణప్రాచ్యదేశమును, మధ్యాఫ్రికా యొక్క ప్రాగ్భాగమును ఆక్రమించియుండిరని సర్వసాధారణముగా విశ్వసింపబడుచున్నది. టాంగనికా ప్రాంతములో రాతిపై చిత్రింపబడిన బుష్ మెనుల వర్ణచిత్రములును, ఉగండా, దక్షిణ సుడానులలోని రాతిచెక్కడములును, కంకాళముల అవశేషములును ఈ అభిప్రాయమును బలపరచుచున్నవి. కలహారి ఎడారియొక్క మధ్య, ఉత్తరభాగములకును, నైరుతి ఆఫ్రికా యొక్క ఉత్తరార్ధ భాగమునకును మాత్రమే ప్రస్తుతము వీరి వ్యాప్తి పరిమితమై యున్నది. బుష్ మెన్ అనగా "పొదల మానిసులు" అని అర్థము. వారు పొదలలో నివసించుచుండెడువారు.

బుష్ మెన్ లు దాదాపు 60 అంగుళముల సగటు ఎత్తుగలిగి పొట్టిగ నుందురు. వారు కొంచెము దృఢమై, సుష్ఠునిర్మితములైన అవయవములతో, చిన్ని చేతులతో, చిన్ని పాదములతో ఒప్పుచుందురు. వారి శరీరచ్ఛాయ పసుపువన్నె లేక కొంచెము పసుపుతో కూడిన గోధుమవన్నె కలిగి యుండును. వారి శిరోజములు పలుచనై చిన్ని చిక్కులుగా చుట్టుకొని మిరియాలపైరువలె కనిపించును. వారి ముఖము బల్లపరుపుగా నుండును. వారి దౌడ ఎముకలు మిక్కిలి ఎత్తుగా నుండును. వారి ముక్కులు చదునుగా నుండును. వారి నుదురు ముందుకు త్రోసికొని వచ్చినట్లుండును. వారి కన్నులు చిన్నవిగానుండి సాధారణముగా కొంచెము క్రిందికి వ్రాలియుండును. వారి చెవులకు తమ్మె లుండకపోవుటకూడా కలదు. వారి పిరుదులు ప్రస్ఫుటముగా కనిపించుచుండును. స్త్రీల పిరుదులు, తొడలు మిక్కిలి క్రొవ్వెక్కి స్థూలములై యుండును.

60 లేక 100 మంది జనులు గల చిన్ని తెగలుగానో లేక వేటగుంపులుగానో నివసించుట బుష్ మెనుల కలవాటు. ఇట్టివి అనేక గుంపులు కలిసి ఒక జాతిగా ఏర్పడి, ఒకే పేరుతో, ఒకే భాషతో బంధింపబడి యుండును. కాని ఈ జాతికి ఈ గుంపులయొక్క సాంఘిక జీవనమును శాసించుటకు ఎట్టి అధికారమును ఉండదు. కనుక ఈ గుంపులు స్వతంత్రములై, స్వయంపరిపోషకములుగా నున్నవి. కుటుంబములే ఈ గుంపులలో గల విభాగములు. మామూలుగా ఈ గుంపులయొక్క జీవన విధానమును, వయోధికులై ఎక్కువ అనుభవము గలవారు నియమింతురు. కొన్ని గుంపులకు వంశ

పారంపర్యముగ వచ్చినట్టి నాయకులుకూడా ఉందురు కాని వారి పలుకుబడి స్వల్పమై యున్నది వారికి యుద్ధములను, వేటలను నడిపించుటయందు తప్ప, న్యాయవిచారణయందు ఎట్టి అధికారము ఉండదు

బుష్‌మెన్‌ల వృత్తి వ్యవసాయముకాని, పశుపాలనము కాని కాదు వారు వేటాడియు భోజనయోగ్యములైన కందమూలములను, కాయగూరలను సేకరించుకొనియు జీవింతురు ఇట్టి జీవన విధానముచే వీరు దేశద్రిమ్మరులగు చున్నారు వీరి ఇండ్లు మోటుగానుండును వాటిని స్త్రీలు సాధారణముగా నీటినుండు వద్ద చెట్లకొమ్మలతో అర్ధవర్తులాకారముగా నిర్మింతురు ప్రతికుటుంబమునకు ఒక్కొక్క గుడిసె ఉండును విల్లును విషదిగ్ధములైన అమ్ములను వీరి యొక్క ముఖ్యాయుధములు నిప్పుదాకట్రలు లొట్టిపిట్ట గ్రుడ్ల తొనులు వలలు వంగిడులు వేటకు వారికి ఉపకరణములుగా నున్నవి

బుష్‌మెన్ జాతిలో యౌవనము ప్రాప్తించిన బాలబాలికల విషయములో కొన్ని ఉపదేశోత్సవములను జరుపుట సర్వసాధారణమైన ఆచారమై యున్నది. యౌవనము ప్రాప్తించిన యువకులకు, వైద్యులు నుదుటిపై వారిప్రత్యేక జాతి చిహ్నమును కత్తితో గుర్తుపెట్టి వారికి ఒకటి రెండు నెలలు పొదలలో ఒంటరిగా నుండు కఠిన జీవనవిధానమును విధింతురు ఆతరుణమందే వారికిస్వజాతీయ సంప్రదాయములు బోధింపబడును బాలికలు తమగుడిసెలందే కొన్ని ప్రత్యేకమైన ఆహార నిషేధములను పాటించుచు, ఒంటరిగా కాలము గడుపుదురు ఇది ఈ ప్రవేశోత్సవములో ఒక అంశమై యున్నది ఇట్టి ప్రవేశ - ఉపదేశోత్సవానంతరము యువతీ యువకులు వివాహార్హులుగా భావింపబడుదురు బహుభార్యాత్వము నిషిద్ధము కాకపోయినను, ఏకపత్నీత్వమే సర్వసాధారణ నియమమై యున్నది

బుష్‌మెన్‌ల అన్ని తెగలలోను వైద్యులు వైద్యులాంత్రికులు కలరు వర్షమును కలుగజేయుట, యువకుల ఉపదేశోత్సవములను నడుపుట, వారియొక్క ముఖ్యవిధులై యున్నవి వారు అస్వస్థులగువారికి మందులిచ్చుచుందురు రక్తము పీల్చి వాయుబుద్బుదములను తొలగించుటయే వారియొక్క వైద్యవిధానములో ముఖ్యమైనదిగా నున్నది

బుష్‌మెన్‌ల యొక్క మతవిశ్వాసములను గూర్చియు, ఆచారములనుగూర్చియు, మనకుగల జ్ఞానము పరిమితముగా నున్నది వారు చంద్రుని తదితర గ్రహనక్షత్రములను, పూజింతురు వారికి ఆ గ్రహ నక్షత్రాదులను గూర్చిన అనేక పురాణములు, ఇతిహాసములు కలవు ఒకవ్యక్తి మరణము నొందినచో వాని శవమును గుడిసెవద్ద, నిద్రపోవుచున్నస్థితిలో మోకాళ్ళను మీదికిగుంజి పార్శ్వముపై పరుండబెట్టి ఖననము చేయుదురు ఒకవ్యక్తి సంపాదించిన వస్తువులన్నియు వానితో పాతిపెట్టబడును జంతువులకు వశముగాకుండా ఉండుటకు సమాధులపై రాళ్ళుపేర్చి అటుపిదపనే ఆ తెగ వారందరును రెండు మూడు సంవత్సరముల వరకు అచోటును పొడ చెప్పరు గుహల యందు, శిలలపైనను, రాతిగృహముల పైనను గతించినదినపు బుష్‌మెన్‌లు చిత్రించిన చిత్రములు, చెక్కిన చెక్కడములు వారి ప్రశస్త సంస్కృతికి తార్కాణములు వారిచిత్రములు సహజముగా నున్నవి ఆ చిత్రములలో పశుచారణము, నృత్యములు, మాంత్రిక, మతసంబంధి దృశ్యములు చిత్రింపబడియున్నవి నేడు ఈ కళాసంప్రదాయము పూర్తిగా నశించినట్లు కానవచ్చుచున్నది నీటిని నిల్వచేసికొనుటకు ఉపయోగపడు నిప్పుకోడియొక్క గ్రుడ్డు మీద చెక్కబడు అలంకరణములు మాత్రమే నేడు మిగిలియున్న వీరి కళాప్రతిరూపములుగా నున్నవి

రా ప్ర

## బెంగాలీభాషా సారస్వతములు :

భాష ఆధునిక భారతీయ ఆర్యభాషా కుటుంబమునకు చెందినది బెంగాలీ (వంగ)భాష వంగభాషా క్షేత్రము గంగానది డెల్టాకు ఇరువైపుల వ్యాపించి యున్నది గంగకు ఉత్తరమున, పూర్ణియా జిల్లాకు తూర్పున గల మహానందా వరకును, దక్షిణమున ఛోటా నాగపూరు సరిహద్దు ప్రాంతము వరకును బెంగాలీ భాషను మాట్లాడుదురు మిద్నపూరు జిల్లాలో చాలభాగమునను సింహభూమిలోని ధాల్‌భూయ్ అను ప్రసిద్ధ ప్రాంతము వరకును, తూర్పున గోల(పా)ర్ పాడా జిల్లాలోని సగభాగమునుంచి అస్సాము లోయల వరకును, సూరమా లోయలోని సిల్‌హట్, కచార్, మైమన్‌సింహ, ఢాకా వరకును, నౌఖాలి, చిట్‌గాంవ్ జిల్లా అరకాను లోయలోను బెంగాలీభాష వ్యవహారములో నున్నది దేశవిభజనానంతరము బెంగాలురాష్ట్రము తూర్పు పాకిస్తానుగను, పశ్చిమ బెంగాలుగను విభజింపబడినది.

బెంగాలు ప్రాంతమునందంతటను గ్రాంథికభాషా రూపము ఒకే విధముగా నున్నను మాండలిక భేదము లెన్నియో కలవు గ్రాంథిక (సాహిత్య) భాషకును వ్యావహారిక (కథ్య) భాషకును చాల భేదము కలదు గ్రియర్సను మహాశయుడు వీటిని రెండు భాషలనిన బాగుండు నేమో యని అభిప్రాయపడినాడు రాజబంగశీ, హైజోంగ్, చాక్మా, రైంగ్మైత్ అనునవి ముఖ్యములైన మాండలికములయినను తూర్పు, పశ్చిమ శాఖలు రెండు ప్రధానములు తూర్పు శాఖకు ఢాకా ప్రధాన కేంద్రము పడమటి శాఖకు కలకత్తా ప్రధాన కేంద్రము

అధునిక బెంగాలీభాష, మాగధీప్రాకృతమునకు సంబంధించిన అపభ్రంశ భాషనుండి 8 వ శతాబ్ది ప్రాంతములో విడివడి 12 వ శతాబ్దమునాటికి పరినిష్ఠితరూపమేర్పరచుకొన్నదని విద్వాంసుల అభిప్రాయము సాహిత్యదర్పణకారుడు చెప్పిన గౌడీయప్రాకృతముయొక్క ఆధునిక రూపమే నేటి బెంగాలీభాష

బెంగాలీభాషలో 11 అచ్చులు, 39 హల్లులు కలవు లిఖితభాషకును, కథ్యభాషకును భేదముకలదు అనగా బెంగాలీలు 'వసు' అనివ్రాసి 'బోసు' అనియు 'లక్ష్మి' అని వ్రాసి 'లొక్కి' అనియు చదువుదురు

బెంగాలీలిపి బ్రాహ్మీలిపినుండి వెలువడినదే బ్రాహ్మీలిపి యొక్క తూర్పుశాఖ కుటిల లిపియని పేర్కొనబడినది దానినుండి బహుశః 11వ శతాబ్దినాటికి నేటి బెంగాలీ వర్ణమాల రూపొంది యుండవచ్చును 1170 నాటి శిలాశాసనములలోను, 1242 నాటి తామ్రశాసనములలోను బెంగాలీ వర్ణమాల విస్పష్టముగా రూపొందినది

1951 సం॥ జనాభా లెక్కల ప్రకారము బెంగాలీ మాట్లాడువారి సంఖ్య 3 కోట్లకు పైబడియున్నది భారతీయ భాషలలో హిందీతరువాత బెంగాలీదే స్థానము

సారస్వతము బెంగాలీభాషలో వాఙ్మయనిర్మాణము దాదాపు క్రీ శ 10వ శతాబ్దమునుండి ప్రారంభమైనదని చెప్పవచ్చును ఈ 10 శతాబ్దముల బెంగాలీ సాహిత్యము

1 ఆదికాలము–క్రీ. శ 9 నుండి 12వ శతాబ్దము వరకు
2 ప్రారంభిక వికాసకాలము–13 నుండి 15వ శతాబ్దము వరకు లేక చైతన్య పూర్వయుగము.
3 వికాసకాలము–16 నుండి 18 వ శతాబ్దమువరకు లేక చైతన్యోత్తర కాలము –
4 ఆధునిక కాలము–19వ శతాబ్దమునుండి నేటివరకు
(అ) రవీంద్రయుగము
(ఆ) రవీంద్రోత్తరయుగము

అను నాలుగు యుగములుగా విభజింపబడినది

వంగభాషలో ప్రాచీనతమమైన కావ్యమని చెప్పబడుచున్న 'రామచరిత' (8 వ శతాబ్దము) యను గ్రంథము నామమాత్రావశిష్టము ఇదే పేరుగల సంధ్యాకరనంది అను నాతడు 10 వ శతాబ్ది పూర్వార్ధమున ఈ కావ్యమును రచించెను 14వ శతాబ్దివరకు వంగభాషలో లిఖితసాహిత్యము మృగ్యము జానపదకథలు పాటలు మున్నగునవి ఉన్నను అవి లిఖితరూపమును పొందక మౌఖిక ప్రచారములో నుండుటచే, వాటి మూలరూపములలో చాలమార్పువచ్చినది 'శ్యామాశయ' 'అంధాబంధూ' 'ధోపార్ పాట్' అనునవి ఇట్టి జానపదరచనములే.

సిద్ధాచార్యులు రచించిన 'చర్యాపదములు' మూలరూపమున గాక, టిబెట్ భాషానువాద రూపమున లభ్యమగుచున్నవి ఈ 47 గేయములు సహజయాన సంప్రదాయమునకు చెందిన సిద్ధుల రచనలు ఈ గేయములలో అపభ్రంశ భాషానంతరము ఏర్పడుచున్న బెంగాలీ భాషయొక్క ప్రాథమిక రూపము కాన్పించుచున్నదని విద్వాంసుల యభిప్రాయము 'బౌద్ధగాన్ ఓ దోహా' అను గ్రంథములో 'మహామహోపండిత' హరప్రసాదశాస్త్రివర్యులు వీటిని సేకరించి యున్నారు

పదవ శతాబ్దమునకు చెందినదని చెప్పబడుచున్న 'డాకార్ణవము' (డాక్ అను నాతడు రచించిన గీతములు), ఖాన్ గేయములలో ప్రాచీన బెంగాలీ భాషా రూపములు కన్పించుచున్నవి పై రెండును నీతిప్రబోధకములయిన గేయపదములు 11 వ శతాబ్దములో రామాయిపండితుడు 'శూన్యపురాణము'ను రచించెను

చైతన్య పూర్వయుగములో ముసల్మాను పాదుషాల దర్బారులలో బెంగాలీ వాఙ్మయమునకు ఆశ్రయము లభించినది మహాభారతమును మొట్టమొదట వంగభాషలోనికి నాసిర్ షా (నసరత్ షా–15–16 శతాబ్దములు) అనువదించెను తరువాత పరాగల్ ఖాను అను నాతడు తన ఆస్థానకవియగు కవీంద్ర పరమేశ్వరునిచే (1494-1525) మహాభారతమును

అనువదింపజేసెను ఈకావ్యము, కృతి కర్త పేరిట పరాగలీ మహాభారతము అని ప్రసిద్ధిగాంచినది. చుటీఖానుఅనునాతడు శ్రీకరనందిచే మహాభారతమును వ్రాయించెను. మాలాధరవసు రచించిన శ్రీకృష్ణ విజయకావ్యము (శ్రీకృష్ణ చరిత్రము 1473–80) భాగవతకథాశ్రయమైనది. బెంగాలులో బహుళప్రచారములోనున్న కావ్యములలో ఇదియొకటి.

ఈకాలమున సంప్రదాయపరమైన సాహిత్యము కూడ ఎక్కువగా రచింపబడినది శిఖాయన్, చండీమంగల్, ఎదావలీ అనునవి సంప్రదాయ ప్రతిపాదితమైన రచనములు. రామాయణ, మహాభారత, భాగవతానువాదములతోపాటు పద (గేయ) సాహిత్య రచనముకూడ బహుళముగా జరిగినది. వంగదేశమున బహుళ ప్రచారమునొందిన కృత్తివాసీ రామాయణము 16వ శతాబ్దిలో రచింపబడినది. విజయపండితుడు, నిత్యానందఘోషు, శ్రీధరదాసు, కాశీరామదాసు మున్నగువారు రచించిన మహాభారతములలో కాశీరామదాసు రచన ప్రసిద్ధతరము ఇది 17వ శతాబ్ది చివరిభాగములో వ్రాయబడినది. చండీసప్తశతిని అనువదించినవారిలో భవానిప్రసాదకర్, రూపనారాయణఘోషు వ్రజలాల్, యదునాథు అనువారు ముఖ్యులు. భవానీప్రసాద్ రచనము ప్రసాదగుణయుక్తమై జనానురాగమును బడసినది.

ఈ యుగములో విద్యాపతి, చండీదాసుల ప్రాభవము అవిస్మరణీయము. విద్యాపతిరచనలు హిందీభాషకుచెందినవా, లేక, వంగభాషకు చెందినవాయను విషయము చర్చనీయాంశముగా నుండెను. అతని రచనలు హిందీకి సంబంధించిన మైథిలీభాషకు చెందినవని పెక్కురుభాషాశాస్త్రజ్ఞుల అభిప్రాయము. వంగభాషలోని పదకర్తలలో (గేయరచయితలలో) చండీదాసు, జ్ఞానదాసు, గోవిందదాసు, బలరామదాసు, చైతన్యస్వామి మున్నగువారు ముఖ్యులు. రాధాకృష్ణ ప్రణయవర్ణనము గావించిన వీరందరిలోను చండీదాసునకే అగ్రతాంబూలము లభించినది.

కానేర్ భితర్ దియామరమే పశిలగో

అకుల్ కరిల్ మన్ ప్రాన్

(కర్ణరంధ్రముద్వారా ప్రవేశించి మనస్సును ప్రాణములను వ్యాకులపరచు వేణునాదమువోలె) చండీదాసు రచనలు పాఠకులను ఉల్లాసతరంగితులను చేయును.

బడూచండీదాసు (14–15 శతాబ్దులు) దీనచండీదాసు (16వ శతాబ్ది), ద్విజచండీదాసు (15–16 శతాబ్దులు) అను పేర్లతో ముగ్గురు చండీదాసులు కలరు. చండీదాసునిపేర రాదాపు పండ్రెండువందల గేయములు,పదములు ఉన్నవి. జయదేవుని గీతగోవిందముచే ప్రభావితమైన ఈ గేయరచనాప్రవాహము ఒక ప్రత్యేక సారస్వత ప్రక్రియగా రూపొంది మూడు శతాబ్దులవరకు వంగభాషను ముంచెత్తినది.

చంపక నగరనివాసియగు చాంద్ సౌదాగర్ అను శివభక్తుడు అనేక కష్టనష్టములకు గురియైనవాడై చివరకు, "మనసా దేవిని పూజించుటకు ఇయ్యకొనుట" అను ఇతివృత్తముగల 'మనసా మంగళము'అనుపేరిట 62 కావ్యములు రచించిరి. మనసా మంగళకావ్యముయొక్క ఆది రచయిత కానాహరి దత్తుడని ప్రవాదము. కాని లిఖితరూపమున ఉపలబ్ధమైన కావ్యము విజయగుప్తునిది (1486) ఈ కావ్యములలో జనప్రియమైనది క్షేమానందుని కావ్యము. నారాయణదేవుని రచన ఉత్కృష్టమయినది. ద్విజజనార్దనుని (16వ శ) చండీమంగళ సంప్రదాయములోను పేర్కొనతగిన కావ్యములు కలవు. వీటిలో కంకణ ముకుందరామ చక్రవర్తి 1589) కావించిన రచన సర్వశ్రేష్ఠమయినది. కృష్ణమంగళకావ్య, షష్టిమంగళకావ్య, టాప్ మంగళకావ్యములేకాక విద్యాసుందర కావ్యములు కూడ ఈ యుగములో వెలసిన విశిష్ట రచనలు.

చైతన్య మహాప్రభుని గేయరచనల ప్రభావము వంగదేశమున అమేయము. చైతన్యుని జీవితకథావర్ణన ఆధారముగా చరిత్రకావ్యముల రచన జరిగినది. చైతన్య తత్త్వమును వివరించుచు వ్రాయబడిన కావ్యములలో కాశీదాసుని చైతన్య చరితామృతము ఉత్కృష్ట రచనము. గోవిందుని 'కడచా' అను సంస్మరణాత్మక పదములకు వైష్ణవసాహిత్యములో అత్యున్నతస్థానము కలదు. ఈ గేయములలో చైతన్యుని దక్షిణదేశయాత్రలు వర్ణించబడినవి. చైతన్యుని శ్రీకృష్ణావతారముగా భావించి బృందావనదాసు (1507) 'చైతన్యభాగవతము'ను రచించెను. ఈ సంప్రదాయమునకు సంబంధించిన కావ్యములలో జయానందుని 'చైతన్య మంగళము (1550), కృష్ణదాసుని 'చైతన్య చరితామృతము' (1517). లోచనదాసుని (1528) 'చైతన్యమంగళము అను రచనములు ప్రసిద్ధములు.

ఈ కాలమున చైతన్య జీవితచరిత్రలతోపాటు ఇతర

భక్తుల జీవితకథలు కూడ వ్రాయబడినవి వాటిలో నిత్యానందుని 'ప్రేమవిలాసము' (1600), యదునందనదాసుని 'కర్ణానందము' (1607) నరహరిఘనశ్యామ చక్రవర్తి (18వ శతాబ్ది ప్రారంభకాలము) రచించిన 'భక్తిరత్నాకర, 'నరోత్తమ విలాసములు' పేర్కొనదగినవి చరిత్రకావ్యములలో 'కాంతనామ' అనునది సంప్రదాయపద్ధతిని రచింపబడిన చక్కనికావ్యము 19వ శతాబ్ది మధ్యభాగములో ఒక బెంగాలీ మహమ్మదీయ రచయిత, వారెన్ హేస్టింగ్సుదివాను అయిన కాంతబాబు జీవితచరిత్ర ఇతివృత్తముగా ఈ కావ్యమును రచించెను

విద్యాపతి, చండీదాసులతరువాత గేయరచయితలలో సుప్రసిద్ధుడు గోవిందదాసు (1537-1612) ఈ గేయములలో రాధాకృష్ణ దివ్యప్రణయము కీర్తించబడినది చైతన్య మహాప్రభు మహత్త్వ ప్రతిపాదకములై, రచనాసౌందర్య, గేయ మాధుర్యములతో కూడిన ప్రార్థనాగీతములు అనేకములు రచింపబడినవి జ్ఞానదాసు (1580) బలరామదాసు, కవిరంజన విద్యాపతి (ఛోటావిద్యాపతి) అనువారు 'వ్రజబులి'లో చక్కని గేయములు రచించిరి తరువాతివారు ఈ గేయములను సంకలనములుగా కూర్చిరి వీటిలో రామగోపాలదాసుని 'శ్రీరాధాకృష్ణ కల్పవల్లి' అతని కుమారుడైన పీతాంబరదాసుని (17 వ శ) 'రసమంజరి', విశ్వనాథచక్రవర్తి కృతమైన (18 వ శ) 'క్షణదాగీత చింతామణి', రాధామోహన ఠాకూరు (1725) రచించిన 'పదామృతసింధువు', వైష్ణవదాసుని (1770) 'పదకల్పతరువు' ప్రధానములు వీటిలో 'పదకల్పతరువు' అన్నిటికంటె పెద్దది దీనిలో విషయక్రమానుసారముగా కూర్చబడిన 3101 కీర్తనలు గలవు

ఈ యుగములో శ్యామాసంగీత్, బావుల్ సంగీత్, కవిగాన్ మున్నగుజానపదరచనములకును ప్రాచుర్యముకలిగినది

రాజాశ్రయములోనుండి, లక్షణగ్రంథముల ననుసరించి నియమబద్ధముగా కావ్యరచన గావించినవారిలో భారతచంద్రరాయ్ గుణాకర్ 1712-60), రామప్రసాదసేన్ కవిరంజన్ అనువారు (1775) రచించిన కావ్యములు శృంగారరస ప్రధానములై ఆలంకారిక భాషతో విరాజిల్లుచుండును 'కాలికామంగళమ'ను మారుపేరుగల 'అనందమంగళకావ్యము' భారతచంద్రుని ఉత్కృష్ట రచన. ఈతడు భాషాప్రయోగమునందును, వర్ణనలయందును సిద్ధహస్తుడు.

రామప్రసాదసేను సరళ సుందరభాషలో రచించిన సంకీర్తనములలో నిర్మల భక్తిభావములు తొణికిసలాడుచుండును విక్రమపురి నరేశుడగు రాజవల్లభుని ఆస్థానములోనున్న జయనారాయణుడును, అన్నదామయి అనునతడును కలిసి రచించిన 'హరిలీల' రమ్యమైన కావ్యము

ఈ యుగములో మహమ్మదీయ రచయితల రచనలు వంగ వాఙ్మయమునకు అద్వితీయ శోభను గూర్చినవి బర్మాభాష మాటలాడుచు చిట్టగాంగ్, అరకానులలో స్థిరపడిపోయిన బెంగాలీ మహమ్మదీయులు తమ మతసంప్రదాయములను వివరించు శాస్త్రగ్రంథములను పెక్కింటిని రచించిరి దౌలత్ కాజీ అనునాతడు రచించిన 'లార్ చంద్ర' లేక 'సతిమాయ్నా'యను రాజపుత్ర శృంగారగాథ, ఖురేషి మాగన్ ఠాకూర్ (17వ శతాబ్ది చివరిభాగము) రచించిన 'చంద్రావతీ' హైందవ కథలపై ఆధారపడిన కావ్యములు మహమ్మద్ ఖాన్ (1646) రచించిన 'మక్తల్ హుస్సేన్', 'ఖయామత్ నామా', అబ్దుల్ నబీ (1684) రచించిన 'అమీర్ హంజా' అను గ్రంథములు ఇస్లాముమత కథలపై ఆధారపడినవి అరేబియన్ నైట్స్ గాథలుకూడ బెంగాలీ మహమ్మదీయులచే వంగభాషలోనికి అనువదింపబడినవి

బెంగాలీ మహమ్మదీయ రచయితలలో శ్రేష్ఠుడు ఆలావాల్ (1607-80) మలిక్ ముహమ్మద్ జాయసీ హిందీలో రచించిన 'పద్మావత్' అను కావ్యమును ఇతడు బెంగాలీ భాషలోనికనువదించెను ఇది సూఫీ సిద్ధాంతసారమును రూపకాత్మకముగావర్ణించు కావ్యము 'సికిందర్ నామా' (1673) 'తొహఫా' (1663) మొదలగు కావ్యములు కూడ పేర్కొనదగినవి

జయదేవుని గీతగోవిందమునకు గిరిధరు డొనర్చిన వంగభాషానువాదము రమ్యమైన కావ్యముగా పేరొందినది

ఈ యుగములో కవివాలాలనుగూర్చియు యాత్రావాలాలనుగూర్చియు ముచ్చటింపవలసి యున్నది ఒక జట్టుగా కవులు ఏర్పడి, ఆశుకవిత్వము చెప్పుచు, ఎదుటి జట్టును పరాభవించుచు, ఊరూరు తిరుగువారిని కవివాలాలని అందురు ఈ జట్లలో స్త్రీలుగూడ నుండిరి ఏంటినీ అను పోర్చుగీసు దేశస్థుడు ఇట్టి జట్టును ఏర్పరచి ప్రసిద్ధి నొందెను జానపద నాటకములను ఊరూర ప్రదర్శించుచు తిరుగువారిని యాత్రావాలాలని అందురు పరమానందుడు, కృష్ణకమలుడు

యాత్రా నాటక రచయితలలో ప్రసిద్ధులు కృష్ణకమలుడు రచించిన 'స్వప్నవిలాసము'ను నాటకపు ప్రతులు 20 వేల వరకు అమ్ముడుపోయినవట. ఈ రెండు కళలు గ్రామీణ ప్రజల మనోరంజనార్థము ఏర్పడినవి.

ఆధునిక యుగోదయమునకు ముందు ప్రసిద్ధులయిన కవులలో భారతచంద్ర రాయ, రామనిధిగుప్త, ఈశ్వర చంద్రగుప్త మున్నగువారు పేర్కొన దగినవారు.

బెంగాలీ భాషలో 18వ శతాబ్ది చివరిభాగమునుండి గద్యరచన ప్రారంభమయినది. క్రైస్తవమత ప్రచారకులయిన పాదరీలు తమ మతగ్రంథములను బెంగాలీ వచనములోనికి అనువదించి ప్రచురించి గద్యరచనలకు ప్రచారము కల్గించిరి.

1778 లో నథానియేల్ బ్రాసీహాల్ హెడ్ అను ఆంగ్లేయుని ప్రయత్నముగా బెంగాలీ లిపిలో 'బంగ్లా వ్యాకరణ' అను పుస్తకము అచ్చొత్తించెను. 1800వ సంవత్సరమున కలకత్తాలో ఫోర్టువిలియం కాలేజీ స్థాపింపబడినది. విలియం కేరీ యనుమహాశయుడు వంగ పండితుల వలన పుస్తకములు వ్రాయించుటయే గాక స్వయముగా నిఘంటువులు, వ్యాకరణములు, చరిత్ర గ్రంథములు రచించినాడు. అతడు 1818 లో సి(శ్రీ)రాంపూర్‌లో 'సమాచారదర్పణ' అను పత్రికను ప్రారంభించెను. ఫోర్టు విలియం కాలేజీలో నుండి గద్య గ్రంథములు రచించిన వారిలో రామరామబసు, మృత్యుంజయ విద్యాలంకార్ అనువారు ప్రముఖులు. బసు రచించిన 'ప్రతాపాదిత్యచరిత్రము' (1801) లండనులో బెంగాలీ లిపిలో ముద్రితమైనది. విద్యాలంకార్ అనునతడు 'పురుష పరీక్ష' యను గ్రంథమును రచించెను.

ఈ కాలములో అనువాద గ్రంథముల సంఖ్య హెచ్చు పెరిగినది. సంస్కృతాంగ్ల భాషలనుండి ఎన్నియో గ్రంథములు వంగభాషలోనికి అనువదింపబడినవి. అనువాదపు తెల్లునమునుండి వంగసాహిత్యమును రక్షించి మార్గప్రదర్శనము గావించినవాడు, గద్యమును పరిష్కరించినవాడు రాజా రామమోహనరాయలు (1770 లేక 1780). అనేక భాషలలో పండితుడయిన రామమోహనరాయలు పాశ్చాత్య నాగరికతచే ప్రభావితుడైనను, దానిలోని చెడుగులను నిరోధించి, మంచిని మాత్రము భారతీయులు గ్రహించవలెనని నమ్మి ప్రయత్నము చేసినవాడు. రాజకీయ, సాంఘిక, ధార్మిక క్షేత్రములలోనేకాక, సాహిత్య క్షేత్రములో కూడ గొప్ప మార్పును తెచ్చినవాడు రామమోహన రాయలు. ఈతని సమకాలికుడగు ఈశ్వరచంద్ర విద్యాసాగర్ (1820-91) సాంఘిక, సారస్వత రంగములలో అపారమైన సేవ కావించెను. ఈతనికి 'వంగవచన' జనకుడన్న అన్వర్థనామము కలదు. వంగదేశమున స్త్రీ విద్యావ్యాప్తికై పాటుపడిన వారిలో ఈశ్వరచంద్రుడు అగ్రగణ్యుడు.

ఇట్లు 1820 నాటికి వంగభాషలో గద్యరచనా విధానము సుపరిష్కృతమై భావ ప్రకటనానుకూలముగా శక్తిమంతమై శోభిల్లెను.

ప్యారీచాంద్ మిత్ర రచించిన 'ఆలాలేర్ ఘరేర్ దులాల్' (1857) అను గ్రంథము వంగసాహిత్యమున మొదటి నవల. భూదేవ ముఖోపాధ్యాయ రచించిన 'అంగురీయ వినిమయ' మను ఈ దశకమునకు చెందినది. ప్రారంభ యుగమునకు చెందిన రచయితలలో తారకానాథ్ గంగోపాధ్యాయ, రమేశచంద్ర దత్తా, స్వర్ణకుమారీదేవి పేర్కొన దగినవారు.

బెంగాలీ నవలారచనను ఉచ్చస్థాయికి తెచ్చినవారిలో ప్రముఖుడు, ప్రథముడు అగు బంకిమచంద్రుడు పుంఖానుపుంఖములుగా చారిత్రక నవలలు రచించినాడు. దుర్గేశనందిని, దేవి చౌధురాణి, ఆనందమఠము మున్నగు నవలలు అఖిల భారత ప్రశస్తిని పొందినవి. చారిత్రక, సాంఘిక ఇతివృత్తములతో నవలారచన గావించిన బంకిమచంద్రుడు సామాన్య ప్రజలలో దేశభక్తి నుద్బోధించుటయే తన ప్రధాన కర్తవ్యముగా తలచెను.

బంకిమచంద్రుని 'రాజసింహ' రమేశచంద్రుని 'మహారాష్ట్ర జీవనప్రభాతము' (1878), 'రాజపుత్ర జీవనసంధ్య' దేశభక్తిని ప్రబోధించు ఉత్తమ నవలలు.

సాంఘిక నవలలు రచించి, రవీంద్ర యుగములో ప్రసిద్ధి వడసినవాడు శరచ్చంద్రుడు. ఆనాటి మధ్యతరగతి జీవనమును, స్త్రీల నెదుర్కొనుచున్న సమస్యలను కన్నులకు కట్టినట్లు చూపిన అతని నవలలో 'శ్రీకాంత్', 'చరిత్రహీనులు', 'దేవదాసు' మున్నగునవి ప్రసిద్ధములు. శరచ్చంద్రుడు నవలా రచనలో రవీంద్రునికన్న మిన్నయని ప్రసిద్ధి వడసినవాడు.

సర్వతోముఖ ప్రతిభా సంపన్నుడగు రవీంద్రుడు ధనిక వర్గ వాతావరణమును, వారి నెదుర్కొను సమస్యలను

చిత్రించుచు 'గోరా' 'నౌకాభంగము', 'రెడ్ ఆలియాండర్స్', 'ఇంటా-బయటా' మున్నగు నవలలు రచించెను రవీంద్రుని కథా కథనశైలి, పాత్రపోషణము అత్యుత్తమములు

ఈ యుగమున కు చెందిన వారిలో 'రమాసుందరి' రచయితయగు ప్రభాతకుమార ముఖోపాధ్యాయ, 'పరశురామ్' అను మారుపేరున వ్యంగ్యప్రధాన రచనలు గావించిన రాజశేఖరవసు, హాస్యరస ప్రధాన రచనలు గావించిన కేదారనాథ వంద్యోపాధ్యాయ ముఖ్యులు

రవీంద్ర, శరచ్చంద్రుల తరువాత నవలారచనలో నూతనత గోచరించును 'కల్లోల్' అను పత్రికలో ప్రచురింపబడిన ఈ నూతన రచనలు వంగపాఠక లోకమున అలజడి కలిగించెను ఈ రచయితలలో గోకుల్ నాగ్ ప్రబోధసన్యాల్, అన్నదాశంకర్, నిరుపమాదేవి జసీముద్దీన్ అనువారు ముఖ్యులు తారాశంకర వంద్యోపాధ్యాయ ప్రధానముగా గ్రామీణ వాతావరణమును చిత్రించుచు 'గణదేవత' 'పంచగామ్', ఆరోగ్యనికేతన్' మున్నగు నవలలు రచించెను 'An acre of Green Grace' అను పౌర ఆధునిక సాహిత్య ప్రక్రియలనుగూర్చి ఆంగ్ల గ్రంథము రచించిన బుద్ధదేవబోసుని 'సాడా', అన్నదాశంకరుని 'పథే ప్రవాసే' 'సత్యాసత్య (6 భాగములు) వనఫూల్ అను మారుపేరున రచన సాగించిన బలాయిచంద్రముఖోపాధ్యాయ రచించిన 'తృణఖండ', విభూతిభూషణ ముఖోపాధ్యాయుని 'పథేర్ పాంచాలి', 'అపరాజిత', 'ఆరణ్యక' మున్నగు రచనలు సుప్రసిద్ధములు

బొగ్గుగనులలో పనిచేయువారిజీవితమును చిత్రించుచు శైలజానంద ముఖోపాధ్యాయ రచించిన 'కయలకుటీ', 'అనాథఆశ్రమ్' అనునవి చక్కని నవలలు నారాయణ గంగూలీ సమరసేన్ సతీనాథ్ భాదురీ విమలమిత్ర అధునిక నవలా రచయితలలో పేర్కొనదగినవారు

19 వ శతాబ్ది చివరిభాగములో నగేంద్రనాథగుప్త, స్వర్ణకుమారిదేవి, సంజీవదేవ్ అనువారు చక్కని కథలను రచించినారు రవీంద్ర పూర్వయుగములో వ్రాయబడిన 'దామిని' (సంజీవదేవ్) ఉత్కృష్ట కథాఖండము.

రవీంద్రుని కథలలోని కళానైపుణ్యము అనుపమము 'కాబూలీవాలా', 'ఫటిక్', 'ఆకలిగొన్న శిలలు' అనునవి సుప్రసిద్ధములు.

ఆధునికులు ప్రేమను ప్రధానముగా గ్రహించినను, గ్రామీణ జీవనమును చక్కగా వర్ణించుచు అనేకములగు కథలు రచించినారు హాస్యరస ప్రధానములగు కథలను మిక్కుటముగా కలవు ఆధునిక కథారచయితలలో ప్రభాత బాబు, ప్రథమచౌధరి, నరేంద్రమిత్రా అనువారు ప్రసిద్ధులు

నవలా రచయితయగు రమేశచంద్రదత్త వంగభాష లోనికి ఋగ్వేదమును అనువదించెను "హిందూ శాస్త్రములు" అనుపేర ధర్మశాస్త్రముల సారాంశమును సులభ సరళశైలిలో రచించెను

మహామహో పండిత హరప్రసాదశాస్త్రి తన నిశిత విమర్శన పటుత్వముతోను, పరిశోధన ప్రతిభలోను ప్రాచీన వంగభాషా-సాహిత్యములకు ఎనలేని సేవ యొనర్చెను

శివనాథ శాస్త్రి రచించిన 'ఆత్మచరిత' ఆనాటి వంగ సమాజమును పాఠకుని కన్నులకు కట్టినట్లు చేయును యోగేంద్రనాథ విద్యాభూషణుడు మహాపురుషుల జీవిత చరిత్రలను చక్కని శైలిలో రచించెను రజనీకాంతగుప్త సిపాయి విప్లవ చరిత్రను రచించెను వంగదేశపు చారిత్రికులలో పేర్కొనదగినవాడు రాజారాజేంద్రలాల్ మిత్ర భూదేవ ముఖోపాధ్యాయుని సాంఘిక, సాంస్కృతిక వ్యాసములు లోకగణన కెక్కినవి

18 వ శతాబ్ది మధ్యకాలము నుండియే వంగదేశమున ఆధునిక నాటకప్రదర్శనలు, రచనలు ప్రారంభమైనవి పాంచాలీగాన్, ఝూమర్ యాత్రా మున్నగు జానపద ప్రదర్శనలలో విసుగెత్తిన అధునాతన విద్యావంతులకు పాశ్చాత్య నాటకములపై మోజు కలిగినది హెరాసిమ్ లబ్‌డెఫ్ అను రష్యాదేశస్థుడు మొట్టమొదటిసారిగా (క్రీ శ 1795) నాటకమును ప్రదర్శించెను పిమ్మట వంగీయుల ప్రథమ నాటక ప్రదర్శనము 1831 లో జరిగినది ప్రారంభదశలో ఆంగ్ల, సంస్కృత భాషలనుండి వంగభాష లోనికి అనువదింపబడిన నాటకములే తరచుగా ప్రదర్శింపబడుచుండెడివి ఈ యుగమునకు చెందిన నాటకకర్తలలో నవీనబాబు, తారాచరణసిక్‌దార్ ప్రసిద్ధులు 1873 లో నేషనల్ థియేటర్ స్థాపనతో మౌలిక నాటక రచనలకు మిక్కిలి ప్రోత్సాహము కలిగెను 'కీర్తిలత', భద్రార్జున్', 'భానుమతీ విలాసము' అను నాటకములలో ప్రప్రథమముగా మౌలికత గోచరించును ప్రసిద్ధ కవియగు మైకేల్ మధు

మధుసూదనదత్తు రచించిన 'కృష్ణకుమారి' (1860), బెంగాలీలో రచింపబడిన మొదటి దుఃఖాంత నాటకము మధుసూదనదత్తు సంస్కృత నాటక సిద్ధాంతములను పూర్తిగా విడనాడి, ఆంగ్ల ఫక్కి ననుసరించి 'శర్మిష్ఠ', 'ఏకేకిలోలే సభ్యతా' (ఇదియేనా నాగరికత?) మున్నగు నాటకములను రచించెను 19 వ శతాబ్ది చివరిభాగములో దీనబంధుమిత్రా (1889) అనువాతని నాటకములు బహు ప్రసిద్ధి పొందినవి మిత్రా రచించిన నాటకములలో ఆంగ్లేయ పరిపాలకుల కోపతాపములకు గురియై, స్వదేశీయుల మన్ననలనందిన 'నీలదర్పణ్' అనునది నీలిమందు పండించు ఆంగ్లేయుల అత్యాచారములను బట్టబయలు పరచు నాటకము సధవార్ ఏకాదశీ' (ముత్తైదవ ఏకాదశివ్రతము), 'కమలేకామినీ' (కమలములో కామిని), 'బియేపాగలాబూఢా' (వివాహోన్మాదియగు ముసలి) మున్నగు రచనలు కూడ పెక్కు పర్యాయములు ప్రదర్శించబడినవి

బెంగాలీ నాటక ప్రదర్శన విషయమున మహర్షి దేవేంద్రనాథఠాకూరు, వారి కుటుంబమువారు ఒనర్చిన సేవ ఉగ్గడింపదగినది 'జోడాసాంకో' (వారి నివాస గృహము)లో నాటకశాల స్థాపించియు, రచనలకు పారితోషికము లొసగియు, వారు ఆధునిక నాటక రచనలకు, ప్రదర్శనములకు ఎనలేని ప్రోత్సాహ మొసగిరి నాటక రచయితగా రవీంద్రుడు కొన్ని నూతన పద్ధతులను ప్రవేశపెట్టెను రవీంద్రుని రచనలలో 'విసర్జన' 'రాజు-రాణి', 'చిత్రాంగద' పేర్కొనదగినవి 'నటీర్ పూజ' చక్కని నృత్యనాటిక

గిరీశచంద్రఘోషు ఆధునిక నాటక ప్రదర్శనలను, సామాన్య ప్రజానీకమునకు అందుబాటులోనికి తెచ్చుటకై ప్రయత్నించెను బాగ్‌బజారులో నాటకశాలను స్థాపించి, పెక్కు నాటకములను రచించి, వాటిని స్వయముగా అతడు ప్రదర్శించెను స్త్రీపాత్రాభినయమునకై స్త్రీలకు స్థానమిచ్చుట, టిక్కట్లుపెట్టి నాటక ప్రదర్శనలు ఏర్పాటు చేయుట మున్నగు వాటిని గిరీశ్ ప్రారంభించెను 78 నాటకములను రచించి, వాటిని చక్కగా ప్రదర్శించిన గొప్ప నటుడు గిరీశ్ అతడు నాటకములలో చక్కని గీతములు రచించెను అతడు ప్రయోగించిన ఛందస్సు 'గైరిశీఛంద్' అను పేర ప్రసిద్ధికెక్కెను అతని రచనలో 'బిల్వమంగల', 'జనా' (భక్తజనాబాయి), 'ప్రఫుల్ల', 'అశోక', 'చైతన్యలీల' ప్రసిద్ధములు 'మెక్బెత్తు' అనువాదము విద్వాంసుల మన్ననపొందినది దీనబంధు, గిరీశచంద్రులను బెంగాలీ నాటక చరిత్రలో యుగపురుషులనుగా పేర్కొనవచ్చును

గిరీశబాబు తరువాత అఖలభారత ప్రసిద్ధినొందిన నాటక రచయిత ద్విజేంద్రలాల్‌రాయ్ (1863-1913) అనునతడు మొగలు సామ్రాట్టుల ఇతివృత్తము లాధారముగా 'షాజహాన్', 'నూర్జహాన్', 'దుర్గాదాసు' మున్నగు నాటకములను రచించెను అతని చారిత్రక నాటకములలో 'చంద్రగుప్త' కూడ సుప్రసిద్ధమైనది పాత్రల చిత్రణములో సిద్ధహస్తుడగు రాయ్ కొన్ని సాంఘిక నాటకములను, ప్రహసనములను రచించెను రాయ్ ఉత్తమ కవియై వరలెను

క్షీరోదచంద్ర విద్యావినోద్ (1864-1927) బావాపు ఏబది నాటకములను రచించెను వాటిలో కొన్ని పౌరాణికములు కొన్ని చారిత్రకములు

విద్యాసాగర్ కాలేజీలో ఉపన్యాసకుడగు శిశిర్ భాదుడి అనునతడు చక్కని సాంఘికనాటకములను రచించెను ఇతడు అభినయము నందుకూడ ప్రవీణుడు

ఆధునిక రచయితలలో 'మానమయి గరల్సుస్కూలు', అనుదానిని రచించిన రవీంద్రనాథమైత్రా, దుమపురుష్ రచించిన 'తారాశంకర్' 'నవాన్న' అను కావ్యరచయిత విజనభట్టాచార్య పేర్కొనతగినవారు

భారతీయ భాషలలో సినిమాతో పోటీకి నిలువగలిగినది వంగ నాటక రంగము, నేటికి పెక్కు ప్రాచీన, ఆధునాతన నాటకములు విజయవంతముగా ప్రదర్శింపబడుచున్నవి

ఆధునికయుగ ప్రారంభదశకు చెందినవాడును, యుగస్రష్టయునగు కవీశ్వరుడు మైకేలు మధుసూదనదత్తు పౌరాణిక కథలను, పురాణప్రసిద్ధ వ్యక్తుల చరిత్రలనే కావ్యవస్తువులుగా పరిగ్రహించినను, వాటిలో ఒక వినూత్నజీవనమును, క్రాంతికారియగు నవీన దృష్టికోణమును, ఒక నూతన వ్యాఖ్యానము సంతరించి తన నవీన రచనాప్రాభవముచే వంగదేశీయుల నుర్రూతలూగించినవాడు దత్తు 'మేఘనాథవధ' 'వీరాంగనా' (రుక్మిణీ మున్నగు నాయికల ప్రేమలేఖలు), 'వ్రజాంగనా' (గోపీవిరహవర్ణన) మొదలగు కావ్యములను రచించెను. అతడు వంగభాషలో మొట్టమొదటిసారిగా అత్మాశ్రయకవిత్వమును రచించెను

రవీంద్రునకు ముందున్న తరమువారిలో బిహారీలాల్ చక్రవర్తి పేరొందినవాడు ఆత్మనిమగ్నమై, గంభీరమైన

ఆతని కావ్యరచన నూతన ఛందస్సులకు, నూతన భావావిష్కరణమునకు ఆలవాలమై, ముందువారికి మార్గప్రదర్శనము కావించెను రవీంద్రు డీతని రచనలచే ప్రభావితుడై, ఇతనిపట్ల తన కృతజ్ఞతను వెల్లడించెను

రవీంద్రుని సమకాలికులలో సురేంద్రనాథ్ మజుందార్, దేవేంద్రనాథ సేన్, అక్షయకుమార్ బడాల్, ప్రసిద్ధులు

ప్రకృతి సౌందర్యము ఆధ్యాత్మికత, వెల్లివిరిసిన పవిత్ర గంగాస్రవంతి రవీంద్రుని కావ్యరచన 'గీతాంజలి' విశ్వప్రసిద్ధమై నోబెల్ బహుమానమును బడసినది సాధన, కబీరు కీర్తనలు, ఫలసంచయము మున్నగు కవితా సంకలనములు రవీంద్రుని కవితాప్రతిభకు తార్కాణములు

రవీంద్రుని అడుగుజాడలలో నడిచి కావ్యరచన గావించిన వారిలో 'ఇందిరాదేవి', 'ప్రియంవదాదేవి', యతీంద్రమోహన్ బాగ్చి అనువారు ముఖ్యులు అనేకములగు విదేశీయ కవితలను బెంగాలీలోనికి అనువదించి, విశ్వకావ్య సౌరభమును వంగీయుల కందించినవాడు సత్యేంద్రనాథదత్తు

కాజీనజరుల్ (ఇస్లాము) అనునతడు రవీంద్ర యుగములో అత్యంత ప్రసిద్ధుడైన కవి ఇతడు కావ్యవస్తువులోను, శైలిలోను, విప్లవకరమగు మార్పులు తెచ్చిన జాతీయకవి ప్రేమ, విరహము, విప్లవము మున్నగు విషయములు వస్తువులుగా ఈతడు అసంఖ్యాకములగు గేయములను రచించెను ఈతని ఉపమాకల్పన అనుపమము రవీంద్రుని ప్రశంసించుచు రచించిన గేయములలోని 'అగ్నిగిరి మల్లికార్ పులేపులే' (ప్రతి మల్లికాపుష్పములో నొక అగ్నిపర్వతము) అను రూపకల్పన అనన్య సాధ్యము

ఆధునికులగు కవులలో ప్రేమేంద్రమిత్రా, బుద్ధదేవవసు, అచింత్యకుమార్ సేన్‌గుప్తా, మొదలగువారు ప్రసిద్ధులు వీరి రచనలు ఎక్కువగా పట్టణవాసులగు మధ్యతరగతి వారి కష్టగాథలను చుట్టుకొని యుండును సర్వతోముఖ ప్రతిభావంతుడైన బుద్ధదేవవసు యొక్క 'మేంథక్' (కప్ప) అను సుదీర్ఘ రచన నవీన నాగరికతను హేళన చేయుచు వ్రాయబడినది పద్మానదీ ప్రకృతిని వర్ణించుచు హుమాయూను కబీరు చక్కని గేయములు రచించెను, తృప్తిహీనమగు హృదయములోని బుభుక్షను వర్ణించుచు మహీఉద్దీన్ పెక్కు కవితలు రచించెను వనఫూల్ అనుకవి హాస్యరస ప్రధానములగు రచనలు కావించెను

అత్యాధునికులలో గల ఆదర్శహీనతకు, నిర్దిష్టలక్ష్యాభావమునకు, అస్పష్టతకు ప్రతినిధులుగా జీవానంద్ రచనలు పేర్కొనవచ్చును 'ఛాడ్‌పత్ర' అను కవితలో సుకాంత్ భట్టాచార్య విలక్షణ రచనాచాతుర్యము కనిపించును ఎజ్రాపౌండు, ఇలియట్ లచే ప్రభావితుడై కావ్యరచన సాగించుచున్నవాడు విష్ణుడే ఆధునికులయందు పేర్కొనతగినవారిలో సుధీంద్రదత్తా, అరుణకుమార్, అజిత్‌దత్తా మున్నగువారు కలరు

వంగసాహిత్యమును పలువురు మహమ్మదీయులు తమ రచనలచే సంపన్నము చేయుచున్నారు

స్వాతంత్ర్యము పొందిన పిమ్మట వంగసాహిత్యమున సర్వతోముఖమగు వికాసము కన్పట్టుచున్నది రచయితలు వివిధ ప్రక్రియలలో ఉత్తమములు, శ్రేష్ఠములు నగు రచనలు చేయుచున్నారు

శం శి జో

## బెర్ట్రాండ్ రస్సెల్

లార్డ్ రస్సెల్ (బెర్ట్రాండ్ రస్సెల్ అని ప్రసిద్ధిగా చెప్పకొనెదరు) అను మహనీయుడు విశ్వవిఖ్యాతుడగు బ్రిటిష్ తత్త్వవేత్తగా గణుతికెక్కెను ఇత డిప్పటికిని సజీవుడై యున్నాడు ఇత డింగ్లండులో క్రీ శ 1872 వ సంవత్సరమున పేరెన్నికగనిన ఒక కులీన కుటుంబములో జననమందెను శైశవ దశయందే తలిదండ్రులు గతించుటచే రస్సెల్ తన తాతయైన లార్డ్ జాన్ రస్సెల్ ఇంటనే పెరిగి పెద్దవాడయ్యెను ఆ కాలమునం దీజాన్ రస్సెల్ ఒక ప్రముఖ వ్యక్తిగా వెలుగొందెను అంతేగాదు బెర్ట్రాండు రస్సెల్ పూర్వులు 1688 వ సంవత్సరమునుండి రాజకీయ రంగమున ప్రకాశించిన ఘనులే

బెర్ట్రాండ్ రస్సెల్, తన తాతముత్తాతల త్రోవబోవక వేరు జీవితమార్గమును త్రొక్కుట కుద్యమించుట చిత్రమగు విషయము తన వంశములో మొట్టమొదటిసారిగా రాజకీయ వ్యాసంగమునుండి త్రోవతప్పి, తన కుటుంబములోనివారికి, సన్నిహిత బంధుమిత్రవర్గమునకు తీవ్రమగు ఆశాభంగమును కల్గించి, మరొక మార్గము ననుసరించినవాడు బెర్ట్రాండ్ రస్సెల్ మూడు సంవత్సరములు గణిత వేదాంత శాస్త్రములను అధ్యయన మొనరించి, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయమును వీడినవెంటనే, పారిస్ నగరమందలి బ్రిటిష్ రాయబార కార్యాలయమందును, ఐర్లెండు వ్యవహారములకు

సంబంధించిన జాన్ మార్లీ కార్యాలయమందును ఆకర్షకములైన ఉన్నత పదవులు ఆతనికి ప్రసాదించుటకు బ్రిటిష్ ప్రభుత్వము సంసిద్ధమైనది. కాని ఆతడా పదవులను నిరాకరించి తన కుటుంబమునకు తీరని ఆశాభంగము కలిగించెను. ఈ సందర్భములో నాతడు, 'నేను రాజకీయ జీవితమును కోరుకొనినచో, నామార్గము నిష్కంటకముగను, సరళముగను ఉండిపోగలదని, చెప్పవలసినవారెల్లరు నాకు సలహా చెప్పి ఒప్పింప యత్నించిరి... నా కుటుంబ బంధువులు అనేకవిధముల నాపై బలమైన ఒత్తిడి తెచ్చిరి. ఒకింత నేను సంకోచించినాను. కాని తుదకు తత్త్వశాస్త్రము ఎడ నాకుగల గాఢాభిమానము, ఆకర్షణము అప్రతిహతమైనదిగా పరిణమించెను' అని నుడివెను.

చిత్రము 101

పైన వ్రాసినట్లు లార్డ్ రస్సెల్ తాత్త్వికుడుగనే తన జీవితమును గడపుటకు తుదినిర్ణయము గావించుకొనెను. అనతికాలములోనే ఆతడు ప్రపంచ విఖ్యాతుడైన తత్త్వశాస్త్ర పారంగతుడుగా గణుతికెక్కెనని వేరుగా చెప్పనక్కరలేదు.

రస్సెల్ శతాధిక గ్రంథములను, వ్యాసములను రచించెను. ఈ రచనలయందు మానవుని ఆలోచనా పరిధిని గూర్చియు జ్ఞానసముపార్జనమునందాతనికి గల అసత్త్వ కాశములను గూర్చియు విస్తృతముగా వివరింపబడినది. ఆతని లేఖినినుండి అర్ధశతాబ్దిపై వరకు ఉత్కృష్ట గ్రంథములు వెలువడెను. ఆతని జీవిత చరిత్రను వ్రాసినవారిలో ఒకరనినట్లు, 'ఫ్రాన్సిస్ బేకన్ కాలమునుండి ఈనాటివరకు పరంపరగా కొనసాగుచున్న బ్రిటిష్ తాత్త్విక సంప్రదాయమునకు నిర్వివాదమైన వారసుడుగా ఆతడు వెలుగొందినాడు.' లార్డ్ రస్సెల్ గెలుచుకొనిన పెక్కు గౌరవ బిరుదములలో 'ఆర్డర్ ఆఫ్ మెరిట్' అనునది మిగుల గౌరవసూచకమైనది. ఈ బిరుదము 1949వ సంవత్సరములో ఆరవ జార్జి చక్రవర్తిచే ఆతనికి ప్రదానము చేయబడినది. సాహిత్య విషయమునగూడ తత్తుల్యమగు 'నోబెల్' బహుమాన మాతనికి 1950వ సంవత్సరములో ప్రాప్తించినది. సర్వసమగ్రమగు ఆతని మూర్తిమత్త్వమును చిత్రించు ఆతని రచనలన్నియు ఇంచుమించుగా మూడు విభాగముల క్రింద చూపవచ్చును (1) గణిత, విజ్ఞాన, తత్త్వశాస్త్రరంగములందు ఆతనిని పరిశోధకకర్తగా పేరుతెచ్చినవి, (2) సాంఘిక విమర్శకునిగా ఆతనిని చిత్రించినవి (3) బుద్ధిసూక్ష్మతగల పరిహాసోక్తిప్రియునిగా ఆతనికి ఖ్యాతితెచ్చినవి.

గణితశాస్త్రముపైన, గణిత - తత్త్వశాస్త్రముపైన ఆతడు రచించిన గ్రంథములు, 20వ శతాబ్దియందానడొక మహాప్రవీణుడైన గణితశాస్త్రవేత్తగా ఆతనికి అంతర్జాతీయ ఖ్యాతిని కూర్చిపెట్టెను. 1897వ సంవత్సరములో ఆతడు వ్రాసిన "రేఖాగణిత మూలసిద్ధాంతములు", ఆల్ఫ్రెడ్ నార్త్ వైట్ హెడ్ అనువానితో కలిసి 1910—1916 సంవత్సరములనడుమ రచించిన "గణిత తత్త్వశాస్త్రము", "గణిత సిద్ధాంతములు" అను గ్రంథములు గణితశాస్త్రక్షేత్రమును సర్వసమగ్రము, సర్వసంపూర్ణమునైన గ్రంథరాజములుగా పరిగణింపబడినవి.

రస్సెలునకు జీవితసర్వస్వమును, ప్రపంచ సర్వస్వము కూడ కేవలమొక తత్త్వశాస్త్రమే. ఈ భావమునకు రెండంశముల మూలమున ఉత్పన్నమైనది (1) తనకు సంప్రదాయసిద్ధముగా సంక్రమించిన మత, నైతికభావ ప్రేరణము, (2) శాస్త్రీయ పరిశోధనములు. మానవ విజ్ఞానమంతయు అనిశ్చితమైనదనియు, అపసవ్యమైనదనియు పాక్షికమైనదనియు ఆతని అభిప్రాయము. అందుచే చాలకాలమువరకు ఆతడు అజ్ఞేయతావాదిగను, సంశయవాదిగను ఉండిపోయెను. ఏదేని యొకమతమునందు విశ్వాసముంచని కారణముచే, ఆనాడినాటి ని అజ్ఞేయుండెను. అయితే, ఆతడొకవిషయమును వక్కాణించెను. సంశయవాదము తార్కికముగా దోషరహితమైనదైనను మనస్తత్త్వరీత్యా దానిననుసరించుట అసాధ్యమైన విషయము. అందుచే సత్ఫలితములను సాధించుటకు తత్త్వశాస్త్రము తనసమన్వయమును ప్రకృతిశాస్త్రములనుండియే స్వీకరింపవలెగాని, మత, నైతిక విషయములనుండి కాదు.

కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయమున నుండగా, హెగెల్ రచనలను రస్సెల్ శ్రద్ధాసక్తులతో పట్టువిడువక పఠించి అనుసరించినాడు. యథార్థమునకు తాత్త్విక జ్ఞానము,

శాస్త్రీయ విజ్ఞానముకంటె మౌలిక విషయములయందు భిన్నమైనదికాదని అతడు స్పష్టమొనరించెను. అయితే తత్త్వశాస్త్రమునకు ఒక ముఖ్యలక్షణముకలదు. విజ్ఞానశాస్త్రాధ్యయన విషయమునకు భిన్నమైన తత్త్వశాస్త్రాధ్యయనమున విమర్శనము ప్రధాన లక్షణము. కానివిజ్ఞానమును విమర్శించు తత్త్వశాస్త్రమునకు కొన్ని పరిమితులు కలవు. సహజముగా ఈ పరిమితులు మానవులను భగవంతునియందు విశ్వాసములేనివారినిగను, సంశయవాదులనుగను చేసినైచును. కాని మానవులు సంశయవాదులైనచో తార్కికవాదములను ప్రయోగించుట సాధ్యముకానేరదు. అయినను మానవుని జ్ఞానేంద్రియములకు సంబంధించిన మూలసిద్ధాంతములను గూర్చిన ఒక విధమైన జ్ఞానసాధనసంపత్తి ఉండనేడున్నదనియు ఇది కేవలము నిస్సంకోచమైనదిగ కన్పట్టుచున్నదనియు, రస్సెల్ వక్కాణించెను. భౌతికపదార్థములు మన జ్ఞానసాధన సంపత్తిని సరిగా పోలియుండుననుట విశ్వాసమొకటి కలదు. ఇట్టివియే పెక్కు విశ్వాసములు ప్రజలయందున్నవి. ఆలోచనా విధానమునకు కడంగువరకు మనమీ విశ్వాసములను కలిగియుండి, అవి తీవ్రమైన విచారణకు గురియగునపుడు, ఆ విశ్వాసములు అదృశ్యములైనట్లు కాన్పించును. ఆవిశ్వాసములను బలపరచు ఏదైననొక క్రొత్తవాదము లభ్యమైననే తప్ప, లేనిచో, వాటిని త్యజింపుమని తత్త్వశాస్త్రము మనలను ఆదేశించును. ఈ విధముగా రస్సెల్ ఒక్కొక్క శాస్త్రీయ భావమును చర్చించి ఆ మూలాగ్రముగా విచారించినపిమ్మట విదర్శనముమీద ఆధారపడు భావమును మాత్రమే అతడు అంగీకరించును. అతడు యౌవనదశయందు రేఖాగణితమును అధ్యయన మొనరించినప్పుడు గూడ యూక్లిడ్ ప్రతిపాదించిన సిద్ధాంతములను అంగీకరించుటకు అతనికి మనస్కరించలేదు. 1914వ సంవత్సరమువరకు ఈ ప్రముఖశాస్త్రీయుడు తన కాలమునంతటిని గణిత, తత్త్వ, విజ్ఞానశాస్త్ర విషయములను అధ్యయన మొనర్చుటయందును, వాటిని గూర్చి రచనలు చేయుటయందును శ్రద్ధాసక్తులతో వినియోగించెను.

ప్రథమ ప్రపంచ సంగ్రామ ఫలితముగా రస్సెల్ తన దృష్టిని సమాజముపైన, దాని సమస్యలపైన మరల్చెను. ఆ యుద్ధకాలములో యుద్ధమునకు వ్యతిరేకముగా అతడొనగిన శాంత్యుపదేశకోపన్యాసములు, బ్రిటిష్ ప్రభుత్వమునకతనిని శత్రువునొనర్చెను. అందుచేనాల్గుమాసములాతడు కారాగృహవాస శిక్షననుభవింపవలసివచ్చెను. అనంతరమాతడు గావించిన రచనలలో అత్యధిక భాగము కేవలము సాంఘిక, రాజకీయ సమస్యలకు సంబంధించినవి. ఒకానొక ప్రఖ్యాత రచయిత పేర్కొనినట్లు, కరుణామయమైన మానవ సమాజ నిర్మాణమునకు ప్రతిబంధకములై, మానవుల మనస్సులలో గూడుకట్టుకొనియుండు దుర్వాంఛలను, సంశయాస్పదమగు భయోత్పాతమును, అధికారతృష్ణను, అసహనమును, ద్వేషభావములను వ్యక్తీకరించి, ఇట్టివియలుచేయుటలో అతడు వాడితూపులవంటి చమత్కార శబ్దజాలములను శరవేగముతో ప్రయోగించును.

అతడు ప్రారంభమునుండియు నిర్మాణాత్మకము, సశాస్త్రీయము, మానవోచితము, ఆశాజనకము, నిష్కళంకమునైన విమర్శనమునే చేయువాడు. సాంఘిక, రాజకీయ సమస్యల పరిష్కారముపట్ల అతడెట్టి ఆసక్తిని ప్రదర్శించెడివాడో, విద్యావిషయక సమస్యలయెడల గూడ అట్టిశ్రద్ధనే చూపెడివాడు. స్వీయ జీవిత చారిత్రక వ్యాసమందొకచోట అతడు "1921 వ సంవత్సరమునుండి బహుకాలమువరకు, పసిబిడ్డలయెడ తలిదండ్రులు నిర్వర్తింపవలసిన బాధ్యతలను గూర్చియు, తత్సంబంధమైన విద్యావిషయక సమస్యలను గూర్చియు చర్చించుటయందు నిమగ్నుడనై యుంటిని" అని చెప్పికొనినాడు. సంప్రదాయబద్ధమైన విద్యావిధానమును సంస్కరించి, అభ్యుదయ విధానమును ప్రవేశపెట్టుట కాతడు కాంక్షించెను. అందుచేత ఈ సమస్యపై వెలుగును ప్రసరింపచేయుచు అతడు అమూల్యములైన కొన్ని గ్రంథములు రచించెను.

వ్యంగ్యపద ప్రయోగములద్వారా విజ్ఞానఖనులనదగిన తన గ్రంథములయందాతడు ప్రజలకు దివ్య సందేశముల నొసగెను. ఎవ్వరియెడల, ఎట్టి ద్వేషభావములేక, తాను హృదయపూర్వకముగా చిత్తశుద్ధితో విశ్వసించిన విషయములను వ్యక్తీకరించుచు, సత్యమునకు, సద్విషయమునకు, భిన్నములైనవాటిని అతడు ఖండించెడివాడు. అతనిరచనలను బట్టి, మానవునికి వాంఛనీయమైనది శుష్కసిద్ధాంతములు కాదు. క్రైస్తవ మతోచిత ధర్మములగు ప్రేమాదరములై యుండవలెనట. అతని ప్రధానవాంఛగా తోచుచున్నది ఒకవంక విజ్ఞానశాస్త్రాభివృద్ధి ద్వారా, మరొకవంక మానవజాతినికృష్టతను తుదముట్టించుటద్వారా, మానవాభ్యుదయ

మునకును, మానవుడు సాధింపగల మహావిజయమునకును, నిరంకుశమైన విడివాదధోరణి పెక్కురూపములలో ప్రతిబంధకములు కల్గించుచున్నదని అతడు స్పష్టమొనర్చెను. అతని రచనలన్నిటియందు జీవిత సత్యములను చిత్రించు చతురోక్తులు కాన్పించును. అతని చతుర రచనము అప్యాయకరమైన వినోదమును కలుగజేయును. శాస్త్రీయ, నైతిక, రాజకీయ, మత, స్త్రీత్వ, విద్యా, వివాహవిషయక సమస్యలపై ఆతడిచ్చిన ఉపన్యాసములనుండియు, రచించిన గ్రంథములనుండియు అచ్చటచ్చటనుండి మణిపూసలవంటి కొన్ని హాస్యభాగములు సంగ్రహింపబడి, ప్రత్యేకముగా గ్రంథములుగాకూడ ప్రచురింపబడినవి.

తత్త్వవేత్త అయినవాడు ఏకకాలమున బుద్ధివైభవమును, హాస్యచతురతను ప్రదర్శించుటయందు సమానప్రతిభ కల్గియుండుట అరుదను విషయము మిగుల సమంజసమైనది, సత్యమైనది.

అయితే ధైర్యసాహసములను, చిత్తశుద్ధిని ప్రదర్శించినందుకు ప్రతిఫలముగా బెర్ట్రాండ్ రస్సెల్ కష్టనష్టములపాలు కావలసివచ్చెను. ఇది రస్సెల్ యొక్క ఏలకియేండ్ల జీవిత పథమునందు సంభవించిన దురదృష్టకరమైన కథనము. అతడు కరుడుకట్టిన పూర్వాచార సంప్రదాయవర్గము యొక్క అసహన ప్రవర్తనమునకు గురియయ్యెను. అయినను మహనీయుడైన ఈ తత్త్వవేత్త, ప్రాచీన సంప్రదాయవ్యతిరేకములైన విస్మయావహములగు తనభావములమీద ప్రతిపక్షులు చేసిన బహిరంగ దండయాత్రలను సహించుకొనుటయే అతని గొప్పలక్షణము. అతడెన్ని నిశితవిమర్శలకు గురియైనను తన అభ్యుదయ పథమునుండి వెనుకడుగు వేయలేదు. లార్డ్ రస్సెల్‌ను అపార్థము చేసికొనినట్లు మరి ఏ మహాపురుషుని లోకము అపార్థము చేసికొనలేదు. అతడు "క్రైస్తవ మత ద్రోహుడు, విగ్రహభంజకుడు, అవినీతిపోషకుడు" నైన నాస్తికుడని పెక్కురు భావించిరి. నైతిక, రాజకీయములందు సంశయభావమును ప్రతిష్ఠించుటకొరకు, తన జీవిత సర్వస్వమును ధారపోసినను సత్యమును లోకము గుర్తింపకపోలేదు.

'బెర్ట్రాండ్ రస్సెల్ తత్త్వరహితుడగు నాస్తికు'డని కొందరనెదరు, ఈ భావమునే మరికొందరు వేరువిధముగా 'అతడు నాస్తికులలోకెల్ల నాస్తికు'డని పేర్కొనిరి. సంగ్రహముగా చెప్పవలెనన్నచో, ఆతడు తన జీవితకాలములో కొనసాగించిన ప్రతి వ్యాసంగమునందును, సత్యమును అన్వేషించుటకై త్రికరణశుద్ధిగాయత్నించెననుటనిర్వివాదాంశము. మత, విజ్ఞాన, గణితశాస్త్రాదులయందు సత్యమును సంస్థాపించుటయే అతని ప్రధానాశయముగా నుండెను. గణిత,మత విషయములను గూర్చి నాతడు ప్రస్తావించి" తత్త్వశాస్త్రమునందు మానవుడు సమైన సంతృప్తిని పొందనాశించితిని. గణిత శాస్త్రీయ వ్యాసంగము ద్వారా తాత్త్విక క్షేత్రమునందడుగు పెట్టినాను, వేరువిధముగా చెప్పవలెనన్నచో, గణితశాస్త్ర అస్తిత్వ యాథార్థ్యములందు విశ్వాసమునేర్పరచుకొనుటకై కారణములన్వయించు కోరికతో గణితము ద్వారా తాత్త్విక రంగమున ప్రవేశించితిని' అని చెప్పెను. అందువలననే, ఆతడు మతమును వదలి, ఈనాటివరకు సంశయవాదిగనే జీవించుచుండెను.

అతని అనుయాయులలో నొకరు తత్త్వవేత్తలందరి జీవితలక్ష్యములు నిష్ప్రయోజనములైనవని చెప్పియున్నాడు. కాని ఈవిషయమును చాలినంత చిత్తశుద్ధితో బహిరంగముగా అంగీకరించిన కొలదిమంది వ్యక్తులలో బెర్ట్రాండ్ రస్సెల్ ఒకడు. ఇట్లంగీకరించుటయందే వాస్తవము విశిష్టమునైన అతని మహనీయత గోచరించును.

శ్రీ శ్రీ దే

## బెర్జిలియస్, జోన్స్ జాకబ్ (1779-1848)

జోన్స్ జాకబ్ బెర్జిలియస్ అనునతడు స్వీడన్ రసాయన శాస్త్రవేత్త. ఇతడు ఆధునిక రసాయన శాస్త్రమునకు పునాదులు వేసిన శాస్త్రవేత్తలలో ఒకడు. మూలద్రవ్యముల పరమాణు భారనిర్ణయములో ఇతడు చేసిన కృషి ఎంతయు గణనీయమైనది. ఈనాడు వాడుకలోనున్న రసాయన శాస్త్రీయ సాంకేతిక పరిభాషను రూపొందించుటలో, లెవోషిర్ చేసిన సూచనలను ఈ శాస్త్రవేత్త విస్తృతమొనర్చి పరిపుష్టమొనర్చినాడు. కొన్ని మూలద్రవ్యములను తయారు చేయుటలో కూడ ఈ శాస్త్రవేత్త ప్రథముడను కీర్తిని వహించినాడు.

బెర్జిలియస్ 1779 ఆగష్టు 20వ తేదీన ఫావర్‌సుండా జోల్‌గార్డ్‌లో జన్మించెను. ఇతడు రసాయన శాస్త్రము నభ్యసించి 1802వ సం॥న అప్సాలా విశ్వవిద్యాలయములో వైద్యశాస్త్రాచార్య పట్టమును పొందెను. వెంటనే ఆ విశ్వ

విద్యాలయములోనే, వృక్షశాస్త్రమును, ఔషధయోగముల కల్పనశాస్త్రమును బోధించు సహాయాచార్యుడయ్యెను.

బెర్జిలియస్ 1815వ సంవత్సరములో స్టాక్‌హోమ్ పట్టణములో వైద్య శస్త్రచికిత్సల కొరకై ఏర్పాటయిన క్యారొలిన్ విద్యాసంస్థలో రసాయన శాస్త్రాచార్య పదవి యందు నియుక్తుడై, ఆ శాస్త్రములో ఏకైక దీక్షతో కృషి చేయ మొదలుపెట్టెను. స్టాక్‌హోమ్‌లో స్వీడిష్ ప్రభుత్వము ఏర్పాటుచేసిన వైజ్ఞానిక శాస్త్రవేత్తల సంఘ సభ్యుడుగా 1808 లోను, శాశ్వత కార్యదర్శిగా 1818 లోను, ఇతడు ఎన్నుకొనబడెను. 1835 లో 14వ చార్లెస్ చక్రవర్తి ఈ శాస్త్రవేత్తకు 'ప్రభు'వను గౌరవబిరుదమును ప్రసాదించెను. దాదాపు 69 సంవత్సరములు జీవించి, అనన్యసాధ్యమైన కృషిచేసిన, ఈ శాస్త్రవేత్త స్టాక్‌హోమ్‌లో 1848లో ఆగష్టు 7వ తేదీన మరణించెను. ఇతడు తన వైజ్ఞానికశాస్త్ర పరిశోధనములలో వాడిన పరికరములను, స్టాక్‌హోమ్ నగరపరిసరములలో నున్న ఫ్రెస్కాటీ వైజ్ఞానిక సంఘమువారు తమ ప్రదర్శనశాలలో నుంచిరి.

బెర్జిలియస్ మొదట కొన్ని సంవత్సరములు జీవరసాయనశాస్త్ర విషయములను గురించి కృషి యొనర్చెను. 1807 నుండి తన కాలము నంతయు, రసాయన, యౌగిక ద్రవ్యములను గురించి శోధించుటలోనే వినియోగించెను. డాల్టన్ శాస్త్రవేత్త నిర్వచించిన పరమాణువాదమును నిష్పత్తి బాహుళ్య నియమమును అనుసరించి ఇతని పరిశోధనములు సాగెను. పదిసంవత్సరముల పైగా కృషిచేసి 2000 ద్రవ్యముల రాసాయనిక విశ్లేషణములను కొనసాగించి వాటిని 1818 లో ప్రకటించెను. కచ్చితమైన నిర్ణయాలకు బెర్జిలియస్ పరిశోధనములు తార్కాణములని శాస్త్రవేత్తల ప్రశంసలను పొందెను. 1818 నాటికి పెక్కు రసాయన యౌగిక ద్రవ్యముల లక్షణములను గూర్చిన విజ్ఞానమును ఇతడు నిశితమొనర్చెను. ఆమ్లజనకము, రాసాయనిక క్రియలలో కీలకమగుటచే, దాని ప్రాధాన్యమును ఆతడు గుర్తించి, మూలద్రవ్యముల పరమాణుభార నిర్ణయములో, దానిని ప్రమాణముగ గైకొనెను. అదియే ఈనాడుకూడ అనుసరణీయముగా నున్నది. ఇతడు పరమాణుభార నిర్ణయ కృషిలో సమస్ఫాటిక రూపనియమమును, గేలూజాక్ అను శాస్త్రవేత్త నిర్వచించిన వాయు పరిమాణముల నియమమును దృష్టిలో నుంచుకొని, చర్చించి, నిర్ధారణములు చేసెడివాడు. అలెస్సాండ్రో వోల్టా విద్యుద్ఘటమును నిర్మించినాడని తెలిసిన వెంటనే, ఆ సాధనము యొక్క ప్రాధాన్యమును గుర్తించి, విద్యుత్ప్రవాహ సహాయముతో, రాసాయనిక క్రియలను సాగించి, శోధింప సాగించెను. సోడియమ్ క్లోరైడ్ ద్రావణమును, సల్ఫ్యూరిక్ ఆసిడ్ ద్రావణమును, విద్యుత్ రాసాయనికముగా ఇతడు విశ్లేషించి నాడు. ఈ ప్రయోగానుభవములను బట్టి, రాసాయనిక యౌగికములలో, సంయోగస్థితియందు గిమిడియున్న పరమాణువులలో, వైద్యుతస్వభావము వ్యక్తమగుచున్నదని ఈ శాస్త్రవేత్త భావించెను. ఆ భావములనే ద్రవ్యముల ద్వివిధ స్వభావ సిద్ధాంతము అను పేర వివరించి, రాసాయనిక క్రియలు సాగుటకు అది మూలకారణము కావచ్చునని సూచించెను. మొదట ఈ సిద్ధాంతము, ఖనిజద్రవ్యజన్యములైన రసాయన యౌగికములకు పరిమితమైనది. కాని క్రమముగా పరమాణు గణములు కూడ వైద్యుత స్వభావమును వ్యక్తము చేయుచున్నవని గుర్తించి, సేంద్రియ ద్రవ్యములకు కూడ ఈ సిద్ధాంతమును అనువర్తింపజేసెను. బెర్జిలియస్ నిర్వచించిన ఈ సిద్ధాంత మీనాడు కేవలము రసాయనశాస్త్ర చరిత్రదృష్ట్యా మాత్రమే ప్రాధాన్యము కలదై యున్నది.

బెర్జిలియస్ సున్నితమయిన త్రాసులను వాడి కచ్చితమైన ద్రవ్యభార నిర్ణయ మొనర్చి విశ్లేషణాత్మక రసాయన శాస్త్ర విభాగమునకు ఆదిపురుషుడైనాడు.

రబ్బరుగొట్టములను శోషణ సాధన పాత్రలను, హంసో దక ధారాపాత్రలను వడపోయుట కనువైన కాగితము లను, ద్రావణములను ఇగురబెట్టుటకుపయోగించు పాత్రలను బెర్జిలియస్ రూపొందించి, ప్రయోగశాలలో వాటిని స్వయముగ ఉపయోగించి, వైజ్ఞానికోపకరణములుగా తీర్చి దిద్దినాడు. అందుచేతనే ఇవి నిత్యకృత్యములలో రసాయన శాస్త్రవేత్తలకు చేకూరినవి.

బెర్జిలియస్, 250 పరిశోధనాత్మక రచనలను యూరపునందలి భాషలన్నింటిలోనికి అనువదింపబడిన "రసాయన శాస్త్రము" అను గ్రంథమును, భౌతిక రసాయన శాస్త్రములలో జరిగిన కృషిని, విమర్శనదృష్టితో సమీక్షించి, 1821 నుండి 1848 వరకు ప్రతిసంవత్సరము ప్రకటించిన సంపుటములను, శాస్త్రవేత్తల కందించి రసాయన శాస్త్రాభివృద్ధికి మూలభూతుడయ్యెను.

హ. అ.

## బెర్నౌలీ సోదరులు :

17 వ శతాబ్దిలో హాలెండు దేశమున ప్రఖ్యాతి వహించిన కుటుంబములలో బెర్నౌలీ కుటుంబ మొకటి ఈ కుటుంబమున ఒక్క శతాబ్ది కాలపరిమితిలో గణితశాస్త్ర పారంగతులైన ఎనిమిది మంది సభ్యులావిర్భవించిరి

బెర్నౌలీ వంశములోనెల్ల జాకబ్ లేక జేమ్స్ బెర్నౌలీ, జోహన్ లేక జాన్ బెర్నౌలీ అను సోదరు లిద్దరును, వారితో పాటు డేనియల్ బెర్నౌలీ (జాన్ కుమారుడు) అను నాతడును అత్యంత ప్రసిద్ధి గడించినవారు వీరిలో జేమ్స్, జాన్ బెర్నౌలీ సోదరుల వృత్తాంత మిట్లున్నది

జేమ్స్ బెర్నౌలీ జాకబ్ లేక జేమ్స్ బెర్నౌలీ అనునాతడు 'బాలే' నగరమున క్రీ శ 1654 వ సంవత్సరము డిసెంబరు 27 తేదీన జన్మించెను 1687 లో ఆతడు బాలే విశ్వవిద్యాలయ గణితశాస్త్ర పీఠమందాచార్యుడుగా నియుక్తుడై 1705 ఆగస్టు 16 వ తేదీన మరణించు వరకు ఆ పదవినే అధిష్ఠించి యుండెను

ఆ కాలమున ఇంగ్లండునందలి గణితశాస్త్రజ్ఞులకును ఐరోపా ఖండమందలి గణితశాస్త్రజ్ఞులకును నడుమ కలన గణితముయొక్క ఉపయోగమునుగూర్చి వాద ప్రతివాదములు విశేషముగా చెలరేగెను కలన గణితమును న్యూటన్ (క్రీ శ 1642-1727), లీబ్నిజ్ (1646-1716) అను పండితులు ఎవరికి వారు స్వతంత్రముగా రచించి యుండిరి విశ్లేషణ సాధనముగా అత్యల్పకలనము యొక్క బలీయమగు శక్తిని గ్రహించిన ప్రాచీన పండితులలో జేమ్స్ ఒకడు కలన గణితమునం దాసక్తిని అలవరచుకొనిన ఆతడు, అధ్యాపకుని సాయము లేకుండగనే, ఆ శాస్త్రమునందు పారంగతుడయ్యెను లీబ్నిజ్ ప్రతిపాదించిన "సమగతి రేఖావక్రత" అను సమస్యకు పరిష్కారమును కనుగొనిన ప్రథము డీతడే క్రీ శ 1690 లో ముద్రితమైన 'ఆక్టా ఎరుడిటోరమ్' అను గ్రంథమునందు 'అభిన్నము'అను శబ్దము మొదటిసారిగా ఉపయోగింప బడినది ఆ గ్రంథమునందే ఆతడు 1694 వ సంవత్సరములో దీర్ఘ చతురస్ర, అతీయ భుజయుగ్మములందలి వక్రముయొక్క వ్యాసార్ధమునకు సంబంధించిన ఒక సూత్రమును వివరించెను కేవలము సర్పిలాకార వక్రరేఖ విషయమున కాక, సాధారణ విషయములందు కూడ అతీయ భుజయుగ్మములను ఉపయోగించిన ప్రథములలో ఇతడొకడు ఇతడు కాటినరి వక్రరేఖా సమస్యను కూడ ప్రతిపాదించి, లీబ్నిజ్ ప్రయోగించిన దీని నిర్మాణ విధానము యొక్క క్రమబద్ధమగు సౌష్ఠవమును సమర్థించెను అంతేకాక నూలు దారము (1) విభిన్నములైన మందములు కల్గియుండుననియు, (2) విస్తరణ శీలమును కల్గియుండుననియు, (3) ప్రతిబిందువు శక్తిప్రయోగములచే ప్రభావితమై ఒక స్థిరకేంద్రమువైపు మరల్ప బడుననియు, ఆతడూహించి, దారములను గూర్చిన అధికతరమగు పెక్కు చిక్కు సమస్యలను పరిష్కరించెను

1694 లో పునర్ముద్రణమును బొందిన 'ఆక్టా ఎరుడిటోరమ్' గ్రంథములో ఆతడు ఏకదిక్సూచికా సర్పిలములను, ఘాతాంకగణన సర్పిలములను గూడ అధ్యయన మొనర్చెను రెండవదానియం దాతడు విశేషమగు ఆసక్తిని ప్రకటించెను వివిధ పరిస్థితులలో విశిష్టమైన స్వయం పునరుత్పత్తి లక్షణము దానియం దుదయించుటయే ఆ యాసక్తికి కారణము 1698 లో ఆతడు ప్రఖ్యాతి గడించిన "తుల్యపరిరేఖా వృత్తక్షేత్రముల"ను ప్రతిపాదించి 1701 లో వాటికి స్వయముగా తానే పరిష్కారములను ప్రచురించెను

జేమ్స్ బెర్నౌలీ రచించిన గ్రంథములలోనెల్ల 'ఆర్స్ కన్జెక్టాండీ' అనునది అత్యంత ప్రసిద్ధమైనది ఈ గ్రంథమాతడు మరణించిన పిమ్మట ఎనిమిది సంవత్సరములకు (1713) ప్రకటింప బడినది ఇందు నాలుగు భాగము లున్నవి రెండవ భాగమునందు ప్రస్తారిత రాసులును, అంకయోగములును, బెర్నౌలీ సంఖ్యలును పేర్కొన బడినవి ఈ సంఖ్యలీనాడు శుద్ధగణిత శాస్త్రమందును ప్రయోగ గణితశాస్త్రమును, విస్తృతముగా అన్వయింప బడుచున్నవి ఈ గ్రంథమందలి ఇతర అధ్యాయములు ఎక్కువగా 'సంభవనీయతా సిద్ధాంతము'నకు సంబంధించినవి ఈ సిద్ధాంతమునం దాతడు అసాధారణములైన ఫలితములను సాధించెను ఒక్కొక్క ప్రయత్నమునందు ఘటిల్లగల రెండు సంభవనీయతా ఫలితములను దృష్టియం దుంచుకొని, ఆతడు చర్వితచర్వణమును, స్వతంత్రమునునైన యత్నములను గూర్చి చర్చించెను ఆ యత్నము లన్నిటియందును ఆతడు సాధించిన సంభవనీయతా ఫలితములు ఒకే తీరుగా నుండెను 'బెర్నౌలీ ప్రయత్నము'లని పేర్కొనబడు ఆయత్నములు నేడు సంభవనీయతా సిద్ధాంతమునందు ప్రముఖస్థాన మాక్రమించినవి పైన చెప్పబడిన గ్రంథములో సంభవనీయతను గూర్చి తాను రచించిన సుప్రసిద్ధమగు 'బెర్నౌలీ సూత్రము'

యొక్క యాథార్థ్యములనుగూర్చ అతడు రుజువుపరచెను ఈ సూత్రము 'గురుతర సంఖ్యాన్యాయము' అని గూడ పిలువబడెడిది ఈనాడా సూత్రము పూర్వముకంటె కొంత భిన్నముగ నున్నది 1913 డిసెంబరులో రష్యాయందలి పెట్రోగ్రాడ్ (ఇప్పుడది లెనిన్‌గ్రాడ్ అని వ్యవహరింపబడుచున్నది) నగరమున విజ్ఞానపరిషత్సభ్యులు గురుతర సంఖ్యాన్యాయము యొక్క ద్విశతాబ్ద్యుత్సవమును వైభవోపేతముగ జరపిరి జేమ్స్ రచించిన "ఆర్స్‌కన్జెక్టాండి" అను గ్రంథము 1713 లో ప్రచురింపబడెను బెర్నోలీ రచించిన ఈ సిద్ధాంతము 'సంభవనీయతా సిద్ధాంత' చరిత్రయందతనికి శాశ్వతమైన విశిష్టస్థానమును చేకూర్చి పెట్టినది మూడు సంపుటములుగా నుండిన అతని సంకలన గ్రంథములో మొదటిది 1713 వ సంవత్సరమునందును, తక్కినవి రెండును 1744 లోను ప్రచురింపబడినవి

జాన్ బెర్నోలి జేమ్స్ బెర్నోలీ సోదరుడగు జాన్ బెర్నోలీ 1667 ఆగస్టు 7 వ తేదీన బాలే నగరమున జన్మించి, 1748 జనవరి 1 వ తేదీన అచటనే మరణించెను 1695 నుండి 1705 వరకు అతడు 'ఒరోనింగెన్' నగర గణితశాస్త్ర పీఠమందాచార్యపదవిని అధిష్ఠించి యుండెను అతని సోదరుడు మరణించగనే 1705 లో బాలే నగరమునందు గణితశాస్త్ర పీఠమునందాతడు ఆచార్యుడుగా ప్రవేశించి, మరణించు వరకు ఆ పదవినే అలంకరించి యుండెను అతడు అత్యుత్సాహవంతులైన అధ్యాపకులలో నొకడని ప్రతీతి అంతేకాక, ఆ కాలమున అత్యంత విజయోపేతులైన సృజనాత్మక పరిశోధకులలో నొకడుగా అతడు వాసికెక్కెను అతడెన్ని నూతన విషయములను ఆవిష్కరించెనో, దాదాపు అంత సంఖ్యలో వాటిపై వాదోపవాదములు కూడ చెలరేగెను అతని వైమనస్యమునకు గురియైన వారందరిపైన-తనకు సోదరుడుగాని, కుమారుడైన గాని అతడు అసహనమును, దుందుడుకుదనమును ప్రదర్శించెడివాడు

అసంఖ్యాకములగు వివాదగ్రస్త సిద్ధాంతములను వదలివేయగా, ఈ దిగువ పేర్కొనబడు నూతనావిష్కరణములు ప్రధానములైనవిగా పరిగణింపబడెను (1) ఘాతమాపకకలనము, (2) విశ్లేషణ శాస్త్రశాఖగా త్రికోణమితిని గూర్చిన ప్రస్తావన, (3) భౌగోళిక గణితశాస్త్రీయ స్థితిగతులు. (4) లంబాకార విక్షేపమార్గముల నిర్ణయము, (5) ద్రుతతమపాత వక్రసమస్యా పరిష్కారము (పవిధముగా ఒక పదార్థము ఒక స్థలమునుండి క్రిందికి విసరబడగా, కనీస కాలములో ఆకర్షణశక్తిచే వేరొక బిందువునకు చేరునో అట్టి వక్రరేఖ)

బీజగణిత చిహ్నమగు 'G' సహాయముచే గురుత్వము యొక్క వేగాధిక్యఫలమును సూచించి, $V^2 = 2gh$ అను సూత్రమును సాధించిన వారిలో అతడు ప్రథముడుగా విశ్వసింపబడుచున్నాడు X యొక్క ధర్మమును సూచించు $\phi(X)$ అను అంకసంకేతము ఆవిష్కరింపబడుటకు అతడే కారకుడు ఒకానొక వైద్యశాఖాధికారికి 1694 లో వ్రాయబడిన లేఖయందాతడు $0/0$ అను సంకేతము యొక్క అనిర్ధారిత రూపములోని గుణదోషములను పరిశీలించు విధానమును వివరించెను.

ఫ్రాన్సు రాజధాని యగు పారిస్ నగరమందలి విజ్ఞాన పరిషత్సభ్యులవలన జాన్ బెర్నోలి పెక్కు పర్యాయములు ఘనసన్మానములను, బహుమతులను బడసెను

ఎం. సు

## బెల్లంకొండ రామారావు

గుంటూరుజిల్లాలోని పమిడిపాడు అగ్రహారము బెల్లంకొండ వంశ్యుల కాణాచి ఎనుబదినాలుగు గ్రామములందు వీరికి ఈనాం భూములున్నట్లు తెలియుచున్నది వీరి మూలపురుషులు విద్వన్మంత్రులై, వ్యాయామవిద్యాప్రవీణులై, దండనాయకులై, యనేకాగ్రహారములు సంపాదించిరని తెలియుచున్నది. వీరి వంశమువారు మొదటినుండియు శ్రోత్రియులును, దాతలును, కర్మతత్పరులును, సదాచారపరాయణులును, వ్యవహారదక్షులునై యుండిరి సంగీతసాహిత్యములు వీరి వంశమువారికి వెన్నతోబెట్టిన విద్యలై మాన్యతనొందినవి.

శ్రీరామరాయకవి తాతగారగు అళ్వారయ్య విశిష్టాద్వైత బోధకమగు "సంకల్పసూర్యోదయము" ను నాటకమును రచించెను. ఆయన అనేకశిష్యులకు ఉత్తమగురువై విఖ్యాతిగాంచెను శ్రీరామారావు తండ్రియగు శ్రీమోహనరావు మంచి మేధావి కాని ఇతడు తన ఇరువదియైదవ ప్రాయముననే స్వర్గస్థుడయ్యెను

వీరివంశ్యులగు శ్రీ సీతారామయ్య, లక్ష్మీకాంతారావు అనువారలమేధాశక్తి అనితరతుల్యము శ్రీ సీతారామయ్యగారే శ్రీ రామారావుగారి ప్రథమ గురువు సీతా

రామయ్యగారివద్ద పలనాటిసీమ విద్యార్థులెందరో సాహిత్య గ్రంథముల నభ్యసించి పండితులై విలసిల్లిరి

ఈ వంశములో పురుషులేగాక స్త్రీలుగూడ సంస్కృతాంధ్రములయందు సముచితపాండిత్యవైభవముతో విలసిల్లినట్లు తెలియుచున్నది

పమిడిపాడు అగ్రహారమునందు శ్రీ రామారావు ది 27-12-1875 (శా శ 1797) సం కు సరియగు యువ సం మాఘ బహుళ అమావాస్య, సోమవారము రాత్రి కర్కాటక లగ్నమునందు జన్మించెను తండ్రి మోహనరావు, తల్లి హనుమాంబ, భార్య ఆదిలక్ష్మమ్మ వీరిది ఋక్శాఖ, ఆశ్వలాయనసూత్రము భారద్వాజసగోత్రము నియోగిశాఖ బ్రాహ్మణుడు వీరి ఐదుగురు సోదరులు ముగ్గురు సోదరీమణులు, రెండవ సోదరి-యితని యగు కందుకూరి నాయకమ్మ పండితులను పోషించుటయేగాక స్వయముగా విద్వాంసురాలై వెలసినది

చిత్రము 102



బెల్లంకొండ రామారావు

శ్రీ రామారావు ఐదు సంవత్సరముల వయసున నుండగనే అతని తండ్రి మరణించెను ప్రాథమిక విద్యను స్వగ్రామమునందు కొలదికాలముననే ఇతడు ముగించెను ఎనిమిదవ సంవత్సరమున ఉపనయనము జరిగిన పిమ్మట పిన తండ్రియగు శ్రీ కేశవరావు ప్రోత్సాహమున ఇతడు ఆంగ్ల విద్యాభ్యాసమునకై గుంటూరుపట్టణమునకు వెళ్లెను అచట మూడవఫారము చదువుచున్న సమయమున స్కూలుకు వెళ్లిన ప్రతిదినము ఇతనికి శిరోవ్యాధి కలుగుచుండినందున, ఆ విద్యను మాని ఇంటికి తిరిగి వచ్చెను అప్పటికి సీతారామారావు వయస్సు పదునాలుగు సంవత్సరములు

తరువాత రామారావు బెల్లంకొండ సీతారామయ్య యొద్ద సంస్కృత మారంభించి చదువుచుండెను ఆ దేసమయమున ఇతనితోపాటు బెల్లంకొండ నరసింహారావు, శంకరమంచి లక్ష్మీనారాయణశాస్త్రిగారలుకూడ చదువుచుండిరి పాఠముచెప్పిన తరువాత శ్రీ రామారావు మరల పుస్తకము విప్పెడి యాలోచనమునైనను చేసెడివాడుకాడట! అయినను మరునాటిపాఠమున కందరికన్నను మిన్నగ నుండుచు వచ్చెను

ఆ సమయముననే ఇతడు వేదపండితులకడ నమకచమకాదులను, ఉపనిషత్తులను వల్లించెను పూర్వమునుండి వచ్చు హయగ్రీవసాలగ్రామములతోడి దేవతార్చనమును ప్రతిదినము భక్తితో ఇతడు చేయుచుండెడివాడు హయగ్రీవారాధనము విద్యాభివృద్ధికి ముఖ్యకారణమని తెలిసికొని ఆ స్వామిని ధ్యానించుచు విశిష్టాద్వైతమతానుసారముగ ఊర్ధ్వపుండ్రాదుల నితడు ధరించుచుండెను ఇతని గ్రామములో చోళరాజ ప్రతిష్ఠితమైన శ్రీ రమావల్లభరాజాలయముగలదు అందు తులసీవనము వేయించి, దానిమధ్యమున కూర్చుండి శ్రీ రామారావు సంస్కృతాభ్యాసము చేసెడివాడు ఇతని చిత్తశుద్ధిని, దైవభక్తికిని సంతసించి భగవాను డొక బ్రాహ్మణరూపమున స్వప్నమందు దర్శనమిచ్చి హయగ్రీవ మంత్రోపదేశ మొనర్చినాడట! దానికి సంబంధించిన పూజా పరికరములు 'దమ్మాలపాటి' గ్రామనివాసియగు శ్రీ రత్నమాచార్యులయొద్ద లభించునని చెప్పి స్వామి అంతర్హితు డయ్యెనట!

స్వప్నవృత్తాంతము ననుసరించి శ్రీ రామారావు రత్నమాచార్యులని దర్శించగా, అతడు శ్రీ రామారావునకు హయగ్రీవకవచము మొదలగు పరికరములను దెచ్చియిచ్చెను ఇట్లు సహజముగ కుశాగ్రబుద్ధియగు శ్రీ రామారావునకు దైవానుగ్రహముకూడ తోడయ్యెను

సత్తెనపల్లి గ్రామనివాసియు, కవిగారిశిష్యుడును అగు శ్రీ రాళ్ళభండి నరసింహశాస్త్రి, విరూపాక్ష గురుపీఠ విద్వాంసుడును, ప్రఖ్యాతపండితుడునగు శ్రీ మల్లాది రామకృష్ణ విద్వచ్ఛయనులవారికడ వేదాంతపంచదశిని సాంగో

పాంగముగ చదివి పమిడిపాటికేతెంచి శ్రీ రామారావును దర్శించెను ఆ సమయమున ఆతనివద్దనుండి వేదాంతపంచదశి యను గ్రంథమును శ్రీ రామారావు తీసికొని రెండు దినములలో పూర్తిగా ధారణ మొనర్చుటయేగాక గురుముఖమున అభ్యసించి వచ్చిన శ్రీ శాస్త్రి చెప్పలేని శ్లోకములకు చక్కని వ్యాఖ్యానమును వ్రాసి యిచ్చి అందరిని ఆశ్చర్యచకితులను చేసెనట!

శ్రీ రామారావు రామానుజాచార్యుల విశిష్టాద్వైత భాష్యమును, శంకరగీతాభాష్యమును ఆమూలాగ్రముగను సవిమర్శకముగను చదివి వాటిలో శంకరభాష్యమే శ్రుతి ప్రమాణసిద్ధమై హేతుయుక్తముగానుండెనని తలచెను అటు పిమ్మట 'అద్వైతసిద్ధి, గౌడబ్రహ్మానందీయమును, ఉపనిషత్సూత్రభాష్యములను సవిమర్శముగా జూచినపిమ్మట ఇతనికి అద్వైతమునందాసక్తికలిగి "శాంకరభాష్యవిమర్శ" మున్నగు అనేక గ్రంథములను వ్రాసెను

బెల్లంకొండ వారిది విశిష్టాద్వైతమత సంప్రదాయము వీరికులగురువులు శ్రీ ప్రతివాదిభయంకర రంగాచార్యులు గారు వీ రొకసారి సంచారమొనర్చుచు తిరుపతినుండి పమిడిపాడు విచ్చేసిరి. ఆ సమయమున వారు శిష్యులైన శ్రీ రామారావును విశిష్టాద్వైతమతాచారము ననుసరించి భుజములపై చక్రాంకితములు వేయించుకొనుటకు ఆదేశించిరట కాని శ్రీ రామారావు అందుకు నిరాకరించుటయేగాక వేదవిహితమైన సీమంతాదిపంచదశకర్మలచే పునీతులగు బ్రాహ్మణులకది నరకహేతువని అనేకదృష్టాంతములచే గురువుగారితో వాదించెనట అప్పటినుండియు శ్రీ రంగాచార్యులుగారు పమిడిపాటి శిష్యసంచారము మానివేసినారట!

శ్రీ రామారావు పతంజలియోగసూత్రము లను క్షుణ్ణముగా పఠించి, రేచక, పూరక, కుంభయోగాదులను బాగుగ నభ్యసించి, చేసిన సాధనమున భూమికి బారావు గజము ఎత్తున పైకిలేచుచు, యోగమును, ఉపాసనమును బలపరచెను వేదాద్రిక్షేత్రమును సకుటుంబముగ దర్శించి శానొనర్చు హయగ్రీవమంత్రోపాసనకు పద్మాసనాదులతోడి యోగముద్రలలో ధ్యానయోగమున భూమిపై గజమెత్తున నుండి తపమాచరించి, మంత్రసిద్ధినొంది స్వామియాజ్ఞచే తర్పణ హోమములు చేసి, అశేషజనమునకు అన్నదానము గావించెనట

శ్రీ తిరుపతి వేంకటకవులకును రామారావుగారికును మంచి మైత్రీబంధముండెను అయితే, కొప్పరపు కవులకును తిరుపతి వేంకటకవులకును మనఃస్పర్థలు పొటమరించిన సందర్భములో, వైదిక, నియోగి వివాదములు ప్రబలెను నరసరావుపేట, గుంటూరు, రేపల్లె మొదలగు పట్టణములందు ఈ వివాదములు అనేకములగు అలజడులకు కారణమైనవి

ఇట్లుండ నరసరావుపేటలో ఒకసారి శ్రీ తిరుపతి వేంకట కవుల అవధానము ఏర్పాటు చేయబడినది ఉభయ భాషాప్రవీణులగు శ్రీ తిరుపతి వేంకట కవుల నెదుర్కొని ఓడించుటకు, ప్రతిభాసంపన్నుడగు శ్రీ రామారావు దక్క అన్యులు చాలరని నియోగి పక్షములోనివారు కొందరు భావించి, శ్రీ రామారావు చెంతకేగి అతనిని బలవంతముచేసి అవధానమునకు "పశ్యాపశ్యానపశ్యతః" అను సమస్యను తెచ్చిరి శ్రీ రామారావుగారు దక్క అన్యులు ఇట్టి సమస్యను సృష్టించ లేరని శ్రీ తిరుపతి వేంకటకవును గ్రహించి, ఆ సమస్య సరియైనది కాదని చెప్పి అప్పటికి తప్పించుకొనిరి స్వయముగా సభకు విచ్చేసిన శ్రీ రామారావు "నాకు వీరితో వాదమేల? నా బ్రహ్మవిచారమునకు, గ్రంథరచనకు ఇది అవరోధము" అని తలచి మిన్నకుండెను అవధానము ముగిసిన పిమ్మట శ్రీ తిరుపతి వేంకటకవులు ఇంటికివెళ్ళి కౌముదిని పరిశీలించగా, ఈ సమస్య తప్పనుటకు ఒక ప్రాచీన మహాభారము ఎట్టకేలకు దొరికెనట! తరువాత శ్రీ రామారావు శిష్యులలో శ్రీ ములుకుట్ల లక్ష్మీనారాయణశాస్త్రి మున్నగు వారు, "మా గురువుగారిచ్చిన సమస్య ఎట్లు తప్పగునో సభాముఖమున సమర్థింపవలసినదని" తిరుపతికవులకు రిజిష్టర్డు నోటీసు నిచ్చిరి దానిపై తిరుపతికవులు దీర్ఘమగు సమాధాన మిచ్చుటయు, అపైన సమస్యాబీజము మరింత పెరిగి, వృక్షమైనలు దిక్కులవ్యాపింపగా శ్రీ రామారావీవిషయమున జోక్యము చేసికొనక తప్పలేదు 'పశ్యశబ్దమీమాంసము,' 'గుంటగర్వభంజనము' 'పంచాననపలాయనము' మొదలగు వ్యాసములు శ్రీ రామారావును, అవధానులపక్షమున శ్రీ జయంతి భగీరథశాస్త్రిలు మున్నగువారును, వ్యాసపరంపరలను ప్రయోగించిరి మహామహోపాధ్యాయ శ్రీ తాతారాయడుశాస్త్రిలుగారును మరికొందరును శ్రీ రామారావిచ్చిన సమస్య సాధువనియే నిశ్చయించిరి.

శ్రీ రామారావును బాల్యమందే కవితాకన్య వరించినది.

శ్రీ హయగ్రీవ మంత్రోపాసనతో ఆయన కవితాశక్తి అనర్గళధారాశుద్ధికలిగి ప్రౌఢిమను సంతరించుకొనెను ఇతడు విద్యార్థిదశయందే 'రమాపల్లభరాయశతకము' అను గ్రంథమును, కొన్ని స్తోత్రములను, ఛందోబద్ధముగా సంస్కృతాంధ్రములయందు రచించెను ఇతడు తన పదునారవ సంవత్సరమున నే 'రుక్మిణీపరిణయము' 'రమాపరిణయము' అను చంపువును రచించెను పుగిఘల్లు రామనాథశాస్త్రివద్ద వ్యాకరణ తర్కశాస్త్రముల నభ్యసించెను స్వయముగా అనేక వ్యాఖ్యానములనరసి, 'సిద్ధాంతకౌముది'కి 'శరద్రాత్రి' యనుపేరిట చక్కని వ్యాఖ్యాగ్రంథమును రచించెను 'కువలయానంద' మను అలంకారగ్రంథమునకుగూడ ఇతడు పాండిత్యవిలసితమైన వ్యాఖ్యానమును వ్రాసెను ఇంకను "సముద్రమథనము శ్రీకృష్ణలీలాతరంగిణ్యాదిగ్రంథము లెన్నిటినో వ్రాయుటయే గాక, మురారికృత సంస్కృతనాటకమునకు బృహద్విమర్శనమును కూర్చెను

శ్రీరామారావు రచించిన గ్రంథములలో 'గీతాభాష్యార్కప్రకాశిక' అను గ్రంథమొకటి, అద్వైత మతమున అపర శంకరుడని ప్రఖ్యాతివహించిన శ్రీ ఆదిభట్ల రామమూర్తిశాస్త్రి 'శ్రీ రామారాయరచితమయిన గీతాభాష్యార్కప్రకాశిక'ను చదివి 'మీబ్రహ్మతేజమును, పిన్నవయసును, అఖండపాండితిని, కుశాగ్రబుద్ధిని అఖండ అద్వైతమతస్థాపనపటిమనుజూడ మీరు ఈ రూపమున వెలసియున్న ఆదిశంకరులో లేక వ్యాసులో అయి యుందురని భావించుచున్నాను' అని రామారావుగారికి వ్రాసిరి

ఈవిధమున అద్వైత మతప్రస్థానభేరిని మ్రోగించుచు శ్రీరామారావు, శారీరక చతుస్సూత్ర వేదాంత 'ముక్తావళి' యను గొప్ప అద్వైత పరమార్థ గ్రంథమును రచించెను ఈవిధముగ ఇతడు అద్వైతశాస్త్రామృతము, సిద్ధాంతసింధువు, కామమీమాంస, భాగవతచతుశ్శ్లోకీవ్యాఖ్య, మొదలగు నూటపలుబదిమూడు గ్రంథములను వ్రాసినట్లు తెలియుచున్నది శ్రీరామరాయ కవీంద్ర విరచిత గ్రంథముల సమగ్రపట్టిక ఇతనిచే రచింపబడిన శ్రీ చంపూ భాగవత గ్రంథమునందు కలదు

శ్రీరామారావు, స్వీకారనిర్ణయమను ధర్మశాస్త్రగ్రంథమునుగూడ వ్రాసిరి వీరి సంస్కృతపంక్తి రచనకును, విమర్శకును, శ్రీశృంగేరిపీఠస్థులు ఆశ్చర్యమొంది శ్రీరామారావుగారు విద్యారణ్యులంతటివారనియు, వారితరువాత నింత చక్కగ పంక్తి వ్రాయగలవారు వీరేననియు ప్రశంసించిరట

శ్రీ రామారాయ రచిత గ్రంథములు

1 శ్రీ పుంభావసరస్వతి
2 రుక్మిణీ పరిణయచంపూ - గద్యపద్యవ్యాఖ్య.
3 వేదాంతకౌస్తుభము
4 కందర్పదర్పవిలాసము - భాణము
5. సముద్రమథనచంపువు - 7, 8 మంజరులు - గరుడ సందేశము
6 హయవదనశతకము - సవ్యాఖ్య
7 హకారాది హయగ్రీవ సహస్రనామావళి
8 భగవద్గీతాభాష్యార్కప్రకాశిక 18 అధ్యాయములు
9 శారీరక చతుస్సూత్రీ విచారః
10 అద్వైత విజయము
11 భాగవత చంపూ వ్యాఖ్య
12 వేదాంతముక్తావళి
13 శంకరాశంకర భాష్యవిమర్శ
14 హకారాది హయగ్రీవ సహస్రనామ మూలము - వ్యాఖ్యోపేతము
15 వివర్ణాదివిష్ణు సహస్రనామ మూలము ,,
16 పరమాత్మ సహస్రనామమూలము ,,
17 హకారాది హయగ్రీవాష్టోత్తరము-మూలము, సవ్యాఖ్య.
18 మకారాదిమత్స్యాష్టోత్తరము-మూలము ,,
19 కకారాది కూర్మాష్టోత్తరము ,,
20 వకారాది వరాహాష్టోత్తరము ,,
21 నకారాది నరసింహాష్టోత్తరము ,,
22 వకారాది వామనాష్టోత్తరము ,,
23 రకారాది పరశురామాష్టోత్తరము ,,
24 రకారాది రామాష్టోత్తరము ,,
25 కకారాది కృష్ణాష్టోత్తరము ,,
26 బకారాది బుద్ధాష్టోత్తరము ,,
27. కకారాది కల్క్యష్టోత్తరము ,,
28 ధర్మప్రశంస (ఆంధ్రానువాదసహితము)
29. ధనవర్ణనము ,,

30 కామమీమాంస (ఆంధ్రానువాద సహితము)
31 విద్యార్థ విద్యోతము ,,
32 త్రిమత మన్మతము ,,
33 కలిభూషణము ,,
34 నియోగివైదికజనహితోపదేశము ,,
35 పశ్యార్థమీమాంస ,,
36 గుంజాగర్వభంజనము ,,
37 పంచానన పలాయనము ,,
38 వేదాన్త సంగ్రహము
39 వేదాన్తనిశ్చయము
40 దేహిదేహభావ వినిర్మూలనము
41 అద్వైతామృతము
42 అద్వైతాన్యమతఖణ్డనము
43 లోకాయతాది యోగాన్తమతఖండనము
44 భాగవత చతుశ్లోకీవ్యాఖ్య
45 కృష్ణోద్ధవ సంవాదవ్యాఖ్య
46 అద్వైతతత్త్వామృతము
47 సిద్ధాన్తసింధువు
48 శ్రీమద్రామాయణాంతరార్థ ప్రతిపాదక శ్లోకత్రయము
49 శ్రీకృష్ణకథా ప్రతిపాదక భాగవతాన్తరార్థప్రతిపాదకమేకం పద్యమ్
50 త్రిపురాసురసంహారాన్తరార్థప్రతిపాదకమేకంపద్యమ్
51 భారతాన్తరార్థవర్ణనము
52 మోక్షప్రాసాదము
53 రమావల్లభ రాజస్తుతి
54 రమావల్లభరాయ శతకము
55 స్వీకార నిర్ణయము
56 శరద్రాత్రి సిద్ధాంతకౌముదీవ్యాఖ్య
57 శూద్రధర్మ దర్పణము

శ్రీ రామారావు గ్రంథముల నన్నింటిని సంస్కృత భాషయందే రచించెను ఇతడు వ్రాసిన గ్రంథములు దాదాపు ఇంకను ఒక వందదాక కలవని తెలియుచున్నది

శ్రీ రామారావు ప్రతిభావంతుడైన పండిత కవి యగుటయేకాక, వర్తమాన కవులకు అనేకులకు గురుమూర్తియై ఖ్యాతిగాంచెను ఎందరెందరో కవులు తాము రచించిన కావ్యములను శ్రీ రామారావుగారికి వినిపించి, వారి పరిష్కారమును శిరసా వహించెడివారు శ్రీ రామారావుగారి ఆమోదముద్ర పడిన గ్రంథములే, లోకవిశ్రుతములు కాగల వన్న భావ మానాటి కవులలో నుండెడిదని తెలియుచున్నది ఈ విధముగ శ్రీ రామారావుగారికి కవిలోకములో ఆచార్యత్వము సిద్ధించినది

మహాపండితుడు బ్రహ్మవేత్త అద్వైతమూర్తి యగు శ్రీ రామారావుగారికి బాల్యమునుండియు, అజీర్ణ వ్యాధి మిక్కుటముగా నుండెడిది అయినను శ్రీ రామారావుగారు ఈ వ్యాధి తమ స్థూలశరీరమును కృశింప చేయుచున్నదే గాని సూక్ష్మ శరీరమును బాధించుట లేదను కారణమున చికిత్స చేయించుకొనుటకు విముఖులై యుండిరి కాని తుదకు కాలిమడమున ఏర్పడిన రాచపుండు కారణమున ఆనంద సంవత్సర కార్తిక శుద్ధ నవమి మంగళవారమునాడు అనగా 27-10-1914 తేదీన తమ ముప్పది తొమ్మిదవ సంవత్సరమున ఇహలోకమును వీడి చనిరి

"కలడు ప్రసిద్ధవంశ్యుఁ డరికాండము సైతము
మెచ్చ దగ్గ ధీ
బలమున కిక్కయాపయిడిపాటినివాసి,
యశస్వి, త్యాగి, వి
ద్యలకు నివాసమంబ! కవితావనితాహృదయంగ
ముండు పే
ర్వెలసిన "రామరావనెడి బెల్లముకొండ
కులీనుఁడున్నశిన్ "
"తిరుపతి వేంకటకవులు"
కొ నా.

## బెల్జియం కాంగో (భూగో)

ఆవిష్కరణము కాంగో దేశపు ఆధునిక చరిత్ర సుస్పష్టమైన పలు దశలుగా విభక్తమైనది బహుకాలము క్రిందనే ఈ దేశము, అచ్చట చెదురుబాటుగా ఆక్రమించి యున్న జాతీయ గణముల స్వాధీనమం దుండెను ఈ గణము లొకప్పుడు తాత్కాలికములు, అనిర్దిష్టములైన నీగ్రో సామ్రాజ్యములను గూడ నిర్మించుకొని యుండెను కాంగో దేశ మొకప్పుడు బానిసలకు నిలయమై యుండెను అరబ్బీ బానిస వర్తకుల మూలముగా, వారిలో కొందరు తూర్పు దేశములకును, కొందరు పశ్చిమదేశములకును, తరలింప బడుచుండిరి

స్టాన్లీ అనునొక సాహసిక యాత్రికుడు కాంగోను స్వయముగా దర్శించి, ఆ దేశమును గూర్చిన సకల విషయములను బెల్జియం ప్రభువగు రెండవ లియోపాల్డునకు నివేదించి, ఆ దేశముతో వ్యాపార సంబంధములు పెట్టుకొనుట వలన తన ప్రభుత్వమునకు ప్రయోజనము చేకూరగలదని అతనికి సలహా నొసగి, అతని వలన పారితోషికమును బడసెను. అంతేకాక, కాంగోకు తత్పరిసరములకు భూ, నదీ, సముద్ర మార్గములను నిర్మించుట కాతడు ప్రణాళికను సిద్ధమొనర్చి ఆ ప్రభువున కొసగెను.

తొలుత కాంగో దేశము ఆఫ్రికా ఖండమందలి నిరక్షమండలమందు బెల్జియం సామ్రాజ్యముక్రింద నొక వలస రాజ్యముగా నుండెను. ఈ దేశమునకు 1960 లో స్వాతంత్ర్యము లభించెను. కాంగోనదీ పరీవాహక ప్రదేశమందలి ప్రధాన భూభాగమును, ఎగువ నైలునదీ పరీవాహక ప్రాంతమందలి స్వల్ప భూభాగమును, గలిసి, కాంగో దేశముగా నేర్పడి యున్నది.

19 వ శతాబ్ది మధ్యభాగము వరకు కాంగోనదీ పరీవాహక ప్రాంతము మానవుని దృష్టిపథమునకు మరుగై యుండెను. 1884-85 వ సంవత్సరములో జరిగిన బెర్లిన్ మహాసభ "కాంగో స్వతంత్ర రాజ్యము"నకు రెండవ లియోపాల్డు ప్రభువును సర్వాధికారిగా గుర్తించెను. 1908 లో ఈ "స్వతంత్ర రాజ్యము" బెల్జియమ్ సామ్రాజ్యములో కలిపివేయ బడెను. అంతవరకు లియోపాల్డు ప్రభువు స్వంత పాలనము క్రిందనుండిన ఈ వలస ప్రాంతము బెల్జియమ్ పార్లమెంటు స్వాధీనము క్రిందికి వచ్చెను.

నేడు రిపబ్లిక్ రాజ్యముగా వ్యవహృత మగుచున్న కాంగో దేశపు విస్తీర్ణము 9,05,348 చ. మైళ్ళు.

కాంగో పరీవాహక ప్రాంతమొక విశాలమగు పల్లపు భూమి. పశ్చిమమున వినక్ర ఆకారములో గొప్ప ఉపనదుల పరంపర సంగమించును. ఉన్నతమగు మైదానపు టంచుగుండా, కోతపడిన ఒక ఇరుకు కాలువలో ఈ ఉపనదుల సమష్టి ప్రవాహము పతన మగుటకు పూర్వమే ఈ సంగమము ఘటిల్లు చున్నది. ఇచ్చట కాంగో నది సముద్రములో కలియుటకు ముందుగా, స్ఫటిక శిలామయ పర్వతములను భేదించుకొని పరవళ్ళు త్రొక్కుచు, నిర్ఝరరూపమును దాల్చి సముద్రములో కలియును. నైరృతి దిశయందు అంగోలా మైదానమునకు సంబంధించిన ఉత్తరపు సానువు నందు, కాసైనది రెండు ప్రధానమగు కాలువలు బయలుదేరు చున్నవి. ఆగ్నేయమున కటంగా రాష్ట్రమునకు చెందిన మరియొక నిమ్నోన్నత పీఠభూమి యున్నది. రాగిగనులకు కటంగా రాష్ట్రము ప్రసిద్ధి నొందినది. తూర్పున మిటుంబా పర్వతములు కలవు. వాటి ఎత్తు 10 వేల అడుగులు. పెర్మియన్, ట్రియాసిక్ యుగముల మధ్యకాలమున మధ్యాఫ్రికా ఖండమంతయు హిమానీ ప్రవాహముల మయమై యుండెను. ఈ ప్రవాహములపై తేలియుండు మంచు పొరలు ముందునకు సాగిపోవుచు, అధోభాగమున శిలా సమూహములను వదలి పోవుచుండెడివి. కాలక్రమమున ఈ శిలాసమూహములు సున్నపు రాళ్ళవంటి పదార్థములతో మిళితములై, ఈనాడు కదంబ రూపములలో కాన్పించు చున్నవి. జూరాసిక్ యుగములో లోతులేని సముద్ర తీరములందు దీర్ఘకాలికముగా ఒండు పేరుకొని పెక్కు రూపములుగా పరిణామము చెందెను. క్రమముగా ఆ సముద్ర జలము శైశవ దశయందున్న కాంగో నదిలోనికి ప్రవహించుటచే, ఈనా డచ్చట లియోపాల్డ్, టుంబా అను సరస్సులు మాత్రమే అవశేషములై గోచర మగుచున్నవి. ఇటీవల 'బూసిరా' అను సారవంతములైన ఒండునేల లచ్చట ఏర్పడి ప్రపంచములో నెల్ల భాగ్యవంతములైన అరణ్యముల అభివృద్ధికి ఆకరము లయ్యెను.

**శీతోష్ణస్థితి:** కాంగోనదీ పరీవాహక ప్రాంతమందు దక్షిణమున 5 డిగ్రీల కుత్తరముగా సంవత్సరము పొడవున సుమారు 80° ఫా వరకు ఉష్ణోగ్రత యుండును. వర్షపాతము సంవత్సరమునకు 60 అంగుళములకు పైగా నుండును. శేషించిన ప్రదేశమందు వర్షపాతము 40 నుండి 60 అం వరకును. వేసవిలో గరిష్ఠముగను ఉండును. కటంగా పీఠభూమిపై సాలానా సామాన్య ఉష్ణోగత 68 ఫా డిగ్రీ లుండును.

**ఉద్భిదజాలము:** ఈ ప్రాంతమందలి ఉద్భిదజాలము ఇప్పటికిని కొంతవరకు మాత్రమే విదితమైనది. కాంగోనదీ పరీవాహక ప్రాంతములో నిరక్ష ప్రాంతీయారణ్యములు కాన్పించును. అనేక రకముల ద్రాక్షతీగెలు, వృక్షములు కలవు. రబ్బరుచెట్లు, వాటిపై ప్రాకు పెక్కురకముల ద్రాక్షతీగెలు సమృద్ధిగా నున్నవి. పెక్కు మండలములలో నూనె త్రాటి, రాఫియా త్రాటి, కోపల్ వృక్షములు సాధారణ

ముగా గోచర మగును మహోగని, టేకు, ఎబోనీ, ఆఫ్రికా జాతి దేవదారు వృక్షములు, రెడ్‌వుడ్, బెత్తములు తయా రగు కొలవ జాతులు విస్తృతముగా పెరుగును జిగురులు, గుగ్గిలము ఉత్పత్తియగు మొక్కలు కూడ అచ్చట విరివిగా నున్నవి సాంద్రారణ్యములందు బ్రహ్మాండ మైన కొన్ని వృక్ష జాతులు కాన్పించును అచ్చటి వృక్షముల ఎత్తు 150 నుండి 200 అడుగుల వరకుండును

**జంతువర్గము** సాంద్రారణ్యములలో మానవాకార ములో నుండు వానరములు, రకరకములైన కోతులు, చింపాంజీ అను వానరములు విరివిగా వ్యాప్తమై యున్నవి కుకివు అను ప్రదేశములో గోరిల్లా జాతి కోతులు కాన్పిం చును పందులు, తోడేళ్ళు నక్కలు, ఖడ్గమృగములు, విషహీనములైన పెద్దజాతి సర్పములు చెట్లప్రాకులు, ఇతర సర్పజాతు లనేకములును, ఇతర తరగతుల జంతువులును విశేషముగా గోచరించును నీటి గుర్రములు, మొసళ్ళు సాధారణముగా నదులలో కాన్పించును పచ్చిక బయళ్ళలో పెక్కు తరగతుల జింకలు, గేదెలు, చారల గాడిదలు, అడవి గాడిదలు పొడల లొట్టియలు, అడవి పిల్లులున, అడవులలో ఏనుగులు, చిరుతపులులు, సింహములును కాన్పించును ఈ జంతువులే కాక కాంగో అడవులలో వివిధములైన పక్షులు, కీటకములు కూడ కన్పడును

**వ్యవసాయము** 1959 వ సంవత్సరములో ఈ దేశ మందు యూరోపా వాసులచే పెంచబడిన వివిధ రకములగు తోటల విస్తీర్ణము, వాటి వివరములు ఈ దిగువ పేర్కొన బడినవి

| పంటలు | ఎకరములు |
|---|---|
| తాళవృక్షజాతులు | 8,87,955 |
| కాఫీతోటలు | 2 09 540 |
| ప్రత్తితోటలు | 9,20,955 |
| రబ్బరుతోటలు | 1,19,843 |
| టీతోటలు | 1111, 512 |
| కోకోతోటలు | 19,345 |

ఆ సంవత్సరములోనే, జంతు, ఉద్భిదసంబంధములగు క్రొవ్వులు నూనెలు 2,60,721 మెట్రిక్ టన్నులు, కలప 1,63,536 మెట్రిక్ టన్నులు, ప్రత్తి 52 700 మెట్రిక్ టన్నులు, కాఫీ 98,416 మెట్రిక్ టన్నులు, రబ్బరు 40,178 మెట్రిక్ టన్నులు, అరటులు 31,039 మెట్రిక్ టన్నులు విదేశములకు ఎగుమతి చేయబడినవి

**గనులు** ఈ దేశములో గనుల్ప్రవర్తకము ఉచ్చ స్థాయిలో నున్నది రాగి, వజ్రములు, బంగారము, వెండి, తగరము, మణిశిల, వరుణము రదము, కార్మణ్యము, యశ దము, ఇనుము, బొగ్గు ఇచ్చట లభ్యమగు ప్రధానలోహ ములు కాంగోలో అత్యంత ప్రముఖమైన రాగి గనులు కివూషీ, ముసోన్సాయిక్, రూవే అను తావులకు దగ్గరగా నున్నవి అన్నిటికంటె వెండి, రాగి, రత్నములు, మాంగ నము అత్యధికపరిమాణములో లభ్యమగుచున్నవి

**రాకపోకలమార్గములు** కాంగోనది, దాని ఉపనదులు ఓడప్రయాణమునకు అనుకూలములుగా నుండును మటాడి యనునది ప్రధానమగు ఓడరేవు దానిద్వారముననే సరకుల రాకపోకలు జరుగుచున్నవి 1958 లో వాడుకయందున్న 1,45,218 కిలోమీటర్ల రహదారులలో 88,787 కిలోమీటర్ల రహదారులు ముఖ్యములైనవి రైలుమార్గముల మొత్తము పొడవు 5174 కిలోమీటర్లు అంతర్జాతీయ విమానాశ్రయ ములు, ప్రధానములైన జాతీయవిమానాశ్రయములుకూడ కలవు బెల్జియమ్ మున్నగు విదేశములతోను, ఆఫ్రికాఖండ మందలి ప్రధాననగరములతోను ఈ విమానాశ్రయములకు రాకపోకల సంబంధములు కల్పింపబడినవి

ఫ్రాంక్ అనునది ఈదేశములో చలామణియందున్న ప్రభుత్వనాణెము 1951 లో స్థాపింపబడిన నేషనల్ బ్యాంకుకు తక్కిన స్థానిక బ్యాంకులు అనుబద్ధములైనవి ఈదేశపు విదేశవ్యాపారము ముఖ్యముగా బెల్జియముతో సాగింపబడు చున్నది

**విస్తీర్ణము: జనాభా** కాంగో రిపబ్లికు విస్తీర్ణము 8,95 348 చ మై అందలి జనాభాలో మానవజాతిపరము లైన మూడు తెగలున్నవి 1, నీగ్రోలు (బంటూ, సుడానీ, నిలోటీ తెగలు), 2, మరుగుజ్జులైన పిగ్మీలనువారు, 3 హమై టులు 1959 వ సం జనాభాలెక్కలనుబట్టి కాంగోదేశపు మొత్తముజనాభా సుమారు 1,37 00 000 వీరిలో దాదాపు 1,36,00,000 మంది ఆఫ్రికాజాతీయులు తక్కినవారిలో యూరోపాఖండమునకు చెందిన వివిధదేశములవారున్నారు

**విద్య** 1959 వ సం లో ఈ దేశమందలి విద్యార్థుల సంఖ్య 17,39,117 1958 లో 225 మంది విద్యార్థులతో

ఎలిజబెత్ విల్లీయందు స్థాపింపబడిన ప్రభుత్వవిశ్వవిద్యాలయము లోను, లియొపాల్డ్‌విల్లీయందు 1954లో 339 మంది విద్యార్థులతో స్థాపింపబడిన క్యాథొలిక్ విశ్వవిద్యాలయమందును స్టాన్లీవిల్లీయందలి మరియొక విశ్వవిద్యాలయమందను ఉన్నత విద్య బోధి పబడుచున్నది

మతము కాంగోలో క్రైస్తవ మతము అత్యధిక సంఖ్యాకులచే అవలంబింపబడుచున్నది. 64 లక్షలమంది క్రైస్తవులలో 53 లక్షలమంది రోమన్ క్యాథలిక్కులు వీరు కాక 1959 వ సం లెక్కలప్రకారము ఈ దేశములో 1,15,000 మంది మహమ్మదీయులు, 1520 మంది యూదులు నివసించుచున్నారు

ప్రభుత్వము · కాంగోదేశ మీదిగువ పేర్కొనబడిన రాష్ట్రములక్రింద విభజింపబడినది –

| రాష్ట్రము | ముఖ్యపట్టణములు |
|---|---|
| 1. లియొపాల్డ్‌విల్లీ | లియొపాల్డ్‌విల్లీ |
| 2 ఈక్వేషియర్ | కోక్విల్ హాట్‌విల్లీ |
| 3 ఓరియంటేల్ | స్టాన్లివిల్లీ |
| 4 కీవు | బుకావు |
| 5, కటంగా | ఎలిజబెత్‌విల్లీ |
| 6 కసాయి | లూలియాబర్గ్ |

1962 లో ఈ దేశము 21 రాష్ట్రములక్రింద పునర్విభజనము చేయబడినది రాజధాని 1929 లో బోమానగరము నుండి లియొపాల్డ్‌విల్లీ నగరమునకు మార్చబడినది 1963 సెప్టెంబరు నెలలో నూతనరాజ్యాంగ చట్టము అములులోనికి వచ్చినది

భవిష్యత్తు ఈ దేశముయొక్క పురోభివృద్ధికి అచ్చటి రాజకీయకల్లోలము తీవ్రప్రతిబంధకముగ నున్నది భిన్నములైన జాతులు, తెగలు ఒకరిపై మరియొకరు తమ ఆధిపత్యమును స్థాపించుకొన జూచుచున్నారు ఈ చిక్కులిట్లుండగా, అంతర్గతరాజకీయవ్యవహారములపై ఒకవంక అమెరికనుల పలుకుబడి, మరియొకవంక కమ్యూనిస్టుల పలుకుబడి బలీయముగ నున్నది

భూమధ్యరేఖామండల శీతోష్ణస్థితిమూలముగా అచ్చటి ఉష్ణస్వభావముగల పైరులన్నియు పుష్కలముగా పండును ప్రధానముగా ప్రకృతిమాత ప్రసాదించు అవకాశములనన్నిటిని వినియోగింపజాలు పరిజ్ఞానము లోపించుటవలన భిన్న జాతులనడుమ అనైక్యము ప్రబలుటవలన, కాంగోదేశము ఆర్థికముగా వెనుకబడియున్నది అయితే ఖనిజసంపద అపారముగా నుండుటవలన, అనువైన శీతోష్ణస్థితి లబ్ధమగుటవలన, కాంగోదేశపు భవితవ్యమును ఉజ్జ్వలమొనర్చుట కవకాశము కలదు

వి మ

## బెల్జియము (భూ) :

బెల్జియమ్ ఒక చిన్నదేశము ఇది ఐరోపాఖండ మైదాన ప్రాంతములో పశ్చిమ భాగమందును, థేమ్సునది ముఖద్వారమునకు అభిముఖముగను ఉన్నది ఈ దేశపు వైశాల్యము 11, 818 చ మైళ్లు, జనసంఖ్య 48, 94, 071 ప్రపంచమునందలి అత్యధిక జనసమ్మర్దముగల దేశములలో ఇది యొకటి

బెల్జియము దేశమును నాల్గుమండలములుగా విభజింపవచ్చును (1) తీరప్రాంతములు (2) మాధ్యమిక మైదానములు (3) దక్షిణ పీఠభూములు (4) బొగ్గు ఉత్పత్తి మండలము-ఈ నాల్గవ మండలము, తక్కిన మండలములకంటె సన్నగానుండి, రెండవ, మూడవ మండలముల నడుమ పశ్చిమమునుండి తూర్పువరకు వ్యాపించియున్నది

తీరప్రాంతములు బెల్జియన్ కోస్తా తీరము సుమారు 40 మైళ్ళ నిడివి కలిగి, సరళరేఖవలె నుండును ఈ తీరమునందు, లిరోభాగపు మైదానముల మట్టమునకు 20-30 అడుగుల ఎత్తుగల ఇసుకదిబ్బలు విస్తరిల్లి యున్నవి ఈ దేశమందలి సముద్రపు రేవుపట్టణములలో న్యూపోర్ట్, ఆస్టెండ్, బ్రీబ్రిగ్ అనునవి ముఖ్యములైనవి వీటిలో మొదటిది ఈసర్ నదీముఖద్వారము చెంత నున్నది, తక్కిన రెండు రేవుపట్టణములు ఒక కాలువచే, ఘెంట్ అను నగరముతో కలుపబడుచున్నవి. తీరమందేర్పడిన ఇసుక మైదానములు ప్రసిద్ధిచెందిన వినోదాశ్రయములుగా ఉపయోగ పడుచున్నవి ఉదా బ్లాంకెన్‌బర్గ్

ఇసుకదిబ్బలను ఆనుకొని యున్న పల్లపు భూమియందలి చిత్తడినేలలు వ్యవసాయమునకు యోగ్యమైన రీతిగా బాగుచేయబడినవి పదిమైళ్ళ వెడల్పుగల ఈ చిత్తడి భూమి మురుగునీటి కాల్వలచే ఆవరింపబడియున్నది 'పోల్డర్ లాండ్' అనబడు ఈ చిత్తడిభూమి ఈనాడు సస్యశ్యామలమైన వ్యవసాయ మండలముగా పరిణామము చెంది, గోధుమ, బార్లీ, షుగర్ బీటుదుంప మున్నగు పంటలకు నిలయమైయున్నది ఇందు పశుపోషణమున కవసరమగు పచ్చిక మైదానములు కూడ కలవు

**మాధ్యమిక మైదానములు** ఈ మండలమును 'స్కెల్ట్' నదీపరీవాహక ప్రాంత మావరించి యున్నది. ఇసుకమయమైన ఈ ప్రాంతము వ్యవసాయమునకు అనుకూలముగ నున్నది. భూగర్భమున మిగుల లోతుగా బొగ్గుగనులు కనుగొనబడినవి. అచ్చట ఉత్పత్తియగు బొగ్గువలన, బెల్జియము యొక్క పారిశ్రామికాభివృద్ధికి దోహద మేర్పడుచున్నది.

'స్కెల్ట్' నదీపరీవాహక మండలము బెల్జియమ్ దేశ మధ్యభాగము నాక్రమించి యున్నది. స్కెల్ట్‌నది ఫ్రాన్సు దేశములో నుద్భవింపగా దాని ఉపనదులగు లైస్, డెండర్, సెన్నీ, డైల్, డెర్నర్ అనునవి విసనకర్ర ఆకృతిలో స్కెల్ట్ నదియందు కలియుచున్నవి. తత్ఫలితముగ ఈ ఉపనదులు ప్రవహించు లోయ మార్గములు, ఆంట్‌వర్ప్ నగరము చెంత స్కెల్ట్‌నదీ ముఖద్వారమునకు సమీపమున ఏకోన్ముఖముగా కలియుచున్నవి. ఈ మండలము బెల్జియమ్ దేశమునందు ప్రధాన వ్యవసాయ క్షేత్రముగ విరాజిల్లు చున్నది. ఇందు విశేషముగ ధాన్యము, చెరకు పండుచున్నవి. రాజధాని యగు బ్రస్సెల్స్ నగరము చుట్టును ద్రాక్షపండ్లు పండించబడి విదేశములకు ఎగుమతి చేయబడుచున్నవి. ఈ మండలము పండే వ్యవసాయోత్పత్తులపై ఆధారపడు పరిశ్రమలు (పంచదార, ఆల్కహాలు, మార్గరైన్, వెనెగర్ మున్నగునవి) నెలకొని యున్నవి. నదీ పరీవాహకమండల పశ్చిమ భాగమున, లైస్ నదీలోయయందు నారబట్టలు తయారుచేయు కేంద్రములు కలవు. ఇచ్చట ఘెంట్, కాంట్రాయ్, రౌండర్స్ అను ప్రధాన నగరములు కలవు. జెన్నీనదిపైగల బ్రస్సెల్స్ అను రాజధాని బెల్జియము దేశ మధ్యభాగమున నెలకొని యున్నది. అనగా అది పైని పేర్కొనబడిన బొగ్గు ఉత్పత్తి మండలమునకును, సముద్రమునకును నడుమనున్నది. బ్రస్సెల్ నగరము, జలమార్గముచే ఆంట్‌వర్ప్ నగరమునకు కలుపబడుచుండుటచే, రేవు పట్టణముగా అది ప్రాముఖ్యము వహించియున్నది. ఇందు కలప పరిశ్రమ, కాగితపు పరిశ్రమ కాగితపు పరిశ్రమలతోపాటు, నాజూకైన భోగ్య వస్తువులు కూడ తయారగు కర్మాగారములు కలవు.

స్కెల్ట్ దీ ముఖద్వారము కడనున్న ఆంట్‌వర్ప్ నగరము బెల్జియమ్ దేశమునందొక గొప్ప రేవుపట్టణమై యుండుటయే కాక, ఇతర దేశములనుండి ఏటేటా ఈ రేవునకు సరకులను తెచ్చు అసంఖ్యాకములైన ఓడలదృష్ట్యా న్యూయార్క్, లండన్ రాటర్‌డామ్ వంటి ప్రపంచ ప్రఖ్యాతమైన రేవుపట్టణములతో పోటీచేసి ప్రథమస్థానము సంపాదింప యత్నించు గొప్ప రేవునగరముగా కూడ అది అభివృద్ధి చెందియున్నది. బెల్జియము యొక్క ఎగుమతి దిగుమతుల వ్యాపారమువలననే ఆంట్‌వర్పు రేవుపట్టణమునకు ప్రాముఖ్య మేర్పడినది.

ఇపిర్స్, బ్రుగ్స్, ఘెంట్ మున్నగు ప్రాచీన నగరములు మధ్యయుగములో ఉన్నివస్త్రములకు ప్రసిద్ధికెక్కినవి.

**దక్షిణ పీఠభూములు** స్కెల్ట్‌నదీ పరీవాహక మండలమునకు దక్షిణముగా, తూర్పు-పశ్చిమములకు విస్తరించిన, మెన్స్ నదీలోయ యొకటి కలదు. ఈ లోయలో మెన్స్ నదికి ఉపశాఖ యగు సాంబర్ నది కూడ ప్రవహించుచున్నది. సాంబర్ - మెన్స్‌లోయకు దక్షిణమున బెల్జియం దేశమునందు ఉన్నతమగు పీఠభూమి కలదు. ఆర్డెన్నిస్ అను 200 అడుగుల ఎత్తుగల ఈపీఠభూమి ప్రాచీన శిలాఖండములచే నిర్మితమై పురాతన పర్వత శ్రేణులలో నొక భాగమై యున్నది. ఈపర్వతమయ భూములు మెన్స్ నదియొక్కయు దాని ఉపనదుల యొక్కయు జలములచే తడుపబడు చున్నవి. దీనికి దక్షిణమున ఎత్తుగానున్న మండలములలో కొంత భాగము అడవులచే ఆవరింపబడి యున్నది, కొంత భాగము గొఱ్ఱెలు మేయు పచ్చిక బీడుగా నున్నది. కాని ఉత్తరభాగమందలి ఉన్నత భూములు సస్యశ్యామలములైన వ్యవసాయ క్షేత్రములుగను, పాడిపరిశ్రమ కేంద్రములుగను వర్ధిల్లుచున్నవి. అత్యంత రమణీయమగు మెన్స్ నదీలోయ, డినాంట్ వంటి పెక్కు ప్రఖ్యాత యాత్రా స్థలములకు నెలవుగ నున్నది.

జర్మను సరిహద్దు సమీపమందున్న వెర్వియర్స్ నగరము ఉన్నిశుద్ధి కేంద్రముగా వాసిగాంచి యున్నది. పూర్వమచ్చట ఉన్ని పరిశ్రమాగారము లుండెడివి.

**బొగ్గు ఉత్పత్తి మండలము** ఈ మండలము ఉత్తర ఫ్రాన్సునుండి సాంబర్ లోయను వెంబడించుచు మాన్స్, చార్లిరాయ్‌లగుండా నమూర్ వరకు విస్తరించి యున్నది. అంతేకాక, అది ఇంకను తూర్పుగా మెన్స్‌లోయ పొడవున, లీజ్ వరకు విస్తరించి యున్నది. ప్రధానమైన ఖనన కేంద్రములు మాన్స్ చార్లిరాయ్ నగరముల చుట్టును నెలకొని యున్నవి. ఈ గనులయందు ఇనుము, సున్నము దాదాపు

నిశ్శేషముగ త్రవ్వి తీయబడినది కాని అదృష్టవశాత్తు లొరెయిన్, లగ్జెంబర్గ్ నగరములందలి నుండి ఇనుము గనులు అచ్చటికి అందుబాటులో నున్నవి

బొగ్గుగనులకు సంబంధించిన కార్యకలాపములకు లోహ పరిశ్రమలు ప్రాతిపదికగా నున్నవి లోహద్రావణము, ఇనుము, రాగి తగర పరిశ్రమలు ఇందలి ముఖ్యభాగములు చార్లిరాయ్ లీజ్ అను తావులలో ప్రధానమగు ఇంజనీరింగ్ పరిశ్రమలు, లోహ పరిశ్రమలు స్థాపింపబడి యున్నవి ఇచ్చట రసాయన పదార్థములు గాజుపదార్థములు కూడ తయారగును

సాంబర్-మెన్స్‌లోయ జర్మనీని ఫ్రాన్సును నడుమ సహజమగు రహదారిగా ఉపయోగ పడుచున్నది దీనికి తోడుగా ఇక్కడ ఘటిల్లుచున్న పారిశ్రామికాభివృద్ధి వలన ఈ ప్రాంతము బెల్జియం దేశమంతటిలో అత్యంత జనసమ్మర్దము కలదిగా నున్నది

భాష, ప్రజలు బెల్జియమ్ దేశము ఒకప్రక్క జర్మనీ, హాలెండు దేశములచేతను, మరొకప్రక్క ఫ్రాన్సు దేశముచేతను పరివేష్టింపబడి యున్నది ఉత్తర బెల్జియం ప్రాంతీయులలో పెక్కురు అందమైన వెండ్రుకలతో, నీలిరంగు నేత్రములతో ఉత్తర ఐరోపా ప్రజలను పోలియుందురు వారు డచ్చిభాషను పోలియుండు ఫ్లెమిష్ భాషను మాట్లాడుదురు దక్షిణ బెల్జియములోని ప్రజలు సామాన్యముగా ఉత్తరాది ప్రజలకంటె ఒక ఛాయ తక్కువగా నుందురు వీరు ఫ్రెంచిభాషను పోలు వల్లూన్ భాషను మాట్లాడుదురు ఫ్లెమిష్‌భాష మాట్లాడువారు జాగరూకులైన వ్యవసాయదారులుగనేకాక, నిపుణులైన చేతిపనివారుగ కూడ ప్రసిద్ధులై యున్నారు వారు ఘెంట్, బ్రూగ్స్‌వంటి పట్టణములలో నివసింతురు కాగా వల్లూన్‌భాష మాటాడువారు, పొరుగువారగు ఫ్రెంచి దేశీయులవలె వ్యవసాయ జీవనమునందు బద్ధులై యున్నారు

మొత్తముమీద బెల్జియమ్ దేశము పారిశ్రామికముగను, వ్యావసాయకముగను అభివృద్ధి నొందుచున్నది మొత్తము భూమిలో 60 శాతమునందు వ్యవసాయము చేయబడుచున్నది అందు విశేష శాతములో భూములు కొండభూములగుటచే. అవి ఫలోత్పాదకములు కాకున్నవి గోధుమ, బార్లీ, పొగాకు, బీటుదుంప, ఉర్లగడ్డలు, రైధాన్యము ఈ దేశమందలి పండు ప్రధాన ద్రవ్యములు వేర్వేరుగా వ్యవసాయ కలాపములను జరుపుట వలన ఒక్కొక్క ఎకరములో లభించు ఫలసాయము అధికముగనే యుండును పెక్కు రకముల పంటలు పరిశ్రమాభివృద్ధికి ప్రాతిపదికగా నున్నవి ఈ దేశములో గుర్రములు, పశువులు పందులు విశేషముగా గలవు ఈ దేశము పారిశ్రామికముగ గూడ అభివృద్ధి నొందుట వలన బట్టల మిల్లులు, ఇంజనీరింగు పరిశ్రమలు విశేషముగా స్థాపింపబడి యున్నవి

వి వి

## బెల్జియము (చ)

బెల్జియము అనునది ఐరోపాఖండమందలి ఒక చిన్న దేశము. దీనికి ఉత్తరమున నెదర్లాండ్సు తూర్పున జర్మనీ, దక్షిణ, పశ్చిమదిక్కులందు ఫ్రాన్సు, వాయవ్యమున ఉత్తర సముద్రము సరిహద్దులుగా నున్నవి దీని విస్తీర్ణము 11,778 చ మై. జనాభా సుమారు 95,28,000 దీని రాజధాని బ్రస్సెల్సునగరము ఈ ప్రాంతమందొకప్పుడు నివసించిన 'బెల్గాలు' అను జాతిప్రజలవలన ఈదేశమునకు 'బెల్జియము' అను పేరువచ్చినది వీరిని క్రీ పూ 57-51 సం ల మధ్య జూలియస్‌సీజరు ఏడుపర్యాయములు జయించి, చివరకీ ప్రాంతమును తనసామ్రాజ్యములో కలుపుకొనెను

నాటినుండి షుమారు 5 శతాబ్దములపాటు రోమనులు ఈప్రాంతముపై తమ అధిపత్యమును నెరపిరి రోమనుల పాలనములో లాటిన్ భాష, రోమకసంస్కృతి. రోమకన్యాయసూత్రములు, క్రైస్తవమతము ఈ ప్రాంతమంతట ప్రాకిపోయినవి ఇది యిట్లుండ క్రీ శ 5 వ శతాబ్దిలో 'ఫ్రాంక్స్' యనబడు జర్మనుజాతీయులు ఉత్తరబెల్జియమ్‌ప్రాంతమునకు వలసవచ్చి అచ్చటనే స్థిరపడిపోయిరి ఇట్లు క్రీ శ 5 వ శతాబ్దాంతమునకు బెల్జియములో 'బెల్గాలు', 'ఫ్రాంకులు', అను రెండుజాతులప్రజలు నివసించుచుండిరి ఈ రెండు జాతులు పూర్తిగ భిన్నమైనవి రోమకనాగరికతా, సంస్కృతులను పుణికిపుచ్చుకొన్న 'బెల్గాలు' కెల్టిక్ తెగకుచెందినవారు వీరు 'వాలూన్' అను నొకరకమైన ఫ్రెంచిభాషను మాట్లాడుచు, దక్షిణప్రాంతమందే నివసించుచు 'వాలూన్'లని వ్యవహరింపబడిరి అట్లే పశ్చిమోత్తరప్రాంతములందు స్థిరపడిపోయిన 'ఫ్రాంకులు' 'ట్యూటానిక్' తెగకుచెందినవారు వీరు 'డచ్ భాషబోలిన 'ఫ్లెమిష్' యనుభాషను మాట్లాడు




THE CHIEF TOWNS IN RELATION TO THE RIVERS AND HIGHLAND OF BELGIUM




REGIONAL UNITS OF BELGIUM

దురు అందుచే వీరు 'ఫ్లెమింగులు' అను పేరును బొందిరి

క్రీ శ 5వ శతాబ్దములో రోమకసామ్రాజ్యపతనానంతరము బెల్జియము, ఫ్రాంకుజాతీయుడగు 'క్లోవిస్' పాలనములోనికి వచ్చినది క్రీ శ 814 వ సం న 'చార్లమేన్' చక్రవర్తి మరణించినపిదప క్రమముగ ఫ్రాంకుసామ్రాజ్యమంతరించుటచే బెల్జియముదేశమందు భూస్వామ్యవ్యవస్థ తలయెత్తినది దేశము భిన్నభిన్నసంస్థానములుగ విభజింపబడినది అట్టిసంస్థానములందు ఫ్లాండర్సు, బ్రబ్బాంట్, హాలెండు, లక్సెంబర్గు, నమూర్, లైగ్, లింబర్గు మొదలుగునవి పేర్కొనదగినవి ఇట్లు భూస్వామ్యవ్యవస్థ ఆచరణమందున్నను, నాడు బెల్జియముదేశము జర్మనీరాజ్యమగు 'లొధారింగా'లో భాగముగనే యుండినది క్రీ శ 843 సం లో జరిగిన 'వెర్డన్ సంధి' ప్రకారము 'ఫ్లాండర్సు' 'ఆర్టాయిస్' ప్రాంతములుమాత్రము ఫ్రాన్సుపాలనములోనికి వచ్చినవి

ఇట్లు బెల్జియములో కొంతభాగము జర్మనీపాలనములోను, మరికొంతభాగము ఫ్రెంచిపాలనములోను షుమారు 6 శతాబ్దములపాటు కొనసాగినది. కాని 15 వ శతాబ్దములో బర్గెండిప్రభువులు ఏదోవిధముగ 'బెల్జియమునంతను తమ పాలనములోనికి తెచ్చుకొనగల్గిరి బర్గెండి-ఆస్ట్రియా, ఆస్ట్రియా-స్పెయిను దేశములకు చెందిన రాచకుటుంబముల మధ్య జరిగిన వైవాహిక సంబంధములను పురస్కరించుకొని బెల్జియము 15 వ శతాబ్ది తుదిపాదములో ఆస్ట్రియా హాప్సుబర్గురాజుల పాలనక్రిందను, పిదప 16 వ శతాబ్దపు తొలిపాదములో స్పెయిను హాప్సుబర్గురాజులపాలనలోను గడపినది 5 వ చార్లెస్, 2 వ ఫిలిప్ ప్రభువుల పాలనములో మతముపేరిట బెల్జియములో ఘోరహింసాకాండ ఘటిల్లినది. దేశమందంతట అసంతృప్తి, అసహనము, అశాంతి ప్రబలిపోయినవి క్రీ శ 1568 సం లో స్పెయిన్ పాలనముక్రిందనుండిన నెదర్లాండ్సు (బెల్జియమ్, హాలెండులు) నందు సుదీర్ఘప్రజావిప్లవ మారంభమైనది ఈ విప్లవజ్వాలలను చల్లార్చి 1598 వ సం న 2 వ ఫిలిప్పు బెల్జియము రాజ్యమును తన కుమార్తెయగు ఇసబెల్లాకు ఇచ్చినాడు ఈ ప్రాంతము 1598 సం నుండి 1621 సం వరకు ఇసబెల్లాభర్తయగు అల్బర్టుయొక్క స్వతంత్రపాలనలో ఉండినది క్రీ శ. 1621 సం న అల్బర్టు సంతతిలేక మరణించుటచేత, బెల్జియము తిరిగి స్పెయినుపాలనముక్రిందకు వచ్చినది క్రీ శ 1713 సం లో జరిగిన 'అట్రిచ్' సంధివలన బెల్జియము ఆస్ట్రియాకు లభించినది పిదప ఆస్ట్రియా వారసత్వపు పోరాటకాలమందు ఫ్రాన్సు ఈదేశమును జయించినది కాని క్రీ శ 1748 సం లో జరిగిన 'ఆక్సిలా-చాపెలాసంధి' సందర్భమున బెల్జియము తిరిగి ఆస్ట్రియాకే దక్కినది నాటినుండి క్రీ శ 1793 వ సం లో ఫ్రెంచివిప్లవసైన్యములచేత ఆక్రమింపబడునంతవరకు ఈ ప్రాంతమంతయు ఆస్ట్రియా పాలనములోనే యుండినది పిదప క్రీ శ 1797 సం న జరిగిన 'కాంపో-ఫోర్మియా' సంధిప్రకారము బెల్జియము ఫ్రాన్సువశకియ్యబడినది అప్పటినుండి 1815 వ సం న 'వాటర్లూ' యుద్ధములో నెపోలియను పరాజితుడగువరకు ఇది ఫ్రెంచిపాలనములోనే యుండినది

క్రీ శ 1815 సం లో జరిగిన వియన్నాసమావేశములో బెల్జియమును హాలెండుతో సంలీనముచేయవలెనని తీర్మానింపబడినది క్రీ శ 1830 వ సంవత్సరమువరకును ఈ రెండుదేశములు 'నెదర్లాండ్సు' అను పేరుతో ఒకేరాజ్యముగ యుండినవి కాని 1830 సం లో బెల్జియనులు డచ్ పాలనమునకు వ్యతిరేకముగపోరి, డచ్ సేనలను తమ భూభాగమునుండి పారద్రోలి స్వాతంత్ర్యమును ప్రకటించుకొనిరి లండన్ సమావేశములో బెల్జియముయొక్క స్వాతంత్ర్యము గుర్తింపబడినది 1831 వ సం లో బెల్జియంజాతీయమహాసభ తమదేశమునకొక రాజ్యాంగమును తయారుచేసి లియోపోల్డును తమ రాజ్యమునకు రాజుగ నెన్నుకొన్నది. బెల్జియము తటస్థవిధానమవలంబించినంతకాలము దాని స్వాతంత్ర్యసంరక్షణభారమును తాము వహింపగలమని ఆదేసంవత్సరములో అగ్రరాజ్యము లొకప్రకటన చేసినవి పిదప 1839 వ సం న ఈ ప్రకటనమును పునరుద్ఘాటించుచు బ్రిటను, ప్రష్యా, రష్యా, ఆస్ట్రియా ఫ్రాన్సు, బెల్జియముతో నొడంబడికలుగావించినవి

షుమారు 8 దశాబ్దములపాటు బెల్జియము ఎట్టిబెడద లేకుండ కాలము గడిపినది, కాని 1914 వ సం న జర్మనీ దీనిపై దాడిచేసి ఆక్రమించినది జర్మనీ ఆక్రమణములోనున్న నాల్గుసంవత్సరములకాలములో బెల్జియము అనేకకష్టనష్టములకు గురియైనది 1919 సం లో జరిగిన 'వర్సైల్సుసంధి' ప్రకారము, బెల్జియము గతములో (1839 సం లో) అగ్రరాజ్యములతో చేసికొన్న యొడంబడికలు రద్దయినవి. దీనివలన తన కిచ్చవచ్చినదేశములతో మిత్రత్వము జరుపుటకును, యుద్ధకూటములలో చేరుటకును బెల్జియమునకు స్వేచ్ఛ లభించినది

నాటినుండి ద్వితీయ ప్రపంచసంగ్రామ మారంభమగువరకు బెల్జియము తనయభివృద్ధికి పాటుబడుచువచ్చినది కాని 1940 సం॥ లో బెల్జియము జర్మనునాజీలవారిచే బడినది. బెల్జియము రాజగు 3వ లియోపోల్డు తేలికగ నాజీలకు లొంగిపోయి నప్పటికిని, మంత్రిమండలిమాత్రము వట్లుచేయక లండనుకు వెళ్ళి యచట ప్రవాసప్రభుత్వము నేర్పరచినది. 1944 వ సం॥ లో మిత్రరాజ్యములవారు నాజీలను తరిమికొట్టినపిదప బెల్జియము మంత్రిమండలి స్వదేశమునకు తిరిగివచ్చినది. 'చార్లెస్' రాజ ప్రతినిధిగ ఎన్నుకొనబడినాడు. ఏడు ..ంవత్సరముల ఆంతరము 1951 సం. న 3వ లియోపోల్డుకుమారుడగు బౌడాయిన్ బెల్జియమునకు రాజైనాడు. నాటినుండి నేటివరకు బెల్జియమునకు అతడే రాజు.

ఏవో కొలదిమార్పులతో ఈనాటికిగూడ బెల్జియములో 1831 సం. పు రాజ్యాంగమే అమలులోనున్నది. రాజ్యాంగ బద్ధబాధ్యతాయుత వంశపారంపర్యపు రాచరికమే బెల్జియము ప్రభుత్వము. కార్యనిర్వాహణాధికారములన్నియు రాజున కియ్యబడినప్పటికిని, రాజుపేర వాటిని నిర్వహించునది మంత్రి మండలియే. చట్టనిర్మాణకార్యక్రమములందు పార్లమెంటుతో పాటు రాజుకూడ భాగస్వామియే. బెల్జియము పార్లమెంటు నందు సెనేటు, ప్రతినిధులసభ అను రెండువిభాగములున్నవి. పార్లమెంటు సభ్యులు నాల్గుసంవత్సరములకొకమారు ఎన్నుకొనబడుదురు. బెల్జియములో వయోజన ఓటింగుహక్కు అమలులోనున్నది. ప్రభుత్వ వ్యవహారము లన్నింటిని, రాజుపేర బాధ్యతాయుత మంత్రిమండలి నిర్వహించును. ప్రస్తుతము బెల్జియములో గాస్టన్ ఐస్కెన్సు నాయకత్వమున ఏర్పరచబడిన క్రైస్తవ సోషలిస్టు-సోషలిస్టుపార్టీలకు చెందిన సంయుక్త ప్రభుత్వము అధికారములో నున్నది.

ఆంట్వర్పు, బ్రబాంటు, తూర్పుఫ్లాండర్సు, పశ్చిమ ఫ్లాండర్సు, లైగే, లింబర్గ్, లక్సెంబర్గ్, నమూర్, హైనాట్ అను తొమ్మిదిరాష్ట్రములు బెల్జియములోనున్నవి. ప్రతి రాష్ట్రము కొన్నిమండలములుగ విభజింపబడినది. రాష్ట్రములకును, మండలములకును పాలనావిషయములో చాల స్వేచ్ఛ యున్నది. రాష్ట్రపాలనావ్యవహారములను జూచుటకు గవర్నరు, రాష్ట్రీయసభలు వ్యవహరించును. అట్లే మండలముల వ్యవహారములను నిర్వహించుటకు బర్గోమాస్టర్ (మేయరు) మరియు కొందరు పెద్దలతోకూడిన సంస్థయొకటి యున్నది. రాష్ట్రీయసభలకు, మండలసంస్థలకు సభ్యులను ప్రజలే యెన్నుకొందురు.

బెల్జియమున్యాయశాఖకు ఆదేశపు కార్యనిర్వాహక వర్గముతోగాని శాసనసభలతోగాని సంబంధము లేదు. సమానాధికారము లియ్యబడినవి. న్యాయవిచారణ సౌలభ్యము కొరకు దేశమంతయు 20 భాగములుగ విభజింపబడినది. ప్రతిప్రాంతమునకు కొ .. న్యాయాధికారి నియమింపబడినాడు. ఈ ప్రాంతీయ న్యాయస్థానములపైన జిల్లా న్యాయస్థానములు వాటిపై ౧ంతి న్యాయస్థానము దానిపై సర్వోన్నతన్యాయస్థానము బెల్జియముదేశమందున్నవి. పై న్యాయస్థానములే గాక ప్రత్యేక సైనిక, వర్తక, శ్రామికన్యాయస్థానములు గూడ అచట నున్నవి.

బెల్జియముదేశపు సంఘవ్యవస్థకు కుటుంబమే మూలాధారము. ఇచట తల్లిదండ్రులు తమబిడ్డలను చక్కని శిక్షణతో పెంచుదురు. తమ ప్రవర్తనముచేత తల్లిదండ్రులు తమబిడ్డల యొక్క నైతిక, ఆధ్యాత్మిక జీవితములకు వరవడిపెట్టుదురు. ప్రతికుటుంబము సామాన్యముగ 10 లేక 12 మందిపిల్లలతో కళకళలాడుచుండును. పెద్దకుటుంబములకు ప్రభుత్వాదరణముకూడ లభించును. అన్నపానాదులవిషయములో బెల్జియమువ్రజలు విశేషశ్రద్ధాసక్తులను జూపింతురు. ఆటపాటలనిన వీరికి బహుప్రీతి. నాటకప్రదర్శనములు, సంగీతము వీరికి ప్రాణప్రదమైనవి.

"విద్యారంగ"ములో బెల్జియము గొప్ప ప్రగతిని సాధించినది. ఈదేశమందు నిరక్షరాస్యులు లేరన్న అతిశయోక్తికాదు. ఇచట నిర్బంధ, ఉచిత, ప్రాథమికవిద్యావిధానము అమలులో నున్నది. విద్యాబోధనము ప్రాంతీయభాషలోనే జరుగును. సెకండరీ విద్యావిషయములో ప్రభుత్వ, ప్రభుత్వేతర పాఠశాలలుగూడ తీవ్రకృషి చేయుచున్నవి. ఉన్నతవిద్యకొరకు 4 విశ్వవిద్యాలయములు వృత్తివిద్యలకై అనేకసాంకేతిక, సాధారణ లలితకళాశిక్షణాలయములు ఏర్పరచబడినవి. ప్రస్తుతము ప్రపంచమందు అభివృద్ధిచెందినదేశములలో బెల్జియముకూడ యొకటి.

ఎ. వెం.

**బెస్‌డా .**

ఆముఖము భూత, వర్తమాన, భవిష్యత్కాలములు మూడును ఒకదానినుండి మరియొకటి ఆవిర్భవించినవి. ఒక

దాని ప్రభావము మరొకదానిపై తప్పక ప్రసరించుచుండును నేటి ప్రగతికి కారణము గతము యొక్క ప్రాబల్యము కాదనుట తగదు. విరుద్ధమగును గతములోని విద్యావేత్తల ప్రభావము మన విద్యావిధానముపై అసాధారణముగ పడినది. సూక్ష్మముగా పరిశీలించినచో, నేటి విద్యావిధానము లోని మూలసూత్రములు, లక్ష్యములు పూర్వపు పెక్కురు విద్యావేత్తల కృషిఫల సర్వస్వమని చెప్పవచ్చును. డాంటే, పెస్టలాజీ, రోమర్ లాక్, రూసో, హెర్‌బర్ట్, స్టర్‌మియన్, రెబిలియస్, అస్క్‌మమల్ కాస్టర్, రటకియస్, కోమినియస్, బెస్‌డా, ఫ్రోబెల్, స్పెన్సర్, ఆర్‌లాల్డ్, మాంటిసోరి మొదలగు ప్రముఖ విద్యావేత్తలలో ఒక్కొక్కరు ఒక్కొక్క తత్త్వమును ప్రతిపాదించి, నేటి విద్యావిధానమును రూపొందుటకు దోహదమొనర్చిరి

**జననము, బాల్యము** గత శతాబ్దమున విద్యారంగములో జరగిన గొప్ప ఉద్యమములలో జాన్ బెర్నార్డ్ బెస్‌డా ప్రారంభించిన ఉద్యమము ఉదాత్తమైనది బెస్‌డా అను విద్యావేత్త 1728 వ సంవత్సరమున జర్మనీదేశములోని హామ్‌బర్గ్ పట్టణమున జన్మించెను అతని తండ్రి శిరోజములను అలంకరించు వ్యాపారస్థుడుగ నుండెను. అతని బాల్యము దుఃఖభూయిష్ఠముగ గడచినది. తల్లి ఆరోగ్యము సరిగా లేనందున బెస్‌డా మాతృపోషణమును విశేషముగా పొందినవాడు కాడు. అతని తండ్రి కఠినాత్ముడై యుండెనని తెలియుచున్నది. ఈవిధముగా తల్లిదండ్రులఆదరాభిమానము లను నోచుకొననివాడై బెస్‌డా తనబాల్యమును గడిపెను

తనవ్యాపారమునే కొనసాగింపుమని కుమారుని తండ్రి బాధపెట్టెను. తనకావృత్తి నచ్చనందున అతడు ఇంటినివిడిచి పారిపోయి 'హాల్‌స్టీల్' నగరమున ఒక పెద్ద గృహస్థునిదగ్గర నౌకరుగా చేరెను. పాపమా యజమానుడు పిల్లవాని బుద్ధి కుశలతను గ్రహించి 'హామ్‌బర్గ్ గ్రామర్' పాఠశాలకు అతనిని పంపెను. 'రియారస్' అను విద్యావేత్త అచట బెస్‌డా యొక్క ఉపాధ్యాయుడుగా నుండెను. అచ్చట తనవిద్యను ముగించుకొనినపిదప స్నేహితుల సాహాయ్యమున, అతడు లీప్‌జిగ్ విశ్వవిద్యాలయమున ప్రవేశించెను. మతాధికారి పదవిని ఆశించి అతడు ఆశాఖకు సంబంధించిన గ్రంథములను చదివెను

మొదటినుండియు బెస్‌డాకు పదిమంది నడచినత్రోవను నడచుట ఇష్టముగాకుండెను. ఎప్పుడును ఒకవినూత్న పంథాలో నడవవలెనని అతడు అభిలాషపడెడివాడు. కొన్నాళ్ళుగడచిన తర్వాత అతడు ఆ విశ్వవిద్యాలయమునుకూడ విడిచిపెట్టెను. ఎక్కువగా స్వాతంత్ర్యమును కాంక్షించువారిపై విధింపబడు నిబంధనములు విప్లవాత్మకముగా పరిణమించును

పిదప బెస్‌డా హాంబర్గును విడిచి 'హాల్‌స్టీన్'కు 'హెర్ వాన్ క్వాలెన్' అనువాని బిడ్డలకు ట్యూటరుగా పని చేయుటకు పూనుకొనెను. ఈసమయములో బోధనమందు క్రొత్తమార్పులు ప్రవేశపెట్టవలెనని బెస్‌డా ప్రయత్నించెను నేర్పవలసిన ముఖ్యవిషయములు సంభాషణలద్వారా బాలబాలికలకు నేర్పవచ్చునని అతడభిప్రాయపడెను. క్రీడలు, బిడి తోటలు పరిసరములందలి వస్తువులు-వీటిద్వారా విద్యగరపు విధానమును రూపొందించుటకై బెస్‌డా నిరంతర కృషి జరుపసాగెను

ఇటుపిమ్మట క్వాలెన్ ప్రాబల్యమున 'డెన్‌మార్క్' లోని 'సోరి' పట్టణమందలి విశ్వవిద్యాలయములో బెస్‌డా ఆచార్యుడుగా చేరెను ఎనిమిది సంవత్సరములు కష్టపడి తన రచనలతో గొప్ప విప్లవమును సృష్టించెను విద్యావిధానమున సనాతనధర్మ పరాయణులకు బెస్‌డా రచనలు గొప్ప ఆగ్రహావేశములను కలిగించినవి ప్రభుత్వమువారికి కూడ కోపము వచ్చి బెస్‌డాను ఆచార్యపదవినుండి తొలగించిరి

అనంతరము 'ఆల్‌టోనా' నగరమున అతడు తన పరిశోధన కార్యములను సాగించి "ఫిలాలిథియా" అను గ్రంథమును రచించెను దీనివలన అతడు పెక్కురకు అనిష్టుడయ్యెను 'చర్చి' నుండికూడ అతనిని, అతని కుటుంబమును బహిష్కరించిరి "లూబెక్" గ్రామమునుండి అతడు ప్రచురించిన గ్రంథములను ప్రభుత్వమువారు దగ్ధముచేసిరి

"రూసో" వ్రాసిన 'ఎమిలి' అను గ్రంథమును చదివి, తన పరిశోధనములను సాగించవలెనని బెస్‌డా మరింత పట్టుదలతో ఎదిరేయ నారంభించెను పాఠశాలలను దర్శించి, అందలి హృదయవిదారక పరిస్థితులను పరిశీలించి, విద్యావిధానములో విప్లవాత్మకమైన మార్పు రావలెనని అతడు నిశ్చయించుకొనెను. బాలబాలికలు కఠినతరమైన పరిస్థితియందు విద్యాభ్యాసము సాగించుచుండిరి, వారు అనారోగ్యముచే బాధపడుచుండిరి, శరీరవ్యాయామము పూర్తిగ అలక్ష్యము చేయుచుండిరి, మాతృభాషను నిర్లక్ష్యముచేసిరి.

గ్రీకు, లాటిన్ భాషలుమాత్రము నిర్బంధముగాను, యాంత్రికముగాను బోధింపబడుచుండెను. బీదబాలురు పెక్కుపోట్లకు లోనగుచుండిరి అచ్చట స్థాపింపబడిన పాఠశాలలన్నియు కలవారి సంతానమునకే విద్యగరపుచుండెడివి యువకులు నిరాశాపీడితులై జీవించుచుండిరి, బోధనము కఠినముగాను, క్రూరముగాను సాగుచుండెను బాలురకు వ్యాకరణము, శైలిలు, గ్రీకు, లాటిను సాహిత్యములు నిర్బంధముగా నేర్పబడు చుండెను

విద్యార్థులను శిక్షించుటకు బైబిల్‌లోని "సామ్స్" యందలి అరువదినాల్గవ లేక అరువది యొకటవ అధ్యాయమును వారిచే కంఠస్థము చేయించుచుండిరి పాఠశాలల గదులు అంధకార బంధురములై అనారోగ్యకరములుగా నుండెను 'లూయీ' ప్రభువు (పదునాల్గవ) కీదవారిని కడుహింసించుచుండెను ప్రభుత్వము శాసించిన విధముగనే క్షౌరము చేయించుకొనవలెను పౌడర్, పోమేడ్‌లను రుద్దిపెంద్రుకలను ఒకేవిధముగా కట్టుకొనవలెను 'కాంట్' అను తత్త్వవేత్త కూడ ఈ దీనావస్థనుచూచి ఖిన్నుడైపోయెను సంస్కరణము బాధదాయకముకాదనియు, విప్లవముతోనే ఆ సమాజపంకమును క్షాళనము చేయవలెననియు బెస్‌డా నిశ్చయించుకొనెను. ఈ క్రొత్త పరిణామమెట్లు సాధించవలెను ? విప్లవాత్మకమైన మార్పు అవసరమని తలచినవారిలో బెస్‌డా అగ్రగణ్యుడు

1768 వ సంవత్సరములో బెస్‌డా తన విద్యాతత్త్వమును ప్రచారము చేయ నారంభించెను అనేక ప్రాంతములలో ఉపన్యసించ మొదలిడెను తుదకు 1774 సంవత్సరమున తన విద్యాతత్త్వమును వివరించుచు "ఎలిమెంటరి" అను గ్రంథమును ప్రచురించెను 'జోసెఫ్' (రెండవ), 'క్యాథరిన్' (రెండవ), 'క్రిష్టియన్' (ఏడవ), 'గ్రాండ్‌ప్రిన్స్' మొదలగు రాజవంశస్థులు మొత్తము 2000 £ వరకు అతనికి సాహాయ్యము చేసిరి. ఈ విధముగా గ్రంథ ప్రచురణమునకు విరాళములు వసూలు చేసికొనుచు జర్మనీ దేశమందంతటను అతడు సంచరించెను 'ఫ్రాంక్‌ఫర్ట్'లో కొన్ని సంవత్సరములు తన సిద్ధాంతమును ప్రచారము చేసెను తదుపరి ప్రముఖ విద్యావేత్తయగు, 'లెవటర్'తో కలిసి 'ఎమ్స్' నగరమును సందర్శించెను. బెస్‌డాను గురించి గోథే అను మహానీయు డొక వ్యాసమును ప్రచురించెను ఆ వ్యాసమునందాతడు బెస్‌డా చేయు విమర్శనము అసిధారవంటిదనియు లెవటర్, బెస్‌డాలు విభిన్న మనస్తత్త్వములు గలవారనియు వివరించియున్నాడు

విద్యాతత్త్వము విద్యాబోధనము సహజముగను, అనురక్తితోకూడినదిగను ఉండవలెనను 'బెస్‌డా' అభిప్రాయముతో 'గోథే' ఏకీభవించెను 'బెస్‌డా' భావించిన 'ఎలిమెంటరి' సిద్ధాంతముకంటె 'కొమినియస్' ప్రతిపాదించిన "ఆర్బిస్‌పిక్టస్" సిద్ధాంతము ఉత్తమమైనదని గోథే విశ్వసించెను బెస్‌డా తన అనుచరులను విసిగించుచు వారు విశ్రాంతిగా కూర్చుండుట సహించెడివాడు కాదు

'బెరిన్స్క్' అను గోథే ముఖ్యస్నేహితుడు 'బెస్‌డా'కు 'లియోపాల్డ్' యువరాజుతో మైత్రి కలుగజేసెను ఈ మైత్రి క్రమముగా వృద్ధిజెందెను బెస్‌డా యొక్క ఆదర్శములను ప్రబోధించుటకు తగిన సంస్థను స్థాపించవలెనని నిశ్చయించుకొని లియోపాల్డ్, "డెసావ్" నగరమునకు అతనిని రప్పించి అతనిచే "ఫిలాన్‌త్రోపినమ్" అను విద్యాసంస్థను స్థాపింప జేసెను పురాతన సిద్ధాంతములకు స్వస్తిచెప్పి విప్లవాత్మకమైన సూత్రములను అందు ప్రవేశపెట్టి విద్యయందాసక్తిగలవారి దృష్టిని 'బెస్‌డా' ఆకర్షించెను 1778 వ సంవత్సరము మే మాసమున జర్మనీ దేశములోని పలువురు ఉపాధ్యాయులు సమావేశమై బెస్‌డా సిద్ధాంతమును గురించి చర్చించిరి బెస్‌డా స్థాపించిన సంస్థలో అతని కుమార్తె, కొడుకులతోసహా పదముగ్గురు విద్యార్థులు మాత్రమే విద్యాభ్యాసము చేయుచుండిరి

సూత్రములు : బెస్‌డా తాను వ్రాసియున్న "ఎలిమెంటరి" అను గొప్ప ప్రామాణిక గ్రంథమునకు అనుబంధముగా "బుక్ ఆఫ్ మెథడ్స్" అను మరొక గ్రంథమును కూడ వ్రాసెను "ఎలిమెంటరి" అను గ్రంథమున సంభాషణలద్వారా, పద్యములద్వారా తన సిద్ధాంతమును అతడు వివరించెను "రూసో" అను విద్యావేత్త నిర్వచించిన 'ప్రకృతి' సిద్ధాంతమునే బెస్‌డా కూడ అనుసరించెను 'బాలబాలికలను' బాలబాలికలుగనే చూడవలెను పవిత్రమైన, నిష్కళంకమైన, కోమలమైన వారి హృదయములను కలుషితము చేయరాదనియు, జ్ఞానేంద్రియములద్వారా వారికి సిద్ధించిన జ్ఞానము వారికి శాశ్వత విద్యను ప్రసాదించుననియు బెస్‌డా విశ్వాసము "ప్రకృతి"కి సంబంధించిన అభ్యాసములను తొలగించిన

గాని విద్య అభివృద్ధి కాదని కొమినియస్ కూడ విశ్వసించెను బాలబాలి లు నేర్చుకొనవలసిన విషయములను కొన్ని దశల వారిగా బెస్‌డా ఇట్లు విపులీకరించెను

1 మనుష్యుడు విదేశములలో నుండు మనుష్యులు, క్రూర మృగములు, అస్థిపంజరము ద్రావకములలో నిముజ్జన చేసిన హస్తము

2 జంతువులు తెలిసికొనవగిన జంతువులు, వాటి నుండి లభించు వ్యాపారమునకు సంబంధించిన సరకులు

3 ఖనిజములు - రాసాయనిక వస్తువులు

4 వృక్షములు - మొక్కలు అతి ముఖ్యమైన వృక్షములు, మొక్కలు వాటికి సంబంధించిన సరకులు, విత్తనములు, అట్టి వృక్షములనుండి కోయబడిన కుర్చీలు, తోట పనిముట్లు, వ్యవసాయపు పనిముట్లు

5 గణితశాస్త్రమునకు సంబంధించిన పరికరములు బరువులు తూచుసాధనములు, కొలతమానికలు, వాయురేచక యంత్రము, సైఫన్ మొదలగునవి, భూమియొక్క ఉనికి, దాని స్వరూపము

6 వ్యాపారములు వివిధ సాధనముల ఉపయోగములను నేర్పుట

7 చరిత్ర శాసనములు, పుస్తకములు, చరిత్రను బోధించు పురాతన వస్తుసముదాయము

8. వ్యాపారమునకు సంబంధించిన వస్తువులు

9 తెలిసిన వస్తువుల సముదాయము ఇల్లు, తత్పరివరములు

ఫ్రెంచి, లాటిన్ భాషలు సంభాషణలద్వారా నేర్చుకొనవలెననియు, అన్ని మతములను గురించి నిష్పాక్షికమైన పరిశీలనము బాలబాలికలు చేయవలెననియు, "ప్రకృతి ననుసరించి" విద్యను బోధించవలెననియు తెలుపు సూత్రము బెస్‌డా తత్త్వమునకు జీవము. బాలుర సహజవాంఛలను అణగద్రొక్కక వాటిని సంతృప్తిపరచి వాటికి ఉదాత్తత చేకూర్చవలెననికూడ అతడు బోధించెను

'వోక్' అను సహోపాధ్యాయునితో కలిసి 'బెస్‌డా' కొన్ని విప్లవాత్మకమైన మార్పులు చేసెను "బెస్‌డా" విధానము 6 సంవత్సరముల ప్రాయమునుండి 10 సంవత్సరముల ప్రాయము వరకు గల బాలబాలికలకు మాత్రమే వర్తించునని విమర్శకులు అతని విద్యావిధానమును విమర్శింప మొదలిడిరి 'గమనము', 'శబ్దములు', 'రంగులు' విశేషముగా బాలురను ఆకర్షించును ఇదియే ప్రకృతిని బోధించు పాఠము దీని నాధారముగా మన విద్యాతత్త్వమును రూపొందించు కొనవలెనని బెస్‌డా బోధించెను పాఠశాల వాతావరణము కడు ఆనందదాయకముగా నుండవలెను బాలురు తమ ఇష్టము వచ్చినట్లు ప్రవర్తించుటకు వీలుండవలెను ఎట్టి నిబంధనలు వారి "స్వేచ్ఛ"ను అరికట్టరాదు ముఖ్యముగా వారి "చదువునకు" చక్కని శిక్షణ నొసగవలెనను ఆశయముచే చిత్రలేఖనము, గురి (లక్ష్యము) మొదలగు అభ్యాసములను బెస్‌డా కల్పించెను

ప్రతి బాలునికి, ఏదో ఒక చేతిపని నేర్పవలెనని బెస్‌డా నిర్ణయించెను బాలుర దైనిక కార్యక్రమమును బెస్‌డా ఈవిధముగా నిర్ణయించెను

8 గంటలు - నిద్ర

8 గంటలు - ఆహారము, విశ్రాంతి, వినోదము

| | |
|---|---|
| 6 గంటలు - పాఠశాల<br>2 గంటలు - పరిశ్రమ | ధనవంతుల బిడ్డలకు |
| 2 గంటలు - పాఠశాల<br>6 గంటలు - పరిశ్రమ | బీదవారి బిడ్డలకు |

శారీరక వ్యాయామము, పర్వతారోహణము బాలబాలికలకు నిర్బంధముగా నుండవలెనని బెస్‌డా చెప్పెను 'బెస్‌డా' సిద్ధాంతము మంచిదేకాని అంతగా ఆచరణీయమైనది కాదని విమర్శకులు భావించిరి. అందుచేత 'బెస్‌డా' ఒక పాఠశాలలో ఉపాధ్యాయుడుగా పనిచేసి విమర్శకుల అనుమానములను ఆక్షేపణములను నివారించెను 'హెర్డర్', 'క్యాంప్' అనువారు బెస్‌డా పాఠశాలయందు పని చేసిన వారిలో ముఖ్యులు "రాబిన్‌సన్ క్రూ సో-ది-ఎంగర్" అను ప్రముఖ గ్రంథమును క్యాంప్ రచించి బెస్‌డా సిద్ధాంతములను ప్రచారము చేసెను బెస్‌డాతో కలిసి పనిచేసిన వారితో "సాల్‌జమన్" "మాలివర్" కూడ చేరియుండిరి 'రీగా' మొదలుకొని "లిస్‌బన్" వరకు బెస్‌డా శిష్యకోటి పెరిగిపోయెను క్యాంట్, బెస్‌డా సిద్ధాంతమును నిశితముగా విమర్శింప మొదలిడెను

1798 లో బెస్‌డా ఆగ్రహించి "అనూనవులకు బుద్ధి లేద"ని తన సంస్థను మూసివేసెను. ఐనను యూరపు దేశమున బెస్‌డా సిద్ధాంతము వేర్లు పాతుకొని ప్రచారమునకు-

వచ్చెను ఆయన తన సిద్ధాంతముచే విప్లవాత్మకమైన మార్పు తెచ్చెనని అందరును అంగీకరించిరి నూతన అభిప్రాయము ములను ప్రచారము చేసిన ధీశాలియనియు, విప్లవకారు డనియు ప్రజలు బెస్‌డాను శ్లాఘింప మొదలిడిరి విద్యాభి వృద్ధికి వలసిన పునాదులు బెస్‌డా వేసెనను విషయమును విద్యావేత్తలు కూడ అంగీకరించిరి స్విట్జర్లాండులోను, హీడెన్‌హీమ్‌లోను కొంతకాలము బెస్‌డా నివసించి తన తత్త్వమును ప్రబోధించెను కొంతకాలము కొన్ని విద్యా సంస్థలు ఆయన సూత్రము లాధారముగా నిర్వహింపబడెను 'మైరోట్' అను బెర్లిన్ శాస్త్రజ్ఞుడు 'బెస్‌డా' ముఖ్య శిష్యుడై ఆయన సిద్ధాంతములను ప్రచారము చేసెను

ఎక్కువకాలము బెస్‌డా 'డెసౌన్' నగరమున నివసించి తన విద్యాతత్త్వమును ప్రబోధించు చుండెను ప్రభుత్వ సహాకారము లేక స్వయముగా బాలురకు విద్యగరపుచు, అనేక ప్రయాసలకోర్చి అతడు తన జీవితమును సాగించుచు 1780 వ సంవత్సరమున 'మాగ్‌డిబర్గ్' నగరమును దర్శించెను ఆతరువాత స్వల్పకాలము అస్వస్థతజెంది తన 67 వ ఏట అతడు మరణించెను "ఇప్పటివలెనే నాయొక్క మరణానంతరము కూడ నా శరీరము మానవ శ్రేయస్సునకే ఉపయోగింపుడని తన తుది కోరికగా అతడు ప్రకటించెను

బెస్‌డా ప్రముఖ తత్త్వవేత్తయైన 'మాక్సుముల్లరు' నకు మాతామహుడు బెస్‌డా కుమారుడు జర్మనీకి అధ్యక్షుడుగా పనిచేసెను ఇతని కుమార్తెయే మాక్సు ముల్లర్ యొక్క తల్లి మాక్సు ముల్లరు బెస్‌డాను గురించి గొప్ప గ్రంథమును రచించెను

ఎవరు ప్రతిపాదించిన సిద్ధాంతమైనను ఆదర్శమైనదనియు, నిర్దుష్టమైనదనియు చెప్పుట కష్టము కాని ప్రతి విద్యావేత్తయు తన జీవితములో ఏవియో కొన్ని సూత్రములను నిర్వచించి, సిద్ధాంతీకరించి ఆచరించి ప్రబోధించును విద్యాభివృద్ధికి ఆ సూత్రములు తోడ్పడుచుండును ఇట్లు నేటి విద్యావిధానము, తన్మూలసూత్రములు ఒకనాటివి కావు అవి అనేక శతాబ్దములుగా జరపబడుచున్న అనేక విద్యావేత్తల అవిరళ కృషిఫలితము విద్యా తత్త్వశాఖమున ధ్రువతారలై మానవకోటికి విజ్ఞానమును ప్రసాదించిన ప్రముఖ విద్యావేత్తయగు బెస్‌డా అట్టివారిలో నొకడు

ఎ ర

## బేట్స్ హెన్రీ వాల్టర్ (1825-1892)

ప్రముఖ ఆంగ్ల జంతుశాస్త్రజ్ఞుడును, ప్రకృతి శాస్త్ర పరిశోధకుడును, సాహసిక యాత్రికుడును నైన బేట్స్ హెన్రీ వాల్టరు లైసెస్టర్ నగరమునందు 1825వ సంవత్సరములో ఫిబ్రవరి 8వ తేదీన జన్మించెను, బాల్యమునుండి ఇతడు ప్రకృతి శాస్త్రమునందు మిక్కిలి అభినివేశము గలవాడు పురుషుల ఉడుపులను తయారుచేయు కర్మాగారమునందితడు ప్రాథమిక శిక్షణము పొందుచున్నసమయమున, అచ్చటి ఉన్నతపాఠశాలలో ఆంగ్లోపాధ్యాయుడుగా నుండిన ప్రకృతి శాస్త్రవేత్తయగు వాలెస్ ఆల్‌ఫ్రెడ్ రస్సెల్ అను నాతనితో 1844-1845లో స్నేహము చేసికొనెను ఆ ఇరువుర స్నేహము దినదినాభివృద్ధి నొందినది కీటకజాతుల నడుమగల విభేదములను, వాటి జీవ పరిణామములను తెలిసికొనవలెనను ఆకాంక్ష వారిలో ప్రబలినది దానిని పురస్కరించుకొని వారిరువురును 1848 ఏప్రిలులో దక్షిణ అమెరికాయందలి బ్రెజిల్ ప్రాంతమునకు బయలుదేరి వెళ్ళిరి ప్రథమమున వారిరువురును ఆ ప్రాంతములలో లభించిన కీటకముల పుట్టు పూర్వోత్తరములను గూర్చి పరిశోధించి, వాటి ప్రతిరూపములను సంపాదించి, వాటిని విక్రయించి, తమ రాకపోకలకు వలసిన వ్యయమును సంపాదింపనెంచిరి

ఆ పరిశోధకు లిరువురు మహా భయంకరమైన అమెజాన్ నదీపరీవాహక ప్రాంతములలో, సుమారు $7\frac{1}{2}$ సంవత్సరములు పెక్కు కష్టనష్టముల నెదుర్కొని, అచ్చటి భిన్నభిన్న కీటక జాతుల జీవితమును గురించి పరిశోధనములు జరపి, చిత్ర విచిత్రములైన నూతనాంశముల నెన్నిటినో, తెలిసికొనిరి సుమారు 14, 712 రకములైన కీటకజాతులను సేకరించి, వాటిని గురించి పరిశోధనములు జరపిరి ఆ పరిశోధనములలో సుమారు 8 వేల కీటకజాతులకు సంబంధించిన విషయములు జంతుశాస్త్రమునకు సరికొత్త వెలుగును ప్రసాదించి, ప్రపంచ జంతు శాస్త్రవేత్తలకు ఆశ్చర్యమును కలిగించినవి వారు పెక్కు విషక్రిములకు సంబంధించిన నూతనాంశములను, గురించియు ఆమెజాన్ నదియందలి భయంకరమైన మొసళ్లను గురించియు, వాటి ఆహారవిహారాదులను గురించియు, పెక్కు విషయములను తెలిసికొనిరి

పిమ్మట బేట్సు, వాలెసును అచ్చట నొంటరిగా విడిచి, 1859 సం జూనునెలలో ఇంగ్లండునకు వెళ్ళెను అచ్చట

అతడు 186 లో ఆమె జాన్ ప్రాంతమున సేకరించిన జంతు జీవిత వివరములను గూర్చి లిన్నియన్ సొసైటీ వారి సమక్షమున సమగ్రమైన ప్రదర్శన, ప్రసంగములను జరపెను అందు జంతుధ్వనుల అనుకరణ విధానమును ప్రదర్శించి, వాటి స్వరూప, స్వభావములను సోదాహరణముగా వ్యక్తముచేసెను చార్లెస్‌డార్విన్, జోసెఫ్ హూకర్ వంటి ప్రముఖ శాస్త్రవేత్తలు బహుముఖ ప్రజ్ఞాశాలియైన బేట్సు ప్రసంగములను వినిన పిమ్మట, అతని ప్రజ్ఞా పాండిత్యములను గుర్తించి, అతనిని మిగుల శ్లాఘించుచు ఉత్తరములు వ్రాసిరి

మహోత్సాహముతో బేట్స్ తనకు అధిక ప్రతిఫలమునీయగల నూతన జంతుశాస్త్రవిషయములను పరిశోధించుటకై 186లో లండన్ నగరమును చేరెను ఆ సంవత్సరమే అతడు వ్రాసిన "అమెజాన్ ప్రాంతములో ప్రకృతి శాస్త్రవేత్త" అను బృహత్తర గ్రంథమును (ప్రసిద్ధ పరిణామ సిద్ధాంతవేత్త చార్లెస్ డార్విన్ యొక్క ఉపోద్ఘాతముతో) జాన్‌ముర్రే అను మహాశయుడు ప్రకటించెను దీనితో బేట్స్ కీర్తిప్రతిష్ఠలు నలుమూలల విస్తరించుటయే కాక, జంతు శాస్త్రవేత్తల శ్రేణిలో అతనికి విశిష్టస్థానము కూడ లభించెను 1864 లో జాన్‌ముర్రే, బేట్సునకు రాయల్ జియాగ్రాఫికల్ సొసైటీ యందు సహాయ కార్యదర్శి పదవి లభించుటకు మిక్కిలి తోడ్పడెను ఈ విశిష్టపదవి లభించిన పిమ్మట బేట్సునకు ఆర్థిక సమస్యలన్నియు తొలగిపోయి అతడు ప్రశాంత వాతావరణములో శాస్త్ర పరిశోధనములు సల్పుకొనుటకు అవకాశము లభించెను అతడా పదవియందు జీవితాంతము పనిచేసి సఫలీకృత మనోరథుడయ్యెను

బేట్స్ తన జీవితకాలమందనేక శాస్త్రగ్రంథములను పరిష్కరించి, పెక్కింటిని సవరించి, ప్రకటించెను అంతేకాక జంతుశాస్త్రమునకు సంబంధించిన అసంఖ్యాకములైన వ్యాసములను అతడు వ్రాసి ప్రచురించెను

బేట్సు యావజ్జీవము జంతుశాస్త్ర విషయమున నిర్విరామముగా సల్పిన మహత్తర సేవను గుర్తించి 1891లో రాయల్ సొసైటీవారు విశిష్ట సభ్యత్వమునిచ్చి అతనిని గౌరవించిరి రాయల్ జియాగ్రాఫికల్ సొసైటీయందు తాను సభ్యుడుగా ఎన్నుకొనబడిన పిమ్మట, సీతాకోక చిలుకలను గురించి సంపాదించిన వివరములను ఒకసంస్థకు విక్రయించెను

బేట్సు జీవితాంతము వరకు పేడపురుగు, ఉరిదె, కుమ్మరిపురుగు మున్నగు అల్పకీటకముల జీవిత విశేషములను కనుగొని, వాటి జీవిత పరిణామ వివరములను వెలుగులోనికి తెచ్చు విషయమై తన దృష్టిని కేంద్రీకరించి, మిక్కిలి పట్టుదలతో పరిశ్రమించి, విజయము సాధించెను ఇట్లు బేట్సు మహాశయుడు జంతుశాస్త్ర వికాసమునకు తన జీవితమును అంకితము చేసి 16, ఫిబ్రవరి 1892వ సం॥లో పరమపదించెను అతని మరణానంతరము అమూల్యమైన అతని కృతిసముదాయమును రేనీ ఆర్థర్ రినెస్సు అను సంస్థవారు ధనమునిచ్చి తీసికొనిరి

పు. వేం.

## బేదరులు :

గుల్బర్గా జిల్లాలో కృష్ణా భీమనదుల మధ్య సురపురమను చిన్న సంస్థానమును బేదరులు లేదా బేండరులు అను తెలుగు బోయ నాయకులు పరిపాలించిరి బేదరులనగా నిర్భయులని యర్థము ఈ నాయకులు తాము కోసలవంశీయులమని చెప్పుకొనియున్నారు వీరి పూర్వులందు ఒకడైన కోసలనాథు డను వానివలన ఈ వంశమున కీపేరు వచ్చినట్లు కైఫియతులు చెప్పుచున్నవి ఈ నాయకుల పూర్వనివాసమగు మురుగల్లు సీమలో కోసలపేట యను గ్రామము పొందింపబడెను రాజా బహిరీపామ నాయక భూపాలుడు తాను రచించిన భార్గవపురాణమున (అముద్రితము) తాము శ్రీరామచంద్ర భక్తుడగు గుహుని సంతతివారమనియు తమది కోసల వంశమనియు చెప్పుకొన్నాడు

మెకంజీ రికార్డులందున్న సురపురరాజుల వంశావళి (సంపత్కుమారీయమున కనుబంధము) ననుసరించి గుహుని వంశమున పరకాలుడను రాజు జన్మించెను అతని కోవలో కోసలనాథుడు పుట్టెను అతని పేర ఈ వంశము కోసలవంశమాయెను ఈ వంశమున బుట్టినవాడే సురపురాధీశ్వరులకు మూలపురుషుడగు వీర బొమ్మినాయకుడు ఈతడు తిరుపతి కాంచి, కలశపక్క, తిరువణ్ణామలై ప్రాంతముల సర్దేశాయి పదవియందుండెను. ఈతని కుమారుడు సింగప్ప ఇతని తరువాత పాలకుడయ్యెను సింగప్ప కుమారుడగు పడియర నాయకుడు తండ్రి తరువాత ఆ భూభాగముల కేలికయ్యెను. పడియర నాయకుని తరువాత పాలకుడైన కల్లప్ప, కాంచీ ప్రాంతములను విడిచి కడప మండలమునందలి మారెళ్ళకు వచ్చి సర్దేశముఖుగా నుండెను ఈ కల్లప్ప కేడుగురు కొడు

కులు, 1 పెద హనుమనాయకుడు 2 చిన హనుమనాయకుడు 3, ఇమ్మడి హనుమనాయకుడు 4 ముమ్మడి హనుమనాయకుడు 5 పరిబంగ హనుమనాయకుడు 6 కరి హనుమనాయకుడు 7 బిళార హనుమనాయకుడు వీరు ఐనమతమును స్వీకరించిరి మొదటి ఐదుగురు ఆదోని తాలూకాలోని తుంబళం ప్రాంతములకును, చివరి ఇరువురు తిరుపతి ప్రాంతములకును పోయిరి కొంతకాలమునకు కల్లప్ప తన మొదటి ఐదుగురు కొడుకులతో హైదరాబాదు రాష్ట్ర మందలి ముదుగల్లునకు వచ్చి యచటి దుర్గాధిపతియగు ముస్తఫాఖాను నోడించెను ముస్తఫాఖానుడు కల్లప్పతో సంధిచేసికొని యాతనికి ముదుగల్లు సీమలో మిరాశి మరియు వర్తేశాయి అధికారముల నిచ్చెను అచ్చట కోసలపేటను పొందించి కల్లప్ప దానిని స్థావరముగా చేసికొనెను.

కల్లప్ప తరువాత నాతనికుమారు లేవురును ఒక్కొక్క రొక్కొకచోటికి వెడలిపోయిరి పెదహనుమనాయకుడు హైదరాబాదు రాష్ట్రమందలి కొడ్డెకల్లు పాళెగాని యధీనమునను, ఇమ్మడి హనుమనాయకుడు కోపగిలోను, ముమ్మడి హనుమనాయకుడు బీదరు నవాబుకడను, పరిబంగహనుమనాయకుడు కలిగిలోను, మిరాశిదారులైరి చినహనుమనాయకుడు 60 అశ్వికులను, 300 పదాతి వర్గమును కూర్చుకొని కృష్ణాతటమందలి కక్కేరి ప్రాంతమును చేరుకొని, బిజాపుర సుల్తాను భూభాగములపై దాడులారంభించెను, బిజాపుర సుల్తాను ప్రధానామాత్యుడు బహిరీ వసంతరావు దేవపుర మాస్థానముగా, ముదుగల్లు సీమకు దేశాయిగా నుండెను చిన హనుమప్పనాయకుడు బహిరీ వసంతరావునోడించి యాతని బిరుదును లాగికొనెను అప్పటినుండియే ఈ నాయకరాజులకు బహిరీ బిరుదము పరంపరగా వచ్చుచున్నది చిన హనుమనాయకునకు పోవినాయకు డుద్భవించెను ఆతనికి పెదసోమనాయకుడు పుట్టెను పెదసోమనాయకునికొడుకు ఎరసింగనాయకుడు ఆతని కుమారుడు మదిరి నాయకుడు మదిరి నాయకుని కొడుకు వీరజంపి నాయకుడు ఆతని కుమారుడు బలెసోమనాయకుడు బలెసోమనాయకుని కొడుకు పెదపామనాయకుడు పెదపామనాయకునకిరువురుకొడుకులు. 1 దేశాయి జక్కభూవిభుడు 2 హుట్టు సోమప్ప నాయకుడు దేశాయి జక్కభూవిభునకు, గడ్డెలింగి నాయకుడు, 2 గడ్డె పిడ్డనాయకుడను ఇరువురు పుత్రులుకలిగిరి (ఇంతవరకున్న రాజులకాలమునుగూర్చిన వివరములు తెలియరావని వంశావళినుడువుచున్నది) గడ్డె పిడ్డనాయకునకు సంతానము కలుగలేదు గడ్డెలింగి నాయకుని పుత్రులు 1 సోమప్ప, 2 అక్కవ్వ, 3 తెడి సోమప్ప, 4 పామనాయక. 5 గులుకసోమప్ప, 6 చిన సోమప్ప, 7 గుడిసోమప్ప అనువారు వీరిలో మూడవవాడగు తెడిసోమప్ప గుడిగుంటకు పోయెను తక్కినవారు తండ్రితో నుండిరి సంతానము కలుగని గడ్డెపిడ్డ నాయకుడు అన్నతో కలహించి కృష్ణాతీరమందలి వీరగొట్టమునకు వలసపోయెను ఈతడు మిల్కి-లితెంపరియై కరికిహాల్లి యనుచోటస్థిరపడిపోయి, అన్నతో పోరాటమారంభించెను కరికిహాల్లికే, వాగినగిరియని పేరు సురపురమునకు మారునంతవరకు ఈ వాగినగిరియే ఏతద్వంశ్యులకు రాజధానిగా నుండెను ముస్లిం చరిత్రకారులీ వాగినగిరిని వాకిన్ ఖేడాయనిరి ఆడలోబుట్టువులు కల్పించుకుని యన్నదమ్ముల కలహములుడిపిరి అన్నగారి నాల్గవకుమారుడైన పామనాయకుని గడ్డెపిడ్డ నాయకుడు పెంచుకొనెను దత్తువచ్చిన పామనాయకుడు వాగినగిరిలో స్థిరపడెను

గడ్డెలింగి నాయకుడును, గడ్డెపిడ్డ నాయకుడును కలిసి సైన్యములను వెనకూర్చుకొని తమ కొడుకులతో దండు వెడలి శహాపురము ఖిల్లేదారు నోడించిరి బీజపుర సుల్తానగు అదిల్షా ఈ నాయకుల నణచుటకై తన సరదార్ల నంపెను వీరిరువురికిని ఎండ్రెండేండ్ల పోరాటము సాగి తుట్టతుదకు క్రీ శ 1664-65 మధ్యకాలములో సంధి కుదిరెను తత్ఫలితముగా సుల్తాను వీరికి కొన్ని ప్రాంతము లీయవలసినవాడయ్యెను వాగినగిరి, శహాపురములను, పాలించి, బహిరీగడ్డె పిడ్డనాయకుడు క్రీ శ 1673 లో మరణించెను అటుతరువాత నాతని దత్తపుత్రుడు బహిరీ పామనాయకుడు పాలకుడయ్యెను కొంతకాలము పేచి సంతానము లేనందున ఆతడు గుడిగుంటకు వలసపోయిన తన మూడవ యన్న తెడిసోమప్పనాయకుని కుమారుడగు పెదపిడ్డనాయకుని దత్తుగొనెను పామనాయకున కొకనాడు గోపాలకృష్ణ విగ్రహమొకటి లభించెను ఆత డద్దానికి ప్రతిష్ఠ యొనర్చి ఆనెగొందిలోనున్న శంఖవరం శ్రీనివాసాచార్యులవలన విశిష్టాద్వైత దీక్ష గొనెను పామనాయకుడు శహాపురమును రాజధానిగా చేసికొనెను ఔరంగజేబు పాదుషా పామనాయకుని పైకి ససైన్యముగా నొక సర్దారును పంపెను పామనాయ

కుడు ఢిల్లీ సైన్యముల కెదురొడ్డి వీరోచితముగా పోరాడి తిరుగుబాటు చేసిన ఢిల్లీ సైన్యముల నోడించెను ఈ కాలమున నాతనికి పుత్రుడు కలిగెను ఈ శిశువునకు చొక్కప్ప నాయకుడని నామకరణ మొనర్చిరి దత్తపుత్రుడైన పెదపిడ్డ నాయకుడును, ఔరసపుత్రుడగు చొక్కప్ప నాయకుడును బహిరీ పామనాయకునకు వారసులైరి పామ నాయకుని బలసాహసములను విని అతని పట్టితెచ్చుటకు ఔరంగజేబు ముప్వురు సైన్యాధికారులను పంపెనట! పామ నాయకుడు ఔరసపుత్రుడైన చొక్కప్పను వాగినగిరియందు ప్రతిష్ఠునిజేసి దత్తపుత్రుడగు పెదపిడ్డనాయకుడును మరికొంత పరివారమును వెంటబెట్టుకొని ఢిల్లీకి పోయెనట ఔరంగజేబు పామనాయకుని సత్కరించి సర్దేశాయి మిరాశీని ప్రసాదించెను. ఢిల్లీనుండి తిరిగి వచ్చునప్పుడు పామనాయకుడొక మహమ్మదీయ శత్రువు కార్య చేసిన మోసమునకు గురియై మరణించెనట

కైఫీయతులలో పామనాయకుని వృత్తాంతము పైవిధముగా నుండ, ఇతర చరిత్రకారుల వ్రాతలు వేరుగా నున్నవి సర్కార్ వ్రాసిన ఔరంగజేబు చరిత్రలో క్రీ శ 1687 నవంబరు మాసమున బిజాపురమునుండియే ఔరంగజేబు సైన్యములను పంపినట్లును పామనాయకుడా సైన్యముల తోడి ఔరంగజేబును దర్శించుటకు బిజాపురమునకు పోయి యచటనే కొన్నాళ్ళకు మరణించినట్లును కలదు ఖాఫీఖాన్ వ్రాతలాధారముగా గొన్న ఇలియట్ డౌన్ చారిత్రకుడు ఈ విషయమున మరియొక తీరుగా వ్రాసినాడు ఔరంగజేబు గోలకొండపై జరిపిన దండయాత్రయందు పామనాయకుడు తానీషాకు సాయముగా తన సేనలను పంపెనట ఇది తెలిసిన ఔరంగజేబు ఖాన్ జాదాఖాన్ అను సర్దారును పామనాయకుని బంధించి తెచ్చుటకు నగరపురమునకు పంపెనట పామనాయకుడు శరణాగతుడై వచ్చి యౌరంగజేబును దర్శించెనట కాని కొలది దినములకే మరల తన నివాసమునకు తిరిగి పోయెనట

పామనాయకుడీవిధముగా పది సంవత్సరములు రాజ్యముచేసి క్రీ శ 1688 లో కాలధర్మము చెందెను అతని దత్తపుత్రుడు, ఔరంగజేబు యొక్క చెరలో నున్నంత కాలము, (రమారమి ఏడేండ్లు) చొక్కప్ప రాజ్యముచేసెను పెదపెద్ది నాయకుడు విముక్తుడై వచ్చి చొక్కప్పను తరిమి రాజ్యమాక్రమించుకొనెను పెదపిడ్డి నాయకుడు ఔరంగజేబు పాదుషా కెదురుతిరిగి కప్పముకట్టుట మానెను అంత ఢిల్లీ సైన్యములు వాగినగిరిని ముట్టడించెను పెదపిడ్డి నాయకుడు హిందూరావు ఘోరపడేయను మహారాష్ట్రవీరుని సాయమున ఢిల్లీ సైన్యములతో మూడునెలలు పోరాడెను ఔరంగజేబు లంచమిచ్చి హిందూరావు ఘోరపడేను తన వైపు త్రిప్పుకొనెను మోసమును గమనించిన పెదపిడ్డి నాయకుడు తన కుటుంబముతో కొలది పరివారముతో వాగినగిరి విడిచి పాలివాడైన లింగినాయకుడు పరిపాలించు గుడిగుంటకు పోయెను ఔరంగజేబు వాగినగిరిని నాశమొనర్చి, గోపాలస్వామి యాలయమును నేలమట్టముచేసి స్వామి విగ్రహమును పెరుగొట్టి యచట నొకమసీదు కట్టించెను (క్రీ శ 1699) దీనికి సాక్ష్యమా మసీదు ద్వారముననున్న పారసీకశాసనము. ఔరంగజేబుకు విధేయులైన ఇతర నాయకులు పెదపిడ్డి నాయకుని లింగినాయకుని బాధించుచునే యుండిరి ఔరంగజేబు మరణానంతరము లింగినాయకుని సాయముతో పెదపిడ్డి నాయకుడు మరల వాగినగిరిని వశము చేసికొనెను పెదపిడ్డి నాయకుడు పీతాంబర నాయకుడను పేరు పెట్టుకొని గోపాలస్వామి యాలయమును పునర్నిర్మించి మహారాష్ట్ర సర్దారుల స్నేహమొనర్చి మొగలాయి దుర్గాధిపతుల ననేకుల నోడించి యఖండ యశము నార్జించెను. కొంతకాలమున కీతడు నిజాంనవాబునకు సామంతుడై నలుబది వేల కిస్తు చెల్లించుచుండెను ఈతడు క్రీ శ 1725 వ సంవత్సరమున మరణించెను

పీతాంబర నాయకుడు బ్రతికియుండగనే యాతని కుమారుడు పామనాయకుడు రాజయ్యెను పామనాయకుడు పూర్వశత్రువును, దేవదుర్గమున కధిపతియునగు వాసుదేవ నాయకుని కూతురు రుక్మమ్మను పెండ్లియాడెను ఈపామ నాయకుడే సురపుర నిర్మాత తొలుత నీతడు వాసనాపురమును విడిదిపట్టుగా చేసికొని తత్ప్రాంత పర్వతభూములందే సురపుర పట్టణమును, కోటలను కట్టించెను తరువాతి రాజులందరికిని సురపురమే రాజధానియైనది వీరి రాజ్యమునకు సాగరమండలమని పేరు ముస్లిం చరిత్రకారులు దీనిని సగరమండలమనిరి, వాగినగిరికూడ దీనియందున్నదే. పామనాయకుడు కూరుడు ఈతడుకూడ నిజాంనవాబుకు కిస్తుచెల్లించుచుండెను తిరుపతి దేవునికి ఏటేట కానుకలంపుచుండెను

ఈతడు 15 సంవత్సరములు రాజ్యమేలి క్రీ॥ శ॥ 1740 లో మరణించెను

పామనాయకునికి పెద్దినాయకుడు, ముండిగై వెంకటప్ప నాయకుడు నను నిరువురు కుమారులు కలిగిరి. పామనాయకుని తరువాత నాతని జ్యేష్ఠపుత్రుడు పెద్దినాయకుడు రాజ్యాధికారియై ఐదుసంవత్సరములు మాత్రము పరిపాలించి నిస్సంతుగా క్రీ॥ శ॥ 1745 లో మరణించెను తరువాత ముండిగై వెంకటప్ప నాయకుడు రాజయ్యెను క్రీ॥ శ॥ 1750 లో నాజర్ జంగ్ పుదుచ్చేరిమీదికి దండెత్తిపోయినపుడు ముండిగై వెంకటప్ప నాయకుడు అతనికి సాయముగా పోయెను అచటినుండి సలాబత్ జంగుతో కలిసి గుత్తి ఆదవాని మీదుగా గోలకొండకు వచ్చి నిజాం మంత్రియగు రాజా రామచంద్రునిచే సత్కృతుడై సురపురమునకు తిరిగిపోయెను ఈతడు కూడ సంతానరహితుడుగానే క్రీ॥ శ॥ 1761 లో మరణించెను

ముండిగై వెంకటప్పనాయకుని తరువాత పీతాంబర నాయకుని పౌత్రుడును, రమణప్పనాయకుని పుత్రుడునునగు మరియొక పామనాయకుడు రాజయ్యెను ఈ పామనాయకుడు విశిష్టాద్వైతమును గ్రహించుటకై కుంభకోణంవద్ది శంఖవరం శ్రీనివాసాచార్య గురుపరంపరలోని మరియొక శ్రీనివాసాచార్యుల నభ్యర్థించెను ఈ శ్రీనివాసాచార్యులు బాలకుడగుటచే నాతని ప్రతినిధులుగా అవుకు సీమనుండి బుక్కపట్టణం అణ్ణయాచార్యులును, అతని సోదరుడు చిన్నయాచార్యులును సురపురమునకు రావింపబడిరి ఈ వైష్ణవ సోదరు లిరువురును గొప్ప పండితకవులు, శాస్త్రాధిక గ్రంథకర్తలు, అణ్ణయాచార్యులవారి కుమారుడే యావద్భారతమున విజయదుందుభులు మ్రోగించిన కిరీటి వెంకటాచార్యులు వారి శుశ్రూషచే పామనాయకుడు విష్ణుభక్తుడగుటయేకాక గొప్ప పండితకవి యయ్యెను ఈతడు తెలుగులో భార్గవపురాణమను ఎనిమిది ఆశ్వాసముల వైష్ణవ ప్రబంధమును రచించెను. ఇది యముద్రితము ఇది వాగినగిరి, సురపురములందు వెలసిన యిలువేలుపు వేణుగోపాలస్వామి కంకితము

దీనిలోన ధట్టీకు సోదించిన వీరి చరిత్రముతోపాటు పామనాయకునకు రాఘవనాయకుడను మారుపేరున్నట్లు తెలియుచున్నది గ్రంథావతారికలో శ్రీరామచంద్ర భక్తుడగు గుహునివంశమున బుట్టిన సురపురాధీశ్వరుల క్రమము పేర్కొనబడినది పామనాయకుడు ఇరువదిరెండు సంవత్సరములు రాజ్యమేలి క్రీ॥ శ॥ 1778 లో కీర్తిశేషుడయ్యెను ఈతనికి తిమ్మాంబ వలన కలిగిన కుమారుడు వెంకటప్పనాయకుడీతని తరువాత సురపురాధీశ్వరుడయ్యెను

వెంకటప్పనాయకునకు నిజాము అలీఖానుడు 'బలవంత బహరీ' 'రోషన్ జంగ్' 'ముసప్ఫర ద్దౌలా,' 'బహారాం ముల్క్' వంటి బిరుదము లిచ్చెను ఈతడు తన మేనమామయొక్క దేవగిరి దుర్గమును జయించి దౌహిత్రుడుగా ఆ రాజ్యమునకు వారసుడయ్యెను ఈ విజయమున నీతనికి నిజామలీఖానుడు మరియు నాతని మంత్రియగు ముషీరుల్ముల్కును తోడ్పడిరి వెంకటప్పనాయకునకు మూడవ భార్యయందు చినవెంకటప్ప నాయకుడు జన్మించెను ఈతనికి బాపుసాహెబ్ అను ముద్దుపేరుండెను ఈతడు ధర్మాత్ముడని పేరుగాంచి, పదునెనిమిదవయేటనే స్వర్గస్థుడయ్యెను వెంకటప్ప రాజ్యకాలముననే (క్రీ॥ శ॥ 1800) రాయలసీమ ప్రాంతములు నిజాంసర్కారుచే బ్రిటిష్ వారికీయబడెను ఈ దత్తమండలములకు మొదటి కలెక్టరుగా మన్రో అనునతడు నియమింపబడెను ఇతడు దత్తమండలములనుండి పెక్కుపాళెగార్లను తరిమివైచెను వారందరును వచ్చి వెంకటప్ప యాశ్రమమున సురపురమున తలదాచికొనిరి వెంకటప్పనాయకు డొకమారు గుడిగుంట నాక్రమించుకొనెను, కాని, గుడిగుంట సోమలింగి నాయకుడు మహారాష్ట్రుల సాయమున మరల తన రాజ్యమును గెలిచికొనెను వెంకటప్పనాయకుడు నిజాంసర్కారుకు బాదామి యుద్ధమున తోడ్పడెను ఈతడు మహారాష్ట్రులకును నిజాంసర్కారునకును కప్పములు చెల్లించుచుండెను ఇరువదియెనిమిదేండ్లు రాజ్యమొనర్చి వెంకటప్పనాయకుడు క్రీ॥ శ॥ 1802 లో మరణించెను

పెదవెంకటప్ప నాయకుని తరువాత అతని భార్య కాటవ్వ నాలుగునెలలు రాజ్యముచేసి తమవంశమునకు చెందిన పిడినాయకునికి పట్టాభిషేకమొనర్చెను ఈపిడి నాయకుని కాలమున సంతఃపుర కలహములు చెలరేగెను ఒకవైపు నిజాంనవాబు, మరియొకవైపు బ్రిటిషు రెసిడెంటు ఇంకొకవైపు మహారాష్ట్రులు కుట్రలువన్ని కలహములు రేపిరి క్రీ॥ శ॥ 1804లో పిడినాయకుడు సురపురమున కేడుమైళ్ళదూరమున నొకవన దుర్గమును నిర్మించుకొని యట స్థావరమేర్పరచుకొనెను ఈతనికిద్దరు కొడుకులు పుట్టిరి బిజాపుర రాజ్య

మండలి తనభూములపన్ను సద్భాగమును గొనుటకై పిడినాయకుడు పోయినతరుణమున బాజీరావు పేష్వా సైన్యములు వచ్చి సురపుర సంస్థానమును దోచికొనెను పిడినాయకుడు నీతిశాలియనియు వదాన్యుడనియు పేరుగాంచెను దత్తమండలములందలి పాళెగార్ల కెందరికో యాశ్రయమిచ్చెను రామాయణ, భారత-భాగవత కాలక్షేపములకై పిడినాయకుడు ఎంతో ధనము వెచ్చించువాడు ఈతడు బ్రాహ్మణుల కనేకాగ్రహారములిచ్చెను ఒకప్పుడు పిడినాయకుడు శ్రావణమాసమున పూనానగరమునకు పోయి 10 000 రూప్యములను బ్రాహ్మణులకు సంభావనగానిచ్చెను నిజాము నవాబునకును, మహారాష్ట్రులకును కప్పము చెల్లించుచుండెను పిడినాయకుడు క్రీ శ 1818 లో కాలధర్మమందెను

అటుతరువాత పిడినాయకుని జ్యేష్ఠపుత్రుడు వెంకటప్ప నాయకుడు పట్టాభిషిక్తుడయ్యెను పట్టాభిషేక సమయమున నీతడు నిజాంనవాబు ప్రధానామాత్యుడైన రాజాచందూలాల్ కు ఏడులక్షల నజరానా ఇచ్చెను ఈతడు కూడ తండ్రివలెనె బ్రాహ్మణ పోషకుడనియు, వదాన్యుడనియు, పేరుగాంచెను ఇతని కాలముననే సురపురరాజుల వంశావళి వ్రాయబడెను. ఇతని కిరువురు భార్యలుండిరి ఇతనికి వారి వలన నేడ్గురు కొడుకులును, ఐదుగురు కూతుండ్రును కలిగిరి

కర్నల్ మన్రో ఇతని కాలముననే మహారాష్ట్రుల క్రిందనున్న బిజాపుర ప్రాంతములను ఆక్రమించుకొని, సురపురాధీశ్వరులకు తత్ప్రాంతభూములనుండి వచ్చురాబడిని ఇంగ్లీషువారికి సంక్రమింపజేసెను ఇతని తరువాత ఇతని జ్యేష్ఠపుత్రుడు కృష్ణప్పనాయకుడు రాజయ్యెను నిజాం సర్కారువారు ఏటేట కప్పమును పెంచుచు సురపురాధీశ్వరుని ఇడుముల పెట్టుచుండిరి

కృష్ణప్పనాయకునకు సంతానము కలుగక పూర్వమాతడు తనతమ్ముడైన పిడినాయకుని కుమారుని దత్తు తీసికొనవలె ననుకొనెను కాని భగవత్కృపవలన నాతని ప్రథమ భార్య ఈశ్వరమ్మ కొకకుమారుడు కలిగెను ఆతనికి వెంకటప్పయని నామకరణముచేసిరి తనకుమారుడు రాజ్యాధికారి యగునను కొన్న పిడినాయకుని ఆశాభంగముకలిగెను ఆతడు బ్రిటిషువారితోకలిసి కుట్రలు పన్నుచుండెను. కృష్ణప్పనాయకుడు హఠాన్మరణమందెను ఏడేండ్లబాలుడైన వెంకటప్ప పక్షమున నాతనితల్లి ఈశ్వరమ్మ రాజ్యముచేయుచుండెను

ఆకాలమున హైదరాబాదులో బ్రిటిషువారి పక్షమున ఫ్రేజరు రెసిడెంటుగా నుండెను బ్రిటిషు వారు పిడినాయకుని రాజ ప్రతినిధిగా నియమింపదలచి ఈశ్వరమ్మనుండి అధికారమును లాగికొనుటకై క్రీ శ 1841 లో కర్నల్ మెడోస్ టెయిలర్ అనునాతని సురపురమునకంపిరి టెయిలర్ తన కార్యమున కృతకృత్యుడయ్యెనుకాని, ఈశ్వరమ్మమాత్రము తనపట్టు విడువక చివరదనుక పోరాడుచునే యుండెను అంతఃపురము వారును, ప్రజలును ఆమెనే బలపరచిరి పిడినాయకుడు రాజ ప్రతినిధిగా చలామణియగుచుండెను ఆతనికొడుకు మాత్రము త్రాగుబోతుగామారి, పనికిరానివాడయ్యెను అప్పుడు టెయిలర్ బాలుడైన వెంకటప్పకే విద్యాబుద్ధులు గరపుచుండెను ఇంతలో పిడినాయకుడు (క్రీ శ 1845) మరణించెను అప్పటినుండి టెయిలర్ రాజప్రతినిధి కార్యమును నిర్వహించుచుండెను క్రీ శ 1850 లో రాజమాతయగు ఈశ్వరమ్మ మరల సురపురము చేరుకొనెను క్రీ శ 1853లో తన 18 వ ఏట వెంకటప్ప పట్టాభిషిక్తుడు కావలసియుండెను టెయిలరు బ్రిటిషువారి ఏజెంటుగా సురపురమున నుండ నిశ్చయమయ్యెను కాని ఆతనికగు వ్యయాధిక్యమును సంస్థానము భరించుస్థితిలో లేనందున నాతడు తిరిగిపోవలసి వచ్చెను క్రీ శ 1853లో ఫ్రేజరుస్థానమున కర్నల్ లో యను నాతడు హైదరాబాదులో రెసిడెంటుగా వచ్చెను ఆ సంవత్సరమే ఈశ్వరమ్మ మరణించెను క్రీ శ 1858 లో వెంకటప్ప పట్టాభిషిక్తుడయ్యెను క్రీ శ 1857-58 మధ్యకాలమున యావద్భారతమున జరిగినవిప్లవమున వెంకటప్పనాయకుడు బ్రిటిషువారినెదిరించెను బ్రిటిషు సైన్యము లాతని బంధించెను మరణదండన విధించి వెంకటప్పనాయకుని సికింద్రాబాదు కారాగారముననుంచిరి సురపురమున బ్రిటిషు ఏజంటుగా మరల టెయిలరు నియుక్తుడయ్యెను ఆతడు తోక్యము కల్పించుకొనుటవలన పునర్విచారణ జరిపి వెంకటప్పనాయకునకు ఐదేండ్ల కారాగారశిక్ష విధించి రాయవేలూరు జైలుకు పంపించిరి కాని మహాభిమానియు, వీరుడునగు వెంకటప్ప మార్గమధ్యమున ఆత్మహత్య చేసికొనెను ఇంతటితో సురపురాధీశ్వరులచరిత్ర ముగిసెను ఆవంశీయులెందరో వారసులుగా నున్నను, సురపురమును, వారికి దక్కనీయక బ్రిటిషువారు 1858 విప్లవమున తమకుచేసిన సాయమునకై నిజామునకు సురపుర సంస్థానమును (క్రీ శ 1861) బహుమతిగానొసగిరి

పూర్వపు హైదరాబాదు సంస్థానమందలి రాయచూరు, గుల్బర్గా జిల్లాలలో సురపుర సంస్థానము కలదు మైసోయొను ఈ సుర పురమును బ్రిటిషువారు షోరాపురమని పిలిచి చరిత్రమునం దటులే పేర్కొనిరి.

బి రా

## బేయర్, ఎడాల్ఫ్‌ఫాన్ (1835-1917)

జోహన్ ఫ్రీడ్రిక్ విల్ హెల్మ్ ఎడాల్ఫ్‌బేయర్ అను పండితుడు 1835 అక్టోబరు 31 వ తేదీన బెర్లిన్ నగరములో జన్మించెను. చిన్నవయస్సునందే అతడు ప్రకృతిని అన్వేషించి అవగాహన చేసికొనవలెనని అభిలషించెడివాడు. ఈ అభి లాష విశేషముగా రసాయనశాస్త్రమునందు అతని జీవితాంతము వరకుండెడిది. స్టాక్‌హార్ట్ రచించిన "స్కూల్ ఆఫ్ కెమిస్ట్రీ" అను గ్రంథమును ఇతని తండ్రి ఈతనికి తొమ్మి దవ యేటనే బహూకరించినాడు. ఈతడొక చిన్న ప్రయోగ శాలను తన ఇంటియందే నిర్మించుకొని పైన పేర్కొనిన గ్రంథమందలి ప్రయోగముల నన్నిటిని స్వయముగా చేసెడి వాడు. పన్నెండు సంవత్సరముల వయస్సప్పుడు కాపర్ కార్బొనేటు, సోడియం కార్బొనేటుల సంయుక్త లవణమును $(C_1Co_3Na_2Co_3 3H_2o)$ మొదటిసారిగా ఇతడు తయారు గావించెను.

బేయరు తన పదునెనిమిదవ సంవత్సర ప్రాయము వరకు షెల్‌బాక్ వద్ద గణితశాస్త్రమును, భౌతికశాస్త్రమును అభ్య సించెను. తరువాత రెండు సంవత్సరముల కాలములో వృక్ష శాస్త్రమును భూగర్భశాస్త్రమును అధ్యయన మొనర్చెను. కాని సైనిక శిక్షణమందు అతడు గడిపినయినప్పటికి అతని అభిరుచి రసాయన శాస్త్రము మీదికి మరలెను. ఆ తరుణములో బెర్లిను నగరమందు రసాయన శాస్త్రములో శిక్షణనిచ్చు ప్రయోగ శాల లేనందున 1856 వ సంవత్సరములో బున్సెన్ వద్ద విద్య నభ్యసించుటకు అతడు హైడెల్‌బర్గుకు వెళ్లెను. అచ్చట వాతడు కెకులే అనువానియొద్ద ప్రథమ శిష్యుడై అతని ఇంటిలోని చిన్న ప్రయోగశాలలో అతనితో కలిసి కృషి సల్పెను. అక్కడ అపాయకరమైన ఆర్సెనిక్ మోనో మిథైల్ క్లోరైడుపై ప్రయోగములు జరుపునప్పుడు, ఒకసారి అతడు తెలివితప్పి, ప్రాణహానినుండి బయటపడుట సంభవించెను. ఈ కృషిఫలితముగా బేయరుకు "డాక్టరు" పట్టము లభించెను.

1860 లో బెర్లిన్ నగరమందలి గెవెర్బె ఇన్‌స్టి ట్యూటులో కర్బన, రసాయన శాస్త్రోపాధ్యాయ పదవి బేయరుకు లభించెను. అక్కడ ప్రధానముగా యూరికామ్లము మీద దాని వ్యుత్పత్తులమీద, 1905 లో అతనికి నోబెల్ బహుమానమును సంపాదించి పెట్టిన నీలిమందుమీద అతడు కృషి జరపెను. ఈ సంస్థయందే ఉత్సాహులు సూక్ష్మ గ్రాహులు, శ్రద్ధాళువులునైన లీబర్‌మన్, విక్టర్ మేయర్ ప్రభృతులు అతని విద్యార్థులుగా ఆకర్షింపబడిరి. తరువాత క్రొత్తగా స్థాపింపబడిన స్ట్రాస్‌బర్గు విశ్వవిద్యాలయములో 1872 నుండి 1875 వరకు అతడు పనిచేసెను. అచ్చటనేయున్న ప్రఖ్యాత శాస్త్రవేత్త ఎమిల్‌ఫిషర్ అనువాతడు బేయరు వద్ద శాస్త్రాభ్యాస మొనర్చెను. 1875 లో మ్యూనిక్ నగర మందు లీబిగ్ అను పండితుడు ఆచార్య పదవినుండి విరమిం పగా, అతని స్థానములో బేయరు తన అంత్యదశయందు ప్రవే శించి కార్యభారమును నిర్వహించెను.

యూరికామ్లముమీద $(C_5 H_4 N_4 O_3)$, దాని వ్యుత్ప త్తులమీద బేయరు పరిశోధనములు చేసి, ఈ అమ్లములో మూడు కర్బన పరమాణువులు ప్రత్యక్షముగా కలిసి యున్న వనియు, దాని వ్యుత్పత్తులలో చాలవరకు యూరియా సంయోగములే అనియు బేయరు నిరూపించెను. అయితే అతని కృషియందు నీలిమందును సంయోగ విధానములచే తయారు చేయుట అత్యంత ప్రధానమైనది. 1870 లో ఇసటిన్ క్లోరైడునుండియు, 1880 లో ఆర్థోనైట్రో ప్రొపియోలి కామ్లమునుండియు నీలిమందును అతడు తయారు చేసి యుండెను. కాని 1882 లో ఆర్థోనైట్రో బెంజాల్డిహైడ్, ఎసిటోనులనుండి నీలిమందును చేయుట ఒక ఘనవిజయముగా పరిగణింపబడినది. నెఫ్తలీనును సల్ఫ్యూరికామ్లముతో ఆక్సీక రించుటకు మెర్క్యురిక్ సల్ఫేటు ఉత్ప్రేరకముగా ఉపయోగ పడునని బేయరు దైవికముగా కనుగొనెను. నెఫ్తలీనును సల్ఫ్యూరికామ్లముతో వేడిచేయునపుడు ప్రమాదవశాత్తు ఉష్ణమాపకము పగిలి అందులోని పాదరసము ఆమ్లములో పడుటయు, నెఫ్తలీను థాలికామ్లముగా ఆక్సీకరింపబడుటయు బేయరు గమనించెను. ఈ సంఘటనము కాకతాళీయము కాదనియు, పాదరసము ఆమ్లముతో ప్రతిక్రియ నొందగా ఏర్పడిన మెర్క్యురిక్ సల్ఫేటు ఆక్సీకరణ ప్రతిక్రియకు ఉత్ప్రేరకముగా ఉపయోగించిన దనియు, బేయరు గ్రహిం చెను. ఈ పరిశోధనము వలన నీలిమందు యొక్క నిర్మితి

వాతడు స్థిరపరుప గల్గెను. పైన పేర్కొనిన విధానములను అనుసరింపక పోయినను, బేయరు కృషి నాధారముగా చేసి కొని, కోల్‌తారునందు లభించు నెఫ్తలీనునుండి నీలిమందును ఉత్పత్తిచేయు పరిశ్రమ 1897 లో నెలకొల్ప బడెను పరిశ్రమలపైన, వ్యవసాయముపైన దీని ప్రభావము ప్రపంచ వ్యాప్తమయ్యెను భారత దేశములో నీలిమందు వ్యవసాయమునకు కొన్ని లక్షల ఎకరముల భూమి పూర్వముపయోగింప బడుచుండెడిది 19 వ శతాబ్దాంతమున ఈ వ్యవసాయము దెబ్బతిని, రానురాను పూర్తిగా నశించెను

ఆకుపచ్చని ఆకులయందుండు పత్రహరితము సూర్యకాంతిని గ్రహించి, ఉత్ప్రేరకముగా వ్యవహరించుచు కార్బానికామ్లమును ఫార్మాల్డిహైడుగు క్షయీకరించుననియు, ఈ విధముగా తయారైన ఫార్మాల్డిహైడు అణువులు వాటితో కలిసి చక్కెరలను తయారు చేయుననియు (ఈ ప్రక్రియ కిరణజన్య సంయోగ మనబడును). 1970 లో బేయరు సూచించెను

చక్రీయ పేంఫిన్ యౌగికముల యొక్క స్థైర్య పరిస్థితులను వివరించుటకు బేయరు 'స్ట్రెయిన్' లేక 'బిగి' సిద్ధాంతమును 1885 లో ప్రతిపాదించెను సహజస్థితిలో కర్బన పరమాణువుయొక్క ఏ రెండు యోజనీయతల నడుమ నైనను కోణము 109°-28′ ఉండును కాని చక్రీయ యౌగికము లేర్పడినపుడు ఆ రెండు యోజనీయతలు, వాటి సహజదిశనుండి మరలును అప్పుడా యౌగికములలో ఒక 'బిగి' యేర్పడి, ఆ యౌగికముల సులభ విచ్ఛేదనమునకు, చురుకుదనమునకు కారణభూత మగును వలయము లోని కర్బన పరమాణువుల సంఖ్య ఎక్కువైనకొలది, ఈ బిగి తగ్గి 5 పరమాణువులున్న వలయములో అది దాదాపు శూన్యమగుననియు, అందుచే అట్టి యౌగికము స్థిరమైనదగుననియు బేయరు విశదీకరించెను

కెకులే పండితుడు ప్రతిపాదించిన బెంజీను నిర్మాణమునందలి లోపమును సరిచేయు యత్నములో బెంజీను వలయమందలి కర్బన పరమాణువుల నాల్గవ యోజనీయతా బంధములు వలయ కేంద్రమువైపు తిరిగి యుండునని బేయరు సూచించెను

బేయరు చేసిన పరిశోధనములు కర్బన రసాయన యౌగికముల విశ్లేషణ, సంయోజన పద్ధతులను అభివృద్ధి పరచుటయే కాక, రాసాయనిక పరిశ్రమాభివృద్ధి కెంతయో తోడ్పడినవి బేయరు, సిద్ధాంతములను గురించి ఊహాగానములు చేయక, ప్రయోగములమీద ఆధారపడు రసాయన శాస్త్రవేత్తగా ప్రఖ్యాతి కెక్కెను

కృత్రిమముగా నీలిమందును తయారు చేయుటకై బేయరు సల్పిన కృషికి ఫలితముగా, 1905 లో అతనికి "నోబెల్" బహుమానము లభించెను

ఎస్ బి వి కృ

## బేరెంట్స్‌విల్లెం :

బేరెంట్స్ అనునతడొక డచ్ నావికుడు ఈయన హాలెండులో పదునారవశతాబ్ది మధ్యభాగమునందు పుట్టెను, చిన్నతనము నుండియు సముద్రయానమునకు అలవాటుపడిన వాడగుటచేత, బేరెంట్స్ నావికావృత్తిని సంతోష పురస్సరముగ చేపట్టెను

తూర్పు ఆసియాతో వ్యాపార సంబంధము లేర్పరచుకొనుటకు ఉత్సహించిన కొందరు డచ్‌వారు ఎన్నిసార్లు ప్రయత్నించినను, ఆర్కిటిక్ మహాసముద్రపు మార్గమును కనుగొనలేకపోయిరి ఎందరో నావికులు కూడా ఈ విషయములో ప్రయత్నములు సలిపి విఫలులయిరి ఇట్లు విఫలులగుటకు కారణము ఉత్తరధ్రువమువద్ద ఆర్కిటిక్ మహాసముద్రము సంవత్సరములో చాలభాగము మంచుగడ్డగా మారి, ఓడల రాకపోకలకు అంతరాయము కలిగించుచుండుటయే.

తూర్పు ఆసియాకు దగ్గిరమార్గమును ఆర్కిటిక్ మహాసముద్రము ద్వారా కనుగొనినవారికి సముచితమైన పారితోషిక మొసగబడునని డచ్ ప్రభుత్వమువారుచేసిన ప్రకటనమును బేరెంట్స్ విని అత్యుత్సాహముతో ముందునకు వచ్చెను రెండు ఓడలతో తనను తుదివరకు అనుసరించుటకు సిద్ధముగానున్న సహచరులతో ఆతడు ఆంస్టర్‌డామ్ నగరము నుండి బయలుదేరెను వాతావరణము తనకు అనుకూలముగా లేకపోయినను, ఆతడు ముందునకు పోసాగెను తుదకు ఆతడు ఆర్కిటిక్ మహాసముద్రములోని నోవయా జెమ్లియాదీవుల పశ్చిమతీరమునకు చేరగల్గెను అక్కడనుండి ఆయన ముందునకు పోలేకపోయెను. సముద్రమంతయు మంచుగడ్డలతో నిండియుండుటచేత ఆతని ఓడలు అక్కడే ఆగిపోవలసి వచ్చెను. వేసవికాలము వచ్చునంతవరకు బేరెంట్స్ తన సహచరులతో ఆ దీవులమీద కాలము వెళ్ళబుచ్చక తప్పినదికాదు వెంట

తీసికొనిపోయిన ఆహారపదార్థములు తగ్గిపోవుచుండినను, బేరెంట్స్ తన ధైర్యమును మాత్రము సడలనీయలేదు చిత్త స్థైర్యముతో, లక్ష్యశుద్ధితో ఆయన ముందునకు పోవుటకు ప్రయత్నించెను కాని సహచరులు ఆయనను అనుసరించుటకు నిరాకరించిరి ఒకవైపు ప్రకృతికూడా తనపట్ల ప్రాతికూల్యమును అగపరచుచుండుటచేత చేయునదిలేక బేరెంట్స్ హాలెండ్ కు తిరిగివచ్చెను ఆయన ప్రథమ ప్రయత్నము 1594లో ఈవిధముగా విఫలమయ్యెను

ఉక్కుగుండెగల బేరెంట్స్ నిరుత్సాహమును చెందక 1595లో మరొకసారి ప్రయత్నము సలిపెను ఈసారి బేరెంట్స్ ఏడు ఓడలతో బయలుదేరి ఆసియాఖండపు అంచునకును వాగ్యాచ్ ద్వీపమునకును మధ్యగానున్న సముద్రపు పాయలోనికి ప్రవేశింప గలిగెను. ఆ పాయ కొంతవరకే వెళ్ళి ఆగిపోవుటచేత బేరెంట్స్ ముందునకు పోవుటకు అవకాశము లేక వెనుకకు తిరిగి రావలసినవాడాయెను

'యశోవా మృత్యుర్వా' అను పట్టుదలతో బేరెంట్స్ మూడవసారి కర్మరంగములోనికి దిగెను ఈసారి అతడు తన రెండు ఓడలతో వెళ్ళెను పూర్వము తాను చేరిన భూభాగముకంటె మరికొంత దూరముపోయి, బేరెంట్స్ ఆసియా ఖండపు అంచునకు మరికొంత దగ్గరగానున్న బేర్ ద్వీపమును, 'స్పిట్జ్ బర్గెన్'ను చూడగలిగెను 'స్పిట్జ్ బర్గెన్' అనునది కొన్ని చిన్నదీవుల కూటమి

బేరెంట్స్‌ను పూర్వపు సమస్యయే తిరిగిఎదుర్కొనెను మంచుగడ్డగా మారిన జలభాగములో ఆయనకు ముందుకు పోవుటకు అవకాశము లేకపోయెను అప్పుడు అతని అనుచరులు ఓడలను అక్కడవదలి కప్పులేని చిన్నపడవలలో 'యూరోపు ఖండ భూభాగమునుచేరి ప్రాణములతో బయటపడగలిగిరి సముద్ర మధ్యమున చిక్కుకొనిన బేరెంట్స్ ఎంత ప్రయత్నించినను తనప్రాణములను దక్కించుకొనలేకపోయెను 1597 జూన్ 20వ తేదీన ఆయన మృతినందెను

కొంతకాలమైనపిమ్మట బేరెంట్సు నివసించు గృహమును డచ్ ప్రభుత్వమువారు కనుగొని అందువెదుకగా ఆయన తన అనుభవములను పొందుపరచిన ఒక 'జర్నల్' దొరకెను దానితోపాటు బేరెంట్స్ సేకరించిన వింతవస్తువులు కూడా లభించెను ఆ నావికుడు సృష్టించిన 'చరిత్ర' స్మృతి చిహ్నములుగా హేగ్ నగరములో అతని 'జర్నలు'ను ఇతర వస్తువులను భద్రపరుపబడినవి

నోవయా జెమ్లియాదీవులకు దగ్గరగానున్న సముద్రపు జలభాగమునకు 'బేరెంట్స్ సీ' అని పేరుపెట్టబడెను ఇది నావికులకు ఒక గొప్ప యాత్రాస్థలముగ రూపొందెను

ఇం వేం

## బేస్‌బాల్

ఈ ఆట అమెరికనుల జాతీయక్రీడగా పరిగణింపబడుచున్నది అమెరికను మిషనరీ పాఠశాలలలోను, కళాశాలలలోను ప్రధానాచార్యుల ప్రోత్సాహముచే ఈ ఆట పాతిక సంవత్సరములకు పూర్వము ఆడబడుచుండెడిది ఈ క్రీడ భారతదేశమునందు పాఠశాలలలోగాని, కళాశాలలో గాని ప్రస్తుతము ప్రచారమునందు లేదు ఈ ఆటయందలి వివరము లిట్లున్నవి ఈ ఆటస్థలము 90 అడుగుల చదరము కలిగియుండును. ఈ చదరమునందలి నాలుగు కొనలను నాలుగు బేసులనెదరు. ఈ చదరము డైమండ్ ఆకారము కలిగి, తెల్లని గీతలతో గుర్తుపెట్టబడును వివరములకు ఈ క్రింది పటమును చూడుడు

చిత్రము 108




ఈ ఆటయందు పాల్గొను జట్టులలో, జట్టు ఒక్కంటికి తొమ్మిదిమంది ఆటగాండ్రు ఉందురు ఏజట్టు ప్రథమమున బ్యాటుచేయవలెనో 'టాస్'ను ఎగురవేయుట మూలముగా నిర్ణయింపబడును రెండవ జట్టువారు 'ఫీల్డ్' చేయుదురు అనగా ఈ ఆటకూడ క్రికెట్ ఆటను పోలియుండును కాని ఇందు నిర్ణీతమైన క్రీడాస్థల పరిమాణము చిన్నదిగ నుండును అయిదు లేక అయిదుంబావు ఔన్సుల బరువు, తొమ్మిది లేక తొమ్మిదింబావు అంగుళముల చుట్టుకొలతగల కార్క్

(బెండు) - రబ్బరులతో చేయబడిన బంతిని ఈ ఆటయందు ఉపయోగింతురు హోమ్ బేస్ తో మొదటి బ్యాట్స్‌మన్ ఆటను ప్రారంభించును అతని బేసుకు ఎదురుగా డైమండ్ మధ్యనుండి బంతిని విసరువాడు నిలిచియుండును అతడు విసరిన బంతిని బ్యాట్స్‌మన్ కొట్టి, పరుగెత్త నారంభించును బ్యాట్స్‌మన్ వెనుక, క్రికెట్ ఆటలోని వికెట్ కీపర్ వలె, విసరిన బంతిని పట్టుకొనువాడొకడు నిలిచియుండును వీరిద్దరు కాక, జట్టులోనున్న మరి ఏడుగురు బేసువద్ద, బేసుమధ్య, నిలబడి ఫీల్డింగు చేయుదురు బంతిని కొట్టినవాడు, తాను బంతిని కొట్టిన దూరమునుబట్టి, హోమ్‌బేస్ నుండి బయలు దేరి, అన్ని బేసులను చుట్టిరావచ్చును లేదా, ఏదియో ఒక బేసులో ఆగి బ్యాట్స్‌మన్ కొట్టిన వైనమునుచూచి పిదప బేసువైపుకు పరుగెత్తుట కారంభించవచ్చును ఒక బ్యాట్స్‌మన్ హోమ్ బేసునుండి బయలుదేరి, మరల హోమ్‌బేసును చేరినచో, ఒకపరుగు సాధించినట్లగును ఈలోగా బేసువద్ద, బేసు నడుమ బ్యాట్స్‌మన్ ఉండగా, ఫీల్డరు తాను విసరిన బంతితో, బ్యాట్స్‌మన్ చేరబోవు బేసును, తాకించినచో, బ్యాట్స్‌మన్ ఓడిపోయినట్లు పరిగణింపబడును బ్యాటింగు జట్టు పూర్తిగా ఓడిపోగానే, ఫీల్డుచేసిన జట్టు బ్యాట్ చేయును. ఏజట్టు ఎక్కువ పరుగులు సాధించునో ఆజట్టు గెలిచినట్లగును

ఈ ఆట అమెరికాదేశమునకే పరిమితమై యున్నది కాని, ప్రపంచవ్యాప్తి పొంది అంతర్జాతీయ క్రీడగా గణుతి కెక్కలేదు ఈనాటి ఒలింపిక్ ఆటలలో కూడ దీనికి స్థానము లేదు

కె న.

## బొజ్జన్న కొండ .

ఆంధ్రప్రదేశమందు దర్శనీయమైన ప్రముఖ పురాతన బౌద్ధక్షేత్రములలో బొజ్జన్నకొండ ఒకటి ఇది విశాఖ మండలము నందలి అనకాపల్లి రైలుస్టేషనున కెదురుగా షుమారు రెండుమైళ్ళ దూరమున "శంఖరము" అను చిన్నగ్రామమునకు సమీపమున నున్నది ఈ గ్రామమునకు ఉత్తరమున మిక్కిలి సమీపములో తూర్పు పడమరలుగా రెండు కొండలు వ్యాపించియున్నవి ఈ రెండు కొండలు ఒకదానితో నొకటి కలసియున్నవి తూర్పుభాగమునగల కొండకు 'బొజ్జన్న కొండ'యనియు పడమటిభాగమునగల కొండకు 'లింగాల మెట్ట' యనియు పేర్లు ఈ రెండుకొండలు షుమారు 28 ఎకరములభూమి నాక్రమించియున్నవి ఒకానొకప్పుడు ఈ రెండు కొండల నంటుకొని 'శారదానది' ఉత్తరదిశగా ప్రవహించుచుండెడిదట! ఈ రెండు కొండలపైన క్రీ పూ 1, 2, శతాబ్దములనాటి బౌద్ధగుహాలయములు, శిలాచైత్యములు, విహారములు, పెక్కులు ఇతరకట్టడములు ప్రేక్షకుల నేత్రపర్వ మొనర్చుచుండును

నేడిచ్చట 'శంఖరము'అని వ్యవహరింపబడుచున్న ఒక చిన్నగ్రామము ఒకానొకప్పుడు గొప్ప బౌద్ధసంఘారామమై యుండెడిదట అనాడు బౌద్ధభిక్షువులు నివసించుచున్న స్థలములకు సంఘారామములని వ్యవహరించుచుండిరి అచ్చటగల బొజ్జన్నకొండపైన పెక్కు సంఘారామము లుండెడివి ఆ సంఘారామములే కాలక్రమమున 'శంఖరము' అను గ్రామరూపము దాల్చి యుండవచ్చునని చరిత్రకారుల యూహ అట్లే బౌద్ధవిగ్రహములతో కళకళలాడుచుండిన ఆ కొండయొక్క 'బుద్ధన్నకొండ' అను అనాటి నామము సైతము వికృతినొంది బొజ్జన్నకొండగా' మారియుండ వచ్చును ఆ ప్రాంతమునందు 'బుద్ధాం' అను గృహనామము గలవారెందరో మనకు గన్పించుచున్నారు

పడమటివరుస కొండయైన లింగాలమెట్టను అంటి యున్న ఈ బొజ్జన్న కొండమీద రెండువరుసలగుహాలున్నవి క్రిందినుండి ఆ గుహలవద్దకు పోవుటకు ఒక పెద్ద మెట్లవరుస యున్నది అట్లే తూర్పునుండి కొండపైకి పోవుటకు వేరొక మెట్లవరుస యున్నది ఈ కొండకు క్రిందిభాగమునందు 'హారతి' యను పేరుగల ఒక వింతయైన పెద్దస్త్రీ విగ్రహము ఆరుబయట నిలబెట్టబడి యున్నది ఆ విగ్రహము తలపైన పొడుగుగా ఒక కిరీటమున్నది ఎడమకాలు సగమునకు మడిచి, కుడికాలు క్రిందికి చాచియున్నది ఎడమతొడపైన ఒకశిశువు గలదు ఆస్త్రీ ఆ శిశువును తన ఎడమచేతితో పట్టుకొని యున్నట్లు అవిగ్రహము మలచబడియున్నది దక్షిణహస్తము అభయ ముద్రాంకితమై యున్నది శిరస్సునకిరువైపుల శిశు విగ్రహములున్నవి ఈ స్త్రీ విగ్రహమునకు ఉభయపార్శ్వములయందు ఇరువురు స్త్రీలు, చామరహస్తలై నిలచి యున్నారు ఆ అపురూపమైనస్త్రీ విగ్రహమును ఆ ప్రాంతపు ప్రజలు 'పిల్లలకోడి' యని పిలుచుచుందురు 'పూర్వము ఈ విగ్రహరూపములో నున్నశక్తి, చంటిపిల్లలను ఎత్తుకొని పోయి తినుచు ఆ ప్రాంతస్థులను బాధించుచుండెడి'దని ఒక

వింత ఐతిహ్యమును చెప్పుచున్నారు. ఆప్రాంతస్త్రీలు నేటికిని ఆ విగ్రహముపై రాళ్లు రువ్వుచుందురు. సమీపమునగల మట్టి దిబ్బలను త్రవ్వుచుండగా ఆ విగ్రహము బయల్పడినదట!

బొజ్జన్న కొండపైనను, లింగాల మెట్టపైనను విశ్వవిఖ్యాతమైన బౌద్ధమహాతీర్థమొకటి నిర్మింపబడి యున్నది. అందు పెక్కు విహారములు, చైత్యాలయములు, గుహాలయములు నిర్మింపబడి యున్నవి. వాటి వివరములిట్లున్నవి.

ఒకటవగుహ: ఇది బొజ్జన్నకొండ పడమటి అంచున నున్న పెద్దగుహ. కొండలో 21 అడుగుల పొడవు 8 అడుగుల వెడల్పుగల భాగమును చెక్కి చతురస్రమును ఏర్పరచిరి. ఈ చతురస్రమునకు ఎడమవైపున, దక్షిణముఖముగా, ఒక కొండయున్నది. ఆ కొండలో ఒక చైత్యాలయము మలచబడినది. ఆ గుహాముఖమునకు కుడివైపునగల కొండయందును, ద్వారబంధమునకు పైనను రెండు అర్ధచంద్రాకారములుగల గూళ్ళున్నవి. వాటికిరువైపులయందు ఒక జంతువును, ధ్యానస్థితుడగు ఒక బుద్ధుని ప్రతిమయు చెక్కబడియున్నవి. ద్వారబంధముల కిరువైపుల 12½ అడుగుల ఎత్తుగల ద్వారపాలకుల విగ్రహములున్నవి. అవి మిక్కిలి మోటుగానున్నవి. ఆద్వారమునకు వెనుక 31¼ అడుగుల పొడవు, 34 అడుగుల వెడల్పు, 8¼ అడుగుల ఎత్తుగల చావడి యొకటియున్నది. దానిలో వరుసకు నాలుగునంతున, నాలుగువరుసల స్తంభములున్నవి. ఆ స్తంభముల మూలములు చతురస్రములుగను, పై భాగములు పలకలుగను, అగ్రములు చతురస్రములుగను మలచబడియున్నవి. మధ్యగల రెండు స్తంభములమీద చామరవాహకుల విగ్రహములు చెక్కబడియున్నవి. దీని మధ్యనొక చైత్యమున్నది. దీనికి అడుగుభాగమున ఒక చతురస్రవేదిక యున్నది. వీటి అన్నిటి వాస్తులక్షణములనుబట్టియు, పనితనమందలి మోటుతనమునుబట్టియు ఇదిమిక్కిలి ప్రాచీనమైన చైత్యాలయమైనట్లు మనకు విశదమగుచున్నది.

రెండవ గుహ: ఈ రెండవగుహ, మొదటిగుహపైన తొలచబడియున్నది. దీనిపైకి పోవుటకు సన్నని మెట్లవరుస యున్నది. ఈ గుహ మొదటిగుహపై అంచుకంటెను 8 అడుగుల లోపలికి నిర్మింపబడియున్నది. దీని ప్రవేశద్వారము 6¾ అడుగుల ఎత్తు, 5 అడుగుల వెడల్పుననున్నది. దీనిపైన 7 అడుగుల ఎత్తుగల చైత్యవాతాయనమొకటి యున్నది. అందు ప్రశాంతధ్యాన మగ్నుడైన బుద్ధదేవుని విగ్రహమున్నది. ఆ విగ్రహమునకు ఇరువైపులయందు భక్తుల విగ్రహములును, పైన యక్షుల బొమ్మలును చెక్కబడియున్నవి. ద్వారమునకుకుడివైపున ఒకగూడున్నది. అందునిలచియున్న బుద్ధుని విగ్రహమును, అతని కిరువైపుల బౌద్ధభక్తుల విగ్రహములును చెక్కబడినవి. ఆ ద్వారమునకు వెనుక 15 అడుగుల పొడవు, 6 అడుగుల వెడల్పును గల వసారా ఒకటి యున్నది. ఆవసారా యొక్క ఎడమ గోడమీద పద్మముపైన ధ్యానమగ్నుడై కూర్చొనియుండిన తథాగతుని విగ్రహమును, దానికిరువైపుల చామరవాహక విగ్రహములును చెక్కబడినవి. కుడివైపుగల గోడమీద ధ్యానమగ్నుడైన శాక్యముని యొక్క పెద్ద విగ్రహమున్నది. ఆ విగ్రహమునకు కుడివైపున ఒక స్తూపమున్నది. వసారావెనుకగల గోడమీద ఎడమవైపునుండి ధ్యానమగ్నుడైన బుద్ధదేవుని ప్రతిమలు వరుసగా చెక్కబడియున్నవి. ఈ వసారా వెనుకగల చావడి వెనుక గోడలో ఒక పెద్దగూడు, ఆ గూడులో ధ్యానమగ్నుడైన బుద్ధుని విగ్రహము చెక్కబడియున్నవి. ఆ బుద్ధ విగ్రహమున కిరువైపుల చామరవాహక విగ్రహములు గలవు. ఆ చావడి కిరువైపులగల గోడలలో వరుసగా తథాగతుని బొమ్మలు చెక్కబడియున్నవి. వాటిలో ఒకబొమ్మ కిరీటమును ధరించి, ఎడమచేత అభయముద్రను దాల్చియున్నది. ఈ బుద్ధ విగ్రహము మిక్కిలి మనోహరమై ప్రజల నాకర్షించుచున్నది. ఆ గుహయొక్క గోడలలో ఎటుచూచినను శాంతమూర్తి శాక్యదేవుని రూపశిల్పము చూపరులకు ఆనందమును కలిగించుచుండును.

మూడవగుహ: ఆగుహ, కొండపైనగల రెండవగుహ మీదనొక సమతల ప్రదేశమందున్నది. దానిపొడవు 7 అడుగులు, వెడల్పు 6 అడుగులు, ఎత్తు 6 అడుగులు. ఈ గుహకు గల వెనుకగోడలలో నున్న గూడునందు ధ్యానస్థిత బుద్ధుని మరొక విగ్రహము మలచబడియున్నది.

నాలుగవగుహ: బొజ్జన్నకొండ పై భాగమునగల ఏకశిలానిర్మిత చైత్యమునకు పశ్చిమోత్తరముగా నున్న కొండవాలులో ఈగుహయున్నది. ఇది మిక్కిలి చిన్నది. దీని ద్వారమున కెడమవైపునగల గూడుమీద రెండు బుద్ధుని బొమ్మలున్నవి. ఈ గుహకు వెనుకభాగమున ఒక వసారా యున్నది. దీనివెనుక గోడపైన సైతము ధ్యానమగ్నుడగు బుద్ధుని చిత్రములవరుస యున్నది.

**అయిదవ గుహ** ఇది నాలుగవ గుహకు సమీపమున నున్నది దీనికి గల చావడి వెనుక గోడమీద మధ్యభాగమున ధ్యానమగ్నుడైన బుద్ధదేవుని విగ్రహ మున్నది ఆ విగ్రహమున కిరువైపుల ద్వారపాలకులు గలరు కుడిప్రక్కన గల గోడపైనగూడా ధ్యానస్థితుడైన బుద్ధునియొక్క విగ్రహమున్నది ఎడమవైపున ఒక నాగునిబొమ్మయు కుడివైపున సింహపు బొమ్మయు కలవు

**ఆరవ గుహ** ఈ గుహ నాలుగవ, అయిదవ గుహలకు ఎడమభాగమం దున్నది ఇందు ఎట్టి శిల్పాలంకరణ ములును లేవు

**ఏడవ గుహ** పైన వివరించిన ఆరు గుహలును బొజ్జన్న కొండపై నున్నవి ఈ గుహమాత్రము లింగాల గుట్టమీద నున్నది ఈ కొండ పడమటి భాగమును అసలు కొండనుండి కొంత వేరుచేసి, ఆ రాతిలో రెండు పెద్ద స్తూపములను చెక్కిరి వీటికి సమీపమునను, కొండ పడమటి ముఖము నందును ఈ గుహ యున్నది దీని పొడవు 11 అడుగులు, వెడల్పు 8½ అడుగులు, ఎత్తు 8½ అడుగులు ఇది స్తంభములు లేని చావడి లోపల మూడువైపుల గోడలకు ఒక చిన్న అరుగు ఉన్నది చావడిమధ్య 4 అడుగుల వ్యాసము గల ఒక చైత్యమున్నది

పైన వివరించిన 7 గుహాలయముల అంతర్భాగము వెలుగు లేకపోయినను, అంత చీకటిగా మాత్ర ముండదు ఎటు చూచినను ఒక విచిత్రమైన శాంతి జ్యోతి వెలుగు చున్నట్లు మనకు గోచర మగుచుండును మన మనస్సు నిర్మలమై పోయి ఒక విధమైన ప్రశాంతత పర్వడుసు

**మహాచైత్యము** బొజ్జన్నకొండ శిఖరము పైభాగ మంతయు చదును చేయబడి యున్నది ఈ భాగమంతయు పెద్ద విశాలమైన రాతిచప్టావలె మనకు గన్పించు చుండును దీని పొడవు 116 అడుగులు, వెడల్పు 28 అడుగులు ఈ భాగ మంతయు కొండకు అడ్డముగా ఉత్తర దక్షిణములకు వ్యాపించి యున్నది దీనిపైన చిన్నవియు, పెద్దవియు దాదాపు 64 చైత్యములు కొండరాతిలో చెక్కబడి యున్నవి వీటిలో అన్నిటికన్న పెద్దచైత్యముయొక్క వ్యాసము 10½ అడుగులును, అన్నిటి కన్న చిన్నచైత్యముయొక్క వ్యాసము 2 అడుగులునునై యున్నది ఈ చప్టా స్థలమునకు ఉత్తర దక్షిణములయందు 128 అడుగుల ఎత్తు 46 అడుగుల వెడల్పుగల రాతి స్తంభము లున్నవి ఉత్తరపు చివర 7 అడుగుల చతురముగల ఇటుక కట్టడ మున్నది దానికి నాలుగువైపుల నాలుగు శిలా చైత్యము లున్నవి చప్టా భాగమునకు తూర్పున, ఉత్తర దక్షిణములుగా పెద్ద గోడను కొండలోనే తొలిచియుండిరి ఆ గోడకు ఉత్తరపు చివరయందు 6 అడుగుల వ్యాసముగల శిలాచైత్య మున్నది దీనిపైని హార్మికా ఛత్రమున్నది రాతిగోడయందు మరియొక చైత్యముగూడ చెక్కబడినది

'ఈ చప్టా ప్రదేశమునకు పడమటి భాగమునందు 78½' పొడవును 70½ అడుగుల వెడల్పును, 12' ఎత్తునుగల ఒక దిమ్మ యున్నది దీనిపైన ఒక మహాచైత్యము కొండ రాతితో తొలచబడి యున్నది దీని వేదిక వ్యాసము 84'-8"లు దీనిచుట్టును ఇటుకగోడ యున్నది ఈ వేదికమీద 80'-8" ల వ్యాసముగల అండమున్నది దీనిపైన హార్మికాఛత్రమున్నట్లు కొన్ని ఆనవాళ్ళు మనకు గన్పించుచున్నవి ఈ వేదిక పైకి పోవుటకు మెట్లున్నవి దీని ప్రాగుత్తరములయందు ఒక చావడియు, దానికి వెనుక ఒక గదియు నున్నవి ఈ మహా చైత్యమునకు పడమటి దిశయందును దక్షిణ దిశయందును పెక్కు శిలాచైత్యము లున్నవి అవన్నియు వరుసలు వరుసలుగా నుండి చూచుటకు మిక్కిలి సొగసుగా నుండును ఇచ్చట చైత్యాన్వితిగల కొన్ని అవశేష పాత్రలును, ఇతర వస్తువులును లభించినవి ఈ మహాచైత్యమునకు తూర్పున మరి నాలుగు శిలాచైత్యము లున్నవి ఈ ప్రాంతముననే పూర్వమొక బౌద్ధ మహా విద్యాపీఠ ముండియున్నట్లు ప్రతీతి యున్నది ఈ మహాచైత్యమున్న ప్రాంతమునుండి మనము ఎటు చూచినను సౌందర్యదేవతా సాక్షాత్కారమును పొంద గలము

**చైత్యగృహము** ఈ చైత్యగృహము బొజ్జన్న కొండపైన తూర్పు భాగమందున్నది ఇది, మహాచైత్యము తరువాత, చాల ముఖ్యమైనది ఇచ్చటి దృశ్యములు చూచుటకు మిక్కిలి ఇంపుగా నుండును ఈ భాగము 164 అడుగుల పొడవును 73 అడుగుల వెడల్పును గలిగి యున్నది దీని గోడల మందము 4 అడుగులు లోపలి భాగమున ఒక రాతి తిన్నె, దానిమధ్య ఒక విగ్రహము ఉన్న ఆనవాళ్ళు మనకు గన్పించు చుండును

**విహారములు** పైన తెలిపిన చైత్యగృహమునకు పడమటి దిశయందు 44½'ల పొడవును, 80'ల వెడల్పును గల

ఒక చావడి యున్నది ఆ చావడికి ఉత్తర దక్షిణముల యందును, పడమటి భాగమందును పెక్కు గదులు వరుసగా నిర్మింపబడి యున్నవి పడమటి చివర పెద్ద ద్వారమున్నది దాని కిరువైపులను రెండు చైత్యగృహము లున్నవి దానికి క్రిందిభాగమున మరియొక గదుల వరుస గలదు వీటిమధ్య ఒక శిలాచైత్యము మిక్కిలి రమణీయముగా మలచబడి యున్నది పై విధముగనే మహాచైత్యమునకు తూర్పు భాగమున 9 గదులును, దక్షిణ భాగమున 22 గదులును ఉన్నవి ఈ గుహాభాగములు గల కొండయొక్క ఎగువ భాగమునకును, మహాచైత్యమున్న కొండయొక్క దిగువ భాగమునకును మధ్యగల కొండను అనేక అంతరువులుగా చెక్కియుండిరి ఈ అంతరువులలో మహాచైత్యమునకు అన్ని వైపులయందును చిన్నచిన్న గదుల వరుసలు చెక్కబడి యున్నవి వీటి కెదురుగా అక్కడక్కడ శిలాచైత్యములును, ఇటుకలతో నిర్మించిన చైత్యములును, పెక్కులు మనకు నేత్రానంద కరముగా గన్పించు చుండును

లింగాలమెట్ట గొట్టిన్న కొండతో కలిసి పెనవేసికొని యున్న లింగాల మెట్టయందు పైతము అనేక శిలాచైత్యములు కొండరాతిలో తొలచబడి యున్నవి అట్లే ఈ లింగాల మెట్ట పర్వతాగ్రపు తూర్పుభాగమునందు ఇట్టి శిలాచైత్యములు వందలకొలది నిర్మింపబడి యున్నవి ఇవన్నియు అతిలోక రమణీయములై శిల్పనైపుణ్యముతో నొప్పారు చుండును ఈ పర్వత శిఖరపు పడమటి భాగమందు గల సమతల ప్రదేశమందు 58 శిలాచైత్యములు రెండు వరుసలలో తొలచబడి యున్నవి వీటికి పై భాగమున ఒకదాని ప్రక్కన మరియొకటి గల 8 వరుసలలో 200 చైత్య గృహములు తొలచబడి యున్నవి వీటికి దక్షిణముగా మరి కొన్ని వందల చైత్యము లున్నవి. ఇవన్నియు వివిధ స్థలములయందు, వివిధ విధములుగా నిర్మింపబడియుండి చూపరులకు నేత్రపర్వ మొనర్చుచున్నవి ఈ చైత్యగృహము లన్నియు దూరమునుండి చూచినచో లింగాకారముతో కన్పించుటచే, దీనికి లింగాలమెట్ట యని పేరిడిరేమో!

మరిమూడు చైత్యములు పైన తెలిపిన చైత్యములకు పడమటగల కొండ నిట్టనిలువుగా కోసివేయబడినది. ఆ కోసి వేయబడిన కొండకు ఎల తూర్పుభాగమున ఒక గుహ తొలచబడినది అచ్చట ఒకదారి నిర్మింపబడియున్నది ఆదారికి పడమట 65 అడుగుల చతురముగల ప్రదేశమునందు ఒక ప్రచండమైన కొండరాయి పెద్ద చైత్యమువలె చెక్కబడి యున్నది దానికి పడమటగల ప్రదక్షిణ మార్గమునకు తూర్పున గల కొండరాతిలో ఒకగుహ నిర్మింపబడి యున్నది ఈ గుహ కెదురుగను, మార్గమునకు పడమరగను, వేరొక పెద్దచైత్యము నిర్మింపబడినది దీనికి పడమట యందు మరియొక పెద్ద చైత్యము తొలచబడినది దానిఎత్తు 26'లు ఆ చైత్యమునకు పడమటి భాగమందు మరియొక చైత్యము చెక్కబడినది

ఈ విధముగా లింగాలమెట్ట పర్వత అగ్రభాగము పైతము మూడు పెద్ద చైత్యములుగను, కొన్నివందల చిన్న చైత్యములుగను చెక్కబడి అపురూపమైన శిల్పకళాసంపదతో విలసిల్లుచున్నది

ఆంధ్రదేశమున బౌద్ధమతము ప్రవర్ధమాన మగుచున్న కాలమున ఈ గొట్టిన్నకొండ, లింగాల మెట్టల ప్రాంతమంతయు చక్కని వసతులతో నిండియుండి, బౌద్ధభిక్షువుల తోను పెక్కు మంది విదేశయాత్రికులతోను కళకళలాడు చుండిన గొప్ప సంఘారామమై యుండెనట!

ఈ ప్రాంతములయందు బౌద్ధశిథిలముల పరిశోధనము జరగినప్పుడు అపురూపమైన అనేక ప్రాచీన వస్తువులును, బంగారు, రాగి, సీసపు నాణెములును, అనేక ప్రాచీన ముద్రికలును, పూసల బరిణలును, భిక్షాపాత్రలును, లభించినవి వాటిలో క్రీ శ నాలుగవ శతాబ్దమున భారతదేశమును అవక్ర పరాక్రమముతో పరిపాలించిన గుప్త సామ్రాట్టగు సముద్రగుప్తుని కాలమునాటి బంగారు నాణెములును, ఆంధ్ర మహాసామ్రాజ్యమును పాలించిన వేంగిచాళుక్యరాజగు విష్ణు వర్ధనుని కాలపు రాగినాణెములును, సాతవాహన సామ్రాట్టుల గుఱ్ఱపు ముద్రగల సీసపు నాణెములును అందు ముఖ్యముగా పేర్కొనదగినవి అచ్చట లభించిన ముద్రికలలో కొన్ని ముక్కోణములు, మరికొన్ని చతురస్రములు, వేరొక కొన్ని కోడిగుడ్డు ఆకారయుతములునునై యున్నవి వాటియందు కొన్నిటిపైన క్రీ శ. 4, 5, 6, 7 శతాబ్దములనాటి లిపు లున్నవి ఇవిమాత్రమేగాక, మట్టితో చేయబడిన 186 ముద్రికలు గూడా లభించినవి ఇంతేగాక పెక్కు రకములయిన పనిముట్లు, కంచుదీపపుసెమ్మెలు, శంఖవలయములు, మట్టితో

చేసిన ఆభరణములు, పూసలు, కడుఖ్ళు, మనుష్యుల యొక్కయు, వివిధరకముల జంతువులయొక్కయు బొమ్మలు, స్ఫటికములు, భిక్షాపాత్రములు, స్తంభములు, కుండలు, చైత్యఛత్రములు అనేక భంగిమలలోగల బుద్ధ విగ్రహములు లభించినవి

ఈ బౌద్ధమహాక్షేత్ర నిర్మాణమునందు ఉపయోగించిన ఇటికల పరిణామము ననుసరించి ఈ కట్టడములు క్రీస్తు శకారంభమునకు ముందునాటివని ఈ ప్రాంతమును పరిశోధించిన అలగ్జాండరు రీ గారు భావించియుండిరి అంతేగాక ఇక్కడ తొలచబడిన శిలా చైత్యములు, గుహలు అశోక చక్రవర్తి కాలమునాటివని, అనగా క్రీ పూ 4వ శతాబ్దము నాటివని వారు తమ అభిప్రాయమును వెలిబుచ్చి యుండిరి అంతేగాక క్రీస్తు శకారంభమున ఈ చైత్యాలయములకు చలువరాతి పలకలను మలచి పెక్కు బుద్ధ విగ్రహములను, లతాగుల్మములను చెక్కి వాటిని సర్వాలంకార శోభితముల గావించిరనియు, వారు తలచియుండిరి అదియునుగాక మహాయన బౌద్ధమతము, ఆంధ్రదేశములో విరివిగా ప్రచార మందున్న కాలములోనే, ఈ గుహానిర్మాణములు సాగియుండి నట్లు వారు భావించిరి

కాని ఈనాటి పరిశోధకులు దీనిని విశ్వసించుట లేదు ఈ కొండలపైన నిర్మాణములలో ఉపయోగించిన ఇటికల వంటి ఇటికలనే ఆంధ్రదేశమందలి పెక్కు యితర బౌద్ధకళా ఖండముల నిర్మాణమందు కూడ ఉపయోగించియుండుటచేత ఇవన్నియు క్రీ పూ 3, 2, శతాబ్దములనాటివని వారు భావించిరి

పైన తెలిపిన ఆధారముల ననుసరించి ఈ బొజ్జన్న కొండలపైనగల బౌద్ధ నిర్మాణములు క్రీ పూ 1టవ శతాబ్ది నుండి క్రీ శ 2వ శతాబ్ది వరకుగల మూడువందల సంవత్సరముల మధ్యకాలములో నిర్మింపబడినవని తెలియుచున్నవి

ఇచ్చటి పరిశోధనలలో లభించిన సముద్రగుప్త సామ్రాట్టు నాణెము ననుసరించి ఈ బౌద్ధకళా కేంద్రము క్రీ శకము నాలుగవ శతాబ్దివరకు మిక్కిలి ఉన్నతస్థితిలో, మూడుపూవులు ఆరుకాయలుగా వర్ధిల్లినట్లును, ఆ తరువాత వచ్చిన కళింగ, గాంగ, చాళుక్యరాజులు వైదిక మతావలంబులై బ్రాహ్మణ మతమును విరివిగా ఆదరించి పోషించినను, ఇతర మతములను గూడా, వారు సమాదరించుటచేత, ఆకాలములో, అవి కొంతవరకు వర్ధిల్లినను ఆ తరువాత అనగా క్రీ శ 7వ శతాబ్దికి పిమ్మట వచ్చిన ప్రభువులచేతను, ప్రజలచేతను అనాదరమును పొంది క్రమముగా అవి క్షీణించి పోయినవని చారిత్రకులు భావించుచున్నారు

ఈ బొజ్జన్న కొండయందలి పరాయిని పరిశోధించినను, పచెట్టును పరిశీలించినను అది బౌద్ధకళా విధానముకలదై, పతీవకళలో, నవనవోన్మేషముతో వర్ధిల్లుచు, పూర్వాంధ్ర వైభవమును, ఆనాటి బౌద్ధశిల్పుల అపురూపమైన కళావమత్కృతిని, వారి నిస్వార్థకళారాధనను, ప్రకృతి సౌందర్యారాధనను, మనకు వేయివిధముల ప్రదర్శించుచుండును

వు వెం

## బొబ్బిలి :

ఆంధ్రప్రదేశమునకు ఉత్తరమున కల శ్రీకాకుళము జిల్లాలో బొబ్బిలి పట్టణము 18°34' ఉ అ, 83°25' తూ రే వద్ద నున్నది వ్యవసాయానుకూలమగు మైదాన ప్రదేశమున విరాజిల్లు ఈ పట్టణము ఆంధ్రులకు ఉత్తేజమును కలిగించు వీరగాథల స్మారకమై వెలయుచున్నది. పుర వైశాల్యము 7 88 చ కి మీటర్లు 1961 సంవత్సర జనాభా 35,593

బొబ్బిలి సంస్థానమునకు ఇది రాజధాని; మూడువందల ఏండ్లలో రెండుసార్లు ఇది నిర్మింప బడినది యుద్ధములో నేల మట్టమయిన కోట శిథిలములు, నందాపురాధీశుల కాలము నాటి (15.17 శతాబ్దములు) సహగమనపు రాయి చిత్రకూటాద్రి ముఖమున నింకొక సహగమనపురాయి భైరిసాగరము, చరిత్రగతిలో మిగిలిన ప్రాత బొబ్బిలి గ్రామమును మృతవీరుల స్మారకార్థము నిర్మింపబడిన యుద్ధస్తంభము, శాంద్ర పావయ్యచావడి, బొబ్బిలి చిక్కవరం, కిర్లంపూడి జమీందారుల కోటలు, పూలవనములు, వేణుగోపాలస్వామి ఆలయము, నేత్రపర్వమగు శిల్పనైపుణిని ప్రకటించు అతిథి గృహము-ఈ పురమున దర్శింప దగినది

బొబ్బిలిలో ప్రభుత్వ కార్యాలయములు, స్వచ్ఛంద సేవాసంస్థలు, కళాశాల, శతవత్సరములు నిండిన బహుళార్థ సాధకపాఠశాల, స్త్రీల ఆసుపత్రి, వైద్యశాలలు కలవు 1932వ సంవత్సరములో చక్కెరమిల్లు నిర్మింపబడినదాది ఈ ప్రాంతము సత్వరముగ ఆర్థికాభివృద్ధి నొందెను బొబ్బిలి పురము జనపనార, వేరుసెనగ వరిధాన్యములకు వాణిజ్య కేంద్రము

విశాఖపట్నం-రాయపూరు రైలుమార్గమున 1908సం॥ బొబ్బిలిలో రైలుస్టేసను నెలకొల్పబడెను బొబ్బిలినుండి సాలూరు వరకు ప్రత్యేక రైలుమార్గము వేయుటతో ఈ రైలు కూడలి, ఏజన్సీ ప్రాంతమునకు కీలక రవాణా కేంద్రముగా రూపొందెను బొబ్బిలినుండి అన్నివైపులకును రోడ్లు, ప్రయాణించువారికి మోటారు రవాణా సౌకర్యములు కలవు

సంస్థాన చరిత్ర వది నేడవ శతాబ్దమునగో గోల్కొండ రాజ్యములోని ఉత్తర సర్కారులలో దూరప్రాంతమైన శ్రీకాకుళము, సర్కారు అరాజక పరిస్థితులకు లోనై, అస్పష్టమైన పొలిమేరలతో, బందిపోట్ల ఆగడములతో, అశాంతియుత పరిస్థితులలో నుండెను అందుచే గోల్కొండ నవాబు క్రీ॥ శ॥ 1652లో షేర్ మహమ్మదుఖాను అను ఫౌజదారుని ఆ ప్రాంతమునందు నియోగించెను షేర్ మహమ్మదుఖాను శ్రీకాకుళము సర్కారులో సుస్థిర ప్రభుత్వమును నెలకొల్పెను ఈ కార్యమున తనకు సహాయపడి, తనను అనుసరించి వచ్చిన పూసపాటి మాధవవర్మకు కుమిలి, భోగాపురం మాన్యములను పెదరాయడు అను పద్మనాయక వీరునకు రాజాంపరగణాను, ఫౌజుదారు బహూకరించెను కాలక్రమమున ఈ రెండు మాన్యములును విజయనగర, బొబ్బిలి సంస్థానములుగా పరిణమించెను

ఆంధ్ర వాఙ్మయమున బొబ్బిలి వీరగాథను స్మరించు గ్రంథము లున్నవి కాని బొబ్బిలి చరిత్ర మాత్రము అసమగ్రముగనే ఉన్నది ఈ సంస్థానమునకు మూలపురుషుడు ధర్మారావు అని కొందరును పెదరాయడప్ప అని మరికొందరును చెప్పుచున్నారు కాని "బొబ్బిలి సంస్థానాధిపతుల చారిత్రము" అను పరిశోధక గ్రంథమును వ్రాసిన మహారాజా సర్ వేంకట శ్వేతాచలపతి రంగారావు, పెదరాయడప్పయే సంస్థానమునకు మూలపురుషుడని నిర్ధరించెను

ఈ సంస్థానమునకు తొలుత రాజాము ముఖ్యపట్టణము. పెదరాయడప్ప కుమారుడైన లింగప్ప కాలమున ఈ సంస్థానము పెంపొందెను షేర్ మహమ్మదుఖాను లింగప్పకు 12 "పోటు" గ్రామములనిచ్చి, "పాదుషా"చే 'రాజా' యను బిరుదును, ఢంకా నౌబత్తుల నిప్పించెను వంశపారంపర్యముగ నుండునట్లు "రంగారావు" అను బిరుదనామము నొసంగెను. ఈ విధముగా రాజాము సంస్థానము పశ్చిమమున ఉత్తరామిల్లి, తెర్లాం గ్రామముల వరకును వాయవ్యదిశయందు, వంతరాం నారాయణపురముల వరకును వ్యాప్తి చెందెను

పై ప్రాంతమునకు ఇంకను పడమటిదిక్కున నుండు బొబ్బిలి, సీతానగరము మండలములు ఈ సంస్థానమునకు ఎట్లు సంక్రమించెనను విషయము బొబ్బిలి చరిత్రలోని చీకటి కోణములలో నొకటి

కుమార నిద్యాధరసింగ్ దేవు "నందాపూర్" అను గ్రంథములో క్రీ॥ శ॥ 1669 నుండి 1673 వరకు నందాపురమును పాలించిన కృష్ణదేవు, అనేక మొఖాసాలను సృజించెననియు, వాటిలో బొబ్బిలి మొఖాసాను నవాబు ఆలీచ్ బేగ్ ఖాన్ అనువానికి ఇచ్చెననియు, కొన్ని ఏండ్లపిదప ఆ నవాబు కోరికపై అతని అనుయాయుడగు "రంగారావు"నకు బొబ్బిలి మొఖాసా బదిలీ చేయబడెననియు వ్రాసెను ఇట్లు ఏర్పడిన బొబ్బిలి మొఖాసాను రాజాము సంస్థానముతో మేళవించుటతో, ఈ పెద్ద రాజ్యము, పూసపాటి వంశజులగు విజయనగరమువారికి ప్రక్కలో బల్లెముగ తయారయ్యెను నందాపుర రాజ్యములోని చిత్రకూట పర్వతపుకనుమకు అనతిదూరమున, భైరిసాగరమునకు దక్షిణపు గట్టుపై, బొబ్బిలికోటను పద్మనాయకులు నిర్మించుకొనిరి ఈ కోటకు బొబ్బిలి యను నామము ఎట్లువచ్చెనో తెలియదు అది మునుపటి నుండి యున్న గ్రామమేయై యుండవచ్చును కాని షేర్ మహమ్మదుఖానుపై తమకుగల విశ్వాసమును ప్రకటించుచు, పద్మనాయకులు దానికి షేర్ ఖాన్ పేరున (షేర్ అనగా "బెబ్బులి") పేరిడిరనియు కాలక్రమమున "బెబ్బులి" బొబ్బిలిగా వ్యవహరింపబడుచు వచ్చినట్లు కార్మైకేల్ వ్రాసిన విశాఖపట్నం మాన్యుయల్‌లో నున్నది - పురనిర్మాణము జరిగినపిదప, కొలది ఏండ్లలో "బెబ్బులి"యను నామము "బొబ్బిలి"గా మారెననుట సందేహాస్పదముగ నున్నది ఈ మార్పు భాషాశాస్త్ర దృష్ట్యా సమంజసమనిపించదు

పెదరాయడప్ప, లింగప్పల తరువాత లింగప్ప దత్తు చేసికొనిన వెంగళ రంగారావు, తదనంతరము రంగపతి రంగారావు, రాయడప్ప, పరిపాలకులైరి క్రీ॥ శ॥ 1757లో గోపాలకృష్ణ రంగారావు కాలమున సుప్రసిద్ధమైన బొబ్బిలి యుద్ధము జరిగెను పౌరుష మూర్తియగు నాతడు యుద్ధముచేయుచు, వీరస్వర్గము నలంకరించెను కోటలోని, స్త్రీలు, పురుషులు ప్రాణములను త్యజించిరి ప్రాణములతో మిగిలిన వెంగళ

రావును బాలుడగు వెంకటరంగారావునకు సంరక్షకునిగా నియమించి, వేంకటరంగారావునకు రాజ్యమునిచ్చి ఫ్రెంచివారు మరలిపోయిరి. విజయనగరమువారి ప్రభావము ఇనుమడించెను. వారు పసిబాలుని వేంకటరంగారావును నిర్బంధించిరి. కొన్నాళ్ళకు ఆతడు నిర్బంధమునుండి తప్పించుకొని, క్రీ. శ. 1796 లో రాజ్యమును మరల పొంది, పూర్వపు కోట యున్న చోటికి, ఒక మైలుదూరమున క్రొత్తగా ఒక కోటను, పురమును, నిర్మింపించెను. అదియే నేటి బొబ్బిలి. క్రీ. శ. 1801వ సంవత్సరమున బ్రిటిషు ప్రభుత్వమువారు రాజా రాయడప్ప రంగారావునకు బొబ్బిలిని శాశ్వతకౌలున కిచ్చి, సాలునకు అతడు తమకు ఎనిమిదివేల బ్రిటిషుపౌనులు పేష్కసుగా చెల్లించునట్లు ఏర్పాటుచేసిరి.

వేంకటరంగారావు దత్తుడుగ స్వీకారముచేసిన రాయడప్ప, పిదప శ్వేతాచలపతి, అనంతరము దత్తుడగు సీతారామకృష్ణ రాయడప్ప, వరుసగా బొబ్బిలి సంస్థానమును, ప్రజానురంజకముగ పాలించి, ప్రజలకు అనేక సౌకర్యముల నొసగూర్చిరి.

సీతారామకృష్ణ రాయడప్పగారు అస్తమించినపిదప ఇరువది యేండ్లు రాణీ లక్ష్మీచెల్లమాంబ అసమాన ప్రతిభతో రాజ్యము ఏలెను. సంస్థానము నేలిన ఏకైకమహిళ ఈ రాణి.

రాణికి దత్తపుత్రుడగు వేంకట శ్వేతాచలపతి సంస్థానమును అనేకవిధముల అభివృద్ధి నొందించెను. అతడు దొరతనము వారి మన్ననలనంది "సర్", "మహారాజా" బిరుదములను పొందెను. అతడు కవిపండితుల సన్మానించి, తానును గ్రంథములను రచించెను. అనేక కట్టడములకు, సంస్థలకు ఆయన పోషకుడై వరలెను. బొబ్బిలి చరిత్రను ఇతడు స్వయముగా వ్రాసెను.

అతనిపిదప వేంకటకుమార కృష్ణరంగారావు బొబ్బిలి సంస్థానమును పాలించెను. తండ్రి అకాలమున మరణమొందుటచే శ్వేతాచలపతి రామకృష్ణరంగారావు పిన్నవయసుననే రాజ్యమునకు వచ్చెను. ఇతడు 31 సంవత్సరముల ప్రాయమున మదరాసు రాష్ట్రమునకు ముఖ్యమంత్రియై పరిపాలనాదక్షుడని పేరుపొందెను. ఇతడు భారతదేశమున ప్రఖ్యాతి చెందిన పరిపాలకుడు. ఇతడు అనేక పరిశ్రమలను నెలకొల్పెను. వ్యవసాయమున ఆధునాతన పద్ధతుల నమలుపరచెను. క్రీ. శ. 1949 లో సంస్థానమును ప్రభుత్వమువారు "జమీందారీల రద్దుచట్టము" ననుసరించి రద్దు చేసినను నేటికిని రాజమర్యాదలను, సిబ్బందిని పోషించుచు రావువారి వంశగౌరవమును నిశ్చలముగ నిలుపుచున్న ఈ రాజు చరితార్థుడు.

బొబ్బిలి సంస్థానమున ఆశుకవియు, శతక రచయితయు నగు మండపాక పార్వతీశ్వర శాస్త్రియు, గురజాడ శ్రీరామమూర్తియు, ప్రసిద్ధి పొందిన పండితులు. హరికథాబ్రహ్మ ఆదిభట్ల నారాయణదాసు బొబ్బిలి తాలూకాలోని అజ్జాడలో జన్మించెను.

**యుద్ధము**: భారత యుద్ధమునకు కెనవచ్చునని దిట్టకవి నారాయణకవిచే వర్ణింపబడిన "బొబ్బిలి యుద్ధము" ఆంధ్రుల అభిమాన పాత్రమయిన వీరగాథ. దీనిని గురించి ప్రబంధములు, కావ్య నాటకాదులును, బుర్రకథలును, తంబుర పాటలును కలవు. ఈ యుద్ధము క్రీ. శ. 1757 లో జరిగినది. అప్పుడు రాజా గోపాలకృష్ణ రంగారావు బహద్దరువారు బొబ్బిలి సంస్థానాధిపతులుగా నుండిరి.

యుద్ధజ్వాలలు ఎగసినది రెండుపూటలు మాత్రమే కాని విరోధాగ్ని అనేక తరములుగ రాజుచుండెను. బొబ్బిలిలోని వెలమవారికిని, విజయనగరపు క్షత్రియులకును కక్షలు వంశపారంపర్యముగ వచ్చుచుండెను. పొలిమేర తగవులు, జలాశయములను గూర్చిన వివాదములు పరస్పర సంఘర్షణములకు తరచుగ దారితీయుచుండెను. రాజాము సంస్థానాధీశ్వరులు బొబ్బిలి కోటను కట్టుకొనగా, కుమిలి-భోగాపురముల పూసపాటి వంశజులు విజయనగరము కోటను కట్టిరి. బొబ్బిలి ఉత్తరపుదిక్కున జెలగాము కోటను బలపరచి, నందాపుర రాజులకడ బొబ్బిలివారి పలుకుబడిని తగ్గించుటకు ప్రయత్నించిరి. వెలమవారు శత్రుకూటమిని చేరి, మహారాష్ట్రుల నాహ్వానించి, విజయనగరమును కొల్లగొట్టించిన పరాభవము పూసపాటి విజయరామరాజు గుండెను రాయి చేసెను. ఫ్రెంచి సేనానియగు బుస్సీకిగూడ బొబ్బిలి రాజుపై ఆగ్రహము వచ్చుటకు కారణము గలదు. ఒకసారి అతని సిబ్బంది బొబ్బిలి రాజ్యము మీదుగా పోవలసి వచ్చెను - బొబ్బిలివారి అనుమతితో బుస్సీ పంపిన సిబ్బందిని మార్గమధ్యమున పొరబాటున నిరోధించి, ముప్పదిమందిని బొబ్బిలివారు వధించిరి. ఈ పొరపాటును బుస్సీ క్షమించలేకపోయెను. ఆ వలలోనున్న బుస్సీకి మునుపు విజయరామరాజు సహాయ

పడుటయు, అంచముగొన్న దుబాసి లక్ష్మన్న, దివాను హైదరుజంగులు అతనిని ప్రోత్సహించుటయు, జమీలందరికి సంస్థానాధిపతులందరును రాజమహేంద్రవరము వచ్చినను రంగారావు రాకపోయె నను అసంతృప్తియు బుస్సీని యుద్ధమునకు పురికొల్పెను

ఫ్రెంచివారిపై తమకు గౌరవ భయభక్తులు లోపించలేదనియు, పన్నుల బకాయి ఉంచలేదనియు, తమపై కినుక వహింపతగదనియు నివేదించుటకు, గోపాలకృష్ణ రంగారావు, వకీలు పంతెన బుచ్చన్నను రాజమహేంద్రవరమునకు పంపెను పంతెన బుచ్చన్న రాజీప్రయత్నములను బుస్సీ త్రోసిపుచ్చి, వెలమవారిని బొబ్బిలికోట విడిచి పొమ్మని, హైదరుజంగుచే లేఖ వ్రాయించెను రాజీప్రయత్నము విడువక, బొబ్బిలిరాజు దామెర ధర్మారావును, పిదప చెలికాని వెంకయ్యను వరుసగా రాయబారమునకు పంపెను తుదకు యుద్ధము తథ్యమగుటచే, శత్రువుల శరణువేడుటకు బదులు వీరస్వర్గమే తమకు శరణ్యమని బొబ్బిలివారు నిర్ణయించుకొనిరి

శత్రుసైన్యమున 11,000 విజయనగరపు బలము, 250 మంది అశ్వికులు గల మొత్తము, 750 మంది ఐరోపీయను సైన్యము, నాలుగు పెద్ద ఫిరంగులు కలవు-బొబ్బిలి కోటలో ఆయుధహస్తుల సంఖ్య 250 మంది మాత్రమే-ఇంత తక్కువ బలగముతో యుద్ధమునకు ఢీకొన్న బొబ్బిలివారి శౌర్యము ప్రశంసనీయము

యుద్ధము క్రీ శ 1767 వ సంవత్సరము జనవరి 24 వ తేదీ ప్రాతఃకాలమున ప్రారంభమై అపరాహ్ణకాలమున ముగిసెను-ఫిరంగి కాల్పులకు కోట బురుజులు, గోడలు పగులుచున్నను, ఉదయము తొమ్మిది గంటలవరకు బొబ్బిలివారు పరాక్రమముతో దుర్గమును రక్షించిరి తమకు లొంగిపోయినచో పోరు నిలుపుదుమని ఫ్రెంచివారు అనేకసార్లు సంజ్ఞలు చేయుచు, అవకాశములను గల్పించిరి బుస్సీ కొంత తడవు యుద్ధమును ఆపుచేసెను

గోపాలకృష్ణ రంగారావు తన కోటలోని అంతఃపుర కాంతల మానరక్షణము, ప్రాణరక్షణకంటె ముఖ్యమని ఎంచి, స్త్రీలను, పిల్లలను అగ్నికి ఆహుతిచేసి, ప్రాణములను రక్షించుకొన జూచువారిని నిర్దాక్షిణ్యముగ నరకునట్లు ఆజ్ఞయిచ్చెను స్త్రీల మానమును ఈ విధముగ సంరక్షించిన పిదప బొబ్బిలి రాజు తన అనుయాయులతో వీరస్వర్గమునలంకరించెను

ఒక వృద్ధుడు సిన్నవయస్కుడగు రాజకుమారుని రక్షించెను ఆ బాలుడే వేంకట రంగారావు బుస్సీ అతనికి రాజ్యమును తిరుగ ఇచ్చి అతనికి సంరక్షకునిగా గాయములతో మిగిలిన వెంగళరావును నియమించెను

యుద్ధము జరిగిన మూడవనాటి అర్ధరాత్రి సమయమున ముగ్గురు వీరులు విజయరామరాజు డేరాలో ప్రవేశించి అతనిని చంపి, తాము ప్రాణములను గోల్పోయిరి. వారి నాయకుడు పరాక్రమశాలియగు తాండ్రపాపయ్య అని అందురు

బొబ్బిలి యుద్ధమున సాటిలేని శౌర్యము జూపిన గోపాలకృష్ణ రంగారావు, ప్రాణములిచ్చి మానము రక్షించుకొన్న రాణి మల్లమ్మదేవి, శత్రువు తెగటార్చి కక్ష సాధించిన తాండ్రపాపయ్య, ఆంధ్రుల స్మృతులలో ఆచంద్రతారార్కము నిలచియుందురు

డి రా ప

## బొమ్మల పరిశ్రమ

మానవజాతి ఎంత పురాతనమైనదో బొమ్మలు, ఆటవస్తువులు కూడ అంత పురాతనమైనవి ఆయా దేశముల భౌతిక పరిసరములపైన, సాంఘిక, ఆర్థిక సంప్రదాయములపైన, ఆర్థికజీవనముపైన అచ్చట లభించు ముడిసామగ్రిపైన, పరికరములపైన, బొమ్మల పరిశ్రమ ఆధారపడును. గతించిన ఏబదేండ్ల కాలము బొమ్మల పరిశ్రమకు స్వర్ణయుగమని చెప్పవచ్చును ఆ కాలములో బాలబాలికలు తమ వ్యక్తిత్వమును ప్రకటింప గల్గిరి పిల్లలయొక్క శరీర భావనా బలములు, జ్ఞాపకశక్తి పెంపొందవలె నన్నచో, ఆటలు, ఆటవస్తువులు, ఆటబొమ్మలు అవసరమని ప్రసిద్ధ విద్యావేత్తలగు ఫ్రోబెల్, మాంటిసోరీ, అనువారు వక్కాణించిరి. అభివృద్ధి చెందిన దేశములందలి పాఠశాలలలోను, ఆటస్థలములలోను, బొమ్మల అంగడులలోను పెక్కురకముల బొమ్మలు, ఆటవస్తువులు వెలసినవి

ఈ ఉద్యమముయొక్క పూర్తి ప్రభావము గృహములలోనికి, పాఠశాలలలోనికి ఇంకను విస్తరింపవలసి యున్నది ఆటబొమ్మలు కొయ్యతోను, వస్త్రములతోను, తేలికయగు లోహములతోను, కాగితములతోను, గుజ్జుతోను, రబ్బరుతోను, సెల్యులాయిడ్‌తోను పిల్లల అవసరములకు తగినరీతిగా సిద్ధము చేయబడుచున్నవి

ఆటవస్తువులలో బొమ్మలకు అగ్రస్థానము కలదు. పిల్లలకు ఒక్కొక్క వయస్సులో ఒక్కొక్క రకమగు ఆట వస్తువు అవసరము. కొన్ని ఆటవస్తువుల వలన, ముఖ్యముగా బొమ్మల వలన తమ పరిసర జాతిలక్షణములను పిల్లలు కనుగొనగలరు. కొన్ని బొమ్మలు పిల్లలలో చురుకుదనమును, కృషిచేయ వలెనను కుతూహలమును, శక్తియుక్తులను ప్రేరేపించును. కొన్ని బొమ్మలు ఊహాశక్తిని ప్రజ్వలింప జేయును. వివిధ దేశముల, వివిధ కాలముల పద్ధతులను, సంప్రదాయములను జంతువులను, పశులను, పిల్లల బొమ్మల వలన తెలిసికొనగలము. పిల్లలు బొమ్మల పెండ్లిండ్లు చేయుట, బొమ్మల కుటుంబములు ఏర్పరచుట మనకు తెలిసిన విషయమే. బొమ్మలు పిల్లలకు ఉల్లాసమును, వినోదమును కలుగజేయునవిగ నుండవలెను.

భారతీయ సంస్కృతియందు ఈ బొమ్మలకు గల స్థానము చాల ప్రాచీనమైనది. సంస్కృత మహాకవి శూద్రకుడు రచించిన 'మృచ్ఛకటికము' అను నాటకము, నాయకుని కుమారుడు ఆడుకొను మట్టిబండిపై ఆధారపడి యున్నది. దక్షిణ భారతదేశములో బొమ్మల కొలువు పండుగకు స్త్రీలు, పిల్లలు ఎట్టి ప్రాధాన్య మొసగుదురో ఎల్లరకు తెలిసిన విషయమే.

భారతదేశములో నేడు వివిధ ప్రాంతములందు వివిధ రకముల ఆటబొమ్మలు చేయబడుచున్నవి. రాజస్థాన్ వనితలలో కనిపించు లావణ్యము, వంగకన్నియల వదనమున గోచరించు ముగ్ధమోహకత్వము, మహారాష్ట్రస్త్రీల అంగసౌష్ఠవము, తమిళ పడతుల చాతురి, తెలుగు ఆడపడుచుల అందచందములు ఆయా ప్రాంతముల ఆటబొమ్మలలో చూడ నగునని డాంగెర్ శేరీ అనువాతడు చెప్పినమాట ఎంతయు సత్యము. ఈస్టిండియా కంపెనీ జీతగాండ్రను జ్ఞప్తికితెచ్చు బొమ్మలను వంగరాష్ట్రములో చేయుదురు. తెలుగుదేశపు బొమ్మలలో గ్రామీణ సంప్రదాయములకు ప్రాధాన్యము కన్పడును.

**నిర్మల్ బొమ్మలు**: ఆదిలాబాదు జిల్లాలో గుట్టలను, చిట్టడవులను పరిసరములందు కలిగియున్న నిర్మల్ నగరము, చిత్రవర్ణములతో విలసిల్లు చేతి పరిశ్రమలకు ఆలవాలము. ఈ గ్రామమున కొయ్యబొమ్మలమీద జరుగు లక్కపూతపని, బంగారుపూతపని ఎంతయు విలువకలది. ఈ పరిశ్రమయందు కళోపేతములగు కుర్చీలు, బల్లలు, తివాసీలు ప్రత్యేకముగ మెచ్చుకొనదగినవి. ఆటవస్తువులను, సహజమై చెక్కుచెదరని రంగులుగల, జంతువులు, పశులు, కూరగాయలు, ఫలములు మొదలగు బొమ్మల నిర్మాణమందు నిర్మల్ పరిశ్రమ ప్రసిద్ధి గాంచినది. అచ్చటి అడవులలో లభించు మిక్కిలి తేలికపాటి బూరుగు పుణికి కర్రలు ఈ పరిశ్రమయందు వాడబడుచున్నవి.

నిర్మల్ పరిశ్రమ తరతరములనుండి అచ్చట వర్ధిల్లుచున్నది. చింతవిత్తులను నానబెట్టి ఆరనిచ్చి, రుబ్బి, జిగురు అగునట్లు ఉడుకబెట్టి, దానిని బొమ్మల భాగములను అతుకుట కుపయోగింతురు. ఆంధ్ర ప్రభుత్వము ఒక పథకమును ప్రవేశపెట్టి, నిర్మల్ కళాకారుల పిల్లలకు శిక్షణ సౌకర్యములు కల్పించుటయే కాక, అచ్చటి ఆ పరిశ్రమాభివృద్ధికై, సహకార సంస్థలద్వారా, ఋణములు, ముడివస్తువులు, యంత్ర పరికరములు ఇచ్చుచు, అచ్చట తయారగు సరకులకు మార్కెటింగు సౌకర్యములను కూడ కల్గించు చున్నది.

**కొండపల్లి బొమ్మలు**: విజయవాడకు 15 మైళ్ళ దూరమునగల కొండపల్లి అను గ్రామము పూర్వము నుండియు బొమ్మల పరిశ్రమకు ప్రసిద్ధమైనది. బొమ్మలను నిర్మించు ఆర్యక్షత్రియ కుటుంబములు ఏలదివరకు ఆ గ్రామమునకలవు. వీరి శిల్పచాతుర్యము వర్ణనాతీతము. పూర్వము ఇచ్చట సాగినవు పరిశ్రమ ఉన్నతస్థితిలో నుండెడిది. కాని ఇప్పుడా పరిశ్రమ రూపమే కాన్పింపదు. చాలకాలముగా కొండపల్లిలో తయారగుచు వచ్చిన లక్కబొమ్మ లిప్పుడు విశాఖపట్టణము జిల్లాలోని నక్కపల్లి గ్రామములోకూడ చేయబడుచున్నవి. కొండపల్లి పరిసరములందలి అరణ్యములలో లభించు తేలికపాటి పుణికి కర్రతో ఈ బొమ్మలు చేయబడును. వీటిని తయారు చేయుటకు ప్రత్యేకమగు కళాప్రక్రియను కళాకారులు అలవరచుకొని, ప్రత్యేకమగు పరికరములను, ప్రత్యేకమగు ముడిసరకులను సేకరించుకొనుచు కళాకారులు ఈకళయందు విశేషాభివృద్ధిని సాధించుకొనిరి.

జీవకళ తొణికిసలాడు కొండపల్లి బొమ్మలు ఆంధ్ర గ్రామీణ జీవితమునకు ప్రతిబింబములనవచ్చును. జంతువులు, పౌరాణిక విగ్రహములు, గ్రామీణవృత్తులను తెలుపు బొమ్మలు పల్లెపడచుల బొమ్మలు, లక్ష్మీ సరస్వతులబొమ్మలు, తాడిచెట్టు కల్లుగీత బొమ్మలు, దశావతారముల బొమ్మలు, చాకలి, గొల్ల మొదలైన పెక్కు రకముల బొమ్మలు, ఇచ్చట సిద్ధమగు

చున్నవి. ఈ బొమ్మలు మదరాసు, బొంబాయి, కలకత్తా, ఢిల్లీ మొదలగు నగరములకును, విదేశములకును ఎగుమతి యగు చున్నవి. ఇచ్చట సాలీనా 60–70 వేల రూప్యముల విలువగల బొమ్మలు నిర్మించబడుచున్నవి. వీటి గిరాకీ నానాటికి హెచ్చు చున్నది. ఇచ్చటి కళాకారులకు సహాయమొసగుటకై సహకార సంస్థ తేర్పడియున్నది. ఇట్టి సహకార సంస్థల ప్రోత్సాహములవలన, కుటుంబస్త్రీలు సహితము బొమ్మల పరిశ్రమ యందు పాల్గొనుచు జీవనము గడవుకొనుచున్నారు.

**ఏటికొప్పాక లక్క బొమ్మలు :** విశాఖపట్టణము జిల్లా సర్వసిద్ధి తాలూకాలోని ఏటికొప్పాక గ్రామములో, లక్క బొమ్మలు అనాదిగా నిర్మింపబడుచున్నవి. ఇట్టి బొమ్మలే, మైసూరు, మద్రాసు, వంగరాష్ట్రములలో కూడ ఇప్పుడు చేయబడుచున్నవి. ఈ బొమ్మలకు ముఖ్యముగా అవసరమైన మెత్తనికపు తేలిక పాటి కఱ్ఱ స్థానికముగా లభించును. రైళ్లు, ఎద్దులు, రైలుఇంజనులు, గ్రామఫోనులు, పండ్లు, పిల్లలాడు కొనుట కుపయోగపడు సామానులు ఇచ్చట నిర్మింపబడును. వీటి కితర రాష్ట్రములలో కూడ గిరాకీ కలదు.

బొమ్మల వ్యాపారములో దళారీలు హెచ్చుగా నుండుటచే, పనివారలకు న్యాయమగు వేతనములు గిట్టుటలేదు. కొండ పల్లి, నిర్మల్ మున్నగు తావులలోవలె, ఇచ్చటకూడ ప్రభుత్వము ఉత్పత్తి, శిక్షణ కేంద్రములను అధికముగా స్థాపించి, సహకారసంఘముల ద్వారా అవసరమైన సౌకర్యము లను చేకూర్చి, ఈ పరిశ్రమ విస్తృతినొందుటకు విశేషముగా దోహదము నిచ్చుచున్నది. జపాను ప్లాస్టిక్ బొమ్మలు చవుకరకపు ఇతరబొమ్మలు విపణివీథిలోనికి విరివిగా ప్రవేశించు చున్నవి.

**ఎఱ్ఱచందనపు బొమ్మలు :** అనాదిగా వచ్చుచున్న తిరుపతి ఎఱ్ఱచందనపు బొమ్మలకు మంచి ప్రఖ్యాతి కలదు. ఎఱ్ఱచందనపుచెట్లు చిత్తూరు, కడపజిల్లాలలో విరివిగానున్నవి. ఈ చెక్కతో సిద్ధముచేయబడిన బొమ్మలను విశేషముగా తిరుపతిలోను, తిరుచానూరులోను అమ్ముచున్నారు. ఈ రెండు నగరములు ఈ పరిశ్రమకు ప్రసిద్ధిగాంచినవి. ఈ బొమ్మల రంగుమారక, అట్లే నిలిచియుండును. తిరుపతికి పోయిన ప్రతి యాత్రికుడు ఈ బొమ్మలను విధిగా కొనును. చిన్నపిల్లలు ఈ బొమ్మలకు దుస్తులు తొడిగి ఆడుకొనెదరు. ఇవి ఒక అంగుళమునుండి అడుగున్నర పొడవు పరిమాణములో చేయబడుచున్నవి.

దేవతల, మానవుల, జంతువుల బొమ్మలను ఇచ్చటి కళాకారులు సంప్రదాయ పద్ధతుల ననుసరించి నిర్మింతురు. వీటిని ముఖ్యముగా చిత్తూరుజిల్లాలో లభ్యమగు ఎఱ్ఱచందనపు కఱ్ఱతో నిర్మింతురు. హైద్రాబాదులోని సాలార్ జంగ్ మ్యూజియములో ఎఱ్ఱచందనపు కొయ్యతో చేయబడిన పెద్దపెద్ద బొమ్మ లిప్పటికిని కన్పట్టును. ఆంధ్ర ప్రభుత్వము మీ కళాకారుల బిడ్డలకు శిక్షణ సౌకర్యములను, శిక్షణ - ఉత్పత్తి కేంద్రములను స్థాపించినది. ఇచ్చట సంప్రదాయ సిద్ధమైన బొమ్మలను చేయుటకై ప్రాధాన్య మియ్యబడుచున్నది. ఈ బొమ్మలకు కెనడా, అమెరికావంటి విదేశములలో కూడ గిరాకీ కలదు. ఈబొమ్మలనిన, పిన్నలకు, పెద్దలకు సర్వులకు మిగుల మక్కువ.

**ఇత్తడి బొమ్మలు :** బాలికలాడుకొనుటకై ఇత్తడి వంటసామానులు, దేవాలయములు, రథములు, పౌరాణికములు ఐతిహాసికములునగు యోధాదివిగ్రహములు, బొమ్మల రూపములో వంగరాష్ట్రమునందలి బంకూరా జిల్లాయందును, పరిసర ప్రాంతములందును విరివిగా చేయబడుచున్నవి. భారత దేశములో అన్ని పుణ్యక్షేత్రములందును వీటికి గిరాకీ హెచ్చుగా నున్నది. ఈ పరిశ్రమకు వారణాసి అనాది నుండియు ప్రసిద్ధిగాంచినది.

**మట్టి బొమ్మలు :** కృష్ణనగరము, కలకత్తా, పూనా, లక్నో పట్టణములు ఈ బొమ్మలకు ప్రసిద్ధములు. ఈ మట్టి బొమ్మలపై అందమైన రంగులు వేయబడును. సవంతవాడి, ఆగ్రా, బెల్గాము జిల్లాలలో కూడ మట్టితో చేయబడి సహజమగు రంగులు వేయబడిన పలురకముల పండ్లు తయారగును.

**బందరు కాగితపు బొమ్మలు :** బందరులో కాగితపు ముద్దలో రంగురంగుల బొమ్మలు తయారు చేయబడుచున్నవి. వాటిలో స్ప్రింగు అమర్చబడుటచే నాట్యమంతట అవియే నృత్యముచేయు దృశ్యము పెద్దలను, పిన్నలను రంజింప చేయును. వీటిని 'డాన్సింగ్ డాల్స్' అని యనెదరు.

ఆధునిక విద్యావిధానములో ఆటవస్తువులకు ముఖ్య స్థానముకలదు. ఇవి పిల్లల మానసికాభివృద్ధి కెంతయు తోడ్పడును. మానవజీవితములో బాల్యదశ చాల ముఖ్యమైనది. మనస్తత్త్వ శాస్త్రము ననుసరించి బిడ్డల పరివర్తనమును సరిగా అర్థము చేసికొనుటకు ఆటవస్తువులు ముఖ్య సాధనములు. ఆటవస్తువులతో ఆడుకొనునపుడు, పిల్లలలో ఉత్సాహము,

ఉద్రేకము, కల్గును వారిలో భావప్రేరణము ఏర్పడును వేలితో గ్రమలలో ఈ బొమ్మల విభాగమునకు విశిష్టస్థానము కలదు

"పేర్వేర బొమ్మల పెండ్లిండ్లు చేయుచు,
అఖిలలతోడ వియ్యంబులందు"

అని పోతనామాత్యుడు రుక్మిణి యొక్క బాల్యమును వర్ణించెను

ఆల్ వి రా

## బొ్రయ్య, కావలి (1776 - 1803)

కావలి వెంకట బొ్రయ్య అను సుప్రసిద్ధ పండితుడు 1776 వ సంవత్సరమున ఏలూరు గ్రామములో ప్రఖ్యాత ఆరువేల నియోగి కుటుంబమున జన్మించెను ఈతని తండ్రి కావలి వెంకటసుబ్బయ్య బొ్రయ్యసోదరులు నారాయణప్ప, లక్ష్మయ్య, రామస్వామి అనువారు పది సంవత్సరముల ప్రాయము వరకు బొ్రయ్య స్వగ్రామమునందే తెలుగుబడిలో విద్య నభ్యసించెను పిమ్మట ఒక గురువునొద్ద సంస్కృత విద్య నారంభించెను సంస్కృతమారంభించి ఆరు నెలలు నిండక పూర్వమే బొ్రయ్య పద్యములు రచించు శక్తిని సంపాదించుకొనెను అతని కవనమును పెద్దలుగూడ ప్రశంసించెడి వారట అప్పటికే అతని సోదరులు ఈస్టిండియా కంపెనీలో ఉద్యోగులుగా నున్నందున, బొ్రయ్యయు నచటనే ఉద్యోగమును సంపాదించుటకు పర్షియను భాషతోపాటు హిందూస్థానీభాషను కూడ అభ్యసింప నారంభించెను

కొలది కాలముననే బొ్రయ్య, పై రెండు భాషలను నేర్చి పదునాల్గవయేట మచిలీపట్టణములోని మార్గన్ పాఠశాలలో ఇంగ్లీషు భాషను నేర్చుకొనుటకేగెను ఇంగ్లీషువిద్య నారంభించిన కొంతకాలమునకే, ఏలూరునందు విడిసియున్న తెల్ల సైన్య పటాలములో అధికారిగా నుండిన కల్నల్ పియర్స్ అనువాని సాంగత్యము బొ్రయ్యకు లభించెను. కల్నల్ పియర్స్ అనుగ్రహమున బొ్రయ్య సైనిక కార్యాలయమందు ఉద్యోగిగా ప్రవేశించి, మిక్కిలి చురుకుగా పని చేయుచు, అచ్చటివారి ఆదరమునకు పాత్రుడయ్యెను

పదునెనిమిదేండ్ల వయస్సు రాకపూర్వమే డెంట్ అను మరియొక సైనికోద్యోగి వద్ద బొ్రయ్య రైటరుగా ప్రవేశించెను అయితే కొద్దికాలము తర్వాతనే పియర్సు బొ్రయ్యను తిరిగి తనవద్దకు రప్పించుకొనెను ఈ మార్పును మెకంజివద్ద ద్విభాషిగా నుండిన బొ్రయ్య అన్నయగు నారాయణప్ప అంగీకరించెను అందుచే బొ్రయ్య మెకంజి వద్ద తన పదునెనిమిదవయేట ద్విభాషిగా చేరెను అప్పటికే బొ్రయ్య అవసరమైన భాషలను నేర్చుకొని, శాస్త్ర పరిశోధనలయందు అనుభవమును గడించియుండెను

ఆంధ్ర ప్రాంతములో కాన్పించిన అశోకుని శిలాశాసనములను, శాతవాహనుల శాసనములను పరిశీలించి, ఆ శాసనాంశములను, పురాణగాథలను సమన్వయపరచిన ప్రథములు మెకంజీ, బొ్రయ్యలేనని రూఢిగా తెలిసినది బొ్రయ్యయే మెకంజీవద్ద పరిశోధన పద్ధతులను నేర్చెనో లేక మెకంజీయే బొ్రయ్యవద్ద నేర్చెనో నిశ్చయముగా చెప్పజాలము కాని మెకంజీయొద్ద బొ్రయ్య చేరినప్పటినుండి పరస్పరము వారు చేదోడు వాదోడుగా నుండి చారిత్రక పరిశోధనములో ఇరువురును అరితేరిరి

బొ్రయ్య, మెకంజీవద్ద చేరువరకు, మెకంజి కాని, అతనియొద్ద పూర్వము పనిచేసినవారు కాని ఈ శాసనములలో నొకదానినైనను చదివి అర్థము చేసికొనజాల కుండిరి బొ్రయ్య యొక్క ప్రతిభను గూర్చియు, అతడు తన కొనర్చిన గొప్ప తోడ్పాటును గూర్చియు, బొ్రయ్య మరణానంతరము, మెకంజీ తన మిత్రునికి వ్రాసిన లేఖలో పేర్కొనెను.

పై విషయమును బట్టి శాసనముల లిపిని, భాషను బోధ చేసికొని అర్థము చెప్పుటలో బొ్రయ్య బుద్ధిపరిణతి నొందగా అతడు ఇతరులకు కూడ అందలి మెలకువలను బోధించెడివాడట వ్రాత ప్రతులను సంగ్రహించుటయందును, అందుకు సంబంధించిన సమాచారములను సమన్వయపరచుటయందును నియోగింపబడిన బొ్రయ్య, తన విధ్యుక్త ధర్మమును ప్రజ్ఞాచాతుర్యముతో నిర్వహించి, తన పరిశోధనములచే యజమానులను సంతోషపరచుచుండెను ఈతనిచే గావింపబడిన పని ఈస్టిండియా కంపెనీవారికి అనుకూలముగ నుండెను తన కర్తవ్యమును నిర్వహించుటకై బొ్రయ్య ఒక్కొక్కప్పుడు దుర్గమారణ్యములను గడచి శ్రీశైల శిఖరమువరకును పోవలసిన వాడయ్యెను.

కొంతకాలము తరువాత మెకంజి తన ఉద్యోగ ధర్మము ననుసరించి, మనిలా (ఫిలిప్పైను దేశము) ప్రాంతమునకు వెళ్లినపుడు, బొ్రయ్య తాత్కాలికముగా తన వ్యాసంగమును కట్టిపెట్టి, హైదరాబాదునుండి మదరాసునకు

జికి వెళ్లెను మార్గమధ్యమున అతడు తాను రచించిన తెలుగు కవిత్వమును, సంస్కృత కవిత్వమును తన గ్రామ వాసులకు వినిపించి, వారి మన్ననలను పొందెను. మెకంజీ తిరిగి భారతదేశమునకు వచ్చినంతనే, బొర్రయ్య ఆతనివద్దకు మరల వెళ్లి, అచ్చట కొంతకాలముండి, వ్రాతప్రతుల సంపాదనమందును, పరిశోధనమందును తన కాలమును వినియోగించుచుండెను.

1798 వ సం॥లో టిప్పు సుల్తానుతో బ్రిటిష్ సైన్యమునకు యుద్ధము సంభవింపగా మెకంజీతోపాటు బొర్రయ్యయు యుద్ధభూమికి పోయెను. బొర్రయ్య తాను స్వయముగా చూచినట్టియు, వినినట్టియు విషయములను గూర్చి కావ్యమొకటి వ్రాసెను. యుద్ధానంతరము మెకంజీ హైదరాబాదులో పర్వేయరు - జనరలుగా నున్నపుడు బొర్రయ్య అతని వద్దనే యుండెను.

ఒకానొకప్పుడు నిజాము రాష్ట్రమున జాగీర్దారొకడు బొర్రయ్యను, ఆతని వద్దనుండిన వ్రాతప్రతులను స్వాధీనమొనర్చుకొని, ఆతనిని బంధించెను. బొర్రయ్య తన కవితాధోరణివలన, పాండితీపటిమవలన, జాగీర్దారుని మనస్సును కరగించి, ఆతని మన్ననలనొంది సంగ్రహింపబడిన వ్రాతప్రతులతో, తాను విముక్తుడాయెను.

మెకంజీ, మైసూరు రాష్ట్రమును సర్వే చేయుటకై నియమింపబడగా, బొర్రయ్యయు ఆతనిని వెంబడించెను. వారు పోవు మార్గమున చరిత్రపరిశోధనమునకు అవసరమైన సామాగ్రిని అతడు సంపాదించెను. ధోండియా అను మహారాష్ట్ర నాయకుడు 1800 లో హరిహర్ వద్ద పట్టుబడినపుడు ఆ ఘట్టమును బొర్రయ్య వర్ణించుచు కవిత్వము చెప్పెను. ఉవత్తూరును పాలించిన శ్రీరంగపట్టణ రాజుల యొక్క వంశావళిని గూర్చియు, యాదవరాజుల వంశావళినిగూర్చియు అతడు కావ్యములు రచించెను. మెకంజీతో కలసి ప్రయాణముచేసిన సందర్భమున, ఆతని అభీష్టము ననుసరించి బొర్రయ్య గణిత, భూగోళ, ఖగోళ, జ్యోతిష, శాస్త్రిములను ప్రాచ్య పాశ్చాత్య పద్ధతుల ననుసరించి పఠించి, గొప్ప పాండిత్యమును సంపాదించెను. చిత్రలేఖనమందును, దేశపటములను గీయుటయందును అతడు ప్రావీణ్యము సంపాదించెను. ప్రయాణముచేయు కాలముననే పెక్కు పాత నాణెములనుకూడ అతడు సేకరించెను.

తాను సముపార్జించిన శాసనములను బొర్రయ్య చక్కగా పరిశీలించి వాటికి సరియైన అనువాదములను తయారుచేసెను. దొడ్డేగను గ్రామమున హళకన్నడ భాషయందు వ్రాయబడిన నొక శాసనమును బొర్రయ్య అనువదించెను. మెకంజీ మిక్కిలి సంతసించి, బొర్రయ్య పేరు శాశ్వతముగా నుండునట్లు ఆ శాసనముపైన అతని నామమును చెక్కించెను. ఆ శాసనమిపుడు రాయల్ ఏషియాటిక్ సొసైటీ వస్తు ప్రదర్శనశాలయందు భద్రపరుపబడి యున్నది.

ఇంతలో ప్రభుత్వమువారు మెకంజీని మద్రాసు పట్టణమునకు రమ్మనిరి. ఆయనతోపాటు బొర్రయ్యయు మద్రాసునకు వెళ్లెను. అచ్చట బొర్రయ్య పుస్తకములను అనువదించుచు, శాసనములను పరిశోధించుచు, రెండు సంవత్సరములపాటు మెకంజీవద్దనే యుండెను.

ఇరువది ఆరవయేటనే బొర్రయ్య పక్షవాత వ్యాధిచే బాధితుడై 1803 వ సం॥లో మద్రాసు నగరమున అకాల మృత్యువు వాతబడెను. బొర్రయ్య మరణమునకు మెకంజీ మిక్కిలి దుఃఖిల్లి, ఆతనిని దహనమొనర్చిన సముద్ర తీరముననే ఆతని పేరనొక శాసనమును వేయించెను.

శాసనములను సేకరించి చదువుటయందును, వాటి నర్థము చేసికొనుటయందును ప్రత్యేక నైపుణ్యమును, ప్రతిభను గడించి, చరిత్ర జిజ్ఞాసువులకును, శాసన పరిశోధకులకును మార్గదర్శకుడైన బుద్ధిమదగ్రగణ్యుడు కావలి వెంకట బొర్రయ్య చిరస్మరణీయుడు.

ఈతడు తన పంధ్రెండవయేటనే కసింకోట అమీనుదారైన వెంకటచలమను నాతని కుదిసోదరిని వివాహమాడి ఆమెవల్ల నొక ఆడుబిడ్డను బడసెను.

బొర్రయ్య మరణానంతరము అతని పరిశోధన కార్యమును ఆతని సోదరులు లక్ష్మయ్య, రామస్వామిగారలు సాగించిరి. ఈ కావలి సోదరులు చరిత్ర పరిశోధకులును, కవులును, పండితులును అయియుండిరి. స్వీయప్రతిభా విశేషమున వీరు కల్నల్ కాలిన్ మెకంజీ దొరగారి గాఢాభిమానమునకు పాత్రులైనవారలు. బొర్రయ్య తమ్ముడయిన రామస్వామి "దక్షిణ భారత కవుల చరిత్ర"ను రచించెను. (1829). ఇదియే తెలుగు కవులను గూర్చిన ప్రథమ చరిత్ర గ్రంథము.

వి. సూ.

## బొలీవియా (చ)

బొలీవియా దక్షిణ అమెరికాయందలి యొక ప్రజాతంత్ర స్వతంత్ర రాజ్యము దీని రాజధాని 'లాపాజ్' అనునది దీని విస్తీర్ణము 434 162 చ మైళ్ళు జనాభా రమారమి 35,00,000 ఉత్తర దిక్కునందు, తూర్పు దిక్కునందు బ్రెజిల్, ఆగ్నేయ దిశయందు పెరగ్వే, దక్షిణమున అర్జెంటైనా, పశ్చిమమున చిలీ, దీనికి సరిహద్దు దేశములు 'స్పానిషుభాష' ఈ దేశపు అధికారభాష ఎరుపు, పసుపు, ఆకుపచ్చని రంగులతో గూడిన త్రివర్ణ పతాకము ఈ దేశపు జాతీయ పతాకము "బొలివియానోస్ ఎల్ హేడో ప్రొపిసియో" అనునది ఈ దేశపు జాతీయ గీతము ఆగస్టు 6 వ తేది బొలివియా యొక్క స్వాతంత్ర్య పర్వదినము

నేటి బొలీవియా దేశమందలి 'తిహ్యునాకొ' పరిసరము అందు క్రీ శ 600-900 సంవత్సరములమధ్య ప్రసిద్ధ భారతీయ నాగరికత అభివృద్ధి చెందినట్లు చరిత్రకారులు తీర్మానించినారు ఈ నాగరికతకు చెందిన పెద్దపెద్ద రాతికట్టడములు, విగ్రహములు, మృణ్మయపాత్ర విశేషములు తప్ప ఈ ప్రాంతమందు మరి యేవిధమైన అవశేషములు లభించలేదు ఏ కారణముచేతనో, ఈ నాగరికత క్రీ శ 900-1200 సంవత్సరముల మధ్యకాలమందు క్షీణించిపోయినది క్రీ శ. 13 వ శతాబ్దారంభమునందు 'ఇన్కా' అను జాతివారు ఈ ప్రాంతమందు తమ రాజ్యమును స్థాపించుకొనగల్గిరి దాదాపుగ 325 సంవత్సరముల కాలముపాటు ఇచట 'ఇన్కా' సంస్కృతి వృద్ధిపొందినది

క్రీ శ 1538వ సంవత్సరము లో స్పెయినువారు 'ఇన్కా' రాజ్యము నాక్రమించుకొని, అచట తమ వలసలను స్థాపించుకొనిరి క్రీ శ 1548 సంవత్సరమున 'పోటసి' ప్రాంతమున వెండి గనులు బయల్పడినప్పటినుండి ఈ ప్రదేశముపై స్పెయినువారికి మక్కువ ఎక్కువైనది ఆనాడు ఈ ప్రాంతమును వారు "ఆల్టో పెరు" అని వ్యవహరించెడివారు క్రీ శ 1559వ సంవత్సరములో దీనిని వారు పెరూలో కలిపివేసి వైస్రాయి పాలన క్రిందకు తెచ్చిరి 'సుక్రే' నగరమును కేంద్రముగ జేసి "ఆల్టో పెరున" కొక స్థానిక ప్రభుత్వము నేర్పాటు చేసిరి. కాని ఇచట వలస లేర్పరచుకొనిన భారతీయులకు గాని, 'క్రియోలు'గాని ఈ ప్రభుత్వమునందు ప్రాతినిధ్యము నొసగలేదు, ఇచ్చటి రాజకీయ, ఆర్థిక వ్యవస్థను స్పెయినువారు తమ గుప్పిటి యందుంచుకొనిరి వారి స్వార్థమునకు మితిలేకపోయినది ఈ కారణముచేత 16 వ, 17 వ శతాబ్దములం దచటి ప్రజలు స్పెయిను ప్రభుత్వముపై తిరుగుబాట్లు జరుపుచు వచ్చిరి

క్రీ శ 1825వ సంవత్సరము వరకు స్పెయిను వారు ఈ ప్రాంతముపై ఆధిపత్యమును వదలిపోకుండ జూచుకొనగల్గిరి క్రీ శ 19 వ శతాబ్దపు ప్రథమ భాగమందు 'వెనిజులా'కు చెందిన 'సైమన్ బొలివర్' అనునాతడు దక్షిణ అమెరికా రాజ్యములకు స్వాతంత్ర్యమును సముపార్జించవలెననెడి దీక్షతో నొక పెద్ద సేనను సమకూర్చుకొనెను అతని సేనానాయకులలో నొకడగు 'ఆంటోనియోజోసె-డి-సుక్రే' అనునాతడు క్రీ శ 1824 వ సంవత్సరములో 'పెరూ' నందలి 'అయాకుచో' అను ప్రదేశమున స్పెయిను సేనలను చిత్తుగ నోడించి, అటనుండి 'ఆల్టో-పెరు'పై తన సైన్యమును నడిపెను స్పెయినువారి ప్రాంతమును వదలి పలాయితులయిరి పిదప అచటి ప్రజలు తమ ప్రభుత్వమును స్థాపించుకొనిరి క్రీ శ 1825, ఆగస్టు 6 వ తేదీన వారు స్వాతంత్ర్యమును ప్రకటించుకొని తమ దాసత్వ విముక్తికై పాటుపడిన 'సైమన్-బొలివర్' యెడల తమకు గల కృతజ్ఞతను ప్రకటించు నిమిత్తము అతని పేరటనే తమ దేశమునకు 'బొలీవియా'యని నామకరణము జేసిరి నాటినుండి ఈ ప్రాంతము బొలీవియా యని వ్యవహరింప బడుచున్నది

క్రీ శ 1826 వ సంవత్సరమున బొలివర్ ఆధ్వర్యవమున ఈ దేశపాలనము కొరకొక రాజ్యాంగము రూపొందించ బడినది దీని ననుసరించి ప్రజలచేత ఎన్నుకొనబడిన అధ్యక్షుడు దేశపాలనము చేయును ఇతని పదవీకాల ప్రమాణము 4 సంవత్సరములు సెనేటర్లతోను, ప్రతినిధులతోను కూడిన రెండు శాసనసభలు గల కాంగ్రెసు కేంద్రమందుండును సెనేటర్లు 6 సంవత్సరముల కొకమారును, ప్రతినిధులు 4 సంవత్సరముల కొకపర్యాయమును ప్రజలచేత ఎన్నుకొన బడుదురు బొలీవియా ప్రథమ అధ్యక్షుడు జనరల్ ఆంటోనియో-డి-సుక్రే అనునతడు

క్రీ శ 1829-1839 సంవత్సరములమధ్య 'జనరల్ ఆంద్రెస్ శాంతాక్రజ్' అనునతడు బొలీవియా అధ్యక్షపదవిని నిర్వహించినాడు క్రీ. శ 1839 లో ఇతడు పదవీభ్రష్టుడు కావింప బడెను నాటినుండి షుమారు 50 సంవత్సరముల

పాటు బొలీవియాలో అధికారముకొరకు తిరుగుబాట్లు, అల్లర్లు జరుగుచు వచ్చినవి ఇట్టి ఇటులుండ క్రీ శ 1879 వ సంవత్సరములో 'చిలీ' రాజ్యము బొలీవియాపై యుద్ధమును ప్రకటించినది పసిఫిక్ తీరమందలి నైట్రేటుకు గురించి తలయెత్తిన వాదమే ఈ యుద్ధమునకు కారణము ఇట్లు సంభవించిన పసిఫిక్ యుద్ధములో చిలీ సైన్యములు బొలీవియా నోడించి, నైట్రేటుకు నిలయమైన 'అటకామా' అను ప్రాంతము నంతటిని స్వాధీన పరచుకొనెను ఫలిత ముగ, బొలీవియా, నైట్రేటు నిధులను నష్టపోవుటయే గాక తీరప్రాంతమునుగూడ పోగొట్టుకొనవలసి వచ్చినది

రాజకీయ వైషమ్యములు కొనసాగుచు దశములకు గూడ ప్రాకుట చేత, క్రీ శ 1925–52 సంవత్సరముల మధ్య కాలమందు, తరచు బొలీవియాలో తిరుగుబాట్లు జరిగినవి వీటి పర్యవసానము దేశ పురోభివృద్ధి, ఆర్థిక వ్యవస్థ కుంటు పడుటయే. పురోమీన వుటయన్నట్లు క్రీ శ 1931–35 సంవత్సరములలో, చాకో ప్రాంతపు వివాదమును పురస్కరించుకొని, చిలీ - బొలీవియాలమధ్య మరల యుద్ధము జరిగినది ఈ చాకో యుద్ధమందుగూడ బొలీవియా అపజయమునే పొందుటచేత, మూడింట రెండువంతుల చాకో ప్రాంతమును చిలీ దత్తము చేయవలసివచ్చినది ఇంతలో రెండవ ప్రపంచయుద్ధము ప్రారంభమగుటయు, క్రీ శ 1943వ సంవత్సరమున బొలీవియా అక్షరాజ్యములపై యుద్ధము ప్రకటించుటయు జరిగెను కాని దానిసేనలు ఈ మహాసంగ్రామమందు పోరాడలేదు క్రీ శ 1945 లో బొలీవియా ఐక్యరాజ్యసమితిలో సభ్యత్వమును పొందినది

క్రీ శ 1956 నుండి 1960 సంవత్సరము వరకు 'హెర్నన్ సైల్సు' 1960 సంవత్సరమునుండి 1964 సంవత్సరమువరకు 'జనరల్ పాజ్, హెస్టెన్సోరో' అనువారు బొలీవియా అధ్యక్షపదవిని నిర్వహించిరి వీరిరువురు దేశ పరిస్థితులను చక్కదిద్దుటకును ఆర్థిక సుస్థిరతను, దేశపురోగతిని సాధించుటకును పాటుపడిరి క్రీ శ 1964 సెప్టెంబరులో గనుల కార్మికులతో ప్రభుత్వమునకు తలయెత్తిన వివాదములు దేశములో తీవ్రమైన అవాంఛనీయ పరిస్థితులను సృష్టించినవి ఈ స్థితిలో 'జనరల్ రెనె బారియాంటోసు' సైనిక తిరుగుబాటు జరిపి, 'పాజ్ హెస్టెన్సోరో'ను పదవీభ్రష్టుని జేసి, ప్రభుత్వమును చేజిక్కించుకొనినాడు. కాని ఆయన కూడ క్రీ శ 1966 జనవరిలో తనపదవికి రాజీనామానిచ్చి అధికారమును 'జనరల్ అల్ఫ్రెడో - ఓవెండో'కు దత్తము చేయవలసివచ్చినది క్రీ శ 1966 జూలై 3 వ తేదీన జరిగిన ఎన్నికలలో 'అల్ఫ్రెడో - ఓవెండో', అధ్యక్ష పదవికి పోటిచేసి గెలుపొందెను ఇతడు 1966 ఆగష్టు 6 వ తేదీన పదవీ స్వీకారము చేసినాడు

బొలీవియా ప్రజలలో సగమునకుపైగా భారత జాతీయులు వీరిభాష "క్వెచూ" మిగిలినవారిలో మూడింట రెండువంతులు మెస్టిజోలు, మిక్కినవారు శ్వేతజాతీయులు వీరందరు స్పానిషుభాష మాట్లాడుదురు భారతీయులు కొందరు, మెస్టిజోలు, వ్యవసాయమును తమ జీవనోపాధిగ జేసికొని పల్లెలందునివసించుచున్నారు మిగిలినవారి వాస స్థానములు పట్టణములే బార్లీ, వరి, మొక్కజొన్న, బంగాళ దుంపలు, చిక్కుడు వీరిప్రధాన ఆహారపదార్థములు 'ఫుట్ బాల్' ఆట, బొలీవియా దేశీయులందరికి ప్రీతికరమైనది వినోదముకొరకు కొందరు వేటాడుటయు కలదు నృత్య గానములందు వీరికి విశేషాదరణము కలదు పండుగలను, పర్వదినములను వీరు మిక్కిలి యుత్సాహముతో జేసికొందురు నూటికి తొంబదిమంది కేథలిక్ మతస్థులు

ఈ దేశములో నిరక్షరాస్యుల సంఖ్య 60 శాతమును మించియున్నది (1949) ఇచ్చటి 1993 ప్రాథమిక పాఠశాలలలో 1, 41, 581 మంది విద్యార్థులు 104 సెకండరీ పాఠశాలలలో 15, 029 మంది విద్యార్థులు ఉండిరి ఇచ్చట అయిదు విశ్వవిద్యాలయములు కలవు గ్రామీణ విద్యాభివృద్ధికి ప్రభుత్వము చురుకుగా కృషి చేయుచున్నది

బార్లీ, వరి, మొక్కజొన్న ద్రాక్ష, కాఫీ, మిరియాలు బంగాళదుంపలు, ఇచ్చటి ప్రధానమయిన పంటలు ఈ దేశీయులు గొర్రెలను, 'ల్లామాలు' అల్పాకలు అను జంతువులను పెంచుదురు. ఈ జంతువులనుండి ఎక్కువ 'ఉన్ని' లభించును వస్త్రములను, దశ్యాలలో దీర్ఘకాలము నిల్వయుంచుటకు వీలైన ఆహారపదార్థములను, పానీయములను, బొలీవియా దేశస్థులు విరివిగ ఉత్పత్తి చేయుదురు

బొలీవియాలో ఖనిజసంపదకు కొదువలేదు తగరము, ఆంటిమొని బిస్మత్తు రాగి, బంగారము, వెండి, సీసము, తుత్తునాగము టంగ్‌స్టన్ మొదలగు ఖనిజములిచట లభించును ప్రపంచమునందలి మొత్తము తగరపుటుత్పత్తిలో ఆరింట

ఒక వంతు బొలీవియానుండియే జరుగుచున్నది బొలీవియా దాదాపుగ తన ఖనిజసంపద సంతటిని అమెరికా సంయుక్త రాష్ట్రములకును, బ్రిటిషు దీవులకును ఎగుమతి చేయుచున్నది. ప్రత్తి, ఊలు, యంత్రసులు, మోటార్లు, కలప, ఆహార పదార్థములు మొదలగునవి ఈదేశము చేసికొను ముఖ్యమయిన దిగుమతులు

అమెరికా సంయుక్త రాష్ట్రముల సహకారముతో బొలీవియా తన ఆర్థిక వ్యవస్థను పటిష్ఠము గావించుటకు కృషిచేయుచున్నది శాంటాక్రజ్ ప్రాంతమున క్రొత్తగ బయల్పడిన నూనెగనులు, బొలీవియా పురోగతికి మిక్కిలి దోహదకరములుగ నున్నవి ఆల్ఫ్రెడో-'ఒవాండో' ఆధ్యక్ష్యమున, ఈ దేశము ప్రగతిని సాధించుటకు ప్రస్తుతము పాటు పడుచున్నది

ఏ చెం

## బొలివియా (భూ) :

బొలీవియా ఒక ప్రజాసత్తాక రాజ్యము అది దక్షిణ అమెరికాయందలి బృహత్తరమైన నొక రాజకీయ విభాగము అది పూర్వమొకప్పుడు ఇన్కా సామ్రాజ్యము యొక్కయు, పిదప పెరూదేశముయొక్కయు అంతర్భాగముగ నుండెను ఆ దేశము 9°-44' దక్షిణ అక్షాంశము మొదలు 23° దక్షిణ అక్షాంశము వరకును, 58° మొదలు 70° పశ్చిమ మధ్యాహ్న రేఖవరకును విస్తరించియున్నది దానికి తూర్పు, ఉత్తరము లందు బ్రెజిల్ దేశమును, ఆగ్నేయమందు పెరగ్వేదేశమును, దక్షిణమందు అర్జెంటినా దేశమును, పశ్చిమమందు చిలీ, పెరూదేశములును ఎల్లలుగ నున్నవి బొలివియాకు సముద్ర తీరమనునది లేదు

విస్తీర్ణము బొలివియాదేశపు విస్తీర్ణము 4,24,162 చదరపు మైళ్లు

పరిపాలనా విభాగములు పరిపాలనా సౌకర్యమునకై ఈ దేశము తొమ్మిది మండలములుగా విభజించబడినది మండలములు, వాటి రాజధాని నగరములు (బ్రాకెట్లలో) వాటి జనసంఖ్య ఈ దిగువవరుసగా పేర్కొనబడినది

| మండలము | జనసంఖ్య |
|---|---|
| 1 లాపాజ్ | 9,48,446 |
| (లాపాజ్) | 3,21,078 |
| 2 కోచబంబా | 4,90 475 |
| (కోచబంబా) | 80,795 |
| 3 పొటోసి | 5,34 300 |
| (పొటోసి) | 45,758 |
| 4 శాంటాక్రజ్ | 2 86,1,5 |
| (శాంటాక్రజ్) | 42 746 |
| 5 చుక్విసాకా | 2 82 9.0 |
| (సుక్రీ) | 40,128 |
| 6 టారిజా | 1,.6 752 |
| (టారిజా) | 16,869 |
| 7 ఒరూరో | 2,10,230 |
| (ఒరూరో) | 62,975 |
| 8 బేని | 1,19,770 |
| (ట్రినిడాడ్) | 10,750 |
| 9 పాన్‌డో | 19,804 |
| (కోబిజా) | 1,728 |

స్థలవర్ణనము ఈ దేశ వైశాల్యములో దాదాపు 60 శాతము నిమ్నప్రాంతములు అవి తూర్పుదిశయందున్నవి. శేషించిన పశ్చిమభాగము ఉన్నతమైన పర్వతమయప్రాంతము అచ్చట వెడల్పును, సమాంతరమును నైన రెండు ఆండీస్ పర్వత శ్రేణులు 12,000 అడుగుల ఎత్తుగల పీఠభూమిని చుట్టుకొని యున్నవి ఎత్తయిన ఈ సమప్రదేశము టిటికాకా అను సరస్సుయొక్క ప్రవాహ ప్రదేశముగా ఏర్పడినది కొన్ని తావులందు ఈ సరస్సు నీరు 500 మైళ్లపొడవు, 80 మైళ్ల వెడల్పువరకు విస్తరించినది ఈ ప్రవాహ ప్రదేశము గుట్టలు, మిట్టలచే ఆవరింపబడినది అది చుట్టుపట్టుల గల కొండల ఉపరిభాగమునుండి జారు నీటిచేతను, నిక్షిప్తమైన రాతి పదార్థముచేతను కప్పబడి యున్నది సమతలమునందు ఈ ప్రాంతము దక్షిణమునకు పోను పోను కొంచెమేటవాలుగానున్నది నదుల వండలిచే నేర్పడిన పలు ప్రదేశములు ఒండొంటితో సమ్మిశ్రితములై, ముఖ్యముగా తూర్పుదిశనున్న దిబ్బలందు 'పైడ్‌మాంట్' అను మైదానములుగా ఏర్పడినవి ఈశాన్యప్రాంతములందు బురదమట్టితో నేర్పడిన పల్లపు మైదానములు, విస్తృతమైన చిత్తడినేలలు, నీటిమడుగులు, అడవులచే వ్యాప్తములైన ప్రదేశములును కలవు దక్షిణమున లానాస్ అను రెండు పచ్చిక మైదానములు, ప్రజలదృష్టి నాకర్షించుచుండును చుకిసాక, దక్షిణ

కాంతాక్రజ్ అను తావులందు స్వల్ప ఆర్థిక ప్రాముఖ్యము గల పల్లపు భూములున్నవి ఆండీస్ పర్వతములకును, అత్యున్నతమైన సైర్రాడీ చిక్విటాస్‌కును నడుమ లానోస్‌డీ చిక్విటాస్ యొక్క ఉపరితలమునందు వైవిధ్యము కన్పట్టును అవల ఉత్తరమున స్వల్ప నీటిపారుదలగల 'లానోస్ ఆఫ్ గ్వారయాస్', 'మోజాస్' అను ప్రదేశములును, రోగో గ్వాడో అను సరస్సును కలవు లాపాజ్ అను ముఖ్యపట్టణము సముద్రమట్టమునకు 12,000 అడుగుల ఎత్తున నున్నది ప్రపంచమంతటిలో మిక్కిలి ఎత్తుగానున్నది ఈ పట్టణ మొక్కటే. పీఠభూమిపైనుండి వీచు శీతవాయువుల తాకిడి లేకుండ, స్పెయినుప్రజలు ఈ నగరమును లోయలో నొక దరియందు నిర్మించిరి ఆ దరిచెంతనున్న శిఖరము పీఠభూమి యొక్క అంచుగా ఏర్పడియున్నది

చిత్రము 104




నదీ, సముద్రాదివర్ణనము ఈ దేశమందలి కొన్ని చిన్ననదులు ఎమజాన్ నదీజలములలో కలియుచున్నవి కొన్ని నదులు రియోడీలా ప్లాటాలోను, మరికొన్ని నదులు టిటికాకా సరస్సునందును ప్రవేశించుచున్నవి తూర్పున నున్న పల్లపు ప్రదేశములలో పెక్కు సరస్సులు కలవు బేని, మామోర్ మైదానములలో కూడ అనేక సరస్సులు కలవు చిక్విటస్ పర్వతములలోని సరస్సుల స్వరూప స్వభావములు, ప్రాముఖ్యము గమనింప తగినవి ఒహియా నీగ్రా, కాసిరెస్, మాండియోరే, గైబా, యుబేరబా అనునవి ఆగ్నేయ దిశయందున్న పల్లపు సరస్సులు వీటి పైభాగమున గల 'లాంచెస్'నకు చెందిన చిత్తడినేలలు పేర్కొనదగినవి బొలివియా కేంద్ర పీఠభూములకు స్వీయపరీవాహ మండలము కలదు ఆ మండలము టిటికాకా సరస్సు, రియోడా సగ్వాడిరో, కాయ్‌పస అను ఉప్పునీటి బాడువభూమి,మున్నగు వాటిచే ఏర్పడి యున్నది ఈ పరీవాహములో పెక్కు పిల్ల కాలువలు వచ్చి చేరుచున్నవి ప్రపంచములో ఎత్తుగానుండు బ్రహ్మాండమైన నీటి రిజర్వాయరులలో టిటికాకా సరస్సు ఒకటి అది 12,507 అడుగుల ఎత్తున నున్నది. దాని ఉత్తరార్థము పెరూ రాజ్యములో నున్నది టిక్వినా అను ఇరుకు జలసంధి, ఉత్తర భాగమును, ఉయ్‌నెయ్ మర్కా అను దక్షిణ భాగముతో కలుపుచున్నది సరస్సుయొక్క విస్తీర్ణములో ఎక్కువ భాగము లోతులేనిది సరస్సుయొక్క తూర్పు భాగమున లోడవైన గుండమొకటి కలదు ఇచ్చటి గరిష్ఠపులోతు 892 అడుగులు ఈ సరస్సునందు పెక్కు చిన్న ద్వీపము లేర్పడి యున్నవి వాటిలోనెల్ల పెద్దదయిన టిటికాకా ద్వీపమునందు ఇన్కా సామ్రాజ్యపు ప్రాచీన నాగరికతావశేషము లిప్పటికిని కన్పట్టును మూన్ అను మరియొక చిన్న ద్వీపము పురావస్తు స్మృతిచిహ్నములకు ప్రసిద్ధి నొందినది ఆ సరస్సు జలము పానయోగ్యమైనది దానితీరప్రాంతము జమ్ముఅను నొకరకమగు గడ్డిచే ఆవరింపబడియున్నది ఈ గడ్డితో చాపలు, పడవలు మున్నగునవి చేయబడును. దానికి నీరు ముఖ్యముగా డెసగ్వాడ్రో నుండి లభించును పీఠభూమిని ఆవరించియున్న ఈ సరస్సు విస్తీర్ణము 1000 చ మైళ్ళు దాని గరిష్ఠపులోతు 15 అడుగులు దాని తూములద్వారా నీరు సాలార్ డీకోయ్‌పసా అను ప్రాంతమునకు చేరుచున్నది

**శీతోష్ణస్థితి** బొలివియా ఉష్ణదేశము అయితే, అందలిఎత్తు, పల్లముల వైవిధ్యముచేత, భిన్నభిన్న ప్రదేశములలో భిన్నభిన్న శీతోష్ణస్థితు లేర్పడుచున్నవి 3000అడుగుల కంటె తక్కువ ఎత్తుకల యూన్‌గస్ మండలము 77° ఫా అల్ప ఉష్ణోగ్రతకలది అచటి వాతావరణమునందు చెమ్మ కలదు సంవత్సరము పొడవున అచ్చట అధిక వర్షపాతము ఘటిల్లును సాలానా సగటు వర్షపాతము ఎచ్చటను 60 అం

కంటె తక్కువగ నుండదు 8000 నుండి 9500 అడుగుల ఎత్తుకల వాల్లె మండలమందలి శీతోష్ణస్థితి వెచ్చగనుండును అచ్చట చల్లని వాతావరణమునకు ఆస్కారమేలేదు వర్షపాతము అధికముగ నుండును కొన్ని శాఖలలో 160అంగుళములకంటె అధికతరమైన వర్షపాతమున్నట్లు లెక్కింపబడినవి కార్సిరాడీ వాల్లే అనునది వాల్లె మండలముపైన 9,500-11,000 అడుగుల ఎత్తుననున్నది అందు శీతోష్ణస్థితి సమముగనుండి, వృక్షముల పెంపుదలకు అనుకూలముగ నుండును పునా అను 11,000-13,500 అడుగుల ఎత్తుగల ప్రాంతము పీఠభూమిని ఆవరించియున్నది అచ్చట సంవత్సరము పొడవున చల్లగనుండును లాపాజ్ యొక్క అల్ప ఉష్ణోగ్రత 50° ఫా కలది వర్షపాతములో అత్యధికభాగము ఈ ప్రదేశమున వేసవిలోనే లభించును ఉగ్రమైన చలికాలములో నాల్గుమాసములు హిమపాతము సాధారణముగ నుండును పునక్రావామండలమనునది 16,000 అడుగుల ఎత్తువరకు వ్యాపించియున్నది అతిశీతలమగు ఈ ప్రాంతమువాసయోగ్యముకాదు ఇంకను ఎత్తుగల తావులలో ఆర్కిటిక్ లక్షణములుగల శీతోష్ణస్థితులు కన్పట్టును

వృక్షసంపద - పశుపక్ష్యాదులు ఈదేశపు నైసర్గిక, శీతోష్ణస్థితులలో మార్పులు ఘటిల్లుటచే, వృక్షజీవితములో నానాత్వము అధికమగుచున్నది గడ్డిచే విస్తరించిన పీఠభూమి గొర్రెల పెంపకమునకు ప్రసిద్ధిచెందినది. ఈ ప్రదేశములో ఎచ్చటను ఎత్తయిన చెట్లు కన్పడవు 10,000 అడుగులకంటె ఎత్తుగానున్న కొండ పార్శ్వములలోను, ఎత్తయిన మైదానములలోను, ముతక కవ్వపు గడ్డి కల పచ్చిక బయళ్ళుకలవు ఆగ్నేయ దిశయందలి సమశీతోష్ణ ప్రదేశములలో పశుపోషణము చేయబడును ముఖ్యముగా బేనీమండలము పశుపోషణ క్షేత్రముగా వినియోగింపబడుచున్నది ప్రప్రథమముగా మోజాస్ అను ప్రాంతమున స్థావరమేర్పరచుకొనిన జెసూట్లు అను నొక క్రైస్తవమత శాఖీయులు పశువులతో పాటు చించిల్లా అను నొకజాతి జంతువులనుకూడ పెంచెదరు ఇచూ అను గడ్డిని ఇండ్లకప్పులకును, చాపల అల్లకమునకును ఉపయోగింతురు టోలా, యారేటా అను చెట్టుకర్రను వంటచెరకుగా ఉపయోగింతురు ఆండీస్ పర్వతపు ఏటవాలు ప్రదేశములలో వాయవ్యమందు యుంగస్ అను పేరుగల సాంద్రారణ్యములున్నవి

పెక్కురకములకోతులు, ఒకవిధమైన చిరుతపులులు, చారలు, చుక్కలు లేని పులులు, అడవిపిల్లులు, దేవాంగిపిల్లులు, చీమ ఎలుగుబంట్లు మున్నగునవి ఉష్ణాటవీప్రాంతములలో కాన్పించును ఆండీస్ కొండలలో అపురూపములైన ఎలుగుబంట్లున్నవి పీఠభూమియందలి ముఖ్యమైన జంతువులలో రోమసహితములగు చించిల్లాలు, చేపలను తిను దక్షిణ అమెరికా నీటిజంతువులు పేర్కొనదగినవి బహిరంగ ప్రదేశములలో పెక్కరీ అను జంతువులు కనిపించును భిన్నజాతుల దుప్పులు, అపోజములు, స్కంకులు, ఆర్మడిల్లాలు అను జంతువులు అంతటనుకలవు కైమానులనునవి ఉష్ణమండలమందలి పల్లపుభూములలో నదులయందు మాత్రమే కలవు కావీ అను జాతి పందులు దేశీయులచే పెంచబడుచున్నవి నేడు ఐరోపా నుండి ఈ దేశములో ప్రవేశపెట్టబడిన గుర్రములు, పశువులు, గాడిదలు, గొర్రెలు, మేకలు, పందులు, కోళ్లు ప్రాముఖ్యమును చెందియున్నవి గూళిసాళువ డేగలు, రాబందులు, ఉష్ట్రపక్షులు, ఒకరకమగు కొంగలు, నీటికోళ్లు, పెద్దబాతులు, పొట్టిబాతులు, మానుగుడికోళ్ళు, సముద్రపుకాకులు వంటి పక్షులు, అందమైన ఈకలతో అలంకృతమైన పక్షులు ఆదేశములో కొల్లలుగా కలవు

వ్యవసాయము : బొలివియాదేశమందలి వ్యవసాయోత్పత్తులలో పెక్కువస్తువులు దేశీయులచేతనే ఉపయోగింపబడును తూర్పు ఆండీస్ పర్వతమునందలి సమశీతోష్ణ లోయలలో కొన్నిధాన్యములు, పండ్లు ఉత్పత్తియగును. దేశీయములైన మొక్కలుకూడ స్థానికమగు ఆహారావసరములకు తోడ్పడుచున్నవి పునా ప్రాంతములో ఆలుగడ్డ, ఓకా క్వినో అనునవి ప్రముఖములైన ఉత్పత్తులు, టిటికాకాసరస్సువద్దనున్న ఉష్ణప్రాంతము ఆలుగడ్డలకు జన్మభూమి 11,000 అడుగుల ఎత్తుగల లోయలలో మొక్కజొన్న పెరుగును, సమశీతోష్ణపులోయలలో యవలు, గోధుమలు, చిక్కుళ్లు బటానీలు, పండ్లు, కూరగాయలు పండించబడును. పునా ప్రాంతములో యవలు పంటకురావు, అందుచే యవలగడ్డి పశువులమేతకై ఉపయోగపడును ప్రాచ్యఉష్ణప్రదేశములలో వరివ్యవసాయము సాగుచున్నది ద్రాక్షమద్యసారమును ఉత్పత్తిచేయుటకై విశేషముగా చెరకు ఉపయోగపడుచున్నది పొగాకు, కాఫీ, ప్రత్తి వ్యవసాయము అచ్చటచ్చట స్వల్పముగ చేయబడుచున్నది అటవీప్రాంతములలో రబ్బరు

చెట్లు పెంచబడుచున్నవి తూర్పున ఓటవాలుప్రాంతములలో కోకో పెంచబడును సింకోనా బెరడులను సంగ్రహించుట యందుకూడ ప్రాధాన్యముకలదు. ప్రాచీనకాలమునుండి కందమూలములు, పెక్కురకముల దుంపజాతి చెట్లు అనాస, బొప్పాయి, ప్రెడ్‌ఫ్రూట్ చెట్లు సుగంధిఫాల వానిల్లా, కోపియాబా అను వృక్షజాతులు ఆ దేశములో పెంచబడుచున్నవి విసిరివేసినట్లున్న దూరప్రాంతములలో నారింజ, పెద్దనిమ్మ, చిన్ననిమ్మ అత్తి, అరటి, ఖర్జూరము, ద్రాక్ష, జీడిమామిడి పండించబడుచున్నవి

ఖనిజసంపద బొలివియాలో గనుల త్రవ్వకము ప్రాముఖ్యము వహించినది ఆండీస్ పర్వతములలో 12-18 వేల అడుగుల ఎత్తున పెక్కురకముల ఖనిజములు కనిపించును. రవాణాసౌకర్యములు చాలకుండుటచే, వాటి ప్రగతి విశేషముగ కుంటుపడినది పొటోసీ, ఒరూరో అను తావులందు మాత్రమే గనులత్రవ్వకమునందు ప్రగతి కనిపించును ప్రపంచములో ఎక్కువ విరివిగా తగరమును సమకూర్చు దేశములలో బొలివియా మూడవది ప్రపంచమందు తగరపుధరలో ఏర్పడు హెచ్చుతగ్గులు, ఈ దేశపు ఎగుమతులపై తమ ప్రభావమును కల్గించుచున్నవి బ్రిటను, అమెరికా సంయుక్తరాష్ట్రములు ఈ దేశపు తగరమును ప్రధానముగా దిగుమతిచేయు దేశములు టంగస్టను, యశదము సీసము, రాగి, వెండి బంగారము, అంజనము, గంధకము, బిస్మతము, రాతినార మున్నగు ఖనిజము లిచ్చుట ప్రాధాన్యముకలవి పెట్రోలియమునిధులకు దక్షిణబొలివియా కేంద్రము రియోపెర్మెజో, కామిరి, సనందిత అను తైలక్షేత్రములు ఆదేశపు ఆర్థిక సౌభాగ్యమునకు మిగుల తోడ్పడుచున్నవి కామిరిక్షేత్రమునందు అత్యధికపరిమాణముగల పెట్రోలియము ఉత్పత్తియగుచున్నది చానిని, కోచాంబా, సుక్రే అను తైల శుద్ధికర్మాగారములకను గొట్టములద్వారమున సంబంధముకలదు

పారిశ్రామికోత్పత్తులు 'చాకో' యుద్ధము ఈ దేశపు పరిశ్రమలకు ప్రప్రథమముగా ప్రోత్సాహము కల్పించెను అయినను ఈ దేశము పారిశ్రామికోత్పత్తులయందు వెనుకబడుటచే ఏ విధముగను స్వయంపోషకము కాదు అక్కడ ఉత్పత్తిచేయబడు ప్రధానవస్తువులలో ఆహారపదార్థములు, పానీయములు నేతబట్టలు, తోలుపనులు, విద్యుత్తు, రసాయనద్రవ్యములు, నిర్మాణపరికరములు పేర్కొనదగినవి సామాన్యమైనవస్తువులు నేటికిని అమెరికాసంయుక్తరాష్ట్రములనుండియు, గ్రేట్‌బ్రిటనునుండియు దిగుమతి చేసికొనబడుచున్నవి

రవాణాసౌకర్యములు రైల్వేమార్గమును పొడిగించు పథకములు 19 వ శతాబ్దిలో ప్రారంభింపబడినవి 1955 వ సంవత్సరమునాటికి రైలుమార్గము 1898 మైళ్ళవరకు పొడిగింపబడెను రైలుమార్గముద్వారా శాంతాక్రుజునకును, బ్రెజిల్, కొరంబా, లాపాజ్, యాకుయిబా, కోచాంబాలకును సంబంధమేర్పడినది శాంతాక్రజ్‌కును, బ్రెజిల్, అర్జెంటైనాలకును రైలుమార్గమువలన సంబంధమేర్పడినది ట్రంకులైను పీఠభూమికి అడ్డముగాపోవుచున్నది ఒకరైలుమార్గము పున అను తావునకు చేరుచున్నది ఇది వాయవ్యమందలి సరస్సునకు చెందిన ఓడరేవు మరియొక రైలుమార్గము ఆగ్నేయదిశయందున్న గాక్విసుండి లాపాజ్ వరకు విస్తరించినది లాపాజ్-కురెనబాక్, సుక్రే-టరబుకో - బొట్యూతే అనునవి ముఖ్యమైన ఇతర రైలుమార్గములు

20 వ శతాబ్ది తొలిభాగమున రోడ్డు రవాణా అభివృద్ధి చేయబడినది నేడచ్చటి రోడ్ల నిడివి 4768 మైళ్లు అయితే, అన్ని కాలములందును ఉపయోగించు రోడ్లపొడవు దాదాపు 1612 మైళ్లు మాత్రమే కోచబాంబా - శాంతాక్రజ్ అనునది అధిక ప్రాధాన్యము గల రోడ్డు నదులపైన, సరస్సులపైన 12,000 మైళ్లదూరము ప్రయాణించవచ్చును

జనసంఖ్య ఎక్కువ జనసంఖ్యగల ప్రదేశములు 8000 అడుగుల ఎత్తునకు పైగానున్నవి శాంతాక్రజ్, ట్రినిడాడ్ అను పెద్ద నగరములు మాత్రమే 6000 అడుగులకు దిగువగానున్నవి 1950 వ సం॥ నాటి లెక్కలనుబట్టి దేశమందలి జనాభా మొత్తము 30,10,031 వీరిలో భారత జాతీయులు 58 శాతమును, మెస్టిజోలు 30 శాతమును, తెల్లవారు 15 శాతమును ఉన్నారు తూర్పు బొలివియాయందున్న చిక్విటాలును, మోజోస్ అనువారును క్రైస్తవుల సాయమున పరిశ్రమలయందు ప్రగతిని సాధించిరి చిక్విటోలను వారు విశేషముగా దక్షిణ మైదానములో నివసించుచున్నారు ఇతర జాతులవారు నేటికిని తొలి నాగరిక దశయందే ఉన్నారు తెల్లవారిలో స్పెయిను జాతీయులు, పోర్చుగీసువారు, ఉత్తర అమెరికనులు చెప్పదగినవారు స్వల్ప సంఖ్యాకులైనను, వారు అన్ని రంగములలోను ప్రగతినొంది ప్రాబల్యము

వహించిరి, మెస్టిసోలు వ్యాపార, పారిశ్రామికాధిపతులుగా పేర్గాంచిరి భారతీయులలో పెక్కురు శ్రామికులు ఇటీవల లభించిన ప్రోత్సాహమువలన కొందరు అగ్రస్థలును, చెస్లో వతిలును ఉన్నట్టికి వచ్చి స్థిరనివాసముల నేర్పరచుకొనిరి ఈ దేశమున నాగరిక జనులు 98 శాతము మాత్రమే కలరు

విద్య బొలీవియాలో నిరక్షరాస్యుల శాతము ఎక్కువ బడికి మించియున్నది (1949) ఈ సంఖ్యాధిక్యమునకు భారతీయ గ్రామాభాహుళ్యమే కారణము ఇచ్చటగల 1566 ప్రాథమిక పాఠశాలలలో 1,41,881 మంది విద్యార్థులు, 101 ఉన్నత పాఠశాలలలో 17,089 మంది విద్యార్థులు కలరు పెక్కు నార్మల్ పాఠశాలలు, భారతీయులకొరకు పెక్కు విద్యాకేంద్రములును కలవు ఇచ్చట అయిదు విశ్వ విద్యాలయములు కలవు (1960) గ్రామీణ విద్యాభివృద్ధికి ప్రభుత్వము చురుకుగా కృషి చేయుచున్నది   మా ఇ

## బోధన పద్ధతులు

విద్యాలక్ష్యములను సాధించుటకు సక్రమమైన బోధన పద్ధతులు సాధనములుగ నుండగలవు తరగతి గదిలో ఒక చివరనుండు అధ్యాపకుడు, రెండవ చివరనుండు విద్యార్థికి విషయజ్ఞానమును ఏదోరీతిగా అందజేయుటయే బోధనపద్ధతి కాజాలదు సక్రమమైన బోధన విధానమువలన అధ్యాపకుని యొక్క వ్యక్తిగత ప్రభావము విద్యార్థియందు నూతన చైతన్యమును కల్పింపవలయును వారిరువురి నడుమ పరస్పర సాహచర్యవిధానమేర్పడవలెను. అందుచే విద్యార్థి సంపూర్ణ వికాసమును బడయును ఆతని సామర్థ్యము సమగ్రముగా పెంపొందును ఆతని జీవితము ఔన్నత్యము పొందును బోధనపద్ధతులు సక్రమమైనవి కానిచో ఫలితములు నిరుత్సాహకరమై, ప్రమాదకరములుగ నుండగలవు

విద్యా సిద్ధాంతములు, ఆశయములు మారుచుండుటతో బోధన పద్ధతులు సంస్కరింపబడుచుండును ఆధునిక కాలమున మనస్తత్వ శాస్త్రాభివృద్ధియగుటతో, బోధన పద్ధతులనుగూర్చి పెక్కు పరిశోధనములు, ప్రయోగములు జరుపబడినవి తన్మూలమున అనేక నూతన సూత్రములు, విధానములు ఆచరణములోనికి వచ్చినవి.

విద్యకు సాధనము విద్యార్థి స్వయంకృషిగాని, బోధనము కాదు ఆతని స్వయం యత్నము, స్వయంబోధనమే నిజమైన విజ్ఞాన వికాసములకు సాధనము, అధ్యాపకుని బోధన తక్కువై, విద్యార్థి స్వయంకృషి ఎంత యెక్కువైన విద్యావిధానము అంత శ్రేష్ఠమైనదగును బోధన పద్ధతులు బోధకుని అవసరమును తొలగించి, విద్యార్థి స్వయంకృషి సామర్థ్యమును అభివృద్ధి నొందింపవలెను పద్ధతులు క్రియాత్మకముగనుండి, విద్యార్థి అందులో పాల్గొనునట్లుండవలెను అది మనస్తత్వ శాస్త్రము ననుసరించి యుండవలెను

బోధనపద్ధతులు పెక్కు అంశములపై ఆధారపడి యుండును అధ్యాపకునికి, విద్యార్థికిని కల పరస్పర సంబంధము, బోధన లక్షణములను, బోధన పరిమితిని కూడ నిర్ణయించును అధ్యాపకుని న్యాయదృష్టి ఉన్నతాశయములు అతని పాఠ్య విషయజ్ఞానము, విద్యార్థి యెడ కల ఆతని సౌమనస్యము ప్రజ్ఞావిశేషము బోధనపద్ధతిని చాలవరకు నిర్ణయించును కొన్ని బోధన పద్ధతులు సంప్రదాయముగ వాడుకయందు గలవు వాటిని అధ్యాపకులు అభ్యసించుటయు గలదు

బోధన పద్ధతులు విద్యార్థి పూర్వజ్ఞానమును వీడి నూతన జ్ఞానమును బడయుటకు అతనికి దోహదమొసగును ఇంద్రియ గోచరములగు విషయములనుండి, భావోదయమును కల్పించుటకును, సులభమగు నిర్ణయములనుండి క్లిష్టమగు విషయములను గ్రహించుటకును. తెలిసిన వాటినుండి తెలియనివాటిని గ్రహించుటకును బోధన పద్ధతులు తోడ్పడును.

బోధనపద్ధతి ద్వివిధము (1) ఉపాధ్యాయుడు కేంద్రముగ నుండునది (2) విద్యార్థి కేంద్రముగ నుండునది కంఠస్థవిధానము ఉపన్యాసవిధానము, ప్రస్తుతము విరివిగా వాడుకలోనున్న లేఖనవిధానము, కేవలము ఉపాధ్యాయుడు కేంద్రముగనుండు పద్ధతికి చెందినవి ఇవి అవాంఛనీయములైనవి కాగా, విద్యార్థికేంద్రముగనుండు విధానములు మనస్తత్వశాస్త్ర సిద్ధాంతమును పాటించును ఇవి వ్యక్తికి ప్రాధాన్యము నిచ్చి, స్వీయ జ్ఞానార్జనమును ప్రోత్సహించును ప్రస్తుతమీక్రింది బోధన పద్ధతులు విద్యావిధానమునందు ఉపయోగకరములుగ నున్నవి

1 వ్యవచ్ఛేదన పద్ధతి, సమన్వయ పద్ధతి మానవుడొక నూతన విజ్ఞానమును బడయుటకు, ఆ నూతన విషయమును వ్యవచ్ఛేదమొనర్చి, తిరిగి సమన్వయపరచి, జ్ఞానమును పొందును ఇది సహజ మనఃప్రవృత్తి ఈ పద్ధతులు చానినను

పరించి యుండును తెలియని విషయమునుండి వ్యవచ్ఛేదము ద్వారా తెలిసిన విషయములకు మార్గమును నిర్ణయించి, మరల తెలిసిన విషయములనుండి సమన్వయముద్వారా అదే మార్గమునసుసరించి తెలియనిదానిని గ్రహించుట లేక సమస్యాపరిష్కారముచేయుట జరుగును ఇందు వ్యవచ్ఛేదమువలన ప్రతిస్థాయియు సహేతుకముగ నుండి మనోవికాశమునకు దారితీయును కేవలము సమన్వయ పద్ధతిని వాడిన ప్రతిస్థాయిని, 'ఎందుకు?' అని ప్రశ్నించుచో, సహేతుకమగు సమాధానము లభింపదు సామాన్యముగ గణితశాస్త్రమునందును, సమస్యా సాధనమునందును, శాస్త్ర ప్రసక్తిగల ఇతర శాస్త్రీయ విషయములను బోధించుటయందును, ఈ పద్ధతులుపయోగించును విద్యార్థికి యోచనాశక్తియు నూతన సమస్యలను స్వయముగ పరిష్కరింపగల శక్తియు అలవడును

2. ప్రతిష్ఠాపన పద్ధతి, ప్రయోగ పద్ధతి కొన్ని ప్రత్యేక విషయములను లేక వస్తువులను పరిశీలించి అందుండి అట్టి ఇతర విషయములకు లేక వస్తువులకన్నింటికిని వర్తించు ఒక సామాన్య సూత్రమును ప్రతిపాదించుట ప్రతిష్ఠాపన పద్ధతి యనబడును సకల శాస్త్రజ్ఞానమును అభ్యసించునపుడీపద్ధతి అనుసరింపబడును ఒక సూత్రమును ప్రయోగించి, విషయములను గ్రహించు పద్ధతి లేక వివరించు పద్ధతి ప్రయోగ పద్ధతి అనబడును తార్కికానుమానములను ప్రతిపాదించునపుడును క్షేత్రగణితమున తర్కసరణియందును ఈ పద్ధతి ఉపయోగింపబడుట అందరు ఎరిగిన విషయమే ప్రతిష్ఠాపన పద్ధతి వలన ప్రతిపాదింపబడిన సూత్రముయొక్క సత్యమును ప్రయోగపద్ధతివలన గృహపరచుట లేక రుజువొనర్చుట జరుగును

3. అన్వేషణా పద్ధతి విద్యార్థులు స్వయంకృషితో, స్వయం ప్రయోగముతో, స్వానుభవముతో, విషయజ్ఞానమును బడయజేయు పద్ధతి అన్వేషణా పద్ధతి అనబడును మానవ జాతి జ్ఞానమును బడసిన పద్ధతి ఇదియే నూతన విషయములను సమస్యారూపమున ప్రదర్శించుటచే, విద్యార్థుల యోచనాశక్తియు, స్వయం కృషియు పెరుగును ప్రతిబోధన పద్ధతియందును ఈ యన్వేషణా విధానమును అవలంభింపవలెను

4 పరిశోధన పద్ధతి విజ్ఞాన శాస్త్రాభివృద్ధికి ప్రయోగము, పరిశోధనము సాధనములు ఈ పద్ధతినే పాఠశాలలో ప్రతివిషయ బోధనమునందును అనుసరించుట మిగులఉపయోగకరమని భావింపబడుచున్నది పరిశోధనశాలయందు విద్యార్థి పాఠ్యవిషయమునకు సంబంధించిన ఉపకరణములతో స్వయముగ ప్రయోగమును సలిపి, పరిశోధనమొనర్చి వ్యక్తిగతముగ విజ్ఞానమును పొందును తన సామర్థ్యమును, నేర్పును పెంపు చేసికొనును విద్యార్థి యథాశక్తి పరిశోధనములను జరుపును ప్రయోగములు ఇంద్రియ ప్రభావమున కనువుగ నుండును కావలసిన పరికరములు ప్రయోగశాలయందు పొందుపరుపబడియుండును ఉపాధ్యాయులు నిర్ణీత ప్రయోగ విషయముల పట్టికలను తయారుచేసి విద్యార్థులకిచ్చెదరు వాటిననుసరించి విద్యార్థులు తమ అవధానమును శక్తిని ఉపయోగించి నిర్వహింతురు ఈ బోధన పద్ధతి మిగుల శ్రేష్ఠమైనదిగా భావింపబడుచున్నది

5 డాల్టన్ పద్ధతి తరగతిలోగల విద్యార్థుల వ్యక్తిగత ప్రజ్ఞావ్యత్యాసములను గుర్తింపవలసి యుండును అందుచే 1919 లో డాల్టన్ అను పట్టణములో మిస్ హెలెన్ పార్క్‌హర్స్ట్ అను ఆమె తరగతిలోని వక్తులందరికి ఒకే రీతిగా బోధనము సల్పుట ఉచితము కాదని తలచి, వ్యక్తుల తెలివితేటలలోగల భేదములననుసరించి వారు స్వేచ్ఛగా, ఇష్టమొచ్చిన విషయములను ఇష్టమొచ్చినంతవరకు అభ్యసించుటకు అనువుగా ఒక 'పరిశోధనపాఠశాల' ను స్థాపించెను అధ్యాపకుల బోధనమునకుకంటె, విద్యార్థుల అభ్యాసమునకెక్కువ ప్రాధాన్యముండుటచే నిర్ణీతకాలములో విద్యార్థి అభ్యసింప వలసిన విషయ నిర్ణయ పట్టికలను, అభ్యసనవిధానమును, వివరములతో సూచించుచు, విద్యార్థులకియ్యబడును అధ్యాపకులు బోధకులుగా గాక, సలహాదారులుగ నుండురు అభ్యాసమున కవసరమైన పుస్తకములు, ఉపకరణములు, సాధనములు, పాఠశాలయందుండుట వలన, విద్యార్థులు పరస్పర సహకారముతో స్వేచ్ఛగా, విద్యాభ్యాసమొనర్చెదరు ఈ పద్ధతిలో కొన్ని ప్రతిబంధకములు గలవు అయినను, వాటిని సామర్థ్యముతో ప్రతిఘటించి, కార్యక్రమమును నిర్వహించినచో, విద్యార్థులు విద్యాలక్ష్యములను సాధింపగలరని విద్యావేత్తల విశ్వాసము

క్రీడా పద్ధతి ఈ పద్ధతి సామాన్యముగ ప్రాథమిక పాఠశాలలలో ఉపయోగపడును బాల్యదశలో క్రీడలపై విద్యార్థులకు ఆసక్తిమెండు వారికి క్రీడయేపని, పనియే క్రీడ,

కను ఆసక్తి, అభిరుచి గల క్రీడలవలనను బోధనను జరుపుట ఉచితమగు పద్ధతి. భాషాబోధనమున గణితబోధనమున ప్రకృతి శాస్త్రబోధనమున, పాఠ్యాంశములకు తగిన క్రీడలను కల్పించి విద్యార్థులు, వాటినాడుటద్వారా ఆవిషయమును అభ్యసించునట్లు చేయు క్రీడాపద్ధతి ప్రాథమికపాఠశాలలందు విరివిగా అనుసరింపబడుచున్నది.

ఉద్యమ పద్ధతి : సహజస్థితిలో ఒక ఉద్దేశ్యపూర్వక కృత్యమును పూర్తిగాసాధించుట ఉద్యమ మనబడును. మానవ జీవితములో జ్ఞానోదయమునకు అతడెదుర్కొనవలసిన సమస్య మూలమగును. సమస్యయొదవినంతనే యోచనాశక్తి, దానిని సాధింపవలెనను సంకల్పము, అందులకవసరమగు ఉపకరణములను కూర్చుకొనుట ఘటిల్లును. తద్ద్వారా జ్ఞాన మలవడును. అంటే సమస్య సహజము గనుండి, సహజస్థితిగతులందు పరిష్కరింపబడుటకు కావలసిన అనుభవజ్ఞానములు జీవితమున ఎంతయు అవసరము కనుక పాఠ్యభాగములను సమస్యాపరిష్కారముతో సమన్వయించుచు, అభ్యసింపజేయు పద్ధతి ఉద్యమ పద్ధతి అనబడును. ఒక ఉద్యమమును సంకల్పించి, దానిని సాధించునప్పుడు విద్యార్థులు పెక్కు జీవితావసరముల విషయజ్ఞానమును స్వానుభవముతో గ్రహించెదరు. ఇది చాల శ్రేష్ఠమగు పద్ధతిగా విద్యావేత్తలంగీకరించెదరు.

కృషి కేంద్రపద్ధతి : ఇది బేసిక్ విద్యావిధానమునందలి ముఖ్యపద్ధతి. మానవునకు ఉపయుక్తమగు ఉత్పత్తిని సాధించు కృషిని కేంద్రముగగొని, దానితో విద్యాబోధనమును సమన్వయపరచుచు బోధించు పద్ధతిగా ఇది పేర్కొనదగును. మానవుడవలంబించు వృత్తికిగాని, అతని జీవితావసరములకై చేయుకృషికిగాని ఈ పద్ధతి నాందిగనుండును. ఈవిధమగు వృత్తి ననుసరించు కృషిని కేంద్రముగగొని విద్యాబోధనము జరుపుటయే మహాత్మగాంధి ప్రతిపాదించిన బేసిక్ విద్యావిధానమునకు మూలము.

విద్యార్థులు బోధన క్రమములో పాల్గొనునట్లొనర్చునట్టియు, వారిచైతన్యమును ప్రవృద్ధమొనర్చునట్టియు అనేకవిధములైన బోధనపద్ధతులలో కొన్ని ఇటీవల ప్రతిపాదింపబడినవి. అందు, అల్పవయస్కులగు విద్యార్థుల స్వయంబోధానుగుణ మగు 'మాంటిసోరీ' పద్ధతిని 'కిండర్ గార్టన్' పాఠశాలల యందుపయోగించుచున్నారు.

భో. మా.

## బోధాయనమహర్షి

బోధాయనమహర్షి ఆంధ్రుడు. ఆంధ్రులకు సంస్కారార్హతను ప్రసాదించి ఉద్ధరించినవారిలో ఆపస్తంబుని బోధాయనుని ప్రధానముగా చారిత్రికులు పేర్కొనుచున్నారు. ఇతడు శ్రౌతసూత్రమును, గృహ్యసూత్రమును ధర్మసూత్రమును, మహాన్యాసకల్పమును, బ్రహ్మసూత్రవృత్తిని మరికొన్ని గ్రంథములనుకూడా ఈమహర్షి రచించినట్లు తెలియుచున్నది.

వైదిక వాఙ్మయమునకు చెందిన సూత్రములు కల్పసూత్రములనియు (శ్రౌతసూత్రములు) గృహ్యసూత్రములనియు, ధర్మసూత్రములనియు, త్రివిధములు. అన్నిటికిని గూడ మొత్తముగా కల్పసూత్రములను పేరు కలదు. ఐనను ఈ నామము శ్రౌతసూత్రములకు స్థిరపడినది. ఈ కల్పసూత్రములన్నియు ఆయాశాఖల బ్రాహ్మణముల ననుసరించి ఆవిష్కరింపబడినవి.

వేదములలోని మంత్రములకు వివిధక్రతువులలో ఉపయోగించు విధానములను సూత్రించువారు శ్రౌతసూత్రకారులనబడిరి. బోధాయనుడీ శ్రౌతసూత్రకారులలో నొకడు.

బోధాయనుని శ్రౌతసూత్రము ముప్పది ప్రశ్నల గ్రంథము. దీని కనేక వ్యాఖ్యానములు కలవు. ప్రతివ్యాఖ్యాతయు బోధాయనసూత్ర ప్రయోజనమును కొనియాడెను. అందు కల్పవివరణకర్తయగు భావస్వామి 'ఒక్కొక్కశాఖకు బ్రాహ్మణము లధికమగుటచేతను, వాటి యర్థము దుర్బోధమగుటచేతను, దానినంత నొకచోటచేర్చి చక్కగా వివరించిన యెడల యాగముచేయగోరువారెల్లరు సుఖముగా కర్మములాచరింతురను తలంపుతో బోధాయనముని ఈ కల్పమును రచించెననెను. శ్రౌతసూత్రములలో ఆపస్తంబముకంటె బౌధాయన మెక్కువ ప్రమాణముగ నుండినది. బోధాయనుని శ్రౌతసూత్రరూపమైన వాక్యముల విద్యాంసులద్వారసముద్రము నావలియొడ్డుగాంచు చున్నారని సాయణాచార్యులొనర్చిన ప్రశంస బోధాయన శ్రౌతసూత్రము యొక్క ప్రశస్తికి తార్కాణము.

బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, యత్యాశ్రమము అను నాలుగాశ్రమములు వేదవిహితములు. జన్మప్రభృతి మరణమువరకు జాతకర్మాది షోడశసంస్కారములు విధింపబడినవి. ఈ సంస్కారములను ఆచరించుటకు

ఆవశ్యకములైన మంత్రములు విశ్వసంస్కారములందు వినియోగించు విధానములు గృహ్యసూత్రములందు పేర్కొనబడినవి. ఈ సూత్రముల రచించిన మహర్షులను గృహ్యసూత్రకారులందురు. ఆశ్వలాయనుడు, ఆపస్తంబుడు, యాజ్ఞవల్క్యుడు, బోధాయనుడు మొదలగువారు గృహ్యసూత్రకారులు. ఆంధ్రదేశమున బ్రాహ్మణులలో ఆశ్వలాయనులనియు, ఆపస్తంబీయులనియు, యాజ్ఞవల్క్యులనియు, బౌధాయనులనియు వివిధశాఖలవారు కనబడుచున్నారు. ఆయా గృహ్యసూత్రముల ననుసరించి వివాహాది సంస్కారముల నాచరించువారగుటచే వారికాయా శాఖానామములు కలిగినవి.

బౌధాయన గృహ్యము నాల్గుప్రశ్నల గ్రంథము. ఇందు 12 అధ్యాయములు గలవు. దీనికనుబంధముగా రెండు ప్రశ్నల పరిభాష, మూడుప్రశ్నల గృహ్యశేషము, మూడుప్రశ్నల పితృమేధము అను మూడు సూత్ర గ్రంథముల నర్వాచీనులెవ్వరో రచించి బోధాయన గృహ్యమున కనుబంధముగా చేర్చియుందురని కొందరూహించినారు.

బోధాయన ధర్మసూత్రము నాలుగుప్రశ్నల గ్రంథము. ఇది వచనాత్మక గ్రంథమైనను, అనేక శ్లోకములతో కూడియున్నది. ఇందలి ఒక్కొక్క ప్రశ్నమునకు ఎనిమిది మొదలు పండ్రెండువరకు అధ్యాయములు కలవు. ఇదియొక స్మృతి గ్రంథము. అపౌరుషేయములగు వేదములలోని విధి నిషేధాత్మక విషయములను ఒక్కచో చేరించి తత్తదాశ్రమానుగుణముగ విభజించి, మహర్షులు ధర్మమును సుబోధమొనరించిరి. ఇట్టి గ్రంథములను స్మృతులందురు, స్మరింపబడినవి కావున స్మృతులనబడినవి. మను, పారాశర, గౌతమధర్మసూత్రములీ శాఖకు చెందినవి. ఇట్టి స్మృతులలో బోధాయన ధర్మసూత్రమొకటి.

'స్వసూత్రే విద్యమానేతు పరసూత్రేణ వర్తతే
బౌధాయన మతంకృత్వా స్వసూత్రఫల భాగ్భవేత్'

ఏశాఖవారైనను తమసూత్రమున్నప్పటికిని పరసూత్రమననుసరించి ఆచరింపవలసి వచ్చెనేని బౌధాయన సూత్రములను ఇట్టి నడచినచో స్వసూత్రము నవలంబించిన ఫలమే పొందుదురని వృద్ధమనువు చెప్పెను. ఈ సూత్రముపై గోవిందస్వామి వ్రాసిన వ్యాఖ్య ప్రసిద్ధము.

శ్రౌత గృహ్య సూత్రములందువలెనే ధర్మసూత్రములందును సంప్రదాయ భేదములు కొన్ని కానవచ్చును. అంతే కాదు, దేశభేదములనుబట్టి వచ్చిన ఆచారభేదములు కూడ కొన్ని కనిపించును. ఆపస్తంబము షడ్విధ వివాహములను చెప్పినది. గౌతమాదులు అష్టవిధవివాహములను పేర్కొనిరి. గాంధర్వమును ఉత్తమ వివాహములలో నేదియు చేర్చలేదు. మనువిచ్చిన కొందరాసురగంధర్వములు సమ్మతించినట్లు గౌతమ సూత్రముచెప్పినది. బ్రాహ్మార్ష దైవములు మూడే ప్రశస్తములని ఆపస్తంబమనినది. దీనికి ప్రాజాపత్యమును చేర్చి నాలుగుప్రశస్తములని బౌధాయనము వక్కాణించినది.

బోధాయనుడు శాఖాభేదమున కతీతమై సేతువు మొదలు హిమాచలపర్యంతము వ్యాప్తముగనున్నది. బోధాయనుని మహాన్యాసకల్పము దేవతాతాదాత్మ్యమును పొందక దేవతనర్చింపరాదు అను నర్థమును తెలుపుచు "నారుద్రో రుద్రమర్చయేత్" అను వాక్యమొకటి కలదు. తనను గురువుగ శరీరావయవములందు మంత్రములచే దేవతలను విన్యాసమొనర్చుటను న్యాసమందురు. అతిన్యాసములు ఉపాసనలందు కన్పించును. ఆ న్యాసములందు సామాన్యముగ మంత్రాంతరములు ఉపయుక్తము లగుచుండును. మహాన్యాసమున అట్లుగాక వేదమంత్రములే ఉపయోగింపబడినవి. కావుననే మహాన్యాసమను నామము దీనికెంతయు తగియున్నది.

మహాన్యాసము ఈశ్వరాభిషేకమునకు పూర్వాంగము. ఇందు అంగములకు రుద్రత్వాపాదకములైన పంచవేద మంత్రన్యాసములుండుటచే "అథాతఃపంచాంగరుద్రాణాం" అను వాక్యముతో ఇది ఆరంభింపబడినది. ఈ న్యాసముచే రుద్రత్వము నొందిన సాధకుడు ఏకాదశవారములు (నమకము) రుద్రముతోడను, ప్రతి రుద్రాంతమునందును చమకములోని యొక అనువాకముతోడను, ప్రతి పర్యాయము రుద్రారాధనముతోడను, అభిషేకమొనర్చిన పాపక్షయము ఘటిల్లి వ్యాధియు, శత్రువులునశించి, శాంతియు, పుష్టియు తుష్టియు ప్రజ్ఞయు, మేధయు, ఆయురారోగ్యైశ్వర్యాదులును కల్గునని బోధాయనులు వచించిరని మహాన్యాసాంతమున కలదు. ఈ విధానము కామధేనువువంటిది. కావుననే సేతు మొదలు శీతనగ పర్యంతము శాఖాద్యతీతముగ స్థిరమైనది. ఇట్టి కల్పమును ప్రసాదించిన బోధాయనుడు నమస్కార్యుడు.

కావున బోధాయనుడు సూత్రయుగమునకు చెందిన వాడనియు మహర్షియనియు, శాఖాప్రవర్తకుడనియు, ఆంధ్రుడు, శుద్ధాంధ్రుడు. శ్రౌత సూత్ర-గృహ్యసూత్ర-ధర్మసూత్ర-మహానామాది కల్పకర్త అనియు తెలియుచున్నది. ఈ మహర్షి కృతి సర్వసూత్ర రచనలయందును సమగ్రత యనునది యొక ధర్మము. ఇతర సూత్రముల రచనయందు అనుక్తములు, అన్యసూత్ర కర్తలనుండి గ్రాహ్యము లగుచున్నవి. కాని బోధాయన రచిత సూత్రములందితరాపేక్ష యుండదని విజ్ఞుల ఆశయము.

మా. శి. కృ. శా.

## బౌద్ధ దేవతలు

ప్రాచీన మతము లన్నింటిలోవలె బౌద్ధమతమునందును అసంఖ్యాక దేవతలు వెలసిరి. ఈ దేవతలను బోధిసత్త్వులందురు. వీరందరిలోను అవలోకితేశ్వరుడు, మంజుశ్రీ అను వారిద్దరు గొప్పవారు. మైత్రేయుడు, సమంతభద్రుడు, మహాస్థామప్రాప్తుడు, క్షితిగర్భుడు అనువారలు చైనాలో జపానులలో ప్రముఖులుగా పేర్కొనబడినారు.

అవలోకితేశ్వరుడు: అవలోకిత బోధిసత్త్వుని ఆవిర్భావ వృత్తాంతము అవిదితము. ఇతడు విశ్వకారుణ్యావతారము. ఈతని సంపూర్ణ నామము అవలోకితేశ్వరుడు. అవలోకితుడు అనగా (స్వర్గమునుండి) భూమిని జూచువాడు. ఈ శబ్దమునకు అంతటను దృశ్యమానుడు అనికూడ అర్థము చెప్పుచున్నారు. కాంతిమయ (ఉజ్జ్వల) నయనములతో వీక్షించువాడని టిబెటీయులు దీని అర్థము చెప్పుదురు. ఇతడు తనను ధ్యానించువారిని నౌకాభంగములనుండి, మరణశిక్షనుండి, తస్కరులనుండి, హింసనుండి, దుఃఖమునుండి, దురాశనుండి, వైషమ్యమునుండి, అపరాధమునుండి తప్పించువాడు. తనను పూజించు స్త్రీలకు సంతాన భాగ్యమును ఇతడు కల్గించును. సాధారణముగా స్త్రీలకు సంతానలాభమును కలిగించు స్త్రీ దేవతలకు గల శక్తిని కలిగియుండుటచే చైనీయులు ఈతనికి స్త్రీత్వమును అంటగట్టినారు. తన కరుణామయ కార్యజాతము సఫలము చెందుటకు ఇతడు వివిధ రూపములను ధరించును. బుద్ధుడుగనో, బోధిసత్త్వుడుగనో, హిందూ దేవతగనో, పిశాచముగనో, బ్రాహ్మణుడుగనో ఇతడు పెక్కు రూపములను దాల్చును. ఇంత యేల, అవసరము ననుసరించి ఏ రూపము నయినను ఇతడు వహింపగలడు.

అవలోకితేశ్వరునకు ఇతర బోధిసత్త్వులకువలెనే పెక్కు నామములు కలవు. వాటిలో మహాకరుణ, లోకనాథ, లోకేశ్వర, పద్మపాణి అనునవి ముఖ్యనామములు. ఇతని విగ్రహము మానవాకారమున నుండును. ఇతడు రాజరాజేశ్వరునివలె మకుటధారియును సర్వాభరణ భూషితుడై యుండును. ఈతని కిరీటమునందు "అమితాభుని" చిన్న విగ్రహమును ఉండును. ఇతని కుడిచేయి సుందరముగా చాచబడి యుండును. ఇది "వరముద్ర"ను సూచించును. ఇతడు తన ఎడమచేతిలో ఎఱ్ఱని కమలమును ధరించి యుండును. ఇతని శరీరచ్ఛాయ తెలుపో లేక రుపో అయి యుండును. కొన్ని సందర్భములందు ఇతనికి నాలుగు హస్తము లుండును. తరువాతి విగ్రహములకు పెక్కు హస్తములు కనబడుచున్నవి. పద్మమునేకాక, ఇతడు గ్రంథము, జపమాల, అమృతభాండము, ఇత్యాది వస్తువులను గూడ వహించి యుండును.

అవలోకితేశ్వరుని విగ్రహమునకు పెక్కు కండ్లు, చేతులు ఉండుటవలనబట్టి అతడు అన్ని భాగములందుండు దుఃఖభాగులను గురించి, వారికి చేయూత నొసగుచుండునని తోచును.

ఈ బోధిసత్త్వుడు ఏ హిందూదేవతకును ప్రతిగాడు. ఇతనికి కల గుణవిభూతులు బ్రహ్మయొక్క గుణవిభూతులను పోలి యుండును. ఇతని స్వీయరూపమునుండియే జగత్తు వికాసము నొందినదని చెప్పబడినది. కాని ఇతనికి గల ప్రత్యేక విలక్షణము "సృష్టి" విధానము కాదు. ఇతడు విష్ణువువలె "స్థితి"కారకుడై పద్మహస్తుడై ఉండును. ఇతనికి శివుడను అర్థమిచ్చు "ఈశ్వర" శబ్దమును గూడ బిరుదముగా చేర్చినారు. అవలోకితేశ్వరుని గర్భకుహరమునందు సమస్త లోకములు, పర్వతములు ఉండును. ఇందు యోగులు, దేవతలు నివసింతురు.

తార: అవలోకితేశ్వరుని అనుసరించి తరుచుగా స్త్రీ విగ్రహ మొకటి యుండును. ఆమె పేరు "తార". తాంత్రిక విద్య ప్రచారములో నున్నకాలమందు ఈ "తార" ఈతని భార్యగా పరిగణింపబడినది. ఈమెను బోధిసత్త్వరూపిణినిగా ఆరాధించినట్లు కనబడుచున్నది. టిబెత్తులో "తార" అతి ప్రాధాన్యముగల దేవత. ఈమెయు పెక్కు రూపములు ధరించును.

తార అనగా తరింపజేయునది. అనగా, సకలబాధా

సమన్వితులగు ప్రాణులను సంసార సాగరమును దాటించునది ఈ నామమున మొట్టమొదట ప్రచారము చేసినవారు బౌద్ధులో, బ్రాహ్మణులో తెలియదు కాని పదవ శతాబ్దిని తరువాత శివశక్తులకు గల మహిమను తారయందు ఆరోపించి నట్లు స్పష్టమగుచున్నది ఈమెకు అష్టోత్తర శతనామములు కలవు ఈ నామావళియందు సాధుగుణ విభూతులను సూచించు నామములతోపాటు దుష్టసంహారకత్వ సూచకము లయిన భయానక నామములుకూడ చేర్చబడి యున్నవి ఈమె కపాలధారిణి యనియు, వేదమాత యనియు, వ్యవహరింప బడినది దీనివలన బౌద్ధులు (శైవశక్తి దేవతను అనుకరింపక పోయినను), శైవ సంప్రదాయ భావములను బోధిసత్త్వునకు ముడిపెట్టినట్లు తోచుచున్నది

**మంజుశ్రీ** మంజుశ్రీ రెండవ మహా బోధిసత్త్వుడు ఇతనికి మంజునాథుడు, మంజుఘోషుడు అను నామములును గలవు వాగీశ్వరుడు, కుమారభూతుడు అను నామాంతరము లనుకూడ కలిగి యుండుటచే ఇతడు రాకుమారుడనియు, బహుశఃముగ బుద్ధుని కుమారుడయి యుండుననియు, తలచు చున్నారు ఇతడు మైత్రేయ బోధిసత్త్వుని గురువు. ఇతడు శాశ్వత యౌవన సంపన్నుడగుటచే అసంఖ్యాకయుగ పరం పరనుండి వెలసిన బుద్ధుల నందరినిగూర్చి ఇతనికి బాగుగ తెలియును ఇతనికి విధిగా భార్య లేదు వివేక పత్నీల సమ న్వితయగు పుంభావ సరస్వతిగా ఇతడు కనబడును అయితే, కొన్ని సందర్భములందు లక్ష్మియో, సరస్వతియో, లేక వీరిద్దరో ఇతని భార్యలుగా చేకొనబడిరి ఇతని రూపాం తరములను గూర్చియు, ఇతని అద్భుత కార్యకలాపములను గూర్చియు పెక్కు గాథలు కలవు

మంజుశ్రీ ఆరాధన సంప్రదాయము హిందూస్థానము లోనేగాక నేపాలు, టిబెత్తు, చైనా, జపాను, జావా అను తావులలో కూడ ప్రబలినది మధురలో ఇతని పేర అంకిత మైన స్తూప మొకటి కలదట ఇతడు "ఆపీత" వైరోచనులను మహానుభావులైన మానవులయొక్క అవతారములను గూడ కల్పించాడు. ఇతడు మిక్కిలి దయామయుడయ్యును, మానవాళికి సహకారి కాడు

ఈతడు భావరు విజ్ఞానమునకుతపస్సంపదకు అధిష్ఠాన దేవతగా మానవాళి ఉపకరించడు అందుచేతనే ఇతడు తన చేతులలో, పిడ్డాక ఖడ్గమును ఒక గ్రంథమును ధరించి యున్నాడు ఇతడు బంగారు వన్నె ఆకృతికలవాడు ఇతడు తనచేతులలో ఎట్టి చిహ్నములను ధరించనప్పుడు వాటిని దాచి ధర్మచక్రమును పట్టుకొని యుండును ఇతని విగ్రహముల ప్రత్యేకతను నిరూపించునవి ఇందీవరము సింహము సింహ ముపై ఇతడు కూర్చుండి యుండును మంజుశ్రీ ఒకదేవత యను భావము క్రీ శ 6 వ శతాబ్దిలో ప్రభవించినట్లు కనబడు చున్నది

**మైత్రేయుడు** అవలోకితుడును, మంజుశ్రీని, తరువాత అత్యంత ప్రాధాన్యము చెందిన బోధిసత్త్వుడు మైత్రేయుడు ఇతనికి అజితుడు (జయింపబడనివాడు) అను నామాంతరము కలదు ఇతడు ఇతర బోధిసత్త్వులవలె ఉన్నత స్థాయిలో నుండడు వారు మానవాతీత శక్తి సంపన్నులు మైత్రేయుడు గౌతమునివలెనే పెక్కు జన్మములెత్తి చివరకు బుద్ధత్వమునకు పాత్రుడయినవాడు ఇతడు మంజుశ్రీకి ఉప దేవతగా ముఖ్యపాత్రను వహించును ఇతని విగ్రహములు బౌద్ధ ప్రపంచములో పెక్కులు గలవు ఇతడు ధర్మచక్ర ప్రవర్తన కార్యకలాపములను పరిరక్షించుచుండును ఇతని పేర అంకితమయిన ప్రసిద్ధ దేవాలయ మొకటి మధ్య ఆసి యాలో తురఫాన్ అను నగరమునందు కలదు ఆ దేవా లయము నందలి శాసన లిఖితములనుబట్టి, ఇతడు పెక్కు రూపములను ధరించునని తెలియుచున్నది ఇతడు ఎల్లప్పుడు కర్మనిరతుడై కరుణాన్వితుడై యుండును తనతరువాత మైత్రేయుడే అవతారము దాల్చునని శాక్యముని చెప్పి యున్నాడు చిత్రములలోని ఇతని రూపము సువర్ణ ఛాయ కలదై యుండును ఇతడు పద్మాసనాసీనుడు కాడు నిలు చుండియో, కూర్చుండియో యున్నట్లు ఇతని విగ్రహము లుండును మైత్రేయుడు బుద్ధత్వము పొందినతరువాత తుషిత స్వర్గమున కధిపతి యగును చంపక వృక్షముక్రింద మూడు సభాసమావేశములు జరుపును. శాక్యమునికి బోధివృక్షమెట్లో మైత్రేయునకు చంపకవృక్షమట్టిది శాక్యముని బోధివృక్షము క్రింద పరమజ్ఞానమును పొందినట్లు మైత్రేయుడు చంపక వృక్షము క్రింద పరమజ్ఞానమును పొందెను

**సమంతభద్రుడు** సమంతభద్రుడు సుప్రసిద్ధ బోధి సత్త్వుడు ఇతడు శాంత్యనుగ్రహముల కాలవాలము టిబెత్తులో ప్రజలకు అత్యంత ప్రియమైన దేవత ఇతడు

ఆకుపచ్చని రంగులో ఏనుగుపై సవారి చేయుచున్నట్లు చిత్రించబడును బౌద్ధధర్మములను చక్కగా పాటించువారిని రక్షించుట ఈతని విధ్యుక్తధర్మము

**మహాస్థాన ప్రాప్తుడు:** మహాస్థాన ప్రాప్తబోధిసత్త్వుడు సమంతభద్రుని పోలినట్టివాడే ఇతడు, అమితాభుడు, అవలోకితుడు త్రిమూర్తులుగా స్వర్గభూమిని ఏలుచుందురు వజ్రపాణి బోధిసత్త్వుల పరంపరలో చేరినవాడు హిందువుల ఇంద్రుడనే బౌద్ధదేవతగా మార్చినట్లు కనబడుచున్నది

**క్షితిగర్భుడు:** క్షితిగర్భబోధి సత్త్వునకు కొంత ప్రాముఖ్యము కలవాడయినప్పటికిని, ఈతని పుట్టుపూర్వోత్తరములు సరిగా తెలియవు క్షితి (భూమి) స్త్రీ దేవతగా సంభావితమైనది క్షితిగర్భుడు నిస్సంశయముగ పురుషదేవత అయినప్పటికిని ఈతని యొద్ద స్త్రీ లక్షణములు కొన్నికలవు ఇతడు పూర్వజన్మములలో రెండుసార్లు స్త్రీగా జన్మించినాడట! ఇతడు ప్రసవావస్థలోనున్న స్త్రీలకుతోడ్పడును ఈతోడ్పాటు కార్యము స్త్రీదేవతలకు విహిత కార్యమయ్యును, ఈతడే, వరప్రసాదియగుట విచిత్రము ఇతడు ముఖ్యముగా పాతాళలోకాధిపతి అయితే అమితాభ-అవలోకితులవలెనే ప్రాణికోటి రక్షణమే తనకర్తవ్యముగా ఇతడు నిశ్చయించెను వారిని నరకప్రవేశమునుండి తప్పించుటయే, తన ప్రత్యేక విధిగా ఇతడు తలచెను ఇతడును, తరచుగా ఒకపరివ్రాజక రూపమున చిత్రింపబడును ఇతడు ముండితశిరస్కుడయి యొక దండమును ధరించియుండును

**ధ్యానిబుద్ధులు:** మహాయాన బౌద్ధమతానుసారము, గౌతమబుద్ధుని తరువాత పెక్కుమంది బుద్ధదేవులు అవతరించుటకలరు ఈ బుద్ధజన్మాంతర భావన క్రమాభివృద్ధిచెంది, ఎందరో వ్యక్తులు కల్పితులైరి ఈ బుద్ధులను సాధారణముగా తథాగతులందురు వీరందరు ఈ లోకమువారుకారు వీరు విశ్వమునయొక్క అన్నిదిక్కులకును చెందియుందురు వీరుండు మరములను క్షేత్రములందురు వీరినామములు ఒకేవిధముగా నుండవు అసంఖ్యాకులగు ఉజ్జ్వల బుద్ధులు అనంతప్రాంతములను ప్రకాశింపచేయుచుందురు

అలౌకికబుద్ధదేవులలో ఐదుగురిని పంచజనులనుగా భావించిరి ఈజనులనే ధ్యానిబుద్ధులందురు

వైరోచనుడు, అక్షోభ్యుడు, రత్నసంభవుడు, అమితాభుడు అమోఘసిద్ధి అనువారయిదుగురు ధ్యానిబుద్ధులు ధ్యానిబుద్ధులనగా ధ్యానతత్పరతకు సంబంధించిన బుద్ధులు ఈ అయిదుగురును ఆదిబుద్ధదేవుని ధ్యానసాధన ఫలముగా ఉత్పన్నులైనవారు తిరిగి వీరు తమ ప్రతిబింబములుగా బోధిసత్త్వులను, మానవబుద్ధులను, తారాదేవివంటి స్త్రీదేవతలను సృష్టించుచుందురు

ఈ అయిదుగురిలో వైరోచనుడు, అమితాభుడు అనువారు ప్రధానులు అక్షోభ్యుడు తూర్పుదిశాధిపతిగా చెప్పబడుచున్నాడు. వైరోచనుని మహిమ అతివ్యాప్తిచెందినది ఇతనిని బ్రహ్మాండాకారముగలవానినిగా రూపొందించెదరు వైరోచనునకు అత్యంతదూరమున ఒకబుద్ధప్రపంచము కలదు దీనిని 'వైరోచనరశ్మిప్రతిమండిత' అనెదరు ఈ లోకము సూర్యకిరణప్రభావితమయి యుండును వైరోచనశబ్దము విరోచనశబ్దభవము విరోచననామము సూర్యునకును గలదు ఈ సూర్యదేవుడు ఎట్లు బుద్ధుడయ్యెనో తెలియదు అయితే బుద్ధునకును, కాంతికిని అవినాభావసంబంధము కలదు గౌతముడు ప్రకాశమానుడు మహాయాన ధర్మగ్రంథములలో బుద్ధులు కాంతిమూర్తులనియు, ఉజ్జ్వలకాంతికిరణములు లోకలోకాంతరాళములకు ప్రకాశము చేకూర్చుననియు చెప్పబడినది. బుద్ధులు కాంతిదాయకులు, కాంతి అంధకారమును మాపును కావున బుద్ధులు అజ్ఞానాంధకార సంహారులు

అమితాభుడు అతిశీఘ్రముగా ప్రశస్తిచెందినవాడు ఈతని ప్రభవమునకు మూలకారణము తెలియదు ఇతడు అవలోకితునివలెనే, విష్ణువువలెనే ఆసియాఖండములోని మహాదేవతాస్వరూపులలో నొక్కడుగా పరిగణింపబడినాడు ఇతనికి 'అమితాయువు' అనియు పేరుకలదు అమితాభుడనగా మితములేని కాంతికలవాడు అమితాయువనగా మితములేని ఆయుస్సుకలవాడు అందుచేత, ఇతడు కాంతియు, అమరత్వమునుకల దేవుడు పశ్చిమదిశాధిపతి, ఇచ్చటికే సూర్యుడును మరణించినవారును పోవుచుందురు అమితాభుని స్వర్గసీమను 'సుఖవతి' అందురు

అమితాభునియొక్క శక్తి విశ్వాసములు కలిగియుండుట, అమితాభుని ప్రార్థించుట—ఇవియే మతధర్మములు తత్ఫలితముగా అమితాభ పూజాతత్పరులను వారి మరణానంతరము ఇతడు 'సుఖవతి' అను స్వర్గసీమలో చేర్చుకొనును పురుషులు స్త్రీలు మరణముచెందనున్నతరి ఒకటో, రెండో, మూడో నాలుగో, అయిదో, ఆరో, ఏడో రాత్రులు అమితాయువు

నామమును స్మరణ చేసినచో వారియెదుట ఇతడు ప్రత్యక్ష మగును అప్పుడు వారు శాంతచిత్తులతో ప్రాణములు విడుతురు మరణానంతరము వారి ఆత్మలు స్వర్గ ధామము నకు గొంపోబడును

బుద్ధపదవాచ్యునకు మూడు శరీరములు లేదా, మూడు స్వరూపములుండును మొదటిది 'ధర్మకాయము' ఇది శుద్ధసత్వ-బుద్ధ-స్వరూపము సర్వజ్ఞాన కలితము నిర్వాణ మునకును అన్వయించును ఇదిఅన్నిసిద్ధాంతములసారభూతము రెండవది 'సంభోగకాయము' ఇది స్వర్గధామములో బుద్ధులు ధరించు దివ్యతేజో విరాజితమగు రూపము మూడవది 'నిర్మాణకాయము' ఇది మానవరూపమునకు మార్పుచెందు నట అమితాభుడు, అమితాయుష, శాక్యముని, వరుసగా ఈ శరీర త్రయాంశభాగులుగా పరిగణింపబడిరి అమితాభుని యందు ధర్మకాయభావము సంపూర్ణముగ ద్యోతకముకాదు అమితాభుడు, అమితాయువు ఒక్కరేయను భావమున్నను 'అమితాయువు' సంభోగకాయ భావమునకు పూర్తిగ ప్రాతి నిధ్యము వహించును అమితాయువు అమూల్యాభరణాలం కృతుడై యుండుటచే ఇతడు సంభోగకాయరూపు డనుటకు ఎక్కువగా తగియున్నాడు, మానవరూపముదాల్చిన కారుణ్య మూర్తియగు శాక్యముని నిర్మాణకాయభావమునకు ఉదా హరణము తరువాత, మహాసుఖకాయము, లేక వజ్రకాయము అను పేర నాల్గవది చెప్పబడినది పత్నీసహితులయి విహరించు బోధిసత్త్వులకిది అన్వయించును

మృత్యుదేవత ఈ దేవతప్రతిభ ఎక్కువగా టిబెత్తులో కనబడును ఈతనిచిత్రములు టిబెత్తులోని బౌద్ధ దేవాలయము లలో కానబడును ప్రతి దేవాలయములో వ్రేలాడుచు కుడ్యములందు చిత్రితమై ఒక చక్రముండును ఈ చక్రము జనన, మరణపరంపరను సూచించుచుండును ఒక బ్రహ్మాండా కార ఉగ్రవాము ఈ చక్రమును పండ్లతో పట్టుకొనియుండి క్రిందపడియున్న స్త్రీ పురుషులను త్రొక్కుచుండును ఈ భూ ద్విగ్రహమే మృత్యుదేవత ఒక వరాహము, ఒక కోడి పుంజు ఒక సర్పము, పరస్పరము కలహించుచు కరచుటకు ప్రయత్నించుచున్నట్లుండును వరాహము మూర్ఖత్వమున కును, కోడిపుంజు వ్యామోహమునకును, సర్పము ద్వేషము నకును చిహ్నములు

పద్మసంభవుడు ఇతడు భారతీయుడు మానవుడుగా జన్మించి దేవత్వమునుపొందిన మహనీయుడు ఇతడు పద్మ ములో సంభవించినాడట! అందుచే ఇతనికి పద్మసంభవుడని పేరు వచ్చినది

బౌద్ధమతమును టిబెత్తులో విశిష్టరీతిలదానినిగ నొనర్ప ప్రయత్నించినవాడు ఈ పద్మసంభవుడేనట! ఈ మహాపురు షుడు ఎనిమిదవ శతాబ్దమువాడని చెప్పెదరు ఇతడు మహా యాన బౌద్ధమునే మిగుల ప్రచారము చేసెను ఈ పంథయందు తాంత్రికసంప్రదాయపు ఆచారములు ప్రముఖముగా నుండెను కావున ఈ సంప్రదాయానుసారము ధ్యానిబుద్ధులు బోధి సత్త్వులు, తారలను శక్తులు, అవలోకితేశ్వరుడు మైత్రేయుడు మంజుశ్రీ, మొదలగుపురుషదేవతలు స్త్రీదేవతలు ఢాకినులు మహాసిద్ధులు ప్రచారములోనికి వచ్చిరి

పద్మసంభవునిచేతిలో ఒక దండముండును ఈదండము మూడుభాగములుగా అగ్రమున చీలియుండును ఈభాగము లందు ఒక కపాలము, ఒక శిరస్సు ఒక వజ్రాయుధముండును ఇతడు అశ్వారూఢుడై ఉండును ఈ అశ్వముపేరు 'బలాహ' ఇది అవలోకితేశ్వరుని ఒక అవతారము పద్మసంభవుని విగ్ర హము కొంచెముచ్చతగ్గులతో శ్మశానవాసియైన శివునిపోలు చుండును

ఆ వీ

## బౌద్ధమతము

శాక్యవంశ సంభూతుడయిన రాకుమారుడు సిద్ధార్థ గౌతముడు క్రీ పూ ౫౬౩ లో జన్మించెను ఇతడు వైరాగ్య శీలము కలవాడయి తన ౨౯ వ ఏట గృహ పరిత్యాగముచేసి సంన్యసించెను (క్రీ పూ ౫౩౪) ఆరు సంవత్సరములు తపస్సు చేసి క్రీ పూ ౫౨౮ లో బుద్ధత్వముచెంది బౌద్ధ మత వక్త యయ్యెను గౌతమబుద్ధుడని ప్రసిద్ధిచెందెను గౌతమబుద్ధుడు ౪౫ సంవత్సరములు బౌద్ధ ధర్మచక్ర ప్రవర్తనము గావించి, సుశ్లోకుడై క్రీ. పూ ౪౮౩ లో సిద్ధిపొందెను మగధ చక్రవర్తు లగు బింబిసారుడు, అజాతశత్రువు అను నిరువురు రాజులకు ఇతడు సమకాలికుడు ఈ ఇరువురురాజులును బుద్ధుని దర్శించి నట్లు తెలుపునట్టి వర్ణచిత్రములు విఖ్యాతమయిన అజంతా గుహాలలో కలవు

గౌతమబుద్ధుని ఉపదేశము హిందూమతముపై కావింప బడిన ఎట్టి తిరుగుబాటును కాదు అదియొక విశుద్ధతరమైన హిందూమతమును సిద్ధింపజేయుట కొనర్పబడిన యొక

ప్రయత్నము మాత్రమే ఉపనిషత్తులందలి కొన్ని సిద్ధాంతములను స్వీకరించి వాటికి బుద్ధుడొక నూత్న వ్యాఖ్యానమొనర్చెను

ఆద్యబౌద్ధమునకు మూలములు పాళీభాషయందు రచింపబడిన పవిత్ర గ్రంథములు వాటికి త్రిపిటకములు లేక సాంప్రదాయికములయిన త్రిపేటికలు అని పేరు ఆ మూడును వినయపేటిక సుత్త (సూత్ర) పేటిక, అభిధమ్మ పేటిక అనునవి వినయమునందు బౌద్ధభిక్షువులు (శ్రమణులు) అనుష్ఠింపదగిన నియమముల సంహితకలదు సుత్తమునందు బుద్ధుని ఉపదేశములును ప్రవచనములును కలవు ఈసుత్తము అయిదు స్కంధములుగా విభక్తమైనది వాటిని నికాయములందురు (1) దిఘ్ఘనికాయములు లేక దీర్ఘ ప్రవచనములు (2) మజ్ఝిమనికాయములు లేక మధ్యమ ప్రవచనములు (నాతిదీర్ఘములు నాతిహ్రస్వములును కానివి (3) సంయుక్త నికాయములు (4) అన్గుత్తరనికాయములు లేక వర్గములుగా విన్యసింపబడిన బుద్ధుని ప్రవచనముల యొక్క గుచ్ఛము (5) ఖుద్దకనికాయము - ఇది బుద్ధుని యొక్క ప్రవచన సముచ్చయము - ఇందు (1) ఉదానము, (2) ఇతివృత్తకము, (3) ధమ్మపదము, (4) ఖుద్దకపథము, (5) సుత్తనిపాతము, (6) థేరగాథ, (7) థేరీగాథ, (8) నిద్దేశము, (9) జాతకగాథలు, (10) పతిసమ్మిదభగ్గసంబిధా, (11) ఉపాదానము, (12) బుద్ధవంశము, (13) విమానవత్థు, (14) పెతవత్థు, (15) చరియాపిటకము అను నవికలవు

ఉదానమునందు బుద్ధుని భాషణములు, ఉద్ధరణవృత్తములు ఆనందపారవశ్యముచే వెడలిన ప్రవచనములు కలవు. ఇతివృత్తకమున బుద్ధుడు బ్రహ్మవిహారమను పదమును సర్వదుఃఖమును నాశనమొనర్చు నొక మనోవస్థావిశేషపరముగ వాడెను

బౌద్ధమునందలి సర్వశాఖలకును సామాన్యమయిన మూలోపదేశమునందు నాలుగు ఆర్యసత్యములున్నవి (1) దుఃఖము (2) దుఃఖకారణము (3) దుఃఖనివారణము (4) దుఃఖనివారణమార్గము అనునవి ఈ నాల్గుఆర్యసత్యములై యున్నవి

బుద్ధుడు తత్త్వబోధము (బోధి) నొందిన పిదప సారనాథ్‌లో, బోధివృక్షముక్రింద, ప్రప్రథమమున కావించిన ఉపదేశమిదియే సత్యము నన్వేషించువాడు కేవల భోగాసక్తియు, కేవల భోగనివృత్తిరూపమయిన ఆత్మహింసయు - అను నీ రెండు పరమావధులను త్యజించి మధ్యమార్గము ననుసరింపవలయును అది నిర్వాణమును లేక ఆనందమును పొందించునట్టి అష్టాంగరూపమయిన నిచ్చెనయై యున్నది

ఆ అష్టాంగమార్గమునందు (1) లోభమును, 'నేను', 'నన్ను', 'నాది' అను భావములను పరిత్యజించి సరియగు అవగతి నొందుట (2) పరార్థమున ఆత్మార్పణమొనర్చు సరియగు ఉద్దేశములను కలిగియుండుట (3) దయను చూపుచు, దానమొనర్చుచు, సరియగు భాషణముల నలవరచుకొనుట (4) శాంతి సౌమనస్యములకు సాధనమగు సమ్యగాచరణమును అభ్యసించుట, (5) అపాయకరముకాని వృత్తిని వరించి, సరియగు జీవిక నేర్పరచుకొనుట (6) ఆత్మసంయమనము మూలమున సరియగు యత్నమొనర్చుట (7) అవివేకముచే కీడుచేయక, సరియగు జాగరూకతను వహించుట (8) పరిపూర్ణ తత్త్వబోధ సంపాదకమయిన చిత్తైకాగ్ర్యమును లేక సమాధిని అలవరచుకొనుట, అనునవి కలవు

ఇదియే దమ్మపదము, అనగా ధర్మమార్గము, ఇది సవిస్తరముగా 423 పద్యములలో వర్ణింపబడినది ఇదియొక ప్రఖ్యాతమయిన భక్తి (బోధక) పద్యసముచ్చయము "అతడు నన్ను నిందించినాడు నన్ను కొట్టినాడు నన్ను జయించినాడు నన్ను దోచుకొన్నాడు" అనునట్టి భావములు కలవారి మనస్సునుండి ద్వేషము తొలగి పోనేపోదు "మనఃపారిశుద్ధ్యము లేక, ఎవడు కాషాయాంబరములను ధరించునో, ఎవడు సత్యవాదికాడో, ఎవనికి ఆత్మ వశమునందు లేదో అట్టివానికి కాషాయ వస్త్రములను ధరించు అర్హతలేదు

"వేయిసార్లు వేయి శత్రువులను యుద్ధములలో జయించిన వానినొకనిని ఒక్క శత్రువునే అనగా తననేతాను జయించినవానితో పోల్చిచూచినచో, ఈ ఇరువురిలో రెండవ వాడే విజేతలలో అగ్రగణ్యుడగుచున్నాడు"

"జటాకలాపముచేగాని, వంశానుక్రమముచే గాని, వర్ణముచేగాని ఎవడును బ్రాహ్మణుడు కాజాలడు ఎవనియందు సత్యసంధత, ధర్మానుసరణము అనునవి కలవో, అట్టివాడే (నిక్కమయిన) బ్రాహ్మణుడు " అతడే ధన్యుడు

"కామక్రోధాదిరూప మనోవికారము (ఆవేగము) వంటి అగ్నిలేదు ద్వేషతుల్యమైన ఆపత్తులేదు భౌతికసత్త వంటి దుఃఖములేదు శాంతికంటె భిన్నమయిన సంతోషము లేదు "

"లోభము రోగములలో నెల్ల నీచతమమైనది యథార్థ నిర్వాణమే నిరతిశయానందమని తెలిసికొనినవారికి సంస్కారములు అత్యంత దుఃఖజనకములు,

ఖుద్దకపథము అనునది యొక లఘు పద్యసంగ్రహము

సుత్తనిపాతము ఇది బ్రాహ్మణమతము మున్నగు భిన్నమతముల సంప్రదాయములనుగూర్చి, వివరించుచు అవి అన్నియు బుద్ధుని మనోభావ పరంపరలను ఎట్లు ప్రభావితము చేసెనో తెలుపును (6 & 7) థేరగాథ, థేరీగాథ-ఇవి బౌద్ధ సన్యాసులును (శమణులు) సన్యాసినులును (శ్రమణులు) రచించిన పద్యములు బౌద్ధమతావలంబనముచే స్త్రీలు విశిష్టులై వరలిరి వారు సంఘసేవయందును, ధర్మవ్యాప్తి కార్యమందును ప్రముఖపాత్రను నిర్వహించిరి శ్రమణులు వ్రాసిన పద్యములలో ఒకదానియందు (కామక్రోధాది) మనోవికారములను రూపుమాపుటయే నిర్వాణమని వక్కాణింపబడినది

"మనోవికారాత్మకమైన లోభమువంటి అగ్ని లేదు ద్వేషముతో ఉపమింపదగిన చెడు అదృశ్య లాలసము లేదు స్వార్థ సంపాదనముతో సరియగు దురితము లేదు శాంతికంటె గురుతరమైన ఆనందము లేదు ఈ విషయములను యథాతథముగ తెలిసికొనుటగూడ నిబ్బాణము (నిర్వాణము) అనబడును అదియే దివ్యానందము

(8) నిర్దేశము ఇది సుత్తనిపాతముపై రచింపబడిన యొక వ్యాఖ్యానము

(9) జాతక గాథలు ఇది పశు, పక్షి, నరరూపములైన తన పూర్వ జన్మములనుగూర్చి బుద్ధుడు స్వయముగా వచించిన కథలు ఈ కథలు అతనిని అనుసరించినవారు (శిష్యులు) జ్ఞప్తియందుంచుకొని గ్రంథస్థము చేసిరి ఈ జాతక గాథలలో పెక్కులు అజంతాగుహల (10 - 16) యందలి వర్ణచిత్రములలో ఉదాహృతములై యున్నవి

కాశియందలి మృగదావములో, (నిర్వాణ) మార్గదర్శియగు బుద్ధుడు ధర్మచక్రమును పరిభ్రమింపజేయుటకు ఉపక్రమించెను ఆ ధర్మచక్రము సార్వజనీనధర్మమునకు చిహ్నమై వరలినది ధర్మమనునది ఏదియో యొక మతమునకును చెందినదికాదు, అది సర్వజగద్ధితకరమును సర్వజనాంగీకార్యమును నైనది

బుద్ధభగవానుని ఈ పరలోపదేశము శిష్యుల నాకర్షించినది బుద్ధుడు, అతని ఉపదేశములు వారికి శరణ్యములయ్యెను ఈనాటివరకును అందరు ఒక కట్టుగా అతనికి కాపటగా నిలబడిరి సర్వ ప్రపంచమునందున్న బౌద్ధులును ఈ త్రిరత్నములనే శరణము కోరుచున్నారు

" బుద్ధం శరణంగచ్ఛామి
ధర్మం చరణంగచ్ఛామి,
సంఘం శరణంగచ్ఛామి" అను నవీత్రిరత్నములు

బౌద్ధ దర్శనశాఖలందలి వివాదాంశముల నిర్ణయమునకై అపుడపుడు బౌద్ధ పండితులు పరిషత్తుల నేర్పరచుకొనుచుండిరి అట్టివాటిలో క్రీ పూ 477 లో రాజగృహము వద్దను, క్రీ పూ 377 లో విశాలానగరమందును క్రీ పూ 247 లో అశోకచక్రవర్తి ఆధ్యక్ష్యమున పాటలీపుత్రమందును ఏర్పరచబడిన పరిషత్తులు పేర్కొనదగినవి బుద్ధుని నిర్వాణానంతరము రెండున్నర శతాబ్దులకు, అశోకమహాచక్రవర్తి కాలముననే, అతని విస్తృత సామ్రాజ్యమందే కాక, హిందూదేశమునకు వెలువలి భాగములందు కూడ బౌద్ధము వ్యాప్తినొందినది హిందూదేశమునందు నూతన పరిపాలకులగు యవనులు, శకులు, క్షాత్రపులు, శాతవాహనులు, పహ్లావులు, కుషానులు, బౌద్ధమును ఆదరముతో స్వీకరించిరి ఇండో బాక్ట్రియాకు రాజగు మెనాండరు అనునతడు 'మిలింద' అను బిరుదమును ధరించెను మిలిందపంహ, లేక, మిలిందుని ప్రశ్నలు అనునవి పాలీ - మతగ్రంథము లందు చేర్చబడినవి తర్కశాస్త్రపారగుడును, బౌద్ధాచార్యుడును నగు నాగసేనుకును, గ్రీకు రాజగు మిలిందునకును, మధ్య ప్రవర్తిల్లిన సంవాదమది మిలిందుడు బుద్ధునిట్లు ప్రశంసించెను

"మనుజులు హిమాలయ పర్వతముయొక్క ఉన్నత శిఖరములపైపు దృష్టిని సారించి, దాని మహత్త్వమును విలువగట్టి భావించుదురు అట్లే మనుజులు పావిత్ర్య శిఖరమును, ప్రకుపిత - మనోవికారమను ప్రభంజనముచే అబాధితుడును, నిర్వికారుడును, శాంతుడును నగు బుద్ధుని - తిలకింతురు వెంటనే (వారి) పాపము నశించును, వారి కామ్యకత్వము లయించును "

అంతట వారు, హిమాలయోన్నతుడగు ఆ బుద్ధుని పరికించి "పాపవిమోచనములను ప్రసాదింపగల్గు ఈ మహానుభావుని శక్తిప్రాభవము ఎంత ఘనమైనది! అని సాశ్చర్యులై పల్కుదురు "

క్రీ పూ 3వ శతాబ్ది నుండి క్రీ శ 3వ శతాబ్దివరకు ఆంధ్రసాతవాహనులు దక్షిణ పీఠభూమిపై నెల్ల తమ అధికార ప్రాభవములను నెరపిరి ఆంధ్ర ప్రదేశమందలి అన్ని జిల్లాల లోను, ఆ రాజన్యులు బౌద్ధమున కొసగిన పోషకత్వమునకు (చిహ్నములగు) అవశేషములు కనిపించుచున్నవి, అమరావతి యందలి సుప్రసిద్ధస్తూపము క్రీ పూ 200 సంవత్సరముల నాటిదని నిర్ణయింపబడినది, ఆ స్తూపము హిందూ శిల్పశాస్త్ర ప్రావీణ్యమునకు చెందిన ఒక అత్యంతమృదుల ప్రసూనమని ప్రశంసింపబడినది

సాతవాహనరాజుల సామంతులలో నొకరగు ఇక్ష్వాకులు (క్రీ శ 225-235) కృష్ణా, గోదావరీనదులకు చుట్టు నున్న ప్రదేశమును పాలించిరి వారి ముఖ్యపట్టణము 'నాగార్జునకొండ' వద్ద ఉండెను బౌద్ధవేదాంతులలో గరిష్ఠుడగు నాగార్జునుని బట్టి దానికా పేరేర్పడెను నాగార్జునుడు సంస్కృతమందు గ్రంథములను రచించెను ఆంధ్రరాజగు గౌతమీపుత్ర యజ్ఞశ్రీ అనునతడు నాగార్జునునకు పోషకుడై యుండెను ఆరాజునకు నాగార్జును డొక సుహృల్లేఖను వ్రాసెను, అందలి సుహృదుపదేశ మిట్లుండెను

"దోషరహితమును, అత్యుదాత్తమును, విశుద్ధమును నగు నీతిని ప్రదర్శింపుము సర్వోచ్ఛపదమునకు నీతియే ఆధారభూమి ధనలోభము, కపటము, కాముకత్వము, మాంద్యము, ఆశ, ద్వేషము అనువాటిని (నీ) శత్రువులనుగా పరిగణింపుము క్షాంతివంటి కష్టసాధ్యమగు గుణమొండులేదు నీమనమునందు కోపప్రవేశమునకు అవకాశ మొసగవలదు అత్యంతముగా, అనవసరముగా, చంచలములయిన పడింద్రియములను జయించిన యొకనిని, యుద్ధమున (తన) శత్రు నివహములను జయించిన మరియొకనితో పోల్చినచో, మొదటివానినే ప్రాజ్ఞులు గురుతరవీరునిగా ప్రశంసింతురు లోకజ్ఞుడవగు నీవు లాభనష్టములు, సుఖదుఃఖములు, నిందాస్తుతులు అను ప్రాపంచికదశాభేదముల విషయమున తాటస్థ్యము వహింపుము నీచేలికిగాని, నీవస్త్రములకుగాని, నిప్పు ముట్టుకొనినచో నీవు దానిని అణచి ఆర్పుటకు యత్నింతువు. అట్లే కాముకత్వమును తొలగించుటకు యత్నింపుము ఎందు నతనన-ఇంతకంటె గురుతరమైన అవసరము మరియొండు లేదు"

ఈ సుహృల్లేఖయొక్క చైనీయ భాషానువాదము చీనాదేశమునకు పంపబడినది

కనిష్కుని (క్రీ శ, 2వ శతాబ్ది) ఆధిపత్యమున బౌద్ధము నందలి వివాదగ్రస్తాంశముల పరిష్కారమునకై, నాలుగవ బౌద్ధపరిషత్తు ఏర్పరచబడెను తత్ఫలితముగా బౌద్ధములో కొత్తపంథ ఏర్పడెను ఈనూతనబౌద్ధమునకు మహాయానము (నిర్వాణప్రాప్తికి మహామార్గము) అనిపేరు ఈకాలమునకు హిందువుల విశ్వదేవతాగణములో బుద్ధు డొక దేవుడుగా పరిగణింపబడజొచ్చెను మహాయానమునందు దేవతాప్రణాళిక అభివృద్ధినొందెను అది ఇది - జాతక (పూర్వజన్మములనెత్తిన బుద్ధదేవులు, భవిష్యత్ బుద్ధదేవుడు, బోధిసత్త్వులు అనునట్టి) వారిదేవతలు వీరు విశ్వప్రేమ, కరుణ అను బుద్ధునిగుణములను అలవరచుకొన్నవారు వీరు సర్వప్రాణులకును మోక్షము సిద్ధించువరకు, స్వీయమోక్షసిద్ధికొరకు యత్నము చేయరు

ఈ మహాయానమే కారణముగా, ఫా హి యా ను, హ్యూన్‌త్సాంగ్, ఇత్సింగు అనువారు హిందూదేశమున గల బౌద్ధుల పవిత్రక్షేత్రములను దర్శించుటకై సంకటములతోగూడిన (హిందూదేశ) ప్రయాణములకు ఉత్సహించిరి ఫాహియాను (399) హిందూదేశమునుండి తిరిగిపోవునపుడు ఒక తుఫానురాగా "ఓమ్ మని (మణి) పద్మహూమ్" అను నొక గూఢమంత్రోచ్చారణము కావించెను అతడు (తన్మూలమున) నౌకాభంగ (రూపమయిన అపాయ)ము నుండి రక్షితుడయ్యెను

అజంతాగుహలలో జగత్ప్రసిద్ధము లయిన కుడ్యవర్ణచిత్రలేఖనములున్నవి మొదటిగుహలో, మహాబోధిసత్త్వుడు పద్మపాణియైయున్నట్లు కనిపించు సుప్రసిద్ధ వర్ణచిత్ర మొకటి కలదు అది హిందూచిత్రలేఖన కళాప్రావీణ్యమున కొక అత్యుత్తమమైన నిదర్శనముగా భావింపబడినది 26 వ గుహలోగల బుద్ధనిర్వాణరంగము, ప్రశస్తమయిన హిందూశిల్పకళాప్రావీణ్యమునకు (మరియొక) తార్కాణమై యున్నది ఆ వర్ణచిత్రముయొక్క ఎత్తు 23 అడుగులు గాఢసుషుప్తిగతుడై బుద్ధుడున్నాడోయనునట్లు అతని వదనము స్తిమితత్వ - శాంతత్వములతో అలరారుచున్నది అతని శయ్యాచిత్రము ప్రక్కన దాదాపు 20 చిత్రములున్నవి అవి స్వామియగు బుద్ధునియొక్క నిర్వాణము కారణముగా విలపించుచున్న శ్రమణులకును, శ్రమణలకునుచెందిన చిత్రములై యున్నవి వారినిగూర్చి బుద్ధుడుపల్కిన తుదిమాట

లివి - "మీకు మీరే దీపిక (వెల్గు)యు, ఆశ్రయమునునై యుండవలెను, పరుల నాశ్రయింపవలదు "

క్రీ శ. 5 వ శతాబ్దినుండి హిందూదేశమునందు తాంత్రిక బౌద్ధము అభివృద్ధినొందెను చీనా, జపాను అను దేశములందు బౌద్ధము జెన్ లేక 'ధ్యాన్' అని వ్యవహరింప బడెను 'ప్రజ్ఞాపారమిత' అనునామెయే మాత, ఈమెయే మహావివేక మహిత ఈమెనే ధ్యానించవలెను హాలెండ్‌లో లెయ్‌డెన్ (అను నగరము) వద్దగల ప్రదర్శనశాలలో కమల మును, పుస్తకమును హస్తమందు ధరించిన ప్రజ్ఞాపారమిత యొక్క శిల్పచిత్రమొకటి సుందరమైనది కలదు

హర్ష చక్రవర్తి (606-647) కాలమున ఆ చిత్రము జావానుండి తొలగింపబడెను

హ్యూయన్ త్స్యాంగ్ హిందూదేశమును దర్శించెను ఆతనికి స్వాగతమొసగుటకు కనోజ్ (కన్యాకుబ్జము) వద్ద ప్రత్యేకముగా ఒక సదస్సుసమావేశము చేయబడెను బుద్ధుని ప్రతిమ సింహాసనమునందు ప్రతిష్ఠింపబడెను నాలందకుచెందిన యొక బౌద్ధభిక్షువు మహాయాన సిద్ధాంతములనుగూర్చి వివ రించుచు ఉపన్యసించెను ఆ సదస్సు జరిగిన 23 దినముల యందును హ్యూయన్ త్స్యాంగును ఏనుగుపై నెక్కించి ఊరే గించిరి, హ్యూయన్ త్స్యాంగు అజంతానుదర్శించినట్లు విశ్వ సింపబడినది అజంతావద్ద 9 వ శతాబ్దికిచెందిన ఒకశాసనము కలదు, అందిట్లు కలదు -

"సిద్ధం జయతి లోకహితంహితోద్యతః
సుఖకరః పరమార్థవిత్ త్రివిధనిర్మలసర్వగుణాఢ్యో మునిః
కరుణామలచంద్రికపిః

దీనికి బుద్ధుని యథార్థస్వరూపము విదితము

శ హ

## బౌద్ధసాహిత్యము •

క్రమబద్ధమైన, బౌద్ధసాహిత్యము నేడు ప్రధానముగా పాళీ, సంస్కృతము, టిబెట్టు, చైనీయ భాషలలో కలదు జపాను కాంబోడియా, ఇండోచైనా సింహళము మున్నగు దేశములలో బౌద్ధమతప్రచార - ప్రసారములతో ఆయా దేశ భాషలలో బౌద్ధసాహిత్యము విరచితమయినది ఈ నాడు భారత దేశములో ఉపలభ్యమానములుగాని మూల బౌద్ధ గ్రంథముల అనువాదములు ఇతర దేశభాషలలో లభించు చున్నవి

బౌద్ధసాహిత్యములో సర్వప్రాచీనము, సంపూర్ణము, పరమపవిత్రము అయినట్టిది పాళీభాషలో రచింపబడిన 'త్రిపి టకము' అనుగ్రంథము వినయపిటకము సుత్తపిటకము, అభిధమ్మపిటకము అనునవి త్రిపిటకములు ఇవి బౌద్ధ ధర్మ సాహిత్యములో పరమపూజ్యములు ఈ మూడు సూత్రగ్రంథ ముల సంకలనమునకు త్రిపిటకమని పేరు ఈ సూత్ర సాహి త్యముగాక, మిలిందపన్హ, నేత్తి పకరణ, వినయ అభిధమ్మ పిటకములపై బుద్ధదత్తుని భాష్యములు, త్రిపిటకములకు అనే కములగు వ్యాఖ్యాగ్రంథములు, ధమ్మపాలుడు రచించిన జాతక కథలు, దీపవంస, మహావంస, చూలవంస, శ్రీలంక గాథలు - ఇత్యాదులు పాళీభాషలో లభించు ప్రధాన బౌద్ధగ్రంథములు బౌద్ధమతమునకు విజ్ఞానసర్వస్వము వంటి దగు 'విశుద్ధిమగ్గము' (బుద్ధఘోషుని రచన) పాళీ భాషరచన లలో తలమానికము

పాళీభాషలోవలెనే సంస్కృతభాషలోకూడ బౌద్ధ సాహిత్యము విరచితమయినది పాళీనికాయములను పరిపోలు ఆగమములు, అభిధమ్మ పిటకములోని ఏడు గ్రంథములను బోలు అభిధర్మమునకు సంబంధించిన సప్త గ్రంథములు సర్వాస్తివాదులవద్ద ఉన్నట్లు తెలియుచున్నది మూల సర్వా స్తివాదులవద్ద వినయపిటకము ఉన్నట్లు గిల్గిట్‌లోనున్న వ్రాత ప్రతులవలన తెలియుచున్నది

శుద్ధ, మిశ్రసంస్కృతములలో హీనయాన, మహాయా నములకు సంబంధించిన అనేక స్వతంత్రగ్రంథములు రచింప బడినవి వీటిలోమహాసాంఘిక లోకోత్తరవాదులైన బౌద్ధు లకు వినయపిటకము వంటిదైన 'మహావస్తు' అతిప్రధాన మైనది బుద్ధుని జీవితమును వర్ణించు 'లలితవిస్తరము', అశ్వఘోషుని 'బుద్ధచరిత', సౌందరనందము, సారిపుత్రప్రక రణము, ఆర్యశూరుని 'జాతకమాల', అవదానసాహిత్యము మున్నగునవి ప్రధానములగు బౌద్ధరచనలు

మహాయానసూత్రములలో ఈ క్రింది ధర్మగ్రంథములు ప్రధానములు

1 అష్టసాహస్రికా ప్రజ్ఞాపారమిత
2 సద్ధర్మ పుండరీకము
3 లలితవిస్తరము,
4 లంకావతారము
5 సువర్ణప్రభాసము

6 గండవ్యూహము
7 తథాగతగుహ్యకము
8 సమాధిరాజము
9 దశభూమీశ్వరము

వీటిని వైపుల్యసూత్రము లందురు నాగార్జునుడు, వసుబంధుడు, అసంగుడు, మున్నగు వారీశాఖకు చెందిన ప్రముఖ రచయితలు

టిబెట్టుభాషలో భారతీయ బౌద్ధగ్రంథముల అనువాదములు 4566 సంకలితములై యున్నవి వాటిలో 1108 గ్రంథములు బకాళఖణ్యూర్ లేక కంజూర్ శాఖకు చెందినవి 3458 బస్తన్ ఖణ్యూర్ లేక తంజూర్ శాఖకు చెందినవి. కంజూర్ శాఖకు వినయ, ప్రజ్ఞా, పారమిత, బుద్ధ వతంసక, రత్నకూట, సూత్ర, నిర్వాణ తంత్రములను ఏడుభాగములు, తంజూర్ శాఖకు తంత్ర, సూత్రములను రెండు విభాగములు కలవు

అనేకములగు భారతీయ బౌద్ధగ్రంథములకు చైనీయ భాషానువాదములు లభ్యమగుచున్నవి బునియనాన్జో అనునాతడు సూత్రపిటకము, వినయ పిటకము, అభిధమ్మపిటకము, వివిధములు అను నాలుగు విభాగములలో 1662 గ్రంథములను లెక్కించియున్నాడు వార్ టోగిరిన్ నందలి తాయిశో సంస్కరణములో 55 ఖండములలో 2184 గ్రంథములు, పరిశిష్టభాగములో 25 ఖండములలో మరికొన్ని గ్రంథములు ఉట్టంకింపబడినవి జపానుభాషలో చైనీయ త్రిపిటకములకు మూడు సంపూర్ణానువాదములు కలవు మంచూరియా భాషలో కూడ ఇట్టి అనువాదములు కలవు మంగోలీ భాషలో తంజూర్ సాహిత్యమంతయు అనువదించబడినది

పైని చెప్పబడినవేగాక, ఇతర దేశభాషలలో కూడ బౌద్ధ సాహిత్యము ఉపలబ్ధమగుచున్నది ప్రస్తుత వ్యాసములో పాళీ సంస్కృతభాషలలో గల బౌద్ధసాహిత్యమును గురించి మాత్రమే చర్చించబడును

ఒకానొకకాలమున పాళీ, ప్రాకృత, సంస్కృత భాషలలో అనంతమగు బౌద్ధసాహిత్యము ఉండెడిది కాని కొంతకాలముక్రితము వరకును ఒక్క 'మంజుశ్రీ మూలకల్పము' తప్ప ఇతర గ్రంథము లన్నియు భారతదేశమున అలభ్యములుగా నుండెడివి నేడు ఉపలబ్ధమగుచున్న బౌద్ధ సాహిత్య గ్రంథములు సింహళము, బర్మా, సయామ, నేపాలు, టిబెట్టు దేశములలోని విహారములలోను, చైత్యములలోను, నిహితమైయుండి, పరిశోధకుల సత్ప్రయత్నములవలన వెలుగు చూచినవే

హీనయాన, మహాయాన శాఖలనుబట్టి బౌద్ధసాహిత్యమును రెండు భాగములు చేయవచ్చును. హీనయాన సాహిత్యము పాళీ భాషలోను, మిశ్రసంస్కృతములోను, మహాయాన సాహిత్యము మిశ్ర, శుద్ధ సంస్కృతములలోను కలదు

బౌద్ధ సాహిత్యములో గౌతమబుద్ధుని జీవిత చరిత్రను లేక విశిష్ట ఘట్టములను వర్ణించు కావ్యములు, నాటకములు, గౌతమబుద్ధుని ఉపదేశములు, బౌద్ధసంఘము పాటించవలసిన సూత్రములు, నియమములు మున్నగు వాటిని నిబంధించు గ్రంథములు కలవు

త్రిపిటకములలో వినయ పిటకములో బౌద్ధసంఘము పాటించవలసిన విధులు, శ్రమణుల కైనందిన జీవితవిధానములు, నియమములు, చాతుర్మాస్య, వస్త్రధారణాది క్రమశిక్షణకు సంబంధించిన నియమములు కూలంకషముగా వివరించబడినవి ఖంధకము(మహావగ్గచుల్లవగ్గ) సుత్తవిభంగము, (పారాజికము, పాచిత్తియము), పరివారము, పాతిమోక్ఖము అనునవి వినయపిటకమునగల నాలుగు భాగములు మహావగ్గలో సంఘ ప్రారంభ వికాసముల చరిత్రతోపాటు, సంఘములో ప్రవేశింపగోరు వ్యక్తులు పాటించవలసిన నియమములు తెలుపబడినవి భిక్షువుల (బౌద్ధశ్రమణుల) కైనందిన జీవనవిధానముగురించిన నియమములను వివరించుచు, నియమవిరుద్ధముగా నడచినవారికి విధింపవలసిన దండనాదులు చుల్లవగ్గలోనున్నవి, బౌద్ధసంగీతులలో మొదటి రెండింటి వర్ణన కూడ ఇందుగలదు పారాజికము, పాచిత్తియములలో బౌద్ధశ్రమణులు చేయగూడని పనులు, అట్టివానికి తగు దండనవిధానము వివరించబడినవి శ్రమణులు కంఠస్థము చేయుటకు వీలుగా సంఘనియమములు పరివారములో ఉట్టంకించబడినవి భిక్షుపాతి మోక్షమనియు, భిక్షుణీపాతి మోక్షమనియు పాతిమోక్ఖమునకు రెండు భాగములు కలవు వీటిలోకూడ పాపములు, వాటిదండన, ప్రాయశ్చిత్తవిధానములు వివరించబడినది

బుద్ధుని ఉపదేశములు సుత్తపిటకమను గ్రంథములో సంకలితములై యున్నవి సుత్తపిటకములో దీఘ, మజ్ఝిమ, సంయుత్త, అంగుత్తర, ఖుద్దక అను ఐదు అధ్యాయములు

కలవు బుద్ధుని మరణానంతరము బుద్ధుని ఉపదేశములను శిష్యులు కంఠస్థము చేయుచుండిరి వీరిలో కొంతమంది దీఘ భాణకులనియు, కొంతమంది మజ్ఝిమభాణకులనియు పిలువ బడుచుండిరి వీరు బుద్ధునివచనములను - ఉపదేశములను లిపిబద్ధముచేసిరి దీఘ, మజ్ఝిమని కాయములలోని విషయ ములనే పునర్వ్యవస్థీకరించి, తరువాతి రెండు నికాయములు వ్రాయబడినవి ఈ నాలుగింటిలో వివరింపబడని విషయము లను చివరినికాయములో కూర్చిరి ఈ పంచనికాయములలో దీఘనికాయము మహత్త్వపూర్ణమైనది దీనిలో మూడు ఖండములు, ముప్పదినాలుగు సూత్తములుకలవు వీటిలో ఆనాటి దార్శనిక సిద్ధాంతములు, సాంఘిక వ్యవస్థ, వర్ణ భేదము మొదలగు విషయములు చక్కగా చర్చింపబడి, బుద్ధుని సిద్ధాంతములు సమర్థింపబడినవి, బ్రహ్మజాలసుత్తము, సామఞ్ఞ ఫలసుత్తము, అంబట్ఠసుత్తమని మూడుఖండముల పేర్లు

మజ్ఝిమనికాయమున నూటఏబదిరెండు సుత్తములు, నాలుగు ఖండములలో వివరింపబడినవి అవి సతిపట్ఠాన సుత్తము, రథవినీతసుత్తము, బ్రహ్మాయు సుత్తము వాసెట్ఠ సుత్తము అనునవి వీటిలో కర్మకాండ, సంన్యాసము, ఆర్య సత్యములు, ధ్యానము మొదలగు విషయములు వివేచింప బడినవి

నైతిక, మానసిక ఆధ్యాత్మిక విషయములు వివేచింప బడిన సంయుత్తనికాయమున సగాథ, నిదాన, ఖంధ, సళాయ తన, మహావగ్గలను ఐదుఖండములు కలవు

సరళమైనశైలిలో ధార్మికనియమములు వివరింపబడిన అంగుత్తరనికాయమున పదునొకండు నిపాతములుగలవు

ఖుద్దకనికాయమున ధమ్మపదము, ఇతివృత్తకము, సునిత్తపాతము విమానవత్థు, థేరగాథ, థేరీగాథ, జాతకములు, బుద్ధవంశము, చరియాపిటకము మున్నగుపదునారుభాగములు కలవు

దార్శనిక, నైతికవిషయములు వివరింపబడిన గ్రంథము అభిధమ్మపిటకము, దీనియందు ధమ్మసంగణి, విభంగ, కథా వత్థు, పుగ్గలపఞ్ఞత్తి ధాతుకథ యమక, పట్ఠానములను ఏడు విభాగములు కలవు

త్రిపిటకముల తరువాత ముఖ్యములైన గ్రంథములలో నైత్తిపకరణ, పేటకోపదేస, మిళిందపన్హా మున్నగునవి పేర్కొనతగినవి ధర్మజ్ఞానప్రాప్తికై సాధనములను వివరించు గ్రంథము నైత్తిపకరణము నాలుగు ఆర్యసత్యములే బౌద్ధ ధర్మమునకు ఆధారభూతములని ప్రపంచించు గ్రంథము పేట కోపదేసము యవనరాజగు మిళిందుని ప్రశ్నలకు స్థవిరనాగ సేను డొసంగిన సమాధానములు మిళిందపన్హాలో సంకలితము లైనవి మిళింద పన్హాకు బుద్ధఘోషుడు రచించిన వ్యాఖ్య సమగ్రసుందరమై బౌద్ధదర్శనమునకు ప్రామాణిక గ్రంథ ముగా వెలుగొందుచున్నది ఇతడు త్రిపిటకములకు సంక్షిప్త రూపమగు 'విశుద్ధిమగ్గ' ను రచించెను ఇతడు వినయపిటక ముపై సమంతపసాదికా, పాతిమోక్ఖముపై కంఖావితరణి, దీఘనికాయముపై సుమంగళ విలాసినీ, మజ్ఝినికాయముపై పంపచసూదని, సంయుక్తనికాయముపై సారత్థపకాసిని, అంగుత్తరనికాయముపై మనోరథపూరణి, ధమ్మసంగణిపై అత్థసాలిని, మున్నగు వ్యాఖ్యాగ్రంథములుగాక ఖుద్దనికాయ ములోని కొన్ని భాగములకు విస్తృత వివరణము లొసంగి నాడు బౌద్ధవాఙ్మయమున అధికగ్రంథ వ్యాఖ్యాతలలో బుద్ధ ఘోషుడు సుప్రసిద్ధుడు

బుద్ధఘోషుడుకాక బుద్ధదత్తుడు, ధర్మపాలుడు అను వారు కూడ బౌద్ధధర్మమునకు సంబంధించిన పాళీగ్రంథము లకు వ్యాఖ్యానములు రచించియున్నారు అభిధమ్మావ తారము, వినయవినిచ్ఛయము అనునవి అభిధర్మ, వినయ పిటకములకు బుద్ధదత్తుడు రచించిన వ్యాఖ్యాగ్రంథములు ధర్మపాలుడు విమానవత్థు, పేతలవత్థు, థేరగాథ, చరియా పిటకములపై వ్యాఖ్యాగ్రంథములు రచించెను

పాళీభాషలోగల చారిత్రిక గ్రంథములైన దీపవంస, మహావంస, చూళవంసములకు బౌద్ధసాహిత్యములో విశిష్ట స్థానముకలదు, సింహళ దేశచరిత్రను బౌద్ధమత చరిత్రను తెలుపు గద్య పద్యాత్మక గ్రంథము దీపవంసము దీనిని ఆధారముగాగొని వ్రాయబడినది మహావంసము ఈ రెంటిని కలిపి చూళవంసమందురు ధమ్మకిత్తి రచించిన సద్ధమ్మసంగ హము, దంతధాతువంసము, ఛకేసధాతువంసము, గంధ వంసము, హత్థవనగల్ల విహారవంసము, పఞ్ఞాస్వామి రచించిన సాసనవంశము, మున్నగు చారిత్రిక గ్రంథములు బౌద్ధమత చరిత్ర నిరూపణకు ఉద్దిష్టములైన రచనలు

ధర్మపాలస్థవిరుని 'సచ్చసంఖేప', అనురుద్ధుని 'అభి ధమ్మత్థసంగహము', 'నామరూప పరిచ్ఛేదము', బుద్ధదత్తుని

అభిధమ్మావతారము, రూపారూప విభాగము, ఖేమాచరి యుని నామరూప సమాసము, ధమ్మసిరి రచించిన బుద్ధసిక్ష, మూలసిక్ష మున్నగునవి పాళీభాషలోని ప్రసిద్ధ ప్రకరణ గ్రంథములు

అనాగతవంసము అను కావ్యమును కస్సపుడు రచించి నాడు ఇది బౌద్ధమతము క్షీణించుటనుగురించి బుద్ధసారిపుత్రుల సంవాదరూపముననున్నది కళ్యాణస్థవిరుని తెలకటాహగాథ, బుద్ధపియుని పజ్జమధు పాళీ భాషలోని శతకములు. వెదేహుడు రసవాహినియను పేరిట మూడుగాథలను రచించినాడు బుద్ధ సోమపియుని సద్ధమ్మోపాయనము మతసిద్ధాంతములను వివ రించు కావ్యము ఇట్టిదే పంచగతిదీపనము ఇటచెప్పబడిన గ్రంథములు 10-15 శతాబ్దములలో రచింపబడినవి వీటిలో కావ్యగత సౌందర్యము అధికము

బౌద్ధసాహిత్యములో అత్యంత ప్రసిద్ధమైన గ్రంథము 'ధమ్మపదము' బౌద్ధేతర దేశములలో, సంప్రదాయములలో కూడ ఈ గ్రంథము బహుళప్రచారములోనున్నది ప్రధాన ముగా బౌద్ధధర్మోపదేశములయినను ఈ గ్రంథములో ప్రతిపా దించబడిన సిద్ధాంతములు సార్వజనీన, సార్వకాలికములైనవి దీనిలో 26 వగ్గములలో (అధ్యాయములలో) 423 ఛందములు కలవు బౌద్ధదర్శనము, బౌద్ధజీవలక్ష్యములు, సిద్ధాంతములు చక్కగా వివరింపబడిన ఈ గ్రంథమునకు 'ధర్మపథము' సార్థక నామము

నిదాన కథ పాళీభాషలో బుద్ధుని జీవితమును వర్ణించు ప్రకైక గ్రంథము ఇది దురేనిదాన,అవిదురేనిదానసంతికేనిదాన అను మూడు భాగములలో విభజింపబడినది ఇందు దీపంకర బుద్ధుని కాలమునుండి గౌతమబుద్ధుని జననమువరకు మొదటి భాగములోను, తుషితస్వర్గమునుండి చివరిసారి ముక్తిప్రా ప్తికై బుద్ధగయలో అవతరించువరకు రెండవ భాగము లోను, బుద్ధుని ధర్మప్రచార ప్రారంభదశనుండి, శ్రావస్తిలో అనాథ పిండకుడు, విశాఖుని కలసికొని వరకు గలకథ మూడవ భాగ ములో వర్ణించబడినది.

గౌతమబుద్ధుని సంపూర్ణ జీవితమును వర్ణించు సంస్కృత కావ్యములలో మహావస్తు, లలితవిస్తరము, బుద్ధచరితము నిదానకథ, అభినిష్క్రమణసూత్రము ముఖ్యములు. బుద్ధుని జీవితములోని ఏదియేని ఒక ఘట్టమును వర్ణించు భాగములు. పాళీ, సంస్కృతవినయ నికాయగ్రంథములలో కలవు మహా పదానసుత్త, అరియపరియసేనసుత్త, మహాపరినిబ్బాణసుత్త, సుత్తనిపాత, అవదాన, మహావంస మున్నగు గ్రంథములలో ఇట్టి వర్ణనాత్మక ఘట్టములు కలవు.

విభిన్న పరంపరానుగతముగా బుద్ధుని జీవితగాథలను వర్ణించు మహాగ్రంథము 'మహావస్తు' ఈ కావ్యములో బుద్ధుని జీవిత సంఘటనలు, అతని పూర్వజన్మ వృత్తాంతము లతో సమన్వయపరచి చెప్పబడినవి ఇందు చారిత్రిక సత్యము లతోపాటు, కాల్పనిక కథలుకూడ జోడింపబడినవని విద్వాం సుల అభిప్రాయము ప్రకృతిచర్యా, ప్రణిధానచర్యా, అను లోమచర్యా, అవివర్తచర్యా అను నాలుగు చర్యల వర్ణన మొదటిఖండములో కలదు ద్వితీయ ఖండములో బుద్ధుని జీవితచరిత్ర, తృతీయఖండములో ధర్మప్రచారగాథలు కలవు. మిశ్ర సంస్కృతములో రచింపబడిన ఈ గ్రంథములో 1325 పుటలున్నవి ఇది క్రీ శ 1, 2 శతాబ్దులలో రచింపబడి యుండ వచ్చును మహాసాంఘికులైన లోకోత్తరవాదులశాఖకు చెందిన వినయపిటకమున కిది ప్రథమ గ్రంథముగాఎంచబడు చున్నది.

లలితవిస్తరము సువ్యవస్థితమగు కావ్యము గంభీర భావసమన్వితములు, ధ్వన్యాత్మకములగు కథలు చాల హృద యంగమముగా వర్ణించ బడినవి ఆ మహాపురుషుని పట్ల పాఠకులకు భక్తిశ్రద్ధలను కలిగించుటకై గ్రంథకర్త చేసిన ప్రయత్నము అత్యంతసఫలమని చెప్పవచ్చును

బుద్ధచరిత్రము 17 సర్గల మహాకావ్యము ఆర్య స్వర్ణాక్షికుమారుడుమ, పార్శ్వుని శిష్యుడునైన అశ్వఘోషుడు సుప్రసిద్ధ బౌద్ధ తత్వవేత్త ఆ మహాకవి ఈ కావ్యములో బుద్ధచరిత్రను, బోధనలను హృద్యముముగా వర్ణించెను

నిదానకథలో నలుగురు బుద్ధుల విస్తృత వివరణము కలదు వారికాలములో బోధిసత్త్వుడు విభిన్నరూపములలో జన్మించి బుద్ధత్వప్రాప్తికి తగు యోగ్యతను సమకూర్చుకొను గాథలు ఇందు వర్ణించబడినవి

ధర్మగుప్తుడు రచించిన 'అభినిష్క్రమణసూత్రము' మిశ్ర సంస్కృతములో రచింపబడెనని విద్వాంసుల అభిప్రా యము మూలగ్రంథము వినష్టమైపోయినది ప్రస్తుతము చైనీయ భాషానువాదము దొరుకుచున్నది ఈ చైనీయ కావ్యమును బీల్ అను ఆంగ్లేయుడు 'రొమాంటిక్ లెజెండ్ ఆఫ్ ది శాక్యబుద్ధ' అనుపేరిట ఆంగ్లములోనికి అనువదించి యున్నాడు

సంస్కృతములో రచింపబడిన బౌద్ధ గ్రంథములలో, మహాయానమునకు చెందిన 'సద్ధర్మపుండరీకము' ప్రాచీనతమమైన గ్రంథము క్రీ శ మొదటి శతాబ్దిలో వ్రాయబడిన ఈ గ్రంథములో గద్యాంశములు శుద్ధ సంస్కృతములోను, పద్యాంశములు మిశ్ర సంస్కృతములోను వ్రాయబడినవి చైనీ, జపానీభాషలలో ఈ గ్రంథము బహుళముగా అనువదింపబడినది హీనయానమునుండి బౌద్ధమహాయానమునకు మారుచున్న కాలములో వ్రాయబడిన ఈ గ్రంథములో హీనయానము ఉపాయకౌశల ప్రధానమై, సంఘములోని మందబుద్ధులకై ప్రపంచింపబడినదని నొక్కి చెప్పబడినది బౌద్ధులు 37 బోధిపక్షీయధర్మములను అనుసరించి, క్లేశావరణముక్తులై ఆర్యసత్యములను, కార్యకారణ భాగమును గ్రహించి, పుద్గలశూన్యత (అనాత్మస్థితి), నిర్వాణదశను పొంది, సంపూర్ణబుద్ధత్వప్రాప్తికి తగు యోగ్యతను సాధించు విధానము ఉల్లేఖించబడినది 27 అధ్యాయములు గల ఈ గ్రంథాంతమున సూత్రపాఠము, సూత్రప్రచారము, సూత్రజ్ఞానమువలన కలుగు పుణ్యము వివరించబడినవి

బౌద్ధ సాహిత్యమునకు చెందిన సంస్కృత కావ్యములలో తలమానికమువంటిదగు బుద్ధచరిత్రమును రచించిన అశ్వఘోషుడు 'సౌందరనందము' అను కావ్యమును 'సారిపుత్రప్రకరణము' అను రూపకమును రచించెను 'సౌందరనందములో' సవతి తమ్ముడగు నందుని బుద్ధుడు బౌద్ధ సన్యాసిగా నొనర్చిన గాథ అతి రమణీయముగా వర్ణితమైనది ఇది 18 సర్గలకావ్యము సారిపుత్రుడు, మౌద్గల్యాయనుడు అనువారిని బుద్ధుడు బౌద్ధమతావలంబులనుగా జేయుట యను ప్రధాన విషయము గల 'సారిపుత్రప్రకరణము'లో బౌద్ధసిద్ధాంతములు, సంప్రదాయములు కూడ వర్ణించబడినవి ప్రాకృత పాళీభాషలను వదలి, సంస్కృతములో కావ్యరచన గావించిన బౌద్ధకవిపండితులలో అశ్వఘోషుడు ప్రథమగణ్యుడు

4వ శతాబ్దములో నున్న బుద్ధఘోషుని పద్యచూడామణి, బుద్ధుని చరిత్ర, 9వ శతాబ్దిలో కాశ్మీరమును పరిపాలించిన అవంతివర్మ ఆస్థానకవియగు శివస్వామి రచించిన కప్పనాభ్యుదయము, 7వ శతాబ్దిలోనున్న శాంతిదేవుని బోధిచర్యావతారము, బోధాయనుని భగవదజ్జుకప్రహసనము, రామభద్రముని (14వ శతాబ్ది) యనునొక సన్యాసి రచించిన బుద్ధరోహిణీయము మున్నగునవి పేర్కొనతగిన రచనలు.

నాగార్జునిని మాధ్యమిక కారిక లేక మాధ్యమిక శాస్త్రము 27 అధ్యాయములు, 400 శ్లోకములు గల ఉత్కృష్టమైన ఆధ్యాత్మిక గ్రంథము నాగార్జునుని మాధ్యమిక వాదమునకు మూలగ్రంథము 'అకుతోభయ' అను వ్యాఖ్యాగ్రంథముకాక నాగార్జునుడు రచించిన గ్రంథములను - ఇరువది వరకు నాన్జో ఉట్టంకించినాడు

నాగార్జునుని శూన్యవాదమును వివరించుచు గ్రంథములను రచించినవారిలో స్థవిరబుద్ధపాలితుడు, భావవివేకుడు ముఖ్యులు, వీరిద్దరు 6వ శతాబ్దికి చెందినవారు వీరు ప్రాసంగిక, స్వతంత్రశాఖలను స్థాపించినారు మాధ్యమికవాదమునకు చెందిన ఇతర రచయితలలో ఆర్యదేవుడు, శాంతిదేవుడు, శాంతిరక్షితుడు కమలశీలుడు ముఖ్యులు

యోగాచార లేక విజ్ఞాన వాదాచార్యుడైన అసంగుడు విజ్ఞానవాద సంస్థాపకుడైన మైత్రేయనాథుని శిష్యుడుం ఈతని తమ్ముడు వసుబంధుడు వీరు గాంధారదేశములోని పురుషపురములో, 4వ శతాబ్దిలో నివసించిరి అసంగుడు రచించిన గ్రంథములలో మహాయాన సంపరిగ్రహము, ప్రకరణ ఆర్యవాచము, అభిధర్మసముచ్చయము, యోగాచార భూమిశాస్త్రము, మహాయానసూత్రాలంకారము, ప్రధానములు, వీనిలో చివరి రెండు సుప్రసిద్ధములు

సర్వాస్తివాదమును వదలి విజ్ఞానవాదమును చేరిన వసుబంధుడు, సర్వాస్తివాదమునకు చెందిన వైభాషికశాఖలో గొప్ప ఆచార్యుడు అభిధర్మకోశమను ప్రామాణిక గ్రంథమును రచించెను పరమార్థసప్తతి, తర్కశాస్త్రవాద విధి యను గ్రంథములుగాక, విజ్ఞానాప్తి మాత్రతాసిద్ధియగు చిన్ని పొత్తమును గూడ రచించెను అభిధర్మకోశమునకు స్ఫుటార్థమను పేరిట యశోమిత్రుడు రచించిన వ్యాఖ్యాగ్రంథము సుప్రసిద్ధము

పాళీభాషలో గల అవదాన (మతమునకు గాని నీతిధర్మములకు గాని సంబంధించిన ఘనకార్యము) సాహిత్యము సంస్కృత భాషలో అవదాన సాహిత్యముగా అవతరించినది బౌద్ధ వాఙ్మయములో అవధాన సాహిత్యమునకు విశిష్టస్థానము కలదు ధర్మోపదేశ ప్రధానములు, నీతిప్రతిపాదకములు అగు ఈ రచనలు హీనయాన, మహాయాన శాఖలలో సమానముగా ఆదరింపబడినవి

హీనయానమునకు సంబంధించిన 'అవదాన శతకము ప్రాచీనతమమని తలంచబడుచున్నది. ప్రత్యేకప్రణాళిక ననుసరించి విభజింపబడిన పదిపది కథలుగల పది శతకములున్నవి. మొదటి నాల్గుదశకములలోని కథలు ఎట్టికర్మ లాచరించినవారు బుద్ధుడుగా అవతరించునో చెప్పుట కుద్దేశింపబడినవి. భూతప్రేతముల వృత్తాంతము లాధారముగా ఐదవ దశకమందలి కథలు వ్రాయబడినవి. చేసిన పుణ్యకార్యములకు ఫలితముగా మానవులు, పశువులు స్వర్గమున దేవతలై జన్మించిన కథలు ఆరవదశకమందు కలవు. చివరి నాలుగు దశకములలో ఎట్టి కర్మలాచరించువాడు అర్హుడగునో చెప్పబడినది.

'దివ్యావదానము' కావ్యశైలిలో వ్రాయబడిన అవదాన కథల సమూహము. వేరువేరు కథలు వేరువేరు కాలములలో వ్రాయబడి, తరువాత సంకలితములైనట్లు కాన్పించుచున్నవి. దివ్యావదానమందలి శార్దూల కర్ణావదానము అను కథ క్రీ. శ. 265 లో చైనా భాషలోనికి అనువదింపబడినది.

కర్మశతకము, కల్పద్రుమావదానమాల, రత్నావదానమాల, అశోకావదానమాల, భద్రకల్పావదానమాల అనునవి పద్యకావ్యములు. ద్వావింశత్యవదానము గద్యప్రధానమైన గ్రంథము. వ్రతావదానమాల విచిత్రకర్ణికావదానము అను గ్రంథములలో బౌద్ధుల ఆచారవ్యవహారములు, వ్రతములు, పండుగలు మున్నగువానిని తెలుపు కథలు కలవు.

అవదాన సాహిత్యములో క్షేమేంద్రుని అవదాన కల్పలత ప్రఖ్యాతమైనది. ఇది క్రీ. శ. 1052 లో వ్రాయబడెను. దీనిలో 107 కథలు కలవు. క్షేమేంద్రుని పుత్రుడగు సోమేంద్రుడు ఈ గ్రంథమునకు పీఠికను సమకూర్చి జీమూతావదానము అను కథనుకూడ చేర్చెను.

ఈ విధముగా బుద్ధుని మరణానంతరము లిపిబద్ధము కాజొచ్చిన బౌద్ధసాహిత్యము క్రీ. శ. 14-15 శతాబ్దముల వరకు పాళీ - సంస్కృతభాషలలో ప్రచురముగా వ్రాయబడినది. సంఘ సంస్కర్తగా ఆవిర్భవించిన గౌతమబుద్ధుడు అవతారపురుషుడుగా మారిన విధానము సాహిత్యములో విశదము కాగలదు.

శం. బి. శా.

## బ్రహ్మగుప్తుడు

ప్రాచీన సుప్రసిద్ధ హిందూగణితశాస్త్ర ప్రవీణులలో బ్రహ్మగుప్తుడొకడు. అతని జన్మదినమేదియో తెలియకున్నను, క్రీ. శ. 598 వ సంవత్సరములో పుట్టి క్రీ. శ. 660 వరకు అతడు సజీవుడై ఉండి యుండవచ్చునని చెప్పబడుచున్నది.

క్రీ. శ. 628 లో అతడు బ్రహ్మగుప్త సిద్ధాంతమను నొక సమగ్రగ్రంథమును రచించెను. అందలి 12 వ, 18 వ అధ్యాయములలో గణితశాస్త్రము (అంకగణితము, బీజగణితము, రేఖాగణితము) సమగ్రముగా వివరింపబడినది. ఈ రెండు అధ్యాయములు హెచ్. టి. కోల్‌బ్రూక్ అను వానిచే అనువదింపబడి 1817 వ సంవత్సరములో లండను నగరమున ప్రచురింపబడినవి.

బ్రహ్మగుప్తుడు రచించిన అంకగణితములోని విశేషభాగము 'వడ్డీ' అను విషయమాధారముగాగలదై యున్నది. సమస్యలలో పెక్కులు త్రైరాశిక సూత్రముచే సాధింపబడినవి. ఈ గణితశాస్త్రక్షేత్రమున అతని రచనకెట్టి ప్రత్యేక ప్రాముఖ్యము నియ్యబడలేదు.

బీజగణితక్షేత్రమున బ్రహ్మదత్తుడు మహత్తరమైన ఫలితములను ఉత్పాదనమొనర్చెను. బ్రహ్మగుప్తుడు అంకగణితశ్రేణికి చెందిన మౌలిక - అంతాంత సిద్ధాంతములను గుణించెను. మూలసంబంధులకు ధనాత్మక మూల్యములను మాత్రమే ఇచ్చుచు అతడొక వర్గాత్మక సమీకరణమును పరిష్కరించెను. దత్తసమస్యకు ఉదాహరణముగా ఈక్రింద నొకటి ఎత్తి వ్రాయబడుచున్నది. సంఖ్యలకు బదులుగా అక్షరములను ఉపయోగించుచు పెక్కురు రచయితలు దానిని అనువదించిరి.

'h' అను నొక ఎత్తయిన బండమీద రెండుకోతులు నివసించుచుండెను. దాని అడుగుభాగము సమీప గ్రామమునుండి 'mh' అను దూరములోనున్నది. ఆ రెండు కోతులలో నొకటి ఆ బండమీదనుండి దిగి ఆ గ్రామములోనికేగెను. రెండవకోతి 'x' అను ఎత్తునకెగిరి, అచ్చటనుండి సరళరేఖాకృతిలో ఆ గ్రామమున కెగిరిపోయెను. ఆ రెండుకోతులు ప్రయాణించిన దూరము సమమైనదే x విలువను కనుగొనుము. బ్రహ్మగుప్తుడు ఈ సమస్యకు కచ్చితమైన ఈ దిగువ సమాధానము నొసగెను.

$$x = \frac{mh}{m+2}$$

ఆదియందు ప్రశ్నలో చెప్పబడినట్లు $h = 100$ మరియు $m = 2$

లైనియర్ సమీకరణములను, వర్గాత్మకసమీకరణము

అను పరిష్కరించుటలో తనకు అవ్యవహితముగ పూర్వుడును, సుప్రసిద్ధ జ్యోతిశ్శాస్త్రజ్ఞుడును నగు ఆర్యభట్టుయొక్క పద్ధతులకు కూడ బ్రహ్మగుప్తుడు మెరుగుపెట్టెను ఋణాత్మక సంఖ్యల ఉనికిని గుర్తించుచు డయోఫాంటస్‌చే పరిశీలింపబడిన వర్గాత్మక సమీకరణములయొక్క మూడు రూప విధానములను బ్రహ్మగుప్తుడు సమైక్యము నర్పగల్గెను అనగా—$ax^2+bx=c$, $bx+c=ax^2$, $ax^2+c=bx$ (అందు $a, b, c$ ధనాత్మక సంఖ్యలు) అతడు వాటినీ క్రిందివిధముగా సాధారణ విషయము క్రిందికే తీసికొనివచ్చెను

$$px^2+qx+r=0$$

ఇపుడభ్యసింపబడుచున్న పద్ధతినే ఉపయోగించుచు బ్రహ్మగుప్తుడు, మొదటివర్గమునకు చెందినట్టియు, నిర్ణయింప శక్యము కానట్టియు, పెక్కు సమీకరణముల యొక్క పరిష్కారములను పూర్ణాంకములలో కనుగొనెను నిర్ణయింపరాని రెండవవర్గమునకు చెందిన ఈ దిగువ సమీకరణము వొకదానిని అతడు పేర్కొనెను

$$nx^2+1=y^2$$

దానికి క్రింది పరిష్కారముల నిచ్చెను

$$x=\frac{2t}{t^2-n} \text{ and } y=\frac{t^2+n}{t^2-n}$$

దాని పరిష్కారమునుగాని, దానితో సంబంధముగల సమీకరణముల యొక్క పరిష్కారములనుగాని ఊహింపగల్గినచో, దాని సాధారణ పరిష్కారము పేర్కొనబడగలదని అవాడతడు రుజువు చేసెను అయితే ఆ పరిష్కారమెట్లు లభ్యముకాగలదో అతడు వివరింపలేదు అయినను, అనంతరీయులైన హిందూగణితశాస్త్రజ్ఞులు చక్రీయపద్ధతి ననుసరించి పరిష్కారముల నొసగిరి లాగ్రాంజ్ కాలమునకు పూర్వము సంఖ్యాసిద్ధాంతములో చక్రీయపద్ధతి అత్యంత ఘనమైన కల్పనగా భావింపబడెను ఏఫ్ కెజోరి అనునత డిట్లభిప్రాయపడెను -

$y^2=ax^2+1$ అను సమీకరణ మీనాడు 'పెల్' సమీకరణమని వ్యవహరింపబడవలసి వచ్చుట దురదృష్టమనియే చెప్పవలెను కాని యథార్థముగా దానిని అధికరించిన ప్రథమ విదగ్ధకృతికి కారకమ్ము హిందూ బ్రాహ్మణుల పాండిత్య ప్రకర్షయే

బ్రహ్మగుప్తుడు కూడ ఇట్లు చెప్పెను -

"'n' అనునది, రెండుపూర్ణాంకముల సముచ్చరీకరణ రాశిగా ప్రకటీకృతమైన కేవ్వ $y^2=nx^2-1$ అను సమీకరణమును $x, y$ ల యొక్క పూర్ణాంకిక మూల్యములు తృప్తిపరుప జాలవు

రేఖాగణితమునందు బ్రహ్మగుప్తుడు విశిష్ట ఫలితములను ప్రమాణీకరించెను అయితే అతని గణనములోని కొన్ని భాగములలో కొన్ని గొప్ప పొరపాటులున్నవి అతడు, రమారమిగానున్న విస్తీర్ణములకును, కచ్చితమైన విస్తీర్ణములకును భేదముకలవనెను, 'హీరన్ ఆఫ్ అలెగ్జాండ్రియా' యొక్క సుప్రసిద్ధసూత్రమును అతడు త్రికోణవిస్తీర్ణ విషయమున ఉదాహరించెను

$$\sqrt{s(s-a)(s-b)(s-c)}$$

అను $a, b, c, d$ అను పార్శ్వములు గలిగి $s$ సగము చుట్టుకొలతగాగల చతుర్భుజము యొక్క విస్తీర్ణముగా

$$\sqrt{(s-a)(s-b)(s-c)(s-d)}$$

అను దానిని పేర్కొనుటచే అతడు హీరన్ సూత్రమునకు అసాధారణమైన విస్తృతిని కల్పించెను. ఈ సూత్రము వృత్తములో ఇముడ్చబడగల చతుర్భుజముల విషయమున మాత్రమే వర్తించునని బ్రహ్మగుప్తుడు గుర్తించియుండినట్లు కాంటర్ అను పండితుడు తెలియబరచెను

చక్రీయ చతుర్భుజములను గూర్చి బ్రహ్మగుప్తు డొనర్చిన ఈ దిగువ సిద్ధాంతము విశిష్టమైనది -

$$x^2=\frac{(ad+bc)(ac+bd)}{ab+cd} \text{ and}$$

$$y^2=\frac{(ab+cd)(ac+bd)}{ad+bc}$$

ఇందు $x, y$ లు కర్ణములు, $a\,b\,c\,d$ లు పార్శ్వముల పొడవులు, బ్రహ్మగుప్తుని సిద్ధాంతము $a^2+b^2=c^2$ and $A^2+B^2=C^2$ అయినచో, అపుడు చతుర్భుజము (వీటికి బ్రహ్మగుప్తుని విషమ చతుర్భుజములని వ్యవహారము; $aC$, $cB$, $bC$, $cA$) చక్రీయముగను, దాని కర్ణములు సమకోణములుగను ఉండును బ్రహ్మగుప్తుడు టాలెమీ సిద్ధాంతము యొక్క ఉపపత్తిని ప్రవేశపెట్టెను ఇట్లు చేయుటలో సమత్రికోణముల ($a, b, c$) నుండియు, మరియు ($\alpha, \beta, \gamma$) నూతన సమత్రికోణముల ($ar, br, cr$), ($\alpha c, \beta c, c$) నుండియు, నిర్మాణముల విషయములో డయొఫాంటస్ అను పండితుని అతడు అనుసరించెను డయొఫాంటస్ ప్రయోగించిన ఈ క్రిందీ ఉదాహరణమునే అతడును ఉపయోగించెను:

(39 62,65) మరియు (25 60 65)

ఆ వేళాక, బ్రహ్మగుప్తుడు సూచ్యాగ్రముల యొక్కయు శంకువుల యొక్కయు తలమును, ఘనపరిమాణమును గూడ నిర్ణయించెను ఈ సమస్యల విషయమున ఆర్యభట్టు పొరపాటునకు గురియయ్యెను అయినను వృత్తమును పరిశుద్ధ యత్నమున బ్రహ్మగుప్తున కంతగా జయము చేకూరలేదు ఆ ప్రయత్నముచే సిద్ధించిన ఫలితము $\pi$ అను సంకేతము యొక్క విలువకు $\sqrt{10}$ అనునది సమాన మయ్యెను

యం సు

## బ్రహ్మనాయుడు

12 వ శతాబ్ది ఉత్తరార్ధమున దాయాదుల మధ్య జరిగిన పల్నాటి యుద్ధములో ప్రముఖ పాత్ర వహించి ఉదాత్త క్షాత్రధర్మమును ప్రకటించిన మహితచరితుడు బ్రహ్మనాయడు ఆంధ్రుల చరిత్రలో 12 వ శతాబ్దము మతకల్లోలములకు నిలయ మయ్యెను వీరశైవమత మొకవైపునను, వైష్ణవమత మొకవైపునను విజృంభించిన కాలమది వైష్ణవ మతస్థుడైన బ్రహ్మన, శైవుడైన సోముని పుత్రికను మలిదేవునకు వివాహ మొనర్చి ఆ శతాబ్దము లోని మతద్వేషములను రూపుమాపుటకు నాంది కావించిన మహానుభావుడు పల్నాటి రాజ్యమును పాలించిన అనుగు రాజునకు మంత్రియగు దొడ్డనాయని కుమారుడితడు అతని తల్లి శీలాంబ అతడు రేచర్ల గోత్రుడు

అనుగురాజు మరణించినపుడు తన పుత్రులనందరిని బ్రహ్మనాయని కప్పగించెను "అందరి నొకతీరుగ ప్రేమాదరములతో కాపాడుము జ్యేష్ఠుడగు నలగామునకు పల్నాటి రాజ్య పట్టము గట్టుము నీవు మంత్రిత్వము వహింపుము" అని అనుగురాజు బ్రహ్మనాయని కానతిచ్చెను అనుగురాజు కోరిక ప్రకారము బ్రహ్మనాయడు నలగామరాజును పల్నాటి రాజ్యమునకు రాజునుచేసి, తానే మంత్రిత్వము వహించెను

నలగామరాజువద్ద బ్రహ్మన మంత్రిత్వము నిరాటంకముగ కొనసాగలేదు. అనుగురాజు జీవించి యుండగా, అతని ప్రాపకమును సంపాదించిన నాగమ్మ యనునామె నలగామ రాజువద్ద చేరి నలగామునకు బ్రహ్మనమీద ద్వేషము ఏర్పడుటకు కారకురాలయ్యెను నాగమ్మ అసాధారణ వ్యక్తి నాయకురాలని ప్రసిద్ధి వహించినది మంత్రపాటవము కలది రాజనీతిప్రవీణ వీరవనిత

బ్రహ్మన గురిజాలలో లేని తరుణమున నాయకురాలు అసలరగు నాగమ్మ కుట్రచేసి, రాజభటులను బంపి బ్రహ్మన్న స్నేహితుల ఖండ్లను దోపిడికి గురిచేయించి అందలి ద్రవ్యరాసుల నలగామునెదుట బెట్టించి ప్రభుత్వ కోశాగారమునకు చెందవలసిన ద్రవ్యమునెల్ల బ్రహ్మనయు, అతని స్నేహితులును అపహరించిరని చెప్పెను ఆమె మాటను నలగాముడు నమ్మెను తత్ఫలితముగా బ్రహ్మన మీద నలగామునకు మనస్సు విరిగెను పిదప నలగాముని రాజ్యభ్రష్టునిచేసి, పట్టమహిషి కుమారుడైన మలిదేవునికి రాజ్య మిప్పించుట బ్రహ్మన తలంపని చాడీలు చెప్పి బాలురైన మలిదేవాదుల యెడ గూడ నాయకురాలు నలగామునకు ద్వేషము కల్పించెను ఇట్లు నాయకురాలి దుస్తంత్రములకు లోనై, నలగాముడు తన సవతితమ్ములను చెరసాలయం దుంచెను

బ్రహ్మనాయుడు నిరుపమాన తేజోవిభాసియు, నిష్కపట హృదయుడును, అవ్యాజ మనోధర్మ ప్రభావ గామియునైన పుణ్యపురుషుడు అతడు నాయకురాలు పన్నిన కుట్రలను గ్రహించి పరిస్థితుల ప్రభావమునకు లొంగి మలిదేవాదులను చెరసాలనుండి విడిపించి పల్నాటి రాజ్యమును విభాగించి, మలిదేవాదుల రాజ్యభాగమునకు మాచర్లను ముఖ్యపట్టణముచేసి కులదైవమైన చెన్నకేశవస్వామి నొక నూతనాలయమునందు ప్రతిష్ఠించి, మలిదేవాదుల నచ్చటికి చేర్చెను మలిదేవుడు పిన్నవయస్కుడైనందున తానే అతని స్థానమున రాజ్యపాలన కార్యమును వహించెను కాని మలిదేవుడు యుక్తవయస్కుడు కాగానే, అతనికిని కల్యాణపురాధీశుడైన వీరసోముని పుత్రిక సీరాదేవికిని, వివాహము చేసెను శివపురిలోనున్న భూతరాట్కుంభమును త్రిపురాంతకములో ప్రతిష్ఠించి, మలిదేవునకు పట్టముగట్టి తానుమంత్రిత్వము నెరపుచుండెను

పల్నాటివీరచరిత్రలో బ్రహ్మన విష్ణ్వంశసంభూతుడుగను, సుగుణరాశిగను, ఉదహరింపబడెను అనుగురాజు తన కప్పజెప్పిన రాకుమారులమధ్య సౌహార్ద సౌమనస్యములను బెంచు తలంపు కలవాడు బ్రహ్మన అందుచే మలిదేవుని వివాహమునకు నలగామరాజు రాకున్నను అతనికోరకై రాజనీతి చతురుడును, విశాల హృదయుడును నగు బ్రహ్మన స్వయముగ, కట్నములను దీసికొని గురిజాలకు వెళ్ళెను కాని సవతిబిడ్డల మధ్య సఖ్యము కుదిరి పెంపొందకుండ చేసినది...(?) తనకు నలగాముని వద్ద

స్థాన మండలాలదనియు, బ్రహ్మన ప్రశాపము నణచుట ప్రథమ కర్తవ్యమనియు మదినెంచిన నాయకురాలు కట్నములు దెచ్చిన బ్రహ్మనను కవ్వించి అతనిని కోడిపందెము లాడునట్లు ఒడబరచెను

బ్రహ్మనకు కోడిపందెములనిన మక్కువ మిక్కుటము అందువలన అతడు మాచర్లకు తిరిగివచ్చి కొలువుదీర్చి, మలిదేవాదులకు నాయకురాలుద్దేశించిన పందెమునుగూర్చి తెల్పి, పానుగల్లులోనున్న మేటదైన 'చిట్టిమల్లు' అను పుంజును దెప్పించి పందెమాడుటకు సపరివారముగా గురిజాలకు చేరెను

ఇరుపైపుల పుంజులను పోరుటకై వదలిరి రెండు పుంజులును చూచువారల కాశ్చర్యము గొలుపుచు పోరు సాగించెను ఎట్టకేలకు నలగాముని పుంజు నెత్తురుగ్రక్కి నేల కొరిగెను నలగాముడు ఖిన్నుడయ్యెను కాని నాయకురాలి రోష మినుమడించెను ఆమె బ్రహ్మనను మలి పోరు పందెమున కొడబరచి, నలగామునకు శాంతివాక్యములు చెప్పెను

నాయకురాలు ఆ రాత్రి బ్రహ్మనాయని చంపించు ప్రయత్నములు చేసెను కాని అవి విఫలమయ్యెను తాను తప్పక విజయమును బొందుటకొక వ్యూహామును బన్ని కట్టు బోతులను పిలిపించి, వారిని మంత్రతంత్రాములచే బ్రహ్మన పుంజును జంపుట కొడబరచెను నిర్ణీత సమయమునకు పందెము ప్రారంభమయ్యెను కొంత పోరు నడచిన తర్వాత నాయని పుంజుమీన కట్టుబోతులు చల్లిన మంత్రాక్షతల ఫలితముగ అది నేలకొరిగి ప్రాణములను విడచెను నాయకురాలి సంతోషమునకు మేరలేదు పందెపు షరతుల ననుసరించి బ్రహ్మనాయడు మలిదేవాదులతో ఏడుసంవత్సరములు మాచెర్లనువదలి వనవాసమునకు బోవలసి వచ్చెను దాని నంగీకరించి, బ్రహ్మనాయడు మాచెర్లకు తిరిగివచ్చెను

బ్రహ్మనాయుడు తాను పందెములో ఓడిపోయినందులకు వగచుచున్న మలిదేవాదుల నోదార్చి వలసకు వారల నొప్పించి, సర్వము సిద్ధపరచెను ఇలవేల్పయిన చెన్నకేశవుని సందర్శించి, అతనిని ప్రార్థించి, దేవుని భూషణముల నెల్ల నొకకంట్లపు కోడిపై నెత్తించి, మలిదేవాదులతోను, అంతఃపురస్త్రీలతోను, వీరనాయకులతోను, గోసంపదతోను, మాచెర్లను వీడి బ్రహ్మనాయడు కృష్ణయొడ్డుకుచేరి అట నొక తోటలో ఆరాత్రి అందరితోను బసచేసెను ఆ తోటలో తిరుగుచున్న ఒక పెద్దపులిని ఆ నదిలోనున్న ఒక మొసలిని బ్రహ్మనాయడు సంహారించెను గంధర్వ దంపతులైన ఆ పులియు, మొసలియు తమ తొలి గంధర్వ దంపతీ రూపములను దాల్చిరి వారు విష్ణ్వంశ సంభూతుడగు బ్రహ్మనచేతిలో శాపవిముక్తులమైతిమని తెల్పి, బ్రహ్మనను కొనియాడి తమ లోకమున కేగిరి బ్రహ్మనాయడు తనలోని మహిమను గుర్తించియు మానుష ప్రవృత్త్యౌచిత్యమును మాత్ర మెన్నడును మరచినవాడు కాడు అదే అతనిలోని గొప్పతనము

మలిదేవాదులు మండాదిని జేరి, యచట తమ నివాసముల నేర్పరచుకొని సుఖులై విశేష ప్రాభవముతో, మూడు సంవత్సరములు గడపిరి ఇట్లుండ గురజాలలోని నాయకురాలు వారి సుఖస్థితినిగూర్చి విని ఓర్వలేక, వారికి కీడొనర్ప తలపెట్టెను అంతట ఆమె నలగాముని ఒప్పించి, మలిదేవాదుల గోగణంబును తరలించుటకై కొంత సైన్యమునిచ్చి పలినేడను వానిని మండాదికి బంపెను కాని ఆ ప్రయత్నము గూడ విఫలమయ్యెను పలినేడు మండాదికి జేరి వేగులవారి వలన వారి బలాబలములను దెలిసికొని అచట గోవులను రక్షించుచున్న లంకన్న అనువానిని ఎదుర్కొనెను లంకన్న పలినేడుయొక్క తల నొక్క వ్రేటున ద్రుంచెను కాని పోరులో తానుగూడ నేలకొరిగెను శేషించిన శత్రువులు గోవుల తరలించిరి ఆ వార్త విన్న బ్రహ్మన గోవుల విడిపించుటకు కన్నమ యనువానిని బంపెను అతడు మార్గమధ్యమున ఎదిరి సైన్యమును దునుమాడి గోవులను మండాదికి మరల్చెను

నలగామరాజు తమ మందను హరింప యత్నించినందులకై బ్రహ్మనాయడు ఉగ్రుడై తానేకాకియై గురజాలకుబోయి నలగామునితో యుద్ధముచేసెదనని ప్రతిజ్ఞబూని ప్రయాణమున కాయత్తపడి భక్తితో తల్లికి మ్రొక్కెను అంతట అతనికి తల్లి రణనీతిని తెల్పుచు

"నీము ఖకాంతిని నిఖిలంబునెరుగ
భావించి హరిహరబ్రహ్మదులైన
తేరిచూడగలేరు ధీరుడ! నీవు
కొరతయేమియులేక కోట బొడిచెదవు"

అని దీవించి పంపెను. బ్రహ్మన దలచిన చర్య యిష్టములేని మలిదేవరాజు, బ్రహ్మన నిశ్చయమును మార్చలేక, అతని వలన తన సోదరుడైన నలగామునకు హాని జరుగకుండునట్లు

వాగ్దానమును బడసి, ఆయనను సాగనంపెను

బ్రహ్మన తాను ఒంటరిగ గురజాలకు వచ్చిన కారణమును నలగామున కెరిగించెను నాయకురాలు బ్రహ్మన నెదిరించుటకు సైన్యమును బంపెను కాని ఆ సైనికులు బ్రహ్మన నెదిరించలేక చెల్లాచెదరై పారిపోయిరి బ్రహ్మన కోట ప్రవేశించునప్పటికే నలగాముడు భయపడి తలదాచుకొనుటకు గంగగుడికి పారిపోయెను బ్రహ్మన నలగాముని బట్టి చంపుటకు ఆ గుడియందు ప్రవేశించెను కాని అచటి దేవి ప్రత్యక్షమై నలగాముని కరుణింపుమని బ్రహ్మన కానతిచ్చెను బ్రహ్మనాయుడు వీరోచితముగ నలగామున కభయహస్త మొసగి మండాదికి తిరిగి వెళ్లెను నిశ్చలసంకల్పుడై యమోఘబాణుండై నిజనామసంచలిత శాత్రవబలుండైన బ్రహ్మనాయుడు నిజమైన వీరుడు

మండాదిలో నుండుట క్షేమముగాదని మలిదేవాదులు బ్రహ్మన కోరిక ప్రకారము తక్కిన గడువుకాలము మేడపిలో గడిపి వనవాసకాలమును పూర్తిచేసిరి

రాయబారముద్వారా మలిదేవాదుల రాజ్యభాగము వారికి సంపాదించి పెట్టుటకు గూడ బ్రహ్మన యత్నించెను ఈ కార్యము నిర్వహించుటకు బ్రహ్మన రాచమల్లుడను బిరుదు వహించిన అలరాజును పంపెను అలరాజు ఇరుపక్షములకును బంధువు అలరాజు రాయబార కార్యసాధనకై గురజాలకు వెడలి కొలువుదీర్చిన నలగామునకు, మలిదేవాదుల రాజ్యమును వారికిచ్చివేయుట శ్రేయస్కరమని యనేక విధముల జెప్పెను

కాని కార్యసాధనకు నాయకురాలు అడ్డుపడెను. ఆమె కుతంత్రమువలన రాయబారము విఫలమయ్యెను. అలరాజు మోసముగా చంపబడెను

తరువాతిది యుద్ధఘట్టము ఆ యుద్ధము నడుపుటలో గూడ బ్రహ్మనయే ప్రముఖపాత్ర వహించెను మలిదేవాదుల రాజ్యమును మరల వారికి రాబట్టవలెనన్న యుద్ధము తప్ప, యుపాయాంతరము లేదని అలరాజు మరణము వలన బ్రహ్మన గ్రహించెను అతడు శుభముహూర్తము నిర్ణయించి మలిదేవుని కొడుకగు బిరుదురాజునకు బట్టముగట్టి, తన కుమారుడగు బాలచంద్రునకు మంత్రిత్వమునిచ్చి, బాలచంద్రుని విప్రస్నేహితుడైన అనపోతునకు కరణకార్యమప్పగించి, వీరనాయకులను యుద్ధసన్నద్ధులను జేసి, రణభేరి వేయించెను యుద్ధమునకు కావలసిన సాధన సామగ్రుల నాయత్తపరచి వీరనాయకులందరు మేడపినుండి కారెంపూడి యుద్ధరంగమునకు బ్రహ్మనాయని నాయకత్వమున ఇనుమడించిన యుత్సాహముతో బయలుదేరిరి తాను శివపురినుండి తెచ్చి త్రిపురాంతకములో ప్రతిష్ఠించిన భూతరాట్కంబమును యుద్ధమునకు సాక్షిగా కార్యమపూడి యుద్ధరంగమున ప్రతిష్ఠింపదలచి బ్రహ్మనాయుడు దానిని బండ్లమీది కెత్తించి సైన్యముతో మేళ్ళవాగుకు దెప్పించెను అంతట సూర్యుడస్తమించెను అర్ధరాత్రి సమయమున బ్రహ్మన, కన్నమను బిలిచి యుద్ధరంగము, పూర్వపు యుద్ధముల వలన ఎముకల కుప్పలతోను, బూడిద పెంటలతోను అపవిత్రముగ నున్నందున దానిని పవిత్రము చేయదలచితినని చెప్పి, దానిని యుద్ధరంగమును కలయజూచి రమ్మని పంపెను కన్నమ యుద్ధభూమిని సమీపింప, భూతపిశాచాదు లతనిని భయపెట్ట ప్రయత్నించెను బ్రహ్మన పాదధూళితోగాని యుద్ధభూమి పవిత్రము కాదుకావున, ఈ విషయము బ్రహ్మనకు తెలుపుమని ఒక ఎరుకలసాని కన్నమతో జెప్పెను కన్నమ తిరిగి వచ్చి ఆ విషయమును బ్రహ్మనకు చెప్పెను

బ్రహ్మనాయ డర్ధరాత్రమున యుద్ధభూమిని ఒంటరిగ ప్రవేశించి భూతపిశాచములను పారద్రోలి, యుద్ధభూమిని పరిశుద్ధ మొనర్చుటకై వర్షమును గురిపింపుమని హరిని ప్రార్థించెనట! బ్రహ్మనాయని ప్రార్థనా ఫలితముగ వర్షము గురిసెనట! యుద్ధక్షేత్రము పవిత్ర మయ్యెనట! యుద్ధదేవతయైన మహాశక్తి బ్రహ్మనకు ప్రత్యక్ష మయ్యెనట! అతడు ఆ దేవతను సమరమునకు సాక్షిగా నిల్పి అటనుండి విడిదికి తరలెను మరునాడు యుద్ధభూమియందు భూతరాట్కంబమును ప్రతిష్ఠించి వీరనాయకులందరు గంగధారయందు జలకములాడి, నాగులేటి యొడ్డున లింగమును ప్రతిష్ఠించి, యుద్ధమునకు సిద్ధమయిరి

నలగామరాజు సైన్యసమేతుడై యుద్ధభూమిని జేరెను, కాలజ్ఞుల నిర్ణయప్రకారము యుద్ధమునకు సుముహూర్తము నిర్ణయింప బడెను

యుద్ధ మనివార్యమని తెలిసికొనిన నాయకురాలు తన మనస్సును మార్చుకొని సంధిచేసికొను తలంపుతో, మాచర్ల రాజ్యమును మలిదేవున కిచ్చుటకును కులము పగతీర్చుటకు నరసింగరాజును బ్రహ్మన కప్పగించుటకును నలగామరాజు

సిద్ధముగా నున్నాడని వర్తమానము పంపి తన నయకౌశల మును ప్రదర్శించెను మలిదేవని కొలువునకు వెళ్ళిన రాయ బారులు మలిదేవాదులను సంధి కొడబరచిరి

యుద్ధము తప్పినదని ఇరువైపుల వీరులు ఆహ్లాదమును బొందిరి నలగామని రాయబారులు, మలిదేవుని వీరులు నొక్క చోగూడి విందారగించు చుండిరి అప్పుడు బ్రహ్మ నాయని కుమారుడు బాలచంద్రుడు కారెముపూడి రణ రంగపు విడిదికి వచ్చెను సంధి కుదిరినదని విని అతడు ఆవేశ ముతో వీరుల నందరిని కదనరంగమునకు కదలుడని పురి గొల్పెను

యుద్ధసన్నద్ధుడైన బాలచంద్రుడు తండ్రి బ్రహ్మనా యని ఆశీస్సుల నర్థించి రాగా, క్షాత్రధర్మమహితుడైన ఆ తండ్రి తన కుమారునితో,

"ఓ బాలచంద్రుడ యొప్పుగా వినుము
ధరలోన నాపేరు దశదిశలందు
ప్రఖ్యాతి నొందుట బ్రహ్మన్నవైతి
మండలేశులకెల్ల మది తల్లడమయి
చెల్లిన మనపేరు చెడిపోవనీకు
పృథ్విమన బిరుదుల పెంపునొందింపు
ఘనమైన నాపేరు కల్ల జేయకుము
ఇలలోన మంలావు చెన్న వేరెవరు
ఇది సమరాంగణ మిది పుణ్యభూమి
శ్రీకంఠు శిరసంటి చెప్పెదనీకు
పటుకీర్తి నొందుచు బ్రహ్మాండమందు
ఇది ముక్తి సోపానమిది మూలధనము
ఇది దోవ వితతుల చెన్న నేమేటి
హెచ్చైన వీరుల కిది పుట్టినిల్లు
కన్నెకయ్య బిడి కని పెట్టిపోరు
నలుపంగవలయును, సత్కీర్తి కలుగ
తలపడునప్పుడు తలకకుమన్న
అలుగులదీప్తికి అలుకకుమన్న
వారణధ్వనివిని వడకకుమన్న
తరచు యుద్ధమ్మున దద్దరిల్లకుమన్న
పరదళంబులుగని పారకుమన్న"

ఈ విధముగా వీరుడైన తండ్రి వీరుడైన కుమారుని వలన కీర్తి వెల్లోసించునో తెల్పి అతనిని దీవించి పంపెను

యుద్ధమందు బాలచంద్రుడు మహాభారతములోని అభిమన్యునివలె వీరమధ్య ఒక్కడై వీరవిహారము జేసి అనే కమంది వీరయోధులను గుండమాడి సైన్యముల నెల్ల చెల్లా చెదరుజేసి శత్రుసైనికులలో నొకని నరసింగుడని భ్రమించి వాని తలగోసి తండ్రివద్దకు దీసికొనిపోయెను తండ్రి యద్ది నరసింగుని తల కాదని కుమారుడు బాలచంద్రునితో జెప్పెను బాలచంద్రుడు తిరిగి రణభూమికేగి శత్రుసైనికుల చెండాడి నరసింగునెదుర్కొని అతని తల గోసి, దానిని పట్టి తండ్రి బ్రహ్మనవద్ద నుంచెను నరసింగుని మరణమునకు బ్రహ్మన మిక్కిలి వగచెను మరియు అనాహూతుడై రణమొనర్చి బంధుమిత్రుల ననేకులచావునకు కారణమైనందుకు బాలచం ద్రుని నిందించెను క్షాత్రతేజమున తండ్రినిమించిన బాలచం ద్రుడంత తండ్రిచేసిన తప్పుల నేకరువుపెట్టెను బ్రహ్మన మనస్సు కలతజెంది "వెన్నిచ్చిన స్త్రీని విమతులకీవు" అని అతని మందలించెను అంత బాలచంద్రుడు తిరిగి రణరంగమున ప్రవేశించి శక్తికొలది వీరవిహారముజేసి నేలకొరిగెను సూర్యు డస్తమించెను ఆరోజు యుద్ధమంత ముగిసెను

బాలచంద్రుని మరణానంతరము మరునాటి యుద్ధ రంగమున కొమ్మరాజు ప్రవేశించి తానుగూడ వీరవిహారము జేసి తన దివ్యాస్త్రములను మోపుగగట్టి బ్రహ్మనకు బంపి, చెన్నకేశవుని మదిలో దలంచుచు అసువులబాసెను అనేక మంది వీరుల యొక్కయు, వీరుడైన బాలచంద్రుని యొక్కయు దివ్యాస్త్రములు గలిగిన కొమ్మరాజు యొక్కయు మరణము నకును, కులనాశనమునకును తన కారకత్వమును గుర్తించి మలిదేవుడు హాతధారణమున ప్రాణములను బాసెను

కథానాయకురాలయిన నాగమ్మ మలిదేవాదుల మర ణమునకు సంతసిల్లెను బ్రహ్మనను తుదముట్టింప ఆమె నల గామ నాజ్ఞనుబొంది పచరుల బ్రహ్మనను బంపెను వీరులం దరు మరణించుట తటస్థించినందుకు బ్రహ్మన వగచి తానే స్వయముగ యుద్ధముచేయు తలంపుతో యుద్ధరంగమున ప్రవే శించెను

బ్రహ్మన తన నెదిరించిన వారినెల్ల హతమార్చి రణ రంగమున విజృంభించెను అదిజూచి నాయకురాలు తానే స్వయముగ బ్రహ్మన నెదిరించు తలంపుతో గుఱ్ఱమునెక్కి శక్తి చేబూని అతని కెదురునిల్చెను కాని వృద్ధుని, బాలుని స్త్రీని, సైన్యాదులులేని రాజును చంపకూడదను భారతీయ

యుద్ధధర్మములను అనుసరించి బ్రహ్మన పరాఙ్ముఖుడయి, స్త్రీహత్యాదోషములకు వెరచి నాయకురాలి యత్నమును భోధించెను ఆ అత్నము ఫలించెను నాయకురాలు ప్రక్కకుతొలగి కొండమగుండ్లకు పారిపోయెను ఈ లోపుగా నలగామడు గూడ స్వప్రాణరక్షణార్థమై తానుగూడ కొండమగుండ్లకు పారిపోయెను అంతట బ్రహ్మన నలగామని పట్టుటకు కొండమగుండ్లకు బోయెను అచ్చటి విప్రులు నలగాముని కరుణింపుమని ఆతనిని ప్రార్థించిరి బ్రహ్మన వారి ప్రార్థనను మన్నించి నలగామునికి హితవుచెప్పి ఆనటనుండి నిష్క్రమించెను

ఈ వీరులకథ, బసవేశ్వరుడు వీరశైవ మతమును ప్రచారములోనికి దెచ్చిన పిమ్మట జరిగినది వీరశైవమున వర్ణభేదము లేదు అన్నికులములు సమానస్థాయిలో నెన్నబడెను బ్రహ్మనాయడొక వర్ణరహిత సంఘమును నిర్మింపబూనిన వ్యక్తిగా ఈ కథలో చూపబడెను నానా కులములందు బుట్టిన బాలచంద్రుని మిత్రులను బ్రహ్మన తన పుత్రసములుగా పరిగణించుట, బ్రహ్మనచేత తీర్థప్రసాదములు గైకొన్న వారందరును ఏకసంఘీయులుగా పరిగణింపబడుట, కుల విచక్షణ లేకుండ వీరులందరు కోడిచే 'చాపకూడు' భుజించుట మొదలైన సంఘటనలు బ్రహ్మనపాత్రకు ఉదాత్తస్థాయిని కల్పించెను ఈ వీరుల కథలో బ్రహ్మనాయడు విష్ణువుగను, నాయకురాలు యోగమాయగను పరిగణింపబడిరి కురుక్షేత్ర యుద్ధమున కృష్ణుడెంత ముఖ్యుడుగ నుండెనో పల్నాటి యుద్ధమున బ్రహ్మనాయడంత ముఖ్యుడుగా నుండెను ఈ బ్రహ్మనాయడు పల్నాటి కృష్ణుడని పేర్కొనబడుచున్నాడు

బ్రహ్మనాయడు యుద్ధములో జచ్చినవారి కందరను బ్రతికించి వెంటబెట్టుకొని గుత్తికొండ బిలములో ప్రవేశించెననియు, అందరు నిజస్వరూపములు గైకొనిరనియు, నందులో బ్రహ్మనాయడు విష్ణురూపము, నాయకురాలు యోగమాయారూపము నందిరనియు వీరభద్రకవి వ్రాసినాడు.

చిం బు వేం. అ

## బ్రహ్మరుద్రయ్య :

రామాయణ మహాభారతములవంటి పౌరాణికగ్రంథములవలెనే ఆంధ్రదేశమున మిక్కిలి ప్రచారములోనుండి గ్రామీణప్రజలకు గొప్ప ఆనందమును, ఆహ్లాదమును కలిగించు దేశీ కథారచనలలో, పలనాటి వీరచరిత్రము, కాటమరాజుకథ, బొబ్బిలికథ, దేశింగ రాజుకథ మున్నగునవి పెక్కు యో నున్నవి బహుజనాదరణముపొందిన ఈ దేశీ కథాసాహిత్యమును ముఖ్యముగ మొత్తెరగులుగా విభజింపవచ్చును 1 యాదవ రాజులకథలు, 2 శక్తికథలు, 3 పలనాటికథలు ఈ మూడు విధములైన కథలనుజెప్పి జీవించువారు ఆంధ్రదేశమున ఎందరో ఉన్నారు యాదవరాజుకథలో ప్రముఖపాత్రధారి యీ బ్రహ్మరుద్రయ్య

ప్రస్తుతవిషయమైన యాదవరాజుకథను ఎర్రగొల్లలు, పిచ్చుగుంటలు మొదలగు జాతులవారు గ్రామములవెంట తిరిగి, శూద్రుల గోత్ర ప్రవరాదులను దెలుపుచు ధనమును గడించి జీవించుచున్నారు ఈకథలకు గొల్లసుద్దులని పేరు ఈ కథలను చెప్పువారు సుద్దులగొల్లలనియు, కొమ్ముగొల్లలనియు వ్యవహరింపబడుచుందురు

నెల్లూరు మండలమందలి కనిగిరి సీమలోని ఆలవలపాడును రాజధానిగా జేసికొని క్రీ శ 1250-1280 సంవత్సరములమధ్య యాదవప్రభువైన కాటమరాజు రాజ్యపాలనము చేసెను ఈ రాజునకు మహాప్రతిభాశాలియైన బ్రహ్మరుద్రయ్య అనునతడు మంత్రిగను, సేనాపతిగను ఉండి అప్రతిమానమైన తన మేధాసంపత్తితో, శౌర్యసాహసములతో ఆరాజ్యాభివృద్ధికి మిక్కిలి తోడ్పడెను ఇతడు గొప్ప ప్రభుభక్తిపరాయణుడు నియమనిష్ఠాగరిష్ఠుడైన పరమశైవుడు శివార్చక కులస్థుడు

ఒకానొక సంవత్సరమున కనిగిరిసీమయందు మహాక్షామము సంభవించెను పశువులు త్రాగుటకు నీరు, తినుటకు మేత లేక మలమల మాడిపోవుచుండెను మనుమసిద్ధిరాజు (1252-1280) ఏలుబడిక్రిందనున్న నెల్లూరుప్రాంతమునకు కాటమరాజు పశువులను కాపరులు తోలుకొనిపోయి, ఆమహారాజునుండి పుల్లరిదీసికొనబడిన పచ్చికబయళ్ళలో పశువులను మేపిరి కొంతకాలమైన పిమ్మట దేశమున సుభిక్షపు పరిస్థితులేర్పడినందున కాటమరాజు మనుష్యులు పశువులను మరల్చుకొనిపోయిరి.

ఒప్పందముప్రకారము మనుమసిద్ధిప్రభువున కీయవలసిన పుల్లరినీయక కాటమరాజు కాలహరణము చేయదొడగెను మనుమసిద్ధిరాజు 'అన్నంభొట్లు' అను బ్రాహ్మణోత్తముని రాయబారిగా నంపెను కాని ఫలితము శూన్యమయినది

మనుమసిద్ధిరాజు కాటమరాజును శిక్షించుటకై తన మంత్రియైన ఖడ్గతిక్కనయాయకత్వమున గొప్పసైన్యమును

బంపెను ఈ దండుతోయి సర్వేపల్లిమిట్టపైని విడిదిచేసినది తిరునామాల తిప్పరాజు, శ్రీకంఠరాజు, పెదవేగిచొక్కరాజు అల్లికొండ అచ్చిరాజు, ఆదివన్నె మాదిరాజు, గయికొండ గంగరాజు, ఉర్లకొండ సోమన్న, పెదవేగిచొక్కరాజు, పెద వరదరాజు, ఉదయాద్రి ఉమ్మయ్య, చెన్నపట్టణము చంద్రశేఖరుడు, దేవముని వెంగళయ్య, పట్టుకోట బసవరాజు, కాళహస్తి పావతిమ్మరాజు, వెంకంచి వెంగళపతిరాజు, ప్రభగిరిపట్టణము పద్మశేఖరుడు మొదలగు రాచవారు ఖడ్గతిక్కననుసరించిరి

కాటమరాజుసైన్యమునకు పల్లికొండ ప్రభువైన చల్ల పిన్నమనేడు నాయకత్వము వహించెను ఈ యాదవుల పక్షమున సహాయకులుగ పల్నాటిప్రభువైన పద్మనాయుడు, దొనకొండ ఆయితమరాజు ఎఱ్ఱయ్య, భట్టావులరాజు, నల్లతన్న, నాచకూళ్లనాయడు, ముమ్మయ్యనాయడు, ఉత్తమరాజు మొదలగు ప్రభువులు వచ్చిరి

ఉభయసైన్యములు పాలేటియొడ్డుననున్న పంచలింగాల కొండవద్ద ఒకదానికొకటి ఎదురెదురుగా విడిసినవి ఈ రెండుసైన్యములకు ఎఱ్ఱగడ్డపాడనుచోట భయంకరమైన యుద్ధము జరిగినది. ఈయుద్ధమున విధివశమున ఖడ్గతిక్కన సైన్యములు పరాజయమొందినవి అయినను ఖడ్గతిక్కన వెనుకంజవేయక నిరుపమానమైన ధైర్యసాహసములతో—

"నేనున్న ఫలమేమి? యిపుడు యాదవుల
పై దూకి గజముం దరిమార్చివత్తు—"

అని ప్రతిజ్ఞాని విజృంభించి తానొక్కడై శత్రుసైన్యములను చీల్చిచెండాడదొడగెను

ఏకాకిగా నిలిచి ఖడ్గతిక్కన యుద్ధభూమియందు ప్రదర్శించుచున్న ధైర్యసాహసములకు ఆశ్చర్యపుచెంది ధర్మశీలియగు చల్లపిన్నమనాయకుడు బ్రాహ్మణహత్యాదోషమునకు వెరచి అతనికి కొంతదూరమున నిలిచి—

"అగ్రజన్ములుమీరు యాదవులమేము
ఉగ్రంబుమీమీద నుంచంగరాదు
తరతరములు రాజతంత్రులు మేము
భట్టుల బ్రాహ్మల వైష్ణవోత్తముల
వెట్టి చరలేమాన్పి వెనుకవేసికొని
ప్రాణాలొసగి కీర్తి బ్రతుకుచున్నాము—"

కనుక నీవు రణరంగమునుండి వెనుదిరిగిపొమ్మని ప్రార్థించెను

ఖడ్గతిక్కన తానొక్కడు అన్పటనిలిచి అంత పెద్దసైన్యముతో పోరుసలిపి విజయమును సాధించుట కష్టసాధ్యమైన పనియని భావించి మరునాడు మరల గొప్పసైన్యమును తీసికొనివచ్చి యుద్ధముచేయుట తగునని తలచి హతశేషులగు వీరులతో అచ్చటినుండి తిరిగి ఇంటికి వెళ్ళెను

యుద్ధమున పగతురకు వెన్నిచ్చి తిరిగి వచ్చినాడని తిక్కననుజూచి దారిపొడుగున ప్రజలు అపహాసనము చేసిరి తండ్రి సిద్ధనామాత్యు డతనినిజూచి—

"పులికడుపున గొఱ్ఱెపుట్టుచందమున
గలిగితి నాయింతిగర్భమునందు—"

అని ఏవగించుకొనెను ఇంటా బయటా అందరు ఆతనిని అపహాస్యములతో ఎత్తిపొడిచిరి ఆమాటలకు తిక్కసేనాని కటకటపడెను తిక్కన ఆరాత్రి అచ్చట ఎటులనోగడపి మరునాడు వేకువజామున మరికొంతసైన్యమును వెంటతీసికొని దృఢసంకల్పముతో హుటాహుటి కదనభూమికి తరలిపోయెను

ప్రచండమార్తాండునివలె వెలుగొందుచు యుద్ధభూమియందు వీరవిహారము చేయుచున్న తిక్కననుజూచి చల్లపిన్నమనేడు

"బుద్ధిచాలనియట్టి భూసురోత్తముడు
యుద్ధంబుసేయ నుద్యోగించినాడు
సర్వదా బ్రాహ్మడు చావకపోడు
బ్రహ్మహత్య మనకుం బాపుకోరాదు
అని బ్రాహ్మణుని జంపమైతిమే నిపుడు
ఇంద్రర నితడు మాయింపకపోడు
చంపకుండగారాదు చావగారాదు
ఇందుకు గతియేమి యెరింగింపుము"

అని దోలాందోళితమనస్కుడై తన ధర్మసందేహమును నివృత్తిచేసి తనకు యుక్తమార్గమును చూపుమని మహామంత్రియు, ధర్మవిదుడునైన బ్రహ్మరుద్రయ్య నడిగెను

మహాప్రతిభావంతుడును, రాజకీయ దురంధరుడును, ధర్మశాస్త్రపారంగతుడును, బృహస్పతివంటి బుద్ధిశాలియునైన బ్రహ్మరుద్రయ్య పిన్నమనాయకునికి కర్తవ్యము నిట్లు ప్రబోధించెను

"చలముకొని పోరాడ జను దెంచునపుడు
కులవితేచనం జేయగూడ దెవ్వరికిం
బలతికై రాముడు పాపి రావణుని

రణమున ద్రుంచఁ డా బ్రాహ్మణుండనక
వైరి పెక్కువనక వధియింపవలెను
ఎదిరించినప్పుడు ఎవరైతనేమి?
వధియింపవలెగాని వర్జింపదగదు"

ఘనుడైన బ్రహ్మరుద్రయ్య ఇట్లు యుద్ధధర్మమును ప్రబోధించెను కాని ధర్మశీలియు, బ్రాహ్మణభక్తిపరాయణుడును, నైన చల్లమపిన్నమప్రభువు రానున్న బ్రహ్మహత్యాపాపమునకు వెరచి విజృంభించి యుద్ధముచేయుటకు వెనుకముందాలోచింప దొడగెను

అంతట బ్రహ్మరుద్రయ్య రానున్న ఆపదను గ్రహించి పిన్నమనేనితో ఇట్లనెను

"ఆజిలో నీవు నేనై యొప్పఁగలను
బ్రాహ్మణుడాతఁడు శివబ్రాహ్మఁడ నేను–
బ్రాహ్మణులము పోరు పాటింపగలము—"

అని అంతటితోనాగక 'ఓ యాదవప్రభూ! తిక్కనమంత్రి నాచేత జచ్చిన మంచిదే, లేక దురదృష్టవశమున ఆతనిచేతిలో నేనుజచ్చినచో—

"గోదావరియు నెల్లిగొండలెన్నాళ్ళు
ఆదిత్యచంద్రులు నవని యెన్నాళ్ళు
అన్నాళ్ళు వెలయు నీ యాదవ కథయు
కలియుగమెన్నాళ్ళు కలుగునన్నాళ్ళు
నవనిలో నాపేరు నర్చితంబగును—"

అని బ్రహ్మరుద్రయ్య తనదృఢవిశ్వాసమును తెలిపి 'హర! హరా! హరహరా! హరహరా!' యని ముమ్మారు భీషణ ఘోంతరాశములు మారుమ్రోగునట్లు గర్జించెను భద్రముగా దాచిపెట్టియుంచిన శివలింగమును వెలికితీసి, భూమిపై ప్రతిష్ఠించి, మారేడుపత్రితో, మల్లెపూలతో, గంధాక్షతలతో అర్చనచేసి, వీరభోజనములు జెల్లించి, కర్పూరతాంబూలములను కానుకలనుసమర్పించి, ధూపదీపనైవేద్యములతో స్తుతులు సలిపి సూర్యచంద్రులసాక్షిగా తాను చేయబూనిన కార్యమును నెరవేర్చితీరుదునని శపథముచేసెను వీరకాసెబిగించి, విభూతి, రుద్రాక్షలు దాల్చి కరోరకరవాలమును చేతబూని, అపరవీరభద్రుడోయన భాసించి సైన్యమునకు నాయకత్వమువహించి వృషభవాహనారూఢుడై సైనికులు జయజయధ్వానములు చేయుచుండ మహాసంరంభముతో యుద్ధమునకు తలపడెను

ఈ మహాదృశ్యమునంతయు వీక్షించుచున్న వీరాధివీరుడైన తిక్కన తనగుఱ్ఱమును బ్రహ్మరుద్రయ్యపై దూఁకించెను అతడను ఽంపింపక ఎదురొడ్డెను తిక్కన్న తన ఖడ్గమును త్రిప్పుచు శత్రుసైన్యములను చీకాకుపరచెను ఘనుడైన బ్రహ్మరుద్రయ్య తన నిశితకరవాలమును ఝళిపించుచు రణభూమియందు ఎచ్చటజూచినను తానెయై యుండి ఎదిరిసైనికులను దిగ్భ్రాంతులనుకేసి, భీతినికలిగించెను

ఆ వీర ప్రతివీరులిద్దరును, మదించిన రెండు సింగములవలె మహాభయంకరముగా ఒకరినొకరు ఎదుర్కొని నిలచి ద్వంద్వయుద్ధము చేసిరి ఆ యుద్ధభూమినుండి రేగిన పెను ధూళి భూమ్యాకాశములందు వ్యాపించి, మనుష్యునకు మనుష్యుడు కానరాకుండ నైపోయినది

బ్రహ్మరుద్రుడు ప్రళయకాల రుద్రుడై విజృంభించి రణభూమియందెల్ల వీరవిహారము చేయుచు, శత్రుసైన్యములను వికావికలు చేయదొడగెను కదనభూమియందు ఎచ్చట జూచినను తలలు, బాహువులు, మొండెములు, కాళ్ళు, కండలు, గుండెలు, రక్తపు మడుగులమధ్య కుప్పతిప్పలుగా కనుపింప దొడగినవి, రణతిక్కనవంటి మహావీరుడు, యోధాగ్రేసరుడు సైతము, బ్రహ్మరుద్రయ్య ధాటికి నిలవజాలక క్రిందుమీదయ్యెను అతని సైన్యమంతయు చెల్లాచెదరైపోయినది అతని శరీరమంతయు గాయములు తగిలి రక్తము స్రవింప దొడగినది ఆ భయంకర దృశ్యము యాదవవీరులు చోద్యముగ జూచి ఆనందించుచుండిరి

యుద్ధశాస్త్ర విశారదుడయిన బ్రహ్మరుద్రయ్య తన సైనికులను జూచి

"తిక్కనయొక్కఁడై దిగువారివాడు
పెక్కురొక్కనితోడఁ బెనఁగాడరాదు"

అని హితబోధచేసి తన చేతికందివచ్చిన ప్రత్యర్థిపై బడి సంహరించిన అపయశస్సుపాలుగాకుండగా, ఆతనికి కొంత దూరమున నిలచి యుండెను అతనితోపాటు నీతిజ్ఞులయిన యాదవ వీరులందరును ఎచ్చటివారచ్చట నిలిచిపోయిరి

అంతట తిక్కన మహాభయంకర స్వరూపుడై కన్నులనుండి విస్ఫులింగములు రాలుచుండగా తన శక్తినంతయు మరల నొక్కసారి కూడబెట్టుకొని, బ్రహ్మరుద్రయ్యపై తన ఖడ్గమును విసరెను ఆ దెబ్బను అతడు మహా చాకచక్యముతో తప్పించుకొని మరల యుద్ధము చేయదొడగెను

"కటకటకటఖంఖంగు ఘల్లుఘల్లనుచు
మెరపులవలె మరి మెరయుచుఁ బిడుగు
చరపులవలె గొప్పసడిని బ్రేయుచును
నిర్వురు పోరిరి దుర్వారులగుచు—"

అట్టులా మహావీరు లిరువురు పరస్పర జయాకాంక్షులై మహాభయంకర స్వరూపులై రామరావణులవలె, అభిమన్యు లక్ష్మణకుమారులవలె తుములయుద్ధము చేసిరి

తుట్టతుదకు తిక్కన్న మహోగ్రరిక్తుడై తన బలము వంతయు కేంద్రీకరించుకొని బ్రహ్మరుద్రయ్యపై తన ఖడ్గమును విసరెను ఆ దెబ్బ తనకు తగిలీ తగులకముందే బ్రహ్మరుద్రయ్య ప్రళయకాల రుద్రుడై మహాభయంకర గర్జనము చేయుచు తన కరవాలమును తిక్కనపై విసరెను ఆ దెబ్బలో ఆ మహాపురుషు లిరువురు నేలపై నొక్కసారి కొరిగి అక్కడికక్కడనే తమ ప్రాణములు వదిలి వీరస్వర్గ మలంకరించిరి హాహాకారములు మిన్నుముట్టినవి

"బలియుఁదిక్కనజంపెఁ బంతమీడేర్చె
బ్రహ్మరుద్రయ్య తా ప్రాణాలు విడిచె—"

అని ఆ మహాభయంకర దృశ్యమును జూచుచున్న యాదవ వీరులందరును ఒక్కసారి వలికి, భూమిపై బడిన బ్రహ్మరుద్రయ్య వద్దగల శస్త్రాస్త్రములను దీసికొని తమ మహా నాయకునికొరకు విలపించుచు దుఃఖసాగర మగ్నులైరి

వేరొకచోట యుద్ధవ్యగ్రుడై యున్న చల్లపిన్నమ నాయుడు పిడుగుపాటువంటి ఈ దుర్వార్త విని శోకసంతప్త హృదయుడై తన సహోదరులతోను, ఇతర సేనానాయకులతోను, రుద్రసేనాని వీరశయన మలంకరించినచోటికి హుటాహుటిగ వచ్చెను తెగి వ్రయ్యలై పడియున్న బ్రహ్మరుద్రుని మృతదేహమును ముందుంచుకొని—

"కటకటా రుద్రుడా! కట్టడినీకు
నిటులౌనె బ్రాహ్మడా! యీశ్వరుమహిమ
యాదవులకు బ్రహ్మహత్యరాకుండ
దిక్కన దెగటార్చి దివికేగినావె!
పరమోపకారివి పావనమూర్తి!
సరగ మాకొరకై ప్రాణమిచ్చితివి
యెన్నెన్నిజన్మాల నెత్తినఁగాని—
తిన్నగానీఋణము తీర్చుకోగలమె—"

అని వారందరును బహువిధముల అతని సుగుణసంపదను, శక్తిసామర్థ్యములను, ధైర్యసాహసములను ప్రస్తుతించిరి ఆ యాదవ వీరులందరును భావికాలమున ఆ మహావీర శిఖామణిని తమ ఇలవేల్పుగా జేసికొని పూజలు సల్పుదుమని ప్రతిజ్ఞ చేసిరి ఆ మహావీర యోధునికి అర్హమగు విధముగ మహనీయమైన సమాధి గట్టించి, చిత్రభానునామ సంవత్సర మాఘ బహుళ అమావాస్య మంగళవారమునాడు మిట్టమధ్యాహ్న సమయమున ఆ పరమ శివమూర్తిని గోరీమున నుంచి శైవసంప్రదాయము ననుసరించి అందు నిక్షేపించి దుఃఖాక్రాంత వదనములతో తమతమ గృహములకు బోయిరి

నేటికిని కనిగిరిసీమ ప్రాంతమునందలి యాదవులు ఆ మహావీరుని తమ ఇలవేల్పుగా భావించి ప్రతి సంవత్సరము తిరునాళ్ళు జరిపి, గొప్ప ఉత్సవములను జేసికొనుచున్నారు

కాటమరాజునకును, మనుమసిద్ధిరాజునకును జరిగిన యుద్ధకాలమును గురించి పెక్కు వివాదము లున్నవి స్థానిక చరిత్రలయందలి తేదీలు శాసనములలోని తేదీలకు సరిపడుటలేదు క్రీ శ 1263 వ సంవత్సరమున ఈ యుద్ధము జరిగి యుండవచ్చునని చరిత్ర పరిశోధకులు భావించుచున్నారు

పు వేం

## బ్రహ్మసమాజము

మధ్యయుగమందు కబీరు, నానక్ తులసీదాసువంటి సంస్కర్తలు కావించిన కార్యమును అవిచ్ఛిన్నముగ సాగించునుద్యమమే బ్రహ్మసమాజోద్యమము హిందూ మతమును సంస్కరించి పరిశుద్ధమొనర్చుటయే ఆ కార్యము హిందూ మతమునందలి ప్రధానాంశములను నొక్కివక్కాణించుట చేతను, అనంతర కాలమున దానియందు చేరిన (అసంగత) అంశముల నధిక్షేపించుటచేతను, అందలి ముఖ్యాంశములను అముఖ్యాంశములనుండి ప్రత్యేకించుటచేతను ఆ కార్యము జరుపబడినది

బ్రహ్మసమాజమును స్థాపించిన మహనీయుడు రాజా రామమోహనరాయ్ (1772–1833) అనునతడు ఆయన వంగదేశమున శిష్టబ్రాహ్మణ వంశమునందు జన్మించెను ఆతని పూర్వులు వంగదేశమున తురుష్క ప్రభువులసేవలో నుండిరి,

రామమోహనరాయ్ బాల్యమున వంగభాషను, సంస్కృతమును, అరబిక్, ఫారసీ భాషలను, అభ్యసించెను.

1803 వ సంవత్సరమున, అతడు అరబిక్ భాషలో లిఖితమయిన ఉపోద్ఘాతములో, ఫారసీభాషలో 'తుహ్‌ఫత్-ఉల్-మువహ్హిద్దీన్' అను గ్రంథరాజమును రచించెను. ఆ గ్రంథమందు 'ఆస్తిక్యముగల సర్వపదార్థములకును మూలభూతుడును, పరిరక్షకుడునునగు ఏకేశ్వరుని ఆరాధించుటయే సత్యము' అను విషయమును అతడు నొక్కి వక్కాణించెను.

రామమోహనరాయ్, ఆంగ్లమును, గ్రీకుభాషను, హిబ్రూభాషనుగూడ అధ్యయన మొనర్చినవాడు. 1820 వ సంవత్సరములో, అతడు జీసస్ క్రైస్తు యొక్క ధర్మసిద్ధాంతములను, నీతిసూత్రములను 'శాంతి సౌఖ్యోపదేష్ట' అను గ్రంథరూపమున పొందుపరచెను. దానిని లండనునందలి యూనిటేరియన్ సొసైటీవారు ప్రచురించిరి. సర్ విలియమ్ జోన్సు, కోల్‌బ్రూక్, విల్సన్‌వంటి ప్రాచ్యవిద్యా విశారదులతో అతనికి సంబంధము కలిగెను. అతడు క్రైస్తవమతమునందు గౌరవానురక్తులు కలవాడయ్యెను.

రామమోహన్‌రాయ్, 1816 వ సంవత్సరమునందు, కలకత్తానగరమున, హిందూమతమునందలి ఏకేశ్వరోపాసనా ప్రతిపాదనల వ్యాప్తికొరకును, తద్రక్షణముకొరకును, వేదాంతకళాశాల నొకదానిని స్థాపించెను. అతడు 'ఆత్మీయసభ' అను నొకసంస్థను కూడ స్థాపించెను. "వేదాంత - ఉపనిషత్సంగ్రహము" అను గ్రంథమును ఆంగ్లేయభాషలోనికి అతడు అనువదించెను. అందు పరబ్రహ్మమే ఆరాధ్యము, పూజ్యము అనుచు (జీవ) బ్రహ్మైక్యము స్థాపింపబడినది.

1828 వ సంవత్సరమునందు, బ్రహ్మసమాజము యొక్క ఆవిష్కరణోత్సవము జరుపబడెను. సత్య - ఏకేశ్వరోపాసనార్థమై అది ఉద్దిష్టమయ్యెను. 1830 వ సంవత్సరములో, బ్రహ్మసమాజ ప్రార్థనామందిర మొకటి ఆవిష్కృతమైనది. ట్రస్టుడీడ్‌లో ఇట్లు శాసింపబడెను:- బ్రహ్మోపాసనా మందిరమునందు ధర్మబోధ, మతబోధలుగాని, ప్రసంగములుగాని, ప్రార్థనలుగాని, దేవతాస్తుతులుగాని జరుపబడగూడదు. అయితే విశ్వకర్తయు విశ్వరక్షకుడునగు పరమేశ్వర విషయకమయిన ధ్యానమును పెంపొందించుటకుగాని, దాన, నీతి, భక్తి - దయా - ధర్మములను అభివృద్ధిపరచుటకుగాని, సర్వమతస్థులలో ఐకమత్యబంధమును పరిపుష్టినొందించుటకుగాని, తోడ్పడునట్టి ప్రసంగములచట జరుగవచ్చును"

1833 వ సంవత్సరమున, నామమాత్రముగనే, ఢిల్లీకి సార్వభౌముడైయున్న అక్బరు (ద్వితీయ) పాదుషా, రామమోహన్‌రాయ్ మహాశయునకు 'రాజా' అను బిరుదమును ప్రసాదించి, అతనిని అప్పటి ఇంగ్లండు రాజుయొక్క కొల్వుకూటమునకు, రాయబారిగా నంపెను. రామమోహన్‌రాయ్ 1833 వ సం॥ సెప్టెంబరు 27 వ తేదీన బ్రిస్టలులో మరణించెను. అతడు తన తుదిక్షణములో 'ఓమ్' అను పవిత్రవర్ణమును నుచ్చరించుచు దివంగతుడయ్యెనట. జెరెమీబెంట్ నామ్ అను ఆంగ్లేయ తత్త్వవేత్త తన ప్రేమ ప్రశంసలకు అధికముగ పాత్రుడై, మానవసేవయందు తనకు విశేషముగా తోడ్పడినవాడని రామ్‌మోహన్‌రాయ్‌ను ప్రశంసించెను.

ద్వారకనాథఠాకూరు, రామమోహన్‌రాయ్ యొక్క అనుయాయులలో నొకడైయుండెను. అతడు రవీంద్రనాథఠాకూరునకు తాతయైయుండెను. ద్వారకనాథఠాకూరు ఇంగ్లండునకుపోయిన తరి, బ్రిస్టలునందలి శ్మశానవాటికలోనున్న రామమోహనురాయ్ యొక్క చితాభస్మమును గని, దానిపై నొకసమాధిని కట్టించెను.

ద్వారకనాథఠాకూరునకు తనయుడయిన మహర్షి దేవేంద్రనాథఠాకూరు (1817-1905), బ్రహ్మసమాజ చరిత్రయందు పేర్కొనదగిన ద్వితీయ మహనీయ వ్యక్తియైయున్నాడు. అతడొక గూఢతత్త్వజ్ఞవరేణ్యుడు. అతడు ఈశోపనిష దుపదేశముచే గాఢముగ ప్రభావితుడయ్యెను. సర్వప్రపంచమునం దీశ్వరుడు నిండియున్నాడు (ఈశావాస్య మిదగ్ంసర్వమ్) అను విషయము నాతడుదర్శింపగలిగినవాడు.

1839 వ సం॥న ద్వారకనాథఠాకూరు తత్త్వబోధినీ సభ నొకదానిని స్థాపించి, తదంగముగా "తత్త్వబోధిని" అను నొక మాసపత్రికకు సంపాదకుడయ్యెను. ఆ పత్రికను, తమ వ్యాసరాజములచే అలంకరించిన ప్రముఖులు - ఈశ్వరచంద్ర విద్యాసాగరు, డా॥ రాజేంద్రలాల్‌మిత్ర అను నిరువురు విద్వాంసులు. ఆ కాలముననే పారిస్ నగరమునందు, బర్నాఫ్ అను ఫ్రెంచి విద్వాంసునికడ మాక్స్‌ముల్లర్ అను విద్వద్వర్యుడు, వేదాధ్యయన మొనర్చుచుండెను. 1856 - 58 సం॥ల మధ్యకాలమున దేవేంద్రనాథఠాకూరు హిమాలయములకు విశ్రాంతికై వెడలెను. అచట అతనికి బ్రహ్మానందకరమైన స్వప్నసందర్శన మొకటి లబ్ధమయ్యెను. "నేను నాచర్మచక్షుస్సులచేగాక, ఈ హిమాలయములు ప్రసాదించిన అంతర్దృష్టిచే భగవంతుని దర్శింపగల్గితిని. ఇప్పటినుండి ప్రపంచముపై

నాహృదయమునుండి జ్యోతిస్సును ప్రసరింపజేయుదును నేను సూర్యుని చేరితిని అంధకారము అదృశ్యమైనది " అని అతడు వచించెను

కేశవచంద్రసేనుడు, 24 సంవత్సరముల ప్రాయమున నుండగనే, అతనిని బ్రహ్మసమాజ మతాచార్యునిగా దేవేంద్రనాథఠాకూరు నియమించెను కేశవచంద్రసేనుడు మతబోధకుడుగా, అత్యద్భుతకరమైన ప్రజ్ఞకలవాడై యుండెను అతడు తన అమోఘ బోధప్రభావముచే క్రొత్తగ పలువురను పయితము బ్రహ్మసమాజ మతములోనికి గొనివచ్చెను ఈశ్వరుని దివ్యనామ ప్రభావము క్రీస్తుపైగూడ ప్రసరించునట్లొనర్చెను

1864 వ సంవత్సరమున కేశవసేనుడు మతబోధయాత్రను సాగించెను మదరాసులో నొక సమాజము స్థాపింపబడెను నియమితకాలములో వెలువడు నొక తెలుగు పత్రిక ప్రచురింపబడెను కాని కేశవసేనుని నేతృత్వమునున్న యువక వర్గము యొక్క సంస్కరణాభినివేశము కారణముగా, అందు చీలిక లేర్పడెను 1868 వ సంవత్సరమునందు కేశవచంద్రసేనుడు భారతవర్షీయ బ్రహ్మసమాజమునకు పునాదులువైచెను ఈ నూతన సమాజపు ప్రార్థనాప్రణాళికలో హిందూ - బౌద్ధ- యూదు - క్రైస్తవ - మస్లిమ్ - చైనీయ మత గ్రంథముల నుండి ముఖ్యభాగములు చేర్పబడెను కేశవచంద్రసేనుని ప్రేరణ నిదేశముల ననుసరించి, కొరానునుండి వంగభాష లోనికి కావింపబడిన ప్రథమ సంపూర్ణ అనువాదము ప్రచురింపబడెను 1870 వ సంవత్సరమున కేశవచంద్రసేనుడు ఇంగ్లండు నకేగినతరి, జె యస్ మిల్ మాక్సుముల్లరు మున్నగు పెద్దలాతనిని మెచ్చుకొనిరి గొప్ప 'ఆత్మనిష్ఠితుడ'ని అతనిని పొగడిరి భారతదేశమునకు మరలివచ్చిన పిదప, కేశవచంద్రసేనునకు రామకృష్ణపరమహంసతోను, దయానంద సరస్వతి తోను పరిచయభాగ్యము చేకూరెను

మతస్థులనందరిని సమాధానపరచి, మతములన్నింటికిని ఐక్యమును సాధించుటయే కేశవచంద్రసేనుని లక్ష్యమై యుండెను 1881 వ సంవత్సరములో, అతడొక నూతన విధానమును ప్రకటించుటతో, అతని లక్ష్యము కార్యరూపమును ధరించెను. 1883 వ సంవత్సరములో, ఆసియా పక్షమున యూరపునకు తానొసగు సందేశములో ఇట్లు ప్రసంగించెను "నేను ఆసియాబిడ్డను ఆసియాదుఃఖములే నాదుఃఖములు ఆసియాసంతోషము నా సంతోషము ఆసియాలో ఒక చివరనుండి మరియొక చివరవరకు వ్యాపించియున్న అఖండమయిన నగరమును, విస్తృతమయిన జాతులను వ్యాప్తమైయున్న బంధువర్గమును చూచి నేను గర్వించుచున్నాను ఎవరిపాదములకు ప్రపంచము నేడు సాగిలబడి మ్రొక్కుచున్నదో ఆ మహనీయులు ఆసియా భూమిపై (జన్మించి) అభివృద్ధి నొందిరి అసంఖ్యాకజనులకు జీవితమును, మోక్షమును, ప్రసాదించిన మహామతములన్నియు, పొత్తివిషయమున ఆసియాకు ఋణపడియున్నవి"

రామమోహన్‌రాయ్‌యు, కేశవచంద్రసేనుడును వేదములను విశ్వసించిన హిందువులను, బైబిలును విశ్వసించిన క్రైస్తవులను, అందరిని చేర్చి ఏకసూత్రముపై నడిపింపగలది బ్రహ్మసమాజము అని తలంచిరి 46 సంవత్సరముల వయసునందే, కేశవచంద్రసేనుడు అకాలమరణము పాలబడెను ముఖ్యముగా 14 సంవత్సరములకంటె తక్కువప్రాయమున తన పెద్దకూతురునకును, కూచి బీహారు యువరాజునకును, కేశవచంద్రసేనుడు పెండిలి యొనర్చిన పిదప - ఆతని నేతృత్వముపై పెక్కురకు అనిష్టము జనించెను

ఈ సంఘటనము 1878 వ సంవత్సరమున సాధారణ బ్రహ్మసమాజమేర్పడుటకు కారణమయ్యెను శివనాథశాస్త్రి నేతగా నుండెను 1881 వ సంవత్సరములో శివనాథశాస్త్రి చెన్నపట్టణమునకేగెను కందుకూరు వీరేశలింగము పంతులు గారును, సర్ వేంకటరత్నమునాయకుడుగారును పిఠాపురము రాజావారి అనన్య సామాన్యమయిన సాహాయ్యముతో ఆంధ్రభూభాగమున బ్రహ్మసమాజవ్యాప్తికి కారకులైరి 1884 వ సంవత్సరమున చెన్నపట్టణమున నేర్పాటు కావింపబడిన బ్రహ్మసమాజమునకు నిర్మాతయై వరలిన మహామహుడు మన్నవ బుచ్చయ్యపంతులు

1893 వ సంవత్సరమున, చికాగోలో జరిగిన సర్వమత ప్రతినిధి సభయందు, బ్రహ్మసమాజమునకు ప్రాతినిధ్యము లభించెను, ఆ మతమునకు నాయకుడైన ప్రతాపచంద్రమజుందారునకు, స్వామివివేకానందుని పార్శ్వమున ఆసీనుడగు భాగ్యముచేకూరెను. 1923 వ సంవత్సరములో హైదరాబాదునందును, 1926 వ సంవత్సరములో విజయవాడ యందును, 1927 వ సంవత్సరములో కాకినాడయందును, బ్రహ్మసమాజమందిరములు నెలకొల్పబడెను. ఆ ఉద్యమమునకు

గోడ్పాటుగావించిన మహాశయుడు శ్రీమతి సరోజినీనాయుడు తండ్రియగు డా అఘోరనాథ ఛటోపాధ్యాయుడు బ్రహ్మ సమాజవ్యాప్తి విషయమున, అలసటనొందక, కృషి యొనర్చినాడు. ఈతడు ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు చెందిన ఆచార్య పెలికర్, హైదరాబాదునందు బ్రహ్మసమాజము దినవారసరు, ఐక్యారణోత్సవము ఏర్పరచి, అప్పటిలో దార్, స్వభావ విరాజితులు మహారాజా సర్ కిషన్ ప్రసాదు

రవీంద్రనాథఠాకూరు (1861–1941), సనాతన ఆదిబ్రాహ్మసమాజముతో సంబంధము కలిగి యుండియు, ఆ బ్రహ్మసమాజము మూడువర్గములుగా చీలి యుండుటను ఇష్టపడక తనతండ్రిగారి మరణానంతరము, దానితో తనకు సంబంధానుబంధములను త్రెంచుకొనెను తాను రచించిన 'గోరా' అను నవలయందు, సర్వమతముల సంకుచితత్వము నాతడు విమర్శించెను ఆతడిట్లనెను "ఏదేవుడు హిందువులకును, తురుష్కులకును, క్రైస్తవులకును, బ్రహ్మసమాజ మతస్థులకును తుల్యముగా ఆరాధ్యుడగు చున్నాడో, ఏదేవుని ఆలయద్వారములు, ఏమతస్థుడు అందు ప్రవేశింపదలచినను, ఎప్పుడును మూసివేయబడవో, ఏదేవుడు హిందువులకేకాక యావద్భారతమునకును ఉపాస్యుడగు చున్నాడో, ఆ దేవునికి సంబంధించిన మంత్రము నేడు నాకు ఉపలబ్ధమైనది"

బ్రహ్మసమాజమునకుచెందిన ఒక శాఖయే బొంబాయి నగరమునందలి ప్రార్థనాసమాజము ఆ సమాజసభ్యులలో నెల్ల అత్యంతఘనుడైనవాడు, న్యాయమూర్తియైన రానడే (1842–1900), ఆతడిట్లనెను "బ్రహ్మసమాజముయొక్కయు, ప్రార్థనాసమాజముయొక్కయు, ఏకైక ఈశ్వరవాదము క్రొత్తదికాదు హిందూమతమునందిమిడియున్న ఇతరప్రాచీన తర ఏకైకేశ్వర వాదములతో దానికి జన్యజనక సంబంధము కలదు

1929 వ సంవత్సరమున కాకినాడ పట్టణములో బ్రహ్మసమాజపు శతవార్షికోత్సవము జరుపబడెను అమెరికా నుండి డా సౌత్‌వర్తును, శ్రీమతి సౌత్‌వర్తును ఇంగ్లండు నుండి డా డ్రమ్మండును, శ్రీమతి డ్రమ్మండును, పాశ్చాత్య దేశములందలి ఏకైకపరబ్రహ్మవాద సంఘముల పక్షమునకు ప్రతినిధులుగా ఆ శతవార్షికోత్సవమున పాల్గొనిరి. 'దేవుని ఆధిపత్యమున ఏకైకకుటుంబము' అను సందేశబోధకమే బ్రహ్మసమాజము

కె హ రా

## బ్యాంకింగు విధానము

బ్యాంకింగు అనగా నేమి? ధనముతో వ్యవహారము జరుపు సంస్థ బ్యాంకు అనబడును విశాల దృష్టితో నాలోచించినచో, ఇతరులకు తమ అవసరములకొరకు ఉపయోగింపని వారి అదనపు ధనమును బ్యాంకులు గ్రహించి, దానిని ఉత్పాదక ప్రయోజనములకు ఉపయోగించువారికి ఋణముల నిచ్చును ఆధునిక బ్యాంకింగు విధానము మానవ సమాజము యొక్క ప్రాథమిక దశనుండియు పరిణామము చెందినది స్వర్ణకారులు అతి ప్రాచీనులైన బ్యాంకర్లుగా చరిత్ర యందు పేర్కొనబడిరి బంగారము మొదలైన విలువగల లోహములతో వ్యాపారము చేయుచుండుటచే అట్టి వస్తుజాతముయొక్క భద్రతకు వారు చర్యలు గైకొనవలసిన వారైరి తమ అవసరములకు సరిపోగా, మిగిలిన ధనమును గాని, బంగారమునుగాని కలిగియుండినవారు, తమ లోహ సంపదను స్వర్ణకారులయొద్ద నిక్షేపించు చుండెడివారు చరిత్రలో అత్యంత ప్రాచీనమగు ఈ నిక్షేప విధానమే 'డిపాజిటు బ్యాంకింగు విధాన'మని ఈనాడు పిలువబడు చున్నది తమయొద్ద భద్రపరుపబడిన ఈ అమూల్య లోహములకు హామీగా స్వర్ణకారులు ప్రజలకు రసీదులనిచ్చెడివారు ఈ రసీదులను ప్రజలు మన్నించుచుండుటచే, స్వర్ణకారుల నిజాయితీయందు పూర్వులు అనుభవ పూర్వకమైన విశ్వాసమును కల్గియుండిరని తెలియుచున్నది అందుచే, ఆ రసీదులు ఒకరినుండి మరియొకరికి దాటిపోవుచుండెడివి రసీదులకు ప్రత్యామ్నాయముగా ప్రజలు కోరినప్పుడు వారికి లోహము స్వర్ణకారులనుండి ముట్టుచుండెను. ఈ రసీదులు బ్యాంకింగు పరిభాషలో 'బ్యాంకునోట్లు'గా ఆధునిక యుగమందు వ్యవహరింపబడుచున్నవి,

బ్యాంకులచే ఖాతాదారుల కియ్యబడు ప్రామిసరీ నోట్లు బ్యాంకునోట్లు అని పిలువబడుచున్నవి ఖాతాదారులీ నోట్లను తమ అవసరములను పురస్కరించుకొని బ్యాంకు అధికారులకిచ్చి, అందు ఉదాహరింపబడిన విలువను వారి నుండి పొందవచ్చును ఈ నోట్లు ధనముతో సమానమగు విలువను కలిగి యుండుటచే, ఇవి వ్యాపార ప్రాముఖ్యము

లందు ధనముగనే పరిగణింపబడి, వ్యవహరింప బడుచుండును బ్యాంకు అధికారులు, పెద్దమొత్తములలో లోహములను, నాణెములను ఒక ప్రాంతమునుండి మరొక ప్రాంతమునకు ప్రజలు మోసికొని పోకుండ వారికి శ్రమను తప్పించుదురు అందుచే ఈ బ్యాంకు నోట్లు వారికెంతయు సౌకర్యమును చేకూర్చును. ప్రపంచములో ప్రప్రథమముగా ఈ బ్యాంకు నోట్లు చైనాదేశమునందు క్రీ పూ 119 వ సంవత్సరములో కనిపెట్టబడెను

తమయొద్ద డిపాజిటుగా దాచియుంచబడిన లోహములో కొంత భాగమును మాత్రమే డిపాజిటర్లు తిరిగి తీసికొందురని తెలిసికొని, స్వర్ణకారులు ఈ డిపాజిటు ద్రవ్యములో కొంత భాగమును ఋణరూపములో లోకుల కొసగి లాభమును ఆర్జించెడివారు ఈ ఋణముల నిచ్చుటలో స్వర్ణకారు లెప్పుడును ఒక్క బంగారమును మాత్ర మియ్యక, ప్రజలకును, వ్యాపారులకును రసీదుల నిచ్చెడివారు ఇట్లొకరి తర్వాత మరొకరు ఆ రసీదులను బంగారముగనే భావించు చుండెడివారు ఈ విధముగా బ్యాంకులు తమయొద్దనున్న డిపాజిటు ధనముకంటె అనేకరెట్లు అధికమగు విలువగల రసీదులను (నోట్లు) జారీచేయుచుండెను ప్రాచీనులైన వ్యాపారి, ఋణదాత, స్వర్ణకారుడు అనువారు ఆనాడు వ్యక్తిగతముగ నిర్వహించుచుండిన విధులలో కొన్నిటిని ఆధునికములైన బ్యాంకులు నిర్వహించుచున్నవి సామాజిక పరిణామము ననుసరించి క్రమముగా ఈ బ్యాంకింగు వ్యాపారము, వ్యక్తుల అధీనమునుండి విడివడి, జాయింటుస్టాకు కంపెనీల పరమైనది ఈ కంపెనీలు వివిధములైన బాధ్యతలను నిర్వహింప దొడగెను

**బ్యాంకుల వర్గీకరణము** బ్యాంకుల కార్యకలాపములకు సంబంధించిన వివిధ రంగములలో ప్రత్యేక నైపుణ్యము విశేషముగా ఈనాడు సాధింప బడినది ప్రధానమగు బ్యాంకుల వర్గీకరణము ఈ దిగువ పేర్కొన బడినది

(1) **వాణిజ్యపు బ్యాంకులు** ఈ బ్యాంకులు ముఖ్యముగా అంతరంగిక వ్యాపార, వాణిజ్య సంస్థలకు పెట్టుబడులు పెట్టుచుండుటే కాక, డిపాజిట్లను స్వీకరించుట, ఋణములను మంజూరు చేయుట, బిల్లులను డిస్కౌంటు చేయుట, మున్నగు సాధారణ బ్యాంకింగు వ్యాపారములను కొనసాగించుచుండును సాధారణముగా ఈ బ్యాంకులు దీర్ఘకాలిక ఋణముల నియ్యవు

(2) **పారిశ్రామిక బ్యాంకులు** ఈ సంస్థలు పరిశ్రమలకు పెట్టుబడిని సమకూర్చుటయందు ప్రత్యేక కృషిని కేంద్రీకరించుచుండును పరిశ్రమలను నిర్వహించు వ్యక్తులకును, సంస్థలకును ఈ బ్యాంకులు దీర్ఘకాలిక ఋణములనిచ్చును

(3) **వ్యావసాయిక బ్యాంకులు** వ్యవసాయదారులకు స్వల్పకాలిక, దీర్ఘకాలిక ఋణములను ఈ బ్యాంకులు మంజూరుచేయును భూసేకరణమునకును, భూమి బాగుసేతకును, భారీయంత్రముల కొనుగోలునకును దీర్ఘకాలికమయిన పెట్టుబడులు అవసరము, విత్తనములకు, ఎరువులకు, వేతనములు మొదలగు వ్యయములకు స్వల్పకాలికమయిన పెట్టుబడులు అవసరము భారతదేశమువంటి కొన్ని దేశములందు ఈ బ్యాంకులు సహకారసంఘముల రూపములో స్వల్పకాలిక ఋణముల మంజూరు చేయుటకును, భూమితనఖా బ్యాంకుల రూపములో దీర్ఘకాలిక ఋణముల మంజూరుచేయుటకును ఉపయోగపడుచున్నవి

(4) **మారకపు బ్యాంకులు** ఎక్స్ఛేంజి బిల్లుల ద్వారమునను, డ్రాఫ్టుల ద్వారమునను, టెలిగ్రాఫిక్ ట్రాన్స్‌ఫరులు మున్నగు వాటి ద్వారమునను, విదేశీచెలామణి ద్రవ్యము యొక్క క్రయ విక్రయములను జరపుటయే ఈ మారకపు బ్యాంకుల ప్రధానకర్తవ్యము

(5) **సేవింగ్సు బ్యాంకులు** స్వల్పాదాయము కలవారు కొలది ధనమునైనను మిగుల్చుకొను అవకాశము ఈ బ్యాంకుల వలన కల్గును ఈ బ్యాంకింగు విధానము ననుసరించి, డిపాజిటుగా స్వీకరింపబడిన ధనమునుండి, కొంత పరిమితిని మించిన మొత్తమును ఖాతాదారులు కోరునప్పుడెల్ల బ్యాంకు అధికారులియ్యకూడదు ఈ పరిమితిని మించి బ్యాంకునుండి డిపాజిటు ధనమును తీసికొనదలచినవారు ముందుగా అధికారులకు నోటీసును అందజేయవలెను ఇట్లు డిపాజిటు ధనమును తరచుగా తీసికొనుటవలన, పొదుపు చేసికొనదలచిన ధనము క్రమముగా క్షీణించును అందుకే ఇట్టి నిబంధనములు, కట్టుబాట్లు ఏర్పరుపబడినవి పోస్టల్ సేవింగ్సు బ్యాంకులు మున్నగునవి స్వల్పాదాయము గలవారికి సహాయకారులుగ నుండును, కాని పోస్టలు బ్యాంకులు మామూలు బ్యాంకుల వలె కాక, ప్రభుత్వాంగములుగ మాత్రమే వ్యవహరించును

(6) **ధర్మకర్తృత్వ సేవింగ్సు బ్యాంకులు** ధనమును

డిపాజిటుచేయు ఖాతాదారులే ఇట్టి బ్యాంకులకు యజమానులు, ఈ బ్యాంకులయందు వాటాదారులుండరు. అందుచే ఈ బ్యాంకుల యొక్క వ్యాపారపు పెట్టుబడి ప్రజలనుండి వసూలగు డిపాజిట్ల ద్వారముననే సేకరింపబడును. ఈ బ్యాంకుల కైనందిన వ్యయమంతయు డిపాజిట్లనుండి కాక "నిర్మాణనిధి" సేకరణమునుండి విరాళముల మూలముననే నిర్వహింపబడును. ధర్మకర్తల విరాళములు బ్యాంకులవలన వచ్చు లాభములనుండి క్రమముగా తిరిగి చెల్లింపబడును. ఇట్టి ముదరా చెల్లింపు విధిగా జరగనవసరములేదు. అది కేవలము నైతికముగా వారిని ఉపకారబద్ధులుగా చేయుటమాత్రమే. నికరలాభము వడ్డీరూపములో డిపాజిటుదార్లకు పంపకము చేయబడును. వారికి లాభాపేక్ష లేకుండుటచే, వ్యాపార ప్రయోజనము దాదాపు శూన్యముగ నుండును.

(7) **స్టాక్ సేవింగ్సు బ్యాంకులు**: ఈ బ్యాంకులు ప్రజలకు వాటాలనిచ్చుట ద్వారా, వారినుండి పెట్టుబడి ధనమును సేకరించి, వాటాదారులకును, డిపాజిటు దారులకును, లాభములను పంచిపెట్టును. ధర్మకర్తృత్వ బ్యాంకులట్లు చేయవు. డిపాజిటుదారులకు నిర్ణీతమైన వడ్డీరేటు చెల్లింపబడును. ఇంతకుమించిన లాభములు వాటాదారులకు డివిడెండ్ల రూపములో పంచిపెట్టబడును. నష్టమును పూరించుటకై స్టాక్ సేవింగ్సు బ్యాంకులు డిపాజిట్లను వినియోగింపరాదు, ధర్మకర్తృత్వ బ్యాంకులు అట్లు వినియోగింపవచ్చును.

(8) **గ్యారంటీ సేవింగ్సు బ్యాంకులు**: ఈ బ్యాంకులు ధర్మకర్తృత్వ బ్యాంకుల యొక్కయు, స్టాక్ సేవింగ్సు బ్యాంకుల యొక్కయు విధులను, కార్యకలాపములను నిర్వర్తించుచుండును. సాధారణమైన డిపాజిట్లకు తోడుగా, ఈ బ్యాంకులు ప్రత్యేక స్వభావముగల డిపాజిట్లను స్వీకరించును. సామాన్యులగు డిపాజిటుదార్లకు నిర్ణీతమగు వడ్డీరేటు చెల్లింపబడును. అదనపువడ్డీ డివిడెండురూపములో ప్రత్యేకముగ డిపాజిటుదార్లకు చెల్లింపబడును. సాధారణులైన డిపాజిటుదార్లకు ఈ స్పెషల్ డిపాజిట్లు గ్యారంటీ ఫండుగా పరిగణింపబడును.

(9) **మ్యునిసిపల్ సేవింగ్సు బ్యాంకులు**: మ్యునిసిపల్ కార్యకలాపములు క్రమముగా వృద్ధియగుటచే, ఈ బ్యాంకులు నూతనముగా స్థాపింపబడినవి. మానవ సంక్షేమమును ఆశించి ఈ సంస్థలు నిర్మింపబడినవి. పాశ్చాత్యదేశములలో ఈ బ్యాంకులు ప్రజాదరమును పొందినవి. భారతదేశములో వీటికి ప్రత్యామ్నాయముగా పోస్టలు సేవింగ్సు బ్యాంకులు వ్యవహరించుచున్నవి. దాదాపు ఈ బ్యాంకులన్నియు నిర్వహించు కార్యక్రమములు పెక్కు అంశములలో ఒకే విధముగా నుండును. వీటిలో ప్రధాన విషయములందు మాత్రమే ప్రత్యేక సావధానత చూపబడును.

**బ్యాంకులు నిర్వహించు విధులు**

(1) **డిపాజిట్లను స్వీకరించుట**: బ్యాంకులు ప్రధానముగా ప్రజలచే డిపాజిటు చేయబడు ధనముపై ఆధారపడుటచే, ఈ ధర్మనిర్వహణము ముఖ్యమైనది. (ఎ) కరెంటు డిపాజిట్లు, (బి) ఫిక్సెడు డిపాజిట్లు, (సి) సేవింగు డిపాజిట్లు అని డిపాజిట్లు మూడువిధములు.

(2) **ఋణముల మంజూరు**: ఈ విషయమై బ్యాంకులు గొప్ప బాధ్యతను నిర్వహింపవలసి యుండును. ఋణములను మంజూరు చేయుటవలన, బ్యాంకు యజమానులు లాభము నార్జించెదరు. కాని ఈ ఋణధనమంతయు బ్యాంకుల స్వంత ధనము కాదు, లోకుల ధనముతోకూడ అవి వ్యవహరించుచుండును. అందువలన, డిపాజిటుదారుల అవసరములను తీర్చుటకు బ్యాంకులు తమవద్ద ధనమును సిద్ధముగా నుంచుకొనును. ఈ కారణముచే, ఋణముల నిచ్చుటయందును, నిధులను సమకూర్చుటయందును బ్యాంకులు విశేషముగా జాగ్రత్త వహింపవలెను. బ్యాంకులు చరాస్తులను ధనరూపమున భారీమొత్తములో నిలువ యుంచినచో, అవి నష్టమునకు గురియగును, అట్లుకాక, అవి అధికలాభమును ఆపేక్షించుచో, డిపాజిటుదారుల కోర్కెలను తీర్చుట అసాధ్యమగును.

బ్యాంకులు కేవలము తమ ఖాతాదారులు డిపాజిటు చేసిన ధనమును మాత్రమే ప్రజలకు ఋణరూపములో నియ్యవు. అవి స్వయముగనే డిపాజిట్లను సృష్టించి, తమవద్దనుండు డిపాజిట్లను మించి ఋణముల నియ్యశక్తి కలిగియుండును. ఋణప్రయోజనము సమంజసముగ నున్నట్లు తృప్తిచెందిన తరువాతను, ఋణభద్రతనుగూర్చి ముందుగా జాగ్రత్త తీసికొన్న అనంతరమును, బ్యాంకు అధికారులు తమ ఖాతాదారులకు చెక్కులద్వారా ధనమును తీసికొను హక్కును కల్గింతురు. ఈ విధముగా ఇచ్చిన ఋణములు ఆయా ఖా

దారుల ఖాతాలయందు డిపాజిట్లుగా పరిగణింపబడును అనగా, ఋణములే డిపాజిట్లను సృష్టించుననినచో, సత్య సమ్మతి మగును

(3) బిల్లుల డిస్కౌంటింగ్ అనుభవమునుబట్టి, స్వల్ప కాలికములైన ఋణములను మంజూరు చేయుట అని ఈ శబ్దమున కర్థము ఉదా॥ ఒక వ్యాపారి తన ధనమును అధిక మొత్తములో వ్యాపారపు పెట్టుబడియందు నిలువయుంచుట కిష్టపడనప్పుడు, అతడు ఋణస్థునివద్దనుండి మారకపు హుండీని స్వీకరింప వచ్చును ఆ మారకపు హుండీ ప్రత్యక్షముగా ఋణస్థునిదేగాని, అతని తరపున మరొకరిదేగాని అంగీకరింప బడిన తరువాత, వ్యాపారస్థుడు, తనకు లావాదేవీలున్న బ్యాంకుచేత డిస్కౌంటు చేయించుకొనవచ్చును తత్ఫలిత ముగా వడ్డీ, కమీషనులుపోను, శేషించిన ధనము వ్యాపార స్థుని చేతికి వచ్చును దీనివలన వ్యాపారస్థునికి కలుగజేయు సౌకర్యములలోపాటు, బ్యాంకుకు లాభము చేకూరకలదు

పైన పేర్కొనిన వ్యాపారధర్మ నిర్వహణముతో పాటు, బ్యాంకులు ప్రజలకు కలుగజేయు సౌకర్యములు పెక్కులు కలవు ఒక ప్రాంతమునుండి మరొక ప్రాంతము నకును, ఒక వ్యక్తినుండి మరొక వ్యక్తికిని, ధనమును చెక్కుల ద్వారా బదిలీ చేయుటకు బ్యాంకులు సహాయపడును కొన్ని బ్యాంకులు తమ ఖాతాదారుల తరపున బిల్లులను అంగీక రించి, వాటిని అతి సులభముగా బదిలీచేసి, చెలామణి చేయిం చును, ధనమును పెట్టుబడి పెట్టుటకు సంబంధించిన సమా చారమును, సలహాలను ఖాతాదారులకు సరఫరా చేయును అంతేకాక ప్రజలకు చెందిన అమూల్య వస్తువాహనములను, సెక్యూరిటీలను, తమ రక్షణముక్రింద భద్రపరచుటకును, ఖాతా దారులకు ఏజెంట్లుగను, ట్రస్టీలుగను, పూచీదారులుగను, వ్యవహరించుటకును, వారిపక్షమున వాటాలను కొనుటకును, అమ్ముటకును క్లబ్బులకు, ధర్మసంస్థలకు, చందాలు చెల్లిం చుటకును బ్యాంకులు ఉపయోగ పడును

పరపతి-ప్రతిష్ఠ దాని పరిమితులు పరపతి, ప్రతిష్ఠ లను కల్పించుట ఆధునిక బ్యాంకుల ప్రధాన కర్తవ్యములలో నొకటి బ్యాంకులలో ధనమును డిపాజిటు చేయువారి అవ సరములను ఎప్పటికప్పుడు తీర్చుటకు బ్యాంకు అధికారులు నూటికి నూరువంతులు ధనమును బ్యాంకులలో భద్రపరచి ఉంచరు బ్యాంకులు, కరెన్సీనోట్లను, నాణెములను భద్ర పరచి, డిపాజిటుదారులు అడిగినప్పుడు తిరిగి ఇచ్చు ధనా గారములు కావు ఖాతాదారులు బ్యాంకులలో డిపాజిటు చేయు ధనమును బ్యాంకులు వ్యక్తులకుగాని, వ్యాపార సంస్థలకుగాని, ఇతర సంస్థలకుగాని ఋణరూపములో విడుదల చేయును తాను కోరినప్పుడు తన డిపాజిటు ధనమును బ్యాంకు ఇవ్వగలనని చేసిన వాగ్దానమును ఖాతాదారుడు విశ్వసించి తృప్తి చెందవలసి యుండును అతి స్వల్పమైన ధనపు నిల్వలతోనే బ్యాంకులు ఈ విధిని నెరవేర్పగల్గును డిపాజిటుదారులు తమ ధనమునంతయు ఏకకాలముననే బ్యాంకులనుండి తీసికొనకుండుట ఇందుకు కారణము ఇట్లు స్వల్ప మూలధనము ప్రాతిపదికగా, బ్యాంకులు "ఋణదాత" అను మహాసౌధమును నిర్మింపగలిగెను ధనమును రొఖ్ఖరూప ములో వీడకయే, బ్యాంకులు ప్రజలకు ఋణములనిచ్చి, వడ్డీని వసూలుచేయుచుండును

అట్లే, బ్యాంకులు సెక్యూరిటీలను కొని, అమ్మకపు దారులకు తమ చెక్కులద్వారముననే ధనమును చెల్లించు చుండును అయితే ఈ చెక్కులు ప్రత్యక్షమగు ధనరూపము కాదు అవి ధనము చెల్లింపబడగలదను వాగ్దానరూపములు మాత్రమే ఇట్టిచెక్కులు ఏదేనియొక బ్యాంకులో డిపాజిటు చేయబడి, తన్మూలముగా సెక్యూరిటీలను అమ్మిన వ్యక్తికి ఋణములియ్యబడును ఈ విధానము పరపతి సౌకర్యవిధాన మనబడును దీనివలన సెక్యూరిటీలను అమ్మినఖాతాదారునికి ఒక్కొక్క సందర్భములో కోరినయెడల, తాను డిపాజిటు చేసిన ధనముకంటె ఎక్కువమొత్తము లభించుచుండును ఈ పరపతిని కల్పించుట బ్యాంకుల యొక్క విశిష్టలక్షణము

బ్యాంకు వ్యాపారమంతయు, ప్రజలు తాము నిలువ యుంచిన ధనమును, కోరినప్పుడు బ్యాంకు తిరిగిచెల్లింపగల దను విశ్వాసముపైననే ఆధారపడి కొనసాగుచుండును ఏకారణముచేతనైనను, అట్టివిశ్వాసము సడలినచో, ఖాతా దారులు తమ ధనముకొరకు బ్యాంకులపై ఎగబడుదురు ఎంతటి మోతుబరి బ్యాంకయినను, ఇట్టి విపత్కర స్థితిని తట్టుకొనజాలదు ఏలనన, బ్యాంకులలో డిపాజిట్లుగా నిలువ యుంచిన ధనమంతయు చరాస్థిరూపములో ఎప్పుడును ఉంచబడదు డిపాజిటు చేసిన ఖాతాదారులకును, బ్యాంకు లకును, సత్సంబంధములు సాగుచు వచ్చువచ్చగ నున్నంత కాలము, ఏడిపాజిటుదారుడును తనధనమును బ్యాంకునుండి

తిరిగి గ్రహింపడు. అట్టి సందర్భములో 'కోరినవారు తమ ధనమును తిరిగి గ్రహింపవచ్చును!' అని బ్యాంకులు ఖాతాదారులను హెచ్చరించును. కాని పరిస్థితులు వికటించి డిపాజిటుదారులందరు ఒక్కసారిగా తమధనమును చెల్లింపుడని బ్యాంకులపై ఒత్తిడి తెచ్చినచో, ఒక్కనికిని ధనము దక్కని విషమస్థితి ఏర్పడును. అట్టి ప్రమాదము ఏ ఒక్క బ్యాంకునకు మాత్రమే ఘటిల్లినచో అది తన ఆస్తులను తెగనమ్మి డిపాజిటుదారులకు ధనమును చెల్లించును. కాని వాతావరణమంతయు ఆందోళనకరముగనున్నచో, డిపాజిటర్లందరును ఆశాభంగము చెందవలసియుండును. ఈ కారణమువలన బ్యాంకులు తమ ఆస్తులలో కొంత భాగమును చరరూపమున నుంచుటయే కాక, తమ మోతుబరితనమునందు ప్రజల విశ్వాసము సడలకుండ చూచుకొనవలెను.

ఆధునికసమాజములో బ్యాంకులు ప్రయోజనకరములే కాక, అత్యవసరములు కూడ. ఇవి చరాస్తిపెట్టుబడులకు రక్షకములుగనే కాక, పంపిణీ చేయునవిగ గూడ వ్యవహరించును. ఈ చరాస్తి పెట్టుబడి, వాణిజ్య, పారిశ్రామికసంస్థల కార్యకలాపములకు జీవనాడివంటిది. బ్యాంకు లనుసరించు వివేకవంతమైన విధానముపైననే దేశముయొక్క సుభిక్షమాధారపడియుండును. బ్యాంకుల ఉపయోగము కీక్రింది అంశములలో సంక్షిప్తమొనర్పబడవచ్చును –

(1) బ్యాంకునోట్లు, చెక్కులు, బిల్లులు, డ్రాఫ్టులద్వారా బ్యాంకులు ప్రజలలో కొనుగోలుశక్తినికల్పించి, అమూల్యములైన లోహముల ఉపయోగమును పొదుపుచేయును.

(2) ఋణదాతలకు, ఋణగ్రహీతలకు సంబంధమును కల్పించుటద్వారా వారిని సన్నిహితులుగ నొనర్చి, బ్యాంకులు ధనమునకు చరలక్షణమును కలుగజేయును. ధనము ఒక ప్రాంతమునుండి మరొకప్రాంతమునకును, ఒకవ్యక్తినుండి మరొక వ్యక్తికిని, వ్యయములేకయే, చెక్కులు, బిల్లులు, డ్రాఫ్టులద్వారా సులభముగ చెలామణి యగునట్లు బ్యాంకులు సహాయపడును.

(3) ప్రజలలో ధనమును ఆదా చేసికొను అభ్యాసమును ప్రోత్సహించును. అట్లుకానిచో, ధనము క్రమపద్ధతిలో వ్యయింపబడక చిందరవందరయైపోవును. బ్యాంకులో మొదట స్వల్ప మొత్తములో ఆదా చేసికొనబడు ధనము క్రమముగా వృద్ధిచెంది వివిధరీతులలో పెట్టుబడులకు సహాయపడును.

(4) ధనమును ఆదాచేసికొనుటకును, పెట్టుబడులను సృష్టించుటకును ప్రోత్సహించుట మూలముగా, బ్యాంకులు దేశముయొక్క ఉపపత్తులను మరింతగా ఫలోత్పాదకమొనర్చుటకు దోహదమొసగుచు, దేశసౌభాగ్యమును పెంపొందించును.

బ్యాంకులు లేనిచో, ప్రపంచముయొక్క వర్తమాన అభ్యున్నతి ప్రమాణమును ఊహింపజాలము.

సెంట్రల్ బ్యాంకులు : ప్రతిదేశమందును బ్యాంకింగు సంస్థలన్నిటికి సెంట్రల్ బ్యాంక్ మకుటాయమానముగ నుండును. ఈబ్యాంకు దేశమందలి ఇతర బ్యాంకులకైనందిన వ్యాపార నిర్వహణమును, క్రమబద్ధమగు వాటి ఆర్థిక సుస్థిరత్వమును, దేశముయొక్క ఆంతరంగిక, బాహ్యప్రయోజన, సంక్షేమములను ప్రత్యక్షముగను, పరోక్షముగను పర్యవేక్షించుచుండును. అందుచే సెంట్రల్ బ్యాంకుయొక్క పరిపాలనా విధానము ఇతర తరగతుల బ్యాంకులకంటె భిన్నమై, విశిష్టముగనుండును. తక్కిన బ్యాంకులవలె, ఈ సెంట్రల్ బ్యాంకులు లాభము నపేక్షింపక, ఇతర రకముల బ్యాంకుల వ్యవహారములను పర్యవేక్షించుచు, వాటికి సహాయపడుచు, వాటిని అదుపులో పెట్టుచు, వాటికతీతమైయుండును. ఈ సెంట్రల్ బ్యాంకులు వివిధదేశములలో వివిధనామములతో వ్యవహరించుచున్నవి. 1935లో భారతదేశమందు స్థాపితమైన రిజర్వుబ్యాంకు, సెంట్రల్ బ్యాంకుయొక్క విధులనే నిర్వర్తించుచున్నది. ప్రతిదేశమునందలి సెంట్రల్ బ్యాంకు కూడ ఒకేవిధమైన నిర్ణీతవిధులను నిర్వర్తించుచుండును. ఈ విధులతో పాటుగా, సెంట్రల్ బ్యాంకు కీక్రింది విధులను గూడ పాటించుచుండును.

కరెన్సీనోట్ల ముద్రణము : కరెన్సీనోట్లను ముద్రించు గుత్తాధికారము సెంట్రల్ బ్యాంకు చలాయించుచుండును. అందుచే కరెన్సీనోట్ల ముద్రణ పరిమాణమును, ఋణదాన పరిమాణమును క్రమబద్ధమొనర్చుట మూలముగా, ఈబ్యాంకు ధనిక మూలమానముయొక్క దార్ఢ్యమును పరిరక్షింపగలదు. సెంట్రల్ బ్యాంకు అధీనములో నోట్లముద్రణాధికారము కేంద్రీకృతమగుటవలన, పెక్కు ప్రయోజనములు సిద్ధించును. అవి ఈ క్రిందివిధముగ నున్నవి.

(ఎ) నోట్లప్రసారములో సమరూపత (బి) నోట్లముద్రణ ప్రసారములలో స్థితిస్థాపకత. (సి) ఋణదానమునకు చర

రూపములో మన్నధనము ప్రాతిపదికయగుటచే, నోట్ల ముద్రణముపై సెంట్రల్ బ్యాంకుకు గుత్తాధికారమున్నచో, అది ఋణములిచ్చు విధానమును అదుపులో పెట్టుకొనగల్గుట, (డి) దేశము యొక్క కరెన్సీ చట్టములననుసరించి సెంట్రల్ బ్యాంకునోట్లను ముద్రించుట

(2) ప్రభుత్వమునకు బ్యాంకరుగా వ్యవహరించుట

(ఎ) సెంట్రల్ బ్యాంకు ప్రభుత్వమునకు బ్యాంకరుగా వ్యవహరించును; ప్రభుత్వము యొక్క ఆర్థిక స్వాస్థ్యమును పర్యవేక్షించుచుండును, ప్రభుత్వమునకు రావలసిన ధనమును స్వీకరించుటకును, ప్రభుత్వము వ్యయించవలసిన ధనమును మంజూరు చేయుటకును ప్రభుత్వపక్షమున ఈ బ్యాంకు వ్యవహరించుట. (బి) ధనరూపములో జరగవలసిన కార్యకలాపమును నిర్వహించుట (సి) ప్రజలనుండి, ఇతరసంస్థల నుండి ఋణములను స్వీకరించుట ప్రభుత్వము చెల్లించవలసిన ఋణముల విషయములో బాధ్యత వహించుట (డి) ప్రభుత్వమునకు ఋణము లిచ్చుట (ఇ) ప్రభుత్వముచే నిర్ణయింపబడు నాణెముల ముద్రణ విధానమును ఆచరణయందుంచుట ఈ కారణముల దృష్ట్యా, సెంట్రల్ బ్యాంకునకును, ప్రభుత్వమునకును సన్నిహిత సంబంధ ముండవలెను ఆర్థిక విషయములపై ప్రభుత్వమునకు సెంట్రల్ బ్యాంకు సలహాల నొసగుట కూడ ఘటిల్లును

(3) బ్యాంకుల అభ్యున్నతికి కృషిసల్పుట సెంట్రల్ బ్యాంకు తక్కిన బ్యాంకులకు నాయకత్వము వహించి, వాటి అభివృద్ధికి కృషిసల్పును ఈ బ్యాంకు వ్యాపారబ్యాంకులతో పోటీ చేయదు దేశమందలి బ్యాంకులన్నిటికి సెంట్రల్ బ్యాంకుతో జమాఖర్చుల విషయమై పరస్పర సంబంధము లుండుటచే, వివిధబ్యాంకుల నడుమ ఘటిల్లు ఋణసమస్యలను సెంట్రల్ బ్యాంకు పరిష్కరింపగల్గును. ఈ సహాయమును పొందుటద్వారా వ్యాపారపు బ్యాంకులు తమ వ్యవహారములను కొలది ధనపు ఉపపత్తుతోడనే నిర్వహింపగల్గును ఈ విధముగా, వ్యాపార బ్యాంకులయొక్క చరరూప ఆర్థిక స్వాస్థ్యము వృద్ధిచెందును

(4) జాతీయ ఉపపత్తుల రక్షణక ర్తృత్వము : దేశము యొక్క లోహసంబంధమైనట్టియు విదేశమారకపు సంబంధమైనట్టియు నిలువలకు సెంట్రల్ బ్యాంకు రక్షణకర్తగాకూడ వ్యవహరించును, అట్టినిలువలను సక్రమమైన ప్రమాణములో సంరక్షించుటకు యత్నించును

పైన వివరింపబడిన విధులతోపాటు, భారతదేశమునందలి రిజర్వుబ్యాంకును, కొన్ని ఇతరదేశములందలి బ్యాంకులును వ్యవసాయిక, పారిశ్రామిక, ఆర్థిక వ్యవహారములలో పాల్గొనుచు, తత్సంబంధములైన సంస్థలకు ధనసహాయ్యమును అందజేయును, సెంట్రల్ బ్యాంకులు సాధారణముగా ప్రజల నుండి డిపాజిట్లను అంగీకరించుటగాని, వారికి ఋణముల నిచ్చుటగాని సంభవింపదు

ప్ర సీ ఆం

## బ్రాహ్మణములు .

బ్రహ్మన్ అనవేదము బ్రహ్మ(న్)కు సంబంధించినవి బ్రాహ్మణములు. 'అనంతావై వేదాః' అన్నట్లు ప్రస్తుతము అవి మనకు అనంతముగా సాక్షాత్కరింపకున్నను విస్తృతముగా సాక్షాత్కరించుచున్న వైదిక సాహిత్యములో ఒక భాగమైనట్టివే ఈ బ్రాహ్మణము లనబడు గ్రంథములు మంత్రరూపమనియు, బ్రాహ్మణరూపమనియు, వేదము స్థూలముగా రెండు విధములని మనము భావింపవచ్చును సాధారణముగ ఆరణ్యకములు వాటి భాగములు నగు ఉపనిషత్తులును కొంతవరకు బ్రాహ్మణముల భాగముగను, కొంతవరకు స్వతంత్ర గ్రంథములుగను ఉన్నవి

ఈ వైదిక సాహిత్యములో నాలుగు వేదముల సంహితలు మూలభూతమైనట్టివి ప్రధానమైనట్టివి ప్రాచీనమైనట్టివి యును సంహితలోని మంత్రములను ఏయే యజ్ఞములందు ఎట్లెట్లు వినియోగింపవలెనో వివరించునవి బ్రాహ్మణములు ఇవి ఇట్లు సంహితకు వ్యాఖ్యానరూపము లగుటచేతనే, సంహితకంటె తరువాతివని నిస్సంశయముగా ఎంచవచ్చును విధిరూపములనియు, అర్థవాద రూపములనియు, ఉపనిషత్తులనియు, బ్రాహ్మణములు మూడువిధములు వీటిలోని విధిరూపభాగములు ఏయే యజ్ఞమును ఎవరెవరు ఎట్లెట్లు చేయవలెనో నియమాదులను విధించును అర్థవాదభాగములు యజ్ఞయాగాదులపై అభిరుచిని కల్గించుటకు వాటివలన కల్గెడు చిన్న ఫలితములనుకూడ గొప్పచేసి చెప్పును ఉపనిషత్తులు తత్త్వచర్చారూపములు ఆత్మానాత్మ స్వరూపమును, ముక్తిమార్గమును మిగుల విస్తృతముగా చర్చించును,

సంహితయంతయు ఛందోరూపమున నుండ, బ్రాహ్మణములు గద్యరూపమున నుండును తరువాతికాలములో ఉదయించిన సకల సాహిత్యములకును, కళలకును, వేదాంగ

ములకును, రూపొందిన మతస్వరూపములకును, ఉత్పత్తి స్థానము వంటిదైనను, అనేక మతవాదములకు చరమ పరమ ప్రమాణభూతమైనదైనను ఈ బ్రాహ్మణ సాహిత్యము ప్రధానముగను, విస్తృతముగను యాగాదులకు సంబంధించిన విషయములనే చర్చించునదగుటచే సాధారణ పాఠకునికి మిగుల విసుగు పుట్టించునదై యుండును కాని భారతీయ భావనారీతిని ప్రపంచములోని పూజా ప్రార్థనావిధానముల ఉత్పత్తి వికాసములను తెలియగోరువారికిని, పరిశోధకులకును ఈ బ్రాహ్మణ సాహిత్యము పెన్నిధివంటిది

ఇట్లు ప్రధానముగ బ్రాహ్మణములు 'యాగశాస్త్రములు' అయినను, ఆయజ్ఞయాగాదులతో సదూరముగనేని సంబంధమున్న ఇతిహాసములను, వీరగాథలను, పురాణకథలను కూడ అటనట తెలుపును ప్రాచీన గ్రంథములలో బ్రాహ్మణములని ఉల్లేఖింపబడిన వాక్యములు కొన్ని ప్రస్తుతము మనకు లభించు బ్రాహ్మణములలో కనబడుటలేదు అందుచే ప్రస్తుతము లభించినవికాక ఇంకను ఎన్నియో కాలగర్భమున నశించియుండునని ఊహింపవచ్చును కాని ప్రస్తుతము లభించినవేని కొలదిగ్రంథములుకావు ఇవియే మిగుల విస్తృతముగానున్నవి

బ్రాహ్మణముల ఉత్పత్తి కృష్ణయజుర్వేదముననే ఐనదని ఊహింపవచ్చును (మంత్ర బ్రాహ్మణములు కలిసియున్న సంహిత, కృష్ణయజుస్సంహిత, వేరువేరుగానున్నది, శుక్ల (శుద్ధ) యజుస్సంహిత), తరువాత తత్ప్రామాణ్యములో సంహిత యన్న దానికి అవష్టంభముగ వ్యాఖ్యారూపమగు ఒకబ్రాహ్మణ ముండుట సంప్రదాయమై ప్రతిసంహితకు కొన్నిచొప్పున బ్రాహ్మణములు వెలసియుండనోపు వీటిలోని ప్రధాన విషయము యజ్ఞయాగాదులకు సంబంధించిన వివరములను, ధర్మసందేహములను, ఊహాసూక్ష్మముగ చర్చించుటయైయుండును ఇట్లు కేవలము సంప్రదాయముకొరకు మాత్రమే ప్రవర్తిల్లిన వగుటచే కొన్ని కేవలము పేరునకు మాత్రమే బ్రాహ్మణము లనవలసివచ్చును అట్టివి ఈ వైదిక సాహిత్యమున మిక్కిలి నవీనమైనవిగా పరిగణింపబడుచున్నవి సామవేద బ్రాహ్మణము లన్నవి, అథర్వవేదమునకు సంబంధించిన గోపథ బ్రాహ్మణమును, ఇట్టికోవకు చెందునవని విమర్శకులతలంపు సామవేద బ్రాహ్మణములు ఒకవిధముగ వేదాంగములకన్న మిన్నయైనవి కాని, భిన్నమైనవి కాని కావని ఎంచవచ్చును గోపథ బ్రాహ్మణము వైదికసాహిత్యములోని నవీనతమ భాగములలో ఒకటి సామాన్యముగా అథర్వవేదమునకు మొదట బ్రాహ్మణమే యుండియుండకపోవచ్చును బ్రాహ్మణ గ్రంథము లేనిచో వేదత్వము పూర్తికాదని గోపథ బ్రాహ్మణ మవతరించి యుండవచ్చును 'బ్లూమ్‌ఫీల్డ్' పండితుడు ఈ గోపథ బ్రాహ్మణము వైతాన సూత్రముకన్న అర్వాచీనమని యెంచ, 'కీత్' పండితుడు ప్రాచీనమని భావించెను ఇది అథర్వాది మహర్షులఉత్పత్తిని, అథర్వాంగిరస్సంహితోత్పత్తిని వేదవిహితములుకాని బ్రహ్మచర్యము గాయత్రీ మంత్రోపదేశము, మున్నగు విషయములను ఉపదేశించును దీనిలో పూర్వోత్తరభాగములని రెండుభాగములు కలవు

ఋగ్వేద బ్రాహ్మణములు

ఋగ్వేద బ్రాహ్మణములలో ఐతరేయ బ్రాహ్మణ మొకటి ఇది నలువది అధ్యాయములుగాను, 8 పంచకములుగాను విభక్తమై యున్నది దీని రచయిత ఐతరేయుడగు (ఇతరాదేవి పుత్రుడు) మహిదాసమహర్షియని సంప్రదాయము చెప్పును సామాన్యముగ ఆయన ఒక్కడే దీని సంపాదకుడో, సంకలనకర్తయో యై ఉండనోపు ఇది ప్రధానముగ సోమయాగ విషయమును, అగ్నిహోత్ర, రాజసూయ విషయములను చర్చించును

దీనితో సమీపసంబంధముకలదే కౌషీతకీ లేక శాంఖాయన బ్రాహ్మణము ఇదిగూడ ఋగ్వేద బ్రాహ్మణమే దీనిలో 30 అధ్యాయము లున్నవి మొదటి అధ్యాయములు దర్శపూర్ణమాసేష్టులు అగ్నిహోత్రము, అగ్న్యాధానము, ఋతుయజ్ఞములను చర్చించును 7 నుండి 30 వరకు సోమయాగము విషయము ఈ అధ్యాయములలో ఇది ఐతరేయ బ్రాహ్మణముతో పూర్తి సామ్యము కలిగియున్నది

సామబ్రాహ్మణములు

వీటిలో (1) ప్రౌఢము, (2) షడ్వింశము, (3) సామవిధి, (4) ఆర్షేయము, (5) దేవతాధ్యాయము (6) ఉపనిషత్తు, (7) సంహితోపనిషత్తు, (8) వంశము అని ఎనిమిది బ్రాహ్మణము లున్నవి వీటికి నియతస్వరము లేదని తంత్రవార్తికము చెప్పుచున్నది వీటిలో ప్రౌఢమునకు తాండ్యము, పంచవింశము, మహాబ్రాహ్మణము అనెడి నామాంతరములు కలవు ఇది 25 కాండములు కలిగిన బ్రాహ్మణము ప్రాచీనతమ బ్రాహ్మణములలో నిదియొకటి. దీనిలో

కొన్ని ముఖ్యములగు ప్రాచీనేతిహాసము లున్నవి ఇందు లోని మరియొక విశేషమేమన, వ్రాత్యస్తోమము లిందులోనే గలవు. వీటిలో వ్రాత్యులను బ్రాహ్మణులలో కలుపుకొనుటకు ఉపయోగించు యజ్ఞములు వివరింప బడినవి తరువాత షడ్వింశ బ్రాహ్మణము అను సామబ్రాహ్మణము కేవలము 25 కాండములు కలిగిన తాండ్యబ్రాహ్మణమునకు పూరణ మను కొనవచ్చును దీనియొక్క చివరిభాగమును అద్భుత బ్రాహ్మణ మందురు ఇది శకునములపై, అద్భుతప్రభావములపై వేదాంగమువంటి గ్రంథము జైమినీయ బ్రాహ్మణము – (ఆర్షేయ బ్రాహ్మణములో ఒక భాగము) తాండ్యబ్రాహ్మణమున కన్నను ప్రాచీనమైనది మతము యొక్కయు, ఇతిహాసము యొక్కయు, చరిత్ర విషయములో దీనికి చాలప్రాధాన్యము కలదు కాని దీని లిఖితప్రతి మిక్కిలి శిథిలమవుటచే ఇందులోని కొన్ని భాగములు మాత్రమే వెలుగును చూచినవి దీనినే తలవకార బ్రాహ్మణ మందురు

**యజుర్వేద బ్రాహ్మణములు** కృష్ణయజుర్వేదమునకు సంబంధించిన తైత్తిరీయ బ్రాహ్మణమనగా తైత్తిరీయ సంహిత యొక్క అనుబంధము తప్ప మరేమియు కాదు కృష్ణయజుర్వేదమునందలి సంహితయందే బ్రాహ్మణము కలిసి యుండుటచే, ఇది కేవలము కొన్ని అర్వాచీన అనుబంధము లను మాత్రము చేర్చుచున్నది ఇవి కేవలము సంకేతాత్మక మగు పురుషమేధయాగమును వివరించును ప్రఖ్యాతిచెందిన శతపథ బ్రాహ్మణము శుక్లయజుర్వేదమునకు సంబంధించినది దీనిలో శతసంఖ్యాకములగు అధ్యాయములుండుటచే ఈ పేరు వచ్చినది. ఇది అన్నిబ్రాహ్మణములలోకెలను మిగుల విస్తృతమైనది విషయమునుబట్టి కూడ ఇది మిగుల ప్రధానమైనది దీనిని గూర్చి పండితలోకము బాగుగ నెరుగును వాజసనేయి సంహిత (యాజ్ఞవల్క్య వాజసనేయికి సంబంధించినదిగాన శుక్లయజుర్వేదము నిట్లందురు) వలెనే ఇదియును కాణ్వ– మాధ్యందిన భేదములచే రెండుశాఖలుగానున్నది ఇది పదు నాల్గుభాగములుగా (కాండములు) విభజింపబడినది మొదటి 9 భాగములు వాజసనేయి సంహిత యొక్క మొదటి 18భాగముల క్రమవ్యాఖ్యానము; ఇవి చివరి 5 భాగములకంటె ప్రాచీనములగుట నిశ్చయము 14 వ. భాగము యొక్క అంతమునందు "శతపథ బ్రాహ్మణము ముత్తమునకుయాజ్ఞవల్క్యుడు కర్త" యనియు, ఆయన అభిప్రాయములే చరమ పరమప్రమాణమనియు పేర్కొనబడినది కాని మరియొక వైపు 6 నుండి 9 వ భాగమువరకు అగ్నిచయనమును వివరించును అందులో యాజ్ఞవల్క్యుని ప్రసక్తియే లేదు ఆయనకు బదులుగా శాండిల్యుడు ప్రమాణభూతుడుగా పేర్కొనబడుటయేగాక 10 వ భాగములో వివరింపబడిన అగ్నిరహస్యమును ప్రతిపాదించినది శాండిల్యుడేయని చెప్ప బడియున్నది 11 వ భాగమునుండి 14 వ భాగమువరకుగల గ్రంథభాగము పూర్వభాగములకు అనుబంధమువంటి దగుటయేగాక సాధారణముగా బ్రాహ్మణములలో చర్చింపబడనట్టి ఉపనయనము (11–4,5), స్వాధ్యాయము (11–5,6–9), అపరకర్మలు (13–9), సమాధులపై మట్టి నింపవలసిన విధానము మున్నగు విషయములు ఇందులో ఉండుటచే, విమర్శకుల అవధానమును తనవైపు త్రిప్పుకొనుచున్నది 13 వ భాగమున అశ్వమేధము, పురుషమేధము, సర్వమేధము చర్చింపబడినవి 14 వ భాగములో ప్రవర్గ్యకర్మలు (రహస్య సంకేత గూఢార్థములు కలవి) చర్చింపబడినవి దీనిచివరి భాగమునసే మిగుల ప్రధానమైనదియును ప్రాచీనమైనదియును అగు బృహదారణ్యకోపనిషత్తుగలదు

భిన్న వేదములకు సంబంధించిన బ్రాహ్మణములలో ముఖ్యమైన పరస్పర భేదకాంశమేమన – ఋగ్వేదమునకు సంబంధించిన బ్రాహ్మణములు హోతయను ఋత్విక్కునకు కావలసిన విషయములను సామబ్రాహ్మణములు ఉద్గాతకు ప్రధానమైన విషయములను, యజుర్వేద బ్రాహ్మణములు అధ్వర్యునకు కావలసిన విషయములను ప్రధానముగ చర్చించును బ్రాహ్మణములలోని ముఖ్యవిషయములలో అన్ని బ్రాహ్మణములు ఏకాభిప్రాయము కలిగియున్నవి సామాన్యముగ బ్రాహ్మణము లన్నియును చర్చించునది ఒకవిషయమునే. ఒకచో విధమగు ఆమోదముద్రను వేయును ఇంత గొప్ప సాహిత్యము ఉద్భవిల్లి ప్రచారము నొందవలయునన్న కొన్ని శతాబ్దులేని పట్టియుండును. వంశబ్రాహ్మణములో ఈ సాహిత్యము యొక్క ఆచార్యుల వంశపరంపరలో 40,50 ఋషుల పేర్లు కనబడును వంశములో ఇంతమంది ఆచార్యుల పురుషాంతరములు సంభవింపవలెనన్న కొన్ని శతాబ్దులు పట్టక తీరదు సామవేదమునకు సంబంధించిన వంశ బ్రాహ్మణము లలో 53 గురు ఆచార్యుల పేర్లు ఒసంగబడినవి వీరిలో చివరి ఆచార్యుడు కపిలుడనియు ఆయన అగ్నినుండి ఈసంప్రదాయ

మును గ్రహించెననియు గలదు శతపథ బ్రాహ్మణములో నాలుగు భిన్నవంశము లొసగబడినవి అందులో ఒకదానిలో, "మనమీ సంప్రదాయమును భారద్వాజీ పుత్రునుండి గ్రహించితిమి, భారద్వాజీ పుత్రుడు వాత్సీ మాండవీ పుత్రునుండి గ్రహించెను" అని యిట్లు జననీనామములతో పేర్కొనబడు 40 ఆచార్యుల పేర్లున్నవి యాజ్ఞవల్క్యుడు 45 వ ఆచార్యుడు ఉపనిషత్తులలోను పేర్కొనబడుటచే మనకు తెలియ వచ్చిన ఉద్దాలకాచార్యుడు యాజ్ఞవల్క్యుని గురువుగా పేర్కొనబడుచున్నాడు చివరి 55 వ మానవాచార్యుడు శాశ్యపనైధ్రువి ఆయనకు బ్రాహ్మణము వాగ్దేవతచే సాక్షాత్కరించినదట ఆ వాగ్దేవక్ దేవత అంభృణి (మేఘగర్జన ధ్వని దేవత) నుండియు ఆ అంభృణి ఆదిత్య (సూర్యుడు) నుండియు బ్రాహ్మణమును బడసిరట

ఈ బ్రాహ్మణముల సాహిత్య శతాబ్దులను ఏకాలమున నుంచవచ్చునని మనమాలోచించినచో, స్పష్టముగ చెప్పుటకు ఆధారములు లేవు వీటిలోని అర్వాచీన తమభాగములు కూడ గౌతమబుద్ధజినులకన్న మిక్కిలి ప్రాచీనములనుటలో సంధియములేదు 4 వేదముల (సంహితల) కన్న ఇవి అర్వాచీనములు ఋక్సంహితలోని విషయములకును బ్రాహ్మణములలోని విషయములకును పెక్కు అంశములలో భేదములున్నవి గంగాయమునల మధ్యభాగము ఢిల్లీప్రాంతము నుండి మధురవరకును బ్రహ్మావర్తమని పిలువబడుచు బ్రాహ్మణముల కాలమున ధార్మిక, తాత్వికాది విజ్ఞానచర్చల కేంద్ర స్థానముగ విరాజిల్లునట్లు తోచుచున్నది

ఋగ్వేదములో ఘనముగా స్తుతింపబడిన దేవతలు బ్రాహ్మణములలో కనబడుచున్నను, వారి ప్రాధాన్యము బాగుగా తగ్గినట్లు కానబడుచున్నది వీటిలో యజ్ఞమే ప్రధానమైనది యజ్ఞముకన్న మించినది మరియొకటిలేదు దేవతలు కూడ యజ్ఞము చేయుదురు ఇట్లు యజ్ఞము అప్రతిద్వంద్వమై సర్వోన్నత స్థానము నాక్రమించినది ఋగ్వేదమున అప్రధానులుగనున్న విష్ణు, రుద్ర, ప్రజాపతులు వీటిలో విశిష్టస్థానమున నున్నారు దేవతలకు ప్రజాపతి తండ్రియని చెప్పబడినది 'అవెస్టా' భాషలోని అహురశబ్దముతో సమానమైన అసుర శబ్దము ఋగ్వేదములో అద్భుత ప్రభావోపేతుడు అను అర్థముతో విష్ణువునకు విశేషణముగా ఉండ, తరువాతి సంస్కృతములోవలె బ్రాహ్మణములలోను రాక్షసవాచకమైనది బ్రాహ్మణములలో దేవాసుర సంగ్రామములెన్నియో ఉట్టంకింపబడినవి

బ్రాహ్మణములదృష్టిలో యజ్ఞముముందర తక్కిన వేవియు పనికిరావు యజ్ఞము ఒకలక్ష్యమునకు సాధనము కాదు యజ్ఞమే సాధ్యమగు ఒకలక్ష్యము యజ్ఞమన, అన్నిటినిమించుశక్తి ప్రకృతియొక్క సృజనశక్తియేయజ్ఞము యజ్ఞమనసాక్షాత్తు ఆ సృష్టికర్తయగు ప్రజాపతియే! "ప్రజాపతియే యజ్ఞము" అను నీవాక్యము పునఃపునరావృత్తమై కనబడును యజ్ఞమింత గొప్పదగుటచేతనే అందులోని ప్రతి అల్పాంశముగూడ ఎంతో మెలకువతో ఒడలంత కన్నులుగా పరిశీలింపబడును ఈ క్రియాకలాపములో ఒకపని ఎడమనుండి చేయవలయునా? కుడినుండి చేయవలయునా? ఏపాత్రను యజ్ఞశాలలో ఏమూలనుంచవలయును దర్భాగ్రములు ఉదఙ్ముఖములా? దక్షిణముఖములా? పురోడాశము నెన్ని భాగములు చేయవలయును ఘృతము హోమకుండమున మధ్యలో ఉంచవలయునా దక్షిణభాగమున ఉంచవలయునా? అని ఇట్లు ప్రతిచిన్న అంశముకూడ ఎంతో శ్రద్ధతో వివరింపబడినది ఇట్టివిషయములపైనే తరతరముల ఆచార్యఋషులు మిగుల ఏకాగ్రతతో శ్రమించిరి వర్ణవ్యవస్థ వేళ్ళుపాతుకొన్నది బ్రాహ్మణులు దేవతలతో సమానులుగానే గాక, దేవతలుగానే భావింపబడిరి దేశప్రభువునకు గూడ బ్రాహ్మణులపై ఎట్టి అధికారములేదు. ప్రజలందరకు దేశప్రభువు రాజైనను, బ్రాహ్మణులకు మాత్రము సోమదేవత రాజు

పదనిర్వచనము 'ఉపవసథ' అనయజ్ఞదీక్ష స్వీకరించుటకు పూర్వపుదినము, దేవతలు సమీపమున (ఉప) నివసించు రోజుకనుక ఆదివసము ఉపవసథమనబడుచున్నది (ఆదినము ఉపవాసము చేయవలయును) ఈవిధమైన నిర్వచనములు బహుళముగ నుండును

'ఇంద్ర' ఈశబ్దము 'ఇంధ్' (వెలిగించు) అను ధాతువు నుండి పుట్టినది ఇంధ్ అను అర్థము స్ఫురింపకుండ దేవతలు ఇంద్రుని ఏల ఇంద్ర అనిరి? అనగా ఒక చమత్కారము అగు సమాధానము ఈయబడినది దేవతలకు దావరికము (గూఢత) పై మక్కువ ఎక్కువ అందుచే ఇంధ్ పదము గూఢమగునట్లు 'ఇంద్ర' అనిరట అట్లే, 'ఉలూఖలము' అను పదము 'ఉరుకరత్' పెద్దగా చేయునది. అను అర్థమున గూఢముగా ఉండునట్లు ఉలూఖలగా చేయబడినదట నిర్వచనములో శాధాత్మ్య

అధ్యవసాయము,గూఢసంకేతము అనుపద్ధతులుపాటింపబడినవి

ఒక్కచో చమత్కారముగా యజ్ఞము సంవత్సర తాదాత్మ్య-అధ్యవసాయముచేసి వర్ణింపబడినది "అగ్నియే సంవత్సరము", సంవత్సరమన ఈ మూడులోకములు అగ్ని ప్రజాపతి ప్రజాసంవత్సరము ప్రజాపతియే యజ్ఞము సంవత్స రముగూడ అమావాస్యరాత్రి దానిద్వారము, చంద్రుడు గడియ" అని ఈప్రకారముగ తాదాత్మ్యము వర్ణింపబడును, ఒక్కచో గూఢసంకేతవిధానము అంకెలతో బాగుగ నిర్వహింప బడినది 'నాల్గింటితో (మంత్రములతో) (కొంతబూడిద) తీసికొనును అప్పుడు చతుష్పాత్తులను (అగ్నికి) ఇచ్చును, .. మూడింటితో (మంత్రములతో) క్రిందకు (నీళ్ళవద్దకు)(బూడి దను) తెచ్చును దానిలో 7 అగును అగ్నివేదిక 7 అంతస్తులు ఉండునుగాన,7 ఋతువులు సంవత్సరము కాన సంవత్సరమగ్ని

"స్త్రీలు అబలలు కాన వారికి ఎట్టి వారసత్వపు హక్కులులే" వని ఒక్కచో ప్రతిపాదింపబడినటి అల్లే 'యజ్ఞము - ఋతము, సత్యము అనియు, స్త్రీ - అనృతము, పాపము' అనియు 'స్త్రీ నిర్‌ృతి' యనియును గలదు కాని మరొకచో శతపథ బ్రాహ్మణ వాజపేయయాగమున స్తంభము ఎక్కుసందర్భమున స్త్రీకి మంచిగౌరవమొసగ బడినది అందులో 'భార్యయను సత్యమారయి భర్తయొక్క అర్థభాగము భార్యలేనంతవరకు భర్తనంతటిని అవిచ్ఛిన్న ముగ సాగింపజాలడు మరియు అతడు అంతవరకు పూర్తి వ్యక్తిగా పరిగణింపబడజాలడు' అనియున్నది బ్రాహ్మణకారుల దృష్టిలో స్త్రీ సౌందర్యమెట్లుండునో శతపథ బ్రాహ్మణము లోని ఈక్రిందివాక్యములు తెలుపుచున్నవి 'జఘనభాగమున విశాలమై, నెన్నడుమునసూక్ష్మమై అంసప్రాంతమున భుగ్నమైయున్న స్త్రీవలె అగ్నివేదిక పశ్చిమమున విశాలమై మధ్యభాగమున సూక్ష్మమై తూర్పున వైశాల్యము కొంచె ముగా నున్నచో దేవతలకు ప్రీతిజనకమగును' అని వర్ణింప బడినది ఇట్లు కేవలము యజ్ఞపరాయణములై-యజ్ఞయాగా దులయొక్క అనంతములగు సూక్ష్మాంశములను వివరించుచు సాధారణ పాఠకులకు దారి, తెన్నులేచని ఎడారులవంటివగు బ్రాహ్మణములలో అక్కడక్కడ శీతలజలాశయములవంటి ఇతి హాసము లెన్నియేనిగలవు

అట్టివాటిలో చేరినవే ఊర్వశీ పురూరవుల ఇతిహాసము, శునశ్శేపునిచరితము (పురుషమేధకథ), జలప్రళయములో మనువుకథ మున్నగునవి ఇవి అన్నియు ఏదో ఒకరూపమున సమర్థనరూపముననో, వివరణరూపముననో, యజ్ఞములకు సంబంధించినవే ప్రజాపతిని స్తుతించుమంత్రములను ఉపాంశు వాక్కు (ఎలుగులేకుండ)తో పఠింపవలెను ఇందుకుకారణము భావపాత్రలుగల ఒక కథలో చమత్కారముగ ఇట్లు వివరింప బడినది

"ఒకనాడు మనస్సు, వాక్కు, 'నేను గొప్ప అన నేను గొప్ప' అని కలహించి ప్రజాపతిని దరిసి, తమ కలహ కారణము నివేదించి న్యాయ్యమగు తీర్పునుకోరినవట, అంత ప్రజాపతి 'వాక్కుకన్న మనస్సే గొప్ప' యని చెప్పెనట అందుకు వాక్కు కోపించి, 'నన్ను నీవు అవమానించితివి కావున నేను నీకెప్పటికిని హవిస్సును గొనివచ్చుదాననుకాను అని చెప్పెనట ఇట్లు వాక్కు హవిర్భాగవాహకను కాక పోవుటచే ప్రజాపతినిగూర్చి చేయు హోమాదులయందు ఉపాంశుస్వరముతో మంత్రములను పఠింతురు'

ఇట్లు ఆటనట కథనములు ఇతిహాసములు, సృష్టిప్రకా రములు, బ్రాహ్మణములలో మనోహరములుగ వర్ణింపబడి యున్నవి

తె. వి. శ

## బ్రాహ్మీలిపి

ఉపక్రమణిక అతి ప్రాచీనమగు వేదకాలమునుండియు భారతీయులకు లిపిజ్ఞానము సంపూర్ణముగ నుండెనని చెప్పుటకు వైదిక వాఙ్మయము నందును, జైన, బౌద్ధ వాఙ్మయము నందును, అనేకాధారము లున్నవి అయినను, ప్రాచీనభార తీయులకు లిపులు తెలియవనియ, అశోకుని కాలమునుండియే విదేశీయుల సాహచర్యము వలన లిపిపరిచయము కలిగించు కొనిరనియు, అశోకుని శాసనములోని బ్రాహ్మీలిపి పాశ్చాత్య లిపులనుండి పుట్టినదనియు, నిరూపించుటకు వారు వ్యర్థప్రయ త్నములు చేసినారు. 'మ్యాక్సుముల్లర్', 'బర్నెల్', 'బుహ్లర్' వంటి సంస్కృత విద్వాంసులు కూడ ఈ అపసిద్ధాంతములు చేయుట శోచనీయము

ఋగ్వేదమునందు అక్షరప్రస్తావన కలదు వేదాంగము లలో ఛందోవ్యాకరణము లున్నవి బౌద్ధ గ్రంథమగు లలిత విస్తరమున 64 లిపులు పేర్కొన బడినవి అంత పురాతన కాలమునాటికే సంపూర్ణలిపి జ్ఞానమున్న జాతి భారతజాతి తప్ప మరొకటి విశ్వమున లేదు, పూర్వకాలమున అక్షరము

లను రంగులతో వ్రాయుచుండినందున లిపియని, వర్ణములు అని వ్యవహారము కలిగెను. ఆతరువాత లేఖనపద్ధతి (చెక్కుట) వాడుకలోనికి వచ్చినది. శిలలమీదను, రాగిరేకుల మీదను, ఈ పద్ధతి అవలంబింప బడినది. కావుననే మనకు క్రీ పూ 5వ శతాబ్దమునకు పూర్వము రంగులతో వ్రాయ బడినవన్నియు నష్టమైనవి. శిలలపై, ప్రతిమలపై, చెక్కబడిన శాసనములు మనకు క్రీ పూ 5వ శతాబ్దము నుండియే లభించుచున్నవి. ఈ విషయము నెరుగక పాశ్చాత్యులు మనకు లిపులే లేవనుటకు సాహసించిరి.

అశోకుని కాలమున భారతదేశమునందు బ్రాహ్మీ లిపియు, వాయవ్యప్రాంతమున మాత్రము ఖరోష్ఠీలిపియు ప్రచారమున నుండినవి. అశోకుడు తనధర్మశాసనములను ఆయాప్రాంతముల వారికి తెలియునట్లు రెండు లిపులలోను వ్రాయించినాడు.

**బ్రాహ్మీలిపి లేఖనములు** : ఇంతవరకు మనకులభించిన లేఖనములలో క్రీ పూ 3వ శతాబ్దమున అశోకుడు వేయించిన ధర్మశాసనములే మొట్టమొదటివని చెప్పవచ్చును. వీనికంటె పూర్వలేఖనములు కొన్ని మాత్రమే కనబడినవి. మధురా మ్యూజియము నందలి అజాతశత్రుని ప్రతిమపై నొకలేఖన మున్నది. అది క్రీ పూ 518 నాటిది. కలకత్తా మ్యూజియము లోని శైశునాగ నందివర్ధనుని ప్రతిమపై గూడ నొకలేఖనము కలదు. అది క్రీ పూ 409 నాటిది. నేపాల్ దేశము నందలి ఒకస్తూపమునందు లభించిన పాత్రపై ఒకలేఖనము కలదు. దానిని 'పిప్రావా' శాసనమునెదరు. అది క్రీ పూ 500 నాటిది. ఉత్తరప్రదేశ్‌లోని గోరఖ్‌పూర్ జిల్లా, సోహ్‌గౌరా గ్రామములోను, బెంగాల్‌లోని బోగ్రాజిల్లా,మహాస్థాన్ లోను రెండు శిలాఫలకములపై బ్రాహ్మీలేఖనములు లభించినవి. ఇవన్నియు అశోకుని కంటె ప్రాచీన లేఖనములు.

ఆతరువాత అశోకుడు బౌద్ధధర్మ ప్రచారమునకై భారతదేశమందంతటను శాసనములను వేయించెను. అవి శిలలపైన, స్తంభములపైన చెక్కబడి యున్నవి. ఆకాలము నాటికే గుంటూరు జిల్లాలోని భట్టిప్రోలులో కుంభీరకుడను రాజు ఒక స్తూపమును కట్టించి యుండెను. అందు లభించిన మూడు రాతిబరిణలపైన బ్రాహ్మీలిపి లేఖనము లున్నవి. ఈ వ్రాతలో అశోకుని శాసనాక్షరములకంటె కొన్ని అక్షరములు విలక్షణములై యున్నవి.

ఈ లిపికి ఈపేరు ఎట్లు వచ్చెను : భారతీయ సాంప్రదాయము ప్రకారము వాక్కును 'బ్రాహ్మి'యందురు. వాగధిదేవతలగు సరస్వతీబ్రహ్మల సంబంధమును తెలుపునట్టి బ్రాహ్మి శబ్దమును మనవారు తమ లిపికి పెట్టుకొనిరి. ఈ పేరు ప్రాచీన కాలమునుండియే వ్యవహారమున నుండినట్లు చెప్పవచ్చును.

క్రీ పూ 3 వ శతాబ్దమునందు వ్రాయబడిన "లలిత విస్తరము"లో 64 లిపులు ప్రస్తావింప బడినవి. వాటిలో మొదటిది బ్రాహ్మీలిపియే. జైనుల 'సమవాయంగసుత్తము' అను గ్రంథమునందు 'బంభీఖరోట్టిధామిలీ' మొదలైన అష్టాదశ లిపులు ప్రస్తావింప బడినవి. 'భగవతీసుత్తము' అను మరొక గ్రంథమున "నమోబంభీయేలివియే" అని ఆరంభములో బ్రాహ్మీలిపికి నమస్కారము చెప్పబడినది. ఇప్పటికిని ఎవరైన చిక్కుగా గొలుసువ్రాత వ్రాసినపుడు 'బ్రహ్మ వ్రాత' అని మనవారు హేళనము చేయుట కలదు. ఇది అలనాటి బ్రాహ్మీలిపిని ఉద్దేశించుచున్నదేమో ! భారత దేశమునందు ప్రాచీన కాలమునుండి బ్రాహ్మీలిపి వ్యవహారమునం దుండెనని నిస్సందేహముగ చెప్పవచ్చును.

**బ్రాహ్మీలిపికి మాతృక** : బ్రాహ్మీలిపి ఎట్లు పుట్టినదను విషయమునుగూర్చి పాశ్చాత్య పండితులు విభిన్న సిద్ధాంతములు చేసినారు. ప్రాచ్య పండితులు మరొక విధముగా చెప్పినారు. ఈ విషయములను గూర్చిన వాదములలో ముఖ్యమైనవి పేర్కొనబడును.

(1) జేమ్సుప్రిన్సెప్, సెనార్ట్, విల్సన్, అనువారు బ్రాహ్మీలిపి 'ఫినీషియన్-గ్రీక్' లిపినుండి పుట్టినదని సిద్ధాంతము చేసినారు.

(2) హాలెవి, క్రీ. పూ 3 వ శతాబ్దమునందలి 'అరమిక్' లిపినుండి బ్రాహ్మి పుట్టిన దనెను.

(3) విలియంజోన్సు, జెన్ పే, పాట్, వెస్టర్‌గార్డ్, వీబర్, మాక్సుముల్లర్, సైస్, హ్విట్నీ, కోప్, లేప్సియస్ యనువారు బ్రాహ్మి "సెమిటిక్" లిపినుండి పుట్టినదనిరి.

(4) స్టీవెన్‌సన్, గోల్డుస్మిత్, బర్నెల్, లినోనార్మండ్, ఐసాక్ టైలర్, క్లార్డ్, ఫ్రెడరిక్ ముల్లర్ మొదలైన వారు దక్షిణ సెమిటిక్ లిపినుండి జన్మించిన దనినారు.

(5) బుహ్లర్ పండితుడు ఉత్తర సెమిటిక్ లిపినుండి పుట్టినదనెను.

(6) లాంగ్ డన్, హంటర్ పండితులు బ్రాహ్మీలిపి శుద్ధ భారతీయమగు హరప్పా చిత్రలిపినుండి పుట్టినదని చెప్పినారు

(7) లాసన్, కన్నింగ్‌హాం, ప్రొ॥ డ్యూసన్, ఎడ్వర్డు థామస్ పండితులు అశోకలిపి పురాతన చిత్రలిపినుండి పుట్టినదనియు, ఇది విదేశీయముగాక శుద్ధ స్వదేశీయ లిపియనియు అనేక ఉపపత్తులతో నిరూపించినారు

(8) డా॥ శ్యామశాస్త్రిగారు బ్రాహ్మీలిపి తాంత్రిక బీజాక్షరములనుండి, యంత్ర లేఖనములనుండి పుట్టినట్లు నిరూపించిరి.

(9) యాజ్ దానీ. డా॥ డి ఆర్. భండార్కర్ పండితులు బ్రాహ్మీలిపి శిలాయుగ అవశేషములగు మట్టిపాత్రలపై కానవచ్చు గుర్తులనుండి పుట్టియుండునని చెప్పిరి ఈ వాదముల నన్నిటిని క్షుణ్ణముగా చర్చించి సుప్రసిద్ధ పరిశోధకులు, ప్రామాణిక పండితులునగు శ్రీ కె వి లక్ష్మణరావు పంతులుగారు క్రింది విధముగా నిర్ణయించినారు

"హిందూదేశమునందలి లిపి ఈ దేశమునందే పుట్టినదనియు, విదేశీయము కాదనియు నిశ్చయింప వచ్చును భారతీయ వర్ణమాల సెమెటిక్ వర్ణమాలనుండి పుట్టలేదు తాంత్రిక చిత్రాంకనలిపి అశోకలిపికి మూలమైనను, కాకపోయినను, మొహంజోదారో, హరప్ప, ముద్రికలవలనను,

చిత్రము 105

అ ఆ ఇ ఉ ఏ ఓ క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ

ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర

ల వ శ ష స హ

బ్రాహ్మీలిపి - వర్ణములు
పటము 1

అందలి చిత్రలిపివలనను, భారతీయ వర్ణములు పుట్టిన విషయము సత్యమని తోచును " అని వ్రాసినారు

లిపి పరిచయము ఇంతవరకు లభించిన లేఖనములను బట్టి శాసన పరిశోధకులు బ్రాహ్మీ వర్ణమాలలో ఈ యక్షరములను గుర్తించినారు (చూ 1 వ పటము)

ఈ బ్రాహ్మీలిపి వర్ణములకు క్రింది విధముగ గుణింత రూపములు కానవచ్చుచున్నవి (చూ॥ 2 వ పటము)

ఈ బ్రాహ్మీలిపి వ్రాత మచ్చునకు అశోక ధర్మశాసనమును చూడుము (చూ 3 వ పటము) ఈ శాసనము నేపాలు దేశమునందలి దుళ్ళాగ్రామముదగ్గర ఉన్నరుమ్మిందై దేవాలయ సమీపమున నొక స్తంభముపై చెక్కబడియున్నది ఈ శాసనమున ఇట్లు వ్రాయబడి యున్నది

(1) దేవానపియేన పియదసినలాజిన వీసతివసాభిసితేన
(2) అతనఆగాచమహీయితే హిదబుధేజాతే సక్యమునతి
(3) సిలావిగడభీచా కాలాపిత సిలాథభేచ ఉసపాపితే
(4) హిదభగవంజాతేతిలుంమిని లుంమినిగామే ఉబలికేకచే
(5) అథభాగియేచ

ఈ శాసనములందలి భాష ప్రాకృతము దానికి సంస్కృతచ్ఛాయ ఈ విధముగ నుండును.

(1) దేవానాంప్రియేన ప్రియదర్శినారాజ్ఞావింశతి వర్షాభిషిక్తేన
(2) ఆత్మనాగత్యమహీయిత మత్రబుద్ధోజాతః శాక్యమునిరితి
(3) శిలావలభచకారిశా శిలా స్తంభశ్చోత్థాపితో
(4) అత్రభగవాన్ జాత ఇతి లుంబినీగ్రామే ఉద్వలికః కృతో
(5) అష్టభాగేచ

దీనికి తెలుగులో నిట్లర్థమగును "శాక్యముని బుద్ధుడిచటజన్మించినందున, దేవానాం ప్రియుడగు ప్రియదర్శిరాజు తన ఇరువదియవ రాజ్యాభిషేక వత్సరమున స్వయముగ వచ్చి పూజించెను భగవంతు డిచట జన్మించె ననుటకు ఒక శిలావిగ్రహమును, శిలా స్తంభమును స్థాపించి లుంబినీ

గ్రామ జనులకు ఫలసాయములో ఎనిమిదవ భాగము మాత్రము "పన్నుకట్టడి చేసెను"

**బ్రాహ్మిలిపి భేదములు:** అశోకుని ధర్మలిపులలో ఉత్తరబ్రాహ్మి, దక్షిణబ్రాహ్మి అను భేదము లున్నవి. భట్టిప్రోలు స్తూపమునందలి రాతిబరిణులపై గల లిపిలోని కొన్ని అక్షరములు ఘ-జ-ద-ధ-మ-ల-శ అనునవి అశోక లిపికంటె భిన్నములై యున్నవి. అశోక లిపియందలి

చిత్రము 106

బ్రాహ్మిలిపి - గుణింతము
పటము 2

దీర్ఘము భట్టిప్రోలు లిపిలో హ్రస్వాక్షరములకే కలదు (చూ 4 వ పటము)

తమిళదేశమునందలి తిరునల్వేలి, మధుర, తంజావూరు జిల్లాలలోని కొన్ని గ్రామములలో గల గృహములలో అశోక, భట్టిప్రోలు లిపులవంటి లిపి కానవచ్చుచున్నది. ఇవి బౌద్ధ శాసనములని, భాష తమిళమని, తమిళ పండితుల అభిప్రాయము. కాని ఇంతవరకు వీటి అక్షరములు తెలియుచున్నవి

చిత్రము 107

బ్రాహ్మిలేఖనము = నమూనా
పటము 3.

గాని భాష సరిగ అర్థమగుటలేదు.

క్రీ పూ 6 వ శతాబ్దమునుండి క్రీ శ 8 వ శతాబ్దమువరకు బ్రాహ్మిలిపి శాసనములు కానవచ్చుచున్నవి. ఈ వేయి పండ్ల కాలములో ఈలిపి అనేకపరిణామములను చెందినది. అశోకునితరువాత కుషానులు, శకులు, క్షత్రపులు, శాతవాహనులు, ఇక్ష్వాకులు, బ్రాహ్మిలిపిలో శాసనములు వేయించినారు. వీరిశాసనములలో ఈ లిపియొక్క క్రమపరిణామము స్పష్టముగ కానవచ్చును.

ఉత్తర బ్రాహ్మి లిపినుండి గుప్తలిపి, కుటిలలిపి, నాగరి, శారదాలిపి, బెంగాలి, టిబెటు లిపులు జన్మించినవి. దక్షిణ బ్రాహ్మిలిపినుండి గుహాలిపి, పశ్చిమీ, మధ్యప్రదేశీ, ఒరియా, తెలుగు, కన్నడ, పల్లవగ్రంథ, తమిళ, వట్టెళుత్తు (మలయాళీ) లిపులు పుట్టినవి. ఇవియేగాక ప్రస్తుతము భారతదేశమునందు వాడుకలోనున్న ఉత్తర

చిత్రము 108.

ఘ జ ద ధ మ ల శ

అశోకలిపి-

భట్టిప్రోలు లిపి-

పటము 4

దక్షిణ లిపులన్నియు బ్రాహ్మిలిపినుండియే జన్మించినవని ప్రామాణిక విద్వాంసులందరును స్పష్టముగ చెప్పినారు. బ్రాహ్మిలిపియేగాక ఖరోష్ఠిలిపి కూడ స్వతంత్ర భారతీయ లిపియనియు, దానినుండియే అరబీ, ఫార్సీ మొదలయిన అపసవ్య లిపులన్నియు పుట్టెననియు, బెంగాలీ విశ్వకోశము చెప్పుచున్నది.

**విదేశములలో బ్రాహ్మిలిపి:** భారతదేశమునందు వివిధ రూపములు ధరించిన బ్రాహ్మిలిపి ఈ దేశముతో సంబంధము కల్గియుండిన బర్మా, సయాం, లావోస్, కాంబోడియా, పెగూ, జావా, ఫిలిప్పైన్ ద్వీపములలో గూడ వ్యాపించి ఆ దేశములందలి లిపులకు మాతృకయై యున్న విషయము ఆశ్చర్యము కలిగించును. భారతదేశమునుండి బౌద్ధమత ప్రచారకులు, వర్త

కులు, యోధులు ఆయా ద్వీపములకు వెళ్ళినపుడు వారితో ఈ లిపికూడ వెళ్ళినది ఆయా ప్రదేశములలో ఈ లిపికి వేరు వేరు నామములు కలిగినవి, కొన్నిచోట్ల ఈ లిపినుండి పరిణామము చెంది క్రొత్తలిపు లేర్పడినవి

లంకలో బ్రాహ్మీలిపి అనేక పరిణామములను పొందినది, సింహళమను వ్యవహారములను కావించినది దానినే మాల్ ద్వీపములో 'ఎవెళఅకురం' అనుచున్నారు అన్నాంలో "చెంలిపి" అని, పయాంలో "పాంక్ ఖం" అని, లావోస్, కాంబోడియాలలో "అక్సర్ మూల్, అఖర్ థిగ్" అని జావాలో అక్సర్ కవి-అచ్చరబుద్ధ" అని, ఫిలిప్పైన్‌లో "తగ్‌బనయా-మంగ్యన్" అని, బర్మాలో "త్సాలోన్హ్-త్సాకోన్సంక్" అని, చీనాటర్కిస్తాన్‌లో "కూచీన్" అని, నేపాల్‌లో "నేవారీ" అని, మంగోలియాలో "పస్సెపలిపి" అని వ్యవహరింపబడుచున్న లిపులన్నియు బ్రాహ్మీలిపినుండి పరిణామము చెందినట్టివే

బ్రాహ్మీలిపిని సాధించిన మేధావి క్రీ శ 8వ శతాబ్దము తరువాత బ్రాహ్మీలిపి క్రమపరిణామము చెంది ఆయా ప్రాంతీయ లిపులుగా మారిపోయినందున బ్రాహ్మీలిపి తరువాతి వారికి తెలిసికొనుట అసాధ్యమయ్యెను 18 వ శతాబ్దమునుండియే అశోక శాసనములను చదువవలయునను ప్రయత్నములు చేయబడినవి. అవి ఫలింపలేదు తుట్టతుదకు 19 వ శతాబ్దమున ఆ మహాప్రయత్నము ఫలించెను

"జేమ్స్‌ప్రిన్‌సెప్" అనునొక బ్రిటిష్ ఉద్యోగి ఈస్టిండియా కంపెనీవారి టంకసాలలో పనిచేయుటకు భారతదేశమునకు వచ్చెను 1880లో కాశీయందలి టంకసాల రద్దు చేయబడినందున ఆతడు కలకత్తా టంకసాలకు బదిలీ చేయబడెను అప్పటికే కలకత్తాలో 'ఏషియాటిక్ సొసైటీ' యను విద్వత్సంఘము స్థాపింపబడి పరిశోధక వ్యాసములతో నొక పత్రిక ప్రచురింపబడుచుండెను ప్రిన్సెప్ తన ప్రతిభచే ఆ సొసైటీ కార్యదర్శి యయ్యెను. ఆతనికి క్రొత్త లిపులను చదువుటయందు చాల అభిరుచి యుండెను అశోక లిపులను చదువుట కతడు పూనుకొనెను 1884 నుండి 1888 వరకు విశేష పరిశ్రమ యొనర్చి అశోకుని బ్రాహ్మీలిపిని, ఖరోష్ఠీలిపిని సాధించెను ఆ కాలమునందే ఫాదర్ స్టీవెన్‌సన్ జేమ్సుటాడ్, మ్యాసన్ అనువారు కూడ ఈ లిపులను చదువుటకు ప్రయత్నించిరి కాని అందరిలో 'జేమ్సుప్రిన్సెప్' మాత్రమే సంపూర్ణముగ సఫలుడయ్యెను అతని మహా కృషి వల్లనే ఈనాడు మనము బ్రాహ్మీలిపిని చదువగలుగుచున్నాము ఆ మహామేధావికి భారతజాతి ఋణపడి యున్నది

గ రా శ

## బ్లావట్స్కీసతి, హెచ్ పి (1831-1891)

హెలీనాపెట్రోవ్నా బ్లావట్స్కీ అనునామె దివ్యజ్ఞాన సమాజమును స్థాపించిన నారీమణి జక్మతః ఈమె రష్యా దేశీయురాలు తన మాతామహిద్వారా, రష్యారాజరికమునకు చెందిన జార్ వంశీయులతో ఈమెకు బాంధవ్యమేర్పడినది పసకొండవ ఏట తల్లి మరణింపగా, ఈమె బాల్యమంతయు మాతామహి ఇంటనే గడపినది ఈమె తాత సారటాన్ రాష్ట్రమునకు గవర్నరుగ అధికారమందుండెను' విద్యాంసురాలైన మాతామహి ఉపదేశమున ఈమెకు గాన, వైజ్ఞానిక, భాషా శాస్త్ర విషయములలో చక్కని శిక్షణయ్యబడెను ఈమె 17 వ యేట ఎరివాన్ రాష్ట్రి గవర్నరుగా నుండిన జనరల్ బ్లావట్స్కీని వివాహమాడెను కాని మూడుమాసముల తరువాత ఈ వివాహబంధము విచ్ఛిన్నమాయెను

11-17 సంవత్సరముల వయస్సులో ఆస్ట్రాఖాన్ యందలి బౌద్ధలామాలతోను, వారి గురువర్యులతోను బ్లావట్స్కీకి పరిచయమేర్పడెను 16 సంవత్సరముల ప్రాయము రాకపూర్వమే ఈమె తన పినతండ్రితో కలిసి మంగోలియా ప్రాంతములకు సరిహద్దున నేయున్న సైబీరియాకు ప్రయాణమొనర్చి, లామాలకు సంబంధించిన సకల వృత్తాంతములను తెలిసికొనెను

1851 వ సంవత్సరములో ఈమె లండనునగరమునందలి హైడ్‌పార్కునందు మాస్టరు మోర్యా అనునాతనితో పరిచయమేర్పరచుకొని, ఆతనికి శిష్యురాలై గుహ్యశక్తులను గడించెను, అనంతరమామె కొంతకాలము హిమాలయప్రాంతములో నివసించుచు, గుహ్యవిద్యలో ప్రవీణులైన పండితుల యొద్ద విశేషపరిజ్ఞానమార్జించెను టిబెట్ పీఠభూమియందలి ఒకపర్వతపు కనుమలో నివసించుచుండిన మహర్షుల శుశ్రూష ఆమెకు లభించెను వారు 'మహాపథజ్యోతి' అను ధ్యానగ్రంథమును ఆమెకు జూపిరి ఆనాటినుండి 'జీవనగీతము'ను ఆమె వినుచు, శ్రవణ సుభగమైన ఆ గీతస్వరసమ్మేళనములను తన స్మృతిపథమున నిలుపుకొనుచుండెను దానినుండి సమన్వయ

భావావశ్యకతను, తననావరించియుండిన మానవజీవిత విశేషములను సాకల్యముగా అవగత మొనర్చుకొనెను

ఆమహర్షులయొద్ద బ్లావట్స్కీ 23 సంవత్సరములు మఠితురాలై, తన మహితానుభవములను 316 ఆధ్యాత్మిక సిద్ధాంతములలో లిఖిత మొనర్చెను 'మౌనవాణి' అను నీ సిద్ధాంతగ్రంథము విశ్వసాహితియందు ఉత్తేజకరమగు ఉత్కృష్ట రచనలలో నొకటి

ఇట్లు జ్ఞానసంపన్నురాలైన బ్లావట్స్కీసతి 1873 లో అమెరికాదేశమునకు పోయెను అచ్చట ఉత్తరజీవితములో తన సహచరుడైన కల్నల్ హెచ్ యస్ ఆల్కాట్ అను వానిని కలిసికొనెను ఇతడు మహాకాయుడు, సౌమ్యవదనుడు, అబ్బురపు గడ్డముగలవాడును, మరియు రూపరేఖావిలాసము లందు విశిష్టుడయి యుండెను బ్లావట్స్కీవలెనే ఆల్కాట్ కూడ సర్వమును పరిత్యజించెను వీరిద్దరుకలిసి 1875 లో న్యూయార్కునగరమునందు మూడాశయములతో ప్రప్రథమముగా దివ్యజ్ఞాన సమాజమును స్థాపించిరి

(1) సర్వమానవసౌభ్రాత్రాశయముతో కుల, మత, జాతి, వర్ణ భేదములేని కేంద్రసంఘమొకటి నెలకొల్పుట

(2) ప్రపంచమందలి వివిధ మతములను, తత్త్వశాస్త్రములను, విజ్ఞానశాస్త్రములను సమదృష్టితో అధ్యయన మొనర్చుటకు ప్రోత్సహించుట

(3) అనావిష్కృతములైన ప్రకృతి సిద్ధాంతములను గూర్చి మానవునియందు నిగూఢములైయున్న శక్తులను గూర్చి, పరిశోధనము జరుపుట

1877 వ సంవత్సరములో బ్లావట్స్కీ 'ఐసిస్' ఆవిష్కరణము అను గ్రంథమును ప్రకటించెను ప్రాచీన ఆధునిక విజ్ఞాన, తత్త్వశాస్త్రముల నధ్యయన మొనర్చుట కీగ్రంథము అత్యంతోపయుక్తమైనది ఇది రెండుసంపుటముల మహాగ్రంథము "సత్యరతులు అడ్డముగానున్న తెరను తొలగించి దినభాగముగామారిన రాత్రికాలపుకాంతిలో నిబ్బరముగ "ఈ సత్యావిష్కరణము"ను ఎట్లుచూడవచ్చునో తెలుపుటయే మా మనఃపూర్వకమయిన వాంఛ" అని ఆమెగ్రంథోపసంహారమునందు చాటినది

హిందూమతమును విమర్శించినవారి నందరిని ఆమె తీవ్రముగా ఖండించెను ఆర్యజాతికిని, వారి ఆధ్యాత్మిక జ్ఞానమునకును మాతృస్థానము భారతదేశమేగాని, గ్రీసు దేశముకాదని ఆమె నిరూపించెను "భారతదేశమునుగూర్చి పరిశీలనము జరుపుటయనగా, మానవజాతి జన్మస్థానమును కనుగొనుటయే" అని ఆమె వ్యాఖ్యానించెను

1879 వ సంవత్సరములో బ్లావట్స్కీ, ఆల్కాటు లిరువురు భారత దేశమునకు విచ్చేసి, మదరాసు శివారగు అడయారునందు దివ్యజ్ఞాన సమాజముయొక్క ప్రధానకార్యస్థానమును నెలకొల్పిరి బ్లావట్స్కీ, తన గుహ్యసిద్ధాంతమును గ్రంథరూపములో రచించుటయందును ఆల్కాటు దివ్యజ్ఞాన సమాజనిర్మాణ కార్యక్రమమునందును, ఆ సమాజపక్షమున "థియాసఫిస్టు" పత్రికను ప్రకటించుటయందును నిమగ్నులై యుండిరి గుహ్యసిద్ధాంత రచనయందు బ్లావట్స్కీకి మద్రాసు వాసియగు శ్రీ టి సుబ్బారావు, బి ఏ, బి ఎల్ గారు సహాయపడిరి ఏ ఆచార్యునకు బ్లావట్స్కీ శిష్యురాలై యుండెనో ఆ యాచార్యునకు ఈ సుబ్బారావుకూడ శిష్యుడయి యుండెను

ఆల్కాటు భారతదేశమం దంతటను పర్యటించుచు, ఉపన్యాసము లొసగుచు, దివ్యజ్ఞానసమాజమందిరములను నిర్మింపించుచుండెను 1882 ఫిబ్రవరి 14వ తేదీన బొంబాయి పురమందిరములో జొరాస్ట్రియను మతమునందు 'ప్రార్థన విశిష్టత'నుగూర్చి ఆల్కాటు ఉపన్యాసమునిచ్చుచు, 'మీరేశబ్దములనైన ప్రయోగించుడు! హృదయనైర్మల్యము, మనోదార్ఢ్యము, చిత్తైకాగ్రతకల్గియున్నచో, ప్రకృతిశక్తులు మీకు ఆకట్టె వశమైపోవును" అని ఉద్ఘాటించెను

1845లో లిట్టన్ప్రభు రచితమైన 'టానోని' అను నవలచే - బ్లావట్స్కీ - ఆల్కాటు లిరువురు గాఢముగా ప్రభావితులైరి ఈగ్రంథము భారతీయుల మనఃఫలకములపై గూడ ప్రభావముద్రను వైచినది 'ఐసిస్' గ్రంథములో మూడవ అధ్యాయమునందు "ఆత్మయను నద్దములో భూలోకము, స్వర్గలోకము ఒకేసారి ప్రతిబింబింపజాలవు ఈరెండింటిలో ఒకటి ప్రతిబింబించునపుడు రెండవది అంతర్హితమగును " అని వ్రాయబడియున్నది

1887 వ సంవత్సరములో బ్లావట్స్కీ ఇంగ్లండునకు పయనమై పోయెను 'గుహ్యసిద్ధాంతము' రెండుసంపుటములలో నీకాలమున లండను, న్యూయార్కునగరములలో ప్రచురింపబడెను

ఈ గుహ్యసిద్ధాంతగ్రంథము, పైన పేర్కొనబడిన 'ధ్యాన' నామకగ్రంథమునకు విస్తృతమగు వ్యాఖ్యానమే

సర్వవ్యాపిత్వము, సర్వశక్తిమత్వము, అనంతత్వము, శాశ్వతత్వము, నిర్వికారత్వము మున్నగు పవిత్రలక్షణములనే ఈ గ్రంథము ప్రతిపాదించును అదియే ఆధ్యాత్మికశక్తి సచేతనమైన ఈ శక్తి ప్రత్యణువును విద్యుచ్ఛక్తియమొనర్చి ప్రాణముగా పరివర్తనము చెందించును సర్వమానవ సౌభ్రాత్రములో దివ్యజ్ఞాన సమాజమునకున్న పరమ విశ్వాసమునకు ఈ సిద్ధాంతమే ప్రాతిపదికగా నున్నది అకలంకమైన దివ్యజ్ఞానమనగా మనోవాక్కర్మలయందు నిర్నిబంధముగ నీఛగ స్వార్థమును పరిత్యజించుటయే, అట్టి సంపూర్ణపరిత్యాగము వలననే ఆత్మ పరిశుద్ధమగును అప్పుడే నీ మూడవనేత్రమగు (అంతర్నేత్రమగు జ్ఞాననేత్రము) పనిచేయ నారంభించును మానవుని స్వార్థప్రవృత్తి మటుమాయమగును మర్త్యుడగు మానవుడు పవిత్రుడయి దేవతామూర్తియగును ఈ మహాదర్శమును సాధించుట కష్టతరమైన కార్యము కాని ఈ మహాకృషియందు దేవదూతలు అదృశ్యులై మనకు సహాయమొనర్తురు వారి సహకారము నందుకొనుటకు మన మర్త్యాలమైనచో వారిని కలిసికొనగలము అట్టి అర్హతను సంపాదించుకొనుటకు మనము జీవితసౌఖ్య వాంఛలను, ప్రాపంచిక వ్యామోహములను పరిత్యజించవలెను

1887 నుండి 1891 వరకు బ్లావట్స్కీ ఇంగ్లాండునందే కాలము గడపెను 1889 లో 'మౌనవాణి' అను గ్రంథము ప్రచురింపబడెను అనీబిసెంటు అను ప్రముఖతత్త్వజ్ఞురాలు బ్లావట్స్కీకి శిష్యురాలయ్యెను ఈ 'మౌనవాణి' పరమోత్కృష్టములైన ధర్మసూత్రములుగల గ్రంథరాజము ఆమె బోధించు పిండితాంశమును ఈక్రిందివిధముగా ప్రకటించినది

"ఓ భక్తుడా! మానవుని ప్రతివేదనకన్నీటిబిందువు నీ హృదయముపై పడనిమ్ము దానికి కారణమైన బాధ తొలగింపబడువరకు, ఆ వేదనకన్నీటిని అట్లే ఉండనిమ్ము దానిని తుడిచివేయవలదు

మానవసమాజమునకు దూరముగ ఏకాంతవాసమే ఘనకార్యమనియు, చీకటడవులలో (తపో) నిష్ఠయందుండుటయే మహామోక్షసిద్ధిదాయకమనియు విశ్వసింపకుము

కందమూల, పర్ణభక్షణాదులు, హిమజలపానము నీవు వాంఛించు మోక్షఫలసిద్ధికి మార్గములని విశ్వసింపకుము

ఓ భక్తుడా! మానవజాతి సంక్షేమార్థము జీవించుటయే మొదటిమెట్టు

వివేకోదయముకల్గినచో, వినయశీలుడవై మెలగుము వివేకవిజ్ఞాననిధివైనచో ఇంకను ఎక్కువగ వినయశీలుడవు కమ్ము అన్నిప్రవాహములను, అన్నినదులను తనలో నిముడ్చుకొను మహాసముద్రునివలె గంభీరముగ నుండుము నీ అల్పప్రవృత్తిని నీ దివ్యశక్తిచే నిరోధించుము

మహామోక్షసిద్ధికి మార్గము నీయందే కలదు వినయమను సుగంధపుష్ప మధురపరిమళము నీ శరీరనాడులయందు పరివ్యాప్తమగువరకు ఆ సుగంధపుష్పవికాసమునకు దోహదమొనర్చుచుండుము

నీ హృదయమును, నీ మనస్సును సర్వమానవజాతియొక్క మహాహృదయమునకును, మహామనమునకును శ్రుతి కూర్చితివా?

ఏలన, పవిత్ర నదీమతల్లుల ఘోష సమస్తప్రకృతిని ధ్వనింపజేసి, మారుమ్రోగునట్లే, ప్రవాహావిష్టుడగు మానవుని హృదయమునందుకూడ సకలప్రాణికోటి యొక్క ఆర్తనాదములు ప్రవేశించి, ప్రతిధ్వనించి, అతనికి గగుర్పాటు కలిగించవలెను సర్వప్రాణిజాతము బాధాక్రాంతమగుచో, ఆనందమనునదియుండునా? సకలప్రాణి ప్రపంచము మూల్గుచున్నప్పుడు నీవుమాత్రము వినుచు బ్రతికి బట్టగట్టగలవా! శాంతిరస్తు! తుష్టిరస్తు! పుష్టిరస్తు! ఓమ్ వజ్రపాణి! హుమ్, ఓమ్ తత్సత్"

మాక్స్‌ముల్లరు వ్రాసిన ఈ క్రిందివాక్యములనే బ్లావట్స్కీసతి పునరుద్ఘాటించినది "ఇహలోకమున మతము అనుదానిని గూర్చి మానవులు పోరాడుచుండెదరు స్వర్గలోకమున సర్వులకు యథార్థమైన మతమొకటే అని వారే గ్రహింపగలరు" మహాభారతమందలి శాంతిపర్వమున సత్యసంధత్వమునుగూర్చి భీష్ముడు ప్రసంగించుసందర్భమున 'నాస్తిసత్యాత్పరో ధర్మః' అను సూక్తిని వివరించినాడు ఈ మహావాక్యమే దివ్యజ్ఞానసమాజమువారి ప్రతిజ్ఞావచనము మానవాళికి దివ్యజ్ఞానము ప్రసాదింపదగు శాశ్వతమగు సూత్రరాజమిదియే సత్యవ్రతము సజ్జనులకు సహజగుణము సత్యనిర్వహణమే శాశ్వతమయిన ధర్మకృత్యము ప్రతిమానవుడు భక్తిగౌరవములతో 'సత్యము'నకు విధేయుడయి యుండవలెను సత్యమే ఉత్తమోత్తమ శరణ్యము సత్యమే విధి సత్యమే తపస్సు సత్యమేయోగము సత్యమే పరబ్రహ్మము సత్యమే మహాయజ్ఞముకంటె శ్రేష్ఠతరమైనది, సత్యాధారముననే

సమస్తము ప్రవర్తిల్లుచున్నది

వివిధమతములు సర్వవ్యాపిత్వముగల సత్యముయొక్క ప్రతిబింబములుమాత్రమే నని దివ్యజ్ఞానసమాజము నొక్కి వక్కాణించుచున్నది అట్టి సత్యప్రమాణమునకు కాలావధి లేదు ఈ అంతర్జాతీయ మతసమైక్య ప్రారంభమునకు బ్లావట్స్కి యొక్క దివ్యజ్ఞానసమాజము యొక్క మహత్తరమైన బోధలే ప్రాతిపదికలై వరలెను

పైన పేర్కొనబడిన గ్రంథములేగాక (1) దివ్యజ్ఞాన బోధిని, (2) దివ్యజ్ఞానసమాజ సాంకేతికపద నిఘంటువు (3) గుహ్యవిద్యాచరణము గుహ్యవిద్యకు గుహ్యవిద్యాత్మక కళలకుగల పరస్పరసంబంధము (4) పీడకలలకథలు (5) ఈనాటి తినుబండారములకొట్టు (6) హిందూస్థానములోని గుహలు, అరణ్యములు (7) నీలగిరిలోని ఒనులు అను గ్రంథములను కూడ మేడమ్ బ్లావట్స్కి రచించియున్నది

శి హ రా.

## బ్రిటనుదేశము (చ)

బ్రిటనుదేశము ఐరోపాఖండపు పశ్చిమభాగమున నెలకొనియున్న ఒకద్వీపము ఈ ద్వీపమునకు గ్రేట్ బ్రిటను అను నామాంతరముకూడ కలదు ఈ ద్వీపమునకు పశ్చిమభాగమున అనతిదూరములో ఐర్లాండుద్వీపముకలదు బ్రిటను, ఐర్లాండుద్వీపములు-రెండనుకలసి బ్రిటిష్‌దీవులు అని వ్యవహరింపబడుచున్నవి బ్రిటనుద్వీపములో ఇంగ్లాండు, స్కాట్లండు, వేల్సు అను విభాగములుకలవు ఇంగ్లాండున కుత్తరమున స్కాట్లండుదేశము నెలకొనియున్నది, స్కాట్లండులో ఉత్తరభాగము పర్వతమయము ఇంగ్లాండునకు పశ్చిమప్రాంతమున నున్న పర్వతభూములు వేల్సుదేశము బ్రిటనద్వీపమును బ్రిటిష్‌ఛానల్ అను సముద్రశాఖ ఐరోపాఖండమునుండి వేరు పరచుచున్నది ఈ సముద్రశాఖ వెడల్పు ఇరువదియైదుమైళ్ళు తొమ్మిదివేల సంవత్సరములకు పూర్వము బ్రిటనుదేశము యూరేషియా ఖండములో కలిసియుండినట్లును, అనంతర కాలమున సంభవించిన భూకంపములు, ఇతర భౌతికప్రళయములవలన ఈ భూభాగము ఆ పెద్దభూఖండమునుండి విడివడినట్లును, భూగోళశాస్త్రజ్ఞులు తెలుపుచున్నారు, తత్ఫలితముగ ఈనాటి డోవరు జలసంధి యేర్పడినదట

బ్రిటనుదేశమున సుమారు రెండులక్షల ఏబదివేల సంవత్సరములనుండియు మానవులు నివసించుచుండినట్లు తెలుపుటకు నిదర్శనములుకలవు, కాని ఈదేశమున అతిప్రాచీన యుగమున నివసించిన జనులనుగూర్చి మనకెట్టివిశేషములును తెలియరావు. ఇతర నాగరక దేశములందు వలెనే బ్రిటను ద్వీపములోని ప్రజలుకూడ పాతరాతియుగము, క్రొత్తరాతియుగము, కంచుయుగము, లోహయుగములనుండి గడచి, తుదకు చారిత్రకయుగమున కాలుపెట్టిరి క్రీస్తునకు ఆరు శతాబ్దులకుపూర్వము కెల్టులు అను ప్రజలు బ్రిటనద్వీపముపై దండెత్తివచ్చి అచట స్థిరనివాస మేర్పరచుకొనిరి వీరు బ్రిటనుతెగకు చెందినవారు కావున, వీరిదేశము బ్రిటనుదేశమన బరగెను ఆ ప్రాచీనకాలమున ఫొనీషియా జాతివారును, గ్రీకుప్రజలును బ్రిటనుదేశముతో వ్యాపారముచేయుచుండెడి వారు గ్రీకులకు బ్రిటనుద్వీపముతో సంపర్కమేర్పడిన తరువాతనే ఇతర ఐరోపాజాతులవారీ దేశవునునికిని గుర్తించి, అచ్చటికి ధారాళముగా రాకపోకలు సాగింపజొచ్చిరి

క్రీస్తుశకపుప్రారంభములో బ్రిటనుదేశమున చారిత్రక యుగము ప్రారంభమగుచున్నది క్రీ పూ 55, 54 సంవత్సరములలో ప్రసిద్ధ రోమకవీరుడైన జూలియస్ సీజరు బ్రిటను దేశముపై దండెత్తివచ్చి, అచ్చటిప్రజలను రణరంగమున పరాజితులనుగావించెను బ్రిటనుదేశమున నిదియే మొదటి చారిత్రిక సంఘటనము క్రీ శ, 43 వ సంవత్సరమునుండి రోమకసామ్రాట్టులు బ్రిటనుద్వీపమును జయించి, తమసామ్రాజ్యములో కలుపుకొనుటకు యత్నించిరి అనతికాలములో ఈ ద్వీపమంతయు వారి స్వాధీనమయ్యెను రోమనులు మూడు శతాబ్దులుపైబడి ఇచ్చట రాజ్యపరిపాలనము సాగించి, తమ నాగరికతను వ్యాపింపజేసిరి క్రీ శ ఐదవశతాబ్ది ప్రారంభమగునరికి, రోమకసామ్రాజ్యము క్షీణించెను వారు తమ్ము తామే సంరక్షించుకొనజాలని పరిస్థితికి వచ్చిరి బ్రిటిషుప్రజలు శత్రువులదాడినుండి తమ్ము తామే కాపాడుకొనవలెననియు, రోమకసామ్రాట్టులు వారికెట్టి సహాయమును చేయజాలరనియు, బ్రిటిష్‌ప్రజలకు తెలిపి రోమనులు క్రీ శ 410 వ సంవత్సరమున బ్రిటనుద్వీపమునుండి వైదొలగిరి భారతదేశమును బ్రిటిషువారు ఆక్రమించుటలోను, ప్రాచీనకాలమున రోమనులు బ్రిటనుదేశమును వశపరచుకొని పరిపాలించుటలోను ఎన్నియో సామ్యవిషయములు కలవు,

క్రీ శ ఐదవ శతాబ్ది ప్రారంభము నుండి జర్మనీ, డెన్మార్కు దేశముల అనాగరక ప్రజలు బ్రిటను దేశముపై

దండెత్తి వచ్చుట ప్రారంభించిరి స్థానికులైన బ్రిటనులకును, ఆగంతుకులకును ఘోరమైన యుద్ధము సాగెను క్రీ శ 618 వ సంవత్సరమునాటికి స్థానిక ప్రజలు సంపూర్ణముగ నోడిపోయి, కొండలలోనికి, అడవులలోనికి పారిపోయిరి బ్రిటను దేశము ఆగంతుకులకు వశపడెను ఈదేశముపై దండెత్తి వచ్చిన అనాగరక జాతులలో ఆంగిలులు, సాక్సనులు అను వారు ముఖ్యులు కావున ఈనాటి ఇంగ్లీషువారికి ఆంగ్లో సాక్సను ప్రజలనికూడ పేరు కలదు ఆంగిలులదేశము ఇంగ్లాండుగ మారెను ఈ ఆంగ్లో సాక్సనులు ఇంగ్లాండుదేశ మందంతటను వ్యాపించి, ఏడు చిన్న స్వతంత్రరాజ్యములనస్థాపించిరి కాలక్రమమున ఈ రాజ్యము లంతరించెను వెస్సెక్సు రాజ్యములో ఈ చిన్నరాజ్యములు కలిసిపోయెను ఇది యిట్లుడంగా, క్రైస్తవ ప్రపంచమున కెల్ల గురువైన పోపు మతాధికారి ఇంగ్లాండు దేశములోని అనాగరక ప్రజలను క్రైస్తవులుగ మార్చుటకై అగస్టైయిను అను మతాధికారిని పంపెను (క్రీ శ 589) ఈతని ప్రోత్సాహమువలన ఇంగ్లాండుదేశమందలి కెంటు రాష్ట్రపు ప్రభువు ఎథల్బర్ట్ అనునాతడు క్రైస్తవమతమును స్వీకరించెను క్రమముగా క్రైస్తవమతము ఇంగ్లాండుదేశమందంతటను వ్యాపించెను ఈవిధముగ క్రైస్తవమతస్వీకరణముచే ఏకీకృతమైన ఇంగ్లాండుదేశమును, వెస్సెక్సురాష్ట్రపు రాజులు రాజకీయముగకూడ ఏకీకృతము కావించుటకై యత్నించుచుండిరి ఇంతలో క్రీ శ 789 వ సం నుండి డేనులు అను ఒక అనాగరకజాతివారు ఇంగ్లాండుదేశముపై దండెత్తివచ్చుట ప్రారంభించిరి, వీరు బలవంతులేకాని మహాక్రూరులు ఓడలపై ఎల్లెడల పయనించుచు ఇతరులను దోచుకొనుట వీరి ముఖ్యవృత్తి వీరు నాస్తికులు. వీరిమాతృభూమి డెన్మార్కు, నార్వే, స్వీడనుదేశములు ఈ ఓడదొంగలజాతివారు ఇంగ్లాండుదేశముపై దండయాత్రలుసాగించి, ప్రజలను దోచుకొని, వీలైనంతమందిని చంపి, వెడలిపోయెడివారు. మరికొంతకాలము గడచినతరువాత వీరు తండోపతండములుగ వచ్చి ఇంగ్లాండుదేశపు తూర్పుప్రాంతములలోను ఉత్తర ప్రాంతములలోను శాశ్వతముగ నివాసముల నేర్పరచుకొనిరి వారికిని క్రైస్తవులైన ఆంగ్లోసాక్సనులకును ఘోరయుద్ధములుసాగెను ఈకాలమున వెస్సెక్సురాజ్యమందు వీరుడైన ఆల్ఫ్రెడురాజు రాజ్యపాలనము చేయుచుండెను ఈరాజు బలమైన సేనను కూర్చుకొని, డేనులనోడించి, వారందరిని క్రైస్తవమతమును స్వీకరించునట్లు ఒప్పించెను ఆంగ్లోసాక్సనులును, డేనులును ఇంచుమించు ఒకేజాతివారు. కావున క్రైస్తవమతము స్వీకరించినపిమ్మట డేనులు ఆంగ్లేయులలో కలిసిపోయిరి ఆల్ఫ్రెడురాజు (671-900) ఇంగ్లాండుదేశమును పాలించిన రాజులలో కెల్ల నుత్తముడు ఈతడు దేశమున శాంతిభద్రతలను నెలకొల్పుటయేకాక విద్యను, విజ్ఞానమును పెంపొందించుటకై చాలకృషిచేసెను ఈతని వంశమువారు సుమారు 160 సంవత్సంములు సమర్థతతో ఇంగ్లాండును పరిపాలించిరి. అటుపిమ్మట 1066 వ సంవత్సరమున ఫ్రాన్సుదేశమందలి నార్మండీపరగణాలను పాలించు విలియం అను ప్రభువు ఇంగ్లాండుపై దండెత్తివచ్చి ఇచ్చటిరాజునోడించి తానీదేశమున కేలికయయ్యెను ఆంగ్లోసాక్సనులయుగమందు క్రైస్తవమతము దేశమందెల్లెడల వ్యాపించుటచే, ఇచ్చటిప్రజలు నాగరకులైరి వారు ఉత్తమమైన దేవాలయములను చక్కనిశిల్పకళానైపుణితో నిర్మించిరి క్రైస్తవమతగురువులు విద్యాసంపన్నులు వారు ప్రజలలో విద్యావ్యాప్తి కావించుటకు కృషిసల్పిరి సాక్సనులయుగమందు కాడ్మన్ అను కవియు, వెనరబిల్ బీడ్ అను గొప్పపండితుడును నివసించి, ప్రజలలో విద్యావ్యాప్తికై కృషిసల్పిరి ఆల్ఫ్రెడురాజు ప్రోత్సాహమువలన ఆంగ్లభాషయందు ఆంగ్లో సాక్సన్ క్రానికల్ అను చారిత్రకగ్రంథమును వ్రాయుట మొదలుపెట్టిరి

క్రీ శ 1066 వ సం న ఇంగ్లాండును జయించిన విలియంప్రభువుతో నార్మనురాజుల పరంపర ఈ దేశములో పరిపాలన ప్రారంభించెను నార్మనులు ఫ్రెంచివారు కావున ఇంగ్లాండుదేశమున విదేశీయప్రభుత్వ మొకటి నెలకొనెనని చెప్పవచ్చును నార్మను పరిపాలకులకును, ఆంగ్లపాలితులకును ఒక్క భాషావిషయమందుతక్క ఏమంత భేదములేదు కావున అనతికాలములో ఇంగ్లీషువారును, ఫ్రెంచివారును సమ్మేళనముచెంది ఒకే జాతిగ ఏర్పడిరి 13 వ శతాబ్ది ప్రారంభము వరకును ఇంగ్లాండుదేశపుప్రభువులు ఫ్రాన్సుదేశమందలి కొన్ని పరగణాలకు పాలకులుగ నుండిరి ఆంగ్ల జమీందారులకు ఫ్రాన్సు దేశములో గొప్ప భూవసతు లుండెడివి 1204 వ సంవత్సరమున ఫ్రాన్సు దేశపు రాజు ఆంగ్లేయుల పాలనలోనున్న తన దేశప్రాంతము నంతను జయించి, ఇంగ్లీషువారిని తరిమివేసెను అందువలన ఆంగ్ల ప్రభువులును, జమీందారులును, ఒక్క ఇంగ్లాండు దేశమునే నమ్ముకొని యుండ

వలసి వచ్చెను. ఈ పరిణామము వలన నార్మనులు ఆంగ్లేయులుగ మారిపోయిరి.

క్రీ. శ. 1066 వ సంవత్సరమునుండి 1485 వ సంవత్సరమువరకును గల నాల్గుశతాబ్దులకాలము ఆంగ్ల దేశచరిత్రలో జమీందారు యుగమని వర్ణింపబడుచున్నది. మధ్యమ యుగమందు ఐరోపా ఖండమందలి ముఖ్య దేశము లన్నిటి యందును జమీందారీ విధానము వ్యాపించి యుండెను. జమీందారీవిధానమునకే ఆంగ్లమున 'ఫ్యూడల్' పద్ధతి అను పదము వాడబడుచున్నది. ఆకాలపురాజులు తమ అనుయాయులైన వీరులు మున్నగువారికి పెద్ద పెద్దజాగీరులను బహుమానముగ ఇచ్చెడివారు. ఈ జమీందారులు రాజునకు కొంత కప్పముకట్టుటయో, సైన్యసహాయము చేయుటయో లేక తదితర సేవల నొనర్చుటయో చేయుచు, ఇతర విషయములలో స్వతంత్రులుగ వ్యవహరించుచుండిరి. ఆనాటి జమీందారులకు కోటలు, ప్రత్యేక సేనలు ఉండెడివి. వీరు తరచు రాజులపై తిరుగుబాటుచేయుచు, యుద్ధములు సాగించుచుండెడివారు. బలవంతులైన ఆంగ్లరాజులు ఈ జమీందారుల నణచియుంచెడివారు. రాజు దుర్బలుడైనచో, జమీందారులు చెలరేగి, సామాన్యప్రజలను తమ యిచ్చవచ్చినట్లు దోచుకొని, అరాజకత్వమును వ్యాపింపజేసెడివారు. జమీందారుల యధికారము సాగినప్పుడు దేశ మెట్లుండెడిదో తెల్పుటకు స్టీఫెన్ రాజుకాలమును (1135-1154) గులాబీల యుద్ధకాలమును (వార్స్ ఆఫ్ రోసెస్) 1455-1485) నిదర్శనములు. ప్రపంచమం దన్నిదేశములలోవలెనే ఇంగ్లాండునందుకూడ సామాన్య ప్రజలు శాంతికాముకులై యుండిరి. కావున వారు జమీందారుల పక్షము వహింపక దేశమునకు శాంతిభద్రతల నొసగ గాలు బలవంతుడైన ప్రభువుకావలెనని కోరుచుండెడివారు. మొదటి విలియం (1066-1087) మొదటి హెన్రీ (1100-1135) రెండవ హెన్రీ (1154-1189) మొదటి ఎడ్వర్డు (1272-1307) అను రాజు లిట్టి సామర్థ్యము కలిగియుండిరి.

ఆంగ్లోసాక్సనులకాలమునుండియు రాజు ప్రజాప్రతినిధుల సలహాతో దేశపరిపాలనము కావించవలెనను సంప్రదాయ మొకటి ఇంగ్లాండుదేశమున నేర్పడియుండెను. ఈ సంప్రదాయము నాధారముచేసికొని, జాన్‌రాజుకాలమున (1199-1216) అతని జమీందారులు మహాపత్రము అను రాజకీయ దస్తావేజులపై బలవంతముగ రాజునుండి చేవ్రాలు చేయించుకొనిరి (1215). ఈ రాజకీయపత్రము ప్రకారము రాజు జమీందారులపై ఎట్టి అక్రమమగు పన్నులను విధింపరాదు, వారిలో నెవ్వరిని తగినంతకారణములేకుండ చెరసాలకు పంపరాదు. ఈ మహాపత్రము ఆంగ్ల రాజ్యాంగ విధానములో ఒకముఖ్యభాగము. దీనివలన రాజు ధర్మమునకు బద్ధుడై రాజ్యపరిపాలనము సాగింపవలెననుసూత్రము నిష్పన్నమగుచున్నది. జానురాజు మనుమడైన మొదటి ఎడ్వర్డు (1272-1307), ఉత్తమమైన శాసనములను శాసనములను చేయించి ఆంగ్లమనువు అను బిరుదును సంపాదించెను. ఈరాజు వేల్సు దేశమును జయించి, శాశ్వతముగ ఇంగ్లాండురాజ్యములో కలుపుకొనెను (1283). ఈతడు 1295 వ సంవత్సరమున నమూనాపార్లమెంటును సమావేశపరచెను. ఇందు జమీందారులు, ఉన్నత మతాధికారులు సామాన్యప్రజల ప్రతినిధులు కూడ చేరియుండిరి. కాలక్రమమున ఈ పార్లమెంటు బలపడి అనేకాధికారములను సాధించెను. ఈ కథాకాలమున ఇంగ్లీషుభాష బాగుగా వృద్ధిచెంది ఆంగ్ల జాతీయభాషగా పరిణమించెను. ఆంగ్లభాషయందలి మొదటిగొప్పకవియగు ఛాసరు అను వాతడీకాలముననే జీవించియుండెను. ఈ కాలమున ఆంగ్లేయుల ఆర్థికజీవితము పెక్కువిధముల వికాసముచెందెను. మధ్యయుగమందు క్రైస్తవమతసంఘమునం దనేక లోపములు సంక్రమించుటవలన వాటిని తొలగించు నిమిత్తము జాన్ విక్లిఫ్ వంటి మతసంస్కర్తలుద్భవించిరి. విక్లిఫ్ బైబిలు గ్రంథమును ఆంగ్లభాషలోనికి ననువాదము కావించెను.

ఆంగ్ల దేశచరిత్రలో జమీందారుల యుగము 1485 వ సంవత్సరములో అంతమయ్యెను. ఆ సంవత్సరమునుండి ఇంగ్లాండుదేశమును ట్యూడరువంశపు రాజులు 1603 వరకు పరిపాలించిరి. జమీందారుల యుగమం దనేక బాధలకు గురియైన సామాన్యప్రజలు ఈ నూతనవంశపు ప్రభువులను హృదయపూర్వకముగ సమర్థించిరి. సమర్థులైన ట్యూడరు రాజులు జమీందారుల ఆధిక్యమును పూర్తిగ నిర్మూలనము కావించి, దేశమున శాంతిభద్రతలను సుస్థిరముగ నెలకొల్పిరి. ఇందువలన ప్రజలు సుఖపడి, పరిశ్రమలు, వ్యవసాయము, వ్యాపారములవలన ధనార్జనము చేయసాగిరి. ప్రజల సానుభూతియు, అభిమానమును, తమకు సంపూర్ణముగ లభించిన కారణమున ట్యూడరు రాజులు నిరంకుశముగ రాజ్యపరిపాలన సాగించిరి. కాని ఆంగ్లజాతికి ప్రాతినిధ్యము వహించు

చున్న పార్లమెంటుసభను, ఈరాజులు తగువిధముగ మన్నించి ఆ జాతీయసంస్థచేతనే తమకు కావలసిన పనులనన్నిటిని చేయించుకొనెడివారు ట్యూడరురాజులలో మొదటివారైన ఏడవ హెన్రీ (1485–1509) స్కాట్లండురాజునకు తన పెద్ద కుమార్తెనిచ్చి, వివాహముచేసెను స్పెయిను దేశపురాజు బిడ్డను తన పెద్దకుమారునికిని, అతడు మరణించినపిమ్మట ఆ రాకుమారిని తన రెండవకుమారునకును ఇచ్చి వివాహము చేసెను ఈ విధముగ అంతర్జాతీయ రంగమున ఇంగ్లాండునకు బలము చేకూర్చవలెనని హెన్రీరాజు భావము ఏడవ హెన్రీ కుమారుడైన ఎనిమిదవ హెన్రీ రాజు కాలములో (1509–1547) ఇంగ్లాండు ప్రభుత్వము రోమునగరమునందలి పోపు మతాధికారి యాధిక్యమును తిరస్కరించి, ఇంగ్లాండు దేశమున మతవిషయములలో కూడ రాజే సర్వాధికారియని ప్రకటించెను ఇంగ్లాండునందు మతసంస్కరణోద్యమమున కీవిధముగ బీజములు నాటబడెను. కాలక్రమముననీదేశమందు మతసంస్కరణ భావములు బలపడి, ఆంగ్లికమ మతసంఘము వారు, కాథలిక్కులు, ప్యూరిటన్లు, ప్రెస్బిటీరియనులు అను మతశాఖలు బయలుదేరెను ఆంగ్ల రాజన్యులు పోపుమతాధి కారి ఆధిక్యమును తిరస్కరించిరేకాని, వారికి నిజమైన క్రైస్తవ మత సంస్కరణ మిష్టములేదు అందువలన వారు మత సంస్కారవాదులను పలుతెరగుల బాధించిరి అయినను ఇంగ్లాడు దేశమునందీకాలమున జాతీయభావములు బాగుగా దృఢపడెను ఎనిమిదవ హెన్రీకుమార్తెయైన ఎలిజబెత్తురాణి రాజ్యముచేయుచున్న కాలములో (1558–1603) స్పెయిను దేశపురాజు ఇంగ్లాండును జయించుటకు "ఆర్మడా" యను గొప్ప నౌకాసేనను పంపెను (1588) జాతీయ స్వాతంత్ర్య మునకు ప్రమాదము సంభవించిన ఈ తరుణమందు, ఆంగ్ల ప్రజలందరును తమతమ విభేదములను విస్మరించి, జాతీయ శత్రువగు స్పెయినుతో పోరాడి, యోధించిరి ఈవిధముగ ఐరోపా రాజకీయములలో ఇంగ్లాండునకొక బలమైన స్థానము లభించెను ఎలిజబెత్తురాణి మితవాద మార్గము నవలంబించి, దేశమందలి వివిధ మతశాఖలవారిని కూడ గట్టుకొనుటకై చక్కని కృషిచేసెను ఈమె కాలమునం దింగ్లాండు దేశమున నొక నూతన చైతన్యము వెల్లివిరిసెను ఈమె రాజ్యకాల మున సర్ ఫ్రాన్సిస్ డ్రేక్ వంటి ధీరనావికులు సముద్రముపై అనేక సాహస కృత్యములు సాధించి, ఇంగ్లాండుదేశవు సము ద్రాధిపత్యమునకు పునాదులు వేసిరి 1600 వ సంవత్సరమున ప్రాగ్దేశములతో వ్యాపారముచేయు నిమిత్తము తూర్పు ఇండియా వర్తకసంఘము స్థాపింపబడెను ఎలిజబెత్తు రాణి యుగమందు ఆంగ్ల నాటక సార్వభౌముడైన షేక్స్పియరు మహాకవి తన ప్రసిద్ధనాటకములను రచించి వన్నెకెక్కెను ఆధునికయుగమం దాంగ్లేయులకు లభించిన కీర్తిప్రఖ్యాతులు ఎలిజబెత్తురాణి యుగముతో ప్రారంభించుచున్నవి

ఎలిజబెత్తురాణితో ట్యూడరువంశ మంతరించెను ఆమె యనంతరము 1603 వ సంవత్సరమునుండి 1714 వరకును స్టూవర్టువంశమువారు బ్రిటనుదేశమును పరిపాలించిరి స్టూవర్టు వంశీయులు మొట్టమొదట స్కాట్లండు దేశమునకు ప్రభువులు 1603 వ సంవత్సరమున ఆరవ జేమ్సు రాజు స్కాట్లండును పరిపాలించుచుండెను ఈతడు ట్యూడరువంశపురాణైన ఏడవ హెన్రీకుమార్తెకు మునిమనుమడు కావున ఎలిజబెత్తు రాణి యనంతరము ఇంగ్లాండు స్కాట్లండు దేశములు రెండింటికిని ఈతడు మొదటిజేమ్సు అను పేరుతో ప్రభువయ్యెను మొదటి జేమ్సురాజును, (1603–1625) ఆతని కుమారుడు మొదటి చార్లెసురాజును (1625–49) మొదటిచార్లెసు రెండవ కుమా రుడు రెండవ జేమ్సురాజును (1685–1688) వట్టి అవివేకులు కాలానుగుణముగ ఇంగ్లాడుదేశపు ప్రజలలో వచ్చిన మార్పు లను గుర్తింపలేక వారు పార్లమెంటుసభతో వివాదము పెట్టు కొనిరి. రాజులు దైవాంశ సంభూతులనియు, అందువలన ప్రజాప్రతినిధుల యభిప్రాయమును వారు లెక్కసేయ నవస రము లేదనియు, వారు తమ ఇచ్చవచ్చిన చొప్పున రాజ్య పాలన సాగించవచ్చుననియు, పై ముప్పురు రాజులునుమూర్ఖ ముగ నమ్మిరి పదునేడవ శతాబ్దినాటికి బ్రిటిషు ప్రజలలో రాజకీయ చైతన్యము బాగుగా హెచ్చెను. వారిలో చాల మంది రోమను కాథలిక్కు మతమును తిరస్కరించి, ప్రొటె స్టెంటుమతము నవలంబించిరి. పన్నుల విధించు హక్కును గూర్చియు, పౌరులను కారాగారమునకు పంపు పద్ధతులను గూర్చియు, విదేశాంగనీతిని గూర్చియు, మతవిషయకమగు ఏర్పాట్లనుగూర్చియు, రాజులకును, పార్లమెంటు సభవారికిని తీవ్రమగు అభిప్రాయభేదములు ఉత్పన్నమయ్యెను. తుదకు మొదటి చార్లెసురాజునకును పార్లమెంటు పక్షమువారికిని ఏడు సంవత్సరములకాలము (1642–1649) అంతర్యుద్ధము సాగెను. రాజుపరాభూతుడై, పార్లమెంటు పక్షవారి సేనచే

ఉరితీయబడెను (1649)

రెండవ జేమ్సురాజు (1685–88) బ్రిటను దేశమున రోమనుకాథలిక్కు మతమును పునరుద్ధరింపవలెనని యత్నించెను కాని ప్రజల తీవ్ర ప్రతిఘటనమునకు భయపడి అతడు దేశమును విడి పారిపోవలసివచ్చెను (1688) ఈ విధముగ బ్రిటన్ దేశపురాజులు ప్రజాప్రతినిధుల యుద్దేశముల ప్రకారము పరిపాలించవలెననియు, వారు రాజ్యాంగధర్మములను అతిక్రమించుటకు వీలు లేదనియు, ఈ తీవ్రవివాదమువలన స్థిరపడెను భావికాలమున బ్రిటనుదేశమును పాలించు రాజులు ప్రొటెస్టెంటు మతస్థులుగ నుండవలెనని కూడ పార్లమెంటు సభవారు తీర్మానించిరి 1649 నుండి పదిసంవత్సరముల కాలము ఇంగ్లాండును ఆలివర్ క్రాంవెల్ అను గొప్ప ప్రొటెస్టెంటు వీరుడు పరిపాలించెను ఈతడు ఇంగ్లాండుదేశపు నౌకాబలమును వృద్ధిచేసెను స్టూవర్టు రాజుల కాలములో బ్రిటనుదేశపు సేనలు ఫ్రెంచివారి సేనలపై గొప్ప విజయమును సాధించెను ఈ కాలమున ఇంగ్లాండు, స్కాట్లండుదేశములు రాజకీయముగ ఏకమయ్యెను (1707) బ్రిటిషువారీయుగమున ఖండాంతరములలో వలసస్థానములను ఏర్పాటుచేసికొనిరి స్టూవర్టు యుగమున జాన్ మిల్టన్ అను ఆంగ్ల మహాకవియు, సర్ ఐజాక్ న్యూటన్ అను గొప్ప ప్రకృతిశాస్త్రజ్ఞుడును జీవించిరి ఈ యుగమందు పెక్కండ్రు కవులును, రచయితలును, బ్రిటన్ దేశమున నుద్భవించిరి

స్టూవర్టు వంశమువారి తరువాత హానోవరువంశమువారును, సాక్సెకోబర్గు వంశమువారును పాలించిరి ప్రస్తుతము విండ్సరువంశమువారును బ్రిటన్ దేశమును పరిపాలించుచున్నారు

1714 సంవత్సరమునుండి నేటివరకునుగల రెండున్నర శతాబ్దుల కాలములో ఈ దేశమున మహత్తరమైన మార్పులు సంభవించినవి ఈ మార్పులు బ్రిటిషువారి జీవితములో ఒక విప్లవమును, గొనివచ్చినవని చెప్పవచ్చును స్టూవర్టు యుగమున ప్రజాప్రతినిధుల పరిపాలన దృఢముగ నాటుకొనెను హానోవరు వంశమువారి కాలమున క్యాబినెట్టు ప్రభుత్వవిధానమేర్పడెను క్యాబినెట్టు అనగా మంత్రివర్గము. ఈనాడు బ్రిటన్ దేశమును పరిపాలించునది రాజుకాదు రాజు పేరిట మంత్రులు రాజ్యకార్యములను నిర్వహింతురు, బ్రిటిషు పార్లమెంటులోని ప్రజాప్రతినిధి సభలో అత్యధిక సంఖ్యాబలముగల పక్షమునకు నాయకుడు బ్రిటను దేశమునకు ప్రధానమంత్రియగును అతడు తనపక్షమునుండి సమర్థులైనవారిని సహాయమంత్రులుగ ఎన్నుకొనును ఆ మంత్రులును, ప్రధానమంత్రియు కలిసి నేడు రాజ్యాంగమును నడపుచున్నారు బ్రిటిషు పార్లమెంటు సభలోని ప్రభువులసభకు విశేషప్రాముఖ్యము లేదు ప్రజాప్రతినిధి సభవారే రాజ్యాంగసంబంధమైన ముఖ్యనిర్ణయములనన్నిటిని కావింతురు ఈ ప్రజాప్రతినిధి సభయందలి సభ్యులనెన్నుకొను హక్కు పందొమ్మిదవ శతాబ్దమువరకు చాల పరిమిత సంఖ్యకలవారికిమాత్రమే లభించియుండెడిది కాని 1832, 1867, 1884, 1918 1928, 1949 సంవత్సరములలో జరిగిన పార్లమెంటు సంస్కరణ శాసనములవలన స్త్రీలతోసహా వయోజనులందరకును వోటింగుహక్కు లభించినది ఈవిధముగ బ్రిటను దేశమున సంపూర్ణ ప్రజాస్వామ్య పరిపాలన మేర్పడినది భారతరాజ్యాంగము చాలవరకు బ్రిటిషు రాజ్యాంగ విధానమును అనుసరించుచున్నది. పదునెనిమిదవ శతాబ్దియందు బ్రిటను దేశమున పారిశ్రామిక విప్లవము ప్రారంభమై, పందొమ్మిదవ శతాబ్దియందు బలపడెను ఈ విప్లవమువలన వస్తూత్పత్తి విపరీతముగ పెరిగిపోయెను తత్ఫలితముగ వ్యాపారముకూడ అపారముగ వృద్ధిపొందెను ఇంతవరకును వ్యావసాయిక దేశముగనుండిన బ్రిటన్ దేశము పారిశ్రామిక దేశముగ మారిపోయెను పారిశ్రామిక కార్మికుల సంఖ్య ఎంతయో పెరిగెను కార్మికులుకూడ కాలక్రమమున రాజ్యాంగ సంబంధమైన హక్కులనుపొంది, ఒక బలమైన రాజకీయపక్షము నేర్పాటుచేసికొనిరి. ప్రస్తుతము బ్రిటనుదేశమందు కన్సర్వేటివు పక్షము (సంప్రదాయవాదుల పక్షము), కార్మికపక్షము మాత్రమే బలమైన రెండు రాజకీయ పక్షములుగ వ్యవహరించుచున్నవి

పదునెనిమిది, పందొమ్మిదవ శతాబ్దులలో బ్రిటిషువారు అమెరికా, ఆస్ట్రేలియా, ఆఫ్రికా, ఆసియాఖండములలో గొప్ప సామ్రాజ్యమును స్థాపించుకొనిరి 1776 వ సంవత్సరమున ఈనాటి అమెరికా సంయుక్తరాష్ట్రములు అను గొప్ప స్వతంత్రరాజ్యము బ్రిటిషు సామ్రాజ్యమునుండి ఉద్భవించెను క్రమక్రమముగ కెనడా, ఆస్ట్రేలియా, న్యూజిలాండు, దక్షిణాఫ్రికా, భారతదేశము, పాకిస్థానము స్వతంత్రప్రతిపత్తిని సాధించినవి ఈ విధముగ బ్రిటిషుసామ్రాజ్యము, ఒకస్వతంత్ర రాజ్యముల సమాఖ్యగ మారిపోయినది 1789 నాటి ఫ్రెంచి

స్వాతంత్ర్యవిప్లవము తరువాత బ్రిటిషువారు మహావీరుడును, ఫ్రెంచి దేశనాయకుడునగు నెపోలియనుతో ఘోరముగ పోరాడి ఘనవిజయమును చేపట్టిరి (1815) ఇరువదవ శతాబ్ది యందు ప్రజ్వరిల్లిన మొదటి, రెండవ ప్రపంచ మహాసంగ్రామములలో కూడ బ్రిటిషువారు మిక్కిలి ప్రశంసనీయమైన ధైర్యసాహసములను ప్రదర్శించి, త్యాగములను కావించిరి ఈ ఇన్నూట ఏబది సంవత్సరములలోను బ్రిటను దేశమున ఎందరో కవులు, పండితులు, తత్వవేత్తలు, ప్రకృతిశాస్త్రజ్ఞులు, రాజనీతికోవిదులును, ఉద్భవించి, దేశగౌరవమును వేయి మడుంగులు పెంపు కావించినారు

ఛం బా.

## బ్రిటిష్‌దీవులు (భూగో)

గ్రేట్ బ్రిటను (ఇంగ్లండు, వేల్సు, స్కాట్లెండు), ఐర్లెండు (ఉత్తర ఐర్లెండు, ఐర్ అను ప్రజాస్వామిక రాజ్యము) అను రెండు మహాద్వీపములు చేరి బ్రిటిష్‌దీవు లనబడుచున్నవి ఈదీవుల మొత్తము వైశాల్యము సుమారు 1,21,600 చ మైళ్ళు, ప్రపంచమందలి ప్రధాన పారిశ్రామిక దేశములలో గ్రేట్ బ్రిటను ఒకటి

సముద్రములతోగల సన్నిహిత సంబంధమువలన ఈ దేశమునకు విశేషఖ్యాతికల్గినది బ్రిటిష్‌దీవులకు పరిసరములందున్న సముద్రజలములు లోతులేనివైనను, పెక్కు స్థలములందలి భూఖండములోనికి సుదీర్ఘముగా చొచ్చుకొని పాయలుగా ఏర్పడినవి అందుచే సుదీర్ఘమగు బ్రిటిష్‌తీరప్రాంతము విచ్ఛిన్నరూపము దాల్చియుండును ఈ పాయల ద్వారా సముద్రములో కలియు నదులు, సముద్రపుపోటు కలిసెడి నదీముఖములుగా ఏర్పడినవి ఈ నదీముఖములు ఆదేశీయులకు జీవనాధారములుగానున్నవి తన్మూలముగా వారునిపుణులు, సాహసికులు నైననావికులుగను, జెస్తలుగను పరిణతిపొందుట కవకాశములు కల్గినవి బ్రిటిష్ దీవులతీరము పొడవున పెక్కు నౌకాశ్రయములీనాడు అభివృద్ధి చెందినవి

నౌకావాణిజ్యము వృద్ధిచెందినను, 18 వ శతాబ్దివరకు ఈ దేశము ప్రధానముగా వ్యవసాయముపైన, గొర్రెల పెంపకముపైన ఆధారపడియుండెను 18 వ శతాబ్ది పూర్వార్థపు తుదిభాగమున నూతనముగా ఆవిష్కరణమొందిన ఆవిరియంత్రము, విద్యుచ్ఛోదిత యంత్రాంగములు కారణముగా, పారిశ్రామిక విప్లవమునందు బ్రిటను అగ్రస్థాన మాక్రమింపగల్గెను సహజముగా బ్రిటిష్ ప్రజలు యంత్రపరికరములను తయారు చేయుటయందు ఆసక్తిని, నేర్పును ప్రదర్శించుట వలన, అపారమగు నేలబొగ్గు దేశమందే లభించుటవలన, ఆదేశమునకు అర్థికాభ్యున్నతి త్వరితగతిలో సిద్ధించినది

నైసర్గికరూపము బ్రిటిష్‌దీవుల ఉపరితలము ప్రాకృతి శక్తుల రాపిడివలన తరిగిపోయి తీవ్రముగా దెబ్బతినెను వర్తమానకాలములో ప్రధానముగా ప్రవాహ జలపు రాపిడి వలన భూమి కోతకు గురియగుచున్నది కాని ప్రాచీనకాలములో థేమ్సునదికి ఉత్తరముగనున్న ప్రాంతము నావరించిన మంచుపొర, భూమ్యుపరితల నిర్మాణమునందు విశేషముగా తోడ్పడెను, హిమయుగమునాటి మంచుదిబ్బలు దాదాపు అర్థచంద్రాకృతిలోనుండు లోయలను రూపుదిద్దుటలో విశిష్టమైన పాత్రవహించెను ఈలోయ లిపుడు స్కాట్లెండునందలి పర్వత భూములలోను, వేల్సుమండలమందలి పీఠభూములలోను అచ్చటచ్చట కాన్పించును

బ్రిటిష్ దీవులలో 800 అడుగులఎత్తును మించిన భూభాగము కాన్పింపదు ఉత్తర, పశ్చిమములందు ప్రధానముగా మిట్టభూములును, ప్రాగ్దక్షిణములందు పల్లపుభూములును కలవు ఈ పల్లపుభూములు సారవంతములైనవి ఆదేశములో సుస్పష్టములగు పెక్కురకముల భౌతిక భూవిభాగములు కన్పట్టును ఉత్తరమందలి స్కాట్లెండు పీఠభూములు, బ్రిటిష్ దీవులలో విశేషప్రాంతము నావరించియున్నవి ఈ పీఠభూములు ప్రత్యేక ఖండములుగా నేర్పడి, కాలువలతోను, కయ్యలతోను, లోయలతోను నిండియున్నవి

స్కాట్లెండు మధ్యభాగమందలి లోయ బీటలువారి వెడల్పుగానున్నది ఇది గ్రాంపియను పర్వతములకును, దక్షిణ పీఠభూములకును నడుమనున్నది ఆగ్నేయమున ఈ దక్షిణ పీఠభూములు చివాయిట్స్ పర్వతములలో విలీనములగుచున్నవి వాటి కావల మరల పీఠభూమి ప్రారంభమై కొంత దూరమువరకు విస్తరించియున్నది

దక్షిణమున ఇంగ్లండులోనికి నిక్కపొడుచుకొనివచ్చిన పెనైన్స్ పర్వతములు ఉత్తర, దక్షిణభాగములుగా విభజింపబడినవి ఉత్తరభాగము టైన్సునుండి ఐర్ వరకును, దక్షిణభాగము ఐర్ నుండి డెర్బిషైరుకుచెందిన పీక్‌మండలము వరకును విస్తరించియున్నవి. పశ్చిమమున పెనైన్స్ పర్వతములు కేంబ్రియన్ పర్వతములతో కలుపబడుచున్నవి

వేల్సు మండలమందలి పీఠభూములు కూడ రాపిడిచే విశేషముగా తరిగిపోయినవి ఇవి ఉత్తర వేల్సునందలి ఇరుకైన తీరమైదానమునుండి గ్లామార్గన్ మండలమందలి వెడల్పైన నిమ్నభూముల వరకు ఆవరించి యున్నవి డివాన్, కారన్‌వెల్ మండలములందలి నైరృతి పీఠభూములలో నల్లరాతి గనులు అపారముగా నున్నవి డెర్ట్‌మూర్, బాడ్‌మిన్‌మూర్ అనునవి టామర్ లోయచే వేరుపరుపబడినవి

"ఇంగ్లీషు మైదానము" గ్రేట్ బ్రిటనులో అత్యంత విశాలవంతమైన నొక పల్లపు భూమి ఇది నాలుగు ఉపఖండములుగా విభజింప బడినది (1) మిడ్‌లెండ్ మైదానము, ఇది చెషైరు, లాంకషైరుల లోపలి భాగము వరకు వ్యాపించినది (2) స్కార్‌ప్‌లాండ్స్, ఇది డార్సెట్‌నుండి యార్క్‌షైరు వరకు వ్యాపించినది (3) తూర్పు ఆంగ్లియా చిత్తడి భూములు, (4) ఉత్తర, దక్షిణ డౌన్స్‌నడుమ రాపిడిచే భూమి కోతపడగా ఏర్పడిన నగ్నప్రాంతము ఇగ్లెండు మధ్యభాగమున ఒకే ఒక మైదానము కలదు ఇందు నున్నపురాతి గనులున్నవి దీనికి నలువైపుల అచ్చటచ్చట మిట్టభూము లున్నవి

నదులు బ్రిటిష్ దీవులందలి నదీముఖములును, నదులును అంతగా ముఖ్యమైనవి కావు నదులు నౌకాయానమునకు ఎక్కువగా ఉపయోగ పడవు వేల్సు స్కాట్లెండులందలి నదులను మినహాయించినచో, తక్కిన ప్రాంతములందలి నదులు మాత్రమే జలవిద్యుత్తు కుపయోగపడును పెక్కు పర్వతభూములు తూర్పుతీరముకంటె పశ్చిమ తీరమునకు సమీపముగా నుండుటచే అట్లాంటిక్, ఐరిష్ సముద్రములలో కలియు నదులు (సెవెర్న్ నదితప్ప) ఉత్తర సముద్రములో కలియు నదులకంటె కురుచగా నున్నవి

స్కాట్లెండు నదులలో క్లైడ్‌నది (106 మైళ్ళ పొడవు) మాత్రమే పశ్చిమముగా ప్రవహించి సముద్రములో కలియుచున్నది తూర్పున ఉత్తర సముద్రములో కలియు నదులలో స్పే (96 మైళ్ళు), డ్యూ (87 మైళ్ళు) టే (100 మైళ్ళు), ట్వీడ్ (98 మైళ్ళు) అనునవి ప్రముఖములు

ఉత్తర పెనైన్స్‌నుండి ఈడెన్, ల్యూన్, రిబ్బుల్, మెర్సీ నదులు ఐరిష్ సముద్రములో చేరును ట్రెంట్‌నది (160 మైళ్ళు) కూడ పెనైన్స్ పర్వతపు పశ్చిమ భాగమున జన్మించి, దాని దక్షిణాగ్రమున వంపుతిరిగి, అచటినుండి తూర్పుగా మరలి, హంబర్ నదిలో ప్రవేశించును యార్క్‌షైర్ ఆస్సేనది (120 మైళ్ళు) హంబర్ నదీముఖములో ప్రవేశింపక పూర్వము, పెనైన్స్ పర్వతపు తూర్పుసానువులందు జన్మించిన ఉపనదులను తనలో కలుపుకొని ముందునకు సాగిపోవును

స్కార్‌ప్‌లాండ్స్‌లోని నదులలో గ్రేట్ఆస్సే (145 మైళ్ళు), నెన్, వెల్లాండ్, వైథమ్ నదులుకూడ చేరియున్నవి 213 మైళ్ళ నిడివిగల థేమ్స్‌నది స్కార్‌ప్‌లాండ్సును పీడిన పిదప, లండను పరీవాహక మండలముగుండా ప్రవహించి, విశాల నదీముఖముద్వారా ఉత్తర సముద్రములో ప్రవేశించును

నైరృతి దిశయందలి నదులలో ప్యారెట్, ఎక్స్, టామర్ అనునవియు ఆగ్నేయమందలి నదులలో శాలిస్‌బరీ అవన్, టెర్క్స్, ఇచియన్, అరున్ అనునవియు ముఖ్యములైనవి ఉత్తర సముద్రములో కలియు స్టోర్‌నదియు, థేమ్స్ నదీముఖములో పడు మెడ్వేనదియు కూడ ముఖ్యములైనవే

వేల్స్ పీఠభూమినుండి ప్రవహించు డీ నది ఐరిష్ సముద్రమును, సెవెర్న్, వైనదులు బ్రిస్టల్ ఛానెలును చేరుచున్నవి షానన్ అను ఐరిష్ నది బ్రిటిష్ దీవులలోనెల్ల మిగుల దీర్ఘతమమైనది

శీతోష్ణస్థితి పశ్చిమమున బ్రిటిష్ దీవులు అట్లాంటిక్ సముద్రమునకును, తూర్పున ఉత్తర సముద్రమునకును అభిముఖముగ నున్నవి నైరృతి పవనముల మూలమున నులివెచ్చని జలము ఉత్తర అట్లాంటిక్ సముద్రోపరితలము మీదుగా బ్రిటిష్ దీవులవైపు ప్రసరించును ఈ జలము వలన, దానిపైగా వీచు వాయువుల ఉష్ణోగ్రత అధికమై విశేషముగు తేమ ఆ వాయువులచే పీల్చుకొనబడును బ్రిటిష్‌దీవులందలి సమానస్థాయి గల శీతోష్ణస్థితియే నైరృతి దిశనుండి వీచు గోరువెచ్చని దెమ్మ వాయువులకు విశేషముగా కారణభూతము లగుచున్నది

ఉష్ణోగ్రత వేసవిలో బ్రిటిషుదీవుల ఉష్ణోగ్రతను ప్రభవింపజేయుటలో ఉత్తర దిశయందుకంటె దక్షిణ దిశయందు ఎక్కువ సూటిగా ప్రసరించు సూర్యకిరణములు ప్రధానమగు పాత్ర నిర్వహించును. సముద్ర ప్రభావము కూడ ఈ సంఘటనమునకు దోహద మొసగును కాని

నెలలో అట్లాంటిక్ సముద్రప్రాంత వాతావరణము శీతలముగ నున్నపుడు, నైరృతి పవనములు గూడ శీతలముగ నుండును ఇవన్నియు కలిసి కోస్తాప్రాంతముల ఉష్ణోగ్రతను తగ్గించును దానికి భిన్నముగా, లోతులేని ఉత్తర సముద్ర ప్రాంతము లోతైన అట్లాంటిక్ సముద్ర ప్రాంతముకంటె త్వరితముగా వేడెక్కును ఉత్తర సముద్ర ప్రభావము వలన, పరిసర భూభాగము కొలదిగ చల్లబడినను, దానివలన కలుగు ప్రయోజనము పశ్చిమ సముద్రముతో సమానమైనది కాజాలదు వే విలో ఉష్ణోగ్రత దక్షిణమునుండి ఉత్తరమునకు పోనుపోను తగ్గుచుండును కాని తీరప్రాంతము లోతట్టు ప్రదేశముకంటె చల్లగా నుండును

శీతాకాలములో ఉత్తరదిశయందుకంటె, దక్షిణదిశయందు సూర్యుడు చాల ఎత్తుగానుండును. కాని దక్షిణార్ధగోళములో సూర్యుడు నడినెత్తిమీదికి వచ్చునపుడు, సూర్యకిరణములు బ్రిటిష్‌దీవులమీద అత్యల్పోష్ణమునుకూడ కలుగజేయజాలవు బ్రిటిష్‌దీవులలో శీతాకాలపు ఉష్ణోగ్రతను ప్రభవింపజేయుటలో సముద్రము విశేషప్రాధాన్యము వహించియుండును జనవరిలో ఆ దీవులందలి భూభాగము వేసవి వేడిమిని కోల్పోవును, కాని సముద్రములో కొంత ఉష్ణము మిగిలియుండును ఈ ఋతువులో అట్లాంటిక్ సముద్రమున కెదురుగానుండు ప్రాంతములు ఉష్ణప్రభావములై యుండును ఉత్తరసముద్రముకంటె అట్లాంటిక్‌మహాసముద్రము ఉష్ణముగ నుండును. ఉత్తరసముద్రపులోతు తక్కువగుటచే, అందలి ఉష్ణము శీఘ్రముగా క్షీణించును శీతాకాలములో ఐరోపా ఖండాంతర్భాగము మిగుల చల్లగానుండును అందుచే ఆ దిశనుండి వీచు వాయువులు బ్రిటిష్‌దీవులపై శీతల ప్రభావమును కలుగజేయును

నైరృతిపవనముల ఫలితముగా బ్రిటిష్ దీవులకు పశ్చిమముగానున్న పర్వతములం దధికవర్షములు కురియును ఈ పవనములు పీఠభూమిని తాకునప్పటికే, వాటి తేమ ఆరిపోయి పొడిగాలులుగా మారును పీఠభూమిపై ప్రసరించు గాలిలో కొంత ఉష్ణముకూడ ప్రవేశించును ఆ పర్వతములందలి గాలివాటపు భాగములలో సామాన్యముగా వర్షచ్ఛాయలు కన్పట్టును

బ్రిటిష్‌దీవులలో పశ్చిమప్రాంతము అత్యున్నతమైనది స్కాట్లెండు నైరృతిభాగము, సరోవరమండలము, వేల్సు పర్వతప్రాంతము, ఐర్లెండునందలి నైరృతిపీఠభూమి—ఇవన్నియు గరిష్ఠవర్షపాతము ఘటిల్లు మండలములు బెన్ నెవిస్ అను తావున సంవత్సరమునకు 171 అంగుళములు సగటు వర్షపాతమును, స్నోడోనియా అనుతావున 200 అంగుళముల వర్షపాతమును ఘటిల్లును ఈ రెండవప్రదేశము ఐరోపా ఖండములో మిగుల తేమగానుండు తావులలో నొకటి

ఉత్తరసముద్రముపైగా వీచు తూర్పువాయువులు పశ్చిమవాయువులకంటె తక్కువ తేమను స్వీకరించును ఇంగ్లండు తూర్పుభాగము బల్లపరుపుగనుండును గుట్టలమీద సహితము, లోయలయందుకంటె అధికతరముగా వర్షము కురియును నాటింగ్‌హామ్, కేంబ్రిడ్జి నగరములలో సగటు సాంవత్సరిక వర్షపాతము 22 అంగుళములు మాత్రమే

బ్రిటిష్‌దీవులలో వాయుప్రసారము ప్రధానముగా తుపానులచే ప్రభావితమైయుండును ఈతుఫానులు సామాన్యముగా ఉత్తర అట్లాంటిక్‌సముద్రమునుండి బయలుదేరును

వేసవియందు పగటికాలము సూర్యరశ్మిచే తేజోవంతమై యుండును, మేఘములు కన్పట్టవు, ఉష్ణోగ్రత తీవ్రముగనుండును శీతాకాలములో పగళ్ళు చలిగాను, కాంతివంతముగాను ఉండును రాత్రులు నిర్మలముగనుండి, నక్షత్రములు మిలమిల ప్రకాశించుచుండును మంచు గడ్డకట్టియుండును బరువైన శీతలవాయువులు లోయలయందు వీచుచుండును లోయలయందు పొగమంచు క్రమ్మియుండగా, తేజోవంతమగు సూర్యకాంతి కొండలపై ప్రసరించుచు ఆనందమును కూర్చుచుండును

సహజోద్భిజ్జములు పూర్వమొకప్పుడు బ్రిటిష్‌దీవులలో విశేషప్రాంతము ఋతుధర్మము ననుసరించి పెరుగు అడవులచే ఆక్రమింపబడియుండెడిది ఉన్నతభూములలోను, గడ్డి, గావము, మొలవని పర్రభూములలో మాత్రమే చెట్లు పెరుగవు అడవులు విశేషముగా వంటచెరకునకును, కలప కొరకును, పశుగ్రాసమును పెంచుటకును, వ్యవసాయము చేయుటకును, రోడ్లను, పల్లెలను, పట్టణములను నిర్మించుటకును నిర్మూలింపబడుచున్నవి బంకమన్నుగల భూములలో ఓకు మున్నగు వృక్షములు ఏపుగా పెరుగును బీచ్ వంటి ఇతరవృక్షములు, ఇసుక, గులకరాయిచే గుల్ల బారిన పల్లపుభూములందు బాగుగా పెరుగును సున్నపురాయిగల డెర్బీ మైరుప్రాంతమందు అశోకవృక్షములను పోలిన ఒకజాతి వృక్షములు సాధార

ణముగా కన్పట్టును నాటింగ్‌హామ్‌షైరు, స్టాఫర్డుషైరు, స్కాట్లెండు పీఠభూములు దీర్ఘాకృతికల్గి దృఢమగు మొండెములుగల మహావృక్షములతో నిండి యున్నవి రెండవప్రపంచ యుద్ధకాలములో నిర్మూలింపబడిన అరణ్యముల స్థానములో ఏడాదికి దాదాపు 80 వేల ఎకరముల భూమియందు పెక్కురకముల అటవీవృక్షములు పెంచబడుచున్నవి సింధూరవృక్షములకంటె దేవదారువృక్షములు ఇసుకనేలలో త్వరితముగను, ఏపుగను పెరుగును తక్కిన వృక్షజాతులకంటె వీటి ఆర్థికప్రాముఖ్యమధికము

ఐర్లెండులో అధికభాగము పచ్చికమైదానములచే ఆవరింపబడియున్నది అచ్చట అరణ్యములు స్వల్పముగాగలవు

**వ్యవసాయము** గతశతాబ్ది తొలిభాగమువరకు బ్రిటిష్ దీవులనుండి ఆహారపదార్థములు అన్యదేశములకుకూడ ఎగుమతి యగుచుండెడివి. కాని ఈనాడు ఆహారవస్తువులకొరకు ఇతరదేశములపై ఆధారపడు దేశములలో బ్రిటిష్‌దీవులు ప్రథమస్థాన మాక్రమించినవి ఇట్టిస్థితిలోగూడ ఆదేశములో పారిశ్రామికరంగము తరువాత వ్యవసాయము రెండవస్థానమందున్నది వివిధవృత్తుల నాశ్రయించిన శ్రామికులలో నూటికి ఏడుగురు వ్యవసాయముపై జీవించుచున్నారు

1500 అడుగుల ఎత్తునుమించిన పీఠభూములందు గొర్రెలు మేయు పచ్చికబయళ్లు కాన్పించును పప్పుదినుసులను, ధాన్యములను పండించుటయందుకంటె గొర్రెలను, పశువులను మేపుటయందే బ్రిటిషువారెక్కువ శ్రద్ధాశక్తులు చూపెదరు గరిష్ఠవర్షపాతముగల తావులందు గడ్డి విశేషముగ పెరుగును కొన్ని నదీలోయలందుకూడ పశుగ్రాసము బాగుగా పెరుగును వాతావరణ మనుకూలముగానుండు తూర్పుప్రాంతమున వ్యవసాయయోగ్యమగు భూమి విశేషముగా నున్నది

**పశువులు** ఇంగ్లండు పశ్చిమప్రాంతమందును, ఐర్లెండునందును, విశేషసంఖ్యలో పశువులు ప్రధానముగా పాల వ్యాపారమునకై పెంచబడుచున్నవి చెషైరు, లాంకషైరు స్టాఫర్డుషైరు, డెర్బీషైరువంటి విశేషజనసాంద్రతగల నగరములు, ఇంగ్లండులోకెల్ల పాలను విశేషముగానుత్పత్తిచేయు ప్రధానకేంద్రములు లండనునకు సమీపమందున్న ఎస్సెక్స్ నగరమందు పాడియావులు అత్యధికసంఖ్యలో పెంచబడుచున్నవి ఐర్లెండులో పాలమండి విశేషముగా వెన్న ఉత్పత్తి యగుచున్నది

**గొర్రెలు** మధ్యయుగములో ఇంగ్లండునుండి ముఖ్యముగా ఉన్ని ఎగుమతియగుచుండెడిది ఆట్టిదేశ మీనాడు వస్త్రోత్పత్తి కవసరమగు ముడిసరుకులను దిగుమతిగావించుకొనుచున్నది వేల్సులోని పర్వతభూములందును, స్కాట్లెండులోని దక్షిణపీఠభూములందును గొర్రెలు పెంచబడుచున్నవి ఇంగ్లండునందలి పల్లపుభూములలో పెంచబడు గొర్రెల ఉన్ని మిగుల శ్రేష్ఠమైనది పశ్చిమమందలి మెరకప్రాంతపు గొర్రెల మాంసము అత్యంత రుచికరమైనది

**పందులు** బ్రిటిష్‌దీవులయందలి పందులలో వాల్గింట మూడువంతులు ఇంగ్లండు, వేల్సుప్రాంతములలో నున్నవి ఇవి మీగడ తీసినపాలను, అమ్మకమునకు అనర్హమగు బంగాళాదుంపలను తిని జీవించును

**గోధుమలు** ఆదేశములోపండు మొత్తము గోధుమలో అత్యధికభాగము తూర్పు ఇంగ్లండులో ఉత్పత్తియగుచున్నది అచ్చటి భూసారము, నీటివసరులు, శీతోష్ణవాతావరణాదులు ఈపంట కనుకూలముగ నున్నవి

**బార్లీ** గోధుమతోపాటుగా బార్లీకూడ తూర్పు ఇంగ్లండులో సమృద్ధిగాపండును బీరు, విస్కీ, సారాయములను తయారుచేయుట కుపయోగింపబడు మాల్టును సిద్ధము చేయుటకు బార్లీని పెంచెదరు

**ఓట్లు** ఈధాన్యవిశేషము బ్రిటనులో ఇతరధాన్యములకంటె విరివిగా వ్యాపించియున్నది గోధుమకు అననుకూలమగు మెట్టప్రాంతమందును, చలిగాలివీచు పల్లపుభూములందును ఈ ధాన్యముపండును

**బంగాళాదుంపలు** ఇవి బ్రిటిష్‌దీవులలో అన్నిప్రాంతములందును పండింపబడుచున్నవి

**సుగర్‌బీటు** పంచదార ఉత్పత్తిచేయబడు సుగర్‌బీటుదుంప ముఖ్యముగా నార్ఫక్ సఫక్, లింకనుషైరు, ఐలీ ద్వీపము, ష్రాప్‌షైరు అను తావులందు విశేషముగాపండును

**మత్స్యపరిశ్రమ** చేపలుపట్టి జీవించుట బ్రిటిష్‌వారి ముఖ్యవృత్తులలో నొకటి ఉత్తరసముద్ర మందును, ఇంగ్లీషు ఛానెలుయందును చేపలు విశేషముగా లభ్యమగును.

**గనులు** గనిబొగ్గు ఈ దేశములో విశేషముగా ఉత్పత్తియగును ఇది పారిశ్రామికోపయోగమునకేకాక, గృహోపయోగమునకుకూడ ప్రసిద్ధమైయున్నది. బ్రిటిషు దీవులందు గనులలో లభించు ఖనిజములన్నిటిలో బొగ్గుమూ

మునసే 83 శాతపు ఆదాయము చేకూరుచున్నవి ఈబొగ్గులో కొంతభాగము విదేశములకు ఎగుమతియగుచున్నది. అపారమగు బొగ్గు లభించుటచే, ఈదేశము పారిశ్రామికముగ గొప్ప అభ్యుదయమును సాధించెను

**ముడిఇనుము** బొగ్గుతరువాత బ్రిటిష్ దీవులలో ప్రఖ్యాతిగాంచిన ఖనిజము ముడిఇనుము బొగ్గుగనులకు సమీపమునసే ఇనుపగనులుండుట ఆదేశపు అదృష్టమనవచ్చును ఇనుమును కరగుట కుపయోగపడు సున్నపురాయి గూడ అచ్చటనే లభ్యమగుట మరింత ప్రయోజనకరముగ నున్నది ఈ ఇనుము యార్క్ షైరు, క్లీవ్‌లాండు, లాంకషైరు, లింకన్ షైరు, ఆక్స్‌ఫర్డుషైరు, నార్తాంప్టన్ షైరు మండలములలో సమృద్ధిగా దొరకును అయినను కొన్ని తరగతుల ముడి ఇనుమును 40 శాతమువరకు ఈ దేశము ముఖ్యముగా ఉత్తర స్పెయిను, స్వీడను, ఉత్తరాఫ్రికాలనుండి దిగుమతి చేసికొనుచుండును సీసము, తగరము, రాగి మున్నగునవి ఆదేశములో లభ్యమగు ఇతరలోహములు

**పరిశ్రమలు** గ్రేట్ బ్రిటను ముఖ్యముగా పారిశ్రామికదేశముగా ప్రసిద్ధికెక్కినది ఇందుకు బొగ్గుగనులే ప్రధానకారణము. పరిశ్రమలలో అత్యధికభాగము బొగ్గుగనుల చెంత స్థాపింపబడినవి ఆదేశమందలి ప్రధానపరిశ్రమలలో వస్త్ర పరిశ్రమ (నూలు, ఉన్ని) ఇనుము – ఉక్కుపరిశ్రమ, నౌకానిర్మాణ పరిశ్రమ, మోటారుశకట నిర్మాణ పరిశ్రమ చేరియున్నవి ఇనుము - ఉక్కు పరిశ్రమకు న్యూకేజిలు, బర్మింగ్‌హాము మండలములును, ఓడ నిర్మాణ పరిశ్రమకు న్యూకేజిలు, పోర్ట్స్‌మత్ మండలములును, మోటారుశకట పరిశ్రమకు లండను, కవెంట్రీ, బర్మింగ్‌హాము మండలములును ముఖ్యకేంద్రములు నూలువస్త్రములకు లాంకషైరు అత్యంతప్రముఖస్థానము బ్రిటిష్‌దీవులు పింగాణీ పరిశ్రమకు కూడ ప్రసిద్ధిగాంచినవి ఇది ఉత్తరస్ట్రాఫర్డుషైరు బొగ్గుగనులకు సమీపమున నెలకొనియున్నది

**వాణిజ్యము** గ్రేట్ బ్రిటనుయొక్క సంపత్సౌభాగ్యములు ప్రధానముగా విదేశవాణిజ్యముపై ఆధారపడియున్నవి ఓడలు సముద్రప్రవేశమొనర్చుటకు సౌలభ్యము కల్గించు నదీముఖనౌకాశ్రయములుండుటచేతను, ముడిసరకుల నాకర్షించు బొగ్గు చౌకగా లభ్యమగుటచేతను, ఇంకను ఇతర కారణములచేతను, ఆదేశపువిదేశవ్యాపారము అభివృద్ధిచెంది, అత్యంత ప్రధానమగు వాణిజ్యదేశముగా వాసికెక్కినది ముఖ్యముగా ఆహారపదార్థములు, పరిశ్రమల కుపయోగపడు ముడివస్తువులు ఆదేశమునకు దిగుమతియగుచున్నవి ముడివస్తువులనుండి ముఖ్యముగా ఉత్పత్తియగునవి నూలు వస్త్రములు అచ్చటినుండి ఎగుమతియగు ప్రధానద్రవ్యములు బొగ్గు, పారిశ్రామిక సంస్థలలో తయారగు సరకులు ముఖ్యముగా ఇండియా, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికా, కెనడా మున్నగు దేశములకు బ్రిటనునుండి సరకులు ఎగుమతియగుచున్నవి లండను, లివర్‌పూలు, సౌథాంప్టను వంటి ప్రధాననౌకాశ్రయములద్వారా ఈదేశపు విదేశవాణిజ్యము విశేషముగా కొనసాగుచున్నది హల్, గ్లాస్గో బ్రిస్టల్ అనునవి కూడ ముఖ్యమగు ఇతరనౌకాశ్రయములు వాణిజ్యాభివృద్ధి కారణముగా గ్రేట్‌బ్రిటనులో పెక్కు పెద్దనగరములు తలయెత్తినవి అందలి నగరములన్నిటిలో, కోటి జనసంఖ్యకలిగి రాజధానిగా వాసికెక్కిన లండను మహానగరము మిగుల గొప్పది

వి వి

## బ్రెజిల్ (భూ)

దక్షిణ అమెరికా ఖండములో దాదాపు సగభాగమును బ్రెజిల్‌దేశ మాక్రమించి యున్నది అది ప్రపంచమునందలి మిక్కిలి పెద్దదేశములలో నాల్గవది అమెరికా సంయుక్త రాష్ట్రములకంటె ఆ దేశము పెద్దదైనను, అందలి 5 కోట్ల జనసంఖ్య గ్రేటు బ్రిటనునందలి జనసంఖ్యకు సమానముగ నున్నది బ్రెజిల్ దేశపు వైశాల్యము 33,87,195 చ మైళ్ళు ఉత్తరమునుండి దక్షిణమునకు దాని నిడివి 2695 మైళ్ళు, తూర్పునుండి పశ్చిమమునకు 2691 మైళ్ళు ఆ దేశము చిలీ, ఈక్వెడారులు తప్ప తక్కిన దక్షిణ అమెరికా దేశములను, వలసప్రాంతములను అనుకొని యున్నది మొత్తముమీద దేశవిస్తీర్ణమంతయు దక్షిణ అమెరికాఖండపు లోతట్టువైపునకు మొగ్గియున్నది. దేశ మధ్యభాగమునందున్న ఉన్నతతలము పెక్కు ప్రముఖ నదులకు మూలాధారముగ నున్నది ఈ నదులలో కొన్ని ఉత్తరాభిముఖముగను, కొన్ని దక్షిణాభిముఖముగను ప్రవహించు చున్నవి

బ్రెజిల్ దేశము స్పెయిన్ సామ్రాజ్యపు వలస రాజ్యములవలె కాక, పూర్వపు పోర్చుగల్లు సామ్రాజ్యపు వలస ప్రాంతములన్నియు కలిసి సంఘటితమైన ఒక పెద్దదేశముగా

చిత్రము 110




నేర్పడి యున్నది అందుచే బ్రెజిల్ దేశమునందు పోర్చుగీసు భాష వ్యవహారమున నున్నది ఈ దేశము మూడు ప్రధాన మండలములుగా విభజింపబడి యున్నది

(1) అమెజాన్ పల్లపుభూములు

(2) లోతట్టు పల్లపుభూములు, పీఠ భూములు

(3) తూర్పుతీరము, దానిని అను కొనియున్న ఎత్తు భూములు

అమజాన్ పల్లపు భూములు ఈ ప్రాంతము రాకీ పర్వతములకు తూర్పున సంయుక్తరాష్ట్రములంత పెద్ద విస్తీర్ణము కల భూభాగము నాక్రమించి యున్నది జనను అందు ఇరువదిలక్షలమంది జన సంఖ్యకంటె ఎక్కువ లేదు. ఈ దేశము నందు కొన్ని భారీనదుల సమూహాముచే నీటిపారుదల సౌకర్యములు కల్పింప బడి నవి వీటిలో 18 000 మైళ్ళు విడివిగల నదులు ఓడల ప్రయాణమునకు అనుకూల ముగ నున్నవి సముద్రయానము సల్పు ఓడలు 2,800 మైళ్ళ దూరము వరకు అమెజాన్ నది కెగువన ప్రయాణించును నదులపై నడచు ఓడలు 500 మొదలు 1000 మైళ్ళ వరకు వాటి ఉపనదులను ఉప యోగించుకొనును నదీ ముఖద్వారము వద్ద అమెజాన్ నది సముద్రమువలె విస్తృ తమై యుండును

బ్రెజిల్ వేడిమి శీతోష్ణస్థితి కలదిగ నుండును, వాతావరణము చెమ్మగను, అసౌఖ్యకరముగను ఉండును ఏ ఋతు వునందును వాతావరణము పొడిగ నుండదు అయితే, కొన్ని నెలలలో వర్ష ములు అత్యంత గాఢముగ కురియును ఉపద్రవకరమైన తుపానులతో పగటి వేళలందే వర్షములు కురియును ఆ దిన ములలో నదీజలము 85-70 అడుగులకు పైగాపొంగి, చెట్లను, మట్టిని నదులలోనికి ఊడ్చుకొనిపోవును ఈ వర్షములు 50-100 మైళ్ళ ప్రదేశమును వరదలపాలు చేయును

వేడిమియు గాఢమైన తేమయు భూమధ్యరేఖాప్రాంతమందు వర్షాధారముచే పెరుగు అడవుల పెంపుదలకు తోహద మొసగును అగ్రమువరకు దాదాపు పర్ణరహితముగ, దట్టముగ నున్న ఈ అటవీ వృక్షములకు గాలి, వెలుతురు లభించుట దుస్తరము ఇతర శాఖలలో క్రుళ్ళిన ఆకు, అలము, పుట్టగొడుగులు, పాములకును పురుగులకును ఆశ్రయ మొసగును ఇవి ప్రాణాపాయకరమగు మలేరియా క్రిములను, పీతజ్వర క్రిములను సృష్టించి వ్యాప్తి నొందించును ఇచ్చట కోతులు పెక్కులుండును

నదులకు సమీపమున వ్యాధిగ్రస్తులైన కొలదిమంది భారతీయులు గుంపులు గుంపులుగా, చెదురుమదురుగా నివసించుచు, చేపలు పట్టుకొనియు, అటవీ పదార్థములను సేకరించుకొనియు జీవించుచుందురు వారు సాధారణముగా నదీతీరములందు పూరిగుడిసెలలో నివసింతురు కొందరు అరణ్యములలో చెట్లను కాల్చివేసి, బయళ్ళను కల్పించుకొని తాత్కాలికముగా అందు నివాసముల నేర్పరచుకొని, అందు నివసించుచు, ఒకటి రెండు పైరులను పెంచుకొనుచుందురు పిమ్మట వారు ఆ నివాసములను వదలివేసి, మరియొక స్థలమున కేగెదరు

రబ్బరు, 'బ్రెజిల్' పోకలు ఈ దేశముయొక్క ఆర్థికాభివృద్ధికి సహాయపడు ముఖ్యమైన ఉత్పత్తులు అరువది, డెబ్బది సంవత్సరముల క్రిందట ప్రపంచములోకెల్ల రబ్బరును ఉత్పత్తిచేయు దేశము ఒక్క బ్రెజిలు మాత్రమే యయుండెను ఇచ్చటనుండి పలుదేశములకు రబ్బరుచెట్టు విత్తనములు ఎగుమతి చేయబడును

అటవీ ఉత్పత్తులలో రబ్బరు తరువాత 'బ్రెజిల్' పోకలు ప్రముఖస్థాన మాక్రమించు చున్నవి చెట్లనుండి రాలిన పోకలను ప్రజలు సేకరించి, వాటినుండి తైలమును తీయుదురు

1,25,000 జనసంఖ్య గల 'మానాస్' అను నగరము అమెజాన్ నదీ పరీవాహక ప్రదేశమందు గల ప్రధానమగు లోతట్టు నగరము ఈ ప్రాంతమునకు పెక్కు దిక్కులనుండి జలప్రవాహ మార్గములు కలవు రబ్బరుపంట పుష్కలముగా నుండు కాలమున ఈ నగరము, రేవుస్థలముగా అభివృద్ధి చెందెను ఇప్పటికిని, ఆ పట్టణమునుండి రబ్బరు ఎగుమతి చేయబడుచున్నను, దాని పూర్వవైభవము రేఖామాత్రముగనే మిగిలి యున్నది.

బెలెమ్ (పారా) 2,40,000 జనాభా గల ఈ రేవు పట్టణము 'పారా' నదిపై విశాలమైన ముఖద్వారము చెంత నున్నది ఈ నగరము పూర్వము రబ్బరు ఎగుమతియగు గొప్ప రేవుస్థలమై యుండి. పిదప స్వీయ ప్రాధాన్యమును కోల్పోయెను

లోతట్టునిమ్నభూములు, పీఠభూములు బ్రెజిలులో విశేష భాగము లోతట్టునందలి నిమ్నభూములతోను, పీఠభూములతోను ఏర్పడి యున్నది తూర్పుభాగమున భూమి పోను పోను మాటోగ్రాసో, గోయజ్ అను పీఠభూములపై ఎత్తుగా నున్నది పశ్చిమమునకు పోనుపోను భూమి పెరగ్వేనదీ ప్రాంతములోని నిమ్నభూముల దెసతగ్గుముఖము పట్టుచుండును

'కాంపస్' అను ఈ ప్రాంతమునందు వేసవి ఉష్ణముగ నుండును సగటు ఉష్ణోగ్రత 80 డిగ్రీల ఫా కు పైగా ఉండును చలికాలము నులివెచ్చగనుండును సగటు సాంవత్సరిక ఉష్ణోగ్రత 10 డిగ్రీలు ఫా వరకుండును సాంవత్సరిక వర్షపాతములో విశేషభాగము వేసవియందు పిడుగులతో, తుఫానువాయువులు ఘటిల్లును

ఈ ప్రాంతములో 'సవన్న' అను పచ్చిగడ్డి పవుగా పెరుగు ఉద్భిజ్జము వర్షములు లేనపుడు ఈగడ్డి ఎండిపోయి మరల వానలు కురిసినపిమ్మట పచ్చనై కన్నులకింపుగనుండును

జనల ముఖ్యవృత్తి పశుపోషణము తక్కువ తరగతికి చెందిన లక్షలాది పశువులు అదుపులోలేని విశాలమగు పచ్చిక మైదానములలో మేతమేయును విస్తృతమైన ఈ పచ్చిక మైదానము పశుపోషణమునకు అనుకూలముగ నున్నది ఆసన్న భవిష్యత్తులో ఈ ప్రాంతము గొప్ప సూంసోత్పత్తి మండల మగుటకు అవకాశము లేదు

గాయజ్ గాయజ్ రాష్ట్రమునకు గాయజ్ అనునది ముఖ్యనగరము ఇది ఆధునికమైనది. సావోపాలో అను రైల్వే కూడలికి ఈ నగరము 40 మైళ్ళదూరమున కలదు

కొరంబా ఈ రేవుపట్టణము పెరగ్వేనదిపైగల ఓడ మార్గముల కూడలివద్ద కలదు ఇది సముద్రమునుండి 1400 మైళ్ల దూరమున నున్నది సావోపాలోనుండి బొలీవియా దేశపు సరిహద్దునకు రాకపోక మార్గములు కలవు

తూర్పుతీరము ప్రక్కనున్న పీఠభూములు బ్రెజిలీయను పీఠభూములు తూర్పుసరిహద్దు తూర్పుతీరమును ఆని

యుండును తీరమైదానము ఉత్తరమున అత్యంత విస్తృతమై యున్నది తూర్పుతీరమును, దాని ప్రక్కనున్న ఉన్నత భూములును అందలి ఉత్పత్తుల యొక్కయు, అభివృద్ధి యొక్కయు భేదమునుబట్టి మూడుప్రాంతములుగా విభజింప వగును

(ఎ) ఈశాన్యరాష్ట్రములు ఈ ప్రాంతమునందు సంవత్సరము పొడవునను తీవ్ర ఉష్ణోగ్రతయు, సమృద్ధమైన వర్షపాతమును ఘటిల్లును 1502వ సంవత్సరములో సాల్వడారు అను తావున పోర్చుగీసువారు తమ మొదటి నివాసము లేర్పరచుకొనిరి వెంటనే వారు చెరకు పైరు వేయనారంభించిరి ఇచ్చటి జనాభాలో విశేషానుపాతము నీగ్రోజాతివారలు చెరకు, ప్రత్తి, అరటి ఇచ్చటి ప్రధానమైన వ్యాపారపు పంటలు గ్రామఫోను రికార్డులను తయారుచేయుట కుపయోగపడు లక్కను ఉత్పత్తిచేయు వృక్షములు ఇచ్చట ప్రాధాన్యము కలవిగా నున్నవి

రిసైఫ్ (పర్నాంబకో) నౌకా విశ్రాంతి స్థలమున గల ఈ నగరమొక పంచదార పరిశ్రమ కేంద్రముగనున్నది ఐరోపా, పశ్చిమాఫ్రికాల నుండి ప్రయాణించు ట్రాన్స్ – అట్లాంటిక్ విమానమార్గమునకు రిసైఫ్, నేటాల్ అను తావులు రెండును, దక్షిణ అమెరికాయందు కడసరిహద్దులు దక్షిణ అమెరికా ప్రాగుత్తరతీరములందు ప్రధాన పట్టణములను కలుపు విమానమార్గములలో అవి కలవు

కేంద్ర రాష్ట్రములు బ్రెజిలునందు అత్యంత సంపన్నములైన ఈ రాష్ట్రములు ఆర్థికముగను, సాంస్కృతికముగను పురోగమించుచున్నవి పెక్కురకముల పైర్లు ప్రతిసంవత్సరము పెంచబడినను, సేద్యము చేయబడిన భూములలో దాదాపు సగభాగము కాఫీతోటలను పెంచుటకు ఉపయోగపడుచున్నది

ప్రపంచములో ఉత్పత్తియగు కాఫీపంటలో సగభాగము బ్రెజిల్ దేశమున పండును దీనితరువాత ముఖ్యమైన పంట ప్రత్తి కేషించిన ప్రముఖమగు పైరులలో కోకో పేర్కొనదగినది అప్రధానమైన పంటలలో చెరకు, అరటిపండ్లు, నారింజపండ్లు మొక్కజొన్న, చిక్కుడు, వరి, పొగాకు కూరలు పేర్కొనదగినవి

బ్రెజిలునందలి పీఠభూములు ఖనిజసంపదతో అలరారుచున్నవి. వీటిలో రత్నములు, శిలాస్ఫటికములు, ముఖ్యముగా నైనవి ఇవి రేడియో పరిశ్రమయం దుపయోగింపబడును మైకా అనునది విద్యుత్పరిశ్రమయం దుపయోగపడును ప్రపంచములో ఉత్పత్తియగు మాంగనములో బ్రెజిలునందు దాదాపు 8 శాతము తయారగుచున్నది. ఈ లోహము ఉక్కుతయారీయందు వాడబడును

కేంద్రరాష్ట్రములు బ్రెజిలుదేశమునకు హృదయము వంటివని వ్యవహరింపబడుట సమంజసమే పరిపాలన కేంద్రము, ముఖ్యపరిశ్రమలు, గొప్పపట్టణములు, ప్రధాన జలవిద్యుత్ స్థావరములు, ఈ రాష్ట్రమునందే కలవు రియో-డి-జెనీరో నగరమును, సాన్‌టోస్ నగరమును కాఫీ ఉత్పత్తియగు పీఠభూములతో కలుపు ఇనుపదారులు ఈ రాష్ట్రములోకలవు, ఇచ్చటినుని, అర్జెంటినా, ఉరుగ్వే దేశములకును ఇనుపమార్గములు కలవు బ్రెజిలుదేశమునందున్న ఇనుపదారుల మొత్తము దూరములో సగభాగము ఈ రాష్ట్రములందే నిర్మింపబడియున్నది

రియో-డీ-జెనీరో 20 లక్షలు జనసంఖ్యగల ఈ నగరము బ్రెజిల్ దేశపు రాజధానిగనేకాక, గొప్పనగరముగ గూడ విరాజిల్లుచున్నది. ఇచ్చటి నౌకాపరిశ్రమ స్థానము ప్రపంచమునందలి గొప్పవాటిలో నొకటి ప్రపంచమందు సౌందర్యమునకు ప్రసిద్ధమైన అఖాతముపై ఆ పట్టణము నిర్మింపబడియున్నది ఈ నగరమును, సాన్‌టస్ అను నగరమును, బ్రెజిల్ దేశమునందు జరగు వాణిజ్య వ్యాపారములలో విశేషభాగమును నిర్వహించుచున్నవి కాని ఈవ్యాపారములో విశేషభాగము దిగుమతులకు సంబంధించియుండును

సావోపాలో 17,50,000 జనసంఖ్యగల ఈ నగరము బ్రెజిల్ దేశములో రెండవస్థానము నాక్రమించుచున్నది ఇది కాఫీతోటలు పెరుగుమండలములో కలదు ఈ నగరము రోడ్డు, రైలు, రహదారులకును, కాఫీపరిశ్రమకును ముఖ్యకేంద్రమైయున్నది ఇందు నూలువస్త్రములను, పట్టువస్త్రములను తయారుచేయు మిల్లులున్నవి, మాంసమును డబ్బాలలో భద్రపరచి కాపటము చేయు యంత్రశాలలు కూడ ఇందు గలవు.

సాన్‌టస్ ఇది సావోపాలోకు సంబంధించిన సముద్రపు రేవుపట్టణము ప్రపంచములో, పలుతావులకు కాఫీ గింజలను ఎగుమతిచేయు అత్యంత ప్రముఖమయిన రేవుపట్టణమిది ఇందు అత్యుత్తమమైన సరకుల గిడ్డంగులు, ఓడ

లను మరమ్మతుచేయు కార్ఖానాలు కలవు ఈ రేవుపట్టణము దేశమునందలి ఎగుమతులలో సగభాగమును నిర్వహించుచున్నది

**బెల్లోహొరిజాంటె** ఇది గనుల ప్రాంతమునకు ముఖ్యనగరమై యున్నది అత్యంత సంపన్నమైన రెండు బంగారు గనులు దీనికి సమీపమున నున్నవి

**సాల్వడార్** 3,83,000 జనసంఖ్యగల ఈరేవు పట్టణము కోకో ఎగుమతులకు ప్రధానమైనది

**దక్షిణ రాష్ట్రములు** పశు పోషణము దక్షిణ రాష్ట్రము లందు ముఖ్య పరిశ్రమ మొక్కజొన్న, స్వల్ప పరిమితిగల గోధుమ, 'రై' ధాన్యము ఇచ్చటి ముఖ్యమైన ఆహారపు పంటలు. చిక్కుడు, అలుగడ్డలు, ఆహారవస్తువులలో చేరినవి ముఖ్యముగా రియో గ్రాన్ డి డోసాల్ అను రాష్ట్రమునందు పొగాకుపంటకూడా కలదు దక్షిణ రాష్ట్రప్రజలలో క్రొత్తగా నివాసముల నేర్పరచుకొనిన ఇటాలియనులు, జర్మనులు పెక్కురు కలరు

**పోర్టోఅలిగ్రే** 8,50,000 జనసంఖ్య గల ఈ నగర మొక గొప్ప పారిశ్రామిక పట్టణము అది పొడవైన ఇసుక తిన్నెచే సముద్రమునుండి వేరు పరుపబడిన యొక పల్లపు జలాశయపు టొడ్డున నున్నది దీనికి పెక్కులోతట్టు రహదారులు కలవు అది రైలురోడ్డుచే లోతట్టు మార్గమునకు కలుపబడినది ఆలోతట్టుమార్గము కేంద్ర రాష్ట్రములను అర్జెంటినాతోను, ఉరుగ్వేతోను కలుపుచున్నది

**రియోగ్రాండి డోసాల్** ఇది బ్రెజిల్ పట్టణమునందలి రేవు పట్టణములలో అయిదవది అందు మాంసమును డబ్బాలలో భద్రపరచు పరిశ్రమ కలదు ఈమాంసపు డబ్బాలు ఈరేవు పట్టణము నుండియే ఎగుమతి యగుచుండును

ధ వ్ర

## బ్రౌన్ సి. పి.

తెలుగుభాషా సాహిత్యములకును, వాటిద్వారా తెలుగు చరిత్రకును, సంస్కృతికిని, ఎనలేని సేవచేసి తెలుగు జాతిని సదా కృతజ్ఞతాబద్ధము చేసిన పాశ్చాత్య విద్వాంసులందు చార్లెస్ ఫిలిప్ బ్రౌను మహాశయుడు అగ్రగణ్యుడు కలకత్తాలో క్రైస్తవమత ప్రచారము చేయుటకు వచ్చిన రెవరెండ్ డేవిడ్ బ్రౌన్ (1762–1812), అతని సతీమణి ఫ్రాన్సెస్ గారల ద్వితీయ సంతాన మీ బ్రౌనుపండితుడు వాణిజ్యముతో ప్రారంభించి క్రమక్రమముగా భారతదేశముపై ప్రభుత్వమును సంపాదించిననాటి ఈస్టిండియా కంపెనీకి రాజధానీ నగరమైన కలకత్తాలో బ్రౌను (10–11–1798) జన్మించెను తండ్రి సౌజన్యము, సహృదయత, భారతీయ భాషాభిమానము, బ్రౌనుకు వారసత్వముగా లభించినవి ఆతడు తండ్రికడ పిన్ననాటనే అనేక భాషా సాహిత్యముల నభ్యసించెను

తండ్రి చనిపోయిన తరువాత బ్రౌను 1812లో తన తల్లితో ఇంగ్లండునకు పోయి ఉన్నతవిద్య గడించెను అచ్చటనే సివిల్ సర్వీసు పరీక్షలో కృతార్థుడై 1817లో భారతదేశమునకు తిరిగివచ్చి ఈస్టిండియా కంపెనీవారికడ మద్రాసులో సివిల్ సర్వీసులో చేరెను తెలుగువారితో, వారి భాషతో బ్రౌనుకు పరిచయమేర్పడిన దానాడే అంతకుపూర్వ మాతడు తెలుగుభాష నెరుగడు తండ్రికడ చిన్నప్పుడే అతడు ఇంగ్లీషు హీబ్రూ, సిరియన్, అరబ్బీ, ఫార్సీ గ్రీక్, లాటిన్, బెంగాలీ, హిందుస్తానీ మున్నగు భాషలను నేర్చియుండెను ఉద్యోగరీత్యా ప్రాదేశిక భాష అభ్యసించ వలసినందుకు మద్రాసు కాలేజీలో 18–8–1817లో చేరి, తెలుగు నేర్చుకొన నారంభించెను ఆనాడు కళాశాలలో బ్రౌనుకు తెలుగు నేర్పిన గురువు వెలగపూడి కోదండరామయ్య పంతులు ఆటు తరువాత కొంతకాలమునకు బ్రౌను మహారాష్ట్ర భాషను కూడ అభ్యసించెను నాటి మద్రాసు గవర్నరు సర్ థామస్ మన్రో యెదుట సివిల్‌సర్వీస్ అంతిమపరీక్ష నిచ్చి దేశభాషాభ్యసనమును గూర్చి ఆతడుపదేశించిన నీతిని ఆదర్శముగా గొని, దేశభాషలం దొకటియైన తెలుగు వాఙ్మయమునకు బ్రౌను తన జీవితము నంకితము చేసెను

ఆతడు తెలుగు నేర్చుకొనునాటికి పాశ్చాత్యులకు పనికి వచ్చు వ్యాకరణము గాని, నిఘంటువు గాని, పాఠ్యపుస్తకములుగాని సరియైనవి లేకుండెను ఆ కొరతను గమనించిన బ్రౌను వాటి నిర్మాణమునకై పథకములువేసి, చివరకు కృతకృత్యుడయ్యెను చిన్నప్పటినుండియే బ్రౌనుకు తప్పొప్పుల పట్టికలు సిద్ధముచేయుట, శిథిలభాగములను పూరించుట, ఇతరులకు రసహీనములుగా తోచెడి సమాచారములను సేకరించుట, సంశోధితప్రతులు సిద్ధము చేయుట మొదలైన పను లందు ఆసక్తి మెండుగ నుండెను చిన్ననాటి ఆసక్తియే తీవలల్లుకొని బ్రౌనును గొప్ప పరిశోధకునిగా తీర్చిదిద్దినది

తత్ఫలితముగా తెలుగుభాషా సాహిత్యముల అదృష్టము పండినది

బ్రౌను తొట్టతొలుత ఉద్యోగము ప్రారంభించినది కడపలో కోర్టులోని వాది, ప్రతివాదులు, నేరస్థులు, సేవకులు మొదలైనవారు మాట్లాడునది తెలుగే వారి ఆధారముతో బ్రౌను తెలుగును ధారాళముగా మాట్లాడనేర్చెను ఇంతలో ఆతనికి తెలుగు దేశమునకు వాడు ముఖ్యపట్టణమైన మచిలీబందరుకు బదిలీ జరిగెను కనుక తెలుగు వ్యావహారిక భాషలోని వివిధమాండలికముల నాతడు గ్రహించుటకు వీలయ్యెను ఆతని కిరువదియైదేండ్ల వయసు వచ్చునాటికి (1823) కూడ ఆతడు నేర్చినది వ్యావహారికభాషయే గ్రాంథికభాష ఆతని కింకను పట్టుబడలేదు తెలుగు సాహిత్యములో కృషిచేసిన నాటి పాశ్చాత్త్యు లాతనిని తెలుగు సాహిత్యము చాలా క్లిష్టమైనదని నిరుత్సాహ పరచిరి ఉద్యోగమువలన తీరికలేమి కొంత, దేశీయులైన పండితుల ఛాందస పద్ధతి మరికొంత, ఈ నిరుత్సాహమునకు తోడయ్యెను ఐనను ఆతడు తన పట్టుదలను విడువలేదు ఆనాడు 'సదర్ అదాలత్'లో పండితుడుగా నున్న వఠ్యం పరబ్రహ్మశాస్త్రి మొదలైన పండితుల సాయమున, బ్రౌను తెలుగు కావ్యములు చదువ నారంభించెను ఆతడు కడప, మచిలీబందరు, రాజమహేంద్రవరము, తిరుచురాపల్లి, మద్రాసు, గుంటూరు, చిత్తూరు మొదలైన ప్రదేశములందు రాజస్వ, న్యాయిక, ఆరక్షి, రూఢి శాఖలందు పనిచేయుచున్నను ప్రతిదినము కొంత సమయమును తెలుగు సాహిత్యము నేర్చుకొనుటకై వినియోగించెను 1834లో ఆతడు సెలవు తీసికొని ఇంగ్లాండునకు పోయెను

ఇంగ్లండులోకూడ బ్రౌను నిర్విరామకృషి యొనర్చెను లండనులో నున్న భారతీయ లిఖితప్రతులను సరిదిద్దుటయందును, ఇండియాహౌసులోని దాక్షిణాత్య లిపులలోనున్న గ్రంథములను మనదేశమునకు తరలించుటయందును, ఆతడు మిక్కిలి కృషిచేసెను 1838లో ఆతడు మనదేశమునకు వచ్చి పార్సీ అనువాదకుడుగా నియుక్తుడయ్యెను అప్పుడే ఆతడు కాలేజి మండలిలో గౌరవసభ్యుడయ్యెను మండలి సమావేశములందు తెల్లవారితోపాటు తెలుగు పండితులు కూర్చుండుట కధికారము నాడు లేకుండెను కాని ఉదారాశయుడైన బ్రౌను కృషిఫలితముగా పాలకులతోపాటు తెలుగు పండితులు కూడ మండలి సమావేశములందు కూర్చొను నవకాశము కలిగెను

1846లో బ్రౌను పోస్టుమాస్టర్ జనరల్‌గా నియుక్తుడయ్యెను ఇంకను ప్రభుత్వమువారికి తెలుగు అనువాదకుడుగా, విద్యామండలి సభ్యుడుగా, మద్రాసు లిఖిత పుస్తక భాండాగారమునకు క్యూరేటరుగా, కళాశాలా మండలిలో సీనియర్ మెంబరుగా "మద్రాసు లిటరరీ జర్నల్" సంయుక్త సంపాదకుడుగా కూడ పనిచేసెను ఆతడేయుద్యోగము చేసినను, ఎచ్చటనున్నను, తెలుగు భాషా సాహిత్యముల గూర్చిన కృషిని మాత్రము తన పరమధ్యేయముగా పెట్టుకొనెను ఈ కాలమందే ఆతడు ఉద్యోగరీత్యా తెలుగు, పార్సీ, హిందుస్తానీ భాషలనుండి ఇంగ్లీషులోనికి, ఇంగ్లీషు నుండి ఈ భాషలలోనికి పూర్లపుటల విషయమును, అనువాదము చేసెను

1853లో ఆతనికి పక్షవాతము వచ్చినది అప్పుడాతడు ఉదక మండలములో విశ్రాంతినిగొని ఆరోగ్యమును చేకూర్చుకొనెను ఆ సమయమందే ఆతడు తన సాహిత్య వ్యాసంగమును గూర్చి క్లుప్తముగా "సమ్ ఎకౌంటు ఆఫ్ ది లిటరరీ లైఫ్ ఆఫ్ సి పి బ్రౌను" అను వ్యాసమును వ్రాసెను ఈ విధముగా నిర్విరామ కృషి చేయుచున్న బ్రౌను, ఆరోగ్యము మరల క్షీణించెను బంధువులాతనిని ఇంగ్లండునకు రమ్మని నిర్బంధముచేసిరి 1855 ఏప్రిల్ మాసములో ఆతడు మరల ఇంగ్లండుకు పోయెను

ఇంగ్లండుకు పోయినను ఆతని కృషి యాగలేదు లండను విశ్వవిద్యాలయము తెలుగుశాఖలో ఆతడు గౌరవ ఆచార్యుడుగా నియమింపబడెను రాయల్ ఏషియాటిక్ సొసైటీ కౌన్సిల్ సభ్యుడుగా కూడ ఆతడు పనిచేసెను సివిల్ సర్వీసు పోటీపరీక్షలకు పరీక్షాధికారి యయ్యెను ఎన్నియో క్రొత్తగ్రంథములు రచించి ప్రచురించుటే కాక, తన వ్యాకరణమునకు మూడవ ముద్రణమును, బైబిల్ అనువాదమును, తన నిఘంటువును విస్తరించు కార్యమును ఆతడు పూర్తిచేసెను లండనులోని ఆతని యిల్లు (22 Kildare Gardens, West Bourne) ప్రాచ్యభాషా విద్వాంసులకొక తీర్థమయ్యెను 1868 లో ఆతనికి మరల పక్షవాతము వచ్చెను కొంతకాలమున కాతడు తేరుకొని 1884 వరకు జీవించి కీర్తిశేషు డయ్యెను ఈవిధముగా ఆతడు స్వయంకృషితో ఎన్నియో భాషల నభ్యసించి, ప్రత్యేకముగా తెలుగు భాషా సాహిత్యములను తన మాతృభాషకంటె మిన్నగా ప్రేమించి

విశేషముగా వాటికై కృషిచేసి నిష్కామసేవ యొనర్చి, తెలుగుజాతికి మహోపకార మొనర్చెను

తెలుగు దేశములోను, ఇంగ్లండులోను, బ్రౌను మహాశయు డేపదవి నిర్వహించినను, తన అధికారమును, పలుకుబడిని వినియోగించి, తన విరామ సమయమును సొంత ధనమును వెచ్చించి మరుగుపడిన కావ్యములను వెలికిదీసి, వ్రాతప్రతులను సేకరించి, వాటికి పుత్రికలు వ్రాయించి, పండితులను, వ్రాయసకాండ్రను నియోగించి, గ్రంథములు పరిష్కరింపించి, వ్యాఖ్యానములు వెలయింపజేసి, శిథిలమై పోవుచున్న గ్రంథముల నెన్నింటినో ముద్రింపించి తెలుగుభాషా సాహిత్యమున కిదివర కెవ్వరును చేయనంత మహోపకారము చేసి, మనలను కృతజ్ఞతాబద్ధులను చేసినాడు వివిధ పాఠములను పరిశీలించి, వ్యాఖ్యానములతో అనేక కావ్యములను మొదటిసారిగా ముద్రింపించినది బ్రౌనుపండితుడే పాశ్చాత్యుల విమర్శన పద్ధతి ననుసరించి సంశోధిత ప్రతులను సిద్ధము చేసినవా డాతడే. తెలుగు దేశమున అతని ఇంటిలో నెలసరి జీతములపై ఎందరో ఉద్దండ పండితులు, వ్రాయసకాండ్రు తాళపత్ర గ్రంథములను సేకరించి, శుభ్రపరచి, ఎత్తివ్రాసెడివారుండిరి వారిపై వెచ్చింపబడిన ధనమంతయు బ్రౌను విద్వాంసునిదే భోజరాజాదులనువలె, కృష్ణరాయాదులను వలె, ఆయన నెప్పుడును పండితులు, కవులు ఆశ్రయించియుండెడివారు అట్టివారిలో రావిపాటి గురుమూర్తిశాస్త్రి, వఠ్యం అద్వైత పరబ్రహ్మశాస్త్రి, జూలూరిఅప్పయ్య, కంభం నృసింహాచార్యులు పయిడిపాటి వేంకటనరసయ్య, తాతాచార్యులు, ములపాక బుచ్చయ్యశాస్త్రి మల్లంపల్లి మల్లికార్జునశాస్త్రి మొదలైనవారు ముఖ్యులు వీరిలో రావిపాటి గురుమూర్తిశాస్త్రి బ్రౌను పండితునకు గురుతుల్యుడు ఈ పండితమండలిని "బ్రౌనుకాలేజి"యని పిలిచెడివారు కల్నల్ కాలిన్ మెకంజీ (1758-1821) తరువాత, బ్రౌనుచే నియోగింపబడినవారే విశేషముగా దేశాటనమొనర్చి గ్రంథములను సేకరించినారు తెలుగువిషయమై సేవచేసినవారిలో బ్రౌను పండితమండలియే మిన్నయని చెప్పుకొనవచ్చును

బ్రౌను పూనుకొనకుండినచో అమూల్యమైన తెలుగు కావ్యము లెన్నియో మనకు దక్కకుండ పోయెడివి అతడనేకగ్రంథముల నుద్ధరించి, వ్యాఖ్యానములు వ్రాయించి, మొదటిసారిగా ముద్రింపించెను జూలూరి అప్పయ్యపండితుల వ్యాఖ్యానముతో 1844 లో వసుచరిత్రమును, 1851 లో మనుచరిత్రమును బ్రౌను మొదటిసారి ప్రకటించెను ఇటులే 1843 లో భాగవతము యొక్క పరిష్కృతప్రతి, కళాపూర్ణోదయము సవ్యాఖ్యానము, విజయవిలాసము, తారాశశాంక విజయము, కవికర్ణ రసాయనము, సారంగధర చరిత్రము, దశావతార చరిత్రము, పల్నాటి వీరచరిత్రము, వైజయంతీ విలాసము (1849), నలచరిత్ర - ద్విపదవంటి ముఖ్యగ్రంథము లెన్నియో బ్రౌను కృషివలననే మనకుదక్కినవి 18_7 లోనే అతడు పంచతంత్రమును పెక్కుప్రతులతో పోల్చి శుద్ధప్రతిని సిద్ధమొనర్చెను అతడు సొంతపైకముతో కొన్ని గ్రంథములను ప్రకటించినాడు మరికొన్నింటిని మంచిదళసరి కాగితములపై ఎత్తివ్రాయించి భద్రపరచినాడు వేలకొలది వేమన పద్యములను సేకరించి స్వయముగా వాటికి ఆంగ్లానువాదము చేసి ఆ యుద్గ్రంథమును విలువైన పీఠికతో 1829 లో ప్రకటించినాడు. తెలుగు ముద్రణకళలో కూడ బ్రౌను చక్కని సంస్కరణములను ప్రవేశపెట్టెను సొంతపైకము వెచ్చించి సేకరించిన లిఖిత ప్రతులను వేలకొలది మద్రాసు కాలేజి లైబ్రరీకిని, మద్రాసు లిటరరీ సొసైటీవారికిని, ఉచితముగా ఇచ్చినాడు ఇంకను మెకంజీ సేకరించిన లిఖితప్రతులు, అతని పండితులు సేకరించిన స్థానిక సమాచారములు, శిథిలావస్థలో నుండగా, వాటినన్నింటిని ఇంగ్లండులో తయారైన కాగితములపై నల్లసిరాతో కొన్ని సంపుటముల క్రింద ఎత్తివ్రాయించి భద్రపరచినాడు అతని సాహిత్యసేవకు ఈనాడు మద్రాసు నగరములోనున్న ప్రభుత్వప్రాచ్య లిఖితపుస్తక భాండాగారమే సాక్షి అచ్చటి ఏతాళపత్ర గ్రంథమునుచూచినను, ఏవ్రాతప్రతిని పరిశీలించినను, ఏ వ్యాఖ్యానమును పరికించినను బ్రౌను మహాశయుని పేరు కనబడును అతని లేఖలు 19 సంపుటములును ఈనాటికిని మూగసాక్ష్యమును పలుకుచున్నవి. ఒక్కమాటలో చెప్పదలచినచో, మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము బ్రౌనులిఖిత భాండాగార మనవచ్చును

తెలుగు నేర్చుకొనుటలో తానుపడిన కష్టనష్టములను గమనించిన బ్రౌను. ఆంధ్రేతరులు తెలుగును సులభముగా నేర్చుకొనుటకై ఉపయోగపడునట్టి అమూల్య గ్రంథముల నెన్నింటినో రచించి ప్రకటించినాడు అట్టివాటిలో నిఘంటువులు వ్యాకరణములు, వాచకములు ముఖ్యమైనవి

ఆతనికంటె పూర్వమే కొందరు పాశ్చాత్యులిట్టిగ్రంథములను వ్రాసి ప్రకటించియుండినను, బ్రౌనురచనలతో అవిసాటిరావు బ్రౌను రచనలు ప్రకటితములైన తరువాత ఆయా గ్రంథములు తేజోవిహీనములై పోయినవి బ్రౌననిఘంటువులు పండితులకు, పామరులకు కూడ ఉపయోగపడునట్టివి ఇంగ్లీషు - తెలుగు, తెలుగు - ఇంగ్లీషు బ్రౌన్యనిఘంటువులు 1845 లో సిద్ధమైనవి బ్రౌను, ఈ నిఘంటువులందు వ్యావహారిక పదములను కూడ చేర్చి పూర్వనిఘంటువులకంటె వాటిని మేల్తరముచేసినాడు ఈనిఘంటువుల నిర్మాణములో ఆతడు పడిన శ్రమ వర్ణింపరానిది ఇంకను తెలుగుభాషలో ప్రవేశించిన ఇతర భాషాపదముల నిఘంటువులు - మిశ్రభాషానిఘంటువు 1854 లోను, జిల్లా నిఘంటువు 1852 లోను అచ్చైనవి నిఘంటువుల తరువాత పేర్కొనదగినది ఆతని వ్యాకరణము తెలుగు నేర్చుకొను పాశ్చాత్యుల ఉపయోగార్థమై బ్రౌను 1840 లో తెలుగు వ్యాకరణమును ప్రకటించెను ఆటుతరువాత దానిని పెక్కుసార్లు సంస్కరించి ప్రకటించెను ఇట్లే వాచకములు కూడ 1852 లో ప్రకటింపబడి తరువాత సంస్కరింపబడి మరలమరల ప్రకటితములైనవి. బ్రౌను వేమువీ వైభవమునకు, ఆతని నిర్విరామకృషికి, రచనా వ్యాసంగమునకు ఈ క్రింది గ్రంథములు, వ్యాసములు తార్కాణములు

(1) The Prosody of the Telugu and Sanskrit Languages Explained – 1827
(2) A familiar Analysis of Sanskrit Prosody-1837
(3) Essay on the Language and Literature of Telugu-1830
(4) Essay on the creed and customs of the Jangams-1840
(5) The Verses of Vemana-1829
(6) A new Telugu version of the Gospel according to St. Luke-1838
(7) A grammar of the Telugu Language-1840
(8) Memoirs of Hyder and Tippu-1849
(9) Cyclic tables of Hindu and Mohamadan chronology, regarding the History of the Telugu and Kannadi Countries-1850
(10) An Ephemeris-1850.
(11) The Telugu Reader, being a series of letters, Private and on business, Police and Revenue matters, with an English translation notes explaining the grammar and a little lexicon-1852
(12) English translations of the exercises and documents printed in theTelugu Reader-1852
(13) Analysis of the words in the first chapter of the Telugu Reader-1852
(14) A little Lexicon-1852
(15) A catalogue of irregular verbs in the English Language-1852
(16) The Telugu-English Dictionary-1852
(17) The English-Telugu Dictionary-1852
(18) The Zillah Dictionary-1852
(19) Vakyavali-1852
(20) Three treatises on Mirasi Rights-1852
(21) Dialogues in Telugu and English-1853
(22) The wars of the Rajas-1853
(23) Disputations on Village business-1855
(24) Popular Telugu, Tales-1855
(25) A Titular memory-1861
(26) Carnatic chronology-1863
(27) Sanskrit prosody and numerical symbols explained-1869
(28) Prophet Balaam-1847
(29) Nisthara Ratnakaramu-1853
(30) Some Account of the Literary life of C P Brown-1836

పైన పేర్కొన్నవికాక ఎన్నియో పరిశోధనాత్మకములు, విజ్ఞానదాయకములునైన వ్యాసరాజములు "రాయల్ ఏషియాటిక్ సొసైటీ జర్నల్"లోను, మద్రాసు లిటరరీ జర్నల్"లోను, ప్రకటించినారు ఆతని రచనలు పెక్కులు అముద్రితములుగా నిలిచిపోయినవి కూడకలవు, ఆట్టివాటిలో పేర్కొనదగినవి

(1) పారిభాషిక పదకోశము-రెండు సంపుటములు

(2) జాన్సన్ ఇంగ్లీషు నిఘంటువునకు తెలుగు అనువాదము 1838-40 సంవత్సరములలో ముగించినది - నాల్గు సంపుటములు

(3) కవిజనాశ్రయ ఛందోగ్రంథమునకు ఆంగ్లానువాదము.

(4) తెలుగు - తెలుగు నిఘంటువు (1841) - మూడు సంపుటములు

(5) మనుచరిత్ర, ఆముక్తమాల్యద, దశావతార చరిత్ర, శారాశశాంక విజయాది గ్రంథముల పదకోశములు, పదసూచికలు.

(8) పద్మపురాణము, దశావతారచరిత్రములందలి, అహల్యా వృత్తాంతములకు ఆంగ్లానువాదములు మొదలైనవి

ఈవిధముగా బ్రౌను, అనాదృతిపాలై చివికి జీర్ణమగుచున్న ప్రాచీన తెలుగు గ్రంథములను వెలుగులోనికి తెచ్చుటే కాక, మినుకుమినుకు మనుచున్న ఆంధ్రభాషా సాహిత్యదీపమును తనఔదార్యమను స్నేహముతో నిర్విరామకృషియను వర్తికతో అఖండజ్యోతిగా వెలిగించినాడు పాలకవర్గమునకు చెందిన పాశ్చాత్య దంపతులకడ పుట్టి అనేక భారతీయ భాషల నభ్యసించి ప్రత్యేకముగా తెనుగు నభిమానించి తెలుగు సారస్వతమున క్రొత్తపద్ధతులను ప్రవేశపెట్టి పూర్వగ్రంథములతోపాటు నూత్నమైన నిఘంటువులను, వాచకములను, చరిత్రలను, వ్యాఖ్యానములను అందించి తెలుగు సంస్కృతికి మహోపకార మొనర్చిన బ్రౌనుమహాశయుడు రాజరాజనరేంద్రుడు, శ్రీకృష్ణదేవరాయలు, రఘునాథనాయకుడు మొదలైన ప్రభువులకంటె గూడ ఆరాధనీయుడు, చిరస్మరణీయుడు, అతని ఋణమును తెలుగుజాతి యెన్నటికిని తీర్చుకొనజాలదు

భ

ని. రా.

## భట్నగర్ శాంతిస్వరూప్ (1894 - 1955)

శాంతి స్వరూప్ భట్నగర్ అను సుప్రసిద్ధశాస్త్రజ్ఞుడు 1894 సం॥ ఫిబ్రవరి 21 వ తేదీన పంజాబు రాష్ట్రములో షాపూర్ జిల్లాయందలి భేరా అను గ్రామములో జన్మించెను ఆ గ్రామమిప్పుడు పశ్చిమ పాకిస్థానములో నున్నది భట్నగర్ తండ్రి ఉపాధ్యాయుడు పసితనమునందే పితృవియోగము సంభవించుటచే, భట్నగరు, తల్లి ఆధీనములో పెరిగి, స్వయంకృషివలన, ప్రఖ్యాత శాస్త్రవేత్తయైనాడు

ఈతడు లాహోరునందలి ఫోర్‌మన్ క్రైస్తవ కళాశాలలో విద్యనభ్యసించి, 1919లో పంజాబు విశ్వవిద్యాలయమునుండి ఎం. ఎస్. సి పట్టమును సంపాదించెను ఆ వెంటనే ఆతడు ఇంగ్లండు వెళ్లి ఆచార్య ఎఫ్ జి డోనన్ వద్ద పరిశోధనాత్మక వ్యాసంగమును ప్రారంభించెను అచ్చట ఈయనకు జె సి ఘోష్, జె. యన్. ముఖర్జీ అనువారు సహపాఠులైరి వీరు పరస్పర సహకారముతో, ప్రోత్సాహముతో కృషి సల్పి "ముగ్గురు వీరాగ్రణులు" అను ఉన్నతకీర్తికి పాత్రులయిరి

డోనన్ ఆచార్యుని పర్యవేక్షణముక్రింద భట్నగర్ ఔషధ రసాయనములను గురించి అధ్యయనమొనర్చి, జల-తైల, తైల-జల, ఔషధరసాయనముల స్వభావ లక్షణములను మార్చుటకును, స్థిరముగనుండునట్లు చేయుటకును అనువైన విధానమును వెల్లడించెను ఆ అధ్యయనము వలన ఈయనకు 1921 లో లండన్ విశ్వవిద్యాలయమునుండి డాక్టరేట్ పట్టము లభించెను. దానితో ఆతనికి స్వతంత్రముగా పరిశోధనములను కొనసాగించుటకు స్థాయి కలిగెను తరువాత కొలది నెలలవరకు భట్నగర్ ఐరోపా పర్యటన మొనర్చుచు, పారిస్ నగరమందలి సార్బోన్ పరిశోధనాలయములోను, బెర్లిన్ నగరమందలి కెయిజర్ విల్హెల్మ్ పరిశోధనాలయములోను కొంత అనుభవము గడించుకొని భారతదేశమునకు మరలివచ్చెను

భట్నగరు మాతృదేశమునకు తిరిగివచ్చిన వెంటనే, కాశీ విశ్వవిద్యాలయములో రసాయన శాస్త్రాచార్య పదవిని అధిష్ఠించెను. అచ్చట 1924 వరకుండి, తన శిష్యులతోను, అనుయాయులతోను కలిసి కొల్లాయిడ్ పదార్థములనుగురించి పరిశోధనములకు కొనసాగించెను. ఈ శాస్త్రవేత్త కలిగించిన ఉత్తేజమువలన ఆ విశ్వవిద్యాలయములో, నాటినుండి నేటివరకు, భౌతికరసాయన శాస్త్ర విభాగమందలి వివిధ విషయములనుగురించి పరిశోధనాత్మక కృషి నిర్విరామముగా కొనసాగుచు వచ్చుచున్నది

భట్నగర్ 1924 అక్టోబరులో పంజాబు విశ్వవిద్యాలయములో భౌతికరసాయన శాస్త్రాచార్య పదవిని, లాహోరులోని పరిశోధనాలయమునకు ఆధిపత్యమును, స్వీకరించెను అచ్చట 1940 వరకు ఎడతెరపిలేకుండ ఈతడు నిర్వహించిన పరిశోధనములు ఈయనకు అజరామరమైన కీర్తిని చేకూర్చెను ఈ శాస్త్రవేత్తయొక్క పరిశోధనాలయము భారతదేశమందలి వైజ్ఞానిక పరిశోధకులకు భావవికాసహేతువై మార్గదర్శకమై, పుణ్యతీర్థప్రాయమైనది. పది సంవత్సరముల పాటు భట్నగర్, తన శిష్యులతో పాటు, ముఖ్యముగా భౌతికరసాయన శాస్త్రవిభాగమునకు చెందిన కొల్లాయిడులు, ఉపరితలముల భౌతికరసాయన స్వభావములు, తేజఃకిరణోత్తేజిత రసాయనక్రియలు, అయస్కాంతిక రసాయనశాస్త్రము అనుశాఖలలో కృషిసల్పెను 1935లో ఈ శాస్త్రవేత్త ఆర్ యన్ మథుర్‌తో కలిసి మాగ్నెటో-ఇంటర్‌ఫెరెన్స్‌బ్యాలెన్స్ అను వైజ్ఞానికశాస్త్ర సాధనమును క్రొత్తగా సృష్టించెను.

ఇతడు ఈ సాధనమును, వైజ్ఞానిక శాస్త్రసాధనముల నిర్మాణములో ప్రపంచఖ్యాతినందిన ఆడమ్‌హిల్లర్ అండ్ కంపెనీ వారు విరివిగా తయారుచేసి, విజ్ఞానశాస్త్రవేత్తలకు సరఫరా చేయుటకనుమతి నిచ్చి, అయస్కాంతిక రసాయనశాస్త్రాభివృద్ధికి దోహదమొసగెను ఆ వెంటనే తన పరిశోధనలను, ఇతర పరిశోధకుల వ్యాసంగములను క్రోడీకరించి, వివరణము లతో "అయస్కాంతిక రసాయనశాస్త్రము" అను బృహద్గ్రంథమును రచించి, మాక్మిలన్ కంపెనీవారిచే ప్రకటింపజేసెను భట్నగర్ కృషివలన, ఒక నూతన శాస్త్రవిభాగము తీర్చి దిద్దబడెను ఇతడు ఈ శాస్త్రావతరణమునకు భగీరథుని వంటివాడు

భట్నగరు యొక్క పరిశోధనములు కేవలము వైజ్ఞానిక శాస్త్రాభివృద్ధికి మాత్రమే పరిమితము కాలేదు ముడి పెట్రోలియమునుగూర్చి లాహోరు పరిశోధనాలయములో ఈతడు చేసినకృషి 'స్టీల్ బ్రదర్స్ అండ్ కంపెనీ' వారికి లాభకరముగా పరిణమించినది ఈ కంపెనీ వారు అతని కృషికి వలసిన ఆర్థికసహాయము చేయుటయేకాక, ఐదు లక్షల రూప్యములను అదనముగా నిచ్చి ఆధనమును చిత్తము వచ్చినట్లుపయోగించుటకనుమతినిచ్చిరి తన వైజ్ఞానిక సలహాలకు ప్రతిఫలముగా వ్యాపార సంస్థలనుండి, లభించిన ఆదాయమును, తన మాటపై పరిశోధనములకు దాతలిచ్చిన విరాళములను, మొత్తముగా లాహోరు విశ్వవిద్యాలయము ద్వారా యువ వైజ్ఞానిక పరిశోధకులకు ఉపకార వేతనముల రూపములో భట్నగర్ పంచిపెట్టెను

రెండవప్రపంచ యుద్ధారంభమున గవర్నరు జనరలుగా నుండిన లిన్‌లిత్‌గో ప్రభువు, భట్నగరును ఆహ్వానించి భారత దేశమందలి వైజ్ఞానిక, పారిశ్రామిక పరిశోధనల కేర్పరుప బడిన సంస్థకు ఆదిపత్యము వహింపుమని కోరెను నాటినుండి భట్నగర్ ఈ బాధ్యతను స్వీకరించి, వైజ్ఞానిక, పారిశ్రామిక, ప్రగతికి పట్టుగొమ్మ యైనాడు క్రమముగా ఇతడు పెక్కు పదవుల నలంకరించి, యుద్ధములో విజయమునకును, తదుపరి దేశముయొక్క పురోగతికిని చేదోడైనాడు

ఈ శాస్త్రవేత్త యొక్క అధ్వర్యములో జరగిన కృషి వలన, విషవాయు నిరోధక వస్త్రములు, రకరకముల వార్నీషులు, నురుగునిచ్చు పదార్థములు, కందెన తైలములుగా నుపయుక్తములగు తైలమిశ్రమములు, గాజునకు ప్రత్యామ్నాయముగా వాడుటకు వీలైన వస్తువులు, నిరుపయోగకరమగు పదార్థములనువాడి, రాసాయనికముగా కల్పించిన ప్లాస్టికులు, గుగ్గిలములు, ఖనిజపదార్థాత్మక మైనములు, కలపనుండి

చిత్రము 111



శాంతిస్వరూప భట్నగర్

సృష్టించుటకు వీలైన రకరకముల పదార్థములు భారతదేశమున లభించు పెక్కు ముడిసరకులనుండి రకరకముల వస్తువులను తయారుచేసుకొను విధానములు లభించెను తత్ఫలితముగా పెక్కురు యువ వైజ్ఞానికుల మనోగత భావములు ఫలించినవి

తిరువాన్కూరులోని మోనొజైటు అను ఇసుక నుండి అపురూప మైన ఖనిజములను తయారు చేయుటకు పరమాణు గర్భిత మైన శక్తిని అందించు ఖనిజముల అన్వేషణకొర కేర్పడిన "ఇండియన్ రేర్ ఎర్త్స్ లిమిటెడ్" కంపెనీయొక్క నిర్మాణములో ఈ శాస్త్రవేత్త ప్రధానమైన పాత్రను వహించెను అనేక ధాతుసాధనక్రియలు, రాసాయనిక విధానములు భారతీయ పరిస్థితులకును, అవసరములకును అనుగుణముగా తీర్చి దిద్దబడినవి. మాంగనమను ఖనిజమందలి మలినములను తొలగించు విధానము విశేషముగ లాభకరమైనదని రుజువైనది

ఈతని జోక్యమువలన వ్యాపార సంస్థలు పరిశోధనమునకై వెచ్చించిన సొమ్ముపై ఆదాయపు పన్నును ప్రభుత్వము రద్దు చేసెను వైజ్ఞానిక పరిశోధనముల కవసరమైన సాధనములపై దిగుమతి పన్నునుకూడ వసూలుచేయుట ప్రభుత్వము మాని వేసెను ఈ రెండంశములు భట్నగర్ యొక్క నిశిత దృష్టిని, ప్రతిభను వెల్లడించగలవు

భారతదేశమందలి పరిశ్రమాధికారులతోను, విదేశములలోని ప్రఖ్యాత పారిశ్రామికవేత్తలతోను ఈతనికి మైత్రీ సంబంధము లుండెడివి ఆ సుహృద్భావసంపద ఇతని కృషిని సుకర మొనర్చెను భారతదేశములో ముడి పెట్రోలియము లభించు అవకాశములు సహజముగా తక్కువగా నుండెను అందుచే దేశీయావసరములకు సరిపడు పెట్రోలియము పదార్థముల సేకరణమునకు ప్రఖ్యాతిచెందిన మూడు విదేశీయ సంస్థలతో భట్నగర్ లాభకరమైన ఒప్పందములను కుదుర్చుకొనెను తత్ఫలితముగా భారతదేశమునందు నూనెశుద్ధి కర్మాగారములు వెలసినవి

భట్నగర్ శిష్యవాత్సల్యముగల ఆచార్యుడు, దేశభక్తుడు స్వాతంత్ర్యము సిద్ధించినతరువాత ఆర్థికోన్నతికిని వైజ్ఞానికపురోభివృద్ధికిని పథకములు వేయుటలో నెహ్రూపండితునికి ఇతడు ముఖ్య సహచరుడైనాడు బరోడాలో 42వ సైన్సు కాంగ్రెసు సమావేశమునకు ప్రారంభోత్సవము చేయుచు, భారతదేశములో వైజ్ఞానిక శాస్త్రాభివృద్ధికై భట్నగర్ తో సమానముగా పాటుపడినవ్యక్తి మరొకడు లేడని నెహ్రూపండితుడు ఘంటాపథముగా వక్కాణించెను భట్నగర్ భారతప్రభుత్వముతో సహకరించి కృషిచేసిన ఫలితముగా 1950–1954 సంవత్సరముల మధ్యకాలములో సుమారు 12 వైజ్ఞానిక, సాంకేతిక, శాస్త్రీయసంస్థలు భారతదేశమందలి వివిధనగరములలో స్థాపింపబడెను ఇతడు పెక్కుదేశములలో పర్యటించి అత్యంత నవీన సాధనసంపత్తిని విశేష ధన వ్యయముతో సేకరించి, పరిశోధనాలయములను దేవాలయములుగా రూపొందించుటకు కారణభూతుడైనాడు

యూనివర్సిటీ గ్రాంట్స్ కమీషనుకు భట్నగర్ మొదటి అధ్యక్షుడు ఎక్కడెక్కడనోఉన్న శాస్త్రవేత్తలందరును యథాశక్తి పరిశోధనములను కొనసాగించుట కుత్సహింపవలెననియు, వారికి ఆర్థికసౌకర్యములను కల్గించవలెననియు, భట్నగర్ వాంఛించెను విశ్వవిద్యాలయములలోను, అనుబంధకళాశాలలలోను పనిచేయు ఆచార్యులకు, అధ్యాపకులకు ఇతడు జీతముల పెంపుదలను మంజూరుచేయించెను శాంతి విశ్వవిద్యాలయములో, ఆసియాఖండమందలి వివిధ ప్రధాన భాషల అధ్యయనమును ప్రోత్సహించుటకొరకు విద్యాకేంద్రమును ఇతడు ఏర్పరచి ప్రగత్యాత్మకమైన దూరదృష్టిని వ్యక్తమొనర్చెను

భారతదేశములో విజ్ఞానశాస్త్రములు పురోగమించుచున్నయుగములో జీవించియున్నవాడు భట్నగర్ ఇతడు (సర్) ప్రఫుల్లచంద్రరాయ్, (సర్) చంద్రశేఖర వెంకట రామన్ మొదలగు ప్రఖ్యాత శాస్త్రవేత్తల కోవకు చెందినవాడు ఇతడు అవిరామముగా కృషిసల్పుచు, విశేష శక్తిసంపదను వ్యక్తమొనర్చుచు, విధి నిర్వహణములో సాటిలేనివాడనిపించుకొనెను ఇతని జీవితయాత్రలో శ్రీమతి లాజ్వంతి తోడునీడగా మెలగుచుండెడిది ఆమె అతనిని సర్వదా అనుసరించి సేవించెను ఈ దంపతుల కిద్దరు కుమారులు, ఇద్దరు కుమార్తెలు కలరు 1946 లో భట్నగరునకు భార్యావియోగము సంభవించెను తనకీవియోగమువలన కలిగిన విషాదమును ఉర్దూభాషలో గేయరూపమున వెల్లడించెను కులభేదమును, విగ్రహారాధనమును నిరసించిన బ్రహ్మసమాజములో భట్నగర్ చిన్ననాటినుండియు సభ్యుడుగా నుండెను 1946 తరువాత ఇతడు కొడుకులతో, కోడండ్రతో జీవించుచు, ఢిల్లీ నగరమునకు కొలది దూరములోనున్న నొక చిన్న వ్యవసాయక్షేత్రమందు కాలక్షేపముచేయుటకు అప్పుడప్పుడు వెళ్లుచుండెడివాడు. భారతప్రభుత్వములో సహజ ఖనిజ సంపత్పరిశోధనశాఖకు, వైజ్ఞానిక పరిశోధనశాఖలకు, ఇతడు కార్యదర్శిగానుండి కర్తవ్యపాలన చేయుచుండెడివాడు

ఇతడు ఇండియన్ కెమికల్ సొసైటీకి అధ్యక్షుడుగా ఎన్నుకొనబడెను అట్లే సైన్సు కాంగ్రెసుయొక్క రసాయనశాస్త్రవిభాగమునకు, సర్వసంఘసభకు అధ్యక్షుడయ్యెను. అనంతరము ఇతడు నేషనల్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ సైన్సెస్ అను సంస్థకు అధ్యక్షుడుగా ఎన్నుకొనబడెను 1936 లో బ్రిటిష్ ప్రభుత్వమితనికి 'ఆర్డర్ ఆఫ్ బ్రిటిష్ ఎంపైర్' అను బిరుదమును, 1941 లో 'సర్' అను బిరుదమును ఇచ్చి గౌరవించెను. 1943 లో రాయల్ సొసైటీవారు ఇతనిని 'ఫెలో' గా ఎన్నుకొనిరి అట్లే ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఫిజిక్స్ అను సంస్థవారు కూడ ఈతనిని 'ఫెలో'గా ఎన్నుకొని సన్మానిం

చిరి 1947 లో ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు ఇతనికి 'కట్టమంచి రామలింగారెడ్డి' పేరనొక బహుమతినిచ్చి ఇతడు జరిపిన రసాయనశాస్త్ర వ్యాసంగమునకు హర్షామోదములు ప్రకటించిరి ఆక్స్‌ఫర్డు, ఢిల్లీ, అలహాబాదు, పాట్నా మున్నగు విశ్వవిద్యాలయములితనికి ఎన్నియో గౌరవ డాక్టరేటు పట్టముల నిచ్చి సన్మానించెను 1981 నుండి విదేశములకేగిన వైజ్ఞానిక ప్రతినిధి వర్గములలో ఇతడు సభ్యత్వము వహించి తన దేశమునకు, తన వ్యక్తిత్వమునకు వన్నె తెచ్చెను 1954 లో భారత ప్రభుత్వము సర్వతోముఖమైన ఈతని ప్రతిభావిశేషములను, సేవాశక్తిని, గుర్తించి 'పద్మవిభూషణ' అను పతకమును, బిరుదమును ప్రసాదించి గౌరవించెను

వివిధపదవుల నలంకరించి, భారతదేశములో విజ్ఞాన శాస్త్ర వ్యాప్తికి అనన్యమైన కృషిచేసిన భట్నగర్ శాస్త్రవేత్త 1955 సం॥ జనవరి 1 వ తేదీన హృద్రోగకారణముగా ఢిల్లీనగరములో పరమపదించెను

హ. అ.

## భట్టిప్రోలు.

భట్టిప్రోలు దక్షిణ భారతదేశము నందలి ప్రాచీన బౌద్ధ మహాతీర్థములలో నొకటియై యున్నది ఈ గ్రామము గుంటూరు జిల్లా రేపల్లె తాలూకాలో నున్నది దీనికి ప్రతిపాలపురమనియు నామాంతరము కలదు విక్రమార్క మహారాజు సోదరుడును, మహామంత్రియు నైన భట్టి ఇచ్చట జన్మించినట్లు తెలుపు ఒక ఐతిహ్యము ప్రచారమునందున్నది

ఈ గ్రామమునందు గల మూడు పెద్ద మట్టిదిబ్బల యందు పురాతత్త్వ శాస్త్రజ్ఞులు ఖనన పరిశోధనములు జరిపినప్పుడు బౌద్ధ మహాతీర్థమునకు సంబంధించిన పెక్కు అవశేషములు లభించినవి. 1870వ సం॥న 'బాస్వెల్' పండితుడు ఈ బౌద్ధతీర్థమును గురించియు, ఇచటగల స్తూపములను గురించియు కొంత తెలిపియుండెను ఆపిమ్మట, వాల్టర్ ఎలియట్ అనునతడు మరికొంత పరిశోధనము చేసెను రాబర్టు సూయల్ అనునతడు 1878 వ సం॥న దీనిని సందర్శించి, స్తూపమున్న ప్రదేశమున, తనకెట్టి శిలాఫలకములు కానరాలేదని వివరించెను కాని "పల్లెటూరు లాకుగోడలకును, నేల చప్టాకును విరివిగా వాడబడిన రాళ్లను చూచిన పిమ్మట నిజముగా అవన్నియు చెక్కడాలున్న రాళ్లే అనియు, భట్టిప్రోలు పెద్ద బౌద్ధతీర్థమనుట సత్యమే అనియు, అతడు మద్రాసు ప్రభుత్వమునకు పంపిన నివేదికలో తన అభిప్రాయమును వెల్లడించెను 1892వ సం॥న అలెగ్జాండరు రీయా యను పురాతత్త్వశాస్త్రవేత్త అచ్చట కొంత ఖనన పరిశోధనము చేసి, మూడు రాతిపేటికలను, కొన్ని ఆభరణములను కనుగొని వాటికి వెలుగును ప్రసాదించెను

మొదటి మట్టిదిబ్బ ఈ దిబ్బయందు బయల్పడిన బౌద్ధ మహాస్తూపము ప్రాచీనకాలపు బౌద్ధ సంస్కృతికి జ్ఞాపక చిహ్నమై, పరిశోధనా రంగమునందును, ఆంధ్రదేశ చరిత్రయందును ఒక విశిష్టస్థానము నాక్రమించి యున్నది స్థానికులు దీనిని 'లంజదిబ్బ' యను కళంకనామముతో వ్యవహరించుచుండిరి

ఈ మట్టిదిబ్బ విస్తీర్ణము 1700 చదరపు గజములు, ఎత్తు 14 అడుగులు ఈ దిబ్బయందు లభించిన స్తూపపు వ్యాసము 132 అడుగులు, ఎత్తు 33 అడుగులు ఈ స్తూపము చుట్టును నిర్మింపబడిన ప్రాకారము యొక్క వ్యాసము 148 అడుగులు దీనిచుట్టును 4 అడుగుల ఎత్తుగల ప్రాకారమును నిర్మించి, ఒక ప్రదక్షిణపథము నేర్పరచిరి ఈ ప్రాకారము పైన చిత్రవిచిత్రమైన శిల్పసంపదతో నొప్పారు చలువరాతి ఫలకములు కలవు ఈ మహాస్తూపముపైనను, దానిచుట్టు గల ప్రాకారపు గోడలపైనను మలచబడిన శిలాఫలకము లేవియు మనకు లభించుటలేదు ఈ స్తూపాగ్రపు మధ్యభాగమునందును, చుట్టును 8 ఇటికలతో అమర్చబడిన యొక రంధ్రమున్నది ఇది పైనుండి క్రిందివరకు ఏర్పరచ బడినది ఈ రంధ్రమునందు ఒక ఎత్తైన చలువరాతి స్తంభమునుంచి, దాని అగ్రమునందు ఛత్రముయొక్క కామను తగిలించెడివారట !

ఈ మహాస్తూప మధ్యమందుగల రంధ్రమునను, ఇతర స్థలముల యందును, ఖనన పరిశోధనము చేయగా అందు మూడు రాతిపేటికలు లభించినవి ఇవి బుద్ధునియొక్క జ్ఞాపక చిహ్న పేటికలట ! ఈ పేటికలను పురాతత్త్వ శాఖవారు జాగ్రత్తగా భద్రపరచి యుంచిరి

పేటికలలో ఎముకలు, నీలమణిరాళ్లు, ఒక పసుపుపచ్చని స్ఫటికపురాయి, షడ్భుజాకారముగల ఒక చిన్న పసుపు పచ్చని స్ఫటికపురేకు, మంచి ముత్యములు, పగడములు, బంగారపు పూలు, హస్తములతో ఆయుధములు ధరించి యున్న రెండు బొమ్మలు, మరికొన్ని చిన్నచిన్న రాగి ముక్కలు లభించినవి.

అపురూపమైన శిల్పసౌందర్యముతో నొప్పు పెక్కు చెక్కడపు పనిముట్లుకూడ లభించినవి ఒక పెద్ద సానరాయిని మూడువంతులు గోడలో నుండునట్లు బిగించిరి దానిపైన ఉత్తమజాతి గుఱ్ఱములపై రౌతులు స్వారి చేయుచున్నట్లు అందమైన చిత్రములను చిత్రించిరి వీటికి ఎడమవైపున నిలిచి యున్న ఒక మనుష్య విగ్రహపు అధోభాగము మిక్కిలి మనోహరముగా మలచబడి యున్నది

ఈ బౌద్ధస్తూపము కేవలము ఇటికలతోను, మట్టితోను నిర్మింపబడినది ఈ ఇటికలు 2 అడుగుల పొడవు, 1½ అ వెడల్పు కలవై యున్నవి ఈ స్తూపనిర్మాణములో ఉపయోగింపబడిన ఇటికల పరిమాణమును బట్టియు, నిర్మాణ విధానమును బట్టియు, ఇందు లభించిన శాసనములు ప్రాకృత భాషలో నుండుటను బట్టియు, ఇది మౌర్య సంప్రదాయమునకు చెందిన అతి ప్రాచీన నిర్మాణమై యుండునని పురాతత్త్వ శాస్త్రజ్ఞు లూహించి యుండిరి కాని ఇట్టి ఇటికలే జగ్గయ్యపేట, అమరావతి మొదలైన ఇతర బౌద్ధ తీర్థములయందలి నిర్మాణములలో కూడ ఉపయోగింపబడి యుండుటచే, ఈ వాదమును నేటి పరిశోధకు లంతగా విశ్వసించుటలేదు ఏది ఎట్లయినను ఈ తీర్థము క్రీ పూ మూడవశతాబ్దము నాటిదై యుండవచ్చునని పెక్కుమంది ఖననశాస్త్రజ్ఞులు అంగీకరించిరి

ఈ స్తూపపు అట్టడుగున దొరకిన శాసనములలో కుబేరుడను నొక రాజు పేరున్నది ఈ రాజునకు, ఈ స్తూపమునకు గల సంబంధ మెట్టిదో సరిగా తెలియవచ్చుటలేదు ఈ స్తూప నిర్మాణ విధానము అమరావతి, జగ్గయ్యపేటలయందలి స్తూపముల నిర్మాణవిధానమును పోలియుండుటచే తను, వాటిని ఇక్ష్వాకు వంశపురాజులు నిర్మించియుండుటచేతను దీనినిగూడ వారేనిర్మింపించియుందు రనియు,ముఖ్యముగాబుద్ధునిమరణానంతరములందు సాక్షాత్ బుద్ధుని అస్థిశకలము నుంచి నిర్మించిరనియు గూడ తెలియుచున్నది ఈ అస్థిశకలమును ఒక చిన్న పెట్టెయందుంచి దానినొక స్ఫటిక కరండములో పెట్టి, రత్నములతో, స్వర్ణ ముద్రికలతో, బంగారు పుష్పములతో దానిని పూరించి, భద్రముగా దానినొక గొప్ప శిలాకరండములో నుంచి అట్టడుగునపెట్టి ఈ మహాస్తూప నిర్మాణము గావించిరి ఇచ్చట లభించిన మూడు కరండములలో ఒకదాని యందు మాత్రమే ఇట్టి అస్థిశకల మున్నది

ఈ స్తూపముల నిర్మాణములో ఉపయోగింపబడిన పాలరాళ్లు పలనాటిసీమకు చెందినవని పురాతత్త్వ శాస్త్రజ్ఞు లభిప్రాయపడిరి అయితే ఈ శిల్పములు అంత నాగరకమైనవి కావు అందుచే ఇవి బౌద్ధ శిల్పకళయొక్క ప్రథమదశకు సంబంధించినవని భావింపబడినది

రెండవ మట్టిదిబ్బ ఈ దిబ్బయందు రెండవ స్తూపమునకు సంబంధించిన పెక్కు శిథిలావశేషములు, పూసలు, బరిణెలు లభించినవి

**మూడవ మట్టిదిబ్బ** మూడవ మట్టిదిబ్బను 'విక్రమార్క'కోట దిబ్బయని ప్రజలు వ్యవహరించు చుందురు ఈ ప్రాంతమందంతట నేడు వ్యవసాయము చేయబడుచున్నది ఇచ్చట మూడవ బౌద్ధస్తూపమునకు సంబంధించిన పెద్ద ఇటికలు ఇతరములైన పెక్కు అవశేషములు కప్పతిప్పలుగా లభించినవి

ఈ మూడు బౌద్ధస్తూపములకు సంబంధించిన ఇటికలను అద్భుత శిల్పసౌందర్యముతో నొప్పు పాలరాళ్ల విలువను గుర్తింపక, కొందరు స్థానికప్రజలు వాటిని త్రవ్వి తీసి తమ ప్రయోజనముల కొరకు వాడుకొనియుండిరి

ఈ బౌద్ధమహాక్షేత్రము మిక్కిలి ఉన్నతదశలో నున్నప్పుడు స్వదేశీయ విదేశీయ యాత్రికులతో, బౌద్ధశ్రమణులతో ఇది కళకళ లాడుచుండెడిదట ! భట్టిప్రోలు మహత్తర బౌద్ధ సాహితీ సంస్కృతులకు కేంద్రమై విలసిల్లినది

పు వేం.

## భద్రాచలము

భద్రాచలము గౌతమీనదీతీరమున రాజమహేంద్రవరమునకు ఎగువ ఉత్తరముగా నూరుమైళ్ళదూరములో తూర్పుకనుమలయందు అడవిప్రాంతములలోనున్న యొక పుణ్యక్షేత్రము గోదావరి యెడమయొడ్డున ఫర్లాంగు దూరములో భద్రాద్రి రామాలయమున్నది మేరుపర్వతుడు బ్రహ్మను గూర్చి తపస్సుచేసి పుత్రుని బడసి వానికి భద్రుడను పేరిడెననియు, భద్రుడు గౌతమిలో స్నానమొనరించుచు శ్రీరామునిగూర్చి తపమొనరించి, రామసాక్షాత్కారమొంది, ఆదేవుడట నివసించునట్లు వరమొందెననియు, నాటినుండి ఆకొండ భద్రాద్రియని ప్రసిద్ధమాయెననియు బ్రహ్మాండ పురాణమువలన తెలియుచున్నది పూర్వము పోకలదమ్మక్కయను శబరభక్తురాలికి సీతారాములు స్వప్నమున సాక్షాత్కారమై తమమూర్తులు కొండమీదనున్నచోటును సూచింపగా, దమ్మక్క ఆవిగ్రహములను కనుగొని వాటికొక చిన్న మండపము నిర్మింపించెనట రామభక్తుడగు ఉద్యోగియొకడు

ఆటకువచ్చునని కూడ ఆమె కలగాంచెనట

క్రీ శ 1674 సంవత్సర ప్రాంతములో కంచెర్ల గోపన్నయను ప్రథమశాఖా బ్రాహ్మణుడు గోల్కొండ నవాబగు అబ్దుల్ హసన్ అను తానాషా కాలములో(1658-1687)

చిత్రము 112.



గోదావరి తీరమందలి శ్రీ రామాలయము

పటము 1

భద్రాచలము తహసిల్ దారుగా నియుక్తుడై సర్కారు బొక్కసమునుండి ఆరులక్షల రూప్యములు వెచ్చించి శ్రీరామునకు ఆలయములును, గోపురములును నిర్మించెను ఈయన దాశరథిశతకమును, రామదాసుచరిత్రయను పుస్తకమున గూర్చబడిన కీర్తనలను రచించి యావదాంధ్రమున వెదజల్లిన నాటినుండియు, భద్రాచలము, ఏటేట శ్రీరామనవమికిని, ముక్కోటి ఏకాదశికిని, వేలకొలది భక్తులనాకర్షించుచు ప్రసిద్ధమైనది

ఆ రామాయణగాథకు సంబంధించిన పెక్కు స్థలము లీ ప్రాంతముననున్నవి. రావణుడు జటాయువు రెక్కలను నరుకగా అవి పడినచోటు రేకపల్లియాయెనట! అది భద్రాద్రికి 28మైళ్ళదూరముననున్నది. పర్ణశాల 22మైళ్ళలో నున్నది భద్రాద్రికి దక్షిణమున నాలుగుమైళ్ళలో నదీగర్భమున వేడినీటి గుండములుకలవు అదిశేషుడిట, హోమకుండములు నిల్పి యజ్ఞములు గావించెనట! ఇచ్చటి కాగ్నేయమున 44 మైళ్ళలోనున్న రామగిరియనుచోట శ్రీరాముడు జటాయువునకు అగ్నిసంస్కారములు గావించెనట! ఈసమీపమందలి రెండుకొండలు వాలి సుగ్రీవుల గుట్టలనబడుచున్నవి.

రామదాసు అనబడుగోపన్న ఖమ్మంమెట్టు జిల్లాలోని నేలకొండ పల్లెయను గ్రామవాసి గోల్కొండ రాజధానిగా కుతుబ్‌షావంశపు రాజులు ఆరుగురు షుమారు 175 సంవత్సరములు క్రీ శ 1687 వరకును (అనగా మొగల్ చక్రవర్తియగు ఔరంగజేబు ఈ రాజ్యమును కూలద్రోసినంతవరకును) పాలించిరి వారిలో తుదివాడగు అబ్దుల్ హసన్ తానాషా వద్ద అక్కన్న మాదన్నలను అన్నదమ్ములు మంత్రులుగా నుండిరి వారు తమ మేనల్లుడగు గోపన్నను భద్రాద్రికి తహసిల్ దారుగా నియోగించిరి బాల్యమునుండియు భక్తిపరవశుడగు గోపన్న, కబీరుదాసు వలన రామమంత్రోపదేశ మొంది, భద్రాద్రిలో రాజకార్యములు నిర్వర్తించుచున్నను, దమ్మక్క సందేశమందుకొని భక్తిపారవశ్యముచే రామనామ సంకీర్తనముచేయుచు సంతర్పణములకును, రామాలయ నిర్మాణమునకును ద్రవ్యమును వ్యయించి బొక్కసము శూన్యము గావించుటచే, ఆతడు తానాషా బంట్లచే బందీగా గోల్కొండకు కొనిపోబడెను గోల్కొండ కోటలో నవాబుయొక్క అంతఃపురమువద్ద నొక కొండగదిలో గోపన్న బంధింపబడెను. ఆతడు వర్ణింప నలవిగాని అవమానములకును, బాధలకును గురిచేయబడెను భక్త్యావేశమున నోడలుమరచి రామదాసు కీర్తనలు పాడుచు పన్నెండేండ్లు కారాగారవాసమొనరించి మరణించె

ననికొందరందురు రామదాసు మొరలాలకించి, రామలక్ష్మణులు నవాబునకు స్వప్నముననగపడి, రామదాసు ఋణపడిన ఆరులక్షలరూప్యములను చెల్లించి, భక్తుని చెరనుండి విడిపించిరనియు, 1686 లో రామదాసు భద్రాద్రిచేరుకొని, అవసాన కాలమురాగా, తనకొరకువచ్చిన దేవవిమానమెక్కి బొందితో స్వర్గమునకేగెననియు కొందరందురు గోల్కొండశిథిలములలో రామదాసు బందిఖానా నేటికిని గలదు

"అదిగో భద్రాద్రీ, గౌతమి ఇదిగోచూడండి", "నను బ్రోవుమని చెప్పవే సీతమ్మతల్లీ, నను బ్రోవుమనిచెప్పవే", 'అంతా రామమయం బీజగమంతా రామమయం' మొదలగు

చిత్రము 118



పటము 2

రామదాసు కీర్తనలను స్మరించుచు భక్తులు గోదావరి యొడ్డున నున్న ఆంజనేయుని గుడినుండి కొండమీది శ్రీరామాలయము నకు రామదాసు కట్టించిన మెట్లెక్కి, గోపురముదాటి ధ్వజస్తంభము ప్రక్కనుండి వెలుపలిమండపమును, ముఖమండపమును దాటి ప్రక్కనున్న వెండి ఊయలచూచి, పశ్చిమాభిముఖముగా నున్న సీతా రామ లక్ష్మణుల విగ్రహము లున్న గర్భాలయమును చేరుదురు ఆలయ నిర్మాణమున శిల్పవిశేషములు లేవు విగ్రహములు మూడడుగుల యెత్తుండును రామవిగ్రహపు చతుర్భుజములలో కుడిచేత శంఖమును, ఎడమచేత చక్రమును, మిగిలినరెండింట విల్లు నమ్ములు ను గలవు పద్మాసనస్థుడగు రాముని యొడమతొడపై సీతాదేవి కలదు ప్రక్కన లక్ష్మణుడున్నాడు రామదాసు చేయించిన రవ్వల మొలత్రాడుతో, చింతాకుపతకముతో, పచ్చల పతకముతో, కల్కితురాయితో, ఇతర భక్తులు చేయించిన యాభరణములతో, ఉత్సవసమయము లలో, శ్రీరాముని అలంకరింతురు సమీపమున లక్ష్మణగుడి, స్వర్ణసీతగుడి, నరసింహునిగుడి, ఆళ్వారుల గుడులు మొదలగునవి ముప్పది యున్నవి ప్రవేశ గోపురమునకు దిగువన అద్దాలమేడలో సీతమ్మకు శుక్రవారోత్సవములు గావింతురు భక్తులు రామకోటి వ్రాసి తెచ్చు కాగితములను గ్రహించు గది యొకటి కలదు రామదాసు యొక్క ఋణమును తీర్చుటకై రామలక్ష్మణులు చెల్లించిన నాణెములను చూపుదురు గోపురపు మెట్లదిగువన వాహనములగది, ఆలయపు కచేరీ, రామదాసు కట్టించిన కల్యాణమండపమును కలవు కొండమీది గుడులనుండి మరియొక గోపురద్వారమున మెట్లమీదుగాదిగి ఊరిలోనికి దిగిపోవచ్చును సీతారాముల కెదుట నొకప్రక్క రామదాసు విగ్రహమున్నది ఆలయమువెనుక భద్రుని కోవెల గలదు రామలక్ష్మణులను పేర రెండు శిలాఫలకములపై శాసనములు చెక్కించి భద్రున కెదుట ప్రతిష్ఠించిరి ఒక గుట్టపై నరసింహస్వామి కోవెలయు, ఊరిలో సమీపమున కాశీవిశ్వనాథుని శివాలయమును గలవు ఊరిలో గుంటూరివారి సత్రము; అంబా సత్రము మొదలైనవి గలవు లక్ష రూప్యముల వ్యయముతో కాకినాడలోని

పై దాఖారి సత్రము నిర్మింపబడినది. ఊరిలో తాతకోవెలయను గోవిందరాజస్వామి గుడి యున్నది. శ్రీరాము లీస్వామిని గొలిచిరట. రామదాసేర్పరచిన ప్రబోధోత్సవము, పూజలు, ఆరగింపు సేవలు, నిశాముఖమున దర్బారు సేవ, తరువాత పర్యంకోత్సవము, శయనోత్సవము మొదలగునవి జరుగుచున్నవి. శుక్రవారమునందు, ఏకాదశినాడు, పూర్ణిమయందు, పునర్వసు నక్షత్రమున, ఇతర ముఖ్యకాలములయందు ప్రత్యేక సేవలుండును. చైత్రశుద్ధ నవమినాడు శ్రీరామజననము, శ్రీరామ కల్యాణముగూడ జరుగును. పాంచరాత్రాగమమునుబట్టి ఆరాధనములు జరుగును. సంవత్సరము పొడవునను శరన్నవరాత్రాద్యుత్సవములు జరుపబడును. వైకుంఠ ఏకాదశీ సందర్భమున పదిరోజులు దశావతారములు ప్రదర్శింపబడును.

1957 వ సంవత్సరములో శ్రీరామనవమినాడు గోదావరిలో జరిగిన పడవ ప్రమాదములో సుమారు రెండువందల మంది భక్తులు నదిలో పడి మరణించుటచే, 1959 లో ఆంధ్ర రాష్ట్ర ప్రభుత్వమువారు భద్రాద్రికడ గౌతమికి నాలుగువేల అడుగుల పొడవున ఒక వంతెనను నిర్మించిరి. వేలకొలది భక్తులు చూడగలుగునట్లు విశాలస్థలములో సీతారామ కల్యాణోత్సవము జరుపబడుచున్నది. దేవాలయములను బాగుచేసి విస్తృతపరచుటకు 25 లక్షల రూప్యముల వ్యయముతో ఆంధ్రప్రభుత్వపు దేవాదాయ ధర్మాదాయశాఖవారి యాజమాన్యమున నొక పథకము 1960 లో ఆరంభమై ఇటీవలనే ముగిసినది.

గోల్కొండ తానాషాకు రామలక్ష్మణులు ప్రత్యక్షమైనది మొదలు గోల్కొండ నవాబులును, నైజాములును, తమ ఏలుబడిలోనున్న భద్రాద్రి, పర్ణశాల, మొదలగు ఆలయములకు సుమారు పందొమ్మిదివేల రూప్యములు ఏటేటా వ్యయపెట్టుచుండిరి. సీతారాము కళ్యాణమునకు ముత్యాల తలంబ్రాలు, హైదరాబాదునుండి వచ్చుచుండెడివి. ఆంధ్రప్రాంతము 1766 నాటికి ఈస్టిండియా కంపెనీ పాలనము క్రిందికి వచ్చినను, భద్రాద్రి మినహా, తక్కిన భద్రాద్రి తాలూకా ప్రాంతమును మాత్రమే, 1860 వ సం॥లో నైజాము ఆంగ్లప్రభుత్వమున కప్పగించెను. ఆలయాధిపత్యమును 958 వరకును నైజాము ప్రభువులే నిర్వహించిరి. రామదాసు అనంతరము, భక్తుడైన తూము నరసింహదాసు అను తహసిల్ దారును, మద్రాసు నుండి వచ్చిన వరదరామదాసు అను మహాధనిక భక్తుడును విశేషధనమును వెచ్చించి ఆలయ నిర్మాణమునకు పూనుకొనిరి. కాని నిర్మాణపుపనులు పూర్తి కాకుండగనే వరదరామదాసు మరణించెను. ప్రభుత్వ ధన దుర్వినియోగమునకై నరసింహదాసును నైజాము సేవకులు హైదరాబాదునకు కొనిపోవరాగా, ఆతడు, వరదరామదాసు శవమును వెంటతీసికొని

చిత్రము 114



సీతారామలక్ష్మణులు – ఉత్సవ విగ్రహములు

పటము 8

వరద సమయమున గోదావరిని దాటబోయి నదీమధ్యమున శవమునుదించి, భక్తితో గానముచేయుచు, తానును నదిలో పడి మరణించెనట! ఈ దాసద్వయము యొక్క పరస్పరానురాగ మట్టిది.

1789 సం॥ ప్రాంతములో ధంసా అను తురుష్క సేనానాయకుడు దేశమును కొల్లగొట్టుచు, భద్రాద్రిపై పడగా, శ్రీరామచంద్రుడు పోలవరమునకు తొలగిపోయెననియు, ఇంకొకమారు అరాజకమేర్పడ, అర్చకస్వాములు విగ్రహములను నదీగర్భమున దాచిరనియు, 1785 నాటికి మూర్తులు మరల భద్రాద్రికి తేబడెననియు, భల్లా పేరయ్య అను కవి రచించిన భద్రగిరి శతకమువలన తెలియుచున్నది. అనంతరము పెక్కండ్రు భక్తులు స్వామికి కైంకర్యములు చేసిరి. చందు

లాల్ అను హైదరాబాద్ ప్రభుత్వ మంత్రి, ఆలయ పోషణమునకు గొప్ప ఏర్పాట్లు చేసెను భక్తి కీర్తనలు రచించిన నిష్ఠల ప్రకాశదాసు చేసిన అద్భుతచర్యలను ఆంధ్రులు చెప్పుచుందురు ఆలయమునకు విద్యుత్కాంతి యంత్రములను విశ్వదాతయగు శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు కల్పించెను పెక్కురు స్వాప్నికభక్తులు వివిధ సేవలుచేసిరి 1960 లో ఆరంభమై పూర్తిగావింపబడిన ఆలయ పునర్నిర్మాణపథకము భద్రాద్రికి మహోన్నతవమును సమకూర్చగలిగెను.

వా రా

## భ ర త నా ట్య ము :

భరతనాట్యమను పేరుతో నేడు ప్రచారమునందున్న కేళికారీతి నట్టువమేళసంప్రదాయమునకు చెందినట్టిది నట్టువమేళమనగా స్త్రీలు ప్రత్యేకముగ నాట్యమాడుటకు అనురూపముగ రూపొందింపబడిన నృత్త, నృత్య, అభినయములు, కల్గిన నర్తనరీతి. ఇందు స్త్రీలు మాత్రమే నాట్యమాడుదురు పురుషులు హంగుధారులుగనుందురు ఇది ఏకపాత్ర నర్తన విధానము అనగా నర్తకి సుమారు రెండు, మూడు గంటలు ఆడుటకు అనువైన రీతిలో నృత్యక్రమము ఏర్పడియుండును పూర్వమీనృత్యపద్ధతికి దర్బారు, కచ్చేరి, ఆస్థానము, దాసిఆట, సాదిర్, కర్ణాటకము, మేజువాణి అను పేర్లుండెడివి భరతనాట్యమను పేరు ఈ యాటకు సుమారు ముప్పది సంవత్సరములనుండి వ్యవహారములోనున్నది పూర్వ మీనాట్యము విద్వత్తుగల నర్తకినులచే రాజుల ఆస్థానములలో, కవి, పండిత విద్యావేత్తల సమక్షమున ప్రదర్శింపబడిన 'కేళిక' రీతియగుటచే, ఇది దర్బారు, కచ్చేరి, ఆస్థానము, మున్నగు పేర్లతో పిలువబడెడిది

భరతనాట్యములో ఆడబడు అంశములకును, దేవళములలో ఆడబడు కవుతములకును, మొహరలకును, నృత్తములకును సంబంధములేదు - ఆ విద్య వేరుగా ప్రత్యేకశాఖములందుండును అయితే, స్వామికోలువులో చేసెడి కేళికకును, కచ్చేరి ఆటకును మాత్రము సంబంధమున్నది కచ్చేరి ఆటలో నృత్తము, నృత్యము అభినయము, ప్రదర్శింపబడును

నృత్తములో అలరింపులు, జతిస్వరములు, స్వరపల్లవులు, శబ్దపల్లవులు, సాహిత్యపల్లవులు, తిల్లాన మొదలైన రచనలకు అడుగులు, ఆడుగులు, తీర్మానములు పట్టబడును. నృత్యములో శబ్దములు, పదవర్ణములు, స్వరజతులు, జక్కిణి, గీతప్రబంధములు ఆడబడును అభినయమునందు పదములు, జావళీలు, అధ్యాత్మరామాయణకీర్తనములు, శ్లోకములు, పద్యములు ప్రదర్శింపబడును.

ఈ ప్రదర్శనవిధానములో కొన్నితావులయందు కొలది మార్పులు ఘటిల్లినవి అలరింపుతో ఆరంభించి జతిస్వరము, శబ్దము, వర్ణము, పదములు, తిల్లాన అనువాటితో ముగించు క్రమము దక్షిణభారతములో వాడుకయందున్నది శబ్దముతో ఆరంభమై, జతిస్వరము, వర్ణము, పదము, తిల్లాన అనువాటితో ముగించు విధానము ఆంధ్రప్రాంతములో ప్రచారమునందున్నది

నృత్యాంశముల వివరము (1) అలరింపు - హృదయమును రంజింపజేయుట, వినోదానందములను కూర్చుట అను అర్థములో ఈపదము వాడబడును విశేషప్రదర్శనమునకు నాందిగా ఈ అంశము ప్రదర్శింపబడును ఇందులో, "తాం, దిత్తాం - తై, తత్తై" అనుశబ్దములకు, లేక, "తాం, తా, తై, జగ, దత్తాం" వంటిశబ్దములకు చారులు, రేచకములు, కరణములు, భ్రమరికలు ప్రదర్శితములగును సమస్థాన, పతాక హస్తముల విన్యాసములో ఈనర్తనము ఆరంభమగును - 'స్థానము' లేక, 'స్థానకము' అనగా, నర్తకి నాట్యారంభములోగాని, మధ్యమధ్యగాని, తుదిలోగాని, నిలబడుతీరు, చారులనగా నర్తకి పాదములను విన్యాసముచేయువిధము, రేచకములనగా చేతులను కదలించెడి పద్ధతి, కరణములనగా, కాళ్ళు, చేతులు, తల, ఇత్యాది అంగ, ప్రత్యంగ, ఉపాంగములతో క్రమపద్ధతియందు చేయు విన్యాసములు, వీటిని అడవులనికూడ అనెదరు కాని అడవులు పూర్తిగా కరణములపై ఆధారపడవు; అవి శుద్ధనర్తనముపై ఆధారముతో కూర్చబడును తీర్మానములనగా, ముగింపు విన్యాసములని అర్థము, అలరింపు అనునది నృత్యప్రదర్శనమునకు ప్రారంభములో ఆడబడుటచే, ఇందులో కష్టమగు శాకగతులు, జతులు, విన్యాసములు ఉండవు అలారి, అలారిప్పు, అలహారి అను పేర్లతో అలరింపు వ్యవహరింపబడును. ఇది త్రిశ్ర (3 అక్షరములు), చతురశ్ర (4 అక్షరములు), ఖండ (5 అక్షరములు), మిశ్ర (7 అక్షరములు), సంకీర్ణ (9 అక్షరములు) గతులలో ఆడబడు నృత్తవిశేషము

నృత్తమనగా, రసభావములు లేని కేవలము తాళము, లయవిన్యాసములు గల్గిన హస్త, పాదవిన్యాసము మృదంగ

జతులు, స్వరములు, తాళగతులు ఇందు క్రమపద్ధతిలో విన్యాసము చేయబడును

(2) జతిస్వరము లేక పల్లవి ఆట – ఇందులో ఒక రాగము యొక్క స్వరములు ఒకతాళములో బంధింపబడి గానముచేయబడును. దానికి, అడవులు ప్రదర్శింపబడును ప్రతిపర్యాయము కొన్నిరకములైన స్వరములకూర్పునుగాని, జతులకూర్పునుగాని ఆడి, మరల పల్లవిని ప్రస్తారము చేయుదురు ఈ స్వరములయొక్క, జతులయొక్క కూర్పు చిత్ర విచిత్రమగు రీతులలోనుండి, అనేక రూపములలో సృష్టింపబడును వాటినే యతులందురు ఆటకు అందమును కల్పించుటకై ఇవి పెక్కు యతులరూపములో స్వరములుగా గాని, మృదంగ జతులుగా గాని కూర్చబడును ఉదాహరణమునకు

"తాహతజంతరి తకుందరికిట తక
తజంతరి తకుందరిత
జంతరి తకుందరి
తరితుకుంద
తకుంద

నాగుపాముపలె మెలికలుతిరుగు విధానము మృదంగ రూపము, ఢమరురూపము, ఛత్రరూపము, త్రిశూలరూపము, ఖడ్గరూపము, పిపీలిక రూపములలో జతులుకూర్చబడి ఆడబడును.

తిల్లాన, జతిస్వరములలో ఒకేవిధమైన జతి కట్టుబాట్లున్నను, లయ, గతివిన్యాసములలో భేదముండును తిల్లాన అనునది తుదిలో ప్రదర్శించు నృత్తమగుటచే, లయ ఉద్ధృతముగ నుండి, జతులు త్వరితగతిని నడచును

స్వరపల్లవి "సాదప గరిసరి గాగరి గప దస" ఈ పల్లవికి పెక్కురీతులలో స్వరములకూర్పు, జతులకూర్పు ఉండును దీనిని జతిస్వరమందురు శబ్దపల్లవిలో పల్లవి మృదంగశబ్దములతో కూర్చబడును

"తాం తరిత దణ జం తరి తదిమిత కిటతక
తకిట కిటకు జెణు తధీం గిణతోం"

సాహిత్యపల్లవిలో, పల్లవికి సాహిత్యముండి, జతులు, స్వరములు మృదంగశబ్దములందు కూర్చబడును

"శుభలక్షణ కవిరక్ష శివకటాక్షపు
శత్రుదక్షణ రిపుశిక్షణ బహుదక్ష హేమహోక్ష వాహనా"

తాళము లయలోను, హస్తపాదవిన్యాసములలోను, తాలవిన్యాసములలోను, నృత్తములోను నర్తకి పాండిత్యము ప్రదర్శితమగును. అటుతరువాత ప్రదర్శించెడి రెండవఅంశమే నృత్యమగును నృత్యములో ప్రదర్శించెడి కొన్ని రచనల వివరము దిగువ పేర్కొనబడినవి

తాళ, లయ విన్యాస సహితమైన శుద్ధ నృత్యముతో పాటల అర్థమును అంగికముద్వారా చేయు ప్రదర్శనము నృత్యమనబడును ఈ విభాగములో ప్రదర్శింపబడునది పాటల అర్థాభినయము మాత్రమే శబ్దమునందు రాజులకు సంబంధించిన పాట యుండును పాట ప్రారంభములో, మధ్యమధ్య మృదంగ తీర్మానము లుండును 'సలాం' అనియో, 'జోహార్' అనియో, 'నమస్తే' అనియో పాట ముగింపబడును.

ఉదా తాతైయ్యా తై దత్తతాం
కిటతక తాతైయ్యా తై దత్తతాం॥
తద్ధణాం ధిమి తాహా జంతరి
జణకు తది కుకు – తదికు డిడి ఢికు
డిడికు ఢింకుకు – తకుంద కిటదరి
కిణకు కిణకిణ – కిణ్ణణ్ణంగి తా
తదిగిణ త్తోం తై – తదిగిణ్ణత్తో –
తెహిద త్తతాం
శ్రీకరా సుగుణాకరా రిపుభీకరాయని
ప్రాకటంబుగ పొగడుకవులకు
దాతలకు సెరదాతవైన మహాప్రభో
తదిగిణత్తోం। ధేంగిణత్తోం।
తత్తై తదిగిణ తోం।
ఏలరా! చలమేలరా! తాళజాలరా।
నన్నేలుకోర సలాముసే॥
తీర్మానం॥ దందందం – ధాంకిట కిటతక
ధీం త త్తతై –
జంజంజం జేంకిట కిటతక
ధీం త త్తతై
దందందం – జంజంజం
తద్ధిత్తా – తాధితా తదిగిణతోం
తాం తదిగిణతోం – తై తదిగిణతోం

జక్కిణికూడ ఇట్టి సంగీతరచనయే ఆటవిధానములో కొలది మార్పుండును గీతప్రబంధములలో దైవసంబంధ వర్ణన గీతములు, కొన్ని కట్టుజతులు ఉండును ఇందులో మృదంగ

తులు రాగయుక్తముగా గానము చేయబడును పదవర్ణమనునది భరతనాట్యములో నృత్తనృత్యములు ప్రదర్శింపబడుటకు చాల ముఖ్యమైనది ఇది సంగీతరచన, పల్లవి, అనుపల్లవి, ముక్తాయి, స్వరము అను పెక్కు చరణములు కల్గియుండును ఇందులో క్రమపద్ధతిని నృత్తనృత్యములను ప్రదర్శించుటకు అనువైన రీతిలో స్వరములను, సాహిత్యమును పూర్వులు కూర్చియుండిరి ఇందు లయ, తాళము, తాళగతులు, అర్థాభినయము పూర్తిగా వికసించును

ఉదా పల్లవి॥ ఎనవి చే నరాదా నాచక్కని సామి

అ॥ మగతా మీరియున్నారా
విగరా శ్రీతంజాపురిని వెలయు మా
బృహదీశ్వరా, నిన్నె నెరనమ్మి నాను
నిజముగా నామదిలో ॥

ముక్తాయి॥ నీ నెనరను । నీ । దొరతనను
నీ కెతగన । నేరలంచినా । సామి ।
అపుడు । నా । మది । భ్రమసి ।
నిరసా । మను । సాగర । ములో ।
మునిగి । తేలు । చుంటి । నామనవి ॥

పద సాహిత్యమందలి వర్ణనము రమణీయమై, శృంగార రసప్రధానమై, నాయికా నాయకుల ప్రణయకథగానుండును ప్రారంభములో పల్లవి, అనుపల్లవి ఆడబడినపుడు, మధ్యమధ్య త్రికాలతీర్మానములు ఆడబడును పిమ్మట ముక్తాయి, చరణములకు, చాటుస్వరములకు నృత్తము, సాహిత్యమునకు అభినయము (నృత్యప్రాధాన్యము కల్గినది) చేయబడును

ఉదా "మరవి నికొనిరారా । నా చక్కని సామి"

ఆరంభములో గతి ప్రదర్శించి, అటుపై ఈ క్రింది విధముగా జతి మూడుకాలములలో ప్రదర్శింపబడును

తళాంగ్ తకదిమి తదిగిణతోం ॥

| | |
|---|---|
| మొదటి కాలము | తాఅఅరితజం । తకఅఅరితజం<br>తకణక రితజణు । తజందణాం<br>దిజందణాం |
| రెండవ కాలము | తా రితజం । తకరితజం<br>తకణకరితజణు । తజందణాం<br>దిజందణాం. |
| మూడవ కాలము | తారిత । రితజం । తకరితజం<br>తారిత । రితజం । తకరితజం |

| | |
|---|---|
| తీర్మానము | తాతకై తకై । తా తిరికిట జం<br>తాతకై తకై । తా తిరికిట జం<br>తాతకై తకై । తా తిరికిట జం |

ఈ విధమైన జతులకు నృత్తమాడబడిన పిదప సాహిత్యమునకు నృత్యమాడబడును వర్ణముతరువాత అభినయము ప్రదర్శింపబడును ఇది రసభావప్రధానమైనది ఇందులో ముఖ్యముగా అష్టవిధనాయికలకు సంబంధించిన పదములు ప్రదర్శింపబడును భరతనాట్యములో శృంగార కరుణ హాస్య వీర రసములుమాత్రము ప్రదర్శితములగును అందును, ఇది కైశికవృత్తి ప్రధానమగు సంప్రదాయమగుటచే, శృంగారరసమే ప్రముఖముగనుండును ముఖ్యముగా క్షేత్రయ్య పదములలో అభినయము ప్రధానముగ నుండును శృంగారమంజరి, అమరుకము పుష్పబాణ విలాసమువంటి గ్రంథములందలి శ్లోకముల భావము విశేషించి అభినయింపబడును కృష్ణకర్ణామృత మనుచరిత్రలలోని కొన్నిపద్యముల భావముకూడ అభినయింపబడును

అభినయము భరతనాట్యములో అతి ముఖ్యమైన అంశము ఇందులో ముఖ్యముగా సంచారుల అభినయము వీక్షింపదగినది ఈ సంచారభావముల విన్యాసము వలననే ఒక్కొక్కపదము కొన్నిగంటలు అభినయింపబడును, స్వీయ, పరకీయ, సామాన్య, నాయికలను అభినయించుటలో, స్వీయ, సామాన్యల అభినయముకంటె పరకీయ-అభినయము కష్టతరమైనది విప్రలంభశృంగారములో అభినయమున కెక్కువ అవకాశముండును సభలో కూర్చొని అభినయించినను, నిలిచి అభినయించినను, నర్తకి అడుగులువేయుచు ఆడుట సంప్రదాయవిరుద్ధమై, రసభంగమునకు కారణమగును కనుక, తాళలయను తెలుపుటకు, నర్తకి భూమిపై పాదముతో తట్టవచ్చునేకాని, అడుగులువేయుచు ఆడరాదు పదములకంటె జావళీలు సులభతరమగు రచనలు పదములు విలంబితకాలములో పాడబడును జావళీలు మధ్యమకాలములో పాడబడును. అందువలన వీటియందు అడుగులువేయుట కవకాశముండును

ఈ అభినయము రెండు విధములు పదములలోని నాయికాభావమును అభినయించిచూపుట ఒకపద్ధతి ఆనాయికతనకుతానై ఆ రసానుభూతిని అనుభవించి, ప్రేక్షకులచే అనుభవింపచేయుట రెండవపద్ధతి వీటిలో రెండవపద్ధతి శ్రేష్ఠ

తరమైనది. కాని ఇది చాల కష్టమైనవిద్య. ఈ అభినయములో ముద్రలు ప్రాముఖ్యము వహింపవు. ముఖాభినయము ఎక్కువగానుండి, సాత్త్విక భావము లెక్కువ ప్రాధాన్యము వహించును.

ప్రస్తుతము భరతనాట్యములో పూర్వముపయోగించిన మృదంగము, తాళములు, ముఖవీణ, శ్రుతి (తిత్తి) అను వాద్యములను, వాయులీనము, క్లారనెట్, మురళి అను వాద్యములను కూడ వాడుచున్నారు. తిత్తి శ్రుతికి బదులుగా తంబురశ్రుతి ఉపయోగింపబడుచున్నది.

కొన్ని సంప్రదాయముల ననుసరించి ఆట ఆడు నర్తకి పాట పాడదు. కొన్ని ప్రాంతములలో పదములభావమును నర్తకి అభినయించునప్పుడు, పాటకూడ విధిగా పాడును. గురుముఖముగా కొన్నిపదములనభ్యసించి అభినయించుట మధ్యమపద్ధతి. ఏదైన నొకపదమును ఒకసారి వినినంతనే, దానిని అభినయమునుకూర్చి ప్రదర్శించుట ఉత్తమపద్ధతి. పద మొక్కటేయైనను, అనేకరీతులగు వ్యాఖ్యానములు కల్పించి, అనేకనాయికాభావములను ఒకేనాయికలో కనబరచుచు అభినయించుట ఉత్తమోత్తమవిధానము. ఈ తరగతికిచెందిన నర్తకి అలంకార, రస, ఛందశ్శాస్త్రాదులనన్నిటిని విధిగా పఠింపవలసి యుండును.

నృత్తములో ప్రావీణ్యముకల్గియుండు నర్తకి సామాన్య తరగతికి చెందినది, నృత్యములో ప్రావీణ్యము కల్గియుండు నర్తకి మధ్యమశ్రేణికి చెందినది. అభినయములో కుశలురైన నర్తకి ఉత్తమవర్గమునకు సంబంధించినదై యుండును. కాని విశేషసాధనమువలన నృత్త, నృత్యములు, పట్టుబడినను, అభినయము అందరకు అలవడుట అరుదుగానుండును. అందులోను, భరతశాస్త్రము సహజసౌందర్యముతో, సౌకుమార్యముతో, కూడిన విద్యయగుటచే, దానికి చిత్తసంస్కారము అత్యధికముగా మండవలెను.

నర్తకిపాడుచు, అభినయించుటయే శ్రేష్ఠమగు విధానము. ఇదియే భరతనాట్యము; నాట్యసంగీతము యొక్క సంక్షిప్తస్వరూపము.

గ. తీ.

## భరతనాట్యశాస్త్రము

నేడు మనము తరచు చూచుచున్న భరతనాట్య ప్రదర్శనము 'చదిర్', 'ఆటకూత్తు', 'చిన్నమేళము' అను పేరులతో దక్షిణదేశమునందు వ్యాప్తిలో నున్నది. భరతనాట్యము అతి ప్రాచీనమైన కళ. కాని దక్షిణదేశము నేలిన తంజావూరురాజు లీకళను ప్రోత్సహించి పోషించిననాటి నుండియే, ఇది సజీవకళగా పెంపుగాంచినది. తంజావూరు చతుష్కము అని పేరుపొందిన షణ్ముగము, వడివేలు మున్నగు నట్టువనారు లీకళలకు ప్రత్యేక రూపకల్పన చేసినారు. వారేర్పరచిన సంప్రదాయములే నేటికిని సర్వత్ర నర్తకీమణులు ప్రదర్శించుచున్నారు.

ప్రపంచములో అత్యంత మనోహరమైన నాట్యరీతులలో భరతనాట్య మొక్కటిగా ప్రవర్తిల్లినది. దీనికి ప్రధాన గ్రంథము, భరతుడు రచించిన నాట్యశాస్త్రము. అభినవగుప్తపాదులు రచించిన వ్యాఖ్యానములో ఈ శాస్త్రగ్రంథము ఆర్యావర్తమునందంతటను ప్రచారములో నున్నది. లక్షణము పుట్టుటకుముందే లక్ష్యము ఉండవలెనుకదా! వేదకాలమునుండి రామాయణ, భారత, పురాణయుగములలో కూడ నాట్యమున్నట్లు బాల, యుద్ధకాండలు, శాంతిపర్వము సూచించుచున్నవి. వాత్స్యాయనుడు ప్రేక్షకులను కుశీలవులనుగూర్చి చెప్పుటయే కాక ఇరువురకును మధ్యగల సంబంధమునుకూడ తెలిపెను. నాట్యశాస్త్రము రచించిన భరతుడు ఆరువేల శ్లోకములుగల గ్రంథమును ౩౬ అధ్యాయములుగల శాస్త్రముగా చెప్పినట్లు అభినవగుప్తపాదుడు పేర్కొనెను. భరతశాస్త్రమనగా భరతుడు రచించిన నాట్యశాస్త్రమేకాక, భ-భావములో, ర-రాగములో, త-తాళములో విలీనపరచునది "భరత"మని కొందరు చెప్పియున్నారు.

నాట్యశాస్త్రమునందు నృత్తము నృత్యము, నాట్యము అనునవి అభివర్ణితమైనవి. వీటిలో కావ్యములు, నాటకములు, గానము మున్నగువాటికి సంబంధించిన సమగ్ర వివరణములు కలవు. కవితకంటెను, వేదాంత తత్త్వముకంటెను, సాహిత్యముకంటెను సంగీతము సులభముగా జనులను రంజింపచేసి, సారూప్యసాధనముగా పరమాత్మతో చేర్చుటకు ఉపయోగపడుచున్నది. అట్టి సంగీతములో మిళితమైన నాట్యము మరింత సునాయాసముగా పరతత్త్వముతో మనకు సంబంధము నేర్పరచుచున్నది. నాట్యకళ రూపకముగా కపటనాటక సూత్రధారియైన భగవంతునితో సన్నిహిత సమధర్మముకలవాడై మానవుడు ఆ లీలామానుష

విగ్రహుని మాయానాటకములో ఒక అంశను పంచుకొను చున్నాడు రసము, సాహిత్యము, అలంకార శాస్త్రములు దీని విభూతియే

సాహిత్యశాస్త్రమునకంతకును రససూత్రమే హృదయము ఈ సూత్రమును లోల్లట, శంకుక, భట్టనాయకులు మూడురీతులుగా తెలిపియున్నారు అభినవుడు మొదలుగా కలవారు ఈ వాదమును ఖండించిరి "నటుడు నాటకవస్తు అర్థము గ్రహించి నటించును అతని అభినయమునకు కవి సంవేదనము మూలము కవియొక్క ఆవేదనమే రసమని పరమార్థము ప్రేక్షకుడు సహృదయమును, ఆవేశనమును గ్రహించి రసమును చవిజూచును" భరతుడు ఎనిమిది రసములనే చెప్పెను శాంతరసమునుగూర్చి చెప్పలేదు భరతునకు శాంతరసము తెలియకపోలేదనియు భాగతమునందలి రసము శాంతరసమేయనియు అభినవగుప్తుడు పేర్కొనెను నాట్యశాస్త్రమునందు, కావ్యములలోవలె నవరసములు ఆత్మానందప్రాప్తికి కావలమైనవిగా వర్ణితమైనవి రసరూపకముల కల్పనము ఈ రసావేశమును ప్రత్యక్షముగా చూపుచున్నది భరతుడు తన నాట్యశాస్త్రమునందలి రససిద్ధిని నిరూపణము చేయుటకు అమృతమంథనము అను సమవకారమును ప్రదర్శింపజేసెను నానాభావములు, నానావస్థలు కల నాట్యము లోకవృత్తానుకరణముగా నిరూపించినట్లు బ్రహ్మ తెలిపెను నాట్యము ధర్మప్రధానము, యశస్కరము, ఆయుష్కరము, లోకోపకారకము, శారీరక మానసిక దుఃఖోపశమన కారకమునైనది దీనియందు శాస్త్రమున్నది, శిల్పమున్నది, విద్యయున్నది, కళయున్నది, యోగమున్నది, కర్మసాధనమున్నది వేదములు, ఇతిహాసములు, శ్రుతి స్మృతిపురాణాదులు నాట్యమున పరికల్పితములై వినోదమును విజ్ఞానమును కల్పించునని భరతముని తెల్పెను

నాట్యమున నృత్యమును లాస్యము, తాండవము అను రెండువిధములుగా ప్రయోగింప వచ్చును, ఈ నృత్యమును ప్రదర్శించుటకు అంగములు, కరణములు, మున్నగునవి ప్రయోగింప వలయును. కరణములు 108 యని భరతుడు తెలిపియున్నాడు వీటిని అంగహారములతోను, హస్తవిశేషములతోను మేళవించి ఆయా భావములను అభినయించు చున్నారు ఇట్టివాటిని తెలుపు గ్రంథము లెన్నియో కలవు నందికేశ్వరుని 'అభినయదర్పణము' 'హస్తముక్తావళి' మున్నగునవి వీటిని విపులముగా వర్ణించి తెలుపుచున్నవి కరణములనగా 'అడుగు' లను పేరుతో ఆంధ్రదేశమున వ్యవహారములో నున్నట్లు 'సంగీతసారామృతము' రచించిన తులజాజీ వర్ణించెను

నాట్యమును ప్రదర్శించు విధానములను భరతుడు లోకధర్మి, నాట్యధర్మి యను రెండు విధములుగా విభజించి తెలిపెను లోకధర్మి లోకవృత్తము ననుసరించును నాట్యధర్మియనగా నాట్యశాస్త్రము ప్రకారము తెలిపిన సంకేతములతో అంగప్రత్యంగములతో, చతుర్విధాభినయములతో వివిధ ప్రవృత్తులతో ప్రవచించునది, నాట్యాభినయమున పంచవిధములయిన ధ్రువపదములను పాడి, సందర్భోచితముగా గానమును ప్రయోగింపవచ్చునని నాట్యశాస్త్రము తెలుపుచున్నది అవే దరువులుగా మన సంగీతనాటకములలో ప్రయుక్తమైనవి అవి ప్రావేశికదరువు, ఆక్షేపికదరువు, నిష్క్రామికదరువు, ప్రాసాదికదరువు, సంవాదదరువు అనునవి ప్రావేశికదరువులో పాత్రప్రవేశము తెలుపబడును భామకలాపములో 'భామనే, సత్యభామనే' యన్నట్లు ఆక్షేపిక దరువులో హాస్యగాడు ప్రధానపాత్రను వెటకారముచేసి హాస్యమును పోషించును 'కాచనే చల్లకాచనే' అన్నట్లు పాత్రనిష్క్రమణమును తెలుపునది నిష్క్రామిక ధ్రువపదము పాత్రయొక్క చిత్తవృత్తిని వర్ణించు ధ్రువపదము ప్రాసాదికదరువు సంవాద దరువు దృశ్యమునకు, దృశ్యమునకు మధ్య జరిగిన కథను సంవాదములో వర్ణించును ఇట్టి ధ్రువపదములు, దరువులు, తెనుగు యక్షగానములలోను, వీథిభాగవతములలోను విరివిగా ప్రయుక్తములయినవి కాళిదాసు రచించిన మాళవికాగ్నిమిత్రములో ధ్రువపదము పాడి, నాట్యాభినయముతో నర్తకి నృత్యము చేసినట్లు వ్యాఖ్యానమున్నది.

భరతనాట్యశాస్త్రమునకు ఒక కథాత్మకమైన కావ్యప్రదర్శనము నిర్దిష్టమై యున్నది అట్టి రూపకములు దశ విధములుగా పేర్కొనియున్నారు వాటిని ప్రయోగించునపుడు, నృత్యగీతాభినయములతో వాచికాంగిక, సాత్త్వికాహార్యాది చతుర్విధ ప్రవృత్తులతో ప్రదర్శించుదురు అయినను నేడు రూపకములలోను, నాటకములలోను, భరతనాట్యముకాక - ఒకనర్తకి నాట్యశాస్త్రములో తెలిపిన పెక్కు అంశములను వేరువేరుగా ప్రదర్శించు చున్నది వాటికి

అనుస్యూతమైన పదార్థము, ప్రత్యేక ప్రయోజనము లేకపోయినను, నాట్యశాస్త్రము తెలిపిన విభిన్న ప్రక్రియలు ఒకచోట చూపు ప్రయత్నము జరుగుచున్నది. వాటిలో ఒక క్రమము ననుసరించి ఈ నాట్యాంశములను నేడు నర్తకీమణులు తమ భరతనాట్య ప్రదర్శనములలో ఆడి, పాడి చూపుచున్నారు. ఈ ప్రదర్శనములలో ప్రధాన నర్తకీనాట్య విలాసమునకు వంతగుదారులు తోడ్పడుచున్నారు. ఈ క్రమమునందు వరుసగా అలరింపు లేక శబ్దము, జతిస్వరము, పదవర్ణము, పదము, తిల్లానా యనునవి అభినయించి నృత్యగీతాభినయ పూర్వకముగా ప్రదర్శించుచున్నారు. దీనిలో నృత్తము అను పద చాలనతోకూడిన అంగాంగ ప్రదర్శనమునకు ప్రాధాన్యమిచ్చునవి అలరిప్పు, స్వరజతి, తిల్లానా మొదలగునవి. ఇట్టి వాటిలో చూడసొంపయిన భంగిమలను, పదగతులను ఎక్కువ ప్రధానముగా ప్రదర్శించుటవలన సాహిత్యమునకు అందలి యర్థమునకు ప్రాధాన్యముండదు. కొంత నృత్తమునకు, కొంత అభినయమునకు, ప్రాధాన్యమును కలిగించు అంశము పదవర్ణము. దీని యనంతరము నర్తకి విశ్రాంతి తీసికొనును. ఈ విరామమునకు అనంతరము అభినయమునకు సాహిత్యమునకు ప్రాధాన్యముగల 'పదముల'ను నర్తకి అభినయించి హావభావ విలాసములతో అతి మనోహరముగా ప్రదర్శించును. దీనియందు నర్తకీమణికి తన ప్రజ్ఞావిశేషములను ప్రతిభావిలాసములను అభినయ కౌశలమును చూపుటకు అవకాశము లభించును.

పదము అనగా మాట యని అర్థము. నాట్యప్రదర్శనములలో రసవంతమైన సాహిత్యములో అభినయ ప్రధానమైన గేయ ప్రబంధముగా అలరారు రచనకు ఈ మాట వాడుచున్నారు. 'పదము' అనగా పాటయని కూడ అర్థమున్నది. విరహపదములు, శృంగారపదములు, తుమ్మెదపదములు, వెన్నెల పదములు, మొదలయినవి చిరకాలమునుండి ఆంధ్రదేశములో నున్నట్లు పండితారాధ్యచరిత్రమువంటి గ్రంథముల వలన తెలియవచ్చుచున్నది. నృత్యభాగము నమాత్రము, శృంగార రసభావములను చిత్రించి వాటిని అభినయముతో ప్రదర్శించుటకు అమరియున్న సాహిత్యము గల పాటను 'పదము' అని అనుచున్నారు. నవరసములలోను రసికజనరంజకమైన ఆదిరసము శృంగారమొకటియే. మనోభావములను అనుభవపూర్వకముగా ప్రదర్శించుటకును అందరికిని ఆహ్లాదము కలిగించగలుగు కల్పనతో విస్తరించి చూపుటకును విన్యాసములతో పలువిధము లయిన వ్యాఖ్యానములతో శృంగారభావములే యెక్కువ అవకాశము కల్పించుచున్నవి. భక్తులు, కవులు, గాయకులు శృంగారరసమును తమ కృతులయందు చిత్రించునప్పుడు, నాయికానాయకులుగా దివ్యదంపతులైన రాధాకృష్ణుల ప్రేమగాథలను, శివపార్వతుల ప్రేమవిలాసములను, సీతారాముల శృంగారమును వర్ణించిరి.

శృంగార రసమంజరి ఒకానొక సమయమున మన దేశములో మధ్వాచార్యులు, రామానుజుడు, చైతన్య మహాప్రభువు, వల్లభాచార్యుడు మున్నగువారు ప్రబోధించిన భక్తి ప్రపత్తుల ప్రకృతి పురుషుల మధ్య సంబంధమును శృంగారభావనగా చిత్రించి, ఆ మధురభావమును పరమావధిగా వర్ణించిరి. ఈ మధురభావమే అనేక మృదు మధుర సంగీత సాహిత్య కృతులకు ఆలంబనమైనది. తెలుగులో క్షేత్రయ్య, సారంగపాణి, సభాపతి వంటి వాగ్గేయకర్తలును మైథిలి, బెంగాలి అవధివంటి భాషలలో చండీదాసు, విద్యాపతి, మీరాబాయివంటి భక్తగాయకులును మధురభావమునే తమ మంజులగీతార్చనలలో ప్రపంచించిరి. భారతీయ సంగీత, సాహిత్య, నృత్య సంప్రదాయములలో ప్రతిఫలించు భావన ఇదియే. ప్రేమ లేక శృంగారము అమలిన శృంగారము. ఈ యాదిరసములో రెండు విధములయిన శృంగార రసము ఈ పదనృత్యములలో ప్రతిపాద్యమైనది. ఒకటి నాయికా నాయకులిద్దరు కలిసిమెలసి ఒకరిలో ఒకరు మనోహరముగా భోగము ననుభవించునది-ఇది సంభోగ శృంగారము. దీనికి స్థాయిభావము, నాయికా నాయకుల కలయిక. ఇది 'రతి' ఇరువురును దూరమై ఎడబాటు చెందినపుడు, ఒకరినిగూర్చి యొకరు సంభావనము చేయుచు పరితపించు భావముతో కూడినది 'విప్రలంభశృంగారము'. రెండింటికిని కూడ మూలాధారమైన స్థాయిభావము 'రతి'. ఈ 'రతి' యను భావము నాయికానాయకులు సంతోషముతో ఆనందముతో అనుభవించునది. కావున, అందమైన వస్త్రములు, ఆభరణములు ధరించుట, ఇంపయిన గంధమాల్యాదులు తెచ్చి అలరింపజేయుట, క్రీడ, అపాంగనిరీక్షణము, చిరునగవు, ఇంపైన మాటలు, సరససంభాషణము-ఇవి యన్నియును కలిసి 'రతిని'ని సార్థకపరచును. ఇక విప్రలంభ శృంగారములో బెంగ, విషాదము, చింత, ఇంపైన వస్తువులపైన విరక్తి,

శరీరస్థితి చెడిపోవుట నాయకునిమీద కోపము, ఆతని అనురాగము మారుటకు కారకులైన వారిపైన అసూయ, మొదలైన భావములు కల్గును విరహము సహింపలేక వాడివత్తలై పోయిన వారి దుఃఖమును, ప్రేమను ఆవేశమును వర్ణించిన కవిగాయకులు విప్రలంభ శృంగారమునే హెచ్చుగా తమ పదములలోను కీర్తనలయందును అభివర్ణించిరి.

ఈ పదములను అభినయించుటలో నాయికా లక్షణములను, అవస్థలను, ఇంగితములను తెలిసి నర్తకి తదనుగుణముగా అభినయింపవలయును. ఈ నాయికాభేదములను, విప్రలంభ శృంగారావస్థాభేదములను రసాలంకార శాస్త్రగ్రంథములు విపులముగా తెలిపియున్నవి భానుదత్తుడు రచించిన 'రసమంజరి' అట్టి గ్రంథములలో నొకటి నాయిక వయస్సు ననుసరించి ఆమె పొందుభావములను తెలుపుటకు ముగ్ధ, మధ్య, ప్రౌఢయను మూడురకముల నాయికావస్థలను తెల్పియున్నాడు మరొకపద్ధతి ప్రకారము, నాయకులతోడి సంబంధము ననుసరించి నాయికలు స్వీయ పరకీయ సామాన్యయను మూడు తెరగులు స్వీయ, ఏకనాయకుని వరించి ఆతనినే నమ్ముకొననది పరకీయ ఒకనిని వరించి, మరొకనిపై మమకారము ప్రదర్శించునది తన ప్రేమను ఏ నాయకునికయినను అర్పించు స్త్రీ సామాన్యం ఈముగ్గురి మనోభావములను మన పదకర్తలు తమ పదములలో అభివర్ణించి యున్నారు

అష్టవిధ నాయికలు ఇక శృంగారభావములను అనుసరించి నాయక ని ప్రేమను అనుభవించు ప్రేయసి ఎనిమిది విధములుగా వర్ణిత యైనది

(1) స్వాధీనపతిక తాను గీసినగీటు దాటక తనకు స్వాధీనుడైన భర్తకలిగిన భాగ్యశాలిని

(2) వాసకసజ్జిక తన ప్రియుడు తనవద్దకు ఎప్పుడు వచ్చునోయని ఆతనిరాకకై నిరీక్షించుచు శయ్యాదులు అలంకరించుకొని సిద్ధముగానుండు స్త్రీ

(3) ప్రియుడు రానికారణముచేత ఆతని విరహమునకు తాళలేక ఉత్కంఠతోనుండునది విరహోత్కంఠిత

(4) ప్రియుడు మోసముచేయగా ఆతనికొరకు దుఃఖపడుచు వాపోవునది విప్రలబ్ధ

(5) ప్రియుని అపచారములకు కోపముతో ఆతనిని ధిక్కరించి ఖండనగా ఆడుగునది ఖండిత

(6) ప్రియుని వియోగముచేత దుస్సహ కోపముతో ఆతనిపై సాకులుచెప్పి కలహించునది కలహాంతరిత

(7) ప్రియుడు మరొక ఊరు పోయినపుడు బెంగపెట్టుకొని ఆతనిపై ధ్యాసలోనే ఉండునది ప్రోషితభర్తృక

(8) ధైర్యముగా ప్రియుడు తెలిపిన సంకేతస్థలమునకు తానై మరలుకొని వచ్చునది అభిసారిక

ఈ అష్టవిధనాయికల శృంగార భావములను పదకర్తలు తమ పదములలో చిత్రించినారు ఇట్టి నాయికల లక్షణములను మనోభావములను చక్కగా గ్రహించి నర్తకి అభినయింపవలయును ఈ భావములను రసములను నాట్యశాస్త్రకర్త విపులముగా చర్చించెను ఈ నాయికా భేదములను గుర్తుపెట్టుకొని, మన వాగ్గేయకారులు పదములు రచించినారు సంస్కృతములో జయదేవమహాకవి రచించిన గీతగోవింద కావ్యములోని అష్టపదులు శృంగారావస్థను వర్ణించెను భానుదత్తుని 'రసమంజరి' ఆధారముగా దేశములోని 'నట్టువనారులు' నృత్యాభినయమును నేర్చుకొనుటకు దానిని లక్షణగ్రంథముగా వినియోగించుకొనుచు వచ్చిరి దీని తెనుగు అనువాదమైన శృంగారరసమంజరి కూడ దక్షిణ దేశములో ప్రసిద్ధమై యున్నది

తెలుగులో తొలుత శృంగారపదములు రచించినవారు అన్నమాచార్యులు తరువాత తాళ్ళపాక వంశమునకు చెందిన పెద్దన్న చిన్నన్న మున్నగువారు శృంగారపదములు రచించినారు ఆవి కీర్తనలవంటివే కాని పల్లవి, అనుపల్లవి చరణములు కలిగిన పదముల పోలికలో లేవు తెనుగులో కి౦ 000 పదములవరకు రచించి, అమృత గుళికలవంటి సంగీత సాహిత్యరసకేళిక లందించిన పదకర్త క్షేత్రయ్య ఈతని పదములే నేడు భరతనాట్య ప్రదర్శనములో తరచు మనము చూచుచున్నాము నృత్యాభినయ సంప్రదాయమునకు మిక్కిలి ఒప్పారునని క్షేత్రయ్య పదములే ఎత్తుగడలోని 'పల్లవి'యే అనేక విధములుగా అభినయించుటకును, పలు విధములైన భావములను ప్రదర్శించుటకును వీలు కలిగి యుండవలెను అలిగితే, 'ఒకసారి', 'ఏమందయాన', 'మగువ తన కేళికామందిరము వెడలెన్' వంటి పల్లవులతో ప్రారంభమైన క్షేత్రయ్య పదములు ఉదాహరణములు 'పల్లవి'ని పదేపదే రెట్టించి పలుకునపుడు అందలి సంగతులు రాగవిలాసములు అనేక రీతులుగా ఒదుగునట్లు వాటికి అనువైన పరిపరివిధములగు భావములను వ్యాఖ్యతకము చేయవలెను

బీజము, అంకురము, శాఖలు పదములో మొదటి సగము పల్లవిలోని, రెండవ సగము అనుపల్లవిలోని పొత్తుకట్టిన భావమునకు తరువాత వచ్చు చరణములు చక్కగా అమరి పోవలెను పూసలో దారమువలె పోహళింపునకు సరిపోవలెను 'పల్లవి' బీజమును పోలిన అభిప్రాయము సూచించును దానికి అంతరము అనుపల్లవి బీజమునుండి తలయెత్తిన కొమ్మలు చరణములు ఈ విధముగా సాహిత్యము దానికి సరిపడిన సంగీతము, రాగభావాది ప్రకటనము, తదనుగుణమైన హస్తములు, ముద్రలు అభినయములు, క్రమముగా వచ్చును బీజము, అంకురము, శాఖ అను ఉపమానమును 'పదము'ను అభినయించు నర్తకితోపాటు ఆ భావమును గ్రహించు రసికులు కూడ గుర్తుపెట్టుకొనవలెను. భరతుడు తన నాట్యశాస్త్రమునందు అభినయమునుగూర్చి చెప్పునపుడు ఈ యుపమానమునే వాడినాడు, మొట్టమొదట 'పదము'ను పాడి పల్లవిని అందుకొనగానే అందలి మాటలు నర్తకి శరీరమందు నాటి, వాటి యర్థము ఆమె శరీరమునందు ప్రాకి, ఒకవిధమైన శోభను అంగప్రత్యంగములయందు వ్యాపింపచేయును ఇది బీజావస్థ దీనినే 'సూచి' అని అందురు మాటలలోని భావమును ముందుగనే సూచించుచున్నది కావున ఇట్టిపేరు కల్గినది దీనితరువాతస్థితి అంకురము-అనగా మొలకలు బయలుదేరుట పాటలోవచ్చు రెండుమూడు అర్థములు ప్రథమాంకురములు కావచ్చును అనుపల్లవి ఈ భావములనే సూచించును ఇది 'అంకుర'రూపమైన అభినయము ఇది ముఖావయవములచేత ప్రదర్శింపబడవలెను మూడవది 'శాఖ' అనగా కొమ్మలువేయుట దీనియందు ముఖాభినయముగా వచ్చిన మొలక, చిలువలు, పలువలుగా ఇతర అవయవములకు ప్రాకి హస్తముద్రలతో, అంగహారములతో, విస్తరిల్లుచున్నది ఈ మూడుమెట్లును గమనించి 'పదము'ను అభినయించినయెడల ఆ నృత్యాభినయము చక్కగా రాణించును. 'అంకురము' 'శాఖ'గా విరియునపుడు నర్తకి మృదువుగా, లలితముగా, కల్పనచేసి పెంచుకొని పోవలెను బీజము, అంకురము, శాఖాప్రాయముగా పదములను మననట్టువనారులచే అభినయింప చేయుచున్నారు ఉదా సావేరి రాగములోని 'రూపకతాళ పదము 'తెలిసేనురా' అను దానిలో వేంకటేశ్వరుడు నాయకుడు. నాయిక అతనిని తెగనాడుచున్నది ఆమె ఖండిత, నాయకుడు శఠుడు, ధూర్తుడు, దొంగతనముగా వేరొక నాయికతో ప్రవర్తించి వచ్చినవాడు, మరొక నాయికపై ప్రేమచూపుచు తనమీద కూడ ఇష్టమున్నట్లు నటించు ధూర్తుడు ఈ కపటమును నాయిక గుర్తించి యెత్తిపొడుపుగా అడుగుచున్నది—

తెలిసేనురా నీకల్లతనమంతయు
తెలిసికొంటిని వెంకటేశా?

ఇట్టిదానిని విలంబకాలములో పాడినయెడల పలువిధములయిన భావములను ప్రదర్శించుటకు వీలుకలుగును నర్తకి తనంతతాను పాడి, భావరక్తిపొంది అభినయించినచో చక్కగా నుండును భరతనాట్య శాస్త్ర ప్రదర్శనములో తలమానికమైన అంశము పదము ఇట్టి పదములను నాట్యసంగీతశాస్త్ర లక్షణములకు, అలంకారశాస్త్ర లక్షణములకు తగునట్లు మృదుమధుర భావయుక్తముగా రసమంజరులుగా రచించుటకు మార్గము చూపినవాడు క్షేత్రయ్య ఆతడు చూపిన ఒరవడిలో సారంగపాణి, సభాపతయ్య, పరిమళరంగడు, సీనయ్య మున్నగు పదకర్తలు అమృతగుళికలవంటి అభినయముద్రలనదగిన పదరచనలను చేసిరి పదము, నేటి నృత్యనాట్యాభినయములో పరిపూర్ణ సుందరమై సంగీత, సాహిత్య సరసభావములను ప్రదర్శించు ప్రబంధవిశేషము నృత్యభారతికి తెనుగు పదకర్త లర్పించిన అమేయరత్న కిరీటపదము, అమృతరసాస్వాదము పదము

పదము, తిల్లానా, వంటి అంశములలో నర్తకి అన్ని పాత్రలను తానుగా భావించుకొని ఏకైకపాత్రగా అభినయించుట నేటి భరతనాట్య ప్రదర్శనములో పరిపాటి అయినది ఇద్దరు స్త్రీలుకలిసి జంటగా ఆడు భరతనాట్యముకూడ కలదు ఈ కాలములో కొందరు ఒక కథాసందర్భమునో, నాటకభాగమునో తీసికొని ఇద్దరుముగ్గురు నటీనటులతో ఇంగ్లీషులోని "బాలే" రూపములో ప్రదర్శించుచున్నారు పూర్వకాలములో భరతుడు నాట్యశాస్త్రములో పేర్కొన్నది నృత్యనాటకమే ఒకే నర్తకి ప్రదర్శించు అభినయములో కళాంశమును, నాట్యధర్మమును చూపుటకు హెచ్చు అవకాశముండును దీని సంప్రదాయమెరిగి, వివిధ శిల్పములలో ప్రతిమలలో దేవాలయ కుడ్యచిత్రములలో నిబద్ధమైన నాట్యభంగిమలను, కరణములను గుర్తించి, ఆదార్య సంప్రదాయమును అర్వాచీన ప్రదర్శనములలో పోనీయకుండ నిలుపవలయును

భరతనాట్య శాస్త్రము దైవికమైన కళ శివుడు పార్వతి నాట్యమంచేసి ఆనందలీలతో అనుగ్రహించిన వర ప్రసాదమే తాండవము, లాస్యము అను రెండు విధములుగా మనకు సంక్రమించిన నాట్యము చరిత్రకెక్కని పురాణ కాలమునుండి దైవమును ఆరాధించుటకును పరమాత్ముని ప్రత్యక్షలీలను దర్శించుటకును ఉపాసనగా వినియోగించిన సాధనమిది ఇహపర ముక్తిసాధనము భక్తి, యుక్తి కలిగిన శక్తి నాట్యము దీని శాస్త్రప్రమాణమును, సత్సంప్రదాయమును, చక్కగా పాటించి ప్రయోగించిననేతప్ప, పవిత్రమైన ఈ కళ సార్థకత పొందనేరదు వేదవిద్యవంటి ప్రయోజనము గల ఈ శాస్త్రము నాట్యవేద మనబడదగి యున్నది

యం. న.

## భరద్వాజుడు .

సురాచార్యుడును, ఇంద్రపురోహితుడు నైన బృహస్పతియొక్క కుమారుడు భరద్వాజుడు ఇతడు అనూచానతముడు, దీర్ఘజీవితముడు అని ప్రశంసింపబడినాడు (ఐతరేయ ఆరణ్యకము (1-2-౩) రామాయణమున శ్రీరాముడు వనవాసకాలమున భరద్వాజుని ఆశ్రమమును దర్శించినట్లు కలదు మహాభారతమున పృషతుని కుమారుడైన ద్రుపదుడు సింహాసనమెక్కిన సమయమున భరద్వాజుడు స్వర్గమలంకరించినట్లు చెప్పబడినది. (ఆదిపర్వము 130 అధ్యా 44 45 శ్లో) దీనినిబట్టి భరద్వాజుడు అత్యంత దీర్ఘజీవి యని స్పష్టమగుచున్నది ఇతడు వేయిసంవత్సరములు పైగా జీవించినట్లు కనబడుచున్నది చరకసంహితలో సహస్రవార్షిక జీవితమును ప్రసాదించు రసాయనములు కొన్ని చెప్పబడినవి

పూర్వము ఈ రసాయనమును వశిష్ఠుడు, కశ్యపుడు, అంగిరుడు, జమదగ్ని, భరద్వాజుడు, భృగువు మొదలగు మహర్షులు ఉపయోగించుకొని అలసటరోగము, ముసలితనము లేనివారై మహాబలవంతులై, కోరినంత కాలము తపస్సుచేసిరి.

ఇంతేకాక తైత్తిరీయ బ్రాహ్మణమున (3-10-11) భరద్వాజుని తృతీయ పురుషాయుషము పూర్తియగునప్పుడు వేదములనంతములని ఇంద్రుడాతనికి ఉపదేశించినట్లు కలదు తాండ్య మహాబ్రాహ్మణమున (15-3-17) భరద్వాజుడు కాశీరాజైన దివోదాసుని పురోహితుడుగా చెప్పబడినాడు

మైత్రాయణీయ సంహిత (3-3-7), గోపథబ్రాహ్మణము (2-1-18) భరద్వాజుని దివోదాసపుత్రుడైన ప్రతర్దనుని పురోహితునిగా చెప్పినవి జైమినీయ బ్రాహ్మణము (3-2-44) ఈతనిని దివోదాసునిమనుమడైన క్షత్రుని పురోహితునిగా తెలుపుచున్నది ఇట్లీతని దీర్ఘజీవితమత్వమును తెలుపు ఆధారము లెన్నియైన కలవు

భరద్వాజుడు ప్రయాగ సమీపమున గంగా యమునా సంగమ ప్రాంతమున ఆశ్రమమును నిర్మించుకొని యున్నట్లు రామాయణమున, అయోధ్యా కాండమునందలి 54వ సర్గ వలన తెలియుచున్నది ఇతడు ఇంద్రునినుండి వ్యాకరణ శాస్త్రమును గ్రహించినట్లు ఋక్తంత్రమను (1-4) వైదిక వ్యాకరణమును ఐతరేయ ఆరణ్యకమును (2-2-4), తెలుపుచున్నవి చరక సంహితాసూత్ర స్థానము (1-33) వలన భరద్వాజుడు ఇంద్రునినుండి ఆయుర్వేదమును గ్రహించినట్లు తెలియుచున్నది ( 03-63), భరద్వాజునకు తృణంజయుడు పురాణములను ప్రవచించినట్లు వాయుపురాణము చెప్పుచున్నది మహాభారతములోని శాంతిపర్వము (483 అధ్యా 8 శ్లో ) నుబట్టి భృగుమహర్షి భరద్వాజునకు ధర్మశాస్త్రము నుపదేశించినట్లు విదితమగుచున్నది ఇంతేగాక ఋగ్వేద సర్వానుక్రమణ వలన భరద్వాజుడు అనేక సూక్తములకు ద్రష్ట అని తెలియుచున్నది పై వివరములను బట్టి భరద్వాజుని బహుముఖ వైదుష్యమును, ప్రతిభయు, తపస్సంపదయు వ్యక్తమగుచున్నవి

ఒకప్పుడు ప్రపంచమందెల్ల వ్యాధులు హెచ్చుపెరిగి ప్రజలయొక్క తపస్సు, ఉపవాసము, అధ్యయనము, బ్రహ్మచర్యము, మొదలగు సద్వ్రతానుష్ఠానములకు భంగము కలిగింప సాగెను అప్పుడు ప్రజానీకముపై కరుణగలిగిన అంగిరుడు జమదగ్ని, వశిష్ఠుడు, కశ్యపుడు మొదలగు మహర్షులు హిమవత్పర్వత పార్శ్వమున ఒక గొప్ప సభచేసిరి "ధర్మార్థకామమోక్షములను సాధించుటకు ఆరోగ్యము అత్యావశ్యకము రోగములు, ఆరోగ్యమును హరించి జీవిత శ్రేయస్సునకు విఘాతము కలిగించుచున్నవి ఈ రోగములను శమింప చేయుటకు ఉపాయమేమి ?" అని వారు చర్చించుకొని, ధ్యానమగ్నులైరి వారి ధ్యానదృష్టికి ఇంద్రు డొక్కడే ప్రజలను ఈ అపాయమునుండి తప్పింపగలవాడని తోచెను అయితే ఇంద్రునియొద్దకు వెళ్లి ఆశ్రయించి రోగశమనోపాయమును గ్రహించుకొని రాగలవారెవరు ? అను ప్రశ్న బయలుదేరెను అప్పుడు భరద్వాజుడు లేచి అందులకు తనను

వినియోగించుకొనవలసినదిగా కోరుకొనెను. ఋషులందుల అంగీకరించిరి. అప్పుడు భరద్వాజుడు దేవలోకమునకు వేగి (దేవర్షుల నడుమ) దేదీప్యమానుడై యున్న దేవేంద్రుని దర్శించి, ఆయాశీస్సులు పలికి "సర్వప్రాణి భయంకరములైన వ్యాధులు బయలుదేరినవి. వాటిని శమింపజేయు ఉపాయమును దయచేయుము" అని మహర్షుల పక్షమున ప్రార్థించెను.

దేవేంద్రుడు భరద్వాజునకు ఆయుర్వేదమును ఉపదేశించెను. ఆయుర్వేదము మొట్టమొదట బ్రహ్మదేవుని చేతను గొనబడినది. నీరోగులకు రోగములు రాకుండుటకును, వచ్చినచో పోవుటకును, ఆయుర్వేదము ఉపకరించును. రోగకారణములు, రోగలక్షణములు, ఔషధజ్ఞానము అను స్కంధత్రయము ఆయుర్వేదమునకు స్వరూపముగా నున్నది. బ్రహ్మ అశ్వినీదేవతలకును, వారు ఇంద్రునకును ఆయుర్వేదమును నేర్పిరి. భరద్వాజుడు ఏకాగ్రమనస్కుడై అచిరకాలముననే ఆయుర్వేద సర్వస్వమును మహేంద్రునివలన గ్రహించెను. ఆయుర్వేద జ్ఞానఫలితముగా తాను సుఖాన్వితుడై అమితమైన ఆయువును పొందెను. మహర్షులందరకును భరద్వాజుడు దీర్ఘాయుష్ప్రదమైన ఆయుర్వేదమును అనుగ్రహించి తద్ద్వారా లోకకల్యాణమునకు కారకుడయ్యెను.

భరద్వాజుని శిష్యులలో ఆత్రేయుడైన పునర్వసువను మహర్షి కాయ చికిత్సాత్మకమైన ఆయుర్వేదమును, అగ్నివేశుడు, భేలుడు, జతూకర్ణుడు, పరాశరుడు, హారీతుడు, క్షారపాణి, అను మహర్షులకు ఉపదేశించెను. వారు ప్రజ్ఞావిశేషము కలవారై తమతమ నామములతో, ఆయుర్వేద తంత్రములను రచించిరి. వారందరు, తమతమ తంత్రములను గురువరు ఆత్రేయ పునర్వసునకు వినిపించి ఆమోదముద్రను బడసిరి. ఈ విధముగా ఆయుర్వేదము లోకమున ప్రచారమగుటకు భరద్వాజుడు కారణభూతుడైనట్లు చరకసంహిత యందు సూత్రస్థాన ప్రథమాధ్యాయమున చెప్పబడినది (శ్లో 8-40).

భరద్వాజుడు ఆయుర్వేదమునకే గాక వ్యాకరణ శాస్త్రమునకును, అందును ఆఖ్యాతభాగమునకును, ప్రవక్తగా నుండెనని తెలియుచున్నది. ఇంతేకాక మహాభారతమున శాంతిపర్వమున 210వ అధ్యాయమునందలి 21 వ శ్లోకము భరద్వాజుడు ధనుర్వేదమును ప్రవచనము చేసినట్లు తెలుపుచున్నది. అంతే 58 అధ్యాయ శ్లోకమున భరద్వాజుడు, గౌరశిరుడు మొదలగు బ్రాహ్మణులు రాజశాస్త్రమును రచించిరట్లు కలదు. భరద్వాజుని తండ్రియగు బృహస్పతి కూడ గొప్ప అర్థశాస్త్ర ప్రవక్తగా ప్రసిద్ధుడైనవాడు.

బరోడా రాజకీయ గ్రంథాలయమునందున్న భరద్వాజ మహర్షి కృతమగు యంత్రసర్వస్వము గ్రంథము నేటికిని సురక్షితముగ నున్నది. అందుండి విమాన నిర్మాణమునకు సంబంధించిన భాగమును స్వామి బ్రహ్మమునిజీ (శ్రీ పండిత ప్రియరత్నజీ ఆర్ష) అనువారు విమానశాస్త్రము అనుపేర నొక గ్రంథమును హిందీ భాషానువాదముతో ప్రకటించియున్నారు.

భరద్వాజుడు పురాణప్రవక్తగా (వాయుపురాణము 103 అధ్యా 63 శ్లో), ధర్మశాస్త్ర ప్రవక్తగా (సంస్కార భాస్కరః ప్ర 3) కూడ ప్రసిద్ధిచెందియుండెను. భరద్వాజ శిక్షయనుపేర ఒక శిక్షాగ్రంథమును భండార్కర్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్, (పూనా) వారు ప్రకటించి యుండిరి. దాని చివరి శ్లోకమును బట్టియు, నాగేశ్వరభట్టు టీకనుబట్టియు, ఇది భరద్వాజ ప్రణీతమైనట్లు కనబడుచున్నది. కాని ఈ గ్రంథమర్వాచీనమైనదనియు, దీనికి మూలగ్రంథమేదైన భరద్వాజ విరచితమైనది ఉండియుండవచ్చుననియు, శ్రీ యుధిష్ఠిర మీమాంసకులు అభిప్రాయపడినారు.

యన్ సి యస్ వేం

## భవన పథకములు – భవన నిర్మాణములు.

భవనము, నిర్వచనము అనంతములును, వివిధములునైన ఉపయోగములకొరకై పథకములను, నమూనాలను రచించి నిర్మించు కళా వాస్తుశాస్త్రముల సమ్మేళనమే 'భవనము' అను శబ్దమునకు విస్తృతార్థము. భవననిర్మాణము భారతదేశ చరిత్రలో అత్యంత ఆకర్షణీయమును ప్రాముఖ్యమును కలిగియున్నది. ఎన్నియో భవనములు గతించిన కళాకారుల స్మృతి చిహ్నములుగా నిలిచియున్నవి. నేడు భవన నిర్మాణ విషయము ప్రభుత్వచట్టముల పరిధిక్రిందికి వచ్చినది. అందుచే యుక్తమైన నిర్మాణపథక ప్రమాణములు ఆచరణమందున్నవి.

వర్గీకరణము: ఆక్రమణమును, ఉపయోగమును బట్టి భవనములు ఈ క్రింది తరగతులుగా వర్గీకరింపబడినవి :—

(1) ప్రజాసంబంధము కలవి – వైద్యశాలలు, అనాథశరణాలయములు, క్రైస్తవ ప్రార్థనా మందిరములు, సభాభవనములు, నాటకప్రదర్శనశాలలు, నేరస్థు

ప్రత్యేకములతోపాటు భవనమునకు అవసరమగు ఇతర ప్రయోజనముల నిమిత్తము-అనగా, పంచిసీటికి, విద్యుచ్ఛక్తి, టెలిఫోను తీగలు మున్నగువాటికి - ప్రత్యేకములను పూర్తి చేయుదురు

**చెమ్మ నిరోధక విధానములు** చెమ్మ సరిగా చూచినను హానికరమైనది. చెమ్మవలన కలుగు చెడువాసన, బూజు, మున్నగు అవాంఛనీయ ఘటనలు చికాకు కల్పించుటయేకాక, భవనమునకు అపాయము నుకూడ కల్గించును, భవనములోని పదార్థములు నాడిపోవును భవనపు వెలుపలిభాగపు ఇటుకలు పచ్చలై, కాలక్రమమున పొడి పొడియై రాలిపోవును లేకపోగా చెడిపోవును భూమి అడుగున నీరు ఊరి నేలపైకి వచ్చుటచేతను, చిల్లులుపడిన పైకప్పునుండి నీరుకారి లోపలకు ప్రవేశించుటచేతను, వర్షపు జల్లు లోనికి ప్రవేశించుటచేతను చెమ్మ ఏర్పడును

నేలమట్టమునకును, భవనము యొక్క చదునైన అడుగు భాగమునకును మధ్య నీరు చొరలేనట్టి పొరను ప్రవేశపెట్టినచో, చెమ్మ ప్రమాదమును అరికట్టవచ్చును

భారతదేశములో కోస్తాజిల్లాలలోని భవనములందలి తేమప్రమాదము హెచ్చుగా నున్నది ఈ ప్రమాదమును అరికట్టుటకు ఈ క్రింది జాగరూకతలు సూచింపబడుచున్నవి

(1) వర్షఋతువులో కూడ నేలమట్టమునుండి మూడు మీటర్లలోతు త్రవ్వినను, నీరు ఊరని స్థలమును భవన నిర్మాణమునకు ఎన్నుకొనవలెను

(2) భవనమునకు నాల్గు ప్రక్కలనుండు భూమి వాలుగనుండి నీరు వెలుపలికి దొరలిపోవునట్లుండవలెను

(3) పర్వతప్రాంతమున భవనమున్నచో, దాని చుట్టును గల ఎత్తయిన నేలమీదుగా నీరు ప్రక్కలకు పారునట్లుండవలెను కాని భవనముద్వారా నీరు పారునట్లుండకూడదు

**గోడలు** ఇంటి వెలుపలిగోడలు ముఖ్యముగ ఈదిగువ మూడుపనులను నిర్వహించును

(1) వాతావరణప్రభావమును అడ్డుకొనుట

(2) ఉష్ణోగ్రతను హద్దులలో పెట్టుట

( ) శబ్దము దరిచేరకుండునట్లు చేయుట

ఈ పనులను నిర్వహించుటకు వివిధరకములైన నిర్మాణ సామగ్రి లభ్యమగుచున్నది వాటిఎన్నిక, ప్రధానముగ గోడల బరువును మోయుటకా? కాదా? అన్నప్రశ్నపై ఆధారపడియుండును భవనభారమును మోయవలసినపుడు గోడలను ఇటుకలతోగాని రాతితోగాని నిర్మింపవచ్చును భవనభారమును ఉక్కుతోగాని, ఉక్కుకలిపిన కాంక్రీటుతోగాని చేయబడిన చట్రము, మోయుచున్నచో, చుట్టు గోడలు అవి నిమిత్తమాత్రములగును తేలికయైన నిర్మాణపు ముక్కలతోగాని, గాజు మొదలగు పదార్థములతోగాని గోడలను నిర్మింపవచ్చును వాడుకలోనికి వచ్చిన క్రొత్త పద్ధతులలో 'నో-ఫైన్స్' కాంక్రీటు విధానమొకటి దీనితో ఇసుకుండదు గాజుఇటుకలతో చేయబడిన చిన్నచిన్న అణువులుండును ముందుగా నిర్మింపబడిన కాంక్రీటుపలకలు తేలికపాటి కాంక్రీటుపలకలు, ఉక్కు లేక ఆస్‌బెస్టాస్‌తో చేయబడిన తేలికయైన పలకలు మొదలగునవి క్రొత్తపద్ధతులు

పెద్దకట్టడముల విషయములో 'నోఫైన్స్' కాంక్రీటుకు బదులుగా దట్టమైన కాంక్రీటును ఉపయోగింతురు కళాత్మకముగనుండుటకై ముఖమునకు చాపరాయిని ఉపయోగింపవచ్చును శీఘ్రకాలములో పనిని పూర్తి చేయగల్గుట, తన్మూలమున వ్యయముతగ్గించుట, ఈనాడు నిర్మాణవిషయములలో గమనింపదగిన అంశములు పట్టణములలో నివేశన స్థలములు తక్కువగ నుండుటచే, మేడమీద మేడ కట్టుదురు కాంక్రీటును యాంత్రికముగా మిశ్రమముచేసి అంతస్తులుగల పెద్ద భవనములను నిర్మించుటలో కాంక్రీటుకుగల ప్రత్యేక స్థానము రుజువగుచున్నది

**తుది మెరుగులు** బాహ్యాకృతి నిర్మాణము పూర్తియైన తరువాత తుదిమెరుగులకు దిద్దుట - అనగా నేల, గోడలు, పైకప్పు, తలుపులు, కిటికీలు మొదలగునవి - ప్రారంభింపవచ్చును వీటికై లభ్యమగువస్తువులు పలురకములుగ నున్నవి

నట్టిల్లును నిర్మాణము చేయుటకు భారతదేశములో ఈ క్రిందిపద్ధతులు వాడుకయందున్నవి :-

(1) మురము లేక మట్టినేలలు పల్లెటూరి గృహములలో సాధారణముగ ఇట్టి నేలలను చూడగలము

(2) అంచుపైన నిలుపబడిన ఇటుక నేలలు, వంశ మున్న ఎక్కువగా లభ్యమగు సింధు, పంజాబు, ఉత్తరప్రదేశ్ రాష్ట్రములలో కనిపించును అచ్చట బాగుగా కాలిన ఇటుకలు ఎప్పటికప్పుడు లభ్యమగు చుండను

(3) సిమెంటు కాంక్రీటు నేలలు, భారతదేశములో ముఖ్యముగా వైద్యశాలలలో, వంటశాలలలో, స్నానాల గదులలో సర్వసాధారణముగా కన్పించును

(4) రాళ్లుపరచి చదునుచేయబడు నేలలు

(5) చలువరాళ్లు లేక పాలాస్త్రి బిళ్లలతో అమర్చబడు నేలలు

(6) ఆస్ఫాల్టు (ఒకవిధమైన బంక) నేలలు నల్ల రంగును కలిగియుండుటచే, ఇంటి వెలుపలి భాగములందును, రోడ్లమీదను మాత్రమే దానిని వాడవచ్చును నవీన పద్ధతుల ననుసరించి ఇండ్లలోని నేలలకుకూడ ఆస్ఫాల్టునేలలు ప్రజామోదమును పొందుచున్నవి

(7) టెర్రజో లేక మొసైక్ నేలలు ఇవి ఒక ప్రత్యేక రకమైన కాంక్రీటు నేలలు అలంకారప్రాయముగ నుండుటచే ఇవి విశేషముగా ప్రజాభిమానమును పొందినవి

(8) చైనా మొసెయిక్ నమూనా పలాస్త్రిబిళ్లల నమర్చిన నేలలు

(9) కొయ్యచక్కలతో అమర్చిన నేలలు భారతదేశములో ఇట్టినేలలు అరుదుగా కాన్పించును ఇచ్చట అడ్డు గోడలందమర్చబడు పన్ననిద్వారములకు రెండురెక్కలుండును ఇంగ్లండు, ఐరోపా దేశములలోని ఇండ్లయందలి ప్రధానద్వారములు ఒకరెక్కమాత్రమే కలిగియుండును ఈ రెండు పద్ధతులలోను లాభనష్టములు కలవు కాని అడ్డుగోడలకు ఒకరెక్క కలిగిన ద్వారములను, ముఖ్యమైన గోడలకు రెండు రెక్కలుగల ద్వారములను అమర్చుట మంచిపద్ధతి గోడలకు సాధారణముగా గచ్చుచేసి, మెరుగుసున్నముతో తుదిరూపు దిద్దెదరు మంచి రకమగు మెరుగుపూత నున్నగను, నీరు చొరనియ్యకుండునదిగను, శబ్దములను, మంటలను అరికట్టునదిగను, ఉష్ణోగ్రతలవలన మార్పు చెందనిదిగను ఉండవలెను సంప్రదాయసిద్ధమైన సిమెంటుతో, సున్నముతో, మట్టితో, చేయబడు పూతలకు బదులుగా నారపలకలు, గోడపలకలు వాడబడుచున్నవి ఇవి ఉష్ణోగ్రతను, శబ్దమును తగ్గించును

మెట్లు ఒకచోటునుండి మరియొక చోటునకు తరచుగా రాకపోకలు జరుపుటకు మెట్లుమాత్రమే కొన్నిచోట్ల సాధనములు కనుక, వాటిని అమర్చుస్థానము జాగ్రత్తతో పరిశీలింపబడదగియున్నది కాపురముండు ఇండ్లలో ముఖద్వారమునకు మెట్లు దగ్గరగానుండవలెను పూర్తిగా స్వకీయోపయోగమునకు కాకపోవునచో గుప్తముగనుండుటకు మెట్లను కొంచెము దూరముగ నిర్మింపవచ్చును పబ్లిక్ భవనములలో ప్రధానప్రవేశమునుండి మెట్లస్థానము స్పష్టముగ కనబడవలెను ఈ రెండు సందర్భములలోను ముఖ్యమైన గదుల ద్వారములకు దగ్గరగనుండునట్లుగ మెట్లుమధ్యగానుండవలెను ఖాళీప్రదేశమును ఆక్రమించకుండునట్లును గాలి, వెలుతురు నిరాటంకముగా ప్రసరించునట్లును, నిర్మాణము సులభమగునట్లును, సాధారణముగా మెట్లను గోడనాధారముచేసి నిర్మింతురు మెట్లు అతిచిన్నవిగను, అతిపెద్దవిగను కాక, మధ్య రకమునకు చెందినవిగా నుండవలెను

మెట్లు కొయ్యతోగాని, నల్లరాయితోగాని ఇటుకతోగాని, కాంక్రీటుతో (ఉక్కుకలిసినది లేక సాధారణము) గాని లోహయినుముతోగాని నిర్మింపబడవచ్చును ఉక్కుకడ్డీలతో కలుపబడిన కాంక్రీటుతో మెట్లను నిర్మించుట భారతదేశమునం దెక్కువ వాడుకలోనున్నది

ఇంటిపైకప్పు ఇంటిని వాతావరణ ప్రభావముల నుండి కాపాడుటకు వేయబడిన కప్పుగల చట్రమును పైకప్పు అందురు వివిధరకములైన శీతోష్ణస్థితుల కనుగుణముగను, లభ్యమగు వస్తువుల కనుగుణముగను, పైకప్పులను నిర్మించవలెను మైదానప్రాంతములలో వర్షము తక్కువగను, ఉష్ణోగ్రత ఎక్కువగను ఉండును ఎండవేడిమినుండి రక్షణకొరకు అచ్చట మందముగను, చదునుగను ఉండు కప్పును నిర్మింపవలెను కోస్తాప్రాంతములలో ఉష్ణోగ్రత సమముగనుండి వర్షపాతము హెచ్చుగ నుండుటచే అచ్చట దట్టమైన ఏటవాలు కప్పును ఉపయోగించుట మంచిది భారతదేశములో వాడుకయందున్న ఏటవాలుకప్పు క్రింది తరగతులలో నుండును

(1) పూరిగుడిసెలు, ఇవి ముఖ్యముగ పల్లెటూళ్లలోను పట్టణములలో పేదవారు నివసించు ప్రదేశములలోను కన్పట్టును

(2) చదునైన బిళ్లలతో తయారైన కప్పులు

(3) మంగుళూరు పెంకులతో తయారైన కప్పులు

(4) గాల్వనైజ్డ్ ఇనుపరేకులు, ఆస్బెస్టాస్, సిమెంటు రేకులతో నిర్మింపబడు కప్పులు

(5) పలకలను విదేశములనుండి దిగుమతిచేయవలసి వచ్చుటచే, వీటిని భారతదేశములో ప్రజలు విరివిగా వాడరు

(1) మాలతీమాధవము ఇది 10 అంకములున్న ప్రకరణగ్రంథము ప్రకరణమునందలి వస్తువు కల్పితమై యుండును కాని ఇందలి కొన్ని సన్నివేశములు, భవభూతి జీవిత ఘట్టములకు సంబంధించినవై యుండును ఈ రూపక ఇతివృత్తమునకు మూలము బృహత్కథయందలిదై యుండునని కొందరూహించినారు ఇందు మాలతీమాధవుల వివాహము ప్రధాన వృత్తాంతము దీనితోపాటు మదయంతికా మకరందుల వివాహముకూడ నడచును. ప్రధానరసముగు శృంగారముతో బాటు వీర, కరుణ, అద్భుత, భీభత్స భయానక రౌద్రములుకూడ సందర్భోచితముగ పోషింపబడినవి ఇది వివిధ ఘటనావైచిత్ర్యము, నానారస పరిపుష్టికల యొక విస్తృత ప్రకరణము

(2) మహావీరచరితము ఇందు 7 అంకములున్నవి ఇందు విశ్వామిత్ర యాగసంరక్షణమునుండి రావణ వధానంతరము శ్రీరామ పట్టాభిషేకమువరకు గల రామాయణ కథ గ్రహింపబడినది బాలకాండమునందలి కొంతభాగము తప్ప తక్కిన రామాయణ కథనంతయు ఇంత స్వల్పావకాశమునందు నిర్వహించిన భవభూతి కౌశల్యము నిరుపమానమైనది మహావీరచరిత నాటకమునకు రెండుమూడు పాఠాంతరములు కనిపించుచున్నవి ఈ నాటకమున మూలకథలో కొన్ని మార్పులు చేయబడినవి కథావృత్తాంతములు చాలవరకు నేపథ్యములోనే నడచును భవభూతి ఈ రూపకమునందు మహాపురుషుడైన నాయకుని వీరరసమును నిర్వహింప నుద్దేశించెను రాముని వీరకార్యములన్నియు రంగముపై జరుగవు సంభాషణల మూలముననో, వర్ణనల మూలముననో ఈ కార్యములు తెలియునట్లు చేయబడినవి మాటల ఆడంబరమువలన, యుద్ధవర్ణనములవలన నాటకమునందు వీరరసోత్పత్తి కాజాలదు కాని రంగముమీద యుద్ధాదులను ప్రదర్శింపరాదను నియమమునకు, కవి సమయమునకు భవభూతి బద్ధుడైనందువలననే ఈ పరిస్థితి ఏర్పడి యుండవచ్చును

(3) ఉత్తరరామచరిత్ర ఇది భవభూతి రచనలలో చివరిగ్రంథము ఇందలి ఇతివృత్తము మహావీర చరిత్రమునందలి కథకు తర్వాతివిషయము రామాయణమునందలి ఉత్తరకాండమునకు సంబంధించినట్టిది ఈ మహాకవి ఉత్తరకాండమునుండియు, పద్మపురాణమునందలి పాతాళఖండమునుండియు కథను గ్రహించి కొన్ని మార్పులుచేసి 7 అంకముల రమ్యతర నాటకమును వెలయించినాడు భవభూతి ఈ ప్రసిద్ధకథలోచేసిన మార్పులు హృద్యములైనవి మహావీర చరితమునందువలెనే ఇందును రంగముపై నడచు కథకంటె సంభాషణములవలన, వర్ణ్యములవలన జరుగు కథ ఎక్కువగా నున్నది కాని దానికంటె ఈ రచన అన్నివిధముల ఉత్తమమైనది

ఈ నాటకమునందు ప్రధానరసముగ కరుణము చిత్రింపదలచినందున కవి ఆశయము సఫలమగుటకు దీనికంటె చక్కని పురాణకథావస్తువు మరొకటి ఉండదు నాటకమంతయు దుఃఖములతో తట్టుకొనలేని, తప్పించుకొనలేని సంకటములతో నిండియున్నది చివరి అంకమునకూడ అద్భుతమునకంటె కరుణమే యెక్కువగ నున్నది ఇది మంగళాంతముగ ముగియుట కరుణరసమునకు భంజకమనియే చెప్పవలెను ఉత్తరకాండమునందు రామకథాపరిణామము కరుణరసపోషకముగ నున్నది ఈ కవి తన దృశ్యకావ్యమును మంగళాంతముగ ముగించుటకై అందుకు తగిన కల్పనలు చేసినాడు సంస్కృతభాషలో కరుణరస ప్రధాన నాటకము ఇదొక్కటే కలదని చెప్పవచ్చును

భవభూతిమహాకవి ఉద్దండపండితుడు, తనకు ముందుండిన ప్రసిద్ధ కావ్యనాటకాదులను చక్కగా అభ్యసించినవాడు భాస-కాళిదాస-శూద్రకుల ప్రభావము ఆయన రచనలలో స్పష్టముగ కానవచ్చుచున్నది కాళిదాస, భవభూత్యాదులను తులనాత్మకముగ పరిశీలించిన కొందరు విద్వాంసులు భవభూతి కావ్యములలో సహజమైన సరళత, అనర్గళత, ఆవేశము అను గుణములకంటె కవిక్లిష్టప్రయత్నమే ఎక్కువగ కలదనిరి కాళిదాసాదులు మృదుమధుర భావములను వస్తువులను సుందరముగ వర్ణింపసమర్థులు భవభూతి గంభీరతీవ్రభావములను వస్తువులను పదాడంబరముతో జటిలముగ వర్ణింప సమర్థుడు అని చెప్పినారు ఆయన ప్రయత్నము భావసంపత్తిపైకంటె, భాషాసంపత్తిపైన ఎక్కువగా ఉండును ఆతని మనోధర్మము పాండిత్యపరిజ్ఞానముతో, ఆత్మవిశ్వాసముతో గంభీరము, ఘనీభూతముఅయినట్టిది ఆయన మహాతేజశ్శాలి సంస్కృతసాహిత్యము నందతని వ్యక్తిత్వము అపూర్వమైనది

గ రా శ

## భస్మములు

వర్తమాన కాలమున పెక్కు చికిత్సా విధానములు ప్రపంచములో-ముఖ్యముగ భారత దేశములో అమలునందున్నవి ఆయుర్వేదము, ఆంగ్ల వైద్యము హోమియో వైద్యము, ప్రకృతి వైద్యము మొదలైనవి అన్ని చికిత్సా విధానము లకు తల్లివంటిది ఆయుర్వేదము ప్రతి చికిత్సా విధానము యొక్క మూలసూత్రములు ఆయుర్వేదములో కలవు ఆయుర్వేద చికిత్స దైవ, మానుష, అసుర, భేదములచే ముత్త్రివిధము రసాదులచే చేయబడు చికిత్స దైవచికిత్స యనియు, మూలికలచే చేయబడు చికిత్స మానుషచికిత్స యనియు, శస్త్ర, అగ్ని, క్షారాదులచే చేయబడు చికిత్స ఆసురచికిత్స యనియు చెప్పబడుచున్నవి

**దైవ చికిత్స యొక్క విశిష్టత** శస్త్రదాహాది చికిత్స లచే రోగములు సమూలముగా నశింపవు గ్రంథులు, మూల వ్యాధి, అంత్రవృద్ధి, ఇత్యాదులు శస్త్రచికిత్సచే నివారింప బడును కాని మరల కొంతకాలమునకే ప్రాతరోగములు తిరుగబెట్టుట అనుభవైకవేద్యము రోగబీజములు నిర్మూలింప బడక పోవుటయే రోగములు తిరుగబెట్టుటకు కారణము రస చికిత్సవలన వ్యాధిబీజములు నిర్మూలమై, వ్యాధి మరల తలయెత్తదు ఈచికిత్సలో మరియొక విశేషము కలదు రసౌషధమాత్ర అల్పప్రమాణము కలదే ఐన దీనిని సేవించిన నోటికి అరుచి (పులుపు, కారము, చేదు, ఇత్యాదులచే కలుగు వెవగింపు) కలుగదు ఇది చప్పగ నుండుటయే ఇందుకు కారణము రసౌషధముచే త్వరగా ఆరోగ్యము కల్గును ఇంతియేకాక, రసౌషధముల నెంతకాలముంచినను, చూర్ణ గుటిక, లేహాదులవలె నిర్ణీతకాలములో అవి వీర్యహీనములు కావు ప్రాతబడిన కొలదియు, అవి వీర్యవంతము లగును అందుచే రసౌషధములు శ్రేష్ఠములు రసౌషధములని చెప్పు టచే ఖనిజముల భస్మములు, అనగా బంగారు, వెండి మున్నగు లోహములు, రత్నములు, రస, గంధక పాషాణాదుల భస్మములని తెలియదగును అవి పరస్పర సమ్మేళనముచేతను, మూలికల చేతను, చేర్పబడి చేయబడు ఔషధములు, ఇట్లు రసచికిత్సలో భస్మములకే ప్రాధాన్యము కలదు

**భస్మములు చేయుటకు ఉపయోగపడు మూలద్రవ్యములు:** పాదరసము అభ్రకము, వైక్రాంతము, మాక్షికము, విమ లము, శిలాజిత్తు, తుత్థము, చపలము, కఫరి (ఇవి మహారస ములు) కంపిల్లము గౌరీపాషాణము, నవాసాగరము, గవ్వలు, అగ్నిజారము, గిరిసింధూరము ఇంగిలీకము, మృద్దారు శృంగి (ఇవి సాధారణరసములు) గంధకము, గైరికము, కాసీసము, (మయిలుతుత్తము) పటిక, తాళకము, మణిశిల, అంజనము, కంకుష్ఠము (ఇవి ఉపరసములు) మాణిక్యము, ముత్యము, పగడము, గరుడపచ్చ (మరకతము), పుష్య రాగము, వజ్రము, నీలము, గోమేధికము, వైడూర్యము (వీటికి వరుసగా సూర్యుడు, చంద్రుడు, అంగారకుడు, బుధుడు, బృహస్పతి, శుక్రుడు, శని, రాహువు, కేతువు అధిపతులు - ఇవి రత్నములు) బంగారు, వెండి, రాగి, ఇనుము, సీసము తగరము, ఇత్తడి, కంచు, సత్తు (ఇవి లోహములు), శంఖము ముత్యపు చిప్పలు, పురిగవ్వలు-ఇత్యాదులు భస్మములను చేయుటకు ఉపయోగపడు మూల ద్రవ్యములు ఈ ద్రవ్యముల ఉత్తమ, నికృష్టలక్షణములను గురించి రసతంత్ర గ్రంథములలో చెప్పబడినది ఉత్తమ లక్షణ ములుగల వస్తువులతో సిద్ధముచేయబడు భస్మములకు అట్టి గుణములే సంపూర్ణముగ సంక్రమింపగలవు

**భస్మములు చేయు విధానము** ఈ విధానము (అ) శోధనము, (ఆ) సంపుటీకరణము, (ఇ) సంధిబంధనము, (ఈ) పుటములు పెట్టుట, (ఉ) భస్మముల పరీక్ష అను ఐదు భాగముల క్రింద విభజింపబడినది

**(అ) శోధనము** భస్మములు చేయుటకు తొలుత ఆయా ద్రవ్యములను శుద్ధిచేయవలయును ఈ క్రియవలన, వాటిలోని విషములు, ఇతరదోషములు తొలగును ఆయా ద్రవ్యముల శుద్ధికై చెప్పబడిన వస్తుసంయోగములచే మర్దన, భావన, స్వేదనాదికములను శాస్త్రోక్తముగ చేయవలయును శోధింపబడని వస్తువులతో చేయబడు భస్మములు అసాధ్యము లగు పెక్కు వ్యాధులను కల్గించును అందుచే కొన్ని సమయ ములలో మరణముకూడ తటస్థింపవచ్చును కాష్ఠౌషధాదుల భస్మములకు శోధన మక్కరలేదు కాని రస, పాషాణ లోహాది ఖనిజములచే చేయబడు భస్మములకు శోధనక్రియ అత్యావశ్యకము

**(ఆ) సంపుటీకరణము:** శుద్ధిచేసిన ద్రవ్యములను పుటము పెట్టుటకై మట్టిపాత్రములలో వాటినుంచవలయును దీనినే సంపుటీకరణమందురు రసభస్మము (ప్రత్యేక విధానము నకై) నకు వజ్రమూష మున్నగునవి చెప్పబడినవి సామాన్య

వైదిక ధర్మము పునరభ్యుత్థానకాలములో శార్ఙ్గధరుడు, భావమిశ్రుడు, చక్రపాణిదత్త అనువారు వరుసగా రచించిన శార్ఙ్గధరసంహిత, భావప్రకాశిక, చక్రదత్త అను గ్రంథముల లోనే కాక, యోగరత్నాకరము, భైషజ్యరత్నావళి మున్నగు గ్రంథములలో సైతము భస్మవిధానములు చక్కగా వర్ణింపబడినవి. ఆంధ్రుల రచనములగు రసప్రదీపిక, బసవ రాజీయము, వైద్యచింతామణి, శరభరాజీయము, బృహ ద్యోగతరంగిణి మున్నగు గ్రంథములలో కూడ భస్మములు చేయు విధానములు, వాటిగుణములు, పథ్యాపథ్యములు వివరింపబడినవి. భారతీయ భస్మవిధానములు ప్రాచీనకాల ములో విదేశములందుకూడ వ్యాప్తిచెందినవి. విషయములు ఆయాదేశభాషలలో రచింపబడినవి. వాటిని గూర్చి పరిశో ధనములు చేయబడినవి.

ముఖ్య భస్మములలో రజతభస్మము, తామ్రభస్మము, స్వర్ణభస్మము, వంగభస్మము, కర్పూర శిలాజిత్తు భస్మము మున్నగు కొన్ని భస్మములు పేర్కొనదగినవి.

ప్ర. వేం. సు. శా.

## భాగవత నాట్యకళ :

అవతారపురుషుడగు శ్రీకృష్ణుని జీవితకథను ఆట పాటలతో ప్రదర్శించుటయే భాగవతనాట్యము. సత్యభామా కృష్ణుల ప్రణయకలహమును భామా కలాపరూపమున రచించి ఆంధ్రదేశములో యోగి సిద్ధేంద్రులు ప్రచారమొనర్చిరి. ఈ ఆటయే భాగవతమనబడును. దీనినే పారిజాతనాటకముగా కూడ కొందరు ప్రదర్శింతురు.

ఈ భాగవతకళ పురుషులచే ఆరాధింపబడిన నాట్యకళా రూపము. కనుకనే దీనిని నాట్యమేళమనెడువారు. ఈ నాట్య మేళమువారు వివిధ పురాణేతిహాసగాథలను నృత్యనాటకము లుగా ప్రదర్శించెడివారు. వీధులందు ఆడబడెడి వీరి ఆటలు వీథినాటకము లనబడెను. భాగవతకథ నాడువారు గనుక వీరిని వీథిభాగవతులని వ్యవహరించిరి.

ఈ భాగవతనాట్యముయొక్క ప్రాచీనరూపము యక్ష గానమని చెప్పవచ్చును. ప్రాచీనకాలములో యక్షులను ఒక తెగవారు ఈ నాట్యసంప్రదాయమును ప్రచారము చేసెడి వారని పండితుల అభిప్రాయము. నేటికిని ఈ తెగవారు "జక్కుల" అను ఇంటిపేరుతో ఆంధ్రదేశములో కొన్నిప్రాం తములందున్నారు. కాని వారు భాగవతనాట్యము మానినారు.

ఈ యక్షగానముయొక్క స్వరూపమిట్టిది. కథ గద్య రూపములో వర్ణించబడియుండును. దానిని నర్తకి పాడుచు, నాట్యమాడుచు, అభినయించును. ఇది కథాగానశైలి. నేటి కాలపు హరికథాకాలక్షేపములతో దీనిని పోల్చవచ్చును. ఈ యక్షగానపురాణి, గానము, మృదంగవాద్యము - ఆంధ్రదేశ ములోని తూర్పు భాగవతులవద్ద కొంతవరకు సజీవముగా నున్నవి.

పురుషుల సంప్రదాయమును భాగవతమేళమని తెల్పి యున్నాము. భారతదేశమందంతట ఈ సంప్రదాయమున్నది. ఆంధ్రదేశములో స్త్రీలుగూడ కొందరు ఈ కళ నభ్యసించి ఆడుట కలదు. అయినను ఈ సంప్రదాయము పూర్తిగా పురుషులది మాత్రమే.

కలాపమను ఆటయే భాగవతము. అతిప్రాచీనమైన భామాకలాపము తరువాత గొల్లకలాపము ప్రచారములోనికి వచ్చినవి. రాధామాధవము, జీవ ఎరుకుల కురవంజి - అను మరిరెండు కలాపములుకూడ ప్రచారములోనున్నవి. కాని పై రెండింటివలె ఇవి విశేష ప్రచారములో లేవు. ఈ కలా పములుగాక భాగవతులు అనేక వీథినాటకముల నాడుదురు. ఇవన్నియు నృత్యనాటకముల రూపములో నుండును.

ఈ కలాపరూపమును సిద్ధేంద్రులవారు రచనచేసి కృష్ణ భక్తికి ప్రజలలో ప్రచారము కల్పించుటకై కూచిపూడి పండి తులకు నేర్పినారు. ద్రవ్యసంబంధమైన విచారము లేకుండ స్వేచ్ఛగా కళాసేవ చేయుటకై గోలకొండ పాదుషానుండి ఆ పండితులకు కూచిపూడిని అగ్రహారముగా యిప్పించినట్లు చరిత్ర తెల్పుచున్నది. అట్లే రాయలసీమలోని బనగానపల్లి నవాబులుకూడ ఈ కళకు పోషకులైరి. శ్రీకాకుళము జిల్లాలో, విశాఖపట్టణము జిల్లాలో, భూస్వాములు పెక్కురు ఈ కళను పోషించుటయే గాక స్వయముగ ఈ కళ నభ్యసించి భాగవతముల నాడెడివారు. తెలంగాణాప్రాంతములో వీథి నాటకములు మాత్రము ప్రచారములోనున్నవి. వాటిని రెడ్డి భూస్వాములు, పటేల్, పట్వారీలు పోషించివారు. ముఖ్య ముగా తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలలో దేవదాసితెగకు చెందిన కొన్ని కుటుంబములు ఈ విద్యను అభ్యసించి సేవ చేసెడివారు.

ఇతరప్రాంతములలో భాగవతవు ఆటగాండ్రు ప్రాచీన సిద్ధేంద్రకలాపము నాడుటయేగాక, తమ ప్రాంతములోని

కవులచేత నూతన కలాపములను వ్రాయించి యోగివారి కలాపములో చేర్చి ఆడుటనారంభించినారు కనుకనే ప్రస్తుతము సుమారు 20 రకముల కలాపములు దేశములో ప్రచారమునందున్నవి

ఈ కలాపములోని సంగీతము పూర్తిగా 'దేశి'బాణిలో నుండును రాగములు, తాళములు కర్ణాటక సంప్రదాయమునకు చెందినవే అయినను వాటిప్రయోగవిధానము పూర్తిగా దేశీయము ఆ విధముగా కర్ణాటక గానములోగాని, కచ్చేరి ఆటలో (భరతనాట్యములో) గాని, రాగవిన్యాసము, తాళప్రస్తారము ఉండవు ఇందలి కవిత్వపు పోకడలుగూడ జాతీయములే ఈ ఆటక్రమము తాండవపద్ధతికి చెందినట్టిది ద్విపద కవితారీతికి ఈసంప్రదాయములో ప్రాముఖ్యము కలదు ద్విపదార్థమును, కథను నడుపుటకు ద్విపదను యక్షగానరీతిలో ప్రాచీనకవులు ఎక్కువగా నుపయోగించిరి ద్విపదను గానము చేసినతరువాత అందలి అర్థమునే మరల"దరువు" రూపములో ఆడుటను ద్విపదార్థ మనెదరు అట్లే కందము కందార్థము, సీసము సీసార్థములు గూడ నుండును

'దరువు' భాగవతపు ఆటలో చాల ముఖ్యమైనది దరువులేని భాగవతపుఆట లేదనియే చెప్పవచ్చును దరువులలో ఎన్నియో రీతులున్నను, ముఖ్యముగా మూడు విధములు చెప్పతగ్గవి అవి

(1) ప్రవేశదరువులు (2) సంవాదదరువులు (3) అభినయ (భావ) దరువులు నాట్యశాస్త్రములో దరువు ధ్రువపదమని చెప్పబడినది. ఒకపాటను, అనేక భావములను పెక్కువిధములుగా సంచారముచేయుటకు అనుకూలమైనరీతిలో గానము చేయుట ధ్రువపదగానమనబడును

ఉదా,– 'భామాకలాపము'నుండి సత్యభామ ప్రవేశదరువు,

భామనే, సత్యభామనే,
ఒయ్యారి – భామనే, సత్యభామనే,
ముద్దుల – భామనే, సత్యభామనే

ఈ దరువు ఈ విధముగా అనేక పర్యాయపదములను చేర్చుచు, భామయొక్క ప్రాముఖ్యమును దెల్పును

ప్రవేశదరువులో సాధారణముగా, పాత్ర, తానెవరో, తనచరిత్ర ఎట్టిదో తెల్పును

ఉదా :– భాయనే పదియారువేల
గోపికలు అందరి లోన,
భామరో గోపాలమూర్తికి,
ప్రేమజాలినదాన॥ భామ॥
అట్టహాసము జేసి సురల
నట్టెగెలిచిన పారిజాతపు
చెట్టు దెచ్చి నాదు పెరట
గట్టిగా నాటించుకున్న
ధీరిమి సత్రాజిత్తు
కూతురై యుందరిలో
బాలా మగనిని బాసి తాళ
జాలని ఒయ్యారి సత్య

సంవాదదరువులు రెండుపాత్రల మధ్య సంభాషణమునకుగాను ఉపయోగించబడునట్టివి

అభినయదరువులో – ఒక సన్నివేశమును ఒకపాత్ర మరొకపాత్రతో దెల్పుచు, అభినయించును.

ఉదా – కలగంటి నమ్మా నాస్వామిని । నే
కలగంటి నమ్మా ।
కలలోన నాస్వామి కనిపించెనే
కనిపించి నను తన
కౌగిట చేర్చెనే ।

* * * *

దరువు ఆటకు ప్రాచీనులు ఒక క్రమమును ఏర్పరచినారు దరువు ఏ తాళములోనున్నను ముగింపులోమాత్రము చతురశ్ర నడక, (4 అక్షరములది) సమగతిలో ఆడి ముగించవలెను. మరియు దరువుల నాడునప్పుడు నర్తకులు, ప్రారంభములో, దరువును నిర్ణీతమయిన తాళములో ఆడి, అటుపై మిశ్రనడక (ఏడు అక్షరాలది)లో, త్రిశ్రనడక (మూడు అక్షరాలది) లో–భావవిన్యాసము కొరకు, ఆటవిన్యాసము కొరకు, ఆడి, చతురశ్రగతిలో ముగింతురు కనుకనే సమర్థుడైన నర్తకుడు ఒక దరువును అనేక తాళరీతులలో, గతి విన్యాసములలో, ఆడినప్పుడు చూచువారికి ఆటగాడు, లయ, తాళములతో ఆడుచున్నట్లు, హృదయాహ్లాదకరముగ నుండును

దరువు, ద్విపద, పద్యములు, వృత్తములు తాళ – ఏలలు, హెచ్చరికలు, ధవళము, అర్ధచంద్రికలు, త్రిపుటలు, శోభనములు అను రచనలుగూడ భాగవతకలాపములలో పాడబడును; ఆడబడును

భాగవతములో, ముఖ్యముగా, భామావేషధారిణియై నర్తించెడిపాత్రయే పాడుచు ఆడవలెను, ఇది భాగవతము నకు ముఖ్యము

యోగి సిద్ధేంద్రులు, వైష్ణవమత ప్రచారము కొరకు- సామాన్యప్రజలకు అర్థమగునటుల ఈ భాగవతప్రాశస్త్యమును సంగీతనృత్యములలో చేర్చి కృష్ణకథగా రచన చేసినారు ఇది కూచిపూడి భాగవతులచే ప్రచారము చేయబడినది కాని ప్రస్తుతకాలములో ఈ "భామాకలాపము"నకు ప్రాగాంధ్ర ములోగల ప్రాముఖ్యము ఎచ్చటను లేదు భాగవతులు ఆట లేని అప్పువారి తిరునాళ్లే లేవు శ్రీకాకుళము, విశాఖపట్ట ణము అను జిల్లాలలో నున్నంతమంది భామవేషగాండ్రు కూచి పూడివారిలోగూడ లేరు వీరందరు పల్లెప్రాంతములలో ప్రసి ద్ధులు, వీరు కలియుగ సత్యభామలను బిరుదములను ధరింతురు

తూర్పుప్రాంతమువారు పాడి ఒప్పించెదరు ఇతర ప్రాంతములవారు ఆడి ఒప్పించెదరు అను వాడుక కలదు, దేవదాసీలు ఆడెడివారనియు, భగతనాట్యమును, అభినయ మును తెలిసిన అట్టి దేవదాసీల ఆట పురుషభాగవతుల ఆట కంటె కొలదిగ భిన్నముగ నుండెడిదనియు చెప్పబడినది

భామాకలాపము ఈకథ చాలచిన్నది

ఒకరోజు సత్యభామ పడకటింటిలో నిదురించియుం డగా శ్రీకృష్ణస్వామి అటకు ఏతెంచి, ఆమెను నిదురలేపి, సర్వాభరణములు ఆమెచే ధరింపజేసెను వారిద్దరును అద్దము ముందు నిలుచుండియుండిరి మనఇద్దరిలో చక్కనివారెవరని స్వామివారడుగ, స్వాధీనపతికయు సౌందర్యగర్వితయునగు సత్యభామ తానే చక్కనిదాననని జవాబిడెను అంత స్వామి కోపగించుకొని, అలిగి అటనుండి మరలివెళ్లెను అలిగి వెళ్లిన స్వామికి సత్య, మాధవి యను చెలికత్తెద్వారా లేఖనంపి అతనిని తిరిగి రప్పించుకొనెను

ఈ చిన్న సన్నివేశము - మర్రివిత్తు మొలకెత్తి వృక్షమై విశ్వవ్యాప్తమైన విధముగా - ఒక పెద్ద కథయైనది, దీనిని ఒకరాత్రి కథగా కొందరు, మూడురాత్రుల కథగా కొందరు తొమ్మిదిరాత్రుల కథగా మరికొందరు ఆడెడివారు - ఇదియే కవి చమత్కారము ఇదియే నర్తకుని ప్రతిభ, ఈ కలాప ములో అష్టవిధనాయికల అభినయముండును విప్రలంభశృం గారాభినయములో, ఋతువర్ణనములు, మదన, వాయు, చంద్రాదుల రూపణము,మూర్ఛనొందుట-ఇత్యాదులెన్నియో అభినయింపబడును కథను పెంచుటకాని, తగ్గించుటకాని, భామా పాత్రధారియొక్క పాండిత్యమును బట్టియుండును ఈ భామాకలాపమొక శృంగారప్రబంధము

గొల్లకలాపము దీనినే "గోపికావిప్రసంవాద" మనె దరు ఇది జ్ఞానప్రబోధకమైన కలాపము ఈ కలాపమును ఆడుటయు, ప్రేక్షకులను మెప్పించుటయు కష్టమే - ఈ కలా పమును ఆడెడి నర్తకులు విధిగా సంస్కృతభాష నభ్యసింప వలెను "అమరము చదువనిది, నీకమరదు" అనెడి సామెత కలదు సంస్కృతభాషాపాండిత్యము లేనివారు ఈ కలాప మును ఆడజాలరు వేదములనుండి, శాస్త్రములనుండి, పురా ణములనుండి ఉద్ధరించి తానుచదివిన విషయములను వ్యాఖ్యా నించి అభినయించి నర్తకి రక్తికట్టింపవలయును ఈ కలా పములో పుట్టుక జాతి, మతము, కర్మకాండ, ముక్తి, సాంఖ్య శాస్త్రము-ఇత్యాది విషయముల నెన్నింటినోకూర్చి గొల్ల వనితయు విప్రుడును చర్చించెదరు మధ్యమధ్య గొల్లభామ తన జాతియొక్క విశిష్టతను విశిష్టతకు గల కారణములను తెల్పుచు నృత్తమాడుచుండును

రాధామాధవీయము : ఇది బహురమణీయమైన భక్తి ప్రబోధకకలాపము ఇది ఆంధ్రదేశములో, తూర్పుతీరమున కొందరాడుట కలదు అయినను పైరెండు కలాపములంత విశేషముగా ఇది ప్రచారములోనికి రాలేదు శ్రీకృష్ణుడు బాల్యములోనే రేపల్లెను వదలి మధురకు వెడలిపోయెను అట నుండి ద్వారకకు తన రాజధానిని మార్చుకొనెను కృష్ణుడు పెద్దవాడై, మహారాజైనను అతనిని గోపగోపీజనము, రాధయు మరువలేదు వెన్నదొంగయగు కృష్ణుడే వారి కండ్ల ముందు కదలాడుచుండెను కృష్ణాష్టమిరోజున ఉట్లపండుగను అందరు జరుపుకొనుచుండగా రాధ ఒంటరిగా కూర్చుండి కృష్ణుని స్మరించుచు, ఆదారిన వెళ్లు హంసలద్వారమున అత నికి కబురుపంపెను తుదకాతనికి తన చెలికత్తెద్వారా వార్త నంపెను దానిపై కృష్ణుడు రేపల్లెకు పయనమయ్యెను సత్య భామ రాధనుగూర్చి అసూయపడుటయేగాక, అనుమాన పడెను రాధయొక్క పవిత్రప్రేమనుగూర్చి కృష్ణుడు సత్య భామకు తెల్పెను అయినను, ఆమె పట్టుబట్టి అతనితో రేపల్లెకేగెను కృష్ణుడు తనరాకను రేపల్లెవాసులకు ఎరుక చేసెను గ్రామపు పొలిమేరవద్ద అందరును అతనికొరకు వేచి యుండిరి కాని కృష్ణుడు రథముపై వచ్చుచు వారిని సమీ

పింపగనే అందరును తిరిగి తమ గ్రామమునకు వెళ్లిపోయిరి. సత్యభామకు ఆశ్చర్యము కలిగెను

"ద్వారకానాథుని గాదు, మేము చూడదలచినది! మాలో ఆడుకొనిన వెన్నదొంగను - మురళీధరుని!" అని వారు పలుకరించిరి కృష్ణుడు అరూపముతోనే వారికి దర్శన మిచ్చెను వారతనిని ఆరాధించిరి భక్తిప్రబోధముచేయు ఇట్టి చక్కని కథ అరుదుగా లభించును ఇందులో శృంగారము తక్కువ, అందుచే ఇది విశేషప్రచారము గాంచలేదు.

జీవయొరుక లకురవంజి వైరాగ్యప్రబోధకమగు ఇది తక్కువ ప్రచారములోనున్నది

గొల్లకలాపకథ రక్తిగట్టుటకై నర్తకులు అందులో "క్షీరసాగరమథనము" అను కథను చేర్చి ఆడుదురు అందువలన మోహినీవేషములో కొన్నిపట్లు అభినయించుటకు, అవకాశమేర్పడును. ఒకప్పుడు త్రిపురసంహారకథను గూడ నృత్యమాడుదురు.

కలాపముల బాణీలు ముఖ్యముగా మూడు విధములుగా నున్నవి –

(1) కూచిపూడిబాణి (2) దేవదాసీలబాణి (3) తూర్పు బాణి (దీనినే బొబ్బిలిబాణి) యందురు కలాపముల ఆట, తెలంగాణములోను, రాయలసీమలోను అంతగా ప్రచారములో లేదు - కలాపములనేకాక యక్షగానములను, వీథినాటకములనుగూడ ఆడునట్టి నాట్యమేళములున్నవి ఈ మేళముల వారు కుశలవ, సారంగధర, ధర్మాంగద, ఉషాపరిణయ, ప్రహ్లాద మున్నగు కథలను నృత్యనాటకములుగా ఆడుదురు ఈ ఆటలో గూడ దరువులు, ద్విపదలు మున్నగు రచనలన్నియు, ఆయాపాత్రలచే సందర్భముల ననుసరించి పాడబడును ఈ మేళములు ఆంధ్రదేశమంతటను గలవు కలాపముల ఆటలో దశావతారములు, రాజులపై శబ్దములు, సలాములు మధ్యమధ్య ఆడుదురు వీటిని కథకును సంబంధముండదు అయినను రక్తికొరకు మధమధ్య ఇవి చేర్చబడి ఆడబడును

భాగవతములో పూర్వము శ్రుతిని, గాత్రమును, మృదంగమును ఉపయోగించెడివారు

ముఖమునకు అర్దలము పూతవేసి, దానిపై అభ్రకపు మెరుగును అద్దెడివారు. ఆభరణములక్రింద చెక్కతోచేసిన వగలను ఉపయోగించెడివారు ఇవన్నియు సాధారణముగా ప్రాచీనకాలములో పల్లెటూరి స్త్రీల ఆభరణములను పోలియుండెను.

భామజడను తెరపై వేయుట భామాకలాపములో సత్యభామయొక్క జడకు చాల ప్రాముఖ్యమున్నది భామ తన జడను తెరపై వేయుటయన, ఆమె సభను పాండిత్యవిషయమున సవాలుచేయుటయే సభలో భామ ఓడిపోయినయెడల సభలో ఆమెను గెల్చినవాడు ఆమెజడను కత్తిరించివేసెడివాడు ఇది భామకెంతయు అగౌరవము అందువలన కలాపనర్తకులందరు తెరపై తమజడలను వేసెడివారుకారు శాస్త్రవిజ్ఞానము సంపూర్ణముగా నున్నవారుమాత్రమే అట్లు చేసెడివారు. భామాకలాప ప్రదర్శనమున అష్టవిధనాయికల అభినయ విజ్ఞానము తేటపడును ఈ విజ్ఞానవిశేషమే భామాకలాపము ఇది ప్రశస్తమై భాగవతమనబడుచున్నది

ఆ వేం

## భాగవతము (సంస్కృతము).

శ్రీమద్భాగవతము భగవద్గుణ వర్ణనైక ప్రధానముగ ప్రణీతమైన మోక్షశాస్త్రము సరస్వతీనదికి పశ్చిమతటమందున్న శమ్యాప్రాసమను ఆశ్రమమందు వ్యాసభగవానునిచే ఇది ప్రణీతము. ఇది దశలక్షణలక్షితమైన పురాణరత్నము వృత్రాసురవధాది వివిధచిత్ర పుణ్యకథా ప్రతిపాదకము

మహాభాగవతము శ్రీహయగ్రీవ బ్రహ్మవిద్యేత్యాది బిరుదాంచితము. ఇది జయనామకము. 'జ' యన ఎనిమిది; 'య' యన నొకటి 'అంకానాం వామతోగతిః' అను న్యాయమునుబట్టి ఇది పదునెనిమిదగును అష్టాదశ సహస్ర శ్లోకములీ భాగవతమం దుండుటచే ఈ నామము సార్థకము భాగవతమందు స్కంధములు 12, అధ్యాయములు 337 కలవు విషయసంగ్రహము

"జన్మాద్యస్య యతోన్వయాదితరతశ్చార్థేష్వభిజ్ఞః స్వరాట్తేనే బ్రహ్మహృదాయఆదికవయే ముహ్యంతి యత్సూరయః తేజోవారిమృదాం యథా వినిమయో యత్ర త్రిసర్గో మృషా ధామ్నా స్వేన సదా నిరస్తకుహకం సత్యం పరం ధీమహి" అను శ్లోకముచే మహాభాగవతమందలి ప్రథమస్కంధము ఆరంభింపబడినది ఇందు బ్రహ్మసూత్రోపనిష త్తాత్పర్యము నిగూఢముగ నున్నది. ఈ శ్లోకమునకు గణేశ-కృష్ణ-శివ-ఆదిత్య-దేవీ - కాళీ - గయాదులపరముగ నూరు వ్యాఖ్యలు కలవు. 'జన్మాద్యస్యయతః (1-1-2) అను బ్రహ్మసూత్రార్థము,

'జన్మాది' అను వాక్యముచే ఉక్తము 'అభిజ్ఞః' అను పదముచే సాంఖ్యసిద్ధాంతమునందలి ప్రకృతితత్త్వకర్తృత్వము నిరాకరింపబడినది, 'ఈక్షతేర్నాశబ్దమ్' (1-1-6) అను బ్రహ్మసూత్రముయొక్క అర్థముచే బ్రహ్మమునకు కర్తృత్వము ప్రతిపాదితము

"యో వై బ్రహ్మాణం విదధాతి పూర్వం
యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై
తగ్ం హ దేవ మాత్మబుద్ధిప్రకాశమ్"

ఇత్యాది శ్రుత్యర్థము 'తేనే బ్రహ్మహృదాయఆదికవయే' ఇత్యాదివాక్యములచే స్పష్టముగా నిరూపితమైనది 'సర్వం ఖల్విదం బ్రహ్మ', 'నేహనానాస్తికించన' అను శ్రుతివాక్యము 'తేజోవారిమృదాం' అనుదానిచే విదితము చేయబడినది ఇందు పలుచోట్ల వేదోపనిషద్వాక్యములే పఠితములైనవి మరియు, 'అర్థోయం బ్రహ్మసూత్రాణాం భారతార్థవినిర్ణయః

గాయత్రీభాష్యరూపోఽసౌ వేదార్థపరిబృంహితః'

అని గారుడపురాణమున గలదు ఈ భాగవతము బ్రహ్మసూత్రార్థమును వివరించును ఇది వేదార్థమునకు వివృతి ఇది భారతార్థబోధకము గాయత్రీభాష్యరూపము

ఈ భాగవత సంప్రదాయమును చతుశ్శ్లోకీరూపమున ఆదిలో, శ్రీనారాయణమూర్తి బ్రహ్మకు చెప్పెను బ్రహ్మ నారదమహర్షికి తెలిపెను నారదుడు వ్యాసమహర్షికి బోధించెను వ్యాసుడు శుకయోగికిని, శుకయోగి పరీక్షిద్రాజునకును ఉపదేశించుట జరిగినది శ్రోతృ, వక్తృప్రతిపాద్యాధికారి వైశిష్ట్యమున ఈ భాగవత మహత్త్వము లోకాతీతము

అత్యంత భయదమగు మృత్యువాసన్నమగుచున్నట్లు తెలిసికొని, నిర్భయుడై, నిశ్చలుడైన పరీక్షిత్తు, నిరపేక్షుడై శ్రీకృష్ణ గుణగణముచే సాకృష్టుడైన శ్రీశుకమహర్షివలన భాగవతమును సప్తాహమున వినెను భక్తియే మోక్షప్రాప్త్యుపాయము ఇది సర్వజన సాధారణము భక్తియన బహిర్ముఖేంద్రియవృత్తిని లౌకిక పదార్థములనుండి నిరోధించి అంతర్ముఖవృత్తిచే ఇష్టరూపమునందు లయింపచేయుట ఇది నవవిధము శ్రీకృష్ణపరమాత్మయొక్క శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవనము, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనము అనునవి నవవిధభక్తులు భక్తికి ప్రథమసోపానము బాహ్యోపాసనము. రెండవసోపానము అంతరోపాసనము పాదసేవనము, అర్చనము, దాస్యము, సఖ్యము అనునవి భక్తులకు బహిరంగసాధనములు. స్మరణాత్మనివేదనములు అంతరంగసాధనములు శ్రవణకీర్తనములు బాహ్యాంతరంగ సాధనములు ప్రేమరూపభక్తి పరియవది. పరాభక్తి పదునొకండవది ధ్రువుడు భక్తిచే పరమాత్మను హృదయమున నిరుద్ధునొనర్చి లోకత్రయమును కంపింపచేసెనని - ధ్రువచరిత్రములో ప్రసిద్ధము ప్రథమస్కంధమందలి రెండవశ్లోకము

ధర్మః ప్రోజ్ఝితకైతవోఽత్ర పరమో నిర్మత్సరాణాం సతామ్
వేద్యం వాస్తవమత్ర వస్తు శివదం,తాపత్రయోన్మూలనమ్
శ్రీమద్భాగవతే మహామునికృతే కింవాపరై రీశ్వరః
సద్యో హృద్యవరుధ్యతేఽత్ర కృతిభిః శుశ్రూషుభిస్తత్క్షణాత్

అనునది ఈ శ్లోకమునందు అనుబంధ చతుష్టయము సమన్వయింపబడినది ఇందు విషయము భాగవతధర్మము బోధ్యబోద్ధవ్యరూపమైనది సంబంధము అధికారి ముముక్షువు ప్రయోజనము తత్త్వజ్ఞానసంపాదనము

ద్వితీయస్కంధమున ముముక్షువునకు విరాట్స్వరూపధారణా యోగకథనము, భగవత్స్వరూప పరిజ్ఞానవిధి ప్రతిపాదనము, ఉపాసనాభేదముచే, ఉపాసకులకు భిన్నఫలప్రాప్తి, ఆత్మస్వరూప కథనము, ప్రపంచోత్పత్తి-ఇత్యాదుల వర్ణనములు కలవు తృతీయమున విదుర-మైత్రేయ సంవాదము, స్వాయంభువమను వృత్తాంతము, బ్రహ్మాండసృష్టి, కపిలావతారకథ, కపిల-దేవహూతుల సంవాదము వర్ణితములు. చతుర్థమున దక్షాధ్వరధ్వంసనకథ, ధ్రువోపాఖ్యానము పృథుచరిత్రము, పురంజనోపాఖ్యానము మున్నగునవి కలవు. పంచమమున ప్రియవ్రతోపాఖ్యానము, జడభరతోపాఖ్యానము, భూగోళస్వరూపాదికము, నరకలోకవృత్తాంతము చెప్పబడినవి. షష్ఠస్కంధమున అజామిళోపాఖ్యానము, దక్షప్రజాపతిసృష్టి, వృత్రాసురవధ, సవితృవంశాదివర్ణనము కలవు. సప్తమమున ప్రహ్లాదచరిత్ర, నృసింహావతారకథ, త్రిపురాసురసంహారము, వర్ణాశ్రమధర్మనిర్ణయము మున్నగునవి చెప్పబడినవి అష్టమమున మన్వంతరవర్ణనము, గజేంద్రమోక్షకథ, క్షీరసాగరమథనకథ, వామనచరిత్రమును, నవమములో అంబరీషాది సద్రాజోపాఖ్యానము, యదువంశవర్ణనాదులును కలవు. దశమస్కంధములో శ్రీకృష్ణుని సృష్టి, స్థితి, లయకర్తృత్వ రహస్యము, శ్రీకృష్ణుడు జన్మప్రభృతి ప్రదర్శించిన మహిమలు, వర్షాదిఋతువులు,రుక్మిణీకల్యాణాది

చిత్రచరిత్రములు వర్ణింపబడినవి. ఏకాదశస్కంధమున కర్మ, జ్ఞాన, భక్తి, ధ్యాన, యోగాభివర్ణనము, యమనియమాది వర్ణనము, కృష్ణనిర్యాణ వృత్తాంతము, ద్వాదశస్కంధమున కలియుగ ధర్మములు, సంసారనిస్తరణోపాయములు, పురాణముల లక్షణములు, మార్కండేయుచరితము, భాగవతభాగ సంగ్రహము చెప్పబడినవి

వేదాంతము పురాణమునకు చెప్పబడిన దశవిధ లక్షణములలో దశమము ఆశ్రయము ఇది ఇతర లక్షణములకంటె భిన్నమును విశిష్టమును నైనది ఆశ్రయమన ప్రపంచసృష్టిస్థితిలయములకు హేతుభూతుడగు పరమాత్మ, పరబ్రహ్మము అని అర్థము సూర్యుడు, ఇంద్రియము, గోళకము, పరస్పరాపేక్షతో కార్యకారులగును పరమాత్మ స్వతంత్రుడు, నిరపేక్షుడు కాలత్రయాబాధ్యుడు ఇతరులకంటె విలక్షణుడు అను అర్థమును ప్రతిపాదించుటకే ఇతర లక్షణములు చెప్పబడినవి

"కృష్ణమేన మవేహి త్వ మాత్మాన మఖిలాత్మనామ్।
జగద్ధితాయ సోఽప్యత్ర దేహీ వాఽఽభాతి మాయయా॥"

జగత్కల్యాణముకొరకు దేహధారివలె ఈ కృష్ణుడు కనిపించును ఇతడు పరమాత్మ - సకలజీవుల కాత్మ, అను శ్రీకృష్ణనితత్త్వ మీభాగవతమున చెప్పబడినది శ్రీకృష్ణుడు పరమాత్మ, సర్వవ్యాపియని, బ్రహ్మగోవత్సాపహరణకథవలన విదితమగుచున్నది

రాసక్రీడా పంచాధ్యాయి శ్రీకృష్ణుని పంచప్రాణరూపము ఇది భగవద్దివ్య క్రీడావర్ణనపరము, రససంబంధిక్రీడ, రాసము రసమనగా "రసో వై సః" అను శ్రుత్యనుసారము శ్రీకృష్ణుడే రాసక్రీడయందు-అనేక రసాత్మకుడై, అనంతరసాస్వాదనముచే తానే, ఆస్వాద్య-ఆస్వాదక, ఉద్దీపనాలంబనరూపమై క్రీడించుట ఈ పంచాధ్యాయిలో వంశీధ్వని, గోపికాభిసారము, శ్రీకృష్ణ గోపికాసంభాషణ రమణములు, శ్రీకృష్ణాంతర్ధానము, గోపికాగీత, శ్రీకృష్ణ పునరావిర్భావము, గోపికూట ప్రశ్నోత్తరములు, రాసనృత్యము, జలక్రీడ, వనవిహారము, మున్నగునాటి వర్ణనములు కలవు ఈ వర్ణనములు మానవునకు పఠన, స్మరణమాత్రముచే పవిత్రతాదాయకములు

భగవచ్ఛరీరము జీవశరీరమునవలె ప్రాకృతముకాదు ఇచ్చట ప్రకృతి చిన్మయము అంతయు చిన్మయమే జగత్తు జడము ప్రాకృతజీవులకు రాసక్రీడారహస్యము గోచరించదు ధర్మరక్షణార్థమై అవతరించిన శ్రీకృష్ణుడు పరదారాగమనముచేయుట యుక్తమగునాయని పరీక్షిత్తు శ్రీశుకుని ప్రశ్నించెను శ్రీశుకుడిట్లుత్తరము చెప్పెను "గోపీనాం తత్పతీనాంచ సర్వేషామేవ దేహినామ్, యోఽంతశ్చరతి సోఽధ్యక్షః క్రీడనదేహభాక్" శ్రీకృష్ణుడు గోపికలకు, భర్తలకు, సర్వదేహధారులకు, అంతశ్చారియై సర్వమును గ్రహించును క్రీడాదేహమును ధరించిన శ్రీకృష్ణుని మాయచే వారి భర్తలకు తమభార్యలు తమ సన్నిధిలోనున్నట్లే తోచెను కావున అజ్ఞానుల ఆక్షేపములు అవిచారరమణీయములని భాగవతమే నిరూపించుచున్నది

స్తుతిభాగము భాగవతములో ఇది విశేషముగా కలదు అంతయు పరమాత్మవిషయమే ఇందలి రెండు మూడు స్తుతులే ఇతర దేవతాసంబంధము కలవి భాగవతములో ఇతర దేవతానింద లేదు భగవత్ స్తుతిలో తత్త్వప్రకాశము తత్ప్రాప్తిసాధనములు వర్ణితములు శ్రుతిగీత, భగవత్తత్త్వప్రకాశకము పృథు, ప్రహ్లాద, ధ్రువ, అంబరీష, బ్రహ్మాదులచే కావింపబడిన స్తుతులు సాధనప్రధానములు 'పృథుస్తవనములో' వేయికర్ణములను నీకథలను వినుటకిమ్ము, నీ స్వరూపదర్శన, శ్రవణ, సత్సంగములచే కలుగు ఆనందము మరిదేనిచేతను కలుగదని వచింపబడినది కపిలగీత, హంసగీత ఉపదేశరూపములు భిక్షుగీత, గోపికాగీతలు, భక్తుల ఆవేదనను ఆశ్రయతత్త్వమునందు తల్లీనతను తెలుపును

త్రిమూర్తులభిన్నులు చతుర్థస్కంధములో

'శరణం తం ప్రపద్యేఽహం య ఏవ జగదీశ్వరః।
ప్రజా మాత్మసమాం మహ్యం ప్రయచ్ఛతు॥

ఎవడు జగన్నియామకుడో ఆతడు నాకు తనతో సదృశుడగు పుత్రునొసగుగాక అని అత్రిమహాముని ప్రార్థించెను అపుడు బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుడు, ముగ్గురును తమతమ లక్షణములతో ఆవిర్భవించిరి "నేనొకదేవునే ప్రార్థించితిని, మువ్వురేలవచ్చితిరి అని అత్రి అనెను అపుడు త్రిమూర్తులు మాకాత్మభేదములు లేవు, శరీరభేదము మాత్రమే కలదు, కావున ముగ్గురు కుమారులు మూడు అంశలతో జన్మింతురనిచెప్పిరి దీనిచే త్రిమూర్తులభిన్నులని తేటపడుచున్నది

'అహం భవాన్న చాన్యస్త్వం, త్వమేవాహం విచక్ష్వ భోః।
న నౌ పశ్యంతి కవయః ఛిద్రం జాతు మనాగపి'

అను శ్లోకమువలన జీవాత్మపరమాత్మలకభేదమని విశదమగు చున్నది

ముక్తికి భక్తియే ముఖ్యసాధనము

'శ్రేయస్సృతిం భక్తిముదస్యతే, విభో
క్లిశ్యంతి యే కేవలబోధలబ్ధయే
తేషా మసౌ క్లేశల ఏవ శిష్యతే
నాన్యద్యథా స్థూలతుషావఘాతినామ్' (10 స్కం 14 అ)

ముక్తికి మార్గమైన భక్తినివదలి, కేవలము జ్ఞానముచే నిర్వు చేరుటకు ప్రయత్నించువారు పొట్టును దంచుటకు కడగినవారి వలె నిష్ఫలులగుదురని బ్రహ్మస్తవములోని ఈ శ్లోకముచే విదితము. అనేకములైన ఉపాఖ్యానములలో నరుడు భక్తిరూపమైన ఉపాయముచే ముక్తిని సాధింపదగునని యు, భక్తియే జన్మసాఫల్యదాయకమనియు, చెప్పబడినది. పురంజనోపాఖ్యానములో భౌతికదృష్టులకు భౌతిక రూపవర్ణనము తత్త్వోపదేశమునకు ప్రతిష్ఠావహమగునని వక్కాణింపబడినది. ప్రథమమున సంసారతత్త్వము, రాజ్యభోగములు, వాటియందు హేయతాబుద్ధి వర్ణితములు. ఇందు జీవుడు రాజుగా, శరీరము పురముగా, పరమాత్మ స్నేహితుడుగా, బుద్ధి భార్యగా రూపించుట జరిగినది.

భాగవతమిట్లు కేవలము వేదాంతసార సంభృతమగుటయేకాక, కావ్యశైలిచేకూడ హృద్యముగ నున్నది. అలంకారములకు, వర్ణనములకు, సూక్తములకు, శయ్యారీతులకు ఇది ఆకరము.

"నరరాజోడు, పచ్ఛన్నః స్వజ్యోత్స్నారంజితైర్ఘనైః
అహంమత్యా భాసితయా స్వభాసా పురుషోయథా"

స్వీయకాంతిచే భాసించు అహంమతిచే ఆచ్ఛాదితుడై ఆత్మ భాసించనట్లు స్వీయచంద్రికచే భాసించు మేఘములచే కప్పబడిన చంద్రుడు భాసింపలేదు, అని చెప్పబడెను. ఇది వర్షాకాల వర్ణనమైపుణ్యమునకును, ప్రశస్తోపమకును ఉదాహరణము.

వృత్తములు: భాగవతమునందు స్తోత్రములు స్రగ్ధర, మందాక్రాంతము, శార్దూలము, వసంతతిలక మున్నగు వృత్తములతో పొందుపరచబడినవి. ఆదియందలి ప్రథమ, ద్వితీయ వృత్తములు, శార్దూలవృత్తములు, మూడవశ్లోకము ద్రుతవిలంబితము. దశమయాగవర్ణనమునను, నృసింహస్తవమునను, వివిధవృత్తములు వాడబడినవి. అనుష్టుప్ఛందోమయస్తోత్రము చాల తక్కువ. పంచమస్కంధమంతయు గద్యమయమైనను, కొంత స్తోత్రభాగము పద్యాత్మకముగనున్నది. దశమస్కంధమున, రసవత్తరములైన శ్లోకములు పెక్కులున్నవి.

వ్యాఖ్యలు: ప్రస్థానత్రయమునకువలె భాగవతమునకును స్వస్వమతానుసారముగా రచింపబడిన వ్యాఖ్యలు పెక్కులు కలవు. వాటిలోనెల్ల శ్రీధరస్వామి కృతవ్యాఖ్యకు గల ప్రతిష్ఠ గొప్పది.

"వ్యాసో వేత్తి, శుకో వేత్తి, రాజా వేత్తి, నవేత్తివా
శ్రీధర స్సకలం వేత్తి శ్రీ నృసింహప్రసాదతః

అను శ్లోకము శ్రీధరీయ వ్యాఖ్యానమునకుగల ఉదాత్తస్థానమును బోధించుచున్నది. అద్వైతమతానుసారముగా వ్రాయబడిన వ్యాఖ్యలు పెక్కులున్నవి.

ఫలము - మహాత్మ్యము: సప్తాహములో ఈ భాగవతమును చదివినవారికిని, వినినవారికిని, ముక్తి కరతలామలకము. భాగవతపురాణమునకు ఇతరపురాణములకంటె ప్రచారము, ప్రతిష్ఠ, మెండు.

"నిగమకల్పతరోర్గళితం ఫలం శుకముఖాదమృత ద్రవ
సంయుతం,
పిబత భాగవతం రస మాలయం, ముహురహో
రసికా భువి భావుకాః !"

అను శ్లోకమును ఉదాహరించుటకంటె, ఈ భాగవత మహత్త్వమును వేరుగా పొగడ నవసరము లేదు.

బం. న. శా

## భాత్ఖండే ( క్రీ. శ. 1860 - 1936 ):

హిందీ సాహిత్యమున సూరదాసు, తులసీదాసు అను మహాశయులు ఉద్గ్రంథములును, కీర్తనలను రచించి తమ కీర్తిని అజరామరము చేసికొనిరి. అట్లే, భాత్ఖండే తన అవిశ్రాంతకృషివలన మానవజీవితమునకును, సంగీతమునకును నడుమగల సన్నిహితసంబంధమును పెంపొందించి, గానవిద్యాభివృద్ధికిని, ప్రచారమునకును తన జీవితమును ధారవోసెను. ఈ కారణముచే భాత్ఖండే, విష్ణుదిగంబర్, పలూస్కరు అను విద్వాంసుల నామములు, సంగీతోద్ధారకులుగా, గాయన ఇతిహాసములో సువర్ణాక్షరములలో లిఖింపబడినవి.

క్రీ. శ. 1860 ఆగస్టు 10 వ తేదీన బొంబాయి జిల్లాలోని వాకేశ్వర్ అను గ్రామమునందు నారాయణభాత్ఖండే కు కుమారుడై భాత్ఖండే జన్మించెను. ఈతనికి బాల్యదశలోనే గానాభిరుచి సంక్రమించెను. కిశోరావస్థలో

తన తల్లిపాడిన పాటలను అనుకరించుచు, ఇతడు ఆమెకు ఆనందము కల్పించుచుండెను ఇతనికి గానము భగవద్దత్తమని తలిదండ్రులు గ్రహించి అందాతనిని ప్రోత్సహించిరి.

విద్యార్థిదశలో పాఠశాలావిద్య కెట్టి ఆటంకము కలుగకుండ పాఠశాలయొక్క వర్ధంత్యుత్సవములలో భాత్ఖండే రసవత్తరముగ పాడి, బహుమతులను గైకొనెడివాడు గాన సభలలోను, నాటకప్రదర్శనములలోను, ఉపస్థితుడై, సంగీత జ్ఞానమును ఆతడు అభివృద్ధిచేసికొనెను ఆతడు సితారువాద్యమును బహుశ్రమతో నేర్చుకొని అందు మంచి నైపుణ్యమును సంపాదించెను 1885 లో బి ఏ డిగ్రీని, 1890లో వకీలు సనదును, ఆతడు గైకొనెను అనంతరము భాత్ఖండే కరాచీ నగరములో న్యాయవాదిగా పనిచేయుచు, విశేషలాభమును గడింపలేని కారణమున, తిరిగి బొంబాయిచేరి, స్వల్పవివాద విచారణ న్యాయస్థానములో ప్రాక్టీసు చేయుచుండెను ఈ కాలములో ఆతని భార్యయు, పుత్రికయు మరణించిరి కాని ఆతడు తిరిగి వివాహమాడలేదు బొంబాయి జ్ఞానోత్తేజక మండలిలో ఆతడు సభ్యుడిగాచేరి, గానమభ్యసించుచు, పెక్కు గ్రంథములను పఠించుచు, సుప్రసిద్ధగాయకుల ప్రదర్శనములను పెక్కింటిని దర్శించెను

1904 వ సం॥లో భాత్ఖండే దక్షిణభారత యాత్రచేసి మద్రాసు, తంజావూరు, కుంభకోణము, మధుర, రామనాడు బెంగుళూరు, తిరువాన్కూరు, మంగుళూరు, మైసూరు మున్నగు నగరములలోని ప్రఖ్యాతగాయకులను దర్శించి, వారితో అనేక విషయములను చర్చించెను ఆ సందర్భమున సుబ్బరామదీక్షితులు రచించిన 'సంగీత సంప్రదాయదర్శనము' అను గ్రంథమునకు భాత్ఖండే పీఠికను వ్రాసెను వెంకటమఖి వ్రాసిన 72 మేళకర్తల పద్ధతిని చదివి, అవగాహము చేసికొని, దాని ప్రాతిపదికపై కొన్ని రాగములను తీసికొని 10 మేళకర్తలక్రింద విభజించి, హిందూస్థానీ సంగీతపద్ధతిని అభినవరాగమంజరిని, లక్ష్య సంగీత గ్రంథములను, ఆతడు రచించెను

1908లో భాత్ఖండే ఉత్తర, పూర్వ భారతదేశ ప్రాంతములను పర్యటించి, భావనగరు, జయపూరు, రాంపూరు, ఢిల్లీ, కాశీ, గ్వాలియరు, బరోడా మున్నగు తావులందలి రాచదర్బారు గాయకులతో పరిచయము చేసికొని, వారి శిష్యత్వముచేసి, అప్రచలిత ప్రాచీన రాగములను నేర్చి హిందూస్థానీ ఘరానాల తరతమభావమును గ్రహించెను 1907 లో విజయనగరము, పూరి, నాగపూరు, హైదరాబాదు, కలకత్తా మొదలైన నగరములకేగి, అచ్చటి గానపద్ధతులను విని, వాటికి సంబంధించిన విషయములను వ్రాసికొనెను ఆ రోజులలో ఉత్తరహిందూస్థానీ సంప్రదాయగ (ఖాన్ దానీ గాయక) గాయకులు ఏమాత్రమును రాగలక్షణమును తెలియనివారై, ఇచ్చవచ్చినట్లు రాగములను పాడుచుండెడి వారు అప్పుడు ఘరానాలకు చెందిన రాగరాగిణీపద్ధతి అశాస్త్రీయముగా నుండుటకు, గాయకులకు సంస్కృతభాషా పరిచయములేకపోవుటగాని, విద్యాగంధము గాని లేకుండుటయే కారణము దాక్షిణాత్య జన్య-జనక రాగపద్ధతి ప్రకారము థాట్ లేక మేళపద్ధతిని హిందూస్థానీ గానములో ఇతడు ప్రవేశపెట్టెను దీనివలన అశాస్త్రీయ రాగరాగిణీపద్ధతి నశించిపోయినది

ఉత్తమ సంగీతజ్ఞాన ప్రచారమునకు మేళనిర్ణయ మావశ్యకమని తలచి 1916 లో ప్రథమ సంగీత కళాపరిషత్తును బరోడాలో భాత్ఖండే నిర్వహించెను ఈ పరిషత్సభకు వివిధ ప్రాంతములనుండి ప్రసిద్ధగాయకులు ఆహ్వానింపబడిరి ఈ సభలో జరిగిన చర్చల ఫలితముగా, అఖిలభారత సంగీత పరిషత్తును, దానికనుబంధముగా నొక విద్యాలయమును, స్థాపించుటకు తీర్మానము గావింపబడినది ఇట్లే, 1918 లో ఢిల్లీనగరమున రాంపూరునవాబు అధ్యక్షతమునను, 1919 లో కాశీనగరమునందును, 1925, 1926 సంవత్సరములలో వరుసగా లక్నో నగరమునందును రెండు సంగీతసభలు జరిగెను వీటి ఫలితముగా సంస్థానాధీశుల ఆర్థిక సహాయమువలనను, ప్రోత్సాహమువలనను, లక్నోలో 1926 వ సంవత్సరములో "మారిస్ సంగీత విద్యాలయము" స్థాపింపబడెను దీనికంతకును భాత్ఖండే ప్రధానకారకుడు ఆతడు సల్పిన పరిశ్రమను గ్వాలియరు, బరోడా సంస్థానాధీశులు అభినందించి తమతమ కళాశాలలలో భాత్ఖండే సిద్ధముచేసిన పాఠ్యప్రణాళికను అమలులో పెట్టిరి

భాత్ఖండే కర్మయోగిగను, త్యాగిగను పేరొందినవాడు ఇతని సంగీతసేవను నాల్గు తరగతులక్రింద విభజింపనగును (1) ముస్లిమునవాబుల సంప్రదాయములో పాతుకునిపోయిన సంగీత విధానమును కూకటివ్రేళ్ళతో పెళ్ళగించి, దానిని పరిశుద్ధమొనర్చి, దానికి నూతనరూపము నొసగుట. (2) హిందూస్థానీ సంగీతములో శుద్ధమేళము లేకుండుటచే

దానిని పరివర్తనమొనర్చి, మేళపద్ధతిని చేకూర్చి, శాస్త్రబద్ధమొనర్చుట (౩) సుప్రసిద్ధ గాయకుల కృతులను సంగ్రహించి, వాటిని సరళస్వరలిపి పద్ధతిలో తయారుచేసి క్రమికపుస్తక మాలిక అను శీర్షిక క్రింద ఆరు భాగములుగ ముద్రించుట (౪) ప్రాచీన సంస్కృతలక్షణ గ్రంథముల పరిష్కృత ప్రచారముకొరకు రాగవిబోధ, షడ్రాగచంద్రోదయము, అష్టోత్తర తాళలక్షణము, తులసీకృత రాగకల్పద్రుమము, అను గ్రంథములను ముద్రించుట మరాఠీలిపిలో హిందూస్థానీ సంగీతపద్ధతి నధికరించి నాలుగు భాగములలో భాత్‌ఖండే తన శాస్త్రానుభవమును సమగ్రముగా వివరించెను విష్ణుశర్మ యను ముద్రతో 'లక్ష్యసంగీతము', 'రాగమంజరి' అను గ్రంథములను అతడు ప్రకటించెను 'షార్ట్ హిస్టారికల్ సర్వే', 'మ్యూజిక్ ఆఫ్ ఫిఫ్టీన్త్ టు ఎయిటీన్త్ సెంచరీస్' అను రెండు గ్రంథములను బి. ఏ విద్యార్థులకు పాఠ్య గ్రంథాలుగా ఇతడు రచించెను ఇతడేర్పరచిన పాఠ్యక్రమ ప్రణాళికను భాత్‌ఖండే గాయనశాల శాఖలవారు అమలులో పెట్టి ఇతని రచనలను పాఠ్యగ్రంథములనుగా ఏర్పరచిరి ఇతడు కవియగుటచే, కొన్ని రాగలక్షణగీతములను, తరానాలను సృష్టించెను ఇతనికి 'చతురపండిత అను ఉపనామము కలదు

ఇతని శిష్యులలో ముఖ్యులైన రతంజోకర్, వడిలాల్ నాయక్, భోలానాథభట్టు మున్నగువారు ఇతని శిక్షాప్రణాళికను అవలంబించి ఖ్యాతిగాంచి యుండిరి పండితరాజా విజయదేవ్‌జీ-మోహన్‌జీ అనునతడు 'రాగభావము' అను గ్రంథమును రెండు భాగములుగా రచించి భాత్‌ఖండేకు అంకితమిచ్చెను మిత్రులగు పలువురు సంస్థానాధీశులు ఇతనిని గౌరవించి సన్మానించిరి

భాత్‌ఖండే 1931 వ సంవత్సరంలో పక్షవాతగ్రస్తుడై, నాలుగేండ్లపాటు బాధననుభవించి, 1936 సెప్టెంబరు 19 వ తేదీన దివంగతుడయ్యెను

మం రా, శా

## భా ను మ తి

శ్రీమతి పాలువాయి భానుమతి తెలుగు సినిమాలోకమున అగ్రశ్రేణికి చెందిన తార. ఈమె 1925 సెప్టెంబరు 7 వ తేదీన ఒంగోలు తాలూకాలోని దొడ్డవరం గ్రామమునందు జన్మించెను. సంస్కారియు, సంపన్నగృహస్థునయిన ఆమె తండ్రి వెంకటసుబ్బయ్య ఆమెను ఒంగోలు నగరమున నుంచి చదువుతోపాటు సంగీత, నృత్యకళలలో ఆమెకు అభిరుచిని కల్పించెను

విద్యార్థి దశయందే భానుమతి శ్రావ్యమైన తన కంఠములో అధ్యాత్మరామాయణ కీర్తనలను, జయదేవుని అష్టపదులను, శ్రీ బసవరాజు అప్పారావు గేయములను పాడి, పెక్కు పారితోషికములను సంపాదించుకొనెను

సి పుల్లయ్య దర్శకత్వమున ఈస్టిండియాఫిల్ము కంపెనీవారు కలకత్తాలో నిర్మించిన 'వరవిక్రయము' అను చిత్రమునకు కొందరు క్రొత్త నటీనటులు కావలసివచ్చిరి రేలంగి వెంకట్రామయ్య ద్వారా పుల్లయ్య దృష్టిలో పడిన భానుమతి 'వరవిక్రయము' అను చిత్రములో కాళింది భూమికను నిర్వహించెను అప్పుడామెకు పదమూడేండ్లవయస్సు కాళింది పాత్రాభినయములో ఆమె ప్రకటించిన హావభావములు, ఆమె పాడిన కమ్మనిపాటలు, అశేష ఆంధ్ర సినిమా ప్రేక్షకులను ముగ్ధులను గావించెను ఆమె నటించిన రెండవ చిత్రము 'మాలతీమాధవము'

కలకత్తా, కొల్హాపూరు, బొంబాయి, పూనాలతోపాటు, చిత్రనిర్మాణమునకు ఒక ప్రధానకేంద్రముగా రూపుదాల్చిన మద్రాసు నగరమునకు, ఒంగోలునుండి భానుమతి కుటుంబ సమేతముగా 1940 వ సంవత్సరములో తరలివెళ్లెను మద్రాసులో అడుగిడ టతోడనే, ఆమెకు జగదీశ్ ఫిలిమ్స్‌వారి 'తహసిల్‌దార్' చిత్రములో చక్కని పాత్రాభినయము లభించెను వై. వి రావు దర్శకత్వమున నిర్మింపబడిన ఆ చిత్రము వ్యాపారరీత్యా గొప్ప విజయమును పొందుటతో భానుమతి ఇటు తెలుగు చిత్ర నిర్మాతల దృష్టినే కాక, అటు తమిళ చిత్ర నిర్మాతల దృష్టినికూడ ఆకర్షించెను ఆమె నటించిన మొదటి తమిళ చిత్రము జెమినీవారి 'అపూర్వసహోదరులు' అను నది ఇది హిందీభాషలోకూడ 'నిషాన్' అను పేరుతో తయారుచేయబడినది భానుమతి హిందీభాషా చిత్రములోకూడ నటించి 'మూడుభాషల తార'గా యశస్సు నార్జించెను

'స్టార్ కంబైన్స్'వారి 'కృష్ణప్రేమ' అను చిత్రమున నటించుచుండగా, ఆమెకు, ఆ చిత్ర నిర్మాణములో సహాయ దర్శకుడైన పాలువాయి రామకృష్ణరావుతో పరిచయమేర్పడెను. ఆ పరిచయము ప్రణయముగా పరిణమించి వారిరువురి దాంపత్యమునకు దారితీసెను

కళావిలసితములయిన చిత్రములను నిర్మించుటలో పేరుపడిన 'వాహినీ' వారు తమ 'స్వర్గసీమ' చిత్రములో భానుమతికి కథానాయికపాత్ర నొసగిరి సుబ్బులు, సుబ్బలక్ష్మిగాను, సుజాతగాను పేరు మార్చుకొని, ఆ పాత్రను నిర్వహించుటలో భానుమతి అద్వితీయమైన ప్రతిభను ప్రకటించెను ఆ చిత్రములో ఆమె పాడిన 'ఓహోహోపావురమా' అను పాట ఆంధ్రదేశమునందు గొప్ప ప్రచారమును గాంచెను తరువాత జెమినీవారు హిందీ, తెలుగుభాషలలో తీసిన 'మంగళ' అను చిత్రములో ఆమె కథానాయికపాత్ర దాల్చి అశేషఖ్యాతి నార్జించెను దీనిలో ఆమె సల్పిన నృత్యము రసికులయిన ప్రేక్షకుల ప్రశంసల నందుకొనెను

'రత్నకుమార', 'రాణి', 'రాజముక్తి', 'రంగూన్ రాధ', 'మలైకళన్' అను తమిళచిత్రములు వ్యాపారదృష్ట్యా గొప్ప విజయమును సాధించి ఆమెనొక అగ్రశ్రేణికిచెందిన తారనుగా రూపొందించెను తరువాత ఆమె వాహినీవారి 'మల్లీశ్వరి' చిత్రములో కథానాయికగా నటించెను కరుణరసప్రపూరితమయిన మల్లీశ్వరి పాత్రకు ఆమె సంపూర్ణమైన న్యాయమును సలిపి, ప్రేక్షకులచేత కంటతడి పెట్టింపగల్గెను

మహానటియై వరలుటయేకాక, వ్యవహారదక్షత కూడ కల్గిన మహిళ అగుటచే, ఆమె తన భర్తతో కలిసి భరణిపిక్చర్స్ అను స్వంత చిత్రనిర్మాణసంస్థకు ప్రాణప్రతిష్ఠ సలిపెను భరణీ నక్షత్రమునందు ఆమెకు కల్గిన కుమారునిపేరనే ఈసంస్థ వెలసినది భరణీ పతాకముక్రింద ప్రప్రథమముగా తయారైన చిత్రము 'రత్నమాల'. తరువాత వచ్చిన చిత్రము 'లైలా మజ్ను'. ఇది వ్యాపారదృష్టిచే పేరుపొంది భరణీసంస్థను పటిష్ఠమొనర్చెను

తరవేగముతోను, కళాసౌష్ఠవముతోను చిత్రములను నిర్మించుటకు స్వంతస్టుడియో ఉండవలసిన ఆవశ్యకతను గమనించి, శ్రీమతి భానుమతి, రామకృష్ణారావులు మద్రాసునందలి కోడంబాకమునందు సువిశాలమైన స్థలమును సేకరించి, దానిలో భరణీస్టుడియోను నెలకొల్పిరి 'ప్రేమ', 'విప్రనారాయణ', 'చక్రపాణి', 'వరుడుకావాలి', 'చింతామణి' మొదలైన చిత్రములు ఈ స్టుడియోనుండియే వెలువడెను రామకృష్ణరావు ఈ చిత్రములన్నింటికిని దర్శకత్వభారమును వహించెదరు. వీటిలో కథానాయికపాత్రను నిర్వహించుటతోపాటు భానుమతి కొన్నిటికి సంగీతదర్శకత్వమునుకూడ నిర్వహించి. కర్ణాటక, హిందూస్థానీ సంగీతములందు తనకుగల గొప్పపాండిత్యమును, ప్రతిభను ప్రదర్శించెను

సినిమా సాంకేతికశాస్త్రమును కూలంకషముగ నెరిగిన భానుమతి 'చండీరాణి' అను చిత్రమును హిందీ, తెలుగు, తమిళభాషలలో నిర్మింపించి, చరిత్రను సృష్టించెను ఈచిత్రమునకు సాధారణ దర్శకత్వమును, సంగీత దర్శకత్వమును గూడ ఆమె నిర్వహించెను ఒకేరోజున ఈచిత్రము ఆసేతు హిమాచల పర్యంతము మూడుభాషలలో విడుదలయగుట భారత చలనచిత్ర చరిత్రలో కనివిని ఎరుగని సంఘటనము దురదృష్టవశమున 'చండీరాణి', ఆశించిన మేరకు విజయము కాంచకపోవుటచే, భానుమతి కొంతకాలము తెరమరుగున కాలము గడపవలసివచ్చెను

బాల్యము నుండియు ఆమెకు సాహిత్యాభిలాష మెండు నవలా పఠనమునిన, ఆమెకు ఎంతయు ప్రీతి తన పదునైదవ యేటనే భానుమతి పెక్కు కథలను వ్రాసి వివిధ పత్రికలకు పంపుచుండెడిది తన సినిమాజీవితములో లభించిన విశ్రాంతికాలమును ఆమె తిరిగి రచనలు చేయుటకు వినియోగింప మొదలిడెను ఆమె రచనలన్నియు 'అత్తగారికథలు' అన్న పేరుతో ప్రకాశముపొంది, తెలుగు సాహిత్యలోకమున నొక విశిష్టస్థానమును సంపాదించుకొనెను ఆమె రచనలలో మానవ మానసికతత్త్వముయొక్క నిశితపరిశీలనము, భావస్ఫూర్తి విశేషముగా కానవచ్చును ఆమె భావశైలి, సమాసరహితమై, చదవరులకు మిగుల ఆహ్లాదకరముగ నుండును కుటుంబజీవితమునందలి దైనందిన సమస్యలన్నియు ఆమె రచనలలో కొట్టవచ్చినట్లుగా పడి పాఠకులకు చక్కని రసానుభూతిని కలుగజేయును అందుచేతనే, 'అత్తగారికథలు' ఆంధ్రసాహిత్యఅకాడెమివారి పారితోషికమును పొందగలిగెను

కాలచక్రము తిరిగి కలిసివచ్చుటచేత, భానుమతి మరల వెలుగులోనికి వచ్చెను మరల కొన్ని తమిళ చిత్రములలోనే కాక తెలుగు చిత్రములయిన "బొబ్బిలియుద్ధము"లో మల్లమదేవిగను "పల్నాటియుద్ధము"లో నాయకురాలుగను నటించి, బహుజనుల ప్రశంసలను చూరగొనెను భరణీపిక్చర్స్ పతాకమును తిరిగి ఎగురవైచి, ఆమెయు, ఆమెభర్తయు 'బాటసారి' 'గృహలక్ష్మి' మున్నగు చిత్రములను తయారుచేసిరి. వ్యాపారదృష్టిచే ఇవి ఘనవిజయమును సాధింపలేకపోయినను శిల్పనైపుణిచే చక్కని ప్రమాణములను సృష్టించినవి

బహుముఖ ప్రజ్ఞాధురీణ అయిన ఈ మహానటిని ఆంధ్ర రాష్ట్రావతరణ తృతీయవార్షికోత్సవ సందర్భమున కర్నూలు నగరములో ఆంధ్రప్రభుత్వము సముచితరీతిని సన్మానించెను

ఇంతవరకు భానుమతి హిందీ, తమిళ, తెలుగు చిత్రములలో మొత్తముమీద నూటపదిహేనింటిలో నటించియున్నది విభిన్న ప్రకృతులుగల పాత్రలను పోషించి ఆమె 'క్యారెక్టర్ యాక్టర్' అని పేరుగాంచినది సినిమా సాంకేతిక శాస్త్రము లో ఆమెకు తెలియని విషయము లేదు ఆమెది స్ఫుర ద్రూపము సంస్కారము ఆమె ముఖమందు ఉట్టిపడుచుండును తెలుగుదేశమునందలి వివిధ కేంద్రములలో ఆమెకు రసికులైన ప్రేక్షకులు పందలాది సన్మానములను జరపిరి 1966వ సంవత్సరము లో హైదరాబాదులో జరగిన అఖిలభారత రచయిత్రుల మహాసభకు ఆహ్వాన సంఘాధ్యక్షురాలుగా ఆమె చేసిన ఉపన్యాసము సాహిత్య చరిత్రలోని కెక్కదగినది ఈనాటి మానవసమాజమును కలవరపెట్టుచున్న సమస్యలన్నియు ఆ ఉపన్యాసమునందు రసాత్మకములుగా చిత్రింపబడినవి

ఇంకను భానుమతి చిత్రములలో నటించుచునే యున్నది ఆమె కోకిల కంఠము చెక్కుచెదరక అట్లే యుండుట అత్యంత ప్రశంసనీయము తనకు మరొకరు నేపథ్య గానమును పలుపుటకు ఆమె ఎంతమాత్రమును అంగీకరింపదు కేవలము వ్యాపార ప్రయోజనమును పురస్కరించుకొని ఎట్టి పాత్రము ధరించుటకు ఆమె అంగీకరించక పోవుటచేతను, స్వతంత్ర భావములు గల వ్యక్తి యగుటచేతను, ఆమె 'అహంకారముగల వ్యక్తి' అని కొందరు అపార్థము చేసుకొనుట కలదు

సంగీత, సాహిత్య, నృత్య విషయములందు ప్రతిభా సంపన్నురాలయిన భానుమతికి భారత ప్రభుత్వమువారు 1966 లో 'పద్మశ్రీ' అను బిరుదము నిచ్చి సత్కరించిరి

భావగర్భితములైన ఆమెరచనలు వివిధ భారతీయ భాషలలోని కీనాడు అనువదింపబడుచున్నవి భరణీ గార్డెన్స్ లోని ఆమె నివాస స్థలమెంతయు రమణీయముగ నుండును, స్వయంపోషక సిద్ధాంతము ననుసరించి ఆమె తనకుటుంబమున కవసరమైన ఆహారపదార్థములను తన గృహావరణమునందే పండించుకొను చుండును. ఫలవృక్షములను, పూలతోటలను పెంచుటయందు ఆమెకు ఆసక్తి మెండు. బాడ్మింటన్, టేబిల్ టెన్నిస్, ఈత గుర్రపుస్వారి మొదలగు క్రీడలలో ఆమెకు ప్రవేశముకలదు కవులతో, గాయకులతో, సాహిత్యోపాసకులతో ఆమె తరచు చర్చలు కావించుచుండును భరణీ గార్డెన్స్‌లో నొక 'సాహితీ వనము'ను ఏర్పరచి సాహిత్యోపాసకులకందరకు దానిలో విశ్రాంతిగృహములను కట్టించవలెననునది ఆమె జీవితలక్ష్యమని తెలియుచున్నది భానుమతి యొసర్చిన గుప్తదానములను చవిచూచిన సాంఘిక, నాటక సంస్థలు తెలుగుదేశమునందు పెక్కులు గలవు

ఇం వెం

భాభా :

డాక్టర్ హోమీ జహంగీర్ భాభా అనునతడు ప్రఖ్యాత భారతీయ వైజ్ఞానికులలో నొకడు ఆతడు 1909 లో జన్మించెను 17 సంవత్సరముల వయస్సు వచ్చువరకు అతడు బొంబాయిలోని కెథీడ్రల్ జాన్‌కోనన్ హైస్కూలులోను, ఎల్‌ఫిన్‌స్టన్ కాలేజీలోను విద్యనభ్యసించెను తర్వాత అతడు కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయములోను, గాస్‌విల్ కియస్ కాలేజీలోను పఠించి, విజ్ఞానశాస్త్రములలో బి. ఎ. డిగ్రీని పొందినాడు ఆ విశ్వవిద్యాలయమునందే 1932 నుండి 34 వరకు గణితశాస్త్ర పరిశోధకులకొరకు ఏర్పడిన "రౌజ్‌బాల్ సంచారి విద్యార్థివేతనము"ను స్వీకరించి జూరిచ్‌లో పాలీ శాస్త్రవేత్తవద్దను, రోమునగరములో ఎన్‌రికోఫెర్మివద్దను, అత్యల్పకాలముపాటు యుట్రెక్ట్‌లో క్రామెర్సువద్దను పరిశోధనములుచేసి తన విజ్ఞానశాస్త్రాభ్యాసమునకు ఆతడు మెరుగులు దిద్దుకొన్నాడు 1934 వ సంవత్సరంనుండి మూడు సంవత్సరములు ఆతడు "న్యూటన్ విద్యార్థివేతనము" నందుకొని కోపెన్‌హేగన్ నగరములో ఐదునెలలపాటు "నీల్స్ బోర్" పరిశోధనాగారములో పరమాణు విజ్ఞానపరిశోధనములు గావించినాడు 1936 లో ఆతడు "1851 వ సంవత్సర వస్తుప్రదర్శనము"నకు సంబంధించిన సీనియర్ విద్యార్థి వేతనమును గైకొని, పరిశోధనములను కొనసాగించెను

1940 లో భాభా భారతదేశమునకు తిరిగివచ్చి బెంగుళూరులోని ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్సులో భౌతిక విజ్ఞానశాస్త్రమునందు సిద్ధాంతవిభాగములో సహాయాచార్యుడుగా ప్రవేశించి, 1942 లో ఆచార్యపీఠము నలంకరించి, 1945 వరకు అచ్చటి పరిశోధనములయందే నిమగ్నుడై కృషిసల్పెను ఆతని పరిశోధనములకు మెచ్చుకోలుగా, ఆతనికి

1942 లో కేంబ్రిడ్జివిశ్వవిద్యాలయము "ఆడమ్స్‌బహుమతి" నిచ్చెను. 1943లో ఆంధ్రవిశ్వవిద్యాలయము లోని వైజ్ఞానిక సంఘము "సర్ శివస్వామిఅయ్యర్ బహుమానమును" గూడ ఇచ్చి అతనిని గౌరవించెను

డాక్టరు భాభా భౌతికశాస్త్రవిజ్ఞానమునకు గావించిన పరిశోధనములు బహుముఖములు కాస్మిక్ కిరణములను గురించి ఆయన శోధించి 1937లోనే హెయిట్లర్ యొక్క సహకారముతో ఎలక్ట్రానుప్రసారమునుగురించి యు, కాస్మిక్ కిరణపాతమును గురించియు "కాస్కేడ్ సిద్ధాంత" మును నిర్వచించెను. ఆ సిద్ధాంతము కాస్మిక్ కిరణములలోనిలక్షణములను గురించి, విపరీత వేగముతో పయనించు ఎలక్ట్రానులతత్వమును ఆ (గామా), కిరణప్రసారస్వభావమును అవగత మొనర్చుకొనుటకు తోడ్పడెను. భాభా, క్వాంటమ్ సిద్ధాంతమునుగురించియు ద్రవ్యనిర్మాణములో పాల్గొను ఎలక్ట్రానను, ప్రోటాను, న్యూట్రాను, న్యూట్రినో, పోజిట్రాను వంటి మూలవిభాజకణముల

చిత్రము 116.

హోమీజహాంగిర్ భాభా

స్వభావములను గురించియు కూడ కృషిచేసెను అతనికృషివలన మెసాన్ అనుకణముయొక్క ఉనికి సూచితమైనది ఆ కణమునకు శాస్త్రవేత్తలు పెట్టినపేరు కూడ భాభా సూచించినదే యూ - మెసానులు వినాశమును చెందుననియు, వాటి గమనవేగము హెచ్చినకొలది అవి మందగించుననియు, ఆ నడవడిక ఐన్‌స్టీను శాస్త్రవేత్త నిర్వహించిన "రిలెటివిటీ సిద్ధాంతము"నకు అనుగుణముగా నున్నదనియు ఈ శాస్త్రవేత్త చర్చించి తెల్పెను ఈ సందర్భములో భాభా గావించిన శాస్త్రచర్చలు తర్కసమ్మతమై, అతని నిశితమైన ప్రజ్ఞను వెల్లడించునవి, ఐన్‌స్టీను సిద్ధాంతము సత్యసమ్మతమనియు నిర్వివాదమనియు రుజువుచేసినవి ఈ విజ్ఞాన పరిశోధనములు భాభాకు కీర్తిని తెచ్చిపెట్టెను 1941 లోనే (సుమారు ముప్పదిరెండేండ్ల పిన్నవయస్సుననే) ఈయనను రాయల్ సొసైటీవారు 'ఫెలో'గా శాస్త్రవేత్తలు ఎన్నుకొనిరి ఈ గౌరవమునకు పాత్రులైన భారతీయులు అత్యల్ప సంఖ్యాకులు ఇంత చిన్నవయస్సులో ఇట్టి గౌరవమును అందుకొన్నవారు మరొకరు లేరను విషయము ఆ శాస్త్రజ్ఞుని అత్యున్నత స్థాయిని తెలియజేయును

భాభా కృషివలననే, కేవలము వైజ్ఞానిక మూలసిద్ధాంతములపై 1945 లో పరిశోధనములకొరకు "టాటా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఫండమెంటల్ రిసెర్చి" అను సంస్థ ఏర్పాటైనది నాటినుండి ఆ సంస్థలో భౌతిక విజ్ఞానశాస్త్ర సిద్ధాంతముల కృషియందు, ఆచార్యుడుగా, డైరెక్టరుగా భాభా నియమితుడైనాడు. విజ్ఞానశాస్త్ర, పరిశోధనాత్మక కృషియే అతనికి తోడునీడయై అర్ధాంగివంటిదైనది

1947 లో భారతప్రభుత్వము అణుశక్తి కమిషనును ఏర్పరచి భాభాను అధ్యక్షునిగా నియమించెను. పరమాణుశక్తి శాఖకు 1954 నుండి ప్రభుత్వకార్యదర్శిగను, ట్రాంబే లోని పరమాణుశక్తి పరిశోధనసంస్థకు డైరెక్టరుగను, భాభా విజ్ఞానశాస్త్రమునకు సేవచేసెను అతని కృషివలననే భారతదేశములో పరమాణుశక్తి యుగమవతరించినది

విజ్ఞానశాస్త్ర పరిశోధన కృషితో అతని ఔన్నత్యమునకు తార్కాణముగా భారతీయవైజ్ఞానికులు 1951 వ సం॥లో భాభాను సైన్సు కాంగ్రెసునకు అధ్యక్షునిగా ఎన్నుకొని గౌరవించిరి 1954 లో భారతప్రభుత్వమితనికి "పద్మభూషణ" అను బిరుదమునిచ్చి ఘనముగా సన్మానించెను 1957 లో అతని మాతృసంస్థయైన గాన్‌విల్ కీయస్ కాలేజీయును, 1959 లో ఎడింబరోలోని రాయల్ సొసైటీయును, అమెరికన్ ఎకాడమీ ఆఫ్ ఆర్ట్స్ అండ్ సైన్సెస్ మొదలైనసంస్థలున్ను ఇతనిని "ఫెలో"గా ఎన్నుకొనెను 1962 వ సం॥లో ప్రపంచ ఎకాడమీ ఆఫ్ ఆర్ట్స్ అండ్ సైన్సెస్, 1963 లో యునైటెడ్ స్టేట్స్ నేషనల్ ఎకాడమీ ఆఫ్ సైన్సెస్, న్యూయార్క్

ఎకాడమీ ఆఫ్ సైన్సెస్ 1964 లో మాడ్రిడ్ నగరమందలి రాయల్ ఎకాడమీ ఆఫ్ సైన్సెస్ మున్నగు అంతర్జాతీయ సంస్థలు పెక్కులు ఇతనికి గౌరవ "ఫెలో" బిరుదము నిచ్చి యాజీవ సభ్యునిగా ఎన్నుకొనినవి. అనేక భారతీయ విశ్వవిద్యాలయములు ఇతనికి గౌరవ డాక్టరేటు పట్టప్రదానము గూడ చేసినవి. వాటిలో కేంబ్రిడ్జి, లండన్, పడోవా యూనివర్సిటీలు పేర్కొనదగినవి. భాభా ప్రపంచ వైజ్ఞానికులలో ఎన్నదగిన వాడని పేర్గాంచెను.

శాంతియుత ప్రయోజనములకై పరమాణుగర్భితమైన శక్తిని వినియోగించు విధానములను సూచించుటకై యునైటెడ్ నేషన్స్ అధ్వర్యవమున 1955 లో జెనీవానగరములో జరిగిన సమావేశమునకు భాభా అధ్యక్షత వహించెను. ఆ నాటి అధ్యక్షప్రసంగములో ఈ శాస్త్రవేత్త ఏకద్రవ్యపరమాణు సంఘట్టనాత్మకసంయోగము నిర్ణీతక్రమములో కొనసాగించుట సాధ్యమే అని సూచించెను. ఆ సూచన ననుసరించి విజ్ఞానవేత్తలు తరువాత మూడు సంవత్సరములలో విరివిగా చేసినకృషి అత్యంతఫలప్రదమైనది. నాటివరకు కొలదిమందికి మాత్రమే తెలిసి గుప్తవిద్యగా భాసించుచుండిన విజ్ఞానము 1958 లో రెండవ అంతర్జాతీయ సమావేశము జరుగునాటికి వైజ్ఞానికులకందరకును అందుబాటయినది. అందుచేత మొదటి అంతర్జాతీయ సమావేశము, భాభాప్రసంగము, అణుశక్తి విజ్ఞానచరిత్రలో ముఖ్యఘట్టములుగా పరిగణింపబడుచున్నవి. విజ్ఞానశాస్త్రవిషయములపై యునైటెడ్ నేషన్స్‌కు సలహాల నిచ్చుటకేర్పడిన సంఘములోను, అంతర్జాతీయ పరమాణుశక్తివినిమయసంఘములోను, భాభా సభ్యత్వమును వహించెను. 1955 మార్చినుండి అంతర్జాతీయ విజ్ఞానవేత్తల సంఘముయొక్క భారతదేశీయశాఖకును, ఆసంవత్సరము జులై నెలనుండి భారతప్రభుత్వ మంత్రివర్గమునకును, సలహాలనిచ్చు వైజ్ఞానికసంఘమునకును భాభా అధ్యక్షుడుగా వ్యవహరించెను.

భాభా ప్రఖ్యాతపరమాణువైజ్ఞానికుడు, విదేశీయ సహకారములతో నిమిత్తము లేకుండ, అణుశక్తిప్రయోజనముల కవసరమైన ఇంధనద్రవ్యములను శోధించు కృషిని ఇతడు ప్రోత్సహించెను. కుండపోతగా వర్షించుచున్నను నిద్రాహారములుమాని ఆతడు లెక్కచేయక కృషిచేసి "అప్సర" అను పరమాణురియాక్టరును నిర్మించి, 20 వ జనవరి 1957 నాడు దానిని వినియోగములోనికి తెచ్చి, ఆసియాఖండమునకు వన్నె తెచ్చెను. ఆ యనుభవముచేతనే తర్వాత జెర్లినా, సి ఐ ఆర్ రియాక్టరుల నిర్మాణము సులభమైనది. "ఉల్బకము" అగ సమాణుశక్తిసన్నద్ధమైన విద్యుచ్ఛక్తి ప్రసారకేంద్రమును నిర్మించుటకు ఇతడు పథకమును నిర్మించెను. ప్రతిసంవత్సరము ప్రతిభావంతులైన యువక వైజ్ఞానికుల నెన్నికచేసి, వారికి తరిఫీదునిచ్చి, విజ్ఞానరంగములో భారతదేశమునకు స్వాతంత్ర్యప్రతిపత్తిని కల్పించెను. ఇతని పర్యవేక్షణనుక్రింద ఏర్పడిన ట్రాంబే అణుశక్తి విజ్ఞానసంస్థలో మొత్తము ఆరువేలమందిలో 4500 మంది శాస్త్రవేత్తలు, సాంకేతిక విద్యానిపుణులు విరామమెరుగని కృషి యొనర్చుచున్నారు.

డాక్టరుభాభా సహృదయుడైన కార్యనిర్వాహకుడు. అణువిజ్ఞానసంస్థలో పనిచేయు ఉద్యోగులు, విజ్ఞానపరిశోధకులు కృషిచేయుట కవసరమైన సౌకర్యములను కల్పించుటలో మాతాపితృవాత్సల్యములోను, కార్యదీక్షతోను పథకములను భాభా అమలుచేసినాడు. అయినను అతని హుందాతనమును చూచి, అతనిచెంతకువెళ్లుట, మొగలు దర్బారును ప్రవేశించుటవంటిదనియు అతడు మొగలు చక్రవర్తులకు సాటియైనవాడనియు, అతనిని బాగుగా ఎరుగని అనుయాయులు భావించెడివారు. కాని అతడు చమత్కార వచోనిపుణుడను విషయము అతని సన్నిహిత మిత్రులెల్లరు ఎరుగుదురు.

భాభా కళాపిపాసి. అతనికి సంగీతమనిన విశేషముగా కర్ణాటక సంగీతమనిన - కడుప్రీతి. బొంబాయిలో ఎక్కడ ఏ ప్రఖ్యాతపాటకుని కచేరి జరిగినను, అతడు తన తల్లిగారిని వెంటనిడుకొని అందు పాల్గొనుచుండెడివాడు. తనకు కావలసిన విరామమును, విజ్ఞానపరిశోధనల కవసరమైన ద్విగుణీకృతోత్సాహమును సంగీతమే ప్రసాదింపగలదని భాభా అనేక పర్యాయములు వక్కాణించెను. భాభా చిత్రకళలోకూడ అభిరుచి కౌశల్యమును కలవాడు. ఇతరకళాకారుల కళాఖండములను అతడు ప్రోత్సహించెడివాడు. ఆధునిక చిత్రకారుల కళాఖండములు పెక్కులు ఈనాడు ట్రాంబేపరిశోధనాగారమునకు శోభను, ఆనందమును కూర్చుచున్నవి. ఒకప్పుడు జీబురుమనుచున్న అరణ్యము ఈనాడు గంధర్వనగరమువంటి విజ్ఞానపరిశోధనాగారమైనది.

బహుముఖప్రజ్ఞాశాలి, కార్యధురంధరుడు, వ్యవహారదక్షుడు, పరిపాలనాపటిమగల సహృదయుడు, కళానిధి, ప్రఖ్యాతవిజ్ఞానవేత్తయైన హోమిజహాంగీరు భాభా 24 జనవరి

1966 వ తేదీనాడు మౌంట్‌బ్లాంక్ వద్ద జరిగిన విమానప్రమాదములో హతుడై కీర్తిశేషులైనారు

హ. అ

## భారతదేశచరిత్ర

హిందూమహాయుగము భరతవర్షము, భరతఖండము, హిందూదేశము అను వేరువేరు పేర్లతో భారతదేశము వ్యవహరింపబడుచున్నది వైదిక మతానుయాయులగు భారతీయులను హిందువులని వర్ణించుట, వారి పరిపాలనా కాలమును హిందూయుగముగా వర్ణించుట, పరిపాటియైనది కాని భారతీయసంస్కృతి గౌరవముతో నిండిన ఈ యుగమును మనము భారతీయ యుగమని వర్ణించుటయే సమంజసము

భారతదేశము కొన్నివేల సంవత్సరములనుండి జనవిహారముగ నుండుచు వచ్చినది బహుపురాతనకాలము నందే ఇచ్చట నాగరికత వికసించినది "సింధునదీలోయ నాగరికత" అను పేరుతో విఖ్యాతిచెందిన జీవనవిధానము ఈ నాగరికతలలో మొట్టమొదటిది, భారతీయ జీవితమును విస్తారముగ ప్రభావితము కావించినవారు ఆర్యులు భారతీయ రంగములోనికి వారు వచ్చుటయు, ఇచ్చట స్థిరనివాసమేర్పరుచుకొనినపిమ్మట వారొక ప్రత్యేక నాగరికతను పెంపుకావించుకొనుటయు, మన దేశచరిత్రయందొక అతిముఖ్యమైన ఘట్టము ఆర్య నాగరికత భారతీయ జీవితమునకు పునాదియని గ్రహించుట చాల అవసరము మతము భారతీయునికి ఊపిరివంటిది ఈ దేశమునందు బౌద్ధము, జైనము అను రెండు నూతనమతము లుద్భవించి వికసించెను అందు బౌద్ధమతము భారతభూమియందేకాక సుదూరమందలి వివిధదేశములలోకూడ వ్యాపించి, అచ్చటి ప్రజల ఆధ్యాత్మిక జీవితమును నేటికిని శాసించుచున్నది శ్రీశంకరాచార్యుడు మున్నగు ఆచార్యులీదేశమున నుద్భవించి, మతములకొక నవస్ఫూర్తిని కల్గించిరి భారతదేశ చరిత్రను, ఇచ్చటి ప్రజాజీవితమును అపారముగ ప్రభావితము కావించినవి విదేశీయుల దండయాత్రలు

భౌతికనిర్మితి కారణముగ, ఈ దేశము విదేశీయుల దాడులకు తరచు గురియైనది పాశ్చాత్య దేశములవారి రాకవరకును, ఈ దండయాత్రలు భూమార్గముననే సాగినవి. ఈ భరతఖండము లోనికి మొట్టమొదట వలసవచ్చినవారు ఆర్యులు ఆ పిమ్మట అలెగ్జాండరు వీరుని యాజమాన్యమున గ్రీకులు ఈ భూమిలోనికి దండెత్తివచ్చిరి ఆతరువాత కుషానులు, హూణులు అరబ్బులు మొదలైన మహమ్మదీయ జాతులవారును, వివిధ యుగములందు ఈ భూమిలోనికి చొచ్చుకొనివచ్చి, కాలక్రమమున ఇచ్చట స్థిరనివాస మేర్పరచుకొనిరి

ఈ దండయాత్రల వృత్తాంతమును మనము తెలిసికొనవలసి యున్నది ఉత్తర భారతదేశమునందును, దక్షిణ భారతభూమియందును పెక్కు రాజవంశములు పరిపాలనము కావించి, విఖ్యాతిగాంచినవి ఆ రాజవంశములలో కొందరు ప్రభువులు అగ్రప్రసిద్ధి చెందినవారై యున్నారు ఆ ప్రభువుల యాజమాన్యమున భారతీయసంస్కృతి అత్యద్భుతముగ వికసించినది ఈ సంస్కృతియందలి విశేషములు ముఖ్యముగ గమనింపదగి యున్నవి భారతీయ నాగరికతయు, సంస్కృతియు విదేశములయందు కూడ వ్యాపించినది కాని ఏ యుగమునందును భారతీయులు దౌర్జన్యము వలనకాని, మారణోపాయము వలనకాని, ఇతరజాతులను వశపరచుకొని తమ జీవితవిధానమును వారిపై నిర్బంధముగ విధింపలేదు భారతీయ సంస్కృతియందలి విశిష్టతయే పరదేశీయులను ఆకర్షించినది పెక్కు సద్గుణములతోపాటు భారత దేశీయులలో కొన్ని దొడ్డలోపములున్నవి ఆ లోపముల కారణముగ క్రీస్తుశకము పండ్రెండవశతాబ్ది తుదిభాగమున మహమ్మదీయులు, భారతభూమికి గుండెకాయవంటి ఢిల్లీనగరమును వశపరచుకొని స్థానికులగు భారతీయుల యాధిక్యమును కుంటుపరచిరి. ఇది మహమ్మదీయ యుగమునకు నాందియని చెప్పనగును

సింధునదీలోయ నాగరికత ఇటీవలి కాలమువరకును ఈ నాగరికతనుగూర్చి పండితులును, చారిత్రికులునుకూడ ఏమియు ఎరుగకుండిరి, 1922 వ సంవత్సరమున భారత ప్రభుత్వమువారు దక్షిణ పంజాబులోని హారప్పాయను ప్రదేశమందును, సింధురాష్ట్రమందలి మొహెంజొదారోయను ప్రదేశమందును, భూమిని త్రవ్వించుటవలన, ప్రాచీననాగరికతావశేషములు లభ్యమైనవి ఈ నాగరికతకు, ద్రావిడుల నాగరికతకును అనేక సామ్యములున్నవి అంతేకాక సింధునదీలోయలోని సభ్యతకును, ప్రాచీనమగు సుమేరియా, బాబిలోనియా (ఈనాటి మెసొపొటేమియా రాష్ట్రము) ప్రాంతమునందలి

నాగరికతకును మిక్కిలి సామీప్యము కానవచ్చుచున్నది కావున ద్రావిడులును, సింధునదీలోయ యందలి ప్రాచీన నివాసులును, సుమేరియా, బాబిలోనియాలయందలి జనులును ఒక్కరైన కావచ్చును లేదా, వారి కొండొరులతో దగ్గర సంబంధములును, రాకపోకలును ఉండియుండవచ్చునని చారిత్రకు లూహించుచున్నారు సింధునదీలోయలోని నాగరికత ఆర్యుల సభ్యతకంటె ప్రాచీనతరమని పండితుల సిద్ధాంతము ఈ నాగరికత ఆర్యులరాకకు పూర్వము భారతభూమియందంతటను వ్యాపించినట్లు తెలియుచున్నది. సింధునదీలోయలోని ప్రజలు నేటికి సుమారు అయిదు వేలసంవత్సరములకు పూర్వమే మిక్కిలి ఉచ్చస్థితియందుండిరి వీరు గొప్ప పట్టణములను నిర్మించుకొనెడివారు అచ్చటి భవనములు ఇటుకతోను, సున్నముతోను కట్టబడెను అవి అతిసుందరములుగను, విశాలములుగను, సర్వవిధముల నివాసయోగ్యములుగను విరాజిల్లుచుండెను అందు ప్రత్యేకమగు స్నానపుగదులు నీటితూములు మొదలైన సదుపాయము లుండెడివి ఈ పట్టణములలోని బాటలు విశాలముగను, సూటిగను నిర్మాణమగుచుండెడివి సింధునదీలోయలోని ఈ ప్రాచీనప్రజల ముఖ్యవృత్తి వ్యవసాయము. ఇచ్చట పరిశ్రమలుకూడ బాగుగ వర్ధిల్లెను, వీరు చక్కని నూలు వస్త్రములు నేసి ధరించుచుండిరి ఈకాలపు ప్రజలు ధరించిన నగలు, నాణెములు భూగర్భమున దొరకినవి మనమీనాడుకూడ ఇట్టి నగలనే వాడుచున్నాము ఆకాలమున వీరు మట్టిపాత్రలు, రాగి పాత్రలు, వాడుచుండిరి ఇనుమునుకూడా వీరెరిగియుండిరి ఈ సింధునదీప్రాంత నివాసులు గొఱ్ఱెలు, గేదెలు, ఒంటెలు, మున్నగు జంతువులను పెంచుచుండెడివారు వీరి ఆహారములో పాలు, పెరుగు, మాంసము, కూరగాయలు చేరియుండెను ఈప్రజలు వ్రాతనెరిగియుండిరి వీరు భూమాతను, శివునిపోలిన దైవమును ఆరాధించెడివారు

ఆర్యులరాక _ ఆర్యుల నాగరికత ఈనాటి భారతీయ విధానము, నాగరికతయు, ఆర్యుల సంప్రదాయముచే అపారముగ ప్రభావితములైనవి ఈప్రభావ మాసేతుహిమాచలము వ్యాపించియున్నది ఆదియందు ఆర్యప్రజలు దక్షిణ రష్యా, మధ్యఆసియా, ఉత్తర ధ్రువప్రాంతములలో నివసించియుండవచ్చును కాలక్రమమున వీరు దక్షిణముగను, పశ్చిమముగను, వలసపోయి, వివిధదేశములలో స్థిరనివాసముల నేర్పరచుకొనిరి. క్రీ పూ 2400-1600 సంవత్సరముల నడుమ ఆర్యులు భారతభూమిలోనికి వచ్చియుండవచ్చును ఆర్యులిచ్చటికి వచ్చునరికి, భారతదేశమున ద్రావిడులు ప్రబలస్థితియందుండిరి ద్రావిడనాగరికత ఉన్నతశ్రేణికి చెందియుండెను వారు బలమైన సేనలను సంసిద్ధముకావించుకొని యుండిరి ఆగంతుకులైన ఆర్యులకును, స్థానికులగు ద్రావిడులకును ఘోరమైనయుద్ధములు ప్రవర్తిల్లెను అందు తుదకు ఆర్యులు విజయములను సాధించిరి ఆర్యులు క్రమక్రమముగ ఉత్తర భారతమునుండి దక్షిణముగ వ్యాపించిరి వీరు మొట్టమొదట బ్రహ్మావర్తమునందు కాలిడి ఆపిమ్మట బ్రహ్మర్షి దేశమునందు వ్యాపించిరి ఈవిధముగ ఉత్తర భారతభూమి ఆర్యులకు వశపడెను చాలకాలమువరకును బీహారు, బంగాళములలో ఆర్యవ్యాప్తి సాగలేదు ఆర్యసభ్యతను దక్షిణాపథమునకు కొనిపోయినవాడు అగస్త్యుడనుఋషి. ఆర్యులనాగరికత ప్రతిఫలించుటకు వారు సృష్టించిన అపూర్వమగు సారస్వతమొక్కటియే సాధనముగనున్నది ఆ ప్రాచీనయుగమునాటి కట్టడములుకాని, సమకాలికములగు గ్రంథములుకాని, విదేశీయుల వ్రాతలుకాని, మనకు లభింపవు ఆర్యులు నిర్మించిన సాహిత్యమునందు ముఖ్యముగ తెలుపదగినవి వేదములు, స్మృతులు, ధర్మశాస్త్రములు, ఇతిహాసములు, పురాణములు అను గ్రంథరాజములు వేదములలో ఋగ్వేదము మిక్కిలి ప్రాచీనము. ఇయ్యది క్రీ. పూ. 8000 కు పూర్వమే లభ్యమయి యుండునని పండితులు సిద్ధాంతీకరించినారు యజుస్సామాథర్వణ వేదములు ఇతరములగు మూడు వేదములు వీటిలో భగవత్ప్రార్థనాదికములు, మతక్రియ కలాపములు కావించువిధము, మతచర్య, భగవత్స్వరూప నిర్ణయము, జ్ఞానము మున్నగు అంశములు కాననగును వేదములతరువాత చెప్పదగినవి మన్వాదిస్మృతులును, శ్రౌత, గృహ్య ధర్మసూత్రములును, సూత్రగ్రంథములును, షడ్దర్శనములును, వేదాంగములును అనునవి సంఘనిర్మాణమును, మానవుల నడవడిని స్మృతులు నిరూపించును సూత్రగ్రంథములు మున్నగువాటిలో ధర్మము యొక్క వివిధస్వరూపములు, ప్రాచీనకాలమునందలి ఆర్యులు సంపాదించిన విజ్ఞానమును కాననగును పైన తెలుపబడిన గ్రంథముల పరిశీలనమువలన ఆర్యుల సంఘమెట్టిస్థితియందుండెనో తెలియవచ్చును

ఆకాలపు ఆర్యప్రజలు ముఖ్యముగ పల్లెలలో నివసించు

చుండిరి వారిలో పెక్కు తెగలుండెను వారు బలమైన రాజ్యముల నిర్మించుకొని యుండిరి ఆర్యులకు వ్యవసాయము ముఖ్యవృత్తి. వారు రాగి, బంగారమును వాడుచుండిరి వారికి గోవులే ధనముగ నుండుచువచ్చెను ఈ ప్రాచీనకాలపు ఆర్యులు సముద్రయానమును కూడ ఎరిగియుండిరి. ఋగ్వేద కాలమునందు స్త్రీలకు సంఘమున గౌరవప్రదమగు స్థానము లభించి యుండెను వారిలో విద్యావతులు పెక్కండ్రుండెడి వారు ఆర్యులు ప్రకృతిశక్తులను పూజించుచుండెడివారు అందు ఇంద్రుడు, అగ్ని, వరుణుడు, సూర్యుడు మున్నగు వారు ముఖ్యులు వీరిని సంతృప్తిపరచుటకై జనులు యజ్ఞయాగాదులను నిర్వర్తించువారు సోమరసమను పదార్థమును దేవతలకు నివేదించి, తాము స్వయముగా సేవించెడివారు ఈ ప్రాచీనప్రజలకు సంగీతము, నృత్యము, జూదము, రథములపోటీ మున్నగునవి వినోద సాధనములుగ నుండెడివి. ఆర్యులయుగమందు ప్రజాపరిపాలనమును రాజులే కావించుచుండిరి కాని వారి పాలనము ప్రజాసమ్మతముగ నుండెడిది ఆ కాలమున సంఘమున వర్ణవిభేదములుండినను, అయ్యవి కఠినరూపమును వహింపలేదు రామాయణ, మహాభారతములు ఆర్యుల ఇతిహాసములు ఇందు ఆర్యప్రజల మతసాంఘిక వ్యవస్థలును, వారి ఆదర్శములును, విస్పష్టముగ ప్రకటితమగును సృష్టిక్రమము, రాజవంశముల చరిత్రము, మున్నగు వాటినేకాక, దేవతలగాథలను, వేదములు, స్మృతులు, శాస్త్రములు, మున్నగు గ్రంథములలో తెలుపబడిన గహన విషయములను పామరజనుల కర్థమగు విధమున పురాణములు వర్ణించును

**బౌద్ధజైనమతములు** ఆధ్యాత్మికముగను, నైతికముగను "ఏది ఉత్తమజీవితము" అను విషయమునుగూర్చి భారతీయులు అనాదినుండియు తెన్నగ చింతించెడివారు వారి ఆధ్యాత్మిక చింతనకు ఫలితముగ వేదములు మున్నగు ధార్మిక గ్రంథములు వెలసినవి స్మృతులు, ధర్మశాస్త్రములు, ఇతిహాసములు మున్నగునవి భారతీయ నైతిక సిద్ధాంతములను, ఆదర్శములను ప్రకటించును వీటిని భారతీయులు వైదిక ధర్మముగ వర్ణించుచున్నారు కొంత కాలమువరకు ఈ ధర్మము సర్వజనామోదమును పొందెను కాని కాలక్రమమున కొన్ని వర్గములలో వైదికధర్మమునెడల అసంతృప్తి యంకురించెను ప్రాచీన వైదికధర్మము కర్మమార్గమునకు విశేషప్రాముఖ్యము నొసగెను యజ్ఞయాగాదులు సర్వేసర్వత్రవ్యాపించెను యజ్ఞాదులలో జంతుహింస చేయబడుచుండినందున పెక్కండ్రు జనులు వీటియెడల విరక్తులైరి వైదికమతము, చాతుర్వర్ణ్యవిభాగను నంగీకరించి, బ్రాహ్మణునకు సంఘమున నొక విశిష్టస్థానము నొసగెను ఇతర వర్ణముల వారికీయేర్పాటు కంటకముగ తోచియుండవచ్చును తత్ఫలితముగ బౌద్ధజైనమతములు రెండును ఉద్భవించెను గౌతమబుద్ధుడు, మహావీరుడు అనువారు ఈ మతస్థాపకులు వీరిరువురును క్షత్రియవంశసంజాతులు, ఇరువురును వేదప్రమాణమును తిరస్కరించి, జీవకారుణ్యమునకు జీవితమున అత్యంతప్రాధాన్యము నొసగి మాతాపితృభక్తి, ధర్మబద్ధజీవనము అను సద్గుణములను విశేషముగ సమర్థించిరి ఈ నూతనమార్గములు కొంత కాలమువరకును విశేషముగ ప్రజామోదమునందెను అశోకుడు మున్నగు ప్రభువులపోషణమువలన బౌద్ధధర్మము యావద్భారతదేశమునందును, ఇతరదేశములందును కూడ బాగుగ వ్యాపించెను కాని ఇంతలో వైదికమతము తనలోపములను గ్రహించి, అహింసాధర్మమును తనలో ఇముడ్చుకొని, బుద్ధుని కూడ ఒక అవతారపురుషునిగ అంగీకరించినందున బౌద్ధము తన విశిష్టతను కోల్పోయి, భరతఖండమునుండి నిష్క్రమించెను జైనమతము హిందూమతమునందొక శాఖగా నేటికిని భారతదేశమున జీవించియున్నది కుమారిలభట్టు శంకరాచార్యుడు అను మహనీయులు బౌద్ధ, జైనమతములను ఖండించి, వైదికమతమును పునరుద్ధరించిరి

**విదేశీయుల దండయాత్రలు** భారతదేశపు భౌగోళిక నిర్మాణము కారణముగను, ఇయ్యది సారవంతమును, ధనవంతమును, విశ్వవిఖ్యాతమును, అగుభూఖండమై యుండిన కారణమునను, ఈ దేశముపై చిరకాలమునుండి విదేశ దండయాత్రలు సాగుచు వచ్చెను వాటిలో మొట్టమొదటిది ఆర్యుల దండయాత్ర దీనివలన భారతీయ జీవిత మపారముగ ప్రభావితమైనది క్రీ పూ 326 వ సంవత్సరమున గ్రీకు వీరుడగు అలెగ్జాండరు భారతభూమిపై దండెత్తివచ్చి పురుషోత్తముడను హిందూప్రభువు నోడించెను కాని ఈ విజయమునకు ఫలితముగ భారతదేశమునందు గ్రీకులరాజ్య మేర్పడలేదు గ్రీకుల దండయాత్రవలన ఐరోపా, ఆసియా ఖండముల నడుమ సంబంధము లేర్పడెను జనులు రాకపోకలు సాగించుచు వచ్చిరి ఇందువలన ఆచ్చటి ప్రజల కొందరుల

భాషములును, సంస్కృతియు తెలియవచ్చెను గాంధారదేశపు శిల్పమునందు గ్రీకుల శిల్పప్రభావము కానవచ్చుచున్నదని శిల్పశాస్త్రనిపుణుల సిద్ధాంతము బౌద్ధమతము క్రైస్తవమతమును కొంతవరకు ప్రభావితము కావించినట్లు పండితులు తెల్పుచున్నారు అశోకచక్రవర్తి క్రీ పూ 232 వ సంవత్సరమున మరణించెను అటుపిమ్మట ప్రబలమగు మౌర్యసామ్రాజ్యము క్షీణింపగా, భారతదేశపు పశ్చిమోత్తర ప్రాంతమునందు గ్రీకులనోడించిన శకులు అనుతెగవారు ప్రవేశించిరి శక రాజ్యములు తక్షశిల, మధుర, మాళవ, సౌరాష్ట్రప్రాంతములందు నెలకొనెను క్రీస్తుశకము ప్రథమశతాబ్దియందు కుషానులను మరియొక విదేశీయ తెగవారు భారతదేశములోనికి చొచ్చుకొని వచ్చిరి కుషాను లార్యావర్తమునందు గొప్ప రాజ్యమును స్థాపించిరి వీరు భారతదేశమున ప్రవేశించుటయేకాక, ఇచ్చట స్థిరనివాస మేర్పరచుకొని, ప్రజానీకమునందు లీనులైరి విదేశీయులగు కుషానులు కాలక్రమమున బౌద్ధమతము నవలంబించుటయు, కుషానురాజైన కనిష్కుడు ప్రసిద్ధుడగు బౌద్ధధర్మపోషకుడగుటయు ముఖ్యముగ గమనింపదగిన యంశము గుప్తవంశములోని స్కందగుప్తుడను రాజు కాలమున (క్రీ శ 480 ప్రాంతము) హూణులను విదేశీయులు భారతదేశముపై దండయాత్రలు కావించుట మొదలిడిరి వీరు కాలక్రమమున ఈ దేశమందు కాలు నిలువద్రొక్కుకొని క్రీ శ 6 వ శతాబ్దిప్రారంభమునాటికి మాళవప్రాంతమునందును, పంజాబునందును రాజ్యములు నెలకొల్పుకొనిరి ఇంచుమించు ఈదేశకాలమున రాజపుత్రస్థానమందు హూణులు, ఘూర్జరులు అను విదేశీయులు చొరబడిరి ఇచ్చట వీరు స్థిరముగనిలువబడిపోయి, హిందూధర్మమును, స్థానికప్రజలఆచారములను అవలంబించిరి ఈవిధముగ భారతప్రజానీకమునందు లీనమైపోయిన విదేశీయులు కొందరు కాలక్రమమున రాజపుత్రులను నామమునువహించినట్లు చారిత్రికులు తెల్పుచున్నారు ఉదా రాజపుత్రస్థానమందలి చౌహానులు ప్రతీహారలు, పారమారలు రాఠోడులు అనువారిని పేర్కొనవచ్చును ఇస్లాముమతానుయాయులగు విదేశీయుల గాథ స్థలాంతరమున తెలుపబడును. ఖడ్గమును చేతబూని దౌర్జన్యముచే భారతభూమియందు ప్రవేశించిన వీరు కాక, మరి మువ్వురు విదేశీయులనుగూర్చి ఇచ్చట పేర్కొనవలసియున్నది వారు క్రైస్తవ, యూదుమతములకు చెందిన పాదిరీలు వీరు ముఖ్యముగ నేటి కేరళ తమిళరాష్ట్రములలో ప్రవేశించి, మత ప్రచారము కావించుకొనిరి వీరు క్రీ శ 1, 2, శతాబ్దులలో భారతదేశమునకు వచ్చిరి రెండవవారు చీనాయాత్రికులు, వీరు బౌద్ధధర్మవిశేషములను గ్రహించుటకై ఈ దేశమునకేతెంచినవారు మూడవవారు పార్శీలు వీరు జొరాస్ట్రరుమతము నవలంబింతురు వీరు తమ మతస్వాతంత్ర్యమును కాపాడుకొనుటకై పారసీకదేశమునుండి భారతదేశమందలి గుజరాతురాష్ట్రములోనికివచ్చి ఇచటనే స్థిరపడిపోయిరి (క్రీ శ 8, 9 శతాబ్దములు)

**భారతభూమియందలి రాజవంశములు-రాజులు** భారతదేశచరిత్ర అతి ప్రాచీనమును, దీర్ఘమును అయినది ఈదేశమతివిస్తృతమైనది కావున ఇచ్చట అనేక రాజవంశముల వారు పరిపాలన కావించి, అనేక ఘనకార్యములను సాధించి, విఖ్యాతి గాంచిరి ఆ యంశములను గూర్చిన సంగ్రహ వివరణము క్రీ పూ 7 వ శతాబ్దినుండి మాత్రమే మనకు భారతదేశమునుగూర్చి విశ్వసనీయమైన చరిత్ర లభించుచున్నది ఆ కాలమునాటికి తక్షశిల, ఉజ్జయిని, కాశి, శ్రావస్తి అను నగరములు విఖ్యాతి చెందియుండెను ఇవి గొప్ప నాగరకతా కేంద్రములుగ పేర్వడెను ఆ కాలమునాటి స్వతంత్ర రాజ్యములలో మగధ, కోసల, వత్స అవంతి, మల్ల చేది, కురు, పాంచాల, మత్స్యక మున్నగునవి ప్రముఖములుగ నుండెను లిచ్ఛవి అను తెగవారు పాలించిన వజ్జిరాజ్యము ప్రజాస్వామికముగ నుండెను కురురాజ్యమందుకూడ కొంతకాలము ప్రజాస్వామ్య ప్రభుత్వము నెలకొని యుండెను క్రీ పూ 642 వ సంవత్సరమున శిశునాగులను రాజవంశమువారు మగధరాజ్యమునకు పునాదివేసిరి ఈ వంశమందలి అజాతశత్రుడు, బౌద్ధమత స్థాపకుడగు గౌతమబుద్ధునికి సమకాలికుడు శిశునాగవంశము తరువాత నందవంశమువారును, వారి తరువాత మౌర్యవంశమువారును మగధరాజ్యమును పాలించిరి మౌర్యవంశములోని చంద్రగుప్తుడు మహాసమర్థుడగు పరిపాలకుడుగ విఖ్యాతిచెందెను అతని మనుమడు అశోకవర్ధనుడు బౌద్ధమత వ్యాప్తికై అపారముగు కృషిసల్పి, అజరామరమగు కీర్తిని సాధించెను మౌర్యవంశము పతనము చెందిన వెనుక పుష్యమిత్రుడను రాజు మగధరాజ్యమును వశపరచుకొని, వైదికధర్మమును బాగుగా పోషించెను ఆ పిమ్మట ఆంధ్రులు సుమారు నాల్గు శతాబ్దులకాలము రాజ్యపాలనము కావించి,

తూర్పుతీరమునుండి పశ్చిమతీరముపరకును, తమ రాజ్యమును వ్యాపింపజేసికొనిరి వీరు బౌద్ధ, వైదికమతముల రెండింటిని కూడ పోషించిరి. ఆవెనుక కుషాను, నాగ, వాకాటక వంశములవారును, గుప్తవంశములవారును భారతభూమిలో పాలనము కావించిరి. కుషాను వంశములో కనిష్కుడు (క్రీ.శ. 120-162) బౌద్ధధర్మ వ్యాప్తికై చాల పాటుపడెను. గుప్తవంశములోని సముద్రగుప్తుడు గొప్ప వీరుడు. రెండవ చంద్రగుప్తుడు వైదికమతాభిమాని. ఈ గుప్తవంశమువారి కాలము హిందూమతమునకును, సంస్కృత వాఙ్మయమునకును స్వర్ణయుగము. ఈ కాలమున బౌద్ధమతము క్షీణింపసాగెను. క్రీ.శ. 606 నుండి 647 వరకును స్థానేశ్వరమునుండి ఉత్తర భారతభూమిని పాలించిన హర్షవర్ధనుడు భారతభూమిలోని తుట్టతుది హిందూచక్రవర్తి. ఇతడు బౌద్ధమతాభిమాని. హర్షవర్ధనుని యనంతరము హిందూ ప్రభువుల యున్నతిని కాపాడినవారు రాజపుత్రులు. ఆనాడు ఉత్తరభారతమునందు నేపాలరాజ్యము, కాశ్మీరము, మేవాడు, కాన్యకుబ్జము, మాళవరాజ్యము, బుందేలు రాజ్యము, అజ్మీరు, బంగాళము, అను వివిధ రాజ్యములు నెలకొని యుండెను. ఈ రాజవంశములవారు బౌద్ధ హిందూ ధర్మములను సభిమానించి, పెక్కు ప్రజాహితకార్యములను కావించి, వాఙ్మయమును, లలితకళలను పోషించిరి. వింధ్యాద్రికి దక్షిణముననున్న సువిశాల దేశమున కదంబులు, గాంగులు, చాళుక్యులు, రాష్ట్రకూటులు, హొయసలులు, యాదవులు, తూర్పుచాళుక్యులు, పరిపాలనము సాగించిరి. ఈ తూర్పుచాళుక్య వంశమునందలి రాజరాజనరేంద్రుడు శబ్దానుశాసనుడని ప్రఖ్యాతిగాంచిన నన్నయభట్టు అను పండితుని ప్రోత్సహించి, మహాభారతమును సంస్కృతము నుండి ఆంధ్రభాషలోనికి పరివర్తనము కావింపించెను. భారతదేశపు దక్షిణతమభాగము ద్రావిడ లేక తమిళప్రాంతము. ఇయ్యది వేలసంవత్సరములనుండి నాగరకత కాలవాలముగ నుండెను. ఈ దేశము ఆయాకాలములందు పల్లవ, చోళ, పాండ్య, చేర (కేరళ) రాజ్యములు నెలకొని గొప్ప వైభవము ననుభవించెను.

అనేక శతాబ్దులుగ గొప్ప వైభవముతో భారతభూమిని పరిపాలించి, ప్రజాసంరక్షణను కావించిన ఈ రాజవంశములవారి ఘనకార్యములు ప్రశంసాపాత్రములు. ఈ కాలము నాటి రాజులకును, ప్రజలకును ధర్మమే మార్గదర్శకముగ నుండెడిది. మతవిషయములలో సర్వమతస్థులయందు రాజులు సహనముతో ప్రవర్తించిరి. వారు ప్రజాహిత తత్పరులై రాజ్యపాలనము కావించిరి. సంస్కృతమువంటి ప్రామాణిక భాషలును, దేశభాషలును, రాజుల ప్రోత్సాహమును పొందెను. సంస్కృతము భారతీయభాషలకు తల్లివంటిది. ఇందలి ప్రాచీన వాఙ్మయము ప్రశంసాపాత్రము. వ్యాసుడు, భాసుడు, కాళిదాసు, భవభూతి, బాణుడు, దండి మొదలగు మహాకవులును, పాణిని, పతంజలివంటి వైయాకరణులును, ఆర్యభట్టు వరాహమిహిరుడు వంటి శాస్త్రజ్ఞులును ఈ భాషకు వికాసము కల్గించిరి. భారతదేశమున అద్భుత సౌందర్యముగల దేవాలయములు, అజంతా, ఎల్లోరాలలోవలె గుహాలయములును ఆవిర్భవించెను. శిల్పము ఈ దేశమున అద్భుతముగ వికసించెను. శిలలపైనను, రాగిరేకులపైనను శాసనములు వేయించు పద్ధతిని భారతీయులు విస్తారముగ వ్యాప్తిచెందించిరి. కొన్ని సందర్భములలో శిలలపై గ్రంథములుకూడ వ్రాయబడెను. భరతదేశమున వివిధ పరిశ్రమలు వికసించెను. గుప్తరాజులు, ఆంధ్రులు, పల్లవులు, చోళులు, మొదలైన రాజవంశములవారి కాలమున భారతీయులు విదేశములతో ముమ్మరముగ వ్యాపారము సాగించెడివారు. విద్యలను కళలను పోషించుటకై భారతీయ ప్రభువులును, ధనాధిపులును, ప్రజలును విశ్వవిద్యాలయముల నెలకొల్పిరి. తక్షశిల, అమరావతి, నలంద, విక్రమశిల అను తావులందలి విశ్వవిద్యాలయములు ప్రఖ్యాతములు.

**భారతీయ నాగరకతా విస్తరణము**: భారతదేశపు ఆదిమ నివాసులగు ద్రావిడులును, ఆర్యులవలె ఒకానొక కాలమున పరదేశములనుండి ఇచ్చటికి వచ్చియుండిరి. వారి సంతతులవారు చిరకాలము వరకును తమ జన్మస్థానములకు పోవుచు వచ్చుచుండెడివారని మనము భావింపవచ్చును. ఈ విధముగ మన దేశపు నాగరకత విదేశములలో వ్యాపించి యుండవలెను. క్రీస్తుపూర్వమునుండియు భారతీయ వ్యాపారులు సిరియా, ఈజిప్టు, బాబిలోనియా వంటి దూరదేశములతో వర్తకము సాగించుచుండిరని పెరిప్లసు అను గ్రంథమువలన తెలియుచున్నది. ఇస్లాము మతస్థాపనకు పూర్వము వైదిక మతమును, బౌద్ధమతమును పశ్చిమ ఆసియాయందలి పెక్కు దేశములలో వ్యాపించెను. ఇచ్చట హిందూ, బౌద్ధదేవతల

విగ్రహములు భూగర్భమునుండి త్రవ్వకముల మూలమున లభించినవి బౌద్ధధర్మము చీనాదేశమున వ్యాపించిన యంశము జగత్ప్రసిద్ధము జాతకకథలు, కథాసరిత్సాగరము వంటి ప్రామాణిక గ్రంథముల యాధారమున ఈ దేశవాసులు, సువర్ణభూమియను నామాంతరముగల మలయాద్వీపకల్పము, జావా, సుమత్రా మున్నగు ద్వీపములతో వాణిజ్యము సాగించినట్లు తెలియనగును భారతదేశపు రాజకుమారులు ఆ ద్వీపములలో గొప్పరాజ్యములను నెలకొల్పిరి వాటిలో చంప, కాంభోజరాజ్యములు ముఖ్యములు వీటిలో వేదాధ్యయన పరులగు బ్రాహ్మణులు నివసించెడివారట కంబోడియా, జావా ద్వీపములలో భారతీయ శిల్పపద్ధతులపై నిర్మింపబడిన అద్భుతమైన దేవళములు నేటికిని కానవచ్చుచున్నవి

మహమ్మదీయుల రాక - హైందవుల పతనము ఇస్లాము మతానుయాయులగు విదేశీయులలో మొట్టమొదట భారతదేశమున కేతెంచినవారు అరబ్బులు వీరు క్రీ శ 637వ సంవత్సరమున నేటి బొంబాయి సమీపమునందున్న థానా పైనను, సింధుదేశముపైనను దాడికావించిరి క్రీ శ 712వ సంవత్సరమున మహమ్మద్ బిన్ ఖాసిం అను అరబ్బువీరుడు దహీర్ అను హిందూప్రభువు నోడించి, సింధుదేశమున మహమ్మదీయుల రాజ్యమును నెలకొల్పెను కాని సుమారు మూడు శతాబ్దులవరకును భారత భూమియందలి ఇతర ప్రాంతములలోనికి చొచ్చుకొనిరాకుండ వీరిని హిందూ ప్రభువులు అరికట్టిరి క్రీ శ 977వ సంవత్సరమున భారతదేశపు పశ్చిమోత్తరమున నున్న గజనీరాజ్యమునందు సబుక్తగీన్ అనునతడు అధికారము పూనెను. ఈతడును ఈతని కుమారుడు గజనీమహమూదును పెక్కుపర్యాయములు పంజాబురాష్ట్రముపై దండెత్తివచ్చి అచ్చటి హిందూప్రభువుల నోడించిరి పంజాబురాష్ట్రము మహమ్మదీయులకు వశపడెను ఆపిమ్మట గజనీమహమూద్ మనదేశముపై పెక్కుపర్యాయములు దండెత్తివచ్చి తుదకు 1026వ సంవత్సరమున కథియవాడు రాష్ట్రమందలి సోమనాథ దేవాలయమును నాశనము కావించెను ఈతడు భారతదేశమునుండి అసంఖ్యాకములగు ధనరాసులను కొల్లగొట్టుకొని పోయెను గజనీమహమ్మదు తరువాత ఈదేశముపై దండెత్తి వచ్చినవాడు ఘోరీమహమ్మదు ఈతడు 1192వ సంవత్సరములో స్థానేశ్వరమను ప్రదేశమున ఢిల్లీశ్వరుడగు పృథ్వీరాజ చౌహాను నోడించి, సంహరించెను ఢిల్లీపట్టణము మహమ్మదీయుల వశమయ్యెను ఇతనితో భారత భూమియందు స్థానికులగు హిందువుల యాధిక్యము క్షీణించెను

హిందూప్రభువుల పతనమునకు వారి దౌర్బల్యమును, పిరికితనమును కారణములు కావు విధి వారికి ప్రతికూలమయ్యెను హిందూరాజులలో గల అనైక్యము అసూయ సామంతుల స్వామిద్రోహమును వారియోటమికి కారణమయ్యెను హిందూరాజులు కాలానుగుణముగ తమసంగ్రామ పద్ధతులను, వ్యూహరచనలను మార్పుకావించుకొనక పోవుట వారి పరాభవములకు ముఖ్యహేతువు దేశకాల పాత్రముల వివక్షత కావింపక, ధర్మపద్ధతులను యథాతథముగ అవలంబించుట మనహిందూరాజుల పరాభవమున కొక ప్రబల కారణము

ఖం బా. శే

## భారతదేశ చరిత్ర

## (మహమ్మదీయ యుగము)

మహమ్మదీయమతము స్థాపింపబడిన నాటినుండియు ఆమతానుయాయులు భారతదేశముతో సంబంధము కల్గించుకొనుచు వచ్చిరి ఇస్లాముమతము నెలకొల్పబడుటకు పూర్వము కూడ అరబ్బులు భారతదేశముతో వ్యాపారరీత్యా రాకపోకలు సల్పుచు వచ్చిరి నూతనమతమును స్వీకరించిన పిమ్మట అరబ్బులు మతావేశప్రేరితులై భారతదేశమున రాజ్యస్థాపనము కావింపవలెనని సంకల్పించుకొనిరి తత్ఫలితముగ వారు భారతదేశపు పశ్చిమప్రాంతములపై దాడులు చేయుటకు ప్రారంభించిరి క్రీ శ 637వ సంవత్సరమున అరబ్బులీనాటి బొంబాయి నగరమునకు సమీపమందున్న థానా అను ప్రదేశముపై దాడిసల్పిరి ఆపైన భరుకచ్ఛ, సింధురాష్ట్రములపై దండయాత్రలు సాగెను క్రీ శ. ఎనిమిదవ శతాబ్ది ప్రారంభమున అరబ్బులు సింధురాష్ట్రముపై దండెత్తివచ్చిరి క్రీ శ 712వ సంవత్సరమున మహమ్మద్ బిన్ ఖాసిం అను అరబ్బు సర్దారు సింధురాష్ట్రమున తన సేనలతో ప్రవేశించి, అచ్చట రాజ్యము కాపించుచున్న హిందూరాజు నోడించి, సంహరించెను ఈవిధముగ భారత భూమియందు మొట్టమొదటి ముసల్మానురాజ్య మేర్పడెను ఆవిజేతలు క్రమక్రమముగ కచ్ప్రాంతము, సౌరాష్ట్రము, కథియవాడ్, పశ్చిమ రాజస్థానములపై దండయాత్రలు సాగించి,

రాజ్యవిస్తరణము కావించుకొనిరి కాని ఉత్తరమున కర్కోట వంశమువారును, దక్షిణమున చాళుక్యరాజులును, తూర్పున ప్రతీహార ప్రభువులును అరబ్బుల పురోగమనమును నిరోధించిరి

ఇది యిట్లుండగా క్రీ శ పదవశతాబ్ది మధ్యభాగమున ఆఫ్ఘనిస్థానమునందలి గజ్నీపటణము కేంద్రముగ నొక మహమ్మదీయరాజ్యము నెలకొల్పబడెను క్రీ శ 997వ సంవత్సరమున ఈరాజ్యమున కేలికయైన మహమూద్ అను గొప్పవీరుడు ప్రప్రథమమున భారత దేశపు వాయవ్యప్రాంతము నందును, పంజాబురాష్ట్రము నందును, రాజ్యము చేయుచున్న హిందూప్రభువుల నోడించి, వారిరాజ్యముల నాక్రమించెను అపిమ్మట ఈరాజు గంగా మైదానములోనికిని, గుజరాతు రాష్ట్రములోనికి, పెక్కు పర్యాయములు దండయాత్రలు సాగించి, పట్టణములను దోచుకొని, అనేక ప్రసిద్ధ దేవాలయములను కూలగొట్టి, అపారమైన ధనసంపదలను సేకరించి, స్వదేశమునకు మరలిపోయెను కాని మహమూద్ రాజు భారతదేశమున స్థిరమైన రాజ్యమును నెలకొల్పుటకు ఎట్టి ప్రయత్నమును చేయలేదు

ఆఫ్ఘనిస్థానములో గజనీవంశమువారి పరిపాలనము తుదముట్టినతరువాత, గోరీవంశము వారు తమయధికారమును ప్రతిష్ఠించుకొనిరి ఈ వంశములోని మహమ్మద్ ఘోరీ అనువాడు భారతదేశమున శాశ్వతముగ రాజ్యస్థాపనము కావించుటకై యత్నములు చేసెను క్రీ శ 1192వ సంవత్సరమున ఈఘోరీరాజు రెండవస్థానేశ్వర యుద్ధమున ఢిల్లీ అజ్మీరు రాజ్యముల కేలికయైన పృథ్వీరాజ్ చౌహాన్ అను రాజపుత్రప్రభువు నోడించి, ఢిల్లీపట్టణము కేంద్రముగ నొక మహమ్మదీయ రాజ్యమును నెలకొల్పెను. ఆనాటినుండియు భారతదేశ చరిత్రయందు మహమ్మదీయ యుగము ప్రారంభమగుచున్నదని చరిత్రకారుల సిద్ధాంతము ఢిల్లీనగరమును ముఖ్యపట్టణముగ చేసికొని, రాజ్యపాలనము సాగించిన ప్రభువులను భారతదేశమునకు చక్రవర్తులుగ భావించుట ఒక ఆచారముగ పరిణమించినది కావున 1193 నుండి 1707 (ఔరంగజేబు చక్రవర్తి మరణసంవత్సరము) వరకును భారతదేశమందు మహమ్మదీయ ప్రభువుల యేలుబడి సాగినట్లు చెప్పవచ్చును 1707వ సంవత్సరముతో మొగలు సామ్రాట్టుల యాధిక్యము నశించినను వారివంశమువారు 1858 వరకును నామమాత్రమునకు ఢిల్లీశ్వరులుగ భావింపబడుచు వచ్చిరి.

విశాలమైన భారతదేశ మెన్నడును ఒక్క ఢిల్లీ సామ్రాజ్యములో ఇమిడియుండలేదు పదునాల్గవ శతాబ్ది నుండి పదునేడవశతాబ్ది మధ్యభాగమువరకును దక్షిణభారత భూమియందు బహమనీ రాజ్యమును, దానిశాఖలును విలసిల్లెను ఇదికాక కాశ్మీరము, గుజరాతు, మాల్వా, జోన్పూరు, ఖాండేష్, బంగాళము, అయోధ్యరాష్ట్రము, దక్షిణమున హైదరాబాదు, మైసూరు, ఆర్కాటు రాజ్యములును చాల కాలము మహమ్మదీయ ప్రభువుల యేలుబడిలో నుండెను భారతదేశ చరిత్రయందలి మహమ్మదీయ యుగపు విశేషము లను గ్రహించుటకై అన్నిరాజ్యముల ఇతిహాసమును పరామర్శ చేయవలెను

వ్యక్తులకు వలెనే జాతులకుకూడ వృద్ధిక్షయము లుండును వైదికమత ధర్మముల నవలంబించిన హైందవ ప్రజలు అనేకశతాబ్దులు భారతదేశమున నివసించి, అత్యుత్తమమైన నాగరికతను పెంపుకావించుకొని, ప్రపంచము నందు గొప్పవిఖ్యాతి గాంచిరి కాలక్రమమున ఈ జాతి క్షీణదశ లోనయ్యెను మహమ్మదీయుల దండయాత్రలు ప్రారంభ మగునప్పటి కీక్షీణతలోని లక్షణములు స్పష్టముగ కానరాసాగెను భారతజాతిలో ప్రవేశించిన ఈక్షయము నైతికముకాని, భౌతికముకాదు ఈ జాతియందలి పురుషు లెప్పటివలెనే బలాఢ్యులుగను, పరాక్రమవంతులుగను మృత్యుభయము లేనివారుగను ఉండిరి కాని వారియందు దూరదృష్టి, ఐకమత్యము, పరసర ప్రపంచమునందు జరుగుచున్న మార్పులను గమనించి కాలానుగుణముగా తమ్ముతాము మలచుకొనుట మున్నగు లక్షణములు లోపించెను ధర్మపరాయణతతో పాటు హైందవులు లోకజ్ఞానమును జోడించుకొనలేకపోయిరి వారిలో అహంభావము, స్వార్థపరత్వము, అనైకమత్యము బాగుగ వ్యాపించెను అందువలన మతావేశపరులైన మహమ్మదీయ జాతులవారు భారతజాతివారి నోడించి ఈదేశమునందు తమ సామ్రాజ్యమును నెలకొల్పుకొనిరి కాలప్రవాహమున కనుగుణముగ మార్పుచెందినవారే లోకమున స్థిరముగ మనగలరు లేనివారికి పతనము తప్పదుకదా

ఢిల్లీనగరమును కేంద్రస్థానముగ కావించుకొని రాజ్యపరిపాలనముకావించిన మహమ్మదీయరాజవంశములలో రెండు ముఖ్యవిభాగములు కలవు క్రీ శ. 1193 నుండి 1536 వరకు ఇచ్చట అయిదు రాజవంశములు పరిపాలన సాగించెను కానిన

వంశము, ఖిల్జీవంశము, తుఘ్లక్ వంశము, సయ్యద్ వంశము, లోడీవంశము అనునవి వీటిపేర్లు. ఈ రాజులలో పెక్కురు ఆఫ్ఘన్ జాతికి చెందినవారు. 1526వ సంవత్సరమున లోడీ వంశములోని తుదిరాజగు ఇబ్రహీంలోడీని తురుష్కజాతికి చెందిన బాబరు అనువీరుడు పానిపట్టురణరంగమున నోడించి, మొగలువంశమును స్థాపించెను. ఈవంశమువా రతివైభవముగ 1707 వరకును ఢిల్లీ చక్రవర్తులుగ పరిపాలనముసాగించిరి. 1858వ సంవత్సరమువరకు కూడ వీరియధికారము ఛాయామాత్రముగ భారతభూమియందు విలసిల్లెనని ఈవరకే తెలుపబడినది.

క్రీ. శ. 1192 నుండి 1526వ సంవత్సరమువరకును రాజ్యపరిపాలనము సాగించిన ప్రభువులలో బానిసవంశమునకు చెందిన కుతుబుద్దీన్ ఐబక్, అల్తమష్, గయాసుద్దీన్ బాల్బన్, ఖిల్జీవంశమునకుచెందిన అల్లావుద్దీన్ ఖిల్జీ, తుఘ్లక్ వంశమునందలి మహమ్మద్ బిన్ తుఘ్లక్, ఫిరోజుతుఘ్లక్ అనువారు ప్రసిద్ధులు. ఈ వంశమువారు ఉత్తరహిందూదేశమందలి విశేషభాగమును జయించి, తమ యధికారములోనికి తెచ్చుకొనిరి. అల్లావుద్దీన్ ఖిల్జీ దక్షిణభారతమందలి దేవగిరి యాదవరాజుల నోడించి ఈ ద్వీపకల్పమునందలి దక్షిణతమభాగమువరకును తన సేనలను పంపి, దేశమును కొల్లగొట్టించి, హిందూరాజులను పరాభవించెను. అతడు దక్షిణభారతమున మధురలో నొక ముసల్మానురాజ్యమును స్థాపించెను. మహమ్మద్ తుఘ్లక్ కాలమున ఢిల్లీ సైన్యములు దక్షిణమునందలి ఓరుగల్లు కాకతీయరాజ్యమును కూలద్రోసెను. ఈ విధముగ ఢిల్లీ మహమ్మదీయప్రభువులు భారతదేశమున సర్వాధికులమని రుజువుచేసికొన గల్గిరి. బానిసవంశమువారును ఖిల్జీవంశమువారును, ఆకాలమున భారతదేశముపై దండెత్తివచ్చిన మంగోలులను క్రూరజాతివారి నోడించి, ప్రజాసామాన్యమును కాపాడిరి. కాని ఈ ప్రభువులు నెలకొల్పినది నిష్పక్షపాతమైన లౌకిక రాజ్యము కాదు. అయ్యది ఇస్లాము మతపక్షపాతముగల మతప్రాతిపదిక రాజ్యము. వీరియుగమున అనేకులగు హైందవులు తమ ధనమానప్రాణములను రక్షించుకొనుటకై ఇస్లాము మతమును స్వీకరించియుందురని భావింపవచ్చును. హిందూరాజులెల్లరను తమకు శత్రువులను భావముతో ఈ మహమ్మదీయప్రభువులు వారితో యుద్ధములు సాగించిరి. ఈ రాజులెల్లరును మహమ్మదీయ మతసిద్ధాంతముల కనుగుణముగ వర్తించుచు, నిరంకుశులుగ పరిపాలన కావించిరి.

వీరికాలమున దేశములో శాంతిభద్రతలు కొంతవరకు నెలకొనినను, హిందువులు, పలుబాధలకు, అవమానములకు లోనయిరి. ఫిరోజుతుఘ్లక్ అనురాజు ప్రజారంజకముగ పరిపాలనము సాగించెను. ఈతడు న్యాయశాసనములను సంస్కరించి, క్రూరశిక్షలను విధించు పద్ధతిని రద్దుచేసెను. వ్యవసాయాభివృద్ధికొరకు కొన్ని కాలువలు త్రవ్వించెను, విద్యావ్యాప్తి కొరకై ఈ రాజు పాఠశాలలను స్థాపించెను. పీడితప్రజల కొరకై ధనసహాయమును కావించెను. ఈ యుగమునాటి మహమ్మదీయరాజులెల్లరును తమ మతస్థులగు విద్వాంసులను, పండితులను, కవులను పోషించిరి. వీరియుగమున చారిత్రక గ్రంథరచన చక్కగ సాగెను. ఈ రాజులు శిల్పకళను పోషించి, గొప్పభవనములను నిర్మించిరి. ఈనాటి ఢిల్లీనగరమునకు సమీపమున నెలకొనియున్న "కుతుబ్ మీనార్" అను జయస్తంభమీనాటి ఉత్తమనిర్మాణములలో నొకటి. వీరు మతసహనము కోల్పోయి హిందూదేవాలయములను ధ్వంసముచేసిరి. కావున ఈ యుగమునాటి మహమ్మదీయరాజులు విదేశీపాలకులే కాని, జాతీయప్రభువులు కారని తెలుపవలసియున్నది. పాలకులెంత బాధించినను హిందూమతము క్షీణింపలేదు. ఆ కాలముననే రామానందుడు, చైతన్యుడు, గురునానక్ మొదలైన గొప్పభక్తులు జన్మించి, ప్రాచీన హైందవమతములో నూతన జీవముపోసిరి.

మొదటిపానిపట్టుయుద్ధము (1526) నకు ఫలితముగ ఢిల్లీ రాజ్యము బాబరువీరునకు వశపడెను. ఈతడు తురుష్కజాతీయుడు. లోకకంటకులుగ దుష్కీర్తిపొందిన చెంగీజ్ ఖాను, తైమూరుల వంశమున నీతడుజన్మించెను. ఈతనిచే నెలకొల్పబడిన వంశమునకు మొగలాయి వంశమను పేరు లభించెను. ఈ వంశములో బాబరు, హుమాయూన్, అక్బరు, జహాంగీరు, షాజహాను, ఔరంగజేబు అను ప్రసిద్ధరాజులు రాజ్యపాలనము సాగించిరి. హుమాయూను, అక్బరులకు నడుమ ఢిల్లీ రాజ్యము సుమారు పదునేను సంవత్సరముల కాలము ఆఫ్ఘన్ జాతికిచెందిన సూర్ వంశమువారికి వశపడెను. ఈ వంశమందలి షేర్ షా (1540-45) అను ప్రభువు భారతదేశమున రాజ్యపాలనము సాగించి, ఉత్తమరాజులలో నొకడు. బాబరు నాల్గుసంవత్సరములుమాత్రమే రాజ్యపాలనము కావించినను తనకు ప్రబలవిరోధులైన రాజపుత్రుల నోడించి, తనరాజ్యమునకు బలముచేకూర్చెను. బాబరు కుమా

రుడు హుమాయూన్ కూడ గొప్పవీరుడే కాని ఈతడు అల సుడు చాకచక్యములేనివాడు. కావున ఈతడు సూర్ వంశీయుడైన షేర్ షాచే ఓడింపబడి, తనరాజ్యమును కోల్పోయెను

షేర్ షా మహా సమర్థుడైన ప్రభువు ఈతడు రాజ్య పరిపాలనమునకై అత్యుత్తమమైన వ్యవస్థ నేర్పాటుచేసెను ఇతడు వ్యవసాయపు పన్నుల వసూళ్ళనుగూర్చియు, పన్నులను విధించు పద్ధతులను గూర్చియు నిర్దుష్టమైన పద్ధతుల నమలుపరచెను ఈ రాజు వర్తకము నభివృద్ధి కావించెను. సైనిక వ్యవస్థను సంస్కరించెను ఈ ప్రభువు సూర్లకొలది మైళ్ళ పొడవుగల చక్కని రాజమార్గముల వేయించెను ప్రజలకు శాంతిసౌఖ్యములను చేకూర్చెను షేర్ షా నిష్పక్షపాతబుద్ధితో హిందువులను, మహమ్మదీయులను ఉన్నతోద్యోగములలో నియమించెను ఈ రాజు శిల్పకళలను పోషించెను ఈతడు బీహారు రాష్ట్రమునందు తనకొరకై సాస్రాం వద్ద నిర్మించుకొనిన అందమైన సమాధి ఇందులకు నిదర్శనము

సూర్ వంశమువారి పరిపాలనము 1556 వరకు మాత్రమే సాగెను రాజ్యభ్రష్టుడయిన హుమాయూను ఆ సంవత్సరమున మరల ఢిల్లీరాజ్యమును సంపాదించుకొనెను కాని అనతికాలములో అతడు మరణింపగా, బాలుడైన అతని కుమారుడు అక్బరు రాజ్యాధికారమును వహించెను. (1556-1605) అక్బరు ప్రపంచమందలి ఉత్తమ రాజన్యులలో ఒక్కడని చెప్పవచ్చును రాజ్యాంగపు టేర్పాట్ల విషయమున అక్బరు తనకు పూర్వము ఢిల్లీశ్వరుడుగనుండిన షేర్ షా అడుగుజాడలలో నడచెను, వీరుడైన ఈ రాజు ఉత్తర హిందూస్థానమునంతను జయించెను. శూరులైన రాజపుత్రులందరును అక్బరు చక్రవర్తికి వశులయిరి ఉదయపూర్ పాలకుడైన రాణాప్రతాపసింహు డొక్కడు మాత్రము అక్బరును ధిక్కరించి నిలచెను వింధ్యకు దక్షిణమందున్న అహమ్మదునగర రాజ్యముపైకూడ మోగల్ సేనలు దాడి వెడలెను ఈ విధముగ అక్బరు సువిశాలమైన రాజ్యమును పాలించెను కాని ఈ ప్రభువునకు శాశ్వతకీర్తిని సంపాదించి పెట్టిన దీతని జాతీయభావపూరితమగు రాజ్యాంగవిధానమే భారతదేశమును విజయవంతముగ పరిపాలింపదలచిన ప్రభువగుటచే ఇచ్చట అధికసంఖ్యాకులుగ నివసించుచున్న హిందూ ప్రజలను సర్వవిధముల సంతుష్టిపరుపవలెనను సత్యమును ఈ రాజన్యుడు చక్కగ గ్రహించెను అక్బరు తన హిందూ ప్రజలపై విధింపబడుచున్న జిజియా మొదలగు అవమానకరములగు పన్నులను రద్దుచేసెను బలవంతులగు రాజపుత్రులను తనకు అనురక్తులుగ కావించుకొనుటకై ఈ రాజు రాజపుత్ర స్త్రీలను వివాహమాడి, వారి మతసంప్రదాయములను మన్నించెను తోడరమల్లు, రాజాభగవానుదాసు, రాజామానసింగు, రాజాబీరబలుడు మొదలైన హిందూ ప్రముఖుల నత్యున్నత పదవులలో నియమించెను వారందరును మిక్కిలి సంతుష్టులై అక్బరు సార్వభౌముని మిక్కిలి విశ్వాసముతో సేవించిరి అక్బరు సర్వమతములను నిష్పక్షపాత బుద్ధితో నవలోకించి, సర్వమత సారమనదగిన మరియొక నూతన మతమును స్థాపించుటకై కృషిసల్పెను ఈ రాజుకాలములో హిందీభాష చక్కగ వృద్ధిచెందెను తులసీదాసు అను భక్తకవి అక్బరుకాలమున జీవించి, దివ్యమైన తన రామాయణ గ్రంథమును రచించెను పైని తెలుపబడిన కారణములవలన భారతీయ ప్రజలలో పాలకులు, పాలితులు అను విభేదములు నశించిపోయి జాతీయ భావమేర్పడెను. అక్బరు సర్వతోముఖ ప్రజ్ఞకల్గిన రాజు ఈతడు సంగీతమును చిత్రకళను, శిల్పకళను పోషించెను ఆగ్రా నగరమునకు సమీపమున ఫతేపూర్ సిక్రీవద్ద ఈ రాజు నిర్మింపించిన మహానగరము, నేటికిని నిల్చియుండి, ఈతని శిల్పకళాభిమానమును వేనోళ్ళ చాటుచున్నది

అక్బరు వారసులైన జహాంగీరు, షాజహానులు ఇందు అతని నిష్పక్షపాతబుద్ధి కొంతవరకు లోపించినను మొత్తముమీద వారును జాతీయభావముతోడను, విశాలహృదయముతోడను తమ విశాలరాజ్యమును పరిపాలించిరి దక్షిణమందలి అహమ్మదునగర రాజ్యము వారికి వశపడెను జహాంగీరు భోగప్రియుడు భూలోక నందనవన మనదగిన కాశ్మీర రాజ్యపు ప్రకృతి సౌందర్యమును స్వయముగచూచి ఆనందించి, లోకమునకు తెలియజేసినవాడు జహాంగీరు షాజహాను శిల్పకళను బాగుగ పోషించెను అతడు నిర్మింపించిన భవనములెన్నియో కలవు వాటిన్నిటికిని తలమానికము ఆగ్రానగర సమీపమందలి తాజ్ మహాల్ అను సమాధి

తన పూర్వులు నిర్మించిన మోగలుసామ్రాజ్యమను మహాభవనమును, షాజహాను కుమారుడగు ఔరంగజేబు (1659-1707) మతవిద్వేష విధానమను వజ్రాఘాతముచే

మొగలాంట కదల్చివైచెను. ఆతనియనంతర మీసామ్రాజ్యము కూలిపోయెను. ఔరంగజేబు వ్యక్తిగతముగ మాననీయుడును, మహాసమర్థుడునైనవాడు. కాని ఇతడు ఒక గొప్ప సామ్రాజ్యమును పాలింపగల విశాల బుద్ధికలవాడు కాడు. మతమురభిమానముచే ఈతడు తన హిందూ, సిక్కు ప్రజల నపారముగ హింసించి, అవమానించెను. హిందువులపై ఇతడు అవమానకరమైన జిజియాపన్ను విధించెను. వారి దేవాలయములను కూల్చివేయించెను. షియామతము నవలంబించిరను కారణమున ఈతాజు తనసాటి మునల్మానురాజులగు బీజాపూరు, గోల్కొండ ప్రభువులను రాజ్యభ్రష్టులను కావించెను. ఔరంగజేబు అవలంబించిన మతవిద్వేష విధానమువలన రాజపుత్రులును సిక్కులును, మొత్తము హిందూ ప్రజలును, దక్షిణమున మహారాష్ట్రులును మొగలాయీ ప్రభుత్వముపై తిరుగుబాటు కావించిరి. బలవత్తరమైన సామ్రాజ్యపు సేనలుకూడ ఈ విప్లవము నణచలేకపోయెను. సమర్థుడైన ఔరంగజేబు జీవించి యున్నంతవరకును సామ్రాజ్యము నామమాత్రముగ నిలచియుండెను. ఆతడు మరణించుటతోడనే విచ్ఛిన్నకరశక్తులు విజృంభించి, మొగలాయీ సామ్రాజ్యమును ఛిన్నాభిన్నము కావించెను. 1707 నుండి 1858 వరకును గల దాదాపు 150 సంవత్సరములందును మొగలాయీ సామ్రాజ్యమునకు ప్రతిష్ఠ కూర్చగల్గిన సంఘటన లేవియును లేవు.

భారతదేశ చరిత్రయందు మొగలాయీ చక్రవర్తుల యుగము ఒకస్వర్ణయుగముగ భావింపబడుచున్నది. ఈ చక్రవర్తులు తాము పరిపాలించిన విశాలసామ్రాజ్యమునుబట్టియు, అపారమగు ధనసంపత్తినిబట్టియు, రాజ్యపరిపాలనా, సైన్యమునిబట్టియు, ప్రజాక్షేమాభిలాషను, లలితకళాభిమానమును బట్టియు, ప్రపంచమందలి ఉత్తమరాజన్యులతో పోల్చదగియున్నారు. ఈ రాజుల కాలమున దేశము సస్యసంపదలతో విలసిల్లెను. శాంతిభద్రతలు నెలకొనెను. పరిశ్రమలును, వ్యాపారమును బాగుగాసాగెను. మొగలాయీ రాజులు విద్యాభివృద్ధికై చాల పాటుబడిరి. ఈ కాలమున హిందీ, పారశీ, అరబ్బీ భాషలలో పెక్కుగ్రంథములు వెలసెను. షాజహానుచక్రవర్తికుమారుడు దారావంటి విశాలహృదయులైన మహమ్మదీయరాకుమారులు సంస్కృతభాషనుకూడ అభ్యసించిరి. మొగలాయి యుగమందలి కవులును, పండితులును, లెక్కకు మించియున్నారు. వీరిలో ప్రజభాషయందు కవితను రచించిన అంధకవి సూరదాసును, "రామచరితమానసము"ను సృష్టించిన తులసీదాసును, అక్బరుచక్రవర్తి దర్బారురత్నము లనదగిన అబుల్‌ఫజల్, ఫైజీసోదరులును, ప్రత్యేకముగ స్మరింపదగినవారు. చిత్రలేఖనము మున్నగు లలితకళలు కూడ ఈ కాలమున బాగుగా వృద్ధిచెందెను.

మొగలాయి యుగమునకు నిజముగ వన్నెతెచ్చిన అంశము జాతీయసమ్మేళనము. మహమ్మదీయులు భారతదేశమును జయించినతరువాత కొంతకాలమువరకును విదేశీయులును, విజితులును, పరస్పరద్వేషముతోడను విరోధభావముతోడను మెలగిరి. కాని 16వ శతాబ్ది సంవత్సరమునకు పూర్వపుయుగమునందే హైందవ, ఇస్లాము మతములయందు సామరస్యభావ మేర్పడెను. ఉదాత్తభావములుకల తత్త్వజ్ఞు లీరెండుమతములయందలి ముఖ్యసిద్ధాంతములును ఒక్కటియే యని ఎలుగెత్తి చాటిరి. ఇందులకు మునల్మాను భక్తుడైన కబీరుదాసు డొక ఉజ్జ్వలనిదర్శనము. మతసామరస్యము క్రమముగ సామాజిక సామరస్యమునకు దారితీసెను. అక్బరుసార్వభౌముడు తాను స్వయముగ రాజపుత్రకన్యలను వివాహమాడియు, తనకుమారుడైన సలీమునకు ఒక రాజపుత్రకన్యను వివాహముకావించియు, హిందూ మహమ్మదీయ సమాజముల సమ్మేళనమునకొక నూతనమైన రాజమార్గము నేర్పాటుచేసెను. ప్రభువు లవలంబించిన మార్గమునే ఆనాటి ఉన్నతవంశ్యులును, సామాన్యప్రజలును కూడ అవలంబించిరని మనము భావింపవచ్చును. వివాహబాంధవ్యము లీరెండు మతములవారిని మిక్కిలి సన్నిహితులుగ కావించెను. మొగలాయి రాజుల కాలమందు హిందూమునల్మానులలోని ఉన్నతవంశములవారు ఒకేభాషను మాట్లాడుచు ఒకేవిధమైన దుస్తులను ధరించుచు, ఒకేవిధమగు సాంఘికాచారముల నవలంబించుచు, ఒండొరుల పండుగపబ్బములలో పాల్గొనుచు, సుఖదుఃఖములలో భాగస్వాములుగ నుండుచు వచ్చిరి. వారిపద్ధతుల ననుసరించుటకు పూర్వమే సామాన్యప్రజలు తమ నిత్యజీవితములో ప్రవేశపెట్టుకొని యుండిరి.

ఈవిధముగ మహమ్మదీయయుగము, అందును ముఖ్యముగ మొగలాయీ చక్రవర్తుల పరిపాలనాకాలము రెండు భిన్నమతముల నవలంబించుచు, రెండు భిన్నజాతులకుచెంది, భిన్న సాంఘికాచారములను పాటించుచు, వచ్చిన హిందూ

మహమ్మదీయ ప్రజలకలయికకు చక్కని అవకాశ మేర్పరచెను. ప్రపంచ చరిత్రయందు మరెచ్చటను ఇట్టి అపూర్వ సమ్మేళనమునకు మరియొక నిదర్శనము లేదు. ఇదికాక మహమ్మదీయ యుగమందు ప్రాచ్య, పాశ్చాత్య ఖండముల కొండొకటితో పరిచయ మేర్పడెను. 1498 వ సంవత్సరమున పోర్చుగల్లు దేశీయుడగు వాస్కోడిగామా భారత దేశము నకువచ్చి చేరెను. పదునారవశతాబ్ది ప్రారంభమున పోర్చుగీసువారు భారతదేశపు పశ్చిమప్రాంతమున గోవా మున్నగు వర్తకస్థానముల నేర్పాటు కావించుకొనిరి. 1600 వ సంవత్సరమున ఇంగ్లాండునందు "తూర్పు ఇండియా వర్తకసంఘ" మేర్పడెను. అటుపిమ్మట ఆంగ్లవర్తకులు భారతదేశమున కేతెంచి, మద్రాసు, కలకత్తా, బొంబాయి, సూరత్ మున్నగు రేవుపట్టణములలో తమ వాణిజ్యకేంద్రములను స్థాపించుకొనిరి. ఆంగ్లేయుల తరువాత హాలెండు దేశమువారును, ఫ్రెంచివారును భారతదేశముతో వ్యాపార సంబంధములు కల్పించుకొనిరి. ఈ విధముగ మహమ్మదీయ రాజుల యుగములో ఆసియా జాతులును, ఐరోపా జాతులును పరస్పరము కలిసికొనుటకు వసతులేర్పడెను.

సువిశాలమైన భారత భూమియందు ఒక్క ఢిల్లీ సామ్రాజ్యము మాత్రమేకాక ఎన్నియో స్వతంత్ర ముసల్మాను రాజ్యము లుద్భవించి, కొంతకాలము వరకును వైభవముతో విలసిల్లెను. ఈరాజ్యములను పాలించిన ప్రభువులలో కొందరు మత దురభిమానముతో వర్తించి, తమ హిందూప్రజలను బాధించినను, అందరును అట్టివారుకారని ఘంటాపథముగ చెప్పవచ్చును. ఈ సుల్తానులలో పలువురు తమ హిందూ ప్రజలను నిష్పక్షపాతముగ కాపాడి, వారి నున్నతోద్యోగములలో నియమించిరి. అంతేకాక వారు హిందువులు రచించిన గ్రంథముల నాదరించి, వాటిని పార్సీ, అరబ్బీ మున్నగు భాషలలోని కనువాదము కావింపించిరి. ముసల్మాను రాజులు పెక్కండ్రు శిల్పకళయందును, చిత్రలేఖనమందును మిక్కిలి అభిమానమును చూపిరి. ఆ రాజులచే నిర్మింపబడిన మసీదులు, సమాధులు మున్నగునవి భారతదేశమందలి వివిధ ప్రాంతములలో నేటికిని నిలిచియున్నవి. ఈ సందర్భమున ఆయా రాజ్యముల నామములను మాత్రము స్మరించుటకు మాత్రమే సావకాశము కలదు.

భారతభూమికి మకుట మనదగిన కాశ్మీరమునందు షామీర్జా అనునాతడు క్రీ. శ. 1840 ప్రాంతమున నొక స్వతంత్ర ముసల్మాను రాజ్యమును నెలకొల్పెను. ఈవంశము లోని జైన్ ఉల్ ఆబిదీన్ అనురాజు (1420-1470) చాల ప్రసిద్ధుడు. ఈతనికి "కాశ్మీరరాష్ట్రపు అక్బరు" అను బిరుదు కలదు. ఈతడు నిష్పక్షపాతబుద్ధితో తనప్రజలను కాపాడెను. పండితులను కవులను పోషించెను. మహాభారతమును, రాజతరంగిణి అను సంస్కృతగ్రంథమును పారసీక భాషలోనికి అనువాదము చేయించెను. ఉత్తమములగు అరబ్బీ, పార్సీ గ్రంథములను హిందీభాషలో వ్రాయించెను. ఈరాజు అనంతరము కాశ్మీరరాష్ట్రమున అరాజకత్వము ప్రబలెను. అందుచే మొగలాయి సార్వభౌముడగు అక్బరు ఈరాష్ట్రమును తన సామ్రాజ్యములో కలుపుకొనెను.

తపతీనదిలోయలోని ఖాందేష్ రాజ్యమును ఒక ముసల్మానుకుటుంబమువారు సుమారు రెండుశతాబ్దుల కాలము (1400-1600) స్వతంత్రులుగ పాలించిరి. ఈ రాజ్యమును 1601వ సంవత్సరమందు అక్బరుచక్రవర్తి తన సామ్రాజ్యములో చేర్చుకొనెను. గుజరాతు రాజ్యమును 1401వ సంవత్సరమున జఫర్ ఖాను అనునాతడు నెలకొల్పెను. ఈ సుల్తానులు 1578 వరకును తమ స్వాతంత్ర్యమును నిలువబెట్టుకొనిరి. అక్బరు సార్వభౌముడీరాజ్యమును కూడ జయించెను. గుజరాతురాజ్యమునకు ముఖ్యస్థానమైన అహమ్మదాబాదు నగరము ఆయుగమునాటి సర్వాంగసుందరమగు పట్టణముగ పేరుపొందెను. ఇచ్చటి భవనములయందు ప్రదర్శితమైన శిల్పకళ అత్యున్నతస్థాయికి చెందినది. ఈ సుల్తానులు దారు శిల్పమునుకూడ చక్కగ పోషించిరి. జోన్పూరు రాజ్యము షర్కీవంశపు సుల్తానులచే సుమారు ఒక శతాబ్దికాలము (1894-1480 పాలింపబడెను. ఈ రాజులు వాఙ్మయమును శిల్పకళను పోషించిరి. వీరికాలమున జోన్పూరునందు నిర్మింపబడిన అతాలా మశీదును, లాల్ దర్వాజాయును, జామామసీదును మిక్కిలి అందమైన కట్టడములు. బంగాళా దేశము మహమ్మదీయుల రాజ్యపరిపాలన ప్రారంభమైననాటినుండియు కూడ ఇంచుమించు స్వతంత్రముగనే ఉండెను. ఈ రాజ్యమును అక్బరుచక్రవర్తి 1576 వ సంవత్సరమున తన సామ్రాజ్యములో చేర్చుకొనెను. బంగాళా నవాబులు శిల్పకళను, బెంగాలీ వాఙ్మయమును చక్కగ పోషించిరి. వీరికాలము నాటి ఆదీనామసీదు, కదమ్‌రసూల్ అను భవనమును చాల

అందమైనవి ఈ వంశములోని నస్రత్‌షా, హుస్సేన్‌షా అను వారలు మహాభారతమును వంగభాషలో వ్రాయించి ఖ్యాతి గాంచిరి మాళవరాజ్యమును మరియొక ముసల్మాను వంశము వారు సుమారు నూట అరువది సంవత్సరముల కాలము (1402-1562) పరిపాలించిరి వీరికి మండూనగరము రాజ ధాని వీరు శిల్పకళను పోషించిరి దక్షిణ భారతమందలి బహమనీ రాజులును, బహమనీ రాజ్యశాఖలైన అహమద్ నగరము, బీజాపూరు, గోల్కొండ మున్నగు రాజ్యముల ప్రభువులును చారిత్రిక ప్రసిద్ధిగాంచిరి వీరికాలమునాటి ఉత్తమ భవనములు బీదరు గుల్బర్గా, అహమ్మద్‌నగర్, బీజాపూరు, హైదరాబాదు నగరములలో నేటికిని కానవచ్చు చున్నవి మిగిలిన మహమ్మదీయ రాజ్యములు బ్రిటిషు యుగము నాటివి

ఖం బా శే

# భారతదేశచరిత్ర (బ్రిటిష్‌యుగము)

బ్రిటిష్ సామ్రాజ్యస్థాపన క్రీ శ 1600 సంవత్సర ములో ఇంగ్లీషువర్తకులు ఈస్టిండియాకంపెనీని ఇంగ్లండులో స్థాపించి భారతదేశములో కాలక్రమమున సూరత్ మచిలీ పట్నం మద్రాసు, బొంబాయి, కలకత్తాలలో వర్తకకేంద్ర ములను నెలకొల్పిరి వీరికి పోటీగా ఫ్రెంచి డచ్చివర్తకులు తమ వ్యాపారకేంద్రములను స్థాపించిరి 18 వ శతాబ్ది ప్రారంభమువరకు వీరిదృష్టి వ్యాపారముమీదనే కేంద్రీకృతమై యుండెను తరువాత మొగలుసామ్రాజ్యము విచ్ఛిన్నమగు టయు, మహారాష్ట్రులు, మొగలుసామంతులు సామ్రాజ్య స్థాపనమునకు పోరాడుటయు, రాజకీయరంగము కల్లోల మగుటయు సంభవించినవి అపుడు బ్రిటిషు, ఫ్రెంచి వర్తకులు ప్రవేశించి రాజకీయ ప్రాబల్యమును సంపాదింపూనుకొనిరి బ్రిటిషువారు దేశీయపాలకులను విడదీసి, ఓడించి చివరకు వారందరిపై పెత్తనము చేయగల్గినారు విదేశీయుల కుతంత్రమును గ్రహింపలేని ప్రభువులు వారి సహాయము నర్థించి తమ స్వాతంత్ర్యమును పోగొట్టుకొని, చివరకు దేశమునకు దాస్యమును సంక్రమింపచేసిరి

18 వ శతాబ్ది మధ్యలో దక్షిణదేశములోని కర్ణాటక రాజ్యములోను, హైదరాబాదు రాజ్యములోను ఆయా సింహాసనములకై వారసులమధ్య అంతఃకలహములు చెల రేగినవి. కర్నాటకములో చందాసాహెబు, హైదరాబాదులో ముజఫర్‌జంగు, ఫ్రెంచివారి సహాయముతో వారి ప్రత్యర్థు లైన మహమ్మదాలీ నాసర్‌జంగులు ఇంగ్లీషువారి సహాయ మును పొందిరి అపుడు జరిగిన మూడు కర్ణాటక యుద్ధముల ఫలితముగ కర్ణాటకములోను, హైదరాబాదులోను ఇంగ్లీషు వారు బలపరచిన అభ్యర్థులు సింహాసనముల నాక్రమించు టయు, ఆ రాజ్యములలో ఇంగ్లీషువారి పెత్తనము ప్రబలు టయు, ఫ్రెంచివారి ప్రాబల్యము తగ్గిపోవుటయు జరిగినవి ఈ సమయమునకనే ఉత్తరాదిన బెంగాలు నవాబైన సురాజు ద్దౌలా ఫ్రెంచివారి ప్రోత్సాహముతో ఇంగ్లీషువారి నెదు రించెను కర్ణాటకములో విజయము సంపాదించిన బ్రిటిషు నాయకుడు క్లైవు బెంగాలునకేగి, నవాబును, అతని సేనాధి పతియైన మీర్జాఫరును విడదీసి, మాయోపాయముచే నవా బును ప్లాసీయుద్ధము (1757)లో ఓడించి స్వార్థలాభముకొరకు స్వామిద్రోహము చేసిన మీర్జాఫరును బెంగాలు సింహాసన మెక్కించెను 'బక్సారు'యుద్ధములో విజయము చేకూరిన తర్వాత బెంగాలులో బ్రిటిషువారి పాలనము ప్రారంభ మైనది ఇట్లు క్లైవు దక్షిణమున, ఉత్తరమున బ్రిటిషు వారికి రాజ్యాధికారమును సంపాదించి వారి సామ్రాజ్యమునకు పునాదులు వేసెను వాటిపై సామ్రాజ్యసౌధమును నిర్మించిన బ్రిటిషు పాలకులలో వారన్ హేస్టింగ్సు, కారన్ వాలీస్, వెల్లస్లీ, మార్క్విస్ హేస్టింగ్సులు పేర్కొనదగినవారు

బ్రిటిషు సామ్రాజ్య విస్తరణము బ్రిటిషువారు మైసూరు సుల్తానులతో నాలుగు యుద్ధములు మహారాష్ట్రు లతో మూడుయుద్ధములు చేసిరి మైసూరు యుద్ధములలో హైదరాలీని, టిప్పుసుల్తానును ఓడించి మైసూరు రాజ్యములో చాలభాగము నాక్రమించిరి పీష్వాపదవికి సంబంధించిన అంతః కలహములలో బ్రిటిషువారు చొరబడుటవలన మహారాష్ట్రు లతో పోరాటము జరిగినది మొదటియుద్ధములో పీష్వా అధికారము చెదరలేదు బాజీరావు పీష్వా అయినతర్వాత అతడు బ్రిటిషువారికి లొంగిపోయెను రెండవ యుద్ధములో భోన్‌స్లా, సింధియాలు లోబడిరి మూడవదానిలో నాగపూర్ రాజు, హోల్కారులుకూడా లోబడిరి 1818లో మహారాష్ట్ర రాజ్యములన్నియు బ్రిటిష్‌పెత్తనముక్రిందికి వచ్చినవి వెల్లస్లీ సైన్యసహకార పద్ధతిద్వారా హైదరాబాదు, అయోధ్య సంస్థానములను లోబరచుకొనెను, రాజపుత్రస్థానము నందలి రాజ్యములను మార్క్విస్ హేస్టింగ్సు జయించెను బ్రిటిషు

సామ్రాజ్య సౌధనిర్మాణమును సంపూర్ణము చేసినవాడు డల్‌హౌసి ఇతడు రాజ్యసంక్రమణ సూత్రమును ప్రయోగించి సతారా, సాంబల్‌పూర్, ఉదయపూర్, నాగపూర్, ఝాన్సీ వంటి మిత్రరాజ్యములను బ్రిటిషు పాలన క్రిందికి తెచ్చెను సాయుధపోరాటము సాగించి శత్రురాజ్యములైన పంజాబును, సిక్కింలో కొంతభాగమును ఆక్రమించెను అంతటితో 1857 లో బ్రిటిషు సామ్రాజ్యము ఆసేతు హిమాచలపర్యంతము వ్యాపించినది

**బ్రిటిషుకంపెనీ పాలన** 1757 నుండి 1857 వరకు భారతదేశములో బ్రిటిషుకంపెనీ పాలన సాగినది ఈ కాలమున దేశపాలనములో ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక రంగములలో జరిగిన మార్పులు కొన్ని గమనింపతగినవి పాలనారంగమున రెగ్యులేటింగ్ చట్టము, పిట్ చట్టము 1833, 1853 చట్టములు ముఖ్యమైనవి రెగ్యులేటింగ్ చట్టము, ఇంగ్లండులో కంపెనీపై ప్రభుత్వ అజమాయిషీని, భారతదేశములో మద్రాసు బొంబాయి, రాష్ట్ర ప్రభుత్వములపై బెంగాలులోని కేంద్రప్రభుత్వపు అదుపును, కలుగజేసి, తద్వారా భారతప్రజలకు సుపరిపాలన మొసగుటకు యత్నించినది తరువాతి చట్టములలో పై ఉద్దేశములు ఎక్కువగా నెరవేరుటకు తగిన మార్పులు చేయబడినవి అందుకు ఫలితముగ దేశములో పరిపాలనను కేంద్రీకృతమైనది న్యాయనిర్వహణమునకై జిల్లాస్థాయిలోను, ఉన్నతస్థాయిలోను, సివిల్, క్రిమినల్ కోర్టులు స్థాపించబడినవి భూమిశిస్తు విధానములో బెంగాలునందు శాశ్వతపన్నుపద్ధతి, ఇతరచోట్ల రైతువారీపద్ధతి అవలంబింపబడినవి. జిల్లాలలో శిస్తువసూలునకు కలెక్టరు, శాంతిభద్రతల రక్షణమునకు పోలీసు ఉద్యోగులు నియమింపబడిరి కంపెనీ పాలనములో దేశీయ పరిశ్రమలు దెబ్బతిని వ్యాపారము దిగజారినవి ప్రజలను పేదరికము బాధించినది అయితే సాంఘిక, సాంస్కృతిక రంగములలో కొన్ని అభివృద్ధికరమయిన సంస్కరణములు జరిగినవి సతీసహగమనము, నరబలి, బానిసత్వము మొదలగు దురాచారములను బెంటింక్ ప్రభువు నిర్మూలించెను డల్‌హౌసీ పబ్లిక్ వర్క్స్ డిపార్టుమెంటును స్థాపించి దేశములో రవాణా సౌకర్యములను వృద్ధిచేసెను రైలు, పోస్టు, టెలిగ్రాఫు సౌకర్యములు అతని కాలమునందే ప్రారంభమైనవి విద్యావ్యాప్తికి కూడ సదుపాయములు కల్పింపబడినవి 1835 లో ఇంగ్లీషుభాషలో పాశ్చాత్య శాస్త్రీయ, సాంకేతిక, సాహిత్య విజ్ఞానమును దేశములో వ్యాప్తిచేయ నిర్ణయింపబడినది అందుకై కళాశాలలు స్థాపింపబడినవి డల్‌హౌసీ వివిధ రాష్ట్రములలో విద్యాసంస్థల వ్యాప్తికి ఏర్పాట్లు చేసి విద్యాశాఖను డైరెక్టరు అధికారము క్రింద స్థాపించెను, 1857లో మద్రాసు, బొంబాయి కలకత్తాలలో విశ్వవిద్యాలయములు వెలసినవి

**1857 తిరుగుబాటు** బ్రిటిషు సామ్రాజ్యము దేశము నెల్లను ఆక్రమించుకొనుటతో స్వదేశీయుల పాలనము అడుగంటి విదేశీయుల పెత్తనము పెరిగినది స్వాతంత్ర్యప్రియులైన భారతీయులు దీనిని సహింపలేక దేశభక్తి ప్రేరితులైన హిందూ, మహమ్మదీయ సైనికుల తోడ్పాటుతో 1857 లో భారీయెత్తున బ్రిటిషుపాలకులపై సాయుధమయిన తిరుగుబాటును లేవదీసిరి అయితే భారతీయులలో ఐకమత్యము లేనందున అది విఫలమయినది దానిని ఒకయేడాదిలో బ్రిటిషుపాలకులు అణచివేయగలిగిరి ఈ తిరుగుబాటు ఫలితముగ దేశచరిత్రలో నూతనఘట్టము మొదలయినది అంతవరకు దేశపరిపాలనమును సాగించిన బ్రిటిషు ఈస్ట్ ఇండియా కంపెనీ రద్దుచేయబడినది పరిపాలనము బ్రిటిషు ప్రభుత్వమునకు పూర్తిగను, ప్రత్యక్షముగను అప్పగించబడినది

**బ్రిటిషుప్రభుత్వ పాలనము** 1858 నుండి 1947 వరకు ఈ పరిపాలనము సాగినది ఈ కాలమున జరిగిన ముఖ్య విశేషములివి

**విదేశవ్యవహారములు** భారతదేశమునకు విదేశములతోగల సంబంధములు, ఇతర దేశములతో బ్రిటిషు ప్రభుత్వమునకు గల సంబంధముల ననుసరించి సాగినవి బ్రిటిషువారికి రష్యా ఫ్రాన్సులతో వైరముండెడిది తమ విరోధులు భారత సరిహద్దులలోనున్న ఆఫ్ఘనిస్థాన్, టిబెట్ బర్మాలలో ప్రవేశించి, భారతదేశమందలి తమ సామ్రాజ్యమునకు ప్రమాదము కలుగచేయకుండుటకై బ్రిటిషువారు పాటుబడిరి పైని సరిహద్దురాజ్యములు తమకు లోబడియుండునట్లు సామోపాయమును, దండోపాయమును ప్రయోగించిరి ఆఫ్ఘనిస్థాన్ రష్యాకు లోబడక బ్రిటిషువారి చెప్పుచేతలలో నుండునట్లు చేయుటకు ఆ రాజ్యముపై రెండు యుద్ధములు జరిగినవి. వాటిఫలితముగ దానినేలిన అమీరులు బ్రిటిషువారికి అనుకూలురైరి బర్మాలో ఫ్రెంచివారు ప్రాబల్యమును సంపా

దించకుండుటకై దానితో మూడు యుద్ధములు జరిగినవి. బర్మా మూడుదశలలో బ్రిటిషువారిచే జయింపబడి ఆక్రమింపబడినది. ఈ శతాబ్ది ప్రారంభములో వైస్రాయిగు కర్జన్, పర్షియన్ సింధుశాఖ, ఆఫ్ఘనిస్థాన్, టిబెట్, బ్రిటిషువారి ఆధిపత్యములో నుండునట్లు తగుచర్యలు తీసికొనెను. రష్యా, ఫ్రాన్సులతో బ్రిటన్ సంధి కుదుర్చుకొనినతరువాత బ్రిటిషు వారికి జర్మనీతో వైరమేర్పడినది. అందువలన మొదటి, రెండవ ప్రపంచయుద్ధములలో జర్మనీకి వ్యతిరేకముగ బ్రిటనుతోపాటు ఇండియాకూడ పోరాడవలసి వచ్చినది.

**సంస్థానములతో సంబంధములు:** ఇండియాలో బ్రిటిషు సామ్రాజ్యము సురక్షితముగనుండుటకు స్వదేశీయసంస్థానములు నిర్మూలింపబడక, నిలిచియుండగలవని 1858 లో అభయమొసగబడినది. సంస్థానాధీశులు సంరక్షింపబడిరి. 1905 నుండి దేశములో బ్రిటిషుపాలనమునకు వ్యతిరేకముగ జాతీయోద్యమము ప్రబలుటతో, సంస్థానాధీశులపై అదుపును తగ్గించి, వారి స్నేహసహకారములను సంపాదించుటకు బ్రిటిషు ప్రభుత్వము ప్రయత్నించినది.

**రాష్ట్రములలో పరిపాలనము:** 1869 నుండి దేశములో పరిపాలనము వికేంద్రీకరింపబడినది. ప్రజలకు శాసనసభలలో సభ్యత్వమీయబడి, వారు పాలనములో పాల్గొను అవకాశము కల్పింపబడినది. శాంతి, భద్రతలతోపాటు, ఆర్థికాభివృద్ధిని, మానసికవికాసమును, నైతికపురోగతిని కలుగజేయుటకు ప్రయత్నములు జరిగినవి. వీటికై పాటుపడిన వైస్రాయిలలో లిట్టన్, రిప్పన్, కర్జన్‌లు పేర్కొనదగినవారు. వీరి కృషిఫలితముగ క్షామబాధానివారణము, నీటివసతులు, వ్యవసాయము, వాణిజ్యము, పరిశ్రమలు, రోడ్లు, రైల్వేలు, పోస్టు, టెలిగ్రాఫ్, విద్య, వైద్యము అనువాటికి సంబంధించిన సౌకర్యములు ఏర్పాటుచేయబడినవి. శ్రామికులయొక్క, స్త్రీలయొక్క, దీనజనులయొక్క బాధలు తొలగింపబడి వారి క్షేమము పెంపొందింపబడినది.

**మత, సాంఘికసంస్కరణోద్యమములు:** భిన్నసంస్కృతులమధ్య సమన్వయమును సాధించు నేర్పును భారతీయులు ప్రాచీన, మధ్యయుగములలోవలె, ఆధునికయుగములోకూడ నిరూపించిరి. 19 వ శతాబ్దమున బ్రిటిషుపాలనముతోపాటు వారి విద్య, అభిప్రాయములు, ఆచారములు, ఆదర్శములు దేశమున కొంతవరకు వ్యాపించినవి. మొదట, వాటియెడల వైరుధ్యము చెలరేగినను, క్రమముగ వానిలోని శ్రేయస్కరమైనవాటిని స్వీకరించి, భారతీయ సంప్రదాయములతో సమ్మేళనము చేయుటకు సంస్కర్తలు పూనుకొనిరి. హిందూ సంస్కర్తలలో రాజారామమోహనరాయలు, రనడే, స్వామిదయానందసరస్వతి, రామకృష్ణపరమహంస, స్వామివివేకానంద ప్రభృతులు ముఖ్యులు. వీరు క్రమముగ బ్రహ్మసమాజమును, ప్రార్థనసమాజమును, ఆర్యసమాజమును, రామకృష్ణసేవాసమాజమును, స్థాపించి వాటిద్వారా సంస్కరణోద్యమములను సాగించిరి. ఇట్టి కార్యమును అనిబీసెంటు దివ్యజ్ఞానసమాజముద్వారా సాధించినది. 20వ శతాబ్దిమున గాంధి, టాగూరు, నెహ్రూలు సంస్కరణములను కొనసాగించినవారిలో ప్రముఖులు. సంస్కరణాభిలాష ముస్లిములలోగూడ వ్యాపించినది. సయ్యద్ అహమద్ ఖాన్ అలిఘర్ ఉద్యమమును, గులాంఅహమద్ ఖాదియానీ అహమదీయ ఉద్యమమును ప్రారంభించిరి. ఇట్లు హిందూ ముస్లిమ్, మతసాంఘిక రంగములలో చెలరేగిన చైతన్యము, సాగిన సంస్కరణము, రాజకీయరంగమునకుగూడ వ్యాపించి స్వాతంత్ర్యోద్యమముగ అవతరించినది.

**స్వాతంత్ర్యోద్యమము రాజ్యాంగ సంస్కరణములు:** 1885 నుండి 1947 వరకు సాగిన భారతదేశచరిత్రను స్వాతంత్ర్యోద్యమచరిత్రగ పరిగణింపవచ్చును. నాటి చరిత్రలో ముఖ్యపాత్రలను నిర్వహించినవాటిలో ముస్లిమ్‌లీగ్, బ్రిటిషు ప్రభుత్వముకూడ కలవు. కాంగ్రెసు భారతజాతీయైక్యమును, స్వాతంత్ర్యమును, సాధించుటకు బ్రిటిషు ప్రభుత్వమును ప్రతిఘటించగా, కాంగ్రెసును నిరోధించి జాతీయైక్యమును, స్వాతంత్ర్యమును భంగపరచుటకు బ్రిటిషుసామ్రాజ్యవాదులు యత్నించిరి. అందుకై వారు 'విడదీసిపాలించు' దుర్నీతిని ప్రయోగించి ముస్లింలీగును కాంగ్రెసునుండి వేరుచేసి, దానిని తమకనుకూలముగనుండునట్లు చేసికొనిరి. ముస్లింలీగు స్వార్థలాభము నిమిత్తము బ్రిటిషుపాలకులతో సహకరించి, దేశము మొత్తమునకు ననుకూలరగల ఐకమత్యమును, స్వాతంత్ర్యమును, సంక్షేమమును, విడనాడుటకు సిద్ధపడినది. దేశములో చెలరేగిన స్వాతంత్ర్యోద్యమము ఫలితముగ ఈక్రింది తెలిపినట్లు రాజ్యాంగసంస్కరణములు జరిగినవి.

**భారతజాతీయ కాంగ్రెసుచరిత్ర:** 1885లో బొంబాయి యందు జరిగిన సమావేశముతో ప్రారంభమైనది. నాటి

నుండి 1907 వరకు దాదాభాయి నౌరోజీ, సురేంద్రనాథబెనర్జీ గోపాలకృష్ణగోఖలే అనువారి నాయకత్వమున కాంగ్రెస్ స్వల్పసంస్కరణములకొరకు బ్రిటిషు ప్రభుత్వమును శాంతి యుతముగ అభ్యర్థించు విధానమును అనుసరించినది దాని కోర్కెలలో ముఖ్యమయినవి కేంద్రరాష్ట్ర శాసనసభలలోను, ప్రభుత్వోద్యోగములలోను, భారతీయులకు, అధికస్థానముల నొసగుటకు సంబంధించినవి మొదట బ్రిటిషు ప్రభుత్వము కాంగ్రెసును సానుభూతితో చూచి, దానికోర్కెలను మన్నించుటకై 1893 వ సంవత్సరపు చట్టమును అవలంబించి, దాని ద్వారా ఎక్కువమంది భారతీయులకు శాసనసభలలో సభ్యత్వమునిచ్చినది అయితే 1907 నాటికి బ్రిటిషువారికి కాంగ్రెసుయెడల వైరుధ్యమేర్పడి, దానికి ప్రత్యర్థిగ ముస్లింలీగును లేవదీసి, కాంగ్రెసుపైకి పురికొల్పిరి నాడుకాంగ్రెసు రెండు శాఖలుగ చీలినది మితవాదశాఖ గోఖలే నాయకత్వమున బాధ్యతాయుత ప్రభుత్వమును కోరగా, అతివాదశాఖ తిలక్ నాయకత్వమున తిరుగుబాటుద్వారా స్వరాజ్యమును సంపాదింప ప్రయత్నించినది మితవాదులను చేరదీసి అతివాదులను అణగద్రొక్కుటకు మార్లే-మింటో సంస్కరణములు 1909 వ చట్టముద్వారా అమలు జరుపబడినవి ఈ చట్టము బాధ్యతాయుత ప్రభుత్వమునుగాక దానికంటె తక్కువ అధికారములను మాత్రమే ప్రసాదించినది ఇందువలన భారతీయులు ప్రభుత్వములో ఎక్కువగ పాల్గొనుటకు అవకాశమేర్పడినది కాని ముస్లిములకు ఎన్నికలలో ప్రత్యేక నియోజకవర్గములనిచ్చి, జాతీయైక్యమునకు నిరోధమేర్పరచి, దేశవిభజనమునకు బీజము నాటినది ప్రథమ ప్రపంచయుద్ధము సాగినకాలమున బాధ్యతాయుతస్వపరిపాలనకొరకు ప్రజలలో అలజడి ఎక్కువయినది. ప్రజాగ్రహావేశముతో యుద్ధమును కొనసాగించుటకు బ్రిటిషుప్రభుత్వము ఆకోర్కెను అంగీకరించినది యుద్ధములో నెగ్గినతర్వాత బాధ్యతాయుత పాలనమును 1919 చట్టముద్వారా పరిమితముగ రాష్ట్రములలో మాత్రము ప్రవేశపెట్టినది ఆమేరకు వాటిపై బ్రిటిషు ప్రభుత్వపు అజమాయిషీ గద్దుచేయబడినది ఈసంస్కరణముల ట్ల అసంతృప్తి చెంది కాంగ్రెసు వాటిని వ్యతిరేకించినది ఖిలాఫత్ ఉద్యమమును, సాగించిన ముస్లింనాయకులుకూడ కాంగ్రెసు వారితో చేతులుకలిపిరి ప్రజలలో అలజడి చెలరేగినది దాని నణచుటకు బ్రిటిష్ప్రభుత్వము దౌర్జన్యచర్యలకుపూనుకొనినది

ఈ తరుణమున, 1920 లో, గాంధిమహాత్ముడు కాంగ్రెసుకు నాయకత్వము వహించి 1947 వరకు స్వాతంత్ర్యోద్యమమును వినూత్నమగు శాంతియుత మార్గములు సహాయనిరాకరణము, శాసనోల్లంఘనము, సత్యాగ్రహము అను వాటిద్వారా సాగించెను, గాంధీ నాయకత్వమును ఆమోదించిన కాంగ్రెసువారు శాసనసభలలోనికి ప్రవేశించలేదు కొంతమంది కాంగ్రెసువాదులు స్వరాజ్యపార్టీని స్థాపించి శాసనసభలలోనికి ప్రవేశించి, ప్రభుత్వమును ప్రతిఘటించి కేంద్ర రాష్ట్రప్రభుత్వములలో సంపూర్ణ స్వపరిపాలనను కోరిరి 1929 లో కాంగ్రెసు సంపూర్ణ స్వపరిపాలనమునేగాక, దేశమునకు సంపూర్ణ స్వాతంత్ర్యమునుకూడ కోరినది

రాజ్యాంగసంస్కరణములను రూపొందించుటలో సైమన్‌కమిషన్ విఫలమైనతర్వాత, లండన్‌లో మూడు రౌండుటేబిల్ సమావేశములు జరగినవి వాటిదృష్ట్యా 1935 చట్టము నిర్మింపబడినది ఇది బాధ్యతాయుతస్వపరిపాలనమును రాష్ట్రములలో సంపూర్ణముగను, కేంద్ర ప్రభుత్వములో పరిమితముగను ప్రవేశపెట్టినది అంతమేరకు వాటిపై బ్రిటిషుప్రభుత్వపు అదుపు తొలగింపబడినది దేశమునకు సంపూర్ణస్వాతంత్ర్యముగాక డొమినియను ప్రతిపత్తి అంగీకరింపబడినది 'ఆల్ ఇండియా ఫెడరేషను' పథకముద్వారా స్వదేశసంస్థానాధీశులకు కేంద్రప్రభుత్వములో ప్రముఖస్థానమీయబడినది ముస్లిముల ప్రత్యేక ప్రాతినిధ్యమునకు ప్రాధాన్యమొసగబడినది కాంగ్రెస్ వీటితో అసంతృప్తి చెందినను, 1937 నుండి 1939 వరకు వాటిననుసరించి దేశములోని ఆరురాష్ట్రములలో ప్రభుత్వములను సాగించి ప్రజలకు స్వపరిపాలనము సమకూరునట్లు చేసినది

చరమదశ 1939–47 1939 లో రెండవ ప్రపంచయుద్ధము ప్రారంభమయినది ఇంగ్లండు, భారతదేశమును కూడ జనానీకి వ్యతిరేకముగ యుద్ధములోనికి లాగినది ఇందులకు కాంగ్రెసు సమ్మతింపక బ్రిటిషుప్రభుత్వమును ప్రతిఘటింప మొదలిడినది కాంగ్రెసు బ్రిటిషువారికి సహాయముచేయుటకు షరతుగా సంపూర్ణ స్వపరిపాలనమును, సర్వస్వాతంత్ర ప్రతిపత్తిని కోరినది ప్రత్యేక ప్రాతినిధ్యమునకు అలవాటుపడిన ముస్లింలీగు ప్రత్యేకరాజ్యమునే కోరినది. సంస్థానాధీశులు తమ ప్రత్యేకహక్కులను కాపాడుకొనుటకు పాటుపడిరి. బ్రిటిషుప్రభుత్వము, పై వారిని విడదీసి వారందరిపై పెత్తనము

సాగించుటకు యత్నించిరి. ఇండియా సహాయమును పొందుటకు రాజ్యాంగ సంస్కరణములకు చెందిన ప్రతిపాదనములు లిన్‌లిత్‌గో, క్రిప్స్, క్యాబినెట్ మిషన్, వేవెల్‌లచే చేయబడినవి కాంగ్రెసుకు తృప్తికరముగ లేనందున అవి విఫలమయినవి. కాంగ్రెసువారు గాంధిజీ నాయకత్వమున వ్యక్తిగతముగను, సాముహికముగను, శాసనోల్లంఘనమును, క్విట్ ఇండియా ఉద్యమమును సాగించిరి. దేశమావల నేతాజీ సుభాష్‌చంద్ర బోసుచే నిర్మింపబడిన భారతజాతీయ సైన్యము యొక్క ప్రభావము బ్రిటిషువారియెడల వైముఖ్యము పెరుగుటకు తోడ్పడినది. ఇట్టి క్లిష్టపరిస్థితిలో బ్రిటన్, 1947 చట్టము ద్వారా ఆగస్టు 15 న భారతదేశమును ఇండియా, పాకిస్థాన్ అను రాజ్యములుగ విభజించి, వాటికిని స్వదేశసంస్థానములకును స్వాతంత్ర్యమునొసగి తాను వైదొలగినది. అంతట బ్రిటిషుపాలనాయుగము అంతమైనది.

ఓ. వ.

## భారతదేశచరిత్ర-(స్వాతంత్ర్యము-అనంతరము)

గాంధిమహాత్ముని నాయకత్వమున భారతీయులు బ్రిటిష్‌పాలనమునుండి విముక్తులై, స్వాతంత్ర్యమును పొందుటకు ప్రయత్నించుచుండిరి. జిన్నాగారి నాయకత్వమున ముస్లిములీగువారు స్వాతంత్ర్యమునకు ముందు తమకు ప్రత్యేకముగా పాకిస్తానము కావలెనని పట్టుబట్టిరి. బ్రిటిష్ ప్రభుత్వమువారి సాకుతో రాజ్యాంగసమస్యను పరిష్కరింపక కాలహరణము చేయుచుండిరి.

రెండవ ప్రపంచ యుద్ధానంతరము ఇంగ్లండులో అట్లీ నాయకత్వమున లేబరుప్రభుత్వమేర్పడగా, వారు భారతదేశ రాజ్యాంగసమస్యను పరిష్కరించుటకు నిశ్చయించి, ప్రభుత్వాధికారములను 1948 జూనునెలలోగా భారతీయుల వశమొనర్పదలచితిమని 1947 ఫిబ్రవరి 20 వ తేదీన ప్రకటించిరి.

మహమ్మదీయులు అధికసంఖ్యాకులుగానుండు ప్రాంతములలో, ఆ ప్రజల అభిమతమునకు వ్యతిరేకముగా దేశసమైక్యమును బలవంతముగా విధింప వీలులేదనియు, అందుచే ఈలోగా మహమ్మదీయ-హిందూ ప్రజాపక్షములకు అంగీకారమగు రాజ్యాంగవిధానమొకటి కుదురనిచో, భారతీయుల క్షేమమాలోచించి తమకు యుక్తమని తోచినట్లుగా, ఏదో విధమగు కేంద్రప్రభుత్వమును ఏర్పరచి, అధికారములను దానికి అప్పగించుటగాని, లేక కొన్ని ప్రాంతములందుగల రాష్ట్రీయ ప్రభుత్వములకే అప్పగించుటగాని చేయదలచితిమని ప్రకటించి, ఈ కార్యములను నిర్వహించుటకు అప్పుడు వైస్రాయిగానున్న వేవెల్ ప్రభువునకు బదులుగా మౌంట్‌బాటన్ ప్రభువును వైస్రాయిగా బ్రిటిష్‌వారు నియమించిరి.

మౌంట్‌బాటను ప్రభువు ముస్లిములీగు నాయకులతోను, కాంగ్రెసు నాయకులతోను సంప్రదింపులు జరిపెను. దేశసమైక్యత పద్ధతిపై, రాజ్యాంగసమస్య పరిష్కారమగు మార్గము కనపడనందున, దేశవిభజనము చేసి, పాకిస్థానము నేర్పరచు పద్ధతిపైననే దానిని పరిష్కరించుటకు కాంగ్రెసు నాయకు లంగీకరించిరి. గాంధిమహాత్మునికిమాత్రమిది ఇష్టము లేదు.

అత్యధికసంఖ్యాకులగు మహమ్మదీయులున్న రాష్ట్ర భాగములను విడదీసి పాకిస్థానము నేర్పరచు సిద్ధాంతము ప్రకారమే పంజాబులోను, బంగాళములోను హిందూ, మహమ్మదీయులసంఖ్య ఇంచుమించు సమానముగ నున్నందున ఆ రాష్ట్రములను విభజించుట న్యాయమని కాంగ్రెసువారు చేసిన వాదనను జిన్నా కాదనలేకపోయెను. మౌంట్‌బాటన్ ప్రభువు ముస్లిములీగు నాయకులతోను, కాంగ్రెసు నాయకులతోను మాటలాడి లండనులోని బ్రిటిష్‌ప్రభుత్వమువారితో ఆలోచించి 1947 జూన్ 3 వ తేదీన దేశవిభజనమునుగూర్చిన ప్రకటనమును గావించెను. అంతకుముందేర్పడియున్న రాజ్యాంగనిర్మాణసభలో చేరుట కంగీకరింపని ప్రాంతముల వారికి ప్రత్యేకముగా నొకరాజ్యాంగనిర్మాణసభ నేర్పరచుటకును, పంజాబు, బంగాళారాష్ట్రముల విభజనమునుగూర్చి, ఆ రాష్ట్రశాసనసభల తీర్మానమును మన్నించుటకును, పాకిస్థానములో చేరువిషయమై పశ్చిమోత్తర పరగణాలలోను, అస్సాములోని సిల్హెట్ జిల్లాలోను జనాభిప్రాయమును తీసికొనుటకును, సింధు రాష్ట్రమునకు ప్రత్యేక రాజ్యాంగ నిర్మాణసభ కావలెనా అను విషయమై ఆ రాష్ట్రశాసన సభవారు తీర్మానించుటకును, అవకాశమొసగబడెను. బ్రిటిష్ ప్రభుత్వము భారతదేశమునకు స్వపరిపాలనాధికారము నొసగు తేది 1947 ఆగస్టు మధ్యకు జరుపదలచినారని వైస్రాయి ప్రకటించుటతో, ఉభయపక్షములవారు వ్యవహారములను పూర్తిచేసికొనుటకు త్వరపడిరి.

అనుకొనినట్లే, మహమ్మదీయులు తమకు ప్రత్యేక రాజ్యాంగ నిర్మాణసభ కావలెనని తీర్మానించిరి. పంజాబు,

బంగాళా రాష్ట్రములలోని మహమ్మదీయేతర ప్రజలు ఆరాష్ట్రము లను రెండుగా విభజింపవలసినదని తీర్మానము చేసిరి అస్సాములోని సిల్హెటుజిల్లా వారును, వాయవ్య సరిహద్దు పరగణాల ప్రజలును పాకిస్థానమున చేరుటకు నిశ్చయించిరి పంజాబు, బంగాళా రాష్ట్రములుగల దేశము రెండుగా చీల్చబడుచున్నదని సిక్కులు బాధపడి అసమ్మతి తెలుపసాగిరి పాకిస్థాన, భారతదేశ రాజ్యాంగనిర్మాణసభలు క్రొత్తరాజ్యాంగము లను నిర్మించుటకు కొంతకాలము పట్టును గనుక, ఈలోగా ఈ రెండు దేశములు బ్రిటిష్ కామన్వెల్తులోని తక్కిన స్వతంత్ర డొమినియనులవలె అధినివేశ రాజ్యములుగానుండిన బాగుండుననియు తమకిష్టమైనచో, కామన్వెల్తునుండి విడిపోవచ్చుననియు బ్రిటిష్ రాజనీతిజ్ఞులు చేసిన సూచనను రెండుపక్షములవారు అంగీకరించిరి

దేశవిభజన మొనర్చుటకు ఉభయపక్షముల ప్రతినిధులతో వైస్రాయి అధ్యక్షతన ఒక కౌన్సిలు ఏర్పడెను దేశవిభజనము చేయుట, ప్రభుత్వసామగ్రిని పంచుకొనుట, సైనిక, సివిలు పరిపాలనావ్యవస్థలను విభజించుట చిక్కులతో కూడినపని దీనిని వైస్రాయి సమర్థతతో నిర్వహించిరి ఆదివరకు పని చేయుచుండిన బ్రిటిష్ ఉద్యోగులు కొంతకాలమువరకు పని చేయునట్లు ఉభయులు నిశ్చయించిరి బ్రిటిష్ సివిలుసర్వీసు, పోలీసువర్గము, సైనికవర్గములలోని వారెవరైన విరమించు కొన దలచినచో, ఉపకారవేతనము పొంది పోవచ్చును, లేదా తమకిష్టమైన క్రొత్తడొమినియనులో పనిచేయవచ్చును ఈ స్థితిలో పాకిస్థానమునకు జిన్నాయే గవర్నరుజనరలుగా నుండుటకు నిశ్చయించుకొనిరి భారతదేశమునకు మౌంట్ బాటన్ ప్రభువునే గవర్నరుజనరలుగా నుండుమని కాంగ్రెసు నాయకులు కోరిరి. భారతదేశమున బ్రిటిష్ పాలనము నను వదలుకొని, స్వపరిపాలనముగల ఇండియా, పాకిస్థానములు అను రెండుక్రొత్త అధినివేశరాజ్యములను నిర్మించుచు ఇంగ్లీషు పార్లమెంటువారు చేసిన ఇండియన్ ఇండిపెండెన్సు చట్టము 1947 జులై 18 వ తేదీన రాజానుమతినివడసి అమలు లోనికి వచ్చెను. ఆదివరకు బ్రిటిష్‌పరగణాలుగానుండిన రాజ్యభాగములను పాలించు బాధ్యతను బ్రిటిషువారు వదలు కొనిరి. ఆదివరకు తమ క్రింద సామంతరాజ్యములుగ నుండిన సంస్థానములపై తమకుగల సార్వభౌమాధికారములను కూడ వదలుకొనిరి. ఇంగ్లీషురాజు బిరుదులో 'భారతదేశ చక్రవర్తి' అను బిరుదమును తొలగించిరి 1947 ఆగస్టు 15 వ తేదీన ఇండియా డొమినియన్ అను స్వతంత్ర అధినివేశ రాష్ట్ర మేర్పడెను మౌంట్ బాటన్ ప్రభువు రాజ్యాంగ ధర్మమును బట్టి కట్టుబడిన గవర్నరుజనరలు అయ్యెను ప్రజాప్రతినిధులు గల రాజ్యాంగనిర్మాణసభయే నూతన పార్లమెంటుగా కూడ వ్యవహరింపసాగెను నెహ్రూపండితుడు ప్రధానమంత్రిగా ఒక మంత్రిమండలి ఏర్పడెను

స్వతంత్ర భారతదేశ ప్రభుత్వమును అనేకసమస్యలు ఎదుర్కొనెను

బ్రిటిషువారు భారతదేశపరిపాలనమును వదలుకొనిన ఫలితముగా, ఆదివరకు వారిక్రింద సామంతరాజ్యములుగా నుండిన స్వదేశసంస్థానములు స్వతంత్రము లయ్యెను అయితే భూగోళ నైసర్గిక స్థితిగతులనుబట్టియు, ప్రజల జాతి, మత సంస్కృతీ సంబంధములనుబట్టియు భారతదేశములోని రైళ్ళు, రోడ్లు, తంతి తపాలా మార్గములు మొదలగు రాజకీయ సంబంధములనుబట్టియు, ఆదివరకు బ్రిటిష్ పరగణాలతో ఈ సంస్థానములకు విడదీయరాని సన్నిహిత సంబంధములుండెను ఇట్లు భారతదేశ మధ్యమునందున్న 554 సంస్థానములు స్వతంత్రముగా వ్యవహరించినచో, నూతనరాజ్యము యొక్క పరిపాలనమందు పెక్కు చిక్కులు కలుగగలవని అందరును గ్రహించిరి ఈ సంస్థానములలో కొన్ని పెద్దవి, కొన్ని చిన్నచిన్న జమీందారులవంటివి కొంతకాలమునుండి సంస్థానముల వ్యవహారములలో అచ్చట ప్రజాప్రతినిధులకు ప్రమేయముండవలెనను ఆందోళనము సాగుచుండెను

ఒకవంక బ్రిటిషువారు భారతదేశమునకు స్వాతంత్ర్యము నొసగు ప్రయత్నములోనుండగా, ఇంకొకవంక కొందరు సంస్థానాధీశులు స్వతంత్రులుగా నుండదలచినామని ప్రకటించిరి. భారతదేశమునుండి బ్రిటిష్‌ప్రభుత్వము వైదొలగి నప్పుడు, దానికిదివరకుండిన సార్వభౌమాధికారములు నూతన స్వతంత్ర ప్రభుత్వమునకు సంక్రమింపవలెనని కాంగ్రెసువారు చేసిన వాదనను ఇంగ్లీషు రాజనీతిజ్ఞులు అంగీకరింపలేదు ఇట్టి పరిస్థితులలో మౌంట్ బాటన్ ప్రభువు సానుభూతివలన, వల్లభ భాయిపటేలు రాజ్యతంత్ర నిపుణతవలన, భారతదేశములోని సంస్థానాధీశులతో సంప్రదింపులు జరిపినఫలితముగా, నూతన రాజ్యమేర్పడిన కొన్నివారములలోనే, విదేశవ్యవహారము లందు, దేశరక్షణమందు, సంసర్గమార్గములందు నూతన

స్వతంత్ర భారతప్రభుత్వమునకు లోబడి భారతయూనియనులో చేరుటకు సంస్థానాధీశులు అంగీకరించిరి. హైదరాబాదునిజాము స్వతంత్రముగనుండి ఏవో సంధిపర్చాటులు చేసికొనుచుండెను. కాశ్మీరములో పాకిస్థానమువారు దౌర్జన్యముచేయగా, ఆ సంస్థానాధీశుడు భారతయూనియనులో చేరెను. చిన్న చిన్న సంస్థానములు సంఘములుగా చేరి, ఒక్కొక్క రాజప్రముఖు నేర్పరచుకొని భారతయూనియనులో చేరెను.

హైదరాబాదు సంస్థానము భారత యూనియను మధ్యగనుండెను. అదివరకు బ్రిటిష్ పరగణాలతో దానికి మిక్కిలి సన్నిహిత సంబంధ ముండియుండెను. అందలి ప్రజలలో నూటికి 85 మంది హిందువులు. భారత సరిహద్దులలోని భారత యూనియను ప్రజలతో సన్నిహిత సంబంధములు కలవారు. ఈ పరిస్థితులలో విదేశ వ్యవహారములు, దేశ రక్షణము, సంసర్గమార్గములు అను మూడు విషయములందు భారత యూనియనులో చేరుట యుక్తమని మౌంట్‌బాటన్ ప్రభువు నిజామునకు సలహానొసగి, దానివిషయమై రాయబారములు జరిపిరి. కాని నిజాము మహమ్మదీయ ప్రజానాయకుల ప్రోద్బలముతో అట్లు అనవసర కాలహరణము చేయసాగెను. ఆ సంస్థాన ప్రభుత్వమునందు ప్రజలకు ప్రాతినిధ్యముండవలెనను ఉద్యమమును అణచుటకు ప్రయత్నించుచు, మహమ్మదీయ మతావేశపరులు విజృంభించుటకు నిజాము అవకాశమిచ్చెను. హిందువులను హింసించుచు రజాకార్ ఉద్యమము కాశింరజ్వీ నాయకత్వమున ప్రబలమయ్యెను. దేశప్రజల ప్రాణ, మాన, ధనములకు రక్షణము లేకుండ పోయెను. నిజాము సంస్థానములోనే కాక రజాకారులు సరిహద్దు ప్రదేశములందలి భారత యూనియనులో కూడ దౌర్జన్యములు చేయసాగిరి. నిజాము ప్రభుత్వము తన సంస్థానమున శాంతిభద్రతలను కాపాడక ఉపేక్షించెను. అంతట భారత యూనియను దేశీయ వ్యవహారముల మంత్రియగు సర్దార్ వల్లభభాయిపటేలు నయమునను, భయమునను నిజామును హెచ్చరించి, ఇక లాభములేదని తలచి, ఆ సంస్థానములో శాంతిభద్రతలను, క్రమపరిపాలనమును నెలకొల్పుటకు భారత యూనియను సైన్యముద్వారా పోలీసుచర్య జరపుటకు నిశ్చయించి, భారత సైనికదళములను పంపగా, నిజాము 18-11-1949 వ తేదీన తన సంస్థానమును భారత యూనియనులో చేర్చుట కంగీకరించి, ఫర్మానా జారీచేసెను. అటుతరువాత భారత రాజ్యాంగమే హైదరాబాదునకు వర్తింపజేయబడినది.

భారతదేశములో స్వతంత్రప్రభుత్వ మేర్పడగనే తలవని తలంపుగా విపరీతపరిస్థితి ఏర్పడెను. పాకిస్థానములోని బహుసంఖ్యాకులగు మహమ్మదీయు లచ్చట అల్పసంఖ్యాకులగు హిందువులు, సిక్కులు మున్నగువారిపై దౌర్జన్యములు చేయుచు, వారిని దోచుకొని, ఇండ్లు తగులబెట్టి, అనేక విధములుగా హింసింపసాగిరి. ముస్లిము రాజ్యములో ఇతర మతములవారికి తావులేదని వారి ఉద్దేశము. వారి ఘోర కృత్యములకు భయపడిన హిందూ, సిక్కు ప్రజలు పాకిస్థానము విడిచి పోవుటకైనను రైళ్ళు చాలకుండెను. రైళ్ళలో నున్నవారిని దుండగులు క్రిందికిలాగి చంపుచుండిరి. నాటు దారిన పోవు అసంఖ్యాక ప్రజలకు రక్షణ లేకుండెను. ఎదిరించినవారిని మహమ్మదీయులు చంపుచుండిరి. వృద్ధులను, స్త్రీలను, బిడ్డలనుగూడ కనికరించక హతమార్చుచుండిరి. ప్రాణములతో భారతదేశపు సరిహద్దులను చేరినవారికి అన్నవస్త్రములుగాని, నిలువనీడగాని లేవు. వీరు వదలిపెట్టివచ్చిన ఇండ్లను, భూములను పాకిస్థానీయు లాక్రమించుకొనిరి. వీరు పడిన బాధలను చూచి భారతీయులగు కొందరు హిందువులు ఇక్కడి మహమ్మదీయులపై ఆగ్రహముతో దౌర్జన్యములు జరిపిరి. అంతట భారతదేశమునుండి పెక్కురు మహమ్మదీయులు పాకిస్థానమునకు పోవసాగిరి. ఒక కోటిమంది మహమ్మదీయేతరులు పాకిస్థానమునుండి భారతదేశమునకు ఆ కాలమున వచ్చిచేరిరి. వీరికి అన్నవస్త్రములు, పునరావాసము కల్పించుట పెద్ద సమస్య ఆయ్యెను. పాకిస్థానమునుండి వచ్చిన ప్రజలకు వసతి కల్పించుటకు భారత ప్రభుత్వము ప్రత్యేకోద్యోగులను నియమించుటయేకాక, ప్రత్యేక ప్రభుత్వశాఖను ఏర్పరచెను. ప్రధానమంత్రియు, గవర్నరుజనరలును ఈ సమస్యయెడల ప్రత్యేక శ్రద్ధ వహించిరి. భారతదేశమునుండి పాకిస్థానమునకు వెళ్ళిపోయినవారి ఆస్తులను కాపాడుటకొరకు రక్షణోద్యోగి నియమింపబడెను.

భారతదేశ రాజ్యాంగనిర్మాణసభ బాబు రాజేంద్రప్రసాదు అధ్యక్షతక్రింద సమావేశమగుచు, మూడేండ్లు కృషి సల్పి, స్వతంత్రభారత రాజ్యాంగచట్టమును తయారుచేసెను. ఈ చట్టము 1950 జనవరి 26 వ తేదీన అమలులోనికి వచ్చెను.

దీనినిబట్టి భారతదేశములోని పౌరులందరికి, స్వేచ్ఛా స్వాతంత్ర్యముల నొసగు హక్కులు రాజ్యాంగచట్టమునందు ప్రాతిపదికగా చేర్చబడినవి దానినిబట్టి పత్రికాప్రకటనము స్వేచ్ఛగా జరుగుటకు ఎవరిమతమును వారు స్వేచ్ఛగా అవలంబించుటకును అవకాశమేర్పడెను దేశపరిపాలనము న్యాయశాస్త్రానుసారముగ జరుగవలెనని నిర్ణయించి రాజ్యాంగచట్టము క్రమబద్ధముగా అమలుజరుగుచున్నదో లేదో కనిపెట్టి నిర్ణయించు అధికారము స్వతంత్ర ఉన్నత న్యాయస్థానములయందుంచిరి భారతదేశమందు హిందువులే, అధిక సంఖ్యాకులుగ నున్నను, అన్నిమతములవారును సమానముగనే పరిగణింపబడిరి అస్పృశ్యత నిషేధింపబడినది ప్రజాసంక్షేమమునకు తోడ్పడు రాజ్యాంగ సూత్రములు కొన్ని శాసింపబడినవి

భారతదేశమునకు స్వాతంత్ర్యము లభించిన 1947 వ సంవత్సరమునుండి, ఎన్ని ఒడిదుడుకులు సంభవించినను, జవహర్‌లాల్ నెహ్రూపండితుని నాయకత్వమున స్థిరమైన ప్రభుత్వమేర్పడియుండెను దేశనాయకులు ప్రభుత్వవిధానములను మన్నించి అడకువతో నడచుకొనుచుండిరి పత్రికా విమర్శనమును, ప్రతిపక్షమువారి విమర్శలను మన్నించు సత్సంప్రదాయమేర్పడెను. 1951–52, 1957 1962 వ సంవత్సరములలో భారతదేశమంతట సాధారణ ఎన్నికలు జరిగినవి నూతన ప్రజాప్రభుత్వములో తాము భాగస్వాములమని ఓట్లిచ్చిన జనసామాన్యము గ్రహింపగలిగెను స్వాతంత్ర్యము లభించినప్పటినుండి భారతజాతి సాంఘిక న్యాయముపై ఆధారపడవలసియున్నదనియు ప్రజలందరికి సమానావకాశములుండవలెననియు, దేశములో శాంతిభద్రతలు స్థాపితమగుట ఆవశ్యకమనియు, దీనిపైననే దేశపురోభివృద్ధి ఆధారపడుననియు ప్రజలు గ్రహించిరి

భారతదేశములో ప్రజాప్రభుత్వము శైశవావస్థయందున్నది దానిని కాపాడుట అవశ్యకర్తవ్యము. న్యాయశాసనములను తృణీకరించి దౌర్జన్యములు, బందిపోటులు చేయువారు, చీకటిబజారువారు దేశములో విజృంభించియుండిరి. ఇతర దేశములలోవలెగాక, భారతదేశములో ఎవ్విధముగనైనను, ప్రజాప్రభుత్వమును విరుగదోడుటకు బద్ధకంకణులైన కమ్యూనిస్టులను ఒకరాజకీయపక్షముగా మెలగనిచ్చిరి హైదరాబాదులో రజాకారుల దురంతములవలె కమ్యూనిస్టులు కూడ ప్రత్యర్థులమీద దౌర్జన్యములు చేసిరి భారతదేశములో, జాతి, మత, కులభేదములతో పాటు, భాషాభేదములుకూడ తీవ్రములై యుండెను వీటిని చిచ్చుముట్టించువారుకూడ నుండిరి ఇటీవల హిందీభాషకు వ్యతిరేకముగా మద్రాసురాష్ట్రములో జరిగిన దౌర్జన్యములవలని నష్టములు అందరు ఎరిగినవే అందువలన దేశరక్షణమునకును, విదేశ సంబంధములకును, ప్రజల క్రమవ్యవస్థకును ఆవశ్యకములగు సరఫరా సేవల నిర్వహణమునకు భంగకరముగా వర్తింతురని అనుమానముగల వారిని సామాన్య న్యాయశాస్త్రప్రకారము విచారణ జరుపకయే, నిర్బంధమున నుంచుట అవసరమని నెహ్రూ, వల్లభభాయిలు అభిప్రాయపడిరి అందుచే అనుమానింపబడిన వారిని నిర్బంధములోనుంచుటకు 'ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టము'ను నూతనరాజ్యాంగము అమలులోనికివచ్చిన వెంటనే అమలు జరుపవలసివచ్చెను 1950 నుండి నేటివరకు ఆ చట్టమును పార్లమెంటు మారప్పుడప్పుడు పొడిగించుచువచ్చిరి ఇది అవశ్యకమైన శాసనమేయని నిష్పక్షపాతులగు విదేశీయులు గూడ అంగీకరించియున్నారు

భారతరాజ్యాంగము ఇంగ్లండు, అమెరికాలయందలి ప్రజాప్రభుత్వ విధానములందలి రాజ్యాంగ ధర్మములపై ఆధారపడి ప్రజాసంక్షేమముకొరకు పాటుపడు ప్రభుత్వ విధానమును స్థాపించియున్నది భారతదేశము స్వతంత్రమగు నాటికే మనజనసంఖ్య 32 కోట్లుండెను భారతీయులు బహుసంఖ్యాకులు పేదవారు మధ్యతరగతివారుగా [illegible] సంఖ్యలోనున్నారు కాని కొద్దిమంది మాత్రమే సంపన్నులు జనసంఖ్య సంవత్సరమునకు నూటికి రెండున్నరలచొప్పున అభివృద్ధి చెందుచున్నది దేశప్రజలలో నూటికి ఎనబది మంది వ్యవసాయమువలన జీవించువారే ఆ వ్యవసాయమైనను తాతలనాటి పద్ధతులతో చేయబడుచున్నది భూమిని బాగుచేయుటకు రసాయనపు ఎరువుల నుపయోగించి, యంత్రముల సహాయముతో కృషిచేయుట మనవారెరుగరు ఇతరదేశములందువలె మనదేశమున భారీపరిశ్రమలు లేవు ఉన్న చిన్నపరిశ్రమలైనను విదేశముల పోటీకి నిలువజాలకుండెను ప్రపంచములోని అన్నిదేశములందుకంటె, భారతీయుల సాలుసరి దామాషా ఆదాయము కడుహీనము ప్రజలలో విద్య చాల వెనుకబడియున్నది సాంకేతికవిద్యలో తర్ఫీదుపొందినవారు బహుస్వల్పము, ప్రజల ఆరోగ్యముకూడ వెనుకబడియున్నది

నివారింపదగు మలేరియా మున్నగు వ్యాధులు సర్వత్ర వ్యాపించి యున్నవి. జాతి, మత, కుల భేదములు, అజ్ఞానము వలన ప్రబలిన దురాచారములు, మూఢవిశ్వాసములు వ్యాపించి యున్నవి.

ఇట్టి పరిస్థితులలో దేశమును ఉద్ధరింపవలెనన్న కొన్ని సంవత్సరములపాటు సర్వతోముఖమైన గట్టికృషి అవసరము. వ్యవసాయము, పరిశ్రమలు, విద్య, వైద్యము మున్నగు అన్నివిషయములందును అభ్యుదయమునకై ప్రయత్నములు చేయవలెను. దీనికి దేశాదాయము చాలదు. అవసరమైనచో క్రొత్తపన్నులు విధించవలెను. ఋణములుకూడ చేయవచ్చును. స్నేహభావముతో సహాయపడగల ఇతరదేశముల సహాయము పొందవలెను.

దూరదృష్టిగల రాజనీతిజ్ఞులగు నెహ్రూపండితుడును, ఇతర కాంగ్రెసు నాయకులును చాలకాలము క్రిందటనే, దేశాభివృద్ధికొరకు ఏయేరంగములందు ఏయేకార్యములను ముందుగా సాధింపవలెనను విషయమునుగూర్చి ప్రణాళికలను తయారుచేయుటకొరకు సంఘమును నేర్పరచి యుండిరి. స్వాతంత్ర్యము సిద్ధించినపిమ్మట భారత ప్రభుత్వము ఈ విషయమునుగూర్చి నిపుణుల సహాయముతో ప్రణాళికలను తయారుచేసి, ఆప్రకారము కృషిచేయుట యుక్తమని నిశ్చయించి, అందుకొరకు "నేషనల్ ప్లానింగు కవున్సిల్" అను సంస్థను ఏర్పరచిరి. ఈ సంఘమువారు 1951 నుండి ఇప్పటి వరకు మూడు పంచవర్ష ప్రణాళికలను తయారుచేసిరి. భారత ప్రభుత్వము దేనికెంతెంత ధనమును వ్యయముచేయవలెనో ఆలోచించి ప్రణాళికలను అమలుజరుపుటకు కృషిచేసెను.

ప్రపంచమందలి వివిధ రాజ్యములవారి రాజకీయాభిప్రాయములతో భారతదేశము జోక్యము కల్గించుకొనక అన్నిరాజ్యములతో స్నేహభావముతో మెలగు విదేశ రాజ్యనీతి నవలంబించుటవలన అమెరికా, కెనడా, ఇంగ్లండు, పశ్చిమ జర్మనీ, జెకోస్లోవేకియా మున్నగు రాజ్యములవారేకాక, సోవియట్ రష్యా, జపాను ప్రభుత్వములును భారత ప్రణాళికలను జయప్రద మొనర్చుటకు కోట్లకొలది రూపాయలను, యంత్రసామగ్రిని ఇచ్చుటయేగాక తమ సాంకేతిక నిపుణులను గూడ పంపియు, యువకులకు తర్ఫీదునొసగియు, అనేక విధములుగా సహాయము చేయుచున్నారు.

మొదటి రెండు పంచవర్షప్రణాళికలు పూర్తియగు నప్పటికి భారత వ్యవసాయరంగమున నూటికి ముప్పది వంతులును, పారిశ్రామికరంగమున నూటికి ఏబదివంతులును అభివృద్ధి కలిగెను. వ్యవసాయాభివృద్ధికొరకు పంచవర్ష ప్రణాళికలు తలపెట్టిన కార్యములలో నదులజలము వ్యర్థకాకుండ వాటికి ఆనకట్టలు నిర్మించి, పల్లపుసాగుకు కాలువలద్వారా నీటిని వినియోగించుటయేకాక, ఆ జలప్రవాహశక్తి సహాయమున విద్యుచ్ఛక్తిని ఉత్పత్తిచేసి, దానిని గ్రామములందు పట్టణములందు పరిశ్రమల కుపయోగించు ప్రాజెక్టులు ముఖ్యమైనవి. ఇవి దాదాపు అన్నిరాష్ట్రములలో ప్రారంభింపబడినవి. కొన్ని చాలవరకు పూర్తియైనవి. కొన్ని ప్రారంభదశలో నున్నవి. వీటిలో దామోదరవాలీప్రాజెక్టు, భాక్రానంగల్ ప్రాజెక్టు, నాగార్జునసాగర్ ప్రాజెక్టులు సుప్రసిద్ధములైనవి. ఈ ప్రాజెక్టులకొరకు కోట్లకొలది ధనము వ్యయమగుచున్నది. ఇవి పూర్తియైనపిమ్మట వీటివలన సర్వతోముఖమైన అభివృద్ధి కలుగుననుటకు సందేహములేదు. వ్యవసాయాభివృద్ధికొరకు తలపెట్టిన రెండవ కార్యము, ఎరువులను తయారీయొత్తున ఉత్పత్తిచేయు ఫ్యాక్టరీల నిర్మాణము. సింద్రీలోని ఎరువులఫ్యాక్టరీ తయారై పనిచేయుచున్నది. ఇతరఫ్యాక్టరీలు నిర్మాణదశయందున్నవి.

పారిశ్రామికాభివృద్ధికొరకు ప్రభుత్వము కోట్లకొలది ధనవ్యయముతో కొన్ని భారీపరిశ్రమలను స్థాపించుటకు కృషి చేయుచున్నది. విశాఖపట్టణములోని నౌకానిర్మాణకేంద్రము, బెంగుళూరులోని విమాననిర్మాణకేంద్రము, చిత్తరంజన్‌లోని రైలుఇంజనుల కర్మాగారము, పెరంబూరులోని ఇంటిగ్రేటెడ్ కోచ్‌ఫ్యాక్టరీలు పనిచేయుచున్నవి. భారతదేశమందలి పారిశ్రామిక వస్తువులను ఇతర దేశములవారు కొనుటనుబట్టి, వాటి ప్రాశస్త్యము తెలియుచున్నది. పంచవర్ష ప్రణాళికలలో స్థాపింపబడిన ఉక్కు, ఇనుము ఫ్యాక్టరీలు కొన్ని పనిచేయుచున్నవి, కొన్ని విస్తృత మొనర్పబడుచున్నవి. భారీపరిశ్రమలలో సిమెంటు, న్యూస్‌ప్రింట్ కాగితము, పంచదార మొదలగువాటిని తయారుచేయు ఫ్యాక్టరీలేకాక, హెవీఎలెక్ట్రికల్స్, థెర్మల్ విద్యుచ్ఛక్తి ఉత్పాదక స్థానములు, నూనెఉత్పత్తి ఫ్యాక్టరీలు, రిఫైనరీలు, టెలిఫోను కేబిల్సు, ఇతరసాధనముల ఫ్యాక్టరీలు, మోటారుకారుల కర్మాగారములు, వైర్లఉత్పత్తి ఫ్యాక్టరీలు స్థాపింపబడుచున్నవి. ఇంజనీరింగు పరిశ్రమలలో అనేకవిధములగు

యంత్రాగారములు స్థాపింపబడినవి అల్యూమినియము, ఇతర లోహపరిశ్రమాగారములు వెలసినవి ఆధునిక వైద్యమునం దుపయోగించు ఆంటీబయొటిక్, సింథెటిక్ ఔషధములు, నేత్రచికిత్స కుపయోగపడు పరికరములు, అద్దములు మొదలగువాటి ఉత్పత్తికొరకు కర్మాగారములు స్థాపింపబడినవి

అన్నిటికంటె విశేషమేమనగా, అమెరికా, రష్యా మున్నగు పెద్దదేశములు అణువిద్యను ఆటంబాంబు, హైడ్రోజెన్ బాంబుల ఉత్పత్తికి ఉపయోగించుచుండగా, భారతదేశమున ట్రాంబేలో స్థాపించిన ఆటమిక్ రియాక్టరుల యంత్రాగారములో అణుశక్తిని విద్యుత్తును ఉత్పత్తిచేయుటకు, వైద్యచికిత్స మున్నగు మానవశ్రేయస్సున కుపయోగించు కార్యములకు వినియోగించుచున్నారు భారతదేశమున శాస్త్రవిజ్ఞాన పరిశోధనముకొరకు నేషనల్ లాబొరేటరీలు, భూగర్భ సర్వేస్టేషనులు, మూనెగవుఖను, ఇతర ఖనిజములను కనుగొను పరిశోధకసంస్థలు స్థాపింపబడి పనిచేయుచున్నవి

ఖడక్‌వాస్లాలో (పూనానగర సమీపమున)స్థాపింపబడిన నేషనల్ డిఫెన్సుఅకాడెమీ,సైనిక,వైమానిక,నౌకాశాఖలను మూడింటిని సమన్వయముచేయు సంగ్రామ విజ్ఞానకేంద్రము, ఇది చాల అపూర్వమైనది

భారత దేశోద్ధరణముకొరకు పంచవర్ష ప్రణాళికల ద్వారా చేయబడుచున్న కృషి సర్వతోముఖమైనది దేశములోని గ్రామీణులకు సౌకర్యములను కల్గించుటకు చేయబడిన బ్లాక్ డెవలప్‌మెంటల్ ఎక్స్‌టెన్షన్ స్కీములు కొన్ని ప్రాంతములందు సవ్యముగా పనిచేయుచున్నవి దేశపాలనములో గ్రామములనే కేంద్రములుగా చేయవలెనను ఉద్దేశములో గ్రామములందు పంచాయతీల నేర్పరచి, పాలనాధికారములను వాటికి యొనర్చుటకు ఆంధ్రప్రదేశమందును, కొన్ని ఇతరరాష్ట్రములలోను పంచాయితీరాజ్య విధానము క్రమక్రమముగా అమలు జరుపబడుచున్నది

పంచవర్ష ప్రణాళికలలోని మహత్తరమైన ప్రాజెక్టులు, గొప్ప పరిశ్రమలు కొంతకాలమైనగాని ఫల పదము కాజాలవు అందువలన కోట్లకొలది ధనము వ్యయమగుచున్నను, ప్రస్తుతము వాటివలన ఆదాయము లభించుటలేదు ఈ మహత్తర కార్యములను సాధించుటకు దేశములో పన్నులు హెచ్చుగా విధింపబడవలసి వచ్చెను కోట్లకొలది ఋణముగూడ చేయవలసివచ్చెను పంచవర్షప్రణాళికల ననుసరించి దేశాభివృద్ధి కొరకు సర్వతోముఖమైన కృషి జరుగుచున్నది అయితే కార్యనిర్వహణమునందు లోపములు లేకపోలేదు. ఉద్యోగుల యొక్క, పనివారలయొక్క మందకొడితనమువలన, కొందరి అవినీతివలన ఇట్టి లోపములు కలుగుచున్నవి జనసంఖ్యకు తగినట్లుగా ఉత్పత్తి అభివృద్ధి చెందుటలేదు, అందుచే ఆహార పదార్థములు, ఇతర పారిశ్రామిక సరకులు కొంతకాలము వరకు ఇతరదేశములనుండి దిగుమతి చేసికొనవలసి యున్నది

ప్రణాళికలకు వ్యయమగు కోట్లకొలది ధనమునకు తగినట్లుగా జనసామాన్యముయొక్క జీవనము సుఖప్రదమగుటలేదు నేడు భారతప్రభుత్వము నెహ్రూపండితుడు నెలకొల్పిన ప్రజాప్రభుత్వ సంప్రదాయములను, ప్రారంభించిన ప్రణాళికలను జయప్రద మొనర్చుటకు శక్తివంచనలేక కృషి చేయుచున్నది

ది. వేం శ

## భారతదేశ పరిశ్రమలు-భారీ, లఘుకుటీరపరిశ్రమలు

ఈనాడు ఆర్థికముగా వెనుకబడియున్న దేశములలో భారతదేశమొకటి ఈ 'వెనుకబడుట' యను లక్షణము ముఖ్యముగా పారిశ్రామిక ప్రగతియందు గోచరించును ముమ్మొందుగా పారిశ్రామికవిప్లవమును సాధించిన దేశము బ్రిటను తరువాత పశ్చిమయూరపియనుదేశములు, అమెరికా సంయుక్తరాష్ట్రములు, జపాను, రష్యా వరుసగా ఇట్టి విప్లవమును సాధించినవి రాజకీయ ఆర్థిక సాంఘిక కారణములన్నిటివలన భారతదేశమునందు కార్యక్రమ విధానమును ప్రవేశపెట్టుటకు పూర్వము నిజమైన పారిశ్రామికప్రగతి, ఆరంభింపబడ లేదు

భారీపరిశ్రమలు, లఘుపరిశ్రమలు, కుటీరపరిశ్రమలు - అని మూడురకములైన పరిశ్రమలు పారిశ్రామిక వ్యవస్థయందు. కానవగును ఒకే కుటుంబమునందలి వ్యక్తుల సహకారముతో నడుపబడు పరిశ్రమ కుటీరపరిశ్రమ అనబడును 5 లక్షల రూపాయల పెట్టుబడికి తక్కువకాని మూలధనమును వినియోగించు 50 మందికి మించని శ్రామికుల వలన పనిగొను పరిశ్రమ లఘుపరిశ్రమ అనబడును ఇందుకు భిన్నమైన పెద్దతరహా పరిశ్రమలు భారీపరిశ్రమలనబడును. భారీఎత్తున పెట్టుబడి, అధికస్థాయిలో శ్రామికుల యొక్క

ముడిసరుకుల యొక్క, యంత్రముల యొక్క, విద్యుచ్ఛక్తి యొక్క వినియోగము, ఫ్యాక్టరీలనిర్మాణము భారీపరిశ్రమల ముఖ్యలక్షణములు. భారీపరిశ్రమలను తిరిగి ఉత్పాదక వస్తువుల పరిశ్రమలు, ఉపభోగ్యవస్తువుల పరిశ్రమలు-అని రెండు తెగలుగ విభజింపవచ్చును. వస్త్రములు, కాగితము మున్నగు నిత్యావసర వస్తువులను ఉత్పత్తిచేయు పరిశ్రమలు ఉపభోగ్య వస్తుపరిశ్రమ లనబడును. ఇనుము, ఉక్కు, రసాయనములు, యంత్రపరికరములు మున్నగువాటిని తయారుచేయు పరిశ్రమలు ఉత్పాదక వస్తుపరిశ్రమలనబడును.

వాస్తవమునకు పారిశ్రామిక విప్లవాత్పూర్వము-అనగా 18 వ శతాబ్దికి పూర్వము ప్రపంచమునందలి పరిశ్రమలన్నియు కుటీరస్థాయియందే నడుపబడుచుండెడివి. యంత్రనిర్మాణము ఆరంభముకాని ఆరోజులలో వృత్తులన్నియు చేతిపనులస్థాయిలోనే జరుగుచుండెను. సాలె, కమ్మరి, కుమ్మరి, కంసాలి, వడ్రంగి, చర్మకారుడు మున్నగువారు వస్తువులను గ్రామీణస్థాయియందే తయారుచేయుచుండిరి. వీటికిగల విపణియు నిర్ణీతము. కళాసమన్వితమైన చేతిపనులట్లుగాక నగరములయందు కేంద్రీకరింపబడి జాతీయస్థాయియందు నిర్మింపబడుచుండెడివి. నిజమునకు భారతీయ హస్తకళాఖండములు 18 వ శతాబ్దమువరకు అంతర్జాతీయ ఖ్యాతిని గడించుకొనియుండెను. ఢక్కామస్లినులు, కాశ్మీరు, పంజాబుల ఉన్నిబట్టలు, మీర్జాపూరు తివాచీలు రాజస్థానపు చలువరాతివస్తువులు, కేరళయందలి దంతపుపనులు, మైసూరునందలి చందనపు వస్తువులు, భారతదేశమున అనేకనగరములలో తయారగు పట్టుబట్టలు, ఈకోవకు చెందినవి.

కుటీరపరిశ్రమలు హస్తకళాఖండములు 19 వ. శతాబ్దములో బ్రిటిష్‌పాలనయందు భారతీయ హస్తకళాఖండములెట్లు క్షీణించినవో అర్థశాస్త్రచరిత్ర విద్యార్థులందరికి తెలియును. ఈక్షీణతకు కారణములు మూడు. (1) స్వదేశ రాజుల పరిపాలన మంతరించుటవలన కళాసమన్వితమైన ఈచేతిపనులకు గిరాకి,పోషణము సన్నగిల్లుట (2) బ్రిటిష్ హయాములో జాగృతినందుచున్న మధ్యతరగతి ప్రజానీకపు అపేక్ష హస్తకళాఖండములపైకంటె, వినియోగవస్తువుల పైననే ఎక్కువగానుండుట. (3) బ్రిటనులో యంత్రములపై తయారయిన అన్నిరకముల వస్తువులు క్రమక్రమముగా భారతదేశమున గ్రామగ్రామమున, వాడవాడన, అమ్ముడుపోవుట, ఏమైనను కటీరపరిశ్రమలయందలి వినియోగ వస్తువులవలె, కళాసమన్వితమైన చేతిపనులు పూర్తిగ క్షీణదశకు రాలేదు. హస్తకళాఖండములన్నియు స్వదేశీసంస్థానములలో నిలద్రొక్కుకొని స్వాతంత్ర్యానంతర సాంస్కృతిక పునరుజ్జీవనమున తిరిగి విదేశవిపణులలో అమ్ముడుపోవుచున్నవి. బిద్రీవస్తువులు, హిమ్రూబట్టలు, కలంకారీ పరిశ్రమ, ఏలూరు, వరంగల్లులతివాచీలు, కొండపల్లి నిర్మల్ ప్రాంతపు బొమ్మలు నర్సాపురపు లేసులు, ఆంధ్రప్రదేశపు హస్తకళాఖండములలో ఎన్నదగినవి.

ద్వితీయ, తృతీయ పంచవర్ష ప్రణాళికలలో వరుసగా 59 కోట్ల రూప్యములను, 8 కోట్ల రూప్యములను, భారత ప్రభుత్వము హస్తకళాఖండముల అభివృద్ధికై వెచ్చించినది. శ్రీమతి కమలాదేవిచటోపాధ్యాయ అధ్యక్షతకింద జాతీయ భారతస్థాయిలో ఏర్పాటుచేయబడిన సంస్థ వీటి ప్రగతికి తోడ్పడుచున్నది. ప్రణాళికలు అమలుజరుగు తరుణములో వీటిలభివృద్ధి ఇట్లున్నది. హెచ్చుజీవన పరిమాణములుగల విదేశములలో భారతీయ హస్తకళాఖండములకు గిరాకీ ఎక్కువ. ఇట్టి గిరాకిని ఇంకను ఎక్కువచేయుటకు అంతర్జాతీయ పారిశ్రామిక ప్రదర్శనములలో మన హస్తకళాఖండములు తోడ్పడుచున్నవి. వీటినాణ్యమును పెంపుచేయుటకు నాణ్యమును గుర్తించుపద్ధతి అమలుచేయబడుచున్నది. కౌశల్యముగల కళాకారులు ఉత్పత్తిచేయగల వస్తువులయొక్క గిరాకీ హెచ్చినంతమాత్రమున వీటిసరఫరా హఠాత్తుగా హెచ్చదు. శిక్షణమును, ఉత్పత్తిని దోహదముచేయు కేంద్రముల నేర్పాటుచేయుటద్వారా ఈసమస్య పరిష్కరింపబడుచున్నది. పారిశ్రామిక సహకారసంఘములు ఉత్పత్తి వసతులను, విపణివసతులను సమకూర్చుచున్నవి. రాష్ట్రప్రభుత్వములు, రిజర్వుబ్యాంకు, పరపతి అవసరములను సమకూర్చుచున్నవి. విదేశద్రవ్యమారకమును సమకూర్చగల హస్తకళాఖండముల ఉత్పత్తిని ప్రోత్సహించవలసిన అవసరమెంతయుగలదు.

కుటీరపరిశ్రమలు వినియోగవస్తువులు : గాంధీమహాత్ముని స్వదేశీఉద్యమమునాటినుండి, కుటీర, గ్రామీణ పరిశ్రమలకు భారతీయ ఆర్థికవిధానమున సముచితస్థానము లభించినది. నిరుద్యోగమును, అసమగ్రోద్యోగమును బాపుటకు వీటిని ప్రోత్సహించుటకంటె వేరొండు సాధనము లేదని

తెలిసికొనబడినది ఖాదీ, కొబ్బరిపీచువస్తువులు, నూనెగానుగలు, తోళ్ళపరిశ్రమ, కాగితము, తాటిబెల్లము, కంబళ్ళు, గొంగళ్ళు, తేనెపరిశ్రమ మున్నగు గ్రామీణపరిశ్రమల అభివృద్ధికై పథకములు ప్రథమపంచవర్ష ప్రణాళికలో పొందుపరుపబడినవి కుటీరపరిశ్రమలలో నెల్ల ముఖ్యమైన చేనేత పరిశ్రమయొక్క అభివృద్ధికి ప్రత్యేక పథకములు నిర్మింపబడినవి ఖాదీపరిశ్రమబోర్డు, గ్రామపరిశ్రమబోర్డు, చేనేతబోర్డు, సిల్కుబోర్డు, కొబ్బరిపీచు పరిశ్రమబోర్డు అను సంస్థలు జాతీయ స్థాయిలో స్థాపింపబడి పరిశ్రమాభివృద్ధికై క్రిందివిధముగా పాటుబడుచున్నవి (1) ఆయాపరిశ్రమల అభివృద్ధికి పథకములు తయారుచేయుట (2) పారిశ్రామికులకు శిక్షణము నొసంగుట (3) వస్త్రోత్పత్తికి పూనుకొనుట (4) పరికరములను, ముడిసరుకులను పారిశ్రామికులకు అందజేయుట (5) తయారైన వస్తువులను అమ్ముట (6) పరిశోధనకృషి మున్నగు విధులను నిర్వర్తించుట గ్రామీణ పారిశ్రామికులు ఏమాత్రమును మూలధనము లేనివారు సాహుకారులు హెచ్చువడ్డీపై ఇచ్చు అప్పులకు గ్రామీణులు ఎగబడినచో గ్రామపరిశ్రమలు అభివృద్ధి పొందనేరవు కావున పరపతి సమస్యను పరిష్కరించుటకై కుటీరపరిశ్రమలకు పారిశ్రామిక సహకార సంఘమొకటి స్థాపింపబడినది

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ఆరంభమగుటకు పూర్వము నియమింపబడిన "కార్వేకమిటీ" కుటీర పరిశ్రమాభివృద్ధికి సంబంధించిన ఆర్థికతత్త్వము నిట్లు పేర్కొనినది (1) నిరుద్యోగ-అసమగ్రోద్యోగములను పరిష్కరించుటకు ఇట్టి సంప్రదాయ వృత్తులను ప్రోత్సహించుటయే సాధనము (2) పెట్టుబడియు నైపుణ్యమును లేని శ్రామికులుగల మన సమాజములో వస్త్రోత్పత్తి పెరుగవలెననిన కుటీరపరిశ్రమలను ప్రోత్సహించుట ఎంతయు అవసరము (3) పరపతి సమస్యలను, విపణిసమస్యలను, పరిష్కరించుటకు సహాకారసంఘములు స్థాపింపబడవలెను (4) కుటీరపరిశ్రమలకు 'సబ్సిడీ'ల నొసంగుటకు ఖాదీపరిశ్రమలపై ఎక్సైజుపన్నులు వేయవలెను

కుటీరపరిశ్రమల అభివృద్ధికి ద్వితీయ, తృతీయ ప్రణాళికలలో వరుసగా 113 కోట్ల రూపాయలు, 136 కోట్ల రూపాయలు కేటాయింపబడినవి మిల్లుబట్టలపై విధింపబడిన సుంకము ఖాదీని ప్రోత్సహించుటకు ఉపయోగింపబడినది ఇట్లే నూనెమిల్లులపై వేసిన పన్నులు నూనెగానుగల నభివృద్ధి చేయుటకు వినియోగింపబడినది ఇంతేగాక ఖాదీ కుటీరపరిశ్రమల పరిధులు (ఉదా బట్టలు, నూనెపరిశ్రమలు) నిర్ణయింపబడినవి పారిశ్రామిక శైలములను ఖాదీపరిశ్రమలు ఉత్పత్తిచేయగా, ఆహారములో వాడబడు నూనెలను కుటీర పరిశ్రమలుత్పత్తిచేయుట ఇందుకు తార్కాణము

లఘుపరిశ్రమలు లఘు, కుటీరపరిశ్రమల నడుమగల తారతమ్యము నిట్లు వివరింపనగును (1) కుటీరపరిశ్రమలు ఆధునిక పరికరములను వాడవచ్చును, వాడకపోవచ్చును లఘుపరిశ్రమలు విధిగా ఆధునిక యంత్రపరికరములను వాడును (2) ఇట్లే విద్యుచ్ఛక్తి వినియోగముకూడ (3) పెట్టుబడి విషయముసకూడ లఘుపరిశ్రమలు కుటీర పరిశ్రమలకంటె ఎక్కువ పెట్టుబడిని కోరును

ప్రథమ ప్రణాళికా నిర్వహణకాలములో లఘుపరిశ్రమల పథకములిట్లున్నవి. (1) కేవలము ఆర్థిక కారణముల వలననే ఒక్కొక్కపరిశ్రమ ఒక్కొక్క స్థాయిలో అత్యున్నత ఆర్థికఫలితముల నిచ్చును లఘుపరిశ్రమ స్థాయిలో అధిక ఫలములనిచ్చు పరిశ్రమలలో జోళ్ళతయారీ ఒకటి. ఇట్టి పరిశ్రమ లన్నియు లఘుస్థాయిలోనే ప్రోత్సహింపబడును (2) ఖాదీపరిశ్రమలకు కావలసిన కొన్ని విడిభాగములను తయారుచేయుటలో లఘుపరిశ్రమలు మంచి ఆర్థికఫలితముల నొసగును ఈ సందర్భమున కూడ ఇట్టి పరిశ్రమలు లఘు స్థాయిలో ప్రోత్సహింపబడును వ్యవసాయ పరికరముల విడిభాగములు, సైకిలు విడిభాగములు ఇందుకు ఉదాహరణములు

పైని పేర్కొనబడిన కార్వేకమిటీ, లఘుపరిశ్రమల అభివృద్ధికి ఈ క్రింది సూచనలను చేసినది (1) పారిశ్రామిక వికేంద్రీకరణమును, లఘుపరిశ్రమలను పెద్ద పల్లెలయందును, చిన్న పట్టణములందును ఏర్పాటు చేయుటద్వారా సాధింపవచ్చును (2) ఇందుకు గ్రామసీమలలోనికి విద్యుచ్ఛక్తిని తీసికొని రావలెను (3) చిన్నతరగతి పారిశ్రామిక వేత్తకు తగిన ప్రోత్సాహమునిచ్చుటకై పారిశ్రామిక వాడలను స్థాపించుట మంచిపద్ధతి (4) పరపతి వసతులను సమకూర్చుటకై ఆర్థిక సంస్థలన్నియు ఒక సమగ్రవిధానము నవలంబించవలయును

ద్వితీయ ప్రణాళికలో 56 కోట్లు రూప్యములను లఘు పరిశ్రమల అభివృద్ధికి ప్రభుత్వము కేటాయించినది కార్వే

కమిటీ సూచన ననుసరించి పారిశ్రామికవాడలు స్థాపింపబడెను. ఫ్యాక్టరీ నిర్మాణమున కనువగు స్థలమును, విద్యుచ్ఛక్తిని, నీటిని రహదారి మున్నగు సౌకర్యములను చిన్న తరహా పారిశ్రామికవేత్తల కొనగుటయే పారిశ్రామికవాడను స్థాపించుటలోగల యుద్దేశము

లఘుపరిశ్రమల పరపతి అవసరములను ప్రభుత్వము తీర్చు విధానమిది (1) యంత్రసామగ్రిని కొనుట కవసరమైన అప్పులను రాష్ట్ర ఆర్థిక కార్పొరేషనులు మంజూరుచేయును (2) దీర్ఘకాలపు అప్పులను తక్కువ వడ్డీరేట్లకు రాష్ట్రప్రభుత్వము లొసగును (3) లఘుపరిశ్రమల వస్తువులకు విపణిని సమకూర్చుటలో కృషిచేయును (4) ముడిసరుకును సరఫరా చేయును. (5) మేలిరకపు ఉత్పత్తివిధానములను సాంకేతిక శిక్షణమును అందజేయును (6) ప్రభుత్వము కొనుగోలునందు లఘుపరిశ్రమల వస్తువులకు ప్రాధాన్యము నిచ్చును ఈ మొదలగు చర్యలద్వారా లఘుపరిశ్రమల అభివృద్ధికి ప్రభుత్వము పాటుబడుచున్నది

తృతీయ ప్రణాళికా కాలమునాటికి కుటీర పరిశ్రమల కంటె లఘుపరిశ్రమల కెక్కువ ప్రోత్సాహము నీయవలెనను భావము ప్రణాళికా నిర్మాతలలో బలపడినది. మూడవ ప్రణాళిక క్రింద 115 కోట్ల రూపాయలు ఇందుకు కేటాయింపబడినవి

ప్రణాళికా సంవత్సరములలో అనేక లఘుపరిశ్రమలు అభివృద్ధి పొందుట జరిగెను సైకిళ్ళు, కుట్టుమిషనులు, చిన్న యంత్రపరికరములు, విద్యుద్యంత్రములు, క్రీడాపరికరములు, తోళ్ళు ఈ సందర్భమున చెప్పదగినవి ఇవి విదేశ వ్యాపార రంగమునకూడ ప్రవేశించి విదేశ ద్రవ్యమారకమును సమకూర్చుచున్నవి

**భారీపరిశ్రమలు ఉపభోగ్యవస్తువులు** మనదేశపు ఉపభోగ్యవస్తు పరిశ్రమలలో ముఖ్యమైనవి వస్త్రములు, జనపనార, పంచదార, సిమెంటు, కాగితము మున్నగునవి

ప్రపంచములో బట్టలపరిశ్రమకు ఖ్యాతిగాంచిన ఐదు దేశములలో భారతదేశ మొకటి వీటిలో అమెరికా సంయుక్త రాష్ట్రములు రష్యా, ముడిప్రత్తికి లోటులేనివి జపాను ఇంగ్లండు దేశములు, బట్టలమిల్లులకు కావలసిన ముడిప్రత్తిని పూర్తిగా దిగుమతి చేసుకొనుచున్నవి ఇండియా ఈ రెండు పరిస్థితులకు మధ్యరకముగా తనకు కావలసిన ప్రత్తిలో కొంత భాగము పండించుకొనుచున్నది కొంతభాగము దిగుమతి చేసికొనుచున్నది 1850 లో బొంబాయి పరిసరములలో కేంద్రీకరింపబడిన భారతదేశీయ బట్టల పరిశ్రమ 1895 నుండి 1914 వరకు మంచి అభివృద్ధిని సాధించి, అరేబియా, పర్షియా, తూర్పు ఆఫ్రికాలలోకూడ విపణులను సంపాదించుకొన్నది భారతప్రభుత్వపు దేశీయ పరిశ్రమల రక్షణ విధానముక్రింద 1926 నుండి 1947 వరకు మరింత ప్రగతిని పొందిన ఈ పరిశ్రమ, చక్కని వికేంద్రీకరణను సాధించిన పరిశ్రమలలో నొకటి బొంబాయియేకాక అహమ్మదాబాదు, కాన్పూరు, నాగపూరు, షోలాపూరు, ఢిల్లీ, చెన్నపట్టణము ఈనాడు భారీఎత్తున బట్టలమిల్లులను కలిగియున్నవి ముడిప్రత్తికొరత, ఆధునిక యంత్రపరికరముల ఆవశ్యకత బట్టల పరిశ్రమకుగల ప్రస్తుత సమస్యలు దేశవిభజనమువలన ఎక్కువగా ప్రత్తిపండు భాగము పాకిస్థానునకు పోయినది 55 లక్షల బేళ్ళప్రత్తి భారతదేశమందలి మిల్లులకు కావలసియుండగా, ఇచ్చట 1948 లో 22 లక్షల బేళ్ళుమాత్రమే పండెను కాని ప్రణాళికా సంవత్సరములలో ఈ కొరత చాలవరకు తగ్గింపబడెను భారతదేశపు మిల్లుల యంత్రసామగ్రి ఆధునికము కాదు మరియు బట్టలపరిశ్రమ మరికొన్ని క్రొత్తసమస్యలను ఎదుర్కొనవలసిన అవసరము నాల్గవ ప్రణాళికా కాలము నాటికి కలిగినది. (1) విదేశ విపణులలో భారతదేశమునకు చైనా ప్రత్యర్థియగుచున్నది (2) ఆఫ్రికాదేశములవంటి వెనుకబడిన ప్రాంతములలోకూడ బట్టలమిల్లులు స్థాపింపబడుచున్నవి (3) నైలాను, టెర్లినులవంటి కృత్రిమ వస్త్రములకు గిరాకీ పెరుగుచున్నది (4) జపాను, ఇంగ్లండు, జర్మనీ, అమెరికా రష్యాలవంటి దేశములు మనకన్న చౌకగా వస్త్రముల నుత్పత్తి చేయుచున్నవి (5) పాకిస్థానముకూడ ఈ పరిశ్రమ నభివృద్ధి చేయుచున్నది ఏది ఎట్లున్నను ఆధునిక యంత్రములను వాడినపక్షమున భారతీయ పరిశ్రమలు పోటీకి నిలబడగల్గిన శక్తిని సంపాదించగలవు

భారతదేశమునందలి 113 జనపనార మిల్లులలో 101 పశ్చిమబెంగాలునందే గలవు. దేశవిభజనమువలన, ముడిసరకును చాలవరకు కోల్పోయిన పరిశ్రమలలో ముఖ్యమైనది జనపనార పరిశ్రమ ప్రణాళికా సంవత్సరములలో జనపనార పండు ప్రాంతము హెచ్చుచేయబడినది. భారతదేశపు మిల్లులకు కావలసిన 75 లక్షల బేళ్ళ జనపనారకు దేశవిభజనము

తర్వాత 50 లక్షల టేన్నులమాత్రమే ఈనాడు భారతదేశములో పండుచున్నది. సరకును నిలువచేయుటకు గోనెసంచులకు మారుగా ఇతరవస్తువులను వాడుచుండుట ఈ పరిశ్రమకు ఏర్పడిన గొప్పసమస్య. ఏమైనను ఉత్పత్తి ఖర్చులను తగ్గించుకొనినచో, పోటీకి నిలబడగలము. విదేశ ద్రవ్యమార్గముచే సంప్రాప్తించు వస్తువులలో ఎన్నదగినవి జనపనార వస్తువులే.

పంచదారమిల్లులు చెరకు పొలములకు దగ్గరలో నున్న అంతమంచిది. ఏలన, చెరకు నరికినతర్వాత పంచదారమిల్లులో వాటిని ఉపయోగించుటకు ఆలస్యము చేసినకొలది, చెరకునందలి తీపిదనము తగ్గిపోవుచుండును. కాని మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశములలో మేలిరకపు చెరకు పండుచుండగా, ఆధునికమైన మిల్లులు బీహారు, ఉత్తరప్రదేశములలో స్థాపింపబడుట జరిగినది. పంచదార ఉత్పత్తిఖర్చును తగ్గింపలేకపోవుటకు ఇది ఒక కారణము. పంచదారపాకములో మిగిలిన తెట్టునుపయోగించి మద్యపానీయముల నుత్పత్తి సాగించనగును. మద్యపానీయముల పరిశ్రమను అలక్ష్యము చేయుట పంచదార ధర పెరిగిపోవుటకు మరియొక కారణము. పైనవివరింపబడిన దేశీయపరిశ్రమల రక్షణవిధానము క్రింద 1932 నుండి 1950 వరకు పరిశ్రమకు రక్షణలభించినది. ప్రణాళికా సంవత్సరములలో మహారాష్ట్రమున అనేక సహకార పంచదారమిల్లులు స్థాపింపబడెను. ఈనాడు దేశములో పంచదారకొరత ఉన్నమాట నిజమే. కాని లేవనింగు విధానము చీకటిబజారునకు దారితీయరాదుకదా!

కంట్రోలు చేయబడుచున్న వస్తువులలో సిమెంటు ఒకటి. టారిఫ్ కమీషను నివేదికల ననుసరించి సిమెంటుధర నిర్ణయింపబడును. సిమెంటు పరిశ్రమను ఎ. సి. సి. మరియు డాల్మియా గ్రూపులు స్వాధీన మొనరించుకొన్నవి. ఏకహస్తగత ఉత్పత్తివలన ఉత్పత్తిఖర్చును తగ్గించుటకు ఈ కంపెనీలు కృషిచేయగల్గినవి. ప్రథమప్రణాళికారంభమున 23 లక్షల టన్నుల సిమెంటును ఉత్పత్తిచేసినయట్టి భారతదేశము తృతీయ ప్రణాళికాంతమునకు సంవత్సరమునకు ఒకకోటి టన్నుల నుత్పత్తి చేయుచున్నది.

తృతీయ ప్రణాళికారంభమునాటి లెక్కలప్రకారము భారతదేశమున 20 కాగితపు మిల్లులు కలవు. వంగ్లీ ప్రాంతము కాగితపు పరిశ్రమకు ముఖ్యకేంద్రము.

ఇనుము, ఉక్కు పరిశ్రమ, బొగ్గు, ఎరువులపరిశ్రమలు యంత్రపరికరముల తయారీ, భారతదేశపు ఉత్పాదకవస్తు పరిశ్రమలలో చెప్పుకొనదగినవి.

ఉత్పాదకవస్తు పరిశ్రమలలోనెల్ల అతి ముఖ్యమైనవి ఇనుము, ఉక్కు పరిశ్రమలు. భారతదేశములో దొరకునంత మంచి ఇనుము ప్రపంచమున మరెచ్చటను లభించుటలేదు. అత్యున్నత తరగతులకు చెందిన బొగ్గు పుష్కలముగా భారతదేశమున లభించకున్నను, ఇచ్చట ఇనుము, బొగ్గు పరిశ్రమకు కావలసినంత మేరకు లభించుచున్నది. జమ్‌షెడ్‌జీ టాటా కృషిఫలితముగా 1907 వ నే టాటా ఇనుము, ఉక్కుకంపెనీ జంషెడ్‌పూరులో స్థాపించబడినది. పైన వివరింపబడిన భారత ప్రభుత్వపు పారిశ్రామిక విధానమువలన రక్షణను పొందిన ఈ పరిశ్రమ 1924 నుండి 1947 వరకు మంచి అభివృద్ధిని సాధించగల్గెను. ఇండియన్ ఐరన్ అండ్-స్టీల్ కంపెనీ, భద్రావతీ స్టీల్ వర్క్సు అనునవి, ఈ పరిశ్రమకు చెందిన మరిరెండు కంపెనీలు. పైనచెప్పబడిన 24 సంవత్సరముల కాలములో విదేశములనుండి భారతదేశములోనికి వచ్చు ఇనుము, ఉక్కు లోహములపై వ్యాపారసుంకములు విధింపబడుటచే భారతీయ పరిశ్రమకు రక్షిత విపణి లభించినది. ప్రణాళికా సంవత్సరములలో భిలాయి, దుర్గాపూరు, రూర్కేలాలలో వరుసగా రష్యను, బ్రిటిషు, జర్మను ప్రభుత్వముల సహాయమువలన మూడు పెద్ద కర్మాగారములు వెలసినవి. ఇటీవల బొకారోలో, ఇతరత్ర మరికొన్ని కర్మాగారములను స్థాపించుచున్నారు. ఇవి అన్నియు మన ఆర్థిక వ్యవస్థకు వెన్నెముకల వంటివనియు ద్రవ్యోల్బణమునకు దారితీయుచున్నవనియు కొందరుఆర్థికవేత్తల అభిప్రాయము. కాని ప్రణాళికాబద్ధమైన పారిశ్రామిక ప్రగతి అవసరముల రీత్యా ఉపభోగ్యవస్తువుల పరిశ్రమలకు ప్రాతిపదిక ఇనుము-ఉక్కుపరిశ్రమ విస్తరణమంతే గలదు. ఇనుము, ఉక్కు సంపదము కొంతవరకు ప్రభుత్వము చేతులలో నున్నది. కంట్రోలు చేయబడిన వస్తువుల ధరలు ప్రభుత్వము నిర్ణయించుచుండగా కంట్రోలు చేయబడని వస్తువుల ధరలు ఈ పరిశ్రమయందలి ప్రతినిధి సంఘములవలన నిర్ణయింపబడుచున్నవి.

తరువాత ఎన్నదగిన పరిశ్రమ బొగ్గుపరిశ్రమ. బీహారులో, పశ్చిమబెంగాలులో, మధ్యప్రదేశములో, ఆంధ్రప్రదేశములో బొగ్గుగనులు గలవు. బీహారులోని రాణిగంజ్ ఝరియా

బొగ్గుగనుల నుండియే 80 శాతము బొగ్గు దొరుకుచున్నది ఆంధ్రప్రదేశము నందలి సింగరేణి బొగ్గుగనులు ఎన్నదగినవి మూడవ ప్రణాళికాంతమునకు (1965-66) 9 కోట్ల 70 లక్షల టన్నులు అవసరమగునని అంచనా వేసినది రెండవప్రణాళిక అవసరముల కంటె ఇది 8 కోట్ల 70 లక్షల టన్నులు హెచ్చు

భారతీయులు సాధింప పూనుకొన్న వ్యవసాయ విప్లవము, ఆనకట్టలు, విద్యుచ్ఛక్తి, ఎరువులు అను మూడు కీలకవస్తువులపై ఆధారపడి యున్నది ఇచ్చటి ఎరువుల పరిశ్రమ మొదటి ప్రణాళికా కాలములోనే ఆరంభమైనది బీహారులోని సింద్రీ ఎరువుల కర్మాగారము మొదటి కర్మాగారము తరువాత నన్‌గల్ వద్ద మరియొకటి స్థాపింపబడినది రూర్కెలాలోని కర్మాగారము ఇంకను పూర్తి ఉత్పత్తిని సాధించలేదు గోరక్‌పూర్, నైవేలీ, విశాఖపట్టణము, కొత్తగూడెము కర్మాగారములలో ఇంకను ఉత్పత్తి ఆరంభింపబడవలసి యున్నది ఎరువులధర, పంపకము-ఈ రెండును ఒక ప్రభుత్వసంస్థచే అదుపు చేయబడుచున్నవి

యంత్రపరికరముల పరిశ్రమ చాల ముఖ్యమైనది బెంగుళూరు, అంబర్‌నాథ్, హైదరాబాదులలో ప్రభుత్వ కర్మాగారములు కలవు ఇందు బెంగుళూరులోని హిందూస్థాన్ యంత్ర పరికరముల కర్మాగారము చాల ముఖ్యమైనది, ఈసంస్థ స్వయముగ సంపాదించిన లాభములనుండి పెట్టుబడి పెట్టి మరియొక కర్మాగారమును స్థాపింపగల్గుట ఒకవిశేషము. ప్రయివేటు రంగమునగల 27 కర్మాగారములలోను పెక్కులు మహారాష్ట్రమున నున్నవి లఘుపరిశ్రమ స్థాయిలో పంజాబు నందు ఇట్టి కర్మాగారములు కలవు పది సంవత్సరములలోగా యంత్ర పరికరముల విషయమున భారతదేశము స్వయం సమృద్ధిని సాధింపగలదని ప్రణాళికా రచయితలు ఆశించుచున్నారు

సూ. కృ. శా

## భారతదేశపు శీతోష్ణస్థితి

భారతదేశపు శీతోష్ణస్థితి వివిధ ప్రాంతములలో వివిధ రీతులుగా నుండును రాజస్థానము వంటి ప్రదేశములలో వర్షములు సంవత్సరమునకు 12 సెంటిమీటర్లు మాత్రమే కురియును తూర్పు, పశ్చిమప్రాంతములలోను, అస్సాములోను సంవత్సరమునకు 1000 సెంటిమీటర్ల చొప్పున ఘటిల్లును. పంజాబులో వేసవి అత్యుష్ణముగను (అనగా 42° సెంటిగ్రేడు), శీతాకాలము అత్యంత శీతలముగను (అనగా 20° సెంటిగ్రేడు) ఉండును కేరళ ప్రాంతములో సంవత్సరము పొడవున ఒకే విధమైన సమశీతోష్ణస్థితి ప్రవర్తిల్లుచున్నది ఇవి భారత దేశపు శీతోష్ణస్థితియందలి ముఖ్యాంశములు

ఉత్తర భారతసరిహద్దున హిమాలయ పర్వతపంక్తులు పశ్చిమమునుండి తూర్పునకు 2400 కిలోమీటర్ల పొడవున వ్యాపించియున్నవి అస్సాం, బల్మా ప్రాంతములలో 3-4 వేల మీటర్ల ఎత్తునన్నున్న పీఠభూమియు, దక్షిణముననున్న తూర్పు పశ్చిమ కనుమలును, నీలగిరి ప్రాంతములోని ఎత్తయిన పీఠభూమియు, భారతదేశపు శీతోష్ణస్థితిపై అత్యధిక ప్రభావమును ప్రసరింపజేయుచున్నవి ఉత్తర హిందూస్థానము నందలి పర్వతప్రాంతములకును, దక్షిణ హిందుస్థానమునందలి పర్వతప్రాంతములకును నడుమ వివిధ ఋతువులయందు ఉష్ణోగ్రతలోను, వర్షపాతములోను అధికవ్యత్యాసము కనిపించుచుండును

భారతదేశపు శీతోష్ణస్థితి ముఖ్యముగా నైరృతి, ఈశాన్య వ్యాపార పవనములపై ఆధారపడి యున్నది జూనునుండి సెప్టెంబరువరకు నైరృతి పవనములును, డిసెంబరునుండి ఫిబ్రవరివరకు ఈశాన్యపవనములును వీచుచుండును దేశమునందు ముఖ్య వర్షపాతము నైరృతి ఋతుపవనముల వలన కల్గుచుండును

**ఋతువులు, శీతోష్ణస్థితి :**

**(అ) శీతాకాలము** (డిసెంబరునుండి ఫిబ్రవరివరకు) శీతలవాయువులు మొదట వాయవ్యభాగమునందు అక్టోబరు నెలలో మొదలై డిసెంబరునెల తుదివరకు దేశమంతటను వ్యాపించును. ఈ కాలములో ముఖ్యముగా అతి శీతల వాయువులు, పొడిగాలులు దేశమంతటను విస్తరించుచుండును

రాత్రులకు పగళ్ళకు నడుమ ఉష్ణోగ్రతయందలి వ్యత్యాసము ఉత్తరభారతదేశమందు విశేషముగ నుండును దక్షిణమునకు పోయినకొలది అది క్రమముగా తగ్గుచుండును సముద్రతీరములో ఈ వ్యత్యాసము చాల తక్కువగను, గాఢమైన పొడిగాలులు వీచు ప్రాంతములలో-అనగా ఎడారి ప్రాంతములలో-చాల ఎక్కువగను ఉండును

ఈ కాలములో వర్షపాతము, మధ్యధరా సముద్ర ప్రాంతమునుండి బయలుదేరి, తూర్పుగా పయనించి, ఉత్తర

హిందుస్థానమునకు వచ్చు సుడిగాలులమూలమున ముఖ్యముగా కలుగుచున్నది వీటిని "పశ్చిమ సంక్షోభములు" అనియందురు జనవరి ఫిబ్రవరి నెలలలో ఈ సుడిగాలులు నాలుగు ఆరు పర్యాయములుగా ఘటిల్లుచుండును ఈ సుడిగాలులు సముద్ర ప్రాంతములందలి తేమగాలులను ముందునకు త్రోయుచు వర్షములను కలుగజేయును ఇవి ఉత్తరప్రాంతమందలి శీతలవాయువులను వెనుకభాగమునుండి దక్షిణమునకు తీక్ష్ణముగ ప్రసరింపజేయుచు, ఉత్తర హిందుస్థానమునందలి శీతల వాయువులను దక్షిణప్రాంతమువారికి అప్పుడప్పుడు రుచి చూపించుచుండును

భారతదేశపు దక్షిణాగ్ర ప్రాంతమునందు కూడ ఒక మాదిరి సుడిగాలులు తూర్పునుండి పడమరకు వీచుచు, దక్షిణ ప్రాంతీయులకు వర్షపాతము కలుగజేయుచుండును మద్రాసు తీరప్రాంతమునందు వీటివలన సుమారు 25 సెం. మీటర్ల వర్షపాతము కలుగును; మైసూరు ప్రాంతములందు కూడ 2-8 సెంటిమీటర్ల వర్షము కురియును

హిమాలయ పర్వతప్రాంతములో సంభవించు అత్యధిక హిమపాతమువలన, అచ్చట ఉద్భవించు నదులు ఎల్లప్పుడు జలసమృద్ధములై ప్రవహించుచుండును ఉత్తరహిందుస్థానములో శీతకాలపుపంటలు ఈనదీజలములపైనే ఆధారపడియుండును.

(ఆ) వేసవికాలము (మార్చినుండి మే వరకు) ఈ కాలములో దేశమంతయు అధిక ఉష్ణోగ్రతను చవిచూచుచుండును మార్చి నుండి జూను నెల 21 వ తేదీవరకు సూర్యుడు ఉత్తరమునకు పయనించుటవలన, వేసవితీక్ష్ణ్యముకూడ దక్షిణము నుండి ఉత్తరప్రాంతమునకు పయనించుచుండును దక్కను పీఠభూమియందు మార్చినెలలో సగటున 38° వరకు ఉష్ణోగ్రత జనించును దేశమధ్యమున ఏప్రిలు నెలలో, ఎండలు తీక్ష్ణముగ నుండును ఉత్తరహిందూస్థానములో మే నెలయందు ఎండలు తీవ్రముగ నుండును. వాయవ్య భాగమునందలి ఎడారిప్రాంతమందు అప్పుడప్పుడు ఎండలు 48° వరకు కాయుచుండును, ఇందువలన వాయుపీడనశక్తి వాయవ్యమునందలి ఎడారిప్రాంతములో చాల తక్కువగ నుండును తూర్పునకు పోయినకొలది (అచ్చటి ఉష్ణోగ్రత తగ్గుటవలన) వాయుపీడన శక్తి హెచ్చుచుండును. ఈపీడనశక్తియందలి వ్యత్యాసము కారణముగా, ఒకవిధమైన సుడిగాలి జనించి, తీరప్రాంతమందలి తడిగాలులను దేశాంతర్భాగములోనికి వ్యాపింపజేయును ఇట్లు తీరప్రాంతమందలి తడిగాలుల యొక్కయు, ఉత్తరప్రాంతమందలి పొడిగాలుల యొక్కయు కలయికవలన మేఘములతో, ఉరుములతో, మెరుపులతో, పెద్దపెద్ద వడగండ్లతో కూడిన వర్షములు అప్పుడప్పుడు పడుచుండును ఇట్టి సమయమందు ఉత్తరభారతమునుండి వీచుచల్లని వాయువులు క్రిందికి దిగి ప్రచండముగ వీచుచుండును ఈ వాయువులు ఉత్తరహిందుస్థానములో "కాలబైశాఖి" అని యందురు వీటివలన దేశమునందు వివిధప్రాంతములలో వర్షపు జల్లులు, ఇసుకలేక దుమ్ము తుపానులు కల్గుచుండును

ఏప్రిల్, మే నెలలలో 10-14 అక్షాంశ ప్రాంతమందు బంగాళాఖాతములో సుడిగాలులు పుట్టి, అప్పుడప్పుడు దేశాంతర్భాగములోనికి వీచుటకూడ సంభవించుచుండును

ఈ కాలమున వాయవ్య ప్రాంతములోను, మధ్యప్రదేశమునందును వర్షము సగటున 2-8 సెంటిమీటర్ల ప్రమాణమునను, బెంగాలు, అస్సాము రాష్ట్రములలో 50 సెంటిమీటర్లపైగాను కేరళరాష్ట్రములో సుమారు 25 సెంటిమీటర్ల ప్రమాణమునను కురియును.

(ఇ) వర్షాకాలము (జూనునుండి సెప్టెంబరువరకు) - మార్చి నుండి జూన్ నెల వరకు సూర్యుడు దక్షిణమునుండి ఉత్తరమునకు ప్రయాణించు చుండును అందువలన ఉష్ణోగ్రతయొక్క కేంద్రీకరణము కూడ దక్షిణమునుండి ఉత్తరమునకు మారుచుండును అందువలన వాయుపీడనాభావ కేంద్రము కూడ ఉత్తరదిశకే జరుగుచుండును తత్ఫలితముగా భూమధ్య భాగమునకు దక్షిణప్రాంతమునందు ఆగ్నేయముగా వీచు వాయువులు, భూమధ్యరేఖను దాటి ఉత్తరమునకు వచ్చి నైరృతిపవనములుగా మారి, దేశమంగంతట వ్యాపించును ఇవి మొదట కేరళప్రాంతమునకు తగిలి, రానురాను దేశమందంతటను విస్తరించును జులై 15 వ తేదీనాటికి వాయువులు వాయవ్య ప్రాంతమునకు చేరును

ఈగాలులు తీసికొనివచ్చు తేమవలన దేశమందంతట వర్షము లుద్భవించి ఉష్ణోగ్రత తగ్గుముఖము పట్టుచుండును ఈ కాలములో రాత్రులకు పగళ్లకు నడుమగల ఉష్ణోగ్రతా వ్యత్యాసము చాల తక్కువగ నుండును.

ఈ గాలులవలన కలుగు వర్షములు పర్వత పంక్తుల మీద కొంతవరకు ఆధారపడియుండును పశ్చిమతీరమందలి

పర్వతపంక్తుల ప్రభావముచే అచ్చట కుంభవృష్టి కల్గును అచ్చటినుండి బయలుదేరు గాలులు తూర్పునకు వచ్చి, తూర్పు కనుమలమీద వర్షమును కలుగజేసి, ఈశాన్య ముఖముగా బంగాళాఖాతముపై పయనించి, అక్కడి తేమనుగూడ సేకరించుకొని అస్సాము కొండలపై కుంభవృష్టిని కలుగజేయును. ఆ గాలులు ఉత్తరమునున్న హిమాలయ పర్వతపంక్తుల ప్రభావము వలన పశ్చిమదిశకు మరలి బీహారునకును, ఉత్తరప్రదేశమునకును, హిమాచల ప్రదేశమునకును, వాయవ్య ప్రాంతమునకును, వర్షమును కలుగజేయును ఈ గాలులు ఇట్లు పశ్చిమముగా మరలుటకు మరియొక కారణను కూడ కలదు ఈ కాలములో వాయుపీడనా భావము థార్ ఎడారి ప్రాంతమందు కేంద్రీభూతమై యుండును అందువలన ఈ గాలులు ఆ కేంద్రము చుట్టును తిరుగుటకు ప్రయత్నించుటలో పశ్చిమ దిశాభిముఖముగా వీచుచుండును.

ఈ కాలములో దేశమందలి వర్షపాతము ముఖ్యముగా బంగాళాఖాతమునందు పుట్టు వాయుగుండములమీద ఆధారపడియుండును ఈ వాయుగుండములు పశ్చిమమునకు పయనించి, వాటి పరిసరప్రాంతమునకు వర్షమును కలుగజేయుచుండును. ఈ వాయుగుండములు అతి తీవ్రముగా నున్న యెడల, పరిమితప్రాంతములో గూడ వర్షముకలిగి, తక్కిన భూభాగములో వర్షాభావ మేర్పడును అట్లుకాక, ఈ వాయుగుండములు సాధారణమైన వయినచో, దేశమందలి విశేషభాగమునకు మధ్యమస్థాయిలో సమమైన వర్షపతనము ఘటిల్లును ఒక్కొక్కప్పుడు ఇవి అస్సాముదిశగా కొంతవరకు పయనించిన యెడల, వీటికి పశ్చిమముఖముగా వీచు శక్తి తగ్గిపోవును అట్టికళలో వర్షమంతయు అస్సాములోనే పడి తక్కిన దేశప్రాంతములో వర్షాభావము సంభవించి, తన్మూలమున కరువు కాటకము లేర్పడవచ్చును

ఈ కాలములో పశ్చిమతీర ప్రాంతమందు 75 సెంటిమీటర్ల వర్షపతనమును, పర్వతప్రాంతమందు 125 సెంటిమీటర్ల వర్షపతనమును సంభవించును పడమటి కనుమలకు తూర్పువైపున 16 అక్షాంశములు దక్షిణముగా వర్షములు చాల తక్కువగా కురియును. వాటికి ఉత్తరముగా 40-50 సెంటిమీటర్ల వర్షమును, ఉత్తర హిందూస్థానములో బెంగాలు రాష్ట్రమందు 40-50 సెంటిమీటర్ల వర్షమును కురియును అచ్చటినుండి పశ్చిమమునకు పోనుపోను వర్షపతనము తగ్గుచు రాజస్థానములో 15 సెంటి మీటర్లు మాత్రమే కురియును అస్సాము రాష్ట్రములో కుంభవృష్టి కురియునని వేరుగా చెప్పనవసరము లేదుకదా! సెప్టెంబరు వచ్చునరికి వర్షములు క్రమముగా తగ్గుచుండును

**ఈశాన్య ఋతుపవన కాలము (అక్టోబరు - నవంబరు)**

అక్టోబరునెల వచ్చునరికి థార్ ప్రాంతమునందు కేంద్రీకృతమైన వాయుపీడనా భావము అదృశ్యమై, అచ్చటకూడ వాయుపీడనము హెచ్చ నారంభించును అందువలన ఈ వాయువులకు పశ్చిమదిశగా వీచు శక్తి క్షీణించును ఇప్పుడు ఈశాన్యమునుండి వాయువులు బయలుదేరి నైరృతివైపునకు వీచుటకు మొదలిడును అంతవరకు దేశముమీద ఆవరించిన తడి, పొడిగాలుల మూలమున పైకిలేచి మేఘములు వర్షములు కల్గును ఇట్టి వర్షములు ముఖ్యముగా దక్షిణ ప్రాంతమునసే అధికముగా కల్గును ఉత్తర ప్రాంతమంతయు పొడిగాలులచేత ఆవరింపబడి యుండును

ఈ గాలులవలన దక్షిణ కేరళప్రాంతములో 25-30 సెంటిమీటర్ల వర్షము ఉత్తరభారతములో 2-3 సెంటిమీటర్ల వర్షము మాత్రమే ఘటిల్లును

వాయుగుండములు శీతకాలములో ఉత్తర హిందూస్థానమునందు పశ్చిమమునుండి తూర్పునకు పయనించు వాయుగుండమును గురించి తెలిసికొని యుంటిమి ఇంతకంటె, తీవ్రతరమగు వాయుగుండములు ఏప్రిలు, మే, ప్రాంతములోను, అక్టోబరు, నవంబరు ప్రాంతములోను బంగాళాఖాతమునందుద్భవించి, పశ్చిమ దిశగా దక్షిణ భారత దేశము మీదుగా పయనించి, కుంభవృష్టిని, అతిభయంకరములగు వాయువులను కలుగజేయును వీటివలన వరదలేర్పడును ఒక్కొక్కప్పుడు 20-30 అడుగుల ఎత్తువరకు సముద్రము పొంగి, తీరప్రాంతమునకు తీరని నష్టము ఘటిల్లును ఈ వాయుగుండములు ఏప్రిల్, మే నెలలో నగటున ఒకటియు, అక్టోబరు, నవంబరు నెలలలో రెండుమూడును ఏర్పడును ఆరేబియా సముద్రములోకూడ ఇట్టి వాయుగుండము లేర్పడును కాని, అవి కొంతవరకు తక్కువసంఖ్యలో నుండును.

టి. ఎస్ ఎస్ ఆం

## భారతదేశపు సినిమారంగము

ప్రపంచమందు అధికసంఖ్యలో చిత్రములను నిర్మించు మూడు దేశములలో భారతదేశ మొకటి. తక్కినవి రెండును

దేశములు అమెరికా జపానులు. సంవత్సరమునకు సగటున భారతదేశములో వివిధ భాషలందు మొత్తము 500 చిత్రముల వరకు తయారగుచున్నవి

బొంబాయి మద్రాసు, కలకత్తా నగరములు భారతదేశమందలి ప్రధాన చిత్రనిర్మాణ కేంద్రములు వీటికి తోడుగా, పూనా, కొల్హాపూరు, కోయంబత్తూరు, సేలం, ఆలెప్పి, తిరువనంతపురం, మైసూరు, హైదరాబాదు మొదలైన నగరములలో చిత్రనిర్మాణమునకు కుపకరించు ఫిల్ము స్టూడియోలున్నవి

ఈనాడు భారతదేశములో సుమారు ఎనుబది ఫిల్ము స్టూడియోలు, సలుబదిరెండు ప్రాసెసింగు లేబరేటరీలును కలవు అంతర్జాతీయ ప్రాముఖ్యమును పొందిన అమెరికాలో పదునైదు ఫిల్ముస్టూడియోలును, బ్రిటనులో యిరువదియును గలవు సంఖ్యాపరముగ భారతదేశమందలి స్టూడియోలు హెచ్చుగా యున్నను, పరిమాణమందును, యంత్రపరికరముల విషయమునను భారతీయ ఫిల్ము స్టూడియోలు అమెరికా, బ్రిటను స్టూడియోలతో పోటీకి నిలువజాలవు హాలీవుడ్‌లోని ఫిల్ము స్టూడియో సంవత్సరమునకు సగటున నలుబది చిత్రములను నిర్మించుచుండగా, భారతదేశమందలి ఫిల్ముస్టూడియో సగటున అయిదు చిత్రములను మాత్రమే తయారు చేయగలుగుచున్నది అమెరికాలో ఉన్న పదునైదు ఫిల్ము స్టూడియోలలో 500 పైగా 'సౌండ్ స్టేజీలు' ఉండగా, భారతదేశమందలి ఎనుబది స్టూడియోలలో 165 సౌండ్ స్టేజీలు మాత్రమే ఉన్నవి ఇవికూడ వైశాల్యమున చాల చిన్నవి భారతదేశములోని సగటు సౌండ్ స్టేజి 6800 చదరపు టడుగుల వైశాల్యము కలది అమెరికాలోని 'సౌండ్ స్టేజి' దీనికి మూడింతలుండును

భారతదేశమందలి ఫిల్ము స్టూడియోలలోని యంత్ర పరికరములు పాశ్చాత్య దేశములలోని ఫిల్ము స్టూడియోలలో ఉపయోగింపబడెడి యంత్రపరికరములతో దీటురాలేవు వీటిని భారతదేశములో తయారు చేసికొనుటకు వీలులేక పాశ్చాత్య దేశములనుండి తెప్పించుకొనుచున్నారు అందుచే ఇచ్చట తయారగు చిత్రములు సాంకేతిక శాస్త్రరీత్యా, పాశ్చాత్య చిత్రములతో పోటీకి ఆగలేవు

చిత్రనిర్మాణ రంగమందు భారతదేశములో ఈనాడు ఛాయాగ్రాహకులు శబ్దగ్రాహకులు, కూర్పుదారులు, శిల్ప దర్శకులు, లేబరేటరీ పనివారు, సంగీత దర్శకులు, చిత్ర దర్శకులు మొదలగు సాంకేతిక శాస్త్రజ్ఞులు సుమారు ఒక లక్షమంది వరకు పనిచేయుచున్నారు ఫిల్ము స్టూడియోలలో పనిచేయు సాంకేతిక శాస్త్రజ్ఞులలో ఛాయాగ్రాహకులు, శబ్దగ్రాహకులు నెలజీతములుగా పెద్దమొత్తములను స్వీకరించుచుందురు ఈ శాస్త్రజ్ఞులకు ప్రభుత్వామోదము బడసిన 'డిప్లొమాలు' లేవు. వీరందరు అనుభవమను విద్యాలయములో శిక్షణపొందిన వారని చెప్పవచ్చును కొన్ని సంవత్సరముల క్రితమే భారతప్రభుత్వము పూనాలో ఫిల్ము ఇన్‌స్టిట్యూటును నెలకొల్పినది దీనిలో దర్శకత్వము ఛాయాగ్రహణము, శబ్దగ్రహణము, కూర్పు, స్క్రీన్ ప్లే రచన, ఫిల్ము నటన మొదలైన విషయములలో విద్యార్థులకు తర్ఫీదు ఒసగబడు చున్నది ఈ సంస్థలో డిప్లొమాలను సంపాదించువారికే స్టూడియోలలో ఉద్యోగము లియ్యవలెనను నిబంధన యుండుటచే వీరిపరిస్థితి ఈనాడు శోచనీయముగ నున్నది అయినను ప్రభుత్వ యాజమాన్యమున నిర్వహింపబడుచున్న ఫిలిము డివిజనులో డిప్లొమాలు లేనివారికిగాడ సముచితమైన పనులు కొంతవరకు లభ్యమగుట హర్షణీయమగు విషయము

భారతదేశమందలి ఫిల్ము స్టూడియోలన్నియు వ్యాపారస్థుల చేతులలో నున్నవి వీటి కవసరమగు పెట్టుబడి యంతయు భారతీయులే సమకూర్చుచున్నారు ఈదేశపు పెట్టుబడి యేమాత్రము భారతదేశ సినిమాపరిశ్రమకు లభించుటలేదు భారత ఫిల్ముస్టూడియోలమీద, లేబరేటరీలమీద, పన్నెండుకోట్ల రూపాయలను, థియేటర్లమీద మున్నూటయైదు కోట్ల రూపాయలును, చిత్రనిర్మాణములమీద, పంపిణీ శాఖమీద నలుబదికోట్ల రూపాయలు పెట్టుబడికి వెచ్చింపబడినవని లెక్కలవలన తెలియుచున్నది

రోజువారీ పద్ధతిమీద ఫిల్ముస్టూడియో చిత్రనిర్మాతకు బాడుగకియ్యబడును ఎనిమిదిగంటల కాలపరిమితికి సంబంధించిన "రోజువారీ కాల్‌షీటు"నకు రూ 800/–ల నుండి రు 1000/–ల వరకు స్టూడియో పుచ్చుకొనుచుండును సరఫరా చేయబడు యంత్రసామగ్రిపైనను, సమకూర్చబడు ఇతర సదుపాయములపైనను, యీ అద్దె ఆధారపడి యుండును

చిత్రనిర్మాణమునకు వలయు ముడిఫిల్ము భారతదేశమునకు విదేశములనుండి వచ్చుచున్నది అమెరికా, బ్రిటను, బెల్జియమ్, జర్మనీ, జపాను, రష్యా, మున్నగు దేశములు

ఈ ముడిఫిల్మును భారతదేశమునకు సరఫరాచేయుచున్నవి. ఈ ముడిఫిల్ము మూడురకములుగా నుండును 1 పిక్చర్ నెగెటివ్, 2 సౌండ్ నెగెటివ్, 3 పాజిటివ్. బొమ్మను తీసికొనుటకు పిక్చర్ నెగెటివును, శబ్దమును గ్రహించుటకు సౌండ్ నెగెటివును వాడెదరు. ఈ రెండింటిని కలిపి ముద్రించుటకు 'పాజిటివ్' ఉపయోగింపబడును. ప్రతిసంవత్సరము భారతదేశము విదేశములనుండి సుమారు రెండున్నర కోట్ల అడుగుల ముడిఫిల్మును దిగుమతిచేసికొనుచున్నది. గినిభగేదు సుమారు మూడుకోట్ల రూపాయలు. దీనిమీద భారతప్రభుత్వము దిగుమతిసుంకమును విధించుచున్నది.

క్రమముగా భారతదేశమందలి చిత్రనిర్మాతలసంఖ్య పెరుగుచుండుటచే, విదేశములనుండి వచ్చు ముడిఫిల్ము సరిపోవుటలేదు. అదియునుగాక, విదేశీమారకపు ద్రవ్యమును ఈ ముడిఫిల్ముమీద విశేషముగా వెచ్చింపవలసి వచ్చుచున్నది. అందుచే భారతప్రభుత్వము ఫ్రాన్సుదేశమందలి ఒకసంస్థతో చేతులుకలిపి స్వీయావసరములకు కావలసిన ముడిఫిల్మును దేశమునందే తయారుచేయుటకొరకు పథకమును రూపొందించినది. ఈపథకము ననుసరించి ఉదకమండలములో ముడిఫిల్ము ఉత్పత్తి యంత్రాగారము నెలకొల్పబడినది. కొద్దికాలములోనే దీనినుండి ముడిఫిల్ము ఉత్పత్తియై చిత్రనిర్మాణము నిరాటంకముగా కొనసాగుటకవకాశమేర్పడగలదు.

భారతీయ చిత్రనిర్మాణ పరిశ్రమలో మూడుశాఖలున్నవి 1 నిర్మాణశాఖ 2 పంపిణీశాఖ 3 ప్రదర్శనశాఖ. ఈ మూడుశాఖల అధిపతులను వరుసక్రమములో ప్రొడ్యూసరు, డిస్ట్రిబ్యూటరు, ఎగ్జిబిటరు అనబడుదురు. భారతదేశములో ఈనాడు సుమారు 600 వరకు చిత్రనిర్మాణసంస్థలు కలవు. పంపిణీశాఖలు 550 వరకున్నవి. చిత్రప్రదర్శనశాలలు 5000 వరకున్నవి. వీటిలో 40 లక్షలమంది ప్రేక్షకులు కూర్చుండుటకు వసతి కలదు.

భారతదేశమందలి చిత్రనిర్మాతలు స్వయముగా పెట్టుబడిదారులుకారు. వీరు ఎక్కువగా వడ్డీపై వ్యాపారస్థులవద్ద ఋణములు తెచ్చి చిత్రములను తీయుచుందురు. హిందీచిత్రమునకు సగటున అరువదిలక్షల రూపాయలు వ్యయమగును. బెంగాలీ, తమిళ, తెలుగుచిత్రములకు నొక్కొక్కదానికి పదిలక్షల రూపాయలు కావలెను.

చిత్రములు ముఖ్యముగా నాలుగువిధములు 1 పౌరాణికములు 2 చారిత్రికములు 3 జానపదములు 4 సాంఘికములు. సాధారణముగా పౌరాణిక చిత్రములకు తక్కిన మూడింటికంటె వ్యయము హెచ్చగును.

చిత్రనిర్మాణశాఖ, పంపిణీశాఖ, ప్రదర్శనశాఖల నడుమ అవినాభావ సంబంధమున్నది. చిత్రము నిర్మాణదశలోనున్నప్పుడే పంపిణీదారును, ప్రదర్శనశాల యజమానియు ఆర్థికముగా చిత్రనిర్మాతకు తోడ్పడుచుందురు. వీరినడుమ ఒడంబడికలు జరుగుచుండును. వీటిననుసరించి ఇచ్చిపుచ్చుకోలు నడచుచుండును. పంపిణీదారు ఒక్కొక్క చిత్రమునకు నిర్మాతకు అయిదారు లక్షల రూప్యములకొరకు ఇచ్చుచుండును. చిత్రమును పంపిణీ చేయుటకు అతడు నూటికి 15 రూప్యములు కమీషను పుచ్చుకొనును. పంపిణీదారు చిత్రప్రదర్శనశాల యజమానునివద్ద ప్రతిచిత్రమునకు కనీసపు పూచీ పుచ్చుకొనును. దీనిననుసరించి ప్రదర్శనశాల యజమానుడు ఒక చిత్రమునకు లాభమువచ్చినను, నష్టమున్నను, దానిని కొన్ని వారములవరకు ప్రదర్శింపవలెను.

చిత్ర నిర్మాణమందు నిర్మాత, దర్శకుడు, నటీనటులు, కూర్పుదారుడు, ఛాయాగ్రాహకుడు, శబ్దగ్రాహకుడు, శిల్పదర్శకుడు, లేబరేటరీ సాంకేతిక శాస్త్రజ్ఞుడు, సమష్టిగా కృషిచేయవలసినవారై యుందురు. చిత్రము బయటకు వచ్చినపిమ్మట, పంపిణీదారు, చిత్రప్రదర్శనశాల యజమానుడు నిర్మాతతో సహకరించిననేగాని చిత్రము వ్యాపారరీత్యా విజయమును సాధించుటకు సాధ్యపడదు. ఒక చిత్రమును ఉత్పత్తిచేయుటకు పదిలక్షల రూప్యములు వ్యయమగునప్పుడు దానిమూలమున నలుబదిలక్షలు వసూలైనప్పుడే నిర్మాత వెచ్చించిన పెట్టుబడిధనము తనచేతిలోనికి వచ్చును.

చిత్రనిర్మాతలు పెద్దపెట్టుబడిదారుల చేతులలో చిక్కుకొనకుండా భారతప్రభుత్వము స్వల్పవడ్డీమీద అప్పులిచ్చు ఒకసంస్థను వాడుకలోనికి తెచ్చినది. దీనిపేరు "ఫిలిం ఫైనాన్సు కార్పొరేషన్", దీని నిబంధనములు కఠినముగా నుండుటచే, చిన్నచిన్న చిత్రనిర్మాతలు ఈ సంస్థవలన ఎట్టిసహాయమును పొందలేకున్నారు. రేడియో, ఉపన్యాసవేదిక, వార్తాపత్రిక మొదలైన ఆధునిక ప్రచార సాధనములకంటె గురుతరమైన సినిమాను సవ్యమైన మార్గములో నడిపించుటకు కేంద్ర, ప్రాంతీయ ఫిలిమ్ సెన్సారు బోర్డులున్నవి. తన చిత్రము పూర్తయినపిదప, నిర్మాత దానిని సెన్సారు బోర్డుకు నివేదించి

టానినుండి సర్టిఫికెట్టు పొందవలసియుండును ఈ బోర్డులో విమర్శకులు, సాహిత్యవేత్తలు మున్నగువారు సభ్యులుగ నుందురు

ఫిలిం పారిశ్రామికుల కష్టనిష్ఠురములను ప్రభుత్వమునకు నివేదించుటకు ప్రాంతీయ ఫిలిం వాణిజ్య సంఘములున్నవి ఇవన్నియు కలిసి "ఫిలిమ్ ఫెడరేషన్ ఆఫ్ ఇండియా" అను కేంద్రసంస్థగా రూపొందినది, భారతప్రభుత్వము ఈ సంస్థతో తరచుగా చిత్రములకు సంబంధించు సమస్యలను చర్చించుచు వాటిని పరిష్కరించు చుండును

ఈనాడు వివిధదేశములలో అంతర్జాతీయ ఫిలిమ్ పోటీ ఉత్సవములు నడచుచున్నవి ఈ ఉత్సవములలో భారత ప్రభుత్వామోదముద్ర పొందినచిత్రములు పాల్గొనుచుండును వంగరాష్ట్రీయుడైన సత్యజిత్ రాయ్ నిర్మించిన చిత్రము లెన్నియో ఈపోటీ ఉత్సవములలో పాల్గొని పారితోషికము లను గ్రహించి, భారతదేశమునకు ఖ్యాతిని తెచ్చిపెట్టినవి

విదేశీ మారకద్రవ్యమును విశేషముగా ఆర్జించుటకు భారతీయ చిత్రములు ఇతరదేశములకు పంపబడుచున్నవి ఈ కార్యకలాపమును నిర్వహించుటకు "ఇండియన్ ఫిలిమ్స్ ఎక్స్పోర్టు ప్రమోషన్ కౌన్సిల్" అను నొకసంస్థ నియమింపబడినది

ఒకవంక ప్రైవేటు వ్యాపారసంస్థలు "ఫీచర్" చిత్రములను నిర్మించుచుండగా, వేరొకవంక భారతప్రభుత్వము, ఫిలిండివిజను అను సంస్థయొక్క యాజమాన్యమున డాక్యుమెంటరీలను, వార్తాచిత్రములను, విద్యావిషయక చిత్రములను నిర్మింపించుచున్నది ఉత్తమ తరగతికి చెందిన చిత్రములకు భారతప్రభుత్వమే కాక, కొన్ని రాష్ట్రప్రభుత్వములు సైతము పసేటా పారితోషికముల నొసగి, సినిమా కళాభ్యున్నతికి దోహద మొసగుచున్నవి

ఇం. వేం.

## భారతదేశ భూగోళము :

భారతదేశము బ్రహ్మాండమగు పర్వతములతోను, నదులతోను నిండియున్నది ఇందలి జనసంఖ్య ప్రపంచజన సంఖ్యలో ఐదవ భాగము కలది ఆసియాలో నొకభాగమైన ఈదేశము, ఆసియాఖండపు దక్షిణ కొనయందున్నది భూమధ్యరేఖకు ఉత్తరముననున్న ఈ దేశముగుండా కర్కాటరేఖ పయనించు చున్నది భారతదేశము ఉత్తరఅక్షాంశమున 8°-4' నుండి 37°-6' వరకు 3200 కిలోమీటర్ల వైశాల్యమునను, రేఖాంశవృత్తమున పశ్చిమమున 68°-7' నుండి తూర్పున 97° 25' వరకు 3000 కిలోమీటర్ల వైశాల్యమును విస్తరించియున్నది ఈ దేశముయొక్క మొత్తము వైశాల్యము 12 67 500 చ మైళ్లు ఇది ఉత్తరమున వెడల్పుగనుండి, దక్షిణమునకు రానురాను సన్నమై, దాదాపు త్రిభుజాకృతిలోనున్నది, ప్రపంచముయొక్క వైశాల్యములో దీనివైశాల్యము పదవవంతు

భారతదేశము ప్రపంచములో జనాభా విషయమున చైనాతరువాత రెండవ పెద్దదేశముగనున్నది 1961వ సం॥ జనాభా లెక్కలనుబట్టి దీనిజనసంఖ్య 43 కోట్లు ఈ దేశపు భూమిసరిహద్దునిడివి 15 00 కిలోమీటర్లు, దీనియొక్క తీరరేఖనిడివి 5700 కిలోమీటర్లు ఇంత విశాలభూభాగము కనుకనే ఇది ఉపఖండ మనబడుచున్నది పరిపాలనా సౌలభ్యమునకై ఈ దేశము 17 రాష్ట్రములుగను, 10 కేంద్ర పాలిత ప్రాంతములుగను విభక్తమై యున్నది

రాష్ట్రములు (1) జమ్ము కాశ్మీరు, (2) పంజాబు, (3) హరియానా, (4) అస్సాం, (5) నాగభూమి (6) ఒరిస్సా, (7) మధ్యప్రదేశము, (8) ఉత్తరప్రదేశము (9) బీహారు, (10) పశ్చిమబెంగాలు, (11) రాజస్థానము (12) గుజరాతు, (13) మహారాష్ట్రము, (14) ఆంధ్రప్రదేశము, (15) మైసూరు, (16) మద్రాసు, (17) కేరళ

కేంద్రపాలిత ప్రాంతములు (1) ఢిల్లీ, (2) హిమాచల ప్రదేశము, (3) మణిపూరు, (4) త్రిపుర, (5) పుదుచ్చేరి, (6) అండమాను, నికోబారు దీవులు, (7) గోవా, డయ్యూ, డామను (8) దాద్రా, నగర్ హవేలీ, (9) లక్షదీవులు, మినకోయిదీవులు, అమినిదీవులు (10) చండీఘరు

భౌగోళిక ఆర్థిక ప్రాముఖ్యము శేషించిన ఆసియా ఖండమునుండి భారతదేశము పర్వతములచేతను, సముద్రములచేతను, ప్రత్యేకింపబడుటవలన, దీనికి విశిష్టమైన భౌగోళిక సమైక్యము సిద్ధించినది ప్రాగర్ధగోళములో దాదాపు కేంద్రమున నుండి ఆఫ్రికా, ఐరోపా, ఆసియా, ఖండములతో వ్యాపార వాణిజ్యములు సల్పుటకు భారతదేశము మిగుల అనుకూల స్థితిలోనున్నది సూయజ్ కాలువ నిర్మాణము ఈ దేశపు ప్రాముఖ్యమునకు మిగుల దోహదమును చేకూర్చి నది హిందూ మహాసముద్రములో దీవులుండుటచే, దూర

ప్రాచ్య దేశములకును, ఆస్ట్రేలియా ఖండమునకు నౌకల ద్వారా సరకులను సరఫరాచేయుటకు మిక్కిలి అనుకూలముగ నున్నది. భారతదేశము ప్రాచీన కాలమునుండియు నౌకా నిర్మాణమునను, నౌకాయానమునను మిగుల ప్రసిద్ధి చెంది యున్నది. అశోకుని కాలమునుండి, భారతదేశములో బ్రిటిషు వారి ఆధికారము ఉచ్చస్థాయి చేరువరకు నౌకానిర్మాణ విషయమునను, సాహసోపేతమైన నౌకాయానవిషయమునను ఈ దేశము వర్ధిల్లినట్లు సంస్కృత, పాలీభాషావాఙ్మయములలో ఆధారములు కన్పట్టుచున్నవి. ఈ దేశములను దర్శించిన గ్రీకు, రోమక అరబ్బీచరిత్రకారుల రచనలుకూడ ఇందుకు సాక్ష్యములుగ నున్నవి.

నైసర్గిక స్వరూపము : భారతదేశము విస్పష్టముగు మూడు భౌగోళిక మండలములుగ విభజింపబడి యున్నది. వాటి నైసర్గికలక్షణములుకూడ భిన్నభిన్నములుగ నున్నవి. (1) హిమాలయ పర్వతప్రాంతము, (2) గంగాసింధు మైదాన ప్రాంతము, (3) ద్వీపకల్పప్రాంతము.

అస్సాముయొక్క ప్రాగ్దిగంతమునుండి కాశ్మీరు పశ్చిమ సరిహద్దువరకు 2000 మైళ్ళ నిడివియు, సగటున 200 మైళ్ళ వెడల్పును గల హిమాలయ పర్వతములు అవిచ్ఛిన్నముగా విస్తరించి యున్నవి. హిమాలయముల సగటు ఎత్తు 17,000 అడుగులకు మించియున్నది. వీటిపై పలుబిది శిఖరములున్నవి. నంగపర్వతము (26,660 అడుగులు), నందాదేవి, ధవళగిరి (26,820 అడుగులు), ఎవరెస్టు (29,000 అడుగులు), కాంచనగంగ (28,150 అడుగులు) అను శిఖరములు ఇందులో ముఖ్యములైనవి.

హిమాలయ పర్వతపాదములయొద్ద 200-300 అడుగుల ఎత్తుగల శివాలిక్ పర్వతములు గలవు. హిమాలయ పర్వతములకు వాయవ్యమున కారకోరమ్, హిందూకుష్ పర్వతములును, సులేమాన్, కర్తార్ అను పర్వతపంక్తులును కన్పించును. ప్రఖ్యాతిగాంచిన ఖైబరుకనుమ ఇచ్చటనే కాబూల్ నదిని అనుసరించి ప్రవహించును. హిమాలయములకు తూర్పుననున్న పర్వతశ్రేణులు బర్మాదేశమునకు చెందిన లూషాయ్ ఆరకాన్ కొండలతో కలియుచున్నది.

హిమాలయ పర్వతములు భారతదేశమునకు ఉత్తరమున పెట్టుకొనినకోటగా రక్షణము నొసగుచున్నది. వాటిపై విశేష వర్షపతనమువలన, దక్షిణమునగల విశాల మైదాన ప్రాంతమునకు సమృద్ధిగా జలాధార మేర్పడుచున్నది. అంతే కాక, మధ్యాసియానుండి వీచు శీతలవాయువులు భారతదేశములోనికి ప్రవేశింపనీయక హిమాలయములు నిరోధించుచున్నవి. గంగా, సింధు, బ్రహ్మపుత్ర వంటి సుపావన స్రోతస్వతులకు జన్మించుటవలన, వీటి ప్రాశస్త్యము మధికముగ నున్నది. హిమాలయములపై లభించు ఔషధ, జంతుజాలముల సంఖ్యాకములు. అందలి ప్రకృతి రామణీయకము అత్యంత నేత్రానందకరముగ నుండును.

గంగాసింధు మైదానము : హిమాలయములకు దక్షిణముగనున్న గంగాసింధుమైదానము సారవంతమగు ఒండలి మన్నుచే నేర్పడినది. ఈ మైదానము తూర్పునుండి పడమర వరకు ఉత్తరభారతమునందు విశాలమగు 1500 మైళ్ళ ప్రాంతమును ఆక్రమించియున్నది. ఆర్యుల నాగరికత కీ ప్రాచీన భూమి జన్మస్థానముగా పేరెన్నికగన్నది. గంగానది కావల నున్న పశ్చిమమైదానము దాదాపు శుష్కప్రాయముగ నుండును. రాజస్థానములో 1,53,000 చదరపుమైళ్ళ వైశాల్యముగల థార్ ఎడారి కూడ ఈ సందర్భములో పేర్కొనదగియున్నది. ఈ మైదానమువలన భౌగోళికముగా ఈ క్రింది ప్రయోజనములు చేకూరుచున్నవి. (అ) సారవంతమైన భూమి (ఆ) అనుకూల వాతావరణ శీతోష్ణములు (ఇ) చదునైన భూమ్యుపరితలముపై రోడ్లు రైల్వేలు నిర్మించుటకవకాశము. (ఈ) నీటిపారుదల సౌకర్యముల కనువగు నదులు. (ఉ) ఖనిజపదార్థములు.

ద్వీపకల్ప పీఠభూమి : ఈపీఠభూమి అత్యంత ప్రాచీనమైన భూఖండము. ఇది భారతదేశమునందు వివిధ నిర్మాణ పరివర్తనములకు గురియైన నడిగడ్డ. ఈపీఠభూమికి ఉత్తరమున వింధ్యసాత్పురాపర్వతములు, పశ్చిమమున పశ్చిమకనుమలు, తూర్పున తూర్పుకనుమలు, ఎల్లలుగనున్నవి. అత్యంత ప్రాచీనమైన అగ్నిపర్వతమునుండి ఉష్ణశిలాద్రవము పారుటచే ఈ పీఠభూమి పెక్కు పరివర్తనములకు లోనైనది. తత్ఫలితముగా విభిన్నములైన నైసర్గిక లక్షణము లేర్పడినవి. ఈ శిలాద్రవ ఫలితముగా, అంతర్భాగము భూమ్యుపరితలమున పైకులికియుండిన శిలాసమూహములు భూమిలో క్రుంగిపోయి ద్వీపకల్పములో అధికభాగము పీఠభూమిగా పరిణామము చెందినది.

వింధ్యపర్వతములకు ఉత్తరముననున్న ఆరావళీ పర్వత

కులు చంబల్, యమున మున్నగు నదులకు ఉత్పత్తిమండల ములుగ నున్నవి 5653 అడుగుల ఎత్తుగల "అబూ" శిఖరము ఈ పర్వతము యొక్క అత్యంత ఉన్నతస్థానము ఈ ద్వీపకల్ప పీఠభూమి యొక్క ఉత్తర భాగమునందు మాళ్వా పీఠభూమి కలదు దక్షిణ భారతమునందలి తక్కిన పీఠభూములన్నిటివలెనే, మాళ్వా పీఠభూమి విచ్ఛిత్తి చెందినది అక్కడక్కడ చెదురు మదురుగనున్న కొండగుట్టలు తప్ప దక్కన మాళ్వా పీఠభూమి యొక్క లోతట్టు ప్రాంతము సమముగనుండును ఈ పీఠ భూమి గంగానదిలోయవైపు వాలియున్నది దీనిలో విశేష భాగము 2000 అడుగుల ఎత్తునకు పైగానున్నది

సాత్పురా పర్వతములు నర్మదా, తపతీనదుల నడుమ నున్నవి. ప్రాచీన కాలములో ఈ పర్వతము కంపనములతో కూడిన ప్రళయములకు గురియైన అత్యున్నత ప్రాంతము నుండి పశ్చిమమునకు విస్తరించినవని నర్మదా, తపతీనదులు పశ్చిమముగా ప్రవహించుచున్నవి నర్మదానదికి దక్షిణమున నున్న ప్రాంతము దక్కను పీఠభూమి యనబడుచున్నది దీని ఉభయపార్శ్వములందు తూర్పు, పశ్చిమ కనుమలున్నవి దక్షిణమున నీలగిరులు కలవు వీటిలో నొక భాగము సహ్యాద్రి పర్వతశ్రేణి యనబడుచున్నది దక్కను పీఠభూమి యొక్క వాయవ్యప్రాంతము అగ్నిపర్వత ఉష్ణశిలాద్రవముచే నిండి యున్నది

పశ్చిమ కనుమలు సముద్రమునకు సమీపముగా కేప్ కామొరిన్ వరకు 1000 మైళ్ళ దూరము విస్తరించి, అరే బియా సముద్రమువైపు నిటారుగ నున్నవి. ఇవి అవిచ్ఛిన్న మగు పర్వతశ్రేణు లగుటచే వీటిని దాటుట కొన్ని కనుమల ద్వారా తప్ప అన్యథా సాధ్యము కాదు 800 మైళ్ళ నిడివిగల తూర్పు కనుమలు మహానది లోయనుండి ఆగ్నేయముగా నీలగిరులలోని సాత్పుర ప్రాంతము వరకు విస్తరించినవి తూర్పు కనుమల సగటు ఎత్తు 1500 అడుగులు పశ్చిమ కనుమల ఎత్తుకంటె వీటి ఎత్తు తక్కువ ఇవి పశ్చిమ కనుమలవలె వరుసగా నుండును తూర్పు, పశ్చిమ కనుమలు నీలగిరుల ద్వారాను, చోటా నాగపూరు పీఠభూమి ద్వారాను, పరస్పర ముగా కలియుటచే దక్కను పీఠభూమికి త్రిభుజాకార మేర్పడినది

తీరమైదానములు తూర్పు, పశ్చిమ కనుమలు రెండింటికిని తీరమైదానములు ఎల్లలుగ నున్నవి తూర్పుతీర మైదానము చాలావరకు సమముగ నుండి వెడల్పుగ నుండి యున్నది ఇది పశ్చిమతీర మైదానము కంటె వెడల్పయినది పశ్చిమతీర మైదానము దక్షిణమున ఇరుకుగనుండి, బొంబాయి కుత్తరమున వెడల్పగును ఈ మైదానములో భాగమైన గుజరాతు, కథైవారు, కచ్ ప్రాంతము చాలావరకు సమముగ నుండును ఈ మైదానము ఉత్తరవాయవ్యమున నుండు, ఇసుక మయమైన థార్, రాజపుటానా ఎడారులలో కలియు చున్నది

నదులు భారతదేశమందలి నదులలో ఉత్తరమున నున్న గంగ, సింధు, బ్రహ్మపుత్ర అను నదులును, దక్షిణమున నున్న గోదావరి, కృష్ణ, కావేరి, నర్మద, తపతి అను నదులును ముఖ్యములైనవి ఉత్తర భారతమందలి నదులు హిమాలయ పర్వతములలో ఉద్భవించి, వేసవియందుకూడ ప్రవహించు చుండును గంగోత్రియందు జన్మించిన గంగానది దీర్ఘతమ మైనది (2590 కిలోమీటర్లు) యమున, గోమతి, గోగ్ర, గండకి, కోసి అనునవి గంగానదికి ప్రధానమైన ఉపనదులు ఈ నదులన్నియు ప్రవాహములతోపాటు తెచ్చు ఒండుమన్ను వలన మైదాన ప్రాంతమంతయు సారవంత మగుచున్నది గంగానదీ ముఖమునొద్ద పెక్కు దీవులేర్పడినవి బ్రహ్మ పుత్రా నదికూడ వందలమైళ్ళు టిబెట్టుగుండా ప్రవహించి గంగానదిలో ప్రవేశించును దీనికి ముఖ్యమగు ఉపనదులు లేవు.

గోదావరి కృష్ణానదులు దక్షిణ భారతదేశములో గోదావరి దీర్ఘతమమైనది ఈనది పశ్చిమకనుమల త్ర్యంబ కమునొద్ద జన్మించి, పాతకొండల ద్వారా దక్కను పీఠభూమి పైన ప్రవహించి బంగాళాఖాతములో చేరుచున్నది మంజీర ప్రాణహిత, ఇంద్రావతి, శబరి అనునవి దీనికి ముఖ్యమగు ఉపనదులు. తూర్పు, పశ్చిమ గోదావరి మండలములలో సారవంతమగు భూములు ఈ గోదావరి నదీజలములచే తడుప బడుచున్నవి ఈనది పొడవు 1450 కిలోమీటర్లు గోదావరి తరువాత కృష్ణానది ప్రధానమైనది ఇది పశ్చిమ కనుమలలో, మహాబలేశ్వరమునొద్ద పుట్టి దక్కను పీఠభూమిగుండా ప్రవ హించి బంగాళాఖాతములో చేరును దీనినిడివి 1290 కిలో మీటర్లు తుంగభద్ర, భీమ అనునవి దీనికి ప్రధానమగు ఉపనదులు

కావేరి: ఈ నదికూడ పశ్చిమ కనుమలలో జన్మించి,

మైసూరు పీఠభూమిగుండా ప్రవహించును. తిరుచినాపల్లి యొద్ద ఈనది రెండు శాఖలై, 760 కిలోమీటర్ల దూరము ప్రవహించిన పిమ్మట, బంగాళాఖాతములో ప్రవేశించును. మోయారు అను నది దీనికి ముఖ్యమగు ఉపనదులు.

నర్మదానది వింధ్యపర్వతములలో పుట్టి పశ్చిమ తీరమునకు పోయి కాంబే సింధుశాఖలో ప్రవేశించును. దాని నిడివి 1280 కిలోమీటర్లు.

మధ్యప్రదేశములోని మహాదేవ పర్వతములలో ఉద్భవించిన తపతీనది సాత్పురా పర్వతములకు దక్షిణముగా ప్రవహించి కాంబే సింధుశాఖను చేరుచున్నది.

భారతదేశము అతి విశాలమై, విభిన్నమైన నైసర్గిక లక్షణములు కలిగియుండుటచే దేశమంతట ఒకేవిధమైన శీతోష్ణస్థితి యుండుటకు అవకాశములేదు. ఈ శీతోష్ణస్థితిని పరిశీలించుటకు భారతదేశమును (1) ద్వీపకల్ప హిందూస్థానము (2) ఉత్తర హిందూస్థానము అని రెండు భాగములుగా విభజింపవచ్చును. మొదటిభాగమందు శీతోష్ణస్థితి ఉష్ణాధిక్యముతో కూడియుండును. ఈ ఉష్ణాధిక్యము సముద్రమునుండి దూరమునకు పోయినకొలది తీవ్రముగ నుండును. ఋతు రూపాంతరము అల్పస్థాయిలో నుండును. ఉత్తర భారతము కర్కటరేఖ కావలనున్నది. ఈ మండలములో శీతోష్ణస్థితులు సాధారణముగ ఒకేతీరుగ నుండవు. పశ్చిమప్రాంతమున వేసవికాలములలో మిక్కిలి వేడిమిగనుండును. చలికాలములో అతి శీతలముగ నుండును. వాయువులో సాధారణముగ చెమ్మయుండదు. కాని తూర్పు భాగములలో చలికాలము సౌమ్యముగ నుండును. వేసవికాలము ఉష్ణముగనుండి వాయువునందు సమృద్ధిగా చెమ్మయుండును. పశ్చిమమున పంజాబు, రాజస్థాన రాష్ట్రములున్నవి. తూర్పు ప్రాంతమందు పశ్చిమ బెంగాలు, అస్సాము, బీహారు, ఉత్తర ప్రదేశ్ రాష్ట్రము లున్నవి.

భారతదేశపు శీతోష్ణస్థితి విశేషముగా ఋతుపవనములచే ప్రభావితమగుచున్నది. నైరృతి ఋతుపవనము వలన జూనునుండి సెప్టెంబరు నెలవరకు వర్షములు కురియును. భారతదేశములో కురియు వర్షప్రమాణములో ఇది 75 శాతము. ఈ ఋతుపవనమునకు పూర్వము (మార్చినుండి మే వరకు) భారతదేశములో కురియు మొత్తము వర్షములో 10 శాతము వర్షము ఘటిల్లును. హిమాలయ పర్వతముల వలన, బంగాళాఖాత శాఖవలన, అరకాన్ పర్వతములవలన, అస్సాము, పశ్చిమబెంగాలు, బీహారు, ఉత్తరప్రదేశప్రాంతములు ప్రభావితములగుటచే అచ్చట సమృద్ధిగా వర్షములు కురియును. అట్లే పశ్చిమకనుమలు అరేబియన్ సముద్రముపైన ప్రభావితమైన ఫలితముగా దక్కను, మధ్యప్రదేశములందు పుష్కలముగా వానపడును కొలదిగనో, గొప్పగనో. ఈ వర్షములు మద్రాసుతీరమునందలి మండలములవరకు విస్తరించును. నవంబరు నుండి ఫిబ్రవరివరకు వీచు ఈశాన్య ఋతుపవనములు భూమి మీదినుండి సముద్రమువైపునకు వీచును. ఈ వాయువులు పొడిగను, మనోహరముగను ఉండును. ఆకాశము చాలవరకు నిర్మలముగనుండును. ఈ ఋతుపవనములు ముఖ్యముగా మద్రాసుతీరమునందు నవంబరు, డిసెంబరు నెలలలో వర్షము కలుగజేయును. ఈ తరుణములో బంగాళాఖాతమున తుపానులు చెలరేగి కొంతవర్షపాతమును కలుగజేయును.

భారతదేశపు వర్షపాతము సంవత్సరమునకు 43 అంగుళములు. నైసర్గిక, భౌతిక పరిస్థితులను బట్టియే ఈవర్షపాత విభజనయుండును. వర్షపాతమునుబట్టి భారతదేశము నాల్గు మండలములుగా విభజింపబడవచ్చును.

(1) గరిష్ఠ వర్షపాతమండలములు (ఇచట 80 అంగుళములు పైగా వర్షము కురియును) (అ) పడమటి కనుమల యొక్క పశ్చిమ పీటవాలు ప్రాంతములు, (ఆ) అస్సాము కొండలయొక్క దక్షిణ పీటవాలు ప్రాంతములు, తూర్పు హిమాలయములు.

(2) మాధ్యమిక వర్షపాతమండలములు (80"–40" వర్షపాతము) (అ) బీహారు, (ఆ) పశ్చిమబెంగాలులో కొన్ని ప్రాంతములు, (ఇ) ఈశాన్యదక్కను (ఈ) ఆంధ్రప్రదేశ సముద్రతీరము (ఉ) తూర్పు మధ్యప్రదేశము, (ఊ) తూర్పు ఉత్తరప్రదేశరాష్ట్రము.

(3) శుష్కమండలము (40"-20" వర్షపాతము) గుజరాతు, కథైవార్, దక్కను, తూర్పు పంజాబు, మధ్యప్రదేశములోని కొన్నిభాగములు, తూర్పు రాజస్థానము.

(4) ఎడారిమండలము (20" కంటె తక్కువ వర్షపాతము)

నేలలు : భారతదేశములో ప్రధానముగా ఈ క్రింది నాల్గురకముల నేలలు గలవు (1) ఒండునేల (2) నల్లరేగడ నేల (3) ఎర్రనేల (4) కొంత లేక ఎర్రబిళ్ళ రాతినేల. వీటిలో ఒండునేలలు అత్యంత సారవంతములైనవి. ఇట్టినేలలు సింధు–

గంగా మైదానములందు కానవగును అంతేకాక గుజరాతు, రాజస్థానము, పంజాబు, ఉత్తరప్రదేశము, బీహారు, పశ్చిమ బెంగాలులలోని కొంతప్రాంతము, గోదావరి, కృష్ణ, తంజావూరు జిల్లాలు, అస్సాము ప్రాంతములందుకూడ ఇట్టినేలలు కలవు నల్లరేవడ భూములుకూడ సారవంతములైనవే ఇవి విశేషముగా మహారాష్ట్ర, గుజరాతు, మధ్యప్రదేశములలోని పశ్చిమప్రాంతము, ఉత్తర ప్రదేశములోని దక్షిణభాగము, బీహారులోని ఆగ్నేయభాగము, ఒరిస్సాలోని వాయవ్య ప్రాంతము, ఆంధ్రప్రదేశములోని పశ్చిమప్రాంతము వీటి యందు కానవగును - ప్రత్తి, జొన్న, గోధుమ, ఎల్లగిసె, పప్పుదినుసులు మున్నగునవి ఈ భూములలో పండును

ఎర్రనేలలు మద్రాసు, మైసూరు, ఆగ్నేయ, మహారాష్ట్ర ప్రాంతములందు కలవు అంతేకాక అవి ఆంధ్రప్రదేశ, మధ్యప్రదేశ రాష్ట్రములగుండా ఒరిస్సా, ఛోటానాగపూరుల వరకు విస్తరించియున్నవి పశ్చిమ బెంగాలులోని కొన్ని జిల్లాలయందును, ఉత్తరప్రదేశ, మధ్యప్రదేశ, తూర్పు రాజస్థానములలోని కొన్ని జిల్లాలయందును ఇట్టినేలలు గలవు, సారమునందు వైవిధ్యమున్న పలుప్రాంతములలో పెక్కు రకముల పంటలు పండును

కొంతనేలలు ఆంధ్ర, అస్సాము, పశ్చిమబెంగాలు, ఒరిస్సాలయందును, తూర్పు పశ్చిమకనుమ ప్రాంతములందును కన్పించును

సహజోద్భిజ సంపద : భారతదేశపు అటవీసంపద అమూల్యమైనది మొత్తము దేశవిస్తీర్ణములో ఆరవవంతును అడవు లాక్రమించినవి ఈ అడవులు అయిదు తరగతులకు చెందినవి వర్షపాత మెక్కువగ నున్నప్రాంతములో అన్ని ఋతువులలో పచ్చగా పెరుగు వృక్షములు కానవగును ఇట్టి ప్రాంతములు పశ్చిమతీరమందును, తూర్పు హిమాలయ పర్వతములందలి దక్షిణపార్శ్వము లందున, పశ్చిమ బెంగాలు, అస్సాము రాష్ట్రములలో కొన్నితావులందును కలవు కాలానుగుణముగా రాలుచు మరల పట్టుచుండెడు ఆకులతో నొప్పు వృక్షములు హిమాలయ పర్వతపు టడవులలోను, దక్షిణభారతములోను పెరుగును ఇవి మద్రాసు, మైసూరు, ఆంధ్రప్రదేశము, ఒరిస్సా, ఉత్తరప్రదేశము, బీహారు, బెంగాలు, మధ్యప్రదేశములలో కొన్నితావులందు కలవు పర్వతముల మీద పెరుగు అటవీ వృక్షముల ఎత్తు, వాటిపై కురియు వర్షముల ననుసరించి యుండును టేకు, దేవదారు, రోజ్‌వుడ్, టేకు మున్నగునవి ఈ అటవీవృక్షములలో ప్రధానము లైనవి భారతదేశమందు పెరుగు అడవుల మూలమున 10 లక్షలమంది కార్మికులు జీవనము చేయుచున్నారు అన్ని రాష్ట్రములందు కంటె అస్సాము రాష్ట్రమునందు అడవు లెక్కువప్రాంతము నాక్రమించియున్నవి

వ్యవసాయము భారతదేశములో 70 శాతము ప్రజలు వ్యవసాయముపై జీవించుచున్నారు, వీరు ఆహార ధాన్యములనేకాక, చెరకు, జనుము, కాఫీ, టీ, జొన్నలు, వేరుసెనగ, పొగాకు, అవిసెగూనె మున్నగు పంటలను గూడ పండించుచున్నారు దేశమందలి మొత్తము భూమిలో మూడవవంతు వ్యవసాయ యోగ్యముగనున్నది 80 శాతము కాయుధాన్యములకు వినియోగింపబడుచున్నది వరిధాన్యము కొన్ని ప్రాంతములలో ఏడాదికి రెండుపర్యాయములు పండును సాధారణముగా, పైరులన్నియు తెగుళ్ళవలనను, చీడలవలనను కొన్నిప్రాంతములలో నశించుచుండును ఎరువులు, రసాయన ద్రవ్యములు లోపించుటచేతను, నీటిపారుదల సౌకర్యములు లేకుండుటచేతను, పంటలు సమృద్ధిగాపండవు అతివృష్టి, అనావృష్టి, దోషములవలన కూడ నష్టముకల్గును

నీటిపారుదల వర్షపాతము అసమానముగ నుండుట చేతను, ఎట్ట కాలము సుదీర్ఘమగుటచేతను, భారతదేశమందు నీటిపారుదల వసతులు విశేషముగా అవసరమగుచున్నవి నదుల జలములలో దాదాపు 94 శాతము ప్రతిసంవత్సరము వృథాకాగా, 6 శాతపుజలము మాత్రమే నీటిపారుదల సౌకర్యములకు ఉపయోగపడుచున్నది (1) మోటబావుల క్రిందను, చెరువులక్రిందను, కాలువలక్రిందను, కొంతవరకు నీటిపారుదల జరుగుచున్నది దాదాపు 160 లక్షల ఎకరముల భూమి భారతదేశములో నీటిపారుదలవలన సాగగుచున్నది నీటిపారుదల వసతులను మెరుగుపరచుటకై భారతప్రభుత్వము రెండవ, మూడవ పంచవర్షప్రణాళికల కాలములో కొన్ని సులార్థ సాధక ప్రణాళికలను అమలుజరిపెను వాటిలో ఈ క్రిందివి ముఖ్యములైనవి (1) తూర్పుపంజాబులోని భాక్రానంగల్ ప్రాజెక్టు (2) ఒరిస్సాయందలి హిరాకుడ్ ఆనకట్ట (3) బీహారులోని దామోదర్ ప్రాజెక్టు (4) ఆంధ్రరాష్ట్రములోని నాగార్జునసాగర్ ప్రాజెక్టు (5) ఆంధ్రలోని తుంగభద్రా ప్రాజెక్టు

**ఖనిజములు** భారతదేశములో లభించు ఖనిజములలో పేలబొగ్గు మాంగనీసము, బంగారము, అభ్రకము, ఇనుము, ఉప్పు ముఖ్యమైనవి. దేశవిస్తీర్ణమును బట్టియు, జనసంఖ్యను బట్టియు చూడగా ఈదేశము యొక్క ఖనిజసంపద అంతగొప్పదికాదు. అదనముగా లభించు ఇనుము, అభ్రకము మాంగనీసము, బాక్సైటు మున్నగు ఖనిజములు విదేశములకు ఎగుమతి చేయబడుచున్నవి. బొగ్గు, బంగారము, చలువరాయి, సున్నపురాయి, పింగాణిమట్టి, హరితాళము మున్నగునవి స్వయంపోషకములుగ నున్నవి. వెండి, నికెలు, పెట్రోలియం, గంధకము, సీసము, పాదరసము, తుత్తునాగము, రాగి, ప్లాటినము మున్నగు ఖనిజములకు పరదేశములనుండి వచ్చు దిగుమతులపై ఆధారపడవలసి యున్నది. మాంగనీసు ఉత్పత్తి యందు ప్రపంచమంతటిలో రష్యా, చైనాల తరువాత భారతదేశము మూడవస్థానము నాక్రమించి యున్నది. అభ్రకపు ఉత్పత్తిలో ఈదేశము ప్రపంచములో ప్రథమస్థానము నాక్రమించియున్నది. ప్రపంచములో జరుగు ఇనుము ఉత్పత్తిలో భారతదేశము ఎనిమిదవస్థానము నాక్రమించుచున్నది. కాని ఇచటి ఇనుము శ్రేష్ఠమైనది కాదు.

**పరిశ్రమలు** పారిశ్రామిక వికాసములో భారతదేశము గొప్పప్రగతి సాధించినది. పారిశ్రామిక కేంద్రములకు సమీపములోనే ముడివస్తువులు లభించుటవలన ఈ ప్రగతి సాధ్యమైనది. వివిధములైన ఈ పరిశ్రమలు సాధారణముగా దేశమంతట విస్తరించియున్నను ప్రధానముగా ఈ క్రింది మూడు మండలములలో ఇవి కేంద్రీకృతములై యున్నవి.

(1) దామోదర్-హుగ్లీ మండలము (ఆగ్నేయ బీహారు, పశ్చిమ బెంగాలు దక్షిణభాగము) ఇచ్చట ఇనుము, ఉక్కు, రసాయనపు ఎరువుల, జనపనార, రసాయన పదార్థములు, కాగితము, గాజుపరిశ్రమలు గలవు.

(2) మహారాష్ట్ర, గుజరాతు మండలము - ఇచట ప్రత్తి కాగితములు, రసాయన ద్రవ్యములు, గాజు, పంచదార, పరిశ్రమలు గలవు.

(3) మద్రాసు, మధుర, కోయంబుత్తూరు, బెంగాలు మండలము ఇచట ప్రత్తి, పట్టు, పంచదార, ఇనుము, ఉక్కు, గాజు పరిశ్రమలు కలవు.

గంగా-యమునా మండలమును (అలహాబాదు, కాన్పూరు లక్నో, ఢిల్లీ) నాగపూరు, జబల్పూరు, భోపాలు, ఇండోరు, మండలమును బట్టలమిల్లులు, సిమెంటు, కాగితపు, రసాయనపు వస్తువులకు, కాగితమునకును ముఖ్యకేంద్రములు.

**రాకపోకల మార్గములు** భారతదేశములో రోడ్డు మార్గములు ప్రయాణమునకు అత్యంత ప్రధానసాధనములు. 2 లక్షల 83 వేల కిలోమీటర్ల కంకరరోడ్డు మార్గములును, 3 లక్షల 83 వేల కిలోమీటర్ల మట్టిరోడ్డు మార్గములును ఇందు నిర్మింపబడినవి. ఈ క్రింది జాతీయ రహదారిమార్గములు ముఖ్యమైనవి.

(1) కలకత్తా-ఢిల్లీ మార్గము (కాశీ, కాన్పూరు నగరములద్వారా)

(3) బొంబాయి - బెంగుళూరు మార్గము (మద్రాస్ నగరముద్వారా)

(3) మద్రాసు - కలకత్తా మార్గము (విజయవాడ ద్వారా)

(4) కలకత్తా-మద్రాసు మార్గము (నాగపూరు నగరముద్వారా)

(5) కాశీ-కన్యాకుమారి మార్గము (హైదరాబాదు బెంగుళూరు నగరములద్వారా)

(6) బొంబాయి-ఆగ్రా మార్గము (ఢిల్లీద్వారా)

నేపాలు, బర్మా పాకిస్థాన్ దేశములకు పోవు జాతీయ రహదారులు కూడ కలవు. ఇవిగాక రాష్ట్రీయ, జిల్లా, గ్రామ రహదారులు కూడ నిర్మింపబడినవి. భారతదేశములో రైల్వే మార్గములు కూడ ముఖ్యములైనవి. ఈ రైల్వేమార్గముల మొత్తము పొడవు 57 080 కిలోమీటర్లు. పరిపాలనా సౌలభ్యముకొరకు ఈ మార్గములు మండలములుగా విభజింపబడినవి. ఉత్తరప్రదేశములోను బీహారు రాష్ట్రములోను విశేషముగా రైలుమార్గములు కలవు.

జలమార్గములుకూడ కొన్ని రాష్ట్రములలో ప్రధానపాత్ర వహించుచున్నవి. వీటి మొత్తపుపొడవు 8000 కిలోమీటర్లు. గంగా, గోదావరి, కృష్ణానదులు, వాటి కాలువలు పశ్చిమ సముద్రతీరము, నౌకాయానమునకు అనుకూలములుగ నున్నవి. వివిధ సముద్రమార్గములద్వారా విదేశములకు పోవుటకు అనుకూల్యము కలదు. తూర్పు, పశ్చిమకోస్తా తీరమున కొన్నిమాత్రమే పెద్ద నౌకాస్థావరములును, ఎక్కువ సంఖ్యలో చిన్నచిన్న నౌకాకేంద్రములును ఉన్నవి. కాండ్లా, బొంబాయి, కొచిన్ నౌకాస్థావరములు పశ్చిమ

తీరమునను, విశాఖపట్టణము, కలకత్తా, మద్రాసు నౌకా కేంద్రములు తూర్పుతీరమునను నెలకొనియున్నవి ఈ కేంద్రములనుండి వివిధములైన ముడిసరకులు విదేశముల కెగుమతి యగుచున్నవి యంత్రములు, రసాయన ద్రవ్యములు, ఆహారధాన్యములు మున్నగునవి విదేశములనుండి దిగుమతి యగుచున్నవి

దేశములో వివిధ నగరములనడుమ విమానమార్గముల ద్వారా రాకపోకలు జరుగుచున్నవి వాటిలో ఈ క్రిందివి ముఖ్యమైనవి

(1) మద్రాసు - ఢిల్లీ
(2) బొంబాయి-కలకత్తా
(3) ఢిల్లీ-బొంబాయి
(4) కలకత్తా-ఢిల్లీ
(5) మద్రాసు-కలకత్తా
(6) బొంబాయి-మద్రాసు

ఇవిగాక విదేశములకు పోవు ఈ క్రింది విమానమార్గములుకూడ నున్నవి :

(1) బొంబాయి - న్యూయార్కు (కైరట్, రోము, లండను నగరములద్వారా)

(2) కలకత్తా-టోక్యో (బాంకాక్, హాంకాంగ్ నగరములద్వారా)

(3) మద్రాసు-సిడ్నీ (సింగపూరుద్వారా)

(4) బొంబాయి-నైరోబీ (ఏడెన్ ద్వారా)

(5) ఢిల్లీ-మాస్కో

జనసంఖ్య జనసంఖ్య విషయమున ప్రపంచములో భారతదేశము రెండవస్థాన మాక్రమించినది మొత్తము జనాభా 43 కోట్ల, 92 లక్షలు. (1961 లెక్కలప్రకారము) భారతదేశములో సగటు జనసాంద్రత చ మైలునకు 140 మంది గంగా సింధుమైదానములోని జనసాంద్రత గరిష్ఠమైనది రాజస్థానము, ఛోటా నాగపూరు, బస్తరు, ఒరిస్సాలలో పర్వతప్రాంతములందలి జనసాంద్రత అత్యంత కనిష్ఠమైనది భారతదేశములోని జనసంఖ్యలో 82 శాతము గ్రామములలో నివసించుచున్నారు ఈ సంఖ్యలో పురుషులకంటె స్త్రీలు అధికసంఖ్యాకులవారై యున్నారు

వి వి.

## భారతదేశము-ఓషధులు

భారతదేశము ఓషధుల సంపద గలది దేశము ప్రజాసంపద గలిగి యుండవలయును ప్రజాసంరక్షణమునకు సర్వ ఋతుపుష్పఫల భరితములగు ఓషధులసంపద అత్యావసరము అట్టి ఓషధులు అనంతములుగా భారతదేశమున కలవు

"సవాఏష పురుషోఽన్నరసమయః" అయా కనబడుచున్న పురుషుడు అన్నరసమయుడు అని ఉపనిషత్తులు ప్రబోధించుచున్నవి మానవ సృష్టికి మూలాధారములును సకల జీవన సంరక్షకములును నైనవి ఓషధులు

ప్రకృతియందలి ఓషధులను, ఓషధుల ప్రయోగమును, సంయోగమును, సంవిధానమును, తెన్నగ పరిశీలించిన భారతీయ మహర్షులు, మానవాభ్యుదయ సౌభాగ్యసంరక్షణముకొరకును జగత్కల్యాణము కొరకును, ఈ ఓషధీ కుటుంబమును వర్గములుగా గణములుగా, రసము, గుణము, వీర్యము, విపాకము, ప్రభావము, ప్రతిభ మున్నగు విశేషములతో, శ్రుతిబోధితముగ, నిర్ణయించి, విభజించి, ఆయుర్వేదమునందు స్మృతిపురాణేతిహాసములందు, మంత్ర తాంత్రికములందు, శైవాగమ, వైష్ణవాగమములందు, జ్యోతిశ్శాస్త్ర వాస్తుశాస్త్రములందు, నాట్య-గాన కళాసముదాయమునందు వివరించియున్నారు ఇందందనక కావ్యములయందు, గ్రామీణపదములందు పాటలయందు, సామెతలుగ, చిటకాలుగా, పండిత, పామర, పాటక జనసామాన్యమునకు అందుబాటులో నుండునట్లు పలుముఖముల ఓషధుల ప్రయోగ, ప్రయోజన, సంప్రదాయములు, దేశమందంతటను విస్తరింప చేయబడి యున్నవి

ఓషధులు_తద్విశేషములు

(1) ఓషధులు ఇవి ఫలించి నశించునవి వరి, గోధుమ యవ, జొన్న, మున్నగునవి,

(2) వనస్పతులు : ఇవి పుష్పించకయే ఫలించునవి (మర్రి, రావి, మేడివంటివి)

(3) వానస్పత్యములు ఇవి పుష్పించి ఫలించునవి మామిడి మారేడు, నేరేడువంటివి

(4) వీరుధములు : వేర్లు, గడ్డలు, దుంపలు, గుబురులు ఇందులోనివే

(5) లతలు మీదికి ప్రాకునవి లతలు (తీగెబారునవి) ఉదా - తమలపాకులు, తిప్పతీగ మున్నగునవి

(6) వితానములు గుబురులుగా, తీవెలుగా విస్తరించి పెరుగునవి

(7) కాండము (కందము)లు కాండములుకల-కంద, చామమున్నగునవి

(8) మూలములు అధికసంఖ్యలో వేర్లుకల శతావరి మున్నగునవి ఈ సముదాయమున కంతయు ఓషధులనియే సర్వసాధారణమైన వ్యవహారము

ప్రకృతి నియతము లగు ఈ ఓషధులు చంద్రుని అమృత కిరణ ప్రసారముచే పోషింపబడుచున్నవి ఓషధుల స్వరూప స్వభావ గుణసంపదలను పరిశీలించి, వర్గీకరించి, పరిచయము చేసినవాడు బృహస్పతి

"యా ఓషధయః సోమరాజ్ఞీ ర్బహ్వీశ్శత విచక్షణాః
బృహస్పతి ప్రసూతా-స్తానో ముఞ్చ న్త్వంహసః"

అను అథర్వణ వేదమంత్రమును బట్టి, ఓషధులు అనేకములనియు, రసగుణ-వీర్య-విపాక భేదములచే అవి శతముఖ దర్శనములు కలవనియు, వాటికి అమృత మయుడగు చంద్రుడు అధిపతియనియు, బృహస్పతిచే ఆయా వ్యాధుల యందవి వినియోగింప బడియున్నవనియు అట్టి ఈ ఓషధులు ప్రాణులకు సంభవించు వ్యాధులనుండి, వారిని విముక్తులను చేయు సమర్థములనియు, తెలియచున్నది

అథర్వణవేదమున ఈమంత్రమునకు ముందును, వెనుకను, గల మంత్రములు సూక్తములు, ఓషధుల విజ్ఞానమును, చంద్రుని ఆధిపత్యమును, బృహస్పతియొక్క ఓషధీజ్ఞానమును తెలియజేయు చున్నవి ఋగథర్వణ వేదములయందు ఓషధులు, వివిధ ప్రయోగాత్మకములుగను, యజుస్సామ వేదములయందు, పౌండరీకాది మహాయజ్ఞములలో, క్రియాత్మకములుగను, తెలియజేయబడినవి ఆశ్వలాయన, కౌశిక, గౌతమ, శాండిల్యాదుల గృహ్యధర్మశ్రౌతసూత్రము లందు ఋగథర్వణములందలి సర్వౌషధుల ప్రయోగములును, వాటివి ఆయా ఆధివ్యాధులయందు ఉపయోగింపవలసిన వివిధ విధానములునవి వరముగ చెప్పబడినవి ఓషధులు అనంతములు, అనంత ఫలప్రదములు. ఈ ఓషధీచయమునుండి, ఆయుర్వేదమునందు నామ-రూప-గుణ-ధర్మ వర్ణనములతో ఐదువందల ఓషధులు సంగృహీతములై యున్నవి

| ఓషధీ విభజనము | | ఆయా ఓషధుల విభజన మిట్లున్నది - |
| --- | --- | --- |
| 1) సాధారణ ఓషధులు<br>(అ) గణములు-50/206<br>(ఆ) స్కంధములు 6/74 | 280 | రెండువందల ఎనుబది శొంఠి, పిప్పలి, మిరియాలు, కరక, తాని, ఉసిరిక మున్నగునవి |
| 2) కల్పౌషధులు - 76 | ఉదా | మామిడి, మర్రి, రావి మున్నగునవి |
| 3) మహౌషధులు - 64 | ,, | నేలగుమ్మడి, అష్టవర్గములు |
| 4) దివ్యౌషధులు - 80 | ,, | సోమలత, సంజీవన - సంధానకరణులు - |
| మొత్తము 500 | | |

ఇవి యన్నియు ఉపయోగ, ప్రయోగవిధులతో ముదిమిని, వ్యాధిని, ముడుతలను, పలితమును, హరించు రసాయన వాజీకరణములతో, అపమృత్యువును, అకాల మృత్యువును హరించునవిగాను, ఆధివ్యాధులకు గురిచేయు శత్రుప్రయుక్త విషదూషితమును, కాలదూషితమునగు వాయు మండల పరిశోధనములుగాను, సత్సంతానమును, సౌభాగ్యమును, సంపదను, వృద్ధిచేయునవిగాను, దీర్ఘాయుఃప్రదాయకములుగాను, స్నానము, పానము, అనులేపనము, ధూపము, భక్షణము మున్నగు కృత్యములందు ఉపయోగపడునవిగాను, క్రియాత్మకములుగాను, చికిత్సోపయుక్తములుగాను ఆయుర్వేదమునందు చెప్పబడినవి

ఆయుర్వేదీయ చికిత్స ఆరోగ్యభంజకములగు దుష్టక్రిమిసంహారములందు తప్ప, పశు పక్షి వృక్ష సముదాయాత్మకముగ, మానవారోగ్య రక్షణ సంవిధానము, లోకరక్షణ తాదాత్మ్యము కలది ఆయుర్వేదము వ్యాధిని నిశ్చయించుట, నిరోధించుట, నిర్మూలించుట మున్నుగాగల విధానమంతయు సిద్ధాంతరీత్యా ఒక్కటియే యైనను, ఆయుర్వేదమునందలి చికిత్సావిధానము నాలుగు భాగములుగా విభజింపబడి యున్నది.

(1) బ్రాహ్మ చికిత్స : ఇది సోమలత ఆదిగా ఓషధులు

సువర్ణము ఆదిగా లోహములు, వజ్రము ఆదిగా రత్నములు, ప్రధానముగా ప్రయోగింపబడు చికిత్సావిధానము. ఇది ఆరోగ్యరక్షణము ఆయుర్వర్ధనము, ప్రయోజనముగా గలది.

(2) ఆసురీ చికిత్స ఇది శస్త్రక్షారాగ్ని, దాహ, బంధన, ఛేదన, పాటన, సీవనములు ఆదిగాగల చికిత్సా విధానము విశేషముగా రోగనిగ్రహమునందిది ప్రయోజనము,

(3) శైవీచికిత్స ఇది రస, గంధక, విష, పాషాణాదులు ఉపయోగించు చికిత్సావిధానము ఇదియు ఆరోగ్య రక్షణము, ఆయుర్వర్ధనము లక్ష్యములుగాగలది ఇందలి రసము కల్పాంత ఆయుఃప్రదాన ప్రయోజనముగలది

(4) దైవీ చికిత్స ఇది మంత్రము, యంత్రము, జపము, తపస్సు స్వాధ్యాయము ధ్యానము, దానము, హోమము మున్నగు వివిధ విధానములుగల చికిత్సా విధానము

చికిత్సా విజ్ఞానగ్రంథములు ఈ చికిత్సావిజ్ఞానమును, ఆయుర్వేద-స్వరూప స్వభావములను, ఓషధులయొక్క ప్రభావ ప్రయోగ, ప్రయోజన మహత్త్వ స్వరూపములను, పాదరస సంయోజనమును తెలిసికొనుటకు, ఋగ్యజుస్సామాథర్వణ వేదములు, చరక, సుశ్రుత, సంహితలు, రసహృదయ, రసార్ణవ రసేశ్వర దర్శనములు, దత్తాత్రేయ, కాత్యాయన, కాకచండీశ్వర సిద్ధనాగార్జున కల్పతంత్రములు, అనన్తనన్ద వరాహసంహితలు పరిశీలింపదగి యున్నవి

మానవుని సృష్టికి ఓషధులు కారణమనియు, ఓషధుల నంతములుగా భారతభూమియందు కలవనియు, చెప్పి దివ్య దృష్టిసిరాజితులగు భారతీయ మహర్షులు దీర్ఘాయుః ప్రదములుగా చెప్పబడు దివ్యౌషధులయొక్క ప్రస్తావమున, సోమమును, సోమసమవీర్య ప్రభావములుగల ఓషధులు లభించు ప్రదేశములను వర్ణించియున్నారు సోమలత ప్రభావ ప్రయోజనములయందొక్కటియే యైనను, నామరూప విశేషములలో ఇరువదినాలుగు విధములుగానున్నది

హిమవత్పర్వతము, సహ్యాద్రి, మహేంద్రపర్వతము, మలయపర్వతము, శ్రీశైలము, దేవగిరి, పారియాత్రకము, వింధ్య, ఇతరేతర మహోన్నత పర్వతములు, వితస్తమహానది, సింధునది క్షుద్రమానస సరోవరము, దేవసుంద హ్రదము, ఇత్యాది ప్రదేశములందు సోమలత లభించును.

పై ప్రదేశములందు సంబరేను (జలకుంభి) అనునది కూడ లభించు వంగరాష్ట్రీయులు దీనినే "బ్రాహ్మి" అని అందురు ఇది అన్నిప్రాంతములందును విశేషముగా పెరుగును సోమము పూర్వోక్త హిమాలయాది ప్రదేశములందు విశేషముగా లభ్యమగుచునియు, సోమసమవీర్యములగు దివ్యౌషధీ గణములచట దొరకుననియు, సుశ్రుతవివరణము ఈ ఓషధులన్నియు చిత్రకూట శ్రీశైలారణ్యములలో రాత్రులందు తేజోవంతములై ప్రకాశించుచుండునట్లు చెప్పబడినది

"నిశిభాన్త్యచలేంద్రస్య-హుతాశ నశిఖాఇవ,
ఓషధ్యః స్వప్రభాలక్ష్మ్యా-భ్రాజమానాస్సహస్రశః"
(వాల్మీకి-అయోధ్యకాండ సం 94)

మరియొక విశేషము

"ఓషధయస్సంవదంతే, సోమేన సహ రాజ్ఞా !
యస్మై కృణోతి బ్రాహ్మణస్తం రాజన్పారయామసి"
(ఋ మం-10-సూ97-మం-22)

ఓరాజా! ఓషధీతత్త్వజ్ఞుడును, వేదసంపన్నుడునైన, వైద్యుడు మమ్ము ఏవ్యాధిగ్రస్తులయందు ప్రయోగించునో, ఆరోగులను, ఆయా వ్యాధులనుండి సంరక్షించెదము" అని ఓషధీశుడగు చంద్రునితో ఓషధులు ప్రతిజ్ఞ చేసినవట ఇట్టి ఓషధీవిజ్ఞానమంతయు వేదాదిగాగల సాహిత్యమునందు లభింపగలదు,

తపస్సు, సుశిక్షితమైన ప్రవర్తనము, శాస్త్రము కల వారికి ఓషధీసిద్ధి ఔషధసిద్ధి, వివిధ విజ్ఞానసమృద్ధశాస్త్రసిద్ధి, అసాధ్యసాధనసిద్ధి కలుగును తపోనియతిగలవారికి పొందరానిదిలేదు ఓషధీ సిద్ధియంతయు తపస్సిద్ధియందుగలదు

వి టి వి రా

## భారతపరిపాలనము-కేంద్రపాలన వ్యవస్థ

క్రీ శ 1600 వ సంవత్సరములో ఈస్ట్ ఇండియా కంపెనీ లండను నగరములో స్థాపింపబడెను భారతదేశములో వ్యాపారమును అభివృద్ధిచేసికొనుటయే తమలక్ష్యముగా కలిగి, అందునిమిత్తమై సూరత్ మొదలగు సముద్రతీర నగరములందు వ్యాపారస్థానముల నేర్పరచుకొని, వాటిని రక్షించుకొనుటకై ఈకంపెనీవారు కట్టుదిట్టములు చేసికొని, నియమనిబంధనముల నేర్పరచుకొనిరి క్రమముగా భారతదేశములో ఈకంపెనీవారు రాజకీయ అధికార గౌరవమును పొందిరి తత్ఫలితముగా వారిహయాములో దేశపరిపాలనా పద్ధతులు కూడ పటిష్ఠముగా రూపొందింపబడి ఆచ

భరణములోనికి కొని రాబడినవి. భారత దేశములో బ్రిటిష్ పాలకుల అధికారము అంతమగునాటికి, రాజ్యపాలనా విధానము క్రమపద్ధతిలో పరిణతినొందినది.

స్వతంత్ర భారతావనిలో 1950 జనవరి 26 వ తేదీన నూతన భారతరాజ్యాంగము ఆచరణములోనికి వచ్చినది. భారతీయ రాజ్యాంగవేత్తలు ప్రపంచమందలి ఆధునిక రాజ్యాంగముల నన్నిటిని పరిశీలించి, స్వీయదేశ పరిస్థితుల కనుగుణముగా వాటిని సమన్వయించి, నూతన రాజ్యాంగమును రూపొందించి, భారతీయుల కర్పించిరి. ఈ రాజ్యాంగము ప్రకారమే, నేడు భారతదేశము పరిపాలనము సాగుచున్నది.

భారత ప్రభుత్వము నేడు ప్రధానముగా ఫెడరల్ ప్రభుత్వముగా వ్యవహరించుచున్నది. ఈనాడు ఆచరణమం దున్న రాజ్యాంగము 'లిఖిత రాజ్యాంగశాసన' మనబడుచున్నది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వముల నిర్మాణము, రాజ్యాంగ శాసనములో వాటి అధికార విభజనమును గూర్చిన స్పష్టీకరణము, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వముల నడుమ కలుగు తగాదాల పరిష్కారమున కేర్పడిన పరమోన్నత న్యాయస్థాన (సుప్రీంకోర్టు) స్థాపనము - ఇత్యాది అంశములు ఫెడరల్ రాజ్యాంగలక్షణములను తెలుపుచున్నవి. కాని అత్యవసర పరిస్థితులలో దేశాధ్యక్షున (రాష్ట్రపతి) కీయబడిన అధికారములు, రాష్ట్రగవర్నరులను నియమించు అధికారము అధ్యక్షునిచే నిర్వహింపబడుట, హైకోర్టుల న్యాయాధీశులు అధ్యక్షునిచే నియమింపబడుట, కేంద్రమునకు, రాష్ట్రములకు ఒకేఒక ఎలెక్షను కమిషను వ్యవహరించుట, దేశమంతట ఒకేఒక్క ఆడిట్ ఎక్కౌంటు విధానము ఆచరణమందుండుట, కేంద్రమునకు, రాష్ట్రములకు ఉభయతారకముగా అఖిలభారత ఉద్యోగివర్గ నియమనిబంధనము లేర్పడుట - ఇత్యాది అంశములు ఏకరాష్ట్ర ప్రభుత్వ లక్షణములను తెలుపుచున్నవి.

భారత ప్రభుత్వము పార్లమెంటరీ విధానము ననుసరించి రాజ్యపాలనమును నెరపుచున్నది. కార్యనిర్వహణశాఖ శాసననిర్మాణశాఖా విషయమున బాధ్యతవహించి వ్యవహరించుటవలన, పరిస్థితుల కనుగుణముగా ప్రభుత్వము రాజ్యమేలుటకు అవకాశముండును. పరిపాలనను కార్యనిర్వహణశాఖచే నడుపబడుటవలన, ప్రభుత్వము పరోక్షముగా శాసనసభలయెడల బాధ్యత కలిగియున్నది. భారత ప్రభుత్వ పరిపాలనా వ్యవస్థయందు కొన్ని శాఖలును, వాటికి సంబంధించిన కార్యాలయములును గలవు. ప్రతి మంత్రిత్వశాఖయందు దానికి సంబంధించిన విభాగములు, వాటి అనుబంధ కార్యాలయములు, ఉపకార్యాలయములు ఉండును. ఇవికాక, సచివాలయము, ప్లానింగ్ కమీషను కార్యాలయము, అధ్యక్షుని కార్యాలయము, ప్రధానమంత్రి కార్యాలయము, లోక్‌సభా కార్యాలయము, రాజ్యసభా కార్యాలయము మొదలగు వియు కలవు. ఆయా మంత్రిత్వశాఖలకు సంబంధించిన విభాగముల ద్వారా ప్రభుత్వ కార్యకలాపములు నిర్వహింపబడుచుండును. పై కార్యాలయములే కాక, రాజ్యాంగరీత్యా ప్రత్యేకముగా పేర్కొనబడిన హోదాలు కలిగిన ఏజెన్సీలు కూడ కలవు. యూనియన్ పబ్లిక్ సర్వీసు కమిషను, కంప్ట్రోలర్ - ఆడిటర్ జనరల్, అటార్నీ జనరల్, ఎలెక్షన్ కమీషనర్, షెడ్యూల్డ్ కులములకు, జాతులకు సంబంధించిన కమీషనర్, మున్నగువారు ఈ ఏజెన్సీల క్రిందికి వత్తురు. వీరికి సంబంధించిన కార్యాలయములు ఏజెన్సీల పర్యవేక్షణము క్రింద పనిచేయును.

పరిపాలనా సౌకర్యముకొరకు పాలకవ్యవస్థ మంత్రిత్వశాఖలుగా విభజింపబడును. ఒక మంత్రిత్వశాఖ పరిపాలనా వ్యవస్థయందలి పెద్ద విభాగము. ఈ విభాగము వివిధపక్షములుగ, ఉపపక్షములుగ, ఉపశాఖలుగ, ఇంకెన్నియో అంతర్భాగములుగ విభజింపబడును. అన్యోన్య సంబంధము కల అంశములకు బాధ్యతవహించుచు, పరిపాలనమునకు అనువుగ నుండి, ఒక మంత్రి యొక్క అధీనమందున్న భాగము మంత్రిత్వశాఖ యనబడును. ఒక్కొక్క సందర్భములో ఒకానొక మంత్రిత్వశాఖయందు రెండు లేక మూడు విభాగము లుండవచ్చును. ఈ విభాగములు పరిపాలనా నైపుణ్యముగల కార్యదర్శి యొక్క అధీనమునం దుండును. మంత్రిత్వశాఖ ఒక క్యాబినెట్ మంత్రి క్రిందనో, లేక స్టేట్ మంత్రి క్రిందనో అవసరమైనచో ప్రధానమంత్రి క్రిందనో వ్యవహరించుచుండును. రాజ్యాంగము ననుసరించి పార్లమెంటుచే ఆమోదించబడిన శాసనము లను అమలులో నుంచుట, తదనుగుణమగు విధానములను రూపొందించుట మున్నగు కార్యకలాపములను ఆయా మంత్రిత్వశాఖలు నిర్వహించుచుండును. ఒక మంత్రిత్వ శాఖయందు మూడు భాగములుండును (1) రాజకీయశాఖ (2) సెక్రటేరియట్ శాఖ (3) కార్యనిర్వాహకశాఖ.

**రాజకీయశాఖ :** ఈ శాఖకు మంత్రి అధినేత. ఇది ప్రభుత్వ విధానములను స్థూలముగా సూచించుచు వాటి కను

గుణముగ నుండు సమస్యలను చర్చించి నిర్ణయములు తీసికొనుచుండును. ఏవిషయములను మంత్రిమండలి సమష్టిగా నిర్ణయింపవలెనో, ఏవిషయములను మంత్రి స్వయముగా నిర్ణయింపవలెనో విశదీకరించు నియమములు ఏర్పడియుండును వాటిననుసరించి మంత్రులు వ్యవహరింతురు. తనశాఖ సమర్థవంతముగా పనిచేయుబాధ్యత మంత్రి స్వీకరించును. మంత్రిత్వశాఖలో పదవోద్యోగి ఎట్టిపొరపాటుచేసినను, తుది బాధ్యత మంత్రిదేయగును పార్లమెంటులో బిల్లులను ప్రవేశపెట్టుట, ప్రశ్నలకు సమాధానములొసగుట, తనశాఖకు సంబంధించినచర్చలలో పాల్గొనుట మున్నగు చర్యలను మంత్రి ఆచరించును

మంత్రిత్వశాఖలోని సెక్రటేరియట్ విభాగమునకు ఒక కార్యదర్శి అధిపతిగా నుండును. ఇతని పర్యవేక్షణ, నియంత్రణముల క్రింద ఈ కార్యాలయ విభాగము పనిచేయును ఈశాఖకు సంబంధించు మంత్రికి ఇతడు సలహాల నిచ్చుచుండును ఎప్పటికప్పుడు ఉత్పన్నమగు సమస్యలకు సంబంధించిన సర్వవిషయములను ఇతడు మంత్రిదృష్టికి తీసికొనివచ్చును ప్రభుత్వ విధానములను రూపొందించుటలో మంత్రికి ఇతడు సాయపడుచుండును పబ్లిక్ అకౌంట్సు కమిటీ ఎదుట ఈ కార్యదర్శియే తనశాఖకు ప్రాతినిధ్యము వహించును ఒకరికంటె ఎక్కువమంది కార్యదర్శులున్నచో, వారిలో సీనియర్ కార్యదర్శియే ముఖ్య సలహాదారుడుగ నుండును మంత్రితో సహకరించుచు, ప్రజలశ్రేయస్సును దృష్టియం దుంచుకొని తనశాఖ సామర్థ్యముతో పనిచేయునట్లు కార్యదర్శి చూచుచుండును ఈ సెక్రటరీక్రింద వరుసగా అడిషనల్ లేక సంయుక్త కార్యదర్శులు, డెప్యూటీ కార్యదర్శులు, ఉపకార్యదర్శులు పనిచేయుచుందురు పక్షమునకు అధిపతిగా అడిషనల్ లేక సంయుక్త కార్యదర్శి వ్యవహరించుచుండును ఉపపక్షమునకు (సబ్ డివిజన్) అధిపతిగా సహాయ కార్యదర్శి వ్యవహరించుచుండును శాఖాధిపతిగా ఉపకార్యదర్శి పనిచేయుచుండును సామాన్యముగా వీరందరు ఐ ఎ ఎస్ శ్రేణికి చెందిన అధికారులై యుందురు విదేశాంగశాఖకు ఐ. ఎఫ్. ఎస్. శ్రేణికి చెందినవారు కార్యదర్శులుగా నుందురు

ఉపకార్యదర్శి క్రింద పనిచేయు సిబ్బందిలో వరుసగా, సెక్షను ఆఫీసరులు, అసిస్టెంటులు, యు డి సి. లు, ఎల్ డి సి లు, స్టెనోగ్రాఫరులు, టైపిస్టులు చేరియుందురు ఈ కార్యాలయములకు అనుబంధములుగా పనిచేయు శాఖలు కూడ నుండును అవి సాంకేతిక సలహాల నిచ్చుచుండును కేంద్ర జలవిద్యుచ్ఛక్తి కమీషను మొదలయినవి ఇట్టిపనులను చేయుచుండును

కార్యనిర్వాహకవిభాగము రూపొందించబడిన విధానము ననుసరించి ఒకప్రత్యేకమైన డిపార్టుమెంటు తన కార్యకలాపములను నిర్వహించుచుండును సెక్రటేరియట్ కాక ఇది వేరొకభాగము ఈభాగమునకు చెందిన ప్రధానాధికారి డిపార్టుమెంటు అధినేత అనియు, లేక డైరెక్టరు జనరల్ అనియు, లేక కమీషనరు అనియు పిలువబడును ఈభాగము ముఖ్యముగా కార్యనిర్వహణమునకు తోడ్పడునట్టిది

ప్రస్తుతము భారతప్రభుత్వమునందు ఇరువది మంత్రిత్వశాఖలును, ఒకప్రత్యేక విభాగమును వ్యవహారమునందుకలవు. ఈ ప్రత్యేకవిభాగము అణుశక్తికి సంబంధించియున్నది పైన పేర్కొనబడిన ఇరువది మంత్రిత్వశాఖలు ఈదిగువ ఉదాహరించబడినవి

(1) దేశవ్యవహారములశాఖ
(2) ఆర్థికశాఖ
(3) రైల్వేశాఖ
(4) రక్షణశాఖ
(5) విదేశాంగశాఖ
(6) వాణిజ్యశాఖ
(7) ఉక్కుగనులు, లోహములశాఖ
(8) పారిశ్రామికాభివృద్ధి, కంపెనీ వ్యవహారముల శాఖ
(9) పెట్రోలియము, రసాయనములు, సాంఘిక సంక్షేమశాఖ
(10) గృహనిర్మాణము, సప్లయి, పనులశాఖ
(11) రవాణా, నౌకాశాఖ
(12) పౌర విమానయాన, విహారయాత్రాశాఖ
(13) కార్మిక, పునరావాసశాఖ
(14) ఆహార, వ్యవసాయ, సహకార, సామాజికాభివృద్ధిశాఖ
(15) నీటిపారుదల, విద్యుచ్ఛక్తిశాఖ
(16) న్యాయశాఖ

(17) విద్యాశాఖ
(18) సమాచార, ప్రసారశాఖ
(19) ఆరోగ్యము, కుటుంబనియంత్రణము
(20) పార్లమెంటరీ వ్యవహారములు, రహదారులు

వి వి సు

## భారతపరిపాలనము-పంచాయతీరాజ్యము

మన దేశసౌభాగ్యము గ్రామసౌభాగ్యము మీదనే ఆధారపడి యున్నది గ్రామవ్యవస్థ భారతదేశమందలి సాంఘిక, రాజకీయ జీవితములో అతి పురాతనమైనది. గ్రామ జీవితమువలన పెక్కులు లాభములు గలవు స్వయంపరిపాలనమునకు గ్రామమే పునాది ఇచ్చట మానవస్వేచ్ఛ నిరాటంకముగా వృద్ధిపొందుటకు అవకాశము ఉన్నది. దేశరక్షణకు వలయు దృఢకాయులైన వ్యవసాయకులకు ఇది ఆలవాలము.

మన దేశచరిత్రలో గ్రామమున కెప్పుడును అధిక ప్రాధాన్య ముండెడిది హిందూయుగమున పరిపాలన వ్యవస్థలలో అదియే ప్రథమసోపానము మొగలు కాలమున గూడ గ్రామమునకు అధికగౌరవ ముండెడిది బ్రిటిషు యుగమున దీని ప్రాముఖ్యము క్షీణించినను, రిప్పన్ ప్రభువు ప్రవేశపెట్టిన సంస్కరణముల మూలమున స్థానిక స్వపరిపాలనా కార్యక్రమమునందు మరల గ్రామములకు ఒకింత స్వతంత్రత యేర్పడెను

భారతదేశము స్వతంత్రమైన పిమ్మట సాధింపబడిన ఘనవిజయములలో పంచాయతీ రాజ్యప్రణాళిక యొకటి అధికార వికేంద్రీకరణ సూత్రము ననుసరించి గ్రామపంచాయతీలకు, పంచాయతీ సమితులకు, జిల్లాపరిషత్తులకు, విరివిగా అధికారము లియ్యబడినవి ఈ ప్రణాళికను అమలు పరచుటతో భారతజాతికి పితయగు మహాత్మాగాంధియొక్క ఆశయము నెరవేరినది

పంచవర్ష ప్రణాళికలోని ప్రజాహిత కార్యములను గ్రామమునకు సంబంధించినంతవరకు, పంచాయతీ రాజ్యశాఖా కార్యదర్శియొక్క ఆదేశప్రకారము గ్రామపంచాయతీలు నిర్వహించుచున్నవి కనీసము 500 మంది జనాభాగల గ్రామపరిపాలనమును పర్యవేక్షించుటకు ప్రభుత్వము ఒక ప్రత్యేకపు టుద్యోగిని నియమించుచున్నది ఇదిగాక పంచాయతీచట్టము ప్రకారము రాజేంద్రనగరు, కొత్తగూడెము మొదలగు పలుప్రదేశములకు 'టౌన్ షిప్పులను' కూడ యేర్పాటు చేసియున్నారు ప్రతి గ్రామమునందును వ్యవహారములను సరిచూచుకొనుటకు గ్రామసభ యొకటి యేర్పడి యున్నది ఈ సభ సంవత్సరమునకు కనీసము రెండుపర్యాయములైనను సమావేశమై (1) గ్రామసంబంధమైన లెక్కలను (2) గత సంవత్సరపు పరిపాలనమును (3) ఆ సంవత్సరపు నూతన కార్యక్రమమును, (4) క్రొత్తపన్నుల విధింపు. మొదలగు విషయములనుగూర్చి చర్చింపవలయును.

కొన్ని రాష్ట్రములయందు సర్పంచిని గ్రామస్థులు, ఇతర పంచాయతీ సభ్యులతోపాటుగా ఎన్నుకొందురు కాని ఆంధ్రప్రదేశములో వీరిని పరోక్షముగనే అనగా పంచాయతీ సభ్యుల నుండియే ఎన్నుకొనవలయును ఎన్నికయైన తరువాత వీరు తమ పదవులకు రాజీనామాల నియ్యవచ్చును

గ్రామపంచాయతీ పరిపాలనాధికారియు (సర్పంచ్) అతనికి సాయముగానుండు మరియొక యధికారియు గ్రామ వ్యవహారములను పర్యవేక్షించుచుందురు పరిపాలనా కార్యక్రమమును రూపొందించుట యందును, కార్యనిర్వహణము నందును, ప్రధాన పాలనాధికారి ముఖ్యపాత్ర వహించుచుండును పన్నులను విధించుటయందును, వసూలుచేయుట యందును, ఇతడు అధికారమును చలాయించుచుండును

**సర్పంచ్ అధికారములు** ఇతడు పంచాయతీ సభ్య సమావేశమునకు అధ్యక్షుడు ఈ సమావేశములను జరుపవలసిన బాధ్యత అతనిపై యున్నది పంచాయతీ రికార్డు నంతయూ అతడు పరిశీలింపవచ్చును

పంచాయతీకి సంబంధించిన ఉద్యోగులనందరిని అతడు నియమింపవచ్చును మాసమునకొకసారి యైనను గ్రామపంచాయతీ సమావేశము జరుగునట్లు అతడు పర్యాటుచేయవలయును. మూడుమాసములు వరుసగా సమావేశము జరుపబడనిచో అతనిపై సభ్యులు విశ్వాసరాహిత్యతీర్మానమును ప్రవేశపెట్టి అతనిని పదభ్రష్టుని చేయవచ్చును

**పంచాయతీ నిర్వహణాధికారి** గ్రామ పరిపాలనమును కార్యనిర్వహణాధికారి నిర్వహించుచుండును ఇతడు పంచాయతీకి బాధ్యుడై, ఆదాయ, వ్యయ పట్టీని తయారుచేయవలయును గ్రామపంచాయతీలు సాధారణముగా, గ్రామజనులయొక్క ఆరోగ్యమును గూర్చియు, విద్యావిషయములను గూర్చియు ఇతర సంక్షేమ కార్యక్రమములను గూర్చియు విచారించుచు పరిపాలన నెరపవలయును

ప్రభుత్వాధికారములు: ప్రభుత్వమునకు పంచాయతీల మీద అధికారమున్నది. జిల్లా పంచాయతీ ఆఫీసర్లను నియమించుట, ప్రతిసంవత్సరము గ్రామ పరిపాలనమును గూర్చి సమర్పించబడు నివేదికను ఆమోదించుట, ఆస్తిసేకరణము, విక్రయము, పన్నువిధింపు మొదలుగాగల అధికారములను ప్రభుత్వము నిర్వహించుచున్నది.

న్యాయపంచాయతీలు: పంచాయతీ చట్టప్రకారము న్యాయపంచాయతీలను ప్రభుత్వము ఏర్పాటుచేసికొనుచున్నది. గ్రామస్థులచే ఎన్నుకొనబడు ఈపంచాయతీలు గ్రామసంబంధమైన సివిల్, క్రిమినల్ కేసులను విచారింపవచ్చును. ఈ న్యాయమూర్తులు 'న్యాయాధ్యక్షుడు' 'న్యాయఉపాధ్యక్షులు' అని పిలువబడుచున్నారు. 250 రూ॥ లకు మించని విలువగల వ్యాజ్యములను వీరు విచారింపవచ్చును. చిన్న చిన్న నేరములను అనగా, పదిరూపాయల విలువను మించని దొంగతనములను, చిన్నతగాదాలను, వీరు విచారింపవచ్చును. గ్రామములలోని రాజకీయ, ఆర్థిక, సాంఘిక వాతావరణదృష్ట్యా నిష్పక్షపాతమగు న్యాయమును కలుగజేయుటకు న్యాయపంచాయతీలు యత్నింపవలయును.

పంచాయతీ సమితి: 1959 లో అమలులోనికి తేబడిన "పంచాయతీసమితి-జిల్లాపరిషత్తు" చట్టమునననుసరించి ఆంధ్ర రాష్ట్రములో పంచాయతీరాజ్యమేర్పరుపబడినది. ఈచట్టము ప్రకారము ప్రతిపంచాయతీసమితి, బ్లాకుకొరకు ఏర్పరుపబడినదో, ఆబ్లాకు పేరును కలిగియుండును. ఈసమితియందు ఎన్నుకొనబడు సభ్యులను, రాష్ట్రశాసనసభనుండి వచ్చు అసోసియేట్ సభ్యులను ఉద్యోగాధికార సభ్యులును కలిసి యుందురు. జిల్లా కలెక్టర్లు వీటి ఎన్నికలను జరుపుదురు. ఈ సమితికి అధ్యక్షుడును, ఉపాధ్యక్షుడును, ఉందురు. వీరికి గౌరవవేతనములను ప్రభుత్వము ఇచ్చుచున్నది. [illegible] సంవత్సరముల కాల[illegible] పదవులలో నుందురు.

అధ్యక్షుని అధికారములు: [illegible]రిపాలనాధికారము కల్గియున్న సమితి అధ్యక్షుడు బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసరు (బి. డి. ఓ) తన సమితియొక్క తీర్మానములను ఆచరణములో పెట్టుచు లేని విషయములను పరిశీలింపవచ్చును. సమితిని మూడుమాసముల కొకసారి ఇతడు సమావేశపరుపవలయును. లేనిచో ఇతడు అధ్యక్షపదవికి అనర్హుడగును. అత్యవసర పరిస్థితులయందు బి. డి. ఓ తో సంప్రదించి సమితికి సంబంధించిన కార్యములను ఇతడు నిర్వహింపవచ్చును; ఇతనిపై విశ్వాసరాహిత్య తీర్మానమును సమితి తీసికొని రావచ్చును.

పంచాయతీసమితి ఆదాయవ్యయ పట్టికను తయారుచేసి ప్రజాక్షేమమునకై వ్యవసాయ క్షేత్రములను, గ్రామ సహకారపరిశ్రమలను, పరపతిసంస్థలను నెలకొల్పి వ్యవసాయాభివృద్ధికి పరిశ్రమాభివృద్ధికి తోడుపడవలయును. పంచాయతీ సమితియొక్క కార్యకలాపములు, దానిక్రిందపనిచేయు ఉపసంఘములలోని, అనుభవముకలవారిచే జరుపబడుచున్నవి.

బి. డి. ఓ. విధ్యుక్తధర్మములు: సమితి కార్యక్రమమునంతయు క్రమమైన పద్ధతితో జరుపుట బి. డి. ఓ. యొక్క విధ్యుక్తధర్మము. ఇతడు పరిపాలనాదక్షతగలవాడై, ప్రజాసేవాతత్పరుడై యుండవలెను. అధ్యక్షునకు సలహాలిచ్చుట, సమితి ఆర్థిక వ్యవహారములను సరిదిద్దుట, గ్రామస్థులకు గ్రామ వ్యవహారములందు ఆసక్తి కలుగజేయుట-ఇతని విధులలో ముఖ్యమైనవి. ఏపంచాయతీ సమితియైనను తన ఆదాయ వ్యయపట్టికయందు పేర్కొనబడని వ్యయమును చేయరాదు. సమితుల ఆర్థికస్వాస్థ్యమునకై ప్రభుత్వము అవసరమైన ధనమును మంజూరు చేయుచుండును.

జిల్లాపరిషత్తు: ప్రభుత్వము, ప్రకటనద్వారా జిల్లా పరిషత్తులను ఏర్పరుపవచ్చును. సమితి అధ్యక్షులు, ఎక్స్-అఫిషియో సభ్యులు, ఎన్నికయైన సభ్యులు, అసోసియేట్ సభ్యులు [illegible] త్తులో నుందురు. వీరుగాక, జిల్లా కలెక్టరును, రాష్ట్రశాసన సభకు, లోక్‌సభకు ఆజిల్లానుండి ఎన్నికయైన సభ్యులను, ఆ జిల్లానుండి రాజ్యసభకు ఎన్నికయైనవారిలో [illegible] ప్రభుత్వముచే నియమింపబడు[illegible]రును, [illegible] సభ్యులుగా [illegible] జిల్లాపరిషత్తునకు [illegible] ఉపాధ్యక్షులు [illegible] యుందురు. వీరందరు [illegible] పదవులలో నుందురు.

పంచాయతీ సమితులయొక్క బడ్జెట్టులను ఆమోదించుటను, ప్రభుత్వము మంజూరుచేసిన ధన[illegible] పంచాయతీ సమితులకు పంచియిచ్చుటకు [illegible] విధించుటను ప్రభుత్వమునకు జిల్లాలోని సర్వతోముఖాభివృద్ధిని గూర్చి సలహాలిచ్చుటకును, ప్రభుత్వపు అనుమతితో [illegible] చేయుటకును జిల్లాపరిషత్తునకు అధికారమున్నది.

ప్రతి జిల్లాపరిషత్తునకును ప్రభుత్వముచే నియమింపబడు కార్యదర్శి యుండును. జిల్లాపరిషత్తుయొక్క తీర్మానములను ఇతడు ఆచరణములో పెట్టవలయును. జిల్లాపరిషత్తులోని

ఉద్యోగస్థులపై ఇతనికి పాలనాధికారము కలదు పరిషత్తు అనుమతితో పరిషత్తునకు చెందిన స్థిరాస్థులను కౌలునకిచ్చుటకును, ఇతరవిధముల వాటిని ఉపయోగించుటకును ఇతడధికారము కల్గియుండును

ప్రతి పరిషత్తునందును, స్థాయీసంఘము లుండును విద్యావ్యాప్తికి స్త్రీ, శిశుసంక్షేమమునకు సాంఘికాభివృద్ధికి రహదారులు, పన్నులు, ఆర్థికవ్యవహారములు మున్నగు పెక్కు శాఖలకు ప్రత్యేకమైన కమిటీలున్నవి ప్రభుత్వమిచ్చు ధనము కాక, స్వయముగా విధించు పన్నులవలనను, నమితులిచ్చు విరాళముల వలనను పరిషత్తులు ధనమును సేకరించుచున్నవి

పంచాయతీ రాజ్యముయొక్క విజయము ప్రజలపై ఆధారపడి యున్నది ప్రజలు విద్యావిహీనులైనచో స్థానిక స్వపరిపాలనము విజయవంతము కానేరదు పంచాయతీ రాజ్యపరిపాలనా విధానము విద్యార్థులకొక పాఠ్య విషయముగా విద్యాప్రణాళికలలో ఏర్పరచబడినది

జి వెం సు

## భారతపరిపాలనము-ప్రణాళికా విధానము.

ఏ వ్యవస్థ అయినను తన లక్ష్యములను సాధింపవలెనన్నచో ఒకవిధమగు ప్రణాళిక అవసరము పరిపాలనా కార్యకలాపముల లక్ష్యములను నిర్ణయించు పద్ధతి, నిర్ణీత లక్ష్యములు సిద్ధించుటకు చేయు యత్నములు, సంకల్పించిన కార్యక్రమమును నెరవేర్చు విధానము, 'యోజన' లేక ప్రణాళిక యనబడును. సహకారము సమష్టిగా చేయబడిన కార్యకలాపములందు యోజన ఇంకను స్పష్టముగా కనిపించును

నేడు ప్రపంచములో కొన్ని అభివృద్ధి చెందిన దేశములును, కొన్ని వెనుకబడిన దేశములును కలవు బ్రిటను, అమెరికా రష్యాలవంటివి అభివృద్ధి చెందిన దేశములు ఆర్థికముగా, పారిశ్రామికముగా, సాంకేతికముగా ఇవి పురోగమనము చెందినవి భారతదేశమువంటి మరికొన్ని దేశములు వెనుకబడిన దేశములు ఒక దేశము జాతీయముగా ఆర్థికాభివృద్ధి పొందవలయునన్నచో, ప్రణాళికయే శరణ్యము. పరిమిత కాలములో, సాధన సంపదల నన్నింటిని వినియోగించుకొని, స్వయంసమృద్ధి పొందవలెనన్నచో ప్రణాళికలు అవసరము, సోవియట్ రష్యా తొలుత 1928 నుండి ప్రణాళికలను రూపొందించి వాటిని అమలులో నుంచుచు విశేషముగా అభివృద్ధిచెందిన మొదటిదేశము ఇతర కమ్యూనిస్టు రాజ్యములలో కూడ ఇట్టి ప్రణాళికలు అమలులో నున్నవి ఒకప్పుడు ప్రణాళిక అను పదము సోషలిస్టు దేశములకు సంబంధించినదే అని అనుకొనెడివారు కాని ఇప్పుడీ పదము ప్రసిద్ధమై అన్ని దేశములందు అనగా పెట్టుబడిదారీ విధానముగల దేశములందు కూడ అమలులో నున్నది

పరిపాలనము ననుసరించిన కార్యకలాపములందు భావి ఎత్తుపై నిర్ణయములు తీసికొని, అందలి లక్ష్యసిద్ధికొరకు అనుసరించవలసిన శ్రేష్ఠమగు మార్గములను రూపొందించి కాలము, ధనము, శ్రమయు వృథకాకుండ అనుకొనిన లక్ష్యము సిద్ధించినదా లేదా యని పరిశీలించుకొని ఆ ఫలితములనుబట్టి ముందునకు సాగుటే ప్రణాళికల నేర్పరుచుటయందురు స్థూలముగా మూడురకముల ప్రణాళిక లున్నవి

1 సాంఘిక, ఆర్థిక ప్రణాళికలు (2) పరిమిత యోజనలు (3) పరిపాలనమునకు సంబంధించిన యోజనలు

మొదటిరకపు ప్రణాళిక సమగ్రమైన ప్రణాళిక అనబడును సంఘములోని అన్ని సాధనసంపదలను, సంఘముయొక్క ఆశయములను, కార్యకలాపములను దృష్టియందుంచుకొని చేయబడిన యోజన ఇది ఇందు సామాజిక కార్యకలాపము లన్నిటికి సమగ్రమగు పథకము వేయుట జరుగును ఇట్టి ప్రణాళికలు రష్యావంటి సోషలిస్టు రాజ్యములలో అమలునందున్నవి ఆర్థిక సంపదను పెంపొందించునట్టి గనుక వీటిని ఆర్థిక ప్రణాళికలందురు ఇట్టి ప్రణాళికలందు దేశములోని ఉత్పత్తిసాధనములను, వినిమయ సాధనములను ప్రభుత్వము తనచేతిలో నుంచుకొనును ప్రజాస్వామ్య వ్యవస్థలందట్టి సమగ్ర ప్రణాళికలను నిర్వహించుట కష్టము

రెండవ రకమునకు చెందిన పరిమిత ప్రణాళికలు భారత దేశమువంటి ప్రజాస్వామ్య దేశములలో నున్నవి. వీటి ననుసరించి సంఘములోని సాంఘిక, ఆర్థిక, కార్యకలాపము లన్నియు కేంద్రీకరింపబడవు కొన్ని ముఖ్యలక్ష్యములను మాత్రము ఎన్నుకొని వాటిసిద్ధికొరకు యత్నించుటజరుగును ప్రభుత్వము కొన్ని కార్యక్రమములనుచేపట్టి నిర్వహించును పైవేటుగా వ్యక్తులు తమస్వంత పెట్టుబడులతో కొన్ని వ్యవస్థలను నిర్వహింతురు ఈప్రణాళికల నిర్వహణములో రాజ్యములోని సర్వసాధన సంపదలను ప్రభుత్వము తన హస్తగతముచేసికొనదు, ప్రజలస్వేచ్ఛా, స్వాతంత్ర్యములు అరికట్ట

నుండును ఇతనిక్రింద సెక్షనుఆఫీసరు, అసిస్టెంటులు (అప్పర్ డివిజన్ గుమస్తాస్థాయి), లోయర్ డివిజన్ గుమస్తాలు, టైపిస్టులు, పనిచేయుచుందురు జనరల్ అడ్మినిస్ట్రేషను డిపార్టుమెంటుకు అధినేతగానుండు ప్రధానకార్యదర్శి తనడిపార్టుమెంటులోనేగాక అన్ని డిపార్టుమెంటులపై పర్యవేక్షణ మొనర్చుచు వాటిపై అధికారమును నెరపుచుండును ఉదా ఆంధ్రప్రదేశ సచివాలయమునందలి 18 డిపార్టుమెంటులు (1) జనరల్ అడ్మినిస్ట్రేషన్ (2) హోమ్ (3) ఆర్థిక వ్యవహారములు, (4) రెవెన్యూ, (5) ప్లానింగ్ (6) పంచాయతీరాజ్యము (7) ఆరోగ్యము, గృహనిర్మాణము, మునిసిపల్ పరిపాలనము (8) ఆహారము, వ్యవసాయము, (9) పబ్లిక్ వర్క్సు, (10) విద్య, (11) వాణిజ్యము, (12) న్యాయశాఖ, (13) పరిశ్రమలు, కార్మికశాఖ

కేంద్రములో ఒక్కొక్క మంత్రిత్వశాఖకు అధిపతిగా ఒక్కొక్కమంత్రి పనిచేయుచుండును రాష్ట్రస్థాయిలో అట్లుగాక రెండు మూడువిషయములకు ఒకరు మంత్రిగానుండుట జరుగుచున్నది కనుక రాష్ట్ర సచివాలయములోని కార్యదర్శి, కేంద్రములోవలె ఒకేమంత్రిక్రింద పనిచేయక ఇద్దరు లేక ముగ్గురు మంత్రులకుకూడ బాధ్యతను వహింపవలసిన వాడగుచున్నాడు, కార్యవిధానములను రూపొందించుటలోకూడ ఒకరికంటె ఎక్కువమందికి ఆతడు సాయపడవలసిన వాడుగ నుండును

రాష్ట్ర పరిపాలనమందు ప్రముఖపాత్రవహించు ప్రధాన కార్యదర్శిపదవికి సాధారణముగా సీనియరుగానున్న ఐ సి యస్ లేక ఐ ఎ యస్ అధికారి నియమింపబడును ఆంధ్రప్రదేశములో రెవెన్యూబోర్డు మెంబర్లనుండి ప్రధాన కార్యదర్శి నియమింపబడు చున్నాడు ఇతడు మంత్రిమండలి సభలకు హాజరై కార్యదర్శిగా పనిచేయును అచ్చటి నిర్ణయములను ఆయాడిపార్టుమెంటుల సెక్రటరీలకు పంపుచుండును శాంతిభద్రతలు, రాజకీయ వ్యవహారములు సర్వీసులు, నియమనిబంధనలు, అవినీతినిరోధము మొదలగు రాష్ట్రములోని అతి ప్రధానమైన విషయములకు ఇతడు బాధ్యతవహించును

రాష్ట్రము జిల్లాలుగాను, జిల్లాలు తాలూకాలు (తహసీల్లు) గాను విభజింపబడియున్నవి పెక్కుగ్రామములతో కూడిన తాలూకాయే పరిపాలనమునకు ప్రాతిపదిక పట్టణములు మునిసిపల్ పరిపాలనము క్రిందనుండును రాష్ట్రములు అయిదు ప్రాంతములుగా విభజింపబడినవి వీటికి జోనల్ కౌన్సిల్లు ఏర్పాటుచేయబడినవి ఇవి కేంద్రమునకు సలహా సంఘములవలె పనిచేయును ఆర్థిక విషయములందును ప్రణాళికల విషయములలోను, సరిహద్దుల విషయములను సరిదిద్దుటలోను, అంతరరాష్ట్రీయ రవాణా విషయములందును, భాషావిషయక, అల్పసంఖ్యాకుల విషయములందును కేంద్రమునకు ఇవి సలహానిచ్చుచుండును

జిల్లా అధికారిని దాదాపు అన్ని రాష్ట్రములలోను కలెక్టరు అని యందురు శిస్తువసూలుచేయు ముఖ్యబాధ్యత అతనిదిగనుక, అతనికి ఆ పేరువచ్చినది కొన్ని రాష్ట్రములందలి జిల్లాలలో ఈ అధికారి డెప్యూటీకమీషనర్ అనిగాని, డిస్ట్రిక్టు మేజస్ట్రేటు అనిగాని చెప్పబడుచున్నాడు కాని జిల్లా పరిపాలనమున కంతటికిని ఇతడే ముఖ్య అధికారిగా నుండి ఎన్నియో విధులను నిర్వహించును

వా వెం. సు

## భారత రాజ్యాంగ శాసనము:

భారతదేశము 1947 ఆగస్టు 15వ తేదీన స్వతంత్రరాజ్యమైనది అనంతరము దేశమందలి ప్రజాప్రతినిధులతో ఏర్పడిన రాజ్యాంగ శాసన నిర్మాణపరిషత్తు రాజ్యాంగ శాసనమును రూపొందించినది ఈ శాసనము 1950 జనవరి 26వ తేదీన అమలులోనికి వచ్చినది నాటినుండి రాజ్యపాలనము దాని ననుసరించి సాగుచున్నది లిఖితరూపమున నున్న ఈ శాసనము ప్రపంచమందున్న రాజ్యాంగ శాసనము లన్నిటికంటెను దీర్ఘమైనది దానియందు 395 అంశములును, 9 షెడ్యూల్లును గలవు, కాలక్రమమున ఈ రాజ్యాంగ శాసనమునకు మార్పులు, చేర్పులు జరిగి మరింతగా పెరిగినది

ఉపోద్ఘాతము రాజ్యాంగ శాసనము ఉపోద్ఘాతముతో ప్రారంభమగును దీనియందు రాజకీయాధికారము ప్రజలదేననియు, రాజ్యాంగ శాసననిర్మాతలు ప్రజలేననియు సూచింపబడినది వారి జీవితలక్ష్యములు, వారి స్వేచ్ఛాస్వాతంత్ర్యములు, వారి స్వామ్యములు, సౌభ్రాతృత్వము న్యాయమైనవిగా పేర్కొనబడినవి వీటిని సాధించుటకు వారేర్పరచుకొనిన రాజ్యాంగ వ్యవస్థ సర్వస్వతంత్రమైన ప్రజాప్రభుత్వము గల రిపబ్లికుగా వర్ణింపబడినది

దేశవిభాగములు భారతదేశమందలి విభాగములు

1950 లో 9 "ఎ" రాష్ట్రములుగను, 8 "బి" రాష్ట్రములుగను 10 "సి" రాష్ట్రములుగను, 1 "డి" రాష్ట్రముగను విభక్తమై ఉండెను కాలక్రమమున వీటియందు మార్పులు జరిగినవి 1956 నవంబరు 1 వ తేదీనాటికి అవి 17 రాష్ట్రములుగను, 10 కేంద్రపాలిత ప్రాంతములుగను వెలసి ఇవి 5 మండలములలో చేర్చబడినవి (1 తూర్పు, 2 పడమర, 3 దక్షిణ 4 ఉత్తర, 5 మధ్యమమండలములు)

పౌరసత్వము పౌరసత్వ నియమములనుబట్టి భారత దేశమున జనించినవారును, అచ్చట స్థిరనివాస మేర్పరచుకొన్నవారును, పాకిస్థానునుండి కాందిశీకులుగా వచ్చినవారును, భారత పౌరులయ్యెదరు విదేశములలో నివసించు భారతజాతీయులు, అచ్చటి పౌరసత్వము పొందనిచో, భారత పౌరులనియే పిలువబడెదరు

ప్రాథమిక హక్కులు భారతపౌరులు జీవితమును స్వేచ్ఛతో గడపుటకు వారికి ఏడురకములయిన ప్రాథమిక హక్కులు గలవు (1) సమాజమందున్న వ్యక్తులందరు సమానులుగా పరిగణింపబడెదరు సమానత్వమును సాధించుటకు జాతి, మత, వర్ణ, అస్పృశ్యతాది భేదములు తొలగింపబడినవి, స్త్రీపురుష వ్యత్యాసముగూడ పాటింపబడదు. (2) పౌరులకు వ్యక్తిస్వాతంత్ర్యము కలదు. ముఖ్యముగా వ్యక్తిగతమైన అభిప్రాయమును వెలిబుచ్చుటకు, దానిని ప్రచారము చేయుటకు, దేశములో పర్యటించుటకు వారికి స్వేచ్ఛ ఇయ్యబడినది (3) పిల్లలకు, శ్రామికులకు పనిచేయు సందర్భమున తగురక్షణ కల్పింపబడినది (4) మతస్వాతంత్ర్యము పౌరులందరకు కలదు అన్నిమతములు సమానముగా పరిగణింపబడును మతపీడనమునకు తావులేదు రాజకీయములు అన్నిమతములకు అతీతముగా నుండును (5) అల్పసంఖ్యాక వర్గములవారు తమ భాషను, సారస్వతమును, సంస్కృతిని సంరక్షించుకొనుటకు సదుపాయ మున్నది (6) ఆస్తిని సంపాదించుటకు, అనుభవించుటకు, వ్యక్తులకు స్వేచ్ఛ కలదు (7) ఈ హక్కులకు భంగము కలిగినపుడు పౌరులు హైకోర్టులద్వారాగాని, సుప్రీంకోర్టుద్వారాగాని వాటిని సంరక్షించుకొను అవకాశము గలదు అయితే ఈ హక్కులు కొన్ని నియమములకు లోబడి యుండును

నిర్దేశక సూత్రములు ప్రాథమిక హక్కులకు తోడుగా రాజ్యపాలనయందు ప్రభుత్వము పాటింపవలసిన సూత్రములు రాజ్యాంగశాసనమున పొందుపరుపబడినవి, ఈ సూత్రములు సామాన్యప్రజల సంక్షేమమును, ఆర్థిక సమానత్వమును, ప్రపంచశాంతిని సాధించుటకు తోడ్పడగలవు అయితే వీటిని న్యాయస్థానముల ద్వారా అమలుపరచుటకు వీలు లేదు

యూనియన్ ప్రభుత్వము భారతరిపబ్లిక్ యొక్క రాజకీయ వ్యవస్థను సమాఖ్య ('యూనియన్') అని యందురు అందున్న కేంద్రప్రభుత్వమునకు యూనియన్ ప్రభుత్వమని పేరు దీనియందు శాసననిర్మాణ, కార్యనిర్వాహక న్యాయనిర్ణయశాఖలు కలవు ఇందు అధ్యక్షుడు అగ్రగామి అధ్యక్షుడు ఇతడు దేశమునకంతకును అధిపతి ఇతడు సాధారణపౌరుడై యుండి అధ్యక్షపదవికి కేంద్ర, రాష్ట్ర శాసనసభలలోని ప్రజాప్రతినిధులచే ఎన్నుకొనబడును ఇతని పదవీకాలము 5 సంవత్సరములు కేంద్రప్రభుత్వ వ్యవహారములు ఇతని పేరనే జరగును ఇతనికి వివిధములైన అధికారములు గలవు-పార్లమెంటు నిర్మించిన శాసనములను ఆమోదించుట, మంత్రివర్గమును నియమించుట, తొలగించుట, ఆదాయవ్యయములను సూచించుట, సుప్రీంకోర్టు, హైకోర్టుల న్యాయమూర్తులను, రాష్ట్ర గవర్నరులను, ఇతర ఉన్నతోద్యోగులను నియమించుట, ఇతని అధికారములలో ముఖ్యమైనవి అంతేకాక ఇతడు దేశరక్షణ సైనికదళములకు అధినేతగను మరణదండనకు పాత్రులైన నేరస్థులను కరుణించి విడుదలచేయు న్యాయాధిపతిగను, విదేశరాయబారులతో సంప్రతించు వ్యవహర్తగను వర్తించును అసాధారణ పరిస్థితులలో (యుద్ధము, సంక్షోభము వంటివి) రాష్ట్రప్రభుత్వములను రద్దుచేసి, వాటిపాలనమును తానే స్వీకరించుటకును, పౌరుల ప్రాథమిక హక్కులను తాత్కాలికముగా తొలగించుటకును, అతనికి అధికారము కలదు అయితే అతివిస్తృతమైన ఈ యధికారములను అతడు సాధారణముగా పార్లమెంటరీ ప్రభుత్వ సంప్రదాయమునుబట్టి, స్వయముగాగాక, ప్రజాప్రతినిధులైన మంత్రుల సలహా ప్రకారము చలాయింపవలసియున్నది ఇట్టి నిబంధనము స్పష్టముగా రాజ్యాంగశాసనమున లేకున్నను, అతడు అట్లే వర్తించును

పార్లమెంటుచే ఎన్నుకొనబడిన ఉపాధ్యక్షుడు పార్లమెంటు యొక్క రెండు విభాగములలో రెండవదియగు రాజ్యసభకు అగ్రాసనాధిపతిగా నుండును అధ్యక్షుడు తన కార్యములను నిర్వహించలేని సమయములందు ఉపాధ్యక్షుడు వాటిని నెరవేర్చును

యూనియన్ ప్రభుత్వపు కార్యనిర్వాహకశాఖను సంబంధించిన మంత్రివర్గము ఇందు క్యాబినెట్ మంత్రులు, స్టేట్ మంత్రులు, డిప్యూటీమంత్రులు చేరియుందురు ప్రధాన మంత్రి వారికి నాయకుడు వీరందరు పార్లమెంటులో సభ్యులు వీరిని నియమించుటకు, తొలగించుటకు, వీరి నిర్వహణను పరిశీలించుటకు నామమాత్రమైన అధికారము అధ్యక్షునికిని, వాస్తవాధికారము పార్లమెంటునకును (అందును లోక్ సభకు) చెందియుండును మంత్రివర్గము అధ్యక్షునికి నామమాత్రముగాను, పార్లమెంటుకు (ముఖ్యముగా లోక్ సభకు) యథార్థముగాను బాధ్యతగల్గి, లోబడి వర్తించును మంత్రివర్గము సలహా నిచ్చు మండలిగా పేర్కొనబడినను, పాలనాధికారమంతయు దానిచే హస్తగతమైయుండును ప్రభుత్వము అధ్యక్షుని పేరున సాగినను, అది మంత్రివర్గపు నిర్ణయానుసారము, అందును, మంత్రులకు నాయకుడైన ప్రధానమంత్రి నిర్ణయము ననుసరించి యుండును. ఇది పార్లమెంటరీ ప్రభుత్వవిధానమనియు, లేదా బాధ్యతాయుత ప్రభుత్వవిధానమనియు అనబడు చున్నది

పార్లమెంటు అనునది యూనియన్ ప్రభుత్వమందలి శాసనసభగా వ్యవహరించును దానియందు రాజ్యసభ, లోక్ సభ అను ఎగువ, దిగువ సభలుండును రాజ్యసభలోని సభ్యుల సంఖ్య 250 ఇందు 12 గురు అధ్యక్షునిచే నియమింపబడుదురు మిగిలినవారు రాష్ట్రములందలి శాసనసభ్యులచే ఎన్నుకొనబడుదురు రాజ్యసభలో మూడవవంతు సభ్యులు రెండేండ్ల తరువాత సభనుండి విరమింతురు లోక్ సభలోని సభ్యులసంఖ్య 500 వీరు వయోజనులైన పౌరులచే ఎన్నుకొనబడుదురు వారి పదవీకాలము సాధారణముగా 5 సంవత్సరములుండును ఈ సభ యందలి సభ్యులచే ఎన్నుకొనబడు "స్పీకరు" సభకధ్యక్షత వహించును పై రెండు సభలు నెరవేర్చు కార్యములు, శాసన నిర్మాణమునకును, మంత్రులు బాధ్యతతో పాలనము సాగించునట్లు పర్యవేక్షించుటకును, ఆయవ్యయములను నిర్ణయించుటకును సంబంధించినవి ఈ అధికారములు రాజ్యసభ కంటె, లోక్ సభకు చాల అధికముగా నుండును

సుప్రీంకోర్టు, యూనియన్ ప్రభుత్వపు న్యాయనిర్ణయ శాఖకు చెందియుండును. అయినను ఇది భారతదేశమంతటికిని అత్యున్నత న్యాయస్థానము ఇందు అధ్యక్షునిచే నియమింపబడిన ప్రధాన న్యాయమూర్తి, ఇతర న్యాయమూర్తులు వ్యవహరింతురు వీరు పదవులలో నుండగనే స్థానభ్రంశములో నెరవేర్పబడు నిబంధనలను రాజ్యాంగ శాసనము ప్రకారము ప్రభుత్వమును, పౌరులును, వర్తించునట్లు చేయుట ఈ న్యాయస్థానము యొక్క ప్రధాన కర్తవ్యము అగుటచే దానికి రాజ్యాంగశాసన, సివిల్, క్రిమినల్ సంబంధమైన వివాదములను పరిశీలించి, అపీలు మార్గమున విచారించు అధికారము కలదు దానికిగల విస్తృతాధికారము ప్రపంచమందలి ఏ ఇతర న్యాయస్థానమునకును లేదు

రాష్ట్రప్రభుత్వములు భారత రిపబ్లికు రాజ్యము నందు ప్రథమమున గవర్నరు యాజమాన్యమునకు లోబడిన రాష్ట్రములు 9 ఉండెడివి అనంతరము జరిగిన రాష్ట్రపునర్నిర్మాణమువలన 1956 నవంబరు నాటికి అవి 17 వరకు హెచ్చింపబడినవి ఆ రాష్ట్రము లీదిగువ పేర్కొనబడినవి

1 అస్సాం
2 ఆంధ్రప్రదేశ్
3 ఉత్తరప్రదేశ్
4 ఒరిస్సా
5 కేరళ
6 గుజరాత్
7 జమ్ము-కాశ్మీర్
8 నాగాలెండు
9 పంజాబు
10. బీహారు
11 బెంగాల్
12 మద్రాసు
13 మధ్యప్రదేశ్
14 మహారాష్ట్రము
15 మైసూరు
16 రాజస్థాన్
17. హరియానము

కాశ్మీరమునకు మొదట ప్రత్యేక ప్రతిపత్తి ఇయ్యబడినది క్రమముగా అది ఇతర రాష్ట్రముల స్థాయికి చేరుచున్నది రాష్ట్రముల ప్రభుత్వ విధానము ఒకేతీరుగా నుండును అంతేకాక రాష్ట్ర ప్రభుత్వము చాలవరకు కేంద్రప్రభుత్వపు నమూనాను అనుసరించి యుండును

రాష్ట్ర ప్రభుత్వమునకు అధిపతి గవర్నరు ఇతడు

టును మార్చుటకు కేంద్ర పార్లమెంటులోని రెండు సభల అంగీకారమేకాక, సగము పైబడిన రాష్ట్రశాసనసభల ఆమోదముకూడ అవసరము. ఇతర విషయములకు పార్లమెంటులోని రెండు సభల అంగీకారము చాలును. అన్ని మార్పులకు తుదకు అధ్యక్షుని ఆమోదము అవసరము. మొదటి 14 ఏండ్లలో రాజ్యాంగ శాసనమున 18 మార్పులు జరిగినవి. ఈ మార్పులు చాలవరకు ప్రభుత్వాధికారములను విస్తరింపజేసినవి. రాజ్యాంగ శాసనమునకు తొమ్మిది అనుబంధములు చేర్పబడినవి. ఇవి రాజ్యాంగమునకు సంబంధించిన వివరములను తెలియజేయును.

ఓ. స.

## భారత రూప్యము.

భారతద్రవ్యవ్యవస్థకు ప్రామాణికద్రవ్యము రూప్యము. భారతద్రవ్య చరిత్రలో వెండి రూప్యమును ప్రతిష్ఠ మొనర్చిన కీర్తి షర్షాకు దక్కెను. మొగలుల కాలములో అక్బర్ షాజహాన్, మహమ్మద్ షాహా మున్నగు పేర్లతో దేశమందంతట రూప్యములు చలామణి అయినను, బ్రిటిష్ ఈస్టు ఇండియా కంపెనీ ఏకచ్ఛత్రాధిపత్యము క్రింద భారతదేశమును తెచ్చునాటికి, ఈ ఉపఖండపు వివిధ రాష్ట్రములలో ప్రాంతీయ ప్రభువులు విడుదలచేసిన వివిధ ప్రామాణిక నాణెములు రమారమి 27 వరకు అమలునందుండెను. అందుచే 1835లో బ్రిటిష్ ఈస్టు ఇండియా కంపెనీ భారతదేశమంతటను ఒకేవిధమైన ద్రవ్యవిధానమును ప్రవేశపెట్ట సంకల్పించెను.

కాని అంతర్జాతీయ ప్రమాణమగు స్వర్ణద్రవ్యమునకు మారుగా రజత ద్రవ్యప్రమాణమును బ్రిటిష్ ఈస్టు ఇండియా కంపెనీవారు భారతదేశములో ప్రవేశపెట్టిరి. ఇందుకు వారొసగిన కారణములేవియు సమంజసముగ లేవు. అనాదినుండియు భారతీయులు వెండి నాణెములకుమాత్రమే అలవాటు పడినారనుట వారి మొదటి కారణము. ఇది చరిత్రకు దూరము. ముసల్మానులు మాత్రమే వెండినాణెముల నభిమానించిరి. కాని హిందూరాజులు బంగారు నాణెములనే విడుదలచేసి యుండిరి. భారతదేశము స్వర్ణద్రవ్యప్రమాణమును భరింపజాలదనునది కంపెనీవారు చూపిన రెండవ కారణము. ఇదియును సత్యదూరమే. బంగారు, వెండి నాణెములు ఉత్తరభారతమునను, కేవలము బంగారునాణెములు దక్షిణాపథమునను, ప్రధాన ద్రవ్యవిశేషములుగా 19వ శతాబ్ది ఆరంభమువరకు చలామణియందుండెను. 1835లో కంపెనీవారు తమ రూప్యమును ప్రవేశపెట్టినప్పుడుగాని, 1852లో బంగారు నాణెములను చలామణి నుండి తొలగించినప్పుడుగాని, కంపెనీ ప్రభుత్వము వాస్తవమునకు స్వర్ణద్రవ్యప్రమాణమును ప్రధానముగా అవలంబించి, వెండి నాణెములను ఉపద్రవ్యముగ మాత్రమే ప్రవేశపెట్టుట న్యాయమైయుండెడిదని నిపుణులు అభిప్రాయమును సూచించిరి.

నేటి భారతరూప్యమునకు మూలమైన ఈస్టిండియా కంపెనీవారి రూపాయి కథ ఇట్లారంభమైనది. 1835 వ సంవత్సరపు రూప్యము 11/12 వ వంతు మేలిమికల 180 గ్రైనుల వెండిరూపాయిగా నుండెను. రజతద్రవ్య ప్రమాణమునకిట్లు నాంది జరిగినను, బంగారునాణెములు వెనువెంటనే చలామణినుండి తొలగింపబడలేదు. ఒక బంగారు మొహరుకు 15 వెండిరూప్యముల వంతున మారకము జరుగుచుండెను. ఇట్టి మారకమువలన 1850 లో ఒక క్రొత్తసమస్య బయలుదేరినది. అమెరికా, ఆస్ట్రేలియాలలో కనుగొనబడిన గనుల వలన ప్రపంచములో బంగారము ఉత్పత్తి హెచ్చి, దానిధర తగ్గుటచే, పూర్వపు మారకపురేటు ప్రకారము మొహరుకు వచ్చిన 15 రూప్యములు–మొహరు విలువకు మించిన రూప్యములను తెచ్చినవన్నమాట. అందుచే ప్రభుత్వపు ఖజానాలలో మొహర్లు స్వీకరింపబడవని డల్హౌసీ ప్రభువు ఉత్తరువును జారీచేసెను. ఇది వేరొక ఉపద్రవమునకు దారితీసెను. భారతీయ వ్యాపారము జాతీయ, అంతర్జాతీయ రంగములలో విస్తరించుచున్న తరుణమున 12 కోట్ల పౌనుల విలువగల బంగారము చలామణినుండి హఠాత్తుగా నిష్క్రమించి, గిరాకీకి తగినంతగా ద్రవ్యము లభ్యముకాక వ్యాపారములో ప్రతిష్టంభన మేర్పడెను. ఈ సందర్భమున భారతప్రభుత్వ ద్రవ్యవిధానమును 1866, 1870 సంవత్సరములలో పరిశీలించిన "మాన్స్‌ఫీల్డ్" "టెంపిల్" కమిషనులు స్వర్ణద్రవ్యప్రమాణపు ఆవశ్యకతను తిరిగి సూచించెను. 15, 10, 5 రూప్యముల విలువలలో బంగారునాణెములను ముద్రింపవలసినదని మాన్స్‌ఫీల్డ్ సలహానీయగా, మొహరానే ప్రమాణద్రవ్యముగా గుర్తింపనగునని టెంపిల్ తెలిపెను. ప్రభుత్వము మాత్రము వెనుకటివలె రజతప్రమాణమునే కొనసాగించి సావరినుకు, రూపాయికి నడుమగల మారకపురేటును మాత్రము సవరించెను. 1868 కు పూర్వము సావరినుకు 10 రూపాయలు మారకపురేటు కాగా, ఆటుతర్వాత రేటు 10½ రూప్యములు అయ్యెను.

బంగారు, వెండి లోహములతో తయారైన రెండు విభిన్న ద్రవ్యముల మార్పిడి ఇట్టి సమస్యలను ఉత్పన్నము చేయగా, ప్రమాణలోహముగా స్వీకరింపబడిన వెండి ఇంకొక విధమైన సమస్యకు కారణభూతమైనది. 19 వ శతాబ్ది తుది భాగములో అంతర్జాతీయముగా వెండి విలువ పడిపోవుట పూర్తిగా దెబ్బతిన నారంభించెను. వెండివిలువ పడిపోవుటకు కారణములు రెండు: వెండి ఉత్పత్తి విశేషముగా పెరుగుటయు, ద్రవ్య సాధనముగా ఎన్నికయైన లోహమునకు కొరత అనివార్య మగుటయు మొదటి కారణము. అంతదనుక రజత ద్రవ్య ప్రమాణము కలిగియుండిన దేశములు ఆపద్దతిని విసనాడుటతో అంతర్జాతీయ లోహవిపణి, వెండితో నిండుట రెండవ కారణము. భారతరూప్యపు విదేశీ మారకపురేటు 1 షిల్లింగు 10$\frac{3}{8}$ పెన్నీల నుండి (1878) 1 షిల్లింగు 2$\frac{3}{8}$ పెన్నీలకు (1892) పడిపోయెను. "హోమ్‌చార్జీల" పేరున భారతదేశము బ్రిటనుకు స్టెర్లింగురూపమున పంపవలసిన ద్రవ్యపువిలువ ఈ కారణముచే హెచ్చెను. మొదటిఫలితము ప్రజలపై విశేషముగా పడిన పన్నులభారము; రెండవఫలితము, హెచ్చుగా ఉత్పత్తియైన వెండి అధికసంఖ్యలో నాణెముల తయారీకి దారితీయగా ఏర్పడిన ద్రవ్యోల్బణము. 1892 లో బ్రస్సెల్స్ నగరములో జరిగిన అంతర్జాతీయ ద్రవ్య మహాసభయందు, రజత ప్రమాణమునకు భరతవాక్యము చెప్పబడినను, భారతదేశము మాత్రము ఈ ద్రవ్యప్రమాణమునే అంటిపెట్టుకొని యుండెను. ద్రవ్యప్రమాణము విషయమున, ఆదినుండియు బ్రిటిష్ ప్రభుత్వ మనుసరించుచుండిన ఈ అనవాంఛనపు విధానము పెక్కు అపరిష్కృత సమస్యలను సృష్టించెను.

1893, 1898 సంవత్సరములలో హెర్షెల్, ఫౌలర్ కమిటీలు ఈ సమస్యలను అవగాహనము చేసికొనినవి. హెర్షెల్ కమిటీ ద్విద్రవ్యప్రమాణమును సూచించెను. మారకపురేటు రూప్యమునకు 1 షిల్లింగు 4 పెన్నీ లుండదగునని ఈ కమిటీ చేసిన సలహాను ప్రభుత్వము అమలుపరచెను. స్వర్ణద్రవ్య ప్రమాణము తప్పదనియు, అంతర్జాతీయ వ్యాపారమున భారతదేశపు దిగుమతుల నికరపు విలువ ఎగుమతుల విలువను మించినప్పుడు, ప్రభుత్వము తగినంత బంగారమును సరఫరా చేయవలెననియు, అపరిమిత చలామణిగల నాణెముగా రూప్య ముండవలెననియు ఫౌలర్ కమిటీ ప్రతిపాదించెను. ఈకమిటీ సిఫారసుచేసిన స్వర్ణప్రమాణమును కొంతమార్పుతో ప్రభుత్వ మవలంబించెను. అదియే స్వర్ణ వినిమయ ప్రమాణ మనునది. అదియు అమలు జరుపబడవలసిన పద్ధతిలో అమలు జరుగలేదు. వినిమయప్రమాణము విజయవంత మగుటకు భారత ద్రవ్యము బ్రిటిష్ ద్రవ్యములోనికి నిరవధికముగా మార్పబడ గలదను హామీ అవసరము. ఇట్టి హామీ భారతదేశము నేలుచుండిన ఆంగ్లేయులనుండి ఆనాడు రాలేదు.

వినిమయ ప్రమాణము క్రొత్తసమస్యలను తెచ్చిపెట్టెను. మొదటి ప్రపంచయుద్ధ మారంభముకాగా, ఈ ప్రమాణమును అమలుజరుపుటకు ఉత్పన్నముచేసిన నిధులు తరిగి, ప్రతిష్టంభన మేర్పడెను. వెండిధర హెచ్చి, రూప్యములు కరగింపబడి లోహము ఎగుమతికాసాగెను. రూపాయి మారకపురేటు షిల్లింగు ఆరుపెన్నీలనుండి రెండుషిల్లింగుల నాలుగుపెన్నీలకు పెరిగెను. మారకపురేటును పునఃపరిశీలింపవలసిన అవసర మేర్పడగా, 1926లో నియమింపబడిన 'హిల్టన్ యంగ్' కమిషను, షిల్లింగు ఆరుపెన్నీలరేటును సిఫారసు చేసెను.

20 వ శతాబ్ది ద్రవ్యసమస్య లింకను క్లిష్టములైనవి. రెండు ప్రపంచయుద్ధముల నడిమికాలమున ప్రవర్తిల్లిన అస్థిర పరిస్థితులు ద్రవ్యరంగమున తెచ్చిన మార్పులఫలితముగా, ప్రపంచ బ్యాంకరుగా 19 వ శతాబ్దిలో ఇంగ్లండు గడించిన ఖ్యాతిని తాను కోల్పోయెను. ద్రవ్యము శాస్త్రీయముగా కొన్ని సూత్రముల ననుసరించి ప్రవర్తించినను, సకల మానవ సంస్థలవలెనే, ద్రవ్యసంస్థ కూడ, ఒకరిచే నడిపింపబడవలెను. ఇంగ్లండునకు ఈతరుణమున అంతర్జాతీయ ద్రవ్యప్రమాణమును నడపగలిగిన శక్తి లేకుండెను. రూప్యము, దానికి సహజముగాగల విలువకంటె 12½ శాతము ఎక్కువ విలువగల ఇతర ద్రవ్యములను ఇప్పట్టున సంపాదించుచుండెను. దీనివలన ఒక ప్రక్క ఎగుమతి వ్యాపారము దెబ్బతినగా, మరియొక ప్రక్క వర్తకులు బంగారమును ఇతరదేశములకు వీలైనంత అమ్మివేసి, అధికలాభములను పొంద ఉవ్విళ్ళూరుచుండిరి. దేశములో ద్రవ్యపుకొరత ఏర్పడెను, పరపతి ద్రవ్యము వృద్ధిచేయబడ లేదు. కేంద్రబ్యాంకును స్థాపింపవలసిన అవసరము ఏర్పడెను.

ప్రస్తుత శతాబ్దమున ద్రవ్యశాస్త్రములోను, ద్రవ్య వ్యవస్థయందును కూడ విప్లవాత్మకమైన మార్పులువచ్చినవి. ద్వితీయ ప్రపంచయుద్ధానంతరము అంతర్జాతీయ ద్రవ్యనిధి ఏర్పరుపబడి, స్వర్ణలోహము దానంతట అది ద్రవ్యము కాకు

న్నది, అన్ని దేశముల ద్రవ్యములకు అది 'లంగరు' అను సిద్ధాంతమామోదింపబడినది. ఇంతే కాక, ప్రపంచ ద్రవ్యము లన్నిటిలో ఎక్కువ స్థిరత్వముగల కీలక ద్రవ్యముగా డాలరు పరిగణింపబడి, దాని విలువతో, ప్రతిదేశము, తన ప్రామాణిక ద్రవ్యపు విలువను లెక్కించుకొను అంతర్జాతీయ ద్రవ్యసంఘటన యొకటి సర్వదేశములచే ఆమోదింపబడినది

ద్రవ్యశాస్త్రమున వచ్చిన మార్పులవలననే, భారత రూప్యముకూడ మారదొడగెను రూప్యమొక ద్రవ్యవిశేషము మాత్రమేకదా! ఇతరవస్తువులవలె అదియు నొకవస్తువే! దానికిని ఒక వినియోగము కలదు ఈవిషయము ననుసరించి ప్రామాణికమైన భారత రూప్యము తనవిధులను సక్రమముగా నిర్వర్తించుచు దేశముయొక్క ఆర్థికాభ్యున్నతికి తోడ్పడవలె ననట, అందుకు తగినంత ద్రవ్యము వ్యవస్థయం దుండవలె ననట-ఇది అభివృద్ధిని సాధించు దేశములయొక్క ఆర్థిక సిద్ధాంతము ఈ సందర్భమున విజాతీయ నాణెమునకైనను, దానివిలువ, ఇంట, బయట ఇట్లు ప్రవర్తిల్లును స్వదేశమునందు కొనుగోలుశక్తియే ప్రామాణిక నాణెముయొక్క విలువను నిర్ణయించును జాతీయముగా నిర్ణయింపబడి, అంతర్జాతీయముగా అంగీకరింపబడిన విలువయే ప్రతి ప్రామాణిక ద్రవ్యమునకునుగల మారకపురేటు అంతర్జాతీయ నిధి నేడు నడుచుచున్న తీరు ఇట్టిదే నేటి అంతర్జాతీయనిధి శకములో భారతరూప్యపు మారకపురేటు పొందినమార్పులు, అంతర్జాతీయ వ్యాపారము నడచినతీరు, ఈసందర్భమున అతిముఖ్యమైన అంశములు 1949 సం॥ వరకు పూర్వము రూప్యమునకు బ్రిటిష్ పౌండుతోనున్న అనుబంధము ననుసరించి అమలునందుండిన మారకపురేటు ఇది ఒకరూపాయి 30 225 అమెరికను సెంట్లు

1949 లో బ్రిటను తన పౌండు విలువను తగ్గించుకొనెను పౌండు అపమూల్యనముతోపాటు స్టెర్లింగు చలామణియందున్న దేశములతో అనుబంధమున్న భారతదేశము కూడ తన రూపాయి విలువను తగ్గించుకొనెను ఈ చర్య వలన రూప్యము విలువ, డాలరు మానమున ననుసరించి 30 225 సెంట్లనుండి 21 000 సెంట్లకు పడిపోయెను ఒక దేశముయొక్క అంతర్జాతీయ వ్యాపారమందు నికరాదాయములో నికరాదాయము = ఎగుమతుల విలువ-దిగుమతుల విలువ) సంవత్సరముల తరబడి కొరత ఏర్పడినప్పుడు ప్రభుత్వమవలంబించు దీర్ఘకాలిక పరిష్కారము అపమూల్యనము అపమూల్యన మొనర్చిన దేశపు ద్రవ్యము ఇతరదేశముల ద్రవ్యములకంటె చౌకయగుటచే, ఎగుమతుల ఖరీదులు తగ్గి దిగుమతుల మొత్తము హెచ్చుట ఈ చర్యయొక్క లక్ష్యము ఇట్లే అత్యవసరముకాని దిగుమతులుకూడ తగ్గింపబడి నికరాదాయము హెచ్చింపబడును భారతదేశపు నికరాదాయపు కొరత మూడు సంవత్సరములలో (అనగా 1951 నాటికి) 183 కోట్ల రూపాయిలనుండి 22 కోట్ల రూపాయిలకు తగ్గినది కాని తిరిగి 1952 నుండి పెరుగ నారంభించినది. దీనికి కారణములు మూడు (1) ఎగుమతులు తగినంతగా వృద్ధిచెందలేదు, దేశములో ఉత్పత్తి పెరుగకుండుట తిరిగి దీనికి కారణము (2) ద్రవ్యోల్బణ పరిస్థితులను అరికట్టలేక పోవుట, అపక్రమ పారిశ్రామిక విధానము ఉత్పత్తి మాంద్యమునకు కారణములు (3) మీదుమిక్కిలి భారతదేశపు దిగుమతులు తగ్గింపజాలనివి

అన్నిటినిమించి, ద్రవ్యోల్బణ విషవృత్తము విస్తరించి, రూప్యముయొక్క కొనుగోలుశక్తి నానాటికి సన్నగిల్లుచున్నది రెండవ ప్రపంచయుద్ధ కాలమున ఆరంభమైన అపమూల్యనము కొరియా యుద్ధమువలన విజృంభించి, ప్రణాళికా కాలమున ద్రవ్యోల్బణ శక్తులు మరింత బలపడినవి సక్రమ పారిశ్రామిక విధానమొక పరిష్కారముగా, కొందరు ఆర్థికవేత్తలీసందర్భమున పేర్కొందురు

భారత రూప్యపు విభాగములలో క్రమముగా దశాంశ నాణెములు ప్రవేశపెట్టబడి పైసల బిళ్ళలు చలామణిలోనికి వచ్చినవి రూపాయికి 100 పైసలగుటతో, వ్యాపారగణితము సుకరమైనది ఇదియొక మంచిమార్పు

1966లో జరిగిన అపమూల్యనము భారతరూప్యము యొక్క చరిత్రలో నవీనఘట్టము అంతర్జాతీయ వ్యాపారరంగమున భారతదేశమునకు నికరాదాయపు కొరత తీరని సమస్యయై పోయినది ఇట్టి తరుగును భర్తీచేయుటకు అంతర్జాతీయ ద్రవ్యనిధినుండి స్వల్పకాలిక ఋణములు లభించును కాని వరుసగా ప్రతి సంవత్సరము తరుగు వచ్చుచుండుటచే రూప్యము విలువ, దాని శక్తికి మించి అసహజముగా నిలుపబడుచున్నదనియు కావున సహజస్థితికి తగ్గింపబడవలె ననియు, అంతర్జాతీయ ద్రవ్యనిధి అధికారులు సలహానిచ్చిరి దీని ఫలితమే రూప్యము 57 శాతమువరకు పొందిన అపమూ

ల్యనము అమెరికను సెంట్లలో పూర్వపు 21 సెంట్ల విలువ నుండి 13 333 సెంట్లకు రూప్యము విలువ మారినది

అవమూల్యనమువలన విదేశ వ్యాపారమెట్లు మెరుగగునో పైన వివరింపబడినది కాని అనుకొన్న ఫలితములు రాకుండుటకు పరిస్థితుల బలిమియేగాని, సిద్ధాంతలోపము కారణము కాదు (1) భారత దేశపు ఎగుమతులు చౌకవైనను ఎగుమతుల మొత్తము హెచ్చుకాదు, ఏలన ఈ ఎగుమతుల గిరాకీకి విస్తరణశక్తి లేదు భారత దేశపు ఎగుమతుల స్వభావమిట్టిది (2) భారత దేశములో పారిశ్రామికీకరణమునకు దిగుమతులు అత్యవసరములు కావున, వాటిని కుదింపజాలము (3) ఉత్పత్తి కూడ దేశములో పెరుగజాలకున్నది దీనికి కారణమేమైనను, అవమూల్యనమువలన లాభము కలుగకపోగా, ధరల పెరుగుదలవంటి నష్టములు మాత్రము తప్పలేదు. ఏమైనను అంతర్జాతీయ ఆర్థికశక్తుల ప్రాబల్యమువలన, అవమూల్యనము తప్పనిసరియగు చర్యయైనది

ఇది సంగ్రహముగా భారతరూప్యముయొక్క పరిణామము, ఇది ఆ సందర్భమున ఉత్పన్నమైన సమస్యల స్వరూపము, ఇవి ఇంటా, బయటా రూప్యముయొక్క కొనుగోలు శక్తి పొందిన మార్పులు రూప్యముయొక్క విలువను ప్రభుత్వము సక్రమముగా అజమాయిషీ చేసినచో, అట్టి చర్య అభివృద్ధికి సాధనమగును, లేక పట్టుతప్పినచో ఒడుదుడుకులకు మూలకారణమగును

సూ. కృ శా

## భారత వాణిజ్య దోహదములు

## దేశాంతర్గతము - అంతర్జాతీయము :

సమర్థవంతముగ నడుపబడు వ్యాపారవిధానము ద్రవ్యవిభజనమున కగు వ్యయమును, కాలపరిమితిని తగ్గించుటకు మాత్రమే కాక, వివిధ వస్తుసముదాయము యొక్క ధరలను స్థిరీకరించుటకు కూడ సహాయపడును అట్టి వ్యాపారము వాణిజ్యాభివృద్ధికి దోహదమొనర్చు సంస్థలయొక్క పటిష్ఠముపై ఆధారపడును ఈ దిగువ పేర్కొనిన సంస్థలు భారతీయాంతర్గత వ్యాపారాభ్యుదయమునకై కృషిచేయు ముఖ్యమైనవాటిలో చేరియున్నవి

చిల్లర వ్యాపారము : చిల్లర వ్యాపారసంస్థలు భారత దేశమందు నగరములలోను, గ్రామములలోను ప్రాచీన కాలమునుండి వ్యవహరించుచున్నవి ఈ దుకాణములు నగరములందును, గ్రామములందును కేంద్రములో వీధుల కిరుప్రక్కల బారులుదీరి యుండును వీటిలో ముఖ్యముగా జీవితావసర పదార్థములు విక్రయించబడును నగరములోని అంగడివీధులు బజారు లనబడును

సంతలు సంతలు గ్రామములందు వారములో నొక నిర్ణీత దినమున జరుగును అమ్మకముదారులు తమ సరకులను ఒక గ్రామ సంతనుండి మరియొక గ్రామ సంతకు తరలించుకొని పోవుచుందురు ఒక్కొక్కప్పుడు వ్యాపార సంతలు గ్రామములలో దేవాలయోత్సవ సందర్భములలో జరుపబడును పెక్కు గ్రామములలో అప్పుడప్పుడు పశువుల సంతలు, ధాన్యపుసంతలు మొదలైనవికూడ ఏర్పాటుపబడును

వేలములు : వేలములద్వారా వస్తువుల అమ్మకము భారత దేశమందంతట సాధారణముగా జరుగుచున్నది. ప్రధాన నగరములలో ప్రఖ్యాతమైన వేలము సంస్థలు స్థాపింపబడియున్నవి అమ్మకముదారుల సరకులను విడుదలచేయుటకీ సంస్థలెంతయు ఉపయోగపడుచున్నవి ఈసంస్థలు ఏజెన్సీలుగా వ్యవహరించుచు, అమ్మకముదారులనుండి కమిషను వసూలు చేయుచుండును స్వల్పకాలములో భారీయెత్తుపై సరకులను విక్రయించుటకు ఈసంస్థలు సత్వరసాధనములుగా సహాయపడగలవు

టోకువ్యాపారము టోకువ్యాపారులు పారిశ్రామికులకును, చిల్లరవ్యాపారులకును నడుమ దళారులుగ వ్యవహరింతురు వారు ఉత్పత్తిదారులనుండి భారీయెత్తున సరకులను కొని, తగిన స్వల్పమొత్తములలో వాటిని చిల్లరవ్యాపారులకు విక్రయింతురు సరకుల సంపక స్థలములకును, గిడ్డంగులకును ఆసరకులను తరగతులవారిగా విభజించు తావులకును, వాటిని బంగీలుకట్టు ప్రదేశములకును, ప్రదర్శనశాలలకును, సరకులను చేరవేయుటకు సంబంధించు వివిధ ఉపకార కలాపములలో టోకువ్యాపారులు పాల్గొనెదరు వ్యవసాయోత్పత్తులకు సంబంధించు వాణిజ్యములో ప్రత్యేకముగా కొందరు టోకువ్యాపారులు పాల్గొనెదరు

సరకులమారకము : సరకుల మారకము షేర్ మార్కెటును పోలియుండి వాటివిక్రయమునకు దోహదమొనగును ఈ విపణివీధియందు ధాన్యములు, అపరములు, ప్రత్తి, నూనెగింజలు మున్నగు సరకులు ఎల్లవేళల విక్రయమునకుసిద్ధముగ

నుండును ఇచ్చట జరుగు విక్రయములవలన, సరకుల ధరలు హెచ్చుతగ్గులు లేక, స్థిరముగనుండుట కవకాశమేర్పడును ఈ వస్తూత్పత్తి మారకసంస్థలు భారతదేశములో కంపెనీ చట్టము క్రింద రిజిస్టరు చేయబడినవి ఇవి రెండుగకములైన లావాదేవీ వ్యవహారములను గుర్తించుచున్నవి (1) సద్యః కాలముననే పదార్థములను రొఖ్ఖమునకు విక్రయించు విధానము, (2) భావికాలములో వాటి ధరలను తేల్చుకొను విధానము రొఖ్ఖబేరము ననుసరించి నిర్ణయమైన ధరకు సరకులు అచ్చటనే విక్రయింపబడును, లేదా ఆధరకే భవిష్యత్తులో నిర్ణీతసమయమునకు విక్రయింపబడును రెండవ విధానమును బట్టి, ముందెన్నడో వస్తువుల ధరలయందు ఘటిల్లు హెచ్చు తగ్గుల ననుసరించి, విక్రయదారుడు, కొనుగోలుదారుడు వారివారి లాభములను పురస్కరించుకొని వ్యవహరింతురు

వస్తుమారక విధానమువలన వివిధపదార్థములను తరగతులవారిగా విభజించుటకును, వాటి నాణ్యమును ప్రమాణీకరించుటకును, ప్రోత్సాహము లభించును ఇందువలన కలుగు ఇతర ప్రయోజనములమాట అటుండగా, ముఖ్యముగా సరకులు విపణివీథికి నిర్విరామముగా చేరుచుండుటవలన, వాటి ధరలలో వ్యత్యాసములు సమసిపోవును ఈవస్తుమారక సంస్థ యొక్క సభ్యుల కార్యకలాపములు ప్రభుత్వముచే అదుపునందుంచబడి, క్రమబద్ధమొనర్పబడును ఈచర్యలను గైకొనుటకై 1953 లో భారతప్రభుత్వము 'ఫార్వర్డు కంట్రాక్టు రెగ్యులేషన్ చట్టము'ను ప్రవేశపెట్టి, అందలి నిబంధనము లను అమలుజరుపుటకొక సంఘమును కూడ స్థాపించెను

గిడ్డంగులు సరకులను దీర్ఘకాలము భద్రపరచుటకై గిడ్డంగు లుపయోగపడును గిరాకీని అనుసరించి అవసరమైనంత కాలము సరుకులను భద్రపరచుటకుగాని, అవసరముపకు విడుదల చేయుటకుగాని, గిడ్డంగు లుపకరించును ఇట్లు ధరల స్థిరీకరణమును కొనసాగించుటకు అవి దోహదమొనగును సరకులు చెడకుండుటకై గిడ్డంగులీనాడు దృఢముగా నిర్మింపబడుచున్నవి ఇవి ప్రభుత్వముచేతను, ప్రయివేటు సంస్థలచేతను కూడ తయారు చేయబడుచున్నవి ప్రభుత్వ గిడ్డంగులలో సరకులను పదిలపరచుకొను వ్యాపారులనుండి కిరాయి వసూలు చేయబడుచున్నది కొన్ని ప్రభుత్వ గిడ్డంగుల అధికారులు సరకు ను భద్రపరచుకొను వారికి ఋణము లొసగుచున్నారు అంతేకాక, సరకులను తరగతులవారిగా విభజించుకొనుటకును, తూచుకొనుటకును, కొలుచుకొనుటకును సౌకర్యములను కల్పించుచున్నారు ఈ గిడ్డంగులు జాతీయ, అంతర్జాతీయ వాణిజ్యమునకు విశేషముగా తోడ్పడును నౌకాశ్రయాధికారులచే కొన్ని గిడ్డంగులు సముద్రపు రేవులవద్ద ప్రత్యేకముగా నిర్మింపబడినవి ఇవి ఓడసుంకములు వసూలుచేయు అధికారుల ఆధీనమందుండును ఎగుమతి, దిగుమతి వ్యాపారులు తమ సరకులను ఈ గిడ్డంగులలో తాత్కాలికముగ భద్రపరచుకొనుచు, వాటికగు సుంకములను చెల్లించుచుందురు

స్వాతంత్ర్యోదయమునకు పూర్వము భారతదేశములో ప్రభుత్వ గిడ్డంగులు దాదాపు లేవనియే చెప్పవచ్చును 1957 లో భారత ప్రభుత్వమొక కేంద్ర గిడ్డంగిసంస్థను స్థాపించెను వ్యవసాయోత్పత్తులను భద్రపరచుటకు ఇట్టి గిడ్డంగులను నిర్మించుట ఈ సంస్థయొక్క ప్రధాన కర్తవ్యము ఇట్లు భద్రపరచుకొనువారికి ప్రభుత్వము బ్యాంకులద్వారా ఋణములను కూడ ఇచ్చుచున్నది ఇట్లే పెక్కు రాష్ట్రప్రభుత్వములు కూడ పబ్లిక్ గిడ్డంగులను నిర్మించి, కేంద్ర ప్రభుత్వ గిడ్డంగులవలె, కట్టుదిట్టములు చేసెను భారత దేశములో అధునాతనమైన గిడ్డంగులు ప్రస్తుతము 800 వరకు గలవు

వస్తువాహక శకటములు ఈ సాధనముల మూలమున సరకులు రైలుమార్గమునను, మోటారురోడ్డు మార్గమునను జలమార్గమునను ఒక ప్రాంతమునుండి మరొక ప్రాంతమునకు శీఘ్రముగా తరలింపబడును, అందుచే వివిధప్రాంతములమధ్య సరకుల ధరలలోగల హెచ్చుతగ్గులు సమసిపోవుట కవకాశ ముండును తక్కిన సాధనములకంటె, రైలుద్వారా రవాణా యగు సరకులు బహుళము అగుటచే, దాని వాణిజ్య ప్రాముఖ్య మధికతరముగా నుండును. అంతేకాక, దూర ప్రాంతములకు రైళ్ళ మీద సరకులు తక్కిన రవాణా సాధనములకంటె చౌకగా చేరవేయబడును సమీప ప్రాంతములకు స్వల్పమొత్తములలో సరకులను మోటారు రోడ్లపై చేరవేయుటకు అనుకూలముగ నుండును అన్ని సాధనములకంటె జలమార్గములపై సరకులు చౌకగా తరలింపబడును. అయితే ఈ విధానము దీర్ఘకాలము పట్టును

భారతదేశపు నదీజలసంపద సమృద్ధమైనను, అంతర్గత జలమార్గము లింకను వృద్ధికావలసి యున్నవి పురాతనమైన పడవలు ఈనాడు ఈ జలమార్గములలో సరకులను చేరవే

యుట కనువుగా లేవు ప్రస్తుతావసరములకు తగినట్టుగా, ఈ జలమార్గములు, పడవలు అభివృద్ధి చేయబడుచో, వ్యవసాయోత్పత్తుల వ్యాపారములో అవి ఆదర్శవంతముగా ఉపకరింపగలవు భారత దేశమునకు 3200 మైళ్ళ నిడివిగల సముద్రతీరము కలదు అయినను విదేశ వాణిజ్యమున కుపయోగపడు మేలైన రేవులు కొలదిగ మాత్రమే కలవు

భారత దేశపు గ్రామసీమలనడుమ మోటారు రవాణా మార్గములింకను ప్రాథమిక దశయందే యున్నవి అందుచే వంటభూములనుండి పట్టణములకు ధాన్యపు రవాణాకగు వ్యయము అధికమగుచున్నది

**బ్యాంకులు** వాణిజ్యపు బ్యాంకులు వ్యాపారులకు ఋణములొసగి, వారికి పెక్కువిధములుగా తోడ్పడును ఈ బ్యాంకులు విదేశ మారక విధానములో కూడ వ్యవహరించును దేశీయ దిగుమతిదారులకు విదేశీ నాణెములను విక్రయించి, విదేశ ఋణదాతలకు, వారియ్యవలసిన బాకీలను చెల్లించుటకు సహాయపడును విదేశీ ద్రవ్యములోనే డ్రాఫ్టులనుకూడ విక్రయించుటేకాక, అచ్చట ద్రవ్యమునకు సంబంధించిన బిల్లులపై కమిషను వసూలుచేసికొని, రొక్కమును దిగుమతిదారులకు అందజేయును అంతేకాక, విదేశ వ్యాపారుల నుండి అవసరమైన సమాచారమును సేకరించి పెట్టును బ్యాంకులీ విధముగా విదేశ వ్యాపారమునకు దోహదమొనర్చుచున్నవి

**భీమా కంపెనీలు** జల, భూమార్గములద్వారా రవాణాయగు సరకులకు అగ్నివలన, భూకంపములవలన, తుపానుల వలన ప్రమాదములు కలుగవచ్చును ఇట్టి నష్టములనుండి రక్షణము పొందుటకు, భీమావిధానములు వ్యాపారులకెంతయు సహాయపడును వ్యాపారులకును, భీమాసంస్థల అధికారులకును నడుమ జరుగు ఒప్పందముల ననుసరించి ఆట్టి రక్షణము సమకూరును భారతీయ వ్యాపారుల మనస్తత్వము భీమావిధానము నెడల ప్రస్తుతము అంతఎక్కువ అనుకూలముగ లేదు ఐచ్ఛికముగ కాక ఋణదాతల ప్రోద్బలమువలన వారు సాధారణముగా భీమావిధానము ననుసరింతురు అయినను, సముద్రముపై రవాణాయగు సరకులు ప్రమాదములకు గురియగుటచే, అవి విధిగా భీమాచేయబడుచున్నవి. భారత దేశములో అభివృద్ధిగాంచిన భీమాసంస్థలు ఈ కర్తవ్యమును చక్కగా నిర్వహించుచున్నవి భారతప్రభుత్వము కూడ ఆట్టి ప్రమాదములనుండి సరకులను రక్షించుటకు స్వంతముగా భీమావ్యవస్థను నడపుచున్నది

**ప్రదర్శనములు, వ్యాపారపు సంతలు** ఇవి పలురకములైన పదార్థముల ఉనికిని గూర్చియు, వాటి ఉపయోగములను గూర్చియు ప్రజలకు పరిజ్ఞానమును కల్గించుటే కాక, వాటి విక్రయమునకు కూడ సహాయపడును. అంతర్జాతీయ వాణిజ్యమును దోహదపరచుటలో ఈ ప్రదర్శనములు ప్రజాదరణమును విశేషముగా పొందినవి దేశీయ పారిశ్రామిక, వాణిజ్య ప్రదర్శనముల నిర్వహణములో సహాయపడుటకును, విదేశములలో జరుగు అంతర్జాతీయ వ్యాపార ప్రదర్శనములలో పాల్గొనుటకును భారతప్రభుత్వ మొక నిర్వాహక సంస్థను స్థాపించెను భారత దేశపు సరకు లచ్చట విరివిగా అమ్ముడగుటకు అప్పుడప్పుడు పారిశ్రామిక, వాణిజ్యప్రదర్శనముల నేర్పరచుటకు కూడ ఈసంస్థ సహాయపడును

**వాణిజ్య మండలులు** . పరిశ్రమలలోను, వాణిజ్యములోను, సంబంధముగల ఈ స్వచ్ఛంద వాణిజ్య మండలులు ప్రాంతీయ ప్రాతిపదికపై నిర్మింపబడును ఈ ప్రాంతీయ సంఘములు రాష్ట్రమండలులుగా సంయుక్తమై మరల అవి యొక జాతీయ వాణిజ్యమండలిగా సమాఖ్యరూపము చెందును ఈ మండలులలో సభ్యులుగా చేరువారి హక్కులను ఇతర ప్రయోజనములను అవి రక్షించును, వాటి కనుగుణమైన శాసనములను ప్రభుత్వముచే అమలు జరిపించుటకు మహజరుల ద్వారాను, సమష్టి చర్యల ద్వారాను కృషి చేయును. ఈ వాణిజ్యమండలులు వ్యాపారుల కుపయోగపడు సమాచారమును సేకరించి ప్రకటించుచుండును, వ్యాపారమునకు సంబంధించు వివిధ విషయములలో పరీక్షలుకూడ నిర్వహించుచుండును అంతేకాక తమతమ ప్రాంతములలో ఉత్పత్తియగు సరకులను ప్రోత్సహించుచు యోగ్యతాపత్రముల నొసగును ఈ యోగ్యతాపత్రముల వలన ఉత్సాహులైన విదేశ వ్యాపారులు తమ వాణిజ్యమును అభివృద్ధి చేసికొనెదరు

**వ్యాపార సంఘములు** ఒక ప్రత్యేక వ్యాపారమునకు సంబంధించిన వ్యక్తులు కలిసి ఏర్పరచుకొను సంస్థలు వ్యాపార సంఘము లనబడును. ఉదా పొగాకు వ్యాపారుల సంఘము; బియ్యపు వ్యాపారుల సంఘము ఈ సంఘములు తమ సభ్యుల ప్రయోజనములను కాపాడుకొనుచు, తమ వ్యాపారకలా

శముల ప్రమాణములను అభివృద్ధి పరచుకొనుటకు యత్నించు చుండును. తమ సౌకర్యములను సాధించుకొనుటకును, తమ కనుకూలమైన చట్టములను అమలు జరిపించుకొనుటకును ఈ సంఘములు ప్రభుత్వములో సంభాషణముల ద్వారా విన్న పముల ద్వారా, రాయబారములు జరపుచుండును

పైన పేర్కొనిన సంస్థలతోపాటు ఈ క్రింది సంఘములుకూడ భారతదేశీయ, విదేశీయ వ్యాపారాభివృద్ధికి తోడ్పడుచున్నవి

సరకుల సరఫరాకు ఆర్డర్లు పంపు సంస్థలు భారీయెత్తున విదేశములనుండి సరకులను దిగుమతి చేసికొనినచే గాని, లాభదాయకమైన వ్యాపారము పొసగజాలదు. కైయుక్తికముగా దిగుమతిదారులు విదేశములనుండి గొప్ప మొత్తములో సరకులను తెప్పించుకొనజాలరు. దిగుమతిదారుల కవసరమగు సరకులను విదేశములనుండి తెప్పించి పెట్టు సంస్థలు భారతదేశములో పెద్దనగరములందు కలవు. ఈ సంస్థలు దిగుమతిదారులనుండి ఆర్డర్లను సేకరించి, వాటిని సమష్టిగా విదేశములలోని తమ ఏజెంట్లకు పంపి వారిద్వారా అచ్చటనుండి సరకులను భారీమొత్తములలో తెప్పించి దిగుమతిదారులకు కమీషను పద్ధతిపై అప్పగించెదరు. విదేశములలోని ఏజెంట్లు ముందుగా సరకుల నాణ్యమును పరీక్షించి, వాటిని ఓడలకెక్కించుట కవసరమగు కలాపముల నన్నిటిని జరపెదరు

బంగీలు కట్టు సంస్థలు : ఎగుమతియగు సరకులను నేర్పుగను, సవ్యముగను, కట్టుదిట్టముగను బంగీలు కట్టుట అత్యావశ్యకము. సరకుల బరువుమీదను, అవి ఆక్రమించు స్థలముమీదను, వాటి రవాణాఖర్చు లాధారపడును. అందుచే బంగీలుకట్టు పరికరములు తేలికగ నుండవలెను. సరకుల భద్రతను దృష్టియం దుంచుకొని, బంగీలు ఇమిడికగా నుండునట్లు చూడవలెను. ఓడ అధికారులకు బంగీనిర్మాణము తృప్తికరముగ లేనిచో, మార్గమధ్యమున సరకులకు కల్గు ప్రమాదములకు వారు బాధ్యత వహింపరు. ఆధునిక యుగములో నైపుణ్యముతో బంగీలు కట్టుట ఒక కళగా పరిణమించినది

క్లియరింగ్, ఫార్వార్డింగ్ ఏజెంట్లు : విదేశములనుండి సరకులను దిగుమతి చేసికొనుట కొన్ని చిక్కులతో కూడి యుండును. వీటిని త్వరగా పరిష్కరించి దిగుమతి వ్యాపారులకు కమీషను పద్ధతిమీద సహాయపడు ఏజెంట్లు ప్రత్యేకముగా కలరు. రేవుస్థలములకు దిగుమతియైన సరకులను విడుదల చేయించి, వాటి నిర్ణీత ప్రదేశములకు అవి చేరునట్లు వీరు సహకరించెదరు. ఇట్లే ఎగుమతి వ్యాపారములో కల్గు యిబ్బందులను కూడ పరిష్కరించి సహకరించు ఏజెంట్లు ప్రత్యేకముగా నున్నారు

సముద్రముపై ప్రయాణించు ఓడలను గూర్చిన సకల సమాచారమును తెలుపు ఏజెంట్లుకూడ కలరు. వాటిరవాణా రేట్లు, విదేశములకవి బయలుదేరు వేళలు, విదేశములనుండి రేవులకు చేరు కాలము, రవాణా సౌకర్యములు మున్నగు పెక్కు విషయములను వారు తెలియజరచెదరు

వాణిజ్య రాయబారులు : పరరాజ్యములతో వాణిజ్య సంబంధములున్న ప్రతిదేశము అచ్చట తమ వాణిజ్య రాయబారులను నియమించుకొనును. వీరు తమదేశముల యొక్క వ్యాపార, వాణిజ్య ప్రయోజనములను పరిరక్షించెదరు

ప్రభుత్వము తమ విదేశవ్యాపారాభివృద్ధికై కృషి సల్పు దేశీయ సంస్థలన్నిటిలో ప్రభుత్వము ప్రథమస్థాన మాక్రమించును. విదేశవ్యాపారాభివృద్ధికి తోడ్పడుటకై భారత ప్రభుత్వము పెక్కుసంస్థలను స్థాపించెను. అట్టివాటిలో ఈ క్రిందివి పేర్కొనదగును

(1) ఎగుమతి సలహాసంఘము (2) విదేశ వ్యాపార మండలి (3) ఎగుమతుల అభివృద్ధి సంస్థలు (4) ఎగుమతుల అభివృద్ధి నిర్వాహక బోర్డు (5) ఎగుమతి ప్రమాదముల భీమా కార్పొరేషన్ (6) ఎగుమతులకు ఋణములిచ్చు గ్యారంటీ కార్పొరేషన్ (7) భారత వాణిజ్య ప్రమాణముల సంస్థ (8) ప్రదర్శనముల నిర్వాహకసంస్థ (9) వాణిజ్యప్రచురణ నిర్వాహకసంస్థ (10) ప్రభుత్వవ్యాపార కార్పొరేషన్ (11) విదేశవ్యాపార సువ్యవస్థాపక రాయబార సంఘములు.

జె. వ.

## భారతీయకళ (హైందవకళ - ప్రాచీనరీతి).

హిందూసంప్రదాయ ప్రకారము మానవునకు పరమావధి మోక్షము. ఇది ఎక్కువగా 'హిందూదేశపు కళ'లో నిబిడీకృతమై యున్నదని చెప్పవచ్చును. నాట్యకళ నేర్చుకొన వలయునన్నచో, మొదట నాట్యమననేద్దియో అవగాహన చేసికొని, శరీరాంగములను ఏపద్ధతిలో చూపించినచో ఏభావముస్ఫురించునో తెలిసికొని,ఆపద్ధతిలో అభినయము

చేయవలెను ఒక వర్ణచిత్రములో ఒక నాట్యసన్నివేశమును చిత్రించుటకు, నాట్యపద్ధతి, శరీరవిన్యాసము, అంగభంగిమలు, ముఖలక్షణములు, తదనుగుణముగా బాహ్యసృష్టి నాకర్షించు రంగులకలయిక-అన్నియు అవసరము ఇదేవిధముగా సంగీతములో ఒక పాటపాడి మెప్పించవలెనన్నచో దానికి అనుగుణముగానుండు రాగము, తాళము, పల్లవి మొదలగు వాటిని మిళితముచేసి పాడవలెను. నాట్యములోగాని, చిత్రలేఖనములోగాని, సంగీతములోగాని కొన్ని పద్ధతులు తెలిసికొనటకు కృషిచేయవలయును ఈ కృషిలోనున్న చతురతయే "కళ" ఇది యొక యోగసాధనము ఈ సాధనములో ఒక తన్మయత్వముకలదు కళాకారుని జీవితములో ఇది ఒక మోక్షసాధనము

ఒక వ్యక్తి తన జీవితమును, ధర్మార్థకామములు అను పురుషార్థములకు అనుగుణముగా హిందూధర్మశాస్త్రపద్ధతిచే నడిపినచో మోక్షము లభించునని స్మృతులు, పురాణములు, ఘోషించుచున్నవి. ఈ పద్ధతికి అలవాటు పడుటయే సరియైన శిక్షణము

హైందవప్రాచీనకళలో మానవుడు శరీరమును యోగసాధనమువలన వశపరచుకొని, దైవసాక్షాత్కారము చేసికొన్నట్లు,అనేకదృశ్యములు రాతిలోగాని,వర్ణచిత్రములోగాని, కనిపించును తథాగతుని యోగనిష్ఠలో చూపించుటలోని ఉద్దేశము, అతడు దైవాంశసంభూతుడని నిరూపించుటయే

ఒక దృశ్యమును చిత్రించవలయునన్నచో చిత్రకారుని మనస్సులోనున్న ఊహాచిత్రము విస్పష్టముగానుండవలెను ఒక దేవుని శిల్పలక్షణానుగుణముగా, ఒకభంగిమములో, ముద్రలో చూపించుటకు ఆ దేవునిచూచి ఆనందించు ప్రేక్షకుల కంటె, శిల్పి పెక్కువిధముల ఆలోచించి చిత్రించవలెను దేవుని భక్తితో దర్శించుటకు వచ్చిన భక్తునికి, శిల్పశాస్త్రపద్ధతులు తెలియకపోవచ్చును. కాని భగవంతుడుగా సృష్టించబడిన శిల్పవిగ్రహమును భక్తుడు చూచి నమస్కరింపవలయునన్న శిల్పికి కళాకౌశలము, ప్రతిభ, అత్యావసరములు

భారతదేశములోని హిందూసంప్రదాయకళ ఏనాని సమయమున పుట్టినదని చెప్పుటకు వీలులేదు. ఒకప్పుడు సింధునది భారతదేశములో గొప్పపేరు పొందిన నది ఈ నదీలోయలు ప్రపంచములో ప్రఖ్యాతిగాంచిన ఒక మహత్తరమైన నాగరికతకు పుట్టిల్లు ఈ అనాది నాగరికతా చిహ్నములు క్రీ. శ. 1920లో, హరప్ప, మొహంజోదారో యను రెండుప్రదేశములలో పురాతత్త్వపరిశోధనముల వలన బయటపడినవి ఈ నాగరికత క్రీస్తు పూర్వము 2500 సంవత్సరముల నాటిది ఈ నాగరికతకు చెందిన పెక్కు కళాఖండములు బయటపడినవి

సింధునాగరికతా కళావిశేషములను తెలిసికొనుటకు అచటదొరికిన అవశేషములు మనకు ముఖ్యమైన ఆధారములు వీటిలో దొరికిన చిన్నచిన్న మట్టిబొమ్మలు కొన్ని కలవు వీటిలో కొన్ని స్త్రీమూర్తులున్నవి ఇవి మాతృదేవతలుగా పరిగణించబడుచున్నవి ఈ స్త్రీమూర్తుల మెడలలోని హారములలో, కటిసూత్రములలో జ్ఞానచిహ్నములుగా నుండు శిరోభూషణములలో, కొంతవరకు దేవత్వము గోచరించును.

రాతి అవశేషములలో విచిత్రమైనవి పురుషుని శరీరపు మొండెములు ఈ మొండెములలో వీపునందు వంపులుండుట, ఎడమకాలు ముందునకు ఎత్తియుంచుట మొదలగునవి శరీరసౌష్ఠవమును ప్రదర్శించుటకై ఉద్దేశింపబడినవై ఉండవచ్చును కాని వాటిలో కొన్ని వంపులవలన, కొన్ని భావోపేతశిల్పములు ఆనాటినుండియు మనకు సంక్రమించిన కళాసంప్రదాయమునకు చెందినవని తెలియగలము

ఇంతకన్న విశిష్టమైనది మొహెంజోదారోలో దొరకిన ఒక నగ్నస్త్రీయొక్క రాతిప్రతిమ. దీనిలో ఒక చక్కని నాట్యాభినయము చూపబడినది. ఈప్రతిమయొక్క కుడిచేయి నడుమునను, ఎడమచేయి తొడపైనను, ఒక కాలు ముందుకును, మరియొకటి వెనుకకును ఉంచబడినది ఇందుకు ప్రాచీన కళాకౌశలము ప్రస్ఫుటమగుచున్నది

సింధునాగరికతకును, చారిత్రకముగా తెలిసిన మౌర్యుల కాలమునకును, మధ్య, దాదాపు రెండువేల సంవత్సరముల అవధియున్నది దీని ఆరంభము వేదకాలమని పాశ్చాత్యులూహించిరి ఈ వేదకాలము నాటి మానవులెట్టికళలను పోషించిరో చెప్పుటకు ఆధారములు లేవు ప్రస్తుతము బ్రాహ్మణ కుటుంబములలో పరంపరగావచ్చిన వేదోచ్చారణములో ఒక విశిష్టమైనకళ ఉన్నదని చెప్పవచ్చును సంప్రదాయానుసారముగా నేర్చుకొనినవారే ఈ ఉచ్చారణమును పోషించగలుగుచున్నారు. ఇందువలననే వేదములు ఇప్పటికీ కూడ సజీవములుగానున్నవి

హిందూ సంప్రదాయమునకు చెందిన శిల్పకళ ఎక్కు

తగా మానవుని పరిణామముమీద ఆధారపడియున్నది మానవ దృశ్యములు యథాతథముగా చూపబడినవి మానవునితో పాటు కొండలు, గుట్టలు, అడవులు, వృక్షములు మొదలగు నవి ప్రదర్శితములైనవి దృష్టాదృష్ట పరిణామములను మేళ వించుటయే హిందూశిల్పములోని సంప్రదాయము హిందూ శిల్పములలో మనకు దీనిఅంతరార్థబోధకములైన ఉదాహర ణములు పెక్కులు కలవు వాటిలో ఒకటి రాతిలో చెక్కబడిన ముఖలింగశివుడు లింగస్వరూపము సాంకేతికము ఈసాంకేతిక లింగమునకు బాహ్యముగా దేవుడని తెలియజెప్పునది శివుని ముఖము

గ్రీకుకళ బాహ్యముగా మిక్కిలి చక్కగా కనిపించును ఈ సంప్రదాయములో శరీరపుష్టి, ఓజస్సు మొదలగు వాటిని వ్యక్తముచేయు కళ ఎక్కువగా కనిపించుచు గ్రీకు శిల్పుల చిత్రములలో గాని, శిల్పములలో గాని, శరీర దార్ఢ్యము ఆదర్శముగా తీసికొనబడినది కాని హిందూశిల్పములోవలె అది అంతరార్థ బోధకకళ కాదు

మౌర్యులనాటి కళావగతికి ఆనాటి శిల్పవర్ణ చిత్రా ద్యవశేషములే గాక చరిత్రకూడ అవసరము క్రీ పూ 326 లో అలెగ్జాండరు భారతదేశము మీదికి దండెత్తివచ్చెను తర్వాత విదేశీయులబారినుండి తప్పించుకొనుటకు చంద్రగుప్త మౌర్యుని సాయకత్వమున మౌర్యరాజ్య స్థాపన చేయబడినది మౌర్యుల ముఖ్యపట్నము పాటలీపుత్రము (పాట్నా), వీరిలో ఖ్యాతినొందిన రాజు అశోకుడు ఇతడు క్రీ పూ 273 వ సంవత్సరమున రాజ్యమునకు వచ్చి క్రీ. పూ. 232 వరకు రాజ్యమేలెను

అశోకుని కాలములో పెక్కు బౌద్ధస్థూపములు నిర్మింప బడినవి తన్మూలమున బౌద్ధకళ పెంపొందినది ఇది కేవలము బుద్ధదేవుని ఆదేశములలో కొంత సత్యమున్నదని గ్రహించుట వలననే యని చెప్పవచ్చును ఆ మహాపురుషుని జ్ఞాపకార్థమై అతడు పుట్టినస్థలములోను (కపిలవస్తు), అభినిష్క్రమణము జరిగినచోట (రాజగృహ)ను, అతడు తపస్సుచేసిన బోధి వృక్షము పెరిగినచోటు (బుద్ధగయ)నను, ధర్మచక్రప్రవర్తనము జరిగినచోట (సారనాథ్) నను, మహాపరి నిర్వాణమొందిన చోటు (కుసినగరము) నను, స్థూపమును నిర్మించుట కశోకుడు ఎంతయు దోహదమిచ్చెను. గ్రీకు రోమను చరిత్ర వ్యాఖ్యా తలు, పాటలీపుత్రములోని రాజగృహము, ఆనాటి పర్షియాకు ముఖ్యపట్టణములగు 'సూస' 'ఎక్బటన' అను వాటికంటె మిక్కిలి మిన్నయైనదనియు, అది కళావిషయకముగ అద్వి తీయమైనదనియు వ్రాసిరి అయితే ఇచ్చట పురావస్తుఖనన ధనము వలన బయటపడిన అవశేషములు అంత విశిష్టము లైనవిగా కనిపించుట లేదు

మౌర్యుల అవశేషములలో మట్టిబొమ్మలుకొన్ని కళా విశేష దర్శకములై యున్నవి ఇవి సింధునాగరికతలోని మాతృదేవతలను బోలియుండును ఇవి శిరోభూషణములతో, ఉన్నతశ్రోణులతో, పయోజములతో, శరీరాచ్ఛాదకములగు జిలుగువస్త్రములతో మూర్తీభవించిన మాతృదేవతలవలె గోచరించును

మౌర్యుల రాతిశిల్పముకూడ ముఖ్యమైనదే అశోకుని ఎత్తైన రాతిస్తంభములపైని నగిషీ ఇప్పటికికూడ చెక్కుచెదర కుండ నున్నది, ఈ స్తంభముల మీద ఘంటాకృతిలోనుండు పద్మములు, పద్మములపై ఒకశిరీరముతో, నాలుగు ముఖము లతో నొప్పారు సింహముల ప్రతిమలు, వాటిపై నొకధర్మ చక్రము, ఇత్యాదులు చిత్రింపబడినవి. కొన్ని స్తంభములమీద వృషభములు, ఏనుగులు, గుఱ్ఱములుగూడ చిత్రింపబడినవి, సింహములు, ధర్మచక్రము మొదలగునవి అశోకుని ధర్మబుద్ధి కిని, రాజనీతికిని, శత్రుదుర్నిరీక్ష్యమైన అతని పరాక్రమము నకును చిహ్నములు

మౌర్యకళలో అనాదివైదిక సంప్రదాయము కాన నగును నేదకాలికమైన యజ్ఞవేదిక అతిపూజ్యమైనది ఇది ఇటికలతో నిర్మింపబడినది ఇటికల అనగా యజ్ఞమునకు ఉప యోగపడు ఇష్టక తరువు పాషాణము మొదలగునవి గూడ ఇట్టి పవిత్రనిర్మాణములకు ఉపయోగపడు సామగ్రి యే యజ్ఞవేదికయందు స్థాపింపబడునది అగ్ని అగ్ని తేజోమయుడు, సర్వభూతములకు ఆధారభూతుడు యజ్ఞవేదిక ప్రపంచాం డము ఇది ఆధారముగ అనేక జీవరాసులు ఉత్పత్తి నొందు చున్నవి ఈ ప్రపంచాండమే బౌద్ధుల మహాస్తూపము ఇదే బుద్ధుని పుట్టి, లయమైన 'చితి' ఇందువలన దీనికి చైత్యగృహ మనిగూడ పేరు ఈ యజ్ఞవేదికలే స్థూపములుగా చైత్య గృహములుగా మార్పుచెందెను

క్రీ. పూ. 232 సం॥ లో అశోకుడు మరణించినతర్వాత మౌర్యుల ప్రభావము తగ్గినది క్రీ పూ 2 వ శతాబ్దము తుదిదశలో మౌర్యసామ్రాజ్యము శుంగరాజుల కైవసమైనది.

కానివారు మౌర్యులవలెనే బౌద్ధకళను పెంపొందింపజేసిరి భారతదేశములో బార్ హూత్, బుద్ధగయ, సాంచి మొదలగు సుప్రసిద్ధ బౌద్ధక్షేత్రములు పెక్కులుగలవు ఈ స్తూపములు వాటిచుట్టు గోడలు, తోరణద్వారములు మొదలగునవి ఇప్పటికిని మిక్కిలి ఆశ్చర్యము గొలుపుచున్నవి ఈ బౌద్ధావశేషములలో, రాతిరగిపీలు, ఎత్తైన స్తంభములు, తదితరములైన మౌర్యకళాచ్ఛాయలు కనిపించవు

బార్ హూత్ స్తూపపు ఆవరణ కుడ్యముల మీద చిత్రింపబడిన మిక్కిలి రమణీయమైన చెట్లు, కొండలు, చెరువులు, ఏనుగులు, కోతులు హరిణములు, పక్షులు, మనుష్యులు, గృహములు, రాజగృహములు ఇత్యాదులు ఆనాటి దృశ్యములను తెలియజేయుచున్నవి సాంచిలోని తోరణద్వారములు మొదట దారునిర్మితములై యుండవచ్చును ఇవి నశిపోయిన తర్వాత క్రీ శ 2వ శతాబ్దములో అదేపద్ధతిలో వాటి స్థానములో రాతికట్టడమును ఏర్పడి యుండవచ్చును ఈ రాతి కట్టడములో ఒక ద్వారము మీద, ఒకచోట, విదిశకుచెందిన దంతపు శిల్పులచే నిర్మింపబడెనని వ్రాయబడి యున్నది. ఈ తోరణములలో ద్వార స్తంభములను, అడ్డుపట్టీలను కలుపు నగ్నయక్షిణుల యొక్కయు, తోరణభారమును వహించుచున్న విగ్రహముల యొక్కయు మంగళవాద్యములతో సాగిపోవుచున్న ప్రజల యొక్కయు, చెట్లు, లతలు, మకరములు, మొదలగువాటి యొక్కయు దృశ్యములు మిక్కిలి రమణీయముగా నున్నవి ఈ తోరణములలో బుద్ధుని జీవితచరిత్ర ఘట్టములు జాతకకథా ఘట్టములు, బుద్ధుని సాంకేతిక చిత్రములు చిత్రింపబడి యున్నవి బుద్ధుడు దేవతలకుకూడ సందేశమొసగుచున్న దృశ్యమొకటి కలదు, అందు చుట్టును నిలబడి కొంతమంది మనుష్యులు బోధివృక్షముపై చూచుచున్నట్లు చిత్రింపబడెను

శుంగసామ్రాజ్యము తుదిదశలో భారతదేశపు వాయవ్యదిశయందు కొన్ని గ్రీకురాజ్యము లుండెడివి వీటిలో కొన్ని పార్థియన్ దండయాత్రలకు గురియైనవి అట్లు గురియైనవి కొన్ని గ్రీకులకు, మరికొన్ని పార్థియన్లకు సంక్రమించెను ఇందువలన వాయవ్యమున గ్రీక్-పార్థియన్ శిల్పకళావశేషములు పెక్కులు దొరికినవి

"మినాండర్" మొదలగు రాజులు బ్రాహ్మణ, బౌద్ధ మతముల గొప్పదనమును విశ్వసించిరి, వారు హిందూ సంప్రదాయము ననుసరించిన శిల్పకళకు కొంత దోహదమిచ్చిరి

తర్వాత క్రీస్తుపుట్టిన పంద సంవత్సరములకు మధ్య ఆసియాకు చెందిన "యూచి" అను జాతీయ జనములు వలసవచ్చి ఈ వాయవ్య ప్రాంతమునందే క్రమముగా కొన్ని రాజ్యములను సంపాదించుకొనెను ఇవే కుషాన్ రాజ్యములు కుషాన్ చక్రవర్తులలో గొప్పవాడు కనిష్కుడు ఇతని కాలమున గూడ కొంతవరకు హిందూకళా సంప్రదాయపద్ధతి పెంపొందెను. ఈ విదేశీయుల సృష్టితో సిద్ధమైన హిందూశిల్పమే గాంధారశిల్పము

గాంధార సంప్రదాయము భారతీయ శిల్పకళలో పెక్కు మార్పులను కల్పించినది దీనిలో గ్రీక్ కళ బాగుగా కనిపించును పురాణశిల్ప సంప్రదాయములో మానవ పరిణామము తక్కువ ఇందు చెట్లు, లతలు ఎక్కువగా నుండుట వలన దీనికి శాఖకళ అని పేరువచ్చెను గాంధారకళలో మానవపరిణామము ఎక్కువ జీవిత గాధలలోగాని, జాతక కథలలోగాని, బుద్ధుని చిత్రణములలోగాని, సాంకేతిక సంప్రదాయము నశించెను రోమన్ బురఖాలో మానవాకృతి చిత్రించబడినది

కుషాన్ రాజగు కనిష్కుని మరణానంతరము వాని కొడుకులు విశిష్కుడు, విష్కుడు, జైన, బౌద్ధమతములను రెండింటిని సమదృష్టితో చూచిరి యమునానది యొడ్డున నున్న వారి ముఖ్యపట్టణమైన మధురలో గాంధార సంప్రదాయమునకు అనుగుణముగా జైనబుద్ధ ప్రతిమలు సిద్ధము చేయబడినవి ఎర్ర ఇసుకరాతి శిల్పములో మద్యపానములో నిమగ్నులైయున్న కొందరు స్త్రీపురుషుల యొక్క దృశ్యములు ఆనాటి సంఘాచారములను తెలియజేయుచున్నవి

గాంధార, మధురా శిల్పసంస్థలు ఉత్తర హిందూస్థానములో ప్రబలముగా నున్నపుడే, దక్షిణ హిందూ దేశములో ఆంధ్ర కళాసంస్థ యొకటి ప్రారంభమైనది ఈ కళాపోషకులు శాతవాహనులు వీరు దక్షిణాపథ రాజ్యాధీశులు ప్రప్రథమములో వీరు హిందూదేశములోని తూర్పు మధ్య భాగమునుగూడ స్వాధీనము చేసికొనిరి. కొంతకాలము ఉత్తరమున 'పైథాన్' (ప్రతిష్ఠానపురము) అనునది వారి రాజధానిగా నుండెడిది తర్వాత దక్షిణమున అమరావతి (ధాన్యకటకము) వారి రాజధానియై యుండెను వీరుకూడ బౌద్ధశిల్పమునకెంతో దోహదమిచ్చిరి వీరి కాలమున అమరా

వతిలో ఒక మహాస్తూపము నిర్మించబడెను అది ఆంధ్ర శిల్పమునకు పుట్టినిల్లు తర్వాత నాగార్జునకొండలో (విజయపురి) రాజ్యము చేసిన ఇక్ష్వాకురాజులచే ఈ శిల్పము పెంపొందించబడెను

ఆంధ్ర కళాసంస్థ, బౌద్ధకళా స్వభావమును కలిగియున్నప్పటికిని, ఎక్కువగా సాధారణ మానవసంఘ జీవితమునకు సంబంధించిన దృశ్యములనే అది చిత్రించినది "బోష్ ఫర్" అను శిల్పశాస్త్రజ్ఞుడు చెప్పినట్లు మతము అను మిషతో సాంసారిక దృశ్యములు, మిథునములు, నగ్నస్త్రీమూర్తులు, పెక్కులు చిత్రించబడినవి వీటిలో 'కళాకారుల'యొక్క పవితనము ఎంతో విశేషముగా కనిపించుచున్నది ఇది పశ్చిమ హిందూదేశములోని భాజా, బెడ్సా, కన్హేరి మొదలగు గుహలలో విశేషముగ గోచరించకున్నను, అమరావతిలో బాగుగ కనిపించును నగ్నస్త్రీమూర్తులయొక్క ముఖలక్షణములను, భంగిమలను, ఉన్నతములైన శ్రోణ్యాదులను శరీరావయముల లలితస్వభావమును చూచి, "శిల్పకళావేదియగు ఆనంద కుమారస్వామి హిందూశిల్పములో అమరావతీకళ శామోద్రేకజనకమగు ఒక లలితకుసుమము" అనెను

ఇక నాగార్జునకొండలోని శిల్పము అమరావతిశిల్పము కంటె ఎంతో లలితమైనది దీనిలోగల మిథునముల, పాలభంజికల, నృత్యముల, యక్షిణుల, సృష్టి మనోహరము ఇవన్నియు బౌద్ధకళా దృశ్యములతో మిశ్రమము చేసి చిత్రించబడినవి నాగార్జున కొండయందలి దృశ్యములలోని మిథునములకు ఒక ప్రత్యేకత కలదు ఇవి సజీవచిత్రములు కోపము వచ్చినస్త్రీని పురుషుడు బుజ్జగించుట, ఆతడు ఆమెకు మధుపాత్రనందించుటకు ప్రయత్నించుట, ఆమె నిరాకరించుట మున్నగు దృశ్యములు మిక్కిలి సహజముగ నున్నవి

చిత్రము 117



క్రీ శ వ శతాబ్దినాటి నాగార్జునకొండ శిల్పము, బుద్ధుడు సారనాథ్‌లో యోగనిష్ఠయందుండి ధర్మచక్రప్రవర్తనము చేయుట

గుప్తరాజుల కాలమున క్రీ శ 4 వ శతాబ్దిలో మరియొక కళాసంస్థ ఏర్పడినది మధురాంధ్ర కళాసంస్థలయందువలెనే, ఇందు మానవస్వరూపములో భగవత్సృష్టి గోచరించును కాని భగవంతుని భిన్నభిన్న విగ్రహములను గర్భగృహములలో ప్రతిష్ఠించుటచేత ఆయావిగ్రహములకుగల స్వరూపములు, ఆయుధములు, భంగిమలు, ముద్రలు, పరిమాణములు గర్భగృహపరిమాణములు, శిఖరములు, విమానములు ఆవరణములు మొదలగు వాటి నిర్మాణములో ఒక విశిష్టపద్ధతి గోచరించును దేవలక్షణములను వాస్తువిశేషములను తెలుపు గ్రంథములు వీరికాలముననే ప్రారంభింపబడెను

గుప్తరాజుల కాలమున బౌద్ధము హీనదశలో నుండుటవలన ప్రజలు స్వస్వమతానుగుణముగా దేవతలను పూజించెడివారు అందువలన బ్రహ్మ, విష్ణువు, శివుడు, దుర్గ, సప్తమాతృకలు మొదలగు దేవతలు గుప్తరాజ్యకాల శిల్పావశేషములలో కనిపించుచున్నవి

గుప్తరాజులు ఉత్తరహిందూదేశమునకు చెందినవారు వీరు దేవాలయ నిర్మాణమునకు దోహదమిచ్చిరి కాని మొట్టమొదట దేవాలయ నిర్మితి దక్షిణ హిందూదేశముననే ఆరంభమయ్యెను నాగార్జునకొండలో చైత్యగృహపద్ధతిలో గజపృష్ఠాకారముగల దేవాలయము నెలకొల్పబడెను అది ఇక్ష్వాకులకాలమున పుష్పభద్రస్వామికి నెలకొల్పబడెను తరువాత ఈ నమూనాగల దేవాలయము నర్సారావుపేట తాలూకానకు చెందిన "చేజెర్ల"యను గ్రామములో కపోతేశ్వరునికి నిర్మించబడెను

తరువాత నలుచదరపుటాకృతిగలిగిన గర్భగృహములు పెక్కులు ఉత్తరహిందూస్థానమున నిర్మింపబడెను, ఒక గర్భగృహము, ఒక ముఖమండపముగల

గుప్తకాలిక దేవాలయములు సాంచిలో, సార్‌నాథ్‌లో పశ్చిమమున సౌరాష్ట్రములోని గోప్, వసవడ మొదలగు చోట్ల నిర్మింపబడినవి

సింధు నాగరికతాగతకళానుసారముగా దాదాపు 5000 సంవత్సరములకు పూర్వము బాగుగా కాల్చిన మట్టి కుండల మీద నల్లనిరంగుతో భారతదేశ వర్ణచిత్రములు ప్రదర్శింపబడినవి వీటిలో అనేక రకములైన గీతలు,వలయములు పూవులు, కాయలు, ఆకులు, చేపలు, పశువులు మొదలగునవి చిత్రించబడినవి కొన్ని కుండలమీద కాకి-నక్కల గాథలవంటి గాథలు చిత్రింపబడియున్నట్లు ప్రతీతి ఇలాటి చిత్రములుగల కుండలు హరప్ప, మొహంజొదారోలలోనే కాక, సింధు నదీలోయలోను, గుజరాత్, సౌరాష్ట్రము, కచ్, మొదలగు చోట్లలోను దొరకినవి

వేదకాలికములైన అవశేషములేమియు లేకపోవుట వలన అనాడు ఎట్టి చిత్రవర్ణములుండెడివో తెలిసికొనుట అసంభవము తర్వాత ప్రవర్తిల్లిన మౌర్య, శుంగ శాతవాహనుల కాలములలోని చిత్రవర్ణ పరిశ్రమకు అజంతాలోని 9, 10 సంఖ్యలుగల గుహలలోని వర్ణచిత్రములు నిదర్శనములు వీటికి అచటనున్న బ్రాహ్మీశాసనములు ఆధారములు

పురాతన వర్ణచిత్రములను సిద్ధముచేయుటకు ఎఱ్ఱని బంకమట్టి, గడ్డి ఊక మొదలగువాటిని కలిపి నూరి జిగురు పదార్థమును తయారుచేసి మొదట గోడకు రెండు, మూడు జిగురుపూతలు పూసి తరువాత గోడపై ఎత్తుపల్లములను, మెత్తనైన రాళ్ళతో రుద్ది చదును చేసెడివారు ఈవిధముగా సిద్ధమొనర్పబడిన గోడపై కెయోలిన్ అను తెల్లరంగుతోను ఎర్రజేగురుతోను 'లాపిస్ లాజులి' అను నీలిరంగుతోను దీపపుమసితోను చిత్రములు తీర్చిదిద్దెడివారు.

హీనయాన, బౌద్ధ మెక్కువగా నుండుటవలన బౌద్ధ చిహ్నములలో, బుద్ధునిగాథలు, జాతకకథలు వర్ణచిత్రములుగ చిత్రించుట జరిగెను

తర్వాత 500-600 సంవత్సరములవరకు ఈ చిత్రవర్ణముల కళ హీనదశలో నుండెను. ఈ పద్ధతి మరల గుప్తరాజుల కాలములో అజంతాలో ప్రవేశపెట్టబడినది బాగ్, సిగిరియా (సింహళము) మొదలగుచోట్ల ఈపద్ధతి అనుకరించబడినది అజంతాలోని ఈకాలపు వర్ణచిత్రములలో ఎక్కువగా బుద్ధజాతకకథల చిత్రణము గోచరించును. ఒకజాతకచిత్రములో నాగరాణి "ఇరందతి" పూర్ణకుడను యక్షునిమాయా అశ్వమును గురించి ప్రశ్నించు దృశ్యము రంగులతో మిక్కిలి నేత్రానందకరముగా నున్నది

గుప్తరాజుల కాలములో దేవాలయ నిర్మాణము లారంభమయ్యెను గాన, సంప్రదాయసిద్ధ శిల్పసంస్థలు క్షీణించెను దీనితో మధ్యయుగములో భారతీయ శిల్పములో, ఒక క్రొత్తదశ ఆరంభమయ్యెను

టి. వి. జి. శా.

## భారతీయకళ - హైందవకళ - మధ్యయుగరీతి

ఉత్తర హిందూస్థానమున గుప్తరాజ్య పతనానంతరము మనకు సంక్రమించియున్న పురాతత్త్వ - అవశేషములు హైందవ కళాచరిత్రలో దేవాలయ నిర్మాణమునకొక ప్రత్యేక స్థానమేర్పడినదని చాటుచున్నవి ఈ అవశేషముల పూర్వాపరములను పరిశీలించగా మానవ దృక్పథములో ఆరోజులలో కొన్నిమార్పులు వాటిల్లినట్లు కనిపించుచున్నది అకాలమున దేవుడు మానవరూపములో నుండునని యూహింపబడుటచే హిందూ శిల్పస్వరూపము మారిపోయెను మానవ పరిమాణమునుగూడ ఆధారముగా చేసికొని దేవప్రతిమను నిర్మించి, తదనుగుణముగా ఆలయనిర్మాణమును చేయుటలో కొన్నిపద్ధతులు ప్రవేశపెట్టబడినవి ఇదియే వాస్తుపద్ధతి

దేవాలయ నిర్మాణము ముఖ్యముగా వైదికయూపస్తంభ సంకేతము మీద ఆధారపడి యున్నది ఈ యూపస్తంభమే దేవాలయ స్తంభము యూపబద్ధమై, విశ్వసింపబడి, యాగాగ్నియందు అర్పింపబడిన పశువునందలి జీవుడు శాశ్వత కీర్తితో దేవత్వమును పొందుచున్నాడు ఇతడే హిరణ్యగర్భుడు దేవాలయస్తంభమే ద్రుమేష్టకాద్యావరణ సహితమయిన హిరణ్యగర్భుని స్థావరము యూపస్తంభతలము తచ్చిహ్నిత సోపానములు, అమలకము, ఆవరణములు ఆలయ స్థూల పరిమాణ నిర్దేశకములు కలశబిందువు సూక్ష్మపరిమాణమును నిర్దేశించును

దేవాలయము దేవుని యొక్క బాహ్యస్వరూపము బాహ్యస్వరూపమును బట్టియే ఇది దేవాయతనము, దేవగృహము అనుపేర్లతో వ్యవహరింపబడుచున్నది దేవాలయములేనిచో ఎంతశక్తిమంతమైన లింగమునకుగాని, విగ్రహమునకుగాని ప్రాముఖ్యము లేదు దేవాలయములోని గర్భగృహము, మండపములు, ప్రాకారములు, విమానములు, తల

చ్ఛందములు, ఉపరితలములు మొదలగు అలయాంగము లన్నియు హిరణ్యగర్భుని శరీర భాగములు వీటిపరిమాణములు విశ్వకర్మ యొక్క బుద్ధివైభవము నకు అనుగుణముగా సృష్టింప బడుచున్నవి విశ్వకర్మ దేవుని సుందరరూపమును, తన మనోముకురమున దర్శించి తనకల్పనాశక్తిచే ప్రతిరూపమును సృష్టించి, తన్మయత్వమును పొందుచున్నాడు దేవాలయము యొక్క బాహ్య రామణీయకము భక్తుల చిత్తముల నాకర్షించి వారిని భగవచ్చింతా నిష్టమనస్కుల నొనర్పు చున్నది

దేవాలయావరణములోని గోడలమీదను, బాహ్యదృష్టి నాకర్షించు దేవకోష్ఠములలోను, దేవతామూర్తులుదిక్పాలకులు ప్రతీహారులు, మిథునములు, శార్దూల ద్విపాది చిత్రములు, చిత్రింపబడి యున్నవి వీటిలో మిథునములు మోక్ష సంకే తములు ఇవి ప్రకృతిపురుషుల కలయికను నిర్దేశించును ఇవి సాంభోగేచ్ఛానారహితమైన అద్వైత తత్వమునకు చిహ్నములు

గర్భద్వారము తెరచుకొనియుండు స్వభావముకలది దీనిద్వారా భక్తుడు గర్భగృహములో ప్రవేశించును ద్వార శాఖలమీద చిత్రింపబడిన ద్వారపాలకులు గదాఖడ్గాది ఆయు ధములచే జనులకు దైవభీతిని కల్పించి వారి మనములందలి మాలిన్యమును దూరీకరించి భక్తిని ప్రబోధించు చున్నారు లలాటమున నున్న గజలక్ష్మి తన పవిత్రవీక్షణములచే భక్తులకు ద్వార పావిత్ర్యమును, ఆరోగ్యైశ్వర్యములను ప్రసాదించుచు న్నది భక్తుడు ఆలయమునందలి అంధకారములో కూర్చొని బహి ర్లోకమును మరచి దేవుని ధ్యానింపగలుగుచున్నాడు. సూర్యుని తేజస్సు దేవాలయ స్తూపియొక్క బిందువుమీద పడినప్పుడు లేదా పూజారి పూజాప్రసంగమున దీపజ్వాలను కల్పించినపుడు భక్తుడు దేవునిరూపమును సాక్షాత్కరించుకొనగల్గుచున్నాడు గర్భాశయమునుండి శిశువువలె గర్భాగారము నుండి బహిర్గతు డైనతోడనే మానవుడు లౌకిక వ్యవహారమందు మగ్ను డగుచున్నాడు

దేవాలయ మొక పర్వతము పర్వతప్రాంతమున నుండు సింహాది మృగములు, దేవాలయాధిష్ఠానమున అనేక రకములుగా చిత్రింపబడుచున్నవి దేవాలయ స్తూపి యొక పర్వతశృంగము ఇది అప్సరో, యక్ష, గంధర్వ, దేవతాది గణముల స్థావరము పర్వత గహ్వర మొక హిరణ్య గర్భాండము ఇది అంధకార బంధురము అనాదిగా హృదయ గుహ దేవునికి ఉనికిపట్టుగా గ్రహింపబడుచుండెను అందుచే పూర్వులు అనేకరకములైన పర్వతగుహలను త్రవ్వించి అందు మూర్తులను ప్రతిష్ఠించుట జరిగినది ఇట్లు త్రవ్వించబడిన గుహలు దేవాలయములుగా ప్రప్రథమమున జైన, బౌద్ధమత ప్రబోధకులచే ప్రవేశపెట్టబడెను కాని మధ్యయుగారంభ మున ఈ గుహలు వైదిక సాంప్రదాయమును బట్టి బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు మున్నగు దేవతలకు ఆలయము లయ్యెను

దక్షిణ హిందూదేశమున సముద్రగుప్తుని దండయాత్రా నంతరము క్రీ శ ౪వ శతాబ్దములో చిన్నచిన్న స్వతంత్ర రాజ్యములేర్పడెను వీటిలో ముఖ్యమైనవి తూర్పు కోస్తా ప్రాంతమున నున్న విష్ణుకుండిన, శాలంకాయన, పూర్వ పల్లవుల రాజ్యములు ఈ రాజ్యాధిపతులు హైందవ శిల్ప ములో గుప్త సంప్రదాయములను కొన్నింటిని ప్రవేశపెట్టిరి ప్రత్యేకములైన దేవాలయావశేషము లేమియు లేనప్పటికిని పర్వతాగహ్వరములను, దేవాలయములుగ మార్చి బ్రహ్మ, గణేశుడు, విష్ణువు, నారసింహుడు, శివుడు, దేవి, నటరాజు, ఉమామహేశ్వరుడు మొదలగు దేవతల శిల్పవిగ్రహములు స్థాపింపబడెను విష్ణుకుండిన రాజగువిక్రమమహేంద్రుని అల్లుడగు సింహవిష్ణువు నెల్లూరు శివారునకు చెందిన భైరవకొండలో కొన్ని గుహాలయములు త్రవ్వించెను విజయవాడ యందలి వస్తుప్రదర్శనశాలలోని, పరశువును ధరించిన శివునియొక్క విగ్రహములో శాతవాహన, ఇక్ష్వాకు, శిల్పుల పనితనము కనిపించుచున్నది కాని ఇది పూర్వపల్లవుల శిల్పముగ పరిగ ణింపబడుచున్నది విజయవాడ వద్దనున్న ఉండవల్లిలోను, మొగల్రాజపురములోను గల గుహాలయములు విష్ణుకుండిన రాజులచే త్రవ్వింపబడినట్లు ఊహింపబడుచున్నది మొగల్రాజ పురములోని గుహాలయ శిల్పమునకు చెందిన వాటితో అష్టభుజ నటరాజు - వరాహ నృసింహ విగ్రహములు ముఖ్యమైనవి వీటిలో గుప్త సంప్రదాయములు కనిపించును

క్రీ శ ఆరవశతాబ్దమున దక్షిణ హిందూదేశమున పల్లవరాజ్యము ఏర్పడెను పల్లవుల రేవుపట్టణము మహాబలి పురమై యుండెను తూర్పున కొంత ఆంధ్రప్రదేశమును, దక్షిణమున తంజావూరు వరకు తమిళదేశమును వీరి స్వాధీ నములో నుండెను వీరు పెక్కు గుహాలయములను త్రవ్వించిరి వీరు త్రవ్వించిన పద్ధతిలో కొంత ప్రత్యేకత యున్నది. మహేంద్రవర్మ క్రీ శ ౬౦౦ లో మహాబలిపురములో పెద్ద పెద్ద

రాతిగుండ్లను గుహాలయములుగ మార్చెను అందుబాటులో నున్న రాతిగుండ్లను మార్చుటలో కొంత స్వతస్సిద్ధత కనిపించును ఇట్టి విచిత్రమైన శిల్పశైలిని మహేంద్రవర్మ ప్రవేశపెట్టుటవలన ఇతనికి "విచిత్ర చిత్త" యను పేరుకూడ లభించెను ఇనుము, మట్టి మొదలగునవి లేకుండ ఆలయములను, యూపములను సృష్టించి పల్లవ కళాసంస్థకు ఇతడు ఆదర్శపురుషుడైనాడు ఇతడొక శాసనములో "అనిష్టికం", "అద్రుమమలోహం", "అసుధం" అనిగూడ వ్రాయించెను.

చతురులైన శిల్పులు బృహచ్ఛిలలో వరండాను గర్భాలయమును, ద్వారశాఖలను, ద్వారపాలకులను దేవతాప్రతిమలను, ఇవాఖాదులను చెక్కి తద్విశిష్టములయిన సుందర గుహాలయములను సిద్ధమొనర్చిరి అట్టిగుహాలయములు దక్షిణమున వల్లలు, తిరుక్కల్ కున్రం, మండగపట్టు మున్నగు గ్రామములలో ఇప్పటికిని గోచరించుచున్నవి

మహాబలిపురము నందున్న శిల్పావశేషములు రథములని, గుహాలయములని, దేవాలయములని, వ్యవహరింపబడుచున్నవి ఇవి పాండవరథములు, మహిషమర్దనీ గుహాదులు, కొన్ని రథశిఖరములు వర్షపునీరు నిలవకుండ గజపృష్ఠాకృతిలో చెక్కబడినవి దీనికి ద్రావిడ సంప్రదాయమున 'శిలాశిఖర'మని పేరు కొన్ని గర్భాలయములలో భాగములు చతురస్రాకారముగా నున్నవి కపోతముమీద తలములు, హారములు, అమలకములు, స్తూపి మొదలగునవి అమర్చి శిల్పులు శిఖరములను తయారుచేసిరి. ఇట్టిదే మహాబలిపురములోని తీర దేవాలయము ఇట్టిదే, కాంచీపురములోని 'కైలాసనాథ దేవాలయము', ఇది రెండవ నరసింహవర్మ రాయసింహుని (క్రీ శ 674) కాలమున అతని భార్యయగు రంగపట్టక అనునామెయొక్క ప్రోత్సాహముచే ముఖ్యపట్టణమైన కాంచీపురమున కట్టబడిన అత్యద్భుతమైన పల్లవ దేవాలయము

రమారమి ఈకాలముననే పశ్చిమ చాళుక్యులు కన్నడ దేశమున ఐహోళే, బాదామి, పట్టడకల్ అనుచోట్ల మరియొక దేవాలయ నిర్మాణసంస్థను స్థాపించిరి ఇవి సంప్రదాయపద్ధతిలో కొండప్రాంతములందు గుహాలయములుగను, ఐహోళ ప్రదేశములలో దేవాలయములుగను ఏర్పరుచబడినవి బాదామి గుహాలయపు వరండాగోడలపై కూర్చొనియున్నట్లు చెక్కబడిన అనంతశాయి - విష్ణు, నారసింహుల యొక్క విగ్రహములును, స్తంభోపరిభాగమును, దేవాలయపు కప్పును కలువు త్రిమూర్తులును, అజంతా, బాగ్ గుహాలయములలో గల గుప్తశిల్పమును స్మరణకు తెచ్చుచున్నవి

ఐహోళ ప్రదేశస్థితములగు దేవాలయములో గజపృష్ఠాకృతిలో బౌద్ధ చైత్యశైలిలో, నిర్మింపబడిన ఐహోళులోని దుర్గాదేవాలయ మొకటి దీని గోడలయందుండు దేవకోష్ఠములలో శివుడు, నరసింహుడు మహిషమర్దని వరాహ విష్ణువు మున్నగు దేవతల విగ్రహములు అమర్పబడినవి

ఇవిగాక తుంగభద్రా నదీతీరమున దక్షిణకాశీ యను పేరుపొందిన అలంపురమనుచోట నవబ్రహ్మ దేవళాలయములను పశ్చిమ చాళుక్యులు కట్టించిరి అవి వినయాదిత్యునిచే (క్రీ శ 682) కట్టించబడినట్లు ఒక దేవాలయమున శాసనమొకటి కలదు ఇట్టి దేవాలయములు కృష్ణ, తుంగభద్ర కలియు కూడలిలో సంగమేశ్వరమువద్దను, కర్నూలు జిల్లాకు చెందిన 'సత్యవోలు' అను గ్రామములోను కనిపించును వీటిలో కంటికి ఇంపుగా కనిపించునవి 'శిఖరము'లు ఇవి ఘంటాకృతిలోనుండు నాగర శిఖరములు గర్భద్వారమునకు పైగా శిఖరపీఠములో వలయాకృతిలో చక్రమువలె నుండు నొక కట్టడము కలదు. దీనికి శుకనాసి అని పేరు ఇది వీరి దేవాలయములలోని ప్రత్యేకత దేవాలయములోపల ప్రవేశించినపుడు గర్భాలయముచుట్టును ప్రదక్షిణము చేయుటకొక పథము సాంధారపద్ధతిలో కట్టబడియున్నది గర్భాలయమునకు ముందు ఎత్తైన స్తంభములమీద ముఖమండపమొకటి పొడవుగా నిర్మింపబడినది.

పశ్చిమ చాళుక్యుల శిల్పకళకు ముఖ్యోదాహరణమైన దేవాలయము 'పట్టడకల్'లోని విరూపాక్ష దేవాలయము. ఇది ద్రావిడ సంప్రదాయ శిల్పములో నిపుణుడైన సర్వసిద్ధి యను స్థపతిచే నిర్మింపబడినట్లు ఒక శాసనములో వ్రాయబడియున్నది ఇట్టి దేవాలయమే పాపనాథ దేవాలయము, దీనిలోని మిథునములు, విగ్రహములు స్తంభములమీద చెక్కబడిన త్రిపురాంతక శివుని విగ్రహము, రామాయణ గాథలను తెల్పు పెక్కు విగ్రహములు ఆనాటి ముఖ్యోదాహరణములు

పశ్చిమ చాళుక్యులలో ముఖ్యుడైన రెండవ పులకేశి తూర్పు వేంగి ప్రాంతమును జయించి తన సహోదరుడైన కుబ్జ విష్ణువర్ధనుని రాజ్యాధిపుని చేసెను తూర్పు చాళుక్య

అనేక దేవాలయములను, శిల్ప కళాఖండములను తయారు చేయించి తన్మూలమున తూర్పుచాళుక్య శిల్పసంస్థను నెలకొల్పిరి విష్ణువర్ధనుని భార్య అయ్యన మహాదేవి విజయవాడలో, జైనులకొరకు ఒక దేవాలయమును కట్టించెను. ఈ శిల్పమునకు ముఖ్యోదాహరణము విజయవాడ ద్వారపాలక విగ్రహములు ఈ ద్వారపాలకుల భంగిమలో ఒక విశిష్టత కనిపించుచున్నది నడుమును వంచి గదను ఆధారముగా చేసికొని ఒకపాదమును భూమిపైనుంచి మరియొక పాదమును ఎత్తియుంచినట్లు చిత్రించుటలో శిల్పియొక్క భావనా వైభవము కనిపించుచున్నది ఘంటికామాలను యజ్ఞోపవీతముగా నుండునట్లు చెక్కుటలో గూడ శిల్పియొక్క ప్రత్యేక నైపుణ్యము గోచరించుచున్నది

గుణగ విజయాదిత్యుని కాలమున తూర్పు చాళుక్యుల దేవాలయద్వారశాఖలయందు త్రిభంగములో గంగను-మకరము మీదను యమునను తాబేలుమీదను చెక్కిరి ఇది ఆరోజులలోని గంగాయమునా నదులయొక్క పావిత్ర్యమును సూచించుచున్నది సామర్లకోటలోని భీమేశ్వరాలయములోను, ద్రాక్షారామములోని శివాలయములోను గల గర్భాలయ ద్వారములకు లలాటమున చెక్కబడిన మకర, మయూర తోరణములు ఆనాటి శిల్పవైశిష్ట్యమును తెలియజేయుచున్నవి

క్రీ. శ. 8 వ శతాబ్దమున, దంతి దుర్గుడు అనువాతడు పశ్చిమ చాళుక్యరాజ్యములను వశపరచుకొని రాష్ట్రకూట సామ్రాజ్యమును స్థాపించెను. ఇతని పినతండ్రియగు మొదటి కృష్ణరాజు పిదప రాజ్యమునకు వచ్చెను ఇతడు కళాపిపాసి పల్లవ సంప్రదాయముల నాధారముగా చేసికొని, కట్టబడిన కైలాసనాథ దేవాలయము నంటి ఒక అత్యద్భుతమైన గుహాలయమును, ఎల్లోరాలో ఇతడు త్రవ్వించెను ఒక రాగిరేకు శాసనములో, నైపుణ్యవిషయమున ఆది దేవతలు, గంధర్వులు గూడ మెచ్చగగిన యాలయమని వ్రాయబడియుండెను దేవాలయము పైనుండి చూచినపుడు, పర్వతప్రత్యేకమే ఒక మూసపోసిన నమూనావలె గోచరించును. దీనిలో గంగ, యమున, సరస్వతి, రతి, మన్మథుడు, గరుడారూఢుడగు నారాయణుడు, త్రిపురాంతక భైరవుడు, అగ్ని, వాయువు, స్కందుడు మున్నగు దేవతలయొక్కయు, శంఖపద్మ నిధులయొక్కయు, శిల్పములు ఆనాటి శిల్ప సంప్రదాయమును తెలియజేయుచున్నవి ఈ దేవాలయపు గోడలమీద రామాయణములో, మహాభారతములో, విష్ణుపురాణములో గల గాథాదృశ్యములు రమణీయముగా చిత్రింపబడినవి

క్రీ. శ. 10 వ శతాబ్దిలో చోళ సంప్రదాయాను సారముగ నిర్మింపబడియున్న కుంభకోణములోని నాగేశ్వరస్వామి

చిత్రము 118



క్రీ. శ. 10 వ శతాబ్దిలో బిలంకూరు (కడపజిల్లా) నందు గజపృష్ఠాకృతిలో నిర్మింపబడిన గణపతి దేవాలయము

దేవాలయపు దేవకోష్ఠములలోని విగ్రహములలో కొంతవరకు పైనుదాహరింపబడిన రాష్ట్రకూటకాలిక శిల్పనైపుణ్యము కనిపించుచున్నది చోళశిల్ప మెక్కువగా తంజావూరు, గంగైకొండ, చోళపురం, దారాసురం మొదలగుచోట్లలో కనిపించును తంజావూరులోని రాజరాజేశ్వరుని దేవాలయము, రాజరాజేశ్వరచోళునిచే నిర్మించబడెను రాజరాజేశ్వరుని కుమారుడగు రాజేంద్రచోళుడు గంగైకొండ చోళపురమును కట్టించెను రాజేంద్రుని శిల్పములో ఉత్తర భారతశిల్ప సంప్రదాయములు కొన్ని ప్రవేశపెట్టబడెను ఇవి నవగ్రహముల చిత్రణమునందును, బ్రహ్మను గడ్డముతో చిత్రించుటయందును కనిపిం

చును ఇచట ద్వారపాలకుల బృహదాకృతులు చూడసొంపుగ నుండును చోళ సంప్రదాయానుసారముగా దారాసురంలో చిత్రింపబడిన మేళవాద్య దృశ్యములు నిత్యానంద సంధాయకములుగా నున్నవి హైందవకళలో ప్రత్యేకస్థానమున కర్హమైనది కాకతీయుల శిల్పకళ కాకతీయుల దేవాలయములు ఎక్కువగా వరంగల్లు హనుమకొండ, పాలంపేట, మొదలగు చోట్ల కలవు కాకతీయులు క్రీ శ 12వ శతాబ్దమునుండి 14వ శతాబ్దమువరకు ఆంధ్రదేశమున ఓరుగల్లు రాజ్యమునేలిరి రుద్రదేవుని కాలమునను (క్రీ శ 1168) ప్రతాపరుద్రుని (క్రీ శ 1299) కాలమునను పెక్కులు దేవాలయములు నెలకొల్పబడెను ద్వారపాలకుల యొక్కయు, వీరభద్రుని యొక్కయు, నందీశ్వరుని యొక్కయు, విగ్రహములు విశేషముగా కాంతివంతములై నగిషీ చేయబడిన నల్లరాతిపై నిర్మాణము చేయబడి కన్నులపండువొనర్చుచున్నవి

కాకతీయ సామ్రాజ్యము క్షీణించిన తరువాత 14వ శతాబ్దానంతరము దేవాలయ నిర్మాణములో కొన్ని క్రొత్త పద్ధతులు ప్రవేశ పెట్టబడినవి దేవాలయములోని గర్భాలయమునందు ప్రవేశించుట కష్టసాధ్యమను నుద్దేశముతో, ఆంధ్రదేశమున తుంగభద్రా నదీతీరమున విజయనగర రాజ్యాధీశులు, ప్రాకారములు, మండపములు, గాలిగోపురములు మొదలగువాటి నిర్మాణమును పెంపొందించిరి గాలిగోపుర ద్వారశాఖలమీద, గంగా యమునా ద్వారపాలికలను ఆధారముగా జేసికొని రెండులతలు ఒకదానితో నొకటి అల్లుకొనిపోయినట్లు చిత్రించుట, విజయనగరాధీశుల శిల్పపు ప్రత్యేకత లతల వంపుల మధ్యభాగమున దేవతామూర్తులు, హంసలు, పశులు మొదలగునవి చిత్రింపబడి వినోదమును చేకూర్చుచున్నవి ప్రప్రథమముగా నిర్మింపబడిన విజయనగర దేవాలయములు ఆంధ్రదేశమున వనపర్తి శివారుకు చెందిన జటప్రోలులోను, మంచాలకట్టలోను, అనంతపురం శివారుకు చెందిన తాడిపత్రి గ్రామములోను కనిపించును ఇవిగాక ఏకశిలారథ నిర్మాణము కాకతీయ శిల్పమునందలి యొక ప్రత్యేకత ఈ రథములను దేవుని ఊరేగించుటకు వినియోగించెడివారు ఇవి దేవాలయముల నమూనాలో చక్రములతో చిత్రింపబడినవి దేవాలయపు గోడలమీదను, ప్రాకారముల మీదను రామాయణ, భారతగాథలకు చెందిన చిత్రములు, మిథున చిత్రములు విజయనగర రాజచిహ్నములగు 'గండభేరుండ' ప్రభృతి చిత్రములు చూడముచ్చటగ నుండును శ్రీశైలమున భ్రమరాంబా మల్లికార్జున దేవాలయ ప్రాకార గాథాచిత్ర దృశ్యములు నేత్రపర్వ మొనర్చుచున్నవి

ఉత్తర హిందూదేశ శిల్పకళా విశేషములు కొన్ని కలవు పశ్చిమహిందుదేశములో గుప్తశిల్పప్రభావము తగ్గిన తర్వాత దక్షిణమునుండి పశ్చిమచాళుక్యులలో ఒకతెగవారు తపతీ, నర్మదానదులను దాటి 'అనార్త', లాట్, సౌరాష్ట్రములను ఆక్రమించుకొనిరి వీరు అనిహిల్‌వడ్ పట్టణమును రాజధానిగా జేసుకొని, క్రీ శ 10వ శతాబ్దమునుండి రాజ్యమునేలిరి ఈ చాళుక్యులకు పశ్చిమహిందూదేశములో, వ్యవహారనామము సోలంకిరాజులు అనునది. వీరు గుజరాతు చరిత్రములో స్వర్ణయుగ కారకులని పేరుపొందిరి వీరికాలమున, అనేక దేవాలయములు నిర్మింపబడెను వీరిలో, మొదటి భీమదేవుడు, మహమ్మద్ గజనీ సోమనాథ దేవాలయమును ఒకసారి దండెత్తి దోచుకున్న కాలమున రాజ్యముజేసెను ఇతడు ఉత్తరగుజరాత్‌లో క్రీ శ. 1026 లో ఒక బ్రహ్మాండమైన సూర్యదేవాలయమును కట్టించెను గర్భగృహములో సూర్యవిగ్రహము లేనప్పటికిని, దీనిశిఖరము ముస్లిం దండయాత్రకు గురియైనప్పటికిని, దేవాలయ శిల్పముమాత్రము చెక్కుచెదరలేదు ద్వారశాఖలయందు సూర్యుని దౌవారిక విగ్రహములు, దండ, పింగళ, ఉష, ప్రత్యూష, ఛాయసువర్ణ అను సూర్యుని భార్యల విగ్రహములు చక్కనిభంగిమలలో సుందరముగా గోచరించును దేవాలయ మండోవరములలోని దిక్పాలకుల యొక్కయు, అలంకారము చేసికొనుచున్న స్త్రీల యొక్కయు, మాతాశిశువుల యొక్కయు, వెనుకకు తిరిగి కాలులోని ముల్లును తీసికొనుచున్న లావణ్యవతి యగు నొక స్త్రీ యొక్కయు విగ్రహములు ఆనాటి శిల్పవైభవమును తెలియజేయును

ఉత్తరమునందలి గంగాసింధు మైదానములు ఎప్పటికప్పుడు విదేశ దండయాత్రలకు గురియగుచుండుటవలన దేవాలయములలోని విగ్రహములు పెక్కులు పగులగొట్టబడెను తన్మూలమున హిందూమతమునకు ప్రాబల్యము తగినది అనాదిగా పూజింపబడు గ్రామదేవతలనే అప్పటివారు పూజించిరి కాళి, దుర్గ అను దేవతలకు బలియిచ్చుట ఎక్కువగా జరుగుచుండెడిది మాతృదేవతారాధన అను పేరుతో కొన్ని అత్యాచారములు, ఆనాటి శిల్పమునగూడ ప్రవేశపెట్టబడెను.

రాజగృహములందలి దేవదాసీలు, కరండకవాహికలు దేవాలయములందు సౌందర్యవతులుగా చిత్రింపబడిరి

ఈ సమయముననే వంగదేశమున, అస్సాములో, శక్త్యారాధనము అధికమయ్యెను గ్రామీణుల మాతృదేవతారాధన, బౌద్ధులలో వజ్రయాన తంత్రయానము మున్నగు ఆరాధనలు యొక్కువయ్యెను అందువలన ఈ దేశములలోని దేవాలయములలో సరసశృంగార ప్రతిమలు పెక్కులు సృష్టింపబడెను

క్రీ శ 10–12 వ శతాబ్దములలో బుందెల్ ఖండ్ ప్రాంతము చండెల్లా రాజులచే పరిపాలింపబడెను ఖజురాహో లోని దేవాలయములు వీరిసృష్టియే ఖండారీయ దేవాలయము, మహాదేవుని ఆలయము, లక్ష్మణాలయము, జగదంబికాలయము, చిత్రగుప్తాలయము వీటిలో ముఖ్యమైనవి ఇవి బ్రాహ్మణ, బౌద్ధ జైనమతములకు చెందినవి ఈ దేవాలయముల గోడలపై శృంగారశిల్పములు పెక్కులు కలవు ఇట్టి శిల్పములు ఒరిస్సాలో భువనేశ్వరములో కోణార్కములో, దేవాలయభిత్తులపై గోచరించును మహమ్మదీయులపై విజయసూచకముగా, నృసింహదేవ గంగు (క్రీ శ. 1238–64), అతని భార్య సీతాదేవి ప్రోత్సాహముతో ప్రపంచ ప్రఖ్యాతి నార్జించిన కోణార్క సూర్యదేవాలయమును కట్టించెను దీనిలోని శిల్పము అత్యద్భుతమైనది

మధ్యయుగమున గుప్తసామ్రాజ్యానంతరము సంప్రదాయ సిద్ధ వర్ణచిత్రకళను పోషించు రాజు లెవ్వరును లేకపోవుటవలన ఆకళ అభ్యసింపబడలేదు కాని ఈమధ్య ఆంధ్రదేశపు అర్చ్ శాఖవారి కృషివలన మెదకుజిల్లాలోని అల్లాదుర్గ్ అనుచోట కల్యాణిచాళుక్యుల (క్రీ శ 1076–1126) నాటి భిత్తివర్ణచిత్రములు బయటబడెను

క్రీ శ 16 వ శతాబ్దమునాటి విజయనగర వర్ణచిత్రములు కొన్ని లేపాక్షిలో కలవు వీటిలో ముఖ్యమైనది కిరాతార్జునీయ కథాచిత్రము వీటిలో అర్జునుడు తపస్సు చేయుట శివుడు కిరాతుని రూపమున వన్యవరాహమును తరుముట శివుడు, అర్జునుడు పోరాటమున్నగు దృశ్యములు సుందరమైన వర్ణములలో చిత్రింపబడి, చూపరుల దృష్టిని ఆకర్షించుచున్నవి

హిందూశిల్పములో ఒకసజీవకళ గోచరించును. దైవభీతితో, భక్తితో, సదాచారములను, సదభ్యాసములను వంశపారంపర్యముగా సంగడించుకొనుచు వచ్చిన హిందువులశిల్పకళ యావత్ప్రపంచములో అద్భుతమైనది ప్రతిభాశాలియైన హిందూశిల్పాచార్యుని ఉలిలోను ఆలయశద్ధ్యాకారాది పరిమాణములను నిర్ధరించు శిల్పపండితుని నేత్రములోను, భిన్నభిన్న వర్ణములను మేళవించు వర్ణచిత్రకారుని తూలికలోను, దైవత్వము ప్రతిబింబించుచున్నది కావుననే దైవసాహాయ్య పురుషకారములవలన మహోత్కృష్టమైన శిల్పకళ రూపొందుచున్నది

టి. వి జి శాస్త్రి

## భారతీయ చిత్రకళాచరిత్రము ·

తరతరములనుండి భారతదేశములో చిత్రకళ పరంపరాగతచరిత్ర కలదై, భారతీయ జీవితముపైన, భారతీయ ప్రతాదృక్పథముపైన ప్రభావమును ప్రసరింపజేయుచు తన ప్రాచీన సంప్రదాయమును ఈరోజువరకు సజీవముగ నుంచగల్గుచున్నది

ఇతరదేశములలోవలె భారతదేశములో కూడ జాతీయ సంస్కృతికిని, జాతీయాభివృద్ధికిని, చిత్రకళ బలవత్తరమైన శక్తిని ప్రసాదించినది ప్రాచీన భారత సంస్కృతీ నాగరికతలును, వాటికి సంబంధించిన అద్భుత విషయములును వాటి లక్ష్యములును, ఈ శతాబ్దములో జరిగిన పరిశోధనములవలన తెలియవచ్చుచున్నవి భారతదేశము అనాదిగ సంగీతమునందు నృత్యమునందు, చిత్రకళయందు, శిల్పకళయందు, వాస్తుకళయందు, అగ్రగణ్యమై, అమూల్యమైన సంప్రదాయములను గడించుకొని యున్నది ఈ విషయము కొన్ని ఆలయములలోను, గుహలలోను గల లేఖనములవలనను, మహాకావ్యములలోని వర్ణనములనుబట్టియు తెలియుచున్నది

భారతదేశములోని చిత్రకళాచరిత్ర పూర్వచారిత్రక, ఆదిమ మానవయుగములోని కళాత్మక అవశేషములలో ప్రారంభమైనది సుమారు 15 000 సంవత్సరములకుపూర్వము గుహలలో నివసించిన మానవునిచే ప్రాచీన శిలాయుగములో మొరటి చిత్రములు లిఖింపబడినట్లు అవగతమగుచున్నది ఆదిమమానవుని మనస్సెప్పుడును, జంతువులను వేటాడుటలో లగ్నమై యుండుటచేత, అప్పటి చిత్రములన్నియు కేవలము జంతువులకు చెందినవై యుండుట ఎంతమాత్రము ఆశ్చర్యము కాదు ఆ చిత్రములు సజీవములై యున్నట్లు భాసించును

ప్రాచీన శిలాయుగమునాటి చిత్రములు హాస్యాకారు

లోను, రాయగఢ్‌లోని సింఘన్‌పూరు గ్రామపరిసరముల లోను కనబడినవి. అచ్చటి జంతుచిత్రములు మిక్కిలి సహజముగను, శక్త్యావేశము కలవిగను ఉండి, అప్పటి చిత్రకారుల అత్యంత వికసిత కళాత్మక భావములను, తద్రూపములను బాగుగా వ్యక్తపరచగల నైపుణ్యమును వెల్లడించుచున్నవి. మీర్జాపూరు జిల్లాలోని కొన్ని గుహాలు అట్టివేటకు సంబంధించినవి. ఎరుపు, నలుపు, మడ్డిరంగులు కల ఇతర జంతువుల చిత్రములుకూడ కాన్పించినవి. అటుతరువాత 4000 సంవత్సరముల అనంతరము మొహంజోదారో యుగమువరకు భారతీయ చిత్రకళ యొక్క విశిష్టమగు అనవాళ్ళేమియు గోచరింపలేదు. వాతావరణ పరిస్థితులవలననేమి, ప్రకృతి వైపరీత్యమువలననేమి, అవి కంటికి కాన్పింపనివిధముగా రూపుమాసిపోయి యుండవచ్చును.

చరిత్రతోపాటు కాలపరిస్థితులలోకూడ పెక్కు మార్పులు వచ్చినవి. శిలలపైన, చెక్కలపైన రంగులువేయు ప్రాచీన పద్ధతిలోకూడ మార్పు కల్గినది. కుడ్యములపై చిత్రరచనావిధానము ప్రారంభమైనది. పూర్వము రాజభవనముల లోని చిత్రశాలలయందును, అంతఃపురములందును ఇట్టి కుడ్యచిత్రములు విరివిగా చిత్రింపబడుచుండెడివి. కుడ్యచిత్రరచనయందు భారతీయ చిత్రకారులు ప్రపంచఖ్యాతిని గడించినారు. సజీవకళ ఉట్టిపడు అజంతాకుడ్య చిత్రములే ఇందుకు తార్కాణము.

భారతీయ చిత్రకళ అజంతాగుహాలలోని భిత్తిచిత్రాలలో సంపూర్ణముగ వ్యక్తమైనది. అజంతా కుడ్యచిత్రరచన క్రీ. పూ. 2వ శతాబ్దములో ప్రారంభమైనను, క్రీ. శ. 7వ శతాబ్దివరకు సాగుచునే వచ్చినది. ఆ గుహాల లోని చిత్రములపై ప్రబలమగు బౌద్ధమత ప్రభావము ప్రసరించినది. గౌతమబుద్ధుని జీవితఘట్టములకు, అతనికి సంబంధించిన వివిధ జాతకకథలకు చెందిన రమణీయములగు దృశ్యములు వాస్తవికముగ చిత్రింపబడినవి. ఆ చిత్రములు ఫ్రెస్కో పద్ధతిలో (ఆరనిగచ్చుపై రంగులువేయుట) వేయబడినవి. ఆ యుగములోని మానవుని ఆత్మవిశ్వాసమునకు, సంస్కృతికి, మతమునకు చెందిన ప్రతిబింబములు ఆ చిత్రములలో కనిపించుచున్నవి.

సాధారణరీతిలో మితమైన వర్ణరేఖాసౌభాగ్యముతో, లావణ్య యోజనముతో, భావపూరితములై, లయబద్ధములై, అసదృశము లైన ఆ చిత్రములు ఆ యుగమునాటి చిత్రకారుల ప్రత్యేక శైలిని ఉత్తమమైన కళాశక్తిని ప్రతిబింబించుచున్నవి. అజంతా చిత్రకళను రేఖాచిత్రకళ యనవచ్చును. ఆ చిత్రకారులు రేఖకు ప్రాముఖ్యము నిచ్చిరి. కేవలము రేఖలతోనే ఆ చిత్రములలోని రూపములకు పెక్కు వంపులతో, భావములను, భంగిమలను వారు సృష్టింపగల్గిరి. వారు ముఖ్యముగా చిత్రములలో కథలను వివరించుచు అయా ఘట్టములను అతి చాకచక్యముతోను, భావస్ఫూర్తితోను చిత్రించిరి. ఆ చిత్రములలోని రూపములు, భంగిమలు, భూషణాలంకారములు శిరోజసౌందర్యము, శిరోజములను ముడుచుకొనురీతులు, ఒక టేమి-ఆపాదమస్తకము, సజీవముగను, వాస్తవికముగను ఉన్నవి. ఆ చిత్రములు మానవరూపములతో శాఖ, కుసుమ లతా కుంజములతో దివ్యములై, అలంకృతములై, ఎంతయు రమణీయములుగా నున్నవి.

అజంతా కుడ్యచిత్రములు బౌద్ధమత ప్రభావితములైనవి. అట్టి శైలిలోనే రచింపబడిన కొన్ని చిత్రములు మధ్యప్రదేశములోని గ్వాలియర్‌లోనున్న 'బాగ్' గుహయందును, సిలోనులోని సిగ్రియాయందును చిత్రింపబడియున్నవి. 'బాగ్' గుహాలోని చిత్రకళకును, అజంతాలోని చిత్రకళకును సన్నిహిత సామ్యముండుటచే, అవి క్రీ. శ. 6, 7 శతాబ్దములలో చిత్రింపబడినట్లు తెలియుచున్నది. దక్షిణమున చాళుక్యరాజుల కాలములో వాతాపిగుహాలలోని చిత్రములుకూడ ఇట్టి శైలిలో నున్నవి. అందువలన అవి అజంతా భిత్తిచిత్రములను అనుకరించి వ్రాయబడినట్లు తెలియుచున్నది. గుప్తయుగపు వివిధ దశలలో ఫ్రెస్కో-చిత్రములు అంతటను విరివిగా చిత్రింపబడినవి. అట్టి బౌద్ధ చిత్రకళాఖండములు 6, 7వ శతాబ్దములలో సర్వత్ర చిత్రింపబడినవి. బౌద్ధచిత్రకళ ఈ శతాబ్దములో మిక్కిలి ఉత్కృష్టమైన స్థానమును ఆక్రమించినది. చరిత్రలో స్వర్ణయుగమని పేరుగాంచి భవిష్యత్కాలములో ఇంకను అభివృద్ధికి వచ్చుటకు మారుగా ఆ చిత్రకళ ఆకస్మికముగా అదృశ్యమైనది. బౌద్ధమత ప్రభావక్షీణ్యము ఇట్లగుటకు కొంతవరకు కారణము. విరుద్ధములైన నూతన హిందూ, ఇస్లాము మతముల యొక్క ప్రబల సంఘర్షణమునుబట్టియు, తద్వాతావరణ పరిస్థితులను బట్టియు ఈ యుగపు చిత్రకళౌన్నత్యము నశించిపోయినది.

జైన లేక మూర్తర చిత్రకళ ఆదిలో వ్యతిరేకములై,

క్రీ శ 7 వ శతాబ్ది మధ్యకాలమువరకు సమకాలికములై, వర్ధిల్లిన జైన, బౌద్ధ మతములతో పాటు భారతీయ చిత్రకళ కూడ సమానముగా వికసించినది

ఒరిస్సాలోని ఉదయగిరి గుహాలయందును, ఖండగిరి గుహాలయందును 7 వ శతాబ్దిలో చిత్రింపబడిన జైన చిత్రము లున్నవి పల్లవరాజుల యుగమునాటి సిత్తన్న వాసల్ గుడి లోని చిత్రములు ఇంకను చెక్కుచెదరకుండ నున్నవి పల్లవ రాజగు మొదటి మహేంద్రవర్మకు చిత్రకళయందు ఆసక్తి మెండు ఆతడు చిత్రకళను పోషించుటయే కాక, స్వయముగా చిత్రములను వ్రాసెను "సిత్తన్నవాసల్ మందిరము" ఆతని అధ్వర్యవమునవే నిర్మింపబడినది అందు రమణీయము లైన కుడ్యచిత్రములు లిఖింపబడినవి ఆ చిత్రములన్నియు క్రీ శ 600 - 625 మధ్యకాలములో చిత్రింపబడినవే, ఆ చిత్రములు అజంతా చిత్రములకు సమకాలికములై, అజంతా చిత్రముల రచనాశైలితోనే, ఆ వర్ణసమూహముతోనే చిత్రింపబడినవి ఈ మందిరముయొక్క కప్పు అంతర్భాగము లోని కమలముల సరోవరమునందు హంసలు, మత్స్యములు గజములు, అప్సరలు తన్మయత్వము చెంది విహరించుచున్నట్లు చిత్రింపబడి యున్నది. అంతకు పూర్వమే దక్కనులో జైన మతప్రభావ ముండినను 9 వ శతాబ్దినుండి 11 వ శతాబ్దివరకు జైనమత ప్రాముఖ్యము శిఖరాగ్రమందు కొనినది ఈ చిత్రములలోని రూపములకు విశాలనేత్రములు, పొడుగైన సూటి ముక్కులు, కోణములు, తిరిగిన గడ్డములు అమరియుండెను ఎల్లోరాలోను, పట్టన్‌చెరువులోను, కొప్పల్‌లోను జైన చిత్రకళ పోషింపబడినది క్రీ శ 9 వ శతాబ్దిలో ఎల్లోరా లోను, క్రీ శ 1130-1165 సంవత్సరముల నడుమ పలదన పూరులోను, 10 వ శతాబ్ది చివరలో తంజావూరులోని బృహదీశ్వర మందిరములోను, 11 లేక 12 వ శతాబ్దములలో తిరుమలై మందిరములోను కుడ్యచిత్రములు వ్రాయబడినట్లు ఉదాహరణములు కలవు 7 వ శతాబ్ది అనంతరము రచింపబడిన కుడ్యచిత్రములలో చాలవరకు మార్పులు కల్గినవి అజంతా చిత్రములలోని సున్నితమైన ఆకారములు, వంపులు, రేఖాసౌభాగ్యము ఈచిత్రములలో కన్పింపవు పై చిత్రముల లోని కళను పరిశీలించి చూచినచో, చిత్రకళ రచనారీతులు క్రమక్రమముగా క్షీణదశను పొందుచున్నట్లు తెలియుచున్నది.

కుడ్యచిత్ర రచనయొక్క క్షీణదశయందే తాళపత్ర గ్రంథములు, హస్తలిఖిత చిత్రగ్రంథములు, వాటిస్థానమును ఆక్రమించినవి. అప్పటికి భిత్తిచిత్రముల ప్రాముఖ్యము సన్నగిల్లినది క్రీ. శ 12 వ శతాబ్ది అనంతరము బెంగాలు, బీహారు రాష్ట్రములలోని పాలరాజుల యాజమాన్యమున ఈ హస్తలిఖిత చిత్రగ్రంథ రచన మారంభమయ్యెను ఈ రాజులు చాలవరకు అజంతా చిత్రరచనా శైలిలోనే రూపములను చిన్న ప్రమాణములలో చిత్రింపజేసిరి తురుష్కుల గండయాత్రలు కారణముగా క్రీ శ 12 వ శతాబ్ది తుదిలో ఈ రచనారీతియందు కూడ అంతరాయము కలిగి, అది అంతరించినది మరల 13 వ శతాబ్దినుండి 16 వ శతాబ్ది వరకు జైనమ మతమునకు చెందిన హస్తలిఖిత చిత్రగ్రంథములు వ్రాయబడినవి భద్రబాహు రచించిన కల్పసూత్రము, మహావీరుని జీవితచరిత్రము చక్కని చిత్రములతో కూడిన గ్రంథములు ఇవి చాలవరకు గుజరాతు ప్రాంతములో వ్రాయబడినవి అందువలన ఆచిత్రములలోని రచనారీతులు, సన్నివేశములు ఘూర్జర సాంస్కృతిక, సాంఘిక, సంప్రదాయములు కల్గియున్నవి భారత దేశములో మొట్టమొదటి నుండియు లలితకళలపై అధికముగా మతప్రభావ ముండియుండెను బౌద్ధమతముతో పాటు, జైనమతము కూడ పరిస్థితుల ననుసరించి జైన్యమును పొందినది దానితో జైన చిత్రకళా ప్రాముఖ్యము కూడ సన్నగిల్లినది

ఆంధ్రదేశమందలి అనంతపూరు జిల్లాలోని హిందూపురమునకు 9 మైళ్ల దూరమునన్న లేపాక్షి ఆలయములో 16 వ శతాబ్ది మధ్యకాలములో చిత్రింపబడిన కుడ్యచిత్రము లిప్పటికిని కలవు అచ్చట విజయనగరాలయములలోని శైలిని బోలు భిత్తిచిత్రములు రచింపబడి యున్నవి జైనమత చిత్రకళవలె ఇక్కడకూడ కథలను వివరించు ఘట్టములున్నవి ఈ రూపములకు సూటియగు ముక్కులు, మీనములను బోలు నేత్రములు, కల్పసూత్ర గ్రంథములో వర్ణితములైన చిత్రములవంటి ఆకారములును గలవు ఇందు స్త్రీలు ధరించిన చీరల ముడుతలు చక్కగా చిత్రింపబడినది ఈ చిత్రకళ జైన చిత్రకళకు సమకాలికమైనది

రాజస్థాన చిత్రకళ ప్రపంచ చిత్రకళా చరిత్రలో నెల్ల, ఒక్కరాజపుత్ర చిత్రకారుడే తన కళాఖండములను నవీనపక్కిలో చిత్రింపగల్గినాడు, ఆచిత్రకళ లయబద్ధమై, రాగ తాళ విశేషమును, సంగీత ప్రభావమును కల్గియున్నది.

మును కల్గియున్నది ఆ కళాకారులు సంగీత శాస్త్రమందలి 42 రాగమాలల పద్ధతి ననుసరించి, చిత్రములను రచించిరి రాగము, రాగిణియువారి చిత్రకళ యొక్క ముఖ్యాంశములు రాజపుత్ర చిత్రకళ చాలవరకు తాళపత్ర గ్రంథములలో చిన్నచిన్న చిత్తరువులు వేయుటయందు ప్రసిద్ధిగాంచినది వాటిని అల్పాకార (మీనియేచర్) చిత్రములందురు చిన్నగ్రంథములలో చిత్రములు రచింపబడునపుడు, వాటి రూపములను, ప్రమాణములను, విశేషముగా తగ్గింపవలసి యుండును ఇట్టి చిత్రములనే కాక, రాజస్థానపు చిత్రకారులు భిత్తిచిత్రములను గీయుటలో కూడ సిద్ధహస్తులు ఎల్లోరా లోని కైలాసమందిరములో రచింపబడిన భిత్తిచిత్రములును, 18 వ శతాబ్దిలో మాల్వాలోని పారమార ప్రభువుల రణరంగ దృశ్యములును, ఉత్తరహిందూస్థానములోని రాజపుత్ర జీవిత ఘట్టములును ఈజాతికళకు చెందినవి రాజపుత్రరాజుల దర్బారులకును, హిందువుల సాంఘిక, మత, సాంస్కృతిక జీవితము నకును చెందిన చిత్రములుగల గ్రంథములు ఆయుగములో వ్రాయబడినవి 17 వ శతాబ్దములో వ్రాయబడిన భాగవత పురాణమునందును, కేశవదాసుని రామాయణమునందును, జయదేవుని గీత గోవిందమునందును, సూరదాసుని సూర సాగరమునందునుగల చిత్రములన్నియు రాజస్థాన చిత్రకళా శైలికి సంబంధించినవే

అటుతరువాత "పహాడీ" (కొండప్రాంతపు) చిత్రకళ పశ్చిమప్రదేశములలోను, పంజాబులోని పర్వతప్రాంతముల లోను విరివిగా ఆచరణలో నుండెను పశ్చిమహిమాలయపు లోయ ప్రాంతములో పెక్కువిధములైన జానపదకళలు వర్ధిల్లెను జానపద చిత్రకళకు, జానపద గేయములకు, గ్రామ పరిశ్రమలకు ఆప్రదేశము పుట్టినిల్లు ఆ గ్రామములోని సామాన్య ప్రజలకు తమ ఇండ్ల గోడలను, గ్రామమందిరము లను, చిత్రములలో అలంకరించుకొనుట అలవాటు వారి దైనందిన జీవితఘట్టములు, సాంస్కృతికరీతులు, ఆచిత్రము లలో ప్రతిబింబించుచున్నవి ఈరచనాపద్ధతులుక్రమక్రమముగా ఆయాకాల పరిస్థితులనుబట్టి, ఆయాదేశములలో ఆయా ప్రదేశముల పేరులతో వర్ధిల్లెను బసోలి, చంబాలా, బుండి మొదలగు ప్రదేశములలో ఈ చిత్రకళ గోచరించును ఈ చిత్రకళ చాలవరకు కుడ్యచిత్రకళయే, రాజపుత్ర చిత్రకళా రేఖలు సున్నితమైన వంపులతోను, ఆకర్షకమైన రంగులతోను గాఢముగ చిత్రింపబడినవి

భారతీయ చిత్రకళా చరిత్రలో 'కాంగ్రాకలమ్' అనునది విశిష్టస్థానమును పొందిన ఒకప్రక్రియ కాంగ్రాచిత్ర కారుడు ప్రకృతిప్రియుడు ఇతడు ప్రకృతి సౌందర్యమును, మానవునియందలి గాఢమైన ప్రణయకలాపములను మిళితము గావించి నూతనరీతిలో చిత్రములను రచించెను ప్రకృతిలోని సౌందర్యమును నేపథ్యముగా తీసికొని, దానిలో తన్మయ త్వము చెంది, ప్రేమపిపాసలో చిక్కుకొనిన రసికప్రియులను చిత్రించుట కాంగ్రా చిత్రకారుని ప్రత్యేకత క్రీ శ 1775 నుండి 1828 వరకు కాంగ్రాచిత్రకళ సంసార్ చంద్ అను నాతని పోషకత్వములో ప్రాముఖ్యము చెందినది ప్రేమికుల ఎడబాటు, నాయికానాయకుల పునస్సమాగమము మొదలగు రసవత్తర ఘట్టములు చక్కనిపద్ధతిలో చిత్రింపబడినవి 18, 19 వ శతాబ్దులలో పశ్చిమహిందూస్థానములోని ప్రజల మత, సాంఘిక సాంస్కృతిక జీవిత ప్రతిబింబములు ఆ చిత్రములలో కాన్పించును పసుపు, ఎరుపు, నీలము, నలుపు, బంగారు రంగులు ఎక్కువగా ఆ చిత్రములలో ఉపయోగింపబడినవి

భారతీయ చిత్రకళ - మొగలుశైలి మొగలుల చిత్ర కళ రచనారీతులు క్రొత్తవికావు అవి రాజపుత్రకళ యొక్క పూర్ణవికాస రూపములే హుమాయూన్ చక్రవర్తి భారత దేశములో సామ్రాజ్యమును పునఃస్థాపనము చేసినపుడు, తనతో ఇరాన్ చిత్రకారులను తీసికొనివచ్చెను వారు భార తీయ కళాకారులతో సంయుక్తముగా చిత్రములను రచించిరి ఇరానియను చిత్రకళ యొక్క శాఖయే మొగలుచిత్రకళ మొగలులు సౌందర్యోపాసకులు. వారి యుగములో కూడ హస్తలిఖిత చిత్రగ్రంథములు వాడుకలోనుండెను 'దాస్తానే-అక్బరే', "మెహనుమ", "ఆయనె-అక్బరె" మొదలగునవి పేరుబడసిన గ్రంథములు.

బాబరు పరిపాలనాకాలమందలి చిత్రకళ కేవ లము అలంకారార్థము ఉపయోగింపబడినది మొగలు చిత్ర కారులు ప్రకృతి దృశ్యముల కెక్కువ ప్రాముఖ్యమునిచ్చిరి వారి చిత్రములందలి చెట్లు, చేమలు, భూషణముగా, అలం కారముగా కనబడును వారు గాఢమైన రంగుల నుపయో గించిరి, ఎరుపు, నీలము, సువర్ణ వర్ణాలతో వారు రమణీయ మైన దృశ్యములను చిత్రించిరి అక్బరుకాలములో ప్రత్యేక మైన రచనాశైలియగు పర్షియన్ ఖలమ్ అనుపేరిట చిత్రకళ

వర్ధిల్లినది. అక్బరు వ్యక్తిగత ఆధిపత్యములో సూక్ష్మచిత్రములు రూపచిత్రములు రాజభవనములలోను అంతఃపురములలోను ఎక్కువగా పర్షియన్ శైలి ననుసరించి వ్రాయబడినవి.

షాజహాను చక్రవర్తి పరిపాలనాకాలములో వాస్తుకళ విశిష్టస్థానమును పొంది ప్రపంచఖ్యాతి గడించినది. అందుకు తాజ్‌మహల్ తార్కాణము. 18వ శతాబ్దిలో చిత్రకళయందు చాలవరకు మార్పు కల్గినది. అది సమస్తమగు రచనారీతులతో మిళితమై రూపొందినది. మొగలు చిత్రకళ ఆయా ప్రదేశములనుబట్టి ఢిల్లీకలమ్, పాట్నాకలమ్, దక్కన్‌కలమ్ అను పేర్లను గాంచినది. బ్రిటిష్ ప్రభుత్వాధిపత్యవర్తనమున మొగలు చిత్రకళ రూపుమాసి పోయినను, కాంగ్రాపహాడీ చిత్రకళ క్షీణదశను పొందినను, ఉత్తరహిందూస్థానములోని చిత్రకళ ఏదోఒక రూపమున కనబడుచునే వచ్చినది. 18వ శతాబ్దిలో బ్రిటిష్‌వారు భారతదేశమునకు వర్తకులుగా వచ్చిరి. వారి రాకతో పాశ్చాత్య, భారతీయ చిత్రకళ రచనారీతులు పరస్పరము మిళితమైనవి. క్రమముగా నిజమైన ప్రాచీన భారతీయ చిత్రకళ దైన్యమును పొందినది.

19వ శతాబ్ది ప్రారంభములో బెంగాలు చిత్రకళా ధ్యాపకుడైన ఇ. బి. హావెల్ అనునతడు ఈ విషమస్థితిని పరిశీలించి భారతీయ వాతావరణానుసారముగ ప్రాచీన భారతీయ చిత్రకళా రచనారీతులు సంప్రదాయానుచితములైనవని గ్రహించి, మరుగుపడిన భారతీయ చిత్రకళను పునరుద్ధరించుటకు సంసిద్ధుడయ్యెను. అతడు చేసిన కళాపరిశోధనము ఫలితముగా, కలకత్తాలో విజయము సాధింపబడినది. చిత్రకళలో తాను ఉద్దేశించిన విప్లవమును గ్రహించుటకు శ్రీ రవీంద్రనాథటాగూరు సరియైన వ్యక్తియని తెలిసికొని అతనికి చేయూతనిచ్చి, వెనుకబడిన భారతీయ చిత్రకళను హావెల్ పునరుజ్జీవింప చేసినాడు. ఇట్లు పునరుజ్జీవింపబడిన చిత్రకళ "బెంగాలు చిత్రకళ"యని ప్రసిద్ధిగాంచినది.

ఆధునికయుగము–చిత్రకళ: 19వ శతాబ్దిలో ఘటిల్లిన సామాజిక విప్లవమువలన, పాశ్చాత్య దేశములలోను అచ్చటి చిత్రకారులలోను, వారిచిత్రకళలోను విశేషముగ మార్పులు వచ్చినవి. ఆధునిక చిత్రకళయంతయు 19వ శతాబ్దిలో ఘటిల్లిన ప్రయోగాత్మకమగు నూతనయత్నము. ఈ క్రొత్త రచనారీతులు వీటి పేర్లు విచిత్రముగా నుండుటచే సామాన్య ప్రజలకవి సులభముగా అర్థముకాజాలవు. ఈ ఆధునిక చిత్రకళలోని అంతరార్థము బోధపడకున్నను, వీటిబాహ్యరూపములు అంతగా మన్ననల నందకపోయినను, ఇందురూపముకంటె, భావప్రకటనమునకు ప్రాధాన్యమెక్కువగా ఇయ్యబడినది. మరుగుపడిన భారతీయ చిత్రకళా భంగిమలలోకూడ నూతన చైతన్యము అర్ధశతాబ్దముగా అవతరించినది.

బి. ప్ర. దే.

## భారతీయ న్యాయవిధానము.

ఏదేశమునందైను ప్రజలమధ్య వివిధరంగములలో సంబంధములకు తీరుతెన్నులను నిర్ణయించుటకు ప్రసిద్ధములు, నిశితములు, నిర్దిష్టములునైన నిబంధనము లుండవలెను. నిరంకుశప్రభువో లేక నియంతయో పాలకుడుగాలేని దేశమునందు పాలకవర్గమునకును, ప్రజలకును నడుమ గల సంబంధములకు కూడ అట్టి నిబంధనలుండును. ఆ నిబంధనముల సముదాయమే ఆదేశముయొక్క న్యాయ విధానమనబడును. ఈ నిబంధనములు ఒకానొకరీతిగా వర్తించవలెననిగాని, ఒకానొక పనిని చేయవలెననిగాని విధిరూపములో నుండవచ్చును, లేక ఒకానొక రీతిగా వర్తింపరాదనిగాని, ఒకానొక పనిని చేయరాదనిగాని నిషేధరూపమునైన నుండవచ్చును. ఆవిధి నిషేధముల ఉల్లంఘనము తప్పక శిక్షార్హము కావచ్చును. ప్రభువుగాని, శాసనమండలిగాని జారీచేసిన విధినిషేధములు, చట్టములు, లేక శాసనములనబడును. పురాతనములై, దేశీయ, ప్రాంతీయ మత, కుల, కుటుంబాచారములుగా నుండి జీవితమునకు గురికాని నిబంధనములు సంప్రదాయము లనబడును. సంప్రదాయములు ఆదిలో లిఖితములు కానున్నను, వాటిని పలువురనుసరించినట్లు లిఖిత నిదర్శనములున్నపుడును, న్యాయస్థానములు వాటిని అంగీకరించినప్పుడును, శాసనములే వాటిననుమతించినప్పుడును వాటికి విలువ ఏర్పడి శాసనములతో సమానమైన అధికారము కల్గును.

నేడు స్వతంత్రము, ప్రజాప్రతినిధి పాలితమునైన భారతదేశము క్రీ. శ. 1947వ సం॥ వరకు అఖండ హిందూస్థానమునందలి భాగమై, బ్రిటిషు పాలనము లోనుండినందున పాలకులు నిర్మించినవియు, వారి పర్యవేక్షణక్రింద లిఖితములైనవియు నైన శాసనములు, వారనుమతించిన సంప్రదాయములు, దేశమంతటియొక్క న్యాయ విధానమునకు మూలముగనుండెను. బ్రిటిషువారు రాకపూర్వము భారతదేశమందు వ్యాప్తిలోనుండిన హిందూ, మహమ్మదీయ

న్యాయవిధానములను, బ్రిటిషు వారుకొంతవరకు అనుసరించి, అందు కొంతవరకు బ్రిటిషు న్యాయవిధానమును ప్రవేశపెట్టిరి అప్పుడు రాజధానినగరములైన మద్రాసు, కలకత్తా బొంబాయి పట్టణములలో మత, కుల విషయములలో తప్ప సకల సందర్భములలో బ్రిటిష్ న్యాయ సిద్ధాంతములే ఆచరణములోనికి తేబడి, క్రమముగా రాజధానీ నగరేతర ప్రాంతములకు కూడ అవి అందచేయబడెను కేవల మత, కుల విశిష్టమై, వ్యక్తి సంబంధమైన వివాహ, వారసత్వాది విషయములలో, హిందువులకు హిందూస్మృతులును, భాష్యకర్తల గ్రంథములును, సంప్రదాయములును, మహమ్మదీయులకువారి మతగ్రంథములును, భాష్యకర్తల గ్రంథములును, ఆచారములును, ఉభయ మతములవారికి న్యాయస్థానముల తీర్పులును ప్రమాణములుగానుండెను రాజధానీ నగరవాసులు కాని పార్శీ వారికి, యూదులకు, భారతదేశములో నివసించు పరదేశీయులకు భారతీయశాసనములు స్పృశించని విషయములలోను, వారి వారి పురాతన ఆచారముల విషయములలోను, అట్టి యాచారములు రుజువుకానప్పుడు, బ్రిటిష్ న్యాయవిధానమే అవలంబింపబడుచుండెను క్రైస్తవుల వివాహాది విషయములలోను వారసత్వ విషయములోను, బ్రిటిష్ విధానమే వర్తించుచుండెను మత, కుల, కుటుంబాచారములలో కొన్నింటిని నిషేధించుచు బ్రిటిష్ వారు కొన్ని శాసనములను నిర్మించిరి. క్రైస్తవమతమును స్వీకరించిన హిందూపురుషునకు తన కుటుంబపు ఆస్తియందు హక్కును నిషేధించునట్టి హిందూ న్యాయ సంప్రదాయమును రద్దుకావించి, ఆతని ఆస్తిహక్కును నిలబెట్టుచు చేయబడిన శాసనము, హిందూ వితంతువుల భర్తృ సహగమనాచారమును నిషేధించుచు చేయబడిన శాసనము, ఇందుకు నిదర్శనములు

దేశశాంతికి, ప్రజాక్షేమమునకు భంగకరమైన హింస, హత్య, చౌర్యము, మోసము, బలప్రయోగము, దౌర్జన్యము మానభంగము మొదలైన అత్యాచారముల విషయములలో శిక్షను విధించుటలో జగత్ప్రసిద్ధి చెందిన భారతీయ శిక్షాస్మృతి ఇతరములైన స్వల్పనేరముల విషయమున మిగిలిన శాసనములు నేరారోపణమును, విచారణమును, తీర్మానమును నిర్దేశించు క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ అను శాసనము, సివిల్ - అనగా వ్యాజ్యము లనబడు వివాదములకు, కేవల వ్యవహార సంబంధములగు ఋణపత్రములకు హుండీలకు, ఋణదాతలకు సంబంధించిన 'నెగోషియబుల్ ఇన్‌స్ట్రుమెంట్ ఆక్టు' ఒప్పందము లను గురించి - అనగా ఖరారునామాలను గురించి - కాంట్రాక్టు ఆక్టు, స్థిరాస్తులను గురించిన ట్రాన్స్‌ఫర్ ఆఫ్ ప్రాపర్టీ ఆక్టు, రిజిస్ట్రేషన్ ఆక్టు లిమిటేషన్ ఆక్టు హిందూ, మహమ్మదీయ మతములకు చెందనివారి ఆస్తులకు వారసత్వమును గురించి ఇండియన్ సక్సెషన్ ఆక్టు, న్యాయస్థానములో అంగీకరించవలసిన లేఖ్య, సాక్ష్యముల రూపమైన సాక్ష్యమును గురించి ఇండియన్ ఎవిడెన్స్ ఆక్టు, వ్యాజ్యములు ప్రారంభించుట, విచారించుట తీర్మానించుట మున్నగు విషయములను గూర్చి సివిల్ ప్రొసీజర్ కోడ్ ఇత్యాదులు బ్రిటిష్ వారి హయాములో జారీయైన ముఖ్యశాసనములు ఇవి మిక్కిలి శ్రద్ధగా రచింపబడిన శాసనములు. ఇవన్నియు బ్రిటిష్ పార్లమెంటు అప్పుడప్పుడు చేసిన చట్టములను అనుసరించి యుండెను. ప్రభుత్వచర్యలను, ప్రభుత్వోద్యోగుల అధికార దుర్వినియోగ చర్యలను న్యాయస్థానములలో ఆక్షేపించు హక్కు ప్రజలకుండెడిది సివిల్, క్రిమినల్ న్యాయస్థానముల తీర్పులపై ప్రాంతీయ, ఉన్నత న్యాయస్థానముల వరకు, ఇంగ్లండులోని ప్రివీకౌన్సిల్ వరకు పునర్విచారణను కోరుటకు - అనగా అప్పీలుచేయుటకు ప్రజలకు హక్కు ఉండెడిది ఘోరహత్య మున్నగు నేరముల విచారణములలో న్యాయాధిపతికి జ్యూరీయొక్క లేక అసెసర్లయొక్క సలహాతో మాత్రమే విచారణ చేయవలసిన బాధ్యత యుండెడిది ఉరిశిక్షకు ఉన్నత న్యాయస్థానముయొక్క అంగీకారము ముందు తీరవలెను కేవలము నేరములు కానట్టియు కేవలము వ్యవహార వివాదములుకూడ కానట్టియు వ్యాజ్యములుకూడ నున్నవి అవి 'టార్ట్స్' అనబడును అనగా ఒకని హక్కును భంగపరచు సందర్భములు. ఒకడు తన మోటారుకారును అతివేగముగా, అజాగ్రత్తగా నడపి మరొకనిని చంపిన సందర్భములో, అతడు నేరస్థుడగుటయే కాక, చనిపోయిన వాని వారసులకు నష్టపరిహార మీయవలసినవాడుకూడ నగును ఇట్టి నష్టపరిహారము కొరకు తేబడిన వ్యాజ్యములకుకూడ దేశము మొత్తముమీద బ్రిటిష్ న్యాయసూత్రమే వర్తింప చేయబడెను

భారతదేశము స్వతంత్రమైన పిదప 'అడాప్టేషన్ ఆఫ్ లాస్ ఆర్డర్' ప్రకారము, లోగడ బ్రిటిష్ వారి పాలనములోని శాసనములు దాదాపు అన్నియును అంగీకరింపబడి అమలులో

అమలులోనున్నవి. శాసనములు లేని సందర్భములలో బ్రిటిష్ న్యాయసిద్ధాంతములే ఇప్పటికిని అమలులో నున్నవి ప్రజలు అధికసంఖ్యాకులుగ హిందువులైనంతమాత్రమున పరమతస్థుల విషయములో అన్యాయముగ ప్రవర్తించి, హిందూమత ప్రాధాన్యమును స్థిరపరచు నుద్దేశము భారతప్రభుత్వమునకు లేదు మత, వివాహ వారసత్వ, దేవాదాయ విషయములలో వారివారి మత సిద్ధాంతములే ప్రమాణములుగ నుండును. హిందువులకు సంబంధించినంత వరకు, చాల ముఖ్యమైన మార్పులు చేయుచు, భారత కేంద్ర శాసనసభ, హిందూ వివాహచట్టమును, హిందూ దత్తత చట్టమును, పోషణ చట్టమును, హిందూ వారసత్వ చట్టమును జారీచేసినది ఈ శాసనములు భిన్నవిభిన్న హిందూశాఖలలో భిన్నభిన్న కులముల నడుమ ఐక్యమును సాధించుట కేర్పడినవి బౌద్ధ, జైన సిక్కు మతస్థులందరు హిందువులుగనే నిర్ణయింపబడినారు వివాహితులకు విడాకుల సౌకర్య మేర్పడినది దత్తత చేసికొనుటకును, ఆస్తినిగూర్చిన పూర్తిహక్కును అనుభవించుటకును, పురుషులతో సమానమైన వారసత్వహక్కులను పొందుటకు స్త్రీలకు సదుపాయము కల్పింపబడినది యూదులకు, పార్శీలకు వారి ఆచారములు రుజువు కానపుడు బ్రిటిష్ న్యాయసిద్ధాంతములే ప్రమాణములగును ఇతర విషయములలో దేశీయశాసనములు ప్రజలందరకును వర్తించుచుండును.

భారతదేశములోని చట్టనిర్మాణ వ్యవహారము, ప్రజాపరిపాలనా వ్యవహారము, న్యాయస్థానములలో వివాద పరిశీలన వ్యవహారము మొదలైన వన్నిటికిని స్పష్టముగా నియమము లేర్పరచి, పాలకవర్గము యొక్కయు శాసనసభల యొక్కయు, ప్రజానీకము యొక్కయు, హక్కులను, బాధ్యతలను నిర్దిష్టముగా నేర్పరచి, ప్రజాస్వామిక పరిపాలనము విధించిన కాన్స్టిట్యూషన్ ఆక్టు అను రాజ్యాంగ శాసనమున్నది వయోవృద్ధ్యా, విజ్ఞానానుభవములు కల్గిన పెద్దలు దేశశ్రేయస్సును, వ్యక్తిస్వాతంత్ర్యమును దృష్టియందుంచుకొని, అవిశాశ్వతముగానుండునట్లుమిక్కిలిజాగ్రత్తతో దీర్ఘకాలము శ్రమించి సిద్ధమొనర్చిన శాసనమిది

పాలకవర్గమున కధ్యక్షుడుగనుండు రాష్ట్రపతిపేర పరిపాలనము జరుగును. ఆయన సర్వసైనిక, నావిక, వైమానిక శాఖలకు సర్వాధ్యక్షుడు ఐదేండ్లకొకసారి ఆయన ఎన్నుకొనబడును అట్లే ఎన్నికయగు ఉపరాష్ట్రపతి ఈతనికి సహాయకుడుగా వర్తించును ప్రజాప్రతినిధులలో అధికసంఖ్యాకపక్షనాయకుడు ప్రధానమంత్రియై తాను, నియమించుకొను ఇతర ప్రజాప్రతినిధులగు మంత్రులతో కేంద్రమందు పరిపాలనాధికారమును నిర్వహించును అట్లే రాష్ట్రీయ పాలకవర్గముకూడ రాష్ట్రీయ పాలకులైన గవర్నరు మాత్రము ఎన్నికవలనగాక, రాష్ట్రపతి నియామకమువలన తన పదవిని పొందును

భారతరాజ్యాంగ శాసనము మున్ముందుగనే ప్రజల యొక్క కొన్ని మౌలిక హక్కులను గుర్తించినది తాను విధించిన అవధులను దాటి కేంద్రముగాని, రాష్ట్రములుగాని స్థిరపరచు శాసనములు చెల్లనేరవని నిషేధించినట్లే, ప్రజల మౌలిక హక్కులను బాధించగల కేంద్ర రాష్ట్రశాసనములు, ఉత్తరువులు, చర్యలు చెల్లజాలవని నిషేధించినది. ఒకానొక రాష్ట్రశాసనముగాని, కేంద్ర శాసనముగాని, ఉత్తరువుగాని, చర్యగాని, చెల్లునాలేక చెల్లదా? అను సంశయమును నిర్ణయించు అధికారము రాష్ట్రములోని ఉన్నత న్యాయస్థానములకును, కేంద్రములోని పరమోన్నత న్యాయస్థానమునకును కలదు అవిధముగా శాసనసభల యొక్క, పాలకవర్గముల యొక్క అధికారములకు అవధులేర్పడినవి న్యాయస్థానమునకు అట్టి అధికారమే కాక, రాష్ట్రీయోన్నత న్యాయస్థానముల తీర్మానములపై పునర్విచారణాధికారమును, రాష్ట్రప్రభుత్వములలో పరస్పరముగల వివాదములను, కేంద్రమునకు, రాష్ట్రములకు పరస్పరముగల వివాదములను విచారించి తీర్మానించు అధికారమును, రాష్ట్రపతి కోరినప్పుడు సందిగ్ధవిషయములపై తీర్మానమునిచ్చు అధికారమును కలదు రాష్ట్రీయోన్నత న్యాయస్థానములకు దిగువ స్థాయిలో క్రమముగా జిల్లా న్యాయాధికారులు, సబుజడ్జీలు, జిల్లా మునసబులు అను హోదాలుగల న్యాయాధిపతులు, ఉప న్యాయాధిపతులు వ్యవహరించుచున్నారు వీరు నేరములను విచారించు దండనాధికారులుగకూడనుందురు వీరి కార్యాలయములు న్యాయస్థానము లనబడును సివిలు,క్రిమినలు వివాదములలో పరాజితులైన కక్షిదారుడు ఎగువ న్యాయస్థానములో పునర్విచారణ కోరవచ్చును ప్రజలకు వ్యక్తిగతముగా గుర్తింపబడిన మౌలిక హక్కులు, జాతి, మతము, లింగము, జన్మము, దేశము అను వివక్షతలు, అస్పృశ్యత నిర్మూలింపబడినవి. దేశశాంతి భద్రతలకు లోబడి, స్వాభిప్రాయమును ప్రకటించుటకును, ఇష్ట

మైన మతము ననుసరించుటకును, అభిమతమగు విద్య నేర్పట నైన ఆర్జించుటకును, ఇచ్ఛవచ్చిన ఉద్యోగమును, వృత్తిని, వ్యాపారమును అవలంబించుటకును హక్కు గుర్తింపబడి నది ఎవరైనగాని న్యాయస్థానము లిచ్చు తీర్పులకు బద్ధులై యుండవలెను విడుదలయైన నేరస్థుడా నేరమునకు తిరిగి బాధ్యుడు కాజాలడు ఎవరైనకాని, ఎవరినైనకాని చట్ట ప్రకారముతప్ప నిర్బంధింపరాదు ఎవరైనను, ఎక్కడైనను నివసింపవచ్చును ఆస్తులార్జించుకొని, వాటిని అనుభవింపవచ్చును. ఎవరి ఆస్తినైనను కిమ్మతు చెల్లించనిదే ప్రభుత్వము తీసికొన రాదు, సామాజిక జీవనములో కుల, మత, జాతి, లింగ వివక్షతలను నిర్మూలించి, సర్వవ్యక్తి సమానత్వమును గుర్తించి, ఇచ్చిన హక్కులను నిలబెట్టు సాధనములను సమకూర్చి, అధికారుల యధికారములకు అవధులేర్పరచి, సర్వవిధముల భారతదేశ న్యాయవిధానము చట్టబద్ధమై వరలుచున్నది

క చి వెం

## భారవి

గీర్వాణసారస్వతోద్యానమున పంచకావ్యములు సుర భిళచంపకములు భారవికవికృతమయిన కిరాతార్జునీయము విశేషవ్యాప్తికలదై కాళిదాసత్రయమునకు పిమ్మట పంచ కావ్యములలో గణతికెక్కెను ఈ కావ్యము కవిపేర భారవి యనబడినది దీనికి లక్ష్మీపదలాంఛనమను నామాంతరమును కలదు ప్రతిసర్గాంత్యశ్లోకమున లక్ష్మీపదమునకవికూర్చినాడు అందుచే ఈ కావ్యమున కాపేరు లభించినదని చెప్పుదురు

కిరాతార్జునీయము పదునెనిమిది సర్గలతో నొప్పుమహా కావ్యము ఇందలి కథ మహాభారతమునుండి స్వీకరింపబడినది ఈ కథను భారవికవి కిరాతార్జునీయ మహాకావ్య రూపమున పొందుపరచెను ఇందలి మొదటి సర్గత్రయమునకు 'పాషాణ త్రయమ'ను నామము ప్రసిద్ధిలోనున్నది మహావ్యాఖ్యాత మల్లినాథసూరి భారవి వ్యాఖ్యానపీఠికలో "నారికేళఫల సమ్మితం వచో, భారవేస్సపది తద్విభజ్యతే" యని వ్రాసెను ఈ కావ్యము, నారికేళపాకముతో అర్థ గాంభీర్యముతో నొప్పుచున్నను రసభరితమై పాఠకుల కమందానంద మొసగు చున్నది

ఏకనాథుడు, జోనరాజు, నరహరి మున్నగుపండితు లీమహాకావ్యమునకు వ్యాఖ్యలు వ్రాసిరి. కాని మల్లినాథ సూరి, "ఘంటాపథంకమపి సూచన మాతనిష్యే" యని, 'ఘంటాపథ' మను పేరుతో నొకవ్యాఖ్య వ్రాసినపిమ్మట నే ఈకావ్యము పాఠకులకు సుగ్రాహ్యమైనది

ఈ కావ్యమునం దర్జునుడొక్కడే ప్రధాననాయకుడు అతని ఉత్కర్షమును ప్రకటింప వర్ణింపబడిన కిరాతుడు ప్రతి భటనాయకుడు పరమేశ్వరుడు అర్జునుని దివ్యాస్త్రలాభ మిక్కావ్యఫలము వీరము ప్రధానరసము అన్యరసములు సందర్భోచితముగ వర్ణింపబడినవి ఇందలి ఋతుగిరికానన శృంగారాది వర్ణనములు మనోజ్ఞములు పంచమసర్గమందలి హిమగిరివర్ణనము కాళిదాసుని కుమారసంభవకావ్యమునందలి హిమవత్పర్వతవర్ణనమునకు సరితూగుచున్నది మొదటి సర్గ త్రయమునందు కవియొక్క రాజనీతి నైపుణ్యము ప్రస్ఫుట మగుచున్నది కవికిగల చిత్ర, యమక, బంధకవిత్వాభిలాష, పదునేనవసర్గలో మిక్కుటముగ గన్పట్టుచున్నది

**భారవికాలము** ఇతనికాలము ఐహోలుశాసనమువలన కొంతతెలిసికొనుటకు వీలగుచున్నది ఈశాసనము రెండవ పులకేశియను రాజచంద్రునిచే నిర్మితము దీని రచనాకాలము క్రీ శ 634 ఈశాసనరచయిత జైనకవి రవికీర్తి యను వాడు శాసనమందు "యేనాయోజిన వేశ్మస్థిరమర్థవిధౌ వివేకినాజినవేశ్మ, సవిజయతాంరవికీర్తిః కవితా శ్రితకాళిదాస భారవికీర్తిః" అను శ్లోకముకలదు దీనిభావమిది 'జినమందిర నిర్మాతయైన రవికీర్తియొక్క కవితాశక్తి కాళిదాస భారవుల కవితకు తుల్యమైనది దీనినిబట్టి భారవికవి క్రీ శ 634కు ముందే అనగా క్రీ శ 520 ప్రాంతమున ఖ్యాతిగాంచినాడని తెలియుచున్నది

**భారవిని గురించిన యొకగాథ** భారవికవిని కొందరు దాక్షిణాత్యుడనియు, కతిపయు కాశ్మీరావాసుడనియు, నింక కొందరాంధ్రదేశీయుడనియు నిట్లు పలువిధముల నుడువు చున్నారు ఈతనిని గురించిన యొకగాథ పండితబృందమున నిట్లు వ్యాప్తిగాంచినది

భారవి తండ్రి శ్రీధరుడు. తల్లి సుశీల భార్య రసికా దేవి నివాసము ధారానగరము అష్టాదశవర్షప్రాయుడైన భారవి అఖండపాండిత్యమును సంపాదించి, పండిత, కవి బృందమున గొప్పపేరు సంపాదించెను పండితులెల్ల రాతని వైదుష్యమును మెచ్చుకొనుచున్నను, తండ్రియగు శ్రీధరుడు మాత్రము కుమారుని పాండితిని పొగడక, 'వాడెంతవాడు-

తానికన్న గొప్పవారెందరో కలరు' అని ప్రక్కవారితో ననుచుండెడివాడు. ఆమాట భారవికి మిక్కిలి కష్టముగ నుండెను తండ్రియున్నంతకాలము తనపేరుప్రతిష్ఠలు పైకి రావని యెంచి, భారవితండ్రినిచంపబూనుకొనెను. ఒకదినమున తనతండ్రిని చంపుటకై యొక పాషాణమునుగ్రహించి, ఇంటిలో నొకవాకిటికి చేరువనున్న యటుకపై దాగియుండెను తండ్రి దైవవశమున నొకవాకిట లోన బ్రవేశించెను తల్లి తనయుని యభిప్రాయమును ఆయ్యెడునన ప్రసంగవశమున తండ్రికి దెల్పెను తండ్రి దానిని విని భార్యతో, "మన కుమారుని విద్యాబుద్ధులను మనము పొగడరాదు ఇతరులు పొగడిన మనము వినరాదు, దానిచే నతని కాయువు తగ్గును అందుచే నేను మన భారవిని గూర్చి తక్కువగా చెప్పుదును వాని పాండిత్యము గొప్పదని నాకుమాత్రము తెలియదా? వాడు మనవంశవర్ధను"డని పలికెను తండ్రి వాక్యములను అటుకపైనున్న భారవి వినెను తాను చేయబూనిన చెడు పనికై మిక్కిలి చింతించెను అతడు పశ్చాత్తప్తహృదయుడై, తన తండ్రివద్దకువచ్చి ఆతని పాదములపై బ్రాలి తనతప్పిదమునకు తగిన శిక్షవిధింపుమని ప్రార్థించెను తుదకు విధిలేక తండ్రి భారవికి 'ఆరునెలలు అత్తవారియింటనుండి రమ్మ'ని శిక్షవిధించెను 'శ్వశురగృహం పరమసుఖం, మ్మనిగదా పెద్దలందురు ఇదియేటి శిక్షయనుకొనుచు, భారవి యొక శుభముహూర్తమున అత్తవారింటికి బోయెను క్రొత్తగా వచ్చిన యల్లుని కొన్నిదినములవరకు అత్తమామలు మిక్కిలి గౌరవించిరి క్రమముగా నాదరము తగ్గెను దినములు గడచినకొలదియు ఈతనిజూచిన, అత్తమామలకు, బావమరదులకు నైతను వెగటయ్యెను అల్లుడుగా భారవి నిత్యము పశువులను తోలుకొనిపోయి పొలమున మేపి, సాయంకాల మగునప్పటికి వాటిని గృహమునకు దోలుకొనివచ్చుచుండెను పొలములోమంచెపై గూర్చొని భారవి 'కిరాతార్జునీయము'ను కావ్యమును వ్రాయుచుండెనట, ఒకదినము భారవి పొలములో పశువులను మేపుచుండగా మాసిన చీరెధరించి యాతనిభార్య యతనికి అన్నమును దెచ్చెనట భార్యపడు కష్టములను భారవి గ్రహించి, తాను వ్రాయుచున్న కావ్యమునందలి

"సహసావిదధీత న క్రియా మవివేకః పరమాపదాం పదమ్,
వృణుతే హి విమృశ్యకారిణం గుణలుబ్ధాస్స్వయమేవసంపదః,"

అను శ్లోకము నామెకిచ్చి, దానినమ్మగాలభించినద్రవ్యముతో నూతనవస్త్రములను దెచ్చుకొమ్మని పంపెనట ఆమె యా శ్లోకము నొకవర్తకునకు జూపగా అతడా శ్లోకార్థము నగ్రహించి యామెకు నూరు నిష్కములొసగెనట. ఆమె యా ద్రవ్యముచే, తనకు, తనభర్తకు వలసిన వస్త్రముల గొనెనట ఇట్లు భారవి ఆరుమాసము లత్తవారింటగడిపి, ఏడవమాసమున మొదటిదినమున తనభార్యతో తనయింటికివచ్చి, తల్లిదండ్రులకు సేవచేయుచు సుఖముగాకాలముబుచ్చుచుండెనట

ఇట్టిస్థితిలో, భారవి భార్యవద్ద శ్లోకముకొనిన వర్తకుడు సముద్రవ్యాపారముచేసి, కొన్ని సంవత్సరములకు తిరిగి ఇంటికి వచ్చెనట తన భార్యవద్ద పరున్న తనకుమారుని పరపురుషునిగా భావించి, యామెను వధించుటకై కత్తియెత్తెనట కత్తికిదగిలి గోడపైనున్న తాటియాకు క్రిందపడెనట వణిజుడు ఆ తాటియాకును దీసి యందలి "సహసా విదధీత న క్రియాం"అను శ్లోకమును గాంచి, తన సతిని లేపి, నిజము తెలిసికొని తన యవివేకమునకుచింతించి, తనకట్టిశ్లోకమును ప్రసాదించిన భారవికవి కఖండసన్మానమొనరించెనట ఈ కథయందలి నిజానిజములకు పండితులే ప్రమాణము

కిరాతార్జునీయమునందలి కథాసంగ్రహము కిరాతార్జునీయము ప్రథమసర్గలో : ద్యూతమున సుయోధనునిచేనోడిన ధర్మరాజు సోదరులతో, ద్రౌపదితో ద్వైతవనమున వసించుచు దుర్యోధనుని రాజ్యపాలనస్థితినిగ్రహింపగోరి, యొకవనచరుని దుర్యోధనునికడ కంపుట, వానివలన, రాజ్యపాలనస్థితి తెలిసికొనుట-ద్రౌపది ధర్మరాజును యుద్ధోన్ముఖునిగ చేయుట మున్నగు అంశములు కలవు

ద్వితీయసర్గలో ద్రౌపది వాక్యములను భీముడు సమర్థించుట, భీముని యాగ్రహమును శమింపజేయుచు ధర్మజుడు ఆతనికి సమయమనుకూలించినవెంటనే సుయోధనునితో కదనమొనర్చుట యుచితమని బోధించుట మొదలగు అంశములు కలవు.

తృతీయసర్గలో వేదవ్యాసమునీంద్రుడు ధర్మరాజు కడకువచ్చి దుర్యోధనునితో యుద్ధమనివార్య మనుటయు, దానికివలసిన శస్త్రాస్త్ర సంపాదనమునకై యర్జునుని తపమొనర్ప నియమించుటయు, అర్జునుడు, యక్షుడు మార్గమును చూప, ఇంద్రకీలాద్రికి బయలుదేరుటయు నను అంశములు గలవు

చతుర్థసర్గలో ఇంద్రకీలాద్రికి పోవుచున్న పార్థుడు

శరదృతుశోభను, జనపద స్థలములను, ప్రకృతిని తిలకించుట వర్ణితములు

పంచమసర్గలో హిమవన్నగవర్ణనము, యక్షుడర్జునుని తపమునకు నియమించి వెడలిపోవుట యనునంశములు గలవు

షష్ఠసర్గలో అర్జునుడు నిష్ఠమెయి తపమొనర్చుచుండ అతని తపోభంగమునకై సురేంద్రు డమరాంగనలను బంపుట వర్ణితము

సప్తమసర్గలో ఇంద్రుని సైన్యము ఫల్గునుని తపోవిఘ్న మొనర్చుటకై ఇంద్రకీలాద్రికి జనుట వర్ణితము

అష్టమసర్గలో గంధర్వులతో, సురాంగన లొనర్చిన శాఖుంజవిహారము, వారి జలక్రీడా పుష్పాపచయాదులు మనోజ్ఞముగ వర్ణితములు

నవమసర్గలో సంధ్యాకాలము, అర్జునునివలన సురాంగనలకు గర్వభంగమగుట, దేవాంగనలు తమ ప్రియులతో జేరుట, సురాపానాదులు వర్ణితములు

దశమసర్గలో అమరాంగనలు పార్థుని మోహింపజేయు ఋతుపరివర్తనము సేయుటయు, అర్జునుని మోహపెట్టుటకై తమ నృత్యాదికమును జూపుటయు, తుదకు విఫలలై స్వస్థానములకు దిరిగిపోవుటయు మున్నగు విషయములు గలవు

ఏకాదశసర్గలో ఇంద్రుడు మునివేషమున పార్థునాశ్రమమున బ్రవేశించి శాపనవిరుద్ధముగ చాపబాణముల నేలధరించితివని అతనిని ప్రశ్నించి దుర్యోధనుడు పాండవుల కొనర్చిన పరాభవమును అతనివలన దెలిసికొనెను ఇంద్రుడు తన రూపమును అర్జునునకు జూపి పరమశివు నారాధింపుమని బోధించి యంతర్ధానము నొందెను

ద్వాదశసర్గయందు : అర్జునుని తపమునుగూర్చి మునులు పరమశివునకు చెప్పుట శివుడర్జునుని పరీక్షించుటకై కిరాతవేషధారియై మూకాసురుని వరాహముగ నొనర్చి, దానిని వధింప నర్జునాశ్రమముచెంతకు వచ్చుటయను నంశములు గలవు

త్రయోదశసర్గలో వరాహము భయంకరముగ ఘుర్ఘురించుచు విజయునిపైకి బోవుచుండ అతడు దానిని బాణముతో గొట్టుట, వెనుకనుండి మాయాకిరాతుడును వరాహమును బాణముతో గొట్టుట, వరాహమునకై మాయాకిరాత విజయులు వివాద మొనర్చుటయను నంశములు కలవు

చతుర్దశసర్గలో మాయాకిరాతుడు తన సైన్యము నర్జునునిపైకి బంపుటయు, పార్థుని బాణవృష్టి కాగలేక శివసైన్య మోడిపోవుటయు వర్ణితములు

పంచదశసర్గలో శివస్కందులు విజయునితో పోరుటకై సిద్ధపడుట కిరాతార్జునుల భీషణబాణయుద్ధము మున్నగు నంశములు కలవు

షోడశసర్గలో : కిరాతకదన పాండితికి పార్థునకు క్రోధము పెరుగుట, విజయుడు, బ్రహ్మవారుణాద్యస్త్రములను కిరాతునిపై ప్రయోగించుటయు, శివుడా యస్త్రముల ద్రుంచివేయుటయు, కిరాతార్జునుల మల్లయుద్ధమును వర్ణితములు

సప్తదశసర్గలో విజయుడు శివసేనపై బాణవృష్టి గురిపించుట, మాయాకిరాతుడు విజయుని బాణముల భగ్నమొనర్చి, అతనిపై నిశితబాణపరంపరను గురిపించి అతనిని శస్త్రవిహీనుని జేయుట, తుదకు ఫల్గునుడు వృక్షములను పాషాణములను శివసైన్యముపై విసరియు విఫలుడగుట మొదలగు విషయములు గలవు

అష్టాదశసర్గలో : శివార్జునుల ముష్టియుద్ధము అర్జునుని బాహుబలమునకు ధైర్యమునకు మెచ్చి శివుడు ప్రత్యక్షమగుట, పార్థుడు పరమశివుని స్తుతించి అతనివలన పాశుపతాస్త్రమును బడయుట, శివాజ్ఞచే ఇంద్రాదిలోకపాలకులు విజయునకు దివ్యాస్త్రముల నొసగుట మున్నగు నంశములు వర్ణితములు

భారవి పాండిత్యము-వర్ణనాచాతుర్యము భారవి అలంకారశాస్త్రమందును, రాజనీతియందును గొప్పపండితుడు ఛందోలంకార వైవిధ్యము కవితగల శాస్త్ర పాండిత్యమునకు నిదర్శనము ఈ కావ్యమున గాననగు దుర్యోధనుని రాజ్యపద్ధతిని వర్ణించు సందర్భమున తెలుపబడిన రాజనీతిప్రౌఢము, సుగమము, హృదయంగమము.

"ప్రభవః ఖలు కోశదండయోః
కృతపంచాంగవినిర్ణయో నయః
సవిధేయపదేషు దక్షతాం
నియతిం లోక ఇవానురుధ్యతే"॥
(కిరా ద్వి-12 శ్లో)

అనుశ్లోకమున కవియొక్క నీతిశాస్త్రవైదుష్యము తెల్లమగుచున్నది. ఈ శ్లోకాభిప్రాయమిది: నయమునకంగములైదు. అని

మంత్రము, అంగబలము, దేశకాలవిభాగము, వినిపాతప్రతీకారము, కార్యసిద్ధియనునవి వీటిని బాగుగ నిర్ణయించుకొని మంత్రమును నడిపించినచో సర్వకార్యములు సఫలమగును మంత్రమువలననే, ధన, చతురంగ బలసంపత్తులు లభించును మంత్ర శక్తి కుత్సాహశక్తియే మూలాధారము ఇట్టి యుత్సాహశక్తినాశ్రయించిన విజిగీషువునకు సర్వకార్యములు సిద్ధించును కాన ఇట్టి యుత్సాహము నవలంబించి శత్రు నిర్మూలనము నకై యత్నింపుమని భీముడు ధర్మజునకు బోధించును ఇందలియర్థ మెంతగంభీరముగ నున్నదో చూడుడు 'భారవేరర్థగౌరవమ్' అనునాభాణక మిందువలననే కలిగినదేమో!

రాజనీతి శాస్త్రము నందెంతసమర్థుడో, ప్రకృతివర్ణనమున నంతదక్షుడు భారవికవి ఉదా

"కురరీగణః కృతరవ స్తరవః
కుసుమానతా స్సకమలం కమలమ్।
ఇహ సింధవశ్చవరణావరణాః
కరిణాం ముదే సనలదాననలదాః॥
(కిరా పంచ - 25శ్లో

ఆడు గోరువంకల రొదలు, పూలతోవంగినచెట్లు, పద్మములతో నొప్పుజలము, ఉలిమిరిచెట్లచే నాచ్ఛాదితములగు నదులు, పరిమళయుక్తములైన పట్టివేళ్లు, ఏనుగులకు సంతసమును గూర్చు చున్నవి ఇందు కవి ప్రకృతిని వర్ణించుటయేకాక, 'తరవః తరవః' 'కమలంకమలం' 'వరణావరణా' 'సనలదానలదా' యను పదావృత్తిదే శబ్దాలంకారశోభను సైతము కూర్చెను

భారవి శృంగారవర్ణనము హృద్యముగ నుండునసుట కీక్రిందిశ్లోకము చక్కటి యుదాహరణము

"లోలదృష్టివదనం దయితాయా
శ్చుంబతి ప్రియతమే రభసేన॥
వ్రీడయా సహ వినీవినితంబా
దంశుకం శిథిలతా ముపపేదే॥"
(కిరా 6 - 47)

ఈకావ్యమున కవి ఛందోవైవిధ్యమును ప్రవేశపెట్టెను

ఉపన్యాసకుని లక్షణ మెట్లుండవలెనో భారవి చెప్పిన ఈశ్లోకమును గమనింపుడు

"స్ఫుటతా న పదైరపాకృతా న
చ నస్వీకృత మర్థగౌరవమ్,
రచితా పృథగర్థతా గిరాం న
చ సామర్థ్య మపోహితం క్వ చిత్"
(కిరా ద్వి 27 శ్లో)

అర్థగౌరవముకలిగి, పునరుక్తిదోషము లేక పదములకు పరస్పర సాకాంక్షత్వ ముండునట్లు మాటాడువాడే యుపన్యాసకుడట

భారవిలోకజ్ఞత ఈ క్రింది సూక్తులచే తేటపడు చున్నది

"హితం మనోహారి చ దుర్లభం వచః"- హితము మనోహరమైన వాక్యము దుర్లభము "వరం విరోధోఽపి సమం మహాత్మభిః"- మహాత్ములతో విరోధమైనను శ్రేష్ఠమే!, "అహో దురంతా బలవద్విరోధితా"- బలవద్విరోధముదుష్ఫలమునొసగును, "నివసంతి పరాక్రమాశ్రయా నవిషాదేనసమం సమృద్ధయః"- సంపదలు పరాక్రమవంతు నాశ్రయించును అనుత్సాహిని వరింపవు "విపదంతాహ్యవినీతిసంపదః"- అవినీతుని సంపదలు విపత్తులంతమందుగలవిగదా!

భారవి సర్గాంత్య శ్లోకములయందు లక్ష్మీపదము నుపయోగించుటయే గాక ఇతర శ్లోకములయందును లక్ష్మీశబ్దమును వాడుచుండుటచే నితడు లక్ష్మీభక్తుడని తోచుచున్నది.

'ప్రాయేణ యమకే చిత్రే రసపుష్టి ర్న జాయతే' యని యాలంకారికులు కావ్యములందలి యమకచిత్రబంధాది కవితలను గర్హించినను, చిత్రకవితాభిలాష మిక్కుటముగాగల భారవి కవిశేఖరుడు, పదునేనవసర్గలో ఖడ్గపద్మ, గోమూత్రికా, మురజాది, బంధములతో శ్లోకముల గూర్చెను శ్లోక మొకటి లేక రెండుహల్లులతో నడిపించుటయు ముందునుండి వెనుకకు, వెనుకనుండి ముందుకు చదివినను శ్లోక మొకే పద్ధతితోనుండునట్లు వ్రాయుటయు, ఈకవియొక్క చిత్రకవితాభిలాషకు తార్కాణములు ఒకే హల్లుతోగూర్చిన శ్లోకోదాహరణము

"ననోననున్నోనున్నోనో నానానానా ననానను
నున్నోఽనున్నో ననున్నేనో నానేనా నున్ననున్ననుత్"
(కిరా 15 - 14 శ్లో)

పై ఈశ్లోకభావము అనేకరూపములగు వదనములుగల ఓగణములారా! అల్పునిచే జయింపబడినవాడు, అల్పుని జయించినవాడును, అల్పునికొట్టినవాడును, అగుపురుషుడు పురుషుడే కాడు ఎవనిప్రభువు జయింపబడడో అతడు హతుడైనను అహతుడే ఇది యుద్ధమున కుమారస్వామి గణములతో బలుకువాక్యము

యమకము నందు దీనవికిగల యభిలాష కీ క్రింది శ్లోక ముదాహరణము

"వికచవారిరుహం దధతంసర,
స్సకలహంసగణంశుచిమానసమ్।
శివమగాత్మజయా చకృతేర్ష్యయా,
సకలహంసగణంశుచిమానసమ్"॥
(కిరా పం - 18)

ఇందు 'సకలహంసగణం శుచిమానసం' అనునప్పుడు, శివ పరముగా, "సకలహం, సగణం, శుచిమానసం," అనియు, సరఃపరముగా, "సకలహంసగణం, శుచి, మానస" అనియు నర్థమును తెప్పికొనవలెను ఇట్టివి పెక్కులు గలవు

భారవికవి నాధారముగ జేసికొనియే మాఘుడు శిశుపాలవధ వ్రాసినట్లగుపడును భారవి పదునెనిమిది సర్గలతో కావ్యమువ్రాయగా నితడు శిశుపాలవధను 19 సర్గలతో వ్రాసెను భారవి ప్రథమసర్గారంభశ్లోకమును "శ్రియఃకురూణాం" అని యారంభింపగా మాఘుడు "శ్రియఃపతి"యనియారంభించెను భారవివలెనే మాఘుడు ద్వితీయసర్గలో రాజనీతిచర్చను జరిపెను భారవి సర్గాంత్యశ్లోకములందు లక్ష్మీశబ్దమును గూర్చగా మాఘుడు శ్రీశబ్దమునుగూర్చెను భారవివలెనే మాఘుడు పదునైదవసర్గలో పదునాల్గవ శ్లోకమును యమక చిత్రకవితలో వ్రాసెను.

ఉదా కారణాగగభీరాసా, సారాభీగగణారకా
కారికారివధా సేనానా సేధావరికారికా
(శిశు-15-14)

మహాపండితుడగు భావప్రకాశకర్తయైన శారదా తనయుడు 'తాదాత్మ్యంభావరసయోః భారవిఃస్పష్టమూచివాన్' అని భారవిని పొగడెను. పుష్పకవి తన భారతచరితమున

"ప్రదేశవృత్త్యాపి మహాన్తమర్థం,
ప్రదర్శయంతీ రసమాదధానా।
సాభారవేః సత్పథదీపికేవ,
రమ్యాకృతిః కైరివ నోపజీవ్యా"

అని భారవికృతిని కొనియాడెను ఇట్లు కిరాతార్జునీయ కావ్యమున బహుశాస్త్ర పారంగతుడై, లోకజ్ఞుడై కన్పట్టు భారవి కవిశేఖరుడు మిక్కిలి ధన్యజీవి

తం. ఆం శా

## భావనారాయణస్వామి ఆలయము (పొన్నూరు)

పొన్నూరు అను గ్రామము గుంటూరు జిల్లాలో గుంటూరునకు 20 మైళ్ళలోపున నున్నది మదరాసు రైలు రహదారి కొకవైపున నిడుబ్రోలును, దానికెదురువైపున పొన్నూరుఅను గ్రామమును కలవు క్రీ శ 19వ శతాబ్దినాటి వాసిరెడ్డివారి పరిపాలనాధికారమున నున్న వేదశాస్త్ర పాఠశాల, సత్రములు మొదలగునవి పొన్నూరునందుకలవు పూర్వమిచ్చటగల యొక వనమునందు మహర్షులు గోష్ఠులు జరుపుచుండిరట అందుచే దీనికి గోష్ఠివనమను పేరుండెను ఆ గోష్ఠులయందు సాక్షిగా వర్తించిన భావనారాయణస్వామికి సాక్షి భావనారాయణస్వామి యను పేరు కలిగెను ఆ సాక్షి భావనారాయణస్వామి ఆలయము పొన్నూరునందు కలదు

పొన్నూరునకు స్వర్ణపురమనియు మరియొక పేరు కలదు 'పొన్ను' అనగా సువర్ణము, ఊరు అన పురము కాగా స్వర్ణపురము-పొన్ను+ఊరు పొన్నూరుగా మారి యుండనగును స్వర్ణపురము సాంస్కృతికము పొన్నూరు ఆచ్ఛికము-ఇచటి సాక్షిభావనారాయణస్వామి ఆలయమున కనతిదూరమున 'నెత్తుటికుంట' అను నొక చెరువు కలదు ఈ భావనారాయణస్వామి ననుసరించి నేడనేక దేవాలయము లాయూర దివ్య శిల్పకళాభిరామములై ప్రజాకర్షకములుగ నున్నవి శ్రీ స్వామివారి ఆలయముండిన ప్రదేశమునకు క్రొత్తపొన్నూరనియు దానివెంట నున్నదానికి ప్రాతపొన్నూరనియు నామములు

'ప్రాతపొన్నూర'ను గ్రామమున పూర్వము క్రీ శ 9 వ శతాబ్దమున నొకరాజుండెడివాడు ఆ రాజునకు చాల కాలమువరకు సంతతి లేదు అతడు బహువ్రతములు, పెక్కు నోములు, మహాదానములు చేసెను ఎంతకును వాని ప్రారబ్ధము తీరలేను దాన నాతనికి సంతానప్రాప్తి లేకపోయెను ఆ రాజునింట నాతని మేనల్లుడు 'గోవిందుడ'నువా డుండెడివాడు వాని తెలివితక్కువకు తోడు గూనియు నుండెడిది అందుచే దిక్కులేనియాతడు రాజునింటబడి యుండి ఆ రాజదంపతుల మనసునకెక్కునట్లు అతడు ప్రవర్తించుచుండెను అతడనిన ఆదంపతుల కభిమానమధికముగ నుండెను. ఆ రాజదంపతులు ఒకపరి 'కాశీకి' వెళ్ళి గంగాస్నాన మొనరించి వచ్చినచో తమ పాపము పరిహారమగునని యుద్దేశించి బయలుదేరిరి. గూనిగోవిందుడును వెంటనుండుట మంచిదని

యెంచి వానిని తోడుగా గొనిపోయిరి వారు ఆ వారణాసిలో మణికర్ణికాది ఘట్టములలో భావనారాయణస్వామి ఆలయమున కెదురుగా గంగానదియందు స్నానముల నొనరించుచు యథాశక్తి దానముల నొనర్చుచుండిరి అట్టి దానములలో మంత్రక్రమములో కన్యాదానప్రసంగము వచ్చెను ఆ రాజదంపతులు మాకు నిజముగ పుత్రికోదయమైనచో మా గూనిగోవిందున కొసగుదుమని నీటిధారను గంగలో వదలిరి ఇట్లనుటకు ఆ దంపతులకు సంతానమిక కలుగదను నిరాశయే కారణము కాని ఫలమున్నను భాగ్యమున్నను తప్పదన్నట్లు స్వగృహమును చేరిన కొలదిరోజుల కావిశ్వనాథుని కృపచే ఆ రాణి గర్భవతియయ్యెను, క్రమముగ పదిమాసములు నిండెను ఆమె పుత్రికను ప్రసవించెను ఆమె సర్వాంగసుందరి, భగవత్కరుణాప్రసాదిని యగుటచే బుద్ధిమతియు నయ్యెను అందుచే ఆమె పెండ్లియీడునకు వచ్చినదిమొదలు దంపతులను ఆ పూర్వపు కన్యాదాన వాగ్దానము బాధించుచుండెను రాజునకు మాత్రము ఏల చూచుచు జూచుచు వయసుమళ్ళిన మూర్ఖుడును, గూనివాడును నగు గోవిందునకు కన్యనిచ్చుటకు మతిగల్గును? ఆడువాండ్రసలే ఇచ్చగింపరు 'కన్యావరయితే రూపం'-అనుటచే ఆ కన్యయు వాని నొల్లదయ్యెను ఈ సంగతి తెలిసి గూనిగోవిందుడు తన మేనమామ నొకనాడడిగెను దాని కారాజు-"నాకూతురును నీకీయను నీకిచ్చెదనన్నట్లు సాక్ష్యమేమున్నది? ఉన్నచో తెచ్చుకొనుము ఇచ్చెద"ననెను వెంటనే మూర్ఖభక్తుడగు ఆ గూనిగోవిందుడు మరల కాశీపట్టణమునకు పోయి అచటి శ్రీభావనారాయణస్వామిని, ఆయన దేవేరియగు లక్ష్మీదేవిని అచటి పేరులేని మ్రానును, మణికర్ణికను సాక్షులై దయచేయుడని ప్రార్థించెను వారందుల కంగీకరించి "వత్సా! మేమువత్తుము-కాని నీవు మారాకను శంకించి వెనుదిరిగి చూచితివా, మేమచటనే ఆగిపోదుము కావున నీవు వెనుతిరిగి చూడక పోవుచుండుము. మేము నీకు సాక్షులుగ వత్తుము పొమ్ము"నిరి

గోవిందుడు సంతసమున వచ్చుచు ఈ గోష్ఠివనము కడకు వచ్చునరికి "ఇక గ్రామము గూడ సమీపించితిని సాక్షులు వచ్చుచుండిరో లేదో" అను శంకచే గోవిందుడు వెనతిరిగి చూచెను ఆ సత్వరచటనే ఆగిపోయిరి ఇప్పుడు శ్రీ భావనారాయణస్వామి వారి ఆలయములోనున్న స్వామియు, పేరులేని పెద్దమ్రానును-మణికర్ణిక (కోనేరు) అనునవి మాత్రముండినవి శ్రీస్వామివారి దేవేరి లక్ష్మియు ఆయనవెంట వచ్చినది కాని ఆ సమీపమునగల కాలువలో నొక కొంతకాలమునకు బెస్తవాండ్రు చేపలను పట్టుచుండిరి ఆమె ఎగతాళికి వారలనడిగి ఒకచేపను తీసికొనెను. అర్ధానిని స్వామిచూచి యామెను వెలివైచెను అందుచే నామె యీ గ్రామమునకు వెలిగా గ్రామదేవతయై యుండెను అను ప్రతీతికలదు ఇంతగా కష్టపడి సాక్ష్యమును కొనివచ్చిన గూనిగోవిందునకు తన కూతునిచ్చి రాజు వివాహముచేసెను ఆనాటినుండి సాక్ష్యమునకుగా వచ్చిన వాడగుటచేగూడ ఆ స్వామిని 'సాక్షిభావనారాయణస్వామి' అని అచటివారు పిలుచుచుందురు శ్రీస్వామివారి ఆలయమున నొకపరి దొంగలు ప్రవేశించి సొమ్ములపహరించుకొనిపోయి వాటిని సమీపముననున్న ఒక చెరువువద్దకు పంచుకొనుటకు వచ్చిరి దొంగలు రక్తమును గ్రక్కి మరణించిరి అందుచే దానిని నెత్తుటికుంట యనుచుండిరట

క్రీ శ 11వ శతాబ్దాంతమున 'అవుకు' రాజ్యాధిపతియైన నంద్యాల నారపరాజు శ్రీస్వామివారి కాలయమును నిర్మింపించెను అటుతర్వాత కులోత్తుంగ చోళదేవ చక్రవర్తి (క్రీ శ 1070-1118) ఆయాలయమును సంపూర్తిగావించి శ్రీస్వామివారికి వైశాఖకల్యాణోత్సవమును, అర్చనాది కైంకర్యములను చేయించుచు కొన్ని ఈనాములను శ్రీస్వామివారి అర్చనాదుల కొసగెను అని నుడువు శాసనాధారములు కలవు ఆపై 1773వ సంవత్సరములో రామారు జమీందారులు శ్రీమాణిక్యారావు జగ్గారావు ప్రాకారాదులను నిర్మింపించి ఉత్సవాదు లొనరించి, తమ యనంతరమీ యుత్సవములు అవిచ్ఛిన్నముగ జరుగుటకై ఆలయమును 19వ శతాబ్దాదిని శ్రీ రాజా వాసిరెడ్డి వేంకటాద్రినాయనికి స్వాధీనముచేసిరట ఇందులకు సాక్ష్యము శాసనములే! ఇప్పటికిని శ్రీ వాసిరెడ్డివారి సాంప్రదాయకులే శ్రీస్వామివారి కళ్యాణోత్సవాదులను జయప్రదముగ నెరవేర్చుచున్నారు

ఈపైకథ ననుసరించి ఈ స్వామి స్వయంభువుడగుటచే ఈ ప్రదేశము మహిమాన్వితమై మహర్షుల కాలవాలమైనది భక్తులు అసంఖ్యాకులు ఉత్సవమునాటికి వచ్చుచుండిరి సార్వకాలికముగా ఈ గ్రామమునకు ప్రజలను రప్పింపవలచి ఇచటి భక్తులు ఊరివెలుపల 6 గజముల ఎత్తుగల ఒక ఆంజనేయ విగ్రహమును, 8 గజముల యెత్తుగల ఒక గరుడవిగ్రహమును

మరికొన్ని ఇతర దేవతావిగ్రహములను లోకాతిశయమగు శిల్పకళతో సిద్ధముచేయించి ప్రతిష్ఠించిరి జనమాశిల్పసౌష్ఠవమును, శ్రీసాక్షి భావనారాయణస్వామి మహిమను జూచి భక్తిని జూపి స్వాభీష్టముల పొందుట నేటివరకు జరుగుచునేయున్నది

ఎం. సి. శా.

## భాషాశాస్త్రము - దాని వికాసము - భాషా కుటుంబములు :

ఈ నాటి ప్రపంచమునందలి వివిధ ప్రాంతములలో పలువిధములైన భాషలు ప్రచారములో నున్నవి స్థూలదృష్టికి ఇవి పరస్పరసంబంధము లేని వేర్వేరు భాషలుగ కనబడును. కాని ఏ ఒక్క భాషనైనను సూక్ష్మముగా పరిశీలించినచో, పదజాలము నందును, వ్యాకరణాది విషయములందును, ఆ భాషకు కొన్ని ఇతరభాషలలో సన్నిహిత సంబంధమున్నట్లు మనకు గోచరించును ఈ సంబంధము యాదృచ్ఛికమని చెప్పుటకు వీలుకానిది కావున ఇట్టి సంబంధముగల భాష లన్నియు ఒక్క తెగకు చెందినవని కాని, ఒక్క కుటుంబమునకు చెందినవని కాని, నిర్ణయమునకు మనము తప్పక రావలసి యుండును, ఈవిధముగా భాషలలోనున్న పరస్పర సామ్య వైషమ్యములను పరిశీలించి వివిధ భాషా కుటుంబములను నిర్ణయించు శాస్త్రము భాషాశాస్త్ర మనబడును. భాషల స్వరూపస్వభావాదులను పరిశీలించుటకై బయల్వెడలిన ఈ శాస్త్రము అనేక ప్రాచీన ఐతిహాసిక, సాంఘిక విషయములను కూడ తెలిసికొనుటకు ఎంతయు ఉపకరించుచున్నది

వర్ణముల నుచ్చరించుపద్ధతి, వాటి ఉత్పత్తిస్థానాదుల నిర్ణయము, పదమునకును అర్థమునకును ఉండు సంబంధము, వాక్య నిర్మాణ విషయమున అవలంబింపవలసిన నియమములు మొదలగు పెక్కు భాషాసంబంధ విషయములనుగూర్చి క్రీస్తుకు ఎన్నియో శతాబ్దుల పూర్వము యాస్క, పాణిన్యాదులగు భారతీయ వైయాకరణులు విపులముగ చర్చించియుండిరి కావున భాషాశాస్త్రాధ్యయన మనేక శతాబ్దులకు పూర్వమే భారతదేశమున ప్రచురప్రచారమున ఉన్నదని చెప్పవచ్చును. కాని మనమీనాడు భాషాశాస్త్ర మనుపేర వ్యవహరించెడు శాస్త్రమునకు పునాదులు ప్రప్రథమముగ పదునెనిమిదవ శతాబ్దమున పాశ్చాత్య పండితులచే వేయబడియున్నవి.

పూర్వము చాలకాలము వరకును భాష కేవలము ఈశ్వరదత్తమని విజ్ఞులెల్లరును విశ్వసించుచుండిరి కాని పదునెనిమిదవ శతాబ్దమున యూరప్ దేశములలో అనేక విమర్శకులు బయల్వెడలి భాషోద్గమ విషయమున అనేక క్రొత్త విషయములను ప్రవేశపెట్టి, వారు భాష ఈశ్వరదత్తమను మతమును ఖండించిరి ఆదిమ మానవులొకచోట చేరి పరస్పరము సంప్రదించుకొని భాషను సృష్టించిరని రూసో అను దార్శనికుడు అభిప్రాయపడెను ఆదిమ మానవులు కలిసియున్నపుడు భావోద్రేకాదులచే వారి నోటినుండి వెడలిన కొన్ని శబ్దములే భాషకు మూలకందను లైనవని కోండిలక్ అను పండితుని అభిప్రాయము హార్డర్ అనునతడు గర్భమునుండి శిశువు వెడలినట్లే మానవుని నోటినుండి భాష అప్రయత్నముగ ప్రకృతిసిద్ధముగ బయల్వెడలినదని ప్రతిపాదించెను జేనిష్ అను పండితుడు ఒక ఆదర్శభాష కుండవలసిన లక్షణములను ప్రతిపాదించుచు, లాటిను, గ్రీకు మొదలగు కొన్ని పాశ్చాత్య భాషల తులనాత్మకాధ్యయనమును చేసెను ఈవిధముగ పదునెనిమిదవ శతాబ్దమున హార్డర్, జేనిష్ పండితులు భాషా శాస్త్రమునకు పునాదులు వేసిరి ఈ శతాబ్దపు చివరి భాగమున పి. ఎస్. పల్లస్ అనునతడు కొన్ని ప్రాచ్య,పాశ్చాత్య భాషలనుండి పరస్పర సామ్యముగల 285 పదములను ఏరి ఒక శబ్దావళిని తయారుచేసెను దాని రెండవ సంస్కరణమున మరి ఎనుబది భాషల పదములను కూడ ఈ శబ్దావళిలో చేర్చెను.

[illegible] పందొమ్మిదవ శతాబ్దిలో భాషాశాస్త్రమునకు సంపూర్ణ వికాసము లభించెను అనేకములగు క్రొత్త భాషల నభ్యసించుటతోపాటు, పండితులు లాటిన్, గ్రీక్ మొదలగు భాషలను నూతన దృక్కోణముతో పరిశీలింప మొదలిడిరి భాషలలో నుండు పరస్పర సామ్య వైషమ్య పరిశీలనమునకు ప్రాధాన్య మీయబడెను భాషలోని ఒక ధ్వని లేక ఒక పద స్వరూపము,విభిన్న కాలములలో పొందు మార్పులు ఐతిహాసిక దృష్టితో పరిశీలింపబడినవి భాష ప్రవాహరూప మైనదనియు, అందలి మార్పులుగూడ క్రమబద్ధముగ నుండుననియు నిరూపింపబడెను 18వ శతాబ్ది చివరిభాగమున విలియమ్ జోన్సు అను పండితుడు సంస్కృత భాషాప్రాశస్త్యమును ముక్తకంఠముతో ఉగ్గడించుచు, సంస్కృతము, లాటిను గ్రీకు భాషలు ఇవి ఒక సుగాలభాషనుండి ఉత్పన్న మైనవనియు, ప్రాచీనము లైన పారసి, కెల్టి, గోథిక్ భాషలకు గూడ వీటితో సన్నిహిత సంబంధము కలదనియు సోపపత్తికముగా ఉద్ఘోషించెను దీనితో భాషాశాస్త్ర పండితులదృష్టి సంస్కృతాధ్యయనము వైపు మ్రొగ్గెను.

ప్రాచీనయుగము ఫ్రెడరిక్ ష్లీగల్ అనునొక జర్మను విద్వాంసుడు (1772-1829) సంస్కృతభాషలో మంచి పాండిత్యమును సంపాదించి 1808 లో భాషాశాస్త్రమున ఒక ఉత్తమ గ్రంథము రచించెను. ఈతడు ప్రప్రథమముగ తులనాత్మక వ్యాకరణ ప్రక్రియను ప్రవేశపెట్టి కొన్ని ధ్వనినియమములను సూచించెను. భాషలను సంస్కృత సగోత్ర భాషలనియు, తద్భిన్న భాషలనియు, రెండు తెగలుగ విభజించెను. ఈతని సోదరుడు అడల్ఫ్ ష్లీగల్ కూడ సంస్కృతాభిమాని యగు భాషాశాస్త్ర పండితుడు. ఈతడు శ్లిష్ట భాషలను సంయోగాత్మకము లనియు, వియోగాత్మకము లనియు రెండు తెగలుగ విభజించెను. రస్క్, గ్రిమ్, బాప్ మొదలగు పండితులు పందొమ్మిదవ శతాబ్ది ప్రారంభమున కొన్ని ప్రామాణిక గ్రంథములను రచించి భాషాశాస్త్రమున కొక నిర్దిష్టరూపము నిచ్చిరి. రాజ్‌మస్ రస్క్ అను వైయాకరణుడు (1787-1832) శాస్త్రీయ పద్ధతులలో ఐస్‌లెండ్ భాషాధ్యయనము చేసి ప్రాచీన నార్స్ భాషోత్పత్తిని గూర్చి ఒక ప్రామాణిక గ్రంథమును రచించెను. ఈతని అభిప్రాయము ప్రకారము మతము, కళలు మొదలగునవి మార్పు చెందినంత శీఘ్రముగ, భాష మార్పుచెందదు. కావున ఏదైనను ఒక దేశము యొక్క చరిత్రను తెలిసికొనుటకు చరిత్ర గ్రంథములు లభింపకపోయినను, తద్దేశ భాషాధ్యయనము సహాయపడును. భాషాధ్యయన విషయమున పదజాలముకంటె వ్యాకరణమునకు ప్రాధాన్యమీయవలెనని కూడ ఈతని ఆశయము. జందావస్తా అను భాషకు ఆర్యభాషాకుటుంబములో ప్రవేశము నీతడు ప్రతిపాదించెను.

భాషాధ్యయన విషయమున ప్రాచీనభాషల కెంత ప్రాధాన్యమున్నదో అంతటి ప్రాధాన్యము చిన్నభాషలకు గూడ కలదను సత్యమును ప్రప్రథమముగ చాటినవాడు జాకబ్ గ్రిమ్ అను పండితుడు (1785-1863). ఈతడు దేవభాషా వ్యాకరణమను పేరతో జర్మన్ భాష కొక వ్యాకరణమును వ్రాసెను. ఈతడుపయోగించిన ఎన్నియో పారిభాషిక పదములు నేటికిని భాషాశాస్త్రమున ఉపయోగింపబడుచున్నవి.

ఫ్రాన్స్‌బాప్ (1791-1867) ఈతడు ధాతుప్రక్రియపై ఒక గ్రంథమును రచించి సంస్కృతశబ్దములతో గ్రీకు, లాటిను, ఇరానీ, జర్మను భాషాశబ్దముల సామ్యపరిశీలనమును చేసెను. సంస్కృతము జందావస్తా, ఆర్మీనీ, గ్రీక్, లాటిన్, లిథుయేనీ, ప్రాచీన స్లావ్, గోథిక్, జర్మన్ భాషల తులనాత్మక వ్యాకరణ రూపముగ మరియొక గ్రంథమును గూడ రచించి, ఈ భాషలన్నిటికిని మూలభూతమగు ఒక భాష యుండియుండవలెనని ప్రతిపాదించెను. పదములకు చివర చేర్చు ప్రత్యయములుకూడ ఒక కాలమున ప్రత్యేక పదములై యుండెననియు, అట్లే 'మి' 'సి' 'తి' మొదలగు ప్రథమ పురుషాది వాచక ప్రత్యయములు సర్వనామశబ్దముల పరివృత్తరూపము లనియు, ఈతడు సప్రమాణముగ స్థిరీకరించెను. ఈతని విభాగము ప్రకారము భాషలు మూడువిధములు - 1 ధాత్వాది వ్యాకరణ నియమ దూరములగు చైనాభాషవంటి భాషలు, 2 ఆర్యభాషలవంటి ఏకాక్షర ధాతుక భాషలు, 3 సామీవంటి ద్వ్యక్షరధాతు భాషలు.

ఈవిధముగ 1850 నాటికి భాషాశాస్త్ర మొక నిశ్చిత రూపము సంతరించుకొని శాస్త్రములలో తనకొక ఉత్తమ స్థానమును గూడ సంపాదించుకొనెను. భాషాశాస్త్రాధ్యయనమున ఈ దిగువ జూపిన విషయములకు ప్రాధాన్య మీయబడెను (1) సంస్కృత భాషాధ్యయనమునకు అధిక ప్రాధాన్యము, (2) భాషల సామ్యవైషమ్యములను పరీక్షించునపుడు సామాన్యలక్షణములను ఎక్కువగ పరిశీలించుట, (3) వర్తమాన భాషలకు ప్రాచీన భాషల కిచ్చిన ప్రాధాన్య మీయకుండుట, (4) లిపిబద్ధ భాషలనే ప్రధానముగ పరిశీలించుచు మాటలాడు భాష నుపేక్షించుట, (5) అట్టి జీవద్భాషలను పరిశీలించునపుడు కూడ ప్రాచీన లక్షణములను మాత్రమే అన్వేషించుట.

సంధికాలము అగస్టు శ్లైఖర్ (1823-1868) ఈతడు లిథుయేనీ, రూసీ మొదలగు భాషలను సాంగముగ పరిశీలించి భాషాశాస్త్రమూల సిద్ధాంతస్వరూపమును నిరూపించ ప్రయత్నించెను. భాషాశాస్త్రాధ్యయనమున సంస్కృతమునకుగల ప్రాధాన్య మీతడు తగ్గించెను. మనుష్యజాతులను నిర్ణయించునపుడు వారి పుఱ్ఱెపొడవు, వర్ణలక్షణము మొదలగువాటికిగాక భాషాభేదమునకు ప్రాధాన్యమీయవలెనని ఈతని అభిప్రాయము. ఈతడు భాషలను ప్రయోగాత్మకములు, అశ్లిష్టయోగాత్మకములు, శ్లిష్టయోగాత్మకములు అని మూడు తెగలుగ విభజించెను. ఈతడు ఆనుమానికమగు ఒక ఆదిమార్యభాషను సృష్టించి-ఆభాషలో ఒక కథానికను గూడ వ్రాసెను.

గేటర్గ్ కుర్టిఉస్ (1847-1885) ధ్వని నియమములనుపాటింప

వలెననెడి అభిప్రాయము కలవాడే అయినను, ఈతడు ధ్వని నియమములు నిరపవాదములనెడు నవీనుల వాదము నంగీకరింపలేదు. శబ్దనిష్పత్తి విషయమున సాదృశ్యమున కీతడు నవీనులిచ్చినంత ప్రాధాన్యమీయలేదు వీరుకాక మాక్సుముల్లరు, హ్విట్నీ మొదలగు పండితులు కూడ భాషావిజ్ఞానమునకు ప్రబల ప్రచారము కలుగుటలో అధికముగ తోడ్పడిరి

**నవీనయుగము** స్టైన్ థాల్ (1823-99) అనునతడు భాషాశాస్త్రమున కొన్ని నూతనాంశములను ప్రవేశపెట్టెను ఈతడు వ్యాకరణ, తర్క, మనో విజ్ఞానశాస్త్రముల పరస్పర సంబంధమును విపులముగా నిరూపించి, ప్రధానముగా మనోవిజ్ఞానము, భాషాశాస్త్రాధ్యయనమున కెంతయు సహకరించుననెడు నూతనవిషయమును సోపపత్తికముగ సమర్థించెను. సుదూర ప్రాచ్యదేశీయములగు చైనాభాషాదుల గూర్చియు, నీగ్రోభాషాదులగూర్చియు ఈతడు విమర్శక కార్యము సాగించెను అస్కోలీ అనునతడు కెంటుమ్ భాషలకును సంతమ్ భాషలకును మధ్యగల భేదమును స్పష్టీకరించెను ఈవిధముగా 1870 నాటికి భాషాశాస్త్రమొక ప్రశస్తస్థానము సంపాదించుకొనెను. ఈశాస్త్రమునకు సంబంధించిన కొన్ని మూలసూత్రములను రూపొందించుకొనుటతోపాటు తులనాత్మకవ్యాకరణ సహాయమున ఊహామాత్రగమ్యమగు నొక ప్రాచీనతమ ఆర్యభాషారూపముకూడ నిర్ధారణచేయబడెను సంస్కృతము, గ్రీక్, లాటిన్ మొదలగు భాషలలోని నూటికి తొంబదిపదముల వ్యుత్పత్తికూడ నిశ్చితమయ్యెను

ఈ యుగమున తాలవ్యనియమమను నొకనియమము కనుగొనబడెను ఈ నియమము ప్రకారము మూలార్యభాషలోని తృతీయశ్రేణికి చెందిన 'క' వర్గము సంస్కృతములో కొన్నిచోట్ల 'క' వర్గముగను, మరికొన్నిచోట్ల 'చ' వర్గముగను మార్పుచెందును ఈ నియమఫలితముగా ఆదిమార్యభాషయందలి మూలస్వరము లు అ, ఏ, ఒ లేకాని, మొదట భావించినట్లు అ, ప, జేలు కావనియు, కావున సంస్కృత భాషయే ఆదిమభాషకు అతిసన్నిహితమనెడు ప్రాచీనవాదము విమర్శసహము కాదనియు నిరూపింపబడెను ఈ నూతన విషయావిష్కరణముతోపాటు అంతవరకును ఉన్న స్వరక్రమమున కొన్నిమార్పులు చేయవలసివచ్చెను ఆదిమార్య భాషయందలి ధాతువులన్నియు ఏకాక్షరములే అనియు, వాటి మూలరూపములు గుణవృద్ధులు లేనివై యుండ, కాలాంతరమున గుణవృద్ధులు వచ్చెననియు ప్రచలితమైయున్న ప్రాచీనవాదము కూడ విడువబడెను

ప్రాచీనయుగపు భాషాశాస్త్రవేత్తలకును నవ్యయుగమువారికిని, దృక్పథమున కొంచెము భేదముండెను ప్రాచీనులు వ్యాకరణ నియమములకు మిక్కిలి ప్రాధాన్యమిచ్చుచు అనియమములకు కొన్ని అపవాదములుండుటకూడ సహజమే యని భావించిరి కాని నవీనుల అభిప్రాయము ప్రకారము మాటలాడువ్యక్తి సిద్ధభాషను ఇతరులనుండి నేర్చుకొనును అంతియే కాని వైయాకరణునివలె అతనికి ధాతువు, ప్రత్యయము మొదలగు విభాగములతో పనిలేదు అతడు తాను వెనుక నేర్చిన శబ్దముల సాదృశ్యముచే అప్పుడప్పుడు కొన్ని క్రొత్తశబ్దములను నిర్మించి ప్రయోగించుచుండును కావున ఏవిధమైన విసదృశ రూపములగపడినచో అవి అపవాద రూపములనికాని, దుష్టరూపములనికాని అనుకొనుట యుక్తము కాదు. పూర్వప్రచలితమగు ఏ పదముయొక్క సాదృశ్యముచే ఈనూతనపదము తయారుచేయబడెనో, దానినే భాషాశాస్త్రజ్ఞుడు కనుగొనవలెను ఈవిధముగా నవీనులు పదరచనా విషయమున సాదృశ్యమునకు మిగుల ప్రాధాన్య మిచ్చిరి

భాషలో ధ్వనిగ్రామము బహిరంగమనియు, అర్థము అంతరంగమనియు నవీనుల అభిప్రాయము. ఆస్టోఫ్ అనునతడు ధ్వనివికాసము శరీర శాస్త్రాంతర్గతమనియు, పదవికాసము మనోవిజ్ఞానాంతర్గతమనియు ప్రతిపాదించెను ఈమతము నిర్దుష్టముకాదని నిరూపింపబడినను, ధ్వనివికాస, పదవికాసములు రెండును విభిన్నమార్గముల నడచుననెడు విషయమును మాత్రము ఎల్లరును అంగీకరించిరి నిఘంటు వ్యాకరణాదిగతమగు భాష కృత్రిమమను నభిప్రాయముచే, మాటలాడు భాషకే వీరు ప్రాధాన్యమిచ్చిరి భాషోత్పత్తి, భాషలవర్గీకరణము అను విషయములను నవీనులు అప్రధానములుగ పరిగణించిరి భాషోత్పత్తి యనునది నిర్ధారణముచేయుట అశక్యమైనదని వీరిఅభిప్రాయము భాషావర్గీకరణముకన్నను భాషల కలయిక ఎక్కువ ప్రధానమనియు ఏభాషలోనైనను కనబడెడు పదరచనాధ్వని నియమాపవాదములు ఇతర భాషా సంపర్కముచే సమర్థనీయములనియు, ప్రతిపాదించుచు వీరు భాషలలో పరస్పరము ఆదానప్రదానములు జరుగుచుండునని సూచించిరి భాషాశాస్త్రాధ్యయనమున వాక్యవిజ్ఞానమునకు వీరు మిగుల ప్రాధాన్యమిచ్చిరి

**ఆధునికయుగము** 1880 సం॥ ర ప్రాంతమున ప్రారంభమయిన నవీనయుగము దాదాపు 1920 తో ముగిసినదని చెప్పవచ్చును క్రమక్రమముగా భాషాశాస్త్రమున అనేక నూతనాంశములు ప్రవేశముపొంది కొన్ని ప్రాచీన సిద్ధాంతములకు ప్రాముఖ్యము తగ్గెను గడచిన నలుబది, ఏబదిసంవత్సరములలో అమెరికా, పసిఫిక్ మహాసముద్రప్రాంతము, ఆఫ్రికా ఖండము, వీటికి సంబంధించిన అనేకసాహిత్యభాషల అధ్యయనము నియమపూర్వకముగచేసి, నేటి భాషాశాస్త్రవేత్తలు వెనుకటియుగమువారిచే అనాదృతములగు భాషోత్పత్తి, భాషావర్గీకరణము మొదలగు అంశములపైగూడ మరల తమ దృష్టిని మరల్చిరి వివిధ భాషాకుటుంబములనుగూర్చి అనేక గ్రంథములు వ్రాయబడుచున్నవి చిన్నపిల్లలలో భాషావికాసమెట్లు జరుగుచున్నదో శ్రద్ధగాపరిశీలించి, దానిసహాయముతో భాషావికాసమునుగూర్చి కొన్ని సిద్ధాంతములను స్థిరీకరించుటకై ప్రయత్నములు జరుగుచున్నవి భాషావికాస విషయమున మనో జ్ఞానమునకుగల ప్రాధాన్యమును గుర్తించి అర్థవికాస విషయమునగూడ దీనికిగల ప్రభావము నిరూపింపబడుచున్నది ఉచ్చారణావయవ ప్రేరణము విషయమున జ్ఞాననాడులు ప్రధానపాత్ర వహించుననెడు సిద్ధాంతము ప్రకారము శరీరవిజ్ఞానసహాయముతో ధ్వనివిజ్ఞానమునుగూర్చిన ఉత్తమకార్యమెంతయో సాధింపబడుచున్నది ధ్వనివికాసమును సూక్ష్మముగా పరిశీలించుటకై అనేకయంత్రములు కూడ ఉపయోగింపబడుచున్నవి. స్వరవిజ్ఞానము దార్శనిక దృష్టితో భాషను పరిశీలించుట, మాండలిక భాషలను వైజ్ఞానిక దృష్టితో పరిశీలించుట, భౌగోళికముగా భాషావిభాగము చేయుట, ఉచ్చరిత భాషారూపమును లిఖితరూపములోనికి మార్చుపద్ధతి మొదలగునవి ఆధునిక భాషాశాస్త్రాధ్యయనమునందలి కొన్ని ప్రధానాంశములు భాషలను ఐతిహాసికదృష్టితో పరిశీలించుటకంటె యథోపలబ్ధముగా అనగా ఆయాభాషలు మనకేయేరూపమున లక్ష్యమగుచున్నవో ఆయారూపమున వాటి స్వరూపస్వభావాదులను పరిశీలించుటకు నేడు ఎక్కువ ప్రాధాన్యమిచ్చుచున్నారు కావుననే, నేడు భాషావిజ్ఞానమునకు వర్ణనాత్మక భాషావిజ్ఞానము అను పేరు ప్రచారములోనున్నది ఈవిధముగ తొలుదొల్త జర్మనీదేశమున అభివృద్ధిచెంది, ఫ్రాన్సుదేశముమీదుగా ఇంగ్లాండులో ప్రవేశించిన భాషాశాస్త్రము నేడు అమెరికాదేశమున క్రొత్తరూపములను దిద్దుకొనుచున్నది ఇంగ్లాండు మొదలగు కొన్నిదేశములలో భాషాశాస్త్ర సహాయముతో గ్రామ, నగర, మనుష్యాదుల నామధేయాదులను పరిశీలించి ప్రాచీననాగరికత, సంస్కృతి మొదలగు ఎన్నియో విషయములను గూడ తెలిసికొనుటకు ప్రయత్నము జరుగుచున్నది

**భాషావిభాగము** భాషలను పదరచనాదుల ననుసరించియు, వాటి అర్థతత్త్వమును - అనగా మూలధాతు సామ్యాదికృతమగు సాదృశ్యమును - అనుసరించియు రెండు విధములుగ విభజింతురు అందు మొదటి విభాగమునకు ఆకృతిమూలక విభాగమనియు, రెండవదానికి ఐతిహాసిక విభాగమనియు పేర్లు

**ఆకృతి మూలక విభాగము** భాషలు అయోగాత్మకములు, యోగాత్మకములు అని రెండువిధములు అయోగాత్మక భాషలలోని ప్రతిపదము స్వయంపూర్ణమై, స్వతంత్రమై యుండును ఒకవాక్యములోనున్న అట్టిపదముల పరస్పర సంబంధము, వాటిస్థానమునుబట్టిమాత్రమే నిర్ణయింపబడును ఇందులకు చైనాభాష ఉదాహరణము "న్గోతని" అనగా "నేను నిన్ను కొట్టుచున్నాను" అని అర్థము. కాని 'నితన్గో' అనగా "నీవు నన్ను కొట్టుచున్నావు" అని అర్థము ఈ విధముగ ఇట్టి భాషలలో ప్రత్యేకపదము స్వతంత్రమై వాక్యమునందలి స్థానభేదముచేతను, స్వరభేదముచేతను, విభిన్నార్థములు బోధించుచుండును

యోగాత్మక భాషలలో స్వతంత్రపదములు సంబంధవాచకపదములతో కలసి అర్థబోధకములుగనుండును అశ్లిష్టములు, శ్లిష్టములు, ప్రశ్లిష్టములు అని యోగాత్మక భాషలు, మూడువిధములు అశ్లిష్టభాషలలో సంబంధవాచకపదములను లేదా ప్రత్యయములను పదములనుండి వేరుచేసి స్పష్టముగ చూపుటకు వీలుగనుండును తుర్కీ మొదలగు భాషలు ఉదాహరణము తుర్కీభాషలో "సేవ్ + మేక్" అనగా ప్రేమించుట అనియు "సేవ్ ఇస్ మేక్" అనగా పరస్పరము ప్రేమించుట అనియు, "సేవ్ దిర్ మేక్" అనగా ప్రేమింపచేయుట అనియు అర్థములు ఏర్పడును

ఈఅశ్లిష్ట భాషలనుగూడ సంబంధవాచకపదములు చేర్చు స్థానమునుబట్టి పూర్వయోగాత్మకము, మధ్యయోగాత్మకము, అన్తయోగాత్మకము అని మూడువిధములుగ విభజింపవచ్చును ఆఫ్రికాలోని 'బంటూ' కుటుంబమునకు

చెందిన కాఫిర్ భాషలో 'కు' అనుమాటకు 'కొరకు' అని అర్థము ఇది పూర్వయోగాత్మక భాషయగుటచే, 'కు' ను, పదమునకు మొదట చేర్పగా "కుతి" (మీకొరకు) "కుని" (వారికొరకు) మొదలగు పదములేర్పడును ఇట్లే ముండా భాషాకుటుంబాంతర్గతమగు సంథాలీ భాషలో "మఝి" (నాయకుడు) "మపంఝి" (నాయకసముదాయము) 'దల్' (కొట్టుట) "దపల్" (పరస్పరము కొట్టుకొనుట) మొదలగు మధ్యయోగాత్మకోదాహరణములు లభించును, ద్రావిడ భాషాకుటుంబమునకు చెందిన భాషలు అన్త్యయోగాత్మక భాషలు "రాముడు", "రాముని", "రామునిచేత" మొదలగునవి ఉదాహరణములు, సంబంధవాచకపదము లేక ప్రత్యయమును చేర్చుటచే పూర్వపదమునందుగూడ కొన్ని వికారములు కలుగును అట్టిభాషలు శ్లిష్టభాషలు సంస్కృతమున 'వ్యాకరణ' 'న్యాయ' 'వేద' మొదలగు పదములకు ప్రత్యయసంబంధముచే, "వైయాకరణ" "నైయాయిక" "వైదిక" మొదలగు పదములు నిష్పన్నమగుచున్నవి అట్లే "క్‌త్‌బ్" అను అరబ్బీధాతువునుండి 'కితాబ్' 'కుతుబ్' 'కాతిబ్' 'మకతూబ్' మొదలగు పదములు తయారగుచున్నవి ఈ శ్లిష్టభాషలనుగూడ సర్వతఃశ్లిష్టములనియు అంతఃశ్లిష్టములనియు రెండువిధములుగ విభజింపవచ్చును ఇందు మొదటి తెగకుచెందిన భాషలలో సంబంధవాచక ప్రత్యయములు పదముతో పూర్తిగా కలసిపోవును అరబ్బీ సామీకుటుంబ భాష ఉదాహరణము. రెండవతెగకు చెందిన భాషలలో ప్రత్యయాదులు ప్రధానముగ పదాంతమున చేర్పబడును. సంస్కృతాది ప్రాచీనార్యభాషలు ఉదాహరణములు

కొన్ని భాషలలో సంబంధాది వాచకములను విడదీసి చూపుటకు శక్యము కాని విధముగా పదముతో కలిసిపోవును వీటినే ప్రశ్లిష్టభాషలందురు ఉదాహరణమునకు "శిశు" 'భుజ్' అను పదములనుండి ఏర్పడిన 'శైశవము','అర్ణవము' మొదలగు పదములు ప్రాచీనార్య భాషలలోని కొన్ని శబ్దములు ఈ తెగకు చెందినవి సమాసప్రక్రియ మొదలగు పద్ధతులచే పెద్దఅర్థమును కొలదిపదములలో కుదించుట ఈభాషల ప్రత్యేకత

పైనచూపిన విభాగమంతయు ప్రాయికమే కాని నియతముకాదు ఒకవిభాగమునకు చెందిన భాషలోని కొన్ని పదములలో ఇతరలక్షణములగపడవచ్చును ఇట్లే ఐతిహాసిక దృష్టితో పరిశీలించినచో, ఒకకాలమున శ్లిష్టముగనుండిన భాషయే కాలాంతరమున అయోగాత్మకముగా కానబడుచున్నది ఉదాహరణమునకు శ్లిష్టభాషయగు సంస్కృతమునుండి బయల్వెడలిన హిందీ మొదలగు భాషలు నేడు అయోగాత్మకములుగ నున్నవి

**ఐతిహాసికవిభాగము లేదా భాషాకుటుంబములు** పాశ్చాత్య పండితులు సంస్కృతభాష నభ్యసించి, యాభాషకు గ్రీకు, లాటిను మొదలగు భాషలతోగల సన్నిహిత సంబంధమును పరిశీలించి, ఇవియన్నియు ఒకే కుటుంబమునకు చెందినవనియు, వీటి అన్నిటికిని మూలభూతము ఒకప్రాచీనభాష ఉండియుండవలెననియు నిర్ధరించిరి నేటి ఆర్యభాషలన్నియు ఈ ప్రాచీనభాషకు శాఖోపశాఖలే అనికూడ నిర్ణయించిరి దీనితో ప్రపంచమందలి భాషలన్నిటిని వివిధకుటుంబములుగా విభజించు ప్రయత్నమారంభమయ్యెను భాషాకుటుంబమును నిర్ధారణచేయుటకు వివిధ భాషలయందలి పదముల (వ్యావహారిక పదముల) సామ్యము, వ్యాకరణ సామ్యము, ధ్వని సామ్యము-ఈ మూడును ప్రమాణములుగ స్వీకరింపబడును వీటి ప్రామాణ్యము యథోత్తరము

అమెరికా, ఆఫ్రికా మొదలగు ప్రాంతములందలి ఆరణ్యకజాతుల భాషల పరిశీలనము ఇంకను పూర్తికాలేదు కావున ప్రపంచమున మొత్తము భాషాకుటుంబము లెన్ని యున్నవో చెప్పుట శక్యము కాదు కాని ఫ్రెడరిక్ మూలర్ అభిప్రాయము ప్రకారము ప్రపంచమున నూరుభాషాకుటుంబములు కలవు పూర్వము వేరువేరు భాషాకుటుంబములుగా భావించిన వాటినే, నేడు కొందరు ఏకకుటుంబముగా నిరూపించుచున్నారు ఉదాహరణమునకు ఉరాల్ అల్తియా కుటుంబము, ద్రావిడకుటుంబము వేరుకుటుంబములు కావని నిరూపింప ప్రయత్నము జరుగుచున్నది అట్లే హిర్ట్ మొదలగువారు ఆర్య, సామీ భాషాకుటుంబములు వేర్వేరు కావని చూపుటకు యత్నించిరి ఈ విధముగ భాషాకుటుంబముల నామసంఖ్యాదుల విషయమున కాలక్రమమున అనేకమార్పులు కలుగుటకు అవకాశము లేకపోలేదు కావున దిగువ చూపబడు విభాగము స్థూలవిభాగమనియే చెప్పవచ్చును

ఆయాప్రాంతముల భౌగోళిక ప్రభావము భాషలపై

గూడ అత్యధికముగ ప్రసరించును కావున భాషాశాస్త్రజ్ఞులు ఆయా భాషల కుటుంబములను విభజించునపుడు భూగోళమును ప్రధానముగా నాల్గుఖండములుగా విభజించియున్నారు (1) ఆఫ్రికాఖండము (2) యూరేషియాఖండము (3) పసిఫిక్ మహాసముద్రఖండము (4) అమెరికాఖండము

**ఆఫ్రికాఖండము** ఈఖండమున (1) బుష్‌మన్ (2) బంటు (3) సూడాన్ (4) హెమెటిక్ (5) సెమెటిక్ - అను ఐదు ముఖ్యభాషాకుటుంబములు గలవు బుష్‌మన్ భాష అన్నిటికంటెను ప్రాచీనమైన ఆటవికభాష. ఈ భాషలో అనేక నూతన వ్యంజనధ్వనులుండుటయేకాక, దాని వ్యాకరణముకూడ విచిత్రముగనుండును లింగభేదము ప్రాణ్యప్రాణిత్వ భేదముపై ఆధారపడియుండును బహువచనరూపనిష్పత్తికై ఈ భాషలో దాదాపు ఆరువది నియమములున్నవి జపానీ మొదలగు భాషలలోవలె ఏకవచనరూపమును ఆవృత్తి చేయుటచే బహువచనమును తయారుచేయు పద్ధతి కూడ ఈ భాషలో నున్నది

బంటు కుటుంబభాష లెక్కువగ దక్షిణ ఆఫ్రికా ప్రాంతమున ప్రచారములో నున్నవి ఇవి పూర్వ ప్రత్యయ ప్రధానములు లింగభేదములేదు. స్వరభేదముచే అర్థములు మారుచుండును ఈ కుటుంబములో దాదాపు 650 భాషలు కలవు ఇవి మూడు తెగలుగ విభజింపబడినవి తూర్పుబంటు కుటుంబమున కాఫిర్, జులూ భాషలును, మధ్యబంటు కుటుంబమున సేసుతోభాషయు, పశ్చిమబంటు కుటుంబమున కాంగోభాషయు ప్రధానములు, ఈ భాషలలో సాహిత్యము లభింపలేదు జాంజిబార్ ప్రాంత భాషయగు స్వహిలీభాషలో అరబ్బీలిపిలో వ్రాయబడిన కొన్ని శాసనములు లభించినవి ఈ కుటుంబ భాషలన్నియు స్వరాంతములు, సంయుక్త వ్యంజనరహితములు

సుడాన్ కుటుంబ భాషలు ఉత్తర ఆఫ్రికాప్రాంతమున మాటలాడబడునవి వ్యాసప్రధానమగు ఈ భాషలలో విభక్తులు కానరావు లింగభేదమున్నది ధాతువులు ఏకాక్షరములు ఈ కుటుంబములో అనేక భాషలున్నను, ఐదారు భాషలు మాత్రమే లిపిబద్ధములై యున్నవి ధాతువులు ఏకాచ్కములగుటచే ప్రత్యయోపసర్గల ఆధిపత్యముండుటయే కాక, స్వరభేదముచే అర్థభేదముకూడ కానవగును సూడాన్, బంటు కుటుంబములలో కొన్ని విషయములందు సాధర్మ్యము కానవచ్చుచున్నది

హెమెటిక్ కుటుంబమునకు చెందిన భాషలను మాటలాడుజాతులు ఆఫ్రికా మధ్యప్రాంతమందును, దక్షిణమందును వ్యాపించి యున్నవి ఇంజీల్‌లో ఉన్న ఒక కథననసరించి హజరత్ మహమ్మద్ జ్యేష్ఠకుమారుడగు 'సేమ్' పేరిట 'సెమెటిక్' కుటుంబమనియు, చిన్నకుమారుడగు 'హేమ్' పేరిట 'హెమెటిక్' కుటుంబమనియు ఈ భాషాకుటుంబములకు నామధేయములు లభించినవి ఈ భాషలలో పదనిష్పత్తి నిమిత్తము ఉపసర్గలు, ప్రత్యయములుకూడ చేర్పబడును క్రియలలో కాలభేదము లేదు లింగభేదనియమములు విచిత్రరీతిలో నుండును బరువైన పెద్దవస్తువులను బోధించు పదములు పుంలింగములనియు, తేలికగా, నాజూకుగా నుండు వస్తువులను బోధించు పదములు స్త్రీలింగములనియు ఈ నియమముల మూలస్వరూపము

సెమెటిక్ కుటుంబమునకు చెందిన భాషలు మొరాకో నుండి సూయజ్ కాలువవరకునుగల ప్రాంతమున మాటలాడబడుచున్నవి ఈ కుటుంబమునకు చెందిన భాషలనుండియే ప్రపంచమునందలి అనేకజాతులు లిపిని అభ్యసించినవి ఈ భాషలలో పదనిర్మాణమున స్వరవికారమునకు అత్యధిక ప్రాధాన్యము కలదు లింగభేదముకూడ హెమెటిక్కుటుంబ భాషలలో కానవచ్చుచున్నది కారకములు మూడు క్రియలకుచివర సర్వనామపదములు చేర్పబడును ఈ కుటుంబములలో ఉత్తరసెమెటిక్ అనియు, దక్షిణ సెమెటిక్ అనియు రెండువిభాగములు కలవు ఆధునిక హిబ్రూభాష, ఫినీషియన్, ప్యూనిక్ మొదలగు భాషలు మొదటి విభాగమునకును, అరబ్బీ, మగ్రిబ్యాక్కి, అబిసీనియన్ మొదలగునవి రెండవ విభాగమునకు చెందినవి

**యూరేషియాఖండము** ఈ ఖండమునకు సంబంధించిన భాషలు ప్రపంచములోనెల్ల అత్యుత్తమము, అతి ప్రాచీనమునగు సంస్కృతికి నిధానములగుటచే ఎక్కువ ప్రాముఖ్యము కలవి ఈ ప్రాంతమునకు చెందిన భాషాకుటుంబములలో యూరాల్-అల్తాయీ కుటుంబము, చైనా కుటుంబము, ద్రావిడ కుటుంబము, కాకేసస కుటుంబము, సెమెటిక్ కుటుంబము (ఆఫ్రికాఖండ భాషాకుటుంబములను గూర్చి ముచ్చటించునపుడు వర్ణింపబడినది) ఆర్యకుటుంబము, వివిధ భాషాకుటుంబము, అను పేరిట ఏడుకుటుంబములు కలవు

భాషాశాస్త్రవేత్తలు ప్రారంభమున ఆర్య భాషా కుటుంబము, సెమెటిక్ భాషాకుటుంబము అను రెండు ప్రధాన భాషాకుటుంబములను కల్పించిరి. వీటితో తురానీ కుటుంబమను పేరుతో ఒక మూడవ కుటుంబమునుగూడ కల్పించిరి. కాలాంతరమున చేసిన పరిశోధనముల ఫలితముగ ఈ కుటుంబమునకు యురాలూ ఆల్టాయి పర్వత మధ్యగత దేశము ప్రధానస్థానముగ నిర్ణయింపబడుటచే "తురానీ" అను పేరునకు బదులుగ "యురాల్ అల్టాయీ" అను పేరు ప్రచారమునకు వచ్చెను. ఈ కుటుంబమున ఎన్నియో భాషలు కలిసియున్నవి. యురాల్ కుటుంబమున ఫీనీఉగ్రీ, సమోయేదీ అను రెండు భాషాసమూహములును అల్టాయీ కుటుంబమున తుర్కీ, మంగోలీ, తుగూజీ అను మూడు భాషాసమూహములును కలవు. ఈ కుటుంబములలో రెండు మూడు లక్షణముల విషయమున సాధర్మ్యమున్నది.

**చీనీ కుటుంబము** ఈ కుటుంబమున అనామీస్యామీ, తిబ్బతీ, బ్రహ్మా, చీనీ అను నాల్గు ప్రధానశాఖలు కలవు. ఏకాక్షర ధాతువులు, వ్యాకరణ నియమాభావము, ఈ రెండును చీనీ కుటుంబ ప్రధాన లక్షణములు. భాషలన్నియు అయోగాత్మకములు. వాక్యములందలి శబ్దముల పరస్పర సంబంధము వాటిస్థానమును బట్టియే నిర్ణయింపబడును. ఒకే శబ్దము స్వరభేదముచే అర్థభేదము కలిగియుండును.

**ద్రావిడ కుటుంబములు** ఈ కుటుంబమునకు చెందిన భాషలు నర్మద మొదలు కన్యాకుమారి వరకును దక్షిణ భారతదేశమున వ్యాపించియున్నవి. ఈ కుటుంబమున తెలుగు, తమిళము, మలయాళము, కన్నడము ప్రధాన భాషలు. ద్రావిడ భాషా కుటుంబ భాషలకు ప్రధాన నిలయము దక్షిణభారత దేశమే యైనను కొందరు విద్వాంసులు ఆస్ట్రేలియా, ఫినో ఉగ్రిక్ ప్రాంతభాషలతో గూడ ఈ భాషకు సంబంధములు నిరూపించుటకు ప్రయత్నించు చున్నారు.

**కాకేశస కుటుంబము** నల్ల సముద్రమునకును, కేస్పియన్ సముద్రమునకును నడుమనున్న భాషలకు కాకేషస కుటుంబమని పేరు. ఈ ప్రాంతము కాకేషస పర్వతపంక్తిచే పరివృతమగుటచే ఆ పేరు వచ్చినది. ఈ కుటుంబములో కూడ ఉత్తర కాకేషస మనియు, దక్షిణకాకేషస మనియు రెండు భేదములు కలవు. ఉత్తర కాకేషసభాషలో వ్యంజనము అధికముగ నుండును. అచ్చులు స్వల్పముగ నుండును. పదరచన అత్యంత జటిలముగ నుండును. కొన్ని శబ్దముల మూలధాతు రూపములను కనుగొనుటకూడ చాలకష్టము. ఉత్తర కాకేషస భాషలకు సాహిత్యముగాని లిపికాని లేదు. దక్షిణకాకేషస శాఖలలో జార్జీభాష ప్రధానమైనది. పదవశతాబ్దినుండి ఈ భాషలో సాహిత్యము లభించుచున్నది. దీనికొక ప్రత్యేక లిపి కూడ కలదు.

**ఆర్యభాషా కుటుంబము** ఈ కుటుంబము, యూరేషియా ఖండమునందే గాక ప్రపంచమునందలి ఇతర భాషా కుటుంబము లన్నిటికంటెను సువిశాలమైనది. ఈ కుటుంబమునకు చెందిన భాషలు మాటలాడువారి సంఖ్యకూడ అత్యధికమైనది. మతసాహిత్యాది దృష్టిచేకూడ ఈ కుటుంబము అత్యున్నత స్థానము నాక్రమించినది. ఈ భాషలలో విభక్తులు బహిర్ముఖములుగా-అనగా పదాంతాదులలో-నుండును. ఒక కాలమున శ్లిష్టభాషలుగానున్న ఈ భాషలన్నియు క్రమక్రమముగ ప్రయోగభాషలుగా మార్పు చెందుచున్నవి. వీటిలోని ధాతువులు చాలవరకు ఏకాచ్కములు. ఈ భాషలకు సమాస రచనాశక్తి కూడ అత్యధికము. ఈ కుటుంబములో కెల్టిక్, జర్మన్, ఇటాలిక్, గ్రీక్, తోఖారీ, అల్బేనియన్, బైటోస్లావిక్, ఆర్మీనియన్, ఆర్య అను తొమ్మిది ప్రధానశాఖలు కలవు.

**వివిధ భాషా కుటుంబములు** కొన్ని భాషలు ఏకుటుంబమునకు చెందినవో నిశ్చితముగ చెప్పుటకు శక్యము కాకుండుటచే, ఆ భాషలన్నిటికిని ఈ నామధేయ మీయబడినది. ఈ సముదాయమున ఏట్రస్కన్, సుమేరియన్ అను రెండు ప్రాచీనభాషలు కూడ కలవు. ఏట్రస్కన్ భాషలు రోమన్ సామ్రాజ్యస్థాపనకు పూర్వము ఇటలీలోని మధ్యోత్తర ప్రాంతమున ప్రచారములో నుండెడివి. నేటి బాస్క్, కోరియాయీ, జపానీ, హారయల్ బోరీ అను భాషలుకూడ ఏకుటుంబమునకు చెందినవో నిశ్చితముగ చెప్పుటకు వీలులేకున్నది.

**పసిఫిక్ మహాసముద్ర ఖండము** ఈ ఖండమునకు మలయ పాలినేసియన్ భూఖండమని కూడ పేరు. ఈ ప్రాంతమున అనేక భాషలు కలవు. ఇచట ఐదు ముఖ్యకుటుంబము లున్నవి. మలయన్, మేలానేసియన్, పాలినేసియన్ అను మూడును పెద్దకుటుంబములు. పాపుఅన్, ఆస్ట్రేలియన్-ఈ రెండును చిన్నకుటుంబములు. వీటిలో మలయవర్గమునకు చెందిన భాషలు మలయప్రాయద్వీపము, జావా, సుమత్రా,

బోర్నియో, ఫిలిప్పైన్, నికోబార్, ఫార్మోసా మొదలగు ద్వీపములలో మాటలాడబడుచున్నవి. మెలానేశియా విభాగమునకు చెందిన భాషలు న్యూగినీ నుండి ఫిజీవరకును, పాలినేశియన్ భాషలు న్యూజిలాండులోను, పాపుఅన్ ఆస్ట్రేలియన్ భాషలు యుగేవిలో కొన్ని భాగములందును మాటలాడబడుచున్నవి. ఈ భాషలన్నియు అశ్లిష్టయోగాత్మకములే. ధాతువులు సాధారణముగ ద్వ్యక్షరములు. ఈ భాషలు క్రమక్రమముగ యోగావస్థనుండి అయోగావస్థకు ఉన్ముఖము లగుచున్నట్లు అగపడుచున్నది.

అమెరికా ఖండము దక్షిణోత్తర అమెరికాఖండములు రెండును ఈఖండమున అంతర్గతములు. గ్రీన్‌లెండులో ఎస్కిమోభాషయు, కెనడాలో అథబాస్కన్ భాషయు, సంయుక్తరాజ్యమున అల్గోంకిన్, ఇరోక్వాయిన్ మొదలగు భాషలును, మెక్సికోలో మొదేరూ బగాతల్స్, అజ్‌టెక్ భాషలును యుకతన్‌లో మయభాషయు, మాటలాడబడుచున్నవి. ఉత్తర అమెరికాలోని ఉత్తరప్రాంతమున కరిబ్, అరవాక్ భాషలు, మధ్యప్రాంతమున గుఆర్నీ-తూపీ భాషయు పశ్చిమ ప్రాంతమున క్విచు, అరౌకన్ భాషలును, దక్షిణ ప్రాంతమున చాకో, టీరాడేల్, ఫుఇయగో భాషలును ప్రచారములో ఉన్నవి. ఈ భాషలనుగూర్చి ఇంకను పరిశోధనము జరుగవలసి యున్నది. ఇవి ప్రశ్లిష్ట యోగాత్మక భాషలు. ఇవి సమానప్రధాన భాషలగుటచే వాక్యశబ్దముల ప్రయోగము అధికము.

ష. శ్రీ.



అనుబంధము-౧


## ACKNOWLEDGMENTS

We offer our grateful thanks to the following for having very kindly helped us with blocks, Photographs and drawings for this Volume

1. The Director of Archaeology, & Museums, Govt of Andhra Pradesh, Hyderabad
2. The Superintendent, Archaeological Survey of India, South Eastern Circle, Hyderabad
3. Dr S Venkateswara Rao, M. D, Himayatnagar, Hyderabad-A P
4. Prof V V L. Rao, Retired Principal, Regional Engineering College, Warangal.
5. Sri M R Balarama Charya, Artist, Secunderabad
6. Dr M B K Sarma, Reader, Dept. of Astronomy, Osmania University, Hyderabad-7 A. P
7. Sri R M Joshi, Retired Director of Records, Govt of Hyderabad, Kachiguda, Hyd-A. P
8. Sri T S S Anjaneyulu, M Sc., Meteorological Officer, Sivajinagar, Poona
9. Sri K S Pillai, Regional Engineering College, Warangal
10. Sri V Visweswara Rao, M Sc., Archaeological Survey of India, Nagapur
11. Sri N Siddheswar, Professor of Mechanical Engineering Regional Engineering College, Warangal

*Secretary*

అనుబంధము - ౨

# పారిభాషిక పదములు

| | | |
|---|---|---|
| **Archaeology** | .. | పురావస్తు తత్త్వశాస్త్రము |
| **Behaviouristic School of Philosophy** | ... | ప్రవర్తనైక మనస్తత్త్వవాదము |
| **Capital** | ... | పెట్టుబడి |
| **Ecology** | ... | ప్రాణిజీవనశాస్త్రము |
| **Fundamental Particles** | ... | ప్రధాన కణములు |
| **Idealism** | ... | ప్రత్యయాత్మకతత్త్వవాదము |
| **Megalithic Culture** | ... | మహాపాషాణయుగ సంస్కృతి |
| **Palaeontology** | ... | పురాజీవశాస్త్రము |
| **Private Administration** | ... | ప్రభుత్వేతర పాలనము |
| **Public Administration** | ... | ప్రభుత్వ పాలనము |
| **Renaissance** | . . | పునరుజ్జీవనము |
| **Surveying and Levelling Instruments** | .. | ప్రవీక్షణ-ఉదాయన పరికరములు |
| **Utilitarianism** | ... | ప్రయోజనైక వాదము |

# సూచిక

